## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100071258/59/60/61/62

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books

Title: Ramayanam
Author
Year to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఓజసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# భారతీయ తత్త్వశాస్త్రము

*

[డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణుని
'ఇండియన్ ఫిలాసఫీ' అను నాంగ్లగ్రంథమునకు
ఆంధ్రానువాదము]

*

ప్రథమ భాగము

*

బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ.,
పి. ఆర్. కాలేజీ, కాకినాడ.



డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణుఁడు.

# అనువాదకుని భూమిక

పంచఖండములలో నాగరికలోకమంతటఁ గీర్తిప్రతిష్ఠలు గాంచి, ప్రాచ్యపాశ్చాత్యవిజ్ఞానవీధుల విలాసవిహార మొనర్చుచుఁ బ్రస్తుతము భారతప్రభుత్వోపాధ్యక్షపీఠము నలంకరించిన శ్రీసర్వేపల్లి రాధాకృష్ణపండితుఁడు రచించినగ్రంథము లన్నిటిలో నుత్తమస్థానము నలంకరించినది ఆతని "భారతీయతత్త్వశాస్త్రము," (Indian Philosophy.) ఆంగ్లమున నిది పదునాఱు వందలపుటలలో రెండుభాగములలో నున్నది. మొదటిభాగము ౧౯౨౩ నను, రెండవది ౧౯౨౭-వ సంవత్సరమునను బ్రకటితమయ్యెను. ఇది యించుమించు ముప్పదిప్రాక్పశ్చిమభాషలలోని కనువదింపఁబడినది. పశ్చిమఖండవిద్వత్ప్రపంచమున కొక మహావిద్వాంసుఁడుగా నధికారము గలప్రాక్పశ్చిమసర్వవిజ్ఞానవేత్తయై, భారతీయతత్త్వజ్ఞానమును సర్వతోముఖసంపూర్ణసమన్వయదీప్తితోఁ బ్రదర్శించి, యీ తెలుఁగుతల్లి ముద్దుబిడ్డఁడు, నలువదికోట్ల భారతీయులపక్షమున మహర్షిఋణమును దీర్చినాఁడు.

శంకరాచార్యానంతరము భూపతితమైన భారతధర్మపతాకమును, శ్రీరామకృష్ణపరమహంస దేవుని ద్వితీయాత్మస్వరూపియై, నాగరకప్రపంచకేంద్రసీమమైన షికాగో నగరమున సర్వమతమహాసభావేదికపై శ్రీవివేకనందస్వామి, భూనభోంతరాళము లేకమై మ్రోగునట్లు జయజయధ్వానములు

సర్వదేశవాసులు తన్మయులై చేయుచుండఁగా నాకసమంటి నవీనప్రపంచమున కాశాజ్యోతియై వెల్గొందు నట్లొనఁగు వేసి నాఁడు. వివేకానందుఁడు యోగి, జ్ఞాని, భక్తుఁడు, బ్రహ్మవేత్తయు నయి భారతీయధర్మమును స్వానుభవావేశోద్రేకము లతోఁ బ్రవచించినాఁడు. భారతీయతత్త్వమును సమగ్రముగా గ్రహించుటకు సంపూర్ణసమన్వయదృష్టి లేక సమ్యగ్దృష్టి యనఁగా నానాత్వము నేకత్వము నొకేచూపులోఁ జూడఁగ లుగుయోగిదృష్టి (An all - Comprehensive spiritual vision) యవసరమై యున్నది. అనంతతత్త్వ,తత్త్వసాధనావైవిధ్యములు భారతీయతత్త్వములో యథోచితస్థానములఁ గాంచి పూర్ణాంశ సమ్యక్సంబంధముచే నవిభాజ్యములై ప్రకాశించినవి. అందుచే భారతీయతత్త్వసౌందర్యము సమాధిగత దివ్యదృష్టికే గోచరించును. పుణ్యతపస్సాధ్యమైన యీదృష్టిలేని కేవలపండితులు, భారతీయులు, పాశ్చాత్యులుకూడ భారతీయతత్త్వమున కపార్థములు, పాక్షికార్థములు సంకుచితార్థములు చెప్పి యనేకగ్రంథములు ప్రకటించినారు.

శ్రీరామకృష్ణ పరమహంసదేవుని సమగ్రసమ్యగ్దృష్టి గాంచిన వివేకానందు ననంతరము, విద్వద్వరేణ్యుఁడుగా, నట్టి దృష్టిని బ్రదర్శించి భారతీయతత్త్వశాస్త్ర రచనము చేసిన మహనీయుఁడు, రాధాకృష్ణపండితుఁడు. పూర్వజన్మముననే యీతఁడు సిద్ధుఁడై, బ్రహ్మవేత్తయై, భారతీయతత్త్వము నభినవ నాగరక ప్రపంచమున కర్థమగు నధికారపాండిత్యముతోఁ బ్రవచనముసేయు నిమిత్తము కారణజన్ముఁడై, జనించె నని చెప్పఁదగు కీర్తనీయమృతమయ గంగాప్రవాహతుల్యరమ్యరచనాధోరణితో

సాక్షిభూతము. ఈయుద్గ్రంథము, భారతీయ బ్రహర్షి వాణి విశ్వ సంద్యమైనదనియుఁ, బశ్చిమఖండ మేధావులు గాని, భారతీయ వైజ్ఞానికులు గాని, దానిని లఘుభావముతోఁ జూచుటకుఁ గాని నిరసించుటకుఁ గాని పూనుకొనుట సాహసమనియు, దాని నలక్ష్యముచేయక, సముచితవినయవినమ్రచిత్తములతో నర్థము చేసికొనఁ గలిగినయెడల, సమగ్రసంతుష్టియుఁ జిత్తశాంతియు విశ్వవిశాలహృదయమును, నిరవధికానందమును బ్రసాదించు ననియు, దీనికి బ్రపంచతత్త్వవిజ్ఞాన రంగములో సులభముగా నగ్రస్థానము నిచ్చి పూజించుటయే ధన్యతాసాధనమనియు ముక్తకంఠమున నిరాఘాటముగాఁ జాటినది.

నేఁటిపశ్చిమఖండమున రాధాకృష్ణవిరచిత భారతీయ తత్త్వ శాస్త్రమును జదువ లేదనిచెప్పుకొనుట కెట్టి మహావిద్వాంసుఁ డును జిన్నతనముగా భావించును. రచనలోనే కాక వక్తృత్వము నఁగూడ నసమానుఁడగుటచే నీతనిమహోపన్యాసములు వినుట కన్నిదేశములవారు నవకాశమునకై పరితపించు చుందురు. మతాంతరునకు ఖండాంతరునకు నెన్నఁడీయని ప్రాచ్యమతధర్మ ప్రవచనాచార్యపదవిని మొట్టమొదటిసారిగా నీతని కిచ్చి ఆక్స్ ఫర్డు విశ్వవిద్యాలయము ధన్యత గాంచినది.

ఆంధ్రపుత్రరత్నమైన యీమహనీయుని విశ్వవిఖ్యాత మగుగ్రంథరాజము నాంగ్ల మెఱుఁగని యాంధ్రసోదరుల కిది వఱకే లభింపకుండుట నాకు మితిలేని పశ్చాత్తాపముచు గలిగించి నది. పదిరెండేండ్ల వెనుక రాధాకృష్ణపండితుఁ డాంధ్రవిశ్వవిద్యా లయోపాధ్యాక్షపీఠము నలంకరించియున్నతఱి, నాతని 'జీవిత పరమార్థ దృక్పథ' మను (Idealist view of life"—Hibbert

Lectures) గ్రంథమును సంక్షేపముగ నాంధ్రీకరించి ప్రకటించి తిని. దానిని జూచి సంతసించి, భారతీయతత్త్వశాస్త్రమును యథాతథముగా నాంధ్రీకరింపుమని నా కాతఁడు డాశీర్వాద పూర్వకముగా ననుమతియిచ్చియుండెను. కాని, కారణాంత రములచే వెంటనే దాని నుపక్రమింపఁజాలనైతిని. మూఁడేండ్ల క్రితము రాధాకృష్ణపండితుఁడు మాస్కో-నగరమున భారత ప్రభుత్వరాయబారిగా నుండఁగా ననువాదము నారంభింపఁ దలఁచితి నని వ్రాయఁగా వెంటనే యారంభింపుమని యాయన సమాధానమువ్రాసెను. దినమునకు మూఁడుగంటలు వ్రాయు నియమము పెట్టుకొని, రెండేండ్లలో దీనిని ముగింపఁగల్గితిని. ఆంధ్రుఁడై, విశ్వవిఖ్యాతి గాంచిన యిట్టిమహాపురుషునిగ్రంథము నాంధ్రుల కాంధ్రభాషలో నందఁజేయుట నావిధియని హృదయ కుహరమునుండి యేదోయొకయనిర్వాచ్య మగు ప్రేరణముకల్గి, పనిపూర్తియగువఱకునాకొకవిధ మగు నేకాగ్రతను జేకూర్చినది ఏదినముననైన వ్రాఁత జరుగని యెడలఁ బిచ్చియెత్తినట్లయ్యెడిది. ఈరచనాకాల మొకమహాసాధనకాలముగా నడచినది. ఇం దలికష్టము పండితు లెఱుఁగనిది కాదు. ప్రాచ్యపాశ్చాత్య తత్త్వభావభాషాపరిచయములు, బహుశాస్త్రసాంకేతికశబ్దార్థ జ్ఞానము, మూలార్థభావోన్నతి కనుగుణమగునుదాత్తాంధ్రపద విజ్ఞానము విశేషముగాఁ గావలసియున్నవి. అన్నిటికంటె ముఖ్య ము రాధాకృష్ణపండితుఁడు, మహామేధావులకుఁగూడఁ దల నొప్పిపుట్టించు తత్త్వశాస్త్రవిషయముల నొకనవలాధోరణిలో నిత్యనూతనోత్సాహపూరిత మొనర్చి రచించినాఁడు. ఆయు త్సాహప్రవాహములో నొకతరంగము నాహృదయములోఁ

ప్రవేశించి, శ్రీమాపనోదన మొనర్చినదని చెప్పఁగలను. ఏమైనను నే నెంతవఱకు నీకార్యమునఁ గృతార్థుఁడ నైతినో పండితులు చెప్పనగును. సాధ్యమైనంతవఱకు నన్నితరగతులచదువరులకు సులభముగా బోధపడవలె ననునుద్దేశ్యము మనసులో నుంచుకొని సరళమైనభాషనే వాడితిని. విషయకాఠిన్యము ననుసరించి కొన్నితావులలో భాషాకాఠిన్యమును తప్పనిసరియైనది. శాస్త్రసూక్ష్మవిషయము లెంత తేలికభాషలోఁ జెప్పినను సంస్కారహీనుల కవి బోధపడునట్లు చేయుట దుస్సాధ్యము. మఱియు, మూలము నతిక్రమింపరాదుగదా !

ఇఁక గ్రంథస్థవిషయము. ఋగ్వేద మారంభమై చైతన్యతత్త్వమువఱకుఁ గలభారతీయులతత్త్వజ్ఞానప్రదీపము, యుగయుగములనుండి వాతావరణములో నెన్నిమార్పులు వచ్చినను, సదసద్దశాపరిణామము లెన్నిసంభవించినను నవినాశమై, నిశ్చంచలమై, నిర్వికారమై, నిలిచి యున్నది. ఇట్టి మృత్యుంజయత్వశీలము గలిగినతత్త్వజ్ఞానము ననంతప్రేమతో విశ్వసించుటచే భారతవర్ష మజరామరమై నిల్చినది. వివేకానందునిమాటలలో బ్రహ్మజ్ఞానోపాసననే భారతదేశమునకు వెన్నెముకయు గుండెకాయము, ముఖ్యప్రాణమును, జీవమూలాధారము నైయున్నది. ఇదియే చావులేనిభారతశక్తి. జన్మజరామరణాదిదోషములనుండి తప్పించుకొనలేక దురంతదుఃఖవశుఁడైనమానవుని సంస్కరించి, నిత్యానందశాంతిసమృద్ధ మగునమర్త్యపదవికిఁ దోడ్కొనిపోవున దీభారతబ్రహ్మజ్ఞానశక్తి. మానవుని దేవునిగా మార్చుమహత్తరాశయమే భారతీయబ్రహ్మర్షివర్యులకార్యక్రమసర్వస్వము. ఇట్టి మహదాశయసంపూర్ణ మగుజాతి వేఱొకటి

లేదు. ప్రభువులు, ప్రభుత్వములు, సంఘములు శాసనములు, నియమములు, నిర్మాణములు, కళలు, కావ్యములు, శాస్త్రములు, సంగీతములు, నర్థములు, కామములు నన్నియు, సర్వమానవప్రవృత్తులు నీలక్ష్యమును బ్రతిఫలింపఁజేయుసాధనసామగ్రులుగా మాత్రమే విలువ గలవి. ఇదియే భారతజాతీయతత్త్వము. దీని నెఱుఁగనివాఁడు భారతదేశము నెఱుఁగనివాఁడే. ఆతఁ డెంతవాఁడు కానిండు. దీని నెఱుఁగక యాతఁడీదేశమున కెట్టియుపకారము నొనర్పఁజాలఁడు. దీని నామూలాగ్రముగ నెఱిఁగి, యాచరించి, భారతదేశము పంచఖండములకుఁ బారమార్థికమార్గమును జూపఁగలదు. ఈ సత్యమును మనము దేశములో మూలమూలల వేయివిధముల నిరంతరాయముగా నుద్ఘాటింపవలసినయవసర మెప్పటికంటె నేఁ డత్యధికముగా నున్నది. నేఁటిప్రపంచము విద్వేషకల్లోలితమై, రాక్షసికవాతావరణమును సృజించి పెంపొందించుచుండుటే, నవీననాగరికజాతుల మని చెప్పికొని, తమభావముల నితరులపై బలవంతముగాఁ జొప్పింపయత్నించుచుండు వివిధజాతుల విజ్ఞానములలోని దారుణలోపములకుఁ బ్రబలసాక్ష్యము. ఇదియే గొప్పతరుణము. భారతజాతి తనస్వధర్మము నెఱిఁగి, దానితత్త్వమును నిస్సంశయముగా గుర్తించి, ప్రపంచోపాధ్యాయపీఠము నలంకరింపవలసి యున్నది. ఇదియే భారతదేశమునకు దైవదత్తమైనకర్తవ్యము. దీనిని గ్రహింపక, మిక్కిలి చంచలము లగుపరజాతిభావదాసులై, యంధానుకరణమే జాత్యుద్ధరణమార్గ మని విప్లవజ్వాలల నుద్రేకింపఁజేయు మూఢభారతీయుల ప్రయత్నము లన్నియు వ్యర్థములైతీరును.

ప్రపంచ మిట్టివిద్వేషవిషపూరితమై, యుద్ధాగ్ని కాహుతియై, భస్మమగుట కుంకించునీతరుణమున, రాధాకృష్ణపండితుని వ్యక్తిత్వ మొకనూత్నాశాజ్యోతియై, శాంతిమార్గమును జూపునదై, యీశ్వరోద్దిష్టమై వెలసినది. అట్టి దైవదూతను గన్న తెలుఁగుతల్లిసౌభాగ్యసంపద గరిష్ఠమైనది. మూఁడుకోట్ల తెలుఁగుబిడ్డలు రాధాకృష్ణుఁడు తమసోదరుఁ డని గర్వించి, జయజయధ్వానములచే నాతని, నాతనిరచనల నారాధించి, ధన్యు లగుట ధర్మమై యున్నది.

ఈగ్రంథము తెలుఁగున రెండువేలపుటలైనది, అందఱి కందుబాటులో నుండుటకై నాలుగుభాగములుగా ముద్రింపఁ బూనితిమి. ఏభాగమున కాభాగము స్వయంసంపూర్ణముగా నుండుటకై, నాలుగుభాగములపుటలు సమానముగా విభజింప లేదు. ఈప్రథమభాగమున నుపోద్ఘాతము, వైదికయుగము, సంధికాలమనఁగా బ్రాహ్మణములయుగము, ఆవెనుక నుపనిషత్తత్త్వముఁ జేర్పఁబడినవి. రాధాకృష్ణపండితుఁడు ముఖ్యముగాఁ బాశ్చాత్యసభ్యప్రపంచము నెదుటఁ బెట్టుటకై చారిత్రకపద్ధతి ననుసరించి, వేదములను, దదంతర్గత మంత్రబ్రాహ్మణోపనిషత్తులను, వానికాలభేదములను, భావసంబంధపరిణామభేదములను, నవీనదృష్టితో వివరించినాఁడు. ఇది పాశ్చాత్యు లంగీకరించిన పద్ధతి. వేదవేదాంగములను, వానియర్థనిర్ణయములను నేఁటి ప్రకృతిశాస్త్రదృష్టితోఁ బరిశోధించి, ప్రకటించిన పాశ్చాత్య పండితుల భావముల నీతఁడు తనసమీక్ష కాధారములుగాఁ గైకొని తననిర్ణయములను ప్రకటించినాఁడు.

ఈభాగమునకు సంబంధించినంతలో మనము సంప్రదాయసిద్ధము లగునభిప్రాయములను గమనింతము. సంహితాబ్రాహ్మణోప నిషత్సమేతములై, అవిభాజ్యమగు నేకరూపము గలవే వేదములు. ఇవన్నియు నేకకాలమునకుఁ జెందిన వని యీ ప్రాచీనుల విశ్వాసము. ఉపనిషత్తులలోనిభావములు కాలాంతరమునఁ బరిణతిచెందినవికావనియు, నీవిభాగములు మనమభ్యాసము చేసికొను సౌలభ్యమునకై చేసికొనినవేయనియుఁ గర్మజ్ఞాన కాండ లొకేవ్యక్తియొక్క రెండునేత్రములవలె నొకేవేదము లందలి ప్రకరణభేదములుమాత్రమే యనియు సంప్రదాయ వాదము. ఇఁక, వేదములకాలమును నిర్ణయించు చర్చ వ్యర్థమైనది. మహర్షులు తాము ద్రష్టలమని చెప్పుకొనిరి. వారు సమాధ్యవస్థలోఁ జూచి వినినవే వేదములని మనమంగీకరించిన యెడల, వారుచూచి వినకపూర్వ మెంతకాలమునుండి వేదము లదృష్టములై యశ్రుతములైయున్నవో నిర్ణయించుట కాధారములు లేవు; వినినమంత్రద్రష్టలకాల నిర్ణయములకు నాధారము లూహానిర్మితములే. సృష్ట్యారంభమునఁ దత్పూర్వమున వేదము లున్నవో లేవో నిర్ణయించుటకు వలయు నానాఁటిగుర్తులను బరీక్షించుశక్తిగల పరిశోధకు లెవ్వరునుబుట్టి యుండలేదు. అందుచే, మనువ్యాసాదులు చెప్పినరీతిగా వేదము లపౌరుషేయములనియు, ననాద్యనంతములనియుఁ బాశ్చాత్యులు నమ్మలేకున్నను మనము నమ్మినచో ఘోరప్రమాదము కాఁజాలదు. అట్లు నమ్మకపోవుట గొప్పలోపమే.

ఉపనిషన్మూల సిద్ధాంతమునుగూర్చి రాధాకృష్ణనండితఁడు విపులముగాఁ జర్చించినాఁడు, అనిర్వాచ్యలక్షణములుగల

పరబ్రహ్మ మేకైకసత్యమనియు, జగత్తు మిథ్యయనియుఁ జెప్పు నద్వైతసిద్ధాంతము కేంద్రస్థానము నాక్రమించును. ఇది సూక్ష్మతమమగు (Sub tlest) విషయము. రాధాకృష్ణుఁడు జగన్మిథ్యార్థమును విపులీకరించినాఁడు. శంకరాచార్యు నభిప్రాయమున కిది భిన్నమై తోఁచుచున్నది. శంకరుఁడు రజ్జుసర్పన్యాయము నుదాహరణముగా నిచ్చి, దీనిని వ్యక్తీకరించినాఁడు. చీకటిలో నొకరజ్జువును జూచి, మనము సర్పభ్రాంతి నొందుచున్నాము. జ్ఞానదీపకాంతిలోఁ జూచిన నది సర్పముకాదు త్రాడే యని తెలియఁగలదు. రజ్జువు పరబ్రహ్మము – సర్పము జగత్తు – చీకటి అజ్ఞానము. బ్రహ్మ మేకైకసత్య మైనచో బ్రహ్మేతరమంతయు నసత్యమైనఁ గావలయును లేదా బ్రహ్మేతరముగాఁ గన్పట్టునదంతయు బ్రహ్మస్వరూపము గావలెను. అనఁగా బ్రహ్మ మేకైకసత్యమయినచో బ్రహ్మేతరవస్త్వస్తిత్వము నెద్దానిని మన మంగీకరింపరాదు. రజ్జువే సత్యమైనచో సర్పము సత్యమెట్లగును? స్వప్నానుభూతవిషయములు జాగ్రదవస్థలో నసత్యములైనరీతిని, స్వప్న మున్నంతకాలము స్వప్నావస్థలో జాగ్రదవస్థయు నసత్యమైనరీతిని, బ్రహ్మానుభవసిద్ధి లభించినవానికి బ్రహ్మేతరమంతయు నసత్యమై తోఁచునని యుపనిషత్తులు చెప్పిన వాక్యములు పూర్ణానుభవసిద్ధ వాక్యములై యున్నవి. మహావాక్యములైన, 'తత్త్వమసి,' 'సర్వం ఖల్విదం బ్రహ్మ' 'అయమాత్మాబ్రహ్మ' మున్నగువాక్యములు బ్రహ్మేతరము నంగీకరింపవు. అనఁగా నజ్ఞానికి జగత్తున్నది; జ్ఞానికి బ్రహ్మమే యున్నది; జగత్తు లేదు. అందుచే జగత్తు జ్ఞానదృష్టిలో మిథ్యయే. మిథ్య లేక లేని జగత్తు కనఁబడుటకు మాయయే

కారణము. మాయ యెచటనుండివచ్చినదని ప్రశ్నింపఁగా శంకరుఁడు తదనిర్వచనీయమ్మను వాక్యముతో బదులుచెప్పెను. తత్త్వశాస్త్రమునఁ జెప్పనగు తుదిమాట (Last word) యిదియే. శంకరుఁ డొక్కఁడే దైవసాహసముతో నీతుదిమాట చెప్పఁగలిగినాఁడు. అనుభవైకసిద్ధ మగువిషయమును దర్కించుటెట్లు? పాల్ డ్యూసేన్ పండితుఁ డీభావము సత్యమైన దని నమ్మినాఁడు. కాని, దీనిని సమర్థించుటలో నాతఁడనవసర తర్కములు చేసి యున్నమాట నిజమే కాని, రాధాకృష్ణపండితుఁ డీ మిథ్యా వాద ముపనిషన్మతమే కాదని వాదించుటచేఁ బండితుల పరిశీలనార్థ మీవిషయము సూచింప సాహసించితిని. ఇంకను గొన్ని యిట్టి పరిశీలనార్హము లగువిషయములు మిగిలినభాగములలో సూచింతును.

గ్రంథముద్రణవిషయము : కాకినాడ వైశ్యయువకులు, సత్కార్యనిర్వహణదీక్షాచిత్తులునగు శ్రీ బచ్చు సన్యాసిరావు ఎం.కామ్. గారు మొదటినుండియు ఈగ్రంథరచనాముద్రణాదిక విషయములలో నాకమితప్రోత్సాహము నిచ్చి తోడ్పడిరి. కాకినాడపురమునకు వెన్నెముకవంటి వీరిని భగవానుఁ డనుగ్రహించుఁగాక, నే నీగ్రంథమును వ్రాయుచున్నా నని తెలిసి కోరనిదే తమంతటఁ దామే. ౧౯౫౦–౫౧ వ యేఁటి మాకళాశాలవిద్యార్థిబృందము, దీనిముద్రణనిమిత్తమై విరాళములు వేసికొని రు 1500-0-0 నాకొసఁగిరి. నాఁటి విద్యార్థిసంఘకార్యదర్శియగు చిరంజీవి పారుపూడి వెంకటరావు (ఇపుడు బి. ఏ.) దీనివిషయములో దీక్షతోఁ గృషిచేసి, మాకళాశాలలోని పండితులైనమీ రిట్టియుద్గ్రంథమును రచించుట, మాకును మాపి

కాపురరాజకళాశాలకును గూడ మిక్కిలి గర్వకారణమని పలు మారులు పలికి, గ్రంథముద్రణ మారంభమగుట కట్టిమహోప కృతియొనర్చినాఁడు. సాధుశీలుఁడు, మితభాషి, దేశభక్తుఁడు, నగునీయువకునకు, తమయుడుతభక్తినిజూపిన యితరవిద్యార్థులకు నీశ్వరుఁ డాయురారోగ్యైశ్వర్యములిచ్చి కాపాడుఁగాక. మదరాసు గవర్నరుగా నుండి, నాప్రయత్నమును గూర్చి నేను వ్రాసిన లేఖకు వెంటనే తమకుఁ దోఁచినవిరాళము నంపుచు నభిమా నాదరములఁ జూపిన శ్రీ శ్రీ శ్రీ భావనగరుమహారాజా వారును, ప్రధానమంత్రిగా నుండిన శ్రీ కుమారస్వామిరాజా గారును, యథాశక్తి తోడ్పడిన శ్రీ పైడా సత్యనారాయణమూర్తి గారును, శ్రీ సమయమంత్రి చిననాగేశ్వరరావుగారును, దదితరు లును నాకృతజ్ఞతకెల్లప్పుడును బాత్రులు.

కోరినవెంటనే తమ అమూల్యాభిప్రాయపూర్వకోద్ఘాతవాక్యములను దయతోఁబంపిన శ్రీగంటిజోగిసోమయాజులు గారికిని, శ్రీ దివాకర్ల వేంకటావధానిగారికిని వినయాంజలి ఘటించుచున్నాను. నాకు సదుపాయమగురీతి ముద్రణాకార్యమును నిర్విఘ్నముగాఁ గొనసాగించుచున్న శ్రీ పట్టమట్ట శేషగిరిరావు గారికి నేను కృతజ్ఞుఁడను.

కాకినాడ,
20--5—53.

ఇట్లువిధేయుడు,
బులుసు వేంకటేశ్వరులు.

# పీఠిక

ప్రొఫెసరు. **గంటి జోగిసోమయాజి**, ఎం.ఏ; ఎల్.టి., పి.ఓ.ఎల్.
ఆంధ్ర విశ్వవిద్యాలయము.

దిక్కాలాద్యవచ్ఛిన్న మయిన యీవిశాలాకాశము నావరించికొని యున్నతమస్సుఁ జీల్చి ఆత్మస్వరూపావిష్కరణవ్యగ్రము లయిన దివ్యజ్యోతులు నక్షత్రతారాగ్రహరూపమున నాయాప్రదేశముల నాయాకాలములఁ గాంతుల వెదచల్లుచునే యున్నవి. ఈకార్య మనాది యనంతము. అట్లే మానవమానసాకాశమున నున్నయజ్ఞానతిమిరమును బటాపంచలు చేయుటకై తత్తద్వ్యక్తిగత మయినజ్ఞానస్వరూప మాత్మీయ మయి స్వపరతారకముగా భిన్నపరిమాణమున గోచరించుచు జగత్తునాదినుండియు వెలుఁగుచునే యుండినది. అట్టిజ్ఞానప్రసృతికిఁ దావలము లయిన దివ్యవ్యక్తులు, స్ఫుటములై, దేదీప్యమానములై, జాజ్వల్యమానము లయి, ప్రాచ్య పాశ్చాత్యప్రపంచముల వెలిఁగి వెలిఁగించి, జిజ్ఞాసువులకు మార్గదర్శకములుగా, ఆత్మస్వరూపమును, భావరూపమున, విద్యావిశేషమున వెలయించినవి. అట్టివ్యక్తులే, మంత్రద్రష్టలు, దార్శనికులు, శాస్త్రకారులు, భాష్యనిర్ణేతలు, మతస్థాపకులు, వేదాంతవిచారకులు, తత్త్వచింతకులు నయి భాసిల్లిరి. వారివారియనుభవములు, వారిసిద్ధాంతములు, వారిప్రవచనములు, వర్షజలమువలె నుత్పత్తిని స్వభావమునను నభిన్నములే యయ్యును, ఉపాధులమూల

మున సామాన్యులకు భిన్నములుగఁ గన్పట్టుచునే యుండును. పయిగా ప్రాక్ప్రతీచీభేదములు కేవలవిరుద్ధములవలె భాసిల్లుచునే యుండును. 'ఇట్టిసిద్ధాంతములలోఁ గొన్నిటికి గర్తలయిన అరిస్టాటిలు మొదలయినపాశ్చాత్యులును, శంకరరామానుజాదు లయిన భారతీయులును ఆయాకాలములఁ బ్రసిద్ధులయి యనుయాయిశిష్యవర్గమునఁ జిరంతనాచార్యు లయిరి.

ఈప్రాక్ప్రతీచీవిజ్ఞానప్రవాహములఁ దనయందు దిముడ్చుకొని సమన్వయస్వరూపమున జహ్నుమహర్షి జాహ్నవిఁ బోలె వెలికిఁ దెచ్చినదివ్యపురుషుఁడు శ్రీరాధాకృష్ణపండితుఁడు. కొంతకాలముక్రిందట భారతదేశము స్వాతంత్ర్యరహితమై ప్రపంచజాతులభావనలో వన్నెదక్కి యున్న యనువున, భారతీయవిజ్ఞానమును వెదచల్లి యితరులదృష్టి నాకర్షించినమహాపురుషుఁడు వివేకానందస్వామి. ఆయనతరువాత మఱల నాధ్వజమును వహించి కీర్తికెక్కినమహాపురుషుఁడు రాధాకృష్ణపండితుఁడే. భారతీయుల విజ్ఞానజ్యోతిని తనగ్రంథరూపమున దేశదేశముల దిప్పి కీర్తికెక్కి భారతదేశమును నుతికిఁ దెచ్చినదివ్యుఁడు రాధాకృష్ణుఁడు. ఉపనిషదర్థములను గీతారూపమున వర్షించిన నీలమేఘము భారతకృష్ణుఁడు. సర్వప్రపంచవేదాంతవిజ్ఞానమును సమన్వయస్వరూపమున బ్రవహింపఁజేసి హిమాలయస్వరూపముననిర్మలుఁడైనవాఁడు నేఁటిభారతీయరాధాకృష్ణుఁడు. హృదయవైశాల్యమునను, కార్యోత్సాహమునను, ధర్మబుద్ధిని, రాజ్యతంత్రజ్ఞతను, ప్రతివాదిమత్తేభపంచాననత్వమునను శరణాగతత్రాణబుద్ధిని, యోగీశ్వరత్వమునను ఆకృష్ణుఁడును నీకృష్ణుఁడును సమానులే. దిక్కాలాద్యవచ్ఛేదముల నతిక్రమించి,

చిదానందమూర్తియై, స్వయంప్రకాశమున వెలుఁగు విశ్వవిఖ్యాత పురుషుఁడైన రాధాకృష్ణుని నాంధ్రుఁడనుకొనుట యజ్ఞతయే కావచ్చునేమో ! కాని, జన్మవాసనల నతిక్రమింపఁజాలము గదా ! వ్యుత్పత్తి యెంతయున్నను స్థితియెంత గలిగినను ఉత్పత్తియే సర్వవ్యవహారములకు నిమిత్తము గావున దాని నతిక్రమింపక రాధాకృష్ణ సత్పురుషుని నాంధ్రుఁడని గర్వించుట,సంస్తుతించుట, ఆంధ్రులకీర్తిప్రతిష్ఠలకు పరిపోషకము.

ఆంధ్రావనిలోఁ బొడమిన యీకల్పభూజముయొక్క గ్రంథసుమముల విశాలవాసనలు అన్యభాషాంతరీకరణముల మూలమున సద్గంధవాహకులయిన గుణపక్షపాతులవలన నానా దేశవాసితమై దిగంతవిశ్రాంతములయి యొప్పుచున్నను,తన్మూలమయిన యాంధ్రభాషాలవాలమున మిక్కిలిప్రచారము నొందలేదు. ఈపనికిఁ బూనుకొనిన శ్రీ బులుసు వేంకటేశ్వరులవారు మిక్కిలిసమర్థులు. ప్రాచ్యపాశ్చాత్య వేదాంతములను, సంస్కృతాంధ్రములను బండితులయి యుపాధ్యాయవర్తన నవదాత సువృత్తమూర్తులయి, భారతధర్మ ప్రచారవిషయమున స్వార్థరహితవృత్తిని బచరించుచుందురు. విశేషించి శ్రీరాధాకృష్ణుల యెడ వీరిభక్తి యపారము. వారిగ్రంథముల నాంధ్రభాషలోని కనువదించుటలోని క్లేశముల నతిక్రమించి, వానిని ప్రచురించుటలోని యడ్డంకులను జంకుగొంకులులేక ప్రతిఘటించుటలో వీరు కృతకృత్యులయిరి. సరసమయి,నిర్దుష్టమయి,మిక్కిలి పఠనపాఠనయోగ్యమయిన యీసరళానువాదము సర్వవిధముల నుపాదేయమయి యఖిలాంధ్రలోకముయొక్క యాదరమునకును గౌరవమునకును బాత్రమయి యలరారుచున్నది. ఆంధ్రవాఙ్మ

మమునందలి యుత్తమగ్రంథమయిన భారత మెట్లు స్తుతిపాత్ర మో యట్లే యీగ్రంథ మాంధ్రుల కెల్లరకును నవలంబ నీయము.

విశాఖపురి.
26–4–53.

సోమయాజి.

II

భారతీయతత్త్వశాస్త్రము! భారత తత్త్వశాస్త్రముల కెంత యవినాభావసంబంధము! భారత మన్నంతనే నేఁటికిని సంస్కృతమును దదంతర్నిహితమైన తత్త్వశాస్త్రమునే పాశ్చాత్య దేశవాసుల స్మృతిపథముల నిల్చుచుండును. మొన్న మొన్నటి దాఁక సంస్కృత మనఁగా నాధ్యాత్మికజ్ఞాన వ్యక్తీకరణ సాధన మగు భాషావిశేష మనియే పలువురు పాశ్చాత్యుల తలంపు. ప్రసవ పరిమళములకువలె, జ్యోతీరోచులకుఁ బగిది భారతతత్త్వశాస్త్రములకుఁగల సంబంధము పరస్పరసమ్యగ్ద్యోతక మైనది. బహిరంతర్జీవన విధానముల భారతీయు లాధ్యాత్మికతత్త్వమునే యాదర్శకముగా గ్రహించుట యిందుకుఁ గారణము. వా రేది తలంచిన, వచించిన, నొనరించిన దాని వెనుక నాధ్యాత్మిక భావము తొంగి చూచుచునేయుండును. త్రికరణశుద్ధిగా నాధ్యాత్మికత్వము నుపాసించి తరించినవారు తొల్లిటి భారతీయులు. తత్త్వము వారిసొమ్ము. అందుచేతనే భారతీయతత్త్వశాస్త్ర మనుమాటలకూర్పు హృదయవచశ్శరీరముల పిసమంతయు వైరుధ్యము లేనిమిత్త్రుల మైత్రివోలె సర్వమనోహరమై వెలయుచున్నది.

నిజమే! భారతవారాశిపంక్తి వీక్షణముల సారించినంతనే తత్త్వతరంగములు పుంఖానుపుంఖముగా నుదయించి మీఁది కుఱుకుచున్నట్లుండుట నిజమే! కాని కేవల తరంగనికరమే రత్నాకరము కానట్లు కేవల తత్త్వవిచారమే పూర్వ భారత వైభవము కాదు. పూర్వభారతీయులు ధర్మమోక్షము లకువలె నర్థకామములకును బ్రయత్నించి యందును సమగ్రసిద్ధి నొందఁజాలిరి. పారలౌకికసౌఖ్యమున కుపనిషదాదు లంబోలె నైహికప్రయోగమునకై వారు కళాశాస్త్రాదుల సృష్టించిరి. ఉద్యానకృషి, పశుపాలనము వైద్యము, నాట్యసంగీత ములు మున్నగువిషయములలోఁ గూడ వారాటితేటి యానంద మును జూఱగొన్నవారే. కాలగర్భమున దాఁగి కనఁబడకుండఁ బోయినది కాని లౌకికవిషయమునుగూర్చి వారు ప్రపంచించిన గ్రంథవిస్తర మెంతయో కలదు. ఎంతయున్ననేమి? హతభాగ్యులమైన మనపాలి కవి లేనట్లే యైపోయినది. పాషాణములు పరవశములైపోయినను సాలగ్రామములు మాత్రము నిల్చినవి. ఇది దురదృష్టములో మన కబ్బినమహాదృష్టము. లేనిచో భారతనామమే యదృష్టనష్టమై పోయియుండును.

భారతోద్యానమందలి యాధ్యాత్మికతావల్లరి నిదాఘసమయసంపర్కముచే వాడిపోయినదే కాని విగతజీవ కాలేదు. భారతీయసంపత్సరిత్తు కృశించినను ఆధ్యాత్మికతావాహిని యదృశ్యముగాఁ బ్రవహించుచునే యున్నది. అందుచేతనే నేఁటికిని దత్త్వవిషయముల భారతమే ప్రాభవమందుచున్నది. రణవాతావరణము కార్కొన్నప్పు డిప్పుడుసైతము ప్రపంచము శాంతిసందేశమునకై భారతమువంకకే యఱ్ఱులుచాచుచున్నది. పురా

తన భారతీయ ఐహిక పారలౌకికముల నేకసూత్రమున సగ్రుచ్చి సంతోషించిరి. ఆప్రకృతి భారతీయచిత్తప్రవృత్తికి నిసర్గమైనట్టిది. తత్త్వము నెప్పుడు విస్మరించునో భారతీయుఁ డప్పుడు వెనుక వెనుకకు దిగఁబడుచునే యుండును. భారతీయయాత్రికుని కది సర్వకాలముల శివాధ్వదర్శనము కావించు దివ్యతేజము. భారతీయ సంస్కృతివల్లరి కది మూలము. అది యున్నంతవఱ కెన్ని ఝంఝాప్రభంజనములైన దాని నున్మూలించివేయఁ జాలవు. ఇది గుర్తించినవా రాధునిక భారతీయులలో లేకపోలేదు. అట్టివారిలో నగ్రగణ్యుఁడు శ్రీరాధాకృష్ణ పండితుఁడు.

రాధాకృష్ణపండితుఁడు ప్రాచ్యపాశ్చాత్యసంస్కృతులు మూర్తిదాల్చినమహనీయుఁడు. ప్రాక్ప్రతీచీవిజ్ఞానవారిరాసుల నేకచుబుకమునఁ బుడిసిలించినయగస్త్యమహాని యాయన. ఆయన వాక్కు హిమవత్తుంగశృంగనిపతద్వియద్వాహినీపయఃప్రవాహబంధుర మైనట్టిది. గతశతాబ్దిని వివేకానందునివలె నీశతాబ్దిపూర్వభాగమున నాయన పశ్చిమఖండముల కేఁగి భారతీయ వేదాంతదుందుభిని నిరతిశయ ప్రతిభాపాటవముతో మ్రోయించి తనకును దనమాతృభూమికిని గూడ దివ్యమైనయశము సంపాదించెను. వేదాంతవాహినిలో విహార మొనరించుటవలెనే రాజకీయరంగముల వాహ్యాళి సలుపుటకూడఁ బరిణతమైనయాయనబుద్ధికిఁ బరిపాటియైనవిలాసము. అందుచేతనే వేదాంతిశేఖరుఁడయ్యు నాయన భారతశాసనసభ కుపాధ్యక్షుఁడు కాఁజాలెను. నిజమునకు భారతదేశమునకుఁ బాలకులు కావలసినవారు, కాఁదగినవారు కేవలరాజకీయవిజ్ఞానవేత్తలుమాత్రమే కారు; వారు రాజకీయతత్త్వముతోపాటు వేదాంతతత్త్వమును

గూడఁ జూఱఁగొన్న మనీషులు కావలయును. ఎన్నో యేండ్ల తరువాత నట్టిదిట్ట యొకఁడు భారతదేశపాలనమున కుపాధ్యక్షుఁ డగుట సంభవించెను. ఇది యాశల రేకెత్తించుశుభోదర్కము.

రాధాకృష్ణపండితుఁడు రచించినగ్రంథము లెన్నో కలవు. అవి యన్నియుఁ దత్త్వపయఃపారావారము త్రచ్చి త్రచ్చి బయ ల్పఱిచిననవ్యనవనీతములే. వాని యన్నింటిలోఁ జూళికాభరణము భారతీయతత్త్వశాస్త్రము. ఇందు వేదయుగమునుండి నేఁటి వఱకు భారతదేశమున వర్తిల్లియుండిన వేదాంతవిచారవిధాన ములు విస్తరింపఁబడియున్నవి. పాశ్చాత్యతత్త్వవేత్తలదృక్పథ ములును నిండెడనెడఁ దారతమ్యప్రతియోగప్రతిపాదనమునకై ప్రపంచితములై యున్నవి. అది పాశ్చాత్యదేశవాసులకే కాక భారతీయులయ్యుఁ దమతత్త్వసంస్కృతులఁ బూర్తిగా విస్మరిం చిన హైందవులకుఁ గూడ నొకరకమైనకనువిప్పు, భాష నేర్చిన ప్రతిభారతీయుఁడును వర్షములకొలంది చదివి యవగాహనము చేసికోవలసిన యుద్గ్రంథ మది.

రాధాకృష్ణపండితుని భారతీయతత్త్వశాస్త్ర మిది వఱకే యాంధ్రభాషలోని కనూదితము కాఁదగినగ్రంథము. ఆంధ్రమాతపుత్త్రరత్నము వెల్వరించినయాలోచనమరీచులకుఁ గూడలియైనదివ్యకేంద్ర మది. కాని, దాని ననువదించుట యనఁగా సులభసాధ్యమైనకార్యము కాదు. అనువాదకుఁ డాం ధ్రాంగ్లసంస్కృతభాషలందుఁ గూలంకషపాండిత్యముకలవాఁడై యుండుటే కాక ప్రాక్ప్రతీచీతత్త్వశాస్త్రముల బాగుగా నెఱిం గినవాఁడై యుండవలెను. ఆంధ్రదేశమున నట్టివా రెందఱు ఉన్నారు? ఒక్కరో యిద్దరో. వారిలో నే నెఱిఁగినవారు శ్రీ

బులుసు వేంకటేశ్వరులుగారు. ఏగ్రంథము నైన నెవ్వరైన రచించుట శక్యమైనం గావచ్చును గాని కొన్నియెడల నౌచిత్యశోభితమై యుండదు. ఆంధ్రభాగవతము నేయల్లసానిపెద్దనయో శ్రీనాథుఁడో కాక పరమభక్తాగ్రగణ్యుఁడైన పోతన రచించుటలో నెంతో యౌచిత్య మున్నది. అట్టియౌచిత్యమే శ్రీబులుసు వేంకటేశ్వరులుగారీభారతీయతత్త్వశాస్త్రము ననువదించుట లోఁ బుష్కలముగాఁ గానవచ్చుచున్నది.

శ్రీవేంకటేశ్వరులుగారు తత్త్వశాస్త్రమునందును ఆంధ్రసంస్కృతములందును ఎం.ఏ.పట్టభద్రులు. భారతీయతత్త్వసంస్కృతులకు మూలకందమైనవేదము వాసములుకూడ వల్లె వేయనేర్చిన పవిత్రగృహమునఁ బుట్టటయేకాక దానిని బిత్రుపాదులతో నధ్యయనము చేసినట్టివారు. తపఃస్వాధ్యాయనిరతులు. ఇహమునకంటెఁ బరమునకై యెక్కువగాఁ బాకులాడువారు. నేర్చినదంతయుఁ జదివినదంతయు జీవితమున ననుసంధింప నేర్చినపవిత్రజీవనులు. పాండిత్యవర్తనములు రెండింటిచేఁగూడ నీభారతీయతత్త్వశాస్త్రము ననువదించుట కెంతో యర్హతగలశ్రీవేంకటేశ్వరులుగారాకార్యమునకుఁ గడంగి దానిని బూర్తి చేయుట యాంధ్రులయదృష్టము. దినకరతేజఃస్పర్థి యైన దీపము నాయన వెలిఁగించినారు. తద్దివ్యకాంతిపుంజముల బహిరంతరముల నలమినతమమును బాపుకొనుట యింక మనము చేయవలసినపని.

ఇప్పటికిఁ బ్రథమభాగము ముద్రితమైనది. ఆద్యంతమాసక్తితోఁ జదివి యానందపారావారమున నోలలాడితిని. శంకరవివేకానందు లీకాలమున భారతదేశమునఁ బుట్టనిలోపమును

రాధాకృష్ణపండితునివలె నాయన తత్త్వశాస్త్రమునాంధ్రమున వ్రాయనిలోపమును శ్రీవేంకటేశ్వరులుగారు తీర్చియున్నారు. అనువాదమయ్యు గ్రంథమంతయు సహజధారాశోభితమైన శైలితో నలరారుచు స్వతంత్రరచనమువలె నొప్పుచున్నది. సంస్కృతము కాకపోయినను సంస్కృతమైనభాష. మూలభావములు మిక్కిలిముద్దుగా వెల్వరింపఁబడినవి. క్లిష్టత యెచ్చటను గానరాలేదు. శైలి సరళసుందరముగా నున్నది. ఆవశ్యకమైనకార్య మర్హులచేతఁ బడినందు కానందించుచు మిగిలిన భాగములుకూడ నచిరకాలముననే వెల్వడునని యాశించుచు నిఁక విరమింతును.

హైదరాబాదు
24—5—53

దివాకర్ల వేంకటావధాని ఎం. ఏ. ఆనర్సు
ఆంధ్రశాఖ, ఉస్మానియావిశ్వవిద్యాలయము

# కృతిప్రదానము

శ్రీవిష్ణుండు శివుండు బ్రహ్మయును మూ
ర్తిం దాల్చిరో యేకమై
ప్రోవన్ లోకము నాత్మశక్తి విలస
త్పుణ్య ప్రభావంబుచే
నా విచ్చేసె మహామహుం డయి యనం
త బ్రహ్మ తేజస్వియై
యావిజ్ఞానికి సద్గురూత్తమున కే
నర్పింతు నీసత్కృతిన్.

వేదార్థామలసారమూర్తి యతఁడే విద్వన్నుతామేయ స
మ్మోదప్రేమరసైకమూర్తి యతఁడే మోక్షప్రదాఖండ వి
ద్యాదానైక మహావ్రతుం డతఁడె నాయాచార్యదేవుండు నా
యీదివ్యత్కృతిభర్తయై మనుచుఁగా కిష్టార్థసంధాతయై.

అరయన్ భారతవర్షతత్త్వమది బ్రహ్మర్షీంద్రతత్త్వంబు మ
ద్గురుఁ డాతత్త్వము మాతృగర్భముననే కూలంకషప్రజ్ఞచే
నెఱుఁగెన్ సాధనసిద్ధిఁగాంచి యది తానైయై వెలుంగొందుఁద
త్పరమాత్ముం డగునాతఁడీకృతిపతిత్వంబంది నన్నోముతన్.

# విషయసూచి



# అభిప్రాయము

"కొందరిమాట ఒకఊరిలోఁ జెల్లును. కొందరిమాట ఒకనాడునఁ జెల్లును. కొందరిమాట ఒక దేశమునఁ జెల్లును. కొందరిమాట సర్వప్రపంచమునఁ జెల్లును. ఇట్టివారు గాంధి, జవహరిలాలు, వివేకానంద, అల్డస్, హక్స్లీ, డాక్టరురాధా కృష్ణన్ మొదలయినవారు. ఇట్టివారు జగద్భద్రంకరులు, శ్రీరాధాకృష్ణపండితులు భారత దేశము నోచిననోము పంట. వీరియుపన్యాసములు గంగాప్రవాహములు, వీరి గ్రంథములు మానససరస్సులు. ఆధునికయుగమున హిందూమతము పునరుద్ధరించినవా రిద్దరే. మొదటివారు శ్రీవివేకానందులు. రెండవవారు శ్రీరాధాకృష్ణులు.

శ్రీరాధాకృష్ణపండితులు వ్రాసిన హిందూతత్త్వ శాస్త్రము నాంధ్రీకరించి శ్రీబులుసు వేంకటేశ్వరులుగారు తెలుఁగు దేశమునకు మహోపకారము చేసిరి. వీరి తెలుఁగు పాండిత్యస్ఫోరకముగా నున్నది. ఇట్టిమహాగ్రంథము తెలుఁగుసేత చాల కష్టమైనపని. ఇట్టిపని వీరు శక్తిమంత ముగాఁ జేసిరన్నచో వీరిపాండిత్యము, పట్టుదల ప్రశంస నీయములు. ఈగ్రంథమును దేశమున నందరు చదివి శ్రీరాధాకృష్ణపండితుల దివ్యభావములు గ్రహించి యా నందింతురుగాక! శ్రీబులుసు వేంకటేశ్వరులుగారు ఇట్టి మహాగ్రంథము లింకను రచింతురుగాక!

బెజవాడ,
4–6–53.

విశ్వనాథ సత్యనారాయణ.
(మహాకవి; కవిసమ్రాట్టు)

ఓం

# భారతీయ తత్త్వశాస్త్రము

## ప్రథమాధ్యాయము

### ఉపోద్ఘాతము

### ౧ భారతవర్ష నైజలక్షణము

ఆలోచనాశక్తి గలమానసములు వికాసము నందుటకు, వివిధకళాశాస్త్రము లభివృద్ధిఁ గాంచుటకు, రక్షణము తీఱికను జేకూర్పఁ గలస్థాయి నొందినసంఘము ప్రప్రథమముగాఁ గావలసి యున్నది. ఉదరపోషణమునకై సంచరించుచు, దారిద్ర్యమున మ్రగ్గుచు, జీవించునాటవికజాతికి మహనీయమైనసంస్కృతి యబ్బుట దుస్తరము. అదృష్టవశమున భారతదేశము సహజప్రకృతిసంపదలతో సర్వాంగమనోహరమై యొప్పారినది. దేశాంతరములనుండి శత్రువులదాడికి గుఱి కాకుండ, నొకప్రక్క మహోన్నత హిమాలయపర్వతశ్రేణియు, నితరదిశలందు మహాసాగరములును నీదేశమును గాపాడినవి. సర్వసంపత్సమృద్ధమై ప్రకృతి మృష్టాన్నము నిచ్చుటచే, నాహారసంపాదనక్లేశము భారతీయున కవసరమే లేకపోయెను. అధికారధనప్రభుత్వముల కొఱకుఁ గొట్లాడుయుద్ధరంగమే లోక మని భారతీయుఁ డెన్నఁడును దలఁచి యుండలేదు. ఇహలోకజీవయాత్రయందు శరీర

పోషణసంబంధము లగుసమస్యలను సాధించునిమిత్తము, ప్రకృతి శక్తులను నిగ్రహించి, ఉపయోగించుటకై మనశక్తుల నన్నిటిని వ్యయింప నవసరము లేనిచో, నపుడు మనము పరమార్థజీవిత మునుగూర్చియుఁ బరిపూర్ణ మైనఆత్మజీవితమునుగూర్చియు నా లోచింప నారంభింతుము. దేశముయొక్క సహజోష్ణవాతావర ణము, భారతీయునికి విశ్రాంతియందు నేకాంతవాసమునందును బ్రీతిని జనింపఁజేసియుండవచ్చును. ముముక్షువైనవ్యక్తి, ఏకాం తముగా మహారణ్యవీధులఁ దిరుగాడుచు ప్రశాంతహృదయ ముతో నూతనభావములఁ గాంచుచు ఆనందపులకితుఁడై గీతము లాలపించునవకాశము కల్గినది. సంసారభారముచే నలసినమా నవు లీప్రకృతిరమ్యసీమలకుఁ బోయి, స్వేచ్ఛగా విహరించు వాయుప్రసారములయు ఝరీపరంపరలయు సందేశములను విని, పక్షిసంఘముల కలగానామృతమును ద్రావి, నిండుహృదయ ములతోఁ బ్రజ్వలితాత్ములై, ఆత్మశాంతిఁ గాంచి తిరిగి వచ్చు చుందురు. అతిసూక్ష్మము లగుజీవితసమస్యలనుగూర్చి, భార తీయమేధావులీతపోవనములందు, నాశ్రమములందు ధ్యానసాధ నములు సల్పిరి. స్థిరమైనపోషణసౌకర్యము,సహజప్రకృతిసంపద, ఉదరపోషణాదికవివిధక్లేశరాహిత్యము, కాలమును నిరర్థకముగా మ్రింగివేయువ్యవహారకర్మరంగమందలి యాందోళనాశూన్యత, యివి భారతజాతియొక్క పరమార్థజీవితాన్వేషణమును బెం పొందించినవి. ఆకారణముచేఁ జరిత్రారంభకాలమునుండియు నీజాతిలో సత్యాన్వేషణవాంఛ, జ్ఞానపిపాస, విజ్ఞానవీధుల విహ రించునపేక్ష గానవచ్చుచున్నవి.

ప్రకృతి ప్రసాదించినసదుపాయములచే వస్తుసత్యాన్వే షణసమస్యలను గూర్చి నిశితపరిశీలనము చేయునవకాశములు గలిగియుండినభారతీయునకు, ప్లేటోతత్త్వవేత్త చెప్పినదౌర్భా గ్యముల కెల్లదౌర్భాగ్య మగు 'వివేకద్వేషము' సంభవించి యుండలేదు. ప్లేటోమహాశయుఁడు తన 'ఫియోడో' గ్రంథమున నిట్లు చెప్పెను; అన్నిటికన్న ముఖ్యముగా నొకవిపత్తు మనకు సంభవింపకుండ మనము జాగరూకులమై యుందుముగాక ! మానవజాతిని ద్వేషించుకొందఱివలె, మనమును వివేకమును ద్వేషించువారము కాకుందుముగాక ! ఏలన, మానవునకు వివేకద్వేషముతో సమానమైనదురవస్థ మఱొకటి లేదు." జ్ఞానపిపాసయే మానవునకుఁ గలసంపదలలోఁ బరమపావన మైనది. ఈజ్ఞానకాంక్ష భారతీయునిమానసాగారమున జాజ్వల్య మానప్రదీపమై యున్నది. లోకములో ననేకదేశములందు జనులు జీవితపరమార్థమునుగూర్చి సమాలోచనము చేయు టొకవిధమైనవిలాసముగాఁ జూతురు. ముఖ్యకాలమును వ్యవ హారరంగములో వ్యయించి, తత్త్వజిజ్ఞాస యేపనియు లేనప్పుడు చేయుదురు. ప్రాచీనభారతదేశములో నేశాస్త్రమునకుఁ గాని, కళకుఁ గాని యనుబంధముగా నుండక సంపూర్ణస్వతంత్రశా స్త్రమై తత్త్వశాస్త్రము విలసిల్లినది. పశ్చిమఖండమున నీశాస్త్ర ము, ప్లేటోఅరిస్టోటల్ మున్నగువారికాలమున యౌవనప్రాదు ర్భావము నందినప్పుడు కూడ, నైతికరాజకీయశాస్త్రముల ప్రాపు నాశించినది. తత్త్వశాస్త్ర మనఁగా మధ్యయుగములలో మతవిశ్వాసము; పేకను, న్యూటనులకాలములోఁ గేవలప్రకృతి

శాస్త్రము; పందొమ్మిదవశతాబ్దపుమేధావులకు రాజతంత్రము, చరిత్రము, సాంఘికవిధానము నై యొప్పినది. భారతవర్షమున మాత్రము తత్త్వశాస్త్రము తనపాదములపై నిలిచినది. తదితర శాస్త్రములు, కళలు, తమమహాశయప్రోత్సాహములకొఱకు దానిపై నాధారపడినవి. బ్రహ్మవిద్య సర్వవిద్యాజననియై, ప్రకాశించినది. బ్రహ్మవిద్యాధారము లేనివిద్య లన్నియు నిరర్థకములు గర్హ్యములు నైనవి. ముండకోపనిషత్తు "సర్వవిద్యా ప్రతిష్ఠా బ్రహ్మవిద్యా" యని పలికినది. అర్థశాస్త్రకర్త కౌటిల్యుఁడు, "తత్త్వశాస్త్రము సర్వశాస్త్రములకు దీపము, సర్వకర్మములకు నాధారము, సర్వవిధులకు మూలబీజ" మని పల్కినాఁడు.

జగద్రహస్యసమస్యల నర్థముచేసికొనుటకై చేయుమానవయత్నమే తత్త్వశాస్త్రకర్తవ్యము గాన, నది జాతి, సంస్కృతులసంస్కారములకు లోనై యుండును. ప్రతిజాతికి జన్మసిద్ధమైన సహజమానసికలక్షణము, ప్రత్యేకశేముషీప్రవృత్తియు నుండును, గతించినచరిత్రయుగములలోఁ, గడచినశుభాశుభాంతర్దశలలో, మార్పులేనిభరతమాతృమూర్తి గోచరించును. తన ప్రత్యేక మగు-అనుశ్రుతముగా వచ్చిన-సంప్రదాయమునకుఁ జెందినకొన్ని మనఃప్రకృతులను భారతజాతి గట్టిగాఁ బట్టుకొని నిల్చినది; తా నొకజాతిగా నిలుచునంతకాలము భారతజాతి యీ లక్షణములను విడువఁజాలదు. ప్రత్యేకవ్యక్తిత్వ మనఁగాఁ బెంపొందుటకు స్వాతంత్ర్యము; కాని, దీనియర్థ మితరులతో నాకృతిసామ్య మేమియు లేకుండుట గాదు. ఆకృతిసామ్యము స్వల్పము

గానైన లేకుండుట సాధ్యముకాదు; ఏలన మానవత్వ మనునది యందు ముఖ్యముగా నాత్మపదార్థము లోకములో సర్వజాతులందు నొకటే. భేదము లన్నియు యుగ, చరిత్రప్రవృత్తుల ననుసరించి యేర్పడినవే. ఆర్జింపఁదగిన దేనికిని లేనట్లే, తత్త్వజ్ఞాన వికాసమునకును నొకేయొక రాజమార్గము లేదు; అందుచే నీభేదము లన్నియు విశ్వసంస్కృతి కలంకారములై యొప్పును. భారతజాతివిజ్ఞానవిశేషలక్షణములను దెలిసికొనుటకుముందు, భారతవిజ్ఞానముపైఁ బశ్చిమవిజ్ఞానప్రభావ మెట్టిదో కొన్నిమాటలు చెప్పవలసియున్నది.

గ్రీసుమున్నగు దేశాంతరములనుండి భారతజాతి కొన్ని భావములను స్వీకరించెనా? స్వీకరించిన నెంతవఱకు? ననుసమస్య పెక్కుసార్లు తలయెత్తినది. భారతీయవిజ్ఞానధనులు తెల్పిన కొన్నిభావములకుఁ బురాతనగ్రీసుదేశమునందుఁ బెంపొందిన కొన్నిసిద్ధాంతములకుఁ బోలిక లుండుటచే వీనికిఁ గాని వానికిఁ గాని న్యూనత నాపాదింపఁదలఁచినవ్యక్తికి కీకార్య మంతకష్టమైనది కాదు.*

---

*సర్ విల్లియమ్‌జోన్సు ఇట్లు వ్రాసినాఁడు; "వేదాంతశాఖల విషయమున నిచట నొకవ్యాఖ్యచేసినఁ జాలును. న్యాయసిద్ధాంతము పెరిఫెటిక్ సిద్ధాంతమునకు సరిపోవును. వైశేషికసిద్ధాంతము అయోనిక్ సిద్ధాంతమును బోలును; రెండుమీమాంససిద్ధాంతములలో రెండవది యగువేదాంతము ప్లేటోతత్త్వమునకును, గౌతమసిద్ధాంతము ఆరిస్టోటల్ తత్త్వమునకును సరిపోవును. ఇంకను కణాదుఁడు థేల్సు; జైమిని, సోక్రటీసు; వ్యాసుఁడు, ప్లేటో; కపిలుఁడు, పైథాగరస్; పతంజలి, జీనోలు; సమభావసమన్వితులు. [గ్రంథము పుట, 360-1) మఱియుం కోల్‌బ్రూక్సు మిసెల్లేనియస్ ఎస్సేస్ పుట i-436) చూడనగును. విశేష

ఏభావము లేజాతికిఁ జెందిన వనున న్వేషణము నిరర్థకమైనది. నిష్పాక్షికదృష్టికి, భావసాదృశ్యములు చరిత్రలోఁ దటస్థించిన సమానభావము లని గోచరించును. మానవహృదయములలో సమానానుభవములు సమానభావముల నుదయింపఁజేయును. ఒకజాతి, అందు ముఖ్యముగా భారతజాతి, తనభావముల నింకొకజాతినుండి స్వీకరించిన యాధారప్రమాణము లెవ్వియును లేవు. మేము రచింపఁబోవు భారతీయతత్త్వఘట్టములు పరికించినచో, నీభారతీయతత్త్వము సంపూర్ణస్వతంత్రత గల్గినదై మానసికసత్యాన్వేషణ ఫలిత మని తెలియఁగలదు. పాశ్చాత్యభావముల ప్రభావముకాని, సంపర్కముగాని యేమియు లేకుండఁగనే తత్త్వసమస్యలు పరిశీలింపఁబడినవి. అప్పుడప్పుడు పశ్చిమజాతి సంపర్కము కొంతసంభవించినను, భారతజాతి తనజీవితాదర్శమును, తత్త్వమును, ధర్మమును, సర్వస్వతంత్రముగాఁ బెంపొందించుకొన్నది. ఈభరతవర్షమునకు వచ్చినఆర్యుల ఆదినివాసమేదైనను, పశ్చిమోత్తరఖండములందలి తమజ్ఞాతులతో సంబంధము తెగఁద్రెంపుకొని, స్వీయభావప్రపంచమును వారు నిర్మించుకొనిరి. పశ్చిమోత్తరభాగములందలి అరణ్యమార్గములనుండి, యనేకజాతుల మూకలు భరతభూమిపై దండయాత్రలు సాగించినమాట నిజమే;

సేమనఁగా, గ్రీక్కులసంస్కృతి భారతీయసంస్కృతి ననుకరించిన దని తేటతెల్లముగా నుగ్గడింపఁబడినంతగా భారతవిజ్ఞానము గ్రీసువిజ్ఞానమునుండిస్వీకరించినట్లుగాఁ జెప్పఁబడలేదు." [చూడుఁడు గార్బే, ప్రాచీనభారతీయ తత్త్వశాస్త్రము. అధ్యాయము ii.].

కాని, ఒక్క అలెగ్జాండరు తప్ప, మిగిలినవా రెవరును, నీయుభయప్రపంచముల మధ్యమందును వైజ్ఞానికసంపర్కమును గలిగించి యుండలేదు. ఇటీవలమాత్రము, సముద్రద్వారములు తెఱువఁబడి, సన్నిహితసంబంధసంపర్కము లేర్పడినవి. కాని, దీనిఫలితములను మన మింకను నిర్ణయింపఁజాలము, ఏలన, ఈ సంపర్క మింకను సంపూర్ణము కాలేదు. కాఁబట్టి యించుమించుగా, భారతీయసంస్కృతి నిజపోషణముచే స్వతంత్రముగాఁ బెంపొందినదే యని నిర్ణయింపవచ్చును.

## ౨

## భారతీయసంస్కృతి సామాన్యలక్షణములు.

---

భారతభూమియందలి తత్త్వశాస్త్రము ప్రధానముగా నాత్మసంబంధము; కాలవిఘాతములనుండియుఁ జరిత్రలోని సంక్షోభములనుండియు భారతదేశమును గాపాడినశక్తి, భారతజాతికిఁగల నిశితమైన పరమార్థచింతనమే కాని, యేరాజ్యాంగ సాంఘిక నిర్మాణములును గావు. విజాతీయదండయాత్రలు, స్వజాతిలోని యంతఃకలహములు, గతచరిత్రలోఁ బెక్కుసారులు, భరతవర్షనాగరికతను వినాశమొనర్చినవా యనునంతపనిఁ జేసినవి. గ్రీక్కులు సిథియనులు, పర్షియనులు మొఘలులు, ఫ్రెంచివారు నాంగ్లేయులు, క్రమముగా భారతసంస్కృతినిఁ ద్రొక్కివేయ యత్నించిరి; కాని, భారతజనని తనశిరమును దిన్నగను నున్నతముగను నిలఁబెట్టుకొనఁగల్గినది. భరతభూమి నణఁచివేయుట యసాధ్యమైనది. ఆమెఆత్మశక్తిసహజతీక్ష్ణతతో

జ్వలించుచునే యున్నది. యుగయుగములనుండియు నీదివ్య భూమి ఒకేలక్ష్యముతో జీవించుచు వచ్చినది. ఆమెసత్యసంస్థాపనమునకు, సత్యనిర్మూలనముకొఱకుఁ బోరాడినది. ఒకప్పుడామెదోసఁగులోనర్చియుండవచ్చును, కాని యెల్లప్పుడు నామె తనశక్తివంచనము లేకుండ, విధిని నెఱవేర్చినది. భారతీయాత్మజ్ఞానచరిత్రము, నిత్యనూతనము, నిత్యసనాతనము నైనసత్యాన్వేషణమున కుదాహరణ మని చెప్పనగును.

ఆత్మజిజ్ఞాస భారతీయజీవనమునకు మూలతత్త్వము. భారతీయతత్త్వము ప్రజాసంబంధికాని, గుహాంతరముల నాశ్రయించునది కాదు. ఈబ్రహ్మజిజ్ఞాస, మానవజీవితము నాధారముగాఁ జేసికొని వివిధశాస్త్రసీమల దాఁటి, తిరిగి జీవితరంగమునందే ప్రవేశించినది. కాలక్రమమున బయల్వెడలినవిమర్శభాష్యములవలెఁ బ్రమాణసూత్రసిద్ధాంతరాద్ధాంతముల లక్షణములతోఁ బ్రాచీనవేదాంతగ్రంథములు నిండియుండలేదు. మహాగ్రంథము లగునుపనిషత్తులు భగవద్గీతయుఁ బ్రజాసామాన్యవిశ్వాసములకు దూర మైనవికావు. ఈగ్రంథములు భారతజాతి ప్రేమించు దివ్యసారస్వతమై, మఱియు, భిన్నదర్శనములకు శాస్త్రములకు నాధారభూతములునై వెలసినవి. అధికసంఖ్యాకవర్గముయొక్క అల్పగ్రహణశక్తి కనుగుణముగాఁ గథలు, నుపాఖ్యానము లనువస్త్రములతో నాచ్ఛాదన మందిన పరమసత్యములే పురాణములై యొప్పినవి. ఈపురాణములు, కొఱకఁబడని తత్త్వశాస్త్రభావములను ప్రజాసామాన్యమునకు సులభముగా నందిచ్చి, సఫలత నొందినవి.

తత్త్వశాస్త్రప్రవక్తలు ప్రజాకోటియొక్క సాంఘికాధ్యాత్మిక పునర్నిర్మాణముకొఱకు యత్నింతురు. భారతీయ నాగరికత, బ్రాహ్మణమత మని చెప్పఁబడుటకుఁ గారణము, తన్నిర్మాతలు బ్రాహ్మణులేయగుట కాదు; భారతీయనాగరికత యొక్క స్వరూపస్వభావములు తత్త్వాన్వేషణపరులు, దైవవిశ్వాసధురీణులు నగుమహనీయులచే నిర్మింపఁబడిన వని యర్థము. సంఘబోధకులు, ప్రభువులు తత్త్వవేత్తలే కావలె నన్న ప్లేటోమహాశయునియాశయము భారత దేశములో ననుష్ఠింపఁబడినది. పరమసత్యము లన్నియు నాత్మసంబంధములగుటచే, ప్రజల నిత్యజీవితము వాని ననుసరించి సంస్కారము నందవలెను.

భారతభూమిలో మత మెన్నఁడు నొకేసిద్ధాంతమును బట్టుకొని యూఁగులాడు పిడివాదము గాదు. వ్యాప్తిచెందుచున్న తత్త్వవిచారణ ననుసరించి, నూతనభావముల నెల్లపుడు తనలోఁ జేర్చుకొను సహేతుక సమన్వయవిధానమే భారత తత్త్వము. భావపురోభివృద్ధితోపాటు ముందుకుఁ బోవుచు విషయసత్యాసత్యముల నెప్పటికప్పుడు పరిశోధించి, చేసిన నిర్ణయములను తాత్కాలికముగాఁ జూచుపద్ధతి యది. భారత విజ్ఞానము, మేధస్సున కధికప్రాముఖ్యము నిచ్చి, మతస్థానమునఁ దత్త్వజ్ఞానమును నెలకొల్పిన దనుసామాన్యవిమర్శనము, భారతీయతత్త్వము హేతువాదనిబద్ధ మని ధ్రువపఱచుచున్నది. ఒకతత్త్వనిర్మాణాధారము లేకుండ నెన్నఁడు నెట్టిమతోద్యమము తలయెత్తియుండలేదు. హేవల్ అనునాతఁ డిట్లువ్రాసినాఁడు: "భారతదేశములో మతమెన్నఁడు నొకప్రత్యేకవాదము

కాదు. అదిఆధ్యాత్మికాభివృద్ధిలో భిన్నాంతరువులకు, జీవితములో భిన్నఘట్టములకు సరిపోవు నిత్యమానవపరివర్తనముయొక్క తాత్కాలిక మైనయొక సూత్రనిర్మాణము."* ఎప్పుడెప్పుడు తత్త్వపరిశీలనము సంకుచితసిద్ధాంతశాఖల రూపము నొందయత్నించెనో, అప్పుడు సంస్కారోద్యమములు బయలుదేఱి, ఆయాభావములను విమర్శనాగ్నిపాత్రములఁ బోసి అసద్భావములను నిర్మూలించి, సత్యభావములను సమర్థించి పోషించుచుండెడివి. అనుశ్రుతముగా వచ్చినసంప్రదాయములు, విశ్వాసములు, మార్పుచెందినకాలమునకు సరిపడకపోవుటయేకాక, అసత్యములుగాఁ దోఁచినపుడు, ఏమహాదేశికునదో అంతర్దృష్టి, ఒకబుద్ధునిదో మహావీరునిదో, ఒకవ్యాసునిదో శంకరునిదో, తత్త్వజిజ్ఞాస ప్రపంచమున నుద్భవించి, యుబ్బుఁతలూఁగించెడిది. అట్టిమహనీయు లుద్భవించిన ముహూర్తములు భారతదేశచరిత్రములో సుప్రసిద్ధములైనవి. ఏలన, నివి పునర్విచారణ, పునర్విలోకనము చేయుముహూర్తములు. ఈసమయములలో, జన్మస్థానము తెలియకుండ నిచ్చవచ్చినచోట వ్యాపించు పరమాత్మముఖావిర్భూత మహావేశపూర్వకాహ్వానమును గుర్తించి మానవశక్తి తనబ్రహ్మజిజ్ఞాసకు నూతనారంభము చేసి నూతనాన్వేషణము సాగించినది. తత్త్వరహస్యమునకును, దైనిక ప్రజాజీవితమునకును గలసన్నిహితసంబంధమే, మతము నెల్లపుడు సత్యమైనదిగను సజీవముగాను నిలఁబెట్టునది.

---

* ఆర్యన్ రూల్ ఇన్ ఇండియా. పుట. ౧౨౦.

చూ. 'హార్టుఆఫ్ హిందూస్థాన్' పైవ్యాసము చూడు. హిబ్బర్టు జర్నల్, అక్టోబరు ౧౯౩౩.

మతసమస్యలు తత్త్వజిజ్ఞాసను బ్రేకెత్తించును. పరమాత్మస్వరూపము, జీవితగమ్యస్థానము. జీవాత్మపరమాత్మ సంబంధము మున్నగుసమస్యలపైనే భారతీయులమానసము లనుశ్రుతముగాఁ గేంద్రీకృతము లగుచువచ్చెను. భారతవర్షమున, తత్త్వశాస్త్రము, మతధర్మసమాలోచనములనుండి సంపూర్ణముగా విడివడకున్నను, తత్త్వవిచారమున కీమతావేశము లెన్నఁడాటంకములు కలుగఁజేసియుండలేదు. మత, తత్త్వముల సంబంధమెట్టియపార్థములకుఁ దావొసఁగలేదు. సిద్ధాంతమునకు ననుష్ఠానమునకు, శాస్త్రప్రవచనమునకు జీవితమునకు నత్యంతసన్నిహితత్వము గలిగియుండుటచే నేతత్త్వము ప్రజాజీవితాచరణమునకుదూరమగునో ఆతత్త్వము చిరకాలము మనఁజాలదు. తత్త్వసూత్రములకు జీవితమునకుఁ గలగాఢసంపర్కము నెఱిఁగియున్నవారి కీతత్త్వశాస్త్రమొకజీవితవిధానము నాత్మసాక్షాత్కారమున కొకపద్ధతియునై వెలయును. భారత దేశములో నేవేదాంతశాఖయును, చివరకుసాంఖ్యమతమువంటిదైన నాచరణశూన్యమైనశుష్కసిద్ధాంతముగా నెన్నఁడునుండియుండలేదు. ప్రతివేదాంతసిద్ధాంతము నఖండనిశ్చయజ్ఞానమును గలిగించి మానవుని హృదయమును బరవశమొనర్చి యాతనియుచ్ఛ్వాసనిశ్వాసములలో లీనమైనది.

భరతభూమిలోఁ దత్త్వశాస్త్రము, ఆత్మపరీక్షావిమర్శనములు లేని దనువిమర్శన మసత్యము. అతిబాల్యదశలందును మతవిశ్వాసమును సమ్యక్సమాలోచనము పరిశీలించుచునే

వచ్చినది. వేదమంత్రములనుండి యుపనిషత్తులవఱకుఁ గలిగిన తత్త్వాభ్యుదయమునుండి జనించినమతాభివృద్ధిని గమనింపుఁడు. బౌద్ధమతకాలమునాఁటికి తత్త్వవిచారము నిశ్చంచలాత్మవిశ్వాసముగా మాఱి, బుద్ధివాదమున నేప్రమాణమునకును దాస్యమంగీకరింపక, సత్యాన్వేషణమునకు సరిహద్దులు గమనింపక, అన్నివిషయములలోఁ జొచ్చి, అన్నిటిని సునిశితతర్కాయుధముచేఁ బరిశీలించి, సహేతుకవాద మెచ్చటికిఁ దీసికొనిపోయిన నచటికిఁ బోవెఱవనిపద్ధతియై వెలసినది. మనము దర్శనశాస్త్రములయొద్దకు వచ్చునప్పటికి, సమ్యక్పరిశీలనముచేయుపట్టుదలతోఁ గూడినబ్రహ్మాండప్రయత్నములు గోచరించును. ఈదర్శనములు, సంప్రదాయమతవిశ్వాసమునుండి యెంతస్వతంత్రముగాఁ బ్రవర్తించినవో, దేవునియొక్క అస్తిత్వమును సూత్రములచే ధ్రువపఱచుట సాధ్యముకాదని నిశ్చయజ్ఞానమును గల్గియున్నమాట నిజమైనను, ఆవిషయమునుగూర్చి మౌనము వహించినసాంఖ్యదర్శనము తెల్పుచున్నది. వైశేషికయోగశాస్త్రములు, జగదీశ్వరు నొకని నంగీకరించినను, నాతఁడు సృష్టికర్తగా నంగీకరింపవు. జైమిని, దేవునిఁ గూర్చి ప్రసంగించి, యాతనికి విశ్వపతిత్వముఁ గాని, ధర్మప్రవర్తనాధికారముఁ గాని లే వని నిరూపించెను. ఆదిబౌద్ధమతము దేవునిగూర్చి యౌదాసీన్యము వహించెను. చార్వాకులు దేవుఁడే లేఁడని వక్కాణించి, వేదములను, పురోహితులను నిందించి, విషయసుఖమే మోక్ష మని వర్ణించిరి.

మతమునందు, సంప్రదాయములయందుఁ గలయఖండ గౌరవము తత్త్వజిజ్ఞాస నెన్నఁడు స్తంభింపఁజేయలేదు. భరత వర్షమున గొప్పవిచిత్ర మేమన వ్యక్తి వర్ణనిబంధనములకు సాంఘికజీవితములో బద్ధుఁడై, మతాభిప్రాయప్రపంచమున స్వేచ్ఛా విహారమున కధికారి యైనాఁడు. ఏయేమతశాఖలందు జను లుద్భవించినను, నాయాశాఖలవిశ్వాసములను తర్కించి నిర్భ యముగా విమర్శింతురు. అందుచేతనే మతద్వేషి, నాస్తికుఁడు, సంశయాత్మకుఁడు, హేతువాది, స్వచ్ఛందభావప్రియుఁడు,భోగ ప్రియుఁడుకూడ భారతదేశమున విహరింపఁగల్గిరి. "మునికొక మత"మని మహాభారతము చెప్పుచున్నది.

సరతోముఖమానవప్రవృత్తి ధర్మమును, తదంతర్గత సత్యమును దెలిసికొనుటకై భారతీయమానస మెట్టికృషిచేసె నో, బుద్ధిపాటవ మెంత కలిగియుండెనో దీనివలనఁ దెలియు చున్నది. జంతుశాస్త్రము మొదలు శిల్పశాస్త్రమువఱకును గల సర్వశాస్త్రములవిషయములోను, కళల విషయములోను— అనఁగాఁ గేవలతత్త్వమతశాస్త్రములలోనే కాక—తర్కవ్యా కరణములు, ఛందోభాషాశాస్త్రములు, జ్యోతిర్వైద్యశాస్త్ర ములు మున్నగునన్నిటిలో భారతీయులతార్కికశక్తి పనిచేసినది. జీవితమున కవసరము, మనోహరము నైనప్రతివిషయమును గూర్చియు నన్వేషణాపరిశీలనములు జరిగినవి. గుఱ్ఱముల నెట్లు మేపుట, ఏనుఁగుల నెట్లు శిక్షించుట మున్నగునల్పవిషయము లనుగూడఁ దీసికొని అశ్వగజశాస్త్రములు రచించి తత్సంబంధ

సాహిత్యములను నిర్మించిన భారతీయుల సర్వతోముఖధీవికా సలక్షణము లెంతగొప్పవో తెలియఁగలవు.

సత్యస్వరూపనిరూపణమునకు వలయుతత్త్వవిచారము, ఆత్మపరిశీలనముతోఁ గాని విషయపరిశీలనముతోఁ గాని యారంభమగును. భరతవర్షమునఁ దత్త్వాన్వేషణముయొక్క కేంద్రి మాత్మయందే కలదు. బాహ్యదృష్టికిఁ దాత్కాలికవిషయ పరంపరలు గోచరించును. భరతభూమిలో "ఆత్మానంవిద్ధి." 'ఆత్మను తెలిసికొనుము" అనునదే ప్రవక్తలయొక్కయు ధర్మముయొక్కయు సారమైయున్నది. మానవునిలో నంతర్భూతమైయున్న ఆత్మవస్తువు సర్వసృష్టికేంద్రమై యున్నది. మన స్తత్త్వశాస్త్రనీతిశాస్త్రములు మూలశాస్త్రము లైనవి. అమిత వైవిధ్యములతో, సూక్ష్మపరిణామములతోఁ గూడినమనస్సుయొక్కచరిత్రము సంపూర్ణముగా వర్ణింపఁబడినది. భారతీయ మన స్తత్త్వశాస్త్రము, సత్యమును దర్శించుటకుఁ బ్రధానమైన దేకాగ్రత యని గుర్తించెను. సంకల్పముయొక్కయు జ్ఞానముయొక్కయు శాస్త్రీయశిక్షణమున కందరాని జీవితముయొక్క గాని, మనస్సుయొక్కగానివ్యాపారములు లేవని భారతీయ మన స్తత్త్వము నమ్మినది. మనశ్శరీరముల కత్యంతసంబంధమున్న దని యది గుర్తించినది. మానసికశక్తు లైనదూరశ్రవణ దూరదర్శనములు భారతీయులదృష్టిలో నసహజము లైనవి కాని యద్భుతము లైనవి కాని కావు. ఈశక్తులు, రోగగ్రస్తులయాలోచనములు కాని, దేవతావేశములుకాని కావు; ఇవిశాస్త్రీయశిక్షణముచే నావిష్కృతము లగుమానసశక్తులే. మానవ

మానసమునకు మూఁడవస్థలుగలవు; జాగ్రదవస్థ, సుషుప్త్యవస్థ, తురీయావస్థలు. స్వభావాతీతమైన మానవశక్తి యనఁబడునది, పెక్కుపేళ్ళతోఁ బిలువఁబడుచున్న సమాధి,ప్రతిభ, ఆవేశము, ఉన్మాదము మున్నగున వన్నియుఁ దురీయావస్థ (Super-Conscious) నుండి బహిఃప్రకటితము లగుచున్నవే. యోగశాస్త్ర మీవివిధవిషయములనుగూర్చి చెప్పును, ఇతరశాస్త్రములు వీనిని గూర్చి విశేష మాలోచింపకున్నను వాని నవసరమున్న చో నుపయోగించును.

మన తత్త్వశాస్త్రము సమకూర్చిన యాధారములపైఁ దత్త్వశాస్త్రనిర్మాణము నిలఁబడును. కేవలజాగ్రదవస్థయందలి సత్యములపైమాత్రమే యాధారపడినకారణమునఁబశ్చిమతత్త్వ శాస్త్రము పాక్షికమైన దనువిమర్శనము నిస్సారముకాదు. ఏలన, జాగ్రదవస్థ యెంతముఖ్యమో మిగిలినవికూడ నంతముఖ్యములే. జాగ్రత్స్వప్నసుషుప్తులలో దేనిని విడువక యన్నిటి యొక్కసత్యమును భారతీయవిజ్ఞానము పరిశీలించినది. జాగ్రదవస్థయే సంపూర్ణావస్థ యని తలఁచినచో భౌతిక, ద్వైత, నానాత్వతత్త్వసిద్ధాంతము లుద్భవించును. కేవలస్వప్నస్థితినే తీసికొన్నచో వ్యక్తిగతసిద్ధాంతము లుదయించును. స్వప్నరహితమగుసుషుప్తి నొక్కదానినే గ్రహించినచో నర్థమగుట కసాధ్యము లగుతత్త్వములు పుట్టును.

ఆత్మపరిశీలనసమస్యలకు భారతీయహృదయ మెక్కువ మక్కువ చూపిన దనిన, లోకసమస్యలకు వైముఖ్యము చూపిన దని తలఁపరాదు. భౌతికశాస్త్రముల విషయములో భారతవర్ష

మెట్టి విజయ మందినదో చూచినచో నీవిషయము తెలియఁ గలదు. ప్రాచీనభారతీయులు, గణితయంత్రశాస్త్రములకుఁ బునాదులు వేసిరి. వారుభూమిని కొలిచిరి, సంవత్సరమును భాగించిరి, ఆకాశమును సరిగా లిఖించిరి, సూర్యాదిగ్రహ మండలములగతిని వివరించిరి, పదార్థనిర్మాణసామగ్రిని శోధించిరి, పశుపక్షి వృక్షబీజస్వభావముల నిర్ణయించిరి.* ప్రపంచములోని జ్యోతిశ్శాస్త్రవిషయముల జన్మమునుగూర్చి చేయఁబడిన నిర్ణయము లెట్టివైనను, జ్యోతిశ్శాస్త్ర రేఖాగణితములకుఁ బ్రయోగింపఁబడిన బీజగణితమును. (Algebra) మొట్టమొదట హిందువులే కనిపెట్టి రని చెప్పనగును హిందువులనుండి అరబ్బులు బీజగణితసూత్రములను నేర్చికొనుట యేకాక, సంఖ్యలు, దశాంశములు గూడ నేర్చికొనిరి. ఇవియే నేఁడు పూర్తిగా ఐరోపా యంతయు వ్యాపించి, గణితశాస్త్రాభివృద్ధి కఖండసేవ యొనర్చినవి. † "సూర్యచంద్రులగతులను. హిందువులు స్పష్టముగా నిర్ణయించిరి. చంద్రపరివర్తనము విషయములో గ్రీక్కుల

* కోపెర్నికస్ జననమునకు నిశ్చయముగా 2000ల సంవత్సరముల ప్రాచీనమైన ఐతరేయబ్రాహ్మణ మిట్లు చెప్పుచున్నది; సూర్యున కుదయాస్తమయములు లేవు. సూర్యుఁ డస్తమించుచున్నాఁడని ప్రజలు తలంచుట లోనిభావ మేమనఁగాఁ,బగలు పూర్తియగునప్పటి కాతఁడు స్థానమును మార్చి, ఒకవైపువారికి రాత్రిని, మఱొకవైపువారికిఁ బగటిని గలుగఁజేయుచున్నాఁడు. సూర్యుఁ డుదయించుచున్నాఁ డనఁగా. రాత్రిపూర్తియగువేళ కుఁ దనస్థానమును మార్చి, యిటుప్రక్కవారికిఁ బగలు, నటువైపువారికిఁ రాత్రి కలుగుచున్నది. నిజమున కాతఁ డెన్నఁడు నస్తమింపఁడు." హాగ్సు ప్రతి. iii—44. ఛాందోగ్యము. iii—II—1—3.

† మానియర్విల్లియమ్సు. హిందూవిజ్ఞానము. పుట. 1841.

భావములకంటె నధికసత్యములు సమీపములైనవే హిందువుల నిర్ణయము లని తేలినది. హిందువులు సూర్యగమనమార్గమును 27, 28 భాగములు చేసిరి. ఇది చంద్రుని పరివర్తనమును బట్టియో, స్వయముగానో ఊహించిరి. అమితతేజోరాసు లగు ముఖ్యగ్రహములఁగూర్చిన వారిజ్ఞానము పూర్ణమైనది. హిందువులకు ఛాల్డియనులకు సమమైన అఱువది సంవత్సరముల చక్రమును వారిపంచాంగములలోఁ జొప్పించి, సూర్యచంద్రగతులతోపాటు, గురువు కాలమునుగూడ వారునిర్ణయించిరి." అతిపురాతనకాలమందే తర్క-వ్యాకరణములను హిందువులు రచించి రని నేఁడు లోక మంగీకరించినవిషయమే. విల్సన్ వ్రాసినాఁడు; "వైద్యములోను, జ్యోతిర్వేదాంతములందువలెనే యొకప్పుడు విజ్ఞానవిలసితము లగుప్రపంచములోని కొన్ని జాతులతో సమానముగా హిందువులు పేరొందిరి. శల్యశాస్త్రము నభినవవిజ్ఞానవేత్తలు కనిపెట్టి లోకమున కీయకపూర్వమే, యీ శాస్త్రనిర్మాణచరిత్ర యేజాతికి లేనపుడు, వైద్యశాస్త్రమున భారతీయులు పూర్ణవైద్యవిద్యను, శస్త్రచికిత్సావిధానమును గనిపెట్టి ఆచరణయోగ్యము లొనర్చిరి". యంత్రములు చెప్పఁదగిన వెవ్వియు వారు కనిపెట్టనిమాట నిజమే. దీనికిఁ గారణము, మధురజలసమృద్ధి గలనదులు, సర్వాహారసంపదలను ప్రసాదించుటచే, వారికీపని యనవసరమైనది. పశ్చిమఖండమందైననీయంత్రనిర్మాణము పదునాఱవశతాబ్దమునమాత్రమే యారంభమైన దనుసంగతిని మనము మఱువరాదు. ఇంచుమించుగా నాసమయముననే భారతదేశము స్వాతంత్ర్యమును

గోల్పోయి, పరాధీనపుబ్రతుకునకు లోనైనది. ఈపరాధీన జీవిత దశలో, భారతవర్షమునకుఁ గ్రియాశూన్య మగుమాంద్యరోగ మావహించినది. ఈదుర్దశ వచ్చుటకుఁ బూర్వము జ్యోతిర్గణిత రాసాయనికవైద్యశస్త్రచికిత్సాశాస్త్రములందును, ఇతరభౌతిక విద్యలందు నేకాక, సర్వకళలందును,వృత్తిపారిశ్రామికవిద్యలందు నుగూడ జగద్వంద్యమైనపదవి భారతదేశమాక్రమించినది. శిలలను జెక్కి విగ్రహములను జేయుట, బంగారమునకు నగిషీ చేయుట, సున్నితవస్త్రములను నేయుట భారతమాత బాగుగా నెఱుఁగును. అత్యంతనాగరికజాతికి వలయుకళాపరిశ్రమ లన్నిటిని ఆమెవ్యాప్తిచేసినది. భారతీయనౌకావళి సముద్రములు లంఘించినవి. భారతదేశవాణిజ్యసంపద ఈజిప్టు మున్నగు మధ్యదేశములనుండి రోమువఱకు వ్యాపించినది. నాఁటి భరతధాత్రియొక్క మానవుని, సంఘమునుగూర్చినభావములు, మతధర్మసూత్రములు, విఖ్యాతములై వెలసినవి. అందుచే భారతీయులాధ్యాత్మికతత్త్వమునను, కవితాగోష్ఠిలోను కాలము గడపిరేకాని, ప్రకృతి తత్త్వశాస్త్రములజిజ్ఞాస నెఱుఁగ రని యనుటుచితవాదము కాదు. ఒకటిమాత్రము నిజము; వారు వస్తువుల యేకత్వమునుమాత్ర మధికముగా నన్వేషించి, నానాత్వమును, భిన్నత్వమును నప్రధానముగాఁ జూచిరి.

ఒకవిధముగా నాలోచించినచో, ధ్యానవిశిష్ట మగుమానస మధికమగు సమన్వయదృష్టిని, ప్రాకృతికమైన మానసము వస్తువిభాగదృష్టిని గలిగియుండును. సృష్టిస్థితిలయములతోఁ గూడిన సర్వతోముఖవిజ్ఞానవిలసితమైన విశ్వజనీనతత్త్వమును వెల్లడించు

నది సమన్వయదృష్టి. సంపూర్ణత్వము నేకత్వమును విడిచి, ప్రత్యేకవిషయములభౌతికపరిశీలనమునఁ బడి, సంకుచిత మగునది ప్రకృతిశాస్త్రదృష్టి. భారతీయవిజ్ఞానము, విశ్వవిశాలములగు మానవాతీతభావముల నోలలాడుటచే, భారతవర్షము, కేవల మూహాజీవితములగడపుచులోకమునవిదేశీయులవలె సంచరించు తత్త్వవేత్తల నుద్భవింపఁజేసిన దనువిమర్శనమున కవకాశమిచ్చినది. పాశ్చాత్యవిజ్ఞానము భిన్నత్వముతోఁ గూడి లౌకికలాభసమన్వితమైనదిగా గోచరించును. పశ్చిమదృష్టి పంచేంద్రియశక్తిపై నాధారపడును. భారతీయదృష్టి, ఆత్మావలోకనముపై నాధారపడి జగద్రహస్యము నెఱుఁగ యత్నించును. మఱియు దీనికిఁ గారణము ప్రకృతివాతావరణమని యిదివఱకేచెప్పినట్లుగాఁ, బ్రకృతిసహజసంపద, తీక్షక, భారతీయహృదయమునకు ధ్యానదృష్టి నొసఁగి, సృష్టిసౌందర్యమును నాత్మజ్ఞానమును గూర్చి, గీతాగాథలలోను, గానసృత్యములలోను, గర్మమీమాంసలలోను, దాత్కాలికలోకవ్యామోహములకు లొంగకుండ నానందమయజీవితమును గడపనిచ్చినది. దీని ననుసరించి "ఊహామగ్నమైనఆసియా"యని నిందాపూర్వకముగాఁ జేయఁబడినవిమర్శనమున కాధారము లేకపోలేదు. ప్రస్తుతకాలములో వేఱుచేయఁబడినవివిధశాస్త్రములను, భారతీయసమన్వయదృష్టి తనతత్త్వశాస్త్రమునందు లీనమొనర్చినది. ఇంచుమించుగా నూఱుసంవత్సరములనుండి, పశ్చిమఖండమున నదివఱకు దత్త్వశాస్త్రమున విలీనములైయున్న, అర్థ, రాజ్యాంగ, నీతి, మనస్తత్త్వవిద్యలు క్రమముగా వేఱుచేయఁబడినవి. ప్లేటోశాల

మునం దూహోద్దృష్టి నరికట్టి, మానవజీవితమున కవసరమైన సర్వశాస్త్రములు తత్త్వశాస్త్రమున నిమిడియుండెడివి. అట్లే, ప్రాచీనభారతీయశాస్త్రగ్రంథములందు సర్వశాస్త్రభావములు తత్త్వజిజ్ఞాసలో లీనమై యున్నవి. ఇటీవలఁ బశ్చిమఖండమునఁ దత్త్వశాస్త్ర మనఁగాఁ గేవలవాదోపవాద నిబద్ధ మైనరసహీన నిర్మాణముగా మాఱుటచేతనే, ఊహారహితము, ఆచరణశూన్యము నైనశుష్కసూత్రసముచ్చయమే తత్త్వశాస్త్ర మను భావము ప్రజలలో వ్యాపించుటకుఁ గారణమైనది.

భారతీయుల, అంతరవలోకనకాంక్షను, సమన్వయదృష్టిని మనము గమనించినచో, జగత్సత్యము బ్రహ్మైకత్వముగా నెట్లు లభించునో తెలియఁగలదు. వేదవాఙ్మయ మంతయు నీయేకబ్రహ్మసత్యమును సూచించును; దీనిపైనే బౌద్ధబ్రాహ్మణమతసిద్ధాంతము లన్నియు నాధారపడినవి; భారతదేశమున గోచరించిన అత్యుత్తమవేదాంతసారమిదియే. ద్వైతమును, ననేకత్వమును ప్రతిపాదించునట్టి మతశాఖలైనను నీసిద్ధాంతమును బునాదిగాఁదీసికొనినవి. బహుళాభిప్రాయములతోఁ గూడినభారతీయవిజ్ఞానమును బరిశీలించినచో, మొత్త మ్మీఁద, సృష్టి, జీవితముల నేకబ్రహ్మతత్త్వముగా నిర్ణయించును. ఈఅద్వైతసూత్రము కేవలము పిడివాదముగాఁ గాక, పెక్కురూపములలో నొకప్పుడు పరస్పరవిరుద్ధరూపములలోఁ బ్రకటితమైనది. వివరణములు, పరివర్తనములు ప్రస్తుతము విడిచిపెట్టి, ఈఅద్వైతమే యేముఖ్యరూపములు దాల్చినదో పరిశీలింతము. దీనివలన భారతదేశములోని తత్త్వశాస్త్రముయొక్క స్వరూపస్వభావ

ములు బోధపడును. దీనిని నాలుగువిధములుగా విభజింపవచ్చును. (౧) అద్వైతము (౨) శుద్ధాద్వైతము (3) విశిష్టాద్వైతము (౪) గర్భితాద్వైతము.

అనుభూతసత్యాంశములపై నాధారపడి తత్త్వశాస్త్రము పెంపొందును. అనుభవాంశములు కేవలవ్యక్తిగతములా, సార్వజనికములా యనువిషయమును నిశ్చయించుటకుఁ దర్కసమాలోచన మవసరము. చూచినసత్యములనునిశ్చయముచేయునపుడే సిద్ధాంతము లంగీకరింప నర్హములు. పశ్చిమప్రకృతిశాస్త్రవేత్తలెంతశ్రద్ధాభక్తులతో భౌతికప్రపంచమును బరిశీలించిరో, అంతశ్రద్ధాసక్తులతో, భారతీయతత్త్వజ్ఞులు, మానసికాత్మికప్రపంచపరిణామములను బరిశీలించిరని యిదివఱకే చెప్పియున్నాము. అద్వైతరూపము ఏకతత్త్వవాదనిర్ణయము లాంతరంగికజీవితపరిణామపరిశోధనములపై నాధారపడినవి.

జీవాత్మవ్యాపారము జాగ్రత్స్వప్నసుషుప్తు లను త్రివిధావస్థలుగా గ్రహింపఁబడినది. స్వప్నావస్థలో నొకవాస్తవికప్రపంచము ప్రదర్శింపఁబడినది. మెలకువవచ్చినవెనుక నది యదృశ్యమగుటచే, స్వప్నావస్థలో మనము చూచినవానిని నిజములని భావింపము. కాని, ఉన్నంతకాలము, తదితరావస్థలతోఁ బోల్చకున్నచో స్వప్నప్రపంచము నిజమే. కలలోఁ గనఁబడిన దబద్ధమని మెలకువగా నున్నప్పటిస్థితి ననుసరించి చెప్పచున్నామే కాని, అన్నియవస్థలు దేనిపై నాధారపడియున్నవో యట్టిపరమసత్యముతోఁ బోల్చి మనము నిర్ణయించుటలేదు. జాగ్రదవస్థయును స్వతంత్రమైన పరమసత్యముకాదు. మెలకువగా నున్న

ప్పుడు మనము చూచినజగత్తు మనము మెలకువగా నున్నంత సేపే సత్యము; స్వప్నసుషుప్తులలో నది యదృశ్యమగును. కల కలలోని లోకము నొకదానిపై నొకటి, మెలకువ, మెలకువ లోని లోకమునొకదానిపైనొకటి నిలిచిన ట్లేనిలిచియున్నవి. అవి స్వాతంత్రము లగుసత్యములు కావు. శంకరాచార్యునిమాటలలో "స్వప్నప్రపంచము నిత్యము నదృశ్య మైనచో జాగ్రత్ప్రపంచము నరుదుగాఁ బ్రత్యేకపరిస్థితులలో నదృశ్యమగుచున్నది." సుషుప్తిలో, జీవాత్మవ్యాపారము స్తంభించుచున్నది. కొందఱు భారతీయతత్త్వజ్ఞులు సుషుప్తిలో బాహ్యస్మృతి లేకయున్నను, ఆత్మ, స్మృతి గలిగి యున్నదని చెప్పుదురు. ఏదియెట్లైనను, సుషుప్త్యవస్థ కేవలశూన్యావస్థ కా దని, మెలకువ వచ్చినతరు వాత, సుఖనిద్రాస్మృతివలనఁ దేలుచున్నది. ఏవస్త్వనుభవము లేకున్నను, జీవాత్మమాత్ర మున్నదని మనము నిశ్చయించి తీర వలెను. స్వప్నశూన్యమైనగాఢనిద్ర యున్నంతకాలము, జీవాత్మకు గోచరించువస్తు వేదియును లేదు. ఈవివిధావస్థలలోఁ గనఁబడి యదృశ్యము లగుచుండుభావపరంపరలచే నస క్తమై పరిశుద్ధాత్మ ప్రకాశించుచునే యున్నది. "ఏది మార్పునొందదో, మార్పునొందువస్తువులమధ్యమందుండి తాను మార్పుచెందదో, అది యావస్తువులనుండి భిన్నమైనది.[౧] అవస్థలు మాఱును గాని వస్తు వొకటే. "భూతవర్తమానములందు, జరిగిన జరుగ నున్న నెలలు, ఏండ్లు, శతాబ్దములు, యుగచక్రములవలన,

---

౧. "యేషువ్యావర్తమానేషు యదనువర్తతే
తత్తేభ్యోభిన్నమ్." భామతి.

నీయాత్మవస్తువు స్వయంప్రకాశమై, యేకమైయుదయాస్తమయ రహితమై వెలుఁగుచున్నది."౧ దేశకాలములు, తత్సంబంధ వస్తుజాలముతోఁగూడ నదృశ్యములైపోయి సర్వావస్థలనుండి యేదిస్వతంత్రమై యున్నదో అదియే ఆత్మ. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలలో దృశ్యమానము లగుచుండు సర్వవస్తుభావ నాటకమునకు సాక్షియై ప్రకాశించున దీయాత్మ. మంచిచెడ్డలకు, ధర్మాధర్మములకు, సుఖదుఃఖములకు నతీతమైన దేదియో మనయందున్న దని నిశ్చయింపవచ్చును. "ఆత్మ ఎన్నఁడును చావదు, పుట్టదు—అజమై, శాశ్వతమై, సనాతనమై దేహనాశనముతో నశింపనిది, చంపువాఁడు తాను చంపఁగలననియు, హతుఁడు తాను నిహతుఁడననియుఁ, దలఁచినచో వారిరువురును నిజము నెఱుఁగనివారు—ఆత్మ చంపదు చావదు."౨

నిత్యసమానత్వముగల యాత్మతో పాటు దృశ్యమాన వస్తుపరంపరయును గలదు. ఆత్మ యవినాశము స్థిరము. వస్తుజాలము క్షణికము పరిభ్రమణశీలము. ఆత్మ సర్వవస్తువులనుండి స్వతంత్రమైనది గనుక స్థిరము; వస్తుజాల మవస్థాభేదములపై నాధారపడినది కావున నస్థిరము.

మనము జగదస్తిత్వము నెట్లర్థముచేసికొనవలెను? వస్తుజాలము దేశకాలకారణములచే బంధింపఁబడియున్నది. ఆత్మ ఏకము మార్పులేనిది, సర్వవ్యాప్తమునైనచోఁ,బరస్పరవిరోధలక్షణములు గలవస్తువులు లోకమునఁ గన్పట్టుచున్నవి. లోకమును

౧. పంచదశి 1—7.

౨. కఠోపనిషత్తు ii-18-19: భగవద్గీత II- -19-20.

మనము 'అనాత్మ' ద్రష్టయొక్క 'దృశ్య' మని చెప్పవచ్చును; కాని, యిది నిజ మెన్నఁటికిని గాదు. దృశ్యప్రపంచము యొక్క ప్రధానప్రమాణము లగు దేశ, కాల, కారణములు పరస్పరవిఘాతములైనవి. అవి పరస్పరాంశములపై నాధారపడి యున్నవి, వానికి స్వతంత్రమైన యునికి లేదు. కాని యవి లేని వానితో జమ కాదు. ప్రపంచము మనయెదుట నున్నది; దాని లో నుండి, దానిసాయమున మనము పనిచేయుచున్నారము. ఈసృష్టి యెందుకుఁ గలిగిన దనుప్రశ్నమునకు జవాబు మనకుఁ దెలియదు. గ్రహించుటకు శక్యము కాని ప్రపంచస్వభావ మునే 'మాయ' యనుశబ్దముతో వాడుచున్నారు. పరమసత్యమైన యాత్మకును నిత్యపరివర్తనమందుచున్న ప్రపంచమునకును సంబంధమెట్టిదని కాని, ఆత్మ, జగత్తు నీరెండు నెట్లెందుకున్న వని కాని ప్రశ్నించుట, ప్రతివస్తువునకుఁ గారణము తప్పక యుండ వలెనని మన మూహించుటయే. అందుచే ననంతమైన యాత్మ సాంతమగు నీప్రపంచ మెట్లైన దని కాని యెట్లు ప్రదర్శనమైన దనికాని యడుగుట, కేవల మసంగత మగుప్రశ్నమై యున్నది. పరిమితమైన దపరిమితమైనదానిని బ్రదర్శింపఁజాలదు. అపరి మితమైనది పరిమితమైనదిగా మాఱునెడ నాయపరిమితమైన దియుఁ బరిమితమై పోయినది. పరమసత్యమైన ఆత్మ, పరిచ్ఛేద్యమైన విశ్వదృశ్యముగా మాఱినదనుట పరమసత్యప్రమాణము నకు విరుద్ధము. పరిపూర్ణమైనవస్తువునకు లేశమైన లోప మెన్నఁడు సంభవింపదు. పరిపూర్ణజ్యోతిలోఁ జీకటియా ? పరిపూర్ణసత్యమైన పరమాత్మ పరిమిత ప్రపంచముగా మార్పుచెందెననుట

మన మంగీకరింపఁజాలము. మార్పుచెందుట తనకుఁగొఱఁత యున్న దని తలఁచుటయే; అనఁగాఁ బరిపూర్ణము కాదని స్పష్టము. పరమసత్య మెన్నఁడును దెలిసికొనుటకు సాధ్య మగునది కాదు. ఏలన, పరిమితము నసంపూర్ణమైనదే మనకుఁ దెలియును. పరిమిత మైనమనమనస్సు దేశకాలకారణముల సరి హద్దులను దాటి పోఁజాలదు. మన మీ దేశకాలకారణముల రహస్యముల నెఱుఁగఁజాలము. ఏలన, వానిలోఁ గలిసియున్న మనము వానిని వేఱుగా నూహింపఁజాలము. / మనజ్ఞానమంతయు మెలకువగా నున్న స్వప్నము. శాస్త్రము, తర్కము నట్టిస్వప్న భాగములు, స్వప్నసంతానములే ! తత్త్వశాస్త్రముయొక్క యిట్టివ్యర్థతనుగూర్చి సంతోషవిచారములు గాని, దూషణ భూషణములు గాని విడిచిపెట్టి, దీనిస్వభావము నర్థము చేసి కొనుటే మనకర్తవ్యము. అప్రమేయప్రజ్ఞానిధు లయ్యు, ముగ్ధ వినయమూర్తులై,ప్లేటోమహాశయుఁడో లేక నాగార్జునుఁడో, క్యాంటో లేకశంకరుఁడో, మనజ్ఞానమంతయుఁ బరిచ్ఛిన్నజగత్తు నుగూర్చినదే కాని, పరమసత్యమునుగూర్చినది కా దని వక్కాణిం తురు. పరమాత్మతర్కలబ్ధముకానిదైనను,సత్యాన్వేషకులందఱు తమజీవితములో నవినాభావముగా లీనమైయున్న దానినిఁగానను భవముచేఁ దెలిసికొందురు. సర్వము పరమాత్మమూలముననే తెలియును. సర్వజ్ఞానసాక్షి పరమాత్మయే, సత్యాంశములయం దలితత్త్వముపైఁ దనవాద మాధారపడు నని యద్వైతిచెప్పును. మనకుఁ దెలిసినట్టియుఁ దెలియనట్టియు సర్వవస్తువులం దున్న శక్తియగుటచే, నందఱియనుభవములో నున్న అత్యంతాంతరం

గికసత్యమే పరమాత్మ; తెలిసికొనుటకుఁ గలవస్తువు పరమాత్మ; తెలిసికొనునదియుఁ బరమాత్మయే. అదియే సత్యము—శాశ్వతము నైనది; తదన్య మేదియును లేదు. వివిధనామరూపప్రపంచమునుగూర్చి యద్వైతి చెప్పున దేమన, నది యున్నది, పోవు నది యని చెప్పును. అది యె ట్లనునది, మనకుఁ దెలియదు.అది స్వవిరుద్ధమైనది; కాని నిజమే, గౌడపాదశంకరుల అద్వైతములోని తత్త్వ మిదియే.

ఈభావముచేఁ దృప్తిపొందని అద్వైతవాదులుకొందఱు, మనఅజ్ఞానమును 'మాయ' యనునామముతో వ్యవహరించి నంతమాత్రమునఁ బ్రయోజనము లే దని యందురు. హృదయాకాశములో ననుభవైకవేద్యమై, యెన్నఁడు మార్పు, నాశనము లేనిపరమాత్మకును, నిత్యపరివర్తనశీల మగుప్రపంచమునకును గలసంబంధమునుగూర్చి యింకొకవిధముగా వీరుసిద్ధాంతీకరించుచున్నారు. పరమాత్మయొక్కపరిపూర్ణతత్వమును మనము చెక్కుచెదరకుండ నిలుపవలయునన్నచోఁ బరమాత్మేతర మేమియును లేదు గావున, జగత్తు, పరమాత్మ కానియేయితర వస్తువునుండియో కలిగిన దనుటకు వీలు లేదు. అందుచే వారు పరమాత్మయొక్కసంకోచరూపమే ప్రపంచమనుచున్నారు. ప్లేటో తత్త్వములోనియనాత్మవంటిదికాని, అరిస్టాటెల్ సిద్ధాంతములోని పదార్థమువంటిదికాని, యొకవ్యతిరేకధర్మమునూహించి,తన్మూలమున జగముద్భవమైన దని చెప్పుచున్నారు. ఈధర్మముచేతనే అనేకత్వములో నీయేకపరమాత్మ ప్రవేశించుచున్న దని చెప్పుచున్నారు. సూర్యమండలమునుండి కిరణకోటిప్రసరించుచున్నది.

కాని, స్వతస్సిద్ధముగాఁ గిరణములు సూర్యునిలో లేవు. అంతములేనిప్రకృతిని, అశాంతిని గలిగిన ప్రపంచప్రవాహమునకుఁ గారణభూత మైనయొకధర్మమునే మాయ యని పిలుచుచున్నారు. మిథ్యామాత్రమైనపరమాత్మ సంకుచితత్వముచే నీలోక ముద్భవించుచున్నది. పరమాత్మ ప్రపంచములోని సర్వవస్తుసదాప్రపమై యున్నది. లోకములోనివస్తువులు తమకులోపమైన యసంపూర్ణత్వమునుండి పూర్ణత్వము నొంద నిత్యము ప్రయత్నించుచుఁ, దమప్రత్యేకత్వమును వ్యక్తిత్వమును విడనాడ శక్యము గాక, మాయ యను భ్రాంతిచే నపహతములగుచున్నవి. ద్వంద్వభ్రాంతిని విసర్జించి,అపరిపూర్ణత్వమును సంహరించి, మాయాయవనికను జించివైచి, నిష్క్రియత్వము నభ్యసించినచో దేశకాలకారణములు తిరిగి, పరమాత్మలో నదృశ్యములగును. మాయయొక్క అసంపూర్ణత యెంతకాల ముండునో, అంతకాలము మనము దేశకాలకారణములచే అల్లఁబడిన వలలోఁ జిక్కుకొని యుండకతప్పదు. మాయ మానవకల్పితము కాదు. అది మనబుద్ధి పూర్వకమైనదియు స్వతంత్రమైనదియును. మనవ్యక్తిత్వములకును, మనబుద్ధిబలమునకును గారణము సర్వశక్తివంత మైనమాయయే. దానినే యొకప్పుడు ప్రకృతి యని వాడుచుందురు. సృష్టిలయములక్రమము, ననంతమగుకాలచక్రపరిభ్రమణము, వీని కన్నిటికిఁ గారణము మాయాకల్పిత మైన యాదిసృష్టియొక్క అసంపూర్ణతయే. ప్రపంచము పరమాత్మయొక్క నిశ్చలత్వచలనము; పరమాత్మప్రతిబింబమే మాయ. ప్రపంచము పరమాత్మయొక్కమార్పు కాదు ; పరమాత్ముని

యింకొకరూపమే, పరమాత్మనుండి వేఱుగా మాయాప్రపంచ
ముండఁజాలదు. సంచలన మచల మైనదిలేనిదే లేదు. సంచల
త్ప్రపంచమూల మచలపరమాత్మలో నున్నది.

జగత్తు పరమాత్మయొక్క చలనమం దున్నట్లే అజ్ఞా
నము లేక అవిద్య, విద్య లేక జ్ఞానముయొక్క చ్యుతియం
దున్నది. సత్యము నెఱిఁగి, గ్రహింపవలె నన్నచో, మన
మవిద్య, తత్సంబంధబుద్ధ్యావరణములను విసర్జింపవలెను. జ్ఞాన
ప్రవేశముతో నవిద్యావినాశ మగును. అనఁగా బుద్ధిమాం
ద్యము కాదు. మాయాకల్పితజగత్తునుగూర్చి, మనబుద్ధిబల
ముచే మనము కల్పించుకొనినసూత్రావళిని సత్యనిర్ణయము
నందు విడిచిపెట్టవలె నని తత్త్వతర్కశాస్త్రములు మనకు
బోధించును. ఎంతకాలము మనము బుద్ధిబద్ధులమై, భిన్నత్వ
ముతోఁ గూడినజగత్తును నమ్మి యుందుమో యంతకాలము
నద్వితీయపరమసత్యదర్శనావకాశము దూరమగును. పరమాత్మ
సంకోచమువలన జగత్తును, విద్యాచ్యుతివలన నవిద్యయు నెట్లు
సంభవించినవనుప్రశ్నకు సమాధానము చెప్పఁజాలము. బుద్ధిసం
భవము లైనసూత్రము లన్నియు, స్వతంత్రత లేనట్టియు, జగ
త్తుపై నాధారపడినట్టియుఁ బద్ధతులపైనే నడచినవి కావున నవి
యథార్థములు కాఁజాల వనియుఁ బరమాత్మదర్శనమున కసమ
ర్థము లనియుఁ దత్త్వతర్కములు ఘోషించును. నిత్యపరిభ్ర
మణ మందుచున్నప్రపంచమునకు సంబంధములేనట్టియు, నవి
నాశమైనట్టియుఁ బరమాత్మనుగూర్చి బుద్ధి శక్తి మన కేదియు
స్పష్టముగాఁ జెప్పఁజాలదు; ప్రపంచకారణ మగుమాయను

గూర్చియుఁ జెప్పఁజాలదు. బుద్ధిబలము పరమాత్మదర్శనము నకు నూటిగా సాయపడలేదు. కాని, ఆత్మదర్శనము వలయు చో మనము దృష్టిని దలకిందొనర్పవలెను. అప్పు డది మనకు సత్యసూచనము చేసి, దానిని సమర్థించి, ప్రచురించుటకు సాయ పడవచ్చును. అద్వైతవాదులు, బుద్ధ్యతీతమైన యొకచూపు కల దనియు, దానికేఁ బరమాత్మసాక్షాత్కార మగుననియుఁ జెప్పుదురు. సర్వవ్యాపి యైనపరమాత్మసాగరములో నుఱికి, మునిఁగి, సర్వాత్మభావమును బొందవలెను. అప్పుడు పరమా త్మనుగూర్చి మన మాలోచించుట మాని, అనుభవింతుము; దాని నెఱుఁగుట మాని అదియే యగుదుము. ఇట్టియద్వైతవా దము, తర్కము, తర్కాతీతదృష్టి, పరమాత్మ, సృష్టివిభాగ ములతోఁ గూడి, కొన్నియుపనిషత్తులందును, నాగార్జునశంక రులు తత్త్వాతీతదశలందుఁ బలికినవాక్యములందును, శ్రీహర్షాది అద్వైతవాదులందును గోచరించును. వీనిప్రతిధ్వనులు, ప్లేటో పెర్మనేడ్సులందును, స్పైనోజాప్లాటినస్‌లందును, బ్రాడ్లీ బెర్గ్సను లందును, నితరగూఢతత్త్వజ్ఞులందును వినఁబడును.

ఇంద్రియాతీతదృష్టిలో గోచరించుపరమాత్మ యెట్టిదై నను, బుద్ధికిమాత్ర మది యొకసంపూర్ణశుష్కభావమే. జగత్తు యొక్కసర్వనామరూపములు నశించినపు డది మిగిలియుండు నందురు. సృష్టి నంతయు మూసఁ బోసి కరఁగించిన మిగులు సార మది. భూమిని సముద్రములను, సూర్యనక్షత్రాదులను, దేశకాలములను, మానవుని, దేవుని బుద్ధినుండి తొలఁగించు కష్టమైనఅభ్యాసముతోఁ గూడిన తత్త్వ మది. సర్వప్రపంచ

మును, జీవరాశిని, వస్తుజాలమును తొలఁగింపఁగా మన స్సాలో చించుటకు వేఱువస్తు వేదియు లేదు. పరిమితమైనది, యితరా ధారముపై నుండునది యగుమనస్సు, సర్వవస్తుజాల మదృశ్యమై నప్పుడు పనిచేయుట కేమియును లేక ఆందోళనపడును. భావ ప్రాధాన్యము గలమనస్సునకు "పరమాత్మయే యున్నది"ను నిందిరియాతీతదృష్టిగోచరమైనసత్య మేమియు లేదను నర్థమిః చ్చును. హేగెల్ చెప్పినట్లు, పంచేంద్రియగోచరము లగువస్తు వులతో మనస్సు పనిచేయును. మనస్సుయొక్క ఆలోచనాపద్ధ తిలోఁ బ్రతివస్తువు సత్యాసత్యములతో, నాత్మానాత్మలతోఁ గలిసియున్నది. అందుచే నిందిరియాతీతదృష్టిగోచర మగుపర మాత్మతత్త్వమువలనఁ దృప్తి కలుగనివారు, రూపవంతమై మానసగమ్య మైనయొకసమన్వయమును గోరిరి. అట్టివారు, నిర్గుణ మైనపరమాత్మను, సగుణ మైనసృష్టిని గలిపి, దేవుఁ డనుసమన్వయభావమును గాంచిరి. తీవ్రాద్వైతులైనను, ప్రపం చము పరమాత్మపై నాధారపడియున్న దనిరి. ఇప్పుడు బ్రహ్మ ము—జగము రెంటిసారమూర్తి యైనయొక దేవునిఁగాంచినాము. ఇందు నానాత్వము నేకత్వము, అంతము ననంతము నగురెం డును మేళవించినవి. ఇపుడు పరమాత్మ జగత్కర్తయై, జగ మును సృజించి, తిరిగి తనలోనికిఁ దీసికొనును. హేగెల్ మాట లలో వాద, ప్రతివాద, సమన్వయము లనంతమైనచక్రభ్రమ ణములో నడచుచున్నవి. దృశ్యమాన మగు ప్రపంచలక్షణము లేవనఁగా, నొకద్రష్ట, యొకదృశ్యము రెండు నుండవలెను. ప్రతిమూర్తిలో నీరెంటిసమ్మేళనమును గలదు. భగవంతునిలోఁ

కూడఁ బరస్పరవిరుద్ధము లైన యీ రెండును గలవు; ఇవి రెండును పరస్పరాధారభూతములై, అన్యోన్యరూపములే కూడ నైయున్నవి. శాశ్వతచక్రభ్రమణశీలము గలక్రియాశక్తిమూర్తి యగు పరమేశ్వరు నంగీకరించినపుడు, తృణబ్రహ్మపర్యంతము గల నానారూపవ్యక్తివస్తుజాలము సులభముగా నుద్భవించును. అట్టిపరమేశ్వరుని మనము నిర్ణయించినప్పుడు, పరమేశ్వరునకును, శూన్యమునకును మధ్యమందుఁ గలసర్వజీవకోటిజన్మమును నిర్ణయించినట్లే. ఇపుడు మనకు మానసకల్పితమైనజగత్తు మనస్సమాలోచనమున కనుగుణమై, మనస్సుచేఁబోషింపఁబడి కర్మకర్త లంశములుగా మేళవించినరూప మైనది. దేశకాల కారణములు వ్యక్తిగతములు కాక, జ్ఞానముయొక్క విశ్వవిశాలసూత్రము లైనవి. కేవలాద్వైతమం దున్నఏకత్వానేకత్వములసంబంధము మనకర్థముకానిదైన నిచట నాలోపము లేదు. ప్రపంచ మేకమయ్యు ననేకమైనది. రెంటిలో నేదియు నొంటరిగా లేదు. పరమేశ్వరుఁ డేకత్వమునకు మూలభూతుఁడు; ప్రపంచ మాపరమేశ్వరుని ప్రదర్శనము, లేక పరమేశ్వరుని స్వీయావిష్కరణము.

అద్వైతవాదము ననుసరించి, పరిపూర్ణపరమాత్మనుండి అత్యల్పసంకోచము పొంది, ఈషన్మాత్రభేదము కలవాఁడే దేవుఁడు. విద్యనుండి అత్యల్పచ్యుతిచే జనించినఅవిద్యాకల్పిత మూర్తియే యతఁడు. ఇంకొకవిధముగాఁ జెప్పినచో, నీపరమేశ్వరభావము మనమహాప్రజ్ఞాసంభవములైనవానిలో నత్యుత్తమభావము. కాని, విచారింపవలసినదేమనఁగా నది యొకబుద్ధి

సంజాత మగువస్తువే. మనబుద్ధినుండి జనించినయీభావ మెంత గొప్పదైనను విద్య కాఁజాలదు. ఈభావము కల్పించిన దేవుని యందుఁ గలపరిపూర్ణత్వములో లేశమాత్రి మసంపూర్ణత గలదు; కాని, లేశమాత్రమైనను నది యసంపూర్ణతయే. పరిపూర్ణత్వమున కేపాటిలోటు గలిగినను, నణుమాత్రమాయాస్పర్శచే నది దేశకాలశృంఖలాబద్ధమైపోవును. పరిపూర్ణపరమాత్మ సృష్టికర్త యగుదేవుఁడుగా మాఱి దేశము నాక్రమించి తనస్థానమునుండి కదలకుండ, లోపలనుండి సర్వమును కదలించుచున్నాఁడు. సర్వకర్త యైనదేవుఁడు సర్వకార్యములం దేదో విధముగాఁ బ్రవేశించుచున్నాఁడు. ఈభగవానుఁ డాత్మానాత్మమూర్తి, మాయాకలితబ్రహ్మము, కర్మకర్తృమిళితరాశి, అనంతశక్తిస్వరూపి, ఆరిస్టాటలన్నట్లు స్వయముగా నచలుఁడై జగత్తుకుఁ జలనమిచ్చువాఁడు, హెగెల్ యొక్క పూర్ణశక్తి, రామానుజుని విశిష్టాద్వైతమూర్తియుఁగాఁ దెలియఁబడుచున్నాఁడు. దేవునిక్రియాశక్తి అనాద్యనంతము గావున, నాతని సృష్టియు నాద్యంతములు లేనిదే. నిత్యసంభ్రమమే ఆతని శీలము.

ఈభావము సమాలోచనమునకు సాధ్యమగువానిలో నుత్తమ మైన దనుటకు సంశయము లేదు. భిన్నతలో నేకత్వమును గల్పించుట, పరస్పరవిరోధభావములను సమన్వయించుట యను లక్షణములు గలబుద్ధి సహజప్రచారముల ననుసరించి పోయినచో, నాత్మయు ననాత్మయుఁ గాక, రెంటిసామరస్యముతోఁ గూడినతత్త్వమును మనకు లభించును. సర్వభిన్నభావ

ముల నొకపూర్ణభావములోఁ గలిపిన నీతత్త్వము లభించును. దీని ననుసరించినతత్త్వశాస్త్రము నిర్మాణశీలము, సమృద్ధిభావ సమన్వితము, క్రియాప్రపంచమున సమన్వయవిశిష్టము; కాని యిందుఁగూడ, భావములతోఁ బనిచేయు తర్కవ్యాపారము, భావములకు జీవమిచ్చు సుగుణవ్యక్తిత్వమును మనదృష్టినుండి మఱుఁగుపఱచును. కాని, యీతర్కలోపములను హేతు చర్చచే సవరింపవచ్చును. నానావస్తుజాలపరిశీలనమునుండి బయ లుదేఱి, పరమార్థస్వరూపమైనభగవానునిభావము గాంచి,భగ వానునినుండి మొదలిడి, నానాసృష్టి భావములకును బోవచ్చు ను. కాని బుద్ధిజనితభావము సంపూర్ణమా యని శంకించినచోఁ జిక్కువచ్చును. విషయవిభాగ సమన్వయలక్షణాన్విత మగు మనమనస్సంజాత మగునీతత్త్వమునకుఁ బరిమితత్వదోషము లేదా ? మనమనస్సునకంటె విలక్షణ మైనమఱియొకమనస్సు నకు జ్ఞానము వేఱై కన్పింపవచ్చును. మనకుఁ గలిగినయీజ్ఞా నము, మనము నిర్మించుకొన్నతత్త్వమే సరియైన దని మనకు గోచరింపఁజేయును. కాని యిది యెట్లు లోపరహిత మని విమ ర్శకు లుగ్గడించినచో, మనము సమర్థించు నవకాశము తక్కువ. సత్యస్వరూపనిర్మాణ మొనర్చిన మనబుద్ధిసంజాతభావము సరి యైనదే కావచ్చును. కాని, మనభావమే సత్యము కాఁజాలదు. భిన్నభావములను పూర్ణభావముగాఁ జేసినంత మాత్రమున నదియు నొకభావము మాత్రమే ! సంబంధములు కల్పించుట యనునది మనస్సులో నొకభాగమే. అఖండ ప్రజ్ఞాసమన్విత మైనను మనస్సు, మనస్సే కాని మఱొకటి కాఁజాలదు. ఈ

విశిష్టాద్వైతము కొన్నియుపనిషత్తులందును, భగవద్గీతలోను, కొందఱు బౌద్ధవాదులందును, రామానుజవాదమందును, బాదరాయణ సూత్రములలో నల్పముగను, గోచరించును. పశ్చిమప్రపంచమున, ఆరిస్టోటల్, హెగెల్ యీసిద్ధాంతమును బోషించిరి.

మొదటివాదము ననుసరించి, పరమాత్మయే సత్యము జగత్తు మిథ్య; కారణము తెలియదు. రెండవవాదము ననుసరించి, ప్రపంచము పరమాత్మయొక్క సంకుచితరూపము; మాయాశక్తి వలన దేశకాలములందుఁ బ్రవేశించినది. మూఁడవ వాదముననుసరించి, ఆత్మానాత్మల సమన్వయరూపమైన భగవంతుఁడు, తక్కిన తృణబ్రహ్మపర్యంతవస్తుజాలమును వెంటనే దీనిననుసరించి సంభవించును. పరిపూర్ణనిర్గుణ బ్రహ్మప్రపంచమునకు నిరుపయోగ మనియు, సృష్టికర్త యగు భగవంతుని భావమును సహేతుకము కా దనియు మనము విడిచిపుచ్చినచో నిరంతరము తాను కాని దేదో కావలయు నని పరిభ్రమించుచున్న విశ్రాంతి శూన్యజగత్తు మిగులును. ఇదియే బౌద్ధమత ప్రధానసిద్ధాంతము. విశిష్టాద్వైతవాదము ననుసరించి, ప్రపంచము, నందలి భిన్నాంతరువులలోని వస్తుజాలము, వీని సత్యమివి పరమాత్మ కెంతదూరముగ నున్నవో దానినిఁ బట్టి నిర్ణయింపఁబడును. వీనికి సామాన్యలక్షణములు దేవకాలములు, సూక్ష్మపరిశీలనముచేఁ గొన్ని ప్రత్యేకలక్షణములును గోచరించును. ఆలోచన గలజీవులు, జడపదార్థములుగా మనము విభజించినచో, మధ్వాచార్యతత్వమగును. ఇదియు నేకబ్రహ్మ

వాదమే, ఏలన, నీజగద్వస్తుభాగములు స్వతంత్రుఁ డైనభగవంతునిమీఁద నాధారపడియున్నవి. కాన నస్వతంత్రములై అనఁగాఁ బరతంత్రములై యున్నవి. ఆలోచన గలజీవకోటికి స్వతంత్రతను సమర్థించినచో, నానాత్వము నంగీకరించిన సాంఖ్యసిద్ధాంతము లభించును. ఇందు మనము ఋజువుచేయలేని దేవునియస్తిత్వమునుగూర్చి మౌనము వహింపవలెను. ఈసాంఖ్యసిద్ధాంతమునకు జగద్వస్తునానాత్వమును గలిపినచో భౌతికానేకత్వవాదము సిద్ధించును. ఇందు దేవుఁడుకూడఁ దా నెంత శక్తివంతుఁ డైనను, జీవకోటిలో నొకఁడు మాత్రమే. అనేకాంతరువులు గల వస్తుజాలమునందుఁ బ్రతివస్తువునకుఁ గలవ్యక్తిత్వము వేదాంతసృష్టికి మిథ్యాకల్పితమే. జగన్నాటకకారణమైన పరమశక్తి యొక్క లక్షణనిర్వచనము ననుసరించి, తత్త్వములు ఆస్తికములో నాస్తికములో తెలియును. ఈతత్త్వనిర్వచన మొకప్పుడు తేజోమయుఁడైన భగవానుని నిరూపించును. మఱొకప్పు డంతర్ధాన మగును. మానవమానసికతత్త్వము ననుసరించి ప్రపంచసమస్య లీవిధముగాఁ బరిష్కారము లగుచున్నవి.

భారతీయ విజ్ఞానములో జీవేశ్వరులమధ్యమందు సహృదయసంబంధ మున్నది. పశ్చిమవిజ్ఞానములో నీరెంటికిని విరోధము విశేషముగా నున్నది. ఈజాతులపురాణగాథలు దీనినే ప్రకటించుచున్నవి. జూన్ అనువాఁడు మానవజాతినంతను నాశనమొనర్చి, అంతకంటె నుత్కృష్ట మైనయింకొకజాతిని సృజించెద నని ప్రయత్నింపగా, నాతని వినాశకార్యక్రమము నుండి, మానవజాతిని రక్షింప యత్నించుమానవజాతి ప్రతి

నిధి యగు ప్రొమొథియస్ కథయును, ప్రపంచమును గాపాడ వలె నని యనేకప్రయత్నములు చేయు హెర్క్యులిస్ గాథయును, ఏసుక్రీస్తును దేవునిపుత్రునిగా స్వీకరించిన చరిత్రయును పశ్చిమఖండమున మానవునికిఁ బ్రాధాన్య మిచ్చి రని సూచించును. క్రీస్తు దేవుని జ్యేష్ఠపుత్రుఁ డనియు ధర్మదీక్షాపరుఁ డగు దేవునిక్రోధ ముపశమించుటకు క్రీస్తును బలియొసఁగవలె ననియుఁ జెప్పబడినది. మనము తెలిసికొనవలసిన ముఖ్యవిషయ మేమన, బశ్చిమఖండమునందలి సంస్కృతిలో జీవేశ్వరులవిరోధమే విశేషముగాఁ జూపఁబడినది. అందు మానవుఁడు దేవుని శక్తి నెదుర్కొని, యాతని తేజమును, లోకమును గాపాడుటకై దొంగిలించును. భారతదేశమున, మానవుఁడు దైవాంశ సంభూతుఁడు. జగత్తంతయు దేవునియజ్ఞ సంభూతము, మానవకోటిని జగత్తును రక్షించు దేవునిసర్వకాలయజ్ఞమునుగూర్చి పురుషసూక్తము పలుకుచున్నది[1]. సర్వనామరూపములను దనయందే ధరించి అఖండశక్తిస్వరూపుఁ డైనవిరాట్పురుషునిఁగా దేవు నందు వర్ణించియున్నారు. భారతీయసంస్కృతికి రూప మిచ్చి, భాగములను బోషించిన ప్రధానలక్షణము బ్రహ్మజ్ఞానాభిలాష భారతీయసంస్కృతియనుమణిమయసౌధమునకాత్మానుభవజ్ఞానమే పునాది. అది నిగూఢయోగతత్త్వము, అనఁగా నేదో యొకవిచిత్రశక్త్యుపాసనముచే లభించిన దని కాదు. మానవప్రకృతిని సుశిక్షిత మొనర్చి, పరమాత్మానుసంధాన

---

౧. ఋగ్వేదము ౧౦-90; ఋగ్వేదము ౧౦-81,3; శ్వేతాశ్వతరోపనిషత్తు iii-3; భగవద్గీత 1 అ.

మునకుఁ దోడ్కొని పోవునభ్యాసమునకుఁ బ్రాధాన్యము నిచ్చి నది. హీబ్రూలయుఁ గ్రైస్తవులయుఁ బురాణములు నెక్కువగా మతధర్మములు నీతిసూత్రములతో నిండియుండ, హిందువుల పవిత్రగ్రంథములు బ్రహ్మజ్ఞానధ్యానముల కుత్తమస్థాన మిచ్చినది. పరబ్రహ్మమే జీవితములోని పరమసత్య మని నమ్మినది భారతదేశము.

సత్యమైన దేదియు నాత్మవిరుద్ధము కాఁజాల దనునది భారతీయతత్త్వశాస్త్రములకు వెనుకనున్న విశ్వాసము. విజ్ఞాన చరిత్రమునందుఁ బైనుదాహరించిన విశ్వాసముయొక్క ప్రాముఖ్యము, దానిని నిత్యజీవనములో నాచరించిన ఫలితమును గూర్చి తెలిసికొనుటకుఁ గొంతకాలము పట్టును. సామాన్య జ్ఞానమున విమర్శాపూర్వకముగా నంగీకరించినవిధానము ఋగ్వేదములోఁ గలదు. ఉపనిషత్ప్రపంచమును సమీపించునప్పటికి, దర్కసమస్యలు బయలుదేఱి, జ్ఞానమును నిర్ణయించుకష్టములు స్ఫుటమగును. బుద్ధిజ్ఞానపరిమితిని నిర్ణయించు ప్రయత్నములు బుద్ధ్యతీతదృష్టికి స్థానమిచ్చినపద్ధతియు నుపనిషత్తులలో గోచరించును. హేతువాదమందు విశ్వాసము సడలినప్పుడు, సంశయములు తలలెత్తి, సంశయవాదులను, నాస్తికులను నుదయింపఁజేసినది. నిర్గుణాత్మకమైన పరబ్రహ్మము, తర్కవిశిష్టమైన బుద్ధికి గ్రహణసాధ్యము కా దనునుపనిషత్తులభావము నంగీకరించి, బౌద్ధమతము జగత్తువ్యర్థ మని ప్రకటించినది. బౌద్ధమతము జగద్వస్తువు లన్నియు నాత్మవిరుద్ధము లనియుఁ, బరస్పరవ్యతిరేకవస్తువులస్పర్థచే దృశ్యజగత్తు నిలిచియున్న దని

యు నిశ్చయించినది. మనము చూచుచున్న ప్రపంచము కాక వేఱేదైన నున్నదో లేదో మనకుఁ దెలియదు. ఈప్రపంచము మాత్రము స్వీయవిరోధలక్షణము గలది. బౌద్ధవాదముయొక్క చివరివాక్య మిది. నాగార్జునుని సిద్ధాంతములో, నుపనిషత్తుల కేంద్రభావము సహేతుకముగాఁ జూపఁబడినది. సత్యమగున దొకటి కలదు. దానిని మన మెఱుఁగఁజాలము. మనమెఱిఁగినది సత్యము కాదు; ఏలన జగత్కారణస్వభావముల నర్థము చేసికొనుటకై మనము చేయునిర్ణయము లన్నియు వ్యర్థముల గును. ఇట్టి చర్చ స్వశక్తిబలము నెఱిఁగిన బుద్ధిపరిశీలనమునకు సూచనచేసినది. బుద్ధిజాత మగునాలోచనయే స్వవిఘాతము, నసమర్థము నైనది. సత్యమును దా నేల దర్శింప లేకున్న దను ప్రశ్నకు భిన్నభావములు బయలుదేఱినవి. బుద్ధి, సత్యము నెందుచే గ్రహింప లేకున్నది ! అది సంపూర్ణత లేనియంశములను మాత్రమే శోధించుటవలననా ? లేక తనజన్మసిద్ధమైన నిర్మాణ లోపముచేతనా ? లేక, ఆత్మవిరుద్ధలక్షణలక్షిత మగుటనా ? సత్యము హేత్వతీతమైన దైనను, హేతువిరుద్ధము కా దనియు వాదించువారు కలరు. అందుచే బుద్ధి మనకుఁ బూర్ణసత్యము నీయఁజాలకున్నది. బ్రాడ్లీమాటలలో, 'ఏది' యనునది 'అది' యనుదాని నతిక్రమించుచున్నది. బుద్ధి మనకు సత్యమునుగూర్చినజ్ఞానము నిచ్చుచున్నది. కాని, యీజ్ఞానమే సత్యము కాదు. సత్యము సామరస్యము గల దనియు, బుద్ధిస్వవిరోధలక్షణయుక్త మనియుఁ జెప్పువారు కొందఱు కలరు. ఏకములో ననేకమును మేళవించునంతకాలము, భావ మెంతమహోన్నత

మైన దైనను, నది శుష్కభావమే; సత్యమునే మనము పట్టుకొనవలె నన్న, భావమును విసర్జింపవలెను. మొదట సత్యమునుగూర్చినభావములు పాక్షికములు; కాని సత్యవిరుద్ధములు కావు. పాక్షికభావములు స్వవిఘాతములే, యేలన నవి పరమార్థముయొక్క అంశాసంబంధములే కాని, వానికిఁ బూర్ణత లేదు. ఇంకొకపద్ధతి. ఇంద్రియాతీత మగునొక విధమైనచూపుచే సత్యగ్రహణము సాధ్యమగును. అందుచేఁ బరమసత్యజ్ఞానమునకు, బుదిశక్తికి మఱొకదానిని మనము చేర్చవలెను. దానినే "దర్శన" మనిరి. 'దర్శన' మనఁగా నొకప్రత్యేకసిద్ధాంతమును ప్రతిపాదించుశాస్త్రము.

దృశ్ చూచుట యనుధాతువునుండి దర్శనశబ్ద ముద్భవించినది. ఈచూచుట, ప్రత్యక్షము కాని, బుద్ధిచే ననుమానించుట కాని, యోగదృష్టి కాని యగుచున్నది. సామాన్యముగా 'దర్శనము' లనఁగా, విమర్శనపూర్వకసిద్ధాంత నిర్వాచనములు, హేతుచర్చచే నిర్ణయింపఁబడిన సూత్రములు, దర్శన మనఁగాఁ బ్రాచీనగ్రంథములం దీనిర్వచనము కానరాదు. యోగదృష్టిచేఁ జూడఁబడిన సత్యాంశములను, హేతుదృష్టిచేఁ గల్పితములైన భావములతోఁ గలిపి యొకశాస్త్రముగాఁ బ్రదర్శించుట యనుభావము గోచరించును. తీవ్రాద్వైతవాదములు, బుద్ధిశక్తియొక్క ప్రయోజనము, సత్యసందర్శనమునందు దాని యసమర్థతను వెల్లడించి, యీయుపకారమువలన నింకొకమార్గము నన్వేషించుటకు దారి చూపు నని వర్ణించియున్నది. సామాన్యాద్వైత వాదములందు, పరమాత్మ యొకవిరాట్స్వ

రూపముగా నిశ్చయింపఁబడినపుడు, సత్య మొకపూర్ణభావముగాఁ జిత్రింపఁబడినది. కాని యట్టి సత్యరూపమైన యీశ్వరుఁడు, మనసత్యభావముల నధిగమించి, చరించును. తీవ్రాద్వైతమందు, సంపూర్ణత్వము గలసత్యమును, యోగదృష్టి మన కొసఁగును. ఏకేశ్వరవాదమున, మనబుద్ధిజాత మైనజ్ఞానము, యోగదృష్టి రెండును గలిసి పనిచేయును. కాని, యీబుద్ధి నిర్ణయము లనుభవజ్ఞానముతో సమానములు కాఁజాలవు. మఱియు, నొకభావము, జీవితానుభవపరీక్షకు నిలిచినపుడే యది సత్యమగును.

'దర్శన' శబ్దము సందేహార్థముతో వాడఁబడినది. తీవ్రాద్వైతతత్త్వము నొకవైపున సహేతుకముగా సమర్థించుటకును, యోగదృష్టిచేఁ జూడఁబడిన పరమసత్యమును వెల్లడించుటకు నుపయోగింపఁబడినది. ధ్యానానుభవముచే లభించినసత్యమును ఋజువుపఱచి, తర్కసహాయమున దానిని ప్రకటించుటకు 'దర్శన' శబ్దమును తత్త్వశాస్త్రముపయోగించినది. యోగసిద్ధమైనను గాకున్నను, బుద్ధిబలముచే నిర్మించుకొనిన పరమసత్యభావమును సహేతుకముగా నిరూపించువిధానమే "దర్శన" మనుభావము నితరశాస్త్రములును గ్రహించినవి. పరమసత్యమునుగూర్చి మానవబుద్ధి తీసికొనినభావము లన్నియు దర్శనములే. కాని, సత్య మొకటైనపుడు దానిని ప్రతిబింబించు భావములకు సామ్య ముండవలెను. అది కేవల మూహాసంభవములు గాక, సత్స్వరూపములు గావలెను. భిన్నదృక్పథముల నుండి, సత్యమును మనము చిత్రించినపుడు, వీనినన్నిటిని

గలిపి పూర్ణసత్యముగాఁ జేయుటతర్కము చేయవలసినపనియే. పరమసత్యము నీవిధముగా భావకల్పనము చేసి, దానివలన సంతృప్తిగానక, ధ్యానయోగముచే నతీంద్రియదృష్టిలో నాసత్యమునే దర్శించుచున్నాము. భిన్నదర్శనములలోఁ భిన్నరూపములుగా వర్ణింపఁబడిన సిద్ధాంతములయొక్క నిజస్వరూపమైన పరమసత్యమును, మన మింద్రియాతీతదృష్టిచేతనే చూడఁగలమని, అద్వైతముయొక్క సారాంశము.

ఒక "దర్శన" మనఁగా, సత్యసాక్షాత్కారము; ఆత్మావలోకనమునకు గోచరించినపూర్ణసత్యము, తత్త్వమును ననుష్ఠానముచేయుటచేఁ గలుగునీయాత్మావలోకనము నిజముగాఁ దత్త్వవేత్త యెవఁడో తెలియపఱచును. అంతశ్శుద్ధిచే నాత్మశుద్ధి నార్జించినవారికే మహోన్నతములైన తత్త్వవిజయములు చేకూరును. ఆత్మశుద్ధి యనఁగా, మానవునంతరంగములో గర్భీభూతమై యుండి, ధ్యానకాలములో నొకఘట్టమున, నెట్టి యపూర్వశక్తి జీవితరహస్యము నొక్కచూపులోఁ జూచి, గ్రహింపఁగలదో యట్టిశక్తి బహిర్ముఖమగుటే. ఎంతనిశితమైన బుద్ధికైన నసాధ్యమైన జీవితరహస్యమును, తత్త్వవేత్త యీ అంతర్దృష్టిచే మన కిచ్చును. పువ్వునుండి పండు వచ్చినంతసులభముగాను సహజముగాను యోగికిఁ బరంజ్యోతి సాక్షాత్కార మనిర్వచనీయమైనరీతినిఁ గలిగి దానితోఁ గఠినసమస్య లన్నియుఁ బరిష్కృతము లగును.

సత్యాన్వేషణమునకు బయలుదేఱువానికి మొదటఁ గొన్ని ముఖ్యలక్షణములు కావలసియున్నవి. వేదాంతప్రథమ

సూత్రభాష్యములో, శంకరుఁడు తత్త్వవిద్యార్థికి నాలుగులక్షణములను సూచించినాఁడు. మొదటిది నిత్యానిత్యవస్తువివేకము; అనఁగా సంపూర్ణజ్ఞాన మని కాదు; అది తుదకు లభించునది; చూచిన దెల్ల సత్యముకా దని, వస్తుపరిశీలనము చేయుజ్ఞానపిపాస. దృశ్యమానవస్తుజాలమును శోధనదృష్టితోఁ జూచి, పరస్పరవిరోధములుగా గోచరించువిషయపరంపరనుండి, వాని మూలభూతమైనసత్యమును బట్టుకొనఁ గలజాజ్వల్యమానమగునూహాశక్తి గలిగి, ధ్యానముచేయు నభ్యాసముచేఁ బ్రసన్నచిత్తము కలవాఁడే సత్యాన్వేషణమున కర్హుఁడు. ఇహాముత్రఫలభోగవిరాగము రెండవది. క్షుద్రవాంఛలు, స్వార్థచింత వ్యావహారికలాభముల నన్నిటిని విడిచిపెట్టువిరాగపద్ధతి. విచారణశీలము గలమనస్సున కన్వేషణమే పరమప్రయోజనము, సదసద్వస్తుజాలమును సరిగా నర్థముచేసికొనుటయే బుద్ధికి సక్రమవినియోగము. అనిశ్చితాభిప్రాయములను గొన్నిటిని మనమున నిడికొని, వస్తుజాలపరిశీలనముచేఁ గన్పట్టిన దోషమును తగ్గించుటకాని, గుణమును హెచ్చించుటకాని చేయనిసహజవివేకసంపద గలవాఁడే తత్త్వవేత్త. జీవితమునుండి అసంగుఁడై, యాతఁడు దానినిఁ జూడవలెను. అందుకే యాతనికి వర్తమానభావిదశలయాలోచన ముండరాదు. అప్పుడు మాత్రమే యాతఁడు, పరిశుద్ధవిచారణకొఱకు, సత్యనిర్ణయములకొఱకు, సర్వము నర్పించి, యథార్థవిషయములం దత్యంతశ్రద్ధవహించి స్వార్థరహిత విశ్వవిశాలదృష్టిని నిలుపఁగలఁడు. ఇట్టిదృష్టి కలుగుటకు హృదయపరివర్తనము కావలెను. దీనినే మూఁడవలక్ష

ణముగాఁ జెప్పిరి. ఇదియే శమదమాదిషట్క-సంపత్తి. వేదాంత విద్యార్థి, బాహ్యాంతరింద్రియనిగ్రహము, తితిక్ష, చిత్తసమత, శాంతి విశ్వాసముల నలవఱుచుకొనవలెను. దేహమును సమగ్రశిక్షణములోనికిఁ దెచ్చి, నిగ్రహసిద్ధి కలవాఁడే, ప్రాణాంతమైనను తపస్సాధన చేయఁగలఁడు. ఇహలోకమోహముల కెన్నఁ డాతఁడు వశుఁడు గాక, లక్ష్యము నెన్నఁడు విడువక, కృషిచేయఁగలఁడు. సత్యాన్వేషి, మహోన్నతలక్ష్యసిద్ధికై సర్వత్యాగమొనర్ప, సాహసము కలిగియుండును. అందుచే నాతఁడు కఠినశిక్షణమునకు లోఁబడవలెను. సుఖాపేక్షదుఃఖావమానముల నోర్పుతో భరింపవలెను. దయాశూన్యమైన ఆత్మపరీక్ష చేసికొనునాతఁడే చివరకు సత్యదర్శనము చేయఁగలఁడు. నాలుగవలక్షణము ముముక్షుత్వము లేక మోక్షాపేక్ష. కాంక్షలను గాల్చివైచి, వైరాగ్యసంపన్న మైనమనస్సు శాశ్వతబ్రహ్మపదవి నార్జింపఁ దీవ్రకాంక్ష గలిగి యుండును. జ్ఞానశక్తిని, శేముషీసంపదను గలిగిన యిట్టితత్త్వవేత్తలను భారతీయు లమితముగా గౌరవించునభ్యాసము కలవారు. తీవ్రసత్యారాధనముచే జగద్రహస్యము నెఱిఁగి, అహోరాత్రకృషిచే నిద్రావిశ్రాంతు లుజ్జగించి, లోకసంగ్రహార్థము జీవించుదివ్యదృష్టి సమన్వితులే నిజముగాఁ బూజ్యు లగుతత్త్వవేత్తలు. మానవజాతిపక్షమున వా రనుభవజ్ఞానము నార్జింతురు. అందుకే, మానవజాతి శాశ్వతకృతజ్ఞతకు వారు పాత్రులు.

ప్రాచీనజ్ఞానసంపద యన్నఁ బూజ్యభావము భారతీయ లక్షణములలో నింకొకటి. గతించినయుగములలో విలువగల

దేనిని నిర్లక్ష్యముచేయనిపట్టుదల, యమోఘమైన సంకల్పము నీజాతికిఁ గలవు. నూతనసంస్కృతి ప్రవాహముల నెదుర్కొని నప్పుడు, క్రొత్త భావములు కనిపెట్టఁబడినప్పుడు, తాత్కాలిక వ్యామోహబద్ధుఁడుగాక, సంప్రదాయవిశ్వాసముల నక్కునఁ జేర్చుకొని, వీలైనన్ని నూత్న భావముల నందిముచ్చుకొనును. ఇట్టి సంప్రదాయప్రియత్వముతోఁ గూడిన విశాలదృష్టియే భారతీయసంస్కృతీనాగరికతలవిజయరహస్యము. ప్రపంచమున వెలసినగతనాగరికత లన్నిటిలో నేఁటికి సజీవమై యున్నది భారతీయనాగరికత యొక్కటే. ఈజిప్టు గతములో నొకప్పుడు పొందిన నాగరికతామహత్వము, నేఁడు మనము భూగర్భపరి శోధకుల వ్రాఁతలనుండియే తెలిసికొనవలెను; భౌతికశాస్త్రీ యవ్యవసాయపద్ధతి నిర్మాణచాతురి నత్యద్భుతముగాఁ బ్రద ర్శించిన బేబీలోనుసామ్రాజ్యము నేఁడు శిథిలశిలారూపమున మాత్రమే కానవగును; ఒకప్పుడు విశ్వఖ్యాతిగాంచిన రోమను నాగరికత, బాగుగాఁబోషింపఁబడిన రాజ్యాంగతంత్రము, ధర్మ ము, సమానత్వసూత్రములతోఁ గూడినసంస్కృతియుఁ జాల వఱకుఁ గాలగర్భమునఁ గలిసిపోయినవి కనీసము నేఁడందఱు నొప్పుకొన్న 4,000 యేండ్లనాఁటి భారతీయనాగరికత, నేఁటికిఁ జెక్కుచెదరనిప్రధానలక్షణములతో నిలిచియున్నది. వేదముల కాలమునుండి అవిచ్ఛిన్నముగాఁ బ్రవహించుచున్న భారతీ యనాగరికతావాహిని, వార్ధక్యయౌవనముల నేకకాలముననే కలిగియున్నది. చరిత్రములో నేఘట్టమునం దవసరమైనను, భారతీయనాగరికత నూత్న యౌవనమును బొందుచున్నది. ఒక

మార్పుజరిగినప్పు డది యవిజ్ఞాతముగానేపడుచున్నది. మార్పు జయప్రదముగానే జరుగును. కాని పూర్వభావమే క్రొత్తనామముతోఁ దలయెత్తినదని యందఱు తలఁతురు. అంతకుఁ బూర్వము గలజాతుల భావములను ఋగ్వేదకాలములో దేశము నాక్రమించినఆర్యులు గమనించి, గౌరవించునంతటి మతవిశ్వాసమును బ్రకటించిరి. వింధ్యహిమాలయములమధ్యమందు విహరించుచున్న ఆర్యులు పూజించుచుండిన దేవతలైన ఆకాశ సూర్యాగ్నివాయువుల కథర్వవేదకాలములో నూతననామములతోఁ గూడిన దేవతానామములను జేర్చిరి. ఉపనిషన్మత మది వఱకే వేదములలో నున్న భావముల పునరుద్ధరణ మని నమ్ముదురు. ఉపనిషత్సారము లే తాను ప్రకటించుచుంటి నని భగవద్గీత చెప్పుచున్నది. పురాణములలో వేదములనాఁటి ప్రకృతి పూజ, తరువాతి మహోన్నతమతభావములు కలిసి ప్రదర్శింపఁబడినవి. పూర్వులసంప్రదాయమందలి గౌరవభావమువలననే నవీనభావములకు విజయము లభించును. ౧. ప్రాచీనరూపములు పోయినను భావములు పోరాదు. ఈభారతీయలక్షణమును గాంచియే భారతదేశము కదలికలేనిమాంద్యమునఁ బడిపోయిన దనువివేకవిహీనవిమర్శనము బయలుదేఱినది. మానవమానస మెన్నఁడును జడపదార్థము కాదు. కాని, గతచరిత్రతో నెన్నఁడు పూర్తిగా సంబంధమును ద్రెంపుకొనఁజాలదు.

---

౧. గిల్బర్టుముర్రె (గ్రీకుమతము నాలుగుదశలు (పుట 58) "నవీన భావమును బురాతనమైన దానినిగాఁ జెప్పుకొనుట మహోద్యమము లన్నిటికి సామాన్యలక్షణమే........."

ఈపురాతన సంప్రదాయములందలి పూజ్యభావమే భారతీయవిజ్ఞానము నవిచ్ఛిన్న మొనర్చినది; గతించిన వివిధ యుగములసంప్రదాయములు సహజగౌరవముతో సహవాస మొందినవి. నందలకొలఁది శతాబ్దములతోఁ గూడినపెక్కుయుగములఫలితమే భారతీయసంస్కృతి. అందుఁ గొన్నిశకములు పెద్దవి, ఫలశూన్యములు, విచారహేతువులు నైనవి; కొన్ని చిన్నవైనను, వేగము గలిగి యానందప్రదములైనవి. కాని, ప్రతిశకము ప్రాచీనసంప్రదాయజ్ఞాననిధి కొక నూతనభావరత్నమును జేర్చినది. భారతీయసంస్కృతి యొకమహావాహినితోఁ బోల్పఁబడినది. ఈమహానది ఉత్తరమున హిమాచలశిఖరములనుండి బయల్వెడలి, మధ్యదేశములందలి విశాలక్షేత్రములమీఁదుగాఁ బ్రమోదనాదములతో నచటనచట నున్న ఝురీపరంపర లను దనలోఁ గలిపికొని ప్రవహించి, ముందు గల ప్రజాకోటియదృష్టముల కాధారమై, వాడవాడలఁ బ్రసరించి, వేగము, శక్తి గలిగినవఱదయై, వేలకొలఁది యాత్రికులభారములు మోసి, యేమాత్రముతగ్గనివోఁడిమితో నుఱకలిడుచున్న యీదివ్యవాహిని, సర్వజీవవాహినీపతి యైన సాగరము నెప్పుడు చేరునో యెవ రెఱుఁగుదురు !

భారతీయ తత్త్వశాస్త్రమంతయు నొకయవిచ్ఛిన్నమైన దైవప్రసాద మని వాదించుభారతీయులు కొందఱు కలరు. అట్టి నాగరికత, భగవంతుని కార్యక్రమమును, నెఱవేర్చుటకే పని చేయుచున్నదని వారు నమ్ముదురు౧. ప్రతిజాతి నొకపద్ధతిలోఁ

౧. గ్రీకు లీలక్షణమునే ఒకజాతియొక్క నైజ మనిరి. దానినే భారతీయులు ధర్మమందురు.

బూర్ణపరిపక్వదశకుఁ దోడ్కొనిపోవుట కంతర్వర్తియైన యొక దైవనియమ మున్నదని వారిభావము. భారతదేశములోఁ బ్రకటింపఁబడిన భావములన్నియు నొకేవృక్షముయొక్క వివిధశాఖలని నుడువుదురు. తల్లి చంటిబిడ్డకుఁ జంద్రునిఁ జూపునపుడు కట్టెదుటనున్న చెట్టుకొనను గలకాంతిచక్ర మని చెప్పును. దానినే పిల్లవాఁ డర్థముచేసికొనఁగలడు. అంతేకాని చంద్రునికి భూమికిఁ గలయమితమైన దూరమునుగూర్చి ప్రసంగించినచో శిశువు కంగారుపడును. అదేవిధముగా షడ్దర్శనములు, పరబ్రహ్మమునుగూర్చిన వివిధభావములు, అల్పశక్తులు గల లోకులకర్థమగుటకొఱకై యొకేసత్యమును పెక్కురీతులఁ జెప్పిరి. భారతీయతత్త్వశాస్త్రములోని షడ్దర్శనములు, పరస్పర విరుద్ధములు కావనియు, నొకే అజాతుండైనపరమేశ్వరునిఁ గూర్చిన వివిధావలోకనము లనియు వేదాంతనాటక మగుప్రబోధ చంద్రోదయము చెప్పుచున్నది. ఒకేజ్ఞానసూర్యునికిరణములు మానవకోటిముఖదర్పణములనుండి ప్రతిబింబించి, కలిసినదివ్యజ్యోతివలె నీవివిధతత్త్వములు నున్నవి. క్రీస్తువెనుక 1380 సంవత్సరమునకుఁ జెందిన మాధవాచార్యుని సర్వదర్శనసారసంగ్రహము పదునాఱువిధములైన దర్శనములను గూర్చి ప్రసంగించుచు నివి క్రమభావాభ్యుదయముచే నద్వైతముతో పూర్తి యగునని చెప్పుచున్నది. హెగెల్ భావరీతిని, భారతీయ తత్త్వవిద్య యంతయుఁ గ్రమాభివృద్ధి నందినమానవజాతి యొక్క జగత్తును గూర్చినపూర్ణభావ మని చెప్పును. క్రమ దశలలో వినిర్మితములైన శాస్త్రములలో సత్యము వివిధము

లగునంశములుగా గోచరించి, తుదకు సంపూర్ణముగా దృశ్య మైన దని వాదింతురు. అద్వైతవేదాంతమునందుఁ బెక్కుజ్వాల లొక్కదివ్యజ్యోతిగాఁ గలిసినవి. పదునాఱవశతాబ్దమునకుఁ జెందిన విజ్ఞానభిక్షువు, షడ్దర్శనములు ప్రమాణములే యని చెప్పెను.౧. వీనినాతఁ డనుష్ఠానసిద్ధాంత భేదముల ననుసరించి రెండుగా విభజించి, సాంఖ్యమతమే పరమసత్యమని నమ్మెను. మధుసూదన సరస్వతి, తనప్రస్థాన భేదమున నిట్లువ్రాసినాఁడు; "వివిధశాస్త్రనిర్మాత లగు మునులు, మాయావాదమును సమర్థించి, సర్వసారమూర్తి యగు నేక పరబ్రహ్మమును పరమసత్యముగా నిశ్చయించుటకే సంపూర్ణముగాఁ బ్రయత్నించి రనుటకు సందేహము లేదు. ఈమునులు సర్వజ్ఞులగుటచే వేఱువిధముగా వారు తలఁచియుండరు. మనుష్యులు విషయలోలురగుటచే నొక్కమాఱే పరమసత్యములను గ్రహించుకుశాగ్రబుద్ధులు కారు గావున, వారు నాస్తికులైపోకుండ, తత్త్వమును గూర్చి అనేకసిద్ధాంతములు వారిసౌకర్యమునకై చెప్పఁబడినవి. మునులయొక్క యీయుద్దేశమును గ్రహింపనేరక, వేదములకు విరోధముగాఁ గూడ వారు సిద్ధాంతముల నెలకొల్పి రని తలఁచి, కొందఱు ప్రత్యేకసిద్ధాంతమున కనుయాయులై, మతశాఖలను సృజించిరి."౧. విమర్శకులు, వ్యాఖ్యాతలందఱును, భిన్నసిద్ధాంత సమన్వయమునకై ప్రయత్నించిరి.౨. సత్యరూప నిర్ణయములోనే వారికిఁ గలభేదము. న్యాయసిద్ధాంతమును

౧. చూడు. మాక్సుమూలరసంస్కృతగ్రంథములు అధ్యా iv1,2

౨. సర్వదర్శన సామరస్యము.

సమర్థించిన ఉదయనునినంటివా రదియే సత్యమనియు. రామానుజానుచరులు విశిష్టాద్వైతమే సత్యమనియు నమ్ముదురు. ఎన్నెన్నిరీతుల భారతీయసంస్కృతి భిన్నవాహినులుగాఁ బ్రవహించినను, తుదకన్నియుఁ దమజీవనములను గొనిపోయి, దేవుని పట్టణ మనుమహాసాగరమును జేరును.

మొదటినుండియు, సత్య మనేకముఖసమన్విత మనియు, నాయాదృక్పథముల కొకేసత్యములోని యొకముఖము కన్పట్టుననియు, నేయొకచూపు నాసత్యమును సంపూర్ణముగాఁ జూడజాల దనియు, భారతీయుఁడు నమ్మినాఁడు. హేతుసిద్ధమైనచో, నెట్టిప్రమాద సిద్ధాంతములనైనను భారతీయుఁ డంగీకరించి, సహానభావము, నిర్భయత్వము గలిగి వర్తించును. తనకు సాధ్యమగుచో సంప్రదాయసిద్ధమగు సంస్కృతిలోనియొక్క లేశమైనను నశింపకుండఁజూచి, తనతత్త్వములో దాని కుచిత స్థానము నిచ్చును. అట్టియౌదార్యము చూపినఘట్టములు మనము ముందుచూతుము. విశాలదృష్టికిఁ బ్రమాదములుకూడ లేకపోలేదు. దీనివలన భారతీయవైజ్ఞానికులు, సంశయాస్పద సిద్ధాంతములను, హేతుగహితభావములను, సంకరవాదముల నపుడపుడు సమర్థించిరి.

3

## భారతీయతత్త్వశాస్త్రముపైఁ గొన్నియారోపణలు

భారతీయతత్త్వశాస్త్రముపైఁ గలయారోపణములలో ముఖ్యమైనవి, నిరాశావాదము, పాక్షికత్వము, నీతియం దౌదాసీన్యము, పురోగమనశూన్యత.

భారతీయతత్త్వమును సంస్కృతిని విమర్శించిన ప్రతి విమర్శకుఁడు నది నిరాశాజనక మని పాటగాఁ బాడెను. హతా శచే నలసిపోయిన మానవమానస మెట్లు స్వతంత్రాలోచన ముచేసి, జీవితపునర్నిర్మాణ మెట్లు చేసికొన్నదో నాకు బోధ పడుటలేదు. నిరాశయే ఫలితముగాఁ గలిగినచో భారతీయ విజ్ఞానము పూర్ణస్వాతంత్ర్యముతోఁ బ్రకాశించు టాత్మవిరుద్ధ ప్రసంగ మని చంటిబిడ్డలకును దెలియఁగలదు. ఉన్నపరిస్థితిలో సంతృప్తి లేకుండుటచే నిరాశాతత్త్వమైనచో భారతీయతత్త్వ మట్టిదే. అంతేకాదు; ఈభావములో నన్నితత్త్వములు నిరాశా పూరితములే. ప్రాణికోటి యనుభవించుదుఃఖమే తత్త్వసమస్య లను, మతసమస్యలను, మనయెదుటఁ బెట్టుచున్నది. దుఃఖ విమోచనము నుగ్గడించుమతసంస్థలన్నియు మనయిహలోకజీవిత మునుండి బయటపడుమార్గమును సూచింప యత్నించుచున్నవి కాని, సత్యము దుఃఖమయము కాదు. భారతీయతత్త్వములో 'సతి' శబ్దమునకు సత్యము సంపూర్ణత యనునర్థములున్నవి. సత్యము సద్గుణము, పరమార్థము పరిపూర్ణతలు కలిసియే యున్నవి. ఏది సత్యమో యది సర్వమంగళప్రదమైన దగుటచే ఆసింపఁదగినది. బొశాంకేపండితుఁ డిట్లు వ్రాసినాఁడు. "నే నాశావాదిని. కాని, నిరాశావాద మెంతవఱకుఁ బోవునో యం తవఱకుఁ బోయి, దాని నతిక్రమించిన ఆశాతత్త్వమే మనకుఁ

౨. నాఁడు కాంతజ్ఞాతీయాదర్శములు. పుట 43

౧. షెలీ, పరిపాలనసమస్యలను గ్రంథములో (పుట 67) భారతీయతత్త్వ ము మాంద్యము నుండియు నలసతనుండియు జనించిన దని వ్రాసినాఁడు.

బూజ్యమైనది. జీవితమున కుచితమైనధోరణి యిదియే. ఎవ
రైన నిది ప్రమాదకరమైనపద్ధతి యని తలఁచి, అనుచితములగు
దోషముల నంగీకరించుచో, వారికి నాజవా బేమి యనఁగా,
సంపూర్ణతను స్పృశించు నేసత్యమైన ననుష్ఠానమునకుఁ బ్రమా
దకరమే! యని చెప్పుదును." దృశ్యమానప్రపంచసన్ని వే
శము దోషకలిత మనియు మిథ్య యనియుఁ దలఁచుట నిరాశా
తత్త్వమైనచో, భారతీయవైజ్ఞానికులు నిరాశావాదు లే; సర్వ
శుభనిలయమైన సత్యసీమకుఁ బోవుట కుపాయములున్న వని
విశ్వసించుటచే వారు పూర్ణాశావాదులనియుఁ జెప్పవచ్చును.

ఒకసిద్ధాంతమును నమ్ముటలోనే భారతీయతత్త్వమంత
యు నిమిడియున్న దనియు నందుచే నీతత్త్వము పిడివాద మ
నియు విమర్శకులు చెప్పుచున్నారు. మనము ముం దీగ్రంథ
మునఁ జెప్పబోవున దంతయు దానికి సమాధానమే. ఇతరసమ
స్యలకుముందు, జ్ఞానముయొక్క జన్మము, ప్రయోజనముమున్నగు
సమస్యలనుగూర్చి పెక్కుతత్త్వశాస్త్రములాలోచింప నారం
భించును. వేదము లేక శ్రుతి అమోఘప్రమాణ మని భారతీ
యులు నమ్ముట నిజమే. కాని, ఒకతత్త్వశాస్త్రము పిడివాద
మెప్పు డగు ననఁగా వేదములు చెప్పినయర్థములు ప్రత్యక్షసా
క్ష్యములకు, హేతుపరిశీలనమునకు నిలిచినభావములకంటె
నతిశయమైన వని నమ్మినచో నపు డట్లే యగును. వేదవాక్య
ము లాప్తవచనములు కాఁబట్టి, ఒకానొకసమస్యనుగూర్చి నిర్ణ
యముచేయుటలో నట్టియాప్తులు మనకంటె నెక్కు డర్హతసా
మర్థ్యము గలవా రని మనకు నమ్మక మున్నచో, విశ్వసింపఁ

డగిన వని చెప్పఁబడెను. సాధారణముగా నీవేదవాక్యములు మహాద్రష్టల యనుభవములను జెప్పును. సత్యనిరూపణమునం దెట్టి హేతుపద్ధతియైనను వారి యనుభవములను గుర్తించి తీర వలసియుండును. సంకల్పము గలవారికి, వేదద్రష్టలయనుభవములు, పొందఁదగినవే ౧. వేదప్రమాణము నుదాహరించుటలో, తత్త్వప్రమాణము నతిక్రమించుభావ మేమియును లేదు. సామాన్యమానవున కేది యంధవిశ్వాసమో, పవిత్రహృదయున కది యనుభవజ్ఞానము. తరువాతి భాష్యములలో సంప్రదాయసిద్ధాంతములను సమర్థించునాచారము పెంపొందెనది. తత్పూర్వభాష్యములును, వేదములలోని మంత్రములకే వ్యాఖ్యానము లని చెప్పికొనుచు, నుపనిషత్తులు సర్వతోముఖభావసమన్వితము లగుటచేఁ గేవలసంప్రదాయసమర్థనవిధానము నంగీకరింపలేదు. ఎనిమిదవశతాబ్దము దాఁటినవెనుక, తత్త్వచర్చ, కేవలసంప్రదాయవాదమై పూర్వస్వాతంత్ర్యమును గోల్పోయినది. ఈమతశాఖల స్థాపకులను పూజించుట కారంభించి, వారికి భిన్నముగాఁ బ్రసంగించుట మహాదోషముగాఁ బరిగణించిరి. మూలతత్త్వసూత్రములు శాశ్వతముగా రచింపఁబడినవి. ఉపదేశికునికర్తవ్యమేమనఁ గాలావసరముల ననుసరించి, వానినే లోకమునకు బోధించుట, పూర్వనిర్ణయములకే నూతనహేతువులు చూపుట, క్రొత్తగా బయల్వెడలినకష్టముల నెదుర్కొనుటకు నూతనబోధనవిధానములు కనిపెట్టుట, నామరూపముల మార్పులోఁ బురాతనసిద్ధాంతమే ప్రకటించుట

౧. చూడు. వేదాంతసూత్ర శాంకరభాష్యము.—iii 2. 24.

మున్న గుపద్ధతులు బయలు దేఱినవి. మూలసమస్యలపై ధ్యానముసడలి, అప్రధానవిషయములపై ననవసర చర్చలు పెంపొందినవి. సంప్రదాయ మనుఖని, దానిలోని ధనము కుప్పలుతిప్పలై మనయభివృద్ధి కాటంక హేతు వైనది; తత్త్వశాస్త్రము ప్రయోగమించుట మానినది; స్వాతంత్ర్యావాయువు పీల్చుటయుఁ గఱవైనది. పాండిత్య చర్చలలోఁ గాలము వ్యర్థమొనర్చినయిటువంటి వ్యాఖ్యాతలకుమాత్రమే వర్తించు, నిర్వ్యామోహకతానంవ, భారతీయ తత్త్వమంతయుఁ దగిలించుట అధర్మము, ఈవ్యాఖ్యాతలు ప్రాచీనజ్ఞానులవంటి ధ్యానసిద్ధులు గలవారు కారు. వీరు కేవలమత ప్రచారకులు, కాని, యింతగాఁ బెరిగిపోయిన పొదలమాటున, భారతీయతత్త్వము యొక్క ఆత్మ నిత్యయౌవనముతోడ నేనిలిచి యీవృద్ధవృక్షరాజ మవసరము వచ్చినపుడెల్ల, పచ్చనియాకులతో, లేఁజిగుళ్ళతోఁ జిగిరించుచునే యున్నది. శంకరమాధవాదులవంటి మహనీయులు బయలు దేఱి, భాష్యకారులని పిలువఁబడినను, సర్వతోముద్యమములను నడపుమూలసూత్రముల నంతర్దృష్టితో గ్రహించి ప్రచురించుచు వచ్చిరి.

భారతీయతత్త్వము నీతిపోషకము గా దనివిమర్శింపఁబడినది. "హిందువుల విజ్ఞానపుసరిహద్దులలో నీతిశాస్త్రమునకుఁ దావు లే దని యే చెప్పవచ్చును."౧ కాని, యీనిందారోపణము నిలువఁజాలదు. జీవితమంతయు నాత్మజ్ఞానచైతన్యమునమొనర్చుటకుఁ బ్రయత్నములు జరిగినవి. భారతీయవిజ్ఞానములోఁ బరబ్రహ్మసిద్ధాంతమునకు మొదటిస్థానము తరువాత "ధర్మ"

౧. ఫార్కుహారు, హిబ్బర్టుజర్నల్, అక్టోబరు 1921 పుట 24

మునకు రెండవస్థాన మిచ్చిరి. కేవల నీతిసూత్రప్రచారము తీసికొన్నను, హిందూబౌద్ధజైనమతములే యితరమతములకన్న దీసిపోవు. నైతికముగాఁ బరిపూర్ణత నందుటే బ్రహ్మజ్ఞానమునకు మొదటిమెట్టు.

భారతదేశమున వేదాంత మనఁగా, నభివృద్ధి లేనిస్థావరమైపోయి, ప్రాచీనసిద్ధాంతములనే తిరిగి తిరిగి 'స్మరించుఱోకదంపువంటి'దని విమర్శించినారు. "కదలికలేనిప్రాక్ఖండ" మనుదానికర్థము భారతవర్షములోఁ గాలపురుషుఁడు కదలుట మాని శవాకృతిని నిలిచియున్నాఁడనియే. పరిష్కరింపవలసిన సమస్యలు కాలభేదము లేనివైనచో, నీవిధమగుస్థావరత్వ మన్నితత్త్వశాస్త్రములకు సామాన్యలక్షణమే. దేవుఁడు మోక్షము, అమృతత్వము మున్నగుసమస్యలును, వానియొక్క తృప్తిలేని పరిష్కారములును, యుగయుగములనుండి తిరిగి తిరిగి చెప్పఁబడుచునే యున్నవి. సమస్యలరూపము లొకటే యైనను, భావములలో మార్పులు వచ్చినవి. వేదములలో సోమపానము చేసినదేవునికాలమునకును, శంకరాచార్యు నద్వైతబ్రహ్మకాలమునకును వలసినంతవ్యత్యాస మున్నది. ఏపరిస్థితులకు తత్త్వవిజ్ఞానము సమాధానముగా నుద్భవించినదో యీపరిస్థితులు తిరిగి తిరిగి సంభవించుచుండఁగా వానిని బరిష్కరించుయత్నములు తిరిగి చేయవలసియుండును. ఈసమస్యాపరిష్కారములు వేదములందును, ప్లేటోవ్రాఁతలందును, క్రైస్తవుల గ్రంథములందును విశేషభేదము లేకుండఁగనే కన్పట్టుచున్న వని, విమర్శకులభావ మైనచో, దీనివలన స్పష్టమగున దేమన, దయాశీ

మైన యాపరశక్తి, తనసందేశము నాయాకాలములలో నందఱ కందఁజేయుచున్న దని గ్రహింపవలెను. యుగములనుండి పవిత్రములగు నీతత్త్వభావములు జాతిసంప్రదాయభేదముల ననుసరించి, భిన్నకాంతులతో మనకు లభించుచున్నవి. క్రొత్త సారాయిని ప్రాఁతసీసాలలోఁ బోసినట్లు, భారతీయతత్త్వజ్ఞులు పురాతనసంప్రదాయములయందుఁ బూజ్యభావముతో నవీనతత్త్వములను బ్రదర్శింతురని యన్నచో నది భారతీయుల సహజలక్షణమని మే మిదివఱకే చెప్పియున్నాము. అభివృద్ధికి లక్షణమేమన, గతములోని మంచినంతను స్వీకరించి, భవిష్యత్తులో నూత్నాంశములను దానికిఁ గలుప యత్నించుటే, తండ్రులసంప్రదాయములను గ్రహించి, కుమారుఁడు చేయవలసినపని తన కాలమున కనుకూలముగాఁ బునర్నిర్మాణ మొనర్చుచుకొనుటే. భౌతికశాస్త్రాభివృద్ధిని గమనింపలేదు కావున భారతీయతత్త్వశాస్త్రము వ్యర్థమని పలికినచో, నూతనదృష్టికిఁ బ్రాచీనము లన్నియు నష్టే కనఁబడును. ఈవిమర్శకు లూహించునంతగా, తత్త్వశాస్త్రప్రధానవిషయమునందు, భౌతికశాస్త్రములు మార్పు తీసికొనివచ్చు నుచ్ఛదశ కింకను రాలేదు. ప్రథమశ్రేణిభాష్యకారుల యనంతరదశకు వచ్చునప్పటికి, భారతీయతత్త్వగమనము మాంద్యముపొందినమాట వాస్తవమే. చిరకాలము పనిచేసినభుజము బరువెక్కినది. ఆరంభశక్తి సన్నగిల్లినది. మతశాఖావాదుల పట్టుదలలు, అంధవిశ్వాసములు, సంప్రదాయములం దతర్కితగౌరవములు మితిమీఱినవి. నాఁటిభారతీయతత్త్వజ్ఞుఁడు కొంతస్వతంత్రకృషి

చేసినచో నీలోపమంతగా లేకుండెడిది. తత్త్వశాస్త్రప్రయోగము నమునకు, సృజనాత్మకశక్తి యెడతెగక ప్రవహించుచుండుటకుఁ దత్కాలమున సజీవములై యున్నయుద్యమములతో స్వాతంత్ర్య భావసమన్విత మైనసంబంధసంపర్కము లుండవలెను. రాజకీయ రంగమునఁ బరాధీనత నందినకారణముచే, భారతీయతత్త్వము తాను గోల్పోయిన బలసాహసములను నేఁడు తిరిగి స్వాతంత్ర్య ప్రభాతారుణకాంతులు వెల్లివిరియుచున్నవి గావున, సంపాదింపఁగలదని యాశించుచున్నాము. భారతీయతత్త్వజ్ఞులు ప్రాచీన సంప్రదాయమునందలి యభిమానముతో సత్యారాధన పరత్వమునందలి ప్రేమను గలిపినచో, గతముకంటె నున్నతమైన భావిదశ ప్రాప్తింపకపోదు.

౪

## భారతీయ తత్త్వశాస్త్ర పరిశీలన ప్రయోజనము.

మనము భారతీయతత్త్వమును కేవలపురాతనవస్తు పరిశోధనదృష్టితో మాత్రమే చదువనక్కఱ లేదు. కొందఱు ప్రాచీనమేధావుల భావములు, విలువలేనివి కావు. ఒకప్పుడు స్త్రీపురుషుల హృదయముల రంజింపఁజేసిన భావములు, తమసజీవత్వము నేనాఁడును బూర్తిగాఁ గోల్పోవు. వేదములనాఁటి ఆర్యులవిజ్ఞానములో, మానవజాతి కూహాసాధ్యమైన యత్యున్నతసమస్యలతో రణము సల్పిన యఖండమానసశక్తులను మనము దర్శింతుము. హెగెల్ చెప్పినట్లు; "నిజమగునర్థములోఁ దత్త్వచరిత్రము గతముతోఁ గాక, అనంతమై, యెడతెగని వర్తమానముతో విహరించును; ఫలితములు, మానవబుద్ధినుండి

జనించి ప్రదర్శనశాలలో వినోదార్థముంచఁబడిన వికారాకృతులు గావు; మనుష్యజాతిభావములో శాశ్వతముగా నంతర్గతములై యున్న దేవతామూర్తుల ప్రదర్శనము లని చెప్పవలెను."౧ భారతీయతత్త్వచరిత్రము ప్రథమావలోకనమున సామాన్యనకుఁ గన్పట్టు పరంపరాగతమైన గగనకుసుమసదృశ భావసంపుటి గాదు.

వేదాంతమును వెక్కిరించుట సులభమే. ఏలన, సాంసారికవిషయసుఖములందే తృప్తిగాంచి మందబుద్ధులైనవారికి తత్త్వసమస్యలు, అసత్యము లగునాకాశహర్మ్యములవలె, రసహీనములై గోచరించును. దీనియం దభిరుచి లేనివిమర్శకునికిఁ దత్త్వచర్చ లన్నియు, "విత్తు ముందా, చెట్టు ముందా" మున్నగు పొడుపుప్రశ్నలతోఁ గూడినతర్కాసిచేఁ జేయఁబడినబుద్ధి వినోదశాలలోని గారడీవలెఁ దోఁచును. మొదలులేని కాలము నుండియు, భారతీయతత్త్వశాస్త్రమునఁ జర్చింపఁబడినసమస్యలు, మానవకోటి నుత్తేజితులఁగావించినవి. శాశ్వతతృప్తికరములగు సమాధానములు లేకుండుఁగాక. జీవాత్మపరమాత్మలనుగూర్చి స్వభావస్వరూపములఁ దెలిసికొనవలె ననునది మానవజాతికిఁ బుట్టుకచే సంభవించిన జ్ఞానపిపాస. బుద్ధిగల ప్రతిమానవుఁడు, విరతి విశ్రాంతులు లేని జననమరణరూపకమైన సంసారమహాప్రవాహమునఁ బడి తాను గొట్టుకొనుచు, నెదుటనున్న సృష్టి నిత్యము కాలచక్రమునఁ బడి పరిభ్రమించుచున్నట్లు గమనించినచో, జీవయాత్రలోఁ దటస్థించు నల్పవి

౧. తర్కశాస్త్రము పుట ౮౭. వాలేస్ చే ననువదింపఁబడినది

ఘాతములమాట నటుంచి, మొత్తముమీఁద నీదృశ్యప్రపంచ మున కర్థమేమి? ప్రయోజన మేమి? యని ప్రశ్నించుకొని తీరవలసియుండును. ఇట్టి తత్త్వజిజ్ఞాస భారతజాతికిఁ బుట్టిన వికారమే కాదు; సర్వమానవకోటి హృదయము నాకర్షించునది

జీవనోపాధికై పరిసంగింపఁబడుతత్త్వములను విసర్జించి, చూచినచో, భారతవర్షమున వృద్ధిపొందినవిజ్ఞాన ముత్తమోత్తమమైన హేతుపరిపూర్ణమైనభావసంపుటి యని తెలియఁగలదు. భారతీయమేధావుల కృషిఫలితము కొన్నిదోషముల కాకరమైనను, మానవవిజ్ఞానమున కమూల్యమైన ప్రదాన మని మా నిశ్చయభావము. కుత్రిమ వాదదూషితము లని మనము నీపూర్వ తత్త్వములను నెట్టివేసినచో, నీగతి భారతీయతత్త్వమునకేకాక లోకములోని యన్నితత్త్వములకును బట్టనలసియున్నది. పశ్చిమ తత్త్వజ్ఞశేఖరులైన ప్లేటోఆరిసోటల్ వంటి వారి రచనా రణ్యములలోని డొంకలు కొట్టివేయగా మానవజాతి జ్ఞానధనములో స్థిరముగాఁ జేర్చుటకు మిగులు విలుగల భావ భూజముల సంఖ్య యత్యల్పము మాత్రమే. ప్లేటోయొక్క యద్భుత భావావేశములను, డేకార్టేయొక్క విసుగుపుట్టించు పిడివాదములను రసహీనమైన హ్యూమ్ భౌతికవాదమును, హెగేల్ యొక్క అన్యోన్య విరుద్ధభావారణ్యములను, జూచి వెక్కిరించుట కష్టమైనపనికాదు; కాని, వారిరచనలను మనము పరిశీలించి లాభము పొందలే దని చెప్పఁగలమా? అదేవిధముగా, భారతీయ తత్త్వజ్ఞుల భావములలోని కొన్నిసత్యములు మాత్రమే, మానవ విజ్ఞానచరిత్ర నిర్మాణమునకు సాధనభూత

ములైనను, బాదరాయణ శంకరులవంటివారిచే నిర్మింపఁబడిన సమన్వయ సిద్ధాంతములు, తత్త్వనిర్ణయములు, మానవవిజ్ఞాన చరిత్రమున మార్గదర్శకములై, మానవకోటి ప్రతిభను జాటు శిలాభవనములై వెలయఁగలవు. ౧

భారతీయ విద్యార్థికి, భారతీయతత్త్వపరిశీలనమే ప్రాచీన భారతవివర్షజ్ఞాన సౌభాగ్య సౌందర్యములఁ దెలిసికొనుటకు వలయుసరియైనదృష్టి నొసఁగఁగలదు. నేఁడు, సామాన్యుఁ డగు

---

౧ భారతీయ తత్త్వశాస్త్రము విలువను పెక్కురు పశ్చిమపండితులు గుర్తించియున్నారు. "ఆసియాఖండములోని, ముఖ్యముగా భారతదేశము లోని తత్త్వములను గావ్యములను శ్రద్ధతో బరిశీలించినయెడల, మన కనేక సత్యములు, అమూల్యము లగునవి గోచరించును. వానితోఁ బోల్చినచోఁ గొన్నివిషయములలో స్తంభించిపోయిన పశ్చిమప్రతిభయొక్క ఫలితముల యల్పత్వము ప్రత్యక్షమగుటచేఁ బ్రాగ్దేశవిజ్ఞానమునెదుట సాష్టాంగమొనర్చి మానవజాతి బాల్యదశలో మహోన్నత తత్త్వములకు భారతభూమియే నిలయ మని కనుఁగొందుము." విక్టరుకజిన్ "పశ్చిమజాతులమైన మన మింతవఱకు గ్రీకులయొక్కయు రోమనులయొక్కయు, సెమెటిక్ జాతి యైన ఒక్క జూయిష్ జాతినుండియు వచ్చిన భావములలోఁ బెరిగితిమి. నేఁడు మనకు గల సంస్కృతిలోని లోపములను దొలగించుటకు, మనదృక్పథములను నాంతరంగిక జీవితము. నింకను పరిపూర్ణమొనర్చుకొనుటకు, విశాలమొనర్చుకొనుటకు నీలోకయాత్రయందేకాక, జన్మాంతర లోకాంతరములందు మనకు శాశ్వతానందప్రదజీవిత సంపాదనకును, ఏవాఙ్మయమును మన మాశ్రయింపవలెనని ప్రశ్నించుకొనఁగా, భారతనాగరికతయే గతియని నిశ్చయించినాను." మ్యాక్సు మ్యూలర్, "స్వజాతీయమైన తత్త్వములు, శాస్త్రములు, వీనియందు జన్మసిద్ధమైన యభిమానాదరములుగల జాతులలోఁ బ్రస్తుతజాతి జర్మనీజాతి, పూర్వజాతి గ్రీకుజాతి; కాని అత్యంతసనాతనమై ప్రథమస్థానము నాక్రమించినది హిందూజాతియే.'

ప్రతిభారతీయుఁడును, పూర్వతత్త్వములైన బౌద్ధమతము, అద్వైతము, ద్వైతము మున్నగువానిని హేతుబద్ధములై పూజార్హములయిన వని యంగీకరించును.

ఈవివిధశాఖలను స్థాపించినవారు, దైవాంశసంభూతు లని నమ్ముదురు. భారతీయతత్త్వ పరిశీలనమువలనఁ, బురాతనమైన దెల్ల పరమప్రమాణ మను విశ్వాసము పోయి, స్వతంత్రసమాలోచనశక్తి యేర్పడును. విచక్షణ లేకుండ కేవల పురాతనములు గనుక ప్రమాణము లని తలఁచు దాస్యశృంఖలమునుండి విమోచనము తప్పక సంపాదింపఁదగినది ఏలన దాస్యభావమునుండి విడివడిన బుద్ధికిఁ దిరిగి సృజనశీలమైన యుపజ్ఞ కలుగుట కవకాశ మున్నది. భారతీయవిద్యార్థికిఁ దన దేశపూర్వచరిత్రయందలి వివరములు దెలిసికొనుట మనఃక్లేశసమన్వితమైనను సంతృప్తి నొసఁగును. వృద్ధులు, తమయౌవనదశలోని సంగతులు స్మరించి సంతసింతురు, వర్తమానదుర్దశవలనివిచారమును మఱచుటకుమందు పురాతనఘనవిజయములను స్మరించుటే.

## ౫

## భారతీయ తత్త్వదశాంతర్దశలు.

భారతదేశమున నితరజాతులకు స్థాన ముండఁగా హిందువుల తత్త్వశాస్త్రములనుగూర్చి చర్చించుచు, నిదిఁ భారతీయతత్త్వశాస్త్ర మని పలుకుటకుఁ గలయౌచిత్యమును మనము కొంత చర్చింపవలసియున్నది. అన్నిటికన్న సువిదితమైనకారణమిట్టిపేరు వాడుకలో నుండుటయే, నేఁడైనను భారతదేశ

మనఁగా నత్యధికహిందూజనాన్వితము, మనగ్రంథవిషయము, చరిత్రలేని కాలమునుండి యించుమించుగా క్రీస్తుశకము 1000 సంవత్సరములు దాఁటువఱకుఁగలభారతీయులతత్త్వచరిత్రమే. ఆతరువాతమాత్రమే క్రమక్రమముగా, హిందువులచరిత్ర కితరులజీవితసంపర్కము కలిగినది.

అవిచ్ఛిన్నమైన భారతీయతత్త్వాభివృద్ధికి వివిధదశలలోని జనులు వారిప్రజ్ఞాసౌరభముల నిచ్చిరి. కాని, మొత్తము మీఁద భారతజాతికి సహజమైన యాంతరంగికశక్తి, వారిభావములకు రూప మిచ్చినది. చారిత్రకమైనదశావిభాగమును జేసి చెప్పుట సాధ్యము కాదు కాని, చరిత్రదృష్టితోడనే భారతీయతత్త్వదశావిశేషముల వివరించుటకుఁ బ్రయత్నింతము. కొన్ని ప్రత్యేకశాఖలకుఁ జెందినసిద్ధాంతములు తత్కాలపరిస్థితులతో సంబంధించియుండును గాన, రెంటిని గలిపి పరిశీలింపవలసియున్నది. అట్లు చేయకున్నచో, మనకు జీవప్రదమైనయాహ్లాదము జనింపక, తత్త్వశాస్త్రము జడాత్మకమైన సంప్రదాయముగాఁ బరిణమించును. ప్రతిశకములో, గోచరమైనయొక్క గొప్పసమస్యను పరిష్కరించుట కొక్కతత్త్వశాఖ సమాధానముగాఁ నుద్భవించినది. అందుచే నాశకములోని ప్రజలదృష్టితోఁ జూచినచోఁ బ్రతితత్త్వశాఖయందుఁ గొంతసత్య మున్నట్లు తెలియఁగలదు. తత్త్వశాస్త్రము లనఁగాఁ దెలిసియో తెలియకయో నిర్మితములై జీవరహితకుడ్యములవలె నిలిచియున్న నిర్ణయములు కావు. ఈనిర్ణయము లెట్లేర్పడినవో తెలియకపోయినను, మనము నిత్యము నెందుండి దేనిచే జీవయాత్రను గొనసాగించుచుం

టిమో యీ'మనస్సు' యొక్క పరిణామప్రదర్శనములే యను సంగతి మఱవరాదు. తత్త్వశాస్త్ర దేశచరిత్రలకు విజ్ఞానవికాస, సాంఘికవాతావరణముల కవినాభావసంబంధ మున్న దనిమనము గుర్తింపవలెను. ౧. చారిత్రికపద్ధతి ననుసరించి, వివిధశాఖాతత్త్వచర్చలలో మనము పాల్గొనక, వానియభివృద్ధిని సాక్షిమాత్రులమై, తటస్థభావముతోఁ బరిశీలింపవలెను. చారిత్రక దృక్పథము మిక్కిలి యమూల్యమైన దని మేము గుర్తింతుము కాని, యించుమించుగా సర్వశాస్త్రకర్తలు నాయాకాలసూచకచిహ్నములను పూర్తిగా విడిచిపెట్టినకారణమున, నాయా తత్త్వశాఖల కాలములను సరిగా నిర్ణయించి చెప్పుట కాధారములు లేవని విచారించుచున్నాము. ప్రాచీనభారతీయునిదృక్పథము, చరిత్రదృష్టి లేనిది లేక, తత్త్వాతీతమైనది యయి యుండుటచే, మనకుఁ బురాతనతత్త్వవేత్తలఁగూర్చికంటె బురాతనతత్త్వములనుగూర్చి తెలియుట కెక్కుడుసాధనములున్నవి. గౌతమబుద్ధునిజన్మ మారంభించి, మనకు భారతీయ చరిత్రకాధారములు లభించునవకాశము లెక్కువైనవి. బౌద్ధమతావిర్భావము, అకేమినిడేయివంశమువలన సింధునదివఱకు వ్యాప్తమైన పర్షియాసామ్రాజ్యవ్యాప్తితో సమకాలికమైనది. హెకాటియస్, హెరిడోటసులవలన లభించినజ్ఞానమే తొలిసారిగా భారతీయవిజ్ఞానము పశ్చిమఖండమునఁ బ్రవేశించినది.

---

౧. ప్లేటో, ప్లేటోతత్త్వము (పుట.౧౦)లో వాల్టరుపేట రిట్లు వ్రాసినాఁడు: ఒకఆంగ్లేయుని పెరటిలోఁ బెరుగుచున్న దేవదారువృక్షము ప్రకృతివస్తుసంతతిలో నొకటని యెంచుదురు.

ఈక్రిందివిధముగా భారతీయతత్త్వదశలను విభజింపవచ్చును. (౧) వేదములకాలము. క్రీస్తుపూర్వము (1500–600) వఱకు ఆర్యు లిచటికి వచ్చి, స్థిరనివాస మేర్పఱుచుకొని, తమ నాగరికత, సంస్కృతులను వ్యాప్తి చేసినకాలము. ఈ కాలమునందే భారతీయ దివ్యతత్త్వాదర్శములకుఁ బునాదులు కల్పించిన ఆరణ్యకవిశ్వవిద్యాలయములు వెలసినముహూర్తము. ఈ కాలముననే క్రమాభ్యున్నతి నందినమంత్రములు, బ్రాహ్మణములు, నుపనిషత్తులు పెంపొందినవి, నాఁడు ప్రకటింపఁబడిన భావములు శాస్త్రీయముగా నాలోచించినచోఁ గేవలతత్త్వసిద్ధాంతములు గావు. పరిశీలనాంధవిశ్వాసములకు విరోధము గలిగి, మార్గాన్వేషణమునకై పరితపించినకాల మది. మనము రచింపఁబోవు విషయమున కైక్యము ఘటించుటకు, ఋగ్వేద మంత్రార్థములనుగూర్చియు,నుపనిషద్భావములను గూర్చియుఁ జర్చింపవలసియున్నది.

(౨) పురాణయుగము (క్రీ. పూ 600—క్రీ. వె 200) మొదటియుపనిషత్తులకాలమునుండి, దర్శనములకాలమువఱకు

---

౧. కాని, యాలోచించువారికది, ఆల్ప్సుపర్వతశిఖరములనుండి బయలువెడలిన ఝురీప్రవాహములచేఁ గొట్టుకొనివచ్చిన విత్తనమనియు, దీనిలోఁ గొన్ని కారణకార్యసంబంధములు తప్పనిసరిగాఁ గలవనియుఁ దెలియునట్లే, మనయర్థహితవిశ్వాసము లనియనుకొనునవి, యేసాంఘికపరిస్థితులభాగమై వానితో నవినాభావసంబంధము గలిగియున్నవో యాపరిస్థితులతోఁబాటు కలిపి యీవిశ్వాసములను, బరికించినచో వానియౌచిత్యము ప్రయోజనము స్పష్టమగును."

వ్యాంపిచినది. రామాయణ మహాభారతములు, మనుష్యసం బంధములలో దైవత్వాధీరత్వపు దేశమును వహించువాహనము లై యుపయోగించినవి. ఈయుగమునందే ఉపనిషత్తుభగవద్గీత లలోని భాగములను బౌద్ధమతము తీసికొని ప్రజాసామాన్య మున కందఁజేసినది. బౌద్ధజైన, శైవ, వైష్ణవమతశాఖ లీకాల మునకుఁ జెందినవే. దర్శనములతో సమాప్తమైన తత్త్వసమా లోచనాభ్యున్నతి యీదశలోనిదే.

(3) క్రీ. వెనుక 200లనుండి సూత్రయుగారంభము. తత్త్వ రచనారణ్యా మెడ తెలిపి లేకుండఁ బెరిగిపోవుటచే, నొకవిధముగు తత్త్వశాస్త్రసూక్ష్మభాష (Short hand of Philosophy) కని పెట్టవలసివచ్చినది. ఇట్లు విషయమును కుదించి సారాంశము తీయుటే సూత్రీకరణమైనది. ఈసూత్రములు భాష్యములు లేనిదే బోధపడవు. అందుచే నీసూత్రములకంటె భాష్యము లకే ప్రాముఖ్య మధికమైనది. ఇందుఁ దత్త్వశాస్త్రములోని విమర్శభావము పెంపొందెనది. గతయుగములలోఁ దెలిసినదా నిని ప్రశ్నోత్తరములచేఁ దర్కింపకుండఁ నంగీకరించుపద్ధతి కాక తత్త్వచర్చలు జరుగుచునే వచ్చినవి. యోగదృష్టిచే నాఁటితత్త్వ వేత్తలు, జగత్సమస్యలను దృష్టికరముగాఁ బరిష్కరించుకొన్న సూత్రములను గనిపెట్టుటాచారమైనది. ఎంతగూఢభావసమ న్వితములైనను, వారితత్త్వసమన్వయములు, క్యాంటుతత్త్వజ్ఞుని మాటలలో, మనశ్శక్తిసామర్థ్యములను మొదట నిర్ణయింప కుండఁ జేసినతీర్మానము లగుటచేఁ గొంతలోపము సంభవించి నది. వీరిపూర్వుల కిట్టిబాధ కలుగలేదు; కారణ మేమన, వారు

హేతుచర్చలకంతగాఁ బ్రాధాన్య మీయలేదు. సత్యమును దర్శించుటకు వలయుసాధనసామగ్రియొక్క గుణలోపవిమర్శ వారికిఁ దట్టనేలేదు. వారిది కేవలతత్త్వచర్చావిధానము కాదు. కెయిర్డుపండితుఁడు చెప్పినట్లు, "మనస్సు తానాలోచించుచున్న విషయములోఁ బరవశమై, తనశక్తి నిగూర్చి తలఁచుటే మఱచినది"౧. ఈవిధముగాసూత్రయుగమునిర్మాణాత్మకమైనయూహా, మతస్వాతంత్ర్యములే కాక, అంతర్విచక్షణాలోచనములు పరిపక్వములైనవి. ఈదర్శనములలో నేవి ముందేవి వెనుక యనునది నిర్ణయింపఁజాలము. అన్నిటినుండి యన్నిటిలో నుదాహృతములైనసాక్ష్యము లున్నవి. యోగము సాంఖ్యమును, వైశేషికము న్యాయసాంఖ్యములరెంటి నంగీకరించుచున్నవి. న్యాయము వేదాంతసాంఖ్యములను గణించుచున్నది. మీమాంసప్రత్యక్షముగానో పరోక్షముగానో తక్కినవానినన్నిటి నంగీకరించుచున్నది. వేదాంతమునట్లే. గార్బేపండితుఁడు దర్శనములలో సాంఖ్యమే పురాతనమైన దని భావించినాఁడు; తరువాత యోగము దానితరువాత మీమాంసావేదాంతములు, చివరకు వైశేషికన్యాయములు నని తలఁచెను. భాష్యకారులయుగమును సూత్రయుగమునుండి స్పష్టముగా విడఁదీయఁ జాలము. రెండును గలిసి నేఁటివఱకును నడచుచునేయున్నవి.

(౪) భాష్యయుగము, క్రీస్తువెనుక 2వశతాబ్దమునుండి ప్రారంభమైనది. దీనికిని సూత్రయుగమునకును గాలవ్యత్యాసమును స్పష్టముగాఁ జెప్పఁజాలము. కుమారిల, శంకర,

౧. క్యాంటుతత్త్వవిమర్శభాగము 1— పుట 2.

భాస్కర, శ్రీధర, రామానుజమాధవోదయన, జయంత, విజ్ఞాన భిక్షు, రఘునాధు లీభాష్యయుగాలంకారులు. క్రమముగా సార స్వత మన్యోన్యసంఘర్షణ రూపమైనది. సూక్ష్మ, సూక్ష్మతర సిద్ధాంతవివాదములు, సునిశితపరిజ్ఞావాదపరీటనములు, ప్రమా ణనిర్ణయచర్చాధ్వనులు మారోగ్రిగినవి. నేటిభారతీయవిద్యాం సులాగ్రంథములను దెలచుట కెభయపడుదురు. ఏలన, జ్ఞానజ్యోతి ప్రసరించుటకు బదులు సంశయాంధకార మావరించును, ఈభా ష్యములం దుత్సాహపరిజ్ఞలు లేవని యెవరు ననరు. కాని, సమా లోచనమునకు బదులు పదాడంబరము, తత్త్వజిజ్ఞాసకు బదులు తర్కవిన్యాసము ప్రత్యక్షమగును, సమ్యగాలోచనాశూన్యత, తర్కలాఘవము, పరస్పరాసహనము, మున్నగులక్షణము లధ మవ్యాఖ్యాతలలోఁ గాన్పించును. కాని, ఉత్తమభాష్యకారుల రచనలు ప్రాచీనాచార్యులవారితలవలె నమూల్యములైనవి. శంకరరామానుజాదులు వేదసిద్ధాంతములను బునఃప్రకటనము చేసిరి. వారిపునఃప్రకటనము నూతనతత్త్వనిర్మాణతుల్యమైనదే.

భారతీయ పండితులచేతనే రచింపఁబడిన కొన్నితత్త్వ చరిత్రములు గలవు. తరువాత రచనలుచేసిన వ్యాఖ్యాతలు తమతమదృక్పథములనుండియే సిద్ధాంతచర్చలు సలిపిరి. ఇత రుల భావములను ప్రతివ్యాఖ్యాతయుఁ దనమాటలలోఁ జెప్పి యున్నాఁడు. కొన్నివేళల నన్నితత్త్వశాఖలను వరుసగాఁ గొం దఱుచర్చించిరి. ఇట్టి చరిత్రానుగుణములగు రచనలనుగొన్నింటి

నిటం బేర్కొనవలసియున్నది. హరిభద్రుని షడ్దర్శనసముచ్చయమొకటి.౧ 6-వ శతాబ్దమునాఁటి దిగంబర జైనపండితుఁడైన సమంతభద్రుఁడు, షడ్దర్శనములను వివరించుచు 'ఆప్తమీమాంస' యనునొకగ్రంథమును వ్రాసె నని చెప్పుదురు.౨ మాధ్యమిక బౌద్ధాచార్యుఁడైన భావవివేకుఁ డనునాతఁడు, 'తర్కజ్వాల' యనుగ్రంథమున, మీమాంసాసాంఖ్య వైశేషిక వేదాంతముల విమర్శనములను రచించెనఁట.

---

౧. బార్తుపండితుఁ డిట్లు నుడివినాఁడు: "సంప్రదాయము ననుసరించి హరిభద్రుఁడు క్రీ. వె. 529 లోఁ గీర్తిశేషుఁడయ్యెను. కాని స్పష్టమైన యితరసాక్ష్యములవలన నీతఁడు 9-వ శతాబ్దమువాఁడనియు, నితనికిఁ బెక్కు నామాంతరములుగలవనియు జన్మముచే బ్రాహ్మణుఁడయ్యు జైనమతము నవలంబించెననియుఁ దెలియుచున్నది. మఱియు నీతఁడు ౧౪౦౦ ప్రబంధములను రచించిన గ్రంథకర్తయనియు, శ్వేతాంబరజైనతత్త్వము ను మొట్టమొదటిసారి సంస్కృతభాషలో వ్రాసి జైనసారస్వతమును సాంస్కృతికమొనర్చెననియు ఖ్యాతి యిప్పటికిని గలదు. బ్రాహ్మణాచారము ననుసరించి షడ్దర్శనములనఁగాఁ, బూర్వోత్తర మీమాంసలు, సాంఖ్యయోగ న్యాయ వైశేషికములు. కాని, హరిభద్రుఁడు 87 శ్లోకములలో బహుక్లుప్తముగాను, నిష్పక్షపాతముగాను బౌద్ధ జైనసిద్ధాంతములను, న్యాయసాంఖ్యవైశేషికములను దర్శనములని పేరిడి రచించెను. ఈవిధముగా నీతఁడు తనమతమున కనుకూలించు దర్శనములేకే, తనమతమున కత్యంతశత్రుత్వము వహించిన బౌద్ధపూర్వమీమాంసలకు మధ్యమందుఁ జొప్పించెను జైమినితత్త్వమును, బౌద్ధమును నాస్తికమతములలోఁ గలిపినాఁడు. ఇది కేవలస్వశాఖాభిమానముచేతను, స్వీయనిర్ణయముల ననుసరించియుఁ గాక నాఁటిబ్రాహ్మణులలోఁ గొందఱవిశ్వాసమై యుండుటచే నట్లు చేసినాఁడు. ఇండియన్ ఆంటిక్వేరీ. పుట. 66—1895.

౨. విద్యాభూషణుఁడు. మిడీవల్ సిస్టమ్స్ ఆఫ్ ఇండియన్ లాజిక్స్. పుట 23.

ఒకదిగంబరజైనుఁడగువిద్యానందుఁడు తన 'అష్టసాహస్రి' యనుగ్రంథమునందును, నింకొకదిగంబరుఁడు మేరుతుంగుఁ డను నాతఁడు (క్రీ. వె. 1300) 'షడ్దర్శనవిచార' మనుగ్రంథమునను హిందూదర్శనములను విమర్శించిరట. దక్షిణభారతదేశము, నకుఁ జెందిన 14-వ శతాబ్దముననున్న మాధవాచార్యుని 'సర్వదర్శన సంగ్రహము' విశ్వవిఖ్యాతమైన గ్రంథము. శంకరకర్తృత్వముచే వెలయుచున్న 'సర్వసిద్ధాంతసారసంగ్రహము'[1] మధుసూదన సరస్వతి విరచితమైన 'ప్రస్థానభేద'ము[2] వివిధదర్శనములను గూర్చి చక్కఁగా వివరించిన ముఖ్యగ్రంథములు.

౧. శంకరకర్తృత్వ మసత్యముగాఁ దోఁచును. చూడు కీత్—ఇండియన్ లాజిక్. పుట 242.

౨. చూడు. మ్యాక్సుముల్లర్ షడ్దర్శనములు పుటలు 75—84.

ప్రథమభాగము

# వైదిక యుగము

## ద్వితీయాధ్యాయము

౧

## ఋగ్వేదమంత్రములు

మనకు లభించిన మానవమానసిక రచనలలో వేదములే ప్రాచీనతమములు. విల్సన్ ఇట్లు వ్రాసెను. "ఋగ్యజుర్వేదముల ముద్రణము పూర్తియైనచో వానిలోని భావముల పరిశీలనాఫలిత ములను, హిందువుల నిజసాంఘికరాజకీయ పరిస్థితులను సరి యగు రీతి నర్థముచేసికొనుట కవకాశములు లభించును. సంఘ నిర్మాణసాక్ష్యము గల ప్రాచీనతమ రచనల చరిత్రమునకే ప్రప్ర థమములవి; గ్రీకు నాగరికతపుట్టుక కత్యంతముపూర్వములై నవి: నేఁటివఱకుఁ దెలిసిన అస్సీరియాసామ్రాజ్య చిహ్నముల కును వెనుకటికాలమునాఁటివి; నామమాత్రముగానే తెలిసిన ఈజిప్టురాజవంశములకు మాత్రము తరువాతఁ గలవి. అత్యంత ప్రాచీనవిషయములనుగూర్చి యూహించుటలోఁ బ్రమోదావ హము లైనసర్వసంగతులను సమగ్రముగాఁ బ్రదర్శించునవి వేద ములు.౧ ఋగ్యజుస్సామాథర్వములు నాలుగువేదములు. మొ దటి మూఁడును నామరూపభాషాభావములలో సామ్యముగలిగి యున్నవి. అన్నిటిలో ఋగ్వేదము ప్రధానమైనది. దైవావేశ ముచేఁ దాము పాడుకొనినగీతముల నార్యులు తమప్రాచీన తమ

౧. రాయల్ ఏషియాటిక్ సొసైటీ జర్నల్ 13వ వాల్యూము. 1852 పు. 205.

నివాసభూములనుండి భరతవర్షమున కేతెంచినపుడు, తాము సంపాదించిన యమూల్యధనరాశిగా సంకలనమొనర్చి కాపాడుకొనవలసివచ్చినది. ఏలన, వారువచ్చి ప్రవేశించిన నూతనదేశములో నాదినివాసులైన వివిధదేవతోపాసకులతో సంపర్కము సంభవించినది. ఋగ్వేదమట్టి గీతాసంకలనము. సామవేదము కేవలప్రార్థనగీతాసంకలనము.

ఇందలిగీతములు చాలవఱకు ఋగ్వేదములోనివే. సొంతములైన వానిలోనైనను విశేషార్థబోధకములైన వేమియును లేవు. ఇవి యజ్ఞశాలలలోఁ బఠించుట కనువగునట్లేర్పాటులు చేయఁబడినవి. సామవేదమువలెనే యజుర్వేదమును బ్రార్థనావసరముల కుపయోగించునది. కర్మతోఁగూడినమతావసరముల నిమిత్తమై యిది కూర్పఁబడినది. విట్నీపండితుఁ డిట్లు వ్రాసినాఁడు; "ప్రాచీనవైదికకాలమున యజ్ఞమనఁగా విశృంఖలభక్తిప్రకటనయు; అందు నిర్ణయింపఁబడిన పురోహితుల కధికారము లేదు; అపరిధానవివరముల కెట్టినియమమును లేదు; యజ్ఞకర్త యిచ్చవచ్చినరీతిని నడపుటకు స్వేచ్ఛగలదు; ఇది ఋక్సామమంత్రముల పఠనముతోఁ గూడియుండెడిది. హృదయపూర్వకముగా దేవునికిఁ జేయుసమర్పణసమయమున, కర్తహస్తములు పూజలొనర్చుచుండఁగా నోరాఁగక మంత్రములు చెప్పవలెను. కాలక్రమమున కర్మవిధానము నియమబద్ధమై ప్రత్యల్పకర్మమును శాసనమునసనుసరించి క్రమవిధానమున నడువ

౧. అమెరికన్ ఓరియంటల్ సొసైటీ ప్రొసీడింగ్సు వాల్యుము 8 పు. 304.

వలసినదైనది. కర్మాచరణకాలములోఁ జదువవలసినమంత్రముల సంఖ్య నిర్ణీతమగుట యేకాక, కొన్నియుచ్చరింపవలసిన వాక్యములు, పదసూత్రములు, నేర్పడి, చేయఁబడుచున్న ప్రత్యాల్ప కర్మభావమును ప్రవచనశాపానుగ్రహములతోఁగూడి, గుప్తార్థ విశిష్టమైనది. యజ్ ధాతువునుండి వచ్చినయజుర్వేద మీవిధముగా యజ్ఞాచరణసూత్రవిధానముల సంపుటి. ఇట్టియజుర్వేదమే గద్యపద్యాత్మకమై యజ్ఞమునందుఁ జదువవలసిన క్రమముతోఁ గూర్పఁబడినది.౧ సామయజుర్వేద మంత్రసంకలనము ఋగ్వేదమునకును, కర్మకాండసుస్థాపితమయిననాఁటి బ్రాహ్మణములకును మధ్యకాలమున నయియుండవలెను. అథర్వవేదము చాలకాలమువఱకు వేదశబ్దఖ్యాతి లేకయుండెడిది. కాని, మన దృష్టిలో ఋగ్వేదముతరువాత నిదే ముఖ్యమైనది. కారణము ఋగ్వేదమువలెనే యిదియును స్వతంత్రమైనభావముల సంపుటీకరణము. విజ్ఞానచరిత్రలో నిది యాలస్యముగాఁ గూర్పఁబడినదగుటచే నీవేదము ప్రత్యేకభావాన్వితము. అనేకరూపదేవతోపాసనల కలవారై యున్నభరతవర్షప్రాచీనజాతులతో సామరస్యమునకై ఆర్యులు విశాలహృదయము సహనశీలముఁ జూపిరని యీరచన చెప్పుచున్నది.

ప్రతివేదమునకు మూఁడుభాగము లున్నవి. మంత్రములు; బ్రాహ్మణములు; ఉపనిషత్తులు; మంత్రసంపుటినే సంహితయందురు, బ్రాహ్మణములు విధివిధానములను దెల్పును; ఉపనిషత్తులు, ఆరణ్యకములు బ్రాహ్మణముల యంత్యభాగములై తత్త్వనిర్ణయచర్చాత్మకములుగా నున్నవి. తరువాత వచ్చిన

భారతీయవిజ్ఞానమున కుపనిషత్తులే పునాదులుగానున్నవి. పూర్వతరములైనవానిలో ఐతరేయకౌశీతక్యుపనిషత్తులు ఋగ్వేదమునకును, కేనఛాందోగ్యములు సామమునకును, ఈశ తైత్తిరీయ బృహదారణ్యకములు యజుర్వేదమునకును, ప్రశ్నముండకములథర్వమునకును జెందినవి. ఆరణ్యకములు ఉపనిషత్తులకును బ్రాహ్మణములకును మధ్యమందు వచ్చును. నామార్థముల కనుగుణముగా నివి, అరణ్యవాసులై తపోనిరతులై యున్నవారి కుపయోగించును. గృహస్థుఁడు చేయవలసినకర్మవిధానమును బ్రాహ్మణములును, సంసారము విడిచి, యరణ్యములకుఁ బోయినవారికిఁగర్మస్థానమందుఁ జేయవలసినవిధినారణ్యకములును, నిర్ణయించును. యజ్ఞక్రియకుబదులుగా, యజ్ఞమునకుఁ గల రహస్యపరమార్థముల నరణ్యవాసి ధ్యానించును. బ్రాహ్మణముల కర్మకాండకును, నుపనిషత్తులతత్త్వవిచారమునకును సంబంధము కలుపున వారణ్యకములు. మంత్రములు కవుల సృష్టియై, బ్రాహ్మణములు పురోహితులరచనలై, ఉపనిషత్తులు తత్త్వవేత్తలధ్యానము లైనవి. ఈమూఁడు నొకటివెనుక నొకటి క్రమముగా రచింపఁబడినను, బిమ్మటఁ గలిసియే యున్నవి. ఉపనిషన్మతము, వైదికదేవతార్చన విధానపరిణతియే యైన నింకొకవిధముగాఁ జూచిన బ్రాహ్మణమతనిరాసరూప మని చెప్పవచ్చును.

౨.

## వేదమంత్రార్థజ్ఞాన ప్రయోజనము.

భారతీయవిజ్ఞానస్వరూపమునుగూర్చి స్పష్టజ్ఞానము వల యునన్నచో నీవేదమంత్రార్థముల నభ్యసించితీరవలెను. వానిని గూర్చి మనమెట్లు తలంచినను.– ప్రక్షిప్తపురాణము లనుఁడు, వివేకహీనులకల్పితగాథ లనుఁడు,–ఏమన్నను, ననంతరకాలము నాఁటి భారతీయార్యుల తత్త్వజిజ్ఞాసకు ననుష్ఠానమునకు మూల భూతము లైనరచనలు గావున, వీనిపరిచయము లేనిదే యవి బోధపడవు. జగద్రహస్యార్థమును సంగ్రహించి, ప్రకటించు కోరికతోఁ జేయఁబడిన ప్రథమమానవప్రయత్నము లైన ఈరచ నలు వసంతస్వచ్ఛసౌరభాంకిత మారుతమునుబోలుచు, హిమ బిందుసుందరమగు నుదయారంభసమయవికాసమాన పుష్పకో మలములగుచు, నెగడుచున్నవి.

ఆర్యులు తమతొలినివాసములనుండి, భరతవర్షమునకు వచ్చిననాఁటిబుద్ధివికాసయుగమునకుఁ జెందినవే నేఁడు మనకుఁ దెలిసినవేదములు. వారితోఁగూడఁ గొన్నిభావములను విశ్వాస ములను గొనివచ్చి, భరతభూమిలో వానిని వృద్ధిచేసిరి. వేద మంత్రములరచనాసంకలనముల మధ్యమందుఁ గొంతకాలము గడచియుండును. సంహితకాలమును మ్యాక్సుముల్లరు ఛందో యుగము, మంత్రయుగము నని విభజించినాఁడు. మొదటియుగ ములో మంత్రములు రచింపఁబడినవి. ఈగీతములను రచించినది సృజనాత్మకమైనకవితాప్రతిభతోఁ గూడినశకము. అప్పుడు

యజ్ఞముల స్మరణయే లేదు. దేవతలకుఁ బ్రార్థనము లే సమర్పింప బడినవి. రెండవ దీగీతములను సంపుటిచేసినయుగము. అప్పుడు వారు వాని నే వరుసలోఁ గూర్పుచేసిరో, అదేరీతి నిప్పటికిని నిలిచియున్నవి. తరువాత యజ్ఞభావములు క్రమముగాఁ దల లెత్తినవి. ఎప్పు డీగీతరచనాసంకలనములకాల మనుప్రశ్న కూహయే జవాబు. క్రీస్తునకుఁబదు నేనుశతాబ్దములపూర్వము వేద ము లున్నవని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. క్రీ. పూ. 300 సంవత్సరములనాఁటికి వ్యాపింపనారంభించిన బౌద్ధమతము వేద మంత్రముల నేకాక, ఉపనిషత్ బ్రాహ్మణములతోఁ గూడిన వైదికవాఙ్మయమునంతను నంగీకరించినది. బ్రాహ్మణములలోని యజ్ఞవిధానము పెంపొందుటకును, ఉపనిషత్తులలోని తత్త్వము సుస్థాపితమగుటకును విశేషకాలము పట్టియుండును. విస్తృత మైన యింతసారస్వతములోని భావవికాసమున కొక వేయేండ్లైనఁ గావలసియుండును. నాఁటివాఙ్మయములోని భావసంపద, వైవిధ్య మును జూచినచో నీలెక్క యెక్కువకాదు. భారతీయ విద్వాం సులు కొందఱు వేదకాలము క్రీ.పూ. 3000 వత్సరములనియు, మఱికొందఱు క్రీ. పూ, 6000 ఏండ్లనియుఁ జెప్పుచున్నారు. మంత్రము కాలము క్రీ. పూ, 4500 లనియు, బ్రాహ్మణముల కాలము క్రీ.పూ. 2500 లనియు, మొదటియుపనిషత్తులకాలము క్రీ. పూ. 1500 లనియు కీ. శే. బాలగంగాధరతిలక్ తలఁచి నాఁడు. జాకొబీ పండితుఁడు మంత్రములకాలము క్రీ. పూ. 4500 గాఁ జెప్పినాఁడు. మేము క్రీ.పూ. 1500 గా నిర్ణయించు చున్నాము గావున దీనికెవరును దోష మెన్నరని తలఁచెదము.

ఋగ్వేదసంహితకుఁజెందినవి 1017 మంత్రములు లేక సూక్తములు; రమారమి 10,600 శ్లోకములు. ఇది యెనిమిదష్టకములుగాను, అష్టకమున కెనిమిదధ్యాయములుగాను, విభాగింపఁబడినది. ఇవి యింకను వర్గములక్రింద విభజింపఁబడెను. ఇది పదిమండలములక్రిందఁగూడ విభజింపఁబడెను. ఈమండల విభాగమే బాగుగానందఱకుఁ దెలిసినది. ప్రథమమండలమున 191 మంత్రములుగలవు. ఇంచుమించుగా గౌతమకణ్వాదులైన 15 గురు ఋషులు దీనికిఁగర్తలు, ఈమంత్రములకూర్పులో నొకసూత్రముగలదు. మొదటఅగ్నికిఁ దరువాత నింద్రునికిఁ దరువాతఁ దదితరులకుఁ జెప్పఁబడిన మంత్రములుగలవు. తరువాతఁగల ప్రతిమండలషట్కమునకు నొక్కొక్కకర్తగలిగి, అగ్నీంద్రాదులవరుసలోఁ గూర్పఁబడినవి. అష్టమమండలమునమాత్రమీపద్ధతిలేదు. మొదటిదానివలె దీనికి నెందఱో కర్తలుగలరు. నవమమండలములో సోమునిసంబోధించిన మంత్రములున్నవి. 8,9 మదడలములలోని మంత్రములుచాలవఱకు సామవేదములోఁ గలవు. ౧౦ వ మండలము తరువాతఁగలిపినదానివలెఁదోఁచును. ఇందలిభావములు వేదమంత్రరచనమునకుఁ జివరికాలమునకుఁ జెందినవిగా గోచరించును. ఇందుమొదటివానిలోఁగల భక్తిరసభరితమైన కవిత్వము రసశూన్యమైన తత్త్వజ్ఞానరూపమును దాల్చెను. జగదుద్భవాదివిషయములనుగూర్చిన యూహాన్వితములైన మంత్రములునుగలవు. వీనితోఁబాటధర్వవేదమునకుఁ జెందినయంధవిశ్వాసములు, శాపవిధానములతోఁగూడిన మంత్రములునుగలవు. తత్త్వజిజ్ఞాసతోఁగూడినవి వారిమనోవికాస

మును, శాపాదికమంత్రములప్పుడే వారికిభారతవర్ష పూర్వజా తులతోడి సంపర్కమును దెలుపును. ఈ రెండుకారణములచే దశ మమండలానంతర్యము విదితమగును.

వేదోపదేశము.

తమజీవితముల నీవిద్యలోవ్యయించి కృషిచేసిన పండి తులు వేదమంత్రార్థములనుగూర్చి భిన్నభావములను గలిగి యున్నారు. క్లీడరరనునాతఁడు ఋగ్వేదమంత్రములు కాలుష్య మెఱుగని బాలురయమాయికప్రార్థనములవలెనున్న వనెను. ఎంత అపరిపక్వమున స్పష్టమునైనను నార్యుల ఋగ్వేదమందే కేశ్వరా రాధనముకలదని పిక్టెటుపండితుఁడు నుడివినాఁడు. ఈభావమును, రూత్ పండితుఁడును, ఆర్యసమాజస్థాపకుఁడగు దయానంద సరస్వతియు నంగీకరించిరి. రాజారామమోహనరాయలు 'పర మేశ్వరుని కల్యాణగుణములప్రతినిధి రూపములే' ఋగ్వేదము లోని దేవతలనితలఁచినాఁడు. బ్లూమ్‌ఫీల్డుమున్నగు నితరులు ఋగ్వేదమంత్రములపరిణతజాతియొక్క కర్మకలాపవర్ణనమని తలపోసిరి. బెర్గెయిన్ వానిని గొన్నిభావములకు మూర్తిప్రకటన ములనెను. జగద్వినుతుఁడైన సాయనాచార్యుఁడు ఋగ్వేదమం త్రములకు సహజమైన యర్థమునుదెల్పెను. దీనినైరోపీయను విద్వాంసులు నంగీకరించిరి. తరువాతివైన బ్రాహ్మణములననుస రించి సాయనుఁడు కొన్నిటికర్థనిర్ణయములు చేసినాఁడు. ఇట్టి భిన్నభావములుపరస్పరవిరుద్ధములనితలఁపరాదు. ఏలన ఋగ్వేద మంత్రార్థముల వైవిధ్యమే దీనికిఁగారణము. క్రమపరిణతినం దిన పెక్కుశకములందలి మేధావులచే రచింపఁబడినవగుటచే నీ

మంత్రిభావములలో వివిధభావపరిణామము గోచరించును. ఒక నిరాడంబరకాలమునకుఁజెందిన జాతియొక్క—మతమే ఋగ్వేదమని స్థూలముగాఁజెప్పవచ్చును. ఋగ్వేదమంత్రజాలమంతయు నతార్కికమై బాల్యప్రిసన్నతామయమైన మానవమానసమత ప్రిదర్శనమే. బ్రాహ్మణములకాలమునకుఁ జెందిన హేతుభావవిశిష్టార్థములనిచ్చు మంత్రిములును గొన్నికలవు. సృష్టిరహస్యము, మానవ జన్మార్థముమున్నగుసమస్యల పరిశోధనాఫలితములఁదెల్పు పరిణతబుద్ధినిబ్రిదర్శించు మంత్రములు దశమమండలములోఁగలవు. కొన్నిమంత్రిములేకేశ్వర సిద్ధాంతమునుదెల్పును. ఒకేపరమేశ్వరుని భిన్నగుణరూపములే వివిధదేవతలని పలికిన స్థలములు కొన్నినిస్సంశయముగాఁగలవు.౧ ప్రిస్తుతము మనకుఁగలసుస్పష్టము సందేహశూన్యమునగు నేకేశ్వరసిద్ధాంతమువంటిది మాత్రిమదికాదు.

భారతీయ సుప్రిసిద్ధపండితయోగియైన అరవిందఘోషు, వేదములు గుప్తార్థములతోడను, యోగతత్త్వములతోడను నిండియున్నవని తలఁచినాఁడు. ఇంద్రియప్రవృత్తుల ప్రతిబింబరూపములైన దేవతలఁనుగూర్చియే వేదమంత్రములుచెప్పుచున్నవని యాతనిభావము. సూర్యుఁడు బుద్ధికి, అగ్ని సంకల్పమునకు, సోముడు భావమునకుఁ బ్రితినిధులు. ఆతనిదృష్టిలోవేదములు యోగమత ప్రితిపాదకములు. "ప్రాచీనకాలమునాఁటి మానవమానసకృపిదర్పణములైన వానిలోఋగ్వేదమే మనకుమొగటిది. గ్రీకుజాతికి,జెందిన ఆర్ఫిక్ ఎల్యూషినియన్ మతరహస్యములు వేద

౧. చూడు. రామానుజభాష్యము [i-164—46, 170-71)

మంత్రరహస్యార్థముల పోడిమిచెడిన నీడలవంటివి. మనమిపుడు నిశ్చయముగాఁ జెప్పనసాధ్యములైన కారణములచే నార్యజాతి తనరహస్యజ్ఞానమును దృష్టాంతాద్యలంకారమయ యవనికచే మఱుఁగుపఱచి, యనధికారులకుఁ దెలియకుండను, గురూపదేశ మందినవారికిఁ దెలియునట్లుగను జేసినది. యోగులనియమము లలో నొకనియమమేమనఁగా ఆత్మదైవజ్ఞానములు పరమరహస్యములు పావనములునని, సామాన్యమానవుఁడు బ్రహ్మజ్ఞానార్హుఁడు కాకపోవుటేకాక, వానికిఁజెప్పినచోఁ బ్రమాదముకూడ నున్నదనియు నేలనఁగా, నర్హతలేనివారు దానిపవిత్రతనుబోఁగొట్టి మహిమను దుర్వినియోగ మొనర్తురనియువారునమ్మిరి. అందుచే వారుజనసామాన్యమున కపరిపూర్ణమైన బాహ్యపూజాదిక మేర్పాటుచేసి, ఉపదేశార్హులకాంతరంగిక నిగ్రహసాధనములు నియమించుటకుఁ దమవాఙ్మయపదజాలమును, మూర్ఖులకు బాహ్యార్థము, బుద్ధిమంతుల కంతరార్థమును దెలియునట్లు శ్లేషాద్యలంకారయుక్త మొనర్చిరి. ఈవిధముగాఁగల్పించిరచించినవే వేద మంత్రములు"[౧]. ఈ వేదార్థనిర్ణయవిధానమెంత యాచిత్యగర్భితమైయున్నను, దీనిని మనమంగీకరింపఁజాలము.

ఈభావమును నేఁటిపశ్చిమవిద్వాంసులంగీకరింపకపోవుటే కాక, సంప్రదాయసిద్ధముగా నర్థనిర్ణయములుచేసిన సాయనాచార్యుఁడుగాని, పూర్వమీమాంసికులుగాని దీనినంగీకరింపరు. భారతీయవిజ్ఞానమంతయు వేదమంత్రములలోని మహోన్నత సత్యములనుండి క్రమచ్యుతియనుట, అసమంజసము. ఆదిపరిపూ

౧. ఆర్య, వాల్యుము ౧. పుట 60.

ర్ణతనుండి పతనమనుటకంటె, మానవకోటిబాల్యదశలోని యప రిణతభావములు, నైతికాధ్యాత్మికాశయములనుండి, కాలము పోను, క్రమాభ్యున్నతిచేఁ దనువాతమహనీయతత్త్వమతసిద్ధాంతము లుద్భవించినవనుటలో సహజమైన మానవవిజ్ఞానక్రమ వికాసవిధానమునకు సరిపోవుచున్నది.

వేదమంత్రార్థవివరణమున, ననంతరములైన బ్రాహ్మణములు నుపనిషత్తులుచూపిన మార్గములనుబట్టిపోవుటయుక్తము. ఈయనంతరరచనములు, వేదమంత్రములలోని భావములనను సరించి, యవిచ్ఛిన్నముగాఁ బెంపొందినవే. బాహ్యమునుండి యంతరంగమునకుఁబోవుట మానవసహజలక్షణము. బాహ్య ప్రకృతిశక్తులయారాధనమునుండి, యుపనిషత్తత్త్వజ్ఞానమువఱకును గ్రమపరిణామమందినదని చెప్పుట మానవునిమతభావక్రమాభ్యున్నతిసూత్రమునకనుగుణము. పురాతనప్రకృతి పూజాభావములను విడిచిపెట్టి, ఉపనిషత్తులు, వేదములలోని తత్త్వభావ బీజములనుద్ధరించి వృక్షములుగాఁ బెంపొదించి పోషించినవి. మేముచెప్పిన యీవిధానమునవీనయుగచారిత్రకపద్ధతికిని, ప్రాచీనవిజ్ఞానోదయమునుగూర్చి ప్రకృతిశాస్త్రముచెప్పిన సిద్ధాంతమునకును, భారతీయసంప్రదాయవిజ్ఞుఁడైన సాయనమహర్షి మార్గమునకును సరిపోవుచున్నది.

౮

## తత్త్వశాస్త్రాంకురములు.

ఋగ్వేదమునందు, జగద్వస్తుదర్శనముచే బయలుదేఱిన కఠినప్రశ్నలపరంపరలకు సమాధానముగాఁ గవితావేశపరవశు

లైన వ్యక్తులమహోత్తేజక ప్రసంగములున్నవి. జగద్రహస్యము లఁదెలిసి ప్రకటింపయత్నించుటలో, నొకయిందిర్యాతీతదృష్టి చేఁగాని, ప్రకృత్యతీతభావావిష్కరణముచేఁగాని కాక,సహజ మైనహేతుపరిశీలనకాంతిచే నెంతవఱకు నాఁటివ్యక్తులుపోయిరో యంతవఱకు వేదమంత్రములుతత్త్వాన్వితములనిచెప్పనగును. వేద మంత్రములలో గోచరించు మనఃప్రవృత్తి ఒకరకమునకుఁజెంది న దేకాదు. ఆకాశమండలిసౌందర్యమును, భూమిపైఁగలయద్భు తములను దిలకించి, ధ్యానించి, మంత్రశ్లోకరచనముచేఁ దమ హృదయభారమును దేలికపఱచుకొనిరి. ఇరాన్‌ఁభరతవర్ష దేవత లైన ద్యాన్, వరుణుఁడు, ఉషస్సు, మిత్రుఁడు మున్నగువారు, వారికవితలో నుద్భవించినవారే. మఱికొందఱెక్కుడుక్రియాశక్తి గలవారు ప్రపంచమును దమప్రయోజనముల కుపయోగించు కొనఁజూచిరి. ప్రపంచజ్ఞానము వారికి జీవయాత్రకుసాయ ముగా నుపయోగించినది. యుద్ధము, దండయాత్రమున్నగునవి సంభవించిన వేళలందు, లాభకరులైనయింద్రాదిదేవతలను వారు కల్పించుకొనిరి. నిజమైనతత్త్వజిజ్ఞాస, నిష్కామముగా జ్ఞానము నార్జించునపేక్ష, కలహప్రయాసలతోఁగూడిన యీదశగడచిన వెనుకనుద్భవించినది. అప్పుడు మానవులు ప్రశాంతచిత్తము లతోఁ గూర్చుండి, తామప్పటివఱకు నజ్ఞులై యర్పించుచున్న యింద్రాదిదేవతల సత్యాసత్యములనుగూర్చి జీవితరహస్య ములఁగూర్చియు నాలోచింప మొదలిడిరి. ఈదశయందే బయలు దేరిన ప్రశ్నలకుఁదృప్తికరములైన జవాబులుదొరకలేదు. వేద మందలి కవి ఆశ్చర్యపడుచున్నాఁడు; "నేనెట్టిస్వరూపముగల

వాఁడో నే నెఱుంగను. ఆశ్చర్యచకితము, బద్ధము నైననామనస్సు పరిభ్రమించుచున్నది." నిజమైనతత్త్వబీజము లనంతరదశలో వచ్చినను, వేదమంత్రములందలి కవిత్వాభ్యాసములలో గోచరించు జీవితమునుగూర్చిన భావములు జ్ఞానప్రదములు. పురాతన వస్తుశాస్త్రమునకుఁ బూర్వము పుక్కిటి పురాణములును, రసాయనశాస్త్రమునకుఁ బూర్వము రససిద్ధవాదమును, జ్యోతిశ్శాస్త్రమునకుఁ బూర్వము ఫలశాస్త్రమునువలెనే, తత్త్వశాస్త్రజిజ్ఞాసకుఁ బూర్వము పురాణమతములును నుండును. వానియందుఁ బరమ సత్యమునుగూర్చిన ప్రశ్నములకు లభించిన సమాధానములు ప్రజాసామాన్య విశ్వాసములనుండి యుద్భవించినవే. వీరిసమాధానము లూహాసముద్భవములే. సృష్టి కారణములు కొన్ని కల్పితగాధలు. ఊహాను దిగఁద్రొక్కి తర్కము నెమ్మదిగా వృద్ధిపొందుచుండఁగా, జగద్వస్తుజాలమును దానికారణమైన స్థిరవస్తువునుండి విడఁదీయు యత్నములు జరిగినవి. పురాణగాథలలోని విశ్వాసములణఁగి, బ్రహ్మాండ సృష్టికారణములను గూర్చినయాలోచనలు రేకెత్తెను. ప్రపంచమునకుఁ జెందిన స్థిరభూతములను దేవతలనుగాఁ జేసి యర్చించుటచే, సృష్టిచరిత్రమే మతమని భ్రాంతి కవకాశము కలిగినది. సమ్యగాలోచనమునకుఁ బ్రథమదశయైన ఋగ్వేదమునందుఁ బురాణము, సృష్టిచరిత్రము, మతము కలిసిపోయినవి. ఋగ్వేద మంత్ర భావములను, దైవశాస్త్రము, సృష్టిశాస్త్రము, నీతిశాస్త్రము, మరణానంతర జీవచరిత్రమునని నాలుగు శీర్షికలక్రింద స్పష్టముగా వర్ణించుటచే నీవిషయమందుత్సాహముజనించునని తలఁచెదను.

౫

## దైవశాస్త్రము

అనేక శతాబ్దవ్యాప్తమైన మతాభ్యుదయమును సులభముగా నిర్వచనము చేయుటకు, నొకతరగతిలోఁ జేర్చుటకు వీలైనంత సులభము స్పష్టమునైనదిగా నుండఁజాలదు. మంత్రముల ముఖ్యలక్షణ మనేక దేవతాన్విత మైయున్నది. అనేక దేవతలకు నామములిచ్చి యారాధించిరి. కాని కొన్ని మంత్రములు మహోన్నత తాత్త్విక భావసంపన్నములై మన కాశ్చర్యపరవశతఁ గల్పించును. ఏలన, ననేక దేవతా భావమునుండి, నిశ్చిత తత్త్వజ్ఞానసిద్ధికిఁగల మార్గము సుదీర్ఘమైనది. ఋగ్వేదమతమునందు త్రివిధాత్మకభావములు గలవు ; ప్రకృతిసంబంధమైన యనేక దేవతాభావము, ఏకేశ్వరభావము, బ్రహ్మైక సత్యభావము. ఈచర్చలో 'దేవ' శబ్దము ననేక వస్తువులనుగూర్చి యనిశ్చితముగా వాడిరను విషయమును మనము జ్ఞాపకముంచుకొనవలెను.౧ "దేవుఁడనఁగా మానవునకుదాత. ౨" సూర్యుఁడు చంద్రుఁడు, ఆకసము దేవతలు, ఏలన వారు లోకమునకుఁ గాంతినిత్తురు. తోడిమానవునకు జ్ఞానదానముచేయు పండితుఁడు 'దేవత.' 3 దేవుఁడు లోకమునకంతకును దాత కావున నాతఁడు "దేవత" యే. తల్లి, తండ్రి, గురువు దేవతలే. ౪ అతిథి దేవత.

---

౧. నిరుక్తము (vii-15) "దేవో దానాద్వా, దీపనాద్వా, ద్యోతనాద్వా, ద్యుస్థానోద్వాభవతి."

౨. దేవశబ్దము నాంగ్లమున 'లేడీ' శబ్దముతోఁ బోల్పనగును లేడీ యనగా మొదట రొట్టెను చేయునదియని యర్థము,

3. విద్వాంసోహి దేవాః. ౪. మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ.

ఇప్పుడు మనము దేవుఁడను భావమున కేయర్థము నిచ్చుచుం టిమో యాభావమునకు దగ్గరగావచ్చు నర్థమును 'దేవత'యను శబ్దమునకు నిశ్చయింపవలెను. అప్పుడు "దేవ" శబ్దమునకు "కాంతి"యని యర్థము.

మానవ మానసమను యంత్రముతో, "దేవత"లను దయారుచేయు విధానము ఋగ్వేదములో నంతస్పష్టముగా నెచటను దొరకదు. పూర్వాచారములచేఁగాని, నిశ్చిత విధి విధానములచేఁగాని మాంద్యముపొందని, మానవ మానసారు ణోదయ వేళనుండు దివ్యకాంతి స్వచ్ఛతలు ఋగ్వేదములోఁ గానవగును. భావముల చరిత్రమందు, మొదలిదియని చెప్పు టకు శక్యముకాదు. కావున మనమెచటనో యొకచోట నారం భము చేయవలెను. వైదిక దేవతలుకొన్ని విషయములలోఁ గొన్ని ప్రకృతిశక్తుల లక్షణములతో సాపత్యముగలిగి, యెట్లనం తర మీ దేవతలు నైతిక మానవాతీత లక్షణలక్షితులుగాఁ బెంపఁబడిరో మనము మొదటఁ జూడవచ్చును. వేదమంత్రము లలోని యత్యంత పూర్వులైన దృష్టలప్రయత్నముగాఁ బ్రకృతి సౌందర్యములను జూచి యానందించు స్వభావముగలవారని చెప్పవచ్చును. కవితాదృష్టి గలవారగుటచేఁ దీవ్రమైన భావా వేగముతోడను,శక్తి కలితమైన ఊహాప్రాగల్భ్యముతోడను వారు ప్రకృతి వస్తుజాలమును దిలకించుటచే, నాయా ప్రకృతిదృశ్య ములు వారియెదుట మూర్తిమంతములై, సజీవములై కన్పట్టెనవి.

సూర్యుని ఉదయాస్తమయములలోని అద్భుతదృశ్యము లనుజూచి, ప్రేమించి పరవశులగుటలోని మాధుర్యము వారికిఁ

తెలియును. అట్టి పరవశత్వముచే నతివిచిత్రమైన జీవాత్మ, ప్రకృతులమధ్యమున సంబంధబాంధవ్యము లేర్పడును. ప్రకృతి యొక సజీవరూపమై, సన్నిహితపరిచయార్హమైన బంధువువలె వారికిఁ దోచెను. కొన్ని మనోహర ప్రకృతిదృశ్యములు స్వర్గలోకమునకు ద్వారములవలెనుండి భగవంతుఁడు దానినుండి తనసృష్టినవలోకించుచున్నట్లు వారు చూచిరి. అందుచే నక్షత్రచంద్రులు, సాగరాకాశములు, ఉభయసంధికాలములు నిజముగా దైవరూపములు. ఈవిధమైన ప్రకృత్యుపాసనమే ప్రాచీనతమ వైదికమతము.

వెంటనే నిర్వల సమాలోచన మారంభించును. ప్రకృత్యభ్యంతర స్వరూపమును జూడవలెనను కోరిక లప్రయత్నముగా నుదయించును. నిజరూప ప్రతిబింబములైన దేవతలను సృజించుపనిని మానవుఁడారంభించును. అపరిణతచిత్తుఁడైన మానవుఁ డేసీమనున్నను నిట్టిమనుష్య ప్రతిబింబరూప దైవకల్పనమును జేసియున్నాఁడు. ఒకనియమరహితమైన, క్రమశూన్య జగత్తును మనమంగీకరింపఁజాలము. దానినేదో యొక విధముగా నర్థము చేసికొని, యొకజీవితసిద్ధాంతము నల్లుదుము. ఏదియు లేకుండుటకంటె నిది మంచిదనితలతుము. సహజముగా మనసంకల్పమును బెంచి, దానికి రూపమిచ్చి, దృశ్యములకుఁ దత్త్వకారణములను వెదకుదుము. ౧. మనుష్య ప్రకృతికనుగుణముగా నన్నిటి

౧. టైలరు పండితుఁ డిట్లు వ్రాసెను. "శరీరముచే శరీరము నడుచున్నట్లు ఆత్మశక్తి యెట్లు పనిచేయించుచున్నదో అట్లే, ప్రపంచపరిణామముల నన్నిటి నితర ఆత్మశక్తులుండి నడిపించుచున్నట్లుతోచును." ప్రిమిటివ్ కల్చరు. ౬. నాచురల్ హిస్టరీలో హ్యూమ్ వ్రాసినాఁడు; "అన్ని జీవములు తమవలెనే యుండు

కర్థముకల్పించుచుఁ, బహిర్దృశ్యముల వెనుక సంకల్పములఁ బ్రతిష్ఠింతుము. దీనిని ప్రకృతియంతయుఁ జైతన్యమను వాదముగా నర్థముచేసికొనరాదు. ఇందు విశ్వమంతయునట్లు కాదు. ఇదియొక విధమైన యనేక దేవతోపాసనము. ప్రకృతిలోనద్భుతదృశ్యములకు దైవత్వమారోపించు విధానము. భరతవర్షముననట్టి యద్భుతదృశ్యము లెన్నెనికలవు. జన్మసిద్ధమైనమతాభిమాన మివ్విధమునఁ బ్రదర్శించుకొనును. ఘోరప్రమాదము నమీపించి తప్పిపోయినప్పుడు, లేక బ్రహ్మాండమైన ప్రకృతిశక్తులకుఁ దాను వట్టిబానిసనని మానవుఁడు తెలిసికొన్నప్పుడు, కలుగు గాఢ మతోద్రేకముహూర్తములలో, దేవుని యొక్క ఉనికి సత్యమని గోచరించును. తుపానులో దేవునికంఠధ్వని నాతఁడు విని, వాయువేగము తగ్గుటలో నాతఁడు దేవుని కృపను జూచును. ఇటీవలవచ్చిన స్టొయిక్కు మతములో నిట్టి కల్పనములున్నవి. "సూర్యచంద్రనక్షత్రములు, ధర్మము, మనుష్యులు దేవతలుగా మారిరి." ౧. ఇంద్రియముల కగోచరమైన యొక ప్రపంచమున్నదను సత్యమును విశ్వసించి వేదముల నాటియార్యుఁడు మంచిపనిచేసినాఁడు. దానినిఁ గూర్చి యాత

---

నని తలఁచుట మానవజాతిస్వభావము. మనకుఁ దెలియని శక్తులెప్పుడో కేవిధముగాఁ గనపడిన కారణమున నవి యొకేజాతికిఁ జెందినవని తలచెదము. అంతేకాక ఆశక్తులకు బుద్ధి, వివేకము, క్రోధాదికము నారోపించుటే కాక, కరచరణాదులతో రూపములిత్తుము."

౧:—చూడు గిల్బర్టుమర్రె వ్రాసిన ఫోర్ స్టేజెస్ ఆఫ్ గ్రీక్ రిలిజియన్—పు. 17.

నికి సందేహములేదు. దేవతలుగలరు. ప్రకృత్యారాధనము, ప్రకృత్యంతర దేవతారాధనము వేదమతముయొక్క ప్రథమదశ.

ఆర్యులు, ఇరేనియనులు జన్మముచే నొకేజాతివారనియు, వారికిసమానలక్షణములు పెక్కుగలవనియు చరిత్రతెలిసిన వారికి వాదుకలోనున్న విషయము. వారు తమ పూర్వనివాసము నుండిభరతవర్షమునకును, జొరాష్ట్రియనుల దేశమైన "ఇరాను"కువచ్చి, యీమధ్య భూమినివాసముగాఁ జేసికొని యవిభాజ్యమైన యొకజాతిగాఁ గొంతకాలము జీవించిరి. జీవితావసరముల కొఱకు, స్థలాభావముచేతను, సంచారకుతూహలము వలనను, దమనివాసమువిడిచి, పెక్కుదిశలలో నూతనస్థలములకై వారు తిరుగాడ వలసివచ్చినది ౧. అందుచేతనే, భరతవర్ష పర్షియా దేశములలోనిప్రాచీనమతతత్త్వభావములకెంతో పోలికయుండుట మనము చూచుచున్నాము, డాక్టరు మిల్సు చెప్పినాఁడు; "అవెస్టా,భాషలో, వేదములకు, వేదములు తనకుఁజెందిన పురాణసంస్కృతమున కెంతదగ్గరగానున్నవో యంతకంటె దగ్గరగానున్నది." భాషలోనేకత్వము లీనమైయున్నది. ఆర్యులు పాంచాలముఖమున భారతదేశమునకు వచ్చినపుడు, నలుపురంగుగలిగి, మద్యమాంసములఁ దినుచు, భూతదైవతముల నర్చించుచుండు దేశీయులనుగాంచి దస్యులనిపిలిచిరి. ౧. ఆర్యులు వారినుండి

---

౧:—భారతీయులు, ఇరేనియనులు ఇండోయూరిపియన్ అను పెద్దకుటుంబమునకుఁ జెందినవారని చెప్పుదురు. దీనినుండియే అల్పవర్గములు ట్యూటానిక్, కెల్టిక్, స్లేవనిక్, ఇటాలిక్ హెలెనిక్, ఆర్మనియన్ శాఖలు వచ్చినవని చెప్పుదురు. వీరిమతసంస్కృతి భావములనుబోల్చి, విద్వాంసులు మొదట వీరికొకటే ఇండోయూరిపియన్ మతముగలదని చెప్పుచున్నారు.

దూరముగా నుండఁదలఁచిరి. ఉన్నతవిజ్ఞానగర్వము, నధికజాతి గర్వమునుండి జనించిన ప్రత్యేకతా భావమునుండియే తరువాత జాతివిభాగముదయించి యుండనగును. ఆర్యులు తమ మతము దేశీయుల భావములతోఁగలిసి మలినముగాకుండనుండుటకై, వారిరచనలనన్నిటి నొకపద్ధతిలోఁ గూర్చుకొనిరి 'సంహిత' యనగా సంపుటీకరణము. ఆర్యు లనార్యులతో సంపర్కము వచ్చినపుడు తాముకరచించిన మంత్రములను సంపుటి చేయఁగా ఋగ్వేదమైనది.

ఆర్యులు, ఇరేనియనులు కలిసి, ఏకజాతిసౌదర్యముతో నున్నకాలమున వారు కల్పించుకొనిన వేదములందలి "దేవత" లనుగూర్చి మనము వర్ణింతము.

మానవుఁడు దుర్బలహృదయుఁడు గాన, ప్రపంచము యొక్క అసంపూర్ణత, మానవుని యల్పత్వము, జూచి, దుర్దశలో మొఱపెట్టుకొనుటకు, ధైర్యముతో నాధారపడుటకుఁ ఘనశక్తిసమన్వితుఁడగు నొక దేవతను గురువుగా, మిత్రుఁడుగా నాపత్సహాయుఁడుగానుండఁగోరును. ఆనాఁటి మానవజాతిబాల్యదశలో, ననంతశక్తిని గూర్చిన యన్వేషణములో ననంతము తేజో

---

ప్రకృతిచైతన్యతత్త్వము, గాఁడీవిద్య, పూర్వులపూజించుట అమర్త్యత్వమందునమ్మకము నిందలి ప్రధానాంశములు. ఇటీవలి మనుష్యజాతిశాస్త్రవేత్తలైన రిస్లీమున్నగువారు వేరుగా విభాగములు చేసిరి. మనకిచట వీనితో సంబంధములేదు.

మధ్యాసియాసీమనుండి ఆర్యులు బయలుదేరి, ఆ ఘనస్థానముకుండ నొకశాఖ భారతవర్షమునకును, మఱొకశాఖ ఇరాన్ దేశమునకుబోయి నప్పటి నుండియే భారతదేశ చరిత్రారంభమగును.

మయమునైన యాకాశముకంటె నధికమైనది లభించుటకష్టము. సూర్యచంద్ర నక్షత్రములు మారవచ్చును; తుపానులువచ్చి, మేఘములు పోవచ్చును; కాని యాకసమెప్పుడు నుండును. 'ద్యౌస్సు' (దివ్ = ప్రకాశించు) ఇండోఇరేనియన్ దేవతయే కాక, ఇండో యూరపియన్ దేవతయు నైయున్నది. గ్రీసుదేశమున 'జ్యూస్' దేవతగాను, ఇటలీలో జ్యూపెటర్ దేవతగాను, ట్యూటానిక్ జాతులందు, "టైర్" లేక "టై" దేవతగాను నేటికి నున్నది. మొదట "దేవ" శబ్దము "కాంతి"కిని తరువాత కాంతిగల సూర్యనక్షత్రములకును, నుషస్సునకును, పగటికిని గూడ నుపయోగింపఁబడినది. ప్రకాశించు సర్వవస్తువులకీ నామము సామాన్యముగా వాడఁబడినది. భూమికూడ శీఘ్రముగా దేవతయైనది. భూమ్యాకాశములు మొదట, వైశాల్యము, విశేష వ్యాప్తి, కలిగి ఫలవంతములైనవిగా గ్రహింపఁబడినవి. ౧. భూమికిఁగల లక్షణములు, "తేనె నిచ్చునది" "క్షీరసమృద్ధి"గలది

---

౪౬ పుటలో ౧:—మనకిప్పుడున్న యాధారములనుబట్టి, మొదట తామార్యులమని చెప్పుకొన్న జాతి యెచటెచటను సంచారముచేసినదో యీవివరముల నేమాత్రము స్పష్టముగాను నిర్ణయించుట దుర్ఘటము. ఆర్యజాతి [illegible] విభాగమంది శాఖలుగాఁ జీలిపోయి, సంస్కృతము వాడుకభాషయైన పిమ్మట సాంఘికపరిస్థితిని దెల్పునవే వేదమంత్రములు కాని ద్రవిడజాతి, భరతభూమిలోని మొదటి జాతియనియు మేమంగీకరింపము. ఆర్యులకంటె ముందుగా భారతదేశమునకువచ్చి, తమనాగరికతను స్థాపించినది ద్రవిడజాతి. ద్రవిడులు, ఆర్యజీవితవిధానములను స్వీకరించినమాట నిజమేకాని, తమభావముల నార్యనాగరికతయందును జొప్పించిరి. దుర్గమములైన పర్వతప్రాంతముల నాక్రమించి యిప్పటికిని జీవించుచున్న వివిధజాతులవారు, భారతదేశముయొక్క ప్రథమనివాసులైన నైయుండవచ్చును.

యని వర్ణింపఁబడినది. మఱియు నచిరకాలములో భూమ్యాకాశములకు మనుష్యలక్షణము లారోపించి, "అజరుఁడనియు, మాతయనియుఁ బితయనియు" సంబోధించిరి. ఔదార్యము, సర్వజ్ఞత్వము, ధర్మగుణము మున్నగు నైతికలక్షణము లన్వయించిరి. ౨ ఈగుణారోపణ విధానము, మొదట భౌతికము, తరువాత వ్యక్తిగతము, వెనుక దైవికమునై వెలసినది. అన్ని దేశములందును భూమ్యాకాశములు ప్రత్యేకముగాఁ బూజింపబడినను, దరువాత వానికి వివాహముచేసిరి. ఆకాశము బీజప్రదాతయై, భూదేవత వివిధఫలక్షేత్రమై గర్భవతియైనది. హోమరుకవి గీతములలో భూమినిట్లు సంబోధించెను." దేవతలకు జనని, నక్షత్రమయాకాశమునకు భార్య," ౩. ఈభూమ్యాకాశములు సర్వజీవరాశికి మాతాపితలే. ఏలన నవియే ప్రాణికోటికిఁ బోషణసామగ్రినిచ్చి రక్షించుచున్నవి. ఋగ్వేదమందు వీని నేకవచనార్ధకమగు బహువచనశబ్దముతో వాడిరి. ఉషస్సు, సూర్యుఁడు, అగ్ని, వాయువు, వర్షము వానిసంతతి, మనుష్యులకు దేవతలకును వారు తల్లిదండ్రులు. ౪. దేవతలసంఖ్య పెరు

(౧) ౧. ౧౬౦.౨: ౧.౧౮౭. ౫; ౪.౫౬.౩; ౬.౭౦.౧,౨

(౨) ౧.౧౫౯.౧: ౧.౧౬౦ ౧;౪.౫౬.౨; ౪.౭౦.౬

(౩) చూడుము మ్యాక్సుముల్లర్. ఇండియా, వాట్ కెన్ ఇట్ టీచ్ అజ్ పుట. ౧౫౬

(౪) ౧.౧౮౫.౪;౧.౧౫౯,౧-౨; ౧.౧౦౬,౩. ౩, ౩,౧౧: ౪,౫౬ ౨;౬,౧౭,౭; ౭,౫౩,౧-౨; ౬,౮౫. ౧౨; ౧౦,౧,౭: ౧౦,౩౫,౩; ౧౦. ౬౪,౧౪; ౧౦,౬౫,౮,౧౦.౧౧.౯. (౫) రామానుజభాష్యము, ౧. ౧౬౦, ౪,౪,౫౬,౩,

గుటతో, భూమ్యాకాశముల కర్త లెవరను ప్రశ్న బయలుదేరి నది. "సర్వజీవముల కానందమిచ్చు, తేజోమయములైన భూమ్యాకాశములు దేవతలలో నెవఁడుచేసెనో యాతఁడు వారిలో కెల్ల నత్యధిక శేముషీమంతుఁడు. ఈ తేజోమయ భూతములను దనప్రజ్ఞచే, నియమించి, శాశ్వతాధారములపై నిలిపినాఁడు.౫ ఈసృజించుశక్తి అగ్నికి ౧, నింద్రునికి, ౨. సోమునికి, 3. నివ్వ బడినది. ఈగౌరవ మితర దేవతలకు నిచ్చినారు.

ఆకాశ దేవత వరుణుఁడు. 'వర్' అనగా నాచ్ఛాదించు లేక ఆక్రమించు నను ధాత్వర్థమునుండి యీశబ్దమువచ్చినది. గ్రీకుల "అవరానన్" అవెస్టాలోని "ఆహురామజ్దా" తో నీ దేవత సరిపోవును. ఆతని భౌతికోత్పత్తి స్పష్టము. వరుణుఁడాచ్ఛాదకుఁడు. నక్షత్రమయమైన సర్వాకాశమును నందలి జీవరాసుల తోడను, నివాసములతోడను నొకవస్త్రముతో వలె నాచ్ఛాదనము చేసినాఁడు. ౫ మిత్రుఁడాతని సంతతమిత్రుఁడు. వరుణమిత్రులు కలిసి వాడినప్పుడు రాత్రిందివములు, అంధకారజ్యోతులు. వరుణుని రూపము క్రమముగా మార్పునొంది దేవతలలో ధర్మమూర్తి యగును. ప్రపంచము నవలోకించుచు, దుష్టులను శిక్షించుచు, దన్నాశ్రయించిన వారిని పాపములనుండి రక్షించుచుండును. సూర్యుఁడాతని చక్షువు,ఆకాశమాతనిదుకూలము, మహామారుతమాతని యూపిరి. ౬ నదులాతని యాజ్ఞచేఁ బ్రవహించుచున్నవి; ౭ అతనివలని భయముచే సూర్య చంద్రి

(౧) ౧. ౬౭. 3. (౨) ౧౦. ౮౯. ౪. (3) ౯. ౧౦౧ ౧౫.
(౪) 3. 3౧. ౧౭. (౫) ౮. ౪౧. (౬) ౭. ౮౭. ౨.
(౭) ౧. ౨౪. ౮. ౨. ౨౮. ౪; ౭. ౮౭. ౫.

నక్షత్రములు తమ తమగతులు తప్పకుండ సంచరించుచున్నవి.౧ ఆయన శాసనముచే భూమ్యాకాశములు విడిగా నిలుచుచున్నవి. భౌతిక ధార్మిక వ్యవస్థ యాతని భుజములపై నిలిచియున్నది. ఆతఁడు చపలచిత్తుఁడుకాఁడు; ధృతవ్రతుఁడు. ఇతర దేవతలాతని యాజ్ఞ ననుసరింతురు. ఆతఁడు సర్వజ్ఞుఁడగుటచేఁ బక్షుల గమనములు, సాగరములో నౌకల మార్గములు, వాయుసంచారము లాతఁడెఱుఁగును. చీమ చిటుకన్న నాతనికిఁ దెలియును. ఆతఁడు దేవతలకు దేవత, పరదేవతయునై, దుష్టశిక్షణము శిష్టరక్షణముఁ జేయును. తానులోకమున స్థాపించిన శాశ్వత ధర్మశాసనము ననుసరించియే తానును నడచుకొనును. అయినను దన్ను దూషించినవారు వేడిన క్షమించి దయతోఁ జూచును. ౧ వరుణునకుఁ జెప్పిన మంత్రము లన్నిటిలోఁ, దాముచేసిన పాపముల నగ్గడించి పశ్చాత్తప్తులై చేయు క్షమార్పణములే యున్నవి. దీనిలన నార్యుల హృదయములు పాపభీతితోడను, ప్రార్థనముల తోడను నిండియున్నవని తోచును. ౨.

భాగవతుల యొక్కయు వైష్ణవుల యొక్కయు భక్తిప్రధానమైన యేకేశ్వరవాదమునకు బీజములు పాపమువలనభీతి,

౧. అథర్వవేదము (౪-౧౬-౧-౫) నుండి మ్యూర్ పండితుఁడు వరుణమంత్రములను బద్యరూపమున భాషాంతరీకరించినాఁడు, దీనివలన వైదికార్యుల దృష్టిలో 'దేవ' భావ మత్యున్నతమైనదని గోచరింపఁగలదు సర్వేశ్వరాను లను సృజించి, దయతో వారినజ్ఞానమునుండియుఁ బాపములనుండియుఁ గాపాడునని దాని సారాంశమైయున్నది.

౨. వేదిక్ మైథాలజీ. పుట 8 (3) తత్వమూలసూత్రముల లక్షణము-"సృష్టికి బూర్వము దేవుడ"ని హెగిల్ పండితుఁడు చెప్పినాఁడు.

దేవుని క్షమాన్విత కృపయందు విశ్వసించిచేసిన వరుణోపాసన మందుఁ గలవు. మెగ్డొనల్ పండితుఁడిట్లు వ్రాసెను; "అత్యుదార మైన యేకేశ్వర మతమునందలి పరమేశ్వరుని లక్షణములు వరుణునికిఁగలవు.3"

వరుణుని యధీనములోనున్న శాసనమునకు "ఋత" మని పేరు. ఋతమనగా వస్తుస్థితి. శాసనము, నందిమిడియున్న ధర్మము నిందుఁగలవు. సూర్య చంద్ర నక్షత్రముల యవక్ర గతులను అహోరాత్రముల యొక్కయు ఋతువులయొక్కయుఁ గ్రమములనుజూచి మొదట యీసూత్రమును గనుఁగొనిరని తోచును. ప్రపంచక్రమమే ఋతము. ప్రపంచములోనేది క్రమ బద్ధమో యందు ఋతమను నియమమున్నది. ప్లేటోచెప్పిన విశ్వభావములకు నీ ఋతమునకుఁ బోలికయున్నది. 3 దృశ్య ప్రపంచము, నాశమగుచున్న దృశ్యములలోనవి నాశమై, శాశ్వతమైన సత్యరూపముగల ఋతముయొక్క ప్రతిబింబమే. వేద ద్రష్టలు ఋతమునుండియే సర్వదృశ్యము లేర్పడినవని నమ్మెదరు. కావున ఋతమే మనకుఁ దండ్రియనిరి.

"ఋతముయొక్క నిలయమునుండి మహత్తు లుద్భవించి నారు." ౧ "విష్ణువు ఋతముయొక్క గర్భము." ౨ భూమ్యాకాశములు ఋతమువలననే యట్లున్నవి. 3 మార్పులేని పరమ సత్యమునుగూర్చిన రహస్య జ్ఞానబీజములిచటనే యారంభించినవి. ఏది స్థిరశాసనమో యదిమారదు. దృశ్యమైనది పరివర్తనశీలముగలిగి, పరిపూర్ణమైనదాని ప్రతిబింబమే. సత్యమైనది

(౧) ౧. ౨౧. 3. (౨) ౧. ౧౫౬. 3 (3) ౧౦. ౧౨౧.

భాగములు మార్పులులేనిది; అసత్యమైన దెప్పుడును మారుచు నదృశ్యమగును. ఇట్టి సృష్టిశాసనము పరమేశ్వరుని సంకల్ప రూపమై, నీతి ధర్మనిలయమై ప్రకాశించును. దేవతలైన నీశాసనము నతిక్రమింపఁజాలరు, ఈభావపరిణామములో భౌతికలక్షణములనుండి దైవత్వమునకుఁ గ్రమాభివృద్ధిఁ గాంచనగును. మొదట ఋతమునకర్థము, "జగమునకు, సూర్య చంద్రనక్షత్రములకు, అహోరాత్రములకు, సంధికాలములకు, నిశ్చితమైన గమనమార్గ"మని చెప్పఁబడినది. క్రమముగా నది మానవుఁడాచరింపలసిన ధర్మమార్గమై,తరువాత దేవతలుకూడననుసరింపవలసిన పరమధర్మశాసనమైనది. "అరుణోదయము ఋతమార్గమునఁ జరించును; అదియే సరియగు మార్గమనియు, నిదివఱకే తనకుం దెలిసియున్నట్లును వర్తించును. ఆమె యెన్నఁడును దారితప్పదు. "సూర్యుఁడు ఋతమార్గమునే యనుసరించును. [౪] జగమంతయు ఋతముమీఁదనిలిచి, అందే నివసించుచున్నది. [౫] ఋతమునుగూర్చిన యీ భావమువలన విధినిగూర్చి వర్డ్స్వర్తు సంబోధించిన వాక్యములు స్మరణకువచ్చుచున్నవి. "నక్షత్రము లపక్రమమునఁ బోకుండ నీవే కాపాడుచున్నావు. అతిసనాతనములైన ఆకాశములు నీవలన శుద్ధములై ప్రబలములై యొప్పుచున్నవి." ఏది భౌతికప్రపంచములో శాసననియమమో, నైతికరంగమున నదియే ధర్మము. నైతికజీవితము గ్రీకుల భావములో సామరస్యము,లేక పరిపూర్ణమైనక్రమము. ఆ భావ

(౪) ౧. ౨౪. ౮. హెరాక్లిటస్ చెప్పినాఁడు. "హెలియస్ అనగా సూర్య డెన్నఁడు తోవతప్పఁడు." (౫) ౪. ౨౩. ౯.

మిచట సూచింపఁబడెను. వరుణుఁడు మొదట నైతికజగత్క్రమమును నిలిపినవాఁడు; తరువాత నైతికలోకక్రమమునకుఁ బ్రభువుగాఁ బరిణతిచెందెను. ఋతస్యగోప్తా, మఱియుఁ బాపులను శిక్షించువాఁడు. పెక్కువేళల, వారుచేసిన దేవతాప్రార్థనములన్నియుఁ దమ్ము సత్యమార్గములలోనుంచి కాపాడుమనియే. "ఓయింద్రా! ధర్మమైన ఋతమార్గమున మమ్మునడపి దోషమగ్నులముగాకుండఁ గాపాడుము."౧.

ఋతమునుగూర్చిన భావమంగీకారము పొందినకొలఁదనే దేవతల స్వరూపములలో మార్పులువచ్చినవి. కారణములేకుండ బయల్వెడలు శక్తులయొక్క వ్యర్థక్రోధములకు గురియగుచున్నదని తలఁపబడినఁ ప్రపంచమును సక్రమోద్దేశముగల శక్తి నడపుచున్నదని తెలిసెను. ఆత్మవిశ్వాసము సడలినపుడును, వస్తువ్యామోహమాక్రమించునపుడును, నీభావము మనకు చిత్తశాంతిని, క్షేమమును జేకూర్చును. ఏమిసంభవించినను, ప్రకృతిసౌందర్యమున కనుగుణమైన నైతికప్రపంచమును సవ్యముగా నడపు నొక ధర్మమున్నది సుమా యను ధైర్యము మనకు లభించును. రాత్రిగడచినఁ దప్పక సూర్యుఁడుదయించునట్లే ధర్మము తప్పక జయము పొందును. ఋతమును నమ్మవచ్చును.

మిత్రుఁడు వరుణుని సహవాసి, ఇరువుర నేకముగాఁ బ్రార్థించువాడుక కలదు. కొన్నివేళల మిత్రుఁడన సూర్యుఁడు కొన్నివేళలఁగాంతి. మిత్రుఁడుకూడ, సర్వసాక్షియు, సత్యప్రియుఁడును. మిత్రావరుణులు కలిసి ఋతమును గాపాడుదురు;

---

౧. ౧౦, ౧౩౩, ౬ ౨. రామానుజభాష్యము. ౭, ౬౦

పాపమును పరిహరింతురు. క్రమముగా, మిత్రుఁడరుణకాంతి గను, వరుణుఁడు రాత్రియందలి యాకాశముగను తలఁపఁబడిరి. మిత్రావరుణులు అదితికుమారులైన ఆదిత్యులనియు, అర్యమ భగులవంటి వారనియుఁ బిలువఁబడిరి.

సూర్యునిగూర్చి పదిమంత్రములున్నవి. మానవమానస మునకు సూర్యోపాసనము సహజము. గ్రీక్కు-మతములోనిది యొకముఖ్యభాగము. ప్లేటో తనరిపబ్లిక్ గ్రంథములో సూర్యా రాధనమును గొనియాడినాఁడు. అతనికి సత్పదార్థచిహ్నమే సూర్యుఁడు. పర్షియాలో సూర్యోపాసనముకలదు. సమస్తకాం తికిని ప్రాణమునకుఁ గర్తయగు సూర్యునకు మహత్తరశక్తులు న్నవి. చరాచరము లన్నిటి కాత్మయాతఁడే. సూర్యుఁడు సర్వ ద్రష్ట; ప్రపంచరహస్యములఁ గనిపెట్టు గూఢచారి. చీకటిని దొలఁగించి, కాంతినిచ్చి, తమతమ కర్మలందుఁ బరతంత్రులగు టకై ప్రాణుల నాతఁడు మేల్కొల్పును. "మనుష్యులను, జూ చుచు, జరాచరములను గాపాడుచుఁ, బాపపుణ్యములకు సాక్షి యై, ఉభయలోకముల సంచరించుటకు సూర్యుఁడుదయించు చున్నాఁడు.౧" ఈవిధముగా సూర్యుఁడు సృష్టికర్త, భర్తయును.

పదునొకండు మంత్రములచే స్తుతింపఁబడిన సవితృఁడు కూడ సూర్యవర్గములోని దేవతయే. ఈతఁడు కాంచన నేత్ర హస్తజిహ్వాలు గలవాఁడు. ఇతనికి సూర్యునికిని భేదములేకున్నను గొన్నిచోట్ల భేదము చూపఁబడెను.౨ పగలు వెలుఁగుచున్న

౧, రామానుజ వేదాంతసూత్ర (౨) ౪,౧౪,3
—భాష్యము ౭,౬3

సూర్యుఁడే కాకుండ, రాత్రికాలమందుఁ గనపడని సూర్యుఁడుఁ గూడ నీసవితృఁడని చెప్పిరి. పాపోపశాంతికిఁ బ్రార్థనలు చేయఁబడిన యీతఁడున్నత ధర్మమూర్తి. "అవివేకముచేఁగాని, దౌర్బల్యముచేగాని, గర్వముచేఁగాని, మానవప్రకృతిచేఁగాని దివ్యాతిథిరూపుడఁవైన నీయెడమే మొనర్చిన పాపమును క్షమించి మమ్మురక్షింపుము." 7గాయత్రీమంత్రము సవితృరూపియైన సూర్యునికి సంబోధింపఁబడినది. "మాబుద్ధులనాతఁడు ప్రకాశింపఁజేయుఁగాక." సవితృని సంబోధించిన, "ఓసవితృదేవా! సంసృష్టికర్తా! మాయాటంకములను దొలఁగించి, ఆశీర్వచనములు ప్రసాదింపుము." మంత్రము యజుర్వేదమునుండి తఱచుగా నుదాహరింపఁబడుచున్నది.

విష్ణురూపమున సూర్యుఁడు జగములన్నిటికాధారము.[౧] విష్ణువు త్రిపాదదేవుఁడు. భూమిని, ఆకాశమును, మానవులకు గోచరించు నున్నతలోకముల నాతఁడావరించియున్నాడు. ఆతని మహాత్త్వము నెవ్వరెఱుఁగఁజాలరు. "భూమిపై నున్న మేము నీ రెండు స్థానముల నెఱుఁగుదుము, నీనిలయమైన మూఁడవదానిని నీవుతప్ప నెవరెఱుఁగుదురు?"[౨] ఋగ్వేదములో విష్ణువునకుఁ దక్కువపదవి యొసఁగఁబడెను. కాని యితనికి ముందు గొప్పపదవి లభించును. కాని వైష్ణవమతమునకు బీజములు ఋగ్వేదమునఁగలవు. ఆతఁడు బృహచ్ఛరీరుఁడనియు, ననగా లోకమే శరీరముగా గలవాఁడనియు, "ప్రాత్యేత్యావహామ్న"నియు ననఁగా భక్తులపిలుపువినిదర్శనమిచ్చువాఁడనియు[3]

(౧) ౧.౨౧.౫౪. (౨) ౧.౨౨ ౧౭; ౭.౯౯ (3) ౧.౧౫౪.౬

వర్ణింపఁబడెను. మానవునిదుఃఖముఁ దొలఁగించుటకై మూఁడు సారు లాతఁడు భూమండల విహారము చేసెనట ! ౧.

పూషన్ యింకొక సూర్యగణములోని దేవత. పశు పాలకుఁడు క్షేత్రపాలకుఁడునైన దేవతయగుటచే మానవబంధు వీతఁడు. ఇతఁడు వ్యవసాయము చేయువారికిఁ బొంధులకు దేవుఁడు.

రస్కిన్ పండితుఁడు వ్రాసినాఁడు; "సవ్యమైన సమా లోచనముగల వానికిఁ, బ్రభాతముకంటె నిగూఢమైన పావన త్వము నిచ్చునదిలేదు." అనంతమగు నీప్రభాతమునుండి, ప్రతి దినము ప్రాణకాంతులు ప్రసరించును. ఇదియే ఉషాదేవి; గ్రీక్కుల ఈవోస్. సూర్యుఁడు, నశ్వినీదేవతలు ప్రేమించు సుందరవధువు. తన హేమకిరణములతోఁ దన్నాలింగనమొన ర్చుకొనుటకై సూర్యుఁడు వచ్చులోపుననే,యదృశ్యమైపోవును.

ఏఁబది మంత్రములలోఁ బూర్తిగాను, ననేకములైన యితర మంత్రములలో నసంపూర్ణముగాను స్తుతింపఁబడినవా రశ్వినీదేవతలు ? వీ రిరువురు కవలల వంటివారు. కాంతి తేజము లకుఁ బాలకులు; దృఢగాత్రులు,గరుడవేగ గమనులు. వా రా కాశదేవతబిడ్డలు, ఉషస్సువారి చెల్లెలు, ప్రదోష కాంతివారికి మూలభూతము. అందుకే రెండుప్రదోషములకు నివువు రున్నా రు. క్రమముగా వారే, మానవులకు దేవతలకు వైద్యులుగాను నద్భుతకరులుగాను, దాంపత్య ప్రేమజీవితరక్షకులుగాను,

౧, మానవఖాఖితాయ, ౪-౬,

ఖిన్నులైన వారి నన్నిదుర్దశలనుండియుఁ గాపాడువారుగాను వర్ణింపఁబడిరి.

అదితినుండి యాదిత్యదేవతా లుదయించిరని యిదివఱకే చెప్పితిమి. 'అదితి' శబ్దమున కర్థము హద్దులులేనిది. అగోచర మునవంతమునై, అన్నివైపులనిండి, భూమి మేఘాకాశముల యవతలకూడ వ్యాపించునదని దీనిభావము. ఇచట నూర్ధ్వలోక ములలోనున్న సర్వమునకిది మూలశక్తి. "అదితి ఆకాశము; మధ్యభాగము; అదితియే తల్లి, తండ్రి, కుమారుఁడు; అదితియే పంచవర్గాత్మకమైన సర్వదేవతారూపము. అదితియేపుట్టిన పుట్టబోవుసర్వవస్తురూపము ౨. సర్వసృష్టిజాలమును సృజించి యాక్రమించిన సాంఖ్యములోని ప్రకృతిభావమిచ్చట సూచిం పఁబడినది. అనాక్సిమాండరుచెప్పిన అనంతతత్త్వమిదియే.

దేవతగా నారాధింపఁబడిన భూతములలో నగ్నియొకటి అగ్ని 3 ఒకయింద్రునికి మాత్రమే తక్కువపదవి గలిగి ౨౦౦ మంత్రములలో సంబోధింపఁబడినది. సూర్యుని కార్చిచ్చునుండి అగ్నిభావ ముదయించినది. మేఘములనుండి పుట్టు విద్యుత్తు అగ్నియే. శఱాతినుండి కఱ్ఱనుండియుఁ గూడ నది వచ్చినది. ౫. మాతరిశ్వుఁ డగ్నినాకసమునుండి తెచ్చి, భృగువులఁ యధీన ములో గోధుమవర్ణముగల గడ్డము, నిశితములైన దౌడలు, మండుచున్న దంతములు గలిగిన స్వరూపమగ్నికిఁ గలదని వర్ణిం చిరి. నెయ్యి, దారువు నాతనిభుక్తి, సూర్యునివలెఁ గాంతిచే రాత్రి చీకటి నాతఁడు పోఁగొట్టును. పర్వతముల నాక్రమించు నవుడాతని మార్గము ధూమమయము; అతని కంఠనాదము

మేఘనాదము; ధూమమే పతాకముగుటచే నాతఁడు ధూమకేతువు. "ఓ అగ్నీ ! మేము సమర్పించు నీసమిధ నంగీకరించి, మండి, నీధూమము నాకసమువైపునకంపి, ఊర్ధ్వలోక శిఖరముల నంటి, సూర్యకిరణములతోఁ గలియుము." ౧. ఈవిధముగా నగ్ని, పచనగృహములందును హోమగుండములందే కాక, యాకసమునందును వాయువునందును సూర్యునందు, మేఘమునందు, మెఱుపునందు, నుమస్సునందుఁ గూడఁగలదు. భూమ్యాకాశములందు వ్యాపించిన గొప్ప దేవతగా నగ్నిమారును. ఈ భావము పెంపొందినకొలఁది, అగ్నిరూపమును మహత్తరమైనది. దేవమానవులకు మధ్యవర్తియై, అగ్ని సర్వసహాయకుఁడగును. "ఓ అగ్నీ ! మాయజ్ఞమునకు వరుణునిగూడఁ దీసికొనిరమ్ము. ఆకసమునుండి యింద్రుని, వాయువునుండి మరుద్దేవతలను దెమ్ము." ౨. "అగ్ని నాజనకుఁ డని నమ్మెదను. అతఁడే నా బంధువు, సోదరుఁడు, మిత్రుఁడు."3

అమర్త్యత్వమును, మహోత్సాహము నిచ్చు దేవుఁడు సోముఁడు. ఈతఁడవెస్టాలోని హయోమాకును, ద్రాక్షాసవసురాసవముల కధిపతియైన గ్రీక్కులడయోనిసోస్ కును సరిపోవును. మత్తువలయువారికి సరిపోవు మత్తశాఖలివి. దుఃఖితుఁడైన వానికిఁ దనదుఃఖములను మఱచుట కేదియో యొకటుండవలెను. మత్తు కలిగించుపానము మొదట నారంభించువాని కొకవిధమైన

౧, అశ్వినులు=గుఱ్ఱములనడపువారు, 3. లాటిన్‌లో ఇగ్నిస్,

౨. రామానుజభాష్యము ౧,౮౯, ౪,౨,౧౨,3

యానందమునందొక గగుర్పాటు కలుగును. వాఁ డున్మాదియనుటకు సంశయము లేదు కాని వాఁడుమాత్రము తానొక దేవతా సంబంధమైన పిచ్చిలోనున్నట్లు తలఁచును. దివ్యదృష్టి, హఠాత్ జ్ఞానము, నిగూఢ తత్త్వానుభవము, విశ్వవిశాల దానపరత్వము, సార్వజనీన సుహృద్భావము, నివి సమాధిగతమైన ఆత్మలక్షణములు. అందుచే జీవికి మహోత్సాహజనకమగు సురయు దైవలక్షణసంపన్నమని తలఁచుటలో నాశ్చర్యము లేదు. విట్నె యిట్లు వ్రాసినాఁడు: "అమాయకులగు నార్యులు ప్రకృతియందలి యద్భుతదృశ్యములను శక్తులను బూజించినారు; సురాపానము దేహమనశ్శక్తుల నుద్రేకింపఁజేసి యొకవిధమైన యున్మాదావస్థకుఁ గొనిపోయినపుడు, మానవుఁడు సహజస్థితిలో నున్నప్పటికంటె నధికము నున్నతమునగు కార్యమొనర్ప సమర్థుఁడగుచున్నాఁడనుసంగతిని వారు కనిపెట్టినంతనే, సురయందు దైవత్వము నారోపించి, దాని నాస్వాదించినవారికట్టి దైవలక్షణములు నిచ్చునని నిశ్చయించిరి. ఈ సోమమునిచ్చు లతనువారు లతలకెల్ల రాణియనిరి; లతనుండి సోమమునుదీయు విధానమునుఁ బవిత్రయజ్ఞమనిరి; ఈ యజ్ఞమునం దుపయోగించు వస్తువులన్నియుఁ బవిత్రము లే. ఈ విధానముయొక్క ప్రాచీనతకు సాక్ష్యములు పారశీకుల అవెస్టా గ్రంథమునఁగలవు. కాని యిట్టి సోమయజ్ఞము భరతవర్షమున నూతనవికాసము గాంచినది." ౧ సోమరసము పూర్తిగా మూర్తిమంతముచేయఁబడ లేదు. లతయు

(౧) రామానుజభాష్యము ౨.౬. (౨) రామానుజభాష్యము౧౦.౭౦.౧౧
(3) రామానుజభాష్యము ౧౦. ౭. 3.

నందలి రసమును దృష్టియెదుట స్పష్టముగాఁ గాన్పించుచుండు టచే వానిని దేవత లనుటకు వారుసాహసింప లేకపోయిరి. సోమము నుగూర్చిన మంత్రములను, లతనుండి సోమమును బిండునపుడు పఠించుట కుద్దేశించిరి. "ఓసోమమా! ఇంద్రునికొఱకై నిన్నర్పించుచున్నాము. మధురమై యుత్తేజకమైన ప్రవాహరూపమునఁ బ్రసరింపుము." ౨.౮-౪౮-3 వ మంత్రములో భక్తుఁడిట్లు తనయున్మాదమును వెలిబుచ్చును; "మేమును సోమమును ద్రాగితిమి. మృత్యువును జయించి, జ్యోతియందుఁ బ్రవేశించి. దేవతలనుజూచితిమి!" దేహము వశముదప్పిన యీస్థితినాత్మ సిద్ధియని తలఁచుట వేదకాలమునకుఁ జెందిన దేకాదు. త్రాగి పరవశమైనప్పటి దృష్టికిని, యోగిదృష్టికిఁ గొంతసంబంధమున్న దని విల్లియమ్ జేమ్సు చెప్పుచున్నాఁడు. శరీరపరవశత్వమువలన దైవసాక్షాత్కారమగునని నమ్మఁబడెను. క్రమముగా సోమ రసమున కౌషధశక్తులు కలిగినవి. అంధులకుఁ జూపును, కుంటి వారికి నడకను నిచ్చినది.౧ ఈక్రింద నుదాహరింపఁబడిన గీతము వేదకాలమునాఁటియార్యులు సోమమునకెట్టి ప్రాధాన్యమిచ్చిరో చూపుచున్నది:

"ఓసోమమా! సృష్టిలోనెచట శాశ్వతకాంతి యుండునో, యెచట సూర్యుఁడుంచఁబడెనో, నన్నట్టి స్థిరమైన, చావులేని చోట నుంచుము;

"ఎచట వివస్వతపుత్రుఁడు ప్రభువై రాజ్యమేలునో,

(౧) జర్నల్ ఆఫ్ అమెరికన్ ఓరియంటల్ సొసైటీ 3-౨౯౨
(౨) ౯. ౧.

ఎచట రహస్యస్వర్గమున్నదో, యెచట నఖండ జలప్రవాహము లున్నవో యచటనాకు మరణరహితమైన స్థానమునిమ్ము;

"ఎచట స్వేచ్ఛగలదో, స్వర్గములలో మూడవలోక మెచటనున్నదో, యెచట లోకములు తేజోమయములో నచట నన్నమరునిగాఁజేయుము;

"ఎచట నాశలు కోరికలుండునో, యెచట తేజోమయుఁడైన సోముఁడున్నాఁడో, యెచట మృష్టాన్నము, నానందము గలవో, అచట నన్నమర్త్యు నొనర్పుము;

"ఎచట సుఖానందములుగలవో, మోదప్రమోదము లెచటనుండునో, ఎచట మావాంఛలన్నియు సిద్ధిపొందునో,యచట నన్నమర్త్యు నొనర్పుము." ౧

పై నుదాహరించిన సోమమంత్రములో వివస్వతపుత్రుని స్మరించితిమి. ఆతఁడే ఋగ్వేదమందుఁ జెప్పఁబడిన యముఁడు. అవెస్టాలోని వివస్వంతుని పుత్రుఁడైన యముడు. మూఁడు యమమంత్రములున్నవి. యముఁడు చచ్చినవారిలో శ్రేష్ఠుఁడు: మరణించినవారికిఁ బ్రభువేకాని, దేవతకాఁడు. యముఁడు మజునులలో మొదట మరణించి, పితృయానమున నింకొక లోకమునకుఁ బోయినవాఁడు. ౧ తరువాత వచ్చినవారంద ఱకు స్వాగతమిచ్చుచాత యైనాఁడు. ఆలోకములో నందఱకం ఈ నధికానుభవమున్నది కనుక నాతఁడు వారందరకుఁ బ్రభువు. కొన్ని చోటుల నాతనినస్తమించు సూర్యుని దేవతయని చెప్పిరి.౨

(౧) ౭. ౬౮. ౨; ౧౦. ౨౫. ౧౧

(౨) సేక్రేడ్ బుక్స్ ఆఫ్ ది ఈస్టు; వేదమంత్రములు భా౧. చూడు. 'బక్సే ఆఫ్ యూరిపైడిన్' గిల్బర్టుముద్రే భాషాంతరీకరణము పు20

బ్రాహ్మణములందు యముఁడు మనుజుల దుష్కర్మములకు నిందించి శిక్షించువాఁడయ్యెను. కాని, ఋగ్వేదమునందాతఁడు పాలకుఁడు మాత్రమే. లూషక్ హెరాక్లిటసుచేఁ బలికించిన యీమాటలలోని సత్యమును యముని వర్ణనము నిరూపించును "మనుష్యులెవరు? మరణించు దేవతలు; దేవతలెవరు? చావులేని మనుష్యులు."

పర్జన్యుఁడార్యుల యాకాశదేవత. ఇతఁడార్యులు భరతభూమిలోఁ బ్రవేశించినతరువాత నింద్రుఁడయ్యెను. ఏలన నింద్రుఁడార్యకుటుంబమునకుఁ జెందిన యితరజాతులలో లేఁడు. వేదములలో పర్జన్యుఁడాకాశమే. "భూమి మాత, నే నామె పుత్రుఁడను. పర్జన్యుఁడు తండ్రి. మాకాతఁడు సాయపడుఁగాక."[౩] అథర్వవేదమందు, భూమి పర్జన్యుని భార్యయని చెప్పఁబడినది.[౪] మేఘ వర్షాధిపతి పర్జన్యుఁడు.[౫] దేవునివలె లోకమునంతను రక్షించును; సర్వప్రాణు లాతనియందు విశ్రమించును.[౬] మేఘమనికాని, వర్షమనికాని యర్థమువచ్చునట్లు పర్జన్యశబ్దము కొన్నిచోటుల వాడఁబడినది.[౭] విధ్యానియమనుల దేవుఁడై, అశనిపాతమున కధిపతియైన పెర్కుమస్కుకుఁ బర్జన్యుఁడు సరిపోల్పనగునని మ్యాక్సుముల్లరు వ్రాసినాఁడు.[౮]

---

(౧) పితృయానము. ౧౦. ౨. ౭. (౨) ౧౦. ౧౪.

(౩) అథర్వవేదము ౧౨. ౧. ౧౨. (౪) ౧౨. ౧. ౪౨.

(౫) రామానుజవేదాంతభాష్యము ౫. ౮౩. (౬) రా. భాష్యము ౮. ౧౦౧. ౬, (౭) రా. భాష్యము ౧. ౧౬౪. ౫; ౯. ౬౧.

(౮) ఇండియా, వాట్ కెన్ ఇట్ టీచ్ అజ్. ౬-౮ ఉపన్యాసములు

భయబీ భత్సములను గలిగించు ప్రకృతి దృశ్యములలో శిలావర్షముతోఁగూడిన తుపానునకు సరిపోవున దేదియును లేదు. ఇంద్రుఁడు చెప్పుచున్నాఁడు; "నేను మెఱుముల నుఱుములను బంపినప్పుడు మీరు నన్ను నమ్ముదురు." వానికి సంబోధించిన మంత్రముల సంఖ్యననుసరించి, వేదములలో నింద్రుఁడే విశేష స్తుతి నందిన దేవత. ఇప్పటివలెనే, ఆర్యులు భారతదేశమునకు వచ్చునప్పటికి వారి యైశ్వర్యమంతము నెప్పుడు వచ్చునో చెప్పఁజాలని వర్షముపై నాధారపడియుండెను. కావున వర్షాధిపతియే సహజముగా ఇండో-ఆర్యులకు జాతీయదైవతమయ్యెను నీలాకాశము, నందలి ప్రదర్శనముల కన్నిటికి నింద్రుఁడే దేవత. ఆతని ప్రకృతినుండి కలిగిన జన్మము స్పష్టము. ఉదకమేఘములనుండి యాతఁడు పుట్టెను. పిడుగే ఆయుధముగా ధరించి, ఆతఁడంధకారమును బోనడచును. కాంతిచైతన్యముల, నోజో బలముల నాతఁడిచ్చును. ఆకాశమాతని యెదుట మోకరించును; భూమి గజగజలాడును. క్రమముగా నింద్రునికి ఝుంఝూనిలాకాశములతోడి సంబంధము మఱుఁగునఁబడెను. ఆతఁడు దేవుఁడై, సర్వలోక జీవాధిపతియై, సర్వమును జూచుచువినుచు మనుజులకు సమున్నత భావాశయములను గలిగించును.౧. అశనివర్షములచే ననావృష్టి నంధకారమును దొలఁగించు నింద్రుఁడు అనార్యులతో నార్యులకుఁ గలిగిన యుద్ధములలో విజయప్రదాతయగు దైవమయ్యెను. అవి క్రియా సాహసము లవసరములైన దినములగుటచేఁ బ్రజలు జయాక్రమణ వ్యాపారమగ్న

(౧) ఋ.౩౯.౩; ఋ.౧౦.౫. ౭,౧౨

లైరి. మతాంతరులైన యితరజాతులతో నింద్రున కేమియుఁ బగ లేదు. "వీర దేవతయై, దేవతలు పుట్టినది మొదలు రక్షించి, ఉభయలోకములను భయముచేఁ గంపింపఁజేసిన యాతఁడే దేవేంద్రుఁడు. భూమిని బర్వతములను సృజించి, అంతరాళము నాక్రమించి, ఆకాశమును నిలఁబెట్టిన యాతఁడే యింద్రుఁడు; సర్పమును జంపి, సప్తప్రవాహములను గాపాడి, గోగణమును రక్షించి, యుద్ధమందు శత్రువుల నుఱుమాడు నాతఁడే యింద్రుఁడు; భయానకమూర్తియైన యాతనిని సంశయించి యెచట నున్నాఁడని ప్రశ్నించి, శత్రువుల సొమ్ములను తుడిచివేయు వాఁడాతఁడు కాఁడని వెక్కిరింతురు. ఆతనిని విశ్వసింపుఁడు; ఆతఁడే యింద్రుఁడు; ఆతని బలముచే నశ్వగోగణములు, సైన్యములు నిలిచియున్నవి. యుద్ధములో నుభయపక్షములవారు సాహాయ్యమునకై యాతనిఁ బిలుతురు; ఆతని సాయము లేనిదే ప్రజలెన్నఁటికి జయింపఁజాలరు; అతని వజ్రాయుధము క్రూరులను నిమిషములో హరించును; ఆతఁడే యింద్రుఁడు." ౧. ఇట్టి వీరరసావతారమూర్తియైన యింద్రుఁ డుత్తమ దైవగుణసంపద గలిగి, భూమ్యాకాశజల పర్వతములను శాసించును. ౨. వేదములలో నుత్తమస్థానమందిన వరుణు నీతఁ డతిక్రమించును. ఆర్యు

౧, రా. వే; సూ. భా, ౨,౧౨

౨,౧౦.౮౯,౧౦

3, వరుణుఁడు చెప్పుచున్నాఁడు. "నేను ప్రభువును; ప్రభుత్వము నాది, సర్వప్రాణిదాతనైన నాకే దేవతలందఱధీనులై నాశాసనముల ననుసరింతురు, మనుష్యుల పరమపావన సీమలన్నియు నేఁ బాలింతును, ఓయింద్రా! నేను వరుణుఁడను, ఘనగంభీరములైన

లకు సంభవించిన రణములందు, శత్రువర్గముతోఁ బోరాడి, శౌర్యప్రతాపములఁ జూపుటకు, శాంతచిత్తుఁడు, ధర్మపరుఁడు నుదారుఁడునైన వరుణుఁడు పనికిరాఁడు. ఈఘనపరివర్తన ప్రతిధ్వనులు కొన్ని ఋగ్వేదమంత్రములలోఁ బొడసూపును. ౧

భారతభూమిలో నివసించుచున్న యితరజాతుల దేవతలతో నింద్రుఁడు యుద్ధము చేయవలసివచ్చెను. జలోపాసకులు, నక్షత్రపృథ్వార్చకులు గలరు. ఇంద్రుఁడు పోరాడిన యితరజాతుల యారాధ్యులైన రాక్షసులు పెక్కురుగలరు. వారిలో సర్పమైన వృత్రుఁడొకఁడు.౨ ఋగ్వేదకాలములో గల కృష్ణుల జాతిచే వీరుఁడుగా బూజింపఁబడిన కృష్ణునితోఁగూడ నింద్రుఁడు పోరాడవలసివచ్చెను. ఆశ్లోక మిట్లున్నది. "అంశుమతీ (యమున)నదీ తీరమునఁ బదివేలసైన్యములతోఁ గృష్ణుఁడు విడిసియున్నాఁడు. గొప్పగర్జనములు చేయుచున్న యీకృష్ణుని సంగతి నింద్రుఁడు దివ్యదృష్టిచేఁ దెలిసికొనినాఁడు. ఈదోపిడిగాండ్ర మూకనింద్రుఁడు మనకొఱకు నాశమొనర్చెను." ౩. సాయనాచార్య వ్యాఖ్యానము వలన నీభావము స్ఫురించుచున్నది. కృష్ణమతశాఖను మనము తెలిసికొను సందర్భములో నీభావము మనకర్థమంతేము కాఁగలదు. రెండు లోకములు నావి. జ్ఞానవిలసితుఁడనైన నేను సర్వజీవుల సృజించితిని. భూస్వర్గములు నావలన నిలుచుచున్నవి. ప్రవాహములు పఱవలై పొంగునట్లు నేను చేసితిని. స్వర్గలోకములను నేను స్థాపించితిని.

౧.౧౦.౯.౧-౩ ౨. రా.వే.భా. ౧,౧౩౫.౮
౩. రా. వే. భా. ౭.౩౩.౨; ౭. ౨౯.౬

పవిత్రుఁడైన యాదిత్యుని సృజించినది నేనే; భూమ్యాకాశాంతరాళములఁ గల్పించినది నేనే."

ఇంద్రుఁడు చెప్పుచున్నాఁడు. "యుద్ధములో నవసరమైనప్పు డాశ్వికులునన్నుఁ బ్రార్థింతురు. అఖండ పరాక్రమోపేతుఁడనై, యుద్ధములు కల్పించి, రణధూళి నెగురఁగొట్టువాఁడను నేనే. ఇదంతయు నేనేచేసితిని. దేవతలంద రేకమై నాప్రతాపము నెదుర్కొనఁజాలరు. హోమప్రార్థనములచే నేను బలిసి పరాక్రమించునపు డుభయలోకములు కంపించును."

ఋషి చెప్పుచున్నాఁడు: "నీవీ కార్యములు చేసితివని యందరెఱుఁగుదురు; ఓ రాజా! ఈసంగతి వరుణునకుఁగూడఁ బ్రకటించితివి. వృత్రాసుర హర్తవో యింద్రా! నీవేయని ప్రజలు స్తుతింతురు. శృంఖలాబద్ధములైన ప్రవాహముల విడిపించువాఁడవు నీవే." (४ ४२) "తండ్రియైన 'అసుర'ని విడిచిపోవుచున్నాను; ఎవరికి యజ్ఞహోమములులేవో, వానినుండి ఎవనికి హోమములిత్తురో ఆయింద్రునొద్దకుఁ బోవుచున్నాను. చిరకాలము ప్రేమతోఁ గలిసియున్నను జనకుని విడిచినాను. అగ్ని వరుణసోములు తప్పుకొనవలెను. అధికార మింకొకనికిఁ బోయినది. నేనుచూచితిని" (౧౦-౧౨४) అనంతరము వచ్చిన పురాణములు కృష్ణునకు నింద్రునకుఁ గలిగిన విరోధమునుగూర్చి స్మరించినవి. ఋగ్వేదకాలమున నింద్రునిచే జయింపఁబడిన కృష్ణుఁడు నాఁటి గోపాలజాతికి దేవుఁడై యుండనగును. భగవద్గీతకాలము

నాఁటికిఁ బోయినపదవిని తిరిగిసంపాదించి భాగవతుల వాసుదేవుఁడు, వైష్ణవుని విష్ణువునై యుచ్చదశపొందెను. ఇట్టి భిన్నదశలతోఁగూడిన చరిత్రముఁగల కృష్ణుఁడు గీతాప్రవక్తయు, (బరిపూర్ణావతారము, యమునాతీర సంచారియైన మురళీగాన మోహనమూర్తి యునయ్యెను.౧

ఇంద్రునితోఁబాటు, వియత్తలమున గోచరించు ననేక దృశ్యములమూర్తులైన యితరదేవతలు గలరు. వాయుదేవత, వర్షదేవతలగు మరుత్తులు, మేఘగర్జాదేవతయగు రుద్రుఁడు గలరు. వాయుదేవతనుగూర్చి యొకకవి చెప్పినాఁడు: "జగమునకు బీజరూపము, దేవతలకుఁ బ్రాణమునైన యీ వాయువెచటనుండి యెప్పుడు పుట్టినది? తనయిచ్ఛవచ్చినచోట సంచరించుచు ధ్వనులుచేయు చుండునుకాని, యాతఁడుమాత్రము కంటికగపడఁడు." వాతదేవత ఇందో-ఇరేనియా దేవుఁడు. భారతభూమియందు నిత్యదర్శనమిచ్చు తుపానులకు దేవతలు మరుత్తులు. "అంతరాళము ధూళిచే మేఘములచేఁ జీకటియై, ఒకక్షణములో వృక్షసంపద యదృశ్యమగును; శాఖలువిరిగి, పల్లవములు డుల్లి, భూమికంపించి, పర్వతములు చలించి, నదులు

౧. తరువాతఁ గొంతకాలమునకు, సర్పపూజ, యింద్రపూజ మున్నగు క్షుద్రారాధనములుపోయి, కృష్ణతత్త్వ మాహాత్మ్యముపొందెను. సోదరనివేదిత వ్రాసినది: "కృష్ణుఁడు కాళీయసర్పమును జయించి, దానిశిరముపైఁ దన పదాంకమును నిలిపెను. సర్పపూజయందు శివుఁడు నాగేశ్వరుఁడని పూజించిన పద్ధతినుండి, శివుఁడు పరదైవమనియెంచిన శైవతత్త్వమునకుఁ బెంపొందిన యీపరిణామమునకు నిట్టి పోలికయేయున్నది. ఇంద్రునికిఁ జేయు యాగమును గోపకులచేఁ గృష్ణుఁడు మానిపించెను.

నుఱగలుగ్రక్కుచుఁ గోధఘూర్ణితములగును." 3 మరుత్తులు బలముగలవి. నాశకారకులునైన, నొకప్పుడు, దయజూపుచు క్షేమకరములగును. ప్రపంచము నన్నిదిశల నుజ్జూఁతలూఁగించి, వాయువును శుద్ధిచేసి వర్షమునిచ్చును. ౧ దివిదేవతబిడ్డలు, నింద్రుని యనుచరులు మరుత్తులు, కొన్నిచోటుల మరుత్తులకు జ్యేష్ఠుఁడని యింద్రునందురు. భీకరదేవతయైన రుద్రునికి భీకర గుణములు గలమరుత్తులు సంతానమందురు. ౨ ఋగ్వేదము నందు రుద్రునకు, మూఁడు మంత్రములేయిచ్చి, మధ్యమపదము నిచ్చిరి. పిడుగు నాతఁడు చేత ధరించి యాకసమునుండి విద్యుద్బాణపరంపరలఁ గురియును. తరువాత నీతఁడే మంగళకరుఁడగు శివుఁడై, గొప్పసంప్రదాయ స్థాపకుఁడగును. 3

ఇదేవిధముగాఁ గల్పితములైన కొందఱు స్త్రీ దేవతలు నిందుఁగలరు. ఉషస్సు, అదితి యట్టివారే. సింధునది దేవిగానొక మంత్రమునఁ జెప్పఁబడెను. సరస్వతి మొదట నొక నదీదేవి, తరువాత విద్యాదేవి యగును. ౪. భాషకు దేవి వాగ్దేవి. వనదేవత అరణ్యాని ౬ తరువాత వచ్చిన శాక్తమతము ఋగ్వేదమండలి దేవులను, గ్రహించిరి. వేదకాలము నందార్యులు సర్వకల్మష నాశకమైన దేవునిశక్తి రూపమున నారాధించిరి.

---

౧ ఇచట కృష్ణుఁడు వైదిక దైవతములను బ్రత్యక్షముగాఁ ద్రోసివేసెను. (ఫుట్ ఫాల్స్ ఆఫ్ ఇండియన్ హిస్టరీ పుట ౨౧౨)

(౨) ౧౬౮. 3౮. (3) మ్యాక్సుమల్లర్. ఇండియా, వాట్ కెన్ ఇట్ టీచ్ అజ్ పుట ౧౮౦.

(౧) రా. వే భా. ౧. 3౭. ౧౧; ౧. ౬౪, ౧౦; ౨. 3౪, ౧౨

(౨) ౧. ౬౪. ౨. (3) రా. శే. భా. ౭ ౪౬. 3: ౧.౧౧౪. ౧.

"రమ్ము! ఓ దేవీ; మాకోర్కెల నిమ్ము! నీవు బ్రహ్మసమానవై, నాశములేని దానవు."

స్థూలమునుండి సూక్ష్మమునకును, శరీరమునుండియాత్మకును బుద్ధి పెంపొందినపుడు, వివిధ దేవతానిర్మాణ మెట్లు జరిగెనో తెలియగలదు. ఇందుఁ జెప్పు దేవతలు ఋగ్వేద దశమ మండలమున నుండుటచే, వీరుకొంతకాలమైన వెనుకనే కల్పింపఁబడిరని తోఁచును. మన్యువు, శ్రద్ధ మున్నగు దేవుని గుణములును దేవతలైరి.

కొన్ని వేళల సవితృనితోసమముగాఁ జెప్పఁబడిన త్వష్ట, సృష్టికర్తయయ్యెను. ౧ ఈ త్వష్ట యింద్రుని వజ్రాయుధమును గల్పించి, బ్రహ్మణస్పతి గొడ్డలిని పదునుచేసి, యందుండి దేవతలు సోమపానముచేయు పాత్రములను దయారుచేసెను. ఈతఁడే సర్వజీవములకు రూపములేర్పఱచినాఁడు. యజ్ఞములు చేయుటారంభమయిన పిమ్మట శకమునకుఁ జెందిన దేవత యీబ్రహ్మణస్పతి, మొదట ప్రార్థనాధిపతియై తరువాత యాగదైవమగును. పరిశుద్ధవేదమతమునకును, దరువాతవచ్చిన బ్రాహ్మణమతమునకు నీ బ్రహ్మణస్పతి పరివర్తనమును దెలుపుచున్నాఁడు. ౨

౬

ఏకేశ్వర తత్త్వబీజములు.

వేదములందలి దేవతాసమూహమును గల్పించిన తత్త్వమునకు భిన్నమైనభావములు, ఆర్యేతరప్రపంచమునుండి యెట్లు వచ్చి మార్పులుచేసినవో మన మథర్వవేద పరిశీలనమందుఁ

జూడఁగలము, దేవి దేవతలనందఱనొకచో ంచినబుద్ధికిఁ కొంతకాలమునకు విసుగుపుట్టినది. అందుచేభిన్నగుణములుగల దేవతలకు సమానత్వమారోపించుటో, లేక యందరు దేవతల నొక దేవునియందుఁ గలిపివేయుటో ప్రారంభమయినది. ఈ రా దేవతలను వర్గీకరణముచేయుటలో, వారిసంఖ్యతగ్గి, భూమ్యాకాశ వాయుత్రియ వర్గములక్రిందను మూఁడు గణములుగా నేర్పడిరి.

దేవతల సంఖ్య ౩౩ కాని, మూఁడుచే గుణితమైన యితర సంఖ్యలునుగలవు. ౧ ఒకే పనిచేయు దేవతల నిరువురను గలిపి చెప్పుటయుఁగలదు. మఱియుఁ జాలమందినిగలిపి "విశ్వే దేవ" శబ్దముతోఁ జెప్పుటయునుగలదు. పరస్పరవిరోధములు గలిగి పోరాడుచున్న యనేక దేవతలను వర్గీకరించు నీ పద్ధతి హేతుబద్ధమున క్లిష్టమునైయున్నది. దీనినుండియే యేకేశ్వర సిద్ధాంతము జనించినది.

దేవునిఁగూర్చిన సరియగు భావమున కేకేశ్వరసిద్ధాంతమే పర్యవసానము. అనంతరూపులగు నిరువురు పరమేశ్వరు లుండుటసంభవము. ప్రతిదేవతనుగూర్చి యీతఁడెవనిచే జనించె

(౪) ౧౦. ౭౫. ౨, ౪, ౬. (౫) ౬. ౬౧. (౬) ౧౦. ౧౪౬.
(౭) ఆయాతు వరదా దేవి అక్షరమ్ బ్రహ్మసమ్మితమ్. తైత్తిరీయారణ్యకమ్ ౧౦ ౩౪. ౫౨. (౮) కోశము ౧౦. ౯౩. ౪. (౯) విశ్వాసము ౧౦. ౧౫౧
(౧) ౩. ౫౫. ౧౯.

(౨) రాత్ పండితుఁడు పలికినాడు; "'పతి' శబ్దాంతనామములుగల దేవతలు తరువాతవచ్చినవారు. వారుకేవల సమాలోచనముచేఁ గల్పితులు" ఇది పూర్ణసత్యముగాదు. పోల్చుడు: వాస్తోష్పతి. కీట్ పండితుడిచ్చిన భావము,

నను ప్రశ్నములు బయల్వెడలినవి. ఇంకొకనికిజనించిన దేవుఁడు దేవుఁడేకాఁజాలఁడు. ప్రకృతి జగద్రహస్యజ్ఞానము పెంపొందిన కొలఁది, దైవభావమున్నతి నందినకొలఁదియు, దేవతలనందఱ నొక్క దేవునిలోఁ గలిపివేయుయత్నము లారంభించినవి. 'ఋత' భావములోఁగాంచిన యేకత్వ మేకేశ్వరతత్త్వమునకుఁ దోవఁ జూపినది. ప్రకృతిలోఁ జూపట్టిన నానాదృశ్యములకు నానాదేవత లుండవలసివచ్చుచోఁ, బ్రకృత్యంతరాళమున గోచరించు నేకత్వమున కనుగుణముగా, సర్వదృశ్యముల నావరించునొకే దేవుఁడుకూడ నున్నాఁడని యూహించు టవసరముకాదా? ఏకమైన ప్రకృతినియమమును నమ్మినచో నొకేపరమేశ్వరుని నమ్మకతీరదు. ఇట్టి యేకదైవభావాభివృద్ధి మూఢవిశ్వాసములకు స్వస్తిచెప్పఁగలుగును. ఒకనియమావళి ననుసరించి నడచు ప్రకృతినిర్మాణమునందుఁ గారణములులేని వైచిత్ర్యముల కవకాశములేదు. అనేకదేవతలనూహించుపద్ధతి మూఢవిశ్వాసము నుండి, వైచిత్ర్యములందు నమ్మకమున్న లఘుబుద్ధినుండియు జనించును. వరుణోపాసనమునందు మన మేకేశ్వరభావమున కత్యంతసమీపమునకు వచ్చితిమి. నైతికాధ్యాత్మిక గుణసంపత్తిలోఁజేరు ధర్మదయా వాత్సల్యఋజుత్వాదు లాతనికారోపించిరి. బాహ్యస్థూల భావములు క్రమముగాఁదొలఁగి అంతరంగిక సూక్ష్మభావములు వృద్ధిపొందెను. మానవులు, ప్రకృతి యిహపరలోకములు వరుణునధీనములోనున్నవి. వరుణుఁడు కేవల బాహ్యశుద్ధియేకాక, అంతశ్శుద్ధినిగూడ వాంఛించును. అనేక దేవతల మధ్యమందొకఁడు పరదేవతయనుభావము వేదములలో

నున్నది. మతాభిరుచికలిగినవారి కిదియే యేకేశ్వరవాదబీజము. ఈ భావము మార్పులను సూచించినది. ఏదేవత నారాధించినపు డాదేవతయే దేవతాశ్రేష్ఠుఁ డనియు, నతఁడే యేకైక దేవుఁ డనియు నారాధింపఁబడెను. కాని యిది స్వవిఘాతమైన సిద్ధాంతము. ఏలన నీశ్వరు లనేకు లున్నా రనుట సమర్థింపఁజాలము. ఇది మతజిజ్ఞాసకు వ్యతిరేకము. అనేకదేవకోపాసన మేకదైవోపాసనమునకుఁ బోవుమార్గమునకై చేయుప్రయత్నము. దుర్బలమైన మానవశక్తి యింకను దనకుఁ గావలసిన వస్తువుకై వెదకుచున్నది. వేదకాలమందలియార్యుఁడుసృష్టిరహస్యము నెఱుఁగఁగోరినాఁడు; తెలిసినభావములు తృప్తి నొసఁగలేదు. పరమదైవమని నమ్మిన పెక్కురు దేవతలు వరుసగా నున్నారు; తాత్కాలికముగా నొక్కనిని శ్రేష్ఠుఁడనుచున్నారు. ఒకఁడు శ్రేష్ఠుఁ డన్నను నితరులు లేరనలేదు. సామాన్యదేవతలుకూడ నొకప్పుడగ్రస్థానము వహించిరి. కవియొక్క అవసరము, భక్తి ననుసరించి దేవతలపదవులు మాఱినవి. "ఆకాశము వరుణుఁడు; భూమి వరుణుఁడు; అంతరాళము వరుణుఁడు; విశ్వమంతయు వరుణుఁడు; సర్వము వరుణుఁడే." కొన్నివేళల అగ్నియే సర్వదేవతాస్వరూపి, కొన్నివేళల ఇంద్రుఁడు దేవతలందఱికంటె నధికుఁడు. ఒకొక్కవేళ ప్రతిదేవతయు, నితరదేవతలందఱను గలిపి తీసినఛాయాపటము. దేవునకు మానవుని సంపూర్ణాత్మసమర్పణము మతానుభవజ్ఞానములోఁ బ్రధానవిషయము. దేవుఁడొక్క పరమేశ్వరుఁడైనప్పుడే యిదిసాధ్యము. అందుచే నొకేదేవుఁడు సర్వదేవతలకు శ్రేష్ఠుఁడనునది మతవిజ్ఞానమునకు

సహేతుకమైనది. "సర్వదేవతలలో నొకఁడు శ్రేష్ఠుఁడను నీమత మన్నిటియందు దైవత్వమారోపించి, విసుగుపుట్టు భావమును కల్పించినది; దేవతలలోఁ దంతమభావముల క్రమముగా సృష్టించినది; ఇది యవసరోచితమగు నేకేశ్వరవాదమునకు దారి చూపినది. ప్రతిదేవతయు సార్వభౌమత్వము నొకసారి పొంది యొకఁడును నిలుపుకొనఁజాలఁడ"ని వ్రాసిన బ్లూమ్‌ఫీల్డు పండితుని వాదము సహేతుకము కాదు. ౧

ప్రతిదేవతయు విశ్వకర్తయనియుఁ, బ్రజాపతియనియు నూహింపఁబడినప్పుడు, వారికిఁగల ప్రత్యేకలక్షణముల నుజ్జగించి, సర్వసామాన్యలక్షణముల నొకపరమదైవతమందుంచి, యేకేశ్వరత్వమును బ్రదర్శించుట కష్టమైనపని కాదు.

వరుణారాధనమందు మనకుఁజూపట్టిన క్రమాభివృద్ధి నందిన యేకేశ్వరభావము, సమానములైన దేవతాలక్షణము లొకే దేవునియందుఁ బూర్ణముగాఁజూచు మతానుభవక్రమము, ప్రకృత్యభ్యంతరముననున్న 'ఋత' రూపమునఁ దెలిసిన యేకత్వము, ననేకత్వమునుండి యేకత్వమును సాధింపయత్నించు మానవసహజప్రకృతి— యివన్నియుఁగలిసి, అపరిపక్వమైన ప్రకృతి దేవతారాధనమునుండి, పరిపక్వమైన తత్త్వజ్ఞానమును ప్రదర్శించు నేకేశ్వరభావమునకుఁ గ్రమాభివృద్ధి జయప్రదముగా నెరవేరియున్నది. నాఁటి వేదద్రష్టలు, సర్వసృష్టి కారణభూతుఁడు, నజుఁడు నవినాశియునగు నొక ప్రధమకారణరూపుఁడగు భగవానునిఁ దెలియుకొనుటకై యత్నించిరి. ఇతర

(౧) ది రెలిజియన్ ఆఫ్ ది వేద పుట ౧౯౩

దేవతల నందరనొక శ్రేష్ఠదైవతమునకుఁ బరివారముగానొనర్చి వానియాజ్ఞలో వీరందఱు లొంగియుండునట్లూహించుట సులభమైన పద్ధతి. పరమేశ్వరు డొకఁడే యుండవలయుననియెడు వారి కాంక్షతృప్తియైనది; మఱియు, సంప్రదాయమును బూర్తిగా నిగఁద్రొక్కు నవసరము లేకుండ నితర దేవతలను గూడ నుంచిరి. భారతీయసమాలోచన యెంతసాహసాంచితమైనను, గాఢస్వామ్య, క్షుద్రత్వము నది ప్రదర్శించి యుండలేదు. ప్రజాదరాభిమానములను మననునందుంచుకొని, కొన్ని విరోధ భావములకు సామరస్యము కల్పించుట కంగీకరించినది. కాని, తర్కము దయాశూన్యమైనది; సునిశితమైనదియు నగుటచే—హిందూమతము పరభావముల యెడఁజూపిన సహనసమరసదృష్టిచే నేఁడు హిందూమతమనఁగా ననేకతత్త్వములు, ననేకమతములు, గాథలు, కల్పనములతో నిండిన యొక కలగూర గంపయైనది. సర్వాత్మశక్తి యగునొక్క దేవుని వివిధగుణముల మూర్తులే వివిధ దేవతలని భావించిరి. సార్వభౌముఁడైన పరమేశ్వరుని శాసనము నంగీకరించి, అన్యదేవతలు వారివారిసీమలఁ బాలించుచుండిరి. వారు, ఒకే చక్రవర్తి క్రిందనుండు సామంతులవలె, పరమేశ్వరుఁడిచ్చిన యధికార పదవులకుఁ బ్రతినిధులే కాని స్వతంత్రులు గారు. తమయిచ్చవచ్చినట్లు విహరించు ప్రకృతిదేవతలు, తమస్వేచ్ఛను గోల్పోయి, ఏకచ్ఛత్రాధిపత్యముక్రిందఁ జెక్కు నిర్ణీత బాధ్యతలు గల సామంతదేవతలైరి. ఇంద్రవరుణాది బృహద్దేవతలును బెద్దసామంతులే గాని స్వతంత్రరాజులు గారు. ఋగ్వేదములోఁ జివరమండలములలో నుత్తమపదవి "విశ్వ

కర్మ” కీయఁబడినది.౧ విశ్వకర్మ సర్వతోముఖ నేత్రపాదుఁడై, ఉభయలోకకర్తయై, సర్వలోకజ్ఞుఁడై, మనుష్యజ్ఞానాతీతుఁడై వెలయుచున్నాఁడు. ఈపదవికి బృహస్పతికిఁగూడ నధికారము గలదు. ౨. కొన్నిచోట్లఁ బ్రజాపతికి నీయధృష్టము పట్టినది. ౩ సర్వకర్తయైన సామస్యోఁడుగా హిరణ్యగర్భుని గ కూడ నచటచటఁ జిత్రించిరి.

## ౭

## ఏకేశ్వరవాదము; బ్రహ్మైకవాదము.

వేదమంత్రములకాలముననైనను, కేవలాకాశవాహర్య్వ ములనిర్మించు నూహాకల్పన బుద్ధియేకాక, తఱచుగా, ప్రశ్నించి తర్కించు చిత్తవృత్తి ప్రదర్శనములవలన నాఁటియార్యులకు సమ్యగాలోచనము సత్యాన్వేషణ దృష్టిగలవని ఋజువగుచున్నది. కనపడుచున్న దృశ్యములను కేవల దృశ్యములనుగా గ్రహించుటకాక, వాని నర్థముచేసికొనవలయునను లక్షణము గలిగిన వారగుటచే నార్యులు బహుదేవతానిర్మాణము చేయవలసివచ్చినది, “రాత్రివేళ సూర్యుఁడెచట నుండును?” పగటివేళ నక్షత్రము లెచటికిఁబోవును? “దివారాత్రములలో నేది ముందు వెనుక నేది? “సూర్యుఁడాకసమునుండి యేలపడిపోఁడు?; వాయు వెచటనుండివచ్చి యెచటికిఁబోవును?”.౧భయాశ్చర్యములతోఁగూడిన యిట్టిప్రశ్నములే సర్వశాస్త్రములకుఁ

---

౧.౧౦.౮౧.౮౨, ౨.౧౦.౭౨

౩,౧౦,౮౫,౪౩,౧౦,౧౮౯,౪ శతపథ బ్రాహ్మణమ్ ౬,౬,౮, ౧-౧౪, ౧౦,౧,౩ (౪) ౧,౨౧

తత్త్వములకు జన్మస్థానములు. మఱియు జన్మసహజమైన జ్ఞాన పిపాస యార్యులలో ననేకరూపములు దాల్చినది. బహుదేవతా కల్పనము జరిగినది. కాని యిట్టి బహుదేవతాకల్పనముచే మానవ మానసము తృప్తిపొందఁజాలదు. ఇందఱు దేవతలలో నిజదైవమెవఁడను సందేహము బయలుదేఱినది; కస్మైదేవాయ హవిషావిధేమ, ఏ దేవునకు మేము హోమమును అర్పింపవలెను?[1] ౨. దేవతలెట్టి అపరిణతబుద్ధి సంజాతులో స్పష్టమగుచున్నది. నూతన దేవతలు భరతవర్షమున నుదయించిరి. కొందఱను దేశీయజాతుల మతములనుండి స్వీకరించిరి. అచంచల విశ్వాసముగలవారు మమ్ము విశ్వాసముగలవారిగాఁ జేయుమని ప్రార్థింప నవసరము లేదు.[2] సంశయము వాతావరణములో నున్నది. ఇంద్రుని యునికి,[3] సర్వాధిపత్యము శంకింపఁబడినవి. ౩. ఈ దేవతల సందర్భమంతయు సభాతకల్పనమును నాస్తికతత్త్వము, విజృంభించుచునే యున్నది. నామరూప నిర్ణయములులేని దేవతల నుద్దేశించి మంత్రములు కొన్ని యున్నవి. ఈ దేవతల అస్తమయ పూర్వప్రదోషకాంతులు కనఁబడుచున్నవి; వారు నెమ్మదిగా నదృశ్యులగుదురు. ఉపనిషత్తులలో, నీప్రదోషకాంతి నశించినది. ఎవరో[4] కొలదిమంది స్వప్నజీవులకుఁ దప్ప నీదేవతలు లేరు. ఏకేశ్వరభావము ప్రబలిన కాలమునందలి పరమేశ్వరుఁడైన నుపనిషత్తులలో విమర్శాతీతుఁడుగాఁడు. మానవమానసమునకుఁ బ్రకృతిదేవుఁడెవఁడును సంతృప్తి నొసఁగలేదు. దేవతలందఱ కధిపతి

౧. ఛా, జై, భా, ౧, ౨౪, ౧౮౫, ౨. ౧౦, ౧౨౧. 3. ౧౦, ౧౯౦
౪. ౧౦, ౮౦, ౧, ౬, ౧౦౦. 3; ౨, ౧౨, ౫

మై యొక్క దేవతాసార్వభౌముఁడున్నాఁడనిన నంతటితోఁ బ్రశ్న లాగిపోవు. "మొదటఁబుట్టిన వాని నెవఁడు చూచెను? రూపము లేనివాఁడు సరూపినెట్లు పుట్టించెను? జగత్తుయొక్క ప్రాణము, రక్తము, చిత్తము నెచటనుండి వచ్చినవి? ఈసంగతి నెఱిఁగిన వాఁడెవఁడు? వాని నడిగినవాఁడెవఁడు? ఇదియే తత్త్వశాస్త్ర మూలసమస్య, జగత్సత్యమేమి? కేవల విశ్వాసము నిష్ప్రయోజనము. ఏది సత్పదార్థమో దాని మన మనుభవములోఁ దెలిసికొనవలెను. అందుచేఁ బ్రశ్నమేమనఁగా, "మొదటఁ బుట్టిన వాని నెవరుచూచిరి?" జిజ్ఞాసగలవారు పరమసత్యమునొకటే చూచిరి కాని, విశ్రాంతిసుఖములతోఁ గనఁ జూడలేదు. నీవు దేవునొక మూఢజాతివానివలెఁ గ్రోధరోష పరీతునిఁగాఁ జూచినను, లేక యొకనాగరికత గలవానివలెఁ సృష్టికర్తయనియు జగత్ప్రభువనియు, దయాసముద్రుఁడనియుఁ దలఁచినను, నేఁడయును విమర్శను నిలువఁజాలని యల్పభావమే. ప్రకృతిగుణములు గల దేవునిభావముపోవలెను, ఇట్టిభావము దేవుని పేఁగొన్ని కల్పిత రూపముల నిచ్చునే కాని, యథార్థభగవానునొసఁగఁజాలదు. మన ప్రాణమునకుఁ బ్రాణమైన దేవుని మనము నమ్మవలెను. కాని మనుష్యుల భావములచేఁ గల్పితమైన అసత్యదైవమును గాదు. సర్వదిశలనుండి మనల నావరించియున్న ఆద్యంతరహితమైన జ్యోతిర్మయుఁడు దేవుఁడు. ప్రాణో విరాట్ అనఁగా అపరిచ్ఛేద్యమైనది ప్రాణము. అందు మనయాలోచనములు, మనచే

౨. శోదదర్మపరిభమాజాయమానమ్.

౧. ఋ. వే. భా ౧.౪.౧౬౪.

నాలోచింపఁబడిన వస్తువులుకూడనున్నవి. అట్టిది భిన్నరూపము లలో గోచరించును. అది అద్వితీయము, అవక్రము, అనాద్యనంతము, దుస్త్యాజ్యము, సర్వశక్తికలితము, దానినుండిసర్వము బయల్వెడలును. సర్వము నందే చేరును. రూపవంతులైన దేవుఁడు దేశికభావములుగలవారి కెంతయవసరమైనను, సత్యకాంక్షికి ప్రమాణము వేఱు. ఆతఁడు ప్రార్థించు దేవునిలక్షణము వేఱు. సత్యమెంత, యనుదేశికమైనది, దూరమైనది, నియతాహాభయకారణము నైనను నది సత్యముకాకపోదు. నేఁటికి నధిక సంఖ్యాతమైన మానవజాతి కేకేశ్వరత్వమే రుచికరమైయున్నను, నది వైదికవిజ్ఞానశేఖరులకు సంపూర్ణసంతృప్తి నొసఁగ లేదు.

పరమసత్యము పుంస్త్రీలింగాది భేదాతీతమనిచెప్పుటకు 'సత్' శబ్దమును వాడిరి. అట్టి సత్పదార్థమునకు వరుణాగ్నీంద్రాది దేవతలు వివిధనామరూపములేయని వారు నిశ్చయించిరి." ఏదియో యొకసత్పదార్థమున్నది; అది యద్వితీయము, నామగుణరూపరహితము, చరాచరసృష్టిజాలమును బాలించునది; నడచుచున్న,గాలిలో నెగురుచున్న సర్వజీవరాశిని శాసించునది. మానవజన్మముకంటె విలక్షణమైన జన్మముకలది"౧. యనినిర్ణయించిరి. "సత్పదార్థ మొకటే; పండితులు దాని ననేకనామములతో,నగ్ని యముఁడు, మాతరిశ్వానుఁడునని పిలుచుచున్నారు.౨

౧. ౩. ౫౪. ౮.

౨ ఏకమ్ సద్విప్రా బహుధా వదంతి అగ్నిర్యమమ్ మాతరిశ్వానమాహుః (౧. ౧౬౪. ౪౬)

నక్షత్రమయాకాశము, విశాల పృథ్వీసాగర భూధరములు, నన్నియు నొకేమనుష్యునియొక్క కార్యములు; ఒకే ముఖముయొక్క లక్షణములు; ఒకేవృక్షమునియొక్క పుష్పములు, ఒకేదివ్యపురుషుని లక్షణములు; అవినాశమైన దేదియున్నదో దానిమూర్తులును; ఛాయలును; అదియే ఆదియందున్నది; మధ్యమందున్నది. అంతమునున్నది; అంతములేనిది.౧"

ఈ"సత్"వస్తువు విశ్వమునకంతరాత్మ: విశ్వస్థితి హేతువు; ప్రకృతిప్రాణము; పరివర్తనములేనిశక్తి. అది భూమియుఁగా దాకాశమును గాదు; సూర్యరశ్మియుఁ గాదు ఝంఝానిలమునుగాదు; అది యింకొక దివ్యశక్తిసారము; ఋతువులకు మూలరూపము; అదియే యాత్మస్వరూపము, అచలమై చలించునది. ౨ దానిని మనము చూడఁజాలము. వర్ణింపఁజాలము సూక్ష్మగ్రాహ్యమైన ఋజుబుద్ధితోఁగవి "ఈవస్తుజగజ్జాలమును సృజించిన యాతని నెన్నఁడుఁజూడఁజాల" మని మొగించుచున్నాఁడు "అజ్ఞానముచే మూర్ఖుఁడనై, దేవతలరహస్యజన్మస్థలమునుగూర్చి యడుగుచున్నాను; నేను తెలియనివాఁడనై; తెలిసిన మహాత్ములను దెలియఁగోరి ప్రశ్నించుచున్నాను.'' 3 సర్వవస్తు జీవసంతతులనుండి వానిని జలింపఁజేయుచుఁ బుష్పములో వికాసము, మేఘజాలమందలిసొగసై, తుపానుగాలిలోని బలమై, యాకాశమందు నక్షత్రములను స్థాపించినదదియే. దేవతలందఱిలో స్థిరసత్యరూపుఁడగు పరమేశ్వరుఁడొక్కఁడే యనుభావము ధ్యానదృష్టిచే

---

౧. వర్డ్సువర్థ, ప్రెల్యూడ్ ౬, ౨.౧౦.౧౫౯.౨

3. రా.వే.భా.౧౦.౧౨౧; ౧౦.౮౨౭;౧.౧౬,౭. ౫-౬

లభించినది. ఇది యాశ్చర్యకరమైన పరిశోధనమే. మానవజాతి యొక్క బాల్యావస్థలో నట్టిమహత్తర సత్యము కనుఁగొనుటచే మనకిది వర్ణనాతీతమగు నాశ్చర్యమును గొలుపఁగలదు. ఇట్టి పరమసత్యకాంతిలో ఆర్యాదివిజులకు, జ్యూలకు వారి విద్వేషులకు, హిందువులకు పారసీకులకు, క్రైస్తవులకు నాస్తికులకు, మధ్యనందున్న యావరణభేదములన్నియు మాయమగును. తాత్కాలికముగానైనను మనమొక దివ్యాదర్శనమును గాంచిన దృష్టిలోనున్నాము; ఇందు లోకములోని సర్వమతములు, నొక పూర్ణజ్ఞానముగల దినమువచ్చి తీసునసచెప్పు ఛాయాచిహ్నములే. ఒకటే యనేకనామములతోఁ జెప్పఁబడుచున్నది. 'పండితులు కవులు, నొకటై, గూఢమై పరమసత్యమును మాటలచే బహువిధములఁ జెప్పుచున్నారు.' ౧. ఈపరమసత్యమునుగూర్చి మానవుఁడసంపూర్ణభావములను గలిగియుండుట సహజము. మానవుని కాంక్షలు, ప్రమాణములేని యూహాల్పభావములనే విగ్రహములను వెలెఁబూజించి తృప్తినందును. పరమసత్యమునూహించి కల్పించుకొనిన మానవుని రూపములతోఁ బోరాడుట శుద్ధమూర్ఖ్యము. ఒకే పరమేశ్వరుఁడు దాను జూపు ననేక ప్రదర్శనములవలనను, జిజ్ఞాసువుల యభిరుచివైవిధ్యము చేతను, భిన్ననామములచేఁ బిలువఁబడుచున్నాఁడు. ఇది ప్రజాభిమతమున కనుగుణమైన నామకరణవిధానమని తెలియవలెను. ఇది పరమసత్యమునుగూర్చి యావిష్కృతమైన పరమతత్త్వరహ

౧.౧౦.౧౧౪; చూడు. ఋగ్వేదము ౩౦-౨.౪

చూడు. యాస్కాచార్యుని నిరుక్తము ౭.౫.

స్యము. ఇజరేలున కట్టినత్యమే స్మరించెరు." నీకు దేవుఁడైన పరమేశ్వరుఁడొక్కఁడే." ప్రాటాగోల్లు నుడివినాఁడు. "అన్ని దేశములకు నొకఁడే సూర్యుఁడొకే యాకాశమున్నట్లే ఒకే దేవుఁడు పెక్కునామములు గలిగియున్నాఁడు."

"హేభగవాన్! అనేకనామములచేఁ బేర్కొనఁబడు దివ్యపురుషుఁడవు; ప్రకృతి కధిపతివి; ఎన్నియుగములు గడచి నను మార్పులేనివాఁడవు; సర్వశక్తియుతుఁడవు; నీశక్తిచే ధర్మము ను బాలింతువు. జయము! జ్యూస్ దేవా! సర్వదేశములలోని సర్వజీవులు, సర్వేశ్వరుఁడైన నీదయను కెనురుచూచుచున్నారు." ౨.

ఈఋగ్వేదమందలి యేకేశ్వరతత్త్వమును గూర్చి డ్యూసెన్ పండితుఁడిట్లు వ్రాసెను. "ఇతరదేశముల వారికి విలక్షణమైన పద్ధతి ననుసరించి, హిందువులీ బ్రహ్మైకవాదమును గనుఁగొనిరి. ఈజిప్టుదేశములో వివిధదేవతలను, సమానులనుగాఁ జేయు వివేకశూన్యమైన పద్ధతిచే నేకేశ్వరభావము కలిగినది; పాలెస్టీనాలో, నొకదేవుని జెహోవాను గౌరవించి, తక్కిన దేవతలనందఱను బలవంతముగా నిర్మూలించి, యాదేవతలను బూజించువారిని జెహోవాకు బలియిచ్చిరి. భారతవర్షమునందీ యేకబ్రహ్మవాదము, అనేకత్వమును తెరమఱుగున నేకత్వము

౨. ది హిమ్ ఆఫ్ క్లియాంథిస్.

నుజూచి గ్రహించిరి.'' ౧. మాక్సుముల్లరువ్రాసినాఁడు; "ఋగ్వేదసంహిత సంకలనముచేసిన కాలమేదియైనను, దానికిఁ బూర్వమే, సత్యస్వరూపియైన దేవుఁడొక్కఁడనియు, నాతఁడు స్త్రీయుఁ బురుషుఁడును గాఁడనియు, మానవప్రకృతి ననుసరించు వ్యక్తిత్వమునకు గల నియమనిబంధనముల కతీతుఁడైనవాఁడని యు నైనను, ప్రజాపతీంద్రాగ్ని మాతరిశ్వానులను వివిధనామములచేఁ దెలియఁబడువాఁడనియు గ్రహించిరి. నిజముగా, వేదమహర్షులు సంపాదించిన బ్రహ్మైకతత్వము తరువాత నొకప్పుడు లెగ్జాండ్రియాలోని క్రైస్తవతత్త్వవేత్తలు గాంచిరికాని, నేఁటికైనను దాముక్రైస్తవులమని చెప్పుకొను చాలమందికీతత్త్వము సరిగాఁ దెలియదు." ౨

ఋగ్వేదములోని కొన్ని పరిణతిగాంచిన మంత్రములలోఁ బరమాత్మ 'వాఁడు' కాని "అది" యనికాని చెప్పఁబడినది. ప్రాచ్య పాశ్చాత్యతత్త్వశాస్త్రములకు రెంటికిని సామాన్యలక్షణమైన యేకేశ్వరభావమునకు బ్రహ్మైకవాదమునకును మధ్యమందుగల సంశయాందోళనము, మొట్టమొదటిసారి, తత్త్వచరిత్రములో నిచట గోచరించుచున్నది. తత్త్వశాస్త్రముచెప్పు నామరూపగుణరహితమై శుద్ధమైన పరమసత్యమే, ఉద్రేకావేశములుగలిగిన హృదయచలన మున్నమానవునిచే మృదుమధుర దయాసాగరుఁడని పూజింపఁబడును.

(౧) ఔట్‌లైన్స్ ఆఫ్ ఇండియన్ ఫిలాసఫీ. పుట ౧౩
(౨) మాక్సుముల్లరు. షడ్దర్శనములు పుటలు ౫౧, ౫౨

ఇది తప్పనిసరియైనది. మతదృష్టి, సంభాషణరూపముగా నుండును; జీవాత్మ పరమాత్మలకు సంబంధరూపమగును. పరిణతుఁడైన మానవున కతీతమైన యపరిమితవ్యక్తిగా దేవుని యూహించుట సహజము. కాని యీ యనేకములోఁ బాలు దేవుఁడొకఁడనుభావము తత్త్వశాస్త్రమున సమగ్రభావము కాదు. తర్కమును దుదివఱకు లాగుకొనిపోవు తీవ్రహేతువాదులనటుంచి, మిగిలినవారి కుపాసింపఁదగిన దైవమూర్తి లేనిదే మతము లేదు. తత్త్వవేత్తయైనను దానుజూచిన పరమసత్యమును నిర్వచింపుమన్నచో నప్పుడాతఁ డుపయోగింపవలయు శబ్దములు, భావములు రూపగుణములు గలిగి యుండకతప్పదు. పరమసత్యమైన పరమాత్మ మనోవాగగమ్యమైన యనంతరూపము మానవుని పరిమితశక్తులు పూర్తిగా నెన్నఁడును గ్రహింపఁజాలవని యెఱుఁగను. అయినను, నాపరమాత్మను దనకున్న యల్పశక్తితో వర్ణింపఁబోకతప్పదు. సర్వవస్తువులలో నంతర్యామియై, సర్వకారకుఁడై, పరిపూర్ణుఁడై అనంతుఁడైన యాతనిఁ గూర్చి, తనయల్పబుద్ధికిసాధ్యమైన యల్పభావములను మానవుఁడు కల్పించుకొనును. ఆత్మసంతృప్తికై మానవుఁడు కొన్నిరూపములఁ గల్పనచేసికొనును. రూపమనంతతత్త్వమునకు లోపమును గూర్చునుగాని, రూపములేనిదే ప్రార్థనము లేదు. మూర్తిమంతుఁడైన దేవుఁడున్నాఁడనఁగా, నాతనినారాధించువాఁడు నుండుటచే నాత్మానాత్మలు భిన్నమైయుండకతప్పదు. కాని "సత్య" దార్థములో నీభిన్నత్వ మేకత్వమైపోవలయును. కావున మూర్తిమంతుఁడైన దేవుఁడు పూర్ణసత్యపదార్థముయొక్క యత్యుత్తమ

మైన చిహ్నము రూపములేనివానికి రూపమును, నిర్గుణునకు గుణమును, సర్వవ్యాపి కేక దేశత్వమును గల్పించితిమి; పరమాత్మునొక మూర్తిగాఁ జేసినంతనే, అది పరమాత్ముని పూర్ణత్వమును దగ్గించును. పరిమితమైన మనస్సుతో సంబంధముండవలెనన్నచో, దేవుఁడు పరిపూర్ణుఁడుగానుండుటకు వీలులేదు; కాని పరిపూర్ణతలేని దేవునారాధించు టుత్తమమతముకాదు. అనగా దేవుఁడు పరిపూర్ణుఁడైనచో మతములేదు. దేవుఁ డసంపూర్ణుఁడైనచో మతము పూర్ణఫలకారికాదు. పరిమితశక్తిగల దేవునారాధించి మనము శాంతి సౌఖ్యములను, విజయ విఖ్యాతులను పొంది తుదకు మోక్షాపేక్ష నిస్సంశయముగాఁ గలిగియుండఁజాలము. నిజమైనమతము పరిపూర్ణుఁడైన దేవునికొరకును. అందుచే జనసామాన్యమునకుఁ దృప్తియగుటకు, దత్త్వశాస్త్రమునకు సరిపడుటకు నా పరమసత్యమును "వాఁడు", "అది" యని రెండుశబ్దములతోడను సంబోధించిరి. ఉపనిషత్తులలో నిట్లేయున్నది; భగవద్గీతలోను, వేదాంతసూత్రములందును నిట్లేయున్నది. ఈ ప్రజాభిప్రాయమున కనుగుణముగా నెఱిఁగిచేసిన సంధి సూత్రమనికాని, సామరస్యమనికాని తలఁపనవసరములేదు. బ్రహ్మైకతత్త్వము ననుసరించి మహోన్నత మతారాధనవిధానమును సమర్థింపవచ్చును, పూజాప్రార్థనములకుబదులు, పొంగిపొరలు రోమాంచమునుగలుగఁజేయు ప్రేమమయమైన ధ్యానసాధనముండును. భగవంతునకుఁ దదంశమునకు మధ్యమందుండు ప్రేమభావ ముత్తమభక్తిగాఁ బరిణమింపఁగలదు. అట్టిపరభక్తియు ధ్యానమును సర్వమునావరించుచు సత్సౌందర్యములతో

మనసునునింపి యానందమీయఁగలదు. ఇట్టిమత మనుభవజ్ఞాన శూన్యులకు రసహీనముఁగను గల్పితముఁగను దోఁచవచ్చునుగాని లదితరమైన యేమతతత్త్వముగాని తత్త్వజ్ఞానము ననుసరించి నిలువఁజాలదు.

భూమిపైఁబుట్టిన సకలమతవిధానములును మానవహృదయానసరమును గుర్తించినవి. తానాధారపడఁగల, తనకంటె నున్నతమైన యొకశక్తిని మానవుఁడుగోరి, యారాధింపఁ జూచును. వేదమతములోని వివిధదశలలోఁ గల్పితులైన దేవతలు పెంపొందుచువచ్చిన మానవుని యవసరకాంక్షలయొక్కయు, మానసికాన్వేషణములయొక్కయు, హృదయపిపాసలయొక్కయుఁ, బ్రతిబింబములు. కొన్నివేళల మానవుఁడు తనప్రార్థనములవిని, తనపూజలనంగీకరించి తనకోరికలిచ్చు దేవతలనుగాంక్షించెను. అట్టివారునుగలరు. మఱియు, ప్రకృతి శక్తిమూర్తులగు దేవతలునుగలరు. ఈయా దేవతలందఱు నొకే పరమాత్మయొక్క భిన్నరూపములని యెంతగాసమర్థించినను, మానవుని యత్యుత్కృష్టసమాలోచనము సంతృప్తిపొందలేదు. దేవతలమూకయందు వెదజల్లఁబడిన వివిధభావకిరణములను నేకరించి పేరులేని యొకదుర్నిరీక్ష్య తేజోనిలయుఁడైన పరమేశ్వర భాస్కరభావములో లయింపఁజేసి; అశాంత్యవిశ్వాసములచేఁ గొట్టుకొనుచున్న మానవహృదయమునకుఁ దృప్తికలుగఁజేయఁ జూచిరి. వేదజిజ్ఞాస పరిపూర్ణసత్యదర్శనమగువఱకును దృప్తిపొందలేదు. వేదమంత్రములలోఁ గల్పింపఁబడిన దేవతలనుగూర్చిన మతభావపరిణామము నిట్లువర్గీకరింపవచ్చును, (౧) ప్రకృత్యా

సనరూపమైన ద్యౌదేవత, (౨) ధర్మతత్పరుఁడై తనవాతవెల
సిన వరుణుఁడు; (౩) జయాకాంక్షయుగమున స్వార్థముల
సమకూర్చు దేవేంద్రుఁడు (౪) ఏకేశ్వరవాదముల ప్రజాపతి:
(౫) పై చతుర్విధభావములయొక్క పరిపూర్ణతకు రూపమైన
పరబ్రహ్మము. ఇట్టి వర్గీకరణము, సహేతుకము, సహజవికాస
క్రమానుగుణము నైనది. వేదమంత్రములు మాత్రమీభావ
ముల నొకక్రమములోఁ జెప్పక, వివిధభావముల నేకస్థలముల
మేళవించియున్నవి. కొన్నిచోటుల నొకేమంత్రమున నిన్ని
భావములును గలవు. వేదమంత్రములను సంకలనము చేయుటకుఁ
బూర్వమే యీభావములన్నియుఁ బక్కాగాఁ బెంపొందియున్న
వనియు, నాఁటియార్యులు వీనిలోఁ గొన్నిటినిగాని యన్నిటిని
గాని నమ్మి, వీనికిఁ బరస్పర వైరుధ్యమున్నదని యూహించియుండరు.

## (౮) సృష్టితత్త్వము

సృష్టికారణస్వరూప సమస్యలనుగూర్చి వేదద్రష్టలాలో
చింపకుండ విడిచిపెట్టి యుండలేదు. పరివర్తనమందుచున్న
సకలవస్తుజాలమునకు మూలభూతమును గనుఁగొనుటలో,
ప్రాచీనగ్రీకులవలెనే, ఆర్యులును వాయుజలాదికములఁ జే
ర్కొనిరి. సంవత్సర (కాల)శక్తిచేఁగాని, కామముచేఁగాని, ప్ర
జ్ఞచేఁగాని, తపస్సుచేఁగాని జలము ప్రపంచముగా మారినదని
చెప్పఁబడెను. ౧. కొన్నిచోటుల జలము తమస్సునుండి కాని
వాయువునుండి కాని జనించినదనిరి. ౨. ౧౦వ మండలము
[illegible]వ మంత్రములో ననంతము నదితిస్వరూపమునైన అస

౧. ౧౦, ౧౯౦, ౨. ౧౦, ౧౨౪,

త్తునుండి జగమంుద్భవించినదని చెప్పఁబడినది. అనంతమైన వస్తువునుండి జగచ్ఛక్తియుద్భవించినదని యొకచోటను, జగచ్ఛక్తియే యామొదటి యనంతవస్తువున కాధారభూతమని యొకచోటను జెప్పఁబడెను. 3. ఈసిద్ధాంతములు క్రమముగా మతసిద్ధాంతములుగా మాఱి రెండును మేళవించి సృష్టితత్త్వనిర్ణయములు బయల్వెడలినవి.

బహుదేవతారాధనకాలమున, వరుణేంద్రాగ్ని విశ్వకర్మలు సృష్టికర్తలని వరుసగాఁ జెప్పఁబడిరి. ౪. సృష్టిక్రమమునకు భిన్నవిధానములున్నవి. ఒకవడ్రంగి యిల్లుకట్టినట్లే, ప్రపంచమును గొందఱు దేవతలునిర్మించిరని యున్నది. ప్రపంచనిర్మాణమునందుఁ గావలసిన కలపనిచ్చిన చెట్టేదియని ప్రశ్నమున్నది. ౫. తరువాత పరబ్రహ్మమే యట్టి వృక్షము, నట్టివృక్షమునుండి భూస్వర్గలోకములు కట్టఁబడినవని చెప్పఁబడినది. ౬ పరిణామోచిత క్రమము ననుసరించి కూడ జగన్నిర్మాణవిధానములు పేర్కొనఁబడినవి ౭. కొన్నివేళల దేవతలు యజ్ఞమునుండి సృష్టిని జేసిరని యున్నది. ఈభావము తరువాతదశకుఁ జెందినదై యుండనగును.

ఏకేశ్వరవాదకాలమునాఁటికి, దేవుఁడు తనస్వరూపమునుండియే జగమునుసృష్టించెనా? లేక తనకువేఱై యెల్లప్పుడునున్న పదార్థమునుండి యీసృష్టినిగల్పించెనా యనుప్రశ్న

3.౧౦.౭౨.3
౪. ౭.౮౬.3.3౨.౮౦.౧౦.౮౧.౨.౧౦.౭౨.౨.౧౦.౧౨౧ ౧
౫. ౧౦.3౧,౭.౧౦.౮౧.౪ ౬. చూడు తైత్తిరీయ బ్రాహ్మణమ్.
౭.౧౦.౧౨3.౧.

బయలు దేఱినది. మొదటిది బ్రహ్మైకవాదమునకును రెండవది ఏకేశ్వరవాదమునకును జెందును. రెండును వేదమంత్రములలోఁ గలవు. దశమమండలమున ౧౨౧వ ఋక్కులో శాశ్వతస్థితి గలిగిన పదార్థమునుండి జగమును దేవుఁడు సృజించినాఁడని వర్ణింపఁబడినది. విశ్వమంతయు నిండియుండిన జలమునుండి హిరణ్యగర్భుఁడు మొదట బయల్వెడలి, రూపరహితమైన యొకప్రళయస్థితినుండి యందమైన యీజగమును గల్పించెను.౧ కాని, యీహిరణ్యగర్భుఁడెందుండి యెట్లువచ్చెనని ప్రశ్నింపఁబడెను. ఏపద్ధతినేశక్తినుండి యాతఁడుజనించెను? ఆదినిజలమునుసృజించిన వాఁడెవఁడు? మనువు,హరివంశము,పురాణములు మూలప్రళయమును దేవుఁడే కల్పించె ననిరి. తనసంకల్పముచే నాజలప్రళయమును గల్పించి, యందొక సువర్ణమయబీజమునుంచి, యందుండి తానే బ్రహ్మరూపమున జనించెనని చెప్పఁబడినది. "నేనే పరబ్రహ్మముయొక్క యింకొకరూపమైన హిరణ్యగర్భుఁడను."౨ దీనివలన శాశ్వతములైయున్న రెండువస్తువుల నొకేపరబ్రహ్మమాధారముగా గలిగియుండెనని తెలుచున్నది.

ఈసిద్ధాంతమే పిమ్మటిదైన నాసదీయమంత్రము. దీని నిట్లు మ్యాక్సుముల్లరు భాషాంతరీకరించినాఁడు :

"అప్పుడు సదసత్పదార్థములు రెండును లేవు; భూలోక స్వర్లోకములును లేవు; ఇఁక నేది దేనియందున్నది ? జలము గంభీరమైనతావున నున్నదా ?

౧. పోల్చు, మనువు. ౧. ౫. ౮., మైత్రి ఉపనిషత్తు. ౫. ౨.

౨ మనువు. ౫,౯.

"అచట మరణము లేదు; అందుచే నమర్త్యత్వము లేదు; దివారాత్రములు లేని కాంతియే ఒక్క-పరమాత్మయే నిశ్చలుఁడైయున్నాఁడు; మ ఱేదియును లేదు.

''అంధతమసమున్నది; మొట్టమొదట నంతయు నొక సముద్రమే; కాంతి లేదు; ఆచ్ఛాదితమై యొక యండమున్నది. తపస్సుచే నందుండి యద్వితీయుఁడు జనించినాఁడు.

"ఆరంభమున నాపరబ్రహ్మ దయాహేతుఁడైనాఁడు; మనస్సులో నది బీజరూపమున నున్నది; కవులు జ్ఞానదృష్టిచే దానిని దమహృదయములలోఁ గనుఁగొని, వ్యక్తావ్యక్తసంబంధము నెఱిఁగిరి.

"ఆపరబ్రహ్మము పైనున్నదా, క్రింద నున్నదా? యని వారిజ్ఞానకిరణమును బ్రసరించినారు. బీజమును ధరించినవారు; శక్తులునున్నవి; ఆత్మశక్తిక్రిందను సంకల్పము పైనను గలదు;

"ఈసృష్టి యెచటనుండిపుట్టినదో, యెవ రెఱుఁగుదురు? ఇచట నెవరు వక్కాణించిరి?

"ఈసృష్టికిఁ దరువాత దేవతలు వచ్చిరి; ఇఁక సృష్టి యెచటనుండి వచ్చినదో ఎవరికిఁ దెలియును?

"ఎవనినుండి యీసృష్టి జనించినదో, లేక యాఆది వ్యక్తి దానినిఁజేసెనో లేదో, ఊర్ధ్వలోకముల కగ్రలోకమైన దానియందుండు బ్రహ్మర్షి కీరహస్యము తెలియవచ్చును: తెలియకపోవచ్చును."౧.

ఈబుక్కునందు సృష్టినిగూర్చి పరిణతిసంచిన సిద్ధాంతమును గమనించినాము. మొదట సదసత్తులు రెండును లేవు.

సత్పదార్థము వ్యక్తరూపమున లేదు. అందుచే నవ్యక్త మసత్పదార్థమని చెప్పరాదు. ఏలన దానినుండి వ్యక్తమంతయు వచ్చినది. ఋక్కులోని మొదటివాక్యమువలన, మనము నిర్మించుకొనిన పరిమాణము లసంగతములని తెలియుచున్నది. సర్వసృష్టికి వెనుకనున్న అవ్యక్తసత్యమును సత్పదార్థమనికాని, యసత్తనికాని చెప్పరాదు. ఒకండేయైన యాదివ్యపురుషుం డూపిరిలేని నిశ్వాసమొనర్చినాఁడు. ౧. వానికంటె నితరమేమియును లేదు. సూర్య చంద్ర నక్షత్రాకాశములతోఁ గూడిన సృష్టికంటె, ప్రథమకారణమైన యాతఁడు పూర్వుఁడు. అతఁడు దేశకాల యుగ మరణ జనన మోక్షాతీతుఁడు. వాఁడున్నాఁడనియేకాని, వాని స్వరూపమెట్టిదో చెప్పఁజాలము. ఇదియే సర్వసృష్టికిఁబూర్వతమమైన ప్రథమస్థితి. అట్టి యవ్యక్తసద్వస్తువునందు మొట్టమొదట "నే"నను భావముకలిగినది. "నే"నను భావమునకు "నేనుకా"దను భావ ముండకతప్పదు. తర్కములో "ఏ"అను వాఁడు "బి" కాదన్నట్లు. అందుచేసత్తునకసత్తు, వ్యక్తమున కవ్యక్తము, ఆత్మ కనాత్మయను నీ ద్వంద్వము మొదటనున్న పూర్ణత్వమునుండి వచ్చినది. కారణము తపస్సు. అనఁగా నప్రయత్నమగు నా విష్కృతి; పూర్ణత్వము వ్యక్తమైన విధానము. ఈతపమువలన వ్యక్తము నవ్యక్తము- నేను - నేను కానిది. ఆత్మ - అనాత్మ, పురుషుఁడు ప్రకృతి వచ్చినవి. ఈరెంటి యన్యోన్య సంపర్క సంజాతమే

---

౧. ౧౦-౧౨౯; చూడు మ్యాక్సుముల్లర్, షడ్దర్శనములు పుటలు ౬౯-౬౬
చూడు శతపథ బ్రాహ్మణమ్ ౫-3-౧.

తక్కినసృష్టి. సృష్టికర్తకిట్టి క్రియాపరత్వము కలుగుటకుఁ గారణము కామము. కామము అహంకారకారణము, మనస్సునకు బీజము, మనసో రేతః. కామమే పరిణామరహస్యము. వృద్ధికి మూలము. ప్రకృతి సామీప్యముచేఁ బురుషునకుఁ గోరిక లుదయించినవి. కామ మాలోచనకంటె నధికమైనది. ఆ బుద్ధిసంచలనము, లోపమును జూచుట, దానిని పూరించుటకు యత్నించుట కామములోనున్నది. వ్యక్తావ్యక్త బాంధవ్యములను గలుగఁ జేయునదదియే. ఎన్నఁడు పుట్టుక అద్వితీయమైన, శాశ్వతమైన వస్తువు. అహంకారముగల బ్రహ్మయై, పదార్థము, ప్రకృతి, అనాత్మ యెదురుగాఁ గాంచినది. అహంకారముగల బ్రహ్మకుఁ గామము ప్రధానలక్షణము. "కో వేద"యను వాక్యము "ఎవఁడెఱుగు"ననునది సృష్టి రహస్యమును జెప్పుచున్నది. తరువాత వచ్చిన తత్త్వజ్ఞులు దీనినే "మాయ"యని పలికినారు. పురుషుని ప్రకృతిని మాత్రమే చెప్పి యూగిపోవు ఋక్కులు కొన్ని యున్నవి. విశ్వకర్మను సంబోధించిన ఋక్కునందు (౧౦-౮౨-౫-౬) జలమయ విశ్వసాగరములో నాది జగద్బీజమున్నదని చెప్పఁబడెను. ప్రళయ జలరాశియందు సృష్టియొక్క అండరూపమున నున్నది. సర్వసృష్టికర్తయైన విశ్వకర్మ, ప్రథమజుఁడై యందుద

---

౧. పోల్చు- ఆరిస్టాటిల్ చెప్పిన- అచలుఁడై చలింపఁజేయువాఁడు.

౨. గ్రీక్కుల ప్రాచీనగాథ- మన 'కామ'మునకు సరిపడు 'ప్రేమ' దైవము 'ఇరాస్' జగమును సృజించెనని చెప్పుచున్నది. ప్లేటో తన సింపోజియమ్‌లో నిట్లు వ్రాసినాఁడు: "ఇరాస్ వలె జనకులు లేరు. వానికిఁ దల్లిదండ్రులున్నారని పండితులుకాని పామరులుకాని చెప్పియుండలేదు, ..." అరిస్టాటిల్ దేవుఁడు కామవస్తువుగాఁ జరించునని చెప్పినాఁడు.

యుంచెను; ఈ యాదిజలరాశిని గ్రీక్కులు ప్రళయమనిరి; జెని సిస్ గ్రంథములో దానినే రూపములేనియవస్థయు, నందనంత సంకల్పము బీజరూపమున నున్నదనియుననిరి. ౧. కామము, సంకల్పము, ఆత్మజ్ఞానము, మనస్సు, వాక్కు-నివి యాయనంత జ్ఞాననిధి లక్షణములు. అతఁడే జలరాశిపై నండరూపమునం దపించుచున్న పరమేశ్వరుఁడు; అనంతశాయియైన నారాయ ణుఁడు. జెనిస్ గ్రంథముచెప్పిన దేవుఁడితఁడే యిట్లుచెప్పెను. "జగముండవలెను; జగముండెను. ఈలోకములన్నిటిని పుట్టించె దనని తలఁచెను. వెంటనే అన్నియు జలము, వాయువు మున్న గునవి పుట్టెను." నాసదీయసూక్త మీ ద్వంద్వము నేకేశ్వర త్వములో సమన్వయించినది. ప్రకృతి పురుషులొకే యవ్యక్త బ్రహ్మపదార్థము రూపములనిచెప్పినది. అవ్యక్తబ్రహ్మ మాత్మ యుఁగా దనాత్మయును గాదు; అహంకారమును గాదు; తదభావ మునుగాదు; అది రెంటికి నతీతమైనది. దీనిలో ద్వంద్వమంత లీనము. మనమాటలలోఁ జెప్పుకొనినచో నాసదీయసూక్తము చెప్పిన సృష్టివిధానములో నీ వర్గీకరణముగలదు: (౧) పూర్ణమైన అవ్యక్తము. (౨) "నేను" "నే"నని తెలిసికొను నహంజ్ఞానము (3) నేనుకానిది నిర్ణయించిన యనాత్మ పదార్థము. దీనినిబట్టి యవ్యక్త మొక్క- మహత్తార్తము నవ్యక్తమైనదని యర్థముకాదు. భాషాతర్కములలో నీదశలున్నవి కాని, నిజముగా లేవు. "నేను"

౧. పోల్చు- జెనిసిస్; 'జలరాశిపై నంతయు నంధకారమే. జలముపై భగవంతుఁడు విహరించుచున్నాఁడు." (౧-౨)

చూడు రా. వే. భా. ౧౦. ౧౨౧; ౧౦. ౭౨.

"నేను గానిది" అవిభాజ్యములు. అందుచే ఇం దాత్మానాత్మలకు ముందు వెనుకలు లేవు. అవ్యక్త మొకప్పుడే తపము చేసి యుండవలెను. కాలాతీతమైన పూర్ణావ్యక్త బ్రహ్మము సృష్టిపరంపరగా నిత్యము ప్రదర్శింపఁబడుచునేయున్నది. సర్వవస్తు సత్యమైనయట్టి బ్రహ్మ మాత్మజ్ఞాన పరిపూర్ణానుభవము పొందువఱకట్లే జరుగుచుండును. అందుచే సృష్టియెల్లప్పుడును విశ్రాంతి విరామములు లేనిదే. నాసదీయసూక్తము సృష్టియెట్లావిష్కృతమైనదో చెప్పినదికాని యెచటినుండి యనుదానిని చెప్పలేదు. సృష్టిస్థితిస్వరూపముల నది ప్రకటించినది. ౧.

ఋగ్వేదసూత్రములలో నెచటను బ్రపంచము భ్రాంతి, అసత్యమను భావమున కాధారములు లేవని మనకుఁ దెలియుచున్నది. ప్రపంచ మొకనిష్ప్రయోజనమైన స్వప్నమునంటిదికాదు; అది దైవశక్తిప్రదర్శనము. 'మాయ' శబ్ద మెచట వాడఁబడినను, 'శక్తి' 'బలము'నను నర్థములోనే వాడఁబడినది. "ఇంద్రుఁడు తనమాయచే వేగముగా ననేకరూపములు దాల్చెను." ౨. కాని కొన్ని వేళల మాయనుండి వచ్చినశబ్దములు మాయినః, మాయావంతః, రాక్షసులగుణములనుజెప్పుట కుపయోగింపఁబడినవి. ౧. 'మాయ' శబ్దము 'భ్రాంతి' లేక 'అసత్యప్రదర్శన' మనునర్థములోను వాడఁబడినది. ౨. ఋగ్వేదము యొక్క తత్త్వము నిరాడంబరమైన అస్తిత్వవాదము. తరువాత

---

౧. పోల్చు, ప్లేటోవ్రాసిన టిమాయుస్ గ్రంథములోని భావము. చూడు. ఫాసెట్ పండితుఁడు తనగ్రంథములలో వ్రాసినభావములు.

౨. ౬. ४౭. ౧౮.

భారతీయవిజ్ఞానవేత్త లైదుభూతములను. ఆకాశము, వాయువు, అగ్ని,జలము, భూమియని పేర్కొనిరి. కాని ఋగ్వేద మొక్క జలమునే చెప్పినది. జలమే మూలపదార్థము. ఇందుండి వివిధ పదార్థములు క్రమముగా నుత్పన్నములైనవి.

మనము చదివిన మంత్రములలోనిభావము మొదట నున్నది శూన్యమనియు నందుండి జగముపుట్టినదనియుఁ దలఁచుట పొరపాటు. ప్రథమస్థితి శూన్యముకాదు. ఊపిరిలేకుండ నిశ్వాసముచేయుచున్న యొకఅవ్యక్తశక్తి యున్నదని మంత్రముచెప్పినది సర్వసృష్టికాధారభూతమైన పరమసత్యమునుగూర్చిశూన్యార్థము స్ఫురించునట్లుగాఁ జెప్పుట వేదఋషుల కభ్యాసమైనది. అవినాభావసంబంధముగల ఆత్మానాత్మద్వంద్వము సృష్టిపూర్వమున్న అవ్యక్తమునకు లక్షణముకాదు. అది రెంటికి నతీతము. అనాత్మయనఁగా, నిప్పుడున్న జగద్రూప మప్పుడు స్పష్టముగా లేదని యర్థము. (౧౦. ౭౨) మంత్రములో "వ్యక్త మవ్యక్తమునుండి వచ్చిన"దని యున్నది. దీనిలో నవ్యక్తమనఁగా శూన్యముకాదు. అందుచేఁ "దరువాత సాంఖ్యశాస్త్రముగాఁ బ్రబలిన

౧. ౫.౨.౬; ౬.౧.౩; ౧.౩౬.౪.౭.౪౯.౨.౭.౯౮.౫.

౨. ౧౦.౫౪.౨.

౩. చూడు. మెక్డనల్ వేదిక్ రీడర్ పుట ౨౦౭.
కొందఱు వేదకాలవిజ్ఞానవేత్తలు—ఆత్మకాని, అనాత్మకాని ప్రథమకారణమని చెప్పిరి: (౧౦.౧౨౯.౧.౧౦ ౭౨.౨) తర్కమందు, వీరికలవనే కార్యము కారణమందున్నదను సత్కార్యవాదము, కారణమందుఁగార్యములేదను అసత్కార్యవాదము బయల్వెడలినవి.

ప్రకృతితత్త్వమునకీ నాసదీయసూక్త మారంభవాక్యము*ను నిర్ణయమును మే మంగీకరింపము.౩.

కొన్నివేళల సృష్టి యొకమూలపదార్థమునుండి చేయఁబడినట్లు చెప్పఁబడినది; పురుషసూక్తమందు సృష్టిచేయు నధికారులు దేవతలనియు విరాట్పురుషుని శరీరమే సృష్టికివలయు సామగ్రి నిచ్చెననియుఁ జెప్పఁబడినది.౧. ఈసృష్టినిర్మాణ మొక యజ్ఞమనియు, నందు విరాట్పురుషుఁడే పశువనియు వర్ణించిరి. "భూతభవిష్యత్తులందలి జగత్తంతయు విరాట్పురుషరూపమే.౨. ప్రకృతిదేవతో పాసనము పరిణామమందు హద్దులు మీఱెను. భారతీయునియూహాశక్తి యాపురుషదేహమునకు బ్రహ్మాండములైన యవయవములనిచ్చెను. కవి తనప్రజ్ఞావిశేషముచే సృష్టిని దేవుని సమన్వయించిన యొకదివ్యరూపము నూహించి కల్పించినాఁడు. ఒకే అవ్యక్తబ్రహ్మమును జెప్పినసూక్తమునకు నీసూక్తమునకును విరోధములేదు. మొదటిదాని ననుసరించియుఁ బురుషప్రకృత్యాత్మకమైన జగమంతయు నవ్యక్తబ్రహ్మముయొక్క ఆత్మావిష్కరణముచే వచ్చినది. భావము మాత్ర మసంస్కృతమైన కథలోఁ జెప్పఁబడినది. ప్రథమావ్యక్తబ్రహ్మము క్రియాశక్తిరూపుఁడైన దేవునిగా మాఱినాఁడు. "పురుషునుండి విరాట్టు, విరాట్టునుండి పురుషుఁడు పుట్టెరి." అనగాఁ బురుషుఁడు పుట్టినవాఁడు, పుట్టించినవాఁడు గూడనైనాఁడు, అతఁ డవ్యక్తబ్రహ్మము—అహంకారాన్వితవిరాట్పురుషుఁడు.

## ౯—మతము.

ప్రకృతిదృశ్యములనుజూచి వానికిని మూర్తిమంతము లొనర్చిన విధానము ప్రథమదశలో నెట్లు జరిగెనో చూచియుంటిమి. ప్రకృతిదృశ్యములను దేవతలుగాఁ జేసినకల్పనము, మత విధానానుష్ఠానములపైఁ గొంత జుగుప్సాప్రభావము చూపినది. మానవులప్రమాణముల ననుసరించిన నీతిభావములను రాగద్వేషములను గలిగిన దేవతాసమూహముచే జగము నిండిపోయినది. చాలమంది దేవతలు పూర్తిగా మానవత్వమును గూడఁ బొందకుండ సహజస్థితిలోనుండిపోయిరి. ఇంద్రుఁడు, జలమేఘసంజాతుఁడు, కొన్నివేళలందుఁ బిడుగుగాఁ బాటాకసము నుండి పడిపోవును. బ్లూమ్‌ఫీల్డుచెప్పినట్లు వేదములందలి దేవతలు "అసంపూర్ణమూర్తులు." మానవత్వ మందిన దేవతలైనను బూర్తిగా మూర్తిమంతులుకారు. మనుజులవలెనే వారును గర చరణములుగలవారు. ఒకశరీరము, తీవ్రరాగద్వేషములు, సొగసైనచర్మము, పొడుగై, గౌరవప్రదమైనగడ్డము దేవతా మూర్తిలక్షణములు. వారు మృష్టాన్నములు మెక్కి, త్రాగి, నృత్యములుచేసి యుద్ధములు చేయుదురు. వారిలో నగ్ని, బృహస్పతి మున్నగు పురోహితదేవతలుగలరు; ఇంద్రమరుత్తులవంటి యుద్ధవీరులుగలరు. మనుష్యులకు రుచికరమైనదే వారికి నిష్టమైనభోజనము: పాలు, పెరుగు, నెయ్యి, క్షీరాన్నము మున్నగునవి, సోమరసము వారికిఁ బ్రియమైనపానీయము. మనుష్యుల సహజలోపమైనస్తోత్రప్రియత్వము వారికినిగలదు. కొన్నిసమ

౧. ౧౦. ౯౦; ౨. ౧౦. ౯౦ ౨.

యములలో వారత్యంతాత్మఘనతా పరవశులై, భక్తులకుఁ
దా మేమివరములీయవలయునని చర్చింతురు; "ఆవులనిత్తునా ?
అశ్వములనా? మనకు వీఁడెన్నఁడైన సోమరసమిచ్చినాఁడా?"౧
దేవతలభావములో హృదయపూర్వకమైన ప్రార్థనముకంటెఁ
విలువైనబలిసమర్పణమే ఘనతరమైనది. మానవదేవతాసంబం
ధము పరస్పరదానప్రతిదానములే.

ప్రకృతిశక్తులను మతారాధనమునకుఁ బనికివచ్చు
మానవతుల్యదేవతామూర్తులుగాఁ గల్పించుట వారిని నీచలక్ష
ణోపేతులనుగాఁ జేయుటే. ఒకఝంఝూమారుతమును బూజిం
చుటలో నైతికము పెద్దదోషము లేదు. పిడుగుపడి మంచివానిని
దుర్మార్గుని సమానక్రౌర్యముతోడనే చంపవచ్చును. పిడుగు
నకు బుద్ధి, వివేకము, వ్యక్తిత్వము కల్పింపనవసరము లేదు.
మానవదైవలక్షణములను వానికిఁగల్పించితివా సమస్య లెక్కు
వగును. నీతినియమములు లేని యొకానొకశక్తిని నీవారాధించు
చున్నావని యంగీకరింపవలెను; ఏలన పిడుగునాశనముచేయును
లేదా, దేవతకు వచ్చినకోపమందువా ? కోపకారణములను
గల్పింపవలెను. అట్టికల్పితకారణము లెంతయోగ్యములైయుం
డునో చెప్పనక్కఱలేదు. మూర్తిమంతుఁడైన దేవుడు స్వేచ్ఛా
స్వభావుఁడు, క్రూరుఁడునగును.౧

ఈభావము ననుసరించి, వేదములందలి ప్రకృతిశక్త్యుపా
సనము హృదయపూర్వకమైనదికాదు; లాభకరమైనదని వారు

౧. ఓల్డెన్ బెర్గు. ఏన్షెంటు ఇండియా. పుట ౭౧.

తలఁచిరి. మననిత్యజీవితములోఁ బ్రమాదకరులైన దేవతలకు భయపడుదుము. సహాయకారులై ఉపకారులగువారిని బూజింతుము. ఇంద్రుని వర్షసమృద్ధినిమ్మని ప్రార్థించి, శిలావర్షము కురిపింపవలదని వేఁడుదుము. గ్రీష్మపరితాపముచూపి, అనావృష్టి దోషములుక్షామములుకలుగఁజేయకుండ,మృదూష్ణము నిమ్మని సూర్యునిప్రార్థింతుము. దేవతల నారాధించుటవలన, సకలైశ్వర్యములుగలిగి, ఇహలోకసుఖములు లభించును. గుణసామర్థ్యముల ననుసరించి, దేవతలకు వర్గవిభాగమున్నదికావునఁ గొన్ని వర్గములవారి నారాధింపవలెను.౨. వారికర్పింపఁబడిన ప్రార్థనములు విసుగుపుట్టించునంతసులభములుగా నున్నవి.3. దేవతలు, నీతికంటెబలము, సౌజన్యముకంటెఁ బరితాపము నెక్కువగాఁ గలిగినవారు.ప్రజల నైతికదృష్టి కట్టిమతారాధన మెక్కువ తృప్తికరముగాదు. ఐనప్పటికిని, వేదకాలపుటాచార్యులకు సమంచితనైతికదృష్టికలదని, యిహలోక ప్రయోజన సిద్ధికై తఱచు దేవతారాధనముచేయుచున్న దినములలోనైనను, సత్ప్రవర్తనముగలవారిని రక్షించి దుష్టులను దేవతలు శిక్షింతురను భావమును విశేషముగా వ్యాప్తిచేయుటచే ఋజువగుచున్నది. మానవుని పరమలక్ష్యమైన పరమాత్మ సారూప్యము ముఖ్యమని

౧ గిల్బర్టుమురె ఫోయస్టేజెస్ ఆఫ్ గ్రీకురిలిజియన్. పుట౨౨.

౨. ౧౦.౪౭.౧; ౪.3౨.౪;౨.౧; ౨.౬; ౭.౫౯;౭.౨౪.౬; ౭.౬౭.౧౬.

3. ౧౦.౪౨.౪.

గుర్తింపబడినది.౧. అనేకదేవతారాధనము భక్తుల నేకేశ్వర పాదసాన్నిధ్యముఁ జేర్చునని విశ్వసించిరి.౨.

క్రతుకలాపము తప్పనిసరిగా వచ్చినది. ఒక దేవునియందు మనకు గాఢమైనభక్తివిశ్వాసములున్నట్లు, మనకుఁగల సర్వము నాతనికి సమర్పణముచేసి నప్పుడేఋజువగును. మనము ప్రార్థించి సమర్పణ చేయుదుము. క్రతుకలాపము విశేషవ్యాప్తి చెందినప్పుడైనను, బాహ్యపదార్థసమర్పణముకంటె నాత్మార్పణము ఘనమనుభావమునకుఁ బ్రాధాన్యమీయఁబడెను. "దేవేంద్రునకు దధిమధుఘృతములకంటె నెక్కుడురుచికరమైన స్తోత్రామృతమునిమ్ము."౩. సర్వకర్మలందు శ్రద్ధ ప్రధానమైనది.౪. వరుణుఁడు తనకుఁ బ్రార్థనములిచ్చువారి హృదంతరాళముల లోని యుద్దేశములను బరిశీలించు దేవుఁడు. క్రమముగా మనుజస్వభావము ననుసరించి, దేవతలకు మృష్టాన్నమే ప్రీతికరమైన భోజనమని నిర్ణయించిరి.౫.

నవపశుయజ్ఞమునుగూర్చి విశేషచర్చ జరిగినది. ఒక శునశ్శేపునుదాహరణమునుబట్టి వేదములు నరపశు యాగము

(౧) ఋ.వే.భా. ౧౦.౮.౮,౧౫;౮.౧౨౫.౫;౧౦.౧౦౭.౨ (౨) ౧.౨౪.౧.
(౩) ౨.౨౪.౨౦: ౬ ౧౫ ౪౯. (౪) ౧.౫౫.౫; ౧ ౧౩౩.౫; ౧ ౧౦౪.౬
(౫) హారిసన్ పండితుఁడు, తన స్టేజెస్ ఆఫ్ గ్రీషియన్ లైఫ్ అను గ్రంథమున (పుటలు ౮౭-౮౮) నిట్లువ్రాసెను;" హోమరు ప్రకారము కర్మకాండ స్వల్పము సులభమును మొదట ధాన్యముచు జల్లి ప్రార్థనముచేసి, ఒకపశు వును గాల్చి, కొంచెము రుచిచూసి మిగిలినదాని నగ్నిలో దేవుని కాహుతి చేయుదురు. తరువాత మాంసము సమృద్ధియైన సురాపానముతో సంతర్ప ణముచేయుదురు."

లనుబ్రోత్సహించెనని తలఁపరాదు. అశ్వమేధయాగములున్నవి.౧ కాని యిట్టియాగములను గూర్చి వేదములలోనే విమర్శనములు గలవు. సామవేదము చెప్పినది; "ఓ దేవతలారా! మీకు మేము దేనిని బలి యిచ్చుటలేదు. మే మేజంతువును వధింపము కేవల మంత్రపఠనముచేతనే మేము యజ్ఞమును నెరవేర్చుచున్నాము." ౧. ఈవిప్లవనాదము నుపనిషత్తులు, తరువాత బౌద్ధులు జైనులు స్వీకరించి పశువధను గర్హించిరి.

క్రతువులు వేదమతములో ద్వితీయదశకుఁ జెందినవి. ప్రథమదశలోఁ బ్రార్థనమే ముఖ్యము. పరాశరస్మృతిననుసరించి మనకు, "కృతయుగమునఁ దపస్సు; త్రేతాయుగమున యజ్ఞములు; ద్వాపరమునఁ బూజ; కలియుగమునస్మరణస్తోత్రములు" నున్నవి. విష్ణుపురాణము యాగవిధానసూత్రములు త్రేతాయుగమునఁ గల్పింపఁబడినవని చెప్పినభావము పరాశరస్మృతికి సరిపోవుచున్నది. మనము యుగవిభాగము నంగీకరింపక పోవచ్చును. కాని, తపమునుండి యజ్ఞమునకు, యజ్ఞమునుండి పూజకుఁ బూజనుండి ప్రార్థనమునకుఁ గ్రమపరిణామమందిన మతానుష్ఠానదశలు సత్యమని మనమంగీకరింపవచ్చును.

వేదమతము విగ్రహారాధన రూపముదాల్చలేదని తెలియుచున్నది. దేవతల కపుడు దేవాలయములు లేవు. మధ్యవర్తుల యవసరములేకుండ మనుజులప్పుడు దేవునితో స్వతంత్రసం

౧. భరతఃగ్నిమున నగ్నియే క్రతువులన్నిటికి ప్రధానదేవత, ప్రాచీనగ్రీసుదేశమిట్లే అగ్ని నారాధించినది. అగ్నిభూమినుండి, సమర్పితాహారమును దేవలోకములోనున్న దేవతలకుఁగొనిపోవును. ఇది కేవల భ్రాంతియాచారమే కాదు.

బంధమును బెట్టుకొనిరి. దేవత లుపాసకులకు మిత్రులుగాఁ జూడఁబడిరి. "ఆకాశపిత" "భూమాత" అగ్ని సోదరుఁడు" మున్నగుశబ్దములు వ్యర్థములుగావు. చాలసన్నిహిత సంబంధము మానవదేవతలమధ్య మందున్నది. మతము జీవితమును గాంతివంత మొనర్చెను. దైవముమీఁద నాధారపడి యాతనిపైఁ దమ భారమును బూర్తిగా నుంచిరి. సామాన్యజీవితావసరములకుఁ వారు దేవునే ప్రార్థించిరి. "మాకుఁ బ్రతిదినము రొట్టెను దయచేయు"మను తత్వము వేదకాలపుటార్యుని నిశ్చయభావమే. నిత్యజీవితమున జీవయాత్రలో వలయునవసరములను దేవుఁడే తప్పక యిచ్చునని వారునిశ్చల విశ్వాసముతో నమ్మిరి. మేమిదివఱకుఁ జెప్పినట్లే, వరుణారాధనమందు వేదములో నత్యుత్తమమైన యేకేశ్వరారాధనమునకు వలయు నంశములన్నియుఁ గలవు. భక్తియనఁగాఁ బరమేశ్వరునియందు విశ్వాసము. ప్రేమ, సర్వస్వమాతనిసేవకై వినియోగించుట, ఆంతరంగిక ధ్యానముచే మోక్షము నార్జించుట యైనచో, నివన్నియు వేదమునందలి వరుణారాధనమునందుఁగలవు.

(౧౦—౧౫; ౧౦—౧౮) ఋక్కులలో చచ్చి స్వర్గమున నున్న పితృదేవతలకుఁ బ్రార్థనములుగలవు. వేదమంత్రములలో నితరదేవతలతోఁబాటు వీరునారాధింపఁబడిరి. ౧.యజ్ఞములందు సమర్పింపఁబడిన హవిర్భాగములను దీసికొనుటకు వారుస్వయముగా సూక్ష్మరూపములతో వచ్చుచుండుటగలదు. పితృదేవ

౧.౬.౨. చూడు పురూరవునికథ

౨. రా.కీ.భా. ౧,౬.౨౪.౨;౩;౬:౭.౭.౧.౨.౯.౨.

ణారాధనము సాంఘికసంప్రదాయమును సూచించుచున్నది. కాని వేదవిజ్ఞానవేత్తలు ఋగ్వేదమునందుఁ బితృదేవతలకు సమర్పించు మాసికాబ్దికాదికర్మలు లేవందురు. ౨

వేదమతమునుగూర్చి తఱచుగా వినఁబడు విమర్శనములలో నాఁడు పాపభీతిలేదని చెప్పుచున్నారు. ఇది దోషమైనభావము, వేదములందుఁ బాపమనఁగా దేవతావిరోధమే. ౩. పాపమునుగూర్చిన వేదభావము హీబ్రూసిద్ధాంతమువంటిదే. దేవుని సంకల్పమే సకలనీతికిఁ బ్రమాణయు. మానవునిదోష మతని సహజలోపమే. దేవునియాజ్ఞల నతిక్రమించినపుడు మనముఁ పాపము చేయుచుంటిమి.

దేవతలు జగద్ధర్మశాసనమైన "ఋత"మును నిలఁబెట్టుచుందురు. వారు దుష్టశిక్షణమును శిష్టరక్షణమును జేయుదురు. పాపమనఁగాఁ గేవల నిత్యవిధినియమముల మానుటే కాదు. కర్మసంబంధమైన పాపములు నీతిసంబంధమైన పాపములు గలవు ౧ పాపచింతనుండియే ప్రాయశ్చిత్తకర్మలుగలవు. ముఖ్యముగా వరుణారాధన విధానమునందుఁ గలపాసము పాపమును క్షమించుట నేఁటిక్రైస్తవుల భావములను స్ఫురణకుఁ దెచ్చుచున్నవి.

మొత్తముమీఁద, ఋగ్వేదమునందు దేవతలు ధర్మసంరక్షులుగా నూహింపఁబడిరి. కాని, కొందఱు దేవతలు మాత్రము దుర్వారమైన అహంభావపూరితులై, యినుమడింపఁబడిన మనుజలక్షణములే గల్గియుండిరి. ఈలోపమును జూచిన ఋషులును

౧.౧౦.౧౫. (౨) బిహారిలాల్: వేదములు పుట ౧౦౧

౩. ౭.౮౬.౬; చూడు. ౭.౮౭.౫.౬

లేకపోలేదు. ఒకఋక్కు, దేవతలు, మనుష్యులవలెనే స్వార్థోపహతులని చెప్పుచున్నది. ౨. వేదసంబంధమైన దేవతారాధనము క్రమముగా క్షీణించుటకుఁ గారణము దేవతలనుగూర్చిన లఘుభావకల్పనమే, లేకున్న, దేవతల స్మరింపకుండ నుదారాశయములుగలిగి పరోపకార ప్రవర్తనమును శ్లాఘించు నొకఋక్కునకు వేఱర్థమేమియును లేదు. ౩. పరిశుద్ధమైన ధర్మమును గాపాడుటకు దేవతలశక్తి చాల నల్పమైనదయ్యెను. మతసంబంధము లేకుండఁ జెప్పబడిన బౌద్ధులస్వాతంత్ర నీతివిధాన మిచట సూచింపఁబడినది.

౧౦

## నీతి తత్త్వము

ఋగ్వేదమందలి నీతివిషయమై, "ఋత" భావముచాల ముఖ్యమైనది. భారతీయవిజ్ఞానమునందొక విశిష్టలక్షణమైన కర్మసిద్ధాంతమీ "ఋతభావమునుండియే పరిణతినందినది. ఈ సూత్రము మనుష్యులు, దేవతలు, నందరాచరింపవసిన విశ్వవ్యాప్తమైన నియమము. ప్రపంచమున నొకనియమమున్నచో నది నిత్యజీవితములో వర్తింపవలెను. ఏకారణముచేతనైన, నట్టికర్మఫలము లీలోకమున ఫలింపకపోయినను, నింకొకచోనైనను దప్పవు. ఎచట నియమమున్నదో, యచట, నవినీతి,సాంకర్యము నుండినను దాత్కాలికములు. దుర్మార్గుల విజయము నిత్యముకాదు. సజ్జనుల పరాజయము భయకారణముకాదు.

(౧) ౧. ౨౩, ౨౨; ౧. ౦౫. (౨) ౯. ౧౧౫. (౩) ౧౦. ౧౧౭.

ఋతము నీతికిఁ బ్రమాణమును సమకూర్చినది. అది సర్వవస్తుసారము: సర్వవస్తుసత్యము. అనృతము లేక అపక్రమము సత్యమునకు విరుద్ధము. ౧. సత్యక్రమ స్వరూపమైన ఋతము ననుసరించువారు సత్పురుషులు. ఋజువర్తనమొక వ్రతము చెప్పఁబడినది. ఇట్టివ్రతానుష్ఠానమే ఋతాభిమానులకు సన్మార్గము. ౨. త్రికరణశుద్ధి సత్పురుషలక్షణము; వేదములుచెప్పిన సజ్జనుఁడు తననియమములనుండి చలింపఁడు. ఋతానుసారియగు వానికిఁ పరిపూర్ణధర్మాభిప్రాయుఁడైన వరుణుఁడు ధృతవ్రతుఁడని చెప్పఁబడెను. కర్మకాండకుఁ బ్రాముఖ్యమేర్పడినవెనుక ఋతమనఁగా యజ్ఞమని భావింపఁబడెను.

ఆదర్శజీవమునుగూర్చి సామాన్య ధర్మప్రవచనమొనర్చి తరువాత ఋక్కులు వివరములను బేర్కొనెను. దేవతలకు ప్రార్థనము లర్పింపవలెను; కర్మలొనర్పవలెను. 3. మానవులకు దేవతలకు నత్యంత సన్నిహిత సంబంధమున్నది. దేవుఁడు సాక్షిగా మానవుఁడు జీవింపవలెను. దేవతలకు సేవయేకాక మనుష్యులకును జేయవలసిన సేవావిధు లున్నవి. ౪. సర్వజీవుల యెడఁ గారుణ్యము: భూతతృప్తి చేయుట ముఖ్యధర్మములు. "దానపరుఁడైనవాని ధనమెన్నఁడును దఱుగదు... ధనికునిహృదయ మన్నములేక మాడుచున్న దరిద్రునిఁజూచి కాఠిన్య

---

రా. వే. భా. ౭. ౫౬. ౨౨.; ౯. ౧౧౫. ౪. ౨. ౬. ౧౦;౪.౫. ౩; ౮. ౯,౨; ౧౨; ౭. ౪౭. ౩. (౨) ౯. ౧౭౧. ౧; ౧౦. ౩౭. ౫.

(3) రా. వే. భా. ౧. ౧౦౪. ౬. ౧. ౧౦౮. ౬; ౨. ౨౬. ౪; ౧౦. ౧౫౧.

(౪) రా. వే. భా. ౧౦, ౧, ౧౭

మొందును. ఎవఁడన్న మన్నాతురులకుఁ బెట్టక, ముందుఁదానే తిని యానందించునో యతనికాత్మశాంతి దుర్లభము."౧. క్షుద్ర దేవతోపాసన, మంత్రాదికము, మోసము, వ్యభిచారము ఘోరపానములని ఖండింపఁబడెను.౨. జూదము నిరసింపఁబడెను. సౌభాగ్యతయనఁగా దేవునిశాసన మనుసరించి బ్రతుకుచు, మానవునికిఁ గృపజూపుటయే. దైవశాసనము నతిక్రమించుటే వ్యసనము. "మమ్ముఁ బ్రేమించువానియెడఁ బాపమాచరించినందుకు, మిత్రద్రోహమునకు, మాయిరుగుపొరుగున నివసించువారికొనర్చిన దోషములకు, నింక నితరులకు మేమొనర్చినయపరాధములకు మమ్ము మన్నించి, హేభగవాన్, మాపాపముల నుపశమింపఁజేయుము."౩. కొందఱు దేవత లెన్ని పూజలర్పించిననుధర్మపథమునుండియపమార్గమునుఁబట్టుట కెన్నఁడంగీకరింపరు. దేవతలందు సవ్యాపసవ్యములు, పరోక్షాపరోక్షములు లేవు. వారెన్నఁడు తప్పవాల్చరు, నిద్రింపరు: సర్వలోకములందుఁ బ్రవేశింపఁగలరు. మంచిచెడ్డల నేఱరక చూడఁగలరు: దూరమైనది వారికి దగ్గఱే; మృత్యువును వారు ద్వేషించి పరిహసింతురు, చైతన్యమయమైన సర్వమును వారు కాపాడుదురు.

వైరాగ్యజీవితలక్షణములు పేర్కొనఁబడెను. ఇంద్రుఁడు స్వర్గమును వైరాగ్యముచే జయించెను. కాని వైరాగ్యమునకు వారు ప్రధానస్థాన మీయలేదు. ప్రకృతిసౌందర్యము, ఘనత అని స్వాచ్ఛ్యసౌభాగ్యము, ఋగ్వేదమంత్రము[illegible] దమకు

(౧) ౬.౫; ౧.౨.౬. (౨) ౭.౧౦౪.౮; ౪.౫.౫. (౩) [illegible].వే.బా [illegible].౭. (౪) ౧౦.౧౨౭. (౫) ౧౨ ౮౬.౨.

మనోహరరసప్రదములుగా వర్ణించిరి. ప్రపంచములోని సత్పదార్థసంతతియందలి ప్రేమయే వారియజ్ఞములకు మూలోద్దేశము. నిరాశాశోకకలుషితము కాని, యానందప్రదజీవితమే వారు జీవించిరి. వైరాగ్యసాధనములు లేకపోలేదు. ఉపవాసము, బ్రహ్మచర్యము దైవశక్తులను సాధించునని వారునమ్మిరి. ఏకాగ్రతతోఁగూడిన సమాధిస్థితులందు దేవతలువచ్చి మనుష్యులలోఁ బ్రవేశించిరి.౫ ఇట్టి సమాధిస్థితినిఁగూర్చి మొట్టమొదటిసారి ఋగ్వేదమునందలి దశమమండలములో (౧౩౬-౩) ఋక్కులోఁ జెప్పఁబడినది.౧.

హిందూజాతి నాలుగువర్ణములుగలదని మొట్టమొదటిసారి పురుషసూక్తమునఁ గలదు. ఈవర్ణవిభాగము సహజముగా నెట్టిపద్ధతి ననుసరించివచ్చినదో తెలియుటకుమున్నది, విజేతలైన యార్యులు, తాముజయించిన దేశీయజాతుల రక్త, సంప్రదాయములనుండి భిన్నమైనజాతిగా వ్యవహరించిరనుసంగతిని మఱవరాదు. ప్రాచీనార్యులందఱొకేజాతికిఁ జెంది యుండిరి. ఆద్యులైన ప్రతివ్యక్తియుఁ, బురోహితుఁడు, యోధుఁడు, వర్తకుఁడు కృషికుఁడునైయుండెను. ప్రత్యేకాధికారముగల పురోహితవర్గము లేదు. కాని తరువాతవచ్చిన క్లిష్టజీవితసమస్యలవలన నార్యులు వర్గములుగా విభజించుకొనిరి. ప్రారంభములోఁ బ్రతివ్యక్తియు నింకొకనితో సంబంధము లేకుండ స్వతంత్రముగా, దేవతలకు యజ్ఞములుచేయునధికారముండెనుగాని, క్రమముగా జనసామాన్యమునుండి పురోహితవర్గము, పండితవర్గము వేఱు

౧. చూ. ౭.౫౯-౬; ౧౦.౧౧౪.౭; ౧౦,౧౬౭... ౧౦.౧౦౯.౭

పడెను. ఆరంభదశలో వైశ్యశబ్దమందఱకును వర్తించెను. యజ్ఞములకుఁ బ్రాముఖ్యము హెచ్చి, జీవితవ్యాపారబాహుళ్యము నిష్టమైనపుడు, విద్య, విజ్ఞానము, కావ్యసాహిత్యములందభిరుచి గల కొన్ని కుటుంబములు కలిసి పురోహితవర్గముగా నేర్పడెను. వేదమతము నిత్యకర్మకాండమైనపు డీపురోహితవర్గ మొక తరగతిగా మాఱెను. ఆర్యులవిజ్ఞాన ధనాగారసంరక్షకులుగా నుండ వలసివచ్చిన కారణముచే నీవర్గము వారికుదరపోషణనిమిత్తము శ్రమలేకుండఁ జేయఁబడెను. వ్యవహారప్రపంచమున నిత్యక్లేశములతోఁ గూడిన జీవితమునకు, జ్ఞానజిజ్ఞాసాన్వేషణములు సులభసాధ్యములుకావు. ఈవిధముగా నొకవర్ణము పరమార్థ జ్ఞానసంరక్షణ నిమిత్తము స్థాపింపఁబడెను.

బ్రాహ్మణులు, కొన్ని స్థిరసిద్ధాంతములను బోధించుటకై ప్రతిబద్ధులైన పురోహితబృందములోని వారుకారు; వారువిద్యాధనముచే గౌరవజాతియై, ప్రజాబాహుళ్యముయొక్క యున్నత జీవిత ధర్మములను నిర్ణయించి, పోషించుబాధ్యత కలిగియుండిరి. విద్యావంతులైన బ్రాహ్మణులనుగాపాడి, పోషించిన ప్రభువులు నాఁడు ప్రజాపాలనముచేసిన క్షత్రియవర్గమయ్యెను. క్షత్రియశబ్దము "క్షత్రి" అనగా "పరిపాలించుట లేక రాజ్యము"నను శబ్దమునుండి వచ్చినది. ఈశబ్దమునకు వేదములందును, అవెస్టా గ్రంథమందును పారశీక శిలాశాసనములందునిదే యర్థమున్నది మిగిలినవారందఱు, ప్రజలు లేక వైశ్యులని పిలువఁబడిరి. ఆది యందు వృత్తిసంబంధమై, యీవర్ణవిభాగము, క్రమముగా జనువంశికమైనది. మంత్రముల కాలములో వృత్తులు వర్ణములు

ననుసరించి విభాగింపఁబడి యుండలేదు. ప్రజల యభిరుచివైవి
విధ్యమునుగూర్చి యొకశ్లోకము చెప్పినది: "నేనొక కవిని; నా
తండ్రివైద్యుఁడు; నాతల్లి ధాన్యముదంచెడిది."[1] బ్రాహ్మణుల
పెంపొందుచున్న ప్రాబల్యమును వర్ణించిన ఘట్టములునున్నవి.
"బ్రాహ్మణుఁడు తనగృహములో శాంతిసౌఖ్యములు గలిగి
జీవించును. అతని గృహమునకుఁ బవిత్రమైన యమూల్యాహార
ముపరివహించుచుండును; ఆతనికి సందారినవేరిమతోఁ బ్రజలు
ధన్యవాదములిచ్చుచు సేవించుచున్నారు; ఆతఁడు చక్రవర్తికం
టెముందుగాఁ బూజ్యుఁడు."[2] జ్ఞానవృత్తి ననుసరించినవాఁడు
యుద్ధములు చేసినవారు. వర్తకము నడపించినవారు, నందఱు
నొకేజాతికిఁ జెందినవారై, తమకు విజితులైన జాతులనుండి
మిక్కిలి దూరస్థులైయుండిరి. జయింపఁబడిన దేశీయజాతులను
రెండుగా విభజించిరి; సేవకావృత్తిగల ద్రావిడజాతి; తదితరపర్వ
తవాసులగు ననాగరికజాతి. ఆర్యులనియు, దస్యులనియుఁ జేసిన
విభాగము రక్తపారంపర్యముల ననుసరించి చేసినదే. ఆర్యులచే
సంస్కరింపఁబడి యంగీకరింపఁబడిన వారిని శూద్రులని
యు, నంగీకరింపఁబడని యితరజాతులు పంచములనియుఁ
గొన్ని చోటులందుఁ జెప్పబడెను. మఱికొందఱు, ఆర్యులు
దక్షిణాపథమునకు వచ్చుటకుఁబూర్వమే శూద్రులుకూడఁ దమ
సంఘములోనే యున్నారని, చెప్పుదురు. ఈరెంటిలో నేదిసత్య
మో నిర్ణయించుట సులభముగాదు.

నిజమునకు వర్ణవిభాగము, ఆర్యులవలనఁగాని ద్రావిడుల
వలనఁగాని వచ్చినదికాదు. భిన్నజాతులొకచోఁ గలిసి జీవింప

[1] ౧.౯.౧౧౨.౩.   [2] ౨.౪.౫౦.౯

వలసివచ్చిన సందర్భములలో నవసరార్థమీ వర్ణవ్యవస్థయేర్పఱుపఁబడినది. నేఁటివర్ణపరిణామమెట్లున్నను నాఁడది దేశముయొక్క అవసరమును జక్కఁగాఁదీర్చినది. దేశీయజాతుల మూఢవిశ్వాసములచేఁ గలుషితముగాకుండ నొకజాతియొక్క విజ్ఞానపావనత్వమును గాపాడుటకు, నాఁటికున్న జాతీయసాంస్కృతిక విభేదములను స్థిరపఱుచుటేమార్గము. దురదృష్టవశమున, కార్శ్యనాశనములనుండి జాతిని రక్షించుటకే నిర్మించిన సాంఘికవ్యవస్థయే, కాలక్రమమున జాతిపరిణతికే యాటంకమయ్యెను. ౧ జాతిపురోగమన ప్రవాహము వేగముగాఁ బ్రసరింపవలసివచ్చినపుడు గూడ నీవర్ణవిభాగములను నడ్డుకట్టలు త్రోవనిచ్చినవి కావు. సంఘనిర్మాణమును జక్కఁగా నిలఁబెట్టి కాపాడినను, మొత్తముమీఁద దేశాభ్యుదయము నీవ్యవస్థ యరికట్టినది. నాఁడు సదుద్దేశముతో స్థాపింపఁబడిన వర్ణవ్యవస్థను నిరసించుటకు మనకధికారములేదు. పెక్కుజాతు లొకే దేశమందుఁ గలహింప

౧. చూడు. ఫార్కుహారు ఔట్లైన్సు ఆఫ్ ది రెలిజియస్ లిటరేచర్ ఆఫ్ ఇండియా పుట. ౬

(హిబ్బర్టు లెక్చర్సు పుట 28)

౨. వర్గములు వర్ణములుగా ఘనీభవించుటకుఁ గలసందర్భమును గూర్చి వ్రాయుచు రైస్ డేవిడ్స్ యిట్లుచెప్పెను; "ఈవర్ణవిభాగము జరుగుటకు ముందార్యేతరులైన దేశీయజాతులందెట్టి కఠినవిభాగమా, తమజాతివారెవరు నార్యులలోఁ గలియకూడదను నియమములుండి యుండవనును. అట్టిఅనాగరిక జాతుల పద్ధతి సంస్కరించి యార్యులువర్ణవ్యవస్థగా నిర్ణయించి పరసహానశూన్యమైన దుష్ఫలితములకుఁ గారణభూతులైరి."

౩. రా. వే. భా. ౧౦. ౧౫.

కుండ జీవించుట కవకాశము వర్ణవిభాగమే యిచ్చి కాపాడినది. అంతర్జాతీయ సమస్యను భరతభూమి వర్ణవిభాగమువలన శాంతియుతముగాఁ బరిష్కరించినది. ఇతర దేశములు తమకువ్యతిరేకములైన జాతులను నాశమొనర్చుటచేఁ బరిష్కరించినవి. ఐరోపాజాతు లితరులను జయించినపుడు, వారి మానవత్వమును మానమునుగూడ నిర్మూలింప సర్వయత్నములు చేసిరి. వర్ణవిభాగముచే ప్రాచీనభారతీయుఁడు జయించిన జాతులు జయింపఁబడినజాతులు, తమ జాతిధర్మములు నశింపకుండఁ బరస్పరాధారభూతులై జీవించుచు, నన్యోన్యవిశ్వాస సౌహార్దములను బెంపొందించుకొనుట కవకాశములు కల్పించినాఁడు.

## ౧౧—జన్మాంతరతత్త్వము

బాహుబల గర్వముతో, విజయోత్సాహ ప్రమోదములతో నార్యులు భరతవర్షమునఁ బ్రవేశించిరి. సంపూర్ణజీవితానందమునందు వారికి విశ్వాసముగలదు. అందుచే మరణానంతర జీవసమస్యయందు వారికెక్కుడభిరుచి కలుగలేదు, నిత్యనూతనమైన ఖేదములేవియులేని జీవితానందకాంతిమయమైన [illegible] వారికిఁగలదు. తమకుఁ దమసంతతికి శతవర్షాయు రైశ్వర్యములను వారుకోరిరి. ౧. మరణానంతర జీవితమునుగూర్చి వారికి బ్రత్యేకసిద్ధాంతము లెవ్వియునులేవు. కొందఱాలోచనాపరులు మాత్రము, స్వర్గ నరకములనుగూర్చి సంశయాస్పదములైన భావములను బ్రదర్శింపకుండ నుండఁజాలక పోయిరి. పునర్జన్మము చాలదూరముననున్నది. మరణము సర్వమునకంతమని

౧. ౧౦. ౬. ౧౦; ౯. ౪౧. ౨.    ౨. ౧. ౨౫. ౬.

వైదికార్యులు వ్రాసి లేదు. రాత్రిగడచినఁ బగలువచ్చును; వచ్చిన వెనుక బ్రతుకుటయని వారుతలఁచిరి. జీవములకొకసారి యుండుట మఱొకసారి లేకుండుటయునుండదు. మరణానంతరము జీవులెచటో-బహుశః, యముఁడు పాలించుచున్న సూర్యునియు త్తమానలోకమునసనుండును. మరణ ఘోరభీతిచేఁ గంపించిపోవు మానవునికివలె వారికింకను యముఁడు దారుణ శిక్షావిధాతయని తోఁచలేదు. యమియాయములు మొట్టమొదట మరణించి, యితర లోకమును బాలించుటకై వెడలిరి. ఒకమనుజుఁడు మరణించి, యమునిరాజ్యములోనికిఁ బోవును. మనకొకస్థానమును లేక వసతి యముఁడిచ్చునే కాని మనయొద్దనుండి పుచ్చుకొనఁడు. శరీరము నశించినపుడు, జీవుఁడొక దివ్యకాంతిమయరూపమును ధరించి, యముఁడు పితృదేవతలతో నివసించుచున్న దేవలోకమునకుఁ బోవును. చనిపోయినవారి దేవలోకమునకు, మధ్యమందున్న జలమును, వంతెనగనుదాటి పోవుదురు. దేవయాన పితృయానములనుగూర్చి వర్ణనములుగలవు. (౧౦.౮౮.౧౫) ఈ యాన భేదములకుఁ గారణము, శ్మశానమందలి పొగ యజ్ఞశాలలోని పొగ, పైకివెడలు పద్ధతులలోని భేదమైయుండవచ్చును. కాని యీ మార్గములనుగూర్చి స్పష్టమైన భావమింకను బెంపొందియుండలేదు.

యమునితోఁబాటు భోగము లనుభవించుచు మరణించిన జీవులు స్వర్గమున జీవింతురు. వారిజీవితము మనజీవితము వంటిదే. స్వర్గసుఖములు లోపరహితములై పూర్ణములైన యిహలోకసుఖములే. “ఈ దివ్యభోగములు దాతలకుఁ జెందు

చవి; స్వర్గములో సూర్యులుగలరు; వారమరత్వమును బొందుదురు; చిరంజీవులగుదురు."౭. కొన్ని చోటులలోఁ, బరలోక జీవిత మింద్రియ సుఖభోగమును విషయమునుగూర్చి వేద మంత్రములలో వక్కాణింపఁబడినది. కాని డ్యూసెన్ పండితుఁడు వ్రాసినాఁడు. "ఏసుక్రీస్తుకూడ స్వర్గమునందు సర్వవస్తు సమృద్ధియుండుననియుఁ మృష్టాన్నభుక్తి,౧ సురాపానము౨నుండుననియుఁ జెప్పినాఁడు. డాంటే మిల్టలనువంటి మహాకవులును స్వర్గవైభవమును వర్ణించుటకు భూలోకభోగములనే గ్రహించి యతిశయోక్తితో వర్ణింపక తప్పినదికాదు." 3. సోమరసపానముచే దేవత లమరత్వమునొందుదురని నమ్మఁబడెను. దేవతల పదవిసంపాదించుట యేమానవులకుఁ గోరఁదగినది; ఏలన, దేవతలు దుఃఖమిళితముకాని సుఖభోగనిలయమైనస్వర్గలోకానందమనుభవింతురు. వారి కాఁకలిదప్పులుకాని, వివాహబంధములుకాని లేవు. ఆదర్శజీవితవర్ణనము స్వర్గభూలోక సుఖభేదములను దెలియఁ జేయును. దేవతలెల్లపుడు జీవింతురు; మనము క్షణికమాత్రనవులము. యమునికూర్ధ్వముననున్న స్వర్గములో వారుసుఖము జేనుభవింతురు; మనము భూలోకమున దుఃఖము ననుభవింపక తప్పదు. మరణములేని జీవనము మనకెట్లులభించును. అమర్త్యత్వము దేవతలీయఁగల వరప్రదానముగావున వారికి మనము యజ్ఞములుచేయవలెను. దేవతల నారాధించుసత్పురుషునికి

(౧) మాచ్యూ ౭.౧౧ (౨) ౨౬.౯ (3) ఫిలాసఫీఆఫ్‌ది ఉపనిషద్సు పుట 3౨౦
(౪) ౨.౨; ౧౦.౧.3 (౫) ఆహ్లాదకసర్వేషామ్ (౬) చంద్రఏవభవతీ.
(౭) ౧.౨౪.౧; ౭.౫౬.౨౪.

స్వర్గములభించును. "అగ్నిదేవా! ఎవఁడు నిన్నర్చించునో వాఁడు స్వర్గములో నొకచంద్రుఁడగును."౪. కాని సందేహ మారంభమైనది. అట్టివాఁడు చంద్రుఁడగునా? లేక చంద్రుని వంటివాఁడగునా? సాయనాచార్యుఁడిట్లు దీనికర్థముచెప్పినాఁడు. "వాఁడు సర్వప్రాణికోటి కాహ్లాదకరుఁడగుచంద్రునివంటివాఁ డగును."౫ కాని యితరులు కొందఱు ఆతఁడుచంద్రుఁడే యగు ననిరి.౬ మరణానంతరముపూర్వము గతించిన తన పితృపితా మహాదులను గలియుట కవకాశమున్నదని నమ్మినసాక్ష్యము లున్నవి.౭.

ఇపుడు ప్రశ్నమేమనగా, దేవతలఁ బూజింపనివారిగతి యేమగుననని? స్వర్గచ్యుతి కేకమగు నరకమొకటి అవినీతిపరు లకు, నాస్తికులకు, దేవతలనునమ్మనివారికి శిక్షకొఱకొక నరక మున్నదా? ధర్మాత్ములు సత్పురుషులుమాత్రమే స్వర్గమునకుఁ బోఁగల్గుచో, దుర్మార్గులైనను, మరణించినవెనుక నశింపరు; స్వర్గమునకుఁబోలేరు; కావున నరకలోకమవసరము. వరుణుఁడు దుర్మార్గులను దిరిగి రావీలులేని నరకకూపమునఁ బడఁద్రోయు నని వినియున్నాము. తనభక్తునవమానించిన ద్రోహి నధోలో కమునఁ ద్రోసివేయుమని యింద్రునికిఁ బ్రార్థనలున్నవి.౧. కలుషవర్తనులందఱట్టియధోలోకమునఁబడి నశింపవలసినదే. కాని పురాణకల్పితములైన ఘోరనరకములింకను నిచటవర్ణింపఁ బడలేదు. ధర్మపరులకుస్వర్గము, నీతిదూరులకు నరకముసామా న్యపద్ధతియైయున్నది. ధర్మప్రవర్తనమునకు శిక్షయు నంగీకరింపఁ

౧ ౧౦.౧౩౨.౪; ౪.౫.౫; ౯.౭౩.౮; ౧౦.౧౫౨.౪.

బడెను. సుఖలేశములేని దుఃఖమయప్రదేశము లీలోకమున నున్నవే నరకములనిచెప్పిన డ్యూసేన్ భావము సరియైనదికాదు. మనకు వేదమునందింకను సంసారము, సుఖాంతరవర్గీకరణమును గానఁబడవు. ఋగ్వేదమునం దొకవాక్యమిట్లు చెప్పుచున్నది.౨. "తానుబుట్టిన కర్మముల ననుభవించి, వృద్ధుఁడై, మానవుఁడు మరణించి, తరువాత మఱలఁబుట్టును. ఇది యాతనిమూఁడవ జన్మము." వైదికసిద్ధాంతము ననుసరించి, యీమూఁడుజన్మము లేవనఁగా, మొదటిది శిశుజన్మము; రెండవది ద్విజత్వము-బ్రహ్మోపదేశముచేఁ గల్గినజన్మము; మూఁడవది మరణానంతర జన్మము. జీవాత్మ సంచరించుచుండు ప్రాణశక్తియని చెప్పఁబడినవి.3. (౧౦.౫౮) ఋక్కునందు, స్మృతితప్పి చనిపోయినట్లున్న యొక జీవుని, వృక్షములనుండియు, నాకాశమునుండియు, సూర్యునుండియుఁ దిగివచ్చి దేహమునఁబ్రవేశింపుమని యాహ్వానింపఁబడినట్లు చెప్పఁబడును. కొన్ని యసహజావస్థలలో దేహమునుండి జీవుఁడు వేఱైయుండఁగలఁడని విశ్వసింపఁబడెను. ఇదంతయు వైదికార్యునకుఁ బునర్జన్మసిద్ధాంతములో నధికపరిచయమున్నదని ఋజువుచేయదు.

## ౧౨-తుదివాక్యము

అనంతరభారతీయతత్త్వమునకు ఋక్కులుమూలాధారములుగానున్నవి. అందు ఛాయామాత్రముగా సూచితములైన యాగవిధానమును బ్రాహ్మణముపోషింపఁగా, నుపనిషత్తులందలి తత్త్వభావములను బోషించినవి. భగవద్గీతలోని ద్వైత

౨. ౪.౨౭.౧. 3. ౧.౧౬౪.3౦.

తత్త్వము, సంస్కరింపఁబడిన వరుణోపాసనమే; సుప్రసిద్ధమైన కర్మసిద్ధాంతము 'ఋతి' భావమునుననుసరించి బాల్యదశలోనే యున్నది. సాంఖ్యములోని ద్వైతతత్త్వము, జలరాశిపై శయనించి యున్న హిరణ్యగర్భునిఁగూర్చినభావమునుండి పరిణతినందినదే. యజ్ఞముచేయునపుడుగాని, సామగానముసల్పునపుడుగాని, సోమరసపానపరవశత్వముచేఁగాని లభించినసమాధ్యవస్థలవర్ణనములు అలౌకికశబ్దశ్రవణ, దృశ్యదర్శనములతోఁగూడిన యోగశాస్త్రమందలి సమాధ్యవస్థలకు సరిపోవుచున్నవి.

## పరిశీలిత గ్రంథములు.

౧. మాక్సుముల్లరు; ఓల్డెన్‌బర్గు; ది వేదిక్ హిమ్సు; సెక్రెడ్ బుక్సు ఆఫ్ ది ఈస్టు. భా. ౩౨.౫౬.
౨. మూయిర్. ఒరిజనల్ సాంస్క్రిట్ టెక్స్టులు. భా. ౫
౩. రాగోజిన్; వేదిక్ ఇండియా.
౪. మాక్సుముల్లరు; సిక్సు సిస్టమ్సు ఆఫ్ ఇండియన్ ఫిలాసఫీ. అధ్యా. ౨.
౫. కాయెగి: ఋగ్వేదము (ఆంగ్లభాషాంతరీకరణము)
౬. ఘాటే; లెక్చర్సు ఆఫ్ ది ఋగ్వేద.
౭. మెక్డొనెల్: వేదిక్ మైథాలజీ: వేదిక్ రీడరు.
౮. బారువా: ప్రిబుద్ధిస్టిక్ ఇండియన్ ఫిలాసఫీ పుటలు ౧-౩౮.
౯. బ్లూమ్‌ఫీల్డు: ది రెలిజియన్ ఆఫ్ ది వేదాస్.

# భారతీయ తత్త్వశాస్త్రము

## తృతీయాధ్యాయము.

### వేదములకు నుపనిషత్తులకు సంధికాలము

"ఋగ్వేదమంత్రము లర్థ రహితమగునట్లు మిశ్రమముచేయుట; పూర్వయుగ దేవతల నామరూపముల మార్చివేసి. దేవతాగణమును బూర్తి చేయుట; నూత్నవిచిత్ర దేవతలను సృజించుట; ఘోరశిక్షారూపమైన నరకమునంగీకరించుట; అనేక దేవతలకు బదులుగా, సర్వప్రకృతి దేవతాస్వరూపి యగు నొకని నూహించుట; సదసత్కార్యసాధనమునకు వలయు మంత్రతంత్రనిర్మాణము; విద్వేషులను నాశమొనర్చుటకు వలయు శాపమంత్రములను సంపుటిచేయుట, పుత్రోదయదీర్ఘాయుర్దాయములకు, పిశాచములను దరిమివైచుటకు, విషదోషాదికములనుండి సంరక్షించుకొనుటకు విచిత్రమంత్రకల్పనము; యోగావేశములను దైవభావముతోఁజూచి యర్చించు, కర్మకాండయందలి మితిలేనిగౌరవము; సర్ప, రోగ, నిద్రా, కాల, నక్షత్రస్తుతి మంత్రములు; పురోహితద్రోహులకు శాపవిధానములు; ఋగ్వేదానంతరము, అథర్వవేద పరిశీలనమువలన లభించుసామాన్యభావజాలమిట్టిదై యుండును." ౧. ఋగ్వేదమునందుఁ జిత్రచిత్రములైన ప్రయోగమంత్రములు, గీతములు, జడములకు, భూతపిశాచములకు మంత్రములు; కొన్నిచోట్ల గలవు. గృహములో నున్నవారు నిద్రలోనుండి పోవునట్లు చేయు

---

౧. హాప్కిన్సు; ది, రిలిజియన్సు ఆఫ్ ఇండియా. పుట ౧౯౧,

చోరులనుపయోగించు మంత్రములు,౨. స్త్రీలకుగర్భస్రావముకె
కాకుండఁ గాపాడి క్రూరశక్తులను బంధించు మంత్రములు, రోగ
నివారణముచేయు మంత్రములును ఋగ్వేదమున గలవు. ౪.
ఋగ్వేదకాలమునందు క్షుద్రదేవతోపాసనా మంత్రవిధానము
లున్నను వేదద్రష్టలు వానినెన్నఁడును ప్రోత్సహించియుండలేదు.
కాని యీమంత్రములు తరువాత ఋగ్వేదమునఁ జొప్పించినవా
నివలెఁ దోచును. అథర్వవేదమున నివిప్రధానస్థాన మాక్రమిం
చును. అథర్వవేదమునఁ గల మతతత్త్వము ఋగ్వేదమునకంటెఁ
బూర్వమైనదేగాని, అథర్వవేద సంపుటీకరణము ఋగ్వేదానం
తరమైనది. వైదికార్యులు వచ్చునప్పటికి భరతవర్షమున దారు
శిలాసర్పములనారాధించుచున్న అనాగరిక క్రూరక్షుద్రజాతు
లుండిరి అట్టి యనాగరిక క్షుద్రజాతుల మధ్యమందుండి, వారిని
బూర్తిగా జయించుటగాని, తమవిజ్ఞానబీజములను వెదజల్లి
వారిని సంస్కరించుటగాని చేయకున్న యెడల, నేసంఘమును
నాగరికతయందు క్రమాభివృద్ధినందఁజాలదు. అట్టి సందర్భ
మున మూఁడుమార్గములుగలవు; క్షుద్రజాతులను నాశనముచే
యుట; విజ్ఞానసంస్కారముకలిగించి వారిని మనలోఁ గలిపి
యుద్ధరించుట; లేక వారి యవిద్యాకూపమునఁబడి వారితోఁ
బాటు నీచదశకుఁ బాల్పడుటయునై యున్నవి. స్వల్పముగాను
న్న జనసంఖ్యగల యార్యజాతికి మొదటిపద్ధతి దుస్సాధ్యము; స్వ
జాతివిజ్ఞానగర్వముగల జాతికి మూఁడవపద్ధతి యెప్పుడునునచ్చదు

౨. ఋ. వే. భా. ౭.౫౫.

౩. ఋ. వే. భా. ౧౦.౧౬౨.

౪. ఋ. వే. భా. ౧౦. ౧౬౧

ఇక మిగిలినది రెండవపద్ధతి. దానినే యార్యు లనుసరించిరి. సుందరశరీరులైన యార్యులకును, కృష్ణవర్ణ దేహులైన దస్యుల కును గలిగిన సంఘర్షణములను ఋగ్వేదము వర్ణించినది. ఈ కలహములనే పురాణములు దేవాసురయుద్ధములని వర్ణించెను. కలహములు శాంతించి, పరస్పర సమరసభావముతోఁ గలిసి మెలసియున్న దశావర్ణనము అథర్వవేదమునం దున్నది. ఈ సామరస్యమువలన ననాగరికజాతుల మతము శ్రౌతసంస్కారము నందినది; కాని యాజాతుల క్షుద్ర మంత్ర తంత్రకలాపము కొంత వేదములలోఁ జొచ్చి దానిని గలుషపఱిచినది. ఆట విక జాతులకుఁ జెందిన వృక్ష పర్వత నక్షత్ర పిశాచాది పూజలు, తదితర మూఢవిశ్వాసములును వేదమంత్రములలోఁ బ్రవేశిం చినవి. క్షుద్రజాతులను సంస్కరించుటకై చేసినయత్నమువలన దాను వ్యాప్తి చేయఁదలఁచిన యాదర్శము కళంకితమైనది. అథర్వ వేదమును డీ కొన్ని భాగములకుఁ దాను జేసిన భాషాంతరీకరణ మున కుపోద్ఘాతముగా బ్లూమ్‌ఫీల్డు పండితుఁ డిట్లువ్రాసినాఁడు. "మాంత్రిక ప్రయోగవిద్యకూడ హిందుమ... భాగమైనది. పరమపావనములైన వైదిక కర్మకలాపములలోఁ గూడ నీక్షుద్ర మాంత్రికవిద్య ప్రవేశించి, కలిసిపోయినది; బ్రాహ్మణపురో హితు లుపదేశించినమహనీయధర్మములందు బెక్కువిధములుగా వచ్చి ...జా బాహుళ్యముయొక్క మూఢ... ...ములు ప్రవే శించినవి. ఈమూఢవిశ్వాసములను వారు ...రింపఁజాలక పోయిరని కాని, లేక యట్టియత్నము తమకు ...ఁబోవని తలచి యూరకుండిరని కాని యూహింపనగును..." ...పై నసమ

స్థలమందు ద్వేషఫలితములిట్లుండును. హిందూమతము, మహోన్నత ధీరభావములు మొదలు, ఆటవికజాతుల మూర్ఖవిశ్వాసములవఱకు నుండుసర్వభావాచార విశ్వాసముల వివిధదశాంతర్దశలలోని తత్త్వములన్నియుఁ గలిపిన కలగూరగంపయని చెప్పుటకుఁగల కారణములు చూచియుంటిమి. ఆరంభమునుండియు నార్యమతము వ్యాపకశీలముగలిగి, స్వీయశక్తిచే వృద్ధినొందున దై, పరసమానభావపూరితమై వెలసినది. తన క్రమాభ్యుదయ యాత్రిలోఁ, దనకెదురువచ్చిన సర్వ నూతనభావములతోఁ జెలిమిచేసి, కలిసి ముందుకుఁబోయిన మతమిది. ఈతత్త్వమునందుఁ బవిత్రమైన సద్వినయసంపత్తి, యనురాగముతోఁగూడిన యన్యభావపరిశీలనము గోచరించును. భారతీయుఁడు హీనమతములతో రణమొనర్చి, నాశనమొనర్చుటకు విముఖుఁడయ్యెను. తనదే సత్యమైన మతమని నమ్ముమూర్ఖవాది గర్వమాతనికి లేదు. ఒక దేవతారాధన మొకవిధముగా నొకనికిఁ దృప్తినిచ్చినచో నదియు నొకసత్యరూపమే. దానిని నెమ్మదిగాను, క్రమముగాను జయింపవలెను. అసమాన మొక్కొకతఱి గుణమేయనుసంగతిని వారుమఱచిరి. ఆర్యులయొక్క మతము, అనార్యులమతము; ఒకటిపావనమైనది, రెండవది కలుషితము; ఒకటియోగ్యమైనది. రెండవది గర్హ్యమైనది; ఇవి కలిసినపుడు నీచమైన దొకప్పు డుత్తమమైనదాని నణఁచివేయుట కవకాశము కూడఁ గలదు.

(౧) సేక్రెడ్ బుక్సు ఆఫ్ ది ఈస్టు వాల్యూము ౫౩

## ౨. దైవతత్త్వము

అథర్వవేదమతము ప్రపంచమంతయు భూత ప్రేత పిశాచములతో నిండియున్నదని భావించు ననాగరికునిమతము. అట్టిమానవుఁడు, ప్రకృతిశక్తులయెదుట, తన నిస్సహాయతను, నిత్యప్రసన్నమగుచున్న మృత్యువుచే నావృతమైన తనజీవిత ప్రమాదావస్థను దెలిసికొని, తనయాలోచనా(ప్రపంచమున నెల్ల పుడు రోగజరామరణములను, క్షామభూకంపములను దలఁచు కొనుచుండును. భూతపిశాచములతో నిండినలోకము, అసం తుష్టిచెందిన భూతపిశాచములచేఁ గలిగిన ఘోరప్రమాదముల నాతఁడు చూచును. ఒకవ్యక్తి రోగగ్రస్తుఁడైనపుడు, వైద్యుని మాని భూతవైద్యుని బిలుతురు. వాఁడు వచ్చి, మంత్రములు చదివి రోగినుండి భూతము నీవలకువచ్చునట్లాకర్షించును. అట్టిఘోరభూతములను దృప్తిపఱిచి యుపశమింపఁజేయుటకు, పశువులను మానవులను బలియొసఁగి రక్తము సమర్పింపవలెను. మృత్యుభీతి, మూఢవిశ్వాసమునకు స్వేచ్ఛనొసఁగెను. రాగోజిన్ సతి యిట్లువ్రాసెను. "ఇచట మనకు, ఋగ్వేదఋషులచేఁ గృతజ్ఞతావిశ్వాసములతోఁ బ్రార్థింపఁబడిన ప్రజోపకారు లును, పుష్టిసుఖప్రదాతలునగు దేవతలగణమునకు బదులుగా, ఆర్యహృదయమున నెన్నఁడునులేని దారుణభయహేతువులై జుగుప్సాకరక్రూరనాదములతో నిండియున్న పిశాచప్రపంచము ప్రత్యక్షమగును."౧. ఆర్యానార్యభావసాంకర్యరూపమే అథర్వ వేదమతము. ఋగ్వేదభావతత్త్వమునకు నథర్వవేదభావతత్త్వ

౧. ఈభావ మవిచ్ఛిన్నముగా నుండుటకుఁగారణ మిందుఁ గొంతసత్యముండి యుండవలెను. శరీరరోగములకు ముఖ్యముగా నరములదోషములకు, భా...

మునకుఁగలభేదమునుగూర్చి లిట్నీపండితుఁ డిట్లువ్రాసినాఁడు: "ఆర్యులు ఋగ్వేదమునందు, భయభక్తులున్నను, ప్రేమవిశ్వాసములతో దేవతల నారాధించిరి; అట్టియారాధన మారాధకుని ధన్యునిగాఁ జేసినది; భయంకరస్వరూపులగు పిశాచదేవతలను, దేవతలు తరిమి నాశముచేసిరి. కాని అథర్వవేదమం దర్చింపఁ బడినవారు, క్రోధకిరాతమూర్తులు; ప్రజలకు వారనిన నెల్ల ప్పుడు దేహము కంపించెడిది;అట్టిక్రూరుల యనుగ్రహసంపాదన మవసరమని తలపఁబడెను. వివిధవిచిత్రపదవులు, వివిధనామ రూపములుగల వారిసంఖ్య చాలగొప్పది. అథర్వవేదమంతయు వారిస్తోత్రములు, వారిదయ సంపాదించుపూజలతో నిండియు న్నది. ఋగ్వేదమున మంత్రము భక్తిభావమును బెంపొందించి నది; యిచట మంత్రము మూఢవిశ్వాసలను బలపఱచినది. ఋగ్వేదదేవతలు సుహృదయకారుణ్యములతోఁ గోరికలిచ్చెడి వారు; పిశాచదేవతలు పూజలెన్నిపుచ్చుకొన్నను వరములు మాత్రము ప్రజలను హింసించియిచ్చెడివారు. కొన్ని క్షుద్ర మంత్రములే విచిత్రముగాఁ గోరినఫలములిచ్చునని నమ్మిరి. అథర్వవేదమున నత్యంతప్రాధాన్యము వహించిన నసంఖ్యాక ములైన క్షుద్రోపాసనమంత్రములే, ఒకఫలమునుగోరిన యజ మానికాని, వానిపక్షమున నొకమాంత్రికుఁడుగాని యీమం త్రములఁ జదివి, విషయకాంక్షలన్నిటిని పొందుచుండెడివారు. ఋగ్వేదమునందు పవమాన ఋక్కులలో సోముని

ప్రయోగము (suggestion) మంచి యథావిధముగాఁబనిచేయునని ఆధు నికమనస్తత్త్వశాస్త్ర మంగీకరించినది, ౧. వేదిక్ ఇండియా పుటలు ౧౧౭- ౧౧౮

బ్రత్యేక భక్తితో స్తుతించినట్లే, యిందును నొకప్రత్యేక కర్మ, విశేష భక్తితోఁ జేయఁబడుచుండెడిది; తాత్త్వక భావములను జెప్పు కొన్ని మంత్రములును లేకపోలేదు. ఋగ్వేదానంతరదశలలో హిందూమతము పొందు యుండ వలసిన విశేషపరిణతి ననుసరించి చూచినచో నుండవలసి నంత విస్తారముగా నీతాత్త్వక భావములు పెంపొంది యుండ లేదు. అధర్వ వేదమతము పామరుల మతమే కాని పండితుల మతముకానట్లు తోఁచును; వేదముల మతమునుండి నేఁటివఱకు వచ్చిన సంధికాలమున నధర్వవేదమతము, తరువాత మనకు లభించిన బ్రాహ్మణుల మహోన్న తాద్వైత మతమునకు దారి చూపలేదనియు, మూఢపామర ప్రపంచము నమ్మియున్న ప్రతిమారాధనములకు, మూర్ఖ విశ్వాసములకు మాత్రమే త్రోవ చూపినదనియుఁ జెప్పవచ్చును."౧. క్షుద్రమంత్రములు, రహస్యక్రియలు, తుచ్ఛ పూజావిధానములతోఁ గూడిన మత ము, పవిత్రమైన వేదమతస్థానము నాక్రమించినది. భూత పిశాచాదులను వశము చేసికొనఁగల వైద్యము నెఱిఁగిన భూత వైద్యుఁడే పండితోత్తముఁడై గౌరవింపఁబడును. ఘోరతపస్సు చేఁ బ్రకృతిని జయించిన యోగులగాథలు వినియున్నాము; వారు తమదుర్దమ తపశ్శక్తిచేఁ బ్రకృతిశక్తులను స్వాధీనము చేసికొనిరి. శరీరమును శుష్కింపఁజేసి, సమాధ్యవస్థలను బొందవచ్చునని వాడుక యున్నది. రహస్య మంత్రజపముచే మానవుఁడు దేవుని చెలికాఁడు కావచ్చును, వేదద్రష్టలు, మాంత్రికా

---

౧. జర్నల్ ఆఫ్ ది అమెరికన్ ఓరియంటల్ సొసైటీ. 3. పుటలు ౩౦౭,౮౦

చార్యులను, క్షుద్రోపాసకుల నంగీకరించిరి: వారి కొక గౌరవ స్థానమిచ్చిరి; ఫలితమేమన నింద్రజాలవిద్యయే యోగవిద్య యని భ్రాంతి వ్యాపించినది. పంచాగ్ని మధ్యమునఁగూర్చుండు వారు, ఏకపాదమున నిలఁబడి ఒక హస్తము నెత్తినిలుచువారు, బయలు దేఱిరి; ఉద్దేశము ప్రకృతిశక్తులను జయించి, దేవతలను స్వవశముచేసి కొనుటయే. మూర్ఖ విశ్వాస మగ్నములైన యాటవిక జాతుల పిశాచ దేవతాగణోదంతములతో నధర్వ వేదమునిండి యున్నను, ఋగ్వేదము నతిక్రమించు నున్నత భావములను, బ్రాహ్మణములు, నుపనిషత్తులు చెప్పినవానిలో సమానములైన వానిని గూడఁ గొన్నిచోటులందుఁ బ్రకటించి యున్నది. కాలపూజ, కామపూజ, స్కంభ (ఆధారము) పూజగలవు. వీనిలో నుత్తమమైనది స్కంభపూజ. ప్రజాపతి, పురుషుఁడు, బ్రహ్మము నామములచేఁ బేర్కొనఁబడిన పరమ తత్త్వస్వరూపమే స్కంభనామధేయుఁడు. దేశకాలములు, దేవతలు, వేదములు, ధర్మములునన్నియు దాని యందే కలవు౧. రుద్రుఁడు పశుపతి, ఇతఁడు వేదశైవమునకుఁ దరువాత వచ్చిన శైవమతమునకు సంబంధియైనాఁడు. ఋగ్వేదమునందు 'శివ' శబ్దమునకు మంగళమను నర్థమేకాని శివుని కర్థములేదు. ఋగ్వేదరుద్రుఁడు పశునాశన కారుఁడగు నొకక్రూర దైవము.౨. అధర్వమున రుద్రుఁడనగా సర్వజీవాధిపతి యైన పశుపతి. ప్రకృతి శక్తిరూపమైన ప్రాణము కొనియాడఁబడినది.3. భారతీయ తత్త్వశాస్త్రమునఁ దరువాత ముఖ్యస్థాన మాక్రమించిన పంచ

౧. రా. వే. భా. ౪. 3. ౬; ౧. ౧౧౪.౧౦. ౨. అథర్వవేదము ౧౦. ౭.
(3) ౧౯.౭౧. ౧.

ప్రాణసిద్ధాంతము ఋగ్వేదమునఁగల వాయుభావము నుండి యిందు మొదటఁ బెంపొందింపఁబడినది. ఋగ్వేదమున దేవతల లో స్త్రీలు పురుషులునున్నను, ఋషులకెక్కుడు ప్రాధాన్య మీయఁబడినది,అథర్వమున స్త్రీదేవతలెక్కువ పూజింపఁబడిరి. అందుచే, తాంత్రిక శాస్త్రములలోఁ గామినీపూజ పునాది యగుటలో నాశ్చర్యములేదు. గోవు పవిత్రత నంగీకరించి,అథర్వ వేదము బ్రహ్మలోకమును పేర్కొనినది.౪. ఘోరయాత నానిలయమైన నరకలోకము పేర్కొనఁబడినది.౫. అథర్వ వేదమందలి తాంత్రికభాగమందైనను నార్యుల ప్రభా వము గోచరించును. తంత్రవిద్య నంగీకరింపక తప్పనిసరియైన చో దానిని సంస్కరింపవలెను. శుద్ధతంత్రము మంచిదే, అప రిష్కృతమైన తంత్రము త్యాజ్యము. కుటుంబగ్రామ జీవితము లలోఁ గొన్ని మంత్రములవలన సామరస్యమేర్పడినది. ఆర్య సంస్కారములేని దేశభాగములలో నింకను జరుగుచున్నరక్త పాతముతోఁ గూడిన యజ్ఞములు ఖండింపఁబడెను. అథర్వవేద మునకుఁ బూర్వనామమైన అథర్వాంగిరసః॥ శబ్దములో నథర్వ మొకభాగము ఆంగిరస మొకభాగమువలెఁదోఁచును. మొదటిది సత్కర్మకలాపమునందుపశాంతిక్రియల కుపయోగింపఁబడినది. రెండవదానిలోనే తాంత్రికాచారములున్నవి! మొదటిది వైద్యము రెండవదితంత్రము; రెండును కలిసిపోయినవి.

అనేక భావసామరస్యమైన యథర్వవేదము వేదముగా గుర్తింపఁబడుటకుఁ గొంతశ్రమయైనది. క్షుద్రతంత్రప్రసిద్ధమైన

(౪) ౧౨. ౪. ౩౬. (౫) భేషజాని. అథర్వవేదము. ౯. ౬. ౧౪.

దగుటచే నదినీచముగాఁ జూడఁబడినది.౧ భరతవర్షమునందు నిరాశాదృష్టి కిది కారణమైనది. మనము దయ్యములను నమ్మి సంతోషముగా నుండఁజాలము. సమీపమునఁ బిశాచముల జూచి భయకంపితులము గాకుండ నుండఁజాలము. కాని యథర్వవేదము దేశములోని భౌతికశాస్త్రాభివృద్ధికిఁ దోడ్పడినదని చెప్పక తప్పదు.

### ౩. యజుర్వేదము—బ్రాహ్మణములు.

విజ్ఞానచరిత్రమం దుపజ్ఞావిమర్శకములొకదాని నొకటి యంటి వచ్చుచుండును. పూర్ణకాంతి మయవిశ్వాసదశలు గలిగి వెనువెంటనే నిస్సారకృత్రిమ భావదశ లుత్పన్నములగును. మనము ఋగ్వేదమునుండి సామయజుర్వేద బ్రాహ్మణములకు బోవునప్పటికి వాతావరణమంతయు మాఱిపోయినది. నిత్యనూత్నతా ప్రసన్నతాలక్షణములనుండి నిరుత్సాహపూరిత కాల్పనికదశకుఁబోవుదుము. మతముయొక్క మూలతత్త్వము వెనుకనుండఁగాఁ రూపములు బహుళములై తలలెత్తినవి. ప్రార్థనగ్రంథము లవసరములైనవి. సంకలన మభివృద్ధిపొందినది. ఋగ్వేదమునుండి మంత్రములను దీసి, యాగక్రియల కనువగురీతిగాఁ గూర్చిరి. పురోహితుఁడే ప్రభువయ్యెను. యజ్ఞవేదికాదికము లెట్లు నిర్మింపవలెనో మున్నగుసందర్భములలో నుచ్చరించుటకు వలయుఁ బ్రత్యేకసూత్రములు కల్పింపఁబడెను. యజ్ఞశాలలోఁ గీర్తించు

౧; పెక్కుపూర్వపురాణములలో వేదములు మూఁడని చెప్పఁబడెను. శా. వే. భా. ౧౦. ౯౦. ౯. గీ. ౭. ౧. తైత్తిరీయోపనిషత్తు ౨. ౨.—౩; బౌద్ధశాస్త్రగ్రంథము లథర్వవేదమును స్మరింపనేలేదు. తరువాత కొంతకాలమున కథర్వవేద మంగీకరింపఁబడినది

టకు సామ ముపయోగింపఁబడెను. ఈరెండు వేదములను బ్రాహ్మణములతోఁగలిపి చర్చింపవచ్చును; ఏలన నివన్నియు యాగసూత్రసంకలనములే. యజుర్వేదమతము నిశ్చలముగా యజ్ఞస్తోత్రముల పఠించుటే. పురోహితబృందముచేరి, యొకబ్రహ్మాండమైన కర్మకాండ నడపుదురు. అత్యల్పక్రియకుఁగూడ నత్యంతమధికమైన ప్రాముఖ్యమిచ్చి, బాహ్యక్రియలకన్నిటి కంతరార్థములు చెప్పుదురు. ఇట్టి యజ్ఞకర్మకలాప వాతావరణములో స్వచ్ఛమతభావాంకురము పెంపొందఁజాలదు. పరమలక్ష్యము నభినందించు నవకాశముకాని, తల్లోపజాతమగు పాపభీతికాని కలిగిన మతతత్త్వమున కిచటఁ దావులేదు. ప్రతిప్రార్థన మొకక్రియతో సంబంధించి, యొకలాభమును గలుగఁజేయునదై యుండును. అల్పజీవితప్రయోజనములకై, విసుగువిరామము లేకుండఁ దిరిగితిరిగి పఠించుసూత్రసముచ్చయమే యజుర్వేదము. ఋగ్వేదమంత్రములకాలమునకును, నితర వేదబ్రాహ్మణములకాలమునకునుగల యంతరమును నిశ్చయముగాఁ జెప్పఁజాలము: ఏలన, నితరవేదములందును బ్రాహ్మణములందును గోచరించుకర్మభావములు ఋగ్వేదముమంత్రములందును గలవు. ఋగ్వేద మంత్రజాలమంతయు, బ్రాహ్మణములకాలమునకుఁ బూర్వములైనవని స్పష్టముగాఁ జెప్పవచ్చును.

### ౪ — దైవతత్త్వము.

బ్రాహ్మణములనఁగా, క్లిష్టవివరములతోఁగూడిన క్రతుకలాపమందుఁ బురోహితుల యుపయోగమునకై ×××పఁబడినవి, వేదములకు ద్వితీయభాగములునైయున్నవి. అందు

ముఖ్యములైనవి ఐతరేయబ్రాహ్మణము, శతపథబ్రాహ్మణము విషయనిర్ణయములోఁగలిగిన స్వల్పభేదములచే బ్రాహ్మణములు వివిధశాఖలుగా నేర్పడినవి. భావిదశలో మతపరిణామమును శాశ్వతముగా మార్చుచేసిన ముఖ్యములగు పరివర్తనములతోఁ గూడిన శకమిది. క్రతుప్రాధాన్యము, వర్ణాశ్రమనిర్వహణము, వేదశాశ్వతప్రామాణ్యము, పురోహితనిరంకుశాధికారము నీ యుగమునకుఁ జెందినవి.

ఈబ్రాహ్మణయుగమున వేదదేవతాగణమునకుఁ జేర్పఁబడిన నవీనదేవతలఁ బేర్కొందము. విష్ణువు యజుర్వేదమునఁ బ్రముఖస్థానమును బొందెను. శతపథబ్రాహ్మణము ననుసరించి విష్ణువు యజ్ఞమూర్తి.౧ ఇందు నారాయణశబ్దము నుపయోగింపఁబడినది. కాని తైత్తిరీయారణ్యకమునం దీనారాయణ విష్ణునామములకు సంబంధముకలిగినది. శివశబ్దముకూడఁ బ్రత్యక్షమై కౌశీతకిబ్రాహ్మణమునందుఁ బెక్కునామాంతరములు గలిగియున్నది.౨. రుద్రుఁ డిప్పుడొకసాత్త్వికదైవమై, గిరిశుఁడని పేర్కొనఁబడెను.౩. ఋగ్వేదములోని ప్రజాపతి ప్రధానదేవతమై సృష్టికర్తగా భావింపఁబడెను. అతఁడే విశ్వకర్మయనిరి. ఏకేశ్వరత్వము బోధింపఁబడెను. అగ్ని ముఖ్యుఁడు. ప్రార్థన దేవతయగు బ్రహ్మణస్పతి, మంత్రనాయకుఁడై, యాగవ్యాపారమును నడపించెను. ఋగ్వేదమున 'బ్రహ్మ' శబ్దమున కర్థము మంత్రము లేక దేవునిస్తుతించుస్తోత్రము. వ్యక్తిగతమైన ప్రా

(౧) ౫-౨-౩-౬; ౫-౪-౧! ౧౨-౪-౧-౪; ౧౪-౧.౧ ౬:౧౫
(౨) ౬-౧-౯ (౩) చూడు తైత్తిరీయసంహిత ౪-౫.; వాజసనేయసంహిత ౯
(౪) శతపథబ్రాహ్మణము. అ. ౭-౨.౧.౧౦. ౭-౨.౩.౧౩.

ర్థించుట క్రియను భావమునుండి, ప్రార్థింపఁబడిన ఫలితమని దీనియర్థము మారినది. ప్రార్థనకారణమునుండి యజ్ఞశక్తియై సర్వప్రపంచమును యజ్ఞోద్భవమని బ్రాహ్మణములు చెప్పుచున్నవిగాన బ్రహ్మశబ్దమునకుఁ దుదకు సృష్టిశక్తియని యర్థము వచ్చినది.౧

బ్రాహ్మణములందలి మతము కేవలనామమాత్రము, వేదమంత్రముల యొక్క కవితావేశము, నిండుహృదయము నిచటఁగానరావు, మంత్రముల నుచ్చరించుటలో,పవిత్రసూత్ర పఠనమే ప్రార్థనమయ్యెను. దేవునికి వినఁబడుట కుచ్చైస్స్వర యుక్త ప్రార్థనము లవసరములని తలపఁబడెను.శబ్దములు రహస్య శక్తులతోఁగూడిన కృత్రిమ ధ్వనులయ్యెను ఈరహస్యము భూదేవత అనుపించుకొనుచున్న పురోహితునికే గాని మఱెవ్వరికిని దెలియదు.యజ్ఞములుచేసి తమస్థానములు దేవతలు పొందిరనియు, నట్టిదేవతలగుటే పరమలక్ష్య మనియుఁ దలఁచిరి. ౨. సర్వప్రాణికోటియు యజ్ఞప్రభావ బద్ధమై యున్నది. యజ్ఞముచే సూర్యుఁ డుదయించు చున్నాడు. నూఱశ్వమేధయాగములు చేసి యింద్రుని పదభ్రష్టునిఁ జేయవచ్చును. యజ్ఞములు దేవతల సంతోషపెట్టి, మానవులకుపకారమొనర్చును. యజ్ఞముల వలననే దేవతలు మానవబంధువులగుచున్నారు. సామాన్యముగా నీయజ్ఞము లిహలోక ప్రయోజనములకొఱకే గాని, స్వర్గ

౧. బ్రహ్మశబ్దమీయర్థములో నుపయోగించిన శ్లోకములు చాలఁగలవు.
,, నిజముగా నీప్రపంచము మొదట బ్రహ్మయే;అది దేవతలను సృజించెను.
శతపథ బ్రాహ్మణము .౧౧-౨.౩.౧;౧౦.౬.౩; ఛాందోగ్యోపనిషత్తు ౮.౩.౧౪.౧.

సుఖముకొఱకుఁగూడఁ జేయఁబడలేదు. కఠోరనియమబద్ధమై యిచ్చి పుచ్చుకొను క్రియ విక్రియ వ్యాపారలక్షణములు గలిగిన క్రతుతత్త్వము, స్వచ్ఛనిరాడంబర వేదమతస్థానము నాక్రమించినది. వేదమంత్రములలోని యజ్ఞభాగములు స్వచ్ఛ మతమును సూచించు ప్రార్థనములకు సహాయకారిగాఁ జేర్పఁ బడెనేకాని, యవి బ్రాహ్మణములలోఁగేంద్రస్థానము నాక్రమించి నవి. యజ్ఞములో నుచ్చరింపఁబడిన ప్రతి యక్షరముఁ, జేయఁ బడిన ప్రత్యల్పక్రియయు ముఖ్యములే, బ్రాహ్మణములందలి మతము, గుప్తార్థములతోనిండి, యాత్మశక్తిని స్తంభింపఁజేయు వ్యర్థ కర్మకలాపమై పోయినది.

యజ్ఞమహాత్త్వము ప్రజలలో వ్యాపింపఁగనే, పురోహి తబృందమునకు గౌరవ మతిశయించినది. వేద మంత్రద్రష్టయు, సత్యగాయకుఁడునైన ఋషి, యిప్పుడు దేవునిచే నావిష్కృతమైన పవిత్రగంథాధికారియు, విచిత్ర మంత్ర సూత్రసముచ్చయ పారాయణపరుఁడుగాను మాఱెను. వృత్తుల ననుసరించి చేసిన వర్ణవిభావము నేఁడు పరంపరాగతమైన ధర్మమైనది. అనేక క్లిష్ట క్రియలతోఁగూడిన యజ్ఞకాండసన్యముగా నడుపుటకుఁ, బురో హితులకుఁబ్రత్యేక శిక్షణాభ్యాస మవసరమైనది. కుటుంబ పురో హితుఁడొక్కఁడు నిట్టివిపుల కర్మలను నడిపింపలేక పోయెను. పౌరోహిత్యము సంప్రదాయసిద్ధము సుప్రసిద్ధ వృత్తియునైనది. వేదవిద్యాశ్రోతము లెఱిఁగిన పురోహితులు, మనుష్యులకును దేవతలకును మధ్యవర్తులై, దైవకటాక్ష ప్రసాదములను బంచి యిచ్చునధికారులైరి. యజ్ఞముచేయు 'యజమాని' కేమియు

నధికారము లేకుండఁబోయినది. యజ్ఞకర్తయైన యజమాని ఉదాసీనుఁడై, వలసిన జనమును, ధనమును, సామగ్రిని తెచ్చి యిచ్చుచుండ వలసినదే, మిగిలిన దంతయుఁ బురోహితుఁడు చేయును. స్వార్థపరత్వము, అధికారగౌరవ భోగకాంక్షలతో మిళితమై ముందుకుఁబోయినది; ఆదిలక్ష్య మడుగంటినది. యజ్ఞములందుఁ జేయు హోమముల ప్రభావ మతిశయోక్తులతోఁ బ్రచురింపఁబడెను. సర్వమతకర్మకలాపమునకు యాజమాన్యమును పురోహితుల హస్తగతమయ్యెను. వ్యర్థములగు కర్మకలాపములను బెంచి, తన్మూలమునఁ దమస్థానమును వారు బలపఱచుకొనిరి. భావాచ్ఛాదనమునకే పుట్టినదనునట్లువారు భాషను వ్యంగ్యార్థములతో నుపయోగింపఁజొచ్చిరి. పురోహితులకు నూత్రమే దానియర్థము విదితము. పురోహితుఁడీక భూలోకమున నడచుచున్న దేవతాతుల్యుఁడని గౌరవించు మహోన్నతస్థానము నాక్రమించుటలో నాశ్చర్యములేదు. "నిజముగా రెండురకముల దేవతలున్నారు: స్వర్గమందున్న దేవతలు తప్పక దేవతలే, వేదములను జదివిబోధించు పురోహితులు మానవ రూపమున నున్న దేవతలే." ౧,

తమ్మనియమించిన యజమాని నవసరము కలిగినచో మంత్రశక్తిచేఁ జంపఁగలమనియుఁగాని యట్టిమానవహత్యా శాస్త్రనిషిద్ధమనియుఁ జెప్పిన పురోహితులు కొందఱుకలరు. ౨

౧. శతపథబ్రాహ్మణము అ౩-౧-౪.౩; ఐతరేయబ్రాహ్మణము. అ౨-౧.౧.

౨. వాజసనేయసంహిత.౩-౫౦. "నీవు నా కిమ్ము; నేను నీకిచ్చెదను" అనువాక్యముతో హోమము చేయును. చూడు. శతపథబ్రాహ్మణము; అ౨-౫.౩,౧౯.

పురోహితులకు గౌరవప్రాముఖ్యములు పెంపొందుట కింకొక కారణ మేమనఁగా,నార్యులు తాము సంపాదించి తెచ్చిన వేద ములను వారు కాపాడుచున్నారనియు, వేదసంరక్షణమే పరమ పావనకర్తవ్యమనియుఁ బ్రజలు నమ్మిరి. వేదసంరక్షకులుగా బ్రాహ్మణులు నియమింపఁబడిరి. వేదములు క్షేమముగా నుండ వలెనన్నచో బ్రాహ్మణుల వృత్తిని పోషింపవలెను. అందుచే బ్రాహ్మణుఁడే తనజీవితమునకుఁ గఠిననియమములు నిర్మించు కొనెను. "వేదాభ్యాసరతుఁడు కాని బ్రాహ్మణుఁడగ్నిలోఁబడిన యెండుగడ్డిపోచవలె క్షణములో నశించును."3 బ్రాహ్మణుఁడు ప్రజాగౌరవమును విషమువలె విసర్జింపవలెను. విద్యార్థిద శలో బ్రహ్మచారియై, శమదమాదులుగలిగి, గురుశుశ్రూష చేసి, భిక్షాచరణముచే జీవింపవలెను. గృహస్థుఁడై, ధనాశవిడిచి సత్యమును బలుకుచు, దేహమనశ్శుద్ధికలిగి, పవిత్రజీవితమును గడపవలెను. తమపై నుంచఁబడిన వేదవిజ్ఞానసంపద్భారమును రక్షించుటలో సర్వసమర్పణము చేయవలెనని బ్రాహ్మణులు సంకల్పించిరి. చరిత్రలోఁ దటస్థించిన వివిధప్రమాదములఁబడి నశింపకుండ, వేదసంప్రదాయములను వారెట్లద్భుతముగా నిలఁ బెట్టి రక్షించిరో చెప్పనవసరములేదు. నేఁటికిని భరతవర్షపట్టణ వీధులలో సంచరించుచుండు వేదవిద్యామూర్తు లిప్పటికిని గోచ రింతురు. అధునాతన కఠోరనియమములకుఁ జరిత్రలోని కొన్ని

౧. శతపథబ్రాహ్మణము అ.౨-౨.౨.౬; అ.౨-౪,3.౧౪

౨. తైత్తిరీయసంహిత అ.౧-౬.౧౦.౪; ఐతరేయబ్రాహ్మణము అ౨-౨౧౫-౨

3. మనువు.

ప్రమాదపరిస్థితులు కారణములై యుండవచ్చును. బ్రాహ్మణముల కాలమున ద్విజులైన ఆర్యులలో భేదము విశేషమున్నట్లు తోచదు. అందఱకు వేదవిద్యాధికారమున్నది. ౧"యజ్ఞమొక నౌకవలె స్వర్గమువైపు పయనించుచున్నది. పాపియగు పురోహితుఁ డొక్కఁడుండున్నచోఁ బడవ మునిఁగిపోఁగలదు, "౨. కావున నీతినియమము లనవసరమని విడువఁబడలేదు. బ్రాహ్మణపురోహితులు మూర్ఖులును గారు, క్రూరులును గారు. ధర్మకర్తవ్యభావములు వారికినిగలవు; వానిని వ్యాపింపఁజేయుటకు వారు ప్రయత్నించిరి. వారు ఋజుమార్గవర్తులై, నియమధీరులై, కర్తవ్యకర్మనిష్ఠాగరిష్ఠులై, తమశక్తి కొలఁది తమమతమును బ్రాహ్మణులు సంరక్షించుకొనిరి. వేదసంరక్షణము తమకులధర్మమని గుర్తించి, యాకర్తవ్యమును మహోత్సాహపూరిత శ్రద్ధాభక్తులతో నిర్వహించిరి. వారు జ్ఞానము, మానవజాతి యనిన నఖండప్రేమ గౌరవములను సూచించు విపులధర్మశాస్త్రసూత్రముల నిర్మించిరి. వారెచటనైనఁ బొరపడినచోఁ, నా దోషము వారిని బంధించిన సంప్రదాయములోనిదే కాని వారిదికాదు. వారెట్టిభ్రాంతివశులైనను వారి ఋజుత్వ మనింద్యము. వారి నియమాచార సంప్రదాయమహత్త్వమునందు వారికి లేశ

౧. మనువుచెప్పెను; "వేదముచదువని ద్విజుఁడు, బ్రాహ్మణుఁడు కాని క్షత్రియుఁడుకాని, వైశ్యుఁడుకాని, బ్రతికియుండఁగనే శూద్రత్వమును బొందును." మహాభారతమున నిట్లున్నది. "గృహస్థధర్మమన్ని వర్ణములకును; ద్విజాతులకు మాత్రమే వానప్రస్థమును నిర్ణయింపఁబడెను."

౨. శతపథబ్రాహ్మణము. ౮.౪-౨.౫.౧౦

మాత్రము సందేహములేదు. కాలపరిస్థితి వారి యాలోచన మును గుంటువడఁజేసెను; అయినను, తమసంస్కృతినాగరికతల యందు వారికిఁగల యభిమానగర్వము లసంగతములని యెవ్వఁడనఁగలఁడు? మఱియు వారిచుట్టునుండుజాతులు విజ్ఞానశూన్యజాతులు; వారిని నాశమొనర్పవలెనని దేశదేశాంతరములైన వేలకొలఁది శక్తులు వారినుద్రేకపఱిచి, స్వీయసంస్కృతిసంరక్షణమున కత్యంత తీవ్రతను గలుగఁజేసినవి.

పౌరోహిత్యము వృత్తియైనపుడు సహజముగా దోషపూరితము. కాని భారతవర్షములోని బ్రాహ్మణుఁడు, దేశాంతరములలోని పురోహిత వృత్తినాశ్రయించిన యేయితరవ్యక్తికిని గర్వాహంకారములలో నధికుఁడుగాఁడు. ఆకాలమునందైనను, క్షీణదశ నెదుర్కొను నిశితవిమర్శనములను దివ్యదృష్టి, నిర్దుష్టనిశ్చల చిత్తమును గలిగిన బ్రాహ్మణులు కొందఱు ప్రకటించియేయున్నారు. స్వార్థపరుఁడైన పురోహితుని డంభకుత్రిమములకుఁ దీవ్రవిముఖత్వముఁ జూపి, మహనీయాదర్శపతనమును జూచి ఖిన్నులైనవారును గలరు. పురోహితుల గుణదోషవిమర్శనమందు, గృహస్థులు చేయవలయు కర్తవ్యములనే బ్రాహ్మణులు దృష్టియందుంచుకొనిరను సంగతిని మఱవరాదు. వానప్రస్థసన్న్యాసాశ్రమ వాసులకుఁ గర్మలులేవు. బాధాకరము కూ్రరము నైనచో బ్రాహ్మణ ప్రభుత్వమప్పుడే పోయియుండెడిది. జాతియందున్న వివిధవర్ణములవారు స్వధర్మముల నిర్వహింపవలెనని చెప్పిన బ్రాహ్మణబోధనము బుద్ధిమంతులైనవారందఱకు నచ్చినది.

కొంతకాలమునకుఁ దత్త్వశాస్త్రమున వేదములయొక్క "శబ్దప్రమాణ" చర్చలు బయలుదేఱినవి. శబ్దప్రమాణము నంగీకరించినవి వైదికమతములనియు,నంగీకరింపనివి అవైదికము'లనియు విభాగమేర్పడినది. వేదమునకుఁ గర్త పరమేశ్వరుఁడే యని విశ్వసింపఁబడెను. వేదము దైవనిర్మితమను సిద్ధాంతమును సమర్థించుటకై, విచిత్రవాద ప్రదర్శనమొనర్చిన కొందఱు విద్వాంసులు తరువాత బయలుదేఱినను, వేదద్రష్టల భావములో వేదమనఁగాఁ బావనహృదయములో స్ఫురించిన పరమసత్యమనియే. "పవిత్రహృదయులు ధన్యులు;ఏలన వారి కీశ్వరసాక్షాత్కారము తప్పక లభించును'వేదములలో ఋషి తాను వేదములను రచించినట్లుకాక, వేదమంత్రద్రష్ట[1].నని చెప్పుకొనును. అనఁగా నాతఁడీదృష్టితోఁగాక జ్ఞాననేత్రముతోఁ జూచెననియర్థము.ఋషి చూపునకింద్రియముల కతీతమైన సత్యము గోచరించుటకుఁ గారణమాతనిహృదయము రాగద్వేష కలుషాంధీకృతముకాదు. దానూహించినదికాదు. తాను చూచిన సత్యము నాతఁడితరులకందఁ జేయుపని మాత్రమే చేసెను.[2] వేదమనఁగా 'శ్రుతి' లేక యంతరాత్మకు వినఁబడు పరబ్రహ్మనాదము."దృష్టి"శ్రుతిశబ్దముల వలన వేదములలోని జ్ఞానము తార్కిక వివేకముచే లభించినది గాదనియు, నంతర్దృష్టిచే లభించినదనియుఁ దెలియఁగలము. కవి

---

౧. వేదశబ్దము 'విద్' ధాతువునుండి వచ్చినది. 'విద్' అనగాఁ జూచుట. లాటిన్ ధాతువు 'విడియొ' గ్రీక్కుధాతువు ఐడప్.

౨. బీథోవిన్ చెప్పినాఁడు; "సర్వకళాసృష్టియును దేవునినుండివచ్చినదే. మానవుని యాంతర్యమందున్న దైవశక్తి క్రియారూపమున నెంతవఱకుఁబరిదర్శితమగునో యంతవఱకును మానవునికి సంబంధించును.

మానస మింద్రియాతీత పదవికిఁ బోయినపుడు పరమసత్యమాత్ర నికి వినఁబడుటో, కనఁబడుటో జరుగును. వేదద్రష్టల ననుస రించి, వేదము దైవనిర్మితమనఁగా నీయర్థమని తలపఁనగును. అదియొక విచిత్రమైన యద్భుత సంఘటనమని వారిభావమై యుండదు. మంత్రములను తామే సల్పించితిమని కూడఁజెప్పి యుండిరి. వారు తమ వేదకావ్యనిర్మాణ కార్యమును, వడంగి, నేఁత నేయువాఁడు పడవనడుపువాఁడు మున్నగు వారితోఁబోల్చి, సహజ కారణముఁ దెల్పిరి. మానవ హృదయావేశములచే నీమం త్రములు రూపము దాల్చినవని చెప్పఁబడెను.౧ కొన్ని తావులలో మంత్రములు తమకు గోచరించినవనిరి.౨మఱియు సోమరసపాన పరవశస్థితిలోనవి తెలిసినవనికూడఁ దెల్పిరి.౩ తమభక్తిని వెలిఁ బుచ్చుటకే వేదములను భగవత్ప్రసాదమనిరి.౪ కేవలావేశము నిరపాయమైన దైవవ్యక్తీకరణమను భావముగానింకను స్థిరపడ లేదు.

మనము బ్రాహ్మణములయొద్దకు వచ్చునప్పటికి వేదములు దైవకల్పితములనునది సత్యమని నమ్మెయుగము ప్రత్యక్షమగు ను.౫ వేదము దైవకార్యమనియు, నందుచే శాశ్వతప్రమాణమ నియు నీయుగమున స్థిరపడినది. ఈవిశ్వాసమునకుఁ గార ణము సులభగ్రాహ్యము. వ్రాఁతయప్పటి కాచరణలో లేదు, ముద్రాయంత్రములుకాని, ముద్రించు వారుకాని లేరు, వేదమం

౧. చూడు. మూయిర్. సేంస్క్రిట్ టెక్స్ట్సు వాల్యుము 3.
౨. రా.వే.భా. ౧.౧౧౭.౨; ౨ 3౫.౨. (3)౧౦.౬౭.౧౧. (౪) ౬.౪౭.3.
(౫) ౧.3౭.౪; 3.౧౮.3.

త్రిమునోటినుండినోటికి గురుపరంపరాగతమైనది. దానికి గౌరవము చేకూర్చుటకై, వేదములకుఁ గొంతపావనత్వమారోపింపఁబడినది. ఋగ్వేదమునందు 'వాక్కు' విద్యాదేవతయైన సరస్వతీముఖమునుండి వేదములుద్భవించినవని యిప్పుడుచెప్పిరి. కావున వాగ్దేవి దేవత.౬ అథర్వవేదము మంత్రమున కమోఘశక్తికలదని చెప్పినది."

"వేదములు పరంజ్యోతియొక్క నిశ్వాసములవలె వచ్చినవి"౧ భగవంతుఁడు వేదములనుసృజించి, తపస్సిద్ధులైనఋషులకిచ్చెనని చెప్పుదురు.ఉచ్చరించినశబ్దము శాశ్వతమైనదనినమ్మిరి. వేదములఁగూర్చిన ఇట్టిభావమువలన ఫలితము తత్త్వశాస్త్రము సంప్రదాయసిద్ధమైనది. ఉచ్చరించినశబ్దము సజీవమైనది, సత్యమైనది. దానినొక స్థిరమైన సూత్రమునబంధించుటచే రసహీనమగును. మిక్కిలిప్రాచీనదశయందు స్థిరపడిన వేదప్రామాణ్యమనంతరతత్త్వపరిణామమునంతనుమార్పుచేసినది. అనంతరయుగమున వేదమంత్రముల కర్థవివరణము చేయవలసివచ్చినప్పుడది వఱకే నిశ్చితములైన భావములను ప్రమాణములుగా స్వీకరించిరి. సంప్రదాయము పవిత్రమైనదనియు, నిత్యసత్యమనియు నమ్మినప్పుడందలి ప్రతిభావమును పరమసత్యమునే చెప్పునని తలఁచుట వింతగాదు. దీనివలననేపరస్పరవిరుద్ధసిద్ధాంతములు తత్త్వములు నొకేమంత్రమునుండితీయఁబడినవి.ఒకతత్త్వమునునమ్ముట

(౬) ఐతరేయబ్రాహ్మణము. ౭. ౯.

౭. వేదానామ్నసూతా. తైత్తిరీయబ్రాహ్మణము ౩అ-౮.౮ ౫.

పోల్చు: సెయింటు జాన్సుగాస్పెల్ "మొట్టమొదట శబ్దమున్నది.

౧. శతపథబ్రాహ్మణము ౧౧ అ-౫.౮౧. చూడు పురుషసూక్తము.

భిన్నభావములుకలిగియుండుటయు నేకకాలమునందే సాధ్యము కావలయునన్నచో, భావపరిశీలనాస్వాతంత్ర్యముండవలెను. ఈ విషయమున భారతీయతత్త్వజ్ఞులు గొప్పప్రజ్ఞనుజూపిరి. సంప్రదాయము, దానియెడగౌరవమునున్నప్పటికి, భారతీయవైజ్ఞానిక సమాలోచనము చిరకాలమపూర్వస్వతంత్రతనుజూపు టాశ్చర్యకరమైనవిషయము, భారతీయతత్త్వవేత్తలుమొదట నొకస్వయం సంపూర్ణమగునొకతత్త్వసిద్ధాంతమునునిర్ణయించి, దానిని సమర్థించుటకొఱకు బ్రాచీనమూలగ్రంథముల వెదకుదురు. అట్టిమూలగ్రంథములనుండి తమసిద్ధాంతములకనుకూలార్థములు తీయుటో. లేక వానికర్థాంతరములు కల్పించుటో జరుగును. ఈ వైదికసంప్రదాయమువలన నొకమంచిఫలితము కలిగినది. ఇది తత్త్వశాస్త్రము సజీవమై, సత్యమైయుండునట్లుచేసినది. జీవితమునకు సంబంధములేని తత్త్వములనురచించి, నిరాధారభావములను బుచ్చుకొని శుష్కమీమాంసలుచేసి తృప్తిపడుటకుబదులు భారతీయతత్త్వజ్ఞులు, పరమసత్యమును తపోయోగధ్యానసమాధ్యవస్థలలో దర్శించి, ప్రకటించిన రూపములైన వేదములను శాశ్వతాధారములుగాఁజేసికొని తమవాదములను సాగించిరి. జీవితకేంద్రసత్యములు వారియంతరంగదృష్టినుండి మఱుఁగుపడుటకు వీలులేకపోయినది. కావున నేతత్త్వమును సత్యమునుగోరినచో భారతీయతత్త్వము నుపేక్షింపఁజాలదు.

## ౫—సృష్టిసిద్ధాంతములు.

సృష్టిసిద్ధాంతములవిషయములో ఋగ్వేదమిచ్చిన భావముల ననుసరించిరి కాని, కొన్నివిచిత్రకల్పనములుకూడనున్నవి.

ఋగ్వేదమువలెనే, తైత్తిరీయ బ్రాహ్మణము, "పూర్వమేమియు నుండి యుండలేదు. భూమియులేదు, ఆకాశమునులేదు; అంత రాళమునులే" దని చెప్పినది. జీవితమునకు బీజము కోరిక. ప్రజాపతి, సంతానమునుగోరి, సృష్టించెను. "మొట్టమొదట ప్రజాపతి యొక్కఁడేయుండెను. ఆతఁడు తా ననేక మెట్లగుదు నని తన లో నాలోచించెను. ఆతఁడు శ్రమపడి తపస్సుచేసెను. జీవరాసుల నన్నిటిని సృజించెను."౧

౬—నీతితత్త్వము.

బ్రాహ్మణముల మతమునుగూర్చి న్యాయముగాఁజెప్ప వలయునన్నచో నందుమహోన్నతభావములు, నత్యంతవిమల నీతి తత్త్వములు నున్నవి. మానవకర్తవ్యమునుగూర్చిన భావముల ప్రారంభమిందున్నది. మానవుఁడు దేవతలకు, మనుష్యులకు జంతువులకు ఋణపడియున్నాఁడు. ఇవి పంచఋణములు. (౧) దేవఋణము (౨) ఋషిఋణము (౩) పితృఋణము (౪) మనుష్యఋణము (౫) పశుఋణము. ఈపంచఋణములను సవ్యముగా నిర్వర్తించునాతఁడు సత్పురుషుఁడు. దేవఋషి మనుష్యపశువులకుఁ గొంతబలిహారమిచ్చి, ప్రార్థనములర్పింపనిదే, ఎవనికిని భుజించుట కధికారములేదు. తనచుట్టునున్న ప్రపంచములో సామరస్యమున జీవించుపద్ధతియిది. జీవితమొక కర్తవ్యబాధ్యతానిర్వహణవృత్త్యము వివరములెట్లున్నను నీభావము పూజ్యమైనదని చెప్పకతప్పదు. మనముచేయు సత్కార్యములను స్వార్థచింతలేకుండఁ జేయవచ్చును. శతపథబ్రాహ్మణము నందు మోక్షప్రాప్తికి సర్వమును త్యాగముచేయు"సర్వమేధ"

౧, అ౧౩—౮-౧,౧.

మును యజ్ఞము చెప్పఁబడినది.[౧] దైవారాధనము ప్రథమకర్తవ్యమే. నియమితకర్మలను కేవలము యంత్రమువలె నెఱవేర్చుటయే ప్రార్థనముకాదు. సత్కర్మానుష్ఠానము, స్తుతి యిందుఁజేరును. దైవమునర్చించుటయనఁగా, దేవునిగుణముల నలవఱుచుకొనుట. నిజముపలుకుట దైవలక్షణమేకాక, మతనీతి ధర్మము. అగ్ని దీక్షాదైవము; వాక్పతి వాగ్దైవము. అసత్యమాడినయెడల నుభయదేవతలు కోపింతురు.[౨] యజ్ఞములఅంతరార్థమునుజెప్ప ప్రయత్నమారంభమైనది. "కేవలకర్మాచరణము వ్యర్థమనిచెప్పు వాక్యములుగలవు, "కేవల యజ్ఞదానోపవాసాదికములవలన మానవుఁడు పుణ్యలోకమును బొందఁజాలఁడు. దీనినెఱుఁగని వానికాపదవి లభింపదు,"[౩] వ్యభిచారము వరుణదేవుని కపచారముచేసిన పాపమని నిరసింపఁబడెను. చేసినదోషకృత్యముల పాపము పశ్చాత్తాపముచే క్షీణించునని చెప్పఁబడెను.[౪] వైరాగ్యమొక గొప్పలక్షణమని స్తుతింపఁబడెను. ఏలన దేవతలు వైరాగ్యము నభ్యసించి తమపదవులను బొందిరి.[౫]

ఆశ్రమధర్మమే యుగములో స్థాపింపఁబడెను.[౬] వైది-

---

౨. "దేవతలకొక్కటేనియమమున్నది-సత్యముపలుకుటే" శతపథబ్రాహ్మణము ౧అ-౧.౧.౪;౧.అ.౧౧.౫; ౩అ.౩.౨.౨;౩ అ. ౪. ౨,౮; ౨అ-౨.౨.౧౯

౩. శతపథబ్రాహ్మణము. ౧౦అ ౫.౪.౧౫.

౪. శతపథబ్రాహ్మణము ౨అ. ౫-౨-౨౦.

౫. తైత్తిరీయ బ్రాహ్మణము ౩అ-౧౨-౩

౬. ఆశ్రమశబ్దము 'శ్రమ'పడుట యనుధాతువునుండి తీయబడుటచేనే కృషి ఫలవంతము కావలెనన్నను శ్రమతప్పదని భారతీయులు తెలిసికొనిరి.

కార్యుని జీవితము నాలు గాశ్రమములుగా విభాగింపఁబడెను. (౧)బ్రహ్మచారియై ఒకటికాని యెక్కువకాని వేదములను జదువుట (౨) ధర్మశాస్త్రములలో నిర్వచింపఁడిన విధులనఁగా, యజ్ఞవిధి, సంఘవిధి నెఱవేర్పునిమిత్తము గృహస్థాశ్రమము. (3) తపోపవాసములతోఁ గడపువాన ప్రస్థాశ్రమము (౪)గృహ సంబంధములేని సన్న్యాసాశ్రమము,తన దనున దేమియును లేక, బ్రహ్మైక్యచింతతోఁ జరించునాతఁడే సన్న్యాసి. వేదములలోని చతుర్విభాగములు ననఁగా మంత్రములు బ్రాహ్మణములు,ఆరణ్యకములు, ఉపనిషత్తులు వరుసగా నాలుగాశ్రమముల ధర్మములను దెల్పును. ౧. యాగకర్మకలాపము వెనుక పటుతర తత్త్వజిజ్ఞాస, నైతికపరివర్తనాభిలాషయునుండి,మానవహృదయమునకు సంతృప్తినిచ్చినవి. ఎన్నిలోపములున్నను, ధర్మపరాయణత్వము బ్రాహ్మణముల మతమును చిరంజీవిగాఁ జేసినది. బాహ్యశుద్ధిశౌచములతోఁ బాటంతశ్శుద్ధిశౌచముల ప్రాధాన్యమును గుర్తింపఁబడెను. సత్యవచనము, దైవారాధనము, తల్లి దండ్రులయెడ గౌరవము, భూతదయ, మానవులయెడఁ బ్రేమ. జారత్వము, చౌర్యము, క్రూరత్వములకు విముఖత, సత్పురుష జీవితలక్షణములుగా నిర్దేశింపఁబడినవి.

వర్ణవ్యవస్థ, నిర్దయాత్మకమైన పురోహితబృంద కల్పనము కాదు; తత్కాలదశాపరిణామమే. బ్రాహ్మణములకాలమున నది సుస్థాపితమైనది. పురుషసూక్తము ఋగ్వేదములో నొక

౧. ఆశ్రమములఁగూర్చి భిన్నభావములున్నవి చూడు. బృహదారణ్యకోపనిషత్తు 3అ. ౫.౧; ఆపస్తంబ ములు ౨అ.౯.౨౧.౧; గౌతమసూత్రములు 3అ.౨

భాగమైనను నిజముగా నది బ్రాహ్మణములకాలమునకుఁ జెందును. నాఁడు, ఆర్యులకును దస్యులకు సంతర్వివాహము లున్నవని నిస్సంశయముగాఁ దెలియుచున్నది. ౧. రక్తసాంకర్యము మిళితముగా కుండనుండుటకై, ఆర్యుల జాత్యౌన్నత్యమును గొనియాడసాగిరి. మొట్టమొదట సాంఘికవ్యవస్థగానుండిన వర్ణవ్యవస్థ, మతవ్యవస్థగా స్థిరపడినది. వర్ణవిభాగము దైవకృతమని యాధారములు చూపి, యందుచే నది మార్చుటకు వీలులేనిదని సిద్ధాంతముచేసిరి. కొంతస్వేచ్ఛనిచ్చి నిర్మించిన మొట్టమొదట వర్గీకరణము, కఠినవర్ణవిభాగమయ్యెను. వైదికయుగ ప్రథమదశలోఁ బురోహితులు తమవృత్తిచే నొక ప్రత్యేకవర్గముగా నుండిరి. కాని ప్రత్యేకవర్ణము కాలేదు. ఆర్యుఁడైనవాఁడెవఁడైనను బురోహితుఁడు కావచ్చును. అట్టి పురోహితుఁడు, యుద్ధముచేయు క్షత్రియునికంటెను, వర్తకముచేయు వైశ్యునికంటెను నధికుఁడు గాఁడు. కొన్ని వేళల వారికంటెఁ బురోహితుఁడే తేలికగాఁ జూడఁబడెను. ౨. కాని యిప్పుడాత్మౌన్నత్య గర్వము వర్ణతత్త్వమునకు మూలాధారమైనది. దీనివలన స్వతంత్రాలోచనము సన్నగిల్లినది. ఉన్నతనైతికాదర్శము సడలినది. వర్ణధర్మము నతిక్రమించినవ్యక్తి ధర్మద్రోహియుఁ గుల భ్రష్టుఁడు నయ్యెను. శూద్రుల కుత్తమ మతానుష్ఠానావకాశము లేకపోయినది.

---

బోధాయన సూత్రములు ౨అ.౬.౧౧.౧౨; మనువు ౫అ. ౧౩౭; ౬అ.౮౭. వశిష్ఠ ధర్మశాస్త్రము. ౭అ. ౨.

౧. అథర్వవేదము. ౫అ. ౧౭.౮.౨. శా.వే.భా. ౭అ. ౧౦౩.౧.౭ ౮.౧౦ అ. ౮౮౧౯.

అన్యోన్య ద్వేషభావ మంకురించినది." ఇట్టిమాటలు క్షత్రియుని వికాని, బ్రాహ్మణునివికా"వని శత్రునిందాభ్యాసము పెంపొం దెను. 3.

### ౭.—పునర్జన్మతత్త్వము

మరణానంతర విషయమునుగూర్చి బ్రాహ్మణములలో నొకనిశ్చయభావము లేదు. పితృయాన దేవయానములకుఁ గల భేదము చెప్పఁబడినది. ౧.భూలోకమునఁ దిరిగి పుట్టు టదృష్టమే కాని గర్హింపఁదగిన దోషముకాదని తలంపఁబడెను.దివ్యజ్ఞానలాభమేదో కలుగవలసియుండి యిహలోకమునఁ బునర్జన్మము లభించునని భావింపఁబడెను. ౨. కాని యన్నిటికంటె ముఖ్య స్థానమాక్రమించిసభావము, దేవతానిలయమైన స్వర్గమున శాశ్వతసుఖజీవిత ప్రాప్తియే, "ఈవిధముగా యజ్ఞము చేసిన వానికి, నిత్యసంపద, కీర్తియు లభించుటేకాక,ఆదిత్యాగ్ని దేవతలతో సారూప్యము, వారిలోకమున స్థిరావాసమును జేకూరును" ౪. నక్షత్రమండలములు కూడ మరణించిన వారుండు నిలయములని విశ్వసింపఁబడెను. ఇంకొక పుణ్యలోకమునకుఁ బోయినను బ్రత్యేకవ్యక్తిత్వముపైఁ గాంక్షపోలేదు. "యజ్ఞాదికర్మలను సరిగాఁదెలిసి, నిర్వర్తించిన వానికి బ్రాహ్మణములు దేవత్వమును లేక దీర్ఘాయుర్దాయమును, బ్రసాదించినవి; కర్మలోపము చేసిన వారికిఁ బరలోకమున వారుచేసిన పుణ్యపాపముల నను

---

3. శతపథ బ్రాహ్మణము ౧౪.౧.౪.౧౦

(౧) శతపథబ్రాహ్మణము. ౬అ, ౬. ౨.౪, (౨) శ. బ్రా. ౧ అం. ౫3. ౧౪

(3) శ. బ్రా. ౧౧అ. ౬.౨.౫. (౪) శ. బ్రా. ౨అ. ౬.౪.౮.

సరించి, ఫలితము లిచ్చినవి. ౫. యజ్ఞము లెంతయధికముగాఁ జేసిన నంతసూక్ష్మశరీరము లభించును; అనఁగా బ్రాహ్మణముల ననుసరించి యట్టిశరీరమున కాహార మరుదుగాఁ గావలసియుండును. ౬. కొన్నిగ్రంథములలో, దీనికి వ్యతిరేకముగా, ౭పుణ్యాత్ముఁడు స్వశరీరముతో స్వర్గమునకుఁ బోవును. ౮ ఋగ్వేదము ననుసరించి, పాపి నాశనము పొందుటయు, బ్రాహ్మణముల ననుసరించి, మరణించినవారు తమ పుణ్యాపాపకర్మల ననుసరించి ఫలితములు బొందుటయు నను నీభేదమున్నది. వీబరు పండితుఁడిట్లు చెప్పెను " అత్యంతప్రాచీన యుగమునందు పుణ్యాత్మునకు లేక జ్ఞానికి సర్వసుఖములతో నిండిన దేవతానిలయము ప్రాప్తించుటయు, పాపి కొంతకాలము జీవించి, మరణించి, నశించుటయుఁ జెప్పియుండఁగా, బ్రాహ్మణములు మాత్రముఁ జచ్చినవారందఱును బుట్టుదురనియు వారికర్మముల ననుసరించి వారికి ఫలితములు లభించుననియు, పుణ్యాత్మునకు సుఖము, పాపికి శిక్షయు నుండుననియు నిర్ణయించినవి."౧. దీనిభావమేమన, మరణానంతర మొక్కటే జీవితముండుననియు నది యిహలోకప్రవర్తనము ననుసరించి యుండుననియుఁ దేలినది. "మానవుఁడు తానుబోవులోకము తాను జేసికొన్నదే."౨.

(౫) శ.బ్రా.౧౧.అ. ౨.౭.౩౩ (౬) ౧౦అ. ౧.౫.౪

[౭] శ.బ్రా ౪అ,౬.౧.౧; ౧౧అ. ౧.౮.౬; ౧౨అ.౮.౩.౩౧

(౮) వీబరు రాయలుఏసియాటికి సొసైటీ జర్నల్ వాల్యూము ౧. ౧౮౬౫ పుట ౩౦౬.

(౧) వీబరుపండితుఁడు (౨) శ.బ్రా. ౬అ, ౨-౨.౨౭. కృతమ్లోకమ్ పురుషోభియాయతే.

"ఈలోకములో మానవుఁడెట్టి ఆహారముతినునో పరలోకమున నాతఁడట్టిదానిచేఁ దినఁబడును."3. జన్మాంతరమున నిచటఁ జేసిన మంచిచెడ్డ లాయాఫలితము లిచ్చును. మఱియు "ఆలోకమున మనకు వారట్టివిధముగాఁ జేసిరి, కావున నిప్పుడిట్టివిధముగానే వారికి మనముచేయుచున్నాము."౪. క్రమముగా నిష్పాక్షికధర్మతత్త్వము పెంపొందినది. ఋగ్వేదము నందుఁ బితృయాన మొకమార్గముగాఁ జెప్పఁబడినది. కాని వైదిక దేవతలు, వారిలోకమునకును, పితృయానము పితృలోకము నందలి పుణ్యపాపఫలములకును భేదమువచ్చినది. మనకింకను, బరలోకమున జన్మపరంపరయు, నిహలోకమునఁ జేసిన దోషపరిహారవిధానములును స్ఫుటముచేయఁబడలేదు. కాని ప్రశ్న మేమనఁగా, దురాత్ములు శాశ్వతనరకమును, పుణ్యాత్ములు శాశ్వతస్వర్గానందమును బొందుదురా? యనునదైయున్నది. "సాత్త్వికస్వభావులు, వివేకవంతులునగు భారతీయులు శాశ్వత నరక, స్వర్గభావము లంగీకరింపఁజాలరు. ఈస్వల్పజీవితములోఁ జేసిన దుష్కర్మలవలని పాపము నశించుటకుఁ, దనూర్మాలమున వచ్చు శిక్షనుండి తప్పించుకొనుటకు వలయునాత్మశుద్ధిమార్గము లున్నవని వారూహింపఁగలరు. అదేవిధముగా, నీస్వల్పజీవితమునందుఁ జేసిన స్వల్పపుణ్యమువలన శాశ్వతపుణ్యాలోకానందము లభింపదనియు గ్రహింపఁగలరు." మనకుఁ బ్రాప్తించిన పుణ్యపాపఫలము లనుభవించుట పూర్తియగుటతోడనే యీ జీవితమును పూరిద్దె, తిరిగి యీలోకమునఁ బుట్టుదుము.

(3) శ.బ్రా. ౧౨౮. ౯-౧౧. (౪) శ.బ్రా. ౨౮. ౬.

జననము, మరణము, పునర్జననము, పునర్మరణము నను నీసహజవ్యాపారము, ఆద్యంతరహితమైన యొక చక్రరూపమున నున్నది.౧. మనకు నిజమగులక్ష్యము జననమరణశృంఖలాత్మకమైన సంసారమునుండి బయటపడు విముక్తియే. "దేవతలకు యజ్ఞముచేసినవాఁడు పొందులోకమాత్మ యజ్ఞము చేసినవానికి లభించులోకమంత యున్నతముకాదు."౨. "సతత వేదాభ్యాసరతుఁడు, జన్మ మరణ బంధవిముక్తి పొంది, పరబ్రహ్మైక్యముఁగాంచును."3 మరణకారణమైన జన్మము పరిహరింపఁదగినది. మఱియుఁ దరువాతగ్రంథములలో నజ్ఞానులై కర్మలు చేయువారు తిరిగిఱిగి మృత్యుదేవత కాహారమగుదురని యొక నూత్నభావమున్నది.౪. ఇంకొకవాక్యమునందు, కామ్యఫలాతీతమైన, యుపనిషద్భావమగు పునరావృత్తిరహితబ్రహ్మభావము చెప్పఁబడినది. "ఆత్మయే సర్వమునకు గమ్యస్థానము: విశ్వమంతయు జలమయమైనప్పుడు నదియుండును; సర్వకామము లందు ఫలించును; అదియే అమృతత్వము." "జ్ఞానమువలన మనుష్యులు కోరికలు నశించిన నీపదవిని పొందుదురు;ఏ ఫలితములాపదవికిఁ బోలేవు; జ్ఞానహీనులైన నిష్ఠాపరులకదిపొందరానిది; ఏలన, నిశ్చితజ్ఞానములేనిదే దానవైరాగ్యముల కాలోకము దూరమైనది. అది కేవలజ్ఞానులకే సాధ్యమగునది.౧. పునర్జన్మసిద్ధాంతమున కవసరమైన సర్వభావములు బ్రాహ్మణములం

(౧) ఐతరేయబ్రాహ్మణము 3అ. ౪౪. (౨) ఐ.బ్రా. ౧౧అ. ౨-౬.
(3) ఐ. బ్రా. ౧౦ అ. ౫-౬-౯. (౪) శ. బ్రా. ౧౦ అ. ౪-3-౧౦: ౧౦ అ. ౧-౪-౧౪; ౧౦ అ. ౨-౬-౧౯; ౧౦ అ. ౫-౧-౪; ౧౧ అ. ౪-3-౨౦.

మున్నవి; కాని యవి బీజరూపమున నున్నవి. వ్యక్తిగతమగు నమృతత్వమును గోరుట వఙ్ఖ్యాలోచనమైయున్నది. పునర్జన్మ సిద్ధాంతము నీబీజరూపభావములనుండి నిర్మించుబాధ్యత ఉపనిషత్తులదైనది. కర్మసిద్ధాంతము, పునర్జన్మసిద్ధాంతము నార్యుల ప్రజ్ఞా సముద్భవములే యగుట నిస్సంశయమైనను, మరణించిన వెనుక తమజీవములు పశువులలోఁ బ్రవేశించునని నమ్మిన దేశీయజాతుల భావములనుగూడ నార్యులు గ్రహించియుండ వచ్చునని చెప్పుటకు మాకభ్యంతరములేదు.

ఉన్నతమత నీతిభావములు ప్రకటింపఁబడినను, మొత్తముమీఁద నీయుగము సంప్రదాయదాస్యమునకుఁ బ్రాధాన్యమిచ్చి, యాగకర్మలను బూర్తిచేయుటయందే లగ్నచిత్తము కలిగియుండెనుగాని, ఆత్మపరిపూర్ణతకొఱ కంతగా నాత్రము చూపలేదు. సంప్రదాయబద్ధమైనశౌచము, సూత్రసముచ్చయ నిగళితమైన కర్మకాండయును జీవితమునకుఁ బ్రధానములని యీయుగము ప్రచారము చేసియుండుటచే, నిజమగు నాత్మతత్త్వానుభవమును పునరుద్ఘాటింపవలసిన యవసరముకలిగినది. ఈకర్తవ్యము నుపనిషత్తులు నెఱవేర్చినవి.

---

౧. వేదాంతసూత్రభాష్యమున శంకరాచార్య లీవాక్యము నుదాహరించి, తమఅద్వైతమునకెంత పోషకముగానున్నదో చూపిరి.

పరిశీలనగ్రంథములు

౧. బ్లూమ్‌ఫీల్డు: అథర్వవేదము సేక్రెడ్ బుక్సుఆఫ్‌ది ఈస్టు వాల్యూము ౬౩
౨. ఎగ్గెలింగు. శతపథ బ్రాహ్మణము. సేక్రెడ్‌బుక్సుఆఫ్‌దిఈస్టు.
(వాల్యూము ౧౨, తొలిభాగము)
౩. హాప్కిన్సు; ది రిలిజియన్సు ఆఫ్ ఇండియా. ౫. ౮.



# భారతీయ తత్త్వశాస్త్రము

## చతుర్థాధ్యాయము.

### ఉ ప ని ష త్త త్త్వ ము.

### ౧. ఉపనిషత్తులు.

ఉపనిషత్తులు ౧. వేదముల చివరిభాగము లగుటచే వేదాంతము లని పిలువఁబడెను. వేదములసారము వీనియం దుండు నని దీనిభావము. భారతదేశములోని యధునాతనమత తత్త్వముల సన్నిటి కీయుపనిషత్తులే యాధారములైనవి. "అవైదికమైన బౌద్ధమతముతోఁ గూడ నేహిందూమతశాఖయు నుపనిషదాధారము లేక యుండలేదు."౨ అధునాతన తత్త్వశాస్త్రము లన్నియుఁ దమసిద్ధాంతముల నుపనిషద్భావముతో, సరిపడ

---

౧. ఉప-ని-షత్ అనఁగా "సమీపమునఁ గూర్చుండుట"; అనఁగా గురుచరణసన్నిధి నుపదేశమును బొందుటకై కూర్చుండుట. క్రమముగా గురువు శిష్యుని కిచ్చురహస్యమంత్రోపదేశ మని యర్థము వచ్చెను. దోషమును బరిహరించి, సత్యమును సందర్శించుట యనుభావమును గొందఱు చెప్పిరి. తైత్తిరీయోపనిషత్తునకు భాష్యము వ్రాయుచు శంకరుఁ డుపోద్ఘాతవాక్యములలో నిట్లు చెప్పెను; "ఉపనిషత్తనునామమునకు బ్రహ్మజ్ఞాన మని యర్థ మేలన, దానినిఁ దెలిసికొనిన వారికి జన్మజరామరణబంధములు తెగిపోవును; లేక, వాని నదిఘ్గూర్తిగా నాశమొనర్చును; లేక, విద్యార్థిని బ్రహ్మపదమునకుఁ గొనిపోవును; లేక, అందుఁ బరమాత్మ వసించియున్నాఁడు."

చూడు పండిట్ మార్చి ౧౮౭౨. పుట ౨౫౪.

౨. బ్లూమ్‌ఫీల్డు: ది రిలిజియన్ ఆఫ్ ది వేదా. పు ౫౧.

కున్నను, సమన్వయించుటకై శోచనీయమైన ఆత్రమును జూ పెను. ఏనవ్యాదర్శము నేవఁడు బోధించినను నది యుపనిషద్భావ సంతతిలో దని చెప్పకొనును. ఉపనిషత్తులందుఁ గల కవితా మాధుర్యము, మహోన్నతపరమార్థభావము నేఁటికిని మానవులబుద్ధులను రంజింపఁజేసి, హృదయముల నాకర్షించుచునే యున్నవి. అత్యంతప్రాచీనము లగుభారతీయ విజ్ఞానరత్నము లందుఁ గలవు. వేదములలోని మంత్రప్రార్థనాభాగములు, కేవల మార్యులమతము, మతానుష్ఠానములతోఁ గూడియున్నవి. మన ముపనిషత్తులలో, సంహితగాథలకంటె, బ్రాహ్మణముల లోని నిశితతర్కవాదముకంటె, నారణ్యకముల దైవతత్త్వమునకంటె నధికపరిణతి నందినభావములను, పైభావదశావిశేషములను జూతుము. ఉపనిషత్కర్తలు, సంప్రదాయభావస్వరూపమును మార్చి, వేదమతమందుఁ దాము దెచ్చిపెట్టిన మార్పులవలన భావస్వాతంత్ర్యమునకై తమహృదయము లెంతసాహసముతోఁ దపించినవో చూపుచున్నవి. ఉపనిషత్తుల యాశయము కేవల మొకపరమార్థసత్యమును బ్రదర్శించుటయే కాదు; తపించుచున్న మానవహృదయమునకు శాంతిస్వాతంత్ర్యములను సమకూర్చుటే, తత్త్వశాస్త్రప్రశ్నములకుఁ దాత్కాలికసమాధానములను వాదప్రతివాదరూపమునను, సంభాషణరూపమునను నందుఁ జొప్పించిరి. కాని ప్రధానముగా నుపనిషత్తులు, జీవితసమస్యల నెదుర్కొనిన సత్యాన్వేషకుల హృదయములనుండి యుబికి, పొంగి ప్రవహించిన కవితామధురగీతములు, నిగూఢభావవాహినులునై యున్నవి. సత్పదార్థస్వరూపమును గ్రహిం

చుటకై మానవహృదయము చూపిన పరితాపమును, పరిశ్రమను నుపనిషత్తులు ప్రదర్శించును. అవి యొకపద్ధతి ననుసరించి, వచించినతత్త్వశాస్త్రములు గావు: ఒకకవిచే నిర్మితములును గావు; ఒకశకమునకును జెందినవి కావు; వానియందుఁ గొన్ని అసంగతములు, అశాస్త్రీయభావములు కూడ నున్నవి; కాని, యుపనిషత్తులనఁగా నింతమాత్రమే యైనచో మనము వానిని జదువ నక్కఱ లేదు. నిరుపమమైనట్టియుఁ బూర్ణసంతృప్తి నిచ్చునట్టియు మూలతత్త్వభావములతో నివి నిండియున్నవి; ఏవైన దోషలేశము లందున్నచో నవి ప్రధాన మని యెంచి వాని నుండి దోషకలుషితసిద్ధాంతములను నిర్మించిరి. మనమట్టిలేశ దోషములను సులభముగా సవరింపవచ్చును. సగము కవిత్వము సగము తత్త్వమును గలిపి, కొంతకాలములో ననేకకవులచే రచింపఁబడినను, నుపనిషత్తులలో నేకోద్దేశము తత్త్వరహస్యమునుగూర్చిన సత్యసందీపితమైనదృష్టియు మనము కాలప్రవాహవేగము తగ్గిన దిగువభాగముననిలఁబడి చూచిన, గోచరించును. ధ్యానయోగమున నవి పొందినఫలితములు కొనియాడఁదగినవి. వైశాల్యము శక్తి, ధ్వని, తృప్తి వీని నుపనిషత్తు లిచ్చినంతగా నేయితరపూర్వగ్రంథము లిచ్చియుండలేదు. ఉపనిషన్మతము తత్త్వము, కొండఱు మేరుసమానోన్నత ధీవిరాజితులకుఁ దీవ్రతమజిజ్ఞాసావేశపరవశులకుఁ జిత్తశాంతిని, మనస్సంతృప్తిని ఇచ్చినది. గఫ్ వంటివారుచెప్పిన, "ఈగ్రంథములందుఁ బరమార్థచింతన మేమియును లేదు." "అనుభవశూన్యమైనశుష్కతత్త్వమే భారతీయతత్త్వజ్ఞులు పొందఁగలిగిన మహోన్నతసత్య"

మనుభావములను మనము గౌరవింపనవసరము లేదు. వివేక ధురీణుఁ డగు జె. యస్. మెకంజీపండితుఁడు," సృష్టితత్త్వమును నిర్మించుటకు, మానవజాతిలోఁ బ్రిథమప్రియత్నమును, బర మాహ్లాదకరమును సమగ్రవినుతిపాత్రము నైన దీయుపనిష ద్భావ" మనుట యోగ్యముగా నున్నది.

౨. ఉపనిషదుపదేశము

ఉపనిషత్తు లేమి యుపదేశించు ననునది చెప్పుట సుల భముకాదు. నేఁడు ఉపనిషత్తులను జదువువిద్యార్థులు, తా మిదివఱకే నిర్ణయించుకొనిన కొన్నిభావముల నందుఁ జూచుచు న్నారు. మానవులు తమమనోనిశ్చయములందు దృఢవిశ్వాసము లేనివారగుటచేఁ దమభావములను సంప్రిదాయశాస్త్రముల యాధారమునఁ బోషింపఁజూతురు. జీవితపరివర్తనముల కివి సరిపోవు మార్గదర్శకములైనను, నంతర్దృష్టి, నిశ్చయజ్ఞానములు సత్యనిర్ణయమున కవసరములు. ప్రిస్థానత్రియభాష్యములందు, విపులము, క్లిష్టము, సూక్ష్మము నగుసిద్ధాంతములో నిర్ణయించి ప్రిదర్శించిన శంకరుని అద్వైతతత్త్వమువైపునకు బహుజనాభిప్రా యము మొగ్గుచున్నది. వేదాంతవిషయమున శంకరుఁడు చెప్పి నదే తుదిమాట కాదనియు, నుపనిషత్తులు చెప్పునది ప్రేమతోఁ గూడిన భక్తిమత మనుట హేతుబద్ధముగా నుండు ననియు నుద్ఘాటించువారును గొందఱు గలరు. వివిధభాష్యకారులు, కొన్నివిశ్వాసములతో బయలుదేఱి, వానినే యుపనిషత్తులలోఁ జూపి, భాషావైచిత్ర్యముచేఁ దమభావముల కనుగుణము లగు నర్థములను గల్పింతురు. పరస్పరవిరుద్ధభావములు గలవారం

జలు నుపనిషత్తులే తమకుఁ బ్రమాణమని చెప్పుదురు. ఉపనిష త్తులును సంశయభావాన్వితములు,సమ్యగ్భావసంపన్నములును, నగుటచే, వ్యాఖ్యాతలు వానిని దమమతతత్త్వముల కనుగుణ ముగా నుపయోగించుకొనుట కెంతయు వీలిచ్చినది. ఉపనిషత్తు లలో నొకనిశ్చితతత్త్వ సిద్ధాంతము గాని, సుస్థాపితమత విధా నముకాని, లేదు. అవి జీవితరహస్యసత్యములు స్ఫురింపఁజేయునే కాని, దానిని సూత్రీకరించుట కాని, సిద్ధాంతీకరించుటగాని యెఱుఁగవు. సత్యమును గూర్చి యవి వ్యంగ్యముగాఁజెప్పిన భావములు, దేవునిఁగూర్చి యవి ప్రకటించినధ్వని ప్రధాన సూచనలు బహుళముగా నుండుటచే నెవని కేభావము కావల సిన నందు దొరకును; ఏ ప్రత్యేక మతాభిమానియైనను నిర్వి చారముగాఁ దనకు వలయుసూక్తుల నందుండి తీసికొనవచ్చును. విజ్ఞానచరిత్రమందు సాంప్రదాయికార్థవివరణమువలనఁ దత్త్వ శాస్త్రమున కపార్థము కల్పింపఁబడుటయు, నట్టిసంప్రదా యము చిరస్థాపితమగుటచేఁ దత్త్వశాస్త్రమును దానికి సహజ మగుపదవిలో నుంచుటకుఁ బ్రయత్నించు విమర్శకులకుఁ వ్యాఖ్యాతలకు నాటంకములు కల్పించుచు వచ్చినది. ఉపనిష త్తత్త్వమునకు నీగతి తప్పలేదు. పాశ్చాత్యవ్యాఖ్యాత లేదో యొక భాష్యకారు ననుసరించిరి. గఫ్‌పండితుఁడు శంకరుననుస రించెను. 'ఫిలాసఫీ ఆఫ్ ది ఉపనిషత్స్' అను తనగ్రంథమున కుపోద్ఘాతములో నిట్లువ్రాసెను: "ఉపనిషత్తత్త్వప్రకాశకులలో శంకరాచార్యుఁ డగ్రగణ్యుఁడు. శంకరునిసందేశమే ఉపనిషత్తుల

సహజము, సత్యమునైనసందేశము." ౧. మ్యాక్సుముల్లరుపండి తుఁడట్లేవ్రాసెను; "ఉపనిషత్తులయొక్క వేదోక్తమైన తత్త్వము పరిణామముగాక 'మాయా' వాదమే, బ్రహ్మపరిణామవాద మవైదికము; 'మాయ' లేక 'వివర్తవాదము' వైదికము...... ఆలంకారికముగాఁ జెప్పినచో, వైదికవేదాంత భావములోఁ బ్రపంచమొక బీజమునుండి వృక్షమువలె నుద్భవింపలేదు; అది సూర్యకాంతినుండి యెండమావులవలె వచ్చినది."౨ డ్యూసేన్ పండితుఁడు నిదేయభిప్రాయమును బ్రకటించెను. భాష్యకారులు చెప్పినభావములనటుంచి,ఉపనిషత్కర్తలకవిహృదయమును నిర్ణయింప యత్నింతము. భాష్యకారులు మన కుపనిషత్తులనుగూర్చి సంప్రదాయమేమిచెప్పెనో యించుమించుగాఁ జెప్పుచున్నారు. కాని ప్రాచీనతత్త్వదర్శకుల సర్వతోముఖసమన్వయమును గాంచిన జ్ఞానమును వారు మనకు వ్యక్తపఱుచుటలేదు. కాని ప్రశ్న మేమనఁగా,నుపనిషద్భావములలో నేకత్వమున్నదా? జగత్కారణమునుగూర్చి యందఱంగీకరించిన సామాన్యసూత్రములు వానియందున్నవా? ఔనని స్పష్టముగాఁజెప్పు సాహసమునకు మేముద్యోగింపము. ఉపనిషత్తులలో నిగూఢభావములు, గంభీరార్థములు, వివిధావలోకనములు కుప్పలుగానున్నవి. అందుచే వివిధమతతత్త్వములు తమకుఁగావలసిన విషయముల నందుండి గ్రహించుట కవకాశమున్నదని మేమంగీకరింతుము, శంకరుఁడు ప్రదర్శించినట్టికాని, అరిస్టోటల్, కాంటువంటి తత్త్వజ్ఞశేఖరులు

---

౧. పంచాస్తికాయసమయసారము, అ ర. (౨) సేక్రెడ్ బుక్సు ఆఫ్ ది ఈస్టు. వాల్యూము ౧౫. పుట ౨౭

ప్రదర్శించిన భావసామరస్యము నుపనిషత్తులు ప్రదర్శింపవు. వానియందు హేతుసమన్వయముకంటె నంతర్దర్శన భావైక్యమున్నది; మఱియు తత్త్వసిద్ధాంతమున కవసరమగు ప్రథమవస్తుజాలమనఁదగు మూలభావములున్నవి. అట్టి మూలభావముల నుండి యొకసమ్యక్సిద్ధాంత నిర్మాణమును జేయవచ్చును. ఉపనిషత్తులలోని కొన్ని వాక్యముల భావములు సందిగ్ధములగుటచేతను, మిగిలినవైన నొకపద్ధతిలోఁగాని యొకవిధానము ననుసరించి కాని లేకుండుటచేతను, వీనినిఁబట్టి యొకవ్యక్తి తానల్లుటకుఁ బ్రయత్నించిన తత్త్వమెంతవఱకు సత్యమైనదో ధైర్యముతోఁ జెప్పుట కష్టమైపని. ఐనను, సుప్రసిద్ధములు, నుత్తమములునైన తత్త్వప్రమాణములను మనస్సునందుంచుకొని, జగత్కారణమునందు మానవునిస్థానము మున్నగు సమస్య లుపనిషత్తులలో నెట్లు పరిష్కరింపఁబడినవో చూతము.

## 3–ఉపనిషత్తులసంఖ్య, కాలము

సామాన్యముగా నుపనిషత్తులసంఖ్య నూటయెనిమిదని నిర్ణయించిరి. అందు ముఖ్యమైన పది యుపనిషత్తులకు శంకరుఁడు భాష్యము వ్రాసినాఁడు. ఈదశోపనిషత్తులు నత్యంతప్రాచీనములు, ప్రమాణములునైనవి. వాని సరియగుకాలమును మనము నిర్ణయింపఁజాలము, అందత్యంతప్రాచీనములైనవికొన్ని బుద్ధునికిఁ బూర్వములైనవియుఁ గొన్నిబుద్ధుని కనంతరములైనవియు నని చెప్పనగును. వేదమంత్ర సంకలనమునకును, బౌద్ధమతారంభమునకును మధ్యకాలమునం దివి రచింపఁబడియుండవచ్చును. (అనఁగా క్రీస్తుపూర్వమాఱవశతాబ్దము.) పూర్వో

పనిషత్తుల కాలము (క్రీ. పూ. ౧౨౦౦—౬౦౦) మధ్య కాలమని నిర్ణయించిరి. శంకరుఁడు భాష్యము వ్రాసిన కొన్ని యుపనిషత్తులు క్రీస్తువెనుక ౮౦౦ లేక ౩౦౦ ల నాఁటివని చెప్పుదురు. ప్రాచీనోపనిషత్తులు గద్యరూపముననున్నవి. ఇవి యేమతశాఖకు జెందినవి. ఐతరేయము, కౌషీతకి, తైత్తిరీయము, ఛాందోగ్యము, బృహదారణ్యకము, కేనోపనిషత్తునందుఁ గొన్ని భాగములు ప్రాచీనములు. కేనోపనిషత్తునందలి ౧—౧౩ శ్లోకములును, బృహదారణ్యకము ౪-వ అధ్యాయములో—౨౧ శ్లోకములు పద్యరూపముననున్న యుపనిషత్తులకు సంధికాలమున నుండుటచే నివి తరువాతఁ జేర్పఁబడినవని చెప్పనగును. కఠోపనిషత్తంతకను తరువాత వచ్చినది. అందు మనకు యోగ సాంఖ్యశాస్త్రములందలి యంశములు గోచరించును.౧. అన్యోపనిషత్తులనుండియు, భగవద్గీతనుండియు స్వేచ్ఛగాఁ గొన్ని భాగముల నది యుదాహరించినది.౨. ప్రాచీనోపనిషత్తులలోఁ జివరిది మాండూక్యము. అథర్వవేదోపనిషత్తులు గూడఁ దరువాతివి. "మైత్రాయణి" ఉపనిషత్తునందు యోగసాంఖ్యముల భావములున్నవి. వివిధతత్త్వ సిద్ధాంతములు చెలరేగుచున్న శకములో శ్వేతాశ్వతరోపనిషత్తు రచింపఁబడినది. వైదికములైన షడ్దర్శనములలోని శాస్త్రీయపదములతోఁ బరిచయమును

౧. చూడు కఠోపనిషత్తు: అ ౨-౧౮-౧౯; ౨అ. ౬,౧౦,౧౧

౨. చూడు కఠోపనిషత్తు: ౧అ. ౨,౫; ముండకము: ౨అ. ౮; ౧అ. ౨-౭; గీత. ౨అ. ౨౯: ౨అ. ౧౮, ౧౯; ౨అ-౧౯-౨౦; ౨అ.౨౩, ముండకము ౩అ-౨,౩; గీత ౧అ. ౫౩; కొందఱు పండితులు గీతకంటె, ముండకోపనిషత్తుకంటెఁ కఠోపనిషత్తు ప్రాచీనమైనదని చెప్పుదురు.

దెల్పుచు, వానిలోని కొన్ని సిద్ధాంతములనుగూర్చి శ్వేతాశ్వతరము ప్రసంగించినది. ఈయుపనిషత్తు వేదాంతసాంఖ్యయోగశాస్త్రములలోని దైవతత్త్వములను సమీకరించి యొకచోఁ గూర్చుటయం దభిలాషను బ్రదర్శించినది. గద్యాత్మకములగు ప్రాచీనోపనిషత్తులలో విశేషతత్త్వజిజ్ఞాస కలదనియు, దరువాత రచింపఁబడినవానిలో మతసంబంధమైన భక్తిపూజాభావములున్నవనియుఁ దెలియుచున్నది. ౧. మనము ప్రదర్శింపఁబోవు నుపనిషత్తత్త్వ నిర్ణయమునకు, బుద్ధునికిఁ బూర్వములైన యుపనిషత్తులనుండియే ముఖ్యముగా భావములను స్వీకరించి, వానినుండి యితరోపనిషత్తు లెంతవఱకు గ్రహించినవో తెలిసికొని వానినిఁ గూడ నుపయోగింతము. మనకుఁ బ్రధానములైనవి ఛాందోగ్య బృహదారణ్యక, తైత్తిరీయైతరేయ కౌశీతకీకేనోపనిషత్తులు; ఈశమాండూక్యములు తరువాతవచ్చును.

## ౪—ఉపనిషద్ద్రష్టలు

తమ భావముల నుపనిషత్తులలోఁ బ్రదర్శించిన బ్రహ్మవేత్తల జీవితములనుగూర్చి, మనకేమియును దెలియకపోవుట మనదురదృష్టము. కీర్తికాంక్షలేశమును లేక, సత్యప్రచారైకవ్రతులై, నిరహంకారులై, తమభావములకు వేదకాలమునాదలి

---

౧. డ్యూసేన్ పండితుఁడుపనిషత్తుల నీవరుసలోఁ గూర్చినాఁడు:—

(౧) ప్రాచీన గద్యాత్మకములు:—బృహదారణ్యక, ఛాందోగ్యతైత్తిరీయైతరేయ కౌశీతక్యుపనిషత్తులు; కేనోపనిషద్భాగములు.

(౨) పద్యాత్మకములు:—ఈశ, కఠ, ముండక, శ్వేతాశ్వతరములు.

(౩) అనంతర గద్యాత్మకములు:—ప్రశ్న, మైత్రాయిణి. మైత్రాయణి తప్ప, మిగిలినవి ప్రామాణికోపనిషత్తులు.

దేవతల యొక్కయు, మహర్షులయొక్కయు నామములనుంచిరి. ఇంద్రప్రజాపతులు, నారదసనత్కుమారులు తార్కికులుగా సుప్రసిద్ధులు. దేవతల నామములను విడిచిపెట్టి, ఉపనిషత్కర్తల చరిత్రములను రచించు సందర్భము వచ్చినపుడీ దిగువ నామములు ప్రధానస్థాన మాక్రమించును. మహీదాసుఁడు ఐతరేయుఁడు. రైక్వుఁడు, శాండిల్యుఁడు, సత్యకామ జాబాలి, జైవలి, ఉద్దాలక శ్వేతకేతు భరద్వాజులు, గార్గ్యాయన ప్రతర్దనులు, బాలాకి, అజాతశత్రువు, వరుణయాజ్ఞవల్క్యులు, గార్గి, మైత్రేయి.

౫—ఋగ్వేదమంత్రములు- ఉపనిషత్తులు.

ఉపనిషత్తులు తమభావవైశిష్ట్యముచే వేదమంత్ర బ్రాహ్మణముల యాధారమవసరములేని స్వతంత్రసారస్వతమని చెప్పఁబడెను. వేదమంత్రములలోని నిరాడంబర దేవతాభక్తి స్థానములో యాంత్రికమైన యాగకర్మకలాపమువచ్చినట్లు మనము చూచియున్నారము. సంప్రదాయములో సమసిపోవు మత

మైత్రాయణ్యుపనిషత్తునుగూర్చి మెగ్డనల్ పండితుఁడిట్లు వ్రాసినాఁడు; "ఇందితరోపనిషత్తులనుండి యిచ్చిన యనేకోదాహరణముల వలనను, అనంతర కాలమునకుఁ జెందిన సంస్కృతపదములను వాడియుండుటచేతను సుస్థాపితమైన సాంఖ్యసిద్ధాంతముతోడిపరిచయమును సూచించుటచేతను, అవైదిక మతశాఖలను స్మరించి యుండుటచేతను, మైత్రాయణ్యుపనిషత్తు అనంతర కాలమునకుఁ జెందియున్నదని తెలియుచున్నది. ప్రాచీనోపనిషత్తుల భావముల సారాంశమును, సాంఖ్యబౌద్ధ మతాభిప్రాయములను గలిపి రచించినదే యీ యుపనిషత్తు" (సాన్స్క్రిట్ లిటరేచరు. పుట ౨౩౦) విద్యారణ్యస్వామి తన "సర్వోపనిషదర్థానుభూతి ప్రకాశ,మున వివరించిన ద్వాదశోపనిషత్తులలో నృసింహోత్తర తాపనీయోపనిషత్తొకటి.

ము సరిపడదని యుపనిషత్తులు నిశ్చయించినవి. వేదమతస్వరూపమును మార్చకుండ, దానినుపనిషత్తులు నైతికమొనర్ప యత్నించినవి. వేదమంత్రములలో సూచనలుగానున్న యద్వైత భావములను పెంపొందించుట; బాహ్యప్రపంచమునుండి తత్త్వకేంద్రము నాంతరంగిక ప్రపంచమునకు మార్చుట; వైదిక బాహ్యకర్మాచారములను నిరసించుట; వేదప్రామాణ్యముపట్ల నౌదాసీన్యము వహించుట యివి వేదములకంటె నుపనిషత్తులు చూపిన పరిణతియని చెప్పవచ్చును.

సంశయోత్పత్తములైన వైదికవిశ్వాసముల నడుముఁగూడ, నొక యేకార్థ ప్రతిపాదకమైనదృష్టి బయల్పడ యత్నించుచున్నది. కొన్నిమంత్రములందు సర్వకేంద్రమగు నేకైకశక్తి సత్యమని ప్రతిపాదింపఁబడెను. దీనినుపనిషత్తులు ముందుకుఁదీసికొనిపోయినవి. ఉపనిషత్తులొక్కటే పరమాత్మశక్తి నంగీకరించినవి; అది సర్వాత్మకము, శాశ్వతము. జ్ఞానాతీతము, స్వయంప్రకాశకము, సృష్టిస్థితి లయకారణమునైనది. ఆపరబ్రహ్మమే జగజ్జ్యోతి, జగత్పతి, జగదాధారము, ఏకము, అద్వితీయము, ఏకైక పూజాస్తుతిపాత్రము. వేదములలోని అపరిపూర్ణ దేవతల దృశ్యమై, పరిపూర్ణుఁడగు దేవుఁడు గోచరించినాఁడు. "ఓయాజ్ఞవల్క్య! నిజముగా దైవము లెందఱుగలరు?" "ఒకఁడే" యని యాతఁడు బదులుచెప్పెను. "మాకింకొక ప్రశ్న కలదు.

౨. ఈవిషయమందభిమానముగలవారు నామిత్రుఁడు సహాధ్యాపకుఁడునైన డాక్టరు బారువారచించిన "ప్రీబుద్ధిస్టిక్ ఇండియన్ ఫిలాసఫీ" యను సత్కృష్టగ్రంథమున, వైదికవిజ్ఞానవేత్తలను గూర్చి రచించిన చక్కని భావములను జదువవచ్చును.

అగ్ని, వాయువు, ఆదిత్యుఁడు, కాలము, ప్రాణము, అన్నము, బ్రహ్మ, రుద్రుఁడు, విష్ణువు. ఈ దేవతలలో నొక్కొక్కని కొందఱు కొందఱు సేవించుచున్నారు. ఇందెవఁ డుత్తముఁ డైనవాఁ మాకుఁ జెప్పుము." అతఁ డిట్లు చెప్పెను ! "సర్వస్వరూపి, అమరుఁడు, అనంతుఁడు నైన పరబ్రహ్మము యొక్క భిన్నరూపములే యీ దేవతలు"౨. సగుణనిర్గుణాత్మకము లైన రెండు నొకే బ్రహ్మమందు లీనమైపోయినవి.

బహుదేవతారాధన భావములు భారతీయ హృదయములో లోఁతుగా నాటుకొని పోయిన కారణముచే వానిని దొలఁగించుట సులభము కాదు. అనేక దేవత లొకే దేవునికి సామంతులైరి. పరబ్రహ్మ కటాక్షము లేనిదే ఒక గడ్డిపోచనైన నగ్ని కాల్పలేదు; వాయువు దాని నెగురఁగొట్టలేదు. "పరబ్రహ్మ వలని భయముచే అగ్ని మండుచున్నది; సూర్యుఁడు ప్రకాశించుచున్నాఁడు. ప్రాణములు, మేఘములు, మృత్యువు తమకర్తవ్యములను నెఱవేర్చుచున్నవి." 3. కొన్నివేళల దేవతలందఱు పరమేశ్వరుని యంశములని చెప్పఁబడెను. ఉద్దాలక నాయకత్వమున నైదుగురు గృహస్థు లశ్వపతి మహారాజు దర్శనము చేసిరి. చక్రవర్తి ప్రతివ్యక్తి నీవిధముగా నడిగెను. "ఎవరిని

---

౧. బృహదారణ్యకోపనిషత్తు 3అ-౯-౧

౨. మైత్రాయణ్యుపనిషత్తు అ ౪, ౫-౬; ముండకము ౧అ—౧-౧; తైత్తిరీయము ౧అ. ౫. బృహదారణ్యకము ౧అ-౪-౬; ౧అ. ౪-౭; ౧అ. ౪.౧౦

(3) తైత్తిరీయము.

నీవు పరమాత్మగా ధ్యానించుచున్నావు ?" మొదటివాఁడు స్వర్గమనియు, రెండవవాఁడు సూర్యుఁడనియు, మూఁడవవాఁడు వాయువనియు, నాలుగవయాతఁ డాకాశమనియు, నైదవవాఁడు జలమ్మనియుఁ జెప్పిరి. సత్పదార్థముయొక్క వివిధాంశములనే వారు ధ్యానించుచున్నారని చక్రవర్తి సమాధానము చెప్పెను. శిరము స్వర్గము, కన్ను సూర్యుఁడు, శ్వాస వాయువు, ఉదర మాకాశము, మూత్రనాళము జలము, భూమిపాదములుగా విరాట్పురుషుని రూపము చిత్రింపఁబడినది. అల్పసంఖ్యాకుల తాత్త్విక విశ్వాసమునకును, ప్రజాబాహుళ్యముయొక్క మూఢవిశ్వాసములకును సామరస్యముచేయుటే మనకుఁ గల సమన్వయవిధానము, ప్రాచీనులు విశ్వసించిన దేవతాస్వరూపముల నొక్కమ్మడి నిర్మూలింపఁజాలము; ఏలన, నట్టినిర్మూలనవిధానము ప్రాతిపదికమైన మానవసహజ స్వభావమును గణింపనిదగును; జనులందఱొక్కసారి పరమసత్యమును గ్రహింపఁజాలరు; జనసామాన్యముయొక్క నైతికాధ్యాత్మిక పరిణతి యనేక దశలలోనుండును. ఉపనిషత్తుల దృష్టిని నిర్ణయించిన విషయ మింకొకటికలదు. వానియాశయము తత్త్వమునుగాని శాస్త్రమునుగాని నిర్మించుటకాదు. ప్రజలకు ధర్మ ప్రవర్తనాభ్యాసము చేయుటే. జీవునికి దేహబంధములనుండి విముక్తి కల్పించి, బ్రహ్మైక్యానందమును పొందుటకు సాయపడుటయే వానిలక్ష్యము. పావనజీవితమున కిచ్చినంత ప్రాధాన్యమునువారు ధీశిక్షణమున కొసఁగలేదు. మఱియు వారికిఁ బూర్వసంప్రదాయ మందధిక గౌరవముకలదు. వేదమంత్రద్రష్టలు

చిరస్మరణీయులైన మూలపురుషులు; వారిని విమర్శింపఁజూచుట యోగ్యముకాదు. ఈవిధముఁగా నభ్యుదయమందుచున్న పరమారతత్త్వమునకును,సుస్థాపితములైన వైదిక దైవారాధన విశ్వాసములకు నుపనిషత్తులు సామరస్యమును గల్పింపయత్నించినవి. మానవునికిఁ దత్త్వదృష్టి ద్వివిధము; బాహ్యము, ఆంతరంగికము; బాహ్యమున సృష్టివైచిత్ర్యము, ఆంతరంగికముగా నాత్మవ్యాపారము. వేదములలో ననంతమైన ప్రకృతి నిర్మాణ స్వభావములపై దృష్టి కేంద్రీకరింపఁబడినది. అంతరంగ ప్రపంచ రహస్యముల పైపుదృష్టి యుపనిషత్తులు మరల్చినవి. "స్వయం జ్యోతియైన పరమాత్మ యింద్రియద్వారములను బాహ్యమునకుఁ దెఱచుటచేత, మానవుఁడు బాహ్యమునకే కాని లోపలికిఁ జూడలేకుండెను; కాని యొకజ్ఞాని ముకుళితనేత్రుఁడై మోక్షాపేక్షతో లోనున్న పరమాత్మను దర్శించెను."౧. బాహ్యభౌతిక లోకమునుండి, మనస్సునకింకను వెనుకనున్న మరణాతీతమైన యాత్మపైదృష్టి కేంద్రీకృతమయ్యెను. జ్యోతిర్దర్శనమున కాకసమువంకఁ జూడనవసరములేదు; అంతరంగమున దివ్యజ్వాలాత్మకమై ప్రకాశించుచున్న యాత్మను దిలకింపవచ్చును. మానవుని యంతరాత్మ ప్రపంచసౌందర్యమునుజూపు మూలయంత్రము, సత్యము ప్రతిఫలించు హృదయాకాశము, ప్రసన్నకాసారము. దృష్టిలోనిట్టి మార్పువచ్చుటచేఁ దత్త్వమంతయును మారినది. మనమిపుడర్చింపఁ దగినవారు దేవతలు కారు; ఆత్మస్వరూపుఁడైన పరమేశ్వరుఁడే. దేవుని నివాసము

---

౧. కఠోపనిషత్తు ౪అ. ౧.

మానవహృదయమే; బ్రహ్మణఃకోశో౽సి౨ "తన యాత్మస్వరూ-పికాని యేయితర దేవత, నెవఁడారాధించినను వాఁడు తెలియనివాఁడే"3. అంతరంగమందలి మరణరహితమైన యాత్మయును, సర్వసృష్టిని కల్పించిన శక్తియు నొకటే. ఆత్మయే బ్రహ్మము; బ్రహ్మమే ఆత్మ. బ్రహ్మాండమునంతను సృజించిన దివ్యశక్తి, ప్రతిప్రాణి హృదంతరముననున్న యాత్మశక్తియే" దైవకటాక్షమునుగూర్చి వేదములు చెప్పిన భావము నుపనిషత్తులంగీకరింపవు. ఇహసుఖైశ్వర్యప్రదాతలగు వైదిక దేవతల కుపనిషత్తులలోఁ బ్రార్థనములు లేవు; దుఃఖవిమోచనమునకుఁ మాత్రమే గలవు.

ఉపనిషన్మహర్షులు దుఃఖమునుగూర్చి అతిశయముగాఁ జెప్పుటచే వారు నిరాశాతత్త్వము నుపదేశించిరని విమర్శకులప్పుడప్పుడు పల్కుచువచ్చిరి. అది సత్యముకాదు. వేదమతమధికోల్లాసకరమైనదే కాని, వస్తువుల యాంతర్యమెఱిఁగిన ఉపనిషణ్మతౌన్నత్యమును బొందలేదు. సుఖపదార్థములలోనిండిన ప్రపంచ

౨. తైత్తిరీయోపనిషత్తు. 3. బృహదారణ్యకోపనిషత్తు ౧అ. ౪.౧౦
౪. చూడు ఛాందోగ్యము. 3అ. ౧౪.

సెంటుఅగస్టైన్: "నేనుదేవుఁడెవరని భూమినడిగితిని అది నేను కాదని బదులుచెప్పెను. మరల సముద్రమును, సాగరగర్భమును, నందలిజంతుజాలమున నడిగితిని. అవియు దేవుఁడు మేము కాము; మాకూర్ధ్వమున వెదకుమని చెప్పినవి; తిరిగి నేను, మహామారుతములను, దానితోనిండిన విశ్వమును, నందలి జంతువులను నడిగితిని; అవియు "అనాగ్జిమినిస్ పొరపడినాడు. దేవుడు మేము కామ"ని చెప్పినవి; అట్లే ఆకాశసూర్యచంద్ర నక్షత్రముల నడిగితిని; మేము కామనియవియుఁ జెప్పినవి. మరల నాశరీరేంద్రియముల నడిగితిని; మీరు దేవుడుకారని చెప్పితిరి. కాని దేవునిఁగూర్చి మీకుఁ దెలిసినది చెప్పుమంటిని.

మును దర్శించి, సంతసించినది వేదమతము. దేవతలను జూచి వారు భయము, భక్తియుఁ గూడఁగలిగియుండిరి. ఇహలోక జీవనము నిరాడంబరము, మధురముగా వారికిఁ దోఁచెను. నిజమగు నాత్మజిజ్ఞాస కేవల సుఖమయజీవితాసక్తి నంగీకరింపదు; జీవితపరమార్థమునుగూర్చి యది ప్రశ్నించి తర్కించును. ఉన్న పరిస్థితియందు గాఢమైనయసంతృప్తియే హృదయపరివర్తనమునకును, నాత్మావలోకనముచే వచ్చు ద్విజత్వమునకును గారణము. ఉపనిషత్తులలోఁ జూపఁబడిన నిరాశాతత్త్వము, సర్వతత్త్వజ్ఞానమార్గము. మానవునికి నిరాశగలిగి, దానినుండి బయల్పడు మార్గము లన్వేషింపఁ జేయును. నిరాశావిమోచన మార్గము లేకున్నచో, దానినుండి బయల్పడు యత్నము చేయకున్నచో నపుడది తీవ్రదోషమే. క్రియోత్సాహములను భంగపఱచి. మాంద్యమును గల్పించునంతటి నిరాశాభావము నుపనిషత్తులెన్నఁడు చెప్పియుండలేదు. సత్యాన్వేషణమునకు వలయు కృషిని నిర్విఘ్నముగాఁ గొనసాగించుటయందు విశ్వాసము నుపనిషత్తు లధికముగాఁ గలిగియున్నవి. బెర్తుపండితుఁడు నుడివినట్లు, "ఉపనిషత్తులయందు దుఃఖమాంద్యములకంటె, సత్యాన్వేషణ పరాయణమందు సాహస మధికముగానున్నది."౧ "జనన మరణాత్మకమైన తుదిలేనికాలచక్రమందుఁ దగుల్కొనిన జీవుని దుఃస్థితినిగూర్చి విశేషముగాఁ జెప్పువాక్యము లుపనిషత్తు

అవియిట్లుచ్చైస్స్వరముతోఁ బల్కినవి: "దేవుఁడు మమ్ముఁ జేసినాఁడు." ఇట్లన్వేషించి, చివరకు లోనున్న ఆత్మనడుగగా "నీదేవుఁడు నీలోనే యున్నాఁడు. నీయాత్మ కాత్మ" యని బదులుచెప్పినది. (కోస్ఫోవన్స్.౧౦అ.౬)

౧. రిలిజియన్స్ ఆఫ్ ఇండియా. పుట ౭౪

లలో నధికముగాలేవు. ఉపనిషత్కర్తలు తాము ప్రకటించిన మోక్షమార్గమువలనఁ గల్గిన యానందముచే నిరాశాతత్త్వము నుండి రక్షింపఁబడిరి. ౨"సంసారవర్ణనము, లేక పునర్జన్మ సిద్ధాంతవిషయమును ప్రకటించినంతమాత్రమున నుపనిషత్తులు నైరాశ్యమును బోధించినవనుమాట యుక్తముగాదు. ఇహలోకజీవనము పరిపూర్ణ జీవితమునకు సాధనము. బ్రహ్మానందము, బ్రహ్మానుభవ జ్ఞానమును సంపాదించుటకై, మనము సంసార జీవితమొక శిక్షణముగాఁ బొందవలెను. ఆత్మజయమువలన లభించు నానందము పరమలక్ష్యమైనవారికి జీవితము మహోత్సాహజనకమై యుండును; బ్రహ్మజ్ఞానసాధనమునకు సంసారానుభవములు మెట్లు, జీవిత మాత్మజ్ఞాన సంపాదనయాత్రలో నొకఘట్టము; బుద్ధిని శాశ్వతవస్తువును గుర్తింపఁజేయుటకు సంసారమొక చక్కని తరుణము. జీవితమొక మాయాస్వప్నము కాదు; ప్రపంచమొక పిశాచ కల్పనమునుగాదు. ఉపనిషదనంతర పునర్జన్మ సిద్ధాంతములలో, నీపూజ్యభావ మదృశ్యమై, జన్మమొక దోషమనియు' సంసారము నొక బంధించు శృంఖలమనియు, వర్ణింపఁబడెను.

బ్రాహ్మణముల కాలమునందు, వేదమంత్రముల నిరాడంబరమైన మతము యజ్ఞక్రియమైనది. మనుష్యులకు దేవతలకు సంబంధము లిచ్చిపుచ్చుకొను లాభనష్టరూపమైన వ్యాపారసంబంధము, వ్యర్థకలాపములో మునిగిపోయిన యీయుగమందు నిజమగు తత్త్వదృష్టిని పునరుద్ధరించు టవసరమైనది.

౨. కేవ్: రిడెంప్షన్, హిందు అండ్ క్రిస్టియన్ పుట ౬౪

ఉపనిషత్తులలో నధ్యాత్మజీవనము నవజీవసృవంతియై ప్రవహించినది. యాగకర్మకలాపమువలన నాత్మకుమోక్షము లభింపదని యుపనిషత్తులు ఘోషించినవి. సృష్టి రహస్యమెరిగిన నిజమైన మతతత్త్వానుష్ఠానమే మోక్షసాధనమని చెప్పఁబడెను. పరిపూర్ణత, లేక బ్రహ్మజ్ఞాన మాంతరంగికము, అంతరాత్మసంబంధము, అది బాహ్యము, వ్యర్థాచారమునుగాదు. జీవాత్మ పరమాత్మైక్య భావమును గూర్చిన నిశ్చయజ్ఞానము సరియగు మతానుష్ఠానమునకు మూలసాధనము, యాగక్రియల నిరర్థకత బాహ్యపూజల ప్రయోజన శూన్యతయును బాగుగాఁ జాటఁబడెను. భగవంతు నాత్మార్పణముచే సేవింపవలెను, గాని, బాహ్యపూజా విధానములచేఁ గాదు. దేవుని స్తుతించినంత మాత్రమున మనకాత్మరక్షణము లేదు. క్రతుకలాపముచే నాతఁడు తృప్తి పొందఁడు. ఉపనిషత్కర్తలు, చరిత్రజ్ఞానము కలవారగుటచే భావవిప్లవ మొక్కసారిగాఁ జొప్పింపఁజూచుట నిష్ప్రయోజనమని గ్రహించిరి. కావున వారు దృష్టిపరివర్తనమునకై యత్నించిరి. యజ్ఞములకు వారు వేఱర్థములు చెప్పి. యాయర్థముల కవిబాహ్యచిహ్నములని బోధించిరి. కొన్ని వాక్యములలో నశ్వమేధయాగమును[2] గూర్చి ధ్యానముచేయుమని శాసించిరి. అట్టి ధ్యానము యజ్ఞనిశ్చయార్థమును మనకుఁ దెలియపఱచుటచే నదియజ్ఞమంత విలువైనదే. యజ్ఞముల కవసరములగు సరణి, వేదికమున్నగు వివరములను శ్రద్ధతో వర్ణించుటచే వారుయజ్ఞమతమునకు వ్యతిరేకులుకారని తెలియుచున్నది.

---

౧. బృహదారణ్యకోపనిషత్తు ౧అ. ౧-౨. ౨. అశ్వమేధము.

యాగకర్మరూపముల నట్లుంచి, వాని భావములను సంస్కరింప యత్నించిరి. ఆత్మదర్శనమే సర్వయజ్ఞములకుఁ బ్రయోజనమని చెప్పిరి. జీవితమే యజ్ఞము, "మనుష్యజీవితమే నిజమగుయజ్ఞము: అతని మొదటి యిరువదినాల్గు వత్సరముల జీవితము, ఉదయకాలహోమార్పణము బుభుక్షాపిపాసలను లక్ష్యముచేయక, సుఖాపేక్షవిడిచి, చేసిన బ్రహ్మచర్యమాతని ప్రథమహోమ సమర్పణము. భోజనపానాది సుఖములను గూడఁ బవిత్రకర్మలుగాఁజేసి, ప్రమోదభరితములైన వివాహాదిక శుభకార్యములందుల్లాసముతో వేదమంత్రములను బఠించుచు ఆత్మశిక్షణము పరోపకార పరతంత్రత, ఋజువర్తనము, అహింస, సత్యవచనము, మున్నగున వాతఁడిచ్చు దక్షిణ, యఘమర్షణ స్నానమే యాతని యరణము,"౧ దేవుఁడిట్లు నిత్యయజ్ఞస్వరూపియై మనకుఁ జెప్పిరి. దేవునియజ్ఞముచే మనము జీవించుచున్నాము. యజ్ఞమనగా మృష్టాన్నభోజనము కాదు; త్యాగమే. చేసినప్రతికర్మయు, దలచిన ప్రతిభావమును, దైవార్పణబుద్ధితోఁ జేయవలెను. నీజీవితము నొకయవిచ్ఛిన్న యజ్ఞముగాఁ జేయుము, మను ప్రథమసోపానమును మెట్టినఁగాని, పైనున్న సత్యమును మెట్టునకుఁ బోవజాలము. సామాన్యులకు యజ్ఞము లవసరము

౧. ఛాందోగ్యోపనిషత్తు 3అ. పోల్చు: ఈశ్వైగేరఆ. ౬-౭ "క్రౌర్య శృంఖలములనుండి విడిపడుటకును, భారములనుడించుటకును, నంబివేయఁబడినవారికి స్వాతంత్ర్యమిచ్చుటకును, సర్వబంధములను త్రెంపివేయుటకును కాదా నేనుపవాసవ్రతము బూనితది? నీయన్నమును నిఱుపేదలకుఁ బెట్టి దూరముగా నెట్టివేయబడిన

లేగాని, యంతటితో సరిపోదు. యజ్ఞములవలన మనము పితృనివాసమైన చంద్రలోకమునఁ గొంతకాలముండి, తిరిగి యీలోకమునకువచ్చి జన్మింపవలెను, బాహ్యకర్మకలాపము నాంతరంగికాత్మ జ్ఞానముతోఁబోల్చి చూపిరి.(౧) యజ్ఞములతోఁగూడిన పురోహితవ్యాపారము వారి కసంగతమని తోఁచినపుడు వారు దాని నెప్పుగా నిరసించిరి, పురోహితబృందము శ్వానముల గుంపువలె నొకరివెనుక నొకరు, "ఓమ్! మనము భుజింతము; ఓమ్! మనము త్రాగుదము......"(౨) మున్నగు వాక్యములు పలుకుచుఁ బోవుచుందురు. ఈవిధముగా బ్రాహ్మణముల కఠిననియమములతోఁ గూడిన కర్మకాండ, దుర్బలహృదయుఁడగు మానవునికి తృప్తినొసఁగ నందున నుపనిషత్తులు దాని కడ్డు కట్టకట్టిరి.

వేదప్రమాణ పావనత్వమునుగూర్చిన యుపనిషద్భావము దాని కనుకూలముగాదు. అనంతర తార్కికులవలె, నుపనిషత్కర్తలీ విషయమున ద్వంద్వాభిప్రాయమును వెలిబుచ్చిరి. వేదములు దైవకల్పితములని చెప్పినపుడు వారిట్లు నుడివిరి; "తడికఱ్ఱలకు నిప్పుపెట్టినపుడు పొగబయలుదేఱి నల్దెసల వ్యాపించునట్లు, పరమాత్మనుండి ఋగ్యజుస్సామమాథర్వాంగిరసములు, పురాణేతిహాసములు, శాస్త్రములు, నిగూఢసమస్యలు

---

దీనులనాదరించి, రక్షించుటకే నీయుపవాసవ్రతము. కట్టుగుడ్డలేని వారినిఁ జూచి, నీవు నీశరీరముమీఁది వస్త్రమునుదీసి వారికిఁ గప్పవలెను;"

(౧) ఛాందోగ్యము. ౧అ. ౧. ౧౦ (౨) ఛాందోగ్యము ౧అ.౧౨ ఖ.౫

గీతములు, సామెతలు, భాష్యములు నన్నియు నిశ్వసితములై బయటికి వచ్చినవి." 3 వేదార్థవైదుష్య మాత్మజ్ఞానమునకు సరిపోనదనియు నది మనల నుద్ధరింపఁజాలదనియుఁ జెప్పిరి ౪. నారదుఁడిట్లు చెప్పెను; "నాకు ఋగ్యజుస్సామములు మంత్రములు, తెలియును. కాని యాత్మస్వరూపము నెఱుఁగను." ౧. ముండకోపనిష త్తిట్లు చెప్పెను; "విద్యలు ద్వివిధములు; పరాపరములు; ఋగ్యజుస్సామాథర్వములు, శిక్షాకల్పాదికములిచ్చు విద్య అపరవిద్య; లేక లౌకికవిద్య; దేనివలన నక్షర బ్రహ్మ పదార్థము తెలియునో అదియే పరవిద్య లేక ఆత్మవిద్య."

## ౬ ఉపనిషత్తులు చర్చించిన విషయములు

ఉపనిషత్తులలోఁ బ్రధానవిషయము తత్త్వసమస్యయే అది సత్యాన్వేషణమే. ఉన్నపరిస్థితులలో నసంతృప్తి వలన, శ్వేతాశ్వతరోపనిషదారంభమునఁ జెప్పిన యీ ప్రశ్నములు బయలుదేఱును; "మనమెచటఁ బుట్టితిమి? ఎచట జీవించుచున్నాము? ఎచటికిఁ బోవుదుము? హే బ్రహ్మ విద్వరేణ్యా ! సుఖదుఃఖమయమైన యీ యిహజీవితమెవని యేర్పాటుచే మనము చేయుచున్నాము ? దీనికిఁ గారణము, కాలమా ? స్వభావమా ? అవసరమా లేక నిర్హేతుకతాటస్థ్యమా ? లేక పంచభూతములా ? లేకపరమాత్మ స్వరూపియగు పురుషుఁడా?" కేనోపనిషత్తునందు శిష్యుఁ డడుగుచున్నాఁడు; "ఎవనియాజ్ఞచే

మన మనస్సుదయించి తనపనిని చేయుచున్నది ? ఎవని శాసనముచే మనము మాటలాడుట జరుగుచున్నది ? చక్షుశ్శ్రోత్రములను నెవఁడు నడుపుచున్నాఁడు ?'' 3 ఉపనిషత్కర్తలు సామాన్యులవలె మన యనుభవ మతర్క్యమని తలఁపలేదు. ఇంద్రియములు మనకుఁ దెలుపునదే తుది సత్యమగునా యని వారు శంకించిరి. మన కనుభవము నిచ్చు మనశ్శక్తులు స్వయముగ వ్యక్తిత్వము గలిగినవా? లేక వానివెనుక వానికంటె నధికమైన శక్తుల ప్రతిబింబములా యివి ? బాహ్య భౌతికవస్తువులు, కొన్ని కారణముల ఫలితములైయుండఁగా వీనిని వీనిసూక్ష్మకారణములంతసత్యమైనవిగా నెట్లుగ్రహించుట ? సర్వవస్తుజాలమునకును వెనుక పరమసత్యమైన మూలకారణమొకటి యుండి యుండు మనస్సునకు శాంతికలుగు నవకాశముండవలెను. జ్ఞానము, మనస్సు, నింద్రియములు విషయములు నివన్నియుఁ బరిమితములు కారణబద్ధములునై యున్నవి. ఇట్టి తాత్కాలిక వస్తుజాలము సుఖమొసఁగఁజాలదని నీతితత్త్వ ముపదేశించుచున్నది. ప్రపంచమిచ్చు సుఖములు, వార్ధక్యమరణములచే నస్థిరములు. అనంతమైనదే అఖండానందము నీయఁగలదు. మతము శాశ్వతానందమయజీవితమును గోరును. కావున నొక కాలాతీతమైన పరమసత్యము లేక సత్పదార్థముండితీరవలెను; దేనినిఁగూర్చి మతమన్వేషించుచున్నదో, యేది మనసర్వకాంక్షల నీడేర్పఁగలదో, యేది తత్త్వజిజ్ఞాసకు గమ్యస్థానమో యట్టిదే యా సత్పదార్థము. సచ్చిదానందరూపమైన యట్టి అనంతతత్త్వమును

(౧) ఛాందోగ్యోపనిషత్తు ౭అ౨; (౨) ముండకము ౧అ ౧.౪,౫ మైత్రాయణి ౬అ. ౨౧ (3) శ్వేతాశ్వతరము౧అ.౧.౧

కుపనిషత్తులు మనలఁ దోడ్కొనిపోవయత్నించినవి. ప్రతిమనుజుని ప్రార్థన మీవిధముగా నుండును."నన్ను అసత్పదార్థము నుండి సత్పదార్థమునకును,అజ్ఞానాంధకారమునుండి జ్ఞానకాంతిలోనికిని మరణమునుండి యమరత్వమునకును దోడ్కొనిపొమ్ము" ౧

మన ముపనిషత్తత్త్వమును, తత్త్వశాస్త్రము, నీతి శాస్త్రములను రెండుశీర్షికలక్రిందఁ బరిశీలింతము. తత్త్వశాస్త్ర శీర్షికక్రింద, (బరమసత్యము, జగత్స్వభావము, సృష్టిసమస్య మున్నగువానిపై నుపనిషత్తులేమిచెప్పినవో చూతము; నీతి శాస్త్ర శీర్షికక్రింద, వ్యక్తియొక్క భిన్నాంశపరిశీలనము, ఆతని గమ్యస్థానము, లక్ష్యము, కర్మస్వాతంత్ర్యముల సంబంధము, మహోన్నతాదర్శమైన మోక్షస్వరూపము, పునర్జన్మసిద్ధాంత ములనుగూర్చి చర్చింతము.

## ౭—సత్స్వరూపము

సత్స్వరూపసమస్యా పరిష్కార విషయములో నుపనిష త్కర్తలైన విజ్ఞానవేత్తలు వేదద్రష్టలు ప్రదర్శించిన బాహ్యదృష్టి నాంతరంగికదృష్టితో మేళవింపఁజూచిరి. అనేకపదార్థము లలో నేకమైయున్న సత్పదార్థమే వేదమంత్రములు కనుఁగొనిన మహోన్నతసత్యము. ఈనిర్ణయము నుపనిషత్తులు బలపఱచినవి. ఆత్మస్వరూప పరిశీలనమును తత్త్వదృష్టితో నప్పుడప్పు డుపని షత్తులు ప్రదర్శించినవి. ఆత్మశబ్దమునకు వ్యుత్పత్తి సరిగాఁ దెలి యదు. ఋగ్వేదములో (౧౦అ. ౧౬—3) ఈశబ్దమునకు 'ఊపిరి'

---

౧. "అసతో మాసద్గమయ, తమసోమాజ్యోతిర్గమయ. మృత్యోర్మా అమృతంగమయ." బృహదారణ్యకము. ౧అ. 3.౨౭.

యనియు, చైతన్యసారమనియు నర్థము చెప్పఁబడెను. క్రమముగా జీవుఁడను నర్థమువచ్చినది. ఆత్మసిద్ధాంతము వివరణముతోఁగూడిన స్పష్టము,పూర్ణమునైన పద్ధతిలోఁ జెప్పఁబడియుండలేదు; అచటచటనున్న భావములొక యేకతత్త్వసమీకరణములోనికిఁ దేఁబడలేదు. ౧. ఛాందోగ్యోపనిషత్తునందు, గురువగు ప్రజాపతికిని శిష్యుఁడగు నింద్రునికిని జరిగిన సంభాషణమున నాత్మశబ్దనిర్వచనము క్రమోన్నత పరిణతినందినది; (౧) శరీరము నేననుభావము (౨) మనస్సు నేననుభావము, (౩) అంతఃకరణము నేననుభావము (౪) పరిపూర్ణసత్యస్వరూపమగు నాత్మపదార్థము నను నాలుఁగుదశలలోఁ జెప్పఁబడినది. ఇచటఁ జర్చింపఁబడినది మానసికముగాక యాధ్యాత్మికసమస్య. మనుష్యుని నిజాత్మస్వరూపమేమి ? నిత్యసత్యమగు నాత్మకుండవలసిన కొన్నిలక్షణములను గూర్చి ప్రజాపతిచెప్పుట కారంభించును. "జరామరణ దుఃఖములుగాని, పాపముగాని, బుభుక్షాపిపాసలుగాని, లేనిదై యేకోరికలు లేక తాను గోరఁదగినది మాత్రమే కోరుచు, నేదియు నూహింపక, తన కుచితమైన దూహించుచు, నుండునో అట్టి ఆత్మయే మనము తెలిసికోనవలసినది." ౨. అన్నియు మారుచుండగా నన్నిటికిఁగర్తయై తాను మార్పులేనిదై, జాగ్రత్స్వప్న సుషుప్తినిద్రాపునర్జన్మ మోక్షాద్యవస్థలన్నిటికాధారభూతమైనదే ఆత్మ"3. అది వినాశములేని సద్వస్తువు, మృత్యువు దానిని స్పృశింపలేదు; పాపము దానికంటదు. నిత్య

---

౧. ఛాందోగ్యము ౮అ. 3-౧౧ (౨) ఛాందోగ్యము ౮అ. ౭,౧;
(3) బృహదారణ్యకము ౪అ. ౪.3

త్త్వము, అవిచ్ఛిన్నత్వము, ఏకత్వము, శాశ్వత క్రియాపరత్వ ము దానిలక్షణములు. స్వయంసంపూర్ణమైన ప్రపంచ మది. అదితప్ప వేఱొకటేమియు దానిని బాధించునదిలేదు. నవ్యవిమ ర్శకులే. నిర్ణయవిధానము సహేతుకముగాదని పలుకుదురు. స్వ యంసంపూర్ణత,స్వయంపోషకత్వ లక్షణముల నూహించి, సమ స్యాపరిష్కారము నతిసులభముగాఁ జేసియున్నాము. కాని యీ పద్ధతి కేవల మర్థరహితముగాదని ముందు మనము చూడఁగ లము. ఆత్మ కేవలమాంతరంగికమును, నెన్నఁడు దృశ్యముకాఁ జాలదని ప్రజాపతిచెప్పిన భావము. అది ద్రష్టయేకాని దృశ్య ముకాదు. ౧.అది కొన్నిలక్షణముల మొత్తమైన"నేను"అనునది కాదు. వీనికి వెనుకనుండి, సర్వసాక్షిగా నున్న 'అహం' పదా ర్థమే యది. అది కర్మలేని పూర్ణకర్త. మనము సాధారణము గా"నేను"అని చెప్పుకొనునదంతయు దృశ్యములోఁ జేరును;ఏలన నేది దృశ్యమో యది యనాత్మపదార్థమే. ఆత్మేతరవస్తుగుణ జాలమునంతను సంపూర్ణముగా వేఱుపఱచవలెను. ప్రశ్నము నకు మొదటి సమాధానములో జన్మపరిణామ వార్ధక్యమరణ ములు గల శరీరమే ఆత్మయని చెప్పఁబడెను. ఒకనినేత్రము నందు నీవుచూచు తేజస్సు,పాత్రములోని యుదకమందుఁగాని, అద్దమునందుఁగాని ప్రతిబింబించునది ఆత్మయని ప్రజాపతిచెప్పె ను. ఒక చిత్రపటములోని మనుజు నానఖాగ్రము చూడవలెను. ప్రజాపతియిందునిని విలువగలవస్త్రములు ధరించి మఱల కుం భోదకములోఁ జూడుమనును. ఏరూపముతోఁ జూచిన, జలము

---

౧. శ్వేతాశ్వతరము, ౧౨, 2,3, (౨) శ్వేతాశ్వతరము ౧౨, ౯,౧

లోను నద్దమందు నారూపమే ప్రతిఫలించును. ఇంద్రుని కొక సందేహము కలిగినది; "ఈ దేహమే ఆత్మయైనచో దీని ప్రతిబింబము, చక్కగా నలంకరించుకొనినఁ జక్కగానుండును; సుందరవస్త్రములు ధరించిన సుందరవస్త్రములతోఁ గనఁబడును; పరిశుభ్రముగా నున్నచో నదియు శుభ్రముగా గోచరించును; కాని యీ దేహము గుడ్డిదైనచో నదియునట్లే కన్పడును; కుంటిదికాని, వక్రముగాని యైనచో నట్లే ప్రతిబింబము నుండును; మఱియు శరీరము నశించును గాన నిందునాకుఁ దృప్తి కలుగ లేదనెను. కొంతకాలము గడచిన వెనుక నింద్రుఁడు తిరిగి గురువు నాశ్రయింపఁగా నీసారి ప్రజాపతి, 'స్వప్నలోకమున సుఖముగా సంచరించునాతఁడే యాత్మ' యని చెప్పెను. లోపదుఃఖములతోఁ గూడి భౌతికమైన దేహ మాత్మ కాఁజాలదు. శరీరము దాని నుపయోగించు చైతన్యముయొక్క యుపకరణము, చైతన్యము శరీరజము కాదు. ఇంద్రునికిప్పుడు ప్రజాపతి స్వప్నజీవియే యాత్మయని చెప్పినాఁడు, కాని యింద్రుని కింకొక శంక కలిగినది. "స్వప్నజీవి, శరీరలోపములచే లోపములను బొందదు; శరీరము కొట్టబడినచో నది దెబ్బతినదు; శరీరముయొక్క కుంటితనము దానికి లేదు. కాని యీ శరీరలోపములు, దోషములు స్వప్నజీవినిఁ గూడఁ దరుముచున్నట్లె యుండును; శరీరమునకుఁ గల్గిన బాధ స్వప్నజీవియు ననుభవించును; ఏడ్చును, కావున నీ స్వప్నగతమగు జీవి నిజమగు నాత్మ కాదు."౧. ఇతర మానసికానుభవములను విడిచి, స్వప్నానుభూతినే ప్రజాపతి

౧. శ్వేతాశ్వతరము ౭౮. ౧౦-౨-౩.

తీసికొనుటకుఁ గారణము స్వప్నము లితరములకంటె శరీరమునకు దూరమైనవి యగుటచే ముఖ్యములైనవి. స్వప్నప్రపంచమున జీవి విశృంఖలముగా సంచరింపఁగలదు. స్వప్న జలరాశిలో మనస్సు శరీరావస్థలచేఁ గట్టువడక, స్వేచ్ఛగా నీదులాడును. ఈయభిప్రాయము ననుసరించి 'ఆత్మ' నిత్యపరివర్తనమందుచున్న మానసికావస్థా సముచ్చయమని చెప్పఁబడినది. ఆత్మ స్వయంపోషకమైనచో, నీస్వప్నానుభూతి, శరీరసంబంధము కొంతవఱకు లేకుండనున్నను, స్వతంత్రమైనదికాదు. జన్మకాలాది పాశబద్ధమైన యీజీవి స్థిరమైనదికాదు. దేశకాలములను స్తంభములకుఁ గట్టఁబడిన యీజీవి అస్వతంత్రమైనది. సంసారచక్రమందది పరిభ్రమించుచున్నది. సహజలోపములు గల వస్తుసామగ్రిలో లోపభూయిష్టమైన ప్రపంచమును దనకొఱకు నిర్మించుకొనుచున్నది. అది నాశరహితమునుగాదు, స్వతంత్రమునుగాదు. జాగ్రత్స్వప్నావస్థలు యేశక్తి యొక్క అసంపూర్ణ ప్రదర్శనములో, నట్టిఘనతరమైనట్టియు, నీవివిధావస్థానుభవముల కాధారభూతమునైన యొకకర్త యుండవలెను. కేవలావస్థాపరంపర స్వయంపోషకముగాదు. ఈ దేహాత్మభావము స్వశక్తిచే నిలువఁజాలదు. ఇంద్రుఁడు ప్రజాపతిదర్శనముచేయఁగాఁ గొంతకాలమున కిట్లుతిరిగి ప్రజాపతిచెప్పెను; "మనుష్యుఁడేయవస్థలో సుఖముగా నిద్రించుచు, సమగ్రవిశ్రాంతిని బొందునో యాయవస్థలోని జీవియే ఆత్మ"౧. ప్రజాపతికిందుని కష్టము తెలిసినది. ఎల్లప్పుడు మాఱుచుండునవస్థల నాత్మయనుట

---

౧. శ్వేతాశ్వతరము ౨౫. ౧౧,౧

పోసగదు; ఏలన, శాశ్వతమైన ఆత్మపదార్థమున శాశ్వతావస్థలతో సమాస మొనర్పు లోపము సంభవించు టేకాక, నిత్యమగు నాత్మ కనిత్యపరివర్తనము లంటగట్టిన దోషమును తటస్థించును. సర్వానుభవములకు వెనుక నొకకర్త యుండవలె ననుభావము నిందుచే నకుఁ దెలుపవలసియున్నది. దృశ్యము ద్రిష్టపై నాధారపడియున్నది! అదేవిధముగా ద్రిష్ట దృశ్యముపై నాధారపడనవసరము లేదు. ఆత్మయే లేకున్నచో, జ్ఞానము లేదు, కళ లేదు, ధర్మము లేదు. ద్రిష్టతో సంబంధము లేని దృశ్య మసంగతము. ద్రిష్టనుండి సర్వదృశ్యములును వచ్చినవి; ఆదృశ్యములలో ద్రిష్టను గలుపరాదు. ఆత్మ, సర్వానుభవకర్త యని నచ్చచెప్పుటకు, ప్రజాపతి కొంతలోపమున్నను నీపద్ధతి యవలంబించెను. మనజీవితము సామాన్యముగా వస్తుజాలముతోఁ బనిచేయుచుండును. మనము లోకమున కమితముగా నధీనులమైయున్నాము. మనవ్యక్తిత్వము, కోరికలు, ఊహాలు, ఆలోచనములతో నిండిపోయి,నిజతత్త్వము నెఱుఁగకున్నది. వస్తుప్రపంచమునఁ బ్రకృతిస్వభావముచే మునిఁగి, నిరంతరవాంఛితార్థఫలసిద్ధికై క్రియాపరతంత్రులమై మననిజస్వరూపమేది యనుప్రశ్నాపరిష్కారమున కొక్క ముహూర్తమైన నాలోచించుటలేదు. ఆలోచింపనవసరము లేకుండ మనకుఁ దెలిసినదే నిజమని నమ్ముచుంటిమి. దానినిఁగూర్చి యాలోచించి, పరిశీలించుట మనకు క్లేశము. ఐరోపా విజ్ఞానచరిత్రమునందు, జ్ఞానమునుగూర్చిన సమస్య మిక్కిలి యాలస్యముగాఁ దలయెత్తిన తరువాత, క్యాంటు పండితు ననుసరించి, యింద్రియాతీత సమ్యగ్దృష్టికిఁగాని

జ్ఞానము సాధ్యముగాదనియు, ప్లాటినస్ విద్వాంసునిప్రకారము తన మానసిక వ్యాపారముల నర్థముచేసికొను నాత్మశక్తియే జ్ఞానాధారమనియుఁ దెలిసినది. ఎంతజ్ఞానావేశమైనను దెలియుట కాత్మవిలోకన మవసరము. అప్రయత్నముగా మనకుఁ దెలియుచున్న అన్నివిషయములు నాత్మానుభవములే. సర్వానుభవములు, నవస్థలు నొకకేంద్ర సత్పదార్థమునకుఁ జెందవలెను. మార్పులన్నియు నొకమార్పులేని శక్తిలోనివే. ఈ భావము నిందుని మనస్సులో నాటుటకై, ప్రజాపతి, జాగ్రత్స్వప్నావస్థలులేని కాలమునఁగూడ నుండునదే 'ఆత్మ' యని చెప్పెను. గాఢ స్వప్నశూన్య నిద్రలో నేదృశ్యములును లేవు. అంతమాత్రముచే నచ టాత్మ లేదని చెప్పఁజాలము; ఏలనఁ గొన్ని వేళల నున్నట్లు తెలియకున్నను, నవిచ్ఛిన్నమైన 'అహం' భావము నిత్యమైయున్నదను సంగతి యింద్రునకుఁ దెలియుననియే ప్రజాపతి తలఁచెను. దేవదత్తుఁడు నిద్రానంతరము దేవదత్తుఁడే. కారణమాతఁడు నిద్రకుఁ బోవుటకు ముందుగల తన యనుభవముతో, నిద్రానంత రానుభవమును గలిపి, తన యవిచ్ఛిన్న వ్యక్తిత్వమును నిలుపుకొనుచున్నాఁడు. దృశ్యములులేని నిద్రలో నాత్మ లేదనరాదు. ప్రతిబింబము లేనిచో నద్దములే దనినట్లగును. దృశ్యముపై ద్రష్టకు సర్వాధిపత్యమునుగల సత్యము ప్రజాపతి ప్రకటించెను. దీనినే యాజ్ఞవల్క్యుఁడు సర్వదృశ్యము లదృశ్యమైనప్పు డాత్మ స్వీయకాంతిలోఁ బ్రకాశించునని చెప్పినాఁడు. "సూర్యచంద్రు లస్తమించి

నపుడు, అగ్ని చల్లారినపుడు, ఆత్మయే ఆతని దివ్యజ్యోతి."౧ కాని ప్రజాపతి కింద్రుఁడు విశేషముగా మనస్తత్త్వవేత్తగాఁ దోఁచినాఁడు. దేహానుభవములు లేక, వికారాకృతులుగల స్వప్నజాలముతో సంబంధములేక, యేదృశ్యమునులేని యీ 'ఆత్మ' యనునది గగనకుసుమమువంటిదే కాని, నిజముకాదని యింద్రుఁడు తలచెను. ఆత్మయనునది, తాను దెలియునట్టియు, జూచునట్టియు, నూహించునట్టియు, గల్పించునట్టియు నేవస్తుజాలముతో సంబంధములేనిదైనచో నిఁక దాని స్వరూపమేమి? 'శూన్య' మని యింద్రుఁడు చెప్పెను; "దేనితోడను సంబంధములేకపోవుటనగా లేకపోవుటే" యని యాతనిభావము. ఇట్లే గౌతమబుద్ధుఁడు చెట్టు నుదాహరణముగాఁ దీసికొనెను. ఆకులు కోసి, కొమ్మలునఱకి, తొక్కలొలిచి, ఖండించిన చెట్టేమి మిగులునని బుద్ధుఁడడిగెను. పొరలొకటివెనుక నొకటి తీసివేసినచో నుల్లిపాయలో మిగులునదేమున్నది? "శూన్యమే." బ్రాడ్లే తత్త్వవేత్త చెప్పినాఁడు: "మనఃకల్పితములైన దృశ్యములతో నిండియుండక పూర్వముగాని, అవిఅదృశ్యములైన యనంతరముకాని, 'ఆత్మ' యను పదార్థము మిగిలియుండుట కేవలమసత్యము. అసంగతము నిరర్థకమును."3 దీనినిబట్టి స్వప్నశూన్యమగు నిద్రావస్థలో 'నాత్మ' లేదు. నిద్రాలసతచే వచ్చు ప్రతికునికిపాటును 'ఆత్మ' యున్నదను సిద్ధాంతమును రూపుమాపునని లోకేపండితుఁడు నుడివెను. "నిద్రయందు, మూర్ఛ

౧ బృహదారణ్యకము. ౪అ.3.౬. (౨) బ్రాడ్లే. ఎథికల్ స్టడీస్ (పుట ౫౨.) 3. అప్పియరెన్సు అండు రియాలిటీ. పుట ౮౯.

యందు మనస్సులేదు; అప్పుడు కాలజ్ఞానముకాని, భావముల సమన్వయ శక్తికాని లేదు, ఆలోచనలేని మనస్సున్నదనుట స్వవచన విఘాతము, నిరర్థకము, శూన్యప్రకటనము."౪ లాకే, బర్క్లేల 'కనేకయుగముల పూర్వమునసే యింద్రుఁడు వారి వాదమైన దేహాత్మవాదమును ప్రకటించెను. "స్వప్నలేశమైనను లేక సుషుప్త్యవస్థలో దేనినితలఁపక, ఊహింపక, సంకల్పింపక, 'ఆత్మ' అసలున్నదా ? ఉన్నచో నెట్లున్నది ?" యని లోపి యడిగినాఁడు; "జీవితములో నెన్ని పర్యాయములిట్టి తాటస్థ్యముల వలన నాత్మలేదని ఋజువగుచున్నది ! మనమట్టిసందర్భములలో 'నాత్మ' లేదని చెప్పుటకేల సాహసింపరాదు?"౧ ఇందునికట్టి సాహసమున్నది.౨ "ఆత్మనిజముగా నశించినది." ఈభావము వలని ప్రయోజనమును భారతీయ విజ్ఞానచరిత్రలోఁ దఱచు మఱవఁబడెను. బాహ్యజీవిత మసత్యమనుటచే నంతరంగమందున్న దైవమును నాశమొనర్చుటే. కేవలదృశ్య రహితమైన ద్రష్టయేయున్నాఁడను భావమే అత్యుత్తమమైన యాదర్శమని తలఁచువా రిందరు ప్రజాపతుల సంభాషణమును బరిశీలించుట మంచిది. దేహసంబంధము విడిచి, దేశకాలవస్తుజాలబంధములఁ దొలఁగించి చూడఁగా మిగులునది 'శూన్య'ము తప్ప వేఱేమియుఁ గాదని యిందుని నిశ్చయాభిప్రాయము. క్యాంటు, డేకార్టే, లంగీకరించిన యీ 'ఆత్మ' పదార్థము, యీకర్మలేని కర్త

(౪) బర్క్లేన్‌వర్క్సువాల్యూము ౧, ౧౫. పు౩౪.

౧. మెటఫిజిక్సు. ఇంగ్లీషు ట్రాన్స్లేషన్ వాల్యూము ౨, ౨ అ. పుట ౩౧౭.

౨. వినాశమేవాపీతో భవతి. ఛాందోగ్యము ౮ అ. ౨—౧-౨.

దృశ్యములేని దృష్టి, యుండుట కవకాశము లేదు. మానసిక శాస్త్రీయకవిచారణ నీసిద్ధాంతమునకే దారిచూపును. కాని ప్రజాపతి, మాన్పులచేతను, భిన్నావస్థలచేతను మార్పుపొందని 'ఆత్మ'పదార్థమున్నదని ఋజువుచేయఁదలఁచెను. ఆత్మ జాగ్రదావ్యవస్థలయందున్నమాట సత్యమే కాని ఆయవస్థలే ఆత్మకాదు. ఈ విషయమునే డాక్టరు మెక్టెగార్డు పండితుఁడిట్లు సూక్ష్మముగాఁజెప్పెను; "ఆత్మలో నేమున్నది? దానికిఁదెలిసినదంతయు దానియందేయున్నది. దానిలో లేనిదేది? అదేవిధముగా దానికిఁ దెలిసినదంతయు నందులేనిదే ఆత్మయందు లేనిదని దేనినిఁజెప్పఁ గలము? ఏదియులేదు. ఆత్మయందున్నదని దేనిని జెప్ప గలము? అదియుశూన్యమే, ఇందలి వైకల్యమును దొలఁగించుచో 'నాత్మ'యే నశించును. ఏలన నీద్వివిధావస్థలు నాకేయాత్మలో నతుకుకొని యున్నవి. ఆత్మ, వస్తు దృశ్యసంబంధములేని యొక ప్రత్యేకవ్యక్తియని చెప్పుదుమా, యది గుణశూన్యమగును; కాదంటిమా. భిన్నావస్థలు, భిన్నదృశ్యములు కలిసి ఆత్మ యగును; కాని, అపుడీయవస్థలు, దృశ్యములు నదృశ్యములగు స్వభావముగలవి కాన, వానితోఁ బాటాత్మయుఁ బోవును"[౧] అనుభవాతీతమైనదిగా నాత్మను గ్రహించుటలోని ప్రమాదముల నింద్రుఁడు చూపెను, ఆత్మ సర్వసార స్వరూపము కావలెను గాని దేనితో సంబంధములేని యొకకల్పిత వ్యక్తిగారాదు. అందుచే నింద్రుఁడిట్లు తన సంశయమును వెలిఁబుచ్చినాఁడు. స్వప్నరహితసుషుప్తిలో నున్నవ్యక్తి తానున్నానని యెఱుఁగఁడు;

---

౧. హెగెలియన్ కాస్మాలజీ. సెక్షన్ ౨౭,

మరేదియు నున్నట్లెఱుగఁడు. అతఁడప్పుడు నశించిపోయె ననియే నానిశ్చయము." ౨. ప్రజాపతి తానుజెప్పిన యాత్మ భిన్నావస్థలలో నవిచ్ఛిన్నముగానున్న యేకవ్యక్తియని చెప్పెను. సృష్టియంతయు నొక్క సత్స్వరూపముయొక్క ఆత్మపరిదర్శనము. "ఇంద్రా! ఈశరీరము, తత్సర్వము మృత్యువశమైనది. అశరీరియు నమరమునైన యీ యాత్మకు దేహము నిలయము. నేత్రమున స్ఫురించు వ్యక్తియతఁడు; నేత్రమాతని చూపున కుపకరణము. వాసనచూచు వాఁడతఁడు. ముక్కుమాత్రమాతని యుపకరణము..."3. ఇచట ఆత్మయనఁగా నిస్సంగవ్యక్తి కాదనియు నిత్యక్రియాత్మకమైన సర్వదృశ్య ప్రపంచమును నడపు నియమ స్వరూపమనియు, హెగెల్ పండితుని మాటలలో నాత్మ, తన కొఱకుఁ దానున్నదనియుఁ జూపఁబడెను. అది ఏకాత్మకము, సర్వాత్మకము గూడనైయున్నది. ఆత్మ ద్రష్ట, దృశ్యమును, మన కనుభవములోనున్న దృశ్యములన్నియు నాద్రష్టపై నాధారపడియున్నవి. ఆత్మఅనంతమైన దనగాఁ గేవలమంతము కానిదికాదు. అది సాంతపదార్థముగాదు కాని, దానికాధారము. అది సర్వా

---

౨. శ్వేతాశ్వతరము ౮అ. ౧౧.౧

3. శ్వేతాశ్వతరము ౮అ, ౧౨, పోల్చు ప్లేటో తనటైమోన్ గ్రంథములో నిట్లుచెప్పినాఁడు, ఆత్మలు రెండున్నవి. ఒకటి శాశ్వతము, ఒకటి తాత్కాలికము. తాత్కాలికాత్మ కాలాత్మకమగ ద్వైత భావకలితము, అదియే అనిత్యమైన జీవాత్మ; నశించుదేహము తాననియు, నశించు ప్రకృతివస్తువులు తనవనియు నమ్మును. నిత్యాత్మ సర్వజగమున కంతర్వర్తియై నడపుశక్తియుచు మానవునిలో నిమిడియున్న దైవాంశస్వరూపము నైయున్నది" అరిస్టోటల్ కూడ నిట్టి భావములనే ప్రకటించినాఁడు.

తీతము, సర్వాంతర్యామియుఁ గూడను. విశ్వమంతయు దాని యందుండి జీవించుచున్నది. "సూర్యచంద్రులాత్మకుఁ గన్నులు చతుర్దిశలు దాని చెవులు; వాయువాతని యూపిరి." ౧. ప్రతి జీవియొక్క హృదయాంతరాళమున జాజ్వల్యమానమై ప్రకాశించుచున్న జ్యోతి; సర్వప్రాణి కోటి యెందుండి పుట్టినదో యాసూక్ష్మాకాశము; ౨. సృష్టికారణభూతము, ౩ చరాచర జగత్తు భయాన్వితమై యందుఁ జలించుచున్నది." ౪. ఆత్మేతరమెద్దియును లేదు. సర్వవస్తు చైతన్య మందిమిడి యున్నది. మనలో నున్న యనంతాత్మ స్వరూపములోఁ జేరనిదేదియు లోకమున లేదు. సర్వస్వరూపమైన పరమాత్మ సార్వకాలిక చరిత్రాంశములను, సత్యములను దనయందే యిముడ్చుకొనియున్నది. మన అల్పజీవనములు నాత్మయందే యుండినను నాత్మ అతీతమై కూడనున్నది. ఈఆత్మయే సర్వకర్త; దృశ్యగములన్నియు నాతని అసంపూర్ణ ప్రదర్శనములే, ఈ కేంద్రజ్యోతిలోని కిరణములే మనలోని చైతన్యశక్తులు. ఈజ్యోతిలేనిదే అవి యదృశ్యమగును. ఈకర్త లేనిదే, దృశ్యపరంపర కాని, దేశకాలముల రూప ప్రవాహములు కానిలేవు. జ్ఞాపకశక్తి, సమాలోచనము, జ్ఞానము, ధర్మతత్త్వము నివన్నియు నాత్మశక్తి సంజాతములే, ఈయాత్మ సర్వజీవాత్మమయమైన కర యని యుపనిషతులు నిశ్చయించినవి. సర్వవస్తుజాలము నందీయాత్మ అంతర్యామితమై

---

౧. ముండకము, ౧౫, ౧,౧; ఛాందోగ్యము ౩౫, ౧౩,౭

౨. ఛాందోగ్యము ౧౫, ౯౧, (౩) ఛాందోగ్యము, ౧౫, ౧౧,౫ (౪) కఠోపనిషత్తు ౬౫-౧ ఛాందోగ్యము ౮౫౧,౩ (౫) బృహదారణ్యకము ౪౫, ౩,౨౩;

సర్వవ్యాపియైయున్నది, "ఇది తప్ప రెండవ దేదియును లేదు." శ్వాసి యూపిరియాడునపుడు శ్వాసయనియు, మాటాడునపుడు వాక్కనియుఁ జూచునపుడు నేత్రమనియు, వినునప్పుడు శ్రోత్రమనియుఁ దెలిసికొనునప్పుడు మనస్సనియుఁ బిలుతురు. ఇవన్నియు నాత్మ క్రియానామములు మాత్రమే."౧ ఇట్టిలక్షణములతోఁగూడిన యాత్మయే శాశ్వతమైనకర్తయై జాగ్రత్స్వప్నాద్యవస్థలందును, నిద్రామరణములందును, బంధమోక్షములందును నవిచ్ఛిన్నమై యున్నది. ఇదిసర్వకాలములయందునుండి, సర్వలోకములను బరిశీలించును. ఇదియే సర్వకర్తయు. సర్వకర్మయుఁగూడనైనది. ఇదిచూచియుఁజూడదు. ఉపనిషత్తిట్లుచెప్పినది; "అదిచూచుట లేదనుకొనినప్పుడది చూచుచునేయుండును; ఈ చూచు దృష్టి యొక్క చూపునకు విరతిలేదేలన, నీదృష్ట నిత్యుఁడు; కాని అతనికంటె వేరైన యింకొకవస్తువే లేనపుడాతఁడు దేనినిఁజూచును?"౨. ఆత్మపరిపూర్ణము; "ఈదృశ్యమంతయును నేనే 3

ఈ సర్వస్వరూపమైన యాత్మ, స్వభావముచేఁ జూడ నసాధ్యమైనది. శంకరుఁడిట్లు చెప్పెను; "సర్వసాక్షియైన ఆత్మ సర్వచిత్తములను బ్రకాశింపఁజేయునే కాని వానియందుండదు." ఇది మనస్సునకు విషయము కాదు, ఒకదృశ్యముకాదు, కాని యివన్నియు దానికొఱకేయున్నవి; అది జ్ఞానముకాదు; సర్వజ్ఞానములు దానికొఱకే! ఆదిజ్ఞానములు దానికొఱకే; అది కనపడువస్తువుకాదు; కాని చూచుశక్తిదానిదే. క్యాంటు పండి

౧ బృహదారణ్యకము. ౧. అ. ౪. ౭.; కౌషీతకి. 3 అ.

౨. బృహదారణ్యకము. ౪అ, 3, ౨3, (3) అహమేవేదం సర్వోఽస్మి.

తేఁడు చెప్పినట్లు, ఇంద్రియములకుఁ దెలిసినది, తెలియవలసినది కాదు. "ఒకవస్తువునుగూర్చి తెలిసికొనుటకు నేను దేనిపై నాధారపడుదునో అదినాకుఁ దెలియువస్తువుకాదు." సర్వానుభవకర్త అనుభవములోనికి రాఁడు; అట్లువచ్చినచో నెవరికెవలనఁ దెలిసినాఁడను ప్రశ్న మిగులును. అనుభవమునకు ద్వంద్వముండవలెను. కావున నాత్మ అనిర్వచనీయమైనది. కావున నన్ని పరమసత్యములనువలెనే దానినంగీకరింపనలేము. సర్వజ్ఞానమున, కాధారమాత్మయేకాని, ఆత్మ, జ్ఞానముకాదు. కర్త, వెనుదిరిగి, తన్నుఁదానే గ్రహింపఁజాలఁడని చెప్పిన కాంట్ పండితుని వాక్యమర్థవంతమైనదే; "ఇదికాని అదికాని యేదియు, గాని కాని యాత్మఅగమ్యమైనది.కారణ మది యగ్రాహ్యమే."[౧] దేహముకాని, మానసికావస్థలుకాన, దృశ్యపరంపరకాన, చేతనక్రియాసముచ్చయముకాని 'ఆత్మ' యని యుపనిషత్తు లంగీకరింపవు. పరాధారమునుగోరు వస్తుసంబంధమాత్మకు లేదు; విషయసంబంధమును లేదు. ఏలన,విషయములను బంధించు నొక కర్త యుండవలెను. అందుచే సర్వజీవచైతన్యమును ప్రకాశింపఁజేసి, అవి లేనప్పుడును స్వయంజ్యోతియై వెల్గొందునదే యాత్మ యని మన మంగీకరింపకతప్పదు. ఇట్టి నిత్యత్వావిచ్ఛిన్నత్వములు గల సర్వకర్తృకర్మాత్మకమైన సత్స్వరూపమే "ఆత్మ" యని యుపనిషత్సిద్ధాంతము. దానిసత్యము నెవరును శంకింపరాదు.[౨]

౧. బృహదారణ్యకము, ౩అ, ౭,౩; ౪అ, ౪.౨౨

౨. నహికశ్చిత్సందిగ్ధేఽహం వానాహంవేతి (భామతి)

మాండూక్యోపనిషత్తు, 'అహం' తత్త్వముయొక్క వివిధావస్థలను బరిశీలించి యీసిద్ధాంతమునే ప్రకటించినది. ఈవిషయమున నుపనిషత్తుచెప్పిన దానిని మనమాటలలోఁ జెప్పుకొందము. 3. ఆత్మకు మూఁడవస్థలు గలవు; ఇవి నాల్గవ వయవస్థలో లీనమగును. ఇవి మెలకువ, స్వప్ననిద్ర, గాఢనిద్ర, తురీయమునని చెప్పఁబడును. మొదటి జాగ్రదవస్థలో నాత్మ, బాహ్యవస్తుజాలముతోఁ గూడిన ప్రపంచమును దెలిసికొనును. స్థూలపదార్థముల నది యనుభవించును. ఇందు శరీరముపై నాధారపడును. ద్వితీయమైన స్వప్నావస్థయందు సూక్ష్మవస్తువుల నాత్మ యనుభవించును. ౧. ఇందు జాగ్రదవస్థలోని వస్తుసామగ్రితో నూతన రూపప్రపంచమును సృజించుకొనును. ఈస్వప్నప్రపంచమున నాత్మశరీరబంధములనుండి విడివడి స్వేచ్ఛావిహారము చేయును. మూఁడవది సుషుప్త్యవస్థ; ఇందాత్మకు స్వప్నములులేవు, కోరికలులేవు. ఆత్మయీయవస్థలోఁ దాత్కాలికముగాఁ బరబ్రహ్మను సంధానముకలిగి యానందము ననుభవించును. ఈసుషుప్తిలో మనము వాంఛాతీతస్థితికిఁబోయి, జీవదుఃఖములనుండి విశ్రాంతిఁ బొందుదుము. దృశ్యములేని, తెలియుచున్న కర్తస్థితియిది; యిందు వైరుధ్యములన్నియు నశించినవి౨. మనోవ్యాపారముచేఁ గల్గిన ద్వంద్వము జాగ్రత్స్వప్నా

3. మాండూక్యము, ౧౫, ౨,౭

౧. బృహదారణ్యకము. ౪౫. 3 ౬.౧౪ (౨) బృహదారణ్యకము ౨౫, ౧. కౌషీతకి ౪౫: ఛాందోగ్యము ౬౫. ౮.౧: ప్రశ్న ౪౫. ౪; ౪౫, 3,౭

వస్థలలోనున్నది; సుషుప్తిలో లేదని శంకరుఁడు చెప్పినాఁడు. బాహ్యప్రపంచముతో నేసంబంధము లేని యీస్థితిలో ఆత్మ పర బ్రహ్మానందమును ఙవిచూచునని చెప్పిన వాక్యములు పెక్కు గలవు. శరీరబంధములలోఁ దగుల్కొని యున్నప్పటికి నాత్మ పరబ్రహ్మస్వభావముకలది, సుషుప్తిలో దేహశృంఖలముల నుండి బయల్పడి, తనసహజస్వభావమును బొందును. ఆరిస్టాటల్ మహాశయుఁడొకచో నిట్లు పలికెను. "ఆత్మ యెప్పుడేకాకియై, నిద్రయందుండునో, అప్పుడది తనసహజ స్వభావమును తిరిగి పొందును." 3. శరీరయాతనములనుండి స్వేచ్ఛగాంచిన తోడనే, ఆత్మ తనసహజదైవత్వమును బ్రకటించుకొనును. "నిద్రలో నాత్మ తన యాథార్థ్యమును వెల్లడించును." ఈస్థితిలో సర్వవ్యాపారములు శాంతించునని చెప్పుటకు నిత్యజాగ్రదవస్థ కలిగిన దాత్మయని చెప్పఁబడినది. కాని యిది కేవలశుద్ధ చైతన్యావస్థయని పొరపడరాదు. అందుచేతనే మాండూక్యోపనిషత్తు సుషుప్తి చరమావస్థ కాదనియు, నాల్గవదింకొకటి యున్న దనియు నందుఁ గేవలమాత్మ స్వయంసంపూర్ణజ్యోతియై బాహ్యాంతర్వస్తు జ్ఞానరహితమై యుండునసనియు దానినే తురీయావస్థయందురనియుఁ దెల్పెను. సుషుప్తిలోనాత్మ, జాగ్రత్స్వప్నావస్థలలోని వ్యాపారములేమియు లేని మహోచ్ఛస్థితిలో నుండి, పరబ్రహ్మముతో నైక్యానందమును బొందును. సుషుప్తిలోని నిష్క్రియత్వమునకు బదులు, తురీయావస్థలోఁ బరిపూర్ణత్వము ప్రదర్శింపఁబడినది. "తురీయావస్థలో ద్రష్టలేఁడు. దృశ్యములేదు. శుద్ధచైతన్యమును లేదు, అంధకారమును లేదు.

అచటనున్నది. అదృశ్యము, అతీతము, అవేద్యము, అనూహ్యము, అనిర్వచనీయము, సర్వజగత్పరిపూర్ణము; నిత్యశాంతి, నిరవద్యానందము; అదియే ఆత్మ" ౧. అ, ఉ, మ్ కలిసిన ఓంకారము దానిరూపము; జాగ్రత్స్వప్నసుషుప్త లామూడక్షరములకు సరిపోవును. అది శుష్కైకత్వ స్వరూపముగాదు; సర్వజగదాధారమైనది. ౨. సుషుప్తిలో మనకు, పరబ్రహ్మైక్యము కలిగి, భేదమయ ప్రపంచమదృశ్యమగును. కాని యది తుదిమెట్టుకాదు కావున నింకొక సోపానము చెప్పఁబడెను. మానసిక వ్యక్తి, మనః కల్పితప్రపంచము నశించినచో దానితో నాతఁడును నశించును. దీనినిబట్టి, ప్రపంచమదృశ్యమగుటతో నాత్మయు నదృశ్యమగు ననుసంశయము కలుగును. కాని, ఆత్మయందీ ప్రపంచసార మిమిడియున్నది. ఎంతవఱకు వస్తుజాలమాత్మకు సన్నిహితములగునో, అంతగా వానిని మనము తెలిసి, ప్రేమింతుము. ఏలన సర్వవస్తువులాత్మ యందున్నవి. పరివర్తమాన వస్తుప్రపంచము నందంతర్భూతమై ఆత్మ, స్వయముగా నచంచలమై యున్నది. ఆత్మయొక్క బాహ్యప్రదర్శనములు మారుచుండును గాని ఆత్మకు మార్పులేదు. ఆత్మ కాద్యంతములు లేవు; కాని యాత్మ చూచు దృశ్యపరంపర గోచరించుచు నశించుచుండును. "ద్రష్టయొక్క జ్ఞానములేని కాలమెప్పుడును తటస్థించి యుండలేదు. అట్లుండిన దన్నచో దానివెనుకనున్న నిజమైన ద్రష్టలేకకర్త అవిచ్ఛిన్న జ్ఞానమూర్తి యని తెలియవ

౧. ప్రశ్నోపనిషత్తు. ౧అ. ౭.

౨ త్రిషుధామాసు యత్తుల్యమ్ సామాన్యమ్. గౌడ పాదకారికలు. ౧అ. ౨౨

లెను."౧. అట్టి ఆత్మపదార్థమే, సర్వసృష్టికి నాధారభూతము, సర్వ సాక్షియునై యున్నది. వస్తుజాతమున కెట్టిసంబంధములో నాత్మ యాధారమైనదో మనకు స్పష్టముగాఁ దెలియలేదు. ఆత్మ యొక్క చతుర్విధావస్థలను గ్రమముగా విశ్వతైజస ప్రాజ్ఞతురీయ ములని చెప్పఁబడినవి ౨

పైని జరిగిన చర్చవలన, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు మూఁటికినునికి యున్నను, మిథ్యాత్వదోషము పట్టినది. "ఏది మొదట లేదో, చివరను లేదో, మధ్యమందును లేనిదే యగును" ౩, దీనిననుసరించి, జాగ్రదవస్థయు మిథ్యయే. స్వప్నానుభవ మితరావస్థల యనుభవముతో నసంగమగుటచే నసత్యమనియన్నచో జాగ్రదవస్థానుభవము స్వప్నానుభవముతో నసంగతమగుటచే నదియు నసత్యమే యగుచున్నది. జాగ్రదవస్థలోని యనుభవము స్వయంసంపూర్ణమైనచో స్వప్నానుభవము స్వప్నావస్థ యున్నంతసేపు స్వయంసంపూర్ణమే. ఈ జాగ్రత్స్వప్నప్రపంచము లాత్మయొక్క దృష్టిననుసరించియే తాత్కాలికముగా సత్యము లగుచున్నవి. జాగ్రత్కాల పరిమాణమునుబట్టి స్వప్నావస్థలోని యనుభవసత్యాసత్యములను నిర్ణయించుట న్యాయము కాదు. అల్పాధిక పరిమాణములలో జాగ్రత్స్వప్నానుభవములు రెండు నసత్యములే. ఇఁక సుషుప్తిలో బాహ్యాభ్యంతర వస్తుజ్ఞానము లేనేలేదు. అదియొక అగాధమైన విచక్షణలేని

౧. చూడు. దేవీభాగవతము అ౩-౩౨. ౧౫-౧౮

౨. కామ, రూప, ఆకోప, లోకోత్తరములని బౌద్ధుల చతుర్విభావము దీనికి సరిపోవును.

౩. గౌడపాదకారిక ౧అ. ౬.

స్థితి. అది హెగెల్ పండితుఁడు చెప్పినట్లు, అన్ని గోవులును నల్లగాఁగనపడు రాత్రివంటిది. ఇచట మనకున్నస్థితి దుఃఖవిరతి గలది. కాని యిట్టి దుఃఖములేనిస్థితియే ఆత్మస్థితికాదు. ఆత్మస్థితి పూర్ణానందస్థితి, అది మెలకువకాదు, స్వప్నముకాదు, నిద్రయుఁగాదు; ఈమూఁడవస్థలనుదెలిసి, వానికతీతమయినస్థితి. ఈ త్రివిధావస్థలలో నేదియు నాత్మనిజస్థితికాదని చెప్పుటకుఁ గారణమాత్మనిజస్థితి నజ్ఞానబద్ధులమై యున్న మనమెఱుఁగంజాలము. ఈత్రివిధావస్థలను నిర్మూలించుటచేఁగాక, వానినతిక్రమించుటచేఁ దురీయానుభవము లభించును. పరిమితజ్ఞానులమగు మనకాత్మ యనిర్వచనీయమైనది. కాని ఆత్మస్థితి సత్యమని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. ఉత్తమమైన యీస్థితి యసత్యమని శంకించువారి కుతర్కములను ఖండించు నుద్దేశముతో నుపనిషత్తులు కొన్ని యసంగతవాదమార్గములను బ్రకటించినవి. కాని అవి కేవల మసంగతములనియు మనము స్పష్టముగాఁజెప్పఁజాలము. ఐనను, మనకు, ప్రస్తుతవిషయ విమర్శనమునందు జనసామాన్య మంగీకరించిన తార్కికప్రమాణముల నుపయోగింపకతప్పదు.

ఉపనిషత్తులలోఁ జర్చింపఁబడిన సమస్యలన్నిటిలోనాత్మసమస్యయే ప్రధానమైన వానిలో నొకటి. దీనినే భగవద్గీతయందును, వేదాంతసూత్రములయందును "అధ్యాత్మవిద్య"యనిరి. కాని, తరువాతవచ్చిన సర్వతత్త్వములకు "ఆత్మజ్ఞానము" ఉపనిషత్తులిచ్చిన వారసత్వమే. దీనికపార్థములు కూడఁ బెక్కుతలలెత్తినవి. బుద్ధశంకరులు, కపిలపతంజలులు, నుపనిషత్తులనే

ప్రమాణముగాఁ గొని, పరస్పరవిరుద్ధ సిద్ధాంతములను బ్రకటించిరి, జీవజాత మందంతర్యామియై యున్న "ఆత్మ" పదార్థ మూహాకల్పితమని తలఁచుటకొఱ కుద్దేశింపఁబడలేదు. ఆత్మ పరిపూర్ణసత్యము, సంపూర్ణచైతన్యము నై యున్నది. అది కేవల మొకదుఃఖరహితమగు శుష్కశాంతిరూపము కాదు. సత్యాన్వేషణమునందు, వస్తుపరిశీలనములో నేది సత్యముకాదో దానిని ముందు నిర్వచించి, తరువాత త్యమేదో నిశ్చయించు పద్ధతిని తర్క మంగీకరించును. ఈపద్ధతివలన నసంపూర్ణవస్తుప్రదర్శనము నిజమగు నాత్మకాదని తెలిసికొనవలెను. ఆత్మయందే సర్వవస్తుసంతతికి స్థానమున్నది. కొందఱు బౌద్ధులీయాత్మ నిర్జలభాండమువంటిదనియు, నది తార్కికుని 'శూన్య' కల్పనమనియు తలఁచిరి. ద్రష్టయొక్క దృశ్యప్రపంచమునం దీయాత్మ నేమూలలను గాంచలేము; అందుచే నది శూన్యమే యని నిశ్చయింప సాహసింతుము. సాంఖ్యులు దీనినొక నిష్క్రియాత్మకమైన శుద్ధసత్త్వముగాఁ దీసికొందురు. కాని దీనికి గుణశీలపరిత్యేకత్వమును గల్పింతురు. అందుచే మనకనంత సంఖ్యాకమగు నాత్మసిద్ధాంతము లభించినది. కొందఱు వేదాంతు లాత్మ లేక బ్రహ్మపదార్థము, శుద్ధముక్తశాంత స్వరూపమనియు, నద్వితీయమనియుఁ జెప్పుదురు. అట్లుచెప్పుటలో నాత్మనొక నిర్వీర్యమగు నల్పవ్యక్తిగాఁ జేయుచున్నామని వారెఱుఁగరు. ఆత్మ కేవల మొకబుద్ధిశక్తిరూపమనియు,నది యూహించుటకే వస్తుకలాపము తనయందు లేకుండ నూహించుననియుఁ గొందఱు బౌద్ధులు ప్రకటించిరి.

## బ్రహ్మము

పరమరహస్యమైన బ్రహ్మపదార్థమునిపుడు తత్త్వప్రమాణ పద్ధతులచే నిర్ణయింపయత్నింతము.౧ ఋగ్వేదమునందు బ్రహ్మైక్యభావము కనుఁగొనఁబడినది. నిత్యక్రియాత్మకము నిష్క్రియాత్మకము నైన పరబ్రహ్మతత్త్వమును సహేతుకముగా బ్రదర్శింప నుపనిషత్తులు పూనుకొనినవి.౧ తైత్తిరీయోపనిషత్తునందుఁ జూపఁబడినట్లు, మనమిఁకొకచో సత్యపరిణతభావముల నుండి అధికపరిణతినందిన 'ఆత్మ' భావములెట్లు పెంపొందినవో

౧. ఉపనిషత్తులలోఁ జెప్పఁబడిన పరమసత్యము బ్రహ్మమని పండితులచే భిన్నరీతుల గుర్తింపఁబడినది. రాగ్ పండితు ననుసరించి, 'బృహ్' (పెరుగుట, వృద్ధిపొందుట) ధాతువునుండి వచ్చినదగుటచేఁ బ్రార్థనమని యర్థము. పవిత్రప్రార్థనములవలన, వృద్ధికలుగును. దీనికే ప్రకృతిశక్తియని యర్థము వచ్చెను. క్రమముగా నదియే పరమసత్యమైనది. రాత్ పండితు ననుసరించి బ్రహ్మమనగా దేవతలయెడ లగ్నముచేసిన సంకల్పము, తరువాత పవిత్రమంత్రము, తరువాత పరమాత్మయని గ్రహింపఁబడెను. ఓల్డెన్‌బెర్గ భావములో, వేదకాలమునందు, దేవతలు, మంత్రశక్తులు విశేషముగానున్నవి కావున, మంత్రవైద్యునికిఁ బ్రాముఖ్యమువచ్చినది. ఆతఁడు తనమంత్రముచేఁ గోరిన ఫలితమును గలుగఁజేయువాఁడు. అప్పుడు బ్రహ్మమనగానొక విచిత్రమంత్రము. బ్రాహ్మణములకాలమున, బ్రహ్మమనగా యజ్ఞములలోఁజెప్పు మంత్రము. బహుశః కొన్ని మంత్రము లుచ్చరించినచో విచిత్రఫలితములు కలిగెడివి. క్రమముగా సృష్టిహేతువైనశక్తి యనునర్థము వచ్చినది. డ్యూసేన్ పండితుఁడు, బ్రహ్మమనగాఁ బ్రార్థనమనియుఁ, బ్రార్థన మాత్మకు సత్యదర్శనమిచ్చుననియుఁ, దరువాత సత్యమే బ్రహ్మమనియు వాడఁబడినదని చెప్పెను. బ్రహ్మము 'వాక్' నుండి, బృహస్పతి, వాచస్పతి శబ్దములవలె నేర్పడినదనెను. మనకు స్పష్టమైన యర్థము బ్రహ్మమనఁగా సత్యమనియే.

౧. చూడు రైన్ ఆఫ్ రిలిజియన్ అధ్యాయము. ౧౩

చూచియుంటిమి. తైత్తిరీయము తృతీయాధ్యాయము నందొక కుమారుఁడు తండ్రిని సమీపించి, సర్వవస్తుజాలము దేనినుండి బయల్పడి, దేనియందుఁ జేరుచున్నవో యాబ్రహ్మపదార్థమును గూర్చి బోధింపుమని యడిగెను. తండ్రి కుమారునికి పరబ్రహ్మ లక్షణములను సామాన్యముగాఁ జెప్పి తద్గుణవిశేషముల నూహించుకొమ్మని బోధించెను. "ఈప్రాణులన్నియు దేనినుండి పుట్టినవో, పుట్టి దేనియందు వసించుచున్నవో, మరణించి తిరిగి దేనియందుఁ బ్రవేశించునో, అదియే బ్రహ్మ[2]ము"ని యాతఁడు చెప్పెను. జగద్వస్తుజాలమంతయు రూపపరివర్తనమునందుచున్న కారణముచే నదిస్థిరమైనదని చెప్పవీలులేదు. నామరూపప్రపంచమున కాధారభూతమై యెన్నఁడు మార్పునొందని వస్తువేదైననున్నదా? కుమారుఁ డన్నమే పరమసత్యమని పల్కెను. ఇది ప్రపంచముయొక్క స్థూలరూపము. లోకాయతు లీభావమును గలిగియున్నారు. కుమారుఁడు కేవలమన్నము చైతన్యయుక్తమైన ప్రాణికోటి నీయఁజాలదను నిర్ణయమునకు వెంటనే వచ్చినాఁడు. తరులతాదులకుఁ బ్రాణము నిచ్చునదొకటి యుండవలెను. ప్రాణమే యట్టిపదార్థమని నిశ్చయించెను.[3] ప్రాణములేని పదార్థముండఁజాలదు; పదార్థములేక ప్రాణము గోచరింపదు. ఈప్రాణశక్తి, అన్నములోఁ గావలసిన దానిని దీసికొని, దానిననుభవించి, పదార్థమును జైతన్యవంత మొనర్చును. జడమైన అన్నమును, రక్తమాంసాదికముగా మార్చు

౨. తైత్తిరీయము. 3అ. ౧
౩. ప్రాణమనగా శ్వాస. చూడు. రా.వే.భా. ౮౧-౬,౧: 3అ. ౫3,౨౧; ౧౦౨. ౫౯. ౬

నీశక్తియే ప్రాణశక్తి, ఈప్రాణశక్తి సర్వమునందు వ్యాపించి, మానవజాతికి జడజగత్తునకు సంబంధము కలుపును. ౧. అన్నముకంటెఁ బ్రాణమింకొకజాతికిఁ జెందినశక్తియనియు, నది అన్నసారమనియుఁ బుత్రిఁడెఱుఁగును.౨. కాని దీనివలన నాతనికిఁ దృప్తికలుగలేదు. ఆలోచించు మనశ్శక్తిని ప్రదర్శించు జంతుజాలము నాతఁడు చూచి, ప్రాణమట్టి శక్తిలేనిదని నిశ్చయించినాఁడు. అందుచే నాతఁడు మనస్సే పరమసత్యమైన బ్రహ్మమని నిర్ణయించెను. కాని యిదియు నసంగతము. ఏలన, మనస్సు కేవలము విషయములను గ్రహించునేకాని, విచక్షణశీలముగల బుద్ధివేఱుగా నున్నది. అందుచే విజ్ఞానము బ్రహ్మమని తలఁపఁబడెను. 3 కొన్ని బౌద్ధమతశాఖలు దీనినంగీకరించినవి. కాని కుమారుఁడు దీనికిఁ దృప్తిపడలేదు; ఏలన, బుద్ధిశక్తి పరిమితమును, లోపభూయిష్టమునగుటచే స్వయం సంపూర్ణము కాదు. మనమెంత ప్రయత్నించినను, బుద్ధిశక్తిచే నిర్మితములైన జ్ఞానవిషయము లన్నిటికిని అసంపూర్ణత్వానేకత్వ దోషములు పట్టునని యుపనిషత్తులు చూపుటకు నిశ్చయించినవి. విజ్ఞానమునందు, నీతితత్త్వమునందు, ద్రష్టృదృశ్యసంబంధము తప్పదు. బుద్ధ్యతీతమైన స్థితియేదో యొకటుండవలెను. దానిననుసరించి మన ప్రమాణములు సత్యనిర్ణయమునకుఁ బనికిరావు. సత్పదార్థమేకత్వలక్షణముగల దగుటచే, ననేకత్వలక్షణముగల బుద్ధిని దాటి మనమింకొక సాధనమును జూడవలెను, బుద్ధియొక్క-

---

౧. ప్రశ్నోపనిషత్తు ౨అ.

౨. బృహదారణ్యకము ౧అ.3.౨౦; ఛాందోగ్యము. ౬అ. ౨.౮

3. ఐతరేయము 3అ. 3; తైత్తిరీయము 3అ. ౫.

ఆలోచనలోఁ దానాలోచించు పదార్థములు; వేఱుగా నున్నవని సామాన్యముగా నమ్మును. బుద్ధి తనవ్యాపారములోఁ దనకంటె వేఱుగానున్న వస్తువుల నూహించును. సత్యమాలోచనాతీతము. అది తురీయావస్థలో గోచరించును. అచట సత్యదర్శకు సత్యము వేరుగా లేదు; రెండునొకటే. అచట జ్ఞాని, జ్ఞానము, జ్ఞేయమునొకటే యగుటచే, నానందముత్తమఫలము. ఇచట బ్రహ్మజిజ్ఞాస పూర్తియగును; ఆనందముకంటె నధికమైన దింకొక ఫలము లేదు. ఈయానందము నిరవధికమైనది; అనఁగా శూన్యప్రదేశము కాదు; జీవియొక్క పరిపూర్ణదశనందుట ౧. "తమ దివ్యజ్ఞానముచే విచక్షణులు నిత్యానందస్వరూపము మరణాతీతమునైన "ఆత్మ"ను దర్శింతురు." ౨. ఈయానందమును గూర్చి మనము నిజముగా నేమియుఁ జెప్పఁజాలము. దానిస్వరూపమును గూర్చినప్రశ్నకే యవకాశమును లేదు. మనము బుద్ధిఘటములో నుండుటచే నేదోవిధముగా దానినర్థము చేసికొనవలసియున్నది. ఆనందము, సర్వాతీతమైన దగుటచే, సర్వసారస్వరూపమగును. సర్వము నానందమునుండియే జనించి, యందే నివసించి, యందే లీనమగుచున్నవి. జడములు, వృక్షములు, జంతువులు, మనుష్యులు గల వివిధజాతులు దానితో నవినాభావ సంబంధము కలిగియున్నవి. వాని యన్నిటి సత్యసారస్వరూపమే యానందము. ప్రపంచములోని సర్వజీవరాసులు బ్రహ్మానందముచే నావృతములై యున్నవి;

౧. చూడు, ముండకోపనిషత్తు
౨. ముండకము ౨౨. ౮

అవి భిన్నరూపములను గలిగియుండుటకుఁ గారణము వానికి భిన్నకర్తవ్యములున్నవి. ఈజీవులన్నియు స్వయంపోషకస్థితి కలిగినవికావు; వానిస్థితి బ్రహ్మముపై నాధారపడి యున్నది. "దేవా! ఈ ఆనందస్వరూపమైన అవ్యయ బ్రహ్మ మెవనిపై లేక దేనిపై నాధారపడియున్నది?" ని యడిగెను. సర్వము దానిపై నాధారపడియున్నది; అది దేనిపై నాధారపడదు. ఒక సంపూర్ణమైన వస్తువులోని వివిధాంశములు నావస్తువుతో నెట్లు విభాజ్యసంబంధము కల్గియుండునో యట్టిసంబంధమును దెల్పు వాక్యము లుపనిషత్తులలోఁ బెక్కుగలవు. "ఒకబండిచక్రము లోని యాకులన్నియు నొక్కయిరుసులో నెట్లతుకబడియున్నవో అదేవిధముగా సర్వప్రాణములు, సర్వదేవతలు, ప్రపంచములు సర్వేంద్రియము లాపరమాత్మలో నిమిడియున్నవి."౧. "పరమాత్మ అతిపురాతనమైన అశ్వత్థవృక్షము. దానివేళ్లుపైకిని, కొమ్మలుక్రిందికిని పెరుగును, సర్వప్రపంచములు నందిమిడియున్న మరణాతీత దివ్యజ్యోతిర్మయమైన బ్రహ్మస్వరూపమది; అదికాక మఱేదియును లేదు."౨.

పరమసత్యమైన పరబ్రహ్మ మనిర్వచనీయమని చెప్పి తద్విరుద్ధముగా నది 'ఆనంద'మని వర్ణించితిమి. సర్వసంపూర్ణమైనసత్యమును మనమూహింపయత్నించునపు డదియొకమూర్తిమత్త్వమును బొందును. మనము భావముచేఁ గల్పించిన సత్యమును అనిర్వచనీయసత్యమునుబోల్చినచో 'ఆనంద' మనిర్వచ

౧. బృహదారణ్యకము. ౨ అ. ౫. ౧౫.
౨. కఠము. ౨ అ. ౬-౧; తైత్తిరీయము. ౧అ.౧౦; భగవద్గీత ౧౫అ౧.

నీయసత్పదార్థము కాఁజాలదనియుఁ, గాని బుద్ధిశక్తిచేఁ జెప్ప సాధ్యమైన బ్రహ్మమునుగూర్చిన మహోన్నతభావమనియుఁ దెలియవలెను. ఆనందము స్వయంజ్యోతియై స్వయంసంపూర్ణమై వెల్గు పరబ్రహ్మముకాదు. తార్కికబుద్ధికి సంపూర్ణమైనది సత్యమనితోఁచును; అందుఁ బ్రపంచములోని భిన్నపదార్థజాలమంతయు నంతర్భూతమైయుండును. సగుణమైన యానందము బుద్ధికిగోచరించిన ఉత్తమప్రమాణమునకు సరిపోవుసత్యము. ఇదియే రామానుజుఁ డంగీకరించిన పరబ్రహ్మరూపము. దీనినే ప్రామాణికసత్తాయందురు. అనిర్వచనీయమైన పరబ్రహ్మమును నిరుపాధికసత్తాయని చెప్పుదురు. ఇదియే శంకరాచార్యుని నిర్గుణబ్రహ్మము. మొదటిది బుద్ధిగోచరమైన సంపూర్ణవ్యక్తిత్వము; రెండవది వాగతీతమైన పరమసత్యము. కాని నిర్గుణబ్రహ్మమే సగుణబ్రహ్మముగా దర్శనీయమని శంకరుఁడే చెప్పినాఁడు. ధ్యానసిద్ధిలో నిర్గుణబ్రహ్మము, జ్ఞానదృష్టిలో సగుణమై ప్రకాశించును.౧.

---

౧. ఉపనిషత్తులు సత్పదార్థమనిర్వచనీయమని స్పష్టముగాఁ జెప్పినవి. కాని బుద్ధిశక్తికిసాధ్యములైన వర్ణనములిచ్చియున్నవి. అవి పూర్ణతృప్తినొసఁగఁజాలవు, బుద్ధిచెప్పు నిర్వచనమేదైన సత్యమగుచో నదిరామానుజతత్త్వమే. ఉపనిషత్తులభావము ననుసరించి, శంకరుఁడు రామానుజునితత్త్వమైన బుద్ధికల్పితసత్యమున కతీతమైనదే సత్పదార్థమని వ్యాఖ్యానించియున్నాఁడు. బుద్ధికల్పితములైన ఉత్తమప్రమాణములుకూడ సత్పదార్థనిర్ణయములో నెట్లసమర్థములో శంకరుఁడుచూపినవాదమును శంకరాద్వైతతత్త్వమును మనము చర్చించునపుడు చూడనగును. సత్పదార్థమంతమో అనంతమో, రెండునో, ఏదియును గాదో, మనము చెప్పఁజాలమని శంకరునివాదము. పూర్ణమునకు నంశమునకును, వస్తువునకు గుణమునకును, కారణమునకును గార్యమునకు నిదియే సంబంధము.

ఈభిన్నదృక్పథముచే నుపనిషత్తులలోని యానందమును గూర్చి విశేషచర్చలు బయలుదేఱినవి. 'ఆనందమయ' శబ్దము లోని 'మయ' వలన ఆనందము గుణమని శంకరాచార్యుఁడు వక్కాణించెను. ఆత్మనుండి భిన్నమైనగుణమునుగూర్చికాని హేతుచర్చ యసంబద్ధము. అది కేవలబ్రహ్మపదార్థమేయైనచో దానికి రూపమిచ్చి, గుణములారోపించుట, విరుద్ధప్రసంగము. కాని తైత్తిరీయోపనిషత్తులో నానందమునకు శీర్షాద్యవయవకల్పనముగలదు. ఆనందమే బ్రహ్మమైనచోఁ దైత్తిరీయమునందు బ్రహ్మమును వేఱుగాఁజెప్పి ఆనందముయొక్క రక్షణపుచ్ఛమని వర్ణింపఁబడెను.౨. కావున శంకరుఁడిట్లు నిశ్చయించినాఁడు; "ఆనంద మాయాత్మ, నిర్గుణపరమాత్మయొక్క ప్రతిబింబమే యగును." రామానుజుఁ డీయానందమే బ్రహ్మమని వాదించినాఁడు. 'ఆనందమయ' శబ్దములోని 'మయ' శబ్దము 'ఆనంద'ము పూర్ణమైనదని తెల్పును. అన్నము, ప్రాణము మున్నగువానికి లోపల నింకేదియోయున్నదని 'అన్యోఽంతరఆత్మా' ఆనందమున కట్టిదేదియునుజెప్పలేదు. అవయవవాదులుచెప్పుట కేవల మూహాకల్పనము. 'పుచ్ఛంబ్రహ్మ' శబ్దమువలన బ్రహ్మకు నానందమునకు భేదమున్నదని తలఁపరాదు. రెంటికిని బూర్ణమునకు వంశమునకుఁగల సంబంధమును జెప్పవచ్చును౧. ఆనందమయ

౨. బ్రహ్మపుచ్ఛంప్రతిష్ఠా ఉపనిషత్తులకును శంకరునకు మధ్యకాలమందు వ్యాపించిన బౌద్ధసంప్రదాయమే, తార్కికహేతువాద మసంపూర్ణమనియు, దానికిఁ గొన్ని సరిహద్దులు దాటిపోవశక్యముగాదనియుఁ జూపుతత్త్వమును శంకరాచార్యుఁడు మనకుఁ బ్రసాదించునట్లు చేసినది.

౧. సముదాయ సముదాయీభావము.

స్వరూపవర్ణనమైనవెంటనే ఉపనిషత్తు 'సోఽకామయత' యని పుంలింగశబ్ద ముపయోగించినది. ఆపుంలింగశబ్దవాచ్యుండే ఆనందమయుండు. ఆనందమయశబ్దము 'సః' తో నన్వయింప వలెనుగాని, 'పుచ్ఛబ్రహ్మ' తోఁగాదు. ఏలనఁ 'బుచ్ఛంబ్రహ్మ' నపుంసకలింగము. ఆనందరూపములైన 'ప్రియము' 'మోద'ము మున్నగుశబ్దము లానందపూర్వరూపములుగా నుపయోగింపఁ బడినవి. శిష్యుండు వీనినుండి ముందుకుఁబోయి యానందము నొద్ద నాగిపోయెను. తైత్తిరీయములోనే ఆనందము బ్రహ్మ మను నర్థమిచ్చువాక్యములున్నవి.

ఈవిచారణమంతయు 'నానందము'బుద్ధికల్పితభావమా? యనువిషయమునుగూర్చియేయని స్పష్టమైనది. శంకరుఁడు సమర్థించిన ధ్యానైకగమ్యుఁడగు నేకబ్రహ్మసిద్ధాంతముగాని. రామానుజుఁడు సమర్థించిన సగుణబ్రహ్మసిద్ధాంతమునుగాని విస్పష్టముగా వేఱుచేసి యుపనిషత్తులేమియుఁ జెప్పియుండలేదు. ఈరెండు సిద్ధాంతములను వేఱుచేసినచో, నామరూపప్రపంచ మున నెట్టిభేదమునుగాని, విలువనుగాని గుర్తించుట సాధ్యము కాదు. ఉపనిషద్భావములో బ్రహ్మమే యీశ్వరుఁడు. భావను సరియైనతూనికతో భావమునుదెల్పుట కుపయోగించినచో 'పర బ్రహ్మము'ను గూర్చి "అహంబ్రహ్మాస్మి"౧. యని చెప్పుకొని నప్పుడు పూర్ణబ్రహ్మపదార్థము లేశమాత్రముగానైనను సంకు చితమైనదని చెప్పకతప్పదు. ఈలేశమాత్రలోపమునుబట్టి, దేశ కాల నిమిత్తబద్ధమైన ప్రపంచమును బ్రహ్మప్రదర్శనమేయని

౧. బృహదారణ్యకము ౧ అ. ౪-౧౦

శంకరుఁడుచూపెను. దురూహ్యమైన బ్రహ్మమును మనమూహించిన క్షణమందే, భిన్నత్వానాత్వములును బ్రహ్మవంటి సత్యములేయని యుపనిషత్తుల నిగూఢభావమనితోచును, ఆత్మసాక్షియగు సత్పదార్థము. గుణసంపూర్ణమైన పరమేశ్వరుఁడుగా మాఱినప్పుడు మనకు లభించినదేవన పూర్ణసగుణబ్రహ్మము సంకుచిత నిర్గుణబ్రహ్మమును. ఏకమైనసత్పదార్థము, అనేకమైన జగత్పదార్థజాలములోఁ బ్రతిఫలించినది. అందుచేతనే వస్తువులతత్త్వము నవిబ్రహ్మమున కెంతదూరములోనున్నవో దానినిబట్టి నిర్ణయించుచున్నాము. అందుచే బ్రహ్మము భిన్నవస్తువులలో భిన్నరూపములలోఁ బ్రదర్శితమగుచున్నది; ఆకారణముచేఁ బ్రతివస్తువునకును దేశకాలనిమిత్తములతో సంబంధమును గలుగుచున్నది. ఈవిధముగానేర్పడిన సోపానపంక్తిలో జడపదార్థములు సత్పదార్థమునకు విశేషదూరముగాను, దేవతాదులు దానికి మిక్కిలిసమీపములోనున్నారు. ఉపనిషత్తులలోఁజెప్పిన ఆనందమయుఁడు. రామానుజుని సగుణబ్రహ్మము శంకరుని యీశ్వరుఁడు, సత్పదార్థమునకుఁగల సోపానపంక్తిలో దుదిమెట్టననున్నారు. అదియే సత్పదార్థమున కత్యంతసమీపమైనమెట్టు, దానిపై నింకొకమెట్టులేదు. ఆసత్పదార్థము, విజ్ఞానఘట్టమున నానందమయుఁడుగా గోచరించిన సగుణబ్రహ్మము. స్వాయముగాఁ గోరి సంకుచితత్వమునందిన శంకరుని యీశ్వరుఁడే ఈశ్వరుఁడేకత్వమున కాధారము; అన్నములేక పదార్థము అనేకత్వమున కాధారము.౧.

౧. చూడు, తైత్తిరీయము ౧౫.౫; వేదాంతసూత్రములు ౧౫, ౧౬పై శంకరరామానుజ భాష్యములు చూడు.

## ౯ బ్రహ్మపదార్థము-ఆత్మపదార్థము.

ద్రష్ట, దృశ్యము; బ్రహ్మము, ఆత్మ, బ్రహ్మాండము, పిండాండము నీరెండును సమానములని తలఁపఁబడెను. బ్రహ్మమే ఆత్మ. ౨. ఈ మానవుని యందున్న బ్రహ్మము, సూర్యునియందున్న బ్రహ్మము నొకటే"౩. ఋగ్వేదములో లోకాతీతుఁడైన బ్రహ్మము, ఇచట సర్వాంతర్యామి యయ్యె ను. అనంతమైన శక్తి అంతముగల పదార్థముల కతీతమై యె చ్చటనో లేదు. వానియందే యున్నది. ఈమార్పునకుఁ గారణ ముపనిషత్తులతత్త్వము ఆంతరంగికమైనది. ప్లేటో తత్త్వవేత్త పుట్టుటకుఁ బూర్వమే యీద్రష్ట, దృశ్యముల సమత్వము తెలిసి కొనఁబడినది. దీనినిగూర్చి డ్యూసేన్ పండితుఁడిట్లు వ్రాసెను; "ఈతత్త్వమునుగూర్చి వేదాంతగ్రంథములలో రచింపఁబడిన అనుచితాలంకారములను, అతిశయోక్తులను విడిచి, కేవల స్వ చ్ఛతాత్త్వికదృష్టితోఁ జూచినచో, జీవాత్మ పరమాత్మ సమత్వ ము లేక బ్రహ్మాత్మసమత్వముయొక్క మహత్త్వవైశిష్ట్యముపనిష త్సమను, తత్కాలమును, దేశమునుగూడ నధిగమించునంతటి ప్రాముఖ్యముగలది; మానవజాతికంతకు నమూల్యమైన విలువ గల గొప్పభావమిది. భవిష్యత్తులో నెట్టిపరిశోధనము లెట్టి నూత్నసత్యములను గనుఁగొనునో చెప్పఁజాలనుగాని, ఒక్కవి షయమును మాత్రము నేను నిస్సంశయముగ నొక్కిచెప్పఁ

౨. తైత్తిరీయము ౧అ,౫, (3) తైత్తిరీయము ౨అ,౮; ౩అ,౧౦ ఛాందోగ్యము అ౩-౧౩,౭; అ౩-౧౪,౨,౪, బృహదారణ్యకము ౫అ, ౫,౨ ముండకము ౨అ,౧,౧౦

గలను. భావితత్త్వశాస్త్రము లూహింపరాని యెట్టి నవ్యమార్గ ములను ద్రొక్కినను. ఈబ్రహ్మాత్మసమత్వభావ మచంచలమై నిలువఁగలదు; దానిబాటకు వక్రతయెన్నఁడును సంభవింపదు. ఈసృష్టిరహస్యసమస్యను గూర్చిన విశేష పరిశీలనమువలనఁ దత్త్వవేత్తలకు నూత్నసత్యమెట్టిది గోచరించినను, దానికి మూలమంత్రము మానవునియందు గంభీరమై, గర్భితమైయున్న యంతరాత్మయందే లభింపఁగలదు. ఉపనిషత్కర్తలైన ఆదివైజ్ఞానికులు, తమకంతములేని యశము నార్జించిన జీవపరమాత్మ సమత్వసిద్ధాంతము, అనఁగా మానవునిలో నంతర్యాభూతమైయున్న ఆత్మయే, సర్వజగదంతర్యామియైయున్న పరబ్రహ్మమని కనుగొనిన సిద్ధాంతము. ప్రపంచచరిత్రలో మొట్టమొదటిది, అగ్రిస్థానము వహించునదియునై యున్నది"౧. ఈజీవాత్మయుఁ బరమాత్మయు నొకటేయను తత్త్వమొక సామాన్యమైన సంశయాస్పద వాక్యముకాదు; అది మనసమాలోచనములయొక్కయు, నూహలయొక్కయు, సంకల్పములయొక్కయుఁ దొలఁగింపరాని అవినాభావసంబంధముగల దివ్యసత్యము. ప్ర దురూహ్యము, నజేయము, నప్రియమునైనచో మానవునియంతరాత్మ దానినిగూర్చి తలఁపకయు, దానిని జయింపకయుఁ బ్రేమింపకయునుండి యుండెడిదే. ప్రకృతి యొకదృష్టియొక్క దృశ్యము; ఒకకర్తయొక్క కర్మ; అదిహేతు బద్ధమైనది, బుద్ధికి గోచరించునది, ప్రేమింపఁదగినది. ప్రకృతిమానవుని కొఱకే యున్నది. తానడుగులు ముందు కిడుటకు నక్షత్రములు కాంతి

౧. ఫిలాసఫీ ఆఫ్ ది ఉపనిషత్సు, పుటలు ౩౯—౪౦

నిచ్చును; అంధకారమాతని కింద్రియశాంతినిచ్చి నిద్రకు జో కొట్టుట కుపయోగించును. ప్రకృతి, తన తెరమఱుఁగునున్న సత్పదార్థమును గుర్తింపుమని యాహ్వానించి, జీవయాత్రకుఁ దోడ్పడుచున్నది. ప్రకృతి ఆత్మచే సృజింపఁబడి, పోషింపఁబడి, నడుపఁబడుచున్నది. సృష్ట్యారంభమునుండి మనస్సాలోచింప నారంభించిన ముహూర్తమాదిగ, పురుష, ప్రకృతి సమత్వము సర్వము నావరించి, నిండియుండిన కేంద్రపరమశక్తి స్వరూప భావము, యోగ్యులగు వారందఱకుఁ దెలిసినదే. "తత్త్వమసి", "ఆ బ్రహ్మమే నీవు" వాక్యమందలి సత్యమునకు, ధ్యానయోగము పావనభక్తి భరితమైన మతానుష్ఠానమును సాక్షీభూతములై యున్నవి. దీనిభావము మనకుఁ దృప్తికరముగాఁ దెలియకపోవచ్చునుగాని, దానిని నిరసించుటకు మనకధికారము లేదు.

పరబ్రహ్మమును గూర్చి వివిధభావములు, ఆత్మనుగూర్చిన వివిధాభిప్రాయములు నొండొంటితో సరిపోవుచున్నవి. తరువాత రచింపఁబడిన వేదాంతగ్రంథములలో, బ్రహ్మపదార్థమును గూర్చిన వివిధాంతరువులైన జాగ్రత్స్వప్నసుషుప్తి తురీయములు స్పష్టముగాఁ బేర్కొనఁబడినవి, పరమసత్యమైన పరబ్రహ్మమే, తురీయావస్థయందు దర్శింపఁబడిన 'ఆత్మ' పదార్థమే. ఇచట ద్రష్ట, దృశ్యమునొకటే. ఇచట చూచువాఁడు, చూపు. చూచినది ఒకే పూర్ణత్వములోఁ గలిసిపోవును. ఆత్మ పదార్థమును, జ్ఞానితో సమానముగాఁ జెప్పినపుడు, బ్రహ్మపదార్థము నీశ్వరునిగాఁ జూతుము. అంతరాత్మయందు నివసించియున్న 'ఆత్మ' వినా వ్యక్తిత్వమే లేనప్పు, డీశ్వరునికిఁగూడ

వ్యక్తిత్వమిచ్చు నొకయంతర్వర్తియైన శక్తిగావలసియున్నది. మతానుష్ఠానమున కీశ్వరభావమే మహోన్నతసత్యము. ప్రాణమే బ్రహ్మము, మనస్సే బ్రహ్మమని చెప్పినపుడు మనకు లభించినది హిరణ్యగర్భుని భావము. ఇది ఆత్మేశ్వరుల మధ్యభావము, హిరణ్యగర్భునకు జగత్తునకు, దేహాత్మలకుగల సంబంధమున్నది. ఇచట ఋగ్వేదభావము గోచరించుచున్నది. ఈజగత్తున కొకబుద్ధి, సంకల్పమునున్నవని యూహింపఁబడెను. మనసములు కలిసియుండును. అట్లే యీజగత్తను శరీరమున కొకపెద్దమనస్సున్నది; అదియే హిరణ్యగర్భుఁడు. ఈవిషయము మ గూర్చిన భావము లుపనిషత్తులలో నచ్చటచటఁ గలవు; నామరూపములలో మాత్రము మార్పుగలదు. ఈశ్వరుని కారణ బ్రహ్మమనియు, జగత్తును గార్యబ్రహ్మమనియుఁ జెప్పిరి. సర్వకార్యసముచ్చయమే కార్యబ్రహ్మము లేక హిరణ్యగర్భుఁడు, స్వభావముచే నీతఁడు పరబ్రహ్మనుండి భేదింపఁడు. బ్రహ్మపదార్థము, ఏకము; నిర్గుణము నద్వితీయమునైనది. ఒకప్పుడా బ్రహ్మమునే సృష్టికర్తయగు నీశ్వరునిగాను, మఱొకప్పుడు సృష్టిరూపమైన హిరణ్యగర్భునిగాను గ్రహించిరి. సృష్టిచేసిన బ్రహ్మయు బ్రహ్మమునుండియే జనించెను.౧. దృశ్యరూపమైన యీవిశ్వమంతయుఁ బోషించువాఁడీశ్వరుఁడు, దేహధారులగు వ్యక్తులందఱును నశించినను, నీశ్వరుఁడు సృష్టినిగూర్చి ధ్యానించుచు నశింపకయుండును. ఆత్మయే దేహమని మనము తలఁచి

౧. ముండకము 3అ. ౧3.౧

నచో, బ్రహ్మమే జగత్తులేక విరాట్టగును. విరాట్టనఁగా విశ్వరూపము, "విరాట్పురుషుఁడు సృజింపఁబడిన సర్వవస్త్వభ్యంతరముననున్న విశ్వాత్మ, అగ్ని యాతనిశీర్షము; సూర్యచంద్రు లాతని నేత్రములు; చతుర్దిశలాతని చెవులు; వాయువాతని యూపిరి; ఆతనినుండి జనించిన వేదములాతని వాక్కులు; విశ్వమంతయు నాతని హృదయము; భూమి యాతని పాదములనుండి పుట్టినది."౨. భౌతికవస్తు సముచ్చయముచే విరాట్పురుషుని దేహము కల్పింపఁబడినది. విరాట్పురుషుఁడు భగవంతుని ప్రత్యక్షస్వరూపము. ఆతనియింద్రియములు దిశలు, పంచభూతము లాతనిశరీరము; "ఇదంతయు నేనే" యను భావ మాతనిబుద్ధి. విరాట్పురుష భావమునకుఁ బూర్వము సూత్రాత్మభావము లేక, సూక్ష్మశరీర సముదాయమే తనవాహనముగాఁ గల హిరణ్యగర్భభావము పెంపొంది యుండవలెను. విరాట్స్వరూపములో హిరణ్యగర్భుఁడు గోచరించును. స్థూలరూపముయొక్క ఆవిష్కరణమగువఱకు సూత్రాత్మ సూక్ష్మశరీరములకు సంబంధించియుండెను. మొదటి కారణరూపములో విజ్ఞానక్రియల బీజరూపమున నాతఁ డుండెను. విరాట్పురుషుఁడు, విశ్వాత్మ సర్వజగత్పదార్థరూపమున గోచరించినాఁడు. బ్రహ్మజగత్తుయొక్క సూక్ష్మపదార్థరూపమున నున్నాఁడు. సూత్రాత్మ హిరణ్యగర్భుఁడే; కారణకార్యాతీతుఁడు పరబ్రహ్మ; ఈపరబ్రహ్మయే అనాత్మసంబంధముచే నీశ్వరుఁడుగా గోచరించును.౧. ఈదిగువ ప్రణాళిక యీపద్ధతిని నిరూపించును:—

(౨) ముండకము ౪అ. ౪.౧౧

| ఆత్మ | బ్రహ్మ |
|---|---|
| ౧. దేహాత్మ (విశ్వము) | ౧. జగత్తు (విరాట్ లేక వైశ్వానరుఁడు) |
| ౨. ప్రాణాత్మ (తైజసము) | ౨. ప్రపంచాత్మ (హిరణ్యగర్భుఁడు) |
| ౩. బుద్ధ్యాత్మ (ప్రాజ్ఞుఁడు) | ౩. ఆత్మద్రష్ట (ఈశ్వరుఁడు) |
| ౪. ధ్యానాత్మ (తురీయము) | ౪. ఆనందము (బ్రహ్మము) |

హేతుప్రకటన మంగీకృతమైనచో, నుపనిషత్తులలోఁ జెప్పఁబడిన బ్రహ్మము తాత్త్వికుల కల్పనముగాని, అనిర్దిష్టమైన సమత్వముగాని, శాంతిగర్భముననున్న శూన్యముగానికాదు. అది సంపూర్ణము, పరమసత్యము నైన చైతన్యము. అనంతరూపములలోనున్న దైవాంశముల సంపూర్ణరూపమే పరబ్రహ్మము. భిన్నవస్తురూపములన్నియు మాయాకల్పితములు నసత్యములు నగుటకు బదులుగాఁ, బరమసత్యములో నిమిడియున్నవి. బ్రహ్మస్వరూపమును నిరూపించుట కుపయోగించిన 'ఓం' కారము దానిసగుణ స్వరూపమును స్పష్టమొనర్చును౧. ఓంకారము పరమాత్మచిహ్నము; పురుషోత్తముని లాంఛనము. ౨. ఓమ్ సంపూర్ణత్వసగుణత్వ చిహ్నము. అనంతర వేదాంత సారస్వతమునఁ జూపఁబడిన పరమాత్మయొక్క త్రివిధరూపములైన

౧. సుషుప్త్యవస్థలో ద్రష్ట, దృశ్యము శాంతించినవి కాని నశింపలేదు.

౧. ఓంకారము బ్రహ్మమునకు సంజ్ఞ, విగ్రహమెట్లు విష్ణువునకు సంజ్ఞయో యిదియునట్లే "ప్రతిమేవవిష్ణోః" శంకరభాష్యము (తైత్తిరీయోపనిషత్తు ౧౮,౬)

౨. మనువు ౨౮. ౭౩; చూడుము తైత్తిరీయము ౧౮ ౭; కఠము ౧౮౨, ౧౯-౧౬

బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుఁడు ఓంకార గుణస్వరూపులు, 'అ' సృష్టికర్తయగు బ్రహ్మ; "ఉ" పోషకుఁడగు విష్ణువు; 'మ' నాశకారకుఁడగు శివుఁడు. 3

వ్యక్తావ్యక్తములైన రెండురూపములలోను బ్రహ్మోపాసనము చేయుమని యీశోపనిషత్తు బోధించుచున్నది. ఉపనిషత్తులు మనకుఁ జెప్పునదొక శుష్కమైన అద్వైతముగాదు. భిన్నత్వమున్నది, కాని యేకత్వమునున్నది. పరిపూర్ణత్వమనఁగా, నపరిపూర్ణతను విస్మరించునదికాదు; పూర్ణతలేని సర్వవస్తువుల కాధారభూతమైనది. బ్రహ్మము కాలాతీతమైనదనఁగా, రెండు వస్తువులున్నవి, యందొకటి కాలగతము, రెండవది దానినధిగమించు కాలతీతవస్తువునని యర్థముకాదు. కాలగర్భములైయున్న సర్వవస్తువులలో నంతర్వ్యాప్తమైయున్న శాశ్వత సత్యమనియే భావము. పరబ్రహ్మ మంతము కా దనంతమును గాదు; పరిణామమునుకాదు, తత్ప్రదర్శనమునుగాదు; అది సర్వాతీతము, సర్వాంతర్యామియుఁ గూడనైనది. ఆత్మయను వసంతర్తువు, అనంతకోటి భిన్నవ్యక్తిరూపములుగా చిగిర్చి, పుష్పించినది. బ్రహ్మశబ్దమునకుఁ బెంపొందుటను నర్థములో నది పూర్ణచైతన్యము, చలనము, వృద్ధిగలిగియున్న దేకాని, నిర్జీవము. జడము,మాంద్యమును గాదు. పరబ్రహ్మ సచ్చిదానందము— శాశ్వతస్థితి, అనంతజ్ఞానము, నిరనధికప్రమోదము, అది జ్ఞాన

3. చూడు, ఛాందోగ్యము ౧౫, 3,౬.౭, బృహదారణ్యకము ౫౫, 3.౧ ర ఆ. 3.౮.౯.

శక్తి క్రియాత్మకము, అది తననుండి తానే కలిగినది. ౧ తైత్తిరీయమున నది, "సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ"యని చెప్పఁబడినది. దీనినిబట్టి బ్రహ్మమొక కేవలజ్ఞానముకాని, శక్తికాని, ద్రష్టకానికాదు; అది జగత్తు. తత్సారము; స్థూలము, సూక్ష్మము; జ్ఞానప్రేమానందమయము, "అదియుఁ బూర్ణమిదియుఁ బూర్ణము."౨. కాని యిదివరలో మేము చెప్పినరీతిగా; బ్రహ్మమనిర్వచనీయమగుటచే నదియేదికాదో చెప్పఁగలము. కాని, యిదియని వాక్కుతోఁ జెప్పఁజాలము.

## ౧౦–బుద్ధి–ధ్యానదృష్టి

ద్రష్టను దృశ్యమును సమన్వయించు నేకత్వమును గనుఁగొనుటే బుద్ధియొక్క లక్ష్యము, అట్టి యేకత్వమున్నదను విశ్వాసము తర్కశాస్త్రమునకు, జీవితమునకుఁ దప్పని సరియగు సూత్రము. ఆ యేకత్వాంశములను నిర్ణయించుటే తత్త్వశాస్త్రకృషి. కాని పూర్ణమును గ్రహింపలేని సహజలోపము బుద్ధి యందుండుటచే నీప్రయత్నము విఫలముకాక తప్పదు. "దేనినుండి మనస్సహితముగా వాక్కుచేరలేక వెనుకకు మరలునో"3 యట్టి సత్పదార్థమును,బుద్ధి తనకుఁగల విషయగ్రహణసూత్రావళితోడను, నియమములతోడను, గ్రహింపఁజాలదు. "కన్నుగాని, వాక్కుగాని, మనస్సుగాని, యచటకుఁ బోఁజాలదు. అదిమనకుఁ దెలియదు. ఎవ్వఁడైనను దాని నెట్లు

(౨) బృహదారణ్యకము, ౫అ ౧.౧,౧ (౧) స్వయంభూః ఈశ ౭అ

(3) తైత్తిరీయము ౨అ,౪

బోధింపఁగలఁడో మాకుఁ దెలియదు."౧. సత్యదార్థము, బుద్ధిగ్రహించుటకు వీలైనదృశ్యముగా నెన్నఁడు మారఁజాలదు. "ఎవనిచే సర్వమును దెలియుచున్నామో వానినెట్లు తెలిసికొనుటకు వీలగును? ఓప్రియురాలా? జ్ఞాత తన్నుఁదాను దెలిసికొనుటయెట్లు?"౨. విషయి, జ్ఞానవిషయము కానప్పుడెట్లు తెలియును. "అది చూచునే కాని చూడఁబడదు; వినునే కాని వినబడదు; దర్శించునే కాని దృశ్యముకాదు; తెలియునే కాని తెలియఁబడదు."౩. అది గోచరవిషయము కానంతమాత్రమున నాత్మలేని వస్తువనరాదు. దానిని గ్రహించుటకు మానవునిబుద్ధిశక్తు లసమర్థములైనను, నదిలేనిదే యివి లేనే లేవు.౪. "దేనిని మనము మనస్సుచే నూహింపలేమో, కాని దేనిచే మనసూహించుచున్నదో, అదియే బ్రహ్మమని యెఱుఁగుము."౫. బుద్ధి దేశకాలనిమిత్తశక్తులను పరిమాణములతోఁ బనిచేయును. కాని దీనివలన మనకుఁ బరిష్కారములేని సమస్యలు, పరస్పర విరుద్ధభావములు లభించును. మొదటి కారణము నొకదానిని మనమూహించినచోఁ గారణకార్యధర్మము సత్యమగును. లేకున్నచో నీసూత్రమర్థములేని వాదమై నిలుచును. కావున నీసమస్య కేవల బుద్ధిశక్తిచేఁ బరిష్కృతము కాఁజాలదు. అందుచేఁ బరమసత్య నిర్ణయవిషయమున బుద్ధి తనయసమర్థత నంగీకరింపక

౧. కేనోపనిషత్తు ౨అ౩; ముండకము ౨అ,౧; కఠము. ౧అ, ౩,౧౦
౨. బృహదారణ్యకము ౨అ, ౪:౧౩; ౩అ, ౪,౨
౩. బృహదారణ్యకము ౩అ,౭,౨౩; ౩అ,౮,౧౧
౪. బృహదారణ్యకము ౩అ, ౮,౧౧; ౨అ, ౪,౧౪;౫అ, ౫,౧౫
౫. కేనోపనిషత్తు

తప్పదు. "దేవత లిందు్రియందున్నారు; ఇంద్రుడు దేవతా జనకునియందున్నాఁడు అతఁడు బ్రహ్మయందున్నాఁడు; కాని బ్రహ్మ యెందున్నాఁడు?" దీనికి యాజ్ఞవల్క్యుఁడిట్లు బదులు చెప్పినాఁడు; "ఇఁక నధికముగా నడుగవద్దు" ౧. మన బుద్ధికల్పితప్రమాణములు దేశకాలనిమిత్త రూపమైన దృశ్యప్రపంచముయొక్క వర్ణనములనిచ్చును; కాని సత్పదార్థము వీనికతీతమైనది. దేశము తనలోనున్నను నది దేశాత్మకముగాదు; కాలము దానిలోనున్నను నది కాలాతీతము; కారణసూత్రబద్ధమైన ప్రకృతియందున్నను నది కారణధర్మాతీతము, పూర్ణస్వతంత్రమైన బ్రహ్మము దేశకాల నిమిత్తాతీతము. బ్రహ్మము దేశాతీతమను విషయ ముపనిషత్తులలో ననంస్కృతముగాఁ జెప్పఁబడినది. బ్రహ్మము సర్వవ్యాపి, యత్యధికమైనది. అత్యల్పమైనది యని చెప్పఁబడెను. "ఓగార్గీ! ఏది స్వర్గమునకుఁ బైనున్నదో, భూలోకమునకుఁ గ్రిందనున్నదో, దేనిని మనుష్యులు భూతవర్తమాన భవిష్యత్తులందురో, అది సర్వములోను, నెల్లయెడలను వ్యాపించియున్నది. కాని, దేశములోపల, బయట నెందువ్యాపించినది? నిజముగా నీశాశ్వతబ్రహ్మము నందెల్లెడలను దేశము వ్యాపించియున్నది." ౨. కాలనియమముల కతీతమై బ్రహ్మమున్నదని చెప్పఁబడినది. ఆద్యంతరహితమైన శాశ్వతత్వముగలిగినదే బ్రహ్మము; అనఁగా బ్రహ్మము శాశ్వతవర్తమానస్థితిగలదై యున్నది. భూతభవిష్యత్తులనుండి యది

---

౧. బృహదారణ్యకము 3అ. ౬.౧

౨. బృహదారణ్యకము 3అ. ౮.౭: ౪అ.౨.౪; ఛాందోగ్యము 3అ-౧౪-3: ౭అ. ౨౫.౪

స్వతంత్రమై యున్నది; ౩. అదియే సర్వమునకుఁ బ్రభువు; ౪. దానిపాదములయొద్ద కాలము గతించుచుండును. ౫. బ్రహ్మము కారణసంబంధాతీతమని చెప్పుటకు, దానిని పూర్ణస్థాణు స్వరూపమని వర్ణించిరి. చలనము కారణసంబంధి కావున దానికదిలేదు. కారణ ధర్మాతీతమైన బ్రహ్మము నీవిధముగా నిర్ణయించుట వలన, బ్రహ్మము సంపూర్ణస్వయంస్థితి స్థైర్యముగలదని యభిప్రాయము తెలియుచున్నది. కాని దీనివలనఁ గొన్నియపార్థములు గలుగవచ్చును. ప్రపంచములోని యన్నిమార్పులయొక్క సూత్రమే కారణధర్మము. కాని కారణధర్మమునకు బ్రహ్మము బద్ధముకాదు. బ్రహ్మమందు మార్పులేదు కాని మార్పంతయు దానిపై నాధారపడియున్నది. దానికి వేఱుగా రెండవదేదియునులేదు. మన మనేకత్వమును బ్రహ్మములో లీనము చేయవలెను. దేశసాన్నిధ్యము; కాలగతి, కారణసంబంధము దానిపై నాధారపడియున్నవి. ఈమహత్తర తత్త్వసమన్వయము మనము బుద్ధిఘట్టమున నున్నంతకాలము బోధపడదు. ఉపనిషత్తులు కొన్నిచోటులందు, బుద్ధిబ్రహ్మము నపరిపూర్ణముగా మాత్రమే గ్రహింపఁగలదనియు, గొన్నిచోటులందు సహజ సామర్థ్యలోపముచే బుద్ధి బ్రహ్మము నసలే గ్రహింపఁజాలదనియుఁ జెప్పినవి. సంబంధములుగల వస్తువులతో వర్తింపఁగలబుద్ధి సంబంధశూన్యమగు బ్రహ్మమును గ్రహింపఁజాలదు. కాని దేశ

---

౩. కఠము ౨౹౫ ౧౪

౪ బృహదారణ్యకము ౪౹౫. ౪.౧౫

౫. బృహదారణ్యకము ౪౹౫ ౪.౧౬౧౭

కాలగతమై యున్నదెల్లను, బ్రహ్మముయొక్క పరిదర్శనమే. మనజ్ఞానము కేవల మసత్యమునుగాదు, సత్యమునుగాదు. సత్యమున కత్యంత సమీపభావము బుద్ధికల్పిత పూర్ణత్వమే. ఈభావము కారణసంబంధసూత్రి కల్పితమగుటచే నసత్యమున కత్యంతసమీపమునకుఁ బోయినను బూర్ణముగా నసత్యము గానేరదు. అది మానవబుద్ధికి సాధ్యమైన పరబ్రహ్మస్వరూపము, బుద్ధి, అనఁగా విషయ గ్రహణశక్తి. దేశకాలనిమిత్తములను బరిమిత ప్రమాణములతోఁ బనిచేయును గానఁ బరమ సత్యమును గ్రహించు సామర్థ్యము దానికి లేదు. హేతుతర్కము (Reason) మనలను విషయగ్రహణ సీమనుండి యింకను బైకిఁ దీసికొనిపోవును. ఇదియైనను సత్యమును మనకీయఁజాలదు; ఏలన సత్యమొక భావముకాదు; ఒక సత్పదార్థము. హేతుతర్కజమైన నిర్ణయ మొకభావమునకంటె నధికమైనది; అది సత్యమునుగూర్చిన యొక అసంపూర్ణభావము. సత్పదార్థము సత్యమునుగా దసత్యమునుగాదు. సత్పదార్థమును గూర్చిన మన భావములు, సత్యములు గావచ్చు నసత్యములు గావచ్చును; ఏలన నవి బుద్ధికి సత్పదార్థమునకు మధ్యమందున్న ద్వైతదృష్టిలోనివి. మనము బుద్ధికి, బుద్ధి కల్పితప్రమాణములకు, వానినుండి బయల్వెడలు వైరుధ్యములకు నతీతమైన సీమకుఁ బోయినచో, నచట మనము సత్పదార్థము నేకమయిపోదుము. ధ్యానమునందు బుద్ధి పరిపూర్ణతనంది, సత్పదార్థమును దర్శింపఁగలదు. సర్వదేశములందలి ధ్యానయోగులును చెప్పినవిషయమే యిది. ప్యాస్కల్ పండితుఁడు మనబుద్ధికి దైవము నెఱుఁగుట సాధ్యమని చెప్పెను. ప్రపంచమునఁగల నానా

త్వమున గూర్చి భయపడ నవసరము లేదనియు, నీభిన్నప్రదర్శన ములన్నియును దేవుని పాదములవొద్దకుఁ జేర్చు కాంచనరజ్జువు లనియు, నచటకు మానవదృష్టి పోఁజాలదనియు బోసెట్ పండితుఁడు నుడివినాఁడు.

సృష్టి కేంద్రసత్యమైన బ్రహ్మమును దెలియు నున్నత శక్తి మనకుఁ బ్రసాదింపఁబడియున్నదని యుపనిషత్తులు చెప్పు చున్నవి. ఆత్మదర్శన మాత్మదృష్టివలననే కలుగఁగలదు. ఇట్టి ఆత్మదర్శనమునకుఁ దోడ్కొనిపోవు జీవితశిక్షణమార్గమే యోగ విద్య. మానవునకు దివ్యదృష్టి లేక ధ్యానదృష్టియున్నది. బుద్ధిజాతములైన భేదములను, తర్కముసూచించు సమస్యలను మనమీ దివ్యదృష్టిచే నధిగమించి, పరిష్కరింపఁగలము. పైన కృపగల కొలదిమంది, బుద్ధిశిఖరాగ్రమున నిలిచి, సత్పదార్థ మును ధ్యానించి గాంతురు. ఇట్టి ధ్యానసిద్ధియందు, "అశ్రుత పూర్వమైనది శ్రుతమగును; అదృష్టపూర్వమైనది దృష్ట మగును; అవిదితపూర్వమైనది విదితమగును."[౧] బుద్ధిఘట్ట మున బయలుదేరిన సమస్యలన్నియు, మనము తార్కికవిధా నము నధిగమించి, అనుష్ఠానజీవితము నారంభించినతోడనే, పరిష్కారములైపోవును.[౨] మన ప్రజ్ఞాతిశయమును, శేముషీ గర్వమును విడిచిపెట్టి, సత్యాంశములను చంటిబిడ్డయొక్క కలుషములేని దృష్టితోఁ జూడుమని యుపనిషత్తులు బోధించు చున్నవి. "తన పాండిత్యగర్వమును విడిచి, బ్రాహ్మణుఁడు

౧. ఛాందోగ్యము. ౬అ. ౧౩; బృహదారణ్యకము ౨అ. ౪-౫.
౨. ముండకము. ౩అ. ౧. ౮.

బాలుఁడై చరింపవలెను." ౩. ఈశ్వరరాజ్యములోఁ బ్రవేశించుటకు మొదటనేవఁడైన నమాయకశిశువుగా మారవలెను. మహోన్నత సత్యములన్నియుఁ బరిశుద్ధచిత్తులకును మోసమెఱుఁగని హృదయములకును గోచరించునేకాని తర్కప్రజ్ఞాధురంధరులకుఁగాదు. "విశేషముగా మాటలను వెదుకవలదు; అది కేవల జిహ్వాలసత్వమునుమాత్రమే కలుగఁజేయును." ౪. "ఈ ఆత్మదర్శనము ప్రజ్ఞచేఁగాని, పాండిత్యముచేఁగాని లభింపదు."౫ ధ్యానయోగులు తమ సమాధిదశలో నాత్మసాక్షాత్కారము నందుదురు,' అది ప్రత్యక్షదర్శనము లేక ప్రత్యక్షజ్ఞానము. సమాధిలో జీవాత్మ పరమాత్మానుసంధానములనందును. అట్టి సాక్షాత్కారముచే, యోగి తన్మయత్వమునంది బ్రహ్మానంద పరవశుఁడగును. అట్టివేళ నాతఁడు తానుగాంచిన నేమో తెలియుస్థితిలో నుండఁడు. దానికంటెఁ బొందవలసిన దేమియు లేదు. బ్రహ్మమునందే సర్వము నాతఁడు గాంచును. అచట పాపమువలనఁగాని, అసృతము వలనఁగాని భయముండదు; అట్టిస్థితిలో యోగి పూర్ణపావనత్వమునొందును. ఈ సాక్షాత్కారము మనకామములను, క్లేశములను నశింపఁజేయును. అట్టి తన్మయావస్థలో ఆత్మ పరమాత్మ తాదాత్మ్యమును

---

౩. బృహదారణ్యకము. ౩అ. ౫.౧. "తస్మాత్ బ్రాహ్మణః పాండిత్యమ్ నిర్విద్య బాల్యేన తిష్టాసేత్" 'బాల్యేన' శబ్దమును డ్యూసేన్, గఫ్ పండితులు గ్రహించిరి. మ్యాక్సుముల్లరుఁ 'బల్యేన'యని చదివి "ఆత్మబలము" ననునర్థము చెప్పెను.

౪. బృహదారణ్యకము. ౪అ. ౪. ౨౧.

౫. కఠము. ౨అ. ౨౩.

బొందును. ప్లాటినస్ యిట్లు నుడివినాఁడు; "దైవసాక్షాత్కారమునందు, జూచునది తర్కప్రజ్ఞ కాదు; అది తర్కప్రజ్ఞకుఁ బూర్వము, పరమందుగూడ నున్నదే; అదియుఁ జూడఁబడిన దేవునివంటిదే. ఎవఁడట్టి దివ్యదృష్టినిఁ బొంది చూచునో, వాఁడు తన్నుఁదానే యొక పరిశుద్ధమూర్తిగాఁ గాంచును; తాను జూచిన దేవుఁడే తాననుభావమును బొందును. అట్టివ్యక్తి చూచునని చెప్పుటయునొప్పదు. ఏలన, నచట ద్రష్టయు దృశ్యమునొకటే; రెంటికి భేదము చెప్పుటకేక వీలుండదు. చూచువాఁడు, చూడఁబడిన యీశ్వరుఁడు నొకఁడేయగునని ధైర్యముగాఁ జెప్పవలెను. అతఁడు దేవునికిఁ జెందినవాఁడై, దేవుఁడే యాతఁడై, ఒకే కేంద్రముగల రెండుచక్రములవలె నగును; కలిసియున్నంతకాల మొకఁడు,బయటికివచ్చిన నిరువురు నగుదురు." ౧. మానవుని సర్వమానసికాశయములు; బుద్ధికాంక్షలు, హృదయవాంఛలు సంకల్పాదర్శములు నన్నియునచట సంపూర్ణసిద్ధినందును. మానవుని జీవితకృషికిది పూర్ణఫలితము; ప్రత్యేకవ్యక్తిత్వమున కంతము." ఇదియే మానవజన్మమునకుఁ బరమగతి, పరమసంపద, పరమనిలయము, పరమానందము."౨. ఇదియు నింద్రియానుభవమువంటిదే కాని, గోచర విషయము కాదు; ఇతరులకు ఋజువగునదికాదు. అనుమానప్రమాణలబ్ధజ్ఞానమువలె నితరులకుఁ జెప్పసాధ్యమైనదికాదు. ఆ యనుభవ

---

(౧) ఇంజ్ ప్లాటినస్. వాల్యూము. ౨. పుట ౧౪౦

(౨) ఏషాఽస్య పరమాగతిః; ఏషాఽస్య పరమాసంపత్; ఏషోఽస్య పరమోలోకః, ఏషోఽస్య పరమానందః" బృహదారణ్యకము. ౪అ. 3-3౨

మును సామాన్యపద్ధతిలో వ్యక్తీకరించుట దుస్తరము. యోగికిఁ గల్గిన సాక్షాత్కారము వాక్కులేనిది. పుట్టుగ్రుడ్డికి మనమింద్రధనుస్సౌందర్యమునుగాని, సూర్యాస్తమయ శోభనుగానిగూర్చి బోధింపఁజాలనట్లే, యోగియొక్క సాక్షాత్కారము యోగి కాని వానికిఁ జెప్పఁజాలము. "బ్రహ్మజ్ఞానమును దేవుఁడు నాతలలోఁ బెట్టినాఁడు; దానిని నీతలలో నేను బెట్టఁజాలను," అనునదే యోగిఅనుభవమునుగూర్చి చెప్పఁగల తుదివాక్యము. బ్రహ్మానుభవ మబోధ్యమైనందున, నది యితరానుభవములకంటెఁ దక్కువసత్యమని తలఁపరాదు. ఈయనుభవమును మన ముపమానములచేఁ జెప్పవచ్చును. బ్రహ్మజ్ఞానకాంతి యఖండమగుటచే దానినిఁ గాంచిన వానికంధత్వము, మూకత్వము కలుగుచున్నవి వాగతీతమైన దానినిఁ గూర్చియెట్లు తృప్తికరముగాఁ దెల్పుట? వాష్కలియనురాజు బాహ్వుఁడను బ్రహ్మవేత్తను బ్రహ్మస్వరూపమును జెప్పుమని యడిగినప్పుడాతఁడు మౌనము వహించెను; రాజు మరల నడుగఁగా నాతఁడిట్లు బదులుచెప్పెను; "నేను జెప్పుదునుగాని నీకు బోధపడదు. ఏలన ''శాంతోఽయమాత్మా"[౧]యని చెప్పెను. బుద్ధిచేఁ జేయఁబడిన నిర్వచనములకు మనము, "ఇదికాదు, ఇదికాద"నియే బదులు చెప్పఁగలము.[౨] ఈవ్యతిరేక వాక్యములవలన బ్రహ్మమును గూర్చి మనకుఁగల బుద్ధి కల్పితనిర్ణయము లసంగతములని తెలియును.

౧. శంకరభాష్యము ౩అ. ౨.౧౭

౨. బృహదారణ్యకము ౩అ ౯.౨౬; ౪అ ౨.౪; ౪అ. ౪,౨౨; ౪అ ౫.౧౫; ౨అ. ౩.౬; కఠము ౩అ. ౧౫; ప్రశ్న ౪అ ౧౦; చాందోగ్యము ౬అ ౨౪.౧: ముండకము ౧అ. ౧.౭; ౨అ ౧.౨; ౩అ ౧.౭-౮

"దేవుని వర్ణించుట కేపరిమాణమును జాలదు. ఆతనిమహిమ యనంతమైనది;" 3. అందుచేతనే బ్రహ్మమునుగూర్చి చెప్పుటకు వ్యతిరేకార్థము లుపయోగింపఁబడినవి. ఆబ్రహ్మమురొక్క స్వస్వరూపము బుద్ధ్యతీతము ననుభవైకవేద్యమును. "బ్రహ్మ మణువుకంటె సూక్ష్మమైనది; స్థూలతమపదార్థముకంటె స్థూలతరమైనది"(౧). "బ్రహ్మముచలించియుఁ జలింపదు; దూరము నాత్యంతికమును; సర్వమునకు బాహ్యమందు నభ్యంతరమందు గూడనున్నది."(౨). ఈపరస్పర విరోధములుగా గోచరించుభావములు, దుర్బలభావమునుండి జనించినవికావు.

సత్పదార్థము లేక బ్రహ్మము మనసర్వానుభవములలో నున్నది; సృష్టిలోని ప్రతివస్తువు దానిపై నాధారపడియున్నది; కాని యేవస్తువును దానిని సంపూర్ణముగా వ్యక్తీకరింపఁజాలదు. కాబట్టి మేము బ్రహ్మము నెఱుఁగమను వారు దాని నెఱుఁగుదురు; వారియెఱుక మాత్రి మసంపూర్ణము; అట్లే దాని నెఱుఁగుదుమను వారియెఱుకయు నసంపూర్ణమే, మనది కొంతజ్ఞానము, కొంతయజ్ఞానమును, కేనోపనిషత్తు చెప్పుచున్నది; "బ్రహ్మపదార్థము మాకు సువిదితమను వారికది తెలియదు; మాకవిదితమను వారికే తెలియును"(3). బుద్ధి కేవలవ్యర్థత్వ న్సూచకమని యుపనిషత్తులు చెప్పుటలేదు. బ్రహ్మమునుగూర్చి యది చెప్పినది సత్యముగాదు; బ్రహ్మమును సంపూర్ణముగా గ్రహింపవలెనని తలఁచినప్పుడే బుద్ధి యత్నము విఫలమగును.

---

3. యజుర్వేదము

(౧) శ్వేతాశ్వతరము 3అ. ౨౦; కేన. ౧అ. 3.

(౨) ఈశా. ౫అ. (3) కేన ౨అ.3

తదితర ప్రయత్నములన్నిటిలో నది జయమే పొందును; బుద్ధి యన్వేషించున దసత్యముగాదు; పూర్ణసత్యమునుగాదు, ఏక వస్తువును విడఁదీయు మానవసహజలక్షణముచే ద్వంద్వములైన కార్యకారణములు, వస్తుగుణములు, మంచిచెడ్డలు, సత్యానృతములు, విషయీవిషయములు కలుగుచున్నవి. ఫిక్టేయొక్క ఆత్మానాత్మసమస్య; క్యాంటు ద్వంద్వములు; హ్యూమ్ యొక్క సత్యాంశములకు సూత్రములకుఁ గలవిరోధము, బ్రాడ్లేయొక్క అన్యోన్యవైరుధ్యములు, నొకేసత్యవస్తువుయొక్క అన్యోన్య సహకారాశ్రయములని గుర్తించినచోఁ దొలఁగిపోవును బుద్ధిని విసర్జింప నక్కఱలేదు; దానిలోపమును బూరింపవలెను. ధ్యానదృష్టిపై నాధారపడినతత్త్వము, శేముషీ తర్కములకు విరుద్ధముగాదు. బుద్ధి కంధకార కుహరముగానున్న చోటులందు ధ్యానదృష్టి, కాంతిప్రసరణ మొనర్చును. ధ్యానసిద్ధికి లభించిన జ్ఞానమును తార్కికవిధానముచేఁ బరిశీలింపవలెను. ఈవిధముగాఁ బరస్పరసహకార పరిశీలనములచే నీరెండును సవ్యమార్గములఁబట్టి చరింపఁగలవు. ధ్యానదృష్టి సహాయములేనిదే, బుద్ధిశక్తి ఫలితములు, నిర్వీర్యముగను భావశూన్యముగను, నసంపూర్ణముగను, నసంస్కృతముగను నుండును; ధ్యానదృష్టి ఫలితములు, హేతుపద్ధతిచేఁ బరిష్కృతముగాక, అంధప్రాయముగను, నస్పష్టముగను, విచిత్రముగను గోచరించును. బుద్ధి యొక్క పరమలక్ష్యము, ధ్యానసిద్ధియందు ఫలించును; ఏలన బ్రహ్మమునందు వైరుధ్యములన్నియుఁ దొలఁగిపోవును. శాస్త్రజ్ఞానము, సిద్ధజ్ఞానము సోదరభావముతోఁ గలిసి పెంపొంది నిజ

మగు దివ్యదృష్టి నొసఁగఁగలవు. కేవల హేతువాదమట్టి పనిఁజే యఁజాలదు. ౧. బుద్ధినిర్ణయములో మనము తృప్తిపడినయెడల వ్యక్తుల అనేకత్వము, స్వతంత్రత, తత్త్వశాస్త్రముయొక్క తుదిమాటగా నంగీకరింపవలెను. అప్పుడు పరస్పరస్పర్థ, సంఘర్షణము విశ్వాదర్శములగును. సత్యస్ఫురణలేనిబుద్ధి, అసంగత తత్త్వమునకు నసమంజస నీతివిధానమునకు మనలఁ దోడ్కొనిపోవును. అట్టి జ్ఞానమువలన బ్రహ్మము మఱుగుపడును. ఇట్టి ప్రజ్ఞాతత్త్వముకంటెఁ, బామరజనుల విశ్వాసమే మంచిదగును. "జ్ఞానముకాని దాని నారాధించువారందఱు నంధతమసమునకుఁ బోవుదురు. (బుద్ధి) జ్ఞానము నందానందించువారందఱు నధికాంధకారముతోఁ గూడిన తమోలోకమునఁ బడిపోవుదురు."౧. ధ్యానసిద్ధిలేని, బుద్ధికల్పిత భిన్నత్వజ్ఞానము, లోపభూయిష్టమైనను మూఢవిశ్వాసమునకంటెఁ క్షుద్రమైనది. ప్రజ్ఞానుభవముల మధ్యమందున్న వైరుధ్యములను, ఇమర్సన్ వంటివాఁడు తెల్పినబ్రహ్మభావముతోఁ బరిష్కరింపవలెను.

"నన్ను మఱచిన దుర్గతియే ఫలము.
నన్ను విడిచియెగురువారి ఱెక్కలేనేను;
సంశయించువాఁడు సంశయమునేనే."

తీవ్రకాంక్షలతో వైచిత్ర్యములతో, భక్తిదాస్యములతో, సత్యానృత మిశ్రమములతో నిండిన సృష్టిసంపదనంతను నేకచ్ఛత్రాధిపత్యముగా నొకేఅనంతశక్తి, ప్రకటించుచును నావరించుచు మేళవించుచు నానందించుచున్నది. ప్రజ్ఞానౌదర్య నైతికరంగములందలి యుద్ధమున, పరమసత్యమున్నది

౧. కఠము ౨.౫ (౨) "మేధయాపిహితః" తైత్తిరీయము

నియొలుగని దుర్బలహృదయములు సొమ్మసిల్లిపోవుదురు, కాని యీ భిన్న విషయ సంఘట్టనమునఁ బడి కొట్టుకొనుచుండువారు దీనినుండియే సర్వసామరస్యమిచ్చు నానందమును గుర్తించి, ధైర్య మార్జింపవలసియున్నది. ఆత్మశక్తియొక్క బహిఃప్రకటన ములందిట్టి కాట్లాట తాత్కాలికముమాత్రమే. ఒకేదివ్యశక్తి తనప్రభావము నన్నిటిలోఁ బ్రదర్శించును. సిద్ధాంతానుభవము లందు, హ్యూమ్‌పండితుని సమస్యలందు క్యాంటుతత్త్వ వేత్త ప్రశ్నావళియందు, నాస్తికుల విచిత్రవాదములందు, బ్రహ్మ శక్తి, యేకమై, అద్వితీయమై తనప్రభావ ప్రదర్శనము చేయు చున్నది.

తర్కముకంటెఁ దపస్సు, విజ్ఞానముకంటె నానందము ముఖ్యమని యుపనిషత్తులు నొక్కిచెప్పుటలో నవి యద్వైత మును సమర్థించుచున్నవని మే ముపోద్ఘాతములోఁ జెప్పినట్లు స్పష్టమగుచున్నది. సత్పదార్థసాగరమున విజ్ఞానప్రమాణ భావ ములతో మనమెంత యీదులాడినను, సాగరగర్భమందున్న బ్రహ్మమను రత్నరాశిని మనము దర్శింపఁజాలము. ఆనందము నందు మానవుఁడు సత్యమునకత్యంత సన్నిహితుఁడైయు న్నాఁడు. వ్యక్తిగతమైన నిగూఢానుభవము నందనగా నానంద మయరంగమందు, సత్యస్వరూప మిమిడియున్నది. బుద్ధిప్రోక్త ములైన వైజ్ఞానికసిద్ధాంతము జీవితాభ్యంతరముననున్న అమూ ల్యఖనియొద్దకుఁ బోవనుద్యమింపదు. విజ్ఞానములోనికి వచ్చిన దంతయు నసత్యమగును; అది వ్యవహారప్రపంచమున నిత్య సత్యమేగావచ్చును. ఏది బుద్ధినిర్మింపఁగల ప్రమాణములకు,

(౧) బృహదారణ్యకము. ౪అ. ౪-౧౦; ఈశా. ౯. అ.

నిర్ణయములకు నతీతమో అదియే బ్రహ్మము. విజ్ఞానము సూచించు తార్కిక పూర్ణతత్త్వము సత్యమునకు ఛాయవంటి దగును. తపస్సమాధిలో సత్యము స్వస్వరూపములోఁ బ్రత్యక్ష మగును. అద్వితీయమైన పరమసత్యమును దెలిసికొనుటకు మనము తర్కప్రమాణాసిధారచే దానినసేకత్వముగా ఛేదించి, యీ బహుత్వమునుండి యేకత్వమును గల్పింప యత్నించుచు న్నాము కాని, యేకమైన సత్పదార్థమట్టి తార్కికవిధానము నకు లొంగునదికాదు. ఇదివఱలో మనము పెక్కుసార్లు చెప్పు కొనియున్నట్లు, సత్పదార్థము ప్రథమతర్కస్పర్శచే నొక సిద్ధాంతతత్త్వ మయిపోవుచున్నది.

## ౧౧—సృష్టి

బ్రహ్మస్వరూపమునుగూర్చి మనము చెప్పుకొనిన విష యములనుబట్టి, సృష్టి పరిణామమునుగూర్చిన భౌతిక విజ్ఞాన సిద్ధాంతముల నుపనిషత్తు లంగీకరింపవని తెలియుచున్నది. భౌతిక పదార్థము, తనలో నిదివఱకే లేకున్నచోఁ బ్రాణము నుదయింపఁజేయ లేదు. బాహ్యమునుండి దానినెట్లుకదిపి చలిం పఁజేసినను, దానినుండి ప్రాణముదయింపదు. పరిణామమున కాదికాలమున నానందము లేనిచో నంతమునందుండఁజాలదు. ఫల మదృశ్యముగానున్నను, నది మొదటినుండియు బీజములో సూక్ష్మరూపముననుండి యుండవలెను. ప్రపంచములోని సర్వ వస్తువులు, తమకు మూలమః, గమ్యమునైన పరమసత్యము యొక్క స్వభావమునుగలిగి యుండవలెను. "కుమారుని స్వభా వములో నేయంశములున్నను నవి తండ్రియందుండవలెను; తండ్రి స్వభావములో నేయంశములున్నను పుత్రునియందు నుండితీర

వలెను." ౧. ప్రపంచములోని మానవులేకాక, సర్వవస్తువులును పరమసత్యస్వభావమును గర్భమునందుఁ గలిగియే యుండవలెను, పరిణామమనగా నాటంకశక్తులను దొలగించి, వస్తువులలో సణఁగియున్న యంతశ్శక్తుల నావిష్కరించుటే. ప్రకృతిశాస్త్రము ననుసరించి వస్తుపరిణామము భిన్నదశలలో నున్నది. తత్త్వవేత్తకును భిన్నత్వములో నేకత్వమే కావలసినది. లోకములోని భిన్నత్వమున కేకమైన యంతశ్శక్తియే యాధారము. "తన హృదయాకాశమందీ యానందమే లేకున్నచో నెవఁ డొక్కక్షణమైన యూపిరిపీల్చి జీవింపఁగలఁడు ?" ౨. క్షణలేశమైన భేదము లేకుండ సూర్యుఁ డుదయించుచున్నాఁడు; నక్షత్రములు తమమార్గముల నడచుచున్నవి; సర్వవస్తువులు స్థానములు తప్పకుండ, నేమరకుండఁ దమపనులు చేయుచున్నవి. కారణము, శాశ్వతసత్యమైన పరబ్రహ్మము, నిద్రించుటకాని, విశ్రాంతిగైకొనుటగాని లేదు. "బ్రహ్మతేజస్సువలననే సర్వమును ప్రకాశించుచున్నవి. బ్రహ్మతేజమే విశ్వమంతటిని తేజోవంత మొనర్చుచున్నది." ౩. ఆనందమే ఆదియందు, నంతమందు నున్నది; అదియే ప్రపంచముయొక్క కారణకార్యములకు, మూలాగ్రములకుఁ గారణము. ౪. తాత్కాలిక శాశ్వత కారణములు రెండునదియే. పరిణామారంభరూపమగు భౌతిక పదార్థము (Matter) స్వతంత్రమైనదిగాదు. దానియం దంతర్భూతమై బ్రహ్మానందము వసించియున్నది. పరిణామము

(౧) ఐతరే యారణ్యకము ౨అ. ౧.౮. ౧. (౨) తైత్తిరీయము అ౨.
(౩) ముండకము. ౨అ. ౨. ౧౦.
(౪) [illegible]లతూలములు. ఐతరేయారణ్యకము. ౨అ. ౧. ౮. ౧.

సూక్ష్మమునుండి స్థూలమునకుఁ జరుగుచున్నది. జడపదార్థములోఁ జేతనములోఁ గంటె బ్రహ్మశక్తి యెక్కువగా నణఁగియున్నది. పరిణామ భిన్నదశాంతరములలోఁ బూర్వపదార్థమునం దెక్కుడుగాఁ జైతన్యమణఁగి యుండుట, ఉత్తరదశలోనున్న పదార్థములో నెక్కుడుగా వికసించియుండుటయుఁ గాననగును. జడపదార్థము మాంద్యలక్షణము కలది కావున నది శక్తిచేఁ జలింపఁబడవలెను. ఈశ్వరుఁడు పదార్థమును జూచి, దానిని సజీవమగునట్లు కదుపుచున్నాఁడని తత్త్వగ్రంథములు చెప్పుచున్నవి. అట్టి యీశ్వరునికిఁ బ్రజ్ఞానమని పేరు. ౧. అతఁడే సర్వపరివర్తనములకుఁ గారకుఁడు. మొదట జడపదార్థమున్నదనియు దానినుండి సర్వవస్తుసముదాయమును దయారుచేయునొక యంత్రకారునివంటి యీశ్వరుఁడున్నాఁడనియుఁ జెప్పుటకుపనిషత్తు లిష్టపడలేదు. ఈశ్వరుఁడు పదార్థము వేరైనచో ద్వైతము మనకుఁ దప్పదు. ఆదియందుఁ బురుషుఁడు ప్రకృతియునున్నవని యంగీకరించిన అరిస్టాటల్ తత్త్వమిట్టిద్వైతమే. ఉపనిషత్తులభావములో మాత్రము, నిత్యక్రియాత్మకమైన చైతన్యము, నిత్యజడమైన ప్రకృతియు నొకేసత్పదార్థముయొక్క రెండురూపములు, జడపదార్థమును దేవుఁడే.౨. కాని మొదటిరూపములైన అగ్నిజలభూములు దైవశక్తి ప్రవేశముచే దైవస్వరూపములుగాఁ జూడఁబడినవి. సాంఖ్యద్వైతముపనిషత్తులకు సహింపరానిది. జగదతీతమైన సత్పదార్థమే, జడ

౧. ఐతరేయారణ్యకము ౧అ. 3.3.౬

౨. ఛాందోగ్యము ౬అ. ౮.౪-౬

పదార్థచైతన్యముల సంఘర్షణమునకు మూలము నాధార మును.3. సర్వప్రపంచమున కేకలక్ష్యము,నేకపరివర్తన కార ణమునున్నదని నిశ్చయింపఁబడెను. భిన్నవస్తుజాలముతోఁగూ డిన ప్రపంచమున నంతర్వర్తియై ఏకత్వసూత్రమున్నదని యుప నిషత్తులు విచిత్రగాథలమూలమునను, నుపాఖ్యానములమూల మునను దెల్పియున్నది. జగత్తునకుఁ, దత్సర్వవ్యాపార ప్రదర్శనములకును బ్రహ్మమే సర్వకారణము. ప్రపంచములోని భిన్నపదార్థములను ఆనందము నందంతమగు పరిణామరజ్జువు లోని ముడులు.

"బ్రహ్మము తన్నే తాను సృజించుకొనెను."౧. ''ఆతఁ డు జగమునుసృజించి, యందుఁ బ్రవేశించెను''౨. ప్రజాపతి యను దేవుఁడు తనయేకాకిత్వమును సహింపఁజాలక, తన్ను రెండుగాఁజేసికొని అర్ధనారీశ్వరుఁడై, సృష్టిలోఁగల సర్వమును సృజించెను. 3. కొన్ని వేళల సృజింపఁబడినవ్యక్తి పూర్వజడప దార్థమునుండి వచ్చెనని చెప్పఁబడెను. మఱికొన్ని చోటులందు, వస్తువుల మూలపదార్థమే యీసర్వవస్తుజాలముగా నుద్భవించె

---

3. ప్రశ్న ౧అ. 3

౧. తైత్తిరీయము. బృహదారణ్యకము ౨అ. ౧-౨౦: ముండకము ౧అ ౧.౬; ౨అ.౧,౧

౨. బృహదారణ్యకము ౪అ.౭

3. బృహదారణ్యకము ౧.౪౨.౧౪.ఇట్టి దేయాంగ్ యీన్ అను చైనా వారి సిద్ధాంతమొకటి యున్నది. స్థూలసూక్ష్మరూపములగు నీరెంటిచే నాది ప్రకియము పోఁగొట్టఁబడెనని చెప్పఁబడెను. యాంగ్ సర్వప్రాణులలోను న్న పుంలింగము; యీన్ స్త్రీలింగము. ఎమ్పిడోకిల్సు సిద్ధాంతమిట్టిదే

నని చెప్పఁబడెను. ౪. జలములోఁ గలిపిన లవణమెట్లు జలమం తయును వ్యాపించియుండునో, యట్లే 'ఆత్మ' సర్వమునందుఁ వ్యాపించియున్నది. అగ్నినుండి నెరసులవలె, సాలెపురుగునుండి దారములవలె, మురళినుండి ధ్వనులవలె సర్వవస్తువులు నాత్మ నుండి బయటికిఁ బ్రసరించినవి. ౫. బీజనాశముకాకుండ వృక్ష ముత్పన్నమైనట్లు సృష్టి యాత్మపదార్థమునుండి వచ్చెననికూడఁ గొన్నిచోట్ల సూచింపఁబడెను. సూర్యునుండి ప్రసరించు సూర్య కాంతివలన సూర్యున కేలోపము సంభవింపదు. దీనినుండియే ప్రాణి ప్రత్యేకవ్యక్తిత్వమా భాసమనుసిద్ధాంతము జనించినట్లు తోచుచున్నది, సాలెపురుగునుండి వచ్చుసాలెగూడు, తల్లిగర్భ మునుండి జనించుబిడ్డ, వేణువీణాదులనుండి యుద్భవించుధ్వనులు మున్నగు నుపమానములు కారణకార్యముల మధ్యమందున్న సన్నిహిత సంబంధమును దెల్పుచున్నవి. బ్రహ్మ, జగత్తుల యేకత్వమును సూచించుటకే వివిధములైన యుపమానముల నుపయోగించిచెప్పిరి.

బాహ్యప్రపంచము, బ్రహ్మమునకు వేరుగాలేదు. ప్రతి జీవి యందంతర్భూతమైయున్న ఆత్మ, జీవి, ప్రపంచాంతర్భూతమై యున్న బ్రహ్మము, ప్రపంచము విడిగాలేవు. బహుత్వముతోఁ గూడిన జగత్తును, ఏమియు మిగులకుండ బ్రహ్మముగాఁ దలప వచ్చును. సృష్టిలోని సర్వవస్తు నానాత్వములోను సూత్రము వలె నేకమై అద్వితీయమై బ్రహ్మము వ్యాపించియున్న దనువిష యములో నుపనిషత్తులభావము నిస్సంశయము. ఏకత్వబహు

౪. ఛాందోగ్యము. ౩అ. ౩౯. (౫) ఛాందోగ్యము. ౬అ. ౨౧. ౨౯; ౬.అ ౨.౧; బృహదారణ్యకము ౪అ. ౫; ముండక ౩అ.

త్వము లేక కాలమున నుండుటనుగూర్చి ప్రసంగించునవు పనిషత్తు లుపమానాదులలో మాటలాడునేకాని, సూటిగా వాబు చెప్పవు. బ్రహ్మస్వరూపజ్ఞానములేనిదే, బ్రహ్మజగత్సం బంధమును గూర్చి చెప్పఁజాలము. రెంటికిని సంబంధములేదని చెప్పఁజాలము; కాని వాని సంబంధమెట్టిదో, రెండు నొకే తత్త్వమున కెట్లు చెందియున్నవో, మనమెఱుఁగము. బ్రహ్మ జగత్సంబంధము మాయలేక, శంకరునిమాటలలో ననిర్వచనీ యము, సర్వసంబంధశూన్యుఁడగు బ్రహ్మ మెట్లుజగత్సంబంధి యయ్యెనను ప్రశ్నమున కవకాశములేదు. ప్రపంచసంబంధము లేదన్ననుసరించినను బ్రహ్మసత్యమునకులోపమురాదు. పరబ్రహ్మ తత్త్వమునకు జగత్తుండ నవసరములేదు. రెండును పరస్పరాధార భూతములై యున్నవనిచెప్పినచో బ్రహ్మమును దేశకాలబద్ధ మైన జగత్తుతో సమానమొనర్చిన దోషమునకుఁ, బాల్పడు దుము. బ్రహ్మజగత్సంబంధ మనిర్వచనీయమని చెప్పుటవలన జగత్తు బ్రహ్మమున కడ్డుగానున్న యొక తెఱవంటిదని ప్రాకృత జనులవుఁడు చెప్పునట్లు జగమసత్యమను భావములో నర్థము చేసికొనరాదు. ఏలన దేశకాలనిమిత్త మిళితమైన జగత్తునకు మూలము బ్రహ్మమే. బ్రహ్మము ప్రపంచములో నెంతవఱకుఁ గలదనగా, బ్రపంచములోని భిన్నవస్తువులు బ్రహ్మమున కెంత దూరముననున్నవో తెలిసికొని, దానినిబట్టి భిన్నదశలలోనున్న వస్తువుల కెంతసత్యమున్నదో నిర్ణయించుటకుఁ దోడ్పడునం తగానున్నది. బ్రహ్మము జగత్తులోనున్నది కాని జగత్తుగాలేదు ఈసమస్య నుపనిషత్తులు బహిరంగముగా నెదుర్కొనవు. భిన్న భావసమన్వయము చేయవలెనన్నచో, బ్రహ్మము సర్వ

సంపూర్ణమను నిశ్చయమునుపై దృఢముగా నిలువవలెను. బ్రహ్మము సర్వసంపూర్ణమనగా, సర్వలోకములు, వాని స్వరూపములు, త్రికాలములందలి సర్వదృశ్యములు, బ్రహ్మమునందే యిమిడియున్నవి; బ్రహ్మేతరమెద్దియును లేదు. బ్రహ్మజగత్సంబంధము మనకుఁ జెప్పశక్యము కానిదను శుద్ధతాత్త్విక వాదమునటుంచి, మనము చెప్పఁగోరఁదలచినచో, జగత్తు బ్రహ్మముచే సృజింపఁబడెననుటకంటె, నది బ్రహ్మముయొక్క సంకుచిత స్వరూపమను టెక్కువ సత్యముగాఁ దోచును. బ్రహ్మమే జగమును సృజించె ననుటవలన, బ్రహ్మము, కొంతకాల మొంటరియైయుండి, తన చరిత్రలో నెపుడో యొకప్పుడు సృష్టిచేసెనని యర్థమువచ్చును. కాలగతమైన లోకమునకు, కాలాతీతమైన బ్రహ్మకారణమని చెప్పుటలో నౌచిత్యము లేదు. జగము బ్రహ్మస్వభావమనుట యుక్తముగానుండును. నిజము నకనేకోపనిషద్వాక్యములలో జగము పూర్ణబ్రహ్మ స్వరూపప్రకటనమే యని చెప్పఁబడెను. ప్రకృతియొక సద్యోవికాసము లేక, స్వతంత్రాత్మ విష్కరణము; ఏలన నది బ్రహ్మశక్తి గర్భితము, సృష్టికి మొదటి ఘట్టములో రెండుస్వరూపములు గలిగినవి; ఒకటి ఆత్మజ్ఞానపూర్ణుఁడైన యీశ్వరుఁడు, రెండు. గర్భమందు బరిణామావకాశముగల జడపదార్థము, బ్రహ్మము పరిపూర్ణమైన పరమసత్యము, బ్రహ్మమునకు జగమెట్లు సంబంధించినదో మనమెఱుగము. ఏదోయొక సంబంధమును నిర్ణయింపవలెనన్నచోఁ, బూర్ణబ్రహ్మ మనేకత్వములో నేకత్వమని, లేక సంపూర్ణ సగుణబ్రహ్మమని చెప్పుటవలన నెక్కువ తృప్తి నిచ్చును. అపుడు మన కాత్మానాత్మలు, లేక ప్రకృతిపురు

షులు పరస్పరసంయోగముచే లోకమును సృజింతురు. ౧. ఆత్మావిష్కరణమే బ్రహ్మస్వభావ రహస్యము. చైతన్యము క్రియాత్మకము, శక్తి, స్థితిలో సహజముగానున్నది. మాయ, శక్తియను నర్థములో బ్రహ్మమునందు నిత్యమైయున్నది.

ప్రవర్తన శీలసంపన్నమైన సృష్టి, నిరాధారమైన యూహాకల్పనమనికాని, అసత్యప్రదర్శనమనికాని, ఛాయారూపమనికాని యుపనిషత్తులం దెచ్చటను సూచింపఁబడియుండలేదు. కళాకవితారాధకులగు నుపనిషత్కర్తలు ప్రకృతి రమ్య సీమల విహరించిరేకాని, ప్రకృతిని విడిచి పై కెగుర నుద్యమింపలేదు. వారు జీవితమొక దుస్స్వప్నమనికాని, లోకమొక శూన్యాలయమనికాని చెప్పియుండలేదు. బ్రహ్మాండమండల పరిభ్రమణ సంజాత మధురనాదములచే వారిజీవిత ముల్లసితమై జాజ్వల్యమై యొప్పెను. ప్రపంచము పరమేశ్వరు నాత్మావిష్కరణము. జగములన్నియు నాతని లీలావిలాస వైభవములు. ౨. కాని ఉపనిషత్సిద్ధాంత మనగా, ప్రపంచము స్వప్నతుల్యమను శుష్కాద్వైతమని పామరజనాభిప్రాయముకలదు. మనము

౧. గార్గ్యాయన మహర్షిచే రచితమని చెప్పఁబడిన "ప్రణవవాద"మను గ్రంథమును భాషాంతరీకరించుచు, నుపనిషత్తులలోని యొక మహావాక్యమైన "అహమేతన్న" "నేనిదికాదు." అనుదానికి భావమును నిర్ణయించుటలో నొక మహత్తరతత్త్వమున్నదని బాబు భగవాన్‌దాసు వ్రాసెను. 'అహమ్' యీశ్వరుఁడు; ఏతత్ ప్రకృతి, రెంటికిసంబంధము 'న' 'నాస్తి' "ఆత్మ అనాత్మకాదు. ఓంకారములోని 'అ' 'ఆత్మ' 'ఉ' అనాత్మ, 'మ్' 'న' యనునర్థము కాని యీమూఁడును బ్రణవములో మిళితమైయున్నవి. ప్రపంచ మాత్మయొక్క అభావప్రతిబింబమని చెప్పఁబడెను.

౨. ఆనందరూప మమృతం యద్విభాతి.

వ్యవహార ప్రపంచానుభవములను దీసికొని, వానికిఁ గారణముల నరయుదుమేని, యొక జ్ఞానమూర్తియగు నీశ్వరుఁడు, జడ ప్రకృతియును సిద్ధించును. సమాలోచనముచే నీ రెండు నొకటేయని మనము నిర్ణయింతుము. మనకుఁగల కష్టమంతయు వీని సమన్వయమందే. ద్రష్ట, దృశ్య మొకవైపునను, నుపనిషత్తులు స్పష్టముగాఁ బ్రకటించిన బ్రహ్మపదార్థ మొకవైపునను సమన్వయింపవలసియున్నవి. సత్య మొకటే, కాని మనకు రెండు కనిపించుచున్నవి. ఈజంటనుండియే ప్రపంచములోని భిన్నత్వమంతయు వచ్చినది. ఇచట నొక మొండిగోడ మనకేదురైనది. తత్త్వశాస్త్రము, ధైర్యముగల సత్యవాదియగునేని, దీనికిఁగారణము దురూహ్యమని చెప్పివేయవలెను. ఎట్లో ఒకటిరెండగుచున్నది. ఈసందర్భములో నీదిగువదే అత్యుత్తమనిర్ణయమని తోఁచుచున్నది: "అసంపూర్ణ జీవరాశియందు సంపూర్ణబ్రహ్మముయొక్క అంతర్యామిత్వమును; సంపూర్ణ బ్రహ్మమం దసంపూర్ణజీవరాశియొక్క స్థితియును నిర్వచనసాధ్యములు కానివని నేనెప్పుడును జెప్పుచునేయున్నాను. ...... దానినిఁ దెలిసికొనుట మనకేకాక, విజ్ఞానమునకే దుస్తరము." ౧. బ్రహ్మ జగ

ఆత్మ, తన స్వభావమును గుర్తించుటకే ప్రపంచము నంగీకరించెను అహం సత్యమ్; ఏతత్ దాని అసత్యఛాయ. ఈవ్యాఖ్యానము కడువిచిత్రమైనది; ఇచట నసత్యమని చెప్పఁబడినది 'ఏతత్' ప్రకృతికాదు. 'అహం' నుండి వేరైన ప్రకృతి మిథ్యయని దీనిభావము. సత్పదార్థమేకము; దానికంటె వేరుగా ననేకత్వము లేదని చెప్పఁబడినది. బ్రహ్మమే బహుత్వమునకుఁ గారణము. భారతీయ తత్త్వములో 'ఓం' కారమునకు నానార్థములున్నవి. మూడు'గల త్రికములన్నియు నిందుఁ జేర్పఁబడినవి. ఆత్మ, అనాత్మ, పర

తత్సంబంధ మనిర్వచనీయమని ఉపనిషత్తులు ప్రథమ సిద్ధాంతముగాఁ దీసికొన్నవి; అనంతర వేదాంతమున దీనికే మాయా నామకరణముచేసినది. ఈసమస్యకుఁ దృప్తికరముగా సమాధానము జెప్పలేకపోవుటకుఁ గారణము, పరస్పరవిరుద్ధములైన దేశ కాల నిమిత్తములతోఁ బనిచేయు మనస్సుయొక్క అసమర్థత అసంపూర్ణతయని చెప్పియుంటిమి. ప్రపంచమునుగూర్చి బుద్ధికిఁ దెలిసిన విషయ మల్పము నసత్యముగూడ నైయున్నది. ప్రపంచ వస్తుసమూహములు, బ్రహ్మమువలన బ్రహ్మమందున్నవి. కాని బ్రహ్మముకొఱకుఁ గాదు. మన పరిమితానుభవ జ్ఞాన మెచటనో యొకచోట శిథిలమై, ఆత్మవిరుద్ధమగుచున్నది. మన పరిమితానుభవములన్నియు నసంపూర్ణములయ్యును, వాని యసంపూర్ణత ఒక దశలో లేక భిన్నదశలలో నున్నది; వానినన్నిటి నొకే యంతరువునఁ బెట్టి అన్నియు సమానసత్యము గలవని చెప్పుట సమంజసముకాదు; అవి అసమానదశలలో

---

జ్ఞానము, జన్మము, జీవితము, మరణము; ప్రకృతి, జీవాత్మ, ‘పరమాత్మ; సత్త్వరజస్తమోగుణములు; భూతభవిష్య ద్వర్తమానములు; బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మున్నగునవి. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మూడవస్థలలో బ్రహ్మముయొక్క రూపములు. పరమేశ్వరుఁడు తన స్వేచ్ఛావిలాసముచే నీశాశ్వతప్రపంచమును సృజించెను, లేక ప్రదర్శించెను; అతఁడే బ్రహ్మ; దానినిఁజూచి, పోషించి సంతసించువాఁడు విష్ణువు; తనలోఁ దుదకు దానిని లీనమొనర్చుకొనునప్పు డాతఁడే శివుఁడు. ఈమూడుక్రియలు వేరనుకొనువారు మూడుమూర్తులను వేరుగా గ్రహింతురు.

(౧) బ్రాడ్లే. మైండు పత్రిక నెం. ౨౪. పుట ౧౫౪.

పోల్సుగ్రిన్ “దేవుఁడెందుకు లోకము సృజించినను నీ పురాణప్రశ్నకు జవాబెవ్వరు నియ్యలేదు; ఇక ముందుండదు. ప్రపంచమున్నది; ఎందుకున్నదో మనకుఁదెలియదు.

నసత్యములని చెప్పవలెను. మన సర్వానుభవములు, బ్రహ్మ మును దెలియుట కసమర్థములను విషయమునే మా యా సిద్ధాంతము తెలుపుచున్నది.

మానవత్వములో సహజముగాఁగల అసంపూర్ణతా లోపము నెఱిగిన కారణముచేఁ గలిగిన వినమ్రభావముచే నుప నిషద్ద్రష్టలు, బ్రహ్మమునుగూర్చి వ్యతిరేకభావములలో (నేతి వాక్యములలో) ప్రసంగించియుండగా, నుపనిషద్ధర్మము తమకు సువిదితమని తలచిన గర్వాహంకారపూరితులు, బ్రహ్మము కేవల శుద్ధ నిర్గుణస్వరూపమని, యుపనిషద్భావమునకు విరుద్ధముగాఁ బ్రలపించియుండిరి. అట్టివాదము సహేతుకముగాదు; ఏలన శంకరుఁడుగూడ బ్రహ్మమద్వైతము నద్వితీయమనియే చెప్పి నాఁడు కాని, యేకమని చెప్పలేదు; ౧ "బ్రహ్మము సర్వగుణా తీతమనియు, నిర్గుణజ్ఞానైకరాశియనియు" నర్థమిచ్చు ననేకము లైన ఉపనిషద్వాక్యములు గలవని ధీబో పండితుఁడు చెప్పుచు న్నాఁడు. "మఱియు బహుత్వముతోఁగూడిన జగత్ప్రదర్శనము మిథ్యయని తోఁపించుటకు వీలుకానందున, నీజగత్తు సత్య ముపైనాధారపడి యుండలేదనియు, నదియొక అసత్యనియమముచే నున్నదను భ్రాంతినిఁ గలిగించుచున్నదనియు, నట్టి నియమము బ్రహ్మముతోఁ గలిసియున్నను బ్రహ్మముయొక్క యేకత్వ మును జనింపఁజేయఁ జాలదనియు నిదియేసవ్యమగు తర్కనిర్ణ యమనియుఁ బ్రకటించిర"ని ధీబో వ్రాసెను. ధీబో పండితు ననుసరించి, ఏకమైన బ్రహ్మమును, అనేకమైన లోకమును సమ న్వయించుటకే మాయావాద ముపయోగించుననియు, దురదృ

(౧) వేదాంతసూత్రముల కుపోద్ఘాతము. పుట

ష్టవశమున, నుపనిషత్తు లోకేవాదమును సత్యమని నిర్ణయించుట కిష్టములేనివైన కారణమున, నొక నిర్విషయ జ్ఞానమూర్తియైన యీశ్వరు నంగీకరించునవి కావనియుఁ జెప్పఁబడెను. పరమసత్యము నొక నిర్విషయబ్రహ్మముగా నుపనిషత్తు లంగీకరింపవు. ఉపనిషత్తత్త్వము 'అద్వైతము' కాని 'ఏకేశ్వరత్వము' గాదు. విషయీ విషయభేదము జగత్తులోనిది కాని, బ్రహ్మములోనిది కాదు, మనము ప్రపంచమును విషయీ విషయ (Subject and Object) ములైన రెండుగా విభజింపఁజాలము; ఏలన బ్రహ్మము రెంటియందేకమైయున్నది. ఉపనిషత్తులు ద్వైతమును నిరసించునుగాని, యీబహుత్వము నేకత్వములోఁ గలుపుట కంగీకరింపవు; కేవలవిచియము నర్థముచేసికొనుటకుఁ గలిపిన నంగీకరించును. ౧.

---

౧. జగద్బ్రహ్మైకత్వమును దెల్పుట కుపనిషత్తు లుపయోగించిన యుపమానములో నిట్లు చెప్పఁబడినది; "వాచారంభణం వికారో నామధేయమ్ మృత్తికేత్యేవ సత్యమ్." వస్తువులన్నియు నొకేబ్రహ్మముయొక్క నామరూపములుగలిగిన రూపాంతరములని భావము. శంకరుఁడి ట్లర్థము చెప్పెను. "రూపాంతరము లేక వికారము వాక్కువలనవచ్చి వాక్కులోనే యున్నది కాని; నిజముచే వికార మసత్యము; అది కేవల నామమాత్రమే కాని, నిజముగాదు." అది కేవల వ్యావహారిక సత్యము కాని అం[illegible] కాని కాదు. మఱియునిది ఉద్దాలకుఁడు చెప్పినమాట; ఉద్దాలకుఁడు రూపపరివర్తన శీలమైన జడపదార్థసత్యస్థితి నంగీకరించినవాఁడు. జడపదార్థ మవిచ్ఛిన్నమైన ఏకపదార్థము; అందు గుణభేదములు గల వివిధాణువులు కలిసియున్నవి. దానిపరిణామ మొక నామాంతరమునిచ్చుటచేఁ గలిగినదని యీవాక్యము చెప్పుచున్నది. ఉపనిషత్తులలో వ్యక్తిత్వమును దెల్పుటకే నామరూపము లుపయోగింపఁబడినవి. చూడు. బృహదారణ్యకము ౧. ౪. ౭. ఏకమైన [illegible]సత్పదార్థమునుండి నామ రూపాత్మక పరిణామ ముద్భ

మఱికొందఱు విమర్శకులు, ప్రపంచము మిథ్యయని చెప్పుటకే మాయాసిద్ధాంతము నుపనిషత్తులు ప్రకటించిన వని చెప్పుదురు. వీరి యభిప్రాయమును బరిశీలింతము. ఐరోపా యందు వేదాంతవిద్యను విశేషవ్యాప్తి చేయుటకై పరిశ్రమించిన డ్యూసేన్ పండితుఁడు నాలుగువిధములైన సృష్టిసిద్ధాంతములు లుపనిషత్తులలో నున్నవని చెప్పినాఁడు. (౧) దేవునినుండి స్వతంత్రమైన జడపదార్థము శాశ్వతముగానున్నది. దాని నాతఁడు సృజింపలేదుకాని, దానితో జగద్వస్తువులను జేసెను. (౨) సృష్టిని శూన్యమునుండి దేవుఁడు చేసెను; ప్రపంచము దేవునినుండి స్వతంత్రమైనది; (౩) దేవుఁడు తానేలోకముగా

వించినది, నామరూపాత్మక వికార మసత్యమను సూచన యిచటలేదు. నామ రూపాత్మకవస్తువులు బ్రహ్మమునకు వేరుగా లేవనుమాట సత్యమే. నామ రూపములనగా నాంగ్లములోని నామరూపములుగావు. అరిస్టాటల్ చెప్పిన రూపము, పదార్థము వీనికి సరిపోవును. రెండునుకలిసి లోకములోని సర్వవస్తువులయ్యెను. బౌద్ధమతములో రూపమనగా స్థూలదేహము, నామమనగా సూక్ష్మమగుమనస్సు. ఉపనిషత్తులలో నామరూపములనగా, నేకపదార్థము నుండి వ్యక్తిత్వావిష్కరణము. ఈవ్యక్తిత్వావిష్కరణమే సృష్టికి మూలసూత్రము, జగత్పరివర్తనధర్మము. వస్తువులు, వ్యక్తులు, పరమేశ్వరుని భిన్న ప్రదర్శనాంశములు. స్వతంత్రమైన స్థితి వానికిలేదు. బ్రహ్మమునకే యట్టిస్థితి కలదు. అవివేరుగా నుండుటబద్ధము. ఉపనిషత్తుల ననుసరించి మోక్షమనగా, బ్రహ్మమునుండి నామరూపములు గలవి వేరనుభావము నశించుటే. ముండకోపనిషత్తిట్లు చెప్పుచున్నది. "బ్రహ్మజ్ఞాన పారంగతుఁడు, బ్రహ్మముతో నేకమై, సముద్రముఁ బ్రవేశించిననదులు తమనామరూపములను విడిచినట్లే, నామరూపములనుండి విడిపడుచున్నాఁడు." కారణముకార్యముకంటె నెక్కుడు సత్యమైనది. దేవుఁడు సర్వవస్తువులకు, వ్యక్తులకుఁ గారణము. కనకమ యాభరణములన్నిటికిఁ గనకమే సత్యమైనట్లు, జగత్తునకు బ్రహ్మమే సత్యము.]

మారినాఁడు; (క) దేవుఁడొక్కఁడే యున్నాఁడు; సృష్టిలేనే లేదు. నాల్గవదే యుపనిషత్తుల మూలసిద్ధాంతమని యాతనియభిప్రాయము. దేశకాలములందున్న ప్రపంచమొక అసత్యదృశ్యము, భ్రాంతి, దేవుని నీడవంటిది. ప్రపంచమును విసర్జింపనిదే దేవుఁడు లభింపఁడు. జగమసత్యమనుభావము ప్రతిమతముయొక్క సారాంశమని డ్యూసేన్ పండితుఁడు తలఁచి, ఉపనిషద్భావము నిదియే యని నమ్మినాఁడు. డ్యూసేన్ తన స్వతంత్ర బుద్ధిపై నాధారపడి, యిట్టి నిర్ణయమునకువచ్చి, తన సిద్ధాంతమును సమర్థించుటకొఱకు,ప్రాచీన భారతీయతత్త్వమునందును, ఉపనిషత్తులందును శంకరాచార్యుని రచనలందును. ప్రాచీన గ్రీసుతత్త్వమందును, పార్మనైడీస్, ప్లేటో, లయందును అభినవ జర్మనీయందును, క్యాంటు, సోపెన్హాయరులందును, తనభావమునుపోషించు వాక్యములకొఱకు వెదకఁజొచ్చెను, ఈ యన్వేషణావేగములో నాతఁడు కొన్ని సత్యాంశములను విడిచిపెట్టెను. నేడు ప్రచారములోనున్న 'సర్వంబ్రహ్మ' వాదముపనిషత్తులలోనిదని యాతఁ డంగీకరించినను, జగన్మిథ్యావాదమే ఉపనిషత్తుల ప్రాచీన సిద్ధాంతమని తలచినాఁడు. "సర్వము దైవస్వరూపమ"ను భావము 'ప్రచారము'లోనున్నదని ఉన్న సత్యము నాతఁ డంగీకరింపకతప్పినదికాదు. ఉపనిషత్తుల మూల సిద్ధాంతము, జగన్మిథ్యావాదమని యాతని స్వతంత్రాభిప్రాయము. ఈ రెండుభావములకును సమన్వయముచేయవలసివచ్చెను. అజ్ఞాన జనసమూహమున కర్థమగుటకును,లోకప్రవృత్తిని దృప్తిపరచుటకును, నీ సమన్వయ మంగీకరింపఁబడినదని యాతఁడు చెప్పెను;" ఆత్మయే యేకైకసత్యమను భావము,

సర్వకాలములయందు, నమ్మఁబడెను. స్వతంత్రమైన జడపదార్థ మున్నదని నమ్మని సామాన్యులుకూడ 'నాత్మ'యే సర్వమని నమ్మిరి. దీనితోఁబాటు, వ్యవహారప్రపంచము తోసివేయుటకు వీలులేనిదగుటచేఁ, బ్రజాసామాన్యముకొఱకు దానినిగూడ నంగీకరించి"రని (1) డ్యూసేన్ వ్రాసినాఁడు. ఉపనిషత్తులు బ్రహ్మ మొక్కటే సత్యమని యుద్ఘాటించుటనుబట్టి డ్యూసేన్ జగన్మిథ్యా వాదమునకు బలముకలిగినది. బ్రహ్మమొక్కటే సత్యమని మేమంగీకరింతుము. బ్రహ్మము తెలిసిన నన్నియుఁ దెలియును. దానికి వేఱుగా నింకొకటి యేదియునులేదనియు మేమంగీకరింతుము. కాని, దానిలోఁగాని, బయటగాని అసలే భిన్నత్వము లేదనినచో, నట్టిభావ మర్థవంతముగా లేదు. డ్యూసేన్ చెప్పినాఁడు; "ప్రకృతి, బహుత్వమును బ్రదర్శించు ప్రకృతి పరివర్తనము కేవలము మిథ్య."(2) అదేవిధముగా నిట్లు ఫ్రేజరు వాదించినాఁడు; "బ్రహ్మమొక్కటే అద్వితీయసత్య మనిచెప్పు నుపనిషత్సిద్ధాంతమునుండి, సహజముగాను సహేతుకముగాను లభించునదే, ద్వంద్వములతోఁగూడిన ప్రపంచ ప్రదర్శనము మిథ్యయను సిద్ధాంతమున్నది. 3. ఈ వాదము లలో. పూర్ణసత్పదార్థమునుగూర్చి తప్పుగా వీరు భావించిరి; పూర్ణమనఁగా నసంపూర్ణముగానిదని వారు తలఁచిరి; శాశ్వత మైనదనఁగా నశాశ్వతముకానిది. శాశ్వతమైన సత్పదార్థము కాలాతీతమైన వస్తువైనచోఁ గాలగతమైన ప్రపంచజీవిత మసత్య

(1) ది ఫిలాసఫీ ఆఫ్ ది ఉపనిషత్సు. పుటలు ౧౬౧-౨

(2) ది ఫిలాసఫీ ఆఫ్ ది ఉపనిషత్సు. పుట ౨౩౭.

(3) ఇండియన్ థాట్. పుట ౬౭

మగును. దేశకాల పరివృతమైన ప్రపంచమునకును, దదతీత మైన శాశ్వతప్రపంచమునకును విరోధమును శాశ్వతమే. కాని శాశ్వతవస్తు వశాశ్వతవస్తువును బహిష్కరించెనని యుపనిషత్తు లలో నెచటను జెప్పలేదు. ఎచ్చటెచట బ్రహ్మ మొక్కటే పరమసత్యమని యుపనిషత్తులు వక్కాణించినవో, అచ్చటచట మెలకువగలిగి, ప్రపంచము బ్రహ్మమందు గర్భితమైయున్నద నియు, నందుచేఁ బ్రపంచమునకును గొంత సత్యముకలదనియుఁ జెప్పియున్నవి. "పరిమితమైన దపరిమితమైన దానిలో నున్నది. విశ్వమంతయు నాత్మమయము." ౧. ప్రాణము బ్రహ్మము; వాక్కు బ్రహ్మము; మనస్సు బ్రహ్మము; జగత్తులోని సర్వము బ్రహ్మమే. క్షుద్రరేణువునందును, నత్యల్పమైన నలుసునం దును దేవుఁడున్నాఁడు. ౨. సత్యమున్నదని నిశ్చయించినపుడు, సత్యముపై నాధారపడినదంతయు నున్నదనియే నిశ్చయము. బ్రహ్మయే సర్వసత్యమను భావమునుండి, బ్రహ్మమందున్న ట్టియు బ్రహ్మముపై నాధారపడినట్టియు నన్నియు నిట్టి బ్రహ్మ సంబంధ సత్యమునుగలిగి యున్నవని తేలుచున్నవి. ఉపనిషత్తు లలోని, "ఆత్మ తెలియుటతో నన్నియునుఁ దెలియు"నని చెప్పిన వాక్యములవలన ప్రపంచస్థితి మిథ్యయేయనుభావము స్పష్టమని డ్యూసేన్ వాదించినాఁడు. ఈవాదము మాకంగీకారముకాదు.

(౧) ఛాందోగ్యము. ౨అ ౪౨౬.

(౨) ముండకము ౨అ.౨-౧౧; కఠము ౨అ.౫. ౨; తైత్తిరీయము.౩అ ౧; ఛాందోగ్యము. ౩అ. ౧౪. ౧; ౨అ. ౧౪-౨-౪; ౬అ.౯; ౪అ. ౯. ౧; బృహదారణ్యకము. ౨అ. ౪. ౬; ౪అ. ౪. ౬; ౪ అ. ౫. ౭; ౨అ. ౫. ౨; ౫అ. ౩. ౧; ౧అ. ౪. ౧౬; ౨అ. ౫. ౧౫; ౩అ, ౭. ౧౫: ౪అ. ౪. ౨౩

సృష్టిలోని సర్వవస్తువులు, సర్వభావములు, ఆత్మయందే యుండినచో, నాత్మ తెలిసిన నన్నియుఁ దెలియునను సిద్ధాంతమును సరిపడును. మనకు మోక్షమునిచ్చు జ్ఞానమువలన మనయందంతర్భూతమైయున్న ఆత్మదర్శనము లభించును. ఇందాత్మయుఁ బ్రపంచమును వేఱనుభావమేమియును లేదు. ఉన్నచో నింద్రుఁడు ప్రజాపతితోఁ జెప్పినది నిజమగును; మఱియు సర్వవిరహితమైన ఆత్మ సర్వశూన్యమగును. అనేకత్వమును విడిచిన యేకత్వము శుష్కవ్యక్తియగును. శాశ్వతవస్తువు క్షణికవస్తుజాలమును మిథ్యయని త్రోసివేయనవసరము లేదు. ఆధ్యాత్మిక, నైతిక, తాత్త్విక కళాసంబంధములైన అత్యుత్తమానుభవ సత్యములను మనము విశ్వసించినచో, ననిత్యమైనది నిత్యవస్తువునందును, మితమైన దమితమైనదానియందును, గర్భీభూతమైయున్నదనియు, మానవుఁడు దేవునినుండి జన్మించెననియు భావించుట యుక్తమైనది. సర్వజగత్తునకు బ్రహ్మమే మూలమైయున్నదను నుపనిషద్వాక్యములు, జ్ఞానహీనులను దృష్టి సఱచుటకై వ్రాయఁబడినవని డ్యూసెన్ వాదించినాఁడు. ప్రపంచము మిథ్యయేయని నిశ్చయించినచో నుపనిషత్తులు, బ్రహ్మ జగత్సంబంధ సిద్ధాంతములను నిశ్చయభావముతోఁ జెప్పియుండవు. డ్యూసెన్ పండితుఁడొక సమర్థింప నశక్యమైన సిద్ధాంతమును స్వీకరించి, దానిని బోషించుట కసంబద్ధవాదములను బ్రదర్శించినాఁడు. మఱియు నాతఁడు సుప్రసిద్ధ జర్మన్ తత్త్వవేత్తయైన క్యాంటు పండితునికి జగన్మిథ్యావాదమును గనిపెట్టినకీర్తి నిచ్చుటకుఁ దలపెట్టి, ఉపనిషత్తులలో నీసిద్ధాంతము సుస్పష్టముగను, నిశ్చయముగను జెప్పఁబడియుండలేదని యీ విధముగా వ్రాసెను.

"ఒక్కటైన బ్రహ్మపదార్థమునకును, అనేకత్వము గలిగిన ప్రపంచమునకును భేదము విశేషముగా నుంచఁబడెను. భారతీయ ప్రాచీనతత్త్వవేత్తలుకాని, క్యాంటుకుఁబూర్వ మేతత్త్వవేత్తలుకాని, దేశకాలములందుఁ బ్రదర్శింపఁబడిన జగద్వస్తుజాలమంతయును కేవల వ్యక్తిగతభ్రాంతి యను మహత్తరభావౌన్నత్యసీమ కెగురఁజాలరైరి."౧ ప్రపంచము భ్రాంతిమాత్రమను సిద్ధాంతమునుపనిషత్తుల నిశ్చయభావముకాదని డ్యూసేన్ జెప్పినది సత్యము. ఉపనిషత్తులలో ననేకసృష్టి సిద్ధాంతములు, బ్రహ్మజగత్సంబంధమును జెప్పుటకే రచింపఁబడి యున్నవి. నానాప్రదర్శనములతోఁ గూడిన ప్రపంచము, ఒకే బ్రహ్మము నుండి గోచరించి, నామ రూపమాత్ర కల్పితమైయున్నదని నిర్వచించు నుపనిషద్వాక్యము లనేకములున్నవని మేము సంగీక

౧. ది ఫిలాసఫీ ఆఫ్ ది ఉపనిషత్సు పుట౧౦౩. క్యాంటు తత్త్వము నుపనిషత్తుల ననుసరించియు, నుపనిషత్తత్త్వమును క్యాంటు ననుసరించియు నర్థము చెప్పఁదలచి, రెండుభావములనుగూడ సక్రమముగా గ్రహింపఁజాలఁడయ్యెను. బౌద్ధులశూన్యవాదముగాఁ దనతత్త్వము నపార్థముచేయరాదని శంకరుఁడుసూచించినట్లే బెర్క్లీశూన్యవాదముగాఁ దనతత్త్వము నపార్థముచేయరాదని క్యాంటు సూచించియున్నాఁడు. సోపెన్హారు తలచినట్లే డ్యూసేన్ కూడ, జగద్వస్తుమూలసత్యసిద్ధాంత నిరసనమును క్యాంటు చేయుటలో నాతని నిజతత్త్వముగాక, ఆసమ్యగాలోచనా ఫలితమనియు నదియొక గొప్పతప్పుగాఁ జూడవలెననియుఁ దలచినాఁడు కాఁబోలును. క్యాంటు తత్త్వము నెఱిగినవారు డ్యూసేన్ చెప్పిన భావముతో నేకీభవింతురనుట సందేహాస్పదము. "మనలో సుస్థాపితమైయున్న నైతికధర్మము నాధారముగాఁ జేసికొని, జీవనిత్యత్వసిద్ధాంతమును క్యాంటు కల్పించెను; ఈసిద్ధాంతము నేకములైన అసత్యాభిప్రాయములతోడి సామరస్యమునఁగాని చేకూరదు. దీనివలన జీవుని జన్మాంతరసిద్ధాంతము లభించునే కాని జీవనిత్యత్వసిద్ధాంతముచే కూరదు" (పుట ౩౧౮)

కెంతుము. ఈవాక్యముల భావమేమన వస్తువుల మూలతత్త్వమంతయు నొకటేయనియు, మనము నామరూపభేదములలో మునిఁగియున్నచో వస్త్వభ్యంతరమున నేకమై అవిచ్ఛిన్నమై యున్న సత్పదార్థమును గుర్తింపలేకపోదుమనియు గ్రహింపవలెను. ఈనామరూపాత్మక ప్రపంచము నిత్యమైన సత్పదార్థము నాచ్ఛాదించుచున్నది.౧. అనిత్యపదార్థములను గప్పిన నామరూపాత్మకమైన తెరను దొలఁగించివేయవలెను. దేశకాల పరివృతములైన వస్తువులభ్యంతర వర్తియైయున్న వస్తు నిత్యస్వరూపమును మఱుఁగుపఱచుచున్నవి. జీవితములో నేభాగము నశ్వరమో, యది నిజమైన జీవితగర్భమందున్న నిత్యసత్యముకాదు. సత్పదార్థము వీనికతీతమైనది. అది వస్తుజాలము ద్వారమున నాత్మప్రదర్శనము చేసికొనుచున్నది; ఆత్మప్రదర్శనమే ఆత్మాచ్ఛాదనమగుచున్నది. ఆవిష్కరణ మెంత సంపూర్ణమైన నంతసంపూర్ణముగా నాచ్ఛాదనము నగుచున్నది. పరమేశ్వరుఁడు తన ముఖమునకుఁ దెరకట్టుకొని, లోకరూపమునఁ బ్రకటించుకొనుచున్నాఁడు. వస్తు మూలతత్త్వమింద్రియ జ్ఞానమున కగోచరము. ప్రపంచము, దేవుని మహిమను వేనోళ్లఁజాటుచు, నాతని

౧. బృహదారణ్యకము ౧అ. ౬.౩. అమృతమ్ సత్యేనఛన్నమ్. 'సత్' పదముయొక్క అస్పష్టభావముకలననే, ఉపనిషత్తత్త్వమును గూర్చిన పెక్కు సంశయముల కవకాశము వచ్చినది. ఒకయర్థములో, 'సత్' నగు స్థితిగల సర్వము ననిభావము. 'సత్' అనగా, సర్వపరివర్తనములలో నంతర్వర్తియైయున్న అమృతత్వమని యింకొకయర్థము. "త్యత్" "సత్" నకు వ్యతిరేకమగుటచే 'నన్నృత'మని చెప్పఁబడెను. (తైత్తిరీయము. ౨అ, ౬,) సామాన్యముగా, పరమసత్యమైన బ్రహ్మము సత్పదార్థమనియుఁ, బరివర్తనశీలము గల జగమే అసత్తనియు వాడుక. ఛాందోగ్యము. ౬అ. ౨.౧; ౩ ౧౪.౧.

నిజస్వరూపమును మఱుఁగున నుంచుచున్నది. అపరిమేయమైన సత్పదార్థములేక, నిర్గుణనిరాకారబ్రహ్మము, సృష్టిలోని ద్వంద్వములచేతను బహుత్వముచేతను గప్పఁబడినది. జీవాత్మలతోఁ గూడిన జగద్వస్తువులన్నియుఁ దాము స్వతంత్రసంస్థితి, వ్యక్తిత్వమును గలవనితలఁచి, స్వీయవ్యక్తిత్వ సంరక్షణము నిమిత్తము నిరంతర కృషిచేయుచున్నట్లు గోచరించును. తామొకే పరమాత్మనుండి వచ్చితిమనియు నాతనిపోషణములో నుంటిమనియు నెఱుఁగరు. ఇట్టి నమ్మకమునకుఁ గారణము మాయ, లేక భ్రాంతి "చెట్టుమీఁదనున్న పత్రియాకును సూర్యరశ్మి, వాయువులచేఁ దాను స్వతంత్రముగాఁ బెరుగుచున్న వ్యక్తి యని యు, హేమంతమురాఁగానే వాడిపోయి నశించుచున్నాననియు సహజముగాఁ దలఁచుట కవకాశముగలదు. కాని నిజముచే, మూలమునుండి ప్రసరించుచున్న రసముచేఁ దాను బోషింపఁ బడుచున్న విషయమును, మొత్తముమీఁద వృక్షపోషణములో దానును భాగస్వామియనియు నెఱుఁగుట కష్టము. ఈవిధముగా ఆకులోనియాత్మ చెట్టులోని యాత్మతో నవినాభావ సంబంధము గలిగియున్నది. దీని నాయాకెఱిఁగినచో, దనజీవము, వృక్షజీవితముతో సమగ్రముగా మేళవించియున్నదని, తెలిసికొనఁగలదు." ౧. ప్రత్యేకవ్యక్తిత్వములను తరంగముల యడుగున, నన్నితరంగములకుఁ బ్రాణమొసఁగుచున్న గంభీరసాగరము గలదని తెలియవలెను. అదేవిధముగా లోకములోని వస్తువులు, స్వతంత్రస్వయంస్థితి గలవనితలఁచి, యొక తెరనడ్డుకట్టి సత్య

౧. ఎడ్వర్డ్ కార్పెంటరు: పేగన్ అండు క్రిస్టియన్ క్రీడ్సు పుట. ౩౦౧

మును గప్పివేయుచున్నాము. అనిత్యములైన పదార్థములస్వ యంవ్యక్తిత్వము నిజమనుభావము మేఘమువలె, సత్యజ్యోతిని మఱుఁగుపఱచుచున్నది. మనము వివేకముతో నీవస్తుజాలము నకు మూలకారణము నొద్దకుఁబోయి చూచినచో, మనయం దును సర్వవస్తువులయందు నంతర్వర్తియై యున్నశక్తి యొకటే యని స్పష్టమగును. ఇట్టి భిన్నపదార్థాంతర్వర్తియైయున్న యేక సత్పదార్థమును గుర్తించుటకు మనకంతర్వీక్షణ మవసరమని చెప్పుటకే, జనకపుత్రసంవాదము ఛాందోగ్యమునందు (౬ అ. ౧౦) జరిగినది. "ఒకన్యగ్రోధవృక్షమునుండి పండొకటి తెమ్ము" "ఇదిగో తెచ్చితినిస్వామీ !" 'దానిని భేదింపుము'. 'స్వామీ య చేసితిని." "అందేమి చూచితివి ?" "అతిసూక్ష్మము లైన గింజలున్నవి,' "ఒకగింజను జితుకఁగొట్టుము." 'అట్లే చేసితినిస్వామీ !" 'అందేమి చూచితివి ?' "ఏమియును లేదు"

తండ్రి యిట్లుచెప్పెను; "గింజలో సూక్ష్మమై నీకుఁగని పించని సారమేమియున్నదో దానివలననే యీవిశాలన్యగ్రో ధవృక్షము నిలిచియున్నది, కుమారా ! నమ్ముము. ఏది సూక్ష్మతమమైనదో, దానిలో నీసమస్తము నున్నది. అదియే సత్యము. అదియే ఆత్మ: నీవు నదియే."

ప్రకృతినుండి యిట్టి యుదాహరణముల నొకటి వెనుక నొకటిచెప్పి, తండ్రి చైతన్యముయొక్క యేకత్వమును, మానవజీవితము సర్వసృష్టిజీవితముతో నొకటి యనుభావమును గ్రహింపుమని యుద్బోధించెను. వస్తువుల యనేకత్వముచే నాచ్ఛాదింపఁబడియున్న యేకైకసత్యమును గుర్తించుట సులభమైన పనిగాదు. మనమతి లౌకికులము, వ్యవహారజ్ఞాన నిమ

గ్నులము, స్వీయవ్యక్తిత్వ సంరక్షణ తత్పరులము నగుటచే నట్టి వివేకము కలుగుట కష్టము.

"ప్రపంచమంతయు, సంపత్పుత్రాదులు, మన జ్ఞానము నన్నియు శూన్యములోని కదృశ్యములై పోవలెను; ఏలన నవి నిజముగా శూన్యములే" ౧ యనునదే ఉపనిషత్తుల సిద్ధాంత మని చెప్పినపుడు డ్యూసేన్ పండితుఁ డుపనిషత్తుల కేంద్రసత్య మును విస్మరించినాఁడని చెప్పవచ్చును. తాను నిశ్చయించిన సిద్ధాంతమునకు వ్యతిరేకభావమునిచ్చు నుపనిషద్వాక్యముల నగా, బ్రహ్మము సృష్టిని బోధించుచున్నదనియు, బ్రహ్మయు నాత్మయు నొకటే యనియుఁ జెప్పువాక్యముల నుపనిషత్తులు ప్రజాభిప్రాయసంతృప్తికై చెప్పిన సవరణలని డ్యూసేన్‌సమాధానము చెప్పినాఁడు. "మూర్ఖజనాభిప్రాయ సంతృప్తికై జీవాత్మ పరమాత్మైక్యభావమును నుపనిషత్తులు ౨ చెప్పిన'వని యీతఁడు వ్రాసినాఁడు. మఱియు; "ఉపనిషత్తులకు అత్యంతాణురూపమైన జీవాత్మకునుఁ అనంతమైన పరమాత్మకును దాదాత్మ్యమును బ్రకటించుటలో నొకవిశిష్టమైన యాహ్లాదము కలదనితోఁచును" ౨. అనగా, మనము విపత్కాలములో దేవునారాధింపరాదు. అట్టి యారాధమునుపనిషత్తులు మూర్ఖుల తృప్తికై యంగీకరించినవని డ్యూసేన్ భావము.

"తత్త్వజ్ఞానమాత్రేతర పదార్థమేదియు నున్నదని యంగీకరింపఁజాలదు. వ్యవహారదృష్టిలోఁ దద్విరుద్ధముగా బాహుళ్యముతోఁగూడిన ప్రపంచము బ్రహ్మమునకు వేఱుగానున్నది. ఈ

---

౧. ది ఫిలాసఫీ ఆఫ్ ది ఉపనిషత్స్, పుట ౧౬౯; (౨)పుట౧౭౧.

౨. ది ఫిలాసఫీ ఆఫ్ ది ఉపనిషత్స్, పుట ౨౩౭

పరస్పరసిద్ధాంత వైరుధ్యములను సమన్వయించుటకుఁ జేసిన ప్రియత్నమునుండి, ప్రపంచస్థితి నిజమను సిద్ధాంతముద్భవించి నది కాని ఆత్మయే సత్యమనియు, నందుచేఁ బ్రపంచ మాత్మ యేయనియుఁ జెప్పఁబడినది." ౧. ఈరెంఁడు భావములేల పర స్పరవిరుద్ధములో, వీని నసంబద్ధములైనను సమన్వయింపఁ వలసివచ్చినదో బోధపడుటలేదు. ఆత్మకు వేఱుగా నేదియు సత్యమైన పదార్థలేదని చెప్పిన దానిభావము, ఆత్మయే సర్వాం తర్యామియై, సర్వము దానియందే యున్నదనియే. 'భిన్నత' తోఁగూడిన ప్రపంచము మనకుఁ వేఱుగా నున్నదను దాని భావములోని 'మనకు' అనగా మనశ్శరీరావృతములై, ఒకచో నివాసము, తత్సంబంధావరణముగల మనుజవ్యక్తులన్నమాట. నిజముగా నట్టివారికి లోకము సత్యమే; వారి నేత్రముల కెట్ట యెదుట నిలిచియున్నది. మన మన్వేషించుచున్న ఆత్మపదార్థ మింద్రియజ్ఞాన విషయముగాదు; కాని సర్వజ్ఞాన మూలాధా రము. దానిస్థితి, సూక్ష్మస్థూల ప్రపంచములకుఁ బూర్వమైనది. జీవులు, ప్రకృతిలోని భాగములే. ప్రకృతిలో నవి పరస్పరము కలిసి పని చేయుచుండును. కాని హేతుదృష్టితోఁ జూచిన యెడలఁ బరస్పరసంబంధము గలిగిన జీవలోకస్థితికి మూలా ధారమాత్మ మానసికజీవులముగా మనకు జగత్తు వేఱుగా నున్నది. కాని, సర్వమునకును జీవమైన ఆత్మలో నన్ని యునున్నవి. తుదిమాటయేమనఁగా, మనము పూర్ణ జ్ఞాన ము గలవారముకాము కావున జగత్తు మనకుసత్యమై గోచ రించును. ఆత్మయే యేకైకసత్యము ; అందు జగత్తిమిడి

౧. పుట ౭౦౫

యున్నది. మన మింకెట్లూహించినను హేతుశూన్యవాద మగును. సశరీరులమైయున్న మనకు వస్తువులతో నిండియున్న ప్రపంచము వేఱు. ఎట్లు మనజీవితములోఁ బదార్థములను వేఱు గాఁజూచియు, వానిని స్వీకరించి, మనలోఁ గలుపుకొనుచున్నామో అటులే, విషయీ విషయములను దనదిగాఁజేసికొనవలెను అప్పుడు మొట్టమొదటఁదనకు వేఱయినదృశ్యముగా గోచరించిన పదార్థము క్రమముగా ద్రష్టయొక్క క్రియాసాధన రంగముగా మాఱును. ఈవిధానము క్రమముగా నభివృద్ధిపొంది, ద్రష్ట దృశ్యమును స్వాధీనపఱచుకొని, సర్వాధిపత్యమును బొందును. అప్పుడు ద్రష్టకు వేఱుగా నేయాటంకమునుండదు; కాని యాదశ వచ్చునందాక గమ్యస్థానము చేరఁజాలము. తనకు వేఱుగా, వ్యతిరేకముగానున్న సర్వమును దొలఁగించుటయే ఆత్మాభివృద్ధి సూచన. దేశకాలబద్ధుఁడై, పరిణామశృంఖలములో నొక 'లింకు' గానున్న యీమానవవ్యక్తిత్వము పూర్ణసత్యమని మనము నమ్మినచోఁ బ్రపంచము మిథ్యయను నిర్ణయముకలుగును. మనమిప్పుడున్న అజ్ఞాన వ్యక్తిత్వములో మనమే బ్రహ్మమని, పరమ సత్యస్వరూపములమని యన్నచో, నప్పుడు మనకంటె వేఱుగానున్న ప్రపంచము కేవల మిథ్యాప్రదర్శనమే. కాని మనము 'ఆత్మయే పరమసత్యస్వరూపమ'ని జెప్పినది పూర్ణమైనది; మనమింక నట్టి పూర్ణత్వమును బొందవలసియున్నది. వైరుధ్యములతోఁ గూడిన మానవునిలోని అపరిపూర్ణాత్మకును, పరిపూర్ణాత్మస్వరూపమైన బ్రహ్మమునకునుగల భేదమును తెలియనికారణముచే, డ్యూసేన్ పండితుఁడు, రెం

టికి నైరుద్ధ్యముగలదని యూహించి, దాని నసంగత విధాన ముచే సమన్వయింపఁ బ్రయత్నించెను.

బ్రహ్మములో నానాత్వము చూడరాదనిచెప్పు రెండు శ్లోకములు గలవు.౧. ప్రపంచమున నేకత్వమును సూచించుట కివి ప్రయత్నించినవి. అనేకము లైన అపరిపూర్ణ జీవులనుగాక యేకమైన అనంత సత్పదార్థము నివి యుద్ఘాటించినవి. మన జాగ్రదావస్థలో ద్రష్టకు దృశ్యమునకుఁ బ్రత్యేకత్వము నిజమని తలంతుము. సమ్యక్పరిశీలనముచే నట్టిప్రత్యేకత్వము పరమ సత్యముగాదని గోచరించును. ద్రష్టకు దృశ్యమునకుఁగల పృథగ్భావము స్థిరముగాదు. నానాత్వమే పూర్ణసత్యముకాదని చెప్పి నపుడు, నానాత్వమే మిథ్యలేక సత్యమేకాదని యర్థముకాఁజాలదు; ఇదియొక బౌద్ధశాఖయొక్క మూర్ఖవాదము; దీనినే శంకరుఁడు ఖండించినాఁడు. ప్రపంచమునకు మూలకారణము బ్రహ్మేతరమని తలఁచినచో మనము గతిహీనుల మగుదుము. బ్రహ్మేతరమైన వస్తుస్థితినే ఉపనిషత్తులు నిరసించుచున్నవి. ఉపనిషత్తులిచ్చిన ఉపమానములైన, లవణము జలము; నిప్పు, నెరసులు; సాలెపురుగు, దారములు; వేణువు, నాదములు, బ్రహ్మ జగత్సంబంధమును దెలుపును. వీనిననుసరించి ఓల్డెన్ బెర్గువ్రాసినాఁడు; "తాదర్థముచేసికొనుటకు వీలైన జ్ఞానము నకు సమీపముగా, విశ్వమందున్న ఆత్మశక్తిని దీసికొనివచ్చు నుద్దేశ మీయుపమానముల వెనుకనున్నట్లు స్పష్టము; కాని, కొంతతెలిసియుఁ గొంతతెలియకయు మనలో నాత్మతోఁబాటు వేఱుగాఁ గొన్ని యితరపదార్థములుగూడ నున్న వను నమ్మకమును

౧. బృహదారణ్యకము. ౪అ. ౪. ౧౯

గలదు. ఉప్పు కరిగిన నీటిలో నంతట వ్యాపించి లవణమున్నట్లే బ్రహ్మము విశ్వమంతయు వ్యాపించియున్నదని భారతీయుఁడు చెప్పును. దీనికి మనమింకొక భావమును సులభముగాఁ జేర్చ వచ్చును. ఉప్పులేని నీటిబొట్టు లవణజలమందొకటైన లేదు. కాని, జలము తనలో నుప్పున్నను, తన సహజ జలలక్షణమును వేఱుగాఁగలిగియే యున్న విధమున, భారతీయుని 'కాత్మ'యే పరమసత్యము, నేకైక దివ్యజ్యోతియై యున్న విశ్వాసముండి యును, వస్తువులలో నేదోకొంత ఆత్మేతర పదార్థము శేషించియున్నదనియు నది తాను గాదనియు నాతఁడు నమ్మును". ఇట్టి భావములను నిరసించుటకొఱకే, ఉపనిషత్తులు నానాత్వ సిద్ధాంతములను ఖండించినవి. సృష్టి, ఆత్మకు వేఱుగా నున్న దనుభావము తమకులేదని ఉపనిషత్తులు స్పష్టపఱచినవి. ఆత్మ వలననే సర్వానుభవములును సాధ్యమగుచున్నవని యుపనిష త్తులు ఘోషించుచున్నవి. ఉపనిషత్తులు కేవలము ప్రజ్ఞాక ల్పితభావములపై నాధారపడక. సత్యాంశపరిశీలనమును గోరు చున్నవి. ఉపనిషత్తులు ప్రకటించిన మహోన్నత సత్యము నిత్యమైన దైవత్వము; ౧ అది దృశ్యప్రపంచమున కతీతము నం తర్భూతమును౨; స్వతంత్రమానవవ్యక్తిత్వమునందే యున్నది,3. ఉత్తమస్థితిలో నొక్క బ్రహ్మమేయున్నది. "అచట బ్రహ్మే తరమైన దానినిఁ జూడము, వినము, తెలియము"౪ ఆత్మసిద్ధి౫ చే గలిగిన దివ్యప్రకాశమునందు, ద్రష్ట, దృశ్యము నొకటనియుఁ బ్రపంచము పూర్ణసత్యముకాదనియు, ద్వంద్వములు శాశ్వత

౧. అధిదైవము. ౨. అధిభూతమ్ 3. అధ్యాత్మమ్
౪. ఛాందోగ్యము. ౭అ. ౨3. (౫) ఆత్మబుద్ధి ప్రకాశము

సత్యములు కావనియు మనము తెలిసికొందుము. "అట్టిస్థితిలోఁ బగలులేదు. రాత్రియును లేదు; స్థితిలేదు, లేకపో లేదు. పర మేశ్వరుఁడొక్కఁడే యున్నాఁడు" (౧) సెయింటుపాల్ చెప్పినాఁడు; "పరిపూర్ణమైనది వచ్చినపుడు, అంశామాత్రమైనది పోవును". అర్లె రూన్‌బ్రోక్ పలికినాఁడు; "నాల్గవయవస్థలో శూన్యము దేవుఁడు గలిసియుందురు; అది ప్రేమమయము; దివ్యకాంతిపూర్ణము. "మానవుఁడాస్థితిలోఁ దన్నుఁ దన దేవుని, సర్వమును మఱచి, ప్రేమ రసమగ్నుఁడైయుండును" అనుభవ సిద్ధిచేఁ గలిగినయట్టి యేకత్వమునే, పరమసత్యములో నానాత్వమును జూడవలదని చెప్పిన యుపనిషత్తులు ప్రకటించినవి.

ఉపనిషత్తుల ననుసరించి, నానాత్వము, కాలగతి, దేశస్థితి. కారణకార్యసంబంధము, విషయీవిషయ సంబంధము, నివి పరమసత్యములు గావని మనమంగీకరింతుము. అనఁగా నవి యసత్యములని యర్థము కాదు. సర్వాంతర్యామియైయున్న యేకైక సత్పదార్థమునందు సృష్టివస్తుజాలమంతయు బ్రహ్మస్తంభ పర్యంతము నిమిడియున్నదని చెప్పుటకే మాయాసిద్ధాంతము నుపనిషత్తులు సమర్థించినవి."తృణబ్రహ్మపర్యంతముగల సర్వజీవుల హృదయములలో నాత్మయున్న"దని శంకరుఁడు చెప్పినాఁడు.భిన్నదశలలోనున్న భిన్నవ్యక్తులు నొకేపరంజ్యోతినుండి ప్రసరించు కిరణములు, మనబుద్ధి కర్థమగుపద్ధతిలోఁ జెప్పవలసి వచ్చుచో, సత్పదార్థమందు సహజముగా స్వయంజ్ఞానముచే భేదమును గల్పించుకొని సృజించు లక్షణముగల శక్తియే మాయయని యనవచ్చును.ప్రత్యేకపదార్థము లున్నవి; లేవు. వీని

(౧) శ్వేతాశ్వతరము ౪౧ ౧౮

గాక మధ్యమస్థితియున్నది. సద్వస్తువుయొక్క పూర్ణత్వమును, నేకత్వమునుబట్టి చూచినప్పుడు, బాధ, నాశనములతోఁగూడిన ప్రపంచము సత్యమునకుఁ దక్కువదగును. పరబ్రహ్మముతోఁ బోల్చినపుడది అపరిపూర్ణమే. ప్రపంచములోని వ్యక్తులను వస్తువులను మనము ఛాయామాత్రములుగాఁ దీసికొన్నను, ఛాయా కారణమగు నసలు వస్తువున్నంతకాలము. ఛాయయు సత్యసంబంధము కలిగియున్నది. జగద్వస్తువులు సత్యముయొక్క అసంపూర్ణప్రదర్శనములే కాని, అసత్యప్రకటనములుగావు. బాహ్యచక్షువులకు గోచరించుచున్న ద్వంద్వములు, భిన్నత్వములు, నుపరిభాగమున నున్నవేకాని, లోనికేగి, జ్ఞానదృష్టితోఁజూచిన యెడల నివన్నియు నొకే పరమాత్మయొక్క వివిధస్వరూపములని తెలియును. ద్వైతము నానాత్వము సత్యముగాదు. ౧

వివేకహీనుఁడు ప్రపంచము నిత్యసత్యమని అనాలోచితముగా విశ్వసించును. ప్రపంచములోని శక్తులు, రూపములు పూర్ణములునుగావు, సత్యములును గావు. వాని యర్థము వివేకింపవలసియున్నది. అవి స్వయంభవములు, స్వతంత్రములు గావు. వానిలోపల, బయట నింకేదియోయున్నది. మనము లోకమును దేవునియందు మగ్నముచేయవలెను; పూర్ణపదార్థములో లఘుపదార్థములను; అవిమర్శదృష్టికి సత్యమనితోఁచిన దానిని ధ్యానదృష్టికి గోచరించు బ్రహ్మమందును లీనమొనర్పవలెను. అఖండమైన ప్రదేశములో నన్నివైపుల, శరీరములతోఁ

౧. అందుచేతనే 'ఇక" అనగా "వలె" శబ్దము ఉపనిషత్తులు పరిగ్రహించినవి. చూడు. బృహదారణ్యకము ౨. ౩ ౪౯ ౧౪; ౪౫. 3.౭: ౪౫. ౪.౧౯

గూడిన మనకో సైతము నిండియున్న వస్తుపరంపర, భ్రాంతి మాత్రమని, కేవల మింద్రజాలమని యుపనిషత్తులలో నెచటను సూచింపఁబడియుండలేదు.

ప్రపంచము భ్రాంతిమూలమను భావము నుపనిషత్తులు సమర్థించునను దురభిప్రాయముచే నాసిద్ధాంతమునుగూర్చి పెక్కు విమర్శనములు చెలరేగినవి. ఉపనిషత్సిద్ధాంతము ననుసరించి, పరివర్తన మసత్యము గనుక దానిపై నాధారపడిన వికాసమునబద్ధమే; ఏలన కాలమసత్యము, పరివర్తనము కాలములోనిది. ఈవాదమంతయు నవివేకముపై నాధారపడియున్నది. బ్రహ్మము కాలములో లేదు కాని, కాలము బ్రహ్మములో నున్నది. బ్రహ్మములో నిజమైన వికాసమున్నది; అదియే సృజనాత్మకమైన పరిణామము. బాహ్యప్రపంచ పరిణామము నిత్యమైనది; ఏలన బ్రహ్మమందుండి, దానివలన, దన స్వరూప ప్రదర్శనమును జేసికొనుచున్నది. సత్యమును మనమెచటనో, కాలములేని అనంతశూన్యమునందు వెదకిన నది మనకు గోచరింపదు. కాలగతియంతయుఁ గాలాతీతమైన పరమసత్యముపై నాధారపడి జరుగుచున్నదని మనము విశ్వసింపవలెనని ఉపనిషత్తులు బోధించుచున్నవి. నిజమైన వికాసమున కిట్టి పరమసత్యాభావమవసరము. ఇట్లు సర్వమును దనయందిముడ్చుకొని యున్న పరమసత్యము లేకున్నయెడలఁ బ్రపంచవర్తన మొకసవ్యమైన పరిణామమనియుఁ బరివర్తన మభ్యుదయమనియు మనము నిశ్చయింపఁజాలము; అపుడు ప్రపంచమునకు లక్ష్యము మంచి యొక్క విజయమని నిర్ణయింపలేము. ప్రపంచపరిణామము ప్రశయాంతము కాక సక్రమమైనదనియు, నభివృద్ధినియమ శూన్య

మైన హఠాత్సంభవము కాదనియు మనకు నిశ్చయభావమూ నిచ్చునది పరమసత్యము. పరమసత్యమనఁగా సంబంధ శూన్యమైన భిన్నదశాపరంపర కాదు; అయినచో ననఁగాఁ బరమసత్యమైన పరమాత్మయే లేనిచో, నభ్యంతరమందొక యుద్దేశ్యము కాని, యొక ప్రణాళికగాని లేని యంధప్రాయమైన వస్తుసంతతియే మనకు మిగులును. భిన్నాత్మకమైన ప్రపంచ పరిణామ దశలన్నిటిలో నేకమై, అవిచ్ఛిన్నమైన పరమాత్మ వర్తించుచున్నది. మనకిపుడు లేనిది, ముందుండని దానికొఱకై, మనము నిరంతరము వ్యర్థముగా కృషి చేయుటలేదు. ఒకవిధముగా చరిత్రదశలలో ననుక్షణము నిత్యపదార్థమైన బ్రహ్మప్రభావము గోచరించుచునే యున్నది. ఆత్మ పరిణామము, వర్తమానము నున్నది. భవిష్యత్తులో నుండునది యొకటే. ఈదృష్టిలో నుపనిషదుపదేశము సమన్వయరూపమే. జగన్మిథ్యాత్మసిద్ధాంతము నుపనిషత్తు లంగీకరింపవు. హాప్కిన్సు చెప్పినాఁడు. "దృశ్యమానప్రపంచము మిథ్యయనుభావము నెచటనైనఁ బ్రాచీనోపనిషత్తులు సూచించియున్నవా? అట్టి సూచన వానిలో లేదు"౧.

౧౨—సత్యము-భిన్నదశలు

పరమసత్యమునందు దశలే లేవు. వస్తుపరిశీలనము చేయు పరిమితబుద్ధికీ దశలర్థవంతములు. వీనికి స్థిరమైన విలువలేదు.

౧. జర్నల్ ఆఫ్ అమెరికన్ ఓరియంటల్ సొసైటీ. ౨౨ అ.పుట 3౮౫ సర్. ఆర్. జి. భండార్కరు పండితుఁడు వ్రాసినాఁడు; "ఆత్మయే సత్యము జగత్తు కేవలమిథ్యయని తలచిన కొందఱు సుప్రసిద్ధపండితులు ప్రకటించినభావము నిస్సంశయముగా దోషభూయిష్ఠమేగాక వారి అవిచక్షణశీలమును బ్రదర్శించును" (వైష్ణవిజమ్ పుట ౨)

ప్రపంచములోని యనేకత్వ మేకత్వములోఁ గలిసిపోయినప్పుడీదశావిశేషము లతిక్రమింపఁబడును. ఉపనిషత్తుల పరబ్రహ్మస్వరూపములో భిన్నదశావస్థలు లేవు. కాని యింద్రియానుభవమిచ్చు ప్రపంచములో నీభిన్నత్వమున కర్థమున్నది. ప్రపంచములోని సర్వవికాసముల కీదశాంతర్దశలు గలవు. అభివృద్ధిప్రయత్నము, వస్తుపరివర్తనము నీభిన్నావస్థాత్మకములే. ప్రపంచములోని వస్తుజాలముయొక్క లక్షణములకు సత్యలక్షణములకుఁ బోలిక యెంతగలదో దానిననుసరించి, వస్తువు లేసత్యదశాపరిణామములోనున్నవో గుర్తింపసాధ్యమగును. పరమసత్యమునుగూర్చి మనకుఁ దెలిసినజ్ఞానముతో లోకమును వివేకింపవచ్చును. ఇది శంకరుఁడంగీకరించినపద్ధతి. బ్రహ్మము విదితమా? అవిదితమా? విదితమైనచో దానిస్వరూపమునుగూర్చి మనము విచారింపనవసరము లేదు; అవిదితమైనచో దానినెఱుఁగఁ జేయు కృషి వ్యర్థము. ఈసమస్యకు జవాబుగా శంకరుఁడు, సత్పదార్థమాత్రరూపమున నిస్సంశయముగా విదితమేయని చెప్పినాఁడు. నేను ప్రశ్నింతును; నేను సంశయించుచున్నా"నను మాటలలో సత్యము తొంగి చూచుచున్నది. సత్యమేదో యున్నదని స్పష్టము, దానిని మనమర్థము చేసికోవలసిన స్వభావముగలది. ఈజ్ఞానమే వస్తువుల సత్యస్థితి పరిమాణమును గొలుచుటకుపయోగించును. జగన్మిథ్యావాదమే సత్యభిన్నదశాభావమునకు విరుద్ధమైనది. సర్వప్రపంచమునకును గమ్యస్థానము, మూలాధారమునైన పరబ్రహ్మముతో నారంభించి, సత్యమునకు భిన్నదశాంతర క్రమము నుపనిషత్తులు జెప్పుచున్నవి. పెక్కుతరగతులలో నున్నజీవులలాకే పూర్ణసత్పదార్థముయొక్క అల్పాధిక

శల జలాగ్ని భూములు మూఁడు నంగీకరింపఁబడినవి. 3. వాయు జలాగ్ని భూమ్యాకాశ పంచకము చెప్పఁబడినది. "అవ్యక్తబ్రహ్మమునుండి యాకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి క్రమముగా వచ్చినవి, భూమినుండి యోషధులు, నోషధుల నుండి యన్నము, నన్నమునుండి బీజము, బీజమునుండి మనుష్యుఁడు నుదయించెను. మానవుఁడన్నరసమయుఁడు." ౧. జీవితముయొక్క భౌతికపదార్థసంబంధమును జర్చించుచు నుపనిషత్తు జడపదార్థపరిణామమును వర్ణించెను. ఈ పరిణామములో నున్నత శ్రేణిలోని దానిలో దిగువ శ్రేణిలో నిదున్నది. శబ్దలక్షణమాకాశములో నున్నది. దానివలననే మనము వినుచున్నాము. ఆకాశమునుండి వాయువు; దానిలక్షణ మాకాసలక్షణమైన శబ్దము వాయులక్షణమైన స్పర్శకూడనున్నది. దీనివలన మనము వినుట, స్పృశించుట కలుగుచున్నవి. వాయువునుండి వచ్చిన దగ్ని; దీనివలన మనము వినుట; స్పృశించుట, చూచుట జరుగుచున్నది. అగ్నినుండి జల ముదయించినది. దీనివలన మనకు రుచికూడఁ దెలియును. జలమునుండి భూమి, దీనిలో శబ్దస్పర్శరూప రసగంధములైదును తెలియును. నేఁటి శాస్త్రవేత్తలకీతత్త్వము విచిత్రముగాఁ దోఁచవచ్చునుగాని యిందొక సూత్ర మిమిడియున్నది. పంచభూత సిద్ధాంత ముపనిషత్తులలోనే మొదట మనకు లభించినది. భూతమునకుఁ దత్సారమైన తన్మాత్రము

3. ఈభూతత్రయ సమ్మేళనముచే సర్వరూపములు నేర్పడెను. చూడు. ఛాందోగ్యము ౬అ. ౨.౩-౪ సాంఖ్యతన్మాత్రసిద్ధాంతమున కిదియే యాధారమైయుండును. చూడు. ప్రశ్న ౪అ.౮.

౧. తైత్తిరీయము ౨అ ౧.

నకు విచక్షణ చేయఁబడినది. ౨. ప్రపంచములోని వస్తువులు గుణములచే భేదములు కల్గియున్నవనియు నట్టి గుణభేదము ననుసరించి ప్రపంచమనంత విభాగములు గలదనియు ఛాందోగ్యోపనిషత్తు కొన్ని తావులందుఁ జెప్పియున్నది. ఉద్దాలకుఁ డీసిద్ధాంతమును బ్రకటించెను. వస్తువులొకదానినుండి యింకొకటి గలుగు పరివర్తనమేలేదు. పెరుగును జిలికినచో వెన్న వచ్చును; కాని పెరుగు వెన్నగా మాఱుటలో నూత్నరూపములేదు; ఏలన వెన్నలోని భాగములు పెరుగులో నిదివఱకే యున్నవి; పెరుగు చిలుకుటచే నవి పైకిఁదేలినవి. ౧. భిన్నపదార్థములొండొంటిలోఁ బ్రవేశింపఁగలవని చెప్పిన అనాక్సగోరస్ సిద్ధాంతమిట్టిదే; "భుజించిన పదార్థము జీర్ణమైన యంశము మనకొక సత్యమును దెల్పును. బియ్యపుగింజ మాంసముగాను, నెముకగాను మాఱుచున్నది. అనగా, బియ్యపుగింజలో మన చక్షువులకు గోచరింపనంతసూక్ష్మరూపమున, నది యేపదార్థముల క్రింద మాఱుచున్నదో యాపదార్థరేణువులున్న వన్నమాట. బియ్యపుగింజలో రక్తమాంసములు, శల్యమస్తిష్కములు నున్నవి" ౨. పదార్థమునందలి యణువులు కలియుచు విడిపోవుచుండునని కణాదుని సిద్ధాంతము. తేనెలోఁ గలిసియున్న వివిధఫలరసములవలె, జడపదార్థమొక క్రమములేని ముద్దగా నున్నది. 3. సాంఖ్యసిద్ధాంత బీజములిందు స్పష్టముగా గోచ

---

౨. చూడు ప్రశ్న ౪అ. ౯: ఐతరేయము ౩అ, 3; కఠము ౨అ, ౧౫; ప్రశ్న ౬అ, ౪

౧. ఛాందోగ్యము ౬అ. ౬.౧

౨. ఏడమ్సన్. ది డెవలప్మెంట్ ఆఫ్ గ్రీక్ ఫిలాసఫీ పుట ౫౦

3. ఛాందోగ్యము ౬అ ౯.౧-౨

రించుచున్నవి. జడపదార్థమునందు జీవాత్మ ప్రవేశించుటవలననో, లేక, ఆత్మశక్తి దానిననేక దశలలోఁ జైతన్యవంత మొనర్చుటవలననో, వస్తుపరిణామము కలుగుచున్నదని చెప్పఁబడినది. జడపదార్థమునందు చలనశక్తి యిమిడియున్నదని కొన్నిచోట్లందుఁ జెప్పఁబడెను. జడపదార్థమునుండి ప్రాణముదయించుచున్నను, ప్రాణమెట్లువచ్చినదో జడపదార్థములోఁ దెలియదు. అదేవిధముగాఁ జేతనపదార్థములలో మనస్సున్నది కాని చైతన్యమునకు మనస్సునకు సంబంధమెట్టిదో తెలియదు. మనుష్యునిలో నాత్మజ్ఞానమున్నది. శిలలకంటె నక్షత్రములకంటెఁ బశువులకంటెఁ బక్షులకంటె మానవుఁడధికుఁడు; ఏలన నాతనికితరులతో సంబంధము ప్రజ్ఞాసంకల్పములవలన, ప్రేమవలన నంతఃకరణమువలనఁ గలుగుచున్నది; కాని యాతఁడింకను బూర్ణుఁడు కాఁడేలన నాతనికింకను వైరుధ్యములచే జనించు దుఃఖమున్నది.

ఈయధ్యాయమును ముగించుటకుఁ బూర్వముపనిషత్సిద్ధాంతము ప్రకృతి దేవతాభావమనుటలో నెంతసత్యమున్నదో పరిశీలింతము. ప్రకృతిదైవభావమనఁగా (Pantheism) ప్రకృతియంతయు దైవస్వరూపమనియు, దేవుని కతీతమైన వేఱొకస్థితి లేదనియుఁ జెప్పుసిద్ధాంతము. ప్రపంచమే పరిపూర్ణ బ్రహ్మస్వరూపమై యిఁక మిగులునదేమియు లేదనిచెప్పునదే యీసిద్ధాంతము. ఉపనిషత్తులలో దేవుఁడనఁగాఁ బ్రపంచముకంటె నతీతుఁడని చెప్పఁబడిన వాక్యము లనేకములుగలవు. ప్రపంచముండుటవలన దేవుని పరిపూర్ణత తఱుఁగదు. దీనినిగూర్చి యుపనిషత్తు మనోహరముగా ని... చెప్పుచున్నది; "అది పూర్ణముః

ఇది పూర్ణము; ఆపూర్ణవస్తువునుండి యీపూర్ణవస్తువు జనించినది. దానినుండి దీనినిఁ దీసివేసినచోఁ బూర్ణత్వమే మిగులును' ఈశ్వరుఁడు తాను లోకముగా మాఱినప్పుడును తనస్వభావమునకు లేశమైన లోపములేకుండఁ జూచుకొనెను. అతి ప్రాచీనమైన ఋగ్వేదమందును సర్వజీవులు కలిసి పరమపురుషునిలోఁ జతుర్థభాగమనియు మిగిలిన మూఁడుపాదములు జ్యోతిర్మయములైన యూర్ధ్వలోకములనియుఁ దలపఁబడినది. ౧. బృహదారణ్యకము ననుసరించి (౫అ. ౧౪) బ్రహ్మముయొక్క ఒకపాదము త్రిలోకములనియు, రెండవపాదము వేదత్రియమనియు, మూఁడవపాదము ప్రాణత్రియమనియు, నాల్గవపాదము భూరేణువుల కందరాని సూర్యుఁడై ప్రకాశించుచున్నదనియుఁ జెప్పఁబడెను. ౨. ప్రపంచమీశ్వరుని యందున్నదని యుపనిషత్తులు చెప్పినవి; కాని ప్రపంచమే యీశ్వరుఁడని యెచ్చటను జెప్పియుండలేదు. ఆతనిసృష్టియైన ప్రపంచముకంటె నీశ్వరుఁడధికుఁడు. జీవికి జీవయాత్రలో నుపకరణమైన శరీరముకంటె జీవియెంతయధికమో, ప్రపంచముకంటె దేవుఁడంతగా నధికుఁడు. దీని ననుసరించి, ప్రపంచమును సృజించిన దేవుఁడెచటనో వేఱుగా నున్నాఁడని భావముగాదు. దేవుఁడు తనస్వరూపమును బ్రపంచరూపముగాఁ బ్రదర్శించినాఁడు; ప్రపంచమాతని స్వరూపము దేవుఁడనంత పరిపూర్ణుఁడు; తాను గల్పించినలోకమున కతీతుఁడు; పరిచ్ఛిన్నములైన భౌతికమానసిక వ్యక్తసముదాయములన్నిటికి నతీతుఁడు. ఆతఁడు సర్వాతీతుఁడు, సర్వాంతర్యా

౧. ఋగ్వేదము ౧౦వ ౯౦, 3; చూడు ఛాందోగ్యము3అ.౧౨.౬

౨. బృహదారణ్యకము ౪అ. 3.3౨.

మియుఁ గూడనై యున్నాఁడు. కావున నుపనిషత్తులు ప్రకృతి దైవత్వసిద్ధాంతమును సంకుచితభావములో నంగీకరింపవు. ఏకత్వముకాని, ఉద్దేశముకాని, విలువగాని లేని పదార్థముల నొక కుప్పగాఁబోసి యాకుప్పకు దేవుఁడని పేరు పెట్టలేదు. ఉపనిషత్తత్త్వము ప్రకృతిదైవభావమునకు విరుద్ధము. ప్రపంచమునకు వేరై, దూరమున దేవుఁడు కూర్చుండి, యప్పుడప్పుడు లోకములో నవతరించుచునో, లేక లోకవ్యవహారములలోఁ దనప్రభావమునుజూపి, దర్శనమిచ్చుచునో యుండునని ఉపనిషత్తులు చెప్పలేదు. మనజీవితములకు మూలసత్యమగు భగవంతుఁడు లేనిదే మనజీవితములు దుస్తరము లను భావములో నుపనిషన్మతము ప్రకృతిదైవసిద్ధాంతమే. లోకములోని సర్వమును పరిచ్ఛిన్నము నపరిచ్ఛిన్నము; అసంపూర్ణము పూర్ణము కూడనైయున్నవి. ప్రతివస్తువు తన వర్తమానస్థితి కతీతమైన దానిని గోరుచుఁ, దన యసంపూర్ణతను తొలఁగించుకొని పరిపూర్ణముకాఁగోరుచున్నది. పరిచ్ఛిన్నవస్తువు నిజస్థితికతీతత్వము నన్వేషించుచున్నది. అప్రమేయబ్రహ్మము పరిమితవస్తుజాలములోఁ బనిచేయుచున్నదని దీనివలన స్పష్టమగుచున్నది. 'సత్' "అసత్" పదార్థమున కాధారమైయున్నది. దేవుని సర్వాంతర్యామిత్వమును జెప్పినతత్త్వమువలన నుపనిషత్తులు ప్రకృతిదైవతత్త్వమును జెప్పినవని ఖండింపవలసివచ్చుచో దానికి మాకంగీకారమే. కాని యీయర్థములోఁ బ్రకృతి దైవభావము సర్వమతముల కవసరమగు ముఖ్యభావమే.

## ౧౪. -జీవాత్మ

పరిమితపదార్థములన్నిటిలో మానవుని జీవాత్మ అగ్రస్థానము నాక్రమించును. జీవాత్మ పరబ్రహ్మము కాకపోయినను, బరమాత్మస్వభావమున కత్యంతసమీపమునకు వచ్చును. జీవాత్మ ప్రపంచముయొక్క ప్రతిబింబమని చెప్పినవాక్యములు గలవు. ప్రపంచమంతయు నసంపూర్ణతనుండి సంపూర్ణతనందుటకుఁ బ్రయత్నించుచున్నది. ఈప్రయత్న కేంద్రము జీవాత్మలోఁ గలదు. తైత్తిరీయము ననుసరించి, ప్రపంచమును గల్పించిన పంచభూతములును మానవవ్యక్తిత్వములోఁ గలవు. ఛాందోగ్యోపనిషత్తునందు (౬అ. ౧౧.౩-౪) భూమిజలాగ్నులు, అనంతపదార్థముతోఁ గలిసి జీవాత్మను గల్పించినవని చెప్పఁబడినది. ౧. సత్యముయొక్క వివిధఘట్టములు కలియుచోటే మానవుఁడు ప్రాణము వాయువునకు సరిపోవును. మన స్సాకాశము, స్థూలశరీరము పంచభూతములును జీవాత్మకు, తృణబ్రహ్మపర్యంతము గల ప్రతిజీవదశతోను బోలికగలదు. ఆనందస్వరూపమైన దైవాంశము జీవాత్మయందున్నది; దానివలననే మానవుఁడు

---

౧. "ఆకాశమందలి నక్షత్రకాంతులను, పశుపక్షిక్రిమికీటకాదులందలి లక్షణములను, సర్వజీవభావములను గలిపి దేవుఁడు, మానవరూపమునఁ బునర్నిర్మాణముచేసినాఁడు." బ్రౌనింగు మతియుఁజూఁడు. ఐతరేయము. ౩అ. ౩; శ్వేతాశ్వతరము. ౨అ. ౧౨.౬ ప్రశ్న ౬అ.౧౧. బ్రహ్మాండమే సూక్ష్మరూపమునవున్న జీవాత్మ. జీవాత్మయే స్థూలమైనబ్రహ్మాండమును, ప్లేటో పిండాండబ్రహ్మాండములకుఁ బోలిక వర్ణించి. యీశ్వరుఁడు, మార్పులేనిది, మార్పుగల రెండువస్తుభాగములు కలిపి మానవునిఁగల్పించి, ప్రపంచమధ్యమున స్థాపించెనని వ్రాసినాఁడు. ప్రపంచము మానవుని స్థూలస్వరూపమని యాతనిభావము, చూడు తైత్తిరీయము. ౧అ.౩. ఆనందగిరి వ్యాఖ్య.

కొన్ని వేళలఁ బరమాత్మ సామీప్యమును బొందుచున్నాఁడు. జీవాత్మ యింద్రియమనస్సులతోఁ గూడిన 'ఆత్మ'.[౨]

పంచభూతములు పూర్ణసామరస్యమునందు లేవు. "సమానములు మిత్రములు నైన రెండుపక్షు లేకవృక్షము నాశ్రయించి యున్నవి. అందొకటి మధురఫలమును దినుచున్నది; రెండవ దేమియుఁ దినకుండ మొదటిదానినిఁ జూచుచున్నది. ప్రపంచమున నొకేవృక్షమున మానవుఁడు దేవునితోఁ గలిసి నివసించుచున్నాఁడు? కష్టములచే వాతుఁడై, మానవుఁడు కృశించి, తన నిస్సహాయతకుఁ బరితపించుచున్నాఁడు. కాని యాతఁడు రెండవ వ్యక్తిననఁగా దేవునిజూచినచోఁ, బ్రమోదమునందును. అతని యదృష్టమేమని చెప్పుదుము; క్లేశములన్నియు నదృశ్యములగును."[౧] జీవాత్మయుఁ బరమాత్మయును స్థిరసామరస్యమును బొందలేదు. జీవాత్మ యెడతెగని యాత్ర చేయుచున్నది; తాను గాని దేదో కావలయునని యత్నించుచున్నది. మానవునిలోనున్న బ్రహ్మము—జీవాత్మనుబిలిచి, తనకెట్టయెదుటనున్న భిన్నత్వ సమస్య నేకత్వముచే సాధింపుమని యుపదేశించుచున్నది. ఈ పరిచ్ఛిన్నాపరిచ్ఛిన్నవస్తువుల మధ్యమందుగల సంఘర్షణము, ప్రపంచపరిణామమంతటిలోనుండి, మానవవ్యక్తిత్వములోఁ దీవ్ర రూపము దాల్చినది. మానవుని ప్రతిరంగమునందును, బుద్ధి హృదయసంబంధ నైతికరంగములలోని సకలకృషియందు నీ సంఘర్షణమున్నది. మానవుఁడు తనప్రత్యేక వ్యక్తిత్వమును దిగనాడి, తనలోఁ బరిమితమైనదాని నపరిమితమైనదానిఁగాను,

౨. చాందోగ్యము. ౮అ. ౧౨.3.

౧. ముండకము, 3 అ. ౧.౨; చూడు రా.వే.భా. ౧అ.౧౬౪.౨౦..

మానవత్వమును దైవత్వముగాను మార్చుకొని, పూర్ణప్రేమ, పూర్ణస్వాతంత్ర్యము ప్రధానలక్షణములైన దేవునిరాజ్యములోఁ బ్రవేశమున కర్హతనార్జించుకొనును. కాని, తనయసంపూర్ణస్థితిలో మానవుఁడుగానుండి పూర్ణస్వరూపమగు పరమసత్యాస్థానప్రాప్తినిఁ బొందఁజాలఁడు. ఈపోరాటమునకు నిలయమైన మానవవ్యక్తి తనకతీతమైన పదవిని సూచించుచున్నాఁడు; ఆతఁడు మానవత్వమునుదాటి పోవలెను. జీవాత్మ స్వయంపోషణసామర్థ్యముగల సత్యపదార్థముగాదు; అయినచో నప్పుడు దేవుఁడుకూడ నట్టిపరిచ్ఛిన్నాత్మచేఁ దానును బరిచ్ఛిన్నుఁడగు నొకస్వతంత్రవ్యక్తిమాత్రుఁడగును. జీవాత్మయొక్క సత్యస్థితి పరిపూర్ణత్వము జీవాత్మయొక్క అసత్యస్థితి అసంపూర్ణతయే: అదియే తొలఁగించుకొనవలసియున్నది. తనలో నంతర్యామియై యున్న పరమాత్మలేకున్నచో, జీవాత్మకుగల దైవాంశము దానితోఁబోవును. తనలో నంతర్వర్తియైయున్న దైవశక్తివలననే మానవునిలోనున్న జీవాత్మ పరిణామవర్గములో నఖండగౌరవస్థానమును బడయుటకుఁ గారణము. తనవ్యక్తిత్వమును పోషణాభారమును బరమాత్మనుండియే జీవాత్మకలిగియున్నది. ఆత్మ పరిపూర్ణమైనది.౧. మానసికఘట్టమునందున్న జీవాత్మలకుఁ బరస్పరవైరము, వైరుధ్యమునున్నవి. ఈతాత్కాలికభిన్నత్వమునుండి 'ఆత్మ' యే యట్టివైరుధ్యమున నేకత్వముకలదను నిర్ణయము సమంజసముకాదు. జీవాత్మల అనేకత్వము, పృథక్త్వము మానసికము. అనేకత్వమే సత్యస్థితియని యంగీకరించుచో, సత్యమునకును, ప్రేమకును, సౌభాగ్యమునకును

౧. చూడు. వేదాంతసూత్ర శంకరభాష్యములో నుపోద్ఘాతము.

స్థానమే లేదు. కావున మానవుఁ డున్నతస్థితిలోఁ బరిపూర్ణుఁడు గాఁడనియుఁ, దానున్న అసంపూర్ణత నతిక్రమించి యున్నతమైన పూర్ణదశనుపొందుటవలననే చిత్తశాంతి చేకూరఁగలదనియు స్పష్టమగుచున్నది. "జీవాత్మయొక్క స్వతంత్రవ్యక్తిత్వమును బరిశీలించినచో నది నిజముకాదనియు, భ్రాంతిమాత్రమనియుఁ దెలియఁగలదు. సంఘముతో సంబంధములేని మానవులస్థితి యెట్టిది? అందఱకు సామాన్యమైన మనశ్శక్తియే మానవత్వమును కలిగించుచున్నది. ఇతరులతో మనస్సంబంధమును దీసివేసి, స్వతంత్రవ్యక్తిగాఁజూచినచో నాతఁ డేమైననగుఁగాక, మానవుఁడుగాఁడు. ఇది మనస్సంబంధమైన సాంఘికధర్మమైనచో, నింకను లోతునకుఁబోయిచూచిన నీసత్యమే గోచరించును. పరిచ్ఛిన్నములైనజీవులు తత్త్వదృష్టిలో నొకేపూర్ణజీవశక్తియని తెలియుటయేకాక, చర్మచక్షువున కగోచరమైన నిగూఢపరమాత్మయందు జీవులన్నియు నేకమైపోయి తమ ప్రత్యేకవ్యక్తిత్వములను గోల్పోవుననియు స్పష్టమగును. తత్త్వదృష్టియందు సర్వమునం దంతర్యామియైయున్న సత్పదార్థమే లేకున్నచో జీవాత్మ లసలేలేవు."౧.

స్థూలప్రకృతితోఁ బోరాటము సల్పుచున్న జీవాత్మ ప్రపంచములోని జీవులలో నగ్రస్థానముగలది; కాని పొందవలసిన పూర్ణస్థితి కింక నది రాలేదు. వైరుధ్యముల మధ్యమందు సంకటపడుచున్న జీవాత్మ పూర్ణబ్రహ్మత్వమునుండి జనించు సామరస్యానందము నింకను జవిచూడవలసియున్నది. అంతర్నిహితమైయున్న దైవశక్తి, పూర్ణావిష్కరణ మందినపుడు, గమ్య

౧. బ్రాడ్లే టూత్ అండ్ రియాలిటీ పుట ४3५

స్థానమును మెట్టినపుడు, మానవత్వము లక్ష్యసాఫల్యమునందును, జీవితములోనున్న పోరాటము, వైరుధ్యము, జీవియొక్క అసంపూర్ణపరిణామమును, సమన్వయము, ఆనందము, శాంతియుఁ బూర్ణపరిణతినిఁ దెల్పును. మానవజీవితము కురుక్షేత్ర యుద్ధరంగము. యుద్ధము పూర్తియై, పరమావధినిఁ బొందులోపున వైరుధ్యములు పోవును. మానవునిలోని దైవాంశ,మానవత్వము పరిపూర్ణమైనపుడు, పూర్ణదైవత్వమై గోచరించును. సృష్టిలోని సర్వద్రవ్యములలో మానవుఁడుత్తమ పరిణామశిఖరము; కాని యనంతత్వము నందుటయే శిఖరాగ్రమును సాధించుట యగును. ప్రకృతియందు జీవశక్తి గర్భితమైయున్నది; ఆ జీవశక్తి పూర్ణవికాస మొందినప్పుడు, ప్రకృతి తన పరమావధినిఁ బొందును. చైతన్యముయొక్క పరమావధి బుద్ధివికసించుట; బుద్ధిపరమావధి సమాధ్యవస్థలోఁ గలుగు జ్ఞానసిద్ధి జ్ఞానసిద్ధి యనగా నాలోచనగాని, ఊహాగాని, సంకల్పముగాని, కాదు. కాని, వీనియన్నిటికిని పరిపూర్ణావస్థయే జ్ఞానసిద్ధి. పరిచ్ఛిన్నమైన జీవాత్మ, తన జనకస్థానమైన పరమాత్మను జేరినపుడు, ఆత్మవికాసము పరిపూర్ణమై, బ్రహ్మాత్వమునందును. "విదితాత్ముఁడగు నాతఁడాత్మయే సర్వముగాఁ జూచును. అట్టి బ్రహ్మైకత్వమును దర్శించిన వానికిఁక బాధలు, దుఃఖములు నెచటనున్నవి ?"

## ౧౫—ఉపనిషన్నీతిశాస్త్రము

ఉపనిషత్తులు ప్రతిపాదించిన పరమలక్ష్యములోని హితములైయున్న భావములను, కేవల నీతిప్రసంగములను ననుసరించి, ఉపనిషన్నైతికధర్మము విలువను మనము నిర్ణయిం

వలసియున్నది,ఇంతవఱకు మనము చెప్పుకొనిన భావములవలనఁ బరబ్రహ్మైక్యప్రాప్తియే ఉపనిషత్తుల యాదర్శమని తెలిసినది. ప్రపంచము తనకొఱకేకాదు. అది దేవునియొద్దనుండి సంభవించినది కావున, దేవునియందే విశ్రాంతిపొంద యత్నింపవలెను. ప్రపంచపరిణామవ్యాపారమంతటిలోఁ బరిమితమైన దపరిమితముగుటకై చేయుకృషియే కాన్పించుచున్నది. ప్రపంచములో నన్నియితరవస్తువులవలెనే. మానవుఁడును దనలోనున్న పరబ్రహ్మవాణివిని,బ్రహ్మమును జేరుటకుఁ జేతులందించుచున్నాఁడు,"పక్షులన్నియుఁ దమ నివాసవృక్షములకుఁ బోవుచున్నటులే, యీ విశ్వమందన్నియుఁ బరమాత్మయొద్దకుఁ బోవును." ౧. "నిన్నెఱిఁగి నీలోఁబ్రవేశింపఁ గోరెదను; ప్రభూ ! నీవు నాలోఁ బ్రవేశింపుము; నాథా ! నేను బరిశుద్ధుఁడ నగుదునుగాక ?"౨. నీవే నా నివాసము"3. ఈశ్వరునితో నైక్యము పొందుటే మానవుని లక్ష్యము. మనుష్యుని మనస్సునకు నితరజీవరాసుల చైతన్యమునకు భేదమేమన, నితరములన్నియు దైవమును జేరుటకే యత్నించుచున్నను, మానవుఁడొక్కఁడే యట ప్రయత్నము నెఱిఁగి చేయుచున్నాఁడు, అనేక జన్మాంతరముల నిరంతరకృషి ఫలితముగా మానవత్వముకలిగి, మానవుఁడు ప్రపంచరహస్యము నెఱిఁగినాఁడు. అందుచే మానవుఁడొక్కఁడే దేవుని పిలుపువిని. తనకై యెదుటనున్న యమృతత్వమును బొందుటకై తెలిసి కృషి చేయుచున్నాఁడు. కావున మానవుఁడు తెలిసి బ్రహ్మత్వమును గోరుచున్నాఁడు.

(౧) ప్రశ్న. ౪అ.౭. (౨) తైత్తిరీయము ౧౩. ౪: (3) తైత్తిరీయము ౧౩. ౪; చూడు. బృహదారణ్యకము ౪అ. 3.3౨

బ్రహ్మాత్వ ముత్తమోత్తమ స్థితియనియుఁ, గాంక్షింపఁ దగిన పరమలక్ష్యమనియు ననేకవిధములఁ జెప్పఁబడెను. ఆస్థితి, "బుభుక్షాపిపాసలకు, అజ్ఞానదుఃఖములకు, జరామరణములకు నత్యంతాతీతమైనది." "జగచ్చక్షువైన సూర్యుఁడు, తన్నుఁ జూచు మానవుని కంటికిఁగల దోషమునంటక దూరముగా నున్నటులే,సర్వజీవాంతర్వర్తియై యున్న యాత్మ లోకదుఃఖముల నంటక దూరమైయున్నది." ఈయల్పప్రాణమును నమ్ముకొని సర్వము దానికొఱకై సమర్పించుచు, రోగాది దుఃఖములకు వశుఁడై మానవుఁడీ ద్వంద్వనిలయమైన ప్రపంచమున బ్రతికి యుండవలసివచ్చుట దురదృష్టమే. అసంపూర్ణ జీవితకారణ ముల నిర్మూలనమునకై ప్రయత్నించుట మానవుని కర్తవ్యమై యున్నది. అనేకత్వమునుండి యేకత్వమును జేరుటయే పరమ లక్ష్యము, పరమార్థమునైనది. దీనివలన మానవునికిఁ బూర్ణ తృప్తి లభింపఁగలదు. తైత్తిరీయోపనిషత్తు చెప్పినట్లది "ప్రాణా రామమ్, మన ఆనందమ్, శాంతి సమృద్ధమ్, అమృతమ్." "మనఃప్రాణముల కానందము, శాంతిపూర్ణము, అమృతము నైనది." అల్పలక్ష్యములు, శరీరమానసములకుఁ దృప్తినీయ వచ్చునుగాని, యమృతత్వములో నివియున్నవి; వీనికతీతమైన తృప్తియునున్నది. మన వివిధజీవితఘట్టములకును సరిపోవు వివిధసుఖములున్నవి; ఇంద్రియసుఖము, మానసికసుఖము, బుద్ధిసంబంధసుఖము; కాని ఆనంద మన్నిటికంటె నుత్తమ మైనది.

ఉపనిషత్తులు చెప్పునీతి యీపరమలక్ష్యములో లీనమై యున్నది, కర్తవ్యనిర్వహణము పరమలక్ష్యమును జేర్చుసాధ

నము. పరమలక్ష్యప్రాప్తికిఁ దీసిపోవునదెద్దియుఁ దృప్తినొసఁగదు. సత్ప్రవర్తనము దానిఁజేర్చుటకొఱకే యుపయోగించును. మానవునిలోనున్న పరిపూర్ణత్వమును జేరు జీవసహజమైన కాంక్షయే నిజమైనధర్మము. నిత్యసత్యపదార్థమగు 'సత్' ననుసరించి జీవించుటే సత్ప్రవర్తనము లేక నైతికశీలము. "దైవవాణియొక్క కఠినహృదయముగలపుత్రిక." యనిచెప్పిన 'విధి' (Duty) కర్థమిదియే. మనజీవితపరమార్థము దేవునియందే యున్నది. ధర్మసూత్రము "స్వర్గమున నీతండ్రియైన దేవుఁ డెట్టిపూర్ణుఁడో, నీవు నటులే కమ్మని చెప్పు శుభాహ్వానమే.

నీతిధర్మములను జర్చించుటకుముందు, ఉపనిషత్తులలో నీతిబోధయుండుట కవకాశమే లేదని చెప్పఁబడిన విమర్శకుల భావములను గొంతపరిశీలింతము. అంతయు నొకటేబ్రహ్మమయినప్పు డిఁక నైతికసంబంధమెట్లని ప్రశ్న; పరమసత్యమైన బ్రహ్మము పరిపూర్ణమైనది; అట్టిబ్రహ్మమే మనము; ఇఁకఁ బూర్ణులమగుటకుఁ బ్రయత్నమెందుకు? నని విమర్శనమున్నది. కాని అద్వైతమనఁగా మంచిచెడ్డలకు భేదమునశించునని యర్థము కాదు. నైతికశీలమున కవసరమగు ప్రత్యేకత్వము, ననేకత్వము నుపనిషత్తు లంగీకరించినవి. సర్వజీవులకు మూలాధారమైన యేకసత్యములేక, భిన్నత్వమే పూర్ణసత్యమైనచో, నీపక్కవానినిఁ బ్రేమింపుమనియుఁ, బ్రేమచే లోకమున నేకత్వమును సాధింపుమనియు బోధించుటలో నర్థమేమిగలదని యుపనిషత్తులడుగుచున్నవి. లైబ్నిజ్ తత్త్వవేత్తయొక్క జీవులవలె, నదివఱకే అంతర్భూతమైయున్న సామరస్యములేని వేఱైనవ్యక్తులమే మనమైనచో, నైతికలక్ష్య మాచరణసాధ్యముకాదు. మనము

ప్రక్కవానినిఁ బ్రేమింపవలె ననుటకుఁ గారణము, మన మందర మొకే పరమసత్యమునకుఁ జెందినవారము. తాత్కాలికముగా వచ్చిన బాహ్యభేదములను విసర్జించి, అంతర్దృష్టితోఁ జూచి నచో మనమందరము, మనయందరిలో సర్వవ్యాప్తియైయున్న యేక పరమాత్మరూపులమే యని తెలియఁగలదు. నిజమైన ఆత్మ పూర్ణమైనట్టియు శాశ్వతమైనట్టియు సత్యము దేశకాలములం దుండి, నిత్యపరిభ్రమణమందుచున్న దశాపరంపరల కతీతమైనది. మనప్రత్యేకత్వమును విడిచిపెట్టుమనిచేయు ప్రబోధము శుష్క వచనముకాదు. మోక్షమనఁగా వ్యుత్పత్త్యర్థము విముక్తి; యిం ద్రియ బంధములనుండి, ప్రత్యేకతనుండి, లఘుత్వమునుండి, అసంపూర్ణతనుండి విముక్తి. అహంభావ మాత్మభావముగాఁ బెరిగిన పూర్ణస్వాతంత్ర్యము విముక్తి. పూర్ణమైన సత్ప్రవర్తన మనఁగా సర్వములోఁ దన్నుఁజూచుటే. నైతికలక్షణము కోరు నీయాదర్శము మనము మన పరిమితజీవనము నపరిమితమైన పరమాత్మ జీవనముతోఁగలిపివేసినపుడే, సఫలమగును. మోక్ష మార్గము, జీవాత్మ పరమాత్మయగు విధానము మనయల్పజీవ ముల నతిక్రమించి, పూర్ణసత్యమైన పరమాత్మలో లీనమగుటే. మన కత్యుత్తమపరమావధి యని యుపనిషత్తులు ప్రకటించినవి.

మానవునిలో దైవత్వ మున్న దని చెప్పినకారణముచే నుపనిషత్తులు నైతికప్రవర్తనమును బోధింపవని యింకొకవిమ ర్శన మున్నది. మానవునిలో దేవుఁ డున్నాఁ డని చెప్పినంతమా త్రమున, నేప్రయత్నమున కవకాశము లేదని నిశ్చయింపరాదు. ప్రత్యక్షముగా మానవునిలో దేవుఁడుకూర్చుండి, యేపరిశ్రమ, ప్రయత్న మక్కఱలేకుండఁ జేసినాఁడని చెప్పలేదు. మానవునిలో

దేవుఁడు మఱుఁగుననుండి, అఖండకృషిచేఁ గనుఁగొనవలసిన వాఁడుగా నున్నాఁడు. మానవుఁడు తీవ్రకృషిచేఁ దనలోనున్న యా దేవుని గుర్తించి గ్రహింపవలెను. మానవునిలో దేవుఁడుండుట, ఉన్నట్లు తెలియుటకై యత్నము నపేక్షించుట; అనఁగా దేవునియునికి నిజమే; నిజమని యనుభవముచే నెఱుఁగుట కృషితోఁగూడిన సమస్యయు సత్యములే. అజ్ఞానహేతుఁడైన మానవుఁడు తనకు బాహ్యాచ్ఛేదనములైన మనశ్శరీరములను దానేయని తెలఁచుచున్నాఁడు. ఆత్మకాంక్షకు మానవునిలఘుత్వము, పరిమితత్వము నడ్డువచ్చుచున్నవి. "దైవాంశ ప్రతివ్యక్తిలోనున్నను ప్రతివ్యక్తి దేవుఁడుకాఁడు. అతనిదైవత్వము పరిపక్వావస్థలో లేదు. ఆతఁడొకభాగము, పూర్ణతనందుటకు యత్నించుచున్నాఁడు. ఉన్నస్థితిలోనాతఁడు ధూళియు దైవమును; పశువు, దేవుఁడునుగలిసిన వ్యక్తి. నైతికపరివర్తన మాతనిలోని దైవేతరపదార్థమును తొలఁగించవలెను; అట్లు తొలఁగించుటలో దానిని నాశముచేయుటకాక, దైవశక్తిచేఁ బునీతమొనర్చి శుద్ధిచేయవలెను." ౧. ప్రకృతియొసఁగిన పరిచ్ఛిన్నత్వము ఆత్మయొసఁగిన యనంతలక్ష్యముల సంఘట్టనమూర్తియే మానవుఁడు కావున, ప్రకృతివిరుద్ధ ధర్మములను పరమాత్మయొక్క పూర్ణసమన్వయధర్మమునకు లోఁబఱచి, తన గమ్యమును జేరుటకు యత్నింపవలెను. తాను బంధింపఁబడియున్న పంజరమును బ్రద్దలుకొట్టి, ప్రేమమార్గమునఁ బరమాత్మ తాదాత్మ్యమును బొందవలెను. నిత్యానిత్య తత్త్వములకు, దైవాసురప్రకృతులకు మధ్యమందుఁ బోరాటముగల మానవజీవితమునకు నీతిసమస్య

౧. ఇంటర్నేషనల్ జనరల్ ఆఫ్ ఎథిక్సు, ౧౯౧౪ పుట ౧౬౯

విశేషార్థము గలిగియున్నది. మానవుఁడు పోరాడుటకే పుట్టి యున్నాఁడు; కష్టైమట శత్రువులేనిదే మానవుఁ డాత్మవికాసమును బొందఁడు.

పరబ్రహ్మ సాక్షాత్కారమునకుఁగల భిన్నమార్గములనుగూర్చి, రథీతరునకు సత్యము; పౌరుషిష్టికిఁ దపము; మౌద్గల్యమునికి వేదము ౧.-చేసిన ప్రసంగములవలన నుపనిషత్తుల లోని మేధావులు నీతిధర్మములనుగూర్చి యానాఁడు విశేషముగా నాలోచించిరని యూహింపనగును. భిన్నతత్త్వవేత్తలు చెప్పిన వివరములను విడిచి, వా రందఱేకగ్రీవముగా నంగీకరించిన నీతిధర్మములను మనము తెలిసికొనవచ్చును.

నీతికి లక్ష్య మాత్మదర్శనము, నైతికప్రవర్తన మనఁగా, నాత్మ నెఱిఁగిన నడత; ఆత్మయనఁగా, దౌర్బల్యక్షుద్రత్వములతోడను, స్వార్థసంకుచితభావములతోడనుగూడియున్న 'అహం' కారముకాదు; మానవునిలో నిగూఢముగానుండి, స్వార్థదురహంకారబంధములులేని, పరిశుద్ధాత్మ, ఇంద్రియసుఖాపేక్ష, దేహానందకాంక్ష, అహంకారముచే నుప్పొంగు నాశాభిమానములు, మానవుని జీవశక్తులను, క్షుద్రజీవనమునకు బంధించి, కృశింపఁజేసి, పతనహేతువులగుచు గాన వానిని నిర్జింపవలెను. ఆత్మవికాసమునకును, లక్ష్యసాధనమునకు నడ్డువచ్చుశక్తుల నన్నిటిని నిరోధింపవలెను. నైతికశీలమనఁగా, వివేకవిజ్ఞానముల ననుసరించి చరించుటయేకాని, యింద్రియాధీనతకాదు. 'దేహము రథము;ఆత్మ ప్రభువు;బుద్ధి సారథి; మనస్సు పగ్గము;యింద్రియములు గుఱ్ఱములు; వస్తువులు బాటలు. బుద్ధిమంతులు,

౧. తైత్తిరీయము ౧౮ ౯.

మనస్సు, ఆత్మ యిందిృయముల యేకమూర్తిని భోక్తయం దురు. కాని యెవనికి వివేకములేదో, మనస్సునీరసమైనదో, యాతని యిందిృయములు, సారథిచేతనున్న క్రూరాశ్వముల వలె, దుష్టమార్గములఁబట్టి పోవును. ఎవఁడు వివేకియో, దృఢ చిత్తుఁడో, ఆతని యింద్రియములు, సారథిచేతిలోని యుత్తమా శ్వములవలె సక్రమగతిలో నడచును. ఎవఁ డవివేకియో, బుద్ధి హీనుఁడో, అపవిత్రుఁడో, యాతఁడమృతపదవినిఁజేరక జనన మరణ సంసారచక్రమునఁ జిక్కుకొనును. కాని విచక్షణాశీలుఁడు, బుద్ధిమంతుఁడు, పవిత్రుఁడునగునో యాతఁడు పునరావృత్తిలేని యమృతత్వమును బొందును." ౧. వాంఛావేగ మరికట్టఁబడ వలెను. కామమునకుఁ జిక్కాని వశమైనచో, ఆత్మనాశ మునఁ గిపోవును; కారణము కామము మానవధర్మముకాదు. వివేకము సూచించులక్ష్యమును గుర్తించి, ఉన్నత నైతిక ధర్మవిధి నంగీక రింపకున్న యెడల, ప్రయోజనశూన్యమై నిత్యనిరర్థక క్రియాన్వి తమైన పశుజీవనమే మనకు మిగులును. వివేకముండుటవలనఁ బ్రకృతికతీతమైన దొకటియున్నదని జ్ఞాపకముచేసి, పరమో ద్దేశ పరమార్థములుగల జీవితముగా, పశుతుల్య జీవితమును సంస్కరించుకొమ్మని మనకుబోధించుచున్నది. ఇట్టియుపదేశము లను లెక్కచేయక, యిందిృయసుఖమే మనలక్ష్యముగాఁబెట్టు కొని, దానికొఱకే మనశక్తులను ధారపోసినచో, మనజీవిత మొక దుర్నీతిదోషమై, మానవత్వమునే భగ్నమొనర్చును. "వివేకముగల మనుష్యుఁడు, తనవివేకమును, పశువులు తమ పశుస్వభావము నుపయోగించినట్లే, దుర్వినియోగ మొనర్చిన

౧. కఠోపనిషత్తు

యెడలఁ బశువుకంటె నధికుఁడని చెప్పఁజాలము." ౨. నీచ బుద్ధులుమాత్రమే లోకములోని వస్తువులనే, దేవతలనువలె నమ్మి, యారాధింతురు."ఇఁక విరోచనుఁడు తెలిసిన దని తలఁచి అసురులయొద్దకుఁ బోయి, శరీరమే యాత్మయనియు దానినే పూజింపవలయుననియు, నెవఁడు దేహాత్మసేవకుఁడో వాఁడుభయ లోకములను జయించునని బోధించెను. అందువలననే యిప్ప టికిని, ధానధర్మములుచేయక, దేవునియందు విశ్వాసములేక, యాగాదిక్రియలు సలుపకుండువానిని 'అసురుఁడ'ని పిలుతురు. వలన నది అసురధర్మము." 3, అట్టిజీవితము వ్యర్థమైన ఆశా భయములకు బానిసయగును. "వివేకముగలజీవితములో నేక త్వము, ఋజుత్వము నుండును. జీవితములోని వివిధాంశములు నుచితిస్థానములలోనుండి, అత్యుత్తమలక్ష్యమును బ్రదర్శిం చును. వివేకమునకుబదులు, మనజీవితము నిందిర్రియములే నడ పినచో నది, క్షణిక కామభోగలాలసత్వమును బ్రతిఫలించు నద్దమగును. అట్టివిధముగా జీవించువానిని గార్దభ మనవలెను. అట్టిజీవితము సంబంధములేని వ్యర్థానుభవపరంపరయై, స్వీకరిం చుటకొక పరమార్థముకాని, నెఱవేర్చుటకొక కర్తవ్యముకాని అనుభవించుటకొక ఫలితముకాని లేకయుండును. వివేకవిలసిత మైన జీవితములో,నారంభమునకుముందుఁ బ్రతికార్యక్రమము విచక్షణ సుశోధితమై, పరమార్థప్రాప్తి సాధనమగునో కాదో నిర్ణయింపఁబడును; కానియెడల విసర్జింపఁబడును." ౧.

(౨)క్యాంటు క్రిటిక్ ఆఫ్ ప్యూర్ రీజన్. (3) ఛాందోగ్యము. ౮అ. ౭. ౪-౫

౧. ఇంటర్నేషనల్ జర్నల్ ఆఫ్ ఎథిక్స్ ౧౯౦౭. పుటలు ౧౬౩-౭౨

వివేకశోభితమైన జీవితము స్వార్థరహితమై లోకకల్యాణముకొఱ కర్పింపఁబడును. సర్వజీవరాశిక్షేమములేనిదే తనప్రత్యేకవ్యక్తిత్వముండఁజాలదని వివేక ముపదేశించును. తనప్రత్యేకవ్యక్తిత్వమును మఱచిపోయినఁగాని, మానవుఁడు చంచలమైనసంపద్బంధమునకుఁ దగుల్కొనకుండ నుండఁజాలఁడు. ఎవఁడు తనస్వార్థమును సంఘక్షేమమునకై విసర్జించునో యాతఁడు సత్పురుషుఁడు; తద్విరుద్ధప్రవర్తనము దుష్టునిదే. స్వార్థపరమైన యొకకార్యమునుజేసి యాత్మ, బంధములను గల్పించుకొనును; సర్వసమత్వభావము పెంపొందినఁగాని యాబంధములు తెగవు. సర్వజీవ దయామార్గమందఱకు నెదుటనున్నది; దానినిఁబట్టి నడచిన నాత్మవికాసము కలుగును. మన మనఘులము కావలెనన్న నస్వార్థపరులము కావలెను. మన యల్పమైన 'అహం' భావ ముత్కృష్టదశయని తలఁచిన మననీచగర్వములను, నికృష్టప్రసంగములను విడిచిపెట్టవలెను. మనలోఁ బ్రతివ్యక్తియుఁ దానొక స్వతంత్రవ్యక్తిననియుఁ దనశరీరమునకు, మనస్సునకు వేఱైయున్న సర్వమునుండి తాను ప్రత్యేకముగా నున్నాననియుఁ దలంచును. ఈయహంకారమునుండి దుష్టభావపరంపరలన్నియు నుదయించును. సర్వవస్తువులు దేవునిలో దేవునికొఱకున్నవని మనహృదయములో నెఱిఁగి, నడతలోఁ జూపవలెను. ఈసత్యమెఱిఁగిన మానవుఁడు తనప్రత్యేకజీవితమును త్యజించి, స్వార్థములనుఁజంపి, 'నాది' యనుదానినెల్ల విడిచి, సర్వాత్మభావము లభించుట కవసరమైనచో లోకమంతయు దూషించి, పరిభవించినను దలయొగ్గును. ఒకవిధముగా నుపనిషదుపదేశము వ్యక్తిగతము; ఏలన నాత్మసిద్ధి నుపనిషత్తులు బోధించుచున్నవి.

కాని 'వ్యక్తిగత'మనఁగా సంబంధశూన్యమైన యర్థములోఁ గాదు. ఆత్మసిద్ధియనఁగాఁ దనకొక్కనికే శ్రేయస్కరముగాదు. నైతికజీవనమనఁగా దేవునియందు లగ్నమైనజీవనము: అనిత్యవస్తువులమూలమున నిత్యవస్తువును జూడఁగోరుచు, దివ్రోత్సాహ ప్రేమమయమై మానవకళ్యాణమునకంకితమైన జీవనము; స్వప్రకాశయసిద్ధికై చేయు స్వార్థసాహసములతోఁ గూడినదికాదు. ౧

మనఆత్మకుఁగల యాఁకలినిదీర్చి, అనిత్యవస్తువులు తృప్తి నొసఁగఁజాలవు. విజ్ఞానరంగమునందు, మనబుద్ధికి లోకవస్తుజాలమందు సత్యమెల్లు గోచరింపదో, యట్లే, నైతికజీవనలక్ష్యమైన యమరత్వము మనయల్పభోగములలో నెన్నఁడు లభింపదు. "అనంతమైనవస్తువే యానందము. క్షణికవస్తువులలో సుఖము లేదు."౧. యాజ్ఞవల్క్యుఁడు తపోవనమునకుఁ బోవ నుద్యమించి తనయాస్తిని భార్యలిరువురకు మైత్రేయీ కాత్యాయనులకుఁ బంచిపెట్టఁగోరెను. మైత్రేయి కేమిచేయవలెనో తెలియలేదు తన గృహసామగ్రి మధ్యమందుఁ గూర్చుండి ఖిన్నురాలై, దీన వదనముతో వనముపైపు జూచుచున్నది. శ్వాసలాగిపోవు వేళముతో, నిరర్థకవస్తుసంపాదనమునకై పరుగులిడు హ్రస్వబుద్ధి నామె యానాఁడు నిరసించినది. దేనినిఁగోరి యనిత్యపదార్థములను మనము కాంక్షింతుమో తద్విరుద్ధఫలితముల నవి మనకిచ్చును. మనలోనున్న ఆత్మశక్తి పూర్ణతృప్తినిఁ గోరును. దాని నిచ్చునది పూర్ణమైన అనంతసత్పదార్థమే. పరిచ్ఛిన్నవస్తువులను

౧. ఈశోపనిషత్తు ౧

౧ ఛాందోగ్యము ౭౪.౨౩౪

మనము కోరిసంపాదింతుము;అవి తృప్తి నొసఁగవు. ప్రపంచము నంతను మనము సంపాదింపవచ్చును; కాని జయించుట కింకను లోకములులేవని నిట్టూర్పువిడుతుము. "మానవుఁడు దేని నార్జించినను, నింకనధికముగా నార్జింపఁగోరును; ఆకాశమునకెగిరి, దానిపైకింక నెగురయత్నించును"౨. మనమందరము, "ఏబాటను నడచి ధనమార్జించి యందుఁ జాలమందిమ్రందిరో,యాబాటను బట్టుచున్నాము."3. వస్తువులకు దాసులమై, బాహ్యవిలాసములందీదులాడుచు, నిత్యమైన ఆత్మను మఱచుచున్నాము. "ఐశ్వర్యమువలన నేమానవుఁడును సుఖమును బొందలేదు." "యావనమద మోహితుఁడైన మూర్ఖయువకుని దృష్టికిఁ బరమార్థమెన్నఁడు గోచరింపదు. "ఇదియే స్థిరమైనలోకము;ఇంకొకటిలేద"ని యాతఁడు తలఁచును; అట్లు తలఁచి యాతఁడు తిరిగి తిరిగి మృత్యుముఖమునఁ బ్రవేశించుచుండును."౪. "జ్ఞానవంతులు శాశ్వతమైన దానినిగుర్తించి, అనిత్యమైన యీలోకమున నిత్యపదార్థముకొఱకు యత్నింపరు"౧. దైవమునుండి వియోగముచే మానవుఁడు దుఃఖితుఁడై యున్నాఁడు; దైవసంయోగము తప్ప వేఱొకటి తిరిగి యాతని దుఃఖమును బోఁగొట్టఁజాలదు.౨ దేశకాలపరిచ్ఛిన్నములై, యింద్రియ శృంఖలాబద్ధములైన లోకములోని వస్తుజాలములు నిర్మలినమై నిత్యసుందరమైన

---

(౨) ఐతరేయారణ్యకము ౨అ. 3.3౧ (3) కఠము ౨అ.౨-3
(౪) కఠము ౧అ. ౨.౬

౧. కఠము ౨అ ౪.౨ (౨) "మీరందఱు దుఃఖితులైయుండి నాదుఃఖోపశాంతికి యత్నించుచున్నారు. దేవుఁడెచటనుండునో నేనెఱుఁగుదును." (జాబ్)

వస్తువుకొఱకై మానవునిహృదయమందున్న దురంతదాహమును సృష్టిపఱుపఁజాలవు. ఇంకొకవ్యక్తి యందలి పూర్ణప్రేమచే లాభించు నుత్తమజీవితమును జీవింపఁగోరువ్యక్తులు చాలమంది గలరు. మానవునిప్రేమకు నిలయమైనవ్యక్తి, యింకొక దేశ కాలగతుఁడైన మనుష్యుఁడే యైనచో నాతని కాంక్షయెన్నఁడును సఫలము కాఁజాలదు. స్త్రీయైనను, బురుషుఁడైనను నింకొకమానవవ్యక్తి యందుఁబూర్ణప్రేమ సౌందర్యముల ననుభవింపఁగోరుట కేవల మాత్మవంచనమే. దేనికైనను బూర్ణత్వము శాశ్వతవస్తువునందే లభింపఁగలదు. అందుచే లోకవస్తుజాలముతో నిస్సంగత్వమవసరము. జన్మారంభమునుండియు నేకాంతవాసముననుండి దుఃఖవిముక్తికై యత్నించినవారు చాలమంది గలరు. భార్యాసుతులను విడిచి, వస్తువాహనాదికములను ద్రోసిపుచ్చి, పావనత్వమును దారిద్ర్యమును తమపతాకములుగా ధరించి, ఆత్మమోక్షార్థులై, సన్న్యసించి పోయినవారును బెక్కుమందిగలరు. ఈవిధముగా సర్వత్యాగ మొనర్చిన యతివర్గములు లోకమున సంచరించి, గృహబంధములను ఛేదించి, తరువాతవచ్చిన బౌద్ధసన్న్యాసమత పారంపర్యమునకు బీజప్రదాన మొనర్చినవి. పావనమైన సన్న్యాసజీవనమే మోక్షమార్గమున కుత్తమసాధనమని యెంచఁబడెను.

నైతికశీలసంపదలో నుపనిషత్తు లంతశ్శుద్ధికి, బాహ్యాకర్మలకంటె నంతరంగమందలి యుద్దేశములకు నెక్కుడు ప్రాముఖ్య మొసఁగినవి. బాహ్యక్రియాపరివర్తనముకంటె నంతశ్శౌచము ప్రధానమైనది. "దొంగతనము చేయకుము. జీవహింసచేయకుము"ని మాత్రమే యుపనిషత్తులు బోధించి యూరకుండక, "పర

ధనకాంక్షయే వలదు" కామక్రోధరాగద్వేషములకు లొంగకు మని కూడ బోధించును. అంతఃకరణప్రవృత్తి శుద్ధము కావలెను; చెట్టును సమూలముగా విడిచి కొమ్మలను నఱికిన నిష్ప్రయోజనము. పరివర్తనముయొక్క విలువ వ్యక్తిహృదయోద్దేశమునుబట్టి పరీక్షింపవలెను; అనఁగా వ్యక్తియొక్క త్యాగశక్తిని బట్టి యుండును.

జీవాత్మవలెనే, సర్వప్రపంచమును భగవానునినుండియే వచ్చినదని తెలిసికొమ్మని యుపనిషత్తులు బోధించును. ఈసిద్ధాంతమున కపార్థముచెప్పి, ప్రేమయనఁగా లోకసంబంధము లేని వ్యక్తిగతమైన 'అహం' భావవ్యక్తీకరణమని విమర్శించిరి. నచో నుపనిషత్తులు, నీతియుఁ బ్రేమయు నాత్మదర్శనసాధనములని, యంగీకరించును. 'అహం' భావశబ్దమును మాత్రమంగీకరింపవు. ఆత్మప్రేమయే మనము చూపు సర్వవిధప్రేమలకును గారణమని యాజ్ఞవల్క్యుఁడు చెప్పినాఁడు. ధనమందారాదులందలి కామము, జాతిదేశములందలి యభిమానము నివన్నియు నాత్మకామముయొక్క ప్రత్యేకరూపములని చెప్పవగును. అనిత్యవస్తుప్రేమ, సాధనమాత్రమైనది; నిత్యసత్పదార్థమందలి ప్రేమచలింపని సిద్ధియేయగును. "పుత్రుఁడు ప్రియుఁడగుటకుఁ గారణము పుత్రునిలోని ఆత్మప్రియమైనది." అనిత్యవస్తువులు నిత్యమైన యాత్మను దెలిసికొనుట కుపయోగించును. పూర్ణసత్పదార్థమునందలి ప్రేమయే ఉత్తమప్రేమ; ఏలనఁ బూర్ణప్రేమయే దేవుఁడు. ౧. దేవునిఁ బ్రేమించుటే యానందము; ప్రేమింపకుండుటే దుఃఖము. దేవుని ప్రేమించుటే

౧. కామాయతనము. బృహదారణ్యకము ౩అ. ౯,౧౧

జ్ఞానము, అమృతత్వమ్ము. దేవుని ద్వేషింపకుండుట సంశయ మోహములకు గురియై, దుఃఖమరణములను బొందుచేఁగలన్ని మతములకు నిదియే ముఖ్యమైన సత్యము. "నా కపచారము చేసినవాఁ డాత్మద్రోహియే యగుచున్నాఁడు.నన్ను ద్వేషించు వారందఱు మృత్యువును ప్రేమించుచున్నారు."౨. ఉపనిషత్తు చెప్పునట్లు, పాపాత్ములు, "ఆత్మహంతకులు 'ఆత్మహనోజనాః'

ఉపనిషత్తులు స్వార్థమును విడువుమని చెప్పుచున్నవి. కాని, మిగిలిన కర్తవ్యములనుగాదు. సాంగత్యము 'మమ'కారముతోఁగాక, దేవునితోఁ జేయుమని యుపనిషత్తుల ఉపదేశము. ఉత్తమయతికిఁ గూడఁ గోరికలున్నవి; అవి స్వార్థములు కావు. "ఎవనికి వాంఛలు లేవో, ఎవఁడు వాంఛాతీతుఁడో ఎవని కోరికలు తృప్తియైనవో,ఎవఁ డాత్మకాముఁడో, ఆతఁడు బ్రహ్మత్వమును బొందును." ౩. మనము విసర్జింపవలసిన కామ మనఁగా, కేవలతృష్ణకాదు; హీనమైన పశుకామమును, మితిలేని కాంక్షను వ్యామోహమును విడిచిపెట్టుమని భావము. నిష్కామత్వము విధింపఁబడినది; అనఁగా శూన్యకాముఁడగుట కాదు. మోహపీడితులముకాకుండ, బాహ్యరూపములందు లోలత్వము లేకుండఁ దుచ్ఛకాంక్షాసిద్ధికై ప్రాకులాడకుండ నుండుమనియే దానిభావము. ౪. కాంక్షయుండుటతప్పుగాదు. కాంక్షించువిషయమెట్టిదను విషయము ముఖ్యము.ఇంద్రియ సుఖలాలసత్వము వ్యభిచారినిఁ జేయును; సుందరవస్తువులందలి కాంక్ష కళాకోవి

---

౧. బృహదారణ్యకము ౪అ. ౪.౯ (౭)

3. బృహదారణ్యకము ౪అ. ౪.౬ (౪) నిజమగు జ్ఞాని శాంతుఁడు. శాంతుఁడు, దాంతుఁడు, ఉపరతుఁడు, సమాకారుఁడునని చెప్పఁబడెను

దునిఁజేయును; దేవునియందుఁ గాంక్ష భక్తునిఁజేయును. జ్ఞాన కాంక్ష మోక్షకాంక్షయు నుండఁదగినవి. సద్వాంఛలనియు నసద్వాంఛ లనియు వాంఛలు రెండుగా విభజింపఁబడినవి. ౫. మనము సత్కాంక్షలనే కలిగి యుండవలెను. నచికేతుఁడుతండ్రి యెడఁజూపిన పితృభక్తి; సావిత్రిదేవి భర్తయెడఁజూపిన దివ్య ప్రేమ, యోగ్యములైనవి. పరమేశ్వరుఁడు, "నే ననేకమగుఁ గాక" యని తనకామమును బ్రకటించెను. దేవునికే కోరిక యుండఁగా మనకేలయుండరాదు? మానవులకుఁ గల పరస్పర ప్రేమ దోషకలితమని యుపనిషత్తు లెచటను దూషించి యుం డలేదు. గర్వద్వేషక్షుద్ర కామములను త్యజింపవలెనేకాని, ప్రేమ, భూతదయ, పరోపకారతత్పరతయు నుండవలసినవే. ఉపనిషత్తులలో నచ్చటచ్చట నాత్మసిద్ధికొఱకు దపస్సే ముఖ్య మైన పద్ధతియని చెప్పినమాట సత్యమే. కాని తపస్సనఁగా, ఆత్మ శక్తిని వికసింపఁజేయు సాధనము; శరీరదాస్యమునుండి యాత్మ నుసంరక్షించుట; తీవ్రాలోచనచేఁ దపింపజేసి మనస్సునకేకా గ్రతను జేకూర్చుటయునై యున్నది. తపస్సనఁగా జ్ఞానమే.౧. జీవితమనున దొకశుభమహోత్సవము. మనము తపోదానార్జ వాహింసా సత్యములను నిత్యాచరణములోఁ జూపవలెను. ౨. తపస్సనఁగాఁ ద్యాగములేక నిష్కామత్వము, "కర్మవలనఁగాని, సంతానమువలనఁ గాని, ధనము వలనఁగాని లభింపదు; అమృత త్వము త్యాగము వలననే లభింపఁగలదు" 3. ఛాందోగ్యోపని

(౫) ఛాందోగ్యము ౭అ. ౧.3

౧. ముండకము ౧అ. ౧.౯, (౨) చాందోగ్యము 3అ. ౧౬; తైత్తిరీ యము. ౧అ.౬. (3) నారాయణీయోపనిషత్తు ౪అ. ౨౧

షత్తు 'శ్రద్ధాతపః' ౪. శ్రద్ధయే తపస్సని చెప్పినది. బాహ్యావస్తువ్యామోహ బంధములనుండి విముక్తి నార్జించుటకు మనమర ణ్యములకుఁబోయి, యేకాంతజీవితము నడిపి, మన క్లేశములకుఁ గొన్ని నూతన క్లేశములను జతపఱిచి, కృశించి,జీర్ణశరీరము నెచటనో త్రోసివేయనక్కఱలేదు. "త్యజించి సుఖానుభవముపొందుమని" యీశోపనిషత్తు చెప్పుచున్నది. "నేను, నాది' యను నహంకార మమకారములను విడిచినచో, లోకమందే మనకు సుఖము లభింపఁగలదు. ద్రవ్యకాంక్షలేనినాఁడు మనము నిజముగాఁ జక్రవర్తులమే. మనమెంత ద్రవ్యహీనులమైన నంతసుఖము లభించును. తాను వేఱను ప్రత్యేకత్వభావమునుజంపి, జీవరాశియెడ నిష్కామదయాంతః కరణమును బెంపొందింపఁ జేయు నర్థములలో సన్న్యాసజీవితమున కాహ్వానముచేయుట యేః సర్వసన్మతములకు మూలసత్యమైయున్నది.

వైదికయుగానంతరము భారతీయవిజ్ఞానమున మార్పు గలిగినది. ౧. అథర్వవేద ముపదేశించిన తపోవిధానములచే యోగప్రవృత్తివృద్ధిపొందినది. ఋగ్వేదమంత్రకాలమునందొక విధమైన స్వార్థసుఖాపేక్ష ప్రబలినది. తరువాత సహజమైన ఆత్మకాంక్షక్రమముగాఁ బ్రబలమై, ఉపనిషత్కాలములో నింద్రియములదౌర్జన్యము నెడఁ దీవ్రమైన నిరసనభావము విస్పష్టనినాదములతోఁ జెలరేగినది. తుచ్ఛకామతృప్తికై శరీరేంద్రియములు ప్రకటించిన పిలుపులకు నిస్సహాయ నిర్వీర్యములతోఁ దలయొగ్గు తత్త్వమదృశ్యమైనది. కాని యుపనిషత్తు లుపదేశిం

౪. ఛాందోగ్యము. ౫౦౧౦.

౧. చూడు రైస్‌డేవిడ్సు బుద్ధిజమ్ హిబ్బర్టులెక్చర్సు పుటలు ౨౧-౧౨

చిన త్యాగము, సన్న్యాసము, ననంతరకాలమునఁ, బెంపొందిన శరీరపోషణము, శరీరమును బ్రతికియుండఁగా నగ్నితప్తమైన ర్చుట మున్నగు దురాచారములలోనికి మారియుండలేదు. బుద్ధునివలెనే, తత్పూర్వుఁడైన భరద్వాజమహర్షి, సంసారవ్యామోహమును, శృతిమించిన వైరాగ్యప్రవర్తనమును సమానదోషములని నిరసించెను. ౧. మితిమీరిన శరీరశోషణాదిక తపోవిధానములు, నిజమైన త్యాగముకాకపోఁగా, నొకవిధమగు స్వార్థపరతాప్రయత్నమేయనిచెప్పవచ్చును. ఆత్మమోక్షమునకై ప్రతివ్యక్తియును ప్రయత్నించవలెననియు, నొకవ్యక్తియొక్క అత్మ,ప్రపంచములోని యాత్మలన్నిటికన్న నాతనికెక్కుడు విలువ గలదనియుఁ, జెప్పఁబడిన, భావము స్వార్థపరమైన భావముకాని వినయప్రదర్శనము కాఁజాలదు. మనముపనిచేయవలెను; అది నిష్కామకర్మకావలెనని యుపనిషత్తులు చెప్పుచున్నవి. సంసారమునువిడచి, వనగుహాగర్భముననివసించు నాతఁడు సజ్జనుఁడు గాఁడు; సంసారములోనుండి, సర్వవస్తువులను ప్రేమించి, వస్త్వంతర్వర్తియైయున్న ఆత్మపదార్థమునందు గౌరవముగల్గి వర్తించువాఁడే సజ్జనుఁడు. అట్టిసజ్జనునికి, దేవుఁడే పూజ్యతమవస్తువు; తక్కినవన్నియు దేవునియొద్దకుఁ దోడ్కొనిపోవు సాధనమాత్రములు. నెఱవేర్చిన ప్రతిసాంఘికవిధి, చేసిన ప్రతివ్యక్తిగత త్యాగము,నాత్మసాక్షాత్కారమునకు సాయపడునదే. మనము తండ్రిలము కావచ్చును; తన్మూలమున మనము సంకుచిత వ్యక్తిత్వముల నతిక్రమించి, విశాలోద్దేశములకొఱకుఁ బనిచేయవచ్చును. దేవునిప్రేమకు మానవప్రేమ ప్రతిబింబము. సర్వ

౧. ముండకోపనిషత్తు

జీవాంతర్గతమైయున్న పరమాత్మనుగుర్తించి, ఆదృష్టితో మనము భార్యను ప్రేమించి యానందింపవచ్చును. "నిజముగా, భర్త కొఱకు భర్త ప్రియుఁడుగాఁడు; ఆత్మకొఱకు భర్త ప్రియుఁడు" ని యుపనిషత్తు చెప్పుచున్నది. అదేవిధముగా, భార్య, సుతులు, రాజ్యములు, బ్రాహ్మణక్షత్రియులు, లోకాంతరములు, దేవతలు, జీవరాసులు, సర్వప్రపంచము, నాత్మకొఱకే ప్రియములని చెప్పఁబడెను. ఇవన్నియు, నాత్మకొఱకై యిచటనున్నవి కాని, స్వయంస్థితికలిగికావు. ౧. లోకములోని వస్తువులు పాపముచేయుట కాకర్షించునవి కావు; బ్రహ్మానంద సముపార్జన సాధనములుగానవి యుపయోగించును. సవ్యమైన దృష్టి మనకుఁ గలిగినప్పుడు, ధనాదికములను మ ముపయోగింపవచ్చును. ౧. "తతో మే శ్రియమావహ" "దాని తరువాత నాకైశ్వర్యమిమ్ము" అవివేకిని ధనము మోసగించునుగాని, వివేకవంతునిఁగాదు; దైవేతరములుగాఁ గన్పట్టు లోక వస్తుజాలము సత్యాన్వేషికిఁదీవ్ర సమస్యగాఁ బరిణమించును. అట్టి వస్తువుల స్వతంత్రవ్యక్తిత్వము నెదుర్కొని, యవి దైవత్వగర్భితవస్తువులనుగా మనమెఱుఁగుటకుఁ బ్రయత్నింపవలెను. సత్యాన్వేషి నిస్సంగమనస్కుఁడై సర్వకర్మలను జేయును. "నిస్సంగత్వమనఁగా,నీలోకమునకు బంధించు సర్వబంధములను ద్రెంపివేసి, యే యనిత్యపదార్థముపై నాధారపడకుండుటయే. నిస్సంగవ్యక్తి, దూషణభూషణములు గణింపక, పర్యవసానమును గూర్చి యౌదాసీన్యముతో యుద్ధరంగమునకుఁ బోవు యోధులవలె, నాతఁడు కర్మరంగమున సంచరించును.

౧. బృహదారణ్యకము ౨౮ ౪ ౫

గౌరవము, కీర్తి, విశ్రాంతిజీవనము, సుఖలాలసత్వము, మాన వాను రాగానుబంధము, వీనినన్నిటి నాతఁడొక దైవకర్తవ్యము నెఱవేర్చుట కడ్డువచ్చినయెడలఁ దృణప్రాయముగా విసర్జించును.౨.ఇట్టి యాత్మసంబంధయుద్ధమున నొకవిధమైన శరీరశిక్షను గూడ నుపనిషత్తులు విధించియున్నవి. శౌచోపవాసములు, ఏకాంతవాస బ్రహ్మచర్యములు మున్నగు శరీరశుద్ధి ప్రక్రియలుపదేశింపఁబడినవి."బ్రహ్మజ్ఞానమునకు నాదేహమర్హమైనదగుఁగాక; నాజిహ్వామధుమత్తమమగుఁగాక.నాశ్రోత్రములు విశేషముగా వినుశక్తి గలవగుఁగాక"3. దేహమొకయాటంకమనియుఁ నాత్మకనవసరమగు నన్యపదార్థమనియు భావ మిందులేదు. ఈదేహశౌచము, నింద్రియనిగ్రహము, మనోవికాసము, శరీర హింసావిధానములోఁ జేరదు. ౧. మఱియు ఛాందోగ్యోపనిషత్తునందు బ్రహ్మచర్య నిష్ఠాగరిష్ఠులైనవారికే బ్రహ్మపదవి లభించునని చెప్పఁబడినది. ౨. విద్యార్థి గురువునొద్దవిద్య నభ్యసించునపుడు పొందవలసినశిక్షణమే బ్రహ్మచర్యము; ప్రపంచరంగము నుండి విరమించుటకాదు. ఛాందోగ్యమునందే (౮అ, ౫) యాగములను జేసినఫలము బ్రహ్మచర్యము సల్పినవానికి

౧. తైత్తిరీయము ౧.౪. (౨) న్యూమన్ యూనివర్సిటీస్కెచెస్, పుట ౧౭౭.

(3) తైత్తిరీయము ౧అ.౪.

౧. గఫ్ పండితుఁడు తపశ్శబ్దమునకు శరీరమును హింసించుట యనుఁ నపార్థమునుచెప్పెను. తైత్తిరీయము (౧అ. ౪.)నందు, దేవునికి నివాసముగా నుండుట కర్హమైనస్థితిలో దేహము నుంచుటకుఁ గావలసిన విధులను చెప్పియుండిరి.

౨. చాందోగ్యము ౮అ ౪.3

లభించునని చెప్పఁబడెను. దీని యభిప్రాయము బ్రహ్మచర్యమనఁగా లోక సంబంధమును విడుచుటయని భావము కాదని చెప్పుటకొఱకే. దేహ మాత్మకు బంటుకాని, వెజగాదు. మనము మనస్సు, బుద్ధి, సంకల్పము, వివేకము. జీవితము నన్నిటిని విసర్జింపవలె నని యుపనిషత్తు లెచ్చటను జెప్పలేదు. బ్రహ్మము సర్వగతమనుభావమువలన నన్నిటిని ప్రేమింపవలె నను సిద్ధాంతము లభించును.

గఫ్ పండితుఁడు వ్రాసినాఁడు: "ఉపనిషత్తులు వర్ణించిన భారతీయమహర్షులు, పవిత్రమైనయాలోచనము, సున్నితవిజ్ఞానము, నిరంతరకర్మపరతంత్రత, సత్యమును [illegible] ననవరతప్రయత్నము, కర్తవ్యదీక్షలవలనఁ గాక, వ్యక్తిత్వము లోని ప్రతిభావము నణఁగఁద్రొక్కి, సర్వాశయములను మట్టుపెట్టి, శూన్యత, ఉదాసీనత, మాంద్యము, నున్మాదము మున్నగు నవస్థలవలన దైవజీవనమునందుఁ బాల్గొననూహింతురు" ౩. యూకేన్ పండితు ననుసరించి, ఉపనిషత్తులలక్ష్యము, "ప్రపంచమునఁ బ్రవేశించి, జయించుటకాక, దానినుండి వేఱై, సంబంధమును దెగఁగొట్టుటయే యనియు; కఠినతమములగు నాటంకముల నెదుర్కొని జీవితమును ముందుకు సాగించి, వృద్ధిఁ బొందుటకాక, వెనుకకు మరలుట, కష్టములయెదుటఁ బలాయించుట, కృశించుట, నీరసించుట, అవిరతధ్యానములు ననుసరింపఁబడుననియుఁ జెప్పవచ్చును" ౧. మానవజీవితమునుండి విముక్తి నుపనిషత్తులు బోధించుచున్నవని చెప్పిన వీరిభావములు

౩. ఫిలాసఫీ ఆఫ్ ది ఉపనిషత్సు పుటలు ౨౬౬-౨౬౭

౧. మెయిన్ కరెంట్సు పుట ౧౩.

నిరాధారములు. ఉపనిషత్తులు జీవితమును గోల్పోవుమ్మని కాని, కామమే వలదనికాని చెప్పియుండలేదు. సంకల్పశూన్యత నీతి సారముకాదు. జీవితమొక స్వప్నమనియు, బ్రపంచము మిథ్య యనియుఁ దలపోసిన మిథ్యావైరాగ్యము కొందఱు భారతీయ విజ్ఞానవేత్తలను, ఐరోపావిద్వాంసులను స్వవశము చేసికొన్నది కాని యిది ఉపనిషత్తుల స్వభావమునకే విరుద్ధమైనది. ప్రపంచ జీవితములో నొకశుభప్రదమైన ప్రమోదమే యుపనిషద్వా తావరణములో నిండియున్నది. ప్రపంచవైముఖ్యము మానవ త్వమునం దవిశ్వాసమును, దేవునియం దసంతృప్తినిఁ దెలియఁ జేయును. "సత్కార్మానుష్ఠానమునకై శతవర్షములు జీవింపఁ గోరవలెను."౧. ప్రపంచమును విడిచిపెట్టుమని కాక, ప్రపంచ ము స్వతంత్రస్థితిగలదను భావమును విడిచిపెట్టుమనియే చెప్పఁ బడెను. ప్రపంచమునకుఁ బ్రకృతికి వెనుక సర్వవ్యాపియైయున్న బ్రహ్మపదార్థమును గుర్తింపుమనియే ఉపనిషత్తులపిలుపు. ఇం ద్రియములకు గోచరించు బాహ్యప్రపంచ స్వరూపమే నిజమని సంతుష్టిచెందక, జ్ఞానదృష్టిచే నంతర్యాతమైయున్న యీశ్వరుని దర్శించి,మనలోనున్న దైవత్వము వేఱుకాదని గ్రహింపవలెను. ఆత్మదర్శనమునకై అన్వేషించువాని కుపనిషత్తులు చెప్పిన జగ త్సత్యవిషయము సాధింపవలసిన గొప్పసమస్య సర్వమును విడు చుట, సంబంధశూన్యమైన వైరాగ్యప్రణాళిక, ప్రపంచము నెదు ర్కొనఁజాలని యలసత్వము నివి, సృష్టికర్తనుదూషించుటయు మానవకోటియెడఁ బాపమొనర్చుటయు నగును. ఉపనిషత్తులు దేవుని నమ్మినట్లే, సృష్టిని నమ్మును.

౧ ఈశోపనిషత్తు ౨౨.

బ్రహ్మజ్ఞానమును గూర్చిన మహోపదేశము నుపనిషత్తులుచేసి, యంతటితోఁ దృప్తిపొంది యూరకుండలేదు. నైతిక లక్ష్యమును సుస్పష్టముగాఁ దెలియఁజేయువిధివిధానములను వివరించియున్నవి. ఎట్టి పరివర్తనములందుఁ గామమును నిగ్రహించి, వివేకము ప్రాధాన్యముగాంచునో; మన యల్పవ్యక్తిత్వముల నధిగమించి, ఆత్మోన్నతిని గాంతుమో; ఒకే దైవకార్యక్రమమందు మనమందరము సమానభాగస్వాములని విశ్వసింతుమో, అట్టి పరివర్తనము లన్నియు ధర్మయుక్తములైనవి; తద్విరుద్ధముల ధర్మములు, మనోనిగ్రహము, హృదయవైశాల్యము, కృపాంతరంగములు ధర్మమైనవి. ౧. కుడిచేతితో నిచ్చున దెడమచేయి యెఱుఁగరాదను నియమమి ట్లుపనిషత్తులలోఁ జెప్పఁబడినది." శ్రద్ధతోనిమ్ము; అశ్రద్ధతో వలదు; సమృద్ధిగా నిమ్ము; వినయముతోనిమ్ము; భయముతో నిమ్ము; దయార్ద్రహృదయుఁడవై యిమ్ము"౨. ఛాందోగ్యమునందు, (౩అ,౧౭) తపము, దానము, ఋజువర్తనము, అహింసాసత్యములు సచ్ఛీలమునకు లక్షణములుగాఁ జెప్పఁబడినవి. ౩. నవనాగరికుల దృష్టిలో, ప్రాణిహింసయనఁగా, వేటకానిచే హతమైన మృగమునుజూచి కరుణకులోనగుట మున్నగునవి, దుర్బలస్త్రీ హృదయమునజనించు నూహాలని హేళనచేయవచ్చును. కాని యుపనిషత్తులలో జీవకోటియందు దయజూపుట పవిత్రధర్మమని చెప్పఁబడినది. సర్వభూతహితత్వము భారతీయధర్మశాస్త్రములోఁ బ్రధానమైన సూత్రము. మృగయా వినోదముకొఱకొక మృగ

౧. బృహదారణ్యకము ౫అ.౨ (౨) తైత్తిరీయము ౧అ.౧౧ (౩) మూడు. ఛాందోగ్యము ౧అ.౯. ౧౨

మును జూపుటగాని, యొక యెలుకను విలాసముకొఱకు బాధించుటకాని, ఘోరపాపమని చెప్పఁబడెను. కామనిగ్రహమునకై విధివిధానములు పేర్కొనఁబడెను. భారతీయ వైజ్ఞానికులు మనశ్శక్తి దేహారోగ్యముపై నాధారపడియున్నదని గుర్తించి, దేహశుద్ధికై, యాహారశుద్ధిని నియమించిరి. ౧. చిత్తచాంచల్యముల నప్రయత్నముగా నిగ్రహింపవలెను; అట్టి నిగ్రహము సాధ్యముకానిచో నొకప్పుడు బలవంతముగాఁ జేయువిధానములు చెప్పఁబడినవి. కోరికలను బలవంతముగా నిగ్రహించు తపస్సునకును, కాంక్షాత్యాగమైన 'న్యాస'మునకును భేదము చెప్పఁబడినది. తుదిమెట్టులోనున్న సన్న్యాసికి న్యాసమును, క్రిందిమెట్టులోనున్న వానప్రస్థునికిఁ దపమును నిర్ణయింపఁబడెను. యోగసాధనములైన యేకాగ్రత, ధ్యానము మున్నగునవియుఁ బేర్కొనఁబడెను. "వివేకవంతులు వాక్కును మనస్సునందును, మనస్సును బుద్ధియందును లగ్నమొనర్పవలెను." ౨. ధ్యానము, నేకాగ్రత, మనశ్శుద్ధికై చెప్పిరి. కోరికలీడేర్చుకొనుటకుఁ గాక, దేవునితో నైక్యమగుటకు, మన మాలోచన లన్నిటినంతర్ముఖమొనర్చి, దేవునిపైఁ గేంద్రీకరింపవలెను. ఇట్టియున్నత దైవధ్యాన విధానమును లోకమునుండి విరమించుటగాదు. జగమునందంతర్వ్యాప్తమై యున్న పరమసత్యమును జూచుటకిది సాధనము," సునిశితము సూక్ష్మమునైనబుద్ధికి భగవంతుఁడు సాక్షాత్కరించును." ౩. సక్రమవిధానమునఁ బూర్ణపావనత్వ మార్జించి, యిహసంబంధ దోషములను నెట్టి

౧. ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః

౨. కఠము ౧౪. ౩.౧౦ (౩) కఠము ౩ అ.౧౨

చేసి, పరమార్థమును సాధించు భిన్నఘట్టములుగా నాశ్రమ చతుష్టయములైన బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థ సన్న్యాసములు విధింపఁబడినవి. సంఘమునకుఁ జేయవలసిన కర్తవ్యములు పూర్తియయినవెంటనే, వ్యవహారరంగమునుండి తప్పుకొను టావశ్యకమైన ప్రతివ్యక్తికి నియమింపఁబడెను. ఇట్టి ఘట్టము మానవజీవితములోఁ దుదిఘట్టము. సన్న్యాసి, ప్రేమమయమైన జీవితము, ధర్మమయమైన ప్రవర్తనము, గలిగి, తనదృష్టిని దేవునియందు లగ్నమొనర్చి, ప్రపంచవ్యామోహములకు దూరస్థుఁడై చరించును. నిరాడంబర నిశ్చలధ్యానతత్పరులగు భారతీయులు, నాశములేని సౌందర్యమును, నవిచ్ఛిన్నమైన ప్రణవగానమునుగూర్చి కలలు గాంచిరి. తామన్వేషించుచున్న సత్పదార్థము దమకు వేఱుగానున్నదని వారు భావింపలేదు. మనసృష్టిలో నది స్వప్నమే కావచ్చునుగాని, యాస్వప్నమే వారికిహలోక వస్తుసత్యమునకంటె నతిమధురమైన సత్యము. మనశ్శరీరములకుఁ గఠినమైనశిక్షణము సన్న్యాసికి నియమించిరి; అట్టి శిక్షణముగలవారే, సన్న్యాసాశ్రమమున నుందురు. కఠినతమమైనశౌచము, దారిద్ర్యము నాతని జీవితసూత్రములు. శిరోముండనముతోఁ గాషాయవస్త్రములను ధరించి, వీథులవెంబడి భిక్షాటనము నాతఁడుచేయవలెను. ఈపద్ధతులాత్మకు వినమ్రభావమునొసఁగును. సక్రమముగా ననుసరింపఁబడిన ఉపవాస ప్రార్థనాదికములచే నాత్మ నిత్యానందశిఖరము నధిరోహింపఁగలదు. సన్న్యాసియెడ మనకుఁగల పూజ్యభావమునకుఁ గారణ మాతనియందున్న వినయము, పావనత్వము. సన్న్యాసమనగా, వైచిత్ర్యములను ప్రదర్శించుటకాని, మనోహరస్వప్న

సంచారముగాని కాదు; కామక్రోధ రాగద్వేషముల నిర్జించి పవిత్రుఁడగుటయే యాతనికర్తవ్యము. ఇట్టి జీవన్మరణ మాత్మ హత్యకంటెఁ గష్టతరమైనది. మరణము సులభము; జీవించుటే కష్టమైనది. సంఘసంబంధ బాధ్యతలనుండి విమోచనముకొఱకై గృహమును సంఘమును విడిచిపోవువాఁడు నిజమగుసన్న్యాసి కాఁడు; సంసారమున నపజయముపొంది, యాతఁడు సన్న్యసింప లేదు. అట్టి హీనకారణములచే సన్న్యసించినవారిమూలముననే సన్న్యాసాశ్రమమునకే కళంకమువచ్చినది. జితేంద్రియుఁడై, సాక్షాత్కారసిద్ధికలిగి లోకకళ్యాణము నిమిత్తమై స్వయముగాఁ గష్టముల ననుభవించునాతఁడే నిజమగుసన్న్యాసి. విధివిధానము లన్నియు మన ఆత్మశుద్ధికొఱకే నిర్ణయింపఁబడినవి; సాంఘిక వ్యవస్థలన్నియు నాత్మవికాససిద్ధికై నిర్మింపఁబడినవి. అందుచే గృహస్థాశ్రమమయినవెనుక వానప్రస్థము చెప్పఁబడినది, ఆత్మ జ్ఞానులు స్వార్థములన్నిటిని త్యజించి, యత్యాశ్రమమును స్వీక రింతురని యుపనిషత్తులు చెప్పుచున్నవి. "ఆత్మస్వరూపము నెఱిఁగి, బ్రాహ్మణులు వస్తువాహన ధనసంతానాది కాంక్షలను విసర్జించి, పరివ్రాజకులైపోవుదురు." ౧. ప్రాచీనభారతవర్షము

౧. ఓల్డెన్ బెర్గు ననుసరించి, యిదియే భారతీయుల మతవిధానమునకుఁ బ్రాచీనతమమైన సూచన; "ఈబ్రాహ్మణులాత్మ నెఱిఁగి, యిహసంబంధము లన్నిటిని విసర్జించి, భిక్షకులైరి. వాఁడు మొదలు బుద్ధునివఱకీ సంప్రదాయమవిచ్ఛిన్నముగా వచ్చినది. బుద్ధుఁడు భార్యాసుతులను, రాజ్యమునువిడిచి, కాషాయాంబరధారియై, ముక్తికై తిరిగినాఁడు. భారతభూమిలో బ్రహ్మమే యేకైకసత్యమను సిద్ధాంతము, సన్న్యాసాశ్రమనిర్మాణము నొకేకాలమున నారంభమైయుండును. ఈరెండు నవినాభావసంబంధములుగలవి. (ఓల్డెన్ బర్గు బుద్ధ. పుట. ౩౨.

నందు, సన్న్యాసి, దరిద్రుఁడు, నిర్ధనుఁడునై, దైనికభిక్షాటన ముచే జీవించుచు, నేయధికారముకాని, పదవికాని లేకున్నను, భూమండలాధిపత్యమును వహించిన చక్రవర్తులాతని పాదములకు సాగిమ్రొక్కుచు నఖండగౌరవము చూపువారు. పవిత్రులన్న భారతీయులకంత గౌరవము.

హిందూమతమున నొక ప్రధానలక్షణమైన ఆశ్రమధర్మము,జీవితమునంతను నాత్మశక్తితో నింపుట కుద్దేశింపఁబడినది. వివాహమునకుఁ బూర్వదశ, కఠిననియమబద్ధమైన బ్రహ్మచర్యదీక్షా విలసితమై యుండవలెను. ఉపనిషద్విజ్ఞానవేత్తల దృష్టిలో వివాహమొక పవిత్రమైన మతానుష్ఠానము, పరమేశ్వరకైంకర్యము, ౧. గృహము పుణ్యనిలయము; ఏపుణ్యకర్మయు భార్యపాల్గొననిదే జరుపుట కధికారములేదు. మానవప్రేమ,కుటుంబసంబంధబాంధవ్యాభిమానములలో లభించు నుల్లాస విలాసములను వివాహముద్వారమునఁ బూర్ణముగా ననుభవించి,యనంతరము క్రమముగా గృహ కుటుంబ సంఘములను సడలించి. విశ్వకుటుంబసభ్యుఁడైమానవతోన్నతశిఖరమునందును.బౌద్ధమతము భారతీయహృదయమునుస్థిరముగానాకర్షింపలేకపోవుటకుఁగారణమది, గార్హస్థ్యముకంటె బ్రహ్మచర్యనియమజీవితమున కాధిక్యమిచ్చుటయు, నధికారతారతమ్యముతో నిమిత్తములేకుండ నందరకు సన్న్యాసాశ్రమస్వీకారమున కధికారమిచ్చుటయునైయున్నది.సన్న్యాసినర్గము'నాది'యనున దేమియునులేని సోదరసంఘము;జాతి కులభేదములులేనిదై,తామనుభవపూర్వకముగా నార్జించిన యానందము నుత్సాహముతో, లోకమున కుపదేశించి,

౧. చూడు తైత్తిరీయము. ౧౨

సేవా ప్రేమ సందేశవ్యాప్తికై జీవించుసంఘము. భూమిపై సన్న్యాసులు దేవదూతలుగా నుండి, పుణ్యముయొక్క సౌభాగ్యమును, వినయముయొక్క శక్తిని, దారిద్ర్యముయొక్క సుఖమును, సేవయొక్క స్వాతంత్ర్యమును ప్రదర్శించుసాక్షులై యుండిరి.

వర్ణవిధులు సంఘమునకుఁ జేయవలసిన కర్తవ్యములను నిర్ణయించునవి. తనకెన్ని యిడుమలుకలిగినను మానవుఁడు తన విధులను నెఱవేర్పవలెను. విధులు వ్యక్తులసామర్థ్యములపై నాధారపడియుండును. బ్రాహ్మణత్వము జన్మముపైఁగాక శీలముపై నాధారపడినది. ఈక్రిందిగాథ యీ సత్యమును నిరూపించుచున్నది.

"జబాలాసుతుఁడైన సత్యకాముఁడు తల్లినిసంబోధించి యిట్లుపలికెను; "జననీ! నేను బ్రహ్మచారిని కాఁగోరుచున్నాను. నే నేకులమునకుఁ జెందినవాఁడను?" ఆమె యిట్లుచెప్పెను; "బిడ్డా! నీ వేకులమునకుఁ జెందితివో నే నెఱుఁగను. నాయౌవనములో దాసీవృత్తిలోఁ బెక్కుచోటుల సంచరించితిని. అప్పుడు నీవు నాగర్భస్థుఁడవైతివి. అందుచే నీకులము నాకుఁ దెలియదు. నాపేరు జబాల, నీవు సత్యకాముఁడవు. కావుననీవు సత్యకామ జాబాలి వని చెప్పుము."

"అతఁడు హారిద్రుమతుఁతుఁడైన గౌతమునియొద్దకుఁ బోయి, యిట్లుచెప్పెను: "మీయొద్ద బ్రహ్మచారినై యుండఁగోరుచున్నాను. అనుగ్రహింతురా?" "వత్సా! నీకులమేది?"యని గౌతముఁడడిగెను. సత్యకాముఁడిట్లు నుడివెను: "భగవాన్! నే నేకులమునకుఁ జెందుదునో నే నెఱుఁగను. నాతల్లినడుగగా

నామె యిట్లుచెప్పెను: "నాయౌవనమునందు, దాసీవృత్తిలో నెక్కుచోటుల నేను సంచరింపవలసివచ్చినప్పుడు నీవు నాగర్భ స్థుఁడవైతివి. నీకులమెద్దియో నే నెఱుఁగను. నాపేరు జబాల నీపేరు సత్యకాముఁడు." కావున నోభగవాన్! నేను సత్యకామ ంబాలిని."

గౌతముఁడిటనెను. "నిజముగు బ్రాహ్మణుఁడు కాక యిట్లు చెప్పఁజాలఁడు. అగ్నినిఁదీసికొని రమ్ము. నీకుప దేశమిచ్చి చేసెదను. సత్యమును బలుకుటకు నీవు జంక లేదు"౧.

ఉపనిషత్తత్త్వమంతయు వర్ణభేదమును సడలించుటకును, కులద్వేషవైరముల నరికట్టుటకును సూచనప్రాయములైయు న్నవి. పరమేశ్వరుఁడందరియందు నివసించు నాత్మస్వరూపుఁడు. కాబట్టి సర్వజనులు సత్యమును దెలిసికొనుటక ర్హులు, సత్యోప దేశమున కధికారముగల వారునైయున్నారు. క్షత్త్రియకులప్రతినిధియగు సనత్కుమారుఁడు బ్రాహ్మణుఁడైన నారదునకుఁ బరమార్థోపదేశము చేసినాఁడు. ఉన్నతమతతత్త్వములు బ్రాహ్మణకులమునకే చెందియుండలేదు. రాజు లానాఁడు, తత్త్వ సమస్యలఁగూర్చి బ్రాహ్మణుల కుపదేశించు నాచారమున్నది. క్షత్త్రియ చక్రవర్తులైన, జనకుఁడు, అజాతశత్రువు, మతసభలు చేసి, తత్త్వచర్చలు జరిపించుచుండువారు. తీవ్రమైన ప్రజ్ఞతో వాదములు పెంపొందినకాల మది. జనసామాన్యముకూడ తత్త్వ సమస్యలం దభిరుచిఁ జూపినకాలమది. విజ్ఞానకోవిదులగు వారు తత్త్వచర్చలు జరుపు నుద్దేశముతో దేశమంతటను సంచరించు వారు. ఉపనిషత్సంకలన కర్తలగు బ్రాహ్మణులు, పూర్ణసత్య

౧. ఛాందోగ్యము ౪అ. ౪.౧.౪

ప్రియులగుటచేఁ దత్త్వాన్వేషణమునందు క్షత్రియులు కూడఁ బ్రముఖపాత్రను స్వీకరించిరని యంగీకరించియున్నారు.౧. జీవితపోషణావసరములను సంపాదించు క్లేశమును స్త్రీలకు లేకుండఁ జేసినను, మోక్షసంపాదనమున కవసరమగు నాత్మజ్ఞానపరిశ్రమయందు వారికిఁ బురుషులతో సమానస్వత్వము లీయఁబడినవి. గార్గి, మైత్రేయి మున్నగువారు, బ్రహ్మజ్ఞానసమస్యలను జర్చించి, తత్త్వచర్చా ప్రసంగములందుఁ బాల్గొనియున్నారు.౨

మోక్షసాధనములలో జ్ఞానమున కుపనిషత్తులు ప్రాధాన్య మిచ్చినవి."తరతిశోకమాత్మవిత్" "ఆత్మవిదుఁడు శోకసాగరమును తరించును" "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి." "బ్రహ్మవేత్త బ్రహ్మయేయగును" ఉపనిషత్తులు జ్ఞానమునకుఁ బ్రాముఖ్యమిచ్చి యుండుటచేతను, నీతి జ్ఞానమునకుఁ దీసికొనిపోవుసాధనమనియుఁ జెప్పియుండుటచేఁ గొందఱు విమర్శకు లుపనిషత్తులు జ్ఞాన మీఁదఁగల యభిమానాధిక్యముచే, సంకల్పమునకు (will)ద్వితీయస్థానమునే యిచ్చిరని తెల్పియున్నారు. డ్యూసేన్ పండితుఁడు సిద్ధపురుషునకు నీతితో సంబంధములేదనిచెప్పియు, నీతియజ్ఞానికి నవసరములేదని వచించెను. "మోక్షమునిచ్చు జ్ఞానమునకు సత్ప్రవర్తనము ప్రత్యక్షముగాఁ గాక, పరోక్షముగానే సాయపడునని చెప్పవచ్చును. ఏలన, జ్ఞానమనఁగా నిది వఱకు లేనిది,యిపుడు సంపాదింపఁదగిన పరిణామదశకలది కాదు; త్రికాలాబాధ్యమై, పరిపూర్ణతగలజ్ఞానము సద్యస్సందర్శన

౧. చూడు. కౌషీతక్యుపనిషత్తు ౧అ. ౪.౨; బృహదారణ్యకము ౩అ.౭ ఛాందోగ్యము ౫అ. ౩,౭

౨. బృహదారణ్యకము ౨అ. ౪

యోగ్యమైనది."౧. మోక్షసాధనమైన యుపనిషత్తులు చెప్పుజ్ఞానము సామాన్యదృష్టిలో మనము గ్రహించు సంకుచితజ్ఞానము కాదు. "ఆత్మ శ్రుతిజ్ఞానమువలనఁగాని, మేధశ్శక్తి వలనఁగాని, పాండిత్యమువలనఁగాని లభింపదు."౨. ఋజుప్రవర్తనముకూడ ముఖ్యమైనది. జ్ఞానముతోఁబాటు ధర్మానుకూల జీవితమును గావలెను. బ్రహ్మజ్ఞానమును గాంక్షించు విద్యార్థి కెంత పరిశీలన శక్తి, మహోత్సాహములున్నను, నైతికాధ్యాత్మికార్హతలు లేనిదే బ్రహ్మోపదేశార్హుఁడుగాఁడు. 3. జ్ఞానమనఁగాఁ గేవలప్రజ్ఞాసామర్థ్యముకాదు; జ్ఞానమనఁగా నాత్మదర్శనము, బ్రహ్మచారియొక్క మనస్సు చంచలము కాకూడదు; ప్రపంచవస్తువులచే నాకర్షింపఁబడరాదు; దేవునిపైఁ గేంద్రీకరించుట కడ్డువచ్చునవి విడిచిపెట్టవలెను. దైవధ్యానముచే నాతనిహృదయము శుద్ధిపొందవలెను. తత్త్వానుష్ఠానసిద్ధులైన మహర్షులు తమయొద్ద శిష్యులుగా నుండఁగోరువారికిఁ గఠినమైన నైతికాధ్యాత్మిక శిక్షణమును విధించి,యట్టి విధముగా సుశిక్షితులైన వారినే యంగీకరించుచు వచ్చిన ట్లుపనిషత్తులు చెప్పుచున్నవి. ప్రశ్నోపనిషత్తునందు పిప్పలాదుఁడను గురువు బ్రహ్మోపదేశమునకై తన యొద్దకేతెంచిన యాఱుగుర నింకొక యేడాత్మశిక్షణముపొందిరమ్మని పంపివేసెను,ఛాందోగ్యోపనిషత్తునందు గౌతమగురువు సత్యకామజాబాలివరణ్యములోఁ దనగోగణమును బోషించి రక్షించుచుండుమని పంపివేసెను;అట్టి యరణ్యసంచా

౧. ఫీలాసఫీ ఆఫ్ది ఉపనిషత్సు పుట 3౬౨.

౨. ముండకము 3అ, ౨,3; 3అ ౧.౮ (౪) చూడు కఠము ౧అ. ౨. ౨౪-౨౫

రమువలన నాతఁ డేకాంతవాసమునుండి యంతర్లోకనాభ్యాసమొనర్చుననియుఁ బ్రకృతిరహస్యములను బ్రత్యక్షముగాఁ బరిశీలించుననియు నట్లు చేసెను. ఉపనిషత్తులు చెప్పిన జ్ఞానమనఁగా, నాత్మశక్తియొక్క సజీవసూత్రమైన విశ్వాసము. చెట్టు ఫలము నిచ్చునట్లే, జ్ఞానము కర్మరూపమున ఫలింపవలెను మనకు జ్ఞానముకలిగిన దనఁగా, మనయందు సత్యము ప్రవేశించి మనమై, మనము సత్యాత్ములమగుచున్నామని యర్థము. "ఎవకిసు దురభ్యాస విముఖుఁడుగాఁడో, ఎవనిచిత్తము స్వాధీనమై శాంతినిఁబొంది, హృదయము విశ్రాంతినిబొందదో, యాతని, జ్ఞానము దుస్సాధ్యము." అందుచేతనే రామానుజుఁడు, జ్ఞానమనఁగా, ధ్యానోపాసనములని యర్థము చెప్పినాఁడు. జ్ఞానము, నీతివిరహితమని చెప్పు లేమాత్రమును సమంజసముగాదు. పరమాత్మైకత్వభావమును బ్రకటింపని కేవల కర్మములనాచరించుట నిష్ప్రయోజనమని యుపనిషత్తులుచెప్పినమాట నిజమే." అంతేకాదు. ఈలోకమున నేజీవియేదైన ఘనమైన యొకపవిత్ర కర్మ నాచరింపకుండునో, యాజీవి వ్యర్థజీవనముచేసినవాఁడగును. "ఎవఁడు తనయాత్మను బరమాత్మగా నెఱిఁగి యారాధించునో, యాతఁడొనర్చిన కర్మయెన్నఁడు నశింపదు."౧. ఈ వాక్యము జ్ఞానసహితముగాఁ గర్మాచరణమును బోధించుచున్నది. పరమార్థలక్ష్యము లేని కర్మవ్యర్థమగును.౨. మానవుఁడు నిజముగాఁ బొందవలసిన గమ్యస్థానము, జ్ఞానశూన్యమైన మంచితనమువలన లభింపదు. యజ్ఞములుచేయుట, నిత్యకర్మానుష్ఠానము మున్నగు సర్వకర్మలయందు, నాత్మపరమాత్మానుసంధానమెల్లపుడు లేకున్నను, నాత్మాతీతపదగమన మున్నది.

పరమేశ్వర ప్రీత్యర్థమే సర్వకర్మములు చేయవలెను. దేవుఁడు లేనిదే, మనజీవితమునకు లక్ష్యము, స్థితి, పోషణమును లేదు. ఇహమునందుఁగాని, పరమునందుఁగాని, విశేషగుణితముగా ఫలము లభింపవలెనని చేయు కర్మకలాపము నుపనిషత్తులు నిరసించుచున్నవి. లోకాంతరమునందు సుఖభాగములను గొని యుంచుకొనుటకొఱకుఁగాని, దేవుని ఖజానాలో నిల్వసొమ్ము పట్టానుంచుకొనుటకుఁగాని యుద్దేశించి, కర్తవ్యములను మనము చేయరాదు. బ్రాహ్మణములలోనున్న యిట్టి యాంత్రిక (Mechanical) కర్మవిధానమును నిరసించుటకే యుపనిషత్తులు జ్ఞానసహితకర్మాచరణము నుపదేశించిన్వి. జ్ఞానకర్మలకు సంబంధము లేదనికాని,కర్మకో నిమిత్తము లేకుండ జ్ఞానమే మోక్షమిచ్చుననికాని యుపనిషత్తు లంగీకరింపవు. జ్ఞానకర్మల సమ్మేళనముచే నుత్సాహతరంగితమైన పూర్ణజీవితము నుపనిషత్తులుపదేశించినవి.

విజ్ఞానముయొక్క లక్ష్యమును, మనము బుద్ధిఘట్టము నతిక్రమించి,ధ్యానఘట్టమునకుఁ బోయినఁగాని యెట్లుసాధింపఁజాలమో, యట్లే, నీతియొక్క పరమార్థమును, ధర్మపదాతీతమైన మతానుష్ఠాన రంగమునకుఁ బోయినఁగాని సాధింపఁజాలము. నీతిఘట్టమున, మనలోని నిత్యానిత్య తత్త్వముల వైరుధ్యము మిగిలియున్నది. జీవాత్మ అహంకారకలుషితుఁడై, పరమాత్మనుండి తాను వేరైన స్వతంత్రవ్యక్తినని తలంచును. వ్యక్తిలోనున్న పరమాత్మ తన సర్వాంతర్యామిత్వమును స్థిరీకరించుకొనుటకై, తీవ్రకృషినొనర్చును. నీతిప్రవర్తనము మన

౧. బృహదారణ్యకము౧౮ ౪.౫. (౨) బృహదారణ్యకము ౩౮౭.౧౮

లోని ప్రాకృతికస్వభావము నదుపులోనుంచును; కాని, మన ప్రాకృతికస్వభావము పూర్ణాత్మస్వభావముగ మాఱినఁగాని లక్ష్యసిద్ధి చేకూరదు. మనము మన ప్రత్యేకస్వతంత్రవ్యక్తిత్వాభిమానమును నాశనమొనర్చి, మనపృథక్త్వమును బోనాడినప్పుడే, తత్త్వానుష్ఠానముచే లభించు నానందమున నోలలాడి, ఆత్మస్వాతంత్ర్య శంఖారావ మొనర్పఁగలము.

మతానుష్ఠానానుభవసిద్ధియే నైతికవిధికి లక్ష్యము. ఆ లక్ష్యములేనిదే, నీతినియమముల ననుసరించుటచేఁ బరమార్థము లభించునను నిశ్చయము మనకులేదు. భయోత్పాతములు రోగ మరణాదులు తటస్థించినపుడు, నివన్నియుఁ దాత్కాలికములనియుఁ, బర్యవసానము శుభమేయగునని యుఁగలుఁగు నిశ్చయమువలన మనకు మనోధైర్యము శాంతి చేకూరును. నీతికి మతము తప్పనిసరియగు నాధారము, ప్రపంచము క్షేమకరమైనదే యనియు, మానవుని యన్వేషణరూపమైన క్లేశము తుదకు జయప్రద మగుననియు దైవవిశ్వాసమే మన కమోఘమైన పరప్రసాదమై యున్నది. "మానవుఁడు, అగోచరము, నిరాకారము, వాగతీతము, అనాద్యనంతమునైన పరమాత్మయే, తనగతి, శరణ్యమునని నమ్మినచో నప్పుడతఁడు నిత్యమైన శాంతినిఁ బొందును. అట్టి బ్రహ్మపదార్థమునుండి తాను వేఱని భావించువాని కశాంతి తప్పదు; ఇట్టియశాంతి తాను జ్ఞాని ననునహంకారదూషితునకు లభించును."౧. ఇట్టి యమోఘదైవ విశ్వాసనిశ్చయ మున్నవానికిఁ బరిస్థితుల వలనబాధకాని, సంఘనిరసనము వలని యశాంతికాని

౧. తైత్తిరీయము ౨౯.౭

యొన్నఁడునుండదు. మానవస్పర్ధలవలన నట్టివ్యక్తి రాగ ద్వేషములకులోను గాఁడు. మతము నీతికిఁ బ్రాణముపోయునది. మతములేని నీతిలేనిపరమార్థముకొఱకు మనముచేయు, తుదిలేని పరిశ్రమ, గమ్యస్థానములేని పరిణామము, ఫలోన్ముఖత లేనియాశయమునగును. మతములోనిది యంతయు, ననుభవసిద్ధిగా, నిర్మలానందముగా, నమూల్యఫలముగాఁ బరిణమించును. అప్పుడు జీవియొక్క పరిమితత్వ దౌర్బల్యము పరాభూతమై, యొకమహనీయార్థసందేశము ప్రత్యక్షమగును. ఇట్టి జ్ఞానస్థితి చేకూరినపుడు, దేహయాత్రయింకను గొంతకాలముండుటా, విరమించుటా యనునది గణింపనవసరములేని సమస్యయగును. ౨. అట్టి జ్ఞానిజీవితమప్పుడు దైవప్రేమచే జాజ్వల్యమానమై, జగత్కల్యాణైకకాంక్షచేఁ దేజోవంతమగును. అట్టివ్యక్తి తనకర్తవ్యనిర్వహణమార్గము మృదువైనదా, కఠినమైనదా యను భేదమును గణింపఁడు. మానవుఁడు సత్యసాక్షాత్కారమును బొందినపుడు, పాపమాతనినుండి తొలఁగిపోయి, నాశముపొందును; కఠినకుడ్యములను దాఁకి బంతిదూరముగాఁ బలాయనమగును. ౧

ధ్యానదశ, విజ్ఞానప్రమాణఘట్టమున కెట్లతీతమో, యట్లే మతానుష్ఠానసిద్ధి, పుణ్యపాపముల కతీతమైనది. జ్ఞాన

---

౨ "దుర్మార్గుఁడైనవాఁడు గొప్పపదవినాక్రమించి, వటవృక్షమువలె వ్యాప్తిపొందుట నేఁజూచితిని; అతఁడు మరణించుటయుఁ జూచితిని; అతఁడేడీ? కానరాఁడు. జ్ఞానిని, ధర్మతత్పరుని జూడుము. వానికిఁ జిరశాంతి లభించినది," (సామ్స్ ౩౭అ.౩౫-౩౭

౧ ఛాందోగ్యము ౮. ౨. ౭.

సిద్ధునికి విధినిషేధములులేవు. ౨. "నేను పుణ్యమేల చేసితినికాను? పాపమేలచేసితిననుతలంపు లాతని బాధింపవు."3. ఆతనికి దేనివలనను భయములేదు. పాపపుణ్యక్లేశమాతనికిఁ గలుగదు. "అమృత్వమందిన యాతఁడు పుణ్యపాపముల కతీతుఁడు. తాను జేసినది, చేయఁజాలనిది యాతనిని బాధింపదు. ఆతని బ్రహ్మజ్ఞానరాజ్యము సర్వకర్మాతీతము." జీవితములోని పాపఫలితము లన్నిటిని హృదయమున జ్ఞానప్రవేశముచేఁ గలిగిన మార్పువలనఁ బరిహరించుట కవకాశమున్నదని దీనివలన స్పష్టమగుచున్నది ఎంతపాపముచేసినను, మనశ్శుద్ధిగల ప్రాయశ్చిత్తకర్మచే నశించి, మోక్షమున కడ్డురాదను క్రైస్తవసిద్ధాంత మిట్టి తత్త్వమునుండి జనించినదే. ఎట్టి పరమాత్మయందు నివసించుట వర్ణించుట కలవికాని యానందమో, అట్టి పరమాత్మ సాక్షాత్కారమయిన, వానిదేహము బ్రహ్మ తేజోమయమై, అల్పము నీచమునైనదంతయు నచటనుండఁజాలక కృశించి నశించును. అట్టియెడ నీతిప్రవర్తనమున కర్థములేదు; ఏలన నచటనేపనిచేసినను కర్తమానవ మాత్రుఁడుగాఁడు. ఆతని సంకల్పమే దైవసంకల్పము; ఆతని జీవితమే పరమేశ్వరుని జీవితము. ఆతఁడు పరిపూర్ణుఁడైన దేవునియందుఁజేరి, పరిపూర్ణుఁడైనాఁడు. ఆతఁడు చేయుపనులన్నియును దేవుఁడే చేయుచున్నాఁడు. జ్ఞానికి దేవునకు భేదము లేదు. డాక్టరు బొశాంకే 'పూజ్యమైన మతమననేది!' యను తనగ్రంథమున నత్యుత్కృష్టమైన స్థితియందుఁగల యేకత్వము నీవిధముగాఁ బ్రకటించియున్నాఁడు, "ప్రేమ

(౨) కౌషీతకి ౨అ. ౮; బృహదారణ్యకము ౪.అ. ౪.౨౨

(3) తైత్తిరీయము ౨అ. ౯.

యొక్క పావనత్వమునందు, నుత్తమశ్రేయోరూపమైన సంక ల్పమునందు నీవు రక్షింపఁబడుచేకాదు, నీవు స్వతంత్రుఁడవు ప్ర బలవంతుఁడవు కూడ నైతివి. . .అచటఁగలిగిన బ్రహ్మైక్యసంధాన ముతో నీభాగమెంత, దేవుని భాగమెంతయను విభాగజ్ఞాన ముండదు. నీవు దేవునిలోనికిఁ జొచ్చుకొనిపోవుటో, దేవుఁడు నీలోనికిఁ జొచ్చుకొనిపోవుటో,యీ రెండు వచోవిధానములలో సత్యము నేది బాగుగాఁ బ్రకటించినట్లు నీకు నచ్చునో దానిని స్వీకరించిచెప్పుకొనుము."౧.

దుశదృష్టవశమున మతజీవితములోని యీ ప్రధాన సత్యాంశము భారతీయతత్త్వముతో నత్యంతపరిచయముగల కొందఱుపండితులకు సరిగాబోధపడలేదు.ఉపనిషద్వ్యాఖ్యాతలలో నధునాతనుఁడైన డాక్టరు. హ్యూమ్ వ్రాసినాఁడు: "ఉపనిష త్సిద్ధాంతమునకును, గ్రీక్కు విజ్ఞానవేత్తల సిద్ధాంతము నకును జాలభేదమున్నది. జ్ఞానియైనవ్యక్తి జీవితము ధర్మసమ్మత మైయుండవలెను; అనఁగా జ్ఞానముయొక్క ఫలితము నీతినిబద్ధ

౧. పుటలు. ౨౦-౨౧. "ఒకనీటిబిందువు సురాపాత్రలోఁ గలసిపోయి సురయొక్క రంగును రుచినిఁ బొందినట్లు; కరిగిన యినుము యగ్నిరూపమును ధరించి, తనరూపమును విడిచిపెట్టినట్లు; సూర్యకాంతిలోఁగలిసిన వాయువు సూర్యకాంతివలెనే గోచరించుచు, సూర్యకాంతిచేఁదాను ప్రకాశించునట్లు కాక, తానేకాంతియై వెలుగునట్లు, జ్ఞానసిద్ధుల హృదయములందుఁగల ప్రేమ యంతయు, స్వాత్మాకృతివహించి దైవసంకల్పముగా మాఱిపోవును. మానవ త్వములో మానవలక్షణమేమైన మిగిలినచో దేవుఁడు సర్వవ్యాపి యెట్లగును? కొంత మానవత్వము మిగులునుగాని, అది మానవాతీతమైన రూపమును, శక్తిని, తేజమును బ్రదర్శించును." (సెయింట్ బెర్నార్డు. మైండు పత్రికలో నుదాహృతము. ౧౯౧౩. పుట ౩౨౯.)

మైన జీవితముకావలెను. ఉపనిషత్తుల ననుసరించి, యేదో యొకవిధమైన తత్త్వజ్ఞానము నెఱింగినంతనే, గతజీవితములోని పాపములన్నియు నశించుటయేకాక, నిరాఘాటముగాఁ బాపములుగా గోచరించు పనుల నెట్టిసంశయమును లేకుండఁ జేయుచుండుట కధికారమిచ్చును. అట్టి జ్ఞానములేనివారికి సహితము దుష్కర్మాచరణమునకుఁ బ్రోత్సాహమొనర్చునవియు, మన దృష్టిలో సహింపరాని ఘోర దోషములనంటివి యగుపాపములను వారుచేసిన దోషములేదు." ౧. మే మిదివఱలోఁ జెప్పినట్లుగా నుపనిషత్తులిచ్చు జ్ఞానమనఁగాఁ, దర్కపరిజ్ఞానవిశేషము కాని, కుశాగ్రబుద్ధికౌశల్యముగాని కాదు; సృష్టి మూలభూతమైన సత్పదార్థము నుత్తమోత్తమమైన పరమసత్యముగా గ్రహించు ననుభవమే జ్ఞానము. ఇట్టి యాత్మదర్శనము, సిద్ధాంతానుష్ఠాన విషయములలో జీవితస్వభావము పూర్ణపరివర్తనమందినఁగాని సాధ్యముగాదు. డాక్టరు హ్యూమ్‌చెప్పిన "ఒకవిధమైన తత్త్వజ్ఞానము నెఱుఁగుట" యనునది పరమపావన హృదయముగలవానికిఁగాని లభించునదికాదు. జ్ఞానులు పూర్ణస్వతంత్రులు. "అట్టి మహోన్నతదశలో నొక చోరుఁడు చోరుఁడు కాఁడు; ఒక హంతకుఁడు హంతకుఁడుగాఁడు. అతనికిఁ బుణ్యమంటదు, పాపము నంటదు; ఏలన నాతఁడు హృదయమున జనించు దుఃఖములనన్నిటిని జయించెను." ౨. ముక్తులైనవారే సంశయములేకుండ నే పనియైనఁ జేయుటకధికారులు. కాని వారి యధికారము స్వైరవిహారోన్మాదము కాదు. 3. యోగి తనకుఁ

(౧) ఇంట్రడక్షన్ టు ది థర్టీన్ ప్రిన్సిపల్ ఉపనిషత్స్. పుట ౬౦
(౨) బృహదారణ్యకము ౪౪ (3) రవీంద్రనాథటాగూరు. సాధన పుట ౧౮

వానే ధర్మము; తనకుఁ, దానున్న ప్రపంచమునకుఁ దానే ప్రభువు. అంతర్వాణి ప్రబోధనముల ననుసరింపఁజాలని వారి కొఱకు నీతినియమము లవసరము, జ్ఞానులవిషయములోఁ బోధ మొనర్చు నవకాశమే లేదు. బాహ్యశాసనమునకు వారు తమ యంతరంగమునం దుచిత స్థానము నిత్తురు. ఆత్మసిద్ధి ననుకూలిం పఱచు, ధర్మశాసనము బాహ్యమునుండి నియమింపఁబడినట్లుగ శ్రీమాన్వితమైన యత్నములో మానవుఁడు దాని ననుసరింప వలసినవ్వలయి యుండును. కాని బ్రహ్మజ్ఞానకాంతి లోపలఁ ప్రసరించినంతనే, నీతి నియమము మానవునిలో నంతర్ముఖమై అజ్ఞాతమై, నడచిపోవుచుండును. సిద్ధపురుషుఁడు చేయుకర్మ బాహ్యశాసనముల కనిష్టముగాఁ దలపంచునట్టిది కాదు; లీలా మాత్రముగా జరుగు పరమేశ్వరుని సంకల్పమున కాతఁడు సంపూర్ణాత్మ సమర్పణముచేసికొనును. విధి నిషేధములవలని బాధనష్టములను గణింపని స్వార్థరహితమైన ఆత్మోత్సాహ నిరవద్యప్రవాహరూపమైనదే జ్ఞానికర్మ. సంఘ మంగీకరించు సామాన్యపరిమాణములు, బాహ్యకర్తవ్యములు, నీతిసూత్ర ములు నాతనిదృష్టి కర్థములేనివి. జ్ఞానిహృదయము, సర్వము నందు సూత్రరూపముననున్న పరమాత్మను దర్శించిన బ్రహ్మా నందరసమునఁ దేలియాడుచు, అజ్ఞాని తనపాపము నెంత ప్రేమించునో, లోకము నాతఁడంతగాఁ బ్రేమించును. "పూర్ణ సంకల్పశుద్ధిగల వ్యక్తికిని నీతినియమములు వర్తించును; కాని యాతఁడు వాని ననుసరించితీరవలెనను బాధలేదు; ఏలన నవి వాని శుద్ధసంకల్పమునుండి కల్పింపఁబడినవే. కావున దైవసంక ల్పమునకు బాహ్యశాసనము లెట్లువర్తించును? ఇచట 'విధి'

యనుదానికి స్థానము లేదు. విధి, నియమము నాతని యిచ్ఛాకారార్పిత సంకల్పములో నిదివఱకే లీనమైయున్నవి." ౧. నీతి నియమములు శుద్ధసంకల్పముయొక్క బాహ్యరూపములు; అందుచే నవి వానిని బంధింపవు. అట్టిబ్రహ్మవేత్త సర్వనియమ సృష్టికర్తయు స్వారాట్టుగనై యుండును. విశ్వపరిణామములో మూఁడురకముల జీవులున్నారు. (౧) తమస్వార్థపరమైన యభివృద్ధినిఁగోరి, తమవాంఛాతృప్తికై తడవులాడు నికృష్టజీవులు వారెన్నఁడును సత్కర్మచేయరు; ఒకవేళఁ జేసినను, స్వర్గసుఖాశవలననో, నరకభీతినో స్వార్థపరులైచేయుదురు. (౨) ధర్మము నెఱిఁగియుండి, తమ యంతరంగమునఁగల మానసికక్లేశములను బోనాడు నుద్దేశముతో, శక్తివంచనములేకుండ ననుసరింప యత్నించువారు. (3) జీవితసమస్యలన్నిటిని బరిష్కరించి, పూర్ణశాంతి నార్జించిన మహాత్ములు లోకోద్ధారకులు. జనోద్దేశమును వారెఱుఁగుదురు; ఆయుద్దేశము నప్రయత్నముగా వా రనుసరింతురు. మనకేదైన ధర్మసంశయము కలిగినప్పుడు, బ్రహ్మవేత్తలు తమ కర్తవ్యములయెడ నెట్లుప్రవర్తించిరో తెలిసికొని, అట్లుప్రవర్తింపుమని యుపనిషత్తులు చెప్పుచున్నవి. ౨. తమకుఁ దెలియకుండఁగానే యెట్లు నక్షత్రములు కాంతినిచ్చుచున్నవో, పుష్పములు సౌరభమును వెదఁజల్లుచున్నవో, యట్లే, జ్ఞానసిద్ధులు ధర్మవ్యాప్తికై, తమవిధులను నిర్వహించుచుందురు. ఇట్టిస్థితిని ప్రతిమానవుఁ డార్జింపవచ్చును; దేవునితో

౧. క్యాంటు మెటఫిజిక్స్ ఆఫ్ మోరల్సు. పుట ౩౧

౧. స్వయమేవ రాజః.

౨. తైత్తిరీయము. ౧౨ ౧౧

నేకమగుట కవకాశమున్నదని యేకమగుటవలననే ఋజువు
చేయవలెను. సిద్ధాంతము సత్యమని యనుభవమే సాక్ష్యమీయ
వలెను. క్రైస్తవ విద్వాంసుల ననుసరించి, మానవునిలోఁబూర్ణ
దైవత్వ ప్రదర్శనము జీసస్ వ్యక్తిత్వములో నొకమారు
జరిగినదని చెప్పుచున్నారు. జన్మించిన ప్రతిమానవునిలోఁ బూర్ణ
దైవత్వసిద్ధిగాంచు నవకాశమున్నదనియు, సముచిత కృషివలన
నట్టి సిద్ధిలభించుననియు, నుపనిషత్తులు చెప్పుచున్నవి. మను
ష్యుఁడు పరమార్థసంపాదన కృషితోఁగూడిన అపరిపూర్ణప్రపం
చములో మాత్రమే నీతి కర్థమున్నది; కావున, నుపనిషత్తుల
తత్త్వమందు నీతికున్నతస్థానము లేదని కొందఱు విమర్శకులుచెప్పి
యున్నారు. డ్యూసేన్ వ్రాసినాఁడు; "ఆత్మజ్ఞానసిద్ధి లభించిన
వెనుక, ప్రతికర్మయు, నందుచేఁ బ్రతినీతి సూత్రాచరణము
నర్థరహితమగుచున్నది." ౧. ఇట్టి దోషారోపణముల కాధార
మును మేము పెక్కుమారులు చెప్పియుంటిమి. ధర్మానుష్ఠా
నము స్వీయలక్ష్యము కలదికాదు. అది జ్ఞానజీవితమునకు సాధ
నము. జ్ఞానమునకే అతీతమైన విలువయున్నది. ముక్తపురు
షులు సృష్టికార్యక్రమములో దేవునితో భాగస్వాములగుదురు.
పరిపూర్ణమైన బ్రహ్మార్పణబుద్ధితో గడపు జీవితముయొక్క
లక్ష్యములో ధర్మానుష్ఠానము లీనమైపోవును. ఈస్థితిలోఁ ప్ర
త్యేకవ్యక్తి, పరమాత్మలోఁ గలిసిపోవును. ఈపరమాత్మాను
సంధానమునకే నిజమైన విలువయున్నది. దానికి సాధనభూత
మైన ధర్మానుష్ఠానము నిష్ప్రయోజనముకాదు.

౧. ఫిలాసఫీ ఆఫ్ ది ఉపనిషత్సు. పుట ౩౬౩.

## ౧౬—మతదృష్టి

మతము ప్రధానముగా జీవితానుభవసంబంధమైనది. మతదృష్టి వికాసమున కుపనిషత్తులు మూఁడుదశలను జెప్పినవి: శ్రవణమనఁగా వినుట, మననమనఁగా సమాలోచనము, నిదిధ్యాసనమనఁగా నాంతరంగిక ధ్యానము; ౧. ప్రథమదశలో మతజీవితములో సంప్రదాయమునకుఁ గలస్థానమును దెల్పును. దేవుని యందు సజీవమైన విశ్వాసము నుపదేశించుటకు సంప్రదాయసిద్ధమైన సత్యసూత్రమేదో యొకటికావలెను. "తాము చూడకున్నను, విశ్వసించినవారు ధన్యులు." మానవులలో నధికసంఖ్యాకులు సంప్రదాయమువలనను, రూపదర్శనము వలనను దృష్టి పొందుదురు. సంప్రదాయము ననుసరించుటే మతమని యుపనిషత్తుల యభిప్రాయముగాఁ దీసికొనరాదు. నిశితపరిశీలనముచే సంప్రదాయాంతర్గతమైయున్న సత్యమును నిర్ణయించి తెలిసికొనుటకు మనము ప్రయత్నింపవలెను. సహేతుకసమ్యక్పరిశీల నావసరమును ద్వితీయదశ ప్రకటించుచున్నది. మొదట నాప్తవాక్యముగా నమ్మినది సహేతుకమని మనము నిర్ణయించుకొందుము. సత్యము నర్థముచేసికొన్నంత మాత్రముచే నది యనుభవము కాఁజాలదు. అత్యున్నతమతదృష్టికి సత్యము గ్రహింపఁబడినది కాక, దర్శింపఁబడినదగును. ఈసత్యానుభవమునకు, ఈపరమార్థదర్శనమునకు, తార్కికప్రజ్ఞా విధానముగాక వేఱొకవిధమైన దృష్టికావలెను. నిదిధ్యాసము తార్కికదృష్టిచే

---

౧. బృహదారణ్యకము ౨అ. ౪.౫; ౪అ. ౫.౬. ఉదయనుఁడు తన కుసుమాంజలి ౧అ. ౩లో నుదాహరించిన యొకశ్లోకములో ఆగమానుమాన ధ్యానములు చెప్పఁబడినవి.

నవి. దర్శింపబడిన వస్తువులకుఁ బరిమితి, వ్యక్తిత్వము నున్నంత కాలము, పరమావధిని మనము జేర లేదనియర్థము. పరబ్రహ్మ దర్శనముచేతనే బ్రహ్మత్వసిద్ధి లభించును.

మానవస్వభావ పూర్ణపరివర్తనమునుపనిషన్మతముకోరు చున్నదని స్పష్టమైనది. అదియొకనామమాత్ర విశ్వాసము కాని, నీతిశిక్షణముకాని, పాక్షికమతశాఖకాని కాదు. బుద్ధీతర మైన మానవప్రకృతిరంగముల నుపనిషత్తులు విడిచిపెట్టినవని విమర్శించుట సత్యముకాదు. వివేకస్వభావమునకు, నూహాస్వ భావమునకుఁ గూడ లక్ష్యసిద్ధిఁ జెందుమార్గముల నుపదేశించి నవి. సామాన్యబుద్ధికి మతానుష్ఠానమునఁ గలుగు వెరుధ్యముల నుపనిషత్తులెఱుఁగును. దేవుఁడు పూర్ణకల్యాణ స్వరూపియైన చో, నీతిధర్మము సిద్ధిపొందినట్లే; ఏలన, లోకములో సర్వము నట్టిదేవుని పూర్ణసంకల్పముచేతనే జరుగుచున్నది, దేవునిసృష్టి కర్తగాఁ దీసికొన్నచో, దనపూర్ణత్వమునకు లోపమును గలి గించు దేనినైనను సృజింపవలెను. సృజింపఁబడినలోకము సృష్టి కర్తనుండియే వేఱైనవయి యుండవలెను, లేదా, రెండునొకటే కావలెను; కాని దేవుఁడే లోకమనుట కేమతధర్మముకాని, నీతి ధర్మముకాని యంగీకరింపదు. మతమందు, మానవసంకల్పము, దైవసంకల్పము వేఱుగానున్నవి. రెండు నొకటైనచో నీతికిస్థాన ములేదు; ఏలన స్వతంత్రమైన మానవసంకల్పస్థితియే లేదు. రెండును వేఱైనచో. నపుడు దేవుఁ డపరిపూర్ణుఁడు,పరిచ్ఛిన్నుఁ డునగును; అట్టిదేవునిలో మనకు విశ్వాసముండఁజాలదు. మఱి యు, దేవునికి స్వతంత్రసంకల్పమున్నదందుమా, అప్పుడాతఁడు కర్మను త్రోసిపైచి ఫలమీయవచ్చును; అనఁగా స్వైరవిహారమే

ప్రిధానసత్యమగును. అట్లుకాక, దేవుఁడును గొన్నినియమ ములకు బద్ధుఁడై, మనకర్మలననుసరించి ఫలములనిచ్చు వాఁడై నచో, దేవునిస్వాతంత్ర్యము సన్నగిల్లినది. ఇట్టి భావవైరుధ్య ములు, మనము దేవునిఁగూర్చి యూహింపఁగల అత్యుత్తమ భావము, అత్యుత్తమముగాదని ఋజువుచేయుచున్నవి. మతమీ విధముగా క్రిందిమెట్టుపైనుండి, అసంపూర్ణదైవభావము తోడ నే సంతృప్తిపొంది, యందెన్ని వైరుధ్యములున్నను సహించి యూరకుండవలెను. ఈపరిస్థితిని మనము సమర్థింపవచ్చును. పరమసత్యమును నిర్ణయించుట మతముయొక్క పనికాదు. తత్త్వదృష్టిననుసరించి, యెంతమహోన్నతములైనను, దేవునిగూ ర్చిన భావములు పరిపూర్ణసత్యములుగావని చెప్పఁగొనవచ్చు ను.౧. ఉపనిషత్సిద్ధాంతముయొక్క సారాంశమిదియైనను, ఉపని షత్తులు సాక్షాత్కారముచేఁ జూచిన సత్యదర్శనమును మన మొక శాస్త్రీయసిద్ధాంతముగా మార్చినపుడు దేవునిగూర్చిన మతసిద్ధాంతమసంపూర్ణమైనదని స్పష్టమైన నిర్ణయముగా బయ ల్పడును. మఱియు నుపనిషత్తు లుత్తమాధమ రూపములైన మత విధానముల నంగీకరించును.

ఉపనిషత్తుల అత్యుత్తమమైన మతము నిశ్చయదీక్షతోఁ జేయఁబడిన దైవ ధ్యానము, దైవానుకూల ప్రవర్తనము, దైవా రాధమునైయున్నది. ఇతరమత ప్రాంగణములలో నింకను సం చారముచేయుచున్న సంప్రదాయసిద్ధ హేతుశూన్యసిద్ధాం తములు, దైవశక్తి వైచిత్ర్యప్రదర్శనములు నుపనిషన్మతమును గలుషమొనర్చియుండలేదు. ఉపనిషత్ప్రధానసిద్ధాంతమైన, సర్వ

౧. చూడు. కేనోపనిషత్తు ౧౪.౫.౮

ప్రపంచవ్యాప్తమైయున్న పరమసత్యస్వరూప మేకము నద్వితీయమునను నదియొక పిడివాదముగాఁ బ్రకటింపఁబడియుండలేదు. మానవప్రజ్ఞా సామర్థ్య మూహింపఁగల పరమార్థస్వరూపమది. తత్త్వశాస్త్రప్రకృతి శాస్త్రాభివృద్ధి దానికి విరోధముకాదు. సరికదా దానినే సమర్థించుచున్నది. సర్వసత్యమైన పరమాత్మ యెడ నఖండగౌరవ ప్రేమాతిశయమే ఉపనిషన్మతము. అట్టి ధ్యానము జ్ఞానమయమైనభక్తి. మతానుష్ఠానోన్నదావస్థలో జీవుఁడు దేవుఁడుగలిసి యేకమైపోవుదురు. ఉపనిషన్మతములో సృష్టియొక్క యేకత్వము, పూర్ణత్వము పరమాత్మకృష్ణమైన సత్యము. సామాన్య మతాచరణమునకిది తృప్తికరము గాకపోవచ్చును, అల్పుఁడగు మానవుఁ డనంతమగు పరమాత్మను గ్రహింపఁజాలకపోవచ్చును. సామాన్యుఁడట్టి పరమాత్మను తననుండి వేఱైన యొకదృశ్యముగాఁ దలపోయును. అవ్యక్త నిర్గుణ బ్రహ్మ మొక సగుణదైవమగును. సగుణదైవస్వరూపము పరమసత్యముగాకున్నను, సామాన్య మతదృష్టికది యవసరము. దేవుఁడు మిత్రుఁడు, బంధువు, పిత, సృష్టికర్త, జగత్పాలకుఁడు. ఆతఁడు పురుషోత్తముఁడని చెప్పఁబడెను కాని యాతఁడు లోకమును దూరముగానుండి పాలింపఁడు. పాలించినచో, నప్పుడా దేవునికి లోకమునకు సన్నిహితసంబంధముండదు. ఆతఁడు విశ్వాంతర్యామి. ఆతఁడొక పురుషుఁడైనను, సర్వాతీతుఁడు, సర్వాంతర్యామి, సర్వవ్యాపి, సర్వవస్తువు లాతనియం దాతనిచే నాతనికొఱకేయున్నవి. కాని జాకోబీ పండితుఁడు చెప్పిన ట్లదృశ్యముగానున్న దేవుఁడు దేవుఁడేకాఁడు. మనమనుకొనినవాఁడే దేవుఁడనితలఁచుట దైవద్రోహము. మతదృష్టిలోని దేవుఁడు పరమ

సత్పదార్థముయొక్క అసంపూర్ణ ప్రదర్శనమయినప్పటికి నది యొక కవి కల్పితపదార్థము కాదు. మనయుల్పమైన మనశ్శక్తి, పరమాత్మ జగద్రూపముగా మారినప్పుడున్న మనుజునిచ్చు శక్తి దేవుఁడే. నిర్గుణపరమాత్మ, సగుణుఁడగు దేవుఁడయ్యెను. పరిపూర్ణమైన సత్పదార్థ మసత్పదార్థద్వారముగ మారలేదని పరిపూర్ణత్వమును సాధింపలేదు మన్నదని భావముగా దేవుని మూర్తి ముపనిషత్తు లంగీకరించును. అప్పటిలో దేవుఁడొక సంపూర్ణపదార్థముగను. నిర్గుణబ్రహ్మము సగుణమూర్తియైన దేవుఁడు నొకటేయని యుపనిషత్తుల సిద్ధాంతభావము. ఒకేసత్పదార్థమును, దానియొక్క సుగుణాతీతత్వమును జ్ఞానాతీతత్వమును. సర్వగతత్వమును చెప్పునప్పుడు పూర్ణబ్రహ్మమనియు; నవతారాధనమున కవసరమగు భక్తిభావముతోఁ బాపత్పదార్థమునే సగుణమూర్తియైన యీశ్వరుఁడనియు వర్ణింతుము. రెంటికి సంబంధము, దేవునకుఁ దన్మూర్తియైన ప్రతిమలకుంగల సంబంధము వంటిదే. ౧. నిర్గుణ పరబ్రహ్మమునుగూర్చిన ధ్యానమే, సగుణమూర్తియైన యీశ్వరునియందు గాఢమైన భక్తియగును. అయినప్పటికి రెండునొకటే. పరమాత్మ నిర్గుణుఁడు సగుణుఁడుకూడ నైయున్నాఁడు. ౨. మానవుఁడు దేవుఁడు తనకతీతుఁడైయున్నాఁడనియు నాతనికృపయే కావలసినదనియునమ్మును. మానవుని జన్మబంధవిముక్తికి దేవునిప్రసాద మవసరము, "ఈ యాత్మ, వేదాభ్యాసముచేఁగాని, మేధశ్శక్తిచేఁగాని, పాండిత్యబలముచేఁగాని లభింపదు. దాని నెవఁడు గాఢముగాఁ గోరునో

౧. తైత్తిరీయము ౧౹౬ శంకరభాష్యము, "సాలగ్రామ ఇవ విష్ణోః"
౨. మూర్తామూర్తము. తైత్తిరీయము ౧౹౬; శంకరభాష్యము.

వాఁడు పొందును. ఆత్మయుఁదనస్వస్వరూపము నాతనికిఁ గటా క్షించును." 3. కొన్నివేళలం దనుభవావేశ మతిశయించి నపుడు భక్తుఁ డిట్లుపల్కెను: "ఈశ్వరుఁ డూర్ధ్వలోకము లెవ్వరి కీయఁదలంచునో వానిచేఁ బుణ్యకర్మలుచేయించును;ఎవ్వని నధో లోకమీయఁదలఁచెనో యాతనిచేఁ బాపకర్మలుచేయించును."౪ మానవేశ్వరైక్యభావము చిరకాలశిక్షణముచేఁగాని లభింపదు. మతానుభవలక్ష్యము సిద్ధించినవెనుక, వ్యక్తిగతాభిప్రాయము మాఱిపోవును. మతానుభవక్రమ వికాసమందినకొలఁది, భక్తునికి దేవునికి భేదము క్రమముగాఁ దొలఁగిపోయి, తుదకిరువురొకటై యైపోదురు. అప్పుడు సంప్రదాయము ననుసరించిన ప్రార్థన మేమియునుండదు. పరమాత్మ బ్రహ్మాండమునంతయు నావ రించి, మహాప్రవాహరూపమునఁ దనయందుఁ బ్రవేశించినట్లు గోచరించును. మనపరిమితములైన హద్దులు తెగిపోయి, మానవ సహజమైన లోపములన్నియు నదృశ్యములగును. మతానుభవ సిద్ధియనఁగా మతము నతిక్రమించుట, ఆదర్శ ప్రాయమైన మతము, ద్వైతముతో నారంభించి, యద్వైతముతో నంతమం దును. మతారాధనము దైవభీతితో నారంభించి, భక్తిగా మాఱి, తరువాతఁ బరిశుద్ధప్రేమయై దేవునితో నైక్యభావముద యించి, సమాధ్యవస్థలో జీవదేవు లేకత్వములో లయమై పోదురు. అట్టిసిద్ధావస్థ ప్రాప్తించువఱకు మతారాధన మంగీక రింపకతప్పదు.

అసమగ్రములగు నారాధనవిధానములు సమగ్రారా ధనమునకు సాధనరూపములుగా నంగీకరింపఁబడినవి. తమకాల

3. ముండకము 3అ ౨.3; కఠము. ౨అ ౨3 (౪) కౌషీతకి ౪అ

మున వ్యాప్తిలోనున్న పరస్పరవిరుద్ధ మతారాధన విధానము లన్నిటికిఁ దగినస్థానమీయఁగోరి, యుపనిషత్తులు తమసామ రస్యభావములోఁ గొంత యసామంజస్యమును గూడఁ బ్రద ర్శించినవి. కొందఱద్భుత ప్రదర్శనములందు విశ్వసించిరి; ఏకా గ్రత, తపస్సు మున్నగు పద్ధతులచేఁ బ్రకృతిశక్తులను లొంగఁ దీసి స్వాధీనమొనర్చుకొనుట కొందఱియభిప్రాయమయ్యెను; కొందఱు కేవల బాహ్యకర్మకలాపమగ్నులైరి; కొందఱు వైదిక దేవతోపాసకులైరి; కొలఁదిమంది లోకబంధములనుండి ముక్తిని సంపాదించుటకు జ్ఞానమే సాధనమని తలఁచిరి. సర్వవస్తువులందు సర్వకాలములందు, సర్వదేశములందు నెల్లప్పుడు నిత్యుఁడై యున్న దేవుని, సామాన్యమానవుఁడొక వస్తువునందు, నొకకా లమునందు నొకప్రదేశమందు మాత్రమే చూడ శక్తిగలవాఁ డగుటచే ప్రాకృతప్రజాకోటియొక్క దైవారాధన విధానము లలో లోపములున్నవని, మానవసహజమైన హృదయదౌర్బ ల్యమును గణింపక, నిరసించినచోఁ, బ్రజాజీవితములో దైవా రాధన మసలే లేకుండఁబోవు సంకటస్థితి యేర్పడుట కవకాశ మున్నదని యెఱిఁగిన మహనీయులగు నుపనిషణ్మహర్షులు సకల మతారాధనములకుఁ దత్తదుచిత స్థానములనిచ్చి యంగీకరిం చిరి. అసలు లేకపోవుటకంటె నేదోయొక విధమైన దైవారా ధనము మంచిది; అందుచే నేరూపమున దేవునుపాసించిన నట్టి ఫలితము లభించునని చెప్పఁబడెను. "బ్రహ్మమును బోషకుఁ డుగా నారాధించినచోఁ బోషణము లభించును; బ్రహ్మమును మహత్పదార్థముగా నారాధించిన మహత్త్వమబ్బును, బ్రహ్మ మును మనశ్శక్తిగా ధ్యానించిన, మనశ్శక్తి లభించును; బ్రహ్మ

మును బ్రహ్మపదార్థముగా ధ్యానించిన బ్రహ్మత్వమే ప్రాప్తించును."౧. భిన్న మానవులకు దేవుఁడు భిన్న రూపములలో దర్శనమిచ్చును. ఇది భగవదవతార వాదముగాదు; ఏలన నీవాదముపనిషత్తులలోఁ జెప్పఁబడి యుండలేదు. నిర్గుణబ్రహ్మోపాసన ముత్తమమతవిధాన మని యుపనిషత్తులు నిర్వచించి యున్నవి. దాని తరువాత నుత్తమమైనది సర్వాంతర్యామియైన యేకేశ్వరునియెడ సమగ్రభక్తి తత్పరత్వము; వైదిక దేవతలను, తదితర దేవతల నుపాసించు టధమమైన మతవిధానము.

ఉపనిషత్తులెట్టి మతోపాసనమును బోధింపవని విమర్శింపఁబడినవి. డాక్టరు అర్కుహార్టు పండితుఁడిట్లు వాక్రుచ్చినాఁడు "నిజమైన దైవారాధన విధానము స్పష్టముగాఁ జెప్పఁబడినను, నిత్యముఁ గొన్ని వేళల నొకశ్లోకమున నుద్ఘాటింపఁబడిన భావమింకొకటి యున్నది. ఉపాస్యమైనయాత్మ, ఉపాసకునియాత్మయు నొకటేయనియు, మానవునికి దేవునికి భేదము లేదనియుఁ జెప్పఁబడినది. కాని యీభేదమే ఆస్తికమతారాధనమునకుఁ బూర్తిగా నవసరము''౧. మానవేశ్వరైకత్వము సత్యమని ఉపనిషత్తులుద్ఘాటించిన మాటసత్యమే. క్రిందిమెట్టులో దైవమానవులకు మనము చూచు భేదము పైమెట్టులో నేకత్వమున నదృశ్యమైనది. "మానవుఁడింకొక దేవత నుపాసించి, తాను దేవుఁడువేఱని భావించినచో నాతఁడజ్ఞుఁడే." ౨. బ్రహ్మ

---

౧. తైత్తిరీయము. ౩అ. ౧౦; చూ. ఛాందోగ్యము ౧అ. ౩-౧౨; బృహదారణ్యకము ౧అ. ౨.౧౩

౧. ది ఉపనిషత్సు అండు లైఫ్ పుట. ౬౦

౨. బృహదారణ్యకము ౧అ. ౪.౧౦

కత్వ మనుపనిషత్తుల పరిణామసిద్ధాంతము; ద్వైతాంతర్యామిత్వము నేఁ (ప్రసిద్ధాంతము. ఇవి నిజముగ మతారాధనమునకు విరుద్ధమైన వా?. నిజమైన మతమున ద్వైతారాధనమునకు స్థానము లేదనియర్థము, ఏలన దేవుని సర్వాంతర్యామిత్వమును నిజముగ ద్వైతారాధన మంగీకరింపక తప్పదు. సత్యమైనమతము, పరిచ్ఛిన్న వస్తువులు స్వయంభూతములు కాని, స్వయంపోషకములు కాని కావనియు దేవుఁడు నిమిత్తకర్తయై, కారణుఁడై, అంతర్యామియై. సర్వాధారము, మూలము, పరమావధియునై యున్నాఁడని యుపదేశించుచున్నది. "నేను స్వర్గమున కేగినచో నీవచ్చటనున్నావు; నరకమున నేను నివసించుచో నాచ్ఛన్నముగా నీవు నచట నున్నావు. నే నుదయమునె రెక్కలుకట్టుకొని. దూరతమసాగర సీమల కేగిపోయినచో నచటను నీహస్తము నాకు బలమిచ్చినది"౩. "నేను దగ్గఱనున్న దేవుఁడనా లేక దూరమున లేనా? యని దేవుఁడు పలికినాఁడు. నేను జూడని రహస్యప్రదేశముల నెవఁడైన దాగుకొనఁగలఁడా? యని దేవుఁడడుగును; ఈలోకము నితరలోకమును నేనాక్రమించి యుండలేదా" మనము దేవునియందుండి, చరించుచు. జీవించుచున్నాము"౧. మఱియు "నెవఁడు ప్రేమమయుఁడో వాఁడు దేవునియందు, దేవుఁడు వానియందు నివసించును"౨. నిజమైన మతము సర్వాంతర్యామిత్వము నంగీకరించి, నిగూఢయోగవిద్యయై పరిణమించును.

(౩) సామ్ ౧౩౯. ౮. సెయింటుపాల్.

(౧) సెయింటుజాన్. (౨) ముండకము ౩అ. ౨-౮ మాండూక్యప్రశ్న ౬౨.౫.

## ౧౭—మోక్షము.

ఉత్తమమతానుభవసిద్ధి, పరమపురుషునితో సాయుజ్యము, శూన్యప్రవేశమగునా? ఈసిద్ధావస్థలోఁ బ్రత్యేకవ్యక్తిత్వము శిథిలమై, స్వార్థపూరితాహంభావము నశించిపోవునని యుపనిషత్తుల నిశ్చయభావమే కాని యది శూన్యముకాని మరణముకానికాదు. "ప్రవహించుచున్న నదులు సాగరమునఁ బ్రవేశించి తమ నామరూపములను గోల్పోవునట్లు, జ్ఞానియైన వాఁడు తన నామరూపములను నుజ్జగించి, సర్వాతీతుఁడైన దైవమునందుఁ బ్రవేశింతురు."3. అజ్ఞానములోనున్న మానవుని స్వతంత్రవ్యక్తిత్వము నుపనిషత్తు లంగీకరింపవు. తమస్వీయ సిద్ధికై ప్రార్థించువారు, తమ ప్రత్యేకవ్యక్తిత్వము, ప్రళయానంతరము కూడ నుండునని నమ్ముదురు. అనిత్యజీవితములో నిత్యమైనది, వ్యక్తిస్వభావములో నుత్తమమైనదియు ననంతమైనసత్పదార్థము; ఇది శరీరము నశించినవెనుక నిత్యమై యుండునది. నిత్యమైన విలువగల దెన్నఁడు నశింపదు. ఈజీవితములో నెట్టి పరమార్థమునఁగోరి, దాని నసంపూర్ణముగా సంపాదింతుమో 'యట్టి' పరమార్థము పరమాత్మయందు సంపూర్ణముగాఁ బొందఁగలము. మనుష్యమాత్రులముగా మనము, మనలక్ష్యముల నరుదుగాఁ గొన్ని వేళలందు మాత్రమే కిరణమాత్రముగా దర్శింపఁగలము. సిద్ధావస్థలో దానిని సంపూర్ణముగా నవిచ్ఛిన్నముగాఁ బొందఁగలుగుదుము. మన మీలోకమునఁ బొందు నానందము శాశ్వతానందముయొక్క ఛాయామాత్రమెట్లో తైత్తిరీయోపనిషత్తు పలుకుచున్నది. ౧. అనంతశ్రమకోర్చి, సంసార

౧. తైత్తిరీయము ౨అ. ౮: కౌషీతకి ౧.అ. 3-౧౯; బృహదారణ్యకము ౪అ.3.33

సాగరమును తరించి, నునము జేరఁబోవున దాకఁటిచిచ్చున కగ్గ
మై మరణించు నెడారికాఁజాలదు. మోక్షస్థితి జీవితపరిపూర్ణ
త్వము లభించుస్థితియని గ్రహింపవలెను. పరబ్రహ్మముశూన్య
స్థితియైనచో, జీవబంధములనుండి విముక్తులమై యట్టి శూన్య
మునఁ బ్రవేశింతుమని చెప్పవచ్చును. అప్పుడు మానవుఁడు
పోవుపరమావధి వినాశమే. అట్టి నిర్ణయము నుపనిషత్తు లంగీక
రింపవు. సిద్ధావస్థలోఁ దాదాత్మ్యము, నమృతానందములభించి,
జీవుని జీవత్వము నశించి, దేవునితో నేకత్వము ప్రాప్తించును.
ఈసిద్ధావస్థయొక్క స్వరూపము వర్ణనాతీతము. దానిని సూచిం
చుటకు మాత్రమే వీలగును. అది పూర్ణానందస్వరూపము;
ఆత్మపెరిగి పరమాత్మగా మారిన దివ్యపదము; ఇహాపరము
లేకమై ప్రవహించు పుణ్యతీర్థము. అనుభవైక వేద్యమగు బ్ర
హ్మానందస్థితి నుపమాద్యలంకారములచేఁ జెప్పనగునే కాని
ప్రత్యక్షముగా వర్ణించుట సాధ్యముకాదు. మనజీవితములో
నట్టియవస్థలు కొన్ని బ్రహ్మానందస్థితి కుదాహరణములుగా
సూచింపఁదగును. బేరన్ వాన్ హ్యూజెల్ సమాధ్యవస్థనుగూర్చి
చెప్పుచు, "ఏకాగ్రతయొక్క నైశిత్యము ననుసరించి, సమాధి
గతుఁడైనవ్యక్తి కాయవస్థలోఁ గాలగతియుండదు;అనఁగా నిత్యా
త్వము గోచరించును. ఇచట ఆత్మనిత్యత్వము దేవుని లక్షణ
మూలాత్మకుఁ గలుగునను సమానత్వభావముచే నూహింపఁబడి
నదికాదు; సమాధిగతుఁడైన యావ్యక్తి కాలాతీత శాశ్వతత్వము
ను గుర్తించుటచే స్వీయనిత్యత్వమును గ్రహించును. అమృతత్వ
ము చనిపోవుముందర లభింపదు;కాని శాశ్వతత్వము దెలియును.
'నిత్యవర్తమాన' మైన పరిస్థితిలో శాశ్వతత్వ మనుభవింపఁ

బడును. అట్టి యనుభవమునకుఁ బూర్వమూహింపఁబడిన ఆత్మ యొక్క అమర్త్యత్వ మీయనుభవావస్థలో స్పష్టమై గోచరించును."౧. ఒక గాన మాధుర్యము ననుభవించుటలో, నొక చిత్రలేఖనమునుగూర్చి కలిగిన తన్మయత్వములో, నొకవాదములోని పూర్ణసారాంశము నవగాహనము చేసికొనుటలో, మనము యోగసిద్ధి తుల్యావస్థలోనుండి, దైవదర్శనము, దేశకాలాతీతస్థితినిఁ జవిచూతుము.౧. పరమాత్మను భవదృష్టిలో ననిత్యవస్తువుల మూలస్థితి నిత్యమైనదని తెలియుటచే, వాని నిజమైన విలువ నిర్ణయింపవీలగును.

మానవ స్వభావదృష్టినుండి, పూర్ణబ్రహ్మానుభవస్థితి వర్ణనాతీతమగుటచే దానిని వర్ణింపఁబూనుట సాధ్యమైనపనికాదు.

---

౧. ఇటర్నల్ లైఫ్ పుట ౨౭

౧. సెయింటు ఆగస్టైన్ తన కన్ఫెషన్సులో నిట్లుచెప్పెను: "మన దేహసంబంధవ్యాపారమంతయు నాగిపోయి, భూమ్యాకాశ సముద్రాది రూపములన్నియు నదృశ్యములై, బ్రహ్మాండమంతయుఁ బ్రశాంతమై, మన జీవాత్మ యునిశ్శబ్దమై, సర్వభావాతీతస్థితికిఁబోయి, యీలోకమునకు సంబంధించిన యాలోచనములుఁ భావములు, చిహ్నములు, శబ్దములు నన్నియు సమసిపోయి యున్న యాస్థితి నూహింపుఁడు. అప్పుడాస్థితిలో నాజీవిపలికెడు పలుకులు వినఁగలవాడిట్లు వినును: "మాకుఁగర్తలము మేముగాదు; నిత్యుఁడైన పరమేశ్వరుఁడు మాకర్త"యని తిరిగిమౌనమువహించి, దేవునిమాటలే వినుమని దేవుని మనకుఁ జూపినపుడు, శరీరముకాని, వాక్కుగాని, రూపముగాని లేనిచోటనుండి దైవవాణివినఁబడును. అప్పుడుమనము, మనవ్యక్తిత్వము నుండి బయల్పడి, దివ్యజ్ఞానజ్యోతిచే స్ఫురించిన నిత్యసత్యమైన దైవమూర్తిని దర్శింతుము; అట్టి దైవసాక్షాత్కారము మనకెల్లపుడుండి, యేయితర రూపములు గోచరింపక, నిత్యానంద సమాధిగ్రస్తులమైయుండెడి యాస్థితినే "దేవుని యానందరాజ్యములోఁ బ్రవేశింపుము"ను వాక్యములో వర్ణింపఁబడినది."

అందుచే నుపనిషత్తులు స్పష్టమైనభాషలో నాస్థితిని వర్ణించి యుండ లేదు.

ఉపనిషత్తులలో రెండు పరస్పరవిరుద్ధములైన వర్ణనము లీయఁబడినవి; దేవునితో సమానమైనస్థితిగా నొకటియు, దేవునితో నైక్యస్థితి రెండవదియు నైయున్నది.

జీవాత్మ పరమాత్మలోఁగలిసి యేకమగునని చెప్పిన కొన్ని వాక్యములుగలవు. "ప్రణవము ధనుస్సు; ఆత్మ, బాణము; బ్రహ్మము లక్ష్యము. జితేంద్రియుఁడైన సాధకుఁడు లక్ష్యమును గొట్టవలెను. లక్ష్యమునుకొట్టు నాతఁడు, బాణము లక్ష్యమునందు గ్రుచ్చుకొనిపోయి నిలిచినట్లే, బ్రహ్మమునందు మగ్నుఁడై బ్రహ్మమైపోవును." ౨. జీవాత్మయే బ్రహ్మమగును. ౩. ఇచట జీవబ్రహ్మైకత్వ ముపపాదింపబడెను. "ఇవన్నియు నమర్త్యమై పరిపూర్ణమైన బ్రహ్మమునందు లయమై యేకమైపోవును." ౪. "అవినాశమై, పరమోత్కృష్టమైన బ్రహ్మమునం దాతఁడు కలిసి యేకమగును." ౫. "వాఁడు సర్వజ్ఞుఁడు, సర్వస్వరూపి యగును." ౧. "వాఁడు సర్వమునందుఁ బ్రవేశించును." ౨. ముక్తజీవి యాత్మ సర్వవస్తువులయందుఁ బ్రవేశించి, సర్వవస్తువులతోఁ దాదాత్మ్యమును బొందును. "బ్రహ్మసాక్షాత్కారమును బొంది, తాము గనిన జ్ఞానముతోఁ దృప్తిఁగాంచి, తమమనోరథము సఫలమై, వాంఛాతీతులై,

౨. ముండకము౨అ ౧౫ (౩) శరవత్తన్మ
౪. ముండకము ౩అ ౨. ౭. (౫) ప్రశ్న ౪అ ౯.

౧. ప్రశ్న ౪అ ౧౦. ససర్వజ్ఞస్సర్వోభవతి.
౨. ప్రశ్న ౧అ; ౭అ సర్వమేవావిశన్తి.

పూర్ణశాంతిగలిగి, సర్వదిశలందు సర్వవ్యాపియైయున్న పరమాత్మను దర్శించి, నిత్య నిశ్చలసమాధిలోనుండి, సర్వమునందుఁ బ్రవేశింతురు.'' ౩. సర్వవ్యాపియై, సర్వాంతర్యామియై సర్వసృష్టినిఁ దనయందు క్షేమముగా ధరించినపరమాత్మ నెఱిఁగిన సిద్ధుల కేవిధమైన క్లేశముగాని దుఃఖముగాని యుండదు. "వేదాంతవిజ్ఞాన సుస్థిరరహస్యమును నిస్సంశయముగా నెఱిఁగిన సిద్ధపురుషులు, సర్వసంగత్యాగముచే శుద్ధాత్ములై బ్రహ్మలోకములనుబొంది, తమ దేహపతనానంతరము' వారియాత్మయే పరబ్రహ్మమగుటచే బ్రహ్మైక్యమును గాంతురు." ౪. మోక్షసిద్ధిగాంచిన మునులు తమ యేకత్వము నతిగాఢానుభవముగాఁ గాంచి, తామే బ్రహ్మమని చెప్పుటకు సంశయింపరు; ''నేనే అన్నము. అన్నభోక్తను నేనే, నేనే ద్రష్టను; దృశ్యమును నేనే, రెండు నేకమైన రూపమును నేనే, ప్రథమజుఁడను నేనే; సృష్టిలయ కారుఁడను నేనే; సూర్యతేజమువంటి తేజోరూపుఁడను నేనే. సృష్టి, దేవతలకుఁ గేంద్రము నేనే."౫. ఈవాక్యములవలన, ద్వైవేతరవ్యక్తిత్వ మింకొకటి లేదనియు నందుచే నాస్థితినిఁబొందిన వెనుకసిద్ధుఁడేకర్మయుఁ జేయనవసరము లేదనియుఁ దెలియుచున్నది. ఈస్థితి, మరణించినవెనుక మఱలఁ బ్రతుకుటవంటిది; కాని యిప్పు డెఱుక లేదు; దేహము లేదు; మనస్సు నశించినది. అంతయు నంధకారమే, మనకునచ్చినచో నీస్థితిని, కలలేని గాఢనిద్రయనియు, వివేకములేని శాంతియనియుఁ

౩. ముండకము ౩అ ౨. ౫.

౪. ముండకము ౩అ ౨. ౬.

౫. తైత్తిరీయము ౩అ

చెప్పుకొనవచ్చును. "ఒక యుప్పుపలుకును నీటిలోఁబడ వేసి నపుడది యందుఁ గలిసిపోయి, తిరిగి తీయుటకెట్లు సాధ్యము కాదో; కాని యానీటిలోనే ప్రక్కఁ గొంతయుదకమునుదీసి రుచిచూచిన నుప్పగానేయుండునో, అదేవిధముగా నీపరమాత్మ అనంతము, నవిచ్ఛిన్నము, పూర్ణజ్ఞానమునై, యీజీవుల దృష్టిలో గోచరించి, వారిలో నదృశ్యమగును. మరణానంతరము తెలివిలేద"ని మైత్రేయితో యాజ్ఞవల్క్యుఁడు పలికినపుడు, మైత్రేయి యిట్లుచెప్పినది: "మరణానంతరము తెలివిలేదని నీవు చెప్పినవాక్యము నాకర్థము గాలేదు." యాజ్ఞవల్క్యుఁడు జవాబిచ్చెను: "నే చెప్పినదానిలో సంశయమేమియును లేదు. ఎచట ద్వైతమున్నదో, అచట నొకనినొకఁడు చూచును; ఆఘ్రాణించును; మాటాడును; వినును; ఆలోచించును; గ్రహించును. కాని, అంతయునొకే ఆత్మస్వరూపమైనపుడు, ఎవని నెవఁడు చూచును?; ఆఘ్రాణించును? మాటాడును? వినును? ఆలోచించును? గ్రహించును? ఎవనిద్వారమున నీ విశ్వము నెఱుఁగుచున్నామో యాతని నెఱుఁగుటెట్లు? ఎఱుకయే తానైన వాని నెవఁడెట్లెఱుఁగుట? దీనినిఁబట్టి మానవబుద్ధి కగమ్యమైన యేదోయొకవిధమున ఆత్మమోక్షమును బొందును. అచటఁ గర్మకాని, చూపుకాని, ఊహకాని, తెలివికాని యేదియు నుండదు. ఏలన నివన్నియు ద్వైతదృష్టి సంబంధములైనవి మాత్రమే. ఇవి విషయ విషయీ భేదములపై నాధారపడియున్నవి. పూర్ణ నిర్గుణస్థితిలో నీద్వైతములన్నియు నదృశ్యములై, తత్సంబంధ క్రియాదర్శనములు మటుమాయమైపోవును. అప్పుడెందు ధ్వనులన్నియు శాంతించి, రంగులన్నియు రూపుమాసి, క్రియా

లన్నియు నుపశమించునో యట్టి నిత్యనిరామయ పూర్ణస్వరూప
మొక్కటియే మిగులును. ఇది వాగతీతమైనదానిని మన యల్ప
బుద్ధిచేఁ జెప్పికొనినవిధానము. వచోఽతీతమైనను నిజమగుస్థితి
వేఱుగానున్నది. దానినిమన మల్పశక్తులమై గ్రహింపఁజాలనంత
మాత్రమున నది శూన్యముకాదు. ఆస్థితిలో జీవి సర్వభేదము
లను దొలఁగి, యనిర్వచనీయమైనదేదో యగును. పైకి నిర్వ్యా
పారులుగా నిద్రించుచున్నట్లు కనఁబడు నీ సిద్ధపురుషులు నిజ
ముగా మహోన్నతక్రియా పరతంత్రులై యుండవచ్చును.
ముక్తపురుషుఁడున్న స్వస్థితిని వర్ణించుచో, నాతఁడు పరిపూ
ర్ణుఁడై, పరబ్రహ్మముతో సమానమైన పదవిని బొంది యున్నాఁ
డని చెప్పవచ్చును. ౧. సిద్ధిపొందిన బ్రహ్మర్షి సర్వలోకము
లందు స్వేచ్ఛగా విహరించుచు, సర్వకామములను బొంది,
యానందించునని చెప్పినవాక్యముల ననుసరించి, యచట నాతఁ
డింకను క్రియాపరతంత్రుఁడై యున్నాఁడని తెలియఁగలదు. "ఈ
లోకములందు విహరించుచు, దనకిచ్చవచ్చిన యాహారమును
దినుచు, నచ్చినరూపమును గైకొనుచు, సామగానముచేయుచుఁ
గూర్చుండును." ౨. మఱియుఁ దాను దేవుఁడే యనుభావ ముం
డును. ఛాందోగ్యము ననుసరించి, మోక్షమనఁగా, దైవసామీప్య
మును బొందుట. ౧. ముండకము ననుసరించి, దైవసాహచర్య
ము. ౨. దేవునితోఁ బూర్ణసమత్వమును జెప్పఁబడినది. 3. అట్టి

౧ పరమమ్ సామ్యముపైతి. ముండకము 3అ ౧. 3
౨. తైత్తిరీయము 3అ ౧౦, ౮.

౧. ఛాందోగ్యము ౨అ. ౨౨. (౨) ముండకము. 3అ ౨.౬
(3) ముండకము 3అ. ౧-3

ముక్తునికిఁ గర్తృత్వమును మిగుల్చుటకై, సమత్వమే చెప్పఁబడెను. సిద్ధావస్థనుగూర్చి భిన్నాభిప్రాయము లెట్లున్నను, నాయవస్థలో నాత్మసంపూర్ణ క్రియాస్వాతంత్ర్యమును గలిగియున్నదను విషయము స్పష్టమైనది. నిజముగా నాస్థితి వాగతీతము; కాని వాక్కు కందినట్లు చెప్పికొనవలసినచో నది పూర్ణదైవ జీవితమని యనవచ్చును. ఆత్మ యచట నశింపలేదు; సూర్యునిలోఁ గిరణమెట్లున్నదో, సముద్రములో జలబిందువెట్లున్నదో గానములో స్వరమెట్లున్నదో అట్లాత్మ బ్రహ్మమందున్నది. విశ్వప్రణవనాదములో జీవాత్మనాదము కలిసియున్నది. అది విశ్వప్రణవము, ప్రత్యేకస్వరము కూడనైయున్నది. ముక్తజీవి, సర్వమునందుఁ బ్రవేశించి, సర్వస్వరూపమై, బ్రహ్మైక్యముఁ గాంచునని చెప్పఁబడినది. ముక్తజీవి యిట్టిస్థితినిగాంచినను, తన ప్రత్యేకవ్యక్తిత్వమును దాను విశ్వసింపని విధమున, లోకకల్యాణమునకై, క్రియాసమర్థుఁడై సంచరింపఁగలఁడని తోఁచును. బ్రహ్మానందానుభవసిద్ధి కిట్టి పూర్ణవ్యక్తిత్వము నిలిచియుండుటవసరము. ఇట్టి స్థితిలోనుండి, కర్మప్రవరుఁడై యుండియుఁ దన బ్రహ్మజ్ఞానముయొక్క మహత్తరౌన్నత్యమును గుర్తించియే యుండును. ప్రపంచమను నీనాటకమునకు సూత్రధారియై దేవుఁడెట్లు సర్వకర్తయైయున్నాఁడో యాతఁడు సాక్షియై తిలకించును. తన కుచితమైన పాత్రను దానును వహించి, ముక్తపురుషుఁడు జ్ఞానపూర్ణుఁడై సంచరించును. సర్వము నాతని యిచ్ఛ కనుకూలముగాఁ బ్రవర్తించును. "వాయువు నగ్ని యాతని బంటులై యాతని యాజ్ఞలననుసరింతురు. ఈస్థితిఁగూర్చిన తాత్త్వికభావ సామరస్యమును మనము ముందుగ్రంథములోఁజూచెదము.

జీవించియుండఁగనే, 'అహం' కారమును వర్జించి, ముక్తసంగుఁడై యుండుట కవకాశమున్నది. అట్టివానినే జీవన్ముక్తుఁడందురు. ఆతని బ్రహ్మానందానుభవశక్తి యాతనికిఁ బూర్ణస్వాతంత్రకర్తృత్వాధికారము నొసఁగును.

అస్పష్టములైన ఉపనిషత్సిద్ధాంతముల వలన నొకే వాక్యములనుండి భిన్నతత్త్వములు బయలుదేఱినవి. ఉపనిషత్తులుచెప్పిన బ్రహ్మాత్మస్థితి కేవల శూన్యమని కొందఱు బౌద్ధులును; పూర్ణబ్రహ్మైక్యమే యగునని కొందఱు వేదాంతులును జెప్పిరి. మఱియు నితరులు కొందఱది నిత్యశుద్ధ ముక్తజ్ఞాన ప్రేమానందమయమైన వ్యక్తిత్వమనియు నాశనముకాదనియుఁ జెప్పిరి. భక్తకవి వరేణ్యుని గీతమిది; "నేను పంచదారతిని యనుభవించెదనుగాని, పంచదారనైపోవుట కిచ్ఛగింపను." శైవ వైష్ణవమతప్రవక్తలీయభిప్రాయమును స్వీకరించిరి. కాని భారతీయతత్త్వవేత్తలందఱు మోక్షమనఁగా జన్మ మరణ రాహిత్యమని యేకగ్రీవముగా నంగీకరించిరి. నిత్యత్వమనఁగా దేవునిలో నేకమగుటయే. నిత్యత్వమును వ్యవహారభాషలో వర్ణించినచోఁ బుట్టుట గిట్టుటలేని స్థితియని చెప్పనగును.

౧౮—పాపము—దుఃఖానుభవము.

అద్వైతతత్త్వము లన్నిటికిఁ బాపసమస్య లేక దౌష్ట్యసమస్య కఠినమైన యాటంకమై నిలచును. అసత్పదార్థ మెట్లువచ్చినదను తాత్త్వికసమస్య నిదివఱకే చర్చించియుంటిమి. ఇప్పుడు మన మధర్మ దోషసమస్యాపరిష్కార మొనర్పవలసియున్నది. వేద మంత్రములలో, వేదోక్తప్రవర్తనము ధర్మము, తద్విరుద్ధ మధర్మముగాఁ బరిగణింపఁబడెను. ఉపనిషత్తులలోఁ బునరావృత్తి

రహిత శాశ్వతజీవితజ్ఞానము నెఱుఁగుట ధర్మము, తదజ్ఞాన మధర్మముగా నెంచఁబడెను. అనఁగా నజ్ఞానదృష్టికలిగి, తాను బరమాత్మనుండి వేఱనుభావములోఁ బ్రవర్తించుటయే అవినీతి. ఉపషత్తులననుసరించి లోకములోని సర్వవస్తువులను దేవునిమందిరమును జూపుబాటలుగా స్వీకరింప నర్హములు. అట్లుకాక వస్తుజాలము నిజస్థితిని గలిగి, స్వతంత్రముగా నున్నదనియు, మనము ప్రత్యేకవ్యక్తులమనియుఁ దలఁచుటయే అవినీతికరమైన పాపము. పూర్ణవస్తువులైన బ్రహ్మమును గుర్తింపక, తానే స్వయంసంపూర్ణుఁడనని తలఁచుట యేదోషము;తలఁచుట యేకాక అట్లు నడచుటయే పాపము. పాప మల్పజ్ఞానమునుండి జనించి, స్వార్థమైన 'అహం'కారమును బెంపొందించి, తన యల్పత్వమే ఘనమైనదని తలఁచి, త్యాగమునకువెఱచుస్వభావము గలది; దోష్యము 'మాయ' యనికాని, శాశ్వతమైనదనికాని ఉపనిషత్తులు చెప్పియుండలేదు. ఈరెంటిలో నేదినిజమైనను, మానవుఁడు దానికి లొంగియుండవలసివచ్చును. దోష్యము, సద్రూపమును బొందుట కవకాశమున్నది. కావున, నసత్యమని చెప్పఁబడినది; దానికి రూపపరివర్తనము కలిగించువఱకుఁ జేయవలసిన కృషియున్నంతకాల మదియుండును. కనుకనది నిజమైనదే.

దేవునికంటెఁ దనయాత్మ నధికమని తలఁచుటే పాపము; దేవుఁడే తనకు జ్ఞానదాత యని తెలియుటే పుణ్యము.మానవుఁడు శాశ్వతముగా పాపమొనర్పఁజాలఁడు.వస్తుస్వభావమునకు విరుద్ధమైన చంచలస్థితిలోనే పాపము నాతఁడుచేయును. ఉపనిషత్తులననుసరించి, ధర్మమనఁగా,వస్తువుల సత్యస్వరూపజ్ఞానము.తుదకు నిలుచునది యోగ్యతయే. "సత్యమే జయించును; అసత్యము

కాదు." ౧. అసత్యము శూన్యమైనది, ఆత్మవిరుద్ధమైనది, నాశన స్వభావముగలది. అఖండభోగైశ్వర్యములతో యంత్రసంపత్తితోఁగూడిన అభినవప్రపంచములోనున్న క్లేశకరమైన అశాంతి పాప మందలకుఁ దృప్తినిచ్చునదికాదని స్పష్టముచేయుచున్నది.

బ్రహ్మాత్మసిద్ధి చేకూరుట సులభసాధ్యముకాదని చెప్పు వాక్యములు విశేషముగానున్నవి. "ఎవనిసంగతి చాలమంది విననైనఁజాలకుండిరో, వినినవారిలోనైనను జాలమంది విన్నదాని యర్థమును గ్రహింపకుండిరో, ఆత్మస్వరూపుఁడైన యట్టి పరమేశ్వరునిఁగూర్చి చెప్పువాఁడు లభించు టాశ్చర్యకరము; చెప్పిన దానినర్థము చేసికొను వాఁ డుండుటయు నాశ్చర్యకరమే." ౨. మోక్షమార్గము, "నిశితాసిధారవంటిది; దుర్గమము, దురత్యయము." ౩. ఆత్మసాక్షాత్కారము మృదువైన పద్ధతియుఁ గాదు, అడ్డులేని వికాసమునుగాదు. పూర్ణత్వమునకు మార్గము శ్రమాన్విత దుఃఖానుభవముతోఁ గూడినది. కఠినములైన యినుపముక్కలను గట్టి దెబ్బలఁగొట్టినఁగాని నిప్పునెరసులు బైటికిరావు. గ్రుడ్డునందున్న పక్షిబిడ్డ, బాహ్యముననున్న వాయుకాంతి వాతావరణమును జూడఁగల్గుటకు గ్రుడ్డునుండి భేదించుకొనినచ్చు శ్రమను బొందుటతప్పదు. నీతిబద్ధ ప్రవర్తనము స్వభావవిరుద్ధముగా గోచరించును. సుఖమునిచ్చునది శ్రేయస్సునిచ్చునది యెల్లప్పుడు కలిసియుండవు. "శ్రేయమిచ్చునది వేఱు; ప్రియమైనది వేఱు. ఈ రెంటికిని భిన్న ఫలితములుగలిగి మానవుని బంధించుచున్నవి. శ్రేయస్కరి

౧. ముండకము ౩అ. ౧. ౬. (౨) కఠము ౧అ. ౨. ౭; భగవద్గీత ౨అ. ౨౯. (౩) కఠము ౧అ. ౩. ౧౪.

మైన దానిని గ్రహించువాఁడు యోగ్యుఁడు; ప్రియమైన దానిని గ్రహించు నాతఁడు పరమార్థమును బోఁగొట్టుకొనుచున్నాఁడు.” ౧. ప్రకృతిస్వభావ సంతృప్తివలన సుఖము లభించునట్లుండును; శ్రేయము ప్రకృతిస్వభావమును నిగ్రహించుటలోనున్నది. నీతిపరివర్తనముచే మానవుఁడెట్లో కోల్పోయిన ఆత్మస్థితినిఁ బొంద యత్నించును. ఆత్మసిద్ధి చేకూరువఱకు నైతికవిధి బాహ్యశాసనమువలె బలవంతమైనదిగా నుండును. శ్రేయస్కరమైనది సుఖముగానుండదు. ప్రకృతి స్వభావముతోఁ గుస్తీపట్టు నైతికవిధానానుసరణము సుఖముగానేయుండును. మానవుఁడు తన నైసర్గికబంధములనుండి విడివడుటకై చేయు యత్నముతోఁగూడిన జీవితము ఘోరరణాకృతి గలిగియుండును. అభ్యుదయమునకు ముఖ్యలక్షణము బాధల ననుభవించుటే. పోరాటము మానవజీవితసూత్రము; త్యాగము వికాసలక్షణము. పోరాటము, త్యాగము నధికమైన కొలఁదియు నానందము, స్వాతంత్ర్యము నధికమగుచుండును. సర్వవికాసము నాశనలక్షణముకలది. ప్రతియడుగున నాత్మకు జయమే. ప్రకృతిస్వభావమున కపజయము. ఈనష్టము నిజమైననష్టము కాదు, నిజమైన నష్టమే యైనచో నది శాశ్వతనష్టమై, మనము దానిని భరింపలేకపోవుదుము. మానవుఁడు తన నిజస్వరూపమగు బ్రహ్మరాజ్యకిరీటమును ధరించుటకుఁ జెల్లింపవలసినకప్పము దుఃఖానుభవము. దీనివలన జీవాత్మయొక్కయు లోకముయొక్కయు నసంపూర్ణతస్పష్టమగుచున్నది. “నేను మిగులదుఃఖముల ననుభ

౧. కఠము. ౧౮. ౨-౧-౨.

వించినాను; మంచిపని యే జరిగినది; ఏలన దుఃఖము దేవునిదూతే: అది ప్రపంచమసంపూర్ణమైనదనియు, మానవజీవితము క్షణికమైన దనియుఁ దెల్పును. దుఃఖము, మనయాత్మోన్నతికి సుశిక్షణము నిచ్చును. ఆటంకములు మానవాత్మను దనశక్తినంత నుపయోగించునట్లుచేసి, వికసింపఁజేయును. చీఁకటి యెంతగాఢముగా నున్న నక్షత్రము లంతనిర్మలకాంతినిచ్చును. మానవజీవితావస్థలో నాత్మోద్ధరణకృషియందు దుఃఖానుభవ మవిలంఘ్యము. మనము మనజీవితమును దేవునికిఁ బూర్ణసమర్పణ మొసర్చునందాక, క్రియాభివృద్ధికివలయు శ్రమాక్లేశముల ననుభవింపక తప్పదు. "మనుష్యుఁడే నిజముగా యజ్ఞ"మని ఉపనిషత్తుచెప్పినది. దైవసాక్షాత్కారమగు వరకు మానవునిజీవిత మెడతెగని క్రమమరణము. జీవితమొక శ్రమాయాతనా దుఃఖరంగము; అందు సాధకుఁడు ఘోరదుఃస్థితి ననుభవించి, శాశ్వతజీవితమును బడయును. ఒకటి వెనుకనొకటి తెరలన్నియుఁ జింపివేయవలెను. జీవితములోని నిజమనినమ్మిన విలాసములను దుడిచివైచి, కాంక్షలను మోహములను విదళించిన, తదనంతరము దైవసాక్షాత్కారముపొంద సాధ్యమగును.

౧౯—కర్మ

నైతికప్రపంచమందు, కర్మసూత్రము, భౌతికసమత్వ సూత్రమున కర్ధభాగమువంటిది. నైతికశక్తి సంరక్షణసూత్రమే కర్మసిద్ధాంతము. ధర్మక్రమస్వరూపము ఋగ్వేదముచెప్పిన ఋతభావమునందు బీజామాత్రముగ నున్నది. కర్మసిద్ధాంతము ననుసరించి, ధర్మప్రపంచమున సంశయాస్పదమైనది, విచిత్రసంఘ

౧. ఛాందోగ్యము ౩అ. ౧౬-౧.

టిన మైనదియులేదు.౧. మన మేవిత్తుచల్లిన నావంట పండును. మంచివిత్తు మంచిఫలమును, చెడువిత్తు చెడుఫలము నిచ్చును. ప్రత్యల్పక్రియయు మనశీలమును నిర్మించును. తనలో నిప్పుడున్న కర్మసంస్కారములు తానుగోరి,జ్ఞానపూర్వకముగా నిర్ణయించుకొన్నవని మానవుఁ డెఱుఁగును. జ్ఞానపూర్వకములైన కర్మ లజ్ఞానపూర్వకముగా జరుగు నభ్యాసములగును. మనలో నేఁడజ్ఞాన పూర్వకముగానున్న సంస్కారములు పూర్వము జ్ఞానపూర్వకముగాఁ జేయఁబడిన కర్మలేయని సహజముగాఁ జెప్పవచ్చును. సముద్రతరంగముల నెట్లాపలేమో, నక్షత్రసంచారము నెట్లరికట్టఁజాలమో యట్లే, నైతికపరిణామక్రమమును మనమాపఁజాలము. మననీడను దాటిపోవు టెట్లు దుస్సాధ్యమో యట్లే, కర్మసూత్రమును దుమికిదాటవలెనని యత్నించుటయు నసాధ్యమే. కాలముచే వాడిపోనట్టియు, మరణముచే నాశమందనట్టియు మనజీవితము ముందుకుఁ గొనిపోవుచరిత్ర సంపుటమును రచించు మనోనియమమే కర్మ. పాపమునుండివిముక్తి యజ్ఞదానాదికములచేఁ బొందవచ్చునని చెప్పిన వేదకాలము నాఁటిభావమునందలి దోషమును దొలఁగించుటకుఁ గర్మసిద్ధాంత మధికముగా నొక్కిచెప్పఁబడెను. పాపాత్ముఁడు నశించు తీరు

---

౧ ఈనియమమును కార్లైలు కవియిట్లు వర్ణించినాఁడు;" మూర్ఖా! నీ ప్రసంగమును రచించియుంచు బాస్వెల్ వంటి వ్రాతకాఁడులేఁడని అదినశించి పోవునని తలఁచుచుంటివా ? ఏదియు నశింపదు.నశింపదు. నశింపఁజాలదు. నీనోట వెంటవచ్చు నెంతమూఢశబ్దమైనను, నదిబీజమై కాలమునఁబడి,శాశ్వత ఫలమునిచ్చును." "మోసపోకుము. దేవుఁడు మూర్ఖుఁడుగాఁడు. ఏలన మానవుఁడేది చల్లిననదియే ఫలించును."

నను ఘోరదురవస్థ ప్రకటింపఁబడెను. యజ్ఞములవలనఁగాక సత్కర్మానుష్ఠానమువలన శ్రేయస్సు లభించును. "సత్కర్మాచరణముచే సత్పురుఁడు, దుష్కర్మాచరణముచే మానవుఁడు దుర్మార్గుఁడు నగును."౧. మఱియు, "మానవుఁడు సంకల్పమునకు బంటు; ఈలోకమున నాతఁడెట్లు నమ్మునో, మరణించిన వెనుక నట్టివాఁడే యగును."౨. అందుచే మనము సత్సంకల్పముగలిగి, సత్కర్మ నాచరింపవలెను. "చిత్తశుద్ధిగల మనుజుఁడు తన మనస్సుతో నేలోకమును గోరునో, యేవస్తువు లపేక్షించునో, యాలోకము, నావస్తువులనుబొందును. అందుచే నాత్మజ్ఞానియగువాఁడు "భూతి" లేక సంపన్నతను గోరుచో నట్టే యారాధింపవలెను."౧. కర్మఫలమే జననమరణాత్మకమైన సంసారకారణము, సంసార మాద్యంతములు లేనిది. పశువులు, వృక్షలతాదులు, మనుజులేకాక, దేవతలును గర్మబద్ధులేయని చెప్పఁబడెను.

ఎవనికర్మకువాఁడే వ్యక్తిగతముగా బాధ్యుఁడను కర్మసిద్ధాంతము సంఘసేవకు వ్యతిరేకమగుచున్నదని విమర్శకులు పలుకుదురు. ఒకరిభార మింకొకరు వహించు ధర్మము నుపనిషత్తులుద్ఘాటించి యుండలేదని యింకొక దోషారోపణము చేయఁబడినది. నిజమున కుపనిషత్తులు మనము కర్మబంధవిముక్తిని సంఘసేవవలననే పొందఁగలమని చెప్పినవి. స్వార్థకర్మలెంతవఱకుఁ జేయుచుందుమో అంతవఱకుఁ గర్మ మనలను బంధించును.

౧. బృహదారణ్యకము ౩అ. ౨-౧౩.

౨. ఛాందోగ్యము ౩అ. ౧౪.౧; బృహదారణ్యకము. ౪అ ౪-౫.

౧. ఛాందోగ్యము ౩అ. ౧-౧౦.

నిష్కామకర్మాచరణముచే మోక్షము లభించును. "ఈవిధము గా నీవు జీవించినచో, నీకెన్నఁడేవిధముగాను గర్మసంగముం డదు." ౨. జననమరణాత్మకమైన శృంఖలమునకు మనము బంధింపఁబడుటకుఁ గారణము స్వార్థకర్మయే. ప్రతివ్యక్తియుఁ గర్తవ్యాచరణమున కశ్రద్ధఁజూపి,తనభారమును దైవముమీఁదనో,నక్షత్రములమీఁదనో,మఱి యింకొకనిమీఁదనో పడవేసి, చరించుకాలమున నీకర్మసిద్ధాంతము; "పక్షి తాను గట్టుకొన్నగూఁటిలోఁ దానే బంధింపఁబడినట్లు, ప్రతిమనుజుఁడు తనకర్మలను రజ్జువులచేఁ దన్నుఁదానే బంధించుకొనుచున్నా"ఁడని౧. వక్కాణించినది.మన కేది తటస్థించినను దానికిఁగారణమర్థములేని యదృష్టముకాదు; మన గతకర్మయే. మనమంధ ప్రాయమైన యదృష్టాధీనులము కాము.దుఃఖానుభవమే పాప ఫలము. ఇట్టి సూత్రము సత్కర్మాచరణమున కమితప్రోత్సాహకారణమనుటలో సంశయములేదు. మానవకర్మాచరణమునకుఁ గొన్నిహద్దులున్నవని మాత్రమదిచెప్పును. మనము మనకర్తలము గాము. అసాధ్యవిషయ మెదురైనప్పుడు, మన యిచ్ఛవచ్చినట్లు మనమేమియుఁ జేయఁజాలమని గుర్తింతుము. సవ్యముగా గ్రహించినచోఁ గర్మ, నైతికప్రయత్నమును నిరుత్సాహపఱుపదు; మనస్సును బంధింపదు; సంకల్పమును గట్టివేయదు, ప్రతికర్మయుఁ బూర్వకర్మఫలితమని చెప్పును. కారణము కార్యముగా మాఱులక్షణమున్నది. ప్రకృతిస్వభావము కంటె నున్నతశ్రేణికిఁ జెందినదగుటచే నాత్మ తన స్వాతంత్ర్య

(౨) ఈశ. ౨అ.

౧. మైత్రాయణ్యుపనిషత్తు 3అ. ౨.

మును బ్రకటింపకున్నచో, నప్పుడు గతమునందలి కర్మయుఁ బ్రస్తుతపరిస్థితియుఁ గలిసి మానవుని కర్మను నిర్ణయింపఁగలుగును. కాని మానవుఁడు కేవల ప్రకృతిసంజాతుఁడుగాఁడు; తాను జేయు కర్మకంటె నధికుఁడు. కర్మనియమమే సర్వమునైనచో, జీవికిఁ గర్మాధికార స్వాతంత్ర్యము లేనే లేదు. మానవ జీవితము కేవల జడపదార్థముల కలయికచే నేర్పడినదికాదు. మానవునియందు, వివిధాంతరువులు—కేవల జడాత్మకము, ప్రాణసంబంధము, జ్ఞానముతోఁగూడినది, బుద్ధియుక్తము, నంతరాత్మసంబంధమునైనవి—పరస్పరసంబంధములు గలిగి, అన్యోన్యాశ్రియభూతమునై యున్నది. కర్మనియమము, మానవునియందలి ప్రాకృతికస్వభావముపైఁ దనప్రభావమును జూపఁగలదు కాని, తదతీతమైన ఆత్మపై నేయధికారమును జూపఁజాలదు. మానవునియం దంతర్యాతమైయున్న దైవశక్తి, ప్రకృతిస్వభామును నిర్జింపఁగలదు. స్వాతంత్ర్యమే దైవలక్షణము. దాని శక్తిచే మానవుఁడు తనప్రకృతిస్వభావమును నిగ్రహింపఁగలఁడు. అందుచేతనే కేవలము యాంత్రిక సంకలనముచే నేర్పడిన యవస్థల మొత్తముగా నాతని జీవితము వ్యక్తమగుటలేదు. మానవుఁడు స్వతంత్రుఁడగుటకై చేయుకర్మలు, కేవలమజ్ఞానపూర్వకముగా జరుగు స్వభావజములుగాని, హఠాత్సంభవముల నెదుర్కొనుటకైచేయు తాత్కాలికావేశములు కాని కాక, అంతరాత్మయొక్క స్వాతంత్ర్యమును బ్రకటించునవై యుండవలెను. మానవునియొక్క ఆరంభోత్సాహములకు, మూలాధారమాతని యంతరాత్మయై యుండవలెను, స్వభావముచే జరుగు కర్మ నిగ్రహింపఁబడవలెను. ప్రకృతిదశల సముచ్చ

యమే మానవుఁడైనచో, నాతఁడు పూర్తిగాఁ గర్మబద్ధుఁడగును. కాని యాతని యందొక దైవాంశమైన ఆత్మ-ప్రభుశక్తి-వెలసియున్నది. ప్రకృతిసంబంధమైన దేదియు దానిని శాసింపఁజాలదు, ప్రకృతిశక్తి సమూహములన్నియు, నాత్మశక్తి యెదుట మోకరింపవలసినదే; అందుచే మానవుఁడు కర్మనియతి నతిక్రమించు సామర్థ్యమును గలిగియున్నాఁడు. ఈశ్వరునితో నేకత్వము నార్జించినపుడు మానవుఁడు పూర్ణస్వతంత్రుఁ డగును. "ఆత్మను, పవిత్రకామముల నెఱుఁగకుండ నెవ్వఁడీ లోకమును విడిచిపోవునో, యాతనిజీవిత మితరలోకములలో నస్వతంత్రమై యుండును; ఎవఁడాత్మ జ్ఞానముకలిగి, పవిత్రకామముల నెఱిఁగి, మరణించునో యాతఁడు లోకాంతరములలో స్వతంత్రుఁడై సంచరింపఁగలఁడు." ౧. బ్రహ్మైక్యస్థితియే పూర్ణస్వాతంత్ర్యము. దేవుని కెంతసమీపమునకుఁ బోయిన, నంతగా నాత్మస్వత్వము పెంపొంది, స్వాతంత్ర్యము సిద్ధించును; దేవుని కెంతదూరస్థులమై, స్వార్థపరులమగుదుమో, అంత తీవ్రముగాఁ గర్మసూత్రము మనలను బంధించును. మానవుఁడు ప్రకృతి పరమాత్మల మధ్యమం దూగిసలాడుచు, మోక్షబంధములకు వశుఁడై వర్తించుచున్నాఁడు.

కర్మకు రెండువిధములైన ఫలములున్నవి; ఒకటి వ్యక్తిగతము; రెండు లోకసంబంధము. ప్రతికర్మయొక్క ఫలితము లోకమునకుఁ జెందును; మఱియు మానవమానస ఫలకముపైఁ గర్మఫలమొక సంస్కారరూపమున ముద్రితమగును. ఈసంస్కార బలముచేతనే చేసినపనినే తిరిగిచేయుచుండు నభ్యాసము

౧. ఛాందోగ్యము ౮౻. ౧. ౬.

మనకుఁ గల్గుచున్నది. కావున నన్నికర్మలకు ఫలితములు, లోకమునకు వ్యక్తికిఁగూడఁ జెందును; మనమెంత యత్నించినను, లోకమునకుఁజెందు మనకర్మఫలితములను మార్పఁ జాలము. కాని మన మనస్సుపై ముద్రితములగు సంస్కారములను మనము నిరోధింపవచ్చును. మనభావిదశ మహదవకాశబంధురమైయున్నది. ఆత్మశిక్షణముచే, మనలోని సత్సంస్కారములను బలపఱచి, దుష్టసంస్కారములను కృశింపఁజేయవచ్చును.

మానవుల కర్మలను ముందుగా గుణించి చెప్పవచ్చును. అవి హేతుబద్ధములైనచోఁ గొన్నిలక్షణములను గలిగియుండును; వానియందొక యాంతరంగిక సామరస్యము, నొక స్వార్థరహిత లక్ష్యము మున్నగునవుండును. దీనివలన నాయా కర్మలను కేవల మజ్ఞాన సంభవములని తలఁపరాదు. ప్రతిజీవియు స్వాతంత్ర్యమును గర్భమునఁ గలిగియున్నది. కంఠెనుండి దారము దీసినట్లుగా, మానవుని కర్మలు జరుగవు. మానవునకాత్మకేంద్రమైన జీవితచిహ్నముగా స్వాతంత్ర్యమున్నది. దేవుఁడాతనికి స్వాతంత్ర్యమును బాహ్యమునుండి యిచ్చియుండలేదు. మానవ జీవితము దేవునియందు సుస్థాపితమై యున్న కారణమున నాతఁడు స్వతంత్రుఁడు. తన దైవస్వత్వము నెంతగా గుర్తించిన నంతస్వేచ్ఛ యాతనికిలభించును.

కర్మ సిద్ధాంత మాస్తిక్యమునకు విరుద్ధమని విమర్శించిరి. ౧. కర్మ, విశ్వమునంతను శాసించు నొక జడాత్మకము

---

౧. చూడు. మాక్నికోల్; ఇండియన్ థీయిజమ్. పుట ౨౨౫.

సంధప్రాయమునైన నియమము. దేవునికిఁగూడ దానిపై నధి కారములేదు. ఒక జడశాసనము నవలంబించునపుడు కొంక న్యాయాధ్యక్షుఁ డనవసరములేదు. పరబ్రహ్మ స్తిత్వమునకు కర్మసిద్ధాంతము వ్యతిరేకముగాదు. కర్మయొక్క నైతికసూత్రము, పరమాత్మ స్వభావప్రదర్శనము. ప్రకృతిజీవులముగా మనము దేవుఁడే జగత్కార్యక్రమమును నడపువాఁడని చెప్పికొనవచ్చును. వేదములలో దానినే ఋతమనిరి. ఋతదైవతము వరుణుఁడు. కర్మ, దేవతల మార్పులేనివ్యాపారము.౨. అది సత్య స్వరూపప్రదర్శనము నైతికజీవిత పరిణామములో నెట్టి యనవ సరమగు జోక్యమున కవకాశములేకుండఁ జేయఁబడినది. నేఁటి ప్రకృతి శాస్త్రవేత్తలు నిదేనిర్ణయమునకు వచ్చిరి. ఒకప్రకృతి శాస్త్రనిర్ణయముకాని, అభ్యాసముకాని, అన్యసంఘటనములచే జోక్యము నంగీకరింపవు. దేవుఁడున్నాఁడని ఋజువుచేయుటకతి మానుషసంఘటనము (Miracles) లవసరమైనచోఁ బ్రకృతి శాస్త్రము శాశ్వతముగా దైవహత్య చేసివేసినది. దేవుని జోక్య మునకుఁగూడఁ గొన్ని నియమములున్నవి. మేల్ బ్రాన్ఛె చెప్పి నట్లు, దేవుఁడు తన వ్యక్తిగతభావముల (Private volitions)చే నడచుకొనఁడు, ఆత్మ ప్రపంచ స్వభావమునకు కర్మసిద్ధాంత మే సరియైన స్వరూపమీయఁగలదు. పూర్ణవస్తువుయొక్క సజీవ వివేక స్వభావమును గర్మ తెలియఁబఱచును. ఆత్మ, తన వ్యాపారమును గర్మసూత్రమును సాధనముగాఁ గైకొని నెఱవే ర్చుచున్నది. ఆత్మ ప్రపంచములోని స్వాతంత్ర్యము, ప్రకృతి రంగములోని యచేతనావశ్యకతయొక్క అయఃకాఠిన్యముగల

౨. దేవానామ్ ధృవాణి వ్రతాని.

మాత్రముగాఁ బ్రదర్శితమగుచున్నది. ౧. స్వాతంత్ర్యము, కర్మ, ఒకే సత్యముయొక్క రెండురూపములు. దేవుఁడు సృష్టిలో నంతర్యామియై యున్నచో, దైవశక్తి యచేతన పదార్థమందు నుండును. దేవుఁడు నియమముచేఁ దెలియఁబడుచున్నాఁడు, కాని నియమమే దేవుఁడుకాదు. గ్రీకులుచెప్పు 'అదృష్టము'; స్టొయిక్ వాదుల 'వివేకము' చైనీయుల 'టాయ్' కర్మసూత్రము యొక్క యావశ్యకతను నిరూపించుచున్నవి.

జీవితానుష్ఠానములం దత్యంతోప యోగకరములగు సిద్ధాంతములలోఁ గర్మసిద్ధాంతముతో సమానమైన దింకొకటి లేదు. ఈజీవితములో మనకేది తటస్థించినను, మనమందఱము వినమ్రాత్మసమర్పణ బుద్ధితో నది మన భూతజీవిత కర్మఫలితమే యని తెలిసికొనవలసినదే. అయినను, భవిష్యత్తు మనచేతిలో నున్నది; అందుచే మనమాశావిశ్వాసములతోఁ గృషిచేయ వచ్చును. గతించిన దానిగూర్చి నిర్విచారత్వమును, రాబోవు

౧. కర్మ దేవుని సంకల్పమునకు విరుద్ధమైనదని ఉపనిషత్తులు చెప్పినది మన మంగీకరింపనవసరము లేదు. రెండు నన్యోన్యేతరములుగావు. వేదములు చెప్పినట్లనేక దేవతలున్నచో దేవతలను గర్మ బంధించును. "మృత్యుదేవత కోరలుసాచి మ్రింగఁబోగా, (దమ) కెంతప్రియుఁడైన వానినైనను దేవతలును రక్షింపలేరైరి. తన కత్యంత ప్రియుఁడగు తనకుమారుఁడు పత్రోక్లాస్ చేతఁబడి మరణింపఁగాఁ దానాతనిని (సర్పిడానును) రక్షింపలేకపోతినని జ్యూస్ దేవుఁడేడ్చెను. ప్రారబ్ధనిర్ణయమును నిర్మూలించు సాహసమాతనికి లేకపోయెను. దేవుఁడైనను విధినిర్ణయమును దాటఁజాలఁడయ్యెను. యూరిపైడిస్ గ్రంథములో అధినాయకుపాత్ర ఆన్ద్రొమాండరు మాటగా నిట్లు చెప్పెను. "వీత్ర, దేవతలకుఁగూడఁ బ్రారబ్ధమే ప్రభువు."

—కోర్నఫర్డు: ఫ్రమ్ రిలిజియన్ టు ఫిలాసఫీ

పుటలు ౧-౨-౩.

పట్టిదానికి ధైర్యమును గర్మయిచ్చును. ప్రపంచములోని విష యములు, లాభనష్టములు నిజముగా నాత్మనంటవని మానవులు నమ్మునట్లు చేయుచున్నది. ధర్మానుకూల ప్రవర్తనమొకటే శ్రేయస్కరము; ఐశ్వర్యము, పదవి, జాతి, దేశము నివి శ్రేయము నొసఁగవు. యోగ్యతతో సమానమైన దేదియును లేదు.

## ౨౦. భవిష్యజ్జీవితము

ఉపనిషత్తులలో జన్మాంతరమునుగూర్చి వేదబ్రాహ్మణముల భావములకంటెఁ బరిణతభావము నుగ్గడించినను, నిశ్చిత సిద్ధాంతమింకను మనకుఁ బ్రదర్శింపఁబడలేదు. పునర్జన్మభావమే ఉపనిషత్తులలోఁ బ్రాముఖ్యమును గాంచినది. దీని ప్రాచీనతమ రూపము, శతపథ బ్రాహ్మణమునందు, జన్మించినవాఁడు మరణించుట, పునర్జన్మ, పునర్మరణము మున్నగువానిని కర్మఫలముతోఁ గలిపి చెప్పినభావమందుఁ గలదు. నిజమైనజ్ఞానముగలిగి, కర్తవ్యములను సక్రమముగా నెఱవేర్చినవారు, మోక్షమును బొందుటకై, మరణించినవెనుక మరలఁ బుట్టుచుందురు; అట్టి జ్ఞానములేక, తమవిధులను సరిగా నెఱవేర్పక మరణించినవారు మృత్యుదేవత కాహారమగుటకే తిరిగి తిరిగి పుట్టుచుందురు. ౧. బ్రాహ్మణములు జన్మ మరణములను లోకాంతర వ్యాపారములనుగా నూహించినవి. ఉపనిషత్తులు, జనన మరణముల నీ లోకముననకే మార్చినవి. ఈ రెండుభావములు సమన్వయమైనవని తోఁచదు. రెంటినొకచోటనే చెప్పినసందర్భము

౧. పునర్మృత్యుభావమును పోల్చుఁడు. కౌషీతకి బ్రాహ్మణము ౨౫౧ ౧.

లున్నవి. సదసత్కర్మఫలము రెండురకములు లోకాంతరమునకుఁ బోయినవెనుక కొంతయుఁ దిరిగి యీలోకమున జన్మించినవెనుక కొంతయు సంభవించును. శవదహనమైన వెంటనే, జీవుఁడు స్ఫురద్రూపముతో స్వర్గమునకుఁబోయి, యచటనుండి, మరల నీ లోకమునకుఁ దిరిగివచ్చి జన్మించును. ౨. పునర్జన్మభావముప నిషత్తులలోఁ బరిపక్వదశనింకను బొందుచున్నదని యీ భావమును స్మరింపని కొన్నిశ్లోకములవలనఁ దెలియుచున్నది. ౩. పునర్జన్మభావమును స్మరించిన మొట్టమొదటి యుపనిషత్తులు ఛాందోగ్యము ౫అ. ౩.౧౦; బృహదారణ్యకము ౬అ. ౨.

ఉత్తమమైన ముక్తియనఁగా బ్రహ్మైక్యమను భావము నుపనిషత్తులు సుస్పష్టముగాఁ బ్రకటించినవి. దేవతలే పరమ సత్యస్వరూపులైనపుడు వారితో నైక్యమే మోక్షముగాఁ దలఁ పఁబడెను. ఇపుడు బ్రహ్మమే ప్రథమసిద్ధాంతము; బ్రహ్మమే విశ్వాధారమైన సత్యము. కావున నిత్యజీవితమనఁగా బ్రహ్మైక్యము. అట్టి యుత్కృష్టమైన పదవి లభించువఱకును, గాల వాహినిలోఁబడి, జీవుఁడు రూపదశాంతరములను బొందుచుండ వలసియున్నది. ముక్తుఁడుగాని జీవుఁడు జన్మమరణ సూత్రి పాశబద్ధుఁడై, అనేకజన్మములెత్తి తన పరమావధిని సాధించు కొనవలసియుండును. ముక్తునికే నిజమైన బ్రహ్మైక్యస్థితి లభించును; బద్ధజీవి కాలగతుఁడై జన్మింపకతప్పదు. "ధవళము, దంత శూన్యమునైన గర్భనరకమునకు నేనెన్నఁడుఁ బోకుందును గాక" ౪. యనుప్రార్థనముఁ దఱచు వినియుంటిమి. మనమెట్టి

---

౨. బృహదారణ్యకము ౬అ. ౨. ౧౪. (౩) బృహదారణ్యకము ౧అ. ౫. ౧౬. (౪) ఛాందోగ్యము ౮అ. ౧౪. ౧॥

జన్మమెత్తవలెనో మనకర్మ నిర్ణయించును. ఉన్నతజీవితపు మెట్టు నెక్కినపుడది స్వర్గమనియు, క్రిందిమెట్టునకు మనము దిగి పోయినపుడది యధోలోకమనియుఁ బిలువఁబడెను. సంసార స్థితి నిజమైన ఆత్మనివాసముకాదు. ప్రకృతిమోహము లెంత వఱకు మనయందునిలిచి యుండునో యంతవఱకు మనము సంసారమున దాసులముకావలసినదే. పరిచ్ఛిన్నశక్తులతోఁ బరిపూర్ణబ్రహ్మమును మన మెన్నఁడును జేరలేము; మనయాత్రలో మనము కొంతముందునకుఁ బోయియుండవచ్చును. అభ్యుదయమనఁగా ననంతవికాసము; ఎడతెగని పరిణామము. మన పరిచ్ఛిన్నతను పూర్ణత్యాగ మొనర్చినపుడు, మనము బ్రహ్మైక్యసిద్ధిఁ గాంచి, సంసారమునకుఁ దిరిగి రానవసరముండదు. ౧. సంసారము జీవశిక్షణసాధనము.

ప్రకృతి ప్రపంచము, వస్తువులన్నియు నశాశ్వతములనియు; నసత్యములనియు, మనకుఁ దెల్పుచున్నది. సర్వవస్తువులకీప్రపంచమందు పునర్జన్మ పునర్మరణములు కలుగుచున్నవి. "మర్త్యుఁడు సస్యమువలె మరణించి, మరల సస్యమువలె జన్మించుచున్నాఁడు." ౨. మరణము జననమునకు, జననము మరణమునకుఁ గ్రమసంబంధములై యున్నవి. కర్మసిద్ధాంతమింకను కర్మకును ఫలానుభవమునకుఁగల నియతి నిశ్చయింపక పోయినను, మన ప్రవర్తనమునుబట్టియే ముందుజన్మ స్వభావముండునని స్పష్టమొనర్పఁబడెను. "ఎవరి ప్రవర్తనము యోగ్యమైనదో వారు వెంటనే మంచిజన్మమును బొందుదురు; అనఁగా బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య జన్మములు వారికి లభిం

౧. ఛాందోగ్యము ౪౮. ౧౬. ౬. (౨) కఠము ౧౮. ౪.

చును. పాపాత్ములు, వెంటనే పందిజన్మమో, కుక్కజన్మమో, చండాలజన్మమో యెత్తుదురు." 3. మనకుఁ బూర్వజన్మ జ్ఞానమున్నను లేకున్నను, జీవియొక్క యేకత్వము వివిధజన్మలలో నవిచ్ఛిన్నమై యుండును. పూర్వజ్ఞానశూన్యత దోషముకాదు. వేలన నొక జన్మమందే జీవితములోని యనేకములైన అనుభవ పరంపరలను మనము మఱచుట సహజము. ముఖ్యమైన విషయమేమన, మన జ్ఞాపకశక్తి ప్రధానముగాదు; అనుభవ సంస్కారముల ప్రోవు నశింపక సంరక్షింపఁబడుటే. బ్రహ్మము సర్వాత్మ కావున, దానికి బంధములులేవు. జన్మాది మరణ పర్యంతము మానవుఁ డొనర్చినదే కర్మగా లెక్కింపఁబడును. "ఆత్మ శరీరము నశించిన తరువాతనుండునా ? యాజ్ఞవల్క్యా! మానవుఁడు మరణించిన వెనుకనాతని ప్రాణ మగ్నిలోను, శ్వాస వాయువులోను, నేత్రములు సూర్యునందును, మనస్సు చంద్రునందును, శ్రోత్రములు దిశలందును, శరీరము మట్టియందును, చైతన్య మాకాశమందును, దేహమునందలి రోమములు లతాదులందును, శిరోజములు వృక్షములందును, రక్తరేతము లుదకమందును బ్రవేశించి, లీనమైపోయినపుడు- మానవుఁడప్పు డేమగును ? "ఈప్రశ్నము నార్తభాగుఁడు యాజ్ఞవల్క్యునడిగెను. వారీ నిర్ణయమునకువత్తురు: "సత్కార్యముల వలన సత్పురుషుఁడును, దుష్కార్యములవలన దుర్జనుఁడు నగును.౧. జీవితములో నిజమైనది శీలముకాని, మనశ్శరీరములు కావు. శీలము మరణము నతిక్రమించి జీవించును. కర్మ మాఱు

3. ఛాందోగ్యము ౫అ. ౧౦. ౭.

౧. బృహదారణ్యకము. 3అ. ౨. ౧3.

యుండినను, పరమాత్మ మారదని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. కొందఱు బౌద్ధులుచెప్పినట్లు బ్రహ్మమే అసత్యమని తోసి వేసినచో, గర్మయే పరమసత్యమగును.

యాజ్ఞవల్క్యుని యుపదేశములో జన్మాంతరమున మృగజన్మము వచ్చు ననియెడువిషయము లేదు. యాజ్ఞవల్క్యోపదేశము బృహదారణ్యకమున నాలుగవ అధ్యాయముతోఁ బూర్తియగును. కాని బృహదారణ్యకముననే అనంతరాధ్యాయములందును, ౧. ఛాందోగ్యకౌషీతక్యాద్యుపనిషత్తులందును, మరణానంతరము పశుజన్మము కూడఁ జేర్కొనఁబడెను. ఆటవికజాతుల విశ్వాసములనుండి యీపశుజన్మాది భావములు గైకొనఁబడి యుండనచ్చును. ప్రపంచములో నించుమించుగా నన్నిదేశములలోను, విద్యావాసనాశూన్యుఁడైన మానవుఁడు మానవాత్మ, పశుదేహములలోఁ బ్రవేశింపఁగలదని నమ్మియున్నాఁడు. పైనుండివచ్చిన ఆర్యులు దేశీయులైన జాతులతో సంబంధమేర్పడినప్పుడు, పశువృక్ష లతాదులకాత్మలున్నవనియు, మానవుల యాత్మలపుడపుడు వానిలో నివసించుననియు నమ్మినవారి భావములను గ్రహించిరి. సర్వపదార్థములలోనున్న ప్రాణము పూజింపఁదగినదనియు, పుష్పమందును, కీటకమందును, పశువునందును, మానవునందును, గల మూలజీవశక్తియొకటే యనుభావము చెప్పుటచే నుపనిషత్తులు పూర్వదేశీయజాతి భావముల నంగీకరించినట్లు ఋజువగుచున్నది. ఆచరణములో దీనివలన విశేషలాభమున్నది. ఋష్యాశ్రమములలో వివిధమృగములకుఁ జూపఁబడిన యాదర మీసిద్ధాంత

౧. బృహదారణ్యకము ౬అ. ౨.౧౬.

మును బలపఱచుచున్నది. మానవుఁడు తానధికుఁడనను గర్వ మునువిడిచి, సెయింటుఫ్రాన్సిస్ చెప్పినట్లు వినయవినమితుఁడై, తాను నల్లటిపేడపురుగు సోదరుఁడనని యంగీకరింపవలెను. మనుష్యులకుఁ బశువులకు నెట్టిసమీపసంబంధమున్నదో ఆధునికప్రకృతి శాస్త్రవేత్తలుచెప్పు పరిణామసిద్ధాంత పరిచయముగల మనకాశ్చర్యము కలుగదు. ఏతత్త్వశాస్త్రమును విస్మరింపఁ జాలదు. వేదములు ప్రకటించిన, లోకాంతరమున లభించుసుఖ దుఃఖముల సిద్ధాంతమున కుపనిషత్తులు స్థానము చూపవలసి వచ్చినది. మరణించినజీవులకు లభించు నానందమయ ప్రపంచ ములోఁ దదధ్యక్షుఁడగు యమునితో సుఖ మనుభవించుటో లేక అంధతమసమున దుఃఖప్రాప్తియో చెప్పిన వేదముల మర ణానంతర భావమును బునర్జన్మసిద్ధాంతముతో మేళవింపవలసిన యవసరము, సనాతనసంప్రదాయాభిమానము కల్గిన ఉపనిష త్తులకుఁ గలిగెను. దీనివలన నుపనిషత్సిద్ధాంతమునకుఁ గొంత క్లిష్టతయేర్పడి, మరణానంతర విషయమును మూఁడువిధము లుగాఁ జెప్పెను. "మేమొక ఋషివాక్యము, నీవిధముగా విని యున్నాము;" నేను మానవులకు రెండుమార్గములను వినియు న్నాను; ఒకటి పితృయానము, రెండవది దేవయానము, మాతా పితలైన ఆకాశభూమధ్యముననున్న జీవులన్నియు నీరెండుమార్గ ములలోఁ బయనించుచున్నవి." ౧. భూమిపైఁ బ్రదికియున్న కాలములోఁ జేసినకర్మ ఫలితముల ననుభవించుటకు మృతజీవి కీరెండుమార్గములున్నవని ఉపనిషత్తులన్నియుఁ జెప్పినవి. ఒకటి దేవయానము, లేక అర్చిర్మార్గము; అనగా జ్యోతిర్మార్గము;

౧. బృహదారణ్యకము ౬.అ ౨.౨

రెండవది పితృయానము లేక ధూమమార్గము. మొదటిదిఅగ్న్యాదులనుండి బ్రహ్మలోకము లేక సత్యలోకమునకుఁ దోడ్కొనిపోవును. ఈలోకమునకుఁ బోయినవారు తిరిగిరారు. తనలోకములోఁ బ్రభువైయొక్క సింహాసనము నధిష్ఠించి కూర్చుండు బ్రహ్మయొక్క సగుణమూర్తియని నమ్మఁబడినంతకాలము నీ దేవయానమున కర్థముండెడిది. కాని బ్రహ్మాత్మైక్యభావము కలిగినవెంటనే బ్రహ్మసింహాసన మూగిసలాడి పడిపోయి, దేవయానము స్థానమున బ్రహ్మైక్యమార్గ మాక్రమించినది. ధూమము, రాత్రిమున్నగు నావరణముల ద్వారమునఁ జంద్రలోకమునకుఁ దోడ్కొనిపోవునది పితృయానము. దేవయానమునఁ బోయినవాఁడు తిరిగిరాఁడు; కాని పితృయానమున వెళ్ళినవాఁడు పుణ్యక్షీణమైన వెంటనే తిరిగి యీలోకమునకువచ్చును. వివరములలోఁ జాలభేదములున్నవి. కౌషీతక్యుపనిషత్తు ననుసరించి, మరణానంతరమందఱు మొదటఁ జంద్రలోకమునకే పోయి, యచటనుండి కొలఁదిమంది పితృయ్యానమున బ్రహ్మలోకమునకుఁబోగా, మిగిలిన వారందఱును దమతమ కర్మజ్ఞాన స్వరూపము ననుసరించి, భూలోకమునకువచ్చి మనుష్యుఁడు మొదలు క్రిమిపఱకుఁగల జన్మము లెత్తుదురు. ౧. దేవయాన పితృయానములు జ్ఞానజ్యోతిర్మయలోకములకు, అజ్ఞానాంధకారలోకములకు సరిపోవును. రౌరవాది మహాంధకారమయ నరకములకుఁ గొనిపోవు నింకొక మూఁడవమార్గముకూడఁ జెప్పబడినది.౨. "పాలీయని శుష్క గోవునుదానము చేసినవారు, దుఃఖ

౧. కౌషీతకి ౧అ. ౨.౩ (౨) బృహదారణ్యకము ౪అ. ౧౧

మయనరకములకుఁ బోదురు."౩. ఈలోకముననే యీమూఁడవ మార్గమున నిత్యము పుట్టిగిట్టుచుండు క్రిమికీటకాదులు పోవు చుండును.౪. బ్రహ్మైక్యసిద్ధిసాధించి మోక్షముగాంచిన పుణ్య పురుషుఁడెచటకుఁ బోనవసరములేదు. ౫. ఉన్నచోటనే బ్రహ్మా నందము నాతఁడు పొందును. "అతని ప్రాణము లెచటికినిబోవు. బ్రహ్మమై బ్రహ్మములోఁ గలిసిపోవును" ౬. మోక్షసిద్ధిగాం చినవారి కేయానమునులేదు; కాని ఊర్ధ్వయాన మవసరమై నచో వారు దేవయానముననే పోవుదురు. ఊర్ధ్వగమనము క్రమాన్వితమైనచో దానినే క్రమముక్తి యందురు.

పునర్జన్మవిధానము పెక్కురీతుల వర్ణింపఁబడినది. "అప్పు డు (మరణానంతరము) వానిజ్ఞానము, చేసినకర్మలు, పూర్వాను భవము కలిసి చేయిపట్టినడపును. గొంగళీపురుగు ఒకగడ్డిపో చను పట్టుకొని, దానినుండియే యింకొకదానిమీదఁ బ్రవేశించి మొదటి దానిని విడిచిపెట్టునట్లే, యీదేహమును విడిచిన జీవి యింకొకదేహమునఁ బ్రవేశించును." ౧. మఱియు, "కం సాలియొక బంగారపుఁదునుకను బుచ్చుకొని దానినుండియేనవ్య మనోహరమైన యింకొక యాభరణరూపమును చేయునట్లే, యీదేహమును త్రోసివైచి, జీవి, జ్ఞానముపొంది, తానుబోవ లయు నింకొకలోకమున కనుకూలము, నూత్నమనోహరము నగు నింకొకదేహమును స్వీకరించును." "శిల్పి, యొక శిలా విగ్రహమును జేఁబట్టి, యందుండి, నూత్నతరము నధికమనో

౩. కఠము ౧అ. ౩. ౪. బృహదారణ్యకము ౬అ. ౨.౧౬
౫. కఠము ౬అ. ౧౪. ౬. బృహదారణ్యకము ౪అ. ౪.౬
౧. బృహదారణ్యకము ౪అ. ౪.౩.

హారమునైన యింకొకరూపమును జెక్కినట్లే, జీవి, యీ దేహమును త్రోసివైచి, అజ్ఞానమునుండి బయటఁబడి, నవ్యసుందరతరమైన యింకొక పితృదేవతా రూపమునో, గంధర్వరూపమునో, దేవతారూపమునో, ప్రజాపతిరూపమునో, బ్రహ్మరూపమునో, మఱేయితర జీవరూపమునో సృజించుకొనును.౨[2] మరణసమయమున జీవి, ప్రాణములనన్నిటిని దనలోనికిఁ దీసికొని, తాను జేసిన కర్మననుసరించి లభించు నుత్తమాధమ దేహములలో నొకదానియందుఁ బ్రవేశించునని కొన్ని తావులందుఁ జెప్పఁబడెను. 3. దీనిననుసరించియే లింగశరీరసిద్ధాంతములు తరువాత నేర్పడినవి. దివ్యజ్ఞానసమాజము వారుదీనిని పశ్చిమ దేశములందుఁ బ్రజల కెఱుకపఱచియున్నారు. ఈసూక్ష్మశరీరము, జీవియొక్క మనశ్శీలములకు వాహనమై, స్థూలదేహ మరణమున చెడకయుండును, నూతనశరీరమున కిదియే యాధారభూతమై, తన కనుగుణముగా దానిని నిర్మించుకొని, యింకొక జన్మమునంతను దానితోఁగడపును. జీవులన్నియుఁ బరమాత్మనుండియే ప్రత్యేకవ్యక్తులుగాఁబుట్టి, తిరిగి పరమాత్మయందే లయమగునని కూడఁ జెప్పఁబడెను.౧.

శరీరమరణముతో నాత్మయు నశించునను భౌతికవాదము నుపనిషత్తులంగీకరింపవు. జీవమవిచ్ఛిన్నమైనదనుదృఢవిశ్వాసము

---

(౨) బృహదారణ్యకము ౪అ. ౪.౪ చూడు. ఛాందోగ్యము ౫ అ. ౧౦.౨; కౌషీతకి ౧అ. ౨: బృహదారణ్యకము,౧అ.౧౬.

(3) చూడు. బృహదారణ్యకము ౪అ, 3.3౭; ౪అ. ౪.౫; ప్రశ్న. 3అ. ౧౦; కౌషీతకి ౪అ.3.

౧. ఛాందోగ్యము ౬అ. ౯.౨:౬అ. ౧౦.౧.౨

కలిగియుండుటచే, స్థూలశరీరము నశించిన యనంతరము జీవము బ్రదికియే యుండునని వారుచెప్పిరి. స్త్రీపురుషసంయోగము, జీవియొక్క నూత్నరూపమునకు వలయు సామగ్రినిచ్చునేకాని, యది జీవసృష్టిచేయు శక్తి కలదికాదు. ఒకఅణువు పెంపొందుటవలన, జీవముదయించుట కాధారమని నిరూపింపఁజాలము. ప్రతిజీవియు స్త్రీపురుష వీర్యమందలి యణువునఁ బ్రవేశించి, తన కుచితమైన నూతనరూపమును దాల్చుచున్నదని చెప్పిన ఉపనిషత్సిద్ధాంతమునకంటె, లోకములో నొక్కొకబిడ్డ పుట్టినప్పుడెల్ల నొకజీవమును దేవుఁడు క్రొత్తగా సృజించునని చెప్పు సంప్రదాయాస్తికవాద మెక్కుడు తృప్తినీయఁజాలదు.

పునర్జన్మసిద్ధాంతము. మనము తర్కప్రజ్ఞచే సమర్థించిన యితర సిద్ధాంతములవలె సమర్థింపఁదగి యుండుటేకాక, మరణానంతరము జీవి పూర్ణముగా నశించిపోవునను సిద్ధాంతముకంటెను, లేక, శాశ్వతముగాఁ గర్మఫలితముల ననుభవించుచుండునను సిద్ధాంతముకంటెను విశేషముగా సంతృప్తినీయఁగలదు. నీతిరహిత స్వైరవిహారము, నిత్యదుఃఖానుభవ దుర్దశయు నవసరములేని జీవితమును బ్రసాదించునది పునర్జన్మసిద్ధాంతము. దుఃఖము జీవుల కసమానముగాఁ గలుగఁజేసిన సృష్టియొక్క అన్యాయ్యమున కీసిద్ధాంతము సమాధానమిచ్చును, భౌతికప్రపంచమునఁగల అసందర్భములు తార్కికబుద్ధి సంతృప్తి కాటంకములైన సమస్యలైనట్లే, నైతికప్రపంచమందలి అపక్రమము లన్నియు వీనికి లక్ష్యము తుదకు శ్రేయమేయని నమ్ముట కాటంకములైన సమస్యలైయున్నవి. మనది హేతుబద్ధమైన విశ్వాసమైనచో, మన కెవిధమైన తార్కిక నైతికసంశయములు

కలుగవవసరములేదు. అరాజకమే నైతికకృషికిఁ దుదిమాటయై నచో నీతికి స్థానములేదు. ఒకవంక మనకు లోకమున గోచరించుచున్న నైతికరంగదుర్దోష ఘోరస్థితి, యింకొకవంక ధర్మమూర్తియైన దేవుఁడు నీరెంటికి సమన్వయము చేయవలసియున్నది. సృష్టిక్రమము "గుడ్డిదర్బారుగ" చేయఁబడినదని తలఁచియూరకుండుటవలనఁ బ్రయోజనములేదు. మానవునకుఁ గర్మస్వాతంత్ర్యమీయఁబడిన కారణమున నీలోకములో నిన్ని అక్రమములు, దుఃఖములు సంభవించిన వనుభావము అసమత్వముతోఁగూడిన మానవజాతి నీలోకమున సృజించినదోషమునకు సమాధానము కాఁజాలదు. ఆదిలోనే భిన్నలక్షణములతో నేర్పడినసృష్టి పరిపూర్ణజ్ఞానమూర్తియైన దైవభావమునకు విరుద్ధమగుచున్నది. పురనర్జన్మసిద్ధాంతమీ సృష్టియొక్క మూలదోషమును లోపము నొకకొంత సవరించి సమన్వయించుచున్నది. లోకములోని అక్రమము, దుఃఖము, మానవుని శీలవికాసమున కేర్పడినవని యీసిద్ధాంతము కొంత యుపశాంతి నొసగుచున్నది. దుష్కర్మఫలితమైన శిక్షదుర్బుద్ధిని శుద్ధిచేయుట కేర్పాటు చేయఁబడినది. మన పాపములకు మనము శిక్ష ననుభవించుచున్నాము, కాని, దానివలన మనము శుద్ధులము కూడ నగుచున్నాము. అందుచే మనకు శిక్షాదుఃఖము మంచిదే.

పునర్జన్మ సిద్ధాంత మెట్లుద్భవించినదో యిదివఱకే సూచించియుంటిమి. ఆర్యులు దేశీయానాగరిక జాతులమధ్యమందు వ్యాపించియున్న భావములతోడి సంపర్కమువలన నీ సిద్ధాంతమును గల్పించియుండవచ్చును. వేదములును దేవ

యాన పితృయానములను జెప్పియున్నవి. పశువృక్షాదులందు మానవుల జీవులు ప్రవేశించునను భావము, భారతవర్షాదిమ నివాసుల విశ్వాసములనుండి వచ్చినది; బ్రాహ్మణములు కర్మలకు ఫలితావశ్యకత నుగ్గడించినవి. ఈభావములతో నుపనిషత్తులు సంసారసిద్ధాంతము నల్లినవి. ఈసిద్ధాంత జన్మమునకు వేఱొక యాధారమును వెదుకనక్కఱలేదు. ప్రాచీనగ్రీసు దేశమున నిట్టి సిద్ధాంతములుండి యున్నయెడల నవి స్వతంత్రముగానుద్భవించి, పెంపొంది యుండనగును. అభినవపండితాభిప్రాయము దీనికి వ్యతిరేకమైయున్నది. భారతీయ గ్రీక్కువిజ్ఞానములందీ సిద్ధాంతములనుగూర్చి, రెండు సుప్రసిద్ధుల రచనల నిట నుదాహరించుచున్నాము. మెక్డనల్ పండితుఁడిట్లు వ్రాసెను. "పైథాగరస్ భారతీయ తత్త్వముపైనను, నితర శాస్త్రములపైనను, నాధారపడినవిషయమున కాధారమున్నది. పైథాగరస్ చెప్పిన జన్మాంతరసిద్ధాంతమున కాతని రచనలలోనే యాధారసంబంధము లేకుండుటయు, గ్రీక్కులే యీ సిద్ధాంతము విజాతీయమని భావించుటయు జరిగినది. ఆతఁడు దీని నీజిప్టునుండి స్వీకరింపలేదు. ఏలన నీజిప్టువారి కీసిద్ధాంతము తెలియదు." ౧. గోంపెర్జు పండితుఁ డిట్లువ్రాసెను: "పైథాగరస్ మతమునకును భారతీయ సిద్ధాంతమునకును సన్నిహిత సమానత్వమున్నది. సామాన్యలక్షణములందే కాక, కొన్ని వివరములలోఁగూడ నీ సామ్యము గోచరించుచున్నది. శాఖాహారమిట్టి వివరములలో నొకటి. సంసారము జనన మరణాత్మకమైన చక్రమువంటిదను సిద్ధాంతము రెంటికి సమానము.

౧. హిస్టరీ ఆఫ్ సాన్స్క్రిటు లిటరేచరు పుట ౪౨౨.

ఈసామ్యము హఠాత్సంభవమనుట తగదు. బుద్ధునికి, బహుశః జరాథుష్ట్రునికి సమకాలికుఁడైన పైథాగరస్ పండితుఁడు, విజ్ఞాన ప్రచార వ్యాసంగము విశేషముగాగల నాటి యుగములో పెర్షియా దేశీయుల ద్వారమున భారతీయుల మతతత్త్వ భావములను సంపూర్ణముగాఁ దెలిసికొనియుండెనని తలచుట సత్యదూరముకాఁజాలదు." ౧. భారతీయులు తమ భావములను జాత్యంతరులనుండి గ్రహింపలేదనిమాత్రము స్పష్టము.

## -౨౧- ఉపనిషన్మనస్తత్త్వశాస్త్రము.

ఒకశాస్త్రీయపద్ధతిలో మనస్తత్త్వము నుపనిషత్తులు నిర్ణయించి రచింపకున్నను, నవి ప్రదర్శించిన కొన్ని భావములను మనము సేకరింపవచ్చును. ప్రశ్నోపనిషత్తునందు ౨. (కర్మేంద్రియము లైదు, జ్ఞానేంద్రియము లైదుఁ గలసి దశేంద్రియములును జెప్పఁబడెను. ఈ యింద్రియములు మనస్సునకు వశములై వర్తించును. మనస్సు కేంద్రమైన యంగమై, దర్శన క్రియాశక్తిని గలిగియున్నది. మనస్సులేనిదే యింద్రియములు నిరర్థకములు. 3. అందుచే నింద్రియములలో మనస్సే ముఖ్యేంద్రియమని చెప్పఁబడినది. మనస్సనగాఁ బ్రజ్ఞలేనిదే వాక్కు దేనినిఁ దెలుపఁజాలదు. "నామనస్సిచ్చటలే" దందుము. "ఆలోకమును నేఁజూడలేదు; ప్రజ్ఞలేనిదే, యేరూ

౧. గ్రీకు థింకర్సు, వాల్యూము ౧ పుట ౧౨౭.

౨. ప్రశ్నోపనిషత్తు, ౪౮. ౨.

3. బృహదారణ్యకము. ౧౭ ౫, 3.

పమును నేత్రము తెలియఁజాలదు." ౧. "నేను పరధ్యాన ముగానుంటిని; నేను జూడలేదు; నేను పరధ్యానముగానుం టిని; నేను వినలేదు. దీనినిఁబట్టి మనుష్యుఁడు మనస్సుతోఁ జూచుననియు మనస్సుతో వినుననియు స్పష్టమగుచున్నది." ౨, మనస్సునొక భౌతికపదార్థముగాఁ జూడబడినది 3. అందుచే నింద్రియజ్ఞానమునకు, ముఖ్యమింద్రియమునుగాదు, ఇంద్రియ వ్యాపారమునుగాదు; ఆత్మయింద్రియము ద్వారమునఁ జూడ వలెనని యుపనిషత్తులు చెప్పినవి. వస్తుజ్ఞానమున కింద్రియ ములకు వస్తుసాన్నిధ్య మవసరమని చెప్పఁబడెను. ౪. ఒకేసారి మనస్సొకే వ్యాపారమును జేయఁగలదు. ౫. మనస్సుకంటె బుద్ధి యున్నతమైనది. బుద్ధివ్యాపార మిట్లైతరేయమునఁజెప్ప బడెను; "స్పృశించుట, చూచుట, ఆలోచించుట, భావముల నిర్మించుట, తెలియుట, అంతరవలోకనము, నిశ్చయించుట, అభిప్రాయపడుట, ఊహించుట, అనుభవించుట, జ్ఞాపకముం చుకొనుట, సంకల్పము, భావముల పొందుపఱచుట, జీవించుట కిచ్ఛ, కాంక్ష. నిగ్రహము, నివన్నియు బుద్ధియొక్క భిన్న లక్షణములు." ౬. ఈ వర్ణనము విమర్శనమునకు నిలుచునది కాదుకాని, అతిప్రాచీనమైన ఉపనిషత్కాలమున నిట్టి మన

౧. కౌషీతకి. (౨) బృహదారణ్యకము 3అ ౧. ౪.

3. అలెగ్జాండరు పండితుఁ డొక నిర్మాణములోని యొకవస్తువువలెఁ; భౌతికశాస్త్రజ్ఞుని 'ఎలెక్ట్రిన్'వలె, మనస్సొక వస్తువని చెప్పెను.

౪. ఎంపిడోక్లిసు; డెమాక్రిటస్ భావములను బోల్చెఁడు.

౫. కౌషీతకి 3 అ. ౪ (౬) కౌషీతకి 3అ. ౨.

స్తత్త్వచర్చ జరిగియుండుటలో విశేషము లేకపోలేదు. నేత్రి మునకు నేత్రము, శ్రోత్రమునకు శ్రోత్రము నైన 'ఆత్మ' అన్ని టిలో నగ్రమైనది. బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, ప్రాణ ములు మున్నగునవన్నియు నాత్మాధీనములు. ౬. ఆత్మ సర్వ వ్యాపియు, పరిపూర్ణమైనదియును, ౭. ఆత్మకు సగుణాకార మిచ్చి, అది మానవుని హృదయగుహలో నివసించుచున్నట్లు చెప్పఁబడెను. ౧. ఆత్మ నీ వారబీజప్రమాణము ౨. కలది నియు, జానెడుపొడుగు ౩. కాని, బొటనవ్రేలంత ౪. కాని యుండుననియుఁ బేర్కొనఁబడెను. ఉపనిషత్కర్త లాత్మకు స్థానమని చెప్పుటలో నాశ్చర్యముండనవసరము లేదు; ఏలన ఆరిస్టాటల్ తన 'డేఅనిమా' గ్రంథమున నాత్మ హృదయ ములో నున్నదనియు, గేలన్ మేధస్సులోనున్నదనియు, డేకార్టే ఆత్మస్థానముపై నియల్గ్లాండనియు, టోషే మేధస్సనియుఁ జెప్పియుండిరి.

౬ బృహదారణ్యకము ౪అ. ౪. ౫; ౧అ. ౪. ౧౬; ౫అ ౬; ౨అ. ౧. ౧౬; ౩అ. ౭. ౨౨; ౪అ. ౩. ౭; ౪అ. ౫. ౧౩:

౭. కఠము ౧అ. ౨. ౨౧; ముండకము ౧అ. ౧. ౬.

౧. బృహదారణ్యకము ౪అ. ౩. ౧౭; ౫అ. ౬; ఛాందోగ్యము ౭అ ౩. ౩; ౫అ. ౧౮ కఠము ౨అ. ౨౦ ౩అ ౧.౪ అ౬ ౬అ ౧౭ శ్వేతాశ్వ తరము ౩అ. ౧౧. ౨౦; హృదయము లేక హృత్పద్మము వెన్నెముకలో నొక కేంద్రము.

౨. బృహదారణ్యకము ౫అ. ౬. ౧; ఛాందోగ్యము ౩అ. ౧౪. ౩

౩. ఛాందోగ్యము ౫అ. ౧౮.౧;

౪. కఠము ౬. ౧౭; ౨అ. ౨౧; శ్వేతాశ్వతరము ౩అ. ౧౩.

మనస్సు చైతన్యముకంటె నధికమైనది. మనస్సులోని యొకభాగమే చైతన్యము; ఆత్మ ప్రపంచముకాదను మహత్తర సత్యము నిప్పుడిప్పుడే పశ్చిమవిజ్ఞానము గుర్తించుచున్నది. లైబ్నిజ్‌కాలమునుండియుఁ జైతన్యము మనస్సులో నొక యల్పాంశమనియు, మనస్సున కవసరమును, ప్రధానమునైన లక్షణముకాదనియు గుర్తింపఁబడినది. "మన యాంతర్య ప్రపంచము బాహ్యప్రపంచముకంటె విశాలమైనది, సంపత్తరమైనది, అధికముగా నాచ్ఛాదింపఁబడినది."యని లైబ్నిజ్ చెప్పినభావము నుపనిషత్కర్తలు స్పష్టముగా నెఱిఁగియుండిరి.

మాండూక్యోపనిషత్తు, ఆత్మయొక్క వివిధావస్థలను, జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయావస్థలను బేర్కొనినది. జాగ్రదవస్థలో, మనస్సు నిందియములు పనిచేయుచుండును. స్వప్నావస్థలో నింద్రియములు మనోగతములై శాంతించియుండునని చెప్పిన విషయమును నేటి మనస్తత్త్వశాస్త్రము కాదనను. కాని ఉపనిషత్తుల ననుసరించి, మన యింద్రియములు పనిచేయుచున్నంతకాలము మనము కునికిపాటులో నుండవచ్చునేకాని, స్వప్నగతి నొందఁజాలము. అది అర్ధ జాగ్రదవస్థ. సరియైన స్వప్నావస్థలలో, మనస్సొక్కటే, విశృంఖల విహారమొనర్చును. జాగ్రత్స్వప్నావస్థలకుఁగల భేదమేమనగా, జాగ్రదవస్థలో, మనస్సు బాహ్యవిషయములపై నాధారపడియుండును; స్వప్నావస్థలో తనకువలయు విషయములఁ దానే కల్పించుకొని యనుభవించును. కాని, జాగ్రదవస్థలోని వస్తువుల వాసనల నుపయోగించును. సుషుప్తి లేక గాఢనిద్ర

మానవుని సహజావస్థయే. ఇందు మనస్సు నింద్రియములు రెండును విరతిఁబొందును. విషయీవిషయ విభాగములతోఁ గూడిన 'అహం' భావము విరతిపొందును. ఈ స్థితిలో దృశ్యములేని ద్రష్ట యొక్కఁడేయుండి తాత్కాలికముగా బ్రహ్మముతో నైక్యముగాంచును. ఏది యెట్లున్నను నీ స్థితి శూన్యమైనది కాని జీవరహితముగాని కాదు. ఏ యనుభవమును లేని గాఢనిద్రావస్థలో జీవుఁడుండి తాత్కాలికముగా నానందముఁ బొందునను విషయ మంగీకరించుట కష్టముగాఁదోఁచును. ఉపనిషత్తులైన నీ యవస్థలోని యెఱుక లేకుండ జరిగిపోవు దేహావసరకృత్యములకుఁ గారణము 'ప్రాణమ'నియు, దానివలననే యుచ్ఛ్వాసనిశ్వాసములు, రక్తప్రసరణము మున్నగునవి జరుగుచుండుననియుఁ జెప్పినవి. పూర్వాపర విషయములను గలుపు జ్ఞాపకశక్తియే యీయవస్థలో జీవి నిర్జీవముకాలేదని ఋజువు చేయుచున్నది. గ్రహణశక్తి లోపించియున్నను, నాసందర్భములో జీవి నిజముగా నానంద మనుభవించుచున్నదా యను విషయము సంశయాస్పదము. తురీయావస్థ ఏకత్వమును గుర్తించునవస్థ; అది మనస్సునకు గోచరించు విషయముకాదు. ఆత్మ సాధనమునకుఁ బూర్ణఫలరూపమైన సర్వైక్యభావము యొక్క అనుభవసిద్ధి తురీయ సమాధియందుఁ గలుగును.

ఉపనిషత్తులలోని వేదాంతేతరవిషయములను బరిశీలించుటకుముందుగా, నుపనిషత్తుల సామాన్యతత్త్వసిద్ధాంతము నిట నిర్వచనరూపముగాఁ జెప్పుకొను టవసరమైయున్నది. భిన్నతత్త్వ నిర్మాణములను సమర్థించుట కనకాశము గలు

గఁ జేసిన, సందిగ్ధభావము లుపనిషత్తులలో నున్నవని మేము మొదటనే చెప్పియుంటిమి; శంకరుని అద్వైతమూ, రామానుజుని విశిష్టాద్వైతమూ మూలగ్రంథములయొక్క నిశ్చితభావమను విషయము నిదమిత్థమని చెప్పుట సుసాధ్యముకాదు. రెండువాదములకు సామర్థ్యమొసగు సూచనలు బహుళముగా నందుఁగలవు. వానిలోఁ బరస్పర వైరుధ్యములున్నవని యుపనిషత్తులెఱుగవు. సమాధ్యవస్థలో గోచరించిన అద్వైతబ్రహ్మము, రెండవదైన సగుణబ్రహ్మము నిజమునకు వేఱుకావు; ఒకేసత్యమును రెండువిధములఁ జెప్పుట యేయగును. ఒకేపరమసత్యము యోగిదృష్టికి నిర్గుణైకబ్రహ్మముగను, తర్కబుద్ధికి సగుణబ్రహ్మముగాను గోచరించును. మొదటిదృష్టిలోఁ బ్రపంచము బ్రహ్మముయొక్క రూపాంతరము; రెండవదృష్టిలో నది దేవునియొక్క పరిదర్శనము, రెంటి ననుసరించియుఁగూడఁ బ్రపంచమొక అసత్య స్వరూపమనికాని మిథ్యయనికాని త్రోసివేయవీలులేదు; ఏలనఁ బ్రపంచము మిథ్యయైనచో మన యనుభవములకెట్టి విలువయు నుండదు. బౌద్ధమతముయొక్కయుఁ దత్శాఖలయొక్కయు నొత్తిడిచే ననంతరమువచ్చిన గౌడపాదాదులు, పరమసత్యముయొక్క అద్వితీయతను, ప్రపంచముయొక్క అసత్యస్థితియును విశేషముగా నొక్కిచెప్పిరి. నిజముగా నట్టి యద్వైత తత్త్వము, మాధ్యమికబౌద్ధుల తత్త్వమును వేదాంతపరిభాషలోఁ జెప్పినట్లగపడును. పురాణేతిహాసములు భగవద్గీతయు చేసిన మతతత్త్వ పునర్నిర్మాణము, న్యాయశాస్త్రమొసగిన దైవతత్త్వము, రామానుజ

కల్పితమైన విశిష్టాద్వైత తత్త్వమునకుఁ దారిఁజూపినవి. నిజముగా నద్వైతవాదులందఱు పరిశుద్ధసంగతు లనగా సంస్కరింపఁబడిన బౌద్ధవాదులనియు విశిష్టాద్వైతులందఱు పరిశుద్ధనైయాయికులనియుఁ బిలువఁబడిరి.

## ౨. ౨.—ఉపనిషత్తులలో సాంఖ్యయోగ బీజములు

ఉపనిషత్తులలో వేదాంతేతరములైన సాంఖ్యయోగ శాస్త్రములకు బీజములున్నవి. ప్రకృతి పురుషరూపమైన ద్వైతమును సాంఖ్యశాస్త్రమును స్థాపించినది. ప్రకృతి సర్వసృష్టికారణమైయుండగా, పురుషుఁడు, సంబంధములేని సాక్షియై ప్రకృతిపరిణామమును దిలకించుచున్నాఁడు; పురుషులయొక్క లేక జీవుల ౧. యొక్క నానాత్వముకూడ నంగీకరింపఁబడినది. ఉప

౧. భిన్నత్వమునకంతకును మూలభూతమైయున్న అవ్యక్తము లేక ప్రకృతి నుపనిషత్తులు స్పష్టముగాఁ జెప్పినవి. "ఇంద్రియములకతీతములై వస్తుతన్మాత్రలున్నవి. వీనికతీతమై మనస్సున్నది; మనస్సుపైన మహాత్తత్త్వమున్నది: దానిపైన వ్యక్తమున్నది; దీనిపైఁ బురుషుఁడు; పురుషునిపైనేమియును లేదు." (కఠము ౩అ ౧౦. ౧౧; ౬అ ౭. ౮.) సృష్టికారణమైన అవ్యక్తముపైన దేవుఁడొకఁడే యున్నాఁడు. "తపస్సుచే బ్రహ్మము వృద్ధిపొంది, అందుండి అన్నముత్పత్తియగును; అన్నమునుండి, ప్రాణము, మనస్సు, భూతములు, లోకములు, కర్మ కర్మఫలములు నన్నియువచ్చును." (ముండకము. ౧అ ౧.) ఇందుఁజెప్పిన అన్నమును శంకరుఁ డవ్యాకృతమని చెప్పినాఁడు. ప్రశ్నోపనిషత్తునందు (౪అ.) వస్తువులన్నియు నెట్లువచ్చినక్రమములోనే అవ్యక్తమునందుఁ దన్మాత్రలతోఁ బ్రవేశించునో చెప్పఁబడినది. (చూడు ప్రశ్న. ౪అ. ౮.) దేవునిలోనుండి ప్రకృతి వచ్చినదని యుపనిషత్తులు చెప్పినవి. పురుషుడనగాఁ పరబ్రహ్మము. (ముండకము ౩అ. ౧. ౧)

నిషత్తులీ నానాత్వము నంగీకరింపవు. ఉపనిషత్తుల అద్వైతము మతానుష్ఠానావసరము కొఱకై యెట్లేకేశ్వరవాదముగా మారినదో మనము చూచియుంటిమి. ఏకేశ్వరవాదము, పరమేశ్వరునితోఁబాటు వానినారాధించు వ్యక్తుల నంగీకరించును. ఫలితము జీవనానాత్వము. కాని పరమేశ్వరుని స్వాతంత్ర్యము ప్రత్యేకజీవుల స్వాతంత్ర్యము పరస్పరవిరుద్ధమను విషయమును సాంఖ్యసిద్ధాంతులు గ్రహించియుండిరి. ఇందెవరో, అటు పరమేశ్వరుఁడో, యిటు ప్రత్యేకజీవులోఁ దొలఁగవలెను. సృష్టి పరిణామ సామర్థ్యము ప్రకృతికీయబడినప్పుడికఁ బరమపురుషుని యవసరము కానరాదయ్యెను. దేవుని సంబంధములేని జడ పదార్థమైన ప్రకృతికి సృజనశక్తి నొప్పగించుట నుపనిషత్తులు నిరసించెను. పరమసత్యమైన దొకే సత్పదార్థమున్నదనియు దానిపై నాధారపడి కర్తృ కర్మభేదము లేర్పడినవనియు నుపనిషత్తుల ప్రధాననిర్ణయమైయున్నది. ౧.

ఉపనిషత్తులలో యోగ శాస్త్రారంభదశ గోచరించును. మన అసంపూర్ణ ప్రజ్ఞాబలము సత్యమును దర్శింపఁజాలదని ఉపనిషత్తుల నిశ్చయభావము; మనస్సను నద్దమున సత్యప్రతి బింబముమాత్రమే గోచరించునని చెప్పఁబడినది. సత్యస్వరూ

---

పసారవృక్షముపై రెండుపక్షులున్నవనియు నొకటి మధురఫలాస్వాదనమును చేయుచుండగా రెండవది సాక్షిమాత్రముగా నుండునని చెప్పిన భావమునుండి సాంఖ్యపురుషుని లక్షణము తీసికొనఁబడియుండును.

౧. చూడు ఐతరేయము, ౧అ ౧. ౨; బృహదారణ్యకము ౧అ ४.3; ఛాందోగ్యము ౬అ ౨. ౬; తైత్తిరీయము ౨అ ౧.

పము నెంతవఱకుఁ దెలిసికొనఁగలశక్తిని మనస్సుకలిగియున్నదో దానినిఁబట్టి మన జ్ఞానపరిమితియుండును. గ్రుడ్డివానికి రంగులును, బధిరునకు గానమును దెలియనట్లే, అల్పబుద్ధికి సత్యము గోచరించదు. తెలియుట యనునది నూతనసృష్టి కాదు; ఉన్న సత్యమునే దర్శించుట. తెలియునుపకరణములో నేమాత్రము కలుషమున్నను, సత్య మసంపూర్ణముగానో, రూపాంతరముగనో గోచరించును. మనస్సునకు సత్యమునకు మధ్యమందు మనస్వార్థములైన కోరికలు, మోహములువచ్చి అడ్డు నిలచును. వ్యక్తికిఁగల దోషములు మనస్సునకుఁ బట్టినపుడు సత్యప్రతిబింబ మస్పష్టమైన యాకృతిఁ గలిగియుండును. ద్రష్ట యొక్క అజ్ఞానము సత్పదార్థమును భిన్నరూపములోఁ జూపును. ఆతనివ్యక్తిగత భావవికారములచే వస్తుసత్యము వికారాకృతిలో గోచరించును. మనస్సంబంధమైన దోషము సత్యములోఁ బ్రవేశించుటే అపార్థమునకుఁ గారణము. నిరహంకార నిష్కపటమైనదృష్టి సత్యదర్శనమునకవసరము. వ్యక్తిగతమైన దృష్టి సత్యమును మఱుగుపఱచును. మనస్సువలన మనకు సంభవించు అపసవ్యవ్యాపారములనుండి మనము బయటపడవలసియున్నది. అనవసరచపలసంచారముచే వ్యర్థమగుచున్న మానసికశక్తులను వారించి, సత్యస్ఫురణ కనుకూలమైన నిశ్చల నిష్కలుష మార్గములలో వానినుంచవలెను. చిత్తమను నద్దమును శుద్ధిచేసి, వ్యక్తిగత కలుషములందుఁ జేరకుండఁ జేయువిధానములను యోగశాస్త్రము మనకిచ్చుచున్నది. ఇట్టిశిక్షణమే మనకు నిరహంకారమైన మహోన్నత వ్యక్తిత్వమునిచ్చును; ఇట్టి

యున్నతదశలోనుండియే మహాపురుషులైన వారెవరుఁ జూడఁ జాలని సత్యములను దర్శించిరి. ఇది ఉపనిషత్తుల ఆత్మసిద్ధాంతమున కనుకూలమైన విధానము. మానవ సామాన్యదృష్టి శాశ్వతమైన ఆత్మప్రపంచమువైపు దిరుగక, యింద్రియ మనఃకల్పితమైన నశ్వరప్రపంచమునందే సంచరించును. మన మీయింద్రియముల నధిగమించి, ఉన్నతపదవికిఁ బోయినచో, మన వ్యక్తిత్వము నన్నగిల్లదు; సముల్లసితము సమృద్ధము నగును. మనవ్యక్తిత్వము భౌతికవిషయ రజ్జువులచే బంధింపఁ బడినచో నది శక్తివంతము కాఁజాలదు. వ్యావహారికబంధముల నతిక్రమించినపుడు మన వ్యక్తిత్వమునకు విశ్వవైశాల్యము గలిగి, సమున్నతపదవి నలంకరించును. అప్పు డనుభవజ్ఞాన మతిశయించును. క్రిందిమెట్టులలో ననగా దేశకాలములందు జరుగు పరిణామస్థితిలోఁ దాత్కాలిక కేంద్రమైన 'అహం' భావముగా మనమున్నప్పుడు, మన యనుభవ మస్వతంత్రమైన దగును. సంకుచితమైన 'అహం' స్థాన కేంద్రమునకుఁ గట్టువడిన, మన వ్యక్తిత్వమును, బంధముల నూడఁబెరకి, స్వతంత్రవ్యక్తిత్వముగా మారినప్పుడే, దేవుఁడు కేంద్రముగాను, మానవుఁడు కేంద్రపరిధి నాక్రమించినవాఁడుగాను నుండు స్వచ్ఛందానుభవసిద్ధి మనకు లభింపఁగలదు. అట్టిస్థితిలో మన ముపనిషత్తులు చెప్పినరీతిని "బాహ్యముననున్నది, లోపలనున్నది యొకటే" యని గుర్తింతుము. బాహ్యమునే విలోకించు నభ్యాసమును విసర్జించినఁగాని, ఆత్మ సౌందర్యానుభవసిద్ధి చేకూరఁ జాలదని యోగశాస్త్రము ఘోషించుచున్నది. భ్రాంతి,

మాయ జగద్దర్శనాపేక్ష నమసినఁగాని, శాశ్వతసత్య జగద్దర్శన లాభము చేకూరదు.

యోగశాస్త్రము మానసికాధ్యాత్మిక శిక్షణము మన కవసరమని చెప్పుచున్నది. పరమార్థసంపాదనమునకుఁ బరిశుద్ధ నియమజీవిత మవసరమని ఉపనిషత్తులును జెప్పినవి. ప్రశ్నోపనిషత్తునందుఁ బిప్పలాదుఁడను గురువు బ్రహ్మజ్ఞానము కోరి వచ్చిన యాఱుగురుశిష్యుల నింకొక యేఁడు శిక్షణము పొంది రమ్మని యిట్లు శాసించినాఁడు. "పోయి మీరింకొకసంవత్సరము బ్రహ్మచర్య శ్రద్ధాతపస్సులతో జీవించి సుశిక్షితులైరండు." సంసారసంబంధ బాధ్యతలులేని, బ్రహ్మచర్య దీక్షవలన మనుష్యుఁడు తన యావచ్ఛక్తిని పరమార్థముపైఁ గేంద్రీకరింప వచ్చును. జ్ఞానవిరోధియైన అశాంతి, నశించి, చిత్తశాంతి తపస్సుచే లభించును. శ్రద్ధలేక విశ్వాస మన్నికర్మల కునవసరమే. ప్రకృతిస్థితినుండి, ప్రకృత్యతీతస్థితికి మానవునుద్ధరించి, యచటఁ బరమేశ్వరుని ప్రత్యక్షసాంగత్యము జేకూర్చుటయే యోగ శాస్త్ర ప్రబోధములోని సారాంశము. మనలను బాహ్యవస్తువులకు బంధించి బానిసలుగాఁ జేయుచున్న మనస్సును నిగ్రహించినగాని మోక్షములభింపదు. బాహ్యవస్తువులకుఁ బరిస్థితులకు బానిసలమైన కారణముననే మనకు సంతృప్తి లభించుటలేదు. "పర్వతశిఖరము పైఁగురిసిన వర్షజలము నలుదెసలనుండి క్రిందకు ప్రసరించునట్లు, వస్తుభిన్నగుణములచే నాకర్షింపఁబడిన వాఁడు నలుదెసలకు వానికొఱకై సంచరించును; శుద్ధోదకమునందు శుద్ధోదకము బోసినచో మార్పులేకుండ నిలిచినట్లు, ఓగౌతమా!

జ్ఞానియొక్క ఆత్మనిలుచును. ౧. తన యాత్మనెఱుఁగని వ్యక్తి మనస్సు, నిలువుఱాతిపైఁబడిన వర్షధారవలె, నన్నివైపులకుఁ జెదరిపోవును. కాని చిత్తశుద్ధికలిగిన వెనుక, సర్వజంతురూపములలో డాఁగియున్న విశ్వజీవసాగరముతో నొకటై విశ్రమించును. స్వేచ్ఛగా వదలినచో బహిర్ముఖమైన మనస్సు ఎడారి యిసుకలోఁ జెదరిపోవును. సాధకుఁడు. తనలోనున్న అంతర్విధానమును దర్శింపఁగోరుచో, మనోదృష్టిని లోపలికిఁద్రిప్పి నిశ్చలముగా నిలుపవలెను. వాక్కును భావములోనికిని, భావమును జ్ఞానములోనికిని, జ్ఞానమును విశ్వచైతన్యములోనికిని, బ్రవేశపెట్టవలెను; అప్పుడే నిత్యమైన ఆత్మశాంతి లభించును.౨ "పంచజ్ఞానేంద్రియము లుపశాంతిబొంది, మనోబుద్ధులు నిశ్చలములైనప్పుడే ఉత్తమగతినిఁ జేరుదుము"3. "ఉపనిషత్ జ్ఞానమను మహాధనుస్సును గ్రహించి, నిత్యధ్యానమను నిశితాస్త్రము నందు సంధించి, బ్రహ్మలగ్నమైన మనస్సును వింటిత్రాడు లాగి, ఓ ఉల్లాసముగల యువకుఁడా! బ్రహ్మమను లక్ష్యమును గురిచూచికొట్టుము" ౧. ప్రతర్దనుఁడను నాతఁడొక నూత్నసంయమన విధానమును గాంచెనని కౌషీతక్యుపనిషత్తు చెప్పినది.

౧. కఠము ౨అ. ౧౫ (౨) కఠము ౨అ. ౧౩. పోల్చు "మనస్సు నిశ్చలమైయున్నప్పుడు కలుగు సమాలోచన మాత్రమువైనది. శబ్దములు కాని రూపములుకాని, మోదఖేదములు కాని దానినప్పుడు బాధింపవు. మనస్సు నకు దేహసంబంధము కాని దేహాభిమానము కాని లేక పురుషదర్శనలాలసమై యున్నప్పు డిట్టిస్థితిలభించును." ప్లేటోఫిడోడోగ్రంథము.

3. కఠము ౧అ ౧౨.

౧. ముండకము ౨అ. ౨,౨

దానికే అంతర్యజ్ఞమని౨ పేరు. దీనిననుసరించి,, మానవుఁ డింద్రియములను కామములను పూర్ణనిగ్రహములో నుంచవలెను. 3 శ్వాసను నిగ్రహించుటచే సమాధి లభించునని ఉపనిషత్తులప్పుడప్పుడు చెప్పినను, 'ఏకాగ్రత'౪ కెక్కువప్రాధాన్యము నిచ్చియున్నవి. బీజాక్షరములగు ఓమ్, తద్వనమ్. ౫ తజ్జలాన్ ౬ ము న్నగుచిహ్నములపై మనస్సు లగ్నము చేయుమని చెప్పినవి. ఏదోయొక ప్రత్యేకవస్తువుపైఁ గొంతసేపు మనస్సును గేంద్రీకరించు నభ్యాసముచే నేకాగ్రత చేకూరునని చెప్పఁబడెను.

న్యాయ్యశాస్త్రసూచన లొక్కముండకమునం దేకలవుఁ ౭. "ఈ యాత్మబలహీనునకు లభింపదు; ఆవేశముచేఁగాని తపస్సుచేఁగాని లింగముచేఁగాని ఆత్మను పొందఁజాలము"౮. లింగమనఁగా, న్యాయ్యశాస్త్రమని తరువాతఁ దెలియఁగలదు; అనఁగా ననుమానములోని మధ్యపదము లేక సంయోగకారణము లింగము. సత్యము ననుమానప్రమాణముచేఁ దెలియునను వ్యవహారసిద్ధాంతముకూడఁ జేర్కొనఁబడెను. "ఒకమట్టిముద్ద వలన మంటిచేఁ జేయఁబడిన సర్వవస్తుస్వభావము తెలియును. ఒక సువర్ణశకలముచే సర్వసువర్ణమయ వస్తుస్వభావము తెలియఁగలదు" ౯. విషయివిషయ భేదముచేతనే జ్ఞానము సాధ్యమని ప్రతర్దనుఁడు చెప్పియున్నాఁడు.

(౨) అంతరమగ్నిహోత్రిమ్ ౨అ. ౫.
3. బృహదారణ్యకము ౧అ. ౫.౨౩ (౪) ప్రశ్న ౫అ. ౧
(౫) కేన ౪అ.౬ ౬) ఛాందోగ్యము ౩అ ౧౪.౧
(౭)ముండకము ౩అ. ౨.౪. ద్వ్యాసేకైహ్వ్యాఖ్యములు దీనికి వేరర్థమును జెప్పిరి.
(౮) లింగము సంయోగసాధనము చూడు ఛాందోగ్యము ౪అ. ౮.౪
(౯) ఛాందోగ్యము ౪అ. ౧.౪-౬

## ౨౩—భావితత్త్వ బీజములు.

తత్త్వాన్వేషణముయొక్క ప్రధానలక్షణముల నుపనిషత్తులు నిర్ణయించి, రాఁబోవుతత్త్వచర్చా మార్గములను సూచించినవి. ఇతర సిద్ధాంతసూచనల నటుంచి, ఉపనిషత్తులు పరిపూర్ణమైన తత్త్వసిద్ధాంతమునకు వలయు లక్షణములను, అనఁగా, ప్రపంచముయొక్క సంబంధసత్యస్థితి, సత్పదార్థముయొక్క పూర్ణత్వైకత్వములు, నీతిమతజీవితానుష్ఠానావసరములను ప్రదర్శించిన విషయమును మనమిదివఱకే చూచియుంటిమి. ఆత్మపరమాత్మైక్యరూపమైన తత్త్వసమన్వయముచే నుపనిషద్విజ్ఞాన ముత్కృష్టబలసమన్వితమైనదని చెప్పవచ్చును. కాని, యీతత్త్వసమన్వయము నుపనిషత్తులు తర్కప్రజ్ఞావిధానముచేఁగాక ధ్యానమార్గసిద్ధివలన నిరూపించియుండుట, కొంతవఱకు నుపనిషద్విజ్ఞానమునకు లోపముగా గోచరించును. తత్త్వశాస్త్రముయొక్క కేంద్రసత్యము నమోఘముగా నెఱిఁగి ప్రదర్శించినను, దాము ప్రదర్శించిన భిన్నతత్త్వభావముల వైరుధ్యములను సక్రమతార్కిక విధానముచే సమన్వయించి యుండలేదని మన మంగీకరింపవచ్చును.

వేదమత విశ్వాసము లుపనిషత్కర్తలపై నెక్కువయొత్తిడి కలుగఁజేసెను. వారు వానిని విమర్శించుట కేసంశయమును జూపకున్నను, పూర్వసంప్రదాయము వారిని గొంత లొంగఁదీసినది. భావిదశాభ్యుదయమునకు వారు కర్తలమనిపించుకొని, పురాతనౌన్నత్యమం దమితభక్తిగలవారనిపించుకొనుటకును జూచిరి. ఫలితములనుబట్టి చూచిన, నిది మిక్కిలి

తప్పమైనపనియని తెలియఁగలదు. ఏనిర్ణీత మతారాధన విధాన ముగాని, పురోహిత సోపానవర్గముకాని లేని స్వచ్ఛమైన తత్త్వ సిద్ధాంతము నుపనిషత్తులు బోధించియున్నను, వీనినన్నిటిని సహించుటయేకాక, అంగీకరించికూడ నున్నవి. "మంత్రముల లోఁగల వివిధకర్మలు నిజమైనవే; త్రేతాయుగమున విశేష ముగా నాచరింపఁబడినవి. సత్కామాములు వాని నెల్లప్పు డాచ రింపుఁడు. కర్మ ఫలానుభవప్రాప్తి కిదియే మీ కుచితమైన మార్గము." ౧. వేదోక్త దేవతావర్గమునకు యథాస్థాన మీయఁబడెను. ప్రజ లాదరించుచున్న దేవతలను విసర్జింపుఁ డని యెవ్వరును బలుక లేదు. నూతనతత్త్వమునకు విరోధముకాని విధమునఁ బూర్వవిశ్వాసములే, యుక్తియుక్తములైన పద్ధతుల చేతను, నర్థాంతరకల్పనముచేతను, సమన్వయింపఁబడినవి. నాఁటి శకము తత్త్వసిద్ధాంతనిశ్చయ ప్రకటనప్రచారమును గోరినను, నత్యధికమైన సామరస్యవిధాన ముపనిషత్తులు ప్రద ర్శించినవి. బాహ్యశాసనములనుండియుఁ గర్మకలాపమునుం డియు మానవునికి దాస్యవిముక్తి కలిగించు మహోద్యమముగా నుపనిషద్విజ్ఞాన మారంభించినది. వారికృషి పూర్వశృంఖల ములనే తిరిగి బంధించుటతో ముగిసినది. జీవితమునకుఁ గ్రొత్త విలువనొసఁగి బోధించుటకుబదులు సంప్రదాయ ధర్మములనే పునరుద్ఘాటనమొనర్చిరి. సార్వజనిక తత్త్వ ధర్మప్రచారము చేయుటవేఱు, స్థాపించుటవేఱు, పురాతనవిశ్వాసము నుత్కృష్ట తత్త్వలక్ష్యముతో మేళవింప నుపనిషత్తులు వంద్యమైన కృషి

౧. ముండకము ౧అ ౨. ౧.

చేసియున్నవి, కాని నాఁటిప్రజలకుఁ, బూర్వగాథా ప్రపంచముఁ నకును నూత్న తాత్త్వికోద్యమ సత్యమునకు భేదమైనఁ దెలి యుట కవకాశమైన లేకపోయినది. ఉపనిషత్తు లుపదేశించిన మహనీయతత్త్వము, ప్రజాసామాన్య మాదరించిన తత్త్వము కాలేకపోయినది. అది జాతినంతను నెప్పుడు వశముచేసికొని యుండలేదు. క్రతుకలాపమతమే సంఘమున నమలులో నున్నది; ఉపనిషత్తులు దాని కధికగౌరవమును గూర్చినవి. పూర్వవేదమతమునకు మూలకారణ మొకవిధమైన నూత్న శక్తి యెచటనుండియో వచ్చి ప్రవహించినది. ఉపనిషద్ధర్మము ప్రజాసామాన్యములో వ్యాపించియుండినచో జాతియొక్క శీలము నూత్నదృక్పథముదొ్రక్కి నూత్నసాంఘికవ్యవస్థా నిర్మాణ మపూర్వముగా జరిగియుండెడిది. కాని యిందేదియు జరిగినదికాదు. శూన్యమైన మతము యథాపూర్వాంధ విశ్వాసములతోఁ బ్రబలినది. పురోహితవర్గాధికారము ప్రబలమైనది. మతవ్యవస్థల సంప్రదాయ దాస్య మొకవైపున, సామాన్య ప్రజాకోటి క్షేమమునెడ నిర్లక్ష్యభావ మింకొకయెడ నేకకాల మందే నివసించినవి. ఏకొలఁదిమందియో మహోజ్జ్వలమైన వేదాంతధర్మమును బూర్ణానుష్ఠానములో నడపి సిద్ధులైరి. అది మతతత్త్వవైరుధ్యములతో నరాజకమైన శకము. స్వచ్ఛతత్త్వము మొదలు విగ్రహోపాసనము వఱకుఁగల నానామత విధానము లకు స్థానమునుజూపిన పద్ధతిలో నుపనిషత్తుల విజ్ఞానమును ప్రబోధింపఁబడినది. ఫలితమేమన నున్నతమతతత్త్వ మథమ మతాచారములో మగ్నమైపోయినది.

ఎల్లచోటులందుఁ బరస్పర విరుద్ధాభిప్రాయములు పెచ్చు పెరిగినవి. మతరంగమున వేదముల ప్రతిదైవభావము, యజ్ఞ కర్మకాండ, ఉపనిషద్ద్వైతము, తత్త్వానుష్ఠానము సమ్మిళితములై నడచినవి. సాంఘికవిషయములయందు, వర్ణభేదమున్నదికాని, దాని కాఠిన్యము తత్త్వవిశ్వవైశాల్యభావముచే సడలింపఁబడినది. జన్మాంతర సమస్యావిషయమునఁ బునర్జన్మసిద్ధాంతము, నరకలోక భావములతో మిళితమై పోయినది. కాని సత్యమైన యాదర్శ మసత్యభావములలోఁబడి యడుగంటినది. పరస్పరవిరుద్ధ సిద్ధాంతములతోఁగూడిన బ్రాహ్మణముల మతములోని సంశయావస్థ శిఖరమునందుకొని, ఉపనిషదనంతర యుగమందును లేక బౌద్ధపూర్వయుగమందును విహరించినది. సత్యము సంప్రదాయముగను, ధర్మము నిత్యకర్మకలాపము ఘనీభవించిపోయి, స్వతంత్రాత్మ సాధనోదక మింకిపోయిన యుగమిది. జీవిత మొక వ్యర్థకర్మపరంపరయైనది. మానవమానసము, విధినియమయంత్రచక్రబద్ధమైనది. స్వేచ్ఛాశ్వాసను కర్మపాశములు కట్టివైచినవి. ఒకమంత్రము పఠించుచునో లేక ఒక కర్మచేయుచునో, మానవుఁడు నిద్రనుండి మేల్కొన్నది మొదలు త్రాగుట, కుడుచుట, స్నానముచేయుట, మున్నగు సర్వక్రియలు చేయవలసివచ్చినది. అర్థరహిత కర్మలకు, మూర్ఖ విశ్వాసములకు ననుచితమైన గౌరవములిచ్చిన శుష్కలఘు తత్త్వమే ప్రాధాన్యము వహించినది. గాంభీర్యములేని శుష్కతత్త్వము, హ్రస్వదృష్టిగల సంకుచితమతము, ఆడంబరములతో నపార్థములు కల్పించి, బుద్ధిమంతులను గొంతకాలము

కాని, జనసామాన్యమును చిరకాలము కాని తృప్తిపఱుపఁజా లదు. సర్వవిచ్ఛిన్నదశ ప్రారంభమైనది. ఉపనిషచ్ఛ్రుతిఘట నోద్యమము తీవ్రరూపము దాల్చినది. ఉపనిషత్తుల అద్వైతము వేదముల బహుదేవతారాధనము; ఉపనిషత్తుల స్వచ్ఛబ్రహ్మ జ్ఞానము, వేదముల క్రతుకలాపము; ఉపనిషత్తుల మోక్ష సంసారభావము, వేదముల స్వర్గనరకములు; ఉపనిషత్తుల విశ్వ జనీనలక్ష్యము, వేదముల వర్ణవిభాగము నివి పరస్పరము నసం బద్ధములగుటచేఁ జిరకాలము కలిసి యుండఁజాలక పోయెను. ఆయుగము సర్వాంగపునర్నిర్మాణమును గోరినది. సామాన్య మానవ జీవితమునకుఁ దృప్తినొసగు స్వచ్ఛమైన తాత్త్విక మతముకొఱకై ప్రజలు నిరీక్షించుచుండిరి. పరస్పరవిరుద్ధములైన భావముల నసంబద్ధసామరస్యముగా నతుకుపెట్టుటచేఁ గలిగిన అసంతృప్తి, స్వచ్ఛసమన్వయమునకు వ్యతిరేకములైన భావము లను బెరికి వైచినఁగాని శాంతించునవకాశము లేదు. నాఁటిమత ములలో స్పష్టముగా గోచరించుచున్న యతుకులను, బౌద్ధులు, జైనులు, చార్వాకులు బహిరంగముగాఁ జూపనారంభించిరి. బౌద్ధజైనులు, నైతికశుద్ధ ప్రవర్తనావశ్యకత నుగ్గడించి, అదను గుణముగా మతపునర్నిర్మాణమునకుఁ బూనుకొనిరి. కాని వారి ప్రయత్నములు విప్లవాకృతి వహించినవి. ఉపనిషద్విజ్ఞానమొ సఁగిన పరిశుద్ధ విశ్వజనీన ధర్మమును బ్రకటింపఁదలఁచిరి. కాని, బ్రాహ్మణముల వర్ణవిభాగము, క్రతుమతము, ప్రజాదరణ మును గన్న యితర విశ్వాసములు పూర్ణముగా విసర్జనీయ ములని వారు తలఁచిరి. భగవద్గీతయును, దరువాతవచ్చిన ఉప

నిషత్తును, గతచరిత్రమును విస్మరింపక, యందలి లోపములను విశాలభావముతో గమనించి, యేభావమును ద్రోసిపుచ్చ నవసరములేని పూర్ణసమన్వయసిద్ధాంత నిర్మాణము కొఱకు యత్నించినవి. ఉపనిషదనంతర యుగమందు, పురాతనాధు నాతన మతపునర్నిర్మాణ ప్రతిఘటన వ్యాపారమును దేశములో వేఱు వేఱు ప్రదేశములలో సాగించి యుండవచ్చును. బౌద్ధజైన ములు ప్రాచ్యదిశయందును, వేదమత ప్రధానస్థానమైన పశ్చి మదిశయందు భగవద్గీతయును కృషిచేసియున్నది. విజ్ఞానప్రపం చమునఁ జెలరేగిన ఆందోళనము, ప్రతిఘటనము, పునర్నిర్మా ణములతోఁ గూడినట్టి యాయుగమునకు మనము తరలు చున్నాము.

పరిశీలన గ్రంథములు

౧. మ్యాక్సుముల్లరు ది ఉపనిషత్సు (సేక్రెడ్ బుక్సు ఆఫ్ దిఈస్టు వాల్యూములు. ౧;౧౫)
౨. డ్యూసేన్:—ది ఫిలాసఫీ ఆఫ్ ది ఉపనిషత్సు.
౩. గఫ్:—ది ఫిలాసఫీ ఆఫ్ ది ఉపనిషత్సు.
౪. బారువా:—ప్రీ బుద్ధిస్టిక్, ఇండియన్ ఫిలాసఫీ.
౫. మహాదేవశాస్త్రి:—ది తైత్తిరీయోపనిషత్తు.
౬. రేనడే:—ది సైకాలజీ ఆఫ్ ది ఉపనిషత్సు. ఇండియన్ ఫిల సాఫికల్ రివ్యూ. ౧౬—౧౭—౧౮
౭. హ్యూమ్:—ది థర్టీన్ ప్రిన్సిపల్ ఉపనిషత్సు.

ఒంటటి భాగము

సమాప్తము

# భారతీయ తత్త్వశాస్త్రము

*

[డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణుని
'ఇండియన్ ఫిలాసఫీ' అను నాంగ్లగ్రంథమునకు
ఆంధ్రానువాదము]

*

ద్వితీయ భాగము

*

బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ.,
ఆంధ్రోపన్యాసకుఁడు,
పి. ఆర్. కాలేజీ, కాకినాడ.

గ్రంథకర్త:
శ్రీ వివేకానందస్వామి జీవితము
శ్రీ రామతీర్థస్వామి జీవితము
హిందూమతము మున్నగునవి.



డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణుఁడు.

# విషయసూచిక

# 7. సప్తమాధ్యాయము

## ప్రాచీన బౌద్ధమతధర్మతత్త్వము

# 8. అష్టమాధ్యాయము.

## పౌరాణికతత్త్వశాస్త్రము



# 9. నవమాధ్యాయము

## భగవద్గీత - ఆస్తికమతము

# 10. దశమాధ్యాయము

## బౌద్ధమతస్వరూపము



## అంకితము



నీవలె బ్రహ్మతత్త్వమును
నిర్మల నిశ్చయ దివ్యవాక్య సం
భావితలీలఁ బల్కఁగల
వాఁ డెవఁడుండెన్ గురుదేవ! లేఁడు నీ
పావనపూర్ణ నిష్ఠయుఁ ద
పంబును గానము లోకమందు నీ
సేవకుఁడన్ గృపాభరిత
చిత్తత నీకృతి స్వీకరింపవే.

# అనువాదకుని భూమిక

శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణపండితుని గ్రంథరాజమైన భారతీయతత్త్వశాస్త్రము పంచఖండవిద్వత్ప్రపంచమున నొక నూత్న తేజోరాశియై ప్రకాశించినది. ప్రాక్ప్రతీచీతత్త్వసాగరమును మథించి, సారవత్తమ భారతీయ దివ్యతత్త్వోపదేశామృత భాండము నత్యంతనైపుణ్యసాహసములతో రాధాకృష్ణుఁడు భుజస్కంధములపై నిడుకొని సహృదయకోటికిఁ బంచి యిచ్చి తాపోపశాంతిని జేకూర్చినాఁడు. రాధాకృష్ణుఁ డీవిధముగా భారతధర్మదీప్తిహేతుభూతుఁడై స్థిరకీర్తి నార్జించినాఁడు.

వైదికయుగమును గూర్చినభాగమును మేము ప్రథమ భాగముగా ముద్రించి యుంటిమి. ఆంధ్రదేశము దాని నత్యంత ప్రేమతో నందుకొని మా కమితప్రోత్సాహము నిచ్చియున్నది. బౌద్ధమతధర్మతత్త్వమును గూర్చిన దీనిని ద్వితీయభాగముగాఁ బ్రకటించుచుంటిమి. బౌద్ధమతము భరతభూమిలోఁ బుట్టి, ప్రపంచమతమై వ్యాపించినది. బౌద్ధమతవాఙ్మయ మనంతగ్రంథ సంకలితమై యున్నది. దానిని సమగ్రముగాఁ జదివి, గ్రహించుట మహామేధావులకైన నసాధ్య మగుకార్యము. కాని రాధాకృష్ణుఁడు భారతీయతత్త్వరహస్యసంవేది యగుటచే దాని స్వరూపస్వభావములను సంపూర్ణముగా, సవివరముగా సమీక్షించి, యిందుఁ బొందుపఱిచినాఁడు.

బౌద్ధయుగ భారతదేశచరిత్ర పెక్కుకారణములచే శంకోపవిషాదసమ్మిశ్రిత మైన దని చెప్పనగును. అది పుట్టిన

భూమిలోఁ జచ్చి, దేశాంతరముల జీవించి నిలిచినది. దీనికిఁ గారణములను రాధాకృష్ణుఁ డద్భుతముగా వివరించి, సమన్వయింప యత్నించి, సత్యమును మిక్కిలి నేర్పుతోఁ బ్రకటించినాఁడు.

సంప్రదాయముననుసరించి, బౌద్ధమతము నాస్తికమతముగాఁ బరిగణింపఁబడినది. కాని, కొన్ని శతాబ్దములపర్యంతమది భరతభూమిలో నఖండవిజయము నందినది. ఈవిజయమునకుఁ బ్రధానకారణము బుద్ధుని జగన్మోహనవ్యక్తిత్వమే. బుద్ధుఁడు సర్వభోగములు గలిగి, సర్వసంగత్యాగ మొనర్చిన సన్న్యాసిచక్రవర్తియై, సర్వప్రాణికోటిని బూర్ణహృదయముతోఁ బ్రేమించిన శుద్ధకృపారాశియై, ప్రజాకోటి హృదయముల నాకర్షించి జయించినాఁడు. కాని, మూలములో నేదియో ప్రబలలోప మున్నఁ గాని, పతనము సంభవింపదు. బుద్ధుఁడు పారమార్థికసత్యమునుగూర్చి మౌనము వహించినాఁడు. ఈమౌనమున కర్థ మేమి? దీనికిఁ బ్రశ్నోత్తరమాలికారూపము నిచ్చి రాధాకృష్ణపండితుఁడు బుద్ధునిమౌనము గంభీరార్థసమన్వితమని యొప్పింప యత్నించి విఫలుఁడై, చివరిభాగములోఁ దానే ఖండించినాఁడు. బుద్ధుఁడు పరమసత్యము నెఱిఁగియు, దేశకాలపాత్రముల ననుసరించి, దానినిగూర్చి చెప్పకుండుటే ప్రజల కెక్కు డుపయోగకర మని భావించినాఁ డని రాధాకృష్ణపండితునివాదమై యున్నది. బుద్ధునివంటిమహాత్ముఁడు తనకుసత్యము తెలిసియుఁ జెప్ప జంకె ననుట సమంజసముగా లేదు. సత్య మనంతబలప్రభావములు గలది. అట్టి సత్యానుభూతి గలవ్యక్తి, ముఖ్యముగా బుద్ధునివలెఁ గరుణారసపూర్ణుఁడైన వ్యక్తి, ప్రజాభిప్రా

యములకు వెఱచి మౌనము వహించినాఁ డనుభావ మర్థవంతే ముగ లేదు. మనకుఁ దెలియనిదానిని గూర్చి మన మేల ప్రసంగింపవలె నని యూరకుండె ననియే యాతనిమౌనభావ మనుటా యుక్తముగాఁ దోఁచును. సత్యమునుగూర్చి పలికిన నపార్థమగు నని భయపడినచోఁ బలుకకుండుటవలన నెక్కు డపార్థములు తేకెత్తినవి. మానవజాతిలోఁ బరమార్థము నెఱుఁగుకోరిక, సత్యమునుగూర్చి పలుకనంతమాత్రమున నశింపదు. బుద్ధుఁడు కేవలపరమార్థమును విడిచి, నీత్యుపదేశముతోఁ దృప్తిపొందుటచే బౌద్ధమతము భారతదేశములో నామరూపములు లేకుండఁ బోయినది. పరమార్థజ్ఞానవిరహిత నీత్యుపదేశము (Non-spiritual if not unspiritual, moral teaching) వేఱులేని వృక్షము వలె మొదటిగాలితాఁకుడునకే భూపతితమైనది. మఱియు భారతభూమిలోఁ దత్త్వజిజ్ఞాసకు వేదప్రామాణ్యమే మూలాధారము. పరతత్త్వమునుగూర్చి యాతఁడు మౌనము వహించుటచే వేదప్రామాణ్యమును గూర్చియు మౌనము వహింపక తప్పనిసరి యయ్యెను. ఏలన, వేదప్రామాణ్య మంగీకరించినచోఁ బరబ్రహ్మతత్త్వము నంగీకరింపక తప్పనిసరి యగును. మూఁడవది బుద్ధు నహింసాప్రచారము. దేశకాలపాత్రలతో నిమిత్తము లేకుండ సర్వజనుల కహింసాధర్మ మాచరణసాధ్య మని తలఁచుట మానవ మానసతత్త్వానభిజ్ఞతనే సూచించును. మఱియు ధర్మసంరక్షణార్థము హింస నంగీకరించిన శ్రుతిప్రమాణజ్ఞానానభిజ్ఞతయు నిట సూచితము.

వేదమతమైన మహర్షిమతము సర్వతోముఖసామరస్య సమన్వయపరిపూర్ణత గలది. బుద్ధునుపదేశ మేకదేశమాత్రము,

పాక్షికము, శ్రుతిప్రమాణవిరుద్ధము నగుటచే భారతదేశమున నిలిచి మనలేకపోయినది. బౌద్ధమతములో ముఖ్యధర్మము లన్నియు భారతజాతిజీవితములోఁ గలిసి, సజీవములై నేఁటికి నిలిచియున్న వనువాదము రాజకీయప్రచారవాదమే యని స్పష్టమగును. మఱియు బుద్ధునివంటి యెంతటిమహోజ్జ్వల త్యాగమూర్తియైనను, పరమార్థసిద్ధి లేకుండఁ జేయునెంతపరిశుద్ధధర్మోపదేశమైనను స్థిరమై నిలువఁజాల దని బౌద్ధమత పరిణామము వెల్లడించుచున్నది. ఏలన ధర్మోపదేశమంతయు సాధనము; ఈ సాధనమువలనఁ జిత్తశుద్ధియుఁ, దన్మూలమున బ్రహ్మజ్ఞానసిద్ధియుఁ బరమలక్ష్యము. అట్టిబ్రహ్మజ్ఞానముపై నాధారపడి దానిని జేర్చుశక్తి కలిగి, తదనుగుణముగాఁ గల్పింపఁబడి, బోధింపఁబడునప్పుడే నీతిధర్మము లర్థవంతము లగును. సిద్ధితో సంబంధములేనిసాధనము సాధన మగునా? ధర్మార్థకామమోక్షచతుర్విధపురుషార్థములలో ధర్మము మోక్షజ్ఞానములపై నాధారపడి, తత్సాధన మైనప్పుడే ధర్మమగును. బుద్ధునియుపదేశమునకు బ్రహ్మజ్ఞానము కాని, శ్రుతివాక్యము కాని యాధారములు కాకుండుటచే నది నిసర్గమరణము నందిన దని నిస్సంశయముగాఁ జెప్పనొప్పును. ఇది మాకుఁ దోఁచినయభిప్రాయము.

ఈభాగమును బరిశీలించి తమయమూల్యాభిప్రాయము లొసఁగి యాదరించినపెద్దల కెల్లప్పుడు కృతజ్ఞుఁడను. మిగిలిన గ్రంథ మింకను రెండుభాగములలో బ్రకటింప యత్నింతుము.

విధేయుఁడు

బులుసు వేంకటేశ్వర్లు.

---

# పీఠిక

౧

## బెజవాడ గోపాలరెడ్డి

ఆంధ్ర విశ్వవిద్యాలయ సహాయాధ్యక్షులు.

సృష్టి రహస్యాన్వేషణమే తత్త్వశాస్త్రము. ఆదినుండియు నెందఱో విజ్ఞానవేత్తలు సృష్టిని గుఱించి విస్మయపడి ఈ బాహ్య ప్రకృతి అంతరమున గలశక్తి ప్రభావమును తెలిసికొన వలయునని ప్రయత్నించినారు. వారి వారి ఆంతరప్రకృతుల బట్టి ఈ శక్తిని గ్రహించుచు వచ్చిరి. దేవుఁడు కలఁడా? లేఁడా! ఉన్న ఆతని శక్తి ఎట్టిది? అను మీమాంస వేదములనుండి మాత్రమే గాక వేదములకు పూర్వమును జరిగి యుండవలయును. కాని అది లిఖితమైలేదు గాన అది మనకు శాశ్వతముగా లుప్తమై పోయినది.

ప్రపంచమున జీవము(Life) ప్రారంభమై కొన్ని లక్షల సంవత్సరములైనదనియు, మానవుఁడు ప్రపంచమున కాలిడి దాదాపు మూడు లక్షల సంవత్సరములైనదనియు శాస్త్రజ్ఞులు నుడువు చున్నారు. కొన్ని వేల సంవత్సరములు మానవుడు కేవలము పశు ప్రాయుఁడుగనే ఉండియుండవలయును. అతని శక్తి వికసించి, ఆతఁడు కనిపించని విషయముల గుఱించి తలపోయుట కొన్ని వేల సంవత్సరముల క్రిందట జరిగి యుండును. వేదములు వ్రాయబడి ఆఱువేల సంవత్సరములైనదనియు, అప్పటికే ప్రకృతికి వెనుకనున్న మహత్తర శక్తి విషయమై మానవుఁడు ప్రశ్నించుకొనుచు, తలపోయు చుండెననియు, మనకు తెలియుచున్నది.

సూర్యబింబమంత పెద్దవైన నక్షత్రములు పదివేల కోట్ల వఱకు కలవని, ఖగోళ శాస్త్రజ్ఞులు ప్రకటించుచున్నారు. ఒక లిప్తకు ౧,౮౬,౦౦౦ మైళ్ళ చొప్పున కాంతిని ప్రసరించుచు ఒక లక్షవత్సరములకుకూడ ఆకాంతి భూమినిస్పృసింపని దూరమున గల నక్షత్రములు కూడ గలవు. అవి గణితమునకు, ఊహకు అందని దూరము. సూర్య మండలము చుట్టును భూమి పరిభ్రమణము కావించుచు ఒక వత్సరములో కొన్ని కోట్ల మైళ్ళు ప్రయాణము కావించి, ఒక క్షణము కూడ ఆలస్యము లేక తన నిర్దిష్ట స్థానమును చేరుచున్నది. అణువులలో, పరమాణువులలో గల వైచిత్ర్యమును శాస్త్రజ్ఞులు మనకు చెప్పుచున్నారు. అణు ప్రభావము ప్రళయ ప్రదీప్తి యగుచున్నది. ఈఅనంతములగు వైచిత్ర్యముల వెనుక ఏదో ప్రబలమైన శక్తి ఉన్నదా? లేదా? ఉన్న దాని ప్రభావమేమి? దాని పరిమితి ఏమి? మానవుని లక్ష్యమేమి? పాప పుణ్యములననేమి? పూర్వజన్మ ఫలితములు గలవా? లేవా? పుట్టుక అననేమి? మరణించిన పిదప ఆ ప్రాణము ఏమాయె? మున్నగునవి మానవునికి పలుమారు స్ఫురించి యుండ వచ్చును. ఆ ప్రశ్నలకు సమాధానము ఇంతవఱకును ఇదమిద్ధమని తేలలేదు. ఎవరి బుద్ధి చమత్కారములనుబట్టి వారు తర్క యుక్తులతో సిద్ధాంతీకరించుచున్నారు తప్ప అంత్య పరిణామము తేలలేదు. భరత ఖండమున ఈ సత్యాన్వేషణము ఋషులు, మునులు, సన్న్యాసులు, వేదాంతులు ఏ మార్గమును వేయుచు వచ్చిరో దాని ఇతిహాసమే "భారతీయ తత్వ శాస్త్రము". డా. సర్వేపల్లి రాధాకృష్ణగారు దాదాపు 30 సంవత్సరముల క్రితము (Indian

Philosophy) అను గ్రంథమును ఆంగ్లమున రచించిరి. అది యొక ఉత్కృష్ట గ్రంథరాజముగ తత్త్వశాస్త్రవేత్తలు పరిగణించిరి. అది ప్రపంచమున విపుల ప్రచారము వడసెను. అట్టి గ్రంథరాజము తెలుగున లేకుండుట పెద్ద లోటుగనే యుండినది. అట్టి కొఱతను తీర్చుటకై ఈనాఁడు శ్రీబులుసు వెంకటేశ్వర్లు గారు పూనుకొని ఆంధ్రులకు అపార సేవ చేయుచున్నారు. వచో నైపుణ్యముతో వేదాంతసారము చిందునటుల ఆంగ్లమున రచింపఁ బడిన గ్రంథమునకు సరియైన అనువాదము తెలుగున కష్టమైనను వీరిపనిఁ బూని మిగుల నేర్పుతో తెలుగు నుడికారము కుంటువడకుండునటుల అనూదితమొనర్చు చున్నందులకు శ్రీ వెంకటేశ్వర్లుగారికి నాహృదయపూర్వక వందనములు. ఇందు తత్త్వమును, సాహిత్యమును గలవు. దేనికొఱకైనను ఈ గ్రంథమును పఠించుట ఉచితము. ఈద్వితీయభాగమున పురాణేతిహాస యుగము, ప్రాచీన బౌద్ధ మతతత్త్వమును గూర్చి విపులముగ చర్చింపబడినది. ఏ విషయమున బుద్ధుఁడు భారత సనాతన ధర్మమును వ్యతిరేకించెను? ఏమహదుదాత్త ఆశయములతో బుద్ధభగవానుఁడు అహింస, సత్య మతమును బూనెనో, అవి క్రమముగా జీర్ణించి తిరిగి సనాతన ధర్మము ఎటుల భరత వర్షమున వ్యాపించెనో తెలిసికొనఁ కౌతుకము ప్రతి భారతీయునకును జనించును. దీనిని రాధాకృష్ణపండితుఁడు ఎటుల వివరించెనో ఈగ్రంథమున తెలియఁగలదు. ఈనాటికైనను తెనుగున ఈగ్రంథము వచ్చుచున్నందులకు సంతసము. మిగిలిన రెండు భాగములును త్వరలో రాగలవని ఆశించుచు శ్రీ వెంకటేశ్వర్లు గారి కృషిని మిక్కిలి ప్రశంసించుచున్నాను.

—

౨

## డాక్టరు ఏ. యల్. నారాయణగారు
ఎం. ఏ; డి. యస్. సి. యఫ్. ఐ. సి.

విజయనగర మహారాజా కళాశాలాధ్యక్షులు విజయనగరం.

ప్రాక్పశ్చిమసంస్కృతులను సమన్వయదృష్టితో చూచిన మహానుభావుఁడు శ్రీరాధాకృష్ణపండితుఁడు. శ్రీవివేకానంద స్వామి తరువాత, అంతసమర్థతతోడను భారతీయవిజ్ఞానమును పాశ్చాత్యులకు అందించినప్రఖ్యాతి వీరిదే. వారు రచించిన ఉద్గ్రంథములలో, ఎన్నికగన్నది భారతీయతత్త్వశాస్త్రము. మతమునకును, భగవంతునకును ప్రశస్తి తగ్గి; భౌతికవిజ్ఞానము తోడనే తృప్తిపొంది, శాంతిని సంపాదింపలేక కలతపడుచున్న ఆధునికప్రపంచమునకు, శ్రీరాధాకృష్ణ పండితుని సందేశము అమృతోపమానమైనది. ఈసందేశమును పూర్ణరూపమున ప్రసాదించిన దీ గ్రంథరాజమే. ఇది ఇంచుమించుగ ముప్పది ప్రాక్పశ్చిమభాషలలోని కనువదింపబడినది. అట్టిగొప్పగ్రంథము ఏనాఁడో తెలుఁగులోనికి రావలసినది! దానిని తెలుఁగులోనికి తెచ్చిన శ్రీబులుసు వేంకటేశ్వర్లుగారు ధన్యులు.

విశ్వకవి యైన రవీంద్రుని కవితాదివిజాపగను తెలుగు నాట ప్రవహింపజేసిన శ్రీ బెజవాడగోపాలరెడ్డి గారివలెనే అంతర్జాతీయప్రఖ్యాతిగన్న శ్రీరాధాకృష్ణపండితుని ఉద్గ్రంథమును తెలుఁగులోనికి తెచ్చిన శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారును మనకృతజ్ఞతకును, మన్ననకును మిక్కిలి పాత్రులు.

శ్రీబులుసు వేంకటేశ్వర్లుగారు ఇట్టికృషి యే ఇంకాధికముగ చేయగలుగుటకు, పరమేశ్వరుఁడు వారికి ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించుఁగాక!

---

3

బ్రహ్మశ్రీ విద్వాన్ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు, పండితులు,
ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వాల్తేరు.

ఆధ్యాత్మికదృష్టి గలప్రాచీనహైందవమహర్షులు చిత్రవిచిత్ర కార్యకలాపములతో నిండియున్నప్రకృతిని, తదంతర్గతము లైనపంచభూతములను, వాని నాధారముగాఁ గొని జీవయాత్ర సాగించుమానవునిగూర్చి తత్త్వజిజ్ఞాసతో వివిధము లైనపరిశీలనము లొనర్చిరి. ఆపరిశీలనములో మానవస్వరూప మెట్టిది? ఆతనియందలిజీవాత్మ శరీరముకంటె భిన్నమా? అభిన్నమా? పరమాత్మస్వరూప స్వభావము లెట్టివి? జీవాత్మకును పరమాత్మకును గలసంబంధ మెట్టిది? దేహికి జననమరణాదు లెట్లు గలుగుచున్నవి? కర్మస్వరూప మెట్టిది? ఈచరాచరప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములు సహజముగా సంభవించుచున్నవా? లేక వానికి వేఱుకారణ మేదైనఁ గలదా? మున్నగుభావములు గలిగినవి.

ఈవిధములగు నూహలతో ఆర్యమహర్షులు అంతర్దృష్టి గలవారై, కామక్రోధాదుల నుజ్జగించి, నియమితచిత్తులయి, మానవతత్త్వమునుగూర్చియు, జగద్రహస్యములనుగూర్చియు నొనర్చిన పరిశోధనలఫలితముగా వేదములు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు, సూత్రములు, పురాణేతిహాసములు మున్నగు ఆధ్యాత్మతత్త్వగ్రంథములు వెలసినవి.

ప్రవర్తకులయందును, తదనుయాయులయందును, సంఘములందును స్థిరపడిన పైభావములే కాలక్రమమున మతములై నెలకొన్నవి. వాదబలము, ప్రజాభిరుచి, ప్రభుతాప్రాబల్యము,

మున్నగు వానిననుసరించి యీ మతములును భిన్నభిన్నములై శాఖోపశాఖలుగా ప్రబలినవి. వీని నన్నిటిని స్థూలనిర్దేశము చేసి ఆస్తికము లనియు, నాస్తికము లనియు రెండువర్గములుగా విభజింపవచ్చును. వేదమును ప్రమాణముగా నంగీకరించుచు యజ్ఞాదికర్మలను సమర్థించునవి–ద్వైతాద్వైత విశిష్టాద్వైతాదులు ఆస్తికమతములుగను, శ్రుతిప్రామాణ్యమును సమ్మతింపక, యాగాదులను నిషేధించునవి–బౌద్ధ జైన పాషండాదులు నాస్తిక మతములుగను పరిగణింపఁబడుచున్నవి.

ఈమతముల నాధారముగఁ జేసికొని కావింపఁబడిన ఆధ్యాత్మతత్త్వపరిశీలనమును, తాత్త్వికగ్రంథరచనయు ప్రపంచములో భారతజాతి కొకప్రత్యేక నాగరకతను, వ్యక్తిత్వమును విశిష్టతను చేకూర్చినవి. బహుముఖములుగా బయల్వెడలిన యీ తత్త్వగ్రంథములనుగూర్చి ప్రాచ్యపాశ్చాత్యవిద్వాంసు లెందఱో అపూర్వపరిశ్రమఁబూనర్చి వానిస్వరూపస్వభావములను ప్రత్యేకముగా నమూల్యములగు విమర్శన గ్రంథములలో వెలువరించిరి.

భారతీయ తత్త్వశాస్త్రనిష్ణాతులలో అగ్రగణ్యులును, మహామేధావులును, సుప్రసిద్ధులును, ప్రస్తుతము భారతదేశ రాజ్యాంగ పరిషదుపాధ్యక్షులు నగు డాక్టర్, సర్వేపల్లి రాధా కృష్ణపండితులు ప్రాచీనభారతీయ తత్త్వగ్రంథములను, వానిపై బయల్వెడలిన వివిధవిమర్శనములను సమగ్రముగా పరిశోధించి, వానిసారాంశమునంతను అనుస్యూతముగను ఏకముఖముగను Indian Philosophy అనుపేరిట నొకమహాగ్రంథమును రచిం

చిరి. వేదములు మొదలు భాష్యములవఱకుఁ గల విషయమంతయు కాలక్రమమునసనుసరించి నాల్గుయుగములుగా విభజించి ఆఱధ్యాయములలో వర్ణింపఁబడినది. మొదటిది వేదయుగము. ఇందు, వేదములు బ్రాహ్మణములు అరణ్యకములు నుపనిషత్తులు మున్నగువానియందలి తత్త్వము పరిశీలింపఁబడినది. రెండవది పురాణేతిహాసయుగము. ఉపనిషత్తుల కాలము మొదలు దర్శనములకాలమువఱకును వ్యాప్తినందిన యీయుగములోని పురాణములయు నితిహాసములయు అవి నిర్వచించిన తాత్త్వికాంశములయు స్వరూపస్వభావము లిందు చర్చింపఁబడినవి. మూఁడవది సూత్రయుగము. ఇందు సూత్రగ్రంథములను గూర్చియు, అవి ప్రతిపాదించు ఆధ్యాత్మికతత్త్వమును గూర్చియు వివరింపఁబడినది. నాల్గవది భాష్యయుగము. భాష్యకర్తలగు కుమారిల శంకర భాస్కర శ్రీధర రామానుజ మాధవోదయన జయంతవిజ్ఞానభిక్షు రఘునాథులు ప్రాచీన తాత్త్వికగ్రంథములకు రచించిన భాష్యములను గూర్చియు, తన్మూలమున భారతీయాధ్యాత్మికవిద్యకుఁ గల్గిన పెంపును గూర్చియు, ఇందు ప్రపంచింపఁబడినది. 7,8,9 అధ్యాయములలో ప్రాచీనబౌద్ధమతధర్మతత్త్వము, పదవయధ్యాయములో బౌద్ధమతస్వరూపమును విపులముగా నిర్వచింపఁబడినవి.

ఏవంవిధగుణమహితమగు అమూల్యగ్రంథమును ఆంధ్రీకరించి శ్రీయుత బులుసు వేంకటేశ్వర్లు ఎం. ఏ. గారు తెనుఁగువారి కెంతయు మేలొనర్చిరి. ఇందలి మొలుతటి నాల్గధ్యాయములును ప్రథమభాగముగా నీవఱకే ప్రకటింపఁబడినవి. ఆఱ

ధ్యాయములు గలయిది రెండవభాగము. నిశితమగు ఆంగ్లభాషా జ్ఞానముతోపాటు భారతతత్వశాస్త్రపరిచయమును, నిరర్గళ మగు సంస్కృతాంధ్రపాండిత్యముతోపాటు పటిష్ఠమగురచనా కౌశలమును గలిగినఁగాని, ఆంగ్లమునందలి యిట్టి శాస్త్రీయ గ్రంథముచు అనువదించుట సుకర మగువని గాదు. అంతియ గాక తత్వశాస్త్రగ్రంథరచనమునను నియతప్రవర్తనము తోడి అధ్యాత్మదృష్టియు, నిర్మల హృదయము తోడి దైవచింతయు కూడ నుండవలెను.

గౌతమీతీరవాసులలో బులుసువారివంశము తరతర ముల నుండియు వేదశాస్త్రముల నభ్యసించి యాగాదికర్మ లొనర్చుచు పుణ్యజీవితము నెఱపుటలో పేరెన్నిక గన్నది. ఆవంగడమువా రగు (శ్రీ) వెంకటేశ్వర్లు ఎం.ఏ. గారును, వారి సోదరులును, తాతతండ్రులవలె ఆస్తిక దృష్టియు కర్మనిష్ఠయుఁ గల ఆధ్యాత్మికహృదయులు కనుకనే వా రిట్టితత్వశాస్త్ర గ్రంథాను వాదమును చేపట్టుటయు, చేపట్టిన కార్యమును సాంతముగా సమర్థతతో నిర్వహించుటయు సంభవించినది.

రచన ఏవిధమగులోపమును లేక, భాష సుబోధమై, అడ్డమాఁకలులేని-మూలభావములను సుబోధముసేయు-ప్రసన్న మగు శైలిలో నడచినది. అనువాద మని చెప్పిననే కాఁబోలు ననుకొనవలయునుగాని, గ్రంథ మంతయు స్వతంత్రరచనమా యనిపించు నిరర్గళధారలో నున్నది. అనువాదకు లగువెంకటే శ్వర్లుగారు సంస్కృతాంధ్రము లభిమానభాషలుగా, ఎం. ఏ. పట్టభద్రులై, కాకినాడ పి. ఆర్. కాలేజీలో ఆంగ్లోపన్యాసకు

లుగా పనిచేయుచు, అధ్యాపనమాత్రమునే పరమలక్ష్యముగ భావింపక దైవచింతయు కర్మనిష్ఠయుఁ గలవారై నిరంతర మేదోయొక యుపహారమును ఆంధ్రసరస్వతి కర్పించుచు భాషాసేవ యొనర్చు స్వభావముగల సారస్వతజీవులు.

వీ రింకను అమూల్యము లగు గ్రంథములను రచించి యితోధిక భాషాసేవ యొనర్తు రనియు, విశేషపరిశ్రమ చేసి సుప్రసన్న మగు శైలిలో అనువదింపఁబడిన వీరి యీభారతీయ తత్త్వశాస్త్రమును ఆంధ్రులెల్లరు చదివి, రాధాకృష్ణపండితుల తత్త్వశాస్త్రబోధామృతమును తనివారఁ గ్రోలి యానందింతు రనియు ఆశించుచున్నాను.

---

౪

శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు ఎం. ఏ;

సంస్కృతోపన్యాసకులు, కళాశాల. విజయవాడ.

భారతీయ తత్త్వశాస్త్రముల లక్ష్యము నిత్యనిరతిశయానందప్రాప్తి. ఆనందస్వరూపమును నిర్వచించుటలోను, తన్మార్గములను నిర్ణయించుటలోను దార్శనికుల దృక్పథములలో భిన్నత్వము కన్పట్టుచున్నంతమాత్రమున భిన్నదర్శనములు భిన్న కాలములయం దుత్పన్నములైన వనికాని, యీదర్శనములలోని పరిణామము తత్త్వాన్వేషకుల పరిశోధనల క్రమవికాసముమీఁద నాధారపడిన దని కాని నుడువుటకు వీలులేదు. ఒకే కాలమున జీవించు బుద్ధిమంతులలో వారివారి మనస్సంస్కారములను బట్టియు, అధికారతారతమ్యమును బట్టియు భిన్నదర్శనములు సమాశ్రయణీయములు కావచ్చును.

భిన్నదర్శనములలో నేది సమంజసము ! ఏది 'దోష యుతము' అనువిచారమునకు తావే లేదు. ఆయావ్యక్తుల చిత్త సంస్కారసంపత్తినిబట్టి యాయాదర్శనములు రుచించును. అందు బాటులో నుండును. అద్వైతము సత్యంతాభినివేశముతో బోధించిన శంకరులుగూడ అద్వైత మందుబాటులో లేనివారు బహుసంఖ్యాకు లుందు రనియు, వారు తాత్కాలికముగా తద్భావము నాశ్రయింపక తప్పదనియు,సంగీకరించియున్నారు. సాధనసామర్థ్యము నను సరించియు, లక్ష్యావధి ననుసరించియు పారిప్లానందము యొక్క పరిమాణము నిర్ణీతమగుచు కావున దర్శనములలో నెల్లరకును వర్తించురీతిగా నిది తప్పనికాని యిది యొప్పనికాని చెప్పఁదగిన పరిస్థితులు సాధారణముగా నుండవు.

మానవుని ప్రవర్తనముపట్లను, ధర్మనిర్వచనముపట్లను కఠోరనియమములు పరిపాల్యము లని భావించిన మనప్రాచీనులు ఆత్మవిచారముపట్ల మానవునకు విశేషస్వాతంత్ర్యము నొసఁగుట కిదియే కారణము. శంకరభాష్యవ్యాఖ్యాతయు పరమ మాన్యుఁడును ఆయన శ్రీమధుసూదనసరస్వతి యంతటి వాఁడు గూడ షడ్దర్శనములను సమన్వయ దృష్టితో చూచినవాడయునని చెప్పుట గమనింపదగిన విషయము.

వేదవాఙ్మయములోకాని, అర్వాచీనార్ష వాఙ్మయ ములోకాని యొక్కేగ్రంథములో భిన్నభిన్న దర్శనములచాయలు గన్పట్టుటకు కారణము మానవకల్యాణమున కుద్దేశింపబడిన యాగ్రంథములు మానవప్రకృతి నానాత్వమును, అధికార తారతమ్యమును పురస్కరించుకొని యెల్లరకును ఆసందవహ్యా

మును చూపదలంచుటయే కాని వేరు కాదు. ప్రకృత్యధికార నానాత్వ సామరస్యముతో మనము చూచినను చివరకు నిలచు సిద్ధాంత మేది యనుశంక నిలచియే యుండును. మానవుఁడు సాధనభూమికలను క్రమముగా నతిక్రమించుచో చివరకు చేరు నది యద్వైతమే యని విశ్వసించు శ్రీ రాధాకృష్ణగారివంటి విద్వాంసులు సర్వదర్శనములను సమానసరణిని పరామర్శిం చుటలో నేమియు విప్రతిపత్తి లేదు.

ఈగ్రంథములో భారతీయదర్శనము లన్నియు పరామ ర్శింపబడినవి. ఏదర్శనముపట్లను విరోధము కాని, వైరస్యమును గాని చూపక, సానుభూతితో నెల్లదర్శనములను ప్రదర్శించుట యిందలి ప్రస్ఫుటగుణవిశేషము. గ్రంథకర్త మధురహృదయము గ్రంథస్థాంశములకు మాధుర్యమును కూర్చినది. గ్రంథవస్తూ దాత్తత కుచితమైన మధురగంభీరభాషలో వారు తమరచనను సాగించినారు. ఆంగ్లపాఠకప్రపంచమును భారతీయతత్త్వశాస్త్ర మువైపునకు త్రిప్పగలిగినారు. పిమ్మట యూరపీయభాషల లోనికికూడ నీగ్రంథము పరివర్తితమైనది.

ఏతద్గ్రంథపాశస్త్యమునకు ముగ్ధులై తమయానందమును స్వదేశీయులకు పంచిపెట్టవలయు ననుదారభావముతో దీనిని తమ మాతృభాషలోనికి పరివర్తింపజేసి స్వీయభాష కొక నూతనభూషను, భారతీయతత్త్వశాస్త్రమునకొక నూతనవిహార రంగమును కల్పించినవారు శ్రీ బులుసు వెంకటేశ్వరులుగారు. గ్రంథకర్తగాను వక్తగాను లబ్ధప్రతిష్ఠులైన శ్రీ వెంకటేశ్వరులు గారి వేదాన్తభావవివరణశక్తి నైసర్గికము.

ఆంగ్లభాష చిరకాలము భారతదేశములో నిలచిపోవలయు ననియు, సూక్ష్మభావబోధకశక్తి భారతీయభాషలకు లేదనియు జెప్పువారి దుర్వాదమును శ్రీ వెంకటేశ్వరులుగారి తెలుగుసేత పరాస్తము చేయుచున్నది. ఎట్టికఠినభావము నైనను, అర్థచ్ఛాయాభేదముల నైనను హృదయాకర్షకమైన పదములలో తెలుపగలశక్తి తెలుగునకు గలదని శ్రీ వెంకటేశ్వరులుగారి యనువాదము చాటుచున్నది. ఆంధ్రరాష్ట్ర మవతరించి రాష్ట్రాంతరంగికవ్యవహారము లన్నియు తెలుగులోనే జరుగుటకు కారణముగా నున్న యీసమయములో శ్రీ వెంకటేశ్వరులుగారి యీ యనువాదము వెలువడుట సకలవిధముల శ్రేయస్సూచకము.

---

శా॥ రాధాకృష్ణమహామునీషికృతశా
స్త్రం బద్వితీయంబు, త
ద్గాథార్థంబు నగాథమై పరఁగు, న
ద్దానిన్ రసోపేతగం
గాధారాసమశైలి నిట్లు తెనుఁగుం
గావింప నీకే తగున్,
నీధీయుక్తికి నీదుశక్తి కభినం
దింతున్ నినున్ మిత్రమా!

ఇట్లు
విద్వాన్ దర్భా వేంకటకృష్ణమూర్తి, ఎం.ఏ.
వి. ఆర్. కాలేజీ, నెల్లూరు.

# భారతీయ తత్త్వశాస్త్రము

## ద్వితీయ భాగము

---

### పురాణేతిహాస యుగము

## పంచమాధ్యాయము

### నాస్తికవాదము

### ౧—పురాణయుగము

మద్రామాయణ మహాభారతములలోని విషయములు వేదకాలమునకుఁ జెందినవే. వేదకాలమున నార్యులు వలసవచ్చి గంగానదీతీర ప్రాంతములందు స్థిరనివాస మేర్పఱచుకొన్నప్పుడు, కురుకులము హస్తినాపురమందును, పాంచాలులు కనూజునందును, కోసలు లయోధ్యయందును, కాశ్యజాతులు కాశీక్షేత్రమందును, నివసించిరి. ఈ పురాణములు క్రీస్తుపూర్వ మాఱవ శతాబ్దమునకంటెఁ బూర్వము రచింపఁబడినట్లు తెలుప నాధారము లేమియునులేవు. గంగాతీరమున నార్యులు వ్యాపించి, దేశము నాక్రమించిన కాలముననే వారు వేదవిభాగ సంకలనముల నొనర్చియుండిరి. మహాభారత విషయమైన కురుపాండవయుద్ధ మాకాలముననే జరిగి యుండవచ్చును. భారతీయ

సంప్రదాయము ననుసరించియుఁ, బురాణాంతర్గత విషయము ననుసరించియు, వేదసంకలన కర్తయగు వ్యాసుఁడు మహాభారత యుద్ధ సమకాలికుఁడని తెలియుచున్నది. రామాయణము, ఆర్యులకును, ఆర్యమతమును స్వీకరించిననాఁటి దేశీయానార్య జాతులకును జరిగినయుద్ధమును వర్ణించును. వేదమంత్రములు పస చెడి, కర్మమతము ప్రజాదరణ పాత్రమై, వర్ణవిభాగ ముచ్చస్థితి లోనున్న కాలమది. కావునఁ బురాణారంభ యుగము నించుమించుగా మనము క్రీ. పూ. పదునెనిమిదవ శతాబ్ద మధ్యభాగముగా నెంచి, అనంతరకాలోచితములైన మార్పులెప్పటికప్పుడు జరిగి పురాణయుగము పూర్తియగునప్పటికి క్రీ. పూ. రెండవశతాబ్ద మారంభించినదని నిర్ణయింపవచ్చును.

విజ్ఞానకాంక్ష, తత్త్వజిజ్ఞాస, బహుముఖ వికాసముల కాలవాలమైన దీయుగమని చెప్పుట కనేకాధారములు గలవు. నాఁటి క్లిష్టతరములైన ఆరంభోత్సాహములనుగూర్చి సంపూర్ణ వర్ణన మొసగుట సులభమైన పనికాదు. బాహ్యప్రపంచము నందుగల వైరుధ్యములు, మనోగతములైన వికల్పములు ప్రజా జీవితమునఁ బ్రతిఫలించినవి. విచిత్ర విరుద్ధభావసంపుటమైనది ఈయుగము, బుద్ధివికాసోద్వేగము, ధర్మదీక్షలతోఁ బాటు మన శ్చాంచల్యము, దుర్నీతులు కలిసినవి. చార్వాకులయొక్కయు బౌద్ధులయొక్కయు యుగమది. నీచమంత్రోపాసనము, శాస్త్రము; సంశయము, విశ్వాసము, స్వైరవృత్తి, తపోనిరతి మిశ్రమమైన యుగమది. ఉద్రిక్తములైన మానవశక్తులు తమ స్వత్వముల నుద్ఘాటించినప్పుడు కట్టుబాట్లులేని యూహాప్రవా

రము లసహజములు కావు. అయినను, భావక్లిష్టత, కల్పనాశక్తి జీవితవైశాల్యమును పెంపొందించినవి. జిజ్ఞాసాధికార మందు అడుఁగలదను భావోద్రేకపూరితమైన ప్రకటనము, సంప్రదాయ దాస్యశృంఖలములను గొంతసడలించి, ప్రజాజీవితమును సత్యోన్ముఖ మొనర్చెను. సంశయించుట ఘోరదోషము కాదని తెలిపెను.

అంతర్దృష్టి, పరిశీలనమునకును, మతవిశ్వాసము తత్త్వజిజ్ఞాసకును, స్థానమిచ్చెను. జీవితముయొక్క అగమ్యము, అద్భుత సంశయావహమునైన సమస్యయుఁ, బ్రపంచమును గూర్చిన భిన్నాభిప్రాయసమన్వయ ప్రయత్నమును, దుఃఖమగ్నమైయున్న మానవకోటి, తాత్కాలిక చిత్తశాంతి నాసించి, కల్పించుకొనిన మధ్యేమార్గములు, ప్రక్కసందులు, విశ్రాంతిస్థానములతోఁ గీకారణ్యాకృతిదాల్చిన భావప్రపంచము, అవిశ్వాసపుటెడారి, అలసత, మాంద్యములతోఁ గూడిన యావనసాహస శక్తి సమంచితపరిస్థితి, భారతీయ విజ్ఞానచరిత్రములో నొక సుప్రసిద్ధమైన శకారంభమునకు వాతావరణమును నిర్మించినవి. రోగగ్రస్తమైన మానసికప్రవృత్తి, పటుత్వము సడలి, నీరసించిన నరములుగలిగిన ప్రజ లెచ్చటివారైనను దమ రోగనివారణోపాయమునకై, శాంతిని, ముక్తిని, నిర్వాణమును, కళావిజ్ఞానధర్మములందైనఁ గాంతురు; లేదా, ప్రమత్తత, తన్మయత, ఉన్మాదము మున్నగువానికి వశులై నశింతురు. తత్త్వపరిశోధనమునకు నిలయమైన యీయుగమున నూత్నతత్త్వములెన్నియో తలలెత్తినవి. ఒకరిభావము నింకొకరు విమర్శిం

చుట, పరస్పరనిర్ణయములు డీకొనుట జరిగినది. సమాలోచన
విధానములలో మార్పున కొకటికాక యనేకములగుకారణము
లున్నవి. ఋగ్వేదమునందు స్వతంత్రాలోచనమునకును, సంశ
యించుటకును నధికారమున్నదను సూచనలుకలవు.౧. బ్రాహ్మణ
ముల కాలమందైనను, నుపాసనవిధానములోని బాహ్య విధిజా
లమున కమితగౌరవ మిచ్చియున్నను, దత్త్వజిజ్ఞాసనుగూర్చి
సమీక్షచేయుకాంక్ష తొంగిచూచుచునేయున్నది. ప్రజాసామా
న్యముయొక్క విజ్ఞానాన్వేషణశీల మణఁచివేయుటకుఁ బ్రయ
త్నించినపుడు, మానవ మానసము తీవ్రప్రతిఘటనముచేసి.
తత్ఫలితముగాఁ గ్రతు కలాప మతశిక్షణముచేఁ జిరకాలము
తొక్కివేయఁబడిన భావోద్వేగము, బాహ్యశాసనాధికార
ముల నన్నిటిని శీఘ్రముగాఁ దృణీకరించి, యుద్రేకవశమై,
సరిహద్దులఁ బెరికివేసి, స్వేచ్ఛావిహారమునుసల్పెను. తామెంత
వేదవిశ్వాసముపై నాధారపడి యుంటిమని చెప్పుకొన్నను,
నుపనిషత్తులు సత్యపరిశోధనమును వృద్ధియొనర్చినవి. సమా
లోచన స్వత్వముల నుద్ఘాటించునపుడు హద్దులునిలువవు.
నూతనాన్వేషణవిధానములను, నవ్యమనోగమనపద్ధతిని, ఉపని
షత్తు లభివృద్ధిచేసి, నూతనయుగ జీవప్రవాహమునకు జీవము
లిచ్చినవి. ఉపనిషత్తులు తాము నెఱుఁగకుండ జరిపిన తత్త్వ
చర్చాప్రదర్శనములు, గంభీరార్థమార్గ సంయుతమైన మనః
పరివర్తనమునకుఁ గారణములైనవి. ఉపనిషద్విజ్ఞానము గంగా
తీరమునకుఁ బశ్చిమదేశమున నుదయించి పెంపొందినను, ప్రాగ్

౧. రా. వే. భా. ౭౫. ౮౫, ౩-౪

శావాసులు దాని నార్జించిరేకాని యనుభవమునకుఁ దేలేక పోయిరి.

రాజ్యాంగమునఁ గూడ నరాజకపరిస్థితులు ప్రజాదృష్టిని సంచలింపఁజేసినవి, చిన్న సామంతరాజ్యముల మధ్యమునఁగలఁత లేర్పడినవి. విదేశీయములైన దాడులు దేశశాంతినిఁ గొంత చెడఁగొట్టినవి. ప్రభువుల భోగలాలసత్వము, ప్రజల దురాశా దౌర్బల్యములచే యుగము క్షీణదశలో నున్నదను నినాదములుం ఘోషింపఁబడినవి. ఒకబౌద్ధసూక్తమిట్లు పలికినది; "లోకములో ధనికులను జూచుచున్నాను; అన్యాయార్జితమైన తమ విత్తము నెవరికి దానము చేయరు. ధనాశాపరవశులై, ధనరాసుల నార్జించి, ఆద్యంతములు లేని భోగముల ననుభవింప యత్నించుచున్నారు. చక్రవర్తి, భూమండలములోని రాజ్యములనన్నిటి నాతఁడుజయించి యుండవచ్చును. సముద్రపర్యంత భూమండలము నాతఁడు పరిపాలించుచుండవచ్చును. కాని, యాతని కింకను దృప్తితీరలేదు; ఇంకను సాగరముల కవ్వలిభాగమునన్న వానినిఁ గూడ నార్జింపఁగోరుచున్నాఁడు. రాజు నతనితో ననేకులు, తృప్తిగనని కాంక్షలతో యమునికతిథులుం గాఁబోవుచున్నారు...బంధువులు కాని, మిత్రులుకాని, పరిచయములుకాని మృత్యుముఖమునఁ బడిన వానినిఁ గాపాడలేరు. వారసులు వాని యాస్తిని గ్రసింతురు; కాని వాఁడు తనకర్మ ఫలమును బొందును; భార్యాసుత ధనరాజ్యాదు లెవ్వియును వాని ననుగమింపవు"౧. సంఘము, రాజ్యము భ్రష్టమైననను

౧. ఓల్డెన్‌బెర్గు: బుద్ధ పుట ౬౫.

తలంపు, నష్టమైన యాశ, ఉపాయాంతరము గోచరింపని మనో దైన్యము, నివి మానవుని స్వకీయాత్మావేశములపై నిలువుమని యుద్బోధించినవి. ఏదోయొక స్థిరమైన స్వప్నప్రపంచము, పాపములు దుఃఖములు లేనిది, త్రికాలాబాధ్యమైనది కనుగొని, యందు సుఖింతమను కాంక్షతో, వైరాగ్యతపో సాధనముల నెడ తెగక యాచరించుచు,నసంగతమైన యీలోకమును, నశాశ్వతమైన యీజీవితసమస్యలను నుదాసీన భావముతో నిర్లక్ష్య మొనర్చినవారు కొలఁదిమందికలరు. ప్రజలందరును జీవితరంగమునుండి, మాంద్యజుగుప్సా నిరాశోపహతులై, తొలగిరి. సంశయాస్పదమైన స్వర్గమునకు బదులు ప్రత్యక్షముగానున్న యాకర్షణములు వారిని వశమొనర్చుకొనెను. మోక్షమునకు సూక్ష్మోపాయములపై నాత్రత జూపనారంభించిరి. లోకమున నిగూఢమైన యొక అపజయావమానము దుస్సహమై నూతనావేశ బీజమైనది. ప్రపంచము ధర్మబద్ధమై పాలింపఁబడు చున్నదను భావముతోఁ గల్యాణగుణపూర్ణుఁడైన దేవుఁడున్నాఁడను భావ మన్వయించును. ఇహలోక జీవితస్వభావమును గూర్చి సంశయముదయించినపుడు, దైవవిశ్వాసము నశించును. ప్రతివ్యక్తియు జీవితము దుఃఖమయమని తలచుచుండగా, లేక సుఖము సంశయాస్పదమని భావించుచుండగాఁ, బూర్వమతము నందుఁ విశ్వాసము నిలిచియుండుట సులభసాధ్యముకాదు. అనేకశతాబ్దములవిచ్ఛిన్నముగా వచ్చిన మతవిశ్వాస మొకస్వప్నదృశ్యమువలె హరించి పోవుచున్నది. వేదప్రమాణము, సంప్రదాయబంధము తెగిపోయినది. మతవిశ్వాసము నీరసించుటతో,

బయలు దేరిన ప్రబలభావాందోళనమునందు, మానవునిస్వాతంత్ర్యము ప్రకటింపఁబడినప్పుడు, విచిత్రములైన తత్త్వనిర్ణయములు, వ్యర్థములైన పరమార్థప్రసంగములు తేకెత్తినవి. నైతికదౌర్బల్యముచే హతమైన యుగము దొరికిన యేతత్త్వమునకైన స్వాగతమిచ్చును. ప్రత్యక్షప్రమాణముపై నాధారపడిన నాస్తికవాదులు, సమున్నత ధర్మప్రచారము, నమూల్యమన స్వతత్త్వనిర్ణయములనిచ్చిన బౌద్ధులు, బయలు దేరిరి. నీటమునిగి పోవుచున్న వాని యాత్రముతో వేదముల నంటిపట్టుకొనియున్న వారు కొందరుకలరు; సంస్కర్తలు, స్వచ్ఛమైన ధర్మానుష్ఠాన జీవనము ప్రధానమని నమ్మి, సత్కార్యాచరణమునకుఁ గడఁగిరి; వారు మరణానంతరసమస్యలను గూర్చి యాలోచించుట నిరర్థకమని తలఁచి మానివేసిరి. సన్న్యాసులు, తీర్థంకరులు నూతనమత శాఖాస్థాపకులమని చెప్పికొనిరి. గౌతముఁడు, వర్ధమానుఁడు ప్రముఖసంస్కర్తలు. బౌద్ధగ్రంథము, లవైదికోపదేశికులను గొందరను బేర్కొనెను. సంశయవాదియైన సంజయుఁడు 'ఆత్మజ్ఞానావకాశమును ఖండించి, శాంతిసాధన మార్గాన్వేషణమునకే తనశక్తి నంతను వినియోగించెను. అజితకేశకంబళియను నాస్తికుఁడు తపస్సార్థ్యమైన జ్ఞాన మసత్యమని నిరసించి, మానవుఁడు చతుర్భూతకల్పితుఁడనియు మరణమున నాభూతములు విడిపోవుననియు వాదించెను; పురాణకాశ్యపుఁడనఁ వాఁడు 'ఔదాసీన్యమతస్థుఁడు.' ధర్మభేదముల నంగీకరింపక, ఆత్మక్రియాహీనమైనదనియు నది కారణములేని జన్మ

ముశలదనియు నిశ్చయించెను. ౧. మస్కరిగోగోశాలియను వాఁడు విధివాది. (Fatalist) జీవితము, మరణము మానవుని యధీనములో లేవనియు, వస్తువులన్నియుఁ దమలోనిహితమై యున్నశక్తిచే నిత్యపరివర్తమానములగుచు మోక్షముపొందు వరకు జీవించుచుండుననియు, నాతనివాదము; ౧. కకుదకాత్యాయనుఁడనువాఁడు పంచభూతములైన జలవాయు భూమ్యాకాశములకు, ఆత్మకునున్న భేదము గుణాత్మకమనియు, భిన్నరూపములను గల్పించుచు, నశింపఁజేయుచున్న శక్తులు ఖేదమోదములనియు, నిర్ణయించినాఁడు. ౨. దేశమున వివిధప్రాంతములలో నసంఖ్యాకులైన ప్రబోధకులు బయలుదేరి తామొక ముక్తిమార్గమును జూపఁగలమని ప్రజలకు శుభలేఖలనంపుచుండిరి.

అనంతర యుగమును జ్ఞానసంపన్నమొనర్చిన పునర్నిర్మాణోద్యమముల ప్రారంభదశ లీయుగముననే గోచరించును. ఇవి యీయుగముననే యారంభించినను, పురాణయుగాంతమువఱకును పూర్ణపరిణతి నందియుండలేదు. దైవసృష్టి మహాత్మ్యమెట్టిదనగా, రోగము, రోగనివారణోపాయము నొక్కెసారి ప్రత్యక్షమగును; దోష విషజలప్రవాహము లెచటఁ బ్రవహించునో, యచటనే యారోగ నిర్మూలనమొనర్పఁగల

౧. అహేతువాదము. సామఞ్ఞఫలసుత్తా. దీఘనికాయ. ౧.

౧. మజ్ఝిమనికాయ ౧. చూడు సూత్రకృతాంగము.

౨. పోల్చు ఎంపిడోక్లీస్సుతత్త్వము. చతుర్భూతములు; పరివర్తన సూత్రద్వయము. సంయోగ కారణము ప్రేమ; వియోగ కారణము ద్వేషము.

మోషధియు నుద్భవించి పెంపొందుచుండును. వేదద్రష్టల యొక్కయు నుపనిషత్తులయొక్కయు నుపదేశము, సూత్రములుగా రచింపఁబడెను. స్వచ్ఛ తర్కప్రతిష్ఠితములు, మహోన్నతభక్తినిధానములునైన విజ్ఞానశాస్త్రములు ప్రచురింపఁబడెను. చార్వాకులు, బౌద్ధులు, జైనులు మొదటివారు. వెనువెంటనే, తత్ప్రతిఫలముగా నుపనిషదుపదేశమందలి ఆస్తికతత్త్వ ముద్ఘాటింపఁబడెను. బౌద్ధ జైనమతములు, తమ ప్రత్యేక ధర్మాభిమానముతోఁ బ్రజల నిగూఢ తాత్త్విక జిజ్ఞాసాదాహమును దీర్పఁజాలవయ్యెను. ఉపనిషత్తులయొక్క ఊహాకందని తత్త్వభావములును, వేదములయొక్క జాజ్వల్యమాన బహుదేవతావర్గమును, జైన బౌద్ధుల సంశయాస్పద నైతికతత్త్వ ప్రచారములును, జనసామాన్యమునకుఁ గలిగిన పరమార్థజిజ్ఞాసను దృప్తిపఱుపలేనప్పుడు, నాటిప్రజల కర్థమగు రీతి నుపనిషన్మతముకంటెఁ గొంచెమూహాకాఠిన్యము తగ్గినదియు, నెక్కువతృప్తి నొసఁగునదియుఁ, దెలియుటకశక్యమైన అస్పష్ట నిర్గుణ నిరాకారబ్రహ్మముకంటెఁ దేలికగా బోధపడు సగుణ సాకారదైవమును బ్రకటించు తత్త్వవిధానములు పునర్నిర్మితములైనవి. ఒక్కఁడే విష్ణ్వవతారమనియు, నిర్గుణబ్రహ్మమనియుఁ బ్రదర్శింపఁబడిన కృష్ణుఁడుగల్గిన భగవద్గీతయుఁ, పాంచరాత్రసిద్ధాంతమును, శ్వేతాశ్వతరము తదనంతరోపనిషత్తులలోనుండి పెంపుచేయఁబడిన శైవమతమును, బుద్ధుఁడు శాశ్వతదైవమని నమ్మిన మహాయానబౌద్ధశాఖయు నీయుగాందోళనఫలితముగా నుదయించినవి. ఈ యుగమునందింకను,

గొందరు తీవ్రజిజ్ఞాసువులు నూత్నజ్ఞానకాంతినిచ్చు తాత్త్విక మార్గములఁ గనుఁగొనఁజొచ్చిరి. తర్కసుప్రతిష్ఠితమైన తత్త్వమున కవసరమగు బీజములు మొలకెత్తనారంభించినవి. తమ పూర్వరూపములలోనున్న సాంఖ్యయోగవిధానములు, స్వతంత్రభావోల్లసితములైన న్యాయవైశేషికములు, బయలుదేరి. తమయధికారమును స్థిరముచేసికొనుటకై, వేదముల ప్రమాణము నంగీకరించినవి. మీమాంసాద్వయము నితరములకంటె వేద గ్రంథములకుఁ బ్రత్యక్షప్రతిబింబములైయున్నవి. ఈభిన్నమత శాఖలన్నియుఁ బురాణయుగాంత్యదశలోఁ బూర్ణప్రకటనమందినవి. నాటి పరస్పరవైరుధ్యములన్నియు నీ మతశాఖలలోఁ బ్రతిబింబించినవి; ఒక్కొక్క మతశాఖ యొక్కొక్క తత్త్వమును బోషించి ప్రతిపాదించినది. ఈయుగమున బయల్వెడలిన తత్త్వములను, చారిత్రకముగాను, తార్కికముగాను మూఁడుగా విభాగింపవచ్చును. (౧) ప్రతిఘటన తత్త్వము లైన చార్వాక జైన బౌద్ధములు (క్రీ. పూ. ౬౦౦). (౨) ఆస్తికవాద నిర్మాణమొనర్చిన భగవద్గీత; అనంతరోపనిషత్తులు (క్రీ. పూ. 500.) (3) ఇంచుమించుగా (క్రీ. శ. 200) కాలమునకు సుస్థిరములైనిలిచిన షడ్దర్శనములు. (క్రీ.పూ. 300)

## ౨. యుగసామాన్యభావములు

చార్వాక జైన బౌద్ధతత్త్వములను బరిశీలించుటకు ముందు, యుగసామాన్యభావములను క్లుప్తముగాబరిశీలింతము. జీవిత మశాశ్వతమనియుఁ, బునర్జన్మ తప్పదనియుఁ దలఁపఁబడెను. జీవితము దుఃఖమయము; వస్తువాహనములు మోహ

దుఃఖజనకములేకాని సత్యములుకావనియెడి యుపనిషద్భావములుగలవు. నచికేతుఁడు యమునడిగిన ప్రశ్నచూడుఁడు: "ఓయమా ! అప్సరసలు, హయములు, ధనము, రాజ్యము నీదర్శనమైనతరువాత నుండునా?" ౧. జీవితము దుఃఖాత్మకమను సిద్ధాంతమునుండియే, పునర్జన్మచక్రసిద్ధాంత ముదయించినది. పుట్టుట, తిరిగి పుట్టుట, యీవిధముగా ననంతజన్మములు పౌనఃపున్యముగా నడచుట, జీవితము నర్థరహితముగను, సంతోషహీనముగను జేసివేసెను. "జీవి, తనకుఁదటస్థింపఁబోవు పరిస్థితినిఁగూర్చి యొకేసారి శాశ్వతముగానిర్ణయింపఁబడినచో నట్టి నిర్ణయమును భరించుట సులభము; ఒక్కసారినిర్ణయమైన వెనుక నిఁక బాధలేదు. కాని, ఒకలోకమునుండి యింకొక లోకమునకును, నొకజన్మమునుండి యింకొకజన్మమునకు ననంతముగా యాత్రలుచేయుచుండుట, నిత్యము తిరిగితిరిగి సంభవించుచుండు మృత్యువును జయించు ప్రయత్నములన్నియు నిష్ప్రయోజనములగుట, యీ భావము, దురంత శ్రమాన్వితమైన యీ అశాంతి, యెంతటి ధీరునైనను దీనుని జేయఁగలదు." ౧. ఈయుగమున బయల్వెడలినమతము లన్నిటికి నీజీవితము క్షణికమనుభావము సామాన్యమైయున్నది. అశాశ్వతజీవితమునకు జగద్వ్యాపారమనియు, సంసారమనియు, వ్యవహారమనియుఁ బ్రపంచమనియు నామములీయఁబడెను. దీనికంగమైనదే కర్మసిద్ధాంతము. ఈసంసారచక్రమునుండి, యీమృత్యువునుండి బయటపడు నుపాయమేదైన నున్నదా

౧. కఠోపనిషత్తు.

యను ప్రశ్న బయలుదేరకతప్పదు. ఆశ్రమములలో సధర్వవేదమునఁ జెప్పిన మంత్రవిధానములు, నుపాసనలు, ప్రకృత్యతీత శక్తిసంపాదనమునకై చేయఁబడుచున్నవి. తపస్సువలన బాహ్యాభ్యంతరశుద్ధి లభించునను దృఢమైనవిశ్వాసమున్నది. ఉపనిషత్తులలోఁ జెప్పిన ధ్యానసమాధులకుఁబదులు తపమున కాధిక్యమీయఁబడెను. యోగసిద్ధిలో నీశ్వరసాక్షాత్కారము సిద్ధించుటకే, మనస్సును శిక్షించి, నిశ్చలమొనర్పవలెనని నమ్మఁబడెను. దేహక్లేశసాధనములుచేయు సాధుసమూహములు దేశములో నాయాప్రాంతముల సంచరించుచునేయున్నారు. వర్ణవిభాగము క్రమక్రమముగా గుర్తింపఁబడెను.

## 3—నాస్తికవాదము–చార్వాకవాదము

తత్త్వశాస్త్రముతోఁబాటు నాస్తికవాదమును సనాతనమైనదే. ఇది విశేషముగా బుద్ధపూర్వదశయందుఁ బ్రబలియున్నది. దీనికి బీజములు ఋగ్వేదమునందుఁగలవు. "ఋష్యనిపూర్వకాలమునందు,ఁ గొన్ని సాక్ష్యములవలన,ఁ గేవల నాస్తిక సిద్ధాంతములను బ్రకటించినవారు గలరని చెప్పవచ్చును అతరువాత, నన్నికాలములందును, నేటివలెనే, నాస్తికవాదము ననుసరించు రహస్యానుచరులు నున్నారు."–౧. ప్రాచీన గ్రంథగ్రంములు నాస్తికవాదము నుదాహరించినవి. "చతుర్భూతములచే మానవుఁడు కల్పింపఁబడెను. మానవుఁడు మరణించునప్పుడు,

---

౧ ఓల్డెన్‌బెర్గ్. బుద్ధుఁడు. పుట ౪౯

౨. గార్బే దిఫిలాసఫీ ఆఫ్ ఏన్షెంటు ఇండియా పుట ౨౯

భూమిభాగము భూమియందును, జలభాగము జలమందును, అగ్నిభాగమగ్నియందును, వాయుభాగము వాయువునందును బ్రవేశించి కలిసిపోవును. ఇంద్రియములవకాశమునందుఁ గలియును. జ్ఞానియుమూర్ఖుఁడు, దేహము చెడిపోవునప్పుడు సమానముగానే నశించిపోదురు. ఆపైనేమియు మిగులదు." ౧. ఈవాదమును పురాతన బౌద్ధగ్రంథములుదాహరించినవి గనుక, నిది బుద్ధుని పూర్వమందే యున్నదని చెప్పనగును. ౨ ఈవాదమును బురాణములుదాహరించినవి 3 మనువు నాస్తికులను పాషండులనుగూర్చి ప్రసంగించి యున్నాఁడు. ౪ ఈనాస్తికవాదమునకు మూలగ్రంథము బృహస్పతి విరచిత సూత్రములు. అవినశించినవి. వీనిని నిరసించిన యితర మతగ్రంథములే మనకాధారములు. సర్వదర్శన సంగ్రహము మొదటి అధ్యాయమున నీవాదముయొక్క ఉపదేశము వర్ణింపఁబడినది.

## ౪—సిద్ధాంతములు.

పురోహిత వర్గాధికారమును నిర్మూలించుటకును, మతవిశ్వాసవిషయమునఁ బూర్ణవిశృంఖల స్వాతంత్ర్యమును బ్రిక

౧. రైస్ డేవిడ్సు, డయలాగ్సు ఆఫ్ బుద్ధ ౨అ. పుట ౪౬

౨. రైస్ డేవిడ్సు. అమెరికన్ లెక్చర్సు పుట ౨౪

3. చూడు శాంతిపర్వము శ్లోకములు ౧౪.౧౪, ౧౪౩౦-౪౨; శల్యపర్వము. ౩౪౧౬: చూడు విష్ణుపురాణము ౩అ. ౧౮.౧౪-౨౬

(౪) మనువు ౨అ. ౧౧; ౩అ, ౧౫౦, ౧౬౧; ౪అ. ౩౦, ౬౧, ౧౬౩; ౫అ. ౮౯; ౮అ. ౨౨. ౩౦౯; ౯అ. ౬౫. ౬౬; ౧౨అ. ౩౩, ౯౫, ౯౬.

టించుటకును గలిగిన అభినివేశములో నీనాస్తికవాదు లింకొక ప్రమాదకరమార్గమును బట్టిరి. వారు ప్రకటించిన భావముల వలన విశృంఖల భావవిహారమెచ్చటికిఁ దోడ్కొని పోవునో మనము చెప్పవచ్చును. ప్రబోధచంద్రోదయ నాటకమందొక పాత్రచే నీసిద్ధాంతమిట్లు చెప్పఁబడెను;" లోకాయత శాస్త్ర మొక్కటే నిజమైనశాస్త్రము. ఇందుఁ బ్రత్యక్ష మొక్కటే ప్రమాణము, భూమి జలాగ్నివాయువులు నాలుగు భూతములు; మానవజీవితమునకు ధనము భోగము రెండే వస్తువులు. జడ పదార్థమున కాలోచన శక్తి కలదు. ఇంకొక లోకము లేదు. చావుతో నన్నియుఁ బోవును." ౧ లోకాయత శాస్త్రమనుటకు గారణమది యీలోక మొక్కటే యున్నదని చెప్పును. వారినిఁ జార్వాకులనియుఁ బిలుతురు. చార్వాకుఁడు మతస్థాపకుఁడు.

ప్రత్యక్షముగా గోచరించున దొక్కటే సత్యము. అది యొక్కటే యున్నది. ప్రత్యక్షము కానిది లేనిదే; ఏలననుండినఁ గనబడెడిది. అను మానమసలే లేదు. మనము పొగను జూచి నప్పుడు, నిప్పుజ్ఞాపకము వచ్చును; కారణము రెండును గలిసి యుండునని మన మిదివఱ కెఱుగుదుము. అందుచే ననుమాన మనుమానింపఁదగినదే; ఏలన నది యొకప్పుడు నిజమగును; మఱొకప్పుడు కాదు. తరువాతవచ్చిన చార్వాకులు దీనికితర కారణములనిచ్చిరి. సర్వవస్తుసంబంధ జ్ఞానమున్నగాని మనకను మానము లేదు. ప్రత్యక్షప్రమాణ మట్టిజ్ఞానమును మనకీయదు;

---

౧. ప్రబోధచంద్రోదయము ద్వితీయాంకము.

౨. లోకమువైపు త్రిప్పినదృష్టి.

అనుమానమునీయదు; ఏలన నొకయనుమాన మింకొక యను మానమునుగోరును; దాని కంతముండదు. ఇతరుల సాక్ష్య మంగీకార యోగ్యముకాదు. సామ్యము అనుమానమును బుజువుచేయదు. అందుచే ననుమానము ప్రమాణము కాజా లదు. అనుమానము కేవలవ్యక్తిగత భావములపొందిక; అం దుచే నెప్పుడైన నదినిజమై తటస్థింపవచ్చును.

ఇంద్రియానుభవమొకటే జ్ఞానము కావున జడపదార్థ మొకటే పరమసత్యము. ఇంద్రియములు తెలియునదదొక్కటే. భూమిజలాగ్ని వాయువులే మనకుఁగల భూతములు. ఇవిశాశ్వ తమైనవి. జీవాణువు మొదలు తత్త్వవేత్తవఱకుఁ గల సర్వప్రా ణికోటియు జడపదార్థకల్పితములు, నాలుగు భూతముల సమ్మి ళనముచే నుదయించునదే బుద్ధి, బుద్ధి వేనినుండి వచ్చినదో ఆ భూతములు విడిపోయినపు డదృశ్యమగును. బుద్ధి, జడపదార్థము లైన భూతములనుండి వచ్చిన భూతరూపమే. తములపాకులు, సున్నము, పోకముక్కకలిసిన నెఱుపురంగు వచ్చునట్లే, భూత ముల కలయికచే బుద్ధివచ్చును." ౧. కొన్ని వస్తువుల కలయి కచే మత్తుకలిగించుశక్తి యెట్లుపుట్టునో, నాలుగుభూతముల కలయికచేఁ జైతన్య ముదయించును. నాలుగుభూతముల సమ్మి ళనముచే, నట్లే జ్ఞానముదయించును. జడపదార్థమున కాలో చనశక్తి యొకలక్షణము. కెబెనీన్ యొక్క సుప్రసిద్ధవాక్యము ననుసరించి, కాలేయము (Liver) నుండి 'ఆమ్ల' రసమెట్లు ద్రవించునో, అట్లే మేధస్సునుండి ఆలోచన ద్రవించును. ఆత్మ,

౧. సర్వసిద్ధాంతసార సంగ్రహము.

దేహమునుండి వేరని తలపనవసరము లేదు. ఆత్మ, చైతన్యముతోఁగూడిన దేహమే. "బుద్ధితోఁగూడిన దేహమే ఆత్మ; "నేను లావుగానున్నాను" "నేను యువకుఁడను" 'నేను వృద్ధుఁడను' 'నేను పెద్దవాఁడను' మున్నగువాక్యములలో స్ఫురించునదే ఆత్మ" ౨. ఆత్మయు దేహమును విడిగానున్నట్లు మనకు సాక్ష్యము లేదు. దేహము లేక ఆత్మయే లేదు. "దేహమునుండి విడిగానున్న యాత్మనెవరు చూచినారు? ప్రాణము పదార్థముయొక్క రూపాంతరము కాదా ?"3. చైతన్యము శరీరముతో సంబంధించి యుండునదే. అందుచే నదియు శరీరమే. మానవుఁడేది తినునో అట్టిరూపమే. నాస్తికవాదములు నాలుగురకములని సదానందుఁడు చెప్పినాఁడు. వారికిఁ బరస్పరభేదము 'ఆత్మ'ను గూర్చిన భావములలో భేదమే. ఒకవర్గము స్థూలదేహమే ఆత్మయనును; ఇంకొకటింద్రియ వర్గమాత్మయనును; మఱొకటి శ్వాసయే ఆత్మయనియు, వేఱొకటి బుద్ధియే ఆత్మయనియుఁ జెప్పును.౪. అందరు నాత్మజడపదార్థ రూపాంతరమే యని యంగీకరింతురు. తమసిద్ధాంతమును సమర్థించుటకీ చార్వాకు లుపనిషత్తు నుదాహరింతురు; "ఈభూతములనుండి యుదయించి అది నశించును. వారు నశించిన వెనుక, అనగా మరణానంతరము, బుద్ధియు మిగులదు"౫. దీని ననుసరించి, యింకొకజన్మములోఁ

౨. సర్వసిద్ధాంతసార సంగ్రహము.
3. ప్రబోధ చంద్రోదయము అంకము ౨
౪. వేదాంతసారము.
౫. బృహదారణ్యకము. ౨౪. ౪.౧౨.

జనకర్మల ఫలితము ననుభవించు 'ఆత్మ' యొక టున్న దని యూహించుట మౌర్ఖ్యము. ఇంకొక లోక మున్నదనుటయే వివేకశూన్యప్రసంగము. దీనికంటె వేఱైన స్వర్గముకాని నరకముకాని లేదు. స్వర్గనరకములు దుర్బుద్ధులచేఁ గల్పితములు. మతమొక మానసికదోషము లేక రోగము. లోకమునకుఁ గర్తగా నొక దేవుఁ డవసరము లేదు. మతమం దవితర్క్యాదరణముచే, మానవులు వేఱొకలోకము దేవుఁడు నుండెనని నమ్మి, అట్టి విశ్వాసము నిర్మూలింపఁబడినపుడు, వారేదో లోపము తటస్థించిన దని భావించి, దానివలన నష్టమున్నదనియుఁ, గష్టముగలుగునని యు నూహింతురు. మనుష్యులు కల్పించుకొనిన విలువలు ప్రకృతి విరుద్ధములు. మంచిచెడ్డలు ప్రకృతిలో లేవు. సూర్యుఁడు మంచి వానికిని, చెడ్డవానికిని సమానముగాఁ బ్రకాశించుచున్నాఁడు. ప్రకృతికొక గుణమున్నది; అదియే అతీతమైన శాశ్వతత్వము. మానవులలో బహుసంఖ్యాకులు, దుర్బలహృదయులగుటచేఁ దమ్మునస్తోత్రముచేయు నమాయికులను గాపాడుచు, నిరసించు వారిని నాశమొనర్చుచునుండు దేవత లున్నా రని నమ్ముదురు. ఇట్టి నమ్మకమునకుఁ గారణ మవివేకమే. ప్రపంచమున నేచటఁ గాని దేవతలువచ్చి దర్శనమిచ్చిన సందర్భమేమియును లేదు. ప్రకృతిశక్తులను జూచి, దేవతలనియు, దయ్యములనియు మన మూహాకల్పన మొనర్చుచున్నారము. దేవతలు లేరని నమ్ము వారు, దయాసముద్రుఁడగు దేవుఁడున్నాడని ప్రకృతిసాక్ష్య మిచ్చుచున్నదని కాని లోకచరిత్రము దేవునిప్రతిభను జూపు

౧. బృహదారణ్యకము. ౨ అ. ౪. ౧౨.

చున్నదని కాని మనవ్యక్తిగతానుభవములు దేవుని సంకల్ప సూచనములని కాని, విశ్వసింపఁజాలరు. చరిత్రమందు ధర్మము జయముగాంచుట దేవుని యుద్దేశమును సూచించుచున్నదనియుఁ, గాల గతి ననుసరించి లోకమునఁ దటస్థించిన వివిధసందర్భములు నాత్మ మోక్షమునకై, దైవముచే నేర్పాటుచేయఁబడినవనియుఁ దల చుట కేవలమాత్మ వంచనమే యగును. ఏదేవతల ప్రమేయము లేకుండఁగనే ప్రకృతితనకార్యములను నెఱవేర్చుచున్నది. ప్రపం చములోని నానాత్వము ప్రకృతి సంజాతము. అగ్ని వేడిగా నుండుట, జలము చల్లగానుండుటయుఁ బ్రకృతి స్వభావలక్షణ ములు. "నెమలి పింఛములోని రంగుల నద్భుతముగా నెవఁడు చేసినాఁడు ? కోకిల కంఠములో మాధుర్యము నెవఁడు కల్పిం చెను ? దీనికిఁ బ్రకృతితప్ప వేఱొక కారణములేదు."౧. సాహ సాంచితమైన యీపిడివాదము, లోకములోని విలువలన్నిటినిఁ౨. దుడిచిపెట్టినది; దేవునియందుఁ బరలోకమునందు విశ్వాసము బిఱికితనము, దౌర్బల్యము, పురుషకారహీనత్వము, మోసము మున్నగు లక్షణములను సూచించునని వాదించినది.

ఈసిద్ధాంతము ననుసరించి, కష్టసుఖములే జీవిత కేంద్ర సత్యములు; విశృంఖల భోగానుభవమే నాస్తికవాదుల నీతికిఁ

౧. సర్వదర్శనసార సంగ్రహము. ౨ అ. ౫;

౨. బెనర్జీపండితు నభిప్రాయములో న్యాయవైశేషికములు మొదట నాస్తికములుగానుండి, తరువాత ననుచరుల హస్తములలో ఆస్తికములుగా మారినవి. కుమారిలభట్టు, పూర్వమీమాంసావాదులాదియగు నాస్తికభావములు గలవని చెప్పెను.

బరమలక్ష్యము, తిని, త్రాగి, సుఖింపుము; ఏలనఁ జావుతో
నన్నియుఁ బోవును.

> " బ్రతికియున్నంతకాలము హాయిగా సుఖింపుముః;
> యముని చూపునుండి తప్పించుకొనువాఁడు లేఁడు;
> మనశరీరము కాల్చివేయఁబడిన వెనుక
> అదితిరిగి యెట్లురాఁగలదు ?"3.

ధర్మమనునది కేవల భ్రాంతి; భోగమే నిజమైనది. జీవిత మనఁగా జీవించు టే. ఉన్నతము; పవిత్రము, యోగ్యము, దయాన్వితమైనదెల్ల నవిశ్వాసమునకుఁ బాత్రమైనది. నాస్తిక వాదమునకు ప్రధానసిద్ధాంతములు ఇంద్రియసుఖము, స్వార్థ సంతుష్టి, స్వేచ్ఛావిహారమునై యున్నవి. కామములను పశు కాంక్షలను నిగ్రహింప నవసరములేదు; ఏలన నవి మానవు నకుఁ బ్రకృతియిచ్చిన వరప్రదసాములు. ఉపనిషత్తులు, నిస్సంగ త్వము, నిగ్రహనిష్ఠ, సర్వజీవదయాళుత్వము, ప్రేమ, ముఖ్య ములనిచెప్పఁగా, నాస్తికులు విశృంఖలపశుబలసంపాదనము, అహంభావసమృద్ధి,లజ్జాహీనముగాఁ బ్రమాణములనునిరసించుట మున్నగువాని నుపదేశించిరి. మనుష్యులందఱును సమానులే కావున, నొకఁడు ప్రభువు నొకఁడు దాసుఁడు కానవసరము లేదు. నీతి నియమములు మానవునికట్టుబాట్లు. తపోపవాస విధానముల నంగీకరించుటచే, జీవితమునకుఁ బ్రధానాశయ మైన భోగమును మఱచిపోవుచున్నాము. "జీవహింసయు, నింద్రియసుఖముల ననుభవించుటయుఁ బరధనమును దస్క—

3. సర్వదర్శన సంగ్రహము—పుట ౨.

రించుటయు న్యాయ్యమా, అన్యాయమా యని విచారణ చేయువారు, జీవితమూలసూత్రమైన సుఖానుభవమునకు విరుద్ధముగాఁ బ్రవర్తించుచున్నారు." ౧. సుఖములు దుఃఖసమ్మిశ్రితములని చెప్పిన బౌద్ధసిద్ధాంతమునకుఁ జార్వాకులిట్లు జవాబుచెప్పుదురు; "దుఃఖములతోఁగూడియున్న కారణమున సుఖములను వారు విడిచిపెట్టుమందురు; కాని దంపి బియ్యము చేయని ధాన్యమును బుద్ధిమంతుఁడెవఁడైనఁ బారబోయునా? దంపి, ఒకవేళఁ జేసినచోఁ బరిశుద్ధమైన బియ్యము లభించును గదా."౨. "ఎల్లప్పుడు నేదోయొక బాధతోఁగూడినవిక నుక నింద్రియసుఖములు విడిచిపెట్టవలెనని చెప్పఁగలవా? సాధ్యమైనంతగా బాధలను త్రోసివేసి, సుఖమును జేపట్టి యనుభవింపవలెను. అందుచే బాధలుకలుగునని భయపడక, మానవ ప్రకృతికి సుఖముగాఁ దోచినవాని నన్నిటి ననుభవింప వలెను.౧.

వేదప్రమాణము తీవ్రనిరసనమునకు గురియయ్యెను. అనృతము, స్వవ్యాఘాతము, పునరుక్తిదోషములు వేదములకుఁ బట్టినవి.

"స్వర్గ మోక్షములుగాని, ఆత్మకాని, పరలోకముగాని లేదు; చతుర్వర్ణాశ్రమ ధర్మకర్మలు నిజముగా ఫలము నీయవు; అగ్నిహోత్రము, వేదత్రయము, సన్న్యాసిదండకమండలా

౧. ప్రబోధచంద్రోదయము. అంకము ౨.

౨ ప్రబోధచంద్రోదయము - ,, ,,

౧. సర్వదర్శన సంగ్రహము. పుట. ౪.

ములు, విభూతిధారణము నివియన్నియుఁ, బురుషకారముకాని, జ్ఞానముకాని లేని అసమర్థుల కుదరపోషణోపాయములుగాఁ బ్రకృతి కల్పించినవి.

"జ్యోతిష్టోమమందలి యాగపశువు స్వర్గమునకుఁబోవుచో, యజమాని, తనతండ్రినేల యాగపశువుగాఁ జేయరాదు? చచ్చినవారికి శ్రాద్ధకర్మవలన సంతృప్తి కలుగుమాట నిజమైనచో, నీలోకమునఁ బ్రయాణముచేయు యాత్రికులు త్రోవలో భుజించుటకే యాహారములను బట్టుకొని పోనవసరము లేదు.

"ఊర్ధ్వలోకస్థులకు మనమిచ్చుటనిచ్చు శ్రాద్ధము ముట్టినచో. నీలోకమున నొక మందిరోపరిభాగమున నున్న వారికిఁ గ్రిందియంతస్థులో వడ్డించి ముట్టినదని యూరకొనరాదా?

"ప్రాణమున్నంతకాలము, ఋణముచేసియైనను సమృద్ధిగా ఘృతాదులుతెచ్చుకొని, తిని సుఖింపుము; దేహము దహనమై బూడిదలోఁ గలిసిపోయిన వెనుక నది యింకఁ దిరిగి యెట్లువచ్చును?

"మరణానంతర మెవఁడైన నింకొకలోకమునకుఁ బోవునెడ, నీలోకమునఁ దనకై యేడ్చుచున్న బంధువులను జూడ నొక్కసారియైన నేలరాఁడు?"

"కావున బ్రాహ్మణు లుదరపోషణనిమిత్త మీకర్మల నన్నిటిని గల్పించిరి; అంతేమఱొక ఫలితములేదు; "వేదకర్తలు; నీచులు, చోరులు, రాక్షసులును: "జర్ఫరి, టర్ఫరి మున్నగు పండితుల ప్రసిద్ధసూత్రావళి యంతయును, అశ్వమే

ధమున రాణికిఁజేయు అవాచ్యకర్మలన్నియు; పురోహితబృందమున కేర్పాటు చేసిన దానధర్మ కలాపమంతయు, మూర్ఖాగ్రేసరుల అద్భుతకల్పనలు.

"నిశాచరులిట్లే మాంసభక్షణమును బోధించిరి" (సర్వదర్శన సంగ్రహము.) చార్వాకుల పద్ధతియెట్టిదో దీనివలనఁ గొంతస్పష్టమైనది. అనేకయుగములం దంగీకరింపఁబడిన తత్త్వశాస్త్ర మీనాస్తికులు వర్ణించిన నీచకల్పనము కాఁజాలదు.౧

## ౫—సామాన్యపరిశీలనములు

పూర్వమతాచారములు, నైంద్రజాలికవిద్యలు, నాస్తికవాదప్రచారమునకుఁ గొంతకారణములైనవి. చార్వాకసిద్ధాంతమువంటి విప్లవాందోళన మనేకశతాబ్దవ్యాప్తమై యున్న మూఢవిశ్వాస మాంద్యముల నొక్కపరి కదల్చి వైచినఁగాని, నాఁటికి సజీవములై, కాలము, జనము, నాదరించిన యభ్యాసములను, సాంఘికవ్యవస్థలను, విశాలభావముతోఁ బునర్నిర్మాణ మొనర్చు ప్రయత్నమంతగా జయప్రదము కాఁజాలదు. మానవవ్యక్తిగతమైన ఆధ్యాత్మికస్వాతంత్ర్యమును, బాహ్యప్రమాణ శాసనతిరస్కారమును నాస్తికవాదము ప్రకటించిన ముఖ్యభావములు. సహేతుకముగాని దాని నెవఁడును బ్రమాణముగా నంగీకరింప నవసరము లేదు. మానవుఁ డాత్మశక్తియందలి విశ్వాససీమకు మఱలఁ దిరిగివచ్చి, పరాధారబాహ్యశాసనములను తిరస్కరించుటయే జరిగినది. యుగమునకు దుర్భర

౧. చూడు రైస్ డేవిడ్సు, డయలాగ్సు ఆఫ్ బుద్ధ ౧. అ. పుటలు (౧౬౬-౧౭౨)

మైన గత సంప్రదాయాచారమునుండి లోకమును గాపాడు టకై చేయఁబడిన ఉగ్రప్రయత్నమే చార్వాకపరిచారము. మూర్ఖసిద్ధాంత విశ్వాసముల నున్మూలింపనిదే, విజ్ఞానవికాస ముతోఁగూడిన పునర్నిర్మాణ కార్యక్రమమున కవకాశము లేకుండెడిది.

అనంతర భారతీయవిజ్ఞానమందు, చార్వాకవాదము తీవ్రమైన నిందకు నిరసనమునకుఁ బాలైనది. మొదట దృష్టి లేనిదే దృశ్యములేదు కావున, దృశ్యమునుండియే దృష్టి జనించెనను సంగతమను సుప్రసిద్ధశాస్త్రీయ వాదము తఱచుగాఁ బరికటింపఁబడెను. జడప్రకృతిశక్తులనుండి, జీవ ముదయింపఁ జాలదు. దేహసంబంధములేని ఆత్మయుండఁజాలదనువాదమున కీవిధముగా సమాధాన మొసఁగఁబడెను; (౧) దేహసంబంధములేని జీవమును మనము చూడలేనంత మాత్రమున, జీవము దేహరహితమై యుండఁజాలదని చెప్పుటకు మనకధికారము లేదు; ఏలన జీవవికాసమునకు శరీర మొక సాధనమై యుండ వచ్చును. కాంతిని కాంతిలేనిదే చూడఁజాలము; అంతమాత్రముచే మనచూపే కాంతియని కాని, చూపునకుఁ గాంతిలక్షణమనికాని నిర్ణయించుట తగదు. (౨) జీవము శరీరలక్షణమైనచో జీవముండఁజాలదు; ఏలన, దృష్టి దేనినిఁదెలియుచున్నదో దాని లక్షణము కాఁజాలదు. అనగా దృష్టి, దృశ్యముకాని, దృశ్యలక్షణముగాని కాదు. (3) జీవము దేహగుణమైనచో,

జడపదార్థగుణము లితరులకు గోచరించునట్లే, ఒకని జీవమింకొకనికి గోచరింపవలెను; కాని మన యనుభవములో నెవని జీవము వానికి స్వగతానుభవమేకాని, యితరులకు విలోకింప సాధ్యమగుటలేదు. (ర) ఒక ఉపకరణస్వభావముగల శరీరవాహన మొకవాహనాధిపతి యధీనములోనున్నదని సూచించుచున్నది. జీవ మావాహనాధిపతికిఁ జెందినది. నాస్తికవాద మాత్మవిచ్ఛేదకము. జడప్రకృతి సంభూతుఁడు మాత్రమే మానవుఁడైనచో,ధర్మసిద్ధాంతనిర్మాణము నాతఁడు చేయుట కవకాశమే లేదు. ప్రత్యక్షమొకటే ప్రమాణమను విషయము నన్నిమతశాఖలు ఖండించినవి. సాంఖ్యతత్త్వకౌముదినుండి యొకశ్లోకము నిట నుదాహరింతుము; "చార్వాకుఁడు జ్ఞానసాధనముగా ననుమానప్రమాణము పనికిరాదని చెప్పినప్పుడు, ఒకవ్యక్తి అజ్ఞానియనికాని, సంశయాత్మకుఁడనికాని, దోషియనికాని యెట్లు నిర్ణయింపవచ్చును? అన్యులలోనున్న అజ్ఞానసంశయ దోషములను బ్రత్యక్షప్రమాణము చూపఁజాలదు. కావున, చార్వాకుఁడైనను తనకంటె నితరులగు వారిలోని యజ్ఞానాదికమును, వారి ప్రవర్తనమునుండి, సంభాషణమునుండి అనుమానించి గ్రహింపవలసియున్నది; అందుచే నతని కిష్టములేకున్నను, నాతఁడనుమాన ప్రమాణము నంగీకరించియున్నాఁడు." ప్రత్యక్షప్రమాణాంగీకారమునుండి వచ్చిన ఫలితములే నాస్తికసంశయవాదములు. మానవప్రపంచమును కదలించుభావము లీసిద్ధాంతమునకు వ్యతిరేకములు; ఏలన నవి బాహ్యముగాఁ బరిగణించుటకు సాధ్యములుగావు. ఇన్నిలోపములున్నను, నవి యధి

తముగా నుపరిభాగముననే యున్నవి. ఈవాదము గతమును గూర్చిన మితిమీఱు గౌరవభావమును బెకలించి, యాచరణములలోని విశ్వాసములపై నఖండప్రభావము చూపినది. మూఢమతవిశ్వాసములను, నవితర్క్యముతో నంగీకరించిన సిద్ధాంతములను మనమునఁ జొరనీని స్వాతంత్ర్యముతో నాలోచించుటకుఁ బ్రజ లారంభించునప్పుడు నాస్తికవాదసీమకే చేరుదురు; కాని యింకను సమ్యగాలోచన మట్టి ప్రమాదమునుండి రక్షించును. తత్త్వసమస్యలలోని క్లిష్టతలను దీర్చుటకుఁ గేవలతర్కశక్తి యెంతవఱకుఁ బ్రయోజనకారియను ప్రశ్నకు మొదటి సమాధానము నాస్తికవాదము.

## ఉపయోగించిన గ్రంథములు


౧. సర్వదర్శనసంగ్రహము, భాషాంతరీకృతము. కవల్ అండు గఫ్. ౨. ఆ.

౨. సర్వసిద్ధాంతసారసంగ్రహము. శంకరకృతమే మో. యమ్. రంగాచార్యులచే సాంగ్లీకృతము. ౨.ఆ.

౩. ప్రబోధచంద్రోదయము. ద్వితీయాంకము.

౪. కోల్‌బ్రూక్. మిస్లేనియస్ ఎస్సేస్. ౧. ఆ. పుటలు. ౪౦౨.

౫. మూయిర్. జర్నల్ రాయల్ ఏషియాటిక్ సొసైటీ.౧౮౬౨.వాల్యూము ౧౯. పుట ౨౯౯.

# భారతీయ తత్త్వశాస్త్రము

## షష్ఠాధ్యాయము

### జైనుల బహుజీవసిద్ధాంతము.

#### ౧. జైన మ త ము.

బౌద్ధులు బుద్ధుని (మేల్కొన్నవాఁడు) కెట్లనుచరులో, జైనులు జినుని (జయించినవాఁడు) కనుచరులు. జైనులు దమ ప్రవక్తయైన వర్ధమానునే జినుఁడని పిలిచిరి. ఇంద్రియ ప్రకృతిని జయించి, ఉన్నతజీవితమును గాంచిన వారందఱకీ నామము చెల్లును. జైనమతనామము ధర్మమార్గమున కత్యధిక ప్రాముఖ్యమిచ్చిన మతమని సూచించును.

#### ౨. వ ర్ధ మా నుఁ డు.

నేఁటి బీహారైన మగధరాజ్యమునకుఁ బ్రభువైన యొక క్షత్రియుని ద్వితీయకుమారుఁడైన వర్ధమానుఁడు బుద్ధుని సమకాలికుఁడు, వయస్సున బుద్ధునికంటెఁ బెద్దవాఁడు. సంప్రదాయము ననుసరించి, యాతఁడు క్రీ.పూ. ౫౯౯ లో జన్మించి, క్రీ.పూ. ౫౨౭ లో దివంగతుఁడయ్యెను. వర్ధమానుఁడు తండ్రివలెనే కాశ్యపుఁడు, ఈతఁడు తల్లిదండ్రు లున్నంతకాల మింటనుండెను. అనంతర మన్నయగు నందివర్ధనుఁడు రాజయ్యెను. కుటుంబము

లోని పెద్దలయనుమతితో నిరువదియెనిమిదవయేట నాధ్యాత్మిక జీవితానుష్ఠానమునకుఁ బ్రారంభించెను. పదిరెండు సంవత్సరము లాతఁడు తపోపవాసాదికము లొనర్చెను, ఆసమయమున రాఢ దేశస్థులైన యనాగరిక జాతులనుగూడఁ జూచెను. ఒకయేఁడైన వెనుక నాతఁడు దిగంబరుఁడయ్యెను. ఈద్వాదశవర్షముల ఆత్మ నిగ్రహానిష్ఠానంతర మాతఁడు 'కేవలి' యయ్యెను. అనంతర మాతఁడు సర్వజ్ఞుఁడనియు, జైనప్రవక్తయనియు, (తీర్థంకారుఁ డనియు) నంగీకరింపఁబడి, జిన మహావీర గౌరవనామములచే సుప్రసిద్ధుఁడయ్యెను, ఈబిరుదనామములు బుద్ధునికిఁ గలవు. తన యవసానదశకుఁ బూర్వము ముప్పదిసంవత్సరములకాలమాతఁడు తన మతప్రచారమునందును, సన్న్యాసవర్గ నిర్మాణమందును గాలముఁగడపెను. అతనిమతమును, ప్రచారమును నంగీకరించి, పోషించిన వారాతిని మాతృసంబంధులగు సామంతరాజులు." వర్ధమానుఁడు తానుబోధించుచున్న మతము వరుసగా నిరువది ముగ్గురు తీర్థంకారుల ద్వారమున నవిచ్ఛిన్నముగా వచ్చినదని చెప్పుకొనెను. ఆ తీర్థంకారులచరిత్ర కాధారములు సరియైనవి లేవు. తానొకనూతన మతస్థాపకుఁడు కాననియు, క్రీ. పూ. ౭౭౬ లో మరణించిన పార్శ్వనాథుని మతమునే తానుబోధించు చున్నాననియు నాతఁడు చెప్పెను. అనేకశతాబ్దముల పూర్వము జీవించిన ఋషభుఁడను నాతఁడీ మతజనకుఁడని జైనసంప్రదాయము. క్రీ. పూ. జైనులు ఒకటవశతాబ్దివఱకు ప్రథమతీర్థం కారుఁడైన ఋషభదేవు నారాధించి చెప్పు నాధారములున్నవి. జైనమతము వర్ధమానునికిఁ, బార్శ్వనాథునికిఁగూడఁ బూర్వ

ముండెననియే చెప్పవచ్చును. యజుర్వేదము, ఋషభుఁడు, అజితనాథుఁడు, అరిష్టనేమి యనుమువ్వురు తీర్థంకారులను పేర్కొనియున్నది. ఋషభుఁడే జైనమతజనకుఁడని భాగవత పురాణ మంగీకరించుచున్నది. ఏది యెంతనిజమైనను, దమ మతము యుగయుగములనుండియు గురుపరంపరాగతమైనదని జైనులు విశ్వసింతురు.

వర్ధమానుని యనుచరులందఱు చాలవఱకు రాజకుటుంబ ములనుండియేవచ్చిరి. వారిలో స్త్రీపురుషులకు వేఱుగా గృహస్థ సన్న్యాసి వర్గముల నేర్పాటుచేసి, జైనసంఘము నాతఁడు నిర్మించి నాఁడు. వర్ధమానుని ప్రభావముచే నాకృష్టులై, భిన్న మతశా ఖలవా రిందుఁజేరిరి. ఒకవర్గమువారు వర్ధమానునివలె సర్వ త్యాగముతోఁబాటుఁ బూర్ణదిగంబరత్వము నంగీకరించినవారు; రెండవవర్గమువారు పార్శ్వనాథుననుసరించి, వస్త్రధారణ మవన సరమని యంతటితో నాగినవారు. కేశిగౌతము లమైత్యవర్ణన మొనర్చిన 'ఉత్తరాధ్యయన' గ్రంథమీవిషయమును బేర్కొ న్నది. ఈసవస్త్ర వివస్త్రవిభాగమువలన జైనులు శ్వేతాంబరు లనియు దిగంబరులనియు రెండుశాఖలుగా క్రీ. వె. ౭౯ లేక ౮౨ వ సంవత్సరమున నేర్పడినవి.

ఈ శాఖాద్వయమునకు భేదము తత్త్వసిద్ధాంతములలోఁ గాక, నీతిసూత్రములందే కలదు. కేవలులు లేక పూర్ణసిద్ధులు భుక్తియవసరము లేకుండ జీవింపఁగలరనియు, లేశమాత్రమైనను 'నాది' యనునాస్తి,(వస్త్రముతోఁగూడ) యున్నచో 'నిర్వాణ' ము లభింపదనియు, స్త్రీలకు మోక్షములేదనియు దిగంబరుల

విశ్వాసము. వస్త్రహీనుఁడు, నిరలంకృతుఁడు, అధోముఖుఁడుగా నుండుటే తీర్థంకారుని లక్షణమనియు, వర్ధమానుఁ డవివాహితుఁడనియు వారు చెప్పుదురు. వా రేపవిత్ర గ్రంథముల నంగీకరింపరు. శ్వేతాంబరుల మతధర్మగ్రంథములను వారు గౌరవింపరు.

## 3—సారస్వతము

ప్రజల మనఃఫలకములపై మతవిశ్వాసము యథాప్రకారమే ముద్రితమైయున్నది. మతగ్రంథవిజ్ఞానము క్రమముగా క్షీణింపఁజొచ్చెను. క్రీ.పూ. నాల్గవశతాబ్దమునాఁటికే మతగ్రంథనిర్ణయము చేయవలసివచ్చెను. ఈయుద్దేశముతో నొక మతసభ నాల్గవశతాబ్దాంతమునఁ బాటలీపుత్రమున నేర్పాటైనది. ఈయుద్దేశము క్రీ. వె. ౪౫౪ వ సంవత్సరమున వలభినగరమున జరిగినసభలో నెఱవేఱినది; సభాధిపతి దేవార్ధి. ఎనుబదినాలుగు మతగ్రంథములుగా నంగీకరింపఁబడెను. వానిలో ౪౪ సూత్రగ్రంథములు, పెక్కుప్రకీర్ణకములు, ౧౨ నిర్యుక్తులు లేక వ్యాఖ్యానములు, ఒక మహాభాష్యము. ౪౪ సూత్రగ్రంథములలో ౧౧ అంగములు, ౧౨ ఉపాంగములు, ౫ భేదములు, ౫ మూలములు, ౮ ప్రకీర్ణకములు, గలవు. ప్రకీర్ణకములలో భద్రబాహుని కల్పసూత్ర మొకటి. ౧. ఈగ్రంథభాష అర్ధమాగధి. క్రీస్తుశకారంభమునుండి జైనమతము సంస్కృతభాష నెక్కువగా నాదరించెను. పవిత్ర మతగ్రంథరచనము క్రీ. వె. ౫౬౭ వ సంవత్సరమున జరిగినదనియు, మతవిద్వాంసులసంఖ్య క్షీణించినదనియు

నందుచే వర్ధమానుఁడు, నితర కేవలులు చేసిన యుపదేశము లెవరెట్లు జ్ఞాపకముంచుకొనిరో, యట్లే లిఖించిరనియు దిగంబరులు చెప్పుదురు. వీని నాధారముగాఁ జేసికొనియే, ౭ తత్త్వములు, ౯ పదార్థములు, ౬ ద్రవ్యములు ౫ అస్తికాయములు గల ప్రమాణగ్రంథములు రచింబఁబడెనని చెప్పుదురు.

౪—ఇతరమత సంబంధము.

బౌద్ధజైనములు సృష్టి ప్రథమకారణమైన సగుణమూర్తి యొకఁడు లేఁడనును, యతిశేఖరులనే దైవసమానులని పూజించును; బ్రహ్మచర్యానుష్ఠానము గల సన్న్యాసిబృందము నంగీకరించును; ఏకారణముచేనైన జీవహింస నంగీకరింపవు. మతస్థాపకులు స్వయంకృషివలనఁ బరిపూర్ణులగుటకు యత్నించిరి; ఎల్లప్పుడుమాత్ర మట్లుండఁ జాలకపోయిరి. ఉభయమతములు కూడ వేదప్రమాణమునెడ నౌదాసీన్యమునో వ్యతిరేకభావమునో కలిగియుండెను. బుద్ధవర్ధమానుల జీవితములలోని తుల్యత చేతను, వారి యుపదేశము లించుమించుగా సమానములగుట చేతను, రెండునొకటే యనియు, జైనమతము బౌద్ధమతశాఖయే యనియుఁ దలంపఁబడెను. బార్తుపండితుఁడిట్లు వ్రాసెను; "వర్ధమానుఁడు లేక మహావీరుఁడనియు, నీయుగమునకు జినుఁడనియుఁ బ్రఖ్యాతిగాంచిన యాతని జీవితగాథ, గౌతమబుద్ధుని జీవితగాథతో ననేకవిషయములలోఁ బోలికగలిగి యుండుటచే రెండు నామములు నొకేవ్యక్తికిఁ జెందినవనుభావము సహజముగా మనకుఁ గలుగును. ఇరువురు రాజకుమారులే; వారి యిరువుర బంధువులకు, అనుచరులకు సమానమానములే యు

న్నవి. ఒకే దేశమున నొకేకాలములో వారిరువురును జన్మించి, ది వంగతులైరి. అందఱచే నంగీకరింపఁబడిన యాధారముల నను సరించి, జినుఁడు క్రీ.పూ. ౫౨౭ నందును, బుద్ధుఁడు క్రీ.పూ. ౪౮౩ నందును నిర్వాణమును బొందిరి; ఈ తేదీలలోని భేదము నకుఁ గారణము నిర్ణయ విధానములోని లోపముమట కవకాశ మున్నది కావున నిర్వాణకాల మొకటేయని నిర్ణయింపవచ్చు ను. రెండు సంప్రదాయములలోను దుల్యవిషయములే తట స్థించినవి. బౌద్ధులవలెనే, జైనులును పూర్వులు తమ మత పోషకులని చెప్పుకొనియుండిరి. ఏ మండలము పవిత్రపుణ్యభూమి యని యొకరుతలఁచిరో దానినే రెండవవారు నట్లే తలఁచిరి; బీహారునందును, గుజరాతు ప్రాంతమందును, రాజస్థానమందలి ఆబూపర్వత శిఖరమునను, వారి పుణ్యతీర్థములు సమానము లో లేక, ఒకదానికొకటి సమీపముగనో యున్నవి. ఈవిధ ముగా సిద్ధాంత, నిర్మాణ, మతాచార సంప్రదాయములందలి తుల్యవిషయముల నొకచో మేళవించి చూచినయెడల, రెం టిలో నేదో యొకటి మతశాఖయనియు, రెండవదాని ప్రతిబింబ మనియు నిస్సందేహముగాఁ దెలియఁగలదు. కాని బుద్ధజీవిత గాథలకు, బ్రాహ్మణముల మతసంప్రదాయములతో నున్నంత విశేషసంబంధసామ్యము మహావీరుని జీవితగాథలతో లేదు; మఱియు బౌద్ధమతమునకు, అశోకశిలాశాసన సాక్ష్యమున్నది; క్రీ.పూ. మూఁడవశతాబ్దమునాఁటికే, బౌద్ధసారస్వతము సుస్థిర మైనది; జైనమతమునకు సాక్ష్యమిచ్చు నత్యంత ప్రాచీనవిషయ ములైనను క్రీ. వె. ఐదవశతాబ్దమునకుఁ బూర్వమునకుఁబోవు;

ఇంకను బౌద్ధుల పూజ్యభాష పాళీభాష; అది అశోకశాసనముల నాఁటిదని స్పష్టముగాఁ జెప్పవచ్చును; జైనులభాష అర్ధమాగధి; యిది ప్రాకృతజన్యము, నిస్సందేహముగా ననంతరకాలమునకుఁ జెందినదియు నైయున్నది; మఱియు మనకు నేఁడు తెలిసిన చరిత్రమంతయు నింకను సందేహావస్థను దాటిపోకయున్నను, జైనగ్రంథాంతర్గత విషయములు–అనగా, నెక్కువ పరిణతిగల సంకలన విధానము, నందలి తర్కాభిరుచి, తనప్రాచీనతను ఋజువుచేసికొనవలెనను నిరంతర ప్రయత్నము, మున్నగు లక్షణములు, పైసకలవిషయములతోఁ గలిపి పరామర్శించినచో నిస్సందేహముగా నొక్కనిర్ణయమును మనము చేయవచ్చును. బౌద్ధ జైనముల రెంటిలో బౌద్ధమతమే స్వతంత్రజన్మముగల మూలమతమని నిర్ణయించవచ్చును." ౧. ప్రతివస్తువున కొక యాత్మగలదను సిద్ధాంతమునంగీకరించినకారణమున జైనమే ప్రాచీనతరమైనదని కోల్‌బ్రూక్ పండితుఁడు వ్రాసినాఁడు. ౨. రెండును వేఱువేఱుమతములని చెప్పు భారతీయసంప్రదాయమున కీయిరువుర పండితుల యభిప్రాయములును వ్యతిరేకములైయున్నవి. హిందూశాస్త్రములు వీనిప్రత్యేకత్వము నెన్నఁడును సంశయించియుండలేదు. గూరినాట్, జాకొబీ, బూలర్ పండితుల పరిశోధనములు దానినే బలపఱచియున్నవి. నేఁడు వర్ధమానుఁడొక చరిత్రాత్మకవ్యక్తి యనియు, జైనమతము బౌద్ధముతో

౧. బార్తు: ది రెలిజియన్సు ఆఫ్ ఇండియా. పుటలు. ౧౪౮–౧౪౯.
౨. కోల్‌బ్రూక్: మిసెలేనియస్ ఎస్సేస్. ౨౮. పుట ౨౭౬.

సంబంధము లేనియొక స్వతంత్రమతమనియు నిశ్చయమైనది. వర్ధమాన గౌతమబుద్ధుల జన్మము, వారి మాతృమరణము, వారి సన్న్యాసము, వారి సిద్ధి, నిర్వాణములైన పంచవిషయములలో భేదములున్నవని గోరినాట్ నిరూపించినాఁడు. వర్ధమానుఁడు వైశాలీనగరమున క్రీ. పూ. ౫౯౯ లోఁ బుట్టినాఁడు. గౌతముఁడు కపిలవస్తునగరమున క్రీ. పూ. ౫౬౭ లో జన్మించెను. వర్ధమానుని తల్లిదండ్రులు చిరకాలము జీవించిరి; గౌతముని జనని గౌతముఁడు జన్మించినవెంటనే మరణించినది. వర్ధమానుఁడు తనబంధువుల యనుజ్ఞపొంది, సన్న్యసించఁగా, గౌతముఁడు జనకునికోరికకు వ్యతిరేకముగాఁబోయి సన్న్యసించెను. ద్వాదశవర్ష దీక్షానంతరమునవర్ధమానునికిని, షడ్వర్షానంతరముననే గౌతమునికి జ్ఞానసిద్ధి గలిగెను. వర్ధమానుఁడు 'పవా' పట్టణమున క్రీ. పూ. ౫౨౭నందును, గౌతమబుద్ధుఁడు కుశీనగరమున క్రీ. పూ. ౪౮౭ యందును నిర్వాణముపొందిరి. జైనమతమే బౌద్ధమునకుఁ బూర్వమతమనియు, స్వతంత్రమైనదనియు ననేకప్రబల సాక్ష్యములను జూపినాఁడు. ఆతనివాదములలోని సారాంశమిటఁ బొందుపఱచు చున్నాము.౧ బౌద్ధగ్రంథములలోఁ జేర్కొనిన నిగ్గంథములు(నిర్ గ్రంథులు) బంధరహితులు వర్ధమానానుచరులు; వీరు క్రీ.పూ. నాల్గవశతాబ్దికైనను జెందుదురు. బౌద్ధపాళీవాఙ్మయములోని 'నాటపుత్తుఁడు' వర్ధమానుఁడే. బౌద్ధమతగ్రంథములలోఁగల నిగ్గంథ సిద్ధాంత వివరణమునుబట్టి

౧. చూడు : సేక్రెడ్ బుక్స్ ఆఫ్ ది ఈస్టు వాల్యూములు ౨౨, ౪౫ ఉపోద్ఘాతము. (జాకొబి)

నిగ్రంథులనగా జైనులేయని స్పష్టమగుచున్నది. "నిగ్రంథనాట పుత్త్రుఁడు సర్వము నెఱుఁగును, సర్వమును జూచును; తనకుఁ బూర్ణజ్ఞాన విశ్వాసములున్నవని చెప్పును. తపోవిధానముచేఁ బ్రారబ్ధకర్మ నాశనమును, నిష్క్రియత్వముచే నూత్నకర్మవిరతిని జేయనగునని యాతఁడు బోధించెను. కర్మలేనిదే దుఃఖము లేదు,"౨. అశోకుని శాసనములు జైనమతశాఖను స్మరించియున్నవి.౩. బౌద్ధగ్రంథములు, జైనులు తమవిరోధులనుగాఁ బేర్కొన్నవి. గ్రంథవిషయ సాక్ష్యము జైనమతము స్వతంత్రమైనదని చెప్పుచున్నది. జ్ఞానము, ఆత్మనుగూర్చిన జైనసిద్ధాంతములు బౌద్ధసిద్ధాంతములకుఁ జాలభిన్నములైనవి. అందుచే నవి బౌద్ధమతమునుండి గ్రహింపఁబడియుండుట కవకాశములేదు. కర్మ, పునర్జన్మమును గూర్చిన భావములు రెంటికిని సమానములైనంత మాత్రమున నేమియు ఋజువుకాదు;ఏలన నీభావములు భారతమతములన్నిటికిని సర్వసామాన్యములైనవి. ఈకారణముల వలన జైనమతమే బౌద్ధమతముకంటెఁ బురాతనమైనదని మేము భావించుచున్నాము. యమ్. పోసిజాపండితుఁడు శాక్యమునికిఁ గొన్ని సంవత్సరములకుఁబూర్వమే బలసంయుతమైన జైనసన్న్యాసివర్గ ముదయించెను; లేదా నిర్మింపఁబడెనని చెప్పినాఁడు".౪. జైనమతమునకు సాంఖ్యతత్త్వమునకుఁ గొన్ని సామ్యములు గలవని కోల్‌బ్రూక్ భావము. జడపదార్థము, ప్రపంచము, శా

౨. సేక్రెడ్ బుక్సు ఆఫ్ ది ఈస్టు వాల్యూము ౨౽; పుట ౧౯౪
3. చూడు. విన్సెంటు స్మిత్, అశోక. పుటలు. ౧౯౨—౧౯3.
౪. ది వే టు నిర్వాణ. పుట ౬౭.

ద్వైతమని రెండును జెప్పెను. ద్వైతము రెంటికి సమానమే. సాంఖ్యమునందుఁ బ్రపంచము, జీవరాసియును బురుషుఁడు, ప్రకృతియను రెంటివలన నుదయించెనని చెప్పఁగా, జైనులు మూల కారణమన్నిటికి నవ్యక్త ప్రకృతియందురు.౧ సామ్యము స్పష్టముగ లేదు. ఆత్మక్రియాలక్షణమును గూర్చిన జైనభావము, న్యాయవైశేషిక సిద్ధాంతములతో సామ్యమును గలిగియున్నది. ఆత్మలేక పురుషుఁడు సాంఖ్యమందు నిశ్చలుఁడు నిష్క్రియుఁడు నైయున్నాఁడు. నిమిత్తము వంటి యేపరిభాషావిషయమందును జైనసాంఖ్యములకుఁ బోలిక లేదు.

సన్న్యాసార్హత తనకేకాని యేయితర కులములకు, లేదనియు, యజ్ఞాదికర్మలన్నిటిని నడపు నధికారము తనదేయనియు నున్నతినొందియున్న బ్రాహ్మణుల యాధిక్యమును బ్రతిఘటించుటకే, సమదృష్టి, విమర్శజ్ఞానమునుగలిగిన క్షత్రియకులాలంకారుఁడగు మహావీరుఁడు జైనమతమును స్థాపించెననియుఁ గొందఱు జైనమతవిద్వాంసులు సమర్థింపయత్నించిరి. ఇది నిరాధారమైన వాదమని స్పష్టముగాఁ దెలియును. బ్రాహ్మణకుల మొక్కదానికేకాక, ద్విజకులములన్నిటికి నీయధికారమున్నది. బ్రాహ్మణుని స్వార్థమే యిట్టి ప్రతిఘటనమునకుఁ గారణమైనచో, నట్టి ప్రతిఘటనము క్షత్రియులనుండిరాదు; కారణమీ విషయమున బ్రాహ్మణ క్షత్రియుల కిరువురకును సమానదోషములే పట్టినవి. అట్టి ప్రతిఘటనము ద్విజేతరులనుండి వచ్చియుండిన యెడల నప్పుడు పైకారణము నిజమైయుండెడిది. ప్రజ

౧. తత్త్వార్థాధిగమ సూత్రము. వ్యాఖ్యానము ౩౮. ౬

లనుభవించిన దుఃస్థితి జైనమతజన్మమునకుఁ గారణమను వాదమును మేము సమర్థింపఁజాలము. పురాణ యుగారంభమున విజ్ఞానరంగమునఁ గలిగిన అశాంతి జైనమతరూపమునఁ బ్రత్యక్షమైనది. దీనికి బ్రాహ్మణద్వేషాది కారణములను మనము కల్పింపనవసరములేదు. భిన్నసిద్ధాంతములను విశ్వసించు భిన్న ప్రజాసమూహములు సాహచర్యము పొందినపుడు, సహజముగా నద్భుతనూత్నసిద్ధాంత విశ్వాసములు తలలెత్తుట జరుగుచుండును. నాఁటి యశాంతిసంభూతమైన తత్త్వములలో జైనమతమొకటై యున్నదని చెప్పనొప్పును.

ఉపనిషత్తులలోఁ బునర్జన్మసిద్ధాంతమును గొన్ని తావులం దధికప్రసంగముగాఁ జెప్పియుండుటచే లోకములోని సర్వవస్తువుల 'కాత్మ' యున్నదను నమ్మకము ప్రబలెను. సహజముగా జైనమతస్థులు, జడపదార్థములైన అగ్ని, వాయువు, వృక్షలతాదుల కొకయాత్మకూడ నున్నదని తలఁచిరి. అట్టిభావము, యజ్ఞములచే సుఖముగాఁ గాలము గడపిన పూర్వులు పొందిన సంతృప్తి నొసఁగఁజాలదు. కాలగర్భమునందుఁ బ్రతిఘటన మగ్నివలె నివురుగప్పియున్నది. అన్నివస్తువులు, పశుపక్ష్యాదులు, క్రిమికీటకములు, లతాపత్రములు 'ఆత్మ'లను గలిగియుండి, పునర్జన్మమును బొందునను భావమువలన నెట్టి జీవహింసచేయుటకును ప్రజలు ఘోరభయోపహతులైరి. యజ్ఞములందుఁగాని, వినోదమునకైనను జీవహింసచేయరాదని వర్ధమానుఁ డుపదేశించెను. తమప్రతిఘటనమునకు బలము చేకూర్చుకొనుటకై, యేదేవత నుద్దేశించి ప్రాణులను బలియొసఁగు

మన్నారో యా దేవతయే లేదనువాదమునుగూడఁ బ్రకటించిరి. జీవితదుఃఖములకు దేవుఁడు బాధ్యుఁడు కాఁడు. బాహ్యాభ్యంతర తపోదీక్షచే దుఃఖనివారణోపాయమును జైనమతము చూపినది. మనము పరిపూర్ణులమై, నిర్వాణము పొందునపుడు, నిర్వాణ మనగా శూన్యావస్థగాదు; నిర్గుణము, సంబంధశూన్యము, పునరావృత్తి రహితమునైన జీవస్వరూపమును బొందుదుము.

వేదప్రమాణము నంగీకరింపదు గావున, జైనమత మవైదికమని పరిగణింపఁబడెను. అందుచేఁ దనతత్త్వము జిన దేవ ప్రసాదమని చెప్పుకొనుటకు వీలైనదికాదు. తనతత్త్వము సత్య మునే బోధించునది కావున నంగీకారార్హమైనదని జైనమతము చెప్పినది. తాము నిర్మించిన జగత్సిద్ధాంతము, తర్కానుభవ ములపై నాధారపడినదని జైనులు చెప్పుదురు. తమతత్త్వ నిర్ణ యములలో జైనులు వేదములుచెప్పిన జగత్సత్యత్వ మంగీక రించిరి; కాని యుపనిషత్తులవలె వారుదానికొక సమగ్రరూపము నీయఁజాలక పోయిరి. ప్రకృతి యణువులచేఁ గల్పింపఁబడిన దనిరి. పురుషులు నిష్క్రియులుగాక, క్రియాదక్షులైరి. జైన తత్త్వములోని ముఖ్యవిషయములు; బహుపురుషత్వము, జ్ఞాన సిద్ధాంతము, స్యాద్వాదము, సప్తభంగి, సన్న్యాసి నియమ సంపుటియునైయున్నవి. ఇచట నితర హైందవతత్త్వములందు వలెనే, ధర్మ సూత్రములాధ్యాత్మిక సత్యముపై నాధారపడినవి. జగత్సత్య తత్త్వమును, సన్న్యాసి నియమావళియు వర్ధమానునికిఁ బూర్వగురుపరంపరాగతమై యుండవచ్చును గాని, జ్ఞానసిద్ధాంత మున కాతఁడే కర్తయని తోఁచును; ఇది తత్త్వశాస్త్రచరిత్ర

యందభిమానముగల విద్వాంసునికిఁ గొంతయభిలాషను గల్పింప వచ్చును.

## ౫—జ్ఞానసిద్ధాంతము.

జ్ఞానము పంచవిధమని జైనులంగీకరింతురు; మతి, శ్రుతి, అవధి, మనఃపర్యాయము, కేవలము[౧]. (౧) ఇంద్రియములచేఁ దెలియు సామాన్యజ్ఞానము మతి, దీనిలో స్మృతిలేక జ్ఞాపకము, సంజ్ఞలేక ప్రత్యభిజ్ఞలేక గుర్తించుట; పరిశీలనమువలన లభించు తర్కము; అభినిబోధములేక అనుమానము.[౨] మతిజ్ఞానమొకచో మూఁడువిధముల భాగింపఁబడెను. ఉపలబ్ధి, భావన, ఉపయోగము.[3] ఇంద్రియ మనస్సులవలనఁ దెలియునదే మతిజ్ఞానము, మనస్సునకు అనింద్రియమని పేరిడిరి. మతి జ్ఞానమునకు ముందు దర్శనమున్నది. (౨) శ్రుతి; అనగా సాక్ష్యము, సంజ్ఞ, శబ్దములనుండి గ్రహింపఁబడునది. మతిజ్ఞానము దర్శనముచేతను, శ్రుతిజ్ఞానము వర్ణనముచేతను లభించును. ఇది చతుర్విధము; లబ్ధిలేక సహవాసము, భావన లేక శ్రద్ధ, ఉపయోగము లేక విషయగ్రహణము, నయము లేక వస్తుజ్ఞానవిశేషార్థములు.[౧] మతగ్రంథముల భావములకు నానార్థ నిర్ణయములుండును గాన నయముకూడఁ జేర్పఁబడినది. (3) దేశకాలములందు దూరము

౧. ఉమాస్వాతి తత్త్వార్థసూత్రములు. ౧ అ. ౯; దర్శనసంగ్రహము. ౫.

౨. పుట ౪౧. జైనతర్కసూత్రమునకు న్యాయశాస్త్రము ౨వ వాల్యూము చూడు.

3. పుట ౪౨.

౧. పుట ౪3.

గానున్నను వస్తువుల, ప్రత్యక్షజ్ఞానము 'అవధి'. అనగా దూరదర్శన శ్రవణాదికశక్తివలని జ్ఞానము. (౪) అన్యులభావములను దెలిసికొనుట మనఃపర్యాయము. (౫) సర్వవస్తు గుణరూప జ్ఞానము, పూర్ణమైనది. కేవలము౨, ఇది దేశకాలవస్తు పరిచ్ఛిన్నము కానిసర్వజ్ఞత్వము;సర్వజ్ఞుని కంతయుఁ గరతలామలకము. ఇంద్రియాతీతము, ననుభవైకవేద్యమునైన యీసర్వజ్ఞానము బంధరహితులై, పూర్ణశుద్ధాత్ములైన వారికిఁగాని లభింపదు.

మొదటి మూఁడురకముల జ్ఞానము దోషసహితము గావచ్చును; తుదిరెండును నిర్దోషములే. 3. జ్ఞానముయొక్క సత్యాసత్యములు దాని యాచరణార్హతపై నాధారపడును; మంచినెఱిఁగి, చెడుగును విసర్జించునట్లు చేయుశక్తి దానికుండ వలెను. వస్తువుల యథాస్థితిని దెలుపునది సరియైనజ్ఞానము గనుక నది యనుష్ఠానమునకుఁ బనికివచ్చును. వస్తువులకు లేని సంబంధజ్ఞానము నిచ్చునది దోషసహితమైన జ్ఞానము. మన మొకత్రాడును పాముగాఁ జూచునప్పుడు, లేనిపామునుజూచిన దోషముపట్టినది. సరియైన జ్ఞానమున వైరుధ్యములుండవు; దోషపూరితమగు జ్ఞానమాత్ర విరుద్ధమయము. దోషజ్ఞానము నందు, మతిశ్రుతుల నపార్థమొనరించు సంశయము; విపర్యయములేక అసత్యము; అనధ్యవసాయములేక ఔదాసీన్యములచేఁ గలుగుదోషము, నిందుఁజేరును. అయిదుయోగ్యములు,

౨. ఉ. త. సూ. ౧ అ. ౨౯.

3. ఉ. త. సూ. ౧ అ. 3౧. పుట ౪౨.

మూఁడయోగ్యములునైన యెనిమిదివిధముల జ్ఞానమున్నది. ఒకే సారి యొకేవిధమైన జ్ఞానమే యుండును.౧.

జ్ఞానము ప్రత్యక్ష పరోక్షములని రెండువిధములు. పంచవిధ జ్ఞానములలో మతి, శ్రుతి, పరోక్షములు; మిగిలినవి ప్రత్యక్షములు.౨. ఇంద్రియములపై నాధారపడవలసియున్నది. కావున, నింద్రియ మనములవలన లభించు మతిజ్ఞానము పరోక్షము.౩. ఇంద్రియజ్ఞానము ప్రత్యక్షజ్ఞానమని తలఁచువారు కొందఱుగలరు. “దర్శనము నాలుగువిధములు. ఇంద్రియగోచరము, ఇంద్రియాఽగోచరము, దూరదర్శనాదికమైన అవధిజ్ఞానము, సర్వము నెఱిఁగిన అనంతజానమైన కేవలజ్ఞానము.౪”

౧. ఉ. త. సూ. ౧ అ. ౧౧, ౧౨. ౨. ఉ. త. సూ. ౧ అ. ౧౪.
౩. పుట ౪౮; చూడుము సిద్ధసేనదివాకరుని న్యాయావతారము ౪. ప్రత్యక్షమనగా సాంవ్యవహారికము, పారమార్థికమునని రెండువిధములఁజెప్పిరి. రెండవదానిలో 'అవధి, మనఃపర్యాయము, కేవలమునున్నవి. మొదటిదానిలో నింద్రియాకృతమనగా నింద్రియ నిబంధనము, రెండుఅనింద్రియ నిబంధనముఁగూడ నున్నవి. మననిత్యజీవితానుభవములో దర్శనజ్ఞాపకములపై నాధారపడునదంతయు సాంవ్యావహారిక ప్రత్యక్షము. ఒకవస్తువెఱుఁగుకోరక తీసుకేయుని దానిని ప్రమాణ మీమాంసవృత్తి నిర్ణయించెను. (సమీచీనః ప్రవృత్తినివృత్తిరూపో వ్యవహారః సంవ్యవహారః; కేవలునికిఁ బ్రత్యక్షము సకలజ్ఞానము; ఇతరుల విషయములో వికలజ్ఞానము.) పరోక్షము పంచవిధములు. (౧) స్మృతము (౨) ప్రత్యభిజ్ఞము — సామ్యములచే లభించినజ్ఞానము — (౩) తర్కము (౪) అనుమానము (౫) ఆగమములేక ఆప్తవాక్యము. ప్రమాణనయతత్త్వాలోకాలంకార గ్రంథమునఁ బ్రత్యక్ష పరోక్ష జ్ఞానములకు స్పష్టతలోమాత్రము భేదమున్నదనిచెప్పఁబడెను చూడుము౨, ౩అ. దీనికిఁగారణము;ప్రత్యక్షజ్ఞానమున కింద్రియవ్యాపారము పరోక్షముగామాత్రమే పాయపడునను జైనులవాదమే. ౪. దర్శనసంగ్రహము ౪. (౫) దర్శనసంగ్రహము. ౪౩.

జీవుని ముఖ్యలక్షణము చైతన్యము. దర్శన జ్ఞానములు రెండును చైతన్యరూపములు.౫. దర్శనమునందు వివరములు దెలియవు. జ్ఞానమున వివరములు తెలియును. మొదటిది లఘుజ్ఞానము; రెండవది బుద్ధి సంజాతము. "వస్తువుల విశేషగుణములతో సంబంధములేని సామాన్య లక్షణములు దెలియుట దర్శనము."౬. ఇం దనేకదశాంతరము లున్నవి. (౧) వ్యంజనావగ్రహము. ఇందు వస్తురూప మింద్రియ ములకుఁ దగిలి, ద్రష్టకు దృశ్యముతో నొకవిధమైన సంబంధ మేర్పడును. (౨) అర్థావగ్రహము. ఇందు ద్రష్టయొక్క చైత న్యము స్పృశింపఁబడును; ఇచట ద్రష్ట దృశ్యము సరుదుగా నెఱుఁగును. (౩) ఈహా. వస్తువిశేష వివరములను, నితరవస్తు వులతోడి సామ్యభేదములను మనస్సు తెలియఁగోరును. (౪) అవాయము. ఇచట భూత వర్తమానజ్ఞానము మేళవించి, వస్తు స్వరూపమిది, అదికాదను గుర్తుతెలియును. (౫) ధారణము. ఇచట నింద్రియములను మేల్కొలిపినవి వస్తుగుణములని తెలి యును; దీనివలన మనస్సులో వస్తుముద్రయొక టేర్పడి, దాని వలన నట్టివస్తువును మనము జ్ఞాపకముంచుకొని తిరిగి గుర్తింపఁగలుగుచున్నాము. ౧. ఇట్టి విషయవిభాగమువలన, దర్శ నము పరోక్షమనియు, వస్తువులునిజముగా మానసాతీత సత్య ములనియుఁ దేలుచున్నది. చైతన్యమునకు వేఱుగాను, అతీత ముగను, నొక సత్యవస్తుజాలమున్నదనియు, నది దర్శనముచేఁ జూచి, జ్ఞానముచేఁ దెలియుచున్నదనియు జైనులుచెప్పుచుం

---

౧. ఉ-త-సూ. ౧౫. ౩౦

దురు. వస్తుగుణసంబంధములు మనయనుభవములోఁ బ్రత్యక్ష ప్రకాశములగుచున్నవే కాని, మానసికాలోచనాదికములనుండి జనించుటలేదు. దృశ్యముయొక్క స్వభావము, ద్రష్ట దర్శనవిధానముచే మార్పునొందదు. భౌతికవస్తువులవిషయములో, జ్ఞానమునకు జ్ఞేయమునకుఁ గలసంబంధము బాహ్యమైనది; ఆత్మజ్ఞానవిషయము వేఱు. జీవుని చైతన్యము నిత్యక్రియాత్మకము; దానివలన, జీవస్వభావమును, జీవిచూచు వస్తుస్వభావమును, రెండును గోచరించును. జ్ఞేయమునం దాత్మయు ననాత్మయును గలవు. దీపము తనస్వరూపమును వస్తుస్వరూపమునుగూడఁ దెలియఁజేయునట్లు, జ్ఞానము తనరూపము జ్ఞేయవస్తురూపమును గూడఁజూపును. జ్ఞానము బాహ్యసంబంధములనే కాని, తనస్వరూపమును దెలుపదను న్యాయవైశేషిక సిద్ధాంతమును జైనులంగీకరింపరు. ఒకవస్తువును దెలియునప్పుడాత్మ తన్నుఁగూడ నేక కాలముననే తెలిసికొనుచున్నది. అట్లు తన్నుఁదాను దెలిసికొనకున్నచో నీజ్ఞాన మాత్మకెన్నఁడును గలుగదు. ప్రతిబిమ్బకార్యము, ప్రతిజ్ఞానకార్యమును, "దానిని నేనీవిధముగ నెఱుగుదును"ను భావమును గలిగియుండును. జీవము, జ్ఞానము నెల్లప్పుడాత్మవికాసమున కుపయోగించుచుండును. చైతన్యము జడపదార్థస్వభావము నెల్లెఱుఁగునను ప్రశ్న మాధాన్యమని తిరస్కరింపఁబడెను; ఏలన వస్తువులఁ దెలుపు జ్ఞానలక్షణము.

ఆత్మజ్ఞాన (Self-consciousness) విషయములో జ్ఞానజ్ఞేయసంబంధ మాత్యంతికమైనది. జ్ఞాని, జ్ఞానములను విడిగాఁ దెలియనగునుగాని రెండును విడదీయరానివి. ఆత్మజ్ఞానమునందు

జ్ఞాని జ్ఞానము, జ్ఞేయమునొకే వ్యక్తిత్వముయొక్క రూపములు, జ్ఞానములేని జీవులులేవు; ఏలన జ్ఞానములేనిజీవి అచేతనమగును. అచేతనముల జీవద్రవ్యములు, జీవములేనిజ్ఞానము పునాదిలేని గగనసౌధనిర్మాణమగును.

ఆత్మ, పరిపూర్ణస్థితిలో, శుద్ధజ్ఞాన, దర్శనస్వరూపము. ౧. ఇవిరెండు నేకకాలికములు. అజ్ఞానజీవులందు ముందు దర్శనము తరువాత జ్ఞానమునుండును. ౨. పూర్ణజ్ఞానమునందు సంశయము, విమోహము, విభ్రమము నుండవు. ౩. వివిధములైన దర్శనములకాటంకముకల్గించు కర్మలు దర్శనావరణీయకర్మలని పిలువఁబడెను; జ్ఞానాటంకములైనకర్మలు జ్ఞానావరణీయకర్మలు. ౪. జ్ఞానమంతయు నాత్మయందున్నది; అవరోధములన్నిటిని దొలఁగించినచో జ్ఞానము బహిర్ముఖమగును. కామమోహాదికము లవరోధములు. ఇవి జడపదార్థము నాత్మలోనికిఁ బ్రసరింపఁజేసి, ఆత్మశక్తిపూర్ణముగాఁ దన ధర్మమును నెఱవేర్పనీయవు; తాత్కాలికప్రయోజనములందు వ్యవహరించు మోహమును గలిగించును. అందుచే, వివేకమువలన నేవిమన కనర్థములో వానికాత్మలోఁబ్రవేశములేకుండ నెట్టివేయవచ్చును. జ్ఞానావరణ కారణములగు నవరోధము లడ్డులేనియెడల, నప్పు డాత్మ స్వేచ్ఛగలిగి, త్రికాలపూర్ణ జ్ఞానమునొందుట కవకాశముగలదు. మనఅజ్ఞాన జీవితమునందు, జడపదార్థ సంస్ప

౧. దర్శనసంగ్రహము. ౬.
౨. ,, ౪౪.
౩. ,, ౪౨.
౪. వీనివర్గీకరణమునకు చూడు జైని: జొల్టైన్సు ఆఫ్ జైనిజమ్. పుటలు. ౩౦-౩౧.

ర్మచే నాత్మకలుషితమగుచున్నది. ఈ యన్యపదార్థమునుజీల్చి భూళిమొనర్చినయెడల, మనజ్ఞానము పరిణతినందును. అవరోధశక్తులను బూర్తిగా మనము నిర్జించినపుడు, ఆత్మ స్వీయశక్తి విజృంభణముగలిగి, అనంతజ్ఞాన వికాసమందును, జ్ఞానసహిత పదార్థరూపములే ఆత్మలు, జడపదార్థమునకు నాత్మకుభేద, మాత్మకుఁగల జడపదార్థసంబంధముపై నాధారపడియుండును.

జ్ఞానము రెండురూపములు; ప్రమాణమనగా వస్తుస్వస్వరూప జ్ఞానము; నయమనగా వస్తుసంబంధజ్ఞానము, నయసిద్ధాంతము జైనతర్కమున నొకయపూర్వ విశేషము. ఒకవస్తువును గూర్చి, మనము తెలుపు నభిప్రాయ దృక్పథమునయము. మన దృక్పథములను మనము నిర్వచనముచేసి, భావనాశక్తిచే వేఱు చేయుదుము, మనకోరికల ననుసరించి, మనభావము లాయా దృక్పథములకుఁ జెందినవై, పాక్షికములగును ఈవిధముగా మనము గొన్ని పాక్షికభావములను గ్రహించి, కొన్ని కాంక్షలపై లగ్నమొనర్చుటచే మనకు సంబంధ జ్ఞానమే కలుగుచున్నది. ఒకసారి యొకదృక్పథమున నుండుటవలన నితరదృక్పథముల నిరసించుట కాఁజాలదు. కొన్నిసందర్భములయందు, సూర్యుఁడు భూమిచుట్టును దిరుగుచున్నాఁడను భావము, భూమి సూర్యుని చుట్టును దిరుగుచున్నదను భావమంత ప్రయోజనకరమైనదే. మనమున్న జ్ఞానదశల ననుసరించి యొకేసత్యము భిన్నరూపములలో గోచరించు ననుభావబీజము లుపనిషత్తులందే కలవు. తాత్కాలిక సత్యమైన పరిణామ ప్రవాహమును నిత్యసత్యవస్తు లక్షణముగా భావించుటచేతనే బౌద్ధమతములోని భావసాంకర్య

మునకు ముఖ్యకారణమైనది. ఒకయవస్థలో సత్యముగాఁదోఁచిన దింకొక యవస్థలోఁ గాకపోవచ్చును. ప్రత్యేకదృక్పథములు పూర్ణసత్య సంగ్రహణ సమర్థములుగావు. మనతాత్కాలికావస్థలలోని నిర్ణయములు సత్యసంబంధములే కావచ్చును గాని, సత్యమును స్వస్వరూపములోఁ బ్రదర్శింపఁ జాలవు. మనదృక్పథముల ననుసరించి సత్యస్వరూపముండునను విషయమును జైనమతము మూలసిద్ధాంతముగాఁ జేసినది. సత్యముయొక్క సామాన్య స్వరూపము భిన్నపాక్షిక దృశ్యములుగా లభించును.

నయముల ననేకవిధములుగా విభజించిరి. అందుముఖ్యమైన వానినిఁబరిశీలింతము. ఒకపద్ధతిననుసరించి సప్తనయములున్నవి. అందునాలుగువస్తువులకు లేక అర్థములకు సంబంధించినవి; మూఁడు శబ్దములకు సంబంధించినవి. వీనిని ప్రమాణములుగా భావించినచో నాభాసహేతువులగును. అర్థనయములీ విధముగాఁ జెప్పఁబడినవి:—

(౧) నైగమనయము, దీనిభావము ద్వివిధము. ఇది ఒక కార్యముయొక్క లక్ష్యము లేక పరమావధి. ఈ లక్ష్యము కార్యారంభమునుండి యంతమువఱకు నవిచ్ఛిన్నముగాఁ గార్యమందుండును. జలాగ్నిపాత్రాదికమును దీసికొని పోవుచున్న యొకమానవుని, 'నీ వేమిచేయుచున్నావ'ని యడిగినచో "నేను వంటచేసి కొనుచున్నా"నని యాతఁడు బదులు చెప్పును. ఇదినైగమనయమున కుదాహరణము. కార్యపరంపరలోని ప్రధానోద్దేశమునిది చెప్పును; మఱియు నుద్దేశపూరిత

మైనదే జీవితమని వక్కాణించును.౧. పూజ్యపాదుఁడీ భావము నంగీకరించినాఁడు. సిద్ధసేనుఁ డింకొకవిధమునఁ జెప్పినాఁడు, ఒకవస్తువును మనము ప్రత్యేకసామాన్య లక్షణములను విడఁదీయకుండ గ్రహించినపుడు మనకు నైగమనయమున్నదని చెప్పెను, (౨) సంగ్రహనయము, ఇదిసామాన్యగుణములను జెప్పును. ఇదివర్గభావము. వర్గములోని ప్రత్యేకవ్యక్తుల భావములు ముఖ్యములేవైనను నొకప్పుడు వర్గసామాన్య గుణముల నెఱుఁగుటవసరమే. సంగ్రహనయము రెండు తెఱఁగులు. అన్ని వస్తువులు సత్స్వరూప సంబంధములని చెప్పు నున్నతవర్గదృష్టి పరసంగ్రహనయము, నీచవర్గదృష్టి అపరసంగ్రహము, పూర్ణ నిర్గుణ దృక్పథము ఆభాసరూపమైన సంగ్రహనయము; వస్తు సామాన్య విశేషగుణ భేదమును జైనవాద మంగీకరించును గాని, యీభేదము సాంబంధికమని తలఁచును. సాంఖ్యము [illegible] విశేషముల నంగీకరింపవు;బౌద్ధము సామాన్యముల నంగీకరింపదు. బౌద్ధము న్యాయవైశేషికములు రెంటి నంగీకరించి,వస్తువు విశేష సామాన్య గుణసంకీర్ణరూపమని తలఁచును కాని విశేషసామాన్య గుణభేదము తాత్కాలికమని జైనమతము, శాశ్వతమని న్యాయ వైశేషికమతము భావించినవి.(౩)వ్యవహారనయము;అనగా,వ్యవహార జ్ఞానముపై నాధారపడిన ప్రజాసామాన్యాభిప్రాయము. వస్తుస్వరూపమును మనముపూర్తిగా నెఱిఁగియుండి, స్పష్టముగా గోచరించు ప్రత్యేకలక్షణముల నుగ్గడింతుము. ప్రత్యేక విశిష్టలక్షణములు మనదృష్టి నరికట్టును. నాస్తికమతము యొక్క,—

౧. తత్త్వార్థసూత్రములు ౧ అ 33 పైవ్యాఖ్యానము.

లేక అనేకత్వము యొక్క మూలతత్త్వములగు 'ఆభాసములు' ఈ నయమునకుఁ జెందినవి. (౪) ఋజుసూత్రనయము, ఇది వ్యవహారనయముకంటె సంకుచితమైనది. ఒకానొక ముహూర్త మునయున్న వస్తుస్థితి నిది గ్రహించును. ఏకత్వము నవిచ్ఛిన్న త్వము నిది గర్హించును. దీనిలో క్షణికమైనదే సత్యమైనది. వర్తమానక్షణములోనున్న రూపమే యొకవస్తువు. ఇది బౌద్ధ వాద సారాంశమని జైనులు తలఁచిరి. సత్పదార్థమునుగూర్చిన కేవలకల్పనములను ఖండించుట కీసిద్ధాంతము పనికివచ్చును గాని, దాని పరమసత్య స్వరూపనిర్ణయమున కిది పనికిరాదు. మిగిలినమూడును శబ్దనయములు. (౫) ఒకనామముచే నొక వస్తువు గుణము, సంబంధము, లేక క్రియ మనమనస్సునకు దాని స్వరూపమును ప్రదర్శించును. ప్రతినామమునకొక నిశ్చితార్థ మున్నది; ఒకేయర్థమునకు వివిధనామములున్నవి. నామము లకు నర్థములకుఁ గలసంబంధము నిత్యమైనదని కాదు. దీనిని మఱచుటచే దోషములు సంభవించుచున్నవి. (౬) సమభి రుద్ధనయము. శబ్దభేదములను ధాతురూపములవలనఁ దెలియఁ జేయును; ఇదియే శబ్దనయప్రయోగము. (౭) ఏవం భూత నయము. ఇది ఆఱవదాని ప్రత్యేకరూపము. ఒక శబ్దార్థమున కుఁగల వివిధదశారూపములలో ధాతువొకే ప్రత్యేకార్థ మును సూచించును. అదియే వాడుకలోని నిశ్చితార్థము. అదేయర్థమింకొక సందర్భములో నింకొకశబ్దమును గోరును. ఈసప్తనయములు, నారంభనయమునుండి వరుసగా నధికవైశా ల్యమును గలిగియున్నవి. నైగమనయ మగ్రస్థానమును, ఏవం

భూతము తుదిపదవిని నాక్రమించును. ప్రతినయ మనేకదృక్ప థములనుండి జూచుటకవకాశముగల వస్తువునొక దృష్టిలోఁ జూచును. ఒకేదృక్పథమునుండిచూచిన వస్తుస్వరూపమే పూర్ణమైనదని తలచినచో నయాభాసముసిద్ధించును. న్యాయవైశేషికములు, సాంఖ్యము, అద్వైతవేదాంతము, బౌద్ధమతశాఖలును మొదటి నాలుగునయములును వరుసగా నంగీకరించి, పూర్ణ వస్తుస్వరూపము తెలిసినదని భ్రాంతిపొందినవని జైనులుచెప్పుదురు.

నయములు తిరిగి ద్వివిధముగాఁ జెప్పఁబడినవి. ద్రవ్యార్థికములు, పర్యాయార్థికములు. మొదటిది వస్తుసంబంధము, రెండవది గుణసంబంధము. ఇవి మఱలఁ బెక్కువిభాగములు చేయఁబడినవి. వస్తుస్థిరస్వభావమునుగూర్చి ద్రవ్యార్థికనయమును, అస్థిరస్వరూపమునుగూర్చి పర్యాయార్థికమును జెప్పెను.

ఇవన్నియు ననిత్యములైన దృక్పథములగుటచేఁ బూర్ణ దృక్పథమును నయనిశ్చయమనిరి. ఇది ద్వివిధము; శుద్ధనిశ్చయము, అశుద్ధనిశ్చయము. మొదటిది నిర్గుణశుద్ధవస్తుస్వరూపమును, రెండవది గుణనిష్ఠిత వస్తులక్షణమును దెలుపును.

ప్రమాణ విమర్శనపూర్వకమైన తత్త్వపద్ధతినెఱిఁగినవారి కీనయసిద్ధాంతము సహేతుకమని తెలియఁగలదు.

ఒకే యేనుఁగు నాలుగురు గ్రుడ్డివారు వర్ణింపఁబూనిన పూర్వగాథను జైను లభిమానముతో నుదాహరింతురు. ఒక్కొక్కఁడే యేనుఁగును స్పృశించి, దాని పూర్ణస్వరూపమును వర్ణింపఁబూనెను. ఏనుఁగుచెవిని పట్టుకొనినవాఁ డేనుఁగుచేటవలె

నున్న దనియుఁ, బాదమును స్పృశించినవాఁడది యొకస్తంభము వలె నున్నదనియు, నిట్లే యితరులు వర్ణించిరి. గజమునంతను జూచినవాఁడు వారిలో నొక్కొక్కరు చూచిన దంశామాత్రమే యని యెఱుఁగును. దృక్పథములందలి భేదములను గ్రహింప లేకపోవుటచేతనే, తాత్త్వికస్పర్ధలన్నియుఁ గలుగుచున్నవి. కార్యము కారణము నొకటియా, లేక రెంటికి భేదమున్నదా యను ప్రశ్న గలదు. కారణము కార్యపూర్వముననే యున్నదనియుఁ, గార్యపరిణామముతోఁ బరిణామమందుచున్నదనియుఁ జెప్పు నీసత్కార్యవాదమును వేదాంతసాంఖ్యతత్త్వములు గ్రహించినవి. కార్యము కారణేతరమైన నూత్నరూపమను నసత్కార్యవాదమును వైశేషికులు చెప్పిరి. రెండును భిన్నదృక్పథములనుండి చెప్పినభావములని జైనతత్త్వము సమన్వయించినది. కార్యమైన యొక స్వర్ణహారము, సువర్ణమే యని తలఁచినచో రెంటికి భేదములేదు; కారణమైన సువర్ణమునందుకంటె స్వర్ణహారమున నొక నూత్నకార్యసృష్టియున్నదని తలఁచినచో రెంటికిని భేదమున్నది. రెండుదృక్పథములనుండి చెప్పిన యీ రెండుభావములు, భావనముచేఁ గల్పితములగుటచే నసంపూర్ణములే యగును.

ఈదృక్పథ వైవిధ్యము, స్యాద్వాదము లేక, సప్తభంగి యందత్యధిక ప్రయోజనముకలదైనది. విడిగాను, గలిసియు నొకవస్తువుయొక్క భిన్నగుణముల నవిరోధముగా నిర్ణయించు నేడువిధముల యుపయోగ మిందుఁ గలదు. వస్తుదృక్పథము నుండి, కర్తయుఁ గ్రియయు నొకటే యనియు, వస్తుగుణము

యొక్క దృక్పథమునుండి, యీ రెండును వేఱగునని చెప్పి, జైన వాదము వస్తుగుణనిర్ణయకష్టమును నిర్మూలించెను.

అనుభవ జ్ఞానమంతయు సంశయాస్పదమని తలఁచిన యీ దృష్టిని స్యాద్వాదమనిరి. ప్రతినిర్ణయము మనకొక సంశయాత్మక మైన 'బహుశః' 'కావచ్చును' అను 'స్యాత్' నిచ్చును. ఒక వస్తువునుగూర్చి, నిస్సందేహముగాను, నిత్యముగాను నిదమిత్థ మని చెప్పఁజాలము. వస్తువులయొక్క అనంతసాంకర్యముచే నేదియు నిశ్చయముగాఁ జెప్పనొప్పదు. సత్స్వభావమత్యంత క్లిష్ట మునస్పష్టమునైనదని యీసిద్ధాంతము చెప్పును. వస్తుస్వభావ మును మనకు నిర్ణయించుట కసలే యధికారములేదని చెప్పదు కాని, స్థిరమైన నిర్ణయమున కధికారము లేదనును. పరిణామ స్వభావముగల సత్పదార్థము, తాత్కాలికము నసంపూర్ణము నగు నిర్ణయమునకే యవకాశమున్నదని చెప్పును. ప్రతినిర్ణయ మును సత్యమే; అనగాఁ గొన్ని పరిస్థితులలోనే సత్యము; అనగాఁ దాత్కాలిక సత్యము.

ఒకవస్తువునుగూర్చి కాని, వస్తులక్షణమునుగూర్చి కాని నిర్వచించు విధానము లేడు గలవు. వస్తువుకాని, వస్తుగుణము కాని యొకదృక్పథమునుండి (౧) ఉన్నది (౨) లేదు (౩) ఉండను నున్నది లేను లేదు, (౪) అనిర్వచనీయము (౫) ఉన్నది కాని యనిర్వచనీయము (౬) నిర్వచనీయము ననిర్వచనీయమును (౭) ఉన్నది, నిర్వచనీయము ననిర్వచనీయమును.

౧. స్యాదస్తి:—దానియందలిపదార్థము, స్థలము, కాలము, స్వభావము వీనిదృక్పథములో వస్తువున్నది; స్వస్థితిలోనున్నది. ఒకపాత్రము; మృణ్మయము, నాగదిలో నిప్పు డొకరూపము కొలత గలిగియున్నది.

౨. స్యాత్ నాస్తి :—ఇంకొక వస్తుపదార్థ దేశకాల స్వభావ దృక్పథమునుండి ఒకవస్తువు లేదు; అనగా నది లేని వస్తువు కాదు; నాగదిలోనిపాత్ర లోహమయము కాదు, వేఱొకచోట లేదు, మఱొకకాలమున లేదు; యింకొకరూపము కొలతను గలిగి యుండ లేదు.

(3) స్యాదస్తినాస్తి:—పైచతుర్విధలక్షణ దృక్పథమునుండి, యింకొకవస్తు దృక్పథమునుండియు నొకవస్తువున్నదనియు లేద నియుఁగూడఁ జెప్పవచ్చును. ఒకవిధముగా నొకదృష్టిలోఁబాత్ర మున్నది; మఱొకదృష్టిలో లేదు, ఒకవస్తు వేదియో యేదికాదో చెప్పఁబడినది.

(౪) స్యాదవక్తవ్య:—మూఁడవదానిలో మన మొకవస్తువు తనకుఁ దానున్నదనియు నింకొకరీతిని లేదనియుఁ జెప్పియున్నాము. కాని ఈవిధముగా నేకకాలముననే చెప్పుట సాధ్యముకాదు. అనగా నవక్తవ్యము. పాత్రమునందు, తనస్వభావము, తన స్వభావ విరుద్ధాభావము నేకేకాలమునం దున్నను, నట్లు చెప్పుట సాధ్యముకాదు.

౫. స్యాదస్తి అవక్తవ్యా:—ఒకవస్తువు యొక్క చతుర్విధ లక్షణ దృక్పథమునుండియు, నాకాలముననే, ఆవస్తువు యొక్కయు, ఆవస్తువుకాని దానియొక్కయు సమ్మిళితదృక్పథముల

నుండియు, ఒకవస్తువున్నది; కాని అవక్తవ్యము. ఇచట వస్తువు యొక్క స్థితి; అనిర్వాచనీయత్వము రెండు నున్నవి.

౬. స్యాన్నాస్త్యవక్తవ్యాః—తానుగాని వస్తుచతుర్విధ లక్షణదృక్పథమునుండియు, నా కాలముననే, తనయొక్కయుఁ దాను గానిదానియొక్కయు నుభయదృక్పథములనుండియు నొకవస్తువులేదు; అవక్తవ్యము. ఇచట వస్తువుయొక్క అభావము, తదవక్తవ్యము చెప్పఁబడినవి.

౭. స్యాదస్తినాస్తి అవక్తవ్యాః—ఒకవస్తువు చతుర్విధగుణదృక్పథమునుండియు, నదికాని దానిదృక్పథమునుండియు, నొకేక్షణమందు, ఉభయ దృక్పథములనుండియు నొకేవస్తువున్నదనియు, లేదనియు, నవక్తవ్యమనియుఁ జెప్పఁబడినది. ఇచట నొక వస్తుస్వరూప మవక్తవ్యమనియుఁ, దానిస్వరూపము, అది కానిదిం చెప్పఁబడెను.

ఒకవస్తువునుగాని,వస్తుగుణములనుగాని గూర్చిచెప్పు నీ సప్తవిధానములలో మొదటిరెండును ముఖ్యములైనవి. ఒకటి అక్లిష్టమైననిర్ణయము. ఒకవస్తువు తనస్వరూపమునందు,స్వద్రవ్యస్వక్షేత్ర స్వకాలములందున్నదని చెప్పును. రెండవదక్లిష్టమగు నభావనిర్ణయము: ఒకవస్తువు, పరరూప ద్రవ్యక్షేత్ర కాలములందు లేదనిచెప్పును. భావాభావ పరస్పరసంబంధము నీ సిద్ధాంతము ప్రకటించుచున్నది, నిర్ణయములన్నియు ద్విముఖములు అన్నివస్తువులు నున్నవి లేకున్నవి; అనగా సదసదాత్మకములు [2]

౧. తత్త్వార్థసూత్రములు. పుట. ౧౪; ౧౬.

౨. స్వరూపేన సత్త్వాత్, పరరూపేన చ అసత్త్వాత్.

ఒకవస్తువు తానైనదియుఁ దానుగానిది కానిదియునైయున్నది. దీనిననుసరించి అభావము భావాశ్రయమైయున్నది. ఊహా కల్పనమైన గగనకుసుమమునకుఁగూడ, గగనము, కుసుమము అను భావము లాశ్రయములై యున్నవి; గగనము, కుసుమము సత్యములే; రెండును గలిసిన నసత్యమగును. దీనివలన జ్ఞానమునకు భిన్నత్వ మవసరమను మూలసత్య ముద్ఘాటింపఁబడినది. అన్యవస్తువులనుండి వేఱుగాఁజూచుట కుపయోగించు లక్షణములేని వస్తువులేనిదే. పైని, లోపల నెట్టి, భిన్నత్వమునకుఁ దావులేని పూర్ణవ్యక్తిత్వము నిజముగా శూన్యమే. జ్ఞేయములగు వస్తువులన్నియు నొకభావములో నున్నవి; యింకొక భావములో లేవు.

శంకరరామానుజులు[1] సప్తభంగితత్త్వమును నిరసించిరి. పరస్పరవిరుద్ధగుణము లొకేవస్తువునందుండుట దుస్సాధ్యమని వారు తలఁచిరి. రామానుజుఁ డిట్లువ్రాసెను; "భావము, అభావము మున్నగు పరస్పరవిరుద్ధధర్మము లొకేవస్తువునం దొకేకాలమున నుండఁజాలవు; వెలుతురు చీకటి కలిసియుండవు." ఒకేవిధముగా ఒకేకాలమునఁ బరస్పర విరుద్ధధర్మము లొకేవస్తువునందుండ వని జైనులు నంగీకరింతురు. వారు చెప్పునదేమనఁ బ్రతివస్తువు స్వభావవైవిధ్యముకలదనియు, ననేకత్వములో నేకత్వమనియుమాత్రమే. సత్స్వరూపము భిన్నతత్త్వములనుగలిగి, వానినిఁ దనలో సమన్వయించును. విజ్ఞానము పరస్పరవిరుద్ధములుగా గోచరించు వస్తుగుణములు, జీవితము

1. శంకరభాష్యము. 2-2. 2.33; రామానుజభాష్యము. 2-2. 2.31.

నందు ననుభవమునందు నిజముగాఁ గలిసియున్నవి. చెట్టు కొమ్మలు కదలుచున్నవి కనుక చెట్టును గదలుచున్నట్లే చెప్పవచ్చును; కాని స్థావరమైన కారణమున నది కదలుటలేదు, ఒక వస్తువుయొక్క స్వతఃస్థితిని, దాని కన్యవస్తుసంబంధస్థితిని స్పష్టముగాను వేఱుగాను దెలిసికొనవలెను. సప్తభంగిసిద్ధాంతము జీవితములో నిరుపయోగమైనదని వేదాంతవాదులుచెప్పిన విషయము వ్యక్తిభావముగనుక మనమిచట దానిని విమర్శింప నవసరములేదు. సప్తభంగిసిద్ధాంత మితర జైనసిద్ధాంతములకు విరోధమని చెప్పుటకును వీలులేదు. ఇది అనేకాంతవాదమున కుపాంగమువంటిది. సత్స్వరూపము బహుముఖములుగలది, నిత్యపరివర్తమానము నగుటచే నేవస్తువు నెల్లప్పు డన్నిచోటులందు నన్ని విధములుగా నుండునని చెప్పుటకు సాధ్యముకాదు; మఱియు నట్టి భిన్నతత్త్వములేని స్థాణురూపసిద్ధాంతమును మేమునః సమర్థింపఁజాలము.

### ౬. జైనతర్కము విలువ.

మన మనంతరాధ్యాయమునకుఁ బోవుటకుముందు జైనతర్కమువలనఁ గలిగిన కొన్నిపరిశీలనముల నిచట వివరించుటవసరము. జైనజ్ఞానసిద్ధాంతమునందలి పుష్టిగలవిషయములను బ్రదర్శించి, వేదాంతుల విమర్శనములనుండి పోషించితిమి. ఐనను, జైనతర్కమద్వైతమును సూచించునని మాయభిప్రాయము; జైను లద్వైతనిర్ణయమునకు వచ్చుటకు భయపడునెడల నంతవఱకు వారితర్కమును వారే యనుసరింపనివా రగుదురు. ఇంకొకసందర్భములో నీవాదము నాధ్యాత్మికముగా

మేము పరిదర్శింతుము. ఇచట జైనతర్కములోని యర్థమును నిర్ణయింతము.

అనిత్యసంబంధ సత్యసిద్ధాంతము, తదతీతమైన పరమ సత్యము నొకదాని నంగీకరింపనిదే, పోషించుటసాధ్యముకాదు. జైనతర్కములోని పరస్పర వైరుధ్యసూత్రము జ్ఞానమున కవసరమేకాని, ఒకవస్తు వితరములనుండి సంపూర్ణముగా భేదించినచో నది, యితరములతో సంపూర్ణసమత్వముగలిగిన వస్తువు వలెనే అసత్యమైనదగును. జ్ఞానము కేవలము భిన్నత్వమేకాక సంబంధలక్షణము కలది. ప్రతివస్తు వితరములనుండి వేఱైనను సంబంధశూన్యముగాదు. పరస్పర వైరుధ్యసూత్రము పరస్పరైకత్వసూత్రమునకు వేఱురూపమే. భిన్నత్వమేకత్వమూలము. జైనులకు సత్యమును జ్ఞానము సూచించునుగావున, సర్వవస్తుస్థితికారణభూతమైన పరమసత్యస్వరూప మొకసగుణాద్వైతము కావలసియున్నది. అది యనేకమునకు సంబంధములేని ఏకపదార్థముకాని, ఏకత్వములేని యనేకపదార్థ సముచ్చయముకాని కాదు. సత్యస్థితిలేనికల్పనములన్నియు, నిదికాని యదికాని, ఒకటిగాని, యనేకముగాని కలవనుభావములయెడ జైనతర్కము సుముఖతచూపదు. జాతి లేక కారణము ననుసరించి, వస్తువులన్నియు నొకటేయనియు, వ్యక్తి లేక కార్యము ననుసరించి, యనేకమనియు జైను లంగీకరింతురు. రెండును వారిదృష్టిలోఁ దాత్కాలికదృక్పథములు. సత్య మనేకరూపమైయుండుట, నిత్యసత్యముకాదు. మనము సంపూర్ణదృక్పథమున నిలిచి, సర్వగుణసంపత్పూర్ణమైన సత్యమును సందర్శింపవలెను. తాత్కాలిక

పాక్షికసత్యమైన యనేకత్వసిద్ధాంతముతో జైనులు తృప్తిపొంది పరస్పరము సన్నిహితము, దృఢతరము, సహజములైనరీతి సంబంధముగలిగి తన యేకత్వము ననేకముగాఁ బ్రదర్శించుచున్న యొక అద్వైతవస్తుభావము సమున్నతమైయుండుట కవకాశము న్నదా యనుప్రశ్నము నడుగ సాహసింపకున్నచోఁ, దమతర్కమును దామే నిర్మూలించి, ఒకసామాన్యసత్యమును బూర్ణసత్యముగా విశ్వసించుదోషమునకుఁ బాల్పడుదురు.

స్థిరములు నవిభాజ్యములును గాని సంబంధములుగల జైనసిద్ధాంత మద్వైతసిద్ధాంతముతో సామ్యముగలిగియున్నది. సత్యమర్థవంతమై, దష్టకు దృశ్యమునకు నత్యంతసన్నిహిత సంబంధముండును. మానసికసీమయందు, మనస్సుబాహ్యజగత్తు నను ద్వైతభావమున కేవలసత్యమున్నను, తార్కికజ్ఞానసిద్ధాంత దృక్పథమునుండి చూచినచో నది యదృశ్యమగును. దష్ట, దృశ్యముననఁగా, వ్యక్తియొక్కమానసము, దానితో నేసంబంధములేని స్వతంత్రజగత్తునుండుటే నిజమైనచో జ్ఞానమునకీ యవకాశమును లేదు, జ్ఞానము సంశయాస్పదము, నిరాధారము నైనఁగావలెను లేదా, ద్వైతమే యసత్యముగావలెను. దష్ట యు దృశ్యమును, బాహ్యానుబంధముమాత్రమేగల వేర్వేఱు స్థితిగల విషయములుకావు. అవి ద్వైతములో నేకత్వము, నేకత్వములో ద్వైతమును, ఈరెంటిలో నేది తొలఁగించినను రెండునులేవు. దష్ట, దృశ్యమును రెండు స్వతంత్రస్థితిగలవి కావు. జ్ఞానావసరనిమిత్తమై వానిని రెండుగా విభజించి చెప్పు కొనుచున్నాము. జైనతర్కమీసిద్ధాంతముయొక్క అవసర

మును గుర్తింపకున్నచో, ననఁగా నద్వైతమునందే ద్రష్ట, దృశ్య ము నున్నవని గ్రహింపనిచోఁ, బూర్ణసత్యమనగా నసంపూర్ణ సత్యఁమని తలఁచినదోషమేకారణము.

మనము జైనసిద్ధాంతము నంగీకరించినచో, వివిధదృక్ప థములలో సంచరించుచుండు జీవి, మన మనుకొనిన వ్యావ హారిక జీవికాక, యింకను గంభీరమైన యర్థముకలవాఁడగును. జ్ఞానము కేవలము వ్యక్తిగతముకాదు. సత్యపరిశీలనము కేవ లము వ్యక్తిగతముకాకున్నచో మనము వ్యవహారప్రపంచమునఁ జూచుచున్నజీవు లందఱిలోఁ బనిచేయుచున్న యేకైకాత్మయొక టున్నదని గ్రహింపవలసియున్నది. జ్ఞానవిషయము నిర్ణయించు టకుముందు, సర్వవస్తువులలోనుండి బాహ్యాభిన్నత్వమునకుఁ గారణభూతమైన యేకాత్మ యొకటున్నదని మనమూహింపక తీరదు. అట్టి యేకాత్మ అనిత్యజీవికాని, తాత్కాలిక చైతన్య స్వరూపముకాని కాఁజాలదు.

మన మనిత్యవస్తు సంబంధమును జూచుచుంటి మనఁగా నిత్యపూర్ణమైన దొకటున్నదని గుర్తింపవలసియున్నది. అట్టి నిత్యపూర్ణైక పదార్థమునుండియే మనముచూచు తాత్కాలిక వస్తుసంబంధములన్నియు నేర్పడునని చెప్పవచ్చును. సంపూ ర్ణమునుండి యసంపూర్ణమునకే మనవిచారణ గమనము చేయ వలెను.

ఈ నిత్యపూర్ణ పదార్థమునుండియే, అనిత్యవస్తు సంబం ధముల విలువను నిర్ణయించు కొలతబద్ద మనకు లభించును. పరమసత్యముతోఁబోల్చినచో లోకసంబంధ సత్యములన్నియుఁ

సాక్షికములు. మనజ్ఞానమంతయు నతీతమైన సత్యమును సూచించుచున్నది. దృశ్యముయొక్క జ్ఞానము క్రమముగా వృద్ధినొంది పరిపూర్ణమగుచుండఁగా, దృశ్యముయొక్క స్వరూపమే మాఱిపోవును. మనజ్ఞానము పరిపూర్ణమైనప్పుడనే, ద్రష్టకును దృశ్యమునకును భేదమంతరించును. ఈవిధముగా నేకమైన పరమ సత్యభావమువలననే మనఅజ్ఞానసంబంధములలోని లోపములన్నిటిని సవరణచేయఁ గల్గుదుము. అప్పుడుమాత్రమే మన సాక్షికానుభవసంబంధములన్నియు, ఆత్మపరిపూర్ణ స్వాతంత్ర్యమును సాధించు మార్గములోని దశాంతరములని మనము దెలియఁగలము. మనమానసిక జ్ఞానకల్పిత సంబంధములన్నియుఁ, సాక్షికములనియు, నసంపూర్ణములనియు గుర్తించినచో, వీని కన్నిటికినర్థమిచ్చి, పూర్ణానంతములగుట కవకాశమును గల్పించు నొక్క నిత్యసత్పదార్థస్థితిని మనమంగీకరించి తీరవలసియుండును.

కాని యీపరమ సత్పదార్థ స్వరూపమును దెలియు మార్గమేదైన నున్నదా యను విషయము నిర్ణయింపవలసి యున్నది. మనయసంపూర్ణ సత్యభావము లన్నిటినొకచోఁ జేర్చుటవలన నాపరమసత్యాకృతి లభింపదు. భిన్నదృక్పథముల నుండి చూచిన దృశ్యములన్నిటి నొకచోఁ గూర్చినంతమాత్రాన పరమపూర్ణ సత్యము స్వస్థితిలో నిర్ణయింపఁబడదు. మనము కేవల తర్కమును ననుసరించినచో, జ్ఞానమంతయు ననిత్యసంబంధ కల్పితమగుటచే నతీతమైన పూర్ణసత్యము నొందఁగఁజాలము. మనమానసిక జ్ఞానము సత్యమును దర్శింపఁజాలనిచో; నింకొకశక్తి యేదైన నాపనిచేయఁగలదా ? ఈప్రశ్నప్రత్యక్షముగా వాదనుగనున్నను.

దానికి సమాధానమును పరోక్షముగా వారిచ్చియుండిరి. జైనుల కేవల జ్ఞానార్థమిదియే ముక్తసంగులైనవారి కట్టి జ్ఞానముండు ననగానదియే ధ్యానసిద్ధియనియు, నందే యద్వైత బ్రహ్మ సాక్షాత్కారము లభించుననియు స్పష్టమగుచున్నది.

జైనసిద్ధాంతము ననుసరించి, ముక్తపురుషుఁడైన కేవలుఁడు, మనయనుభవములోని సర్వవిషయములను తనయత్యున్నత పూర్ణజ్ఞానమందు సమన్వయముచేసి కొన్నవాఁడని తెలియుచున్నది. ఆత్మ, తనపరిశుద్ధమైన స్వచ్ఛదశలోఁ బరిపూర్ణమైన జ్ఞానమును గలిగియుండును. ఈపూర్ణజ్ఞాన మాత్మయొక్క స్వతఃసిద్ధమైనస్థితి. జడపదార్థసాహచర్యముచే నాత్మజ్ఞానప్రకాశము మఱుగుపడి, భిన్నజీవులలో భిన్నరూపములుగా నసంపూర్ణ ప్రదర్శనము చేసికొనుచున్నది. ఈజడపదార్థ మాత్మయందుఁ బ్రవేశించి, ఆత్మయందుఁ దానాక్రమించిన స్థానముననుసరించి ఆత్మశక్తుల నధికముగానో అల్పముగానో యాచ్ఛాదించుచున్నది. తృణబ్రహ్మపర్యంతముగల జీవులలో నీయాత్మశక్తికిని, జడపదార్థమునకును బోరాటము జరుగుచున్నది. జడపదార్థశక్తు లత్యధికబలసముపేతములైనప్పు డాత్మశక్తియొక్క స్పర్శేంద్రియవ్యాపారమునే ప్రదర్శించు లోహశిలాదిరూపమును, సంపూర్ణజ్ఞానాగ్ని, ప్రబల తమవిజృంభణరూపసిద్ధావస్థ గలిగిన పుణ్యమూర్తియందు జడపదార్థశక్తు లంతరించి నశించుటయును జరుగుచున్నది. మధ్యమదశలలోని యనేకవర్గములకుఁజెందిన జీవులలో నే శక్తి యెంత విస్తృతిగలిగియున్నదో దానినిబట్టి వారిజ్ఞానదశ నిర్ణయమగుచున్నది. జ్ఞానము ప్రకా-

శించుటో, మఱుఁగుపడుటో, జీవుల యాత్మశక్తి నాచ్ఛాదించు జడపదార్థ పరిమాణమునుబట్టియుండును. ఆత్మయందు జ్ఞాన మంతర్నిహితమైయున్నది. దానిప్రకాశమున కడ్డునిలచినకార ణములను దొలఁగించిన, దానికాంతి నలుదెసలఁ బ్రసరించును. అవరోధములు పూర్తిగాఁ దొలఁగింపఁబడినపుడు, ఆత్మయే, దేశకాలానవచ్ఛిన్నమైన పూర్ణజ్ఞానరాశియగును. అపుడు శుద్ధచైతన్య సారమూర్తియైన ఆత్మయొక్క దివ్యకాంతి నణ చివేయు కాంక్షలుకాని యావేశములుకాని దరికిఁజేరవు. అట్టి పూర్ణావస్థలో భేదస్వరూపదర్శనమునకవకాశముండదు. జ్ఞేయము పూర్ణసత్యము; జ్ఞాత, భిన్నత్వము లేని పూర్ణవివేకము; అం దుచే నచట వ్యవహారప్రపంచమునందలి అనిత్యభేదములకుఁ దావులేదు. భేదకారణమైనదేదో అది నమసిపోయినది; ఉన్నది భేదరహితమైన శుద్ధాత్మచైతన్యము. అందుచే సనేకజీవత్వము పరమసత్యమని జైనులు సమర్థింపఁజాలరు.

౭—మనస్తత్త్వము.

మనము జైనులతత్త్వభావములను బరిశీలించుచుంటిమి గావున వారి మనస్తత్త్వభావముల పరిచయముగలిగి యుండు టవసరము. మనశ్శరీరముల ద్వైతమును నంగీకరించిరి. వారు పంచేంద్రియములను రెండువర్గములుగా విభజించిరి: (౧) ద్రవ్యేంద్రియములు (౨) భావేంద్రియములు. ౧. వస్తు

౧. ఉత్పాదాత్రిములు. ౩౬. ౧౫. ఇక్కడ మూర్త్యనుగావ మానసిక భాగము, ద్రవ్యభాగము మున్నదనియు, అట్టి దేహమునందట నిండియు న్నదనఁగా, రెండునులక్షణములు కలసియున్నవనియుఁ జెప్పిరి. దీనివలన సమస్యాపరిష్కారము కాఁజాలదు.

రూపమునకు నేత్రమునకు సంధానకర్త రంగు. రంగు వస్తుగుణములలో నొకటి. దానిని గ్రహించురీతిని నేత్రనిర్మాణము చేయఁబడినది. ఇంద్రియము లీవిధముగా జీవునియొక్క ఉపకరణములు. వానిద్వారమున నాత్మ వస్తువులరూపము నెఱిఁగి యనుభవించుచున్నది. ఈయనుభవశక్తి ఆత్మకుఁ జెందినదై యున్నది. బాహ్యముననున్న వస్తుగుణములు భోగ్యములు; ఇంద్రియము లాత్మయొక్క భోగోపకరణశక్తులు. స్పర్శ యొక్కటే యెనిమిదివిధములుగా విభజింపఁబడుటఁ జూచినచో విశేషమైనమన స్తత్త్వజ్ఞానము వీరికిఁగలదనిబోధపడును. శీతము, ఉష్ణము; కఠినము, మార్దవము; పలుచనిది, గట్టిది; తేలికయైనది, బరువైనది. రుచి పంచాత్మకము; కారము, పులుపు, చేదు, తీపి, ఉప్పు. వాసన రెండురకములు; సువాసన, దుర్వాసన. పంచవర్ణములు; నలుపు. నీలిమ, పసుపు, తెలుపు, ఎఱుపు. ధ్వనులేడు విధములు; షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, దైవతము, నిషాదము. ఇంద్రియము నకు వస్తువునకుఁగలుగు సంపర్కముచే నింద్రియదర్శనము గలుగును. మానసిక దర్శన మింతమాత్రముచే లభింపదు. ఇది కేవలమాత్మ జ్ఞానప్రకాశమున కడ్డువచ్చు తెరనుదొలఁగించును. కర్త, భోక్త, జ్ఞానియునొకఁడే. అనుభవము మూఁడువిధములు; తెలియుట, భావించుట లేక కర్మఫలముల ననుభవించుట,[౧] సంకల్పించుట[౨]. సంకల్పమునకు భావనకుదగ్గఱిసంబంధమున్నది.

---

౧. కర్మఫలచేతనా. ౨. పంచాస్తికాయసమయసారము. పుట ౩౮.

సాధారణముగా మొదటభావన, తరువాత సంకల్పము, తరువాత జ్ఞానము 3 కలుగును. జీవికిని పుద్గలమునకు సంబంధము, ద్రష్టకు దృశ్యమునకుఁగల సంబంధమే. వానిని రెంటినిఁగలుపు శక్తి జ్ఞానముకాదు; ఏలన నొకవిషయమును మన మెఱుఁగవచ్చును గాని, దానిననుసరించి మనము నడువకపోవచ్చును. సృష్టియంతయును జ్ఞానమున ప్రతిబింబించుటచే సిద్ధాత్మని పూర్ణప్రజ్ఞారూపమై, యున్నది. వానియందాత్మ బంధములే లేకపోవచ్చును. జీవునికోరికల ననుసరించి, లోకానుబంధముండును. వాంఛాదాసత్వముచే బంధమునఁ బడియుండుట జీవునికవసరములేదు; ఏలన వాంఛ నున్మూలింప వచ్చును.

ప్రతిజీవియు దేహాత్మకల్పితము; అందాత్మ కర్తృత్వముగల భాగస్వామి; దేహము నిష్క్రియాత్మకమైన భాగము. కేవల మనస్సత్యత్వ సిద్ధాంతమునకు, దేహమేసత్యమను సిద్ధాంతమునకుఁ గలలోపములను, రెంటికనోన్యన్య సంబంధ సహకారములున్నవనిగుర్తించి, జైనతత్త్వము పరిహరించెను. కాని ఆత్మానాత్మభేదము కేవలమనః కల్పిత మను విషయమును జైన తత్త్వము గ్రహింపలేదు. శాశ్వతములైన రెండువస్తువులున్నవనియు, వానిమధ్యమందు జరుగు వ్యాపారమే వానినుండి వేఱైన జ్ఞానమనియు జైనతత్త్వము. మఱియు దేహము, పరిణామమందిన యున్నతదశాస్వరూపములలో నూతన గుణములను బ్రదర్శించునను విషయమును జైనతత్త్వము గుర్తింపలేదు. మనశ్శరీర ద్వైతసిద్ధాంతమును నమ్మి మానసిక దశా

3. పంచాస్తికాయసమయ సారము పుట 3౮.

జ్ఞానముతో జైనసిద్ధాంత మాగిపోయినది. రెంటికిఁగల పరస్పర సంబంధబాంధవ్యము నది యంగీకరింపక, అనేకలోపములతోఁగూడిన సంబంధశూన్యమైన ద్వైతము నంగీకరించినది. "కర్మపదార్థము, దానియొక్క సహజస్వభావము ననుసరించి, కావలసినమార్పులను దానే చేసికొనును. జీవుఁడునట్లే, కర్మనియతి ననుసరించి, వచ్చు అపరిశుద్ధజ్ఞాన దశలనుండి, తన జ్ఞానమునందలి మార్పులను దానే కల్పించుకొనుచుండును." [౧] రెండును సర్వస్వతంత్రములైన రెండు శక్తులైయున్నవి. రెండు సంపూర్ణ స్వతంత్రశక్తులై యుండఁగా జీవుఁడేల కర్మానుభవము ననుభవింప వలెనను ప్రశ్నముకు సమాధానముగాఁ దత్పూర్వ స్థాపితమైన సామరస్యమేన [౨] కారణమని చెప్పఁబడెను. ప్రపంచములో భౌతిక పదార్థములు, పెద్దవి, చిన్నవి గలవు. ఇందుఁగొన్ని కర్మపదార్థములగుటచే జీవుల నాకర్షించును. వాని సాహచర్యముచే జీవి, కర్మపదార్థాణువులు కలియును. ఈ యేకస్థల సాహచర్యమే కర్మపదార్థము జీవునందుఁ బ్రవేశించుటకుఁగారణము, మనస్సునకిందు క్రియాసంబంధములేదు. పంచాస్తికాయ సమయసారగ్రంథ భాష్యకారుఁడు కాటుకపొడికి సమీపమునయున్న పాత్రము నలుపెక్కు నను నుదాహరణముచే నీసంబంధమును దెల్పెను. స్వతంత్రములైన యీ రెండుశక్తులెట్లో సమన్వయముపొందినవి. రెంటికిని ప్రత్యక్ష కారణసంబంధములేదని చెప్పఁ

---

౧. పంచాస్తికాయ సమయసారము. పుట. ౬౮.

౨. " " " ౭౦-౭౭.

బడెను గాన, వీనిసంబంధము మిక్కిలిగోప్య మైన దని చెప్పుటకు మాత్రమే వీలగును.

దీనినిబట్టి జ్ఞానముకూడ గోప్యమయినవస్తువే. దాని యంతరమునకుఁబోయి మనము చూడఁజాలని పరమసత్యమది గాదు. మన మొక సంకుచితభావమునకుఁ దెలిసి కట్టుబడి, మనస్సునన దొకటియు దానికెదురై స్వతంత్రమైన జగమును పరస్పరము సంబంధము లేనివైయున్నవనియూహించుచుంటిమి. మనము మనకెదుటనున్న వస్తువులను జూచుటలేదు; వస్తువుల ప్రతిమలను ప్రతిబింబములనుమాత్రమే చూచి, నిజప్రపంచము నవి తెల్పునని తలఁచుచుంటిమి. మనస్సునకు జగత్తునకు సమాన ధర్మ మొకటియున్నఁగాని, మనోభావమునకు, జగత్తునకు సామ్యమున్నదని చెప్పఁజాలము. అందుచే మనస్సు తనమందిరమునఁ గూర్చుండి, తనకు బాహ్యముగానున్న ప్రపంచమును దిలకించుచున్నదను సిద్ధాంత మర్థరహితమగును.

ఆత్మకుఁ గొలతలున్నవనియుఁ, బెరుగుటకుఁ దరుగుటకు నవకాశములున్నవనియుఁ జెప్పఁబడెను. ఆత్మస్థూలదేహమున కంటెఁ జిన్నది కాఁజాలదు; ఏలనఁ జిన్నదైనచో శరీరానుభవములనది తనవిగా గ్రహింపలేకుండును. అదిగర్భమునఁ బ్రవేశించినపుడు చిన్నదై, శరీరముతోఁబాటు క్రమాభివృద్ధినంది తుదకున్నత రూపమును పొందును, ప్రతిజీవితాంతమున నది మఱల సూక్ష్మమై యింకొకజన్మమును బొందుచుండును. శరీరమునందాత్మ వ్యాపించిన పద్ధతి యింకొక ప్రకృతివస్తువు వ్యాపించు పద్ధతికాదు; ఏలన నాత్మ భాగములు లేనిది, "వద్మ

రాగమణి క్షీరపాత్రములో నుంచినపుడు, మణికాంతి క్షీరమునకుఁగూడఁ గల్గినట్లే, ఆత్మతనశరీరములో౧ నుండి శరీరమునకుఁ గూడఁ జైతన్యము నిచ్చుచున్నది". అనంతసంఖ్యగల యాత్మలు, మధ్యమాకృతిగల్గి, లోకాకాశమునంతను నిండియున్నవి.౨ శంకరాచార్యు ౧. నభిప్రాయములో దేహముతో సమానవ్యాప్తి గల యాత్మలుండుట, సాధ్యముగా దేలన, దేహముచే నాత్మ పరిమితమై, దేహమువలెనే అనిత్యవస్తువగుటయు ననిత్యవస్తువగుటచే మోక్షము లేనిదియునగును. మఱియు నాత్మ ఒక కొలతగలశరీరమును విడిచిపోవునపుడు, మఱల నింకొకపెద్ద దేహములో పునర్జన్మమందుఁ బ్రవేశింపవచ్చునెడఁ గష్టపడ వలసివచ్చును. ఆత్మ అవసరోచితముగఁ బెద్దదిగాఁ బెరుగుటయుఁ జిన్నదిగా కృశించుటయు, జరుగునని స్థూలముగాఁ జెప్పవచ్చును. కర్మపదార్థాణుజాల మాత్మయందుఁ గొన్ని ప్రవేశించుచు, నదివరకున్నవి గొన్ని బయటికిఁ బోవుచునుండుటచే నాత్మ రూపము మార్పులేకుండ నుండునని చెప్పుటకు వీలులేదు. కాని కొన్ని యణువులు నిత్యములై మార్పులేకుండనుండునని చెప్పినచో, మార్పుచెందు నణువులేవో మార్పుచెందని వేవో నిర్ణయించుట తిరిగి యింకొకకష్టమును దెచ్చిపెట్టినవి. ఉపమానములచే జైనులీ

౧. పంచాస్తికాయసమయసారము పుట 33. మాహెర్ తనసైకాలజీ గ్రంథమున నిట్లుచెప్పెను. "ఒకనిర్గుణరూపముగాఁగాక, ఆత్మశరీరమంతటను వ్యాపించియున్నది; మఱియునది సర్వత్రవ్యాపించియున్నది; కాని తన శక్తులనన్నిటిని ప్రదర్శించుటకవకాశము లేకున్నది."

౨. మధ్యమపరిమాణము.

ప్రశ్నలకు సమాధానములీయఁజాతురు. ఒకదీపమును చిన్న పాత్రలోనుంచినను, పెద్దగదిలో నుంచినను నచటఁగల ప్రదేశమును సమానముగానే కాంతిమంతమొనర్చును. అట్లే జీవి తాను ప్రవేశించుశరీరముల విస్తృతినిబట్టి పెరుగుటో, కృశించుటో జరుగును.

## ౭—తత్త్వశాస్త్రము.

నైతికబాధ్యత నంగీకరింపని తత్త్వములన్నిటికి జైన తత్త్వము వ్యతిరేకమైయున్నది. మానవుని నైతికప్రవర్తనమునఁ గర్మస్వాతంత్ర్యము ముఖ్యమైన భావముగా గ్రహింపఁబడెను. దేవుఁడు జగమును సృజించెనను సిద్ధాంతముగాని, లేక జగము ప్రకృతినుండి జనించినదనుభావముగాని, లేక జగన్మిథ్యావాదముగాని జైనతత్త్వమునకు రుచింపవు; ఏలన, నవి దుఃఖకారణమునుగాని, దుఃఖనివారణోపాయమునుగాని చెప్పఁజాలవు. ౨. జ్ఞానముగల జీవి పంచభూతకల్పితుఁడనుట, నైతికదృక్పథమునుండి యెంత నిరర్థకవాదమో, జగములోని భిన్నత్వమొకేశక్తియొక్క రూపవైవిధ్యమనుటయు నట్టిదే. ౩ ఆత్మ కర్తగాదను సిద్ధాంతమువలన నైతికనియమావళియు నిరర్థకమగును. ౧. తనపూర్ణత్వమునందాత్మ సురక్షితముగా నున్నదనియు, జగద్వ్యాపారములన్నియు వస్తుగుణ సంయోగ

---

౧. శంకరభాష్యము ౨అ. ౨. ౩౩-౩౬.

౨. సూత్రకృతాంగము. ౧అ. ౧. ౩, ౫-౮

౩. ,, ౧అ. ౧. ౧,౭-౧౦; ౨అ. ౧. ౧౬,౧౭

౧. సూత్రకృతాంగము ౧ అ. ౧. ౧. ౧౩.

నియోగములచే నేర్పడుచున్నవనియుఁ జెప్పుటవలన నాత్మ యొక్క కర్తృత్వము నిర్మూలించి, నైతికబాధ్యత నర్థశూన్య మొనరించుచున్నాము. ౨. స్వభావముచే వస్తుజాలమంతయు యథాస్థానముల నాక్రమించియున్నదను విధివాదము, వ్యక్తి స్వయంకృషి కవకాశమును లేకుండఁ జేయుచున్నది. ౩. వ్యక్తులు తమభావిదశను బాగుచేసికొనుటకుఁ బాడుచేసికొనుటకును స్వతంత్రులైనఁగాని నీతినియమములకు విలువయుండదు; అదే విధముగా నాత్మ తనపూర్ణత్వము నేకత్వము నుత్తమస్థితియం దైనఁ గలిగియుండుటవసరము. ౪. ద్రవ్యస్వభావమును, బర్యాయలక్షణమును మొదట మనము చర్చించి, జగత్తత్త్వసిద్ధాంతము నావెనుక పరిశీలింపవలసియున్నది.

పరిణామము, పొందవలసిన లక్ష్యములేని శాశ్వతస్వభావముగల సత్పదార్థమున్నదని జైనులంగీకరింపరు. ప్రతివస్తువు, జన్మస్థితిలయములు గలిగియున్నది. వస్తునిర్వచనము మనదృక్పథము ననుసరించియుండును. జగద్రూపమున నున్న దే ఆద్యంతములు లేకుండ నెల్లప్పుడున్నది. దానికి గుణములు మార్పులు గలవు. జన్మస్థితిలయములు గలదేదియైనను ద్రవ్యమే. దానికిఁ గొన్ని క్రియాశక్తులున్నవి. స్థితిగలపదార్థములలో నున్న మూల ద్రవ్యము స్థిరమైనదనియుఁ బ్రతిద్రవ్యమునందు మార్పుగలగుణము లున్నవనియుఁ గూడఁ జెప్పఁబడెను. భౌతికరూపములు

---

౨. ,, ,, ౧౬ ౧.౧౧౯.౨౬.౧.౨౨-౨౪

౩. ,, ,, ౧౬. ౧.౨౧-౯; ౧౬. ౧.౪. ౭-౯; ౨౬. ౧.౩౨.

౪. ,, ,, ౧౬. ౧.౩.౧౧.

యథాస్థితిలో జడాత్మకములైయుండును; ప్రత్యేకద్రవ్యములు మారుచుండును. జీవిమార్పులేని స్వభావముగలదికాదు. జైనుల దృష్టిలో మనయనుభవములోనున్న జీవియేయున్నది; తదతీత జీవలక్షణ ప్రశంసవారు పెట్టుకొనలేదు. లోకములోని ద్రవ్యములు కొన్ని క్రొత్తగుణముల నార్జించుచు నదివరకున్న కొన్నిటిని విడుచుచు, నిత్యము మార్పు పొందుచుండును. మార్పులేని కొన్నిసామాన్యలక్షణములు గల వ్యక్తియున్నచో; గతలక్షణములు, నవీనలక్షణములు నావ్యక్తికిఁ జెందినవని చెప్పుటకు వీలుండును. భిన్నత్వములోనున్న యేకత్వమే వారి సత్త్వ జగత్తు, తదతీతమైనదేదియును లేదు. వారు చెప్పునది భేదాభేద వాదము. తన భిన్నగుణపరివర్తనము లందవిచ్ఛిన్నమై యున్నదే వారిదృష్టిలో వస్తుస్వరూపము. వస్తువు, గుణము విడఁదీయరానివి. అనేకగుణములు గలది వస్తువనివారు నిర్వచించిరి.౧, అది నిత్యపరిణామశీలముగల యేకవస్తువు.౨. "సర్వవస్తుసారరూపమగు ద్రవ్యమొకటే; అది అనేకరూపములను బ్రదర్శించును; జన్మస్థితిలయములు దాని స్వభావములు; ద్వంద్వవైరుధ్యములచే దానిని వర్ణింపవచ్చును."3.

ద్రవ్యమణువులలోనున్నట్లు, గుణములు వస్తువులకుఁ జెందియుండునే కాని యేయాశ్రయములేకుండ నుండఁజాలవు. ముఖ్యములగు గుణములివి; (౧) స్థితి, (౨) అనుభవయోగ్య

౧. పంచాస్తికాయ సమయసారము ౮; ౯; ౧౧.

౨. ,, ,, ,, ౬.

3. "అనంతధర్మాత్మకమ్ వస్తు" హారిభద్రుని షడ్దర్శనసముచ్చయము ౫౭

ము (౩) ద్రవ్యత్వముగలది (౪) జ్ఞానయోగ్యము (౫) విశిష్ట శీలముగలది. (౬) ఏదోయొక రూపమును గలిగియుండు లక్ష ణముగలది. ఇవి ద్రవ్యములకు సామాన్యగుణములు; స్వతంత్ర ములైన ప్రత్యేకగుణములు కూడ వీనికిఁ గొన్నికలవు. ఇందే దేనొకగుణమును దీసికొని, దానినే వస్తువనుటకు వీలులేదు. "కానివస్తువులేని గుణముకాని,గుణములేని వస్తువుకాని లేదు."౪. వస్తువునకు గుణమునకు నేమియు సంబంధములేదను న్యాయ సిద్ధాంతము వీరిచేఁదిరస్కృతమైనది. ఒకవస్తువు తనగుణము లందే యున్నది; గుణములే వస్తువునకు రూపమునిచ్చుచున్నవి. ఇది బాంధవ్యమేకాని స్థితికాదు. "వస్తువు తన గుణములనుండి పూర్తిగా వేరైనదైనచో, నప్పుడొక వస్తువే అనంతవస్తువులుగా మారవచ్చును; లేదా గుణములు తమ వస్తువునకుఁ బూర్తిగా వేరైనవైనచో, నొకవస్తువుండుట కవసరమే లేదు" ౫. నిర్గుణ బ్రహ్మవాదమును, క్షణికవాదమును రెంటినిగూడ జైనులు తృణీకరించిరి. ౧. వస్తువు, గుణమును, 'దేవదత్తునిగోవు' వలె బాహ్యసంబంధమును గలిగి యుండవచ్చును; లేక 'ఉన్నతమైన గోవు' వలె నాంతర్యసంబంధమును గలిగియుండనగును. "ధన ము, జ్ఞానము, కలిగియున్నవారు, ధనికుఁడు, జ్ఞానియు నెట్లగు

౪. పం. ష.సా. ౧౩

౫. ,, ,, ౫౦

౧. విశేషములేని సామాన్యము, సామాన్యములేని విశేషమును లేవు. హరిభద్రుని షడ్దర్శనసముచ్చయము. ౪౬ జైఁదన వృత్తియందు మణిభ ద్రుఁడొక శ్లోకము నుదాహరించినాఁడు. "ద్రవ్యమ్ పర్యాయవియుతమ్, పర్యాయా ద్రవ్యవర్జితాః క్వకదా కేన కిం రూప దృష్టమానేన కేనచేతి."

చున్నారో, అట్లే, ఏకత్వము ననేకత్వము సంబంధించియున్నవి రెండు రూపములలోనే వస్తువునకున్నవి." ౨. "వస్తుగుణసంబంధము, ఏకకాలమందున్న సమానత్వము, నేకత్వము, విభాగింప శక్యముగానిది, సహజమైన యేకరూపముగలది; వస్తుగుణైక్య భావము, ఏకత్వమువలనఁగాని సంయోగమువలనఁగాని జనించినదికాదు."3.

గుణసహితమైన ద్రవ్యమొక రూపమునుగాని, యొక యవస్థనుగాని, కలిగియుండవలెను. దీనినే మార్పునకులోనైన పర్యాయమందురు. సాగఁగొట్టఁబడుగుణము, పసిమి బంగారము గుణములు. ఇవి మారవు; పర్యాయములు లేక రూపములు మారును. పర్యాయములు రెండురకములు:(౧)ఒకవస్తువుయొక్క ముఖ్యగుణములరూపములు. రంగు నిత్యగుణమైనను, నీటిరంగు మారవచ్చును.౪. తాత్కాలికగుణములైన కలుషము (బురద మున్నగునవి మారవచ్చును. జలమెల్లప్పుడు బురదగానే యుండదు. ౫. అజములు, సహచరులు, స్వతంత్రములునైన 'జీవము' 'అజీవము' నను రెండునుండి విశ్వమంతయుఁ బుట్టినది. జీవముభోక్త; అజీవము లేక జడముభుక్తి; సచైతన్యము జీవము జడ మచేతనము. కాని జడమును మనము, దర్శన స్పర్శనా ఘ్రాణాదికముచే నెఱుఁగవచ్చును. జడమునకు త్రివిధాత్మకమైన చైతన్యములేదు. అందుచేనది దృశ్యము. ౬. "ఏది వివిధ పదార్థములను జూచునో, తెలియునో, సుఖమునుగోరి దుఃఖ

౨. పం. స. సా. ౫3 (3) పం.స సా. ౫౬ (౪) సహభావిన్ పర్యాయా (౫) క్రమభావిన్ పర్యాయా (౬) పం. స. సా. ౧3౨

మునకు భయపడునో, పరోపకారాపకారాది కర్మఫలములననుభవించునో, అదియే జీవము." ౧. జీవము, అజీవము– 'నేను' 'నేను–కానిది' తోఁబోల్పరాదు. దృశ్యమునందలి భేదకల్పనముచేఁ జేసిన వర్గీకరణమేయిది. చేతనములైన జీవులు శరీరాత్మలను గలిగియుండి, ఆత్మలు పదార్థమునుండి వేరైనవికావున నిత్యములు. అజీవములు రెండురకములు. ధర్మము, అధర్మము, ఆకాశకాలములు మున్నగునవి రూపములులేనివి; సరూపములు పుద్గలము లేక పదార్థమువంటివి.

మొదటి అజీవద్రవ్యము ఆకాశము. దానిని, లోకవస్తుజాలమంతయునున్న లోకాకాశమనియు, నూర్ధ్వమున శూన్యమైయున్న అలోకాకాశమనియు రెండుగావిభజించిరి. ౨ ప్రదేశమిట్లు నిర్వచింపఁబడెను : " పుద్గలముయొక్క ఒక అవిభాజ్యమైన అణువుచే నడ్డుకొనఁబడినదై, సర్వపదార్థాంశములకు స్థలమిచ్చునదే ప్రదేశము." 3. అట్టి ప్రదేశములో, ఒక ధర్మాంశము, ఒక అధర్మాంశము, ఒక కాలాంశము, పెక్కు పదార్థాణువులు సూక్ష్మరూపమున నుండవచ్చును. ప్రదేశము చలనమునకుఁగాని, నైశ్చల్యమునకుఁగాని యవస్థారూపము కాదు. ४. చలననియమము ధర్మము. "రుచి, వర్ణ, పరిమిత, శబ్దస్పర్శములు ధర్మమునకు లేవు. అది లోకమునంతను వ్యాపించియుండి, అవినాభావసంబంధముచే నవిచ్ఛిన్నమై యున్నది;

---

౧. పం. స. సా. ౧౨౯. (౨) పం. స. సా. ౯౭ చూడు దర్శనసంగ్రహము. ౧౯-౧౦ (3) దర్శనసంగ్రహము. ౨౭. (४) పం. స. సా. ౯౯; ౧౦౦.

ఆకాశమంతయు వ్యాపించియున్నది. కావున దానికివ్యాప్తి యునున్నది. నిజమున కేకప్రదేశమునందున్నను, స్థానవహార ములో౯ బెక్కుప్రదేశముల నాక్రమించి యుండును.'' ౫. అది అమూర్తము, అవిచ్ఛిన్నము, నిరవధికము. "అది రూపములేని స్వభావముచే ననంతరూపములుగలిగి, అగురులఘురూపమై దృశ్యాదృశ్యములందుండు శక్తి కలది కావున, నిత్యమై యున్నది. చలనముచేనది చలించదుకావున౯ జలించు స్వభావముగల జీవములకు, పదార్థములకు నవకాశ మిచ్చుచున్నది." ౬. "ఎట్లన నీరు తానుగదలకున్నను, చలించుచున్న చేపలకనకాశ మిచ్చుచున్నది." ౧. ద్రవ్యమునకు౯ గల ప్రత్యేకగుణములెవ్వియు ధర్మమునకు లేకున్నను, నది స్వయంసమర్థమైన యునకి గలది. అది చలనమునకు౯ గారణము కాకున్నను, చలనముని కవకాశమిచ్చునది. అధర్మము నైశ్చల్యనియతి. దాని కింద్రియ గుణములులేవు; రూపములేదు; లోకాకాశమంతయు నది నిండి యున్నది. ౨. ధర్మాధర్మములు రెండును, క్రియారహితములు, రూపరహితములు, అణురహితములు, అవిభాజ్యములు, చాంచల్యనైశ్చల్యముల కవి ఉదాసీనహేతువులు. నిజహేతువులు వేరుగానున్నవి. లేకున్నచో వస్తువులు నిత్యచలనములో నిత్యస్థాణువులో యగును. ఇవి చాంచల్యనైశ్చల్యముల ననుసరించి

(౫) పం. స. సా. ౯౦. (౬) పం.స.సా ౯౧.

౧. పం. స. సా. ౭౫; ౯౫ చూడు దర్శనసంగ్రహము ౧౭ వర్ధమాన పురాణము. ౧౬అ. ౨౯.

౨. పం. స. సా. ౯౪.

యుండునవికాక, చలించునట్టియుఁ జలింపనట్టియు సర్వవస్తుజాలముల యొక్క ఆధారభూతములైయున్న శక్తులు, చెల్లాచెదరై, సాంకర్యము నొందియున్న వస్తుజాలమున కొకక్రమమును స్థానమును జేకూర్చునవే ధర్మాధర్మములు. జైనతత్త్వమున ధర్మాధర్మములనఁగా బుణ్యపాపములు గావని తెలియవలెను. చలన విశ్రాంతులను గలుగఁజేయు శక్తులవి. ఆకాశము, ధర్మాధర్మములతోఁగూడి, జీవులు, ద్రవ్యములు స్థితికలిగియుండుట కవకాశమిచ్చుచున్నది. ఉండుటకాకాశము స్థానమీయఁగా, ధర్మముచే నవి చలించుటలేక చలింపఁబడుటయు, నధర్మముచే నిశ్చలములగుటయు జరుగుచున్నది. ఉనికి, చలనము, విరతి, యివి యాకాశలక్షణములని నవీనతత్త్వశాస్త్రము చెప్పుచున్నది. ఈ మూడును పరస్పరము నొండొరులలోఁ బ్రవేశింపఁగలవు. ఏకదేశస్థలయినచో, నవి సమానపరిమాణరూపములు గలిగి, అవిభాజ్యమైన యేకత్వమును గలిగియున్నవి. వానికి వేరువేరు వ్యాపారములుండుటచే వానిని వేరుగాఁ జెప్పుకొనుచున్నాము.

కాల మొకవిధమైన ద్రవ్యముగా నప్పుడప్పుడు చెప్పబడెను. ప్రపంచమంతయు నిండియున్న యీకాలసూత్రమునందు విశ్వగతిపరంపరలన్నియుఁ గూర్పఁబడినవి. అప్పుడప్పుడు తటస్థించుమార్పుల మొత్తముయొక్క రూపము మాత్రమే కాదు కాలము; అదియొక నిరవధికమైన గమనము, భూతమునుండి భవిష్యత్తులోనికిఁబోవు నవిచ్ఛిన్నస్వరూపము. కాలమున కస్తిత్వమున్నదికాని, కాయత్వమనగాఁ బరిణతిలేదు. దానికి వ్యాప్తి

లేదేలన నది యేకముఖమైనది. ౧. ఆద్యంత, రూపములు లేని శాశ్వతకాలమునకును, ఆద్యంతములును, గంటలు, నిమేషములు మున్నగు వైవిధ్యములును గల తాత్కాలిక కాలమునకు భేదము చెప్పఁబడినది. మొదటి దానినిఁ గాలమనియు, రెండవదానిని సమయమనియుఁ బిలిచిరి. కాలము సమయమునకుఁ బ్రధానకారణము. పరిణామమువలన వర్తనము లేక మార్పులలో నునికియు గ్రహింపఁబడెను. ౨. “అనిత్యకాలము మార్పులవలనఁగాని, వస్తువులలోని చలనము వలనఁగాని తెలియుచున్నది.” 3. కాలమును జక్రమనియుఁ జెప్పిరి. కొంతకాలమునకు రూపములన్నియు నశించును గాన నాశసమాసమనియుఁ జెప్పఁబడెను. ౪.

పదార్థములేక పుద్గలమును ప్రమాణమునుగూర్చి మనమిపుడు చర్చింపవలెను. “ఏవింద్రియములచేఁ జూడఁబడుచున్నవో, యట్టి దేహములు, మనస్సు, కర్మలు, మున్నగునవి మూర్తములు లేక మూర్తిగలవి. ఇవన్నియుఁ బుద్గలము.” ౫. “శబ్దము, సంయోగము, సూక్ష్మత్వము, స్థూలత్వము, ఆకారము, విభాగము, అంధకారము, ప్రతిమ, కాంతి, ఉష్ణములతోఁగూడిన యీగుణము లన్నియును పుద్గలమునకుఁ జెందినవి.” ౬. పరిమాణము, గుణము, గణించుటకు శక్యముకాని, నిత్యమైన వస్తువే పదార్థము. అణువుల సంఖ్యతగ్గుటకాని పెరుగుట కాని

౧. చూడు దర్శనసంగ్రహము. ౨౫ (౨) పం. స. సా. ౨౩-౨౬. (3) పం.స.సా ౧౦౭, ౧౦౮. (౪) పోల్చు; 'కాలోఽస్మి' భగవద్గీత ౧౧. ౩౨. (౫) పం.స.సా. ౮౯ (౬) దర్శనసంగ్రహము. ౧౬.

లేకుండ, బదార్థము పెరుగుట తరుగుటగలదు. అది యేరూపమునైననుబొంది యేగుణములనైనను కలిగియుండఁగలదు. పదార్థము చలనస్వభావముగల శక్తియొక్క వాహనమది. పుద్గలమునకీ చలనశక్తియున్నది. ఇది రెండువిధములు, ఒకటిపరిస్పందము, రెండవది పరిణామము, పుద్గలము ప్రపంచమునకు భౌతికమైన మూలాధారము. పదార్థమారువిధములు. ఇవి స్పష్టత, స్వచ్ఛతలపై నాధారపడియుండుట, శబ్దస్పర్శరూప రసగంధములు పుద్గల లక్షణములు, ఆకాశము, ఆత్మలుతప్ప, తక్కిన సర్వము పదార్థజన్యములు, మనము చూచు వస్తువులు స్థూల పదార్థరూపములు. ఇంద్రియగోచరము కాని సూక్ష్మపదార్థముకూడ నున్నది. అదియే భిన్నవర్గములకుఁ జెందిన కర్మరూపములుగామారును.

జైనద్రవ్యశాస్త్రమునకుఁ బ్రధానసిద్ధాంతము, ప్రపంచమణుకల్పితమనియెడు భావము. ఇంద్రియగోచరములగుచున్న వస్తువులు పరమాణుకల్పితములు, సంపూర్ణ సమానలక్షణములుగల పుద్గలము ఛిన్నమై, గుణభేదములుగల అణువులుగామారుచున్నది. అణువున కాదిమధ్యాంతములు లేవు. అణువు సూక్ష్మము, నిత్యము, అతీతము, అదిదేనినుండి జనింపలేదు; నాశనముకాదు. సర్వమూర్తముల కాధారమైనను నది యమూర్తము. కేవలుఁడొక్కడే తన దివ్యదృష్టిలోఁజూచు నొకరూపము దానికున్నదని యొకప్పుడు చెప్పఁబడెను. అణువులకు బరువు గలదు. ఎక్కువబరువైన పదార్థములు క్రిందకును, తేలికయైనవి పైననుండును. అణువొక్క ప్రదేశము నాక్రమిం

చును, ౧. ఒకస్థూలమైన అణుస్థానమును సూక్ష్మములైన గణనాతీతసంఖ్యలుగల అణువు లాక్రమించును. ప్రత్యణువు నొకవిధమైనరుచి, రంగు, వాసన, స్పర్శయుఁ గలిగియుండును. ౨ ఈగుణములు స్థిరములు, నిత్యములునుగావు. పరస్పరాకర్షణములుగల యణువుల సంయోగముచే ద్రవ్యములుదయించును. ద్రవమైనదొకటి, అనార్ద్రమైనదొకటి రెండణువులు గలిసినపుడు సంయుక్తాణువొక టేర్పడును. ఈయార్ద్రితానార్ద్రితలు పెక్కుదశలలో నుండవచ్చును. వ్యతిరేకస్వభావములుగల యణువులే మేళవించుచుండును. అణువుల పరస్పరాకర్షణాపకర్షణములను జైనులంగీకరింతురు. అణువుల చలనము, నాకాశము, ధర్మాధర్మములను గలిగించును. సంయుక్తాణువులు లేక స్కంధము లితరస్కంధములతోఁ గలియుచుండును. పుద్గలము, అణువులందును, స్కంధములందును నుండును. స్కంధములు రెండు మొదలుగా ననంతసంఖ్యలలోఁ గలియుచుండును. దృశ్యమానమగు ప్రతివస్తువొక స్కంధము, విశ్వమంతయు నొక మహాస్కంధము. భౌతికప్రపంచపరివర్తనములన్నియు నణుసంయోగ వియోగములచే జనించుచున్నవి. ౧ అణువులు స్థిరస్వభావములుగలవి కావనియుఁ, బరిణామమునుబొంది నూతనలక్షణముల నావిష్కరించుచుండునని యు నిదివఱకే చెప్పియుంటిమి. భూమి జలాగ్ని వాయువుల కనుగుణముగా భిన్నలక్షణములుగల యణువులు లేవనియుఁ

౧ పం ౪. పా. ౭౪.
౧. పం. స. పా. ౫౭.

దెలియుచున్నది. భిన్నభూతముల కనుగుణములైన లక్షణముల నుదయింపఁజేసి, వానివలన నణువులు భూతరూపములఁ గల్పించుచున్నవి. భూతము లెన్నియున్నవో అన్నివిధముల యణువులున్నవని న్యాయవైశేషికసిద్ధాంతము. ఒకేలక్షణములుగల యణువులు వివిధరూపసంయోగములచే వివిధభూతములను గల్పించుచున్నవని జైనవాదము. మూలాణువులలో గుణభేదములను జైనులంగీకరింపరు. ౨. ఈవిషయములో జైనులు లెన్సిప్పస్, డెమాక్రిటస్సులతో నేకీభవించుచున్నారు. అణువర్గీకరణముచేఁ గలిగినరూపము లనేకములు. ఒకయణువొకప్పుడతివేగమైన చలనమునుబొంది క్షణమాత్రములో విశ్వమంతయును జుట్టివచ్చు శక్తినిగలిగియున్నదని చెప్పఁబడెను.

జైనుల మతములోఁ గర్మ ద్రవ్యరూపమైనది. ఈభావమునను సరించియే, భావములు, నూహలు మనశీలము పైఁ బ్రభావమును గలిగి, మనఆత్మ సంస్కారములను గల్పించి, మార్చుచుండునని చెప్పవీలైనది. కర్మ ద్రివ్యాత్మకశక్తి; పదార్థము సూక్ష్మరూపము. కర్మరూపమునుబొందనర్హమగు సూక్ష్మపదార్థము జగమంతయు నిండియున్నది. పుణ్యాపాపఫలములను గల్పించు విశిష్టమైనశక్తి యీ సూక్ష్మపదార్థమునకుఁగలదు. బాహ్యాప్రపంచసాంగత్యమువలన, నాత్మయందీ సూక్ష్మపదార్థము ప్రవేశముగాంచును. దీనివలన కర్మ శరీరమేర్పడును. ఈ కర్మ శరీర మాత్మ మోక్షముపొందువరకు విడువదు. ఈకర్మపదార్థ మాత్మయొక్క తేజస్సునకవరోధమై యుండును. జీవుల

(౨) షఁ. స. సా. ౧౦-౧౩, ౧౫.

కాత్యంతికమైనది భావకర్మయును, దేహములకాత్యంతికమైనది ద్రవ్యకర్మయునని చెప్పఁబడినది. ఈరెండు నొకటేయైనను; చేతనాచేతనముల సంబంధముననుసరించి యీభేదమేర్పడినది. ప్రతి కర్మయుఁ దనసంస్కారమును జీవునియందు ముద్రించి, భావికర్మకుఁ బునాదిగానుండునట్లు చేయును. జీవులలోనుండి పనిచేయుచున్న సహజమైనశక్తి. కర్మావస్థలైదు రకములుగా నుండి, ప్రతికర్మయు మానసికసంస్కారహేతువగును. "ఔదయిక, ఉపశమ, క్షయ, క్షయోపశమ, పరిణామములను నైదవస్థలలో జీవిభావములు నడచుచుండును."[౧] పరిణామము మాత్రము కర్మబద్ధముకాదు; మిగిలిననాలుగును ఘాతికావస్థల ననుసరించి మార్పులుపొందుచుండును. సాధారణముగాఁ, గర్మ[illegible] దమకుచితములైన ఫలితముల నిచ్చుచుండును. ఆత్మ ఔదయికావస్థలోనున్నట్లు చెప్పఁబడెను. తగినప్రయత్నముచేఁ, గర్మ ఫలితావస్థకురాకుండఁ గొంతకాలమాపుచేయవచ్చును. కర్మ నణఁచియుంచినను, నివురుగప్పిన నిప్పువలె నది నశింపకయుండును. అప్పుడాత్మ ఔపశామికస్థితిలో నున్నదందురు. కర్మ నణఁచిపెట్టుటేకాక, నశింపఁజేసినప్పు డాత్మ క్షాయికావస్థయందుండి, తరువాత మోక్షముఁ బొందును. నాల్గవయవస్థ క్షయోపశమికావస్థ; ఇందు మిగిలిన యవస్థలలోని యనుభవము లన్నియు నుండును. ఈస్థితిలోఁ గొంతకర్మ నాశనమై కొంత యణఁగిపోయి, కొంత పనిచేయుచుండును. ఈయవస

౧. పం. ప. సా. ౬౨.

యోగ్యులకుఁ జెందినది; క్షాయికావస్థయు, నౌపశామికావస్థయు యోగులకుఁ జెందినది. ౧.

జీవికీ విధముగాఁ, బంచకోశములున్నవి. మొదటి నాలుగు నాకాశకాలములు, ధర్మాధర్మములు నమూర్తములు; ఐదవది పుద్గలము మూర్తమైనది. ఈయైదు కోశములును లోక నిర్మాణముచేసినవి; వీనిపైనున్నది అనంతము నప్రమేయమునైన 'అలోకము.'' ౨.

౧. కర్మ జీవునిలోఁ జేరునపుడది యెనిమిదిరకముల ప్రకృతినిసృజించి కర్మణ శరీరమును నిర్మించును. జ్ఞానావరణీయకర్మలు; ఇవి అజ్ఞానాసంపూర్ణ జ్ఞానదశలను గలుగఁజేయును: రెండు దర్శనావరణీయములు; ఇవి సమ్యగ్దృష్టిని మఱుగుపఱచును; మూఁడవరకము వేదనీయములు; ఇవి జీవిసహజానంద సుఖములను మఱపింపఁజేసి,దుఃఖమును బాధను గలిగించును;నాలుగవ రకము మోహనీయములు; దైవవిశ్వాస, ప్రవర్తన, భావావేశములను సక్రమవిధానమునఁ జూడనీయక, సందేహాదోషాదులను గలుగఁజేయును. మిగిలిననాలుగు వ్యక్తిగతములు;

(౧) ఆయుష్కములు. ఒకజీవితాయుర్దాయమును నిర్ణయించును;

(౨) నామములు. ఒకవ్యక్తియొక్కస్థితికిఁ గారణభూతములైన పరిస్థితులను, దశలను గల్పించి, దేహసామాన్య విశేషలక్షణములను కలిగించును. (3) గోత్రములు. వ్యక్తికి సంఘమునఁ గలస్థానమునిచ్చిన జాతికుల వంశములను నిర్ణయించును. (౪) అంతరాయములు. ఇవి జీవియొక్క స్వతస్సిద్ధమైన శక్తి కవరోధములై, సత్కర్మాచరణ కాంక్షలను నెరవేరకుండఁజేయును.

కర్మసిద్ధాంతముతో సంబంధించిన లేశ్యసిద్ధాంతమొకటియున్నది. ఇది యారువిధములు: జీవియొక్క కర్మల మొత్తమంతయుఁగలిసి, మానవచక్షువుల కగోచరమైన యొకదైవసంబంధమైన తేజస్సు లేక వర్ణమును గలిగించును. ఈ లేశ్యములు నైతికనియమాధారములైనవి. జీవముయొక్క స్వరూపమును జన్మస్వభావము; చేసినకర్మయుఁ గలిసి నిర్ణయించును. ప్రతికర్మయు నొకపరిమితకాల నియతిని గలిగియుండును. ఆదశలోనే దానిని నాశమొనర్పవలెను.

పదార్థమునకుఁ బదార్థవస్తురూపములకు వేరైజీవులు న్నవి. జైనులు జీవశబ్దమును నానార్థములలో నుపయోగించిరి. జీవమనగాఁ బ్రాణము, శక్తి, ఆత్మ చైతన్యము, బాహ్యప్రపంచమునకుఁ బూర్తిగా వేరురూపమైనచేత నానుభవమే జీవము. జీవులసంఖ్య అనంతము; అందనేక జాతులున్నవి. (౧) నిత్యసిద్ధ జీవులు (౨) ముక్తులు (౩) బద్ధజీవులు. ముక్తజీవులకు దేహములుండవు. ప్రపంచవ్యాపారములతో నేసంబంధమును లేకుండ, సర్వబంధములనుండి విడివడి, వారు లోకాతీతమైన స్థితిగలిగి సుఖించుచుందురు. బద్ధజీవులు మోహములకుఁ బలియై పదార్థపాశబద్ధులై, అంతములేని పునర్జన్మపరంపరలలోఁ దగుల్కొనియుందురు. నిత్యసిద్ధులు పూర్ణపావనమూర్తులై, పదార్థదోష మిూపన్మాత్రమంటకయుందురు. వీరియందు ఆత్మ పదార్థసంబంధపాశము తెగిపోయినది. వీరు నిరుపాధిక జీవులు; అనంతచైతన్యము, పూర్ణపావనస్థితియుఁ గలిగి, అనంతజ్ఞాన, అనంతదర్శన, అనంతవీర్య, అనంతసుఖములు పొందుదురు. సంసారచక్రమునందుఁ బరిభ్రమించుచున్న సోపాధికజీవులను తుచ్ఛపదార్థముతరిమి బాధించుచుండును. అజ్ఞానమువలన జీవుఁడు తాను బదార్థమని భ్రాంతిచెందును. ముక్తజీవి యనగా దోషాతీతుఁడైన పవిత్రుఁడగు ద్రష్టయని స్పష్టము. ఈ జీవియే ఉపనిషత్తులుచెప్పిన 'ఆత్మ'. ఆత్మస్వయంస్థితి, యప్రమేయత్వము, గలిగి, సర్వసంకల్ప భావవికల్పములకుఁ బూర్వమై, యాధారమైనదని చెప్పఁబడెను. సంసారబద్ధమైన జీవియనగా లోకానుభవప్రమాణ నిశ్చితమైనజీవి. ఈరెంటి

స్వరూప స్వభావముల నిశ్చయించుటలోనే జైనతత్త్వము వ్యాకులతఁ బొందినది. తుదిసిద్ధావస్థలోఁ దప్ప, నాత్మ యె ల్లప్పుడు పదార్థసంబంధమును గలిగియున్నది. కర్మ యీసం బంధకారణము. ఆత్మ సర్వావస్థలలో నవిచ్ఛిన్నమై, యుండు టేకాక దేహమునుండి జనించినది కాకయున్నది. ఒకనవీన పదార్థ ముద్భవించుట కాని, ఉన్న పదార్థమునకు నాశనము కాని లేదని జైను లంగీకరింతురు. అణువుల సంయోగమే నూత్నరూప ములకుఁ గారణము. జీవు లనేకము లేకాక, సమానముగా నన్ని యు నిత్యములే. బాహ్యకారణము లెన్ని యడ్డు దగిలినను,జీవుల మూలరూపమగు చేతనత్వము నశింపదు. జీవులకుఁ బరిమాణ ముగలదు; అది వైవిధ్యము గలది. నాఁటి కేదేహములందుండ వలెనో యా దేహపరిమాణముల ననుసరించి జీవపరిమాణములు పెరుగుట తరుగుట జరుగుచుండును. జీవులలోని భేదవాదము జైనుల అహింసాసిద్ధాంతమున కవసరమైనది. ఇంద్రియములసం ఖ్యనుబట్టి జీవజాతివిభాగ మేర్పడెను. త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణములగు పంచేంద్రియములు గలజీవు లుత్తమములు. త్వగింద్రియము మాత్రమే గలజీవు లధమములు. మిగిలినవి మధ్యమములు. ఉత్తమజీవులైన మనుష్యులకు, దేవతలకును షష్ఠేంద్రియ మొకటి మనస్సనున దున్నది. దానిచే వారు వివేక జీవులు.౧. ఇంద్రియములు, దేహములు కలిసి జీవుఁడు కాఁడు; వీని కంతర్భూతాధారమైయున్న చేతనత్వము జీవుని ప్రధాన లక్షణము.౨. జీవలక్షణమైన జ్ఞానము జీవునికి వేఱుకాదు. జ్ఞాన

౧. పం. స. సా. ౧౧౫-౧౨౮. (౨) పం. స. సా. ౧౨౮.

మార్గము లనేకములు గావున లోకము లనేకములై యున్న వని జ్ఞానులు చెప్పుచున్నారు.3. జీవము, జ్ఞానము నభిన్నములు. బద్ధజీవులలో జ్ఞానము ఆనందము మఱుఁగుపడియున్నవి. తృణాగ్రజలబిందువు మొదలు, గ్రహమండలమువఱకుఁ గల సర్వము, మనుష్యులు, జంతువులేకాక, జీవములనుగలిగి యున్నవి. భూతాత్మలుగూడ నున్నవి. భూమిజీవులు, అగ్నిజీవులు మున్నగునవి, పుట్టి మరణించి, తిరిగిపుట్టుచు నాయా సమాన భూతశరీరములనో అన్యభూతశరీరములనో పొందుచుండును. ఇవియు స్థూలములు కొన్నియుఁ గొన్ని సూక్ష్మములును. సూక్ష్మములగోచరములు. ఏకేంద్రియములు లతాదులు. ప్రతిలతయు నొక జీవి దేహము కావచ్చును, లేక, అనేక దేహములుగల జీవులనుగలిగి యుండనగును. భారతీయ తత్త్వజ్ఞులుకొందఱు లతాదులు జీవులని చెప్పియున్నను, జైనులీ సిద్ధాంతము నద్భుతముగా నభివృద్ధిచేసిరి. ఒకేజీవముగల లతాదులు స్థూలరూపములుగలిగి, జననివాస యోగ్యప్రదేశములందుండును. అనేక జీవవర్గములు గల లతాదులు, సూక్ష్మములు నదృశ్యములునై, ప్రపంచములో నన్నిప్రదేశములందు వ్యాపించియుండును. ఇట్టి లతలు నిగోదములని పిలువఁబడును. అనంత జీవవర్గదేహములై యీలతలు గుల్మములుగాఁ బెరిగి, అన్నిటి కేకశ్వాస జీర్ణకోశములుగలిగి యుండును. అనంతసంఖ్యగల నిగోదములుకలిసి నొకగోళరూపమగును. ప్రపంచమిట్టి గోళకోటితోఁ గ్రిక్కిరిసియున్నది. నిర్వాణముచెందిన జీవులస్థానములకు గోళములందలి జీవులు

3. పం. స. సా. ౪౯; ౫౦.

వచ్చి చేరుచుండును. ఒక్క నిగోదములోని యనంతైకభాగ మునందలి జీవులు, మొదలులేని కాలమునుండి నేటివఱకు మోక్షముపొందిన జీవుల కాళీస్థలముల నాక్రమించుటకు సరిపోయినవి. అందుచేఁ బ్రపంచమెప్పుడైన జీవులులేనిదగునని భయపడ నవసరము లేదు. ౧. లోహ శిలాది జడపదార్థములం దుఁగూడ జీవు లున్నవనెడు జైనసిద్ధాంత మతి విచిత్రమైనది.

జీవిదశ దేహదశ ననుసరించి యుండును. జడపదార్థమందు జీవచైతన్యము నిగూఢమైయున్నది; చేతన దేహమందది చలించుట కారంభించినది. చేతనత్వము మనుష్య దేహములలోఁ బ్రవృత్తిగలిగియున్నది. "అన్ని మాంసము లొకరకమునకుఁ జెందవు. మనుష్యులలోని మాంస మొకరకము, జంతు మాంస మింకొకరకము, మత్స్యమాంసము వేఱొక రకము, పక్షిమాంస మింకొకరకము" నను వాక్యార్థముతో నీభావమును బోల్చి చూడుము.

జీవమునకు రూపము లేకున్నను, జ్ఞానలక్షణముగలిగి, కర్మఫలభోక్తయగుచు, దేహ పరిమాణముకలిగి యుండును. ౨. జీవి మార్పులను నిజముగాఁ బొందుచుండును; లేకున్నచో నది కారణకర్త కాఁజాలదు. 3. జీవి భావముల కుపాదాన కర్త; కర్మ పదార్థము నిమిత్తమాత్రకారణము. ౪. కుమ్మరి జీవములోఁ గుంభభావ మున్నది; తరువాత నది మృణ్మయ కుం

---

౧. చూడు. లోకప్రకాశము. ౬అ. 3౧.

౨. దర్శనసంగ్రహము. ౨. (3) పం. స. సా. ౬౫.

౪. పం. స. సా. ౬౪.

భముగా బహిర్ముఖమై తయారగుచున్నది. అయినను, అనంత రూపపరిణామమున్నను, జీవి తన సహజస్వభావము నవిచ్ఛిన్నముగా నిలుపుకొనును. జన్మమరణములు జీవికిఁ బర్యాయములు మాత్రమే. ముక్తజీవి సంసారబద్ధ జీవితో నేకమైయుండును. ౧. జీవి పరిణామజాలగ్రంథులలోఁ దగుల్కొని యెల్లప్పు డుండ ననసరము లేదు. అనఁగా, శరీరముతో నిమిత్తము లేకుండ నది యుండఁగలదు. చైతన్యము పదార్థముతో సంబంధము లేని స్వాతంత్రిశక్తి. అది యాద్యంతములు లేని శాశ్వతశక్తి. అణు సముదాయములు ఛిద్రమై నాశమగుచుండును.

అజీవద్రివ్యము లైదింటిని, షష్ఠజీవమును గూర్చి క్లుప్తముగాఁ బ్రసంగించియున్నాము. ఈయాఱింటిలోఁ, గాలము తప్ప మిగిలిన వస్తికాయములు; ౨ రూపసంబంధములుగలవని కూడ నూహింపవచ్చును. కాలము సత్యమైనదే; కాని దానికి రూపము లేదు. కావునఁ గాలమొక స్వాతంత్రిస్థితిగల ద్రివ్యము. కాని దీని కస్తికాయము లేదు. అనేకద్రివ్యము లొకేస్థలమం దుండి, తమ స్వభావమున మార్పులేకుండఁ బరస్పర ప్రివేశశక్తి గలిగియు నున్నవి. జైనుల షష్ఠద్రవ్యములు, వైశేషికుల నవభూతములనుండి వేఱైనవి. వైశేషికసిద్ధాంతము ననుసరించి, భూజలాగ్ని వాయ్వాకాశములు, కాలము, దిక్కు, మనస్సు, ఆత్మలు తొమ్మిది యున్నవి. మొదటినాలుగు పదార్థములని జైనులమతము. ఇంద్రియముల కనురూపములైన పదార్థలక్షణము లవి. అంశములు కలియుట, నొకదానిలో నొకటి

౧. పం.స.సా.౨౦. ౨. అస్తి=స్థితి; కాయము=స్థలము నాక్రమించునది.

ప్రవేశించి మాఱుటవలనఁ బదార్థ మొకద్రవ్యమైనది. శబ్ద మాకాశ సంభవమని వైశేషికులు చెప్పఁగా, జైనులు పదార్థాంశ సంఘర్షణముచే శబ్ద ముత్పన్న మని చెప్పుదురు. ౨.

జీవాజీవములు రెండును ప్రపంచమున కంతకును సరిపడు ప్రమాణములు. ఆఱుద్రవ్యములలో జీవము, పుద్గలము ముఖ్యము లైనవి. మిగిలిన వారెంటిప్రవృత్తి ఫలితములు. జీవి పదార్థ బద్ధుఁడగుటే సంసారము. జీవపుద్గలములు సక్రియాద్రవ్యములు లేక యొకచోటనుండి యింకొకచోటికిఁ జలించుచుండు ముఖ్య కారణములు. ధర్మాధర్మములు చలనముల కవకాశమిచ్చును గాని, మార్పులకుఁ బ్రత్యక్షపరోక్ష కారణములుగావు. అందుచే వానిని సక్రియానిష్క్రియాద్రవ్యము లనిరి. జీవాజీవానుబంధ హేతువు కర్మ. కర్మోత్పత్తి, ఫలితము, నాశనము, జీవాజీవములు జైనతత్త్వసిద్ధాంతములు. ౧. జీవాజీవములు ముఖ్యనియామములు; రెండును గలిసియుండును. అజీవబంధవిముక్తియే జీవునికి మోక్షము. మోక్షమే సర్వకర్మలక్ష్యము. కర్మచేయుట మాని, కర్మనాశనముచే నీలక్ష్యసిద్ధి చేకూరును. సంవర మవరోధము. దీనివలననే కర్మ జీవియందుఁ బ్రవేశింపకుండ నడ్డుపెట్టఁగలము. పూర్వకృతపాపముల నన్నిటిని సమూలనాశన మొనర్చునది నిర్జరము. ఆశ్రవము అనఁగా లోనికిఁబ్రవహించుట, బంధముల మూలమున సంవరనిర్జరము లవసరములైనవి. అన్యపదా

---

౨. పం.స.సా. ౭

౧. జీవ, అజీవ, ఆశ్రవ, బంధ, సంవర, నిర్జర, మోక్షములు సప్త తత్త్వములు (తత్త్వసూత్రములు ౪.) పాపపుణ్యములను జేర్చి యొకప్పుడు నవ పదార్థములనిరి, (పం.స సా. ౧.౨౮; దర్శనసూత్రము ౨౮)

ర్థము జీవునిలోనికిఁ బ్రవహించుటే ఆశ్రవము. దేహమునకు జీవునిబంధించునది బంధము. బంధకారణములు మిథ్యాదర్శనము, అవిరతి, ప్రమాదము, కషాయము (కల్మషము), వాఙ్మనోదేహములచే జీవిలో నుత్పన్నములగు పరిభ్రమణములు లేక యోగములు. ౨. ఒకవస్తువేదికాదో యదే యని భ్రమించుట మిథ్యాత్వము. ౩. ఆశ్రవబంధములు దుష్కర్మఫలితములగుచుండఁగా, సత్ప్రవర్తనముచేఁ గర్మనిర్మూలమగును. తత్త్వమంతటిలో మనకు భావద్రవ్యపరివర్తనభేదములు చూపఁబడినవి. భావములు కర్మను నిర్ణయించును. ౪

జీవములోఁగల కర్మపదార్థమే జీవిజన్మకారణము. జీవికి సహజముగాఁ గలజ్ఞానము దివ్యదృష్టి, కలుషితములగుట కిదియే కారణము. మోక్షసిద్ధిచేకూఱువఱకు జీవియెన్నఁడు పూర్తిగాఁ బదార్థమునుండి బయటపడదు. జీవికాలుష్యమిట్లేర్పడును. సూక్ష్మపదార్థము కర్మగామారుటకు ముందు జీవిలోనికిఁ బ్రవాహమై ప్రసరించును. సదసద్రూపములైన కర్మ సుఖదుఃఖఫలితముల నిచ్చుచుండును. ఒక కర్మ తనఫలితమునిచ్చునపుడు, జీవమునుండి దానిని తుడిచివేయుచు నెన్నఁడు కర్మఫలప్రవేశమునకు జీవునియందుఁ జోటులేకుండఁజేసి, పదార్థకలుషమంతయు బూర్తిగాఁ దుడిచివేయఁబడి, జీవిశుద్ధమగును. దురదృష్టవశముచేఁ గలుషప్రవేశనాశనము లేక కాలమందు జరుగుచునే

౨. ఉమాస్వాతితత్త్వార్థసూత్రములు ౭అ.౧.

౩. అసతిసద్బుద్ధి అద్వైతములోని ఆవరణవిక్షేపములకుఁ బోలిక. యున్నవి.

౪. దర్శనసంగ్రహము ౨౯.

యుండుటచే సంసారచక్రమునందు జీవిబంధింపఁబడియే యుం డును. మరణకాలమున, జీవి తనకర్మశరీరము ధరించి,పునర్జన్మ మెత్తవలసినచోటి కచిరకాలమునఁ బోయి,తాను నూత్న దేహ మునందుఁజేరి, దానిపరిమాణము ననుసరించి, వృద్ధిక్షీణతల నొందుచుండును. జన్మస్థానముల ననుసరించి బద్ధజీవులు నాలు గువర్గములుగా విభజింపఁబడినవి. (౧) నరకములోఁబుట్టినవి (౨) జంతువులలోఁబుట్టినవి (3) మనుజసంభవములు (౪) స్వర్గమున జనంచినవి.౧.

౯—ధర్మశాస్త్రము.

ముక్తిఁగోరువారు, హీనపదార్థము నున్నతమైన యాత్మ శక్తికధీనము చేయవలెను. అణఁచియుంచుభారము దొలఁగిన ఆత్మమహోన్నతపదవిఁబొంది, సిద్ధాత్ములు చరించుపదవికిఁ బో వును. అంతరాత్మ శుద్ధమగుటే మోక్షసంపాదనమార్గము. మానవజీవితమును సంస్కరించి, కర్మపాశములు తగులోకున కుండఁజేయుటకు ధర్మనియమాచరణమే మార్గము. త్రిరత్న రూపమైన, జినునియందు విశ్వాసము, యాతఁడుపదేశించిన జ్ఞానసముపార్జనము, పూర్ణశుద్ధప్రవర్తనము నిర్వాణమార్గము నిజస్థితియందనఁగాఁ దత్త్వములందు విశ్వాసము సక్రమమైనది; సత్యస్వభావమునుగూర్చి నిస్సంశయము, నిర్దుష్టమునగు జ్ఞాన ము సక్రమజ్ఞానము; బాహ్యప్రపంచవస్తువులయెడ రాగద్వేష రహితమైన యుదాసీనభావము సక్రమప్రవర్తనము.''౨. పై

౧ పం. స. సా. ౧౬.

౨ పం. స. సా.౧౧౫ చూడు తత్త్వార్థసూత్రములు ౧ ఆ ౧.

మూఁడునుగలిసి యొకటేమార్గమగును గాన, మూఁటినేక కాల మందే సంపాదింపవలెను. జ్ఞానభక్తులు గలవాఁడు పంచవిధ ప్రవర్తనమును గలిగియుండుటే ధర్మము. (౧) అహింస; అనఁగా హింసమానుటే కాక సర్వభూతములయెడ దయఁజూ పుట. (౨) దానము, సత్యవచనము. (౩) చౌర్యాదులు లేని మర్యాదజీవనము, (౪) మనోవాక్కాయములందు శౌచము. (౫) ప్రపంచవిషయాభిమానత్యాగము. ఈలక్షణములుగల వ్యక్తి యోగ్యుఁడనఁబడును. పంచమలక్షణమైన త్యాగమనఁగా దిగంబరుఁడైపోవు సన్న్యాసమని కొందఱర్థముచెప్పిరి. కాని దాని భావము, మనము భేదములను జూచుచు, లజ్జాదికములకు వశు లమై యున్నంతకాలము మోక్షార్హులము కామనియే. జైన ధర్మశాస్త్రములు భక్తికర్మలకు రెంటికిఁ బ్రాధాన్యమిచ్చినవి. సంసారులకు సన్న్యాసులకును వేఱుధర్మనియమములు కల్పింపఁ బడెను. ౧. మనశ్శాంతినిగూర్చు కర్మలన్నియుఁ బుణ్యకర్మలే. అన్నార్తులైనవారికన్నము, దాహబాధితుల కుదకము, దరిద్రులకు వస్త్రాదికము, యతులకు వసతి మున్నగు నవవిధదానములిచ్చు టచేఁ బుణ్యము లభించును. హింస ఘోరపాపకర్మ, అనృతము, మోసము, జారత్వము, పరద్రవ్యకాంక్షమున్నగు నితరపాపము లున్నవి. క్రోధగర్వదురాశాదికము మనల నీలోకమునకు బం ధించును. వినయము, అదాంభికత్వము, సహనశీలము, తృప్తి మున్నగునవి ఆత్మాభ్యున్నతికిఁ గారణములు. ద్వేషము, వైర ము, దూషణము, పరద్రోహము, నిగ్రహములేకుండుట, క్రి

౧. తత్త్వార్థసూత్రములు. ౭. అ. ౨౦.

త్రిమము,,దోషపూరితభక్తి మున్నగునవికూడఁ జెప్పఁబడెను. పాపము దైవమునెడఁగాక మానవునెడ నపరాధము.

“ఎవఁడు మనుజ పశు పక్ష్యాదులను బాగుగాఁ బ్రేమించునో వాఁడే బాగుగాఁ బ్రార్థించినవాఁడు; ఎవఁడు క్రిమి బ్రహ్మపర్యంత జీవరాశి నత్యంత ప్రేమతోఁ జూచునో యాతఁడే ఉత్తమప్రార్థనము చేసినవాఁడగును.” కోల్‌రిడ్జికవి. బౌద్ధుల ధర్మనియమావళికంటె జైనుల ధర్మసూత్రసముచ్చయము కఠినతరమైనది. వారిదృష్టిలో క్షమాశీల మత్యుత్తమమైనధర్మము; భోగాభిలాష పాపహేతువు. ౧. మోదఖేదములయెడ మానవుఁ డుదాసీనుఁడు కావలెను. బాహ్యవస్తువుల యాకర్షణములకు లోఁబడకుండునదే నిజమగుస్వాతంత్ర్యము. “బాహ్యవస్తువ్యామోహముచే నేజీవి, సంతోషక్లేశముల ననుభవించుచుండునో, యాజీవి స్వేచ్ఛను గోల్పోయి, విభ్రాంతచేతస్కుఁడై, బాహ్యవస్తువులకు వశుఁడై పరాధీనుఁడగును. ౨. ఏజీవి అన్యసంబంధశూన్యుఁడై, యితరభావములకు వశుఁడు కాక, తనకు సహజములైన ధర్మజ్ఞానములవలనఁ దన శాశ్వతస్వభావములను జూచి, తెలిసికొనునో, యట్టిజీవి పూర్ణస్వాధీననిశ్చయుఁడగును.” 3. “మానవుఁడా! నీకు నీవే మిత్రుఁడవు. నీకంటె వేఱైన మిత్రునికొఱకేల కోరెదవు?” ౪. ఇచటఁ బూర్తియైన విధివాదము లేదు. కర్మయే అన్నిటికిని

౧. ఆచారాంగసూత్రములు యస్.బి.ఇ. ౨౨ అ. పుట ౪౮ చూడుఁడు పం.స.సా. ౭౬-౭౭.

౨ పం.స సా.౧౬3 (3) పం.స.సా. ౧౬౫

(౪) యస్.బి.ఇ. ౨౨అ. పుట 33.

కారణమైనను, వర్తమానజీవితము మనచేత నున్నది. కనుక, గత కర్మఫలమును మార్చుకొనవచ్చును. బ్రహ్మాండమైన కృషిచే గత కర్మఫలమునుండి మనము తప్పించుకొనవచ్చును. దేవునిజోక్యమిం దుండదు. యతివరేణ్యులు ధన్యాత్ములగుటకుఁ గారణము, దేవుని నిర్హేతుక సందిగ్ధకటాక్షము గాదు; ప్రపంచముయొక్క క్రమగతిలోఁ దామును భాగస్వాములగుటయే. మనముచేయు వ్రతనిర్వహణము నిర్విఘ్నముగాఁ గొనసాగుటకు బలముచేకూర్చును గాన ధ్యానము ముఖ్యమైనది.* గృహస్థ జీవితమునకుఁ బదునొకండుదశలు, ఆత్మవికాసమునకుఁ బదినాలుగుదశలు నిర్ణయింపఁబడుటచే జైననియమ కఠోరత్వము తెలియఁగలదు. ఇట్టి యుగ్రశిక్షా నియమముల ననేక భక్తపుంగవు లభ్యసించి, తన్నిర్వహణమునం దసువులఁగోల్పోయిరి.

జైనధర్మమునకుఁ బ్రధానమహింస యనఁగా జీవముగల ప్రతిదానియెడ గౌరవము చూపుట. అపచారమునకు వెఱచుట ఈనియమమతిదీక్షలో శాసించుటవలన బయలుదేరిన కొన్ని యాచారములు, దీని నభిమానాదరములతోఁ దిలకింపని కొందఱచే నపహాస్యమునకుఁ బాలైనవి. ఏజీవికైనఁ గష్టము కలుగునేమో యని, కొందఱు జైనులు తాము నడచుత్రోవను దుడుచుచుఁబోవుట, ఊపిరిపీల్చునపు డేదైనజీవి యాఘ్రాణింపఁబడి మరణించునను భయముచే ముఖావరణములు గప్పుకొని నడచుట, నీటిని వడియఁగట్టుట, తేనెను విసర్జించుట మున్నగు నభ్యాసములను జేసిరి. అహింస పూర్తియైన భావములో నాచరణసాధ్యముగాని

---

* తత్త్వార్థసూత్రములు. ౭అ. ౮-౧౦.

మాటనిజమే. మహాభారతమిట్లు నుడివెను; "జ్ఞానమువలననే కాని, నేత్రములకు గోచరింపని జీవకోటిచే లోకమంతయు నిండి యున్నది. మనము మనకంటిఱెప్ప లల్లార్చునప్పుడు వానియవ యవములు నలిగి నశించును." ౧. భాగవతపురాణమిట్లుచెప్పినది: "జీవులకు జీవములే యాహారములు" ౨. ఈసూక్ష్మసత్యము లను మఱచినయెడల జీవించుటే కష్టమగును. తెలియక, మన మప్రియత్నముగ నేజీవిని బాధింతుమో యనునొక విధమైన అమాయికభయముతో శ్రోత్రియులగు జైనులు జీవింతురు.

ఆత్మహత్యదోషమని బౌద్ధమతము నిరసించును; కాని జైనమతము దానివలన జీవిత మున్నతమగు నని తలఁచును. తపో వృత్తి క్లేశకరమనియుఁ,గామనిరోధము దుస్సాధ్యమనియుఁ దలఁ చువ్యక్తికి ఆత్మహత్యచేసికొనుట కధికారమీయఁబడెను. ద్వాదశ వర్షతపోదీక్షానంతరము. నిర్వాణము తప్పక లభించునుగాన, నట్టి సాధకుఁ డాత్మహత్యచేసికొన్నట్లే యని భావింపఁబడెను. నాఁటితత్త్వములకు సహజముగానున్న పద్ధతిననుసరించి, స్త్రీలు మోహకారణములని తలఁపఁబడెను. 3, ఇతర భారతీయమత ములు తలఁచినరీతిని, జైనమతమును, అజైనమతస్థులకు ధర్మని యమముల ననుష్ఠించినచో మోక్షావకాశమున్నదని చెప్పెను. తనసంబోధసత్తరిగ్రంథమున కారంభవాక్యములలో రత్నశేఖరుఁ డిట్లువ్రాసెను; "వాఁడు శ్వేంతాంబరుఁడైనను, దిగంబరుఁడైనను,

౧. శాంతిపర్వము. ౧౫; ౨౬.
౨ భాగవతమ్. ౧౮. ౧౩. ౪౬. "జీవో జీవస్య జీవనమ్."
3. యస్. బి. ఇ. ౨౨౮. పుట ౪౭.

గారణమైనను, వర్తమానజీవితము మనచేత నున్నది. కనుక, గత కర్మఫలమును మార్చుకొనవచ్చును. బ్రహ్మాండమైన కృషిచే గత కర్మఫలమునుండి మనము తప్పించుకొనవచ్చును. దేవునిజోక్య మిం దుండదు. యతివరేణ్యులు ధన్యాత్ములగుటకుఁ గారణము, దేవుని నిర్హేతుక సందిగ్ధకటాక్షము గాదు; ప్రపంచముయొక్క క్రమగతిలోఁ దాముఁను భాగస్వాములగుటయే. మనముచేయు వ్రతనిర్వహణము నిర్విఘ్నముగాఁ గొనసాగుటకు బలముచేకూర్చును గాన ధ్యానము ముఖ్యమైనది.* గృహస్థ జీవితమునకుఁ బదునొకండుదశలు, ఆత్మవికాసమునకుఁ బదినాలుగుదశలు నిర్ణయింపఁబడుటచే జైననియమ కఠోరత్వము తెలియఁగలదు. ఇట్టి యుగ్రశిక్షా నియమముల ననేక భక్తపుంగవు లభ్యసించి, తన్నిర్వహణమునం దసువులుగోల్పోయిరి.

జైనధర్మమునకుఁ బ్రధానమహింస యనఁగా జీవముగల ప్రతిదానియెడ గౌరవము చూపుట. అపచారమునకు వెఱచుట ఈనియమమతిదీక్షలో శాసించుటవలన బయలుదేరిన కొన్ని యాచారములు, దీని నభిమానాదరములతోఁ దిలకింపని కొందఱచే నపహాస్యమునకుఁ బాలైనవి. ఏజీవికైనఁ గష్టము కలుగునేమో యని, కొందఱు జైనులు తాము నడచుత్రోవను దుడుచుచుఁబోవుట, ఊపిరిపీల్చునపు డేదైనజీవి యాఘ్రాణింపఁబడి మరణించునను భయముచే ముఖావరణములు గప్పుకొని నడచుట, నీటిని వడియఁగట్టుట, తేనెను విసర్జించుట మున్నగు నభ్యాసములను జేసిరి. అహింస పూర్తియైన భావములో నాచరణసాధ్యముగాని

*తత్త్వార్థసూత్రములు. ౭అ. ౪-౧౦

మాటనిజమే. మహాభారతమిట్లు నుడివెను; "జ్ఞానమువలననే కాని, నేత్రములకు గోచరింపని జీవకోటిచే లోకమంతయు నిండి యున్నది. మనము మనకంటిరెప్ప లల్లార్చునప్పుడు వానియవ యవములు నలిగి నశించును." ౧. భాగవతపురాణమిట్లుచెప్పినది: "జీవులకు జీవములే యాహారములు" ౨. ఈసూక్ష్మసత్యము లను మఱచినయెడల జీవించుటే కష్టమగును. తెలియక, మన మప్రియత్నముగ నేజీవిని బాధింతుమో యనునొక విధమైన అమాయికభయముతో శ్రోత్రియులగు జైనులు జీవింతురు.

ఆత్మహత్యాదోషమని బౌద్ధమతము నిరసించును; కాని జైనమతము దానివలన జీవిత మున్నతమగు నని తలంచును. తపో వృత్తి క్లేశకరమనియుఁ,గామనిరోధము దుస్సాధ్యమనియుఁ దలఁ చువ్యక్తికి ఆత్మహత్యచేసికొనుట కధికారమీయఁబడెను. ద్వాదశ వర్షతపోదీక్షానంతరము. నిర్వాణము తప్పక లభించునుగాన, నట్టి సాధకుఁ డాత్మహత్యచేసికొన్నట్లే యని భావింపఁబడెను. నాఁటితత్త్వములకు సహజముగానున్న పద్ధతిననుసరించి, స్త్రీలు మోహకారణములని తలఁపఁబడెను. 3, ఇతర భారతీయమత ములు తలఁచినరీతిని, జైనమతమును, అజైనమతస్థులకు ధర్మని యమముల ననుష్ఠించినచో మోక్షావకాశమున్నదని చెప్పెను. తనసంబోధసత్తరిగ్రంథమున కారంభవాక్యములలో రత్నశేఖరుఁ డిట్లువ్రాసెను; "వాఁడు శ్వేంతాంబరుఁడైనను, దిగంబరుఁడైనను,

౧. శాంతిపర్వము. ౧౫; ౨౬.

౨ భాగవతమ్. ౧౫. ౧3. ౪౬. "జీవోజీవస్య జీవనమ్."

3. యస్. బి. ఇ. ౨౨౫. పుట ౪౮.

బౌద్ధుఁడైనను, మఱేయితరమతశాఖకుఁ జెందినవాఁడైనను, సర్వజీవరాశియుఁ దనయాత్మస్వరూపమే యని నమ్మినచో మోక్షమును బొందును."

వర్ణవిభాగమును జైనులు నిరసింపరు; శీలమునుబట్టియే వర్ణమును గ్రహింతురు. "తాను జేయు కర్మలవలన నొకఁడు బ్రాహ్మణుఁడో, క్షత్త్రియుఁడో, వైశ్యుఁడో శూద్రుఁడో యగును...ఎవ్వని నేకర్మ లంటవో వానిని మేము బ్రాహ్మణుఁ డందుము."౧. "జైనులు బౌద్ధులును బ్రాహ్మణశబ్దము నొకగౌరవ శబ్దముగా నుపయోగింతురు. అందుచే బ్రాహ్మణవర్ణమునకుఁ జెందనివారికి నది యుపయోగింపఁబడును"౨. కులగర్వము, ప్రత్యేకత్వము జైనులు గర్హింతురు. మనుష్యుఁడు పాపములు చేయుటకుఁ గారణములైన అష్టగర్వములలోఁ గులగర్వమొకటి యని సూత్రకృతాంగగ్రంథము నిరసించినది.3

జైనసంఘము నాలుగువర్గములు గలది. సన్న్యాసులు, సన్న్యాసినులు, గృహస్థులు, గృహిణులు. బౌద్ధమతమున గృహస్థులకు సన్న్యాసివర్గముతో నంతసన్నిహిత సంబంధము లేదు. బౌద్ధజనసంఖ్యకంటెఁ దక్కువసంఖ్యగల్గియు, బౌద్ధమునకువలెఁ బ్రచారకమతముగాకున్నను, జైనమతము నేఁటికిని జీవించియున్నది; బౌద్ధమతము దేశమం దదృశ్యమైనది. శ్రీమతి

౧. యస్. బి.ఇ. ౧౪ అ పుట ౧౪౦. (౨) యస్. బి.ఇ. ౨౨. పుట 3౦. 3. జైనులు కొన్ని ప్రత్యేకకుటుంబములనుండియే తమయతిసన్న్యాసి వర్గసభ్యులఁజేరి తీసికొందురు. తమసంఘములోఁ దామును వర్ణవిభాగమును పాటింతురు.

స్టీవెన్సన్ దీనికిఁ గారణమిట్లు చెప్పియున్నది; అవసరోచితసందర్భములలో జైనమతము తనపదవిని నిల్పుకొను నుపాయములను గలిగియున్నది. బౌద్ధమతమువలెఁ బరిసరసంఘసంబంధము నది తెగఁదెంపుకొనలేదు; జైనులు తమశుభాశుభకర్మలన్నిటికిని, దేవాలయార్చనాదికమునకును బ్రాహ్మణులనే పురోహితులుగాఁ బెట్టుకొనిరి. తమపూజ్యములైన వీరగణములో హిందువు లారాధించు రామకృష్ణాదినామములఁ జేర్చిరి. మహావీరుని సంఘనిర్మాణకౌశలముకూడ జైనమతస్థైర్యమునకుఁ గారణమైనది. ఆతఁడు గృహస్థులనుగూడ సంఘములోఁ జేర్చి, వారి కుచితస్థానముల నిచ్చి నిలఁబెట్టెను. బౌద్ధమతసంఘమున సన్న్యాసులకేకాని గృహస్థులకుఁ దావులేకపోయెను. దేశమున నవైదికమత నిర్మూలనప్రచారము తుపానువలె వీచినపుడు, జైనులు హిందూసంఘమునఁ గలిసిపోయి హైందవసహజౌదార్యరక్షణములఁ బడయఁగల్గిరి. జైనతత్త్వముకూడ హిందూమతమున నేకొత్తదనములేని యొక ముఖ్యతత్త్వాంశముగాఁ బరిగణింపఁబడినది."౧

కర్మపదార్థజనితమగుటచే జైనులదృష్టి ననుసరించి, బాహ్యకర్మకు, బౌద్ధులు ప్రాముఖ్యమిచ్చిన కర్మోద్దేశమునకంటె నధికప్రాముఖ్య మొసఁగఁబడినది. బౌద్ధ జైనములు రెండును జీవిత, వ్యక్తిత్వముల నర్థములనియే తలఁచినవి. జన్మ మొక ఘోరవిపద్దశయనియు దానినెట్లైన నిర్మూలింపవలెననియు నిశ్చయించినవి. ప్రకృతికి మనలను బంధించి, సర్వ

౧. ది హార్ట్ ఆఫ్ జైనిజమ్. పుటలు ౧౮-౧౯.

దుఃఖములకుఁ గారణములైన బంధముల నన్నిటిని ఛేదించి మనము స్వతంత్రులము కావలెనని రెండును బోధించినవి; దారిద్ర్యశౌచములు, శాంతిసహనములు నుత్కృష్టగుణవిశేషములని కొనియాడినవి. హాప్కిన్సుపండితుఁ డిట్లు జైనవాదమును జమత్కారముగఁ జిత్రించినాఁడు; జైనమతముఖ్యభావము లేవనఁగా, దేవుఁడు నాస్తియని నమ్ముట, మానవు నారాధించుట, క్రిమికులమును బోషించుటయు నైయున్నవి."౨ బౌద్ధజైనములకుఁగల విశేషసామ్యము ధర్మనియమములందే గలదు; కారణము రెండును తమభావములను బ్రాహ్మణములనుండియే గ్రహించినవి." బ్రాహ్మణ సన్న్యాసియొక్క విశిష్టమూర్తి, వాని నాదర్శముగాఁగొని, బౌద్ధజైనులు తమ యాశ్రమాచారములను విశేషముగాఁ గల్పించుకొనిరి.3.

౧౦—ఆస్తికదృష్టివైఖరి.

జీవముయొక్క అనిశ్చయస్థితిచేతను, పదార్థముల పరస్పర సంరక్షణమువలనను జగదుత్పత్తి జరుగుట కవకాశము గలిగినది. సృష్టిలయముల కొక దేవుని యవసరము లేదు. "స్థితిగల వస్తువులకు నాశనము లేదు; శూన్యమునుండి పదార్థసృష్టి జరుగనేరదు. వానికి సహజముగానున్న గుణరీతులచేతనే వస్తువు లుద్భవించి, అదృశ్యములగుచున్నవి." ౧. పదార్థములు పరస్పర సంయోగములచే నూతనగుణకల్పనము చేయుచున్నవి.

౨ ది రిలిజయన్సు ఆఫ్ ఇండియా. పుట ౨౯౭.

3. యస్. బి. ఇ. ౨౨—పుట ౨౮.

౧. పం. శ. సా. ౧౫.

శూన్యమునుండి కాని, తాటస్థ్యపరంపరలనుండికాని సృష్టి యుదయించెనను సిద్ధాంతమును జైను లంగీకరింపరు. సక్రమ పద్ధతిననుసరించు ప్రకృతిసూత్రములు విచిత్రతాటస్థ్యములచేఁ గలుగవు. ఆస్తికుఁడు తలఁచునట్లొక ప్రథమకారణము నూహింపనవసరము లేదు. సృష్టిక్రియాహీనుఁడగు నొక దేవుఁడెట్లు తటాలున సృష్టిక్రియనారంభించునో యూహించుట సాధ్యము కాదు. అట్లే దేవుఁడు సృజించెనని యంగీరించినచో నాతఁ డే పదార్థము నూతగాఁగొని సృజించెనను క్లిష్టసమస్య యేర్పడును. ఆపదార్థము సృష్టికిఁ బూర్వమేదో యొకరూపమున నున్నదా? లేదా? అది దేవుని యవేద్యసంకల్పమన్నచో, మన మప్పుడు శాస్త్రచర్చలన్నిటిని గట్టిపేయుటే మంచిదగును. దేవునిసంకల్పమున కనుకూలముగానే సృష్టిలోని పదార్థము లన్నియు వర్తించుచున్నవన్నచో, వానికి దేవుఁడు భిన్నగుణములనేల యిచ్చెను ? మార్చుకొనుటకు వీలులేని ప్రత్యేకలక్షణముల నేల భిన్నపదార్థములు కలిగియున్నవి ? దేవుని సంకల్పమైనచో జలమేకాల్చి, అగ్నియే చల్లదనమునీయరాదా ? నిజముగా, భిన్నపదార్థములు తమ స్వభావముల కనుగుణముగాఁ గొన్నిప్రత్యేక లక్షణములనుగలిగి, యీలక్షణములు నశించినచో, నాపదార్థములును, నాశమగురీతి నున్నవి. లోకమందున్న ప్రతివస్తువున కొక కారకుఁడుండు టవసరమని చెప్పొచో కారకున కింకొక కారకుఁడు నాతనికి మఱొక కారకుఁడు నిట్లనంతకారకత్వము వ్యర్థవాదమునకుఁ దీసికొనిపోవును. ఈ వ్యర్థవాదమునుండి బయల్పడు మార్గమొక స్వయంస్థితిగల దేవుఁ

డున్నాఁడనియు,సర్వము నాతనివలననే వచ్చినవనియు నమ్మక నిత్యమై, స్వయంప్రకాశముగల యొక సత్పదార్థ మున్నదనుటకు వీలైనచో, నట్టి సత్పదార్థములనేకము లున్నవనుట కేమి యభ్యంతరమున్నదని జైనతత్త్వవేత్త ప్రశ్నించును. నిత్యవస్తువులనేకములను సిద్ధాంతముతో నాతఁడు బయలుదేఱి, యావస్తువుల యాత్మప్రదర్శనావసరముచే లోకప్రదర్శన మేర్పడినది. మానసికములు, పదార్థజాతములునయిన రెండువస్తువులతో జగమంతయు తన స్వభావముచేతనే అనంతసంఖ్యాకములైన పరిభ్రమణములతో నిత్యమై ఆద్యంతరహితమై వర్తించుచున్నదని చెప్పెను; ఇట్టి ప్రపంచ వ్యాపారమునకే భగవంతుని సహాయసంపత్తియు జోక్యము నవసరములేదు. కాల, స్వభావ, నియతి, కర్మ, ఉద్యమములను బంచావస్థల సహకారముచే విశ్వమందలి వైవిధ్యములు, భేదములు నేర్పడినవి. విత్తులో మహావృక్షమగుటకు వలయు శక్తులన్నియు నుండునుగాని, యట్టి వృక్షముగాఁ బెరుగుట కనుకూల ఋతుసాహాయ్యము, ప్రకృతి వాతావరణము, సుక్షేత్రమందు నాటుట మున్నగునవి ముఖ్యావసరములు. ఎట్టివృక్ష ముదయించి పెరుగవలెనో విత్తే నిర్ణయించును.

ప్రపంచమునుండి వేఱైన యొకయీశ్వరుఁడు లేఁడుగాని, లోకములోని కొన్నిపదార్థములే సక్రమాభివృద్ధిగాంచినచో దైవత్వమందఁగలవు. వారే అర్హతులు: అనగా సర్వదోషములను బరిహరించి, సర్వజ్ఞులైన జ్ఞానచక్రవర్తులు. సృష్టిశక్తిగల దేవుఁడొకఁడు లేకున్నను, ప్రతిజీవియుఁ బరిపూర్ణజ్ఞానసిద్ధుఁడై

నప్పుడు పరమాత్మయగును.౧ మానవాత్మయందు నిగూఢమై యున్న పూర్ణశక్తియొక్క యత్యుత్తమము, నున్నతము పూర్ణమునైన ప్రదర్శనమే భగవంతుఁడు. పరిపూర్ణసిద్ధులందఱు దైవతుల్యులే, సములే, వారిలో భేదములు లేవు.

సరిగా నాలోచించినచో జైనమతములో భక్తికి స్థానము లేదు. సర్వముతో నిస్సంగత్వమే వలయునది. తపోగ్నిలో మమకారమోహము దహింపఁబడవలెను. తర్కమంగీకరింపకున్నను, దుర్బలమానసులు, తీర్థంకారులను దైవభావముతో నారాధింప వలసివచ్చినది. గృహస్థులైనవారు, వారి నైతికమతావసరముల కనుగుణమైన తత్త్వమును,మతానుష్ఠానపద్ధతిఁ గోరిరి. జైనమతము జన్మదేశమునుదాటి, యితరప్రదేశములకు వ్యాపించినపు డచటి ప్రజానీకముయొక్క మతాభిరుచుల కనుగుణమైన సంతృప్తికర విశ్వాసముల నిర్మింపవలసిన యవసర మతిత్వరితముగా వచ్చినది. లేకున్న నితర దేవతోపాసకులను జైనమతములోనికిఁ జేర్చుటకు సాధ్యముకాదు. కృష్ణుని దైవముగానమ్మినశాఖవారు జైనమతావలంబకులైనప్పు డిరువదిరెండవ తీర్థంకారుఁడగు 'అరిష్టనేమి'కిని కృష్ణునికిని సంబంధముకలిపిరి. హిందువుల దేవతలు పెక్కుమంది జైనమతమునఁ బ్రవేశమును గాంచినారు. నేఁడు జైనమతము శాఖలుగాఁ జీలిపోయి, జైనవైష్ణవులు, జైనశైవులు మున్నగువర్గము లేర్పడియున్నవి.

---

౧. పోల్బ్ అలెగ్జాండరు పండితుని దేవతాసిద్ధాంతము : దేశము కాలము, దేవత వాల్యూము ౨. పుటలు. ౩౪౬, ౩౬౫.

ఆర్జించినపుణ్యరాశి విశేషముచే స్వర్గలోకమున మానవాత్మ యొక దేవతాస్వరూపమును దాల్చియుండుటొక ఫలితము. పుణ్యక్షీణమైన వెంటనే ఆరూపముపోవును. దేవతలును మనుష్యులు, పశువులవలెనే సదేహులు; తారతమ్యమవస్థామాత్రభేదమే, దేవతాశరీరము విశేషలావణ్యము, శక్తి గలిగి యుండుటకుఁ గారణ మాయాత్మపూర్వజన్మమున నొనర్చిన సుకృతఫలమే. ముక్తజీవులు దేవతల కతీతులు. వారికిఁ బునరావృత్తి లేదు. వారికి లోకముతో నెట్టిసంబంధమును లేదు; లోకము వారి నాకర్షింపఁజాలదు. తాము బహుప్రయాసలకోర్చినిర్వాణశిఖరమున కెక్కి-వచ్చిన క్లేశతమము దుర్గమమునైన మార్గమునఁ బయనింపలేక చీకాకుపడుచున్న యాత్రికులను వారు జూడరు; వారికే సాయము నొనర్పరు. సుప్రసిద్ధులైన జైన తీర్థంకారులకుఁ బ్రార్థనలర్పించినచో, వారు దుఃఖపరివర్తనములతోఁగూడిన ప్రపంచమును విసర్జించి, పూర్ణసిద్ధిపొంది యుండుటచేతను, లోకములోజరుగు విషయములయెడ వారు పూర్ణోదాసీన్యమును వహించి, లేశమాత్రము వికారము పొందనివారగుటచేతను, మనప్రార్థనములకు వారినుండి సమాధానము లెన్నఁడును రావు. కాని మనకు వలయు శిక్షణమునుగల్పించి, కాపాడుటకు దేవతలున్నారు. ౧. వారు మనమొఱలాలకించి, వరములు ప్రసాదింతురు. జినులైనవారికి మనము చేయవలసిన ఉత్తమప్రార్థనము వారుచెప్పినరీతిని నడచుకొనుటే. తీర్థంకారులయెడ భక్తి కాదు వలయునది; ఆత్మజ్ఞానసంపాదనముచే

౧. శాసనాధిష్ఠాయదేవతాః

మోక్షమును బొందవలెను. ౧. జినునిగూర్చి చేయుధ్యానస్తోత్రములవలన మనయాత్మను జారవిడిచిన వారమగుదుము. జైనుల మత మతి ప్రసన్నమైనదగుటచే నందు దేవుని అవ్యాజకటాక్షము నకుఁగాని, తప్పులనుమన్నించు విధానమునకుఁగాని తావులేనిదగుటచేఁ బ్రజాసామాన్యమున కీమతమం దాదరము కలుగలేదు. అందుచే ననేకవిషయములలో జనాభిరుచి ననుసరించి నియమములు మార్పుచేయవలసివచ్చెను.

౧౧—నిర్వాణము.

నిర్వాణమనగా నాత్మ శూన్యప్రవేశముచే నాశమగుట కాదు; తుదిలేని యానందరాజ్యప్రవేశముచే నిత్యత్వము గాంచుట. అది విదేహస్థితిగాని, స్థితిరాహిత్యము గాదు. ముక్తజీవి, వికారశూన్యుఁడై, నిర్లిప్తుఁడై, లోకమునఁ బరిభ్రమించుచున్న తోడిజీవులయెడ దయచూపుట కాని వారికి సాయమొసఁగుట కాని చేయుట కిచ్ఛగింపరని యిదివఱకే చెప్పియున్నాము. "ముక్తజీవి, పొడుగుకాదు, పొట్టికాదు;......నలుపు, నీలము, కాదు; చేదుకాదు, కారముకాదు; శీతము నుష్ణముకాదు...అశరీరియై, జన్మరహితుఁడై,...... అతఁడు చూచును, దెలియును—ఆస్థితిని వర్ణించుట కుపమానములు లేవు; అట్టిజీవికి రూపములేదు;సర్వావస్థాతీతుని యవస్థ నేమనిచెప్పవచ్చును."[౩] సిద్ధావస్థ, సంసారపరంపరల కారణముకాని ఫలితముగాని కాదు, అది సర్వకారణాతీతము.[౨] కారణనియమమున కాతఁడువశుఁడు

౧. పం.సా.సా.౧౭౬ ౩. యస్.బి.ఇ. ౨౨-పుట౨౨
౨. పం. స. సా. ౩౬.

గాఁడు. "సామాన్యదృష్టిలోఁ బూర్ణవిశ్వాసజ్ఞానప్రవర్తనములు మోక్షకారణములని యెఱుఁగుము; కాని నిజముగా నీమూఁడు గుణములుగల యాత్మయే మోక్షకారణము."౧. ముక్తజీవినిఁ గూర్చి మనమేమియు నిశ్చయముగాఁ జెప్పఁజాలము; మఱియు సరిగాఁ జెప్పవలయుచో, ముక్తజీవులనేకములనియు మన మెఱుఁగఁజాలము. సిద్ధావస్థ నిష్క్రియాత్మకముగా వర్ణింపఁబడినది. ముక్తజీవికిఁ గర్మలు కాంక్షలును లేవనియు, నచట శుద్ధనైశ్చల్యముండుననియు, అది పరివర్తనముకాని, అంతముకాని లేని విశ్రాంతియనియు, వచింపఁబడినది. గతకర్మశక్తి యంతయు నశించినది; జీవియున్నదికాని, పునర్జన్మము మాత్రము లేదు. అనుచితమైనను. ముక్తస్థితి అనంతచైతన్యమనియు, శుద్ధజ్ఞానమనియు, పూర్ణస్వాతంత్ర్యమనియు, శాశ్వతానందమనియుఁ గూడ వర్ణింపఁబడినది. ౨. దర్శనజ్ఞానము లింద్రియలక్షణములు గాక, జీవలక్షణములగుటచే సిద్ధావస్థలో జీవిదర్శించుట, తెలియుటఁ గలిగియుండును. ముక్తజీవికారంభమున్నది కాని యంతము లేదు; బద్ధజీవికారంభము లేదు, కాని యంతమున్నది. సిద్ధావస్థ ముక్తజీవులందఱకు సమానపదవియగుటచే వారన్యోన్యప్రవేశసంబంధములచే నానందింతురు. ముక్తజీవి యాత్మ పదార్థమునకొక వైలక్షణ్యమున్నది; దానిశక్తిచే నొకేయాత్మ యందనంత జీవకోటి స్థలాభావము లేకుండ నుండవచ్చును. కాని ముక్తజీవి కానవాలుగా రెండులక్షణములున్నవి; తుదిజన్మరూప వాస

౧. దర్శనసంగ్రహము. ౩౮; ౪౦. ౨. పం. స. సా. ౨౮.

నయు, బూర్వజ్ఞానమును. ఇరువదినల్గురు తీర్థంకారులలో నీ సిద్ధలక్షణములు పూర్ణతమపరిమాణములో గోచరించును.

లోక మలోక మధ్యభాగమున మానవుని యుదరమువలె నున్నది; ఊర్ధ్వమున సిద్ధశీలమున్నది; అనగా శీర్షముండుచోటు. ఈసిద్ధశీలము సిద్ధులనివాసము. ఇది విశ్వజ్ఞానచక్షువు. అందుచే మోక్షమనఁగా ననంతమగునూర్ధ్వగమనముగ, ముక్తిలభింపఁగానేజీవి, యూర్ధ్వముఖమై పయనించుటకుఁ గారణము పూర్వకర్మఫలవేగము౨, లోకమునకు బంధించియుంచిన విషయ3 పాశములు తెగిపోవుట౪యు, నూర్ధ్వగమనమే సహజాత్మలక్షణమగుటయునై యున్నవి.౫

౧౨—తుదినుడువు.

ప్రపంచవస్తువుల వ్యావహారికవర్గీకరణములనుండి, జీవుల యనేకత్వమును జైనతత్త్వము నిర్ణయింపఁజూచును. తర్కమందు, మనమిదివఱలోఁ జూచినట్లుగా, జ్ఞానముయొక్క సంబంధావస్థపై నాధారపడినది, కాని, లోకవస్తుసంబంధములు స్థిరములు, స్వతంత్రములుకావు. ఏలన, నవి మనభావముల ఫలిత

౧. నిశ్శోర్ధ్వగమనముక్తి. ౨. పూర్వప్రయోగాత్.
3. అసంగత్వాత్. ౪. బంధాచ్ఛేదాత్.
౫. తథాగతి పరిణామాత్, చూడు ఉమాస్వాతితత్త్వార్థ సూత్రములు, ౧౦ అ ౭. సిద్ధజీవులైదురకములు. (౧) సశరీరులైయుండి జైనమతము బోధించిన తీర్థంకారులు. (౨) సిద్ధజీవులు, మోక్షమును బొందుటకుఁ గర్మాణ తేనాపతనమున కెదురుచూచుచుండువారు. (3) ఆచార్యులు లేక మఠాధిపతులు. (౪) ఉపాధ్యాయులు లేక ప్రచారకులు (౫) మిగిలినవారు సాధువులు; పైవారందరిలోనుండురు. (దర్శనసంగ్రహము...౫౦-౫౪).

ములు. మఱియు, సత్యము జ్ఞానము నొకటేయగుటవలన లభించున దద్వైతముకాని ద్వైతము కాని యనేకత్వము కాని కాదు. నిజమునకు, జైనతత్త్వము నిర్ణయించిన యనేకత్వముతోఁగూడిన లోక మొక తాత్కాలిక దృక్పథదర్శనమే కాని, సత్యజగత్తు కాఁజాలదు.

లైబ్నిజ్ తత్త్వవేత్త లోకమంతయును మోనాడ్‌లతో నిండియున్నదని చెప్పినరీతినే, జైనులు లోకమంతయు జీవులతోఁ గిక్కిరిసియున్నదని చెప్పుదురు. "అతి సూక్ష్మాణువునం దనంత జీవకోటి యిమిడియున్నది. ప్రత్యణువును లతాసమూహముతో నిండియున్న వనమనియో, మీనకోటితో నిండియున్న కాసారమనియో చెప్పవచ్చును. అంతేకాదు; ప్రతివృక్షశాఖయుఁ బ్రతిజంతువర్గములోని ప్రాణియుఁ బ్రతిద్రవపదార్థబిందువును, తిరిగి జీవపూర్ణమైన ప్రహ్లదమనియో, వనమనియో చెప్పవచ్చును. వనమునకు వృక్షములకును మధ్యభాగమందును, మీనములకు నీటికిని మధ్యమందునుగల భూమి, వాయువులలో వృక్షములు కాని మీనములుకాని లేకున్నను, నిజముగాఁ గంటికి గోచరింపనంత సూక్ష్మాకారములలో వృక్షమత్స్యము లంతట నిండియున్నవి. ఈవిధముగా లోకములలో నిస్సారమైనది, నిరుపయోగమైనది, మృతప్రాయమైనది, అప్రకమమైనదియు నేదియు లేదు; దూరమునుండి మన మొక మత్స్యములతో నుండిన కూపమును జూచినచో నం దస్పష్టమైన నీటికదలికయే కనిపించి, మీనముల స్పష్టాకృతులు గోచరింపని విధముననే. లోకమంతయు బాహ్యదృష్టికి స్పష్టముగా గాన్పించునేకాని, నిజముగా లేక

మాత్రమైన జీవరహిత ప్రదేశమందు లేదు." జైనతత్త్వమునకు, లైబ్నిన్ మొనాడ్సిసిద్ధాంతము, బెర్గ్సన్ సృజనాత్మక పరిణామ సిద్ధాంతములతో నధిక సామ్యము లున్నవి.[౧]

చైతన్యముగల ప్రతివస్తువు జీవమే. బెర్గ్సన్ యొక్క చేతన పదార్థమున కిది సరిపోవును. అది అనుభవముతోఁ గూడిన యొక కర్తయైనకారణమున లైబ్నిజు మొనాడువంటిదే. ఏజడ పదార్థవాదము జీవకారణమును నిరూపింపఁజాలదు. జైన మతము పరిణతిలేని తాత్త్వికనిర్ణయములుచేయు యుగమునకుఁ జెందినదగుటచే, జీవునికి ఆత్మకును, అజీవునికి జడపదార్థమునకునుగల భేదముల స్పష్టజ్ఞానమును గలిగియుండలేదు. స్థితిగల వస్తువులలో జీవ మొకవిధమైన వస్తువు. పదార్థసాంగత్యము నుండి విడివడిన జీవాత్మయని చెప్పఁబడెను. పదార్థదోషరహితమైన శుద్ధచేతనత్వమే ఆత్మ. దానికి బాహ్యరూపము లేదు. అత్యుత్తమాత్మ పదవి నాక్రమించిన పరిశుద్ధజీవము రూపరహితచైతన్యము. పుద్గలము చైతన్యస్పర్శలేని కేవల జడపదార్థముగాదు. అదియు సచైతన్యమే. ఆత్మ చేతనాత్మక జీవము; పదార్థము చేతనమగు ననాత్మ. ఇది బెర్గ్సన్ చెప్పిన అవకాశము, లైబ్నిన్ చెప్పిన ప్రాతిపదిక పదార్థము. అమిశ్రమైన పుద్గలము శుద్ధాత్మభావ వ్యతిరేక వస్తువు. అది కేవల భిన్న రూపమే; అందుచే జైనతర్కము ననుసరించి, యసత్యమైనది.

---

౧. ఆదిలో జైన మతమెంత సామాన్యమైన భౌతికశాస్త్రముగా నుండినను, దరువాతవచ్చిన జైనతత్త్వజ్ఞులు, దానిని సమర్థించ వీలైనపరిణామములతోఁగూడిన తత్త్వముగా వృద్ధిచేయబడెను.

జీవము, రెంటియొక్క మిశ్రమరూపము. అది ఆత్మద్రవ్యము కూడను. ౧. పదార్థముతో నిండిన యాత్మయే బద్ధమైయున్న జీవి. సంసారమునఁ బడియున్న జీవులన్నియు నీవ్యతిరేక పదార్థాంశమునుగలిగి యున్నవి. ఆత్మ లేక శుద్ధచైతన్యము, కేవల జడపదార్థము, నీరెంటి మిశ్రమమైన జీవము నీ మూఁడును మూలపదార్థములని నమ్మెను; మొదటిరెండును దృష్టిగోచరములుకావు. పుద్గల స్కందమునకుఁగూడఁ జేతనాంశ కలదు. కావున, నితరజీవులవలె నదియు నొక జీవమే. జైనుల జీవాజీవములు, ఆత్మయొక్కయుఁ, బదార్థముయొక్కయు వ్యావహారిక రూపములుగావు; రెంటియొక్క సంయోగముచే జనించినవి. పుద్గలమునం దాత్మస్పర్శయున్నది; జీవమందు ద్రవ్యము ప్రవేశించియే యున్నది. జీవాజీవములు, ఆత్మానాత్మలని చెప్పుటకు పదముల నపార్థములో నుపయోగించిన విభ్రాంతియే కారణము. నిజమున కాత్మానాత్మలు మూలరూపములు; అవి పరస్పరసంబంధ సామరస్యము లేనివి. జీవములో ననాత్మ యధికముగా నున్నది; ఆజీవములో ననాత్మ యధికముగానున్నది. పూర్ణసత్పదార్థములో నీరెండును రెండుక్రమములుగల రూపములు.

బాహ్యదృష్టికిఁ బ్రపంచము జీవసముదాయము; ప్రతి జీవియు రూపముగల వ్యక్తియు, సముచ్చయరూపమునైయున్నది; అనేకములో నేకము నొకటిలో ననేకము నైనది. రెంటిసంబంధ మనాదియైనది. సంసారజగమున నీరెండు విడిగా

౧. చూడు అవుట్లైన్సు ఆఫ్ జైనిజము పుట ౨౨.

నుండవు. తమ కంటిపట్టుకొనియున్న పదార్థవిదళనమే సర్వజీవులకుఁ బరమలక్ష్యము. చైతన్యముగల కేంద్రములన్నియు జీవములే. ప్రపంచమునం దాత్మయుఁ, బదార్థమును, ద్రష్టయు దృశ్యము, నెల్లప్పుడు కలిసియేయుండునని చెప్పఁబడెను. మానవానుభవమంతయు నీరెంటిలో నొకదానినొకటి లోఁబఱచుకొనవలెనని చేయుచున్న పోరాటముతో నిండియున్నది. జీవునందుఁగల ఆత్మాంశ కూర్ధ్వగతియుఁ, బదార్థాంశ కధోగతియు సహజములని చెప్పుట విచిత్రమైన భావము. మనుష్యదేహములోనున్న జీవి, పదార్థభావ మధికమగుటచే నీ భూలోకజన్మము నే పొందుచుండును.

అనాత్మపదార్థ మాత్మపదార్థముపైఁ బొందు నధికార తారతమ్యముల ననుసరించి,జీవతారతమ్యము లేర్పడినవి. అత్యుత్తమములైన దైవదశలలో, దేవతలనుండి, సిద్ధాత్ములవఱకును గలవారిలో ననాత్మపై నాత్మపొందిన అధిరకారశక్తి యధికతరమై యుండుటయు, ననాత్మప్రభావ మధమస్థితిలోనుండుటయు గుర్తింపఁదగినవి. అత్యంతాధమ దశలలో ననాత్మప్రభావమత్యధికమై యుండుటచే వస్తుసంబంధములు కేవల బాహ్యములైయుండును. జడపదార్థదశనుండి వృక్షపశ్వాదులవఱ కున్నతిచెందిన దశలో నాత్మశక్తి యధికముగాను, అనాత్మశక్తి యల్పముగాను బ్రదర్శితగుచుండును. ఈజీవులకొక యేకత్వము, నసాంకర్యస్థితియుండుటచే వ్యక్తిత్వములను గలిగియున్నవి. గతమును వర్తమానవర్తనములోఁ గలుపుకొని జీవులు వర్తించును. దేవతాస్థితి మనకు లభించునపుడు మనలో ననాత్మశక్తి యత్యల్పమైపో

వును. జీవితానందము దేవతాసదృశౌన్నత్యము గలిగియుండును. లోహములకు దేవతలకు మధ్యమందుండు జీవదశలన్నిటిలో నాత్మానాత్మసంఘర్షణముతప్పదు. శుద్ధాత్మయందును, శుద్ధ పదార్థమందును, ఆత్మయు ననాత్మయు నిస్సంకరముగ నుండును. మనవ్యవహారములో నట్టి దదృశ్యము. ఈపద్ధతి ననుసరించి జీవానేకత్వము, తత్త్వము నిర్ణయింపఁగలపరమసత్యమని యంగీకరింపఁగలమా? జీవులలో రెండువేఱైన లక్షణములు పనిచేయుచున్నవని చెప్పఁబడెను. మనము చూచుచున్న జగము ఆత్మానాత్మలయొక్కయు, సదసత్తులయొక్కయు ద్వయము, సత్, సత్యమైనది; అదియే యాత్మ; సర్వజ్ఞత్వము గలది; ఈ సర్వజ్ఞత్వమును మఱుఁగుపఱచి జీవునిబద్ధునిగాఁ జేయుచున్న దే అసత్తు. స్వస్వభావముచే, ననంతజ్ఞానప్రసారముచే నాత్మలోకమంతయు వ్యాపించియున్నది. కాని, జీవియొక దేశమున కేబద్ధుఁడై, లోకమొక కేంద్రమునఁ బ్రతిఫలించునట్లందుఁ బ్రతిబింబించుచున్నది. ప్రత్యేకవ్యక్తిత్వమున కాధారభూతమైనదసత్తు. మమకారకాంక్షలు గలయొక ప్రత్యేకవ్యక్తినని జీవి తలపోయునట్లు చేయునొక ఆనాత్మశక్తి, జ్ఞానసమృద్ధమైన ఆత్మయొక్క బాహ్యరూపము, మానసిక ప్రపంచమునందొకస్థితి, అసదూప్రపములు. శరీరము జీవియొక్క అసంపూర్ణతను నిర్ణయించి ఆత్మనొకదృక్పథములో నుంచును. వివిధజీవులైనలోహ, వృక్ష, పశు, మనుజ, దేవతలలో భేదములు వానివాని శరీరభేదముల చేతనే కలిగినవి. అనగా నీశరీరములలోని యాత్మయొక శేవ్యైవము, వ్యతిరేకరూపమైన పదార్థము భిన్నవ్యక్తిత్వభ్రాంతినిఁ

గలుగఁజేయుచున్నది. "జీవునియొక్క ప్రత్యేకత్వము, వ్యక్తిత్వము మనవ్యవహారదృష్టిమాత్ర స్థితి గలవి. నిజమునకు సర్వజీవరూప మేకైక చైతన్యమే"౧. వ్యావహారికానుభవములో మన మింద్రియదర్శనమునకు జ్ఞానమునకు, ప్రాముఖ్యమిచ్చుటచే, ఏకమైన సత్పదార్థమనేకత్వముగా గోచరించి యదియే సత్యమనిభ్రాంతిని జనింపఁజేయును. జైనజ్ఞానసిద్ధాంతమునందు మనము వ్యవహారజీవ దశాతీతమైన తార్కికదృష్టి యొసఁగు ద్రష్టస్థితికిఁ బోవలెను. ద్రష్ట అవిచ్ఛిన్నమైనస్థితిగలది; విశ్వమంతయు దానికొఱకేయున్నది. ౧; అట్టి ద్రష్టనే మనము మన సమాలోచనముచే నొకమానసిక జీవిగాఁదలఁచి, దానికొక దేహము, దేశము, కాలమును గల్పించి, మనవ్యవహారజ్ఞానము ననుసరించి, యదివేఱైన ప్రత్యేకజీవియనియు, నట్టివనేకములనియుఁ దలఁచుచున్నాము. దీనినే సుప్రసిద్ధములైన శంకరునిమాటలలోఁ జెప్పఁగొన్నచో, జీవానేకత్వమెంతవఱకు సత్యముగా గోచరించుననఁగా, మనము ద్రష్టనొక దృశ్యముగాఁజేసి దాని లక్షణములను మనము వితర్కించుటకు వీలగునని తలఁచినంత సేపు నని చెప్పవచ్చును. సక్రమజ్ఞానమార్గము ననుసరించి, ద్రష్టకు మనవ్యవహారానుభవములోని భావములు, నూహలచేఁ గల్పించిన దేహాదిరూపములను దొలఁగించి, దృశ్యముతోడి సర్వసంబంధమును నిర్మూలించి, చూచినచో నిజముగా నొకేద్రష్ట యుండెనని తెలియఁగలదు. ఇట్టి భావశిఖరమున కధిరోహింప జైనమత మిచ్చగింపలేదు; ఇట్టి యాదర్శమువంక నదిచూడ

౧. ద్రవ్యసంగ్రహము ౩.౭.౮.

లేదు. ఈమహోన్నతభావతత్త్వము సామాన్యదృష్టికి లభించుట కష్టమైనమాట నిజమని చెప్పవచ్చును. మానవవిజ్ఞానమున వ్యావహారిక పారమార్థికసత్యముల మధ్యమందొక యడ్డుగోడ నిలిచియున్నది. మనసహజాల్పత్వముచే సత్యము నెఱుగుటకై ప్రత్యేకవిషయముల పరిశీలనముతో బయలుదేఱి. వానియందలి మమకార పాశములనుండి విడివడఁజాలని వారమగుచున్నాము.

జైనమతమైనను బూర్ణసత్పదార్థమొకటియను సిద్ధాంతమునుగూర్చి యాలోచించి దానికి వ్యతిరేకముగా వాదించెను. "అందఱకు నొకటేయాత్మ యుండుటయే సత్యమైనచో నొకరికొకరినుండి భేదము తెలియకుండఁ బోవలసివచ్చుటేకాక భిన్నానుభవములను గలిగియుండుట కవకాశమే లేకుండును. బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్య శూద్ర భేదముకాని, క్రిములకుఁ బక్షులకు సర్పములకు భేదముకాని లేకుండెడిది; అందఱును మానవులు, దేవతలునునై యుందురు; లోకములో దురాత్మష్ఠులు, సదాచారపరులు నొక్కటే యగుదురు." ౧. మానసిక దశలోఁగాని, వ్యవహారరంగమునఁగాని యనేకత్వమును దిరస్కరింప నవసరము లేదు; వ్యవహారప్రపంచముననే కర్మఫలానుభవము సంభవించును. మనస్సు దేహాద్యుపాధి బద్ధమైయు

౧. పోలుప్ బొశాంకే: "జ్ఞానవ్యాపారములలో నాత్మ సర్వవ్యాపి యని నిస్సంశయముగా నంగీకరింపఁబడెను. ఆత్మ తన వ్రవహారపరిమితిని దాటి లోకమంతయును వ్యాపించి, యితరాత్మానుభవములను గ్రహించి, తనప్రత్యేకతను, పరిమితవ్యక్తిత్వమును విసర్జించును."

(గిఫర్డులెక్చర్సు; సెకండుసీరస్. అధ్యాయము ౨.)

౧. సూత్రకృతాంగము. ౨ అ. ౭. శ్లో. ౫౧. చూడు. ౧౮. ౧.౧.

న్నప్పుడు జీవానేకత్వవాదమున కర్థమున్నది. కాని మా ప్రశ్న యే మనగా, నీ యుపాధిబద్ధమైన యల్పజీవియే పరమసత్యస్వరూపమా యని? జీవియొక్క పరిమితత్వమే శాశ్వతసత్యమై, నిర్మూలింపరానిదైనచో, నప్పుడు జీవ నానాత్వము సత్యమే, కాని, జైనులు బాహ్యబంధనములు జీవముయొక్క మూలతత్త్వమున లేని కారణమునఁ దాత్కాలికము లనియు, సిద్ధాత్మని యందవి పూర్ణముగా నశించుననియు నంగీకరింతురు. అట్టి సందర్భములోఁ దాత్కాలిక జీవానేకత్వము సత్యమనుట హేతువిరుద్ధము. తత్త్వవిచారణమున సందతేకగ్రీవముగా నంగీకరించిన ప్రమాణమేమనగా, మొదటఁ జివర నేది లేదో యది వర్తమానము నందుటయు నబద్ధమనునది. ౨. అనేకత్వము తాత్కాలిమును, వ్యావహారికస్థితిగలదే కాని, పరమ సత్యము కాదు.

ఇంద్రియాతీతమైన సిద్ధావస్థయందు భేదమున్నదో లేదో తెలియుటకు మనకవకాశము లేని కారణమున, వ్యవహారజగమున మనకు గోచరించు జీవానేకత్వ సిద్ధాంతమును సమర్థించుటకు మేము సుముఖులముగాము. ప్రత్యేకవ్యక్తిత్వము గలిగి, దేహాద్యుపాధులచేతను, ప్రకృతిగుణములచేతను బద్ధమైయున్న జీవమునకు మోక్షావకాశముండుట సమర్థింపఁదగిన విషయముగాదు. జీవ ప్రత్యేకవ్యక్తిత్వము పాపమునకు దోషమునకు దారిచూపును; ఈప్రత్యేకత్వము నశించుటే మోక్షము.

౨. ఆదా అంతేచ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా.

తాత్త్వికముగా లోకమునఁ బ్రవర్తించుచున్న రెండు శక్తులయొక్క సంబంధస్వభావముపైఁ దాత్త్వికముగా నద్వైతమో ద్వైతమో యాధారపడియుండును. జైనులు పదార్థముల కారణనిర్ణయమునకు యత్నింపరు. ప్రమాణనిర్ణయముకాని వాని పరమ సత్యలక్షణములను ఋజువుచేయుటకుఁగాని వారుపూనుకొనలేదు. తనవిలాసము ననుసరించి ప్రవర్తించు విశృంఖలనేతగా లోకాతీతుఁడైన దేవుఁడొకఁడున్నాఁడని జైనులంగీకరింపరు. ప్రకృతి, ఆత్మ, దేవుఁడు నొకేవస్తువుయొక్క భిన్నరూపములని జైనుల యభిప్రాయముగాఁ జెప్పుకొన్నచో వారిసిద్ధాంతము నపార్థముచేసిన వారముకాము. పరిపూర్ణసిద్ధి పొందిన యాత్మగాక వేఱుదేవుఁడు లేఁడు, ఇంకొక విధముగా దేవుఁడున్నాఁడని యూహించుటాతని నొక పరిమితవ్యక్తి నొనర్చుటే యగును. మానవునిమానస మితరులనుండి తన్ను వేఱుగాఁ జూచుకొని, పరిమితమైనదగును! పరిమితులులేని మానసమొకదానిని మనముచేకూర్చుకొనఁ గలిగినచోఁ, దనస్వరూపమును సమగ్రముగాఁ దానే దర్శింపఁగల మానస మదియైనప్పుడు, మానవానుభవములోని లోపములన్నియు నప్పుడు తొలఁగిపోవును. బాహ్యజ్ఞానము మానవుని యనుభవము లోపలనే యున్నది. పరిమితాకృతులకతీతమైన స్థితికిఁబొమ్మని చెప్పునదే యాశక్తి. సర్వమానసములకు నేకత్వమును ఘటించు జ్ఞానము మనల నతిమితములైన పరిస్థితులలో నున్న జీవమునకతీతమైన స్థితికిఁ దోడ్కొని పోఁగలదు. దేశకాలముల చేసంకుచితమైన మానసము నుండి, దేశకాలములకుఁగారణ భూతమైన యున్నత

మానసము నొద్దకు మనము గమనింతుము, నిత్యత్వము సాంతి పదార్థమున గర్భీభూతమై యున్నది. అందుచేతనే, పరిమితజీవి అపరిమితత్వము నందుకొనుటకు నిత్యము పోరాటము సలుపుచు నట్టిస్థితి నెప్పుడందుకొనునో యప్పు డాపోరాటముచు ముగించును. అట్టియాత్మశక్తికి వేరై యేజీవములు నుండుట కవకాశము లేదు.

మన యనుభవములోనున్న వ్యవహారప్రపంచమున నిత్యము పరస్పరసంఘర్షణము కలిగియున్న పదార్థద్వయమునకుఁ గల సంబంధ మెట్టిది? అవి యొకేపూర్ణత్వములోని భేదములా? అవి పరస్పరమైత్రిగలిగి, పూర్ణత్వముయొక్క యభ్యుదయమునకే కృషిచేయుచున్నట్లు తోఁచుచున్నవి. బాహ్యదృష్టి కవి వైరుధ్యముకలవానివలె గోచరించుచున్నను, నిజముగా నవి స్వచ్ఛమైన యొకపూర్ణైకత్వమునందలి యంశములుగా సమన్వయమును జూపుచున్నవి. ఇట్టిసత్యముల నుద్ఘాటించుటచే జైనతత్త్వ మొకే ముహూర్తములో సత్యము నానాత్వము కలదనియు నేకత్వము గలదనియుఁగూడఁ జెప్పుచున్నది. అట్టిదృష్టికిఁ గేవలాత్మగాని, కేవలపదార్థముగాని లేదు. ఈరెండును మనకు కల్పిత తర్క రూపములే. సత్యమేకమైన యొకపూర్ణత్వము: శుద్ధాత్మయు, శుద్ధపదార్థము దానినిగూర్చిన భావకల్పనములు, అవి సత్పదార్థముయొక్క ద్వివిధరూపములు, వ్యావహారికముగా వ్యతిరేకములు. నిజముగా విడఁదీయరాని పూర్ణత్వాంశములు, సర్వస్వరూపమైన యేకాత్మశక్తి, లోకమున భిన్నరూపముల గోచరించుచున్నది. ద్వంద్వములయొక్క పోరా

టము భిన్నదశలలోఁ బ్రవర్తించుచుఁ, బూర్ణత్వదర్శనముతో నది యదృశ్యమై పోవుచున్నది. జైనతర్కము, మనోవ్యాపారమునే పరమప్రమాణముగా నంగీకరించినచో నట్టిమనస్సునకు దృశ్యమైన జగత్స్వరూపమే పరమసత్యమని నిర్ణయించిన యెడల నప్పుడు సగుణబ్రహ్మైకతత్త్వము దానిఫలితముగాలభించును. ఒకశుద్ధచైతన్యము, పూర్ణత్వము. తనకు వ్యతిరేక మేమియును లేని నిష్క్రియాత్మకమైన శక్తిస్వరూపము. స్థాణురూపమైన యీశ్వరత్వము శూన్యత్వతుల్యమైనదే. తద్విరుద్ధముగా. జైనమతమాత్మ తనపదార్థబంధముల నన్నిటిని దెగద్రెంపుకొని పూర్ణస్వాతంత్ర్యముతో నూర్ధ్వగమనము చేయుశక్తి కలిగి. యున్నదని చెప్పుచున్నది. సిద్ధాత్ముల పూర్ణావస్థ తర్కబుద్ధికగోచరమని కుమారిలుఁడు ఖండించియున్నాఁడు. "పూర్ణజ్ఞానమూర్తి మనయింద్రియదృష్టి కిచటఁ గనిపింపఁడు. ఆతని సత్యస్వరూప మనుమానముచేనైనఁ దెలియశక్యముగానిది." ౧. జైనులు 'ఆత్మ' యొక్క సహజపూర్ణత్వము నంగీకరించి, ఆవరోధములను దొలఁగించినచో నది దర్శింపఁబడునని చెప్పిరి. ఆత్మకు స్వతస్సిద్ధమైన సర్వమును గ్రహింపఁగలశక్తి యున్నదనియు, నట్టి శక్తి నావిష్కరించుసాధనోపాయములున్నవనియుఁ గుమారిలుఁడు నంగీకరించును. జైనమతమందలి యీభావమును మన ముద్ఘాటించి, మఱియు "కేవలి"యొక్క అతీంద్రియజ్ఞానమున్నదను మాటమఱవక, యట్టి జ్ఞానము మానసికజ్ఞానమున కతీతమైనదని యెఱిఁగినచో, నప్పుడు పూర్ణమై,అప

౧. సర్వదర్శన సంగ్రహము. పుటలు, ౪౧-౪౧.

మేయమైన 'అద్వైతతత్త్వము' మనకు లభించుటయే కాక, సత్త్వమునకు శూన్యమునకును మధ్యేమార్గమున సంచారము చేయుచున్న తాత్కాలిక వస్తుపరిదర్శనమంతయు నసత్యమని భావింపవలసివచ్చును. ఆత్మయొక్క పరమసత్యస్వరూపస్థితిని మనము విడిచిపెట్టినయెడల, నప్పుడు ప్రపంచమే సత్యమని చెప్పకొనవచ్చును. లేదా, ఆత్మస్వస్వరూపమును మనము గుర్తింతుమా ఆప్పు డనాత్మరూపమైన దంతయుఁ బూర్ణసత్యముగాదనియు, నది సత్స్వరూపముయొక్క ఛాయామాత్రమే యనియు నది జ్ఞానదృష్టితోఁజూచి తెలిసికొనఁదగినదనియు మనకు బోధపడును. అప్పుడు ప్రపంచ మనాత్మశక్తిచే దృశ్యమానమగుచున్న తాత్కాలిక స్వరూపమని తెలియును. ఈపద్ధతిలో శంకరుఁడు చెప్పిన స్వచ్ఛాద్వైతము మనకు సిద్ధించును. తత్త్వయానమున మధ్యేమార్గమున నాగిపోవుటవలననే జైనుల జీవనానాత్వసత్యసిద్ధాంతమున కవకాశము కలిగినదని మాత్రము చెప్పవచ్చును.

## పరిశీలిత గ్రంథములు


౧. యస్. బి. ఇ. వాల్యుములు ౨౨; ४४.

౨. జాకోబి:—ఇ. ఆర్. ఇ. వాల్యుము ౭ నందు జైనమతమును గూర్చియు, జైనుల అనువాదమునుగూర్చియు రచించినవ్యాసములు.

3. ఉమాస్వాతి:—తత్త్వార్థసూత్రములు. (జైనుల పవిత్రగ్రంథములు.)

४. నేమిచంద్రుడు:—ద్రవ్యసంగ్రహము. (జైనులపవిత్రగ్రంథములు)

౫. కుందకుందాచార్యుడు. పంచాస్తికాయ సమయసారము :
(జైనుల పవిత్రగ్రంథములు)

౬. జైని:—ఔట్లైన్సు ఆఫ్ జైనిజమ్.

౭. స్టివెన్సన్ సతి:—ది హార్టు ఆఫ్ జైనిజమ్.

౮. బరోడియా:—జైనసారస్వత చరిత్ర.

౯. యస్. డి. యన్. యము 3.

# భారతీయ తత్త్వశాస్త్రము

## సప్తమాధ్యాయము

### ప్రాచీనబౌద్ధమత ధర్మతత్త్వము.

#### ౧-ప్రాచీన బౌద్ధమతము.

తత్త్వచరిత్రయందు, ప్రాచీనబౌద్ధమతము ప్రదర్శించిన తత్త్వము పూర్ణస్వతంత్రములైన తత్త్వములలో నొకటైయున్న దని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. మూలభావములందుఁ, బ్రధానదృష్టియందు నీబౌద్ధతత్త్వము పందొమ్మిదవ శతాబ్దమం దుచ్ఛదశనందిన ప్రకృతిశాస్త్రీయ విజ్ఞానముతోఁ జెప్పఁ దగిన సామ్యములను గలిగియున్నది. జర్మనీలోని సోపెన్హోయల్, హార్ట్మనుల అభినవనిరాశావాదము (Pessimism) ప్రాచీన బౌద్ధమతముయొక్క సంస్కరింపఁబడిన నూత్నరూపమే. కొన్నిసమయములందు, జర్మనుల నిరాశాతత్త్వము, "కలుషితమైనబౌద్ధమతమే' యని చెప్పఁబడెను. సత్పదార్థముయొక్క అనవరత క్రియాశీలసిద్ధాంతమును దీసికొన్నచో బెర్గ్సన్ తత్త్వజ్ఞుని 'సృజనాత్మక పరిణామతత్త్వము' (Creative Evolutionism) యొక్క ఉదయమున కత్యద్భుతమైన యరుణోదయమని చెప్పవలెను. నేటికాలమునఁ గర్మరంగమునఁ గల యువ

సరములకు సముచితమును, విశ్వాసమునకు శాస్త్రమునకుఁగల పరస్పరవైరుధ్యములఁ దొలగింపసమర్థమును నైన తత్త్వశాస్త్రమును పురాతన బౌద్ధమతము మనకిచ్చియున్నది. అనంతరకాలమున భిన్నదశలలో బౌద్ధమతము పెంపొందిన భిన్నరూపములను, బౌద్ధమతస్థాపకాచార్యుఁడైన బుద్ధునిగూర్చి బయలుదేరిన వృక్కటపురాణములను గాథలను విడిచిపెట్టి, ప్రాచీనబౌద్ధతత్త్వప్రధానసూత్రములనే మనము పరికించినచోఁ బైని మనము చెప్పినభావము స్పష్టమగును.

## ౨. బౌద్ధ విజ్ఞానవికాసము.

భరతభూమియందే బౌద్ధమతమునకు సహస్రాబ్దపరిణామముగలదు. రైస్ డేవిడ్సు చెప్పినట్లు, "బౌద్ధమతమునకుఁ జెందిన ప్రతిగ్రంథమునందును. శతాబ్దములు గడచినకొలఁదియు, బౌద్ధతత్త్వము కొలఁది భేదముల నెల్లప్పుడును బొందుచునేయున్నది."[1] బుద్ధనిర్యాణానంతరము రెండవశతాబ్దము నాఁటికే పందొమ్మిదిరకముల బౌద్ధసిద్ధాంతములు లభించినవి. ౧. భావముల సీమలో, జీవితమనఁగాఁ బరివర్తనము. వికాసమంతయు నీ యొక్క శకమునకే చెందినదని వక్కాణించుట సాధ్యముకాదు. ప్రాచీనబౌద్ధము, హీనయాన మహాయానములు నీయుగమునకుఁ జెందినవైనను, బౌద్ధచతుశ్శాఖలు మనలను యుగాంతరమునకుఁ దోడ్కొనిపోవును. ఈయుగమునాఁటి బౌద్ధమునుగూర్చి మేము రచించునప్పుడు వివిధశాఖలను గూర్చియు స్మరింతుము; ఏలన నీయుగాంతమునాఁటికీశాఖలును బూర్ణపరిణతినందినవి.

---

౧. రైస్‌డేవిడ్సు. జె.ఆర్.ఏ.యస్. ౧౮౯౧ 'బౌద్ధమతశాఖలు'

## 3—సారస్వతము.

ప్రాచీనబౌద్ధమతాంశములకు మనము పీటకములపై నాధారపడవలసియున్నది. పీటకములలోని భావములు పూర్తిగా బుద్ధుఁడుపదేశించినవైనను గాకున్నను, మనకు లభించిన సారస్వతములో నవియే బుద్ధోపదేశమున కత్యంత సన్నిహితములు. భారతీయ ప్రాచీనబౌద్ధులు తమ మూలాచార్యుని యుపదేశములు, చేఁతలు నందు రచింపఁబడినవని నమ్ముదురు. పీటకముల సంకలనము, రచనము జరిగిన నాఁటికి వ్యవహారము నందున్న బుద్ధోపదేశములు, బుద్ధునిఁగూర్చిన విశ్వాసములు నందుఁ గలవు. మూఁడవ బౌద్ధసంఘ మహాసభ జరిగిన క్రీ.పూ. ౨౪౧.సంవత్సరము నాఁటికీగ్రంథ సంకలనము పూర్తియై యుండవచ్చును. ప్రస్తుతము మనకు లభించిన బుద్ధోపదేశములలో నివియే నిస్సంశయముగా నత్యంతప్రాచీన ప్రమాణగ్రంథములు.

అనంతరబౌద్ధసంప్రదాయముల ననుసరించి, గౌతముని నిర్వాణానంతరము కొలఁదికాలమునకే, అనఁగా 'జ్ఞానదీప మనిత్యత్వమను మారుతాఘాతముచే నారిపోయినపుడు', బుద్ధునియుపదేశ సిద్ధాంతములనుగూర్చి, అనుచరులలో భిన్నభావము లేర్పడినవి. ఇట్టి భిన్నవాదములను సమన్వయమొనర్చుటకై, మగధకు సమీపముననున్న రాజగృహమందొక మహాసభ జరిగినది. అనుచరవర్గమంతయు సభలో నాసీనమైయుండఁగా నందఱిలో నుత్తమపండితుఁడగు కాశ్యపుని, అభిధమ్మపీటకములోని తత్త్వభావము చదువుమని కోరిరి. నాఁటికిని బుద్ధుని శిష్యులలో నగ్రగణ్యుఁడు సజీవుఁడునైన "ఉపాలి"ని

వినయపీఠకములోఁగల శిక్షాసూత్రములను శాసనములను జదువుమనిరి. బుద్ధుఁడు తన ప్రచారనిమిత్తము సంచారముచేసిన దినములలోఁ జెప్పినకథలు, నుపాఖ్యానములు గల సుత్తాపీఠకమును జదువుమని, బుద్ధుని ప్రియశిష్యుఁడైన ఆనందుని జదువుమని కోరిరి. చిరకాలమువఱకు బుద్ధుని యుపదేశము గురుశిష్యపారంపర్యముగా వచ్చినది; సిలోనులోని వట్టగామణి రాజ్యకాలమున క్రీ.పూ.౮౦-వ సంవత్సరము నాఁటికే అవి రచింపఁబడెను. "త్రిపీఠకమూలగ్రంథము, దానిపై భాష్యము, పూర్వము జ్ఞానశేఖరులగు బౌద్ధభిక్షువులు జిహ్వామూలముననే అందఁజేయుచువచ్చిరి; కాని తరువాతఁ బ్రజలు పరిశుద్ధమతమునుండి పతితులగుచున్నారని తెలిసి, బుద్ధుని పరిశుద్ధోపదేశములు నిలిచి యుండవలెనను నుద్దేశముతో భిక్షువులుగలిసి గ్రంథరూపమున లిఖించిరి" ౧. పాళీభాషలో

౧. మహావంశము అ. 33.

౧. (439) పంచవిభాగములు నిట్లున్నది :—

(అ) దీఘనికాయము. 3౪ సుత్తములు గల దీర్ఘోపన్యాసములు. ఒక్కొక్క సూత్రి మొక్కొక్క సిద్ధాంతమును దెల్పును. మొదటిది బ్రహ్మజాలసుత్తము, రెండవది సామఞ్ఞఫలసుత్తము (తపస్సుఫలితములు చెప్పును.) అంబట్ఠసుత్తము వర్ణవిభాగమును గూర్చి బుద్ధుని భావమును దెల్పును. కూటదంతసుత్తము బ్రాహ్మణ బౌద్ధమతముల భేదములను దెల్పును. తేవిజ్జసుత్తము నట్టిదే. మహానిదానసుత్తము కారణధర్మమును నిర్వచించును. బౌద్ధగృహస్థుల ధర్మములను దెల్పునది సిగాలోవాదసుత్తము. బుద్ధునియవసానదశా విశేషములను మహాపరినిబ్బాణసుత్తము వచించును.

(ఆ) మజ్ఝిమనికాయము. మధ్యమపరిమాణముగల ౧౫౨ ప్రసంగములు, నుపన్యాసములు, బౌద్ధమత విషయములన్నిటిని గూర్చియుఁ దెల్పును.

ప్రమాణగ్రంథములు మూడు వర్గములుగా నున్నవి. (౧) సుత్తా లేక కథలు (౨) వినయములు లేక శిక్షణములు (౩) అభిధమ్మ లేక సిద్ధాంతములు. మొదటిసుత్తాపిటక మైదుభాగములుగా నికాయములని చెప్పుదురు. మొదటినాలుగు ప్రధానముగా బుద్ధుఁడు చెప్పిన ఉపన్యాసములు, లేక ప్రసంగములు, లేక సంభాషణములు. అవి ప్రకటించుసిద్ధాంతములలో భేదములు లేవు. ౧ఈసుత్తాపిటకమునంతనుగూర్చి రైస్ డేవిడ్సు యిట్లు వ్రాసినాఁడు. "సూక్ష్మమైన తాత్త్వికదృష్టియందు, సోక్రటీసు చేసినట్టి సంభాషణవిధానమునందు, దీక్షతోఁగూడిన సమున్నతభావమునందు, నాటిమహోన్నత విజ్ఞానప్రదర్శనసాక్ష్యము

(ఇ) సంయుత్తనికాయము. సంయుక్తోపదేశములు. సుప్రసిద్ధమైన ధమ్మచక్క పవత్తనసుత్తమిందున్నది. దీనినే వారణాసి సూత్రమందురు. ఇది వినయపిటకమునందును గలదు.

(ఈ) అంగుత్తరనికాయము. ౧౧ ఆశ్వాసములలో ౨౩౦౦ సూత్రములు.

(ఉ) ఖుద్దకనికాయము. లఘూపదేశసంపుటి. ౧౫ భాగములు గలది.

(౧) ఖుద్దకపాఠము (౨) ధమ్మపదము (౩) ఉదానము (౪ ఇతివుత్తకము (౫) సుత్తనిపాతము (౬) విమానవత్థు (౭) పేటవత్థు (౮) థేరగాథ (౯) థేరీగాథ (౧౦) జాతకము (౧౧) నిద్దేశము (౧౨) పటిసంభిదామగ్గము (౧౩) అపదానము (౧౪) బుద్ధవంశము (౧౫) చరియాపిటకము థేరగాథ, థేరీగాథలు కవితామాధుర్యము, నభిరుచిజనింపఁజేయునది. గౌతముని కాలములో నర్హత పదవినందిన సిద్ధులు తాముపొందిన యానందమునుగూర్చి పాడినగీతములుగలవు బుద్ధుని పూర్వజన్మములు గాథలే జాతకములు. ధమ్మపదము (యస్. బి. ఇ. వాల్యూము ౧౦) బౌద్ధమతప్రధానసిద్ధాంతములను గలిగియున్నది. త్రిపిటక విషయములను పఠించుట కోరిక శ్రద్ధయులేనివారు ధమ్మపదమును మాత్రమే చదివి తృప్తిపొందుదురు.

నిచ్చు లక్షణమునందు, నీయుపదేశములు ప్లేటోతత్త్వవేత్త సంభాషణగ్రంథముల నెల్లప్పుడు జ్ఞాపకముచేయుచుండును... ఈగ్రంథము లాంగ్లములోని కనువాదమై బోధపడినవెనుక, మనచరిత్ర; తత్త్వశాస్త్రపాఠశాలలో గౌతమబుద్ధుని సంభాషణములు ప్లేటోసంభాషణముల కిచ్చినసమానస్థానమును బొందఁగలవని నిరాఘాటముగాఁ జెప్పవచ్చును." మతసంస్థావిషయములనుగూర్చియు నందలి సన్న్యాసివర్గమునకు వలయు శిక్షణాసూత్రములనుగూర్చియుఁ జెప్పు వినయపీఠకము మూఁడుముఖ్యభాగములైనది. అందు రెంటికిఁ బునర్విభాగము జరిగినది. (౧) సుత్తవిభంగము (అ) పారాజికము (ఆ) పాచిత్తీయమునని రెండుగా విభజింపఁబడెను. (౨) ఖండకము (అ) మహావగ్గము (ఆ) బుల్లవగ్గమునని రెండయ్యెను. (౩) పరివారము. మూఁడవది అభిదమ్మపీఠకము: నీతిధర్మములను, సమయోచితముగా తత్త్వవిషయములనుగూర్చి చెప్పును. ఇది యేడుభాగములైనది. (౧) ధమ్మసంగణి, క్రీ.పూ. నాల్గవశతాబ్దమునందు మొదటియర్ధమునకో, మధ్యభాగమునకో చెందినదని చెప్పుదురు. (౨) విభంగము (౩) కథావత్తు (౪) పుగ్గలపణ్ణత్తి (౫) ధాతు (౬) యమకము (౭) పట్ఠానము. ఇది పాళీభాషలోని ధర్మగ్రంథవిధానము. ఇందలి సిద్ధాంతములను థేరవాదములందురు. కారణము మొదటిబౌద్ధసభలో థేరులు లేక పెద్దలచే నివి సంకలనము చేయఁబడినవి.[౩]

౧. (చూడు పుట 488) (౨) అభిదమ్మనగా సిద్ధాంతము.

౩. చూడు. ఓల్డెన్ బెర్గు. దీపవంశము. పుట 32.

మిళింద పన్హా అనగా మిళిందరాజు ప్రశ్నములు ౪ సయాము దేశమునందువలె నీ పాళీ ధర్మగ్రంథములఁ జేర్పఁబడెను. ఒక బౌద్ధదేశికుఁడు, నిశిత తార్కికుఁడునైన నాగసేనుఁడకును, నించుమించుగా క్రీ. పూ. ౧౬౫– ౧౩౦ సంవత్సరములలోఁ సింధుతీరము నేలిన, గ్రీకురాజగు మిలానందరునకును జరిగిన సంభాషణము లివి యైయున్నవి. ఇది సిలోను దేశములోఁ బరమ ప్రమాణగ్రంథముగా నుపయోగింపఁబడుచున్నది. క్రీస్తుశకారంభ కాలమున నొకప్పుడిది లిఖితమైనది. ఈ గ్రంథమే బుద్ధోపదేశమునకు సరియైన సంగ్రహరూపమని నిశ్చయింపనక్కఱలేదు. ఈ సంభాషణము బుద్ధనిర్యాణానంతరము 800 సంవత్సరములకు జరిగి, యనంతర కాలమున నెప్పుడో బౌద్ధమతశాఖగాఁ బ్రవర్తిల్లినది. రైస్ డేవిడ్సు ననుసరించి మిలిందరాజ ప్రశ్నములు, "భారతీయ సాహిత్యమున నుత్తమ గద్యరచనమనియు, భాషాసౌష్ఠవము ననుసరించి యే దేశమందైనను నట్టి జాతిగ్రంథములలో నుత్తమమైనదనియుఁ జెప్పవచ్చును." పాలీపిటకముల తరువాత నిదియే పూర్ణప్రమాణ గ్రంథరాజమని బుద్ధఘోషు నభిప్రాయమైయున్నది. ౧. పాలీపిటకముల భావములన్నియు బుద్ధునియుపదేశములతో సరిపడినను, మిళిందరాజ ప్రశ్నములందు బౌద్ధధర్మభావము కొంతవిపర్యాంతరత్వమును బొందినట్లు తోఁచును. నాగసేనుఁడు, బుద్ధుఁడొక నాస్తికతత్త్వము నుపదేశించి

౪. యస్. బి. ఇ. వాల్యూమ్సు. ౩౫, ౩౬.
౧. యస్. బి. ఇ. ౩౫ వా పుట. ౧౬.

నట్లుగా, నాత్మ యీశ్వరుఁడు ముక్తులకు భావిదశయు లేవని వాదించినాఁడు. నాగసేనుఁడు పూర్తిగా నుగ్రహేతువాదియై తార్కికశాస్త్రవిధానము ననుసరించి, సత్యస్వరూపము మఱుఁగున జేరి విశ్వాసపరులచేఁ గల్పితములై యున్న కొన్ని దోషముల నాతఁడు చీల్చి తుత్తునియలొనర్చినాఁడు. సత్యాన్వేషకుఁడైన వాఁ డధమము సత్యవాదియైనఁ గావలయునని తలఁచి, మానవకోటి యనుభవించుచున్న కష్టదుఃఖ సాగరమును తరించుట కంధమత విశ్వాసము నిరర్థకమని నిరసించినాఁడు. మనకుఁగల సాక్ష్యము లసంపూర్ణములగుటచే దైవవాది విషయములనుగూర్చి బుద్ధుఁడు తీర్పులు చెప్పి యుండఁడనియే యూహింపనగును. బుద్ధునిమౌనము నపార్థముచేసి నాగసేనుఁడు పూర్ణనాస్తికతను బట్టినాఁడు. అతని దృష్టిలో నొక యభిప్రాయమునకు సాక్ష్యము చూపట్టకున్నచో నందు విశ్వాసమును, గౌరవమును విడిచిపెట్టుటకది తగినహేతువే. అసంపూర్ణ సాక్ష్యమువలన నొక విషయమును నమ్మకుండుట దోషమే కాక, దండింపఁదగిన యపరాధము. బుద్ధుని దృష్టి నిశ్చయింప సాధ్యము కాని దానినిఁగూర్చి యేనిర్ణయము చేయకుండుటే. అవివేకసాహసముతో ఖండించుట నాగసేనుని తత్త్వము. బుద్ధుని భావములను, నిరంకుశ తర్కవాదముచేఁ బెంపొందించి బోధింప యత్నించిన నాగసేనుఁ డందలి లోపముల నప్రయత్నముగాఁ బ్రదర్శించిన ఫలితమును బొందెను.

బుద్ధఘోషుని విశుద్ధమగ్గము బౌద్ధమతమునఁ జేరిన యొక బ్రాహ్మణునిచే క్రీ. వె. ४०० సంవత్సరమున రచింపఁ

బడిన యనంతరగ్రంథము. ఇది పూర్వ బౌద్ధసిద్ధాంతమును వర్ణించి, హీనయానమందలి అర్హతాదర్శమునుగూర్చి చెప్పును. బుద్ధఘోషుఁడు మొదటి బౌద్ధభాష్యకారుఁడు. ఈతని 'అత్త సాలిని' ధమ్మసంగిణి పై నమూల్యమైన భాష్యము. బుద్ధఘోషునసంతరమున థేరవాదము విశేషముగా వ్యాప్తినొందలేదు. తాత్త్వికముగాఁ గాకున్నను, చారిత్రికముగా సుప్రసిద్ధిగాంచిన యితర పాళీగ్రంథములలో ముఖ్యములైనవి దీపవంశము (క్రీ. వె. ౪ వ. శతాబ్దము) మహావంశము (క్రీ. వె. ౫ వ. శతాబ్దము). ఈ యధ్యాయమున మనము రచింపఁబోవు ప్రాచీన బౌద్ధమత విషయము ముఖ్యముగాఁ బిటకములకు వానిపై సంప్రదాయ భాష్యములకుఁ జెందినదై యుండును. మిళిందరాజ ప్రశ్నముల గ్రంథము కొంతవఱకు నుపయోగింపఁబడునుగాని పూర్ణప్రమాణముగాఁ గాదు. అనంతర గ్రంథ భావముల నుదాహరించినను, పూర్వ బౌద్ధ భావముల కనుగుణములైనవానినే గ్రహించుటలో మెలఁకువ చూపెదము.

౩—బుద్ధుని జీవితవ్యక్తిత్వములు.

ఉపనిషత్తులనుండి పూర్వబౌద్ధమునకుఁ బోవుటయనఁగా అనేకుల మానసికకృషినుండి, యేకైకవ్యక్తియొక్క భావముల కడకుఁ బోవుచుంటిమన్నమాట. ఉపనిషత్తులలో మన మొక వాతావరణమునుగూర్చి యత్యద్భుతమైనజ్ఞానము నభ్యసించితిమి; బౌద్ధమతములో మనము సర్వవిజ్ఞాన మొకవ్యక్తిలో మూర్తీభవించుటఁ జూతుము. జ్ఞానము జీవితము కలిసిన యీ తత్త్వ మానాఁటిప్రపంచముపై నద్భుతప్రభావమును జూపినది.

బుద్ధుని అపూర్వమహత్తరమైన జీవితము, వ్యక్తిత్వము, పూర్వ బౌద్ధవిజయమునకుఁ బ్రధానకారణములైనవి. క్రీస్తునకాఱు శతాబ్దములపూర్వము, భారతవర్షములో, నాధ్యాత్మిక నిస్సంగత్వమునందును, మహోన్నతలక్ష్యమునందును, మహోదార జీవితమునందును, మానవకోటియెడ నఖండప్రేమయందును, తనకుఁ బూర్వాపరచక్రవర్తులలో నెవ్వనికిని దీసిపోవని శీలసంపదగలిగి,జీవించినరాజొకఁ డుండెనని తెలిసినచో నెవ్వఁడైనను ననల్పాశ్చర్యచకితుఁడు గాకుండ నుండఁజాలఁడు. బుద్ధుఁడు, అనగా జ్ఞానసిద్ధుఁడనునామమున మతప్రచారకుఁడైన గౌతముఁడు తినశిష్యులకును దన్మూలమున లోకమునకును సువిదితుఁడైనాఁడు. ౧ ఆతఁడు క్రీ.పూ. ౫౬౭ న జన్మించెను. అతని పేరు సిద్ధార్థుడనఁగా, లక్ష్యమును సాధించినవాఁడు. వంశనామమున గౌతముఁడు; తండ్రి శుద్ధోదనుఁడు, తల్లి మాయాదేవి, శాక్యరాజ్యమున కాతఁ డౌరసుఁడు; గౌతముఁడుపుట్టిన సప్తమదివసముననే తల్లి పరమపదించుటచే నాతనిని, శుద్ధోదనుని రెండవభార్యయగు మహామాయాపతీదేవి, రాజధానీనగరమైన కపిలవస్తునందుఁ బెంచినది. ఆతఁడు సన్నిహితబంధువైన యశోధరను వివాహమాడి, రాహులుఁడను కుమారుని గనెను. కుమారుఁడు తరువాత తండ్రికి శిష్యుఁడయ్యెను. బాల్యదశలోనే లోకముయొక్క తెలియుటకు సాధ్యముకాని, రహస్యము, భారము నాతనిపైఁ దమప్రభావమును జూపినవి. జీవితముయొక్క క్షణభంగురత్వము, అనిత్యత్వము నాతని నధికముగా

౧. బుద్ధపదమున కర్థము జ్ఞానమూర్తియని గౌరవపదము క్రీస్తువంటిదే.

బాధించినవి. అజ్ఞానవశులై, పాపకర్మపరులై, దుఃఖాంధకూపములఁ గుమిలిపోవుచున్న మానవజాతిదుర్దశ నాతఁడు గ్రహించినాఁడు. గౌతముఁడు బాటలోఁజూచిన నాలుగుదృశ్యముల గాథ; నడుమువంగిపోయిన ముదుసలి; జ్వరార్తుఁడైన రోగి; శిరోజములఁ బీకుకొని యేడ్చుచు జనులు మోయుచున్న శవము; బిచ్చమెత్తుకొనుచున్న సాధువు-యీనాలుగు దృశ్యములు నాతనికోమలహృదయమున గ్రుచ్చుకొనిపోయి, లోకము దుఃఖమయమను పాఠము నుపదేశించినవి.౧ అమాయికులైన వారికి ఘోరకఠోరతనుజూపి, ఉత్తమసాధకులైన వారికైనను, విఫలప్రయత్నులనొనర్చునట్టి, సృష్ట్యారంభమునుండి ప్రాణుల హింసించుచున్న జన్మసమస్యాభారమాతని మృదుహృదయముపై హత్తుకొని, మేల్కొల్పుటకుఁ దానుజూచిన దుఃఖమయ ప్రదర్శనములు సరిపోయెను. అతనిలో నేయనుమానమును లేని భావములన్నియు మూలములలోనికిఁ గదలిపోయి, యాతఁడు దిగ్భ్రాంతిజెందెను.

---

౧. దుర్విధిపరిపాకమే 'జాగ్రిశాంఘు'నకుఁగూడ లోకదుఃఖములను గూర్చి విషాదముజనించి, ధ్యానింపఁజేసినది. "మానవజాతి యనుభవించుచున్న దుఃఖము, నిరాశ, దుర్దశ, నన్నుఁగంపింపఁజేసి, నాయాత్మోద్ధరణ కర్తవ్యమును మరపింపఁజేసినవి. లోకములోఁ బోల్చిచూచినచో నాజీవిత మణుమాత్రమని తెలిపి, లోకముతోఁ దాదాత్మ్యముపొంది, దుర్భరమైన మానవకోటియొక్క దుర్దశావస్థయొక్క అనుల్లంఘనీయత నూహించి, స్తబ్ధుఁడనై, వివేకమును గోల్పోయితిని."

డబ్లియు. యస్. లిల్లీ "మెనీమాన్షన్సు"లో నుదాహరించెను. చూడుము మహాదానసుత్తాంతము. రైస్ డేవిడ్స్. బుద్ధ-సంభాషణములు. వా.౨

ఇంద్రియవిషయముల వ్యర్థత్వమును స్పష్టముగా నెఱిఁగి, దేహాభిమానముతోఁగూడిన జీవితముయొక్క నైచ్యమునుండి మానవకోటికిఁ దరణోపాయమునుజూపు కరుణాంతరంగముతో నాతఁడు తనరాజప్రాసాదసుఖమును,పదవిని,భోగభాగ్యములను దృణప్రాయముగా విసర్జించి, నిత్యవస్తుతత్త్వమును దెలియుటకై తపోనిరతుఁడయ్యెను. ఆదినములలో, సత్యాన్వేషణపరాయణు లైనవా రశాంత్యసంతృప్తులకు గుఱియై, నిత్యసంచారముచేయు సన్న్యాసులై యుండెడివారు. జ్ఞానకాంక్షగలవాఁడు, తనయన్వేషణమున కారంభసూచకముగాఁ బ్రపంచభోగభాగ్యములను మొదట విడిచిపెట్టవలెను.పురాతన సంప్రదాయాభ్యాసము ననుసరించి, గౌతముఁడు నిజగృహమునువిడిచి, సన్న్యాసిజీవితమును స్వీకరించెను. తనరాజపదవి నవలఁద్రోసి, కాషాయవస్త్రమును ధరించి,శాంతిసౌఖ్యములకై యెదురుచూచుచున్న ప్రపంచములో వీధులవెంబడి నుదరపోషణమునకై బిచ్చమెత్తుచుఁ దిరుగాడెను. బుద్ధుఁ డిట్టిసంసారత్యాగము నిరువదితొమ్మిదవయేటఁ జేసెను. కొంతకాల మేకాంతవాసమున, నతివిచిత్రములైన భావప్రపంచముల విశృంఖలవిహార మొనర్చి, కొన్నిస్వయముగాఁ గల్పించుకొనిన తత్త్వనిర్ణయములచే నాత్మశాంతి బొందయత్నించెను; కాని యెట్టిశాంతియు లభింపలేదు. నిశితతరోహాపతర్కములు చిత్తశాంతినొసఁగఁజాలవు. శరీరమును గృశింపఁజేయు నుగ్రతపోపవాసములు రెండవపద్ధతి. ఉరువేలపర్వతములలోనికి గౌతముఁ డేవురుసన్నిహితమిత్రులతోఁబోయి,యేకాంతమున నచట ఉపవాసాదికముతోఁగూడిన ఘోరతపశ్చర్యకుఁ బూనుకొనెను.

కాని యెట్టిశాంతిలేశము నాతఁడు చవిచూడఁజాలఁ డయ్యెను. తానుజూడఁబోయినసత్యము పూర్వమెంతదూరమున నుండెనో యిప్పుడు నంతేదూరమున నుండెను. ఉపవాసక్లేశ మధికమై, నిరాశ తీవ్రమై, నీరసము శ్రుతిమించి, యొకరాత్రమున నాతఁడు మరణోన్ముఖుఁడయ్యెను. సత్యసమస్య యెప్పటియట్లేయున్నది; జీవితరహస్యము ప్రశ్నారూపముననే మిగిలియున్నది.

ఆఱుసంవత్సరముల ఘోరతపోనిరతివలన, నీ పద్ధతి నిరర్థకమైనదని బుద్ధుఁడు నిశ్చయించెను, ఐశ్వర్యముయొక్క వ్యర్థత్వము, మతగ్రంథములిచ్చు ననుభవశూన్య జ్ఞానము, యతిజీవితములోని దుర్భరదీక్ష వీనినన్నిటి నొక త్రాసునఁదూఁచి నిరర్థకములని నిశ్చయించుకొనెను. భోగవిసర్జనముచేఁ బవిత్రమైన దేహముతో, వినయముచే శుద్ధమైన మానసముతో ఏకాంతమున కలవడిన హృదయముతో, వనగుహాంతరమున నాతఁడు శాంతి నార్జింపఁజూచెను. ఈశ్వరసృష్టిలోని ప్రకృతి సౌందర్యములఁ దిలకించుచో నదృష్టవశమున సత్యము స్ఫురించునేమోయని, అరుణకాంతిలోని లావణ్యమును, బాలసూర్యుని తేజస్సౌందర్యమును, ప్రకృతియొక్కయు జీవరాశియొక్కయు

---

౧. ప్రజలీతని సంసారత్యాగము నతివిచిత్రముగాఁ జెప్పుకొందురు. అర్ధరాత్రిమున నాతఁడు భార్య పరుండిన మందిరమునకుఁబోయెను. అచట నామె కుమారుని తలపైఁ జేయివైచుకొని నిద్రించుచుండెను. బాలు నొకసారి ముద్దిడుకొనవలెనని తలఁచెను గాని తల్లి మేలుకొనఁగాంచునను భయముచే మాని, తుదిసారి వారి నవలోకించి, రహస్యముగాఁ బర్వతసీమకుఁ బారిపోయెను.

వనంత వైవిధ్యసంపదను దిలకించెను. ధ్యానప్రార్థనములనుజేసెను. ఆతనిని దీక్షనుండి విరమింపఁజేయు నుద్దేశముతో, మన్మథుఁ డొక్కొక్కసారి, యాతనిపై దాడివెడలుట, మోహదృశ్యములఁ జూపుట మున్నగు నాటంకములఁ గల్పించెనని బుద్ధగాథలు తెల్పుచున్నవి. మన్మథుఁడే అపజయమందెను. తృణకల్పితాసనముపై నొక వటవృక్షచ్ఛాయఁ గూర్చుండి, ప్రాఙ్ముఖుఁడై, అచంచల నిష్ఠాగరిష్ఠుఁడై, తన పరమలక్ష్యమునకు మానసమును బంధించి, "పరిపూర్ణ జ్ఞానజ్యోతి నాయెదుటఁ బ్రకాశించువఱకు నీ యాసనమునుండి చలింపన'ని ఘోరప్రతిజ్ఞబూనెను. ఏడువారము లట్లాతఁడా చెట్టుక్రింద నుండెను. "ఒకగొప్ప క్లిష్టమైన సమస్య నెదుర్కొన్నప్పుడు మానవమానసము, ముందుకుఁబోవుచు, నూతనస్థానముల నొక్కొక్క పదముగా గెల్చుచు, గెల్చినపదములను గణింపక హఠాత్తుగా నొక్కముహూర్తమున గోచరించిన జ్ఞానకాంతిచే జయమును సాధించును. గౌతమునికట్టి విజయమే తటస్థించినది."[౧] వటవృక్షచ్ఛాయనున్న యాసనమునందు– దానికి బోధినందమని శిష్యులు పేరిడిరి. బోధిపంద మనఁగా జ్ఞానపీఠము నిగూఢసమాధ్యవస్థలో విశ్రాంతుఁడై యున్నతఱి, నొక దివ్యజ్ఞానజ్యోతి యాతని మానసాగారమునఁ బ్రకాశించెను. వెదకిన సత్యమాతనికిఁ గరతలామలకమైనది.

పెక్కేండ్ల అనవరతాన్వేషణము వలనను, ధ్యానము వలనను గలిగిన జ్ఞానముచే నాతఁడు దుఃఖపంకమగ్నమై యున్న

౧. వెల్సుఔట్లైన్ ఆఫ్ హిస్టరీ పుట ౨౦౭.

మానవకోటికి నిత్యానందప్రదమగు మార్గమును చూపుటకై తనకొక దివ్యకర్తవ్య మున్నదని తెలిసికొనెను. చతుస్సత్యకలితమైన ఆర్యధర్మమును, అష్టవిధమోక్షపద్ధతి నాతఁడు పతితలోకమునకు చక్కఁగ బోధించెను. తత్త్వసిద్ధాంతప్రజ్ఞాప్రాగల్భ్యముల పొంతఁబోక, పాపపరీతాపమానకరజీవితములను గడపుచున్న ప్రజాసామాన్య ముద్ధరింపఁబడు నను నుద్దేశముతో నాతఁడు తన ధర్మసందేశమును వ్యాప్తి యొనర్చెను. స్వచ్ఛప్రసన్నమైన యాతనివదనారవిందము, నిస్తులౌదార్యసౌందర్యము గల యాతని జీవితము, దీక్షాప్రోత్సాహములతోఁ గూడిన యాతని ప్రేమ, శుద్ధజ్ఞానప్రవచనముతో సమ్మిశ్రితమైన యాతనిసందేశము స్త్రీపురుషహృదయముల నప్రయత్నముగ జయించెను. తనతోఁగూడ నుండిన పంచమిత్రసన్న్యాసుల నాతఁడాదిశిష్యులనుగా నంగీకరించెను. వారికే మొట్టమొదట నాతని ధర్మచక్రప్రవర్తనము నుపదేశించెను. అనఁగా ధర్మమను చక్రమునకుఁ జలనశక్తి నిచ్చుట. వారు దాని నంగీకరించి, బౌద్ధసంఘ ప్రథమసభ్యులైరి. శిష్యులసంఖ్య క్రమముగాఁ బెరిగినది. నూత్నధర్మమును నలుదెసల బోధించుటకుఁ బ్రచారకులు పంపఁబడిరి. మొదటిదశలో నీమతస్వీకార మొనర్చి, విశ్వవిఖ్యాతి గాంచినవారు, సారిపుత్తుఁడు, మొగల్లానుఁడు, రాజగృహసన్న్యాసులు. ప్రథమ పంచశిష్యులలో నొకఁడైన అస్సజీవద్ద నుపదేశమందిరి. బుద్ధుఁడే స్వయముగా వారిని సంఘసభ్యుల నొనర్చెను. ప్రాచీన బౌద్ధగ్రంథములయందు ప్రముఖస్థానముల నాక్రమించినవారు, బుద్ధుని మరణానంతరము జరిగిన మొదటి బౌద్ధమహా

సభాముఖమున వినయపిటకమును బఠించిన ఉపాలియుఁ, గాశ్యపుఁడు పరిషదధ్యక్షుఁడును, నాఁటి బౌద్ధులలో నగ్రేసరుఁడును, మఱియు బుద్ధుని శవసంస్కారము వానిరాకకొఱకే ఆపుచేసిరని చెప్పఁబడినది; బుద్ధునిబంధువు, ప్రియశిష్యుఁడునగు ఆనందుఁడును; ఇతఁడు బుద్ధు నతిజాగరూకతతోడను శ్రద్ధాభక్తుల తోడను సేవించినవాఁడును, నతనినిర్వాణకాలమునఁ జెంతనున్న బంధువర్గములో నత్యంత సన్నిహితుఁడును; ముఖ్యులు. తరువాత వేలకొలఁదిమంది శిష్యులైరి. అనేక బ్రాహ్మణ పండితులును శిష్యులుగాఁ జేరిరి. తాను విసర్జించిన పండ్రెండేండ్లకుఁ దిరిగి బుద్ధుఁడు తండ్రి యాస్థానమునకుఁబోయి, తల్లిదండ్రులను, భార్యాసుతులను దనమతమునఁ జేర్చుకొనెను. గృహస్థులనేకులుకూడ సామాన్యశిష్యులుకాఁగాఁ గొందఱుస్త్రీలును మతస్వీకారమొనర్చి ప్రత్యేక స్త్రీసంఘమును స్థాపించుకొనుట కనుమతిని బొందిరి.

నలుబది సంవత్సరముల ప్రచారక జీవితానంతరమునఁ దనకు దేహత్యాగముచేయు సమయ మాసన్నమైనదనియుఁ బరినిర్వాణము౧ పొందఁ దరుణ మేతెంచె ననియుఁ దెలిసికొని, బుద్ధుఁడు తనయనంతరము చేయవలయు కార్యకలాపమును గూర్చి, ఆనందునకు శిష్యకోటియెదుట, ఉపదేశములు, చేసినాఁడు. అవసానదశలో నాతని యుపదేశవాక్యములను విని

౧. నిర్వాణమనగాఁ బ్రతికియుండఁగాఁ బొందు యానందము; శరీరపతనమైన వెనుక లభించునది పరినిర్వాణము. (చూడు. పరినిబ్బాణసుత్తము యస్. బి. ఇ. ౧౧.)

బౌద్ధుఁడైన సుభద్రుఁడను పరివ్రాజకుఁడు బుద్ధునిచే స్వయముగా నంగీకరింపఁబడిన తుదిశిష్యుఁ డయ్యెను. తమకుఁగల సంశయముల నుగ్గడింపుఁడని శిష్యుల నడిగెను. వారుమౌనము వహించిరి. అప్పుడు బుద్ధుఁడు వారి కిట్లుపదేశించెను; "ప్రియులారా! నేను మిమ్మిపుడు విడిచిపోవనైయున్నాను. జీవియొక్క ఉపాధివర్గమంతయు నశించునదే. బుద్ధిమంతులై, మోక్షము నార్జించుకొనుఁడు."[౨] ఎనుబదవయేట నాతఁడు మరణించెనని చెప్పుదురు. పూర్వదిశయొక్క ప్రసన్నగాంభీర్యము, లోకాతీత సౌజన్యము, కోమల నైశ్చల్యము; అగాధదయాంతరంగములను బుద్ధునిమూర్తి లోకములకు శాశ్వతప్రదానము. శాక్యముని, తథాగతనామము లాతనికిఁ గలవు.

పైవిషయములన్నియు ఋజువునకు నిలిచిన సత్యాంశములే. లలితవిస్తారము,[3] జాతకకథలలో నింకను విశేషములు పేర్కొనఁబడెను. అవి కేవల జనకల్పితవాక్యములే.[౪] బుద్ధుని నిర్యాణానంతరము ౨౦౦ సంవత్సరముల తరువాతనే గ్రంథ

---

౨. మహాపరినిబ్బాణ సుత్తము. ౬౫.౧. ఈ తత్త్వమనఁగా ప్లేటోఫీడోలో గ్రంథమననుసరించి, మృత్యువును ధ్యానించుట. పోల్చు, మార్కస్, అరీలియస్. "అంతయుఁ దుదకుఁ గుల్లి నశించునదే......అన్నియు సమానముగా క్షణికములు చంచలములు, నశ్వరములును.........చివరకు మట్టిలోఁ గలిసి పోదుము; మట్టియూ మారును; ఈమార్పు లనంతములు. ఈపరివర్తనములఁగల వస్తువులనుజూచి జుగుప్సపొందని వివేకవంతుఁ డుండఁడు. బుద్ధిమంతుఁడీ నశ్వరవస్తువుల నాసింపఁడు."

3. ఎడ్విన్ ఆర్నాల్డ్సు లైట్ ఆఫ్ ఏషియా.

౪. నిదానకథ. జాతకములు ౧-వ భాగము; అశ్వఘోషుని బుద్ధచరితము.

సంకలనము చేయఁబడినదని మనమెఱిఁగియున్నప్పుడు, నిరాధార కల్పనములు సత్యాంశములతోఁ గలిపి యల్లఁబడినవని యూహించుటలో నాశ్చర్యములేదు.౧ బుద్ధానుచరుల కల్పనాకౌశలము బుద్ధునిజీవితగాథల నతిచమత్కార మొనరించు విచిత్రకథలతో మేళవించినది. ఇవి బుద్ధుని జీవితవర్ణనము చేయుటమాని తమకాతనిగూర్చి తెలిసినగాథల నన్నిటిని వర్ణించినవి.౨

## ౫—కాలపరిస్థితులు

ప్రతి మతతత్త్వమును బయలుదేఱిన కాలమున లోకములోనున్న భావములను, లక్షణములను ప్రకటించి, ప్రతి

---

౧. దీఘనికాయములోని ౧౪వ ప్రకరణము మహాపదాన సుత్తాంతములోనిది బుద్ధునిగూర్చిన ప్రాచీనతమచరిత్రమిందున్నది. ఇదిబుద్ధుని ఆత్మకథా ప్రసంగమే యందురు.

౨. బుద్ధుని జీవితమునుగూర్చిన జన గాథలన్నియుఁ జాలవరకుఁ గల్పితములను మే మంగీకరింతుము గాని, యంతయుఁ బుక్కిటిపురాణమేయను నభిప్రాయమును మే మంగీకరింపము. సహజముగానుదయించి, పెంపొందిన యీ కతిమునుగూర్చి మతాభిమానులుచేసిన కేవల కల్పితగాథలే యీ బౌద్ధగాథలన్నియునని ఈ.మ్. సెనార్టులు, మరికొందరును దలచి, ప్రచారము చేయుచున్నారు. బుద్ధుని చరిత్రములో నొక సూర్యునిగాథ, సంబంధములేని యితర పంకగాథలతోఁ గలిసియుండుటచే, నిదంతయు నసత్యమని సెనార్టు వాదించినాఁడు. అతనివాదము మా కంగీకారముకాదు. బుద్ధుని జీవితమును గూర్చిన కథలు సహజములైనవియు, నిజమైన సంప్రదాయమునుండి జనించినవియునైయున్నవి. గ్రంథములు ప్రాచీనదశలో నున్నట్లు సాక్ష్యమున్నవి. బౌద్ధమతము బుద్ధునివంటి యొక అతిలోకప్రజ్ఞాన్వితమై, ఆధ్యాత్మికావేశజ్వాలామయమై శాసించు శక్తిగల వ్యక్తిత్వములేనిచో పెంపొంది యుండదు. బుద్ధుఁడొకగొప్ప మతప్రవక్తయని సెనార్టు నంగీకరించునుగాని సూర్యగాథ యాతనిని బాధించుచున్నది. బుద్ధుని జీవితములోని ప్రధానాంశములు కల్పితములుగాఁజాలవు.

ఫలింపఁజేయును. నాఁటి ప్రజల భావములు, వాని నెట్లాతత్త్వము గ్రహించినదో మున్నగుసందర్భములు తెలిసినఁగాని యే తత్త్వము నర్థముకాదు. తరువాత రచనముచేయఁబడినట్టియు, నంతకుఁ బూర్వ మలిఖితసంప్రదాయపూర్వకముగా నున్నట్టియు సారస్వతమునుండి బుద్ధుఁడు జన్మించిన కాలపరిస్థితుల నూహింపవచ్చును. దేశమంతయు నేకచ్ఛత్రాధిపత్యముక్రింద లేదు. వివిధ వంశములకుఁ జెందినరాజులు స్వతంత్రరాజ్యములను స్థాపించుకొనుచుండిరి. సంస్కృత మందఱకును మాతృభాషయైనను, దేశభాష లనేకము వాడుకలో నున్నవి. వేదములకొక యతి లోకప్రమాణ గౌరవ మేర్పడియున్నది. సంఘవిధినిషేధాత్మకములైన మనుధర్మశాస్త్రము మున్నగునవి వాడుకలో నున్నవి; తరువాతఁ బెంపొందిన శాసన కాఠిన్య మప్పు డంతగా లేకుండెను. షడ్దర్శనము లింకను నిర్మితములు కాలేదు. కాని, వానిని నిర్మించుటకువలయు తత్త్వవిచారము విశేషవ్యాప్తి నందియున్నది. ప్రజలశక్తి యంతయుఁ దత్త్వగోష్ఠి, చర్చలకొఱకే వినియోగమగుటచే, నైతికదృష్టి క్షీణించినది.

పరస్పరవిరుద్ధములైన యనేకసిద్ధాంతములు. కల్పనములు, కొందఱంగీకరించి, కొందఱు నిరసించుటయుఁగలిగి, యభిప్రాయప్రకటన మొనర్చిన ప్రజల తాత్కాలిక భావోల్లాసవైఖరులఁ దెల్పుచు, వాతావరణమంతయు విచిత్రవాదసంకీర్ణమై యున్నది. అందఱంగీకరించిన సత్యాంశములు లేవు; దినదినము మాఱుచుండు వాదములు, విశ్వాసప్రకటనములు విశేషముగాఁ

గలవు. ప్రపంచము, ఆత్మ పరిమితములా నిత్యములా, రెండునా? రెండునుగావా ?, సత్యమిథ్యాభేదసంబంధము, పరలోక మున్న దా లేదా, పునర్జన్మము, కర్మస్వాతంత్ర్యములు గలవా లేవా మున్నగువిషయములనుగూర్చి పరిణతప్రసంగములు విశృంఖలముగాఁ జెలరేగిసంచరించుచున్న దినములవి. కొందఱు మనస్సే ఆత్మ యనియుఁ, కాదు వేఱని కొందఱు, దేవుఁడే సర్వకర్త యని కొందఱు, కాదు మానవుఁడేయని కొందఱు, నిశ్చయముగాఁ దెలియుట సాధ్యముకాదని మఱికొందఱు, మాతత్త్వము నంగీకరించిన మోక్షము సులభసాధ్యమని ప్రచారముచేయు వారు కొందఱు; అతిదీర్ఘములైన తత్త్వగ్రంథరచనా నిమగ్నులైకొందఱు, వారు చేయుచున్న రచనములనప్పుడే విమర్శనాయుధ ప్రహారములకు గుఱిచేయుచున్న వారు కొందఱు గలిగి, కాలము మహాకోలాహలముగా నున్నది. వేదసంప్రదాయ విరుద్ధసిద్ధాంతములు పెక్కు బయలుదేఱినవి. నిర్గ్రంథము (బంధములులేనివి) లున్నవి; బ్రాహ్మణమతమునకుఁ జెందని శమనులు) యతీశ్వరులు) కొందఱున్నారు; సన్న్యాసముచే మోక్షము గోరువారు కొందఱు, తపఃకార్శ్యములచే ముక్తి బడయ యత్నించువారు కొందఱు, కేవల తార్కికయుక్తిప్రయుక్తులచే జ్ఞానులమైతిమని తలచుతార్కికులు, వాదభీష్ములు, ప్రతివాద భయంకరులు, నాస్తికులు, సంశయాస్తికులు, గలరు. గర్వదంభాహంకార కాలరుద్రులు కొందఱుండి యిట్లు పలుకువారు, "నాతో వాదింపఁ గల శమనుఁడుగాని, బ్రాహ్మణుఁడుకాని, ఆచార్యుఁడుగాని, దార్శనికుఁడుగాని, లేఁడు. తానొక పూర్ణజ్ఞాని నని దర్పములు

చెప్పఁగొను ప్రబుద్ధుఁడుకాని నన్నెదుర్కొని వాదింపఁజాలఁడు. నావాదముతో నేనొకనిర్జీవమైన స్తంభము నెదుర్కొన్నను, నది చలించి,యూగిసలాడి, భూపతితమగును. సజీవుఁడైనమానవుఁడే నన్నెదిర్చినచో, నాతఁడు వెంటనే చెమటలుగ్రమ్మి,నురువులుగ్రక్కి. పారిపోవలసినదే"౧. పరస్పరవిరుద్ధసిద్ధాంత విశ్వాసముల కాట్లాటలతో భావసాంకర్యము ప్రళయ తాండవమాడిన కాలమది.౨

తత్త్వాభిమానుల విశృంఖలభావవిహారము, దేశకాల, నిత్యత్వములనుగూర్చిన భావములను దేలికగాఁజూచి, మహోన్నతతత్త్వశాస్త్రకళను హీనపఱిచిరి. సాంకర్యమందిన సందిగ్ధ భావ మేఘజాలమునకు స్వచ్ఛాత్మసత్య రవికిరణములు మఱుఁగునఁ బడిపోయినవి. సత్యదర్శనము లేనివారే కల్పనా చాతుర్యముఁజూపి మాఱుబాటలుపట్టుట సహజము. ఉత్సాహవాహిను లెదురై ప్రవహించుట, పరస్పరము ఢీకొనుతత్త్వసిద్ధాంతములు, పాటుపోటుగల విశ్వాసపరంపర, వీనినన్నిటిని దిలకించి, కేవల తత్త్వవిచారముయొక్క వ్యర్థత్వమును బుద్ధుఁడు గ్రహించి గుణపాఠమును నేర్చుకొనెను. యుక్తిప్రయుక్తులతోఁ గూడిన తత్త్వసిద్ధాంతవాదోపవాద గర్వములపైఁగాని, తుదమొదలులేని వెఱ్ఱి ప్రశ్నాపరంపరల ప్రయోగములపైఁగాని సునిశితమేధావిత్వము నార్జించు సిద్ధాంతరాద్ధాంత చర్చాప్రసం

౧. గోల్డెన్ బెస్టు బుద్ధ పుట ౭౦.

౨. గౌతమబుద్ధుని కాలమున బ్రహ్మజాలసుత్తముచెప్పిన ౬౨ సిద్ధాంతములున్నవని రైస్ డేవిడ్సు, బుద్ధునిమతమును గూర్చిన తన అమెరికా ఉపన్యాసములలో విమర్శవిభాగ మొనర్చి చెప్పియున్నాఁడు.

కములపైఁగాని ఆత్మయొక్క మోక్ష మాధారపడి యుండలేదని బుద్ధుఁడు గ్రహించెను. సుస్థిరనిశ్చయము లేని విజ్ఞానము, బుద్ధికి శ్రమాన్వితము కాకపోవచ్చును గాని, నైతికప్రవర్తనమునకుఁ బ్రమాదమే. జ్ఞానములో సాంకర్యము నీతిసాంకర్యమునకుఁ దారిచూపినది. కాబట్టి బుద్ధుఁడు నిరర్థులతత్త్వవాదములను దూరముగా విడిచిపెట్ట నిశ్చయించుకొనెను. బౌద్ధమతమునందున్న తత్త్వవిధానము మూలధర్మమునకుఁ జెందినదికాదు; తరువాతఁ జేరిన అభిధమ్మములోనిదే. ౧. బౌద్ధమతము ప్రధానముగాఁ మనస్తత్త్వము, తర్కము, ధర్మమేకాని తత్త్వోపదేశముకాదు.

విశాలభారతభూమిలో దేవతాగణమును సృజించుమానవునత్యద్భుతశక్తి, బహుదేవతారాధనదృష్టి, పూర్ణస్వాతంత్ర్యమును గలిగియుండెను. దేవతలు, దయ్యములు, శపించుటకు శాసించుటకును, గరుణించుటకుఁ గాపాడుటకుఁగూడ సమర్థులై, ప్రజాజీవితమును స్వాధీనపఱచుకొనెను. భిన్నశాఖలతోఁ గర్మకలాపముతోఁ గూడిన వేదమతమే జనసామాన్యాదరణమును బొందియున్నది. దేవతలను సంతృప్తియొనర్చుటే ప్రజల నిత్యకర్మమైనది. ఏకేశ్వరవాదుల యేకైక దైవమైనను, విశేషమానవలక్షణములను గలిగి, కొంత ధీరత్వము ప్రదర్శించువాఁడై తన యిష్టప్రవర్తనమున కడ్డులేనపుడు దయాంతరంగుఁడై, అడ్డు కలిగినపు డాగ్రహాపరవశుఁడై, క్రోధము చల్లారిన వెనుక కరుణామూర్తియై యుండెను. ఏకైకమూర్తి యగుదేవునకు, తన భక్తునకుఁ గలసంబంధము స్వామిభృత్యసంబంధము. పాము

౧. అభి=అతీతము; ధమ్మము=భౌతికశాస్త్రము.

వగవంటిగుణముగల యుద్ధనాయకుఁడైన యాభగవంతుఁడు తన స్వేచ్ఛననుసరించి మనయదృష్టమును నిర్మించి, కోపగించి నప్పుడు శత్రువుకేమరుగా నిలువుమని మనలను శాసించును. ఆతఁడు లోకముతో ననుచితమైన జోక్యము కల్పించుకొనును. పాపమొనర్చిన లోకమును నాశమొనర్చుటకు సూచనగా నాతఁడు శోకచుక్కలను బ్రదర్శించువాఁడు. ప్రజలు దానిని గ్రహింపకున్నచో, నమూయిక జనసమూహముల నశింపఁజేయు మహోజాడ్యములను బంపుచుండువాఁడు. అభూతవైచిత్ర్యములు దినదినము జరుగుచుండెను. విశ్వసమానమగు ధర్మము నుపనిషత్తులు బోధించినను, నది జనవిశ్వాసము కాలేదు. నిరాఘాటమైన యేకేశ్వరవాదము మానవుని బాధ్యతను దేవునిపైఁ బడవేయు మాంద్యముగాఁ బరిణమించెను. అతఁడే యేకైకకర్త యగుక, మన మంచిచెడ్డలకు బాధ్యుఁ డతఁడే. కేవల విలాసము నకుఁగాని, మానవకుటుంబములోని యేపూర్వపురుషు నపచారమును దండించు నుద్దేశముచేఁగాని యాతఁడు లోకమునంతను దుఃఖనిరాశావశ మొనర్చెను.

ప్రతిపాపము దేవుని శాపనాతిక్రమణమే. దానికిఁ బరిహారము పశ్చాత్తాపమంది, ధూళిలోఁ దలమోదుకొని, దేవుని సంతోషింపఁజేయుటే. దేవునిప్రీతియే పుణ్యము, అన్యమంతయు దైవద్రోహమైనపాపమే. పాపఫలితములయెడ లోకు లుదాసీనులైరి; కర్మసిద్ధాంతము మాత్రము వారి జిహ్వాగ్రమున నున్నది. మానవవ్యాపారము లన్నిటికిఁ గ్రోధపరవశుఁడైన దేవుని వజ్రాయుధమే శరణ్యమైనది. ఫలితము మతమునకు

జీవితమునకు, దేవునకు లోకమునకు సామరస్యము లేకుండఁ బోయినది.

కర్మ కలాపమునందు జరుగుచున్న కూ్రరచర్యలు బుద్ధుని హృదయమును కలవరపఱచెను. దేవునియందలి మూఢ విశ్వాసము మానవనీతి ధర్మమును గలుషితమొనర్చెను. దైవ ప్రీతి గలుగునని యోగ్యులగు జనులు చాలమంది తుచ్ఛ కార్యము లొనర్తురు. మతము ధర్మములమధ్యమందు గలఁ సంబంధవిషయములలో సంకరభావములవలన లోకమునకుఁ గలిగిన హాని వర్ణనాతీతము. తన కుమారుని బలియొసఁగ నబ్రి హామును దేవుఁ డాజ్ఞాపించెను; సాల్, తన కారాగారమున నున్న దోషులను జిత్రివధచేయుటకు దైవాజ్ఞఁబడసెను. మతము పేర సంఘమున జరిగిన, జరుగుచున్న ఘోరములు బుద్ధుని హృదయకంపమునకుఁ గారణములయ్యెను.

దేవుఁడే సర్వము నను సిద్ధాంతమువలన నాస్తికులు, సంశయాత్ములు సత్ప్రవర్తనమును గలిగియుండనవసరము లేదు; ఏలన ధర్మము దైవము రహస్యముగా నెవరికో తెల్పినదే కావున, నితరులకది తెలియఁజాలదు. నూతనసత్యములు, శాస్త్రములు నీతితో సంబంధములేనివి కావచ్చును. విశ్వాసహీనులు, నైతిక విధులను నిరసింపవచ్చును.

బుద్ధుఁడును, లుక్రిషియస్ వలెనే, మానవాతీత ధర్మమున కంటె మానవధర్మమువలననే లోకము బాగుపడునని తలఁచి నాఁడు. పురోహితులతోఁగాని దేవతలతోఁగాని సంబంధము లేకుఁడ, మానవుఁడు తనమోక్షమునకు దానే కర్త,

బాధ్యుఁడునని చెప్పినచో మానవత్వమందు గౌరవము, నీతిధర్మమం దాదరము కలుగునని యాతఁ డూహించినాఁడు. "ఇంకొకఁడు మన సుఖదుఃఖములకుఁ గారకుఁడున్నాఁడని తలచుట కంటె మూర్ఖతలేదు." ౧. బుద్ధుఁడు తన యుపదేశమును బ్రచురించి, వెడలినవెనుక మానవసహజమైన నీతిధర్మము విశ్వజనీనమైనదని భారతీయహృదయమున నాఁటి, జన్మసిద్ధమైన యభ్యాసముగా మాఱిపోయినది.

వ్యవహారప్రపంచము యొక్క కారణమును దెలిసికొనుట కొకదేవుని యస్తిత్వ మూహింపనక్కరలేదు. బుద్ధుని యుపదేశమును దరువాతఁ జూచెదము. కర్మనియమమే చాలును. లోకాతీతమైన సత్పదార్థమొకటి యున్నదనుసూచన నిగూఢమై యున్నది కాని, యది తర్కబుద్ధికిఁ గనఁబడునది కాదు. ఉపనిషత్సిద్ధాంతమును బుద్ధుఁ డంగీకరించి, సెయింటు పాల్ నిర్ణయమును దానే చెప్పఁ గలిగినాఁడు; "దేవునిజ్ఞాన మహిమాసంపదయొక్క అనంతత్త్వము నేమనిచెప్పఁగలను! దైవనిర్ణయవిధానములు, పద్ధతులు వాఙ్మనోఽతీతములు." ౨.

ప్రజాసామాన్యమున కుపనిషత్తులు లభింపని గ్రంథములు. వానియుపదేశము మూర్ఖవిశ్వాస పంకమగ్నమై యదృశ్యమైనది. 3. తమస్వాధీనములో దేవతల నుంచుకొనుటకై

౧. బోధిచర్యావతారము.

౨. రోమన్సు. ౧౧ అ. 33.

3. బుద్ధుని కాలమున దేశపరిస్థితిని లలితవిస్తారమిట్లు వర్ణించినది: "ఉరువేల పర్వతమున నున్నపుడు గౌతముఁడానాఁడు మనోనిగ్రహమునకుఁ బ్రజలలో వ్యాపించియున్న సాధనములన్నిటిని గుర్తుకందుంచుకొనెను. ఆతఁడిట్లా

కొందఱు పాసనలు ముఖ్యమనిరి. బుద్ధునికి నొకసన్న్యాసికిని జరిగిన సంభాషణమునందు, ఆహారనియమముచే శరీరశోషణము చేయుటకు ౨౨ పద్ధతులును, వస్త్రధారణ నియమములు పదమూఁడును చేర్పఁబడినవి. సర్వసంగత్యాగ సౌందర్యము పశుప్రాయాంధ విశ్వాసముచే వికారాకృతిం బొందెను. ఆత్మోద్ధరణము పొందయత్నించువారు పశుత్వములోనికి జారిపోవు ప్రమాదములుండెను. సామాన్యప్రజాకోటి మూర్ఖకర్మాభ్యాసముల కలవాటుపడెను. బుద్ధుఁడు చెప్పినచొప్పునఁ "బ్రజల సొమ్ముతిని, వారికీకర్మకలాపములను గల్పించి, శవములను బీకుకొని తినుగ్రద్దలు, రాబందులవలె, నెల్లప్పుడు లాభము పైలాభమును జేర్పయత్నించుచుండు పురోహితబృందము

లోచించెను; "నేనుబుట్టిన యీజంబూద్వీప ప్రజలకు జ్ఞానముచే మోక్షము వచ్చు నవకాశములేదు. భిన్నకాంక్షలతోఁగూడిన తైర్థికులు క్షుద్రకామమును మొసలి నోటఁబడి కొట్టుకొనుచున్నారు. వీరితో దేశమునిండియున్నది. మూర్ఖబుద్ధులు వివిధతపోపవాసాది క్లేశములచే నాత్మశుద్ధి నార్జింపయత్నించుచున్నదియే లోకమున బోధించుచున్నారు. కొందరు వారుజపించుచున్న మంత్రము తెలుపరు; కొందఱు తమకరములనే నాఁకుచుందురు; కొందఱుధూళిధూసరితాంగులు; కొందఱకు మంత్రములులేవు; కొందరు పెక్కుచోట్లకుఁ దిరుగుదురు; కొందరు, గోవులను, హరిణములను, గుఱ్ఱములను, పందులను, కోఁతులను, ఏనుఁగులను బూజించుచున్నారు. కొందరువిచిత్రాసనములవలన ఔన్నత్యము బొందఁజూతురు. మఱికొందఱగ్నిధూమములను బీల్చుచు, సూర్యునకెదురై నిలచుట, పంచాగ్నిమధ్యమునను ండుట, ఒంటికాలిపై నిలచుట, ఒకచేయి యెల్లప్పుడు పైకెత్తినిలచుట, లేక మోకాళ్లపైనుండుట, బ్రహ్మేంద్రరుద్రవిష్ణుకుమారుల నారాధించుట, దేవీపూజలొనర్చుట మున్నగునవిగలవు.

మాయలోఁబడి లోకులు మాల్గుచుండిరి.''3. దైవశక్తి ప్రవహించుకాలువలే పురోహితులని తలఁపఁబడియుండెను. వారే మతప్రతినిధులు. ఆత్మసందేశ ప్రవక్తయగు బ్రాహ్మణునియెడ బుద్ధునకు నిజమైన గౌరవముకలదు. అట్టిబ్రాహ్మణుఁడు, "వెండి బంగారములతో నాకు నిమిత్తములేదని" చెప్పును. అట్టి సందేశాధికారియగు బ్రాహ్మణుఁడు పురోహితుఁడై తన నిజజ్ఞానదానముచేఁ బొందిన గౌరవప్రతిష్ఠలను బోఁగొట్టుకొని, కంటివానినిజూచి 'లేచి నడువు'మని దీవింపలేని వాఁడయ్యెను, ఆత్మజ్ఞానబోధచే రోగి కుపశాంతిగూర్చుటకు బదులు, దేవతలు తనస్వాధీనములో నున్నారని దంభములుపలికి, విశేషధనసంగ్రహమొనర్చి, దీనులనిట్లు సంబోధింప మొదలిడెను; "పుత్రా! దేవునికొక బలియొసఁగుము; నాకు దక్షిణనిమ్ము; నీపాపములు బ్రద్దలైపోవును." పాపపరిహారము రూప్యములనిచ్చి కొనుటచే మానవహృదయమున బయల్వెడలు నశాంతిపోఁజాలదు. ప్రజాసామాన్యమునకు మతమనగాఁ గర్మ, ప్రార్థన, ఉపవాసము, విధినిషేధాత్మకములైన శుద్ధికర్మకలాపము, సర్వమానవ సంబంధములలో నుండవలెను. ఇట్టిరీతిని మూర్ఖాచారములే పరమ ప్రమాణములని నమ్మిన ప్రజాజీవితముయొక్క వ్యర్థత్వమును బుద్ధుఁడు గ్రహించెను. ప్రజలుస్వార్థపరుల కొఱకాత్మద్రోహము చేసికొనుట నాతఁడు సహింపఁజాలకుండెను. మూర్ఖవిశ్వాసములయెడ, హేతుశూన్యాచారములయెడ బుద్ధుఁడు తననిశిత ప్రతిఘటనా బాణపరంపరల గురియ ధనుష్టంకారమొనర్చెను.

3. రైస్ డేవిడ్సు బుద్ధిష్టు ఇండియా. పుట ౨౧౫.

తనశిష్యులనట్టి కుత్రిమముల పొంతఁబోక, ధర్మసూత్రాచరణ మొనర్పుమని శాసించెను. దేవతల దైవత్వమును, వేదముల ప్రామాణ్యము నాతఁడొక్కదెబ్బతోఁ గొట్టివేసెను.

ప్రాచీన భక్తివిశ్వాసములు సడలి, దైవభావములు స్వప్నప్రపంచ దృశ్యములవలె నడుగంటిపోవుచు, వియార్థా సత్యాంశ మిళితమైనయుగములోఁ దలలెత్తులోపములను బుద్ధుఁ డెఱుఁగును. మానవహృదయము లశాంతినిలయములై, తీవ్ర సంతృప్తిగలిగి, నూత్నసందేశమున కెదురుచూచుచున్నవి. పూర్వ బౌద్ధమతము, యుగాన్వేషణ ప్రతిబింబమైయున్నది. మానవాత్మయొక్క నిజకాంక్షయైన సత్యము, శివము, సుందరము నైన సందేశమును బుద్ధుఁడు సరిగాఁజేపట్టెను.

మతశాఖా పతనము, తత్త్వముల క్షీణదశ, గలిగినసందర్భములో బుద్ధుఁడొక ధర్మసంస్థాపనమునకు దృఢమైన పునాదిని గట్టవలసివచ్చెను. గ్రీసు దేశములో నతివిశాలములైన ప్లేటో, అరిస్టోటలుల తత్త్వముల యనంతరమున, స్టాయిక్కులయు, ఎపిక్యూరియనులయొక్కయు నీతి ధర్మప్రచారము ప్రబలినట్లే, భారతదేశమునను దటస్థించెను. తత్త్వశాస్త్రాధారములు చలించి జంకినపుడు, విజ్ఞానవేత్తలు ధర్మప్రవర్తన సూత్రములపై దృష్టి కేంద్రీకరించిరి. నిత్యము మాఱుచున్న తత్త్వములపైని, ఆస్తికభావములపైని ధర్మ మాధారపడినచోఁ జిరస్థాయిగానుండుట కవకాశములేదు. బుద్ధుఁడు తన ధర్మమందిరమును సత్యాంశము లను దృఢశిలలపైఁ గట్టనుంకించెను. ప్రాచీనబౌద్ధము మానవునిదృష్టిని దేవునిసేవనుండి

మానవసేవ కాకర్షింపఁదలఁచిన నిర్మాణోద్దేశపూర్వకమైనది. నూత్నమైన యొక జగత్సిద్ధాంతమునుగాక, కర్తవ్యనిర్వాహణా మునెడ నూతనోత్సాహమును నిర్మింప నాతఁడు యత్నించినాఁడు. ప్రత్యేకసిద్ధాంతవిశ్వాసము, పురోహితత్వము, యజ్ఞము, కర్మకాండ, మున్నగునవేమియు లేనట్టియు, హృదయపరివర్తనము, నంతశ్శిక్షణనిగ్రహములనుగోరు నొకమతమును సృజించు నవకాశము నదృష్టము బుద్ధునికి లభించినది. సంశయాస్పదము లైన తత్త్వసిద్ధాంతములందలి విశ్వాసముకాని, ఆగ్రహపరవశుఁడైన దేవునిప్రీతికొఱకుఁ గ్రూరకర్మ లొనర్చుటగాని, ఆత్మముక్తి నొసఁగఁజాలవని యాతఁడు ప్రకటించెను. ఆత్మమోక్షము సంపూర్ణ సచ్ఛీలముపైని, సత్కార్యాచరణము పైని ఆధారముపడియున్నదని యాతఁడు వచించెను. ధర్మసూత్రమొక ప్రజ్ఞాదురంధరుని మానసికకల్పనముగాని, సందేహాస్పదమగు దైవప్రోక్త లక్షణముగాని, కాదు; అది వస్తుసత్యసహజస్వరూపము. సత్యము నెఱుఁగని అజ్ఞానమే సర్వదుఃఖములకుఁ గారణమని బుద్ధునభిప్రాయము. పవిత్రమైన తపోదీక్షకు విలువలేదనుట, జనసామాన్యమాదరించుమతము కాదనుట; వైదికకలాపమును దెగనాడుట, నొకమాటలోఁ దత్త్వమునే మతమొనర్చుటయు నీపని, యెంతటి అసాధారణప్రజ్ఞాసాహసాంచితమో సరిగానిర్ణయించుట సాధ్యముకాదు. పూర్వబౌద్ధములో మూఁడుప్రధానలక్షణములు గోచరించును. (౧) ధర్మదీక్షాపరత (౨) దైవతత్త్వప్రశంస లేకపోవుట (3) తత్త్వవిచారమునందు అరుచి.

పరమార్థచింత, విశ్వాసభావములు సన్నగిల్లిన సందర్భ మును బుద్ధుఁడు గణింపవలసివచ్చెను. ఆత్మపరీక్షాత్మపరిశోధన ములకుఁ దినములైననాఁడు, పూర్వము తర్కింపకుండ నంగీక రించిన సత్యముల నిప్పుడు విమర్శించు నభ్యాసముగలిగిన ప్రజ లున్నప్పుడు, మతమును విమర్శాతీతమై నిలువఁజాలదు. బుద్ధి మంతులైనవారే, ఆత్మ యసత్యమనియు, నమరత్వము స్వప్న దృశ్యమనియుఁ దృణీకరించుచుండ, వాని నిత్యసత్యత్వమును గూర్చి ప్రజలకు విశ్వాసమునుదయింపఁజేయుట సుసాధ్యము గాదు. బుద్ధుఁడు విమర్శదృష్టి నంగీకరించెనుగాని, కొన్ని మిన హాయింపులుచేసెను. నాస్తికవాదుల లక్షణములైన సంశ యము, ఔదాసీన్యము, అవహేళనములకు బుద్ధుఁడు పూర్ణ ముగా వ్యతిరేకవ్యక్తి; కాని యుగములోఁగల వివేకకిరణముల నాతఁడు సంగ్రహించి, సంప్రదాయాచార వ్యవహారముల నతి నిశితవిమర్శాముస్త్రనకు గుఱిచేసెను. కాని నిజమునకు జ్ఞానసిద్ధాంతములు, నాచరణవిధానములు, నొకవిధముగాఁ దాత్కాలికములే; ఒక్కొకతరము గడచినకొలఁది, నూతన తరమువా రాసిద్ధాంతాచరణ విధానములను స్వీకరించి, తమ జిజ్ఞాసను దృప్తిపఱచుకొనఁజూతురు; మఱియు గ్రమ వికా సమందుచున్న జ్ఞానమును, బరిణతినందుచున్న అంతర్దృష్టిని బరి శీలించినవాని ఫలితములను సమన్వయము చేసికొనుచుందురు. వాతావరణము మాఱినది; జ్ఞానము పురోభివృద్ధి పొందినది. సంశయాసక్తి హెచ్చినది; సంప్రదాయమతమునం దవిశ్వా సము ప్రబలినది. విజ్ఞానవేత్తలు,అనుభవాంశములను, మానవు

వాంతర్య జిజ్ఞాసతో సమన్వయ మొనర్చి, నూత్నము లైన విశాల తరత త్త్వ నిర్మాణ మొనర్చి, జీవితమును దృప్తికరముగా నడప యత్నించు చుండిరి. బుద్ధుఁడు యుగప్రతినిధియై నిలిచెను. సంప్ర దాయ విశ్వాసములయెడ రేకెత్తుచున్న సందేహవాతారణ మాతనికి బోధపడినది. కాలగర్భము లైయున్న విషయప్రవా హములు సహజముగా ముందున కురకలిడుచునే యున్నవి; బుద్ధుఁడా ప్రవాహ వేగమునకుఁ దోడ్పడెను. యుగశక్తి నాతఁడు కేంద్రీకరించి, విజ్ఞానవేత్తలు రూపమీయఁజాలక బాధపడు చున్న భావములకు బుద్ధుఁడొక రూపమును కల్పించి ప్రాణ ప్రతిష్ఠచేసెను. యుగభావప్రకటనకర్తయు భావియుగారంభ కుఁడు నొక్కముహూర్తమున బుద్ధుఁడై ప్రకాశించెను. యుగ మునకుఁ బ్రతిభావంతునకుఁగలసంబంధమును జెప్పుచు హెగెల్ పండితుఁడు, యుగములో నిర్మింపఁబడుచున్న స్వాగతకుడ్య ములోఁ దుదిఱాయినే ప్రతిభావంతుఁ డమర్చునని చెప్పి యున్నాఁడు. నూత్నయుగాదర్శ భవనమును జాలమంది కట్టు దురు; కాని తద్యుగపురుషుఁడువచ్చి, దానినిఁబూర్తిచేసిన కాని భవననిర్మాణము ముగియదు, ఆభవనము స్థిరముగా నిలువదు. అట్టిమహాశిల్పిహస్తము బుద్ధునిది; భారతీయ మహోన్నత ప్రతిభామూర్తులలో నాతఁ డొకఁడై యు న్నాఁడు. సోక్రటీసునకు సోఫిస్టులతోఁగల సంబంధమే బుద్ధు నికిఁ దనపూర్వ మహాపురుషులతోఁ గలదు. ఒకవిధముగా నాతఁడు నాఁటియుగ విమర్శకదృష్టికి మూర్తిమంతుఁడయ్యెను. నాస్తికవాదము పెచ్చుపెరుగకుండ నడ్డుకట్టయై ఆత్మధర్మమును

గాపాడిన వాఁడాతఁడే. మోక్షము లభించుట విశ్వసింపదగినది కాకపోవచ్చును: భగవంతుఁడుండు టూహాకతీతముకావచ్చును, కాని యిచటఁ గర్తవ్యనిర్వహణ మమోఘమైనదే.

బుద్ధుఁడు శుద్ధహేతువాదియని మేమూహింపము. హేతువాదనిర్వచన మిట్లు చేయఁబడెను; "హేతువు నుపయోగించి, మతవిశ్వాసముల మట్టిఁబెట్టునభ్యాసమది" ౧. నాశన లక్ష్యముతో బుద్ధుఁడు బయలుదేరియుండలేదు. నిష్పక్షపాతముగా సత్యమును దెలియవలెనని బయలుదేరిన యాతఁడు తన మనమున నేపాక్షికభావముల నుంచుకొనలేదు. ఒకవిధముగా నాతఁడు హేతువాదియే; ఏలన, దైవప్రోక్తములతో సంబంధములేకుండ మానవసహజమైన పద్ధతిచే నాతఁడు సత్యమును బరిశీలింపఁబూనుకొనెను. ప్రకృతిపరిదర్శనముల కర్థనిర్ణయము చేయుటలోఁ బ్రకృత్యతీతవిషయములను సాక్ష్యముగా దీసికొనరాదని చెప్పు ప్రకృతిశాస్త్రవేత్తల భావములలో నాతఁ డేకీభవించును. తాను జెప్పఁబోవు సందేశాంశముల విషయమున నాతఁడు విస్పష్టజ్ఞానము గలవాఁడగుటచే, నే దైవిక తాటస్థ్యములు కాని, అద్భుతవైచిత్ర్యములు కాని, తనకార్యక్రమము నుండి మార్గము తప్పుట కవకాశమును గల్పింపలేకపోయినవి,

భక్తిమార్గమున విశ్వాసమడుగంటిన యుగమునందుఁ దిరిగి దానినే పునరుద్ధరించుట నిరర్థకమని నిశ్చయించి, యాతఁడు తర్కానుభవములపై నాధారపడి, కేవలహేతువాదముచేఁ బ్రతిపక్షులను జయింపఁగోరెను. పరిశుద్ధహేతుబలముపై నాధార

౧. బెరీ ౧౯-వ శతాబ్దపు హేతువాదచరిత్రము. వాల్యము ౧.

పడిన మతము నుపదేశింప నిశ్చయించుటచే నాతఁడు మూఢ విశ్వాసములకును సంశయవాదములకు నవకాశము లేకుండఁ జేయఁ గల్గెను. ఆతఁడెన్నఁడు నూతనప్రవక్త ననుభావమును జూప లేదు. ఆతఁడొక హేతువాది; అట్టి వాదముచే నితరులను మోక్షమార్గమునకుఁ దోడ్కొని పోఁజూచెను. తన తపస్సుయొక్క అనుభవమును శిష్యులయెదుటఁ బెట్టి, తననిర్ణయములను వారు నటులే కృషిచేసి పరీక్షించుకొనుఁడని శిష్యులకుఁ జెప్పెను. ఆతని సిద్ధాంత మన్యులనుండి విన్నదికాక, "వచ్చిచూడు" మను పద్ధతిలోనిది. ౧. "బుద్ధుఁడు మానవుల నుద్ధరింపఁడు; తన్నుఁ దా నెట్లుద్ధరించుకొనెనో, వారును దమ్ముఁదామే యుద్ధరించు కొను నుపాయములఁ జెప్పెను. ప్రజాలాతని యుపదేశము నంగీకరించుటకుఁ గారణ మాతఁడు చెప్పినాఁడని కాదు; అతఁ డిచ్చిన ప్రోత్సాహముచే యత్నించినవారి మనస్సులందతని యుపదేశజ్ఞానము సమానమై స్ఫురించినది." ౨. ఆతనిపద్ధతి మనస్తత్త్వవిభాగము: అసమంజసమగు తత్త్వభాగములకుఁ జోటీయక, తాను స్వయముగా ననుభవములోఁ జూచినవిషయము లను సమన్వయించి, యథార్థములని తనకుఁ దోఁచిననిర్ణయము లచే దుఃఖమయలోకము నుద్ధరింపఁబూనుకొనెను. "వస్తు స్వస్వరూపములను జూచునాతఁడు, మిథ్యాభావములను, ఛాయ లను నమ్ముటమాని, శివస్వరూపమైన సత్యమును దర్శించు"నని యాతనిభావము. తత్త్వభావ వీథీవిహారములను విడిచి, జగ త్సత్యక్రమధర్మము నాతఁడు నిరూపించెను. జ్ఞాన మనుభవ

---

౧. సంయుత్తనికాయము 3 అ. ౨. ఓల్డెన్‌బెర్గు. బుద్ధ.

చెప్పినాఁడు; "గౌతముఁడు హిందువైపుట్టి పెరిగి, హిందువైజీవించి హిందువై మరణించెను. గౌతముఁడుచెప్పిన తత్త్వము, సిద్ధాంతములును, హిందువుల వైదికమతశాస్త్రములలో నెచటనో యొకచోటనున్న వే; బుద్ధుని నీతినియమములునట్టివే. ఇతరు లిదివఱకే బాగుగా నిర్వచించిన విషయములనే సంస్కరించి, కుదించియుఁ బెంచియు, గ్రిమరూపమిచ్చియు నాతఁడు సమన్వయించెను. అదివఱకే సుప్రసిద్ధులైన భారతీయవైజ్ఞానిక శిఖామణులు ప్రచురించిన ధర్మసూత్రములను బరిశీలించి వానినుండి విశాలనియమములను నిర్ణయముల నాతఁడొక నూతన దృక్పథములో నిర్మించినాఁడు. ఇతర హిందూధర్మప్రవక్తలకు నితనికి భేదమంతయు, నితనికిఁ గలయపూర్వనిష్ఠ, విశ్వవిశాల కృపాంతరంగములోనే యున్నది."౧. "బౌద్ధమతము బ్రాహ్మణమతములోని వివిధమతసిద్ధాంతములనేగాకుండ, చారిత్రకుని దృష్టిలోఁ దక్కువ విలువకాని, ఆత్మదృష్టి. ఆస్తికవైఖరీతత్త్వమును ముఖ్యముగా గ్రహించెను. ఈయాత్మదృష్టి గ్రహింపవలసినదేకాని వర్ణింపసాధ్యమైనదికాదు." ౨. కర్మకలాపమందసహ్యాభావముపనిషత్తులకు బౌద్ధమునకు సమానమైనదే. ఇతర భారతీయార్య ప్రపంచముతోఁబాటు బౌద్ధమతమును గర్మసిద్ధాంతమును తన్మూలమున నిర్వాణమును లభించునని విశ్వసించెను. ఉపనిషత్తులలోఁగూడ నితరహిందూమతశాఖలన్నియుఁగూడ దుఃఖము, క్లేశమయజీవితము నిహాలోకప్రధానసత్యము లని యంగీకరించియేయున్నవి. బుద్ధుఁడు తనధర్మమునకు నుపనిషద్ధ

౧. బుద్ధిజమ్ పుటలు. ౨౩-౨౪. ౨. ఓల్డెన్ బెర్గు బుద్ధుఁడు పుట ౫౩

ర్మమునకును భేదమున్నదని తలంచి యుండలేదు. ఉపనిషత్తుల యొక్కయుఁ దదనుచరులయొక్కయు సానుభూతి తనకుగల దని యాతఁడు నమ్మెను. తనమతమందుగల అజ్ఞానులను, జ్ఞానులనుగూర్చి యెంతగౌరవ భావమాతనికుండెనో, బ్రాహ్మ ణుల నంత గౌరవభావముతోఁ జూచెను. జన్మచేతనైన బుద్ధ మతము హిందూమతశాఖయే. "హిందూమతము, హిందూదేశమునఁ బుట్టి, పెంపొంది, వ్యాపించెను."౧. మేము రచించిన పూర్వ భాగ ములలో, నుపనిషత్తత్త్వమెట్లు బౌద్ధమత [illegible] టకుఁ బ్రయత్నించితిమి.

౭—దుఃఖము.

తన యాత్మానుభవముచే బుద్ధుఁడు నాలుగువిషయ ములు సత్యములని నిశ్చయించెను. ఒకటి దుఃఖము,౨ రెండు దుఃఖ కారణము,౩ మూడు దుఃఖము నివారింపనగును,౪ నాలుగు దుఃఖ నివారణోపాయము.౫

మొదటి మహాసత్యవిషయము [illegible]. [illegible] దుఃఖానుభవము. "ఇది దుఃఖమునుగూర్చిన మహాసత్యము. జన్మము దుఃఖము. జర దుఃఖము, రోగము దుఃఖము. మర ణము దుఃఖము, అనిష్టప్రాప్తి దుఃఖము. ఇష్టవియోగము దుఃఖము, తృప్తిచెందని యేయితరకామమైనను దుఃఖమే, ఒక మాటలో, మోహాసంగములనుండి జనించిన పంచరాసులును దుఃఖమే."౭ బుద్ధునియుగమందు నునిశిత మేధావులు, గంభీ

౧. రైస్‌డేవిడ్సు. బుద్ధిజమ్. పు. ౮౫. ౨ దుఃఖము; ౩ సముదయము. ౪. నిరోధము; ౫. మార్గము. ౬. కేరా, భావన, దర్శన, సంశ్య హేతు వులు. ౭. ధర్మరాజ్యస్థాపనము. పుట ౫.

భావసమన్వితులు, నిత్యసంభ్రమణశీలమైన యాజీవితమున కర్థమేమియని యడుగుచుండఁగా దుర్మార్గులు బాధించుటకు శక్యముగా నట్టిది, ఆయాస ముడిగి శాంతినిచ్చునదియు నగు నిర్వాణము ననఁగా, దుఃఖతరణోపాయమును గోరుచున్న జనులకు బుద్ధుఁడు తనసందేశమును వినిపించెను. జీవితము దుఃఖమయమను విషయములో బౌద్ధమతము ప్రత్యేకముగాఁ జెప్పినదేదియుఁగాను; బుద్ధుఁడీవిషయము ననవసరముగా నతిశయోక్తితోఁ జెప్పెను. మానవ విజ్ఞానచరిత్రమునందు, జీవితదుఃఖలక్షణములను బుద్ధుఁడు వర్ణించినంత ఘోరస్వరూపములో, విషాదకరపదజాలముతో నెవ్వఁడు వర్ణించియుండలేదు. ఉపనిషత్తులలో సూచింపఁబడిన విషాదభావము బౌద్ధమతములోఁ గేంద్రస్థానము నాక్రమించినది. స్వయముగాఁ గోరి వరించిన దారిద్ర్యజీవితాదర్శము, ఆత్మార్పణమహత్త్వము, సర్వసంగత్యాగము బుద్ధుని మానసమును మంత్రమువలె బంధించెను. ఈ లోకమునుండి తరణోపాయమునకై, ప్రజలను యత్నింపఁజేయుటకై, లోకదుఃఖ మతిశయముగాఁ జిత్రింపఁబడెను. ఇహలోకమునందుఁ బ్రజలసుఖమునకై సర్వయత్నములు చేయవచ్చును. సంఘములో సధర్మమును నిర్మూలింపవచ్చును గాని, మానవునికిఁ దృప్తి లభింపదు. బుద్ధుఁడు బ్రతుకే దుఃఖమనియు, వ్యక్తిత్వమును బోషించుకొనుటకుఁ జేయు కృషియే దుఃఖమనియు, చంచలలక్ష్మీకటాక్షము భయంకరమనియు నిర్ణయించెను.[౧]

౧. బుద్ధుఁడు చెప్పెను; "జీవుల సంసారమున కాదిలేదు, అజ్ఞానపంకమగ్నములై, తృష్ణాశృంఖలాబద్ధములైన జీవులు స్వేచ్ఛనొంది విహరించుటకు దారిలేదు. వత్సలారా! మీ రెంతయో ప్రేమతోఁ గోరినది లభింపక, హా

మానవజీవితము శాపగ్రస్తమని తోఁచును. ఊహచే బాధింపఁబడి, అదృష్టముచే మోసగింపఁబడి, ప్రకృతిశక్తులచేఁ బరాజయమంది, అనంతమైన కర్తవ్యభారముచేఁ గ్రుంగి, మరణభీతిచే స్థైర్యముచెడి, రాఁబోవుజన్మములలో నిట్టిదుఃఖపరంపరయే తిరిగి ప్రాప్తించుననను విషాదము చుట్టుముట్టి, మానవుఁడు, "ఇచట నుండి పారిపోవుదును; మరణమే శరణ్యము"ని మొఱపెట్టును. ఇహలోక దుఃఖజాలమునకు మందు దానినుండి తొలఁగిపోవుటయే.

అనిత్యత్వమునుగూర్చి వర్ణింపనలవిగాని విచారము, సత్ప్రవర్తనముయొక్క విషాదకరమైన వ్యర్థత్వము, బుద్ధిమంతులను జలింపఁజేయు సత్యములు. థియోడిసీపత్రికలో(౧౭౯౧) "తత్త్వనిర్మాణప్రయత్న వైఫల్య"మను శీర్షికతో వ్రాసిన వ్యాసమందు, క్యాంటుతత్త్వవేత్త, లైబ్నిజ్ ప్రకటించిన జీవితమునందలి ఆశోత్సాహవాదమునకు సమాధానముగా నిట్లు వ్రాసినాఁడు; "సమ్యక్పరిశీలనముగలిగి, వయస్సుగడచిన వ్యక్తియెవఁడైనను, మానవజీవితముయొక్కవిలువనుగూర్చి పరిశీలించినచోఁ, దానిది వఱకు జీవించిన పరిస్థితులలోనే కాక, యేయితరపరిస్థితులలోనైనను, మఱల నీదరిద్రమానవజీవిత నాటకరంగమునఁ బ్రవేశింప నిష్టపడునా ?" మహాతత్త్వవేత్తల విషాదదుఃఖములు వారిజ్ఞానముచేఁ గలిగినవై యుండవచ్చును. ఊహయే కాని ఆలోచనలేనివారికింత విషాదముండదు.

బుద్ధుఁడు లోకజీవితముయొక్క దుఃఖపక్షము నెక్కువచేసి వర్ణించినమాట సత్యము. జీవితమునుగూర్చిన బౌద్ధుల

నిచ్చునా ?" ౧. బౌద్ధుఁడిట్లడుగును: "లోకము దుఃఖాగ్నిఁబడి దహనమగుచుండఁగా, నవ్వులాట సంతోషము నెట్లున్నవో ! అంతయుఁ జీఁకటిమైయుండఁగా, గాంతికొఱకు కేలయత్నింపరు ? జరాదౌర్బల్యములచే నీదేహము క్షీణించిపోవును; పాపరాశిమైన శరీరము భస్మము కాక తప్పదు. పుట్టినవానికిఁ జావు తప్పదు." ౨.

పావనత్వము, నిస్సంగత్వము లేని యిహలోకజీవితము జీవనయోగ్యము కాదనుట నిరాశావాదమైనచో బౌద్ధమత మట్టిదే పరలోకమునన్న యానందముకొఱకిహలోకజీవితమును బలియొసగుమనుటే నిరాశాతత్త్వమైనచో బౌద్ధమట్టిదే. కాని యిది సక్రమమైన నిరాశాతత్త్వము కాదు. ఆశ కవకాశమే లేదని, "ఇహలోక జీవన మాయాసాస్పదము; పరసుఖము ను లేద"ని వచించునది నిరాశావాదము. కొన్ని బౌద్ధశాఖలిట్లే చెప్పుటచే నవి నిరాశాతత్త్వములుగా నెన్నఁబడెను. కాని పూర్వబౌద్ధధర్మ మట్టిదిగాదు. జీవితమొక యనంతదుఃఖ పరంపరయని యది చెప్పునుగాని, మానవస్వభావము పరిపూర్ణత నొందఁగలదనియు, నైతికశిక్షణము ముక్తి నీయఁగలశక్తి యనియు నది వచించును. బుద్ధునిమానసము సృష్టివిషాదభారముచేఁ గ్రుంగినను, నదియొక మహోద్దేశశూన్యమైకాదు. కామమును, సర్వకామములను జయించుశక్తిగలదై యున్నది. ప్రతిమానవుఁడు తన భారమును వహింపవలసియున్నాఁడు; ప్రతిహృదయము తనక్లేశచరిత్ర నెఱుఁగును; వినను. వీనిద్వార

౧. కథము. ౧౪. ౧౫౬. (౨) ధమ్మపదము. ౧౧౪. ౧౪౬,౧౪౮.

పరివాహాత్మకమైన జీవి నిమిత్తసూత్రబద్ధమైనది. "ఓరాజా ! మూఁడువిషయములు లోకమున దుర్లభములు. తెలిసికాని, తెలియకగాని, జరామరణములకు లొంగని దీ లోకమునలేదు. అశాశ్వతముకాని గుణముగలదేదియు నీలోకమున దొరకదు. పరమసత్యస్వరూపమైన వస్తువిచట లేదు." ౧. "అనిత్యమైనది, ఓమునులారా ! సుఖమా, దుఃఖమా ?" "గురువరా ! దుఃఖమే." ౨. అనిత్యత, దుఃఖము నొకటే. కోరిక దుఃఖకారణము; ఏలన మన మనిత్యము, పరివర్తనశీలము, నశ్వరములైనవానినే కోరుదుము. మనము కోరినవస్తువుయొక్క అనిత్యతయే మనకాశాభంగమును విచారమును గలుగఁజేయుచున్నది. సుఖములన్నియు క్షణికములు. జీవితము దుఃఖాత్మకమను మూలసిద్ధాంత ముపనిషత్తులనుండియే గ్రహింపఁబడినది.

బుద్ధుఁడు లోకములో సర్వ మశాశ్వతమని నిర్ణయించి, శాశ్వతమైనదొక్క ఆత్మయే యనఁదగినచో నది యీలోకవస్తువుకాదని వాదించినాఁడు. ప్రతివస్తువు అనాత్తా (అనాత్మ.) "దేహము, ఇంద్రియ వ్యాపారము, దర్శనము, సంఖరములు, చేతసత్వము నన్నియు నశ్వరములు, దుఃఖహేతువులు. అన్నియు ననాత్మస్వరూపములే." ఇందేదియు సత్యముగాదు; కేవలసత్యాభాసములు. మనము జీవమనుకొనునది శుష్కక్రియాసంపుటియై, దానికొఱకు బాధపడవలసినంత వస్తువు

౧. మిళింద. ౪ ఆ. ౭. ౧౨. చూడు. భిక్షుణీసంయుత్తము; ధమ్మపదము. ౫ ఆ. ౪౭-౪౮; ఓల్డెన్‌బర్గ్ బుద్ధుఁడు. పుటలు. ౨౧౮-౨౧౯.

౨. [illegible]కాయము. 3 ఆ. ౧౯; బుద్ధఘోషుఁడు. అత్థసాలినీ

గాదు. మానవులు కలహించుటకుఁగారణ మజ్ఞానము. "జరా మరణములు, దేనినుండి దేనిపై నాధారపడి వచ్చుచున్నవి? అవి జన్మముపై నాధారపడి జన్మించుటవలన వచ్చుచున్నవి. అజ్ఞానమణఁగినచో, భావములణఁగును; భావములుపోయినచో దుఃఖానుభవము నశించును.[3] తుచ్ఛకాంక్షలజ్ఞాన జములు. అజ్ఞానోదయముతో దుఃఖాంధకారము పటాపంచలగును. అజ్ఞానము, దుష్కామము నొకేసత్యముయొక్క భావకర్మములై యున్నవి. నిరర్థక మూర్ఖసంకల్పము తుచ్ఛకామ సంజాతము; తుచ్ఛకామము వ్యర్థసంకల్పజాతము. అనుభవములో రెండు నొకటే. బౌద్ధులకు, హిందూతత్త్వవేత్తలకు జ్ఞానము, సంకల్పము నొకటే: వానికి భేదము లేదు. చేతనమను శబ్దములో నాలోచన, సంకల్పముగూడఁ గలవు. ఆలోచనా పరిశ్రమ, బుద్ధి సంకల్పశుద్ధి మార్గములు. జీవితమున కజ్ఞానము మూల కారణము. స్పష్టమై, సునిశితమై, పరిశీలనాత్మకమైనయొక్క చూపునకే, లోకమందన్నియు, భార్యాసుతులు, కీర్తిగౌరవములు, ప్రేమభాగ్యములు క్షణికములని, వ్యర్థములని తెలియఁ గలదు. "దేనిని మనమునమ్మి బ్రతుకఁజూచిన నది మన కసంతృప్తినేయిచ్చును."[౧]

౨౫,౦౦ సంవత్సరముల వెనుక, బుద్ధుఁడు మనకొక అనుష్ఠానతత్త్వమును నిర్మించి యిచ్చినాఁడు. నేఁటి భౌతిక శాస్త్రము, విజ్ఞానము నట్టితత్త్వమునే నిర్మింప యత్నించుచున్నది. భౌతికవస్తు స్వభావమునుగూర్చిన విద్యుదాకర్షణ

3. లలిత విస్తారము.

౧. మజ్ఝిమనికాయము. ౩౨.

సిద్ధాంతము (Electro-Magnetic theory) భావప్రపంచమున విప్లవము కలుగఁగఁజేసినది. పదార్థము జడముకాదు; నిత్యస్పందమైన యణుశక్తి గర్భితము. యమ్. బెర్గ్సన్ చేరచితమైన 'మనశ్శక్తిగ్రంథమువలన, మనస్తత్త్వమునఁగూడ నొకవిప్లవము సంభవించినది. వస్త్వనిత్యత్వము, తెంపులేని పరివర్తనములనుండి, బుద్ధుఁడొక పరిణామసిద్ధాంతమును నిర్మించెను. ఆత్మలు, జీవనములు, నిత్యముమార్పునొందుచున్న సంచలనశక్తులు, ప్రవాహరూపములునని బుద్ధుఁడు నిరూపించెను. దృశ్యాదృశ్యరూపపరంపరల సముచ్చయమే జీవితమని యాతనిభావము.౨. అదియొక పరుగిడుచున్నప్రవాహము.3. ఇంద్రియములకు, శాస్త్రమునకు గోచరించు లోకము క్షణక్షణము మాఱుచున్నది. పౌనఃపున్యముగా సంభవించు జననమరణచక్రపరిభ్రమణమే జీవితము. జీవితము విద్యుచ్చంచలమైనను, శతవర్ష పరిమితమైనను,పరివర్తనాత్మకమే. సర్వము మార్పే. మానవదైవ సంబంధములన్నియు మార్పునకులోనైనవేయని బౌద్ధశాఖలన్నియు నంగీకరించును. బుద్ధుఁడు మన కనలోదాహరణమిచ్చి, పెక్కుపరివర్తనముల సముచ్చయరూపమే లోకమని ఋజువుచేసినాఁడు.౫

౨. పాతుభావో౽తప్పాదో. 3. "వస్తువులన్నియు మారుచున్నవి." "అస్థిరస్థితియే సత్యము". (హెరాక్లిటస్, ఫ్రాగ్మెంట్సు. ౪౬, ౮౪). ౪. పోల్పు. హెరాక్లిటస్ : "నిత్యము మారుచున్న అగ్నియే జగము". బుద్ధుఁడు, హెరాక్లిటస్, ఇరువురు నతిక్షణికమగు నగ్నినే, ప్రపంచక్షణికత్వసిద్ధాంతమును ఋజువుచేయుటకుఁదీసికొనిరి. (౫) మహావగ్గము. ౧ అ.౧౨౧.

" లోకపరంపరలు, సృష్టిలయముల మధ్యమందు
నిత్యము పరిభ్రమించుచున్నవి; నదీప్రవాహము
పైనీటిబుడగలవలె నవిపుట్టుచు, బ్రకాశించుచు,
జితికిపోయి నీటఁగలిసి కొట్టుకొనిపోవుచున్నవి"౬.

అగ్నిజ్వాలయెడతెగనిదై కన్పట్టుచున్నను, బ్రతిక్షణము నది నూత్నజ్వాలయే. ప్రవాహము నిత్యము నూత్నజలముచేఁ బోషింపఁబడుచున్నది. సర్వమెడతెగనిమార్పులోనున్న దనునదే బౌద్ధతత్త్వకేంద్రసత్యము. లోకములోనున్న దేదియుఁ బరిపూర్ణ సత్యలక్షణమును గలిగియుండలేదు.

"జన్మించిన దేదియు మరణింపకుండ నుండనేరదు" ౧.

"పుట్టుక కేదివశమైనదో, అదినాశమునకు బలియగును."౨ జన్మించినసర్వము మరణించుట దురతిక్రమణీయము. జీవించు కాలపరిమితిలోనే భేదముకలదు. కొలఁదిమంది కొన్నిసంవత్సరములు, మిగిలినవారు మిక్కిలి స్వల్పకాలముమాత్రమే జీవింతురు. పరివర్తనమే సత్యగర్భము. ప్రపంచమునకు నిత్యతగాని యేకత్వముగాని లేదు. అదియొక శక్తిప్రసరణమే. ప్రకృతివస్తువులు ప్రదర్శించుమార్పులు, నాశనములవలన నీభావ ముదయించి యుండనగును. మన మెఱిగిన జీవిత మవిచ్ఛిన్నపరివర్తనమే. సజీవప్రపంచము మన మనఃప్రతిబింబము. ప్రతిస్వరూపము పరిణామదశలో నొకతాత్కాలికావస్థయై. యట్టిదశాపరంపరల సముచ్చయమే 'ధర్మదాతువు' లేక లోకమగుచున్నది. "ఓ కచ్చాణా! ఈప్రపంచము ద్వైతభావమునుండి జనించుచున్నది:

౬ షెల్లీ: హెల్లాస్.

'అది ఉన్నది,' 'అది లేదు' అనునవి రెండుభావములు. కాని సత్యము జ్ఞానము నెఱిఁగినవారు లోకములోనివస్తువులన్నియుఁ దమకన్నుల యెదుటనే పుట్టుచున్నవని తెలిసి, "అదిలేద'నుట కవకాశములేదని గ్రహింతురు. సత్యజ్ఞానములుగలవారు వస్తువులెట్లు రూపరహితములై పోవుచున్నవో చూచినచో "అది యున్నది" అనిచెప్పఁజాలరు. "సర్వము నున్నద'ను నదొక భావము. ఓకచ్చానా ! ఏదియును లేదనునదొక విపరీత భావము.సత్య మీరెంటికి మధ్యమస్థితి[3]. అనాద్యనంతమైన పరివర్తనమే యున్నది. ఈపరివర్తన మొక్కముహూర్తకాలమాగి యొకవ్యక్తి యేర్పడుకాలమెన్నఁడును దటస్థింపదు. నామరూపములచే నొకవస్తువును గుర్తించులోపుననే యది మాఱిపోయి, యింకొక వస్తువగుచున్నది.[4]

ఇట్టి మహాపరివర్తన ప్రవాహములోఁ జలనములను గూర్చి కాక, వస్తువులఁగూర్చి యెట్లూహించుట ? ఒకదాని వెనుక నొకటివచ్చు మార్పుల కంథులమై యూహింపవచ్చును. పరివర్తన ప్రవాహములోఁ గొన్నిచోటులందు గుర్తులు పెట్టుకొని,యాగుర్తులమధ్యమందున్నవి వస్తువులని తలఁచుచున్నాము. వస్తుసమానత్వము నిజముకాదు. వివిధదశాసంబంధములచే నిలకడ గలలోకమును మనము నిర్మించుకొనుచున్నాము.ప్రపంచ మనఁగాఁ బరస్పరసంబంధముగల,కారణకార్యములయొక్కయు

౧. అభిధమ్మకోశ వ్యాఖ్య. ౨. మహావగ్గము. ౧–౨౩. 3. సంయుత్త నికాయము. ఓల్డెన్‌బెర్గు: బుద్ధుఁడు. పుట ౨౪౯. ౪. చూడు. సంయుత్త నికాయము. ౨౦ అ. ౯౦.౧౬

పూర్ణత్వాంశముల యొక్కయు, వస్తుగుణములయొక్కయు బొంభవ్యములు కావలసియున్నవి. స్థిరములైనవని మనము తలఁచున వెనిమిదిసంబంధభావములు; సృష్టిలయములు, ఆరంభవిఘ్నములు, ఏకత్వము ననేకత్వము, రాకపోకలు, వస్తుస్థిత్యస్థితులస్వభావములైన నన్యోన్యసంబంధములు లేనిదే యుండఁజాలవు. ఈసంబంధములన్నియు ముఖ్యావసరములుగావు. అవి క్యాంటు పండితుఁడు చెప్పినట్లు, వస్తువుల స్వస్వరూపములైన సత్యములుగావు. ౧. అవి వ్యవహారప్రపంచమునసే వర్తించును. మన మెంతకాలమీ తాత్కాలికపరిమిత సంబంధములు సుస్థిరములని తలపోయుదుమో, అంతవఱకు సర్వదుఃఖములకుఁ గారణమైన అజ్ఞానమున నుంటిమని యర్థము. జీవిత మొకవస్తువుగాని, వస్తుదశగానికాదు; అదియొక అనవరతపరిణామము. బెర్గ్సన్ తత్త్వమిందు బీజప్రాయముగ నున్నది.

పరివర్తనముయొక్క అవిచ్ఛిన్నత్వమునకే మనము వస్తునామకరణము చేయుచున్నాము. బిడ్డఁడు—పిన్నవాఁడు యువకుఁడు—మధ్యమవయస్కుఁడు—వృద్ధుఁడు నొకఁడే. బీజము వృక్షము నొకటే. వేయేండ్ల మనుగడగల వటవృక్షము, నొక చిన్నబీజమునుండి యుత్పన్నమైన అంకురమే. ఎడతెఱపిలేని చలనమే వస్తువునకు రూపము నిచ్చుచున్నది. మన దేహకారణమైనపదార్థము, ఆత్మకారణమైన చేతనశక్తి. క్షణక్షణము మాఱుచున్నను, దేహము, ఆత్మ పూర్వరూపములేయని భ్రి

౧ బుద్ధఘోషు నభిప్రాయములోఁ గాలమనునది వివిధదశలను జూచి మనమభ్యాసముగాఁ బెట్టుకొన్న నియమమే.

మించుచున్నాము. కొన్ని దశాపరంపరల నొకవస్తు వని చెప్పు దుము: అందు మొదటిదశ రెండవదశకుఁ గారణమందుము; ఏలన, మొదటిది రెండవది సమానముగానే యున్నట్లు గోచరించును. భ్రాంతిమాత్రమైన యేకవస్తుసమానత్వము, అనేక క్షణికదృశ్యసముచ్ఛయము; దాని అవిచ్ఛిన్నత, నిత్యపరివర్తన శీలమైన ఏకత్వమని చెప్పవచ్చును. అనేక తాటస్థ్యముల సంఖ్యయే ప్రపంచము. అనుక్షణము నవి దృశ్యమగుచు, నదృశ్యమగుచు, నూతనదృశ్యము లేర్పడుచు నిట్లే నడచుచుండును. వేగముగాఁ ద్రిప్పుచున్న యొకనిప్పుగల కఱ్ఱ, పూర్ణమైన జ్వాలాచక్రమను భ్రాంతిని జనింపఁజేసినట్లే పరివర్తనవేగాతిశయముచేత, విశ్వ మొకస్థిరమైన రూపమనుభ్రాంతి జనించుచున్నది. భ్రాంతిజాతమైన యట్టివస్తువున నొకరూపము, నామము నొసఁగుట మనకు వ్యావహారికముగా నవసరమైనపని. నామరూపముల సమానత్వము నామరూపముల వెనుకనున్న వస్తుసమానత్వమును సూచింపదు. మఱియు, నట్టివస్తువున కొకనిత్యత్వ మాపాదింప యత్నించుట కేవల మానసికవ్యాపారము. మనమది వర్షించుచున్నదందుము. వర్షమున్నదికాని 'అది' యేదియును లేదు. చలనముతప్ప వేఱేమియును లేదు. కర్త లేనికర్మం. వస్తువులేని చలనమున్నది.

మార్పుల కన్నిటికాధారభూతమైన యొకమార్పులేని వస్తువునకు బదులుగా బుద్ధుఁడు కారణధర్మమును బ్రకటించి, దానివలనఁ బరివర్తనముయొక్క అవిచ్ఛిన్నతను నిరూపించెను. విశ్వవ్యాప్తమైన కారణధర్మము, తదంగమైన యనంతావిచ్ఛి

న్న తానూత్రిము నివియే బుద్ధమతము భారతీయ విజ్ఞాననిధి కొసగిన రత్నములు. స్థితి మార్పే; అది మార్పులపరంపర అన్నిటికి "ఉత్పాద, స్థితి, జరానిరోధములు" గలవు. "లోకములో నేదియున్నను నది, కారణావస్థాసంజాతము, పూర్ణముగా ననిత్యము." కారణభవమెల్ల నశించును."ఏదేదిపుట్టి, రూపము కలిగి, గోచరించునో, ఆయావస్తుగర్భమునందే దానినాశన బీజములున్నవి. "సముచ్చయపదార్థము వార్ధకము నొంది తీరును." ప్రతివస్తువు కల్పితము; దానిస్థితి అవిచ్ఛిన్నపరివర్తన ములసంపుటి; ప్రతిపరివర్తనమునకుఁ బూర్వపరివర్తనమే కారణము. ఒకవస్తువనఁగా, నొకశక్తి, ఒకకారణము, ఒకయవస్థ. దానినే ధర్మమందురు. బుద్ధుఁడు చెప్పినాఁడు; "నేనొక ధర్మమును జెప్పుచున్నాను. ఉన్నది మాఱును. దాని యుత్పత్తిచేనిదియు వచ్చినది. అదిలేకున్న నిదియును లేదు"౧. బుద్ధునికి నుపనిషత్తులకు వలెనే, ప్రపంచమంతయుఁ గారణబద్ధమైనది. వస్తువులకు స్వయంస్థితిలేదనియు, నవి కారణజాతమైన కార్యపరంపరయనియు నుపనిషత్తులుచెప్పగా, వస్తువులవస్థాసంజాతములని బుద్ధుఁడు చెప్పను. పూర్వబౌద్ధమువలెనే, ఉపనిషత్తులును విరతిలేనిమార్పు, అనవరత పరివర్తనక్రిమముగల యీలోకములో మానవునకు శాంతినిచ్చు స్థానము లేదని స్పష్టముగాఁ జెప్పినవి.

వ్యవహార ప్రపంచమునఁ బరస్పరాధారభూతమైన సంబంధముచే "పతిచ్చసముప్పాదము"చే వస్తుస్థితి యేర్పడును.

---

౧. మజ్ఝిమనికాయము. ౨౮. ౩౨

కారణవిధానము స్వయముగాఁ బరివర్తనముగలది. ఒకవస్తువు యొక్క స్వస్వరూపము, లేక ధర్మమా వస్తువునందు గర్భితమై యున్న సంబంధన్యాయమే. మార్పుపొందువ్యక్తి యొకఁడు లేఁడు, మార్పు స్వయంపరివర్తనముగలది. న్యాయసిద్ధాంతము చెప్పునట్లొకవస్తువున కింకొకటి కారణమని చెప్పుటకు వీలు లేదు. ప్రపంచపరిణామము స్వశక్తిపై నాధారపడినదని యెట్లు చెప్పవచ్చునో యట్లే, కారణసూత్రమును స్వయంప్రభావము గలదని చెప్పవచ్చును. సర్వపరివర్తనములకుఁ గారణసంబంధము వర్తించును. గతమంతయు ముందుకుఁబోవుచున్న పరివర్తన ప్రవాహములోఁ గొట్టుకొనిపోవుచుండును. బాహ్యప్రపంచమున సంబంధములే మనకుఁ దెలియుటచేఁ గారణసంబంధమును జెప్పఁజాలము. కాని యాంతర్యప్రపంచమున, మన సంకల్పము స్పష్టమైనకారణమని మన మెఱుఁగుదుము. కాని యన్నిటిలోఁ బనిచేయునదొకేశక్తి. దానినే షోపెన్హోయరు సంకల్పమనెను; బుద్ధుఁడు కర్మయని చెప్పెను. ఇదియే మూల సత్యము; జగత్కారణము. బాహ్యప్రపంచమునఁ గారణ కార్యసంబంధము స్పష్టము. అధునాతన తత్త్వము లెంతకృషి చేసినను, కారణవాదము నింతకంటె స్పష్టముగాఁ జెప్పలేక పోయినవి. కారల్ పియర్సన్ మున్నగు ప్రకృతిశాస్త్రవేత్తలు కారణవాదమును సంబంధవాదముగా మార్చుట మంచిదని చెప్పుచున్నారు. కారణకార్యములు, ఒకే ప్రవాహముయొక్క పూర్వాపరదశలను దెల్పును. నడచుచున్న విషయములను, కారణసూత్రముచేఁ జెప్పుదుముకాని, యావిషయముల న్నెల

యున్నవో చెప్పఁజాలము. మూలకారణముల సమస్య తత్త్వశాస్త్రములోనిది; మనయనుభవములోఁ జేరునవి ద్వితీయకారణములు. బౌద్ధమతాశయము, తత్త్వమును నిర్మించుటగాదు; భౌతికపరిస్థితి వర్ణనము మాత్రమే. అందుచే నొకవస్తుదశకుఁ గారణమడిగినచో బుద్ధుఁడు ఆదశకున్న పూర్వదశను వర్ణించి ప్రకృతిశాస్త్రవేత్తల ననుకరించినాఁడు.

కారణాత్మక పరిణామ మొక చలనపరంపరగలిగిన జడప్రకృతిగాదు. అట్లయినచోఁ బ్రతి దశాపరంపరయు నశించుట, తిరిగి నూతన దశాపరంపర ఉదయించుచుండుటయు జరుగవలసియుండును. ఒకేదశాపరంపర, స్వయంశక్తిగలిగి, యింకొక దశావరంపరగా నదియే మారుచున్నది. గతదశయే భావిదశారూపమగుచున్నది. శక్తిని పరంపరాను గతముగా నొసగు పరిణామ తత్త్వమును బౌద్ధమతము నమ్మును. ఒకదశ, నూతనదశాబీజమునకుఁ దన శక్తినొసగుచుండును. బౌద్ధకారణవాదము బీజము వృక్షముగామాఱుపద్ధతి; ఇందు బీజవృక్షము లొకదానికొకటి యవసరము.జీవితమంతయు నొక శక్తి; అదిమనకుఁ జూపట్టదుకాని, యున్నది; దానిశక్తి మన కాంతరంగికముగా ననుభూతము. ప్రపంచపరిణామము స్వయంవికాసశీలము గలది, అది ఒకదానివెనుక నొకటిగా నుదయించుచున్న యెడతెగని రూపపరంపరగా గోచరించును; కాని యదొక అవిచ్ఛిన్నవికాసము; ఒక అవిభాజ్యమైన రాగమువంటిది. గతము వర్తమానానుగతమై, బాహ్యదృష్టి కనేకము లగుముందువెనుకలు గలవిషయపరంపరవలె గోచరిం

చును. అప్పుడు జీవితమనఁగా నొకదానివెనుక నొకటిగా వచ్చు దృశ్యపరంపరయే. కారణవాదమనఁగా, నాగసేనుఁడు చెప్పిన ట్లొక దశాపరంపరయే.

పూర్వబౌద్ధము, నుపనిషత్తులు ప్రకటించిన జగదనిత్యత్వసిద్ధాంతమునే, అనంతరబౌద్ధతత్త్వవేత్తలు క్షణికవాదముగాఁ బెంపొందించిరి. వస్తువు లనిత్యములని చెప్పుటకును, క్షణికములని చెప్పుటకును భేదమున్నది. వస్తువులుగాక, వస్తుజ్ఞానమే క్షణికమని బుద్ధునభిప్రాయము; ఏలన నాతఁడిట్లు చెప్పెను "శరీరమొక యేఁడు, లేక నూఱేండ్లు నుండును: లేక నధికముగా నుండును. కాని, మనస్సు, బుద్ధి, చిత్తము ననఁబడున దహోరాత్రములందు నిత్యము మాఱుచు నొకక్షణములో నశించుచు, నింకొకక్షణములో నుదయించుచున్నది." ౧. శరీరము, మనస్సు,చిత్తము మున్నగునవి 'ఆత్మ' కాదని ఋజువుచేయుటే బుద్ధునియాశయము. ఇవి నిత్యములుగావు. వస్తువుల అనిత్యతను జెప్పినప్పుడు క్షణికత్వమని భావముగాదు. మనస్సునుగూర్చి చెప్పునపుడే బుద్ధుఁ డనలము నుదాహరణముగానిచ్చెను. ఒక దీపజ్వాల, అనేక క్షణికజ్వాలలపరంపర; ప్రతిజ్వాలయు నొక క్షణమే యుండును. చిత్తపరిణామమట్టిదేనని భావము. చిత్తవికారములక్షణికత్వమునకు,వస్తువుల అనిత్యత్వమునకు భేదమును బుద్ధుఁడు స్పష్టముగా గుర్తించినాఁడు. ఈక్షణికత్వములన్నిటికిఁ జెప్పినచో నదియే క్షణికవాదము. అనంతర బౌద్ధవాదులం సర్వము క్షణికమని నమ్మెదురు. నిత్యస్థితి ఆత్మవిరుద్ధభావమని

౧. సంయుత్తనికాయము. ౨౪.౯౬.

వారు చెప్పుదురు. సత్త్వ మర్థక్రియాకారిత్వము. అంకురము లా నుదయింపఁజేయునదిగా బీజమున్నది. నిత్యవస్తువులిట్టి క్రియాశక్తిని గలిగియుండవు. మూడుకాలములలోను మార్పు లేని వస్తువులున్నచో, భిన్నకాలములలో భిన్నరూపముల నవి యేల ప్రదర్శించుచున్నవి? వస్తుమూలప్రకృతి మార్పు లేనిదనియుఁ, గొన్ని యితరపరిస్థితులలో నదియు బహిర్గతమగుననియుఁ జెప్పుచో, దానికి సమాధానముగా వారిట్లు చెప్పిరి. ఒకపనిని చేయుట కొకవస్తువునకు శక్తియున్నచో, నాపని నదిచేయును; చేయకున్నచో నాశక్తి దానికి లేనట్లే. కొన్ని పరిస్థితు లట్టిమార్పును, గలిగియున్నచో. నాపరిస్థితులే యున్నవి కాని, నిత్యవస్తుశక్తిగాదు. స్థితియనఁగాఁ గారణసామర్థ్యమైనచో, వస్తువులన్నియు ననిత్యములు. "ఒకజీవియొక్క జీవితదశాకాలము, సరిగాఁ జెప్పుచో, నతిస్వల్పము, నొకభావముండునంతకాలమే యుండునదియునని చెప్పవలెను. ఒకరథచక్రము కదలుచున్నప్పు డొకచక్రభాగముపైఁ దిరుగును; ఒకచక్రభాగముపై నాగును; అట్లే, జీవితమొక 'భావ' కాలపరిమితి గలది. ఆభావము పూర్తి కాఁగానే, యాజీవితమును బూర్తియగును." ౧. బౌద్ధమతము తరుణవయస్సునందే ప్రదర్శించిన యీ క్షణికవాదము ననుసరించినచో. చలనస్వభావము బోధపడుటకష్టము. ఒకవస్తువు కదలుచున్నట్లు కనబడినచో దానిచలన మనుక్షణము నుదయించుచున్నది; ఒక అగ్నిజ్వాలవలె నది క్షణక్షణము పుట్టుచునే యున్నది; ఏయొకక్షణములోను అదియొకేజ్వాల కాదు.

౧. విశుద్ధిమగ్గము ౨౫.

ప్రకృతి యొక అవిచ్ఛిన్నపరిభ్రమణము. కఠినకారణ సూత్రబద్ధమైన యొక అనంతపరిణామము. అది యెడతెగని యొక పూర్ణము, అవిభాజ్యమునైన ఏకత్వము. ఏమిజరిగినను సర్వప్రకృతిచక్రమందు నొకచలనము బయలుదేఱి వ్యాపించును. కేవల జడాత్మకప్రపంచమందైనను, బౌద్ధమతమొక విశ్వవిశాలనియమముండి, విశ్వక్రమ కారణమైనదని చెప్పును. "అదియొక బ్రహ్మాండస్వరూపమే కాని, దానికొక నిర్ణీతక్రమము లేదు." ౧. విశ్వరూపచక్ర మొకకర్తగాని, విదితమైన యారంభముగాని లేనిదై, కారణకార్యకేంద్రీకరణస్వభావముచే దొరలిపోవుచున్నది." ౨.

లోకక్రమమును పాళీభాషలో నియమ మందురు. క్రీ. పె. ౫వ శతాబ్దమునకుఁజెందిన బుద్ధఘోషునకుఁ గొంతపూర్వమును, పీఠకముల రచనానంతరమునను, పంచక్రమములు పేర్కొనఁబడినవి, కర్మనియమము లేక కారణకార్యక్రమము, ఉతునియమము లేక జడపదార్థక్రమము; బీజనియమము; చిత్తనియమము; ధర్మనియమము. సదసత్కర్మలు. శుభాశుభఫలితములనిచ్చునని చెప్పునది కర్మనియమము; ఒకవ్యక్తి చేయు శారీరక, మానసికాది కర్మలుకొన్ని, ఆవ్యక్తికిని, తత్సంబంధులకు దుఃఖమునుగలుగఁజేసి, మఱికొన్ని సుఖములనిచ్చును. ఇది విశ్వవ్యాప్తమైన నియమము. కర్మ, ఫలములవరుస నిది తెల్పును.

---

౧. పోపువాక్యములు.

౨. బుద్ధఘోషుఁడు. విశుద్ధమగ్గము. ౧౭.అ.

జీవ చలనపూరితమైన యీవిశ్వ మెడతెగని ప్రవాహమై, మాఱుచుఁ, బెరుగుచు, యత్నించుచుఁ, బోవుచున్నను నిందొక నియమమున్నది. పూర్వబౌద్ధమునకు బెర్గసన్ తత్త్వమునకు నిదియే భేదము. జీవితము నియమశూన్యమని, బెర్గసన్ మతము; బుద్ధుననుసరించి, జీవితమంతయు నొక సామాన్య నియమమున కుదాహరణము, జీవితమునుగూర్చియు, నియమమునుగూర్చియు బౌద్ధతత్త్వ మొక దివ్యకాంతియై,ప్రకృతిశాస్త్ర సిద్ధాంతములను బ్రకాశింపఁజేసి, వానికొకయర్థమిచ్చి, మానవుని నిగూఢస్వభావలక్షణములను దృష్టిపఱచును. నియమమున్నదను విశ్వాసము, మానవజీవితముపైనున్న దుఃఖభారమును దేలికపఱచి, ధైర్యమొసఁగి, యత్నమునలన, నీజీవితలంపటము నతిక్రమించి పోవచ్చునని ప్రకటించినది.

బౌద్ధమతమునకు నుపనిషత్తులకుఁగల ప్రధానభేదము, తాత్త్వికసత్యమైన నాశరహితనిత్యసత్పదార్థము, మానవునాత్మస్వరూపమై యున్నదనువిషయమునుగూర్చియే. విశ్వక్రమగతినిగూర్చి బుద్ధుఁ డంగీకరించియున్నాఁడు. అది శూన్యమునుండి జనించి, తిరిగి శూన్యమునకే పోవుచున్నదేమో చూడవలెను. బుద్ధుఁడొక సత్యమగు కేంద్రముగాని, ఒకనిత్యత్వనియమముగాని నిరంతరపరిభ్రమణాత్మకమైన లోకమున నున్నట్లు చెప్పియుండలేదుకాని, దానియర్థము, చలనశక్తులసంచారము తప్ప లోకమున నేదియు సత్యస్వరూపము లేదని కాఁజాలదు. దొరలుచున్న యీజగచ్చక్రమును మొదటఁ గదలించిన ప్రథమకారణమేది యనునదే ముఖ్యమైనప్రశ్న. దానికిఁ గదలిక

నెవఁడిచ్చెను ? మనస్సొకచలనము, లోక మింకొకచలనము నైనచో నీరెంటికి నేకస్థానమేదైన నున్నదా ? ఇంద్రియగోచరమైన ప్రపంచమునుగూర్చియే మనము తలఁచినచో నది దేనిపై నాధారపడినదో మనకుఁదెలియదు. తాఁబేలుపై నేనుఁగున్నదా యేనుఁగుపైఁ దాఁబేలున్నదా యనునట్లు, ప్రపంచకారణసూత్రమునకుఁ గర్తయీశ్వరుఁడో, లేక యొకపదార్థమో, లేక ప్రపంచము స్వయంసహాయశక్తిచే నిట్లుపరిణామమునొందుచున్నదో చెప్పఁజాలము. అనుభవాంశములనే బుద్ధుఁ డంగీకరించును. వస్తువులు మాఱుచున్నవి. లోకమున మార్పేకాని, మార్పుల కాధారమైనయొకవస్తువు లేదు. అందుచే నిచటఁ బరమసత్యమైనది పరివర్తనసూత్రము లేక, కారణసూత్రమే. మూలకారణమునుగూర్చి బుద్ధుఁ డేమియుఁజెప్పఁడు. లోకము తనయవసరముచే నడచుచున్నది. ఇం దరాజకముగాని,అన్యాలజోక్యముగాని లేదు. బ్రాహ్మణబౌద్ధముల భేదములను ఓల్డెన్‌బెర్గు యిట్లునుడివినాఁడు; "పరివర్తనము వెనుక నొకవ్యక్తియున్నదని బ్రాహ్మణములతత్త్వము, వ్యక్తిగా గోచరించునది పరివర్తనమేయని బౌద్ధులవాదమునైయున్నది. మొదటిభావ మొకే కారణబద్ధము కానిసత్పదార్థము; రెండవది పదార్థములేని కారణధర్మమును."[౧] ఈవర్ణనము రెండుసిద్ధాంతములకుఁగల ముఖ్యభావమునే స్వీకరించినది; భేదములను విడిచిపెట్టినది. ఉపనిషత్తులు, బుద్ధునివలెనే, సృష్టియొకపూర్ణవస్తువనియు, మరణాదికదోషభూయిష్ఠమైనను, భిన్నస్పష్టపదార్థములుగా విభ

౧. బుద్ధుఁడు. పుట ౨౯౧.

జింపశక్యముగాని”దనియుఁ జెప్పియున్నవి.౨. అదియొక అవిభాజ్యమైనచలనము, మార్పుతో సంబంధములేని కేవలపురుషు నొక్కని నుపనిషత్తు లూహించియుండలేదు. పరివర్తనాత్మకమైనజగము మిథ్యయని యవి చెప్పలేదు. జగత్పరివర్తనములో నీశ్వరశక్తియున్నదని యుపనిషత్తులభావముగా ఓల్డెన్ బెర్గు కూడఁ జెప్పియున్నాఁడు. పరివర్తనాత్మకజగత్తు, పరస్పరసంబంధములేని భిన్నదశలసంపుటియని యుపనిషత్తులభావముకాదు. అదియొక ప్రదర్శనమేకావచ్చుఁ, గాని, సత్యముయొక్క ప్రదర్శనము. పరివర్తనమే సత్యమని యుపనిషత్తు లంగీకరింపవు; పరివర్తనములవెనుక మార్పులేని యొకసత్పదార్థమున్నదని యవిచెప్పును. మార్పులన్నియు నొకనిత్యవస్తు ప్రత్యేకలక్షణములు. ఈలక్షణములేమార్పును బ్రదర్శించుచున్నవి. మార్పులన్నిటికి వెనుక నొకవస్తువున్నదనికాని, ఆతనియనుచరులు భావించినరీతిని, పరివర్తనమే నిత్యమైనదనికాని బుద్ధుఁడు చెప్పియుండలేదు. రూపములవెనుకనున్న సద్వస్తువిషయమాతఁడు స్మరింపక, మనయభ్యుదయమున కవసరమైన వ్యవహారప్రపంచస్వభావము నాతఁడు చెప్పెను. కాని, నాగసేనుఁ డూహించినట్లు లోకమునఁ గారణపరంపరయే యైనచోఁ, గారణబద్ధముగాని దేదైన నున్నదా లేదాయని యడుగవలసివచ్చును. లేకున్నచోఁ, గారణ ధర్మమాత్మవిరుద్ధమగును. ప్రతిదృశ్యమున కింకొకదృశ్య మకారణమగుచో, దేనికిని సరియగుకారణమును మనము చెప్పఁజాలము. మనము కారణధర్మమునెట్లో యతి

---

౨. ఫ్రిడ్లే.

క్రమించి, ఆత్మకారణశక్తిగల యొకసత్పదార్థము, కారణ ధర్మబద్ధమైన పరివర్తనమునకు మూలమైనది, స్వయముగా నది స్వతంత్రమైనదియునని నిర్ణయింపవలెను. ఒక అనిత్యమైన దనిత్యముగా గోచరించుచున్నదని మనముచెప్పినపుడది నిత్యమైనదానికి వ్యతిరేకమైనదని భావము; అపుడా నిత్యమైన దేదియను ప్రశ్నముదయించును. అట్టి శాశ్వతవస్తువింకను వికాసమందుచున్నదనికాని, లేక, సర్వపరివర్తన రూపముల నది ప్రదర్శించుచు, స్వయముగాఁ దననిత్యతను, బూర్ణతను నిలుపుకొనుచున్నదనికాని చెప్పవలసియున్నది. ఎట్లైన నొకసత్పదార్థమంగీకరింపఁబడక తప్పదు.

ఆరిస్టాటలుననుసరించి, మార్పులకొక సమాన్యవస్తువుండవలెను. మార్పులు దేనివో ఆవస్తు వుండకతీరదు. అట్టి నిత్యవస్తుహీనముగా మార్పులులేవు. ఇది క్యాంటుతత్త్వజ్ఞుని 'ఎనాలజీ ఆఫ్ సెకండు ఎక్స్పీరియన్సు' నందలి సత్యాంశము. "నిత్యవస్తువులేనిదే, కాలగతములైన సంబంధములుండవు. ఈపరివర్తనములో, 'అ' తరువాత 'ఆ' వచ్చినదనగా, 'అ' పూర్తియైనవెనుక, 'ఆ' ప్రారంభించినదన్నమాట.'అ' 'ఆ'లకు సంబంధమేలేదు. ఈరెంటినిఁ గలుపునదొకటి. రెంటికిసామాన్యమైయున్నచో నపుడు సంబంధమేర్పడును. అట్టి, సంయోగకర్తయింకొకటిలేనిచో, 'ఆ'అదృశ్యమైనఁగాని, 'ఇ' ఆరంభింపదు; మిగిలినదిట్లేయుండును.పూర్వాపరదశాసామాన్యలక్షణమొకటియుండితీరవలెను. దానినిత్యత్వము మూలముననే పూర్వదశయనంతరదశానుగతమై. పరంపరాక్రమ మేర్పడును. ఈ సం

భానలక్షణము తాత్కాలికముగా నిత్యమైనదని యన్నచో, నిట్టి తాత్కాలికలక్షణములకు శాశ్వతవస్తువొకటి మూలరూపమై యుండవలసివచ్చును. విశ్వమంతయు నొకసంబంధముల యల్లికయనిచెప్పి, యూరకున్నచో, నీసంబంధ సంయోగశక్తి లేని యల్లిక నిలువఁజాలదు. అది పక్షి లేనిగతి పరంపరవలె నుండును. పరస్పరసంబంధములచే, వస్తుత్వము జనింపదు. బుద్ధుఁడు వ్యవహారప్రపంచముపై దృష్టి లగ్నముచేసి, సత్పదార్థ, మవిచ్ఛిన్న పరివర్తనపరంపరయే యనినాఁడు. జగన్మూలప్రపసత్యము, పరివర్తనపరంపరలో నున్నదని నేఁడుప్రచురించిన బెర్గ్సన్ తత్త్వమిదియే. అచలవస్తువుల మిథ్యారూపములే అజ్ఞానదృష్టికి గోచరించును. జ్ఞాన మీ మిథ్యారూపము లనిత్యములని తెలియఁజేసి, వీనియం దంతర్వర్తియై యొక కారణ ధర్మమున్నదని బోధించును.

మనము క్షణికవాదమ నంగీకరించినచో, నిత్యత్వముతోఁగూడిన కారణధర్మము, సమానవ్యక్తిత్వముతోఁగూడిన అవిచ్ఛిన్నత్వము నంగీకరింపవలెను; లేదా, ప్రపంచమొక కొన్ని నిరంకుశశక్తుల రాక్షసికనృత్యమనియెఱిఁగి, దానికర్థము చెప్పుకృషిని విరమింపవలెను. నిత్యత్వముతోఁగూడిన కారణ ధర్మమునకును, క్షణికవాదమునకును భేదమిట్లు శంకరుఁడు నిర్వచించెను; "బౌద్ధులదృష్టిలో నంతయు క్షణికము. రెండవ క్షణము వచ్చునప్పటికి మొదటిక్షణములోనున్న వస్తువు లేదు; పూర్తిగాఁ గ్రొత్తదైన యింకొకవస్తువుదయించును. అందుచే మొదటిది రెండవదానికిఁ గారణమని నీవుచెప్పఁజాలవు; రెండ

వది మొదటిదానికార్యమనియుఁ జెప్పవీలులేదు. క్షణికవాద మునుసరించి, రెండవక్షణ మారంభించునప్పటికి మొదటిది పూర్తియైనది; అనగా ఉత్తరవస్తుజన్మమునకుఁ బూర్వమే పూర్వవస్తువదృశ్యమైనది. అందువలన నుత్తరవస్తువు పూర్వ వస్తుకారణముచే నుత్పన్నముకాలేదు; శూన్యమునుండి స్థితి జనింపదు."౧ కొందఱనంతర బౌద్ధులుఁశంకరుని విమర్శ సరి యైనదనిగ్రహించి, మార్పులన్నిటికి వెనుక నొకనిత్యవస్తువు లక్షణమున్నదని వాదించిరి. సోజెన్ చెప్పినాఁడు: అన్నిటికి మూలాధారము నిత్యమైనది. మాఱుచున్నది వస్తువుయొక్క గుణవిశేషము; అందుచే బౌద్ధము మొదటిక్షణములోని వస్తు వుత్తరక్షణములో నుండదని చెప్పుచున్నదనుట తప్పు.''౨.

వ్యావహారిక జగత్తుపై దృష్టికేంద్రీకరించి, బుద్ధుఁడు ఉపనిషత్తత్త్వవేత్తలవలె సృష్టికేంద్రమును,సర్వజీవప్రాణ్నివాసి యునైన యొకనిత్యసర్వపోషకశక్తి యున్నదని నిర్ణయింపలేదు. మనకు జ్ఞానగమ్యము కానంతమాత్రమున, నిత్యపదార్థము లేదనుట పొసగదు.ఉన్నదంతయు నవస్థాపరంపరయే యైనచో నిరవస్థాకాలమే తెంచినపుడు మిగులునది శూన్యావస్థయే. ఓల్డెన్ బెర్గుచెప్పినాఁడు; "ఒకయవస్థ, యవస్థాంతరమును గోరును. ఈసిద్ధాంతమునను సరించి, తర్కింపనారంభించినచో నొకయవస్థాపరంపర, పూర్తియై, నశించునపుడిఁక మిగులునది శూన్యము కాక వేఱేమున్నదని చెప్పవీలగును?"౩. మనబుద్ధి గమ్యమైన జగద్రూపమున కనిత్యస్థితియే గలదని బుద్ధుఁడుప

౧. వేదాంతసూత్రభాష్యము. ౨ అ. ౨.

నిమత్తులతో నేకీభవించుచున్నాఁడు. వ్యవహారదృశ్యపరంపరకు వెనుకనొక శాశ్వతస్థితి యున్నదని మనబుద్ధి సూచించితీరును. ఈనిత్యపదార్థమనిత్య పరంపరలోనిది కాదు. కారణధర్మపాశములనుండి స్వతంత్రమైనదగుచో, నది యతీంద్రియస్థితిగలది కావలెను; కాని, దృశ్యమగు లోకముతో దానికేసంబంధము లేదనుటయు దోషమే; ఏలన, అప్పుడీ దృశ్యప్రపంచ మాభాసమగును. ప్రతివస్తువునున్నట్లు గోచరించునుగాని, నిజముగా నట్లులేదు. ఏకకాలమునఁ బ్రతివస్తువు నిత్యము ననిత్యమును గూడనైయున్నది. ప్రతిదశనుండియు నుత్తరదశకుఁ బోవుచు నుత్తరదశకుఁ గారణభూతమైన పూర్వదశయొక్క ప్రధానవ్యక్తిత్వమును వెంటఁబెట్టుకొనిపోవును. ఉన్న ప్రతివస్తువు నున్నది, లేదు, నిత్యము, ననిత్యముననుసీసిద్ధాంతముపరివర్తన పరమార్థమునుజూపి, సత్పదార్థమే పరివర్తనము లన్నిటికి మూలభూతమని ప్రకటించును. బుద్ధోపదేశస్వరూపమిది. రెండువ్యతిరేక దశలమధ్యవర్తిత్వమే స్థితి; దృశ్యప్రపంచ పరిశీలనము వలన మనము వస్తువుయొక్క నిత్యానిత్యలక్షణ విభాగము చేయఁజాలము. రెంటెని విడఁదీసి, ఒక్కొక్కదానినే విడిగాఁ బరిశీలించినచో మనశ్రమకు శూన్యమేఫలితమై మిగులును. వ్యవహారస్థితియొక్క నిత్యత, తాత్కాలికమధ్యమ స్వరూపము; అది అనాత్మనుండి యాత్మకుఁ బయనము; అదియే పరిణామము. ఇంద్రియ మనోగోచరమగు ప్రపంచవస్తువులు నిత్యములను

౧. సర్వాస్తివాదులు. ౨. సిస్టమ్సు అఫ్ బుద్ధిస్టిక్ థాట్. పుట౧౩౮
౩. ఓల్డెన్‌బెర్గు బుద్ధుఁడు పుట ౨౭౭

భావమును స్థాపించుటకై యత్నించుతర్కము నిరర్థకమైనదనియు నవి యొక లక్ష్యసిద్ధికై పయనించుచున్న యాత్రిక స్వరూపము లనియు బుద్ధుఁడు నిశ్చయించెను. సత్పదార్థవిషయమున నాతఁడు మౌనముద్రవహించి యుదాసీనుఁడగుటకుఁ గారణ మూహదూరము, మనస్సునకతీతమగుట, లోకమున కర్థము చెప్పుటకుఁ దానుజూడని విషయము నుదాహరించుట కిచ్ఛగింపక యే యని తోచుచున్నది. లోకానుభవమే మనకుఁగల సాధనము. సద్వస్తువు అనుభవాతీతము. మన కతీతమైన విషయస్వభావనిర్ణయమునకై వ్యర్థప్రయత్నములు చేయుట కాతఁ డిష్టపడలేదు. నిష్పాక్షికముగాఁ జెప్పినచోఁ, బరిమితమగు మానవజ్ఞానమును బట్టి, పరమసత్యమైన సత్పదార్థముయొక్క అస్తిత్వనాస్తిత్వములను నిశ్చయముగాఁ జెప్పి ఋజువుచేయు నవకాశములు లేవని యొప్పుకోనక తప్పదు. నిత్యపరివర్తమాన శీలమైన జగత్తులో నిత్యవస్తువును దర్శించుటసంభవమని బౌద్ధము, నుపనిషన్మతము నంగీకరించినను, నుపనిషత్తు లాసత్పదార్థమున్నదని యుద్ఘాటించియుండగా, బౌద్ధమత మావిషయమున మౌనము వహించెను. ఇదమిత్థమని నిర్ణయింపని యీమౌనభావమును, నాస్తిక వాదముగాఁ బరిగణించుట కవకాశము లేదు. పరుగిడుచున్న యీపరిణామ ప్రవాహములో, నిత్యమైనది లేదనికాని, అశాంతి నిలయమైన లోకమునఁ గంపితమైన మానవహృదయమునకు శాంతినొసఁగు తావుకాని లేదను నవివేకమునకు బుద్ధుఁడు పాల్పడియుండలేదు. పరమసత్యము, వాఙ్మనముల కతీతమునైన దేదైననున్నదా యను ప్రశ్నమునకు సమాధానము చెప్పుట కెంత

యనిష్టమును బుద్ధుఁడు ప్రదర్శించినను, నాతని కావిషయములో నేసందేహమును లేనట్లు తెలియుచున్నది. "పుట్టనిది, ఆరంభములేనిది, చేయఁబడనిది, అద్వితీయమునైన దున్నది. శ్రమణులారా! అదియే లేకున్నచో, జన్మారంభ జరామరణాదిస్థితినుండి మనకు విముక్తియే యుండఁజాలదు." ౧. అవితర్క్యమై, విశ్వసింపఁదగిన యొక పరమసత్యమే సృష్ట్యంతర్యామియై యున్నదని బుద్ధుఁ డెఱుఁగును.

౯—సంసారము

జగత్పరిణామము దృశ్యము, సత్యమునైనదా? జగత్తు నిరంతరప్రవాహమనియు, నది నిస్సత్త (సత్త్వశూన్యము) యనియు, నిర్జీవ (నిర్జీవ) మనియు నాతని ముఖ్యభావములు. ఉన్నదంతయు ధర్మములేక దశాసంపుటి. అది అసత్యమే కాని స్థితి లేనిది కాదు. బుద్ధుని ప్రారంభోపదేశములలోఁ గొన్నివాక్యములవలన జగత్తునుగూర్చిన భావము కేవలవ్యక్తిగతమను నభిప్రాయమున్నది. దృశ్యమైనజగము, ద్రష్టయొక్క అవస్థపై నాధారపడియున్నది. అట్టిజగము ప్రతిమనుజునిలో నున్నది. "౧"మర్త్యమైన యీశరీరమునకొక కొంతపైని, చేతనత్వము, మానసములతోఁగూడిన ప్రపంచమున్నది. దానికి వృద్ధి క్షీణనాశనము లున్నవి." ౧. ముక్తి లభించినవెనుక జీవ మేమగు నని యడిగిన యొక సన్న్యాసి ప్రశ్నమునకు బదులుగా బుద్ధుఁడిట్లు

౧. ఉదానవికాయము. ౭అ. 3.

౧. రైస్ డేవిడ్స్. బుద్ధసంభాషణములు. ౧అ. పుట ౨౭౯. జ్ఞానికి లోకము గోచరింపదనియుఁ జెప్పఁబడెను.

చెప్పెను; "ప్రశ్న యిట్లుండవలెను: 'ఎచట భూజలాగ్ని వాయువులు లేవో, ఎచట స్థూలము సూక్ష్మము; దీర్ఘము హ్రస్వము; సదసదాత్మకములైనవన్నియు నదృశ్యములగునో, జ్ఞాపకము లేకుండ, నెచట దృష్టి, దృశ్యము నూపట్టకుండ మాయమగునో, అది యేది ?;" దానికి జవాబిది; "పూర్వ స్మరణావకాశము లేకుండఁ, జేతనత్వము నశించుటచే నన్నియుఁ బోయినవి." ౨. ప్రపంచము దృష్టిపై నాధారపడియున్నది: ఆదృష్టితోనుదయించి, యాతఁడు, పోవుటతో, నదియుఁ బోవుచున్నది. మనముచూచు ప్రపంచములన్నియు మనఃకల్పితములే. లోకములో విస్పష్టసత్యములు, మనయింద్రియానుభవములు. మనభావములకు సరిపోయిన వస్తువు లున్నవో లేవో చెప్పఁజాలము. అజ్ఞాన, కర్మలశక్తివలన లోకపరిణామము జరుగుచున్నది. ప్రత్యేకత్వముగాని, వ్యక్తిత్వముగాని లేని యేకైక సత్పదార్థమున, మనముచూచు భిన్నరూపములన్నియు మనముకల్పించుకొన్న వేయను భావమును ప్రకటించినవాక్యములు కొన్నికలవు. సత్పదార్థము నొకదృశ్యముగా నూహించుటచే మనకీ భిన్నరూపములు గోచరించినవి. మొదటిభావము జగత్తంతయు స్వప్నవస్తుతుల్యమని తీసివేసినచో, నిఁక రెండవది జగత్తునొక కథావస్తువుగా మార్చి చెప్పినది. ౩. జీవించుసంకల్పమునుండియే సర్వవ్యక్తిరూపభావములు కల్పింపఁబడినవని చెప్పిన సోపెన్హోయరు తత్త్వమునకు రెండవభావము సరిపోవును.

---

౨. డాల్కే: బౌద్ధమతవ్యాసములు. పుట ౩౧౦

౩. కథావత్తు.

అచ్ఛేద్యమైన విశ్వపరిణామప్రదర్శనమును, మనయజ్ఞానము చీల్చి, భిన్నవ్యక్తిరూపముల నూహించుకొనుచున్నదని కొన్ని సమయములఁ జెప్పఁబడెను. జ్ఞానిదృష్టికి సముచ్చయద్రవ్యములు నశించి, యందు మూలద్రవ్యములు గోచరించు నను వాక్యములు కొన్నియున్నవి. సముచ్చయద్రవ్యములు శిథిలములై, ఏకాత్మకవస్తువులు నిత్యములైయుండు నను లైబ్నిజ్ సిద్ధాంతమును ప్రారంభదశలోని బౌద్ధులెఱుఁగుదురు. కాని 'ఆత్మ' కూడ సముచ్చయద్రవ్యమేయనియు నందుచే నశ్వర వస్తువనియు వారు చెప్పుదురు. నాశములేని యేకాత్మకవస్తువులనగా, భూమి జలాగ్ని వాయువులు; వైభీషకు లాకాశమును గూడఁ జేర్చిరి. భూకంపములకుఁ గారణమడిగిన ఆనందుని ప్రశ్నమునకు సమాధానముగా బుద్ధుఁడుచెప్పిన వాక్యములననుసరించి, పూర్ణశూన్యస్థలముండుననికూడ భావించినట్లు తెలియుచున్నది. "ఆనందా ! ఈవిశాలమైన భూమిజలముపైని, జలము వాయువుపైని, వాయు వాకాశమందును నిలిచియున్నవి."౧. "పూజ్యనాగసేనా ! లోకములోనికిఁ గొన్ని జీవులు కర్మవలనను, గొన్ని కారణాంతరమునను, గొన్ని ఋతువులవలనను, వచ్చినవి. ఈమూఁడుకారణములనుండికాక, యింకొకవిధముగా వచ్చినదేదైన నున్నయెడలఁ జెప్పుము." "ఉన్నవి. ఆకాశము, నిర్వాణము రెండు నట్టివికావు."౨. పరిణామప్రపంచమునుగూర్చిన స్పష్టమైన భావములను బుద్ధుఁడు మనకిచ్చియుండలేదు. అనేక భావములు, సూచనలు నాతఁడిచ్చిన వాని ననంతర బౌద్ధులు

౧. దీఘనికాయము. ౨౦౭ ౨. మిళిందము. ౮౫.

తమకుఁ దోఁచినట్లెల్ల పెంచి, పాళ్ళీకార్థములఁ జెప్పిరి. నాగసేనుఁడు వ్యక్తిగతకల్పనముగా లోకమున కర్థము చెప్పినాఁడు. ఒకవస్తు వావస్తులక్షణముల సంపుటియని యాతఁడు వచించెను. మనుష్య దేహములో, క్షణికేంద్రియజ్ఞాన స్పర్శాపరంపరలు తప్ప నిత్యమైన దేదియును లేదు. ఈస్పర్శాపరంపరలనే మనస్సు గ్రోగిడి, వస్తుకల్పనము చేసికొనుచున్నది. మనఃకల్పిత క్షణిక దృశ్యముల నృత్యమే పదార్థమని నాలుగుబౌద్ధశాఖలలో నొక శాఖ చెప్పినది. మనస్సే సర్వమని యింకొకశాఖ భావము; వేఱొకశాఖ శూన్యవాదము నంగీకరించి, ప్రపంచము నిజము కాదు. అసత్యమును గాదు; రెండును గాదు; రెండును గాక పోదని వాదించును. బాహ్యజగత్సత్య నిర్ణయము చేయుట బుద్ధునిపని కాదు. పరిణామదశా పరంపరాప్రవాహమునఁబడి కొట్టుకొనిపోవుచున్న మానవునకు రక్షణలేక, యల్లాడుచున్న సంగతియే యాతనికి ముఖ్యమైనది. జీవించుటకుఁ గాంక్ష యున్నంతకాలము, మానవుఁడే యగాధసంసారాంధమునఁబడి, పతనోత్పతనముల నొందుచు నుండవలసినదే. ఈఅశాంతి రూపమున జీవికి శాంతిలేదని బుద్ధుఁడు గ్రహించినాఁడు. "ప్రజ్వలించుచున్న అగ్నిమధ్యమునసుండి దహింపఁబడుచున్న వేళ, నగ్నికారణ మరయు సమయముగాదు; మంటనుండి బయటపడు నుపాయమే చూచుకొనవలసియున్నది." ౧.

## ౧౦ — జీవము

మనశ్శరీరముల ద్వైతము పరిణామములో నొకభాగము; పూర్ణములోని యంశములు; వస్తువులన్నియు నొకే యవిచ్ఛి

౧. మజ్ఝిమనికాయము వాల్యూము ౧. పుట ౨౯

న్న పరిణామముయొక్క భిన్నదశల సంబంధములు. జీవము నిత్యమైనదైనను, నది యెల్లప్పుడు చేతనత్వముతోఁ గలిసియుండదు. ఏయొకదశాంశమైనను, పరిభ్రమించుచున్న సర్వలోకముతో సంబంధము గలిగియుండును; అట్టి దశాంశముచేతనమైనచో, దానినే మనము జీవమందుము. వస్తుసత్యములను దర్శించుటకు సచేతనులకే సాధ్యము.

జీవమనగా మానవుని వ్యవహారజీవితము; అది మాఱుచుఁ బెంపొందుచుండును. శరీరముకాని, పరిణామముగల మనస్సుగాని 'ఆత్మ'గాదని యుపనిషత్తులు స్పష్టముగాఁ జెప్పినవి. కాని, మానసిక భౌతికగుణసంయోగముచే వ్యక్తియేర్పడుచున్నాఁడు. ప్రతివస్తువవలెనే, ప్రతివ్యక్తియు నొక సమన్వయము లేక సముచ్చయము. బుద్ధులు దీనిని సంస్కారమందురు. ప్రతివ్యక్తియందుఁగల భిన్నాంశముల కొండొంటితోఁ గల సంబంధములు నిత్యము మాఱుచుండును. వరుసగావచ్చు నేరెండు క్షణములలో నది యొకటికాదు. మానవుఁడొక సజీవసముచ్చయ ద్రవ్యము; ఏరెండు క్షణములలో నది సమానముగాదు; కాని, యాత్మసమానత్వము పూర్తిగా నశింపక, అనేక జన్మపరంపరల నొందుచున్నది. ౧. మనశ్శరీరములు రెండు నెడతెగని మార్పులోనున్నను, శరీరముకంటె మనస్సునకెక్కుడు చాంచల్యము, అనిత్యత గలవు. అందుచే నీరెంటిలో నేదినిత్యమో చెప్పవలసియున్నచో దేహమనియే చెప్పవలసి

౧. చూడు. మహానిర్దేశము పు. ౧౧౭; విశుద్ధిమగ్గము ౧౪. డబ్లియు. పి. టి. పుట ౧౯౦

యున్నది.౨ వ్యక్తిత్వమొక యస్థిరమైన పరిణామదశ. రైస్ డేవిడ్సు చెప్పినాఁడు: "సంయోగములేనిదే వ్యక్తిత్వములేదు; పరిణామములేనిదే సంయోగములేదు; ఒకపదార్థ మింకొకటికాకుండఁ బరిణామములేదు; పదార్థ నాశనములేకుండ నొకపదార్థ మింకొకటియగుట జరుగదు; ఈ నాశనమెప్పుడో యొకప్పుడు పూర్తియగును" 3. అది నిత్యత్వమేమియులేని యొక అనవరత పరిణామము. నామరూపములు ననిత్యములు. ४. కాశిలోని, కొండన్న అధ్యక్షుఁడుగాఁగల యతిపంచకమునకు, 'ఆత్మ' లేదను రెండవయుపదేశమును బుద్ధుఁడిట్లు చేసెను; "శరీరము శాశ్వతమైన యాత్మగాదు; అది నశించును. భావన, దర్శన, జ్ఞానము లాత్మగావు. ఏలనఁ జేతనత్వమే నశించును." "మన రూపభావ,దర్శన,చిత్తవికారములన్నియు ననిత్యములు;అందుచే దోషములే; నిత్యములు, శ్రేయఃప్రదములుకావు. అనిత్యము, దోషయుక్తము, చపలమునైన దాత్మ కాఁజాలదు. అందుచే నల్పాధికములు, దూరసమీపములు, విషయావిషయములు, కాలత్రియమం దెప్పుడున్నను, అన్నియు ననిత్యరూపములే యగును గాని నిత్యమగు నాత్మకాఁజాలవు; 'ఇది నాదికాదు;

౨. సంయుక్తనికాయము ౨౫. ౯౪, ౯౭ హీనయానమునకుఁ జెందిన అభిధర్మవిభాషాశాస్త్రమునను సరించి, ౨౪ గంటలలో ౬౪౦౦౦ లక్షల ౯౯ వేల ౯ వందల ౮౦ క్షణములున్నవనియుఁ, బంచస్కంధములు క్షణక్షణము పుట్టుచు, నశించుచుండుననియుఁ జెప్పఁబడెను.

చూడు. యామకమిసోజెస్ సిస్టమ్సు ఆఫ్ బుద్ధిస్టిక్ థాట్ పుట ౧౧౧.
(3) ప్రపంచమతతత్త్వములు పు. ౧౪౨ (४) మహావగ్గము ౧౫ ౬. ౩౮.

ఇది నేనుగాను; ఇది నానిత్యమైన ఆత్మగాదు."* పెద్దళ్లసుత్తములో ధమ్మదిన్నుఁడిట్లు చెప్పెను; "సంస్కారములేని యజ్ఞాని ఆత్మనొక దేహరూపముగాను, లేక దేహమునందొక యాత్మ యున్నట్లును, లేక దేహమువంటి రూపముగల యొకఆత్మ స్వరూపమున్నట్లును; లేక ఆత్మయొక భావరూపమనియు, లేక భావరూప మాత్మలోనున్నదనియు లేక, భావమునందాత్మయున్నదనియుఁ దలతురు." ఆత్మకాని, పురుషుఁడుగాని, జీవముగాని, సత్త్వముగాని యేదియును లేదు. మానవునిలో మార్పులేని నిత్యమైన లక్షణమేదియు మాకు గోచరింపలేదు."౬. పంచస్కంధముల కూర్పే యున్నది. ఉపనిషత్తుల నామరూపములనుండి బౌద్ధులు స్కంధవాదమును బెంపొందించిరి. వ్యక్తిత్వమునకుఁ గారణములైన వస్తుసంబంధమైనరూపము, మనస్సంబంధమైన నామముతప్ప, నిత్యమైనదేదియు మానవునియందు లేదు.

సురంగమసుత్తమందు, దేహములోఁగాని బాహ్యమునఁగాని, మనశ్చిత్తాదుల వెనుకకాని, ఆత్మయుండుచోటున్నదని యానందుఁడొనర్చిన వ్యర్థవాద ప్రియత్నములిందుఁ జర్చింపఁబడెను. ౧. మేధఃపదార్థమందుఁగాని, యింద్రియముల సూక్ష్మస్థానములందుఁగాని, దేహములో నేయితరభాగమునందుఁగాని నిత్యమైన యాత్మకు స్థానమున్నదని వెదకుట వ్యర్థప్రియ

(*) మహావగ్గము ౧౮. ౨౧. (౬) సంయుక్తనికాయము ౪.౮౯౪.

౧. పశ్చిమఖండ, మనస్తత్త్వజ్ఞులు దేహములో, నరనిర్మాణములో, మెదడులో నొకచోటు నందాత్మ యున్నదని నిర్ణయింపఁబూనిరి.

త్మమని చెప్పఁబడెను. శరీరసంబంధములేని ఆత్మశక్తి యొక టున్నదనిచెప్పుట, కర్మసిద్ధాంతమునకు వ్యతిరేకమని బౌద్ధులు తలచిరి; ఏలన. సర్వకర్మల కాయాత్మయే కారణమనితలచి, మనుజులు కర్తవ్యముల నెఱవేర్చుట మానివేయుదురు. రైస్ డేవిడ్సు సతిచెప్పినట్లు, "అనాత్మవాదము బౌద్ధులు చేయుటకుఁ గారణము, నిత్యమై, అతీతమై, అవిచ్ఛిన్నమై, ఆనందమయ మైన ఆత్మయున్నదనుట కిష్టములేక కాదు; పరమసత్యస్వరూప మైన పరమాత్మయు జీవాత్మయందే యున్నదను సిద్ధాంతము నంగీకరించుట కిష్టములేక యట్లు వాదించిరనితోఁచును"౧. ఉప నిషత్తులు చెప్పినయాత్మ జన్మాంతరములు గలదికాదు. ఉప నిషత్తుల 'ఆత్మ'ను గూర్చిన యింకొక అపార్థమును, బుద్ధుఁడు ఖండించినాఁడు. భేదములతో నిమిత్తములేని శుష్కమైన యేకత్వ మాత్మ యను భావమది. అదియే నిజమైనచో నది యింతకుఁడిదివఱకే చెప్పినట్లొక శూన్యవ్యక్తిత్వమగును.

ఆత్మవిషయమున బుద్ధుఁడు మౌనము వహించుట కిం కొక కారణమున్నది. జీవాత్మయే పూర్ణమైనదని నిశ్చయించు లక్షణము మానవులలో నధికబలమైనది. ఈలక్షణమే విశేష మైన ఆత్మసాధన దోషముగాఁ బరిణమించినది. 'అహం'కార గర్వమును, 'మమ' కారదోషమును గర్హించుటకుఁ గూడ బుద్ధుఁడు సంశయింపలేదు. ఆత్మనుగూర్చిన దురభిప్రాయ ముల నాతఁడు ఖండించెను. మనము వేనిని యాత్మరూపము లను కొనుచున్నామో, అవి యాత్మకాదని యాతఁడు చెప్పి

౧. బౌద్ధమనస్తత్త్వము. పు. ౩౧.

నాఁడు. "సోదరులారా! ఆత్మకాని ఆత్మకుఁ జెందిన దేది కాని, నిజమైనదిగా నంగీకరింపమనగా, మతద్రోహులగు వారి కిందివిధమునఁ జెప్పిన భావములోఁగాదు; "ఇది ప్రపంచము; ఇదియాత్మ; నేనెల్లప్పుడు నుందును, నాకు నాశములేదు, మార్పులేదు, నేను నిత్యుఁడనని" యీవిధముగాఁ బలుకు వారు శుద్ధమూర్ఖులుగారా?"౧. మన పరిమితమైన జీవము, తాను శాశ్వతమని వదలువిధానమును బుద్ధుఁడు ఖండించి నాఁడు. రెండుక్షణములు మనము నిత్యముగా మార్పులేకుండ నుండఁజాలము. ఇఁక నేయాత్మకొఱకు మనము శాశ్వతత్వ మును గోరుచుండుట?"౨. చైతన్యమున్నదెల్ల నాత్మయను తత్త్వమును బుద్ధుఁడు నిరసించెను. కన్నులకు గోచరించు గుణ ముల కాధారమై యొకయాత్మయున్నదను వాదము నాతఁడం గీకరింపఁడు; ఏలన నది మనకుఁ దెలియునదికాదు. ఈగుప్తమైన యెఱుక కందని, యెఱుఁగరాని, వస్తువును బుద్ధుఁడు న్యాయ ముగానే నిరసించినాఁడు. ఆరంభదినములలో బుద్ధుఁడు సమాధి క్రమదశావిశేషములను సుప్రసిద్ధుఁడైన "ఆలారకాలముఁడను యోగియొద్ద శిష్యుఁడై నేర్చుకొనెను. ఆయోగి, జీవుఁ డా త్మత్యాగముచే ముక్తుఁడగునని యుపదేశించినాఁడు; "తన్నుఁ దానే త్యజించి, శూన్యమును జూచును. అతఁడే నాస్తికుఁడు. అప్పుడొక పక్షిపంజరమునుండి వెడలునట్లు, ఆత్మశరీరము

౧. మజ్ఝిమనికాయము. ౧అ. ౧౩౮. పోల్చు భగవద్గీత ౩అ.౨౭.

౨. చూడు. ఇంజి, ప్రొసీడింగ్సు ఆఫ్ ది అరిస్టొటిలియన్ సొసైటీ వాల్యుము ౧౯, పుట ౨౦౮.

నుండి, యెగసిపోవఁగా, ముక్తి పొందెనని యందురు. ఇదియే నిత్యము, మరణాతీతము, భేదరహితము నైన బ్రహ్మపదార్థము, జ్ఞానులు దీనినే మోక్షమందురు." బుద్ధుఁడీసిద్ధాంతము నంగీకరింపలేదు. ముక్తిపొందినయాత్మ, యెట్టిపదవిని పొందెనను, నింకను, తిరిగి జన్మించుననియు, మనకుఁ బూర్ణత్వము సిద్ధించుటకు సంపూర్ణముగా నాత్మత్యాగ మవసరమనియు బుద్ధుఁడు నిశ్చయించినాఁడు.

'ఆత్మ' యేదికాదో బుద్ధుఁడు మనకు స్పష్టముగఁ జెప్పినాఁడు. 'ఆత్మ' యేదోమాత్రమతఁడు నిశ్చయముగా నుడువలేదు. కాని బుద్ధునిదృష్టిలో నాత్మయే లేదనుటకు వీలులేదు. "అప్పుడు పరివ్రాజకుఁడైన వచ్ఛగొట్టుఁడు బుద్ధుని కిట్లనెను: "గౌతమ , ఏమినిశ్చయించితివి ? 'అహం' అనున దున్నదా ?" బుద్ధుఁడింకను మౌనము నేవహించెను. అప్పుడా వచ్ఛగొట్టుఁడు లేచి తనదారిఁబోయెను. కాని పూజ్యుఁడగు నానందుఁడు బుద్ధునితో నిట్లుపలికెను: "పరివ్రాజకుఁడగు వచ్ఛగొట్టని ప్రశ్నమునకుఁ దామేల సమాధానమీయలేదు ?" "ఆనందా ! పరివ్రాజకుఁడు వచ్ఛగొట్టుఁడడిగిన ప్రశ్నకు నేను "'అహం' అనునదున్నదియని సమాధానము చెప్పినయెడల, 'అహం' నిత్యమైనదని శ్రమణులు, బ్రాహ్మణులు నమ్ముచున్న తత్త్వమును సత్యమని నే నంగీకరించినవాఁడ నైయుందును. మఱియు, పరివ్రాజకుఁడైన వచ్ఛగొట్టుఁడు 'అహం' లేక ఆత్మ లేదా"యని యడిగినప్పుడు "ఆత్మలేద"ని సమాధానము నేనిచ్చినయెడల, ఆత్మ నాశనమగునని నమ్మిన శ్రమణక బ్రాహ్మణుల తత్త్వ

మును సమర్థించినవాఁడనై యుందును." ఈసంభాషణమును గూర్చి ఓల్డెన్‌బెర్గు వ్యాఖ్యానించినాఁడు; "ఆత్మలేదను వాదమును బుద్ధుఁడంగీకరింపకుండుటకుఁ గారణము, ఉన్నదని విశ్వసించు దుర్బలహృదయుల కది కఠోరమైన వార్తగావచ్చును; ఉన్నదనికాని లేదనికాని చెప్పని బుద్ధుని పద్ధతిచూడఁగా, నాతని యితరోపదేశ సాక్ష్యములనుబట్టి, ఆత్మలేదనియే యాతని విశ్వాసముగాఁ జెప్పవచ్చును."౧. బుద్ధుఁడు నాస్తికవాదమును జ్ఞానపూర్వకముగా సమర్థించుట మానెనని మేమంగీకరింపము. ఓల్డెన్‌బెర్గు భావము సత్యమైనచో, నిర్వాణమనగా నాశనమని తేలును. బుద్ధుఁడది యంగీకరింపలేదు. నిర్వాణమనగా, శూన్యప్రవేశముగాదు; పరిణామవిరమణము; ఆత్మ తనశుద్ధస్వరూపమును దెలిసికొనుట, దీనినుండి సహేతుకముగాఁ దేలునదేమనగా, నిత్యమైనదేదో యున్నది; అది అజ్ఞానియాత్మగాదు. ఆత్మస్కంధరూపముగాదు, పూర్తిగా వేఱునుగాదని చెప్పిన బుద్ధుని భావము దీనితో సరిపోవుచున్నది. ఆత్మ మన శరీరముల కూర్పునుగాదు; పరివర్తనములతో సంబంధములేని నిత్యవస్తువునుగాదు. ౧. భారవాహకుఁడు, భారములను గూర్చినచర్చలో, స్కంధములు భారమనియు, పుద్గలము భార

౧. బుద్ధుఁడు. పుట. ౨౭౩

౧. పుద్గల పణ్ణత్తిగ్రంధమున మూఁడురకముల ఆత్మసిద్ధాంతములు పేర్కొనఁబడెను. (౧) శాశ్వతవాదము; ఈయాత్మయిప్పుడున్నది మున్ముందునుండును. (౨) ఉచ్ఛేదవాదము. ఆత్మముందుండదనియుం (3) ఆత్మయెప్పుడును లేదనియుఁ జెప్పును.

వాహకుఁడనియు, రెండును వేఱుపదార్థములనియు స్పష్టమగును. అవి ఒకేపదార్థమైనచో భేదమే చూడనవసరములేదు. "ఓ స్వాములారా! నేను మీకు భారము, భారవాహకుని జెప్పు చున్నాను. పంచకోశములు భారము; పుద్గలుఁడు భారవాహకుఁడు. ఆత్మలేదనువాఁడు మూఢుఁడు."౨. జన్మించుటయే భారమును మోయుట; దానిని విడిచిపెట్టుటే ఆనందము లేక నిర్వాణము.

దృశ్యముల వెనుకనున్న నిత్యాత్మనుగూర్చి, మనము ప్రసంగించునపు డతీంద్రియస్థితికిఁబోవుచున్నారమని బుద్ధుఁడు స్పష్టముగాఁ జెప్పెను. జన్మజరాదుఃఖమయ ప్రపంచమాత్మకు సముచితనిలయముగాదని యుపనిషత్తుల భావముతో నేకీభవించుచు, నుపనిషదాత్మ సిద్ధాంతవిషయమున నాతఁడు మౌనధారియయ్యెను. ఆత్మయొక్క అస్తిత్వానాస్తిత్వము లాతఁడు చెప్పలేదు. తార్కికశక్తిచే ఆత్మసత్యస్వరూపమును మనము నిర్ణయింపఁజాలము. జీవాత్మకాధారమై నిగూఢమైయున్న పరమాత్మ, మనజ్ఞానమున కగమ్యము, గుప్తమునైన రహస్యము కొందఱదియున్నదందురు; లేదనుట కితరుల కధికారమున్నది. తత్త్వపరిశీలనమునకు హద్దులున్నవని గుర్తింపఁగల తత్త్వజ్ఞులము కమ్మని బుద్ధుఁడుమనలనుగోరినాఁడు. ఆత్మాస్తిత్వానాస్తిత్వ తత్త్వచర్చను మనము విసర్జించునప్పుడే నిజమగు మనస్తత్వము సాధ్యమగును. భౌతికశాస్త్రజ్ఞులు, జీవశాస్త్రజ్ఞులు, పదార్థ

౨. డబ్లియు. బి. టి. పుట ౧౬౧. సర్వాభిసమయసూత్రము. ఉద్యోతకరుని న్యాయవార్తికమునందుదాహరింపఁబడినది. 3 అ. ౧. ౧.

జీవముల నిర్వచనముచేయకుండఁ దమపరిశీలనములను సాగించిరి. నట్లే, బుద్ధునిపద్ధతి ననుసరించి, ౧౯-వ శతాబ్దమధ్యస్థ మనస్తత్త్వపరిశీలనమును జేసిరి. మానసిక వికారరూపముల వర్ణించుటకే తృప్తిఁబొంది, ఆత్మసిద్ధాంతప్రకటనమున కాతఁడు సాహసింపలేదు. హేతువాదులైన మన స్తత్త్వజ్ఞులు, ఆత్మస్వభావమును; పరిమితమా కాదా యను విషయమును నిర్ణయింప యత్నించిరి.౧. తానుచేయఁ దలఁచుకొన్న వర్ణనమునకు,ఆత్మను గూర్చి ప్రసంగించుట అతిక్రమణమేయగును, వ్యవహారమున నున్న జీవాత్మయే మన మెఱుఁగినది. తదతీతమైన దింకొకటున్నదని బుద్ధుఁడెఱుఁగును. గుణసంపుటియే ఆత్మయని యాతఁడంగీకరించుట కెన్నఁడిష్టపడఁడు; అదియింకేదియో నిర్ణయించుట కాతఁడు పూనుకొనఁడు.

---

౧. ఈరెండుభావములకు భేదము, మనకుసజీవులైయున్న ఉత్తమమనస్తత్త్వజ్ఞులలో నొకఁడగు స్టౌంటు పండితుఁడిట్లు ప్రకటించెను: "ఒక వ్యక్తి జీవితములోఁ బ్రవేశించు నిత్యపరివర్తమానములగుచున్న అనేకానుభవములు, భిన్నావస్థలలో సమమైయేకమైయున్న యొక ఆత్మకుఁజెందినవని,స్పష్టముగానో అస్పష్టముగానో అందరకుఁ దెలిసియున్న విషయమే. ఈయేకత్వము, సమానత్వముగతి ఆత్మయొక్క సరియైన స్వభావస్వరూపములను, దానికిఁజెందిన యనుభవముల సరియైన సంబంధమును బరిశీలింపవలెనన్నచోఁ, బరస్పరవిరుద్ధములైన భావములను మనముగణింపవలసియున్నది. ఒకత్రిభుజము, ఒకరాగము, ఒక సజీవద్రవ్యముయొక్క భిన్నాంశముల నేకముఖమునకుఁ దీసికొనివచ్చు సంయోగసూత్రమెట్టిదో, ఒకజీవిలోని భిన్నానుభవములనుచేర్చి యేకత్వమును ప్రదర్శించు విలక్షణమైన సూత్రమునట్టిదే. దీనిననుసరించి, ఒకకోరిక, ఒక వ్యక్తికోరికయని మనముచెప్పునప్పుడు, ఆచేతనపదార్థములకులేనిదైన యేకత్వము, సమానత్వముగల అనుభవసంపుటీరూపమైన యొకప్రత్యేకమానసము

జీవాత్మకుఁగల బాహ్యకోశముల నన్నిటినొలిచివేసి, ర్వాధారభూతమగు నాత్మవస్తువు నుపనిషత్తులు కనుఁగొనినవి. బుద్ధుని భావమదియే కాని, దానినాతఁడు వక్కాణింపలేదు. వ్యావహారమున ననిత్యమైన జీవరూపము నాతఁడాత్మగా నంగీకరింపఁడు. ఆత్మ అంగుష్ఠమాత్ర పరిమాణముగలదనియు, మరణకాలమున నది, బ్రహ్మరంధ్రమునుండి దేహమునువిడిచి బయటికిఁబోవుననియు శ్రుతిప్రమాణోక్తమయిన ఉపనిషద్భావము నాతఁడంగీకరింపలేదు. ఆత్మనిరూపించుటకు సాధ్యమైనదికాదని యాతఁడంగీకరించును. మనఅంతర్విలోకమున కది లభింపదు కాని, అదియే మనలోనున్న సర్వసాక్షియగు కర్త యని మనము గ్రహింపవలెను. అదిలేనిదే జీవాత్మయునులేదు. భావపరంపర, వస్తువుల ప్రోవు, మున్నగు నుపమానములలో సంయోగసూత్రమొకటి యుండవలెను. అంతర్వర్తియైన యీసూత్రములేనిదే మానవుని జీవితమర్థవంతముకాదు. అందుచే బుద్ధుఁడు పరిపూర్ణాత్మతత్త్వమును నిరసించును. పూర్వబౌద్ధవాదులు, బుద్ధుఁడు కాలాను

వందొక కోరికప్రవేశించినదని మనభావము. దీనికివ్యతిరేకముగా, మానవాత్మ అనుభవముల సంపుటియే కాదు. అందున్న ఒకనిత్యమైనధర్మమే యీవివిధానుభవముల నేకముఖమునకుఁదెచ్చి సంయోగమొనర్పఁగల సామర్థ్యముగలిగియున్నదని తీవ్రవాదముచేయువారుగలరు. అనేకభావముల సంపుటియే ఆత్మయనునది సత్యవిరుద్ధమని వారుద్ఘాటింతురు. అన్నిభావములకు సామాన్యమై, యేకమైన కేంద్రమే ఆత్మయనియు, నదియే వానియేకత్వమునకుఁ గారణమనియుఁజెప్పుదురు. ఈరెంటిలో మొదటిదానినే నంగీకరించి. రెండవదానిని విసర్జించుచున్నాను. ఆత్మయొక్క యేకత్వము, భావములసంపుటికి వేఱుగా నాకుఁ దోఁచలేదు. (జ్ఞానసిద్ధాంతములోఁ గొన్నిముఖ్యభావములు.)

కూలమైన లౌక్యమునను సరించి, ఆత్మయున్నది, లేదని నిర్ధారణా ముగాఁ జెప్పుటమానుకొని మౌనము వహించినాఁడని చెప్పుచు నట్టి మౌనములో నపార్థముల కవకాశములున్నవని యంగీక రించిరి.

ప్రజ్ఞాపరమితసూత్రమునకు వ్యాఖ్యవ్రాయుచు నాగా ర్జునుఁడిట్లు చెప్పెను; "కొన్ని వేళల నాత్మయున్నదనియుఁ, గొన్ని సమయముల లేదనియు, తథాగతుఁడు వచించినాఁడు. ఆత్మయున్నదని యాతఁ డుపదేశించినపుడు, నాస్తికుల ఉచ్ఛేద వాదమునఁబడిపోయి, ప్రజలు భ్రష్టులగుదురనియు తాము చేసిన కర్మలనునను సరించి జన్మజన్మాంతరముల ఫలితముల ననుభవించుట తప్పదనియుఁ జెప్పుటకే. ఆత్మ లేదని యాతఁడు చెప్పినపుడు, ప్రజలు తాము శాశ్వతాత్మస్వరూపులమని తలఁచి, పంచకోశములంకొఁగూడి, పరివర్తనములపాలై అనిత్య మైన సర్వలక్షణములు నిత్యాత్మస్వరూపములేయని దుర్మతా వలంబులై చెడుదురను నుద్దేశమే. ఇపుడీ రెండుభావములలో నేది సత్యమైనది ? ఆత్మ లేదనునదే నిస్సంశయమైన సత్యము. ఈసిద్ధాంతము బోధపడుట కష్టము. అపరిణతబుద్ధులకును, యోగ్యతలేని వారికొఱకు నీతత్త్వోపదేశమును బుద్ధుఁడు ద్దే శించియుండలేదు. ఎందుచేత ? మూర్ఖులాత్మలేదని చెప్పినచో, నిజమనితలచి నాస్తికుల దుర్మతమవలంబింతురు. బుద్ధుఁడు తన రెండుభావములను రెండుభిన్నములైన యుద్దేశములతో జెప్పెను. ఆత్మయున్నదని చెప్పినపుడు, శ్రోతలకు సంప్రదాయ

ధర్మము నుపదేశించెను; ఆత్మలేదని చెప్పినపుడు శ్రోతల కతీతధర్మము నుపదేశించెను." ౧.

## ౧౧—నాగసేనుని ఆత్మతత్త్వము

మనము బుద్ధుని ప్రత్యక్షోపదేశమునుండి, తద్వ్యాఖ్యాకారులైన నాగసేన, బుద్ధఘోషుల తత్త్వనిర్ణయములకుఁ బోయినచో, బుద్ధునిమౌనమును లేక సంశయాస్తిక్యమును నాస్తికపరముగా నర్థముచెప్పిన వాతావరణము గోచరించును. సంప్రదాయమను వృక్షమునుండి, బౌద్ధతత్త్వమనుశాఖను పెరికి, తార్కికక్షేత్రమునఁ గ్రొత్తగా నాటిరి. పరిణామసూత్రమును తర్కహస్తములతోఁ జివరవఱకు గట్టిగా లాగిరి. వ్యాఖ్యామున్నగువారిని జ్ఞాపకముచేయు, కేవల వ్యావహారికపరిణామధర్మముల నపూర్వనైపుణి, చాకచక్యములతోఁ బెంపొందించి, ప్రదర్శించిరి. మనస్సుయొక్క నిర్మాణపరిశీలనము తత్త్వసమస్యాసమాలోచనమునకు వలయు సుశిక్షణావిధానమని బుద్ధుఁడు

౧. అట్లే విజ్ఞానమాత్రశాస్త్ర భాష్యమున ధర్మపాలాచార్యుఁడు చెప్పినాఁడు: "ఆత్మ. ధర్మములస్థితి, అనగా జీవము, వ్యావహారికప్రపంచముల స్థితి మతధర్మము తాత్కాలికముగామాత్రమే యంగీకరించెను. అంతేకాని అవి నిత్యములనుభావముతో నెన్నడుచెప్పియుండలేదు." నాగార్జునుని ప్రధానశిష్యుఁడైన ఆర్యదేవుఁడు, తనమాధ్యమికశాస్త్ర భాష్యమునందు, చెప్పినాఁడు: "బౌద్ధులు, సర్వజ్ఞులై, జీవస్వభావములను బరిశీలించి, ఒకసారి ఆత్మ యున్నదనియు, నొకసారి లేదనియుఁ, బ్రజలకు సద్ధర్మము నుపదేశింతురు. బుద్ధిశక్తులు పరిణతిపొందకుండ నెవఁడును నిర్వాణమునుబొందఁజాలఁడు; దుఃఖమేల నిర్మూలింపవలెనో తెలిసికొనలేఁడు. ఈయున్నతదశలో లేనివారికొఱకే, బౌద్ధులాత్మయున్నదని చెప్పుచుందురు." (చూడు యమకామీ సోజన్: సిస్టమ్స్ ఆఫ్ బుద్ధిస్టిక్ థాట్. పుటలు. ౧౯-౨౦)

నిర్ణయించెను. మనదృష్టి, తాత్త్వికమైన పూర్ణపదార్థనిర్ణయ మునుండి అనుభవగతమైన మానవ మానసికసీమపైఁ గేంద్రీకృతముకావలెనని యాతఁ డభిప్రాయపడినాఁడు. మానవ మానస మను నాకాశమున భావపరంపర లను మేఘములు దృశ్యాదృశ్యసంచారములు చేయుచుండును. మనోభావముల యెడతెగని సంచలన సంచారములనే మనసునందుంచుకొని, మనఃపరిశీలనముయొక్క సుస్పష్టవిధానములనే నమ్మి, నిత్య మగు నాత్మవస్తువు నిరాధారకల్పనమనియు, నవిచ్ఛిన్నమైన చరిత్రముగల గుణపరంపరా సముచ్చయమే మానవునందున్న యాత్మయనియు నాగసేనుఁడు నిర్ణయించినాఁడు. ఆత్మ లేదను నాస్తికవాద మితనివలన సుస్థిరత గాంచినది. తననామమైన నాగసేన శబ్దమునకు నిత్యమైనదేదియు లేదని యర్థముచెప్పునంతటి యావేశమును బ్రదర్శించినాఁడు. ౧. వస్తువులు మనఃకల్పిత నామములుమాత్రమే. నాగసేన నామమెట్టిదో, రథమునునది యట్టిదే. వస్తువు ప్రదర్శించు గుణములవెనుక నిత్యమైన దింకొకటేమియును లేదు; మన మనస్సుచూపు గుణముల కంత ర్వర్తియైయున్న ఏకత్వముగల పదార్థమున్నదని చెప్పుట కాధారములు దురూహ్యములు.

"మిళిందుఁ డడుగుట కారంభించెను. "మహాత్మా! తమ నామధేయము నెఱుఁగఁ గోరుచున్నాను.?"

"నాపేరు నాగసేనుఁడు. ఓరాజా! ఈమఠములోని సోదరు లీపేరుతోడనే నన్నుఁ బిలుతురు. కాని ఇది అందరకుఁ దెలి

౧. మిళింద ౨అ. ౧,౧

యుట కుపయోగించుచున్న యొకశబ్దము. ఈ పేరుగల పదార్థ ములో నిత్యమైనదేదియును లేదు.''

మిళిందుఁడప్పుడు యవనులను, నాగసేనుని శిష్యులను సాక్ష్యముగాఁ బిలిచి యిట్లనెను; "నామముగల యీనాగ సేనుని వ్యక్తిత్వమునందు నిత్యమైన (ఆత్మ) దేదియు లేదని చెప్పుచున్నాఁడు. ఆతఁడిప్పుడు చెప్పునది మనమంగీకరింప వచ్చునా?" నాగసేనునివైపు దిరిగి యాతఁడిట్లనెను; "నిత్యమైన ఆత్మ నీరూపమందు లేనియెడల, ఎవరు నీకు, నీసోదరులకు, నీ కాషాయవస్త్రముల, నాహారవసతులను, నిచ్చి, రోగులకు సౌకర్యములు చేయుచున్నది? అట్టివస్తువు లిచ్చినపుడు వాని ననుభవించు వాఁడెవ్వఁడు? ధర్మజీవనము చేయుచున్న వాఁ డెవఁడు? ధ్యానము చేయుచున్న దెవఁడు? ఉత్తమ పదమైన నిర్వాణమును బొందువాఁడెవఁడు? జీవములను జంపుచున్న వాఁడెవఁడు? ఇతరుల వస్తువులను దస్కరించుచున్న వాఁడె వఁడు? భోగలంపటుఁడై, అనృతములాడుచు, దప్పఁద్రాగు చు, నీజన్మముననే ఫలితములనిచ్చు పంచమహాపాతకములను జేయుచున్న వాఁడెవ్వఁడు? ఆత్మయే లేకున్నచోఁ, బుణ్యపాప ములు లేవు; మంచిచెడ్డలకుఁ గర్తయే లేఁడు; పుణ్యపాప ఫలిత ములును లేవు. ఓపూజ్యతముఁడవైన నాగసేనా! నిన్నొకఁడు వచ్చి చంపినచో హత్యాదోషము లేదా? అప్పుడు మీసంఘ మును లేదు, గురుశిష్యులును లేరు; నీగుర్వాజ్ఞకు విలువయును లేదు. నిన్ను నాగసేనుఁడని నీసోదరులందరు పిలుతురని చెప్పి తివి. ఈనాగసేనుఁడెవరు? నాగసేనుని వెండ్రుకలా?

"రాజోత్తమా! నేనట్లు చెప్పలేదు.

"లేక శరీరముపై రోమములు నాగసేనుఁడా?

"నిశ్చయముగాఁ గాదు.

"గోళ్ళు దంతములు, చర్మము, మాంసము, నరములు, మేధస్సు, నిందొకటికాని, అన్నియుఁగాని నాగసేనుఁడా?"

ఏదియునుగాదని నాగసేనుఁడు చెప్పెను.

"బాహ్యరూపమైన శరీరమా?, వేదనలా? సంజ్ఞలా? సంస్కారములా? విజ్ఞానమా? నాగసేనుఁడ?" ఇదియుఁగాదని నాగసేనుఁడు బదులు చెప్పెను.

"ఈస్కంధ సమ్మేళనము నాగసేనుఁడా?

"రాజోత్తమా! కాదు."

"పంచస్కంధములు కాక వేరేదైన నాగసేనుఁడా!

"రాజోత్తమా! కా"దనియే నాగసేనుఁ డింకను బదులు చెప్పెను.

"ఇట్లెన్నియడిగినను, నాగసేనుఁడు దొరకలేదు. నాగసేనుఁడొక శుష్కశబ్దము. అయినచో మాకెదుటనున్న నాగసేనుఁడెవఁడు!"

పూజ్యుఁడగు నాగసేనుఁడు మిళిందు నడిగెను; "తామిచటికి నడచివచ్చిరా? రథము నెక్కివచ్చితిరా

"నేను నడచిరాలేదు. రథమెక్కియే వచ్చితిని.

"నీవు రథము నెక్కివచ్చినచో, దయతో రథమనగా నేమో తెలియఁజెప్పుము. రథముయొక్క స్తంభము రథమా!

"నేనట్లు చెప్పలేదు."

"ఇరుసు రథమా ?" "కాదు" "చక్రములు, కూర్చుండు స్థలము, తాళ్లు. చక్రపత్రములు రథమా ?

"ఇవేవియునుగాదు."

"ఇవిగాక వేరేమైన రథమా ?

"కాదనియే" బదులుచెప్పెను.

"ఇట్లెన్నియడిగినను, నాకు రథము తెలియలేదు. రథ మొక్క శుష్క-శబ్దము. అయినచో నీవెక్కి-వచ్చిన రథమేది ?" యవనులను, మతసోదరులను సాక్ష్యముగాఁబిలిచి, నాగసేనుఁ డిట్లనెను; "మిళిందరాజు తానొకరథమునెక్కి వచ్చితినని చెప్పినాఁడు. రథమననేమియో చెప్పుమనగా నాతఁడు చెప్పఁజాలఁడయ్యెను. ఈతఁడు చెప్పినది మనమంగీకరింపఁగలమా ?

"మఱియు మిళిందుఁడు చెప్పెను;" నేనసత్యమాడలేదు, యోగివరా ! స్తంభము, చక్రములు, తాళ్లు, మున్నగున వన్నియుఁ గలిసి, అందరకుఁ దెలియునామమైన రథముగానున్నది."
"మంచిది, నీవు 'రథము'ను సరిగా గ్రహించితివి. అదేవిధముగా, శరీరములోని ముప్పది రెండవయవములు, పంచస్కంధములుగలిసి, అందరకుఁ దెలియునామమైన నాగసేనుఁడయ్యెను. బుద్ధునియెదుట మాసోదరి వజీరాదేవి, యిట్లుచెప్పెను; "భిన్నభాగము లేకకాలమున నొకేచోటఁగూడియుండిన 'రథ' నామమెట్లువచ్చెనో, అట్లే స్కంధములు గలియఁగా 'ఆత్మ' నామము ప్రసిద్ధమయ్యెను.౧.

౧. మిళింద. ౨. ౩.౧.౧.

'ఆత్మను' గూర్చి బుద్ధుని మౌనమును, నాగసేనుఁడు వ్యతిరేకార్థముగాఁ దీసికొని 'ఆత్మ' లేదని నిరూపించెను. 'ఆత్మ' శబ్దమునే వాడుట మాని, అవస్థలను జెప్పెను. భావపరంపరా ప్రవాహమే 'ఆత్మ'. ఈవివిధదశలకు నొకేసామాన్య లక్షణ ముండుటఁజూచి, దానికే ఆత్మయని నామకరణము చేసిరి. ఆత్మ యున్నదను జ్ఞానముగాని స్ఫురణగానియున్న దన్నచో, నది మానసికశక్తి కందుబాటులో విషయము కాదని సమాధానము చెప్పెను. వివిధభాగముల కలయికలో రథము నిజముగా నున్నదని తలఁచినట్లే, మానసికదశల వెనుక నిత్యమైనయాత్మయున్నదని తలఁచుచున్నాము. 'ఆత్మ' భావమును శోధించినచోఁ, దేలునదేమనగాఁ, గొన్ని గుణములు కలిసియున్నవి. కొన్నిగుణములసంపుటి శరీరమెట్లో, అట్లే కొన్ని మానసికావస్థల మొత్తమును 'ఆత్మ' యను నామముతోఁబిలుచుచున్నాము.౨. గుణములులేనిదే యాత్మలేదు; ఎట్లన రెండుగట్టులు, నీరు, యిసుకలేనిదే నది లేనట్లు, చక్రములు, స్తంభములు, ఇరుసు, మున్నగునవి లేనిదేరథము లేనట్లును,3. భావములకు వస్తువులకు భేదమును నాగసేనుఁ డంగీకరించును.

---

౨. భావముతో 'ఆత్మ' యున్నదనుటకుసాక్ష్యమని బెద్దలేచెప్పినారు. తరువాతభావమును మార్చుకొనెను. వర్క్స్. వాల్యుము ౪. పు. ౪3౪.

3. బోధిసత్త్వుఁడు యాత్రికునితో నిట్లనెను: "వనాయాతసమీర పరిమిళితమైన గంగోదకమును త్రాగుదువా?" యాత్రికుఁడిట్లు బదులుచెప్పెను: "గంగయేది ? యిసుక గంగా ? నీరు గంగా" ఈతటము గంగా? ఆతటమా? బోధిసత్త్వుఁడెదురు పల్కెను; "నీరు, నిసుకను తటములను లేకున్న నిఁక గంగ యెక్కడిది?" జాతకకథలు : నెం. ౨౪౪.

ప్రతివ్యక్తిలోను, నామరూపములు, మనశ్శరీరము లున్నవి. దేహము నిత్యపదార్థముకానట్లే, మనస్సును నిత్యమైన యాత్మ కాదు. భావములు, దశలు, గుణములు, వచ్చుచుఁబోవుచుఁ గొంతసేపు మనదృష్టినాకర్షించి, యదృశ్యములగును. వీనినన్నిటినిఁగలుపు నిత్యమైనఆత్మ యొకటున్నదని మనముభావింతుము. ఇది అనుభవమునకు విరుద్ధము. హ్యూమ్‌వలెనే నాగసేనుఁడును, మనయనుభవములో నాత్మ వస్తులక్షణములకు సరిపోవునదేదియు లేదని వాదించును. ఏకము, నవిచ్ఛిన్నమునైనదేదియు గోచరింపదు. ఏభావముకాని తత్సమానమైన గుణప్రదర్శనము చేయని దసత్యమే. మనకెట్లు కనఁబడుచున్నవో అవే వస్తువులు. "నామట్టుకు నేను, నాలో నత్యంత సన్నిహితముగాఁ బ్రవేశించినపుడెల్లఁ దప్పక నేనొక గుణమునే దర్శించుచున్నాను; ఉష్ణముకాని, శీతముకాని, వెలుగుకాని చీకటిగాని, రాగముకాని ద్వేషముకాని, సుఖముకాని, దుఃఖముకాని, గోచరించును. నే నెప్పుడు ప్రయత్నించిన నేదో యొక దర్శనమేకాని వేఱేయేదియుఁ జూడఁజాలనైతిని. గాఢనిద్ర వంటి సమయమున నాదర్శనములన్నియు నదృశ్యములైనపుడు, నే నాస్థితిలో నెంతసేపుంటినో అంతసేపు నేను లేనట్లేలెక్క. మఱియు, మరణముచే నాధర్మములన్నియుఁ దొలఁగింపబడినపుడు, నే నాలోచించుట, చూచుట, ప్రేమించుట, ద్వేషించుట, నాశరీరనాశనముతోఁ బోయినపుడు, నేను బూర్తిగా నాశనమైతిననియు, నాసంపూర్ణనాశనమున కింతకంటె నేదియు నవసరములేదనియుఁ జెప్పగలను. ఎవఁడైనను దనలో నావలెనే

ప్రవేశించి, తానింకొక పదార్థమును జూచితినని చెప్పినచో నాతనితోనిఁక నేను వాదింపను. నాయనుభవము, వాని యనుభవము వానికెంతనిజమో, నాకు నంతే నిజమనియు, నీవిషయమున మేమిరువురము భిన్నాభిప్రాయులమనియుమాత్రమే నేను జెప్పఁగలుగునది. వాఁడు తనలో నేకము నిత్యమునైన తన రూపమును జూచియుండవచ్చునుగాని నాకట్టిదేదియును గన్పట్టలేదు. ఈతత్త్వజ్ఞుల నటుంచి, మిగిలిన మానవకోటినిగూర్చి భిన్నదర్శనముల మొత్తములే మానవులని నేను నిశ్చయముగాఁ జెప్ప సాహసించుచున్నాను. ఈభిన్నదర్శనము లొకదానివెనుక నొకటి వర్ణింపనలవికాని మహావేగముతో నెడతెగకుండ జరిగి పోవుచున్నవి. మనకనులలోని గ్రుడ్లు తిరుగులోపుననే భిన్న దశలు గడచిపోవుచున్నవి. మనచూపుకంటె, మనయాలోచన మధికచపలమైనది; మన యితరేంద్రియములన్నియు నిట్టి పరివర్తనమునకుఁ గారణములగుచున్నవి. ఒక్క క్షణకాలమైనను నిశ్చలముగానుండు నాత్మయనుశక్తి యేమియును లేదు." ౧. మఱియు హ్యూమ్ తరువాత నిట్లువ్రాసెను: "మనము మనస్సనుకొనునది, పెక్కుసంబంధములుగల భిన్నభావముల మొత్తమే. తెలియనివారు దానికే యేకత్వము, సమానత్వమున్నదని భావింతురు." ౨. హ్యూమ్వలెనే, నాగసేనుఁడును, పదము

౧. హ్యూమ్స్ వర్క్సు వాల్యుము ౧. పుట ౩.

౨. యమ్ టెయిన్ పలికినాఁడు: "జరిగినవిషయములు తప్ప నాత్మలో నింకేదియును లేదు." వాట్టెరుభావములో, నాత్మయనగా, "నది అస్పష్టమైన యొకశబ్దమనియు, జీవితము,లేక జీవితమునకుఁ గారణమైనయొక నియమమనియు దానిఫలితములు మనకనుభవములైయున్నవనియుఁ జెప్పెను.

లన్నియు నర్థరహితములనియు, 'ఆత్మ' యనుపదము నట్టి శుష్కపదమేయనియు, నది వివేకసమ్మతమైన నిశ్చయమగు టచేఁ జెప్పకతీఁనిసత్యమనియు వాదించినాఁడు. భావమున కం జనిది నిజముగా లేదు. దుఃఖమున్నదనిమాత్రమే మనమెఱుం గుదుముకాని, దుఃఖమునునుభవించు కర్తయొకఁ డున్నాఁడని యెఱుఁగము. 3. డేకార్ట్, లాకేలు చెప్పినగుణముల కాధార మైన యొకవస్తువున్నదని తానెఱుఁగనని, నాగసేనుఁడు న్యాయ్యముగానే చెప్పినాఁడు. దానిభావము మాకుఁ గలుగ లేదు;ఏగుణములకది యాధారమైనదని చెప్పఁబడెనో, యాస్థితిని గూర్చి మేము చెప్పఁజాలము.ఆధునికమనస్తత్త్వశాస్త్ర మాత్మ లేని శాస్త్రమును నిర్మించినది; భిన్నభావనములయు నూహ లయుమొత్తమునకే, 'ఆత్మ' యను ముద్రవేసిరని నిర్ణయించి నది. 'ఆత్మ' యనునదొక అలంకారపదమనియు, దానికి సమ మైన సత్యవస్తువు హుళిక్కియనియు విల్లియమ్ జేమ్సు ప్రకటిం చినాఁడు. "ఆత్మశబ్దము దేనిని జెప్పదు; దేనిని నిర్ణయింపదు; దాని భావపరంపరలే మనకుఁ దెలిసినవి." కొందఱు వ్యావహా రికతత్త్వవేత్తలు, ప్రకృతిశాస్త్ర తర్కవిధానములననుసరించి, పూర్వబౌద్ధులవలెనే, ఆత్మసిద్ధాంతమును నిరసింతురు. ౧. బాహ్య ప్రదర్శనములలో నజ్ఞాతసంబంధముగలిగి, వానికిఁ బూర్తిగా వేఱైయున్న యొక నిత్యవస్తువున్నదనుట మూఢ విశ్వాసమని, వారియభిప్రాయము. "ఇంద్రియాతీత లక్షణము లన్నిటిని తోసివైచిరి. అందుచే 'ఆత్మ' భిన్నావస్థల సముచ్చ

౧. పెర్రీ : ఫిలసాఫికల్ టెండెన్సీస్ పుట ౨౭౧

యమును దెల్పు నామవాచకము. అది చేతనానుభవముల సంపుటి. ౨. నాగసేనుని తర్క మమోఘము. రథము మున్నగు వస్తువులన్నిటికి వెనుకనొక గుప్తమైన సద్వస్తువున్నదని ప్లేటో వలె నమ్మినయెడల, దర్శనసంపుటియగు మానవునం దాత్మ యున్నదని మన మంగీకరింపనవసరము లేదు.

ఇంద్రియజ్ఞానమే లోకమునుగూర్చి చెప్పు నుపకరణమైనచో, ననుభవము మన అనుక్షణ భావనయగును. ఒకక్షణములోని సంబంధము లేని దర్శనమే ఆత్మ. అట్టి క్షణికదర్శమున మున్నంతసేపే మనము మనస్సు లేక ఆత్మయని పిలుచుదాని ఆయుర్దాయము. ఈక్షణములోనున్న జీవస్పందనమే జీవితమని విల్లియమ్ జేమ్సు చెప్పినాఁడు. చేతనత్వ మొకప్రవాహము..... వివిధవస్తువులని మనము తలచునవి ఆప్రవాహములో వివిధ స్పందనములు." నిజముగుద్రష్ట నిత్యుఁడుగాఁడు; ఆతనిజీవితము క్షణమాత్రమే; ఉత్తరక్షణములో నింకొకఁడుదయించి పూర్వక్షణపురుషునితో సంబంధమును గలుపుకొని పనిచేయును. ఆ క్షణమునకు ద్రష్టకు జ్ఞానమున్నది; పూర్వద్రష్ట అనుభవమును గ్రహించి, తనవ్యాపారమును నడపుకొనుచున్నాఁడు," ౩. ఆత్మ యీవిధముగా క్షణికచేతనుఁడు. మనము మనస్సని

౨ విశుద్ధిమగ్గమున నిట్లున్నది; "చక్రస్తంభాదికము లోకసంబంధములో నున్నప్పుడు రథమని మనము చెప్పి, ఒక్కొక్క భాగమునే పరిశీలించినయెడల, నిజముగా రథమనునది లేదని యెట్లు చెప్పనగునో, అట్లే, గృహము, సైన్యము, పట్టణము మున్నగునవి భిన్నాంశముల సంపుటము లెట్లో అట్లే, ఆత్మ, జీవములు నను శబ్దములు, మనశ్శరీరానుభవ పరంపరలే" (3) మనస్తత్త్వసిద్ధాంతములు.

పిలుచు దర్శనము,నిత్యమైన యింకొక మనస్సులేకఆత్మయొక్క లక్షణముకాదు; క్షణికానుభవముల విచిత్రసంపుటియై, యెడ తెగనిమార్పు లొందుచున్నది. దీనిననుసరించి, తాత్కాలిక మైన అనుభవైకత్వమునైనను జూడఁజాలము. రెండనుభవ ములకు సంబంధమున్నదనియు, నీరెండు నొకేవ్యక్తి యనుభవ ములని చెప్పుచుందుమనియుఁ, గాని ఆయొకేవ్యక్తి యనగా వివి ధానుభవసంబంధ సంపుటియని చెప్పుకొన్నచో, నావ్యక్తి యవ సరము తొలఁగిపోవుననియు బెట్రాండురసెల్ వాదించినాఁడు. అవిచ్ఛిన్నత్వమున్నది కాని, ఏకత్వము లేక సమానత్వము లేదని యాతనివాదము. రెండుక్షణముల అనుభవములో సం పూర్ణసమానత్వము లేదు. పూర్వక్షణానుభవము నశించి, అదృ శ్యమైపోయినది; మనమాలోచించు చుండఁగానే మన యను భవములు పరుగెత్తుచున్నవి. ప్రతిక్షణమొక సంబంధములేని స్వతంత్రానుభవమే; ఒకటిపోయి, రెండవది వచ్చి, యట్లే మటుమాయమగుచున్నది. ఒకే చక్రపరిధి అనేకములైన ఏక దేశములున్నవి(Points in circumference)కాని యవియొక్కలి సమీపములై కలిసియుండుటచే నదియొక పరిధియని యెట్లు తలఁచుచుంటిమో, యట్లే. మనక్షణికానుభవము లత్యంత సన్నిహితములై యుండుటచే నేకత్వమున్నదను భ్రాంతిని బొం దుచున్నాము. ప్రతిమనుజుఁడు నిజముగా ననంతమనుజ పరం పరయే; ఇందొకొక్కఁ డొక్కక్షణమే జీవించి మరణించు చున్నాఁడని రస్సెల్ చెప్పినాఁడు. గతము వర్తమానమెట్లు

గును? ౧. క్షణికత్వము, ఏకత్వము, పరస్పరవిరుద్ధములు గత కర్మఫలము వర్తమానములో వచ్చునను కర్మసిద్ధాంతము. లో నీయేకత్వమెట్లువచ్చినదో నిరూపింపఁబడలేదు.

విచిత్రమైన యీయాత్మ సులభవాదములతోఁ బోవునది కాదు. అది లేనిదే దర్శనము, స్మృతి సాధ్యములుకావు. వివిధ దర్శనములే మనస్సైనచో దర్శించునదెవరు? ఒకదర్శనమింకొక దర్శనమును దర్శింపదు. అధునాతన విజ్ఞానమునకు క్యాంటు తత్త్వజ్ఞుఁడిచ్చిన అమూల్యభావమేమన, భిన్నమానసికానుభవముల కేకత్వమును ఘటించి నడపునొక యాత్మజ్ఞానముగల వ్యక్తియున్నదనియే. ప్రత్యేకవ్యక్తులముగానున్న మనజ్ఞానమునకు, భిన్నవస్తుసంబంధముగల ప్రపంచమునుగూర్చిన జ్ఞానమునకు నట్టి వ్యక్తిత్వమే యాధారము. అనుభవపరంపగలో నొక యనుభవముకాని యొకవ్యక్తిత్వమాయనుభవములకర్తయను భావము జ్ఞానమునకవసరము. ఆత్మవ్యాపారమైన సమన్వయము లేనిది, పరస్పరాన్వయశూన్యములైన వివిధభావపరంపరలుండి, జ్ఞానము లేకుండును. వివిధభావములుమాత్రమేగల మన యనుభవములో, భావములేయున్నవికాని, వస్తువులు లేవు. నిజమైన తత్త్వముయొక్క కేంద్రసత్యమైన యీవిషయము; క్యాంటు తత్త్వజ్ఞుని కనేకశతాబ్దములపూర్వము, భారతీయ

---

౧. స్మృతిని (Memory) గూర్చి, అనురుద్ధునిభావమును, అనురుద్ధుని అభిధమ్మత్థసంగ్రహమునకుఁ దానువ్రాసిన పరిచయవ్యాసమునందు 'ఆంగు' చెప్పియున్నాఁడు. ప్రతిమానసికదశ, తరువాతదశలో నాల్గువిధముల సంబంధము గల్గియున్నది. అనంతరము, సమనంతరము, నాస్తి, అవిగతము. ఒక్కొక్కటే పూర్వదశాజ్ఞానమును ముందు దానికందిచ్చును. "పుట ౧౮.

తత్త్వజ్ఞశిరోమణియగు శంకరాచార్యునిచే విస్పష్టసిద్ధాంతముగా నిర్వచింపఁబడినది. తన వేదాంతసూత్ర భాష్యమున శంకరుఁడు క్షణికవాదమును ఖండించియున్నాఁడు.[1] మన అనుభవము క్షణికముగాదు. ఏలన, నదియొక నిత్యమగు వ్యక్తి కిఁజెందినది వ్యక్తియే లేనిచో, గతస్మరణము; స్మృతి, సాధ్యములుగావు. ఈభిన్నానుభవములొకవ్యక్తిని గోరవన్నచో, నొకక్షణములో జరిగిన విషయమింకొక క్షణమున స్మరింపఁబడుచున్నది. నిన్నటిది నేఁడుస్మరించినట్లే. అందుచే మననిర్ణయములు క్షణికములుగాక నిత్యములేయని శంకరుఁడు చెప్పినాఁడు. "ఒకఁడు నిన్న చేసినపనిని నేఁడునేను స్మరించుచున్నాను." అది నిన్న పూర్తియైనపనియే. "నిన్ననొకపని నేఁజేసియుంటినని స్మృతి కలుగుచున్నది." నిన్నజరిగినపని, నేఁటిదాని స్మృతియు సమానత్వముగల యొకవ్యక్తి అనుభవమనుట భ్రాంతికావచ్చును. ఏలన, నారెంటికివ్యక్తి లేకయే సమానత్వముండి యుండవచ్చును. కాని యీవాదము నిలువదు; రెండువస్తువులు లేనిదే వాని సమానత్వమును గూర్చిన నిర్ణయమును మనము చేయఁజాలము; క్షణికవాదమును మనమొప్పుకొన్నచో రెండుసమానవస్తువులు లేవు. కావున నిత్యద్రష్టయొకఁడున్నాఁడనియు, నాతఁడు లేనిదే, భూతవర్తమానానుభవముల నేకముఖమునకుఁదెచ్చి, సమానత్వనిర్వచనములుచేయ వీలుండదనియు స్పష్టమగుచున్నది. గతమును వర్తమానములో దర్శించుటకొక ద్రష్టయుండి తీరవలెను. రెండనుభవముల సమానత్వముపైనట్టి స్మృతిలభించుచున్నదను

1. శంకరసూత్రభాష్యము. 2 అ. 2. 18—32.

కొనినను, నాసమానత్వమునకైన నొకసమాన వ్యక్తిత్వ మవ
సరము. మఱియు, ననుభవసమానత్వము సమాననిర్ణయము
లకుఁ జాలుననుటయుఁ బొసఁగదు. ఏలన, నేనునిన్నఁగలిసిన
యొకవ్యక్తిని నేఁడుగుర్తించినానని చెప్పినపుడు, నిన్నటి, నేఁటి,
నానిర్ణయములు పూర్తిగా సమానములుకావు; నేఁజూచిన
నిన్నటివాఁడును, నేఁడుచూచినవాఁడును సమానులగుటచే
నిర్ణయసమత్వ మేర్పడినది. కేవలసమానత్వము స్మరణకుఁ
జాలదు. మఱియు మనలను మనమేయనుమానింప నవసరము
లేదు. నిన్న నేఁ జూచినదియే, నేఁడునేఁజూచుచున్నదా యని
సందేహముండవచ్చునుగాని, నిన్నఁజూచిన యా 'నేనే' నేఁడు
చూచుచున్న 'నేన'గునా కాదా యని సంశయింపఁబనిలేదు.
ఈవిధముగా శంకరుఁడు క్షణికవాదమును ఖండించి, ద్రష్ట
యొకఁడులేనిదే, అనుభవసమన్వయము, జ్ఞానము, స్మృతి,
సాధ్యములుకావని ఋజువుచేసినాఁడు.౧.

నాగసేనుఁడు జ్ఞానసిద్ధాంతమునుగూర్చి ప్రసంగింపని
కారణమున నీసమస్యలును విడిచిపెట్టెను. లేకున్న చో, జ్ఞానమున
కవసరమగు విషయీవిషయములు రెండునొకటి కాఁజాలవని
వాదింపవలసి యుండెడిది.

## ౧౨—మనస్తత్త్వశాస్త్రము.

ఆత్మనుగూర్చిన తాత్త్వికసిద్ధాంత మేదియైనను, బౌద్ధు
లందరు మానవజీవిత విషయముల నొకనిత్యాత్మ సంబంధము
లేకుండ గ్రహించి యర్థము చెప్పినారు. మఱియు నాత్మకొక

౧. శంకరసూత్ర భాష్యము ౨౮. ౨.౨౫

వేళ నిత్యస్థితి నంగీకరించినను జీవితరంగములో నది క్రియా ప్రయోజనరహితమైనది. మనమిప్పుడు బౌద్ధులాత్మ నెట్లువిభజించిరో చూతము, "ఒకఁడు 'నేన'ని పలికినప్పుడు, స్కంధసంపుటినిగాని, యేయొక స్కంధమునుగాని పచించి యది తానుగానున్న 'నేన'ని భ్రమించుచున్నాఁడు" ౨. లోకయాత్ర చేయుచున్న జీవమనగాఁ బంచస్కంధముల సమ్మేళనము మాత్రమే. ఈస్కంధములు లేక సముచ్చయ ద్రవ్యములు మానవులకైనను, నితరజీవులకుఁ దక్కవగాను నుండును. మనస్సొక నిర్మాణమునకుఁగల యేకత్వమును గలిగియున్నది. ౩. మానసికశక్తుల సంపుటీకరణమే మనస్సు.

వ్యక్తిత్వమునకుఁగల ముఖ్యాధారములు నామరూపములను రెండువిభాగములు చేయఁబడినవి. ఉపనిషత్తులందైనను, జీవాత్మలక్షణములు నామరూపములే. పరిశుద్ధమైన నిర్గుణబ్రహ్మ మీనామరూపముల ద్వారమున లోకమునఁ బ్రదర్శితమైనది. నామము మానసికావస్థలకును, రూపము భౌతికపదార్థాంశములకును జెందియున్నది. ౧. మనశ్శరీరములన్యోన్యాధారభూతములని తలఁపఁబడెను. "స్థూల మెల్ల రూపము; సూక్ష్మ మెల్ల నామము. రెండు నొకదానితో నొకటికలిసి

౨. సంయుత్తనికాయము. ౩అ. ౧౩౦

౩. డాక్టర్ మక్డుగల్ వ్రాసెను; "మానసికావస్థలయొక్క లేక సంకల్పముల సంయోగస్వరూపమే మేధస్సని నిర్ణయింపనగును" (మనస్తత్త్వశాస్త్రము)

౧. రూప్యతిని ప్రదర్శించును గాన రూపమనంబడినది. సంయుత్తనికాయము. ౩ అ. ౮౬.)

యున్నవి; అందుచే రెండును గలిసియే దృశ్యములగును. కోడి తనగుడ్డును వేఱుగాను, గుడ్డుపైనున్న డొలకను వేఱుగాను పరిసవింపనట్లే, రెండునత్యంత సన్నిహితసంబంధము గలిగి కలిసియున్నట్లే, నామములేనిదే రూపములేదు; రూపములేనిదే నామములేదు. ఇవి పరస్పరాధారములై యున్నవనఁగా ననంతకాలమునుండి యట్లుండుట వానిస్వభావమైనది." ౨.

ఇతర భారతీయతత్త్వజ్ఞులవలెనే బౌద్ధులును మనస్సాక యవయవమని నమ్మరు. బాహ్యాభ్యంతరముల భేదమును, లేక విషయావిషయ భేదము నీవిధముగా నొకవాక్యము చెప్పుచున్నది; "వ్యక్తిగతములైన, ఆంతర్యములైన దశలేవి? ఏదశలొకవ్యక్తియొక్క ఆత్మనుసంబంధించినవో 'నావి' యని చెప్పుకొనునవి. బాహ్యములైన దశలేవి? ఏదశలింకొకవ్యక్తిగతములై అనగా నితరవ్యక్తుల అనుభవములై ఆయితర వ్యక్తులు 'మావి'ను కొనుచున్నారో యవి." అన్నియు ధర్మములు లేక మనోభావములు, దర్శనజ్ఞానములకు గోచరించు దృశ్యములు, మానవవ్యక్తిత్వము నామరూప కల్పితమైన మనోభావసముచ్చయము, ధర్మసంగణి ప్రథమగ్రంథములో, మనస్స్వభావము లేక నామస్వరూపమును దెల్పు విషయములు చర్చింపఁబడినవి. ద్వితీయగ్రంథమున, బాహ్యరూపస్వభావములైన విషయములను వర్ణించిరి. ధర్మమనగా బాహ్యాంతరింద్రియ విషయములన్నిటికిఁ జెందినపదము. ప్రపంచదృశ్యములు రెండు వర్గములుగా విభజింపఁబడినవి. (౧) రూపినోఅనఁగా రూప

---

౨. మిళిందపు. ౨ అ. ౮.

ములు గలవి; నాలుగుభూతములు, వానిరూపాంతరములు. (౨) అరూపిణో—అనఁగా రూపములులేనివి; చేతన దశావిశేష ములు – ఊహా, దర్శనము, సమన్వయము, బుద్ధియను స్కంధ ములు, రూపమనఁగా బాహ్యమునఁ జూపట్టు ప్రపంచమనియు, నది,లోనున్న మానసికప్రపంచమునకు భిన్నమైనదనియు మొదట క్రమముగా, మనకుఁ బునర్జన్మములనిచ్చు నితరలోకములని దీనికర్థము వ్యాపించెను. పూర్వబౌద్ధుఁ డీవిషయమున నింత కంటె నధికముగాఁ బరిశోధింప నిచ్ఛగింపలేదని మనముగుర్తింప వలెను; ఏలన నాతనిప్రధానాశయము నైతికము; ఆతఁడు తనభౌతికస్వరూపము ననుసరించి, జగత్ప్రకృతిని నిర్ణయింపఁ దలపెట్టినాఁడు.

నామమునకు సంబంధించినవి చిత్తము, విజ్ఞానము, మనస్సు. నామరూపవిభాగమైదు స్కంధములుగాఁ గూడ నున్నది. (౧) భౌతికలక్షణములు (౨) వేదనములు (3) సం జ్ఞలు (౪) సంస్కారములు (౫) విజ్ఞానము లేక తర్కశక్తి. ఈపదములకుఁ బూర్తిగా నిశ్చితములైన యర్థములులేవు. భావి సముచ్చయరూపమైన 'ఆత్మ'ను దెలుపును. చేతన మనేకాంశ ములను గలిగియున్నది. 'సంస్కార' మున నూహాభావ తర్క రూపములన్నియు సామరస్యమును బొందియున్నవి. విజ్ఞాన మనగా, బుద్ధిసంబంధ విషయములను గ్రహించునది. ౧.

౧. దీనికైనుబదియారు విభాగములున్నవి. పంచేంద్రియములును,మన స్సును, వివేకమును బరిదర్శించునది విజ్ఞానము. ఈయేనుబదియారును,౧౯-౩ అంతర్విభాగములు గలిగి, మానవునిశరీర, మనోగత, నైతికాశయ భావముల నన్నిటిని లెక్కచెప్పును. చూడు. రైస్‌డేవిడ్సు, బుద్ధిజమ్ పుటలు ౯౦-౯౭

దీని కింద్రియ సాహాయ్యమవసరము లేదు; మిగిలినవానికిఁ గావలెను.

విశేషపరిణామోన్నతినందిన యీ యంతరంగ దశా విభాగవిజ్ఞానము ప్రధానవిషయములలో నవీన మనస్తత్త్వ సిద్ధాంతములకు సరిపోవును. మానవవ్యక్తియొక్క బాహ్యాభ్యంతరములైన దేహమానసముల భేదముల నిది స్థూలముగా నంగీకరించినది. ఈ మనశ్శరీరమూర్తియందుఁ, గొంతపరిమితిలో నిలకడగలది దేహము. లేక రూపకాయము; ఈ నిలకడ మనస్సునకుఁ దక్కువ. మానసికరంగమున సంజ్ఞా, వేదన, విజ్ఞానములున్నవి. వేదనమనగా, నింద్రియవ్యాపారము.౨ సుఖము, దుఃఖము, రెండునులేని మానసికానుభవముల నిది, బాహ్యవస్తువులతో నింద్రియస్పర్శలచేఁ గల్పించును; తన్హా లేక తృష్ణ కిదియే కారణము. ఇంద్రియ, మానసిక దర్శనములు, తత్సంబంధములను గ్రహించుశక్తి సంజ్ఞావిభాగములోనివి.3 ఇచట మనకు స్పష్టమైన గ్రహణశక్తియున్నది. భిన్నపరిణామ దశలతో నీచిత్తసంతాన పరంపరలు జనించుచుండును. సంజ్ఞా విషయమింద్రియ విషయముగాని, మానసికవిషయముగాని కావచ్చును.

బుద్ధఘోషుననుసరించి, విజ్ఞానము మొదట వస్తువును స్పృశించినవెనుక, దర్శనము, భావన, సంకల్పము జనించును. కాని యివన్నియు నొకే విజ్ఞానానుభవములోని కల్పితభేద

౨. మిళిందము ౨౮. 3.౧౦

3. మిళిందము ౨౮. 3.౧౧

ములు; నిజముగా విడఁదీయరానివి. "ఒకపూర్ణమైన విజ్ఞానానుభవములో నిది యొకటి నది తరువాత వచ్చునని చెప్పుటకు వీలు లేదు"౧. వేదనమే పూర్ణముగా విజ్ఞానమనియు, వస్త్వనుభవమనియు బుద్ధఘోషుఁడు చెప్పినది విచిత్రమే. ౨.

పూర్వబౌద్ధుల యింద్రియజ్ఞాన సిద్ధాంతము నిచట మనము చూడవచ్చును. నీలిరంగుగలవస్తు ప్రతిమ నేత్రమునకుఁ దగిలినప్పుడు, వస్తువుయొక్క నీలిమ, నేత్రేంద్రియమును, గలిసినవి. కొన్నివేళలఁ గారణప్రత్యయ భేదము చెప్పఁబడెను; దర్శనము, నేత్రము, వస్తువులమీఁద నాధారపడినదనియు, నీలిరంగునుజూచుట మాత్రము పూర్వానుభవముపై నాధారపడినదనియుఁ జెప్పిరి. ఇంద్రియ విషయములైదు;రూప

---

౧. అత్థసాలిని పుటలు ౧౪౩-౧౪౪

౨. వేదనము (౧) అనుభవము గుణముగను (౨) భోక్తృత్వము క్రియగాను, (౩) మానసికలక్షణములరుచి, రూపముగాను, (౪) శాంతి, సన్నిహిత కారణముగను గలిగియున్నది. (౧) చతుర్విధజీవదశలందు ననుభవములేని వేదనములేదు. (౧) కేవలసుఖవేదనమునే యనుభవముకలదని మేమంగీకరింపము. సుఖదుఃఖములు, రెండునులేని యనుభవములన్నియును భోక్తకుఁ జెందును. ఒకవస్తువురుచి తెలియుటకితరములైన దశలు కొలఁదిగా గ్రహించును. స్పర్శకేవలము స్పృశించుటే; దర్శనము కేవలము చూచుటే; సంకల్పము కేవలము వివిధవర్ణనములను గలుపుటే; విజ్ఞానము తెలియుటే. వేదనయొక్కటే, అధికారసామర్థ్యములచే వస్తురుచి ననుభవించును. అందుచే అనుభవమే వేదనలక్షణము. (౩) చేతసికము లేక మనోలక్షణమును రుచిచూచు స్వభావము గలదని వేదన చెప్పఁబడెను. ప్రశాంతమైన శరీరము సుఖముగా నుండును గాన వేదనమునకట్టిది సన్నిహితహేతువని చెప్పఁబడెను, అత్థసాలిని ఇ.టి. పు ౧౪౫-౧౪౬.

శబ్ద, గంధ, రస, స్పర్శలు. బుద్ధఘోషుఁడు వీనిని రెండువర్గములుగాఁ జెప్పెను. అసంపత్తరూపములు; సంపత్తరూపములు. వస్తురూపములతో దేహసాంగత్యములేనివి మొదటివి; రూప శబ్దములు; మిగిలినవి దేహసంయోగముకలవి; స్పర్శకు రూపాంతరములు. సర్వేంద్రియానుభవములును స్పర్శనుండి జనించినవని డెమాక్రిటిస్ చెప్పినాఁడు. పంచేద్రియవిషయములను పంచారమ్మణమని చెప్పిరి. ఇంద్రియము, నింద్రియవిషయము కలిసినప్పుడు, వేదనము జనించును. నిజమునకు, విజ్ఞానమనగా, "నప్రియత్నముగా, నింద్రియము విషయముతోఁ గలియగా బయల్వెడలిన మానసికదశల ఫలితము. ఇంద్రియ విషయ స్పర్శ, రెండుగొఱ్ఱెపోతులు కొట్లాటకుఁ గొమ్ములు కలిపినట్లే జరుగును; నేత్రము వేఱు; వస్తువు వేఱు; సంపర్కము రెంటి కలయికయే" ౧. బాహ్యరూపము లింద్రియముల నొత్తిడి గలుగఁజేసి, వ్యక్తిలోని రూపమును మార్చుటచేఁ గలిగెనని ధర్మసంగణి చెప్పుచున్నది. నేత్రము వస్తువు పరస్పరము నాధారపడియున్నవని చెప్పు నితరభావములును గలవు. నేత్రములేనిదే లోకములేదు; లోకములేనిదే చూచు నేత్రమునులేదు. ౨. మానసికవిషయములు పంచవర్గములు. (౧)

---

౧. మిళిందము. ౨ అ. ౮. ౯; చూడు మజ్ఝిమనికాయము ౧ అ. 3.

౨. ధర్మసంగణిలోని యింద్రియదర్శనమునుగూర్చిన విషయమిట్లు రైస్ డేవిడ్సుసతి సంగ్రహించినది :—

అ— ఇంద్రియములు.

1. మొదట ప్రతియింద్రియము ప్రకృతిలోని చతుర్భూతములకెట్లు సంబంధించినదో, దేహమునకేరీతి సంబంధించినదో చెప్పి, దానిఅగోచరత్వమును, నొత్తిడికలుగఁజేయుశక్తిని నిరూపించియున్నారు.

చిత్తము (౨) చేతసికములు లేక చిత్తగుణములు (౩) పదార్థ రూపములు లేక స్థూలగుణములు, సుకుమరరూపములు లేక సూక్ష్మరూపములు. (౪) పణ్ణత్తి; నామము, అభిప్రాయము, భావము, ఆలోచనము. (౫) నిర్వాణము. ఇవి ధర్మారమ్మణము. ధర్మమనగా మానసికదర్శనము, ఇంద్రియయానుభవ

---

౨. ఇంద్రియవ్యాపారము తద్విభజనము.

(అ) ఒకవ్యక్తిత్వము—ఒత్తిడి కనుగుణముగాఁ బరివర్తనము.

(ఆ) ఒకస్పష్టమైన ఒత్తిడికలుగఁజేయు లక్షణరూపము

(ఇ) (అ) (ఆ) లకు సంఘర్షణము.

(ఈ) ఫలితమైన మానసికదశాప్రవాహము. మొదటుస్పర్శ సుఖదుఃఖ స్ఫలము, లేక భావఫలితము, లేక రెండును ఈలక్షణము రెండుసార్లుచ్చరింపఁ బడెను; పరస్పరమైనయొత్తిడి వర్ణింపఁబడెను. మొదటునీమార్పు; మార్పు వలన జనించిన వస్తుదర్శనము.

## (ఆ)—ఇంద్రియ విషయములు.

1. మొదట నొక్కొక్కయింద్రియ విషయమునకుఁ బ్రకృతితోడి సంబంధము, ప్రకృతిలోని విషయములను గొన్నివర్గములుగా విభజించుట, దాని అగోచరత్వము; గోచరించు కొన్నిరూపములు, ఒత్తిడికలుగఁజేయుశక్తి వీనిని గూర్చి సామాన్యనిర్వచనము.

2. (అ) లోపలనే విషయపృథముండి విషయవ్యాపార విభాగము:—

(అ) దేహములోని తత్సంబంధేంద్రియముపై నొత్తిడి గలిగించు నొక విధము ను లక్షణము.

(ఆ) ఇంద్రియముయొక్క యొత్తిడి.

(ఇ) దానికనుగుణమైన యింద్రియవిషయముయొక్క యొత్తిడి.

(ఈ) ఫలితమైనమానసికదశాప్రవాహము. మొదటుస్పర్శ; సుఖదుఃఖానుభూతి; భావఫలము; లేక రెండును; పరివర్తనమును రెండుసార్లుచ్చరించుట; మొదటునీమార్పు; మార్పువలన జనించిన వస్తుసందర్శనము.

(బౌద్ధమనస్తత్త్వము. పుటలు. ౫౧—౫౪).

మెట్లు, అర్థభావములతోఁ గూడిన జ్ఞానముగా మాఱునో చెప్పఁ బడలేదు. భౌతికావయవ మాత్రమైన మనస్సు, వేదనముల నుండి అర్థభావములను గల్పించుకొనునని చెప్పఁబడెను. అది యెట్లుజరుగునో మనమెఱుఁగము. వస్తువు, ఆలోచనము రెంటి రూపమైన చిత్తమీ వేదనములను విజ్ఞానప్రవాహముగా మార్చు కొనునట. అభిధమ్మములో నేడవగ్రంథము పత్థానపీఠక మనఁ బడును. పట్టాణములనగా సంబంధములు, దృష్టకు దృశ్యము నకు సంబంధమే విజ్ఞానమని బౌద్ధులంగీకరింతురు. కేవల బుద్ధి కార్యమైన స్మరణ (Reccgnition) యేముఖ్యకర్తవ్యమైన విజ్ఞాన వ్యాపారముగా సర్వదశలందు నున్నది. ౧.

అభినవ మనశ్శాస్త్రమున గుర్తించిన సంకల్పము (will) నకు బౌద్ధపరిశీలనములో స్థానమున్నట్లు తోఁచదు. సంకల్ప మును, వేదనస్మరణములవలె ముఖ్యమైనదే. బౌద్ధసిద్ధాంతము ననుసరించి మానవజీవితమునకుఁ బ్రధానోపకరణమైన విజ్ఞా నమునకు సంకల్పము ముఖ్యభాగము. పంచస్కంధముల సాం గత్యఫలితమైనదిగా బౌద్ధ మనస్తత్త్వమున సంకల్పము పరిగ ణింపఁబడినదని తలఁచుటకాధారము లేదు. విజ్ఞానమనగా జ్ఞానము, వేదనమనగా అనుభవము, (Feeling) సంస్కారమనగా సంకల్ప మునని మనము నిర్ణయింపవచ్చును. అభినవశాస్త్రము చెప్పు సంకల్పమునకుఁ జెందిన లక్షణములన్నిటిని దననిఘంటువునందు ఛైల్డర్సు సంస్కారమునకుఁ జెందినవనియే చెప్పినాఁడు. వాంఛ, యత్నములు సంకల్పలక్షణములు. యత్న మన్ని సంస్కారము

౧. మిళిందము. ౨౮. ౩. ౧౨.

లకు సాయపడుశక్తియని రైస్ డేవిడ్సుసతి చెప్పినది. ఆరిస్టోటలు నభిప్రాయములో సంకల్పయత్నము, కామ, రాగములకు, నిర్ణయములకు నవసరమని చెప్పెను. నేటిశాస్త్రములోవలెఁ గామరాగనిర్ణయాది విభాగములు స్పష్టముగ లేకున్నను, బౌద్ధతత్త్వమునందు సంకల్పము, నైతికరంగమునఁ దత్ఫలితములు పూర్తిగాఁ బేర్కొనఁబడినవని రైస్ డేవిడ్సు సతి యభిప్రాయము; పీఠకములందు, "సంకల్పనైతిక వ్యాపారసంబంధములు స్పష్టముగా నిర్వచించఁబడెన"ని చెప్పుచున్నది. ధర్మసంగణియందు రెండువాక్యములందు, సంకల్పమునకుసంబంధించిన సమానార్థకపదములన్నియు, వానిలక్షణములును బేర్కొనఁబడెను. ఆరంభము, యత్నము, ప్రియత్నము, కృషి, ఉత్సాహము, పట్టుదల, ఆటంకనిరోధము, దృఢపరిశ్రమ, తీవ్రముగాఁ గాంక్షించుట, మున్నగువీర్యలక్షణ సంపద పేర్కొనఁబడెను. నైతికములు, తద్విరుద్ధములునైన మానసికలక్షణములు సంకల్పజములేయని వచింపఁబడెను. ఈశబ్దములు మనస్తత్వపరిశీలనమున కుపయోగించినపుడు దోషములేదని మనతోఁబాటు బౌద్ధులు నంగీకరించిరి. కాని సంకల్పజములైన పవిత్రధర్మసమాచరణ ఫలితములను జెప్పవలసివచ్చినప్పు డాపదములకే ఉచిత విశేషణముల నొసఁగి వాడియున్నారు. అహంకారము, తృష్ణ, నీచకామము, కామరాగము, రూపరాగము మున్నగునవి చెప్పఁబడెను." ౧. సర్వలక్షణములను సంకల్పవికారములనియే నిర్ణయింపఁబడెను. మానసికజీవితముయొక్క సంకల్పలక్షణము

౧. జె. ఆర్. ఎ. యస్. ౧౯౨౮. పుట. ౪౫

లేక, సహేతుకక్రియాలక్షణము నభినవ మనస్తత్త్వశాస్త్ర మద్ఘాటించినది. సంకల్పమునకుఁ గొన్ని వేళల సిద్ధాంతప్రాముఖ్యమును, గొన్ని వేళల ననుష్ఠానప్రాముఖ్యమును బౌద్ధు లిచ్చిరి. అలెగ్జాండరుపండితుని భాషలో "మనస్సు సంకల్పించుకొన్న లక్ష్యమునందు భేదములుకలుగకుండ నుంచుకొనుట కుపయోగించున వంతరంగసంకల్ప క్రియలు; లక్ష్యములను మార్చునవి బాహ్యవ్యాపారమునకుఁ బూనుకొనిన సంకల్పరూపములు." జ్ఞానము సంకల్పమును "ప్రతికార్యమునందు విడిగా నుండవు. కాని, ప్రతిసంకల్పవ్యాపారము మానసికరంగ, క్రియారంగములం దవసరోచితముగ రెండురూపములను బ్రదర్శించును." ౧. సాధారణముగా సంకల్పము మానసికమయ్యుఁ గ్రియారూపమునఁ బరిణమించును. జ్ఞానవ్యాపారము లెక్కుడు క్రియాత్మకములు. ప్రతీత్యసముత్పాద వాదమునందు, దర్శనములు కామముల నుదయింపఁజేయునని చెప్పిన బౌద్ధతత్త్వము సహేతుకమైనదే. సంకల్పము దేనిపైఁ గేంద్రీకృతమైనదో యావస్తువును మనముస్పృశించుట, చూచుట, ఊహించుట, జ్ఞాపకముంచుకొనుట మున్నగునవి చేయనగును. జ్ఞానము, సంకల్పము, సంకల్పముయొక్క బాహ్యాభ్యంతరక్రియారూపములని చెప్పవచ్చును. శరీరశాస్త్రమున వేదనాత్మకములు, చలనహేతువులునగు నరముల ఒకచుట్టు నేకాత్మకమైన వ్యాపారముగా గణింతురు. ఈనరములలో నంతర్ముఖములైనవి జ్ఞానమునకు, బహిర్ముఖములైనవి సంకల్పమునకు సరిపోవును. ఈ

౧. బ్రిటిషు జర్నల్ ఆఫ్ సైకాలజీ. ౧౯౧౧. పుట. ౨౪౪.

రెంటివ్యాపార మేకాత్మకముగానే గ్రహింపఁబడి,యం దివి భేద రూపములని గుర్తింపఁబడినవి. మానసికజీవిత మంతయు సంక ల్పాత్మకమైనప్పుడు, లక్ష్యసిద్ధికై చేయు ప్రయత్నమే సంకల్పమ గును. అప్పుడు సంకల్పములోనున్న కార్యము, బాహ్యసిద్ధినం దును. ఇచటనైనను సంకల్పము క్రియాత్మకమే. క్రియావ్యాపా రమున కాటంకమేదైనఁ గలిగినప్పుడు ఆలోచనాసంబంధమైన జ్ఞానము పనిచేయును. ధ్యానగమ్యమైన యానందము, సంకల్ప పరిణామమే; ఇచట ధ్యానమే ఆనందప్రదమైన సంకల్పవ్యాపా రము. భావన, సంకల్పమునుండి స్వతంత్రముగాదు. అది సర్వ క్రియలననుసరించును. మానసికదశలను త్రివర్గమొనర్చిన పూర్వాభ్యాసములను విసర్జించి, ప్లేటుపండితుఁడు, ద్వివర్గమే చేసి, జ్ఞానమునకుఁబదులుగాఁ గుతూహలమనుదానిక్రింద నీ రెం టిని వనగా, వేదనాసంకల్పక్రియలను జేర్చినాఁడు. జ్ఞానము నకుఁ బ్రత్యేకస్థితిని దొలగించి, యది సంకల్పమున కాంతరంగిక రూపమేయని నిశ్చయించినచో, మానసికజీవితమునకుఁ గేంద్ర సత్యమైన బౌద్ధుల సంకల్పమే ప్రధానమను భావము నంగీకరిం చినవార మగుదుము.

ఇంద్రియాతీతమైన 'ఆత్మ' లేకున్న నాస్థానమున యమ్. పోస్సిన్ చెప్పినరీతిని, విజ్ఞానము ప్రవేశించినది. ౧. ఒకజన్మము నుండి యింకొకజన్మమునకుఁ దోడవచ్చునది విజ్ఞానము. ౨. మనకు విజ్ఞానసంతానమున్నది. ఈవిజ్ఞానమొక నిత్యమైన,

---

౧. జర్నల్ ఏషియాటిక్ ౧౯౦౨. ఈభాగము పీఠకముల తరువాతదై యుండనగును. ౨. డబ్లియు. బి. టి.—పుట ౨౦౭.

మార్పులేని, జన్మాంతరయాత్రచేయు వ్యక్తిత్వముగాదు; అనేక క్షణిక విజ్ఞానదశాపరంపరాప్రవాహము. విజ్ఞానావస్థలు, వేదనములతో సంబంధములేని స్వతంత్రావస్థలు; భౌతికావస్థల యాధారము వీని కవసరములేదు.

బౌద్ధ మనస్తత్త్వశాస్త్రము సముచ్చయాత్మకమని చెప్పవచ్చును. కొన్నిసూత్రముల ననుసరించి, ప్రతిధర్మమునకుఁ బూర్వాధారములైన లక్షణములన్నిటినవి యెట్లు విజ్ఞానకారణములగుచున్నవో వర్ణించి, ఆయుగమున సూచితములైన హేతువుల నగ్గడించిరి. కొన్నిదర్శనములు తటస్థించినపుడు తత్తుల్యములగు భావములే యేలకలుగుచున్నవను ప్రశ్నమునకు, నాగసేనుఁడిట్లు బదులుచెప్పెను;"అవి వాని స్వభావములగుటచేతను, వానిద్వారములగుటచేతను, వానియభ్యాసము లగుటచేతను, వాని సాహచర్య లక్షణముచేతనునట్లు తటస్థము లగుచున్నవి." స్వభావలక్షణ మభినవశరీరశాస్త్రమునఁజెప్పిననరముల అభ్యాసధర్మమని చెప్పవచ్చును. "వర్షించినపుడు, వర్షజలమెచటికిఁ బోవును? "భూమి యెటువల్లమున్న నటుపోవును." 'సృష్ట్యాదిని జలమెట్లు పల్లమునకుఁ బ్రవహించెనో, యిప్పుడునట్లే ప్రవహించుచున్నది."౧. డాక్టర్. మెక్డుగల్ వ్రాసినాఁడు;"ఏనరముల సమూహమునుండియొక యుద్రేకముప్రవహించునో, ఆనరసమూహము దానివలన తనపటుత్వమును గొంతఁగోల్పోవుననినమ్ముట కాధారములున్నవి."భావప్రసరణముచే నరముల దార్ఢ్యము సడలునని తెలియుచున్నది.౨. నాఁడు ప్రకృతి శాస్త్రములు లేవు గావున,

౧. ౨౫. 3. ౭. ౨. ఫిజియలాజికల్ సైకాలజీ. పుటలు. ౧౨౫—౨౬.

నీవిషయమును బౌద్ధులు తమమన స్తత్త్వపరిశీలనముచేతనే తెలిసి కొనిరి. కాని, శరీరశాస్త్రము, మేధస్సుయొక్క భౌతికపరిశీలన మువలననుగాదు. గతస్మరణశక్తినిగూడ వారుపేర్కొనిరి.

మానసికదశల పరిణామమునుగూర్చి, చెప్పఁచుఁ, ప్రతి మానసికదశకు మూఁడవస్థలుగలవనిరి. ఉత్పాదము, స్థితి, భంగ ములు. ఇందొకొక్కటియు నత్యంతసూక్ష్మకాలమైనక్షణమే యుండును. ఒకచిత్తదశ, యుదయించుట, నిలుచుట, నశించు టయు నీమూఁడునుగలిసియొకచి త్తక్షణమగును. ఒకక్షణకాలము కూడఁ బూర్తిగ నీదశయుండదని కొందరుబౌద్ధులు పలుకుదురు. ఒకదశగోచరించి నశించునేకాని అతిసూక్ష్మాంశ పరిమితికాల మైనను నిలకడదానికుండదు. విశుద్ధిమగ్గము చెప్పినది; "పూర్వ క్షణమందలి దశగతించినది; అది నిలుచునదికాదు, నిలువదు. ఉత్తరక్షణదశయునట్టిదే. వర్తమానక్షణికదశ యున్నది; కాని యదిగతములోలేదు; ముందుండదు."3.

ప్రతివిజ్ఞానదశయు, ననావిష్కృతమైన యాంతర్యచేత నముయొక్క చేతనప్రవాహమే. స్మృతిహీనమైన దశను (Un-conscious State) బౌద్ధమన స్తత్త్వ మంగీకరించినది. అది విధి చిత్తములేక పరిణామము లేనిదనియు, విధిచిత్తమనగా జాగ్ర దవస్థయనియుఁ జెప్పఁబడెను. మనోద్వారమున నీరెండును వేఱైన యవస్థలుగాఁ బరిణమించినవి. భావాంగము౧లేక జీవవ్యాపార

3. డబ్లియు. బి. టి పుట ౧౫౦.

౧. భావము=స్థితి, అంగము=భాగము. భావాంగమనగా స్మృతిలేనిస్థితి, అన్నియు సజీవములే; కొన్నిదశలలో స్మృతియున్నది; కొన్నిటలేదు.

మఱఁగియున్నప్పుడీ స్మృతిశూన్యత తటస్థించును. జాగ్రద్విజ్ఞాన శూన్యదశయే భావాంగము.౨.

ఇంద్రియ క్షోభములను భావములుగాను, భిన్నత్వములో నేకత్వమును గలిగించు క్రియాసామర్థ్యము కేవల భౌతికసిద్ధాంతమునఁ జెప్పుటకు వీలులేదు. మానసికదశావిభాగమునిచ్చిన బౌద్ధమనస్తత్త్వము, సంకల్పము, శ్రద్ధయున్నగు వానికొకద్రష్టయవసరమగునా కాదాయను సమస్యనూహించి యుండలేదు. ఊహాలను, సంబంధములనిచ్చినదేకాని, వానినిఁ గలిపి యర్థముచేసికొనునొక చేతనవ్యక్తిత్వము సంగతి నాలోచింపలేదు. విజ్ఞానకర్తయనగా, భిన్నమానసికావస్థల మొత్తమని వారిభావము. "నామరూపములవలన వ్యాపారములు జరుగును." నామరూపములు నిత్యపరివర్తనాత్మకములు. స్పర్శననుభవించువ్యక్తి యెవఁడని యడుగరాదు; స్పర్శావస్థ కాధారమేమియని యాలోచింపవలెననియే చెప్పఁబడెను.౩. మనకు వ్యక్తిత్వమున్నదనుకొనుట భ్రాంతి; కాని 'నేను' పునర్జన్మమందుచుంటిని, నిర్వాణము నార్జించితినని చెప్పుకొనుచున్నాము.

౨. భావాంగములు ౧౯ విధములు. అందుఁ బది కామలోకమునను ఐదురూపలోకమునను, నాలుగుఅరూపలోకమునను నుండును. రైస్ డేవిడ్సు సతినను సరించి, "ఒకసజీవనిర్మాణము యొక్క మానసికస్పందనముల సముచ్చయము విజ్ఞానము: అల్పకాల పరిమితమైన జీవితములోవచ్చి, తెలియంచుఁ బోవుచున్నవి"

(బుద్ధిస్టు సైకాలజీ. పుట. ౧౬) భావాంగమువ్యక్తి గతముగాఁజూచిన స్మృతిలేనిస్థితి; బాహ్యమునుండి చూచిన నిర్వాణము.

౩. చూడు. సంయుక్తనికాయము. ౨ అ. ౧౩.

దీనినే బుద్ధఘోషుఁడిట్లు చెప్పినాఁడు. "ఏభిన్నావస్థల సమూహ మొక వృక్షమనిచెప్పి, దానికిఫలము లుదయించినప్పు డా వృక్షముఫలించినదని యెట్లు చెప్పుచున్నామో, అదేవిధముగా నేభిన్నావస్థలసముచ్చయములైన రూపములను మానవుఁడనియు దేవతయనియుఁజెప్పి, అవి సుఖ దుఃఖములను బొందినచో మానవుఁడు లేక దేవతసుఖదుఃఖములను గాంచెనని చెప్పుకొను చున్నాము."౧. వర్తమానదశ, గతదశకాకున్నను, వర్తమానము గతమునుండి వచ్చినది కనుక, దశాపరంపరా ఫలితమే యైయున్నది.౨.

నిత్యాత్మభావము లేదు కనుక పునర్జన్మవిషయము నిర్ధారణమైనది. ఏకాత్మలేనిదే, పాపపుణ్య ఫలానుభవరూపమైన శిక్షయెవరికిఁ జెందునను సమస్యయున్నది. తప్పుచేసినవాఁడప్పుడే పోయి, శిక్షానుభవమున వేఱొకఁడున్నాఁడని చెప్పుచో నెట్లు పొసగును. కాని, శిక్షానుభవమునకువలయు జీవసమానత్వమున్నదట. ఈసమానజీవి, కేవలము నియమరహితమై. పరస్పర సంబంధములేని దశాపరంపరకాదు; అదియొక భౌతిక, మాన

---

౧. డబ్లియు. బి. టి. పుట ౨౮౧

౨. "ఓరాజా! ఒకఁడొకదీపమును వెలిగింపగా నది రాత్రియంతయు నుండుటలేదా?" "నిజమే, రాత్రియంతయు వెలుగుచున్నది." "మొదటి జాములో నున్నదీపజ్వాల రెండవజాములో నెట్లుండుచున్నది?" "కాదు, ......దీపము రాత్రియంతయు నొకేపదార్థమువలనఁ గాలుచున్నది." "అదే విధముగా నోరాజా! వస్తుభిన్నదశాపరంపరలు కలియుచున్నవి. ఒకదశవచ్చి పోవునంతలో రెండవది వచ్చుచున్నది. ఆద్యంతములేని యీపరివర్తనము నడచుచున్నది. (మిళిందము)

సిక, నైతికసజీవదశాసంపుటి. మిళిందరాజు నాగసేను నడిగినాఁడు "పుట్టిన మానవుఁడు, వాఁడే యున్నాఁడా, వాఁడుమారిపోయి యింకొకఁడు జీవించునా ?" "పుట్టినవాఁడునుగాఁడు, వేఱొకఁడును గాఁడు." "ఉదాహరణపూర్వకముగాఁ జెప్పుము." "ఓ రాజా ! నీవు చంటిబిడ్డగానున్నప్పుడు వీపుపైఁ బరుండిన యా బాలుఁడు, నిప్పుడు పెరిగి పెద్దవాఁడవైన నీవు నొకటేనా ?" "కాదు. ఆబిడ్డను నేనుగాను." "ఆబిడ్డవు నీవుకానిచో, నీకుఁ దల్లియుఁ దండ్రియు గురువును లేఁడు." 3. చచ్చినవాఁడు పునర్జన్మమెత్తినవాఁడు కాఁడు; కాని వీరిరువురకు విశేషభేదము లేదు; చచ్చినవానినుండియే మఱలఁ బుట్టినవాఁ డుదయించును. ప్రతిదినము మనము నూతనపురుషులమేకాని, పూర్తిగా నూతనులము కాము. ఎడతెగనిమార్పులో, నెడతెగని యవిచ్ఛిన్నత్వమున్నది. బుద్ధఘోషుఁడిట్లు పలికినాఁడు:" ఏకశాపసంవరలనుండియైన నొక పూర్ణసమానవ్యక్తి లభించునేని, పులుపెక్కిన పెరుగు పాలనుండి జనించియుండలేదు. అసలు సమానత్వమే లేకుండినచోఁ, బాలు లేకుండఁ బులుపుపెరుగును లభించియుండదు." పూర్ణసమానత్వముకాని, పూర్ణభిన్నత్వముకాని లేవు. అంతయు నొకదశాపరంపర. ఉత్తరక్షణసృష్టి, పూర్వసృష్టి కత్యంతసన్నిహితమగుటచే వ్యవహారమునకు రెండు నొకటేయని గ్రహింపవచ్చును. ఇట్లే కర్మయు నవిచ్ఛిన్నము; పునర్జన్మము నూత్నజన్మమే. ఉపనిషత్తులలోనైనను, నిత్యవికాసమందుచు ననిత్యమైన జీవరూపము సంసారచక్రమున సంచరించుచు, పుణ్యపాప కర్మఫలభోక్తయగుచున్నది. పునర్జ

ర్మమునకు జీవైకత్వ మవసరము. అనిత్యత, కారణధర్మముల వలన నొకక్రియాత్మకమైన జీవభావము కనుగొనఁబడినది. ఉదయించినవెంటనే నశించు ప్రత్యనుభవము నుత్తరక్షణానుభవ జీవితములోఁ గలిసిపోవుచు, నుత్తరక్షణానుభవమున నీవిధముగా గతమంతయు సూక్ష్మరూపమున నంతర్భూతమై ప్రవహించుచున్నది. బెర్గ్సాన్ స్మృతి సిద్ధాంతవాక్యములను స్మరింపఁజేయుచు, బౌద్ధులు స్మృతియనునదొకటి వేఱుగా లేదనియు, వర్తమానజీవదశలో గతానుభవమంతయు నవిచ్ఛిన్నముగాఁ బ్రవహించుచుండుననియు నిర్వచించిరి. "మనబాల్యదశలో మనము కోరినది, సంకల్పించినది, అనుభవించినదియు నీక్షణామున వర్తమానమునఁ దొంగిచూచుచు, నందుఁగలిసి, విజ్ఞానద్వారమునొద్ద నిలిచి, గెంటుచున్నది. విజ్ఞానము దానిని గుమ్మమునొద్ద విడిచి ముందుకుఁబోవుచున్నది."౧. గతము వర్తమానమును గడచి, తనకాటుయొక్క యానవాలు నిచట విడిచి యదృశ్యమగును.

### ౧౩—ప్రతీత్యసముత్పాదవాదము

దుఃఖమయమైన జీవోత్పత్తి, తన్నాశమును, ప్రతీత్యసముత్పాదసిద్ధాంతము చెప్పును. "అప్పుడు బుద్ధభగవానుఁడు రాత్రి ప్రథమయామమునఁ గారణపరంపరపైఁ దనదృష్టిని కేంద్రీకరించి, దానిననులోమ విలోమ క్రమమునఁ బరిశీలించెను; "అజ్ఞానమునుండి సంస్కారములు, సంస్కారములనుండి విజ్ఞానము, విజ్ఞానమునుండి నామరూపములు, నామరూపముల

౧. క్రియేటివ్ ఇవల్యూషన్ పుట ౯,

నుండి, షష్టరాష్ట్రములు ననగా త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణ మనస్సులు, సష్టరాష్ట్రములనుండి, సంయోగము,నందుండి వేదనము, నందుండి కామము, నందుండిసంగము, నందుండిపరిణామము, నందుండిజన్మము, నందుజరామరణములు, వియోగ విచారదుఃఖ దైన్యాదులు జనించుచున్నవి. దుఃఖపరంపర కంతకు మూలకారణము లిట్లున్నవి. తిరిగి, అజ్ఞాననాశముచే ననగాఁ గామము పూర్ణముగా నశించుటచే, సంస్కారములు నశించును; దానితో విజ్ఞానము, దానితో నామరూపములు, నామరూపములతో షష్టరాష్ట్రములు, వానినాశముతో సంగము, దానితో వేదనము, దానితోఁ దృష్ణ. తృష్ణతో సంయోగము, దానితోఁబరిణామము, దానినాశముతో జన్మనాశనము, జన్మనాశనముతో జరామరణ వియోగవిచార దుఃఖదైన్యాదులు నశించును. ఈదుఃఖ పరంపరను నిర్మూలించు విధానమిది."౧. బుద్ధునికాలమున రెండుమూడు పదములతోఁగూడిన యీసిద్ధాంతమునకు వివిధభావములను గలిపి, యీదీర్ఘరూపమును తరువాతఁ గల్పించిర"ని వారక్ పండితు నభిప్రాయము. మానవజీవితము సంసారచక్రమునఁ దగుల్కొని యున్నదనియు

౧. మహావగ్గము. ౧అ. ౧.౧-3; యస్.బి.ఇ. 13అ; మిళిందము. ౨అ.3.౧.

౨. అష్టబంధములకు ప్రాణవాయువు, వాక్కు, జిహ్వ, నేత్రము, శ్రోత్రము, మనస్సు, కరములు, త్వక్కు వీనియంగములు చెప్పఁబడినవి. ఇదియే బౌద్ధసిద్ధాంతమున కాధారమై యుండవచ్చును. బ్రహ్మచక్రమను మాట శ్వేతాశ్వతరమున నున్నది. (౬అ,౧) పూర్వబౌద్ధమున దీనినే భావచక్రమనిరి. బృహదారణ్యకము 3అ.౨.

పరివాహరూపముననున్న కారణధర్మబంధములనుండి విముక్తుఁడగుటకు మానవున కవకాశమున్నదనియు దీనిభావము. ఇట్టి విధమైన సంసారచక్రము, దానినుండి బయల్పడునుపాయమును నుపనిషత్తులును వర్ణించినవి. సంసారచక్రముననున్న భిన్నాంశములే భూతవర్తమాన భవిష్యజ్జీవితములు.3.

జీవనేచ్ఛయే మనజీవితములకు మూలము. జీవనేచ్ఛానాశనమే నిర్వాణము. కాల్డరన్ వాక్యము నభిమానముతో షోపెన్హాయరుదాహరించినరీతిని, జన్మమెత్తుటే మానవుఁడు చేసిన మహాదారుణపాపము. ఈచిన్నసత్యమే, అతివిస్తారమగు కారణధర్మముగాఁ బెంపొందింపఁబడినది. ఇది బుద్ధుఁడుపదేశించిన ద్వితీయమహాసత్యము. తృష్ణచే దుఃఖ ముదయించుననియుఁ దృష్ణామయ జీవితావస్థలను నీసత్యము ప్రకటించెను. ఒకదానికొకటి కారణమైన ద్వాదశనిదానము లిచటఁ బేర్కొనఁబడినవి. మొదటిదైన అవిద్యయుఁ జివరిదైన జరామరణమునుగాక మిగిలిన పదియు దశకర్మలని చెప్పఁబడెను. పూర్వబౌద్ధములో నివి జీవదశలేకాని, వేఱువిషయములుగాఁ జూడఁబడలేదు. నిదానసంఖ్యకాని, క్రమముగాని నిర్ణయింపఁబడలేదు. ప్రతీత్య

3. ఈక్రిందిపట్టిక యీభేదములను జూపును. చూడు మజ్ఝిమనికాయము. ౧౪౦; మహాపదానసుత్తాంతము. ౨

౧. పూర్వజన్మమునకుఁ జెందినవి. అవిద్య, సంస్కారములు,

౨. వర్తమానజన్మమునకుఁ జెందినవి { విజ్ఞానము; నామరూపములు; షడాయతనములు లేక యింద్రియములు; స్పర్శ, వేదన, తృష్ణ ఉపాదానములు

౩. భావిజన్మమునకుఁ జెందినవి భవ, జాతి, జరామరణములు.

సముత్పాద, నిదానసిద్ధాంతములందు, సర్వజీవముల స్థితియం దును, బరస్పరాధారభూతములైనధర్మములు పేర్కొనఁబడినవి.

ఈదశాపరంపరలో మొదటిదిఅవిద్య: అసత్యమైన‘నేను’ అనుభావమే స్వతంత్రజీవ వ్యక్తిత్వమునకు ముఖ్యాధారము.ఇది కర్మహేతువు, కర్మసారథియుఁగూడను. జ్వాలయొక నిప్పునెర మును, నిప్పునుప్రజ్వలింపఁజేయునదియు నెట్లో, జీవాత్మ అవిద్యా కర్మలకు సంతానమును, కారణమునుగూడనైయున్నది. జీవిత స్వభావమైన దుఃఖము నవిద్య మఱుఁగు పఱచును.౧.అవిద్య నుగ్గ డించుట బౌద్ధమతమునకే ప్రత్యేకలక్షణము గాదు. బిషప్ బట్లర్ చెప్పినట్లు,“వస్తువు లవి యేవో అవియే; వానిఫలితములు నెట్టివో యట్టివే. ఇఁకమనమేల వానిచే మోసగింపఁబడుట కిష్టపడ వలెను?” కాని నిజముగా మనమనుదిన మాత్మవంచకులమగు చున్నాము. సత్యాంశములనెఱిఁగి, వానియర్థమును గ్రహింపు మని బుద్ధుఁ డుపదేశించుచున్నాఁడు. అసత్యమైనవానిని వాంఛిం పఁజేయు నవిద్యయే జీవితమందాశ నుదయింపఁజేయుచున్నది. బ్రతికి, జీవితసుఖ మనుభవింపుమని యది మన కుత్సాహ మిచ్చుచున్నది. జీవనాసక్తి చతుర్విధమానసికోన్మాద హేతు వులలో నొకటగు హేయము నీచము, మూర్ఖమునైన తృష్ణ యని బుద్ధునిభావము. మానవుఁడు తన యిహలోకజీవితదుర్భర దుఃస్థితిని నిర్మూలించుకొనుట కుపాయ మసత్యకామమైన జీవనాసక్తిని నశింపఁజేయవలెను. అహంకారమున కజ్ఞానమే

౧. “ఈలోకమున నేదియు బాపముచేయనిదే దుఃఖమనుభవింపను”
(కార్లైల్. వార్ధకవ్యాసములు.)

కారణమని పూర్వబౌద్ధ ముపదేశించినది. ప్రపంచజీవపరంపరకు సంబంధములేని తానొకస్వతంత్రవ్యక్తినని అదిభావింపఁజేయును. మనయల్పజీవము నందాసక్తిచే, ననేకశ్రమలకోర్చి దానిని బోషించి శాశ్వతముగా రక్షింప యత్నింతుము.౧

ప్రత్యేకవ్యక్తిత్వ మొకదోషము, దానిబాహ్యస్వరూపమే తృష్ణ, మానవులు దుఃఖాత్ములగుటకు వారు బ్రతికియుండుటేకారణము. జీవనాసక్తి సర్వదుఃఖమూలము. అవిద్యాశక్తి యమోఘబలము కలదగుటచే జీవిదురంతదుఃఖ మనుభవించియున్నను దానికి జీవనాసక్తి పెరుగుచునే యుండును.

విషయపరంపరలోని రెండవది సంస్కారము. సంస్కారశబ్దము సిద్ధమొనర్చు, నేర్పాటుచేయు ననుధాత్వర్థమునుండి వచ్చినది. అది చేయుపద్ధతికిఁజేసిన క్రియాఫలితమునకుఁగూడ వర్తించును. వస్తువులన్నియు నింకను బరిణామదశలోనే యున్నవనియు, జీవాత్మయు నొకపరిణామపరంపరయే యనియు నది సూచించును. సంస్కారమనఁగా సమన్వయములేక అన్వయము పుణ్యాపాపఫలితములు గల కర్మయనియు దానికర్థమున్నది. విశాలమైన యర్థములో సంస్కారమనగా నూతనజన్మమునకుఁ గారణభూతమైన సంకల్పశక్తి లేక జీవశక్తియని చెప్పవచ్చును. మజ్ఝిమనికాయమిట్లు చెప్పినది; "శిష్యులారా! భక్తి ధర్మ

---

౧. సముద్రతరంగముపైనున్న ఫేన బుద్బుదము సముద్రమునుండి యెంతవేఱైనదో, జీవశరీరములోనున్న యొక అణు వితరదేహ భాగములనుండి యెంతవేఱైనదో, మనుష్యులు పరస్పరము నంతవేఱైన వారను భావము నెఱుఁగరు. (రైస్‌డేవిడ్సు, ప్రపంచమతతత్త్వములు. పుట ౧౪౪)

ము, సిద్ధాంతజ్ఞానమును గలిగిన యతివరేణ్యుఁడు, వివేకవిలసితుఁడై, ఆత్మార్పణబుద్ధితోఁ దనలో దానిట్లనుకొనును; "నా శరీరము మృత్యువశమై పోయినపుడు, ప్రతాపముగల యొక రాజకుటుంబమున నేను జన్మింపఁగలను." ఈభావమునే యాతఁడు సంకల్పించి, పారాయణము చేయుచుండును. ఈభావ సంస్కారము లంతరంగమునందుండి, యాతనికట్టి జన్మమునే లభింపఁజేయును. శిష్యులారా! పునర్జన్మ స్వభావమీరీతిగా నుండును." ఈవిధముగా మనుష్యదేవతా జన్మకాంక్షలను జెప్పి తుదకు నిర్వాణకాంక్ష వర్ణింపఁబడెను. సర్వసంస్కార నాశనసంస్కారమును కలుగవచ్చును. అనగా జ్ఞానమోక్ష ప్రాప్తి.

కారణ ధర్మపరంపరలలో నామరూపములకాధారమైన మూఁడవది విజ్ఞానము. "ఆనందా! విజ్ఞానము గర్భమునఁ బ్రవేశింపకున్నచో గర్భములో నామరూపము లుదయించునా?" "ఆర్యా! ఉదయింపవు." "విజ్ఞానము గర్భమునఁ బ్రవేశించి, తరువాతఁ దొలఁగిపోయినచో నీజీవితములో నామరూపము లుదయించునా?" "ఆర్యా! ఉదయింపవు." "బాలబాలికలకుఁ జిన్ననాఁడే విజ్ఞానము నశింపఁగా, నామరూపములు వికసించి, విస్తరించి, వృద్ధిపొందునా?" "ఆర్యా! అట్లుజరుగదు."౧. మరణమువలన శరీరవేదనదర్శనాదికములన్నియు నశించునుగానిపూర్వోత్తరజన్మములకు సంధానహేతువగు విజ్ఞానము నశింపదు. నిర్వాణము లేక మోక్షముగలిగినప్పుడే అది పూర్తిగా నదృశ్య

౧. మహానిదానసుత్తము.

మగును. పూర్వదేహి పోయినప్పు డుత్తరదేహికి బీజప్రదానము చేయునదే విజ్ఞానము. ఈబీజము గర్భకోశమందుఁ దన నూతనదేహమునకు వలయు పరికరములను గ్రహించును. అవసరసామగ్రి లభింపకున్నచో విజ్ఞానబీజము పెంపొందఁజాలదు. "ఆనందా! విజ్ఞానమున కుచితములైన శరీరము, నామము నాశ్రయములుగా లభింపకపోయినచో, సర్వదుఃఖహేతువులైన జన్మజరామరణము లోకదానివెంటనొకటి బయలుదేరునా?" స్వామీ! అట్లుబయలు దేరవు" ౨.

ఎన్నుమయజగత్తు విజ్ఞానమయజీవున కెట్టయెదుటనున్నది. ద్రష్టలేనిదే దృశ్యము లేదు. ఇంద్రియములు విషయముల సంబంధముగలిగి, యిచ్చిన విషయసంజ్ఞములే షట్టేంద్రియవ్యాపారములకాధారములు. ఈవిషయసంజ్ఞోత్పత్తియే జన్మకారణము, తన్నిరోధమే మరణము. విజ్ఞానము, నామరూపజగత్తు పరస్పరాధారభూతములు. వానినుండియే ఆఱుక్షేత్రములైన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణమానసము లుదయించును. తన్మూలముననే బాహ్యజగత్సంబంధమున కవసరములగు నింద్రియములును, వానికి విషయరూపములైన శబ్ద స్పర్శ రూప రసగంధములును జనించును. రూపములు నేత్రములకు గోచరించునట్లే, భావములు మనస్సునకెదుటఁ బ్రత్యక్షములగునని చెప్పఁబడెను. చూపువలన నేత్రము, వినుటవలనఁ జెవి, యీరీతి నింద్రియము లుదయించెనని కొన్ని వేళలఁ జెప్పఁబడెను.

వేదనమునుండి జన్మపరంపరలకుఁ గారణమైన తృష్ణ జనించును. జీవితమునకు, దుఃఖమునకు నిదియొకప్రధాన కార

---

౨. మహాపదానసుత్తము; సంయుత్తనికాయము. ౧.

ణము. మనముండుటకుఁ గారణము మనజీవనాసక్తియే. సుఖాసక్తిచే దుఃఖము ప్రాప్తించుచున్నది."జగమంతయు విషసిక్తముగాఁజేసిన తృష్ణ కెవరు వశులగుదురో. వారిదుఃఖము వేగముగాఁ బచ్చికపెరిగినట్లు పెరుగును. ఎవరుతృష్ణను జయించిరో వారిదుఃఖము, పద్మపత్రములనుండి నీటిబిందువులు రాలిపోవునట్లు పోవును."౧."వేళ్లు గట్టిగా నున్న చెట్టుకొమ్మలు నఱకినను తిరిగి చిగిర్చి, పెద్దవృక్షమెట్లగునో. అట్లే, తృష్ణమూలల నాశనముకాని వారికిఁ దిరిగి తిరిగి, దుఃఖములుదయించుచునే యుండును."౨. రూపత్రయముగల యీతృష్ణయే దుఃఖకారణము ౩.

తృష్ణనుండి యుపాదానము లేక మోహము జనించును. జ్వాలయెటు వ్యాపించినన ట్లే దాని కింధనమును బోవుచుండును. తృష్ణను నశింపఁజేయుటే మోక్షము. వస్తువ్యామోహమే బంధము. మోహపాశములే జీవిని వస్తువులకు బంధించి యుంచునవి.

మోహమునుండి భావ ముదయించును. చంద్రకీర్తి. భావమనగాఁ బునర్జన్మకారణమగు కర్మయని నిర్వచించినాఁడు.౪ భావమునుండి జన్మము, జన్మమువలన జరామరణములు, క్లేశ దుఃఖములు హైన్యదైన్యములు నుదయించును.

ఈవిధానమంతయును నిరాధార కల్పనమే. విజ్ఞానము లేక 'అహం' కారము నిత్యమైనయొక ఆత్మలోనున్నది కాద

౧. ధమ్మపదము. ౨౪ అ. ౩౩౫. ౨. ధమ్మపదము. ౨౪ అ. ౩౩౮. ౩. చూడు మహావగ్గము. ౧ అ. ౧. ౨. ౪. పూర్వభవజనకమ్. కర్మ. మాధ్యమికవృత్తి.

నియుఁ గారణకార్య ధర్మమువలన నుత్పన్నమైన దశాపరంపరయనియుఁ జూపుట కిట్లు చెప్పఁబడినది. దుఃఖకారణ దుఃఖనిరోధములైన ద్వితీయ తృతీయసత్యములను జీవితముయొక్క వ్యర్థత మొదటఁ దెలిసికొన్నచో నావెనుక దుఃఖనివారణోపాయమాలోచింపనగును. మనము పట్టుకొని ప్రాకులాడుచున్న 'అహం' కారము ప్రథమమూల కారణమైన అవిద్యాజన్యమగు నొక అనిత్యరూపమే. అహంకారమెంతకాలముండునో అవిద్యయంత కాలముండును. జీవి దుఃఖముల నుదయింపఁజేయు కర్మల నాచరించుటకాదు; దుఃఖముయొక్క రూపమే జీవము. భ్రాంతిని జనింపఁజేయు జీవమును భ్రాంతియే. అహంకారము రోగము, రోగలక్షణమునుగూడనైయున్నది. ఉపనిషత్తుల ననుసరించి, ఆత్మనుగూర్చిన యజ్ఞానమెంతకాలముండునో జీవరూపమంత కాలముండును. థియలాజికా జెర్మానికా గ్రంథమునని ట్లున్నది: "నరకములో శిక్షాగ్నితప్తమగునది వ్యక్తియొక్క స్వయంకృత సంకల్పాపరాధమే." ఈస్వయం కల్పితసంకల్ప మజ్ఞానరూపమునఁ బ్రసవించుచున్నది. ఇది కారణము కార్యమును; వంచకుఁడు వంచితుఁడుగూడనై యున్నది. అవిద్య, అహంభావము పరస్పరాశ్రయములు. అజ్ఞానమున కవకాశమిచ్చు 'అహం' భావనాశముచేఁగాని యజ్ఞానము నశింపదు. ప్రపంచమంతయు నవిద్యకు వశమై దుఃఖించుచున్నది. పృథ్వీశ్వరుఁడు మొదలు బిచ్చగానివఱకును, దివ్యతేజోరూపియగు దేవత మొదలు కీటకమునఱకు నందఱునజ్ఞానమువలననే దుఃఖభాగులగుచున్నారు." శ్రమణుఁడైనను, బ్రాహ్మణుఁడైనను, స్వర్గవాసియైనను, మారుఁ

డైనను, బ్రహ్మయైనను, మఱెవఁడైనను జేయలేనివైదు పను లున్నవి. రోగశీలమైనదాని ననామయముగను, మరణశీలమైన దాని నమర్త్యముగను, నశ్వరమైన దానినవినాశిగను, పోవుదాని నుండునట్లుగను జేయఁగలవాఁడు లేఁడు."౧. అవిద్యాజన్యమైన 'అహం' భావమే, సర్వదుఃఖకారణము మూలదోషము నైనది.

జగమంతయు నవిద్యపై నాధారపడియున్నది. కాని యీయవిద్యయెట్లు వచ్చినదో చెప్పలేదు. పరిణామచక్రమున కారంభము తెలియదు. ఆదికారణ మంధకార పరివృతమై యున్నదని వివేచనము లేకుండ సంగీకరింపవలెను. బుద్ధు ననుసరించి, పుట్టి, పెరిగి, ప్రత్యేకవ్యక్తిత్వమును జూపు ప్రతివస్తువు నవిద్యాసంభవమనియే. జీవనమే అవిద్యకు సాక్ష్యము. ఊగుచున్న యొక్క ఊయెలనుజూచి, దానికెవఁడో చలనమిచ్చె నని గ్రహింతుము. అట్లే, జీవపరిణామప్రవాహమునకుఁగారణ మవిద్య. అవిద్యకుఁ బూర్వమేమియును లేదు; ఏలన సృష్టిపరి ణామమునకాదిలేదు, బుద్ధుఁడజ్ఞానము శాశ్వతమని చెప్పినట్లు తోఁచును. కారణ ధర్మపరంపర కిది మొదట నుంచఁబడుటకుఁ గారణము, సంకల్ప మవిద్యనుండి జనించి, సంకల్పమునుండి 'అహం' కారముదయించినది. అజ్ఞానము దేనినిగూర్చి యని యడిగినప్పుఁడు, 'నేను' యొక్క స్వభావమును, చతుర్విధ తత్త్వ జ్ఞానమును సరిగాఁదెలియకుండు టేయని పూర్వబౌద్ధము బదులు చెప్పినది. ఈజన్మమునకుఁగారణము చతుర్విధసత్యజ్ఞానరహిత మైన యిట్టియింకొకపూర్వజన్మమే. జీవాత్మపరమాత్మ స్వరూ

౧. అంగుత్తరనికాయము ౨ ౭ ఓల్డెన్‌బెర్గు బుద్ధుడు పు౨౧౭.

ప్రమేయను విషయము తెలియని అవిద్యయే, సర్వదుఃఖమూలమైన 'అహం' కారణమని యుపనిషత్తులు చెప్పుచున్నవి. రెంటికినవిద్యయే జన్మకారణము, రక్షణసమర్థమైన జ్ఞానశూన్యతయే సత్యమును మఱుఁగుపఱచుచున్నదని రెండును జెప్పుచున్నవి.

అజ్ఞానము నిత్యమైనదని బుద్ధుని భావము కాదు. ఆత్మనాశమగుటకే యజ్ఞాన ముదయించుచున్నది. అజ్ఞానోదయకారణమైన తాత్త్వికసమస్య విడిచిపెట్టఁబడినది. దానిని మనము పరిష్కరింపఁజాలము. అవిద్య సత్యముకాదు; ఏలన నది నశించును; అది అసత్యమునుగాదు; ఏలన నసత్యమైనదైనచో నది దేనికిని గారణము కాఁజాలదు. ఏదోయొక కారణమును జెప్పవలెనని బౌద్ధమత మవిద్యను బేర్కొనలేదు; అది నిజముగా జీవస్థితికారణము. బహుశః ఉపనిషద్భావ మధికసత్యమని చెప్పనగును. నానారూపమయ ప్రపంచము, సత్యమును మఱుఁగుపఱచు శక్తి కలదియు, సత్యము నావిష్కరించుశక్తి కలదియుఁగూడనైయున్నది. అనాత్మరూపమైన యీశక్తి సత్యమును బహిర్ముఖ మొనర్చును. ఈవిధముగా సమర్థించుటకు మనమొక కేంద్రసత్యస్థితి నంగీకరింపవలసియుండును. అట్టి కేంద్రసత్యస్థితి నంగీకరింపనంతసేపు, అవిద్య, తత్కారణము దురూహ్యములై యుండును. కాని బౌద్ధమతముచెప్పిన విషయములన్నియు నుపనిషత్సిద్ధాంతమున కనుకూలములే. అవిద్య పూర్తిగా నిరర్థకమైనదికాదు. మోక్షము నార్జించు నుపాయమదియే చూపును. నిర్వాణమనగా నాశనము కాకున్నచో, సత్య

మనగా ననిత్యదృశ్యము కాకున్నచో 'అహం' వ్యక్తిత్వము కేవల మనాత్మగాదు; అది యాత్మానాత్మల మిశ్రమము; అవిద్య, జ్ఞానము లేకుండుటే కాని, అసత్యము కాదు. అవిద్య పోయినచో విద్యలేక సత్యమే గోచరించును. అశ్వఘోషుఁడు మున్నగు ననంతరబౌద్ధులు కొందఱవిద్య హఠాత్సంభవమనియు విశ్వరూపమునుండి జీవసంకల్పము తటాలుననుదయించెననియుఁ జెప్పుచున్నారు. ఏకైకవిశ్వమానసముయొక్క అసంపూర్ణ ప్రతి బింబములే భిన్నవ్యక్తులని వసుబంధుఁడు మున్నగువారు వాదించిరి. విశ్వశక్తినుండి, వివిధవ్యక్తిత్వములను అవిద్యయను శక్తియుదయింపఁ జేసెననితలఁచిరి. సత్యకేంద్రముననున్నయొక వ్యతిరేకలక్షణమే అవిద్య. దానిలోపలనున్న సత్యమును మన పరిమితబుద్ధి చూడఁజాలదు. పరిపూర్ణసత్పదార్థ తత్త్వమునంగీకరించినయెడల బౌద్ధతత్త్వము తృప్తికరము నంగీకారయోగ్యము నగును.

## ౧౪—ధర్మశాస్త్రము.

నిశారక్షకభటునకు, రాత్రిదీర్ఘమై తోచును;
అలసుఁడైన పథికునకు బాట కడు దీర్ఘమైకన్పట్టును;
సత్యజ్యోతిని దర్శింపని వానికి జన్మపరంపరా
క్లేశము తుదిలేనిదై గోచరించును.

ఒకబౌద్ధ సామెత యిట్లున్నది. ౧. ఇహలోకజీవితము పరదేశములో నొకయాత్ర. వివేకవంతుఁడీ యాత్రను త్వరగా ముగించుకొనును. మానవ జీవితములోని వైరుధ్యమునుండి

౧. ఓల్డెన్ బెర్గు; ప్రాచీనభారతదర్శనము పుట ౯౪.

బయటపడు మార్గమును బుద్ధుఁడు చూపినాఁడు. దుఃఖవిమోచనమే బుద్ధుని యుపదేశసారము. అతివ్యాప్తమైన జీవితదుఃఖమునుండి విముక్తి నార్జించుటే నైతికవర్తనమునకు లక్ష్యము. మన అహంవినాశమే మోక్షము. పరమలక్ష్యము నిర్వాణమే గావున, తల్లక్ష్యసిద్ధికిఁ దోడ్పడనిపోవు కర్మలును, పునర్జన్మము నరికట్టు పద్ధతులునుగల జీవితమే యోగ్యమైనది; తద్వ్యతిరేకములన్నియు దోషములే. వ్యవహార ప్రపంచప్రమాణములు సంస్కారమును గోరును.

బౌద్ధనీతి బౌద్ధమనస్తత్త్వముపై నాధారపడియున్నది.౧. నిశ్చయమైన తత్త్వమునకును, నిర్మలమైన నీతిధర్మమునకును, నిర్వక్రమైన మానసికతత్త్వపరిశీలన మవసరము. బౌద్ధమనస్తత్త్వము నీతిధర్మ నిరూపణముకొఱకే విస్తరింపఁబడినది. బౌద్ధశిక్షణము, సుసంకల్పనిర్మాణములకు, వేదనము లెట్లుదయించునో, శ్రద్ధ యెట్లేర్పడునో చెప్పు సిద్ధాంతమవసరము. బౌద్ధతత్త్వము మానవుని నైతికవ్యక్తిత్వమును బరిశోధించి, తత్పరిణామములో నైతికనియమసూత్ర మెట్లువర్తించుచున్నదో నిర్ణయించును. ఆత్మసిద్ధాంత నిరసనమునకుఁగూడ నొక నైతికోద్దేశముకలదు. బౌద్ధమతమునను సరించి, సంకల్పము మానవునికిఁగల విశిష్టలక్షణమై దానిమూలముననే యాతఁడు నైతికవ్యక్తి యగుచున్నాఁడు. కర్మసిద్ధాంతము, లేక, నైతికనియమధర్మము

౧. "మనస్తత్త్వసహితమైన నీతిశాస్త్రము క్రైస్తవప్రపంచమునకుమాత్రమే చెందిన"దని చెప్పిన మార్టినో నిర్ణయము తప్పు. (టైప్సు ఆఫ్ ఎథికల్ థియరీ వాల్యూము ౧౭ పు ౧౪.

తృష్ణయే జన్మహేతువని చెప్పెను. కాంటుతత్త్వవేత్తవలెనే బుద్ధుఁడును, లోకమునందేదైన విలువగలిగినదున్నచో నది సుసంకల్పమేయనియు, నైతికనియమముచే నది స్వతంత్రముగా నిర్ణయింపఁబడినదనియుఁ జెప్పెను. మానవులందఱు శ్రేయస్సంకల్పులుకావచ్చును. సంకల్పమలసి, కర్మాసక్తి నశించునపుడు 'అహం' కారము నశించును. ఇంద్రియవిషయ సుఖాసక్తి నశించినయెడలఁ గర్మయుఁ బోవును. ప్రపంచ నశ్వరత్వము నెఱిఁగినచో సుఖాసక్తియు నశించును. వివిధగుణాన్వితమైన జీవాత్మను ఛేదించి, యందుఁ గ్రొత్తగుణములు చేరకుండఁ జూడవలెను. భారతీయ విదేశీయతత్త్వములకుఁ బెక్కింటికి వలెనే, బౌద్ధతత్త్వమునకును, జన్మపరంపరనుండి నిత్యానంద స్థితిని గాంచుటే, లక్ష్యమైయున్నది. ఆర్ఫికుసోదరసమితి పునర్జన్మనాశనమునకే పరితపించినది; సత్య శివ సుందరరూపములను ధ్యానించు నిత్యమైన జీవితమునే ప్లేటో పరమలక్ష్యమని వర్ణించినాఁడు.

కర్మ బుద్ధిసంకల్పములు రెంటికిని జెందినది. అదియొక మానసికోద్దేశము, కార్యమై ఫలించుచుండుటచే ద్విలక్షణా సంపన్నమైనది. మనస్తత్త్వము ననుసరించి, ప్రతికార్యమునకు మూడుమూర్తులు గలవు; (౧) సంకల్పోదయము (౨) కార్యము (3) కార్యమువలన జనించిన అసంతృప్తిలేక విచారము. మొదటిది మనోనిశ్చయము. అది కార్యము కాకున్నను వ్యర్థముకాదు. ప్రతినిశ్చయము, ప్రతికార్యము దానికుచితమైన విలువను గలిగియున్నది. కాలమునుబట్టి అది అనిత్యమైనదై

నను, శీలమునకు శాశ్వతమైనదే. కొన్నికర్మలకు సద్యఃఫలితములు, కొన్నిటి కనంతరజన్మమునందు నుండును. కర్మలు రెండువిధములు. (౧) పవిత్రములైనవి అనాశ్రినసములు (౨) అపవిత్రములు. పవిత్రకర్మలు రాగతృష్ణా జ్ఞానరహితములు గావున ఫలితములులేనివై, 'అహం' కారమును నశింపజేయుటకుఁ దోడ్పడును; నిర్వాణమార్గమును జూపును. చతుర్విధసత్యములనుగూర్చి ధ్యానము, అర్హాతపదవినిచ్చు పవిత్రకర్మమై, సదసత్ఫలితములు లేనిదగును. ఈదృష్టి ననుసరించి మిగిలిన కర్మలన్నియు దోషములే; ఇహపరసుఖదుఃఖకారణములైన యీదోషకర్మములనే తిరిగి, సదసత్కర్మలుగా విభజించిరి. వివిధప్రమాణము లంగీకరింపఁబడినవి. రాగ తృష్ణలను, 'అహం' కారమోహమును నిర్జించు కర్మలు యోగ్యములు; దుఃఖఫలితములిచ్చునవి దోషకర్మలు. లోకాంతర సుఖాభిలాషతోఁ జేయునవి మంచికర్మలు; ఇహలోకసుఖకాంక్షతోఁ జేయునవి దోషకర్మలు. మంచికర్మలు కోరికలను నశింపఁజేసి, యితరకర్మఫలములను రాకుండఁజేయును. సత్కర్మలు క్రమముగా ముక్తిలేక నిర్వాణము నిచ్చును. పరోపకారకములు సత్కర్మలు; స్వార్థములు దుష్కర్మలు. ఈవివిధ ప్రమాణములకు వైరుధ్యములేదు. కామమును జయింపఁజేసి, సత్కర్మజీవితమునకు దారిచూపుకర్మలు లోకకల్యాణప్రదములే. అట్టిసత్కర్మలు లోభ ద్వేష మోహరహితములు. స్వార్థము కొఱకును, నిహలోకసుఖమునకును జేయుకర్మలు భవబంధ

హేతువులు, అవి మిథ్యాజ్ఞానకామద్వేషములచే జనించినవి.౧. వస్తుస్వభావసత్యముల నెఱుఁగమియే నైతికదోషము.

బుద్ధుఁ డుపదేశించిన తత్త్వము మితిలేనిరాగము; శ్రుతిమించిన వైరాగ్యముల నిరసించును. ఆఱుసంవత్సరముల తపఃకార్శ్య మనుభవించినవెనుక, "దేహము నీరసించుటచే జ్ఞానమార్గము గోచరింప"దను నిర్ణయమునకాతఁడు వచ్చినాఁడు. "సత్యము నన్వేషింపబోవువాఁడు రెండువిపరీతపద్ధతుల నాశ్రియింపరాదు. కామములకు, నింద్రియసుఖములకు లోలుఁడగు నభ్యాసమొకటి, రెండవది, భయంకరము నిరర్థకము, హేయమునైన తపోపవాసాది కఠినపద్ధతుల నభ్యసించుటయునైయున్నవి. తథాగతుఁడు కనుఁగొనిన మధ్యే మార్గమున్నది. ఈ మార్గము కన్నులుతెఱచి, జ్ఞానమిచ్చి, శాంతినిర్వాణములఁ జేకూర్చును. ఇదియే ఆర్యుల అష్టాంగయోగము. సక్రమవిశ్వాసములు; సక్రమాశయములు;సక్రమవచనములు, సక్రమ-ప్రవర్తనము సక్రమ జీవనప్రవృత్తి; సక్రమప్రయత్నము; సక్రమమనఃప్రవృత్తి; సక్రమసంతోషము. ౨. ఇదియే బౌద్ధమతముయొక్క అష్టాంగనీతిధర్మము.

సక్రమవిశ్వాసము మొదటిది. మనకార్యములు మన యాలోచనములఁ దెల్పును. దోషకర్మలు దురాలోచనాఫలితములు. జీవరూపముననున్న భిన్నాంశములు చాలవఱకు మరణముచే శ్మశానభస్మరాశిలోఁ గలిసిపోవునని, మనమెఱుఁగక

౧. చూడు. డబ్లియు. బి టి. పుటలు ౨౧౬–౧౮

౨. ధర్మచక్రప్రవర్తనములోఁ బ్రథమోపదేశము.

"అహం' కారమునుఁ బట్టుకొని పాకులాడుచున్నాము. అక్రి మభావములు పోవుటకుఁ గ్రిమమైన జ్ఞానమవసరము. బౌద్ధ మనస్తత్త్వమందు సంకల్పము జ్ఞానమునొకటిగాఁ బరిగణింపఁ బడెను.

సక్రిమాశయము సక్రమదృష్టిఫలితము. "అదియే సర్వ సంగ త్యాగకాంక్ష; సర్వమందుఁ బ్రేమగలిగి జీవించు తలఁపు నిజమైన మానవధర్మము."3. తాను నేఅనుభావమును విడిచి, సాధకుఁడు సర్వకల్యాణమునిమిత్తము పనిచేయును. మహా యాన ధర్మమునననుసరించి, నిజమైన లోకకల్యాణదీక్ష యిట్లు పలుకును: "సర్వజీవుల భారమును నేను భరింతును." ౪.

ఆశయములు కార్యరూపమును దాల్పవలెను. మనో వాక్కాయములందు సమానశుద్ధికావలెను. అనృతముపలుక కుండుట, మోసములేకుండుట, పరుషవాక్యములాడకుండుట, వ్యర్థప్రసంగము మానుట సక్రిమభాషణమగును."

సక్రిమకర్మ స్వార్థరహితకర్మ. బుద్ధునకుఁ బూజాపున శ్చరణములందును, మంత్రితంత్రిములందును, కర్మకలాపమం దును విశ్వాసములేదు. "నూఱుసంవత్సరము లగ్నినుపాసించుట కంటె, ధర్మనిష్ఠాగరిష్ఠునొకని సేవించుటమేలు." ఒకసారి బాహుదానదిలోఁ జేయుస్నానము సర్వపాపములను హరించు నని యొకబ్రాహ్మణుఁడు చెప్పినప్పుడు బుద్ధుఁడిట్లు జవాబిచ్చెను: "ఎన్నిమాఱులు స్నానమొనర్చినను బాహుద మూర్ఖుని పాప ములను బోఁగొట్టదు. పాపద్వేషదోషకలితు నేనదియు శుద్ధు

3. సుత్తవిభంగము. (౪) వజ్రిధ్వజసుత్తము.

నొనర్పఁజాలదు. పవిత్రుని కన్నిరూపములు పవిత్రమైన ఫాల్గు-ణమే; నిత్యోపవాసమే. సత్కర్మనిరతునికంతయు నిత్యదీక్షయే. ఓబ్రాహ్మణుఁడా! స్నానమిచటనే చేయవచ్చును. కాని అన్ని జీవులయెడ దయగలిగియుండుము. అనృతమాడక, హింస చేయక, 'నా'దను వస్తువులేక, స్వార్థరహితుఁడవైనచో గయా-తీర్థమునకరిగి దేనినార్జింతువు? ఎచ్చటియుదకమైనను గంగోద-కమే యగును."౧. మూర్ఖముగాఁ గర్మలాచరించుట కాదు; నీసేవకులకు ఆశ్రితులకు దయచూపుట, పూజ్యులను గౌర-వించుట, జితేంద్రియుఁడవై, కృపాంతరంగుఁడవై సర్వజీవుల నాదర బుద్ధితోఁజూచుట, మున్నగుసత్కర్మములు సర్వస్థలము-లందుఁ జేయఁదగును. పవిత్రనియమములను బఠించుటకంటె ధ్యానము పవిత్రమైనది." ౨. యజ్ఞకర్మవిధానమును బుద్ధుఁడు ప్రత్యక్షముగా నిరసింపలేదు. భిన్నకర్మరూపములకు ముఖ్య-మగు నైతికవృత్తినుగ్గడించి, పరోక్షముగఁ గర్మాసక్తిక్షీణింపఁ జేసెను. "క్రోధము, సురాపానమత్తత, మోసము, ద్వేషము, ఇవియే మలినములు; మాంసభక్షణమే కాదు." 3. "ఉపవా-సము, దిగంబరత్వము, ముండనము, జీర్ణవస్త్రధారణము, పురోహితులకు దానము, దేవతలకు హోమములు, భ్రాంతి కలుషితుఁడైనమానవుని శుద్ధునొనర్పఁజాలవు." నీచరూపముల

౧. లక్ష్మీనరసు. బౌద్ధమతసారము. పుట ౨3౦

౨. అశోకశిలాస్తంభ శాసనము. ౭.

3. మనుష్యుని దేహములోఁ బ్రవేశించునది కాక, యాతనినుండి బయల్పడునదే యాతని గలుషితునొనర్చును.

నుపాసించు మూర్ఖవిధానములను బుద్ధుఁడు ఖండించెను. అసహజములైన దైవారాధనపద్ధతుల నాతఁడు మృదుమధురవచనములతో విమర్శించును.

ఉద్దేశపవిత్రత, వినయవర్తనము బౌద్ధమతమునకు ముఖ్యములు. నిర్వాణసాధనములైన పారమితములలో శీలము ప్రధానమైనది. నివృత్తిప్రవృత్తులకెంత భేదమున్నదో, శీలదానములకంత భేదమున్నది. అహింసాదినియమాచరణమే శీలము; దీనులకు, నిస్సహాయులకు సాహాయ్యమొనర్చు త్యాగము దానము. సర్వజీవసౌఖ్యమునకై జీవించుటే దానము. యూవాన్‌చ్యాంగ్ తన్నుదొంగిలించి, దుర్గకు బలియొసఁగుచుండగాఁ, జెప్పినవాక్యములుత్తమదానరూపమును బ్రకటించుచున్నవి; "నేను మఱల నీదేశమున నిచటనే జన్మించి, యీహంతకుల హృదయములు మార్చి, వారిదుర్వృత్తులనుమాన్పి, పరోపకార పరతంత్రులనుగాఁజేసి సర్వలోక శాంతికొఱకు ధర్మవ్యాప్తిచేయఁ గోరుచున్నాను.".

సక్రమకర్మ, వంచనానృతదాంభికాది ప్రవృత్తిరహితమైన సక్రమజీవితమును నిర్మించును. ఇంతవఱకు ప్రవర్తన ముగ్గడింపఁబడినది; అంతశ్శౌచమునకు మానవుఁడు వ్యక్తిగతముగా శుద్ధుఁడుగావలెను. సర్వప్రయత్నములకు లక్ష్యము దుఃఖనివారణమే. చివరివి మూఁడుననగా, సక్రమప్రయత్నము; సక్రమాలోచనము; సక్రమశాంతి అంతశ్శుద్ధికి సంబంధించినవి.

మానసికోద్రేకములను నిగ్రహించు నభ్యాసమే సక్రమయత్నము. దీనివలన దుర్గుణములుదయించుట మానును.

దురాలోచనముల నణచివేయుట, సదాలోచనములఁ బోషించుటయునని దీనిభావము. మనకిష్టములేని యొకభావమును మనస్సునుండి పారఁదోలుటకు బుద్ధుఁ డుపాయపంచకము నుపదేశించినాఁడు. (౧) ఒకమంచిభావమును స్మరింపుము (౨) దురాలోచనము కార్యరూపమునఁ బరిణమించినప్పుడు దాని ఫలితమును ధైర్యముతో నెదుర్కొనుము. (౩) దురాలోచనమునుండి మనమును దూరముచేయుము (౪) దురాలోచన కారణములను బరిశీలించి, నిరోధింపుము. (౫) శరీరబలముచే మనస్సును మార్పుము. అశుభభావనము వలన నశుభవిషయములపై నాసక్తి క్షీణించును. "పూజ్యపాదా! ఒక కాంత యిటుబోవుటఁ జూచితిరా?" "ఇటుఁబోయిన వ్యక్తియొక కాంతయో, పురుషుఁడో నేను జెప్పఁజాలను. ఒక అస్థిపంజరము మార్గమునఁబోవుట మాత్రము నేనెఱుఁగుదును"౧. ఇదిపూజ్యపాదుని సమాధానము. సక్రియకృషి లేనిదే జ్ఞానోదయము కాదు. తన్మూలముననే మనము క్రోధద్వేష గర్వసంగముల నున్మూలింపఁగలము.

సత్క్రమాలోచనమునుండి సత్క్రమయత్నమును విడఁదీయఁజాలము. చిత్తచాపల్య నిగ్రహమునకు, నిత్యపరిభ్రమణ శీల

---

౧. యమ్పోసిన్ యీభావమునిట్లు స్పష్టీకరించినాఁడు; "చతుర్విధములైన దుఃఖము నెఱఁడెటిగి, అల్పభావముల అసత్యమును నిర్మూలించి, ప్రపంచవస్తుకాంతా ధనాదికముల వలనఁ గలుగు సుఖలేశము తృణప్రాయమని గ్రహించుటకే యీసాధన ముద్దేశింపబడినది." (౩) చిత్తాధీనోధర్మః ధర్మా...

మగు మనస్సును స్వాధీనమునం దుంచుకొనవలెను. ౨. బౌద్ధ మునందును, స్టాయిక్కు-మతము నందునుగూడ నావేశములు "అపజయములు; నైతికారోగ్యభంగములు; వానికి వశులమై నచో ఆత్మనంటుకొనియుండు దీర్ఘవ్యాధులు నగును." ఇవన్ని యు సక్రియప్రయత్న నిరోధకములు. ఆత్మజ్ఞాన గర్వమును ధర్మానుష్ఠానమున కాటంకమే. "ఎవఁడు పవిత్రుఁడై, తాను పవిత్రుఁడనని యెఱిఁగి, అట్లెఱిఁగినందుకు సంతోషించునో, యాతఁడపవిత్రుఁడై, అపవిత్రభావముతో మరణించును. ఎవఁడు తా నపవిత్రుఁడై, తా నపవిత్రుఁడ నని యెఱిఁగి,పవిత్రుఁడగుటకు యత్నించునో, యాతఁడు పవిత్రభావముతో మరణించును." "ధర్మము మానసముపై నాధారపడియున్నది. జ్ఞానము ధర్మాచరణముపై నాధారపడియున్నది."౩.

ఒక జీవాత్మఁగా దీసికొనినపుడు, పంచస్కంధములు మానవుని స్వరూపమును బూర్తిగా నిర్ణయించును. ప్రజ్ఞ లేక. సిద్ధజ్ఞానమునుగూర్చి బౌద్ధతత్త్వముచెప్పు భావముల ననుసరించి, మన కీసిద్ధాంతమునఁ గొంతమార్పుగోచరించును.స్కంధములపై నాధారపడిన జ్ఞానసిద్ధాంతము కేవల మింద్రియజ్ఞాన తత్త్వమే. ప్రజ్ఞాభావమిందు మార్పును గోరును. మానవమానసము యొక్క యత్యున్నత వ్యాపారమేప్రజ్ఞ; మతదృష్టిలో దీనికగ్ర స్థానమున్నది. పాలీమత సిద్ధాంతములందును, విశుద్ధిమగ్గము నందును, ప్రజ్ఞ స్కంధములలో నొకటని నిర్ణయింపఁబ్రయత్న ములు జరిగినవి. సుత్తాపీఠకములో దీనిని విజ్ఞానము వంటిదని

౨. తత్రికతాభినందిని.

చెప్పఁబడెను, అభిధమ్మమందు దీనిని సంస్కారములలోఁ జేర్చిరి. ఈప్రజ్ఞ లేక దివ్యదృష్టిని రూపస్కంధములోఁ జేర్చినందుకు ఖండించి, ప్రజ్ఞ యట్టిదికాదని కథావస్తువు నిర్ణయించెను. బుద్ధఘోషుని కాలమునందు, సంజ్ఞ, విజ్ఞానము, ప్రజ్ఞ మానవాలోచనముయొక్క భిన్నరూపములని తలఁపఁబడెను. ఇదియే మిక్కిలి సమంజసమైనభావము. తానువేఱైన యొక్క జీవము ననుభావముతో, వ్యక్తికిఁగల జ్ఞానమునుగ్గడించి చెప్పునట్టి వ్యావహారదృష్టియే స్కంధభావము. ప్రత్యేకజీవభావము, విశ్వజీవముతో నైక్యమగునపుడు, వ్యావహారజ్ఞానము స్థానములో ప్రజ్ఞవచ్చి చేరవలసియున్నది. అజ్ఞానులు విజ్ఞానమును, జ్ఞానులు ప్రజ్ఞను బెంపొందించుకొందురు. ఇంద్రియ జ్ఞానమునుండి, అతీంద్రియజ్ఞానమునకుఁ గ్రమపరిణామము గలదు. రెండును విడిగాలేవు; రెండవది మొదటిదాని విస్మృతియే. ప్రజ్ఞకుఫలము బోధ లేక సిద్ధి.

ఇంద్రియముల నణఁచివేయుటకాక, సత్యమునుదర్శించు నభ్యాసము వానికిఁజేయుటే మనశ్శిక్షణోద్దేశము. ఇంద్రియ భావనాసుత్తమందు,ఁ బారాశర్యుని శిష్యునొకని నాతని గురువెట్లింద్రియ శిక్షణమును బోధించెనని బుద్ధుఁడడిగినాఁడు. తమ కార్యముల నిఁక నెఱవేర్పఁజాలని స్థితికివచ్చువఱకు నింద్రియములను శిక్షించువిధానము తన గురువుపదేశించెనని యాతఁడు బదులుచెప్పెను. అప్పుడిఁకఁ గన్ను దేనినిఁ జూడదు, శ్రోత్రమే శబ్దమును వినదు. అనగా నంధులు, బధిరులు తమ యింద్రియములను జక్కగా శిక్షించియుందురని బుద్ధుఁడు పలికెను.

ఇంద్రియములకు దర్శనమిచ్చిన సర్వవస్తువులను బరిశీలించి, సత్యనిర్ణయమును జేయుట కుపకరించునట్లు శిక్షించుటే నిజమైన యింద్రియశిక్షణము. ఇంద్రియజ్ఞానము, బుద్ధిజ్ఞానముల విస్తరించి, సంస్కరించుటే నిజమగు నాత్మదృష్టి, ప్రజ్ఞావస్థలో నొకపూర్ణ సత్పదార్థమును మనము దర్శింతుమని బుద్ధుని యభిప్రాయముగాఁ దోఁచుచున్నది. "ప్రసన్నపవిత్ర తేజోమయుఁడవై నీవు గోచరించుచున్నావు; సారిపుత్రా! నీవెక్కడనుండి వచ్చితివి?" "ఆనందా! నేనేకాకినై, ప్రజ్ఞాసమాధిలో నుంటిని,...ఆస్థితిలోఁ బ్రపంచవస్తు దర్శనమునుండి, అనంతమైన ఆత్మదర్శన సీమకుఁబోయి—యచటనుండి, శూన్యములోనికిఁ బోయితిని. అచట నాకు దివ్యదృష్టి లభించినది. అట్టి దివ్యదృష్టిలో, భూతవర్తమాన భవిష్యత్తులలో లోకములు, మనుజులెట్లు వచ్చిపోవుచున్నారో చూడఁగల్గితిని. ఇదంతయు "నేను" "నాది"యను భావములేకుండనే జరిగినది." పరమార్థదర్శనము గలిగిన యిట్టి దివ్యదృష్టి, ఉపనిషత్తత్త్వ నిర్మాణమునకు సముచితమైనది. ఆపనిచేయుటకు బుద్ధుఁడు జంకినాఁడు; అట్టి తత్త్వనిర్మాణము ఫలించుటకుఁ గొంతకాలము పట్టినది. దానికి బదులుగా నాతఁడు మనకుఁ గొన్ని దృక్పథములను, మానసికదశావిశేషయములను యుక్తి చమత్కారములతో నొసఁగినాఁడు. ప్రజ్ఞాదశానంతరము ధ్యానము, నిశ్చలసమాధియు నున్నవి. ధ్యానము బౌద్ధమతమందుఁ బ్రార్థనమునకుబదులుగా గ్రహింపఁబడినది. ఈపూర్వ బౌద్ధభావమును హీనయానశాఖ పెంపొందించినది. ధ్యానమునకు నాలుగుదశలున్నవి: ఏకాంతవాస

ముచే జనించు నానందము మొదటిది; ఇందుఁ బరిశీలనము, అంతర్దృష్టి, యింద్రియవ్యాపార విరతితోఁగూడిన అన్వేషణమునుండును; రెండవదశలో నుత్సాహ, చిత్త శాంతులుండును: సర్వవాంఛోపరతి, 'అహంకార'ము లేకుండుట మూడవదశ; నాలుగవదశలోఁ బూర్ణశాంతి, పూర్ణనిగ్రహమునుండి, సుఖదుఃఖభావములు లేకుండును. ౧. సమచిత్తత్వమును సాధించుటకు ధ్యానమే ఉత్తమమార్గము. అహంభావమును నాశమొనర్చి, సత్యములో లయింపఁజేయు దృఢప్రయత్నమే ధ్యానము. బౌద్ధసంఘ సభ్యుల దైనికసాధనములో ధ్యానమునకుఁ బ్రధాన స్థానమున్నది. మనస్సును, హృదయమును శిక్షించువిధానములు, నాఁటి విశ్వాసములనుండియే వారును గ్రహించిరి. మైత్రి, కరుణ, మోదము ఉపేక్షాభావముల నభ్యసింపవలెను. ఇవి బ్రహ్మవిహారముల పవిత్రములైన చతుర్విధావస్థలు. వీనినభ్యసించుటచే, సాధకులకుఁ, గ్రమముగా విశ్వమేకాక ప్రాణిలోకమంతయుఁ బ్రేమింపఁదగినదిగాఁ దెలియును. నలుబది ధ్యానవిషయములు, నాలుగుసమాధిదశలు, మన కామములను దగ్గించి, యింద్రియ విషయలోకమునుండి దూరస్థుల నొనర్చును అత్యుత్తమ

౧. చైల్డర్సు దీనినిట్లు చెప్పెను: "సాధకుఁడు మొదటనొక్క భావముపై ధ్యానమారంభించి, శాంత్యానందములుగలిగి, తాను ధ్యానించు భావమును గూర్చి వివేచించును. రెండవదశలో వివేచనముమాని శాంత్యానందములుగలిగి, యుండును. మూడవదశలో ఆనందమునుగూడ విడిచిపెట్టును. నాల్గవదశలో మనశ్శుద్ధిపూర్ణమై, సర్వభావముల కతీతమై, సుఖదుఃఖాతీతమగును. ఇదియే ఉత్తమసమాధి." (డిక్షనరీ పుట ౧౬౮.)

విషయధ్యానము సత్యమును దర్శింపఁజేయును. కాని ధ్యానింప వలసిన ఆయత్యుత్తమ విషయమేదియని మనము ప్రశ్నింపకుండ నుండఁజాలము.

నిర్హేతుక దైవప్రసాదస్మరణమే బౌద్ధతత్త్వమున లేదు. స్వయంశిక్షణమే సర్వకార్యములఁ జేయును. స్వయంకృషి, స్వయంవికాసము, సర్వవస్తువులనుండి సంపూర్ణమైన స్వాతంత్ర్య మును మానవునకిచ్చును. తన్నుఁదా జయించినవాని నెవ్వఁ డును జయింపలేఁడు. "తన అహంకారమును నాశనమొనర్చు కొన్నవానిని దేవతలైనను జయింపఁజాలరు." ౧. మత సంబం ధము లేని, సర్వమానవప్రేమ, చిత్త శిక్షణమును బుద్ధుఁడుపదే శించియుండుటచే ఆగస్టుకాంస్టేకు 2,000 సంవత్సరములు ముం దుగాఁబుట్టెనని కొందఱు తలఁచుచున్నారు!

బౌద్ధధ్యానము. యోగసిద్ధాంతమునుగూడ, మానసిక శిక్షణమునకు, దేహారోగ్యనియమావసరము నుపదేశించును. దేహమును నిగ్రహించుట జ్ఞానసాధనము. తపమునకుబదులు, జ్ఞానము నిచ్చు మానసికదశాపరిశీలనమునకుఁ బ్రాధాన్యమీ యఁబడినది. ఇంద్రియములను,ప్రపంచవిషయములనుండి నిర్మూ లించి, అంతరంగప్రశాంతి నార్జించు నభ్యాసమన్ని యోగతత్త్వ ములకు సామాన్యపద్ధతియే. ధ్యానదశాచతుష్టయమునందు, లోకవిషయములనుండి క్రమనివృత్తి పద్ధతులు చెప్పఁబడెను. ధ్యానమనగా నిరర్థకమైన యేకాంతవాస విలాసముగాదు. ఇం ద్రియ ద్వారములను మూసివేసి,మనశ్శక్తులను వికసింపఁజేయు

౧. ధమ్మపదము ౧౦౪.

నిర్ణీతవిధానము. యమ్. పోసిఁ చెప్పినాఁడు; "ఒకమ్మణ్ణాము చక్రముపైఁ గేంద్రీకరించు నభ్యాసముగాని అట్టి యేయితరాభ్యాసముగాని, మనస్సు తనగుణములను పద్ధతులను క్రమముగా విడిచిపెట్టుటకొఱకే. సమాధినిగోరు నాతఁడు ధ్యానముతో నారంభించి, వివేకవిచారములుగలిగి, తరువాత, నాతఁడు తృష్ణ, పాపము, చాపల్యము, తర్కము, సుఖాసక్తి మున్నగువానిని విసర్జించును; ద్రవ్యము, సంగము, భేదము మున్నగువాని కతీతుఁడై, దృశ్యములేని ద్రష్టయై, శూన్యమును ధ్యానించుచు, నాతఁడుపొందుదశలో, విజ్ఞానముకాని విస్మృతికాని, లేక, తుదకు వేదనము, భావముకూడ నశించినవాఁడై, యొక్కమైమఱపులో నుండును.౧ ఇట్టియింద్రియ వ్యాపారనిరోధము, నింద్రియ విషయనిర్మూలనములవలన, ధ్యానములోఁ జిత్తమున కధికమైన ప్రసన్నత, స్వాతంత్ర్యము లభించునోలేదో మనము నిశ్చయముగాఁ జెప్పఁజాలము. అభినవ ప్రకృతిశాస్త్రమీ విషయమునవింకను బాల్యదశలోనున్నది; లభించునని, యితరభారతీయ విజ్ఞానముతోఁబాటు బౌద్ధతత్త్వమును విశ్వసించును. అట్టివిశ్వాసము నేఁడునుగలదు. మానసిక వ్యాపారము నరికట్టి, యింద్రియచాపల్యము నణఁచివేసి, అహంకారమును క్షీణింపఁజేసినచోఁ, బరమాత్మయొక్క దివ్యకాంతి యధికముగాఁ బ్రకాశించున్నని నేటికిని భారతీయులందరును నమ్ముదురు, భిన్నమతతత్త్వములలో యోగాభ్యాస పద్ధతులు భిన్నముగానుండును. ఉపనిషత్తులకు యోగమనగా

---

౧ నిర్వాణమార్గము పు. ౧౬౪.

బ్రహ్మైక్యానుసంధానము, పతంజలి యోగశాస్త్రము ననుసరించి, సత్యదర్శనము. బౌద్ధమతములో యోగమనగా బోధిసత్త్వస్థితి. ఈస్థితిలోఁ బ్రపంచము శూన్యమని తెలియును.

స్మృతిలేని యవస్థలన్నియు యోగ్యములైన సమాధ్యవస్థలని బుద్ధుఁడుచెప్పలేదు. కామనిర్మూలనోద్దేశముతోఁ గాంచిన సమాధియే సక్రమమైనది. అతీంద్రియశక్తుల నార్జించు నుద్దేశముతో యోగాభ్యాసములు చేయువారు పెక్కురుగలరని బుద్ధుఁడెఱుఁగును. సక్రమనైతికానుష్ఠానమువలనను, జ్ఞానము వలననుగూడ నట్టిశక్తులు లభింపఁగలవనిచెప్పి, యీయోగాభ్యాసపద్ధతుల నాతఁడు సంస్కరించుటకుఁ గారకుఁడయ్యెను.౧. ప్రదర్శనార్థము, వైచిత్ర్యములను జేయుట బుద్ధుఁడు తనశిష్యులకు నిషేధించెను. అతీంద్రియశక్తి సంపాదనము నిజమగు నాత్మవికాసమున కుపకరింపదు. టిబెట్టులోని లామామతమునందు బౌద్ధయోగపద్ధతులు స్పష్టముగా గోచరించును.

అష్టాంగమార్గమును నాలుగవస్థలుగామార్చిరి. మానవు నిహలోకమునకు బంధించు దశవిధ బంధనములను ఛేదించుట కీయవస్థలుపయోగించును. ఇందు మొదటిబంధము సత్కాయదృష్టిలేక తానొకవేఱైన యాత్మననుభ్రాంతి. ఈభ్రాంతి అహంకారమునకు జనని. నిత్యమైన యాత్మయొకటి లేదనియు, మనము జీవాత్మయని తలఁచునది స్కంధసముచ్ఛయము మాత్రమే యనియు, నమ్మినచో మనకునాస్తికదృష్టికలిగి, భోగలంపటులమై చెడిపోవచ్చును. ఇచట వివేకమనసరము. రెండవ

౧. యస్. బి. ఇ. వాల్యుము. ౧౧.

బంధము విచికిత్స. మాంద్యదోషములకిది యొక తెరవంటిది. ప్రాయశ్చిత్తాది కర్మకాండయందు మనవిశ్వాసములను విడిచి పెట్టవలెను. రాగద్వేషాజ్ఞానములనుండి శాస్త్రకర్మలు మనలను విముక్తులను జేయవు. అహంభావదోషమును బరిత్యజించి, బుద్ధుని, ఆతనిసిద్ధాంతములను సంశయించుటమాని, కర్మకాండను నమ్ముకొనక, యెవ్వఁడుండునో వాఁడుసన్మార్గమున మొదటిదశలోఁ బ్రవేశించినాఁడు. వానిని స్రోతాపన్నుఁడు లేక ప్రవాహజలమున నడిచినవాఁడని చెప్పుదురు. ఈ దశనుగూర్చి ధమ్మపదమిట్లు చెప్పుచున్నది: "పవిత్రజీవితములో నీమొదటి ఘట్టమునఁజేరుట సర్వవసుధాతల సార్వభౌమత్వముకంటె, స్వర్గమున కేగుటకంటె సర్వలోకాధిపత్యముకంటె నధికమైన ఫలమునిచ్చును." ౧. కామప్రతిఘములు రెండును తరువాత నాటంకములు. వీనిని జయించినవాఁడు, యాత్రలో ద్వితీయఘట్టమును జేరినవాఁడు. వాఁడు సకృదాగామి లేక యీజగముననొకమాఱేపుట్టువాఁడు. లోపములు పూర్తిగాఁ బోకున్నను, చాలవరకుఁదొలగినవి. ప్రధానవిపర్యయములైన కామక్రోధదంభముల నెవఁడు నిర్జించునో యాతఁడొక్క జన్మమెత్తి తరువాతమోక్షమును, పొందును. పైరెండాటంకములను బూర్తిగా నాశమొనర్చినవాఁడు, అనాగామియనగాఁదిరిగి జన్మింపఁడు, ఇతని కింకను గొంత దోషమున్నను, నింకఁ బతనములేదు. ఇతఁడింకను జయింపవల

౧. ధమ్మపదము. ౧౭౮. (౨) బుద్ధుని పూర్వకాలమున ముక్తపురుషు నర్హతుఁడనియుఁ బిలిచిరి.

సిన దోషములేవనగా, ఇహాపరలోక సుఖకాంక్ష, గర్వము, ఔద్ధత్యము, వస్తుసత్యస్వరూపాజ్ఞానమునై యున్నవి. ఈబంధములను ఛేదించినవాఁడర్హతుఁడైవి. నిర్వాణమును బొందును. అతనిదుఃఖకారణములు నశించినవి; దోషములు తుడిచి వేయఁబడినవి; ఆతనికిఁ బునర్జన్మములేదు. అర్హతస్థితి పావనమైన యానందమునిచ్చునది. బౌద్ధమతమునకునిర్వాణము లక్ష్యము; అర్హతునకది ప్రాప్తించును. అర్హత్వఫలముపాధి శేష నిర్వాణము. ఆ ర్హతుఁడింకను మనుజుఁడే; మరణముతో నాతఁడును నశించును. అప్పుడు జీవితమను దీపములోని తైలముపూర్తిగాఁ గాలిపోయినది; జీవితబీజము పొల్లుగామాఱిపోయినది. సృష్టి నుండి యాతఁడదృశ్యుఁడై, పరినిర్వాణమును బొందును; అనగా జీవనిర్మాణకారణములు నశించును.౧

బౌద్ధనీతి వ్యష్ట్యాత్మకముగాని సమష్ట్యాత్మకముగాదు. మనజీవితములలో మనము బుద్ధుననుకరింపవలెను. నియమాధికార సంప్రదాయములు ముఖ్యములుగావు. సంఘనియమములనుగూర్చి ఆనందుఁడడుగగా. బుద్ధుఁడిట్లుచెప్పెను: "మీకు మీరే జ్యోతులుకండు. మీకుమీరే గతులుకండు. మీకితరమైనచోటులం దాధారమును గోరకుఁడు."

ప్రవర్తనము యోగ్యము నయోగ్యమునని రెండుగాఁ జెప్పఁబడినది. మొదటిది స్వార్థరాహిత్యమునుండి జనించి, కృపారసమును వెలిబుచ్చు కర్మరూపమునొందును; రెండవది 'అహం' కారము నాశ్రయించి, దౌర్జన్యమును వెలిబుచ్చు

౧. చూడు. ప్రపంచతత్త్వములు. పుటలు. ౧౭౫-౭౯.

కర్మరూపమునుదాల్చును. దశ నిషేధములను విసర్జించుటవలన జరిగినకర్మలు మంచివి; హత్యా చౌర్య వ్యభిచారములు మూడును దేహసంబంధపాపములు; అనృత, దూషణ, ప్రలాప మూర్ఖప్రసంగములు నాలుగును వాగ్దోషములు; పరవస్తుకాంక్ష, ద్వేషము, విపర్యయము మానసికదోషములు. పాపప్రవర్తన విభాగములింకొక రీతిగాఁగూడ నున్నవి. కామము, పునర్జన్మ కాంక్ష, అజ్ఞానము, తత్త్వవిచారము చతుర్విధ పాపప్రవర్తనము. ఒక్కొక్కతప్పు డన్నిటినిగలిపి, చిన్నసూత్రములుగాఁ జెప్పిరి: ఏప్రాణిని హింసింపకుము; దొంగతనమువలదు; వ్యభిచరింపకుము; అనృతమాడవద్దు; మత్తుకలిగించు సురాపానము చేయకుము. ఈపద్ధతులలోఁ బంచవిధ నిగ్రహమున్నది. అనగా క్రోధమును, వస్తుసంపాదనకాంక్షను, శరీరసుఖాపేక్షను, పిఱికితనమును, ఈర్ష్యను నిగ్రహింపుమనియే దీనిభావము. దీనిఫలిత మేమనఁ దానునుఖపడుట, యితరులను సుఖంపఁజేయుటయు నగును; దీనివలన ధర్మశీలము వృద్ధిపొందును. క్రోధమును నిగ్రహించుటచే వినమ్రభావమును, పరధనకాంక్షఁ నశించుటచే దానగుణమును, కామమును జయించుటచేఁ బరిశుద్ధ ప్రేమయుఁ బెంపొందును. ఆదర్శములైన ధర్మములుః పది యని కూడఁ జెప్పఁబడెను; దానము, విశుద్ధవర్తనము, ఓర్పు, దీక్ష, ధ్యానము, వివేకము, సక్రమసాధనసంపత్తి, పట్టుదల, బలము, జ్ఞానము. కొన్నివేళల నైతికశిక్షయనగా, ధర్మము, విజ్ఞానము, అంతర్దృష్టియని చెప్పఁబడెను. మిళిందమునందు, సత్ప్రవర్తనము ఓర్పు, శ్రద్ధ, ధ్యానము, జ్ఞానము ధర్మజీవిత లక్షణములుగాఁ

జెప్పఁబడెను. ౧. పూర్వబౌద్ధధర్మశాసనములకును, నుపనిషన్నీతిసూత్రములకును ముఖ్యాంశములలో భేదము లేదు.౨.

ధర్మజీవనమునకు మూలోద్దేశమునుగూర్చి మనమాలోచింతము. దుఃఖనిరోధము, సుఖప్రాప్తి మనప్రవర్తనమునకంతకు మూలోద్దేశములు. నిర్వాణ మత్యున్నతసుఖము. అభినవచార్వాకులు, జీవితము నెంత యధికముగా వృద్ధిచేసిన నంత సుఖమతిశయించునని చెప్పుచున్నారు. పునర్జన్మహేతువులైన అజ్ఞాన స్వార్థభావముల నాశనములోనే సుఖమున్నదని బౌద్ధులు చెప్పుచున్నారు. తపోజ్ఞానధర్మములు తోడ్కొనిపోవుమార్గము క్షుద్రములైన ధనము, నున్నతపదవి మున్నగువాని నిచ్చునది కాక, శాశ్వతమైన మోక్షమునిచ్చునని బుద్ధుఁడుపదేశించియున్నాఁడు. అల్పాపేక్షలవైపు దృష్టిని మరల్చుటకుఁ గారణమల్పజ్ఞానమే. లోకులందఱిట్టి యల్పజ్ఞులే." ముల్లోకములందు స్వార్థపరుఁడుకాని వానినిఁ జూచుట దుర్లభమైనవిషయమే."3 మన వ్యక్తిత్వపరిమితులెఱుఁగని యజ్ఞానమే స్వార్థహేతువు. సత్యముయొక్క సక్రమజ్ఞానము స్వార్థరాహిత్యమునకుఁ గారణము. సంకుచితమగు మమకారమును నిర్జించి విశ్వజనీన విజ్ఞానహేతువైన విశాలభావములను బెంపొందించుటవలన నిజమైన శ్రేయఃప్రాప్తి చేకూరును. పవిత్రస్వార్థమైన జ్ఞానముకొఱకు స్వార్థవిషయ వ్యామోహములను విసర్జింపవలెను. దుఃఖితమానవకోటియెడ దయార్ద్రహృదయముఁజూపుట ఔదార్యలక్ష

౧. మిళిందము. ౨౮ ౧. ౭-౧౫. (౨) ఆత్మహత్యదోషము. అహంకారమాత్మహత్యచే నశించదు. (3) సంయుత్తము. ౧.

ణాము. ఒకేఅంతముగల జీవయాత్రలో సమానముగా దుఃఖిం చుచున్న మిత్రులము మనము. సర్వలోకములందును, గలసర్వ జీవులు నైతిక పరిపూర్ణతానూత్రమునకు బద్ధములైయున్నవి. నైతికధర్మసూత్రము దేవ మనుష్య తిర్యగ్జాతి జీవితములన్నిటిని సమానముగాబంధించును.ఇట్టి సర్వజీవసాభ్రాతృత్వము బుద్ధుని తత్త్వము; ఇది స్పష్టముగా విశదీకరింపఁబడనిమాట సత్యమే. మానవస్వభావములోని గుణములన్నియు స్వార్థపరములుగావు. స్వార్థరహితప్రవర్తన మసహజలక్షణముగాదు. స్వార్థకర్మయే మనమెఱిఁగిన మానవవ్యాపారమంతయునుగాదు. ప్రతివ్యక్తియు నితరవ్యక్తులకు వేఱైయుండెననుట పూర్ణసత్యముగాదు. సర్వ జీవములను సహచరులనొనర్చునేకసూత్రమున్నది. ఈసూత్రము మననిత్యానుభవములో సిద్ధిగాంచినపుడు జ్ఞానానంద శాంతినిల యమైన నిర్వాణము సమకూరును. సర్వజీవములతో నైక్య భావము కలుగుటే మోక్షము. "సాధకుఁడు తనప్రేమతో లోకమన్ని దిశలను నింపివేయును."౧. బౌద్ధధర్మమున నీతికి లోకాంతరఫలము లేకున్నను, స్వర్గసుఖప్రాప్తిభావము సామా న్యులకొఱకుంచఁబడెను.

ధర్మాచరణమునకు బాహ్యపరిస్థితులతో సంబంధము లేదు నీవు చక్రవర్తివైనను, దరిద్రుఁడవైనను, జ్ఞానశూన్యత అందఱ కొకటే. ఋజుత్వముగలిగి సత్యారాధనముగల జీవితమేగణిం పఁదగినది. విధినిర్వాహణముకంటె వ్యక్తిశీలపరివర్తనము ప్రధా

౧. మహాసుదర్శన సుత్తాంతము.

నమైనది. వినయదాన దయారహితమైన జీవనము జీవన్మరణ తుల్యమే.

బౌద్ధధర్మము శేముషీచాతుర్య ప్రదర్శనమను విమర్శనము పునరుక్తిగాఁ జెప్పఁబడినది. సర్వదుఃఖమునకు మూలబీజ మజ్ఞానమగుటచే జ్ఞానావసరము నుద్ఘాటించిన మాట నిజమే. సత్యజ్ఞానము మనస్సును సంస్కరించును. నిజమైనజ్ఞానముచే నిండినహృదయమున స్వార్థవాంఛలు పెంపొందవు. అందుచే జ్ఞానిలేక బుద్ధుఁడే ముక్తపురుషుఁడని చెప్పినారు. ౨. శ్రేయోజ్ఞానము సుజీవనము. కర్మచేఁ గల్పితమైన శరీరమును జ్ఞానము కేవలము నశింపఁజేయఁజాలదని బుద్ధుఁడెఱుఁగును; కాని యింకొకజన్మములో నింకొకశరీరమును నిర్మింపకుండఁ జేయఁగలదు. మఱియు జ్ఞానమనగాఁ గేవల మానసికజ్ఞానమని బుద్ధుని భావముగాదు. కేవల శాస్త్రపాండిత్యముగాని రహస్యసూత్రమంత్రజ్ఞానము కానికాదు. నైతికానుష్ఠాన సహితమైన జీవితమే జ్ఞానమని యాతనిభావము. కామావేశ పరవశములైన భావములనుండి మనహృదయమును గాపాడి, సత్యసందీపిత మొనర్చునదే జ్ఞానము. మనబుద్ధిలో నొకమూల

(౨) 'ఇచట బ్రాహ్మణముల జ్ఞానము, బౌద్ధధర్మ ప్రవచనములకు సూచనగానున్నది...శతపథ బ్రాహ్మణమునం దాత్మనెఱిగిన వానిని 'ప్రతిబుద్ధుఁడ'ను శబ్దముతోఁబలికిరి. అశ్వత్థవృక్షచ్ఛాయఁ గూర్చుండి యొకానొక మహూర్తమున జ్ఞానకాంతిని దర్శించి మేల్కొనిన బుద్ధునిట్లే ప్రతిబుద్ధుఁడని చెప్పుట బౌద్ధుల కలవాటైనది. ఆశబ్దమునుండి బుద్ధ'డను శబ్దము గైకొనఁబడినది.'' (ఓల్డెన్ బెర్గు. బుద్ధుఁడు. పుట ౫౨)

నొకయరలో దాచుకొనునట్టిది జ్ఞానముగాదు. మనలోఁ బ్రవేశించి, మనయావేశములను సంస్కరించి, మనయాత్మలో లీనమై, జీవితముతో నేకమైపోవునదే జ్ఞానము బుద్ధిపీఠముపై నిలిచి, సర్వభావాశయములపై నమోఘపరిభావమును జూపు పరిజ్ఞాశక్తి రూపమై, సంకల్పమును పవిత్రమొనర్చునది. సిద్ధాంతవిజ్ఞానము జ్ఞానముకాదని తేవిజ్జసుత్తము చెప్పుచున్నది. ౧ నేనేమి చేయవలయునను ప్రశ్నమునకు బుద్ధుఁడుపనిషత్తుల పద్ధతిలో బదులుచెప్పెను. మమకార నాశనముతో మోక్షము లభించును. సత్యసముపార్జనోపాయములను బుద్ధుఁడీవిధముగాఁ బెక్కుసారు లుపదేశించినాఁడు (౧) శ్రద్ధ ౨. (౨) దర్శనము. కేవల శ్రద్ధచాలదు. ఇతరులనుండి మనము విన్నవిషయములను సత్యములని మనము చూడవలెను. "ఓయతులారా! మేము మా ఆచార్యుని నమ్ముచున్నాము; వారు చెప్పిన ధర్మములను విశ్వసింతుమని చెప్పుదురా? మీరట్లు చెప్పరాదు. మీరు స్వయముగాఁ జూచినది, యెఱిఁగినది, గ్రహించినదే సత్యమని గ్రహింపుఁడు" 3. (3) భావన లేక మననము, అనగా సత్యముపై మనస్సు లగ్నమొనర్చి, అది మనతో అనేకమగువఱకు దీక్షబూనుట. సుశిక్షితబుద్ధి లేనివారున్నత జీవితపథమునకుఁ బోఁజాలరు. కాని అజ్ఞానభావములన్నిటిని దొలఁగించు సత్యదర్శనమే, మానవజీవిత పరమావధి. అనేక నీతిసూత్రములను జెప్పి, ఆరిస్టోటల్ తన ధర్మశాస్త్రమును ధ్యాన ముత్తమమార్గ

౧. 3అ.౧.౨ (౨) మజ్ఝిమనికాయము. ౧అ. ౭౧. (3) మజ్ఝిమ నికాయము. ౧అ.

మనిచెప్పి ముగించెను. ప్రజ్ఞయే అత్యుత్తమమైన ధనమని బుద్ధుఁడుచెప్పి, ప్రేమయు దయయులేక ప్రజ్ఞ లభింపదనియు, లభించినను నది నిస్సారమనియు నుపదేశించెను. సచ్ఛీలము, దానములేని యోగధ్యానము నిరర్థకము.౪

బౌద్ధనీతి సన్న్యాసినియమమని యింకొకనేరము నారోపించినారు. సన్న్యాసమనగా, కామోన్మూలనమైనచో బౌద్ధధర్మమట్టిదే. జీవగృహనిర్మాణమునకుఁ గారణము కామము. నిత్యచపలసంచారమే కామలక్షణము; దానికి శాంతిలేదు. అజ్ఞానులలోఁ గామమనగా భోగతృష్ణ; విద్యావంతులలోఁ గామము వస్తువాంఛ. కామనాశముతోఁగాని రెండునుబోవు. దీనికి దృఢసంకల్పమవసరము. బుద్ధుఁడు కేవలౌదాసీన్యము నుపదేశింపలేదు. దుష్కామములు ఉదాసీనతచేఁబోవు; వజ్రసంకల్పముతోఁ గూడిన పరమలక్ష్యమవసరము.

బుద్ధుఁడు సంకల్పనాశనమునుగాని, లోకమునుండి పలాయనమునుగాని చెప్పలేదు. కామముతోఁ దీవ్రరణమొనర్పుమనియుఁ బాపముతో ద్వంద్వయుద్ధముచేయుమనియు నాతఁడుద్ఘాటించెను. "విమర్శకుఁడు బౌద్ధధర్మములోని నిర్మాణవక్షభావములను బరిశీలించినచో బయటికి శాంతగంభీరమూర్తిగా గోచరించుచున్న బౌద్ధసన్న్యాసినిఁజూచి భ్రాంతిచెందక, బౌద్ధమతముదయింపఁజేసిన సారస్వతము, కళ, అతిశయోత్సాహసంకల్పముల నత్యద్భుతముగాఁ బ్రదర్శించుటయేకాక, మహాత్తర భక్తిశ్రద్ధలను, క్రియాపాటవమును బోషించి వ్యాపింపఁ

(౪) ధమ్మపదము ౧౮౩

జేసెనని తెలియఁగలదు. మఱియు, క్షుద్రములైన మానవ కామరాగములనుండి, పరమోత్కృష్టమైన పవిత్రప్రేమభావమునుదయింపఁజేసిన మతము బౌద్ధమతముతో సమానమైన దింకొకటిలేదు. క్రైస్తవమతము నీవిషయమున బౌద్ధమునకు సరిపోవఁజాలదు."౧. కామరాగములను నశింపఁజేయుమని బుద్ధుఁడుపదేశింపలేదు; సర్వప్రాణికోటియెడ నఖండప్రేమను జూపు జీవితము నభ్యసింపుమని కోరెను. దేదీప్యమానమగు నిట్టి శుద్ధప్రేమతో జగమంతయు నిండించి, సుహృదయతను వెదజల్లుమని యాతనిప్రబోధము. "మనమనస్సు చలింపరాదు; మనము నికృష్టవచనముల నుచ్చరింపము. హృదయకోశమున లేశమైన ద్వేషములేని విశుద్ధప్రేమదయారసపూర్ణులమై మృదువైన ప్రవర్తనమును జూపుదుము. ఇట్టిపవిత్రశీలమును జూపు వానిపై మేముప్రేమామృతధారలను గురిసి, విశ్వమంతయు నిట్టివిమలభావములతో నింపి, జగత్కల్యాణమునుసాధింతుము.౨ జాతకకథలలోని యనేకగాథలు, పూర్వజన్మములలో బుద్ధుఁడు

౧. రైస్‌డేవిడ్సుసతి. జె. ఆర్. ఎ. యస్. ౧౯౨౫ పుట ౫౫.

౨. మజ్ఝిమనికాయము, ౨౧. (౧ (పుట 584)—తారానాథుని భారతీయ బౌద్ధచరిత్రయందు ఆర్యసంఘుఁడను సన్యాసికథ కలదు. తనదిగువభాగమంతయుఁ గ్రిమిదష్టమైయున్న యొకకుక్క క్రిములనుజూచి మూలుగుచు ఘూంకారము చేయుచున్నదాని నాసన్న్యాసి చూచి, కృపాంతరంగుఁడై తనలో నిట్లనుకొనెను: "ఈశ్వానమును కొనివేయుచున్న క్రిములను దొలగింపకున్నచో నిదిచచ్చును; కానిక్రిములను దీసి పారవేసినచో నవియుఁజచ్చును." ఇట్లాలోచించి, తనశరీరమునుండి కొంతమాంసముకోసి క్రిములనుదీసి వానికాహారముగా నిచ్చెను.

ప్రాణికోటియెడ నమితకృపఁ జూపినాఁడని చెప్పుచున్నవి.౧. బుద్ధుని యుపదేశము రెండతివాదములకు మధ్యేమార్గము; పశు భోగము, హద్దుమీరిన వైరాగ్యము రెండును దోషములని యాతనిమతము. కామమును సక్రమమార్గమున నడపుకొమ్మ నియే కాని నాశనమొనర్పుమని కాదు. వేదనమునుగూర్చి బౌద్ధుల పరిశీలనములు నీసిద్ధాంతమునే బలపఱచును. ఒకవిజ్ఞాన భావము మంచిదో చెడ్డదో దానిఫలితముపై నాధారపడును. ఫలితము శ్రేయఃప్రదమైనచో నది సుఖహేతువు; కానిచో దుఃఖహేతువు; రెండునుగానిచోఁ దటస్థభావమే మిగులును. సర్వజీవులు శ్రేయమునే యపేక్షించును. కాని చాలవఱకు జనులిహలోక శ్రేయము నపేక్షింతురు. నిత్యశ్రేయోభిలాష కొలదిమందికే యుండును. నీచదశలో జీవించు సంకల్పమును విసర్జించి, ఉత్తమ జీవనసంకల్పమును వికసింపఁజేసికొమ్మని బుద్ధునిభావము. ఏకాంతవాస మౌనము లేకాగ్రతకుఁ దోడ్పడును గాన నవి స్తుతింపఁబడెను. సంకల్పమును నిగ్రహించి పోషింపవలెనే కాని, యణఁచివేయరాదు. సుశిక్షితసంకల్పము లేనిదే ఘనకార్యమేదియు జరుగదు. ఒకరాజకుమారుఁడు బుద్ధుని శిక్షణమెంతకాలమునకుఁ బట్టభద్రునిఁజేయునని యడుగఁగా, నశ్వారోహణ శిక్షణమువలెనే యిదియు, ధైర్యము, ఆరోగ్యము, తెలివి, శక్తినేర్పు ననుగుణపంచకముపై నాధారపడియుండునని బదులుచెప్పెను.౨.

౧. చూడు పుట (588) ౨. మజ్ఝిమనికాయము. ౮౫.

మనము కామముల నన్నిటిని నిర్మూలింపఁబనిలేదు. దుష్కామములనే ప్రచండసంకల్పముతో నిగ్రహింపవలెను. 3. "హృదయములోని మలినములన్నిటిని భస్మమొనర్చుటకే నేను తపస్సాధనము నుపదేశించినాను. అట్లు చేయునాతఁడే నిజమైన తపస్వి." మఱియుఁ దపస్సనగా బుద్ధునిదృష్టిలో నంతరంగ పరిపంచమేయున్నది కాని, కేవలము బాహ్యశరీర పరిస్థితుల నాతఁడధికముగా లెక్కచేయలేదు. దేహమును శ్రద్ధతోఁ గాపాడవచ్చును గాని దేహాభిమానము పనికిరాదు. "యుద్ధ రంగమున నెప్పుడైన నీదేహము శరాఘాతము నందినదా?" "అట్టియనుభవమున్నది." "ఆగాయమునకుఁ దైలము మర్దించి, మెత్తనిగుడ్డకట్టి సంరక్షించితివా?" "అట్లుచేసితిని," "నీగాయ మును నీవు ప్రేమించితివా?" "లేదు." "అదేవిధముగా తప స్వులు తమదేహములను ప్రేమింపరు. మమకారశూన్యులై తమదేహములను జ్ఞానసాధనముగా నుపయోగింతురు."౪ తనభిక్షువులకుఁ బరిశుభ్రవస్త్రములు, నియతాహారము, వసతి, ఔషధసేవ అంగీకరించెను. తత్త్వవిషయముల నెఱుఁగుటకు వలయు మనోబలమును శరీరక్లేశములు క్షీణింపఁజేయుననియాతఁ డెఱుఁగును. సదసద్వివేకముచే బుద్ధుఁడు తపస్సాధనమును సం స్కరించెను. వివేకశూన్యములైన క్షుద్రపద్ధతుల నాతఁడుతృణీ కరించెను. శక్తిని పదునైన వంచనుబట్టుకొనినచో హాని చేయును. దంభతపస్సు సాధకునధోగతిపాలుచేయును. జీవిత పరిత్యాగముకాక, జీవితమమకార పరిత్యాగమే యాతఁడుప

3. మహాపరినిర్వాణసుత్తము ౭ అ, ౪. మిళిందము. పుట ౭౩.

దేశించినది. తపస్వి శరీరమును కృశింపఁజేయువాఁడు కాఁడు; చిత్తమును శుద్ధిచేసికొను నాతఁడు వస్తువాంఛాదాసత్వము నుండి, విముక్తికై, ధనదారాపుత్రపశుమందిరాదులందు మమకారము నున్మూలించుటే తపోదీక్ష. ఉపనిషత్తు చెప్పిన నచికేతుఁడు హృత్పద్మపీఠముపై నధివసించియున్న మరణాతీత బ్రహ్మసాక్షాత్కారసిద్ధికై, లోకభోగతృష్ణలన్నిటి నఖండ జుగుప్సాభావముతోఁ దృణీకరించి విసర్జించెను. సంగత్యాగము విశుద్ధ జీవనమున కతిముఖ్యము. ధర్మసారమును దెల్పుమని సన్న్యాసిని గౌతమి యడుగగా బుద్ధుఁడిట్లు బదులుచెద్పెను; "ఏయుపదేశము కామమును బ్రోదిపింపఁజేసి, శాంతినినశింపఁజేయునో; గర్వమును హెచ్చించి, వినయమును కుదించునో; కోరికలను తగ్గింపక, యతిశయింపఁజేయునో, జనసంగమాసక్తిని గలిగించి యేకాంతవాసమున కనిష్టముదయింపఁజేయునో; క్రియాపరత్వమును మందగింపఁజేసి సోమరితనమును పెంపొందించునో; నిగ్రహించుటకు సాధ్యముకాని మనస్సును వృద్ధిచేయునో, అట్టి యుపదేశమంతయు నధర్మమే."౧. చిత్తస్థైర్యము, శాంతికలుగుటకు నిర్జనప్రదేశరతి, ధ్యానము సాధనములుగాఁజెప్పఁబడెను.

బౌద్ధమతము తనజాతిపూర్వబంధములను బూర్తిగా తెగఁగొట్టుకొనఁజాలకపోయెను. వేదయుగమునుండియు, సంసారపరిత్యాగమొనర్చి, సన్న్యాసులై లోకసంచారజీవితమును గడవునాచారము భారతీయులకుఁగలదు. కొందఱు బ్రహ్మసాక్షాత్కారసిద్ధినిగోరి 'సంతానకాంక్షను విడచి, ధనార్జనా

౧. డాల్కే. బౌద్ధవ్యాసములు. పుట ౨౧౫.

వాంఛను ద్రోసిపుచ్చి, ఇహలోకశ్రేయమును త్యజించి, సన్న్యసించిపోయిన సంగతి నుపనిషత్తులలోఁ జూచియుంటిమి. విధివిహిత కర్మబాధ్యతను, నిర్వహణమును వీరికవసరము లేదని ధర్మశాస్త్రము లంగీకరించినవి. చేత భిక్షాపాత్రిమునుగాని, ఎవరిని బలుకరించుటగాని, యాచించుటగాని లేనిమౌనముద్రి వహించి, వీధుల వెంబడి నింటింట కేగుచు సంచరించుసన్న్యాసియే సర్వజనుల కాదర్శపురుషుఁడని, బిచ్చగాఁడు మొదలు చక్రివర్తి వఱకు నాతనికిఁ బ్రిణామము చేసి గౌరవింతురు. ఈసన్న్యాసులనుగూర్చి జాకోబి వ్రాసినాఁడు: "సన్న్యాసిధర్మములను గూర్చి వ్రాసిన నియమములనుబట్టి చూచినచో, నీవర్గమున కధికగౌరవస్థానము క్రీ. పూ. ఎనిమిదవశతాబ్దమునం దీయఁబడినదని స్పష్టమగుచున్నది." బౌద్ధసన్న్యాసులు, దారిద్ర్యవ్రిత బద్ధులై, భిక్షావృత్తిపై నాధారపడి, బౌద్ధధర్మవ్యాప్తికై దీక్ష బూనినవారు. లోకులందఱు సన్న్యసింతురని బుద్ధుఁడు తలచియుండఁడు. జనులనాతఁడు రెండువర్గములుగా విభజించి, సంసారబంధములు గలవారిని 'ఉపాసకు'లనియు, సంసారబంధవిచ్ఛేదముచేసికొనినవారిని శ్రిమణులనియు నిర్ణయించెను. ౧, లోకసంబంధమైన విధివిధానములనినఁ దనకెంత గౌరవమున్నను లోకవిధి నిర్వహణమొక్కటే మోక్షమీయఁజాలదనియాతఁడు తలపోసెను. "కామరాగపరివృతమై, వైకల్యములతో నిండియున్నది సంసారజీవితము. సర్వవస్తు సంగత్యాగమొనర్చి, స్వతంత్రుఁడైనవ్యక్తి జీవితము నిరాటంకవాయువ్రిసారమువలె

౧. పోల్చు. పెయింటిఫాధుర్నిన్ సన్న్యాసిసమాజములు.

స్వచ్ఛందమైనది. గృహస్థుఁడైయుండువాని కున్నతజీవితమును గడ పుట- అనగా పూర్ణమై, పవిత్రమై, అకుంఠితమైన జీవితమును గడపుట యెంతదుష్కరమైనకార్యము ! నా శిరోజములను గడ్డమును నిర్మూలించి, కాషాయవస్త్రధారినై, గృహావరణమును వీడి, విశాలజగద్రాజ్యమునఁ బ్రవేశించి విహరింతునుగాక!"[౭] కాని యీభావమునంద అంగీకరింపలేదు. సన్న్యాస మవసరము లేకుండనే, మోక్షమునార్జించవచ్చునని మజ్ఝిమనికాయము చెప్పుచున్నది. బుద్ధుఁడు కఠినములైన తపోపవాసాదులను నిర సించినను, నిర్వాణమును బొందఁగోరుసాధకులకు బుద్ధుఁడిచ్చిన శిక్షణవిధానమును జూచినచో, బ్రాహ్మణములు చెప్పిననియమములకంటె నెక్కుడు కఠోరముగనున్నది. సిద్ధాంతములో నాతఁడు తీవ్రకృశత్వముతోఁ గూడినవిధానము నంగీకరింపలేదు గాని, ఆచరణములోమాత్రము కఠోరశిక్షణము తప్పనిసరి యగుచున్నది.

నిర్వాణసంపాదనమునకే బౌద్ధులందఱొక సోదరబృందముగాఁజేరిన సమాజమునే సంఘమనిరి. ఇందు విశ్వాసము గలిగి, కొన్నినియమముల నాదరించువారే సంఘసభ్యులు కావచ్చును. సర్వమానవుల కిందుఁదావున్నది. మొదట బుద్ధుఁడు స్త్రీలను జేర్చుకొనుటలో వ్యతిరేకభావములను బ్రదర్శించెను. ఒక వనితయెడఁ బురుషుఁడెట్లు సంచరింపవలెనని యానందుఁ డడుగఁగా, దానికి బుద్ధుఁడు బదులుచెప్పెను; "ఆమె వైపుచూచుటమానుము...చూచుటవసరమైన మాటలాడకుము; మా

---

౭. తేవిజ్జసుత్తము. ౧౹౨ ౪౭.

కూడుటవసరమైనచో జాగరూకుఁడవై ప్రవర్తింపుము''.౧. శుద్ధోధనుని మరణానంతరమాతని పట్టమహిషి, ५०० మంది రాజసతులను వెంటఁబెట్టుకొనివచ్చి, మతస్వీకారమున కనుమతి యడుగఁగా, మూడుమారులు బుద్ధుఁడు తిరస్కరించెను. కారణము, సంఘమునఁ జేరిన పురుషసభ్యులకు మనశ్చాపల్యముద యింపవచ్చునని యాతఁడు తలఁచెను. ఇంకొకసారి వారు నడచి చేనరిగి రక్తము స్రవించుచున్న పాదములతో, ధూళిదూసరిత వస్త్రములతో నేతెంచినపుఁ డానందుఁడు, "లోకమునందు బుద్ధులవతరించుటకుఁ గారణము మగవారి నుద్ధరించుట కేనా?" యని ప్రశ్నించెను. "నిశ్చయముగా స్త్రీలనుద్ధరించుటకుఁ గూడ"నని జవాబు పలికెను. అప్పుడా స్త్రీలందఱు సభ్యురాండ్రైరి. ఇహజీవిత దుఃఖమందఱకు నున్నదిగావున, బౌద్ధ ధర్మమందరునంగీకరింపవలెను. రోగగ్రస్తులు, నేరస్థులుగా నిశ్చయింపఁబడినదుష్టులు, తమసాన్నిధ్యముచేఁ గలఁతలు కలిగించు యుద్ధభటులు, ఋణగ్రస్తులు, సేవకావృత్తిలో నున్నవారు, తల్లిదండ్రుల యాజ్ఞలేని పుత్రులు, బాలురు నంగీకరింపఁబడరు. సంఘము, సన్న్యాసులయొక్కయు సాధువులయొక్కయు సోదర సమాజము. బ్రాహ్మణములు చెప్పిన సన్యాసులట్టి సంఘనిర్మాణము నెఱుఁగరు. ఎఱిఁగియుండి తమసంఘ మొక ప్రచారకసమాజముగాను మతాంతరులను జేర్చుకొను సంస్థగాను బౌద్ధులు నిర్మించుకొనిరి. బౌద్ధసన్న్యాసి ఆగ్రహాను గ్రహములఁ జూపు కోరికగలవాఁడుకాఁడు. వైచిత్ర్యప్రదర్శకుఁడుగాఁగాని, జీవదే

౧. మహాపరి నిర్వాణసుత్తము. ५అ. ౨౩.

వులమధ్యవర్తిగాఁ గాని యాతఁడు వర్తింపలేదు. ఆతఁడొక నాయకుఁడు. సంఘమున సన్న్యాసులకు గృహస్థులకుఁ దావు గలదు. గృహస్థుఁడు బౌద్ధధర్మము నామోదించును; సన్న్యాసి దానిని వ్యాపింపఁజేయును. బౌద్ధసంఘనియమములు, బ్రాహ్మణగ్రంథములనుండి గ్రహింపఁబడి, పరిచారక వ్యవస్థానుగుణముగా మార్చుకొనఁబడినవి. బుద్ధునికి శిష్యునకు సంబంధముగాని, సన్న్యాసులకు ననుచరులకు సంబంధముగాని, ఆచార్యశిష్యసంబంధమే.

బుద్ధుని వర్ణధర్మాభిప్రాయమును గూర్చి విపరీతభావములు కొన్ని గలవు. వర్ణధర్మమున కాతఁడు విరోధి కాఁడు కాని యాతఁడుపనిషద్వర్ణ ధర్మము నంగీకరించెను. సంఘనాయకుఁడైన బ్రాహ్మణుఁడు శీలముచే బ్రాహ్మణుఁడుగాని, జన్మమాత్రముచేఁగాదు. బుద్ధునికాలమున జన్మముపై నాధారపడిన వర్ణవ్యవస్థ సంకరస్థితిలోనున్నది. "అనఘుఁడైన బ్రాహ్మణుఁడు, మలిన గర్వనిర్ముక్తుఁడై, ఆత్మనిగ్రహముకలిగి, జ్ఞానమూర్తియై, ధర్మాచరణ దీక్షాబద్ధుఁడైనచో వానిని బ్రాహ్మణుఁడని పిలువవచ్చును. క్రోధద్వేషములకు వశుఁడై, క్రూరుఁడై, వంచకుడై మూర్ఖభావదాసుఁడై యుండువాఁడు నిజముగాఁ జండాలుఁడు; అట్టివానికి జీవకారుణ్యముండదు." "పుట్టుకచే నెవ్వఁడును బ్రాహ్మణుఁడుగాఁడు. ఎవ్వఁడును చండాలుఁడును గాఁడు; తాను చేయుకర్మలవలననే బ్రాహ్మణుఁడుగాని, చండాలుఁడుగాని యగును."౧. మానవులందఱు పూర్ణజ్ఞానులగుట కవకాశ

---

౧. చూడు వసలసుత్తము వాసిట్ఠసుత్తము. ధమ్మపదము ౨౬ అ.

మున్నది. ఒకమానవుఁడు పూర్ణజ్ఞానియైన మూర్తియే బుద్ధుఁడు. ప్రతిమానవుఁడు జ్ఞానధ్యాన నిగ్రహముల నభ్యసించి బుద్ధుఁడు కావచ్చును. కొందరు మానవులు జ్ఞానహీనులై నశించిపోవుటకును, గొందరు ధర్మతత్పరులై సిద్ధిపొందుటకును బుట్టిరనుట వ్యర్థప్రలాపము. అందుచే నన్నివర్ణములవారును సంఘములోఁ బ్రవేశమును గాంచిరి. ఈవిధముగా బుద్ధుఁడు వర్ణవ్యత్యాసము నున్మూలించెను. కాని బ్రాహ్మణధర్మమునందుఁ గూడ సన్న్యాసికి వర్ణవివక్షణము లేదని యంగీకరింపఁబడెను. బుద్ధుఁడు వర్ణభేదనాశన మొనర్చెననుటకు వీలులేదు; ఏలన నాతనిధర్మమున్నతాధికారులకే యేర్పడెను. బౌద్ధధర్మములోని సూక్ష్మముల నర్థముచేసికొను సామర్థ్యము పండితులకేకలదు. అందుచే బుద్ధుఁడు తఱచుగా శ్రమణులను బ్రాహ్మణులను నాదరించెను. మొదట బౌద్ధధర్మమునవలంబించినవారు వారణాసిలోని బ్రాహ్మణులు ధనికకుటుంబములకుఁ జెందినయువకులునై యున్నారు. బుద్ధుఁడొక సాంఘికవిప్లవమును గల్పించెనని చెప్పఁజాలము. పుణ్యపరిపాకముచేతనే బ్రాహ్మణకులమున జన్మము లభించుననియు బుద్ధుఁడంగీకరించినాఁడు. ౧. బుద్ధుఁడు, దరిద్రులకు, దీనులకును జ్ఞానరాజ్యమున స్థానమున్నదని చెప్పిన యొకమతసంస్కర్త. "ఇప్పటికిని, బౌద్ధ జైనమతములు, సంస్కరణోద్యమములనియు, వర్ణభేదకాఠిన్యమును బ్రతిఘటించు నిమిత్తమవి యేర్పడెననియుఁ దలచువారి భావములు నిరాధారములు. బ్రాహ్మణ సన్న్యాసివర్గముయొక్క వర్ణభేదప్రకట

౧. చూడు హార్డీ. మాన్యూయెల్ ఆఫ్ బుద్ధిజమ్. పుట ౪౪౬

నమునవి ప్రతిఘటించెను. సన్న్యాసిసంబంధములేని వర్ణవ్యవస్థను వారంగీకరించియున్నారు. వారి సంఘములందైనను, ప్రవేశించుట కందరకధికారమున్నదని చెప్పినను, నున్నతవర్ణముల వారినే విశేషముగా మొదటఁ జేర్చుకొనిరి. ఇంకొకవిచిత్రమేమనగా, జ్ఞానవిషయమున బౌద్ధగృహస్థ శిష్యులు బౌద్ధసన్న్యాసులనే గురువులుగా నంగీకరించినను, తమ గృహస్థకర్మ సంబంధములలోఁ బురోహితులను పూర్వబ్రాహ్మణులనే పెట్టుకొనుటకు బౌద్ధసంఘము నంగీకరించియున్నది." ౨. బుద్ధుఁడొక సంఘసంస్కర్త గాఁడు. స్వార్థపరత్వమువలననే దుఃఖము కలుగుచున్నదని నిస్సంశయముగా నిశ్చయించుకొనినవాఁడగుటచే, నహంకారపిశాచమును సమూలనాశన మొనర్చుటకై, యాతఁడు నైతికమైన మానసికశిక్షణ ధర్మము నుపదేశించెను. బుద్ధుని దృష్టి పరలోకదృష్టి; ఇహలోకజీవితముపై నాతనికంతగా విశ్వాసము లేదు. సంఘసంస్కర్తయు, జాతీయనాయకుఁడునగుటకు వలయు నైహిక సంఘనిర్మాణోత్సాహ మాతనికి లేదు. "బుద్ధుని తత్త్వము, సంఘసంస్కర్తకుండవలయు నుత్సాహమునకు వ్యతిరేకమైనది. అణఁచివేయబడిన జాతులకుఁ బ్రతినిధ్యము వహించి, అగ్రజాతుల నెదుర్కొని యుద్యమనాయకత్వము వహించు నావేశము బుద్ధుని తత్త్వమందేలేదు. రాజ్యము, సంఘము నష్టియుండనిండు. సంగములనుత్యజించిన సన్న్యాసికి లోకవ్యాపార తంత్రములతో నిమిత్తము లేదు. వర్ణవిభాగ మాతనిని బాధింపలేదు. ఏలన, నిహలోకసంబంధ విషయము

---

౨. హోలిన్సీ. కలకటారివ్యూ. ౧౯౫౭. పుట ౩౭౦

లన్నియు సమానముగా వ్యర్థములైనవే, తనపలుకుబడిని వ్యావహారప్రపంచమున వెనుకఁబడిపోయి క్లేశములననుభవించువారి కుపకారము జరుగుటకై వర్ణవిభాగదోషములను ఖండించుట కుపయోగింపలెనని యాతనికిఁ దోఁచలేదు." ౧. విజ్ఞానప్రపంచమున నుపనిషణ్మతము, బౌద్ధముకూడ వర్ణవిభాగకాఠిన్యమును నిరసించినవి; రెండునుగూడ దీనునికి హీనస్థితిలోనున్నవానికి నుత్కృష్టతత్త్వపదవి కధికారమున్నదని చెప్పియున్నవి; కాని వేదములునిర్మించిన వ్యవస్థలను, నభ్యాసములను, వినాశమొనర్ప రెండును బ్రయత్నింపలేదు, కాని వర్ణకాఠిన్యమును సడలించుటలో నుపనిషత్తులకంటెఁ గొలదిగా నెక్కుడుఫలితమును బౌద్ధమతముగాంచినది. ఆదినములలో సంఘసంస్కారము చేయవలయునను తీవ్రావేశము నాఁటి ప్రజ్ఞావంతుల కెవరికిని కలుగలేదు. సంఘసంస్కారమునకవసరమైన ప్రజాప్రతినిధిపరిపాలన తత్త్వము నవీనప్రపంచమునకుఁ జెందినది.

వేదోక్తముగా జరుగుచున్న గార్హస్థ్యకర్మలవిషయములో బుద్ధుఁడు జోక్యము కల్పించుకొనలేదు. ౨. సిద్ధాంతవిషయములలో వేదమే పరమప్రమాణమను భావమును బుద్ధుఁడంగీకరింపలేదు. బుద్ధుఁడు సామాన్యముగా బాహ్యాధికారమునుగాని, రహస్యతత్త్వమునుగాని గుర్తింపఁడు. "ఓశిష్యులారా! ముప్పొరకు రహస్యములున్నవి......స్త్రీలకు,హీనోప

౧. ఓల్డెన్ బెర్గ. బుద్ధుఁడు. పుటలు. ౧౪౩-౪౪

౨. చూడు భండార్కారు. ఎపిక్ ఇన్ టు ది ఆర్లీహిస్టరీ ఆఫ్ ఇండియా.

దేశముచేయు పురోహితులకు,అసత్యసిద్ధాంతప్రచారకులకు..."3 "గుప్తములా,బహిరంగములాయను భేదములేకుండ సత్యప్రబోధములను జేసియున్నాను. ఆనందా! సత్యములవిషయములోఁ గొన్నిటిని గుప్తముచేసి, యెవరికిఁ జెప్పకుండ గుప్పిటఁబెట్టుకొను పద్ధతినాదికాదు." ४. బుద్ధుఁడు వేదములను నిందించియెఱుఁగడు. జీవహింసనుజెప్పు నా వేదభాగమునుమాత్రి మాతఁడు నిరసించెను; గీతాగోవింద గ్రంథకర్తయగు జయదేవ మహాకవియు, బుద్ధశతకమని పేరొందిన భక్తిశతక గ్రంథకర్తయైన రామచంద్రిభారతియుఁ బైభావములతో నేకీభవించిరి.

## ౧౪—కర్మ. పునర్జన్మము.

కర్మసూత్రిము మానవస్వభావజమేకాని, బాహ్యశాసనముగాదు. మానసికాభ్యాసనిర్మాణము; దౌష్ట్యమునెడఁ బెంపొందుచున్న యాదరభావము, మనమెఱిఁగిన నెఱుఁగకున్నను, మనయాత్మస్వాతంత్ర్యమును క్షీణింపఁజేయు క్రియావ్యాపారముల పౌనఃపున్యము నివన్నియుఁ గర్మసూత్రిములో లీనమైయున్నవి. మనముచేసిన కర్మలఫలితములనుండి మనము తప్పించుకొనఁజాలము. భూతకాలవర్తనము వర్తమానభావిదశలలోఁ బ్రివహించుచున్నది, మానవసంబంధములలో న్యాయ్యమునొసగునదియే కర్మసూత్రిము, "తాముచేసిన కర్మలలోని భేదముఃలవలననే, మనుజులందరొక రీతిగాలేరు. కొందరుచిరజీవులు; కొందరల్పాయుష్కులు; కొందరారోగ్యవంతులు; కొందరు

3. అంగుత్తరనికాయము. (४) మహాపరినిర్వాణసుత్తము.

రుజాగ్రస్తులు మున్నగునవి భేదములు"౧. ఇట్టిసూత్రము లేనిచో మనుజులు తాముదారుణమైన అన్యాయమునకు గుఱియైతిమని తలచెదరు. దుఃఖితుఁడైనవాఁడు దుఃఖమనతిక్రమణీయమని గ్రహించును; ఏలనఁదాను దుఃఖానుభవముచేఁ బూర్వఋణమును దీర్చివేయుచున్నానని భావింప వీలగును. సుఖము ననుభవించు నాతనికీసూత్రము వినయమును బోధించును; ఏలనఁదనసుఖము స్థిరమైయుండుట కాతఁడు పుణ్యకర్మ చేయుచునే యుండవలెను. తలపగిలి, గాయములనుండి యొడలెల్ల రక్తము కారుచు, మతాంతరుల క్రోధమునకుగుఱియైన యొకశిష్యుఁడు బుద్ధుని సమీపమునకువచ్చినపుడు బుద్ధుఁడాతనితో నిట్లనెను; "ఓఅర్హాతా! అట్లేయనుభవింపుము" ఇపుడు నీకుఁగలిగినకర్మఫలమును నీవీరూపమున ననుభవింపకున్నచో నరకమున ననేక శతసంవత్సరముల దుఃఖము నీకుఁబ్రాప్తించి యుండెడిది." ప్రతివ్యక్తికి స్వకర్మబాధ్యతయును, భావిజన్మ విశ్వాసమును గర్మసూత్రమునకు వలయును. పాపఫలము, పాపముచేయువాని జీవితదశననుసరించి యుండును. నీతిహీనుఁడు, దుర్బలుఁడునైన మానవుఁడొక పాపమొనర్చినచో నాతనికి నరకము ప్రాప్తింపవచ్చును. యోగ్యుఁడైనవాఁడట్టి పాపమునే చేసినచో నల్ప దుఃఖముతో దానిఫలిత మీజన్మమునందే పూర్తియగును. "ఒకలవణ కణము నొకచిన్నజలపాత్రములోఁ గలిపినచో నందలినీరంతయు నుప్పగానుండును. ఆకణమునే గంగానదిలోఁ

౧. మిళిందము. మజ్ఝిమనికాయము. ౩అ ౨౦౩.
౨. బుద్ధఘోషుఁడు. అత్థసాలిని. పు. ౮౮.

గలిపినచోఁ దెలియపీలగుమార్పు గంగాజలము రుచిలో గోచ
రింపదు.౧.

కర్మసిద్ధాంతము బౌద్ధమతమునకుఁ జాలపూర్వకాలము
నకుఁ జెందినదే కాని, బౌద్ధమత పరిణామవాదమున దీనికిఁ దా
ర్కికమైన పోషణము లభించినది. కారణకార్యాత్మకమైన
దీర్ఘశృంఖలమునందు మానవులు పరస్పరసంబంధములు గలిగి
తాత్కాలిక వ్యక్తిత్వముగల 'లింకులు'. ఒకవ్యక్తియొక్కచరి
త్రి మాతనిపుట్టుకతో నారంభించినది కాక, మొదలెఱుగని
యనేక జన్మాంతరములనుండి వచ్చుచున్నది.

దేవతలకు మానవులకుఁగూడఁ గర్మసూత్రి మనుల్లం
ఘనీయమైనచో, మానవుని పురుషప్రియత్నమున కిసుమంత
యవకాశమును లేకుండఁబోవును. ఏమిజరిగినను గర్మయే కారణ
మైనచో, జరిగినదానిని దేనినిగూర్చియును నెవఁడు నాలోచిం
పఁబనియే లేదు. కర్మయే సర్వమును జయించును. మోక్షము
కర్మప్రివాహములోనిదే. ఇట్టి భావము విజ్ఞానచరిత్రిమందుఁ
దఱచుగాఁ దలయెత్తుచుండును. దేవతలకు మానవులకు సమా
నముగా నమోఘము ననతిక్రిమణీయమునైన యొక సూత్రి
మున్నది; మానవప్రయత్నముగాని ప్రార్థనముగాని దానిని
మార్చలేదని గ్రీకులు భావించిరి. ఇట్టి విశ్వాసమే కాల్విని
ష్టులకు, ముస్లీము కిస్మెత్తునకుఁగూడఁ గలదు. బుద్ధుఁడు తన
బుద్ధత్వసిద్ధి కిదివఱకే తనకర్మఫలము నిర్ణయించినదేమో చెప్పి
యుండలేదు. బుద్ధుఁడు దీనికి స్పష్టమైన సమాధానమీయక,

---

౧. అంగుత్తరనికాయము ౧ అ. ౨౪౯

విచారణీయమైన విషయమని చెప్పి యూరకుండెను. కాని, మానవునకుఁ గర్మస్వాతంత్రమును, కర్మసూత్రమును దుదకు నిర్జించుశక్తిని బౌద్ధధర్మమిచ్చియున్నది. ౨. దోషమును దీవ్రముగాఁ బ్రతిఘటించుటకు శక్తితోఁగూడిన కృషికావలయు ననునాతని యుపదేశము. కర్మచేయుటకు స్వాతంత్ర్యము మనకు లేదనుసిద్ధాంతమునకు వ్యతిరేకమైయున్నది. బుద్ధునుపదేశమునఁ బశ్చాత్తాపమునకు సావకాశమున్నది. కర్మసూత్రి కర్మస్వాతంత్ర్య సామరస్యమును సూచించు నీదిగువ విషయములు గమనింపఁదగినవి. కారణధర్మమే నేఁటివిజ్ఞానమూనందుఁగూడ కర్మసూత్రాధి కారమును సమర్థించుటకుఁ గలకారణము. కర్మ, బౌద్ధతత్త్వము ననుసరించియొక నిర్జీవసూత్రముగాదు; అది జీవులశీలమునుండియే యుత్పన్నమైనది. జీవము వికసించులక్షణముగలది. ఆత్మయనున దొకటిలేదు. నిత్యపరిణామ మందుచు నభ్యుదయమందుచున్న దశాపరంపరలేయున్నవి. గతము వర్తమానమును బంధించినను, భావిదశను మనసంకల్పము ననుసరించి నిర్మించుకొనవచ్చును. వర్తమానము గతముచే నిర్ణయింపఁబడుటొక యంత్రవిధానముగాదు. భూతవర్తమాన దశలమధ్యమందొక యవిచ్ఛిన్నసూత్ర మున్నదని కర్మసిద్ధాంతము చెప్పుచున్నది. అనగా వర్తమానమొక్కటే గతకర్మఫలమని చెప్పరాదు. "ఓ పురోహితులారా! ఎవఁడైనను మానవుఁడు తనకర్మల ననుసరించి ఫలమనుభవింప వలెనని చెప్పినచో, నపుడు మతజీవి

౨. చూడు మిళిందపఞ్హ ర అ ర, ౩౮-౪౧

తమున కేయవకాశమునుండదు. దుఃఖమును బూర్తిగా నిర్మూలించు నుపాయమును లేదు, కాని తాను జేసిన కర్మల కనుగుణమైన ఫలసిద్ధి చేకూరునని యెవ్వఁడైనఁ జెప్పినచో, నప్పుడు మతానుష్ఠానావకాశము నున్నది; దుఃఖమును పూర్ణముగా నాశమొనర్చు మార్గము నున్నది."౧. కర్మసూత్రమును నిర్జీవసూత్రముగా నర్థముచేసికొనుట వలన నీతిమతముల కవకాశము పోవును.

బుద్ధుఁడు మానసికవ్యాపారమున కిచ్చిన ప్రాముఖ్యమే యీసూత్రార్థమందలి క్లిష్టతకుఁ గారణమైనది. మనస్తత్త్వశాస్త్రమునకు లక్ష్యము పరిమితమైనదగుటచే, ఆత్మ యనగా వివిధమానసిక దశాసముచ్ఛయమని చెప్పుటకు బుద్ధుని కధికారమున్నది. మనస్తత్త్వశాస్త్రమునకు, వివిధమానసిక దశాపరిణామముల సంబంధమును నిర్ణయించుటే ముఖ్యముగాన, కర్మనిర్ణయ సూత్రము దానికనుగుణముగా నుండును. కాని యేకాత్మతత్త్వమున కర్థ మీసూత్రము తృప్తికరముగాఁ జెప్పఁజాలదు. ఈభిన్నదశలన్నియు నొకవ్యక్తికిఁజెందినవని చెప్పకున్నచో నాత్మస్వభావమున కపార్థమును జేసిన వారమగుదుము. మనయాత్మ, యేసమయమునందైనను, మనముచేసినకర్మమునకుఁ గర్తయైయున్న కారణమున గతకర్మబంధములను ఛేదించుకొనఁగలదు. కర్మరహితమైన కర్త నిరర్థకవ్యక్తియగును. ఆత్మయొక్క వివిధదశలే సత్యములని గ్రహించుచోఁ, గర్మసూత్రము వానిని నిజముగా బంధించునని చెప్పవచ్చును. కాని

౧. అంగుత్తరనికాయము. 3 అ. ౯౯.

వ్యక్తిత్వము సంగీకరించినచోఁ గర్మస్వాతంత్ర్యమంగీకరించి నట్లేయగును. నిష్కారణముగా నేదియును జరుగదని ఆత్మ యొక్క ప్రస్తుతావస్థ యట్టికారణము గావచ్చునని చెప్పు టకు విరుద్ధము కాఁజాలదు. మనస్సుయొక్క సక్రమవ్యాపారము నందు జోక్యముకలిగించుకొనుచునుండు నొకస్వతంత్రసంకల్ప మున్నదను నశాస్త్రీయభావమును బ్రతిఘటించుటకే బౌద్ధ ధర్మముద్యమించినది. ప్రపంచములో జడధర్మమునకంటె నధిక మైన ధర్మమున్నది; వ్యక్తియొక్క వాంఛాభావముల పూర్ణ సహజ చరిత్రమునున్నది. ప్రకృతిలోనున్న యీసహజక్రమ మును, నాత్మపరిణామవికాసమును గర్మసూత్రము తెలుపు చున్నది. బాధ్యతనుగాని, ప్రయత్నావకాశమునుగాని తొల గించుటకొఱకుఁ గర్మసూత్ర ముద్దేశింపఁబడలేదు. ప్రయత్నము లేనిదే ఘనకార్యమేదియు సాధింపఁబడదు.

మనమత్యున్నతస్థితిని బొందినపుడు కర్మకుమనపై నధికా రము లేకపోవును. గతకర్మఫలములన్నియు హరించి పోవును. మోక్షావస్థ, సుకృతదుష్కృతముల కతీతమైనది. కర్మలయొక్క ఫలితమున్నంతకాలము పునర్జన్మావసరముండి తీరునుగాన, పున ర్జన్మరాహిత్యమే మోక్షముగావున. ముక్తిపొందినవానికి నీతి తో నిమిత్తములేదని చెప్పఁబడెను. పుణ్యపాపములు రెంటికి నతీతమైన పదవియే జన్మరాహిత్యము. నైతికవర్తన మట్టిపదవి నార్జించు సాధనమే. లక్ష్యము సిద్ధించుటతోఁ గృషి పూర్తి యగును. ఇంకొకజన్మమున కవసరమగుఫల కారణమైన కర్మ చేయ నవసరముండదు. ముక్తుఁడగువాఁ డేపనిచేసినను, నిస్సం

గుఁడై చేయునని చెప్పిన యుపనిషద్భావమే యిది. కేవలము కర్మలు ఫలితముల నొసఁగవు; కర్మలవెనుకనున్న కాంక్ష లిచ్చును. కాఁబట్టి పరమగతియైన మోక్షావస్థ, ధర్మాతీతము, కర్మాతీతమునైనది; కాని ధర్మకర్మలకు మోక్షముతో సమన్వయము నున్నది.

కర్మనియమ బద్ధమైన జన్మపరంపరల చిహ్నమే సంసారచక్రము. పూర్వజన్మశైథిల్యము, నూత్నజన్మోత్పత్తియే మరణము. తిరిగి పుట్టఁబోవుబిడ్డకు శ్మశానదహనజ్వాలయే ఊయెల సామగ్రి. జీవితకాలమునకుఁ బెక్కుమార్పులుగలవు. జననమరణములు పెద్దమార్పులగుటచేఁ బెద్దపేర్లు పెట్టితిమి. మన మీజన్మమందనుభవింపవలసిన కర్మసముచ్చయమయి పోవుటతోడనే మరణము తటస్థించును. కాలచక్రము, మనకింకొక జన్మావకాశము నొసఁగి, మనముకోరినచో, నుత్తరదశ నున్నతదశగాఁ జేసికొనుటకు వీలిచ్చినది. ఈసంసారచక్రమునందు మనుజులేకాక, సర్వజీవులు పతనోత్పతనముల నందుచుండును. బ్రాహ్మణముల సిద్ధాంతమునసుసరించి, బుద్ధుఁడును దుర్మార్గులకు నరకమును, సజ్జులకుఁ బునర్జన్మమును జెప్పినాఁడు. స్వర్గమునుగూడ నంగీకరించెను. "మరణముచే దేహము నశింపఁగా సుకృతాత్ముఁడు స్వర్గమున జన్మించి సుఖస్థితినందును."[౧], స్వర్గనరకములు పునర్జన్మమునకుఁ బూర్వము లభించుఁ దాత్కాలికావస్థలని కొన్నిచోటులఁ దెలుపఁబడెను. బుద్ధుని పూర్వజన్మగాథల నుగ్గడించి, పునర్జన్మసిద్ధాంతమును బౌద్ధులు విశేష

౧. మహాపరినిర్వాణము ౧౫. ౨౮.

ప్రచారమొనర్చి, పూర్వజన్మాంతరములందు బుద్ధుఁడెట్లుత్యాగ పరాయణత్వముచేఁ గ్రిమోన్నతినంది, తుద కశ్వత్థ వృక్ష చ్ఛాయ నాతఁడెట్లు దివ్యజ్ఞానసిద్ధినందెనో వర్ణించియున్నారు. మనము కొన్ని యింద్రియాతీత శక్తుల నార్జించినచోఁ బూర్వానేక జన్మముల వివరములన్నియు గోచరించునని యొక సిద్ధాంతము గలదు.

ఆత్మదేహాంతరయాత్ర చేయుటకాని, ఒకేవ్యక్తి పునర్జన్మపరంపరల నందుటకాని బౌద్ధమతమున లేదు. ఒక మనుష్యుఁడు మరణించినపు డాతని దేహముతోఁబాటు దానిపై నాధారపడియున్న మానసికదశాసంపుటియును నశించును. చచ్చినవాఁడుకాదు తిరిగి జన్మమెత్తుట; ఇంకొకఁడు క్రొత్తగాఁ బుట్టును. వివిధదేహములలోఁ బయనించు నాత్మలేదు. దేహాంతరములలో యాత్రచేయునది శీలము.౨ మరణముచే వేరైన రెండుజీవితములను గర్మసూత్ర మెట్లుకలుపునో బౌద్ధధర్మము చెప్పలేదు; అదియట్లు జరుగునని విశ్వసించెను. భిన్నజన్మపరంపర, సహజకారణధర్మముచేఁ గలుపఁబడునందురు. పూర్వజన్మశీలము, నూత్నజన్మమునకు వలయు సామగ్రినిచ్చునని యుఁ జెప్పఁబడెను. కర్మబలముచే మరణించుచున్న మానవునివిజ్ఞానము నూతనజీవదశల నుద్భవింపఁజేసి, యొకసూక్ష్మదేహమును గల్పించి, దానియాధారమున నూత్నదేహపరిణామ

౨. అభిధమ్మకోశము 3అ.౨౪.

3. పోసిన్ నిర్వాణమార్గము పుటలు. ౪3-౪౪

నది మరణించుచున్న మానవుని యంత్యభావమనియు, నాభావమే యాతనిజీవితముయొక్క పరివర్తనమున కంతటికి సారభూతమైనదనియుఁ దలఁపఁబడినది. మరణకాలమున నిట్టి భావశక్తియే నూతనజన్మకాంక్షయై నిలుచునని చెప్పఁబడెను. జీవితవ్యాపార సంబంధమైన కర్మశక్తియేకాక, బ్రతుకవలెనను కాంక్షలేక ఉపాదానకారణము కూడఁ బునర్జన్మకారణమని తెలియుచున్నది. జీవితమనగా భిన్నదశల సంపుటియగుటచే, నీ భిన్నములైపోయిన వివిధావస్థలును దిరిగి కలియకున్నచో జీవితములేదు. అట్టి సంయోగశక్తియే ఉపాదానము. ఇది లేనిదే కర్మ చేయజాలదు. కర్మ,సామగ్రి కొఱకెదురు చూచుచుండు నియమసూత్రమే.

"ఏదోనొక జీవితమునందొకవ్యక్తి మరణశయ్యపై నున్నప్పుడు, మరణము సహజమైవచ్చినను, దౌర్జన్యముచే హఠాత్సంభవమైనను, మరణవేదనల యాఘాతములచే దేహమందలి అల్పాధికావయవములలోని శక్తులన్నియు చెదరి, పచ్చి తాటియాకు సూర్యరశ్మివశమై యెట్లుక్రమముగా నెండిపోవునో అట్లే, క్రమముగా శుష్కించి వాడిపోవును. చూపు ఊహాశక్తి, మున్నగు నింద్రియములు పనిచేయుటాగిపోవును. ఆలోచనాశక్తి చెడిపోయి, దేహపటుత్వము మున్నగునవి, కేంద్రపీఠమైన హృదయమునఁ గొంతసేపు నిలఁబడుటకు యత్నించును. కర్మబలముచే హృదయము కొంతసేపు కొట్టుకొనుచుండును. పూర్వమా వ్యక్తిచేసిన ఘనతరకార్యములును దృఢముగానేర్పఁబడిన యభ్యాసములును, స్మృతిపథముననిలఁబడి, కర్మచేఁగల్పిత

మైన యొకరూపమును ధరించి, విజ్ఞానమై, ముందుజన్మమున కవిచ్ఛిన్నమై పోవుచుండును."

"విజ్ఞానమింకను నిలిచియుండఁగనే, జీవనతృష్ణ అజ్ఞానముకూడ నిలిచియుండిన కారణముచే, బునర్జన్మదోషమున జ్ఞానము తెలియకుండఁ జేయుచుండును; విజ్ఞానమును బునర్జన్మ కాంక్ష, కోరినజన్మమువైపుకు గెంటును; విజ్ఞానమునకు బాసటయైయున్న కర్మయునట్లే చేయును. ఒకపిల్లకాలువను దాటు నప్పుడు మనుజుఁడు మొదట పట్టిపై నిలఁబడి, పైనివ్రేలాడు చున్న చెట్టుకొమ్మకు గట్టినత్రాడును గట్టిగాఁ బట్టుకొని, అడుగడుగునకు నూతము చూచుకొనుచు ముందు కరుగుచుండు నట్లే, కర్మచేతను, తృష్ణచేతను ముందుకుఁ ద్రోయబడిన విజ్ఞానమింకొకవిశ్రాంతి స్థానమున నిలువవచ్చును. లేక ఇంకనొక జన్మ మారంభమగును. ఇచట నశించిన పూర్వవిజ్ఞానమునే మరణమనియు, నూతనవిజ్ఞానము నూతన దేహమునందుఁ జేరుటే పునర్జన్మమనియు వ్యవహరించుచున్నాము. కాని యీప్రస్తుత విజ్ఞానము పూర్వజన్మ విజ్ఞానమునుండి జనించినదికాదు; పూర్వజన్మమునకుఁ గారణములైన ధర్మములును, నూతనజన్మాపేక్షారూపమైన తృష్ణయుఁగలిసి నూతన విజ్ఞానమైనది."౧

ఒకవంక మనుష్యులకుఁ, బశువులకుఁ, బిశాచములకు భేదము చెప్పఁబడినది; వేఱొకవంక నరకనివాసులైన దేవతలకు

౧. బుద్ధఘోషుఁడు, విశుద్ధిమార్గము ౧౭౮, చూడు. డబ్లియు బి.టి. పుటలు ౨౩౮-౨౩౯.

రాక్షసులకును భేదము తెల్పఁబడినది. ౧. దేవతలు, రాక్ష సులు నగోచరరూపులై. జన్మకాంక్షచే నేదేహమునైన సంక ల్పమాత్రమునఁ బొందఁగలరు. పశు, మనుజ, పిశాచముల కట్టి సామర్థ్యములేదు; వానికిఁ బునర్జన్మములకు వలయు సా మగ్రి సిద్ధమైయున్ననేగాని పునర్జన్మములు లభింపవు; మరణ సమయమున నిట్టి సామగ్రి సిద్ధముగలేక యాలస్యమైనచోఁ గొంతకాలము గంధర్వరూపమున వీరుందురు. ఈగంధర్వులు, అశరీర రూపములలోనుండి, తమభావబలముచే నచిరకాలము లో నూత్నజన్మముల కవసరములగు పరిస్థితులను గల్పించు కొందురు.

అవిచ్ఛిన్నదశా లక్షణమునకుఁ గారణమైన కారణధ ర్మమే పునర్జన్మమునకును సరిపడును. పునర్జన్మమెత్తిన మాన వుఁడు చచ్చిపోయినవాని కర్మఫలభోక్త; కాని యాతఁడు నూ తన పురుషుఁడే. ఇరువురు సమానులుకాకున్నను, నిరువురకు ననుబంధము పూర్తిగా విచ్ఛిన్నముకాలేదు. క్రొత్తవ్యక్తి తన కర్మలరూపమే. బృహదారణ్యకోపనిషత్తునందు, యాజ్ఞవ ల్క్యున కార్తభాగునితో జరిగిన సంభాషణమున నీసిద్ధాంతము సూచింపఁబడినది.

కర్మయే స్థిరమైన గుణమని బౌద్ధతత్త్వ ముఖ్యభావమై యున్నను, విజ్ఞానము నట్టిదేయని కొన్ని సమయములందు సూచింపఁబడెను. "మనము చూచునదంతయు మనవిజ్ఞాన ఫలి

---

౧. చూడు ఆంగు, రైస్‌డేవిడ్సు. కంపెండియమ్ ఆఫ్ ఫిలాసఫీ పు.౧౩౭—౩౯.

తమే." విజ్ఞానమే మన ఆత్మయొక్క నిర్మాణవస్తు సామగ్రి యనియుఁ జెప్పఁబడెను. ౨. విజ్ఞానమునకుఁ గర్మకుఁగల సన్నిహితసంబంధమును జూపుచున్నది. ఉత్తమమైన నిర్వాణావస్థలో, మనకుఁ గర్మవిజ్ఞానములు రెండును బంధములుగావు; వ్యక్తిత్వమరణముతో సర్వదుఃఖ నాశనమగును. కర్మయే జన్మపరంపరలన్నిటిని నడపుచుండును; కర్మనాశనముతో జీవనాశనమును బూరి యగును.

## ౧౬—నిర్వాణము.

"ఇపుడిది దుఃఖనిర్మూలన సంబంధమైన పరమసత్యము. నిజముగా నిఃశేషముగా కామము నశించును; జీవనతృష్ణయుఁ బూర్ణముగా విచ్ఛిన్నమైపోవును." నిర్వాణస్వరూపమును స్పష్టముగా బుద్ధుఁడు నిర్ణయించి యుండలేదు. నిర్వాణమార్గమునకుఁ బ్రజలనాకర్షించుటే బుద్ధుఁడు కర్తవ్యముగాఁ బెట్టుకొనెనుగాని, నిర్వాణమునందుండు సుఖసంపద్వైభవముల నాతఁడు వర్ణించుటకుఁ బూనుకొనలేదు. అతనిపూర్ణదృష్టి నాకర్షించినది జీవితదుఃఖము. నిర్వాణశబ్దమునకు, నిశ్వసించుటని కాని, చల్లార్చుటయని కాని యర్థము. నిశ్శ్వసించుటలో నశింపఁజేయుట యను నర్థమున్నది. చల్లార్చుటలో నాశనములేదుగాని, కామోష్ణతయొక్క ఉగ్రత్వము శాంతించుటయని స్ఫురించుచున్నది.

౨. హ్యూమ్‌తత్త్వమునందును, వ్యక్తిసమానత్వము, భిన్నభావ పరంపరలకుగల సంబంధముచేఁ గలిగినదని చెప్పుటాశ్చర్య జనకమైనది.

"ముక్తిపొందిన మనస్సు, ఆరిపోయిన దీపమువలె నున్నది."౧. మాటలలోఁ జెప్పుటకు సాధ్యముకాని నిర్వాణావస్థయొక్క సదసద్రూపముల నీభావములు వ్యక్తపఱచుచున్నవి. బౌద్ధతత్త్వమునననుసరించి, నిర్వాణమనగా దైవసామీప్యముచే లభించు నానందమొసగు నవస్థకాదు; అట్టిదైనచో జీవనకాంక్షపూర్తిగా నశింపక మిగిలియుండును. నిర్వాణప్రాప్తివలన నశించునది నింద్యమగు తృష్ణకాని జీవితమే నశింపదనిచెప్పిన బుద్ధునివాక్యములనేకములుగలవు. కామద్వేషాజ్ఞానాగ్నిజ్వాల లుపశాంతించుటే నిర్వాణము. ఈయర్థమునందే బుద్ధుఁడు తన ముప్పదియైదవయేట నిర్వాణమునుబొంది యందు బోధిని గాంచెననియు, మిగిలిన నలుబదియైదు సంవత్సరములు దానుదెలిసికొనిన బోధిసందేశమును లోకము నందంతటను బ్రచురించి, మహోపకారమొనర్చెననియు మనము గ్రహింపవలసియున్నది. ఒకప్పుడు నిర్వాణము రెండువిధములని చెప్పఁబడినది. (౧) ఉపాధిశేష నిర్వాణమనగాఁ గామములు శాంతించుట (౨) అనుపాధిశేషనిర్వాణమనగా జీవనాశనము. ఛైల్డర్సు నభిప్రాయముఁ బ్రకారము మొదటినిర్వాణమందుఁ బూర్ణజ్ఞానియైన వానికిఁ బంచస్కంధములు మిగులునుగాని, జీవతృష్ణగాని, వస్తుకాంక్షకాని యుండ

౧. దీఘనికాయము. ౨ అ.౧౬; చూడుము మజ్ఝిమనికాయము ౭౨. ఇందు మండుటకేమియు లేని కారణమున నారిపోయినమంటతో నిర్వాణజీవస్థితిని బుద్ధు వర్ణించినాఁడు. శ్వేతాశ్వతరోపనిషత్తు (౬ అ—౧౯) ఇంధనములేని అగ్నివలె పరమాత్మయున్నదని వర్ణించెను. చూడుము. నృసింహోత్తరతాపనీయోపనిషత్తు. ౨

దనియు, రెండవరకపు నిర్వాణమునందు వ్యక్తిమరణముతో జీవనాశము పూర్తియగుననియుఁ జెప్పఁబడినది. అనగా మరణకాలమువఱకు దేహముండు టొకటి, మరణముతో సర్వనాశమగుటొకటి యని రెంటికి భేదము నిరూపింపఁబడెను. అర్హతుఁడు పరినిర్వాణమునుబొంది, లోకమునుండి యదృశ్యుఁడగునని భావము.

ఉపాధిశేషానుపాధిశేషనిర్వాణములకు భేదము, నిర్వాణమునకుఁ బరినిర్వాణములకుఁ గలభేదమే; మరణము, పూర్ణమరణముల కుండుభేదమే. ౧. ఈవిషయమున నిశ్చితార్థము లేదు. ౨. పరినిర్వాణమైనఁ బూర్ణజీవనాశము కాఁజాలదు. జీవపరిపూర్ణావస్థా ప్రాప్తి దీనియర్థము. "బుద్ధయోగీశ్వరుఁడు పూర్ణమోక్షమనగా నిర్దోషవిజ్ఞానపరంపరా ప్రవాహమని భావించినాఁడు." 3. విఘాతవైరుద్ధ్యములులేని చిత్తశాంతియే నిర్వాణము. దుర్గుణబీజాంకుర నాశనము వలన నాత్మోన్నతి లభించును. ఈమహాజ్ఞానసాధనా ఫలితమైన నిర్వాణమఖండప్రమోదభరితమై యుండవలెను. అది పరిపూర్ణతాసిద్ధికాని, పూర్ణనాశనస్థితి కాఁజాలదు. అహంకార సంబంధమైన గుణనాశముతో మనము విశ్వజీవముతోఁ దాదాత్మ్యమంది జగజ్జీవితోద్దేశ భాగస్వాముల మగుదుము. అప్పుడు పరిపూర్ణత్వమనగా మూడుకాలములయందు నిత్యమైయున్నదానితో నేకత్వమునందుట. జీవపరిమాణము విశ్వజీవముగాఁ బెంపొందును.

౧. మిళిందము ౨అ. ౨.౪. (౨) ఓల్డెన్‌బెర్గు నిర్వాణవర్ణ్య 3అ.
(3) యస్.యస్.యస్.యస్. ౨అ. ౪.౨౧.

అది అహంకారరహితమైన యొకస్థితి. కాలాతీతమైన అస్తిత్వము, పూర్ణధైర్యశాంతి సుఖానంద నిత్యప్రసన్నతా పావనత్వముల దివ్యస్వరూపము." ౪. పరి నిర్వాణానంతరము బుద్ధుఁడు లేకుండఁబోయెనని చెప్పువాక్యములు మిళిందమునఁ గలవు." బుద్ధుఁడు పునర్జన్మమున కవకాశమిచ్చు మూలములు కూడ లేనిరీతి నస్తంగతుఁడయ్యెను. బుద్ధుఁడంతమును పొందినాఁడు; ఆతఁడిక నిచ్చటనున్నాఁడని కాని, యచ్చట నున్నాఁడని కాని చెప్పుటకు వీలులేదు. ఇఁకనాతఁడు తనయుపదేశమను దేహమున జీవించియున్నాఁడు."౫. బుద్ధుఁడిక లేఁడు కనుక మనము బుద్ధునారాధింపఁజాలము; కనుక నాతని చిహ్నములను, సిద్ధాంతములను బూజింతుము. ౬. నాగసేనుఁడు నిర్వాణమనఁ బూర్ణనాశనమని చెప్పుచు, నది చిత్తవృత్తి నిరోధము, భావనిరోధమునని పలికెనుగాని, పూర్వబౌద్ధులకు మాత్రము నిర్వాణమనగా, జీవపూర్ణత్వమనియు, సుఖదుఃఖాతీతమైన దివ్యానందస్థితియనియుఁ జెప్పవలసియున్నది. "ఓవచ్చా! తథాగతుఁడు దేహబంధమునుండి విముక్తుఁడై నపుడు, సాగరగంభీరతను, వైశాల్యమును, బొంది, కనుఁగొన నశక్తుఁడయ్యెను." ఖేమయను సన్న్యాసిని కోసలదేశస్థుఁడగు పసేనదితో, మరణము వలన బుద్ధుఁడు పంచస్కంధనిర్ముక్తుఁడైనాఁడని చెప్పినది. పాపనాశనముతో ముక్తుఁడును నాశమగునను మతదోహభావమును

(౪) మిళిందము ౨అ ౨. ౯ ౩అ. ౪-౯; ౨అ. ౧.౬.

(౫) మిళిందము ౩.అ ౫.౧౦ (౬) మిళిందము. ౪అ. ౨; సంయుత్తనికాయము ౧అ.

బ్రికటించిన, యమకుని సారిపుత్త్రుఁడు దూషించినాఁడు. నిర్వాణమనగాఁ బూర్ణనాశనమని యర్థము చెప్పవలసిన వాక్యమొక్కటియు లేదని, నిర్వాణమునుగూర్చి చెప్పిన వాక్యములను సమగ్రపరిశీలన మొనర్చిన మ్యాక్సుముల్లరు, చైల్డర్సుపండితులు చెప్పినారు. అనిత్యమగు నహంకారము నశించినదనియు నిత్యమైనవ్యక్తిత్వము నిలిచియున్నదనియు దీనిభావము. ఇంద్రధనుస్సులోఁ గొంతసత్యము, కొంతకల్పనము నున్నట్లే జీవమునందుఁ గొంతయాత్మ,కొంతయనాత్మపదార్థము గూడనున్నది. కురియుచున్న వర్షబిందువులు రూపము, కాంతి రేఖ నామము, రెంటిసంపర్కము లేక భావము ఇంద్రధనస్సు. కావున నింద్రచాపమసత్యరూపము, కాని నిత్యసత్యమైన దీయసత్యరూపమున కాధారమై యున్నది. "జ్ఞేయము జ్ఞాతనైన నాకెదురైయున్నంతసేపు లోకమునాపై నాధారపడియున్నది. జ్ఞేయము రూపమేకాని, రూపమున కాధారమైనది జ్ఞేయముకాదు. కావున జ్ఞానము, బాహ్యరూపమైన జ్ఞేయమును మాత్రమే నిర్మూలింపఁగలదు. రూపమైనదంతయు వచ్చుచుఁ బోవుచుఁ బరిణామమందుచు నుండును. కాని రూపము దేనినాశ్రయించియున్నదో, అది నిత్యమైనది; ఆత్మ; ఆత్మ, అనాత్మరూపమైన పరిణామదశలలోని కెన్నఁడు నేవిధముగాను రాఁజాలదు. ఎప్పుడు నేవిధముగాను నిత్యమైనది నాశమందదు.'' ౧, ఆత్మయొక్క శాశ్వతస్థితియే నిర్వాణము; ఏలన నది విడిపోవు లక్షణముగల గుణసముచ్చయమైన సంస్కారాదికముగాదు. అది

౧. ఛాక్కే. బౌద్ధ వ్యాసములు. పుట ౨౪౯.

నిత్యమైనది; దానిరూపములు మారుచుండును. జననమరణము లకు వశమైన స్కంధముల వెనుకనున్న సత్యమిది. నిర్వాణ సత్యముపై నాధారపడి పరిణామమును భ్రాంతి జనించి నది. అది సర్వమూలసారము, వచోతీతము నగుటచే బుద్ధుడు దానిస్వరూపమును నిర్ణయింపఁ బూనుకొనలేదు. గాఢ నిద్రావస్థతోఁ బోల్పఁదగిన నిర్వాణమునందు, ఆత్మ తన వ్యక్తిత్వమును గోల్పోయి, సత్యస్వరూపమునఁ గలసి పోవుచున్నదని చెప్పఁబడెను. అనంతర మహాయాన గ్రంథములలో, నున్నది భావాంగమనగా జీవ ప్రవాహమని చెప్పఁబడెను. అజ్ఞానమను మారుతము దానిపైవీచి, ప్రవాహ సౌమ్యతను గదలించి, జీవసాగరమునఁ దరంగచలనముల నుద యింపఁజేయును. నిద్రాణమైయున్న యాత్మచలించి, తన ప్రసన్న విశృంఖలగమనమున కాటంకమును బొందెను. అది మేల్కాంచి, ఆలోచించి, యొకప్రత్యేకభావమును నిర్మించు కొని, జీవసాగరమునుండి, తానువేఱగును. గాఢనిద్రలో నీబం ధములు సడలును. తిరిగిప్రసన్నప్రవాహమునఁబడి తనపూర్వ గమనమును సంపాదించుటే నిర్వాణము. జీవప్రవాహమున నిద్రలో నాలోచనాతరంగములు ప్రవాహప్రసన్నతను జెడ కొట్టనట్లే,నిర్వాణమునందును మనకు శాంతి లభించును.నిర్వాణ మనగా నాశనమునుగాదు,జీవయథాస్థితియునుగాదు; జగత్సత్య స్వరూపమైన సత్పదార్థములోఁ గలియుటయే; దీనిని బుద్ధుడు స్పష్టముగాఁ జెప్పియుండలేదు. అది విజ్ఞానాతీత విషయమగు టచే నేతినేతివాక్యములచేఁ జెప్పుటకే వీలైనది.విషయా విషయ

సంబంధాతీతమైన స్థితియది. ఇందహంకార జ్ఞానము లేశమాత్రమైన నుండదు. నిమిత్తధర్మమున కతీతమయిన అవస్థయగుటచే నది సర్వబంధవిముక్తమైనది.౧. అది నిత్యమైనదియు సత్యమైనదియును, కాని. దేశకాలబద్ధమైన ప్రపంచగతముకాదు. వర్ణనాతీత మాధుర్యములైన గీతములలో దానిననుభవించిన యోగి యోగినీజనులు తన్మహనీయానందమును వర్ణించియున్నారు. ప్రత్యేకజీవి, ముక్తావస్థలోఁ బ్రవేశించి, సర్వసంబంధ బంధములను విచ్ఛేదనమొనర్చి, యపరిమేయపరిశాంతిని గాంచును. ఒకయర్థములో నది జీవనాశము; వేఱొకయర్థములో నది పరిపూర్ణమోక్షము, జాజ్వల్యమాన రవికాంతిలో నక్షత్రకాంతి యదృశ్యమగుట, గ్రీష్మాకాశమండలిధవళమేఘశకలము, వాయులీనమై పోవుటవంటిది. నిర్వాణమనగా నాశనమని తలచుట క్రూరమైన మతద్రోహము'ని౨. బుద్ధునిభావము.

నిర్వాణస్థితిలో నుత్తమ క్రియాపరత్వ ముండుననియు వచింపఁబడినను;సాధారణముగా నీయవస్థ నిష్క్రియావస్థయని తలపఁబడెను. మితిలేనియాందోళనము, విశ్రాంతిశూన్యకర్మబాహుళ్యముతో నిండియుండిన యుగములో, నాయాసక్లేశపరవశులైన మానవులకు, శాంతిసౌఖ్యముల నొసగుస్థితియున్నదని వర్ణించుటెంతయు సమంజసమైయున్నది. ఎడతెగని జన్మపరంపరలలో మగ్నులైై విశ్రాంతియెఱుగని మానవులకుఁ బునర్జన్మరహితమై పరమసుఖదమైన స్థితియగు నిర్వాణమును

౧. శూన్యతానిమిత్త ప్రణిహితమ్. ౨. సంయుత్తనికాయము. 3అ. ౧౦౯.

బొందవచ్చునని చెప్పినసందేశమెంతయు సంతోషజనకమై యా మోదింపఁబడెను.

అది జ్ఞానవిషయముకాదు కావున, నితరమత ప్రవక్తల వలెనే, నిర్వాణస్థితి స్వరూపమును నిర్ణయించుటకు బుద్ధుఁడంగీకరింపలేదు. కాని ఉపనిషత్తులవలెనే బుద్ధుఁడును భావాభావవర్ణనము నిచ్చి యున్నాఁడు. తేవిజ్జసుత్తమునందు నిర్వాణమనగా బ్రహ్మైక్యమనుటకుఁ గూడ నాతఁడామోదించి నాఁడు. బుద్ధుఁ డభావతత్త్వవాది యనుటకే బ్రహ్మైక్యవాదము వ్యతిరేకమగును గాన, రైస్ డేవిడ్సు దానిపై నట్లు వ్యాఖ్యానించినాఁడు; "సర్వజీవకృపాభ్యాసము వలన బ్రహ్మతో నైక్యము సిద్ధించునను నాశను గల్పించుటవలన, బుద్ధుని యభిప్రాయములో బ్రహ్మయనగా బౌద్ధబ్రహ్మయని తలఁప వలెను. అనగాఁ బూర్వజన్మవ్యక్తిత్వముతో సంబంధములేని యొక నూత్నపురుషుఁడు తాత్కాలికముగా బౌద్ధబ్రహ్మతోఁ గలిసి, సుఖానుభూతి నందునని యభిప్రాయమై యుండవలెను. తేవిజ్జసుత్తమునందలి వాక్యార్థము, "సర్వజీవదయాభావము ననుసరించి జీవించుటవలన, నీవుకోరిన నీబ్రహ్మైక్యమును లభించున"ని తలఁపవలసియున్నది. కాని తనమత విరుద్ధమైన భావమును, తన సత్యసందేశమునకుఁ దుదిభాగమున బుద్ధుఁడుపదేశించెననుట యుక్తము గాఁజాలదు."౧. కాని బుద్ధునిదృష్టిలో నిందు మతద్రోహము లేదని రైస్ డేవిడ్సు గ్రహింపకుండుట శోచనీయము. నిర్వాణమొక అభావస్థితి కాకున్నచో,

౧. తేవిజ్జసుత్తమున కుపోద్ఘాతము. యస్.బి.ఇ. వాల్యూము ౯ పుట౧౬౧.

నొక నిత్యవస్తువును మన మంగీకరింపకతప్పదు. తర్క మనుల్లంఘనీయము. బుద్ధుఁడొక నిత్యతత్త్వము నంగీకరింపక తప్పనిసరియయ్యెను. "ఓశిష్యులారా! పుట్టుక లేనిది, చేయఁబడనిది కల్పితము కాని దేదో యొకటున్నది. జన్మ రహితమైన యట్టివస్తువే లేకున్నచో జన్మమెత్తిన జీవికిఁ దరణోపాయమే లేకుండెడిది. ౨ జీవము స్కంధనిర్మిత మనునది పూర్ణ సత్యముగాదు. ఆత్మయనునది కేవల మనశ్శరీర గుణ క్రియాసముచ్చయమే యైనచో నది, విడి విచ్ఛిన్నమై పోయినచో మిగులునదింకేదియునుండదు. మనకోరికలనుజంపి, కర్మను భస్మమొనర్చి, మనమును నశించిపోవుదుము. మోక్షమనగా నాశనమగును. కాని నిర్వాణమనగాఁ గాలాతీతస్థితి; అందుచే బుద్ధుఁడు కాలాతీతస్థితిగల సత్పదార్థము నంగీకరింపవలెను, ఈ జీవపరిణామ ప్రపంచమున కంతర్గతమై, వ్యవహారప్రమాణముల కతీతమై, కార్యము లేని కారణము, స్వయంభువము నైన యొకశక్తి యున్నది. "నిర్వాణమిపుడు వచ్చినదని కాని, రాలేదని కాని, రాఁగలదని కాని, కాలగతమైనదని చెప్పఁజాలము."౧. కాలదశలన్నిటిలో నేక కాలమున నున్నదే నిర్వాణము. కాలము కాలాతీత నిత్యత్వమునఁ గలిసిపోవును. చలించుచున్న జగ మచలమైన సత్యస్వరూపమును మఱుఁగుపఱచుచున్నది. బుద్ధుని నిర్వాణ మర్థవంతమగుట కిట్టిభావ మవసరము. ఇట్టి యింద్రియాతీత విషయముల నిర్వచనము నిత్యజీవితానుష్ఠానాభ్యుదయముల కనసరము లేదు కాబట్టి, బుద్ధుఁ డావనికిఁ బూనుకొన లేదు.

౨. ఉదానని కాయము. ౧ అ. ౩; ఇతివృత్తకము. ౪౩.—౧. మిళిందము.

మాలుంక్యపుత్త్రుఁ డడిగిన ప్రశ్నములకు బదులుచెప్పుచు, శాంతి పావనత్వము, వివేకము జీవితమునందెట్లు లభించునను ప్రశ్నములకే సమాధానము నిత్తుననియు, మిగిలిన పరతత్త్వవిషయము లడుగవలదనియు బుద్ధుఁడు వారించెను. కాని యిట్టితత్త్వపరిధానసమస్య నణఁచివేయుటవలనను, దిరస్కరించుటవలనను బోదు. ఈప్రశ్న మానవత్వమునకు సహజమైనలక్షణము. బుద్ధుఁడు దీనికి నిశ్చయమైనసమాధాన మీయనందున, భిన్నశాఖలవారు, భిన్నసిద్ధాంతములను గల్పించుకొనిరి. కొందరు నిర్వాణము శూన్యత యనిరి. బిషప్బిగండిట్లు చెప్పినాఁడు : "ఒకఅర్థరహితమైన అవివేకమువలన, నైతికానుష్ఠాన జీవితమునకు ఫలము పూర్ణనాశనమని చెప్పినారు." రైసుడేవిడ్సుసతి, బౌద్ధనిర్వాణమనగా నాశనమని చెప్పినది. ఓల్డెన్బెర్గుభావమునిట్టిదే. ౨. డాల్కే యిట్లే తలచుగాఁబల్కెను. ఒకచోట నాతఁడిట్లు చెప్పెను: "దుఃఖవిముక్తి యనఁగా, శూన్యభావముగా నొక్కబౌద్ధమతమే చెప్పెను; అన్యులు దానికే ఆనందభావము నాచ్ఛాదించిరి." 3. వీరిననుసరించి నిర్వాణమనఁగా శూన్యరూపమైన నిశ; కాంతిలేని అంధకారము. బుద్ధునిభావమిట్లు పాక్షికముగా నన్వయించుట కిది మొదటిసారి కాదు. ముక్తావస్థ, భావాతీతమని ప్రకటించినవెనుక బుద్ధుఁడే, "ఇట్లుపదేశించుటవలన, నన్యాయ్యముగా, నిరాధారముగాఁ గొందరిట్లు దూషించిరి; "శ్రమణుఁడైన గౌతముఁడొక నాస్తికుఁడు. నిజమైన ఆత్మస్వరూపమే మరణించును, నశించునని బోధించి

(౨) చూడు బుద్ధుడు. పుట. ౨౭3. (3) బౌద్ధవ్యాసములు పుట౪౯.

నాఁడనిరి. నన్ను నేను కానివానిగను, నాది కానిసిద్ధాంతము నాదనియు వీరినిరసనము.౧." కొందరు, బౌద్ధనిర్వాణ మత్యంత సుఖప్రదమైనదనియు, నందుచే బుద్ధుఁడు సుఖతత్త్వము నుపదేశించెననియుఁ జెప్పుట విచిత్రమైనది. బుద్ధునివాక్యముల ననుసరించి, రెండు భిన్నసిద్ధాంతములఁ గల్పించుకొనిరి. నిర్వాణ మనగాఁ బూర్ణస్థితియనియు నది యనిర్వచనీయమైన కారణము చేదానినిగూర్చి వ్యతిరేకభావములచే వర్ణింపవచ్చుననియు, నందలి మహత్తరసిద్ధి, అనుకూలభావములచే సూచింపనగు నని యుఁగాని యీవర్ణనములన్నియు ననిర్వచనీయస్థితిని నిర్వచించు యత్నము లేయనియు బుద్ధుఁడు విశ్వసించెనని చెప్పవచ్చును.

౧౭.—దైవతత్త్వము.

బుద్ధుని యుగములో వ్యవహారమునందున్న మతము నందలి ముఖ్యభావము, మనుజులకు దేవతలకు మధ్యమందేర్పాటైయున్న వర్తకతుల్యసంబంధము. ఉపనిషత్తులు ప్రదర్శించిన బ్రహ్మభావము మహోన్నతమైనదైనను, బహుదేవతారాధనము. గ్రహమండలములను, పంచభూతములను, వృక్షములను, జంతువులను, పర్వతములను నదులను బూజించుపద్ధతి యంగీకరింపఁబడెను. నిరంకుశభావ స్వైరవిహారము, లోకములోని నానారూపములకు దైవత్వమంటఁగట్టి, అదిచాలక, విచిత్ర వికృతాకారములుగల నూత్నరూపములను గల్పించెను. విజ్ఞానప్రపంచమున నీదేవతల పదవి నుపనిషత్తులు దిగఁద్రొక్కినను, నిత్యజీవితాభ్యాస రంగమున నీదేవతల ప్రభావము మామూలు

౧. మజ్ఝిమనికాయము. ౨౨.

గానే సాగిపోవుచున్నది. సృష్టికర్తలు, నిర్వాహకులు, మనుష్యుల శుభాశుభములకుఁ గారకులు దేవతలేయని ప్రచారములు సాగించువారు లేకపోలేదు. దేవతలవలని భయము, మఱిజన్మములో రాఁబోవు శిక్షవలని వెఱపు, స్తోత్రపాఠములచేనా దేవతల సదభిప్రాయము నార్జింపవచ్చునసెడి భావముతోఁ గూడిన మానవత్వమును బానిసతనముగామార్చిన దుఃస్థితి, యివన్నియుఁ దొలఁగవలెనన్నచో, దేవతాభావ నిర్మూలన మొక్కటే మార్గమని బుద్ధుఁడు నిశ్చయించెను. సృష్టికిఁ బ్రథమ కారణమేమి యనుచర్చ, నైతికాభ్యుదయమున కుపకరింపదు. అట్టిచర్చ, నిష్క్రియతకును, బాధ్యతా రాహిత్యమునకును మార్గమును జూపును. దేవుఁడున్నచో నాతఁడు లోకమున జరుగు మంచికిఁ జెడ్డకు నన్నిటికిఁ గర్త కావలెను; అప్పుడు మానవునకుఁ గర్తృత్వము లేదు. దేవుఁడు లోకములోని దౌర్జన్యమును నిరసించి, దోషమునకుఁ దాను గర్తను గానన్నచో, నాతఁడు సర్వప్రతినిధి కాఁజాలఁడు. దేవుఁడు మనదోషములను మన్నింపఁగోరుదుము.౧. దైవప్రసాదము సర్వసమర్థమైనచో నొకక్షణములో నొకని యోగిగానో, నేరస్థునిగానో చేయఁగల దైనచో ధర్మజీవనము, పరిశుద్ధశీల నిర్మాణములయెడ మన మౌదాసీన్యము వహింతుము. సత్ప్రవర్తనాభ్యాసము వ్యర్థశ్రమయగును. ధర్మాధర్మఫలితములు స్వర్గనరకములగుట కేవల తాటస్థ్యములగును. దోషప్రవర్తనము నరకమునిచ్చుచో నరకమెచటనో యెప్పుడో తటస్థించునది; ఇహలోక సుఖ మర

౧. "దేవుఁడు నన్ను క్షమించు నః; ఏలన నది యాతనిపని." (హీనీ.)

చేత నున్నదని ప్రజ లూహింతురు. ఈభావములను నిరాకరించి, ధర్మము, సుఖము; అధర్మము దుఃఖము నవినాభావసంబంధములు గలవని బుద్ధుఁడు వక్కాణింపవలసియున్నది.౨. భిన్న భావవిహార కల్పనములతోఁగూడిన తత్త్వజిజ్ఞాసయు, దేవతలపైఁ దమభారమును బడవేసి, స్వయంకృషిపై నాధారపడు ధైర్యసంపదను విడనాడు మూఢాచరణపద్ధతియుఁ జూచి, బుద్ధుఁడు తనయుపదేశము నీలోకవిషయములనుగూర్చియే చేసిన చాలు నని తలఁచెను. విచక్షణాన్వితమైన దృష్టి కశనిపాతమునందు దేవుఁడు గోచరింపఁడు. ప్రకృతిరూపములను సహజవిధానముచే నర్థముచేసికొనినచో, మతమాహాత్మ్యములు సత్యములను భ్రాంతి నశించును. ఒకసగుణదైవముండెననుట విచక్షణ భావమునకు విరుద్ధము. అనుగ్రహము, వరప్రసాదము, నిర్హేతుక కటాక్షము మున్నగు భావములను కర్మసిద్ధాంతమంగీకరింపఁజాలదు. ఈకర్మసిద్ధాంతము నెదుట, దేవుని అమోఘ శాసనాధిపత్యము నిలువఁజాలదు. కర్మనియతి నిర్ణయింపకుండ, నొకశిరోజము శిరమునుండిజారదు; ఒకశిలయుఁ బైనుండి పడదు. ప్రకృతిలో జరుగు విషయములను మార్పుచేయలేని దేవుఁడు దేవుఁడెట్లగును ? మఱియు దేవుఁడు దయాసింధువనుటయు, లోకమున హృదయవిదారకములైన సందర్భములున్నవనుటయుఁ బొసఁగదు. లోకమునందున్న దుఃఖమునకుఁగర్మయే కారణము కాఁగలదు. సర్వజీవరాసులలో ననఁగా దేవతలు, రాక్షసులు, నరకవాసులు, పశువులు, మనుజులు మున్నగు

౨. అంగుత్తరనికాయము ౬. ౧.

వానితో నిండియుండిన ప్రపంచమునకుఁ గర్మసిద్ధాంతమే సరియగు నర్థమును జెప్పఁగలదు. కర్మ కతీతమైనదిలేదు. ఇంద్ర వరుణాది దేవతలున్నారని బుద్ధుఁడంగీకరించినను, గర్మసిద్ధాంతమునకు వీ రవసరములేదు. వీరైనను, జన్మపరంపరాత్మకమైన కర్మసూత్రబద్ధులైన కారణముచే, నైతికధర్మశాసనము నేవిధముగా మార్చుటకు నశక్తులు.౧. మనజీవకారణుఁడైన దేవుఁడొకఁడులేఁడు. స్వకర్మవశుఁడై మానవుఁడు జన్మించును. ఎవరి కుమారుఁడై పుట్టవలెనో కర్మయే నిర్ణయించును. "నా కర్మయే నా ధనము...... నా ఔరసత్వము...... నన్ను ముందుకుఁ గొనిపోవుశక్తి...... నేను జెందుజాతి రూపము. నాకు గతి." సృష్టికర్తయైన యీశ్వరుఁడొకఁడున్నాఁడను పూర్వాచారపరుల విశ్వాసమును, వస్తువులలో సహజమైయున్న శక్తిచేతనే ప్రపంచ మునయించి, నడచుచున్న దను స్వభావవాదమునుగూడ బౌద్ధులు నిరసింతురు. ప్రపంచ నానాత్వమునకుఁ గారణము కర్మలే.౨. నిర్ణయాధికారముగలవే కర్మఫలములు. కర్మలే తమఫలముల కవసరమగురీతిని లోకమును నిర్మించుచుండును. ఒకవ్యక్తి, సూర్యుఁడై జన్మింపవలసియున్నచో, వాఁడట్లుపుట్టుటయేకాక, వానికివలయునిలయము, దివ్యభవనము, వేగముగలరథము మున్నగునవి యాతనికర్మ ఫలనిర్ణయాధికారముచే సమకూరును.3. ఇదేవిధముగా సృష్ట్యా

౧. చూడు. బుద్ధసంభాషణములు. ౧౨ పుటలు ౨౮౦, 3౦౨.

౨. కర్మజమ్ లోకవైచిత్ర్యమ్. అభిధర్మకోశము. ౪అ ౧.

3. అధిపతిఫలము.

రంభమునందుఁగూడఁ, బూర్వసృష్టిలోని వ్యక్తుల కర్మముల ననుసరించి, పునస్సృష్టిలోని జను లెట్టిఫలితముల నందవలెనో తదనుగుణమైనలోకము సృష్టినొందెను. సర్వజీవుల కర్మఫలిత రూపమైనదే యీప్రస్తుతలోకము.

దేవుని అస్తిత్వమునుగూర్చిన సంప్రదాయవాదములను పూర్వబౌద్ధులు ఖండించిరి. ఒకగడియారము, గడియారము చేయువాఁ డున్నాఁడని యెట్లుసూచించునో, యట్లే జగము దేవుఁడున్నాఁడని సూచించునని చెప్పుతర్కమును బౌద్ధులంగీకరింపరు. మనకు జీవరూపమైన యొకకారణ మవసరము లేదు. బీజము వృక్షముగామారునట్లే, ఒక దేవునిలోనిమిత్తము లేకుండ సృష్టిజరుగవచ్చును. వస్తువులు, నాలోచనములు, సుఖదుఃఖాత్మకములైన వేదనములెట్టివో, యట్లేకర్మలమూలమున జనించినవే. గుడ్డునుండి, కోడి, కోడినుండి గుడ్డును పరంపరగా నేయితరసాహాయ్యము లేకుండ నెట్లుదయించుచుండెనో, అట్లే, కర్మబద్ధమైన జీవసంసారమొక తిరుగుచున్న చక్రమువంటిది. ఆచక్రసంచలనశక్తి చక్రిమ లోనేయున్నది. నేత్రశ్రోత్రములు, శరీరజీవములు, ప్రపంచముతో సాంగత్యముచే వేదన, కాంక్షా ప్రవృత్తుల నుదయింపఁజేయుచున్నవి; వీనిఫలితములుగాఁ దిరిగి నేత్రశ్రోత్రాదిసృష్టి యగుచున్నది. ఇదియే శాశ్వతమైన ధర్మచక్రపరివర్తనము. దానిగమనమును మనము మార్పు చేయఁజాలము. బుద్ధుఁడు విశేషముగా దేశికుఁడుగాని, రక్షకుఁడుగాఁడు; అతఁడు సత్యమును దర్శించుటకు మనకు మార్గమునుజూపినాఁడు. సంసారమునకుఁ బ్రథమకారణుఁడైన యొక

సృష్టికర్త నాతఁడూహింపఁడు. సంసారప్రవాహమునకుఁ గారణము సంసారములోనే యున్నది. సృష్టికర్తకారణము, సృష్టి యాతనికార్యము ననువాదము నిస్సారమైనది. వస్తువు లెట్లు జనించుచున్నవో తెలియుటకు, వస్తువులను దాటి వేఱొకచోటికిఁ బోనవసరము లేదు. కార్యమునకుఁ గారణము పూర్వమైనదని చెప్పువాదము నిలువకపోయినను మానవునికింతకంటె నూహించునవకాశము లేదు. నిష్కారణమైన ప్రథమకారణము స్వవిరుద్ధభావము. కారణకార్యపరంపర లనాద్యనంతములై జరుగుచున్నవనుకొన్నచో మొదటికారణసమస్యయే పోవును. అదేవిధముగాఁ, గర్తలేనిసృష్టి యెట్లుండుననువాదమును వ్యర్థవాదమే. లోకములోనిదోషముల కాకర్తయే కారకుఁడు గావలసియుండును. అట్టికర్త జీవులను బాధించుటకు సృష్టిని, కుయుక్తిచాకచక్యముతోఁ గల్పించియుండవలెను. సృష్టియందలి దుఃఖపరంపరకంటె సత్యమైన దేదియు లేదు. పరిపూర్ణుఁడైన యీశ్వరుఁడిట్టి అపరిపూర్ణజగత్తును సృజించియుండఁడు. అందుచే నొకదయాసముద్రుఁడైన దేవుఁడుకాని, యాతని లీలకాని జగత్కారణముకాదు. నిష్కారుణగాఁ బనిచేయు నొకసూత్రనియతియే సర్వసృష్టిజాలమును నడపుచున్నది. స్పినోజావలెనే బుద్ధుఁడును ప్రపంచము మంచిదికాదు చెడ్డదికాదు, కృపాహీనమైనదియుఁగాదు, అవివేకమునుగాదు, పూర్ణమైనదిగాదు, సౌందర్యనిలయమును గాదని నిర్ణయించును. మనుజుని మానవత్వసహజధోరణిచే లోకమంతయు నొకమానవత్వలక్షణముగలశక్తివలన నడచుచున్నదని తలపింపఁజేయుచున్నది. ప్రకృతి,

విజాతీయసూత్రముల ననుసరింపదు. ప్రకృతిలో నవసరనియాతియే యున్నది.౧

## ౧౮—కర్మసిద్ధాంతము-అందలిభావములు

యంత్రమువలెఁ దిరుగుచున్న సంసారచక్రమునుండి బయల్పడుటకై మానవుఁడు తీవ్రముగా వాంఛించును. సంసారస్వభావమునననుసరించి, యిట్టి నిరాశాతత్త్వ ముదయించక తప్పదు. మానవుని ఆత్మాభ్యున్నతికి సాయపడురీతి నీసంసారకల్పనము దేవునిసంకల్పమని ఉపనిషత్తు లుగ్గడించినవిధమున,

౧. ఈవిషయమై బుద్ధుఁ డనాథపిండికునితో సంభాషణమున నీదిగువరీతిగాఁ జర్చించెను: "ప్రపంచ మీశ్వరునిచే సృజింపఁబడినచో లోకమునఁ బరివర్తనముగాని, నాశనముగాని యుండరాదు. అన్నియు నాతనినుండియే జనించునుగాన, దుఃఖములు ప్రమాదములు, నుండరాదు; సదసద్వస్తువుల నాతఁడే చేసెనుగాన మంచిచెడుగులను భేదము నుండఁగూడదు. విజ్ఞానజీవులలో సుఖదుఃఖములు, రాగద్వేషములును జనించుచున్నవి కావున, వీనికర్త యీశ్వరుఁడైనచో, నీశ్వరునికిని సుఖదుఃఖములు, రాగద్వేషములు నుండవలెను. ఇవి యీశ్వరునిలోనున్నచో నాతఁడు పరిపూర్ణుఁడెట్లగును? ఈశ్వరుఁడే సర్వకర్తయై, సర్వజీవులాతనికి దాసత్వము చూపవలయుచో ధర్మానుష్ఠానమువలన పరమేమున్నది? సత్కర్మయు దుష్కర్మయు నొకటే యగును; ఏలన నన్నియుఁ నాతడే చేయించును; దేవుఁడు నట్టికర్మలను జేయువాఁడే యగును, కష్టదుఃఖముల కింకొక కారణమున్నచో, దేవుఁడు కారణముకాని దింకొకటి యున్నదన్నమాట. అయినచో, నంతయు నింకొక కారణమువలననే జనించెనని యేలచెప్పరాదు? ఈశ్వరుఁడే కర్తయైనచో, నాతఁడొక యుద్దేశముంచియో, లేకుండనో పనిచేయును. ఆతనికొక యుద్దేశమున్నచో నతఁడు పరిపూర్ణుఁడుగాఁడు; ఏలన నుద్దేశ మొకలేనిదానినిఁగోరి, దానివలనఁ దృప్తిఁబొందఁజూచును. ఆతఁ డుద్దేశములేనివాఁడైనచో నాతఁ డున్మాదియైనను లేక స్తన్యముచేజీవించు శిశువైనను గావలయును. ఈశ్వరుఁడే కర్తయైనచో, భక్తి

బౌద్ధమతము చెప్పుటకు వీలులేదు; ఏలనఁ దాత్త్వికముగా నొకనిత్యమైన పరతత్త్వమును బౌద్ధమత మంగీకరింపదు. బౌద్ధుల కర్మసిద్ధాంతము, మనకుఁజేసిన యుపదేశ మొకటే; సృష్టివెనుక నొక మహోద్దేశముకాని ముందొకపరమలక్ష్యముగాని లేదు. కాని కర్మనియతియే నిజమైనదని చెప్పుటయు సృష్టివెనుక నొకపరమసత్య మున్నదని వచించుటయు, నొకేభావముయొక్క-ద్వివిధరూపములు. కర్మననుసరించి సృష్టిలో వైచిత్ర్యములుండుట కవకాశము లేదుగాని, సృష్టిలో నిత్యమైపనిచేయుచున్న

---

ధరితులై యాతని ధ్యానింపవలెనే కాని, తమకవసరము వచ్చినప్పుడే ప్రజలేల వానికి మ్రొక్కు పెట్టుకొందురు? అనేకదేవతలనేల పూజింతురు? ఈవిధముగా నీశ్వరాస్తిత్వ మసమంజసమని ఋజువుచేయఁబడినది; స్వవిరుద్ధభావములన్నియు నిట్లే పరిహరింపఁదగినవి." (అశ్వఘోషుని బుద్ధచరితము) "'ఆస్తికులు చెప్పునట్లు, దేవుఁడు గ్రహించుటకు శక్యము కానంతటి గొప్పవాఁడైనచో, వానిగుణములున్నట్లే మనభావములకతీతముగావలెను. అందుచే వానిని మన మెఱుఁగనుజాలము. సృష్టికర్తృత్వ మతనిగుణమనియు గ్రహింపఁజాలము. (బోధిచర్యావతారము.) "జగ మీశ్వరుని కార్యముగానిచో, నది సర్వరూపములవెనుక పూర్ణమై, అవస్థాశూన్యమై, అవిజ్ఞాతమైయున్న పరమాత్మ ప్రదర్శన మేలకారాదు? 'అనాథపిండికునితో బుద్ధుఁ డనెను'; "పరమాత్మ యనగా, లోకవస్తువులలో నెట్టిసంబంధమును లేనిదైనచో దానిని మనము హేతువాదశాస్త్రముచే నెఱుఁగఁజాలము. అన్యసంబంధము లేని వస్తువును మనము లెట్లెఱుఁగఁగలము? అది యున్నదనుటెట్లు? ప్రపంచమంతయూ సంబంధబంధురమని మన మెఱుఁగుదుము. సంబంధశూన్యమైనదేదియును లేదు, ముందుండదు. దేనిపై నాధారపడక, దేనికిసంబంధింపక యున్నది. పరస్పరసంబంధములుగల వస్తుజాలముల నెట్లుదయింపఁజేయును? మఱియుఁ బరమాత్మ యేకమా? అనేకమా? అదియేకమైనచో భిన్నకారణములచేజనించిన భిన్నవస్తువులు దానినుండి యెట్లుత్పన్నములైనవి? పర

యొక ఆత్మతత్త్వమున్నదని చెప్పినచో నది కర్మసిద్ధాంతమునకు వ్యతిరేకము గాఁజాలదు. సర్వత్రి, సర్వస్వరూపియై యుండక, తన చంచలవిలాసములచే నప్పుడప్పు డచ్చటచ్చట గోచరించు దేవునిభావమును నిరసించుటకే కర్మసిద్ధాంత ముపయోగించును. ఊహాలతోడను భావములతోడను బనిచేయు బుద్ధి గుణరూపములుగల లోకమును గొన్ని భావములుగాఁ గల్పనముచేసికొనును. విజ్ఞానమయమైన జీవితముతో సంబంధములేని యిట్టి బ్రహ్మపదార్థమునుగూర్చిన భావము లుపనిషత్తులందు నచ్చ

---

మాత్మ లనేకములైనచో, వాని పరస్పరసంబంధ మెట్టిది ? పరమాత్మ సర్వవ్యాపియై, సర్వమునునిండియున్నచో, నది ద్రవ్యములను జేయలేదు; ఏలన వానిని జేయుటకింకొక చోటియునులేదు. పరమాత్మనిర్గుణమైనచో నది సృజించినవస్తువులు నిర్గుణములే కావలయును. కాని సర్వవస్తువులు గుణములనుగలిగియున్నవి. అందుచేఁ బరమాత్మ కారణము కాఁజాలదు. పరమాత్మ గుణములకు వేరైనచో, గుణగణములతో నిండిన వస్తువులలో నదియెట్లుండగలదు ? పరమాత్మ మార్పులేనిదైనచో నన్ని వస్తువులు మార్పులేనివే కావలెను; కార్యము కారణస్వరూపమై యుండవలెను. కాని లోకద్రవ్యము లన్నియు మారి, నశించుచున్నవి. పరమాత్మ మార్పులేనిదెట్లుకాఁగలదు ? మఱియు, పరమాత్మ సర్వవ్యాపియైనచో, సర్వస్వరూపము కాబట్టి, మోక్షయత్న మెందులకవసరము ? అప్పుడు మనము, పరమాత్మలమే కనుక, పరమాత్మ కల్పించిన దుఃఖముల నోర్పుతో ననుభవించుచుండవలసినదే." (అశ్వఘోషుని బుద్ధచరితము.) న్యాయవైశేషికాస్తిక్యముగూర్చి, అనంతరబౌద్ధమత మొసఁగిన వాదమును యస్. యన్. యస్. యస్. ఇచ్చియున్నది. (౧) తర్కరీతిని దేవుని అస్తిత్వమును మనము నిరూపింపజాలము. (౨) దేవుఁడు లోకాధిపతియైనచో మానవుల నాతఁ డధర్మకార్యముఁ జేయునట్లు ప్రోత్సహించుచున్నాఁడు. 3) మతప్రమాణగ్రంథముల కాతఁడే కర్తయైనచో బరస్పరవిరుద్ధభావముల నాతఁడెట్లు ప్రకటించెను ? (౪) అతఁడు ధర్మపరుల ప్రతినిధియైన

టచ్చుటఁగలవు. అనంతమైన బ్రహ్మము వాఙ్మనములకతీతము. సత్యమునుగూర్చిన యిట్టి అతీతభావము, అనిర్వచనీయము, ౧ ఆత్మరహితము ౨ ఆధారశూన్యము ౩ నైనఁ గావచ్చును. లేదా శుద్ధశూన్యమనియైనఁ జెప్పవచ్చును; ఏలన దానికి జీవితముతో సంబంధములేదు. బుద్ధుఁడట్టి బ్రహ్మపదార్థము తత్త్వజ్ఞుని మానసికకల్పనమనెను. ౪. తత్త్వచింతలోఁబడి, నీతిదూరులగుచున్న ప్రజలకిట్టి భావప్రకటనమవసరమని బుద్ధుఁడు తలఁచెను. అథమము, పరబ్రహ్మాస్తిత్వము ఋజువుచేయుటకు వీలులేనిదైనకారణమున, దాని అస్తిత్వ నాస్తిత్వ నిర్ణయమును జేయుటకు మనకధికారము లేదు. మన జ్ఞానాతీతవిషయమును

---

చో నాతఁడు పరిపూర్ణుఁడుగాఁడు. (౫) సృష్టిచేయుటలో నాతని కేదైన కాఁక్ష, స్వార్థము నున్నదా? ఉన్నచో నాతఁడపరిపూర్ణుఁడే; లేనిచో సృష్టినేల పనిలేక చేసినాఁడు? నిరర్థకకార్య మాతఁడు చేయునా? అతని కార్యమొకవిలాసమైనచో నాతఁడొక బాధ్యతలేని బాలుఁడగును. (౬) దేవుఁడు మానవుని నిస్సహాయతకుఁ గారణము; ఏలన దేవుని ప్రచోదనముచే మనుజులు స్వర్గనరకములకుఁ బోవుచున్నారు. (౭) దేవుని విలాసముకొఱకు మనుజులు దురంతకార్యగ్నిఁ గ్రాగుచున్నారని చెప్పుటలో నేమిస్వారస్యమున్నది? (౮) దేవుఁడు వరదానసమర్థుఁడైనచో, నాతఁడు వానిని దుష్టులకుఁ గ్రూరులకు నీయవచ్చును: సత్పురుషులను నరకమునఁ ద్రోయవచ్చును. (౯) వారుచేసిన కర్మలననుసరించి ఫలితములాతఁడిచ్చుచో, నందరు వానితో సమానులేయగుదురు. వరప్రదానశక్తి లేనిచో సర్వాధిపతినామమెట్లు సార్థకముకాఁగలదు? (౪అ ౨౩-౩౯) ఇచటనుదహరించిన [illegible]ఁడుగ్రంథములు ననంతర బౌద్ధమునకుఁ జెందినవి. ౧. అనిర్దేశ్యము. ౨. అనాత్మ్యము. ౩. అనిలయనము. ౪. బ్రహ్మజాలసూత్రము. ౧అ ౨౬.

గూర్చి మన మే నిర్ణయమును చేయకుండుటే వివేకమని బుద్ధుఁడభిప్రాయపడెను. విజ్ఞానము పరిమితసత్యమైనచో, దైవమును గూర్చిన మనవిజ్ఞానమునట్టిదే. అందుచేఁ బరోక్షమైన బ్రహ్మవిచారణమును మాని, ప్రత్యక్షమైన లోకమును దాని స్వభావమును నిర్ణయించుటకుఁ బూనుకొనుట సమంజసము. జగత్పరిణామ క్రమము మనకుఁ బ్రత్యక్షము. అనాద్యనంతము, నిస్తటమునై, నానారూపకల్పితమైన మహాసాగరమువంటి యీ జగద్వస్తు పరంపర, కారణకార్యసంబంధముచే నిత్యపరివర్తమానమైయున్నదనియు, నిత్యచపల లీలాప్రవృత్తిగల యొక సృష్టికర్త దీనికిఁగారణమై నడపించుచున్నాఁడని తలపోయ నవసరము లేదనియు బుద్ధుఁడు నిశ్చయించినాఁడు కాని బుద్ధుని యీ సిద్ధాంత మర్థవంతమగుట కుపనిషత్తులు స్పష్టముగాఁ బ్రకటించిన పరమసత్పదార్థస్థితిని గుర్తించుటవసరము.; ఉపనిషత్ప్రకటనమును, బుద్ధుఁడెచ్చటను కాదనియుండ లేదు. ౧. ఉపనిషన్మత, బౌద్ధమతములు రెండును, మానవజీవితము శాంతి లేనిదనియు, వైకల్య దుఃఖ దూషితమనియుఁ జెప్పియున్నవి. కాని జీవితములో దుఃఖమొక్కటే సత్యముగాదు. జీవితమును బ్రోక్కినైచు నీ దోషములు, దుఃఖములు, నిస్పృహము, దుఃఖరహితమునైనదానిని సూచించును. ఇవి మానవునందు నిద్రా

---

౧. వాదముకొఱకైనను, బ్రహ్మశబ్దముచ్చరించిన వాక్య మేబౌద్ధగ్రంథములందును గానరాదు. "సర్వవ్యాపియగు బ్రహ్మశబ్దమును, మిత్రి శతుభ్రావములచేనైనను బౌద్ధులుదాహరించియుండలేదు. చతుర్ముఖబ్రహ్మను దాహరించిరి." (ఓల్డెన్‌బెర్గు. బుద్ధుఁడు.)

ణమైయున్న ఆత్మశక్తిని మేల్కొల్పి, తద్వికాసముచే విజయ
మునార్జింపుమని యాహ్వానించుచున్నవి. రూపములలో వైరు
ధ్యము, జగమాత్మమయమని చెప్పుచున్నది. పాపరూపములైన
కామములను నిర్మూలించి, ఆత్మానందమును బొందవలెనని
బుద్ధుని యుపదేశము. క్షుద్రకామములే పరమసత్యములనియు,
జగత్కేంద్రము నిర్హేతుక చలనసంభ్రమణమనియుఁ జెప్పుట
సత్యదూరము. సహిష్ణుతాశక్తియే తత్త్వసారమనియు, సాహ
సమే సత్యశక్తిరూపమనియు బుద్ధుఁ డుపదేశించినాఁడు. దైవ
ప్రదర్శనములోని యేకైకాంశమును దీసికొని మనము నిర్ణ
యించుట న్యాయ్యమైనచో లోకమిప్పుడు నిరీశ్వరలోకమని
చెప్పవీలగును. పూర్ణజగత్పరిశీలనము, ప్రకృతి ప్రదర్శ
నము వెనుక, నిత్యమై, పరిపూర్ణమై యొకసత్పదార్థ
మున్నదనియు, నీపరిణామ పరంపరలన్నియు నాయాత్మ
శక్తి స్పందనములే యనియుఁ దెలుపును. ఇట్టి భావము
నంగీకరింపనిచో, లోక ముద్దేశ శూన్యమైన యొక యెడారి
యగును. ప్రపంచ గమనము, క్రమనైతికాత్మ వికాస
మును గాంచుచున్న దను లక్ష్యము నిరర్థకమగును.
ప్రపంచ ముద్దేశ శూన్యమైన నిర్హేతుక ప్రదర్శనమను భావ
మును బుద్ధుఁడంగీకరింపఁడు. లక్ష్యము, గమ్యము లేని కేవల
పరిణామదశాపరంపర, అర్థరహిత శబ్దాటోపము ప్రపంచము
గాదు. అట్టిభావము సర్వతత్త్వలక్షవినాశమే యగును. పరి
ణామదశల కొకలక్ష్యమున్నదని బుద్ధుఁడెఱుఁగును.మార్పులకు
లోనగుచున్న దృశ్యముల వెనుకనొక నిత్యసత్యమున్నది;

దాని నేపేరఁబిలిచినను నిబ్బందిలేదు; అది కర్మ యనుఁడు, ధర్మ మనుఁడు; దాని సత్యమునకు భంగము వాటిల్లదు. దీని శాసనము నతిక్రమించు వేఱు శాసనము లేదు. వెనుక నిగూఢమై యొక నిత్యవస్తుతత్త్వమున్నదని యంగీకరింపకున్న యెడలఁ బరిణామప్రదర్శన మొక యింద్రజాల ప్రదర్శనమే యగును. కర్మశిక్షణము, చిత్తశుద్ధినిచ్చి, దోషనిర్మూలన మొనర్చునది. కర్మసూత్రప్రవర్తనము, ఆత్మవికాసమునకుఁ గాంతినిచ్చునది. మానవుఁడాత్మ వికాసమున కనుగుణముగాఁ దనజీవన నియమములను గల్పించుకొనవలెను. సర్వకాలములయందు ధర్మశాసనమే లోకమును బాలించును. ఈశ్వరాస్తిత్వమును బుద్ధుఁడు సూచింపకున్నను, నీశ్వరధర్మము నాతఁడు సమ్మతించెను. కర్మసూత్రము కేవల నిర్మానసికశక్తియని బుద్ధుఁడు చెప్పలేదు. అణుసమూహములను గల్పించి, వానిసమ్మేళనముచే విశ్వవస్తుజాలమును బ్రదర్శించు నాశక్తి కేవల జడశక్తి కాఁజాలదు. ప్రపంచపరివర్తనమునకుఁ గారణమై, నిత్యమై, స్వయంపోషకమైన అనంతశక్తి, లేదని బుద్ధుఁడుచెప్పిన వాక్యమొక్కటియును లేదు. ప్రపంచపరిశీలనము వలన నొకవిశ్వధర్మమున్నదనియే మనము చెప్పఁగలిగిన సత్యమైనను, అనిత్యమైన జగత్పరిణామ విధానమొక్క నిత్యమైన ధర్మమునకు నిలయమైన బ్రహ్మపదార్థమున్నదని సూచించుటకుఁ జాలును. ఈధర్మము, పరమధర్మస్వరూపుఁడైన యొక దివ్యపురుషుని మనస్సులో నుదయించినదే యని గ్రహింపవచ్చును.

లోకధర్మ క్రమమునఁ జపలచిత్తుఁడై, నిర్హేతుకముగా జోక్యము కల్పించుకొను దేవుఁడున్నాఁడను దైవతత్త్వమును కర్మసూత్రము నిషేధించును. అట్టి జోక్యము, దేవుని కనర్హమైనకృత్యము. అట్టి దైవమునందు విశ్వాసము, చంటిబిడ్డలకు, నిరక్షరకుక్షులకు నుండవచ్చును. లోకధర్మవిరుద్ధ ప్రవర్తనశీలుఁడగు దేవునియస్తిత్వమును నిరసించుట, పరిపూర్ణుఁడగు దేవుఁడు లేఁడనిచెప్పుట కాఁజాలదు. ధర్మక్రమము, ప్రకృతి క్రమగమనము, దైవత్వవిరుద్ధములుగావు. జగత్కారణము పోషకమునైన పరమాత్మస్థితి స్వరూపము మనజ్ఞానమునకతీతమై నంతమాత్రమున, మనము నాస్తికవాదము ప్రకటింపనవసరములేదు. అమోఘమైన ధర్మసూత్రమును బుద్ధుఁడంగీకరించినాఁడు. అట్టి ధర్మమూర్తియైన పరమాత్మ నాతఁడు గుర్తింపవలసియున్నను, మౌనము వహించినాఁడు. భావిదశలో నేదియు హేతువిరుద్ధముగాఁ దటస్థింపదను మనవిశ్వాసము రాఁబోవు దశాపరంపరలు నిష్కారణములై, విలయహేతువులు కాఁజాలవను మననమ్మకము, లోకప్రవర్తన మొక పరిపూర్ణజ్ఞానమూర్తి యధీనమైయున్నదను నిశ్చయజ్ఞానము వలననే నిలఁబడఁగలవు. దేవుని క్రోధము నెడ నీచమైనభయము, నాతని కటాక్షముచే దనస్వార్థమును బెంపొందించుకొను భక్తి మున్నగు క్షుద్రభావములతోఁ గూడిన జనసామాన్యమతమును బుద్ధుఁడు నిర్మూలించి, ధర్మము తప్పక రక్షించునను భావమునిచ్చి, స్వచ్ఛమతసారము నాతఁడు పోషించెనని, బౌద్ధమతము నెడ విముఖభావములు గలవారుగూడఁ జెప్పె

కొనవచ్చును. ప్రపంచము జీవరహితమైన జడపదార్థసముచ్చయము కాదనియు, సజీవమైన ధర్మకాయమనియు బుద్ధుఁడు నిర్ణయించెను. చరాచరప్రకృతి నిర్మాణసూత్రమే ధర్మమని యాతని నిర్వచనము. ప్రకృతిలోని ప్రతినిమిత్తము, లోపలఁ బనిచేయుచున్న జీవస్పందనమే జగదాధారభూతమైన విశ్వజీవతత్త్వము నెడ సంశయభావము, నిష్క్రమ ప్రవర్తనము నకుచ్ఛేదకము ఇట్టి విరుద్ధభావమును బుద్ధుఁడుపదేశించెనని మనము చెప్పుకొనఁజాలము.

## ౧౯—అనుష్ఠానమతము.

మానవుని నైజమతస్వభావ మొకదేవుని కోరును. బుద్ధుఁడెంత జాగరూకతతో నుపదేశించినను, దైనికమత వ్యవహారములో నాతనినే దేవుఁడని బౌద్ధులారాధించిరి. "ప్రభూ! తమకంటె నెక్కువజ్ఞానమూర్తి, ఘనతరుఁడునైన వాఁడెవఁడు? గతములోఁగాని, ముందుఁగాని యుండఁడనియు, సామాన్య సన్యాసికాని, బ్రహ్మకాని తమకుఁ జాలఁడనియు నావిశ్వాస" మని సారిపుత్త్రుఁడు పలికినప్పుడు బుద్ధుఁడిట్లు బదులుచెప్పెను; "నీమాటలు ధైర్యము నుత్కృష్టభావమును గలవి, నీవొక తన్మయావస్థలో గీతము నాలపించితివి. గతములోనున్న బుద్ధులందర నెఱిఁగియుంటివి కాఁబోలును?" "ఎఱుఁగను స్వామీ! ముందుండఁబోవు బుద్ధులనందఱ నెఱుఁగుదువా!" "ఎఱుఁగను ప్రభూ!" "నీవు నన్నైనఁబూర్తిగా నెఱుఁగుదువు; నావర్తనము శీలము, నామనస్సు, జ్ఞానము, జీవితము, మోక్షము నెఱుఁగుదువు." "ఎఱుఁగనుస్వామీ!" భూతభావి బుద్ధుల నెఱుఁగవని

నీవు గ్రహించితివి. అయిన నేల నీవట్టి సాహసవాక్యములఁ బల్కితివి ?" ౧. కాని మానవస్వభావము నణఁచివేయుట యెవ్వరితరము ? లోకచక్షువును,లోకాదర్శప్రాయుఁడును, పరిపూర్ణత్వమార్గదర్శియుఁ, దా నొక జ్ఞానిమాత్రుఁ డనియుఁ దానుగాంచిన మార్గము నితరులకు బోధించినవాఁడననియు నాతఁడే చెప్పుకొనినవాఁడునైన బుద్ధుఁడొక్కఁడే శరణ్యుఁడని, ప్రజాసామాన్య మాతఁడే దేవుఁడని పూజించిరి.౨

జనసామాన్యుల మతభావముల నంగీకరించి, బ్రహ్మేంద్రాదిదేవతలు,లోకాంతరములు బుద్ధుఁడు గలవనిచెప్పెను.3. దేవతలనుగూడ మర్త్యుల నొనర్చెను. ప్రపంచప్రథమకారణమును, కర్మనియామకుఁడైన సృష్టికర్తను నాతఁడు తిరస్కరించి, అజ్ఞానజను లారాధించు దేవతల విషయమున వారితో నేకీభవించి, దేవతలకు మనుజులకు సంపర్కమునుగూడ నంగీకరించెను. సరూపములు, రూపరహితములునైన యధోలోకములను సంపాదించు తత్త్వసాధనముల నాతఁ డంగీకరించెను. బౌద్ధమతమున కధికగౌరవమును జేకూర్చుటకొఱకు, బ్రహ్మేంద్రాదిదేవతలును బౌద్ధమతస్వీకార మొనర్చిరనికూడఁ జెప్పఁబడెను. మోక్షమిచ్చుజ్ఞానము మనుజుల కెంత యవసరమో,

---

౧. మహాపరినిర్వాణసుత్తము. ౨. పోల్చు. "ఓబ్రాహ్మణుఁడా! అజ్ఞానమను గ్రుడ్డులో బంధితులై యలమటించుచున్న జీవులయాగ్రుడ్డును జితుకఁగొట్టి, పరమోత్కృష్టమానవసౌభాగ్యత్వమును పొందటప్రకటించి,సత్యమును దర్శించినవాఁడను నేనే. అందుచే మొదటి బుద్ధుఁడను పురాణపురుషుఁడను, పరమపూజ్యుఁడను నేనే" (ఓల్డెన్ బెర్గ్. బుద్ధుఁడు పుట.3౭౯.) బుద్ధుఁడొక మార్గదర్శకుఁడు మాత్రమే. 3. చూడు మహాగోవిందసుత్తము, తేవిజ్జసుత్తము.

నంతే యవసరము. ఇదంతయు బ్రాహ్మణసంప్రదాయములోనిదే. పుణ్యకర్మాచరణము, యజ్ఞనిర్వహణము, తపోదీక్షలవలన దేవతలు తమపదవులను సంపాదించి నిలుపుకొందురని బ్రాహ్మణమత సంప్రదాయమే చెప్పుచున్నది. పుణ్యధనము స్వర్గభోగములచే క్షీణించినంతనే, దేవత లితరరూపమును ధరింతురనియు నున్నది. పదవులకొఱకు, నధికారములకొఱకుఁ గీర్తికొఱకు దేవతలు పలుపాట్లుపడిన గాథలనేకములున్నవి. దేవతల యున్నతపదవుల కొఱకు యాగతపములచే నధికపుణ్యధన మార్జింపయత్నించు వారికి దేవతలాటంకములుగూడఁ గల్పించియున్నారు.౧. వైదికమత దేవతలనేస్వీకరించి, వారిని మోక్షజ్ఞానమిచ్చు బౌద్ధసన్న్యాసికి శిష్యులనుగాఁజేసి బౌద్ధమతము ప్రదర్శించినది. "బ్రహ్మ అవిద్యావశుఁ డయ్యెను; విష్ణువు వివేకింపరాని మాయామగ్నుఁ డయ్యెను; శంకరుఁడు స్త్రీకాంక్షచేఁ బార్వతిని దనదేహమందే ధరించెను; కాని యీలోకమున మునిశ్రేష్ఠుఁడైన బుద్ధుఁడొక్కఁడే అవిద్యామాయామోహములు లేనివాఁడు."౨

## ౨౦—జ్ఞానసిద్ధాంతము

చార్వాకులవలెఁగాకుండ బౌద్ధులు ప్రత్యక్షమునే కాక, అనుమానప్రమాణమునుగూడ నంగీకరింతురు.3. కాని నైయా

౧. మేనకావిశ్వామిత్రుల పురాణగాథ దీనిని ఋజువు చేయుచున్నది.

౨ రామచంద్రుని భక్తిశతకము. 3. ఎస్.యస్.యస్.యస్. 3అ ౪౪. ౧౫-౨౨. పూర్వబౌద్ధము, ఉపమానమును శబ్దమానమును గూడ నంగీకరించినట్లు తెలియుచున్నది. మైత్రేయుఁ డుపమానమును, దిజ్నాగుఁడు శబ్దప్రమాణమును విసర్జించినారు. చూడు. జె.ఎ.యస్. బెంగాల్. ౧౯౦౫. పుట౧౭౯.

యికుల అనుమానమునకు బౌద్ధుల యనుమానమునకుఁ గొంత భేదమున్నది. కారణకార్యములకు సంబంధమును గలుపవచ్చునని బౌద్ధులుచెప్పఁగా, నైయాయికు లితరసంబంధరూపములనుగూడ నంగీకరింతురు. బౌద్ధుల ననుసరించి, కార్యములనుండి కారణములనూహింపవచ్చును. నైయాయికుల ననుసరించి, కార్యముల నుండి కారణములనేగాకుండ, సంజ్ఞలవలన, సంజ్ఞలుగల వస్తువులనుగూడఁ దెలియవచ్చును. ఈభేదమునకుఁ గారణము బౌద్ధ పరిణామవాదము. ప్రత్యేకవిషయములకు సామాన్యసత్యములకు నవినాభావసంబంధముండుటచే నట్టి సామాన్యసత్యము లెల్లప్పుడు నిజము కాకపోవచ్చునుగాని, కారణపరంపర కెట్టి దోషము పట్టలేదు. కొమ్ములుగల జంతువులన్నియు, చీల్చిన గిట్టలు గలవనుసత్యము, మనకుఁగల యనుభవములో సామాన్యధర్మమై యున్నదికాని యది శాశ్వతసత్యము కానేరదు. పొగనుండి నిప్పును దెలియు ననుమానము దోసిపుచ్చఁజాలము; అట్లు త్రోసిపుచ్చినచో జీవితమే దుర్ఘటమగును.

రెండు దృశ్యములకుఁ గారణసంబంధముల నెట్లేర్పరుపఁగలము? పూర్వబౌద్ధము ననుసరించి, 'అ' కు 'ఆ' పూర్వమైనచో, 'ఆ' అదృశ్యముతో 'అ' అదృశ్యమైనప్పుడు, నితర విషయములు మార్పుచెందక యున్నప్పుడు, "అ" కు "ఆ" కారణమైన దని చెప్పవచ్చును. ఇది భేదపద్ధతి. అనంతరబౌద్ధులు, కారణమునకు వెనుక సన్నిహితకారణములను గూడ వక్కాణించి, సిద్ధాంతమును బెంపొందించిరి. ఇతరవిషయములలో మార్పు లేకుండఁ జూడవలెననియుఁ జెప్పిరి. కారణానుమానము నీవిధ

ముగాఁ బంచపదములుగల దానినిగా నొనర్చి, దానినే, పంచ కారణియనిరి. (౧) మొదటఁ గారణము లేదు; కార్యమును లేదు; (౨) కారణము గోచరించును. (3) కార్యము గోచరించును. (౪) కారణమదృశ్యమగును. (౫) కార్యమదృశ్యమగును. ఒకవర్గము, వర్గవిభాగములు, పరస్పరసంబంధములు, నింకొకవిధముగా నిర్మింపవచ్చును. ఒకవర్గ మింకొకవర్గముతోఁ గలిగియున్న సంపర్కము ననేక సందర్భములలోఁ జూచినప్పుడు, నావర్గములను విడిగా నెన్నఁడు మనము చూడనప్పుడు, రెంటికి మూలసమానత్వ ముండవలెనని మన మనుమానింతుము. అనుమానము స్థిరమై, సామ్యమును నిర్ణయించినపుడు, సామాన్యసూత్ర మప్పు డుదయించును. ఒకదృశ్య మొక త్రిభుజమని మన మెఱిఁగినపుడు, దానినొక మూర్తియని పిలువవచ్చును; ఏలన మూర్తి కుండు లక్షణములు ప్రత్యేకరూపమునకు నుండవలెను. అదియొక మూర్తియుఁగాకున్నచోఁ దిభుజమును గాఁజాలదు. కావున, దశలలోఁ గారణదశలును, నేకకాలమున నుండు వానిలో సామాన్య ప్రత్యేకవస్తువులును, సామాన్యసూత్రకారణములని బౌద్ధులు చెప్పిరి.

బుద్ధుఁడీ సత్యప్రమాణములను మన్నించెనని తలఁచుట కాధారములు లేవు. జీవిత నిరాశాతత్త్వము, సంసారమునందు నమ్మకము, స్వర్గనరకములు, తనకాలమునందు వాడుకలో నున్న విజ్ఞానశాస్త్రములనుండి బుద్ధుఁడు యథాతథముగా స్వీకరించెను. జగత్తును గూర్చిన యెంతస్వతంత్రమైన విజ్ఞానమును, గతసంప్రదాయమునుండి పూర్తిగా విడివడఁజాలదని

తెలియుచున్నది. పూర్వసంప్రదాయమును విచక్షణము చేయ కుండ స్వీకరించిన యీవిషయమును విడిచిపెట్టినచో, మిగిలిన తత్త్వమంతయు సహజసమన్వయము గలదనియుఁ జెప్పవచ్చును. ప్రథమకారణములను గూర్చియుఁ, బ్రధానకారణములను గూర్చియు బుద్ధుఁడు విచారణచేయుట మానివేసెను. ఎదుట నున్న ప్రపంచమును గూర్చియేకాని, నిత్యసత్యమైన తత్త్వ మును గూర్చిన చింత యాతఁడు పెట్టుకొనలేదు. ప్రపంచనిత్య త్వానిత్యత్వ తాత్త్వికవిచారణమున సంశయాకుల చిత్తుఁడైన యొకబ్రాహ్మణునితో నట్టి సిద్ధాంతములతోఁ దనకు సంబం ధము లేదని బుద్ధుఁడు చెప్పెను. బౌద్ధధర్మ మొక దర్శనముకాని, యొకతత్త్వముగాని కాదు. అదియొకయానము; అనగా మోక్ష సాధనమైన వాహనము. ౧. అనుభవము నాతఁడు పరిశీలించి, దానిసత్యస్వరూపమును నిర్ణయించును. విభాగవిధానమును బౌద్ధులనుసరింతురు గావున వారిని విభాజ్యవాదులని చెప్పాట కలదు. దృశ్యమాన ప్రపంచమే తన పరిశీలనమున కవధిగా నిడుకొని, దేవతల విషయము నాతఁడు విడిచిపుచ్చి, తన్ను దేవతలును విసర్జింతురు గాకయని కోరెను. ఇంద్రియాతీతసత్య మునుగూర్చి, బుద్ధునిదృష్టి ప్రయోజనశీలమైన ఔదాసీన్యము. ఇట్టిదృష్టియే, అనుభవాంశములకు, హేతునిర్ణయములకు, నై తికసూత్రములకును సరిపోవుదృష్టి. ఏదియు నిషేధింపఁబడలేదు. పునర్నిర్మాణావకాశము గలస్థితిలోఁ దనదృష్టినుంచుకొనెను. దీనివలన బుద్ధుఁడు సంశయవాదియనికాని, శూన్యవాదియని

౧. మజ్ఝిమనికాయము.

కాని తలఁపరాదు. అతఁడు చెప్పినదేమన, మనము ముందరఁ పూర్ణజ్ఞానుల మగుటకు యత్నింతము; తరువాతఁ బరతత్త్వ నిర్ణయములు చేయవచ్చును; ఇప్పుడే వానినిఁగూర్చి, మనము కలహించుటవసరము లేదు. తాత్త్విక సిద్ధాంతములయెడ నాతని యౌదాసీన్య మెంతదృఢమైనదన, నతని ప్రథమశిష్యులు కొందఱు బ్రాహ్మణముల తత్త్వసిద్ధాంతములను నమ్మినను నాతఁ డేమియు మాటాడలేదు. బుద్ధుని భావములకు వ్యతిరేకముగా బహిరంగముగాఁ బ్రసంగించిన శిష్యులనుగూర్చి, బ్రహ్మజాలసుత్తము చెప్పుచున్నది. బుద్ధుఁడు తన యనుచరులకు, బ్రాహ్మణులకుఁ దన యుపదేశములను జెప్పెను. మనమైహిక వాతావరణములో నున్నంతకాలము, నిర్వచించుటకు శక్యము కాని తత్త్వవిషయములను చర్చించు యత్నములను మానుట మంచిదని యాతఁడు చెప్పెను. విశ్వాసములేని వారికిఁ గలిగించుటకై, బలవంతము చేయుటకుఁగాని, వైచిత్ర్యప్రదర్శనములఁ జూపుటకుఁగాని బుద్ధుఁ డనుమతింపఁడు తత్త్వజిజ్ఞాస లోపలనుండి రావలసినదే. కావునఁ బ్రేమ, దానముల నాచరణలోఁ జూపుఁడని యాతఁడు శిష్యుల కుపదేశించెను. ఆత్మశుద్ధి, తత్త్వచర్చచేఁగాక, చిత్తశాంతిచే లభించునని యాతఁడు పల్కెను. ధర్మానుష్ఠానజీవితముచే జ్ఞానజ్యోతి హృదయమందుఁ బ్రకాశించినపుడు, మనకుఁ దత్త్వమదే బోధపడును; ఇప్పుడజ్ఞానదశలోనుండి దానినిగూర్చి తెలియఁగోరు టెందులకు ?

ధర్మానుష్ఠానమునకుఁ దత్త్వసమస్యాపరిష్కార మనవసరమని బుద్ధుఁడు చెప్పినదే సుప్రసిద్ధవిషయము. బుద్ధుని మౌనమునకు సరియైన యర్థమేమి? ఆతనికి నిజముగా సత్యము తెలిసియుఁ జెప్పుట కిష్టపడలేదా? ఆత్మకాని, దేవుఁడు కాని లేఁడను నాస్తికవాదియా? లేక, తత్త్వసమస్యాచర్చ నిరర్థకమని యాతఁడు భావించెనా? లేక, తత్త్వవిచారణ ధోరణి, నిరుత్సాహపఱుపవలసిన లోపమని యాతఁ డూహించెనా? బుద్ధుని ప్రియశిష్యులలోఁ జాలమంది, బుద్ధుఁడు దేవుని, ఆత్మను, పరిహరించెననియు, నాతనితత్త్వము స్పష్టముగా నాస్తికవాదమనియుఁ దలఁచిరి. నాగసేనుఁడు, బుద్ధఘోషుఁడు, బౌద్ధమతమును విమర్శించిన హిందూతత్త్వజ్ఞులును, బుద్ధుని తత్త్వము నాస్తికమని భావించిరని జగద్విదితమైన విషయమే మిక్కిలి తరుణవయసునందే, బౌద్ధతత్త్వమునకు నాస్తికతకు నేకత్వము సుప్రసిద్ధమైనది. ఈనాస్తిక భావమును బుద్ధుఁడైనను సరిగా నుపదేశించి యుండలేదని, మేము వినయముతో మనవి చేయుచున్నాము; బుద్ధుని మౌనము నాతని ప్రథమశిష్యులు కొందరు నాస్తికముగా నన్వయించియున్నారు. బుద్ధుని మౌనమునకుఁ బరమార్థము నాతఁడెఱుఁగకయైన నుండవలెను. లేదా, తత్త్వసిద్ధాంత జ్ఞానమున్నను లేకున్నను నందరకుఁ దరణోపాయము చూపవలెనను నభిప్రాయమైన నైయుండవలెను. కావున బుద్ధుని మౌనము నాస్తికభావమును గాని, సంశయ భావమునుగాని, మానవజాతియెడ నపారమైన ప్రేమ, ధర్మావేశములనుగాని, ప్రకటించును. బౌద్ధతత్త్వమును మేము

ప్రదర్శించుటలో, నాత్మ లేదను భావము నాతఁడు నిరసించెననియు, బుద్ధుని నిర్వాణ మనఁగా నాశనమను టపార్థకల్పనమనియు, నియమబద్ధమైన స్థితినుండి మనము విముక్తులమై పూర్ణమోక్షావస్థనుగాంచుటే నిర్వాణమనియు, నీ తత్త్వ మొకనాస్తికభావముచే సమన్వయించుట దుస్తరమనియుఁ బ్రసంగించియున్నారము. తాను సత్యమును దర్శించితి ననియు, దానిననుసరించి, ప్రజలను మోక్షస్థితికిఁ దోడ్కొని పోఁగలననియుఁ బుద్ధుఁడుచెప్పిన వాక్యములే యాతఁడు సంశయాత్మకుఁడు గాఁడని నిరూపించును. ఆతఁడు సత్యమునెఱుఁగనిచోఁ, దాను బుద్ధుఁడనని యాతఁడంగీకరింపక యుండెడివాఁడే. ఇఁక మిగులునది మూఁడవది. పరమార్థరహస్యము లన్నియు నాతఁడెఱుఁగుననియుఁ, దనయొద్ద కేతెంచిన జనసామాన్యమున కెఱిఁగించినచో వారి విశ్వాసనిశ్చయములు వికలములగునని యెంచి, యట్లుచేయ లేదనియుఁ దెలియుచున్నది.౧. ఇదియే మాకు సంతృప్తికరమైన యభిప్రాయము. ఒకసమయమున బుద్ధుఁడు కొన్ని యెండుటాకులు తీసికొని కరతలమున నుంచి, హస్తముననున్న యెండుటాకులుగాక యింకను నున్నవా యని యడుగ నానందుఁడు, "హేమంతమునఁ జెట్లయాకు లన్నియు నన్నివైపుల రాలుచున్నవి. అవి గణనాతీతములుగా"నున్నవి అనిబదులుచెప్పెను. అప్పుడు బుద్ధుఁడు చెప్పెను: "అదేవిధముగా నేను మీకొక గుప్పెడుసత్యములను చెప్పితిని. ఇవిగాక, గణనాతీతసంఖ్యగల సత్యములింకను నున్నవి." ౨.

౧. చూడు. బి. జి. ౩౮. ౨౬.

౨. ఆనందాచార్యుని బ్రహ్మదర్శనమందు దాహృతము. పుట౧౦.

తానుజెప్పిన పరిణామ ప్రపంచవిషయమేకాక, యింక నెన్నో సత్యములున్నవని యాతనిభావము. మానవుఁడు ధర్మానుష్ఠానపరుఁడైనచో నా యితరసత్యము లన్నియు గోచరించును తానుబొందిన పరమజ్ఞానావస్థ యితరులకు లభించుటకువలయు నీతిప్రవర్తనమే ప్రధానమైనదని బుద్ధుఁడు వక్కాణించెను. ఇట్టి బుద్ధునిభావము తాత్త్వికముగా సమర్థింపఁదగినది. మానవజ్ఞానమునకుఁగల పరిమితి నాతఁడుగుర్తించి హేతువిచారణముచేఁ దెలియఁదగినది, తెలియరానిది స్పష్టముగాఁ బ్రకటించెను. మనయింద్రియములు పరిణామదృశ్యములనే యెఱుఁగఁగలవు; పరిణామవశములైన వస్తువులు సత్యములుగావు. ఉపనిషత్తులవలెనే, పరమార్థము నిగూఢరహస్యమని యాతఁడు గుర్తించెను. పరిమితమైనబుద్ధి అపరిమితమైన సత్పదార్థమును, దేశకాలములందు బంధింపయత్నించుచో భావవైరుధ్యము లేర్పడును. మన మూహాతీతమైనదాని నూహింపఁజాలము. సత్పదార్థమును దెలియుటకై చేయుప్రతిప్రయత్నమును, పరిణామములేని సత్పదార్థమును పరిణామశీలమైన దృశ్యముగా మార్చివేయును. సత్యము మానవమానసముచే గ్రహింపఁబడరాదు; ఏలన, మానవమానసముకూడ నవిద్యాజాతమే. నేను నీవను భేదములతోఁగూడిన జ్ఞానము సంపూర్ణమైనదికాదు. మానవునకు సత్యమునకును మధ్యమందొక దృష్టినిరోధకమైన తెఱయున్నది. మనము దానిని చూడఁజాలనంత మాత్రమున నసత్యముగాదు. "జ్ఞానమెచట నున్నది నాగసేనా?" "ఓరాజా! ఎచటను లేదు." "అయినచో జ్ఞానమే లేదు."

"వాయు వెచటనున్నది రాజా!" "అంతటను లేదు" "స్వామీ! అయినచో వాయువేలేదు." పరమాత్మాస్తిత్వము బుద్ధి శక్తి కందనిదని బుద్ధుఁడు చెప్పెనేకాని, అదిలేనేలేదని యాతఁడెచటను జెప్పియుండలేదు. ఆతనిభావము గోథేకవి, ఫౌస్టు మాటలలో నిట్లుచెప్పనగును;

"దేవుని కెవఁడు నామకరణము చేయఁగలఁడు ?
"ఆతని నేను నమ్మినానని యెవఁడు వచింపఁగలఁడు ?
"దేవుని నేను నమ్ముటలేదని హృదయముగల
వాఁడెవ్వఁడు పలుకసాహసింపఁగలఁడు ?"

బుద్ధుఁడు వేదప్రమాణములపై నాధారపడి, బ్రహ్మతత్త్వమును స్థాపించుట కిచ్ఛగింపలేదు; ఏలన శబ్దప్రమాణము నంగీకరించినచో నిఁకనంతటితో నావిషయమాగదు. అసలు ఉన్నదో లేదో తెలియక, ఉన్నచో నెచటనున్నదో, యెట్లున్నదో, దేనితోనిర్మింపఁబడినదో యెఱుఁగక, ఒకభవనముపై కెక్కుటకై, నాలుగుబాటలుకలియు నొకచోట మెట్లు కట్టించుచున్నవారితో, శ్రుతిప్రమాణమునను సరించి, బ్రహ్మసత్యమని నమ్మి బ్రహ్మైక్యముకొఱకై యత్నించువారిని బుద్ధుఁడు పోల్చెను. జ్ఞానాతీతమైన సత్యమునుగూర్చి లోతుగాఁదఱచు పద్ధతినిగూడ బుద్ధుఁడు నిరుత్సాహపఱచెను. ౧. మనోబుద్ధుల కతీతములగు విషయములనుగూర్చి చర్చించి కాలమును వ్యయించుట కాతఁడిష్టపడలేదు. లోకాస్తిత్వమును, నీతి పరివర్తనావసరమును గూడ తత్త్వచర్చావాదములవలన విఘాత

౧. ఫ్రాన్సిస్ బేకను కూడ నట్లేచెప్పెను.

ములపాలగునని తనకాలమున దేశమందుఁ జెలరేగుచున్న శాస్త్ర వాదోపవాదములవలన నాతఁడు గ్రహించి యున్నాఁడు. అందుచే బుద్ధుఁడుఁ తత్త్వచర్చావిషయసమానములు మాని, నిత్యజీవితమును శుద్ధియొనర్చుకొను నైతిక నియమముల నభ్యసింపుఁడని పిలిచినాఁడు. తత్త్వజిజ్ఞాసలో లోతునకుఁ బోవుటయం దిష్టముగల జనులభావముల నాతఁడు వారిప్రశ్నములవలననే గ్రహించి, తత్త్వసిద్ధాంతచర్చాభిలాష పంచమత దోహములలో నొకటియని యాతఁడు ప్రకటించెను. ౧. నైతికానుష్ఠానమందలి శ్రుతిమించిన గౌరవభావమే, తత్త్వసిద్ధాంతములయెడ నింతనిరసనభావము బుద్ధునికిఁగలుగుటకుఁ గారణము. తనయుగమునందుఁ బ్రజాహృదయములో నిదివఱకే యేర్పడియున్న తత్త్వసంశయాంధకారమునకుఁ దాను నింకొకతత్త్వము నుపదేశించి, మఱికొంతసంశయమును గలుపనిచ్ఛగింపక, తెలిసినవిషయములనుగూర్చియే పరిశీలనము సాగించుట మంచిదని చెప్పెను.

తత్త్వవిషయమున క్యాంటుబౌద్ధులకుఁ గొంత సామ్యమున్నట్లు తోఁచుచున్నది. హేతుపరిశీలనముతో సంబంధములేని తత్త్వవిశ్వాస ప్రకటనమునకును, నాస్తికవాదమునకును సంఘర్షణము జరుగుచున్న యుగమందే యిరువురు జన్మించుట తటస్థించినది. తత్త్వవిశ్వాసముల కాధారములైన హేతువుల నరయుటకై నిగూఢాలోచన మవసరమనియు, ధర్మనియమానుష్ఠానములను గాపాడవలయు ననియు నిరువురు నిశ్చయించిరి.

౧. మల్లసూత్రము. ౯ఆ. ౧.౪.

ఇంద్రియాతీతవస్తు సత్యముల నింద్రియసాధనములచే నెఱుఁగఁ గోరు యత్నములను విడిచిపెట్టుఁడని యిరువురు బోధించిరి. బాహ్యవస్తు స్వభావములు మఱుఁగుపఱచిన సత్యమునుగూర్చి హేతువులేవనెత్తు ప్రశ్నములకుఁ దత్త్వశాస్త్రము తృప్తికరము లగు సమాధానములిచ్చి, పరిష్కరింపఁజాలదని యిరువురు నమ్మిరి. ఇంద్రియాతీత విషయములకు బుద్ధిశక్తిచే నర్థముచెప్ప యత్నించుటచే వైరుధ్యములు, నసంగత నిర్ణయములు నుద యించునని వారుతలఁచిరి. దేవతలను మనుజులను నందఱను శాసించు ధర్మసూత్రమే పరమపూజ్యమని వారు నిశ్చయించిరి. ధర్మసూత్రమును గూర్చిన విచికిత్సలేక సంశయము, మోక్ష నకు విరోధమగు మహాపాపమని యిరువురు బోధించిరి.

పరతత్త్వసిద్ధాంత పరిశీలనమును బూర్తిగా నిరసించు ధోరణిశోచ్యమైనది. మానవుఁడు తత్త్వజిజ్ఞాసను మానుకొనఁ జాలఁడు. మనకుఁ దెలిసినది పరిమితమైనదని బుద్ధుఁడు చెప్పినపు డపరిమితమైన దేదియను ప్రశ్నరాకమానదు. ఈపరిమిత మైన దాయపరిమితము నందున్నదా ? లేక, దీనికది కార ణమా ? ప్రపంచమునకాది యున్నదా ! ఆత్మశాశ్వతమైనదా? మానవుఁడు స్వతంత్రకర్తయా ? ప్రపంచమున కొకయుత్కృ ష్టకారణమున్నదా ? మున్నగుప్రశ్నలు, మానవుని మహో న్నతాశయములతో నవినాభావ సంబంధమును గలిగియుండు టచే నణఁచివేయఁబడునవికావు. ఈసమస్యలను బరిష్కరించు టకు మనకు శక్తిలేకపోవచ్చును. కాని, మనము వీనినడుగుట మానఁజాలము. పరమార్థము నెఱుఁగఁజాల నంతమాత్రమున

మానవునిసహజగౌరవోన్నతి చెడదు; కాని పరమార్థము నెడ. నుదాసీనభావము వహించుటయు మానవుని గౌరవోన్నతికి లోపమే. పరమార్థవిషయముల లోతులకుఁబోయి యటు విలోకించు కాంక్ష యుదయించుటే దోషమని బుద్ధుఁడు పలికినాఁడు. కాని, అతీంద్రియవిషయ పరిశీలనము నాతఁడనుచితముగా ఖండించినఫలిత మాతని కనుకూలముగా జరుగలేదు. ౧. బౌద్ధమత చరిత్రమే తత్త్వజ్ఞానావసరమును నిరూపించినది. తత్త్వజ్ఞానముతోఁ గలహించుటందుఁ బ్రవేశించుటే యను పరమసత్యమునకు బౌద్ధమతచరిత్రయే తార్కాణము.

౧. "అతిదూరగమ్యమగు జ్ఞానమును సంపాదించుట సాధ్యమని తలచినంతకాల, మట్టి జ్ఞానముతో నిమిత్తము లేకుండ జీవింపఁగలమని వివేకముతోఁ గూడిన నిర్మలచిత్తముతోఁ బ్రతిఘటించుటయు నసాధ్యమే. జ్ఞానప్రచారము చేయుటొక కర్తవ్యమనితోఁచుటయు, హేతువాదమణఁచి యుండుటయు, నిరాడంబరమైన జ్ఞానమును జూపుటకుబదులు, మానవస్వభావమునుద్ధరించుటకాటంకమైన మౌర్ఖ్యమునే చూపును. ఆత్మస్వభావము, జీవస్వాతంత్ర్యము, తల్లోపము, జన్మాంతరము మున్నగు సమస్యలు మానవులధీశక్తినంతను నాకర్షించి, తమ యల్పానుభవముల నాధారముగాఁ జేసికొని, వాదప్రతివాదములు, సూక్ష్మయుక్తి ప్రయుక్తులు ప్రదర్శింతురు. అట్టిచర్చాసముదాయమునుండి వస్తులక్షణములను, వాని మానవమనస్సంబంధములను నిర్ణయించి, నిర్ణయవిధానములను బరిశీలించు తత్త్వశాస్త్ర నిర్మాణకృషి యారంభమగుటతో, నూహాప్రపంచమునకు సరిహద్దులేర్పడి, బాటలు కల్పింపబడును. సంస్కారశూన్యులకు సులభసత్యములుగా గోచరించు విషయములలో ననేక కఠినసమస్యలిమిడియున్నవని తత్త్వశాస్త్రకృషియైనను, మనకు జ్ఞానము లభించినదను భ్రాంతిని నిర్మూలించి, వస్తువులసత్యము, మానవబుద్ధికతీతమైయున్నదని స్పష్టమగును." (కెయిర్డు. కాంటుతత్త్వశాస్త్రము. వాల్యూము ౧. పుట. ౧౮౨.)

అస్పష్టభావ ప్రకటన మెల్లప్పుడు ప్రయోజన కారి కాదు. బుద్ధుని యస్పష్టతనుండియే, అతని యనుచరులనేక తత్త్వ సిద్ధాంతములను కల్పించిరి. ఆతని జాగరూకతతోఁ గూడిన యుపదేశము నాస్తికవాదముగాఁ బ్రబలి, పాక్షికతత్త్వవాదము పనికిరాదను బుద్ధుని కోరికను నిష్ఫల మొనరించెను. నాగసేనుఁడు పరమార్థము నిరాధారమైన కల్పనమని తృణీకరించుట మనము చూచియున్నాము. వేద్యావేద్యవిషయ భేదమునే యాతఁడు నిరసించినాడు. ప్రకృతి దృశ్యజ్ఞానము సంపూర్ణమైనదికాదను సత్యమునే యాతఁడు విడిచిపెట్టినాఁడు. ఇంద్రియజ్ఞానమే సత్యము స్థిరమునైనది. మనయింద్రియానుభవమునకతీతమైన దేదియును లేదు. ఇంద్రియానుభవము, సత్యము నొకటే. అనుభవమున కతీతమై, అగోచరమై యున్నదానిని గూర్చిన భావకల్పనము కాక, మనయనుభవముతో సరిపోవునదే నిజమైన తత్త్వజ్ఞానము. ప్రపంచము దేశకాల పరిమితులచేఁ బరిమితమైనదికాదను సత్యమును మనము గ్రహింపవలెను. ప్రపంచకారణము, ప్రపంచమునకు వేఱైయున్నదను భావముతో మనము వాదింపనవసరములేదు. బుద్ధుని యితరానుచరులు, ప్రపంచమును గూర్చి బుద్ధుఁడుచెప్పిన యుపదేశములనుండి వారికిఁదోఁచిన తత్త్వసిద్ధాంతములను గల్పించిరి.

### ౨౧—బౌద్ధతత్త్వము—ఉపనిషత్తులు.

యుగముల వెనుకటివిజ్ఞాన ప్రవాహరూపముల సంబంధస్వరూపములను నిర్ణయించి పునర్నిర్మాణ మొనర్చుటకుఁ గోరికగల వారికొకదానివెంబడి నొకటివచ్చు పరిణామధర్మము

కాని, యొకదానినుండి యింకొకటి యుదయించు తార్కిక పద్ధతిగాని, స్పష్టమైనదేదియు లభింపదు. అజ్ఞానాంధకారము నెడ గాఢమైనద్వేషము, జ్ఞానజ్యోతియెడ నఖండాదర భావము కలిగిన బుద్ధుఁడు, రహస్యమైన దానినెల్ల విడిచిపెట్టెను. ఈ పద్ధతి సుస్పష్టమైన, సరళమైన విజ్ఞానమున కవకాశ మిచ్చినది కాని, కొన్నిలోపములు కూడ లేకపోలేదు. బుద్ధుని యుపదేశము గాంభీర్యమును, సమన్వయలక్షణమును గోల్పోయినది. అన్యోన్యసంబంధము లేక వేని కవి వేఱె యాతని భావములు నిలిచినవి. ఏకవస్తులక్షణములైన పరస్పరసంబంధములు స్పష్టముగ లేవు. భిన్నభావముల నొకసంపూర్ణ సమన్వయస్వరూపములో మేళవించు సావకాశము దృష్టి దూరమైనది. మానవుని తార్కికశక్తి, శిల్పనిర్మాణము వంటి దగుటచేఁ దనభావములను, సూత్రముల నొక నిర్మాణమున్నకుఁ జెందినవానినిగాఁజూడఁగోరును. బుద్ధునియుపదేశము లందంతర్వ్యాప్తమై యట్టి భిన్నభావసమన్వయసూత్రమున్నదని మనము చూపవలసియున్నది. బుద్ధుని ధర్మశిక్షణకనుగుణమై పోషకమైనదనుట కుపనిషత్తత్త్వమొక్కటే యున్నది. ఒకసామాన్య విజ్ఞాన ప్రవాహములో నుపనిషత్తుల తత్త్వము పూర్వము, బౌద్ధ తత్త్వము పరమునైయున్నవి. "ఉపనిషత్తులలోని యనేకసిద్ధాంతములు శుద్ధబౌద్ధతత్త్వభావములే; లేక, ఉపనిషద్భావములే బౌద్ధధర్మరూపమున వికసించి యభ్యున్నతినందినవి."౧. బుద్ధుఁడొక నూతనధర్మ ప్రవక్తనని తలఁపలేదు; పూర్వధర్మమునే యాతఁడు

౧. మ్యాక్సుమ్యుల్లర్. యస్. బి ఇ. ౧౧; ఉపోద్ఘాతము. పుట ౭.

పునరుద్ధారణ మొనర్ప యత్నించెను తత్త్వనిర్ణయవిషయమున బుద్ధుఁడు నుపనిషత్తులుగూడ వేదప్రమాణమును గణించియుండలేదు. అనుష్ఠానములో రెండునుగూడఁ దమకువ్యతిరేకములైన పద్ధతులలో సఖ్యమొనర్చినవి. అందు బౌద్ధము నుపనిషన్మతమును సిద్ధాంతములో నంగీకరించినవారు నిత్యాచరణములో వైదిక దేవతారాధకులై యుండిరి. ఈవిషయములో నుపనిషత్తులు దేవతారాధనవిధానము నెడఁ జూపినంత సఖ్యతను బౌద్ధులుచూపలేదు. రెండును, హేతురహితములు, జడాత్మకములునగు క్రతుకర్మకలాపమును నిరసించినవి. యజ్ఞకర్మ నిర్వహణమువలనఁ గాని, తపోధ్యానములచేఁగాని మోక్షములభింపదని రెండును స్పష్టపఱిచినవి. పరమసత్యస్వరూపజ్ఞానమే బంధవిముక్తినొసఁగునని రెండును జెప్పినవి. ప్రత్యేకజీవసత్యము స్థిరమైనదిగాదని యుభయనిశ్చయమైయున్నది. ఇహలోక జీవితము దుఃఖదూషితము, పరలోకసుఖప్రాప్తికే మనము యత్నింపవలెనను భావము రెంటికిసమానమే. జీవితమమకారజ్వరవిముక్తి ముఖ్యమని రెండు నుద్ఘోషించినవి. ఉపనిషత్తుల ప్రధానసందేశమైన సర్వజీవైకత్వమునుగూడ బుద్ధుఁడంగీకరించెను. రెండును జీవితమొక యాత్రయనియు నందు మన కుచ్చనీచదశాప్రాప్త్యవకాశము లున్నవనియుఁ జెప్పెను. ధర్మము సర్వలోకము నొకేరీతి శాసించుననను విశ్వజనీన నూత్రము నూత్నమైనదికాదు. పరమసత్యము బుద్ధిక గ్రాహ్యమని రెండు నంగీకరించినవి. పరమసత్పదార్థము, శూన్యమును గాదు, శూన్యవిరోధమును గాదు, రెండునుగాదు, రెండునుగాకపో

దను విషయ ముపనిషత్తులలోని కొన్నివాక్యములను మాకు దృష్టికిఁ గొనివచ్చుచున్నది. సత్యమైన దేదియులేక, మనము శాశ్వతముగా నజ్ఞానవశులమై యుండవలసివచ్చినయెడల, తీరని జిజ్ఞాసాదాహము మనకెన్నఁడును గలుగదు. ఆత్మ, ప్రపంచము మున్నగుసమస్యలకు సమాధానములిచ్చుసందర్భములో నుపనిషత్తు లుపయోగించిన శబ్దములు, నామరూపములు, కర్మవిపాకము, అవిద్య, ఉపాదానము, అర్హతుఁడు, శ్రమణుఁడు, బుద్ధుఁడు, నిర్వాణము, ప్రకృతి, ఆత్మ, నివృత్తి, మున్నగు వానినే బుద్ధుఁడు నుపయోగించెను. కొలదిమందికిమాత్రమే పరిచయాధికారముగల యుపనిషద్ధర్మమును బౌద్ధమతము ప్రజాబాహుళ్యమునెదుటఁ బెట్టినది. ఈప్రచురణావసరమునకై, జనసామాన్యమునకు దురవగాహములైన నిగూఢసత్యములను బౌద్ధమతము త్యజించినది. ఉపనిషదున్నతసందేశమును, మానవకోటి నిత్యజీవితాచరణములోఁ జొప్పింపవలెనని బుద్ధుని వ్రతమైయున్నది. ౧. ఉపనిషత్సత్యములను సామాన్యప్రజా స్వాధీనమొనర్చుటయే బౌద్ధచరిత్రకర్తవ్యమైనది. ఈవిధముగా బౌద్ధమత మొకసంప్రదాయమును సృజించి, దానిని నేఁటికిని సజీవముగానుండునట్లుచేసినది. హిందువుల చరిత్రమం దట్టిప్రజాపరములగు మహోద్యమము లుదయించుట సామాన్యలక్షణమైయున్నది. మహర్షి ముఖచ్యుతమహోపదేశరత్ననిధి, కొలఁదిమంది సొంతమైన భాగ్యమైయుండఁగా, వైష్ణవాచార్యుఁడైన సుప్రసిద్ధరామానుజుఁడు, గుప్తమంత్రార్థరహస్యములను బంచి

౧. చూడు. హోమ్సు, ది క్రీడ్ ఆఫ్ బుద్ధ.

ములకుఁగూడ నుపదేశించెను. బ్రాహ్మణధర్మము, స్త్రీయ ప్రాతిపదిక సూత్రాచరణమునకుఁ దిరిగివచ్చుటే బౌద్ధమత మని చెప్పవచ్చును. ఉపనిషణ్మతమునకు విరోధముగా బయలు దేరిన ప్రతిఘటనాతరంగశిఖరముపైనిలిచి, దిగ్విజయయాత్ర చేసిన విప్లవకారుఁడు బుద్ధుఁడుకాఁడు. ప్రజలు మఱచి నిర్లక్ష్య మొనర్చిన యుపనిషద్ధర్మములను దిరిగి బహిరంగప్రచారమొన ర్చిన సంస్కర్తగా నాతఁడుపనిచేసెను. బుద్ధుఁడొనర్చిన దోష మేమనగా, నుపనిషద్ధర్మములో నొకభాగమును దీసికొని, పూర్ణసత్య మదియేయని, దానినిబెంచి అతిశయోక్తిగాఁ బ్రచ ర్శించెను. తత్త్వవిచారమనిన నాతనికిఁగల యరుచిచే నాతఁ డర్ధసత్యమునేగ్రహించి, తానుగ్రహించిన సత్యమనేకములైన యితరసూత్రములపై నాధారపడియున్నదనికాని, తానుజూచిన దృష్టి కతీతమగుదృష్టియున్నదనికాని యాతఁడు దెలిసికొనలేక పోయెను.

## ౨౨—బౌద్ధమతము—సాంఖ్యతత్త్వము

బౌద్ధ జైనమతములు రెండును సాంఖ్యసిద్ధాంతముపై నాధారపడియున్నవని కొందరు విద్వాంసులు తలఁచినారు. సాంఖ్యసిద్ధాంతముల విస్తృతియే బౌద్ధమతమని బర్నూఫ్ తలఁ చెను. సాంఖ్యకర్తయగు కపిలుఁడు బుద్ధుఁడు నొకవ్యక్తియై యుండవచ్చుననియు, దీనికి సాక్ష్యముగా బుద్ధుఁడు కపిలవస్తు పురమున జన్మించెననియు వీబరుపండితుఁడు పలికెను; జీవితము దుఃఖమయమని వీరిసామాన్యనిశ్చయము. బ్రాహ్మణమత మందలి దేవతల యారాధనము నుభయులు నామోదించి

బ్రహ్మతత్త్వమునుగూర్చి మౌనము వహించిరి. జడపదార్థ నిత్యత్వమునుగూర్చియు, వస్తుస్వభావమునుగూర్చియుఁ, ప్రళయమునుగూర్చియుఁ గొన్నిసిద్ధాంతములు రెంటికిని సమానములే. సాంఖ్యుల ద్వైతసిద్ధాంతము, తత్త్వములగణనము బౌద్ధమునకుఁ బ్రాచీనములని జాకొబి, గార్బేలు తలఁచుచున్నారు. సాంఖ్యుల సృష్టిసిద్ధాంతమునకు, బౌద్ధభావములకుఁ గొన్ని పోలికలు కలవు.[౧] బౌద్ధమతముచెప్పిన చతుర్విధసత్యములును, సాంఖ్యప్రవచనభాష్యములోఁ జెప్పిన నాలుగుసత్యములకు సరిపోవును. (౧) మనము దేనిబంధమునుండి విముక్తులమగుచున్నామో అదిదుఃఖము (౨) మోక్షమనగా దుఃఖనాశనము (౩) దుఃఖకారణము ప్రకృతిపురుషసంబంధ జ్ఞానవివేకము లోపించుటే. (౪) మోక్షసాధనము జ్ఞానదర్శనమే. కపిలుఁడు, బుద్ధునివలెనే, యజ్ఞములను, ప్రార్థనములను, విధికర్మలను నిరసించెను. సాంఖ్యగ్రంథములు తమకర్త యని చెప్పికొనిన కపిలుఁ డనేకశతాబ్దములు బుద్ధునకుఁ బూర్వుఁడనియుఁ, బుద్ధునికాలమున సాంఖ్యభావములు ప్రజలలో వ్యాప్తములై యున్నవనియు బౌద్ధులంగీకరింతురు. వస్తుస్థితినిగూర్చి అఱువదిరెండు సిద్ధాంతములుగల దీఘనికాయమునందలి మొదటిసుత్తాంతములో, సాంఖ్యసిద్ధాంతమునకు సరిపడునదొకటికూడఁ గలదు. "దేనిపై నాధారపడి

---

౧. అవిద్యకుఁ బ్రధానమునకు, సంస్కారమునకు బుద్ధికి, విజ్ఞానమునకు నహంకారమునకు, నామరూపములకుఁ దన్మాత్రలకు, షడాయతనమునకు నింద్రియములకుఁ బోలికలున్నవి. (చూడు కెరన్. బౌద్ధమతలక్షణములు. పుట ౪౭.). సాంఖ్యుల ప్రత్యయసంఘము, బౌద్ధుల ప్రతీత్యసముత్పాదము చాలపోలికగలిగియున్నవి.

యేకారణములవలన, సన్న్యాసులును బ్రాహ్మణులును శాశ్వత పదార్థాస్తిత్వమును విశ్వసించి, ఆత్మయు, జగత్తును శాశ్వతములని ప్రకటించుచున్నారు? సాంఖ్యతత్త్వమూలభావములను బుద్ధుఁ డెఱిఁగియుండనగును. లోకము దుఃఖమయము, మోక్షమనగా ప్రకృతినుండి వేరగుటయనుభావములు బుద్ధుని కనుకూలముగాఁ గన్పట్టియుండవచ్చును. బౌద్ధస్కంధసిద్ధాంతమునకు సాంఖ్యమానసిక దశాపరిశీలనము ముఖ్యాధారమైయుండవచ్చును. కాని అనేకశతాబ్దముల యనుభవముల సంపుటీకరణమైన సాంఖ్యతత్త్వ మనంతరకాలమునకుఁ జెందినదను విషయ మసత్యముగాదు. నిరంతరపరివర్తమాన మహాప్రవాహమున నొకటివెంబడి నింకొకటివచ్చుచుండు క్షణికస్థితిగలవే వస్తువు లనుబౌద్ధుల క్షణికవాదమును, వస్తుస్థితిదర్శనముపై నాధారపడియున్నదను సిద్ధాంతమును, శూన్యమే పరమసత్యమనుభావమును సాంఖ్యసూత్రములు (౧౮-౨౭-౪౭) ఖండించియున్నవి. మఱియు బౌద్ధమతశాఖాతత్త్వముల జ్ఞానముతోఁ దమకుఁ బరిచయమున్నట్లును, వాని కనంతరకాలమునకే యవి చెందియున్నట్లును సాంఖ్యసూత్రములు చెప్పియున్నవి.

౨౩–బౌద్ధమత విజయము;

ఇంచుమించుగా నొకవేయి సంవత్సరముల కాలము బ్రాహ్మణమతము జాతీయమతమై విలసిల్లియుండగా, బౌద్ధమతము దానిని జీర్ణింపఁజేసి, రెండుశతాబ్దములలో, భారత రాజధర్మమై ప్రకాశించినది. ప్రపంచచరిత్రమున నెచటను ప్రచారక మతములైన ముస్లిము, క్రైస్తవమతములు గూడ

నట్టి యపూర్వవిజయమును బొందియుండలేదు. బుద్ధుఁడైనను, ప్రజాసామాన్యముయొక్క కోరికలకును, నభిప్రాయములకు ననుగుణముగాఁ దనయుపదేశములనుమార్చి బోధించి యుండ లేదు. పాపపరిహారమునకు నాతఁడెట్టి జనాకర్షణములైన తేలిక పద్ధతులను జూపుటకాని, మోక్షమును దాను బంచిపెట్టుచు న్నానను దంభప్రకటనమునుగాని యాతఁడు చేసియుండలేదు. మానవులు సహజముగా వాంఛించు సుఖాభిలాషలన్నిటిని నిశ్చయదీక్షతో నిగ్రహించు పద్ధతిని బోధించిన బుద్ధుఁడు ప్రజాస్వార్థమున కనుగుణమగునుపదేశము నెన్నఁడును జేసియుండ లేదు. బౌద్ధమత విజయకారణములు ముఖ్యముగా త్రిరత్నములు, (౧) బుద్ధుఁడు (౨) ధర్మము, (౩) సంఘము, బుద్ధుని యప్రతిమానమూర్తి, యతని మహనీయ జీవితక్రమము, మానవకోటియెడ నాతని సోదరభావము, యోగిపుంగవుల కాతని చక్రవర్తిత్వము, నివన్నియుఁ బ్రజామానసము నద్భుతముగా నాకర్షించినవి. బౌద్ధమత స్థాపకాచార్యునిఁ గూర్చి బార్తుపండితుఁడిట్లు వ్రాసెను; "ఆవిశ్వవంద్యమూర్తిని మనము సరిగా గ్రహింపవలెను......పరిపూర్ణశాంతి మాధుర్యములు రూపొందిన యాతనిలోకోత్తర సౌజన్యము, సర్వజీవరాసుల యెడ నాతని యనంతకారుణ్యము, ధర్మస్వాతంత్ర్యము, నిర్దుష్టపూర్ణభావ సమన్వితము నైనవాఁడాదివ్యమూర్తి" ౧. "జ్ఞానప్రదములు, శ్రేయోదాయకములుకాని మాటల నాతఁడెన్న

౧. భారతీయుయుతముల పు౹౹ ౧౧౭.

డును మాటాడలేదు. ఆతఁడు విశ్వజ్యోతి. ౨." ఆతని యస
మానౌదార్యము, ధర్మదీక్షాభినివేశము, మానవకోటి నాక
ర్షించియుండకున్నచో నాశ్చర్యముకలిగి యుండెడిది. అతఁడుప
దేశించిన మానవసౌభ్రాతృత్వము, పెంపొందుచున్న వర్ణకాఠి
న్యమునుపశమింపఁజేసెను. సంఘమునందలి శిక్షణము కూడ

౨. మధ్యయుగములందుఁ గూడ మార్కొపోలో బుద్ధునిగూర్చి విని
యిట్లువ్రాసెను. "బుద్ధుఁడు క్రైస్తవుఁడుగాఁబుట్టి యున్నచో నేసుక్రీస్తు
నకుఁ బ్రధానభక్తుఁడై యుండెడివాఁడు. ఏలన, నాతఁడు పవిత్రము,
శుద్ధమునైన జీవితమును గడపెను." "రెండుమతముల స్థాపకులకు, సుగుణశీల
స్వభావములలోఁ జాల సామ్యములున్నవి. ఇరువురు నపూర్వవిమర్శకశక్తిని,
నఖండజ్ఞానమును గలిగియున్నారు. అన్నిటికన్న ముఖ్యముగా నిరువురును
మానవజాతికి ముక్తినే వాంఛించిరి. ఉభయులును ప్రేమరాజ్య సూత్రముల
ప్రకటించిరి; మనసోదరులయెడ మనయెడఁ బ్రేమనేకాక, బుద్ధుఁడు తన
ప్రేమరాజ్యములోఁ బశుజాతినిగూడఁ జేర్చినాఁడు, "ఏప్రాణిని హింసింప
రాదు." సర్వమునుద్యజించి, శిష్యులు తమ్మనుసరింపవలెననియే యిరువురును
బోధించిరి. ఇహలోకసుఖైశ్వర్యత్యాగమును, ఆత్మత్యాగమును, జీవితమునకుత్కృ
ష్టమైన భూతదయాధర్మము నిరువురు సమానముగా నుపదేశించిరి. సంకల్ప
శుద్ధియొక్క అప్రతిమాన ప్రాధాన్యము నిరువురు నుపదేశించిరి.
దోషమునకు ప్రతీకారమును ద్వేషమునకు ప్రేమచే జయింపవలెననియు
నిరువురుచెప్పిరి. శిశువులు, దరిద్రులు, దీనులు, పతితులు నన్న నిరువురకు
నపారకారుణ్యముకలదు. మనకుఁ దెలిసినవారి జీవితగాథలలో నద్భుతసామ్య
ములున్నవి. అన్నిటికంటెఁ బ్రధానము, విలక్షణమునైన దేమనగా, నాక
ర్షకశీలాసదృశమైన వారి జగన్మోహనవ్యక్తిత్వ ప్రభావములు, మహోన్నతస
త్యములై ప్రజాహృదయముల నాకర్షించినవి." "క్రైస్తవేతరులలో మోక్షమా
ర్గము సత్యము, ప్రాణమునైన క్రీస్తునకుఁ బూర్వపురుషుఁడు బుద్ధుఁడని
నేను తలచెదను." బిషప్‌మిల్మన్ మెమాయర్సు. పుట ౨౦౩. (డబ్లియు.
యస్. విల్లీ. అనేకభవనములు పుట౭౦)

ననేకుల నాకర్షించినవి. బుద్ధునివలెనే, యనుచరసన్న్యాసులును సత్యపరిబోధము నిమిత్తము సర్వసంగములను ద్యజించిరి. పవిత్రలీమోక్షమున కర్హులను నాతని మహోన్నత నైతికోపదేశమే, సర్వప్రవక్తల ధర్మసారమై యున్నది. దేవుఁడున్నాఁడని నమ్మనివారికిఁగూడ బుద్ధుఁడు సత్కర్మాచరణ మార్గము నుపదేశించెను. సర్వజీవకృపాపరత్వమును బౌద్ధధర్మము ప్రకటించిన హృదయ ప్రకంపనమొనర్చు ధోరణిలో స్వతంత్రమైన యేయితర ధర్మతత్త్వమును బోధించియుండలేదు. రక్తపాతముతోఁ గూడిన పశువధ యజ్ఞములలో నింకను నడచుచున్న దినములలో సర్వజీవదయా ప్రకటనము నిచ్చిన బౌద్ధసందేశముత్కృష్ట ఫలితము నొసఁగెను. వైదిక కర్మకలాపమున కాతఁడు చూపిన ప్రతిఘటనము వలన నాతని సిద్ధాంతములు జనసామాన్యమునకు రుచించెను. "ఈలోకమున ద్వేషమెన్నఁడును ద్వేషముచే శాంతింపదు; ద్వేషము ప్రేమ చేతనే శాంతించును." "యుద్ధవిజయము ద్వేషమును పోషించును, ఏలనఁ బరాజితుఁడు దుఃఖించును." "రణరంగమున నొక్కఁడే వేయిమందిని జయింపవచ్చును, గాని, ఆత్మజయమును గాంచినవాఁడే ఉత్తమ విజయుఁడు." "క్రోధమును దయచేతను, చెడుగును మంచిచేతను నిగ్రహింప వలెను." "జన్మముచేతఁ గాక, శీలముచేతనే యెవ్వఁడైనను బ్రాహ్మణుఁడుగాని నీచకులజుఁడుగాని యగును." నీవుచేసిన సత్కర్మలను మఱుఁగుపఱచి, నీవుచేసిన పాపములను లోకము నెదుటఁ జెప్పుకొనుము." "పుండుపై నుప్పును మర్దించినట్లు, పాపకర్మ

రెవరిచినను వానిఁగూర్చి దూషణవాక్యముల నెవ్వఁడుపయోగిం చును ?" మున్నగు నుపదేశములనుండి బుద్ధుని బోధామృత ముయొక్క అతిలోక రామణీయకము నెఱుఁగనగును. సౌజన్య ముయొక్క ఘనతనుగూర్చి బుద్ధుని మేఘగంభీర నినాదము వంటి దింకొక చెప్పఁడును మన చెవులఁబడి యుండలేదు. జాజ్వ ల్యమానమైన ధర్మశీలప్రబోధమే బౌద్ధమత విజయమునకుఁ గారణభూతమైనది. బౌద్ధమతప్రచారక తత్త్వముకూడ బుద్ధుని యుపదేశవ్యాప్తికిఁ గొంత హేతువైనది. బుద్ధుఁడు తనశిష్యుల నిట్లాజ్ఞాపించెను. "నానా దేశములకుఁబోయి యీసందేశము నుపదేశింపుఁడు. దరిద్రులు దీనులు, ధనికులు నధికులు సమాను లని బోధింపుఁడు. సాగరములో నదులన్నియుఁ గలియురీతిని, యీమతములో సర్వవర్ణములు గలిసిపోవును." అది ప్రేమ ప్రధాన మతమగుటచేతను, చిరస్థాపిత సంప్రదాయమునకును, వైదిక కర్మకలాపమునకును వ్యతిరేకముగాఁ బనిచేయుచున్న శక్తులకు రూపమిచ్చి ప్రకటించుటవలనను, దీనులు, దరిద్రులు, దిక్కులేనివారు రక్షణార్థులను కారుణ్యసందేశము నిచ్చుట చేతను బౌద్ధమత మఖండవిజయము నందినది.

ఉపయోగించిన గ్రంథములు.

౧. బౌద్ధసూత్రములు. యస్. బి.ఇ. వాల్యూము. ౧౧
౨. ధమ్మపదము; సుత్తనిపాతము. యన్.బి.ఇ.వాల్యూము౧౦
3. మిళిందరాజప్రశ్నములు. యన్.బి.ఇ. వాల్యూములు. 3౫, 3౬.
౪. వారెన్: అనువాదములలో బౌద్ధమతము.

౫. రైస్ డేవిడ్సు: బౌద్ధమతము.
౬. రైస్ డేవిడ్సు: బౌద్ధభారతవర్షము.
౭. రైస్ డేవిడ్సు: బుద్ధసంభాషణములు.
౮. రైస్ డేవిడ్సుసతి: బౌద్ధమతము.
౯. రైస్ డేవిడ్సుసతి: బౌద్ధమనస్తత్త్వశాస్త్రము.
౧౦. రైస్ డేవిడ్సుసతి—ఆంగు. అనురుద్ధుని తత్త్వసాపుటి
౧౧. రైస్ డేవిడ్సుసతి—మాంగ్ టిన్: ది ఎక్సుపొజిటర్.
౧౨. పోసిన్; నిర్వాణమార్గము.
౧౩. కెరన్: భారతీయ బౌద్ధధర్మపట్టిక.
౧౪. హాప్కిన్సు: భారతీయమతములు. ౧౩ అ.
౧౫. హోమ్సు: బౌద్ధతత్త్వము.
౧౬. కుమారస్వామి: బుద్ధుఁడు; బౌద్ధధర్మము.

# భారతీయ తత్త్వశాస్త్రము

## అష్టమాధ్యాయము.

### పౌరాణికతత్త్వశాస్త్రము

#### ౧. బ్రాహ్మణమత పునర్నిర్మాణము

దేశములోఁ దూర్పుభాగమునఁ బ్రతిఘటనోద్యమములు ప్రచారము చేయుచున్నను, బ్రాహ్మణులస్వస్థానమైన పశ్చిమభాగమున నప్రయత్నముగానే పెక్కుమార్పులు జరుగుచున్నవి. విచిత్రవిశ్వాసములను బ్రకటించుచున్న నూతనజాతుల నార్యసంఘములోనికిఁ జేర్చుకొనుచున్న సమయములో, దేశమున విచ్చలవిడిగా సంచరించుచున్న నూతనజాతుల మనోభావముల కనుగుణముగాఁ బ్రాచీన వైదికవిజ్ఞానము ప్రచండపరివర్తన మందవలసివచ్చెను; లేకున్న, వారినార్యజాతులఁగా నొనర్చు కార్యక్రమము కొనసాగదు. అది విస్తరించి, నూత్నరూపములఁ దాల్పవలెను. లేదా, నశించి, యదృశ్యముకావలెను. ఆర్యుల యాభిజాత్యగర్వము, నూత్నజాతులకు యాగకర్మాధికార మొసగుటకిచ్చగింపలేదు; కాని, వారిని విడిచిపెట్టుటకు నిష్టపడలేదు. అవిచ్ఛిన్నముగాఁ దమయభ్యున్నతి కొనసాగవలెనన్నచో, నూత్నవిశ్వాసములను దమవిజ్ఞానమునందు జీర్ణించు

కొని, నవ్యజాతుల నైతికావసరముల కనుగుణముగాఁ బ్రదర్శింప వలసియున్నది. అనార్యుల నార్యులనుగా మార్చు పద్ధతి కేవలము మతసంబంధమైనది. నూత్నజాతుల విశ్వాసములు, చిహ్నములు, కథలు, గాథలుదీసికొని బ్రాహ్మణుఁడు భావాంతరములనందుఁ గల్పించి, వారినానందింపఁజేసెను. వారి దేవతల నాతఁడంగీకరించి, వైదికవిజ్ఞానముతో సమన్వయింపప్రయత్నించెను. కొన్ని అధునాతనములైన యుపనిషత్తులు, అనార్యమత విధానముల పునాదిపై వేదమతపునర్నిర్మాణమునకుఁ బూనుకొనిన యత్నములే. బౌద్ధయుగపూర్వదశలో ననార్యజాతి జన సమూహముల కార్యత్వమిచ్చు మహోద్యమము చెలరేగినకాలమున జనించినవే పాశుపత, భాగవత, తాంత్రికవిధానములన్నియు నైయున్నవి. ఆర్యప్రభావముచే నీ పద్ధతులన్నియు నెట్లు కల్పితములై పోషింపఁబడినవనఁగా, నేఁడవి వేదముల నుండియు, నుపనిషత్తులనుండియు నుదయించినవికావని నమ్ముట కసాధ్యముగానున్నవి. భారతవర్షమున నార్యుల వ్యాప్తిదశలో వైదికమతము వికసించి వ్యాపించిన పద్ధతి నీ రామాయణ మహాభారతేతిహాసములు ప్రదర్శించుచున్నవి.

## ౨—మహాభారతము.

ఒకే భారతకుటుంబమునకుఁజెందిన రెండుశాఖల మధ్య మందుఁజరిగిన ప్రాచీనమహాయుద్ధమును మహాభారతము వర్ణించును. శతపథబ్రాహ్మణము ౧. "భారతవంశీయులుపొందిన యౌన్నత్యమును బూర్వులుకాని, యనంతరకాలజులుకాని పొం

---

౧. ౧౩. ౫ ౪.

దియుండలేద"ని పలుకుచున్నది. ఆర్.సి.దత్తు, ప్రాట్టు ౨ పండితులననుసరించి, క్రీ.పూ. పదిరెండు లేక పదుమూడవ శతాబ్ద ప్రాంతమున జరిగినయుద్ధములోఁ బ్రదర్శింపఁబడిన వీరవిహారములను మహాభారతమువర్ణించినది. దీనిని కోల్‌బ్రూక్ ౧౫-వ శతాబ్దమునకుఁజెందినదనెను; విల్సన్, ఎల్ఫిన్‌స్టోన్, విల్ఫర్డులదే సత్యమనిరి. మెక్డొనెల్ యిట్లువ్రాసినాఁడు: "భారతమూలసారము, చరిత్రమునకాధారరూపమైనది, ప్రాచీన సమీపనివాసులకు నిరువురు రాజకుటుంబములవారి కనగా, కురుపాంచాల వంశీయుల కీ యుద్ధము జరిగియున్నదనుటలో సందేహము లేదు; తరువాత నీ రెండుకుటుంబములును గలిసినవి. యజుర్వేదమున నీ రెండు తెగలు కలిసియున్నవి; భారతవీరులలో ముఖ్యుఁడగు వైచిత్ర్యవీర్యుఁడైన ధృతరాష్ట్రుఁడు విఖ్యాతపురుషుఁడుగాఁ గాఠకమునఁ బేర్కొనఁబడెను. అందుచే నీ యితిహాసమునకుఁ జరిత్రబీజములు చాలపూర్వకాలమునందే, అధమము క్రీ.పూ ౧౦-వ శతాబ్దమునకైనఁ జెందునని చెప్పవలెను." ౩. భీముని రక్తాస్వాదనకాంక్షయు, ద్రౌపది బహుభర్తృత్వమును, దదితరములనుబట్టి, విషయమున కాదిరూప మనార్యమని తెలియుచున్నది. కాని యచిరకాలములో నీ గాథ నార్యగాథగాఁ జేసివైచిరని తోఁచును. దేశమునందలి వివిధరాష్ట్రపతులగాథలలో నొకమహాకావ్యమై, మహాభారతము జాతీయమైన యితిహాసమైనది. సర్వప్రజలకు, వంగదేశమువారికిని, దక్షిణాపథమువారికిని, పంజాబుదేశస్థులకును, దక్కనుప్రాంతీయులకు నీయితి

౨. దత్తు. ప్రాచీనహిందూనాగరికత ౩. సంస్కృతసారస్వతము. పుటలు. ౨౮౭-౮

హాసము సమానముగా నాదరణపాత్రమైనది. ఈ యితిహాస కల్పనము ప్రజాసామాన్యము నాకర్షించినది; అందుచేఁ బ్రజలు చెప్పుకొను కథాప్రపంచమునంతను స్వీకరించినది. జాతియొక్క పూర్వవిశ్వాసములను, సంప్రదాయముల నీయితిహాసము సంకలనమొనర్చి పోషించినది. సర్వభావసంపుటిమై విస్తరించిన యీ మహాభారతమునుగూర్చి, యిందులేనిది భారతీయభూమిలో నేదియులేదని చెప్పుదురు. భారతభూమి నాశ్రయించిన భిన్నజాతుల మతసాంఘికభావముల నిది క్రోడీకరించి, తన్మూలమున భారతవర్షజాతుల కందర కేకత్వమున్న దను భావము నుద్ఘాటించినది. సోదరి నివేదిత యిట్లువ్రాసినది:-

"ఒక పండితుఁడు గాక, ఒక యభిమానపాఠకుఁడుగా నొకవిదేశీయుఁ డీ గ్రంథమును జదివినచో నాతనిదృష్టిని రెండులక్షణము లాకర్షించును: "మొదట భిన్నత్వములో నేకత్వము; రెండవది, నిర్మాణాత్మకమై, యేకమైన పీఠసంప్రదాయమును గలిగి, యేక కేంద్రముగల భారతజాతి భావమునడి శ్రోతల శ్రోత్రకుహరములలో నిరంతరము ధ్వనించును."

### ౩—కాలము – కర్తృత్వము

పూర్వభారతగ్రంథవిస్తరణమే ప్రస్తుతము మనకున్న మహాభారతమని యంగీకరింపఁబడెను. వ్యాసుఁడు మొదట ౨౪,౦౦౦ శ్లోకములుగల గ్రంథముగా మహాభారతమును రచించెననియు, దానినే వ్యాసుఁడే ౬,౦౦౦,౦౦౦ శ్లోకములుగా బెంచెననియు మహాభారతప్రథమాధ్యాయము చెప్పుచున్నది. అం దిప్పుడొక్క లక్షశ్లోకములే మిగిలియున్నవి. ఈభారత

మైనను, యుద్ధవిషయములనుగూర్చి సంప్రదాయసిద్ధములైన పద్యములు, పాటలు, గీతములు మున్నగువానిపై నాధారపడి యుండనగును. మహావీరులు ప్రదర్శించిన ప్రతాపములను, యుద్ధలాఘవమునుజూపిన యోధాగ్రేసరుల గూర్చిన స్తోత్రములను, రాణులసౌందర్యమును, రాజాస్థానముల మహత్తర శోభను ప్రశంసించు కీర్తనములు, గీతములు, యుద్ధనినాదము లింకను ప్రజలశ్రోత్రములలోఁ బ్రతిధ్వనించు కాలముననే రచింపఁబడియుండనోపును. అతిప్రాచీనకాలము నుండియుఁ, బశ్చిమమునఁ గురుపాంచాల దేశములందును,దూర్పునఁ గోసల సీమయందును, వారివారిజాతుల నాయకుల వీరవిజృంభణము లనుగూర్చి, గీతపాఠములు సంకీర్తనములు చేయుచునేయుండిరి. ఈగీతములు పరంపరాగతములైన కారణమున, లిఖింపఁ బడియుండలేదు; అందుచే ననేకపరివర్తనములకులోనై యుండ వచ్చును. తమకు సంబంధింపకున్నను, బ్రాహ్మణమతము వీని నన్నిటిని విడిచిపెట్టుటకు వీలులేదు; ఆర్యవిజ్ఞానమునకును, నార్యులకును బ్రజాసముదాయములో గోచరించిన కథలు, గాథలు, గీతికలు, చారిత్రకోపాఖ్యానములు, నూహాకల్పనములు మున్నగువానికిని సామరస్యముకల్పించి రచించినగ్రంథమే మహాభారతము. యుద్ధమునకు సమీపకాలమునందే, రచింపబడియుండుటచేఁ గావ్యనిర్మాణోద్దేశముకాని, తత్త్వనిర్ణయభావముకాని లేని, వీరగీతమే మొదటభారతమై యుండనగును. దీనిరచనాకాలము క్రీ.పూ. ౧౧౦౦, ప్రాంతమై ౧.

౧. వైద్యపండితుఁడు పూర్వభారతరచనము రమారమి క్రీ. పూ. 3,౧౦౦ గాఁదలఁచెను.

యుండును. నూత్నవిషయపరంపర చేరుచుండుటచే, దానిని నందు జీర్ణించుట కష్టకార్యమైపోయినది; కాని యీపని దిగ్విజయముగాఁ గొనసాగి, మహాభారతరూపమున ఫలించినది. పామరజనగీతములకు, నూతనజాతుల మూఢవిశ్వాసములకు నొకవంకను, నార్యులమతానుష్ఠానదీక్ష కింకొకవంకను జరిగిన అసంతృప్తికరమైన సామరస్యము గ్రంథముఖమున ముద్రితమై గోచరించును. వ్యాసుఁడు తనశక్తినంతను వినియోగించి గ్రంథరచనము చేసెను. నాఁటివాతావరణమున సంచారములోనున్న గాథాసంప్రదాయములను, వీరపూజలను, యుద్ధసంఘటనములను, హృత్కంపము కలిగించు శౌర్యప్రకటనములను, నీతినియమములులేని భిన్నదేవతలకు వైదికనామకరణమొనర్చి వానికి సమన్వయమొనర్చి విశ్వవిస్తృతిగల మహాకావ్యముగా వ్యాసుఁడు ౧. నిర్మింపఁగలిగెను. గీతారూపము మొదటిది; ఉత్తరరూపము భారతము. బహుదేవతారాధనము, కర్మకలాపము వ్యవహారములలోనున్న దినములలో నిది రచింపఁబడి యుండవచ్చును. వైదిక దేవతలైన యింద్రాగ్నుల యారాధనము గల భాగము లీకాలమునకుఁ జెందినవి. ఆదినములలో స్త్రీల కధికమైనస్వాతంత్ర్యమున్నది; వర్ణకాఠిన్యము లేదు. మతశాఖాతత్త్వముగాని, ఆత్మతత్త్వముగాని, అవతారవాదముగాని, నాఁడు లేదు. కృష్ణుఁ డొకచారిత్రిక పురుషుఁడుగా సుప్రసిద్ధుఁడయ్యెను. యవనులు, పహ్లావులు, శాకజాతివారు దేశమునందుఁ బ్రవేశించినది రెండవదశ. సృష్టిస్థితిలయకారకు

౧. ఒకేవ్యక్తి యీగ్రంథకర్త యగునని చెప్పుటనందేహాస్పదమైనది

లైన బ్రహ్మ, విష్ణువు, శివుఁడు నొకే బ్రహ్మమునకుఁ రూపము లైన త్రిమూర్తి భావము వ్యాప్తిలోనున్నది. మొదట నింద్రుఁడు చూపిన ప్రతాపశౌర్యములిపుడు విష్ణువునకు నొకప్పుడు శివునకుఁ గల్పింపఁబడెను. మొదట వీరగాథగా నారంభమైన భారత మిపుడు బ్రాహ్మణమతగ్రంథమై, శివుఁడు, విష్ణువు వరుసగాఁ బరమేశ్వరత్వపదవిని గాంచినవారై, యొక ఆస్తిక గ్రంథముగాఁ దయారైనది. భగవద్గీత యీకాలమునకుఁ జెందినది; కాని యందలితత్త్వవిషయములన్నియు మహాభారతము చివరికాలమునకుఁ జెందియుండవలెను. ఏడెనిమిదిభాగములలోఁ దత్త్వము, మతము, రాజ్యతంత్రము, ధర్మశాస్త్రము మున్నగునవి చర్చింపఁబడెను. బ్రాహ్మణమతము కొలదిమందికుద్దేశింపఁబడినకాలము గతించి, నూత్నవిశ్వాసములను, మతాచరణవిధానములను దనలో లీనమొనర్చుకొనిన సందర్భములో బూర్వవిజ్ఞానములోని తత్త్వవిషయములను నూత్నదశావసరముల కనుగుణముగాఁ బునఃకల్పనము చేయవలసివచ్చెను. ఉపనిషత్తుల అద్వైతమునకును, ప్రజల దైవవిశ్వాసములకును సమన్వయము నిర్మించు యత్నములు జరిగినవి; స్థిరమైన సామరస్యవిధానము నిర్ణయింపఁబడలేదు. భగవద్గీతాగ్రంథకర్త నిష్కళంకమైన యంతర్లోకనశక్తితోడను, సమన్వయసామర్థ్యముతోడను, నూతనమతతత్త్వ నిర్మాణ మొనర్చెను. ఇదియే తదనంతరాస్తిక తత్త్వములన్నిటి కాధారమయ్యెను. భిన్నకాలములకుఁజెందిన భిన్నకర్తలకృతుల కాకరమై, చరిత్రమునకుఁ

గాల్పనికగాథలకు, రాజధర్మములకు నీతిధర్మతత్త్వశాస్త్రములకు నిలయమైన సర్వవిజ్ఞానస్వరూపమై ప్రకాశించినది. ౧.

౧. మహాభారత రచనాకాలము మనకు సరిగాఁ దెలియదు. బౌద్ధమత మదయించిన కాలమున మహాభారతమున్నదని నిస్సంశయముగాఁ జెప్ప వచ్చును. దీని కాలస్వరూపమించుమించుగా క్రీ.పూ. ౫-వ శతాబ్దము నాటికి రచింపఁబడియుండవచ్చునని మెక్డొనల్ భావమైయున్నది. ఇందుబుద్ధుని స్మరణయే లేనికారణముచేఁబై యూహాకుబలము కలుగుచున్నది. పాణినికి భారతమందలి పాత్రలసంగతి తెలియును. (గవియు ధిభ్యామ్ స్థిరః ౭.౩.౯.౫. వాసుదేవార్జునాభ్యామ్ వుణ్. ౪. ౩. ౯. ౭.) అశ్వలాయనసూత్రములు భారతమును మహాభారతమునుస్మరించి యున్నవి. (గృహ్యసూత్రములు ౩.౪. ౪) గుప్తచక్రవర్తులకాలములోని యొకశాసనము మహాభారతమాకాలమున నున్నదని చెప్పుచున్నది. అశ్వఘోషుఁడు తన బుద్ధచరితమునందును, సౌందర నందమునందును, భారతమునుబేర్కొనెను. బౌధాయనుఁడు తనధర్మసూత్రము లలో రెండుశ్లోకముల నుదాహరించెను. అందొకటి భారతములోని యయాతి చరిత్రములోనిది. (౨౮ ౨, ౨౬) రెండవది భగవద్గీతలోనిది (౨. ౨౨, ౯.) ఇతఁడు క్రీ. పూ. ౪౦౦ వాఁడు. ఈసాక్ష్యముల నన్నిటినిబట్టిచూడ మహా భారతము బుద్ధునికాలమునాటికి సుస్థాపితమైయున్నదని స్పష్టము. కాని మహాభారతభాగము లేయే భిన్నచరిత్రలకాలములకుఁ జెందినవో సరిగానిశ్చ యించి చెప్పఁజాలము. క్రీ. పూ. ౫-వ శతాబ్దానంతరమైనను, చాలమంది రచయితలు తమవికాసమందిన నూత్న నైతికమతభావములనందుఁ జొప్పించు టకాని, తదనుగుణముగాఁ గొన్ని మార్పులుచేయుటకాని జరుగలేదని నిశ్చ యింపఁజాలము. కొన్ని భాగములు పురాణకాలమునకుఁజెందినవనియు, క్రీ. వె. ౬-వశతాబ్దమువఱకును గ్రంథము పెరుగుచునేయున్నదనియుఁ గొందరభిప్రా యపడినారు. "క్రీ. వె. ౩౦౦ నాటి కీమహాకావ్యము నిశ్చయముగా గూర్పం పఁబడెననియు, క్రీ వె. ౫౦౦ నాటికిది నేటిరూపమునే కలిగియుండెననియుఁ జెప్పవచ్చును." (బూలర్, క్రిస్టే, మహాభారతపఠనమునకు సాహిత్యము.) ఏది యెట్లున్నను గ్రంథము క్రీ.పూ. ౫౦౦ నాటికేస్థితిలో నున్నదో యిప్ప టికినాస్థితిలో నవిచ్ఛిన్నమైయున్నది.

కొన్ని వేళల మహాభారతము పంచమవేదమని వచింపఁబడినది. సాంఘికధర్మ వ్యక్తిధర్మముల నిరూపించు నధికారప్రమాణముగల గ్రంథమనియు నిది చెప్పఁబడెను. ౨. దుర్బలులకుఁ బతితులకుఁగూడ ధర్మమార్గము నిది యుపదేశించును.౩ బౌద్ధమతగ్రంథము లన్ని వర్ణములవారును జదువవచ్చును; బ్రాహ్మణుల వేద వేదాంగములు ద్విజేతరులు చదువరాదు. ద్విజేతరులకుఁగూడ నుపకరించుట కవసరమై పంచమవేద మేర్పడినది.

## ౪—రామాయణము.

వాల్మీకిరామాయణ మొకసుప్రసిద్ధమైన యితిహాసము. భారతమువలె నిది నానామత భావసంపుటముగాదు. రామాయణవీరుఁడగు రాముఁడు ధర్మమునకవతారము, పరిపూర్ణతకు మూర్తిమత్త్వము, నగుటచే విష్ణువునవతారమని యెంచిరి. అతఁడీలోకమున నధర్మమును రూపుమాపుటకొఱకు, ధర్మమును సంరక్షించునిమిత్తము నుదయించెను. మొదట నితిహాసముగా బయలుదేరిన యీగ్రంథము, వైష్ణవతత్త్వమును బోధించునదిగా మార్పునొందినది. మహాభారతమంత విశ్వజనీన తత్త్వము నిది ప్రకటించదు. పరిపక్వరచనావైదుష్య మిందుఁగలదు; దీనివలన నిది యేకకర్తృకమని చెప్పవచ్చును. కాని

---

౨. ఆశ్వలాయన గృహ్యసూత్రములు. ౩. ౪. ౮

౩. సాయనుఁడు కృష్ణయజుర్వేదభాష్యములో వేదాధికారములేని స్త్రీ శూద్రులకొఱకు మహాభారతము, పురాణములు, కల్పింపఁబడినవని వ్రాసినాఁడు. చూడు బిబ్లియోథికా ఇండికా వాల్యూము ౧. పుట ౨

యిందు మనము రెండుదశలను గనుఁగొనవచ్చును. మొదటిది యితిహాసము; రెండవది మతతత్త్వప్రదర్శనము. ద్వితీయకాండ మొదలు షష్ఠకాండవరకుఁ దీసికొని, తరువాతఁ జేర్చఁబడినవని యందరంగీకరించిన ప్రథమ సప్తమకాండలను విడిచిపెట్టినచోఁ గావ్యముయొక్క ప్రధానవిషయ మైహికమని తెలియఁగలదు. రాముఁడొక సత్పురుషుఁడు, ఘనుఁడు, మహావీరలక్షణసమన్వితుఁడునై, దక్షిణదేశమును నాగరికతాపర మొనర్చుటకొఱకనాగరకజాతుల నాతఁ డుపయోగించెననియుఁ జెప్పవచ్చునే కాని, విష్ణ్వవతారముకాదని స్పష్టమగును. రామాయణము ప్రకటించు మతము బహుదేవతారాధనము, బాహ్యము. ఇంద్రాధిపత్యముగల వైదికదేవతలిందుఁ గలరు. నూత్నదేవతలైన, కామ, కుబేర. కార్తికేయులును ఉమా గంగా లక్ష్మీదేవులును, దేవతాస్థానములొసఁగఁబడిన సర్పరాజైన శేషఫణి, మర్కటమైన హనుమంతుఁడును, నెలుగుబంటియైన జాంబవంతుఁడును, గరుడపక్షియు, జటాయువును, శివునివాహనమైన వృషభమును ముఖ్యస్థానమును బడసినవి. యాగమే పూజావిధానము. విష్ణువునకు, శివునకు నగ్రస్థానములున్నను, సర్ప వృక్ష నదీపూజలున్నవి. కర్మయుఁ, బునర్జన్మవిశ్వాసమునున్నవి. మతశాఖలు లేవు. రెండవదశలో యవనులు, పార్థియనులు, సిథియనులు పేర్కొనఁబడిరి. రాముఁడు విష్ణ్వవతారమని స్థాపించుయత్నములున్నవి.

తత్కాలాచార విశ్వాసములను రామాయణమే విశేషముగాఁ బ్రదర్శించినను, మతతత్త్వదృక్పథములో మహాభార

తమునకుఁ గలప్రాముఖ్యము రామాయణమునకు లేదు. గృహస్థధర్మము నదిపోషించి, మోక్షసంపాదనమునకు సంసారపరిత్యాగ మవసరములేదని చెప్పినది గావున, రామాయణము బౌద్ధసన్యాసిమతమునకుఁ బ్రతిఘటన రూపముగా నుద్భవించిన దని కొందరు తలఁచుచున్నారు.

రామాయణము బుద్ధుఁడు నాస్తికుఁడనిగ స్మరించియుండుటచే, మహాభారత కాలమునకుఁ దరువాతనే రామాయణరచనము జరిగియుండుననియు, నందలి కథమాత్రము మహాభారత పూర్వగాథయే యైయుండవచ్చుననియుఁ దోఁచుచున్నది.

భారతీయ తత్త్వశాస్త్రాభిమానియైన సత్యప్రియునకుఁ గౌతుకము గలిగించు మహాభారత భాగములు, సనత్సుజాతీయము, భగవద్గీతా, మోక్షధర్మము, అనుగీతయునైయున్నవి. యుద్ధపరిసమాప్తి కాలమున నర్జునుఁడు, యుద్ధారంభవేళ శ్రీకృష్ణుఁడు తనకుపదేశించిన గీతినుపదేశింపుమని కోరగా, దత్సమానమైన యోగదృష్టి తిరిగి లభించుట దుస్తరమని పలికి, దానికిబదులుగా ననుగీతనుపదేశించెను. భిన్నభావములను సమన్వయించుటకు భగవద్గీత యత్నించిన మాటనటుంచి, మహాభారతము భిన్నవిశ్వాస సంకలనమేకాని సమన్వయముకాదని చెప్పవచ్చును. అనేకములగు తత్త్వశాఖలున్నవని యనుగీత పలుకుచున్నది. "వివిధరూపములగు ధర్మనియమములు పరస్పరవిరుద్ధములుగాఁ దోఁచుచున్నవి. శరీరము నశించిన వెనుక

---

౧. అయోధ్యాకాండము.

గూడ ధర్మముండునని కొందరనుచున్నారు; ఉండదని కొందరు పలుకుచున్నారు; కొందరంతయు సంశయాస్పదమనియుఁ గొందరు సందేహమే లేదనియు వచింతురు. కొందరు శాశ్వతమనఁబడు వస్తువశాశ్వతమనియుఁగాదు శాశ్వతమేయని కొందరును వాకొనుచున్నారు. సత్యము నిత్యము వనిత్యముగూడనని కొందరువాదించుచున్నారు. కొందరు సత్పదార్థమేకమనియుఁ గొందరది ద్వైతరూపమనియు, మఱికొందరది ద్వైతాద్వైతరూపమనియుఁ జెప్పుదురు. బ్రహ్మవేత్తలైన కొందరు బ్రాహ్మణులు బ్రహ్మమేకమనియుఁ, గొందరది భేదరూపమనియు నితరులది నానారూపములు గలదనియుఁ జెప్పుచున్నారు. దేశకాలములు సత్యములని కొందరును, కాదని కొందరును వచించుచున్నారు."[1] అన్యోన్యవిరుద్ధభావము లొకచోఁ గూర్పఁబడినవి; వేదముల బహుదేవతారాధనము, నుపనిషత్తుల యద్వైతము, సాంఖ్యద్వైతము, యోగదైవత్వము, భాగవత, పాశుపతశాక్తేయుల యేకేశ్వరవాదము నిందుఁగలవు. వివిధ మత భావపరిశీలనమును భావిగ్రంథ భాగమునకు విడిచి, యిచట మహాభారత రచయితలగు వైజ్ఞానికుల తత్త్వభావములను మనము దర్శింపవచ్చును.

౫—యుగసామాన్య భావములు.

భిన్నతత్త్వలక్షణములు మహాభారతములో నుండుటచే నది యేప్రమాణముల నంగీకరించినదో విస్పష్టముగాఁ జెప్పుట కష్టము. సాధారణముగా వేదప్రమాణ మంగీకరించినది. ప్రి

---

౧. ౧. ౧౮-అధ్యాయము.

త్యక్షానుమానాగమ ప్రమాణములను గుర్తించెను. కొన్నిచో ట్లందు న్యాయశాస్త్రమునకుఁ జెందిన నాలుగు ప్రమాణములు నిందుఁ బేర్కొనఁబడెను. ౨. వేదప్రమాణ విరోధులకె నదితప్పక ఖండించును. వేదనిందకులైన నాస్తికుల వాదమును సాంఖ్యతత్త్వాభిమానియైన పంచశిఖుఁడు ౩ నిరసించెను. లోకాయతులును ౫ పేర్కొనఁబడిరి. హేతుమంతులైన పండితులు, ఆత్మసత్యమును, నిత్యత్వమును దృణీకరించుచు "భూమండలమంతయు సంచరించుచుండిరి." ౬. "దిగంబరుఁడై యున్మాదునివలె నొకఁడు కాశీక్షేత్రమున గంతులిడి, ప్రజలనాశ్చర్యచకితుల నొనర్చె"నను వాక్యములు జైనుల నుదాహరించినవి.౭. బౌద్ధమత ప్రతిఘటనము కన్పట్టును. "నీవంతకాంతిగలదానవగుటకుఁ గారణమేమి?" యని యొకకాంత యింకొకకాంతనడుగగా, నామెకిట్లు బదులుచెప్పెను: "నేను కాషాయవస్త్రములనుగాని నారచీరలనుగాని ధరించలేదు; ముండితశిరముగాని, జటాభారముకాని నాకు లేదు." ౧. మతద్రోహము, వేదనింద, నరకహేతువులనియు,క్షుద్రజన్మములకుఁ గారణములనియుఁ జెప్పఁబడెను. మహాభారతములో నొకపాత్ర యిట్లు చెప్పుచున్నది; "నేను నక్కనై పుట్టుటకుఁ గారణము, పూర్వజన్మములోనే నొక కుత్రిమపండితుఁడను, దర్కవా

(౨) ౧౨అ. ౫౬.౪౧. (౩) ౨అ. ౩౧.౭౦ (౪) శాంతిపర్వమ్ ౨౧౯. (౫) ౧అ. ౭౦.౪౬ (౬) ౧౨అ. ౧౯.౨౩. (౭) ౧౪ అ. ౬.౧౯.

౧. ౧౩అ. ౧౨౩.౯. మూడు౧౨అ. ౧౯.౩౭

దిని, వేదవిమర్శకుఁడను; కుతర్కము, పిడివాదము చేయుచు, సభాముఖముల నుపన్యసించుచుఁ, బురోహితుల నిందించుచు, బ్రహ్మాస్తిత్వవాదములను నిరసించుచు, నాస్తికుఁడనై, సంశయాత్మకుఁడనై, నేను నొకపండితుఁడనను నహంకారముతో నుంటిని." ౨. పురాణేతిహాసములును బ్రమాణములే యని చెప్పఁబడెను. ౩. వేదప్రమాణమును గూర్చి యచటచట సంశయము కూడ వ్యక్తమయ్యెను. "వేదము మోసగించు నది." ౪ విధిని మేధాతిథులకు వేదమును బ్రమాణము కాదని చెప్పిన యుపనిషదభిప్రాయ మిచట సూచింపఁబడెనని తోఁచును.

మహాభారతము వేదమతము నంగీకరించి, దానిని విశేషముగ వికసింపఁజేసినది. పూర్వధర్మమును బోషించి, నూతన దేవతల ప్రవేశమున కనుకూలమొనర్చినది. ఇంద్రుఁడు దుర్బలుఁడయ్యెను; సూర్యకుటుంబ దేవతయైన విష్ణువు గుణములు శక్తులు, అగ్నిసూర్యులకు సంక్రమించినవి. యముఁడు తనఘనతను నిలుపుకొనునుగాని, ధర్మరాజగును. "కొందరు తలచునట్లు యముఁడు మృత్యువుకాదు. సుకృతుల కానందమును బాపులకు దుఃఖమును నొసఁగువాఁడు యముఁడు." ౫ వాయువరుణులు తమ గౌరవములను గోల్పోయిరి. ప్రజాపతి యథాస్థానము నలంకరించెను. విష్ణువు, శివుఁడు ప్రాముఖ్యము పొందకపూర్వము సుప్రసిద్ధుఁడై యుండెను. ప్రథమ బౌద్ధ

(౨) ౧౨అ. ౧౮౦. ౪౭-౪౮. (౩) ౧౨ అ. ౩౪౩.౬౦. (౫)గీత ౪౨౬. ౪.౧౨ అ. ౪౨౬

పాలీ సారస్వతమున నిట్టి దశయున్నది. రెండవఘట్టములోఁ దిమూర్తిభావ ముదయించెను. బ్రహ్మవిష్ణు శివులు, పరమేశ్వరుని భిన్నరూపములే; పదవిలోఁ బరస్పర సహాకారబంధము గలవారు. ఈవిషయము మెగస్తనీసుకుఁ దెలియును. స్పష్టము లైన భేదలక్షణములు దెలియకున్నను, విష్ణుశివు లిరువురు దేవతాశ్రేష్ఠులైరి. ఇరువురు సులభముగా నొండొరులతోఁ గలిసిపోయిరి. ౧ ఒకగీతము విష్ణుపరముగా శివునికి, శివపర ముగా విష్ణువునకుఁ జెప్పఁబడెను. ౨. మూఁడవదశలో నితిహాస వీరుఁడగు కృష్ణునకు విష్ణువుతో నైక్యము కల్పింపఁబడినది. కృష్ణతత్త్వము, ప్రకృతివస్త్వారాధనమందలి మూఢవిశ్వాసము లను, గర్జకలాపమును దిగఁద్రొక్కినది. కృష్ణుని కాళీయశిరో నాట్యమునకర్థము, కృష్ణుఁడు నాగపూజను నిరసించుటయే. ఇవివలన నింద్రుని పరాజయము వైదికసంప్రదాయమునకు బరాజయము, విష్ణుతత్త్వమునకు విజయము.

దేవతలందరలో శ్రేష్ఠుఁడొకఁడున్నాఁడను తత్త్వమింకను ప్రచారములోనున్నది. "నేను నారాయణుఁడను, సృష్టికర్తను, నాశకారకుఁడను, నేనే విష్ణువును, బ్రహ్మను, దేవతాధిపతియైన యింద్రుని నేనే, నేను గుబేరుఁడను, యముఁడను, శివుఁడను, సోముఁడను, గాశ్యపుఁడను, ప్రజాపతిని."3. ఉపనిషత్తుల యేకేశ్వరతత్త్వము ప్రబలమై, దేవతలందరు నొకే బ్రహ్మరూపములని వ్యక్తీకరించును. దేవుని అంతర్యామిత్వ మంగీకరింపఁబడెను. ఉపనిషత్తుల నిర్గుణబ్రహ్మము సగుణబ్రి

౧. 3అ. ౧౮౯.౫. (౨) 3అ. 3౯.౭౬. (3) 3అ. ౧౮౯.౫.

హ్మమై, యీశ్వరుఁడనియు, శివ, విష్ణు, కృష్ణ ౪. నామము లను బొందెను. నిష్కామభక్తియే మహాభారత మతసారము. నిర్గుణబ్రహ్మము పూజావిధానమున కనుకూలముకాదు; అందుచే సకల కల్యాణగుణమూర్తి యగు నీశ్వరుఁడు మహాభారతమునకు దేవుఁడయ్యెను. సగుణ నిర్గుణమూర్తులలో నిర్గుణబ్రహ్మమే పరమసత్యమను నమ్మకమున్నది. ౫. వ్యక్తమైన వాసుదేవునికంటె నవ్యక్తబ్రహ్మమధికుఁడు. "అవ్యక్తబ్రహ్మమే పరమసత్యము, నిత్యము, అవినాశము, అవికారమునైనది." ౬. కాని ప్రాధాన్యము సగుణమూర్తియైన వాసుదేవుని కీయఁబడెను. మతానుష్ఠాన దృక్పథములో నీభావము నుపనిషత్తులును బోధించినవి. ౭.

భిన్నమార్గములలో నేకసత్యమునకుఁ దీసికొనిపోవు నను నొకవిధమైన నిశ్చయజ్ఞానముచేఁ బ్రజాసమూహములోనున్న భిన్నవిశ్వాసములను మహాభారత మంగీకరించినది. "పంచజ్ఞానతత్త్వములు, నారాయణ తత్త్వమునే బోధించి, భిన్నభావములతో నర్చించినవి. జ్ఞానహీను లీరహస్యము నెఱుఁగరు" పూర్వవైదిక మతముఁ క్రమముగా నితిహాసములలో నవ్యహిందూమతముగా మారినది. అవైదికములైన ఆగమవర్గమునకుఁ జెందినశాక్త, పాశుపత, శైవ, పాంచరాత్రతత్త్వములు

---

(౪) పతంజలి శివభాగవతులగూర్చి ప్రసంగించెను. చూడు మహాభాష్యము. ౨౮ ౭౬ ౫. శాంతిపర్వము 33౯. ౨౧-౨౯. (౬) శాంతిపర్వమ్. ౧౬౨ ౧౦. ౭. చూడు కఠోపనిషత్తు ౧౮. ౨.౨౦; శ్వేతాశ్వతరము 3౮ ౨౦; ౬౮. ౨౧; ముండకము. 3౮. ౨.3

హిందూమతములో మిళితములైనవి. దేవాలయ విగ్రహారాధనము, పుణ్యతీర్థయాత్రలు క్రమముగా వచ్చిచేరినవి. మహాభారతమునఁ బ్రసంగింపఁబడిన భిన్నతత్త్వముల జ్ఞానమును, శాస్త్రనిర్మాణ యుగమున బ్రహ్మసూత్రార్థ నిర్ణయప్రయత్నముల నర్థము చేసికొనుట కవసరమై యుండును గాన, వానిని సంగ్రహముగా మనమిచటఁ దెలిసికొనుట మంచిది.

## ౬—దుర్గాపూజ

మహాభారత భీష్మపర్వారంభమున దుర్గాపూజ పేర్కొనఁబడినది. యుద్ధారంభమునకుముందుగా దుర్గాదేవికిఁ బ్రణామమాచరించి, విజయమిమ్మని ప్రార్థింపుమని కృష్ణుఁ డర్జునునికిఁ జెప్పినాఁడు. ౧. మొదటిదశలో నీమె వింధ్యాద్రియందలి జాతులచేఁ బూజింపఁబడిన కన్యాదేవత. త్వరలో నేయామె శివుని భార్యయై ఉమాదేవియైనది. మార్కండేయపురాణమునందును, హరివంశములోని రెండు శ్లోకములందును, ౨. నొక గొప్పమత శాఖకు నీ దుర్గాంబ మూలాధారమైనది. ౭-వ శతాబ్ద పూర్వభాగమున బాణకవి చండీశతకమును రచించెను.

౧. ౨౩౯. ఆమెకుఁ బెక్కు నామములీయఁబడెను: కుమారి, కాళి, కపాలి. మహాకాళి, చండి, కాంతారవాసిని, మున్నగునవి. విరాటపర్వమున యుధిష్ఠిరుఁడు దుర్గాప్రార్థనము చేసిన యొకశ్లోకముకలదు. (౬-౯) వింధ్యపర్వతములలో సురాపానము, మాంసభోజనము, పశుహింసలు చేయుచు మహిషాసురునిజంపినదానిగా స్తోత్రమున్నది. కృష్ణునివలెనే నీలమేఘశ్యామవర్ణముగలదికావున నామె కృష్ణుని చెలియలనియుఁ దలఁపఁబడెను.

౨. ౫౯, ౧౬౬౯. చూడు ఏవలెన్ (దేవీస్తోత్రములు)

శక్తిపూజ మొదట ననార్యజాతులలోనుండి, తరువాతఁ గ్రమముగా నార్యులచే నంగీకరింపఁబడినది. ఈమె భయంకర రూపిణియై, విలయశక్తుల కాధారమైనకారణమున, రుద్రుని భార్యగాఁ జేయఁబడినది. ఋగ్వేదమునందలి దేవస్వరూపములతో నీమెనుగలుపుటకు రుద్రాణి, భవానియను నామకరణములచేఁ బ్రయత్నములు చేయఁబడెను. సర్వజీవమూలశక్తి రూపమును స్తుతించుటకు రచితమైనదని చెప్పఁబడిన దేవీసూక్తము 3, శాక్తేయమతమున కాధారమైనది. అందలి యారవశ్లోక మిట్లున్నది: "బ్రహ్మద్వేషియైన దుర్మార్గుని ఖండించుటకు రుద్రునికొఱకు నేను ధనుస్సునెక్కుపెట్టుచున్నాను. మానవునికొఱకు నేను రణమొనర్తును. భూమ్యాకాశములు నేనావరించియున్నాను." ఆకాశముతో నారంభించిన యీ జగమంతటిని బరమాత్మనుండి యావిష్కరించునట్టి శక్తి యీమె. "నేను వాయువువలె సంచరించి సర్వమును గల్పింతును." ౧. అసురులనోడించి కాంచిన జయగర్వాంధులైన దేవతలకు బుద్ధి చెప్పిన దేవిగాఁ గేనోపనిషత్తునందీమె వర్ణింపఁబడినది. తుదకామె దేవేంద్రునెదుట నొక సుందరాంగిరూపమునఁ బ్రత్యక్షమై ఉమాహైమవతి యనుపేరుతో నాతనికి జ్ఞానోపదేశమొనర్చును. తరువాత నామె బ్రహ్మయొక్క మాయాశక్తియైనది. ఈదేవియొక్క శక్తిసాహాయ్యములేకుండ సృష్టిస్థితి లయ కార్యములను బరమేశ్వరుఁడు చేయఁజాలఁడని యొకతత్త్వ

3. ఆర్. వి. ౧౦ అ.౧౨౫.

౧. ౧౦ అ. ౧౩.౮.

వ్యాఖ్యబయలు దేరినది. ఈశ్వరుఁడు సృజించునపు డాతఁడు వాక్ఛక్తి చేతను, రక్షించునపుడాతఁడు శ్రీ లేక లక్ష్మీశక్తి చేతను, లయముచేయునపుడు దుర్గాశక్తి చేతను నావహింపఁబడునని చెప్పుదురు. సర్వజీవస్థితికాధారము, పోషకము, నాశకమునైన శక్తి యీశ్వరి. శక్తిమతశాఖ నార్యవంతమొనర్చుటకు యత్నములుచేయఁబడినను, నేటివఱకుఁగూడ వాడుకలోనున్న కొన్ని శాక్తేయుల యాచారములవలన లోపభూయిష్ఠమైనదని తెలియఁగలదు.

## ౭—పాశుపతతత్త్వము

మహాభారతమునందు శివునకుసంబంధించిన పాశుపత దైవతత్త్వము చెప్పఁబడినది. ౧. ప్రకృతి నాశనశక్తులమూర్తియైన ఋగ్వేదమందలి (౧ మం. ౧౧౪, ౮.) రుద్రుఁడు, శతరుద్రీయమునందుఁ బశుపతియైనాఁడు. బ్రాహ్మణములందు రుద్రునకుఁ బర్యాయపదముగ శివశబ్దము వాడఁబడెను. పాశుపతతత్త్వము రుద్ర–శివ సంప్రదాయమైనది.

సర్వదర్శనసంగ్రహమందును, ౧ అద్వైతానందునిబ్రహ్మవిద్యాభరణమందును, పాశుపతతత్త్వ వివరణమున్నది. తన

---

(౧) (శాంతిపర్వమ్. ౩౪౯. ౫౬౪) నారాయణీయప్రకరణమునందుఁ బంచమత తత్త్వములలోనిది యొకటిగాఁ జెప్పఁబడెను. వనపర్వమునం దర్జునుఁడు, హిమాద్రి నమానాధుఁడై, దేవగణపరివృతుఁడై,యున్న పశుపతి యొద్దఁ బాశుపతాస్త్రమును బడసెననియున్నది. ఇతఁడీ ఋగ్వేదమునందలి మరుద్గణాధిపతియైన రుద్రుఁడనీ తలపవచ్చును.

౧౬.౮ అధ్యాయము

వేదాంతసూత్రభాష్యమున శంకరుఁడీద్వైతతత్త్వమును విమర్శిం చినాఁడు.౨. దీనిముఖ్యములైన పంచప్రమాణములునిట్లున్నవి. (౧) కారణము, జగమునకు సృష్టిస్థితిలయకారకుఁడు, శాశ్వత పరిపాలకుఁడు, పతి లేక ప్రభువైనవాఁడు కారణము. (౨) కార్యము. ఇది కారణముపైనాధారపడినది. కార్యమున విద్య, కళలు లేక నింద్రియములు, జీవులు లేక పశువులు నున్నవి. సర్వస్థితిజ్ఞానములు, పంచభూతములు, పంచగుణములు, పంచేం ద్రియములు, పంచకర్మేంద్రియములు, బుద్ధిచిత్తాహంకార ములు పతిపై నాధారపడియున్నవి. (౩) యోగము లేక శిక్ష ణము. మానవుఁడు మానసికశిక్షచే దేవునిజేరువిధానము. (౪) విధి లేక నియమములు; అనగా ధర్మానుష్ఠానమార్గములు. (౫) దుఃఖాంతము.దుఃఖనిర్మూలనమగు మోక్షము;పూర్ణజ్ఞాన క్రియాశక్తులుగలస్థితి. మోక్షావస్థయందైనను, జీవి తన ప్రత్యే కవ్యక్తిత్వమునుగలిగియేయుండి, స్వేచ్ఛారూపములను బొం దుచు నేపనినైనను సంకల్పమాత్రమునఁ జేయఁగలిగియుండును. వైశేషికసూత్రములకు మొదటివ్యాఖ్యాతయైన ప్రశస్తపాదుఁ డును, న్యాయభాష్యమునకు టీకవ్రాసిన ఉద్యోతకారుఁడును, పాశుపతతత్త్వవాదులు.

౮—వాసుదేవుఁడగు కృష్ణుఁడు

ఇపుడు మనము చర్చించునది మహాభారతమున సుప్రసి ద్ధమైన వాసుదేవ కృష్ణతత్త్వము. ఇది భగవద్గీతకును, నభినవ వైష్ణవమతమునకు నాధారమైనది. భాగవతమతాభివృద్ధిలో

౨. శంకరభాష్యము. ౨ అ. ౨-౫౧. ౫౫

నాలుగుదశలున్నవని గార్బెచూపినాఁడు. మొదటిదశలోనిది బ్రాహ్మణతత్త్వమునకు వేఱైనది. గార్బెభావములో క్రీ. పూ. ౩౦౦ వఱకు వ్యాపించిన ప్రథమదశా లక్షణములేవనగా, కృష్ణ వాసుదేవాత్మకమైన యేకేశ్వరవాదము, సాంఖ్యయోగములతోడి సఖ్యభావము, మతస్థాపకుని దైవముగానొనర్చిన విషయము, భక్తిభావముచే నతిశయమైన మతతత్త్వము నైయున్నవి. వేదాంతసూత్రభాష్యకారులచే విమర్శింపఁబడిన అవైదిక లక్షణములుగల యీమత మీదశకుఁ జెందినది. ఈమతము బ్రాహ్మణ భావపూరితమగుట, కృష్ణుఁడే విష్ణువనుట, విష్ణువునకత్యంతప్రాముఖ్యమునిచ్చుట విష్ణువు గొప్ప దేవుఁడనుట యే కాక, సర్వదేవతలకు నగ్రగణ్యుఁడనుటయు నీ రెండవదశకు (క్రీ. పూ. ౩౦౦) జెందినవి. విష్ణువునారాధించువారు వైష్ణవులను శబ్దప్రయోగము మహాభారతమునఁ గలదు.౧ వేదమునందలి విష్ణ్వారాధనమునకు నిర్వ్యాజ కృపాసిద్ధాంతము లేదు. మూఁడవదశ భాగవతమతము వైష్ణవమతముగా మారుట. వేదాంత సాంఖ్యయోగతత్త్వభావములిందుఁ గూర్పఁబడినవి. క్రీ. వె. ఒకటి మొదలు పదిరెండవశతాబ్దమువఱకు నిట్టిపరివర్తనముజరిగినదని గార్బెయభిప్రాయపడినాఁడు. రామానుజుఁడు వైష్ణవతత్త్వనిర్మాణముచేయుట తుదిదశ. ఇచట మనకు మొదటి రెండుదశలతోడనే సంబంధము.

హరిగీతా౨ భగవద్గీత౩ లలోఁ జెప్పఁబడిన సిద్ధాంతము

౧. ౧౨౫. ౬-౯౭. (౨) ౩౪౮-౫౩. ఇదియొక ఏకాంతికమతము నారాయణీయము, సాత్వతము, ఏకాంతికము, భాగవతము, పాంచరా

శ్వేతద్వీపమునందుఁ బరమేశ్వరుఁడు, నారదునకుఁ జేసిన వాసుదేవనాయకమైన భాగవతమతోపదేశమే.

మహాభారతమందలి నారాయణీయ ప్రకరణములో నరనారాయణులను జూచుటకు, నారదుఁడు బదరికాశ్రమమునకుఁ బోయిన కథగలదు. అచట నారాయణుఁడు కొన్ని పుణ్యకర్మలు చేయుచుండుటగాంచి, సర్వజగత్కర్తయైన యాతఁడు కూడ దేనినిఁగోరి యట్టికర్మ నాచరింపవలసివచ్చెనని నారదుఁడడిగెను. నారాయణుఁడు తనకు నిత్యరూపమైన అవ్యక్తబ్రి

---

త్రము. సమానార్థకపదములుగా వాడఁబడినవి. ఈశాఖకు ముఖ్యాధారగ్రంథములు మహాభారత నారాయణీయ ప్రకరణము, శాండిల్యసూత్రములు, భాగవతపురాణము, పాంచరాత్రాగమములు, రామానుజుని యొక్కయు నాల్వారులయొక్కయు రచనములు. దీనికి ముఖ్యగ్రంథములుగా బ్రహ్మవైవర్తపురాణము, భాగవతము, విష్ణుపురాణము, భగవద్గీత, మహాభారతము (౨అ. ౭.౨౮-౩౨; ౩అ ౧౪ ౭౩; ౪అ. ౩.౧౯౪)నని నారదపాంచరాత్రము చెప్పుచున్నది. క్రీ. శ. ౧౨-వ శతాబ్దమునకుఁ జెందిన కారణమున రామానుజుని రచనములు మనకిచటఁ బనికిరావు. రామానుజుఁడుపనిషత్తుల అద్వైతమును, భాగవతమును సమన్వయింప యత్నించును భాగవతమైనను మన యన్వేషణమునకుపకారికాదేలన, మహాభారతమునందు భక్తిమతమునకుఁ దానుసరియగు స్థానమీయని కారణమున భాగవతమును రచించినట్లు వ్యాసుఁడు వ్రాసికొనెను. (౧అ ౪.౫) నారదునికోరిక ననుసరించి, భాగవతమును వ్యాసుఁడు భక్తిప్రధానముగా రచించెను. నారదసూత్రములు శాండిల్యసూత్రములు మహాభారతమున కనంతరము రచింపఁబడినవి.

భాగవతమునకు నారదసూత్రములు శుక వ్యాసులను స్మరించెను. (నా. సూ. ౮౩) శాండిల్యసూత్రములు భగవద్గీతనుండి (౯-౧౫) శ్లోకముల నుదాహరించెను. కావున మనకు ముఖ్యాధారము మహాభారతనారాయణీయ ప్రకరణము

హ్మామును ధ్యానించుచున్నానని నారాయణుఁడు బదులుచె ప్పెను. అట్టి రూపమును జూడవలెనని కోరి, నారదుఁడు శ్వేతద్వీపమునకుఁ బోగా,ఁ దనయందుఁ బూర్ణనిశ్చల భక్తిగల వానికేఁగాని తనరూపము గోచరింపదని పరమపురుషుఁడు జెప్పెను. వాసుదేవమతము నారదునకుపదేశింపఁబడినది. వాసుదేవుఁడే పరమాత్మ, సర్వాంతర్యామి. జీవాధిపతి. వాసుదేవుని పరరూపమైన సంకర్షణుఁడు; సంకర్షణ సంజాతుఁడు ప్రద్యుమ్నుఁడు లేక మనస్సు, ప్రద్యు
లేక ఆత్మజ్ఞానము. ఈనాలుగును బరమేశ్వరుని దివ్యరూపములు. ఈరూపములు, లేక వ్యూహముల సంఖ్యాస్వభావములనుగూర్చి భిన్నభావములు గలవని మహాభారతము చెప్పుచున్నది. ౧. భగవద్గీత వీనిని స్మరింపలేదు. సృష్టిసిద్ధాంతమునకు నీవ్యూహపద్ధతి విరుద్ధముగానున్నదని వేదాంతసూత్రములు విమర్శించుచున్నవి. వరాహనారసింహ, వామన పరశురామ, శ్రీరామావతారములను జెప్పి "మధురలోఁ గంసుని నాశనమొనర్చ నవతారము జనించు"నని రచింపఁబడియున్నది. బుద్ధుఁడవతారముగాఁ జెప్పఁబడలేదు. భీష్ముఁడు యుధిష్ఠిరునకుఁ జెప్పిన ఉపరిచరవసుచరిత్రము వ్యూహములను బేర్కొనలేదు. ౨. దీనివలన రెండువిషయములు స్పష్టములగుచున్నవి:

---

౧. శాంతిపర్వమ్. ౩౪౮. ౫౭. (౨) మొదటఁ జిత్రశిఖండులచే స్థాపితమైన పాంచరాత్రమతమును పరిచరవసువు స్వీకరించెను భగవంతుని సాన్నిధ్యమున నీతత్త్వమును మొదట ఋషులు ప్రతిపాదించిరి. భగవంతుఁడిట్లు చెప్పెను: "మీరుత్కృష్టములగు లక్షశ్లోకములను రచించిరి. అవి

భాగవతమత మేకేశ్వరమతమనియు, నందలి మోక్షసాధనము భక్తిమార్గమనియుఁ దెలియుచున్నది. పశువధ నిరసింపఁబడెను. పశుహింస చేయరాదని చెప్పినకారణముననే బుద్ధుఁడు విష్ణ్వవతార పురుషుఁడని చెప్పఁబడెను. భక్తికర్మాభ్యాస మేక కాలమునఁ జేయవలెనని యీమతము చెప్పెను. 3. సంసార పరిత్యాగముతోడి సన్న్యాస మీమతమంగీకరింపదు. ౪.

భగవంతుని మొదటి ప్రసిద్ధనామము వాసుదేవుఁడు.౫ “నిత్యుఁడు, ప్రేమనిలయుఁడు, దయాసముద్రుఁడు, అబోధ్యుఁడునైన దేవుఁడే వాసుదేవుఁడు.” ౬. ఈనామము భాగవత

---

వేదానుకూలములై, మానవులకవసరములగు సర్వనియమములను గలిగియున్నవి. కర్మ ధ్యానమతమార్గముల రెంటినవి చెప్పెను. ఈశాస్త్రము గురుశిష్యపరంపరగాలమున బృహస్పతికఱకువచ్చెను. బృహస్పతినుండి వసురాజు దీనిని గ్రహించి, నా భక్తుఁడగును.” వసురాజశ్వమేధము చేయుగా బృహస్పతి పురోహితుఁడగును. ఏకత,ద్విత,త్రితులు యాగసదస్యులగుదురు. అందు పశువధలేదు. దేవుఁడు వసురాజునకేదర్శనమిచ్చి యాతనిహోమమును స్వీకరించును. బృహస్పతి కోపగించును. సదస్యులు దైవకటాక్షములేనిదే దైవసాక్షాత్కారములభింపదని చెప్పుదురు. అపుడు వారు శ్వేతద్వీపమున చంద్రనిభకాంతిగల భక్తులుగలరనియు, వారికింద్రియములు లేవనియు, వారు నిరాహారులనియు, సూర్యతేజోవిరాజితుఁడగు దేవునియందు మగ్నులైయున్నారనియు, చెప్పిరి. తామచటనే భక్తిగలవానికేఁగాని దైవముప్రత్యక్షముగాఁడను జ్ఞానమును దెలిసికొనిరనియుఁ దెల్పిరి. (చూడు. భండార్కరు. వైష్ణవమతము)

3. శాంతిపర్వము. ౩౩౪-౩౫౧.

౪. పోల్చు: ప్రవృత్తి లక్షణశ్చైవ ధర్మో నారాయణాత్మకః (శాంతిపర్వము. ౩౪౭-౮౦-౮౧)

౫. చూడు. భ. గీ. ౭అ. ౧౯. (౬) భీష్మపర్వము.౬౬-౮౯

మంత్రములలోనున్నది. ౧. భగవన్నామము, పూర్వవైదికమతమునుండివచ్చినదే భాగవతధర్మమని సూచించుచున్నది. వేదములలో భగుఁడను వరప్రసాదియైన యొక దేవుఁడు చెప్పఁబడినాఁడు. భగమనగా శ్రేయమనియు, సంస్కృతవ్యాకరణమునను సరించి, శ్రేయముగలవాఁడు భగవంతుఁడనియు నర్థము వచ్చెను. అట్టిదేవము నారాధించుటే భాగవతమతమైనది. విష్ణుపురాణము భగమనగా నైశ్వర్య, ధర్మ యశస్సంపత్ జ్ఞాన వైరాగ్యములను షడ్గుణసంపత్తియనియు నిదిగలవాఁడు భగవంతుఁడనియుఁ జెప్పినది. ౨. క్రమముగా వాసుదేవుఁడే, నారాయణుఁడు విష్ణువనయ్యెను.

---

౧ ఓం నమోభగవతే వాసుదేవాయ.

౨. విష్ణుపురాణము. ౬౪ ౫, ౭౮. వాసుదేవునికి సాత్వతుఁడనుపేరు మీయబడినదికావున భాగవతమతము సాత్వతమతమనియు సుప్రసిద్ధము. (ఆదిపర్వము. ౨౧౭-౧౨.) భగవంతునర్చించువారు సాత్వతులని భాగవతము చెప్పినది. (౧, ౧౮, ౨౫; 3, ౧, ౨౯.) మెగస్తనీసీవిషయమును స్మరించెను. అనార్యుల నార్యులఁజేయుపద్ధతిలో వాసుదేవుఁడు నారాయణుఁడై విష్ణువయ్యెను. భగవద్గీతాకాలమున విష్ణువు పరమేశ్వరుఁడుగా గుర్తింపఁబడిన విషయము సంశయాస్పదము. అందు విష్ణు వాదిత్యులలో నొకఁడు. మహాభారత నారాయణీయప్రకరణమున వాసుదేవుఁడు నారాయణుఁడునొకఁడే. జీవాత్మపరమాత్మలకు లేక నరనారాయణులకుఁగల అవినాభావసంబంధతత్త్వము మిశ్రములైన రెండుపక్షుల వేదమందలి కథననుసరించియే పెంపొందియుండవచ్చును. సాక్షిమాత్రుఁడు నారాయణుఁడు. ఫలభోక్త నరుడు. సర్వప్రపంచనిలయుఁడైన విశ్వాత్ముఁడే నారాయణుఁడు (మ. భా. ౧౨౬ ౩౮౧) నరస్ అనగా జలమనియు, జలనివాసుఁడైన కారణమున నారాయణుఁడాయె ననియు మనువు చెప్పినాఁడు. (౧౬. ౧౦ చూడుము. ఆర్. వి. ౧౦౬. ౭౨ ౫, ౬.) సర్వప్రపంచాధిపతియై యాతఁడు క్షీరసాగరమున శేషశయానుఁడై యున్నాఁడు. అలంకారమునటుంచి అనాత్మకవ్యతిరేకుఁడైయున్న పరమే

ఆరంభమునుండియు విష్ణువునకు భావిదశ యుత్కృష్టమైనది లభించునని సూచనలున్నవి. వేదములందు విష్ణువు త్రిపాదుఁడని చెప్పఁబడెను. 'పక్షులైన నెగిరిపోఁజాలని' దివ్య కాంతిమయ ప్రదేశములో నాతఁడు గుప్తుఁడైయుండును. ౩ మహోన్నతమైన విష్ణుపదమును జేరుటే ఉపనిషత్కాలమునాఁటి మానవుని ముఖ్యకాంక్ష. ౪ వేదములందుఁగూడ దుఃఖసాగరమునుండి మానవునుద్ధరించు కార్యము విష్ణువునకీయఁబడినది. ౫ శతపథబ్రాహ్మణమునందు మానవులందరు 'విష్ణువు' లని చెప్పఁబడెను. ఐతరేయబ్రాహ్మణమునకనుసరించి, అసురులతోఁ బోరాటమున దేవతలకు సాహాయ్యముచేసిన మహోపకారి విష్ణువు. అసురులనుండి భూమిని తిరిగి దేవతలకొఱకై సంపాదించియిచ్చుటకు విష్ణువు వామనుఁడై యవతరించెను. ౧ నారాయణశబ్దము, విష్ణుసంబంధముగాకున్నను, మొదటిసారి శతపథబ్రాహ్మణమునఁ బేర్కొనఁబడెను.౩

---

శ్వరుఁడే యాతఁడు. అతనినుండియే నారదుఁడు తనయోగేశ్వరతత్త్వజ్ఞానమును బొందినాఁడని చెప్పఁబడెను. ౩. ఆర్. వి. ౧అ. ౧౫౫-౫ ౪. కఠోపనిషత్తు ౧. ౩. ౯. ౫. ఆర్. వి. ౬. ౪౯. ౧౩. ౬. ౫అ. ౨.౫.౨-౩.

౧. శతపథబ్రాహ్మణము ౧అ. ౨, ౫, ౫; తైత్తిరీయబ్రాహ్మణము ౧అ. ౬. ౧. ౫. (౨) ౧౨ అ. ౩, ౪, ౧.

౩. తైత్తిరీయారణ్యకమునందు నారాయణుఁడు "శాశ్వతపరమదైవమై" 'హరి' నామమును బొందెను. (౧౦ అ. ౧౧. ౧.) మహాభారతమునందు నారాయణుఁడొక సనాతనమహర్షి. (చూడు. ఆర్. వి. ౧౦, ౯౦; యమ్: బి; ౫అ. ౪౯ ౫-౨౦; ౭అ. ౨౦౦. ౫౭.) బ్రాహ్మణములకాలమున నారాయణుఁడు విశ్వవిస్తృతిఁబొంది, మహాభారతమునందు విష్ణువుతో నేకమైనాఁడు. ఈవిధముగా మహాభారత భీష్మపర్వమునందు నారాయణ, వాసుదేవ, విష్ణు నామములు పర్యాయపదములైనవి. (అధ్యాయములు. ౫౫, ౫౬.)

వాసుదేవ నారాయణశబ్దములతోఁ గృష్ణునకుఁగల సంబంధమెట్టిది ? మహాభారతమునం దప్పుడప్పుడు వీరికి భేదమున్నట్లు చెప్పఁబడెను. ౪ కాని వెంటనే యాతఁడు పరమపురుషుఁడుగా నిర్వచింపఁబడెను. క్రీ. పూ. ౩౦౦ లకుఁజెందిన చంద్రగుప్తుని యాస్థానమునకు రాయబారిగావచ్చిన మెగస్తనీసు కృష్ణుఁడానాఁడు మథురలో దేవుఁడుగా నారాధింపఁబడుచున్నాఁడని వ్రాసెను. కృష్ణుని పూర్వచరిత్రమును మనముగుర్తింపలయుచో, నాతఁడొక వైదికఋషియనియు, నొకమంత్రకర్తయనియుఁ దెలియుచున్నది. ౫. ఆతఁ డాంగిరసవంశీయుడు. ౬. ఛాందోగ్యోపనిషత్తునందు, దేవకీసుతుఁడైన కృష్ణుఁడు, ఆంగిరసకులజుఁడగు ఘోరునిశిష్యుఁడుగాఁ జెప్పఁబడెను ౭. వేదమంత్రకాలమునుండి యుపనిషత్కాలమువఱకు కృష్ణుఁడొక వైదికవిజ్ఞానవేత్తయను సంప్రదాయమున్నది. కాని ఋగ్వేదమునం దిందొకవాక్యమున, నిం‍ద్రునితో యుద్ధముచేయుటకు, పదివేలసైన్యముతో నంశుమతీ నదీతీరమునఁ గృష్ణుఁడు సంసిద్ధుఁడై యున్నట్లు చెప్పఁబడెను. ౮. ఒక బాలదేవునర్పించిన ఆభీర

౪. ౭ అ. ౩౩౪, ౧౮. ౫. ఆర్. వి. ౮ అ. ౭౪.

౬. చూడు. కౌషీతకిబ్రాహ్మణము ౩౩అ.౯; పాణిని; ౪అ. ౧,౯౬.

౭. ౩అ. ౧౭

౮. ౮అ. ౯౬. ౧౩-౧౫. తరువాత కథలో నింద్రునిపూజను గోపకులచే మానిపించుట, నందుచేనింద్రుఁడు కోపించి శిలావృష్టిఁగురియుట, గోపసంరక్షణమునకై కృష్ణుఁడు గోవర్ధనపర్వతము నెత్తుట, మున్నగునవన్నియు ఋగ్వేదకథపై నాధారపడియుండనోపును. అథర్వసంహితలోఁ గృష్ణుఁడు కేశియను రాక్షసునిజంపినట్లు వర్ణింపఁబడెను. బౌద్ధగ్రంథములలోఁ గృష్ణుని

లను గొల్లవాండ్రజాతి యొకటున్నదని సర్. ఆర్. జి భండార్కరు పండితుఁడు నుడివినాఁడు. ౧. నాగరికతలేని యొక అనార్యజాతి యది యని తెలియుచున్నది. ఈసంచారముచేయు జాతులనుండియే కృష్ణుని కాంతావిహారగాధలు బయలుదేరినవని తోఁచును. ౨. వైద్యపండితునభిప్రాయములో, నార్యుల రెండవదండయాత్రలో వచ్చిన యాదవులను క్షత్రియకులమునకుఁ గృష్ణుఁడుచెందినవాఁడనియు, నీ వంశీయులకు యమునా నదీ తీరము నిలయమైనదనియు, వారికింకను బహుసంతతినిఁ బోషించి పెంచు నాచారమున్నదనియుఁ దెలియుచున్నది. 3 ఇతర ప్రాచ్యవిజ్ఞానవేత్తలు, వీబరు, దత్తు మున్నగువారలు, పలువురొకేభార్యను వివాహమాడు నాచారముగల యనార్యజాతి జనులు పాండవులని తలఁచిరి. ఈజాతులందు కృష్ణమతమున్నదనియు, కృష్ణునిసాహాయ్యమునఁ బాండవులు యుద్ధమున జయమందిరనియు మహాభారతగ్రంథకర్త చూపయత్నించెను. బ్రాహ్మణమతమునకు విజాతీయులయిన పాండవులయుద్ధములు గాథలు నొక మహోద్దేశముతో మహాభారతేతిహాసమునందు సంక్రమింపఁజేసి క్రమముగాఁ బాండవుల నార్యులనొనర్చి, భారతీయులని నామకరణముచేసిరి. బుద్ధునికి రెండువందల సంవత్సర

---

కూర్చిచెప్పబడెను. (చూడుము లలితవిస్తారము) జైనమతము తలయెత్తునప్పటికే కృష్ణపూజ వ్యాప్తిలోనున్న సాక్ష్యమున్నది. సుప్రసిద్ధయాదవుఁడైన ౨౨-వ తీర్థంకరుఁడు అరిష్టనేమిచరిత్రమును జెప్పుచుఁగొన్నిమాహాత్మ్యలతో కృష్ణునిచరిత్రమంతయు వర్ణించెను. (చూడుము యస్.బి.ఇ.వాల్యూము ౨౨ పుటలు ౨౭౬-౭౯)

౧. మౌసలపర్వము ౭ అ. ౨. వైష్ణవమతము పుట ౩౬-౩౭

3. పౌరాణికభారతవర్షము. ౧౭అ.

ములు పూర్వము కృష్ణుఁడు జీవించినట్లును, వసుదేవ సుతుఁడని యు, నేకేశ్వర సంబంధ నైతిక మతము నాతఁడు స్థాపించెననియుఁ, గ్రమముగా నాతఁడు వాసుదేవునిగా భావింపఁబడి పూజింపఁ బడెననియు, వాసుదేవపూజ నాతఁడే స్థాపించెననియు గార్బేపండితుఁ డభిప్రాయపడుచున్నాఁడు. నాటికి నిలిచిన సంప్రదాయములన్నియుఁ గలిసి, మహాభారతమునందుఁ గృష్ణుఁ డనార్యవీరుఁడుగను, దత్వదేశికుఁడుగను, స్వజాతిదేవుఁడుగను వర్ణింపఁబడెను.

కృష్ణుఁడు పరమేశ్వరుఁడుగా గుర్తింపఁబడిన క్రమ విధానమును మహాభారతము చెప్పుచున్నది. కొన్ని చోటులందాతఁడు మహాదేవునర్చించుచున్నట్లు చెప్పఁబడినది. ౧. అతని దైవత్వము లోపించిన కొన్నిసందర్భములు గలవు. ౨. సభాపర్వమునందు కృష్ణుని దైవత్వమును శిశుపాలుఁడు నిరాకరించును; భీష్ముఁడు సమర్థించును: "కృష్ణుఁడు దేవుఁడు కాఁడని చెప్పువాఁడు మందబుద్ధి." కృష్ణుని దేవునిగా నంగీకరించుటకు వ్యతిరేకులున్నారని స్పష్టము. ద్వారకాపురాధీశుఁడైన యుద్ధనాయకుఁడని కొన్ని చోటులఁ జెప్పఁబడెను. భగన్నామముగల యేకేశ్వరారాధనము నుపదేశించిన ప్రవక్తగా నప్పుడప్పుడాతఁడు గోచరించును. ఒక్కొక్కప్పు డాతఁడే భగవంతుఁడని చెప్పఁబడెను. అనేకయుగముల భావపరంపరలు, కృష్ణుఁడొక చారిత్రికపురుషుఁడను భావముతో నారంభించి,విష్ణ్వవతారముగా నిశ్చయించు తత్వ

---

(౧) చూడు ద్రోణపర్వము.

౨. మూయిర్ ఓ. యస్. టి. ౪ఆ. పుటలు ౨౦౫.

మునకు నాతని ననేకదశలలోఁ జూపిన భిన్నావలోకనములు మహాభారతము ప్రదర్శించును.

అవైదికశాఖలు పెచ్చుపెరుగుచున్నకాలమున వానిని ప్రతిఘటించుటకు, నొకవ్యక్తిని లోకోత్తరపురుషునిగాఁ జిత్రింపవలెనని తలఁచి మహాభారతమును రచించినకర్త లాలోచించినట్లు తోఁచుచున్నది. వారికెదురుగా లభించినది కృష్ణుని మూర్తి. గోపికలతో రాసలీల, జలక్రీడ, గోపికావస్త్రాపహరణము మున్నగునవికొన్ని కృష్ణునిదైవత్వమున కనుచితములుగాఁ గన్పట్టుచున్నవి. వీనికర్థాంతరములు కల్పింపవలసియున్నది. శుకయోగిని బరీక్షిత్తు తన సందేహమును బోఁగొట్టుమని కోరినాఁడు ! "అధర్మనాశనముకొఱకు ధర్మస్థాపనకొఱకుఁ బరమేశ్వరుఁ డవతరించినాఁడు. మతసూత్రముల నాతఁడు ప్రదర్శించి, పోషించి, రక్షించి, వ్యభిచారప్రవర్తనములచేఁ దానే వానినుల్లఘించినాఁడా ?" శుకుఁడిట్లు బదులుచెప్పెను : "అపవిత్రపదార్థములను దహించుటచే నగ్ని యపరిశుద్ధముగానట్లే, మతసూత్రములనుల్లఘించుట, సాహసకార్యములొనర్చుట దేవతలకుఁ బాపహేతువులుగావు, కాని దేవతలుకానివా రట్టికార్యములను మానసికముగానైనఁ జేయరాదు. శివునివలె మానవుఁడు విషముమ్రింగినచో వెంటనే మరణించును. దేవతల వచనములెల్లప్పుడు సత్యములే; వారిపనులొకప్పుడు ధర్మములు కాకపోవచ్చును" ౧. బ్రాహ్మణునియుక్తి దీనితోనాగలేదు. కృష్ణునికార్యముల కంతరార్థములఁ కల్పించి, తత్ప్రకరణముల

౧. భాగవతము. దశమస్కాండము. 33 ౨౮-౨౯.

నతి నిగూఢరహస్యార్థములతో నింపును. గో[illegible]నఁగా పాండిత్యముతో నిమిత్తములేక దేవుని భక్తితోఁ గొలచిన మానవులు. గృహ బంధు సంతానాదికములఁ బరిత్యజించివచ్చిన గోపికాస్త్రీలుత్తమవరుఁడైన దేవునిగోరి యాత్మార్పణమొనర్చిన జీవులు, బృందావనము మానవునిహృదయమే. రాధాదులైన గోపికలు, లోకసాంగత్యమను మాయావశులైరి. కృష్ణుని మురళీగానము దేవునిపిలువు. వానిననుసరించుట పేరుప్రఖ్యాతులను త్యజించుట, ఆత్మగౌరవము, ప్రత్యేకత్వమును ద్రోసిపుచ్చుట, గృహబంధు బంధములను ద్రెంపివైచుట. సాంఘికగౌరవము, గృహశాంతి మున్నగువానినిఁ గోరువారు దేవుని యాహ్వానము నాలకింపఁజాలరు. దేవుని ప్రేమించుటనగాఁ బ్రజలచే నవమానములను భరించుటే. జీవాత్మయనుకన్యక పరమాత్మయను పెండ్లికుమారుని – అందరకునొకే వరుఁడైనను నొక్కొక్కని కొక్కొక్కరూపమున గోచరించు వరుఁడు – ప్రేమించుటనగా గృహము, భర్త మున్నగువానిని విసర్జించుటే. ఈతత్త్వము భారతీయులకే ప్రత్యేకమైనదికాదు. అన్నిటిలోఁ బ్రియతమమైన దానిని త్యజించినఁగాని, దైవప్రీతి కలుగదు. వైష్ణవగీతములలో నిత్యము మనము వినుచుందుము. "నీకొఱకు నేనొక యనాథనైతిని" అనేకజాతులలో నిట్టికథలున్నవి. నీతివిరుద్ధ ప్రవర్తనములును, ఆత్మదైవ సంబంధములుగాఁ జమత్కరింపఁబడినవి. కాని మనమెంత సదుద్దేశముగలిగి, అర్థాంతరకల్పనములు చేసి, లోపములను గప్పిపుచ్చుటకుఁ బ్రయత్నించినను, బురాణముల లోని కృష్ణుని జీవితవిధానమును మన మంగీకరింపఁజాలము.

కృష్ణునిజీవితములో నిట్టిసందర్భములు, నాతని బాల్యక్రీడలు, సురాపానలాలసుఁడైన బలరాముని పరివర్తనము, కృష్ణుఁడనార్యుఁడని విశదపఱచును. కృష్ణుఁడు నేఁడు భారతీయులచే నేకగీర్వముగాఁ బూజింపఁబడుటకుఁ గారణము, భగవద్గీతాకారుఁడాతనినొక యద్భుతతత్త్వోపదేశికునిగాఁ బ్రదర్శించియుండుటయే. కృష్ణుఁడు దేవుఁడగుటతోఁ గేశవ జనార్దనాదినామములు వాసుదేవునికొసఁగఁబడెను. ఆతఁడు దేవకీసుతుఁడు మున్నగు గాథలును మొదటివాఁడైన వాసుదేవునకే చేర్చఁబడెను. నేఁటికిని కృష్ణునిఁగూర్చి పరస్పరవిరుద్ధ వర్ణనములున్నవి. ఆతఁడొక మహాత్ముఁడనియుఁ నిగూఢతత్త్వజ్ఞానియనియుఁ గొంత ధర్మలోపమున్నను, పరిజాభినందనపాత్రుఁడగు వీరుఁడనియు నెన్నోరీతుల వర్ణనములున్నవి.

వాసుదేవ కృష్ణార్చనముతోఁగూడిన భాగవతతత్త్వము పాంచరాత్రమతమనియుఁ జెప్పఁబడును. ఈనామమున కుత్పత్తి యెట్లో మనకుఁ దెలియదు. పద్మతంత్రమునం దిట్లున్నది. "దీనితోఁ బోల్చినచో నితరపంచశాస్త్రములు నంధకారమునిచ్చునవియే. అందుచే నిది వాడుకచేఁ బంచరాత్రమని పిలువఁబడెను." ౧. పంచసిద్ధాంతములను జెప్పుటచే నీపేరువచ్చియుండనగును. మహాభారత నారాయణీయ ప్రకరణమునందైనను, బరిశుద్ధమైన యీ మతప్రతిపాదనమున్నదని చెప్పఁజాలము; ఏలన వేదభావములప్పుడే యిందును సంక్రమించినవి.

---

౧. ౧౪. ౧. ౬౫, ఈనామోత్పత్తినిగూర్చి భిన్నభావములకు చూడు ష్రేడర్: పాంచరాత్రమున కుపోద్ఘాతము.

ఆళ్వారులలో నతిప్రథముడైన యాల్వారు దక్షిణదేశమున క్రీ. వె. ౫-వ శతాబ్దమునకుఁ జెందును. ఆతఁడీ మతమును స్వీకరించెను. ఆల్వారుశబ్దమునకు దైవభక్తిమగ్నుఁడని యర్థము. అన్నివర్ణములనుండి తీసికొనఁబడిన పన్నిద్దరాల్వారులున్నారు. తమిళములోఁ బ్రబంధములనఁబడు వీరిగ్రంథములు విష్ణునేదో రూపమున స్తుతించిన భక్తిపారవశ్యమును బ్రకటించును. ఇవియే వైష్ణవుల వేదములు. నమ్మాళ్వారుచే నుపదేశము పొందిన నాదమునితో నారంభించిన గురుపరంపరలో సుప్రసిద్ధ వేదాంత సూత్రభాష్యకారుఁడగు రామానుజాచార్యుఁడారవవాఁడగుటచే నవంతరదశకుఁ జెందినవాఁడు. భాగవతులు వైష్ణవమతమునకుఁ బూర్వవిశిష్టపురుషులు. మొదటఁ బాంచరాత్ర మతానుచరులు వైదికమత పూజావిధానముల నాచరించుట కనుమతింపఁబడలేదు. వారిపద్ధతులు పాంచరాత్రాగమములపై నాధారపడియున్నవి.౧

చర్చనీయాంశముల నాగమములు నాలుగువిధములుగా విభజించినవి. (౧) జ్ఞానము (౨) యోగము (౩) విగ్రహనిర్మాణ స్థాపనక్రియలు (౪) కార్యములు లేక సంస్కారములు చతుర్వ్యూహములతోఁ గూడిన వాసుదేవ కృష్ణుఁడే ప్రధాన దైవము. కృష్ణు నంతర్యామిత్వమును ముఖ్యమే. "తృణ

౧. వేదాంతదేశికుని పాంచరాత్రరక్షలో ననేకవిధానములు పేర్కొనఁబడెను. ఇదియును, ౧౦ వ శతాబ్దమునకుఁ జెందిన యామునాచార్యుని ఆగమప్రామాణ్యమును, వేదాంతసూత్ర పాంచరాత్ర ప్రకరణమును (౨అ. ౨పా. ౪౨-౪౫) ఈతత్త్వమునకాధారగ్రంథములు. నారాయణుఁడే తన మతమును బ్రసాదించెనని వైష్ణవుఁడు వీని కాలనిర్ణయమునకుఁ బాటుపడఁడు.

బ్రహ్మ పర్యంతము సర్వము కృష్ణమయమే. ౨. విష్ణుదేవుఁడు తనకుఁగల క్రియాభూతులను శక్తివలన సర్వజగమును సృజించును. వస్తుగుణములకుఁగల యవినాభావసంబంధమే పరమేశ్వరునకు శక్తికిఁగల సంబంధము. పాంచరాత్ర సిద్ధాంతమునను సరించి, రామానుజుఁడు బ్రహ్మము, జీవులు, ప్రపంచము నున్నవని యంగీకరించును. యాగవిధానములుపోయి, దేవతానిలయములలో విగ్రహపూజలారంభమైనవి. మతమావేశపూరితమగును. భక్తిముఖ్యమని వక్కాణింపఁబడును. ఈతత్త్వము నుండి జనించిన అధునాతనవైష్ణవమతమునకుఁ బ్రధానలక్షణము ప్రపత్తి లేక సంపూర్ణాత్మసమర్పణము. అనన్యసక్తులై దేవుని పాదపద్మముల నమ్మినవారిని దేవుఁడు సంరక్షించును. ధర్మమూర్తియైన దేవుఁడెట్లు పాపాత్ముల రక్షింపఁగలడనుప్రశ్న యుదయించును. ఈతత్త్వము లక్ష్మీదేవిని మధ్యవర్తినిగా నేర్పాటుచేయును. దేవునిధర్మశాసనము లక్ష్మీదేవిదయతో మేళవించును. లక్ష్మీదేవి శిక్షించుటెరుగదు. 3. మధ్యవర్తిదైవస్వరూపమే; భక్తునిపిలుపునందుకొని సాయపడును. దేవుని కృపకంటె లక్ష్మీకటాక్షమే ప్రధానమైనది. పూర్వకర్మదోషములన్నియును క్షమింపఁబడును.

జీవాత్మ ముక్తిఁబొందుటకుఁ బ్రపత్తియే మార్గము. ఇది సాంఖ్యయోగ మార్గములవలెనే రక్షింపఁగలదు.౧. విష్ణు

---

౨. ఆబ్రహ్మస్తంబ పర్యంతమ్ సర్వం కృష్ణశ్చరాచరమ్ [నారద పాంచరాత్రిమ్]  3. నిత్యమ్ అజ్ఞాతనిగ్రహా.

౧. శాంతిపర్వమ్ ౩౪౮-౬౪.

భక్తులలో వర్ణభేదము లేదు. జాబాలబ్రాహ్మణమిట్లు చెప్పును: "హూణ కిరాతాదిజాతి జనులును, విష్ణుభక్తుని సాంగత్యముచే సర్వపాపవిముక్తులగుదురు." స్మార్తులవలె వీరు వర్ణాశ్రమాచార నియమములనంతగాఁ బాటింపలేదు.

పాంచరాత్ర, భాగవత, సాత్వతమతమార్యమతమో అనార్యమతమో చర్చనీయాంశము. దీనిపూజావిధాన మవైదికమగుటచే నిదిఅనార్యమని కొందరు వాదింతురు. ఇది వేద కర్మలనుగాని సంస్కారములనుగాని యంగీకరింపలేదు; సంకర్షణుఁడే జీవుల జన్మకారకుఁడనుసిద్ధాంతము వేదమతవిరుద్ధము. యామునాచార్యుఁడు తనఆగమప్రామాణ్యమునందు, ఆగమ ప్రమాణవిరోధవాదము లన్నిటినిఁ బేర్కొని పరిహరించును. వేదవిరుద్ధభావము లిందుఁగలవనియు, నివి యగ్నిహోత్ర జ్యోతిష్టోమాదికర్మల నుపదేశింప వనియు, మఱియు నివి వేదముల దూషించుననియు, ద్విజులు వీనినంగీకరింపలేదనియుఁ బ్రతికక్షులభావములు. మఱియు నివి అనార్య జాతివారైన సాత్వతులచే నాచరింపఁబడినవి.౨. ఇందు విశేషముగా నైంద్రజాలికవిద్యలు, మూఢవిశ్వాసములు గలవు.౩. సంప్రదాయసిద్ధాంతములలో నిది పేర్కొనఁబడలేదు. బాదరాయణుఁడైన నీతత్త్వమును సమర్థింపలేదని శంకరుఁడు చెప్పుచున్నాఁడు. చక్రాంకితముద్రలు మున్నగువిచిత్రకర్మకలాపములు దీనియందుఁగలవు. ఈయభ్యంతరములకు యామునాచార్యుఁడు బదులుచెప్పినాఁడు. ఈతత్త్వము వేదములకు సంబం

---

(౨) మనుధర్మశాస్త్రమ్. ౧౦.౨౩.౫ (౩) క్షుద్రవిశ్వాప్రచురతా.

ధించినదే; దీనిని బాదరాయణుఁడు మహాభారత భాగవతములం దంగీకరించినాఁడు. మఱియు సుప్రసిద్ధఋషిపుంగవులైన భృగు భరద్వాజు లంగీకరించిరి; భాగవతులంద రుత్తమబ్రాహ్మణులే; సాత్వతులనగా నొకజాతికాదు; సత్వగుణ మధికముగాఁగలిగిన భక్తులని యర్థము. రామానుజుఁడు యామునాచార్యు నంగీక రించెను; ఈతత్త్వము సమర్థింపవలసివచ్చుటచేతనే యిది వేద సంబంధమతమని యంగీకారమును బడయుటకుఁ గొంతకాలము పట్టియుండునని చెప్పవచ్చును. అభినవవైష్ణవమతములో ముఖ్య ములైన విగ్రహార్చనము, చక్రాంకితము, ఊర్ధ్వపుండ్రధార ణము పాంచరాత్రమతములోనివే. ఏనామముతోఁ బిలిచినను బాంచరాత్రమతము పురాతనమతమనియు, బౌద్ధమతకాలము నాటిదనికాని, యంతకంటెఁ బూర్వమున్నదనికాని చెప్పవచ్చు ననియు,మహాభారతనారాయణీయప్రకరణము శ్వేతద్వీపము నకు నారదుఁడుచేసిన యాత్రలనుగూర్చియు, శ్వేతద్వీపవాసు లందరు నేకేశ్వరవాదులు లేక యేకాంతికవాదులనియు వర్ణిం చెను గాన నీమతము క్రైస్తవులనుండి గ్రహింపబడెననియుఁ గొందరు వాదించువారు లేకపోలేదు. డాక్టరు. సీలు పలికి నాఁడు; "కొందరు భారతీయవైష్ణవులు, ఈజిప్టు, ఆసియా మైన రు దేశములకు నిజముగాఁ బయనించినసాక్ష్యములు నారాయ ణీయప్రకరణమున లభించుచున్నవి. భారతీయులకుఁగల సహజ సర్వమతాభిమానాదరదృష్టితో వీరు, కొంతకాలముపోయిన వెనుక గౌతమబుద్ధు నవతారములలోఁ జేర్చినట్లే, క్రీస్తును గూడ నవతారవర్గమునఁ జేర్చి,నారాయణావతారముగాఁ బరిగ

శింప యత్నించిరని తేలుచున్నది."౧. వీబరుకూడ నిదేయభి ప్రాయమును బ్రకటించెను.౨. లాస్సేను వీరితో నేకీభవించెను. భారతవర్షమునకుఁ బశ్చిమోత్తరదిశనున్న దేశములలో క్రైస్తవ మత మున్నదని తెలిసి, కొందరుబ్రాహ్మణు లచటికిఁబోయి, క్రైస్తవమతభావములను గొన్నిటిని సంపాదించి తెచ్చియుండవచ్చునని యీతఁడభిప్రాయపడెను. కాని వీరేగిన దేశము పార్థియా దేశమనియు, నచట మతప్రచారకుఁడగు థామస్ క్రిస్తుసందేశమును ప్రచురించెనను సంప్రదాయము ప్రాచీనమైనదనియు నీతఁడు భావించినాఁడు. కాని యేకేశ్వరతత్త్వము వేదములకుఁ దెలియనిదికాదు. నారదుఁడు నేర్చుకొనినశాస్త్రములలో నేకాయనతత్త్వ మొకటియని ఛాందోగ్యోపనిషత్తు పలుకుచున్నది ౩. భాగవతమతము, భారతీయ మూల తత్త్వభావములకు విరుద్ధములైన భావములను గలిగి యుండలేదు. "ప్రాచీనభారతీయ విజ్ఞానజీవితముతోఁ బరిచయముగల వ్యక్తికి, భక్తితత్త్వము భారతీయ దృష్టినుండి జనించినదే యని స్పష్టముకాఁగలదు." ౪. గార్బెభావములో" క్రైస్తవమతమునుండి భక్తితత్త్వము గ్రహింపఁబడెనని చెప్పుట కవసరము సాక్ష్యము నేటికి లేశమాత్రమైనను లభించియుండలేదు. భక్తిశబ్దార్థము సూచించుతత్త్వము క్రైస్తవ మతమున కొక్కదానికే విలక్షణమైనదికాదు. ఇతరములైన

౧. వైష్ణవ, క్రైస్తవమతములు పుట ౩౦. (౨) ఐ. ఎ. ౧౭౭౪. కృష్ణజన్మాష్టమీ ఉత్సవోత్పత్తిపరిశోధనము." (౩) ౭౮. ౧.౪.
(౪) గార్బె. ప్రాచీనభారతీయతత్త్వము. పుట. ౭౪.

యేకేశ్వరవాదతత్త్వములలో దేవునియందు భక్తివిశ్వాసములు క్రిమాభ్యున్నతినొందుట యేకాక, యేకేశ్వరవాదము నతిక్రమించిన తత్త్వములందుఁగూడ నీభక్తివిశ్వాసములుసహాకారముతోఁ బెంపొందినవి. ముఖ్యముగా భారతవర్షములో భక్తిమతము స్వజాతీయమని చెప్పుటకు వలయు లక్షణములన్నియు నున్నవి. బార్తుపండితుఁడు వచించినట్లు, భారతవర్షమున ఋగ్వేదకాలమునుండి, నేటివఱకుఁగల మతచరిత్రలో నన్నిదశలందు నేకేశ్వరభావములుండి, అవిచ్ఛిన్నముగాఁ బెంపొందుటవలన, విశేషదైవభక్తి విశ్వాసతత్త్వము భారతీయులే కల్పించుకొనసమర్థులని నిర్ణయింపవచ్చును. శ్వేతద్వీపమనగాఁ బత్కాలభూగోళ శాస్త్రమునను సరించి, మేరుపర్వతమున కావలనున్న భారతవర్షభాగమే. క్రైస్తవమతము భారతవర్షమునకు వచ్చినది క్రీ. వె. రెండు మూడు శతాబ్దములలో మాత్రమే. ఏకేశ్వరతత్త్వము దీనికంటె నతిపురాతనమనుటకు వలయునంత సాక్ష్యమున్నది. వాసుదేవనామము పాణిని వ్యాకరణములో నున్నది ౧ భండార్కరు పండితునభిప్రాయములో "ఇంకను బూర్వికుఁడుగానున్నను క్రీ. పూ. ౭-వ శతాబ్దారంభకాలమునకే పాణిని చెందియున్నవాఁడు." ౨. బౌద్ధ జైన మతగ్రంథములు భక్తిమార్గము నుదాహరించినవి. 3. తేరగాథలోని భక్తిమార్గ శబ్దమును బౌద్ధులు పూర్వభారతీయ మతగ్రంథముల నుండి తీసికొనిరని యమ్. సెనార్టు తలఁచినాఁడు. "అత్థ

౧ ౪అ. 3, ౯౮. (౨) బొంబయిగెజెటీర్ వాల్యుము౧ భా౨ పు. ౧౪౧ (3) తేరగాథా. ３౭౦

పూర్వమే యోగసిద్ధాంతములు, విష్ణుగాథలు, భగవంతుఁడని యర్చింపఁబడిన విష్ణు కృష్ణచరిత్రముగల తత్త్వములే దేశమున లేకుండినయెడల బౌద్ధమతము పుట్టియుండెడిదే కాదు." ౪. బార్తు పలికినాఁడు: "దేవకీపుత్రుఁడైన కృష్ణుఁడే దేవుఁడుగాఁ బూజింపఁబడి, కృష్ణునిచే నుపదేశింపఁబడిన భాగవత. సాత్వత, లేక పాంచరాత్ర మతము క్రీ. పూ. ౬-వ శతాబ్దమునకుఁజెందిన జైనమతమునకంటెఁ జాలపూర్వమైనది."౫. పాణిని సూత్రములకుఁ దానురచించిన భాష్యములోఁ బతంజలి వాసుదేవుఁడనగాఁ బూజ్యుఁడగు దేవుఁడని రచించెను.౬. భాగవతమతము, క్రైస్తవమతమునకుఁ బూర్వదశలోనిదని తెల్పు భూగర్భశాస్త్ర పరిశోధనలసాక్ష్యముకూడనున్నది. భాగవతుఁడైన హెలియోదొర వాసుదేవునికిఁ గృతజ్ఞతాపూర్వకముగా నొక ధ్వజస్తంభమును గరుడవిగ్రహముతో, స్థాపించెనని క్రీ. పూ. ౨-వ శతాబ్దమునకుఁజెందిన బేశనగరశాసనము చెప్పుచున్నది..౭ భగవంతుఁడైన సంకర్షణవాసుదేవపూజనుగూర్చి ఘోసుండి శాసనము చెప్పుచున్నది. క్రీ. పూ. ప్రథమశతాబ్దమునకుఁ జెందిన యింకొకశాసనము సంకర్షణలేక వాసుదేవస్తోత్రమును గలిగియున్నది. ఈసాక్ష్యములనుబట్టిచూడగా, భారతవర్షములోని యేకేశ్వరతత్త్వము స్వదేశీయమైన స్వతంత్రతత్త్వమని

౪. ఇండియన్ ఇంటర్ ప్రెటర్. ౧౯౧౭ పుటలు ౧౭-౭౮.

౫. ఐ. ఎ. ౧౮౯౪. పు. ౨౪౮.

౬. జె. ఆర్. ఏ. యస్. ౧౯౧౦. పుట ౧౬౮.

౭. ఎపిగ్రాఫికా ఇండికా వాల్యుము. ౧౦.

యు, నది సహజమైన జాతీయజీవితవిజ్ఞానములనుండి సముద్భ్ర వించినదే యనియు స్పష్టమగుచున్నది.

### ౯—పౌరాణిక ప్రపంచస్వరూపము.

యథాస్వరూపముగాఁ గాకున్నను, మహాభారతము సృష్టిక్రమము విషయములో సాంఖ్యసిద్ధాంతము నంగీకరించి నది. పురుషుఁడు ప్రకృతిబ్రహ్మ స్వరూపములని నిర్ణయింపఁ బడెను. ప్రపంచము పరబ్రహ్మమునుండి యావిష్కృతమైన దనియు వచింపఁబడెను. ఆత్మనుండి ప్రకృతినిర్మాణము చేసిన గుణములన్నియు సాలెపురుగునుండి దార ముదయించినట్లు ప్ర స్మృతమైనదని పలుకఁబడెను.౨ ఈవిధముగా బ్రహ్మము సృష్టి కారణమని యితరరూపములలోఁ గూడఁ జెప్పఁబడెను. సృష్టి చేసిన చతుర్ముఖ బ్రహ్మ, ఒకస్వర్ణాండమునుండి జనించెనని యుఁ దీనికిఁ గారకుఁడు పరబ్రహ్మమనియు నాయండమందే సర్వజీవరాసులు నుండుననియు వచింపఁబడెను. బ్రహ్మాండభా వము నేఁటికిని నిలిచియున్నది. సాంఖ్యద్వైతతత్త్వములనుగొన్ని తావులందు మహాభారతము స్పష్టముగా వివరించెను. ప్రకృతి పురుషునకు వేరైనది. కాని పురుషుఁడు సర్వస్వరూపి. పురు షుఁడు ప్రకృతియు నొకేతత్త్వమునుండి జనించినవి. పురుషా ధీనమై ప్రకృతిసృజించును; ౩ లేక ప్రకృతిలోని సృజనశక్తులను పురుషుఁడు ప్రోత్సహించి క్రియాన్వితము లొనర్చును. ౪. కాని యితరస్థలములందుఁ గ్రియాశక్తి యంతయుఁ బ్రకృతి యందే యున్నదనియుఁ బురుషుఁడేపనియుఁ జేయఁడనియుఁ

౨. ౭౮. ౨౧౫.౪౦౩. ౧౨౮. ౩౧౪, ౧౨. (౪) ౧౨౮. ౩౧౫. ౯.

బురుషుఁడు తాను గర్త యని తలఁచినచో నది భ్రాంతి యనియుఁ జెప్పఁబడెను. ౫. సృష్టిలయములు ప్రకృతికర్మలే యనియుఁ, బ్రకృతి పురుషునుండి జనించినదే యనియు, నందుచేఁ బ్రకృతిపురుషునందుఁ గాలాంతరములందుఁ బ్రవేశించుచుండు ననియు నచ్చటచటఁ జెప్పఁబడెను. ౬. గూఢముగాఁ దప్ప, మహాభారతమున మాయాసిద్ధాంతము స్పష్టముగాఁ బ్రతిపాదింపఁబడియుండలేదు, సాంఖ్యసిద్ధాంతము ననుసరించియే సృష్టి పరిణామక్రమము మహాభారతమున వర్ణింపఁబడెను.౧.

ఈదశలో సాంఖ్యతత్త్వ నిర్మాణము జరుగకున్నను, సాంఖ్యభావములు పరిపక్వమందుచున్నవి. మహాభారతము నందు గోచరించిన సాంఖ్యతత్త్వముయొక్క ముఖ్యలక్షణముల నిట మనము గ్రహింపవలసియున్నది. ఏలన, ననంతరవిజ్ఞాన మంతయు నీసాంఖ్యతత్త్వమును, మతమును నంగీకరింపకున్నను సాంఖ్యమనస్తత్త్వమును సృష్టితత్త్వమును నంగీకరించినవి. సాంఖ్య లొసగిన భూతములసంఖ్యనే మహాభారతమంగీకరించినది. ౨ అను గీతయొసగిన పరిణామక్రమము సాంఖ్యశాస్త్రీయసిద్ధాంతమునకు సన్నిహితముగా నుండును. ౩. అవ్యక్తమునుండి మహత్తు, మహత్తునుండి యహంకారము నందుండి పంచభూతములు,

౫. ౧౨అ. ౨౨౨. ౧౫-౧౬. (౬) ౧౨అ. ౩౦౩. ౩౧. చూడు వి. వి. ౬. ౩౭.

౧. చూడు అశ్వమేధపర్వము. ౩౫అ. ౨౦-౨౩; ౪౭అ. ౧౨-౧౫.

౨. చూడు శాంతిపర్వము ౩౦౩-౩౦౬; అనుగీత; ౯అ. ౫౦.౮; ౧౨అ. ౩౦౬. ౩౯-౪౦

౩. ౧౪అ. ౪౦-౪౨.

నందుండి శబ్దస్పర్శరూప రసగంధములును, పంచప్రాణములును, మఱియు నహంకారమునుండి పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, మనస్సును నుదయించినవి. పదునారు గుణములతోఁ గూడిన పురుషుఁడు పదునేడవ వాఁడని లెక్కింపఁబడెనే కాని, యిరువదియైదు తత్త్వములు లేనందున, సాంఖ్యతత్త్వము పూర్తిగా లభించియుండలేదు. మహాభారత మిరువదియైదు తత్త్వములకు పెక్కుతావుల నీశ్వరునిఁ గూడఁ గలిపి యిరువదియారు లెక్కించెను.౮ దీనివలన సాంఖ్యసమస్యల విషయమై ప్రజలు విశేషముగా నాలోచించుచున్న కాలమది యని తెలియుచున్నది.

మహాభారతము గుణతత్త్వము నంగీకరించినది. సత్త్వరజస్తమోగుణములు ప్రకృతిలక్షణములు. భిన్నపరిమాణములలో నీగుణములు సర్వవస్తువుల యందు నున్నవి. జీవులు దేవతలుగాను, మానవులుగాను, జంతువులుగాను, నొకవిభాగము నేగుణమధికముగా నున్నదో దానినిఁబట్టి చేసిరి. ౯ ఈ మూడుగుణములు నాత్మబంధనములు, అవి కలిసి కనిపించును. పరస్పరసంబంధము గలిగి, ఒకదానినొకటి యనుసరించును. సత్త్వమున్నంతకాలము తమము నుండుననుటకు సందేహము లేదు. సత్త్వతమము లున్నంతకాలము రజోగుణము నుండును. అవి కలిసి యాత్రచేసి, కలిసియే సంచరించును.” ౧. దీనిపై వ్యాఖ్యానించుచు నీలకంఠుఁడిట్లు వ్రాసెను. “సత్త్వమెంత పెం

(౮) శాంతిపర్వమ్, ౩౦౮; చూడు ౩౦౬. ౨౯; ౩౧౦-౨౦

౯. అనుగీత ౧౮౫. ౩౬-౩౮.

౧. అనుగీత. ౨౮౫.

పొందినను, దానికిఁ దమస్సు నిరోధకమైయుండును. ఈవిధ ముగా నభివృద్ధి నిరోధకశక్తులు మూఁడుగుణములయందు నవి చ్ఛిన్నముగాఁ గలిసియుండును. వానిబలములో భేదమున్నను నవి యెల్లప్పుడును కలిసియుండును." తమస్సు మానవునిలో మాంద్యలక్షణము, దానిలక్ష్య మింద్రియసంతృప్తి, సుఖసంపా దనము, దాని పరివృత్తి అజ్ఞానము. దానిని నిగ్రహించు మాన వుఁడు సౌమ్యుఁడనఁబడును. రజస్సు ఉద్రేకశక్తి; కోరికల నతిశయింపఁజేయును. అది మానవున కశాంతినిచ్చి, విజయ మును, నధికారమును సంపాదించునట్లు చేయును, దానిని నిగ్ర హించినపుడది మృదువైన ప్రేమ, దయ. కరుణారూపముల గోచరించును. అజ్ఞానావృతములకుఁ దోడ్పడునిపోవు తమస్సు నకును, సత్యదృష్టినిఁ బెంపొందఁజేయు సత్త్వమునకును మధ్యస్థ మైనది రజోగుణము. మానవునిలో జ్ఞానభాగము సత్త్వము. అది నిశ్చలమైన సచ్ఛీలవికాసమొనర్చి, యోగ్యతను బోధిం చును. మానవులను సక్రమముగా నడపుశక్తి సత్వగుణమే, దానిధర్మము క్రియాత్మకమైన జ్ఞానము, సక్రమవిధి నిర్వాహ ణము గుణత్రయాధీనుఁడు గానివాఁడు లేఁడు. మనస్సుసత్త్వము నకు, జీవితపరివృత్తికి రజస్సు దేహమునకుఁ దమస్సు నిలయ ములు. తమస్సు మనభౌతికస్వభావమునందును, రజస్సుచేతన స్వభావమందును, సత్త్వము మానసిక స్వభావమునందును నుచ్చదశలో గోచరించును. మనమానసిక నిర్మాణమునందు మూఁడును భిన్నాంశరూపక సంయోగమును గలిగియే యుం డును. విజ్ఞానజీవితమందలి సంకల్పభాగమును దీసికొన్నచో,

నెడ తెగని కోరికలయొక్కయు వాని ననుభవించుటయొక్కయు బునరావృత్తి గలిగిన క్షుద్రజీవిత ప్రవృత్తిలోఁ దమస్సు బలవత్తరమైయుండును. అధికారలాభ జయాదికములైన కామములందు రజోగుణము విజృంభించును. రజస్తమములకు సామరస్యముచేకూర్చి, జీవమునకు లోకమున కననుకూలసంబంధమును గలిగించి, ఆంతరంగిక సమన్వయమును సాధించునది సత్త్వగుణము. ౨. ఈమూడు గుణములు పరస్పరసంయోగముచే మానవుని శీలమును నిర్ణయించును. కావున మానవులందరు సాత్త్వికులు, రాజసికులు, తామసికులుగా వర్గీకరింపఁబడుదురు. ద్విజులలో వైశ్యులధములు; స్పర్ధక్రియాపరతంత్రులగు క్షత్రియులు మధ్యములు; బ్రాహ్మణు లుత్తములు. ఈ గుణముల ననుసరించి దైవలక్షణములను జెప్పునపుడు, బ్రహ్మవిష్ణుశివులు మూడుగుణములకుఁ బ్రతినిధులు. దేవునియం దీమూడుగుణములును సామరస్యము నొందియుండుటేకాక, దైవ ప్రవృత్తిహేతువులునైయుండును. దేవునియందు సత్త్వము స్వయంజ్యోతి రూపమైన దివ్యకాంతి,రజస్సు సర్వవ్యాపారసంకల్పశక్తి, తమము కర్మనివృత్తిసూచకము. ఈత్రివిధశక్తులు ప్రకృతిలో సర్వవ్యాపారములకుఁ గారణములై యున్నవి. ఈ మూడుగుణముల వ్యాపారమే లోకనాటకము. "గుణములు గుణములనుండి పుట్టి, గుణములలోఁ గలిసిపోవును.౧."

౨. పోల్చు, ప్లేటో మూడు గుణములు; కామము, క్రియ; హేతువు వీనిననుసరించి మూడురీతులు మానవవర్గీకరణము.

౧. శాంతిపర్వము. ౩౦౯-౨౩.

సాంఖ్యతత్త్వాచార్యులు కపిలుఁడు, ఆసురి, పంచశిఖుఁడు-౨నని చెప్పుదురు. కాని పంచశిఖుని తత్త్వమునకు సాంఖ్యతత్త్వమునకు భేదములున్నవి.3. పౌరాణికతత్త్వము, వేదాంతతత్త్వమునకును, సాంఖ్యతత్త్వమునకును మధ్యమదశను గల్పించిన దను డ్యూసేను నభిప్రాయమును మేమంగీకరింపము. పురాణములు రెంటిని. స్వీకరించినవి. పురాణములలో సాంఖ్యతత్త్వము సమగ్రముగా లేకున్నను, ముఖ్యాంశములన్నియు నున్నవి. యోగసిద్ధాంతమంతయు స్వీకరింపఁబడునుగాని, పతంజలియోగశాస్త్రపదములు మాత్రము పూర్తిగాఁ వాడఁబడలేదు.౪.

పంచభూతములైన భూమి జలముఅగ్ని వాయువుఆకాశముల కనుగుణములైన పంచేంద్రియములను. త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములను మహాభారత మంగీకరించినది. ఇంద్రియమున కింద్రియ విషయసంయోగమాత్రముచే దర్శనము లభింపదు. ఇంద్రియ వేదనమును మనస్సు స్వీకరించి బుద్ధికందిచ్చి బుద్ధి ఆత్మకు సమర్పింపవలెను. "మనస్సాహాయము లేనిదే నేత్రము చూడఁజాలదు. ౫. మనస్సు వార్తలనందించునదే కావున బుద్ధి నిర్ణయించునది. ౬. ఆత్మ స్వభావమునుగూర్చి, కొందరు, ప్రకృతికార్యములకు, సాక్షిమాత్రమనియు, వేదజ్ఞానముల కాధారమనియు,స్వయముగా నచంచలమనియు సాంఖ్యులభావ

(౨) అనుగీత ౧౨౮ ౩౧౯, ౫౯;౧౨౮ ౨౧౭, ౧౪.
3. చూడు కీత్ సాంఖ్యతత్త్వము పుటలు ౩౯-౪౦
(౪) ౧౨౮. ౨౩౭, ౬-౭. (౫) శాంతిపర్వమ్ ౩౧౧, ౧౭.
(౬) శాంతిపర్వమ్. ౨౫౧, ౧౧.

ములను నమ్మిరి. ఆత్మ అణుస్వరూపమను భావములుగూడ నంగీకరించినది. జీవాత్మల అస్తిత్వము నేకాక, పరమాత్మ లేక పురుషోత్తముఁడున్నాఁడనియు భారతము విశ్వసించును. దేహాబద్ధుఁడైన ఆత్మ, క్షేత్రజ్ఞుఁడనియు, దేహగుణశూన్యుఁడగు నప్పుడాత్మయే పరమాత్మయనియు భావింపఁబడెను. లింగశరీర భావమును భారతము చెప్పుచున్నది. ౨.

౧౦–ధర్మశాస్త్రము.

సుఖసాధనమైన ధర్మసూత్రమునకు మహాభారతముచ్చ స్థానమునిచ్చినది. "జీవులందరు దుఃఖనివారణమును సుఖ ప్రాప్తిని గోరుదురు." 3. "మనము కోరునది సుఖము; ద్వేషించునది దుఃఖము" ౪. లోకమున సుఖదుఃఖములు రెండును గలిసియున్నవి. ౫. కాని సుఖదుఃఖములు రెండు ననిత్యములే. ఏస్థితియందుండి సుఖదుఃఖముల రెంటిని నిర్వికారప్రశాంతచిత్తులమై గ్రహింపఁగలమో, ఆస్థితినిసంపాదించుటే మానవ ప్రవృత్తికిఁ బరమావధి. ౬. మానవునకు సంపూర్ణ సంతృప్తి నొసగుటకు నిశ్చలస్థితిని ధర్మమే ప్రసాదింపఁగలదు. ఇహలోకమునందు శాంతి సుఖములను, ననంతరము మోక్షమును ధర్మమీయఁగలదు.

ధర్మము మోక్షమునిచ్చునుగాని మోక్షము సిద్ధి, ధర్మము సాధనముగాఁ జెప్పఁబడెను. మానవుని పురుషార్థము

౧. చూడు శాంతిపర్వము. ౧౮౭-౨౪ (౨) వనపర్వము ౨౯౬-౧౬
3. శాంతిపర్వము ౧౩౯, ౬౧. (౪) శాంతిపర్వము ౨౯౫, ౨౭.
౫. శాంతిపర్వము ౧౯౦-౧౪; ౨౫-౨౩; వనపర్వము ౨౬౦, ౪౯
౬. శాంతిపర్వము ౨౫-౧౬

లైన ధర్మార్థ కామ మోక్షములలో నీ రెంటికి భేదముచూపఁ బడినది. మోక్షసాధనసూత్రములు మోక్షధర్మములు. సంకుచితార్థములో ధర్మమనగా నీతిసూత్ర సముచ్చయము; కాని యిందు మోక్షభావముకూడ నిమిడియున్నది.

సార్వజనిక నియమములైన అహింసా సత్యములుగాక, ధర్మము సంఘపరిస్థితులపై నాధారపడియుండునది. ధర్మమున కెల్లప్పుడు సంఘసంబంధమున్నది, సంఘము నేకముగా బంధించి చూపునది ధర్మము. ౭. మనము ధర్మమును బోషింపకున్నచో సాంఘికముగా నరాజకము సంభవించి, సంపద, కళ నశించును. సమాజస్థితికి ధర్మ మాధారము. ౮. ధర్మమే సర్వసృష్టియొక్క క్షేమమునుగూర్చును. ౯. "సంఘక్షేమమునకు వ్యతిరేకమైనదానిని దేనినాచరించుటవలన నీవు లజ్జాన్వితుఁడవుకావలసివచ్చునో దానినిఁ జేయకుము." ౧౦. "నీకేది యహితమని తలచుచుంటివో దాని నితరులకును జేయకుము." ౧౧. అను నీసూత్రమున సర్వధర్మసార మిమిడియున్నదని మహాభారతము చెప్పుచున్నది. వర్ణధర్మములు ధర్మసాధనములుగా శాసింపఁబడినవి." తాను ముండితుఁడుగాక, రాజ్యమును తనవీర్యముచే రక్షించు లే

(౭) "ధారణాద్ధర్మ మిత్యాహుః ధర్మో ధారయతే ప్రజాః" కర్ణపర్వము ౬౯-౫౯

౮. లోకసంగ్రహము లేక సమాజధారణ.

౯. సర్వభూతహితమ్.

౧౦. శాంతిపర్వము ౧౨౪, ౬౬, ౨౬౧, ౯, ౧౦౯, ౧౦.

౧౧. పండితపత్రిక ౧౮౭౧. పుట ౨౩౮.

క్షత్రియునిధర్మము." ౧. వర్ణధర్మములకంటె సర్వజన సామాన్యములైన నీతిధర్మము లధికములు. "సత్యము, ఆత్మనిగ్రహము, తపము, ఔదార్యము, అహింస, నియమవ్రతము, ఇవియే కార్యసిద్ధిహేతువులు. కులవర్ణములుగావు." ౨. "ప్రాణముకంటెను మోక్షముకంటెను ధర్మమేఅధికమైనది. రాజ్యము పుత్రులు, యశము, సంపద యివన్నియు సత్యముయొక్క విలువలోఁ బదునారవవంతును గావు." ౩. స్త్రీలకు వైదిక కర్మాధికారము లేకున్నను, పుణ్యతీర్థయాత్ర, పురాణపఠనము, భక్తివిశ్వాసములతో దేవుని భజించుట మున్నగునవి చేయ నచ్చును. ౪.

ధర్మ మిహలోకసు ఖైకసాధనముగా నేర్పాటుచేయఁబడి నదికాదు. కామసంతృప్తియే దానిలక్షణముగాదు. కామానుభవము నిత్యసుఖప్రదముకాదు. "సుఖకాంక్ష సుఖానుభవము వలనఁ దీరదు." ౫. మనకేది ప్రాప్తించినను మనయాశ పెరుగుచునేయుండును. "జిలుగు సాలెపురుగు తనయైశ్వర్యముచే మరణించుచున్నది." ౬. అనంతమైనదానిని గోరు కోర్కెను సాంతమైనదేదియును తృప్తిపఱుపఁజాలదు. అవసరమైనచో ధర్మము కొఱకు మనము క్లేశము లనుభవింపవలసి యుండును. శాశ్వతా

---

౧ "దండ ఏవహి రాజేంద్రక్షాత్ర ధర్మోనముండనః." శాంతిపర్వము ౨౩, ౪౬. (౨) ౩అ. ౧౭౧-౪౨ (౩) ౩అ. ౩౪, ౨౨

౪. ౩అ. ౩౭, ౩౩; ౩అ. ౭౪, ౭౩.

౫. "నజాతుకామః కామానాముపభోగేన శామ్యతి" ఆదిపర్వము, ౭౫, ౪౯. చూడు మనువు ౨అ. ౯౪. (౬) ౧౨అ. ౩౩౦, ౨౯.

నందసంపాదనమునకు దుఃఖానుభవమే మార్గము. ౭. అసంతుష్టి యభ్యుదయమునకు దోహదము. ౮. మనము మన మనస్సులను నిగ్రహించి, కామము లుద్రేకము పొందకుండఁ జూడవలెను. మనకుఁ జిత్తశుద్ధిగలిగి, సత్యము లభించినచో, మానవులకుఁ గష్టముగాఁ దోఁచుననిగాని, మనకు శ్రమకలుగుననికాని తలఁచి ధర్మాచరణమును మానము. మనస్సంకల్పముల శిక్షణము వలన నిట్టిదృష్టి పెంపొందును. కొన్నితావులందుఁ దీవ్రజపము బోధింపఁబడెను. సుఖదుఃఖములు మిశ్రమమైయుండుటచే వీని బంధములనుండి విముక్తినందుమార్గము తృష్ణానాశనమే. ౯. సుశిక్షణముచే మనకు లభించుస్థితి కామసంతృప్తికంటెను, మహేంద్రపదవికంటెను నగణ్యముగా నతిశయమైనది. ౧౦. మహాభారతమునందుఁ దపోయోగములనుగూర్చి సక్రమమైన పద్ధతి యేదియు నిర్వచింపఁబడలేదు. ఏకపాదముపైనిలుచు ఋషులను, తమపైవల్మీకములు పెరుగుచున్నను సమాధిగతులై యుండువారిని, ఉగ్రకోపాంధులైన దుర్వాసుడు, మున్నగుఋషులనుగూర్చియు వినియుంటిమి. తపోమార్గమునకుఁ బ్రముఖ్యమీయఁబడినదికాని, దానినిగూర్చి ప్రతిఘటనములును గలవు. "కాషాయాంబరధారణము, మౌనవ్రతము, దండత్రయధారణము కమండులువును స్వీకరించుటయు నివి తప్పుదారినిబట్టించును. ఇవి మోక్షసాధనములు గావు." ౧౧. తక్కిన త్రివిధా

౭. వనపర్వము ౨౩౩, ౪. (౮) సభాపర్వము ౫౫-౧౧ "అసంతోషః శ్రియో మూలమ్." (౯) శాంతిపర్వము ౨౫, ౨౨; ౧౭౪, ౧౬.
౧౦. శాంతిపర్వము ౧౭౪, ౪౮; ౧౭౭, ౪౯.
౧౧. శాంతిపర్వము ౩౨౧, ౪౭

శ్రీమధర్మములు నిర్వర్తించునందాక లోకమునువీడి సన్న్యసించుట కంగీకరింపఁబడలేదు. త్యజించుటకుముందు లోకమున జీవించి యనుభవమును సంపాదించు టే ప్రధానమను విషయమును దెల్పుగాథ యొకటి మహాభారతమునందుఁ గలదు. వివాహముచేసికొనకుండ ముందుగనే సన్న్యసించిన యొకఁడు తిరిగి తిరిగి యొకఘోరమైన నరకకూపమును జేరెను. అచట నాతఁడు తన తండ్రిని తాతను, నింకనితరతరముల బంధువులను నొకరివెనుకనొకరు ఘోరాంధ తమఃకూపమున కున్ముఖులై యున్నవారిని గాంచెను. వారందరు పట్టుకొనివ్రేలాడుచున్న త్రాడు నొకకాలశక్తియను నెలుక నెమ్మదిగాఁ గొరికివేయుచున్నది. చిన్ననాఁడు తానువినిన జ్ఞాపకముగలవారి కంఠనాదములు "మమ్మురక్షింపు"మని యఱచుచు వినఁబడినవి. వీరందరికి మోక్షమిచ్చి కాపాడుటకు వారివంశములో నొకపుత్త్రుఁడుదయించు టే. సన్న్యాసి దానియర్థమునుగ్రహించి, యింటికిఁ దిరిగివచ్చి వివాహమాడెను.

ఒకసంఘములోని వ్యక్తులమై సంఘము నెడ మనవిధ్యుక్త ధర్మములను నెఱవేర్పవలయుచో, మనవిధులేవో తెలిసికొను టెట్లు? పవిత్రులు పరిపూర్ణులు, వారికి వారే శాసనములు. పరిణతినొందనివారందరు నితరులుకల్పించినట్టియు సంఘమంగీకరించినట్టియు నియముల నంగీకరింపవలెను. ఆచారము ప్రధానమగు నియమము.౧. నియమములు మనలోని స్వభావదోషములను నిరోధించునవికావున నవి శాసనరూపములను దాల్చి

౧. అనుశాసనపర్వము ౧౦౪, ౧౪౬; మనువు ౧౧. ౧౦౮.

బాధించునవిగా గోచరించును. 3. కర్తవ్యములకు వైరుధ్య మేర్పడుచో నప్పుడు మనము మహాత్ముల ననుసరింపవలెను. మనలనుత్సాహపఱచి, ధర్మోద్యుక్తులమగునట్లు చేయుట కొక ప్రేమపాత్రుఁడగు వ్యక్తి యవసరమని గుర్తింపఁబడినది. తర్కము స్థిరమైనది కాదు; ధర్మశాస్త్రములు భిన్నభావముల నుపదేశించును. ఏఋషివాక్యమును నిశ్చయముకాదు; ధర్మ సూక్ష్మ మతి గుప్తమైనది; అందుచే మహానుభావుల దారినిఁ బోవలెను.” ౪. మహానుభావులనగా నాత్మజ్ఞానులే. కొన్ని సామాన్య ధర్మములున్నవి. ‘అతివాదములను విసర్జింపవలెను’ మున్నగునవి. ౧. అతిశయమైన సహిష్ణుతాభావమును దోషమే. ౨. సత్యము, అహింస ప్రధానధర్మములని చెప్పినను వానికిసవరణలను మహాభారతము ప్రకటించినది. 3. సత్యము పలుకుటలో స్థిరమైనవిలువలేదు. మానవజాతికల్యాణమే సత్య వచనమునకు ఫలప్రాప్తి. ౪. కాని నియమమున కనుబంధ ముల నంగీకరించుటవలన ప్రమాదములనుగుర్తించి, మహాభా రతము, సత్యవిరుద్ధముగాఁ బ్రసంగించినవారికిఁ బ్రాయశ్చిత్త ములను నియమించినది.౫.

3. చూడు మీమాంససూత్రములు ౧౬. ౧, ౨; శాంతిపర్వము ౭౯ ౪, ౨౯. (౪) వనపర్వము ౩౧౨, ౧౧౫.

౧. అతిసర్వత్రవర్జయేత్ ౨. వనపర్వమ్. ౨౮.౬,౮. (3) శాంతి పర్వమ్. ౧౦౯, ౧౫-౧౬ ౪. యద్భూతహితమ్ అత్యంతమేతత్సత్యమ్ మతమ్ మమ. శాంతిపర్వము ౩౨౯. ౧౩; ౨౮౭. ౧౬. (౫)౮౪. ౧౦౪-౧౦౯

పాపము, పశ్చాత్తాపముతోఁ గూడిన తప్పు నొప్పుకొనుభావము నంగీకరింపఁబడెను: నిజముగాఁ బశ్చాత్తప్తుఁడైన వాఁడిట్లు చెప్పవలెను. "నేనట్టి తప్పు నికెన్నఁడును జేయను." దేవునియందు నిశ్చలమైనభక్తి ధర్మసంశుద్ధమైన పరివర్తనమునకు సాధనము. ఎంత పుణ్యకర్మనొనర్చినను, జ్ఞానము వలనఁగాని పరమార్థము లభింపదనిచెప్పు కొన్ని వాక్యములునుగలవు. "మోక్షప్రాప్తికవసరమగు నేకాగ్రతాభ్యాసము నందున్న పవిత్రత నార్జింపనంతకాలము మనము తిరిగితిరిగి జన్మించుచుండవలసినదే."౧.

మహాభారతము కర్మకు శక్తిగలదని, యనగాఁ జేసిన కర్మ యనుభవించి తీరవలెనను విషయమును విశ్వసించును. సర్వజీవులు కర్మబద్ధులనియు, జ్ఞానమువలనఁ గర్మబంధ విచ్ఛేదమగుననియుఁ జెప్పు నుపనిషద్భావమును మహాభారత మంగీకరించినది. ౨ పితరుల కర్మఫలము సంతతికిఁగూడఁ బ్రాప్తించుననియుఁ గొన్నితావులఁ జెప్పఁబడెను. ౩. వ్యక్తిస్వాతంత్ర్యమునకుఁ గర్మబంధమునకు సామరస్యము కల్పింపయత్నములు జరిగినవి. కఠోరమైనకర్మనియతితోఁబాటు వ్యక్తిస్వాతంత్ర్యమున కవకాశముండఁజాలదను భావమే ప్రధానముగాఁ జెప్పఁబడినను, గొన్నిసవరణలు లేకపోలేదు. మానవప్రయత్నము కర్మను మార్పుచేయఁగలదు. కర్మ అగ్నివంటిది; దానిని విసరి

(౧) అనుగీత 3అ.౨౩. (౨) కర్మణా బధ్యతే జంతూః విద్యయా తు ప్రముచ్యతే. శాంతిపర్వము. ౨౪౦,౭, ౩. శాంతిపర్వము ౧౨౯; మనువు, ౪అ. ౧౭౦; ఆదిపర్వము ౮౦.3

జ్వాలగా నొనర్పవచ్చును; ఆర్పివేయవచ్చును. కర్మ మూఁడు విధములు; ప్రారబ్ధము, సంచితము, ఆగామి. ఈదేహామనుభవింపవలసిన యీజన్మములోఁ బూర్వజన్మ కర్మ ఫలసంస్కారములేవి యారంభమగునో యవి ప్రారబ్ధములు. ఇతరపూర్వజన్మవాసనలు సంచితములు; అనగా బీజరూపసంస్కారములు. ఈజన్మములోఁ జేసిన కర్మఫలసంస్కారము లాగామికర్మలు; ప్రాయశ్చిత్తములచేతను, జ్ఞానముచేతను, సంచితాగామి కర్మలు నాశనమగునుగాని, ప్రారబ్ధములుపోవు. దైవకృపచేఁ గూడ సంచితాగామికర్మలు నశించును. ఏదైననొక కార్యసిద్ధి కర్మవలననేకాక, సముచితయత్నమువలనఁ గూడనగును. కర్మ నియమ వ్యాపారము దేవునికధీనమై యున్నది. దేవుని స్వభావ ప్రకటనమే కర్మసూత్రము. కర్మసూత్రమును ధరించువాఁడు, ఆధారము, శక్తి యీశ్వరుఁడే. ౧.

ముందు జన్మమునుగూర్చి, మహాభారతములో స్పష్టమైన భావములేదు. పితృయాన దేవయానములు, నరకమును న్నవి. అమరత్వమనగా, "నొకచక్రవర్తివలె నైశ్వర్యము ననుభవించుటకాదు; ౨ ఆకలిదప్పులు, జరామరణములు మున్నగు దుఃఖములులేని, పుణ్యలోకమున ననుభవించు నిత్యానందమే అమరత్వము. అది మహాయోగికి లభించు బ్రహ్మానందము. యోధునకు దేవేంద్రుని స్వర్గము లభించును. ఇహలోక దేహములను విడిచిన మునీశ్వరులయాత్మలే నక్షత్రములని చెప్పఁ

౧. మహాభారతము ౮౫. ౧౨౯.

౨ ౭.౫. ౭౧. ౧౭.

బడెను. యుద్ధరంగమున నసువులఁ గోల్పోయిన వీరుల మూర్తులే నక్షత్రములుగా నర్జునుఁడు గ్రహించినాఁడు. దైవముతో నైక్యానుసంధానమే పరమలక్ష్యము. ప్రకృతితో సంబంధము లేని పురుషుఁడు తానని మానవుఁడు గుర్తించుటతో సర్వప్రకృతిబంధములనుండి విముక్తి కలుగునని చెప్పిన సాంఖ్యభావ మొకొక్కచోఁ బేర్కొనఁబడెను. "దేహధారియైన జీవుఁడు స్వచ్ఛమైన యాత్మదర్శనము పొందినచో నప్పుడాతనిని శాసించువాఁడెవఁడును లేఁడు. ఆతఁడే త్రిలోకాధినేత; ఆతఁడిచ్ఛవచ్చిన దేహములను బొందఁగలఁడు...ఆతఁడు బ్రహ్మైక్యము పొందును." 3

## ౧౧— శ్వేతాశ్వతరోపనిషత్తు

అనంతరకాలమునకుఁ జెందిన యుపనిషత్తు లీదశకుఁ జెందినవి. ఇవి పూర్వోపనిషద్భావములనే పునఃప్రకటన మొనరించును. ఇవికొంతవిశేష విజ్ఞానమును బ్రదర్శించును; మధ్యమకాలమున దేశములోని ప్రజల మనోవికాసమును సూచించును. ఇవియొక మతమునకుఁగాని, యొకశాఖకుఁగాని చెందును. కేవల యోగాభ్యాసములను, లేక సాంఖ్యతత్త్వమును. లేక వేదాంతతత్త్వమునుగొన్ని కొన్ని యుపనిషత్తులు ప్రత్యేకముగా బోధించును. మనము తీవ్రతప మొనర్చి, సర్వకామములను నిర్మూలమొనరింపవలెనని జాబాలోపనిషత్తు చెప్పుచున్నది. మైత్రిఉపనిషత్తు నిరాశాతత్త్వమునే ప్రదర్శించును౧.

3. అనుగీత ౪

౧. మైత్రి ఉ. ౧౫. ౨-౪.

సాంఖ్యయోగసిద్ధాంతముల కిది సామరస్యము కల్పించును. సాంఖ్యమతము చెప్పిన యిరువదినాలుగు తత్త్వములు పరబ్రహ్మమునుండి జనించినవని నిరూపించుయత్నము కన్పట్టును. మైత్రి, ధ్యానబిందు, యోగతత్త్వోపనిషత్తులు యోగతత్త్వమును గొనియాడును. భిన్నప్రదేశములో కేవిశ్వదేశములోని భాగములైనట్లు, జీవులు బ్రహ్మములోని భాగములని అమృతబిందూపనిషత్తు చెప్పుచున్నది. ఇది యద్వైతార్థమును బ్రకటించును. "విజ్ఞానాతీతమై నిష్కలుషమై భాగములులేని దే బ్రహ్మస్వరూపము. నేనే బ్రహ్మమునని తెలిసికొన్నవాఁడే, అవినాశి యగును." ఉపాధికారణముచే నొకటే యనేకముగా గోచరించును. చంద్రునివలెను, జలములోఁ జంద్రుని ప్రతిబింబమువలెను, బ్రహ్మ మొకటిగాను, ననేకముగాను గూడఁ గనఁబడును.'' ౨. మోక్షమునకు సన్న్యాసమొక్కటే మార్గమని కైవల్యోపనిషత్తు చెప్పును. 3. జ్ఞానము ర ప్రధానమనిచెప్పి, ఆత్మవస్తువులపై నాధారపడదని వాదించును. "జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు మూడింటిలోను, భోక్త, అనుభవము, పదార్థములు వీనినుండి వేఱై. నిత్యసచ్చిదానంద సాక్షిమాత్రుఁడనైన వాఁడనే నేను.'' ౫. ధ్యానము, సగుణారాధనము, రూపధ్యానములను గొన్ని యుపనిషత్తులు చెప్పును. విష్ణువు లేక శివుఁడు పరబ్రహ్మమనియు వానియెడ భక్తిమార్గమును గొన్ని యుపనిషత్తులు బోధించును. ఇట్టివే మహానారాయణము, రామతాపన్నీయము, శ్వేతాశ్వతరము, కైవల్యము మున్నగు నుప

(౨) ౨-౧౦ (3) కైవల్యోపనిషత్తు ౧౮. ౧. (౪) ౯-౧౦ (౫) ౧౭.

నిషత్తులు. ఈయుపనిషత్తులన్నియుఁ జాలవఱకు,సాంఖ్యయోగ వేదాంత తత్త్వభావములను సమన్వయింప యత్నించినవి. సాంఖ్యాదిశాస్త్రముల నిర్మాణానంతరమే యీ యుపనిషత్తు లుద్భవించినవి. శ్వేతాశ్వతరోపనిషత్సిద్ధాంతముల నిట వివరించు టవసరము; ఏలన భగవద్గీతవలెనే యదియును, భిన్నతత్త్వముల సమన్వయమునకై యత్నించినది. ఒకభేదము మాత్రమున్నది. దీనికి శివుఁడే పరమదైవము.

సాంఖ్యయోగతత్త్వముల శాస్త్రీయపద పరిచయము జూపెనుగాన, నీయుపనిషత్తు బౌద్ధయుగోత్తరకాలమునకుఁ జెందినది. కపిలనామము నిది యుచ్చరించినది; కాని శంకరుఁడీ కపిలనామము హిరణ్యగర్భుని కర్థమని చెప్పినాఁడు. త్రివర్ణములు గల ౬. అజమును గూర్చియుండుటచే నివి సాంఖ్యగుణత్రియమని కొందరు భావింతురు. కాని శంకరుఁడు మూఁడు రంగులు సాంఖ్యగుణములను గాక, ఉపనిషత్తులు చెప్పిన మూలభూతములగు భూమిజలాగ్నులను దెల్పునని చెప్పినాఁడు. ఇందలి ద్వితీయాధ్యాయము, యోగతత్త్వమును గూర్చి విశేషముగా వివరించినది. న్యాయశాస్త్రభావములో లింగశబ్దముపయోగింపఁబడినది. ౧. బౌద్ధభావములైన కాలకర్మస్వభావ పురుషాదులతోఁ బరిచయమును వెలిబుచ్చుచున్నది. పరమసత్యమును దెల్పుటకై, యిందు హరుఁడు, రుద్రుఁడు, శివుఁడు మున్నగు

(౬) ౪౫. ౫.

౧. ౬౫. ౯.

నామములుపయోగింపఁబడెను. ౨. బ్రాహ్మణమత సగుణదైవ మునకు నిర్గుణబ్రహ్మ లక్షణము లారోపింపఁబడెను.

శ్వేతాశ్వతరము "ఆస్తికమతమునకు గొప్పనిర్మాణ" మని డ్యూసేన్ పండితుఁడు పలికినాఁడు; ఏలన సృష్టికర్తయుఁ, బోషకుఁడు, ధర్మమూర్తియైన సగుణదైవము నిదియిచ్చెను. జీవులకు, ప్రకృతిపదార్థమునకుఁ బ్రభువు వారుఁడు. జగత్కారణము స్వభావమను భౌతికవాదము నిది నిరసించును. ౩. వస్తువులకుఁగల గుణముల ననుసరించి, పరస్పరసంయోగము చేతనే జగ ముత్పన్నమైనదని భౌతికసిద్ధాంతవాదము. ఈసిద్ధాంత మునకు దేవుఁడవసరము లేదు.

ఈశ్వరాస్తిత్వమును దర్కము ఋజువుచేయఁజాలదు. భక్తిధ్యానములకే యది సాధ్యమగును. ౪. "ధ్యానసమాధిగతుఁడైన యోగి, తన ఆత్మయొక్క స్వచ్ఛస్వభావమువలన దివ్యజ్యోతిస్వరూపమైన బ్రహ్మమును దర్శించును. అజము, శాశ్వతము, ప్రకృతిస్వభావాతీతమునైన బ్రహ్మమును దర్శించినవాఁడు సర్వబంధ విముక్తుఁడగును." ౫. "పరబ్రహ్మము నకు దృశ్యమానమగు రూపము లేదు; ఎవఁడును దననేత్రము లతో నాతనిఁ జూడలేఁడు. ఎవరాతఁడు హృత్పద్మముపై నధివసించియున్నాఁడని యనుభవజ్ఞానముచేఁ దెలిసికొందురో, వారు మృత్యువును జయింతురు." ౬. పరమేశ్వరుఁడగు నాతఁడు ప్రకృతికి నాత్మకు నధిపతి; బంధమోక్షముల కారణము, సర్వ

(౨) ౧అ. ౧౦; ౩అ. ౪,౭; ౪అ. ౧౦. ౧౨ (౩) ౬ అ. ౧.
(౪) ౬అ. ౧౩. (౫) ౨అ. ౧౫. (౬) ౪అ ౨౦.

వస్తువులలో నిత్యమైనవాఁడు, స్వయంభువుఁడు." ౭. దేవుని యంతర్యామిత్వము నంగీకరింపఁబడెను. ఆతఁడు మానవుని హృదయాంతర్వర్తియై సర్వజీవులలో నుండువాఁడు. "నీవు కాంతవు, పురుషుఁడవు, నీవు యువకుఁడవు, నీవు యువతివి, చేతి కఱ్ఱనూతఁగాఁ గొని వణకుచున్న వృద్ధువు నీవే, నీవు విశ్వముఖుఁడవు." ౮ నిర్గుణబ్రహ్మమే సత్యమనియు, నీశ్వరుఁడు లోకము, ఆత్మ దానిలక్షణములే యనియు శ్వేతాశ్వతరోపనిషత్తునకుఁ దెలియును. "ఎచ్చటఁ జీఁకటి లేదో, అచటఁబగలు రాత్రియు లేవు; అస్తిత్వనాస్తికత్వములు లేవు; అది యేకైక సత్స్వరూపము." ౧. ఆతఁడు నిర్గుణుఁడే; కాని దైవతత్త్వజ్ఞులు నిర్గుణుఁ డనగా దోషగుణవర్జితుఁడని యర్థమును జెప్పాదురు.౨ పరిణామజగత్తున కతీతుఁడై, ౩. దేశాతీత తుఁడై" ౪. కారణ ధర్మాతీతుఁడై నిర్వికారుఁడైన పరబ్రహ్మస్తిత్వమును శ్వేతాశ్వతర మంగీకరించుననుటకు సందియము లేదు. అది శుద్ధమూల విజ్ఞానరూపము; దానికాంతిచేతనే సర్వము ప్రకాశించుచున్నది. ౬. "దానికి భాగములు లేవు, ప్రవృత్తి లేదు. కల్మషము లేదు, అజ్ఞానము కాని దుఃఖముగాని లే''దని౭ వర్ణింపఁబడినది. ఈపరమాత్మనుండి, మూఁడురూపము లుదయించినవి; సర్వజ్ఞుఁడైన పరమేశ్వరుఁడు, అపరిపూర్ణమైన ఆత్మ, సుఖదుఃఖాను

(౭) ౬అ.౧౬; ౬అ.౭. ౬అ. ౧౩. (౮) ౩అ. ౧౧, ౧౮, ౧౬, ౪అ. ౩. మాడు మహానారాయణము ౨,౭; కైవల్యము. ౯, ౧౦.

౧. ౪అ. ౧౮. (౨) ౬అ.౧౧ (౩) ౩అ.౧౮ (౪) ౩అ.౨౦ (౫) ౫అ.౧౩; ౬అ.౫ (౬) ౬అ. ౧౮. (౭) ౬అ.౧౯

భవసామగ్రిలో నిండియుండిన ప్రకృతిప్రపంచము, ౮. మూలములో నీమూఁడింటికి నెట్టిభేదమును లేదు. ఏకబ్రహ్మమునకు మూఁడురూపములవి. ౯. ఉపనిషత్తుల పరబ్రహ్మము పురుషులందరలోఁ బురుషోత్తముఁడైనాఁడు. సగుణదైవమూర్తి, జీవప్రకృతుల కాధారమైన దివ్యస్వరూపి. ౧౦. ఆస్తికధర్మములన్నిటికి నిట్టి వ్యంగ్యార్థమున్నది. మానవవిజ్ఞానమునకు, సర్వశరణ్యు౧౨ఁడు, సర్వార్థప్రదుఁడు ౧౩ మిత్రుఁడు, యోగ్యుఁడునైన పరతత్త్వమూర్తి యవసరము. నిర్గుణబ్రహ్మారాధనము దుస్తరము కావున, సగుణమూర్తి యొకఁ డూహింపఁ బడెను. ౧౪ "బ్రహ్మము పూర్ణజ్ఞానమూర్తి, అవిభాజ్యుఁడు, అశరీరి, భక్తిసాధనలోనున్న భక్తుని యుపకృతికొఱకు రూపగుణకల్పనము చేయఁబడెను." ౧౫ నిర్గుణసగుణ బ్రహ్మరూపము లొకటేయనియు, సగుణమునకు నిర్గుణమే కారణమనియు శ్వేతాశ్వతరము చెప్పుచున్నది. ప్రపంచము నందలి వ్యక్తులనిమిత్తము నిర్గుణబ్రహ్మము సగుణమూర్తి యగుచున్నది. వ్యక్తి తానొక ప్రత్యేకవ్యక్తిత్వమును గలిగియుంటినని యెంతకాలము తలఁచునో, అంతకాలము పరమాత్మ వేఱుగా నుండిన కారణమున సగుణమూర్తి కాక తప్పదు. తనవ్యక్తిత్వమును మానవుఁడు కేవలభ్రాంతియని తెలిసికొనఁగానే జీవాత్మ పరమాత్మ లేకమగుదురు.

(౮) ౧అ.౯ (౯) ౧అ.౧౨ త్రివిధమ్ బ్రహ్మమేతత్ చూడు౧అ.౭ (౧౦) సంయుక్తమేతత్ (౧౧)౩అ.౫. (౧౨)౩అ.౧౬ (౧౩)౪అ.౧౧ (౧౪) కైవల్యము ౨౪. (౧౫) రామతాపనీయోపనిషత్తు౧అ.౩; చూడు కైవల్యము ౧౮.

ఇందు మాయాసిద్ధాంతమున్నది. మాయ దేవుని స్వాధీనము. కొన్ని మార్పులతో సాంఖ్యతత్త్వ మంగీకరింపఁబడినది. ప్రకృతి స్వతంత్రమైనదను భావముపోయి, దేవుని స్వరూపమగును. ౧. దేవుని యాత్మశక్తి వలన లోకము సృజింపఁబడినది. ౨. "తన దేహమునుండి వచ్చినదారముతో సాలెపురుగెట్లు తన గూడుకట్టుకొనునో, అట్లే యొకఁడైన దేవుఁడు తన లోని పదార్థమునుండియే లోకమును సృజించి, దానిని తన స్వరూపముచేతనే కప్పినాఁడు" ౩. దేవుఁడొకటి ననేకముగాఁ గల్పించెను. ౪. ప్రపంచము మిథ్యయను భావము లేదు. మన దృష్టికి గోచరింపకుండ లోకము సత్యము నడ్డుపెట్టుచున్నదని చెప్పఁబడినది. ౫. ప్రపంచము మాయయే; ఏలన నిర్గుణబ్రహ్మమునుండి సగుణదైవమూర్తి, లోకము, జీవులు నెట్లు వచ్చినవో మనమెఱుఁగము. మాయ దైవశక్తి యనియు నంగీకరింపఁబడెను. ఆత్మజ్ఞానమూర్తియైన యీశ్వరుఁడు అనాత్మ శక్తిచే లోకమునంతను గల్పించెను గావునఁ బ్రకృతియు మాయయే. మాయయనగా నవిద్యాభావము నంగీకరింపఁబడెను; ఏలన జగత్ప్రదర్శనము తదంతర్గత సత్యము నాచ్ఛాదించుచున్నది. ఈభిన్న భావములు పరస్పరవిరుద్ధములుగావు; కాని వీనిని సరిగా నర్థముచేసికొనకున్నచో ఫలితము సంశయమే యగును.

తుదిలేని సంసారభావమునకు, నుపనిషత్తుల సృష్టిసిద్ధాంతమునకు మధ్యేమార్గముగాఁ గల్పసిద్ధాంతము కల్పింపఁబడి

---

౧. ४అ. ౯.౧౦ ౨ ౧అ.౩ (3) ౯అ.౧౦ ४. ౬అ. ౧౨. ఏకో రూపమ్ బహుధా యః కరోతి ౫. ౫అ.౧

సది. దీనిననుసరించి, ప్రతిజీవితముయొక్క కర్మఫలములు ముందు జీవితములోఁ గలుగుచుండును. ప్రతిజీవితము పూర్వ జన్మఫలితమగును; మొదటిజన్మ మనునది దీనికి విరోధమగును. అందుచే, నొకానొకకాలమున సృష్టి యారంభించెనని చెప్ప వీలుండదు. కాని సృష్టిప్రారంభించిన యుగములు, ప్రళయ ములు క్రమగతి ననుసరించి వచ్చిపోవు చుండునని చెప్పఁబ డెను. ఒకసారి జరిగిన సృష్టి ఒకకల్పకాలముండి,తరువాతఁ బర మేశ్వరునిలో లయమయి, తిరిగి యావిష్కరణము పొందుచుం డును. పునస్సృష్టికిఁ గారణము జీవుల కర్మ సంస్కారములన్ని యు మిగిలిపోయి, వాని యనుభవమునకుఁ బునర్జన్మములను గోరును. ఈకల్ప సిద్ధాంతమును, భగవద్గీతయు, శ్వేతాశ్వత రమును, పురాణములు నంగీకరించినవి. ౧. "దేవుఁడు సర్వ జీవులలోనుండి, లయకాలమందుఁ గ్రోధాగ్నితప్తుఁడై, జగ ద్వస్తు జాలమునంతను విచ్ఛిన్న మొనర్చి వైచును" ౨. "ఆతఁ డొకటి వెనుక నొకటిగా సృష్టియంతయు నాచ్ఛాదనములచేఁ గప్పి, తిరిగితిరిగి వానినిఁ దనలోనికిఁ దీసికొనుచుండును" ౩. మిగిలిన యుపనిషత్తులు దీనికి విశేషార్థము నిచ్చినవి. "జగ త్ప్రళయము సంభవించినపుడీ పరమేశ్వరుఁడొక్కఁడే సాక్షిమా త్రుఁడై యుండి, తిరిగి తన దివ్యమూర్తి గర్భమునుండి పవిత్ర జీవుల నుద్భవింపఁ జేయుచుండును." ౪ ఉపనిషత్తులు చెప్పిన

౧. జి.జి. ౯అ.౭; ౧౮అ.౧౭-౧౯. (౨) శ్వేతాశ్వతరము ౩అ.౨ (౩) ౫అ.౩. ౬అ. ౩-౪ (౪) మైత్రి ఉ. ౬అ. ౧౭.

యేకసృష్టికిఁ గాలాంతరసృష్టికల్పనసిద్ధాంత మీవిధముగా జీవుల కర్మఫలాను భవముకొఱకు నిర్మింపఁబడినది.

ఏకేశ్వర మతమగుటచే దేవునికి జీవాత్మకు భేదము స్వభావములోఁ గాకున్నను, బరిణామములో నున్నదని శ్వేతాశ్వతర ముపదేశించినది. ౫. దైవధ్యానారాధనములచే నజ్ఞానము నశించును. ౬. భక్తిప్రధానమైనది; దైవకృపచే మానవునికి స్వతంత్రకర్మాధికారమున్నది. ౭. కాని భగవంతుఁడు చపలుఁడుగాఁడు; తన కటాక్షమును గొన్ని నియమముల ననుసరించియే చూపును. ఆత్మ సమర్పణములేక ప్రపత్తిమార్గ ముపదేశింపఁబడెను.౮. ధ్యానార్చనములకు విరోధము సూచింపఁబడినది." పరమాత్మ నిత్యుఁడనియు, మన యంతరంగమున వసించుచున్నాఁడనియుఁ దెలియవలెను; ఆతఁడు తప్ప వేరేమియు నులేదు; జీవాత్మయే, కర్తృభోక్తృభోగ, విషయస్వరూపమైన పరమాత్మగా నెఱిఁగినవాఁడు ముక్తిఁ బొందును."౯

మరణానంతరజీవి మూఁడు మార్గములలో నొకదానిని నడువవలసియుండును; జ్ఞానముచే దేవయానమును, సత్కర్మచేఁ బితృయానమును, బాపకర్మలచే నరకమార్గముపట్టి పయనింపవలసియుండును. ౧. జగన్నాథు నెఱిఁగినచో సర్వబంధవిముక్తి కలుగును.౨. అంతవఱకును మనకామముల ననుసరించి, భిన్నరూపములు గల దేహములను ధరించుచు జన్మించుచుండ

(౫) ౪అ. ౬-౭. ౧అ. ౮. (౬) ౧అ. ౧౦; ౪అ. ౪-౬ (౭) ౩అ. ౨౦; ౧అ ౧౬,౨,౨,౩౧౨. ౬;౨౧. (౮) ౬అ. ౧౮. (౯) ౧అ.౧౨.

౧. ౫అ.౭. (౨) ౫అ.౧౩

వలెను." సర్వజీవాధారము, గతియునైన యీబ్రహ్మచక్రము నందు, జీవుఁడను యాత్రికుఁడు, తాను వేఱు దేవుఁడు వేఱను భావమున్నంతకాలము పరిభ్రమించు చుండవలెను. దైవకృపచే నాతఁడుద్ధరింపఁ బడినపుడు మోక్షసిద్ధి నాతఁడు గాంచును."౩.

### ౧౨—మనుధర్మశాస్త్రము

మనము భగవద్గీతా విచారణము చేయుటకు ముందు స్మృతులలో నుత్తమస్థాన మీయఁబడిన మనుధర్మశాస్త్ర మునుగూర్చి సంగ్రహముగాఁ బరిశీలింతము. వేదములోఁ జెప్పఁబడిన మనువే దీని కర్తయని ఋజువుచేయుటకుఁ బ్రయత్నములు చేయఁబడినవి. ౪. ఋగ్వేదము నందాతనిని జనకుఁడైన మనువని పిలిచిరి. ౫. సాంఘికనైతిక క్రమమును స్థాపించి, ధర్మనిర్ణయము చేసిన వారిలో మొదటివాఁడు మనువు' మానవజాతియంతయు మనుసంభూతము. ఆతఁ డేకైకధర్మ కర్త కాకున్నను, నతని ధర్మశాస్త్రము విశేషగౌరవముతో నాదరింపఁబడెను. "మనువాక్యములకు విరోధముగాఁ జెప్పిన స్మృతి ప్రమాణముకాదు." ౬.

మనుధర్మశాస్త్రము క్రీ.పూ. ౧౨౫౦ నాటికిఁ జెందిన దని సర్. విల్లియమ్‌జోన్సు నిర్ణయించినాఁడు. ష్లెగల్ దాని కాలము క్రీ.పూ. ౧౮౦౦ తక్కువ కాదనినాఁడు. మోనియరు విల్లియమ్సు క్రీ.పూ.౫౦౦ అని నిర్ణయించెను ౭ మహాభారతము

౩. ౧అ.౬ ౪ ఋవే. ౮మం. ౨౭. ౫ ఋ.వే. ౧.మం ౮౦.౧౬. ౧ మం. ౧౨౪.౨; ౨ మం. ౩౩. ౧౩. ౬. చూడు. తైత్తిరీయసంహిత ౨ అ. ౨.౧౦.౨;౩అ. ౧.౯. ౪. ౭. ఇండియన్ విస్డమ్ పుట ౨౧౫.

లోని అధునాతన భాగములకంటె నిటీవలిదని వీబరుపండితుఁ డూహించినాఁడు. మనువు వేదసారస్వత పరిచయము గలిగి, పూర్వధర్మకర్తలను, సంప్రదాయములను స్మరించియున్నాఁడు. పూర్వము గద్యములోనున్న గ్రంథమునకుఁ దరువాతఁ జేసిన పద్యరూపమే నేఁటి మానవధర్మశాస్త్రమని, వీబరు, మ్యాక్సు ముల్లరు, బర్నెల్ భావించుచున్నారు. "ఇది మానవులకు సంబంధించినశాస్త్రము. కృష్ణయజుర్వేదశాఖకుఁ జెందిన మైత్రాయణీయ షడ్వర్గములో నొక వర్గమునకు సంబంధించినది. ఈ శాఖవారింకను బొంబాయి రాష్ట్రమునఁ గొలఁదిమంది గలరని తెలియుచున్నది." ఈభావమును సమర్థించుటకు బర్నెల్ విట్నీ వాక్యముల నుదాహరించినాఁడు. ౧. భాషాశైలి స్వభావముల ననుసరించి మనుధర్మము పౌరాణిక యుగమునకుఁ జెందినదని కొందరందురు. మహాభారతము, తదితరపురాణముల వలెనే యిదియు వేదాధికారము లేనివారి కుపకృతియొనరించు ప్రజాదరపాత్రతగన్న గ్రంథము. ధర్మశాసనమునకు మతమునకుఁ గలసంబంధమిది తెలుపును. దాని ప్రధానోద్దేశము తత్త్వశాస్త్రము కాదు. ఇందలి తాత్త్వికభావములు కేవల పరిచయ వాక్యములని మేధాతిథి భావించినాఁడు. ప్రథమద్వితీయాధ్యాయములలోఁ గల తత్త్వభావములు పురాణములలోనివే. పౌరాణికసాంఖ్యము, వేదాంతము మనుధర్మమున సమ్మిళితము లైనవని కోల్బ్రూక్ చెప్పినది సత్యము. ౨. సృష్టిసిద్ధాంత

౧. బర్నెల్ మనుస్మృతి—ఉపోద్ఘాతము పుట ౧౮ ౨. వివిధవ్యాసములు, వాల్యూము ౧. పుట ౨౪.౯.

మును గూర్చి మనువుచెప్పిన దానిలో విశేషమేమియును లేదు. 3. సృష్టినిగూర్చి చెప్పిన ఋగ్వేదమంత్రముపై నది యాధారపడియున్నది. పరమసత్యస్వరూపము పరబ్రహ్మము. ఆతఁడు స్వయంస్థితిగల హిరణ్యగర్భునిగను, నంధకారముగను రెండు రూపముల ద్యోతకమయ్యెను." తనశరీరమునుండి య నేకవిధములైన జీవములను సృజింపఁగోరి, యాతఁడు మొదట జలమును సృజించి యందు బీజమునుంచెను. ఆబీజము సూర్య సమకాంతి గల యొకహిరణ్మయాండమయ్యెను. ఆయండము నుండి తానే బ్రహ్మగాఁబుట్టి, సృష్టికర్తయయ్యెను. ఆయండ మునవున్న యాదైవము దానిని రెండుగా విభజించి, వానినుండి భూలోక స్వర్గలోకములను, వానిమధ్యమం దాకాశమును. అష్టదిశలను, జలమునకు స్థిరనివాసమును గల్పించెను. తరు వాత నందుండి మనస్సును, అహంకారమును, ఆత్మను, సత్త్వ రజస్తమో గుణాత్మకములైన సర్వవస్తువులను, విషయములను దర్శించు పంచేంద్రియములను సృజించెను." మనుధర్మశాస్త్ర ముయొక్క ప్రధానతత్త్వముయొక్క స్వభావమీ క్రిందివాక్యా ర్థముపై నాధారపడియున్నది. "ఇది అదృశ్యమైనట్టియు స్పష్ట ములైన లక్షణములు లేనిదియు నగు తమోరూపమునసనుండి. తర్కమున కతీతమై, జ్ఞానమున కందనిదై సుషుప్తిమగ్నమైన దానివలెనున్నది."౪. తమస్సనగా సాంఖ్యుల మూలప్రకృతి యని యర్థము, 'తమోభూత'మనగా మూలప్రకృతి మగ్నమైనదని

3. ౧౨ పుట ౫. ౪. ఆసీదిదమ్ తమోభూతమ్ అప్రజ్ఞాతమలక్షణమ్ అప్రతర్క్యమ్, అవిజ్ఞేయమ్, ప్రసుప్తమివసర్వతః ౧౨.౫.

భావము. వేదాంతభాష్యకారుఁడగు రాఘవానందుఁడు, తమస్సనగా నవిద్యయని చెప్పినాఁడు. హిరణ్యగర్భుని కారణసామర్థ్యముచే నంధకారమునుండి సాంఖ్యతత్త్వ క్రమము ననుసరించి, జగముద్భవించినది. ప్రపంచము హిరణ్యగర్భుని శరీరమనియు, జీవు లాతఁడు సృజించినవనియుఁ జెప్పఁబడెను. సృష్టిసిద్ధాంతార్థము విమర్శకుల దృష్టిననుసరించి భిన్నరూపముల నుండును. గుణత్రియ సిద్ధాంతము ౧. త్రిమూర్తిభావము ౨. సూక్ష్మశరీరతత్త్వము 3 కూడనిందున్నవి.

మనువురచించిన గ్రంథము ముఖ్యముగా ధర్మశాస్త్రము. ఆచారధర్మములను నిరసించుచున్న దినములలో నిది వానిని బోషించెను. సంప్రదాయ గౌరవము క్షీణించుటతో శాస్త్ర ధర్మాధికారభావములు క్షీణించినవి. నిరంకుశ స్వైరభావప్రచారమునకు సమాధాన మాచారధర్మమును గౌరవించునట్లొనర్చెను. గంగానదీతీరములనున్న హిందూసంఘములలోనున్న యాచారసంప్రదాయములనే మనువు తన శాసనముల కాధారములుగా స్వీకరించెను. వైదికయాగము ౪ ల నాతఁడంగీకరించి, వర్ణధర్మ మీశ్వరకల్పితము ౫ మని విశ్వసించును, తపోమార్గము నాతఁడంగీకరించి, ధర్మవిరుద్ధ కామములను విసర్జింపుమని బోధించును. ౬. ఇందుఁ గొన్నిలోపములున్నను, నిరుపమాన ప్రతిభాప్రజ్ఞ లిందు గోచరించును, "తల్లులగుటకు స్త్రీలును, తండ్రులగుటకుఁ బురుషులును సృజింపఁబ

౧. ౧౨అ. ౨౪. (౨) ౧అ. ౧౦. (3) ౧౨అ. ౧౬-౧౭
౪. 3అ. ౭౬. (౫) ౧అ. 3౧. (౬) ౪అ. ౧౭౬.

డిరి." ౭. "భార్య, సంతానము తాను గలిసినవాఁడే పూర్ణ పురుషుఁడు." భార్యాభర్త లేకవ్యక్తిరూపములే, ౮. గృహస్థ ధర్మాచరణము ప్రథమము ప్రధానమునైన ధర్మము. "వేదాధ్యాయనముచేయకుండ, వివాహమాడి సంతతినిగాంచకుండ, యజ్ఞకర్మలు నిర్వర్తించకుండ నేద్విజుఁడు మోక్షము నపేక్షించునో యాతఁ డధోగతినందును." ౯. "బ్రాహ్మణునకు వేదాధ్యయనదీక్షయే తపస్సు, క్షత్రియునకు దుర్బలసంరక్షణము, వైశ్యునకు వర్తక వ్యవసాయములు, శూద్రున కితరవర్ణముల సేవయుఁ దపస్సులు." ౧౦

పునర్జన్మావసరము లేకుండఁ జేయునది, సత్త్వగుణాధిక్యముగలది ధర్మప్రవర్తనము. ౧. సర్వమును జయించిన వాఁడు ధర్మవీరుఁడు. పరవశమైనదంతయు దుఃఖము; ఆత్మవశమైనదంతయును సుఖము. ౨. "సర్వభూతములలోఁ దనయాత్మను, దనయాత్మలో సర్వభూతములను జూచి, తనయాత్మకే సర్వార్పణ యజ్ఞమొనర్చువాఁ డాత్మాధిపతి, స్వయంప్రకాశము గలవాఁడగును." 3. మనముచేయుకర్మలు భావిజీవితమునందెట్టి ఫలితములనిచ్చునో, దానిపై ధర్మమాధారపడి యున్నది. ముందు మంచిజన్మము నొసగునది సత్ప్రవర్తనము. నీచజన్మ

౭. ౯అ. ౯౬ (౮) ౯అ. ౮౫ (౯) ౬అ. ౩౭.

౧౦. చూడు భగవాన్‌దాసు. హిందూసాంఘికవ్యవస్థ; ఇంటర్నేషనల్ జర్నల్ ఆఫ్ ఎథిక్స్. అక్టోబరు. ౧౯౨౨. 'హిందూధర్మము.'

౧. ౧౨ అ. ౮౯ (౨) ౮ అ. ౧. ౧౬౦. సర్వంపరవశం దుఃఖమ్, సర్వమాత్మవశం సుఖమ్. (3) ౧౨ అ. ౯౧; ౧౧౭

మునిచ్చునది నీచకర్మయునగును. కాని యీ రెండునుగూడ జన్మరాహిత్యమును మోక్షమునిచ్చుకర్మకు న్యూనములే.

సంప్రదాయసిద్ధమగు ధర్మమునే మనువు బోధించెననియు నూత్నవికాసమున కవకాశము నాతఁడొసగలేదనియు మేముచెప్పఁజాలము. మంచిచెడ్డలను నిర్ణయించుటకాతఁడు నాలుగు మార్గములను జెప్పినాఁడు. శ్రుతి, స్మృతి, ఆచారము, అంతఃకరణము. సాంఘికవ్యవస్థయొక్క సక్రమగతి మొదటి మూటిపై నాధారపడును; కాని దానియభ్యుదయము నాల్గవ దానిపై నాధారపడును. అంతఃకరణవృత్తి కనుగుణముగా మనము ప్రవర్తింపవచ్చును. ౪. మనకు సహేతుకమని తోఁచిన దానినిఁగూడ మనము చేయవచ్చును.౫.అంతరాత్మప్రచోదనము లేక అంతర్వాణియే దైవవాణియని మను వంగీకరించినాఁడు.౬.

ఉదాహృతగ్రంథములు


౧. తెలాంగ్. భగవద్గీత, అనుగీత మున్నగునవి. యస్.బి. ఇ. వాల్యూము ౮.

౨. హాప్కిన్సు: ది గ్రేట్ ఎపిక్ ఆఫ్ ఇండియా.3వ అధ్యాయము.

౩. సి. వి. వైద్య. పౌరాణిక భారతవర్షము. అ౧,౭.

౪. ఆర్.జి భండార్కరు. వైష్ణవ, శైవమతములుమున్నగునవి.

౫. హేమచంద రే చౌదరి. తరుణవైష్ణవచరిత్రము.

౬. బూలర్. మనుస్మృతి. యస్.బి.ఇ. వాల్యూము ౨౫


౪. ౨ అ. ౧౨. (౫) మనఃపూతమ్ సమాచరేత్. ౬అ. ౪౬.
౬. ౪అ. ౧౬౧.

# భారతీయ తత్త్వశాస్త్రము

## నవమాధ్యాయము.

### భగవద్గీత — ఆస్తికమతము

#### ౧—భగవద్గీత

మహాభారతములో భీష్మపర్వభాగమగు భగవద్గీత, సంస్కృత సారస్వతములో నత్యంత సుప్రసిద్ధమైన ఆధ్యాత్మిక గీతము. "ప్రపంచమునందే భాషలోఁగాని, యింత అప్రతిమాన మనోహరమైనట్టియు, యథార్థమైనట్టియుఁ దాత్త్వికగీత మింకొకటిలేదు."౧. భగవద్గీత మతతత్త్వ నీత్యుపదేశములు చేయు గ్రంథము. ఇదియొకశ్రుతిగాదు; స్మృతిగా నంగీకరింపఁబడినది. ప్రజాదరమే యొకగ్రంథ ప్రాశస్త్యమును దెలుపునదైనచో భారతీయవిజ్ఞానములో గీత కసమానప్రజాదరముకలిగినది. ఇందలి మోక్షసందేశ మతిసులభమైనది. ధనికులుమాత్రమే యజ్ఞ, కర్మలొనర్చి దేవతలను స్వాధీనము చేసికొనఁగలరు: సంస్కృతిగలవారే జ్ఞానమార్గము ననుసరింపఁగలరు. కాని యందర కందుబాటులోనున్న భక్తిమార్గమును గీతబోధించినది. గీతాగ్రంథకర్త, గీతోపదేశికుఁడు సాక్షాత్పరమేశ్వరుఁడే

౧. విల్లియమ్ వాన్‌హాంబోల్టు.

లోకమున నవతరించెనని చెప్పినాఁడు. మానవజాతిలో నుత్త ముఁడైన నరుఁడు, తనజీవితములో నొకసందిగ్ధదశలో నున్న ప్పుడు, కృష్ణుఁ డుపదేశము జేసినాఁడు. తాను బూనుకొనిన కార్యము ధర్మమైనదని నిశ్చయించి, శత్రువునెదిరించుట కర్జు నుఁడు రణరంగమున కేతెంచినాఁడు. కర్మాచరణ ముహూర్త మేతెంచినపు డాతఁడు విధ్యుక్తధర్మ విముఖుఁడైనాఁడు. ఆతని యంతఃకరణము చలించినది; హృదయము విషాదపరిప్లుతమైనది; "విప్లవములో మునిఁగిన యల్పరాజ్యము పొందువేదన" నాతని మనస్సుపొందినది. చంపుట పాపమైనచోఁ బ్రేమపాత్రులు, పూజ్యులైన వారినిఁజంపుట దారుణమైన పాపము. ప్రపంచ రహస్యము నెఱుఁగక, దుర్భరజీవితభారమును సహింప నసమ ర్థుఁడైన మానవమూర్తియే యర్జునుఁడు. తనకామములు కాం క్షలు నసత్యములని తెలిసి, ప్రపంచముయొక్క యథార్థస్వరూ పము నెఱుఁగఁగల నిశ్చలచిత్త విజ్ఞానమయ కేంద్రము నాతఁ డింకను నంతరంగమున నిర్మించుకొని యుండలేదు. అర్జునుని విషాదము కాంక్షావైకల్యముచేఁ దాత్కాలికముగా నుదయించి నదికాదు;జగద్వ్యవస్థానిత్యతవలన జనించు హృదయ నైరాస్యము జీవిత వ్యర్థత్వమువలన నదిసంభవించినది. అవసరమైనచోఁదన జీవితమును నిరర్థముగాఁ బరిత్యజించుట కాతఁడు సంసిద్ధుఁడై నాఁడు, కాని తాను నిర్వహింపవలసిన కర్తవ్యమేదో యాతనికిఁ దెలియలేదు. ఆతని నగాధమైన వ్యామోహ మెదుర్కొని, హృదంతరమున వచింపనలవిగాని విషాదాగ్ని విజృంభించినది. ఆతని విషాదము స్పష్టమైనదేకాని, ప్రచండమైనది; అది మా

నవజన్మముయొక్క విషాదమే; తాత్కాలిక ప్రవృత్తినాటకము నతీతమైన దృష్టిగలవారికిది సువిదితము కాఁగలదు. ప్రథమాధ్యాయములో నర్జునుఁడు ప్రదర్శించిన విషాదయోగము, జీవయాత్రలో నమావాస్యరాత్రి; ఇది పురోగమనమున కవసరమైన దశయని యోగులు చెప్పుదురు. తరువాతఁగలిగిన జ్ఞానవికాసముతోఁగూడిన ఆత్మసిద్ధిదశలు సంభాషణములోఁ గ్రమముగాఁ బెంపొందును. ద్వితీయాధ్యాయారంభమునుండి తత్త్వపరిశీలన మారంభమగును. మానవునిలోఁ బ్రధానమైనది శరీరముకాని, యింద్రియములుగాని కావు; మార్పులేని యాత్మయే ప్రధానమైనది. అర్జునుని మానసమునకొక నూత్నమార్గము చూపఁబడెను. కురుక్షేత్రమే జీవితరంగము. కౌరవులాత్మజ్ఞానవికాసమునకుఁ బ్రతిబంధకములు. మోహముల నణఁచివైచి కామములను నిగ్రహించి, యింద్రియములపై నాతని ప్రభుత్వము నార్జింప నర్జునుఁడు యత్నించును. అభ్యుదయమార్గము స్వార్థమును త్యజించు క్లేశకరమైన మార్గము. అర్జునుఁడీ కఠోర క్లేశకరపరిస్థితినుండి, ప్రజ్ఞావాదములచేతను, దర్కప్రసంగ యుక్తులచేతను దప్పించుకొన యత్నించును. హృదయదౌర్బల్యమున కాహుతికావలదని యర్జునునికిఁ గృష్ణుఁడు హృదయోత్కంపము కలిగించు దైవవాణీ విలాసముతో నుపదేశించెను. మానవ హృదయమునందు మూలమూలల దాగుకొని యుండు క్లిష్టభావములు, స్వార్థప్రేరణములు, తామసిక సంస్కారములు, కృష్ణుని దివ్యదృష్టిలో విస్పష్టముగా గోచరించినవి. కొంత సంభాషణము జరుగునప్పటికి విచిత్రనాటక లక్షణము లదృశ్య

ములైనవి; రణరంగ ప్రతిధ్వనులు సమసిపోయి, నరునకు నారాయణ దర్శనమే మిగులును. యుద్ధరంగమున కుచితమైనరథమే, పరమాత్మతత్త్వవిచారణమున కనువగు నేకాంత వన గుహాంతర సీమయై తోఁచును. ఘోరయుద్ధరంగ భీకరధ్వనులు వారిచెవుల సోకవు. గీతోపదేశికుఁడు భారతీయుల కత్యంతప్రియుఁడైన పరమేశ్వరుఁడు; లీలామానుషవిగ్రహుఁడైన మానవుఁడు. ఆతఁడు పరమశృంగారనిధానము, పావనపరిపూర్ణప్రేమ నిలయుఁడు. పక్షిసంఘముల కలనాదములలో,మనోజ్ఞసుమదళవర్ణకాంతిలో, సర్వసుందరవస్తు జాలములలో శ్రీకృష్ణుని దివ్యలావణ్యమూర్తి నాతనిభక్తులు దర్శింతురు. దేవుఁడే తానే లోకమున స్వయముగా నవతరించి యెట్లుమాటాడునో కవి చక్కగా విశదపఱచును. కృష్ణుఁడు తానే బ్రహ్మస్వరూపుఁడనని చేయు ప్రసంగములను గవి సమర్థతతోఁ బోషించును. ఇంద్రుఁడు తానే బ్రహ్మస్వరూపమని చెప్పిన వేదవాక్యమునకు, దేవేంద్రుఁడు తనలోని యాత్మయే బ్రహ్మమనుభావముతోఁ బలికియుండెనని వేదాంతసూత్రము లర్థము చెప్పినవి.౧ 'నన్ను పూజింపుమ'ని యింద్రుఁడుచెప్పిన దానికి 'నేను బూజించు దేవునిఁ బూజింపు'మనియే యర్థము. ఇదేవిధముగా వామదేవుఁడు తానుమనువు, సూర్యుఁడునని చెప్పినదానికి నర్థముచెప్పఁబడినది. మఱియుఁ గామము భయము నశించి, జ్ఞానాగ్నిచేఁ బునీతుఁడైన వ్యక్తి దేవుఁడేయగునని గీత బోధించినది. గీతాచార్యుఁడైన కృష్ణుఁడు సాంతమైన వానియందిమిడియున్న యనంతతత్త్వమును, త్యాగిం

౧. ౧౫. ౧. ౩౦.

ద్రియాదులచే నాచ్ఛాదింపఁబడి మానవునిలో డాగియున్న పరమేశ్వరుఁడనియు గీత చెప్పుచున్నది.

గీతోపదేశము విశ్వజనీనము. జనసామాన్యమునకుఁ దెలిసిన హిందూమతమున కాధారభూతమైన తత్త్వము. గీతాగ్రంథకర్త మహోత్కృష్ట సంస్కృతిగలిగి, విమర్శాలక్షణము కంటె నెక్కుడు విశాలభావముగలవాఁడు; ఆతఁడు కల్పించినదొక పరిచారకోద్యమముకాదు; ఆతఁడు సంబోధించునదొక మతశాఖకాదు; ఆతఁడొక తత్త్వనిర్మాణమును జేయఁదలఁచుకొనలేదు; కాని, తన మందిరద్వారమును సర్వతత్త్వభావములకును దెఱచియుంచెను. సర్వమతారాధన విధానములకాతఁడాదరముచూపి యుండుటచే హిందూమతార్థ ప్రవచనమున కాతఁడర్హుఁడని ఋజువుచేసికొని యున్నాఁడు. విజ్ఞానము విభాజ్యమనియు, నందుఁ గొన్ని యోగ్యభాగములున్నవనియుఁ గొన్ని నిరసింపఁదగినవనియు నిట్టి పాక్షికభావ దృక్పథమునుండి హిందూతత్త్వమునకు విజాతీయమైనది. ౧. గీత మనకుఁ దన విజ్ఞానబలముచేతను, మహోన్నతదృక్పథముచేతనే కాక, భక్త్యావేశ పారవశ్యముతో ఆత్మజ్ఞానావేశ మాధుర్యముతోడను దివ్యోపదేశముచేసినది. అమానుషాచారముల నిర్మూలించి, ఉత్తమ దైవారాధనపద్ధతిని నెలకొల్పుటలో గీత చిరస్మరణీయమైన మహోపకారముచేసియున్నను, దన అన్యభావనిరసనమునకిష్టములేని దృష్టివలన దుర్మతాచారములను గొన్నిటిని బూర్తిగాఁ దొలగింపలేకపోయినది.

---

౧. భ. గీ. 3అ ౨౯.

గీతాకంత మతివాదధోరణి కొంతకలిగియున్నది. గీతా గ్రంథకర్త తాను తప్పుచేయుట కవకాశము లేదని నమ్మినాఁడు. సత్యము నాతఁడు దర్శించినరీతి నుపదేశించెను; సత్యము నాతఁడు పరిపూర్ణముగాను, సర్వతోముఖముగాను దర్శించి నాఁడు. తానుజూచిన సత్యము రక్షించుశక్తి గలదని యాతఁడు విశ్వసించినాఁడు. "గీతారూపమునఁ బలికినవాఁ డొకఋషి; తన మనోహృదయములు జ్ఞానావేశములచే నిండి పొరలినవే కాని, యాతఁడొక శాస్త్రవేత్తవలె నొక మతశాఖా విద్య యందు సుశిక్షితుఁడై, యొకలక్ష్యముఁ బెట్టుకొని, తత్త్వవిషయ ములను విభాగించి, క్రమనిర్మాణ మొనర్చినవాఁడు కాఁడు."౧. ఒక తత్త్వశాస్త్రమునకును, గావ్యనిర్మాణమునకును గీత మధ్యమస్థానము నాక్రమించును. ఇం దుపనిషత్తులకుఁగల అనంతస్ఫురణ లభింపదు; ఏలన నిది జీవితసమస్యాపరిష్కారము నకు బుద్ధిపూర్వకముగాఁ జేయఁబడిన మేధాశక్తి ప్రయత్నము. క్లిష్టమైన యంతఃకరణప్రవృత్తి, మానసికాందోళనములతోఁ గూడిన యొకపరిస్థితి నెదుర్కొనుటకుఁ గల్పింపఁబడిన గ్రంథమిది.

గీతయొక్క ప్రధానతత్త్వ ముపనిషత్తత్త్వమే; భేదమే మన మతవిషయమెక్కువ ప్రాముఖ్యమీయఁబడినది. ఉపనిష త్తులలోని సూక్ష్మములైన తత్త్వభావములు బహుముఖములైన మానవహృదయావసరములను తృప్తిపరుపఁజాలవు. జీవితరహ

౧. ఇండియన్ ఆంటిక్వెరీ. ౧౯౧౮ పుట. 3 గార్బెరచించిన భగవద్గీతోపోద్ఘాతము.

స్వామును స్పష్టపఱుచుట కుపయోగింపఁబడిన యితరపద్ధతు-లన్నియును ఆస్తికతత్త్వపద్ధతులే. మనుజులందరును దర్కపద్ధతినే ప్రేమించునట్లు చేయుట సాధ్యముకాని పని యని గీతాగ్రంథకర్త తలఁచినాఁడు. అందుచే నాతఁ డుపనిషత్తులను బ్రమాణముగాఁ దీసికొని, వానియందలి మతభావములను విశదీకరించి, జనసామాన్య విశ్వాసములను, జాతీయభావములను మేళవించి, నిర్మాణ మొనర్చెను.

## ౨—కాలము

భగవద్గీతాకాలమును నిర్ణయించుట సులభము కాదు. ఇది మహాభారతములో నొక భాగమైనను, దరువాత నెవరో దీనిని రచించి మహాభారతమునఁ జేర్చియుందురాయని కొందరు సంశయించిరి. "యుద్ధ ప్రథమదివసమున నుభయపక్ష సైన్యములు రణరంగమున నిలిచి, నొండొరుల నెదుర్కొననుంకించుచున్న యవసరమున, కృష్ణార్జునులొక దీర్ఘమైన తత్త్వచర్చా సంభాషణమునందుఁ బ్రవేశించి, వివిధ మోక్షమార్గములను గూర్చి చర్చించుచుండిరనునది" అసహజముగా గోచరించుచున్నదని వీబర్ పండితుఁడు నుడివినాఁడు. తెలాంగు పండితుఁ డీభావముతో నేకీభవించుచు, భగవద్గీత యొక స్వతంత్రగ్రంథమనియు, దీనిని మహాభారతగ్రంథకర్త తనయుద్దేశముల కవసరముగురీతి నుపయోగించుకొనెననియుఁ దెలిపినాఁడు.[౧] యుద్ధారంభకాలమున నొకతత్త్వమునుగూర్చిచర్చించుట కారంభించుట సమంజసమైనను, యుద్ధరంగమువంటి విపత్పరిస్థితుల

౧. యస్. బి. ఇ. వాల్యూము ౮ ఉపోద్ఘాతము. పుటలు ౫౬

లోనే ఆలోచనాపరులకుఁ బరమార్థ సమస్యలుదయించుట కవ
కాశముగలదు. అట్టిసందర్భములందే, తత్త్వాన్వేషణాపరాయ
ణులైనవారు తమ యింద్రియావధుల నధిగమించి, యంతరంగ
సత్యదర్శనముచేయుటకు వలయు చిత్తైకాగ్రతను బొందుదురు.
అర్జునికిఁ దనమిత్రుఁడైన కృష్ణుఁడు క్లుప్తముగాఁ జెప్పినయుపదే
శము ననుసరించి, కవి యేడువందలశ్లోకములను గల్పించి
యుండవచ్చును. మహాభారతగ్రంథకర్త, అవకాశములభించి
నపుడెల్ల ధర్మప్రబోధముఁ జేయఁదలఁచియుండుటచే నిట్టితరుణ
మునఁగూడ నాపనియే చేసియుండనగును.

భగవద్గీత నుదాహరించు సాక్ష్యములు మహాభారత
గ్రంథముననే కలవు. వీనివలన మహాభారత రచనాకాలము
నుండియు, గీత యందొకభాగముగా నమ్మఁబడెనని స్పష్టముగాఁ
దెలియుచున్నది. ౨. మహాభారతముయొక్కయు, గీతయొక్కయు
శైలీ సామ్యములు, రెండు నొకేగ్రంథములోనివని తెలియఁ
జేయుచున్నవి. 3. ఇతరమతతత్త్వములగూర్చి, రెండును జెప్పు
భావములు చాలవఱ కేకీభవించుచున్నవి. అకర్మకంటెఁ గర్మ
శ్రేష్ఠమని యంగీకరింపఁబడెను. ౧. వైదికయాగములనుగూర్చిన
నిదృష్టి, ౨. సృష్టిక్రమమునుగూర్చిన నిర్ణయములు 3. సాం

౨. ఆదిపర్వము. ౨. ౬౯; ౧. ౧౭౯; ౨. ౨౮౭.
3. తిలక్: గీతారహస్యము. అనుబంధము. యస్. బి. ఇ. వాల్యూముల
ఉపోద్ఘాతము.
౧. భ.గీ. 3అ; వనపర్వము. 3౭ అ.
౨. శాంతిపర్వము ౨౬౭: చూడుము మనువు. 3అ
3. భ.గీ. అధ్యాయములు ౭,౮ శాంతిపర్వము ౨3౧

ఖ్యగుణ సిద్ధాంతవర్ణనము ౪. పతంజలియోగమునుగూర్చిన ప్రసంగములు౫, విశ్వరూపవర్ణనము ౬ నించుమించుగా రెంటిలో సమానముగానున్నవి. మఱియు సమన్వయవిధానమునందు గీత చూపిన ప్రత్యేకత్వమును లేదు.

గీత మహాభారతములోని నిశ్చయమైన భాగముగా మనము నిర్ణయించినను, దానికాలము స్పష్టము కాఁజాలదు; ఏలన మహాభారతమునం దనేకభాగము లనేకకాలములకుఁ జెందియున్నవి. భగవద్గీతకుఁ దానురచించిన విద్వదుపోద్ఘాతమునందు తెలాంగ్ పండితుఁడు, గీతోపదేశమును గూర్చియు, దాని ప్రాచీనశైలినిగూర్చియు, నందలి శ్లోకచ్ఛందస్సునుగూర్చియు, గ్రంథాభ్యంతరసాక్ష్యములను గూర్చియుఁ, బ్రసంగించి క్రీ. పూ. ౪-వ శతాబ్దమునకంటె గీత కొంత పూర్వగ్రంథమనివాదించినాఁడు. అథమమది ౪-వ క్రీ.పూ. ౪-వ శతాబ్దమునకైన జెందునని సర్. ఆర్. జి. బండార్కరు వ్రాసినాఁడు. గీతాప్రథమరచనము క్రీ.పూ. రెండవశతాబ్దమునకును, నేఁడు మనకుఁ గల రచనము క్రీ.వె. రెండవశతాబ్దమునకును జెందునని గార్బే తలచినాఁడు. క్రీ. వె. తొమ్మిదవ శతాబ్దమునకుఁ జెందిన శంకరుఁడు గీతాభాష్యము వ్రాసినాఁడు; కాళిదాసునకు గీతాపరిచయ

౪. భ.గీ. అధ్యాయములు ౧౩,౧౪; అశ్వమేధపర్వము ౩౬-౩౯ శాంతిపర్వము ౨౧౫; ౩౦౦.౩౧౧.

౫. భ.గీ. ౬అ; శాంతిపర్వము ౨౩౯, ౩౦౦

౬. ఉద్యోగపర్వము ౧౭౦; అశ్వమేధపర్వము ౫౫; శాంతిపర్వము ౩౩౯ వనపర్వము ౯౯.

మున్నది. కాళిదాసుని రఘువంశమునందు ౭ గీతాశ్లోకముతో సమానమైన యొకశ్లోకమున్నది. బాణుఁడు గీత నుదాహరించును; కాళిదాస బాణు లిర్వురును క్రీ.వె.పంచమ సప్తమ శతాబ్దములకుఁ జెందినవారు. క్రీ.వె. రెండవశతాబ్దమునకుఁ జెందిన పురాణములు భగవద్గీతవంటి గీతల ననేకములను గలిగియున్నవి. భాసుని కర్ణభారము నందొకవాక్యము గీతాశ్లోక ప్రతిధ్వనివలెఁ గన్పట్టును, ౮ కొందరు భాసుఁడు క్రీ.వె. రెండవ లేక నాల్గవశతాబ్దము వాఁడనియుఁ గొంద రాతఁడు క్రీ. పూ. రెండవశతాబ్దము వాఁడనియుఁ జెప్పుచున్నారు. మొదటి గణనము ననుసరించినను, గీత దానికంటెఁ బూర్వగ్రంథమై యుండవలెను. బోధాయన గృహ్యసూత్రములకు వాసుదేవారాధనా పరిచయముండుటేకాక, భగవానుని వాక్యమొకటి గీతాశ్లోకమును స్ఫురింపఁజేయుచున్నది.౧. బోధాయనుని పితృమేధ సూత్రములు నిట్టివే. ఆపస్తంబుఁడు క్రీ. పూ. మూడవ శతాబ్దమువాఁడైనచో,౨. బోధాయనుఁ డాతనికంటె నొకటి రెండు శతాబ్దములు పూర్వికుఁడు. అందుచే క్రీ. పూ, ౫-వ

౭. ౧౦.౩౧. పోల్చు భ గీ. ౩అ. ౨౨

౮. హతోఽపిలభతేస్వర్గమ్ జిత్వాతులభతేయశః పోల్చు భ. గీ.. , ౩౭.

౧. ౨. ౨౨. ౫. పోల్చు. భ.గీ. ౯అ. ౨౬.

౨. యస్. బి. ఇ వాల్యూము ౨. ఉపోద్ఘాతము. పుట ౬౩. పోల్చు. గాల్యూము [౧౪-పుట ౬౩

శతాబ్దము గీతాకాలముగా నిర్ణయించుచో, మననిర్ణయము విశేషదోషమును గలిగియుండఁ జాలదు.3.

3—ఇతర తత్త్వసంబంధము.

తనయుగమునను్న భావములన్నియు గీతాగ్రంథకర్త హృదయమునఁ బనిచేసినవి; తాను నివసించుచున్న ప్రపంచము నందలి మతసిద్ధాంత కిరణజాలముల నొకచో నాతఁడొక దివ్య జ్యోతిగాఁ గేంద్రీకరించి ప్రదర్శించినాఁడు. ఒకవైపున గీతకును, వేఱొకవైపున వేదములకు, నుపనిషత్తులకు, బౌద్ధమతమునకు, భాగవతమతమునకును, సాంఖ్యయోగ తత్త్వములకునుగల సరి యగు సంబంధములను మనము తెలిసికొనవలసిన యవసర మున్నది.

గీత వేదప్రమాణమును దిరస్కరింపదు. ఒకవిజ్ఞాన సీమయందున్న ప్రజలకు వేదవిధులు నిస్సంశయముగా సత్యము లని చెప్పవచ్చును. వేదోక్తవిధి ననుసరింపని వారికి మోక్షము లభింపదని గీతచెప్పుచున్నది. క్రతు కర్మలన్నియు నిష్కామ ముగాఁ జేయవలెను.౪. ఒకయున్నత దశకు వచ్చినవెనుక పరమార్థప్రాప్తికి వేదకర్మజాల మాటంకమే యగును. వైదిక దేవతల కీయఁబడిన మహోచ్చస్థానములను గీత యంగీకరింప లేదు. వేదకర్మలు మనకధికారైశ్వర్యముల నొసఁగినను, నవి మనకు సూటిగా ముక్తినొసఁగఁజాలవు. మోక్ష మాత్రదర్శ

3. ధర్మసూత్రములలోని యుదాహరణములు, ప్రక్షిప్తములని తలచి నచో, గీతాగ్రంథకాలము క్రీ.పూ. 3 వ-౨ శతాబ్దమని చెప్పవచ్చును.

౪. ౧౭౮. ౧౨.

నముచేతనే లభించును. మోక్ష జ్ఞాన రహస్యము హస్తగత మైనపుడు, వైదికకర్మాచరణమున కవసరములేదు.౫.

గీతయొక్క మూలతత్త్వముపనిషత్తులనుండి స్వీకరింపఁ బడెను. కొన్నిశ్లోకము లుపనిషత్తులలోను గీతయందును సమానముగానున్నవి.౬. క్షేత్ర క్షేత్రజ్ఞ, క్షరాక్షరచర్చ లుపనిషత్తులపై నాధారపడినవే. పరమతత్త్వమునుగూర్చిన యంశము లుపనిషత్తులలోనివే. గీతయందలి భక్తి, ఉపనిషత్తులందలి ఉపాసనమునుండి సూటిగాఁ బె పొందినది. పరమేశ్వరునెడభక్తి, పూర్ణత్యాగమును గోరును, "ఈప్రపంచములో జీవింపవలసి యుండగా మనకు సంతానమువలనఁ బ్రయోజనమేమి ?"౧. పరమేశ్వరభక్తి, ఆత్మనిగ్రహము, శాంతిసమత్వములుగల పదవి నార్జించుట మున్నగుభావములు నాఁటి వాతావరణములో నున్నవి. నిష్కామకర్మ, ఉపనిషత్తులలో సమర్థింపఁబడినది.౨. ఆత్మకున్నతస్థితిలో నిస్సంగదృష్టి లభించునని ఉపనిషత్తులే చెప్పినవి.3 ఉపనిషత్తులలోని తత్త్వమతానుష్ఠానభావములను గీత పెంపొందించెను గాని,వానికి విరోధములేకుండఁ జూచెను. ఉపనిషత్తులుచెప్పిన పరిపూర్ణ పరమసత్యము జీవితమును మార్చు

---

౫. ౨అ. ౪౨-౪౫; ౯అ. ౨౦—౨౧.

౬. భ. గీ ౨అ. ౨౯; కఠోపనిషత్తు ౨. ౭. భ గీ. ౨.౨౦,౮. అ.౧౧. కఠోపనిషత్తు ౨అ. ౧౯; ౨అ ౧౫, భ.గీ. 3అ. ౪౨; కఠోపనిషత్తు 3 అ. ౧౦; భ గీ.౬-౧౧ శ్వేతా. ఉ. ౨.౧౦; భ.గీ. ౯-౧3; శ్వే. ఉ.౨.౮.

౧. బృ.అ,ఉ. ౪అ. ౪,౨౨ (౨) ఈశోపనిషత్తు (3) ఛాందోగ్యము ౪అ, ౧౪.3; బృ,అ.ఉ. ౪ అ. ౪.౨3,

చేయుటకు వలయు నుత్సాహము నొసఁగజాలదు. భాగవత సంప్రదాయమును దృష్టిలోనుంచుకొని, ఉపనిషన్నిర్గుణ బ్రహ్మమునకొక తేజోవంతమైన వ్యక్తిత్వమును గీతకల్పించెను. ఆతఁడే శివ, విష్ణురూపములచేఁ దెలియఁదగిన సగుణమూర్తి. కాని గీతాగ్రంథకర్త విస్మరింపఁబడిన ప్రాచీనతత్త్వమునే తిరిగి యుద్ధరించుచుండెననియు, నూతనతత్త్వము నుపదేశించుట లేదనియు నెఱుఁగును. "ఈయక్షర బ్రహ్మయోగమును నేను వివస్వంతునకుఁ జెప్పితిని; వివస్వంతుఁడు మనువునకు, మనువుఇక్ష్వాకువునకుఁ జెప్పెను." దీనినే యిప్పు డర్జుననకుఁ గృష్ణుఁ డుపదేశించెను. ౪. దీనివలన గీతారహస్యమును గాయత్రీమంత్రద్రష్టయు మూఁడవ మన్వంతర ఋగ్వేదఋషియునైన విశ్వామిత్రుఁడు మొదట రామున కుపదేశించెను. క్రమముగా నది సూర్యవంశరాజులైన కృష్ణుఁడు, గౌతమబుద్ధుఁడు, మున్నగు వారికి లభించెను. అధ్యాయాంతమందుఁ జెప్పినరీతిని గీతయొక్క పూర్తిపేరు భగవద్గీతా నామముగల ఉపనిషత్తు. సంప్రదాయము చెప్పు గీతోపనిషత్సంబంధము సువిదితము; "ఉపనిషత్తులు గోవులు, దోగ్ధ కృష్ణుఁడు, అర్జునుఁడు వత్స; గీతోపదేశమే అమృతమువంటి క్షీరము."

భాగవతమతమే గీతయందలి సమన్వయ తత్త్వమున కాధారభూతమైనది. భాగవతసిద్ధాంతము గీతోపదేశము నొకటేయని సూచింపఁబడినది. దీనిని హరిగీతయనియు నందురు.౫ బౌద్ధమతస్మరణము గీతలో లేకున్నను, గీతలోని కొన్నిభావ

(౪) భ.గీ. ౪అ. ౧-౩ (౫) శాంతిపర్వము ౩౪౮-౧౦

ములు బౌద్ధభావములవలె నున్నవి. రెండును వేదముల అప్రతిహత ప్రమాణమును ధిక్కరించును. వర్ణవిభాగకాఠిన్యమును రెండును గొంతసడలించును. కర్మమతమునకు నిరసనరూపకముగానే రెండు తత్త్వములునుదయించినను, గీత, బౌద్ధమతముకంటె నెక్కుడు సంప్రదాయానుగుణమైనదగుటచే నెక్కువ ప్రతిఘటనము చేయలేకపోయినది. మధ్యేమార్గమును బుద్ధుడు ప్రకటించెను గాని, తనయుపదేశములలో నాతఁడు స్వీయనియమాతిక్రమణ మొనర్చెను. వివాహమునకు బదులు బ్రహ్మచర్యమును, మృష్టాన్నమునకుబదు లుపవాసమును బోధించుట మధ్యేమార్గము కాఁజాలదు. సన్న్యాసుల మతోన్మాదమును; ఆనందమునకు బదులు దుఃఖమును, దినమునకు బదులు నిశాంధకారమును మంచివని స్వీకరించిన యోగులను గీత నిరసించినది. గుహాంతర సీమలందుఁ గుములుట, మృత్యువును గోరుట మున్నగువానితో నిమిత్తముఁలేని మోక్షసాధనలున్నవని గీత పలికినది. నిర్వాణ ౧ శబ్దము గీతలోనున్నది కాని యిది బౌద్ధమతమునుండి స్వీకరింపఁబడినట్లు తోఁచదు; ఏలన నిది బౌద్ధమతమే చెప్పిన శబ్దముకాదు. నరోత్తముని లక్షణములను గూర్చి గీతయు బౌద్ధమతమును జెప్పినభావములు సమానములే౨. ఒకతత్త్వముగాను, మతముగాను బౌద్ధమతముకంటె గీత యెక్కుడు పూర్ణమైనది; బౌద్ధతత్త్వము శూన్యభావమున

---

౧. గీత. ౬ అ. ౧౫. (౨) భ.గీ, ౨అ. ౫౫-౭౨; ౪అ. ౧౬-౨౩; ౫ అ. ౧౮-౨౮; ౧౨ అ. ౧౩-౧౬. పోల్చు. ధమ్మపదము, ౩౬౦-౪౨౩; సుత్తనిపాతము, మునిసుత్తము ౧౨. ౭, ౧౪.

కెక్కువ ప్రాముఖ్యమిచ్చినది. బౌద్ధధర్మముల నీతిసూత్రములను గీత స్వీకరించి, బౌద్ధులతత్త్వమే సర్వదోషములకు నవిశ్వాసములకును మూలకారణమని పరోక్షముగా ఖండించెను. పూర్వసంప్రదాయ సంబంధములను డెగఁదెంపుకొనని కారణముచేతనే బౌద్ధమతమునకు వలెఁగాక గీత కెక్కువ చిరప్రాముఖ్యము లభించినది.

గార్బే ననుసరించి, "సాంఖ్యయోగ శాస్త్రములందలి యుపదేశములే భగవద్గీతయందలి తత్త్వప్రసంగములకుఁ బూర్తిగా నాధారభూతములైనవి. వానితోఁ బోల్చినచో వేదాంతమునకు ద్వితీయస్థాన మీయఁబడినది. సాంఖ్యయోగము నామములు పెక్కుచోట్ల నుదాహరింపఁబడెను. కాని వేదాంత శబ్ద మొక్కమారే స్మరింపఁబడెను. (వేదాంతకృత్ ౧౫ అ, ౧౫) అదియైనను నుపనిషత్తు లేక సిద్ధాంతప్రవచన భావములో వాడఁబడినది. కావున, మనము, నేఁడుమనకులభించియున్న గీతాగ్రంథమునఁ దత్త్వశాఖలన్నియు నెట్టిస్థానమును గలిగియున్నవని తలఁచినప్పుడును, సాంఖ్యయోగ సిద్ధాంతములకును, వేదాంతమునకునుగల సమన్వయావకాశము లేని సందర్భమును గమనించినప్పుడును, భగవద్గీతలోని వేదాంతము ప్రథమగీతాగ్రంథమునకుఁ జెందినదికాదని తోఁచుచున్నది. తాత్త్వికముగాఁగాని, మతదృష్టిలోఁగాని మనము పరిశీలించినను నీసత్యమే బయల్పడఁగలదు," గీతలో నుపయోగించిన సాంఖ్య యోగ శబ్దములు సాంఖ్యయోగ శాస్త్రములకు సంబంధించినవికావు. మోక్షసాధనములలో సాంఖ్యమనగా విచారణమనియు, యోగ

మనగా ధ్యానవిధానమనియు నర్థము.౧. మఱియు భగవద్గీత కాలమునందు, సాంఖ్యయోగ శాస్త్రములకు వేదాంతమునకు స్పష్టమైన భేదనిర్వచనము చేయఁబడి యుండలేదు. గార్బే పండితు నభిప్రాయమునకట్టి స్పష్టనిర్వచన మవసరమైయున్నది. "ఉపనిషత్తులందును, భగవద్గీతయందును, దదితర ప్రాచీన హిందూమత గ్రంథములందును అనేకపరిణామములకు లోనైన పెక్కుతత్త్వసిద్ధాంతములు మిళితములై యున్నవి. విడఁదీసి వానిని భిన్నశాస్త్రములుగాఁ జెప్పుకొన్నచో, నవి పరస్పర సమన్వయమున కనుకూలములుగావు. సాంఖ్యము, వేదాంతము నవి అనేకయుగములనుండి మనము వాడుచున్న యీ తత్త్వములెన్నఁడో చెప్పుటకు శక్యము కాని కాలమున నవి వేఱుగా నిర్మింపఁబడియుండవలెనని౨ చెప్పిన ఫిడ్జిఎడ్వర్డుహాలు భావము సత్యదూరముగాదు. సాంఖ్య మన తత్త్వము, సృష్టి క్రమము గీతచే నంగీకరింపఁబడెను. కాని గీత సాంఖ్యతత్త్వ సిద్ధాంతముల, నిర్వచనముల నంగీకరింపలేదు.3. కపిలునిపేరు గీతలోనున్నది. కాని పతంజలి నామములేదు. గీతలో స్మరింపఁబడిన కపిలుఁడు సాంఖ్యతత్త్వకర్తయైన కపిలుఁడని చెప్పఁజాలము. ఒకవేళ నట్లైయైనను సాంఖ్యతత్త్వ వివరములన్నియు స్పష్ట

౧. భ.గీ. ౨.౩౯; 3.3: ౫.౪-౫; ౮-౨౪; ౧౮-౧౩ లో సాంఖ్యమను వచనమున్నది. వ్యాసస్మృతినుండి మధ్వాచార్యుఁడు సాంఖ్యమును స్మరించిన యొకశ్లోకము నుదాహరించి, సాంఖ్యమనగా ఆత్మతత్త్వవిజ్ఞానమని యర్థము చెప్పెను. భ.గీ.౨అ. ౪౦-వ శ్లోకముపై మాధ్వభాష్యమునుజూడుఁడు.

౨. సాంఖ్యసారమున నుపోద్ఘాతము. పుట ౭.

3. భ.గీ. ౨.౧౧-౧౬; ౧౮-౩౦; ౨. ౨౭-౨౯; ౫-౧౪; ౭.౪;౮.౫...

ముగా నాఁటికి నిర్వచింపఁబడియుండలేదు. మనోబుద్ధ్యహంకార శబ్దములు తఱచువాడఁబడినను, సాంఖ్యభావములో వాడఁబడి యుండలేదు. ప్రకృతిశబ్దము భిన్నార్థముతోనే వాడఁబడెను,౧. దైవాస్తిత్వ సమస్యను సాంఖ్యము ప్రయత్నపూర్వకముగా నుపేక్షించియుండఁగా, గీత దానిని స్థాపింప నధికశ్రద్ధ చూపి యున్నది.

ప్రకృతిపురుష భేదమును గుర్తించినను, గీత వానిద్వైత భావమును సమన్వయించినది. పురుషుఁడు స్వతంత్రుఁడుగాఁడు, దైవప్రకృతిలోనొక యంశమే పురుషుఁడు. మానసికశక్తి ఉన్నత ప్రకృతిరూపము. మనము సాంఖ్యమునుగూర్చి చర్చించు నప్పుడు, ప్రకృతివిషయములన్నియుఁ బురుషునికొఱకు నిలిచి యున్న ప్రదర్శనములని తెలియఁగలము. ప్రకృతి అచేతన మైనను, నాత్మకు మోక్షమును జేకూర్చు మహోద్దేశమును గలిగియున్నది. ఉద్దేశపూర్వకములైన ప్రకృతి వ్యాపారము వలనఁ, బ్రకృతి యచేతనమైనదని చెప్పుటకువీలులేదు. గీతలో నీలోపము తొలఁగింపఁబడినది. ప్రకృతి వ్యాపారమున కాధా రమై యొకపరమార్థమున్నది. సాంఖ్యతత్త్వములోవలె నిచటఁ బురుషుఁడు లేక జీవి స్వతంత్రవ్యక్తిగాఁడు. పురుషుని స్వభావము ప్రకృతి వ్యాపారమును గుర్తించుట మాత్రమేకాక ఆనందిం చుటయుఁగలదు. జీవులు నిజముగా వేరువేరుగా నున్నవను భావమును గీత యంగీకరింపదు.౨. ఒకయుత్తమ పురుషుఁడు

౧. ౩అ. ౩౩; ౪-౬; ౭.౪; ౯-౮; ౧౧. ౫౧; ౧౩-౨౦: ౧౮.౫౯.
౨. ౭అ. ౪; ౧౩ ౨౦-౨౨; చూడు వేదాంతసూత్రములు, ౨.౧.౧; దానిపై శంకరభాష్యము.

లేక పరమాత్మ స్వరూపుఁడుగలఁడని గీతచెప్పుచున్నది. కాని, జీవాత్మలక్షణములను, జీవాత్మకుఁ బ్రకృతితోఁగల సంబంధ మునుబట్టి చూడఁగా సాంఖ్యసిద్ధాంతము కొంతవఱకుఁ దన ప్రభావమును గీతపైఁ జూపినదని చెప్పవచ్చును.3. పురుషుఁడు సాక్షియేకాని కర్తకాఁడు. ప్రకృతియే సర్వముఁజేయును. "నేను చేయుచున్నా"నని తలఁచువాఁడు పొరపడుచున్నాఁడు. పురుషునికిఁ బ్రకృతితో సంబంధములేదని తెలియుటే జీవిత లక్ష్యము. గుణత్రియ సిద్ధాంతమంగీకరింపఁబడెను. "ప్రకృతిజ మైన గుణత్రియాధీనము కాని వస్తువు లోపమునఁగాని దేవత లకు నిలయమైన స్వర్గమందుఁగాని యేవియులేదు.౧. త్రిగుణ ములే జీవుని బంధించుపాశము. గుణత్రియమునకు మనమెంత కాలము బద్ధులమైయుందుమో యంతవఱకు సంసారచక్రమునఁ బరిభ్రమించుచుండవలెను. గుణత్రయాతీత స్థితియేమోక్షము. సాంఖ్యసిద్ధాంతము చెప్పినట్లే, యింద్రియములు, వానిగుణ ములు నిందును జెప్పఁబడినవి.౨.

యోగాభ్యాసములను గూర్చియు గీత ప్రసంగించినది. చంచలస్వభావముగలిగి దుర్నిగ్రహమైన మనస్సు నెట్లునిగ్ర హింపవలయునని యర్జునుఁ డడుగఁగా, నభ్యాసవైరాగ్యములచే మనోనిగ్రహము సాధ్యమని కృష్ణుఁ డుపదేశించియున్నాఁడు.౩.

### ౪—గీతోపదేశము

మానవుని పరమగతినిగూర్చియుఁ, బరమసత్యమును గూర్చియు గీతాకాలమున ననేకభావములు వ్యాప్తిలోనున్నవి.

3. సాంఖ్యకారికా ౬౨; భ.గీ. ౧౩. ౩౪.

అనుభవజ్ఞానముచే ఆత్మదర్శనముపై నాధారపడిన ఉపనిషత్సం ప్రదాయములు, ప్రకృతి సంబంధమునుండి విముక్తిఁగాంచుటయే ముక్తియని చెప్పిన సాంఖ్యతత్త్వభావములు, మననిత్య నైమిత్తిక కర్మానుష్ఠానమువలననే పరిపూర్ణత సిద్ధించునని చెప్పిన పూర్వమీమాంసా ధర్మములు, హృదయమును భక్త్యావేశపరవశమొనర్చినచో బ్రహ్మదర్శనానందము లభించునని పలికిన భక్తిమార్గవిధానములు, లోకవస్తుజాలమునుండి మరలి, అంతర్ముఖమైన దృష్టివలనఁ గలిగిన చిత్తశాంతివలననే మోక్షజ్ఞానముచేకూరునని వచించిన యోగతత్త్వసందేశములు నాకాలమున దేశమునందు వ్యాపించియున్నవి. పరమసత్యమైన సత్పదార్థము నిర్గుణముగాను, సగుణమూర్తిగను గ్రహింపఁబడినది. ఇట్టి భిన్నభావములన్నిటి నొక సమన్వయతత్త్వములోనికిఁ దెచ్చి, ప్రకటింప గీత యత్నించినది. అందువలననే మోక్షసిద్ధాంతమునుగూర్చియు, సాధనములనుగూర్చియు బాహ్యదృష్టికి విరోధములుగా గోచరించుభావములతో గీతనిండియున్నది. ఏకైకసిద్ధాంతప్రతిపాదనము గీతయందు గోచరింపనికారణమున గీతాతత్త్వమునుగూర్చి, రచయితలు భిన్నసిద్ధాంతములను నిర్మించిరి. భిన్నశతాబ్దములలో భిన్నవ్యక్తులు గీతాగ్రంథరచనములోఁ బాల్గొనిరని గార్బే, హాప్కిన్సు పండితు లభిప్రాయపడిరి. గీతామూలస్వరూపములో నొక యాస్తికగ్రంథముగా

---

౧. భ. గీ. ౧౭-౪౦: ౧౮-౫. ౨. ౩అ. ౪౦-౪౨; ౧౩-౫.

3. చూడు భ. గీ. ౬అ. 33-3౪. ౧౦-3౭లో న్యాయతత్త్వము స్మరింపఁబడెనని శంకరునభిప్రాయము. చూడు శంకరగీతాభాష్యము.

సాంఖ్యయోగ తత్త్వములననుసరించి క్రీ. పూ. రెండవశతాబ్దమున రచింపఁబడినదనియు, నుపనిషదద్వైతవాదులు తమసిద్ధాంతమును సమర్థించుటకు క్రీ. వె. రెండవశతాబ్దములో నందు వేదాంతభావములను జొప్పించిరనియు గార్బేతలఁచినాఁడు. "ఈరెండు సిద్ధాంతములును, ఏకదైవ సర్వదైవతత్త్వములు రెండును గలిసిపోయినవి. రెండు నొకదానినొకటి యనుసరించి కొన్నితావుల సంబంధములేకుండగను, గొన్నిచోటుల దుర్బల సంబంధముతోను గీతలోఁ బ్రదర్శింపఁబడినవి. ఇందొకటి బాహ్యమైన హీనధర్మముగను, రెండవది రహస్యమైన అంతరంగికధర్మముగనుగూడఁ జెప్పఁబడలేదు. పరమసత్యజ్ఞానమునకేకదైవతత్త్వము మార్గదర్శకమగు నారంభదశయనికాని, సర్వము బ్రహ్మమేయను వేదాంతతత్త్వమే తుదిసత్యమని కాని యెచ్చటను బేర్కొనఁబడి యుండలేదు. భాషలోఁగాని, భావములోఁగాని రెంటికి నెట్టిభేదము లేనట్టుగనే గీతలో నన్నిచోటులందుఁ జెప్పఁబడెను." ౧. అధునాతనోపనిష ద్రూపమున నున్న యొక విష్ణుగీతమే, కృష్ణప్రోక్తమైనగీతగా మారినదని హాప్కిన్సు పలికినాఁడు. అది మొదట శ్వేతాశ్వతరమువంటి యొక ఉపనిషత్తేయనియుఁ, దరువాత దీనిని కృష్ణమతశాఖవారు తమకనుగుణముగా మార్చుకొనిరనియు కీత్ పండితుఁడు చెప్పెను. ఒక అద్వైతగీతమును విష్ణుభక్తులు తమకనువగునట్లు తీర్చిదిద్దిరని హోల్ట్సుమన్ అభిప్రాయము. గీతాగ్రంథకర్త హృదయము భిన్నతత్త్వ ప్రవాహములచేఁ గలఁతఁబొందెనని బార్నెట్టు

౧. ఐ. ఎ. డిసెంబరు ౧౯౧౫.

తలంచినాఁడు. ఉపనిషత్తుల మహోన్నతమైన అద్వైతశిఖరము నుండి, నిమ్నగమన మొనర్చిన సంకుచితత్త్వమే గీతయనియు, నేకదైవతత్త్వమునుండి, నాస్తికతత్త్వములు బయలుదేరిన సంధి కాలమునకు గీత చెందుననియు డ్యూసేన్ పండితుఁ డూహించి నాఁడు.

పై పండితులభావములను వేనిని మనమంగీకరింప నవసరము లేదు. మహాభారతకాలమున బయల్వెడలిన నూతన సందర్భముల కనుగుణముగా రచింపఁబడిన ఉపనిషణ్మతమే గీతోపదేశము. ఏకదైవతత్త్వాభిమానుల కుపనిషత్తులలోని యుత్కృష్ట తత్త్వమునుండి, యొకమతానుష్ఠాన నిర్మాణమును గీత కల్పించినది. అంతర్దృష్టిపై నాధారపడి బ్రహ్మతత్త్వమును బ్రకటించిన ఉపనిషత్తులలో నేకేశ్వరభజనముచే లభించు భక్తిభావామృతమునకుఁగూడఁ దావుగలదని గీతబోధించినది. నిర్గుణ నిరాకారబ్రహ్మము ధ్యాన భక్తిమార్గములలో నున్న వారికనుగుణముగా గోచరించెను. సిద్ధాంతమునుండి యనుష్ఠానమునకుఁ దత్త్వమునుండి మతమునకు దృక్పథములోని మార్పులర్వాచీనోపనిషత్తులందుఁ గాననగును. వీనియందు రక్షకుఁడొకఁడు సగుణరూపములో గుర్తింపఁబడెను. జీవితానుష్ఠానముల కవసరమై, ఉపనిషత్సత్యాధారమైన తత్త్వసమన్వయమును గీత కల్పించి, భారతీయజీవితరక్తమునందుఁ బ్రవహించునట్లు చేసెను.

వివిధ తత్త్వభావసిద్ధాంతములను సమగ్రమైన యొక పూర్ణతత్త్వములోనికిఁ దెచ్చి గీత సమన్వయింపఁగలిగినదా

యను విషయమును ముందు మనము చూడఁగలము. సామరస్యమున కవకాశములేని భిన్నభావములు గీతయందుఁ గలవని భారతీయ సంప్రదాయమే కలదు. దేదీప్యమానములైన కొన్ని భావములు సమన్వయమున కెంతమాత్ర మనుకూలింపవని పశ్చిమ పండితుఁడు నిశ్చయముగఁ జెప్పుచున్నాఁడు. సామరస్యముమాట నటుంచి, సామరస్యమున కవసరములగు విషయములనుగూర్చియే మనము తీర్పులు చెప్పనవసరము లేదు.౧.

---

౧. గీతనుగూర్చి అనేక భారతీయ భాష్యములున్నవి. వృత్తికారుఁడు, శంకర, రామానుజులు మాధ్వులు. వల్లభనింబార్క జ్ఞానేశ్వరులు ముఖ్యులు. వేదాంతసూత్రములకు విపులవ్యాఖ్య రచించినవృత్తికారుఁడగు బోధాయనుఁడు గీతపైనొకవృత్తిని రచించెనని ఆనందగిరి వ్రాసినాఁడు. [ (౨అ.౧౦) శంకర గీతాభాష్యమున కానందగిరి వ్యాఖ్యచూడుఁడు.] గీతజ్ఞానకర్మ సముచ్చయ మార్గము నుపదేశించునని యాతనియభిప్రాయము. రెంటిలో నేయొకటియు మోక్షమీయఁజాలదు. జ్ఞానమే పరమసాధనమనియు, జీవబ్రహ్మైకత్వము కేవలమనుభవైకవేద్యమనియు శంకరుఁడు భావించినాఁడు. జగములోని అనేకత్వము మనఅసంపూర్ణజ్ఞానముచే గోచరించుచున్నది. అసత్యమైనద్వైతముపై నాధారపడినది కావున సర్వకర్మలు బంధహేతువులు. నిజమైన జ్ఞానము ద్వైతభావము నున్మూలించినప్పుడు, ఆత్మసిద్ధి చేకూరును; తరువాత నైష్టికకర్మయు నవసరములేదు. అన్యములైనకర్మ భక్తియోగములు జ్ఞానసాధనములు. (చూడు శంకరగీతా భాష్యము, ౩అ. ౧.) చిత్ అనగా జీవుఁడు, అచిత్ జగత్తు, ఈశ్వరుఁడు మూఁడు పదార్థములున్నవనియు, చిదచిత్తు లీశ్వరుని దేహమనియు రామానుజుఁడు పల్కినాఁడు. రామానుజతత్త్వము విశిష్టాద్వైతము, మతము భక్తిమతము, వర్ణవిభాగముండవలెనని పరోక్షముగ నాతఁడు సూచించినాఁడు. శంకరరామానుజు లిద్దరు కర్మకు ద్వితీయస్థానమును భిన్నోద్దేశములతో నిచ్చియున్నారు. మధ్వుఁడు మాయావాదము నిరసించి, పరబ్రహ్మము, జీవుఁడు శాశ్వతముగా వేరని నిర్ణయించెను. ఇతఁడును

గీతోపదేశ సందర్భమునుబట్టి చూచినచో, జీవితసమస్యను పరిష్కరించి, సక్రియకర్మానుష్ఠాన మార్గమును సూచించుటయే ప్రధానోద్దేశమని తెలియఁగలదు. అదిముఖ్యముగా నొకధర్మనిర్ణయము లేక యోగశాస్త్రమునని స్పష్టము. ధర్మసూత్రము లకుఁ బ్రాధాన్య మొసఁగిన కాలమునందు గీత వ్రాయఁబడిన కారణముచే ధర్మప్రాధాన్యమును గీతయును స్వీకరించినది. యోగశబ్దమున కెన్నియర్థములున్నను, గీత కర్మయోగమునకుఁ బ్రాధాన్యమిచ్చినది.౧. యోగమనగా దేవుని సాన్నిధ్యమః

దైవభక్తియే ఉత్తమమోక్షమార్గమని నిశ్చయించెను. శుద్ధాత్మయు బ్రహ్మము నొకటే యని వల్లభుఁడు పలికినను, జీవుఁడు బ్రహ్మములో నంశమని చెప్పెను. జగత్తు మాయకాదు. మాయపరమేశ్వరుని శక్తియే, అతనిసంకల్పముచే నదివేర్పడినది. అవ్యాజ దైవకృపయే మోక్షకారణము. ప్రపంచము. జీవులు సూక్ష్మరూపములలో దేవునియందుండెననియు, నిదిద్వైతాద్వైతమనియు నింబార్కునభిప్రాయము. పతంజలియోగమునే గీతబోధించినదని జ్ఞానేశ్వరుని వాదము. గీతనుగూర్చి సమర్థులైనవారిన్ని భిన్నభావములను గలిగియుండఁగా, గీతార్థము గ్రహింప యత్నించు విద్యార్థికి విశేషకష్టమున్నది. గీతయిచ్చిన సమన్వయములు, సామరస్యములు విద్యుత్తరంగములవలెఁ బ్రకాశించును.

కాని యెట్లుపరస్పరవిరుద్ధ భావములకు సమన్వయ మేర్పడెనో వివరములు మనకు లభింపవు. గీతఆత్మజీవితముసుద్ధరించినది. మనముమతవిశ్వాసముపై నాధారపడినంతకాలము, మనకదిమహోజ్జ్వలకావ్యముగానుజ్జ్వలమైయుండును. కాని విమర్శకుఁడు దానిలోని భిన్నాంశములను శ్రద్ధతోఁ బరిశీలింపకున్నచో సునిశ్చితమైన తత్త్వమందుగోచరించదు.

౧. యోగమభ్యాసము; సాంఖ్యము జ్ఞానము. చూడుము. శ్వే. శా. ఉ. "సాంఖ్యయోగాధిగమ్యమ్." యోగమనఁగాఁ గర్మయనియు నర్థమున్నది. చూడుము. గీత. ౩.౭; ౫.౧,౨;౯,౨౮; ౧౩.౨౪. యోగమనఁగఁ బరమేశ్వరుని యద్భుతశక్తియనియు నున్నది. చూడుము ౯.౫;౧౦.౭; ౧౧-౮. లేని వస్తుప్రాప్తియోగమనియుఁగలదు. చూడు. ౯-౨౨;

నకుఁ బోవుట; సృష్టినిగల్పించిన మూలశక్తితో సంబంధమును సంపాదించుట, పరమాత్మదర్శనము, చిత్తమనస్సంకల్ప శక్తుల నన్నిటిని దేవునికి సమర్పించుటయే కాని యేయొకశక్తినో యిచ్చుటకాదు. యోగమనగా మానవుఁడంతరాత్మతోఁ దాదాత్మ్యమునుబొందుట. అంతరంగమును సుశిక్షితమొనర్చి, సుఖాధికార కాంక్షలను దృణలీల నెదుర్కొని విసర్జించు నిశ్చల చిత్తబలమును సంపాదింపవలెను. లోకములో మనకుఁ దటస్థించు విపత్ప్రమాదములు మనయాత్మకంటని రీతిని ప్రవర్తింపఁగల విధముగా మనము చిత్తశిక్షణాభ్యాసము చేయుటే యోగమని చెప్పవచ్చును. యోగమీవిధముగా మోక్షోపాయము. బుద్ధినిబ్రసన్నమొనర్చి, చిత్తమును విభ్రాంతులనుండి క్షాళనముచేసి, సత్యదర్శనముచేయుట కనువగురీతి నాంతరంగిక శిక్షణముఁబొందుటే పతంజలి యోగవిధానము. ఆవేశోద్రేకములను మనమునిగ్రహించి, పరమాత్మదర్శనము చేయుటకు దేవునకాత్మ సమర్పణముచేయుటే సాధనము. మనజీవితమంతయు నొకయవిచ్ఛిన్న దైవసేవార్పణముగా నగునట్లుగా మనసంకల్పమును మనము శిక్షింపవచ్చును. మనజీవితప్రవృత్తిలో దేవుని మనము చూడవచ్చును; అదియొక కిరణముగా గోచరించి, క్రమముగాఁ బెంపొంది అనంతజ్యోతియై ప్రకాశించును. ఈ వివిధయోగములన్నియు నీశ్వరసంయోగమునుగూర్చు యోగముగాఁ దుదకు ఫలించును. కాని కేవల ధర్మోపదేశము, తత్త్వసిద్ధాంతముల యాధారములేక నిలువఁజాలదు. అందుచే గీతలోని యోగశాస్త్రము బ్రహ్మవిద్యపై నాధారపడియున్నది.

ఈవిధముగా గీత జీవితతత్త్వమును, ధర్మసూత్రమును, బుద్ధిగతమైన సత్యాన్వేషణమును, నిత్యానుష్ఠానరంగమునఁ బ్రతిఫలించు సత్యమునుగూడ నైయున్నది. ప్రతఅధ్యాయము తుదను దీనినే గీతపేర్కొనినది; బ్రహ్మవిద్యాయామ్ యోగశాస్త్రే అనగా బ్రహ్మవిద్యానుగుణమైన మతశిక్షణమని యర్థము.

### ౫—పరమసత్యము.

ఉపనిషత్తులలోవలెనే పరమసత్యాన్వేషణము బాహ్యాభ్యంతరతత్త్వవిభాగ పరిశీలనములననుసరించి చేయఁబడినది. ద్వితీయాధ్యాయమున దన తత్త్వనిర్మాణసూత్రము నీవిధముగాఁ బ్రకటించుటవలన గ్రంథకర్త తత్త్వాభిలాషప్రత్యక్షమగుచున్నది; "అసత్యమునందు సత్పదార్థము లేదు ; సత్యమునందసత్పదార్థము లేదు." ౧. వస్తువు, ఛాయ; అక్షరము క్షరముల భేదమును నిర్వచించుటతో సత్పదార్థపరిశీలనమారంభమగును, "లోకముననాశనమగుక్షరము, నవినాశమగు నక్షరముననను రెండుస్వరూపములున్నవి. మార్పులేని దక్షరము," ౨. ఇచట నక్షరమని చెప్పఁబడినదే పరమాత్మయనుటకు వీలులేదు. ఏలన దీనితరవాతశ్లోకమునందే. "అన్యుఁడొకఁడు పురుషోత్తముఁడు లేక పరమాత్ముఁడున్నాఁడనియు, నాతఁడే మూడులోకములందువ్యాపించి, వానినిరక్షించుచున్నాఁడనియు ౩; జెప్పఁబడినది. గీతాగ్రంథకర్త మొదట సర్వపరిణామములకుమూలమై

౧. "అవ్యక్తమైనదింకొక బ్రహ్మస్వరూపమున్నది. అదినిత్యమై, జగద్వస్తు వినాశముతో నది నాశము కాదు." (౮-౨౦)

౨. ౧౫ అ. ౧౬.  (3) ౧౫ అ. ౧౭. చూడు. ౮-౨౦.

ఆధారభూతమైన శక్తినిగూర్చి నిర్వచించినాఁడు. మనయనుభవములోనున్న యీదృశ్యమాన ప్రపంచమందే, క్షరాక్షరములైన రెండులక్షణములునున్నవి. లోకములోని వికారములతోఁ బోల్చినచోఁబ్రకృతి యంతకంటె స్థిరమైనదేకాని, ప్రకృతి ఎవనిపై నాధారపడియున్నదో యాపరమేశ్వరునితోఁ బోల్చినచో నదియునవిత్యమైనదే.౧ ఈయుత్తమ పురుషునియందే నిజముగా నమరత్వము, నిత్యత్వమునిలిచియున్నవి. ౨ రామానుజుఁడు తనసిద్ధాంతమునకనుగుణముగా, క్షరమనగాఁ బ్రకృతియనియు, నక్షరమనగా జీవాత్మయనియుఁ, బురుషోత్తముఁడనగా నీరెంటికినతీతుఁడైన పరమాత్మయనియు నర్థముచెప్పినాఁడు. నిత్యానిత్యములఁగూర్చి మనముచేయునూహా ప్రసంగములు మాని, పురుషోత్తముఁడనగా సగుణసాకారమూర్తియనియర్థము చెప్పుకొనవచ్చును. పరిమితజగత్తున కాధారభూతమైనదని బ్రహ్మమునుగూర్చిచెప్పి, యట్టిబ్రహ్మము నిరాకారనిర్గుణమని వచించుట సమంజసముకాదు. గీతనిత్యానిత్యవస్తువులభేదమును నిర్ణయించును. ఏదిపరిమితమును నిత్యమో అదిసత్యముకాదు. పరిణామశీలముగలదంతయు స్వవిరోధలక్షణయుక్తమైనది. మార్పునకులోనైనదాత్మకాదు. ఆత్మకుమార్పులేదు. లోకద్రవ్యములన్నియుదాముకానిదగుటకు మార్పునొందఁ బరిశ్రమించుచున్నవి కావుననవియన్నియు నసత్యములే. లోకములోనిసర్వవస్తువులు 'అనిత్యతాముద్రితములు, వీనివెనుకమార్పులేమియుఁ బొందనిదేదోయొకటున్నదని మనయంతర్వాణి చెప్పుచున్నది. ఏలననేదియు శూన్యమునుండిజనించదు. పరమాత్మ, నిత్యపరి

కామవశమగు ప్రకృతికాఁజాలదు, అది పరబ్రహ్మము, ప్రపంచమనాది ప్రవాహరూపమైనది, పరబ్రహ్మ కూటస్థమైనది. “ఎవఁడు పరమాత్మ సర్వవస్తువులలోనుండి, అవినశించినను, నశించకుండనుండునని తెలియునో, యాతఁడే తెలిసినవాఁడు.”[౩]. ఈపరబ్రహ్మము సర్వస్వరూపమై యుండుటచే వానినుండి గుణరూపమున భేదించదు. అనంతమైనపరతత్త్వము, సర్వలోకవస్తుజాలముల కాధారభూతమై, వానియునికికిఁగారణమై, పోషించుచున్నదని గీతభావించెను.

జీవాత్మ తనస్థితికసంతుష్టినొంది, తనకిప్పుడు లేని పదవిని దేనినో పొందవలెనని తపించుచున్నది. తనకుఁ బరిమితత్వమున్నదని భావించు జీవునిభావమే, అపరిమితమైనవస్తువున్నదని సూచించుచున్నది. తన పరిమితమైన దుస్థితినుండి అతీతమైన స్థితి నార్జింపవలెనని యత్నించుచున్న జీవి తనయవస్థలో సత్యముగాదు. సత్యమైనఆత్మ అవినాశస్వభావముగలది, జీవాత్మలో నిత్యమై, ద్రష్టయేకాని దృశ్యముకాని శక్తినికనుగొన గీత యత్నించినది. క్షేత్రమనగా దృశ్యము; క్షేత్రజ్ఞుఁడనగా ద్రష్ట లేక ఆత్మ.[౧]. మనకు విదితమైన దాత్మలక్షణముకాదు. మానవుని యందంతరంగమున ద్రష్టయొకఁడున్నాఁడు; మానవుఁ డెన్ని మార్పులఁబొందినను, ద్రష్టమారఁడు. ఆద్రష్ట నిత్యుఁడు, అనంతుఁడు, కాలాతీతస్థితియుఁ గలిగినవాఁడు. దేహమనోబుద్ధ్యాదులసంపుటిని విడఁదీసి, యెన్నడు మారకుండనుండు లక్షణమునందు గీత కనిపెట్టినది. దేహమంతవంతమైనది. కావు

౧. ౧౩. ౧, ౯-౬

నను క్షణికముగావుననునది యనిత్యము. ౨. ఇంద్రియజీవితము నాశస్వభావముగలదియు క్షణికమునుగూడ నైయున్నది. ౩. మానసము విద్యుచ్చంచలము. ఇవన్నియు నొకద్రష్టకు దృశ్యములు; ఆత్మకుపకరణములు. అవిస్వయంస్థితిగలవి కావు. సర్వజ్ఞానమునకును మూలాధారమైనశక్తి "ఇంద్రియమనోబుద్ధుల కతీతమైనద" ని గీతచెప్పినది. ఇది సర్వశక్తులను మేళవించి, సుషుప్త్యాది సర్వావస్థలలోనుండునది. ఈ మేళవించు సంయోగశక్తి, యింద్రియములకుఁగాని, మనస్సునకుఁగాని. బుద్ధికిఁగాని, వీనియన్నిటికిఁగలిపికాని లేదు. ౫. దృశ్యమైన ప్రపంచమునకును, జీవాత్మకునుఁగూడ ద్రష్టయైనట్టియు నాధారభూతమైనట్టియు నొకశక్తి యున్నదనునదే ప్రధానవిషయము. ద్రష్టలేనిచో దృశ్యమును లేదు. కాని దృశ్యము లేకున్నను, ద్రష్ట యెప్పుడునుండును. అమరమైన యీశక్తినిగూర్చి గీత మహోజ్జ్వల వర్ణనములిచ్చినది. అది దేహమున కధిపతి. "ఆతఁడు జన్మించలేదు; మరణించఁడు; ఇంతవరకునుండి యిఁక ముందుండనివాఁడును గాఁడు. అజుఁడు, నిత్యుఁడు, శాశ్వతుఁడు పురాణపురుషుఁడు, శరీరమునశించునప్పు డాతఁడు నశించఁడు."౬ "ఆయుధము లాతని స్పృశింపవు; అగ్ని యాతనిఁ గాల్పలేదు; వాయువు శుష్కింపఁజేయలేదు; జల మాతనిఁ దడుపలేదు. అతఁడచ్ఛేద్యుఁడు, అదాహ్యుఁడు...... అవిచ్ఛిన్నుఁడు;

౨. ౨అ. ౧౩. ౧౧. ౧౮. ౩. ౨అ. ౧౪.
౪. ౩అ. ౪౨. ౫. ౧౩అ. ౬. ౬. ౨అ. ౨౦.

సర్వవ్యాపి, స్థాణువు, అచంచలుఁడు, పురాణతముఁడు." ౧.

పరమాత్మస్వరూపమునుగూర్చి గీత చెప్పినది శంకావహముగనున్నది. "అచ్యుతమైన యీపరమాత్మ, శరీరమందధివసించియున్నను, ననాదియైనది, నిర్గుణమైనదియు నగుటచే, నేకర్మయుఁ జేయదు; ఏకర్మయు దానినంటదు." ౨. పరమాత్మ సాక్షిమాత్రమని యభిప్రాయము. ఆత్మ కర్తగాదు. పరిణామ జగన్నాటకమంతయు దృశ్యమునకుఁ జెందినదే. ఇంద్రియ మనోబుద్ధులు అచేతనప్రకృతినుండి జనించినవి. అచేతనప్రకృతి నుండి చేతనలక్షణములుగలయివన్నియు వెనుకనున్న ఆత్మశక్తివలన సాధ్యమగుచున్నవి. మనలోనున్న ద్రష్టయైన యాత్మ, సమతాప్రసన్నతలుగలిగి బాహ్యప్రపంచమున కాధారము నంతర్యామియునైనను, వానిచే నసక్తమైయున్నది.

లోకములో జీవించుచున్న జీవులలో విషయివిషయములు లేక ఆత్మానాత్మలు గలిసియున్నవి. ౩. జీవాత్మలనగాఁ బ్రకృత్యావరణములోనున్న పరమాత్మయే. ప్రపంచమున విషయివిషయము లెప్పుడును గలిసియే గోచరించును. ౪ దృశ్యము మాత్రము పరమసత్యస్థితిలేనిది. దృశ్యముకంటె నధికమైన ద్రష్టపై దృశ్యమాధారపడియున్నది. "బహురూపాత్మకమైన జగత్తు తనలోనున్నట్లును, దనలోనుండియే జనించినట్లును దెలిసికొనువాఁడు పరబ్రహ్మైక్యమును బొందును" ౫. విషయ సాంగత్యము వలన జనించిన అజ్ఞానము నశించుటవలనఁ బ్రతి

(౧) ౨. ౨౨-౨౫ (౨) ౧౩. ౩౧. (౩) ౧౩. ౨౬
(౪) ౧౩. ౨-౨౧ (౫) ౧౩-౩౦

వ్యక్తి లోనున్న ఆత్మయు నొకటేయని తెలియఁగలదు. మరణించు వారికొఱకు దుఃఖింపనవసరము లేదని యర్జునునకుఁ గృష్ణుఁడుపదేశించినప్పుడాతని యభిప్రాయములో మరణ మనగా నాశనముగాదు. దేహరూపములు మారునుగాని, దేహిమారఁడు. పరిపూర్ణత లభించువఱకు వ్యక్తిత్వముండును. ఎన్నిపర్యాయములు శరీరములు నశించినను, లోనున్న ఆత్మ తనప్రత్యేకత్వమును నిలుపుకొని, నూత్నశరీరములను ధరించుచుండును. ఈ విశ్వాసముచే ధైర్యముపొంది, మానవుఁడు బ్రహ్మజ్ఞానము నార్జింప యత్నింపవలెను. మన నిత్యత్వము మన అవినాశత్వముచేతను, బరిపూర్ణత్వముచేతను స్థాపితమగుచున్నది. మనలో గర్భితమైయున్న అనంతశక్తి యావిష్కరణ మందుచున్నది. ఆత్మయొక్క అస్తిత్వము నీవిధముగా నిశ్చయించుటచేతను, ఉపనిషత్తుల అనుభవజ్ఞానమును సమర్థించుటచేతను, శరీరము భస్మమునఁ గలిసిపోయినను, ఆత్మకు నాశములేదని యుపదేశించి, కృష్ణు డర్జునుని మానసికాందోళనమును శాంతింపఁ జేసెను.

"ఆత్మయెన్నఁడునుబుట్టియుండలేదు; ఆత్మయెన్నడు లేకుండనుండదు. అదిలేనికాలము లేదు; ఆత్మకాద్యంతములులేవు. జన్మరహితము, మరణరహితము, పరివర్తనశూన్యమునై ఆత్మయెల్లప్పుడుండును. ఆత్మకునిలయమైన దేహమునశించినను, మృత్యువాత్మ నెన్నఁడునంటఁజాలదు. ౧.

౧. సర్. ఎడ్విన్ ఆర్నాల్డు అనువాదము.

ఆత్మయే బ్రహ్మము, బ్రహ్మమే ఆత్మయని ఉపనిషత్తుల వలెనే గీతయు నుద్బోధించినది. నశ్వరములగు నింద్రియములకు మనస్సునకు వెనుక ఆత్మయున్నది; నశ్వరములైన లోకవస్తుజాలము వెనుక బ్రహ్మమున్నది; రెండునొకే స్వభావముగలవి కావున రెండునొకటే. దీనిసత్యమును బ్ [illegible] యుదనయనుభవము లోఁ దెలిసి, నమ్మవలసినదే. మార్పులేనిదానిని మార్పుగలదానిఁగా నిర్వచింపయత్నించుట వ్యర్థమగును. కాని అనుభవైకవేద్యమగు పరబ్రహ్మను, తార్కికముగా లోకమునకు మూలాధారమను భావమును గీత చెప్పుటకు యత్నించియుండలేదు; కాని యీభావము గీతలో నిమిడియున్నది. లోకమర్థరహితప్రదర్శనము కాకుండ సక్రమానుభవయోగ్యము కావలసియున్నచో దానికాధారముగ సర్వావస్థాతీతమగు పరబ్రహ్మ మవసరమైయున్నది. కాని యీనిత్యానిత్యవస్తువులు పరస్పరము వేరైనవి కావని స్పష్టముగా గుర్తింపవలెను. అట్లుగుర్తింపకున్నచో నిత్యవస్తువును గూర్చి మనకపార్థము కలుగును. మనకు మొదటఁ క్షణికమైన అనిత్యపదార్థమును, నిత్యమైనవస్తువును వేరుగాఁ దోచును. కాని యిదియే పరమసత్యమైనచో, ననంతమై [illegible] నిత్యవస్తువు పరిమితమై, అనిత్యవస్తువుగా మారవలసివచ్చును. పరిచ్ఛిన్న పదార్థమునుండి యవిచ్ఛిన్న పదార్థము సంపాదింపఁబడినదని తలఁచుట యుక్తము కాఁజాలదు. నిత్యపదార్థమే అనిత్య పదార్థములోని సద్రూపము. అనంతపదార్థము సాంతపదార్థమునకు వేఱుగా నొకచో నిలిచియుండలేదు. పరిమితవస్తువులోని యనంతశక్తిని మనము గమనింపనిచో, సంసారమొక యంతములేని ప్రవాహమై

మనకులభించును. ఈసంసారముయొక్క అనంతత్వమే, అనిత్య పదార్థములో నిత్యపదార్థమున్నదని సూచించుచున్నది. అనిత్య వస్తువు,అనిత్యవస్తురూపముననున్న నిత్యవస్తువునుప్రకటించును. రెంటికి భేదమును జూచుదృష్టి,వివేకహీనమైనది.నిజముచే ననంతవస్తు వొకటేయున్నది; దానిని మనము ప్రకృతిబంధములచే ననిత్యము నల్పమునైన దానినిగాఁ జూచుచున్నాము. అతీతత్వము, అంతర్యామిత్వము మున్నగుపదములే దోపార్థముల నిచ్చునేలన,ఁ బరమాత్మకుఁ 'వేరైన' పదార్థమున్నట్లుగా నివి సూచించును. పరమాత్మను దెలుపుట కేబుద్ధిప్రమాణమును సరిపోదు. అందుచేఁ బరమాత్మ, స్థితిగలదని కాని లేనిదనికాని, వ్యక్తమనికాని అవ్యక్తమని కాని చెప్పవీలుపడదు. ౧. దేశ కాల నిమిత్తాత్మకమైన జగత్తున కాధారభూతమై, అవి నాశమై స్వయంస్థితిగల శక్తియే సత్యవస్తువని ఉపనిషత్తులు చెప్పిన భావమునే గీతయు నుద్ధరించినది.

అద్వైతతత్త్వమునే గీత ప్రతిపాదించినది. అవినాశమైన పరమాత్మస్వరూపమే పరబ్రహ్మము. వేదాంతులు వర్ణించిన యీబ్రహ్మమును తపోనిధులు పొందుదురు. జీవాత్మపొందనగు నుత్కృష్టపదవి; ఈపదవి క్రొత్తగా నార్జింపఁబడదు; అదివఱకే జీవులలోనిత్యమై, ప్రకాశించుచున్నది. అట్టి పరబ్రహ్మమందే చరాచరజగత్తంతయు నిమిడియున్నది. పరబ్రహ్మమువలననే చరాచరములన్నియు నున్నవి; అదిలేనిదే యివియు నుండఁజాలవు; కాని పరబ్రహ్మ దేనికిని గారణముకాదు; ఏమియుఁ

---

౧. ౧౩, ౧౭.

జేయదు, దేనిని సంకల్పింపదు. బ్రహ్మమును జగత్తును లక్షణములలో వేరుగానున్నటులు తోఁచును. సంసారమసత్యమని మనము నిరసించి యది ఛాయామాత్రమనినను, నది యొక సత్పదార్థముయొక్క ఛాయ. సంసార మనిత్యమని, తా నతీతమైన స్థితికిఁ బోవలయునన్న కాంక్షతోఁ జేయు నాందోళనము వలననే తెలియుచున్నది. కాని పరబ్రహ్మమునకట్టి దోషమేదియును లేదు. పరిణామప్రపంచము పరబ్రహ్మాధారమైన కారణముచే నది నిత్యానిత్యలక్షణములుగలదని చెప్పఁబడినది. సంసారములోనున్న అనంత వైరుధ్యములు, భేదములు. భేద వైరుధ్యములులేని దివ్యపదవివైపు మానవ మానసమునాకర్షించుటకొఱకే యున్నవనియు, నున్నతజ్ఞానసిద్ధిలో నివన్నియు నదృశ్యములగుననియుఁ జెప్పఁబడెను. సర్వభేద సంబంధములు పరబ్రహ్మపై నాధారపడినను, నవి వానికి వ్యతిరేకములుగావు; ఏలన వీనికన్నిటికి మూలతత్త్వమే పరబ్రహ్మము, సంసారజగత్తు పరబ్రహ్మముపై నెట్లాధారపడినదో మనకుఁ దెలియదు; కాని యాధారపడినమాట నిజము; ఏలన, నదిలేనిదే యిదియుండఁజాలదు. ప్రశాంత సుషుప్తి నొందుచున్న వ్యక్తియు, గంభీరఘోషావృత సాగరమును గూడ నున్నవి. రెంటికిఁగల సరియైనసంబంధమును మన మెఱుఁగము. మనఅజ్ఞానమును మాయాశబ్దముచే వెలిబుచ్చుచున్నాము. రెండునొకటే; కాని యవి వేరుగానున్నట్లు తోఁచుచున్నది; ఈ వేరుగాఁ దోచుట యేమాయ, లోకాతీతమైన సత్యము, మార్పులులేనిదైనను, మార్పులు దానివలననే కలుగు

-చున్నవి. తాత్త్వికముగా మనజ్ఞానమింతటితోసరి. "దీనినిఁ బ్రత్యక్షముగా నెవఁడు చూడఁగలఁడు. ఈసృష్టి హేతువైన యాసత్యము నెవఁడు వాకొనఁగలఁడు? బహుళమైన యీసృష్టి యేలనున్నదో యెవఁడు నిర్ణయింపఁగలఁడు?"౧

దీనినే జీవాత్మసమస్యగాఁ జూచినప్పుడు, విషయీ విషయసమస్య యగును. నిత్యసాక్షిరూపమైన పరమాత్మకును, నిత్యప్రవాహరూపమైన లోకమునకు నెట్టిసంబంధమున్నదో మనకుఁ దెలియదు. ఈసమస్యా పరిష్కారమునకు శంకరుఁడ ధ్యాస కారణమును జెప్పినాఁడు. విషయీ విషయములకు సంయోగము వర్తింపదేలన, విషయియందు భాగములు లేవు; సమవాయసంబంధమును వర్తింపదేలన,ఁ గారణకార్య సంబంధ మీరెంటికిని లేదు. అందుచే శంకరుఁడిట్లు నిర్ణయించి నాఁడు; "రజ్జు సర్పభ్రాంతివలెను, ముత్తెపుచిప్పను జూచి వెండి యనుభావనయునువలెనే, వివేకము లోపించుటచేత, నొక దాని లక్షణము లొకదాని కున్నవను నధ్యాస మనకుఁ గలుగుచున్నది. ఆత్మానాత్మలు కలిసియున్నవను మిథ్యా జ్ఞానము, సక్రమజ్ఞానప్రాప్తిచే నశించి, దానితోఁబాటు పర బ్రహ్మ మొక్కటే దర్శింపఁబడును." ౧. ఈసిద్ధాంతము గీతలో నిర్వచింపఁబడ లేదు; కాని యందు గర్భితమైయున్నదని వాదించువారు గలరు.

---

౧. తైత్తిరీయ బ్రాహ్మణము ౧౮. ౮-౯.
౧. శంకర గీతాభాష్యము ౧౩. ౨౬

ఉపనిషత్తులందలి తత్త్వజ్ఞానమును, గీత, యేకేశ్వరమతముగాఁగల్పించి, భక్తిశ్రద్ధాప్రార్థనముల కవకాశమును గల్పించెను. మనకు నిర్గుణ బ్రహ్మజ్ఞానములేనంతకాలము, మనము పరిణామజగత్తులో,బనిచేయుచున్నంతకాలము, పురుషోత్తముఁడొకఁడు జగత్కారణుఁడని విశ్వసింపక గత్యంతరములేదు. పరమాత్మయొక్క నిర్గుణనిరాకారరూపమొక్కటే మానవుఁడూహించి యూరకుండనక్కర లేదు. ఉపనిషత్సిద్ధాంతమును మానవకోటి నిత్యజీవితములో ననుష్ఠాన యోగ్యమగునట్లుగాఁ జేయ నుద్యమించిన, గీతయొకపరమపురుషుని వ్యాపారముచే లోకమునడచుచున్నదని నిర్ణయించెను. మానవవ్యక్తిత్వమునకంతటికిఁ బూర్ణతృప్తినిచ్చు దైవమునుగల్పించి, యట్టిదైవలక్షణము కేవల నిర్గుణాత్మయును గాదు, కేవల జగత్తును గాదనియు, రెంటికి నతీతమైనదనియు నిరూపించెను. సర్వప్రాణిలోకము నావరించియున్న పరమాత్మయే జగత్కారణము, మూలము నైయున్నది. తత్త్వలక్షణములతో ధర్మలక్షణములు కూర్పఁబడెను. ౧. విభాగములనగా సంబంధమేమియు లేక వేరైనవను నపార్థమునకు గీత గురికాకుండ, విజ్ఞానముకొఱకుఁ జేయఁబడిన విభాగములనన్నిటిని సమన్వయమొనర్చెను. భేదములను గల్పించి,సమన్వయించులక్షణము లేనిదే విజ్ఞానముండఁజాలదు. మనము నిర్గుణపరబ్రహ్మమునుగూర్చి యాలోచించిన క్షణమందే, అనుభవజ్ఞానమును బుద్ధిజ్ఞానముగా మార్చివేయుచున్నాము. అనగా మనబుద్ధిజ్ఞానమున కందనిదికావున నిర్గుణ

౧. భ. గీ. ౭. అ౯, ౧౩

బ్రహ్మము పోయి, శూన్యము లభించినది. నిర్గుణబ్రహ్మము సర్వత్ర యున్నదే కావున, నిర్గుణపరమాత్మయు శూన్యమును మనకు మిగిలినవి. ఈయాత్మానాత్మైకత్వము, మన బుద్ధిజ్ఞాన మెంతసత్యమో అంతే సత్యము. నిర్గుణపరమాత్మయైన పరబ్రహ్మము విశ్వమును సృజించి కాపాడు పరమేశ్వరుఁడెట్లయ్యెనో గీత మనకు వివరించియుండలేదు. ఈసమస్యకు మనబుద్ధి పరిష్కారమును నిర్మింపఁజాలదు. మన మనుభవస్థితికిఁబోయి నపుడు, బుద్ధికల్పితసమస్యా కాఠిన్యములన్నియు నదృశ్యము లగును. నిర్గుణపరబ్రహ్మము సగుణమూర్తియైన విషయము రహస్యము లేక మాయ. జగత్తు పరబ్రహ్మ మంతసత్యము గాదనియు మాయాశబ్దమున కర్థము.

పరబ్రహ్మజగత్సంబంధమును మనము తర్కశక్తిచే నర్థముచేసికొన యత్నించితిమేని, బ్రహ్మమున కొకశక్తియున్నదని మనము చెప్పుకొందుము. నిర్గుణనిష్క్రియాత్మకమును, ఏదృశ్యసంబంధములేనిదియు నగు బ్రహ్మము, తర్కములే, ప్రకృతిసంబంధమునుండి, శక్తివంతుఁడైనట్టియు, క్రియాత్ముఁడైనట్టియు సగుణమూర్తిగాఁ గల్పింపఁబడినది, 'జలముపైఁ దపోమగ్నుఁడైన నారాయణుఁడు' మనకుఁ గలఁడు, శాశ్వతమైన "నేను" మిథ్యారూపమైన "నేనుకా"దను దాని నెదుర్కొని యాతఁడు తపించుచుండెను. అనాత్మయనఁగాఁ బ్రకృతి, ఇదియే మిథ్యాహేతువు, ఇదియే మానవదృష్టినుండి సత్యమును మఱుఁగుపఱచును. ప్రపంచమునకుఁ బురుషోత్తమునితో నవినాభావసంబంధమున్నది. పురుషోత్తముఁడు మొదలిడి, సర్వవస్తువులకాత్మ

నాత్మసంబంధమున్నది. మన మనాత్మతత్త్వము నొక దానిని పరబ్రహ్మములోఁ బ్రవేశింపఁజేసి, అందు గర్భితమైయున్న రూపమును ప్రకృతిపరిణామరూపమున బహిర్గతమగునట్లూహించుచున్నాము. పురుషోత్తమునిహృదయ మందొక ప్రవృత్తికాంక్షనుదయింపఁజేసి, త్రికాలముల రూపము లాతనియందుఁ గలవని తలఁచి యాతఁడే యీశ్వరుఁడని భావించుచున్నాము. విశ్వరూపము నొక్కదృశ్యముగా నర్జునునకుఁ గృష్ణుఁడు చూపినాఁడు. ౧. ఆయీశ్వరుని శాశ్వతదివ్యతేజోరాశియం దర్జునుఁడు, బ్రహ్మాండగోళములు, అనంతవస్తురూపములు దర్శించెను. అభ్యుదయమునకు వైరుధ్యమే ముఖ్యాధారము. దేవుని యందుఁగూడ నతని స్వాధీనమందున్నను, మాయాశక్తియున్నది. పరమేశ్వరుఁడు తన ప్రకృతినుండి జీవులను సృజించును. జీవులు తమ స్వభావములననుసరించి, తమ సుచితదశలనందుచుండును. ఇదంతయుఁ బరమేశ్వరుఁడు తన స్వీయశక్తిచే నవిత్యప్రపంచమునఁ బనిచేయుచున్నను, దేనితో సంబంధములేని యింకొక ప్రకృతి యాతనికున్నది. ఆతఁడు నిర్గుణపరబ్రహ్మమును, సర్వాంతర్యామియైన సంకల్పమును గూడనైయున్నాఁడు. ఆతఁడనిమిత్తకారణుఁడు, అచలుఁడై సర్వమును జనింపఁజేయువాఁడు.

"ఆతఁడు సర్వవస్తువులకు లోపల, వెలుపల నున్నాఁడు. అచలుఁడు, కాని చలింపఁజేయువాఁడు: ఆతఁడతిసూక్ష్మబుద్ధికి సర్వత్ర యెల్లప్పుడు గోచరించును. అందరకు నతిసమీపమున

౧. భ.గీ. ౧౧అ; ౬అ, ౨౯; ౭అ. ౪-౯; ౪అ ౨౪; ౧౦అ.

నుండియు నతి దూరస్థుఁడు. ఆతఁడద్వితీయుఁడైనను, సర్వస్థుఁడు. అన్ని వెలుఁగులకు నాతఁడే వెలుఁగునిచ్చువాఁడు; అంధకారగర్భమునఁ నున్నవాఁడు; శాశ్వత స్వయంప్రకాశస్వరూపి," ౧. లోకమునఁ" చేతనాచేతన రూపములువలెనే, భగవానుఁడు పరాపరరూపములు గలవాఁడు. అతనిలోని అపరప్రకృతి, సర్వజగత్పరిణామ భేదములకుఁ గారణము. ఆతని పరప్రకృతి చేతనాత్మక జీవకోటికిఁ గారణము, రెండు ప్రకృతులు నొకేబ్రహ్మరూపములు. మధ్వాచార్యుఁడీయర్థము నిచ్చు నొక శ్లోకము నుదాహరించినాఁడు: "దేవునికి జడాజడప్రకృతులు రెండుగలవు, జడప్రకృతి; అవ్యక్త ప్రకృతి. జడప్రకృతియనగా జడప్రకృతిని పోషించు శ్రీశక్తి, శ్రీదేవినారాయణుని రాణి. హరి, యీరెండు ప్రకృతులచే లోకమును గల్పించును".౨. అవ్యక్త జడపదార్థము నుండి, భిన్నరూపములతోఁ గూడిన లోకముద్భవించినదని సాంఖ్యతత్త్వనిర్ణయమును గీతయు నంగీకరించును; పురుషుని సాన్నిధ్యముచే నిట్టి సృష్టివ్యాపారము నడచుచున్నదని సాంఖ్యతత్త్వము చెప్పఁగాఁ, బురుషప్రకృతుల సమ్మేళనముచేతనే యట్టి సృష్టి జరుగుచున్నదనియు, ద్రిష్టలలోఁ జేతనత్వము, జడములలో నచేతనత్వము నధికముగా గోచరించుచున్నదనియు గీత చెప్పుచున్నది. రెండు నొకేపరమేశ్వరుని దివ్యరూపములు; జగన్ని

౧. ౧౩అ. ౧౬-౧౮. సర్ ఎడ్విన్ ఆర్నాల్డు అనువాదము.

౨. ౭అ-౬వ శ్లోకముపై వ్యాఖ్యానము.

ర్మాణ మూలశక్తులు. ౩. అందుచేతనే పరమేశ్వరుఁడు సర్వజగదాధారమును, సర్వజీవాంతరంగ జ్యోతియు నని చెప్పఁబడెను. పరమేశ్వరునికిఁ గల యీరెండు ప్రకృతులలో నొకటి మొదట జడపదార్థమై, దానినుండి యీవెనుక జీవరూపముద్భవించి, జగత్పరిణామములో రెండు నన్యోన్యవైరుధ్యము గలిగి యెట్లు పరివర్తించుట సాధ్యమైనదో వివరములేమియు గీత మనకుఁ జెప్పియుండలేదు. ౧.

మానవు నంతరంగమందును, ప్రకృతియందును నివసించియు రెంటికి నతీతమై భగవానుఁడు వర్తించును. అఖండమైన బ్రహ్మాండ మనంతాకాశము నాక్రమించి, భగవానునియందు విశ్రమించియున్నది కాని భగవానుఁ డందులేఁడు. దేవుని బాహ్యరూపము మారవచ్చును గాని, యాతనిలో నొకమూల సత్తా, సర్వపరివర్తనముల కాధారమై మార్పులేనిదై యున్నది.

(3) రామానుజుఁడిట్లుచెప్పినాఁడు: "జడప్రకృతికిని, సంబంధింపఁబడిన చేతన బీజమునకునుగల్గిన సంపర్కముచే, దేవతలు మొదలు, జడపదార్థములవఱకుగల సర్వవస్తుజాలములు సృజింపఁబడినవి. (రామానుజగీతాభాష్యము౧౩-౨) కాని జీవులీశ్వరునుండి వేరగు స్వతంత్రస్థితిగలవని రామానుజుఁడు వాదించినాఁడు; కాని గీత, అవ్యక్తబ్రహ్మము నిజముగా నపరిచ్ఛిన్నమనియు, విభక్తమువలె గోచరించుననియు స్పష్టముగాఁ బల్కినది. (విభక్తమివ ౧౩-౧౬)

౧. పురుషోత్తమునిగూర్చిన గీతాభావమును, బెర్గసన్ చెప్పిన నిత్యవస్తుభావములతోఁ బోల్చుటకు వీలులేదు; పురుషప్రకృతులనుగూర్చిన గీతాభావమును బెర్గసన్ చెప్పిన చేతన జడపదార్థములతోడను బోల్చుటకు సాధ్యముకాదు.

నానాత్వముతోఁ గూడిన జగత్తాతని యేకత్వమున కేలోప
మును గలిగింపఁజాలదు. ౨.

"వాయువు సర్వగతమై, ఆకాశము నాధారముగాఁ
జేసికొనియున్నట్లే, సర్వరూపములు నాయందున్నవి." ౩.
చలించు వాయువులు లేకున్నను, నాకాశమున్నట్లే, సృష్టిపరి
ణామ పరివర్తనములంటక, భగవానుఁడు నిత్యశుద్ధుఁడై యుం
డును. భగవంతునిచేఁ బ్రకటింపఁబడిన సృష్టి యాతని స్వయం
సంపూర్ణతకు లోపమును గలిగింపదు. కాని యాతనిసృష్టి
ద్వారమునఁగాక, భగవంతునిస్వరూపమును మనమెఱుఁగఁ
జాలము. జీవపరిణామ జ్ఞానాభ్యుదయ సంకలితమైన జగత్తును
భగవానునుండి తీసివేసినచో మిగులు దేవునిస్వస్వరూపము
మనజ్ఞానమున కతీతమైనది కావచ్చును. మనమీ జగత్ప్రదర్శన
మందు మగ్నులమైయున్నచో, మనము సత్యమును జూడలేక
పోవచ్చును. దృశ్యములతో సంబంధములేని భగవానుఁడెట్లుం
డునో, తానుగారణమైన సర్వవస్తుపరిణామములమధ్యమందుఁ
దనస్వస్వరూపమున మార్పులేకుండ నెట్లునిలచునో, మనము
తెలిసికొనవలసియున్నది.వస్తుసంబంధము లున్నంతమాత్రమున,
దృష్టయొక్క యేకత్వము చెడునని మనము తలఁపనవసరము
లేదు. పరమాత్మ ప్రదర్శించు జగద్రూపమే పరమాత్మయని
భ్రమించినచో గీతోపదేశము జగద్బ్రహ్మవాద మగును. గీతా
కారుఁడట్టి భావములను స్పష్టముగా నిరసించినాఁడు. బ్రహ్మాండ

౨. మహాభారత శాంతిపర్వము. ౩౩౯-౩౪౪.

మంతయు నాతని యేకాంశముచేఁ బోషింపఁబడుచున్నది.౧ దశమాధ్యాయమునఁ దనవిభూతిలో నొకయంశమునే ప్రదర్శించినానని కృష్ణుఁడు వచించినాఁడు. నిర్గుణబ్రహ్మముయొక్క అవినాశిత్వము, సగుణమూర్తియగు నీశ్వరుని క్రియాశక్తియుఁ గలిసి పురుషోత్తముఁడైనాఁడు.

మతానుష్ఠానదృష్టిననుసరించి, విషయావిషయసంబంధములకుసంబంధములేని నిర్గుణబ్రహ్మముకంటె, సాకారసగుణమూర్తియైన పురుషోత్తముఁ డధికుఁడు. ఆతఁడు పక్షపాతములులేని ధర్మమూర్తి; ఆర్తశరణ్యుఁడు. ఆతఁడు కొందరను గొన్ని సమయములలో దండించినంతమాత్రమున నాతఁడు నిర్దయుఁడని మన మూహింపరాదు. శ్రీధరుఁ డొకశ్లోకము నుదాహరించినాఁడు: "తనబిడ్డ నాదరించినను, మందలించినను, తల్లి నిర్దయురాలు కానట్లే, మంచిచెడ్డలునిర్ణయించు నీశ్వరుఁడు నిర్దయుఁడు గాఁడు." ౨. మతానుష్ఠానాభ్యాసముల నిమిత్తము నిర్గుణనిరాకారబ్రహ్మము సగుణ సాకారపురుషోత్తముఁడుగా స్వీకరింపఁబడెను. దుర్బలుఁడైన మానవుఁడు పురుషోత్తమభావము, నెఱుఁగక స్వీకరించి ఆత్మవంచనచేసికొనలేదు. హేతుజ్ఞానదీపమున సత్యము నిర్గుణాత్మకముగా గోచరించినను, ననుభవజ్ఞానజ్యోతిలో సగుణ నిర్గుణోభయాత్మకుఁడైన యీశ్వరుఁడు ప్రకాశించును. వీని సామరస్యవిధాన ముపనిషత్తులందుఁగలదు. ఈశోపనిషత్తననుసరించి, సత్పదార్థము చలస్థిరస్వభావములు రెండును గలది. ఒకటి విడిచి రెండవదానిని వేరుగాఁ దెలియ

౧. గీత. ౬; ౯, ౧౦ ౨. ౧౦. ౪౨.

యత్నించుట అజ్ఞానతిమిరమందుఁ బ్రవేశించుటే. అవినాశమైన పరమాత్మను, ననిత్యమైన జగమును సమన్వయింప గీత యత్నించినది. సర్వశక్తియుక్తుఁడైన అధ్యాత్మమూర్తియే పురుషోత్తముఁడు. అతఁడే నిత్యనిష్క్రియుఁడైనప్పుడు నిర్గుణబ్రహ్మము. శంకరానందుఁ డుదాహరించిన శ్లోకమిట్లు వచించును: "వ్యక్తావ్యక్తరూపములు రెండు వాసుదేవునికిఁగలవు. అవ్యక్తము పరబ్రహ్మము; చరాచరాత్మకప్రపంచ మంతయు నాతనివ్యక్తరూపము."3. ఒకేపరబ్రహ్మమునకువ్యక్తావ్యక్తములగు రెండులక్షణములున్నవి; ప్రకృతిలక్షణమును జెప్పినప్పుడు వ్యక్తమునకుఁ బ్రాముఖ్యమునిచ్చి జీవమందొక యంశమని చెప్పఁబడును."౪. ఈ యభిప్రాయమునే కృష్ణుఁడిట్లు చెప్పెను. "ఎచ్చటెచ్చట విభూతి, సత్త్వము, సంపద, ఊర్జితమునుండునో అవి యన్నియు నా తేజోంశసంభవములని యెఱుఁగుఁడు." ౧. మనమాతని భక్తులముకావలయునని, కృష్ణుఁ డుద్బోధించునప్పుడును, విశ్వరూపమును బ్రదర్శించునపుడును, 'నేను' కర్తృత్వపదము నుచ్చరించినపుడును, నివియన్నియు నిర్గుణబ్రహ్మము యొక్క వ్యక్తస్వరూపమునకుఁజెందినవి.౨.ఇట్టివ్యక్తబ్రహ్మమే, సృష్టివ్యాపారహేతువై, కాలచక్రమునందును, బరిణామప్రవాహతరంగములందును వ్యవహరించును. దీనికతీతమైనది నిర్గుణనిష్క్రియాత్మక పరబ్రహ్మరూపము.దీనిపై నింకేదియును లేదు.

3. భ. గీ. ౪. ౭. పైభాష్యము.
౪. భ. గీ. ౪. ౧౧. పైభాష్యము.

౧. ౧౦. ౪౧, ౨. ౯.౩౪; ౧౪.౨౭; ౧౮. ౬౫.

రెండునుగలిసి పురుషోత్తముడయ్యెను. సగుణమూర్తియైన యీశ్వరుడే పరమతత్త్వ సత్యమని తలచినచో మనకు దోషముపట్టును. "ఏది అనాద్యంతమో, ఏదియున్నదని, లేదని చెప్పజాలమో, దేనినెఱిగి, మనము మోక్షమునార్జింతుమో అట్టి స్వచ్ఛమైన బ్రహ్మమే నేనుచెప్పబోవు జ్ఞానవిష యము." 3. వ్యక్తిస్వరూపమంతయు నీశ్వరుడు తన యోగ మాయచే స్వయముగా బ్రదర్శించెనని గీతాకారుడు పెక్కు మారులు వచించియున్నాడు. ౪. వివేకహీనులు, నాయొక్క తరుగులేని అతీతస్వభావము నెఱుగక, నాస్వస్వరూపమును దర్శింపజాలనివారై, నేను బూర్ణదర్శనమిచ్చితినని తలం తురు." ౫. సరియైన తాత్త్వికదృష్టిలో నిర్గుణబ్రహ్మము పురుషోత్తమాకృతిదాల్చుట సత్యమునకుగొంత కొఱతయే యగును. అందుచే నీశ్వరుడే నిర్గుణబ్రహ్మముకంటె నుత్కృ ష్టుడని గీతాతాత్పర్యముగా వాదించుటతప్పు. మతాభ్యాసా వసరములకొఱకు, సగుణమూర్తియైన పరమేశ్వరుడు పరిపూర్ణ దైవమని గీతబోధించిన విషయము వేఱు.

మనము గీతచెప్పిన సృష్టిస్వభావమునుగూర్చి ప్రసంగించు టకు ముందు, బురుషోత్తమునకు కృష్ణునికిగల సంబంధమును గూర్చి చర్చింతము. ఇందవతార సమస్య యిమిడియున్నది.

పురుషోత్తముడే కృష్ణుడై జన్మించెనా, లేక కృష్ణుడు పురుషోత్తము నంశావతారమాయెను విషయములో భేదాభి ప్రాయములున్నవి. అవతార సిద్ధాంతము గీతలోనున్నది.

3. రామానుజగీతాభాష్యము ౧౩.౧౨. ౪. ౭.౨౫. ౫. ౭.౨౪.

"నేనజ్ఞుఁడను, అవ్యయాత్ముఁడను, సర్వజీవాధిపతినైనను, నా ప్రకృతి నధిష్ఠించి, నామాయాశక్తివలన నేనే జన్మించు చున్నాను."౬. అవతారములు సామాన్యముగా భగవానుని పరిమితస్వరూపములు. కాని యొక్క కృష్ణుఁడుమాత్రము పూర్ణావతారమని భాగవతము చెప్పుచున్నది; "కృష్ణస్తు భగవాన్ స్వయమ్." కృష్ణుని స్వరూపమే యాతని సర్వతోముఖ పరిపూర్ణతను సూచించును. ఆతఁడు శిరస్సునధరించిన నెమలి పింఛములోని రంగులు మానవుని నేత్రములకు మిఱుమిట్లు గొల్పును; ఆతని శరీరవర్ణము నీలాకాశవర్ణము; ఆతఁడు ధరించిన పుష్పమాల, గ్రహనక్షత్రజాల కాంతిపుంజముల సూచించును; ఆతఁడు గానమాలపించు మురళి యాతని దివ్యసందేశము నిచ్చును; ఆతఁడు ధరించిన పీతాంబరము, విశ్వాకాశ తేజోరూపము; ఆతనియురమందలి మచ్చ, తనభక్తులు తనకుఁ జూపు భక్తిచిహ్నము; భక్తులయెడఁ దనకుఁగల యాదరభావమును సూచించును; ఆతఁడు భక్తులహృదయముల నివసించును; ఆతనికృప అపారమైన దగుటచే నొకపాదముపై నింకొక పాదమునువోపి, తనపూర్ణకటాక్షమును బ్రసాదించు సూచనగా నిలఁబడినాఁడు. శంకరుఁడు, ఆనందగిరియుఁ గృష్ణుఁడు పరమేశ్వరు నంశావతారమనియే చెప్పిరి.౧. గీతాకారు నభిప్రాయ

౬. ౪.౬.

౧. 'అంశేన సంబభూవ' శంకరుఁడు. దీనిపై వ్యాఖ్యానించుచు నానందగిరి, 'స్వేచ్ఛానిర్మితేన మాయామయేన స్వరూపేణ' యనిపల్కెను.

ములోఁ గృష్ణుఁడు సాక్షాత్పురుషోత్తముఁడని యే, "నేను మనుజదేహము ధరించినందున, సర్వజీవాధిపతినైన నన్నెఱుఁగక, మూర్ఖులు నన్నల్పునిగాఁ దలఁచుచున్నారు."౨.

అవతార సిద్ధాంతము మానవజాతికొక నూత్నతత్త్వ సందేశము నిచ్చుచున్నది. అవతారములలో భగవానుఁడు యోధాగ్రణియై పాపకలుష మృత్యునాశనములతోఁ బోరుచున్నాఁడు. "ఎప్పుడెప్పుడు ధర్మగ్లానియు నధర్మవృద్ధియునగునో, నేనప్పుడు నన్ను నేనేసృజించుకొనుచుందును. దుష్టశిక్షణము కొఱకు, శిష్టసంరక్షణమునకు, ధర్మసంస్థాపనము నిమిత్తము ప్రతియుగమందు నేనుజన్మించుచుందును."3. ఈ వాక్యములు ప్రపంచమందు దైవశాసనమెట్లు ప్రవర్తించునో రసస్ఫూర్తితో వర్ణించుచున్నవి. దేవుఁడు మానవుని రక్షకుఁడుగాఁ జెప్పఁబడినప్పుడు మానవలోకములో నధర్మశక్తులు విజృంభించి, మానవాభ్యుదయమున కాటంకము కల్గించినపుడు, తానవతరించి ధర్మమును రక్షింపవలెను. హిందువుల పురాణముల ననుసరించి, తామసికశక్తులు లోకములోఁ బెచ్చుపెరిగినపుడొక రావణుఁడో, కంసుఁడో ప్రజలను బీడించునపుడు, భూదేవితోఁగలిసి బ్రహ్మేంద్రాదులందరు వైకుంఠమునకుఁబోయి, మొఱపెట్టుకొందురు. పరమేశ్వరునకు లోకసంరక్షణము నిత్యకర్తవ్యమే యైనను, గొన్నిసమయములలో నాతఁడెక్కువ తొందరగా రక్షింపవలసిన యవసరమేర్పడుచుండును. లోకమున నధర్మమధికముగాఁ బ్రబలి హద్దులుమీరినపుడు, సహజమైన దేవునిశక్తి

---

౨. ౯.౧౧. 3 ౪.౮. చూడు తేవిజ్జసూక్తము; మహోర్ణవతంత్రము ౪.౮.

ప్రదర్శనముచాలక, ప్రత్యేకశక్తి నాతఁడు ప్రకటింపవలసి వచ్చును. దేవుఁడప్పుడు మానవునిలోఁ బ్రవేశించుటే యవతారము; మానవుఁడు దేవుఁడగుటకాదు. ప్రతిమానవుఁడట్టి దైవావతారమే యైనను, నిచటి దైవశక్తి యాచ్ఛాదితమై యున్నది. ఆత్మజ్ఞానపూర్ణుఁడైన యీశ్వరావతారమునకును, నజ్ఞానావృతుఁడైన మానవాంతర్గతదైవమునకును భేదమున్నది. మానవుఁడైనను, మాయాతీతుఁడై, తనయజ్ఞానమును నిర్మూలించుచో, నతఁడు నవతారసముఁడగును. సృష్టికర్తయైన పురుషోత్తముఁడు తానుసృజించిన జీవులకు వేరుగాలేఁడు, లోకమున నాతనికర్తవ్యములను నెఱవేర్చుచునేయున్నాఁడు. తనలోనున్న దైవత్వము నావిష్కరించుకొన్నచో మానవుఁడు పూర్ణజ్ఞానియగు దేవుఁడేయగును. అందుచే దేవుఁడు మానవుఁడుగాఁ బరిచ్ఛిన్నుఁడగుచున్నాఁడని చెప్పినను, మానవుఁడు తన స్వస్వరూపమైన దైవత్వమున కవరోహణముచేయుచున్నాఁడని చెప్పినను భేదముండదు. కాని, సామాన్యముగా నవతారమనఁగా, భగవానుఁడొక మహోద్దేశమును నిర్వర్తింప భూమిపై జన్మించి తన సంకుచితరూపమందైనను, బూర్ణజ్ఞానమునుగలిగి యుండెననియే భావింపఁబడెను.

తాత్త్వికబుద్ధి అవతారములను, లేక పరిపూర్ణతారూపములను, లోకపరిణామాభ్యుదయ శిఖరములుగా నన్వయించును. మహాత్ములైనవా రాయాయుగధర్మప్రతినిధులై, విలక్షణమైన దైవశక్తిని తమజీవితములలోఁ బ్రతిబింబించిరి. పూర్ణనిగ్రహసమర్థులై, తమయందణఁగియున్న దైవాంశము నావిష్కరించి,

ప్రదర్శించిన మహాత్ములజీవితములే, సాధకులైనవారి కెక్కువ ప్రోత్సాహజనకములైయుండును. వారినిస్మరించి మానవులు ధైర్యముగొని, వారివలె నున్నతపరిణతినొంద యత్నింతురు. జిజ్ఞాసువులైనమానవు లట్టిమహాత్ముల యడుగుజాడల నడిచి, దైవసాన్నిధ్యమునొంద యత్నింతురు. మానవమాత్రుఁడైన యొకఁడు క్రీస్తుగా బుద్ధుఁడుగాఁ బెంపొందినట్లే, ప్రతిమానవుఁడు పెంపొందవచ్చును. భూమిపై మన జన్మమును బునీతమొనర్చుకొని నిరంతరకృషికాని లేక, మనలో దైవమును మూర్తీభవింపఁజేసికొను యత్నముకాని వివిధదశాపరిణామములతోఁగూడి యున్నది. విష్ణుమూర్తి దశావతారములు దశ పరిణామావస్థలను దెల్పును. అమానుషావస్థలో, ననగాఁ బశుజన్మమునకుఁ బ్రతినిధులుగా మత్స్య, కూర్మ, వరాహములు చెప్పఁబడినవి. నృసింహావతారము, పశు మానవదశా సంధిని దెల్పును. వామనావతారమున మానవత్వవికాసము పూర్తి చెందలేదు. మానవత్వములో మొదటిఘట్టమునకుఁ బ్రతినిధి. అనాగరికౌద్ధత్యము, క్రోధావేశమును బ్రదర్శించిన పరశురాముఁడు, లోకమునంతను నిర్మూలనమొనర్చెను. తరువాత నాత్మజ్ఞానపూర్ణుఁడై, కుటుంబమును, జీవితమును, బంధుప్రేమను త్యాగమొనర్చిన రామావతారము, నావెనుక, జీవితరణరంగమునఁ బ్రవేశింపుమని యుద్బోధించిన కృష్ణావతారమును, ననంతరము, సర్వజీవరాశియెడ నపారమైన యనుకంపగలిగి, మానవజాత్యుద్ధరణకై తనజీవితమును సమర్పించిన బుద్ధభగవానుఁడు, నుదయించిరి. దశమమైన కల్క్యవతార

మింకను రావలసియున్నది; ఇతఁడు కృపాణహస్తుఁడై, ధర్మద్వేషులను, దోషములను నాశమొనర్చును. మానవాభ్యుదయమునందు, విషమపరిస్థితు లేర్పడిన ఘట్టములకీ యవతారములు సంబధించియున్నవి.

౬—పరిణామప్రపంచము.

గీత మాయాసిద్ధాంతమున కెట్టిస్థానమిచ్చినదో తెలిసికొనుటకు, నందు మాయాశబ్ద మేయర్థములలో నుపయోగింపఁబడినదో, గీతాతత్త్వమునకు వానికి నెట్టిసంబంధమున్నదో మనము పరిశీలింపవలసియున్నది.

(౧) జగద్వ్యవహారములతోఁ బరబ్రహ్మమునకు సంబంధములేనిచో, నివన్నియు నెచటనుండి యుదయించినవను విషయము నిర్వచనమునకు సాధ్యముకాని రహస్యమగును. ఈ యర్థములో గీతాకారుఁడు మాయాశబ్దము నుపయోగించి యుండలేదు; ఈభావమాతని యభిప్రాయములో గర్భితమై యున్నదేమో ! మొదలు లేనట్టియు, నిజము కానట్టియు నవిద్య, జగన్మిథ్యాత్వహేతువనుభావము గీతా గ్రంథకర్తకు మనస్సులో లేదు.

(౨) సగుణసాకారమూర్తియైన యీశ్వరునియందే సదసద్రూపములు రెండు నిమిడియున్నవి.౧. అసద్రూపమును ప్రదర్శించున దాతని మాయాశక్తి; లేక ఆత్మవిభూతి. ఈయర్థములో నీశ్వరుఁడును మాయయుఁ బరస్పరాధార భూతములై,

(౧) ౯. ౧౯.

రెండును మొదలు లేనివైయున్నవి. ౨. ఈశ్వరునియీశక్తియే మాయయని గీతార్థము. ౩.

(౩) ఈశ్వరుఁడు తనకుఁగల ప్రకృతి పురుషశక్తుల రెంటి చేతను లోకమును సృజించియున్నాఁడు, కావున నవి దేవుని మాయాస్వరూపములని చెప్పఁబడెను. ౪. క్రమముగా మాయ యనగా జడప్రకృతియని యర్థము సంభవించినది. భగవానుఁడు పురుషుఁడను బీజమును ప్రకృతి గర్భమందుంచి, దానివలన లోకము నావిర్భవింపఁజేసినాఁడు.

(౫) వ్యక్తప్రపంచము, మానవులదృష్టినుండి సత్యమును మఱుగుపఱచును గావున, నది మాయాలక్షణము గలదనిచెప్పఁబడెను. ౫. ప్రపంచము మిథ్యకాదు. అది దేవునితో సంబంధములేని యచేతన రూపమని మనము భావించినచో నందుఁ గలదైవత్వమును మనము గోల్పోదుము. అందుచేనది భ్రాంతిజనకమగును. దైవమాయయే అవిద్యామాయయగును. అజ్ఞానదశలోనుండి, సత్యదర్శనము లేనికారణమున నది మనకే యట్లగపడును. దీనినంతను నెఱిఁగి, తనస్వాధీనములో నుంచుకొనునుగాన నిది దేవునికి "విద్యామాయ"యే యగును. మానవునకు మాయ దుర్భర దుఃస్థితిహేతువు; ఏలన నది పూర్ణ సత్యమును జూచుటకు శక్తిలేని యల్పజ్ఞానమునే మానవుని

(౨) చూడు శాండిల్యసూత్రములు; ౨అ. ౧౩.౧౫

(౩) ౧౫-౬౧: ౪,౬

(౪) ౪.౧౬.

(౫) ౭. ౧౪: ౭. ౨౫

కిచ్చెను. భగవానుఁడప్రమేయమగు మాయాకోశముచేఁ గప్పఁబడినాఁడు. ౬.

(౬) ఈశ్వరుఁడు కర్త; జగత్తు కార్యము, కార్యమునకంటెఁ గర్త లేక కారణమెల్లప్పుడు నధికమైనదే; అందుచే; జగము, దేవునికంటెఁ దక్కువసత్యమైనది. ప్రపంచముయొక్క యిట్టి అసత్యస్వరూపము, ఆత్మవిరుద్ధ స్వభావముగల ప్రపంచపరిణామ లక్షణమే సూచించుచున్నది. వ్యవహారప్రపంచమునఁ జేతన జడపదార్థముల కన్యోన్యవిరోధమున్నది. పరమసత్యము దానికతీతమైనది. ౧.

కాని, లోకమందలి పరిణామములన్నియు నసత్యములని గీత సూచించియుండలేదు.౨. శంకరాద్వైతముకూడ లోకపరిణామములు నిజముగా జరుగుచున్నవనియే చెప్పెను; బ్రహ్మము నుండి మొట్టమొదట జగదుత్పత్తియే వివర్తమని యాతఁడు వాదించెను. ప్రపంచము పురుషోత్తమునుండి నిజముగా జనించినది.కాని పరమార్థదృష్టిలో నది నిజముకాదు.ఏలన,నది స్వవిరుద్ధ ప్రదర్శనము. "ప్రపంచము మిథ్య; దానికొక స్థిరమైనయాధారమేదియును లేదు; దానికొక నాథుఁడులేఁడు; శుక్రశోణితసాంగత్యముచేతనే లోకముదయించిన"దను ౩ భావమును గీత నిరసిం

౬ అవిద్యాహేతువు కాని మాయ సాత్త్విక మాయ యనఁబడును.అది కలుషితమైనపుడవిద్యనుదయింపఁజేయును. సాత్త్విక మాయలోఁ బ్రతిఫలించిన వాఁడీశ్వరుఁడు; తామసికమాయలోఁ బ్రతిఫలించువాఁడు జీవుఁడు. ఇది అర్వాచీన వేదాంతము. చూడు పంచదశి ౧-౧౫-౫౭ ఈభావము గీతలోలేదు.

౧. ౨.౪౫; ౭.౨౫. ౨. ౩.౨౫;౪.౬; ౭.౧౪; ౧౪.౨౩. ౩. ౧౬.౮౦.

చును. ఈశ్వరాధిష్ఠితమై లోకము నిజముగా నభివృద్ధినొందు చున్నది. మనము జీవించియున్నంతకాలముమాత్రమే లోకము నిజమని గీతచెప్పియుండలేదు. దేవునిభుజములపై గోచరించు, స్వప్నతుల్యమైన అసత్యరూపమే లోకమనియు గీతవచించియుండ లేదు. పరిణామజగత్తులోనుండియు, నిత్యమైన అమృతత్త్వమును బొందవచ్చునని గీతోపదేశము. దీనికి లోకమందుండియు నిస్సంగుఁడై పనిచేసినపురుషోత్తముఁడే మనకుత్తమమైన యుదాహరణము, మనము మాయాతీతులమైనంతనే దేశకాలనిమిత్తములు నశించిపోవు; ప్రపంచ మదృశ్యముకాదు; దానిసరియైన యర్థము నీకుగోచరించును,

పురుషోత్తముఁడనగా నెవరికందుబాటులోలేని అతీతస్థితి కాదు; పురుషోత్తమస్థితి, ప్రతిపదార్థమునందును, ప్రతివ్యక్తియందును, గర్భితమైయున్నది. సర్వవస్తుజీవస్థితుల కాతఁడాధారము. జడపదార్థజీవములతోఁగూడిన ప్రపంచము పరమేశ్వరుని స్వభావజము. భగవానుఁడు లోకమును శూన్యమునుండి సృష్టింపలేదు; లోక మాతనిస్వరూపములోనిదే. ప్రళయకాలమందు, సర్వజీవరాశితోనిండిన ప్రపంచమంతయు సూక్ష్మరూపములో దేవుని గర్భమందుండును. వ్యక్తస్వరూపములో నీజీవులన్నియుఁ దాము వేఱనియు, దేవునితో సంబంధములేదనియు నజ్ఞానవశులై భావించును. ఇది దేవునిరాజయోగము. ప్రపంచ మూర్ధ్వమూలము, నధశ్శాఖమునని వర్ణింపఁబడినది.౪ ప్రకృతి యనగా జగత్సామాన్యలక్షణము. అనంతములైన పరస్పర

౪. ౧౫.౧.

విరోధరూపములు, పరస్పరాహారజీవవ్యాపారములు, పరిణామ, భేద, నిర్మాణ, వికాసప్రివృత్తు లన్నియుఁ బ్రికృతి కర్మలు. "భూమి వాయుజలాకాశాగ్నులును, మనోబుద్ధ్యహంకారము లును గూడిన నాప్రికృతి అష్టభాగములుగలది." ఇది దేవుని అపరరూపము లేక ప్రకృతి. దీనిని చైతన్యవంతమొనర్చి, పోషిం చున దాతనిపరరూపము లేక పరప్రికృతి. ౧. రామానుజుఁడు వచించినాఁడు; "ప్రికృతి లేక జడాత్మకమైనలోకము, భోగ ద్రివ్యము; దీనికన్యమై, జీవముగలదింకొకవర్గమునకుఁ జెందినది. ఇవి భోగద్రివ్యము ననుభవించుజ్ఞానముగలజీవులు." కొన్ని యద్వైతభావములను విడిచిపెట్టి, జీవ, పదార్థములను వాని కధీశ్వరుఁడైన పురుషోత్తమునిఁ దీసికొన్నచో గీత రామానుజు మతమును సమర్థించునదిగానున్నది. కారణకార్యములగు రెండు రూపములలోను నున్న చేతనాచేతనవస్తుజాలమంతయు నా దేహము. సర్వవస్తువులు, జీవులు హారములోని మణిగణముల వలెనున్నవి. వానిలోనుండి బంధించుసూత్రిమును నేనే." యను నీమణిగణసూత్రోదాహరణము రామానుజుని సిద్ధాంత మును బలపఱచునని యాతఁడు చెప్పినాఁడు.౨.

జీవాత్మ భగవానునిలో నొక యంశమని చెప్పఁబడెను. "మమైవాంశః" 3. ఇచట "అంశ"యనగా నజ్ఞానదృష్టిలో గోచరించు "భాగ"మను నర్థమేకాని, సత్యమని యర్థములేదని

౧. ౭.౪,౫. చూడు రామానుజగీతాభాష్యము ౭.౪-౫.

౨. రామానుజగీతాభాష్యము ౭. ౭.

3. ౧౫. ౭.

పాదించుటలో శంకరుఁడు గీతా గ్రంథకర్త యుద్దేశమునకు వ్యతిరేకమైన యర్థమును గల్పించినాఁడు. జీవాత్మ పురుషోత్తముని నిజమైనయంశ; బ్రహ్మానువిభక్తమను భావములో శంకరుఁడు చెప్పినది సహేతుకమైనదే; కాని యప్పుడు పురుషోత్తముఁడును గల్పితభావమే; ఏలన నాతనియందు ననాత్మలక్షణము కూడనున్నది. మానవుఁడు కర్త; పరిశుద్ధాత్మస్వరూపి గాఁడు; జీవాత్మ; యనగా దైవాంశస్వరూపము. దేహమనోబుద్ధీంద్రియములచే బద్ధమైన కారణమున జీవాత్మయంశగాఁ జెప్పఁబడినది. ప్రకృతికిఁ గాలము, చలనము, వ్యాప్తియు నున్నట్లే, పురుషునికి విజ్ఞానరూప వ్యాప్తియున్నది. పరమాత్మ ప్రాణమయాన్నమయ విజ్ఞానమయ కోశకల్పితమగు నుపాధిచేఁ బరిమితుఁడైనాఁడు, "పురుషుఁడు ప్రకృతితోఁ గలిసి, ప్రకృతి సంజాత ద్రవ్యముల ననుభవించును. సదసద్రూప జన్మమున కిదియే కారణమై, గుణసంబంధము కలిగియుండును."౧.

౭—జీవాత్మ

జీవులందరు బాహ్యరూపాకృష్టులై, మాయకు వశులై యున్నారు. ౨. సంసారమందు జన్మమునకవిద్య కారణము. సత్యము నెఱుఁగ నంతకాలము, సంసారచక్రమునందు జనన మరణములు పొందుచుండుట తప్పదు. మనము మాయనధిగమించి, మన స్వస్వరూపము నెఱిఁగినప్పుడు మన జీవప్రత్యేకత్వము నశించును. ఈలోపుగ నేరూపము ధరించినను నది యదృశ్యము గాక తప్పదు. జీవుఁడు తాను గాని దేదియో

(౧) ౧౩. ౨౧. (౨) ౭. ౧౩, ౨౬, ౨౭.

కావలెనని నిత్యము యత్నించుచున్నాఁడు. కాని యీ ఉపాధి గత జీవితములోఁ బూర్ణాత్మస్వరూపము వ్యక్తముకాదు. పరిణామము తుదముట్టి, జీవాత్మ పరమాత్మలో లీనమగువఱకు నీప్రయత్నము సాగుచునేయుండును. ఈప్రకృతి ప్రపంచము తుదిలేనిపరిణామము గలిగి, అనంతత్వమును బొందు అవకాశముున్నదై, అవిచ్ఛిన్నముగాఁ బెంపొందుచున్న లక్ష్యమును సాధించుననవరతసాధనముతోఁ గూడినదైయున్నది. అనగాఁబరిణామముపై నాధారపడిన భేదములన్నియుఁ, బ్రకృతితోఁగల సంబంధము లన్నియు ననిత్యములని స్పష్టమగుచున్నది. పురుషోత్తమ భావవిజ్ఞానదశలోఁ బురుషుల నిత్యత్వము, ననేకత్వమును గీత యంగీకరించినది. కావున జీవులనఁగా బురుషోత్తము నంశలే మూర్తిమంతములైనవి. పరబ్రహ్మ సత్యదృక్పథము నుండి చూచినచో, జీవుల స్థితిదృశ్యములపై నాధారపడియున్నది. ఈలోకమునందైనను, ప్రత్యేక జీవవ్యక్తిత్వముల సూచించు వ్యాపారములు, నిష్క్రియాత్మకమైన పరబ్రహ్మ కర్మలుగాక, ప్రకృతి కార్యములే, "ప్రకృతిజములైన గుణములే ప్రతివ్యక్తిచేఁ గర్మలజేయించును." ౩. పురుషులు నిత్యులైనచో వారు వేర్వేరు కర్తలనుట దోషముకాదు. గీత యిట్లనుచున్నది; "ప్రకృతిగుణములచే జరుగుచున్న కర్మలకు, అహంకార భ్రాంతిమగ్నుఁడైన మనుజుఁడు తానే కర్తనని తలఁచుచున్నాఁడు." "గుణములు గుణములందుఁ జరించుచున్నవి."౪. దృశ్యసంబంధము జీవునికిఁ బ్రత్యేకవ్యక్తిత్వ భ్రాంతినిగలుగఁ

(3) 3.౫ (౪) 3.౨౭.౨౮.

జేయుచున్నది. అనాత్మయే యీభేదబుద్ధికిఁ గారణము; నిజముగా మనయందరలో నున్నట్టి యాత్మయు నొక్కటే; శ్వానములోనున్నను శ్వపాకునిలో నున్నను, ౧. భేదము లేదు. ఇట్టి వాక్యములన్నిటి నద్వైతపరముగా నన్వయించుట శంక రుని కతిసులభము, శంకరుఁడు చెప్పినాఁడు, "జీవు లంత్యవిశే షములనగా, సత్యముగా వేరైయున్నవని ఋజువుచేయు సాక్ష్య ములును మనకు లేవు. కావునఁ బరబ్రహ్మము, ఏకము నవిభ క్తము." ౨. ప్రత్యేకజీవులకు నిర్వచింపరాని ప్రత్యేకలక్షణ ములు లేవని చెప్పనవసరము లేదు. ఉపాధిగతములైనవి కనుక జీవులు వేఱని చెప్పవచ్చును. మహాభారత మిట్లు చెప్పుచున్నది: "గుణబద్ధుఁడైనవాఁడు జీవాత్మ; గుణవిముక్తుఁడైనవాఁడే పర మాత్మ." ౩. జీవబ్రహ్మైకత్వమును దెలుపు వాక్యములకు రామానుజుఁడీరీతిగా నర్థముచెప్పును. బ్రహ్మమున కనంతము లైన బాహువులు పాదములు నున్నవను దానికి రామానుజుఁ డిట్లు వ్రాసెను; "పరిశుద్ధమైన ఆత్మ, అనగా దేహేంద్రియా ద్యుపాధి రహితమైనప్పుడు, సర్వవ్యాపిత్వము గలిగియున్నదని భావము". ౪. మఱియు నందరలోనున్న పురుషుఁడు "సాక్షి, పోషకుఁడు, భర్త, సర్వాధిపతి, పరమాత్మ"యని గీత చెప్పిన దానికి రామానుజుఁ డుద్విగ్నమనస్కుఁడై, వ్రాసెను; "అట్టి పురుషుఁడు, తనకుఁగల ప్రకృతి గుణసంబంధముచేత, శరీర

---

౧. గీ. ౧౮; ౧౩. ౨.౨౨. ౨. శంకరగీతాభాష్యము గీ.౧౯

౩. శాంతిపర్వము. ౧౮౭.౨౪. ౪. రామానుజగీతాభాష్యము౧౨.౧౩

మును బరిపాలించు ప్రభువయ్యెను; పరమాత్మయన్నను, దన దేహాధిపత్యమునే సూచించును." ౫.

అచ్చటచ్చట నుదాహరింపఁబడిన యేకవచన బహువచనరూపములనుబట్టి, జీవుని యథార్థరూపమిదియని నిశ్చయింపఁజాలము. వ్యవహారప్రపంచదృష్టితో బహువచనము చెప్పఁబడెను. "నేనెప్పుడు నభావమునుబొందలేదు; నీవుకాని యీరాజన్యులుకాని యెన్నఁడును లేనివారుకారు. మనలో నెవ్వరమును ముందుండనివారము కాఁజాలము." ౬. దీనినిబట్టి శాశ్వతమైన అనేక జీవసిద్ధాంతమును బోషింపవచ్చును; రామానుజుఁడిట్లు భావించెను: "జీవులు వేరని, దేవుఁడు జీవుల నుండి వేరని, భగవానుఁడే ప్రకటించినాఁడు." దీనికివ్యతిరేకముగా శంకరుఁడిట్లు రచించినాఁడు; "మన మాత్మస్వరూపులముగా నిత్యులము, భూతవర్తమాన భావికాలములందెల్లప్పుడు నుందుము."

భిన్నోపాధులననుసరించి, భిన్నరూపములుగా జీవులు గోచరింతురని గీత బహువచనము నుపయోగించినదని శంకరుఁ డూహించినాఁడు. ఇది సత్యమని తరువాత శ్లోకమే చెప్పుచున్నది; అందుఁ బునర్జన్మము స్మరింపఁబడినది. కావునఁ బరమార్థదృష్టిలో నాత్మయొక్కటే. ౧.

---

౫. రామానుజగీతాభాష్యము. ౧౩.౨౩; ౧౩.౩౩.

౬. రామానుజగీతాభాష్యము; శంకరభాష్యము. ౨.౧౨

౧. ౮. ౪; ౧౩. ౩౧

బ్రహ్మైక్యము లభించువఱకుఁ బునర్జన్మముతప్పదని గీత చెప్పినది. మనయజ్ఞానమువలన జన్మము. దానివలన మరణము తిరిగి తిరిగి సంభవించును. బాల్య కౌమార యౌవన వార్ధక దశలవలెనే, జననమరణదశలును గలుగుచుండును.

"చినిఁగిన వస్త్రములను బారవైచి, నూతనవస్త్రములను ధరించురీతినే, ఆత్మ జీర్ణదేహమును విసర్జించి నూతనశరీరమును దాల్చుచుండును." ౧.

మరణము నివాసమునుమాత్రమే మార్చును. ఆటలాడు నాతఁడు తానాడాడుటకుపయోగించు నుపకరణమును సరియైన స్థితిలోనుంచుకొనును. వార్ధక్యమునఁ గ్రమముగా దుర్బలములగుశక్తులు, రోగములచేఁ దాత్కాలికముగాఁ గలుగునీరసము, స్థూలశరీమునకు సంబంధించినవైనను, మానసికావస్థపైఁ దమప్రభావమును జూపును. శరీరము మృతినొందినప్పుడొక నూతనోపకరణ మీయఁబడును. శరీరమృతితో జీవము మృతి నొందదు; ఒకదేహముపోయిన నింకొక దేహమువచ్చును. మనకు లభింపఁబోవుజన్మము మనశీలముపై నాధారపడియుండును. మనపరివర్తనమునందు సత్త్వ రజస్తమోగుణముల పరిమాణముననుసరించి, మనకు దేవ మనుష్య పశు పక్ష్యాది జన్మములు లభించును. మనము ముందుకువేసిన ప్రతిపదము మనకు సంరక్షింపఁబడును. ఈజన్మములో యోగసిద్ధిపొందలేని వారిగతి యేమగునని యర్జునుఁ డడిగినప్పుడు, సత్క్రియాపరుఁ

౧. ౨.౨౨. సర్. ఎడ్విన్ ఆర్నాల్డు అనువాదము. చూడు ౨.౧౩;. ౨. ౨౭.

డెన్నఁడు నశింపఁడనియుఁ, "దానుబూర్వజన్మములోఁ జేసివిడిచిన జ్ఞానకృషినిగలిగి, తిరిగి జన్మించి, మోక్షము పొందువఱకు నున్నతాభ్యాసముచేయు నవకాశము లభించుచుండుననియుఁ గృష్ణుఁడు బదులుచెప్పినాఁడు. 3. కర్మఫలము లెల్లప్పుడును గాపాడఁబడుచునేయుండును. దైవమార్గమునుబట్టి నడచువాఁ డెన్నఁడు నపమార్గమునకుఁ బోఁడు. మోక్షసిద్ధి లభించువఱకుఁ బునర్జన్మము కలుగుచుండును. ౪. మనోబుద్ధీంద్రియాదుల తోఁగూడిన సూక్ష్మశరీరము, స్థూలదేహము నశించినవెనుక పూర్వజన్మసంస్కారములను భరించి, దేహాంతరప్రాప్తి నొందును. ౧. మనము పరిపూర్ణులమగుటకుఁ బునర్జన్మము శిక్షణోపాయము. సన్న్యాసులకు లభించు దేవయానమునుగూడ గీత చెప్పియున్నది. ౨. పాపులుపోవు మూడవమార్గమును బ్రకటింపఁబడినది. 3.

## ౮—ధర్మశాస్త్రము.

జీవులు వేఱువేఱుగా గోచరించుట, వానియల్పత్వము, ప్రత్యేకవ్యక్తిత్వము, నివి కారణాంతరసంభవములేకాని, స్థిరసత్యములుగావు. తాను స్వతంత్రవ్యక్తిని, సంపూర్ణుఁడ నను భావము పూర్తిగానశించినఁగాని, నిశ్చలశాంతినిత్యత్వములు లభింపవు. మోక్షమనగా మహోన్నత జీవాతీతస్థితిలేక బ్రహ్మైక్యము; ఇది జ్ఞాన, భక్తి, తపస్సాధనములచే లభించును. మన లక్ష్యము బ్రహ్మసంస్పర్శములేక బ్రహ్మములో నేకమగుట.

3. ౬.౪౪-౪౫ ౪. ౭. ౧౯.

౧. ౧౫.౮. ౨. ౮.౨౩-౨౬. 3. ౯.౧౨;౧౬.౧౯-౨౧.

ఇదియే నిజముగా సాధింపఁదగినది. పాపమును బరిహరించి, దేహజములైన కల్మషముల భస్మమొనర్చి, మనలోని క్షుద్ర ప్రకృతిని జయించి, కామబంధములనుండి యింద్రియముల విడిపించి ముందుకుఁబోవు నవకాశ మందరకుఁగలదు. సాధకుఁడైన ప్రతివ్యక్తియుఁ దన నేత్రములతో సత్యమునుదర్శించి, తన బుద్ధితో దానిని నిర్ణయించి, తనహృదయముతో దాని నర్చింప వలెను. ఇతరులుచెప్పిన పూర్ణసత్యమును వినుటకంటె, మనము స్వయంకృషిచే నార్జించిన సత్యాంశమైనను నధికమైన విలువ గలది.౪.

బుద్ధిసంకల్పహృదయముల సంపుటియే మానవుఁడగుటచే, నాతఁడు సర్వతోముఖసంతృప్తి నందఁగోరును. పరమాత్మజ్ఞానముచేఁగాని, పురుషోత్తమునందలి పరిశుద్ధభక్తిసేవాదికములచేఁగాని, తనసంకల్పమును దైవసంకల్పమున కర్పించుటవలనఁగాని మోక్షము లభించును. ఈమార్గములన్నిటిలోను, దన యల్పమగు 'నహం' భావము నతిక్రమించి, పురోగమనము చేయు ననివార్యమైనకాంక్ష ప్రతిజీవియందుఁగలదు. మన మేమార్గమునుబట్టిపోయినను మనము జేరుపరమావధి యొకటే. ఈభిన్నశక్తిసమన్వయసామర్థ్యమువలననే, సత్యశ్రేయస్సౌందర్యములు మనకులభించును. ఇందేభాగము నుపేక్షింపఁదగదని గీత స్పష్టముగా వక్కాణించినది. సర్వతోముఖదైవపరత్వము వలన సమన్వయ జీవితమేర్పడును. భగవానుఁడును సచ్చిదానంద స్వరూపుఁడు. పరబ్రహ్మము జ్ఞానులకు మధ్యాహ్న

౪. ౬,౨౦,౨౩,౨౭,౨౮.

వేళ వెలుగొందు సూర్యునివలె, లేశమాత్రము నంధకారము లేకుండ, దివ్యతేజోరాశియై ప్రకాశించును; ధర్మతత్పరులగు వారికిఁ బక్షపాతములేని స్థిరమైన ధర్మమూర్తిగా గోచరించును; ప్రేమోన్మాదులకు, బరమపావనమైన శాశ్వతప్రేమ సౌందర్యనిధానమై ప్రత్యక్షమగును. భగవానుఁడెట్లు తనలో సత్తును, చిత్తును, ఆనందమును సమన్వయించెనో, అట్లే మానవులును దమజీవితములో సమన్వయానుష్ఠానమును జూపవలెను. మనము గమ్యస్థానమును జేరినవెనుక, మార్గమధ్యముననున్న యవరోధములు మనకు వర్తింపవు, సాధకుఁడైన వానికి, ధ్యానకర్మలు విరోధములుగాఁ దోచవచ్చును. ఇట్లు తోచుట మన అసంపూర్ణజ్ఞానచిహ్నము. భిన్నమార్గములలో ననుసరింపఁదగిన దేదియని యర్జునుఁడడిగినప్పుడీ సమస్యను గూర్చి మనము తాపత్రయ పడనవసరములేదని స్పష్టముగాఁ గృష్ణుఁడు చెప్పినాఁడు; ఏలన, నీభిన్నమార్గములు తుదియందు వేరుగావనియు నివి మధ్యకాలమున నొకటితోనొకటి కలియుట విడిపోవుట జరిగినను, జివరకన్నియు నొకేచోటఁ జేరుననియు వక్కాణించినాఁడు. మానవుఁడు తాను విభాగములై పనిచేయఁడు. అభ్యుదయమనగా భిన్నలక్షణ వికాససామరస్యము కాని, సంబంధములేని భిన్నాంశముల పెంపుగాదు. జ్ఞానసంకల్ప నిశ్చయములొకే ఆత్మవికాసములోని యంశములు.

గీత, తనకాలమందున్న భిన్నభావములను, నిర్దుష్టము లొనర్చి సమన్వయింపఁ జూచినది. జ్ఞానపరిశీలనము, సంపూర్ణ స్వార్థత్యాగము, ఉజ్జ్వలభక్తిభావము, యోగాభ్యాసము,

వైదికకర్మాచరణము దైవ ప్రీతిసాధనములని యానాఁడు విశ్వసింపఁబడెను. ౧. యథోచితస్థానముల నిచ్చి వీనినన్నిటిని గీత సమన్వయించినది. అన్నిటిని మేళవించి జీవితరంగమున రణమొనర్చుట సత్వరమోక్షసాధనమని గీత విశ్వసించినది. పురుషోత్తమాధిష్ఠితమైన యీవిశ్వమునందు సర్వసాధన సమ్మిళిత మార్గమువలన, సాధకుఁ డమోఘ బలసంపన్నుఁడై, చరింపఁ గలఁడు.

కర్మ, ఉపాసనము, జ్ఞానమునను నుపనిషత్ప్రతిపాదితములైన మూఁడుమార్గములను గీత బోధించినదనియు, నొక మార్గమున కాఱుచొప్పునఁ బదునెన్మిదధ్యాయములు రచించెననియు మధుసూదన సరస్వతి తలఁచినాఁడు. సత్యమేదియైనను, విజ్ఞానజీవితము త్రిపథములుగా విభజింపఁబడినది. పరమాత్మ సాక్షాత్కారమునకు భిన్నవ్యక్తులు భిన్నపద్ధతులలో బయనించిరనియు, ధర్మసూక్ష్మరహస్య సమస్యావిచారమునఁ గొందరు, తార్కికసంశయ నివారణ విధానముచేఁ గొందరు, భక్త్యావేశ పరవశత్వముచేఁ గొందరు తత్సిద్ధిని గాంచిరని గీత యంగీకరించినది.

---

౧. పోల్బ్రష్లాటినస్, "ఆత్మజ్ఞానమును సాధించుటకు భిన్నమార్గము లున్నవి; కవిసున్నత శ్రేణికిఁ గొనిపోవు సౌందర్యప్రేమ; ఏకేశ్వరు నర్చించు భక్తి, తత్త్వశాస్త్రకోర్కె దీర్చు శాస్త్రాభ్యుదయము; పరమపావనమైన విశ్వాసముతోఁ గూడిన భక్తిప్రార్థనములు; ఇవి వ్యవహారరంగమునకుఁ బరిత్యక్తవ్యమునకు నతీతమైన పరిపూర్ణసత్యమునకుఁ దోడ్కొనిపోవు రాజమార్గములు."

### ౯—జ్ఞానమార్గము

తార్కికమానసము, పాక్షికదృష్టితో సంతృప్తిపొందక వస్తుసంపూర్ణ జ్ఞానసంపాదనమునకై యత్నించి, సత్యదర్శన మగువఱకు విశ్రాంతిగాంచనేరదు. పరమసత్య సాక్షాత్కారము తనకు సాధ్యమను మృతిలేని విశ్వాసముచే నది ధైర్యమునుగాంచును. ౧. గీత రెండువిధములగు జ్ఞానముల నంగీకరించినది; ఒకటి బుద్ధిచే బాహ్యప్రపంచ స్వరూపము నర్థము చేసికొనునది; రెండవది ప్రకృత్యభ్యంతరమున సర్వదృశ్యముల కాధారమైయున్న పరమసత్యము ననుభవముచేఁ దెలియునది. బుద్ధి తర్కమునకు వశమైనప్పుడు మానవునిశక్తి ప్రకృతియందు లగ్నమై, ప్రకృతివ్యాపారములతోఁ దాదాత్మ్యమును బొందును. పరమసత్యస్వరూపముయొక్క స్వస్థితి నంతరంగమందుఁ దిలకించుటకుఁ, దానుగాని వానితో సంబంధములను మానవుఁడు విసర్జింపవలెను. జగద్వ్యాపారవివరములను బుద్ధిచే గ్రహించుట విజ్ఞానమనియు, సర్వవస్తు సర్వతోముఖజ్ఞానమున కది వేరైనదనియుఁ జెప్పఁబడెను. విజ్ఞాన, జ్ఞానములు రెండు నొకేవృత్తియొక్క ద్వివిధరూపములు, సర్వజ్ఞానము దైవజ్ఞానమే. భౌతికశాస్త్రము, తత్త్వశాస్త్రము రెండును బూర్ణ సత్యస్వరూపము నాత్మరంగమునఁ జూడయత్నించునవే. శాస్త్రజ్ఞానము రజోగుణాధిక్యముచేతను, తత్త్వజ్ఞానము

---

౧. "ఆనందము దేవునిఁబ్రేమించుటలోనున్నది. ప్రేమ జ్ఞానము వలన జనించును." (స్పైనోజా) "కొంతమందికి, దైవానుభవమునకు ముఖ్యమార్గము లోకము నర్థముచేసికొనుబుద్ధి ప్రయత్నమునందేయున్నది. (బ్రాడ్లే)

సత్త్వగుణాధిక్యముచేతను బ్రకాశించును. భౌతికశాస్త్రము లొసగు సత్యాంశములు, తత్త్వశాస్త్ర మొసగు పూర్ణసత్యము లని భ్రమించినచోఁ, దమోగుణప్రధానమైన క్షుద్రజ్ఞానమే మనకు లభించును. ౧. మనము శాస్త్రజ్ఞానరంగమున నున్నంతకాలము, సత్యము మనకొక కల్పితభావమే. అనంత పరిణామము, సత్పదార్థమును గప్పివేయును. మనస్సునకు దుర్భరముగానున్న యంధకారమును శాస్త్రము దొలగించును. తాను నిర్మించిన ప్రపంచ మసంపూర్ణమైనదని ప్రకటించును; దీనినతిక్రమింపవలయునని యుద్బోధించును. శాస్త్రము పూర్ణజ్ఞానమీయదుగావున, వినయసంపత్తి నిచ్చును; గతమునుగూర్చిన మఱపు, అనాగతమునుగూర్చిన యజ్ఞానము రెండుప్రక్కలనుండి మన కుత్తలపాటునుకలిగించును. వస్తువుల ప్రథమ కారణములను దెలిసి, మానవజాతి పరమలక్ష్యమునుగాంచుటకు శాస్త్రమువ్యాఖ్యలూనుట నిరర్థకకాంక్షయని శాస్త్రమే యంగీకరించుచున్నది. పరమసత్యము నెఱుఁగుటకు శాస్త్రమున కింకొకవిధమైన శిక్షణ మవసరమైయున్నది, పరిప్రశ్నతో సేవను మేళవింపవలెనని గీత చెప్పుచున్నది. ౨. మనస్సునకుఁ గల సహజవిలోకనము నింకొకవైపునకుఁదిప్పి, అంతర్ముఖత్వమును వికసింపఁజేయవలెను. తన చర్మచక్షువులతో సత్యమును దర్శింపలేక, దివ్యదృష్టినొసగుమని కృష్ణుని కోరియున్నాఁడు. 3, ఈశ్వరదర్శనానుభవముచేఁ దనలో సర్వ

(౧) ౧౮-౨౦, ౨౨. (౨) ౪. ౩౪. (3) పోల్చు, ప్రశస్తమా-టులు: "ఓభగవాన్; అతఁడు చూడఁగలుగుట కాతని నేత్రముల విప్లవము."

వస్తువులనుజూచుటే విశ్వరూపసందర్శనము; కవి దీనినతిశయో క్తిగా వర్ణించినాఁడు. ఇట్టి సాక్షాత్కారము లభింపవలెనని నచో, మానవుడు తన మానసమును లోనికిఁజొప్పించి, యీశ్వరునిపైఁ గేంద్రీకరింపవలెనని గీత చెప్పినది. మనకు సత్య మును గోచరింపకుండఁజేయునది కేవల బుద్ధిలోపముమాత్రమే కాక, స్వార్థపరతాహంకారముగూడ నైయున్నది. అజ్ఞానమనగా బుద్ధిలోపమేకాదు; ఆత్మదర్శనములేని యంధత్వము. దీనినిఁ దొల గించుటకు, మనయాత్మకు దేహేంద్రియాదుల సాంగత్యముచేఁ గలిగిన కలుషములను క్షాళనమొనర్చి, వస్తువులనొక నూతన దృక్పథములోఁ దిలకించు నాత్మదృష్టిని వికసింపఁజేయవలెను. కామాగ్నిజ్వాలల నార్పివైచి, తృష్ణయొక్క విజృంభణము నణఁచివేయవలెను. ర. అస్థిరము చపలమునైన మనస్సు నొక ప్రసన్నకాసారమువలెఁ జేసినందున నందు సత్యమను రవిబింబము చక్కగాఁ బ్రతిఫలించును. వివేకనిర్ణయశక్తిగల బుద్ధియు సుశిక్షితముకావలెను. ౫. బుద్ధి పూర్వకర్మములననుసరించి పనిచేయును. దానిని సుశిక్షితమొనర్చి, ఆత్మదృష్టిగల దానినిగాఁ జేయవలెను.

చిత్తశిక్షణసాధనముగా యోగపద్ధతిని గీత స్వీకరించి నది. మనపరిమిత జీవితమునకతీతమైన యేస్థితినుండి, సర్వవస్తు సంబంధముల మూలరహస్యముల నెఱుఁగఁగలమో, యట్టి స్థితినిఁ బొందుటకు వలయుసాధనములను యోగశాస్త్ర

(ర) ర.౩౯. (౫) ౨. ౪ర.

మిచ్చును. యోగశిక్షణమందలి ముఖ్యఘట్టములు: (౧) భగవానుఁడు వచ్చి నివసించుటకు వలయునంతపరిశుద్ధిని మన శేంద్రియములకు సంపాదించుట, (౨) విషయములపైఁ బరుగిడు చిత్తమును నిగ్రహించి, అంతర్ముఖమొనర్చి, యేకాగ్రతతో భగవానునిపై నిలుచునట్లుచేయుట, (౩) సమాధ్యవస్థలో దేవునితో నేకమగుట. పతంజలియోగములోవలె గీత సూత్రములనన్నిటిని విశదముగాఁ జెప్పలేదు. కాని, వివిధసాధనముల నుదాహరించినది. ౧.

భిన్నభావములు గల వైజ్ఞానికుల కందర కంగీకారయోగ్యములైన కొన్ని సర్వసామాన్య ధర్మములను గీత మనకిచ్చినది. మనము శ్రద్ధ౨. నభ్యసించి, యింద్రియవిజృంభణము నరికట్టి, దేవునిపై మనస్సును లగ్నమొనర్పవలెను. నిశ్చల శాంతి ప్రసన్నత లాత్మదృష్టికి ముఖ్యావసరములు. ఇంద్రియ నిగ్రహముచే లభించు ప్రశాంతచిత్తమున కంతరాత్మయొక్క వాణి వినఁబడును. స్వచ్ఛమైన యోగమనఁగా సమత్వము.౩. "కుంభగత దీపశిఖవలె నెచట మనస్సు చలింపకుండునో; ఆత్మదర్శనముచే నాత్మ యెచట సంతృప్తిగాంచునో; ఇంద్రియముల కందని యేస్థితియందునిలిచిన, బ్రహ్మానందానుభవము గలిగి, సత్యమునుండి మానవుఁడు చలింపఁడో, యేస్థితికి మించినదేదియులేదని తెలియునో, యెచటనుండినచో ఘోరవిపత్తులను బాధింపఁజాలవో, అట్టి దుఃఖరహితమైనస్థితియే యోగము".౪ ఆత్మదృష్టికొఱకుఁ బ్రతివ్యక్తియు యోగాభ్యాసముచేయ నవ

---

౧. ౬౮. ౨. ౪. ౩౯. ౩. ౨.౪౮. ౪. ౬-౧౯-౨౩.

సరము లేదు. వశిష్ఠవాక్యమును మధుసూదన సరస్వతి యిట్లుదాహరించినాఁడు. "అహంకార సమన్వితమైన మనస్సును నిగ్రహించుటకు, యోగము, జ్ఞానము నను రెండు పద్ధతు లున్నవి. యోగమనఁగాఁ జిత్తవృత్తినిరోధము; జ్ఞానమనగా సమ్యగవేక్షణము, కొందరకు యోగాభ్యాసము సాధ్యముకాదు; కొందరకు జ్ఞానమార్గమలవడదు" ౫. అనుభవజ్ఞానము కర్మోపాసనములచేఁగూడ లభించును. ౬. కొందరకు యోగాభ్యాసముచే నాత్మదర్శన లాభముండునని గీత యంగీకరించినను, గీత యోగవిధానమునందలి ప్రమాదముల నెఱుఁగనిదికాదు. ౧. తపోపవాసాదికములచే, నింద్రియశక్తులు పటుత్వమును గోల్పోయి, నీరసించినను, విషయకాంక్షాబలము తరుగకయే యుండును. ముఖ్యమైన దింద్రియనిగ్రహము, విషయములయెడ నౌదాసీన్యమును, ఇది జ్ఞానమువలన లభించును.

అనుభవజ్ఞానము ప్రత్యక్షరూపమైన దగుటచే నది హేతురహిత నిశ్చయముకాదు. శాస్త్రనిర్ణయము దానికిఁ బోషకమైనది. దీక్ష, తీవ్రపిపాసలతోఁగూడిన జ్ఞానమది; అచట సంశయలేశమునకును దావులేని పూర్ణానుభవము; ఆస్థితిలో మనకు నిశ్చల విశ్రాంతియు నాత్మశాంతియు లభించును. 3.

పూర్ణమైన అనుభవజ్ఞానము సిద్ధించుటతో, మనసంకల్పావేశములు కూడ నందుఁ బాల్గొనును. ఆత్మప్రకాశముతో

---

౫. గీతాభాష్యము ౬.౨౯. ౬. ౮-౮౨

౧. ౨. ౫౯-౬౧. ౨.౯ ౨ ప్రత్యక్షావగమమ్. 3. ౮. 3౫; ౫. ౧౮-౨౧.

నిండిన యీశ్వరసాక్షాత్కార మానందామృతరస ఝరీపరం పరల నుదయింపఁజేయును. పరమేశ్వరారాధనమే యెడతెగని సర్వజీవితాశయమగును. బ్రహ్మజ్ఞాని భక్తుఁడేకాక భక్తాగ్రగణ్యుఁడు ౪. "నన్నెఱిఁగినవాఁడు నన్నారాధించును." ౫. భగవాను నెఱుఁగుటనగా, మనహృదయముల నాతని కర్పించుటయు నాతని నర్చించుటయును. ౬. మన మాత్మస్వస్వరూపము నెంత పూర్ణముగా నెఱిఁగిన, నితరుల యవసరముల నంత యధికవివేకముతో గుర్తింతుము. "శ్రేయఃప్రదమైనది జ్ఞానమునకు మూలాధారమైన శిలవంటిదేకాక, సచ్ఛీలమునకు ధ్రువతార వంటిది కూడ నగునని" సుప్రసిద్ధుఁడైన నేటిల్‌షిప్పు పండితుని వాక్యము. నలుబదియేండ్ల కాలమును మానవోపదేశోద్ధరణముల కై ప్రేమతో సమర్పించిన ఉత్తమజ్ఞానమూర్తియైన గౌతమ బుద్ధుని జీవితమే దీనికుదాహరణము.

జ్ఞానము ధర్మమునెడ శ్రద్ధచూపదని కొందరు వాదించిరి; సత్ప్రవర్తనమునకు జ్ఞానము ముఖ్యావసరమును గాదనిరి. బుద్ధివలన మన నిర్ణయములలో దోషములుండవచ్చును; ధర్మానుష్ఠానలోపముచేఁ బ్రబలదోషము లుండును. బుద్ధి స్వతఃమంచిదికాదు; చెడ్డదియునుగాదు; దానిని మనము సచ్ఛీల నిర్మాణ నిర్మూలనముల రెంటికి నుపయోగింపవచ్చును. విభాగవంశీలనోపలక్షితమైన బుద్ధికిది యంతయు సక్రమమైనదిగానే తోఁచవచ్చును. గీత యుపదేశించిన జ్ఞానము, మనలన సమగ్రభావములనుండియు, సంకుచితదృక్పథములనుండియు నతీతమైన

(౪) ౭. ౧౭. (౫) ౧౫-౧౯. (౬) ౧౦. ౮-౯.

స్థితికిఁ దోడ్కొనిపోయి, సర్వాంగపరిపూర్ణమైన సత్యమును జూపి, మానవులకుఁగల భేదములు శాశ్వతములు గావనియు, నట్టి యసత్యభేదములపై నాధారపడిన ప్రవర్తనము యోగ్యమై నదికాఁజాలదనియుఁ దెలియఁజేయును. సర్వమానవ జీవితము లకు మూలమొకటేయనియు, సర్వజీవులయందొకే స్వయం స్థితిగల శాశ్వతబ్రహ్మశక్తి పనిచేయుచున్నదనియు మనము గ్రహింతుము. ఈరహస్యమును మనమెఱిఁగినపుడు, మన యింద్రియవ్యామోహములు, అహంకార కాలుష్యములు తొలఁగిపోవును. ౧.

## ౧౦—భక్తిమార్గము.

మానవుని హృదయావేశముయొక్క సక్రియవ్యాపార ధర్మమును దెల్పునదే భక్తిమార్గము. భక్తి, జ్ఞానమునకును గర్మకును వేఱైన ఆవేశసాంగత్యమును జూపును. ౨. వ్యక్తుల మధ్యమందుండు సజీవసంబంధమును జూపున దావేశము; మానవుని దేవుని బంధించు మతానుష్ఠానమును బ్రకటించునపుడది శక్తివంతమై యుండును. మనము ప్రేమించి యారాధించుట యెఱుఁగనిచో, మన మహంకార కారాగృహమున బద్ధులమై యుందుము. ఈమార్గము సక్రియానుష్ఠానముచే నీశ్వరదర్శన ప్రాప్తి హేతువగును. దుర్బలులకు నల్పులకు, పామరులకు నజ్ఞానులకు, నందరకిది యందుబాటులోనున్న మార్గమును, నత్యంత సులభమార్గమును నైయున్నది. 3. ప్రేమార్పణము, మనసం

(౧) ౨.౫౯. (౨) శాండిల్యసూత్రములు ౧.౪,౫,౭,
(3) ౯.3౨; ౧౧.౫3-౫౪.

కల్పమును దైవోద్దేశమునకు స్వాధీనమొనర్చుట, తపశ్శిక్షణము, అధికక్లేశముతోఁగూడిన బుద్ధిప్రవృత్తి మున్నగువాని యంతకష్టమైనది కాదు. కాని అన్యమార్గముల వలని ఫలితము దీనికిని లభించుటే కాక, దీని కితరమార్గముల కంటె నాధిక్యము గూడఁ గలదని చెప్పుదురు; ఏలన, భక్తియే ఫలస్వరూపము; అన్యములు ఫలసాధనములు.

భక్తిమార్గమున కాది యెప్పుడనున దత్యంత పురాతన కాలాంధకారగర్భమునఁ బడిపోయినది. ఉపనిషత్తుల యుపాసన మార్గము, భాగవతుల భక్తిమార్గము గీతాగ్రంథకర్తకుఁ బ్రేరణహేతువులైనవి. ఉపనిషత్తులు విస్పష్టముగా నిర్వచింపని కొన్ని భక్తిభావముల నుపనిషద్భావ పరిణతితోఁ దుల్యమగు రీతినిఁ బ్రకటింప గీతాగ్రంథకర్త యత్నించినాఁడు. నిర్గుణబ్రహ్మము గీతయందు "జ్ఞానుల జ్ఞానముగాను, బ్రహ్మర్షుల తేజస్సు[౧]"గాను, మనుజులకును దేవతలకు నాదిపురుషునిగను, బ్రహ్మర్షుల కగ్రగణ్యునిగను, సర్వభక్షకుఁడైన మృత్యుస్వరూపునిగాను వర్ణింపఁబడెను. ౨. అవ్యక్తబ్రహ్మారాధనము మోక్షసిద్ధినిచ్చునని యంగీకరించి, అది క్లేశతరమని గీతాకారుఁడు వచించినాఁడు. ౩. జ్ఞానమార్గమునఁ గాలునిలుపు స్థలమును సామాన్యమానవుఁడు గాంచనేరఁడు. ఒకవస్తువునకు మనయందుఁగల ప్రేమలో భేదబుద్ధికొంతయున్నది. ప్రేమయెంత సన్నిహిత సంయోగకారణమైనను, ప్రేమించువ్యక్తియుఁ బ్రేమపాత్రుఁడైన వ్యక్తియు వేరుగా నుండకతీరదు. విజ్ఞానమునందు

(౧) ౭.౧౦. (౨) ౧౦. ౨౦-౨౫; ౩.౮. (౩) ౭. ౫.

వలెనే భక్తియందువలెనే మనము ద్వైతముతోఁ దృప్తిపొంద వలెను. కాని, ద్వైతము నధిగమించు నద్వైతము దీనిఁ కంటెఁ గ్రిందిమెట్టని వర్ణించుట సమంజసముకాదు. పరిపూర్ణా నంద సౌందర్యమూర్తియగు నొకసగుణదైవము భక్తిమార్గ మున కవసరము. మనమనః ప్రతిబింబమును మన మారాధింపఁ జాలము. వ్యక్తిత్వమనఁగా మిత్రిత్వమునకు, లేక సాంగత్య సంయోగముల కనువగు నొక మూర్తి కావలెను. సాకారుల మైన మనకు సాయపడుసాకారమూర్తి యుండవలెను. అందు చే, నే దేవునియందు మనప్రేమాన్విత హృదయము ప్రవేశిం చునో, యట్టివాఁడు, రక్తపాతమును విలాసముగఁగొని వినో దించు నాతఁడుగాని, దుఃఖభారములను వహింపఁజాలక మొఱ వెట్టు దీనుల యార్తనాదములను వినకుండ, సుఖసుషుప్తిగాంచు నాతఁడుకాని కాఁజాలఁడు. ప్రేమయే దేవుఁడు. ౪. ఎవఁడు తన సర్వస్వమును దేవునకర్పించి, దేవుని పాదపద్మములఁ బట్టుకొ నునో, యాతని కీశ్వరనివాసద్వారములు తెఱువఁబడి యుం డును. దైవవాణి యిట్లు పలికినది; "నాభక్తున కెన్నఁడును నాశ నములేదని నేను ప్రతిజ్ఞ చేయుచున్నాను."౫.

ఇచ్చిపుచ్చుకొను కఠినసూత్రముచే దేవుఁడు లోకము నకు బద్ధుఁడుకాలేదు. కర్మఫలితములు దైవభక్తిచే నశించిపో వును. ఇది కర్మసూత్రోల్లంఘనము కాదు; ఏలన దైవభక్తియను కర్మకును ఫలితముండవలెను. కృష్ణుఁడిట్లు వచించినాఁడు; "దుష్ప్రవర్తనముగల పాపియైనను, ననన్యభక్తితో నన్నుపాసిం

(౪) శరణాగతవత్సలః (౫) ౯.౩౧.

చినయెడల,నాతని నేను శాపమునుండి విముక్తునొనర్తును". ఏలన నాతఁడు నిశ్చయసంకల్పముతో దైవోన్ముఖుఁడై, ధర్మతత్పరుఁడైనాఁడు. దేవుఁడు స్వయముగా నెవనిపుణ్యాపాపములను భరిం పఁడు. ౧. కాని ప్రతికర్మయు దానికుచితమైన ఫలితమునిచ్చు రీతినే యాతఁడు జగద్ధర్మనిర్మాణము చేసినాఁడు. ఒకవిధముగా భగవానుఁడేఁ 'అందరు చేయుయజ్ఞములను, దపములను' సంతోషముతో స్వీకరించును. "నాకిష్టులు, ననిష్టులు నెవరును లేరు." "నాభక్తులు నాకుఁ బ్రియులు"౨. మున్నగు వాక్యముల లోని పరస్పరవిరుద్ధభావముల నీరీతిని సమన్వయించు కొనవలెను.

'మూగవాఁడు తానునుభవించు రుచినిఁ జెప్పఁజాలనట్లే భక్తియొక్క-స్వభావమును వర్ణించుట సాధ్యముకాదు. ౩. కాని యీ భక్త్యావేశముయొక్క- ప్రధానలక్షణములను గొన్నిటిని మనము చెప్పవచ్చును. సర్వాంగపరిపూర్ణమైన యొకవస్తు వారాధింపఁబడుచున్నది. లక్ష్యము పరిపూర్ణతకావున, నపరిపూర్ణమైన దేదియు నారాధ్యము కాదు. నారదుఁడు తనభక్తి సూత్రములలో మానవప్రేమకు సామ్యమునుజెప్పి, సామాన్య మానవుఁడుకూడఁ దన ప్రేమపరిణామములోఁ దన్నే తానతిక్రమించి, యొకలక్ష్యమును జేరయత్నించును. లక్ష్యమే తన స్వరూపము నాచరణమందుఁ బ్రదర్శించును. భక్తికి లక్ష్యమైన యాతఁడు పురుషోత్తముఁడు. ఆతఁడు సర్వాత్మాంతర

(౧) ౯ అ. ౫-౧౫ (౨) ౯-౨౯-౧౨. ౧౪-౨౦, ౧౬-౧౬
(3) నారదభక్తిసూత్రములు ౫౧-౫౨ (౪) నా. భ. సూ. ౨౩

జ్యోతియు, సర్వసృష్టికాధారమగు చైతన్యకాంతియు నై యున్నాఁడు. కృత్రిమదృష్టికి సత్యములుగాగోచరించు పంచభూత లక్షణములుగాని, మీమాంసకులు తలంచురీతిని యజ్ఞభోక్త కాని దేవుఁడుకాఁడు. ప్రకృతిశక్తులకు మానవుఁడుకల్పించిన మూర్తిస్వరూపుఁడు నాతఁడు గాఁడు. ఆతఁడు సాంఖ్యపురుషుఁడును గాఁడు. ఇవన్నియు నాతఁడేకాని, వీనికంటె నతీతుఁడు (౫) దేవుఁడెట్లు సర్వజీవాంతర్వర్తియై యున్నాఁడో గీతాగ్రంథకర్త విశదముగా నుద్ఘాటించి యున్నాఁడు. పరమేశ్వరుఁడు జీవాత్మకు విజాతీయుఁడైనచో, నాతఁడారాధింపఁదగినవాఁడు కాఁజాలఁడు; జీవాత్మకు దేవునకు భేదము లేశమాత్రమును లేకున్నచో నప్పుడారాధనమే యవసరము లేదు. దేవుఁడు కొన్ని జీవలక్షములుకలిగి, కొన్ని విశేషలక్షణములను కలిగియున్నాఁడు. కాంక్షింపఁదగిన సర్వైశ్వర్యనిధానమైన ప్రకృతి లేక లక్ష్మీనాథుఁడైన పరమేశ్వరుఁడాతఁడు. ఆతనితోడి సంయోగావకాశమును, ప్రమోదభరితమైన దృష్టినొసఁగును. "నీ మనస్సును నాయందు లగ్నమొనర్పుము; నీబుద్ధిని నాయందుఁ జొప్పింపుము; అట్లు చేయుటచే నీవు నాతోఁగలిసి, యూపైని జీవింపఁగలవు." (౧) ఇట్టి పరమోత్కృష్టమైన ప్రేమకుఁ దదితరప్రేమరూపములన్నియు న్యూనములైనవి. వానిలోనున్న నిత్యదైవలక్షణము వలన నితరవస్తువులు మనకుఁ బ్రియములగుచున్నవి. భక్తుఁడత్యంత వినయపరిపూర్ణుఁడు. తానర్చించు దేవునియెదుటఁ

(౫) ౮-౪

(౧) ౭, ౮.

దానజాలమాత్రుఁడనని యాతఁడు తలఁచును. అట్టి సంపూర్ణమైన ఆత్మసమర్పణము నిజమైనభక్తికి ముఖ్యలక్షణము, దేవుఁడు వినమ్రతను గోరును. ౨. దైవకటాక్షములేని తనబ్రతుకు వ్యర్థమని భక్తుఁడు నమ్మును. ఆతనిభక్తి దేవునియందుఁ బ్రీతిగనో, దైవసందర్శనములేని దుఃఖమునుదెల్పు విరహముగనో పరిణమించును. తా నారాధించుచున్న దైవముయొక్క అనుగ్రహము నందలివిలువను గుర్తించుభక్తుఁడు తనజీవితమును తృణప్రాయముగాఁజూచుటలో నాశ్చర్యములేదు. దైవానుగ్రహముపై నాతఁడు పూర్తిగా నాధారపడును. సంపూర్ణసమర్పణమే దీనికి మార్గము. "నీ మనస్సును నాయందు లగ్నమొనర్పుము. నాభక్తుఁడవు కమ్ము; నా పాదపద్మముల నాశ్రయింపుము; అపుడు నీవు నాయందుఁ జేరఁగలవు. నీవు నాకుఁ బ్రియతముఁడవని నేను ప్రతిజ్ఞచేయుచున్నాను. సర్వధర్మములను బరిత్యజించి, నన్నే శరణుపొందుము; దుఃఖింపకుము; నిన్ను సర్వపాపములనుండి విముక్తునిఁజేయుదును." 3. మనను౦డి భగవానుఁ డేకాగ్రభక్తినిఁ గోరును. మన జ్ఞానాజ్ఞానములను మనయల్పత్వముల నాతఁడు తొలఁగించి, మన జీవితములనాతఁడు దివ్యతేజోమయములుగను, లోకకల్యాణప్రదములగుటకు వలయు పావనమూర్తులుగను మార్చెదనని, యభయహస్త మిచ్చినాఁడు. మఱియుఁ బరమేశ్వరునిసేవ నెల్లప్పుడు చేయు కోరికయుండును. భక్తుఁడు, తనకత్యంతప్రియుఁడగు దేవునే దర్శింపఁగోరును; మాటాడఁగోరును. తలఁపఁ

(౨) నా. భ. సూ. ౨౭ దైవప్రియత్వమ్. (3) ౧౮. ౬౫-౬౬.

గోరును." ౪. ఆతఁ డేకర్మ చేసినను దైవప్రీత్యర్థమే చేయును. ఫలాసక్తి లేని నిష్కామకర్మయే యాతఁడు చేయును. అది భగవంతునికి నిర్విశేషమైన ఆత్మార్పణము. ౫. భక్తుఁడు తాను దైవాధీన సర్వస్వుఁడైనప్పుడది కేవల మందవిశ్వాసావేశము కాదు. అది అకలుషితమైన ప్రత్యక్షసమర్పణము. ఇందు జీవితమంతము మహదావేశపులకితమైనది. ఆతని హృదయమును సంపూర్ణముగా నీశ్వరాధీనమొనర్చినాఁడు; ఆతని కేకోర్కెయును లేదు. దుఃఖమును లేదు; సమాధిగతుఁడై యాతఁ డఖండశాంత్యానందముల ననుభవించును. ౧, దేవుని నమ్మి, ప్రేమించి, యర్చించి, యాతనియందుఁ బ్రవేశించుటయే సద్భక్తియని గీత వచించినది. అట్టిభక్తికి భక్తియే ఫలితము.

సద్భక్తికి ముఖ్యలక్షణము శ్రద్ధ. పరమేశ్వరుని మనము ముందు విశ్వసింపవలెను; తరువాతఁ గ్రమముగా భక్తుని మానసకాసారమునఁ బ్రతిఫలించును. ౨. శ్రద్ధ ముఖ్యమైనదికావునఁ, గొందరు దేవతలనునమ్మినచో నా దేవతలంగీకరింపఁబడిరి. మానవుల అభ్యాసములందు, మనఃప్రవృత్తులందు ననంత భేదములుండుట కవకాశమున్నది కావున, నుపాసనమునందు, భావమునందు వ్యక్తులకు స్వాతంత్ర్యమొసఁగఁబడినది. అసలు లేకుండుటకంటె నేదోయొకవిధమైన ప్రేమయుండుట మంచిది, ఏలన మనము ప్రేమలేనిచో, స్వార్థపరులమగుదుము. పరమేశ్వరుఁడు భిన్నవ్యక్తులకు భిన్నరూపములలో దర్శనమిచ్చును. దేవత

(౪) నా. భ. సూ. ౫౫ (౫) భ.గీ. ౯. ౨౭

(౧) నా. భ. సూ. ౪-౬. మత్తః స్తబ్ధః, ఆత్మారామః (౨) ౪. ౪౦.

లాతని యంశస్వరూపులే. పురుషోత్తమునికంటె నవతారములు న్యూనములని గీతభావము. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, సృష్టి స్థితి లయకారకులు గాకున్నచో, వారును బురుషోత్తముని కంటె నల్పులే. ౩. వైదిక దేవతోపాసన మంగీకరింపఁబడెను.౪. గీత కజ్ఞానులయందుఁగలకృపచే,క్షుద్రదేవతార్చనములు నంగీక రింపఁబడినవి. భక్తితో నే దేవత నర్చించినను, చిత్తశుద్ధిగలిగి, ఉన్నతసత్యము నెఱుఁగు నవకాశము నిచ్చును ౫.

ఇట్టి వివిధభక్తిభావములకుఁ దాత్త్వికాధారములు వివ రింపఁబడకున్నను, సూచింపఁబడినవి. ఎట్లుభావించునో మానవుఁడట్టి వాఁడగును; ఎవఁడు దేనినర్చించునో దానినేపొందును. ప్రపంచము మహోద్దేశ కల్పితమగు ధర్మవ్యవస్థ; అందెవఁడేది కోరునో యదియే యాతనికి లభించును. "దేవవ్రతముగల వారు దేవతలనే పొందుదురు. పితృవ్రతముగలవారు పితృదేవ తలనే పొందుదురు."౬. "ఎవఁడే దేవతనెట్టి భక్తితో నర్చించు నో, ఆతనికట్టి భక్తియూరూపమందు నిశ్చలమగునట్లు నేను జేయుదును. అట్టి భక్తితో నాతఁడు తానర్చించిన దేవతనుండి కాంక్షితార్థములఁ బొందును; నిజమున కాయర్థముల నేనే యిచ్చుచున్నాను."౭. రామానుజుఁడిట్లు చెప్పెను; "తృణ బ్రహ్మపర్యంతము సర్వజీవులు కర్మవలనజన్మమరణముల నొందు చున్నవి. అందుచే నవి ధ్యానయోగములుగావు." నిజముగా సత్యమూర్తియగు పురుషోత్తముఁ డొక్కఁడే పూజ్యుఁడు.

౩. ౧౧. ౩౭. ౪. ౯.౨౩. ౫. ౭. ౨౧-౨౩ ౬. ౯. ౨౫; ౧౭.౩. ౭. ౭. ౨౦-౨౧.

ధ్యానమార్గములన్నియు నుత్తమమైన భక్తికి సోపానములే. దశమాధ్యాయమునందు, విశేషబలకాంతులను బ్రదర్శించు వస్తువులపై మనము మనదృష్టిని గేంద్రీకరించు నభ్యాసముచేయ వలయునని గీతబోధించియున్నది. దీనినే ప్రతీకోపాసనమందురు. ఏకాదశాధ్యాయమునందు, విశ్వమంతయు దేవునిరూపమని చెప్పఁబడినది. ద్వాదశాధ్యాయమున సర్వలోక ప్రభువగు దేవుని వర్ణనమును గాంతుము. సర్వోత్కృష్టుఁడగు దేవుఁడే మనకు ముక్తినీయఁగలఁడు. అన్యదేవతారాధకు లల్పఫలములను, పరమేశ్వరోపాసకులు మోక్షమును బొందుదురు.౨.

భగవంతుని శక్తి జ్ఞానకల్యాణ గుణములను ధ్యానించుట, భక్తి హృదయముతో నాతనిని నిత్యస్మరణచేయుట; భక్తబృందముతో నాతనిగోష్ఠి సలుపుట; తోడిమిత్రులఁగలిసి యాతని సంకీర్తనముచేయుట; సర్వకర్మలీశ్వర సమర్పణబుద్ధితోఁ జేయుట మున్నగునవి భక్తియొక్క భిన్నరూపములు.3. దీనికి నిశ్చితసూత్రము లెవ్వియునులేవు. ఈభిన్నపద్ధతులచే మానవుఁడు దేవుని సామీప్యమును గాంచును. అనేకవిధములగు శిక్షణములు, రూపకల్పనములు మనస్సును దేవునియెడఁద్రిప్పుటకుఁ గల్పింపఁబడినవి. ఇంద్రియ విషయ వాంఛలను మనము పూర్తిగాఁ ద్యజించినఁగాని, పరిశుద్ధ భక్తి సాధ్యముకాదు. అందుచే నొకప్పుడు యోగాభ్యాస మంగీకరింపఁబడెను.౪. మన

---

౨. అంతో బ్రహ్మాదిభక్తానామ్ మద్భక్తానా మనంతతా"......మాధ్వభాష్యము. గీత. ౭.౨౧. 3. నా. భ. సూ. ౧౬-౧౮. ౪. నా. భ సూ. ౪౭-౪౯.

యుత్సాహ మేరూపమునైనఁ బొందవచ్చును. ప్రతీకోపాసనముతో నారంభించి, మనతాపత్రయములను దొలఁగింపుమని ప్రార్థించుటవఱకుఁ బోవచ్చును. సర్వవిషయములను విడిచి, దేవునొక్కనే ధ్యానింపుమని యప్పుడప్పుడు గీతచెప్పును. ఇది వ్యతిరేకమార్గము.[౫] విశ్వమంతయు జగదీశ్వరుని అనంతదివ్యరూపముగాఁ బ్రార్థింపుమని యొకచోటఁగలదు.[౬] అంతరంగమందును, బాహ్యప్రకృతియందునుగూడ మనము దేవునిఁ జూడవలెను; అట్లు చూచి, మనపరివర్తనములో మనలోనున్న దైవత్వము నావిష్కరింపవలెను. భక్తిప్రపత్తు లొకేపద్ధతి యొక్క రెండురూపములు. అనంతరూపుఁడైన దేవు నేరూపములోనైన నేపద్ధతిలోనైన నర్చింపవచ్చును. ఇట్టి సహనశీలము వలననే హిందూమత మనేకారాధనానుభవముల సమన్వయస్వరూపమై, భిన్నమతశాఖావిశ్వాసముల సామరస్యమై, ఒకే సత్యమనంతముఖములు గలదను సూత్రముపై నాధారపడిన ఆత్మసాధన విధానమై ప్రకాశించినది.

భక్తియొక్క మహోచ్చస్థితిలో దైవాస్తిత్వ ప్రసాదములనుగూర్చి మనకు నిశ్చయస్థైర్యము లేర్పడును. అట్టి యనుభవము స్వయంసంతృప్తి హేతువగును; అదిస్వయం ప్రమాణశీలముగలది. తార్కికచర్చలు నిరర్థకములు. దేవునిఁగూర్చి, నిరర్థకవాదములను భక్తుఁడు గణింపఁడు[౧]. ఇదిఉత్కృష్టమైనభక్తి

౫. గీత. ౬. ౧౧. ౫.

(౧) నా. భ. సూ. ౫౮. ౭౫.

దీనిపై నింకొకమెట్టులేదు. ఇదినిరంతర నిర్హేతుకభక్తి.౨. ఇట్టి నిర్హేతుకభక్తుల సంఖ్యయత్యల్పము. దేవునియందు భక్తికిఁ బ్రాధాన్యమిచ్చి, జ్ఞానసంకల్పములను నిరసించు నావేశ మత విధానముల దౌర్బల్యమునకు గీత వశము కాలేదు. దేవునికి భక్తులందఱును బ్రియులేకాని, జ్ఞానియగుభక్తుఁడాతనికిఁ బ్రియతముఁడు.3. మిగిలిన త్రివిధభక్తులును, ఆర్తుఁడు, జిజ్ఞాసువు, అర్థార్థియు తమవాంఛాసిద్ధికై, దేవునిఁబ్రేమించి, అవసరము తీరినవెంటనే మానివేయుదురు; కాని జ్ఞాని, పరిశుద్ధాత్ముఁడై యెల్లప్పుడాతని నర్చించును.౪.అట్టిస్థితిలోని భక్తి లేక తీవ్రప్రేమ జాజ్వల్యమానాగ్నియై,పరిమితోపాధిబంధములను గాల్చి భస్మ మొనర్చును. సత్యమపుడు సాక్షాత్కరించును. ఇట్టి తత్త్వజ్ఞాన హీనమైన గీతామతము కేవల ముద్రేకమతమై, భక్తి కేవల మాదేశోత్సాహప్రదర్శనమై యుండెడిది.

ప్రశాంతమైన ప్రార్థనతో నారంభించినభక్తి, క్రమముగా నీశ్వరసాక్షాత్కార కాంక్షయై, దుదకమోఘమైన యానందప్రేమ రసోన్మాదముగఁ బరిణమించును. ఇందు భక్తుఁడు భగవానుఁడు నేకమగుదురు. "వాసుదేవ స్సర్వమితి" యను వాక్యార్థమాతని యనుభవములో ఋజువగును. ప్రపంచములోఁ దాను వేరైనయొక నిరర్థకవ్యక్తినను భావము నమసి పోయి జగత్కళ్యాణసంధాతయైన భగవానునికిఁ దానొక ప్రతినిధినని గ్రహించును. ౫. మానవజాతిలో మహోత్కృష్టుఁ

(౨) భ. గీ ౭. ౧౭-౧౮; ౮ ౧౪.౨౨ భాగవతము 3అ. ౨౯-౧౨.
(3) ౭. ౧౭. (౪) ౧౮. ౫. (౫) భ. గీ. ౧౮-౪౬; ౭-౧౯; ౮. ౭.

దైనవాని వ్యక్తిత్వ మా దైవస్వరూపములోని యంశమాత్రమే ప్రతిమానవుని నిజమైనస్వరూపము. దేశకాలములం దావి ష్కృతమగుచున్న పరమాత్మయే జ్ఞానభక్తులు పరస్పరాధార భూతములు. ౧. యథార్థమైనభక్తి సచ్ఛీలమున గోచరించును. భక్తుఁడు, సర్వజీవకోటియెడ ననవరతజ్వాలారూపమై ప్రకా శించు పరమకృపాంతరంగముగలిగి, పొంగిపొరలుచున్న తన కృపారసమునకుఁ బ్రతిఫలమపేక్షింపఁడు. అది దేవునిప్రేమ వంటిదే; దేవుఁడు ప్రపంచమును సృజించి, పోషించి, తిరిగి దానినిఁ దన్నుఁజేరున ట్లుద్ధరించుచున్నాఁడు. భక్తుఁడేమియుఁ జేయుఁడు; దైవశక్తియే యాతనిలోనుండి లోకహితార్థము పనిచేయును. తనజీవితమును దేవునికర్పించి, దైవాప్పణబుద్ధి సర్వకర్మలు చేయునాతఁడే ఉత్తమభక్తుఁడు. అట్టిభక్తునియం దుత్తమతత్త్వజ్ఞానమును, పరిపూర్ణపరిణతినందిన మానవశక్తియు నుండును. కొందరుభక్తులు భక్త్యావేశపరవశులై, లోకవ్యవహా రములలో జోక్యముకలిగించుకొనకున్నను, గీతననుసరించి, పరి శుద్ధ భక్తుఁడైనవానియందు భక్తి, జ్ఞానవైరాగ్యతిచేఁ గాంతిమం తమై, మానవకళ్యాణముకొఱకుఁ దాను స్వయముగాఁ గ్లేశ మనుభవింపఁ దీవ్రనిశ్చయములో సంస్థితుఁడగును. తిలక్పండి తుఁడు విష్ణుపురాణమునుండి యీశ్లోకము నుదాహరించెను: "ఎవరు తమకర్తవ్యములను నిర్వహించుటమాని, కృష్ణసన్నిధా ముచేయుచుఁ గూర్చుందురో, వారునిజముగా దైవద్రోహులు,

(౧) నా. భ. సూ. ౬౮-౬౯.

పాపులు. పరమేశ్వరుఁడుకూడ ధర్మసంరక్షణకొఱకు మనుష్యుఁడై జన్మించినాఁడు." ౨.

భక్తియే ఆత్మసాధనలో నుత్తమమైనదని తలఁచువారికి నిర్గుణబ్రహ్మైక్యప్రాప్తి కాక, సగుణసాకారమూర్తియగు పురుషోత్తమునితో నైక్యము లభించును. కాని నిర్గుణభక్తియే సర్వవిధభక్తులలో నుత్తమభక్తియని గీత వక్కాణించినది. అప్పుడు నిర్గుణబ్రహ్మమే పరమప్రమాణమగును. 3. భక్తి, పూర్ణపరిణతి నందినప్పుడు, భక్తుఁడును భగవంతుఁడు నేకబ్రహ్మానందరసమగ్నులై, యొకే జీవితముయొక్క రెండు రూపములుగా గోచరింతురు. ద్వైతముతో నారంభమై పెంపొందిన భక్తిమతమున కద్వైతతత్త్వమే సంపూర్ణతనిచ్చును.

౧౧—కర్మమార్గము

ఈశ్వరసేవ లేక కర్మమార్గమువలనఁ గూడ మనకు మోక్షములభించును. దేనివలన నిర్గుణమైనది సగుణమగునో యది కర్మ యనఁబడును. ౧. కర్మ కారంభకాలము లేదు; ఏవిధానముచే జగత్కర్మ, ఆరంభమై, నడచుచున్నదో తెలియుటకు దురూహ్యమైనది. ౨. జగత్ప్రళయకాలమున సూక్ష్మ కర్మబీజరూపముననుండి, పునస్సృష్టికాలమున నంకురించునని చెప్పఁబడినది. 3 సృష్టిక్రమమంతయు నీశ్వరునిపై నాధారపడియున్నది. కావున, భగవానుఁడే కర్మాధ్యక్షుఁడని చెప్పవచ్చును. ౪

(౨) భ. గీ. ౯. ३०. పోల్చుజాన్ ౨-౯-౧౧. ౪. ౧౫-౨౦

(3) భాగవతము. 3-౨౯; ౭-౧౪

(౧) ౭. ౨౪-౨౯, (౨) ౪.౧౭. (3) ౮. ౧౮-౧౯. (౪) ౭.౨౭

మన కేదోయొకకర్మబాధ్యత యొసఁగఁబడును. మనప్రవర్తనము ధర్మపోషకమగునట్లుగను, నొకేసమయమున నాత్మశాంతియుఁ దృష్టియు నొసఁగునదిగను నుండుటవసరము. సేవానక్తచిత్తుఁడైన మానవుఁడు తరించు ప్రవర్తనావిధానము కర్మమార్గము.

గీతాకాలమున సత్కర్మనుగూర్చి యనేకభావము లున్నవి. యాగాదికకర్మల నుపదేశించిన వైదికసిద్ధాంతము, సత్యాన్వేషణకర్మ నుపదేశించిన యుపనిషద్విధానము, సర్వకర్మలను నిరసించిన బౌద్ధమార్గము, దైవసేవారూపమగు కర్మను బోధించిన ఆస్తికవాదము మున్నగునవి కలవు. వీనియన్నిటినుండియు నొక సమన్వయతత్త్వమును గీత నిర్మించినది.

కర్మవలననే మనకు లోకముతో సంబంధమేర్పడినదను విషయమును గీత గుర్తించినది. మానవజాతియందే ధర్మమర్థవంతమగుచున్నది. జగద్వస్తుజాలమునందు బాధ్యతను గుర్తించినవస్తువు మానవుని ఆత్మయొక్కటే. మానవుఁడాత్మసుఖమును వాంఛించునుగాని, దాని నాతఁడు భౌతికపదార్థములలో గనుఁగొననేరఁడు, మానవుఁడు కోరుసుఖము బహురూపమైనది. విభ్రాంతచిత్తమువలనను, అక్రమాశాకాంక్షల వలనను లభించుసుఖము తమోగుణాధిక్యముగలది; ఇంద్రియములవలని సుఖము రజోగుణాధిక్యముగలది; ఆత్మజ్ఞానసంభవమైనసుఖము సత్త్వసంశుద్ధమైనది. (౧) భగవానుఁడే తనయపారకృపావిశేషముచే ప్రపంచమును నడపుచున్నాఁడనియుఁ, దాను స్వతం

(౧) ౨.౭౧; ౬.౨౨, ౧౫,౨౮; ౧౨, ౧౨; ౧౭. ౬౨; ౧౮-౩౬౩౮

త్రికర్తనుగాననియు విశ్వసించినప్పుడే మానవునకుత్కృష్టానందము లభించును, మానవునియాత్మ సర్వజగద్వ్యస్త్యంతర్వర్తియై యున్న ఆత్మను దర్శించినప్పుడే తృప్తిగాంచును. ౬. మానవునికి బంధవిముక్తి నొసఁగునది, ఆత్మపరిపూర్ణతను జేకూర్చునది సత్కర్మయనఁబడును.

దేవునితో, మానవకోటితో, ప్రకృతితో యథార్థమైన యేకత్వమును బ్రదర్శించునదే సక్రమప్రవర్తనము; ఇట్టి ప్రధానమైన లక్షణము లోపించుటయే దుష్ప్రవర్తనము, జగము యొక్క ఏకత్వము మూలసూత్రము, పరిపూర్ణతను సమీపింపఁజేయునదే మంచిది; తద్విరుద్ధమైనదెల్ల చెడ్డదే. బౌద్ధగీతా మతముల కిదియే ముఖ్యమైనభేదము, ఉత్తమజీవితమునకు ధర్మమునే బౌద్ధమతము కేంద్రముగాఁ జేసినదికాని,ధర్మశీలమునకు, నాత్మసిద్ధికిఁగాని,జగత్కల్పనోద్దేశమునకుఁగాని గల సంబంధము నుగ్గడింపలేదు. మనకృషిలో మనము సిద్ధిగాంచమన్నను, ప్రధానమైన దేవుని మహోద్దేశము చెడదని గీత వచించినది. సర్వాంతర్యామియైన ఆత్మ, బాహ్యదోషములెన్ని గోచరించినను, తన స్వచ్ఛతను గోల్పోవఁజాలదు. దేవుని సంకల్పము నెఱిఁగి, తన కర్తృత్వమునందు లయమొనర్చిన కొలఁదియు మానవుఁడు తన పరమార్థమును సాధించును.

పరిచ్ఛిన్నులగు జీవులందరును, దా మవిభక్తమగు నొక శక్తికిఁజెందిన వారమని యెఱిఁగి, సర్వజీవక్షేమము కొఱకై ప్రవర్తింపవలెను. తాను సర్వస్వతంత్రుఁడ ననుభావమును, దాను

(౬) ప్లేటో రిపబ్లిక్ ౯.

జీవానేకత్వముచే బద్ధుఁడనను భావమును మానవుఁడు త్యజింప వలెను. లోకసంగ్రహమే నిజమగులక్ష్యము. సృష్టిశక్తియే లోకమునందుఁ బనిచేయును. సత్పురుషుఁడైనవాఁడు, దానికి సహకారియై, విశ్వక్షేమంకర ప్రవర్తనమును జూపవలెను. ౧. జీవుల స్వతంత్రవ్యక్తిత్వమును గీత నిరసించినది. అత్యుత్తము లైన వారత్యున్నతభారములను వహింపవలసినవారే పరిచ్ఛిన్న జీవుల ప్రయత్నములు, దోషపూరితములగుటచే శుద్ధిఁగో రును. పాపములను, నధర్మములను నిర్మూలించుటకు మన ము పేక్షచూపరాదు. యశోవాంఛతోఁగాని, రాజ్యలోభముచేఁ గాని, కాక, ధర్మరక్షణ పరత్వముతో యుద్ధము చేయుమని కృష్ణుఁ డర్జునున కుపదేశించినాఁడు. కాని మన మధర్మ నాశనము నకై పోరాడునపుడు, దుఃఖవ్యాకులత్వములకుఁ గారణభూతము లగు రాగద్వేషములు విడిచి, జ్ఞానులమై, సర్వజీవదయాభావ ముతో యుద్ధమొనర్పవలెను. ౧.

ఇంద్రియనిగ్రహము సత్పురుషలక్షణము. కామము

... నిగ్రహింపని యింద్రియ ములకు స్వేచ్ఛ నిచ్చినచో, దేహాంతర్వర్తియైన యాత్మను బానిసగా నొనర్చును. ౨. కర్మఫలకాంక్ష లేని నిశ్చలచిత్తమును సమత్వము నలవఱచుకొమ్మని గీత యుపదేశించినది. ౩. ఇదియే నిజమైనసన్న్యాసము. అజ్ఞానముచేఁ జేయు కర్మత్యాగము

(౧) ౫.౨౫; ౧౨.౪.

(౧) ౧౧. ౫౫ (౨) ౬. ౪౬; ౮. ౨౭. (౩) ౬. ౪౬: ౮. ౨౭

తామసికత్యాగము. శరీరక్లేశాది భీతివలనఁ జేయు కర్మత్యాగము రాజసికత్యాగము. అసక్తచిత్తముతో, ఫలితములవలన భయములేని చిత్తముతోఁ జేసిన కర్మ, సత్త్వసంపన్నమై ఉత్తమ కర్మయగును. ౪.

కర్మవిషయములో సరియగు గీతాభావమును మనము గ్రహింపవలెను. సన్న్యాసిధర్మము నది యంగీకరింపదు. బౌద్ధుల కర్మనిరసనసిద్ధాంతమును గీత అర్థవంత మొనర్చెను. కర్మత్యాగ మనఁగాఁ గర్మఫలత్యాగము, కర్మస్వభావమును శోధించి, బాహ్యకర్మస్వరూపమునకు వెనుకనున్న మానసికసంస్కారములను వేఱుపఱచి, స్వార్థనివృత్తిచే వానిని గ్రహింపుమని గీత బోధించినది. ౫. కర్మమానుట లేక నైష్కర్మ్యము నిజమైన ధర్మసూత్రము కాదు; నిష్కామకర్మ చేయుటే కర్మయోగము. ౬. నరకద్వారములైన కామక్రోధాసూయల నిగ్రహింపవలెను. ౭. కామములన్నియు దోషములుగావు. ధర్మాచరణకాంక్ష దైవప్రీతికరము. ౮. కామముల నున్మూలించుట కాక వానిని శుద్ధిచేయుటే గీతోద్దేశము. అన్నమయప్రాణమయ కోశములనుశుద్ధిచేసి మనోమయ విజ్ఞానమయకోశములను నిర్మాణ మొనర్పవలెను. అప్పుడు మనలో నాత్మస్వభావము సంతృప్తిఁ గాంచును. ౯. కర్మస్వాతంత్ర్యమనఁగా కర్మమానుట కాదు.

(౪) ౧౭.౭-౯, ౧౧-౧౨. (౫) ౧౮. ౧౮ (౬) ౫.౧౧; ౧౮.౪౯
(౭) ౨. ౬౨-౬౩; ౧౬. ౨౧. (౮) ౭. ౧౧.
(౯) ప్రాణమునకుఁ బుష్టి; విజ్ఞానమునకుఁ దుష్టి, ఆత్మకు శాంతి లభించును.

"దేహధారు లొకక్షణమైనను కర్మచేయకుండ నుండఁ జాలరు. ౧.

"నేత్రము చూడకుండ నుండఁజాలదు;
వినవలదని శ్రోత్రము నాజ్ఞాపింపఁజాలము;
మనకిష్టమున్నను లేకున్నను, మన దేహము
లకు స్పృశించులక్షణము పోదు." ౨.

మనకు భూమిపై విశ్రాంతియెన్నఁడును లేదు; నిత్య క్రియాత్మకమే జీవితము. కర్మయే జగచ్చక్రమును నడపు చున్నది; ప్రతిజీవియునందుఁ దనశక్తి ననుసరించి పాల్గొనక తప్పదు. 3. గీతబయలు దేరిన ప్రకరణమంతయుఁ గర్మోపదేశ మునే సూచించును. మనకు మోక్షములభించుసందాక కర్మ తప్పదు. మనము మోక్షముకొఱకుఁ గర్మచేయవలెను; మోక్షముపొందిన వెనుక, మనమీశ్వరకర్మయందుఁ బాల్గొన వలెను. అప్పుడు, చిత్తశుద్ధి, శిక్షణములకవసరములగు కర్మలు చేయనక్కఱలేదు. సిద్ధపురుషులకు విధినిషేధములు లేవు; వారి విలాసముననుసరించి వారు ప్రవర్తింతురు; కాని ముఖ్యవిషయ మేమనగా వారేదోయొక కర్మచేయుదురు. ౪.

కర్మ యెట్లుచేసిన బంధింపదో యట్టికర్మచేయుమని గీతోపదేశము. లోకసంగ్రహార్థము పరమేశ్వరుఁడును కర్మ చేయుచున్నాఁడు. నిర్గుణబ్రహ్మ భావముననుసరించి, భగవా

(౧) ౧౮-౧౧ (౨) చక్షుస్సర్వేన్ద్రియా ? (3) 3, ౧౦, ౧౬.
(౪) బృహదారణ్యకోపనిషత్తు. ౬. ౪. ౨౨; శంకరగీతాభాష్యము. 3. 3౨.

నుఁడు స్వయంసంపూర్ణుఁడు. నందుచే వాంఛాతీతుఁడు; కాని ప్రపంచక్రమమునాతఁడు నడపుచుండకతప్పదు. అట్లే యర్జునుఁడును యుద్ధరూపకమైన కర్మ చేయకతప్పదు. ముక్తపురుషులైనను దమవలెనే యితరులు ముక్తిఁగాంచుటకు సాయపడవలెను. మానవసేవయే భగవత్సేవ. ౫. లోకహితార్థమును, దైవప్రీత్యర్థమును స్వార్థరహితుఁడై, ఎవఁడు నిష్కామకర్మ చేయునో యాతనిని గర్మ బంధింపదు. "కర్మసంఘము లేని యున్నతజ్ఞానపీఠమునందున్న నన్నును గర్మలు బంధింపవు. ౬. సన్న్యాసత్యాగములకు భేదమును గీత యిట్లుచెప్పినది: "కామ్యకర్మలు విసర్జించుట సన్న్యాసము; సర్వకర్మఫలత్యాగము త్యాగము."౭ సన్న్యాసముకంటె త్యాగము శ్రేష్ఠతరము మన నిత్యజీవితవ్యాపారమును మానుకొమ్మని గీత చెప్పలేదు; స్వార్థకాంక్షలనణఁచివేయుమనియే బోధించినది. ప్రవృత్తి నివృత్తి సమన్వయమార్గమునే గీత పోషించినది. కేవల నివృత్తి సన్న్యాసము కాఁజాలదు. హస్తములు బనిచేయకుండవచ్చునుగాని, మనస్సులోని కాంక్షలు కలఁతపెట్టుచునేయుండును. బంధించునది కర్మ కాదు; కర్మోద్దేశము. "కర్మనువిడిచిన అజ్ఞానులు నిజముగాఁ గర్మచేయుచునేయున్నారు; జ్ఞానిచేయుకర్మ నిజముగా నకర్మయే."౮. అంతరంగమున జ్ఞానము, బాహ్యమునఁ గర్మప్రవృత్తియు నన్యోన్యవిరుద్ధములుగావు. గీత ఉపనిషద్భా

(౫) ౧౮. ౪౬. (౬) ౯. ౯; ౪. ౧౩-౧౪ (౭) ౧౮-౨

(౮) అష్టావక్రగీత. ౧౮. ౬౧

వముతో నీ రెంటిని సమన్వయించినది. గీతచెప్పునది నైపుణ్యము-గల కర్మ. "యోగః కర్మ సుకౌశలమ్." ౨.

మనము బాహ్యశాసనములకులోఁగి కాక, అంతర్వాణీనినాదాజ్ఞననుసరించి కర్మ చేయవలెను. ఇదియే ఉత్తమ కర్మ. ఆరిస్టోటలిట్లుపలికినాఁడు; "స్వీయాంతరంగ నిశ్చయము ననుసరించి కర్మచేయు నాతఁ డుత్తముఁడు; ఇతరులుచెప్పిన గ్రహించి చేయువాఁడు మధ్యముఁడు." 3. సంస్కారములేనివారికి శాస్త్రములే ప్రమాణములు. వేదములుచెప్పు విధులు బాహ్యములే; ఆత్మజ్ఞానముచే నుత్తీర్ణులమైనప్పుడు మన మంతస్సాక్షి ననుసరించి కర్మచేయునపుడు, వేదవిధి మనకు వర్తింపదు.

పరిశుద్ధమైన యుద్దేశముతో మనము సర్వకర్మలను జేయవలెను. స్వార్థపరత్వముయొక్క సూక్ష్మతర ఛాయలను మనమునుండి తొలగించి, యిష్టానిష్టకర్మలను మమకారమును త్యజించి, కీర్త్యభినందన కాంక్షలను నిర్మూలింపవలెను. మనము జ్ఞానమునపేక్షించుచో నిట్టి సత్కర్మచేఁ జిత్తశుద్ధిని సాధింపవలెను. స్వార్థపరుఁడు నహంకారమూఢుఁడునగు నాతఁడు, తానే లోకమునకుఁ బ్రభువనితలఁచి, యింద్రియవిషయలోలుఁడై పరిభ్రమించు రాక్షసుఁడై, నాస్తికవాదమే తత్త్వార్థముగను, నింద్రియసుఖమే ధర్మముగను నిర్ణయించును. ౪.

(౨) ౨.౫౦, ౪౯; 3. 3; ౪. ౪౨;౬. 33, ౪౬ (3) ధర్మ
ప్రము. ౧౮. ౪.౭ (౪) ౧౬. ౯,౪౨

గీతాధర్మమునందు, గుణత్రయసిద్ధాంతమున కున్నతస్థానము చూపఁబడినది. ౧. గుణములకు మానవుఁడు బద్ధుఁడగుటచేఁ బరిచ్ఛిన్నత్వము కలిగినది. మానసికములైన బంధముల నాత్మకంటగట్టుట తటస్థించినది. సత్త్వసంశుద్ధమైన దుత్తమకర్మయని చెప్పినను, నదియు బంధించును; ఏలన, నుత్తమకాంక్ష సాత్త్వికాహంకారము నుద్భవింపఁజేయును. మోక్షప్రాప్తి కన్నిరకముల యహంకారములును నశింపవలెను. ఎంత సాత్త్వికమైనదైన నహంకారమవరోధమై, ఆత్మను జ్ఞానానందములకు బంధించును. సర్వగుణముల కతీతుఁడై, నిర్గుణబ్రహ్మస్థితి నార్జించుటే, మానవుని కుత్తమస్థితి. ౨.

వైదికయజ్ఞ కర్మభావమును మార్చి, ఉత్తమజ్ఞానముతో గీత సమన్వయించినది. 3. ద్రవ్యయజ్ఞ మాత్మశుద్ధినే సూచించును. యజ్ఞము లాత్మనిగ్రహమును, ఆత్మార్పణమును నేర్పు ప్రయత్నములే. ఇంద్రియసుఖ కాంక్షలను త్యాగముచేయుటే నిజమైన యజ్ఞము, మన మెవని నుద్దేశించి యజ్ఞములు చేయుచున్నామో, యాతఁడు పరమేశ్వరుఁడైన యజ్ఞపురుషుఁడు. ౪. ఈలోకములోని సర్వవస్తువులును, పురుషార్థసాధనము నిమిత్త మీశ్వరుఁడు నిర్మించెనని యెఱిఁగి, యీశ్వరార్పణ బుద్ధితో సర్వకర్మలను జేయవలెను. మనము భుజించినను, త్రాగినను, మనమేమిచేసినను సర్వేశ్వరార్పితముగాఁ జేయవలెను. యోగి దేవునియందుండి పనిచేయును; కావున నాతఁడే మనకను సరణీయుఁడైన కర్మయోగి ౫.

(౧) ౧౪.౫ (౨) ౧౭.౨౩. (3) ౧౪.౧౯. (౪) ౪.౨౪,౨౮ (౫) ౪.౩౩

మానవపరివర్తనమును శిక్షించు కొన్ని సామాన్యధర్మసూత్రములను గీత ప్రవచించినది. కొన్ని వాక్యములలో మధ్యేమార్గ ముపదేశించినది. ౧. గీత వర్ణాశ్రమధర్మముల నంగీకరించినది. హీనస్థితిలోనున్న వారొక్కసారిగా నుత్తమస్థితిని బొందఁజాలరు. జీవితాభ్యాసములు పరివర్తనమందుటకుఁ జాల కాలము పట్టును; జన్మాంతరములు కూడఁబట్టవచ్చును. ఊర్ధ్వగమనమున కవసరమగు చతురాశ్రమముల కనుగుణముగాఁ జతుర్వర్ణవిభాగమును గీత చేసినది. వర్ణము గుణప్రధానమని చెప్పి, యేవర్ణమునకుఁ జెందినవ్యక్తి తానావర్ణధర్మము నాచరింపవలెనని బోధించినది ౨. స్వధర్మమనగాఁ దనవర్ణమున కనుగుణమైన ధర్మము. నియత ధర్మాచరణమే యీశ్వరారాధనము. ౩. సమాజక్షేమమునకై, ప్రతిమానవుఁడు కొంత కర్మనుచేయుట దైవోద్దిష్టము. వర్ణాశ్రమధర్మ సంకలితమైన జాతి యీశ్వరకల్పితమని గీత నిర్ణయించినది. ప్లేటో యిట్టిభావనమునే సమర్థించినాఁడు. "జగత్పరిపాలకుఁడైన యీశ్వరుఁడు సర్వవస్తువులను, సర్వజీవసంరక్షణమునకును, సర్వజీవోద్ధరణమునకును గల్పించినాఁడు. ఇందుఁ బ్రతిజీవికి సముచితమైన కర్మయుఁ గామమునున్నది...ప్రతివైద్యుఁడు, ప్రతినిపుణ కళాకోవిదుఁడు, సర్వజీవసుఖము నిమిత్తమై తనతన పనిఁ జేయుచున్నాఁడు. వ్యష్టి,సమష్టిక్షేమము కొఱకై పనిచేయవలయునే

(౬) ౩.౨౧ (౭) ౬.౧౬, ౧౭.

(౧) ౪ ౧౩ (౨) ౨.౩౧. (౩) ౧౮. ౪౬-౪౭.

కాని, వ్యష్టికొఱకు సమష్టిపనిచేయదు" ౪. ఆరంభములోఁ గుణప్రాధాన్యమైనను, దరువాతఁ గ్రమముగా వర్ణము జన్మప్రాధాన్యమైనది. ఎవనికెట్టి గుణములున్నవో నిర్ణయించుట సుసాధ్యముకాదు. దీనిని నిర్ణయించుటకు జన్మమొక్కటే సాధనము. జన్మగుణ మిశ్రమముచే, వర్ణముయొక్క పరమార్థభావము నశించినది. ఒకవర్ణములో జనించిన వారి కాలక్షణములే యెల్లప్పు డుండుననుట కవకాశములేదు. వర్ణవిభాగతత్త్వమునకును, వ్యవహార సత్యమునకును, భేదముండుటచేఁ గ్రమముగా వర్ణవ్యవస్థశిథిలము కాఁజొచ్చినది. నేఁటి మన విజ్ఞానము ననుసరించి, వర్ణవ్యవస్థను నిరసించుట సులభమేకాని, పరస్పర సహాకార సద్భావములతోఁ గూడిన యొకసంఘమును నిర్మించి, యందు ద్వేషస్వార్థలకవకాశము లేకుండఁజేయుటకై చేయఁబడిన యత్నము వంద్యమైనదనుటకు సందియములేదు. ధనమునకుఁ బ్రాధాన్య మొసగక, వర్ణవ్యవస్థ జ్ఞానమునకుఁ బ్రాధాన్యమిచ్చినది. ఈనిర్ణయము పూజ్యమైనదే.

ఆశ్రమ చతుష్టయములో నాల్గవది సన్న్యాసము. ఇందు మానవుఁడు జీవిత వ్యాపారమునుండి విరతిపొంద నాహ్వానింపఁబడినాఁడు. ౫. వార్ధకమునందు, దేహముకృశించి కర్మ చేయుటకు సామర్థ్యము తగ్గిపోయినపు డీయాశ్రమము స్వీకరింపఁదగినదని కొన్నితావులఁ జెప్పఁబడినది. ౬. స్వార్థవాంఛలను

(౪) ధర్మములు ౧౦.అ.౯౦౩. బి. జోవెటల్ వెర్షన్ ౨.౪౪.౩.౨౪౧.౧౫:
(౫) మనువు ౬అ. ౩౩-౩౭ మహాభారతము, శాంతిపర్వము.
(౬) మనువు. ౬అ. ౨; మహాభారతము. ఉద్యోగపర్వము. ౩౬,౩౯

విడిచిపెట్టుటే నిజమగుసన్న్యాసము; ఈపని గృహస్థులును జేయవచ్చును. ౨. సన్న్యసింపనిదే మోక్షములేదను భావమును గీత యుపదేశించినదని చెప్పుట సత్యముగాదు. గీతచెప్పిన పద్ధతిలోఁ జేసినకర్మవలన జ్ఞానముసిద్ధించును. ౩. అహంభావము తొలగి, యీశ్వరకర్తృత్వభావము పెంపొందును. మనసంకల్పమును మనమనుసరించినచో నీ సిద్ధాంతము బోధపడును. ఈ యవస్థలోఁ బూర్ణదైవభక్తియునుండును. కర్మమార్గమందీవిధముగా భక్తిజ్ఞానసంకల్పములు మూడునుగలవు.

మనము పేర్కొనిన భావములననుసరించి, సేవా మార్గమున మోక్షప్రాప్తియున్నది; కాని పూర్వమీమాంసార్థములోఁ గర్మకాదు వైదికయాగనిర్వాహణము మోక్షము నీయదు. అవి సాధనమాత్రములే. ఉన్నతజ్ఞానమునకు యజ్ఞములు సోపానములు. కాని దైవార్పణబుద్ధితోడను, స్వార్థరహితముగను నిష్కామముగను చేసినకర్మ, స్వతంత్రముగా మోక్షమునీయఁగలదు; దీనినిజ్ఞానాంగముగా శంకరుఁడు పరిశీలించుటయు, భక్త్యంగముగ రామానుజుఁడు పల్కుటయు ననుచితమే. వారిసిద్ధాంతములను సమర్థించుకొనుటకే, శంకర రామానుజాదులు, కర్మమార్గము గన్యాతరమార్గమని యర్జునున కుపదేశించుటలో, నాతనిని రణోన్ముఖునిచేయుటకై కృష్ణుఁడు ప్రియసంభాషణచేసెనేకాని, కృష్ణునియుద్దేశ మదికాదని వాదించిరి. ౪. కృష్ణుఁడసత్యబోధనముచే నర్జునునిచే యుద్ధము

(౨) భ. గీ. ౫అ. ౩. (౩) ౪అ. (౪) శంకరగీతాభాష్యము. ౩౬, ౩౮, ౬, ౧-౨; ౧౮.౧౧; రామానుజగీతాభాష్యము. ౫. ౧; ౩. ౧.

చేయింపఁబూనెనని మే మంగీకరింపఁజాలము. చిత్తశుద్ధికై కర్మచేయువలయు నజ్ఞానమునందు నర్జునుఁడు లేఁడు. జనకుఁడు మున్నగువారు, జ్ఞానలోపముచేఁ గర్మలోపములను జేసినవారని యు మేము భావింపఁజాలము. మోక్షసిద్ధ్యనంతరము కర్మ కవకాశము లేదనితలఁచుటకును సాధ్యముకాదు. జ్ఞానాగ్నిచే స్వార్థకాంక్షలను గాల్చి, కర్మచేయుటే శ్రేష్ఠమను మతము తనకుబోధింపఁబడినదని జనకుఁడు చెప్పినాఁడు. జ్ఞానసిద్ధికలిగిన తరువాతఁగూడ దేహపోషణావసర కర్మలు మిగిలియుండునని శంకరుఁడు నంగీకరించినాఁడు. ౧ కొన్నికర్మ లంగీకరించినపుడు ముక్తపురుషుఁ డెంతకర్మచేయుననునది నిర్ణయింపఁజాలము. ముక్తపురుషుఁడు తిరిగి కర్మచేయుటవలనఁ గర్మబంధమేర్పడు నని భయపడి మానివేసినయెడల యాతనిజ్ఞాన మసంపూర్ణమైనదని చెప్పవలెను. ౨. బ్రహ్మపదార్థమునకుఁ బ్రపంచముతో నిమిత్తములేనట్లే, ఆత్మకు దేహముతో నిమిత్తము లేదని యంగీకరించినను, దేహముకర్మాచరణముచేయుట కాటంకమేమి యున్నది ౩ మానవప్రకృతిలో భిన్నత్వముగలదనియుఁ, గొందఱకు నివృత్తి, కొందఱకుఁ బ్రవృత్తి రుచించును గావున, వారి వారి స్వధర్మములననుసరించి వారు కృషిచేయునగునని యు గీత యంగీకరించినది. ౪.

ఈప్రకరణమును ముగించుటకుఁబూర్వము, మానవునకుఁ గర్మస్వాతంత్ర్యమునుగూర్చి గీతాభావములను దెలిసికొన

(౧) ౩. ౮. (౨) ౧౮. ౭; ౩. ౬. (౩) ౪. ౨౧; ౫. ౧౨.

(౪) మహాభారతము శాంతిపర్వము ౩౩౯–౩౪౦.

వలసియున్నది. పూర్వజన్మ కర్మ, వంశలక్షణము, శిక్షణము, పరిస్థితులు, మానవుని సంకల్పమును నిర్ణయించును. విశ్వమంతయు, నొకవ్యక్తిలోఁ బ్రతిఫలించును. పరోక్షముగాఁ బ్రకృతికల్పించుబంధము దైవశాసనముకాదు. "సర్వవస్తువులును దమ ప్రకృతిననుసరించుచున్నవి. నిగ్రహ మెట్లుసాధ్యమగును?" ౫. సృష్టియను తెర వెనుకనుండి యంత్రకారునివలె దేవుఁడు జీవులందరను బొమ్మలవలె నాడించుచుండఁగా మానవప్రయత్నము వ్యర్థమనితోఁచును. ౬. సంకల్పము ప్రకృతిబద్ధమైనచో మానవున కేస్వాతంత్ర్యమును లేదు. బౌద్ధు లాత్మయే లేదనియుఁ గర్మయే పనిచేయుచున్నదనియుఁ జెప్పుచున్నారు. ప్రకృతి పరీతమైన సంకల్పమున కతీతమగు నాత్మ యొకటున్నదని గీత చెప్పుచున్నది. ప్రకృతి యెట్లుబంధించినను, ధర్మాంగమున సంకల్పమునకు నిర్ణయస్వాతంత్ర్యమున్నది. మానవునకుఁ గర్మస్వతంత్రితగలదని గీత విశ్వసించినది. తాను జేయఁదలఁచిన తత్త్వబోధ పూర్తియైన వెనుక, కృష్ణుఁ డర్జునునితో. "నీ యిచ్చవచ్చినరీతిని జేయు"మని చెప్పెను. ౭. ప్రకృతి కాత్మపై నధికారముగల శక్తి లేదు. ప్రకృతినియమములను మనము పాటించితీరవలెనను నియమము లేదు. మనసంకల్పవికల్పములే ఆత్మవికాసనిరోధకములని చెప్పఁబడెను. ప్రకృతిలో మనము నిరోధింపఁజాలని శక్తులు కొన్నియు, నిరోధింపఁగలవి కొన్ని చంచలప్రసరణములు నున్నవని చెప్పఁబడెను. దృఢ

(౫) ౧౮. ౫౯-౬౦; ౩, ౩౩-౩౬. (౬) ౧౮, ౬౧.

(౭) "యథేచ్ఛసి తథా కురు." ౧౮, ౬౩.

చిత్తులుగానివారినే ప్రకృతి చలింపఁజేయును. విజ్ఞానవిలసితు లగు మానవులు ప్రకృతినియమముల నతిక్రమింపఁగలరు. విజ్ఞానమయమైన సంకల్పముచే వారు సర్వమును నిర్ణయింతురు. పరిశీలనలేని పశుజీవితమును వారు గడపరు; "ఒకరహస్యమైన శక్తివంటిది మానవునిచేఁ బాపముచేయించునదేదియో యున్నదా ?" దీనికి జవాబు, "కామమే యట్లు పాపములను జేయఁ బ్రోత్సహించుచున్నది. కామమే మానవుని భూలోకశత్రువు." ౨. కామమును నిగ్రహించి, జ్ఞానముచే శీలమును దిద్దుకొనుటకు మానవునకవకాశమున్నది. శంకరుఁ డిట్లువ్రాసియున్నాఁడు: "శబ్దాదికములైన యింద్రియవిషయములలో, నొక్కొక్క యింద్రియమున కిష్టపదార్థాసక్తియు, ననిష్టపదార్థవిరక్తియు జనించును. ఈసందర్భములో నెచట మానవుని కర్మాధికారమునకును, శాస్త్రోపదేశమునకును దావున్నదో నేను జెప్పుచున్నాను. శాస్త్రోపదేశము ననుసరింపఁదలచునాతఁడు ప్రప్రథమముననే యిష్టానిష్టములను బరిత్యజింపవలెను." 3. కర్మ యొకదశయే కాని, పరమావధికాదు. కర్మ నైదుభాగములొనర్చి యందదృష్ట మొకభాగమని చెప్పిన గీతావాక్యమువలన నిది స్పష్టమగుచున్నది; అధిష్ఠానము, కర్త, కరణము, చేష్ట, దైవము పంచలక్షణములు ప్రతికర్మకుఁ గలవు. తుదిదైన దైవలక్షణమే, అతి మానుషమైనశక్తియు, సృష్టిలోని సర్వజీవుల కర్మల నుచితరీతినిమార్చి, ఫలితములీయఁ గలదియు నైనది.

---

(౨) 3, 32; ౬,౫-౬ (3) శంకరగీతాభాష్యము. 3-34

## ౧౨— మోక్షము

జ్ఞానభక్తి కర్మమార్గములలో మనము దేనిననుసరించినను, జీవబ్రహ్మైక్యానుసంధానమే అన్నిటికి నేకలక్ష్యమై యున్నది. చిత్తము శుద్ధమై, అహంకారము నశించిన యెడల నాత్మపరమాత్మలతో నైక్యమగును. మనము మానవసేవతో నారంభించినయెడల, గర్మానుభవములందే కాక, ప్రాణిజీవములందుఁగూడ మనము పరమాత్మసాయుజ్యమును బొందుటతో మనయాత్ర పూర్తియగును. భక్తివలన నానందసమాధి లభించి యందు బ్రహ్మైక్యము తటస్థించును. ఏబాటనుబట్టి పోయినను, దుదకీశ్వరదర్శనానుభవసాయుజ్యప్రాప్తి నిశ్చయము, ఇదియే ఉత్తమమైన మతము; ఆత్మజీవితము; లేక పూర్ణజ్ఞానావస్థయని చెప్పవచ్చును.

సిద్ధావస్థలోఁగలుగు ననుభవజ్ఞానము, సిద్ధిలేనివాని జ్ఞానము వేఱు, మోక్షము లేక యీశ్వర సాక్షాత్కారము భక్తిఫలము కాని, కర్మఫలము కాని, యెంత సాన్నిధ్యమునకుఁ దోడ్కొనిపోఁగల్గినను, జ్ఞానముకాని కాఁజాలదని శంకరులు చెప్పినది యథార్థము, అది అనుభవజ్ఞానము లేక ప్రత్యక్షజ్ఞానము. ఇట్టి ప్రత్యక్షానుభవమునకే భిన్నమార్గములు కల్పింపఁబడినవి. సాక్షాత్కారసిద్ధినొసగు భిన్నమార్గములవిలువను గీతసరిగా నిర్ణయింపలేదు. "నన్నుఁదెలిసికొనుటకు యత్నింపుము. నన్ను ధ్యానింపలేకున్నచో యోగము నభ్యసింపుము, ఇట్టియభ్యాసమునకసమర్థుఁడవగుదేని, నీవుచేసిన సర్వకర్మములను నాకర్పించి, నన్ను సేవింపుము. ఇదియు నీవుచేయలేకున్నచో, ఫలాసక్త

ని విడిచి, నీస్వధర్మము నాచరింపుము."౧. మఱియు, "నిరతా-
భ్యాసము కంటె జ్ఞానముత్కృష్టతరమైనది; ధ్యానము జ్ఞానము
కంటె శ్రేష్ఠతరము; ధ్యానముకంటెం గర్మఫలత్యాగము
శ్రేష్ఠతరము; త్యాగముచే శాంతిలభించును."౨. ప్రతిమార్గ
మొకప్పుడు శ్రేష్ఠతరమని చెప్పంబడెను.౩. గీతాకారునభిప్రా
యములో నేమార్గమైనను బనికివచ్చును; ఎవని కేమార్గము
మంచిదో, గీతనిర్ణయింపక, వ్యక్తులకే విడిచిపెట్టెను. "కొందరు
ధ్యానముచేతను, గొందరు తత్త్వవిచారణచేతను, గొందరుకర్మ
చేతను, గొందరు సేవచేతను, మృత్యువును దరింతురు."౪.

మోక్షమే పరమగతి. జ్ఞానము, మోక్షము, మోక్ష
మార్గముకూడ ననునర్థములో వాడంబడినది. జ్ఞానశబ్దమున
కిట్లర్థద్వయమున్నదను సంగతినెఱుంగక కొందరు, జ్ఞానమార్గ
మితర మార్గములకంటె శ్రేష్ఠతరమైనదనియు, సమాధ్యవస్థలో
బ్రహ్మానుభవజ్ఞానమే మిగిలి, భక్తి కర్మ లదృశ్యములనియు
వాదించిరి. ఈవాదనకు సమర్థనీయమగు నాధారము లేదు.

మోక్షమనగాంబరమాత్మతో నైక్యము, దీనికే, ముక్తి,
బ్రాహ్మీస్థితి, నైష్కర్మ్యసిద్ధి, నిస్త్రైగుణ్యపదవి, కైవల్యము,
బ్రహ్మభావము మున్నగు నామములుపయోగింపంబడినవి. ఇట్టి
బ్రహ్మానుభవస్థితిలో సర్వైకత్వభావము కలుగును. "ఆత్మలో
సర్వజీవులు నున్నవి. సర్వజీవులలో నాత్మయున్నది."౧. వైదిక

(౧) ౧౨. ౯-౧౧. (౨) ౧౨. ౧౨.
(౩) ౬.౪౬;౭.౧౬.౭.౧౨. (౪) ౧౩.౨౪-౨౫;౧౮.౪౫-౪౬.
(౧) ౬.౨౯.

కర్మాచరణము, యజ్ఞకలాప నిర్వాహణము, మున్నగు సత్క్రియాజాలమువలన లభించుఫలము మోక్షఫలముతో సరిపోదు.౨.

సిద్ధావస్థలోఁగర్మకెట్టి స్థానమున్నదను విషయములలో భిన్నాభిప్రాయములున్నవి. అట్టి స్థితిప్రజ్ఞావస్థలో జీవుని ప్రత్యేక వ్యక్తిత్వము నిలిచియుండునో లేదో గీతసుస్పష్టముగా వచించి యుండలేదు. గీత, మోక్షావస్థనే, సిద్ధి యనియు, పరాసిద్ధి, పరాంగతి, 'పదమనామయమ్' 'శాంతి' 'శాశ్వతిమ్పదమవ్యయమ్' మున్నగు మాటలతోఁజెప్పెను.౩. ఈనామములవలన నాస్థితిలో వ్యక్తిత్వమున్నదో లేదో స్పష్టముకాలేదు. ముక్తపురుషులకు వ్యవహారప్రపంచవ్యాపారములతో నిమిత్తముండదని చెప్పువాక్యములు కొన్నికలవు. వారికిఁబ్రత్యేకవ్యక్తిత్వమే లేదు గనుక కర్మావకాశమును లేదని చెప్పుదుము. ద్వైతమున్నశూన్యమగుటచేఁగర్మకవకాశమే పోయినది. ముక్తపురుషుఁడు నిర్గుణుఁడు. ఆతఁడు పరమాత్మతో నేకాత్ముఁడగును.౪. ప్రకృతియే కర్మ చేయుచున్నదనియు, బరమాత్మనుఁబ్రకృతి పరిణామకర్మలతో సంబంధము లేదనియు మనము నిశ్చయించినచో నప్పుడు సిద్ధావస్థలో నహంకారముకాని, సంకల్పముకాని వాంఛకాని లేదని చెప్పవచ్చును. సిద్ధావస్థ గుణరూపాతీత మైనదియుఁ, బూర్ణశాంతి స్వాతంత్ర్యములు గలదియునగును. అది కేవలము మృత్యువును జయించునదే కాదు; ఏస్థితియందాత్మ తనను

(౨) ౮.౨౮. (౩) ౧౨.౧౦; ౧౬.౨౩; ౧౪.౧; ౬.౪౫, ౮.౧౩; ౯.౩౨; ౧౬.౨౨-౨౩; ౨.౫౧; ౪.౩౯; ౫.౧౨; ౧౮.౬౨; ౧౮.౫౬.

(౪) ఆత్మబో. ౭.౧౮; ముద్భారంయాతి ౮.౫; ౮.౭.

జన్మమృత్యువులు లేవనియు, బరిణామదశలకతీతమైన, అనంత శాశ్వతబ్రహ్మాత్మభావము లభించినదనియు, నెఱుగునో యీ బ్రాహ్మీస్థితిసిద్ధించును. శంకరుఁ డిట్టి వాక్యములను గైకొని, గీతలోని మోక్షమును సాంఖ్యులకైవల్యావస్థలో సమానమైన దిగాఁబ్రకటించినాఁడు. ముక్తిఁ బొందిన వెనుక మనకింకను దేహము నిలిచియున్నచోఁ, బక్వఫలము యొక్క డోలక రాలిపోవు నట్లు, దేహము పతనమగువఱకుఁబ్రకృతియే దాని యందుఁబని చేయుచుండును. అప్పుడు సిద్ధాత్మ దేహకర్మలతో నెట్టి సంగము లేక యుండును, దేహమున్నంతకాలము, కర్మవ్యాపారముండు నని శంకరుఁడు నంగీకరించెను. ప్రకృతి కల్పితోపకరణములనుండి మనము విడివడఁజాలము. జీవన్ముక్తుఁడు సదేహుఁడై, బాహ్య ప్రపంచ పరిణామముల నెఱిఁగియు నందుఁజిక్కుపడఁడు, కాని ముక్తపురుషుని స్వరూపము పూర్ణదైవస్వరూపముగా మార్పు నొందునను సూచన గీత యిచ్చియుండలేదు. ఆత్మశరీరములు పూర్ణసామ్యములేని భిన్నస్వరూపములు; దేహాభిమాన నాశన ముతో నాత్మ పరిపూర్ణత నందును. ఈభావములో, నిర్గుణ బ్రహ్మావస్థకుఁగర్తృత్వమును మన మాపాదింపఁజాలము; ఏలన, సర్వకర్మ ప్రవృత్తికి హేతుభూతమైన అహంకారము, సగుణ వ్యక్తిత్వము నిచట నశించినది. అహంకార పూర్ణనాశనముతో నభ్యుదయమునకుఁ జరమదశ ప్రాప్తించును. కాని నిర్గుణ బ్రహ్మా వస్థను గూర్చిన మనభావములు పూర్ణములుగావని శంకరుఁడు స్పష్టపఱిచెను. మనుజజ్ఞానదృక్పథము నుండి పూర్ణబ్రహ్మావస్థ ను మనము గ్రహింపఁజాలము, ఈయుద్దేశముతో,జీవానేకత్వ

మును జెప్పుగీతాశ్లోకములు నిర్గుణబ్రహ్మావస్థను వర్ణించునవి కావని యాతఁడు నిశ్చయించెను.

సిద్ధపురుషులకును గర్మావకాశమున్నదని చెప్పుకొన్ని శ్లోకములును గలవు. పూర్ణజ్ఞానులైన మహాత్ములీశ్వరుని వలెనే, తాము ను లోకమునఁ గర్మచేయుదురు. ౧. సిద్ధావస్థం బ్రహ్మమందు లయమగుటకాదు; ప్రత్యేక వ్యక్తిత్వముండును, ముక్తాత్మ, పరమాత్మస్థితుఁడయ్యు, నందేకాంశమాత్రవ్యక్తిత్వమును గలిగియుండును. సర్వసృష్టి వస్తుజాలమందు నిండి యుండినను, పురుషోత్తముఁ డెట్లు కర్మ చేయుచున్నాఁడో, అటులే, ముక్తపురుషులును జేయవలెను. ఉత్తమగతి పురుషోత్తమసాయుజ్యమే.౨. ఈగతిని బొందినవానికిఁ బునర్జన్మము లేదు. వాఁ డీశ్వరసదృశుఁ డగును. ౩. మోక్షమనగా, జీవ శాశ్వత నాశనముకాదు; దేవునిసాన్నిధ్యముననుండి స్వేచ్ఛానందము లనుభవించుస్థితియే "నాభక్తులు నన్నుఁ జేరుదురు"౪. మోక్షమునందుఁగూడ, జ్ఞాని ప్రత్యేకవ్యక్తిత్వమును గలిగి యుండునని గీతాకారు నభిప్రాయము. ఈశ్వరసారూప్యము.౫ కలుగునని చెప్పినగీతావాక్యములు కొన్నియున్నవి. మోక్షము దేవునితో సమానత్వముకాక, సాదృశ్యమే. అమృతత్వమనఁగా దేవునిదివ్యకాంతిలో నుండఁగలుగుట. ముక్తావస్థలో మనము

(౧) ౪, ౧౪-౧౫. (౨) నివర్తన్యని మద్యోగ.
(౩) ౧౮. ౨౧; ౪. ౧౦. మద్భావమాగతాః
(౪) ౭. ౨౩; ౯. ౨౫; ౪. ౯.
(౫) ౧౪. ౨. మమసాధర్మ్యమాగతాః.

వేఱుగానే యుందుము; కాని క్షాళితసర్వకిల్బిషులమై, సర్వసంగ సర్వసంశయబంధ విచ్ఛేదముచేసి, స్వాధీనాత్ములమై, జగత్కల్యాణక్రియాపరతంత్రులమై యుందుము. మన మపుడు నిర్గుణులము కాము; రజస్తమముల నడఁచి, సత్త్వగుణైకదీప్తులమై యుందుము. ౬. రామానుజుఁ డీభావమును సమర్థించి, ముక్తపురుషుఁడు దైవముతో నిత్యయుక్తుఁడై, తనజీవితమునందట్టి మహిమను బ్రదర్శించునని వాదించినాఁడు. అతనిదివ్యతేజమునుండి జ్ఞానము ప్రవహించును; దేవునియందలి భక్తి ప్రేమలలో నాతఁడు నిమగ్నుఁడైపోవును. ఇచట సిద్ధావస్థలో మన ముక్తమము, సంశుద్ధమునైన ప్రకృతిలక్షణములను గలిగియుందుము. మనము దేవునియం దుండి, దేవునియందుఁ బనిచేయుదుము. అనగా, కర్మకేంద్రము, జీవక్షేత్రమునుండి దైవక్షేత్రమునకు మాఱును. దైవశక్తి, సర్వవస్తురూపములు ధరించి, వానిలో స్పందించుచున్నట్లు మనకు గోచరించును. ప్రతిజీవియుఁ దన కేంద్రావధుల నీశ్వరునియందున్నవని యెఱుఁగును. బ్రహ్మానుభవస్థితిలోఁగూడ జీవికిఁ బరిశుద్ధాత్మ వ్యక్తిత్వ మున్నదని రామానుజసిద్ధాంతము.

ముక్తపురుషుఁడు నిర్గుణబ్రహ్మమందు లయమంది, ప్రపంచఘోషాతీతమైన శాంతిని బొందునని యొకభావమును, ఈశ్వరసాన్నిధ్యమును మాత్రమే పొంది, క్షుద్రకాంక్షలచే జనించు దురంతదుఃఖముల కతీతమైన నిత్యసుఖప్రాప్తి గలిగి, శుద్ధాత్మలమై యుందుమని యింకొకభావము నితరేతర విరోధములై

(౬) శాంతరజనమ్. ౬. ౨౭.

యున్నవి. గీత మతగ్రంథమగుటచే సగుణదైవమూర్తిమత్త్వ ము నంగీకరించి పోషించినది; మానవునిలోని యాత్మ, జ్ఞాన శక్తులు, ప్రేమౌదార్యములు పూర్తిగాఁ గలదైన సద్వ్యక్తిసం పుట కర్తవ్యమని యుపదేశించినది. దీనినిబట్టి గీతాతత్త్వము ఉపనిషద్విరుద్ధమని తలఁపరాదు. ఇంచలి విరుద్ధమైన ధోరణి యంశ మును గూర్చి మాత్రమే, నిర్గుణబ్రహ్మమూ సగుణ దైవమూ పరమసత్య మనునది. గీతాతత్త్వచర్చా సందర్భములో గీత, ఉపనిషత్ప్రతిపాదితమైన నిర్గుణనిరాకార బ్రహ్మభావమునకు వ్యతిరేకము గాదనియు, మన మతానుష్ఠానదృక్పథము నను సరించి, నిర్గుణబ్రహ్మమే సగుణమైన పురుషోత్తమ రూపమున గోచరించుననియుఁ జెప్పియున్నాము. పరిమితమైన మానవబుద్ధి కింకొక యుపాయము లేదు. అందుచే, నీరెండు భావములును, నిర్గుణబ్రహ్మమును గూర్చిన బుద్ధి, జ్ఞాన, అనుభవజ్ఞానములచేఁ గల్పితములైన ద్వివిధరూపములని మనము చెప్పుకొనవచ్చును. మన అజ్ఞానదృష్టికి నిర్గుణబ్రహ్మము నిష్క్రియాత్మకమైన లోకసంబంధము లేని యొకతత్త్వముగ నుండి, కర్మ కవకాశము లేనట్లు తోపించును. మానవదృక్పథమునుండి మనము దానిని గ్రహింపవలయు నన్నచో రామానుజుని తత్త్వమే తప్ప గత్యం తరము లేదు. నిర్గుణసగుణ బ్రహ్మైకోక్తి యని చెప్పుటకుగీత, పూర్ణానుభవావస్థలో మాత్రమే యట్టి యేకత్వము గోచరించు ననియు, నది యెట్లో చెప్పుట సాధ్యము కాదనియుఁ జెప్పినది, నిర్గుణబ్రహ్మము వలెనే ముక్తపురుషులు నిర్గుణత్వమునొంది నను, సగుణదైవమువలెనే, ప్రత్యేక వ్యక్తిత్వములను బ్రిద

శ్చెంతురు. ఈవిధముగా గీత, నిరాకారనిర్గుణ శాంతబ్రహ్మ భావమును, సాకారసగుణ క్రియాత్మకశక్తి రూప పురుషోత్త ముని భావమును సమన్వయించినది.

మరణానంతరము ముక్తజీవావస్థ యెట్టిదైనను, దేహావసాన పర్యంతము ముక్తపురుషుఁడేదో కొంతకర్మ చేయవలసి యున్నది. ఈకర్మ ప్రకృతియే చేయునని శంకరాచార్యుఁడును దేవుఁడే చేయునని రామానుజుఁడును జెప్పిరి. కర్తృత్వాహంకార రహితమైనకర్మ నిట్లు రెండువిధములుగాఁ జెప్పిరి. విశృంఖలమైన స్వేచ్ఛతో, నంతరంగమున నానందము, శాంతియు వెల్లివిరియుచుండ,ఁ దానుజేయు కర్మకు బాహ్యోపకరణములపై నాధారపడక, ముక్తపురుషుఁడు తనకర్మను నిర్విఘ్నముగాఁ గొనసాగించును. ముక్తపురుషులకు సంశయసంజాత క్లేశభార మిసుమంతయు నుండదు. వారిముఖ విలాసములో నజ్ఞానాంధకార లేశమునకుఁ దావుండదు. వారు తమజ్యోతిర్మయావలోకనములచే, నిశ్చయ గంభీరకంఠధ్వనిచే, వారి యనుభవ విశ్వాసము లమోఘములని స్ఫురింపఁజేయుదురు. దేహావసరములు కాని, కామములుకాని, వారిని స్వాధీనమొనర్చు కొనఁజాలవు. సంపద్విపత్తులు వారికి గర్వదైన్యముల నొసఁగవు చిత్తచాంచల్య భయ క్రోధములు వారెఱుఁగరు. వారు నిత్య ప్రసన్న మనస్కులై, స్వచ్ఛబాల్యముఖ సరోజ విరాజమానులై యుందురు. ౧.

(౧) బాలభావస్తథా భావో నిశ్చింతో యోగ ఉచ్యతే. జ్ఞానసంకలినీ ము.

ముక్తజీవి పుణ్యపాపముల కతీతుఁడు, పరిపూర్ణతచే ధర్మము నాతఁ డతిక్రమించినాఁడు. ఆతఁడాత్మజ్ఞాన పరిపూర్ణతచే విశ్వవిశాలమగు నౌదార్యము, సామర్థ్యము, తేజము కలిగి, నీతి సూత్రములకతీతుఁడై ప్రవర్తించును. పునర్జన్మహేతువగు నేదేని పాపకర్మ నాతఁడాచరించినను దానివలన నాతఁడు బద్ధుఁడు కాఁడు, సామాన్య మానవసమాజమును బంధించు నియమము లాతనికి వర్తింపవు. ముక్తపురుషుఁడు, పూర్ణ నిరంకుశస్వాతంత్ర్యమును గలిగియుండునని గీత భావించినది. నీట్షేతత్త్వజ్ఞుఁడు ప్రకటించిన మానవాతీత పురుషునివలె (Super man) దుర్బలులు, నల్పులు, నసమర్థులునగు వారియెడ నోర్పుచూపఁజాలని ప్రవర్తనము నీముక్తపురుషులు లోకములోఁ బ్రదర్శించినయెడల దీనిసిద్ధాంతము ప్రమాద సంభరితమైనదగును. గీతచెప్పు ముక్త పురుషులు సాంఘిక నియమములను పాటింపకున్నను, నవి గౌరవింపఁదగినవని నిస్సంశయశముగాఁ బ్రకటించిరి. ముక్తులైన మహాత్ములు తాము క్లేశము నొందకుండుటేకాక, యితరులకు నే క్లేశములను గలిగింపరు [౧]. లోకహితార్థము జీవించుటే వారి ప్రకృతిగా నుండును. లోకములోని సర్వజీవులయెడల నీ మహాత్ములగు ముక్తపురుషులు సమత్వమును గలిగి యుందురు. వారు సజీవమగు నాత్మజ్ఞాన చేతస్కులై, సాంఘిక నియమానుష్ఠానముచే మానవు లాత్మవికాస పరిపూర్ణత నందవలెనని బోధింపఁజూతురు. వారిలో దైవసంకల్ప మెట్లు గోచరించిన నట్లు నియత కర్మాచరణ మొనర్చుచుందురు.

---

(౧) ౧౨. ౧౫.

గీత యొక్క నైతికసమాజము నంగీకరించినను, ధర్మ్మసమాజమునొకటిఁ బ్రకటించెను. సంఘముతో సంబంధము లేని అనంతాభ్యుదయావకాశము వ్యక్తికిఁగలదని గీత బోధించెను. సన్న్యాసి, సంఘవర్ణధర్మములన్నిటికి నతీతుఁడు. ఇది మానవుఁడు సంపాదింపఁగల మహోత్కృష్టపదవి. భార్యాసుతాదిక సర్వబాహ్యసంబంధములను విసర్జించి, తానుఁదన యీశ్వరుఁడుగలిసి, వనగుహాంతరమున నేకాంతవాసియై, సంపూర్ణసంతుష్టి నొందఁగలశక్తి మానవునకిచ్చున దీసన్న్యాసి ధర్మము. ఇది సంసారమునుండి పలాయనధర్మముకాదు; ఆతఁడు సంఘమునకు దూరస్థుఁడైయున్నను, సర్వజీవ కృపాపరతంత్రుఁడై జీవించును. కైలాసశిఖరముపై ధ్యానగతుఁడై యున్న పరిపూర్ణసన్న్యాసి చక్రవర్తియగు శివునివలె, లోకకల్యాణముకొఱకు విషమైనఁ ద్రాగును.

## పరిశీలిత గ్రంథములు


౧. తెలాంగ్; భగవద్గీత, యస్. బి.ఇ. వాల్యూము ౮

౨. క్: గీతారహస్యము.

౩. అరవిందఘోషు: గీతారహస్యములు.

# భారతీయ తత్త్వశాస్త్రము

## దశమాధ్యాయము.

### బౌద్ధమత స్వరూపము

#### ౧—బౌద్ధమతశాఖలు

బుద్ధుని జీవితకాలమునందే, అనుచరులలో ౧. భేదాభిప్రాయములుద్భవించినవి కాని, యాతని మహత్తర వ్యక్తిత్వ ప్రభావముచే వృద్ధి నొందఁజాలకపోయినవి. ఆతని మహానిర్వాణానంతరమా భేదములు బహిర్గతములైనవి. రాజగృహమందు మొట్టమొదట సంకలనము చేయఁబడినవియు నేటికిని సిలోనునందు నిలిచి యున్నట్టియు త్రిపిటకములు థేరవాదములోనివని హీనయాన శాఖస్థులు నమ్మెదరు. ఈప్రథమసంఘ సమావేశము, విశేష ప్రతిఘటనమున్నప్పటికిని, సన్న్యాసి ధర్మశాసనమును గొంత సడలింప యత్నించినది. దీని యనంతరమొక నూఱేండ్లకు వైశాలియందు రెండవసంఘ సమావేశము జరిగినది. ఈసభ యందు వినయ సిద్ధాంతాచరణములు పరిశీలింపఁబడి, వినయ

(౧) దేవదత్తుని యత్నముల నవలోకింపుఁడు.

మాతిక్రమణాచారముల నేమైన నంగీకరింప వలెనా లేదా
యనువిషయము చర్చింపఁబడెను. తీవ్రవివాదమైన వెనుక,
సంప్రదాయవాదులైన స్థవిరులు ౨. లేక వృద్ధులు, నియమో
ల్లంఘనములను నిరసింపఁగల్గిరి. అభ్యుదయపక్షమైన మహా
సాంఘికులు, సభలోఁ దామోటుపడినను, నధికసంఖ్యాకమైన
యనుచరవర్గమును గలిగియుండిరి. వీరందఱును గలిసి మహా
సంగీతి యనునొక సభనడిపిరి. ఈసభాంశావర్ణనము, సనాత
నుల దృక్పథమునుండి రచింపఁబడినది. దీపవంశ గ్రంథమునఁ
గలదు. 3. ఈసభ మతమును ధ్వంసమొనర్చెననియుఁ బూర్వ
మతగ్రంథములను విచ్ఛేదమొనర్చెననియు, నికాయములందలి
సిద్ధాంతప్రవచనములను దాఱు మాఱొనర్చెననియు, బుద్ధోప
దేశమందలి యుద్దేశమును నాశమొనర్చెననియు వర్ణింపఁబడి
నది. సనాతనాభ్యుదయ వర్గముల మధ్యమందు వివాదాంశము
లలో ముఖ్యమైనది బుద్ధత్వప్రాప్తి విషయము, వినయధర్మముల
మార్పులేని సక్రమానుష్ఠానముపై నది యాధారపడియున్న
దని స్థవిరులు వాదించిరి బుద్ధపదవి ప్రతిమానవుని యందంత
ర్నిహితముగా నున్నదనియు, దానిని సక్రమావిష్కరణము
చేయుటచేఁ బ్రతివ్యక్తియుఁ దథాగతస్థితిని బొందవచ్చుననియు
నభ్యుదయ వర్గీయులు వాదించిరి. స్థవిరవాదము పరంపరగా
వచ్చిన నేఁటిసిలోను బౌద్ధులధర్మమని చెప్పుదురు. బౌద్ధమతము
తన రెండవశతాబ్దమునందే, పదునెనిమిది శాఖలుగాఁజీలి

(౨) పాలీభాషలో థేరులు.
(3) ఔ.

ప్రతిశాఖయుఁ దన దేసరియైన ప్రాచీనబౌద్ధమని సమర్థించెను. తరువాత నశోకునికాలము (౧) వఱకు బౌద్ధమతమెట్లు నడచి నదో మనకుఁ దెలియదు. బుద్ధునికి రెండున్నర శతాబ్దముల యనంతరము, మౌర్యచక్రవర్తియైన అశోకుఁడీమతమును స్వీకరించుటతో నిది విశేషవ్యాప్తి నొంద నారంభించెను. బుద్ధుని మరణానంతరము మూఁడుశతాబ్దములవఱకు, నొక హిందూ మతశాఖగానున్న బౌద్ధమతము, ముఖ్యముగా నశోకచక్రవర్తి కృషివలనఁ బ్రపంచమతమై విలసిల్లినది. (౨). కాబూలు ప్రాంతమునుండి గంగానదీముఖ ప్రదేశము వఱకును, హిమాలయములనుండి వింధ్యపర్వతశ్రేణివఱకును వ్యాపించినఁ దనరాజ్యమందంతటను, శాశ్వతములై యుండఁగల స్తూపములను నిర్మింప నశోకుఁ డాజ్ఞాపించెను. కాశ్మీరమునుండి సిలోనువఱకుఁగల దేశములోని వివిధభాగములకును, దనరాజ్యములో లేని యితర ప్రాంతములకును, నాతఁడు మతప్రచారకుల నంపెను. మతప్రచారకుల నాతఁడు సిరియాప్రభువు రెండవ ఆంటియోకస్ వద్దకును, ఈజిప్టుపరిపాలకుఁడగు రెండవటాలెమీ వద్దకును, మాసిడోనియా చక్రవర్తి ఆంటిగోనస్ గోనటాస్ వద్దకును, సైరిన్ రాజగు మాగస్ వద్దకును, ఎపిరస్ సార్వభౌముడగు రెండవ అలెగ్జాండరు వద్దకును బంపెనని పదమూఁడవశాసనము చెప్పుచు

(౧) "బుద్ధుని మరణానంతర మెంకటిన్నర శతాబ్దముల కాలమందు బౌద్ధమత మెట్లునడచినదో, చెప్ప స్వజాతీయ విజాతీయాధారములెవ్వియుఁ గానరావు." రైస్ డేవిడ్సు బౌద్ధభారతవర్షము పుట ౨౧౯.

(౨) చూడు. వి. స్మిత్ అశోక. పు. ౨౨.

న్నది. క్రీ.పూ. ౩–వ శతాబ్దమున బౌద్ధమతము కాశ్మీరము సిలోనులందుఁ బ్రవేశించి, క్రమముగా నేపాళము, టిబెట్టు, చైనా,జపాన్, మంగోలియా దేశములలో వ్యాపించెను. అశోక పుత్రుఁడగు మహేంద్రుఁడు, సిలోనునందలి బౌద్ధమతాధిప తిగాఁ జేయఁబడెను. బౌద్ధమతమునఁ దలలెత్తుచున్న నూత్న భావములను జూచి, అశోకుఁడు బౌద్ధమతములోని ధర్మము నెక్కుడుగాఁ బ్రచారముచేసెను. ౧. బౌద్ధమత సన్న్యాసులకుఁ గల్గిన గౌరవప్రతిష్ఠలఁజూచి, వంశీయశీలురు పెక్కురిందుఁజేరిరి. మహావంశగ్రంథము చెప్పినరీతిని, "మతద్రోహులు స్వార్థప్ర యోజనము లాసించి, కాషాయాంబరముల ధరించి, తమకుఁ దోచిన భావములనే బౌద్ధమతధర్మములని ప్రకటించి, తమకుఁ గలిగిన సంకల్పమే ధర్మమని ప్రచురించిరి." ౨. మొగ్గలిపు త్రుఁడైన టిస్సాఅధ్యక్షతక్రింద మూఁడవమత మహాసభ, మత మును శుద్ధిచేసి కాపాడునిమిత్తము పాటలీపుత్రమందు సమా వేశమయ్యెను.

చాలవఱకు దేశాంతరులై భారతవర్షమును బరిపాలించు చున్న యవనులు, శాకులు,క్షాత్రప,శాతవాహన, పహ్లావకుషా ణాదులు వెంటనే బౌద్ధమతావలంబులైరి. దక్షిణ పశ్చిమదిశ

---

(౧) అశోకుఁడు శిలాశాసనములలో నొకదానియందు, కనకముని స్తూపమును రెండవమారు స్థాపింపుమని యాజ్ఞాపించినట్లు చెప్పినాఁడు. స్తూపనిర్మాణములు, తీర్థయాత్రలు మున్నగువానికిఁ బ్రజలలవాటుపడియు న్నట్లు తెలియుచున్నది. కనకముని పూర్వబుద్ధుఁడను విశ్వాసమువలన, బుద్ధ పరంపరయందుఁ బ్రజలకప్పుడే విశ్వాసమేర్పడియుండెనని స్పష్టము.

(౨) ౩౮–౩౯

లందు బ్రాహ్మణమతప్రతినిధులగు భూపాలురు గొందఱున్నను, నధికసంఖ్యాకులు బౌద్ధులెరి. క్రీ. శ. ప్రథమ శతాబ్దములో రాజ్యముచేసిన గుప్తులకాలమున బ్రాహ్మణమతము పునరుజ్జీవిత మైనది. చంద్రగుప్తుని మధురశాసనములు, స్కందగుప్తుని బీహారుశాసనములు సముద్రగుప్తుఁడొనర్చిన అశ్వమేధమును వర్ణించినవి. బ్రాహ్మణమత పునర్విజృంభణమును దెల్పు నితరాధారము లనేకములున్నవి. శివ విష్ణుమతశాఖలు జనసామాన్యములో వ్యాపించినవి. వాసవదత్తలో సుబంధుకవి, జైమిని శిష్యులు బౌద్ధసిద్ధాంతమును ఖండించిరని వ్రాసియున్నాఁడు.(౪) బౌద్ధుల ముఖ్యభాషయగు ప్రాకృతము, సంస్కృతభాషచే నతిక్రమింపఁబడెనని, నాఁటి బౌద్ధ సంస్కృతశాసనములే తెల్పుచున్నవి. బ్రాహ్మణమతము ననుకరించి, బౌద్ధమతము బుద్ధునే దేవునిగాఁ జేసినది. బుద్ధునివిగ్రహములను స్థాపించి, సగుణమూర్తి కారాధనములు బయలుదేరి, కనిష్కుని సమకాలికుఁడగు నాగార్జునుఁ డిట్టివిధానమునకు రూప మొసఁగి, మహాయాన బౌద్ధశాఖను స్థాపించెను. ఇతనికిఁబూర్వమే యిట్టి పూజాపద్ధతులు పెంపొందియున్నవి. థేరవాదులనుండి మహాసాంఘికులు చీలిపోయినయుద్యమము మహాయానబౌద్ధశాఖగాఁ బరిణమించినది. పూర్వ బౌద్ధక్షీణదశ, మహాయాన శాఖాసముద్భవము బ్రాహ్మణమత పునర్వికాసము నేకకాలమునందే జరిగినవి. కనిష్కునికాలమున పంజాబులోని జలంధరనగరమున జరిగిన

(3) ౭౮౦ క్రీ పూ.

(౪) కేచిజ్జైమిని మతానుసారిణా ఇవ తథాగత మతధ్వంసినః

సభలోని సిద్ధాంతములను మహాయాన మనుసరించును. మూల సిద్ధాంతమును విస్తరించి, నూత్నభావములను జేర్చి, జనసామాన్యుల మూర్ఖవిశ్వాసవైచిత్ర్యముల లిందు విశేషముగాఁ గల్పించియున్నారు. హీనయానము పాళీభాషాన్వితమైన పూర్వశాఖ; మహాయానము సంస్కృతభాషాంచితమైన నూతనశాఖ. ఆది బౌద్ధమతముయొక్క మూలరూపమును, బుద్ధుఁడుపదేశించిన వైజ్ఞానిక, సన్న్యాస, పవిత్రధర్మములను, తాను రక్షించి, పోషించుచుంటినని హీనయానము చెప్పును. మహాయానము యోగ, దైవ, భక్తితత్త్వముల నభివృద్ధిచేసెను. సిలోను బర్మాలలో హీనయానము తన యౌన్నత్యమునిలుపుకొనఁగా, మహాయానము నేపాళ, చైనా దేశములం దభివృద్ధిపొందెను. బాహ్యప్రపంచముతో సంబంధములేని యాంతరంగికదృష్టి హీనయానమునకును, లోకపరిస్థితులననుసరించి, వ్యవహారదృష్టిగల మహాయానమునకును నిట్టిభేదము, బౌద్ధమతచరిత్రములోఁ దుదివఱకుఁ గోచరించును. మహాయానము సర్వజనోపకారియైన మార్గము; హీనయానము కొలఁదిమందికే పొందసాధ్యమగు నల్పమార్గము. హీనయానమును ముఖ్యమతముగా నంగీకరించిన దక్షిణాపథము కనిష్కుని సభ నంగీకరింపలేదు. దక్షిణమున సిలోను మున్నగు చోటులందు వ్యాప్తిగాంచిన కారణమున హీనయానము దక్షిణబౌద్ధమనియు, నుత్తరదేశములందు మహాయానము టిబెట్టు, చైనా, మంగోలియా, కొరియా, జపాన్ మున్నగు చోటులందు వ్యాపించిన కారణముచే నుత్తరబౌద్ధమనియుఁ బిలువఁబడెను. కాని యీవిభాగము స్థిరమైనదికాదు. రైస్‌డేవిడ్సు ఇట్లు వ్రాక

టించినాఁడు: "దక్షిణోత్తర బౌద్ధశాఖల లనఁబడు వానియందు, నేఁడుకాని, పూర్వముకాని, భాషయందుఁగాని, భావములందుఁగాని యెట్టి ఆంతరంగికసమన్వయము లేదు." ౧. బౌద్ధ వాఙ్మయ మంతయునుత్తరదేశముననే జన్మించెననియు, రెండుశాఖలు నెట్టి సంబంధములేని ప్రత్యేకమతములుగావనియు, వీని కన్యోన్యభావ సంక్రమణ మున్నదనియు మనము గుర్తించినచో వీనికి దక్షిణోత్తరశాఖానామము లనవసరములని బోధపడును. కాని హీనయాన మహాయానములకుఁ గొంతభేదము క్రీ. వె. ౪-వ శతాబ్దమునకుఁ బూర్వమే బ్రబలియుండెను. ఫాహియాన్, యువాన్ చ్వాంగులు హీనయానమును స్మరించిరి, లలితవిస్తారమునందు నిది పేర్కొనఁబడినది.

హీనయానము పాళీమత గ్రంథముపై నాధారపడియున్నది; బౌద్ధమతసంస్కృతగ్రంథములన్నియు మహాయానమునకుఁ జెందినవి. మహాయానమతమున కొకప్రత్యేకమత గ్రంథములేదు; ఏలన నదియొక ప్రత్యేకశాఖాభావములను గలిగియుండలేదు. ౨.

౧. బౌద్ధభారతవర్షము పుట ౨౭3.

౨. మహాయానశాఖకు ముఖ్యగ్రంథము లీదిగువ తొమ్మిదియునైయున్నవి. (౧) అష్టసాహస్రికా ప్రజ్ఞాపారమితము (౨) గండవ్యూహము (3) దశభూమీశ్వరము (౪) సమాధిరాజము (౫) లంకావతారము (౬) సద్ధర్మపుండరీకము (౭) తథాగతగుహ్యకము (౮) లలితవిస్తారము (౯) సువర్ణప్రభాసము. క్రీ. వె. 200 లకుఁజెందిన ప్రజ్ఞాపారమితము బోధిసత్త్వుని ఆఱుసిద్ధులనుగూర్చియు, నందు ముఖ్యముగా నత్యున్నతమైన శూన్యసిద్ధాంతజ్ఞానమునుగూర్చియుఁ జెప్పినది. దీనిసంగ్రహరూపమే తనమాన్యమిక

## ౨—హీనయాన బౌద్ధమతము

మతగ్రంథసిద్ధాంతముల కనుగుణమైన వికాసమే హీనయాన బౌద్ధమతము. వీనియందుఁ బ్రకటింపఁబడినవి శాస్త్రపద్ధతిలేనిభావములు, మిళిందమునందును గోచరించును; అనంతరము వీని నభిధర్మములుగా వైభాషికులు లేక సర్వాస్తివాదులును, బుద్ధఘోషుఁడు తనగ్రంథములందును, అభిధర్మసంగ్రహమునందును విస్తరించిరి. హీనయానము ననుసరించి, సర్వ

సూత్రముల కనుగుణముగా నాగార్జునుఁడు రచించెనని వాడుకగల మహాయానసూత్రములు. గండవ్యూహము బోధిసత్త్వమంజుశ్రీస్తవమును, శూన్యతధర్మకాయము, బోధిసత్త్వులచే లోకసంరక్షణమునను మూఁడుసిద్ధాంతములను బ్రకటించును. దశభూమీశ్వరము (క్రీ.వె. ౪౦౦) బుద్ధత్వసిద్ధికిఁగల పదిదశలను వర్ణించును. బోధిసత్త్వుఁడుత్తమగతినిబొందు ధ్యానదశావిశేషములను వర్ణించునది సమాధిరాజము. లంకావతారసూత్రములు (క్రీ.వె; ౪౦౦) యోగాచార లక్షణముల వర్ణించును. సద్ధర్మపుండరీకము (క్రీ.వె. ౨౫౦) బుద్ధుని సర్వదేవతాధిపతిఁజేర్చి, యాతఁడు పూర్వయుగసహస్రములందుండెననియు, ముందెల్లప్పుడుండుననియు రచించెను. ఈగ్రంథమువనుసరించి, బుద్ధోపదేశమును విని, సత్కార్మాచరణ మొనర్చినచోఁ బ్రతిమానవుఁడు బుద్ధుండుకాఁగలఁడు. బుద్ధస్మరణ చిహ్నములైన స్తూపాదికములు నిర్మించినవారు నుత్తమగతినిఁ బొందుదురు. లలితవిస్తారము బుద్ధలీలను వర్ణించును. బుద్ధునిజీవితకర్మ పరమేశ్వరలీలగాఁ జెప్పను. దీనిననుసరించియే ఎడ్విన్ ఆర్నాల్డు "ఆసియాకాంతి' గ్రంథమును రచించెను. సువర్ణప్రభాసమందలి విషయములు కొన్ని తాత్త్వికములు, కొన్ని గాథలు; ఇందుఁదాంత్రికప్రక్రియగలదు. సుఖావతీవ్యూహము, అమితాయుర్ధ్యానసూత్రము, వజ్రచ్ఛేదికము జపానులో విశేషప్రచారమును గల్గియున్నవి. సుఖావతీవ్యూహము (క్రీ.వె. ౧౦౦) స్వర్గమును వర్ణించి, అమితాభుని స్తుతించెను. హిందూపురాణ సామ్యముగల కారండవ్యూహము అవలోకితేశ్వరుని స్తుతించును. పరమేశ్వరుఁడధోముఖుఁడై,

వస్తువులు క్షణికములుగ. స్థిరమైనవని చెప్పఁబడిన దేశము, నిర్వాణము నిజముగా లేనివస్తువులు. అవి కేవల నాస్తికభావనామములు, క్షణికములైనధర్మములు, వస్తుస్వరూపము వ్యక్తి లేనిభావములు; కర్త లేనియూహలునున్నవి. ఈతత్త్వము వ్యక్తులు కాని వస్తువులు కాని లేవనుక్షణికదశాప్రదర్శనవాదము. ౨. అల్పములు క్షణికములునగు ధర్మములే, కారణకార్యములుగాఁ గలిసి, నామమాత్రములగు నసత్యద్రవ్యములను బ్రదర్శించుచున్నవి.

జీవితముయొక్క లక్ష్యము నిర్వాణము లేకజీవనాశనము, మనజీవనమంతయు నేదోయొకకోరికకలది; అందుచే బంధము. ౩ నిర్వాణము ప్రాప్తించినవెనుక మిగులునదేమైన నున్నదాయను విషయములో హీనయాన మాలోచింపదు.

---

జీవలోకమునందనంత కృపాపూర్ణుఁడై, సర్వప్రాణులు మోక్షముపొందువఱకుఁ దానును బొందననియుండువాఁడు. సర్వజీవులు మోక్షముపొందవలెనను తీవ్రకాంక్షయందు గోచరించును. మహావస్తువు హీనయానగ్రంథమగును. బుద్ధని లోకోత్తరపురుషునిగా విశ్వసించు మతనిరోధులైన లోకోత్తరవాదుల గ్రంథమిది. ఇందు మహాయాన సిద్ధాంతము లనేకములున్నవి. అశ్వఘోషుని బుద్ధచరితము (క్రీ. శ. ౧౦౦) మహాయాన మహితగ్రంథములలో నొకటి. సౌందరనందకావ్యము నితఁడే వ్రాసెను. వజ్రసూచియు నితనిగ్రంథమందురు. ఆర్యశూరుఁడనుకవి (క్రీ. శ. ౪౦౦) సుప్రసిద్ధజాతకమాలా గ్రంథమును రచించెను. శాంతిదేవుని (క్రీ. శ. ౭౦౦) శిక్షాసముచ్చయము మహాయాన సిద్ధాంతగ్రంథము. బోధిచర్యావతారము తత్కృష్ట మతగీతము, ఇంకను వివరములకు చూడు సంస్కృతబౌద్ధసారస్వతచరిత్ర—నారిమన్, రాజేంద్రలాల మైత్రా నేపాళ బౌద్ధసాహిత్యము. ఇచటనిచ్చిన తేదీలూహింపబడినవి.

౧. యత్ సత్ తత్ క్షణికమ్. ౨. పుద్గలనైరాత్మ్యమ్. ౩. డబ్లియు. బి. టి. పుట. ౧౬౨.

హీనయానమునకుఁ బ్రధానమైనది అర్హతాదర్శము, ఈపదవి స్వయంకృషివలన లభించునని హీనయానసిద్ధాంతము. సత్యచతుష్టయమునుగూర్చి తపోధ్యానములే సాధనములు.౮. అర్హతస్థితినందినవారికి బుద్ధత్వము లభించునా యను విషయమునుగూర్చి హీనయానము మౌనము వహించినది. ప్రతిప్రాణి కెని బుద్ధత్వము ప్రాప్తించునాయను విషయమునుగూర్చియు నది స్పష్టముగాఁ జెప్పియుండలేదు. అర్హతపదవియే లక్ష్యముగాఁ గల కేవలస్వార్థపరమైన యీయాదర్శము, కృపాకారుణ్యసముద్రుఁడైన బుద్ధుని యాదర్శమునకు విరుద్ధమును, నిరుపయోగమునైనది. మఱియు హీనయానము బుద్ధుఁడే రక్షకుఁడను విశ్వాసమును గలిగియున్నది; ఈవిశ్వాసము మంచిదే కావచ్చును గాని, అసలు బుద్ధుని యుపదేశమునకు విరుద్ధమైనది. ఇబ్సేనువాక్యములలో హీనయాన బౌద్ధమతము నిటు సంగ్రహింపవచ్చును; "ప్రపంచచరిత్ర మంతయు నొక మహా విధ్వంసక కార్యమనితోఁచు క్షణములుగలవు; కావున నొకటే ప్రధాన విషయము; ప్రతివ్యక్తియుఁ దన్నుఁదాను గాపాడుకొనుటే."

అర్హతపదవియే మహోత్కృష్టపదవి. అచటఁగామాగ్ని చల్లారి, పునర్జన్మబంధ హేతువగు కర్మ లేకుండును. తన యుపదేశారంభకాలమున బుద్ధుఁడీట్టి పదవిని బొందెను. భూమిపై నాత్మనిగ్రహముచే నిర్వాణము నార్జించుట కేమానవాతీతశక్తియు నవసరములేదు. జీవకోటిలో నుతమోత్తముఁడగు

౮. దర్శనభావనములు.

బుద్ధుని మనము గౌరవించుటకుఁ గారణమాత్రఁ డిట్టిస్థితిని బొందిన మార్గదర్శి; తత్సాధనవిధానము నుపదేశించినవాఁడు, అంతకంటె విశేషమేమియును లేదు. మానవప్రవృత్తి కలాపమునకు దూరమైన, యేకాంతగుహాంతరములందు ధ్యానయోగముచే నిర్వాణము నార్జింప హీనయానస్థులు ప్రయత్నింతురు. ఖగ్గవిసాణసుత్తమందు సంసారసమాజ సంబంధములు పూర్తిగా నిషేధింపఁబడినవి. "సంఘజీవితము సల్పువానికి మమకారముదయించును; దానివలన దుఃఖము సిద్ధించును."౧. హీనయానమతానుచరులు రాజమార్గములఁ బోవునపుడు, బాహ్యసౌందర్యములచేఁ దామాకృష్టులుగాకుండ ముకుళితనేత్రులై పోవలయునని నియమముగలదు. వివేకవంతుఁడు "మండుచున్న అగ్నికణములను వలె దాంపత్యజీవితమును విసర్జింపవలెను."

"ప్రపంచసంగము వలన మనఃక్లేశముదయించును;
గృహస్థజీవనములోఁ జిత్తవిక్షేపకారణ పాంసుపటలి చెలరేగును,
గృహ బంధుమిత్రాది బంధనిర్ముక్తమైన స్థితియే,
సన్న్యాసి నిత్యముఁ గోరు నేకైకపదవి."౧.

విశుద్ధిమగ్గము ననుసరించి నిర్వాణము పొందఁగోరువాఁడు, మహాత్తర ధర్మబోధక పాఠశాలయనఁదగు శ్మశానవాటికకుఁబోయి, ప్రపంచము, జీవుఁడు నివన్నియు ననిత్యము

(౧) ౨౮.

(౧) సుత్తనిపాతములోని మునిసుత్తము. ౧౮. ౧౨. మిళిందపఞ్హమునకు ఉదాహృతము. ౪౮ ౫.౧.

లని యది బోధించు నుపదేశమును వినవలెను. మమకార క్రియా న్వితమైన జీవితమువలన మనము లక్ష్యమును సాధింపఁజాలము. కామప్రేమలు లేని అద్వైతాదర్శ ముత్సాహజనకమైనదికాదు. సరియైన సంఘనిర్మాణములేని యాదినములలో నీభావముల కెక్కుడు ప్రాధాన్య ముండి యుండవచ్చును. కాని ప్రపంచ మొక మఠముగా మాఱఁజాలదు. బలవంతముగా నాబాల గోపాలమును, శాసనముచే సన్న్యాసులను జేయఁజాలము. మానవజీవితము, జీవితమునందు జుగుప్సాభావమొక్క దానితో నిండినదికాదు. నిజమగు సన్న్యాసము ప్రపంచదుఃఖముల యెడ నౌదాసీన్యము వహించుటకాదు; ఘోరప్రవృత్తి రంగమధ్యమున నిశ్చంచలమై యుండఁగల యొక ప్రశాంత కేంద్రములను నిర్మించుకొనుటే. కఠోరప్రపంచ నినాదముల మధ్యమందు, సన్న్యాసి యేకాంతమందిరమునందే కాకుండ, మన మచంచల స్థిర చిత్తమునుగల్గి ప్రవర్తించుశక్తిని బొందియుండఁ గలుగుటే నిజమగు వేదాంతము. మూలబౌద్ధము, హీనయానమువలెఁ గాక, దురంతదుఃఖ దూషితుల నివాసములందును, నిరంతర ప్రవృత్తిలంపటులైన జనసమూహములందును, సేవావకాశముల సంపాదింపుమని బోధించినది.

జనసామాన్యము నమ్మిన బహుదేవతారాధనముపై నాధారపడిన యొకవిధమగు మనుష్యధర్మ రక్షితమైన దైవభావమును, నుపదేవతాభావమును హీనయానము పెంపొందిం

౧. సుత్తనిపాతములోని మునిసుత్తము, ౧ అ. ౧౨. మిళిందమునందు ఉదాహృతము. ౪ అ ౫. ౧.

చెను. ఈ దేవతలు సర్వజ్ఞత్వ సర్వవ్యాపకత్వములు లేనివారు. శిక్షణమునకు ధ్యానమొక ముఖ్యాంగము కావున నీ దేవతలను గల్పించిరి. చారిత్రకవ్యక్తియైన బుద్ధుని మహిమాన్వితునిఁ జేసి, దైవముగా నొనర్చి, యుపాస్య దేవతల కవసరమున్నదని నిశ్చయించిరి. బుద్ధుని జన్మమరణకాలములందు దేవతలువచ్చి, బుద్ధుని స్తుత మొనర్చిరి. బుద్ధుఁడు దేవతలకు దేవుఁడు, జ్ఞానము, శక్తిపూర్ణముగాఁ గలవాఁడు. కాని, ఉపాస్యోపాసక సంబంధము స్పష్టపఱుపలేదు. అసలు, బుద్ధుఁ డొకమతప్రవక్త, మార్గదర్శకుఁడును. అతఁడు దేవుఁడును గాఁడు, మానవాతీతుఁడును గాఁడు. బుద్ధుఁడు బోధిజ్ఞానము సందిన యితర సిద్ధులవంటివాఁడు కాఁడు; అతఁడు మోక్షమార్గముఁ గనుఁగొనుటయే కాక, లోకమునకుఁ బ్రకటించెను. ప్రాచీన హీనయానము ననుసరించి బుద్ధుఁడు మనుజులలో నొక మనుజుఁడు; సామాన్యులకంటె నధికమైన జ్ఞానశక్తులు కలవాఁడు. బుద్ధునిఁ బూజించుటాతని స్మరణము కొఱకే. ఈమతములోని కొందరు పూర్వసంప్రదాయవాదులు, మనము బుద్ధు ననుకరింపవచ్చును. కాని బుద్ధుని పరిపూర్ణత మనకసాధ్యమని చెప్పుదురు.౧. అందుచే వారు మరణించిన వెనుక నే పుణ్యలోకమునందో జనించి, యాజన్మమందు బోధిపదవిఁ బొందుట కింకొకయాత్ర చేసి ముగింతురని విశ్వసించిరి. ఇంద్రియాతీత విషయములనుగూర్చి తెలిసికొన యత్నింపవలదని గౌత

౧. హీనయానులలో నొక శాఖయగు లోకోత్తరవాదులు బుద్ధుఁడు లోకోత్తరుఁడనియు, నపుడపుడు లోకకల్యాణము కొఱకవతరించుచుపోవుచుండునని యు వీరు వర్ణింతురు.

ముఁడుచెప్పిన యుపదేశమును హీనయానస్థులు పూర్తిగా విస్మరించిరని స్పష్టమగుచున్నది. మొదట బుద్ధునంగీకరించి, బుద్ధత్వ మార్గమున నీమునులు ప్రవేశించి, తరువాత హిందూదేవతల నారాధించు నీవిధానము బహుదేవతారాధనమగును. తాత్త్వికముగా క్షణికవాదము, ఆచరణమందు బహుదేవతారాధనము, నల్పాధిక తారతమ్యము నిందు గోచరించుచున్నవి. సిద్ధాంతమునందు దేవుఁడులేఁడనిచెప్పి, ఆచరణమునందు బుద్ధోపాసన మంగీకరించు విస్పష్టతత్త్వములేనిమతమే హీనయానము. సజీవదైవము నంగీకరించు భక్తి కిందుస్థానములేదు. హీనయానబౌద్ధమతము నిర్వాణమార్గము నొకటే చెప్పునదికాదు; పరమపవిత్రులైన మునీశ్వరుల కటాక్షమున బ్రహ్మలోకములో జనించు మార్గమునిది యుపదేశించును. స్వర్గనరకములున్నవి. హీనయాన మతభావ మంతములేని పరిణామకోలాహలము వలని జుగుప్స, అలసటలచేతను, ప్రవృత్తివిరమణమువలని విశ్రాంతిచేతను బయలుదేఱినది. ఇది దృఢమనస్సంజాతమైన మతముకాదు. ఒకవిధమైన లోకద్వేషమే యీమతమునకు ముఖ్యోద్దేశము. ఈమతము తాత్త్వికముగా నాస్తికము, నిస్సంశయమునగు నిర్వచనమును గోరును; మహాయానము ఆస్తికమత వికాసములను గోరును. మహాయానముకంటె హీనము విశేష విశ్వాసముతో బుద్ధుని చారిత్రక సంప్రదాయములను బోషించినది. మహాయానము ప్రజాసామాన్య హృదయాశయముల కనుకూలమతమును గల్పించి,సంతోషపెట్టఁజూచును. నాస్తికులు నూహాకల్పితములు నగు భావములచే హీనయా

నము నిర్జీవవిజ్ఞానమున కవతారమై యాత్మబంధన హేతువై నది. మన మనుష్ఠించుట కొకనిశ్చయ విశ్వాసమునుగాని, సాధించుట కొకలక్ష్యమునుగాని హీనయాన మొసఁగియుండ లేదు.

3—మహాయానము.

బౌద్ధమతారంభకాలము మొదలు, అశోకునికాలము వఱకునుగల సిద్ధాంతములు పూర్వబౌద్ధమును దెలిపినచో, నశోకునికాలమందలి భావములు హీనయానసిద్ధాంతమును బ్రకటించును. అశోకుఁడు మొదలు కనిష్కుని కాలమువఱకు నున్నట్టియుఁ దరువాతఁ బెంపొందినట్టియు భావములు మహాయానమతమునకుఁ జెందినవని చెప్పవచ్చును. మతాచారణములేని, నిరుత్సాహజనకమగు తత్త్వసిద్ధాంతము చిరకాలము త్సాహసంతోషములను లోకులకుదయింపఁ జేయఁజాలదు. హీనయానము మానవుని పరచింతాపరత్వమును గణింపక, ఆధ్యాత్మికదృష్టి కపకృతియొనర్చినది. హీనయానముయొక్క నాస్తికతత్త్వము, పెట్టెలోఁబెట్టిన యస్థిపంజరమువలె, సుందరకుసుమమందున్న రోగగ్రస్త కీటకమువలె నుండెను. అపకృతినందిన మానవుని కాంక్షలు, తేకెత్తి, చెలరేగి, హీనయాన నిరుత్సాహతత్త్వమును, ప్రచండప్రతిఘటనముతో ఢీకొని, పోరాడెను. సముచిత జ్ఞానాహారములేక కృశించుచున్న జీవాత్మ, నాఁటి పరిబాహ్యమతములోని, భావస్ఫూర్తినిచ్చు సాంకేతికతత్త్వములందుండి పోషణము నన్వేషింప యత్నించినది. బుద్ధుని జీవితము దేశికము నుదయింపఁజేయఁగలదు. అందుచే బుద్ధుఁడొక

దేవుఁడుగా నిశ్చయింపఁబడెను. ధర్మానుష్ఠానసిద్ధికి మూర్తియు, ధర్మావతారము నై యాతఁడు గోచరించెను. తత్త్వదృష్టిగల హీనయానమతస్థుఁడు బుద్ధోపదేశమందలి గౌరవముచే, బుద్ధు నవతారముగాఁ దలఁచుటకు సంశయించి, హృదయ దౌర్బల్య మను యవనికను జించివైచి, బుద్ధుఁడు నొకమానవుఁడే యని ప్రకటించి యుండును. కాని, భక్తిజ్వాలను రగుల్కొల్పఁజాలని మతము, మూర్ఖమైనఁ బొందవలెను లేదా రణము నైన ననుభవింపవలెను.

ధర్మరంగమునందు, లోకసంబంధము లేకుండుట వలనఁ గలుగు దుష్ఫలితములతోఁ గూడిన సన్న్యాసిమతము, మానవ సహజము లైన వాంఛాసుఖములను బలవంతముగా నణఁచివే యువిధానము, ప్రకృతిస్వభావమును రూపుమాపఁగోరు నిరర్థక ప్రయత్నము, తీవ్రాసంతృప్తి హేతువులైనవి. మానవుఁ డేప్రపంచమునుండి పలాయన మొనర్పఁదలఁచెనో దానికి బంధింపఁబడియున్నాఁడు. ఆత్మ కానిదానికి దాస్యమునుండి విముక్తి యనఁగా నాత్మనాశనమే యైనచో, మరణమే మనకుఁ బరమ లక్ష్యమగును. మోక్షమనఁగా, నాత్మేతరమును జయించుటే కాని, యాత్మనాశనమని బుద్ధుని భావము కాదు. మహాయాన మతస్థులు బుద్ధుఁడు తపోవిధానము నుపదేశింప లేదందురు. బుద్ధుఁడు నిర్వాణముపొంది, కన్నులుమూసికొని కూర్చుండ లేదు. జ్ఞాననేత్రములతో నాతఁడు లోకమునుజూచి, లోకము ముక్తి మార్గమునుబట్ట జ్ఞానదీపమును జూపినాఁడు. "సిద్ధిపొందనివానికి నేను రక్షకుఁడను; ముక్తిమార్గమున యాత్రచేయు వానికి

నేను మార్గదర్శకుఁడను; నౌకను; వినిర్మలకాసారమును, సంసారసాగరమున కవ్వలియొడ్డుఁ జేరువారికి సేతుబంధనమును. అంధులకు నేనొక దివ్వెను, అలసులకు నేను విశ్రమించుపాన్పును; నాసేవను గోరువారికి నేను బానిసను.” ౧. నిర్వాణమనగా జీవనాశనమని హీనయాన మర్థకల్పనము చేసినది. నాశనమును లక్ష్యముగాఁగొని కౌఁగిలించుకొను స్వభావము మానవసహజలక్షణము గాదు.

హీనయాన నాస్తికతత్త్వము జనసామాన్య మతముఁ గాఁజాలదు. బౌద్ధమతము విశ్వవ్యాప్తమై, జనసముదాయముఁ నాకర్షించినపుడు, హీనయానము నిష్ప్రయోజనమైనది. హీనయానముకంటె నుదారమైనది; బలవత్సన్న్యాసము నుపదేశింపనిది యగు నొకమతము కావలసివచ్చినది. బౌద్ధమతము దేశమందెల్లెడలను, దేశాంతరములందును వ్యాపించినపుడది దేశమునలేని సనాతన మతమునకు విరోధమును విడిచిపెట్టి, అనేకనూత్నరూపములను ధరించినది. మహాయాన బౌద్ధమతారంభకాలమునందు, విదేశములనుండి, అనాగరికజాతులు దేశమందుఁ బ్రవేశించి, నూతనోద్యమహేతువులయ్యెను. అల్పనాగరికతగల జాతులు పంజాబులోఁ గొంతభాగమును, కాశ్మీరము నాక్రమించెను. ౧. ఈ దేశాంతరులలోఁ సిథ్యనుండి,

(౧) బోధిచర్యావతారము.

౧. చైనాదేశమున వ్యాపించినది మొదట హీనయానమో, మహాయానమో నిర్ణయింపఁబడలేదు. కాని క్రమముగా మహాయాన పద్ధతి పరిణమంది, నేఁటికి నున్నతస్థాన మాక్రమించి యున్నది.

తాము జయించిన బౌద్ధుల సంస్కృతి విజ్ఞానములను, భాషా మత నాగరికతలను స్వీకరించిరి. నాటి రాజులలో నగ్రగణ్యుఁడగు కనిష్కుఁడు బౌద్ధుఁడయ్యెను. అధికార కేంద్రము తూర్పు భాగమునుండి పశ్చిమమునకు మారెను. పాళీభాషస్థానమును సంస్కృతమాక్రమించెను. నాగరికతా శూన్యులైన జాతులు బౌద్ధమతస్వరూపమును దమకు నచ్చినరీతిని మార్చుకొని యంగీకరించిరి. ఉత్కృష్టమైన బౌద్ధమతమును, వారి లఘుప్రజ్ఞా సీమకు సరిపోవునట్లు కల్పించుకొనిరి. మహాయాన బౌద్ధమునకు బ్రాహ్మణ మతమునకు సిద్ధాంతములలో విశేష భేదములున్నను మహాయానమతము దాల్చిన రూపము ప్రజలిదివఱకు విననిది కననిదికాదు. పూర్వబౌద్ధము ప్రకటించిన కొన్ని నిరుత్సాహకర భావములను విసర్జించి, ప్రజాహృదయము నాకర్షించు మతతత్త్వమును బ్రదర్శింపకున్నచోఁ దాను జయప్రదము కాఁజాలదని మహాయానము నిశ్చయించెను. హిందూమతమునకుఁ జెందిన యోగతత్త్వము, ఉపనిషత్తత్త్వము, భగవద్గీతా తత్త్వము, నెట్లు పురాణ నవీనభావ సామరస్యములను గల్పించి ప్రజాహృదయమును జూరఁగొనినవో, యట్లే తానును జేయుట యుక్తమని మహాయానము విశ్వసించెను.

దేవునిఁగూర్చియు, నాత్మనుగూర్చియు, మానవుని పరమార్థమునుగూర్చియు మహాయానమతము కొన్ని సుప్రసిద్ధ భావముల నిచ్చినది. "పూర్వబౌద్ధమైన హీనయానముకంటె నధికతరమైనదని చెప్పుటకు మహాయానమని తదనుచరులు నామకరణమొనర్చిరి. జ్ఞాన భక్తి విశ్వాసములవలన సర్వలోక

సర్వజీవులకు మహాయానము ముక్తిమార్గమును జూపును. దుర్వార సంసారమున కవ్వలియొడ్డుననున్న నిర్వాణము బాహ్యమత సాహాయ్యముగాని, ఉపాసనాదికమొసఁగు మన శ్శాంతికాని యవసరములేని కొలఁదిమంది ధీరులైనవారికే సాధ్య మని హీనయానోపదేశముయొక్క సారాంశము. నియత మార్గములేని నిర్గుణ బ్రహ్మోపాసనమువలె హీనయానము దుస్సాధ్యమైనది.; మహాయానము సులభమార్గము. మానవు లందఱు వెంటనే సంసారమును, లోకబంధుత్వమును విచ్ఛేద మొనర్చుకొని సన్న్యసింపనవసరములేదు. బుద్ధుని లోకసంతా నమున కవసరమైన రీతిని ధర్మకాయమును మార్చినదని మహా యానము చెప్పినది; ఆత్మసాధనమునందు వృద్ధులైనవారికే హీనయాన ముపకరించును. మోక్షజ్ఞానము ప్రధానమైనద నియు, నాత్మసాధనము వ్యక్తిగతమనియు హీనయానాభిప్రా యము; నిర్వాణ రహస్యస్వరూపమునుగూర్చి యది ప్రసం గింపఁదలఁచుకొనలేదు. మహాయానము భక్తికెక్కువ ప్రాము ఖ్యమునిచ్చి, సర్వజీవకోటికి నిర్వాణముపొందుట కనకాశ మున్నదనియు, నిర్వాణమనఁగా నైకైక సత్స్వరూపమనియు, నది మనవ్యవహారానుభవములోఁగల జీవాత్మయందు నేలక్షణ ములును లేని శూన్యగుణరూపమనియు వక్కాణించినది." ౧. పవిత్రమైన బుద్ధోపదేశమును లోకావసరముల నిమిత్తమై మహా యానము కలుషితమొనర్చినదని హీనయానము భావించినది.

(౧) ఆనందకుమారస్వామి బుద్ధుఁడు, బుద్ధఘోష, పుటలు. ౨౨౬– ౨౨౭.

ఎట్లైనను, పరమార్థసాధనమునకు జ్ఞాన ముత్తమమార్గమని లోకమునకు హీనయానము బోధింపఁగా, మహాయానము, మనము లోకమునందు సత్కార్యానుష్ఠానముచే నూత్న సాంఘిక మతాదర్శములను బ్రకటింపవలెనని యుపదేశించినది. ప్రకృత్యతీతమైన దేదియును లేకుండుట, ఊహాసంతృప్తి కవకాశము లోపించుట, జీవిత ముఖ్యసమస్యలను నిరాశాతత్త్వముతో సవరింపఁజూచుట, నిర్వాణమనఁగా నాశనమని యుపదేశించుట ధర్మజీవనమనఁగా, కేవల మతవైరాగ్యమనుట, వీనివలన హీనయానము కొలఁదిమంది పరిజ్ఞానవ్రతులకే యుపయోగించు మతమైనకారణముచే, భక్త్యుపాసనా పరతంత్రుల సంతృప్తికై, యొక నూతనోద్యమ ముదయించుట కవకాశమేర్పడెను.

## ౪—మహాయానతత్త్వము

ముందు మనము మహాయాన సామాన్యతాత్త్విక సిద్ధాంతములనుగూర్చి వివరించి, తదంతర్గతములైన శూన్యవాద మనఁగా సర్వము శూన్యమనువాదమును, విజ్ఞానవాద మనఁగా విజ్ఞానేతరప్రపంచము శూన్యమను వాదమును వానివివరములను భావిప్రకరణమందుఁ బరిశీలింతము. హీనయాన మాత్మ యనగా క్షణికదశాసముచ్చయము లేక స్కంధసమూహమని చెప్పఁగా, నీ స్కంధములు నసత్యములేయని మహాయానము వచించును. దీనియర్థము సత్యమైనదేదియు లేదనికాదు. మూలాధారమైన సత్పదార్థ మొకటున్నదని యంగీకరింపఁబడెను. దీనికే 'భూతతథతా' లేక 'సత్సారమని' పేరు. దీని మత సూత్రములకు ధర్మకాయమని నామముగలదు. అన్ని పరస్పర

విరుద్ధభావముల సమున్నత సమన్వయరూపమే యిది. విచ్ఛిన్న హృదయుల కిది యనంతశాంతినిచ్చునది కావున నిర్వాణ మనియుఁ బిలువఁబడెను. ఇదియే బోధి లేక జ్ఞానము. ఇదియే ప్రపంచక్రమమును నడపి, సర్వరూపకారణ మగుచున్నది. మహాయానతత్త్వము నద్వైతసామ్యముకలదు. సర్వజగద్వస్తువు లొకేసత్పదార్థ స్వరూపములు. సత్పదార్థస్వరూపము భాషాతీతము ననిర్వచనీయము నైయున్నది. "వస్తువులు స్వస్వరూపములు జ్ఞానమున కందుబాటులో లేనివి. ఏవాగ్రూపములు వానినివర్ణింపఁజాలవు. అవి దర్శనాతీతములు, గుణాతీతములు. అవి పూర్ణసమానత్వముగలవి; వానికిఁ బరిణామనాశనములు లేవు. ఇవన్నియు నొకేయాత్మస్వరూపములు. ఆ సత్తునకే 'తథత' యను నామాంతరమున్నది." ౧. "అప్పుడు వాక్కుగాని వాచ్యవిషయముగాని లేదు. భావముకాని, భావింపఁబడునదికాని లేదు. తథతాజ్ఞానముకలిగి, 'అహం' భావమును సంపూర్ణముగా నశింపఁజేసికొన్నచో నీ కపుడంత తృప్తి కలిగినదని చెప్పవచ్చును." ౨. సత్పదార్థము సంబంధమునకు, నహంకారమునకు, నవస్థలకు నతీతమైనది; అది స్వయంస్థితిగలిగి, సర్వాధారమై, యున్నది. అది "సర్వజ్ఞాన జ్యోతిస్వరూపము; బ్రహ్మాండదీపము, సమగ్ర యథార్థజ్ఞానము; పరమపావనమైన శుద్ధ చిత్తస్వరూపము; నిత్యము, అసంగరూపము, పవిత్రము. స్వయంప్రభుతగలది, అవినాశము, నిత్యముక్తమునైనది" 3.

(౧) సుజుకి యనువాదము; భక్తిజాగృతి. పుట ౪౬.
(౨) ,, పుట ౪౭; (3) ,, పుట ౯౬.

వ్యవహారజగత్తు సత్యముకాదు; బుద్ధికల్పితమే. అది స్వప్నమువంటిదే కాని అర్థరహితముకాదు. జగము మాయ, మరుమరీచిక, విద్యుల్లత, బుద్బుదము వంటిదని మహాయానబౌద్ధులు చెప్పుదురు. ౪. ప్రపంచములోని సర్వవస్తువులకును మూడు లక్షణములున్నవి; (౧) మూలసారము (౨) గుణములు (౩) కర్మలు, మృణ్మయపాత్రలోని మృత్తు మూలసారము, గుణము పాత్రరూపము, కర్మజలమును నిలుపుట. గుణకర్మలు జన్మమరణములకు వశమైనది; మూలసారమవినాశము. సముద్రమందలి తరంగములు పెద్దవి, చిన్నవి కావచ్చునుగాని, సముద్రజలపరిమాణము పెరుగదు, తరుగదు. ప్రపంచమంతటికి నిత్యానిత్య లక్షణములున్నవి. నిత్యము భూతతథత; ఇది సర్వకాల సర్వదేశములందుండి, సర్వాధారమై, నిత్యమై వెలయుచుండును. నిత్యమై సర్వాంతర్గతమై యున్న యీనిత్యపదార్థ ముపనిషత్తులలోని బ్రహ్మ పదార్థమే. ౫ ఇది తప్ప వేఱొక—పరమార్థము లేదు. కాని తాత్త్వికసత్యమైన సంస్మృతిలేక జగత్తునందు, ఏకమైన సత్పదార్థమనేకమై నామరూపములు దాల్చినది. సత్పదార్థమవస్థాతీతము, నవస్థాంతర్గతములునైన రెండు రూపములను గలిగి యున్నది. ప్రపంచస్థితినిగూర్చి మహాయానము మధ్యేమార్గము

(౪) లలితవిస్తారము. (౫) మహాయాన మతస్థులు తమ భావములు ఉపనిషద్భావములతోఁగల సామ్యము నెఱిఁగియున్నట్లు తోఁచును. లంకావతార సూత్రమిట్లుచెప్పినది; 'ఆత్మ సిద్ధాంతమునందు గాఢవిశ్వాసము గల వారిని మనమతమున కాకర్షించు నిమిత్తము, పరమసత్యము తథాగత గర్భమందున్నదను భావము కల్పింపఁబడినది.'

నవలంబించినది. జగత్తు సత్యమునుగా దసత్యమును గాదు. అనుభవములో లోకము నిజముగానున్నదికాని, పరమార్థమున లేదు. తరంగములున్నవి; నిత్యములుగావు. ప్రపంచమొక యనిత్యదృశ్యము, పరిణామవశమైనది. సత్పదార్థము సర్వాంతర్గతమై యున్న కారణమున, బ్రతివస్తువు వస్తుతః పూర్ణవస్తువే; మతభాషలోఁ బ్రతివ్యక్తియు స్వస్వరూపమున బుద్ధుఁడే. అవతంసకసూత్రమిట్లు చెప్పుచున్నది. "ప్రతిప్రాణియందును తథాగతుని పూర్ణజ్ఞాన మిమిడియున్నది. అజ్ఞానభావములవలనను, మమకారములవలనను దీనిని జీవుఁడు తెలిసికొనలేకున్నాఁడు." పరమాత్మయొక్క వివిధరూపములే జీవులు. తరంగముల మూలద్రవ్యము జలమైనరీతిని జీవుల స్వస్వరూపము తథత. కర్మపరంపరలకు వశమైనదహంకారము; ఇది అవినాశమైన యాత్మగాదు. అనిత్యమైన జీవాత్మలో సత్స్వరూపమున్నది. అట్టే సృష్టిలోని సర్వద్రవ్యములందు జననమరణాతీతమైన సత్స్వరూపమున్నది. "ఒకజీవమునందే, ముక్తాత్మయు, సంసారగతాత్మయు నున్నవి. రెండు నవినాభావసంబంధముగలిగి, విడిగా నుండఁజాలవు." ౧.

ప్రపంచోత్పత్తి మాయామూలుగా నుపమానములచేఁ జెప్పఁబడెను. ప్రపంచమునకుఁ గారణ మవిద్య. మన యహంభావజన్యమైన యవివేకముచే సర్వవస్తువులు వ్యక్తిత్వమును గలిగియున్నవనుభ్రాంతి జనించుచున్నది. మన అహంభావము నశించినచో, లోకములోని వ్యక్తిత్వలక్షణములన్నియు నదృశ్య

౧. సుజూకీ; భక్తిజాగృతి. పుట ౯౯.

ములగును. అపుడు వస్తురూపమునఁగల లోకము నదృశ్యమగును. ౨. వస్తుతః శుద్ధ ముక్తస్వరూపములైన జీవమానస మజ్ఞానవాతోపహతిచేఁ జలించి, భిన్న మానసరూపములు దర్శింపఁబడుచున్నవి. మనస్సు, అజ్ఞానము, భిన్నవ్యక్తిత్వ భ్రాంతియు నిత్యపదార్థములుగావు." ౩. జీవత్వముకాని బాహ్యప్రపంచముకాని సత్యములుగావు. "అహం" భావము నిర్మూలింపఁబడినప్పుడు,మన మేకము నద్వితీయమునగు నాత్మనిత్యమై శాశ్వతమై, అవినాశమై, సర్వవస్తు మూలరూపములను దనయందుఁ గలిగి, ప్రకాశించుటఁ గాననగును." ౪. ప్రపంచము నిజముగా లేదు; అజ్ఞానముచే నది చూపట్టుచున్నది. అభావరూపమైన యీ యజ్ఞానమెచటనుండి జనించినది ? దీనికి సమాధానములేదు. అది యెట్లోయున్నది; శాంతస్వరూపమైన సత్పదార్థమును జలింపఁజేసినది;ఏకసత్పదార్థము నేకమై,సంసార చక్రము తిరుగుట కారంభమైనది. ఈయవిద్యాశక్తి, సత్పదార్థమందున్నదని భ్రాంతివశులమై యూహించినాము. వ్యవహార

---

౨. ,, ,, పుట ౩౬.

౩. సుజుకి పుట ౬౫.

౪. సిద్ధావస్థలో సర్వవస్తువు లేకేసత్యస్వరూపములని దర్శింతుము. అశ్వఘోషుఁడిట్లు వ్రాసినాఁడు: "మిథ్యారూపములన్నియుం సృష్ట్యాదినుండియు నష్టేయున్నవి. వానిమూలశక్తి ఆత్మయే. అజ్ఞానులు వస్తుసంగదోషముచే సర్వవస్తువులు పరమార్థరూపములని తెలియలేకున్నారు. బుద్ధతథాగతులు నిస్సంగులగుటచే, వస్తుస్వస్వరూపములను దిలకించి, అహంకారనాశనమొనర్చి, సర్వజ్ఞత్వముఁ బొందుదురు." (సుజుకి. భక్తిజాగృతి పుటలు ౬౦; ౪౨౬.)

జగత్తు, ఆత్మ, అవిద్యావశమున గోచరించిన రూపము. అవిద్య అనిత్యమైనదైనను, నేదోరూపమున తథతయందుండనలెను. అవిద్య, అగాథమైన సత్పదార్థగర్భాంతమందలి యొక నెరసుగా నశ్వఘోషుఁడు వచించినాఁడు. అదియే విజ్ఞానమని యూతఁ డూహించెను. ఈవిజ్ఞానజాకృతియే స్వయంపూర్ణమైన తథత నుండి ప్రపంచోత్పత్తి కారంభమైన ప్రథమసోపానము. అప్పుడు విషయీ విషయభేదము లుదయించినవి. మూలసత్పదార్థమొక్కటే; అందు ద్రష్ట, దృశ్యము నేకమైనవి. అది శూన్యముమాత్రము కాదు కాని, తర్కబుద్ధి దానిని వర్ణింపఁజాలదు. బోధిదశనుండి మనము బయటకువచ్చినంతనే, వైవిధ్య వైరుధ్యములతోఁగూడిన లోకమునఁ దిరిగి గోచరించును. అవిద్యయే ప్రపంచోత్పత్తి కారంభకారణము. మనబుద్ధిశక్తి ననుసరించి 'అభావ' స్వరూపమైన అవిద్య సత్పదార్థ గర్భమందున్నదని చెప్పవలెను. ఎందుచేత ? అట్లున్నదిగనుక; మణి పద్మమునందున్నది; ౧. స్వయంసృజనశక్తి సత్పదార్థమునందున్నది. పారమార్థికముగా, సత్యాసత్యములొకటే. అవి యొకేవస్తువుయొక్క రెండుముఖములు, ప్రపంచము సత్పదార్థముయొక్క రూపాంతరముగాకున్న యెడల, నది పూర్తిగా నర్థరహితము, నసత్యమునగును. జన్మ మృత్యు ప్రవర్తనసంగము సత్పదార్థముయొక్క బాహ్యప్రకటనము. సత్పదార్థము దేశకాలములలో దృశ్యమానమగుచున్న ప్రపంచరూపము. పరమసత్యమైనది సర్వసత్త్వము లేక సర్వాత్మస్వరూపము, "ఈ

(౧) ఓమ్ మణిపద్మేహుమ్.

శుద్ధరూపము, జననమరణాత్మక సంసారమై, సత్త్వము, గుణము కర్మరూపమున మహాయానము లేక మహాసత్త్వమగుచున్నది. (౧) మొదటిసత్త్వముయొక్క మహత్త్వము. మహాయానము యొక్క మూలసత్త్వము, పరిశుద్ధాత్మరూపమున సర్వవస్తువుల లోనుండి, పవిత్రులలోను, నపవిత్రులలోనుండియు మార్పు లేనిదై, వృద్ధిక్షైణ్యములులేక, భేదాతీతమైయున్నది. (౨) రెండవది గుణమహాత్త్వము. ఇది తథాగతుని గర్భకోశము. ఇందగణ్యపుణ్యములరాశి, సద్గుణరూపముననున్నది. (౩) మూడవది కర్మమహత్త్వము. ఇది లోకసంబంధ లోకాతీత సత్కర్మాచరణ హేతువైనది. ౧.

## ౫—మహాయానమతము.

మానవుఁడు తన స్వభావమును చిరకాలము ప్రతిఘటింపఁజాలఁడు. విమర్శాదృష్టియొక్క నిర్నిరోధగమనమార్గమునకు, మానవుని హృదయావసరము లవరోధములై నిలుచును. మతగ్రంథములందే, మానవహృదయమునకు సంతుష్టినొసఁగు వాక్యములనేకములు గలవు. మజ్ఝిమనికాయము (౨౨) నందు "మార్గములందుఁ బ్రవేశింపని వారికిని" "నాయందు భక్తి శ్రద్ధలు చూపినచో" స్వర్గము లభింపఁగలదని చెప్పఁబడెను. ఇది గీతాభక్తి మార్గమునకుఁ బ్రతిధ్వనియై యున్నది. మహాయాన మిట్టివాక్యముల నాధారముగాఁజేసికొని, రక్షకుఁడైన దేవుఁడున్నాఁడని విశ్వసించును. మహాయానమతములో నేకత్వము లేదు. మతసంబంధ మూఢవిశ్వాసముల నది సహించ

౧. సుజుకి; భక్తిజాగృతి. పుటలు ౫౩-౫౪.

చినది. ఇది యెచ్చట వ్యాపించినను ఇండియా, చైనా, కొరి యా, సయామ్, బర్మా, జపాన్ దేశములలో నచటి జాతీయ మతములను సహించి, ప్రజలకు జీవితమునెడ నొక నూత్న గౌరవము, పశుపక్ష్యాదులందు దయ, దైవార్పణ బుద్ధియు ముఖ్యములని బోధించినది. ప్రజలు నైతికసూత్రముల నంగీక రించి, సన్న్యాసవర్గమునకు గౌరవము చూపినయెడల వారి మూఢమతాచారములను, బౌద్ధబోధకులు ఖండింపనవసరము లేకపోయెడిది. నీవు సత్పురుషుఁడవై యున్నంతకాలము నీవే దేవ తారాధనము చేసిన నిబ్బందిలేదు. ఎచట వ్యాపించినను మహా యానమతము పుష్టికలిగి వర్ధిల్లుట కిదియే కారణము. అది ప్రవే శించిన ప్రతిదేశమందును, నొక విశిష్టచరిత్రము, నూత్నసిద్ధాం తాభివృద్ధియుఁ గలిగినవి.

భారతదేశావరణముల దాఁటి దేశాంతర వ్యాప్తిగాం చిన బౌద్ధమత చరిత్రములెట్టివో వర్ణించుట మనకుఁ బ్రస్తుతాం శముకాదు. బౌద్ధమతము తీవ్రము, లోకవిముఖము, నాత్మ నిగ్రహామునైన నియమసంపుటితో నారంభమై, ఆలయశాసన మందిరములు శిథిలములై, కూలి, నశించుటతో నంతమొం దుటఁ జూడఁగా దాని సహనశీలము వ్యక్తమగుచున్నది. నాగరి కత, సంస్కృతియులేని జాతులు తమపద్ధతులను బోప్పింపకుండ బౌద్ధమతమును స్వీకరించి యాదరించుట దుస్సాధ్యము. మత విషయమున వ్యక్తి స్వాతంత్ర్యము నాదరించుట మహాయాన తత్త్వమునకు సముచితమైనదే. నానామతములు నొకే ధర్మ కాయముయొక్క భిన్నరూపములై, ఒకేసత్యమును దెలుపును.

ధర్మము సర్వవ్యాప్తమై నట్టియు, జీవిత పరమార్థరహస్య రూపమైనట్టియు నఖండశక్తి. ధర్మము మూర్తీభవించు ప్రయత్నములో మొదటిరూపము "ఆదిబుద్ధ" రూపము, లేక ప్రథమ కారణము, శాశ్వతమైన పరమేశ్వర స్వరూపము, ప్రథమ బుద్ధరూపము, నిస్తులము, నిరుపమానము నైనది. ౧. ఈయాది బుద్ధస్వరూపమైనను, జీవితానుభవములతో సంబంధము కాని, తాను సృజించిన లోకముతో సంబంధముకాని కలిగినదికాదు. మహోత్కృష్టజ్ఞాన ప్రేమసాగరులగు బుద్ధులే లోకసంరక్షకులు, గతములో నిట్టి బుద్ధులసంఖ్య గణనాతీతము, నట్లే భావి కాలమునను వీ రగణితసంఖ్యాకులై వెలయుదురు. ప్రతిమానవునకు బుద్ధత్వమే లక్ష్యముగాన బుద్ధు లనేకు లుండుట కవకాశ మున్నది. వీరు తమ మోక్షసిద్ధి హస్తగతమై యున్నదని యెఱిఁగి, లోకసేవచేయుట కొఱకు సిద్ధి పొందకుందురు. ఈబుద్ధరూపము లన్నియు తాత్కాలికములైన యేకసత్పదార్థముయొక్క భిన్న రూపములు. గౌతమబుద్ధుఁ డట్టి పరమేశ్వరావతారములలో నొకఁడైన ధర్మావతారము. అతఁ డేకమై, అద్వితీయమైన సత్స్వరూపుఁడు గాఁడు; అనేక దేవతాస్వరూపులలో నాతఁ డొకఁడు. అమృతాభుఁ డొకవైపునను, దన కటాక్షముచే భక్తుల రక్షించుచున్న అవలోకితేశ్వరుఁ డింకొకవైపునను గూర్చుండి

---

౧. సూత్రాలంకారుఁ డాదిబుద్ధసిద్ధాంతమును ఖండించినాఁడు. విశేష పుణ్యజ్ఞాన సంభారము నార్జించినకాని బుద్ధత్వము ప్రాప్తింపదనియు నం దుచేఁ జాలకాలము గతించినఁగాని ఆదిబుద్ధుఁ డుండుట సాధ్యముకాదనియు విమర్శింపఁబడెను.

యున్నారు. ౧. పరమేశ్వరుఁడు భిన్నమానవుల కవసరమగు భిన్నరూపములలో గోచరించును. "జీవుల భిన్నదశలను, మనః ప్రవృత్తులను స్వభావముల ననుసరించి, ధర్మమునే ననంతరూపములలోఁ బ్రదర్శించుచున్నాను." ౨. వైదికదేవతలు చాల మంది పరమేశ్వరుని భిన్నరూపము లగుదురు. నాగార్జునుఁ డుపదేశానుష్ఠానములచే హిందూదేవతలైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, కాళికాదేవియు హిందూశాస్త్రములలోఁ జెప్పిన గుణములను గలిగియున్నవి కావునఁ బూజింపవలసినవని యుపదేశించెను. సంప్రదాయసిద్ధములైన హిందూదేవతల నొక నూతనపరిణాళికలోఁ జేర్చి, వారికి నిర్ణీతస్థానములు, నధికారములు నిచ్చిరి. 3. అనేకసంఖ్యగల బోధిసత్త్వులను, దేవతాశ్రేష్ఠులను, మునివర్గములను గలిగియుండుటచే నీమతమును మహాయానమని పిలిచిరి. వీరిలోఁ జాలమంది వైదికార్య

(౧) అశ్వఘోషుఁడు, సుజుకి యనువాదము. ఫి. క్రి. బాగ్చి. పుటలు

(౨) పోల్చు. భగవద్గీత ౯౫. ౪౪; సద్ధర్మపుండరీకము. ౨౬.

(3) ఇంద్రుఁడు శతమన్యువు, వజ్రపాణియునై, స్వర్గాధిపతియైన త్రయస్త్రింశ లోకాధిపతియయ్యెను. బ్రహ్మ మహాబ్రహ్మయు స్థానపతిగా మారెను. సరస్వతి యాతని భార్యలలో నొకతెగా నేయున్నది; లక్ష్మి యింకొకభార్య. అవలోకితేశ్వరుఁడు లేక పద్మపాణి, విష్ణువు లేక పద్మనాభుని గుణములను గలిగియుండెను. విరూపాక్షనామము శివనామములలో నొకటి; కాని బౌద్ధపురాణములో నాతఁడు నాల్గు చక్రవర్తులలో నొకఁడు. గణేశుని వినాయకునిగాను, రాక్షసుఁడైన వినటకునిగానుగూడఁ దీసికొనిరి. సప్తర్షులు సప్తతథాగతులు. అజితుఁడు, అవలోకితేశ్వరుఁడు శాక్యమునియుఁ గలిసి దేవతాత్రయమయ్యెను.

దేవతలే, స్వల్ప నామభేదములతో బౌద్ధదేవతలైరి. భక్తి మార్గమున కున్నతస్థాన మిచ్చియుండుటచే, యోగ తంత్ర విధానములు విశేషముగా నందుఁ జేయుట కవకాశ మేర్పడెను.౪.

మహాయానాద్వైత తత్త్వము, బహుదేవతారాధనము నకుఁ దావిచ్చినదికాని, దేవతావర్గమంతయు నేకపరమేశ్వరుని భిన్నరూపములని స్పష్టపఱచిన విషయమును మనము మఱవరాదు. ఈ దేవతల యేకత్వము మహాయానస్థుల త్రికాయసిద్ధాంతముతోఁ గలిపినచో మనకు విషయము సువిదిత మగును. కాలావస్థాతీతమైన యాత్మతత్త్వధర్మమే ధర్మ కాయము. ఏకైకచారిత్రపురుషుఁడగు బుద్ధునిగా గోచరించి నది సగుణవ్యక్తిత్వముగల యీశ్వరుఁడుగాఁడు; సర్వాంతర్గత మైన మూలాధారశక్తి, యెట్టిమార్పును లేకుండ బహురూపముల ధరించినది. ధర్మకాయ ముపనిషత్తుల నిర్గుణబ్రహ్మమునకు సరిపోవును. అది కేవల ధర్మశరీరముకాదు; సర్వస్థితిమూల మైన అనంతసత్పదార్థము. ౧. ఇది నామరూపములను ధరించి సంభోగకాయమైనది. ఇందలిమార్పులేని సత్పదార్థము భోగ కర్తయైనది. నిర్గుణబ్రహ్మ యీశ్వరుఁడుగా మాఱెను. అతఁడు స్వర్గాధిపతియు నామరూపధారియునగు దేవుఁడు, సర్వజ్ఞుఁడు, సర్వస్వరూపి, సర్వశక్తివంతుఁడు, సర్వబుద్ధుల కగ్రగణ్యుఁ

(౪) పోల్చు. కల్నల్ వాడెల్ వర్ణము. మహాయానబౌద్ధము యోగ తంత్రము, నాస్తికతర్కమునని చెప్పెను.

౧. దీని నామాంతరముల వలన నిదిస్పష్టమగుచున్నది. స్వభావకాయ ము; తత్త్వము; శూన్యము: నిర్వాణము; సమాధికాయము.

డైన యాదిబుద్ధమూర్తి, మనము నిర్వాణకాయమున కేతెంచు నప్పటికీ, యేకైకక్రియాశక్తియొక్క రూపములుగా నవతారములను గాంతుము.

ప్రతి బుద్ధుఁడు త్రికాయస్వభావమును గలిగియుండును. బుద్ధుని సహజస్వభావము బోధిలేక జ్ఞానజ్యోతి, కాని యాతఁడు పూర్ణనిర్వాణము నొందువఱకు బోధిసత్త్వరూపమున సంభోగకాయమును గలిగి కర్మఫలముల ననుభవించు చుండును. చరిత్రలోఁ జూపట్టిన బుద్ధులు, నిజముగానున్న బుద్ధులే, స్వర్గలోకాధిపతులై, మానవకోటిని రక్షించు నిమిత్తము భూలోకమున నుదయించిరి. "బుద్ధపరంపరలో నేనొకఁడను. నాకుఁ బూర్వము చాలమంది యుండిరి;ముందు ననేకులు జన్మింతురు. దౌష్ట్యదౌర్జన్యములు లోకమున మితిమీఱినపుడు, భూమిపై ధర్మరాజ్య సంస్థాపనార్థము బుద్ధుఁ డుదయించుచుండును." ౧. "బహుజనులకు మోక్షమిప్పించుటకును, సుఖప్రాప్తి లభింపఁజేయుటకును, లోకులపై నమితకృపచే, మానవకోటికిని దేవతావర్గమునకు నానందప్రదాత, మోక్షాశీర్వచన వదాన్యశేఖరుఁడునై మహాత్త్వసంపన్నుఁడగు బుద్ధుఁ డుదయించును." ౨.

మహాయాన మతవిధానములను బరిశీలించినచో, భగవద్గీతా మతమునకును దీనికిని భేదమేమియును గోచరింపదు. సర్వోత్కృష్టమైన ధర్మకాయతత్త్వము, గీతయొక్క బ్రహ్మ

౧. పోల్చు. గీత. ౪అ. ౭,౮.

౨. అంగుత్తరనికాయము.

తత్త్వమునకు సరిపోవును. కృష్ణుఁడు తాను బరదైవతమని చెప్పు కొనినట్లే, బుద్ధుఁడు నద్వితీయబ్రహ్మమని చెప్పఁబడెను. బుద్ధుఁ డొక సామాన్యదేవుఁడు కాఁడు; దేవాతిదేవుఁడు. 3. బోధి సత్త్వులందరి నాతఁడే సృజించును. ౪. గయాక్షేత్రమందు బుద్ధుఁడు బోధిజ్ఞానము పొందెనని తలఁచువా రజ్ఞానులు. "నేను స్వయంసంభూతుఁడనగు జగత్పితను. మూర్ఖతచే నపసవ్యజ్ఞా నులగు వారు దీని నెఱుఁగరు కావున, నేను మృత్యువశుఁడనై నట్లు నటింతును." ౫. బుద్ధుఁడనాది పురుషుఁడు. దహింపఁబడు చున్న గృహోపమానముచే మానవకోటియందాతనికిఁ గల యనంతప్రేమ నిరూపింపఁబడెను. ౬. సర్వజీవరాశియు నాతని సంతతి. ౭. "లోకత్రయము నగ్నిజ్వాలయందు నిడిచి, వనై కాంతసీమ తథాగతుఁడు ప్రశాంతచిత్తుఁడై యుండి, మూఁడు లోకములు నారాజ్యము; సర్వజీవులు నాబిడ్డలు; ప్రపంచమం తయు దుర్భరదుఃఖాలయమై యున్నది; వారిమోక్షముకొఱకు నేనే ప్రయత్నించి సాధింతునని తలఁచుచుందును." "నన్ను నమ్మినవారికి శ్రేయఃప్రదుఁడను; నన్ను శరణుఁజొచ్చిన వారం దఱు నామిత్రులు." ౮.

3. సద్ధర్మపుండరీకము, ౭౮, 3౧
౪. " " ౧౪౮.
౫. " " ౧౫. ౨౧: భ.గీ. ౪,౯
౬. పద్మము. 3౮; మహావగ్గము. ౧౮ ౨౧.
౭. పద్మము. పుట ౮౯.
౮. లలితవిస్తారము. ౮౮. పోల్చు భ.గీ. ౭. ౧౬.

కాయత్రయ సిద్ధాంతమునకు వ్యక్తిగతార్థము చెప్పఁబడినది. సర్వజీవులందు ధర్మకాయమున్నది; దానిపై సంభోగకాయమున్నది; అనగా నాత్మ అహంకార వ్యక్తిత్వమును బొందినది; కలుషితచిత్తరూపము మూఁడవదైన నిర్మాణకాయము.

## ౬—ధర్మశాస్త్రము.

హీనయానమున కర్హతపదవివలె, మహాయానమునకు బోధిసత్త్వపదవి నార్జించుటే ధర్మలక్ష్యము. బోధిసత్త్వుఁడనఁగా "పూర్ణజ్ఞానసత్త్వము గలవాఁడని" యర్థము, కాని చారిత్రకముగా "పూర్ణజ్ఞానము పొందుమార్గముననున్న వాఁడనియుఁ, గాఁబోవు బుద్ధుఁడనియు" నర్థము, గౌతమబుద్ధుఁడు సత్యాన్వేషకుఁడైనప్పు డీపదమాతనికి మొదటిసారి వాడఁబడినది. కాఁబట్టి యీజన్మమునఁగాని భవిష్యజ్జన్మములలోఁగాని బుద్ధపదార్హత గలవానికీశబ్దము వర్తించును. నిర్వాణసిద్ధితో భూలోకసంబంధము పూర్తిగా నశించును. బోధిసత్త్వుఁడు దుఃఖపంక మగ్నమైన మానవజాతి యందమితదయారసముచే నిర్వాణసిద్ధి నందుట కిచ్ఛగింపఁడు. దుర్బలమానవుఁడు, దుస్సహదుఃఖవశుఁడై యొక మార్గదర్శకునిఁగోరును; నిర్వాణమార్గమునఁ జరింపనర్హులగు నీమహాత్ములు, మానవులను నిర్వాణమార్గమునకు నడపింతురు. హీనయానాదర్శమైన పూర్ణనివృత్తి లేక అర్హతత్త్వము, నిస్సహాయుఁడై యొంటరిగా నిర్వాణమునకుఁ జేయు ప్రయాణము, దీనివలనఁ గలుగు నానందము, మహాయానము నను

కరించి, యాత్రికునికి మారుఁడు కల్పించు నాకర్షణమని చెప్పఁబడెను. ౧.

బుద్ధత్వము నార్జించు కోరికగలవాని జీవితము పూర్వబౌద్ధమునం దష్టవిధమార్గముగా వివరించియుండఁగా నిందు దశభూములు లేకఘట్టములుగా వర్ణింపఁబడెను. బోధి లభించునను భావమునుదయించిన ప్రముదితాభావము మొదటి ఘట్టము. ౧. ఈఘట్టమునందే బోధిసత్త్వుఁడు, తన భావిగమనమును నిర్ణయించు నమోఘప్రతిజ్ఞలను లేక ప్రణిధానముల నొనర్చును. భూలోకమందున్న సూక్ష్మతమ రజోలేశము కూడ ముక్తి పొందనిదే నేను నిర్వాణమును బొందనని చేయు నవలోకితేశ్వరుని ఘోరప్రతిజ్ఞ యిట్టిదే, హృదయము శుద్ధమై జీవభ్రాంతి నశించినచిత్తము లభించు నంతర్దృష్టి క్రమముగా వికసించును. వస్తువుల అనిత్యత్వమును గుర్తించుటవలన జిజ్ఞాసువుయొక్క భూతదయ పెంపొంది, హృదయనైర్మల్యము సిద్ధించును. ఈదశలో ధర్మాచరణము, విచక్షణశక్తియు వృద్ధిపొందును. తరువాతఘట్టములో బోధిసత్త్వుఁడు, క్రోధద్వేషవిపర్యయాదుల నశింపఁజేయు వివిధభావనములందు నిష్ఠాగరిష్ఠుఁడై భక్తి, దయ, దానము, నిష్కామత్వములను బెంపొందించు

(౧) అష్టసాహస్రికా ప్రజ్ఞాపారమితము ౧౧ అ.
మనోహరవాక్యములలోఁ జెప్పఁబూనినచో, సృష్టిలోని జీవరాసులన్నియుం ముక్తిపొంది, తుదకొక గొద్దింక, అసంతుష్టప్రేమబద్ధమై నిలిచియున్నచోఁ బోధిసత్త్వుఁడు విచారించునుగాని, అర్హంతుఁడు తనధ్యానమునుండి చలింపఁడు.

(౧) చిత్తోత్పాదము.

కొనును. ఇది ప్రభాకారియను మూఁడవఘట్టము; ఇందు జిజ్ఞాసువు సహనశీలప్రకాశమును గలిగి వర్తించును. బోధి సత్త్వుఁడిచట, నహంకారాంకురములన్నియు నశించుకొలఁకు, సత్క్రియాచరణమునందు సుశిక్షితుఁడై, బోధిపక్షధర్మము లను సంపాదించును. ఇది నాల్గవదియైన అర్చిష్మద్దశ. ఇఁక నాతఁడు సత్య చతుష్టయమును సక్రమరీతి నర్థము చేసికొను టకై, శ్రవణమననములందుఁ గృషిచేయును. ఇది పంచమ సుదుర్జయఘట్టము. ధ్యానసమాధులిందు ముఖ్యములు. ధర్మా చరణ ధ్యానముల ఫలితముగా బోధిసత్త్వుఁడు ప్రపంచోత్పత్తి తత్సార శూన్యత్వములను గ్రహించును. ఇది అభిముఖి ఘట్టము. ఇచ్చట ప్రజ్ఞ ప్రధానము. కాని యింక నాతఁడు నిష్కాముఁడుకాలేదు. తాను బుద్ధుఁడుకావలెననియు, మానవ కోటిని రక్షింపవలెననియుఁ గోర్కెలుగలిగియుండును. సర్వ జీవ మోక్షమును సాధింపఁగల జ్ఞానసంపాదనమున కాతఁడు కృషిచేయును. ఇది సప్తమమైన దూరంగమఘట్టము. అతఁడు ప్రత్యేక కాంక్షలను విడుచుటచే, వస్తువ్యామోహము నశించి, అచలుఁడగును. ఇదియే అష్టమఘట్టము. ఇందాతఁడు "అను త్పత్తిక ధర్మచక్షువై" తథాగతగర్భస్థములై సర్వవస్తువులునున్న వని దర్శించును. ఇచట బోధిసత్త్వుని ప్రవృత్తి స్వార్థరహితము, ద్వంద్వశూన్యమునగును. ప్రశాంతచిత్తుఁడై యుండుట కంగీక రింపక, ధర్మబోధప్రవృత్తినిమగ్నుఁడగును. ఇది సాధుమతీ మార్గమైన నవమఘట్టము. ఇందాతఁడు పూర్ణనిష్కాముఁడై పనిచేయును. గౌతమబుద్ధునిగూర్చి యిట్లు చెప్పఁబడినది; ఈ

యిహలోకమున నేదోయొక జన్మములో, బరోపకారార్థమై తన ప్రాణపరిత్యాగముచేయుటకై బుద్ధుఁడు సంసిద్ధుఁడు కాని ప్రదేశమొక యంగుళమైనను లేదు. మహాయాన బోధిసత్త్వుఁడుపనిషత్తులుచెప్పు జ్ఞాని, క్రైస్తవమతములోని రక్షకుఁడు, నీష్టే చెప్పిన లోకోత్తరమానవుఁడు; ఏలన, స్వశక్తివలనఁ దరింపలేని లోకము నాతఁడు తరింపఁజేయఁగలఁడు. దశమఘట్టములో బోధిసత్త్వుఁడు తథాగతుఁడగును. తథాగతుఁడనఁగా ధర్మమేఘము. నిర్వాణమనగా ధర్మజీవనము. ప్రాణికోటియెడ నిరుపమాన దయాదాక్షిణ్యములుచూపుటే ధర్మజీవనము. మహాయాన మతమునను సరించి, అర్హాతత్త్వమునకుఁ బైని రెండుఘట్టములున్నవి; అవి బోధిసత్త్వ బుద్ధఘట్టములు. మహాయానమునందు బోధిసత్త్వ సిద్ధాంతమున కుత్కృష్ట ప్రాముఖ్యమిచ్చియుండుటచేఁ గొందరు దీనిని బోధిసత్త్వయానమని పిలుతురు.

దాన, వీర్య, శీల, క్షాంతి, ధ్యాన, ప్రజ్ఞలు ధర్మజీవన నియమములు, మతజీవన కాఠిన్యము సడలింపఁబడినవి. ఒక వ్యక్తి సన్న్యాసియగుట ఆతని స్వభావశీలములపై నాధారపడియున్నది. వివాహితుఁడయ్యు మోక్షముసాధింప వీలున్నది. సన్న్యాసదారిద్ర్యములు హీనయానమునందుఁ బ్రధానములే కాని, యిం దప్రధానములు, బుద్ధునుపదేశములననుసరించిన మోక్షము లభించును. దైవవిశ్వాసము భక్తియుఁగూడ ముఖ్యములే. ప్రజ్ఞాపారమితవ్యాఖ్యానములో నాగార్జునుఁడిట్లువ్రాసెను: "బుద్ధుని ధర్మసాగరమునకు విశ్వాసమే ద్వారము; ఆ సాగర

మును దరించుటకు జ్ఞానమే తరణి." మానవుఁడు తనశక్తిచే మోక్షముఁబొందు నవకాశమున్నదని మహాయానము నమ్మదు. ఒకరక్షకుని సాహాయ్య మవసరము. మనము సిద్ధిపొందిన వెనుక కాకున్నను, మార్గమున యాత్రికులమై యున్నంతకాలము పూజా ప్రార్థనాదిక మవసరము. పుణ్య పాపానుభవరూపమైన కర్మసిద్ధాంతము, విశ్వాసముచే మోక్షములభించు విధాన ములోఁ గొంతదయాన్వితమై నడచినది. శ్రావకులు లేక విను వారు, ప్రత్యేకబుద్ధులు, బోధిసత్త్వులునని మూఁడురకములవా రంగీకరింపఁబడిరి. శ్రావకులు ధర్మమును, ప్రత్యేకబుద్ధులు, జ్ఞానమును, బోధిసత్త్వులు భక్తిని స్వీకరించిరి. ౧.

సన్న్యాసమార్గమునఁ గొలఁదిమందికే నిర్వాణప్రాప్తి యున్నదని హీనయానము చెప్పఁగా, బుద్ధుని యందు భక్తి గలిగి, ధర్మాచరణము చేసిన ప్రతిమానవుఁడు, హీనకులజుఁడైనను బోధిసత్త్వుఁడు కాఁగలఁడని మహాయానము బోధించినది. మహాయానము బోధించు విశ్వజనీనమైన ధర్మమార్గము పూర్వబౌద్ధపద్ధతి కనుగుణమైయున్నది. సర్వమానవకోటికి నిర్వాణసుఖ ప్రధానమొనఁగుటయే బుద్ధుని ప్రధానోద్దేశము. "ఓ భిక్షుకులారా! మీరుపోయి అనేకుల కుపకృతిమొనర్చి, అప్రమేయకారుణ్యముతో మానవకోటిసేవ చేయుఁడు, వాగర్థముల నమూల్యమై, ఆదిమధ్యాంతములం దేకమాధుర్యరస విలసితమై ప్రకాశించు దివ్యోపదేశమును లోకులందరకును బోధింపుఁడు. హీనయానస్థులకు ధర్మమనఁగాఁ, జిత్తమును ప్రావం

౧. అంగుత్తరనికాయము. ౨౦. ౨౮౫.

చిక సుఖకాంక్షలనుండి శుద్ధియొనర్చి నిర్మలముగా నుంచుటే. కాని బోధిసత్త్వాదర్శ మున్నతభావ సమన్వితమైనది. ధర్మాచరణ ఫలితమైన పుణ్యమును పరోపకారార్థము దానమొనర్చుట యను నీపరివర్తసిద్ధాంతము ముఖ్యమైనది. జీవైకత్వము పై నాధారపడిన పరుల పాపముల భరించుటయను సిద్ధాంతము దీనివలన స్మరింపఁబడుచున్నది. ఏమానవుఁడును దనకొఱకే జీవించుటలేదు. ఒకనిగుణదోష ఫలితములు సర్వజీవకోటికిఁ జెందును.

భూమిపై నేదియు సత్యముకాదను తత్త్వసిద్ధాంతమును, పరోపకారము నిమిత్తమే మనము జీవింపవలెనను ధర్మసూత్రము నెట్లు సమన్వయించుటో యనునది మాధ్యమిక తత్త్వసమస్యయై యున్నది. మహాయానమందలి బోధిసత్త్వుఁడు, లోకమును దాను రక్షింపవలెనను వ్యామోహాబద్ధుఁడై యున్నాఁడు.

మహాయానమునందు నిర్వాణమునకంటె, బోధిజ్ఞాన విలసితమైన మునీశ్వరత్వమున కెక్కువ ప్రాముఖ్యమీయఁబడినది. నిర్వాణ మాత్మమోక్షము శాశ్వతత్వముపైఁ గేంద్రీకృతమైన సుఖస్థితియని క్రమముగా నర్థము మారినది. మరణాతీతమైన శాశ్వతానందమును గోరు మానవ హృదయమునకుప శాంతినిచ్చు నిమిత్తము బ్రాహ్మణ మతగ్రంథములందు వలెనే క్రమముక్తివిధానము బోధింపఁబడినది. బుద్ధు లిహలోకయాత్ర ముగించినవెనుకఁ గూడ నుందురని యంగీకరింపఁబడెను. నరకము నకు వ్యతిరేకమైన స్వర్గలోకము నిర్వాణమునకు బదులుగా

నిర్మింపఁబడినది. బోధిసత్త్వావస్థ ప్రాప్తించులోపున, నూర్ధ్వ లోకాంతరములలో ననేకజన్మము లంగీకరింపఁబడినవి. మహాయానము వీని కతిశయ ప్రాముఖ్యము నిచ్చి, నిర్వాణప్రాప్తిని కట్టకడకుఁ ద్రోసివైచినది. కాని తదవస్థాస్వరూపమును వర్ణింపుమని నప్పుడు, సంప్రదాయ బౌద్ధమత సమాధానములనే యిచ్చినది. నిర్వాణమనఁగాఁ బునర్జన్మరాహిత్యము, ౧ జన్మపరంపరాపాశమును ఛేదించుట, ౨. కామద్వేషాజ్ఞానములను నిర్మూలించు 3 లేక సర్వావస్థాతీతపదవి ౧ యని చెప్పఁబడెను. మనజీవితములవస్థా బద్ధములుగావున నిర్వాణము తదతీతమైనది. కాని యది స్థితిత్యభావము కాదు; అజ్ఞానమును బోనాడిన మోక్షపదవియే, బోధిసత్త్వుఁడు బుద్ధుఁడైనపుడేమి తటస్థించును? ఆతఁడు నిర్గుణ సత్పదార్థములో లయుఁడైపోవునా? లేక తన వ్యక్తిత్వమును వేఱుగా నిలుపుకొనునా? దీనివిషయమున మహాయానము స్పష్టముగాఁ జెప్పియుండలేదుగాని, రెండవ భావమునే విశేషముగాఁ బోషించినది. బుద్ధుఁడగుట యనఁగా, సత్పదార్థముతో నేకమగుటయే. పూర్ణసిద్ధినశ్వఘోషుఁడిట్లు

---

౧. పునర్జన్మనివృత్తి అశ్వఘోష బుద్ధచరితము ౧౫ అ. ౩౦

౨. నాగార్జునుఁడు.

3. రత్నకూటసూత్రము.

౧. వజ్రచ్ఛేదికా బోధిచర్యావతారము ననుసరించి, దీనిభావము లోకమును, నహంకారమును విసర్జించుటే. రత్నమేఘము యీ నిర్వచనము నంగీకరించెను. ప్రజ్ఞాపారమితము నిర్వాణమనగా మహత్తరాగాధ స్వరూపమని చెప్పినది. నిర్వాణమనగా శూన్యతయనియు, ననగా సర్వమోహములను దొలగించునదనియుఁ జంద్రకీర్తిభావము.

వర్ణించినాఁడు; "అది శూన్యప్రదేశము వంటిది; దర్పణము-
యొక్క మెఱుఁగువంటిది: అనఁగా నిత్యము, సత్యము,నుత్కృ-
ష్టము నైనది; సర్వవస్తువులకుఁ బరిపూర్ణత నిచ్చునది; అవినాశ-
మైనది; ప్రపంచములోని సర్వజీవదశలునందుఁ బ్రతిఫలించును-
దానిలో నేదియుఁ బ్రవేశింపదు; దానినుండి పోవున దేదియును
లేదు; అంతేదియు నశింపదు. అదియు నేకము నద్వితీయము
నైన నిత్యాత్మస్వరూపము; వికల్పములు దానినిఁ గలుప-
మొనర్పఁజాలవు; అది ప్రజ్ఞాసారము". నిర్వాణమనగా మహాత్మ
లేక పరమాత్మతో నైక్యభావమని యసంగుఁడు చెప్పినాఁడు-
నిర్వాణము నాశనముగాదని మహాయాన మతస్థులు సమర్థింప
నాతురము జూపిరి.

౭—భారతభూమిలో బౌద్ధమత పతనము.

బౌద్ధమతము భారతభూమిలో నదృశ్యమై పోవుటకు
ముఖ్యకారణము, వైష్ణవశైవతాంత్రిక హిందూమత శాఖలతో
దీనికిఁ గలభేదము ప్రజలకు గోచరింపకుండుటే. తన మనోజ్ఞ-
త్వముచేఁ బ్రజాహృదయమునకు సంతృప్తి నొసఁగఁగల యిం-
కొక మతశాఖ దేశములో విస్తరించియున్నది. దేవుఁడు లేఁడ-
నియు, మానవునకు మృతత్వముఁ బొందు నవకాశము లేదనియు,
జీవితమంతయు దుఃఖమయమనియు, జీవితకాంక్షయే ఘోర
దోషమనియు, మరణమనఁగా సంపూర్ణ జీవనాశనమనియు,
బోధించిన పూర్వబౌద్ధమతము, తన ప్రభావమును గోల్పోయి-
నది. మహాయానమతము పూర్వబౌద్ధమత ప్రఖ్యాతిని తిరిగి
యార్జింపలేక పోయినది; అందుచే బ్రాహ్మణ మతముతోఁ

దనకుఁ గలిగిన పోరాటములలో దుర్బలమై సంశయావస్థకుఁ బాల్పడినది. మఱియు దానివ్యాప్తి అధికమైన కొలఁదియు దౌర్బల్యమును బెంపొందినది. మూఢవిశ్వాసముల నతివిస్తారముగాఁ బెంపొందించుటచే నీనియెడ లోకుల కసంతృప్తి జనించెను. తాను వ్యాపించిన చోటులందెల్ల మహాయానము పరమతముల నణఁచివేయుటకు యత్నింపక, తన ధర్మప్రచారమును వానియందుఁ జొప్పింపఁజూచెను. అన్ని దేశములం దన్నిరకముల మనుజుల నది సంతృప్తిపఱుపఁజూచిన కారణముచే నూతన స్వర్గములను, మూఢవిశ్వాసములను విశేషముగాఁ గల్పింపవలసి వచ్చినది. పరమతములలోఁ జొత్తుచేయఁ జూచుట మహాయానమున కొకవిధముగా బలమునిచ్చి, యింకొకవిధముగా దుర్బలత్వమాపాదించెను. అశోకుని పదిరెండవ శాసనములోఁ జెప్పిన, "ఆత్మమతస్తవము, పరమతనిందయుఁ బనికి రాదు. పైగా, నితరమతముల కేకారణముచే గౌరవమున్నను మనమును దానిని గుర్తించి గౌరవింపవలెను." ఈయుదారభావము మహాయాన మత ప్రధానలక్షణమైనది. యూదులకు యూదుఁడై, ఏమతము వారి కామతస్థుఁడై, కొలఁదిమందినైనను దనమతమున కాకర్షింపవలెనని యత్నించిన సెయింట్ పాల్ యుక్తిని మహాయాన మవలంబించినది. మహాయానము దేశమున కొకరూపమును ధరించినది. ౧. భక్తిమోక్షముల

౧. బౌద్ధమతమునుగూర్చి హాక్మన్ రచించిన గ్రంథములో మహాయాన భిన్నరూపములు వర్ణింపఁబడినవి. బౌద్ధచరిత్రకారుఁడు ఆవతంసక, ధ్యాన, మంత్రశాఖలను, చైనీయుల టీంటీశాఖను జపానీయుల నిఛిరెన్ శాఖను గూడ స్వీకరింపవలెను.

కది స్థానమిచ్చుటంతో మూఢవిశ్వాసముల కన్నిటికిఁ దావిచ్చి నది. క్షుద్రారాధన విధానముల నన్నిటినో కుయుక్తులతో సమర్థింపవలసి వచ్చినది. క్షుద్రయోగప్రక్రియలు పవిత్రమైన బుద్ధుని మహోపదేశములోఁ బ్రవేశమును గాంచినవి. అద్భుతములను జూపుట, దూరశ్రవణము, భూతపిశాచాదికముల దర్శించుట మున్నగువిధానముల కాశ్రయమిచ్చె. మహాయానము నిరసించినది. ఏకాకియై, నిర్మలినాత్ముఁడై, నిరాడంబర కాషాయాంబరధారియై, రక్షాశూన్యపాదములతో, వినమ్రశిరస్కుఁడై కాశీనగరమునకుఁ బోవుచున్న యాబుద్ధుని దివ్యవిగ్రహముచుట్టును, గారడీప్రదర్శనముల నాధారము చేసికొనిన శిష్యవర్గము చేరినది. బుద్ధుని వ్యక్తిత్వమునెడ లోకమునకు గౌరవము కలిగించుటకు నిర్మలనియమ జీవనులగు బౌద్ధమత ప్రచారకులు తమ గురూత్తముని భావములకు విరుద్ధమైన చరిత్రమును గల్పించుటకుఁ గారకులైరి. బుద్ధుఁడొక మనుష్యమాతృని పుత్రరత్నమని నమ్ముటకు దుస్సాధ్యమయ్యెను. ఆతనిని దేవునిఁ జేయుటకై పుక్కిటిగాథలు కల్పింపఁబడినవి. "అనారోగ్యములైన వీరి యూహాకల్పనముల మఱుఁగున గౌతమబుద్ధుని మహనీయ ధర్మోపదేశము లాచ్ఛాదితములైనవి. క్రొత్తసిద్ధాంతముల సంఖ్య పెరిగినది. కల్పితమైన యొకభావమును సమర్థించుట కింకొకభావమును గల్పింపవలసి వచ్చినది. బౌద్ధమతాకాశమంతయుఁ ఘోరబుద్ధికల్పనములతో నిండిపోయినది. మెఱుఁగులు తీర్చిన అసత్యగాథా కల్పనముల కడుగునఁబడి, పరమపావనములు, సమున్నతములు నైన బుద్ధుని పుణ్యో

పదేశము లదృశ్యములైనవి."౧. బౌద్ధసన్న్యాసులు తమ పూర్వ ప్రబోధావేశములను గోల్పోయిరి. బౌద్ధమత సన్న్యాసివర్గము, అవినీతికరమైన పరివర్తనమునకు లోనైన పురోహితబృందము ననుకరించినది. "పవిత్రజీవితదీక్షా బద్ధులైన నిరాడంబర సన్న్యాసులు కారు; రాజప్రాసాదములవంటి మఠములు; భోగవృష్టి గల యతులు; ప్రజల ధార్మికాధ్యాత్మిక చింత నుత్సాహపఱచు నిర్మలోపదేశములు కావు; శిక్షణము, తత్త్వములను గూర్చిన కుయుక్తి ప్రసంగములు గలిగి బౌద్ధ మీమాంసితికి వచ్చినది."౨ మూఢవిశ్వాస, స్వార్థపరతా, భోగలాలసత్వములు బౌద్ధమతజీవిత కంఠపాశములైనవి. యువాన్‌చ్వాంగు భారతవర్షమునకు యాత్రికుఁడై యేతెంచి నపుడాతఁడు పూర్వబౌద్ధధర్మ మసత్యగాథాకల్పనము లనుమలిన పదార్థములచేఁ గప్పఁబడిపోయి యుండుటఁ గాంచెను. అశోకుని కాలమునందు సముజ్జ్వలమతమై, కనిష్కునికాలమున వఱకైన నుత్సాహవంతమైయుండి, తరువాత ననంతబుద్ధుల సిద్ధాంతము, వారి అయా నిజత్వతత్త్వములు మున్నగు వైచిత్ర్యములలోఁ గప్పితమైన కారణ్యములఁబడి యదృశ్యమైనది.

బౌద్ధమతము స్వీయదోషములచే క్షీణించుచుండఁగా దేశమునఁ బ్రాచీనమైన మత మూలము స్పష్టముగనే నిలిచి యున్నది. ప్రజాసామాన్యజీవితము బ్రాహ్మణమత ప్రభావమునకు వశమైయున్నది. పూర్వబౌద్ధమతమును [illegible]

(౧) రైస్‌డేవిడ్సు. బౌద్ధమతము.

(౨) హాప్కిన్సు.

దేవతలు గలరు. బౌద్ధమతములలో నవీనముగాఁ జేరినవారు తమ దేవతలయెడ గౌరవభావమునుగూడఁ దోఁచుకొనిపోయిరి. హీనయానము బ్రహ్మ, విష్ణు, నారాయణు లను నామము లఁగూడనే స్వీకరించెను. మహాయానము, హిందూసిద్ధాంతాచారముల నెన్నఁ డెదుర్కొనియుండలేదు. దేవతావర్గమును, వారి యల్పాధిక తారతమ్యముల నంగీకరించి, మహాయాన మాదిబుద్ధుని సర్వదేవతాధిపతిగాఁ జేసినది. బ్రాహ్మణులు బుద్ధుని విష్ణ్వవతారముగా గౌరవింపఁగా, బోధిసత్త్వ పద్మపాణియగు నవలోకితేశ్వరుఁడే విష్ణువని బౌద్ధులు గౌరవించిరి. మతము వ్యక్తివ్యాపారమైనది. బ్రాహ్మణమతసన్న్యాసులు బౌద్ధశ్రమణుల సోదరులే యని భావింపఁబడిరి. బ్రాహ్మణమతము, మహాయానమతము ననేకమతతత్త్వసిద్ధాంతముల నంగీకరించెను. భారతీయమానసిక సహజమైన యభినివేశ లక్షణముచేఁ, దార్శనికముగా నద్వైతము నంగీకరించి వ్యక్తిగతముగా నిష్టదేవతారాధనా స్వాతంత్ర్యము నిచ్చెను. మహాయాన తత్త్వమతములు, అద్వైతతత్త్వమును దన్మతమగు నేకేశ్వరారాధనమునకును సరిపోవును. బహుళసంఖ్యాకమైన ప్రజాసామాన్యముయొక్క అవసరముల కనుగుణముగా బోధింపవలసివచ్చుటచే మహాయానమత ప్రచారము గీతయొక్క హీన ప్రతిమాకృతి వహించెను. క్రమముగా మహాయానభావము లన్నియు హిందూతత్త్వమునందు లయమై, యవసరోచిత పరివర్తనములంది, కొంతకాలమునకు మహాయానమనఁగా వైష్ణవ

మతములోని శాఖాంతరమని తలఁపఁబడెను. ౧. సన్న్యాసివర్గమున కధిక ప్రాముఖ్య మొసఁగిన హీనయానము వైదిక మత శాఖాంతరముగా భావింపఁబడెను. బౌద్ధమతమునకుఁ దాను ప్రత్యేకముగా బోధింపవలసిన దేదియు లేకుండెను. సర్వభూత దయ, దైవభక్తి ముఖ్యము లనియు, బుద్ధుఁడు విష్ణ్వవతారము లలో నొకయవతారమనియు బ్రాహ్మణమతము ప్రచారముచేయ నారంభించుటతో భారతవర్షమున బౌద్ధమత మృతికి ఘంటానాదము ప్రయోగింపఁబడెను. బౌద్ధమతము హిందూమతమునందలి గుణదోషముల రెంటిని స్వీకరించి ప్రచురించెను. భారతవర్షీయానంతకాల సంప్రదాయశక్తి, తన సహజవిశ్వాసభావములతోఁ దిరిగి ప్రజానీకమును స్వవశముచేసికొనెను. బౌద్ధమతము హిందూమతగర్భమునఁ జేరి జీర్ణమై, యదృశ్యమయ్యెను.

బౌద్ధమతము భారతభూమిలో సకాల మృతిసందెను. ౧. మతాభినివేశముగల పురోహితబృందము రాజాశ్రయముఁజూపి, పోరాడి బౌద్ధమతమును నాశనమొనర్చెనని స్వార్థభావపరులుచెప్పు విషయము. కుమారిలుఁడు, శంకరుఁడు బౌద్ధ

(౧) బౌద్ధమతము వైష్ణవమతముగా మారినపద్ధతి పరిస్థితులను శ్రీ క్షేత్రమునఁ జూడనగును. అచట మొదట గౌతమబుద్ధుని గౌరవార్థ మేర్పరుపఁబడిన యొక దేవాలయమునందిపుడు జగన్నాథరూపమున కృష్ణుఁడున్నాఁడు. ఆలయములోఁ బచితమైనయన్నము సర్వవర్ణములవారు జగన్నాథప్రసాదముగా స్వీకరించు నాచారము పూర్వబౌద్ధాచారమూలకము

(౧) మోనియర్ విల్లియమ్సు. బౌద్ధమతము. ౫౩. అధ్యాయము.

మతసిద్ధాంతములను ఖండించినమాట నిజమేకాని, బ్రాహ్మణమతము బౌద్ధమతమునకుఁ జూపిన ప్రతిఘటనము, ప్రాచీనమతము, తనయందుద్భవించిన యొక శాఖ, నిజముగా లేని నూత్నత్వమును దనసిద్ధాంతముల కున్నదని ప్రచురించినప్పుడు సహజముగాఁ జూపుప్రతిఘటనమువంటిదే. భారతదేశము నుండి బౌద్ధమతము దౌర్జన్యముగా నశింపఁజేయఁబడినదని చెప్పు ప్రచారమాధారము లేనిగాథయే. బౌద్ధబ్రాహ్మణమతములు పరస్పరము సన్నిహితములై కలిసి, కొంతకాలమేదేమో తెలియకుండునట్లు నడచి,తుద కేకమైనవి. బౌద్ధమత పతనమునకుఁ గారణములు క్రమజీర్ణము, శాంతియు నౌదాసీన్యము లేకాని, పురోహిత బృంద కాఠిన్యముకాని, నిర్మూలన కార్యక్రమఫలితముకాని కాదు.

జీవితముయొక్క ఒకానొక క్లిష్టసమస్యవిషయములో బౌద్ధమతచరిత్రము సునిశ్చితమైనది. సముచిత తత్త్వాధారములు లేకుండఁ, బరిశుద్ధ ధర్మస్థాపనము చేయవలయు దుస్సాధ్య విధానము నది ప్రకటించినది. బౌద్ధ మతము నిరాడంబరనిర్మల ధర్మము సమితప్రభావముతోఁ బ్రచురించినను, భారత దేశమున నది నిజమైన యధ్యాత్మిక విమోచనము నొసఁగఁ జాలదయ్యెను. పూర్వబౌద్ధము ప్రాచీనసంప్రదాయ లోపములను బ్రతిఘటించు వారికందఱకును నివాసకేంద్రము నొసఁగినది. హీనయానము, తన అతిశయవాదములచే, బౌద్ధమతమందలి ప్రధానలోపములను బయటపెట్టినది. హీనయానము ప్రవర్తించిన దోషములను సవరించు నుద్దేశముతో మహాయానము

మఱియొక వక్రమార్గమును ద్రొక్కి, నిర్మలాధ్యాత్మిక జీవితము పేర మూర్ఖవిశ్వాసములకుఁ దావొసఁగి, తన్మూలమును బుద్ధుని మహత్త్వాశయములనే రూపుమాపెను. ధర్మాచరణ సూత్రమునెడ నిర్దుష్టమైన దృఢదీక్షయే బౌద్ధమత రహస్యబలమైయుండఁగా, జీవితతాత్త్విక పరమార్థలక్ష్యము నది గుర్తింపని కారణమున నది విఫలమై పోయెను.

౮—భారతీయవిజ్ఞానము – బౌద్ధమతప్రభావము.

బౌద్ధమతము భారతీయసంస్కృతిపై నొక శాశ్వతమైన ముద్రను లిఖించి పోయినది. దానిప్రభావము సర్వాంగము లందును గోచరించును. బౌద్ధధర్మములో నుత్తమభాగమును హిందూమతము జీర్ణించుకొన్నది. జీవితము నందొక నూతన గౌరవము, జంతుసంతానమందు దయ, బాధ్యతగల ప్రవర్తనము, పరజీవిత లక్ష్యసాధనమునందుత్సాహము ప్రత్యక్షములు లయ్యెను. బ్రాహ్మణమత తత్త్వములు, బౌద్ధమతప్రభావమునే మానవకోటి క్షేమమునకు, హేతువునకు విరుద్ధములుగానున్న కొన్నిభావముల నుద్ఘాటించుట మానుకొనెను. ౧. [illegible]

౧. శంకరుఁడను వానిచే రచితమైన "ఆచారమయూఖ" మను గ్రంథమున నీదిగువ చెప్పఁబడిన పంచదోషములు నిషేధింపఁబడెను (౧) అగ్నిహోత్ర హోమములు (౨) యజ్ఞములందు గోవధ (౩) శరీరకార్యముతోఁ గూడిన జపతపాదులు (౪) పితృదేవతా యజ్ఞ సంతర్పణములలో మాంసభోజనము (౫) సోదరునిమరణానంతర మాతనిభార్యను వివాహమాడుట. "అగ్నిహోత్రమ్ గవాలంభమ్, సన్న్యాసమ్ పలపైతృకమ్, దేవరాచ్చసుతోత్పత్తిః కలౌ పంచావివర్జయేత్." చూడు నిర్ణయసింధువు ౩ల. అగ్నిహోత్రమునకు [illegible] అశ్వాలంభమని పాఠాంతరము.

మతములోని సద్భావములు మహాభారతమునందుఁ బ్రతి ధ్వనించెను. "యుద్ధములో జయించుటవలన ద్వేష మతిశయించును. ద్వేషమువలన ద్వేషము నశింపదు." ౧. బౌద్ధమతానంతరము, ప్రపంచమునుగూర్చి భారతీయవిజ్ఞానమున కుత్సాహము కలిగియుండుట దుస్సాధ్యముగాఁ గన్పట్టెను. నాఁటి నజీవ మానవులకు సంతుష్టినొసఁగిన ప్రమాణములు సమర్థించుట కష్టమయ్యెను. మానవజీవితము దోషకలుషితము. ముక్తియే కలుషాపహారమైనది. అర్వాచీన తత్త్వములన్నియు దీని నంగీకరించినవి. జన్మము, ప్రవృత్తియు దోషములని న్యాయశాస్త్ర మంగీకరించినది. ౨. పుణ్యపాపములు రెండును బునర్జన్మహేతువులు కావున వాంఛితములు కావు. మన మిహలోకమునఁ దిరిగి జన్మించి, పుణ్యమనుభవించుటో, పాపమునకు శిక్ష ననుభవించుటో జరుగును. జన్మించుట మరణించుట కొఱకే, జన్మరాహిత్యమే సుఖము, బుద్ధుని కాలమునుండి, భారతీయవిజ్ఞాన చరిత్రములో నాత్మ ప్రకృతిని ప్రతిఘటించు తత్త్వము సృష్టిపొందెను. బుద్ధుని యనంతరమువచ్చిన వైజ్ఞానికులందఱు వైరాగ్యచ్ఛాయలందు జీవించిరి. కాషాయాంబర ధారణమే జీవితచరమ దశాలక్షణము, కామదోష మతిశయోక్తిగా వర్ణింపఁబడెను. ౩. ప్రపంచము తృష్ణాబద్ధమైనది. 3. జీవితముయొక్క అస్థిరత్వము, ప్రపంచముయొక్క అనిత్యత్వము

౧. ఉద్యోగపర్వము. ౭౧. ౫౯, ౬౩

౨. న్యాయసూత్రములు. ౧౯. ౧; ౪.౧౯.

౩. జన్మదుఃఖమ్ జరాదుఃఖమ్ జాయాదుఃఖమ్ పునః పునః ఆశాపాశపరమందుఃఖమ్, నిరాశాః పరమంసుఖమ్. ౪. ఆశాపాశబద్ధస్తేలోకే,

బుద్ధుని యుపదేశములు. ఈభావములను భారతీయ విజ్ఞానము గుర్తింపక తప్పనిసరియైనది. కొన్ని బుద్ధునకు [illegible] అపార్థములు, కొన్నియాతని మహోజ్జ్వలభావములు [illegible] విజ్ఞాన ప్రవాహగమనమును మార్పుఁగలిగినవి. ప్రపంచములో నుత్తమ వస్తువులు తిరిగి జన్మించుటకు ముందు నశింపవలసి యున్నట్లుగనే, పరిశుద్ధబ్రాహ్మణ మత[illegible] తిరిగి జన్మించుటకు ముందు బౌద్ధమతము మరణింపవలసివచ్చినది. ప్రాచీన సంప్రదాయములను విసర్జింపని భారతీయులలో నేఁడును బుద్ధుఁడు జీవించియే యున్నాఁడు. బుద్ధుని ప్రభావ [illegible]ములందు నవ్యాహతముగా నిలిచియున్నది. సర్వజనులచే దేవుఁడుగాఁ బూజింపఁబడుచుఁ, బౌరాణిక ప్రపంచమున నాతఁడుత్కృష్టస్థానము నాక్రమించినాఁడు. [illegible] పహతమై పౌరాణిక సంప్రదాయము నశింపకుండ [illegible] యుండునంత కాలము, హిందువు లర్చించు దేవతలలో [illegible] బుద్ధుఁడు భారతదేశమునఁ బ్రకాశింపఁగలఁడు. బుద్ధుని నీతి సందేశములు సర్వమానవ సమాజమునకే [illegible] [illegible]వహాలుల కుపశాంతి నొసఁగి, [illegible] [illegible]కమై, జనసామాన్యమున కుత్సాహప్రదమై విలసిల్లును.

పరిశీలిత గ్రంథములు.

౧. సద్ధర్మపుండరీకమ్. యస్. బి. ఇ. ౨౧.
౨. బౌద్ధమహాయాన గ్రంథములు. యస్. బి. ఇ. ౧.
3. సుజుకి; మహా
౪. సుజుకి; ది అవేకెనింగ్ ఆఫ్ ఫెయిత్.
౫. కుమారస్వామి; బుద్ధుఁడు; బుద్ధోపదేశము.

# విషయసూచిక



## ఏకాదశాధ్యాయము

### బౌద్ధమతశాఖలు



### అనుబంధము

## తృతీయ భాగము

# ప్రథమాధ్యాయము

## ఉపోద్ఘాతము



# ద్వితీయాధ్యాయము

## న్యాయ సిద్ధాంతము

# తృతీయాధ్యాయము

## వైశేషికాణువాదము

# ఉపోద్ఘాతము

**శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు**

చక్కని గ్రంథము చదివినపుడెల్ల 'ఈగ్రంథము తెలుఁగులో నున్నచో ఎంత బాగుండును' అని నాబాల్య మంతయు నొక యువ్విళ్లూరింపుగాఁ గడచెను. జిజ్ఞాసువులగు వారందఱును ఇది సహజమని అనుకొందును. ఒకపుడు,

"... ... ... నీ
తెలుఁ గెవ్వరిపాలు చేసి తిరిగెద వాంధ్రా!"

అనియు,

"నీదు తెలుఁగుబాస నిఖిల పుష్పమధూళి
చిలికి తేనెపెరను జేయవయ్యా!"

అనియుఁ జెప్పియుంటిని. నాయీకోరికయు నావంటి వారి అందఱికోరికయు మెలమెలగా నెఱవేరు కాల మాసన్నమైనదని శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారు భాషాంతరీకరించిన భారతీయ తత్త్వశాస్త్రము వంటి ఉద్గ్రంథములఁ గాంచి ఉప్పొంగిపోవుచున్నాను.

కొన్ని గ్రంథములకు ఉపోద్ఘాతము కావలయును. కొందఱు గ్రంథకర్తలకును ఉపోద్ఘాతము కావలయును. కాని ఈమాతృకకును ఈపుత్త్రికకును ఉపోద్ఘాత మున్నను లేకున్నను ఒకటియే. శ్రీరాధాకృష్ణులకా ఉపోద్ఘాతము? మఱియు బులుసు వేంకటేశ్వరులకా? శ్రీ రాధాకృష్ణులకు శ్రీ వేంకటేశ్వరులే

ఉపోద్ఘాతము. మఱి శ్రీ వేంకటేశ్వరులకు శ్రీ రాధాకృష్ణుతే ఉపోద్ఘాతము.

మూలగ్రంథము భరతఖండమున భగవద్జ్ఞాన మెటు లంకురించెనో ఎటులు పల్లవించెనో ఎటులు పుష్పించెనో ఎటులు ఫలించెనో వివరించునది. ఏవిషయ మెత్తికొనినను పైని ఏడుతరములు క్రింద ఏడుతరములు వేయికంఠములలో వివరింపకమానదు. ఇది ఒకతఱి జ్ఞానచరిత్రమా అని అనిపించును. ఒకతఱి జ్ఞానమునకు కుబేర భాండారమా అని అనిపించును.ఒకతఱి వేదాంత సిద్ధాంతములకు హిమవంతమా అని అనిపించును.అది యటులుండుఁగాక ! ఇది అన్ని ఉపనిషత్తులకును అన్ని దర్శనములకును అన్ని శాస్త్రములకును అన్ని భాష్యములకును చత్వరము. చార్వాకులనుండి శంకరులవఱకును గల శాస్త్రజ్ఞులకు సభారంగము. మఱియు నిది జ్ఞానపురాణము. వేయేల ! తెలివి కిది పన్నిద్దఱు వేవెలుఁగులు.

ఇట్టి ఉద్గ్రంథమును తాము చదివి త్రేఁచి తామే దాఁచుకొనక మిగుల శ్రమించి తమశోడి తెలుఁగువా రందఱిచే ఎగసి చదివించునటులు శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారు దీనిని తెలిఁగించిరి. వీరి యీత్యాగమందు గౌరవగర్వము లేదు. అహంత అంతకంటె లేదు.

వీరి రచనలో ఎంతయో పరిసన్నత ఉన్నది. ఎంతయో గభీరత ఉన్నది. ఇది ప్రవహించుచున్నదా నిలిచియున్నదా అని పరికించునంతలోనే కన్ను కనుఁగొనలేనంత వడితో జలజల ప్రవహించుచుఁ బోవును. మఱియు నిందొక మోసమున్నది—

చాలఁ జోటుల మూల మొకటి వేఱలేదని యిది చెప్పక చెప్పు చుండును. పైఁగా మూలమున నున్న అర్థచ్ఛాయల కన్నిటి కిది ముకురము.

ఇఁక నొకకథః—బులుసు పాపయ్యశాస్త్రిగా రొక పర్వదినమున పలువురు శ్రౌతులతోడను వేదవేదాంగవిదులతోడను స్నానము చేయుటకు గౌతమిలో దిగిరి. బ్రాహ్మణుఁ డొకఁడు వేదమూర్తియగు పాపయశాస్త్రిగారిని దఱిసి—"ఊఁ ములుఁగుఁడు" అని సంకల్ప మారంభించెను. పరివేష్టించియున్న పండితు లందఱును కడుమెల్లగా—"ఏమి యీసాహసము! పాపయశాస్త్రుల వారికా నీసంకల్పము?" అని అనిరి. ఆబ్రాహ్మణునకు మూర్ఛ వచ్చునంతపని యాయెను. అది చూచి పాపయశాస్త్రిగారు—"నాయనా! దర్శకుఁడు లేని దేదియు రాణించదు. మఱి నీవు చెప్పుము" అని సంకల్పము చెప్పించుకొని అందఱచేతను నగిపించి సాదరముగా సత్కరించిరఁట!

చిరివాడ, కృష్ణా.
1-6-54.

వేలూరి శివరామశాస్త్రి
శతావధాని

# అనువాదకుని భూమిక

శ్రీ రాధాకృష్ణపండితుని "భారతీయ తత్త్వశాస్త్రము" మొదటి రెండుభాగముల నిదివఱకు మేము ప్రకటించి యున్నాము. వానిని గూర్చి, పెద్దలు, పండితులు, పత్రికలవారు తమ ప్రశంసావాక్యముల నొసఁగి మాకెంతయు నుత్సాహమును గూర్చి యున్నారు. ఆంధ్రదేశములోఁ బెక్కు భాగములనుండి యనేకులు రాధాకృష్ణపండితునం దపరిమిత గౌరవముతోడను, సహజమగు హైందవతత్త్వజిజ్ఞాసతోడను, మాయనువాదము నభినందించుచు మాకు లేఖలను వ్రాసి యున్నారు. వారికందరకు మాకృతజ్ఞతను వెల్లడించుచున్నాము.

ఇది మూడవభాగము. ఇందు బౌద్ధమతశాఖల వివరణమును, న్యాయవైశేషికదర్శనములు సంపూర్ణముగను ప్రకటింపఁబడినవి. ఇదివఱలో మేము నుడివినట్లే, రాధాకృష్ణపండితుఁ డద్వితీయ ప్రజ్ఞాశాలియై, విశ్వవిశాలదృష్టితో నిందలి వివిధఘట్టములను వివరించి యున్నాఁడు. ఇందు ముఖ్యముగా న్యాయసిద్ధాంతము సునిశితవాద సమ్మిశ్రితమై, భావములు సులభగ్రాహ్యములు గాకుండును. కాని శ్రీరాధాకృష్ణపండితుఁడు ప్రాక్పశ్చిమ తర్కశాస్త్రగ్రంథముల నన్నిటిని జదివి చేసిన పరిశోధన మనితర సాధ్యమైనదని చెప్పనొప్పును. విస్పష్టములగు సక్రమాలోచనా నిర్ణయములచే సత్యమును నిశ్చయింపఁబూనుకొనునదే

తర్కశాస్త్రమై యున్నది. ఇంచు మించిరువది శతాబ్దములనుండి భారతీయ మేధావులు, గౌతమునితో నారంభించి, యీన్యాయసిద్ధాంతమును గూర్చి యనేక గ్రంథములను రచించినారు. ఆయాముఖ్యగ్రంథకర్తల నందఱను బేర్కొని, పశ్చిమఖండ న్యాయశాస్త్రకారులతోఁ బోల్చి, సాధ్యమైనంత సులభశైలిలో వివిధసిద్ధాంతములను శ్రీ రాధాకృష్ణపండితుఁడు మృదుమధురముగాఁ బ్రకటించినాఁడు. ఇదేవిధముగా మనకు రాధాకృష్ణుఁడు కణాదుని వైశేషికదర్శనమును వివరించినాఁడు; ఇది అణుసిద్ధాంతము. దీని యారంభదశ బుద్ధుని కంటెఁ బూర్వమని తెలియుచున్నది. విశ్వమంతయు నణుకల్పితమని యీసిద్ధాంతము చూపును. మనము నేఁ డణుయుగమునకుఁ జెందియున్నాము; కావునఁ గణాదు నణుసిద్ధాంత విశేషములు తెలిసికొన మనకు నూత్నమగు నాకాంక్ష జనించుటలో నాశ్చర్యము లేదు.

దీనితో మూఁడు భాగములు వెలువడినవి. నాల్గవ భాగము ముద్రణము చాలవఱకైనది. వెనువెంటనే ఐదవ భాగమును బ్రకటితము కాఁగలదు. నాల్గవ భాగములోఁ బూర్వోత్తర మీమాంసా సిద్ధాంతములు సమగ్రముగా వివరింపఁబడినవి. కర్మజ్ఞానకాండలలోని మహత్తరభావసంపుటి, భారతీయ విజ్ఞాననిధికమూల్యాలంకారము, అందఱకుఁ దెలియవలయుననునుద్దేశముతోడనే సాధ్యమయినంత సులభశైలిలోనే రచించితిమి, విషయకాఠిన్యము పరిణత బుద్ధిని గోరునదగుటచేఁ జదువరులు దీని నినుమడించిన శ్రద్ధాభక్తులతోఁ జదివి ఫలి

తము నొందుదురని యాశించుచున్నాము. ఆంధ్రసోదరు లిదివఱకు వలెనే, యీమిగిలిన భాగములను సాదరబుద్ధితో స్వీకరింతురని నమ్ముచున్నాము. ఈగ్రంథభాగమునకు అమూల్యమగు ఉపోద్ఘాతము ననుగ్రహించి మాయందు భ్రాతృవాత్సల్యముఁ జూపిన శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారికి మిక్కిలి కృతజ్ఞులము.

ఇట్లు,

బులుసు వేంకటేశ్వరులు.

# కృతిపతిస్తవము.



శ్రుతులున్ వానిశిరంబులున్ సకలసం
స్మృత్యంబులౌ శాస్త్రముల్,
మత తత్త్వంబులు ధర్మముల్నిఖిల క
ర్మవ్రాతగుప్తార్థముల్,
సతతంబుꣳ భవదీయజిహ్వపయి స్వే
చ్ఛన్ నృత్యముల్ సల్పు; నీ
వతికారుణ్యముతోడ నీకృతికి ని
త్య క్షేమమున్ గూర్పవే.



ఓం

# భారతీయ తత్త్వశాస్త్రము

## ఏకాదశాధ్యాయము.

### బౌద్ధమత శాఖలు

#### ౧. బౌద్ధమత శాఖా చతుష్టయము.

సత్యమును గనుఁగొనుటకు విచక్షణమార్గమునే బుద్ధుఁడుపయోగించెను. పరిశీలన హేతువాదముల నాతఁడు సమరించెను. ఆతనిమతమం దవిశ్వాసము కాదు. "ఎవరును నాధర్మమును నాయందు గౌరవముచే నంగీకరింపవలదు. సువర్ణము నగ్నిలోఁ బరీక్షించినట్లు దానిని మీరు పరీక్షింపుఁడు." ౧.

---

౧ దురదృష్టవశమున బహుసంఖ్యాకులైన జనులు బౌద్ధమతమును స్వీకరించునాటికిఁ దత్త్వజిజ్ఞాసనశించినది. బుద్ధునిమాటలలో విశ్వాసము హెచ్చినది. "బుద్ధుఁడు తానుచెప్పిన దంతయుఁ జక్కఁగాఁ జెప్పినాఁడ"ని అశోకుఁడు పలికినాఁడు. దివ్యావదానమం దిట్లున్నది. "గ్రహమండలములతో నాకసము పడిపోవచ్చును; భూమి పర్వతశిఖరములతోఁ బైకెగురవచ్చు; సాగరము లింకవచ్చు, కాని బుద్ధు లెన్నఁడు దోషము పలుకరు."

a general principle, regardless of its limitations or relations to other principles, and which is therefore full of impetuosity and self-confidence, at once purblind and bold, is a state as dangerous as we can well conceive. We must endeavour to meet this half-culture with a culture less incomplete, trained to exact methods of thought and observant of the details of fact.

This passion for intellectual abstractions when transferred to the literature of imagination becomes a passion for what is grandiose and vague in sentiment and in imagery; in religion it becomes what Tocqueville noticed as characteristic of democratic societies, a tendency to pantheistic forms of faith. The great laureate of European democracy, Victor Hugo, exhibits at once the democratic love of abstract ideas, the democratic delight in what is grandiose (as well as what is grand) in sentiment, and the democratic tendency towards a poetical pantheism. An acute French critic, whose early death we must deplore, M. Émile Hennequin, thus exhibits in tabular form some of those themes for which Victor Hugo had a special predilection.

"*Sujets abstraits.*

(*a*) Vers à propos de rien, sujets nuls ;
(*b*) Sujets indifférents, vers à propos de tout, versatilité ;
(*c*) Développement de lieux communs ;
(*d*) Humanitarisme, socialisme, optimisme, idéalisme, et panthéisme vagues ;
(*e*) Aspects grandioses, mystérieux ou bizarres, de la légende, de l'histoire ou de la vie."

Between the "verses *apropos* of nothing" and the "verses *apropos* of everything" lies indeed a stupendous creation of true poetry, all brought into being by one

గొన్ని శాఖలుగా విడిపోయిరి. కాని, వారిలో ముఖ్యశాఖ, సర్వాస్తివాదమును సమర్థించెను. పాళీగ్రంథము లీభిన్నవాదములను బ్రకటించెను. కథావత్తు గ్రంథ మీబహుశాఖోపశాఖలనుగూర్చి ప్రసంగించినది. ౧. క్రీ. పూ. ప్రథమశతాబ్ద పూర్వ ముదయించిన యీశాఖావాదములను, హిందూతత్త్వవేత్తలు స్మరించి యుండలేదు. బౌద్ధశాఖలు ముఖ్యమైనవి నాలుగనియు, నందు రెండు హీనయానమునకును, రెండు మహాయానమునకును జెందిన వనియు వారు తలఁచిరి. వైభాషికసౌత్రాంతికములు హీనయానశాఖలు, ఇవి సర్వాస్తివాదమును విశ్వసించి, దేశకాలములయందు స్వయంస్థితిగల ప్రపంచము నిజముగా నున్నదనియు నందు మన స్సితరవస్తువులతోఁ బాటొక స్థానమును గలిగియున్నదనియు నమ్మును. యోగాచార, మాధ్యమికులు మహాయానశాఖీయులు. యోగాచారశాఖీయులు విజ్ఞానము స్వయంభువమనియు, సర్వవస్తువులను సృజించు శక్తి కలదనియుఁ జెప్పుదురు. ఇదియే పరమార్థమును పరమసత్యమును. మహాయానసూత్రములకు మూలాధారమునుగల్పించిన 'అభావ' తత్త్వమును మాధ్యమికులు పోషింతురు. మాధ్యమికులనే సర్వవైనాశికులనియు నందురు. ౨

౧. చూడు. జె. ఆర్.ఏ.యస్ ౧౮౯౧, పాళీగ్రంథసమాజపత్రిక, ౧౯౦౪-౦౫

౨. ౭వ శతాబ్దమునకుఁ జెందిన ఇత్సింగు వ్రాసినాడు. "బోధిసత్త్వులను బూజించి, మహాయానసూత్రములఁ బఠించువారు మహాయానమతస్థుల

బౌద్ధమతముయొక్క భిన్న శాఖాతత్త్వభావములు బీజ రూపమునఁ జిరకాలమునుండి యున్నను, కనిష్కునికాలమున కనంతరమే, వీని సంకలన నిర్మాణములు జరిగినవి. హిందూ దర్శనములు వీనినే విమర్శించినవి. అనగా నివి వానికిఁ బూర్వ కాలమునకుఁ జెందినవి. ఇవి క్రీ. వె. 2-వ శతాబ్దమునకుఁ జెందినవని చెప్పినచో సత్యమునకు విశేష భేదముండదు ; ఇందుఁ గొందరు సుప్రసిద్ధులైన శాస్త్రకారు లింకను నర్వాచీనులై యుండవచ్చును. బుద్ధుని మరణానంతరము 3-వ శతాబ్దములో వైభాషికులును, 4-వ శతాబ్ధములో సౌత్రాంతికులును ప్రాముఖ్యము గాంచిరి. బుద్ధుని మరణానంతర మైదువందల సంవత్సరములకు మాధ్యమికులు బయలుదేరిరని ఆర్యదేవుఁడు చెప్పినాఁడు. యోగాచార శాఖాస్థాపకుఁడైన 'అసంగుఁడు' క్రీ. వె. మూఁడవశతాబ్దమునకుఁ జెందియుండును. బౌద్ధతత్త్వ ప్రచార ప్రసిద్ధి క్రీ. వె. ౫, ౬, ౭ వ శతాబ్దములలో నుత్కృష్టదశ నందినది.

నియుఁ, గర్మలొనరింపనివారు హీన యానమతస్థులనియుఁ జెప్పబడుదురు. మహాయానము రెండురకములు, ఒకటి మాధ్యమికము, రెండు యోగము. స్థితి గలదంతయు నిజముగా లేనిదనియు, మనకుఁ గోచరించు వస్తువు భ్రాంతిమాత్రమనియు మాధ్యమికులు చెప్పుదురు ; యోగశాఖవారు సర్వము మనఃకల్పితమనియు. వస్తువులన్నియు మనోభావములేయనియుఁ జెప్పుదురు, (లకకుసు వ్రాసిన ఇత్సింగు పుట ౧౫)

## ౨. వైభాషికులు

హీనయానమునకుఁ జెందిన మతశాఖలు సర్వాస్తివాదమును సమర్థించినవి.౧ ఇతరశాఖల భాష విరుద్ధభాష యగుటచే వైభాషికుల కీనామము వచ్చినది; లేక అభిధర్మభాష్యనామమైన "విభాష"కుఁ జెందినవా రగుటచే వైభాషికులైరి. వీరు సూత్రముల ప్రమాణమును బూర్తిగా నిరసించి, అభిధర్మమునే యనుసరింతురు. వస్తుస్వభావమును సుస్పష్టముగాఁ దెలుపుట కనుభవమే సాక్షియని వారు చెప్పుదురు. వస్తువులతో ప్రత్యక్షసంపర్కము వలన జనించు ప్రత్యక్షజ్ఞానమే యనుభవమని వారిమతము. ప్రపంచము దర్శనమున కనుగుణముగా నున్నది. బాహ్యప్రపంచము మన కగోచర మనుట యుక్తము కాదని వారి తలంపు. ప్రత్యక్షదర్శనములేనిదే అనుమానమును

---

౧ సర్వాస్తివాదులు లేక హేతువాదులు ముఖ్యమైన వేదుగ్రంథము బనియు నంగు బుద్ధునకంతర మించుమించుగా 300 సంవత్సరములకు కాత్యాయని పుత్రునిచే రచింపఁబడిన "జ్ఞానప్రస్థాన" మగ్రగణ్యమైనదనియు నమ్మెదరు. దీనిపై భాష్యము "మహావిభాష" నామమున నైదువందలమంది యర్హతులచే వసుమిత్రుని నాయకత్వమునఁ గనిష్కుఁడు జరిపిన మహాసభానంతరమున రచింపఁబడెను. వసుబంధుని 'అభిధర్మకోశము' నందుదీని సంగ్రహరూపము గలదు. యశోమిత్రుఁడభిధర్మకోశ వ్యాఖ్యను రచించినాఁడు, ఉదానవర్గ ధమ్మపాద, ఏకోత్తరాగమ భాగములు సర్వాస్తివాదమునను సరించినవి, బుద్ధునియందు భక్తినుగ్గడించినను, అశ్వఘోషుని బుద్ధచరితము, ఆర్యశూరుని 'జాతకమాల' యీశాఖకుఁ జెందినవే. వారిలోవారికి భిన్నభావములున్నను, భదంతుఁడు, ధర్మత్రాత, ఘోషకుఁడు, బుద్ధదేవుఁడు సర్వాస్తివాదమును సమర్థించినవారిలో ముఖ్యులు.

౨. చూడు-పుట ౨౩౧.

లేదు. దర్శనముల యాధారములేనిదే మనకు వ్యాప్తియును లభింపదు. దర్శింపఁబడిన వస్తుజ్ఞానములేని యనుమానము స్వభావవిరుద్ధమైనది.౧ అందుచే వస్తువులు రెండు విధములు ; దర్శింపఁబడినవి, అనుమానింపఁ బడినవి. అచ్చటచ్చట కొన్ని వస్తువు లనుమానమునకు గోచరించినను, సామాన్యముగా నవి ప్రత్యక్షమునకే ఋజువగును. బాహ్యవస్తు ప్రపంచమునకు నంతరంగ భావప్రపంచమునకు భేదము చెప్పఁబడెను. జ్ఞానములోవస్తువులు కలిసియుండు పద్ధతి వేరు ; బాహ్యజగత్తులో నవి కలిసియుండు పద్ధతి వేరు. బాహ్యప్రకృతియు మానసిక ప్రపంచము పరస్పర స్వతంత్రస్థితిగలవని చెప్పు సహజప్రత్యక్షవాదులు వైభాషికులు. వీరి జ్ఞానసాధన సిద్ధాంత మొక విధముగు ప్రత్యక్షవాదము. మనస్సునకు వస్తుజ్ఞానమున్నది. ద్రవ్యాస్తిత్వమును గూర్చిన మన జ్ఞానము మనఃకల్పనము కాదు; ద్రవ్యదర్శనమే వస్తువులున్నవి. వస్తుమూల పదార్థము మూడుకాలములందు నిత్యమై యున్నది.

నిత్యవస్తు మూలపదార్థములు క్షణికవస్తురూపములు గావు; వాని వెనుకనున్న వస్తుకారణభూతములు. పంచభూతములు లేక స్కంధములయొక్క మూలపదార్థములు శాశ్వతముగా నున్నవని కొందరు సర్వాస్తివాదులు చెప్పెదరు. లోపముగల కారణసిద్ధాంతమును వారు విడిచిపెట్టిరి; ఏలనఁ గార్య కారణము లొకేవస్తువుయొక్క రెండురూపములని వారియభిప్రాయము. మంచునకు నావిరికి జలమే మూలద్రవ్యము.

౧ సకలలోకానుభవ విరోధాచ్చ

బాహ్యరూపములు క్షణికములే కాని, మూలద్రవ్యము నిత్యమైనది. కారణధర్మమును గూర్చిన భావము నార్యదేవు డిట్లు వివరించినాఁడు ; "కారణ మెన్నడు నశింపదు ; అది కార్యరూపముగా మారినప్పు డవస్థయే మారినది. మృత్తుపాత్రమైనవు డవస్థయే మారినది. మృన్నామముపోయి పాత్రినామము వచ్చినదే కాని మృత్తుసమానమే".౨

---

(పుట-780) ౨, అభిధర్మకోశభాష్యమునందు వివరింపఁబడిన భావములో దీనినిఁబోల్చి చూడుఁడు; దారువగ్నిజ్వాలాసంపర్కముచే నశించునని మనము తలపవలెనా ? అవును, దారువు భస్మమైపోయి, మన కేమియు గోచరింపదు. మనకుఁ బ్రత్యక్షముగా గోచరించు నీ జ్ఞానము నేతర్కమును గాదనలేము. కాదు, అది తర్కముపై నాధారపడియున్నది. మనకు దారువు గోచరింపకున్నను, దారువు భస్మమై, సజీవమై యుండుట కిచ్ఛలేక యిట్లు చేసియుండవచ్చును, అగ్నివలన నదృశ్యమైనదని చెప్పఁబడిన దారువు కేవల శూన్యరూపమే. శూన్యమునకుఁ గారణము లేదు, కార్యమునుగాదు. మఱియు అస్తిత్వమునుండి నాస్తిత్వము పొందిన వస్తువునకుఁ గొన్ని వేళలఁ గారణమున్న యెడల, జన్మములవలె నట్టికారణ మెల్లప్పుడు నుండవలెను, కాని జ్వాల, ధ్వని, భావము నివి క్షణికములని నీవు మనఃస్ఫూర్తిగా నంగీకరింతువు, (౪-౨) "వస్తువులే కారణములు లేక తమ స్వభావముచేతనే నశించినచో-గాలిలో విడిచిన వస్తువులు పడిపోవునట్లు వస్తువులు పుట్టుటతోడనే-స్థితికాలములేకుండ వెంటనే నశింపవలెను. లేక స్థితియున్నదా, నాశన మెన్నడును లేకుండవలెను. (౪ అ-౨) వస్తువు పెరుగుట, పక్వమగుట, గలదంటివేని, యివన్నియుఁ బరిణామదశలు, మార్పుభావము స్వవిరుద్ధమైనది. "ఒకేవస్తు వింకొకటియగుట సత్యముకాఁజాలదు, వస్తువొకటియేయైయుండి, దానిలక్షణములు మారుననుటయు సత్యముగాదు, (౪అ-౨)వస్తువులు క్షణికములైనచో నవి స్వభావముచేతనే నశించుచున్నవి. ఒక దీప మారిపోయినచో నది క్షణికముగావున నట్లు జరిగినదికాని, నీ వూదివేయుటచేఁగాదు. మనమున్న దానిని నశింపఁజేయలేము; లేనిదానిని నశింపఁజేయలేము.

in literature. It cannot be altogether an idle question to ask whether it is possible or desirable that separate channels should be cut for the flow of these several streams of sentiment in literature.

Unquestionably our strength springs from the soil in which we grow. We are not epiphytes, living upon the air. A literature which consciously aims at cosmopolitanism is almost always a literature in a period of decline. Yet it is well to remember that the spirit of a man may inhabit an ampler space than that in which his body lives and moves. "Spartam nactus es: hanc orna." Yes, but which Sparta is our possession—the land that has fed our bodies, or the land that has nourished and enriched our souls? Carlyle, the son of a Scotch peasant, and proud of his honourable parentage, had in him always much that was derived from his Scottish birth and breeding, his Scottish moors and hills, his Scottish religion. But how much less fruitful would have been the result for literature if he had drawn a circle around his mind corresponding to his physical environment, and had admitted within that circle no other thoughts and aspirations than those proper to a Scottish literary coterie, or the Scottish kirk from which he had gained so much in moral training and for the ministry of which he was at one time designed? In his solitude of Craigenputtoch — "a solitude altogether Druidical . . . nothing to disturb you with speech, except Arcturus and Orion, and the spirit of nature," he was really an inhabitant of Weimar, and the companion of Goethe and Schiller. Would he have served Scotland better or worse if he had occupied his imagina-

వ్యవహారప్రపంచము సత్యమని వైభాషికులు సౌత్రాంతికులు నంగీకరించిరి. వస్తువులు బాహ్యాభ్యంతరములుగా రెండు తెఱఁగుల నున్నవనిరి. బాహ్యవస్తువులు భౌతికములు; అభ్యంతరవస్తువులు చిత్తజములు.౨

భూతచతుష్టయమే కాని యైదవది లేదు, కాఠిన్యగుణము గల భూమి; చల్లనైన జలము; వేడిమిగలయగ్ని; చలనశీలము గల వాయువు. పంచమమైన యాకాశభూత మంగీకరింపఁబడ లేదు. పరమాణుసంయోగములచే నేర్పడినవే బాహ్యవస్తురూపములు. అణుసిద్ధాంతమును వైభాషికులు, సౌత్రాంతికులు నంగీకరించిరి. వస్తువులన్నియు నణుకల్పితములు, అణువుషణ్ముఖములు గలదనియు,గాని దానిలోనున్న యావరణ మొకటే యనియు వైభాషికులవాదము. మనము శిరోజసముదాయముసే చూడఁగలము కాని, యేకశిరోజమును జూడఁజాలనట్లే,

౨ వసుబంధుని అభిధర్మకోశములో వర్ణింపఁబడిన విషయీవిషయ విభాగములను బరిశీలింతము. విషయీవిభాగము. సులభము,పంచస్కంధములు ద్వాదశాయతనములు, అష్టాదశధాతువులు. విషయవిభాగము రెండువిధములు అసంస్కృతధర్మములు, సంస్కృతధర్మములు, వస్తువులవలన జనింపని అసంస్కృతధర్మములు స్వయంస్థితిగలవి, ఉత్పత్తివృద్ధి నాశనములుగల మార్పుల కతీతములైనవి, మూడురకములు-(౧) ప్రతిసంఖ్యానిరోధము (౨) అప్రతిసంఖ్యానిరోధము (౩) ఆకాశము. సంస్కృతధర్మములు నాలుగురకములు-(౧) ఏకాదశరూపధర్మములు (౨) ఒక చిత్తధర్మము (౩) ౪౬ చైత్తధర్మములు (౪) పదునాలుగు చిత్తవిప్రయుక్తధర్మములు. ధర్మమనగా ననేకవస్తువులు. న్యాయ్యము, విధి,విశ్వాసము,మతము,ప్రపంచవిషయములు. వస్తువులు రాజ్యము మున్నగునవి.స్థితిగల యేపదార్థమునకైనను ధర్మశబ్దము వర్తించును. చూడుము సోజెన్: బౌద్ధమతతత్వములు.

మనమణు సముదాయమును జూడఁగలము కాని, ఏకాణువును దర్శింపలేము.

అణువనఁగా సూక్ష్మతమమైన రూపాంశమని వసుబంధువు నిర్వచనము, ౧ అణువునొకచో నుంచుటకాని, త్రొక్కుటకాని, పట్టుకొనుటకాని, యాకర్షించుటకాని సాధ్యముకాదు. అది దీర్ఘముకాదు; హ్రస్వముకాదు; చక్రముకాదు, చతురస్రముగాదు, వక్రముగా దవక్రముగాదు, ఉన్నతముగాదు, నిమ్నముగాదు, అది అవిభాజ్యము, నదృశ్యము, నశ్రుతము, ననాస్వాద్యము, నరూపము నైనది. 3. అణువు లొకదానిలో నొకటి ప్రవేశింపలేవు. అణుద్వయా ణుత్రయములను వైభాషిక సౌత్రాంతికు లంగీకరింపరు. కాని యవి యనేకసంఖ్యలలోఁ గలియవచ్చును. ఇంద్రియముల నాకర్షించు భౌతికపదార్థములు రూపముయొక్క లక్షణచతుష్టయమైన, వర్ణగంధ, రుచిస్పర్శల సముచ్చయములే. ఈలక్షణ చతుష్టయము గలిగిన దొకపరమాణువు, ఇది విభజింపఁబడదు. పరమాణు సముదాయమే మనకు గోచరించును. అణువు పరమాణుసంపుటి యగుటచే దర్శనీయము. సర్వభూతములలోని యణువులు ప్తేజోవాయు లక్షణములు గల సమానరూపములే.

౧ అణువు పరమార్థమనియు నింద్రియగోచరము కాదనియు న్యాయసూత్రములు చెప్పును. న్యాయసూత్రములు. ౨ అ. ౧.౩౬, ౪, ౨-౧౪.

౨. రూపముయొక్క సూక్ష్మతమాంశము పరమాణువు. అది అచ్ఛేద్యము, అగ్రాహ్యము, తొలగింపరానిది.

3. అభిధర్మమహా విభాష.

వస్తువులన్నిటియందు భూతచతుష్టయ లక్షణములున్నను, గొన్నిటిలోని యణువులు తమశక్తి నావిష్కరించును. కొన్ని యనావిష్కృతములై యుండును. కఠినలోహమందు భూపదార్థము, ప్రవాహమందు జలపదార్థము, జ్వాలయం దగ్నిపదార్థము, ప్రధానముగా గోచరించును. సర్వాస్తివాదులు ప్రపంచద్వయము నంగీకరింతురు. భాజనలోక మనగా వస్తువులతో నిండియున్నది. సత్త్వలోకమనగా జీవములతో నిండినది. మొదటిది రెండవదాని కుపకరించును. మనస్సునకు జడపదార్థమునకును సంబంధములేని "ప్రాప్తి" "అప్రాప్తి" వంటి చిత్తవిప్రయుక్త ధర్మములున్నవి. ఇవి స్థితిగలవికావు కాని మనస్సునకుఁగాని, జడపదార్థములకుఁగాని సంబంధము గలిగినప్పు డివి స్థితినిఁగాంచును.

అసముచ్చయాత్మక భూతములు మూడున్నవి. భేదరహితమునసంతము నైన దాకాశము, అదనిత్యమై సర్వవ్యాప్తమైన నిజస్థితిగల పదార్థము. ౧. ఆకాశము రూపములేనిది. వస్తువుకాదు, కాని దాని క స్తిత్వమున్నది. ధర్మ దర్శనాభావమే అప్రతిసంఖ్యా నిరోధము. ఇది జ్ఞానముచే జనించినది కాదు. ప్రత్యయములేక అవస్థాశూన్యతచే నిది కలిగినది. ౨. ఒకేవస్తువుపై నేకాగ్రతచే నితరభానములన్నియు నణఁగిపోవును. ప్రతి సంఖ్యా నిరోధ మతీంద్రియ జ్ఞానముచే లభించునది. ఇదియే సర్వాస్తివాదుల పరమలక్ష్యము. ఈశాఖయొక్క

౧. న్యాయానుసారము నీభావమునే కలిగియున్నది.

౨. వసుబంధువు.

నిర్వాణ మనగా స్కంధోపాధి పరిమితమైన యవస్థగాని, తద్విరుద్ధముగాని కాదు. వీరి యసంస్కృత ధర్మత్రయమును శంకరుఁడు ఖండించినాఁడు. అవి అవస్తువులనియు, నభావమాత్రములనియు, నిరుపాఖ్యములు[3].లనియు నాతఁడు చెప్పినాఁడు. కాని యివి అనిర్వచనీయములైనను, నసత్యములు కావు.

మనకు నిజమగు జ్ఞానసాధనములు రెండేయున్నవి. దర్శనసమాలోచనములు, కల్పనారహితమైనది గావున దర్శనము లేక గ్రహణము మనకు సత్యమునిచ్చును. కాని దర్శనము మన కస్పష్టరూపముల నిచ్చును. ఆలోచనము లేక అధ్యవసాయము స్పష్టమైనదైనను, మనకు జ్ఞానము నీయదు. ఏలననది కేవల భావాత్మకము. దర్శనము మిథ్యకాదు కాని, స్పష్టమైనది కాదు. భావము స్పష్టమైనదే కాని మిథ్యారూపము, కేవల భావశూన్యముగా దర్శింపఁబడు వస్తువు లేదు. జ్ఞానవస్తువుల యొక్క దర్శనాత్మక, భావాత్మకరూపముల నిర్ణయించుట కష్టము. ఈ వైభాషికసిద్ధాంతము నిర్దుష్టమైనదికాదు. ఏలన, దర్శన మస్పష్టమైనదైనచో, వస్తువుల నిజస్వరూప జ్ఞానము నది మనకిచ్చినదని యెట్లు నిశ్చయింపఁగలము? దర్శనమువలన నేదో వస్తుజాల మున్నదని మనము గ్రహింపవచ్చును. కాని వస్తుస్వరూపమును నిస్సంశయముగా నిర్ణయించుట కనుమాన మవసరము.

దర్శించునది విజ్ఞానము. ఇది చిత్తాధారము, నిత్యమునైనది. స్మృతి, చిత్తధర్మము, ఇంద్రియవిషయములు రూపాత్మక

3. వేదాంతసూత్రభాష్యము ౨ అ ౨. ౨౨-౨౪.

ములైన రుచి గంధ శబ్దస్పర్శములు, వీని కనుగుణముగాఁ బంచేంద్రియములు నున్నవి. ఇంద్రియములు బాహ్యవస్తువులను జూచి, చిత్తమును మేల్కొల్పి, విజ్ఞానము నుద్రేకింపఁజేయును. బాహ్యవస్తువులను గ్రహించు నీయింద్రియములు స్వభావముచే భౌతికములు. ప్రతిదానికిఁ బ్రధానము నంగభూతము నగు రెండు భాగములు గలవు. పంచేంద్రియముల ననుసరించి యైదును, నంతరింద్రియమైన మనస్సు ననుసరించి యొకటియు నారువిధములైన విచక్షణమున్నదని చెప్పఁబడెను. షష్ఠేంద్రియమైన మనస్సువలనఁ బ్రత్యేకవర్ణములను మనము తెలిసికొనుటే కాక, వర్ణస్వరూపమును లేక శబ్దస్వరూపమును మనము తెలిసికొందుము. చిత్తము విజ్ఞానము నొకటేయని వసుబంధువు నభిప్రాయము. ౧. చిత్తవిజ్ఞానముల కంటె వేరైన ఆత్మలేదు.

ఈ మతశాఖననుసరించి, బుద్ధుఁడొక సామాన్యమానవుఁడు, తనబుద్ధత్వముచే సవికల్పక నిర్వాణము నార్జించి, మరణముచే మహానిర్వాణమును బొంది, బుద్ధుఁడు నశించి పోయినాఁడు, బుద్ధునిలోఁగల దైవాంశయేమనఁగా నాతఁడితరుల సహాయసంపత్తి లేకుండ సత్యము యొక్క అనుభవజ్ఞానము నార్జింపఁగలిగినాఁడు.

౧. మనస్సు (చేతతి) పరిశీలించును గానఁ జిత్తమనియు, (మన్యతే) ఆలోచించునుగాన మనస్సనియు, (విజానతే) తెలిసికొనునుగావున విజ్ఞానమనియుఁ జెప్పఁబడెను. అభిధర్మకోశము, ౨

### 3 సౌత్రాంతికులు.

హీనయానము యొక్క రెండవ శాఖకుఁ జెందిన వారు సౌత్రాంతికులు.౨. మనస్సంబంధము లేని బాహ్యప్రపంచమున్న దని సౌత్రాంతికవాదము. కాని దానిని మనము ప్రత్యక్షముగా దర్శింపలేము. వస్తువులను గూర్చి మనకుఁ గలిగిన మానసిక వేదనలచే వాని యునికిని మనము గ్రహించుచున్నాము. వస్తువులు లేని వస్తుదర్శనముండదు కావున నవి యుండితీరవలెను.3.

మాధవాచార్యుఁడు తన సర్వదర్శన సంగ్రహములో బాహ్యప్రపంచాస్తిత్వము ననుమానించు సౌత్రాంతికులవాదములను వివరించినాడు. "వస్తుజ్ఞానమునకు వస్తువుయొక్క ఉనికి నిజమై యుండవలెను, ఏలన దానికి రెండురూపములున్నవి,... వస్తుస్థితి కేవలజ్ఞాన రూపమేయైనచో నట్లే గోచరింపవలెను.

౨. సౌత్రాంతికపదార్థ వ్యుత్పత్తినిగూర్చి మాధవుఁ డిట్లనును; "కొందరు శిష్యులు పూజ్యుఁడగు బుద్ధుని తన సూత్రాంతము అవగాఁ దన యుపదేశముయొక్క పరమార్థమేదని యడుగఁగాఁ జెప్పినది వినినవారు సౌత్రాంతికులు" (యన్. డి. యస్. పుట 382) బుద్ధుని ప్రసంగములు గలిగిన సుత్తా పిటకమును నమ్మి, యితర పిటకములను విసర్జించువారు సౌత్రాంతికులు కావచ్చును. వీరికి సూత్రములే ప్రమాణములు, బుద్ధునివాక్యములు తప్ప నేయితర ప్రమాణములను నమ్మనివారొక శాఖయు, నితరముల నంగీకరించువా రింకొక శాఖయు రెండుశాఖలుగ నున్నారు, నాగార్జునని సమకాలికుఁడైన కుమారలబ్ధుఁ డీశాఖాస్థాపకుఁడు. తర్కపండితుఁడగు ధర్మోత్తరుఁడు, వసుబంధు నభిధర్మకోశభాష్యకారుఁడగు యశోమిత్రుఁడు నీశాఖావారలు.

3. లోకేవ్యాసము, ౪ అ. ౪. 3.

కాని బాహ్యవస్తురూపముగా గోచరింపరాదు." ఆధునికతర్కమునకిది బాహ్యవస్తువునకు నిజవస్తువునకు భేదము తెలియని యజ్ఞానమని తోఁచ వచ్చును. అంతరంగమందలి భావమే, నిజముగా బాహ్యమున వస్తువున్నట్లు భ్రాంతిని గలిగించుచున్నచో సౌత్రాంతికులు దాని కిట్లు సమాధానము చెప్పుదురు;" ఇది సమర్థింపఁదగినది కాదు; నిజముగా బాహ్యవస్తువులు లేని యెడల మూలమేలేని భావముదయించుటే అసంభవము. వసుమిత్రుఁడను నతఁడొకఁడు వంధ్యాపుత్రునివలె గన్పట్టుచున్నాఁడనుట వంటిదే యగును."౧. కొన్ని లక్షణములచే వస్తువు యొక్క నిజస్థితిని మనము గ్రహింపఁగలము. పుష్టికరమైన చూపునుబట్టి మనుజునికి సముచితపోషణమున్నదనియు, భాషననుసరించి జాతిని, ముఖవైఖరినిబట్టి హృదయ భావమును గ్రహించినట్లే.౨. మఱియు విజ్ఞాన రూపమందరలో నొకటే రూపము గలిగి యున్నది. అదియే పరమ ప్రమాణమైనచో లోకమంతయు నొకటేయై యుండవలెను. కాని మనమొక మారు నైల్యమును, వేఱొకమారు కుంకుమరంగును జూచుచున్నాము, ఈ భేదము, భేదముగల వస్తువులయునికిచే జనించియుండవలెను." విజ్ఞానవైవిధ్యమే, బాహ్యవస్త్వస్తిత్వమును ఋజువుచేయుచున్నది. మఱియు, "ఒకవస్తువున్నప్పుడే, కన్పట్టు కొన్ని వస్తువులు, కొన్ని వేళలనావస్తువుకాక వేఱొక వస్తువుపై నాధారపడి యుండవచ్చును." విజ్ఞానము భిన్నకాలములలో భిన్నవర్ణములను దర్శింపవచ్చును, "అది అహంకారమునకు సంబంధించిన

౧. పుట ౨౭, ౨, పుట ౨౮

కర్తృజ్ఞానమే లేక ఆలయ విజ్ఞానమే కావచ్చును. వివిధవర్ణములుగాఁ జూపట్టునది వస్తువిజ్ఞానము లేక ప్రవృత్తి విజ్ఞానము." ఈ బాహ్యప్రపంచము మన సంకల్పము ననుసరించి గోచరించునదికాదు. అప్రయత్న పూర్వకములైన యింద్రియ దర్శనముల కర్థము చెప్పవలెనన్నచో, శబ్దస్పర్శరూపరసగంధాదులను, సుఖదుఃఖాదులను గలుఁగఁజేయు బాహ్యప్రపంచ మొకటి యుండక తప్పదు, అందుచే విజ్ఞానమునకుఁ బ్రపంచము బాహ్యమై యున్నది, మనకనుమానము చేనది యున్నదను విశ్వాసము కలుగుచున్నది, కాని బాహ్యప్రపంచాస్తిత్వము సంశయ విఘాతమున కతీతమైన యాథార్థ్యమును గలిగి యున్నదా యని ప్రశ్న యుదయించును. డేకార్టే చెప్పినట్లు, "వస్తువులు నిజముగా లేకున్నను, నున్నవనుభావమును మన మనస్సునకుఁ దోపించునదేదైన భూతము లేదు గదా!" మన విజ్ఞానమునకు గోచరించు వస్తువులు నిజముగా మన భావములే యని చెప్పు యోగాచారుల సిద్ధాంతమును సమీపించితిమి, ఎట్టి భూత ప్రభావమును మనలను మోసగించుట లేదు. వ్యక్తియొక్కయు విజ్ఞానము యొక్కయు నేకత్వమును మనము విడఁదీసినపుడు, అహంకార విజ్ఞానమును, ప్రపంచవిజ్ఞానము నుండి వేరుపరచినపుడు, రెండును నశించును. మాధ్యమిక సిద్ధాంతమాత్మానాత్మద్వయమును నిరసించి. తదతీతమైన యేకత్వమునకుఁ దోడ్కొని పోవును.

బాహ్యవస్తువులు లేనిదే వాని దర్శనజ్ఞానమును లభింపఁ జాలదని సౌత్రాంతికులు చెప్పి, యీ బాహ్యవస్తువులు క్షణిక

ములని నిర్ణయించిరి.౧ మన విజ్ఞానరూపమును నిర్ణయించు బాహ్యవస్తువులు క్షణికములైనచో నవి నిత్యవస్తువులనుభ్రాంతి యె ట్లుదయించుచున్నది ? " వస్తురూపము లొకదానివెంబడి నొకటి మనస్సులోఁ బ్రవేశించుచున్నవి. వాని వేగప్రదర్శనములచే నొకేకాలమం దవి గోచరించుచున్నట్లు భ్రాంతిజనించుచున్నది. అష్టదళపద్మములోని యెనిమిది దళములగుండ నొక బాణముపోవునట్లును, నలాటచక్ర భ్రాంతివలెను వస్తువులు గోచరించుచున్నవి," సౌత్రాంతికులు ద్వైతమునూహించువారే కాని స్థిరనిర్ణయమును జేయువారుకారు. ప్రపంచము ప్రత్యక్షానుభవసిద్ధమని వారంగీకరింపరు. కాని మనకు భావదర్శనముల నిచ్చుచున్నది, కావున జగత్తు సత్యమని యనుమానింతురు. విజ్ఞానరూపదర్శనముచే వస్తువులు తెలియుచున్నవి. మానసిక లక్షణము ననుసరించి చూచినచో వైభాషికులవాద మెక్కువ సమంజసముగా నున్నది. మనము దర్శించునపుడు, మనకుభావమే గోచరించునని సౌత్రాంతికుఁడు చెప్పును ; ఒకవృక్షమును మనముచూచినపుడు మనకు వృక్షమే గోచరించుచున్నది కాని వృక్షభావమే కాదని చెప్పు వైభాషికుల వాదము మన స్తత్వ వివరముల నెఱుగని యసంస్కృతబుద్ధికి సమంజసముగానే తోఁచును. మన స్తత్వవిషయ పరిశీలనమునుగొనివచ్చి, సామాన్యమానవుని దర్శనములోఁ జొప్పించి వాదించుట మన స్తత్వశాస్త్రదోషములలో నొకటి యగును. ఒకవ్యక్తి చెట్టును జూచుచున్నాఁడు ; తాను వృక్షముకాదు. అతఁడు చూచునది చెట్టు

---

౧. యస్, యన్, యస్ యస్ 3ఊ, 3,౧౬.,

కాదు ; వృక్షమను నొకభావమునే యాతఁడు చూచి, బాహ్య జగత్తులో నది యుండియుండవలె నని యనుమానించుచు న్నాఁడని చెప్పుట స్పష్టమైన విషయమును తలక్రిందొనర్చుటే యగును. దర్శనములు విజ్ఞానముయొక్క క్రియయనియు, నిజము గానున్న బాహ్యప్రపంచవస్తువునకు విజ్ఞానమునకు నట్టి సంబంధ మున్నదనియుఁ జెప్పు వైభాషిక సిద్ధాంతము నాధునిక మన స్తత్త్వశాస్త్ర మంగీకరించుచున్నది.

ధర్మకీర్తి న్యాయబిందు గ్రంథమునకు ధర్మోత్తరుఁడు వ్రాసిన న్యాయబిందుటీక యనుదానిలో మానవునకుఁగల సర్వ వాంఛలు సమ్యక్ జ్ఞానమువలననే సిద్ధించునని చెప్పియున్నాఁడు. ఒకనిర్ణయము నిజవస్తువుల కనుగుణమైనదగుచో సత్యమైనది ; సత్యమనగాఁ గార్యసిద్ధి చేకూరుటే. జ్ఞానమంతయుఁ బ్రయోజ నాత్మకము. ఒకవస్తుభావమును దర్శించుటతో నారంభించి, తద్వస్తువిషయమై జనించిన కాంక్ష సిద్ధించుటతోఁ బూర్తియగును. మనవాంఛాసిద్ధి నిచ్చుటలోఁ బ్రత్యక్షానుమానములు రెండు నుపయోగించును. గావున, రెండును సక్రమ జ్ఞానసాధనములే. దర్శనము ప్రత్యక్షజ్ఞానము నిచ్చును. అనుమానము మానసిక భావముచేఁ బరోక్షజ్ఞానము నిచ్చును. స్వప్నములు మున్నగు మిథ్యాదర్శనములు దోషజ్ఞానమునఁ జేరును.

బాహ్యప్రపంచము సత్యమని నిర్ణయించి, సౌత్రాంతికుఁడు జ్ఞానసాధన విధానమును వివరించినాఁడు. నాలుగువిషయములపై నాధారపడి జ్ఞాన ముదయించును. ౧ ఆలంబనము ౨ సమనంతరము లేక భావాంతర సూచనములు, ౩ సహకారికఅధి

స్వరూపము. "నైల్యము మున్నగు నాలంబనమువలనఁ జిత్తము నందు నీలవర్ణముగల వస్తురూపము ఉదయించును. దానినే జ్ఞానమందురు. సమనంతరమువలనఁ బూర్వజ్ఞానము స్మరణకు వచ్చును. ఒకప్రత్యేక వస్తుజ్ఞానము మనకుఁ గలుగుటకుఁ గారణములు, తేజస్పందనము, నొక యింద్రియము ప్రధానముగా బ్రవృత్తియందుండుటయు నైయున్నది." ౧ తన న్యాయబిందు గ్రంధమునందు ధర్మకీర్తి, మనఃకల్పనా సంబంధమేమియు లేని వస్తుగోచరత్వమే దర్శనమని రచించినాఁడు. అనగా నది నిర్వికల్పజ్ఞానము ; ఏలన సవికల్పజ్ఞానమునందు మానసికభావకల్పనావ్యాపారమున్నది. బాహ్యాకారణ సంబంధముల నింద్రియములు తెలియఁబఱచుననియు, నామసంబంధములు మనఃకల్పితములనియు ధర్మకీర్తి నుడివినాఁడు. మనఃకల్పనములతో నెట్టి సంబంధమును లేని,స్వచ్ఛమైన దర్శనము వస్తు స్వస్వరూపమును గోచరింపఁజేయును. కాని మనయనుభవములోని వస్తుదర్శనములందు, స్వచ్ఛదర్శన మెంతయున్నదో, మనోవ్యాపారమెంతయున్నదో నిర్ణయించుట కష్టమైన పని.

ఎట్టిభేదమును లేకుండ వైభాషికులవలెనే సౌత్రాంతికులును అణుసిద్ధాంతము నంగీకరించినారు. ఆకాశమనగాఁ బరమాణువే యనియు, రెంటికి భేదములేదనియు రెండును మనఃకల్పనములేయనియు సౌత్రాంతికుని భావము.౨

వైభాషికులకు మాధ్యమికులకు వ్యతిరేకముగాసౌత్రాంతికులు మనస్సు తన్నుఁగూర్చి తా నాలోచింపఁగలదనియు

౧, యన్,డి,యన్, పుట ౩౦ ౨, యస్,యస్,యస్,యస్, 3అ, 3-గ,

వందుచే మన మాత్మానలోకన శక్తిని గలిగియున్నామనియు సమర్థించిరి. 3. చేతివ్రేలు తనయగ్రమును దానే స్పృశింపఁజాలదు. కాని దీపము తన్ను నితరములనుగూడ కాంతివంత మొనర్చుచున్నది. 4. ఈసిద్ధాంతము వ్యవహార ప్రపంచమున కనుగుణముగా నున్నది.

సౌత్రాంతికుఁడైన యశోమిత్రుఁడు, వసుబంధు రచితమైన అభిధర్మకోశ భాష్యకారుఁడు, దైవాస్తిత్వమును గూర్చి యిట్లు వాదించినాఁడు. ఈశ్వరుఁడుగాని పురుషుఁడుగాని, ప్రధానముకాని జీవులను సృజింపలేదు. మహాదేవుఁడైనను వాసుదేవుఁడైనను, మఱెవ్వఁడైనను ప్రకృతియైనను, పురుషుఁడైనను సృష్టి కేకకారణుఁడైనచో, నాతఁడు ప్రథమకారణమైన కారణమున సృష్టియంతయు నొకేకాలమున నొక్కమారుగా జరిగి యుండవలెను. ఏలనఁ గార్యములేని కారణ ముండఁజాలదని మన మంగీకరించి తీరవలెను. కాని జీవులొక్కసారిగా నుద యించియుండలేదు. కొన్నిటితరువాతఁ గొన్ని క్రమముగా జనించుచేకాక, కొన్ని పిండజములు, కొన్ని యుద్భిజ్జములు ననేకరీతులుగాఁ బుట్టినవి. అందుచే సృష్టికిఁ గారణపరంపర యున్నదనియు దేవుఁ డొక్కఁడే కారణము కాదనియు స్పష్ట మగుచున్నది. కాని కారణ నానాత్వమునకు హేతువు దేవుని సంకల్పమే యను నాక్షేపణముగలదు. "ఇప్పుడొక జీవి, యీ లక్షణములు గలిగి, యీవిధమునఁ బుట్టుఁగాక, ఇంకొక లక్షణములుగల జీవవర్గ మింకొకవిధముగా జనించుఁగాక" యని

3. స్వసంవిత్తి, 4. బోధిచర్యావతారము, ౬౮,౧౫,

దేవుఁడు సంకల్పించుచున్నాఁడు. సృష్టికార్యక్రమ మీవిధముగా జరుగుచున్నదని గ్రహించి దేవుఁడే సర్వసృష్టికి నేకైక కారకుఁడని గ్రహింపవలెనని చెప్పుదురు. దీనికిట్లు మేము సమాధాన మిచ్చుచున్నాము. దేవునికి భిన్నసంకల్పము లున్నచో భిన్న కారణములున్నవని యంగీకరించు టేయగును. దీనివలన దేవుఁడు ప్రథమకారణమని మనముచెప్పుకొన్న మొదటిసిద్ధాంతము నిరసింపఁబడుచున్నది. దేవుఁడొక్కఁడు, భాగములులేనివాఁడు నగుటచే, భిన్నకాలములయందు భిన్నకారణములచే సృష్టిని గల్పించుట కవసరములైన భిన్నసంకల్పములు గలవాఁడని చెప్పుటయును సమంజసముగాలేదు. శాక్యముని పుత్రసంతతివారు, సృష్టి అనాదియని నమ్ముచున్నారు. ౧.

---

౧. మొదట సర్వాస్తివాదశాఖకుఁ జెందియు దరువాత నసంగుఁడు యోగాచారసిద్ధాంతము నుపదేశించెను. యోగాచార భూమిశాస్త్రమునందును, స్మృతిచిహ్నముగా ననేక ఛందస్సులలో రచించిన గీతములుగల మహాయానసూత్రాలంకార గ్రంథమునందును, దానిపైఁ దానే రచించిన భాష్యమునందును, తన సిద్ధాంతము నతఁడు వివరించెను. నాల్గవశతాబ్దాంతమున వసుబంధుఁడు జీవించినట్లు చెప్పుదురు. తకాకుసు, జాకోబి, యాత డైదవశతాబ్దాంతమువాఁ డనిరి. కాదు మూఁడవశతాబ్దమువాఁడని కొందరనిరి. యువాన్‌చ్వాంగు మిత్రుఁడు, కనూజిరాజ్యాధీశుఁడు శ్రీహర్షునికాచార్యుఁడునైన గుణప్రభుఁడు వసుబంధుని శిష్యుఁడు. వసుబంధుఁడు మహావిద్వాంసుఁడు, విపరీతవాదియు నని ప్రసిద్ధిగలదు. హీనయానగ్రంథమైన అభిధర్మకోశము నాతఁడు రచించెను. తరువాత నాతఁడు సోదరుఁడైన అసంగునిచే మహాయానమతశాఖకు మారినాఁడు. మహాయానగ్రంథములకుఁ బెక్కింటికి భాష్యములువ్రాసినాఁడు. అశ్వఘోషుఁడుకూడ యోగాచారశాఖీయుండే. అతనిముఖ్యగ్రంథముమహాయానశ్రద్ధోత్పాదము. కానిదీనికితఁడు కర్తయగునా యను సంశయములున్నవి. క్రీ॥ వె॥ ప్రథమశతాబ్దమునఁ

## ౮. యోగాచారులు

ఆర్యసంగుఁడు లేక అసంగుఁడును, దిఙ్నాగునికాచార్యుఁడును, నసంగుని కనిష్ఠసోదరుఁడు నగు వసుబంధుఁడును యోగాచారుల విజ్ఞానవాదమునకు మూలపురుషులు.౧.

బుద్ధులైన వారియందు బోధిరూపమున దర్శింపబడిన పరమసత్యము యోగాభ్యాసమువలనఁగాని లభింపదని చెప్పును గాన నీశాఖ, యోగాచార శాఖయని పేరొందినది. యోగాచారమనునామము తత్త్వానుష్ఠానమును జెప్పును, విజ్ఞానవాదము

పూర్వదేశమునుండిన బ్రాహ్మణుఁడితఁడు, సుప్రసిద్ధ కుషాణచక్రవర్తియైన కనిష్కుని కితఁడు మంత్రిగానుండెను. కనిష్కుని కాలము నిర్ధారణము కాలేదు. అశ్వఘోషుఁడు బుద్ధచరితమును రచించెను. బుద్ధుఁడు లంకాధిపతియైన రావణుని దర్శించి యాతఁడడిగిన ప్రశ్నములకు యోగాచారసిద్ధాంతము ననుసరించి సమాధానములిచ్చెనని లంకావతారసూత్రగ్రంథము వర్ణించినది. ఇది యోగాచారశాఖకు ముఖ్యగ్రంథమే కాని యిందు మాధ్యమికశాఖాభావములుఁ గూడ నున్నవి. అభిసమయాలంకారాలోకము, బోధిసత్త్వభూమియు నీశాఖాగ్రంథములే. ఈశాఖకుఁ జెందిన సుప్రసిద్ధపురుషులు నందుఁడు దిఙ్నాగుఁడు, ధర్మపాలుఁడు, శీలభద్రుఁడు. శీలభద్రుఁడు, నలందా విశ్వవిద్యాలయాచార్యుఁడు, యువాన్‌చ్వాంగునకు బౌద్ధతత్త్వము నుపదేశించినవాఁడును. న్యాయబిందు సుభాషితసంగ్రహమునకు, ప్రమాణసముచ్చయమునకుఁ గర్తయైన దిఙ్నాగుఁడు దక్షిణభారతీయ తత్త్వవేత్తయు, వసుగునికిని వసుబంధునికిని శిష్యుఁడును, (క్రీ॥ శ॥ ౫౨౦-౬౦౦) ప్రాంతమునకుఁ జెందినవాఁడునైయున్నాఁడు. మేఘదూతలో నీతనిని కాళిదాసు స్మరించినమాట నిజమైనచో కాళిదాస సమకాలికుఁడు. "అద్రేః శృంగం హరతి-దిఙ్నాగానాంపథి పరిహరన్ స్థూలహస్తావలేపాన్" సుగ్రీవుఁడు దిఙ్నాగుఁ డాంధ్రుఁడని చెప్పెను. చూడు- హిందూతర్కము. పుట 88.

౧ రీడ్, వర్ట్స్ పుట ౨౮౬

దాని తత్త్వలక్షణముల నుపదేశించును. జీవమును గూర్చియు, బాహ్యవస్తువులను గూర్చియునే కాకుండ, ధర్మములనుగూర్చి కూడ సవిమర్శక పరిశీలనాపద్ధతి నుపయోగించి విజ్ఞానసంబంధమే పరమసత్యమను సిద్ధాంతము నీశాఖ సమర్థించినది.

సౌత్రాంతికుల దర్శనసిద్ధాంతము నుండి యోగాచారుల విజ్ఞానవాదము సహజముగా నుద్భవించినది. మనజ్ఞానమున కాలంబన సామగ్రి, క్రమరీతిలేని పద్ధతిలో మనకు బాహ్యజగద్వస్తువులనుండి వచ్చినదే యని సౌత్రాంతికులు చెప్పిరి. ఈ బాహ్యవస్తువులేవో మనకుఁ దెలియదు. మనజ్ఞానమునకు విషయములు మనోభావములైనచో, నాలోచించు దృష్టకు బాహ్యములైన వస్తువుల ప్రతిబింబములే మనకు లభించిన కారణమున బాహ్యవస్తువుల స్వస్వరూపము మనకుఁ దెలియుట సుసాధ్యము కాదు, మనకుఁ దెలిసిన వస్తువులు నిజవస్తువుల ప్రతిబింబములే. మనము వస్తుసంబంధములేని భావములతో నారంభించి, వానికి వస్తుసంబంధము నా వెనుక కల్పించినచో నవి మనకు నిజమని యెట్లు నిర్ణయింప నగును, బాహ్యజగదస్తిత్వము మిథ్యామాత్రమే. ఒకవేళ నిజమైనచో దానిని మనమెన్నఁడె ఱుఁగఁ జాలము. మనము తెరమఱుగులకుఁబోయి, మన భావముల నుదయింపఁజేసిన కారణముల నెఱుఁగఁ జాలము, "మన యింద్రియములు, మనకుఁ గొన్ని భావములున్నవని తప్ప, వేఱుగా సాక్ష్యమీయవు,మన మాధారములేని నిర్ణయములను జేసి కొన్నచో మనమాత్మవంచకుల మగుదుము."౧. మనకు భావములున్నవనియుఁ దన్మూలమున వస్తువులననుమానించుచు

న్నామనియు సౌత్రాంతికుఁడు చెప్పునపుడు, బాహ్యవస్తువులు న్నచో మనము వాని నెఱుఁగఁజాలమనియు, నవి లేకున్నచో నున్నవనితలచుటకు నవకాశమున్నదనియు స్పష్టమగుచున్నది.[౧] మన భావముల కొరకై కారణ ముండుటవసరమైనచో నా కారణము బాహ్యప్రపంచమే కానక్కర లేదు. మనకప్రియ త్నముగా సంభవించు భావముల విషయములోనైనను, వాని కేదోయొక కారణముండవచ్చునని మాత్రమే చెప్పఁగలము. ద్రవ్యద్వయ సిద్ధాంతములో నారంభించిన కారణమున, తనదర్శన సిద్ధాంతముయొక్క ఫలితములను సౌత్రాంతికుఁడూహింప లేదు.

యోగాచారునివని బర్క్లే వనియే. సౌత్రాంతికుఁ డూహించిన, తెలియుటకు శక్యముకాని శాశ్వతజడ జగత్తుండుట, నిరాధారకల్పనమనియు నాత్మవిరుద్ధ సిద్ధాంతమనియు, ఋజువు చేసి, బాహ్యప్రపంచమున్నదను భావముల నన్నిటిని విడిచి పెట్టుఁడని చెప్పుటయే యోగాచారుని కార్యమైయున్నది. మనభావముల కన్నిటికి నాధారభూతమైన జడజగత్తున్నదనుట కాధార మేమియును లేదు. జడపదార్థము నొకభావమేకాని వేరు కాదు. వస్తువులు వేదనాసముచ్చయములే. మన జ్ఞానవిషయ ములు మనస్సుపై ముద్రింపఁబడిన యింద్రియవేదనలు కావ చ్చును. లేక కామ రాగాదులవలన నుద్భవించిన మానసిక వ్యాపారములు గావచ్చును. విజ్ఞానసంబంధము లేని బాహ్యవస్తు వులు మనకుఁ దెలియవు. యోగాచారు లిట్లనుగుదురు. "మనకు దెలిసిన బాహ్యవస్తువు నిజమైన స్థితినుండి వచ్చినదా! కాదా?

---

౧ బర్క్లే మానవజ్ఞానసూత్రములు ౭-వ భాగము.

అది స్థితినుండి రాలేదు; ఏలన నొకదానినుండి యుదయించినది నిత్యము కాఁజాలదు. అది స్థితినుండి జనింపకున్నచో నదిజనించుట కేయవకాశము లేదు.' మఱియు "బాహ్యవస్తువొకసూక్ష్మాణువా? లేక బహ్వణుసముచ్ఛయమా? అదిరెండవదికాదేలన, మనమెఱిగినది భాగమో పూర్ణమో మనకుఁ దెలియదు. అది యణువుకాదేలన నణువుమన యింద్రియములకగోచరమైనది." మనమణువుల నెఱుఁగఁజాలము. అణుసముచ్ఛయ విషయములో నవి యణువులనుండి భేదించునో, భేదింపవో యెఱుఁగము. అవి యణువులనుండి భేదించుచో, నవి యణుసముచ్ఛయము లని చెప్పుటకు వీలులేదు; అవియు నణువులు నొకటేయయినచో, స్థూలరూపముల మానసిక ప్రతిబింబము లవియేయని నిర్ణయింపఁజాలము. మఱియు, వస్తువులు క్షణికములైనచో, నవి యొకక్షణముమాత్రమే యుండును. జ్ఞానము కార్యము కావున, నది కారణ మదృశ్యమైన వెనుకనే లభించును; అందుచే జ్ఞానమున కవకాశమే లేదు. ఏలన జ్ఞానముదయించుటకుముందే వస్తువు నశించినది. కావున మన మొకవస్తువును దర్శించుటకు వస్తువుండనవసరములేదు. ఒకవేళ వస్తువు లున్నను, నవి భావరూపములోనే మనకు గోచరించుటచే మనకు భావములే వస్తువులు. మనకవసరములైనవి భావములే కావున బాహ్యవస్త్వస్తిత్వమును మన మూహింపనవసరములేదు. భావములు వస్తువులును గలిసియే మన కనుభవములో లభించుచున్నవి గావున, రెంటికిని భేదములేదు. మన మెఱిగిన వస్తుగుణ

౨ యస్. డి. యన్. పుట ౨౮

ము, లైన రుచి దైర్ఘ్యపరిమాణాదులన్నియు భావములే. మన మనస్సునకు వేరుగా వస్తువు లేవియు లేవు ; ఉన్నవని తలఁచుట వ్యర్థవాదము. బాహ్యవస్తువులు నిజముగా లేవు. బాహ్యమున గోచరించు రూపవరంపర లన్నియు నిజముగా మన మనోవ్యాపారములే. క్షణములోఁ గన్పట్టి యదృశ్యములగు మేఘముల వలె నివియు దృశ్యములై యదృశ్యము లగుచుండును. బాహ్య వస్తువులని చెప్పఁబడు నక్షత్ర గ్రహ మండలాదులు సక్రమ విధానమున గోచరించు మనఃకల్పనలే. దీని కితర కారణము లున్నవి.౧ మన మనస్సులో నున్నదానినే బాహ్యప్రకృతిలో నున్న ట్లూహించుచున్నాము. మనకుఁగల బహువిధభావము లకుఁ గారణము లేమని యడిగినచోఁ బూర్వభావసంస్కార ములే యట్టి కారణములని యోగాచారులు బదులు చెప్పు దురు. బాహ్యవస్తుసంబంధము లేకుండగనే, పూర్వమానసిక సంస్కారముల ననుసరించి స్వప్నములలో ననేక భావపరంపరలు గోచరించుచున్నవి. జాగ్రదవస్థానుభవము నట్టిదేయని చెప్ప వచ్చును.౨ సర్వధర్మములు ననగా వస్తువులు వానిగుణములు

౧ పోల్చు, ఐన్‌స్టీన్సు సంబంధ సిద్ధాంతము. ఒక కర్రయొక్క పొడవు దాని ముఖ్యగుణముకాదు. ఏలన కర్రపొడవు చూచువాని ననుసరించియు, కర్రయొక్క స్థానము, సంబంధవేగము ననుసరించియు నుండును.

౨ దిఙ్నాగుని తర్కము ననుసరించి, స్థితి యనగా నర్థక్రియాకారిత్వము. బాహ్యవస్తువులు సత్యములు గావు, నిత్యవస్తువు క్రియాశూన్యమైనది. ఇప్పుడొక క్రియామగ్నమైయుండి, గత భావికాలములలోఁ గర్మ సాధించు శక్తి దాని కున్నదా ? అయినచో నది సర్వము నొకేమారు చేయును. ఏదియైనను దాను చేయఁగల పని నాలస్యముగఁ జేయదు. కాకున్నచో నది యెన్నఁడే పనినిఁ జేయఁజాలదు. ఒక శిల, యిప్పుడొకపత్రిని జనింపఁజేయ

విజ్ఞానాంశములు మాత్రమే. మన విజ్ఞానము ఖ్యాతిలేక దర్శనమువలనను, వస్తుప్రతి వికల్పములేక మనఃకల్పనమువలనను, వ్యవహారజగత్తునంతను నిర్మించినది విజ్ఞానమునందీలక్షణములనాదియై యున్నవని యోగాచారుల సిద్ధాంతము.౧

యోగాచారులు విజ్ఞానవాదమును సమర్థింతురు. విజ్ఞానేతరమైన దేనికిని, నిజాస్తిత్వములేదని వారివాదము. "సర్వం బుద్ధిమయంజగత్" బాహ్యమునను్నదని చెప్పఁబడు ప్రకృతి ప్రపంచము మాటయేమైనను, నాంతర్యమగు ననుభవమును గాదనఁజాలము. మన జ్ఞానము నిజమైన ప్రకృతి ప్రతిబింబము కాకపోవచ్చునుగాని, లేదని చెప్పఁజాలము. జ్ఞానమున్నది, దాని యస్తిత్వము స్పష్టము. పూర్వ బౌద్ధమతము, సర్వము విజ్ఞానఫలితమనియు, విజ్ఞానావృతమనియుఁ జెప్పి యీవాదమును సూచించియున్నది. "నేటి మనస్థితియంతయు మన యాలోచనాఫలితమే. అది మన భావముపై నాధారపడి యున్నది. మన భావములతో మిళితమైయున్నది." మన మరణానంతరము సూక్ష్మశరీరము పునర్జన్మమునందువిజ్ఞానకల్పితమై యుదయించును. మన విజ్ఞానమునకు బాహ్యవస్త్వాధార మన

లేకున్నచో నెప్పుడు నుదయింపఁజేయలేదు. నిత్యవస్తువో కానోక. కార్యము నితరధర్మముల సాహాయ్యమునఁ జేయుచుందురేని, యీధర్మములు బాహ్యములైనచోఁ గ్రియాత్మకములు;లేక యివినిత్యవస్తువుల కొకనూత్నశక్తినిచ్చిచో నది నిత్యవస్తువునందు లోపించినకారణమున నశిపోయి,యీశక్తిగలయింకొక వస్తు వుదయించవలెను నిత్యవస్తువున కొకదానివెనుకనొకటివచ్చు పరికృతిలక్షణములను జెప్పుటకువీలులేదు.కావున నవియనిత్యములనియే నిర్ణయించవలెను.

౧. చూడుు, లంకావతారసూత్రము.

సరము లేదని యోగాచారులు చెప్పుదురు. కావున వీరివాదము నకు నిరాలంబనవాదమని పేరు వచ్చినది. భౌతికమానసికధర్మ భేదములేని కారణమున సర్వధర్మములును మనోమయములే.

వస్తువులేనిదే వస్తువిజ్ఞానము నుండదు కావున, విజ్ఞానమును భ్రాంతియేయని మాధ్యమికుఁడు చేయు విమర్శకు యోగాచారుని సమాధాన మిట్లున్నది. "అంతయు శూన్యమైనచో శూన్యమే సత్యస్వరూప నిర్ణయముకు జేయునని చెప్పవలసివచ్చును. ఇట్టి విశ్వాసముగల మాధ్యమికుఁడు భిన్నవిశ్వాసములు గల యితరులతో వాదించుట కధికారము లేదు. ఏదియు సత్యము గాదని విశ్వసించువాఁడు తన విశ్వాసముకు సమర్థింపను లేఁడు. అన్యులవాదమును నిరూపింపను జాలఁడు."[౨], సర్వవస్తువులు శూన్యమని మాధ్యమికుఁడు చెప్పినచో నీగుణశూన్యత్వమున కైన నొక యాధారముండవలెను. బోధిసత్త్వభూమి యిట్లు నుడువుచున్నది; "శూన్యము సత్యమని సమర్థింపవలయుచో నేది శూన్యలక్షణలక్షితమో అది యుండవలెను; ఏలక్షణములు లేని కారణమున నది శూన్యలక్షణయుక్తమయ్యెనో యాలక్షణములు చెప్పవలెను, రెండును లేకున్నచో శూన్యమున్నదని యెట్లుచెప్పఁగలము?" త్రాడును చూచి యజ్ఞానముచే దానిని సర్పమనుకొను చున్నాము. త్రాడున్నది. సర్పము లేదు. అందుచే రజ్జువు సర్పశూన్యమైనది. అదే విధముగా, వస్తువులకుఁగల రూపాదిగుణలక్షణములు శూన్యము కావచ్చు, బహిర్గోచరములగు గుణములు లేకున్నను, గుణా

౨. యస్. యస్. యస్. యస్. 3 అ. 3-౪.

ధారమైన మూలవస్తువున్నది. జ్ఞానిజ్ఞేయ భేదము లొక దానిపై నాధారపడియున్నవి. దీనిని దెలుపుటకు స్వప్న ముదాహరణ ముగా నీయఁబడినది. స్వప్నదృశ్యములు, మనదర్శనమునకు లభించు వస్తువులపై నాధారపడవు. స్వప్నములో మనము చూచు నేనుఁగులు లేవు, అవి మనఃకల్పితములే కాని బాహ్యమున నున్నట్లూహింపఁబడుచున్నవి, పూర్వజ్ఞానముచే ముద్రితములై యున్న వాసనలనుండి గజాకృతి స్వప్నమునందు మనస్సుచేఁ దీసికొనఁబడినది. గజమును స్పృశించు జ్ఞానమును భావసంస్కార కల్పితమే. జ్ఞేయమేదియును లేదు గాన జ్ఞానమును లేదు, జడ పదార్థమే లేదు; విజ్ఞానమునకు వేరుగా నేదియు లేదు, కాని యీభావకల్పనము లన్నిటికి నొక యాధారముండవలెను; అట్టి యాధారమే విజ్ఞానమని యోగాచారుల సిద్ధాంతము.

యోగాచారులు నిస్సంశయముగా విజ్ఞానవాదులు. ఉన్న దంతయు నవిచ్ఛిన్నమైనవిజ్ఞానము. అదియే సగుణమైన సత్యస్వ రూపము, తానొక వ్యక్తిననియుఁ, దనకుస్థితిగలదనియు విజ్ఞాన మయుఁడగు మానవుడు దృశ్యములను జూచియే గ్రహించును. సర్వాంశములును విజ్ఞాన కోశమందుఁ జేరును. అంతరంగమందే విషయావిషయములతోఁ గూడిన యొక్క చిన్న ప్రపంచ మేర్ప డును. అందలి గుణపరిణామముల కే యిది నిబద్ధమైయుండును. బాహ్యప్రపంచము తనస్థితిని గోల్పోయి, భావసంబంధములుగా మారి మానసాగారమున నృత్యమొనర్చును. నిత్యము బరివర్త నమునకులోనగు చున్నవిజ్ఞానమున కాలయమని పేరిడిరి కాని, దీని భావమును యోగాచారులు స్పష్టముగ నిర్వచింపలేదు.

ఇదినిత్యమైన యాత్మకాదు, ఆలయమనగా నిత్యము మారు చుఁబెంపొందుచున్న జీవాత్మ యనియుఁ జెప్పబడినది.౧. అది ప్రతిబింబములను నిత్యము స్వీకరించుచుఁ దనయందు ముద్రిత ములై యున్నకర్మబీజములచే వానిని వికసింపఁజేయుచు, నెడ తెగని ప్రవృత్తిలోనుండును. అది కేవల మనిత్యమైన జీవాత్మయే కాదు; సర్వవిజ్ఞానమునకు నిలయమై, యోగిజనులకే తెలియునదై యుండును. ధ్యానము వలనను, నాత్మపరిశీలనాదిక సాధనాంత రములచేతను, జాగ్రదవస్థావిజ్ఞానము పూర్ణవిజ్ఞానములో సం శామాత్రమని మనము గ్రహింతుము. ప్రతి మానవుని యందు నిట్టి పూర్ణవిజ్ఞానరాశి, యొక మహాకాసారము వలె నున్నది కాని, మానవుఁడు దానిని పూర్తిగా నెఱుఁగఁడు.౧. ఆలయ విజ్ఞానమందలి యత్యల్పాంశమునే మన మెఱుఁగుదుము. ఆలయ విజ్ఞానమనగాఁ బరమాత్మయను భావములు సూచింపబడినవి. అది ఉత్పాదస్థితిభంగ వర్జమని చెప్పఁబడినది.౨.సర్వమానసము లకు సామాన్యములైన గణనాతీతములైన యూహలకు భావ ములకు నది మూలాధారము, అది యొక్కటే నిజస్థితి గలది, ప్రత్యేక వ్యక్తుల విజ్ఞానము లాలయములోని భిన్నాంశములు, జగదస్తిత్వవిశ్వాసభ్రాంతికి మూలాధారమైనదిదియే. ప్రపంచ

౧. పోల్చు. జెం టైలుని నవ్యవిజ్ఞానవాదము.

౧. యోగాచారులు 'అంతర్గతసంస్కార' (Sub-Conscious) వాదము నంగీకరించిరి. కాని విల్లియమ్ జేమ్సు నేటి మనస్తత్వశాస్త్రములో విఖ్యాతమైన మాత్మ పరిశీలనమని ప్రకటించినాఁడు.

౨. లంకావతారసూత్రము.

ములోని సర్వవస్తువులందున్నవి. వివిధవస్తువులు తమ సంఖ్యా రూపముల ననుసరించి, విజ్ఞానాల యాంశామాత్రిదృశ్యము లే, అజ్ఞానముచే నీవిజ్ఞానాలయమును మనము భిన్నాంశములుగా విభజించుచున్నాము "విజ్ఞానము స్వభావముచే నవిభాజ్యము, అజ్ఞానులు జ్ఞాని జ్ఞేయ జ్ఞానభేదము లందున్నట్లు చూతురు."౩. మఱియు, "నిజముగా నున్న వస్తువొక్కటే; అదియే వివేక సహితమైన విజ్ఞానము,భిన్నరూపములుగా నది గోచరించుటచే దాని యేకత్వమునకు లోపము కలుగదు.౪. మాన, మేయ, ఫలములు పూర్ణవిజ్ఞానరాశిలో నూహింపఁబడిన భేదములు. మనఃప్రవృత్తి పరివర్తనముచే వస్తువులుదయించుచున్నవి. లంకావతారసూత్రమిట్లు చెప్పుచున్నది: "చిత్తమున్నది;చూపుచే గోచరించు వస్తువులు లేవు, చూపుచేఁదెలియబడిన వస్తువుల వలనఁ జిత్తము శరీరమందును, భోగద్రవ్యములందును, మందిరాదులందును గోచరించును, దీనికి మనుష్యాలయమని పేరు."

విజ్ఞానమే ప్రపంచ స్వరూపము. ప్రకృతి వస్తువులు దాని కితర రూపములు. విజ్ఞానమే సర్వమును ; తదితరము నదియే. మనము విజ్ఞానమునుండి తర్కసీమకుఁ బోవుచున్నాము. సర్వవస్తువులు విజ్ఞానమునకు సంబంధించియున్నవి. విజ్ఞానమునకు బాహ్యమున నేదియును లేదు. ఆలోచించు కర్తకును, వస్తువులకును సుస్థిరమైన భేద మేమియును లేదు. విజ్ఞానమే జ్ఞానమున కారంభము నంతమునై యున్నది. విజ్ఞానమును

౩. యన్. యన్. యన్. యస్. 3 అ ౨-౪.

౪. యన్. యస్. యన్. యన్. 3 అ ౨-౬.

దీసివేసినచో సర్వము శూన్యమై పోవును. ఆలోచించువ్యక్తి కేవల వ్యక్తిగాఁడు ; తా నెరిగిన దంతయు నాతఁడే; ఆతని విజ్ఞాన మాతనిలో నొక భాగము, విజ్ఞానమునకు వేరై, క్యాంటు పండితుఁడు చెప్పు స్వయంస్థితిగల వస్తువు కేవల మనఃకల్పనము. ఆలోచనమునకు వెనుక దానికిఁ గారణమై యేదో యింకొకటి యున్నదనుటయు, నింకొక యాలోచనమేకాని వేఱొకటి యేదియును లేదు. విజ్ఞాన మొక్కటే యేకైక సత్పదార్థము. అది జ్ఞాని, జ్ఞేయమునుగూడ నైయున్నది. ఇదియే యోగాచారభావ మైనచో, బాహ్యప్రపంచము శూన్యమగుచున్నది. ఆలోచించు మానవుఁడీబాహ్యరూపముల నంతరంగములలోఁ గల్పించుకొని, తత్సంఘర్షణముచే విజ్ఞానమును గల్పించుకొనుచున్నాఁడు. ఆలోచనముయొక్క ప్రథమస్థితి, సృజనశక్తియు నీసిద్ధాంతమున కాధారములై యున్నవి. విజ్ఞానమే సత్పదార్థము, తద్రూపములై యున్నది. ఆకాశ మనుఁడు, ప్రకృతియనుఁడు, విజ్ఞానమున కవ్వల యేయాలంబనమును నది గుర్తింపదు. తన విజ్ఞానమునకు వలయు విషయములనుదప్ప వేఱేమియు నది యెఱుఁగదు. విజ్ఞానమునం దన్నియు నున్నవి. విషయిచేఁ గల్పితమైన విషయము, విషయినుండి విడిపోయి, చొరనశక్యమైన యేకాంతమున నున్నచో నప్పు డది యుపహృత సత్యలక్షణము గలదగును. ఈభావము ననుసరించి విజ్ఞానమే బ్రహ్మ. విజ్ఞానము సర్వవస్తువులం దంతర్యామియై యున్నదనియు, నాలయము సర్వవ్యక్తుల కొకటేయనియు, జీవాత్మల కనేకత్వమున్నను, బరమాత్మ యొకటేయనియు, యోగా

చారులు వాదించుటచేఁ బరమాత్మ సర్వజీవుల కొకటే యను భావమును దెలిబుచ్చుచున్నారు. ఆలయ విజ్ఞానము సర్వస్వరూపము, సర్వమూలము సర్వసృజనశీలభాసితము, దేశకాలాద్యనవచ్ఛిన్నము నైనది. దేశకాలాద్యవస్థలన్నియు జీవాత్మలక్షణములు. ప్రకృతి వస్తువులు విజ్ఞాన మహాసాగర గర్భస్థరూపములు. సర్వసృష్టి జననియైన యీమహావిజ్ఞాన సాగరములోని వన్నియు మఱల లయమై, నానాత్వమువశించి, జన్మస్థానమును బొంది, యేకము కాఁగలవు. అది పరిపూర్ణజ్ఞానము. అందు దెలియుట, భిన్నత్వముండుటయు నసాధ్యములు. అదియెప్పుడు నొకటిగానే యుండును గావునఁ బరిపూర్ణమైనది. ఆలయమనగా జీవాత్మకాక, సర్వాత్మ యగును.

ఒకేసత్పదార్థమైన విజ్ఞానమునుండియే సర్వమావిర్భవించెనని తత్త్వనిర్ణయమైయుండగా, యోగాచారులొకొక్కప్పుడు జీవాత్మ కేవలవేదనకాని, లేక వేదనాసముచ్చయమని కాని చెప్పిరి. ప్రపంచమే యొకవ్యక్తియొక్క విజ్ఞానసామగ్రియుఁగాదు. స్థూలత, దైర్ఘ్యము, కాఠిన్యము, ధృఢత్వము కేవలమానసికభావములేకాదు, కావనియోగాచారులుచేయు వాదము నిస్సంశయముగా సంస్కారశూన్యమైన విజ్ఞానవాదమే. మానవవిజ్ఞానముదయించుటకుఁ బూర్వమున్న ప్రపంచస్థితికిఁ గారణమునిది యొసఁగఁజాలదు. అందరకు సమానుభవమునిచ్చు మనలోకజీవనమునకుఁ గారణము నీసిద్ధాంతము చెప్పఁజాలదు. దేశకాలావృతమైన ప్రపంచము, ప్రత్యేకవ్యక్తిగత విజ్ఞానముపై నాధారపడియున్నదనుట యోగాచారుల యభిప్రాయము కాకున్నను,

శుద్ధజడజగత్సత్యవాదమును ఖండించవలెనను నాతురముతో, మానసికతాత్త్వికభావములను సరిగానర్థముచేసికొనక కేవల మనఃప్రపంచమే పరమసత్యమను వాదమును సమర్థించినారు. మఱియు నిట్టియస్పష్టజ్ఞానముతో మనస్సుయొక్క సత్యానిత్య లక్షణముల రెంటికి విజ్ఞానమను నొకేనామకరణము నొసర్చిరి. కర్మఫలరూపమైన స్కంధవిజ్ఞానమును, సర్వమునందాత్మశక్తి రూపమున నిత్యమవిచ్ఛిన్నక్రియాత్మకమైయున్న ఆలయవిజ్ఞాన మును మనకుంగలవు. జగదస్తిత్వసత్యము ఆలయవిజ్ఞానముపై నాధారపడియున్నది. వస్త్వస్తిత్వజ్ఞానములకొరకు పూర్ణవిజ్ఞాన ముండుటవసరము. అనగా విశ్వమంతయుం గేవలవిజ్ఞాన రూపమేకాదు. కాని యోగాచారులట్టి సిద్ధాంతమును తప్పుగా బ్రకటించినారు. మనస్సు స్వయంసంపూర్ణ మైనదనియు, దానికనుభవములో గోచరించు వస్తుజగత్తును స్వయంసంపూర్ణమనియు సులభముగాం జెప్పివేసిన జగత్సత్య వాదుల సిద్ధాంతమును యోగాచారులు తృణీకరించిరి. జడ పదార్థ మనఃప్రపంచముల మాటుననుండి రెంటికి నేకకారణ మైన మూలతత్త్వమును గనిపెట్టవలెనని వారుయత్నించిరి. వారుసరియైనదృష్టితోడనే బాహ్యప్రపంచమును నిర్మించునది విజ్ఞానమనియు నది కేవల వ్యక్తిగతమైనదికాదనియు నిర్ణయిం చిరి. ఈవిజ్ఞానగర్భమునందే విషయీ విషయభేదమేర్పడును. ఆలయవిజ్ఞానము మూలాధారమైన సత్యము. ఇది యేభిన్నమా నసముల ద్వారమునను,వస్తురూపమునను బ్రతిఫలించుచున్నది. విషయీ విషయభేదము జ్ఞానముయొక్క స్వభావలక్షణమే

కాని, వైభాషికులు, సౌత్రాంతికులు చెప్పునట్లు, రెండు వేరైన వ్యక్తులమధ్యమందుండు సంబంధముకాదు. ఆలయవిజ్ఞానము పూర్ణస్వరూపముకలది; అందు జ్ఞాని, జ్ఞేయమునొకటే. దురదృష్ట వశమున నిచట జీవవిజ్ఞానమునే ఆలయవిజ్ఞానముగా భావించు పొరపాటువీరుచేసిరి. జీవవిజ్ఞానము పరిమితమైన మానసిక విజ్ఞానము లేక స్కంధవిజ్ఞానము. మనము కూటస్థజ్ఞాన మును దేశకాలబద్ధులైన ప్రత్యేకవ్యక్తుల మానసికవిజ్ఞానమని భ్రమించినచో మనము సంశయవాదమను నగాధకూపమునఁ బడిపోవు ప్రపాతతటమున నిలిచియున్నవారమగుదుము. బౌద్ధ మతేతర విమర్శకులందరు దోషపరిచ్ఛిన్నమైనను యోగాచార సిద్ధాంతమునందలి సత్యలేశమునుగూడ విస్మరించి, యది కేవ లము మనస్సేసర్వమునను సిద్ధాంతమును జెప్పినదని ఖండించిరి.

మనస్సునందుఁ దప్ప వేఱుగాజగత్తు లేదను నీసిద్ధాంత మును శంకరుఁడు పెక్కుపద్ధతులలో ఖండించెను. దర్శ నములోని భిన్నత్వ మీ సిద్ధాంతము విడిచిపెట్టినది. మన మొక సాయంకాలారుణకాంతులఁ దిలకించుచుండగా నొక హఠాచ్ఛబ్దము వినఁబడుచో దానికెట్లర్థము చెప్పవలెను ? వస్తు వులు భావములు నేకకాలమందు గోచరించుననుటవలన నవి రెండు నొకటికాఁజాలవు. ఏకత్వమునకు నవినాభావసంబంధము నకు భేదమున్నది. మన విజ్ఞానకార్యములన్నియు వస్తుశూన్యము లైనచో శూన్యత్వజ్ఞానమును శూన్యమేయగును. జాగ్రత్స్వ ప్నావస్థలపోలిక సమంజసముకాదు. స్వప్నానుభవమాంతరం గికము, వ్యక్తిగతము; జాగ్రదవస్థ యట్టిదికాదు. స్వప్నము

లోని దృశ్యములు స్వప్నముతోఁబోవును; కాని జాగ్రిదవస్థ లోని వస్తువులు నిత్యములు. జాగ్రిత్స్వప్నావస్థలకు నిజమైన భేదమున్నదని శంకరుని వాదము. రెంటికిని భేదమే లేనిచో స్వప్నములో మనము చాలదూరము ప్రయాణము చేయు చుందుము. మనకు మెలకువవచ్చినపుడు మనము పరుండి స్వప్నము గాంచినచోటఁగాక, స్వప్నములో నెచటికిఁబోతిమో యచట మేల్కొనవలెను. జాగ్రిత్స్వప్నానుభవములు రెండును నిత్యములుగావనియు, మనము జాగ్రిదవస్థననుసరించి స్వప్నానుభవములను బరిశీలించుచో నబద్ధముగాఁ దోఁచినయెడల, స్వప్నావస్థననుసరించి జాగ్రిదవస్థను బరిశీలించినచో జాగ్రిదవస్థయు నసత్యముగానే తోఁచుననియుఁ జెప్పినచో శంకరుఁడు, మనకుఁ గర్మాచరణమునకుఁ బ్రధానమైనది జాగ్రిదవస్థగనుక; స్వప్నావస్థ యసత్యముగా నిర్ణయింపవచ్చునని బదులుచెప్పినాఁడు. జాగ్రిదవస్థయు నసత్యమని బౌద్ధుఁడు నిర్ణయించుచో నింకొక యనుభవముపై నాధారపడి యట్టినిర్ణయము చేయవలసి యున్నది. అట్టియున్నతానుభవము నొకదాని నాతఁ డంగీకరించుచో నది నిత్యమైనదని యాతఁడొప్పుకొనవలెను. అప్పుడు క్షణికవాదము వ్యర్థమై, వేదాంతవాదము ధృఢమగును. లేని వస్తువులను మనము చూడఁజాలము. శంకరుఁడు మానసికాంశములపై నిలఁబడినాఁడు. "మనమెల్లప్పు డేదోయొకదానినిఁగూర్చి తలంచుచునే యున్నాము." కాని, యది "విషయశూన్యమైన యాలోచన" కాదు. ఒకస్తంభమునో, యొకగోడనో తెలియు నాతఁడు, కేవల వస్తుహీనమైన ధర్శనమును జేయుటలేదు.

మనకు జ్ఞేయవస్తువులైన స్తంభ కుడ్యాదులను దెలియుచున్నాము. ఒకస్వప్నాసనము, స్వప్నమానసికాంశము కాదు; అట్లే జాగ్రదవస్థలో మనము కూర్చుండిన 'కుర్చీ' మన మనస్సులోనిది కాదు. కుర్చీయొక్క స్థితి మన మనస్సుపై నాధారపడియుండవచ్చునుగాని, మన మనస్సులోని యొక భాగము కానక్కర లేదు. మనముచూచిన వస్తువు విజ్ఞానము నుండి యుత్పన్నమైన రూపమే కాని, వస్తురూపము మనకెన్నడు గోచరింపదనిచెప్పు వాద మర్థరహితమని శంకరుని నిశ్చయము. ఆదినుండియు వస్తువులే నిజముగా లేనిచో, లేనివస్తువుల రూపములను విజ్ఞానమెట్లు ప్రదర్శింపఁగలదు ? వస్తువులు నిజముగా నున్నవి కనుకనే, విజ్ఞానము వాని రూపప్రతిబింబములను గల్పించుకొనుచున్నది. అట్లుకాకున్నచో, విజ్ఞానము స్వేచ్ఛా రూపములను గల్పించుకొనవచ్చును. వస్తువులు బాహ్యమున నున్నవను మన విజ్ఞానము మిథ్యయనియు, వస్తువులు బాహ్యమున నున్నట్లుగా గోచరించునే కాని, నిజముగా నివి బాహ్యమున లేవనియుఁ జెప్పువాదమునకు, నిజముగా బాహ్యమున నేమియు లేకున్నచో, బాహ్యవస్తుస్థితి యేలజనింపవలెనని శంకరుఁ డడుగుచున్నాఁడు. సర్పమనునదే నిజముగా లేకున్నచో, రజ్జువునందు సర్పభ్రాంతియే జనింపదు. అందుచే బాహ్యవస్తువు లుండితీరవలెను. ౧.

జాగ్రత్స్వప్నావస్థలకు భేదమున్నదని కుమారిలుఁ డిట్లు వాదించినాఁడు. "జాగ్రదవస్థాజ్ఞానముచే స్వప్నానుభవ మసత్య

౧ చూడు. ఉదయనుని ఆత్మతత్త్వవివేకము.

మని ఋజువగుచున్నది. ఇది మా నిశ్చయము. రెండు నసత్యములేయని తలఁచు మీకు వానియందలి భేద మేముండును ?"౨ యోగుల సమాధ్యవస్థలో జాగ్రిదవస్థయు నసత్యమని తెలియుచున్నదను వాదమునకుఁ గుమారిలుఁ డిట్లు చెప్పినాఁడు; "అట్టి యోగిజ్ఞాన మీజన్మములోఁ గలిగినవాఁ డెవఁడును లేఁడు. అట్టి స్థితినిబొందినవారి యనుభవమేమో మనకుఁ దెలియదు."౩ నిర్ణయానుమానములు మనస్సంబంధములైన విషయావిషయములపై నాధారపడియున్నవనియు, బాహ్యవస్త్వస్తిత్వము వీని కవసరము లేదనియుఁ జెప్పు న్యాయసిద్ధాంతమును నిరాలంబవాదు లుదాహరించుచో, న్యాయసిద్ధాంతము బాహ్యవస్తుసత్యమునంగీకరించి, తన సిద్ధాంతమును చేసినదని కుమారిలుఁడు బదులు చెప్పినాఁడు.౪ భావములలోని భేదములకుఁ జిత్తసంస్కారములే యాధార మనుటవలన మన కన్యోన్యాశ్రియ దోషము పట్టి వ్యర్థవాదమునకుఁ దోడ్కొనిపోవును. పరిశుద్ధభావమునకు నితరభావములకు భేదము మనకుఁ దెలియు నవకాశము లేదు. గ్రహించువానిలో వాసనలు భేదభావముల నుదయింపఁజేయునుగాని, గ్రహింపఁబడిన వస్తువులో నట్టిభేదము లేదు.౫ మఱియు వాసనకూడ నిరాధారమైయున్నది. "భావములు క్షణికములు. అందుచే నవి పూర్తిగా నదృశ్యము లగును. వాని సంబంధ

---

౨ శ్లోకవార్తికము. ౫ అ ౩, ౮౮-౮౯
౩ ,, ,, ,, ౯౩-౯౪
౪ ,, ,, ,, ౨౬౭-౨౭౫
౫ ,, ,, ,, ౧౮౦-౧౮౧

మేమియు మిగులదు. వాసన వాసితుఁడు నేకకాలమందుండరు కనుక రెంటికిని సంబంధములేదు. అందుచే వాసనయే లేదు." రెండు క్షణములు కలిసియుండని కారణమున నవి వాసనచే సంబంధమును బొందఁజాలవు. ఒకవేళ నవి రెండు నొకేకాలమున నున్నను, నవి యన్యోన్య సంబంధమును గలిగియుండవు; ఏలన రెండును క్షణికములగుటచే, బరస్పరప్రవృత్తి వానికి లేదు. ౧ పూర్వజ్ఞానలక్షణము లనంతరజ్ఞానమునం దున్నయెడల నవి పూర్తిగా నశించినవని చెప్పరాదు. వాసనల నుదయింపఁజేయుచు వానిని భద్రపఱచు శాశ్వతమైన విజ్ఞానావసరమున్న కారణముచేతనే యోగాచారులు నిత్యమగు నాలయవిజ్ఞానమును గల్పించిరి, కాని బౌద్ధసిద్ధాంత గౌరవముచే నది నిత్యము మారుచుండునదని వారు చెప్పవలసివచ్చినది. అందుచే యోగాచారసిద్ధాంతము లోపభూయిష్ఠమైనది. శంకరుఁడు దీనిని చక్కగా ఖండించినాఁడు. నిత్యమైన యొక నియమము లేకున్నచో, జ్ఞానమున కవకాశము లేదు. ఆలయ విజ్ఞానమే నిత్యమైన యాత్మస్వరూప మన్నచో, నిత్యమైన దేదియును లేదను బౌద్ధసిద్ధాంతము నిలువదు. యోగాచారుల తాత్త్వికోత్సాహమువ నిషత్సిద్ధాంతము సమీపమునకు వారిని జేర్చినదికాని, బౌద్ధతత్త్వవిశ్వాసము వారిని సత్యమును గుర్తింపకుండఁ జేసినది.

కాని, కేవల భావసంబంధమే జగత్తని చెప్పుటచే సత్యము శుష్కపదమగునని యోగాచారులు గుర్తించిరి. విషయావిషయభేదములతోఁ గూడిన దృశ్యప్రపంచాస్తిత్వమును

౧ శ్లోకవార్తికము ४ అ 3 ౧౨౭-౧౨४

వారంగీకరించిరి. మాధవుఁ డిట్లు వ్రాసినాఁడు; "ఈసిద్ధాంతము ననుసరించినచో, నొక మధురపదార్థములను దినుటవలన లభించు రసము, శక్తి, పుష్టియు మధురపదార్థ భావానుభవముచే లభించునని యెవ్వఁడు నంగీకరింపఁ జాలఁడు."౨ యథార్థమైన మూఁడుడోలరులకు, వానినిఁగూర్చిన భావమునకుఁగల భేదమును జెప్పిన క్యాంటుతత్త్వవేత్త స్మృతిపథమునకు వచ్చుచున్నాఁడు. మానసికముగా విషయివిషయభేదమును యోగాచారులు నంగీకరించినారు. కాని తాము విజ్ఞాన మనిచెప్పు నొక పూర్ణ వస్తువులోనివి భిన్నరూపములని సవిమర్శ పరిశీలనము వారికి వ్యక్తపఱచెను. జీవాత్మ తనకు వేఱుగా నొకవస్తువును జూచును; అట్లు చూడకున్న విజ్ఞాన జీవితమున కవకాశము లేదు. జీవాత్మకు గోచరించు దృశ్యము పరమార్థదృష్టిలో నిరర్థక దృశ్యముకాదు. జీవాత్మ యెంతనిజమో, దానికి వేఱుగానుండి, విశ్వవిజ్ఞానముపై నాధారపడియున్న బాహ్యప్రపంచము నంతే సత్యము. ఆలయ విజ్ఞానతత్త్వము పిక్టే తత్త్వమునకు సరిపోవును. అనుభవమంతయు స్వయంజ్ఞాన సమర్థమగు నొక ద్రష్టకుఁ జెందినదనియు, నాత్మయనగా నేకకాలమందే కర్తయుఁ గర్మయుఁగూడ నైయున్నదనియు నాతని భావము. అహంకారము, తనయందే తనకు వ్యతిరేకమైన యొకరూపము నూహించుకొనుచున్నది. ఈవిధానముచే అహంకారము తనకు వేఱైనవస్తువును గల్పించుకొనుచున్నది. అదేవిధముగాఁ బూర్ణమైన ఆత్మశక్తి, తనకువేఱుగా

---

౨ యస్. డి. యస్. పుట ౨౬

గోచరించునట్టియుఁ, దనరూపాంతరము లైనట్టియు భిన్నములైన జీవాత్మలను గల్పించుకొనుచున్నది.

దేశకాలబద్ధమైన ప్రపంచము, మన యజ్ఞానదృష్టికి సత్యముగా గోచరించుచున్నది. మనబుద్ధి స్వస్వరూపమున, విషయీ విషయభేదరహితమైనది ; కాని అసత్యములగు భావములవలనఁగాని, అనాది వాసనావశమునఁగాని, ద్రష్ట, దృశ్యమననుభిన్నరూపములను జూచుట కలవాటుపడినది. మనబుద్ధి ద్వివిధము; జ్ఞానాజ్ఞానాపూర్వకము, జ్ఞానరూపమైన బుద్ధియథార్థమైన సత్యమును గ్రహింపఁ గలదు. అజ్ఞానపూర్వకమైనబుద్ధి, దేహభాగములగు స్కంధాయతన ధాతుజన్యమైన సహజజడత్వముచే నవిద్యారూపమై, సత్యప్రమాణ నిర్ణయాధికారము లేనిదైనది.౧ ప్రతివ్యక్తియందు విజ్ఞానమున్నది; సర్వవస్తుభావబీజములందున్నవి. భౌతిక జగత్తు నిజముగాలేదు; కాని అవిద్యాకల్పితమైన మనోగతభ్రాంతిచే ఆలయ విజ్ఞానమునందలి భావబీజములను బాహ్యప్రపంచ వస్తురూపములుగా వికసింపఁజేసి, యట్లు గోచరించిన రూపములే సత్యములని మానవుఁడు తలఁచును. ఇదియు భావప్రపంచ తత్త్వమే; ఏలన బాహ్యజగత్తు మానసికభావనిర్మితమైనది. "సర్వపోషక విజ్ఞానము లేక ఆలయమునందు అవిద్యయున్నది; అవిద్యవలనఁ జూచునది, ప్రతిబింబించునది, గ్రహించునది, బాహ్యజగత్తు, వస్తుకల్పన మోహ తెగకుండఁ జేయునది జనించును."౧ ఆలయావిద్యామిశ్రమము

౧. యస్.డి.యన్ ౨౫. ౨౬౨. స.సి.సా.సం ౩౫ ౪,౬-౭

౧. అశ్వఘోషుఁడు, శ్రద్ధాజాగృతి పుట ౭౫

చే జీవాత్మయు, దానికనుబంధమైన బాహ్యజగము, నుదయించును. ఈరెండును నిజముగా భ్రాంతిరూపములు; ఆలయమందదృశ్యము లగును. మనఃప్రపంచ మూలసత్యము తత్త్వసత్యమే.

ఒకబుద్ధుని భావములుతప్ప, తక్కినవన్నియు గుణత్రియస్వభావముగలవి. (౧) పరికల్పితస్వభావము (౨) పరతంత్రస్వభావము (3) పరినిష్పన్నలేక పరిపూర్ణస్వభావము. మన స్వప్నానుభవములు మొదటివర్గములోనివి. బుద్ధి, స్వప్నములో బాహ్యరూపకల్పనముచేయును. స్వప్నావస్థలో నిట్లుకల్పితమైన వస్తురూపములు, దేహేంద్రియములు, వానికిఁదెలిసిన వస్తువులు, భౌతికప్రపంచము. ఈద్వైతభానమునుండి ఆత్మానాత్మలు, మున్నగునవి గోచరించును. స్వప్నావస్థలో గోచరించిన గజములు మున్నగునవి సత్యములని స్వప్నగతుఁడెట్లు తలపోయునో, యట్లే భావరూపములను నిజముగాబాహ్యముననున్న వస్తువులని భ్రాంతిపడుటవలననే ద్వైతభావ మేర్పడుచున్నది. ఈ ద్వైతము తాత్త్వికసత్యముకాదు; విషయావిషయభేదముల నూహించు వికల్పసంజాతమైనది. కాని భావముల మూలకారణమేది? ఒకక్రమవిధానమున నవి గోచరించునా సూత్రమేది? జగత్సత్యవాదులు చెప్పుబాహ్యవస్తువులచే నవియుదయింపలేదు; వేదాంతులు వచించు నిత్యమైనయాత్మనుండియుఁగాదు; లేక నవి స్వతంత్రములునుగాదు. భావములొకదానిపై నొకటి యాధారపడియున్నవి. యమ్. పోసిన్ వ్రాసినాఁడు: "బౌద్ధతత్త్వవేత్తలందరు, కర్మసిద్ధాంతవాదులును క్షణికము

లైనను, భావములన్నియుఁ బూర్ణనాశనమందవనియుఁ, దిరిగి నూత్నభావముల మదయింపఁజేయుననియు, నట్లుచేయుటకుఁ గొంతకాలము గడచినఁ గడువవచ్చుననియు నంగీకరింపక తప్పని సరియైనది.జడపదార్థమున్నదనియు, మానవుఁడొక భౌతిక మానసిక నిర్మాణమనియు, వారునమ్మునంతకాలము, భావములు పరస్పరాశ్రియభూతములని చెప్పుటకష్టమైనదికాదు."షడ్విధజ్ఞానములకు భౌతికాధారమును, బాహ్యాపేరిణములు నున్నవి: స్మృతితోసహా సర్వమానసికాంశములకు నీషడ్విధజ్ఞానములచే నర్థము చెప్పవచ్చును. కాని యేభౌతికాంశాధారమవసరము లేకుండ సంపూర్ణమన స్తత్వమును విజ్ఞానవాదు కల్పింపవలసియున్నది. వారిట్లుచెప్పుదురు: "జగత్సత్యవాదులు లంగీకరించిన యింద్రియ మనోజ్ఞానములన్నియు బీజములను సృజించును. అవి బోధిసత్త్వల శక్తితప్ప నేయితరసంబంధమును లేకుండ సకాలమునఁ బరిపక్వమై నూతనేంద్రియ మనోదృశ్యములుగా మారును. మొదటనాటఁబడి, పరిపక్వమైన బీజముల మధ్యమ కాలమునందొక దానివెనుక నొకటిగా బయలుదేరినయింద్రియ మనోజ్ఞానములలోని యంశము లీ బీజములుకావు. 'నేను' గా నున్న తేపటి యనేకజ్ఞానపరంపరలలో "నీలిమ" యను జ్ఞానము నిన్నటి జ్ఞానవిశ్వాసములపై నాధారపడియుండును. అందుచే మనము ప్రాచీన షడ్విధజ్ఞానరూపములకు నేటితత్త్వవేత్త చెప్పు" అవిజ్ఞాతసంస్కారముల" (Unconscious images) ను నింకొకజ్ఞానవర్గమును జేర్చవలసియున్నది. ఇవిస్పష్టములైన జ్ఞానబీజములు; అనుభవజ్ఞానముచే జనించినవి; వీనికి వెనుక నీ

బీజము లవిజ్ఞాత సంస్కారపరంపరల విచ్ఛిన్నాత్మ స్వయంసృష్టిచే నుదయించి, పూర్వజ్ఞానబీజములచేఁ బోషింపఁబడి, నూత్నబీజోత్పత్తిచే విస్తరించి, యవిపక్వమై, నూత్నబీజోత్పత్తి లేనికాలమున సంతర్ధానము లగును.“౧” క్రొత్తబీజములను నాటక, పూర్వబీజములు ఫలములై పోయినపుడు, మనము జ్ఞానముయొక్క రెండవఘట్టమును దాటి మూడవదైన పరినిష్పన్నతదశకుఁ దరలుదుము. మనమిచట విషయీ విషయభేదము మిథ్యాభావకల్పితమని గ్రహింతుము. స్వచ్ఛభావ స్వరూపము నెఱుఁగుటకు, ద్వైతభావము పోవలెను. కాని భావము లద్వైతస్థితికిఁ బోవునప్పుడదియబోధ్యము, ననిర్వచనీయము నగును. అదియప్పుడు నిర్విశేషము లేక నిర్గుణమగును. అప్పుడదియున్నదని (భవత్యేవ) మాత్రమే చెప్పవచ్చును. అప్పుడు దానికి వస్తుమాత్రమనియు, లేక చిత్తమాత్రమనియుఁ బేరు.

పరికల్పితసత్యము స్పష్టమైన దోషమనియు, నది రజ్జువునుజూచి సర్పమని తలఁచుట వంటిదనియుఁ జెప్పవచ్చును. పరతంత్రసత్యమనగా సంబంధజ్ఞానమనియు మన మొక రజ్జువును రజ్జువుగాఁ దెలియునట్టిదనియుఁ; బరినిష్పన్నసత్య మనగాఁ దాత్త్వికసత్యమనియు ననగా రజ్జువొక మానసికభావ మనియు వస్తుతః దాని స్వస్వరూపము మనకుఁ దెలియదనియుఁ జెప్పకొనవచ్చును. నాగార్జునుఁడు మొదటి రెంటెని సంవృతి సత్యమనియు, మూఁడవది పరమార్థమనియుఁ బలికినాఁడు. ప్రమాణబద్ధము కానిది, కేవల వ్యక్తిగతమునైన పరికల్పితసత్యము

---

౧. ఇ. ఆర్. ఇ. వాల్యూము ౮ పుట ౧౫౦.

మిథ్యాజ్ఞానమని క్యాంటు మాటలలోఁ జెప్పవచ్చును. అది హేతునిర్ణయమునకు నిలువదు; వ్యవహారప్రయోజన శూన్యమైనది. సంబంధములు గలిగి, ప్రమాణబద్ధమైనది యింద్రియజ్ఞానమని పరతంత్రజ్ఞానమును జెప్పనగును. ఇట్టి ప్రమాణసిద్ధమగు జ్ఞానమువలన సర్వప్రమాణాతీతమైన పరమసత్యము తెలియఁబడదు. అద్వితీయమగు దివ్యశక్తి మనలోఁగూడ నున్నది కావున మనము పరమసత్యమును గ్రహించు నతీంద్రియదృష్టి నార్జింపఁగలము. బాహ్యదృశ్యములతో సంబంధము లేకుండ నవిభాజ్యమై పూర్ణమైన యాశక్తి ప్రతివ్యక్తియందు గర్భితమై యున్నది. భిన్నోపాధికల్పనముల కాధారభూతములైన దేశకాలములకు బద్ధమైన దృష్టికి ద్వైతముగోచరించును. ఆలయమున కనేకత్వములేదు కాని, దానిరూపాంతరము లనంతములై దేశకాలములందు గోచరించును. ఏయవస్థయందు సర్వవిరోధములుపశమించి, భావాభావసమానత దృశ్యమగునో దానినే యోగాచారులు 'తథతా' నామమునఁ జెప్పిరి.౧

జగత్సత్యవాదులతో నేకీభవించి, యోగాచారులు జగద్వస్తుజాలమును సంస్కృతా సంస్కృతములని రెండువిధములుగా విభజించిరి. సంస్కృత ధర్మములనుగూడ వీరు తిరిగి ద్వివిభాగమొనర్చిరి; కాని జగత్సత్యవాదులు జడపదార్థమునకుఁ బ్రధాన స్థానమీయఁగా, యోగాచారులు చిత్తమునకగ్రస్థాన మిచ్చిరి. 'చిత్తమే సర్వవస్తు మూలద్రవ్యము, చిత్తమునకు రెండురూపములున్నవి; లక్షణము లేక బాహ్యరూ

౧ చూడు. మహాయాన సూత్రాలంకారము

వము; భావము లేక అంతరంగికరూపము. మొదటిది చంచల స్వభావము; రెండవది నిశ్చలరూపము. వస్తువులను దిలకించుట యు వాని భావరూపముల నందుకొనుటయు నీరెండును చిత్త కార్యములు. మొత్తము చిత్తధర్మము లెనిమిది. పంచేంద్రియ ములకుఁ జెందిన వైదు; నారవ దంతఃకరణము, నేడవది విజ్ఞానము, నెనిమిదవ దాలయవిజ్ఞానము.౧

---

౧ శంకరుఁ డిట్లు వ్రాసెను, "ఈ సిద్ధాంతమునుగూర్చి మేమిట్లు విమర్శించుచున్నాము." బౌద్ధులు చెప్పిన ద్వివిధవర్గములు, అనగా సంస్కృతాసంస్కృతధర్మములు - అణువులచే నేర్పడిన భూతములు, భూతవస్తుజాలములు పంచస్కంధములును నెట్లేర్పడినవో బుజువుచేయఁబడలేదు. భౌతికవస్తుసముచ్చయకారణములైన భాగములకు జ్ఞానములేదు; వస్తుసముచ్చయములో నిమిడనికే చైతన్యమున్న యెడల నిపుడు జ్ఞానమున్నదని చెప్పుటకు వీలుండును. నిత్యమైన యొక జ్ఞానముగల యాత్మనుగాని, యీశ్వరునిగాని బౌద్ధులంగీకరింపరు. లేక అణువులు స్కంధములును తమ స్వశక్తిచే తమంతట కలియుచున్నవని చెప్పుటకును వీలులేదు; ఏలన, వానికిఁ గ్రియాశక్తి యున్నచో నవి యున్నను విశ్రాంతి నొందవు. ఈ సముచ్చయమును సమకూర్చు క్రియాశక్తి ఆలయవిజ్ఞాన ప్రవాహమందున్నదనుటకును వీలులేదు. ఆలయవిజ్ఞాన మేకజ్ఞానమా కాదా యనునది నిశ్చయముచేయవలెను. ఏకజ్ఞానమైనచో, నది నిత్యమైనది కావలెను. అప్పుడది వేదాంతముచెప్పు నిత్యాత్మ యగును. అనిత్యము క్షణికము నైనచో నణుసంచలనశక్తి దానికుండఁజాలదు. ఆలయవిజ్ఞానము కేవలక్షణపరంపర యైనచో నది వర్తింపనవసరములేదు, అందుచే నణువులు తామే కలిసి పదార్థములఁ జేయుచున్నవను వాదము సరియైనది కాదు. కాని యీ పదార్థములు లేకున్నచో సంసారప్రవాహము నిలిచిపోవును. కావున నవి యున్నవని స్పష్టము. (వేదాంతసూత్రభాష్యము. జి. థిబోకూర్పు. పుటలు ౪౦౩—౪) వస్తూత్పత్తికి విద్య కారణము కాఁజాలదు. దేని నాశ్రయించి యవిద్య నిలుచునో దాని కది యెట్లు కారణము కాఁగలదు? మఱియు కారణసిద్ధాంతమును సక్రమముగా నిర్ణయింపఁబడలేదు."

అ సంస్కృతధర్మములారు : ఆకాశమనంతము, మార్పులు లేనిది; కేవలభావాత్మకము; పూర్ణజ్ఞానముచే సర్వవిధ క్లేశములను నిర్మూలించునది ప్రతిసంఖ్యానిరోధము; పూర్ణజ్ఞానసాహాయ్యము లేకుండగనే సర్వదుఃఖములను నశింపఁజేయునది అప్రతిసంఖ్యానిరోధము; సర్వపదవీ వ్యామోహములను జయించినది అచలస్థితి; సంజ్ఞావేదనానిరోధము, ఈ యైదును వేర్వేరుగావు; జగత్తుయొక్క నిత్యస్వరూపమునుగూర్చి మనము గుర్తుకొఱకుపయోగించిన పరిభాష, ఉత్తమస్థితినిచ్చు వివిధ దశావిశేషములని మనము వీనినర్థము చేసికొనవచ్చును. ధర్మపాలుఁడిట్లు చెప్పినాఁడు; "ఇవన్నియు సత్పదార్థముయొక్క భిన్నములగు నంశారూపములు." యోగాచారుల పరమతత్త్వము 'తథత'. "ఇది సర్వాతీతమైన పరమసత్యము. దీనిస్వరూపము సత్యము నిత్యమునైనదగుటచే దీనిని తథతయనిరి." దీనిస్వరూపము భాషాతీతము; అనిర్వచనీయము.౧. దానిని శూన్యముగా మనము పొరపడుదుమోయని 'భావ'మని చెప్పఁబడెను. అసంగుఁడిట్లు చెప్పెను; "ఇదిభావమునుగాదభావమునుగాదు. అదియిట్టిదట్టిదని చెప్పలేము. అదిజనించదు, మరణించదు. దానికి వృద్ధి

౧. వసుబంధువు. ౨. స్వయంజ్ఞాన పూర్ణమైనయొక పరమాత్మయున్నదనియు, సర్వజగద్వ్యాపారనాతని పరిపూర్ణమేధయనియు, ప్రపంచములోని కేవలభాగములుగాఁగాక పరమాత్మయొక్క స్వయంజ్ఞానశక్తిలో మన మంశాత్రులమనియు నాతని ప్రపంచవ్యాపారమునందు భాగస్వాములమనియు నందుచే మనకు ధర్మమతానుష్ఠానముల కిదియే యాధారమనియు హెగెల్ మహాశయుని యుపదేశ సారాంశమని మేము నిశ్చయించుచున్నాము."

(టి. హెచ్. గ్రీన్: వర్క్సు, వాల్యూము 3. పు ౧౪౬.)

క్షయములులేవు. అదిపవిత్రమునుగా దపవిత్రమునుగాదు. ఇట్టిదే పరమార్థలక్షణము."

జీవత్వము లేక అభావలక్షణముతోఁ గలిసినప్పుడు 'తథత' నే ఆలయవిజ్ఞానమందుము. సత్యార్థమును విజ్ఞానము లేక చిత్స్వరూపముగా గ్రహించినంతనే, జీవత్వమునందుఁ బ్రవేశ పెట్టినాము. ఆలయమందు నిత్యమైన భిన్నత్వమున్నది. ఇచటనే స్వయంప్రకాశమైన విజ్ఞానమున్నది. హెగెల్ యొక్క పూర్ణ సద్రూపమిదియే.౨ సత్తునుండి మానమాలయ విజ్ఞానముగాఁ బోయినంతనే, విజ్ఞానముతోఁ బాటు దేశము, జీవముతోఁ బాటు అనాత్మరూపమును గాంతుము. సత్తుయొక్క పరిచ్ఛేద రూపాంతరమే దేశము; దానికి నిజమైన స్థితిలేదు. అవిద్యా రహితమైన మనస్సు నెదుట గోచరించు ననత్యత్వమే జగద్రూపము. అవిద్యానాశనముతో జగద్రూపము నదృశ్య మగును. దేశము వ్యావహారికముగా నిజము నిత్యము నైనది.౧ అవిద్యా సంజాత ప్రదర్శనము లామూలనత్యా ర్థము నంటవు. ఇదియే అర్వాచీన వేదాంతమందలివివర్తవా దము. "జ్ఞానైకరూపమునందు ద్వైతదర్శనము మిథ్యయే."౨ మఱియు, "అంతరంగికభావము బాహ్యరూపముగా గోచరిం చును."౩ ఏకైకసత్య మవిద్యాశక్తివలన లోకముగాఁ గన్పట్టు చున్నది. ఏవిధముగా సర్వవస్తువులు సత్పదార్థమందున్నవో మనకుఁ దెలియదు. అన్నియు నందేయున్నచోఁ బరిణామము న

౧ సుజుకి పుట ౧౦౭, ౨ స, ద, సం పుట ౨౬ ౩ స, ద, సం. పుట ౨౭,

కవసరములేదు. అందులేనిచో, సత్పదార్థము వాని నుత్పన్నము
చేయుచో, నది మార్పు గలదగును. సర్వానుభవ కారణమైన
అవిద్య, ఆలయవిజ్ఞానముతో నెట్లారంభమగుచున్నదో మనకుఁ
దెలియదు. "సర్వవిజ్ఞానమనోరూపముల విద్యారూపములైనను
నవిద్య, పరమార్థముతో నొకటియు వేరునుగూడ నైయున్నది.
ఒక దృష్టిలో నది యనిత్యము; వేరొక దృష్టిలో నదియవినా
శము."౮ "జ్ఞానాజ్ఞానములు రెండు నొకటే కుండలన్నియు
భిన్నరూపములైనను, నొకేమృత్తికనుండి చేయఁబడినవి."౫
తథత ప్రథమసత్యము. ఆలయావిద్యలు తరువాత వచ్చునుఁ
తరువాత జీవాత్మలు,వస్తువులు పరస్పరపోషకములై జనించునుఁ
ప్రతివ్యక్తియందును నహంభావము, తదతీతసత్పదా
ర్థముగూడ నున్నవి. మనకవిద్యయున్నంతకాల మహంభావ
ముండును. మానవులలోని భిన్నత్వమున కవిద్యాశక్తియే కార
ణము." సర్వజీవులొకే గుణసామ్యమును గలిగియున్నను,
ననాదినుండి యహంభారకారణమై పనిచేయుచున్న యవిద్యా
పరిమాణము గంగాసైకతరేణువులకంటె నధికసంఖ్యాకమగు
దశలలోనుండి పనిచేయుచుండుటచే నీభిన్నత్వమనంతముగా
నున్నది."౧. మనచిత్తమజ్ఞాన కలుషితమై భిన్నవ్యక్తిత్వదర్శన
ప్రవృత్తిమగ్నమైనది, ఇదియే సంసారము. కర్మవాసనావశమై
సంసారచక్రమనవరతమైసాగుచున్నది. ఆలయము లేక చిత్తము
మనముచూచు వస్తువుల కాధారము. మనపూర్వకర్మ బీజము

౮ సుజుకి పుట ౬౭ ౫ సుజుకి పుటలు ౭౩-౭౮

౧. సుజుకి. పుట ౮౯.

లిందుండి పెంపొందుచుండును. ఆలయము లేక చిత్తమునందు రక్షితములైయున్న కర్మబీజములు సుఖదుఃఖసదసత్కర్మఫల రూపములై పరిణమించుచున్నవి. ఇందుఁగొన్ని బీజములు కలుష పూర్ణములై ౧. సంసారహేతువులగును. కొన్ని బీజములు పవిత్రములైనవగుటచే మోక్షహేతువులగుచున్నవి. మనలో గర్భితమైయున్న పరమార్థసత్యమే మనకుఁబరచింతను గలిగించుచున్నది.

కాని, మనలోఁ బరమాత్మయున్నంతమాత్రమున మనకు ముక్తిలభింపదు. హేతుప్రత్యయభేదము చెప్పఁబడినది. దారువుయొక్క మండుస్వభావమగ్నికి హేతువు; కాని దానికి మనము నిప్పుముట్టించకున్నచో నదియంటుకొనదు. అదేవిధముగాఁబరమాత్మ మోక్షహేతువైనను, ధర్మజ్ఞానాభ్యాసమవసరము. అసంగుడిట్లు వ్రాసినాఁడు; "సంపత్సుఖాసక్తివిడిచి, నియమోల్లంఘనమునం దీషన్మాత్రప్రీతియు లేక, దోషములవలన దైన్యము నొందక, సత్క్రియాచరణకాలమునందెట్టి చలనము శ్రద్ధాభక్తులందు లేకుండఁజూచుకొని, లోకము కలుగఁజేయు నాందోళనా వైకల్యములకు వశులై, చిత్తప్రశాంతిని చెడఁగొట్టుకొనక యేకాగ్రత నభ్యసించు, వస్తుస్వరూపముల యాథార్థ్యమును సక్రమజ్ఞానముచే గ్రహించుచు బోధిసత్త్వులు విజ్ఞానమాత్ర సత్యమును దర్శింతురు." యోగాచారులు యోగాభ్యాసము చేయుదురు. యోగమనుభవజ్ఞానమిచ్చును, బుద్ధిజ్ఞానము వ్యవహార జ్ఞానమునుమాత్రమే చేకూర్చును. పరమార్థదర్శనము

౧. సాశ్రవబీజము.

నకు యోగశిక్షణమవసరము. మనస్సునందవిద్యాకాలుష్యము పూర్తిగానశించినయెడలనందు సత్యము ప్రతిఫలించును.౧.

మనస్సును శుద్ధమొనర్చి, స్వస్వరూప తేజోవిలసిత మొనర్చుటే నిర్వాణము. "నిత్యమైన పరచింతాభ్యాసముచే సర్వవృత్తులుపముల నడఁచి, భిన్నవస్తురూపముల దర్శింపఁ జేయునవిద్యనుండి నిర్ముక్తమైన స్వచ్ఛజ్ఞానము నార్జించి, మహోదయస్థితిలేక ముక్తిపదము నొందుదుము."౨. విజ్ఞాన మాత్ర శాస్త్రము నిర్వాణము చతుర్విధమని చెప్పుచున్నది. (౧) సర్వవస్త్వంతర్గతమైన పావన సత్స్వరూపముగానున్న ధర్మ కాయమే నిర్వాణము. సర్వచేతనులలో నీ నిర్వాణము గర్భితమైయున్నది. (౨) ఉపాధిశేషనిర్వాణము. ఇది సశేషముక్తి. మనకు సర్వాతంక మోహములును నశించినను, భౌతికశృంఖలాబద్ధులమై యింకను దుఃఖవశులమై యుందుము. (౩) అనుపాధిశేషనిర్వాణము, ఇది సర్వబంధవిముక్తి. (౪) పూర్ణజ్ఞాన సమన్వితమై, లోకసంగ్రహైకసాధనమగున దుత్తమనిర్వాణము

సర్వసత్యమునకును విజ్ఞాన మవసరమని వాదించి, యోగాచారసిద్ధాంతము తర్కశాస్త్రమునకు మహోపకార మొనర్చినది, కాని మానసికేతరమైన వస్తువులు లేని లోకము

౧. స్పినోజా ధర్మశాస్త్రమునఁ దుదిపుస్తకమును జూడుడు. కామనిగ్రహమువలన మానవునిలో నంతర్భూతమైయున్న తేజస్సమన్వయరూపమైన యనంతశక్తి, అజ్ఞానదుఃఖాలయ విముక్తిగాంచును. కామవశమైన మానసమున కసత్యము సత్యముగాఁదోఁచును. కామముచేఁగలుగు మానసాందోళనములు తొలఁగిపోయినపుడు, జగద్రహస్యస్వరూప దర్శనసిద్ధి చేకూరును.

౨. స. ద. సం. పుట ౨౬.

కాని లేదని తెఱచుగా వాదించి, తనదౌర్బల్యమును బ్రకటించుఁ కొన్నది. ఆలయవిజ్ఞాన శబ్దమునకు నిశ్చితార్థమును జెప్ప లేదు. వస్తుమాత్రమైన తథతారూపమే ఆలయవిజ్ఞానమనియు, సర్వప్రపంచ రూపభావము లదృశ్యములైనపుడు మిగులున దదియే యనియుఁ గొన్నితావులఁ జెప్పఁబడినది. కొన్నితావుల నది సర్వరూపాశ్రయమైన విజ్ఞానరూపమని వచింపఁబడినది. అభావముతోఁ గూడిన విశ్వమానసమని యొకచోఁ బేర్కొనఁ బడినది. వ్యక్తిగతమైన విజ్ఞానవాహినియని యింకొకచో నిర్వచింపఁబడినది. ప్రధానవిషయమైన దీనినిగూర్చి స్పష్టనిర్వచన లోపమువలన, సహజముగాఁ బెక్కువిమర్శలకు గురియైనది.

## ౫. మాధ్యమికులు[౧]

మాధ్యమికతత్త్వ మతి ప్రాచీనమైనది ; దీనిబీజములు బుద్ధుని యుపదేశములలోఁ గలవు. తనమార్గమును బుద్ధుఁడు

౧. దాక్షిణాత్య బ్రాహ్మణుఁడైన నాగార్జున విరచితమైన మాధ్యమికసూత్రగ్రంథమే మాధ్యమిక శాఖకు ముఖ్యగ్రంథము. నాగార్జునుని జీవితమును క్రీ. వె. ౪౦౧ సంవత్సరములో చైనాభాషలోని కనువదించిన కుమారజీవుఁడు క్రీ. వె. ౨ వ శతాబ్దములో నాగార్జునుఁడు జీవించినాఁడని దెల్పినాఁడు. కాని నాగార్జున తత్త్వసంప్రదాయము క్రీ. వె. ప్రథమశతాబ్దమునకుఁ జెందినదే. క్రీ. పూ. మొదటిశతాబ్దమున నాఁ డుండెనను వాదమొకటి కలదు. దలైలామాయొక్క పురాతన గ్రంథములో రక్షింపఁబడిన చరిత్ర నమ్మఁదగిన దైనచో, క్రీ. పూ. ౫౬ నందు జీవించిన ధోరభద్రుని నాగార్జునుఁడు బౌద్ధమతావలంబి నొనర్చెనని శరచ్చంద్రదాసు వ్రాసినాఁడు. బుద్ధుని మరణానంతరము ౪౦౦ ప్రాంతమున దక్షిణకోసలమందు నాగార్జునుఁడు జీవించి పరిపూర్ణజ్ఞానియగు బోధిసత్త్వుఁ డయ్యెనని చైనాయాత్రికుఁడైన యువాన్ చ్వాంగు తెలిపినాఁడు. క్రీ. వె. 300 నాగార్జునుని కాలమని

మధ్యమమార్గమని చెప్పినాఁడు. భౌతిక భోగలాలసత్వముఁ నొక వంకను, దేహకార్శ్యములతోఁ గూడిన కఠిననిష్ఠాజపాదుల నొక వంక నాతఁడు నిరసించినాఁడు. తత్త్వమునందుఁగూడ నాతఁ డతివాదములను ఖండించెను. సర్వదృశ్యములు సత్యములనియు లేక సర్వము మిథ్యయనియుఁ జెప్పువాదములు, అతిభావాభావ వాదముల మధ్యమమార్గమునే మాధ్యమిక తత్త్వ మవలంబించినది. భారతీయ మహోత్కృష్టవైజ్ఞానికులలో నొకఁడు, జగత్సత్యవాదులలోను విజ్ఞానవాదులలోను గంటె, నీతత్త్వమం దనుభవ పరిశీలనము మిక్కిలి సునిశితముగా నుండును. స్వార్థ

---

డాక్టరు విద్యాభూషణు నభిప్రాయము. కుమారజీవుఁ డాతని జీవితానువాదముచేసిన క్రీ. వె. ౪౦౧ సంవత్సరము దాటియుండదని చెప్పవచ్చును. న్యాయసూత్రములు చెప్పిన షోడశప్రమాణముల జ్ఞానము తనకున్నట్లు నాగార్జునుడు సూచించినాఁడు; వానిపై నొకవృత్తినిగూడ నాతఁడు రచించినాఁడు. పంచపదాత్మకమైన తర్కవాక్యము నాతఁడు త్రిపదాత్మకము చేసెను. ఉపాయకౌశల్యహృదయమను నింకొక తర్కగ్రంథమం దాతఁడు వాదకళా ప్రపంచనము చేసినాఁడు. విగ్రహవ్యావర్తనికారికయందు, నాగార్జునుఁడు న్యాయ ప్రమాణసిద్ధాంతమును ఖండించెను. వాత్స్యాయనుఁ డీతని భావముల నెఱుఁగును మాధ్యమిక సూత్రములకు సంస్కృతభాష్యము రచించిన చంద్రకీర్తి యించుమించుగా క్రీ. వె ౭ వ శతాబ్దములోనివాఁడు క్రీ. వె. ౭వ శతాబ్దమువాఁడైన శాంతిదేవుఁడు మాధ్యమికుఁడని కొందరును, యోగాచారుఁడని కొందరును జెప్పుచున్నారు. ఇతఁడు తన గ్రంథములైన బోధిచర్యావతారము శిక్షాసముచ్చయములలో సంవృతి, పరమార్థములను ద్వివిధ సత్యముల నంగీకరించి, శూన్యసిద్ధాంతమును సమర్థించెను. "అనుకంపాంతరంగుఁడవై శూన్యమును నమ్మి సత్క్రియాచరణముచేఁ బుణ్యము నార్జింపుము" (శిక్షాసముచ్చయము: ౧౭౦ ౨౧) మాధ్యమిక సిద్ధాంతము నితరతత్త్వములు విమర్శించినవి.

రహితమైన మానసికోత్సాహము, తత్త్వాన్వేషణోద్రేకము, నిరపేక్షమైన స్వచ్ఛసంపూర్ణ తత్త్వనిర్మాణమున కాతనిఁ బ్రేరేపించినవి. ఆతని తత్త్వ మొకప్పుడు సంశయవాదమును, వేఱొకప్పుడు యోగపద్ధతిని ప్రదర్శించును. మానవుని జ్ఞానము పరిచ్ఛిన్నమైన కారణముచే సంశయాత్మకమైనది; కాని, సత్యముయొక్క పూర్ణప్రమాణమం దాతనికి విశ్వాసమున్నది. ఆతని సంశయవాదము బౌద్ధ సంబంధి; ఆతని నిర్గుణతత్త్వ ముపనిషత్తులనుండి స్వీకృతము. అంతర్దృష్టిలేని వ్యర్థపదజాలముచేతను నౌదాసీన్యముచేతను మన వ్యవహారవిజ్ఞానము భావవైరుద్ధ్యములను గప్పివేయుచున్న పద్ధతిని నాగార్జునుఁ డుత్తమ తాత్త్వికోత్సాహపరవశుఁడై ప్రదర్శించును. సత్యమునుగూర్చి యోగాచారులు వచించిన పరిచ్ఛిన్నభావములనుండి, నాగార్జునుఁడు సంశయవాదమును గల్పించును. కాని నాగార్జునుని తత్త్వమునందుఁ బ్రధానాంశ ముపనిషత్ప్రోక్తమైన యద్వైతమే ఉపనిషత్సిద్ధాంత పునఃప్రకటనము మాత్రమే మనకు నాగార్జునిలో గోచరించునని తలఁచుట వ్యర్థభ్రాంతియే యగును. ఆతఁడు తన తాత్త్వికోత్సాహము నుపనిషత్తులనుండి యే స్వీకరించినను, బౌద్ధభావవాతావరణమును మనమునందుంచుకొనియే యాతఁడు తన తత్త్వమును గల్పించెను. ఆతని తత్త్వము ప్రజ్ఞాపారమితముపై నాధారపడియున్నదని చెప్పుదురుగాని, నిజముగా నాతఁడు కల్పించిన తత్త్వ మపూర్వమైన నూత్నతను గలిగియున్నది. విజ్ఞానవాదమునకుఁ బూర్వమే శూన్యవాదముదయించె నని చెప్పుదురు కాని, యది సత్యమని నిర్ణయింపఁ

జాలము. రెండును సమకాలికములై పెంపొందియుండవచ్చును. ఎట్లైనను, మనవిషయప్రదర్శన విధానము రెంటికిఁగల తార్కిక సంబంధమును సూచించును.

## ౬. జ్ఞానసిద్ధాంతము

మనము దర్శనములనుండి, వానికిఁ గారణములైన వస్తువుల నెఱుఁగఁజాలకున్నచో, దర్శనముల కతీతమై, దర్శించుచున్న స్వయంజ్ఞానశక్తి నెట్లు తెలియఁగలము? బాహ్యజగత్తునకు లేని యస్తిత్వము, విజ్ఞానభావముల కున్నదని యెట్లు చెప్పఁగలము? ఏలన రెండును క్షణికదృశ్యవర్గములే. చూచుట, అనుభవించుట, సంకల్పించుట మున్నగు క్రియలతో సంబంధము లేని విజానస్వరూప మెట్టిదో మనమెఱుఁగము. వస్తువు వస్తుగుణములకు భిన్నముకాదు. అయినచో నది దుర్గ్రాహ్యము, కావున బాహ్యప్రపంచ మాంతరంగిక జగత్తునకు రూపాంతరమని తలఁచి, ద్రష్టయే సర్వస్వరూపియని చెప్పనవసరము లేదు. వ్యవహారప్రపంచ దర్శనము విచ్ఛిన్నతలేని యొక ద్రష్టపై నాధారపడియున్నదని యోగాచారులు తలఁచినారు. ఇంకొక యడుగు ముందుకేగి, ఆత్మకాదుగదా, ఆత్మయొక్క నీడమైన లేదని వాదించిరి. యోగాచారులవాదము సిద్ధమైనచో మనము తెలిసికొనుటకు వస్తువులే లేవు. జ్ఞేయములగు వస్తువులు లేనిదే, విజ్ఞానాస్తిత్వమును బోవును.౧. దృశ్యము లేనిదే ద్రష్టయు లేఁడు. ఈవిధముగా నిత్యమగు నాలయమును మాధ్యమికుఁడు తిరస్కరించి, భావపరంపరను ప్రవాహములో విడిచిపెట్టెను. బాహ్యా

౧. స. సి. సా. సం. ౩ అ. ౧. ౧౮.

వస్త్వను బంధములు గోచరింపనినాఁడు, బాహ్యజగత్తునుండదు. బాహ్యాభ్యంతర వస్తుజగత్తులు రెండును శూన్యములేయగును. మన జాగ్రదవస్థయు నొకవిధమైన స్వప్నమేయని మాధ్యమి కుఁడు చెప్పును. అవ్యాహతమైన తార్కికయుక్తి ననుసరించి, ద్రష్టృదృశ్య స్వరూప స్వభావము లనిర్వచనీయములని మాధ్య మికుఁడు గ్రహించినాఁడు. శాస్త్రజ్ఞానము, లోకజ్ఞానము ప్రమాణములే, వాని ప్రయోజనమును విలువగలదేకాని, యవి పరమసత్యములుకావు. ప్రపంచము మిథ్యయను మాధ్య మిక సిద్ధాంతమును గూర్చిన స్పష్టాగ్రవివరణమునకు ముందు, మాధ్యమికుఁ డెట్టిభావములవలన నీసిద్ధాంతమును గల్పించెనో మనము చూతము.

అతిభావాభావ మధ్యమమార్గమే మాధ్యమికమార్గమని పదార్థమే చెప్పుచున్నది. జగత్తు నిజమైనదైనచో, నందు మార్పులెన్నఁడు నుండఁజాలవు. ప్రపంచము పరిణామగతమైన దైనచోఁ గ్రమాభివృద్ధి వికాసముల కవకాశమున్నది. నాగార్జు నునిఁగూర్చి చెప్పుచు నిట్లు చంద్రకీర్తి వచించెను. "ప్రతివస్తు వునకు నాత్మసత్త్వమున్నచో, నొకస్థితినుండి యింకొక స్థితికిఁ బరివర్తన ముండజాలదు. అట్టి సందర్భములో మానవుఁడు శ్రేయోన్నతపదవి నొందుట కవకాశ మెచ్చట నున్నది?" పరి పూర్ణము సత్యమునైన ప్రపంచములో నేకర్మయుఁ జేయుట కవకాశముండదు. అందుచేఁ బ్రపంచ మసత్యము కావలెను. నాగార్జునుఁ డిట్లనుచున్నాఁడు. "శూన్యసిద్ధాంతమును నీవు నిరసించినచోఁ, గారణసిద్ధాంతమును నిరసింపవలెను. ఆత్మస

త్త్వమనునది యున్నచో, నగణిత సంఖ్యాకవస్తుజాలము జన్మిం పనివి, నాశనములేనివి కావలెను. దీనియర్థము శాశ్వత శూన్య త్వమే. శూన్యత్వములేనిచో, లేనిదానిని బొందుట కవకాశ మును, దుఃఖనాశనమునకు, గామోన్మూలనమునకు నవకాశమే యుండదు."౧ పరిణామము జగత్స్వభావ మగుటచే, దానినిఁ బరిపూర్ణ సత్యముగా మన మంగీకరింపఁజాలము. జగత్తు పర మార్థసత్యము కాదనినంత మాత్రమున, నాగార్జునుఁడు జగత్తును మిథ్యయనియు వాదింపఁడు.

ప్రతీత్యసముత్పాదసిద్ధాంతమునుండి మాధ్యమికుల జగ న్మిథ్యావాద ముదయించినది. ఒకటివెనుకనొకటి యవిచ్ఛిన్న పరంపరగావచ్చు ధర్మసముచ్చయమే వస్తువు. మానవుఁడొక ధర్మసముచ్చయము; మానవునివేదన సంకల్పము. భావము లన్నియు ధర్మములు. భౌతికధర్మసముచ్చయరూపమే యొక వాహనము. భౌతిక మానసిక ధర్మసమూహమే మానవుఁడు; ఈసమూహమే యాతనికి వ్యక్తిత్వభ్రాంతిని గన్పించును. ఈ ధర్మములకు వేరుగా, వాహనము, మనుజుఁడు భావస్థితినే కలిగి యున్నారు. ధర్మములే యున్నవి; అవి నశ్వరములు, భిన్నదశా పరంపరలలోనవియంతర్దశలు. ప్రతిభావమునకు నించుమించుగా బాహ్యమునఁబ్రత్యయరూపమున ననేకధర్మములున్నవి; చూడఁ బడు వస్తువు, నేత్రము, మున్నగునవి; కాని దాని సరియగు హేతువు వేఱొకపూర్వభావమే. ఎట్లనగా, దీపముయొక్క ప్రతిక్షణమునకు, నూనె వత్తి మున్నగునవి ప్రత్యయధర్మము

౧. అధ్యాయము. ౨౪.

లైయున్నను, ప్రతిక్షణదీపమునకుఁ బూర్వక్షణదీపమే హేతువు. ఏదియు స్వతంత్రమైనది లేదు. ప్రతివస్తువు వస్త్వంతరముపై నాధారపడియున్నది. సర్వధర్మములు, ధర్మసముచ్చయములు నసత్యములని మాధ్యమికులు నిరసింపరు; కాని యవిక్షణికములు ననిత్యములు నని చెప్పుదురు.౨. కాని వారుచేయు వాదతన్మయత్వమున నొకప్పుడు ధర్మములన్నియుఁ మిథ్యయనియుఁ జెప్పకపోలేదు.

వస్తుతత్త్వమును నిర్ణయించుశక్తిలోపము, వస్తువే లేదనుటకుఁ దగిన హేతువగుచో, బాహ్యాభ్యంతర వస్తువులెవ్వియును లేవనవచ్చును. అవి అణువులో నణుసముచ్చయములో, సత్త్వసంభవములో కావో మనము చెప్పఁజాలము కావున బాహ్యవస్తువు లసత్యములని యోగాచారుల వాదము. ఈసిద్ధాంతమునకు మూలమైన నియమమును నాగార్జునుఁడంగీకరించి, మనకు దెలియని దసత్యమేయని నమ్మి, మనమునిశ్చయముగా నేదియుఁ జెప్పఁజాలము కావున విజ్ఞానము నట్టిదేయని వాదించినాఁడు. ఈసందర్భమున నేనాగార్జునుఁడు సంబంధసిద్ధాంతమును గల్పించినాఁడు. విజ్ఞానసంబంధముచే సర్వవస్తువుల కస్తిత్వమున్నదని యోగాచారులు చెప్పిరి. మనవిజ్ఞానోపకరణముతప్ప వేఱొక యుపకరణము వస్తుజ్ఞానమిచ్చునది మనకు లేదు. సంబంధము లే

౨. మనము వస్తువులనుగూర్చి సహేతుకముగాఁ బరిశీలించినచో దేని స్వరూపమును మనకుఁ దెలియదు. అందుచే సర్వవస్తువుల స్వస్వరూపము మనకుఁ దెలియదని చెప్పవలెను. (లంకావతారసూత్రము. ౨. ౧౭౩.)

లోకములను నిర్మించినవని నాగార్జునుఁ డంగీకరించినాఁడు. సంబంధ బాహుళ్యరూపమే లోకము. ఆకసమందలి నక్షత్రగ్రహ మండల రాసులు, భూమిపైనున్న సర్వవస్తురాజి, బ్రహ్మాండము లోని సర్వద్రవ్యములును, సత్త్వహీనములైనవి. అవి భావకల్పిత సంబంధములు, కాని యీసంబంధములైనను విదితములుగావు. ప్రపంచమంతయు నవిదితసంబంధసముచ్చయ రూపమని నాగార్జునుఁడు నిశ్చయించినాఁడు. జడపదార్థము, ఆత్మ, దేశకాలములు, కారణము, ద్రవ్యము, చలనము, శాంతి, మనఃకల్పిత దృశ్యజాలములే కాని, వానికాధారమైన సత్త్వమేమియు లేదు. సత్యము స్వయంసమన్వయ సమర్థమై యుండవలెను. కాని మనము సత్యమును లేక యనుభవమునే ప్రమాణములచే స్థాపింప యత్నింతుమో, ఆప్రమాణము లస్పష్టములును, నాత్మ విరుద్ధములునైనవి. సత్యము మనకు జ్ఞానవస్తువు కావలెను కాని మనయనుభవసంబంధము లట్టిగుణమును గలిగియుండలేదు. స్వయంసమన్వయములేని వస్తువులు గోచరింపవచ్చును గాని, యవి సత్యములుగావు. బ్రాడ్లీ తత్త్వము నిట్టిపద్ధతినే పట్టినది. బ్రాడ్లీ తనతత్త్వనిర్మాణమునందుఁజూపిన శాస్త్రీయ విజ్ఞాన సంపద్విలాసమును నాగార్జునుఁడు చూపలేకపోయెను. నాగార్జునుని కృషియంత పరిపూర్ణమైనదియుఁగాదు, శాస్త్రీయపద్ధతి ననుసరించియును లేదు. బ్రాడ్లీకు శాస్త్రీయ తత్త్వరచనా కౌశలము నెడఁగల యుత్కంఠ నాగార్జునునికి లేదు. కాని, నాగార్జునునికిఁ బ్రధానసూత్రము తెలియును; పునరుక్తిదోషము, లోపభూయిష్టము నైనను, నాతని సిద్ధాంతమునం దైక్యముకలదు.

గతిలేక చలనముయొక్క పరిమాణము సమర్థనీయముగలేదు, దాని స్వభావము మనకుఁ దెలియదు. ఒకవస్తు వొకేకాలమున రెండుస్థానములం దుండదు. "మన మొకమారు నడచిన మార్గమును మఱలఁ ద్రొక్కము; ముందు నడువవలసిన మార్గమున నడువము. ఏమార్గమున మన మిదివరకు నడువలేదో, ముందు నడువమో, యది దుర్గ్రాహ్యము."౧ మార్గమును రెండుగా విభజింపవచ్చును; ఇదివరకే గతించినది; రానున్నది, మూడవదిలేదు, మొదటిది గతించినది; రెండవదింకను రాలేదు. అందుచే నడచుట దుస్సాధ్యము. గతిలేక చలనరాహిత్యముయొక్క ఫలితములు తరువాత శ్లోకములలోఁ జెప్పఁ బడినవి.౨ గతియే లేనపుడు గతిసల్పువాఁడును లేఁడు.3 గతిలేనప్పుడు కర్త లేఁడు; లేనికర్తయెట్లు చలించును? "ఇదివఱకే గతించిన మార్గమున నడచుటకు నీవారంభింపక, రాబోవుమార్గమునను నీవు నడచుట కారంభింపక, గతించిపోవుచున్న మార్గమున నీవుండక, దేనిని గమించుచున్నావు?"౪ గతిని గమించువాని నొకటిగాఁ, జెప్పుటకు వీలులేదు; ఏలనఁ గతిలేని గమనము చేయువాఁ డుండఁజాలఁడు. గతివేరు, గమనించువాఁడు వేరనందుమా, నడచువాఁడులేని నడక, నడకలేని నడచువాఁడు నుండుట కవకాశమున్నది. రెండు నొకటియుఁగాదు, వేరునుగాదు. అందుచే గమనము, గమించువాఁడు, మార్గము మూడు నసత్యములే.౫ లేక స్థితి నిజమని చెప్పఁగలమా?

౧ మాధ్యమిక సూత్రములు ౨ అ ౧, ౨ ౨అ౨-౫, 3 ౨అ ౨, ౬। ౭, ౯, ౪ ౨అ ౧౨, ౫ ౨అ ౧౪, ౧౯

చలనము, మార్పు, విరతి, యన్నియు నర్థశూన్యములే. చల
నము, మార్పు నిజములై యుండఁగా, నాగార్జునుఁడు లేని సమ
స్యలఁ దెచ్చిపెట్టుచున్నాఁడని తోఁచవచ్చు. కాని యవిగోచరిం
పవచ్చును. గాని, వాని స్వరూపమేమియని మనము నిర్ణయింప
వలసియున్నది. మనము తత్త్వపరిశీలనము చేయఁదలఁచినప్పుడు
వాని మూలరహస్యములను మనము స్పష్టముగా నిర్ణయించ
వలెను. గతి విరతులనుగూర్చి సమగ్ర జ్ఞానము మనకు లభిం
చుటలేదు; అందుచే నవి పరమసత్యములు గావు; వ్యావహారిక
ప్రయోజనముల కవసరమగు కల్పిత పదములే.

సప్తమాధ్యాయమునందుత్పత్తి స్థితి లయశీలములగు
సంస్కృతధర్మములనుగూర్చి నాగార్జునుఁడు ప్రసంగించినాఁడు.౧
ఉత్పత్తిస్థితి నాశనములు వేర్వేరుగా నొక సంస్కృతమునకు లక్ష
ణములు గాకున్నచో, నవికలిసి, యేకకాలమున నొకేవస్తువునం
దెట్లుండఁగలవు? ఒకవస్తువుత్పత్తికాలమునందే నాశనమును,
స్థితిని గలిగియుండకపోయినచో నది సంస్కృత మనఁబడదు.
అటులే మిగిలిన రెండులక్షణములును, కాని మూఁడులక్షణము
లొకేకాలమందుండఁ జాలవు. కాంతియు నంధకారము నొకే
క్షణమం దుండనట్లే, సంస్కృతములు నిజములుగావు. ౨౧-వ
అధ్యాయమున నాతఁడు సంభవ నాశనములనుగూర్చి చర్చించి
యవి యసత్యములని ఋజువుచేసినాఁడు. ఇట్టి విమర్శదృష్టిలో
నుత్పత్తి నాశనము లసాధ్యములు. ౧౯-వ అధ్యాయమునందు
భూతవర్తమాన భవిష్యద్దశలు గలకాల మర్థరహిత ప్రమాణ

౧ ఉత్పాదస్థితిభంగ సహాహారస్వభావము.

మని యాతఁడు రచించినాఁడు గతవిషయము సందేహావార్త; భవిష్యత్తు స్పష్టముగాఁ జెప్పరానిది. ఈక్షణమే మనకు స్పష్టముగా ననుభవములో నున్నది. కాని, భూతభవిష్యత్తులు లేని వర్తమానము దురూహ్యము. కావునఁ గాలము కేవల శూన్యమునుండి కల్పితమైన భావరూపము మాత్రమే.౨

ఒకవస్తువు దాని గుణములచే మనకుఁ దెలియును, వస్తుగుణములన్నియు మనకుఁ దెలిసినపుడు మనకు వస్తువు తెలిసిన దన్నమాట; గుణములన్నియుఁ దెలియనిచో వస్తువును దెలియదు. ఈవిషయమునుగూర్చి నాగార్జునుఁడు పంచమాధ్యాయమునఁ బ్రసంగించి, భూమి జలాగ్ని వాయురాకాశములను, విజ్ఞానమును జర్చించి, గుణములకుఁ బూర్వమే వస్తువును లేదని నిర్ణయించెను. ఏలన నిర్గుణపదార్థ ముండదు.౩. నిర్గుణపదార్థము వేరుగా నున్నచో నప్పుడు గుణము లెచ్చటనున్నవి? అవి నిర్గుణవస్తువునందు లేవు; స్వతంత్రముగా నుండఁజాలవు, మఱెచ్చటను వానికిఁ దావులేదు. వస్తువు గుణములకు వేఱై యుండఁజాలదు. ఒక వస్తువుకాని, గుణముకాని కానిదేదియును లేదు. గుణము వస్తువును, వస్తువు గుణమును జూపును; రెండు నొకటియో, వేరో మనకుఁ దెలియదు. ౧౪-వ ప్రకరణమునందు వస్తుస్వభావమునుగూర్చి చర్చించుచు, వస్తువులకు భావముకాని అభావముకాని ముఖ్యలక్షణముగాఁ జెప్ప వీలు లేదని చూపినాఁడు. వర్ణ కాఠిన్య మృదుత్వ రుచివాసనాది గుణములు కేవల వ్యక్తిగతములు. మన కింద్రియము లుండు

౨ తే ఆకాశస్థితేన చేతసా కాలం కుర్వంతి, 3 ౧-వ అధ్యాయము.

టచే నవియున్నవి. కన్ను లేనిచో రంగును, శ్రోత్రము లేనిచో శబ్దమును లేవు, తమకు వేరైన విషయములపై గుణము లాధార పడియుండుట స్పష్టము. అవి మన యింద్రియములపై నాధార పడియుండుటచే గుణములు స్వతంత్రముగా సత్యములుగావు. అవి స్వయంస్థితినిగలిగి యుండలేదు. గుణము లింద్రియసంబంధములగుటచే, ముఖ్యాముఖ్య గుణ విభాగమును నాగార్జునుఁడు చేయలేదు. సర్వగుణములును కేవలము 'దృశ్య' మాత్రములగుటచే నివి యేవస్తువులందు గోచరించునో యావస్తువులు నసత్యములే. ఏలన గుణముల దోషము వస్తువులకును జెందును. ఈ గుణములను గలిగియున్న వస్తువులను మనమెన్నఁడు నెఱుఁగము. మనము గుణములనే యెఱుఁగుదుము. వస్తువుయొక్క స్వస్వరూపము మన యనుభవమున కతీతమైనది. కావున మనకు దానిస్థితియందలి నమ్మకము కేవలము మనయిచ్ఛపై నాధార పడియున్నది. మనకుఁ దెలిసిన గుణములుకాక, వేరుగుణములు వస్తువుల కున్నవని చెప్పఁజాలము. గుణములను, వానిలోవానికిఁ బరస్పరవిరోధము లేకుండగా నొక జిగురువలె దనకంటి పట్టుకొని యున్నదే వస్తువైనచో నపుడు గుణముల యైక్యతకు సంబంధమే కారణము. కావున వస్తువు నిరాధారగుణ సముచ్చయ భావకల్పితరూపము; విజ్ఞానవిషయమునై యున్నది. విజ్ఞానము దానిస్థితి కాధారభూతమై యున్నది. వస్తువు, గుణములు నన్యోన్యసంబంధము గలవి. విడిగా నేవియు సత్యములుగావు. అన్యోన్యాధారభూతములైన వస్తు, గుణములు పూర్ణసత్యములుగావు. వ్యావహారికముగా గుణములున్నది వస్తువని మనము చెప్పుకొన

వచ్చును. ఏలన నేదియో వెనుక నాధారముగా లేకున్నచో, రూపభారాది గుణములు మన కూహింప నసాధ్యములు. నిమిత్త ధర్మము, అన్యాధారము, సామీప్యము, పరిమితత్వమునను సంబంధములపై నాధారపడి వస్తువులు సత్యములుగా గోచరించు చున్నవని నాగార్జునుఁడు తెలిపినాఁడు.

మాధ్యమిక సూత్రిచతుర్థ ప్రకరణమునందుఁ గారణ సంబంధముల వైరుధ్యములు చూపఁబడినవి. "ఒకవస్తువు తన కారణమునుండి వేరుగాఁగాని, ఒకకారణము వస్తువునుండి వేరుగాఁగాని దర్శింపఁబడదు. వస్తుకారణము వస్తువునుండి వేరైనచోఁ, గారణములేని వస్తువున్నదని వక్కాణించినట్లగును. కారణములేని వస్తువులేదు కాఁబట్టి, వస్తువునకు వేరై కారణ మున్నదనుటయు సహేతుకముకాదు." కారణమునకు వేరైన కార్యమును, కార్యమునకు వేరైన కారణమును నుండుట సాధ్యముకాదని నాగార్జునుఁడు వాదించినాఁడు. ఒకవస్తువు దానినుండియేకాని, యింకొక దానినుండికాని, రెంటినుండికాని యేకారణము లేకుండఁగాని జనింపదు. అందుచేఁ దార్కిక ముగాఁ జూచినచో నుత్పత్తి కవకాశములేదు.[1] సత్యమగున

[1] స. సి. సా. సం. అ ౪-౭. ౯. యీవాదము నిట్లు నిర్మించినది. "ఏకారణమునులేని వస్తువును సృజింపఁజాలదు. ఉ॥ చతుర్భుజములుగల చక్రము. ఉన్న దానివిషయములో నుత్పత్తి చెప్పవలయుచో, నిదివరకే యున్న దాని కుత్పత్తి చెప్పవలెను. ఒకే వస్తువున కుండుట లేకుండుటయు నేకకాలమునఁ జెప్పరాదు. అస్తిత్వ నాస్తిత్వములు రెండును లేని వస్తువున్నదనియుఁ జెప్పలేము."

దేదియు నుదయించదు. ఈక్షణమున లేనికుండ మరుక్షణములో నుండఁ జాలదు. ఇది స్వవిఘాతోక్తియగును. వస్తువులు పరమ సత్యములు గావని మన మెఱిఁగియుండగా, నవి యట్టివస్తువుల నెట్లుత్పత్తి చేయఁగలవు? కారణములనుగూర్చి మనము చెప్పు కొనునప్పుడు, తర్కసిద్ధముగా మనము చెప్పుచుండుట లేదు. ద్రష్టృదృశ్యములు, వస్తుగుణములు, దేశకాలములు నను వ్యవహారపదములను వాడుచున్నాము. పారమార్థికముగాఁ జెప్ప వలయుచోఁ గార్యకారణములుగాని, యుత్పత్తి వినాశములు గాని లేవు.[1] కారణ మనగా మొత్తము సామగ్రియంతయునని కొందరుచెప్పునదియు నర్థరహితమని చూపఁబడినది.[2] ఈచర్చ వలన మార్పనునది నిరాధారమైనదని తెలియుచున్నది. 'అ' మారి 'ఆ' యగును. నాగార్జునుఁ డిట్లు వాదించెను; 'అ' మారి 'ఆ' కాఁగలుగుచో. 'అ' యెప్పుడు 'ఆ' యేయై యుండవలెను. లేకున్నచో 'అ' యెన్నడును 'ఆ' కాఁజాలదు. కాని 'అ' 'ఆ' కాదు; ఏలన, 'అ' మారుచు 'ఆ' అయినదని చెప్పఁ బడుచున్నది. అందుచేఁ బరివర్తన మర్థమగునదికాదు. కారణ ధర్మము మార్పునకు కారణముకాఁజాలదు; ఏలనఁ గారణ ధర్మము నిరాధారమైనదే.

ఒక గుణము వస్తువున కాధారసంబంధము కలిగియున్నది. రెండు నొకానొక సంబంధమును కలిగియున్నవి. జ్ఞానజ్ఞేయము లట్టి సంబంధములే కలిగియున్నవి. పారమార్థికముగా రెండు నసత్యములే; కాని వ్యావహారికముగా నవియున్నట్లుగోచ

---

౧. ౮ ౨౧. ౨. ౨౦ ౮.

రించును; కాని పరస్పరాధారభూతములై యవి యున్నంత కాలము నవి నిత్యములు గాఁజాలవు.

ఒకకాలమున లేక దేశమునందున్న దృశ్యమింకొక కాలమున లేక దేశమునందున్న యింకొకదృశ్యముతో సామీప్య సంబంధమునుగలిగి యుండవచ్చును. గాని, దేశసంబంధములు వ్యావహారికములగుటచే, పారమార్థికముగాఁ బూర్వాపరములు నిజములుకావని స్పష్టము.

అంశమునకుఁ బూర్ణమునకుఁగల సంబంధము నూలునకు వస్త్రమునకుఁగల సంబంధము వంటిది. దారములులేని వస్త్రముగాని, వస్త్రములేని దారములుగాని యుండఁజాలవు. రెంటిలోఁ నేదియు పారమార్థిక సత్యముగాదు. అంశాతిరిక్తమైన పూర్ణములేదు; పూర్ణములేని యంశలు లేవు. రెండును పరస్పరాధారభూతములై యున్నవి. కాని యీసంబంధము కేవలము సంవృత్తిలేక భ్రాంతి. ప్రపంచములోని వస్తువు లెవ్వియును పారమార్థిక సత్యములుగావు. అవి పరస్పర సంబంధమాత్రములై యున్నట్లు గోచరించును.

నవమాధ్యాయమున 'ఆత్మ' విషయము చర్చింపఁబడినది, గుణములకువేరై వస్తువులేదను సూత్రముననుసరించి, విజ్ఞానావస్థలకువేరై 'ఆత్మ' లేదని తెలియుచున్నది. పనిచేయుట, అనుభవించుట, ఆలోచించుటయను కార్యములకుఁ బూర్వ'మాత్మ' లేదు. నవమాధ్యాయములో నాగార్జునుఁ డిట్లు చెప్పినాడు; "చూచుట, వినుట, అనుభవించుట మున్నగు క్రియలుచేయున దాత్మయనియు, నీక్రియలకుఁ బూర్వమది యున్నదనియుఁ

గొందరు చెప్పుచున్నారు. కాని, క్రియలకుఁ బూర్వమాత్మ యున్నదని యెట్లు చెప్పఁగలము? అట్లుగా నాత్మ ముందే యున్నచోఁ,జూచుటలో నపుడు దానికి సంబంధము లేకున్నచో, నాత్మతో సంభంధము లేని చూచుటయను క్రియ స్వతంత్రముగా జరుగదా? ఆత్మయు దర్శనాది క్రియలు నన్యోన్యాశ్రయములై యున్నవి. మఱియుఁ జూచుట, వినుట మున్నగు సర్వ కార్యముల కది పూర్వమే లేకున్నచో, నదియే యొక క్రియకును బూర్వముండఁ జాలదు. చూచుట, వినుట, అనుభవించుట మున్నగునవన్నియు నొకే యాత్మకార్యములైనచో నాత్మ ప్రతిక్రియకుఁ బూర్వముండి యుండవలెను. చూచుట, వినుట, యనుభవించుట మున్నగున వేదవ్యములనుండి యుదయించుచున్నవో, యాద్రవ్యములందాత్మ లేదు." చూచుట మున్నగు క్రియలు జరుగువరకు నాత్మ యున్నట్లు మనకుఁ దెలియదు, అందుచే నీకార్యములకుఁ బూర్వమాత్మలేదు, ఆత్మ యీక్రియల కనంతరము నుదయింపదు, దర్శనాది క్రియలు స్వతంత్రముగానే నడుచుచున్నచో నాత్మతో నిమిత్తమేమి యున్నది? ఆత్మయు, దర్శనాదిక్రియలు నేకకాలమునందే యున్నవి, కాని యివి పరస్పరము వేరై స్వతంత్రములైనఁగాని యేకకాలమునందుండజాలవు.౧. బాహ్యజగత్తు లేదని నిరూపించుటకు యోగా

౧. న్యాయతత్త్వము వాగార్జునని యీభావమునుగూర్చి ప్రసంగించి, దాని కిట్లు జవాబుచెప్పినది:"ఈవిషయముగా నీవు దర్శనాదికమున కభావమును జెప్పినచో,నింద్రియ విషయాస్తిత్వము నెవ్వఁడును స్థాపింపజాలఁడు. ఇంద్రియ విషయములులేనిచో వానినిగూర్చి వాదమవసరము లేదు. అందుచే నీవాదము నిరాధారము. సర్వసాక్ష్యములను నీవు నిరసించినచో, నీనిరసనమునకు

చారులుపయోగించిన హేతువాదమునే, ఆత్మ లేదని చెప్పుటకు
నాగార్జునుఁడుపయోగించెను. బాహ్యములకు గోచరించు లక్షణ-
ముల వెనుక జగత్తునకు నిజమైన యాధారమొక జడపదార్థ
రూపమున లేనిచో, భావముల వెనుక నొక భావము కాని,
ఆత్మ యేలయుండవలయును? అవిచ్ఛిన్న క్షణిక మానసిక దశా
పరంపరయే యాత్మయని చెప్పవలెను. విజ్ఞానమయము యొక్క
స్వస్వరూపమెట్టిదో మనకుఁ దెలియదు, అదియొక ప్రవాహము;
భావపరంపరలను మనకుఁ బ్రదర్శించునొక క్షేత్రము. భౌతిక
ప్రపంచమున్నదను విశ్వాసమెంతసాహసమైనదో నిత్యమగు
నాత్మయున్నదను విశ్వాసమును నాగార్జునుని దృష్టిలో నంతే
నిరాధారమైన సాహసమే. భిన్నమానసకల్పముల కనసరమగు
రీతిని విజ్ఞానవిషయము లొక క్రమములో నిర్మింపఁబడి యున్న
వనుటయు నూహాకల్పనమే. వస్తువులనగా నవి మనకెట్లు గోచ
రించుచున్నవో యవియే మనమొక భావప్రవాహమని కూడఁ
జెప్పరాదు. విజ్ఞానదశలకు వేరుగా నొక యాత్మయున్నదని మన
మంగీకరించుటకుఁ గారణము వ్యవహారప్రపంచము కొఱకే.
అష్టమాధ్యాయమునందు, ఆత్మభిన్నదశలు, ఆత్మకర్త, క్రియలు
పరస్పరాధారభూతములను భావమును జెప్పఁబడెను. "కర్మ
ననుసరించియే కర్త యను శబ్దమును, కర్త ననుసరించియే
కర్మయను శబ్దమును వచ్చినవి. పారమార్థికముగాఁ జూచినచోఁ
గర్తయు లేఁడు; కర్మయు లేదు."౨.

---

విలువ లేదు. నీవు భావవాదమునకు విలువయుండవలసినచో, నప్పుడు
దర్శనాదికమును నీ వంగీకరించవలెను." ౨. ౧౬ అ. ౧౦.

నిర్వచనము చేయుటకు వీలులేనిది జ్ఞానము. వేదనల వలన భావములు జనించును; భావములు వేదనల నుత్పత్తి చేయును. చెట్టు విత్తును, విత్తు చెట్టును జనింపజేయుచున్నవి. దర్శనము స్వయంస్థితికలది కాదు. "ఇదివరకే చూడఁబడిన దానిని నీ విప్పుడు చూచుటలేదు. రాబోవుదానిని నీ విప్పుడు చూచుటలేదు. గతములోఁగాని భవిష్యత్తులోఁగాని చూడఁబడని వస్తువున కస్తిత్వము లేదని చెప్పవలెను." ౧. "దృశ్యమును నేత్రేంద్రియము చూచుటలేదు; నేత్రేతర మొద్దియును జూచుటలేదు. ఇఁకఁజూచునది మూఁడవదేదియును లేదు." ౨. మార్గము, గమనము. మార్గగామియు సత్యములైనట్లే, దృష్టి, దర్శనము, దృశ్యముకూడ నసత్యములు. దర్శనము, దృశ్యవిషయములు పరస్పరాధారమైన అస్తిత్వమును గలిగియున్నవి. దృష్టిలేకున్నచో రంగులేదు. రంగులులేకున్నచో నేత్రేంద్రియమునకు దర్శనములేదు. "పుత్రుఁడు తల్లిదండ్రులపై నాధారపడినట్లు, నేత్రవేదనలు, రంగులపైనను, నేత్రములపైనను నాధారపడియున్నవి." మనము చూచినది, మనవ్యక్తిగతమైనది కాదని నిశ్చయముగాఁ జెప్పఁజాలము. ఒకేవస్తువు భిన్నవ్యక్తులకు వేరుగాను, నొకేవ్యక్తికి భిన్నకాలములలో భిన్నముగాను గోచరించును. ౧౪వ ప్రకరణములో 'సంసర్గ' మును గూర్చి చర్చించి దానినిగూడ నాతఁడు తిరస్కరించినాఁడు. మార్పులు; దశాపరంపరలు వచ్చుచుఁ బోవుచుండును. ఒకదాని వెనుకనొకటి వచ్చు పారంపర్యమునైనను, నేకత్వాను

---

౧. ౩౨ ౩     ౨. ౩౨ ౪

భవముగల వ్యక్తి లేనిదే, సమర్థింపఁజాలము; కాని యీ యేకత్వముగల 'ఆత్మ' నిరాధారవస్తువని యిదివరకే చెప్పియుంటిమి.

ఇఁక జాతిలక్షణములఁగూర్చి యేమిచెప్పవలెను? ఈ లక్షణములు వ్యక్తులకు వేరై స్వతంత్రముగానున్నవా? లేక యెల్లప్పుడవి వ్యక్తులయందే గోచరించునా? మనజ్ఞానమంతయు భేదముపై నాధారపడియున్నది. ఒక గోవననేమి? అదియొక అశ్వముకాదు, గొఱ్ఱెకాదు. అనగా నావు—కానిదేదియు నావు కాదు. ఒకగోవున్నదని చెప్పుటకుబదులుగా, నొకగుఱ్ఱముకాని యొకచెట్టుకాని లేదని చెప్పుచున్నాము. మనజ్ఞానమంతయు వ్యావహారికసంబంధమయము; భేదపోషితము. గుఱ్ఱములేదు; ప్రపంచమునులేదు. వీనిస్వరూపమేమో మనకుఁదెలియదు. ఈ సమస్యారూపమిట్లు చెప్పఁబడెను: "ఒకవస్తుస్వరూప మితర వస్తువులనుండి భేదముచేయనిదే మనమెఱుఁగఁజాలము. ఒక వస్తువుయొక్క స్వస్వరూపము మనకుఁదెలియనిదే, దానికితర వస్తువులతో భేదమును దెలియఁజాలము. ౧. వస్తువులన్నియు నితరేతరసంబంధమయములు. అన్నియు ననంతములగు కార్యకారణములపై నాధారపడినవగుటచే నేవస్తువునకును స్వయంస్థితిలేదు. సర్వవస్తుగుణములును, వ్యావహారికములేకాని నిత్యములుగావు. వస్తుసంబంధ బాంధవ్యసమూహములతో మనము కార్యములొనర్చుచున్నాము. ఈ సంబంధ బాంధవ్యములకుఁ బరస్పరసంయోగము లేదు. ఇపుడు మనముచూచువస్తువులు

౧ యస్మాన్నహి స్వభావానామ్ ప్రత్యయాదిషు విద్యతే,
అవిద్యమానే స్వభావే పరభావో నవిద్యతే,

సుషుప్తిలో లేవు. స్వప్నవస్తువులు జాగ్రిదవస్థలో లేవు. నిత్యస్థితిగల వస్తువన్నియవస్థలలోను గోచరింపవలెను. భావము స్వీయజ్ఞానము లేనిది, పరభావజ్ఞానశూన్యమైనది. సత్యము శాంతమే, జ్ఞానము సాధ్యముకాదు. ౨. నాగార్జునుని నిశితతర్క నిశ్చయమిట్లున్నది.

లోకమునకు వేరై దేవుఁడుగాని, దేవునకు వేరై లోకముగాని లేవు; రెండును భ్రాంతిభావములే. నాగార్జునుఁడు నిరసించిన యీ దేవుఁడు, ప్రమాణజ్ఞానమెఱుగని మూఢవిశ్వాసముగలవారి దేవుఁడుమాత్రమే యని మనము మఱువరాదు. మహాయానమతమందు ధర్మకాయస్వరూపుఁడైన దేవుని యందాతనికి నిర్మలభ గలదు.

అతిసాహసమైన తర్కముతో నాతఁడు జన్మస్థితి లయాత్మకమైన ప్రపంచము నిజముకాదని ఋజువుచేసినాఁడు. ౧. దుఃఖము, ౨ సంస్కారములు, 3 బంధమోక్షములు ౪ సర్వకార్యములు౫ నసత్యములు. అవి కేవల పరస్పరసంబంధభావములు; వానిస్వరూప మజ్ఞేయము. మానవకోటియొక్క మతావసరముల కెంతవిరుద్ధములుగానున్నను, నాగార్జునుఁడు తన తర్కము చూపిన ఫలితములను సాహసముతోఁ బ్రకటించినాఁడు. నిజమునకు బుద్ధుఁడులేక తథాగతుఁడే లేఁడని తన తత్త్వమును

౨. రూపాది వ్యతిరేకేన యథాకుంభో నవిద్యతే
వాయ్వాద్యవ్యతిరేకేన తథారూపమ్ నవిద్యతే. (అధ్యా ౧.)

౧ ౯ అ. ౨ ౧౨. అ. 3 ౧3 అ. ౪ ౧౬. అ. ౫ ౧౮. అ. ౬. ౨౨. అ.

ముగించి, పారమార్థికదృష్టి ననుసరించి, సత్యాసత్యములకే భేదమును లేదని నిరూపించినాఁడు. నిజమైనదేదియు లేనప్పుడు దేని నపార్థము చేసికొందుము.౭. దుఃఖాది సత్యచతుష్టయము, ౮. నిర్వాణభావములు¹. నన్నియు నసత్యములే. తన మాధ్యమికశాస్త్రమందలి ప్రథమవాక్యమునందే యాతఁ డిట్లు చెప్పినాఁడు; చావులేదు; పుట్టుకలేదు; భేదములేదు, నిత్యత్వము లేదు, అనేకత్వములేదు, ఏకత్వమును లేదు; ఉత్పత్తిలేదు, లయమును లేదు." ఏదియును సత్యముగాదు. దీనికి వ్యతిరేకార్థమిదివరకే చెప్పఁబడెను.దీనికిఁ బ్రత్యక్షసాక్ష్య మవసరము లేదు. ఉన్న దానికిఁ గారణము కావలెనుగాని లేనిదాని కవసరము లేదు. ప్రపంచమునకు క్షణికదృశ్య రూపమున్నది.వస్తువు లనిత్యములు గావు, నిత్యములును గావు; అవి జనించలేదు, నాశనము కాలేదు, అవి సమానములుగా నసమానములునుగావు. వానికి వచ్చుటయు లేదు, పోవుటయును లేదు. ఇదంతయు ననిత్యదృశ్యమే. గుణములయొక్కయు వాని సంబంధములయొక్కయు భావపరంపరయే జగము. మనమీ యన్యోన్యములగు సంబంధములను నమ్ముచున్నాము. వ్యవహారప్రపంచమున కుపయోగించు ప్రమాణములు పారమార్థిక సత్యములని తలఁచు శాస్త్రవిశ్వాసము నంధప్రాయమైనదేయని నాగార్జునుఁడు నిరసించినాఁడు.

సంబంధములవలన జగదస్తిత్వమునందు భ్రాంతిజనించుచున్నది. కార్యకారణములు, పూర్ణము తదంశలు స్వయంస్థితి

¹ ౨౩. అ. ౧. ౨౪. అ. ౯ ౨౫ అ.

గలవి కాక, పరస్పరాధారములై, జగత్కల్పనము చేయు చున్నవి. సంవృతిజ్ఞానములేక వ్యవహారజ్ఞాన విషయమైన జగత్తున్నదని యీప్రమాణములు మనకు భ్రాంతిని జనింపఁజేయు చున్నవి. దృశ్యముల అన్యోన్యసంబంధనిర్ణయముల కివి యను కూలములుగా నున్నవి. పారమార్థిక సత్యము నివి స్థాపింప యత్నించుచో నాత్మవిరుద్ధములగును. అవి తత్త్వాధారములేని వ్యావహారిక ధర్మములకుఁ బనికివచ్చు సూత్రములు. బ్రాడ్లీ తత్త్వవేత్త మనశ్శక్తి భావసంబంధములను గల్పించునుగాని, యది కల్పించు సంబంధములు సంబంధశూన్యములగు వస్తువులకేయని జెప్పినాఁడు. నాగార్జునుఁడు గ్రీన్ తత్త్వజ్ఞునిభావముతో నేకీభవించును. వీరిరువురుగూడ మనయనుభవములో లభించు సత్యము వ్యావహారికమనియు, దీనికి వెనుక ననిర్వాచ్యమైన పూర్ణసత్యమున్నదనియు నమ్మెదురు. కాని బ్రాడ్లీదృష్టిలో మనవ్యవహారశాస్త్రజ్ఞానానుభవమునందు సంబంధములలోనికి రాని దేదియో కొంతగలదు. కాని నాగార్జునుఁడీభావము నంగీకరింపఁడు. కాని నాగార్జునుఁడు కేవలము నిర్మూలించు విమర్శకుఁడే కాఁడు; ఆతఁడు నిర్మాణాత్మక ప్రజ్ఞావంతుఁడునై యున్నాఁడు. శాస్త్రమునకందని పరమార్థసత్యమున్నది. వ్యావహారిక ప్రపంచానుభవమునుజీల్చి చెండాడి, దానివెనుక నిత్యసత్యమైనదున్నదని యాతఁడు నిశ్చయించినాఁడు. దృశ్యమాన జగత్తు స్వవిరోధ ధర్మకల్పితము. ఇంద్రియాతీతసత్యము విరోధములులేని నిత్యాస్తిత్వముగలది. మనము చూచు, విను, అనుభవించు లోకమునకు వెనుక నేదోయొక్కపరమార్థమున్న

దని తలపఁకుండ నుండఁజాలము. మనముచూచు స్పర్శధ్వని రూపాదులు నిరాధారములైన శూన్యమునుండి జనింపలేదు. చతుర్థాధ్యాయములోఁ దనకారంభమున శూన్యత్వభావము లేదనియుఁ దరువాత నదివిధిగా సంగీకరింపఁబడెననియు నాగార్జునుఁడు చెప్పినాఁడు. శూన్యత్వమును దర్కశూన్యముగా విశ్వసించుట సాధ్యసమదోషమగును, జగత్తు భ్రాంతియను విషయమాతని కవిలంఘ్యమైనది. జ్ఞానసిద్ధాంతమున కవసరమగు తార్కికసమస్య యేమనగా మనయనుభవార్థమేమియని. మనయనుభవమున కవసరమగు కారణములనుజూపి, వాని నిరాధారతనుబ్రదర్శించి, మనయనుభవము పారమార్థికముగాదని నాగార్జునుఁడు నిర్ణయించినాఁడు. పారమార్థిక సత్యమున్నదను విశ్వాసముగల యాతనిహృదయమునకవరోధముగా నీతర్కపరిదర్శనము నాతఁడు కల్పించినాఁడు, తనహృదంతర్గత సత్యమును బాహ్యసంశయవాదముచే స్థాపించినాఁడు. ప్రకృతియొక దృశ్యము మాత్రమే; కాని దేనినుండి సర్వమునుదయించి, తుదకు దేనియందు లీనమగునో యట్టినిత్యము నవిచ్ఛిన్నమునగు పరమసత్యము ప్రకృతికి మూలాధారమైయున్నది. దానినిగూర్చి మనము ప్రసంగించునపుడు మనవ్యవహారవిజ్ఞాన ప్రమాణములను స్మరింపరాదు. అదియెట్టిదో, నిత్యముక్తమో, జ్ఞానరూపమో, మనముచెప్పఁజాలము. దానినిగూర్చి మనము ప్రశ్నించుచో, మనఅజ్ఞానావస్థలను నిత్యసిద్ధమగు వస్తువునకుఁగల్పించిన దోషము పట్టును. అనంతసత్యస్వరూపమును నిర్వచింప నిరాకరించుటది లేదనుటకాదు. పరమార్థసత్యస్థితి జగదనిత్యరూప

మును సూచించును. "స్కంధములు శూన్యములు; సర్వవస్తువులు శూన్యలక్షణోపేతములు; అవియాద్యంత రహితములు; అవిదోషయుక్తములు, దోషశూన్యములును; అవి పరిపూర్ణములును, నపరిపూర్ణములును; కావున నోసారిపుత్రా! ఈశూన్యమునందు రూపముకాని,దర్శనముకాని, నామముకాని,భావముకాని, జ్ఞానముకాని లేవు౧ మనకనుభవములోనున్న ప్రపంచము వ్యావహారికమని యంగీకరించి, సంబంధకారణమైన విజ్ఞానమును యోగాచారులు కల్పించిరి.విజ్ఞానమాత్రమను భావమును బరిశీలించి, యదినిరర్థకమని నాగార్జునుఁడు చూపినాఁడు. విజ్ఞానము జీవాత్మయైనచో నది పారమార్థిక సత్యముగాదు. అది పారమార్థిక సత్యమేయైనచో దానికాత్మయను వ్యావహారిక ప్రమాణము వర్తించదు. పరమార్థము పరమార్థమే; దానిని గూర్చి మనమేమియుఁ జెప్పఁజాలము. మనబుద్ధికార్యమంతయు క్షణికము. మనముపరమార్థమును మనబుద్ధిచే గ్రహించిన యెడలఁ బరమార్థము నొక క్షణికవస్తువేయగును;దానిని మనము సగుణమైన ఆత్మజ్ఞానరూపమన్నచోఁ దత్సంబంధమగు నొక వ్యక్తిత్వమును మనము కల్పింపక తప్పదు.

## ౭. సత్య-జగత్-భిన్నదశలు.

నాగార్జునుని క్షణిక జగద్వాదము, మనము పూజించు ప్రమాణభావము లన్నియు భ్రాంతియని విసర్జింపఁగోరుచున్నది. సర్వ మసత్యమైనచోఁ, బుణ్యపాపములు నసత్యములే. మనము దుఃఖమునుండి విముక్తులమై నిర్వాణమును సంపాదించు

౧. బృహత్ ప్రజ్ఞాపారమితహృదయసూత్రము పుట ౧౪౭ యస్.బి యి. 69

యత్నము చేయనవసరములేదు. ఏలన మన దుఃఖము నస త్యమే. జీవితము భ్రాంతియని నమ్మి మనము జీవింపఁజాలము. భ్రాంతిపై నాధారపడి మనము ధర్మజీవనమును నడుపఁజాలము. పారమార్థికదృష్టిలో మన దుఃఖము లసత్యములేకావచ్చును గాని, మన ప్రస్తుత జీవిత మున్నంతకాలము మనకవి యథార్థ ములే. పరమార్థసిద్ధిఁ బొందినవాని కేసమస్యలును లేవు. అతఁడు నిర్వాణమును బొందినాఁడు. కాని లోకమునందు మగ్నులై యున్నవారు కర్మచేయవలెను. ప్రపంచములో నున్నవారి కంద రకు భ్రాంతి యవిలంఘ్యముగావున, ధర్మానుష్ఠానావశ్యకతయు నవిలంఘ్యమే. పారమార్థికముగా నేమిశటస్థించినను, మానవ జీవితమునకుఁ బుణ్యపాపవిచక్షణము నీభ్రాంతివాదము తొల గింపఁజాలదు. నాగార్జునుఁడు వ్యావహారిక పారమార్థికసత్యము లను రెంటి నంగీకరించును. "బుద్ధుని యుపదేశము రెండువిధ ములైన సత్యము నంగీకరించును. క్షణికమైన వ్యవహారప్రపంచ జ్ఞానము, అద్వితీయము నిత్యమునైన పరమార్థజ్ఞానము"౧. ఈభేదమువలన, సర్వశూన్య తత్త్వమునకు ధర్మానుష్ఠానము నకును గల వైరుధ్యము తొలగింపఁబడినది. పారమార్థిక సత్య జ్ఞానమే నిర్వాణ హేతువైనను, నది వ్యవహారసత్యజ్ఞానముద్వార మున నేసాధ్యమగును. సంవృతిజ్ఞానము మానవుని బుద్ధివ్యాపార ఫలితము. ఇదియే ప్రపంచదృశ్యమునకుఁ గారణము. సంవృతి శబ్దమున కర్థము సత్యమును గప్పివేయునదనియే. పరమార్థ సత్యమును నిరూపింపనవసరములేదు;ఏలన నది స్వతః ప్రమాణ

౧. ౨౪ అ.

స్థితిగలది. స్వప్నగతుఁడు తన స్వప్నానుభవము నెట్టి తర్క-వాదమువలనను నిర్మూలింపఁజాలఁడు; ఏలన స్వప్నవస్తువును లేదనుటకుఁగాని యున్నదనుటకుఁగాని యుపయోగింపఁబడు ప్రతి హేతువు స్వప్నవస్తువువలెనే అభావదోషమును గలిగి యుండును. కాని మనము మేలుకొన్నంతనే స్వప్నవస్తు వసత్యమని తెలియును. అదేవిధముగా మనము పరమార్థమును దెలిసికొనఁగానే సంవృతిజ్ఞాన మసత్యమని బోధపడును. సంవృతిజ్ఞాన వాదము నెంతచేసియు సంవృతిని నిర్మూలింపఁజాలము. దానియందు సర్వవస్తువులు నిజమనునట్లుగానే దృశ్యమానము లగుచుండును. ద్రష్టృదృశ్యములు, సత్యాసత్యములు బంధమోక్షములు వ్యవహారములో నర్థవంతములే. పారమార్థికదృష్టిలో సంవృతి స్వప్నతుల్యమైన మిథ్యవంటిదే. లోకములోని సర్వవస్తువులు, బుద్ధుఁడు, నిర్వాణకాంక్ష మున్నగు మనోజ్ఞభావములు నన్నియు నదృశ్యములైపోవును. అంతయు మిథ్యయైనచో మిథ్యాభావమును మిథ్యయేయని చెప్పు జన సామాన్య వాదము నాగార్జునునిఁ జలింపఁజేయఁజాలదు. తార్కికజ్ఞానములోని లోపములవలన నాతఁడు నిత్యపరిపూర్ణ సత్యమగు పరమార్థము నాతఁ డంగీకరింపవలసివచ్చినది. అంతయు శూన్యము గావున, నేదియు జనించుటకాని,లయమగుట కాని లేకున్నచోఁ బుణ్యాపాపభేదమే యుండదను నాక్షేపణమునకు నాగార్జునుఁడు సర్వకామ సంతృప్తి నొసఁగి, యాంతరంగిక శాంతిని బ్రసాదించు పరమార్థసత్యము సంవృతిజ్ఞానముచే మఱుఁగుపడియున్నదని సమాధానము చెప్పినాఁడు. నిజమునకు జన్మ

మరణములుగాని, బంధమోక్షములుగాని లేవు. సత్యము శూన్యము, అనగా నది వ్యక్తిత్వమును గాని యేగుణమును గాని కలిగియుండలేదు. అనగా నది పరిపూర్ణశూన్య మనికాని, నిర్గుణ నిర్జీవత్వ మనికాని యర్థముకాదు.౧. సంవృతి సత్యమని చెప్పుచున్నను బరమార్థమునందు సంవృతి చెప్పునదేదియును లేదని భావము. నాగార్జునుఁడు దీని విషయములో బుద్ధు నిట్లుదాహరించినాఁడు. "స్త్రీ లేదు; పురుషుఁడు లేఁడు; జీవము లేదు; చేతనము లేదు, ఆత్మ లేదు, ఈ ధర్మములన్నియు స్వప్నముల వలెను, గల్పనములవలెను జలములోఁ జంద్రుని ప్రతిబింబముల వలెను, నసత్యములు నభావములునై యున్నవి."

హేతువుదోషోపహతమని నిరసించి, విశ్వాసమునకు స్థానమిచ్చెను. ఈవిజ్ఞానముపై నాధారపడిన విశ్వాసము మూఢ విశ్వాసముకాదు, ఇది నిరాధారమగు మానసికకల్పనము కాదు, హేత్వాధారసహితము. పారమార్థిక వ్యావహారిక సత్యములకు సంబంధము లేనివైనచో మనకులభించునది పూర్ణసంశయావస్థయే. పరమార్థ జ్ఞానమునుండి వేరుచేసి విడఁగొట్టినచో వ్యవహార ప్రపంచజ్ఞానమైనను సమర్థించుటకు వీలుపడదు. వ్యావ హారిక సత్యముతో నిమిత్తములేకుండఁ బారమార్థిక సత్య మును సాధింపఁబడదని నాగార్జునుఁడు వచించినాఁడు.౨. బుద్ధి గోచరమగు సత్యము స్థిరమైనది కాకున్నను, పూర్తిగా నిరసిం పఁదగినదికాదు, కొందరు తత్త్వవేత్తలు గ్రహించినట్లుగా బుద్ధి శక్తి పరిపూర్ణశక్తి కాదు, బుద్ధి కగోచరమైన పరమసత్యము పరిచ్ఛిన్నమానసమునకొక విశ్వసనీయభావము, దానిని మనము

దర్శింపలేక పోవచ్చును గాని నమ్మవచ్చును. మానవునకుఁ దెలిసినది వ్యవహారప్రపంచము గావున, దాని నేమానవుఁడును దర్శించి యుండలేదు! కాని, తన వ్యవహారజ్ఞానమున కట్టి యతీతసత్యసిద్ధాంత విశ్వాసమవసరమని మానవుఁడు తలఁచును. మన కెఱుకలోనున్న విషయముల జ్ఞానము పూర్ణమగుటకీపద్ధతి నవలంబింపవలసి యుండును. కాని, యీపద్ధతి యంతయు మన దృష్టి యెదుటఁ జిత్రింపఁబడి యుండలేదు. పరమసత్యము మన హృదయాకాశములపై విహరించుచు, మనము సిద్ధముగా నున్న చోవది మన హృత్పీఠముల నధివసించును. మనము మన బంధములను దాటిపోవలెను. పూర్ణ జ్ఞానము మనకు లేనంతమాత్రమున దాని యావశ్యకత యందలి విశ్వాసముండుట దోషము కాదు. తర్క-యుక్తి పరిధిలోనికి దానిని మనము చొప్పింప లేకున్నను మన విశ్వాసమున కదియాధారము కావచ్చును. మన కగోచరసత్యవస్తువును గూర్చిన విశ్వాసమిట్టి విధముగానే యుండును.

ఒక సూక్ష్మభావదృక్పథము ననుసరించి, నాగార్జున సిద్ధాంతమును గుమారిలుఁడిట్లు విమర్శించినాఁడు; "ఏది యిప్పుడు లేదో అది యెన్నఁడు నుండఁజాలదనియు నేది యిప్పుడున్నదో అది పూర్ణసత్యమే యనియు నందుచే ద్వివిధ సత్యములు లేవనియు నంగీకరింపవలసి యున్నది."౧. మాధ్యమిక సిద్ధాంతము ప్రపంచము శుద్ధశూన్యమని బోధించునని శంకరుఁడు తలచినాఁడు, ఇట్టి భావముతోడనే ఉదయనుఁడిట్లు

డిగినాఁడు; "శూన్యతను గూర్చిన భావము సత్యమా కాదా? ఒకవ్యక్తి లోకమును దాను శూన్యముగాఁ జూడకుండినచో లోకము శూన్యమని నీవెట్లు చెప్పఁగలవు? లోకము శూన్యమగుట నిజమైనచో శూన్యమును గాంచెందని యింకొకఁడు దానినిఁ జూచినాఁడని భావము. అపుడు వేరైన వాఁడొకఁడు, వాఁడు చూచినది నిజమని యంగీకరింప వలసియున్నది."

నాగార్జునుఁడు స్థితి పలుతెగలు గలదని గుర్తించినాఁడు. భ్రాంతి మాత్రములైన వస్తువులు ప్రత్యక్ష విషయము లంత సత్యములు గావు. కాని రెండును మానసిక విషయములగుటచే నొకే జాతికిఁజెందినవి, సర్వవస్తువులు వ్యక్తులు ధర్మసముచ్ఛయములే; ఒకానొక సముదాయమునఁ గలియు ధర్మముల స్వభావమునననుసరించి భేదములుండును. వస్తువులలో సమాన ధర్మములు జేరును, వ్యక్తుల విషయములో నట్లుకాదు. మనప్రాణేంద్రియాదులు, చెప్పఁదగిన మార్పులేమియు లేకుండగనే పునర్జీవితములగుచుండగా, మానసిక ధర్మములు గొప్పమార్పులకు లోనగుచున్నవి. భ్రాంతివిషయములకు మనస్సునకు వేరైనస్థితి లేదు; కానిమనయనుభవములోనివస్తువులకనుభవావస్థలో స్థితియున్నది; అట్టిభేదముచే నివిదప్రష్టనుండి స్వతంత్రములు, దేశకాలములందుఁ బ్రపంచమునకు స్థితియున్నదని నాగార్జునుఁ డంగీకరించును గాని యది స్థిరముగాదని చెప్పును, వ్యవహారప్రపంచమున కొకవిధమైన స్థితి లేకపోలేదు. కొన్నియవస్థలలో దానిని మన మట్లు గ్రహింపఁగలము; తిరిగి తిరిగి గ్రహింపఁగలము, ఇది విశ్వజనీనమైన యనుభవమేలననిది సర్వజనులకు సామాన్యమై యున్నది.

కేవల మానసికావస్థ, వ్యాప్తముకాదు, దేశసంబంధికాదు, కావున నదిక్షణికము, ఏకైకవ్యక్తిగతము, అందుచే మానసిక విషయస్థితి కంటె, భౌతికవస్తుస్థితి, యెక్కువ స్థిరమైనది. విజ్ఞానప్రవాహ వేగముతో మారుచుండు భావరూపములుక్షణికములు, కాని, భౌతికపదార్థములింద్రియగోచరములై, యెక్కువస్థిరత్వమును గలిగి యున్నవి; ఏలనఁ గొన్ని నిశ్చిత నియమముల ననుసరించి వానిని మనము మఱల విజ్ఞానమునఁ జేర్చఁగలము. లోకములో నుండుట యనగా, దేశకాల నిమిత్తనిర్మాణములోనుండు స్థితియే; కానియిది నిత్యస్థితిమాత్రముకాదు. అనగా వస్తువుల సత్యములని భావము కాదు. లలితవిస్తారమిట్లు చెప్పుచున్నది; "లోకములోనే వస్తువునకు భావము (స్థితి) లేదు; అభావమును లేదు." ప్రపంచము పూర్ణసత్యమునుగాదు; పూర్ణ శూన్యమునుగాదు; రెండవ భావము దురూహ్యము, కావున శూన్యశబ్దముచే మాధ్యమికుఁడు పూర్ణనాస్తిత్వమునుగాక, అనిత్యాస్తిత్వమునే చెప్పెను. ఇదియే శంకరుని వ్యవహారజగత్తు. స్వయంస్థితిలేని కారణమున వస్తువులకు నిత్యత్వములేదని చెప్పుట వేరు; వస్తువులసలే లేవని చెప్పుట వేరు. ఈ రెండుభావములునుగూడ మాధ్యమిక గ్రంథములలోఁ గాననగును. వస్తువులనిత్యములను భావమే మాధ్యమిక సిద్ధాంతమని తోఁచుచున్నది. ఏకకాలమందలి పెక్కు కారణములచే నుత్పత్తియగుట ధర్మముల స్వభావమనియు నట్లుత్పత్తియయినవి స్వయంభువములు కావనియు, నందుచే నవి స్వయంస్థితిలేనివనియుఁ జెప్పు ప్రతీత్యసముత్పాదవాదమును బట్టి, మనకు వ్యావహారికముగా గోచరించు వస్తువులం పార

మార్థికముగా సత్యములుగావని మాత్రమే నిశ్చయమగు చున్నది. ఈయర్థములో శూన్యమనగాఁ గారణ సంజాతమని యనగాఁ బరాధారభూతమని యర్థము. బౌద్ధజగదస్తిత్వవాదు లైన సౌత్రాంతికులును వైభాషికులును గారణములవలన నుత్ప త్తియైనది స్వయంస్థితిలేనిదను భావమును, అసత్యమను భావము నుగ్గడింపరు; అందుచే నది శూన్యమనియు వారుచెప్పరు. "సర్వమును శూన్యమే; ఏలన సార్వలౌకికమగు నిమిత్తధర్మము నుండియే సర్వమును జనించెను."౧. వస్తువుల అభావమును, నిత్యపరిణామమందుచున్న సంసారప్రవాహమును మాధ్య మికులు వక్కాణించినారు. ధర్మములు పారమార్థికముగను, వ్యావహారికమునుగూడ లేవనుభావమును మాధ్యమికులు చెప్పి నట్లు కొందరుతలఁతురు. వస్తువుల నసాధ్యములగు వంధ్యా పుత్రాదికముతోఁబోల్చవలెను. వంధ్యసౌందర్యమును మనము వర్ణింపవచ్చునుగాని, వంధ్యాపుత్రుఁడసత్యము. ఆతని వాక్య ములలోఁ గొన్ని యిట్టిభావమును సూచించునని తలపఁబడినను, నాగార్జునుని భావమిదికాదని తోఁచుచున్నది, అట్టి వాక్యము లలో నొకటియిది: "మనము ధర్మముల ననుభవములోఁ జూచుటలేదా ?" యనుప్రశ్నకు నాగార్జునుని జవాబిది; నిజమే! నేత్రదోషముకల సన్యాసియుఁ దనభిక్షాపాత్రమం దున్న తలవెండ్రుకను జూచునట్లే, నిజముగా నాతఁడు దానినిఁ జూడఁడు, తలవెండ్రుక యెంతనిజమో యాతనిజ్ఞానము నంతే నిజము, ఏలన స్వచ్ఛనేత్రములుగల వానికిఁ దలవెంద్రుకను

కూర్చిన భావమే తట్టదు;" ఒకవ్యక్తిపరమార్థ సత్యమును సంపాదించునపుడు, వస్తువుల నిజస్వభావము నాతఁడుచూచును; అప్పుడాతఁడు వానియస్తిత్వమును నమ్మఁడు. అవి వానికి గోచరింపనే గోచరింపవు. అందుచేఁ బరిపూర్ణజ్ఞానమనగా వస్తువుల శూన్యత్వజ్ఞానము. ప్రపంచమంతయు నొకమాంత్రికుని వినోద ప్రదర్శనమువంటిది. అవిద్యావిముక్తుఁడగు సిద్ధుఁడట్టి దృశ్యముచే మోసగింపఁబడఁడు. ఉన్నట్లు గోచరించునది భ్రాంతి. సర్వవస్తువులు, భావములు మాధ్యమికులదృష్టిలో శూన్యములగుటచే, వారిని సర్వవైనాశికులనియుఁ బిలుచుట కలదు. గ్రహనక్షత్రాదులతోఁ గూడిన సృష్టియంతయు నిరాధారదృశ్యమనుభావమున కనుగుణముగా బౌద్ధులునాలుగుశాఖలకుఁజెందుదురని తలఁచు ప్రజాభిప్రాయము సమంజసముగా నున్నది. బాహ్యవస్తుజాలము చూపట్టుచున్నదను వైభాషికులు; వస్తువుల ప్రతిబింబములే మనకు గోచరించుచున్నవని తలఁచు సౌత్రాంతికులు; సృష్టియంతయు మానసికమని భావించు యోగాచారులు; సర్వవైనాశికులనఁబడుమాధ్యమికులు. కాని యీభావమునాగార్జునుని తత్త్వమునకుజెందదని మాయభిప్రాయము. మనము కూర్చుండియుండిన యాసనము నిజమైనయాసనము కాదని ఋజువుచేయనుంకించు సామాన్యమాంత్రికునివంటివాఁడు నాగార్జునుఁడుగాఁడు. ఆతఁడంగీకరించు దృశ్యము నిత్యసముత్పన్నమగు స్థితిగలదనియు, నదిపారమార్థిక సత్యముగాదనియు నాగార్జునుని వాదము.

## ౮. శూన్యభావము— అంతర్గతార్థములు

శూన్యభావమున ననేకార్థములు గ్రహింపఁబడినవి. కొందరకది శుద్ధశూన్యము; కొందరకది సర్వవస్త్వంతర్యామియై, అతీతము ననిర్వచనీయము నైన నిత్య నియమము. మొదటిది వ్యవహారప్రపంచసంబంధమైనది; రెండవది పారమార్థికసత్యము. మిథ్యాకల్పనమైనను శూన్యవాతావరణములోఁ బోషింపఁబడదు. సర్వాభావమునకంతర్గతమై భావముండును. పరిపూర్ణశూన్యత దురూహ్యము. సంపూర్ణనాస్తికభావ మూహాకల్పనము; ఏలన నిర్ణయముచేసిన కర్తయైనను నిజముకావలెను. ఒక యతీతసత్యమును నాగార్జునుఁ డంగీకరించును, కాని యాతఁడుపనిషత్తులవలెనే, యదిజ్ఞానవిషయముగాదని వాదించును. "నేత్రము చూడదు; మనస్సాలోచింపదు; మనుజులకు దురవగాహమైన పరమసత్యమిదియే. ఏప్రదేశమున సర్వవస్తు సమ్యగ్దర్శనమొకేకాలమందు లభించునో యది బుద్ధునిచేఁ బరమార్థప్రపంచమని పిలువఁబడెను. అది వాగతీతము."౧. "దానిని భావమనికాని అభావమనికాని రెండునుననికాని. రెండును గాదని కాని, చెప్పఁజాలము. కాని దానిని సూచించుటకొఱకు శూన్యమని చెప్పెదము." ౨. కూటస్థమగు సత్యమున్నది; లేకున్న నీవిధముగా వస్తుప్రపంచముండుటకు వీలుండదు. శూన్యత భావాత్మకమైన నియమము నాగార్జునుని భావ

౧. 3 వ అధ్యాయము.

౨. శూన్యమితి వక్తవ్యమ్ అశూన్య మితివాభవేత్.
ఉభయంనోభయం చేతి ప్రజ్ఞప్త్యర్థంతుకథ్యతే.

మునుగూర్చి కుమారజీవుఁడిట్లు పలికినాఁడు : "శూన్యతమూల ముననే సర్వవస్తువులును నిలిచియున్నవి. శూన్యతలేనిదే యేదియు నుండఁజాలదు." శూన్యతయే సర్వాధారభూతమైనది. "ఓసుభూతీ! సర్వధర్మములకు శూన్యతయే శరణ్యము. అవి దానిని మార్చలేవు." ౧. "ఏదికారణమునకు, విజ్ఞానదర్శనములకు నతీతమైనదో యేది జన్మోద్భవములు లేనిదో, యేది యనంతమో దానికే శూన్యత నామాంతరమైయున్నది." ౨. శూన్యతననుసరించి వ్యవహారప్రపంచము నిత్యపరిణామశీలమగు దృశ్యము. తుదిలేని పరిణామనాశమునుజూచి మానవుఁడు నిరాశోపహతుఁడగుచున్నాఁడు; కాని యాతఁడది క్షణికమైన అసత్యదృశ్యమని గుర్తించినంతనే, దానినతిక్రమించి, నిత్యసత్యమును దర్శించును; మఱియు నిదంతయు ననిత్యమైన స్వప్నమనియు, ౘదవకు విజయము నిశ్చయమనియు నిర్వికారచిత్తుఁడై యాతఁ డుదాసీనతవహించి కూర్చుండును.

పరమసత్యమునుగూర్చి మనమేమియుఁ జెప్పఁజాలము. దానికి వ్యతిరేకములైన సర్వావస్థలను విసర్జించినచో మనము దానినిఁ బొందఁగలము. పరమసత్యమునకు స్థితియున్నది, లేదు; అది భావాభావవిరోధమునుగాదు. 3. మాధ్యమికులననుసరించి హేతువు,వాక్కు వ్యవహారప్రపంచములోనివి.వ్యవహారప్రపంచ ప్రమాణములతోఁ బరమార్థసత్యమును నిర్ణయింపఁబూనుట

---

౧. ప్రజ్ఞాపారమితా. ౨. అష్టసాహస్రికాప్రజ్ఞాపారమితా ౧౮ అ.
3. అస్తినాస్త్యుభయానుభయ ఇతి చతుష్కోటివినిర్ముక్తమ్ శూన్యత్వమ్. (మాధవుడు స.ద.సం.)

సూర్యుని వేడిమి మన నిత్యోపయోగమునను్న 'ఉష్ణమానము' తోఁ గొలుచుటకు యత్నించుటవంటిదగును. మనదృష్టిననుసరించి పరమార్థము శూన్యము.౪. ఏలన మనము వ్యవహారములో నుపయోగించు నేప్రమాణమును దానికి వర్తించదు కావున దానిని శూన్యమనుచున్నాము. దానికి స్థితియున్నదనుట తప్పు; కారణమేమన నాకృతిగలవస్తువుల లక్షణమది; అది స్థితిలేనిదనుటయుఁదప్పే; ౧. ఏలన దానినిఁగూర్చి వర్ణింపఁబూనుటయే దోషము. విజ్ఞానము ద్వైతభావముగలది; సత్యమద్వితీయమైనది; బుద్ధుఁడిట్లుచెప్పెనని చెప్పుదురు: "ఏభాషయొక్క అక్షరములకును వశముగాని సత్యమును వర్ణించుటెట్లు, తెలియుటెట్లు? సర్వాతీతమైనదియు "శూన్యతా" నామమునఁ జెప్పఁబడునదియు నగు సద్దానినిఁగూర్చి యీ మాటలు చెప్పుటయు దోషమేయగుచున్నది." "ధర్మము (వస్తువు) యొక్క నిజస్వరూపము నిర్వాణము; అది అనిర్వచనీయము, అగ్రాహ్యము, జననమరణాతీతము, వాగ్భావాతీతము నైయున్నది."౨. సర్వసంబంధముల నతిక్రమించు నీభావమునే డన్సుస్కోటస్ను పండితుఁడిట్లు చెప్పినాఁడు: "దేవుఁడు శూన్యమని పిలువఁబడుటలో నక్రమమేమియును లేదు." "ఏలన విజ్ఞానమునకు సంబంధశూన్యమైనది శూన్యమే. 3.

౪. శూన్యమ్ తత్!

౧. తత్రిఅస్తితానాస్తితే నానవిద్యతేనోపలభ్యతే.

౨. ౧౮ అ. 3. బ్రిడ్జే. బ్రహ్మోపనిషత్తుప్రకారము బ్రహ్మము, "శూన్యము, తుచ్ఛము, అభావము, అవ్యక్తము, అదృశ్యము, అచింత్యము,

పరమ సత్యము సర్వబంధాతీతమై, యందుచే మన యల్పవిజ్ఞానము నగోచరమైనను, మానవమానసమునకు సహజమైన యవిద్యచే నది క్షణిక ప్రపంచరూపమున దృశ్యమానమగు చున్నది. అవిద్య సంబంధనియమము, ప్రపంచము పరమ సత్యమునకుఁ బ్రతిబింబము; లేకున్న మనము పరమార్థమును సంవృతి మూలమున నెన్నఁడు పొందలేము. నాగార్జునుఁడు దీని నంగీకరించినాఁడు. వస్తువుల స్వరూపము రెండర్థములలోను శూన్యమే. "మనమిప్పుడు దర్శించుచున్న వస్తువులు గతములో శూన్యమే; ముందును శూన్యమే, సర్వవస్తుస్వభావమును శూన్యమే." లేని వస్తువులనున్నట్లు భావింపఁజేయునదవిద్య, సత్యజ్ఞానము మహావిద్య; దానికి వ్యతిరేకమైనదవిద్య.

నాగార్జునుని శూన్యము హామిల్టనుయొక్క "అవస్థాతీతమును" స్పెన్సర్ యొక్క దుర్జ్ఞేయమును, స్మరింపఁజేయు చున్నది. దాని సర్వసంబంధాతీత లక్షణమువలన నొకప్పుడు ప్లాటినస్ చెప్పిన 'ఏకము' నకును, స్పైనోజా వచించిన 'పరమార్థమునకును' స్కెల్లింగు నిరూపించిన 'నిర్గుణ' ము నకును బోల్పఁబడినది. లోకక్లేశములచేఁ జకితమైన మానసము నిది

నిర్గుణము." సత్యజ్ఞానానంద స్వభావముగల బ్రహ్మము శూన్యమునిరూగ స్వరోదయము వర్ణించినది. శూన్యంతు సచ్చిదానందమ్ నిశ్శబ్దబ్రహ్మ శబ్దితమ్. పోల్చుకబీరు: "సర్వసత్యములకు సత్యమును, సకలసత్యము లెవని యందున్నవో యాతని శూన్యుఁడందురు." (టాగూరు అనువాదము)

యాకర్షించును.౧. సర్వోత్తమమైన యిది తన పరిపూర్ణతచే నచలముగాను, సర్వపరిణామ విహీనముగను గోచరించును. ఏక్షణమున దాని కభావమును బ్రతిపాదింతుమో, యాక్షణమున దాని సంపూర్ణత నశించును. ఈదృష్టిలోఁ బరమసత్యము పూర్ణసత్యమైనచో నందభావమునకు స్థానము లేదు. అట్టి సర్వపరిపూర్ణ సత్యము నిర్జీవముగాఁ దోఁచును. భావమెంత యవసరమో అభావము నంతే యవసరము. అభావము లేనిదే భేదము లేదు. తత్ఫలితముగా జీవపరిణామమును లేదు. పరమార్థము సజీవమైనచో, దానియందొక అభావాంశయు నున్నదని తప్పనిసరిగాఁ జెప్పుకొనవలసియున్నది. నాగార్జుఁ డిట్టి వాదమును "మనుజస్వభావమ"ని కొట్టివేయును. పరమార్థమును గూర్చి కాని, వ్యవహార పరమార్థ సంబంధ రహస్యమును గూర్చి కాని తెలిసికొని నిర్వచింపలేని మన యసమర్థతవలన నది శూన్యమని మనము విశ్వసింపనవసరము లేదు. మహాయోగులనుభవించు నిర్వాణానందమే. పరమార్థము పూర్ణమైనదనియు నిత్యానందసంధాయకమనియు ఋజువుచేయుచున్నది. మాధ్యమికులు పూర్వులైనచో యోగాచారుల వాదపరిణామమును మన మర్థముచేసికొనుటకు వీలయ్యెడిది. నాగార్జునుని పరమసత్యమును గూర్చిన హేతుసిద్ధాంతము మన కాలయు

౧. షెల్లి : షేబరుగీతము:-"హేభగవాన్! తుదిలేని మార్పువలన నాహృదయమున కధిక తాపము కల్గుచున్నది. జీవిత మతివేగగమనముకలదై విసువుపుట్టించుచున్నది. అది విశ్రాంతి నెఱుఁగని వివిధగతులుగలిగి పరుగెత్తుచున్నది. నీయందెట్టి మార్పునులేదు. అనంతశాంతమైన నీ దివ్యరూపమునఁ బరిణామ ప్రతిబింబమైననులేదు.

విజ్ఞానసిద్ధాంతమునకుఁ బ్రోవచూపును. మన యల్పదృష్టినుండి నాగార్జునుని పరమసత్య మచలపదార్థముగాఁ దోఁచుచున్నది. ఇది యోగాచారుల దృష్టిలో నెల్లప్పుడు పెరుగుచున్న ఆలయ విజ్ఞానము. వస్తువులు, వ్యక్తులు దానికి బాహ్యమునఁగాకుండ దానియందేయున్నారు. వారు నిత్యపరిణామమునం దున్నారు. ఈనిత్యపరిణామము పూర్ణవిజ్ఞానములోనిదే. వస్తువులు మాధ్యమికుల దృష్టిలోఁ బరమసత్యమునకు వేరై, తమ యల్పత్వముచేతనే బంధింపఁబడియున్నవి. ఈరెంటికి నెట్టిసంబంధమున్నదో మన పరిమితబుద్ధికి గోచరించదు. ఆలయవిజ్ఞాన మొక యవస్థ గాదు; అదియొక పరిణామము. అది ఆత్మతత్త్వమే, ప్రపంచ రూపమునఁ బరిణమించుచున్నది. పరమసత్యమును మన భావముచే గ్రహించు నుత్తమపద్ధతి దానిని చిద్విజ్ఞానముగా భావించుటే. ఇందు మనకు భావాభావములు, అనేకత్వైకత్వములు నున్నవి. ఆత్మవిజ్ఞానము సర్వవస్తుమూలమని చెప్పు హెగిలియన్ సిద్ధాంతమునకు యోగాచారుల సిద్ధాంతము సన్నిహితమైనది. మాధ్యమిక సిద్ధాంతము శంకరుఁడు, బ్రాడ్లే మున్నగువారి అద్వైతసిద్ధాంతమునకు సరిపోవును. ఏలన వారికి జీవాత్మభావము పారమార్థికముగాదు. జీవాత్మభావము భావసంబంధమే. పరమసత్యమున కెట్టిసంబంధమునుగాని చెప్పుట సహేతుకము కాఁజాలదు.

## ౯ ఉపసంహారము

ప్రపంచమసత్యమైనను, గతాభ్యాసబలమున దానిని మనము నిజమని తలఁచుచున్నాము, నిర్వాణపథమును జేరుటకు

మనము పురాతన మార్గము ననుసరించి,వస్తుసత్యమును గూర్చి మనకుఁగల అసత్యభావములను విడిచి దుఃఖమును నిర్మూలించు కొనవలెను. కష్టదుఃఖములును, సుఖానందములును, నవిద్యా సముద్భవములే. మనస్సే సర్వకష్టములకును దుఃఖములకును మూలము. వ్యవహారప్రపంచమున ధర్మసూత్రములకు సముచితప్రయోజనమున్నది.

సంసారము కేవల వినోదప్రదర్శనమని చూపఁబడినది. తదంతర్గత సత్యము నెఱుఁగుటయే నిర్వాణము. అదియే పర మార్థము, తథాగతమనగా జీవాత్మ లేకపోవుట. ప్రపంచ మనగా నిశ్చితరూపము లేనిది.౧. శూన్యమునకుఁ జెప్పిన లక్షణ ములన్నియు నిర్వాణమునకుఁగలవే. అది వ్యవహారలోక భాషా తీతము, అది శూన్యమనికాని అశూన్యమనికాని,రెండునని కాని, రెండునుగాదని కాని మనము చెప్పఁజాలము.౨. వ్యవహారధర్మ మునను సరించి బుద్ధుఁడుండెనని మనము చెప్పెదము. నిజముగా నదియుఁజెప్పుటకు మన కధికారము లేదు. నాగార్జునుఁడిట్లు చెప్పినాఁడు: "నిర్వాణ మనగా నేలోపమును లేనిది; అది యిది వఱకు లేక సంపాదించుటచే వచ్చినది కాదు; ఒకప్పుడుండి మఱొకప్పుడు లేకుండునది కాదు; వర్ణించుటకు సాధ్యమైనది కాదు: సృజింపఁబడునది కాదు."నిర్వాణ సిద్ధివలననవిద్య తొలఁగి పోయి, జన్మబంధములు తెగిపోవును. జన్మరూపావస్థాతీతమై నదియే మిగులును. నిర్వాణమును బొందుటయను మాటయుఁ బనికిరాదని చెప్పఁబడెను. అజ్ఞాననాశనమే ప్రధానము.

---

౨. అ. ౨౨–౧౬. చూడు. ౨౫ అ. ౧౭.౨ అ. ౨౨–౧౧.

ముక్తిని సంపాదింపఁదలచువారు, పరమార్థ ధర్మములైన దానము, నీతినియమానుష్ఠానము, సహిష్ణుతాభావము, కృషి, ధ్యానము, పరమార్థ జ్ఞానము; నభ్యసించి, పరిపూర్ణతనందవలెను. సర్వమసత్యమని యెఱిఁగిన బోధిసత్త్వుఁ డితరులను శాపవిముక్తుల నొనర్ప నేల యత్నించునని మనమడిగినచో సమాధానము వజ్రచ్ఛేదికలో నిట్లు చెప్పఁబడెను. "బోధిసత్త్వ మార్గమునఁ బ్రవేశించిన వారిట్లు నిశ్చయించుకొనవలెను. సర్వజీవులకుఁ బరిపూర్ణ నిర్వాణ పదప్రాప్తినొసఁగి, నేనెవరిని తరింపఁజేయ లేదని తలఁపవలెను ఏలన, ఓసుభూతీ! జీవులున్నారని తలఁచుటయే బోధిసత్త్వపదవికి విరుద్ధము."3. "బోధిసత్త్వుఁడే వస్తువును దానము చేయరాదు; ఏలన దానివలన వస్తువులు నిజమని నమ్ముట యగును."4 సరిగాఁ జెప్పినచో బోధిసత్త్వుఁ డున్నాఁడని తలఁచుటయే భ్రాంతి.

వైభాషికులు ద్వైతతత్త్వముతో నారంభించి, వస్తువుల ప్రత్యక్షదర్శనము జ్ఞానమని తలఁచినారు. సౌత్రాంతికులు వస్తువులు భావముల ద్వారమున మనకుఁ దెలియునని చెప్పి, మనస్సునకు వస్తువులకును మధ్యమందొక తెఱను నిర్మించినారు. భావముల కవ్వలనున్న వస్తువులను యోగాచారులు లేవనియే చెప్పుట సమంజసముగా నేయున్నది. మనయనుభవమంతయు భావపరంపరాసముచ్చయమే యని వీరునిర్ణయించిరి. మాధ్యమికులింకను విశేషసాహసతర్కసంపర్కముచే మనస్సుకూడ

3. యస్. బి ఇ. ౪౯. పుట ౧౩౭.
4. ,, ,, పుట ౧.

నొకభావమేయనియు మనకు మిగులునవి సమ్యక్సంబంధము లేని భావములు దర్శనములు మాత్రమేయనియు నిర్ణయించిరి. ఆంగ్లేయుల వ్యావహారిక తత్త్వశాస్త్ర మీమార్గముననుసరించినది. లాకేయొక్కయు నాతనియనుచరులయొక్కయుఁ దర్కవిధానమున కారంభముగా ద్రష్టయు దృశ్యము నన్యోన్యసంపర్కము గలవనియు, జ్ఞానవిషయమీ సంపర్కఫలితమనియు నిర్ణయించిరి. వేనిసంపర్కమువలన జ్ఞానవిషయ ముదయించినదో యావిషయమునందు ద్రష్టృదృశ్యముల యంశము లెవ్వియును లేని కారణమున, మనకుద్రష్టనుగూర్చికాని దృశ్యమునుగూర్చికాని యేమియుఁ దెలియదు. ఇట్టిసిద్ధాంతముయొక్క సక్రమఫలితముగా హ్యూమ్‌యొక్క నాస్తికవాదము జనించినది. దీనిననుసరించి, ఆత్మయుఁ బ్రపంచమును మానసికదశాపరంపరాజాలమే. ఈయుద్యమముయొక్క ఆంగ్లతత్త్వమునిట్లు రీడ్ పండితుఁడు సంగ్రహించినాఁడు; "మొట్టమొదటఁ దత్త్వశాస్త్రమునందు భావములు, వస్తువుల ప్రతిబింబములుగా మాత్రమే ప్రవేశపెట్టఁబడినవి. ఈయుద్దేశముతోఁ గైకొనిన భావములు, నిర్దోషములైఁ మానవవిజ్ఞానవ్యాపారమున కెంతో స్తుతిపాత్రములుగాఁ దోడ్పడినవి. కాని, వానినిగూర్చి జనులు స్పష్టముగా నాలోచించుట కారంభించిన వెనుక, క్రమక్రమముగా నీభావములు, తాము వేనిప్రతిబింబములో వానిస్థానముల నాక్రమించి, తుదకుఁ దాము తప్ప వేరువస్తువుల అస్తిత్వమునే లేదనినవి. ఈభావములు, గాలిలోవిహరించు పక్షులవలె స్వతంత్రములైనవి, కాని, నిజముగా నీస్వయంస్థితి స్వాతంత్ర్య

ములుగల భావములు, స్వైరవిహారముగలిగి, నిరాధారములు, వివస్త్రములునై, తమదిగంబరత్వమును మాపుకొనుటకొక చింకిగుడ్డ పీలికయైనను లేక, చరించుట మొదలుపెట్టినవి."౧. తన కూటస్థములైన యీభావముల తత్త్వమునుగూర్చి సమగ్రమైన పునర్విచారణచేసి, అవసరమైన మార్పునంగీకరించనియెడల, జ్ఞానమునకు, ననుభవమునకుఁ, దత్త్వశాస్త్రమునకు నెట్టి యవకాశమును లేకుండును.

తాత్త్వికదృక్పథమునననుసరించి చూచినచో, వైభాషికుల పదార్థద్వయసిద్ధాంతము, మనము సౌత్రాంతికులయొద్దకు వచ్చునప్పటికి, మనస్సువైపునబలమెక్కువై గోచరించును. యోగాచారులు బాహ్యజగత్తును విసర్జించి, సర్వవస్తుకేంద్రస్థానము మనస్సునకిచ్చిరి. ఇఁక మాధ్యమికులు జీవాత్మలు కాని, భౌతికవస్తువులుగాని పారమార్థికముగా సత్యములు గావనిరి. పరమసత్య మద్వితీయమైయున్నదనిరి. ఈ యద్వితీయ సత్య మాత్మజ్ఞానముకలిగిన సగుణరూపమని యోగాచారులు నమ్మిరి కాని,మాధ్యమికులు ఆత్మానాత్మలురెండును సమానముగా నసత్యమనిరి. సగుణరూపము పారమార్థికసత్యముకాదు.

అద్వైతవేదాంతశాస్త్రము మాధ్యమిక తత్త్వమును విశేషముగాననుసరించినదని మనము చెప్పరాదు. గౌడపాద కారికలలోని అలాట శాంతిప్రకరణమునందు మాధ్యమికుల భావములు విశేషముగాఁ గలవు. అద్వైతసిద్ధాంతముచెప్పిన వ్యవహార పరమార్థములు మాధ్యమికుల సంవృతిపరమార్థ

౧. గ్రంథములు—పు. ౧౧౯.

ములకు సరిపోవును. శంకరుని నిర్గుణబ్రహ్మమునకును, నాగార్జునుని శూన్యమునకును విశేషసామ్యము గలదు. అనిత్య ప్రపంచహేతువైన అవిద్య నిరువురంగీకరించిరి. ప్రపంచము భావప్రమాణసంబంధముల నాట్యమనిచెప్పు నిశితతర్క ప్రజ్ఞావిలాస మిరువురకు సమానమే. మనము శ్రీహర్షునివంటి అద్వైతవేదాంతవాదినిఁ దీసికొన్నయెడల, నాతఁడు మాధ్యమికసిద్ధాంతములనుమాత్రమే ప్రదర్శించెనని తెలియఁగలదు. మనవ్యవహార ప్రమాణములగు కార్యకారణములు, విషయీ విషయములు, మున్నగువాని వైరుధ్యములను జూపి, నిర్వచన సాధ్యములు కానికారణమున వస్త్వస్తిత్వమును లేదనెను. శ్రీహర్షుని ఖండనము ననుసరించి వస్తువు లనిర్వచనీయములు; మాధ్యమికవృత్తిననుసరించి, యవి నిస్స్వభావములు. రెంటి యర్థము నొకటే. బౌద్ధసహజమైన దృష్టిననుసరించి, పరమ సత్యముయొక్క భావలక్షణముల నాతఁడు వర్ణింపఁడు; అది యున్నదని యాతఁ డంగీకరించును. వ్యవహారప్రపంచము మిథ్యాదృశ్యమను నాతని వ్యతిరేకతర్కముచే నద్వైత తత్త్వమున కాతఁడు మార్గమును సిద్ధమొనర్చును. కాని మాధ్యమికులు, అద్వైతవాదులు, పరస్పరవిరోధ సిద్ధాంతవాదులమని తాము తలఁచుట విచారకరమగు వైచిత్ర్యము.

## ఉదాహృతగ్రంథములు


౧. సర్వదర్శనసంగ్రహము ౨-వ అధ్యాయము.
౨. సర్వసిద్ధాంత సారసంగ్రహము.
౩. శంకర వేదాంతసూత్రభాష్యము.
౪. నాగార్జున మాధ్యమికసూత్రములు.
౫. యమకమి సోజెన్. బౌద్ధవిజ్ఞానతత్త్వములు.

## అనుబంధము

### కొన్ని సమస్యల పునఃపరిశీలనము.౧.

నా 'భారతీయ తత్త్వశాస్త్రము' సమోద్యమునతో స్వీకరింపఁబడినది. నా విమర్శకులు చూపిన యభినందనమునకు సుహృదయమునకు నేను వారికి నాకృతజ్ఞతను వెల్లడించుచున్నాను. నాప్రథమ భాగమువలన నుదయించిన కొన్ని సమస్యలను నే నిచటఁ జర్చింపఁబూనుకొంటిని. తత్త్వార్థనిర్ణయ విధానము, భిన్నమతసామ్య పరిశీలనా ప్రయోజనము, ఉపనిషదుపదేశము, బుద్ధునిదని చెప్పఁబడు నాస్తికవాదము, నాగార్జునుని తత్త్వశాస్త్రము మున్నగునవియే యీసమస్యలు.

### ౧. తత్త్వార్థనిర్ణయ విధానము.

తత్త్వశాస్త్ర చరిత్రకారుఁడు, భాషాశాస్త్రపండితునివలెఁగాని, విద్వాంసునివలెఁగాని కాక, శబ్దములు స్ఫురింపఁజేయు భావములను గ్రహించు నుపకరణముగామాత్రమే పాండిత్యము నుపయోగింపవలెను. కేవలభాషాశాస్త్రకోవిదుఁడు ప్రాచీనభారతీయ విజ్ఞానవేత్తల భావములను, తత్త్వశాస్త్ర చరిత్ర భూమియందు మృణ్మయములై బయల్పడి, చెదరియున్న జీర్ణాస్థి సముదాయములనువలె దర్శించును. ఈదృష్టితో నాతఁడు, ప్రాచీనభావములను బునరుజ్జీవనమొనర్చి వాని కర్థనిర్ణయమును జేయు నట్టి సత్ప్రయత్నమునైనను, నసందర్భార్థ

౧ ఈవ్యాసము 'మైండు' పత్రికలో వెలువడినది వాల్యుము 35. యన్. యస్. సం. ౧౩౭

కలితమనియు నసత్యమనియుఁ గొట్టివేయును. కాని తత్త్వవేత్త దృష్టి యిట్టిదికాదు. నిత్యనూత్నములైన జీవితసమస్యలతోఁ బోరాడి పరిష్కరించునిమిత్తము నిర్మింపఁబడిన ప్రాచీనుల సిద్ధాంతములకు విలువగలదని గుర్తించి, యవి భూగర్భమునుండి బయల్పడిన శిథిలాస్థికలవంటివి కావనియు, నెంతకాలము గతించినను నిత్యములై ప్రకాశించుచున్న తత్త్వరూపము లనియు నాతఁడు భావించును. తత్త్వసమస్యలకు మానవ మానసముల భావపరిణతి యాకృతిదాల్చిన యుపనిషత్తులుగాని బుద్ధభగవానుని సంభాషణములుగాని, నేఁడు సజీవములైయున్న వివిధతత్త్వశాఖలందును నూతనాకృతులతో జీవించియే యున్నవి. ప్రాచీనభారతీయుల మహోపదేశవాక్యము లచట చటఁజెదరి యున్నను, నస్పష్టములైనను, నొకక్రమములో లేకున్నను, నవి కల్పించిన సారస్వతమంతయుఁదార్కిక హేతు విరుద్ధముగా నున్నదనుట సాహసము. కేవల శబ్దశాస్త్రపద్ధతిని గాక, సృజనాత్మకమైన తర్కమునకుఁ గర్తవ్యమేమనఁజెదరి యున్న మహనీయుల వాక్యములను జతపఱచి, వారెట్టి జీవితా శయములను బ్రదర్శించిరో వానినిఁ బ్రదర్శించి, దేహోపాధి బంధవిముక్తాత్ములము గావలయును. మ్యాక్సుముల్లర్ పండి తుఁడిట్లు రచించినాడు: "నూత్రములు మున్నగువాని యందు మనకు సులభముగా లభించు నేప్రాచీన భారతీయ తత్త్వము నందలి యుపదేశములనైనను మనము కేవల పునశ్చరణము చేయుట చాలదు; ప్రాచీనులూహించిన సమస్యలను మనము మనకు సన్నిహితములుగాఁ జేసికొని,యవి మనవేయని భావించి

ప్రాచీనవిజ్ఞానవేత్తలు మనకుఁబ్రసాదించి పోయిన కొలఁది బాటలలో మనమును నడువయత్నింప వలెను."౧. అంశములను గూర్చుట, ప్రియాణములను బొందుపఱచుటయు ముఖ్యములైన పనులే; కాని మానవ జాతియొక్క మనశ్శక్తి చేసిన సాహసకృషి వ్యాపారఫలితములను సేకరించి ప్రకటించుట యను చరిత్రకారుని మహోద్యమములోనిది యొకభాగ లేశ మేయని గ్రహింపవలెను ౨. భావముల వెనుక నున్న హేతువులను, శ్రద్ధగా గమనించి, వానినుండి లభించు నిశ్చితార్థములను బయల్పఱచి, తత్కారణములను సూచించి, సిద్ధాంతస్థాపన మొనర్చి, సంబంధశూన్యముగా గోచరించు చున్న భావదుర్గమారణ్య మధ్యమునందు సక్రమ గమనసాధనములగు బాటల నేర్పరుపవలసియున్నది. మృతరచయితల యొక్కయు వారిరచనలయొక్కయు నంశముల క్రోడీకరణమే

---

౧. సిక్సు సిస్టమ్సు ఆఫ్ ఇండియన్ ఫిలాసఫీ. పుట ౨౯౩.

౨. పోల్చు. హెగెల్:"విజ్ఞానమందు,ముఖ్యముగాఁదత్త్వవిజ్ఞానమందు, శబ్దముల వ్యుత్పత్త్యర్థములను గ్రహించుటేకాని,వాని భావములను,సామాన్యార్థములలో దెలిసికొనుటేకాని జ్ఞానము కాజాలదు.అందుచేతత్త్వవేత్తలఅభిప్రాయములను, సిద్ధాంతములను,ఉపదేశములను, మనము తెలిసికొని యుండవచ్చును; వారిభావములకుఁగలయాధారములను,తత్ఫలితములను నిర్ణయించుటకై మనము విశేషకృషి చేయుచుండ వచ్చును, కాని,తత్త్వవేత్తయొక్క కేంద్రభావముల యర్థము మనకు లభింపకపోవచ్చును."తత్త్వజ్ఞానహీనులగు తత్వశాస్త్రచరిత్రకారులను గానములోనిభిన్న ధ్వనులను వినుపశువులతో హెగెల్ పోల్చినాఁడు పశువులు ధ్వనులను వినువేకాని వానివెనుకనున్న ధ్వనిసమ్మేళనముచేఁ గలుగు రాగసామరస్య స్వారస్యములనవి యెఱుఁగఁజాలవు. తత్త్వశాస్త్రచరిత్ర. ఇ. టి. వాల్యూము ౧. పుట. ౨౫.

కాకుండ తత్త్వశాస్త్ర చరిత్ర మానవమానసమునకు జ్ఞాన సాధనమై, ప్రమోదాకర్షణహేతువు కావలయునన్నచోఁ, జరిత్రకారుఁడు విమర్శకుఁడై, తత్త్వార్థనిర్ణయసమర్థుఁడై యుండవలెను. అతఁడు కేవలము "చింకిగుడ్డల నేరువాఁడైన" చో నిష్ప్రయోజనము.

## ౨. భిన్నతత్త్వసామ్య పరిశీలనము

ప్రాక్పశ్చిమఖండములలో విజ్ఞానసంస్కారముగలవారందరు నేఁడు పరస్పరభావముల నర్థముచేసుకొనవలెనని కోరుచున్నారు. భిన్నతత్త్వసామ్యపరిశీలనముకంటె దీని కధికలాభకర మార్గమింకొకటిలేదు. ఈ పరిశీలనమునందుఁ బ్రమాదములకుఁ దావున్నది; ఏలన నైరోపీయ పండితునికిని, భారతీయ తత్త్వార్థనిర్ణయకారునికినిగూడ భేదదృష్టికలుగుట కవకాశములున్నవి. "భారతీయ మతాన్వేషణమ"ను పేరఁ బ్రచురింపఁబడిన గ్రంథములు భారతదేశమున నివసించిన ఐరోపీయు క్రైస్తవమతప్రచారకులచే రచింపఁబడినవి. ఒకతరము పూర్వపు ప్రచారకులు రచించినవానికంటె నివి కొంతమెఱుఁగే. కాని, భారతీయవిజ్ఞానమునుగూర్చి వీరి కపోహలు లేవనుటకువీలులేదు;ఏలన భారతీయవిజ్ఞానమునకు మకుటాయమానమై ప్రకాశింపఁగలదే క్రైస్తవమతమని ప్రదర్శించునుద్దేశముతో నీ గ్రంథములను వారు రచించిరి. భారతీయవిజ్ఞానమును బరిశీలించిన కొందరు పశ్చిమఖండ పండితులు, మొదటినుండియు భారతీయు లాత్మవికాసమునఁ గుంటువడిరనియు, మతవిషయమునఁ గాని, తత్త్వశాస్త్రవిషయమునఁగాని — విజ్ఞాన

కళాసారస్వతములమాట చెప్పనక్కఱయేలేదు — ఉన్నత ప్రయోజనాంశములఁ గనిపెట్టుటకు వారికి సామర్థ్యములేక యుండిరనియు, నిశ్చయించియున్నారు. ఉత్కృష్టతత్త్వ సంస్కృతుల యాధిపత్యము శాశ్వతముగాఁ బశ్చిమదేశహస్తముల కరగతమై యున్నదను విషయమును వారు నిస్సంశయముగా నమ్ముదురు. ఐరోపీయనాగరికతయే పురాతనమైనదనియు, నుత్కృష్టతరమైనదనియు వారు నిర్ణయించి, భారతీయ విజ్ఞానమందు గోచరించు మహత్త్వరాశయములన్నియు క్రీస్తుశకానంతరదశకుఁజెందినవే యని ఋజువుచేయ యత్నింతురు. కొన్ని మహోత్కృష్టభావములు భారతీయులవని కొందరజ్ఞానులు తలఁచుచున్నారనియు, నవి నిజముగా గ్రీసుదేశములనుండి గ్రహింపఁబడినవనియు వారు చెప్పుచున్నారు. ఋగ్వేదమంత్రములు, నవిప్రకటించు నాగరికతయు బేబిలోనియా యీజిప్టుదేశముల సంస్కృతుల కంటె నర్వాచీనములని నిశ్చయించుటే వారి యుద్దేశము.

అసంస్కృతములు, అపరిణతములునైన ప్రాచీన భారతీయ భావములను, బరిణతగాంచిన పశ్చిమఖండ భావములతోఁ బోల్పయత్నించుటే యసమంజసమని పశ్చిమ పండితుఁడు నిరసించుచుండఁగా, మ్లేచ్ఛభావములతో నతిసనాతనములగు భారతీయ విజ్ఞానతత్త్వములను బోల్చుట తమ కవమాన హేతువని తలఁచు భారతీయ విమర్శకులును లేకపోలేదు. మతవిషయమందును ముఖ్యముగా వేదాంతవిషయమందును భారతదేశము పశ్చిమదేశముల కంటె నున్నత స్థానము నాక్రమించుననియు,

భారతీయ విజ్ఞానముతోఁ బోల్చినచోఁ బశ్చిమఖండ విజ్ఞానము సంస్కారశూన్యము నిస్సారము ననియు వీరు భావింతురు.

వ్యక్తులయభిరుచులనుబట్టి యీనిర్ణయముతో నేకీభవించుటో మానుటో జరుగుచుండును. పరస్పరగౌరవము, తత్సంభవమగు నాదరభావము లేకున్నచో నొండొరుల నర్థము చేసికొనుట కవకాశముండదు, మనము చరిత్రను సరిగాఁ జదివినచో నాంతరంగికజ్ఞానకాంతిప్రతిదేశమునకుఁ గలదనియు నాత్మజ్ఞాన సిద్ధికందరు సమాన భాగస్వాములే యనియుఁ దెలియఁగలదు. భిన్నతత్త్వ పరిశీలనమునందు, జ్ఞానమంతయుఁ దనదే యనియు, నితరులంధకారమగ్నులై యున్నారనియు నిశ్చయభావములుగల సంస్కృతిలేకమత సామ్రాజ్యవాది సరియగు మార్గదర్శికాఁజాలడు, నిష్పక్షపాతముగఁ దత్త్వ నిర్ణయము చేయఁదలచునాతఁడు, శాస్త్రీయ పరిశోధనపద్ధతి నవలంబించి, వివేకమును దానితోఁ గొంత యూహాశక్తిని సహేతుకముగా నుపయోగింపవలెను. ఆధునిక కవితాలక్షణముల ననుసరించి భారతీయ తత్త్వభావములఁ బరిశీలించి, నేటిసమస్యలకు వానిననుసంధించు నప్పుడు, తానుపయోగించు ప్రమాణములనట్టి వ్యక్తి సద్విమర్శతో నెన్నుకొనుటయందు శ్రద్ధాసహిష్ణుతలను జూపవలెను; ఏలనఁ నవి పూర్వప్రమాణములతో సమానములుగానే గోచరింపవచ్చునుగాని,నిజముగా భేదమును గలిగియుండవచ్చును. ప్రాచీన విజ్ఞానరీతులకు బదులుగా నవీన వాదపద్ధతుల నుపయోగించుటకు సిద్ధపడరాదు, ఇట్టి మహత్తరకృషిలో, రచయిత, ఒక భావమునింకొకటిగా నర్థము చేసి

కొనుట కవకాశమెల్లప్పుడు నుండును. ఈప్రమాదమన్నివిధ ములగు చరిత్రరచనలందు సామాన్యమే, ఇట్టి ప్రమాద వశ ముగాకుండఁగాపాడుకొను విధానమొక్క భిన్నతత్త్వ సామ్య పరిశీలన పద్ధతియే. అప్పుడు మనము ప్రతి సంప్రదాయము యొక్క ముఖ్య లక్షణములను గుర్తించి, దాని విలువను గ్రహింతుము.

### 3. ఉపనిషదుపదేశము

నేన్వ్రాసిన ఉపనిష దుపదేశ విషయములో నా భావ ముల కొక ముద్రవేసి, యొక పతాకము నెగురవేయలేదని కొందరు విమర్శకులు దిగ్భ్రాంతిచెందిరి. శంకరుని తత్త్వమునకుఁ జెందినదియు, డ్యూసేను పండితునిచే సమర్థింపఁబడినదియు నగు 'మాయా' సిద్ధాంతముపై నేఁజేసిన విమర్శ ననుసరించి, నేను శంకరాచార్యుని తత్త్వమునకు విరోధినని కొందరు తలఁచిరి. సగుణోపాసన విషయమున నేనుజూపిన యౌదాసీన్యమునుబట్టి రామానుజాభిప్రాయమునకును నేను వ్యతిరేకుఁడనే యని మఱి కొందరు నిశ్చయించిరి. శంకరునికాని రామానుజునికాని, మఱే యితర భాష్యకారునిఁగాని యనుసరింపని వ్యక్తి, తత్త్వవిరుద్ధ వాదియని భావింపఁబడుచున్నాఁడు. నేనుజేసిన ఉపనిషదుపదే శార్థ వివరణము హేతుదూరము గాదనియు, నేనొక సంప్ర దాయమునకుఁగాని, భావమునకుఁగాని నా వివరణముకొలఁది భేదముగలిగియుండిన నుండవచ్చుననియు మనవిచేయుచున్నాను.

ఉపజ్ఞగల యే తత్త్వవేత్త యొక్క మూలభావములైనను భాష్యకారులయొక్కయు శాఖాస్థాపకుల యొక్కయు వాదోప

వాదములలోఁ గప్పవడిపోవును. సోక్రటీసును ప్లేటో దృష్టితో డను, ప్లేటోను ఆరిస్టాటల్ లేక ప్లాటినస్ దృష్టితోడను మనము చూడఁ గోరుదుము. సుప్రసిద్ధ భాష్యకారులలో నేదోయొక భాష్యకారు ననుసరించి, ఉపనిషదర్థ నిర్ణయముచేయ యత్నించుచుందురు. ఏవిధముగా నుపనిషత్తులు భిన్నతత్త్వవ్యాప్తి కవకాశములు కలిగించినవో చూపి, ప్రధానాచార్యులగు శంకర రామానుజుల సిద్ధాంతముల కేకసూత్రతఘటింప నేనుయత్నించి యున్నాను. మన మేకైకమగు నొక దృక్పథమును గనుగొనఁ గల్గినచో, భిన్నతత్త్వార్థ వివరణములను మనము సమన్వయించి గ్రహింపవచ్చును. అట్టి యేకైక దృక్పథము లేకపోవచ్చును. కాని యట్టి దున్నచో నుపనిషదుపదేశము నధిక సౌలభ్యముతో మన మర్థముచేసికొన వీలగును. తత్త్వార్థ నిర్ణయమునం దున్నత సమన్వయ దృష్టియే అధికసత్యమైనదని చెప్పనొప్పును.

పరమార్థమును వర్ణించుటలో నుపనిషత్తులు భావద్వయము ను ప్రకటించినవి. ఒకపరి దానిని వ్యవహారప్రమాణముల కతీతమైన నిర్గుణ తత్త్వముగాను, వేఱొకపరి, దానినే మన ముపాసించి పూజింపవలయు సాకారుఁడైన యీశ్వరునిగను వర్ణించినవి. దీనిఫలితముగా జగత్స్వభావమునుగూర్చి మనకు రెండుభావములు లభించినవి. కొన్ని వాక్యములలోఁ బ్రపంచము నిర్గుణబ్రహ్మమునకు లీలాస్వరూప మనియుఁ గొన్ని యితర వాక్యములలో నీశ్వరుని స్వరూపమనియు వర్ణింపఁబడినది. శ్రద్ధాన్వితుఁడైన పాఠకుఁడీ భావద్వయము నుపనిషత్తులలోఁ బెక్కుతావుల దర్శించును. నిర్గుణబ్రహ్మముయొక్క వివర్తస్వ

రూపమే లోకమని యొక భావమును, పరమపురుషుని బాహ్య స్వరూపమే జగమని రెండవ భావమును గోచరించును.౧. మొదటిది శంకర సిద్ధాంతమునకును, రెండవది రామానుజ వాదమునకును సన్నిహితముగా నున్నవి. "మూలగ్రంథముల నిజతత్త్వము శంకరాద్వైతమా, రామానుజ విశిష్టాద్వైతమా యనునది నిశ్చయముగాఁ జెప్పుట సులభమైన పనికాదని"౨ నే నొప్పుకొనుచున్నాను.

రెండును బరస్పరవిరుద్ధములుగాఁ జూపట్టుచున్న వీనిని సమన్వయ మొనర్చుటకు, రెండు దృక్పథములను దీసికొనుటే సముచితమార్గము. బుద్ధ్యంతరువునుదాటి, సత్యస్వరూపమును మన మంతర్దృష్టితోఁ దిలకించినయెడల, నిర్గుణబ్రహ్మము తప్ప వేఱెద్దియును గోచరింపదు. ప్రపంచము నిర్గుణబ్రహ్మమే. రెంటి సంబంధమును గూర్చిన సమస్యయే లేదేలన రెండు నిర్గుణబ్రహ్మమే. మనము మనుజదృష్టినుండి నిర్గుణబ్రహ్మమును జూచినచో, మన బుద్ధికల్పిత ప్రమాణముల ననుసరించి, యది సర్వభేదయులను సమన్వయించు నొక పూర్ణవస్తువని చూపట్టును. నిర్గుణబ్రహ్మమే సాకారమూర్తియైన యీశ్వరుఁడై, తన దైవమాయచే జగత్తును రక్షించుచుండును. శంకరుఁడు చూపిన నిర్గుణబ్రహ్మరూపము, రామానుజుఁ డంగీకరించిన యీశ్వరరూపము నొకే పరమసత్యముయొక్క అతీంద్రియదృష్టికి, పరిమితమైన మానవబుద్ధికి గోచరించిన భిన్నరూపములని చెప్ప

౧. చూడు పుటలు: ౧౬౮, ౧౭౨-౧౭3, ౧౮౪-౮౬, ౨౦౨.
౨. పుటలు: ౨౫౮-౨౫౯.

వచ్చును.౩. ఈ ద్వివిధభావములు నుపనిషత్తులందు మిశ్రితములై యుండుటచేతనే శంకర రామానుజులు వారివారి భావములను సమర్థించుకొనఁగల్గిరి. మనము ముందుఁజూచు రీతిని దృక్పథ ద్వయోపకరణము నుపయోగించి శంకరుఁడీ రెండుభావములను జెప్పిన యుపనిషద్వాక్యములను సమన్వయింప యత్నించినాఁడు.

### ౪ బుద్ధునిదనఁబడు నాస్తికవాదము.

నేను జేసిన పూర్వబౌద్ధ వివరణమునందు, ఉపనిషదుపదేశమే యొక నూతనాశయోద్ఘాటనముకో",౧ బునఃప్రకటితమ"ని చూప యత్నించితిని, ఉపనిషద్వాక్యము లనెచటను స్పష్టమునా స్మరింపకున్నను, బుద్ధుని ఉపదేశమం దుపనిషద్విజ్ఞాన ప్రభావమున్నదని యంగీకరించియే యున్నారు. ౨. వేద ప్రమాణమందు౩ను, కర్మకలాపదీక్షయందు నుదాసీనతయుఁ, గర్మసూత్రమందును,బునర్జన్మమునందు౪ను విశ్వాసము, మోక్ష

---

౩.పుటలు: ౧౬౪,౧౭౨,౧౮౦-౧౮౧-౧౮౪-౧౮౫, ౨౫౮-౨౫౯.

౧. పుట ౩౬౧; చూడు పుట ౩౭౫

౨. అతిసనాతనవాదియగు కుమారిలుఁడువంటి తత్త్వవేత్తలుకూడఁ, ప్రపంచముమనఃకల్పితమను భావము, క్షణికవాదము, అనాత్మసిద్ధాంతము బౌద్ధులుపనిషత్తులనుండియే గ్రహించినారని చెప్పినాఁడు. "విజ్ఞానమాత్రక్షణభంగనైరాత్మ్యాదివాదానామ్ అపిఉపనిషత్ప్రభవత్వమ్." తంత్రవార్తికమ్. ౧. అ. ౩. ౨.

౩. ముండకోపనిషత్తు ౧అ. ౧. ౫.

౪. ,, ,, ౨.౭-౧౦.బృ.అ.ఉ.౧అ.౪.౧౫.

౫. ఛాం.ఉ.౫అ.౧౦-౭;కఠ ఉ.౫.౭;శ్వే.ఉ.౫అ.౧౧-౧౨.

ము లేక నిర్వాణసంపాదనావకాశముఁ జగజ్జీవాత్మల అనిత్యతా సిద్ధాంతమును౭, బుద్ధునకు నుపనిషత్తులకు సమానము లే. భూమి పైనున్న దేనికిని బరిపూర్ణ స్థితిలేదనియు, సాంసారిక జగత్తు ఆద్యంతములులేని పరివర్తన ప్రవాహమనియు బుద్ధుఁడుపనిషత్తు లభావముల నంగీకరించెను గాని, నిర్గుణ బ్రహ్మాస్తిత్వమును గాని, ఆత్మ, మోక్షభావములను గాని యాతఁడు నిశ్చయముగాఁ బ్రకటించి యుండలేదు. సిద్ధులైన వారి మరణానంతరావస్థయెట్టిదో, మరణానంతరము వారుందురో లేకుందురో, రెండునో, యేదియుఁగాదో ఆత్మయొక్కయుఁ బ్రపంచము యొక్కయు స్వభావమెట్టిదో, అవి నిత్యములో, అనిత్యములో, రెండునో, రెండునుగాదో, బుద్ధుఁ డేమియు మనకుఁ జెప్పలేదు. ఈప్రశ్నలాతఁడు గుప్త విషయములలోఁ జేర్చి, వానిని గూర్చి యూహించుటే నిషేధించినాఁడు. ఈసమస్యలను గూర్చి బుద్ధుఁడు పిడివాదములు చేయుట కిష్టపడని మాటనిజమే కాని, వీనిని గూర్చి యాతఁడు మౌనము వహించిన మూకీభావము యొక్క భావార్థములను నిర్ణయించుట మాత్రముల్లాసకరమైన విషయమే యగును. ప్రపంచపరివర్తనల కంటని పరమసత్య

౬. ఛాం.ఉ.౪అ.౧౫.౫-౬; బృ.అ.ఉ.౬ ౨.౧౫; శ్వే.ఉ.౧అ.౭.౮.౧౨

౭. పరివర్తనశీలమగు ప్రపంచము 'జగత్' శబ్దముచేఁ జెప్పఁబడెను. ఈ.ఉ ౧.బృ.ఆ.ఉ ౩అ.౧.౩. పోల్చు "సర్వమ్ మర్త్యోరనన్తమ్." బృ ఆ ఉ.౩.౨.౧౦.౧అ.౩.౨౮, కఠ. ఉ.౧అ.౧౨. నందు స్వర్గమనగా నాశి దప్పులు, దుఃఖము, జరామృతులు, లేనిదని చెప్పబడెను. మహోన్నతములైన యిహలోకసుఖములు వ్యర్థములను భావము కఠ.ఉ.౧అ.౨౬-౨౮ లోఁ జూపఁబడెను.

మొకటియున్నదా, పరివర్తనశీలమగు స్కంధములకువేఱై నిత్య లక్షణముగల యాత్మయున్నదా, నిర్వాణావస్థ పూర్ణభావస్థితి యగునా యను మూఁడు సమస్యలు తత్త్వశాస్త్రమునందలి మూలైక సమస్యయొక్క భిన్నరూపములే. వ్యవహారజగత్స్వరూపాత్మముల కతీతమైన పరమసత్య మొకటి యున్నచో నప్పుడు నిర్వాణమనఁగానట్టి పరమసత్యపదవిని జేరుటయగుచు, ముక్తాత్మయే నిత్యాత్మస్వరూపమగును. పరమసత్యమే లేనిచో, నిత్యమగు నాత్మయును లేదు, నిర్వాణమన శూన్యమగును. మొదటి భావముపనిషద్విజ్ఞాన సారమైయున్నది; రెండవది భౌతికశాస్త్ర మనుసరించునభావహేతువాదమునకుఁ జెందును.

బుద్ధుని వ్యక్తిగతభావము లేవియైనను, ముముక్షుజనులకు నిరుపయోగములు గావునఁ బరతత్త్వవిషయ సమస్యలు చర్చింపఁదగినవికావని యాతఁడు భావించెను. ఆతని సర్వతాత్త్వికవిచారణా త్యాగము, ప్రతి విజ్ఞానవేత్తకును, ప్రతి తత్త్వమునకును నామకరణముచేయుఁ గుతూహలముగల అభినవ తత్త్వశాస్త్ర చరిత్రకారునికిఁ గ్రోధోత్పాదనహేతువగు సంశయాంధకారమువలెఁ జూపట్టును. కాని బుద్ధుఁ డాతనికిఁ దన హృదయమును జూపఁడు. బుద్ధుఁడు వహించిన మౌనమాతని సంశయావస్థా సూచకమా? తనకుఁ దోఁచినదాని నాతఁడు లజ్జాన్వితుఁడై ప్రకటింపలేకపోయెనా? లేక తనభావములను మఱుగుపఱచి యుంచుటే లాభమని తలపోసి యూరకుండెనా? ఆతని మానసమును సంశయమేఘము లావరించినవా! లేక తాను మోసగింపఁబడుదు నను భయముచేఁ జకితుఁడై

యట్లూరకుండెనా? తన యుపదేశము భావాభావ రూపము లలో నెవరెట్లర్థముచేసికొనిన నట్లే మంచిదని తలఁచినాఁడా? మనకు మూఁడేమార్గము లున్నవి, పరమసత్య మున్నదని బుద్ధుఁ డంగీకరించెను; లేదా దానిస్వభావము నాతఁ డెఱుఁ గఁడు; లేదా దాని యస్తిత్వము నాతఁడంగీకరింపనేలేదు. అందుచే నాతని జ్ఞానము భావాత్మకమా, అభావమా, సంశ యాస్పదమా యను విషయమును మనము చర్చింపవచ్చును. ఈకార్యమును నెరవేర్చుటకు మన కారంభవిఘ్న మేమనఁగా, బుద్ధుని యుపదేశము లిఖితరూపమున నేదియు మనకు లేదు. పాళీప్రమాణ గ్రంథము బుద్ధుని మరణానంతరము చాలకాల మునకు బయల్వెడలినది. అందుచే నీ పాళీప్రమాణగ్రంథములో నెంతవరకు బుద్ధుని యుపదేశ మున్నది, తరువాతఁ గల్పింపఁ బడినదెంత యను విషయమును మనము నిశ్చయించుట సులభ ముకాదు. సనాతన భారతవర్షమున మహోపదేశకుల యుపదే శములు, ప్రసంగములు వారి శిష్యులచే వల్లింపఁబడి, అనుశ్రు తముగా ననంతర తరమువారి కందఁజేయఁబడినవి కాని, రచింప ఁబడలేదు. వేదములట్టివే. బుద్ధుని విషయము నట్టిదే. బుద్ధుఁ డతని జీవితకాలమందే, సన్యాసివర్గమును స్థాపించి, శిష్యపరం పరను గలిగియుండెను. వారే బుద్ధునుపదేశమునకుఁ బ్రతినిధు లైరి. బుద్ధుని వాక్యములే 'తు' 'చ' తప్పకుండ యథోక్తము లుగా మనకు లభించినవని చెప్పఁజాలముకాని, బుద్ధోపదేశము నందలి ప్రధానవిషయ మంతయుఁ జాలవరకు మనకు లభించి యున్నదని తలఁపవచ్చును. పూజ్యసత్య చతుష్టయము, అష్ట

విధమార్గము, మహాపరినిర్వాణసుత్తము, సుత్తనిపాతములలోని బుద్ధుని మహోపదేశముల ప్రమాణములను మనము శంకించితి మేని, యాజ్ఞవల్క్య శాండిల్యోద్దాలకాదుల మహోపదేశము లను మనము శంకింపవలసివచ్చును.౧. పూర్వ బౌద్ధమునకుఁ దమకుఁదోఁచిన యర్థమును గల్పించు నిమిత్తము, వారివారి యిచ్ఛానుసారముగా భావాభావ సంశయాత్మక వాక్యములు బుద్ధునివేయనియు మిగిలినవి బుద్ధుని యనుచరులచేఁ గల్పింపఁ బడినవనియు ఋజువుచేయుటకు యత్నములు చేయఁబడినవి. కాని బుద్ధుని మౌనమునుగూర్చి మనకుఁదోఁచిన భావములకు వ్యతిరేకముగా నున్న వాక్యములు బుద్ధునివిగావను నభిప్రాయముతో మనము పరిశీలన మారంభించుట శాఖాచంద్రమణమే యగును. ఏలన నేయాధారము లావాక్యములు బుద్ధానంతర కాలమునకుఁ జెందినవని తలంచుచున్నారో, యవి భిన్నదృక్పథములను జూపునవిమాత్రమేయైయున్నవి. బుద్ధునివే యని సామాన్యముగా నంగీకరింపఁబడిన గ్రంథముల నాధార

౧. రైస్ డేవిడ్సు ననుసరించి, నాలుగు బృహన్నికాయములును, ఇతివుత్తకము, సుత్తనికాయము మున్నగు నల్పనికాయములలో నధిక భాగములును క్రీ. పూ. ౪౦౦ సంవత్సరమునకుఁ జెందినవనియు, వినయము, మహావగ్గము, చుల్లవగ్గములో ౧-౧౦ ప్రకరణములును క్రీ.పూ. ౩౦౦ లకుఁ జెందినవనియుఁ జెప్పఁబడెను. సాంచి మున్నగు ప్రదేశములలోని స్తూపశాసనాదులం[illegible] ననుసరించి, క్రీ. పూ. [illegible] శతాబ్ది మధ్యకాలము నాటికి పిటకములని చెప్పఁబడు బౌద్ధగ్రంథములు స్థిరములై యున్నవనియు నవి పంచనికాయములుగా విభజింపఁబడినవనియుఁ దెలియుచున్నది.

ముగాఁజేసికొని, వానివలన నెట్టితత్త్వము సముచితమని నిర్ణయింపనగునో చూతము.

౫

బుద్ధునిమౌనమునకు శూన్యమే యర్థమనుభావము విశేషప్రాముఖ్యము గాంచినది. హిందూతత్త్వజ్ఞులు, పూర్వబౌద్ధులు నవీనభారతీయతత్త్వపరిశీలకులుకూడ నీభావమునే స్వీకరించిరి.౧ పశ్చిమఖండమున హెర్బర్టుస్పెన్సరు, ఆగస్టుకాంమ్టేల భౌతికతత్త్వవాదులభావములు ప్రజామానసములనుఱ్ఱూతలూగించినపుడు బౌద్ధగ్రంథపరిశీలనము నెడ నాదరము పెంపొందినది. బౌద్ధవిద్వాంసులు బుద్ధునిమౌనము నాస్తికవాదమును మఱుగుపఱచిన తెరవంటిదేయని, సహజముగా నిశ్చయించిరి. తన యనుచరులకస్మాత్తుగా సబ్బులగుదురోయని బుద్ధుఁడు తన మనోనిశ్చయమును బ్రకటింప సాహసింపలేదని వీరు తలఁచిరి. వీరివాదమునే మనమంగీకరించినయెడల బుద్ధునితత్త్వ మసంజసమగుటయేకాక, బుద్ధునిశీలమును నిరసింపవలసివచ్చును. ఈ భావమునకు వ్యతిరేకములైన బుద్ధునివాక్యము లెన్నోయున్నవి. వాని కీయర్థము పొసఁగదు. మఱియు శివకేశవుల దైవారాధనముద్ధృతముగా విజృంభించుచున్న దినములలో బుద్ధుఁడు నాస్తికవాదియేయైనచో నాతనిమతమునకుఁ గలిగిన విజయము

---

౧. పోల్సుమెక్డొనల్ పండితుఁడు; "తనయుపదేశముయొక్క లక్ష్యసిద్ధిఁగూర్చి బుద్ధుఁడే౦దేహమునకుఁ దావొసఁగలేదు. సర్వసంస్కారసర్వస్కంధనాశనము, శాశ్వతమరణము ఫలితము."

హిందూస్థాన్‌రివ్యూ ౧౯౨౩. పుట ౯౩.

నిరాధారమని చెప్పవలసివచ్చును. పూర్వబౌద్ధమత స్వీకృతి యొనర్చినవారందరు దైవభక్తులని చూపుట కనేకాధారము లున్నవి. మహాసుదర్శనము, చక్రవర్తిసింహనాదసుత్తాంతములు పూర్వబౌద్ధులమానసములను సూర్యభగవానుఁ డాక్రమించి నాఁడని తెలియును. పూర్వబౌద్ధమును స్వీకరించిన అగ్నిదేవతోపాసకులైన జటిలులు నాస్తికవాదముతోఁ దృప్తిఁ బొందుట కవకాశము లేదు. ౧. పరమసత్య మేదియు లేదనియు, నాత్మయు నసత్యమేయనియు, ధర్మానుష్ఠానజీవితమునకు ఫలితము నాశనమే యనియు బోధించినతత్త్వము, బుద్ధునియెడఁగాని, అతని యుపదేశము నెడఁగాని గౌరవోత్సాహముల ప్రజలలో నుదయింపఁజేయుట కవకాశము లేదు. ఇట్టిశుష్కతార్కికవాదము క్రీ. పూ. ౬వ శతాబ్దమునాటి భారతీయులహృదయముల నాకర్షించినదని తలఁచుట, మనస్తత్త్వధర్మముల నెఱుఁగనియజ్ఞానమేయగును. బెర్రిడేల్ కీత్ వంటి నిదానముగల పండితుఁడు సైతము బుద్ధుఁడు నాస్తికుఁడని నమ్మఁజాలననెను. బుద్ధుఁడు వ్యవహారరంగమునఁ జూపిన అజ్ఞతావాదమునకు నాస్తికార్థకల్పనముచేసిన పాళీప్రమాణగ్రంథములలోని వాక్యములు బుద్ధుని మూలోపదేశముగా స్వీకరింపనవసరము లేదని యాతఁడభిప్రాయపడెను. ౨.

౬

రెండవదైన అజ్ఞతావాదమేయొకనిశ్చయార్థమును జెప్పదు. కీత్ పండితుఁ డీవాదము నతికుతూహలముతో సమ

౧. మహావగ్గము, ౧ అ. ౧౫.    ౨. బుద్ధిస్టుఫిలాసఫీ పుట ౪౭

గ్రించినాఁడు. ఆతఁ డిట్లు చెప్పినాఁడు; "బుద్ధుఁడు చిత్తశుద్ధిగల అజ్ఞతావాదియని గ్రహించుట సమంజసము. ఆతఁడు తనకాలములోఁ బ్రచారములోనున్న వివిధతత్త్వములు భావముల నన్నిటిని బరిశీలించి, అభినవతత్త్వమును నేఁడుపరిశీలించి మన మెట్టిసంతృప్తిని గాంచనట్లే, బుద్ధుఁడు నెట్టి మనస్సంతృప్తినిఁ బొందక, పరమసత్యమునుగూర్చి యెట్టి హేతుసహితముకాని, నిర్హేతుకముకాని యగు నిశ్చయభావమును గలిగియుండకపోవచ్చును. బుద్ధునివాక్యము లేయని నిశ్చయముగాఁ జెప్పుట కవకాశముగల ప్రసంగములలో మనకుఁజూపట్టిన తత్త్వనిర్మాణసామర్థ్యలోపము ననుసరించి, యాతఁ డజ్ఞతావాదియే యని నిర్ణయింపవచ్చును." "ఈవిషయములలో నజ్ఞతావాదమునకు జ్ఞానపరిమాణపరిమితినంతను సహేతుకపరిశీలనముచేసి నిశ్చయమునకు రానవసరములేదు. ఈభావమునకు రెండే యాధారము లున్నవి. జీవాత్మ పరబ్రహ్మాదికవిషయముల సత్యమును గూర్చి బుద్ధునికే నిశ్చయభావమును లేకుండవచ్చును. కాని నిర్వాణప్రాప్తి కవసరమగు చిత్తనైర్మల్యము పైవిషయములను గూర్చి వాదోపవాదములు చేయుటవలన నిలువదని యాతఁడు నిశ్చయించియుండవచ్చును."౧.

ఈయజ్ఞతావాదము ననుసరించి, తనకుసమాధానముగా నిచ్చుటకే భావమునులేని కారణమునఁ దాత్త్వికప్రశ్నముల కాతఁడు బదులుచెప్పనిరాకరించెనని చెప్పుట బుద్ధదివంటి నిరుపమానప్రతిభాశాలి కన్యాయమొనర్చుటే యగును. బుద్ధునికి

౧. బుద్ధిస్టు ఫిలాసఫీ పుటలు ౬౩, ౩౫.

నిశ్చితసిద్ధాంతమేమియు లేకున్నచో, జీవితమునుగూర్చి యాతఁ డున్నతార్థములను విశాలభావములను బ్రకటింపఁగలిగి యుండకపోవును. జీవయాత్రలో నేబాటయును లేకుండ బుద్ధుఁడు సంచరించెనని నిర్ణయించుచో, నాతని తత్త్వము దురూహ్యము, నాతని సర్వమానవ కల్యాణకాంక్ష దుర్గ్రాహ్యమునగును. మానవప్రయత్నముయొక్క పరమలక్ష్య స్వభావమును గూర్చి యాతనికి సుస్పష్టభావములు లేకున్నచో, నిర్వాణ స్వరూప రహస్యమును గూర్చి యాతనికి జ్ఞానప్రకాశము గోచరింపని యెడల, మనము మనజీవితములను బరిపూర్ణములొనర్చు కొన్నచో నవ్యయానందప్రాప్తి యున్నదని యాతఁడెట్లు బోధింపఁగలిగి యుండెను? ఆతఁడు వహించిన "బుద్ధుఁడ"నగా జ్ఞాన సిద్ధుఁడను' నామమే, పరమార్థ విషయములఁగూర్చి యాతనికి సత్యములైనను నసత్యములైనను గొన్ని స్పష్టభావములున్నవని ఋజువుచేయుచున్నది. ధర్మమును సమగ్రముగా నాచరింపవలసి నదని శిష్యులకాతఁడు చేసిన మహోపదేశముల మఱుఁగున గోచరించు నాతని గంభీర నిశ్చయవ్యక్తిత్వమాతని సంశయాత్మునిగా నర్థముచేసికొనుట కాటంకమగుచున్నది." బుదిమంతుఁడు నాయొద్దకురావచ్చును; ఆతఁడు ఋజుమార్గగామియుఁ బరిశుద్ధచిత్తుఁడు కావలెను. ఆతనికి నేనుపదేశముచేసి అనుష్ఠాన పథము నిచ్చెదను; నేఁజెప్పినచొప్పున నాతఁ డాచరించినచో, గృహసౌఖ్యములవిడిచి, మోక్షమునార్జింప నానాదేశములు తిమ్మరి, విఫలులై, సంచరించువారివలెఁగాక—ఏడుదినములలో

దరించు నవకాశమున్నదని చెప్పుచున్నాను."౧. పరమార్థమును గూర్చి నిస్సంశయభావములులేనిచో నిట్లుపదేశించిన బుద్ధుఁడు వంచకుఁడైనఁ గావలయు లేక ఉన్మత్తుఁడైనఁ గావలయును.

మఱియుఁ, దనకుఁదెలిసిన సత్యములనన్నిటిని దానుజెప్పి యుండలేదని బుద్ధుఁడు పలికినవాక్యముల నీవాదము గ్రహించి యుండలేదు. పాసాదికసుత్తాంతమందు౨ ధర్మానుష్ఠానమునకవసర ముకాని యాధ్యాత్మిక సత్యములన్నియుఁ దనయొద్దనున్నను జెప్పఁదలచుకొనలేదని బుద్ధుఁడు వచించియున్నాఁడు. సంయుత్త నికాయము బుద్ధునుపదేశప్రసంగము నొకటి చెప్పుచున్నది. ఒకవృక్షముయొక్క గుప్పెడాకులు చేతఁబట్టుకొని తనయెదుట నాసీనులైయున్న సన్యాసులతోఁ, దనచేతనున్న పత్రముల సంఖ్యతోఁ బోల్చినచో నరణ్యములోని పత్రములసంఖ్య యెట్లు గణనాతీతమో, అదేవిధముగాఁ దా నుపదేశించిన సత్యముల సంఖ్యతోఁ బోల్చినఁ దనకుఁదెలిసియు నుపదేశింపని సత్యముల సంఖ్య గణనాతీతముగా నుండునని బుద్ధుఁడు చెప్పినాఁడు. బుద్ధుఁడు తాను నమ్మినదానికంటెను, దెలిసినదానికంటెను దక్కువగా నుపదేశించియుండగా, నాతనిశిష్యు లాతఁ డుపదే శించినదానికంటెఁ దక్కువగా నమ్మినారని తోఁచుచున్నది.

బుద్ధు నజ్ఞతావాదము హేతునిర్ణయముపై నాధారపడి నదికాదని కీత్ పండితు నభిప్రాయము. బుద్ధుఁడు దీనిని తార్కికముగా నిశ్చయించియుండకున్నను, పరమార్థసమస్య

౧. ఉదుంబరికాసీహనాద సుత్తాంతము. దిఘా. యస్. 3 అ. ౫౬.
౨. „ „ „ 3 అ. ౧౩౮.

లను, వ్యవహారప్రమాణ జ్ఞానముచేఁ బరిష్కరింపయత్నించుట కష్టసాధ్యమను భావము బుద్ధునికిఁబూర్వ తత్త్వవేత్తల కపరిచితవిషయముకాదు. ప్రపంచమునకాది యున్నదాయను విషయమునుగూర్చి బుద్ధుఁడు ప్రసంగించుట కిష్టపడకుండుటకుఁ గారణము రెండు సమాధానములలో నేదియు నాతనికి తృప్తికరముగా లేకుండి యుండవచ్చును. బుద్ధుఁడు తనకాలమునఁ బ్రచారమందున్న వివిధతత్త్వభావములను బరిశీలించియున్నచో నొకవిధముగా హేతుబద్ధమైయున్న ఉపనిషత్తుల అజ్ఞాతా సిద్ధాంత మాతనిదృష్టి నరికట్టియుండెడిది.

బుద్ధుని అజ్ఞాతాతత్త్వ ముపనిషత్తులలోవలె నుద్దేశపూర్వకమైనదికాక, పూర్ణమైనదైనచో, బుద్ధుని తత్త్వచింతా సామర్థ్యమున కది గౌరవప్రదముకాదు. ఏలన బుద్ధుని మౌనమున కిట్టర్థము చెప్పువారు బుద్ధుఁడు నిశ్చయలక్షణ శూన్యుఁడైన తత్త్వవేత్తయని నిర్ణయింపఁదలఁచిరి. ఇది కేవలము వ్యక్తిగతాభిప్రాయము. బ్రహ్మజాలసుత్తమునందు వర్ణింపఁబడిన అరువదిరెండును, పోట్టపాదసుత్తము[1] నందుఁ బది పద్ధతులు చెప్పి యవి మోక్షసాధనములు కావని నిరసించినవియును, తనకాలమునందలి మతానుష్ఠానములఁ గూర్చియు బుద్ధుఁడు ప్రదర్శించిన సమ్యగ్విమర్శా దృష్టినిబట్టి చూచినచో నాతఁడనల్పప్రతిభా సంపన్నుఁడనియు నుత్కృష్ట విమర్శకుఁడనియుఁ దెలియఁగలదు. అనేకతత్త్వసిద్ధాంతముల నాతఁడు విమర్శించిన పద్ధతి చూచినచో నాతఁడు తాత్త్వికవిచక్షణా సామర్థ్యము లేని

---

౧. డిఘా. యన్. ౧ అ. ౧౮౭.

సామాన్యుఁడనుట యుక్తియుక్తముగా లేదు. అది నిరాధార మైనట్టియు విచిత్రమైనట్టియు నజ్ఞానమగును గాని అజ్ఞతా వాదము కాఁజాలదు. పరమార్థవిషయమునుగూర్చి, యే బుద్ధిమంతుఁడును, ముఖ్యముగా బుద్ధుఁడువంటి శేముషీధురంధరుఁడు, నుత్తమధర్మకర్మ వీరుఁడును, నిశ్చయవిశ్వాసము లేక జీవింపఁజాలఁడు.

బుద్ధుని యుపదేశము నిస్సంశయముగా సంస్కారశూన్యమైన విజ్ఞానమునకుఁజెందిన దను విశ్వాసముగలవారి భావముల కనుగుణముగా నుండునని, యాతని తత్త్వ మజ్ఞతావాదమని యట్టి పండితులు సమర్థించుచున్నారు. బుద్ధుని యుపదేశమున కే యితరమగు నర్థములనైన వారు నిరసించుటకుఁ గారణ మవి విశేషహేతుసిద్ధములైయున్న కారణముచే సంస్కారశూన్యము లనుటకు వీలులేదు. బుద్ధుఁడు సంకుచితభావములు గల హేతువాది యనియు, మన స్తత్త్వజ్ఞాన హీనుఁడనియు, వ్యర్థతత్త్వవేత్తయనియు వర్ణించుటవలన నెవరికిని సంతృప్తికలుగకపోవుటే కాక, యిట్టి విమర్శకుల భావముల నంగీకరింపని వారికెట్టి మనఃక్లేశమును గలిగింపఁజాలవు. క్రీ. పూ. ఆరవ శతాబ్దమునకుఁ జెందిన భారతవర్షమునం దైనను, ప్రజాకోటి యొక్క మతదృష్టి నాకర్షించిన బుద్ధుఁడొక స్వప్నభావప్రచారకుఁడని యెవ్వఁడును నమ్మఁజాలఁడు.

౭

బుద్ధుఁడొక స్వప్నభావపూరితుఁడని కాని, వంచకుఁడని కాని మనము నమ్మకున్న చో, నాతఁడు ఋజువాదియు, నాత్మ

నిశ్చయదీక్షా పరతంత్రుఁడు ననియు, హేతురహితవాదములచే నాకర్షింపఁబడని దృష్టికలవాడనియు విశ్వసించవలెను. అప్పుడు శ్రద్ధగాఁ బరిశీలించువాని కాతని యుపదేశములో నాతఁడు పర ధ్యానముగా నున్నపు డనిన యొక్క వాక్యమో, ఒక్క భావమో, ఆతని జీవితమునకు మూలాధారభూతిమై, యాతని జ్ఞానసిద్ధికి రూపమైన సూచనల నొసఁగఁగలదు. అట్టి యాతని తత్త్వముయొక్క రూపము సుస్పష్టముగాఁ జెప్పకున్నను, విశ్వ విశాలమైనదై విలసిల్లును.

ప్రపంచము నిస్సారమనియు యనిత్యమనియు బుద్ధుఁ డుద్ఘాటించిన భావము లౌకికమంతయువ్యర్థమని చెప్పిన ఉప నిషద్భావమున కనుగుణముగానే యున్నది.౧. ప్రధానమైన ప్రశ్న యేమనఁగా, నుపనిషత్తులలోవలెఁ, బరమసత్యము నొక దానిని దర్శించినఫలితముగా నిహలోకజీవనము నిరర్థకమని బుద్ధుఁడు నిరసించెనా? యనునదియన్నది. సత్యమునుగాని దైవమునుగాని యొకఁడు నమ్ముటలేదని చెప్పినప్పు డాతఁడు పామరులునమ్ము సత్యదైవములనమ్మఁడని యర్థము. అపరిణీత భావములను బుద్ధుఁడు నిగసించుటవలన నాతనికిఁగల పరిణీత భావములతోఁ బోల్చిచూచియే యాతఁడట్లు చేసియుండును. నిజముగా బుద్ధుఁ డెచ్చట నెప్పుడు నుపనిషత్సత్యమైన నిర్గుణ బ్రహ్మవిషయమును నిరసించియుండలేదు. కథావత్తునందు భిన్నవివాదాంశములు చర్చింపఁబడినవి; కాని అవ్యయమైన

౧. "అధ్రువములైన వస్తువులందు ధ్రువమైనదిలేదని విశేషులు తెలిసికొందురు." కఠ. ఉప. ౪౧. ౨.

సత్పదార్థమునందు స్మరింపఁబడియుండలేదు. దీనివలన స్పష్ట మగునదేమన నుపనిషదుపదేశమును బుద్ధుఁడంగీకరించెను. శాలీపట్టణమునం దాతని సుప్రసిద్ధోపదేశము శాశ్వతరాజ్య మొకటున్నదని స్పష్టముగా సూచించుచున్నది. పరమార్థ మస్తియనికాని, నాస్తియనిగాని, రెండునుగాని, రెండునుగాదని కాని చేయఁబడిన వర్ణనములు బౌద్ధేతరగ్రంథములందట్టి సమానవాక్య ములను స్ఫురింపఁజేయుచున్నవి. బౌద్ధేతరగ్రంథములందిట్టి వాక్య ములు పరమార్థములేదని కాక, దానినిగూర్చిన లౌకికవర్ణన లసత్యములనియే చెప్పును. ౧.

అట్లైనచో బుద్ధుఁడు నిస్సంశయవాక్యములలోఁ బరమ సత్యాస్తిత్వము నేల ప్రకటింపలేదు? ఆతఁడట్లు వర్ణించుట కిష్టపడలేదు; ఏలన; నితరులవాదములు కేవలవ్యావహారిక ప్రమా ణములని యాతఁడు నిరసించి వానినే తాను నుపయోగించి వ్యవహారజగత్తునుండి పరమార్థజగత్తులో నడుగుపెట్టినవాఁ డగును. పరమార్థము వ్యావహారికదృష్టికి లభించునది కాదు; వ్యవహారప్రపంచ పరిమితులలో నెచటను బరమార్థము చూపట్టదు. దీని నుపనిషత్తులు నంగీకరించి, వ్యావహారిక జగత్సంబంధములైన ప్రమాణములను బరమార్థతత్త్వమున కుపయోగింపవలదని నిషేధించియున్నవి. ఉపనిద్ద్రిష్ట, బ్రహ్మస్వ రూపమును వర్ణింపుమని యడుగఁగా, మౌనము వహించెను. తిరిగి తిరిగి ప్రశ్నింపగా నట్లే మౌనము వహించి తుదకిట్లు

౧. ఆర్. వి. ౧౦. ౧౨౯. ౧–౨; బృ. ఉ. ౨అ. ౫. ౧౯; ౩అ. ౮. ౮ ఈ. ఉ. ౮, ౫, కఠ. ఉ. ౩అ. ౧౫; ముం. ఉ. ౧అ. ౧. ౬;

పలికెను. "శాంతోఽయమాత్మా."౨. "ఎచటికి నేత్రము వాక్కు-చేరలేదో, మనస్సు పోఁజాలదో, దానిని గూర్చి యెట్లు చెప్పవలెనో మేమెఱుగము."౧. "అది తెలియఁబడిన దేదియుఁ గాదు, అవిదితమున కతీతమైనది."౨. తఱచుగా నుపనిషత్తులు బ్రహ్మమును గూర్చి నేతివాక్యములలో వర్ణించినవి.3. నిర్గుణ బ్రహ్మము తెలియనిది, తెలియరానిది, అనాద్యంతమైనది, నిరాకారనిరాధార నిర్దేశమైనదను భావము జనసామాన్యమునకు దుర్గ్రాహ్యము, అందుచే మతకాంక్షాయత్తచిత్తుల సంతృప్తికై, పరబ్రహ్మ మనిర్వచనీయమైనను, సగుణాత్మక వర్ణనములొసఁగి యున్నవి. నిర్గుణబ్రహ్మ మనిర్వచనీయమను మహోగ్రతత్త్వమున కుపనిషత్తులు కట్టుబడకపోయినను, బుద్ధుఁడధిక ఋజుదృష్టి గలిగి, బ్రహ్మపదార్థమును గూర్చి యే వ్యావహారిక ప్రమాణమును బనికిరాదని నిశ్చయించెను. పరమాత్మ యనగా జగత్తు కాదు; దేహేంద్రియ మనోబుద్ధిభావములచేఁ గల్పితమైనదాత్మ కాదు; ఇహలోకజీవితము నిర్వాణముగాదని బుద్ధుఁడు చెప్పినాఁడు కాని, వానిస్వరూపమెట్టిదో యాతఁడు చెప్పలేదు;౪.

---

౨. ౨. ౧: శ్వే. ఉ. ౬అ ౧౧; మైత్రే. ఉ. ౪. ౧౭.
౨. శంకరభాష్యము. 3అ. ౨. ౧౭.

౧. కేన. ఉ. ౧అ 3; కఠ. ఉ. ౬అ ౧౨-౧3; ముం. ఉ. 3అ ౧. ౮.
౨. కేన. ఉ. ౧అ ౪.
(3) బృ. ఉ. ౨అ 3. ౬; 3అ ౮. ౮; 3అ ౯. ౨౬; ౪అ ౨-౪; కఠ. ఉ. 3అ ౧౫; ముం. ఉ. ౧అ ౬.
(౪) పోల్చు అగస్టైన్: "దేవుఁడేదికాదో తెలియవచ్చునుగాని, అతఁడేదో తెలియరాదు. ట్రినిటే ౭అ ౨.

ఏలన నవి తర్కప్రమాణములకు ఋజువుకానివి. వాని యాథార్థ్యము ముక్తపురుషుల అంతర్దృష్టికి గోచరించును. వారివాక్యములను ప్రమాణములుగా నితరులు గ్రహించి నమ్మవలసినదే, కాని యట్టిప్రమాణము నంగీకరించిననాఁడు, వేదప్రమాణమును, వైదిక దేవతల నంగీకరింపవలసివచ్చును. సత్యసిద్ధిలేని మానవహృదయ మానసములం దుదయించిన కల్పనముల నితరుల ప్రమాణము నాధారము చేసికొని నమ్ముమని బయలుదేరుచున్న యాహ్వానములకు బుద్ధునిప్రమాణ వాక్యములకు భేదమెవ్వఁడు పరిశీలించును? పరమార్థ విషయములనుగూర్చి నిశ్చయమైన సిద్ధాంత జ్ఞానమున కవకాశము లేదని యుపనిషత్తులు ప్రకటించియున్నవి; బుద్ధుఁడంగీకరించినాఁడు. మేము పరబ్రహ్మసాక్షాత్కారము నొందితిమని చెప్పువా రితరులపైఁ దమ భావములను జొప్పింప యత్నించు స్వార్థమతప్రచారకులు, బుద్ధుఁడు తన పూర్వుల నిర్హేతుక వాదములను నిరసించి, తానట్టి యింకొక వాదము నెట్లు స్థాపింపనోర్చును? మఱియు నట్టి యత్నమువలన వివాదములు పెంపొంది, ఆత్మజ్ఞాన వికాసవిఘాత హేతువులగును. బుద్ధుఁడు తనకుఁ దెలిసిన సత్యములను బ్రకటింపఁడు; మోక్షసాధనమున కివి నిరుపయోగములగుటయే కాక, వీనినిఁ గూర్చి ప్రజలలో భేదాభిప్రాయములున్నవి.౧. ఆతని కాలములో వ్యర్థవాద

౧. ఉదానము. పుట ౧౧; సంయుత్తనికాయము. ౪౩ ౪౩౭; దీఘనికాయము. ౧ ౧౭౯. నిర్గుణబ్రహ్మము భావాతీతమైనదని విశదపరచుటకు మౌనమువహించుట సుప్రసిద్ధమైనపద్ధతియే. నిర్గుణతత్త్వస్వరూపమును గూర్చి యడిగినప్పుడు విమలకీర్తి మౌనముద్రవహించెను; భోధిసత్త్వమంజుశ్రీ

ములు చేయునభిలాష దురంతమనోవ్యాధి రూపమును దాల్చి నది. బుద్ధుని దృష్టిలో హిందూతత్త్వజ్ఞులు, అగాధవిజ్ఞాన సమస్యలను గూర్చిచర్చించు వ్యాపారములోమగ్నులై జీవితసంగూఢావసరములను దృణీకరించు చున్నారనితోఁచినది. అందుచే బుద్ధుఁడతీంద్రియ జ్ఞానవిషయ వివాదములనుండి దృష్టిమరల్చి, సత్యసాక్షాత్కారమున కనుష్ఠానమార్గమైన మతధర్మములయెడ శ్రద్ధచూపుఁడని తన శిష్యులకుఁ బ్రబోధించెను. మనము మన వ్యక్తిగతాపభ్రంశలనుండి విడివడి, మన హృదయములందు సత్యము ప్రతిఫలించి, మన జీవితమును మార్పుచేయు నవకాశము గలిగించినచో సత్యము స్వస్వరూపావిష్కృతి నొందును. నిత్యజీవితానుష్ఠానములోనే పరమార్థము ప్రకాశింపఁగలదు. అది విద్వద్వివాదవిషయముకాదు; ముముక్షుజనైక శరణ్యము. సత్యాన్వేషణమందు మానవబుద్ధికిఁగల పరిమితత్వముచేత, బుద్ధుఁడు ప్రజలయొక్క తత్త్వజిజ్ఞాసాపిపాసను సంతృప్తి పరుప నవసరములేదని నిశ్చయించెనే కాని, తత్త్వజ్ఞానమును గూర్చి యాతనికి సునిశ్చితాభిప్రాయములు లేక కాదు.

తర్కసాధ్యమైన సరిహద్దులలో జగత్వ్యాపకమైన సూత్రమును గూర్చియది ధర్మమని వర్ణించినాఁడు. వేదకాలములో ధర్మభావమును గూర్చిన పూర్వచరిత్రమును బరిశీలించినచో 'ధర్మ' పదార్థము స్పష్టముకాఁగలదు. ఋగ్వేదమునందు భౌతిక

యిట్లాశ్చర్యమును సూచించెను. "మంచిపనిచేసినాఁడు! అద్వైతము నిజముగా వాగతీతము." విమలకీర్తి సూత్రము. పోల్చు. సుజుకి: మహాయాన బౌద్ధము. పుటలు ౧౦౬–౧౦౭

క్రియ నైతికక్రియామార్గములలో ఋతభావమునుగూర్చి చూచి యున్నాము. ఋతము దైవకల్పితముకాదు; దైవమే; దేవతల కతీతమైనది; దేవతలు దానికి రక్షకులని చెప్పఁబడెను. మానవ జీవితభిన్నరంగములలో ననఁగా విధి నిషేధాచారనీతిరంగము లలో నన్ని సమస్యలకుఁ బరిష్కారరూపమును, జగత్క్రమ రూపమునైనదే ధర్మము. బృహదారణ్యకోపనిషత్తునందు భగ వంతుఁడు క్షత్రియవైశ్యశూద్రజాతులను సృజించి "వీని కంటె శ్రేష్ఠతరమైన ధర్మసూత్రమును" సృజించెనని చెప్పబడినది, నిజముగా ధర్మముకంటె నతిశయమైన దేదియును లేదు; 'ధర్మాత్ పరమ్ నాస్తి!...ఏది ధర్మమో అదియే సత్యము....నిజముగా ధర్మము సత్యము నొకటే"౧. వేదప్రోక్తమైన ఋతమే ధర్మము సత్యమునై యున్నది.౨. తైత్తిరీయోపనిషత్తునందు, సర్వజ్ఞుడు దన యాత్మరూపముగా జూచుముక్తాత్ముఁడిట్లు గానముచేయును. "నేను ప్రథమఁజుడను; ఋతమును; దేవతలకుఁబూర్వుఁడను; అమృతనాభిని."౩. అట్లే కఠోపనిషత్తునం దొక ఋగ్వేద

౧. ౪. ౧౬. చూడు. బృ.ఉ. ౫. ౧౫. ౧; ఈ. ఉ. ౧౫; "సత్యముఖము హేమపాత్రిచేఁ గప్పఁబడెను; ఓపూషన్ ! నీవు దానినిఁ దొలగింపుము; ఏలన నాతనిధర్మమే సత్యమని చూడవలెను." చూడు. ఆర్. వి. ౪. ౫. ౫; ౭. ౧౦౪. ౮; ౯; ౧౧౩. ౪; ౧౦ ౧౯౦. ౧.

౨. ఋతమునకు వ్యతిరేకము అనృతమనగా నసత్యము నధర్మమును.

౩. అహామస్మిప్రథమజాఋతాస్య పూర్వం దేవేభ్యోనాభాయి.

మంత్రములోమార్పు లేకుండఁ బునరుక్తమైనది. ఇందు ఋతము పరమేశ్వరుఁడేయని చెప్పఁబడినది ౫. పరబ్రహ్మము ఋతము సత్యమునై యున్నది. ౬. ధర్మము ఋతము సత్యమేయనుభావము ఋగ్వేదకాలమునకును నుపనిషత్కాలమునకునుగూడఁ జెందినదే. తత్త్వజిజ్ఞాసువునకైకైక సత్యముగా, గోచరించి, జ్ఞానశుద్ధుల వలన బ్రహ్మసాక్షాత్కారము లభించును. ఇదియే ఉపనిషత్తులుద్ఘాటించుభావము. మతాభిమానులకు నిర్గుణబ్రహ్మము నిత్యప్రేమ నిలయముగాఁ దోఁచును. తత్సాధనమార్గము ప్రీతి, భక్తి చూపుటే, ఈభావమును గొన్ని యర్వాచీనోపనిషత్తులు, భగవద్గీతా, పురాణములును బ్రదర్శించినవి. ధర్మానుష్ఠాన తత్పరులగువారు, పరబ్రహ్మము శాశ్వత ధర్మరూపమని భావించి, సేవాత్యాగముల వలన దానిని సాధింపఁగోరుదురు. భిన్నమనః ప్రవృత్తులుగల మానవులకుఁ బరబ్రహ్మమొకటేయైనను భిన్న రూపములలో ననగా జ్ఞానజ్యోతిగాఁ బ్రేమనిధిగా, జీవిత జీవనముగాఁ దోఁచుచుండును.

---

౪. ౪అ ౪౦. ౫; చూడు వాజసనేయిసంహిత. ౧౦; ౨౪; ౧౨. ౧౪. తైత్తిరీయసంహిత. ౩. ౨. ౧౦. ౧; శత. బ్రా. ౬అ ౭, ౩. ౧౧; తై. ఆరణ్యకము. ౬. ౧. ౫. ౬; రంగరామానుజుఁడు. భాష్యము వ్రాయుచు కఠ. ఉ. ౫. ౨. నందు ఋతమనగా అపరిచ్ఛిన్నరూపబ్రహ్మణ్యక అని చెప్పినాఁడు.

౫. వేదాంతసూత్రములు ౨; తైత్తిరీయము ౩అ ౧౦; కఠము ౫. ౨; శై శంకరభాష్యమునుచూడుము.

౬. ఋతమ్ సత్యమ్ పరబ్రహ్మ. తైత్తిరీయారణ్యకమ్. ౬అ ౧౩. ౨౭. ౧౨.

బుద్ధునిదృష్టి ప్రధానముగా ధర్మదృష్టి; అందుచే సహజముగాఁ బరబ్రహ్మముయొక్క ధర్మరూపమాత్రని నెక్కువగా నాకర్షించినది. ఉపనిషత్తులు పరబ్రహ్మకిచ్చిన స్థానమును బుద్ధుఁడు ధర్మమున కిచ్చినాఁడు.౧. సర్వవస్తువులును ధర్మాధీనములై యున్నవి. అగన్న సుత్తాంతమునందు, జగత్పరిణామమును, నందలి జీవాంతరభేదములును ధర్మమాత్రములై యున్నవని చెప్పఁబడినది.౨. బ్రహ్మచక్రము ధమ్మచక్కమగు. బ్రహ్మపదము ధమ్మపదమగును.3. అష్టాంగ మార్గమనాలోచితముగా బ్రహ్మయాన మనియు ధర్మయానమనియుఁ జెప్పఁబడెను. తథాగతుని దేహము బ్రహ్మము లేక ధర్మమని చెప్పఁబడెను.

౧. పోల్చు. రవీంద్రనాథటాగూరు: "ఈధర్మము, నుపనిషద్బ్రహ్మమునోకటే; బౌద్ధమతముచెప్పుధర్మము— శాంతి, సత్, ప్రేమరూపములుగల శాశ్వత సత్యము; మానవుఁడు దీనియుత్కృష్ట సమర్పణమునగాఁ దన జీవితార్పణమును జేయవచ్చును. ఈధర్మముమానవునియందు మానవాతీతమైన త్యాగమునుద యింపఁజేసి, యిట్టి అహంకారనాశనమువలన మనమీ లోకమునఁనెఱిఁగి యున్న దేనికిని బోల్చుటకువీలులేని ఉత్తమస్థితినీయఁగలదు: ఐనను దానినిగూర్చి, ఆత్మనాశనమార్గముననఁగాక అనంతప్రేమమున నొకింత యస్పష్టరూపమునైనను మనము తెలిసికొనవచ్చును. ఈవిధముగా నిస్తులమైన ప్రేమాంబునిధి విజ్ఞానమున జీవించుటయే బ్రహ్మవిహారమని బుద్ధుడు చెప్పినాఁడు. విశ్వభారతి. త్రైమాసికపత్రిక. ౧౯౨౮. పుటలు 3౮౫-3౮౬.

౨. దీఘనికాయము. 3౯ ౮౦.

3. సంయుక్తనికాయము. ౧.౧౮౧; ౫.౫; థేరగాథ. ౬౮౯.

ఆతఁడు బ్రహ్మైక్యములేక ధర్మైక్యము పొందెనని చెప్పుదురు.౮. ధర్మమును మన ముపాసించి పూజించవలెనని చెప్పు వాక్య- వాక్యములు పాళీప్రమాణ గ్రంథములలో నున్నవి.౯. మిళింద మునందు ధర్మము ధర్మదేవతామూర్తిగాఁ జెప్పఁబడెను.౧౦. ధర్మమే పరమసత్యము; జగద్వస్తుసమూహము లన్నియు నానావిధ కైక ధర్మరూపములు గావున ధర్మములనఁబడెను.

శరీరరూపము, దర్శనములు, అనుభవములు, మనో వృత్తులు, బుద్ధియు నసద్రూపములు గావున వానికాత్మలక్షణ

౮. బుద్ధుఁడు నిర్వాణముపొందినప్పుడు, 'ధర్మధాతు స్వభావాత్మ స్థితి' నందె, నని చెప్పిరి.

౯. సంయుక్తనికాయము. ౨౪ ౧౩౮; అంగుత్తరనికాయము. ౨౪ ౨౦

౧౦. పోల్చు. శతపథబ్రా. ౧౪ ౪.౩.౧౮; పోల్చుసోనీన్: "బౌద్ధులు ఈశ్వరుని [illegible] న్యాయాధ్యక్షునిగాని, సృష్టికర్తనుగాని యంగీకరింపకున్నను, వారు సర్వా ధారమై నిర్దుష్టమైనధర్మము నంగీకరింతురు. అదియొట్లప్రయత్నముగా నడచి నను నత్యద్భుతమైన వివేకవైశాల్యములుగలది ... నా యభిప్రాయములో బౌద్ధులు నాస్తికులనుట ద్రోహము. బౌద్ధులు దైవానేకరూపములలో నొకటైన ధర్మము నారాధించినారు." (బుద్ధుని ధర్మమార్గగ్రంథములలో సుదాహృతము. పుట. ౧౩.) సాండర్సు చెప్పినాఁడు: "ధర్మమునందు, నద్వితీయము, నగ్రాహ్యమునైన సత్యమునందు, బుద్ధుని పరిశుద్ధవిశ్వాస మాస్తికతయని చెప్పవచ్చును. తనదేశప్రజలయొక్కయు నార్యజాతి జ్ఞాన ప్రతిభయొక్కయుఁ బూర్ణజ్ఞానమాతనియున్న కాలమున, ధర్మ సూత్రముల కాధారభూతములైన తత్త్వవిచారములను వారేనిర్మింపఁగాఁ గలరని బుద్ధుఁడు విడిచిపెట్టినాఁడు." కర్మ ధర్మసూత్రములను గూర్చి, ధర్మాస్తికతను బుద్ధుడు నూతనమును పూర్వమునైన జ్ఞానమును ప్రదర్శించి నాఁడని సాండర్సు నభిప్రాయమై యున్నది. (బౌద్ధచరిత్రలోకమునం పుట. 3.)

ణము లేదని బుద్ధుఁడు చెప్పినాఁడు.౨. జీవాత్మయొక్క పరివర్తనశీలమున కుపమానములుగ నగ్నియు, జలచలనమునీయఁబడెను. పరివర్తనాత్మకములగు స్కంధములకు వేరుగా నాత్మయనునది లేదని వారణాసీ నగరోపదేశమునఁ గానరాదు. వచ్ఛగొట్టుని తోడి ప్రసంగమందు ఆత్మయొక్క సద్భావమసత్యమని చెప్పుటకు బుద్ధుఁడొప్పుకొనలేదు, బుద్ధునికనేక శతాబ్దముల యనంతరము విరచితమైన లంకావతారగ్రంథము, తనశ్రోతలను గనుమూయుటకై 'ఆత్మ' సిద్ధాంతమంగీకరించెనని చెప్పినది. అనేకములైన యితరోక్తులచే సమర్థించుటకు వీలుండఁగా బుద్ధుఁడు డాత్కాలిక వాదప్రయోజనములకై తననిశ్చయప్రమాణముల విడనాడెనని చెప్పవలసిన యవసరము లేదు. ముక్తపురుషుఁడు తన దేహమును వీడులోపున నిర్వాణము సహజముగా లభించునని వాదించి, పునర్జన్మరాహిత్య జ్ఞానముతోఁ గూడిన శ్రేష్ఠతమమైన యానందావస్థయే నిర్వాణమని బుద్ధుఁడు చెప్పుట వలన నాతఁడాత్మ సత్యమని యంగీకరించినట్లే యైనది. ముక్తపురుషుని లక్షణము ప్రకృత్యతీతమైనదని యాతఁడు ప్రకటించినపుడును, నాతఁడుపదేశించినది వస్తునాశనమని నేరమారోపింపగా నతఁడు ప్రతిఘటించినపుడును, బంచస్కంధనాశనముతో నాత్మనశించునది కాదని యాతడంగీకరించినట్లే యగును. ధమ్మపదమునందాత్మస్వయంప్రభువనియు, సదసత్కర్మసాక్షియనియుఁ

౨. చూడుము మహావగ్గము, ౧అ. ౬.౩౮; మజ్ఝిమనికాయము. ౩౯; మహానిదానసుత్తము; దీఘనికాయము. ౨అ.౬౬.

౧. అలగద్దూపమసుత్తము; మజ్ఝిమనికాయము. ౧అ. ౧౪౦.

జెప్పఁబడినది.౨. సాంఖ్యమునందు నద్వైత వేదాంతమునందు నుపనిషత్తులకు బౌద్ధమతమున కనుగుణముగా ననాత్మసంబంధ ములైన లక్షణములన్నియు నాత్మనుండి వేరు చేయఁబడినవి.

కాని వ్యవహార ప్రమాణములచే నాత్మాస్తిత్వమును బుద్ధుఁడు స్థాపింపనిష్టపడలేదు. అందుచే నిత్యతాలక్షణముగల యాత్మ,స్కంధములతో నొక్కటా వేరాయను ప్రశ్నముల కాతఁడు సమాధానముల నొసఁగుట కిచ్ఛగింపలేదు.౩. ఆతఁడు నిరసించినది నిత్యమైన యాత్మకాదు; దానిని గూర్చిన తత్త్వావలోకనములనే. ఆత్మస్వభావమును గూర్చిన మిథ్యాభావములను జర్చించి యాతఁడిట్లువ్రాసెను; "ఓ శ్రమణులారా! ఇది కేవలమభిప్రాయములలో సంచారము; భావములు కల్పించుకొని సంతోషించుటే; వ్యర్థములైన యూహలను బ్రకటించుటే, శుష్కభావవిలాసము మాత్రమే."౪. బుద్ధుని ప్రథమ శిష్య వర్గములో నొకశాఖవారు 'ఆత్మనిత్యత' యందు విశ్వాసము గలవారున్నారు. వీరే సమ్మతీయులు, వజ్జిపుత్త్రకులనని కథావత్థు చెప్పుచున్నది. సంయుత్తనికాయమునందు భారవాహక సూత్ర మున్నది.౧. బౌద్ధభాష్యకారులగు బుద్ధఘోషుఁడు వసుబంధువు చంద్రకీర్తి యశోమిత్రుడు మున్నగువారు శూన్యవాదుల గుటచే, వారు తమ కనుకూలముగా దీనికర్థము చెప్పిరి. కాని

౨. ౩, ౧౬౦.

౩. మజ్ఝిమనికాయము, ౧౪, ౨౬౬.

౪. శీలాచారము: బౌద్ధసంభాషణములు. వాల్యూము ౧. పుట ౬.

౧. ౩౪. ౨౫.

పరివర్తనాత్మకములగు స్కంధములే భావములు, భారవాహకులు గూడనని తలఁచుట యుక్తముగాలేదు.

నిర్వాణమనగా 'శుద్ధ శూన్యత' యనుట సముచితము కాదని నేఁడందరంగీకరించి యున్నారు. నిర్వాణశబ్దమునకు నాశనమనియర్థము; నాశనమగునది. "కామము, దుఃఖము. పునర్జన్మము". ౨. చిత్తవికారములనుత్పత్తి తృష్ణను బూర్తిగా నిర్మూలించుట వలన వెంటనే నిర్వాణము లభించుననియు, నది యనిర్వచనీయమగు నవస్థయనియుఁ బూర్వబౌద్ధులభావమైయున్నది. ౫. అది సంసారము నశించిన అపరిమేయ శాంతినిలయమైన సత్యపదవి.

ఆపస్నకసుత్తమందు నిర్వాణ వర్ణనముపనిషత్తులలో వర్ణింపబడిన మోక్షభావమును సూచించును. "ఇతరులను బాధించక, తానుబాధపడక తనజీవితకాలమునందే భుక్త్యవసరము తొలఁగిపోయి, ప్రసన్నహృదయుఁడై, బ్రహ్మైక్యము చెంది, యాత్మలో సుఖమందును." ౬. థేరథేరీగాథామనోజ్ఞ

---

౨ మహావగ్గము; ౬అ. ౩౧,౭; ఎస్. బి.ఇ. వాల్యూ.౧౩.

3 బ్రహ్మజాలసుత్తము: దీఘనికాయము. ౧ అ.

౪ నందిసంయోజనో లోకో వితక్కస్సవిచారణా
తణ్హాయవిప్పహానేన నిబ్బానమితిఉచ్యతే, (సుత్తనిపాతము. ౧౧౦౯ ౧౦౯౭)

౫ మజ్ఝిమనికాయము ౧౩౯ పోల్చు. కీత్. "నిర్వాణము సత్యమని ప్రమాణగ్రంథముల భావముల సారాంశముగాఁ దోచును"

(బౌద్ధతత్త్వము పు ౯౩)

౬ అనత్తంతపో అపరంతపో దిత్తేవ. ధమ్మే నిచ్ఛాతో నిబ్బుతో సీతిభూతో సుఖపటిసంవేది బ్రహ్మభూతేన అత్తనావిహారతి.

మజ్ఝిమనికాయము ౧౫ ౪౧౨

గీతములందు, నిర్వాణసుఖమనగా మోక్షానందము సుమచిర ముగా వర్ణింపఁబడినది.

తర్కజ్ఞానమున కలభ్యమైన కారణముచే నిర్వాణమును మనము తృప్తికరముగా వర్ణింపఁజాలము. ముక్తపురుషులుదాని యనంతగుణమహత్త్వము ననుభవించినను, బుద్ధిశక్తి కది శూన్య ముగానే తోఁచును. సాంసారిక కర్మసూత్రబద్ధమైన వ్యవహార ప్రపంచమదృశ్యమగుటయే నిర్వాణము. "ఓయతులారా! అది భూజలసంబంధముకాదు; అనంతాకాశ విజ్ఞానసంబంధమును గాదు; శూన్యమునుగాదు; దర్శనమునుగాదు; ఇహలోకమును గాదు; పరలోకమునుగాదు; సూర్యుఁడునుగాదు; చంద్రుఁడును గాదు." "అచట మృతికాని పుట్టుకకాని లేదు; ఇహపరము లచటలేవు; మధ్యమలోకమును లేదు; అది దుఃఖనాశనము." ౧ "అది శూన్యముకాదు, అదిజన్మముః లేనిది; ఆదిలేనిది; అకృతము అమిశ్రితము; అట్టిదేలేనిచో జన్మమునుండియు, సంసారమునుం డియు కృతమిశ్రితములనుండియు విముక్తియే లేదు." ౨. ఈవిధ ముగా నిర్వాణమనఁగా సజమునసంతము, 3 నశ్వరప్రపంచవిరోధ మైన నిత్యతాలక్షణముగల యేకైకస్థితియునను నర్థమునకుఁ బ్రమాణాధారమున్నది. ౪. నిర్వాణముఃపొందిన ముక్తపురుషులస్థితిని

౧. ఉదానము ౮అ ౧ ౨అ ౧౦; ఇతివుత్తకము.

౨. ఉదానము ౮అ 3 ౧౦; పోల్చు ఛాందో. ఉ. ౮అ ౧3. ౧. నందు మర్త్యులుపోవు బ్రహ్మలోకము 'అకృతమ్' అనియున్నది. మోక్షస్థితి 'అకృతః' యని యున్నది. ముండ ఉ. ౧అ ౨. ౧౨.

3. మిళిందము పుట ౨౭౧.

౪. చూడు-సైకలాజికల్ ఎథిక్సు. పుట 3౬౭.

గూర్చి ఉదానము ప్రసంగించి, ఆరిపోయిన అగ్నిజ్వాలామార్గ మలభ్యమైనట్లే, పూర్ణ సిద్ధాత్ములగు ముక్తపురుషులు పోయిన మార్గమదృష్టమని చెప్పినది. ఇంధనమంతయుఁగాలిపోయిన పరిశుద్ధజ్వాలవంటిది పరమాత్మయని ఉపనిషత్తులుఁగ వర్ణించినవి. ఇంధననాశముతో నగ్ని, కంటికిఁగనఁబడకున్నను, నశించదు. ౨. స్వర్గమోక్షముల కుపనిషత్తులు భేదముచెప్పనుగాన, బుద్ధుఁడు నట్లే నిర్వాణమనగా స్వర్గసుఖముకాదనియు, నరూపలోకమందానందమయ జీవితకాంక్షపూర్ణనిర్వాణమున కాటంకమనియు వివరించెను.

నిర్వాణమనగాశూన్యముకాదని బుద్ధుఁడంగీకరించినట్లు స్పష్టము. నిర్వాణమనఁగా 'శూన్యరాత్రి' యను యమకుని భావము మతద్రోహమని సారిపుత్రుఁడు ఖండించెను. 3. కోసలాధిపతియగు పసేనాదికిని, ఖేమానామధారిణియగు సన్యాసినికిని జరిగిన మనోజ్ఞసంభాషణమునందు, నిర్వాణమనగా ననిర్వాచ్యానందమనియు, నది వ్యవహారప్రమాణ వర్ణనముల కతీతమనియుఁ జెప్పఁబడినది. గంగాతీరమునందలి యిసుకరేణువులను,

---

౧. శ్వేతా. ఉ. ౨. పోల్పు కీత్: "నిప్పారిపోవుట యనగా నాశనమగుట యని మన యర్థము భారతీయుల భావముకాదు. నిప్పులేనప్పుడగోచరమై యే శుద్ధరూపమున నగ్ని యున్నదో, దీప మారిపోయినపుడది యట్టి పూర్వావ్యక్తరూపమును బొందునని వారియభిప్రాయ మనుటలో సంశయములేదు.

(బౌద్ధతత్త్వము. పుటలు ౬౫-౬౬)

3. సంయుక్తనికాయము. 3౹౹ ౧౦౯.

సముద్రమునందలి జలబిందువులను లెక్కపెట్టలేనట్లే, తథాగతుని జ్ఞానముయొక్క లోతునెవఁడును గ్రహింపఁజాలఁడు.౪. నిర్వాణస్వరూపమును గూర్చిన సర్వప్రశ్నలకు సమాధానమిచ్చుటకు బుద్ధుఁడంగీకరింపలేదు;ఏలన,నీప్రశ్నలు ధర్మదీక్షాభివృద్ధికాటంకములు;౫.మఱియు నిర్వాణమనను వేద్యము, "ఏది యనిర్వచనీయమో, దానినిగూర్చి మౌనమే శరణ్యము."౬.

౮—

భౌతిక శాస్త్రీయమనస్తత్వము గలవారు,బుద్ధుని యుపదేశము అభావాత్మకమైన తార్కికవాదమని చెప్పుదురు. తత్త్వనిర్వాణవిషయములలో నభినవప్రయత్నముల వ్యర్థతను గుర్తించిన వారాతని సిద్ధాంత మజ్ఞతావాదమను చున్నారు; వీరి వాదమున కననుకూలములైన వాక్యముల కర్థము చెప్పవలసి

---

౪. ,, ౪౯ ౩౭౪; మజ్ఝిమనికాయము ౧౯ ౪౮౨.

౫. ,, ౨౯ ౨౨౩; ,, ,, ౬౩.

౬. పోల్చు. అరవిందఘోషు: "నిర్వాణలక్ష్యము వేదాంతమందలి ఆత్మానుభవముయొక్క అత్యుత్తమస్థితిని గూర్చిన వ్యతిరేకవర్ణనము."

(ఆర్య. ౬, పు. ౧౦౧.)

ఫ్రీడ్రిక్ హీలరు ననుసరించి, "నిర్వాణము, వ్యతిరేకభావముగా గోచరించినను, శూన్యార్థకల్పితమైనను, సర్వప్రపంచములోని సర్వమతస్థుల హృదయములు నిశ్చయముగాఁగోరు శాశ్వతమోక్షమనియే చెప్పవచ్చును" (నవ్య పాళీ-ఆంగ్లకోశమున నుదాహృతము) అర్వాచీన బౌద్ధశాఖలు నిర్వాణమనగా సర్వాత్ముఁడైన బుద్ధునితో నైక్యమగుటలేక, మానవహృదయమందు బుద్ధత్వ మావిష్కృతి మగుటయని భావించినవి. స్వభావశూన్యతయే నిర్వాణమని యర్థముచెప్పిన యితరులకైతె, యీభావము బుద్ధుని యుపదేశమునకు సన్నిహితముగా నున్నదని చెప్పవచ్చును.

వచ్చినపుడవి బుద్ధుని యనుచరులచేఁ గల్పితములని వచించి యున్నారు. పాలీప్రమాణ గ్రంథముల ననుసరించి ఆత్మ, పరమాత్మ, నిర్వాణముల కాస్తికభావార్థముల నీయవచ్చునని కీత్ పండితుఁడు చెప్పియు, నివి బుద్ధుని భావములనుటకు సాహసము లేక, బుద్ధుని 'పూర్వశిష్యులలో నొకవర్గమువారి భావములని' నిర్ణయించెను.౧. ఆధ్యాత్మిక సమస్యలను గూర్చి, బుద్ధుని మౌనమునకు భిన్నవ్యక్తులు చెప్పిన యర్థములు వారి విశ్వాస వ్యాపారములే.౨. నిష్పాక్షిక చిత్తుఁడైన చరిత్రకారుఁడు తన వాదములలో సత్యప్రియత్వమును జూపు టేకాక, తన యభి

---

౧. బౌద్ధతత్త్వము పుటలు ౬౩-౬౪.

౨. పూర్వయుగములకుఁ జెందిన తత్త్వశాస్త్రభావముల నిర్ణయించుటలో మన కాధారములై యున్న "అసంపూర్ణములు, అప్రత్యక్షములు, లేక సంశయాస్పదములునైన" లిఖితపూర్వక వాక్యముల సిద్ధాంతములవిషయములో వ్యక్తిగత విశ్వాసమున కెట్టిస్థాన మున్నదను సందర్భమునుగూర్చి, బర్నెట్ పండితుఁడు చెప్పినాఁడు. "మానవుఁడు తన జీవితమును, ప్రాచీన తత్త్వవేత్తల నర్థముచేసికొనుటకై యభిమానపూర్వకమైన కృషిలోనున్నచో నొకొక్కప్పుడు స్ఫుటమైన యొక నిశ్చయ మాతని హృదయమును వశము చేసికొనును. కాని దీని కాధారము పదటీక(Foot-Note)యందు మాత్రమే రచింపఁబడు పెక్కునిర్ణయముల మూలముననే అసంపూర్ణముగాఁ బ్రకటింపవీలగును. లభించిన వాక్యముల సంఖ్య నిశ్చయముగావలెను. ఈసంఖ్య యెప్పుడును పూర్తిగాదు. ప్రతివాక్యమును సమానార్థమునే చెప్పునదై యుండవలెను. స్పష్టముగా స్మృతిపథమునలేని గణనాతీతవాక్యముల భావములు మనసులోనుంచుకొని వీనిని జదివి యర్థముచేసికొనవలసియుండును. వీనివలన నేర్పడు నిర్ణయములే యిరువురకు నొకేయభిప్రాయమును గలిగింపవు." (గ్రీక్ ఫిలాసఫీ: పుటలు ౧-౨)

వాదన ప్రకటనలలో ధర్మమును గూడఁ బ్రదర్శించవలసి యున్నది. ఒక తత్త్వములోని వైరుధ్యములను గుర్తించుటయాతని కర్తవ్యమే కాని, తాను నిర్ణయించిన యర్థములు సఫలము గావలెనన్నచోఁ బ్రధానవిషయములనుండి యప్రధానవిషయ ములను వేరుచేసి వైరుధ్యములను సమన్వయించుటకు యత్నింప వలెను. ఉపదేశప్రమాణగ్రంథభావముల ననుసరించి, యెక్కు సమంజసమైన యింకొక యర్థమును జెప్పుటకవకాశముండగా, దానినిఁ దోసిపుచ్చి, బుద్ధుని తత్త్వము శూన్యవాదమే యని కాని, అజ్ఞతావాదమే యని కాని రాపాడించుట యుక్తము కాదు. బుద్ధునజ్ఞతావాదమును సమర్థించు నాతఁడు బుద్ధుని మౌనమున కజ్ఞానము నర్థముగాఁ జెప్పును; శూన్యవాదపోష కుఁడు బుద్ధుఁడు మౌనమువహించుట పిఱికితనముగా వాదించును. మొదటి వాదముననుసరించి బుద్ధునికి సత్యము తెలియదు; తాత్త్వికప్రశ్నములకు జవాబీయనోపక తనగౌరవమును గాపా డుకొనఁజూచి, కారణముమాత్రమట్టి ప్రశ్నములు నిష్ప్రయోజ నములని చెప్పినాఁడనిభావము. రెండవవాదము ననుసరించి, బుద్ధునికి సుస్పష్ట భావములున్నవి; కాని సంప్రదాయసిద్ధమైన ప్రజాభిప్రాయము నెదుర్కొను ధైర్యములేక, మౌనము వహిం చెనని యభిప్రాయము. ప్రపంచములోని మహోత్కృష్టపురుషు లలో బుద్ధుఁడొకఁడనియు, సోక్రటీసును గూర్చి "ఉత్తముఁడు, జ్ఞానిశ్రేష్ఠుఁడు నాతని కాలములోఁ బరమధర్మమూర్తి" యని ప్లేటో చెప్పిన వాక్యములకు సరిపోవువాఁడనియు విశ్వసించు వారు 'శూన్యతా' 'అజ్ఞతా' వాదులభావములతో నేకీభవిం

చుట కిష్టపడకున్నచో, క్షంతవ్యులమని మనవి చేయుదురు. బుద్ధునియొక్క తాత్త్వికప్రజ్ఞనుగాని, యాతని నిరుపమానధర్మదీక్షామహాత్మ్యమును గాని క్రిందు పరచుటకు మనమిచ్ఛగించనిచో భావాత్మకమైన యర్థమునే మన మంగీకరింపవలెను. తత్త్వజ్ఞానమునం దాతని లోపదోషములకును నాతని తత్త్వజ్ఞాన సంజాతమైన యాతని ధర్మోపదేశమునకు నట్టి యర్థకల్పనము మాత్రమే సరిపడును. బుద్ధుఁడు జీవించిన కాల తాత్త్వికవాతావరణమున కిదిసరిపోయి, ఉపనిషదుపదేశప్రవాహమున కవిచ్ఛిన్నతఘటించును. ఒకదేశముయొక్క విజ్ఞాన చరిత్రము స్వక్రమసమ్యగ్వికాసమునే కాని, ఒకదాని వెనుక నొకటిగావచ్చు మార్పుల కూర్పుకాఁజాలదు.

—

ఉపనిషత్తత్త్వదృక్పథమును బుద్ధుఁ డంగీకరించినచో హిందూతత్త్వజ్ఞులు బౌద్ధమతమును విరోధిమతముగా నేల ప్రకటించిరి? హిందూబౌద్ధమతసంస్కృతుల భిన్నతకుఁ గారణమేమి?

హిందువులకుఁగల విరోధము బుద్ధుని తాత్త్వికభావములతోఁగాదు బుద్ధుని కర్మమార్గముతోడనే. విజ్ఞానరంగమున వ్యక్తిస్వాతంత్ర్యమును, నాచరణరంగమున నియమానుసరణమును, జరితారంభమునుండియు హిందువుల తత్త్వము, అస్తికవిషయమున నుదాసీనత నెంచక, పూర్వమీమాంసా సాంఖ్యతత్త్వములను హిందువులు వైదికములుగా నెంచి, మహోన్నత తత్త్వధర్మచింతా పరతంత్రత గలిగియున్నను బౌద్ధమతమున వైదికమతముగా నెంచినారు. కారణమేమన

మీమాంసాసాంఖ్యములు హిందువుల సాంఘిక వ్యవస్థావిధానములతో జోక్యము పెట్టుకొనలేదు; బౌద్ధము ప్రజాసామాన్యమున కుపదేశింపయత్నించినది.

ఉపనిషత్తత్త్వముయొక్క ఫలితములను జూపుటకొఱకై, సాటిలేని ప్రతిభాసౌందర్యమును ప్రదర్శించి, ఉపనిషత్తులయెడ వచోమయగౌరవమును మాత్రమే చూపువారి విశ్వాసానుష్ఠానములందలి వైరుధ్యములను బుద్ధుఁడు ప్రకటించినాఁడు. ఉపనిషద్ద్రష్టలు తమ భావములను బరబ్రహ్మశిఖరముల నంటు మహోన్నత సాహసవేగములను జూపియుండగా, ప్రజాసామాన్య మల్పదేవతల నారాధించుచు, దమ కర్థము తెలియని కర్మకలాపము నంటిపెట్టుకొని యుండునట్లుగా విడువఁబడిరి. బుద్ధునికాలములోనున్న బుద్ధిమంతులు తరుగులేని కర్మకాండాపద్ధతికి విసిగి విశ్వాసమును గోల్పోయిరి. వానప్రస్థులకు యతులకుఁ గర్మావసరము లేదు. గృహస్థులుమాత్రమేల యీ వ్యయప్రయాసలతోఁ గూడిన కర్మకలాపముమానకూడదని సంశయించిరి. అర్థమునువిడిచి శబ్దదాసులగువారి వైఖరిని బుద్ధుఁడు నిరసించి, మోక్షము బాహ్యశాసన రూపకర్మాచరణములో లేదనియు నది యంతర్గతాత్మ వికాసముపై నాధారపడియున్నదనియు వక్కాణించెను.

కొన్ని సవరణలతో నహింసాధర్మము నుపనిషత్తు లంగీకరించినవి. వైదికదృష్టి చిరస్థాపితమైన ప్రదక్షిమగలదగుటచే నుపనిషదుపదేశమునకు విరోధముగా నున్నను వైదికవ్యవస్థల నుపనిషత్తులు సహింపవలసివచ్చినది. ఛాందోగ్యోపనిషత్తు,

మోక్షకామియైనవాఁడు జీవహింసచేయరాదని చెప్పుచుఁబుణ్య కార్యములలో ననగా యజ్ఞములందుఁ బశువధకనుజ్ఞనిచ్చెనుగ. కాని పశువధ బుద్ధుని దృష్టిలో ఘోరదోషమగుటచే దాని నాతఁడు పూర్తిగా నిషేధించినాఁడు.౨.

వర్ణనియమములను దాము ప్రోత్సహింపకున్నను, నుప నిషత్తులు సహించినవి. బుద్ధునిప్రచారము వర్ణవిభాగమును స్పష్టముగా నిర్మూలించినది. వ్యక్తుల యున్నతాధోస్థితికిఁ గారణములు జన్మములుకావనియు, శీలములే3. యనియు బుద్ధుఁడు చాటించెను. ద్విజవర్ణత్రయమునకే వేదాధికారమును బ్రాహ్మణులిచ్చియుండ బుద్ధుఁడట్టి నిషేధములను దొలగించెను. బ్రాహ్మణుల నిరుపమాన ప్రజ్ఞాసామర్థ్యములను బుద్ధుఁ డంగీకరించి, వారికి శ్రమణులతో సమానపదవి నిచ్చి, శ్రమణులగుట కవకాశము శూద్రులకుఁ జండాలురకుఁ గూడ నిచ్చెను. ఉన్నత

---

౧. అహింసా సర్వభూతాని, అన్యత్రతీర్థేభ్యః ౮అ. ౧౫

౨. చూడు కూటదంతసుత్తము; దీఘనికాయము. ౧అ. ౧౨౭ యతులకుఁ దగినశిక్షణమును విధించినను,జనులు తనప్రధాననియమముల నుల్లంఘింపనంతవరకు వారి కులమతాచారపూజాదికములతో జోక్యముకలిగించుకొనలేదు. పశువధలేకుండ యజ్ఞములనెరవేర్చుటకు బ్రాహ్మణుఁడైన కూటదంతుని కనుజ్ఞనిచ్చెను.బుద్ధుని స్వకీయశిష్యుఁడైన కుమారకశ్యపుఁడు పాయసి రాకుమారునికి హింసారహితయజ్ఞములు మంచికనిచెప్పెను. (చూడు పాయసి సుత్తాంతము, దీ.ని. ౨౩.) సర్వమానవజాతిని ప్రేమించుట, ధర్మమునాచరించుటయు నుత్తమయజ్ఞమని బుద్ధుఁడుచెప్పెను. (చూడు. ఛాం. ఉ. 3అ.: ౧౬. ౧౭)

3 అగన్నసుత్తాంతము. దీ.ని.3అ; సంయుత్తనికాయము. ౨.౧3౮ అంగుత్తరనికాయము.౨ ౨౦.

కులజుఁడైన బ్రాహ్మణునెట్లు శిష్యునిగా స్వీకరించెనో యట్లే సునీతుఁడను శ్వపచునికూడ నట్లే గ్రహించెను.౮.

అనేక సంస్కరణముల కాతఁడు కారకుఁడైనను, పూజ్యమైన యార్యధర్మమునే పునరుద్ధరించుటకై తాను జీవించి మరణించినట్లు బుద్ధుఁడు విశ్వసించినాఁడు. బుద్ధుఁడు తా నొక నూతనమత స్థాపకుఁడనని తలఁపలేదు; వైదిక హిందూమతము నాతఁడు సంస్కరించి, తానుచుట్టు నున్న సంఘము నుద్ధరింపవలెనని కోరెను. అభ్యుదయమార్గదర్శకు లేయుగమునందైనను, విప్లవప్రతిఘటనా ప్రతినిధులని ప్రజలు సందేహమనస్కులగుటలో నాశ్చర్యములేదు. సాంప్రదాయిక పురోహిత బృందము స్థానమున నాధ్యాత్మిక సోదరబృందమును, జన్మాధిక్యత స్థానమున వ్యక్తిగతశీలమును, వేదప్రమాణమునకుబదులు తర్కహేతువాదమును, కర్మకలాపాచారకాండస్థానమున ధార్మికానుష్ఠానమును, వైదిక దేవతల స్థానమున ముక్తపురుషులను, జొప్పించి, బుద్ధుఁడు హిందూపురోహితుని దృష్టికి నిరసింపఁదగు సంఘవిప్లవకారునిఁగఁ జూపట్టెను. బుద్ధుఁడు తదనుచరులం క్షమింపరాని మతద్రోహులుగాఁ బరిగణింపఁబడుటకుఁ గారణము వారు ప్రచురించిన సామాజికవిప్లవము. బుద్ధుని తత్త్వ

౮. కశ్యపసీహనాదసుత్తము: సమన్నఫలసుత్తము. ౧౮. గిర్నర్, సహాబజ్ గర్ లవద్ద అశోకుని శాసనములు; చూడు వినయపిటకము వాల్యూము ౨; మధురాసుత్తము. పోల్చు; "వంశమునందు గౌరవముగలవారిలో క్షత్రియుఁడుత్తముఁడు, కాని జ్ఞానధర్మములందు సిద్ధుఁడైనవాఁడు మానవులందే కాక, దేవతలయందును శ్రేష్ఠుఁడు." (అంబట్టసుత్తము.)

ములో హిందూవిజ్ఞానముతో సమన్వయింపరాని సిద్ధాంత మేది యునులేదు; కాని బ్రాహ్మణాగ్రేసరత్వముతోఁ గూడిన సంఘ వ్యవస్థకును, దానికి విరోధప్రచారమునకుఁగలిగిన సంఘర్షణము తీవ్రమైనది. ఉగ్రముగా జరిగిన యాస్తికసిద్ధాంత వివాదము లలో నవైదికవాది యెవఁడైనను నాస్తికుఁడే. మన నిరాధార భావముల నంగీకరింపనివా రందరు మతద్రోహులే; మనకు భిన్నమైన ధర్మప్రమాణములను విశ్వసించినచో వారవినీతి పరులే. క్రతుకర్మయుక్తమైన వైదికమతపోషకునికి బుద్ధుఁడు మతద్రోహియైన శత్రువే. యజ్ఞశాలలో హోమముచేయు చున్న భరద్వాజుఁడను బ్రాహ్మణుని దర్శింప బుద్ధుఁడేగినపు డాతఁడు: "ఓ ముండితశిరస్కుఁడా! ఓ శమనకా! నీవు కుల భ్రష్టుఁడవు. లోనికిరాకుమ"ని యరచెను.౧. వైదికమతము నెది రించు ప్రతిఘటనోద్యమము లన్నిటిని సనాతనసంప్రదాయ వాదు లిట్లే చూచిరి. వైదికాచారమునకంటె బ్రహ్మజ్ఞాన మధికమైనదని చెప్పినందుకు శంకరుని మండనమిశ్రుఁడు గర్హిం చినాఁడు.౨. బుద్ధుని ప్రతిఘటన ముపనిషత్తత్త్వమును గూర్చి కాదు, బ్రాహ్మణపోషితమైన హిందూమతమునుగూర్చియే, పెంపొందుచున్న వేదాంతసంప్రదాయమునకు విరుద్ధముగాఁ

---

౧. తత్రైవముండకా, తత్రైవశమనకా, తత్రైవవసలకా, తిష్ఠాహి.

౨. "తనసాలగ్రామపూజచే మండనమిశ్రుఁడు సర్వదేవతల నాహ్వా నించి, తన కరగతదర్భాంకురములను క్షాళనము చేయుచుండగా, శంకరాచా ర్యునిపాదములు దేవతావర్గమధ్యమున గోచరించెను. అవిసన్యాసిపాదములుగా నెఱిఁగి, క్షణమాత్రక్రోధపరీతుఁడై, యిట్లు సంబోధించెను, 'కుతోముండీ' 'ఈసన్యాసి యెచటనుండి' ఆనందగిరి: శంకరవిజయము.

దమ సిద్ధాంతమును వ్యాపింపఁజేయుటలో బుద్ధుని యనుచరులు నూతనమత ప్రచారకులు చూపు సహజోద్రేక లక్షణములను ప్రదర్శించుటలో హిందూ బౌద్ధమతముల మధ్యమం దుదయించిన చీలిక స్థిరతరమయ్యెను. బుద్ధోపదేశమునందలి శూన్యవాదము కథావత్తువునందును, మిళిందరాజప్రశ్నలందును, హీనయాన మహాయాన మతగ్రంథము లందును వివరింపఁబడినది. వేదాంతవాదులైన పండితులు భిన్న బౌద్ధమతశాఖా సిద్ధాంతములను నిశిత విమర్శనములకు గురియొనర్చుటలో నాశ్చర్యములేదు.

౧౦.

చతుర్విధబౌద్ధశాఖలును బుద్ధుని యుపదేశమునే బోధించుచున్నట్లు చెప్పుకొనుచున్నవి. ధర్మములు, వాని కారణకార్య సంబంధము, వాని స్వరూపనాశనముచేయు పద్ధతిని బుద్ధుఁడు కనుఁగొనెనని వారిభావము. గతమెన్నటికి లభింపనిదై నశించిపోయినందున,వర్తమానముతో నెట్టిసంబంధమును లేనిదనిచెప్పిన ఆజీవకులకు వ్యతిరేకముగా వస్తువులు సంస్కారసమూహములైనను,'అన్నియునున్నవ'ని బుద్ధుఁడు నిర్ణయించెను,ధర్మజీవితావసరములకై, సర్వవస్త్వస్తిత్వమును బుద్ధుఁ డంగీకరించెను. సర్వాస్తివాదులైన వైభాషికులును సౌత్రాంతికులును, వస్తుద్వయాస్తిత్వమును నిరూపించిరి. ఉపనిషత్తులు చెప్పిన నామరూపములను బౌద్ధులు స్వీకరించి, రూపమనఁగా జడపదార్థాంశములనియు, నామమనగా దర్శనములు, భావనలు, వృత్తులు, బుద్ధి యనుచతుర్విధ మానసభాగములనియు నిర్వచించిరి. ఇంద్రియ-

విషయము జడపదార్థము; చతుర్విధ మానసరూపములాత్మయు నగును. పంచేంద్రియములు, మనస్సును గలిసి షడాయతనము లనియు వాని విషయము లారువిధములనియు నొకప్పుడు చెప్పఁబడెను.౧. మనస్సుయొక్క విషయము లింద్రియసంబంధములు గానివి,అరువది నాలుగురకములుగాఁజెప్పిరి. మరికొన్ని సమయములందు, మనస్సుతోఁ గూడిన పంచేంద్రియములును, షడ్విధ విషయములును, షడ్విధవిజ్ఞాన రూపములును గలిసి పదునెనిమిది ధాతువులనిచెప్పిరి. సరిగాఁజెప్పుచో బాహ్యాభ్యంతరభేదములుగాని, భిన్నద్రవ్యముల పరస్పర సంపర్కముకాని లేదుగాని, వాడుకలోనట్టి సంబంధమున్నట్లుగాఁ జెప్పబడుచున్నది. జడపదార్థమును మనస్సును గూడ నిరంతరము భిన్నములైన క్షణిక ప్రవాహరూపమునఁ బరిణామమందుచున్నవి. మనస్సు విజ్ఞానప్రవాహరూపమును, జడపదార్థము నిబిడద్రవ్యరూపముగాను మారుచున్నవి. ఇట్టి యింద్రియవిషయములును, మనో విషయములును కారణసూత్రము ననుసరించును. క్షణికరూపములు గోచరించి వెంటనే యదృశ్యములగు చున్నవి కాని, యవిచలింపవు, మార్పునొందవు. వీనికి సంబంధించిన కారణధర్మము నూతనార్థమును గలిగి యున్నది. ఇదియే ప్రతీత్యసముత్పాదము. ఒకదాని వెనుకనొకటి యుద్భవించును. ఒకదాని కొకటి కారణముకాదు.

౧. స్కంధములు, ఆయతనములు, ధాతువులు ననివిభాగింపఁబడినవి... చూడు. థేరగాథ ౧౨౬౬.

వస్తుద్వయాస్తిత్వసిద్ధాంతము ననుసరించి, విజ్ఞానమును, విజ్ఞానవిషయము నేకకాలమందుండుటయే జ్ఞానము, స్టెర్బా-ట్స్కీ పండితుడిట్లు దీనిని వర్ణించినాడు: "వర్ణాంశము (రూపము) నేత్రేంద్రియ పదార్థాంశము (నేత్రము) విజ్ఞానపదార్థాంశము (చిత్తము) నేకకాలసన్నివేశముచే వర్ణస్పర్శవేదన కలుగుచున్నది."[౨] దీనియర్థమేమనఁగా, విజ్ఞానాంశము విషయాంశము, నింద్రియాంశముల గుణములతోఁ గోచరించుచున్నది. విజ్ఞానమింద్రియావయవమును గ్రహింపక, విషయమునే గ్రహించును; ఏలననీ రెంటికిని సారూప్యసంబంధమున్నది. కాంతియెట్లు ప్రసరించునో విజ్ఞానమట్లే గ్రహించును. అభిధర్మకోశ మిట్లు చెప్పినది: "దీపకాంతి సామాన్యముగా గ్రహింపఁబడిన యుపమానము. దీపమనగా, నెడతెరపిలేకుండ నుదయించు జ్వాలాపరంపరా స్వరూపమే. ఈజ్వాలోత్పత్తికి స్థానము మారినపుడు దీపమారి పోయినదందుము. అనేక విజ్ఞాన దశాపరంపరలకు విజ్ఞానమనునది వ్యవహారనామము. అది దానిస్థానమునుండి మారినపుడు (అనగా నింకొక విషయాంశసన్నివేశమును బొందినపుడు) మనమది యావస్తువును గ్రహించినదందుము."[౩] మనకు క్షణికములైన విజ్ఞాన విద్యుల్లతాపరంపరలే యున్నవి; తెలిసికొనునది వేరొకటిలేదు. ఈయనవరతక్షణిక విజ్ఞానదశలలోఁ బూర్వక్షణము త్తరక్షణకారణము.

౨ త్రయాణాం సన్నిపాతస్స్పర్శః (ది సెంట్రల్ కన్సెప్షన్ ఆఫ్ బుద్ధిజమ్, పు. ౫౫)

౩, ౯: చూడు, స్టెర్బాట్స్కీ, ది సెంట్రల్ కన్సెప్షన్ ఆఫ్ బుద్ధిజమ్ పు. ౫౭.

ఈభావమునుండి యోగాచారుల విజ్ఞానవాదమున కొక మెట్టే యున్నది. సర్వక్షణికాంశములు నాలయవిజ్ఞాన మను నొకదానికే చెందినవని యోగాచారులవాదము. ధర్మములన్నియు విజ్ఞానజన్యములు. పూర్వసంస్కార ఫలితముగా విషయములు విజ్ఞానమునకుఁ బ్రత్యక్షములగును. విజ్ఞానజాతమైన బాహ్యప్రపంచమునకు మనము నామసంజ్ఞలను గల్పింతుము.౨. పూర్వక్షణ ముత్తరక్షణ కారణమై, రెండును కేవల సమనంతరత్వ సంబంధమునుమాత్రమే కలిగియున్నవను నిత్య ప్రవాహరూపమైన విజ్ఞానవాదమునుండి, మానసికదశలన్నియుఁ బరిణామములుగాఁ గల ఆలయవిజ్ఞాన సిద్ధాంత ముత్పన్నమైనది. అసత్యదశాభేదముల నంగీకరించుట నిత్యమైనసత్యము నంగీకరించుటే యగును. వ్యక్తిగతభావము లసత్యములు లేక నిస్స్వభావములు. మొదటికారణమేమన, మనస్సునకు వేరైన ప్రపంచములో స్థితిలేని కేవల పరికల్పితభావములే యవి; రెండవకారణ మవి కేవల పరతంత్రములు; మూడవకారణ మివన్నియుఁ బరిపూర్ణమైన 'తథత' లో లీనములగునవే. ఈ భిన్నరూపములన్నియు స్వయముగా సత్యములుగా వేలన నివి యేకైక పరిపూర్ణవస్తు భిన్నరూపములు.

గ్రాహ్యగ్రాహకరహితమైన శుద్ధవిజ్ఞానమే పరిపూర్ణ సత్యస్వరూపము౧. ఈపరిపూర్ణ సత్పదార్థము ప్రపంచములో

---

౨. నామసంజ్ఞావ్యవహార. లంకావతారసూత్రము, పుట౫.

౧. అద్వయలక్షణమ్ విజ్ఞప్తిమాత్రమ్. చూడు. స్ట్చెర్బట్స్కీ; ది కన్సెప్షన్ ఆఫ్ బుద్ధిస్టునిర్వాణము, పుటలు ౩౨-౩౩.

నంతర్యామియైయున్నది కావున, నిర్వాణకాముఁడు దృష్టిని మార్చుకొనుటే చేయవలసినపని. అతీంద్రియమైన యోగశక్తి, ప్రపంచవస్తువులను సక్రమదృష్టితోఁజూచు సామర్థ్యమునిచ్చును. అజ్ఞానికి సంసారమైనదే జ్ఞానికి నిర్వాణము. కాని యోగాచారుఁడు వ్యక్తిగత విజ్ఞానమునకు, విశ్వవిజ్ఞానమునకు భేదమును సరిగా వివేకింపఁజాలకపోయెను. జ్ఞాని జ్ఞేయజ్ఞాన భేదముల సత్యములనియు, నవి కలుషీభూతమైన విజ్ఞానమున కట్లు గోచరించుననియుఁ జెప్పుటవలనను, వ్యక్తిగత విజ్ఞానదశలకును విశ్వవిజ్ఞానమునకును వీచీసాగరసామ్యము నుదాహరించుటవలనను, తథత యనునది శాశ్వతసత్యమనియు నేకైకా సంస్కృతధర్మమనియు నంగీకరించుటవలనను, మిగిలినవన్నియు ననిత్య వ్యవహార ప్రపంచరూపములే యని నిర్ణయించిన కారణమునను, సర్వధర్మములు (వస్తువులు) నేకైక చిత్స్వరూపములని భావించుటవలనను, యోగాచారుఁ డనాలోచితముగానైనను పరిపూర్ణవిజ్ఞానాస్తిత్వము నంగీకరించుచున్నాఁడు. ప్రపంచము మనఃకల్పితమను భావము తఱుచుగా గోచరించును. ఈ యోగాచారసిద్ధాంతమును మాధ్యమికులు నిశితముగా విమ

౨. ఒక వస్తువు తనపైఁదానే వర్తించలేదు కావున మనకు స్వసంవిత్తిలేదని వీరివాదము. హస్తాంగుళము తన్నుఁదానే స్పృశింపలేదు; కత్తి తన్నుఁదానే ఛేదింపలేదు. సర్వప్రపంచ ధర్మములును పరస్పరాధారభూతములని వాదించి మాధ్యమికులాకారణముచేఁ బ్రపంచము శూన్యమని నిర్ణయింతురు. సర్వస్థితికిఁ గూటస్థసత్యమే శూన్యమనియు వర్ణింపఁబడెను. నాగార్జు

నుని మాధ్యమిక తత్త్వపండితులెల్లరు నాతని తత్త్వము శూన్య వాదమనియే చెప్పుదురు౨ నాగార్జున తత్త్వప్రకరణమునందు౩. నే నాతనివాద మభావవాదముకంటె నధికముగా భావాత్మకమే యని చూపియుంటిని. శూన్యమనగా నాగార్జునుని దృష్టిలో నస్తిత్వముగల పరమసత్యమనియు, నది వ్యవహారధర్మ విరహితమను భావములో శూన్యమనియుఁ జెప్పియున్నాము. నాగార్జునుని పరమసత్యము కేవలమఖండశూన్యమో కాదో మనము పరిశీలింతము.

౧౧—

ప్రపంచము శూన్యమని నాగార్జునుఁడు భావించుటలో సందేహములేదు. సత్పదార్థమనఁగా స్వ-భావము గలది, అకృతకమైనది,పరతంత్రనిరపేక్షఁగలది యనిభావము. పరతంత్రమైన దెల్ల శూన్యమనగా స్వ-భావ-శూన్యమైనది. నిజమైనది స్వతంత్రమైనది, కారణసముత్పన్నముగానిది.౨. ద్రష్టృదృశ్యములు, వస్తు, గుణములు కర్తృ కర్మలు, భావాభావములు, ఉత్పత్తిస్థితిలయములు, ఏకత్వానేకత్వములు. పూర్ణాంశలు, బంధమోక్షములు, దేశ, కాలసంబంధములు మున్నగువాని పరస్పరసంబంధములపై ప్రపంచ మాధారపడి యున్నది; నాగా

---

౨. కెరన్. మాన్యుయల్ పు.౧౨౬; జాకొబీ,ఎ.ఒ.జె.౩౧,పు.౧;కీత్: బుద్ధిస్టుఫిలాసఫీ, పుటలు, ౨౩౭,౨౩౯,౨౪౭,౨౬౧.

౩. పుటలు, ౬౪౩.

౧, ౧౫, ౨, మాధ్యమికకారికా.

౨, అశూన్యమ్...అప్రతీత్యసముత్పన్నమ్, మా.వృత్తి. ౪౦౩.

ర్జునుఁడీ సంబంధములలో నొక్కొక్కటే పరిశీలించి, యందలి వైరుధ్యములను బ్రదర్శించును,3. సత్యమవిరోధలక్షణము కల దగుచో నపుడు వ్యవహారప్రపంచ మసత్యము, ప్రపంచము శుద్ధాస్తిత్వమునుగాని, శుద్ధనాస్తిత్వమునుగాని కలిగియుండలేదు, శుద్ధసద్వస్తువువస్తువుగాదు, జగత్సంబంధికాదు; శుద్ధనాస్తిత్వము భావమేకాదు; వీలన నది భావమేయైనచో సంపూర్ణశూన్యత యొక వస్తువగును: కాని శబ్దార్థము దీనికి విరోధము. శూన్యము శూన్యమెట్లుకాఁగలదు, సత్పదార్థమొకపరిణామము. ప్రపంచము లోని వస్తువులున్నవి, కావుమారుచున్నవి,అవి నిత్యమదృశ్యము లగుచున్నవి. అవి స్వయంస్థితిగలవి కాని, లేనివికానికాదు; వీలన నవి దర్శింపఁబడి,క్రియాజనకములై ఫలితముల నిచ్చుచు న్నవి. లలితవిస్తారమిట్లు చెప్పను:" స్థితిగల వస్తువేదియును లేదు; స్థితిలేని దేదియును లేదు, ఇట్టి వస్తుతత్త్వరహస్యము నెరిగినవాఁడు రెండిటికి నతీతుఁడగును."౧. నాగార్జునుఁడు వస్తుతత్త్వమును గూర్చి యారంభించి, వస్తువు లనిత్యములుగావు నిత్యములును గావు; పుట్టవు, గిట్టవు; సమానములుగావు, భిన్నములునుగావు; ఆరంభావసానములును వానికిలేవని ప్రవచించెను.౨. వస్తువులకు నిజమైన సముత్పాదములేదు; ప్రతీత్యసముత్పాదమే యున్నది;

3. పుట ౬౮౫.

౧. నచపునరిహాకశ్చిదస్తి ధర్మః, సోఽపినవిద్యతియస్యనాస్తిభావాః। హేతుక్రియాపరంపరాయాజానే, తస్యనభోతిహాఅస్తినాస్తిభావాః। (౨౫౮.)

౨. అనిరోధమనుత్పాదమ్, అనుచ్ఛేదమశాశ్వతమ్, అనేకార్థమ్ అనానార్థత్ అనాగమమనిర్గమమ్.

వానికి సముచ్ఛేదమును లేదు; ప్రతీత్యసముచ్ఛేదమే యున్నది; మిగిలిన లక్షణములునట్టివే. సృష్టిలోని సర్వవస్తువులు నిట్లుగాఁ బ్రతీత్యస్థితిగలవే. నాగార్జునుఁడు శూన్యశబ్దమును జగత్తుయొక్క అవాస్తవికతను దెలుపుట కుపయోగించెను.3. ఒకవస్తువు నిత్యము, నవస్థాతీతమైనచో దానికుత్పత్తిలయము లుండరాదు.౪. పరివర్తనము లేని వస్తువులు జగమునందు లేని కారణముచే జగత్తు శూన్యమైనది.

మధ్యమమార్గము నుపదేశించువాఁడు కావున నాగార్జునుఁడు జగన్మిథ్యావాదము నంగీకరింపఁడు. వస్తువుల స్వయంస్థితి సిద్ధాంతమునే యాతఁడు ఖండించును; వాని యసత్యాస్తిత్వము నాతఁడు నిరసింపఁడు. నాగార్జునునిఁగూర్చి వ్రాయుచు చంద్రకీర్తి యిట్లు నుడివినాఁడు. "వస్తువుల స్వయంస్థితి నంగీకరించిన నీకు, వస్తువుల కట్టిస్థితిలేదను మా వాదమువలనఁ బ్రపంచముయొక్క అస్తిత్వమున కుపహతి కలిగినది, వ్యవహారజగత్తు సత్యమే యను మా సిద్ధాంతమునకు వస్తువులకు స్వయభావము లేదనుటచే దోషముపట్టలేదు."౫.

3. "యః ప్రతీత్యసముత్పాదః శూన్యతామ్ తామ్ ప్రచక్ష్యతే" (మా కా ౨౪౧౮) "శూన్యాః సర్వధర్మాః నిస్స్వభావయోగేన" —ప్రజ్ఞాపారమితము.

౪. "యద్యశూన్యమిదం సర్వమ్ ఉదయో నాస్తి నవ్యయః" మా. కా. ౨౪౧౮

౫. "భవతస్తు స్వభావవాదినః స్వభావస్యభావానామ్ వైధుర్యాత్" సర్వభావాపవాదస్సంభావ్యతే, వయంతుప్రతీత్యోత్పన్నత్వాత్ సర్వభావానామ్ స్వభావమ్ ఏవమ్ నోపలభామహే. తత్కస్యాపవాదం కరిష్యామః (మాధ్యమికవృత్తి, ౧౫౯.) కొన్ని వాక్యములు పూర్ణమిథ్యావాదమును జెప్పునవి

ప్రపంచ మసత్యమనియు నింకొకటి సత్యమైన దేదియు లేదనియు నాగార్జునుని విశ్వాస మని చెప్ప వీలులేదు. విజ్ఞాన మంతయు నసత్యమైనచో, నసత్యముగాని దేదో యుండవలెను. ఏలన సత్యమగునదొక యేదియు లేకుండ నసత్యవాదమున కర్థమే లేదు. పరమార్థజ్ఞానము సర్వాంతర్యామి యగుటచే నది లేకుండ, వ్యావహారిక జ్ఞానమును లేదు. వ్యవహార జగత్తులోని సర్వమును బరమార్థమునే సూచించును. “ఓ సుభూతీ! శూన్యతయే సర్వవస్తువులకు శరణ్యము. దాని నవి మార్చలేవు.”౧. వస్తువులు స్వతంత్రములుగా గోచరించుటకుఁ గారణము మాయ.౨. “ఓ సారిపుత్రా! ఉన్నవని నిశ్చయింపఁబడిన వస్తువులు లేకుండుటయే అవిద్యయందురు”౩. వ్యావహారిక జగత్తును బరమార్థజగత్తుగా నర్థముచేసికొనుటే అవిద్య. కాని పరమార్థ

---

కలవు. ౧౭వ ప్రకరణములో నాగార్జునుఁడు ప్రపంచమును స్వప్నాకాశహార్మ్యాదులతోఁ బోల్చెను:

“క్లేశాఃకర్మాణి దేహాశ్చఫలానిచ
గంధర్వనగరాకారా మరీచిస్వప్నసన్నిభాః॥

గంధర్వనగరాకారములవలె నిస్స్వభావములనియు మిథ్యారూపములు కావనియుఁ జంద్రకీర్తి వాదించెను; “మేము జగదనిత్యతావాదులముకాని నాస్తికవాదులము కామ”ని చంద్రకీర్తి వాదము.(మాధ్యమికవృత్తి ౩౬౮.)

౧. శూన్యతాగతికాహి, సుభూతే, సర్వధర్మాః, తేతాంగతిం,నవ్యతివర్తంతే.

౨. ధర్మతైషా సర్వధర్మానామ్ మాయాధర్మతా ముపాదాయ......

౩. యథా, సారిపుత్ర! నసంవిద్యంతే తథాసంవిద్యతే ఏవమ్ అవిద్యమానాస్తేనోచ్యంతే అవిద్యేతి.

ము మనము వ్యవహారజగత్తు ద్వారముననే తెలిసికొనఁ గలము. పరమార్థజ్ఞానము లేనిదే మనకు నిర్వాణప్రాప్తిలేదు౪.

నిర్వాణస్వరూపమునుగూర్చి యుపదేశించుటే మాధ్యమిక శాస్త్ర ప్రయోజనము. ప్రపంచభావమునశించిన యానంద స్వరూపమే నిర్వాణము౧. వస్తుప్రపంచ శూన్యతను గుర్తించుటే నిర్వాణము, నదియే పరమసత్యము౨. నిర్వాణమును, శూన్యతయు నేతివాక్యములలోనే చెప్పఁబడెను. నిర్వాణము భావము కాదభావమునుగాదు; రెంటికి నతీతమైనదిర. శతకమను సుప్రసిద్ధ గ్రంథమునందు శూన్యతయే నిర్వాణమని చెప్పఁబడెను౩. శూన్యతయే సత్యము. "లేక వృద్ధి క్షీణములు లేని తథత"౫.

౪. వ్యవహార మనాశ్రిత్య పరమార్థోనదేశ్యతే పరమార్థమనాగమ్య నిర్వాణమ్ నాధిగమ్యతఇతి–

—మాధ్యమికకారికా ౨౪

౧. సర్వప్రపంచోపశమ శివలక్షణమ్ నిర్వాణమ్ శాస్త్రస్య ప్రయోజనమ్. మాధ్యమికవృత్తి. చూడు మాండుక్యోపనిషత్తు ౭,౧౨. పోల్చు చంద్రకీర్తి. భావాభావాంతరద్వయరహితత్వాత్ సర్వస్వభావానుత్పత్తిలక్షణా శూన్యతా– మాధ్యమికవృత్తి ౨౪

౨. యోఽనుపలంభః సర్వధర్మాణాం సాప్రజ్ఞాపారమితేతి ఉచ్యతే

3. శూన్యతామేవనిర్వాణమ్ కేవలమ్ తదిహోఽభయమ్–

–మాధ్యమికవృత్తి ౧౮

౪. నచాభావోఽపినిర్వాణమ్ కుతఏవాస్యభావతా

భావాభావపరామర్శ క్షయోనిర్వాణముచ్యతే. =రత్నావళి.

౫. యమ్. యమ్. శారప్రసాదశాస్త్రి యిట్లు వ్రాసెను: "ఈ యభావవర్ణములన్నిటియందున నిర్వచనీయభావాత్మకమైన 'శూన్య' మున్నది. (బౌద్ధగ్రంథ సమాజపత్రిక వాల్యుము ౨ అ3, పు౭.)

అష్టసాహస్రిక ప్రజ్ఞాపారమితమునందు శూన్యత యనగా "అప్రమేయమైనద"ని వర్ణింపఁబడెను. "ఓ సుభూతీ! ఏది కారణములేనిదో, ఏది భావధ్యానాతీతమో, ఏది యకృతకమో, ఏది అభావజన్యము కాదో, ఏది త్యాగముచేఁగాని, నిగ్రహము వలనఁగాని, నాశనమువలనఁగాని, మరణమువలనఁగాని లభింపదో, దానికే 'అప్రమేయమై'నదని పేరు౬. నాగార్జునుని భావములో నిర్వాణము, బుద్ధుఁడు, శూన్యత ఒకే సత్యమును దెలుపును. ప్రపంచ విరతియే నిర్వాణమని చెప్పినచో నది వ్యవహారభావము, కారణాంతరములచేఁ గలిగినది. నిర్వాణమునకుఁ బూర్వము ప్రపంచ మున్నదనియు నిర్వాణసిద్ధి యనంతర ముండదనియుఁ జెప్పుట సహేతుకముగా లేదు. అందుచే నాగార్జునుఁడు, వ్యవహారపరమార్థ జగత్తులకు మూలములో భేదము లేదనియు నిర్వాణము, సంసారము నొకటే యనియు భావించినాఁడు. అతఁడిట్లు పలికెను. "కారణావస్థా బద్ధమగుటచే మనమీ ప్రపంచ మసద్రూపమని చెప్పుదుము. కారణావస్థాదిబంధముల నున్మూలించినచో నిదియే పూర్ణసత్పదార్థము"౧. పరమసత్యము, అజము, అవినాశము, అనిత్యము, నిత్యము, సని యాతఁడు వర్ణించుటవలన సత్పదార్థము వ్యావహారికలక్షణములన్నిటికి వ్యతిరేకమైనదని యాతని భావము. ఉపనిషత్తులు నిర్గుణబ్రహ్మ వర్ణనమున నుపయోగించిన యా శబ్దములనే

౬. ౧౨౮

౧. మాధ్యమిక కారికా. ౨౫౮.

శూన్యతావర్ణనమునకు నాగార్జునుఁ డుపయోగించెను౨. అది యేకముగా దనేకమునుగాదు, సత్తుగా దసత్తునుగాదు3. పరమ సత్యమైన శూన్యము వాగ్విజ్ఞానాతీతము౪.

వ్యావహారిక ప్రపంచగతమైన బుద్ధిశక్తికిఁ బరమసత్య మగ్రాహ్యమని శాంతిదేవుఁడు పలికినాఁడు. భిన్నతాలక్షణ యుక్తమైన విజ్ఞాన మభేదమైన పరమసత్యమును గ్రహింపఁ జాలదని మాధ్యమికుఁడు వచించినాఁడు. సర్వభావనిర్మూల నమే శూన్యతయని విద్వాంసులు చెప్పుదురు. దానిని శూన్యతగా దర్శించినవారు నింకేమియు నధికముగా వర్ణింపఁజాలరు౧. "శబ్దముల కలభ్యమైన విషయమునుగూర్చి యెట్టి వర్ణనమును గాని జ్ఞానమునుగాని ప్రదర్శింపఁగలము అది శబ్దాతీతము౨

౨. కేన ఉ.3అ,౧౧; బృ. ఆ.ఉ.౨,౫,౧౯; 3-౮,౮; కఠ. ఉ.3,౧౫ ఈశ, ఉ. ౯-౧౦; ము. ఉ. ౧అ. ౬; మాండూ. ఉ.౭

3. నాస్తికోదుర్గతిం యాతిసుగతిం యాత్యనాస్తికః
యథాభూతపరిజ్ఞానమ్ మోక్షమద్వయనిశ్రితా,

—ఆర్యరత్నావళి.

అని నాస్తియని తలఁచువాఁడు దుర్గతినిబొందును; అనాస్తికుఁడు సుగతినిబొందును; కాని సత్యము నాస్తియుఁ గాదు; అస్తియుఁగాదను యథాభూతజ్ఞానికిఁగాని మోక్షములేదు.

౪. బోధిచర్యావతారము. ౯అ.౨.

౧. శూన్యతా సర్వదృష్టీనామ్ ప్రోక్తానిఃసరణమ్ జినైః।
యేషాంతు శూన్యతాదృష్టి స్తానసాధ్యాన్ బభాషిరే॥

—మాధ్యమికకారికా ౧౩అ.

చెప్పుటయు నక్షరమైనదానిని క్షరముగాఁ జెప్పుట యేయగును౨. ఇట్టి అనిర్వచనీయ విషయ నిర్వచనము సత్యమునుగూర్చి మనము చెప్పగల పద్ధతిలో నుత్తమమైనది; కాని, యది అనిర్వాచ్య వర్ణనమే యగుటచే, వ్యర్థమని దాని నుపసంహరించుచున్నాము3. శూన్యత నెఱుఁగుటే సర్వము నెఱుఁగుట; దానిని మన మెఱుఁగనిచో మన మెఱిఁగిన దేమియును లేదు౪. అనిర్వచనీయమైన యీ సత్పదార్థము ధర్మములయొక్క 'ధర్మత' 'ఇదంత' తథత, భూత తథతయునై యున్నది. ఇదియే తథాగతగర్భము. నాగార్జునుని శూన్యవాదమునం దంతర్గతములై యున్న భావముల నిట్లు నిశ్చయింపకున్నచో నాతని తత్త్వసిద్ధాంతమునుగాని, యాతఁ డుపదేశించిన భక్తిమార్గమును గాని సమర్థించుట దుస్సాధ్యము౫.

౨. అనక్షరస్య ధర్మస్య శ్రుతిః కా దేశనా చ కా।
శూన్యతే యస్య శిచ్చా పి సమారోపాదనక్షరా॥
—మాధ్యమికవృత్తి ౧౫.

3. చూడు - వేదాంతసారము పు.౭.

౪. మాధ్యమికకారికా ౨౪; బృ. ఆ. ఉ. ౨అ. ౪, ౫, ౭-౯; 3అ. ౨ ౧; ౪అ. ౪ ౨౧; ౫అ. ౧.౧; ముం. ఉ. ౧అ 3.

౫. రూడోల్ఫ్ అట్టో చెప్పినాఁడు. "మనయోగులు దర్శించు విచిత్రమైన శూన్యతావస్థయే, బౌద్ధయోగులు చెప్పు శూన్యతయు శూన్యమునైయున్నది మన శూన్యతకు బౌద్ధులశూన్యతకు నర్థము దీనికిఁబూర్తిగా వేరైనదని యర్థము మనకు విదితదృష్టములగు వానికంటెఁ బూర్తిగా నన్యమగుటచే దానినిగూర్చి యేమియుఁ జెప్పుట కవకాశమేలేదు."

ది ఐడియా ఆఫ్ ది హోలీ. ఇ.టి. పుట. 3౦.

'శూన్య' శబ్దార్థ స్పష్ట నిర్వచన లోపముచే మనకిట్టి సంశయావస్థ కలిగినది. వ్యవహార ప్రపంచమునకును బరమ సత్యమునకుఁగూడ 'శూన్య' శబ్దమే వాడఁబడినది. బుద్ధి పరికల్పితభావ సంబంధములచే నిర్మితమైన వ్యవహారజగత్తు సువిదితముకాదు. అందుచే జగత్తునుగూర్చి యెట్టి జ్ఞానసిద్ధాంతమును స్థాపింప యత్నింపఁడు. కారణము బుద్ధికల్పితమైన యే సిద్ధాంతమును లోపరహితము కాఁజాలదు. సమన్వయించుటకు శక్యముకాని వైరుధ్యములున్నవి కావున జగద్భావ రహస్యమును బుద్ధి వివరింపలేనప్పుడు, పరమసత్యమునుగూర్చి మాత్ర మెట్లు నిశ్చయింపఁగలదు? రెండు నబోధ్యములైన రహస్యములే. అందుచే రెంటికిని 'శూన్య' శబ్దమునే నాగార్జునుఁ డుపయోగించినాఁడు. సదసద్విషయమును నిర్ణయించుటలో జగము, పరమసత్యముకూడ సమానముగా నవిదితములే. సత్యము 'శాంతమే' సత్తుకా దసత్తునుగాదు. సత్పదార్థమే సర్వసత్యమన్నచో, జగత్తు మిథ్యయగును. జగమే సత్యమన్నచో, సత్పదార్థము మిథ్యయగును. రెండును శూన్యములే కాని భిన్నార్థము లున్నవి.

నాగార్జునుని తత్త్వమును బరిశీలించి, తుదకు శూన్యవాదమునకు నద్వైతవేదాంతమునకుఁగల కొన్ని సామ్యములను నేను సూచించియుంటిని[౧]. జగత్తు పరిణామవశమైనది కావున

౧. పుటలు, ౬౬౮-౬౬౯.

సత్రూపమని రెండువాదములు నంగీకరించును౨. వ్యవహార జ్ఞాన ప్రమాణముల కందని సత్యమొకటి యున్నదని రెండును విశ్వసించినవి3. కాని నాగార్జునుఁడు దీనిని సూచించి విడుచునే కాని, అద్వైతవేదాంతమువలె సర్వ వివరములతోఁ గూడిన తత్త్వమును నిర్మింప యత్నింపఁడు. ధర్మాధర్మములు సంసారగతులైనవారి కుత్తమాధమ గతులకుఁ గారణమైయుండును గాని వీనివలన నిర్వాణము లేక మోక్షస్థితి మూర్పనొందదు౧.

అద్వైతవేదాంతమునకు శ్రుతిప్రమాణమే కాక, హేతు ప్రమాణమును జూపుటకై, మాధ్యమికసిద్ధాంతముకంటె నధికోపయోగకరమైనది గౌడపాదునకు లభింపలేదు. గౌడపాదుని కారికలనేకములు నాగార్జునుని గ్రంథమును స్మృతికిఁ దెచ్చును౨. అందుచే వాచస్పతి శూన్యవాద పోషకులను ప్రకృష్టమతులనియు, సర్వాస్తివాదులను హీనమతులనియు, యోగాచారులను మధ్యమమతు లనియువచించుట సముచితముగానే యున్నది3.

౨. శంకరుఁ డీ శ్లోకము నంగీకరించును:—
జరామరణధర్మేషు సర్వభావేషు సర్వదా।
తిష్ఠంతి కతమే భావాః జరామరణం వినా॥" మాధ్యమిక కారికా ౭.

3. సత్యమోక్షములనుగూర్చి శంకరుని భావమున కనుగుణముగానే చంద్రకీర్తివాక్య మిట్లున్నది. సర్వకల్పనాజాల రహితజ్ఞానజ్ఞేయ నివృత్తిస్వభావమ్, శివమ్, పరమార్థస్వభావమ్. చూడు-శంకర భాష్యము. 3అ. ౨. ౧౭; భ. గీ. ౪అ. ౧౨.

౧. ధర్మేచ సత్యధర్మేచ ఫలమ్ తస్య న విద్యతే— మాధ్యమిక కారికా౪. పోల్చు: బృ. అ. ఉ. ౪అ. 3. ౨౧-౨౨; కఠ. ౨అ. ౧౪.

౨. పోల్చు: గౌడపాద కారికా. ౨అ. 3౨; ౪అ. ౨౨; ౪అ.౪౪

3. భామతి: ౨అ. ౨. ౧౮.

ఓం

# భారతీయ తత్త్వశాస్త్రము

## తృతీయభాగము - ప్రథమాధ్యాయము.

### ఉపోద్ఘాతము

### ౧—దర్శనముల ఉత్పత్తి.

బుద్ధుని యుగము, భారతవర్ష తాత్త్వికదృష్టికి నవ్యవసంతోదయముగా విరాజిల్లినది. ప్రాచీన సంప్రదాయమునకుఁ గల్గిన ప్రచండప్రతిఘటనమునకు ఫలితము తత్త్వశాస్త్రాభ్యుదయము. తమ పూర్వులు, నాటి పద్ధతుల ననుసరించి పరిష్కరించిన సమస్యలను, కొన్ని యడుగులు వెనుక కేగి, పునఃపరిశీలనము చేయుటకుఁ బ్రజలుత్సాహవశులైరి. వాని లక్షణము లెట్టివైనను, బౌద్ధ జైన మతముల తిరుగుబాటు, భారతీయ విజ్ఞాన చరిత్రమునం దొక నూతనయుగహేతువైనది. ఈ మతములం ధవిశ్వాసపద్ధతిని శాశ్వతముగా నణఁగఁద్రొక్కి విమర్శదృష్టి నుద్భవింపఁ జేసినవి. బౌద్ధవిజ్ఞానవేత్తలకుఁ దర్క—

శాస్త్రమే ప్రధానక్షేత్రము. దానినుండియే తమ శత్రు సిద్ధాంత నిర్మూలనమునకు వలయు నస్త్రజాలమును గల్పించు కొనిరి. పురాతనాంధ విశ్వాసములను నపరిశుద్ధాచారముల నుండి మనస్సును క్షాళనమొనర్చి శుద్ధియొనర్చు నౌషధరాజముగా బౌద్ధమతము పనిచేసినది. చిత్తశుద్ధితోఁగూడిన సంశయ తత్త్వము, సహజములగు పునాదులపై నిలుచు విశ్వాసములను గుర్తించునట్లు చేయును. తత్త్వాభ్యుదయ ఫలితముగాఁ బునాదు లింకను లోతుగాను దృఢతరముగాను నిర్మించవలెనను నిశ్చయము జనించినది. అట్టి నిశ్చయమునుండియే షడ్దర్శనము లుదయించినవి; ఇందు మతకవితారీతులకు బదులు నిశితవిమర్శయు విషయపరిశీలనమును ప్రాముఖ్యము గాంచినవి. సంప్రదాయ శాఖావాదులు తమ భావములను సూత్రీకరించి,వానిని తర్క హేత్వాధారములచే సమర్థించుకొనవలసివచ్చెను. తత్త్వచింతకుఁగల ప్రాముఖ్యము తత్త్వవిమర్శకునకు గలిగెను. దార్శనిక పూర్వయుగమందలి తాత్త్వికభావములు సృష్టిస్వభావమును గూర్చిన సామాన్యనిర్ణయములు. కాని, ఫలవంతమగు తత్త్వాన్వేషణమునకు ముఖ్యాధారభూతమైనది సహేతుకమైన జ్ఞానసిద్ధాంతమని వారు గ్రహించియుండలేదు. విమర్శకులు తమ ప్రతివాదులను జీవితానుభవముల కనుగుణములైన సహజ పద్ధతుల నుపయోగించునట్లు చేసిరి. తమ విజ్ఞానవిధానములను సమర్థించుకొనుట కతీంద్రియ ప్రమాణములపై నాధారపడుటకు వీలులేకపోయినది. మనకు నచ్చిన విశ్వాసములను సమర్థించుటకు హేత్వాభాసము లుపాయములు కాఁజాలవు. ఇప్పు

డాత్మవిద్య కాధారమాన్వీక్షికిలేక పరిశోధకమార్గము౧. హేతుబద్ధమైన తత్త్వసిద్ధాంత సమర్థనావశ్యకత సంప్రదాయవాదులకు రుచికరముగా నుండియుండదు౨. అంతర్దృష్టికి బదులు హేతువిమర్శనపద్ధతి చేకొ్త్తుటవలన సంప్రదాయ భక్తులగువారు ప్రాణోపద్రవము తటస్థించినట్లు తలఁచిరి. జీవితానుభవముల నుండి సముద్భవమందు విజ్ఞాన శక్తిస్వరూపము, మన కుపనిషత్తులయందును, విశ్వరూప సందర్శన జ్ఞానములచేఁ బరవశమై యాలపించు గీతాలహరీ రూపమైన భగవద్గీతయందును, ప్రత్యక్షమై, నేఁడు సమున్నత విచక్షణాన్విత తత్త్వపరిశీలనరూపము నొందినది. మఱియు హేతునిర్ణయవిధాన మంగీకరింపఁబడినపుడు, విజ్ఞానఫలితములయెడ మనకుఁ గలుగు నిశ్చయములు సంశయావధిని దాటిపోవు. విమర్శాత్మకమైన తత్త్వవిధానమెల్లప్పుడును మనము పూజించు సంప్రదాయమున కనుగుణ

---

౧. న్యా. భా. ౧అ. ౧. ౧; మనువు: ౭అ. ౪౩, కౌటిల్యుఁడు (క్రీ. పూ. 300) ఆన్వీక్షికి తక్కిన మూఁడింటికి వేఱైన ప్రత్యేకశాస్త్రమని చెప్పినాఁడు తక్కినవి త్రయీ అనగా వేదములు; వార్తఅనగా వాణిజ్యము దండనీతి యనగా రాజ్యాంగము, (౧అ. ౨) క్రీ. పూ. ౬-వ శతాబ్దమువరకు వాన్వీక్షకి ప్రత్యేకముగా నభ్యసించవలసిన శాస్త్రమని గుర్తింపఁబడెను. వాటినుండి తత్త్వశాస్త్ర నిర్మాణ మారంభమై, క్రీ. పూ. ౧-వ శతాబ్దమున 'ఆన్వీక్షకి' స్థానమున 'దర్శన' ముపయోగింపఁబడెను. (చూడు, మహాభారత శాంతిపర్వము. ౧౦. ౪౫ భాగవతపురాణము ౮ కాం. ౧౪. ౧౦) ప్రతితత్త్వ మొక జిజ్ఞాసతో నారంభించి, యొక అవసరమును దీర్చినది. పోల్చు: జిజ్ఞాసయా సందేహప్రయోజనే సూచయతి, (భామతి. ౧అ.౧.౧)

౨ ధర్మశాస్త్రములు చెప్పిన విధులనుండి ప్రజలను విముఖులనొనర్చును గావున ఆన్వీక్షకి నభ్యసింపరాదని రామాయణము చెప్పినది.

ముగా నుండకపోవచ్చును. కాని నాటి యుగవైఖరి ననుసరించి హేతుసిద్ధమైన ప్రతి తత్త్వశాఖయును దర్శనసమాన ప్రమాణము గలదిగా నంగీకరింపవలసివచ్చెను. లోకమునందు వ్యాప్తిలోనున్న బహుళభావముల నొకచోఁజేర్చి, వానికొక సముచితాకృతి నిచ్చు ప్రయత్నములే దర్శనములని యెంచఁబడెను౧. అవి సత్యముయొక్క అనేకరూపములలో నేదో యొక రూపమును దెల్పును. ఇట్టి యభిప్రాయమువలన స్వతంత్రములు, సంబంధశూన్యములుగా గోచరించు భిన్నదర్శనము లొకే మహోత్కృష్ట దర్శనరూపములని గ్రహింపఁబడెను. ఏయొక్క దర్శన తత్త్వమును, సర్వదర్శనములయొక్క తత్త్వ ప్రకరణార్థముతోఁ గలిపి తెలిసికొనినఁగాని, సంపూర్ణార్థము నొసఁగఁ జాలదు.

## ౨. వేదములతో సంబంధము.

విమర్శనావిధానము, తాము నమ్మినతత్త్వములు తామనుకొన్నంత స్థిరతరాధార నిర్మితములుగావని తెలియఁజేసి, తాత్త్వికాహంకార గర్వముల సడలింపఁజేసినది. కాని నాస్తికుల యొక్కయు సంశయవాదులయొక్కయు కొందరు బౌద్ధమతానుచరులయొక్కయు సంస్కరణోద్యమోద్రేకము, సర్వసిద్ధాంత నాశకరూపము గైకొనెను. ఇట్టి నాస్తికతా ఫలితములు, హిందూమనఃప్రపంచమున నశాంతి హేతువులయ్యెను. మానవుఁడు సంశయాత్మకుఁడై జీవింపఁజాలఁడు. బుద్ధి బల మదము

౧. మాధవుఁడు: స.ద. సంగ్రహము.

కేవలము సంతృప్తి నొసఁగఁజాలదు. వాగ్వివాదోత్సాహము, మనశ్శాంతి నీయఁజాలదు. మనము సత్యమును దర్కముచే స్థాపింపలేకున్నచో నది తర్కదౌర్భాగ్యమేయగును. అంతమాత్రముచే నుపనిషన్మహర్షులవంటి పూజ్యహృదయుల మహాత్త్రాశయములకుఁ బ్రమాదము సంభవింపదు. అనేక యుగవికాసమునందిన సత్యాన్వేషణము, విజ్ఞానము సత్యమున కొక యడుగైన ముందునకు వేయకుండ నుండదు. దైన్య మొకటే మార్గముకాదు, హేతుచకితమైన బుద్ధికి విశ్వాస మాశ్రయమిచ్చును. ఉపనిషద్ద్రష్టలు పావనతమ బ్రహ్మజ్ఞానవిద్యామందిరములో నుత్తమ దేశికులు. భగవంతునిఁగూర్చియు నాత్మజీవితమునుగూర్చియు వారు మనకుపదేశించిరి. నిస్సహాయమైన కేవల హేతువాదముచే మనకు సత్యమును సమూలముగా గ్రహించు సామర్థ్యములేని కారణముచే నాత్మజ్ఞాన సిద్ధులైన బ్రహ్మర్షివరేణ్యుల వాక్యములనుండిమనము వలయు సాహాయ్యసంపద నాసింపవచ్చును. విశ్వాసమవితర్క్యముగా నంగీకరించినవిషయముల నీవిధముగా హేతువాదముచే సమర్థించు తీవ్రకృషి జరిగినది. మానవజాతియొక్క క్రమాభ్యున్నతి నందు

---

(౨కాండ-౧౦౦-౩౬) (మహాభారతశాంతిపర్వము ౧౮౦-౪౭-౪౯ ౨౪౬-౪౮ హేతుశాస్త్రముచే నపహృతవివేకులై శ్రుతిస్మృతులనెవరు నిరసింతురో వారుబహిష్కరింపఁదగుదురని మనువుచెప్పినాఁడు (౨౫-౧౧) కాని, గౌతముఁడుతనధర్మసూత్రములందును (౧౧౫) మనువు (౭-౪౩)ను రాజుల కాన్వీక్షకినాదేశించిరి. శాసనసభలలో హేతువాదు లుండవలెననిరి. శ్రుతిని సమర్థించుహేతువు పరిగ్రాహ్యమే. అన్వీక్షకీసహాయమున వ్యాసుఁడు వేదవిభాగముచేసినాడట. న్యా. సూ. వృత్తి. ౧.౧.౧.

చున్న అనుభవజ్ఞానమును వివేకపూర్వకముగా గ్రహించు యత్నమే తత్త్వశాస్త్రమగుటచే నిందు వైపరీత్యమేమియును లేదు. తత్త్వశాస్త్రనిర్ణయము లంధవిశ్వాసములపై నాధారపడకుండ మనమపరిమత్తులమై యుండవలెను.

ఇట్టి దర్శనములలో నారు ప్రాముఖ్యమునందినవి. గౌతముని న్యాయము; కణాదుని వైశేషికము; కపిలుని సాంఖ్యము; పతంజలి యోగము; జైమిని పూర్వమీమాంస; బాదరాయణుని ఉత్తరమీమాంస లేక వేదాంగము:, ౧. ఇవన్నియు బ్రాహ్మణదర్శనములనగా వేదప్రమాణము నంగీకరించునవి. వేదప్రమాణము నంగీకరించు దర్శనము లాస్తికములనియు, గానివి నాస్తికములనియు నెన్నుదురు. ఒకదర్శనమాస్తికమో నాస్తికమో అదిప్రకటించు ఆస్తిక నాస్తికసిద్ధాంతములపై నాధారపడక, వేదప్రమాణము నంగీకరించునా లేదా యనువిషయముపైననే యాధారపడియుండును. ౨. బౌద్ధశాఖలకును మూలాధారము లుపనిషత్తులేయైనను, వేదప్రమాణమునవి యంగీకరింపని కారణముచే నవైదికములని యెంచబడినవి. ఈ విషయములగూర్చి యధికారజ్ఞానముగల కుమారిలుఁడు బౌద్ధదర్శనములన్నియు నుపనిషత్తులనుండియే తమభావ

౧. హరిభద్రుఁడు తన షడ్దర్శన సముచ్చయములో బౌద్ధన్యాయ, సాంఖ్య జైన వైశేషిక జైమినీయదర్శనములను వివరించెను. (౧౮, 3.) జినదత్తుఁడు, రాజశేఖరుఁడు నీభావమునే యంగీకరించిరి.

౨. ప్రామాణ్య బుద్ధిర్వేదేషు.మనువునాస్తికో వేదనిందకఃయని చెప్పెను (౨౮, ౧౧) చూడు మహాభారతము ౧౨ పర్వము ౨౭౦. ౬౭.

ములను గ్రహించినవని యంగీకరించి, యింద్రియవిషయము లపైఁ బ్రజలకుఁ బెంపొందిన మితిమీరిన వ్యామోహము నుపశమింపఁజేయు నుద్దేశముతో నివి బయల్వెడలినవనియుఁ జెప్పి, యివన్నియుఁ బ్రామాణ్యముకల దర్శనములేయని వక్కాణించెను. 3.

వేదప్రమాణాంగీకారము, తత్త్వవిషయములలో నాత్మానుభవమే బుద్ధితర్కమునకంటె శ్రేష్ఠతర మార్గదర్శకమవి యంగీకరించుటేయగును. అనగా వేదముచెప్పిన ప్రతిసిద్ధాంతమును నమ్ముటకాని, ఈశ్వరాస్తిత్వమునందు విశ్వాసముంచుట కాని కాదు. సృష్టిరహస్యార్థ సమస్యాపరిష్కారమునకై నిశ్చయమైన కృషిచేయుదీక్షనే యిది సూచించును. ఈ దర్శనము లన్నియు నొకేయర్థములో వేదప్రామాణ్యమునుగూడ నంగీకరించియుండలేదు. వైశేషికన్యాయదర్శనములు దైవాస్తిత్వము ననుమానప్రమాణముచే గ్రహించినవని మనము ముందు తెలిసికొందుము. సాంఖ్య మాస్తికమేకాదు. యోగ మాచరణలో వేదమునుండి స్వతంత్రతఁ జూపినది. మీమాంసలు రెండును వేదములపైనెక్కువగా నాధారపడినవి. సామాన్య దైవ భావమును వేదములనుండియే పూర్వమీమాంస గ్రహించినదికాని, పరమేశ్వరభావమునుగూర్చి యది విశేషాంశమును జూపలేదు. ఉత్తరమీమాంస, యీశ్వరాస్తిత్వమును శ్రుతిప్రమాణముచే గ్రహించి, అనుమానప్రమాణముచే సమర్థించును; దైవసాక్షాత్కారము ధ్యానజ్ఞానములవలన లభిం

3. తంత్రవార్తికము, ఆ ౧౩,౨,పు ౭౧

చునని చెప్పెను. ఆస్తికదృష్టిగల అర్వాచీన తత్త్వవేత్తలు గొందరు సాంఖ్యమును వైదికదర్శనములలోఁ జేర్చ నంగీకరించలేదు. ౧.

దర్శనముల తాత్త్వికలక్షణమునకు వేదప్రమాణము నంగీకరించుటచే విశేషలోపము సంభవించియుండలేదు. ౨. శ్రుతిస్మృతులకుఁ గలభేదము సుప్రసిద్ధమే: వానికి విరోధము సంభవించినచో శ్రుతియే ప్రమాణము. శ్రుతి, కర్మకాండయనియు (సంహితాబ్రాహ్మణములు) జ్ఞానకాండయనియు(ఉపనిషత్తులు) రెండుగా విభజింపఁబడినది. ఇందు జ్ఞానకాండకెక్కువ ప్రాధాన్యమున్నది. ఇందులోఁ జాలవఱకర్థవాదమని త్రోసివేయఁబడినది. ఈ భిన్నలక్షణములన్నియు వేదప్రమాణమును విశాలభావముతోఁ బ్రయోగించుటకు వీలిచ్చెను. వేదార్థవివరణము భాష్యకారుల వ్యక్తిగతవిశ్వాసములపై నాధారపడియుండును.

---

౧. భీమాచార్యుఁడు తనన్యాయకోశమునందు పరలోకాద్యస్తిత్వవాది ఆస్తికుఁడనియు, వేదమార్గనుసరింపనివాఁడు నాస్తికుఁడనియుఁ జెప్పినాఁడు. సాంఖ్యము, అద్వైతవేదాంతము నాస్తికములని యాతనిభావము. "మాయావాదివేదాంత్యపి నాస్తిక ఏవపర్యవసానే సంపద్యతే" సాంఖ్యయోగ పంచరాత్ర పాశుపతదర్శనములు, బౌద్ధమతమువలెనే వేదవిరుద్ధములని కుమారిలుఁడు తెలిపినాఁడు. (తంత్రవార్త్తికము. ౧అ. 3,౪)

౨. న్యాయవైశేషికులనుగూర్చికీత్ పండితుఁడువ్రాసిన దితరదర్శనముల విషయమునను సత్యమే: "ఇవి వైదికప్రామాణ్యము నంగీకరించు ఆస్తికదర్శనములే. కాని సృష్టిరహస్యార్థసమస్యల నివి లౌకికపద్ధతులచే సాధింప యత్నించినవి; ఇవి తాము కల్పించిన తత్త్వనిర్ణయములను శ్రుతులంగీకరించినట్లు చూపినవేకాని. నిజముగా నివి స్వతంత్రములగుటయేకాక, వేదవిహితార్థములతో సామరస్యము లేనివిగూడ నున్నవని చెప్పవచ్చును."

తర్క-పద్ధతుల నుపయోగించి, హేతుసహితనిర్ణయముల నొనర్చియు, పూర్వసంప్రదాయవాక్యములతో నవిచ్ఛిన్నైకతా భావమును బోధింప వారు యత్నింతురు. తాము పూర్తిగా నూతనమైన సిద్ధాంతము నేదైనఁ బ్రకటించుచున్నట్లు తమ్ము భావింప వారిచ్ఛగింపరు. ఇది పూర్తిగా నిజము కాకున్నను, వారు సత్యమని నమ్మిన తత్త్వము ప్రచారమగుట కుపయోగించెను.౧. భిన్నదర్శనములకుఁ జెందినవిమర్శకులు, వ్యాఖ్యాతలును దమభావములు శ్రుతిసిద్ధము లని ప్రకటించుకొని, ప్రత్యక్షముగా నట్టిశ్రుతి ప్రమాణవాక్యములు లభింపకున్నను, తమ ప్రజ్ఞావైదగ్ధ్యముచే నట్టియర్థములను జెప్పఁగల్గిరి. తరువాత సంభవించిన వివాదములలోఁ దమవాదములను సమర్థించుభావములు వేదోక్తములే యని చూప యత్నించిరి; కాని నిజముగా వారు వివరించుచున్న సమస్యలు వేదముల కపరిచితములే, వేదములందలి సామాన్య భావములు సుస్పష్టములు సవివరములు గావు; అందుచే నవి భిన్నశాఖలవారు వారిసిద్ధాంతముల కనుగుణముగా నర్థకల్ప

౧. పోల్చు. గోథే: "ఈవిషయములో నధికప్రజ్ఞావంతులు, కొందరు బయలుదేరిరి. వీరిని సీతాకోకచిలుకలతోఁ బోల్పవచ్చును. ఇవి రెక్కలులేని పూర్వస్థితినిమరచి, రెక్కలువచ్చువఱకుఁ దమ్ముఁబెంచి పోషించిన పూర్వ దేహము విసర్జించివేయును. ఇతరులు వినయకృతజ్ఞతాది గుణసంపన్నులు; వీరు పూమొగ్గలవంటివారు; ఇవి పూర్ణకుసుమములుగా వికసించుచుఁ దమ కాధారమైన మూలమును విడువక, తమ్ముకాపాడిన కొమ్మనుండి విడివడక, వీని సంబంధ సాహాయ్యములచేఁ గ్రమముగాఁ బరిపక్వఫలము నిచ్చును." (మెర్జిచే నుదాహృతము-యూరపియన్ థాట్ ఇన్ ది నైన్టీంతు సెంచరీ. వాల్యూము ౪ పుట ౧౩౪.)

నము చేసికొనుట కనుకూలములైనవి. మఱియు వేదము, లురు గ్రంథములగుటచే భాష్యకారులు తమ కెచట నేవాక్య మనుకూలమని తోఁచిన దానినేయెంచి, తమభావములను సమర్థించుకొనుటయందు ప్రజ్ఞాకౌశలము చూపుట కవకాశము గల్గినది.

దర్శనములలోని భిన్నతత్త్వలక్షణములకుఁ దత్త్వాన్వేషణముల మూలోద్దేశములైన మతదృష్టులే కారణములు. ఒకనిశ్చితసిద్ధాంతముయొక్క చిరంజీవిత్వము దానికాధారమైన తత్త్వసమస్యపై నాధారపడలేదు; దానికిఁ జెందినమతవిశ్వాసలక్షణములపై నాధారపడియున్నది; ఏలన నట్టి మతవిశ్వాసము శ్రుతిప్రామాణ్య మప్రతిహతమను భావముపై నిలువఁగలదు.

## 3—సూత్రములు

వేదవాఙ్మయ మతివ్యాప్తి పొందినపుడు, వేదవిద్యావేత్తలు తమ భావముల కొక యాకృతి నీయవలసివచ్చుటచే సూత్రసారస్వత ముదయించినది. వారుదర్శనములలోని ముఖ్యసిద్ధాంతముల నన్నిటిని సూత్రరూపమునఁ బ్రకటించిరి. అవి యల్పాక్షరములు,అసందిగ్ధములు,సారవంతములు,విశ్వతోముఖములు, అనవద్యములు నిర్దుష్టములునై యుండవలెను[౧]. అనవసర పునరుక్తిరహితములై, మఱియు సాధ్యమయినంత క్లుప్తములై యుండవలెను[౨]. వారికిఁ బుస్తకాధారములేమి జ్ఞాపక

౧. 'అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతోముఖమ్ అస్తోభమనవద్యంచ సూత్రంసూత్రవిదోవిదుః (మాధవుఁడు బాదరాయణసూత్రములపై ౧.౧.౧.) చూడు జయతీర్థుని న్యాయసుధ ౧.౧.౧; భామతి. ౧.౧.౧.

౨.

శక్తియే యాధారమగుటచే నీ ప్రాచీనసూత్రకారులు వచో వ్యాప్తి కంగీకరింపరు. ఇట్టి యత్యంత సూక్ష్మాక్షర సంఖ్యాకము లైన సూత్రములు భాష్యములు లేనిదే బోధపడుట కష్టమయ్యెను.

భిన్నదర్శనములు భిన్నతత్త్వ విచారణములు గల దేశములలో వృద్ధిపొందినవి. సూత్ర సంకలనమునకుఁ బూర్వమనేకతరములనుండి యీ సూత్రములందలి భావములు దేశములోఁ బెంపొందుచు వచ్చినవి. అవి యొక్క తత్త్వవేత్త యొక్క భావములుగాని, యొకతరమునకుఁ జెందినవికాని కావు; అనేకతరములలో ననేక వైజ్ఞానికుల భావముల సంపుటీకరణములే సూత్రములైనవి. సూత్రములకు గర్భస్థ, ప్రసవ కాలములు వేఱైన కారణమున వాని జన్మకాలమును నిర్ణయించుట సులభము కాదు. ఆత్మవిద్యాసంపత్తికి సునిశ్చితారంభ కాలము లుండవు.

సూత్రములు గతానేకతర కృషి పరంపరోద్భవములు. "అవి చరిత్రలో నొక కేంద్రస్థానము నాక్రమించును; పెక్కు పూర్వతరములలో వ్యాప్తములైయున్న తత్త్వ సారస్వతవ్యాసముల నొకవైపున నవి సూత్రీకరించినవి. వేఱొకవైపున ననవరత విశాల ప్రవృత్తిఁ జూపిన భాష్యకారుల యొక్కయు, స్వతంత్ర రచయితల యొక్కయు నభ్యుదయభావ ప్రవాహములకు జీవనప్రదాన మొనర్చు పర్వతశిఖర ఝురీరూపమై విలసిల్లినది. ఈ పర్వత ఝరులు నేఁటికిని జిజ్ఞాసువులకు నిర్మలతత్త్వామృతము నూటలూరించుచునే యున్నవి. దీనికింక నుత్కృష్ట

మైన భావిదశ యుండఁగలదని మా విశ్వాసము"౧. సూత్రరచనా మునకుఁ జాల పూర్వమే దర్శనములు బయల్వెడలి యుండ వలెను. భాషాభావములరీతుల ననుసరించి చూచినచో నీ తత్త్వసూత్రము లన్నియు నించుమించుగా నొకేయుగమునకుఁ జెందినవని తోఁచును౨. సూత్రగ్రంథకర్తలు తత్త్వస్థాపకులు గాని, మూలపురుషులుగాని కారు; వారు కేవల సంకలన కర్తలుమాత్రమే. తత్త్వసూత్రములలో నితర తత్త్వములకుఁ బరస్పరస్మరణ మున్న కారణము దీనిని ఋజువుచేయును. సూత్ర సంకలనదశకుఁ బూర్వము వివిధదర్శనము లేక కాలమున నే దేశమునఁ బెంపొందుచు వచ్చినవి. భిన్నసిద్ధాంతములనుండి బయల్వెడలిన భిన్నదర్శనములు, బుద్ధుని యనంతరతరములలో నారంభించి క్రైస్తవ శకారంభమునకుఁ బూర్వమే స్థాయీ భావము నొందినవి. ఈ తత్త్వభావము లన్నిటికి నాధారము స్మృతిపరంపరయే కాని లిఖితగ్రంథజాలము కాదు. భగ్నస్మృతి హేతువుచే ననేక ముఖ్య తత్త్వములు నశించియుండవచ్చును. మనకు మిగిలియున్నవైనను బూర్తిగా మూలశుద్ధములు కాక పోవచ్చును. కొన్ని పూర్వతరములకుఁ జెందినవి. బృహస్పతి

౧. ధీబో: శంకరభాష్యమున ఉపోద్ఘాతము, పు. ౧౨.

౨. ఏదోయొకరూపములో దర్శనము లన్నియు క్రీస్తుశకమునకుఁ బూర్వమునందే యుండియుండవలెను. జైనులప్రాచీన మతగ్రంథములలో వైశేషిక, బౌద్ధ, సాంఖ్య, లోకాయత, షష్టి తంత్రదర్శనములు పేర్కొనఁబడెను. (వీబర్సు సాన్స్క్రిటు లిటరేచరు, పు. ౨౩౬, ౨౪౯ చూడుడు. లలితవిస్తారము ౧౨; చరకసంహిత; మహాభారతము, నారాయణీయప్రకరణము.

సూత్రములు, వైఖానస సూత్రములు, భిక్షుసూత్రాదికము లును, తత్త్వ సారస్వతములోఁ జాలభాగమును నశించియుండు టచే, భిన్నదర్శనముల కుండియుండు సంబంధ కాలాదికములను గూర్చిన విశేష వివరములు మనకుఁ దెలియకుండఁ బోయినవి. సూత్రములు క్రమవికాసమంది రచింపఁబడిన కాలము బుద్ధునికి నశోకునకును మధ్యమకాలమని మ్యాక్సుముల్లరు పండితుఁడు నిర్ణయించినాఁడు. కాని వేదాంత సాంఖ్యయోగ సూత్రముల విషయములోఁ బరిణతరూపము లభించుటకుఁ దత్పూర్వము చాలకాలము పట్టియుండునని యాతఁ డంగీకరించినాఁడు. కౌటి ల్యుని యర్థశాస్త్ర మీ భావమునే వ్యక్తపఱచినది. నాఁటికిఁ బూర్వము పూర్వమీమాంసా సాంఖ్యములు రెండుభాగము లుగా నుండి 'ఆన్వీక్షికి' యను నామమునఁ బరగుచుండెను. బౌద్ధసూత్రములలో నితరసూత్ర స్మరణములు చాల తక్కువగా నున్నను, షడ్దర్శనజ్ఞానము వానికిఁ గలదని తెలియుచున్నది. బుద్ధునియనంతరము పూర్వభాగదశలలోఁ బ్రసన్నమైన విజ్ఞాన జీవితప్రవాహము సమానములైన బహుముఖముల పాయలై ప్రవహించినది. కాని వీనిని సూత్రీకరింపవలె ననుకోరిక, ప్రతి ఘటనోద్యమముల ఫలితముగా జనించినది. ఈ భిన్నదర్శనము లనంతర సంకలనకర్తల చేతులలోఁ జాలమార్పులను బొంది యున్నను,నివన్నియు మూలపురుషుల నామాంకితము లయియే ప్రచరితములైనవి. వేదాంతమునందు శంకర రామానుజాదు లనేకులు సిద్ధాంత విభేదములను గల్పించినను, వేదాంతసూత్ర తత్త్వ మొక్క వ్యాసుని తత్త్వమనియే నేఁటికిని నమ్ముదురు.

ఘనతములైన భారతీయ తత్త్వవేత్తలు సైతము, తాము కేవలము మూలగ్రంథార్థ వివరణము చేయుచున్నామనియే చెప్పుకొనిరి కాని, యట్టి మూలార్థ వివరణమునందు వారు స్వయం ప్రతిభా కల్పనములను జూపియుండిరి. ప్రతి దర్శనము నితర దర్శనములను దృష్టిలో నుంచుకొనియే రచింపఁబడినది. షడ్దర్శనోద్యమము నేఁటికిని పరిణతినందుచునే యున్నది. ఒకరి వెనుక నొకరుగా వచ్చిన భాష్యకారులు సంప్రదాయ సిద్ధాంతములను ప్రతిస్పర్థుల దాడులనుండి రక్షించి సమర్థించుచునే యున్నారు.

ప్రతిదర్శనము విషయములోను, మొదటనొక తత్త్వజిజ్ఞాసావిర్భావకాలమును, తదనంతరము సూత్రీకరణమును జరిగినది. దానితరువాత నీసూత్రములకు భాష్యములు. తరువాత టీకలు, వృత్తులు, సర్థవివరణములు బయలుదేరి, మూలభావ సిద్ధాంతములకు మార్పులు, పాఠాంతరములు, విస్తృతీకరణములు పెంపొందినవి. ఉపనిషత్తులకాలము నుండియు భాష్యము లన్నియు సంవాదరూపముననే యుండెను. క్లిష్టములైన తత్త్వసమస్యల కర్థసౌలభ్యమునుగూర్చుటకు సంవాదరూపమే యుత్తమమైనపద్ధతిగా గ్రహింపఁబడినది.

ర—సామాన్యభావములు

షడ్దర్శనములకుఁ గొన్నిముఖ్యభావములు సమానములేగ. ఇవన్నియు వేదప్రమాణము నంగీకరించినవనఁగా నివి

౧. "వివిధదర్శనములను నేను విశేషముగాఁ బరిశీలించిన కొలఁదియు, విజ్ఞానభిక్షువు మున్నగువారు వీనినిగూర్చి తలపోసినభావమే నాకును హృదయ

యొక్కే జ్ఞానసాగరమునుండి తమభావములను గ్రహించిన వని యర్థము. తమభావములు ప్రజలకు సులభగ్రాహ్యములగుటకు, హిందూదేశికులు తమకులభించిన సంప్రదాయసంపత్తి నుపయోగించుకొనిరి. అవిద్య, మాయ, పురుషుఁడు, జీవుఁడు, భిన్నదర్శనములకు సమానతాత్త్వికశబ్దములైనను,నీపదముల కాయాదర్శనము లిచ్చిన భిన్నార్థముల ననుసరించి వానివైలక్షణ్యము తెలియును. విజ్ఞానచరిత్రమునందుఁ గొన్నిశబ్దములు, వాక్యభాగములు వివిధదర్శనములలో భిన్నార్థములతో నుపయోగించుట తఱచుగాఁ దటస్థించుచుండును.ఉత్తమమతవిజ్ఞానమునకుఁజెందిన జీవద్భాషను గొన్నిమార్పులతో నుపయోగించి ప్రతితత్త్వము తనసిద్ధాంతములను బ్రకటించును. ఈదర్శనములలోఁ దత్త్వశాస్త్రము స్వీయజ్ఞానసహితమగును. వేదములందు రచింపఁబడిన ఆత్మానుభవములు తార్కికయుక్తిచేఁ బరిశీలింపఁబడినవి. ప్రమాణస్వరూపనిర్ణయము, జ్ఞానసాధనవిచారము ప్రతిదర్శనమందొక ముఖ్యప్రకరణమైనది. ప్రతిదర్శనమునందు ప్రత్యేకమైన జ్ఞానసిద్ధాంతమున్నది; ఈజ్ఞానసిద్ధాంత మాదర్శక తత్త్వమున కవిలంఘ్యమైనదో, తత్ఫలితమో యైయుండును. అంతర్దర్శనము, అనుమానము, శ్రుతి మూఁడు నీదర్శనములన్నియు

---

మున నాటుకొనినది; మద్దర్శనముల తత్త్వవైవిధ్యాంతర్నిహితమై జాతీయసామాన్యతత్త్వజ్ఞానమని చెప్పఁదగిన భాషాసంపద, దూరస్థమై, ప్రాచీనమై యుత్తరదిశనుండున్న మానససరోవరమువలె నున్నది. ఈకాసారమునుండి ప్రతి తత్త్వవేత్త యుఁదకనుకూలమైనంత జ్ఞానోదకమును మోసి తెచ్చికొనినాఁడు." (మ్యాక్సుముల్లర్, సేక్రెడ్ బుక్ సీరీస్, పు. ౨౨)

నంగీకరించిన ప్రమాణములు. అంతర్దర్శనము హేతుదర్శనము కంటె నధికమైనప్రమాణము. తర్కయుక్తికి జీవితముసర్వతో ముఖముగా విదితము కాదు. స్వీయవిజ్ఞానలక్షణము ప్రపంచము యొక్క పారమార్థిక ప్రమాణముకాఁజాలదు. దీని నతిక్రమించిన దింకొకటి యున్నది. దీనినే అంతర్దర్శన మనియు, స్వతఃప్రమాణ మనియు పూర్ణవిజ్ఞానప్రమాణ మనియు నీశ్వర సాక్షాత్కారమనియుఁ జెప్పుదురు. దానిని సరియగుమాటలలోఁ జెప్పలేము; అందుచే నతీంద్రియజ్ఞాన మందుము. మన కిట్టి యతీంద్రియజ్ఞానకిరణస్పర్శ లప్పుడప్పుడు తగిలిననాఁడు మన మొక విశాలోన్నతకాంతి సీమకుఁబోయిన యనుభవము కలుగును. ఆత్మవివేకములేనిది పశుజ్ఞానము; ఆత్మవివేకముగలది మనుష్యులజ్ఞానము. వీని కెంత భేదమున్నదో, మానవుని యాత్మవివేకజ్ఞానమునకును, మానవుఁడు పొందవలసిన అతీంద్రియజ్ఞానమునకును నంతభేదమున్నది. కేవలతర్కయుక్తికి సాధ్యము కాని అతీంద్రియదృష్టిపై భారతీయ తత్త్వశాస్త్రమాధారపడి యున్నది. తర్కభౌతికశాస్త్రములపై నాధారపడిన సంస్కృతి కర్మకుశలతాసిద్ధినొసఁగవచ్చును గాని, మహదావేశజనకము కాఁజాలదు.

దర్శనములన్నియు బౌద్ధసంశయవాదమును నిరసించి, బౌద్ధులయెడ తెగని క్షణిక దశాపరంపరాప్రవాహమునకు వ్యతిరేకముగా శాశ్వతసత్య మను నచలప్రమాణ కుడ్యము నొక దానివి నిర్మించినది. అనాదికాలమునుండియు జగత్తను మహావాహిని ప్రవహించుచున్నది; ఈప్రవాహము కేవలమనఃకల్పి

తముకాదు; నిజమైనదే. అది అవ్యక్తమైన ప్రకృతివలనఁగాని మాయవలనఁగాని, అణువులవలనఁగాని వ్యక్తమగుచున్నది." "నామరూపములు తొలఁగింపఁగా దేనియందు ప్రపంచము నిలిచి యున్నదో దానిని గొందరు ప్రకృతియనియుఁ, గొందరు మాయ యనియుఁ గొందరణువు లనియుఁ జెప్పుదురు.౧" దేని కాధియున్న దో దాని కంతమున్నదని విశ్వసింపఁబడినది. భిన్నభాగములచేఁ గల్పితమైన దేదియైనను, నిత్యమునుగాదు, స్వతంత్రస్థితిసహిత మునుగాదు. ఏదియథార్థమో అది అవిభాజ్యము, దేశము నందుఁ గాలమునందు వ్యాప్తమైన జగత్తుసత్యముకాదు; ఏలన నట్టి జగత్తు పరిణామ నశనమైనదేకాని యచలము కాదు. దీనికి వెనుక నేదో సత్యమైన దున్నది — అణువులుగాని, జీవులుగాని, ప్రకృతిపురుషులుగాని, పరబ్రహ్మకాని సత్యస్వరూపములు.

సంసారమొక చక్రమువంటిదని సర్వదర్శనము లంగీకరించును. సృష్టిస్థితిలయాత్మకములయిన యుగసహస్రములు కాలచక్రమునఁ బరిభ్రమించుచుండును. అభ్యుదయమునందు విశ్వాసమునకీసిద్ధాంతము వ్యతిరేకముకాదు; ఏలనఁ బ్రపంచము లెక్కలేనన్ని పర్యాయములు గమ్యస్థానమును జేరుట; తిరిగి బయలుదేరినచోటికి వెనుకకు నెట్టఁబడుటయుఁగాదు జరుగునది. సృష్టిలయము లనఁగాఁ బ్రపంచము లుదయించి నశించుటయుఁ

---

౧. తన యోగవార్తికములో బృహద్వాశిష్ఠమునుండి విజ్ఞాన భిక్షు వుదాహరించినాఁడు.

"నామరూపవినిర్ముక్తమ్ యస్మిన్ సంతిష్ఠతే జగత్
తమాహుః ప్రకృతిమ్ కేచిన్మాయమన్యేపరే త్వణుమ్."

దిరిగి నూతనప్రపంచము లుదయించుటయుఁ గాదు. నూతనప్రపంచము జగచ్చరిత్రలో నొకనూతనాభ్యుదయ ఘట్టము; ఈఘట్టమునందుఁ బూర్వప్రపంచములో నపరిపక్వములైయున్న శక్తులన్నియుఁ దిరిగి వికసించి, వృద్ధిపొంది, పరమావధిని జేరు నవకాశములుండును. అనగా మానవజాతి తనకుఁగల యూర్ధ్వగమన మార్గమునఁ దిరిగి యాత్రనారంభించి పురోగమన మొనర్చును. ఇట్టియుగము లనంతములై దొరలిపోవుచుండును.

పూర్వమీమాంసతప్పఁ దక్కినదర్శనములన్నియు మోక్షసాధనపద్ధతులను జూపును. పాపవిపర్యయ దోషములవలన నజ్ఞానగతమైన యాత్మస్వస్వరూప జ్ఞానమును బొందుటే మోక్షమని వీనియభిప్రాయము. దర్శనములన్నిటికిని లక్ష్యమొకటే; పూర్ణసమచిత్తశాంతి, సందేహాసరోధవిముక్తి, దుఃఖయాతనారాహిత్యము. నిస్సంశయము, పునర్జన్మాదిరహితము, చెక్కుచెదరని నిత్యప్రశాంతియు నార్జించుటే. చాలదర్శనములు జీవన్ముక్తిభావము నంగీకరించినవి.

ప్రపంచము నిత్యధర్మబద్ధమైనదని హిందువుల మూలవిశ్వాసము; కాని మానవుఁడు తనలక్ష్యమును సాధించుకొనుటకు వలయు స్వాతంత్ర్యమునున్నది. పూర్వజన్మములను దర్శనము లంగీకరించును. మానవజీవితము మోక్షమార్గములో నొకఘట్టము; మార్గము, మార్గము తోడ్కొనిపోవు గమ్యస్థానము దృష్టిగోచరములు కావు. ఈయాత్రలో మరణము తుదివిషయము కాని, ఆటంకముగాని కాదు; నూతనఘట్టమునఁ జేర్చు

సాధనమే. ఆత్మవికాస మవిచ్ఛిన్నపరిణామమే; జన్మమరణము లచే నది వివిధదశలతోఁగూడి యుండును.

వేదాంతము మనలను సత్యమందిర ద్వారమునొద్దకుఁ దోడ్కొనిపోవును; కాని మందిరములోనికిఁ జేర్పదు; మందిర ప్రవేశమున కంతర్దర్శనము లేక సాక్షాత్కార మవసరము. మనము సంసారాంధకారమున దారితప్పి పడిపోయిన శిశువుల వలెనుండి, మనస్వభావము నెఱుఁగక, భయ భ్రాంతులతోఁ దడవులాడుచున్నాము. కామరాగాది దోషములనుండి మనలను విముక్తులనొనర్చి, మనయజ్ఞానములను దొలఁగించి, మన సత్య స్వరూపము నెఱుకపఱచు జ్ఞానకాంతి యవసరమైయున్నది. అట్టి ఆత్మజ్ఞానము మోక్షప్రాప్తి సాధనమని యందరంగీకరించిరి; మోక్షస్వరూపమునుగూర్చి భేదాభిప్రాయములున్నవి.౧ అజ్ఞానమే బంధహేతువు; కావున సమ్యక్ జ్ఞానమే మోక్షసాధనము. కేవలధర్మమునకుఁజెందిన యంతరువున కతీతమైనస్థితికిఁబోవు టే దర్శనముల కాశయమైయున్నది. పంకమందుద్భవించియుఁ బైకి వచ్చి వికసించు పరిశుద్ధపద్మముతో జ్ఞానికిఁబోలిక చెప్పఁబడెను. అతనీవిషయములో ధర్మాచరణ లభ్యమగు శ్రేయమిదివఱకే సిద్ధించినది. సంసారచక్రమునందు ధర్మాధర్మములు సదసద్గతు లకుఁ గారణములైనను, ధర్మాతీత పథము పొందినవ్యక్తి సంసారమునుండి తరించును. స్వార్థరహితప్రేమ, నిష్కామకర్మ,

౧. బౌద్ధవిజ్ఞానవేత్తయగు ధర్మకీర్తియు "సమ్యక్ విజ్ఞాన పూర్వికా, సర్వపురుషార్థసిద్ధిః" యని న్యాయబిందు గ్రంథము నారంభించినాఁడు.

చిత్తశుద్ధి, ధర్మానుష్ఠానజీవితమునకు ముఖ్యములని దర్శనము లన్నియు నంగీకరించినవి. కొలఁదిభేదములతో నన్నియు వర్ణాశ్రమ ధర్మములను సమర్థించినవి.

నేను మొదట నుపోద్ఘాతములో౧ జెప్పినరీతిని భారతీయ తత్త్వశాస్త్రరచన మనేక క్లిష్టసమస్యలతోఁగూడి యున్నది. ముఖ్యరచయితల కాలములు గ్రంథములు నిస్సందేహములు గావు; సుప్రసిద్ధులచారిత్రిక యాథార్థ్యములు గొన్నితావుల శంకింపఁబడినవి. అవసరములైన పెక్కురచనలు అలభ్యములు; మనకు లభించి ముద్రితములైయున్నవైనను సక్రమ పద్ధతిలో లేవు. భారతీయవిజ్ఞానవిదు లెవ్వరును భారతీయ తత్త్వశాస్త్ర రచనకుఁ బూనుకొనియుండలేదు. మాధవుఁడు తనదర్శన సంగ్రహమునందుఁ బదునాఱు భిన్నదర్శనముల వివరించినాఁడు. మేము మొదటిభాగములో లోకాయత బౌద్ధజైనభాగములను బ్రదర్శించియున్నాము. దీనియందు న్యాయవైశేషిక, సాంఖ్య యోగ, పూర్వోత్తర మీమాంసలనుగూర్చి తెలుపఁదలఁచినాము. జైనము, రామానుజమతము, పూర్ణప్రజ్ఞామతము, వేదాంతసూత్రములపై నాధారపడి భిన్నతత్త్వములను గల్పించినవి. పాణినిరచనమునం దంతగాఁ దత్త్వవిశేష ప్రసక్తి లేదు. మీమాంసకుల భావమైన శబ్దశాశ్వతత్వము నంగీకరించి,స్ఫోటవాదమును గల్పించినది;అనఁగాఁ బ్రతిశబ్దమునందు నదృష్టమైన యొకబీజాత్మకశక్తియున్నదనియు నది యేభావమునకు

౧. భారతీయ తత్త్వశాస్త్రము. ప్రథమభాగము.

వాహనమనియు నీసిద్ధాంతము చెప్పును. ఈషడ్దర్శనములలో వై శేషికమున కధికగౌరవము లేదు; న్యాయదర్శనము తర్కశా స్త్రానుబంధముచే ముఖ్యముగా వంగదేశమునందు విశేషవ్యాప్తి నొందినది. యోగదర్శన మాచరణములో నేకొలఁదిమందిచేత యభ్యసింపఁబడుచున్నది. పూర్వమీమాంస హిందూధర్మ శాస్త్రముతో సన్నిహితసంబంధమును గలిగియున్నది. సాంఖ్య మనుష్ఠానయోగ్య దర్శనమే కాదు. ఇఁక వేదాంతదర్శనమే భిన్న రూపములలో దేశమంతయు నలముకొనినది. ఈషడ్దర్శన పరి శీలనమునందు మనము సుప్రసిద్ధములైన సూత్రములను వానిముఖ్యభాష్యములను గణింపవలసియున్నది. ఇటీవల విజ్ఞాన వేత్త లేకొలఁదిమందియోతప్ప, మన కొసఁగిన తత్త్వనిర్ణయ ములు విశేషాదరపాత్రములుగావు; వారిపాండిత్య మపారము; కాని,వారు చరిత్రలో క్షీణదశకుఁజెందినవారగుటచే సృజననిర్మా ణములకు బదులు, విమర్శనము, పునర్నిర్మాణము వారికర్తవ్య లక్షణములైనవి. వ్యక్తిగతవిశ్వాసములను సమర్థించుట, సువిది తములైన విషయముల కతినిగూఢములగు నర్థాంతరకల్పన ములు, తమకు నచ్చిన ఆస్తికభావమునెడ నతిపక్షపాతదృష్టి, తత్త్వాన్వేషణమునందు నిర్వీర్యత మున్నగువారు ప్రదర్శించిన లక్షణములు మనకు విశేషాదరయోగ్యములు గావు.

మన కనవద్యమైన యాచారము ననుసరించి, ప్రపంచ విషయ విభాగముల నిచ్చు న్యాయవైశేషికములతో నారంభిం చి,సాహసాంచిత విజ్ఞానావలోకనములచే మనలోకానుభవము ర్థమును నిర్ణయింపఁబూనిన సాంఖ్యయోగముల తత్త్వములను

బరిశీలించి, శ్రుతిసిద్ధములైన సత్యములకును, తత్త్వశాస్త్రనిర్ణయములకును సామరస్యమున్నదని ఋజువుచేయ యత్నించిన మీమాంసాదర్శన పరిశీలనముతో ముగింతము. ఈపద్ధతిరచన, చరిత్రానుగుణము కాకున్నను, విశుద్ధతర్క హేతు ప్రసిద్ధమై యుండఁగలదని మే మాశించెదము.

# ద్వితీయాధ్యాయము

## న్యాయసిద్ధాంతము

### ౧—న్యాయవైశేషికములు.

ఇతరదర్శనము లన్నియు జగత్తు నేకముగాఁ దీసికొని తత్త్వనిర్ణయములు చేసియుండఁగా, న్యాయవైశేషికములు, లౌకిక భౌతికవిజ్ఞానము లున్మాదసంజాత భావము లని నిరసింపక వీనిమూలమున జగద్విభాగ పరిశీలనము సలిపి, తత్త్వములను గల్పించియున్నవి. విషయపరిశీలనమున కిదివఱ కుపయోగించిన పద్ధతులకు భిన్నముగా శాస్త్రీయవిధానము నీదర్శనము లుపయోగించినవని తదనుచరులు ప్రకటించుచున్నారు. తార్కిక విమర్శాన్వేషణ పద్ధతుల ననుసరించి, బౌద్ధవిజ్ఞానవేత్తలు ప్రకటించిన నిర్ణయము లసమంజసము లనియు, జీవితముయొక్క అవిచ్ఛిన్నరూపము క్షణికదశాపరంపరగా విడఁగొట్టుట హేతు

విరుద్ధమనియు నీ దర్శనములు వాదించును. బాహ్యప్రపంచము కేవల మనఃకల్పితమగు నూహామాత్రమే యను బౌద్ధులక్షణిక వాదమునుండి వెలువడు సంశయాత్మక తత్త్వముల నెదుర్కొని నిరసించుటకే ముఖ్యముగా నివి ప్రయత్నించును సంప్రదాయ సిద్ధముగాఁ జెప్పఁబడిన వస్తువు లున్నవనియు, నంతరంగమున నాత్మ, బాహ్యమునఁ బ్రకృతి గలవని యీదర్శనములు తర్కయుక్తముగా ఋజువుచేయ యత్నించును. ప్రత్యక్షమైన యింద్రియప్రమాణము, హేతునిర్ణయములపై నాధారపడి, మతవిద్వేషులైన వైజ్ఞానికు లాస్తికతపై దాడివెడలినపుడు బయలుదేరిన సంశయ మహాప్రవాహముల నెదుర్కొనుటకుఁ గేవల శబ్దప్రమాణ విశ్వాసము చాలదు. సమ్యక్ జ్ఞానాధారములను దెలియు విధానములను సమగ్రపరిశీలనము చేసినప్పుడుకాని జీవితమత లక్ష్యములు చేకూరవు. శ్రుతిజ్ఞానమును, నింద్రియజ్ఞానము నాన్వీక్షకీ శాస్త్రవిధుల ననుసరించి, విచక్షణాన్వితమైన పరిశీలనమునకు గురిచేయవలెను[1]. హేతుసిద్ధమైన దేదియైనను సత్యమని యంగీకరించుటకు నైయాయికుఁడెల్లప్పుడును సంసిద్ధుఁడే[2]. ఆత్మస్వరూపమును మోక్షావస్థను గూర్చి మాత్రమే న్యాయదర్శనము వివరించినచో నీవిషయములనే

---

౧. ప్రత్యక్షాగమాభ్యామ్ ఈక్షితస్యాన్వీక్షాతయావర్తతఇతి ఆన్వీక్షికీ (న్యా.భా.౧అ.౧౧.) మఱియు, "ప్రత్యక్ష శబ్దప్రమాణములచే నిదివఱకే 'ఈక్షిత' మైన విషయమును 'అను ఈక్షణ'ము చేయుటచే అన్వీక్షయైనది." (న్యా.భా.౧అ.౧.౧.) అరిస్టోటలు వచించురీతిని తర్కము 'అనుభావము'ల శాస్త్రము, అనగా జ్ఞానమాత్మ పరిశీలనము చేయుపద్ధతి.

౨. బుద్ధ్యాయదుత్పన్నమ్ తత్సర్వం న్యాయమతమ్.

యుపనిషత్తులును వివరించినవి కావున నవు డీరెంటికిని భేదమే లేకయుండెడి దని వాత్స్యాయనుఁడు నుద్యోతకరుఁడును బలికి యున్నారు. తత్త్వసమస్యలను హేతుచర్చచే నిర్ణయించుట లోనే న్యాయతత్త్వ వైశిష్ట్య మిమిడియున్నది. తర్క-ప్రమాణ సూత్రములచే జ్ఞానవిషయముల విమర్శించి పరీక్షించుటే న్యాయశాస్త్ర ప్రయోజనమని వాచస్పతి నిర్వచనము చేసినాఁడు3.

న్యాయవైశేషికములు, సంప్రదాయ తత్త్వశాస్త్ర భావములగు దేశకాలనిమిత్త ద్రవ్యములు, చిత్తము, ఆత్మ, జ్ఞానము మున్నగువానిని గ్రహించి, అనుభవములో వాని యర్థములను వివరించి, లభించిన ఫలితములకు జగత్సిద్ధాంత రూపము లిచ్చినవి. తార్కిక భౌతికరంగము లీ సంప్రదాయము లందు ప్రధానలక్షణములగును. న్యాయవైశేషికములు క్రమ ముగా నాంతరంగిక బాహ్యప్రపంచములను విషయములుగాఁ దీసికొనినవి. జ్ఞానసాధనసామగ్రిని విపులముగా వర్ణించి సర్వము సంశయాత్మక మను సంశయవాదమును న్యాయశాస్త్రము కఠి నముగా నిరసించును. ప్రత్యక్షానుభవమును బరిశీలించుటే వైశేషికశాస్త్ర ప్రధానోద్దేశము. మన కింద్రియముల వలనఁ గాని, అనుమానమువలనఁగాని, శ్రుతివలనఁగాని తెలిసిన వస్తు వులను బరీక్షించుటకుఁ గొన్ని సామాన్య నియమముల నిది కల్పించినది. ఇట్టి దృష్టిని స్వీకరించి న్యాయవైశేషిక తత్త్వ ములు జీవాత్మ లున్నవనియుఁ, దమ చుట్టునున్న ప్రకృతిశ్రే

3. ప్రమాణైరర్థపరీక్షణమ్. (న్యా.వా.తా.టీక.౧అ.౧.౧.)

సంపర్కమును గలిగి యున్నవనియు నమ్ముటలో నాశ్చ ర్యము లేదు.

ఈరెండు నొకే దర్శనములోని రెండుభాగములని చాల కాలము తలఁపఁబడెను. వస్తువులను జ్ఞానసాధనములఁగూర్చియు నిర్ణయించిన యొకేశాస్త్రమునుండి విడిపోయిన రెండుశాఖలే స్వతంత్ర శాస్త్రములైనవని కొందర భిప్రాయపడిరి. అర్వాచీన గ్రంథము లీ రెండు నొకేశిక్షణముగ, యొక్క ద్వివిధరూపము లని భావించినవి. ఈవిషయమున నెట్టినిశ్చయమును జెప్పుటయుఁ గష్టమైనదే. వాత్స్యాయనుని న్యాయభాష్యమునందును నీ రెండును వేరుగాఁ జూడఁబడలేదు. వైశేషికము న్యాయమున కనుబంధముగాఁ గూడఁ జూడఁబడెను౨. ఉద్ద్యోతకరుని న్యాయ వార్తికము వైశేషిక సిద్ధాంతముల నుపయోగించెను. ఈరెం డును జాల పూర్వమే కలిసినవనియు, న్యాయవార్తికము రచిం చిననాటికి వీనిసంయోగము పూర్తియైనదనియు జాకొబిపండితు నభిప్రాయమైయున్నది3. పెక్కు న్యాయసూత్రములు వైశేషిక

౧. చూడు వరదరాజకృతతార్కికరక్షా; కేశవమిశ్రుని తర్కభాషా, శివాదిత్యుని సప్తపదార్థా; విశ్వనాథుని భాషాపరిచ్ఛేదము; సిద్ధాంతముక్తావళి; అన్నంభట్టుని తర్కసంగ్రహము, దీపిక; జగదీశుని తర్కామృతము: లౌగాక్షి భాస్కరుని తర్కకౌముది. బౌద్ధవైజ్ఞానికులైన ఆర్యదేవుఁడు, హరివర్మయు న్యాయము వైశేషికమునకు వేరైన స్వతంత్రశాస్త్రమని యంగీకరింపలేదు. (Wi వైశేషిక ఫిలాసఫీ, ప్ర ౫౪-౫౬)

౨. న్యా.భా.౧అ ౧.౪; వాత్స్యాయనుఁ డుదాహరించిన వేదాంత సూత్రములు 3అ.౧.౧౬ న్యా.భా.లో ౨అ.౨.౨౪; వే.సూ.౪.౧.౧౬.న్యా. భా లో. 3.౧.33;3.౧.౬౭.

3. ఇ.ఆర్.ఇ.వాల్యుము.౨.పుట ౨౦౧.౮.

సూత్రముల భావమును గలిగియున్నవి. ఈ రెండును సమనంతర దర్శనములని చెప్పఁబడినవి. ఏలన రెంటికి జీవానేకత్వమునందును, ఈశ్వరునియందును, అణుకల్పిత జగత్తునందును, సమవిశ్వాసముండుటే కాక రెండును వానినిగూర్చి సమానవాదములనే చేయును. ఈ రెండు దర్శనములు నతిప్రాచీనకాలమందే సంయోగమందిన మాటనిజమే కాని, ఒకటి తార్కికరంగమునకు, నింకొకటి భౌతికరంగమునకు నధికప్రాముఖ్య మిచ్చిన భేదముమాత్రము లేకపోలేదు౪. హేతునిశ్చితమైన వస్తుజ్ఞానము యొక్క రీతులను, విధులను న్యాయశాస్త్రము నిర్ణయించియుండగా, వైశేషికము ప్రపంచ మణుకల్పిత మను విషయమును నిశ్చయించును. అణువాదమును న్యాయము వాదమవసరము లేకుండ నంగీకరించెను౧.

౪. ఉద్ద్యోతకరుఁడిట్లుచెప్పెను; "ఇతరశాస్త్రములు ప్రమాణములను నిర్ణయింపవు; ప్రమాణములవలనఁదెలిసిన విషయములనే విచారించును."

(న్యా.వా.౧అ.౧.౧.)

౧. వైశేషికము న్యాయమునకుఁ బూర్వమైనదని గార్బేయభిప్రాయము. (ఇ,ఆర్,ఇ,వాల్యూము ౧౨,పుట ౫౬౮,చూడు ఫిలాసఫీ ఆఫ్ ఎన్షెంట్ ఇండియా. పు,౨౦;జె.ఎ,ఓ,యస్,౩౧.) గోల్డుస్టుకర్ వైశేషికమొక న్యాయశాఖయనినాఁడు, కీత్ గార్బే భావము నంగీకరించును. ఇవివిశేష హేతుయుక్తముగానున్నది;ఏలన విదర్శన పూర్వకపరిశోధనములన్నియు వ్యక్తిగతతత్త్వముల ననుసరించును. న్యాయసూత్రముల నిర్మాణస్వరూపము; శబ్దశాశ్వతత్వము, ఆత్మస్వరూపము, అనుమానవిధానము మున్నగు సమస్యలను గూర్చిచూపిన విశేషశ్రద్ధ కీత్ పండితునిభావమును సమర్థించుచున్నవి. (న్యాసూ,౪,౧,౧౯) లో ఈశ్వరునిగూర్చి చెప్పినదీవిషయములో వైశేషికము చెప్పుదానికంటె నధికమైనది. దేహవ్యాపారములనుండి ఆత్మాస్తిత్వమును సమర్థించువాదము సర్వమనోభావముల కాధారమైన దాత్మయనిచెప్పు న్యాయవాదముకంటె సం

చిరకాలమునుండియు న్యాయతత్త్వము విశేష గౌరవా దరములను బొందియున్నది. మనువు దానిని శ్రుతిలోఁజేర్చి నాఁడు. యాజ్ఞవల్క్యుఁడు వేదాంగముల నాలుగింటిలో నొకటి న్యాయమని నిశ్చయించెను౨. హిందువు లభ్యసింప వలయు విషయపంచకము కావ్యనాటకాలంకార తర్క-వ్యాకర ణములు. తరువాతనే శాస్త్రము ప్రత్యేకముగా నభ్యసించినను సర్వశాస్త్రములకు మూలాధారమైనది తర్క-శాస్త్రమని భావింపఁబడెను. ప్రతి హిందూ విజ్ఞానశాఖయు న్యాయశాస్త్ర మూల నియమముల నంగీకరించి, న్యాయశాస్త్ర విమర్శనమం తను వీనినే యుపయోగించును. సర్వసక్రమ తత్త్వశాస్త్ర పరిచయమునకు న్యాయశాస్త్రము ప్రాతిపదికమైయున్నది౩.

---

౧ సాకారహీనమైనది. న్యాయమును స్మరింపక, వైశేషికసిద్ధాంతమును విమర్శిం చిన బాదరాయణసూత్రములవలన (౨అ,౨,౧౨-౧౭) వైశేషికమే పూర్వ తరమను భావముసమర్థింపఁబడినది కాలనిర్ణయవిషయములలో ననుమానాధా రములను విస్తారముగాఁజెప్పి, దోషపరీకరణమును క్లుప్తముగా రచించినవే సూత్రములంతగానుపయోగింపవు. న్యాయవేదాంతసూత్రములకు సామ్యాంశములు పెక్కుగలవు. పోల్చు;న్యా,సూ,౩అ,౧,౩౬;౨అ,౧౯౪;౧అ,౧,౧౦;౩అ,౧, ౨౭;౩,౧,౩౯;౩,౧,౬౫;వే,సూ,౪అ,౧,౭;౮అ,౨,౨౦;౩అ,౨,౪;౪అ,౨,౩; ౪,౧,౬-౧౩;౮-౨,౪-౯;౭,౨,౯;౮,౧,౨౩— కొన్ని,వే, సూత్రములు,న్యా, సూత్రములకు వివరణములయినచో ఆ వే. సూత్రములు, న్యా. సూత్రముల కనంతరము రచింపఁబడినవని తెలియును.అన్ని వే,సూ, లట్టివి కాఁజాలవు.

౨. యాజ్ఞవల్క్యస్మృతి, ౧అ, ౩, పోల్చు, ఆత్మోపనిషత్తు ౨అ విష్ణుపురాణము ౩అ, ౬.

౩. కౌటిల్యుఁడు. (౧అ,౨) న్యా,భా,౧,౧,౧,లో నుదాహృతము.

## ౨—న్యాయప్రారంభదశ.

ఆన్వీక్షకి యనగా జీవితపరమార్థతత్త్వసమస్యలను విచక్షణపూర్వకముగాఁ బరిశీలించుట యని మన మిదివఱలోఁ జూచియున్నాము. మఱియుఁ దత్త్వసమస్యలనన్నిటిని శాస్త్రీయ పద్ధతులలోఁ బరిష్కరింపఁజేసిన యత్నములన్నిటిని సాంఖ్య యోగ లోకాయత మతదర్శనము లిందుఁ జేరు విశాలార్థముతో నీశబ్ద ముపయోగింపఁబడినది. ఈ వివిధ విజ్ఞానదర్శనము లుపయోగించిన తర్కవిమర్శన విధానములను శ్రద్ధతోఁ బరికించు యత్నములు జరిగెను. ప్రతిశాస్త్ర మొకన్యాయశాస్త్రమే; ఏలన న్యాయ మనఁగా నొకవిషయములోఁ బ్రవేశించుట లేక ప్రవేశించి పరిశీలించుట యని యర్థము. అందుచే విషయములను సహేతుక పరిశీలనముచేయు సర్వశాస్త్రసామాన్యరీతుల నిది పరీక్షించును గాన న్యాయశాస్త్రము శాస్త్రములకెల్ల శాస్త్రమని చెప్పనొప్పును. కేవల సూత్రకారులేకాక తర్కకోవిదులుకూడ నగుటచే మీమాంసకులు శుద్ధన్యాయవిద్యావ్యాసంగములకుఁ బ్రోత్సాహ మిచ్చిరి. వైదికయజ్ఞ మతావసరముల నిమిత్తమై తర్కశాస్త్ర ముద్భవించియుండనగును. ఏలన,యజ్ఞవిధానములను,వాని సూత్రములను, ఫలితములను సరిగా నిర్ణయించుటకు వేదమంత్రార్థవివరణమును సక్రమరీతిని జేయవలసివచ్చినది.అందుచే మీమాంసాశాస్త్రములను గనుగొని స్థాపించిన తత్త్వవేత్తలు తర్కశాస్త్ర

వికాసము నాదరించి పోషించిరి౧. ఇతరులకంటె గౌతముఁడు ప్రవచించిన తర్కసూత్రములు విశేష ప్రజ్ఞాన్వితము లగుటచే గౌతమ న్యాయశాస్త్రమే ఆన్వీక్షకి యని తలపఁబడెను. ఈవిధముగా సామాన్య తత్త్వశాస్త్రవిధానము లన్నిటికి నుపయోగింపఁబడిన 'ఆన్వీక్షకి' శబ్దము సంకుచితమై కేవల తర్కశాస్త్రమును జెప్పుటకే క్రమముగా నుపయోగింపఁబడినది౨.

న్యాయశాస్త్ర నిర్మాణమునకుఁ బూర్వఘట్టములలోఁ దర్కవాదములకు౧ ముఖ్యస్థాన మీయవలసి యున్నది. న్యాయము తర్కవిద్య యనియు వాదవిద్య యనియుఁ గూడఁ బిలువఁబడెను. వాదము విజ్ఞానజీవితమునకుఁ బ్రాణమువంటిది. క్లిష్టార్థములతోఁ గూడిన సత్యనిర్ణయములో వాదమును మన ముపయోగింపక తీరదు. ఏలన ననేకబుద్ధు లాలోచించి సహా

౧. మాధవుని న్యాయమాలవిస్తారము, పార్థసారథిమిశ్రుని న్యాయరత్నాకరము, ఆపదేవుని న్యాయప్రకాశము మున్నగు మీమాంసగ్రంథనామముల వలన న్యాయము మీమాంసకుఁ బర్యాయపదమని తెలియుచున్నది. చూడు. ఆపస్తంబధర్మసూత్రములు ౨అ,౪,౮,౨౩; ౨అ,౬,౧౪,౩.

౨. చూడు మనవు, ౭అ,౪౩; గౌతమధర్మసూత్రము ౧౧; రామాయణ అయోధ్యకాండ, ౧౦౦,౩౬; మహాభారతశాంతిపర్వము. ౧౮౦-౪౭.

౧. మొదటిసూత్రమీదర్శనమందు వివరింపఁబడిన విషయముల నిట్లు చెప్పినది. (౧) ప్రమాణమనగా జ్ఞానసాధనము (౨) ప్రమేయములేక జ్ఞాన విషయములు (౩) సంశయము (౪) ప్రయోజనము(౫)దృష్టాంతము (౬)సిద్ధాంతము (౭) అవయవములు (౮) తర్కము (౯) నిర్ణయము (౧౦) వాదము (౧౧) జల్పము (౧౨) వితండము (౧౩) హేత్వాభాసము (౧౪) చలము (౧౫) జాతి (౧౬) నిగ్రహస్థానము. మొదటి తొమ్మిదియును కేవల తార్కికములు; మిగిలినఏడును విపర్యయదోషములను దొలగించుటకుపయోగించును.

రించినఁగాని సత్యము నిశ్చయముకాదు౨. తత్త్వచర్చలు కొనసాగిన విద్వత్పరిషత్తులను గూర్చి ఉపనిషత్తు లుదాహరించియున్నవి౩. సంవాదపద్ధతి నుపయోగించిన సోఫిస్టు ఉద్యమము నుండి గ్రీక్కుల తర్కశాస్త్ర ముదయించినది. వాదకళాభ్యాసమువలన సోఫిస్టులు హేతుక్రమ నియమములను గనుఁగొనుటయేకాక, చిత్రయుక్తి ప్రయుక్తి పద్ధతులనుగూడఁ గల్పించిరి. ఇతరులతో సంవాదరూపక చర్చలవలన సోక్రటీసు సత్యావిష్కృతిని బడయుటకు యత్నించెనని ప్లేటో సంవాదగ్రంథములవలనఁ దెలియుచున్నది. వివాదములందు వాదిప్రతివాదుల కిరువురకు నుపయోగించు రెండుతర్కగ్రంథములను టాపిక్సును సోఫిస్టికల్ రెఫ్యుటేషన్సును ఆరిస్టాటిల్ రచించెను. కాని యాతఁడలంకారమునుండి తర్కమును, వివాదపద్ధతులనుండి హేతునియమములను వేఱుపఱచెను. రాజాస్థానములందును, విద్యాలయములందును నవి తీవ్రముగాఁ జెలరేగిన వాగ్వాద

---

౨. సోక్రిటీసు దీనినివాడెను. సత్యస్థాపనలో దీనివిలువను ప్లేటోగ్రంథములు చూపును. ఆరిస్టాటిల్ చెప్పినాఁడు; "కొందఱొక విషయముయొక్క ఒక ముఖమును; మఱికొందఱింకొక ముఖమును దర్శింతురు; కాని యందఱును గలిసి యన్నిముఖములు చూడఁగలరు", (పొలిటిక్సు) మిల్టనుయొక్క ఏరియోపజిటిక్సును, మిల్సుయొక్క ఎస్సేన్ ఆన్ లిబర్టీయును చర్చాస్వాతంత్ర్యమును మెచ్చుకొన్నవి.

3. చూడు, ఛాం, ఉ, ౬, 3, ౧; బృ, ఆ, ఉ, ౪, ౨.౧, ప్రశ్న, ఉ, ౧౫, ౪, మరియుఁజూడుము, మనువు, ౪, ౭౦; ౮, ౨౬౯; ౧౨, ౧౦౬; మ. భా. శాంతిపర్వము. ౧౮౦-౪౭; ౨౪౬, ౧౮; మఱియు మనువు ౧౨, ౧౧౦-౧౧౧, పరాశరుఁడు, ౮, ౧౯; యాజ్ఞవల్క్యుడు ౧, ౯; వినయపిటక పరివారమునందును, పరిషద్విచారములు చెప్పఁబడెను.

యుద్ధముల ఫలితముగా గౌతమన్యాయశాస్త్ర ముదయించిన దనుటకు సందేహము లేదు. శాస్త్రచర్చలకుఁ గొన్ని నియమ ముల ననుసరించు టవసరమయ్యెను. కావునఁ దర్కసిద్ధాంత మేర్పడినది. ఆరిస్టోటల్ వలెనే గౌతముఁడును, హేతువాద నియమములకు రూపమిచ్చి, యుక్తనియమముల నయుక్తముల నుండి వేఱుపఱిచి, వివిధవాద యుక్తి ప్రయుక్తి రూపములను వర్ణించెను. మొదటిసూత్రములో నీయఁబడిన పదునాఱువిషయ ములు సంవాదపద్ధతిలో జ్ఞానమునకుఁ దోడ్కొనిపోవు వివిధ ఘట్టములని తలఁపఁబడెను౧. అనంతర తర్కగ్రంథము లనేక ములు వాదనియమములను జర్చించి౨ సంవాదసమస్యలను బరి ష్కరింప యత్నించును3.

గౌతమ న్యాయదర్శనము తర్కవిషయములో నత్యంత తృప్తికర రచనమైనను, పాణినికిఁ బూర్వము వ్యాకరణముండిన ట్లును, జైమినికిఁబూర్వము మీమాంస యున్నట్లును, గౌతము నికిఁ బూర్వము తర్కము నున్నదని జయంతుఁడు వక్కాణించు

---

౧. మఱియుఁ జూడు. న్యా.భా ౧.౧.౧.

౨. తార్కికరక్షా

3. కౌటిల్యుఁడు తర్కయుక్తియను పేర ముప్పదిరెండు శాస్త్రపదము లను వాడినాఁడు. చరకసంహిత, సిద్ధిస్థానము ౧౨; సుశ్రుతసంహిత, ఉత్తర తంత్రము ౬౫ నందునీసంఖ్యయొసఁగబడినది. చరకసంహితలో అన్వీక్షకి భాగమునందు (విమానస్థానము ౮) వాదసూత్రములనుగూర్చి విస్తారముగా వివరింపఁబడెను.

చున్నాఁడు, ౪. ఛాందోగ్యోపనిషత్తు వాకోవాక్యమును ౫ స్మరించినది. వాకోవాక్యమనఁగాఁ దర్కశాస్త్రమని శంకరుఁ డర్థము చెప్పినాఁడు. ౬. మహాభారతము తర్కశాస్త్రమును, ఆన్వీ

౪. న్యాయసూత్ర గ్రంథకర్తకుఁ బూర్వము పెక్కురచయితలు విషయప్రదానమొనర్చియుండిరని డాక్టరు. విద్యాభూషణుఁ డభిప్రాయపడినాఁడు. దత్తాత్రేయుఁడు, పునర్వసుఆత్రేయుఁడు, సన్న్యాసినియైన సులాభా అష్టావక్రుఁడు మున్నగువారి నామములతోఁ దుదాహరించెను.

(భారతీయ తర్కశాస్త్ర చరిత్ర పుటలు ౯—౧౭)

౫. ౭౮ ౧, ౨.

౬. చూడు సుబాలోపనిషత్తు ౨౮ అర్వాచీనోపనిషత్తులు గొన్ని ప్రమాణశబ్దము ను శాస్త్రీయముగ వాడినవి. చూడు మైత్రి. ఉ ౬,౬,౨౪; నృసింహోత్తరతాపని ఉ ౮; సర్వోపనిషత్సారము. ౪; కాలాగ్నిరుద్రోపనిషత్తు. ౭; ముక్తికోపనిషత్తు. ౨. తైత్తిరీయారణ్యకమునందు, చతుర్విధజ్ఞానమార్గములుగా స్మృతి, ప్రత్యక్షము, ఐతిహాసము, అనుమానమునని చెప్పెను. మఱియుఁ జూడు. రామాయణము ౫కాం ౮౭,౨౩; మనువు ౧౨, ౧౦౫ అనేకన్యాయశాస్త్ర శబ్దభాగములు పూర్వగ్రంథములలోఁ గలవు. తర్కము (కఠో ఉ ౨,౯; మనువు ౧౨,౧౦౯; మ భా ౨,౧౫౩); వాదము (మనువు ౬,౫౦; రామాయణము ౧, ౧౩-౨౩; ౭-౫౩-౬౦) యుక్తి (ఐతరేయబ్రాహ్మణము ౬, ౨౩; రామాయణము ౨, ౧, ౧౩.) జల్పము (మ॥భా॥ ౧౩-౪౩౨౨) వితండము (మ॥ భా॥ ౨, ౧౩౧౦; ౭, ౩౦౨౨; పాణిని ౪, ౪, ౧౦౨.) ఛలము (మనువు ౮,౪౯; రామాయణము, ౪,౫౭, ౧౦) నిర్ణయము (మ॥భా॥ ౧౩-౭౫౫౩, ౭౫౩౫) ప్రయోజనము (మనువు ౭, ౧౦౦; మ॥భా॥ ౧, ౫౮౦౫.) ప్రమాణము(మనువు ౨,౧౩; రామాయణము ౨,౩౭,౨౧; మ॥భా ౧౩,౫౫,౭౨.) ప్రమేయము (రామాయణము ౧,౫౨ ౧౩; మ॥భా॥ ౧,౧౫౭:౭, ౧౪౧౯.) (చూడు విద్యాభూషణుని భారతీయ తర్కశాస్త్రచరిత్ర పు. ౨౩)

క్షకిని ౧. గూర్చిచెప్పి, నారదునకు న్యాయవాక్యమును, వైశేషికమందలి సంయోగానుమాన నియమములు దెలియుననియుఁ బలికెను. విశ్వనాథుఁడొక పురాణవాక్యము నుదాహరించి, వేదముయొక్క ఉపాంగములలో నొకటియని సూచించినాఁడు. ౨. బౌద్ధ తత్త్వము సంపూర్ణ తర్కసిద్ధమైనదైనను, ప్రాచీనప్రమాణగ్రంథములలోఁ దర్కమునొక శాస్త్రముగా సమన్వయించు ప్రయత్నములెవ్వియుఁ బొడచూపవు. కాని తర్కశాస్త్రకోవిదులైన వ్యక్తులస్మరణమున్నది. బ్రహ్మజాల సుత్తము తర్కియని విమర్శి 3 యని నామము లుచ్చరించెను. మజ్ఝిమనికాయమందలి "అనుమానసుత్త"మను నామములోని "అనుమానము"నకు "అనుమానప్రమాణ"మని యర్థమయి యుండవచ్చును. కథావత్థువు పతిన్న (ప్రతిజ్ఞ) ఉపనయనము, నిగ్గహము (నిగ్రహము) మున్నగుశబ్దములను దర్కార్థము లలోనే వాడియున్నది. ౪. "యమకము"నకు పదములవ్యాప్తి, వానిమార్పులను దెలియును. పతిసంహిదావగ్గము వస్తుశబ్దముల విభాగములను జెప్పుచున్నది. నెట్టిపకరణుఁడు తర్కసిద్ధాంతమును విశేషముగా నభినందించినాఁడు. మిళిందప్రశ్నములలో న్యాయశాస్త్రము "నీతి" యనుపేరఁ బరగెను. ౧. లలిత

౧. మ॥ భా॥ ౧,౭౦,౪౨;౧౨,౨౧౦,౨౨
౨. న్యాయసూత్రవృత్తి ౧,౧,౧.
3. మఱియుఁ జూడు ఉదానము ౬-౧౦
౪. మఱియుఁజూడు. విభంగము. పుటలు ౨౯3.
౧. యస్. బి. ఇ. పుటలు ౬-౭

విస్తారము తర్కమును హేతువిద్యయని పిలిచినది. తర్కశాస్త్ర మతిపురాతనమైనదని జైనాగమములు తలఁచినవి. ఆర్యరక్షితునిచే విరచితమైన "అనుయోగద్వారము" నందు (క్రీ. వె. ౧౦౦) గౌతమసూత్రమునందువలెనే పూర్వవత్, శేషవత్, సామాన్యతోదృష్టాయను ననుమానవిభాగము లుపయోగింపఁబడినవి. క్రీ. పూ. 3-వ శతాబ్దారంభమునందు జరిగిన పాటలీపుత్రపరిషత్తులో నిశ్చయింపఁబడిన జైనవేదాంగములలో నొకటైన భగవతీసూత్రమం దుదాహృతమైన యొక పూర్వగ్రంథమునకుఁ బునర్ముద్రణమువంటిదే ఆర్యరక్షితుని గ్రంథమని తోఁచును. అనుమానము త్రివిధమను సిద్ధాంతము క్రీ. పూ. 3-వ శతాబ్దమునకంటెఁ బూర్వమైనదై యుండవలెను.

బుద్ధునికిపూర్వమే న్యాయశాస్త్రారంభదశయై యుండవలెను. కాని శాస్త్రీయకల్పనము ప్రాచీనబౌద్ధకాలమునందును ముఖ్యసిద్ధాంతముల స్థాపనము క్రీ. పూ. మూడవశతాబ్దముకంటెను బ్రాచీనమునునై యుండవలెను. సూత్రరచనమునకుఁ బూర్వము న్యాయశాస్త్రము చరిత్రపూర్వకముగా మనకుఁ దెలిసినది స్వల్పము.

### 3–సారస్వతము – చరిత్ర.

న్యాయసారస్వత చరిత్ర యిరువది శతాబ్దములకుఁబైగా వ్యాపించియున్నది. భాగపంచకము, ప్రతిభాగమునకు రెండంతర్భాగములు గల గౌతమ న్యాయసూత్రము మొదటి తర్కగ్రంథము. ఉపపాదన, నిర్వచన, పరీక్షాపద్ధతుల నీగ్రంథ మనుసరించునని వాత్స్యాయనుఁడు చెప్పినాఁడు. ఇతరభాగ చతుష్ట

మునందు వివరింపవలసిన పదునారు విషయములను మొదటి భాగము సూచించును. రెండవభాగము సంశయస్వరూపమును ప్రమాణపద్ధతులు, వాని ఋజుత్వమును గూర్చి వివరించును. దేహాత్మేంద్రియములు, వాని విషయములు, జ్ఞానము, మనస్సు స్వరూపమును గూర్చి చర్చించునది మూడవభాగము. నాలుగవది, సంకల్పము, దుఃఖము, బాధ, మోక్షములను గూర్చి చెప్పును. కాకతాళన్యాయముగా నిది విపర్యయ సిద్ధాంతమును పూర్ణాంశసంబంధమును గూడఁ జర్చించును. తుదిభాగము జాతి (నిరాధారాక్షేపణము) నిగ్రహస్థానము (దూషణావకాశములు) లగూర్చి వివరించును. మతతత్త్వ సిద్ధాంతములతోఁ గూడిన తర్క-ప్రకరణమందు బ్రాహ్మణముల విజ్ఞానఫలితములను, మేళవించి, గౌతమసూత్రము తత్ఫలితముగా ఆస్తికమతమును దార్కికముగా సమర్థించినది. గౌతమ న్యాయములోఁ బూర్వసూత్రములు, పతంజలి వ్యాకరణ మహాభాష్యమున వివరించిన నవాహ్నికములు గలవు. ఆహ్నిక యుగమునకుఁ జెందిన క్రీ. పూ. మూడవ శతాబ్దమునాటివి; కాని కొన్ని న్యాయసూత్రములు మాత్రము క్రీస్తు కనంతర శతాబ్దములకుఁ జెందినవని చెప్పకతప్పదు౧.

౧. న్యాయసూత్రి, న్యాయభాష్యము లించుమించుగా సమకాలికము లేక నొకతరము భేదముగలవో యని జాకొబివిశ్వసించినాఁడు. శూన్యవాదము పెంపొందిన క్రీ. వె. రెండవశతాబ్దమునకును, విజ్ఞానవాదము స్థాపింపఁబడిన క్రీ.వె. ౪వ శతాబ్దమునకు మధ్యకాలమున కివి చెందునవి యాతఁడు భావించెను, (చూడు, జె,ఏ,ఓ,యస్,3౧,౧౯౧౧.పుట ౨-౧3) ఇంచుమించుగా క్రీ.వె. మూడవశతాబ్దమునకుఁ జెందిన నాగార్జునుని శూన్యవాదముల

గౌతమ న్యాయసూత్రములకు వాత్స్యాయనుని న్యాయ భాష్యము సుప్రసిద్ధప్రమాణభాష్యమై యున్నది. వాత్స్యాయనుఁడు గౌతముని యనంతరము వెనువెంటనే వచ్చినవాఁడు

---

వినిర్మితమే న్యాయసూత్రములందున్నది; క్రీ. వె. నాల్గవశతాబ్దమధ్యభాగము నకుఁజెందిన అసంగవసుబంధుల విజ్ఞానవాదఖండనము కాదని జాకోబీ యభిప్రాయము, కాని యీతని భావమును సమర్థించుట కష్టము. వాత్స్యాయనుఁడును, వాచస్పతియుఁగూడ (న్యా. సూ. ౪-౨-౨౬) విజ్ఞానవాదఖండనమే యని వచించి యున్నారు. శూన్యవాదనిరసనము న్యాయసూత్రములలోలేదని మనము చెప్పరాదు (పోల్చు. న్యా. సూ ౪,౧,౪౦;౪,౧,౪౮ మాధ్యమికకారిక ౧౫-౬;౭,౨౦. మఱియుఁ బోల్చు. న్యా. సూ. ౪,౧,౩౪-౩౫; చంద్రకీర్తి వృత్తి పు,౬౪-౭౧.) కాని శూన్యవాదము నాగార్జునునికిఁ బూర్వమేయున్నది; నాగార్జునునకు న్యాయశాస్త్ర పదపరిచయమున్నది. అతఁడణు సిద్ధాంతమును నిరసించినాఁడు. (పోల్చు. న్యా సూ. ౪,౨,౧౮-౨౪;౩౧-౩౨; మాధ్యమికకారిక ౭-౩౪; మఱియు న్యా. సూ ౩,౨,౧౧:౪,౧,౬,౪.) న్యా సూ. నాగార్జునునికిఁ బూర్వమును, మాధ్యమిక సంప్రదాయమున కనంతరమును నుండెనని మనము చెప్పవచ్చును. (మఱియుఁ జూడు, భారతీయతత్త్వశాస్త్రము. ప్రథమ భాగము, పు, ౬౪౩; యు.ఐ. వైశేషికతత్త్వము, పు.౭౫.) లంకావతారసూత్రము తార్కికులను నైయాయికులను స్మరించెను; కొన్ని సృష్టి భావములను నిరసించిన న్యా,సూ, పూర్వబౌద్ధదశకుఁ జెందినవని మనము మఱవకున్నచో, క్రీ. వె. ౩౦౦, లేక ౩౫౦ దఱకుఁజెప్పిన సువాలిపండితునిచే సమర్థింపఁబడిన జాకోబి నిర్ణయించిన కాలము చాలముందుకుఁ ద్రోయఁబడెనని చెప్పవచ్చును. (చూడు. యు.ఐ. వైశేషికత్వము, పు,౭౬.) క్రీ॥వె॥ ౧౭౦-౩౦౦ మధ్యకాలమున జీవించిన శబరుని సమకాలికుఁడైన పంచశిఖునికిఁ దెలియును గాన న్యా॥ సూ॥క్రీ॥ వె॥ ౧-వ శతాబ్దమునకుఁ జెందునని గార్బే భావమైయున్నది. గౌతముఁడు బాదరాయణ సూత్రపరిచయము గలవాఁడు (పోల్చు॥ న్యా॥ సూ॥ ౩, ౨,౧౪-౧౬—బా॥ సూ॥ ౨,౧, ౨౪) ఆతనికి జైమిని పూర్వమీమాంసతోడను బరిచయమున్నది. (చూడు। న్యా॥ సూ॥ ౨,౧,౬౧,౬౨; బోడస్. తర్కసంగ్ర

కాఁడని స్పష్టము. ఏలన గౌతముని పాఠశాలలోఁ జర్చింపఁబడి వాదముల ఫలితములను సంగ్రహించి చెప్పిన వార్తికలక్షణములు వాత్స్యాయనుని వాక్యములయందు నున్నవి. కొన్ని

---

హాముననుపోద్ఘాతము.) చూడు॥ వై॥సూ॥ 3,౨,౯; వై॥సూ॥ (౪,౧,౪-౫)లో నణువాదమును బాదరాయణుఁడు ఖండించెనని బోడాస్ నమ్మినాఁడు,(ఋతియుఁ బోల్చు॥ న్యా॥ సూ॥ 3,౧,౨౪-3౦) ఆత్మ శ్రుతిప్రమాణమువలన నే తెలియుననను వేదాంతసిద్ధాంతమిందు సూచితము, అట్లే, వై॥సూ॥ ౪,౨,౨-3 బా॥సూ॥ ౨,౨,౨౧-౨౨ నను వ్యతిరేకముగా దేహము భూతపంచకము లేక భూతత్రియ సమ్మేళనజాతమని చెప్పును, గౌతముఁడు చాలచోటులందు సరిగా బాదరాయణుని భావముల ననుసరించును, చూడు, న్యా॥ సూ॥ ౪,౧, ౬౪, 3,౨,౧౪-౧౬ బ్రహ్మసూత్రములలోఁగాని, మాధ్యమికసూత్రములలోఁగాని,న్యాయసూత్రప్రత్యక్షస్మరణమే లేదని కొన్ని వేళలఁజెప్పఁబడెను. గౌతమునిశిష్యుఁడని ప్రసిద్ధిపొందిన వ్యాసుఁడు ముఖ్యముగా న్యాయసిద్ధాంతమీశ్వరు నంగీకరించును గావున ఖండింపనవసరము లేదని తలఁచి యుండవచ్చును. మఱియు బా. సూ. ౨, ౧, ౧౧ - ౧3, ఈశ్వరాస్తిత్వమును దర్కముచే స్థాపించున్యాయపద్ధతి నామోదింపదని కొందరుచెప్పుదురు. అణుసిద్ధాంతములు అసత్కార్యవాదము బా॥ సూ॥ లలోఁ జర్చింపఁబడెను: ౨,౨,౧౦-౧౬; ౨ ౧,౧౫-౨౦. న్యాయసూత్రకాలనిర్ణయమున నుపకరించు వాక్యములెవ్వియుఁ బూర్వబౌద్ధగ్రంథములందుఁ గానరావు. కాత్యాయనుఁడు (క్రీ॥పూ॥ ౪౦౦) పతంజలి (ఇతనియుద్గ్రంథము రమారమి క్రీ॥పూ॥ ౧౫౦ ప్రాంతమున రచింపఁబడెను.) న్యాయదర్శనము నెఱుగుదురు. చూడు గోల్డుస్టూకరు పాణిని. మీమాంసద్వయముపై భాష్యములు రచించిన ఉపవర్షుఁడు, న్యాయసిద్ధాంత పరిచయముగలవాఁడని, యీతనివాక్యము లుదాహరించిన శబరునివలనఁ దెలియుచున్నది. హరివర్మ (క్రీ॥వె॥ ౨౬౦) న్యాయశాస్త్రమునందలి పదునారు విషయముల నెఱుగును. శ్వఘోషుఁడు పంచావయవ తర్కవాక్యమునే యుపయోగించెను. చూడు. యు. ఐ. వైశేషికతత్త్వము. పుటలు ౫౬; ౭౧. అందుచే నీరూపములలోఁ గాకున్నను, న్యా.సూ. క్రీ॥పూ॥ ౪-వ శతాబ్దములో

సూత్రములకు వాత్స్యాయనుఁడు భిన్నార్థముల నిచ్చెను. దీని వలన నీతనికిఁ బూర్వము భాష్యకారులు పెక్కుమంది గల రనియు సూత్రార్థనిర్ణయములో వారి కేకీభావము కుదురలే

నున్నదని తెలియుచున్నది. యమ్. యమ్. హరప్రసాదశాస్త్రి యిట్లు చెప్పి నాఁడు: "న్యా॥ సూత్రమిప్పటిస్థితికి వచ్చుట కనేక పూర్వముద్రణములు మార్పులుఁ బొందలేదని చెప్పఁజాలను." (జె. ఎ. యస్ ఆఫ్ బెంగాల్ ౧౯౦౫ పుట ౧౫౭; చూడుము పు. ౨౮౫); తన న్యాయసూచీయందును, న్యాయసూత్రోద్ధారమునందును సూత్రములను సమకూర్చుటకు రెండుమారులు ప్రయత్నించియుండుటచే న్యా॥సూ॥ నిరుష్టాధికారమును శంకించినట్లగుచున్నది. గౌతముఁడు న్యా. సూ. ప్రథమ ప్రకరణమునుమాత్రమే రచించెననియు, క్రీ॥పూ॥ ౬-వ శతాబ్దములో మిథిలానగరమున జీవించి ధర్మసూత్రములు రచించిన గౌతముఁడీతఁడేయనియు నీతఁడు బుద్ధుని సమకాలికుఁడనియు డాక్టరు విద్యాభూషణు నభిప్రాయమైయున్నది. (చూడుము యస్.బి. హెచ్చి. న్యా॥ సూ॥ పుటలు ౫-౮; భండార్కరు స్మృతి వాల్యుము పుటలు౧౬-౧-౧౬౨.) గౌతముని మొచటిభావములు (చరకసంహిత; విమానస్థానము ౮అ) లోనివేయని యూతనిభావము. న్యా.సూ. లును, చరకసంహితయుఁ బాల వరకు సమానభావములను గలిగియున్నవి; కాని "వైశేషికప్రమాణములను న్యాయసిద్ధాంతములను స్మరించిన చరకసంహితవలన న్యా. సూ. కాలనిర్ణయమునకు విశేషప్రయోజనములేదు; ఏలనఁ జరకసంహిత పెక్కుమార్పులను బొందినదగుటయే కాక దానికాలమును సందేహాస్పదమే" యని చెప్పఁబడెను. (ఐ.యల్.ఎ. పుట ౧౩)

న్యా.సూ. లకు గౌతముఁడు కర్తయా యనువిషయమును శంకింపఁబడినది. వాత్స్యాయనుఁడు, ఉద్ద్యోతకరుఁడు, మాధవుఁడునుగూడ న్యా.సూ. కర్త అక్షపాదుఁడనిరి. దీనికి వాచస్పతి జయంతు లంగీకరించిరి. పద్మపురాణము (ఉత్తరఖండము ౨౬౩) స్కాందపురాణము (కాళికాఖండము ౧౭అ) న్యా.సూ. కర్త గౌతముఁడేయని చెప్పినవి. విశ్వనాథుఁ డీభావమునే తెలిపెను. హిందూసంప్రదాయమునననుసరించి గౌతముఁడే అక్షపాదుఁడనగాఁ

దనియుఁ దెలియుచున్నది. మఱియు గౌతముఁడు సనాతన ఋషి యని వాత్స్యాయనుఁడు చెప్పి, పతంజలి మహాభాష్య

---

పాదములయందు నేత్రములుగలవాఁడు. గౌతముఁడు ధ్యానసమాధిఁ దుండై యొకతరి నూతఁబడిపోయెననియు నట్టిప్రమాదములు కాకుండ గౌతముని పాదములకు దర్శనశక్తి నిచ్చి భగవానుఁడు కృపఁజూపెననియు నొకకథయున్నది. "గౌతముఁడు, అక్షపాదుఁడునుగూడ న్యా.సూ. రచనకుఁ దోడ్పడిరని తోఁచును. న్యా.సూ. ముఖ్యముగా నైదువిషయములను దెలుపును. (౧) ప్రమాణము (౨) ప్రమేయము (౩) వాదము (౪) అవయవము (౫) అన్యమతపరీక్ష. (౨) (౩) ను (౧ పూర్వరూపమునను బ్రాహ్మణ బౌద్ధ జైన మతగ్రంథములలో విపులముగా నుదాహృతములు; వీని నాధారముగాఁ జేసికొని గౌతముఁడు తన ఆన్వీక్షకీవిద్యఁ గల్పించియుండవచ్చును. దీనితుది రూపమే న్యా.సూ. గౌతముని ఆన్వీక్షకీవిద్యనుండి విశేషసామగ్రిని దీసికొని న్యా.సూ. నిజముగా రచించినవాఁ డక్షపాదుఁడు." ఇట్టి విద్యాభూషణుని భావము సంప్రదాయవిరుద్ధము. (హిస్టరీ ఆఫ్ ఇండియన్ లాజిక్సు పుటలు ౪౯-౫౦). ఈభావము కేవలమూహాకల్పితము; దీనిని సత్యమనియు నసత్యమనియుఁగూడఁ జెప్పఁజాలము. ధర్మసూత్రకర్త యీగౌతముఁడేయని చెప్పుటయే కాక, రామాయణమునందలి అహల్యాగాథలోని గౌతముఁడీతఁడేయనియుఁగూడ జెప్పుదురు. మ॥భా॥ శాంతిపర్వము ౨౬౫,౪౫ ననుసరించి మేధాతిథి గౌతమునికింకొక పేరు. భాసుఁడు తన ప్రతిమానాటకములో న్యాయదర్శనకర్త మేధాతిథియని రచించినాడు: "మానవీయమ్ ధర్మశాస్త్రమ్, మాహేశ్వరమ్ యోగశాస్త్రమ్, బార్హస్పత్యమర్థశాస్త్రమ్, మేధాతిథిర్న్యాయశాస్త్రమ్" (౫-వ అంకము) చూడు హిస్టరీ ఆఫ్ ఇండియన్ లాజిక్సు పు ౭౬౬.

౧. చూడు న్యా.భా. ౧,౧,౫; ౧,౧,౩౭; ౧,౨,౯ లలో నితర భాష్యకారులను మామూలుగానుపయోగించు పదములతో వాత్స్యాయనుఁడు స్మరించినాఁడు; ఏకే, కేచిత్, అన్యే, చూడు మ॥భా॥ ఆదిపర్వము ౪౨-౪౪

మును, కౌటిల్యార్థశాస్త్రమును౧. వైశేషికసూత్రమును౨ నుదాహరించియున్నాఁడు. ఉపాయకౌశల్యము, విగ్రహ వ్యావర్తని గ్రంథకర్తయగు నాగార్జునుఁడు వాత్స్యాయనునకుఁ దప్పక పూర్వుఁడు. ఏలన వాత్స్యాయనుఁడు నాగార్జున సిద్ధాంతములను ఖండించెను. వాత్స్యాయనుని వివరణమును, బౌద్ధదృక్పథము ననుసరించి, దిఙ్నాగుఁడు విమర్శించినాఁడు. ఇట్టి సాక్ష్యములవలన క్రీ. పూ. ౪౦౦ లకుఁ బూర్వము వాత్స్యాయనుఁ డుండెనని మనము నిశ్చయింపనగును౩.

టిబెట్టు భాషానువాదములలో జాగ్రత్తచేయఁబడిన నాగార్జునుని గ్రంథములు ప్రమాణసముచ్చయము, దానికి గ్రంథకర్తచే స్వీయ విరచిత భాష్యము, న్యాయప్రవేశము, హేతుచక్రహమరు, ఆలంబనపరీక్ష, ప్రమాణశాస్త్రప్రవేశ

౧. న్యాయ,భా. ౧,౧,౧; అర్థశాస్త్రము ౧౧; న్యా,భా,౫,౧,౧౦; మహాభాష్యము, ౧,౧,౩.

౨. పోల్చు,వై,సూ, ౪,౧,౬–న్యా,భా,౩,౧,౩౩; ౩,౧,౬౭; వైశే, సూ, ౩,౧,౧౬–న్యా,భా, ౨,౨,౩౪.

౩. వాత్స్యాయనుఁడు క్రీ॥పూ॥ నాల్గశతాబ్దమధ్యభాగమునకుఁ జెందిన దక్షిణభారతీయుఁడని డాక్టరు విద్యాభూషణుఁడు తలఁచెను. (హిస్టరీ ఆఫ్ ఇండియన్ లాజిక్కు) పుటలు ౪౨, ౧౧౬-౧౧౭; ఎ, ౧౯౧౫, ఆర్టు. ఆన్ వాత్స్యాయన) కీత్తున,బోడన్ పండితులీభావము లంగీకరింతురు, కాని, జాకోబియు సువాలియు నాతనికాలము ౬-వ శతాబ్దారంభమో, యింకను గొంత పూర్వమోయని తలఁచిరి. వాత్స్యాయనునకు మహాయానక్షణికవాదము,శూన్యవాదము మున్నగునవి తెలియునుగాననాతఁడు నాగార్జునార్యదేవుల కర్వాచీనుఁడని హరప్రసాదశాస్త్రి భావించెను.(చూడు,జె,ఏ,యస్,(ఆఫ్ బెంగాల్ ౧౯౦౫; పుటలు ౧౨౪-౨౯.)

మును గలవు. ఇవి జపానులో జనాదరణపాత్రత గన్నవని చెప్పుదురు౪. దిఙ్నాగుఁడు క్రీ. వె. ౫-వ శతాబ్దమునకుఁ జెందిన వాఁడు.౧. తర్క-సిద్ధాంతమునందుఁ ప్రశస్తపాదునిచే గల్పితము లైన పెక్కు-ముఖ్యములగు మార్పులు దిఙ్నాగుని వందురు, ప్రశస్తపాదుఁడు దిఙ్నాగునికిఁ బూర్వుఁడని చెప్పినచో దిఙ్నాగుని సహజప్రతిభకుఁ గొంతలోపము సంభవించును.

ఉద్ద్యోతకరుని న్యాయవార్తికము౨(క్రీ.వె. ౬౦౦) దిఙ్నాగుని శాత్స్యాయన మతవిమర్శనమునకు ఖండనము.ధర్మకీర్తి న్యాయ

---

౪. ఈగ్రంథవిషయములుగొన్ని విద్యాభూషణుని హిస్టరీ ఆఫ్ ఇండియన్ లాజిక్కు,పుటలు ౨౭౬-౨౯౯ నుండియు,ఉద్ద్యోతకరుఁడు తనన్యాయవార్తికములో నుదాహరించిన దిఙ్నాగుని భావములవలనను దెలిసి కొనవచ్చును.

౧. తారనాథుని బౌద్ధచరిత్ర మిట్లుచెప్పును. దిఙ్నాగుఁడు కాంజీవరములోనొక బ్రాహ్మణపుత్రుఁడు; హీనయానధర్మములం దాతఁడుచిరకాలము లోఁబండితుఁడై, తరువాత వసుబంధునొద్దనుండి మహాయానమతమును గూడ గ్రహించెను.యువాన్ చ్వాంగు సాక్ష్యమననుసరించి,వసుబంధువు బౌద్ధుఁడు కాకపూర్వమే హిందువుల షడ్దర్శనములను, బౌద్ధులఅష్టాదశశాఖలను బాగుగా నభ్యసించియుండెను. వసుబంధువు క్రీ॥ వె॥ ౪ వ శతాబ్దపూర్వార్ధమునకుఁ జెందునని నిర్ణయింపఁబడెను; దీనికిఁగొంతపూర్వము దిఙ్నాగుఁడుండి యుండవలెను,తనమేఘదూతలోఁ గాళిదాసు 3 దిఙ్నాగుని స్మరించినవిషయము దీనికి సరిపోవును; ఏలనఁ గాళిదాసుఁడీకాలమునకుఁ జెందినవాఁడే, (చూడు, కీత్, క్లాసికల్ శాన్స్క్రిట్ లిటరేచర్, పుటలు ౩౧-౩౩;భారతీయతత్త్వశాస్త్రము, పు, ౬౨౪.)

౨. న్యాయశాస్త్రసంరక్షుఁ డుద్ద్యోతకరుఁడని సుబంధువిరచితవాసవదత్తలో సూచింపఁబడినది. చూడు(హాల్సు ఎడిషన్ పు.౨౩౫)క్రీ॥వె॥౬౨౯-౬౪౪ లో స్థానేశ్వరచక్రవర్తియగు హర్షునికాలమున బాణుని హర్షచరిత్రము రచింపఁబడెను,యువాన్ చ్వాంగు నాకాలముననే భారతవర్షయాత్రచేసెను.

బిందువు దిఙ్నాగుని మతమును విమర్శించిన ఉద్ద్యోతకరమత ఖండనము. ఉద్ద్యోతకరుఁడు[3] దాహరించిన 'వాదవిధి' యను గ్రంథము ధర్మకీర్తి విరచితవాద న్యాయమనియుఁ, దనన్యాయ బిందు[౪]గ్రంథమున ధర్మకీర్తి యుదాహరించిన శాస్త్రముద్ద్యోత కరుని వార్తికమనియు మనము నిశ్చయించినచో నవుడీ రచ యిత లిరువురును సమకాలికులని చెప్పవచ్చును. తుదకు ధర్మ కీర్తి కాలము ౭-వ శతాబ్దారంభమని చెప్పవచ్చును.[౫] ౯-వ శతాబ్దమున ధర్మోత్తరుఁడు తన న్యాయ బిందుటీకలో దిఙ్నా గుని, ధర్మకీర్తిని ననుసరించెను.

౯-వ శతాబ్దప్రథమార్థమునందు, వాచస్పతి న్యాయ వార్తిక తాత్పర్యటీక రచించి, న్యాయదర్శనముయొక్క సంప్ర దాయార్థమును దిరిగి స్థాపించెను. ఆతఁడింకను న్యాయశాస్త్ర మును గూర్చి రెండు చిన్నగ్రంథములను రచించెను: న్యాయ సూచీనిబంధము; న్యాయసూత్రోద్ధారము.[౧] ఈతఁడు సర్వ

---

హర్షచరిత్రము వాసవదత్తను స్మరించును గాన నుద్ద్యోతకరుఁడు ౬-వ శతాబ్దమునకుఁ జెందెననుట యుక్తముగా నుండును, ఉద్ద్యోతకరుఁడు భారద్వాజ గోత్రుఁడు పాశుపతశాఖీయుఁడు.

3. న్యా,వా, ౧,33.

౪. న్యాయబిందువు, 3, పీటర్సన్ను ఎడిషన్ పుటలు ౧౧౦-౧౧౧

౫ ఇత్సింగు వీనిని స్మరించెను, చూడు తకాకుసు, ఇత్సింగు,పు,౫౮.

౧. న్యాయసూత్రోద్ధార కర్త యితఁడు కాఁడనియు ౧౫-వ శతాబ్దమునకుఁ జెందిన యింకొకఁడనియుఁ గొందఱుసూచించిరి. వాచస్పతి తన న్యాయ సూచిగ్రంథమును ౮౯౮ లో రచించినట్లుచెప్పినాఁడు. ఇది విక్రమశకవర్షమై యుండును; అనఁగా క్రీ॥వె॥ ౮౪౧ (క్రీ॥వె॥ ౧౦౦౦) బౌద్ధతార్కికుఁడగు రత్నకీర్తి కితఁడు పూర్వుఁడనుటలో సందేహములేదు.

తోముఖప్రజ్ఞాన్వితుఁడు; ప్రమాణాధికారముగల యితర తత్త్వములను గూర్చి గ్రంథములను రచించినాఁడు: అద్వైతవేదాంతమును గూర్చి భామతి; సాంఖ్యమతముచుగూర్చి సాంఖ్యతత్త్వకౌముది; అందుచే నితనికి సర్వతంత్రస్వతంత్రుఁడనియు, షడ్దర్శన వల్లభుఁడనియు బిరుదములు గలవు. వాచస్పతి గ్రంథమునకు 'తాత్పర్యపరిశుద్ధి' యను నుదయనుని గ్రంథమమూల్యమైన భాష్యమైయున్నది. ఆతని ఆత్మతత్త్వవివేకము ఆత్మ నిత్యమను సిద్ధాంతమును బోధించునదియు, ఆర్యకీర్తి మున్నగు బౌద్ధవాదుల విమర్శనమునై యున్నది. ఆతని కుసుమాంజలి న్యాయ ప్రతిపాదితమైన ఆస్తికతత్త్వమును సశాస్త్రీయముగఁ బ్రకటించిన మొట్టమొదటి గ్రంథము,౨. కిరణావలి, న్యాయ పరిశిష్టములాతని యితర రచనములు. జయంతుని న్యాయమంజరి న్యాయసూత్రమునకు స్వతంత్రమైన భాష్యము. వాచస్పతి నుదాహరించిన జయంతుని రత్నప్రభ, దేవసూరియు నుదాహరించిరి; ఇతఁడు పదవశతాబ్దమువాఁడు,3. భాసర్వజ్ఞుని న్యాయసారము, న్యాయతత్త్వ వివరణము. ప్రత్యక్షాను మానశబ్దప్రమాణముల నాతఁడంగీకరించి,ఉపమాన మొక స్వతంత్ర ప్రమా

౨. తా నాస్తికమతమునకుఁ జేసిన సేవకు భగవంతుఁడు తనకుఁ గృపఁ జూపలేదనియెంచి, దేవునిట్లు సంబోధించెనని చెప్పుదురు: "బౌద్ధులు సర్వాక్రికారులై వెలిగినపుడు నీయస్తిత్వ మెవనిపై నాధారపడియుండెనో యట్టి నన్ను, నేఁడు నీ వైశ్వర్యప్రమత్తుఁడవై నిరసించినావు."

"ఐశ్వర్యమదమత్తో౽సి మామవజ్ఞాయవర్తతే
పరాక్రాంతేషు బౌద్ధేషు మదధీనా తవస్థితిః।

3. చూడుము, హిస్టరీ ఆఫ్ ఇండియన్ లాజిక్ — పుట ౧౪౭.

ణముగాదని త్రోసిపుచ్చినాఁడు, ఆతఁడు కాశ్మీరశాఖకుఁ జెందిన శైవుఁడు, ౧౦-వ శతాబ్దమువాఁడు, వర్ధమానుని న్యాయనిబంధప్రకాశము (క్రీ. వె. ౧౨౨౫) అభినవశాఖాస్థాపకుఁడును దండిప్రయునైన గంగేశుని భావములను గూర్చినను, ఉదయనుని న్యాయ తాత్పర్యపరిశుద్ధికి భాష్యమైయున్నది. రుచిదత్తవిరచిత 'మకరందము' (క్రీ. వె. ౧౨౭౫) వర్ధమానుని భావములను విస్తరించెను.

అనంతరన్యాయగ్రంథములు వైశేషికప్రమాణములను ప్రత్యక్షముగా నంగీకరించి వానిని ప్రమేయముక్రిందనో, ప్రమేయస్వరూపములైన పదిరెండులో నొకటగు నర్థముక్రిందనో వచించిరి. వరదరాజవిరచిత తార్కికరక్ష (క్రీ. వె. ౧౨౦౦) యొకముఖ్యగ్రంథము. న్యాయశాస్త్రముయొక్క ద్వాదశవిషయములను, వైశేషికముయొక్క ఆరుప్రమాణములను ప్రమేయముక్రింది కీతఁడు తీసికొనివచ్చెను. కేశవమిశ్రుని 'తర్కభాష' (౧౩-వ శతాబ్దాంతము) న్యాయవైశేషికభావములను సమ్మిళితమొనర్చెను.౧

ముఖ్యములైన జైనతర్కగ్రంథములు: భద్రబాహువు దశవైకాలికనిర్యుక్తి (క్రీ. పూ. ౩౫౭) సిద్ధసేనదివాకరుని న్యాయావతారము (క్రీ. వె. ౬౦౦) మాణిక్యనందిపరీక్షాముఖసూత్రము (క్రీ. వె. ౮౦౦), దేవసూరి ప్రమాణనయతత్త్వాలోకాలంకారము (క్రీ. వె. ౧౨-వ శతాబ్దము) ప్రభాచంద్రుని ప్రమేయకమలమార్తాండము. జైనబౌద్ధవిజ్ఞానవేత్తలు హిందువులవలె

౧. దీనిని డాక్టరు ఝా అనువదించెను; ఇండియన్ థాట్ వాల్యుము ౨.

మతతత్త్వములలోఁ దర్కమునుగలిపివేయక వేరుగా నీశాస్త్ర మును బెంపొందించిరి. హిందువుల న్యాయగ్రంథములు, అణువులు, అణులక్షణములు, ఆత్మ,పునర్జన్మ, ఈశ్వరుఁడు, జగత్తు, మున్నగు విషయములతోఁబాటు జ్ఞానపరిమితి, జ్ఞానస్వరూప సిద్ధాంతములను జర్చించినవి. బౌద్ధజైనతార్కికులు తత్త్వవిషయములయం దాదరములేనివారై కేవల తార్కికవిషయములకే ప్రాముఖ్యమిచ్చి నేటిపరిశుద్ధమైన తర్కశాస్త్రమునకు మార్గదర్శకులైరి.

గంగేశుని 'తత్త్వచింతామణి' అభినవతర్కమునకు ముఖ్య ప్రమాణపఠనగ్రంథము౨. గంగేశుని కుమారుఁడు వర్ధమానుఁడు పితృ సంప్రదాయములనే తనగ్రంథములలో ననుసరించెను. 'ఆలోక' మను పేరజయదేవుఁడు తత్త్వచింతామణికి వ్యాఖ్యవ్రాసినాఁడు (౧౩-వ శతాబ్దము). ౧౫-వ శతాబ్దాంతమునకుఁ గాని, పదునారవ శతాబ్దప్రారంభమునకుఁగాని చెందిన నవద్వీపకళాశాలలో నుత్తమగ్రంథముగాఁ బరిగణింపఁబడిన తర్కచింతామణివ్యాఖ్యను వాసుదేవసార్వభౌముఁడు రచించెను. ఇతఁడు సుప్రసిద్ధులగు శిష్యులనుగాంచిన యదృష్టవంతుఁడు; సుప్రసిద్ధ వైష్ణవసంస్కర్తయగు చైతన్యుఁడు; విశ్రుతకీర్తియుఁ దర్కపండి

---

౨. ఈగ్రంథవిషయమును విద్యాభూషణుఁడు సంగ్రహముగాఁ దన హిస్టరీ ఆఫ్ ఇండియన్ లాజిక్ పుట (౪౦౭-౪౫౩) లలో నిచ్చెను. గంగేశుఁడు మిథిలానగరమునందు ౧౨-వ శతాబ్దాంతమందు జీవించెనని యాతని యుదయనుని గ్రంథములతోడి పరిచయమువలనను, శివాదిత్యుని, హర్షునివాక్యముల నాతఁ డుదాహరించుటవలనను దెలియుచున్నది. తత్త్వచింతామణిలో (౨ ఆం.పు. ౨౩౩) శ్రీహర్షునిభావములు ఖండింపఁబడెను.

తుఁడును, 'దీధితి', 'పదార్థఖండన'౧ గ్రంథకర్తయునగు రఘునాథుఁడు; విఖ్యాతధర్మశాస్త్రకోవిదుఁడగు రఘునందనుఁడు; తంత్రకర్మకాండలో నధికారపండితుఁడగు కృష్ణానందుఁడు. గంగేశుఁడు నాలుగుప్రమాణములనుగూర్చియే రచించి, తత్త్వవిషయప్రసక్తి యేమియుఁ బెట్టుకొనకున్నను, రఘునాథుఁడు వేదాంతవిషయములందుఁగూడ నభిమానముఁ జూపెను. జగదీశుఁడు (౧౬-వ శతాబ్దాంతము) గదాధరుఁడు (౧౭-వ శతాబ్దము) నిరువురు నీశాఖలకుఁ జెందినవారే. ఆంధ్రబ్రాహ్మణుఁడైన అన్నంభట్టు,౨ (౧౭-వ శతాబ్దము) సనాతననాధునాతన న్యాయశాస్త్రములనుండియు, వైశేషిక సూత్రములనుండియు నొక సక్రమన్యాయశాస్త్రమును గల్పింప యత్నించినాఁడు. కాని యితనిభావములు పురాతనశాస్త్రానుకూలములే. అతని గ్రంథములైన 'తర్కసంగ్రహము' 'తర్కదీపిక' న్యాయవైశేషికశాఖకుఁ జెందిన ప్రముఖపఠనగ్రంథములు. వల్లభుని న్యాయ......... విశ్వనాథుని న్యాయసూత్రవృత్తి (౧౭-వ శతాబ్దము) విలువగల యితరగ్రంథములు.3.

---

౧. ఈ వైశేషికతత్త్వవిమర్శనము పదార్థనిరూపణము'ను పేర 'పండిట్ (౨౮-౨౯) లోఁ బ్రచురింపఁబడెను.

౨. హిస్టరీ ఆఫ్ ఇండియన్ లాజిక్కు పు. 3౮౮.

3. చైనా జపానులలోని హిందూధర్మశాస్త్రచరిత్రవిషయమునకుఁ జూడు. సుగ్రీవుఁడు; చైనాజపానులలోఁ బోషింపఁబడిన హిందూతర్కశాస్త్రము

భారతీయ తర్కవిద్యావికాసములలో భిన్నదశలు గుర్తింపవచ్చును. మనకు మొదటిది ఆన్వీక్షికి. దీనికి మహాభారతమున న్యాయమునకు వేరుగానొక స్థానమీయఁ బడెను. అచిరకాలములో నది న్యాయముతోఁ గలిసినది; ప్రాచీనప్రమాణగ్రంథములలోఁ దర్కసిద్ధాంతముతోఁ బాటు ప్రపంచమును గూర్చిన తత్త్వభావములు గూడ నున్నవి. వాత్స్యాయనుఁడిట్లు చెప్పెను; "పరమశ్రేయమును బొందుటకీదిగువ విషయములను బూర్తిగా నెఱుఁగవలెను: (౧) పరిహరింపఁదగినది (దుఃఖము, అవిద్యారూపములైన తత్కారణములు, ఫలితములు,) (౨) దుఃఖనిర్మూలనహేతువు అనగా జ్ఞానము, (3) దుఃఖనిర్మూలన సాధనము లనగా, తత్త్వగ్రంథములు (౪) పరమావధి లేక పరమశ్రేయము."౧. ప్రాచీన న్యాయశాస్త్రము తర్కవిషయములను జర్చించినదిగాని, తర్కము కొఱకుఁగాదు. జైనబౌద్ధశాస్త్రవేత్తలరచనలు దృష్టిలో మార్పులను గలుఁగజేసినవి. అభినవ న్యాయశాస్త్రము, కేవల జ్ఞానసిద్ధాంతమును గూర్చియే చెప్పెను గాని, తర్కజీవిత సంబంధములను మఱచినది. ప్రాచీన నైయాయికుఁడు తర్కమునకుఁ దత్త్వమునకుఁగలసంబంధము నధికముగా గ్రహించినాఁడు. తర్కశాస్త్రము విజ్ఞానమునకు విజ్ఞానవిషయముతో సంబంధమును గూర్చిన ప్రమాణరూపములను మాత్రమే కనుగొనెను. అభినవ నైయాయికుఁడు జ్ఞానసాధనమైన ప్రమాణమునుగూర్చియు నిర్వచనసిద్ధాంతమునుగూర్చియు నధికశ్రద్ధబూని, విజ్ఞానవిషయ

---

౧. న్యా॥ భా॥ ౧. ౧. ౧.

మైన ప్రమేయమును౨ బూర్తిగా విడిచిపెట్టును. గంగేశు ననంతరము బయలుదేరిన తార్కికుల యుక్తిప్రయుక్తులు, నిశిత ప్రజ్ఞావాదచాతుర్యములు పాఠకులకు భయముగొలిపి, శాస్త్ర పరిచితిగలవారికైనను వారిభావములు దురూహ్యములై కన్పట్టును. ఈగ్రంథమహాసాగరము నీఁదినవారు వారి విచిత్రవాద గరిమకు దిగ్భ్రాంతులై, జ్ఞానజ్యోతిని దర్శింపలేక చీఁకటిలోనే తడవులాడిరి. అతిసులభవిషయముల నత్యంతసూక్ష్మవాదములతో నాచ్ఛాదించిరి. భేదములనుదీయుటయందు సహజాసక్తిగల తార్కికబుద్ధి, సూత్రజాలములను బేధించునదై జ్ఞానరహితమైనదగును. శాస్త్రవిషయపరిశీలనముపోయి శాస్త్రపదజాల వివరణము మిగులును. భేదములను గుర్తించుటకుఁ గల్పితములైన శబ్దములు, కొన్నిసమయములలోఁ దమలోపములను గప్పిపుచ్చుట కుపయోగించిరి. ఈ గ్రంథములలోఁ గొన్నిటివిషయములోఁ దమకుఁ దెలియనివిషయములఁగూర్చి గొప్పపాండిత్యమును బ్రదర్శించినవని చెప్పవచ్చును. తమ బుద్ధియను పిండిమర చాలస్వల్పముగానే పనిచేయునని నమ్మువారైనను, దానికున్నశక్తికి సరిపోవుబియ్యమైనను నిత్యమును సమకూరుటలేదని యంగీకరింపక తప్పదు.౧ నవ్యన్యాయము

---

౨. లక్షణప్రమాణాభ్యామ్ వస్తుసిద్ధిః

౧. పోల్చు. బోడస్: తర్కసంగ్రహము పుట౧; కీత్. ఐ.యల్.ఎ. పుట3౫. డాక్టరు విద్యాభూషణుఁడు న్యాయతత్త్వచరిత్రకాలమును మూడుభాగములుగా విభజించినాఁడు. ప్రాచీనదశ (క్రీ॥పూ॥ ౬౫౦-క్రీ॥వె॥౧౦౦౦) మధ్యమదశ; (క్రీ॥వె॥ ౧౨౦౦ వఱకును) అభినవదశ (క్రీ॥వె॥ ౯౦౦ నుండి,)

బుద్ధిని పదనుపట్టుట కొరకపిడిరాయివలెఁ బనికివచ్చుననుమాటలో సత్యము లేదు.

### ౪—న్యాయదర్శన పరిమితి

న్యాయమనగా నేది మనస్సునిర్ణయముచేయుటకుఁ దోడ్పడునో అది న్యాయము.౨. 'న్యాయ' మను నదొక వాదమునకు నామాంతరమైనది. ఇతరదర్శనములకంటె నధికముగా నీవాదములగూర్చి నిర్వచించునదే న్యాయదర్శనమని పేర్కొనఁబడినది. వాదము లుచితములు, అనుచితములు. వాడుకలో "న్యాయ'మనగా ధర్మమైనది లేక తప్పులేనిది. అందుచే న్యాయమనగా నిర్దుష్టమైన వాదశాస్త్రమను భావమేర్పడెను. సంకుచితార్థములలో న్యాయమనగాఁ దర్కవాదమని భావము. ౧. విశాలార్థములో వస్తువులను ప్రమాణములచేఁ బరిశీలించుటే న్యాయమని గుర్తింపఁబడెను.అందుచేనిది ప్రమాణశాస్త్రమైనది.

---

చూడు హిస్టరీ ఆఫ్ ఇండియన్ లాజిక్ పుట౧౩. అభినవన్యాయలక్షణమును దెలిసికొనుటకు చూడు డాక్టరు శైలేశ్వరసేను విరచితమైన ఎ స్టడీ ఆఫ్ మధురానాథ తత్త్వచింతామణి రహస్యము ౧౯-౨౪.

౨. నీయతే అనేన ఇతిన్యాయః

౧. న్యాయ. భా. ౧.౧.౧. ఒకతర్కవాక్యములోని పంచావయవములను గలిగిన నిగమనము లేక నిర్ణయమునకు 'పరమన్యాయ' మని వాత్స్యాయనుఁడు వాడినాఁడు. దానికే జిజ్ఞాసుఁడు న్యాయావయవములని వాడెను. చూడు న్యా॥వా॥ ౪ ౧.౧౪. వాచస్పతిన్యాయసూచి యందీప్రకరణమును (౧౧.౩౨,౩౯) న్యాయప్రకరణమని పేర్కొనెను. విశ్వనాథుఁడు న్యాయస్వరూపమనెను. చూడు న్యాయసూత్రవృత్తి (౧.౧.౨౫.౧.౧.౩౧; ౧.౧ ౩౮; ౧,౧.౪౦) మాధవుఁడు (స.త.సం.౧౧) దీనినే అనుమానమని యుక్తరుబ కొఱకు వాడినాఁడు.

జ్ఞానము లక్షణచతుష్టయ శీలముగలది. (౧) ప్రమాత (౨) ప్రమేయము (3) ప్రమితి (౪) ప్రమాణము. ౨. ప్రతి జ్ఞానక్రియయందును, దోషసహితమైనను, దోషరహితమైనను, మూడు లక్షణములున్నవి; తెలిసికొనుకర్త; దేనినిఁగూర్చి తెలిసికొనునో యావిషయము; వీని పరస్పరసంబంధము. జ్ఞానము నిర్దుష్టమో, దోషయుక్తమో నాల్గవదైన ప్రమాణముచే నిశ్చితమగును. సామాన్యముగా నిర్దుష్టజ్ఞానమునకిది ముఖ్యహేతువగుచున్నది. 3.

వాత్స్యాయనుఁడు ప్రమాణమనగా జ్ఞానసాధనము లేక, "దేనివలన నొకఁడు తానొక విషయమును దెలిసికొనుచున్నాఁడో యది" యే ప్రమాణమని నిర్వచించెను. ౪. ప్రమాణమనగా 'ఉపలబ్ధిహేతువు'౫. లేక జ్ఞానకారణ మని ఉద్ద్యోతకరుఁడు పలికినాఁడు. తెలియువాఁడు, తెలియునది రెండును జ్ఞానకారణములు గావున నీ నిర్వచనము విశాలమైనదని యాతఁడంగీకరించును గాని, దీనినే యాతఁడిట్లు సమర్థించినాఁడు: "ప్రమాతృ ప్రమేయములు తమ క్రియల ఫలితమును వేఱొకచోఁ గాంచుచున్నవి; అనగా, నివియొక ప్రమాణమును క్రియాముఖమునకుఁ దెచ్చుచున్నవి. ప్రమాణము జ్ఞానము నిచ్చుటవలననే తన ఫలితమును బొందుచున్నది. అందుచేఁ బ్రమాణమే జ్ఞానమునకు నిజమగు కారణమని గ్రహింపవలసి

---

౨. ప్రమాకరణమ్ ప్రమాణమ్ మఱియుఁ జూడు. వేదాంతపరిభాష.
3. న్యా. వా. ౧.౧.౧. (౪) న్యా. భా. ౧.౧.౧
౫. మఱియుఁజూడు. న్యా. వా. తా. టీక. ౧.౧.౧

యున్నది." ఎచ్చటెచ్చటఁ బ్రమాణమున్న నచట జ్ఞానమున్నది. ప్రమాణము లేనిచోట నిఁకేమియున్నను, జ్ఞానము లేదు. ఈవిధముగాఁ బ్రమాణముపలబ్ధికిఁ బ్రధానకారణము: ఇది జ్ఞానోదయాత్పూర్వము చిట్టచివర వచ్చును౧. సత్యము ననుసరించిన జ్ఞానము లేక ప్రమ నుదయింపఁజేయునదే ప్రమాణమని శివాదిత్యుఁడు చెప్పుటవలన నిది తర్కనిర్వచనమైనది౨. విషయములనుగూర్చిన నిర్దుష్టమైన స్పష్టజ్ఞానమునకుఁ గారణమే ప్రమాణమని జయంతుని భావము3.

జ్ఞానముయొక్క నిశ్చయమైన రూపము ప్రమాణముపై నాధారపడియున్నది. ఇతరలక్షణములైన ప్రమాతృ ప్రమేయములు ప్రత్యక్షానుమానముల రెంటికిని సామాన్యములే. ఇదే

౧. వా. ౧,౧,౧ ఇంకొక యాక్షేపణమిప్పుడు పరిశీలింపఁబడును. ప్రమాతృప్రమేయములవలననే ప్రమాణము జనించుచున్నదన్నచో నివి ప్రమాణమునకుఁ బూర్వమునుండియుండవలెను. కాని ప్రమాణమున్నప్పుడే మనము ప్రమాతృప్రమేయములను గుర్తింపఁగలుగుచున్నారము. విజ్ఞానవ్యాపారమునఁగాఁ బ్రమాణముతోడి సంబంధములేనిదే ప్రమాతృప్రమేయముల కర్థమేలేదు. ఉద్యోతకరుఁడు దీనినంతి నంగీకరించెనుగాని యిట్లుచెప్పినాఁడు: "ప్రస్తుత కార్యమునకుమాత్రమే యీమాటలు సంబంధించినవి కావు" వంట యిప్పుడు చేయుచున్నను లేకున్నను పచనకారుఁడు పచనకారుఁడే. "అట్టి వాడుకకుఁ గారణము శబ్దమందున్న గర్భితశక్తియే; ఈశక్తి దానియందెల్లప్పుడు నున్నది. అదేవిధముగా, ప్రమాతృప్రమేయములనుండి ప్రమాణము జనించుచున్నదనుదానిలో నసందర్భమేమియును లేదు."

౨. సప్తపదార్థ. ౧౪౪ భాగము. మణిభూఁజూడు. స. ద. సం.౧౧

3. అవ్యభిచారిణీమ్, అసందిగ్ధామ్, అర్థోపలబ్ధిమ్.

న్యాయమంజరి. పుట. ౧౨,

విధముగా నన్ని రకముల జ్ఞానములకును మనస్సున కాత్మతో స్పర్శ, మూలకారణమగును. పలుతెఱగుల జ్ఞానములలో నీ స్పర్శ వివిధరూపములను గలిగియుండును. న్యాయము జ్ఞానమునే గూర్చి చెప్పునదైనను, జ్ఞానమునకు ముఖ్యాధారలక్షణమైన ప్రమాణమునుగూర్చి చర్చించును గావున నది ప్రమాణశాస్త్రమైనది౧. మనము విషయస్వరూపమును బరిశీలించుటకు ముందు మనకుఁగల జ్ఞానోపకరణముల సామర్థ్యమును దెలిసికొనవలెను; ఏలన: "మనము కొలువవలయు వస్తువునుగూర్చిన జ్ఞానము, కొలుచు కొలమానము యొక్క జ్ఞానముపై నాధారపడియుండును."౨. ప్రమాణశాస్త్రము మనకు విషయముల యొక్క సమ్యక్జ్ఞానము నిచ్చుటయేకాక, జ్ఞానముయొక్క సత్యాసత్యముల నిర్ణయించుట కుపయోగించును3. అది ప్రమాణప్రయోజనములు రెండునుగలది యగుటచే దానికి సత్యమును తదౌచిత్యమును గావలసియున్నవి. ప్రపంచమునుగూర్చి మనకు మన మానసము లిచ్చు విషయములు సాధారణముగా సత్యములే యను నిశ్చయముతో న్యాయశాస్త్రము ప్రారంభమగును. జ్ఞానమంతయు నర్థప్రకాశకమే యనగా సత్యమునే చెప్పును. వస్తువులనుజూచి, వాని సామ్యములను గుర్తించి, నిర్ణయములుచేయుట కవకాశముండు రీతిగా మనము కల్పింపఁ

౧. ప్రమాణము విష్ణునామములలో నొకటియని విశ్వనాథుఁడు చెప్పినదానిననుసరించి, ప్రమాణపరిశీలనమున కెంతప్రాధాన్యమును హిందూశాస్త్రకారులిచ్చిరో తెలియనగును. ౨. మానాధీనా మేయసిద్ధిః।

3. పోల్చు. డబ్లియు. ఇ. జాన్సన్‌యొక్క తర్కశాస్త్రనిర్వచనము: "విజ్ఞానవిషయవిభాగపరిశీలనము." (లాజిక్ వాల్యుము౧ పుట౧3.)

బడియున్నాము. మానవులందరు నీ జ్ఞానక్రియా వ్యాపారమునఁ బాల్గొనుచున్నారు. వారి శ్రద్ధయు,సామంజస్యమును భిన్నాంతరువులలోఁ నుండును. వస్తు జ్ఞానము నార్జించవలెనను నుద్దేశముతో నెప్పుడు మానసికప్రవృత్తి కలిగినను, నది తర్కాన్వేషణమునకు యోగ్యమైన విషయమగును. సత్యాన్వేషణము మానవవ్యాపారములో సహజముగానే యున్నది. తర్కసిద్ధాంతము దానిని సృజించుటలేదు. ఈ మానవప్రవృత్తి లక్షణమున కర్థము గ్రహించి, దాని స్వరూపమును గొన్ని సామాన్య సూత్రములలోఁ జెప్పుటే యీ శాస్త్రము చేయుపని. భౌతిక శాస్త్ర మేదైన నీపనినే చేయును. శరీరములోఁ బ్రాణమెట్లు వర్తించుచున్నదో యా విధానములను శరీరశాస్త్రజ్ఞుఁడు పరిశోధించునట్లే, జ్ఞానోత్పత్తి విధానమునఁగల సూత్రములను దార్కికుఁడు ప్రకటించును. శరీరవ్యాపార ప్రవర్తనమునకు శరీర శాస్త్రజ్ఞుఁడు కారణముగానట్లే, తార్కికుఁడును జ్ఞానవ్యాపారమునకుఁ గారకుఁడుగాఁడు.

ప్రయోజనము సత్యము పూర్తిగా వేరనియు వానికి భిన్ననిర్ణయ రూపములు గావలెననియు న్యాయదర్శన మంగీకరింపదు. ప్రయోజనములు సత్యాంశముఁలతో సంయుక్తములై యున్నవి; అందుచే వానిని విడిగా గ్రహింపఁజాలము. మనము నిర్విషయములైన మనస్సులతో నారంభించుటలేదు. అనుభవ సంప్రదాయములవలన జగత్స్వరూపమును గూర్చిన భావములు కొన్ని యిదివఱకే మనలోనుండి యున్నవి. మతగ్రంథముల ద్వారమున మనకు సాంకర్యమందిన జ్ఞానసాధన సముచ్చయము

లభించియున్నది. మనకుఁగల జ్ఞానసాధనమార్గములకు న్యాయము వర్గీకరణము చేయును. నాలుగు ప్రమాణముల మూలమున మనకు సమ్యక్ జ్ఞానము లభించుచున్నది. (౧) ప్రత్యక్షము౧. (౨) అనుమానము౨. (౩) ఉపమానము (౪) శబ్దప్రమాణము౩ పశ్చిమఖండ తర్కశాస్త్రములు సాధారణముగాఁ బ్రత్యక్షమునుల౪. గూర్చి ప్రసంగింపరు; కాని న్యాయశాస్త్రము ప్రత్యక్షము నొక ముఖ్యమైన జ్ఞానమూలముగా స్వీకరించినది. న్యాయదర్శనములో ననుమానము కేంద్రస్థానము నాక్రమించినది. దీనినే హేతువిద్యయనియు నందురు. అనుమానవాదము యొక్క ప్రామాణ్యము నిది పరిశీలించును౧. ఈ భావము ననుసరించి అనుమానసిద్ధాంతమునే అనుమానవాద మనిరి. ఈ యర్థములో బ్రత్యక్షజ్ఞానము తర్కశాస్త్రమున కతీతమైనది. ఇట్టి సంకుచితార్థమును న్యాయ మంగీకరించదు. శబ్దప్రమాణము నంగీకరించుటవలన న్యాయశాస్త్రమునకు మతమునందాదరమును దెల్పుచున్నది. ఈ చతుర్విధ జ్ఞానాధారములను గూర్చి న్యాయము మనకు మన తత్త్వానుగుణమైన వివరణము

౧. ఇంద్రియజ్ఞానము ప్రత్యక్షజ్ఞానములలో నొకరకము.

౨. ఒకదానినుండి యింకొకటిగాని, ఒకదాని వెనుక నింకొకటి కాని, తెలిసికొనుటకే 'అనుమాన' మనివ్యుత్పత్తి.

౩. న్యా॥ సూ॥ ౧, ౧, ౩ చరకుఁడు ఆప్తోపదేశము, ప్రత్యక్షము, అనుమానము, యుక్తియనువానినిఁ జెప్పెను. మఱియుఁ జూడుఁ స్థానాంగ సూత్రము.

౪. ప్రొఫె. జె. యస్. మిల్: "సత్యము మనకు రెండుపద్ధతులలోఁ దెలియును, ప్రత్యక్షము, అనుమానము."

(సిస్టమ్ ఆఫ్ లాజిక్ ఇంట్రొడక్షన్. పుట ౪)

నిచ్చును. మనోవ్యాపారరీతుల నెఱుఁగనిదే, మనోవిషయమైన జ్ఞానమునుగూర్చి తర్కాన్వేషణము చేయుట సాధ్యముకాదు. మనస్సు పురోగమన మొనర్చె యెట్లు సూత్న ఫలితముల నొసఁగునో విశేషవివరములతో న్యాయశాస్త్రము చర్చించును. ఇట్లుచేయుచు నీపద్ధతులలోఁగల లోపములనుగూడ నది ప్రకటించును. జ్ఞానసాధన చతుష్టయములో నేదో యొకదానివలన మనకు జ్ఞానము కలుగుచున్నదను సామాన్య సూత్రీకరణముచే జ్ఞానసమస్య పరిష్కృతముకాదు. సామాన్యసూత్ర ప్రకటన మర్థసమస్యా పరిష్కారము కాఁజాలదు.

మానవ మానసము జ్ఞానమును గ్రహించి పెంపొందించు సాధనములను మార్గములను గూర్చి పరిశీలించుటయే కాక, మానవ సహజమైన సత్యాన్వేషణ మార్గమునుండి మారుత్రోవలను బట్టు విజ్ఞానప్రమాణ క్రమములను దర్శనసూక్తులలోను సూత్రములలోను బ్రకటించును. మనలో నిదివఱకే యున్న జ్ఞానముయొక్క సత్యాసత్యములను బరిశీలించి నిశ్చయించు మానములే తర్కప్రమాణములు. దీని ననుసరించి

౧. 'హేతువిద్య' యనుపదము మిళిందమున (యస్.బి.ఇ. వాల్యూము ౩౫. పుట౬-౭) లలితవిస్తారము (౧౨)నను నుపయోగింపఁబడినది. హేతుశబ్దమునకుఁ గారణమని యేయర్థమైనను, జైనపండితులు దీనిని విశాలార్థములలో వాడిరి. మఱియుఁ జూడుము మనువు. ౨౫ ౧౧; మ.భా. ఆదిపర్వము ౧,౬,౭; శాంతిపర్వము ౨౧౦,౨౨; అశ్వమేధపర్వము, ౨౫,౨౭. పూర్వవైయాకరణులగు పాణిని, కాత్యాయనుఁడు, పతంజలియు నీయర్థమునే గ్రహించిరి. మఱియుఁ జూడుము న్యా॥వా॥ ౪,౧,౧౪;

తర్కశాస్త్రమనగా జ్ఞానసామగ్రికి విలువనుగట్టు ప్రమాణ శాస్త్ర మగుచున్నది. మనకుఁగలిగిన జ్ఞానము సత్యమున కెంత దగ్గరగానున్నదో చూపి యీవిధముగా నీ శాస్త్రము జ్ఞాన ప్రామాణ్యమును నిశ్చయించును. సత్యసమస్యకును దత్త్వ సిద్ధాంతమునకును సన్నిహితసంబంధమున్నది. అందుచే న్యాయశాస్త్రము జ్ఞానసిద్ధాంతమును దత్త్వశాస్త్రమును గూడ నైయున్నది౧. కావున న్యాయమనగాఁ గేవల తర్కముకాదు; అది మన సత్త్వ, తర్క, తత్త్వమత చర్చలతోఁగూడిన పూర్ణ జ్ఞాన ప్రమాణశాస్త్రము.

## ౫—నిర్వచన స్వరూపము

న్యాయసూత్రము చెప్పు ననేకవిషయములను మొదటఁ బ్రతిపాదించి, తరువాత వానికి నిర్వచనములుచేసి, యనంతరము పరిశీలించెను౨. ఇతరవిషయములనుండి భేదము తెలియునట్లుగా నిర్వచన మొకవిషయము యొక్క స్వరూపమును జెప్పును. నిర్వచనోద్దేశ మేమనగా నొకవస్తువు వేఱొక వస్తువని పొరపడుట కవకాశమున్నది కావున, నొకవస్తు వితరవస్తువుల నుండి యెట్లు భేదలక్షణములను గలిగియున్నదో చెప్పును౩. వస్తువుల భేదమును మనము వాని మూలరూపముల నెఱుఁగకుండగనే గుర్తింపవచ్చును. ఒక అసాధారణ ధర్మముకూడ నట్టి భేదమును దెలియఁజేయును. నిర్వచనమునకు సహజము

౧. న్యా॥ భా, ౧,౧,౧.

౨. ఉద్దేశ్యము, లక్షణము, పరీక్షా. న్యా॥భా॥ ౧,౧,౨.

౩. న్యా॥భా॥ ౧,౧,౨.

లైన మూఁడుదోషము లుండవచ్చును. (౧) అతివ్యాప్తి ఒకవర్గమునకుఁ జెందిన లక్షణముల నితరములకుఁగూడఁ జెప్పుట; ఒకగోవునకు నిర్వచనము కొమ్ములుగల జంతువని చెప్పుటలో నతివ్యాప్తియున్నది. (౨) అవ్యాప్తి. ఒకవర్గములో నొకభాగమునకే లక్షణములను జెప్పుట, గోవు కపిలవర్ణముగల జంతువని నిర్వచించుట. (3) అసంభవము, అనగా నిర్వచింపఁబడిన వస్తువుయొక్క ప్రధానలక్షణములను జెప్పకుండుట; గోవొక చీల్చని గిట్టలుగల జంతువనుట. "ఒకవస్తు వేవర్గమునకుఁ జెందునో యావర్గమునకు సర్వసామాన్యమైనలక్షణము నుగ్గడించుచు నందు హెచ్చుతగ్గులుండ" వనునదే నిర్వచనము[౧]. అట్టి నిర్వచనము లభించుటకు, ముందొక జాతిని జెప్పి, ఇతరములు భిన్నములు[౨]. నను పదములచే నన్యజాతివస్తువులను వేరుచేయుదుము. ఒకజాతి, తద్భిన్నముల నిర్ణయములచేఁ గల్గిన నిర్వచనమిది.

## ౬-ప్రత్యక్షప్రమాణము.

వివిధజ్ఞానమూలములలో ముఖ్యతమమైనది ప్రత్యక్షము. వాత్స్యాయనుఁడు చెప్పినాఁడు; "మానవుఁడొక వస్తువుయొక్క జ్ఞానమును గోరినపుడు, దానినిగూర్చి యొక నమ్మఁదగిన వ్యక్తివలన వాగ్రూపమైన జ్ఞానముకలుగును; కాని యా వస్తువునుగూర్చిన ప్రత్యేకలక్షణములవలనఁ గలుగు ననుమాన పద్ధతిచేఁ దనకుఁదెలిసిన విషయము సత్యమగునో కాదో నిశ్చ

౧. లక్ష్యతావచ్ఛేదకసమనియ తత్వమ్

౨. ఇంద్రియమనగా 'శబ్దేతరోద్భూతమ్' అని చెప్పఁబడెను.

యింపఁజూచును. కాని యిట్టి యనుమానప్రమాణ లబ్ధమగు జ్ఞానము లభించిన వెనుకనైనను, దాను దెలిసికొనిన వస్తువును స్వయముగాఁ దన చక్షువులతోఁ జూడఁ గాంక్షించును. కాని యావస్తువు నాతఁ డొకసారి కన్నులారఁ జూచిన వెనుక నాతనికి సంతృప్తి లభించును; ఆవెనుక నింకేయితరవిధమైన జ్ఞానమును గోరఁడు"౧. అనుమాన శబ్దమువలెనే ప్రత్యక్షశబ్దమును సత్యమును గ్రహించుటకును, నట్టి సత్యగ్రహణమునకు వలయు మానసిక వ్యాపారమునకును గూడ నుపయోగింపఁబడినది. మొదటఁ బ్రత్యక్షమనఁగా నింద్రియజ్ఞానమను నర్థమున నుపయోగింపఁబడినను, దరువాతఁ బ్రత్యక్షమనగా నింద్రియమూలమునఁగాని మఱేయితర మార్గమునఁగాని లభించు జ్ఞానమునకు నర్థమువచ్చినది౨. గంగేశుఁడు ప్రత్యక్షమనగా నెట్టయెదుట గోచరించునదని నిర్వచనము చెప్పెను౩. జ్ఞానమనఁగా దేని మూలమున జ్ఞానము తెలియునో యదికాదు౪. అనుమానోప

---

౧. న్యా. భా. ౧,౧,౧ 3 ఒకేవిషయము వివిధప్రమాణములవలనఁ దెలియనగును. ఆత్మాస్తిత్వము శ్రుతి, అనుమానములచేఁ దెలియును, అనలాస్తిత్వము మనకొకఁడు చెప్పుటవలనఁగాని, మనము చూచుటవలనఁగాని అనుమానమువలనఁగాని తెలియవచ్చును. ఏకైకప్రమాణసాధ్యములు గొన్నియున్నవి. యజ్ఞమువలన స్వర్గములభించునని శ్రుతిప్రమాణమువలననే తెలియుచున్నది. "ఒకేవిషయము భిన్నప్రమాణములచేఁ దెలియుచున్నదనగా, నొకేవిషయముయొక్క భిన్నరూపములు తెలియుచున్నవని ఉద్ద్యోతకరుఁడు భావించెను. (న్యా. వా. ఉపోద్ఘాతము)

౨. న్యాయబిందుటీక, పుట ౭

3. ప్రత్యక్షస్యసాక్షాత్కారిత్వమ్ లక్షణమ్.

౪. జ్ఞానాకరణకమ్ జ్ఞానమ్ ప్రత్యక్షమ్.

మాన శబ్దప్రమాణములందు, మన కాధారములుగలవు. అను మానమునకుఁ బూర్వమున్న యాధారములు; ఉపమానము నకు సమానలక్షణములు; శబ్దమునకు సంప్రదాయము నున్నవి. స్మృతియందుఁ బూర్వజ్ఞాన మున్నది. ప్రత్యక్షమునందు జ్ఞానము పూర్వావస్థకాదు, దైవసాక్షాత్కార జ్ఞానము ప్రత్యక్షము, సంపూర్ణము; తత్సంబంధియగు పూర్వజ్ఞాన మేది యును దానికిఁ గారణముకాదు.

ఇంద్రియ దర్శనమనగా, "ఒక యింద్రియమున కొక విషయముతో స్పర్శవలన లభించునది, వాగతీతము, నిర్దుష్టము సుస్పష్టము" నని గౌతముఁడు నిర్వచనము చెప్పెనుఁ.

ఇంద్రియదర్శనములోఁగల భిన్నాంశముల నీనిర్వచనము పేర్కొనుచున్నది. (౧) ఇంద్రియములు (౨) ఇంద్రియార్థ ములు (౩) పైరెంటి సన్నికర్షము (౪) తత్ఫలితముగా జనించు

---

పోల్చు మెక్టగార్టు. "ప్రత్యక్షదర్శనముపై నాధారపడిన విశ్వాసము పరమసత్యము;ఏలన నది దర్శనముపై నాధారపడివను నింకొక యేవిశ్వాసముపై నాధారపడినదికాదు." (ది నేచర్ ఆఫ్ ఎగ్జిస్టెన్సు. పుటలు ౪౨-౪౩)

(౧) ౧.౧.౪. పోల్చు. ఆత్మతో మనస్సు నింద్రియములు, విషయ ములు గలిసినపుడు లభించు జ్ఞానమే యింద్రియదర్శనమని చరకుఁడు నిర్వచించినాఁడు. గౌతముని నిర్వచనమును గంగేశుఁడు పెక్కు హేతువులఁ జూపి ఖండించెను. అతివ్యాప్తమైన దెందుచే ననగా, ప్రతి జ్ఞానక్రియకు మనస్సులో విషయమునకు సంయోగమున్నది. మనస్సు నొక యింద్రియమే, ఏయింద్రియాద్యుపకరణములతో నిమిత్తములేకుండ దేవుఁడు సర్వమును గ్రహించుచున్న దివ్యజ్ఞాన మిందుఁజేరదు. దర్శనమువలననే యింద్రియస్వరూపము నిర్ణయింపఁబడును. అందుచే నిది స్వవిఘాతవచనమగుచున్నది.

జ్ఞానము. ఇంద్రియాస్తిత్వ మనుమానముచేఁ దెలియునదే. ఒక రంగుయొక్క జ్ఞానము నేత్రేంద్రియము లేనిదే లభింపదు[2]. త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణము లను నైదింద్రియములు బుద్ధి లక్షణముల ననుసరించియున్నవి[3]. వీనికై దధిష్ఠానములున్నవి. గతి, ఆకృతి భేదములనుబట్టి జాతిభేదము లైదని గ్రహింపఁబడెను. అగ్నివలన నేత్రమును, నాకాశమునుండి శ్రోత్రమును, భూమినుండి ఘ్రాణేంద్రియమును, జలమునుండి జిహ్వయును, వాయువునుండి త్వగింద్రియమును గలిగి, శబ్దస్పర్శరూప రసగంధములను గుణములను పంచభూతములు ప్రదర్శించుచున్నవి[4].

త్వగింద్రియముయొక్క రూపాంతరములే మిగిలిన యింద్రియములని డెమాక్రిటస్ వలెఁ జెప్పుభావము దోషయుక్తమైనదని నిరసింపఁబడినది. ఏలన నొక యంధుఁడు రంగును జూడఁజాలఁడు[5]. త్వగింద్రియముయొక్క భిన్నాంశములు, మిగిలిన యింద్రియముల లక్షణములను గలిగియున్నవని చెప్పినచో నింద్రియము లనేకములగును. కానిచో, శబ్దరూపాదు లింద్రియ

(౨) ఇంద్రియములకుఁ బ్రత్యేకలక్షణము లుండుటచే వాని యర్థములని చూడఁగలుగుచున్నవి. కాని యవి తమ్ముఁదాము చూడఁజాలవు. నేత్రమొక బాహ్యవస్తువునే చూచునుగాని తన్నుఁ జూడఁజాలదు. ఒకశబ్దము విషయము దీనికి వేరైయున్నది (న్యా. సూ. 3.౧ ౬౮-౬౯,౭౧.)

(3) న్యా. సూ. 3.౧.౫౪.

(౪) ద్రవ్యముకాని పదార్థము జగమంతయు వ్యాపించుట కేదియు నవరోధము కాఁజాలదు. కుడ్యాదులు నేత్రముయొక్క చూపున కడ్డువచ్చును. అందుచే నేత్రము జడపదార్థము.

(౧) న్యా.సూ. 3.౧.౫౧-౫౨.

గోచరములు కావని చెప్పవలసివచ్చును౨. ఇంద్రియ మొకటే యైనచో దర్శనా కర్ణనా ఘ్రాణాదిక మొకేకాలమున జరుగవలెను. మఱియు స్పర్శవలన సమీపవస్తువులే తెలియును. కాని నేత్రశ్రోత్రములు దూరస్థవిషయములనుగూడ గ్రహింపఁగలవు. ఇంద్రియ మొకటేయను వాదమును న్యాయము తిరస్కరించి, త్వగింద్రియముయొక్క ప్రత్యేకత నది యంగీకరించినది. త్వక్కునకు మనస్సంయోగ మున్నపుడే తాత్కాలిక విజ్ఞానప్రాప్తి యుండును. కాని మనస్సు త్వగింద్రియమున కందుబాటులో లేనపుడు, విజ్ఞానమయజీవితమే లేదు. సుషుప్తి యట్టిదే.

దర్శనమునకు మనస్సు ముఖ్యాధారము. ఏదేనొక పరిశీలనమందు మనమున్నపుడు, గాలివలని శబ్దము మనకు వినపడదు; శబ్దము మన యింద్రియముతో సన్నివేశమును బొందును; జీవాత్మ, దేహమంతటను వ్యాపించియుండును గాన, నదియు శబ్దముతో సాంగత్యమును బొందును. మఱియు, "ఒకటి కంటెఁ బెక్కింద్రియములకు వానివిషయములతో సన్నికర్షము కలిగినపు డన్నివిషయముల దర్శన మేకకాలమున నుండదు. ఏలన మనస్సున కొకేవిషయముతోడి సంపర్కమువలన నితర విషయ సంపర్కముండదు. దీనివలన దర్శనము మనస్సంపర్కము లేనిదే లభింపదని స్పష్టమగుచున్నది"౪. జీవాత్మకును నింద్రియములకును సంధికూర్చునది మనస్సు. ఏకకాలమున

(౨) చూడు: న్యా.సూ. 3.౧ ౫3.
(3) చూడు: బృహ. ఉ. ౪,౧,౧౯; తర్కసంగ్రహదీపిక. పు ౧౫.
(౪) న్యా.భా. ౧.౧.౪

వివిధజ్ఞానక్రియలు లేమికి మనస్సే కారణముగా. దృశ్యములు వేగముగా నొకటివెనుక నొకటి దర్శింపఁబడుటచే నేకకాలము ననే దర్శింపఁబడినట్లు భ్రాంతి జనించును. మన మొక గుండు సూది నొకకాగితపు దొంతరలో గ్రుచ్చినచో నన్నిటి నొకసారియే గ్రుచ్చితిమని భ్రమింతుము కాని నిజమునకు సూది యొకటివెనుక నొకటి గ్రుచ్చుచున్నది౧. కావున మనస్సొక యింద్రియముతోఁ గలిసియున్నప్పు డింకొకదానితోఁ గలిసి యుండఁజాలదు. అందుచే మన స్సణుమాత్ర పరిమాణముకల దని చెప్పఁబడినది. అట్లుకాక మనస్సు సర్వవ్యాపకత్వముకలదై నచో నేకకాలమున సర్వేంద్రియములతో సంయోగముపొందకుండుటకుఁ గారణము లేదు. ఒక యింద్రియ మా యింద్రియ విషయముతో సన్నికర్షము పొందినవెంటనే, మనస్సా యింద్రియమునొద్దకు విద్యుద్వేగముతోఁ బోవును. మఱియు, రెండు సర్వవ్యాపకవస్తువులకు సంయోగము దురూహ్యము. "స్మృతి, అనుమానము, శబ్దజ్ఞానము, సందేహము, ప్రతిభ, స్వప్నము, ఊహ, సుఖాద్యనుభవము మున్నగునవి మనోఽస్తిత్వమును సూచించును"౨. జీవాత్మపొందు జ్ఞానక్రియలు స్వప్రకాశక ములుగావు. కోరికలు, యూహలు మన మెఱిఁగినట్లే, మనము జ్ఞానక్రియలను మనస్సుమూలముననే, తెలియుచున్నాము.

(౫) ౧.౧.౧౬; ౨.౧.౨౪; 3.౨.౬-౭; న్యా.వా. ౧.౧.౧౬.

(౧) న్యా భా. 3.౨.౫౮.

(౨) న్యా.భా. ౧.౧.౧౬

వాత్స్యాయనుఁడు మనస్సు నింద్రియములలోఁ జేర్చినాఁడు. అంతరంగదశలగు నూహలను, వాంఛలను, జ్ఞానక్రియలను దెలుపునట్టి యంతరింద్రియమే మనస్సు. ఆకసముననున్న సూర్యుఁడు, బల్లపైనున్న సిరాబుడ్డి, నాకంటె వేరైన బాహ్యప్రపంచమునకుఁ జెందినవని వెంటనే గుర్తించుచు, సుఖదుఃఖానుభవములు, కాంక్షలు మున్నగున వాత్మసంబంధములనియు వెంటనే గ్రహింపఁబడును౩. జీవాత్మ, ఆంతరంగికదశలను మనస్సహాయముచే దర్శించును. బాహ్యవస్తు దర్శనమున కింద్రియములతోడ్పా టవసరము౧. బాహ్యాభ్యంతర దర్శనభేదము నిజమైనదికాదు; ఏలన, ఒక కాగితముపై వ్రాయవలెనను కోరిక, కాగితమెంత ప్రత్యక్షజ్ఞానమో. కోరికయుఁ దత్సమాన ప్రత్యక్షమే. కాగితమువంటి బాహ్యపదార్థమైనను, కోరికవంటి యంతరంగవిషయమైనను, జ్ఞానసంబంధము సమానమే, రెంటియందును వస్తుదర్శనము సద్యోదర్శనము, ప్రత్యక్షమునై యున్నది౨.

---

(౩) బాహ్యదర్శనము, మానసికదర్శనము, లౌకికదర్శనము, అలౌకిక దర్శనము ననికూడఁ జెప్పఁబడెను.

(౧) పోల్చు: లాకేయొక్క బాహ్యాభ్యంతర దర్శనములు. సుఖమునకును, సుఖానుభవ జ్ఞానమునకును భేదమున్నదని ఉద్ద్యోతకరుఁడు చెప్పినాఁడు. సుఖమొక దృశ్యవిషయము; సుఖానుభవముతో మనస్సంయోగ మున్నపుడు సుఖజ్ఞాన ముదయించును. త్వక్కునకుఁ జల్లనిగాలికి సంయోగముకలిగినపుడు చల్లతనము కలుగును. దానితో మనస్సు సంయోగము పొందినపుడు, చల్లతనముయొక్క సుఖానుభవము లభించును.

(౨) మనస్సు తన్నుఁదాను దెలిసికొను నుపకరణము కాఁజాలదు. ఏకకాలమున భిన్నజ్ఞానక్రియలు లేకుంజేసి, మనస్సున్నదని గుర్తింతుము; ఇదియు

మనస్సు నేత్రాదీంద్రియములవలె నొక యింద్రియమే యనియుఁ గొలఁదిభేదము లున్నవనియు వాత్స్యాయనమతము. బాహ్యేంద్రియములు భౌతికపదార్థ కల్పితములు; అవికొన్ని వస్తువులనే గ్రహింపఁగలవు; అవి యుపకరణములుఁగామాత్రమే పనికివచ్చును. కొన్ని విశిష్టలక్షణములనే అవి గుర్తించుశక్తి గలవి, మనస్సు భౌతికపదార్థముకాదు; అన్ని వస్తువులను గ్రహింపఁగలదు; ఉపకరణముగాఁగూడ నుపయోగించును. ఏలక్షణముతో నిమిత్తములేకుండఁ బనిచేయఁగలద"ని యాతఁడు పలికినాఁడు[3]. ఉద్ద్యోతకరుఁడు దీనిని పూర్తిగా సంగీకరింపఁడు. భౌతికపదార్థమా కాదా యను విషయ ముత్పత్తిగలిగిన వస్తువులకే చెందును; మనస్సట్టి యుత్పత్తి లేనిది. మనస్సు సకలవస్తువులను గ్రహించుననియు, నింద్రియములు కొన్ని నియమితవస్తువులనే గుర్తింపఁ గల్గుననియు నీతఁడంగీకరించును. ఈతని యభిప్రాయములో మనస్సు జీవాత్మను బోలియున్నది. స్మృతి హేతువైన సంయోగమున కది యాధారము; సుఖానుభవహేతువైన సంయోగమునకు నదే యాధారము ౧. ప్రతి జీవాత్మకొక విశిష్టమైన మనస్సు కలదు. అదినిత్యము, సూక్ష్మము, పరిమాణ

---

మనస్సువలననే తెలియును, కాని యిచట మనస్సు తాను తనపై వర్తించుట లేదు; ఏలన మన స్సుపకరణముకాదు, చూడుు, (న్యా.వా.తా.టీక 3.౧.౧౭) యోగాభ్యాసమునందు మనస్సును దర్శింపవచ్చునని ఉద్ద్యోతకరుఁడు భావించినాఁడు. (న్యా.వా. 3. ౧. ౧౭)

(3) న్యా. భా. ౧. ౧. ౪.

౧. న్యా. వా. ౧. ౧. ౪

శూన్యము నైనది. ప్రతి జీవికిఁగల మనస్సొకటియే కాని పెక్కు మనస్సులుండవు. ఒకేజీవికిఁ బెక్కు మనస్సు లున్నయెడ, నేక కాలమున ననేక విధజ్ఞానములు, కాంక్షలు, నుండవలెను; కాని యట్లు లేవు.౨.

దర్శన మొక విధమైన జ్ఞానము కనుక జీవాత్మకుఁ జెంది నదే, జీవాత్మకు మనస్సునకు సంబంధ మొక విధముగా శాశ్వత మైనది; కాని ప్రతిమానసిక క్రియతో నట్టిసంబంధము పునఃప్రాప్త మగుచుండును. జీవాత్మకు బాహ్యవస్తువునకు సహజమగు సం బంధమున్నదని న్యాయమతము. ఒక ముద్రికయొక్క ఆకృతి లక్కపై నెట్లు ముద్రితమగునో యట్లే, బాహ్యవస్తువు రూపము మనస్సుపై ముద్రితమగునని తలపఁబడెను. ఒక బాహ్యవస్తు రూప మింద్రియముపై నొత్తిడికలిగించి, సన్నికర్షముచే నా రూపము భౌతికముగా నేర్పడి, మానసికరూపముగా నెట్లు మారునో యను నీభౌతిక మన స్తత్వ కేంద్రసమస్యను న్యాయ సూత్రము పరిష్కరించలేదు. ప్రకృతిశాస్త్ర మెంత వృద్ధిపొంది నను, నీసమస్య నేటికి నట్లే నిలిచియున్నది.

ఒక దర్శన మేర్పడుటకు దర్శించువానికి బాహ్యముగా వస్తువులుండవలెను. ఈభావమును విశ్వసించుటచే న్యాయ శాస్త్రము, మనకు క్షణికములగు నూహాపరంపరలు మాత్రమే యున్నవి; బాహ్యజగత్తు జ్ఞానహీనులకే గలదను సిద్ధాంతదోష మునకుఁ బాల్పడకుండ సురక్షితమైనది. ఇంద్రియము తదనుగుణ మైన విషయముతోఁ గలిసి విజ్ఞానమునకుఁ బ్రత్యక్షదర్శన

౨. న్యా. ౧. ౩. ౨. ౫౬.

మగును. ఇంద్రియవిషయము లింద్రియములపై నొత్తిడిచేఁగలుగఁజేయు విజ్ఞానఫలితముల పరిమాణములుగూడఁ జెప్పఁబడినవి కాని, సూక్ష్మ యంత్రసామగ్రి లేనిదే వీనిని సరిగాఁ జెప్పుట కష్టమైనది. సర్వవిజ్ఞాన క్రియలందును జీవాత్మ మనస్సంయోగమును, నింద్రియ మనస్సంయోగమును, నింద్రియవిషయ సంయోగమును ముఖ్యలక్షణములుగా గ్రహింపఁబడినవి౧. ఇంద్రియములు విషయసంపర్కము పొందినపుడు జీవాత్మలోని మార్పువలన దర్శన ముదయించును. "ఇంద్రియములు విషయసంపర్కము లేకుండ దర్శింపఁగలిగినచో నపుడవి గోడవెనుక నున్న వస్తువులనుగూడ దర్శింపవలెను౨. కాని యది జరుగుట లేదు. ఉద్ద్యోతకరుని భావములో సన్నికర్షమనగా సంయోగముకాదు; ఇంద్రియ విషయమగుటయే. అనగా నింద్రియముతో నొక సంబంధములోనికి వచ్చుట.

విషయములు భిన్నవర్గములలో నున్నవి. ఒక పచ్చగడ్డిపరక యొక ద్రవ్యము, దాని పచ్చదన మొకగుణము; గుణములు వస్తువులకు సంబంధించియున్నవికావున వానిని వేరుగాఁ జూడఁజాలము3. వస్తువులు, వస్తుగుణములు వేరుగాలేని కారణముచే, నవి వాని యాధారముల మూలముననే దర్శింపవలెను. ఇంద్రియేంద్రియ విషయసంబంధము సంయోగము; వస్తుగుణ-

---

౧. ౨. ౧. ౨౯.

౨. న్యాయ కందలి పు. ౨3; న్యా. భా. ౨. ౧. ౧౯.

3. ఒక్క ధ్వనివిషయము తప్ప; ధ్వని గుణమైనను, నిరాధారముగా దర్శింపఁబడును.

సంబంధము సమవాయము, ఒక యుదాహరణము, కన్ను వస్తువుతోఁ బ్రత్యక్షసంయోగమును గలిగియున్నది; ఆ వస్తు వర్ణముతోఁ బరోక్షసంబంధమును, వస్తు జాతిభావముతో నింక నధికపరోక్ష సంబంధమును గలిగియున్నది.

ఇంద్రియ విషయసంయోగ మారువిధములని చెప్పఁబడి నది. ఒకపాత్రను మనము ప్రత్యక్షముగాఁ జూచునప్పుడు కలు గునది సంయోగము. ఒక పాత్రయొక్క రంగును మనము గ్రహించునపుడది సంయుక్తసమవాయ మనఁబడును. మూడ వది సంయుక్తసమవేత సమవాయము; పాత్రయొక్క వర్ణ మే వర్గమునకుఁ జెందునో గ్రహించునది. నాల్గవది సమవాయము. అనగా నొక ధ్వనిలక్షణము నెఱుగుట; ధ్వనికి శ్రోత్రమునకుఁ గల సహజసంబంధము దీనివలనఁ దెలియును.౧. సమవేత సమ వాయమైదవది; ఒక ధ్వనియొక్క లక్షణ మేవర్గమునకుఁ జెందు నో తెలుపును. ఆరవది విశేణత; వస్తుగుణసంబంధమును సూచిం చును. ఒక పాత్రాభావ దర్శనము దీని కుదాహరణము; ఏలన మననేత్రమునకు భూమికిని సంయోగమై యచట నొక పాత్ర లేదను గుణమును దర్శించును, ఈసంయోగమును రెండు విధ ములుగాఁ జెప్పవచ్చును. ఒకటి 'ఘటాభావవత్ భూతలమ్', భూమి ఘటములేని లక్షణమును గలిగి యున్నది. రెండవది 'భూతలేఘటా భావోఽస్తి' భూస్థలిపై ఘటాభావమున్నది, ఇచట సంబంధము తారుమారుగాఁ జెప్పబడినది, మొదటిది

౧. ఆ కర్ణేంద్రియము శ్రోత్రకుహరములో నున్న ఆకాశము, శబ్ద మాకాశగుణము.

దాని ననుసరించి అభావము మన నేత్రిముతో సంయోగము పొందిన భూమి గుణముగాఁ జెప్పఁబడినది; దీనినే సంయుక్త విశేషణత యందురు, రెండవ దాని ననుసరించి, అభావమునకు విశేషణము చెప్పఁబడినది; దీనిని సంయుక్త విశేష్యత యందురు.౭. ఈభేదము లన్నియు జగత్స్వరూపమును గూర్చిన న్యాయతత్త్వభావముల ననుసరించి యేర్పడినవి. వైశేషికదర్శనముతోఁ బాటు న్యాయదర్శనమును, ద్రవ్యములు, గుణములు, క్రియలు, సామాన్య విశేషములు, సమవాయము, అభావము నున్నవని యంగీకరించును. పరిమాణముగల యొక వస్తువు స్పష్టమైన వర్ణముగలదైనచో నది దర్శింపఁబడును.౧. సంబంధ స్వరూపము సంయోగము, నేత్రము వస్తువుతో నిజముగా సంయోగమును బొందును, అభినవన్యాయము ననుసరించి, త్వగింద్రియముకూడ రూపములుగల వస్తువులను గ్రిహింపఁ గలదు.గుణములు,చలనము సంయోగముయొక్క రెండవరూపముచేదర్శింపబడును. సామాన్యలక్షణము రెండు లేక మూడవ సంయోగరూపము వలనఁ దెలియును; ఈలక్షణమది ద్రివ్యమో, గుణమో,చలనమో దాని ననుసరించును. న్యాయము దృష్టిలో సమవాయము నొక దర్శనవిషయమే; వైశేషికులు సమవాయము నీయర్థములోఁ దీసికొనరు. అభావమారవలక్షణము.

పూర్వోత్తర మీమాంసల నుపలబ్ధి-స్వతంత్రిజ్ఞానప్రమాణముగాఁ జెప్పిరి. కుమారిలభట్టు ననుసరించి, మనము ఘటాభావమును గ్రహించునపుడు, మనకు ద్వివిధజ్ఞానక్రియ లున్నవి;

౭. కీత్.

౧. వై॥ సూ॥ ౪, ౧, ౬.

ఒకటి భావాత్మకము, భూమియున్నది: రెండభావాత్మకము, ఘటము లేదు. ఘటాభావము భూమికి విశేషణమనియు, నట్టి విశేషణసంయుక్తమైన భూతలము దర్శింపఁబడుచున్నదనియు నైయాయికుని యభిప్రాయము. ఇంద్రియములతో సంబంధమున్న వస్తువులే దర్శింపఁబడుననియు నభావవస్తువుల కింద్రియసంయోగముండదు కావున నవి గోచరింపవనియు నాక్షేపించి వచో విమర్శకులు సంయోగ సమవాయములే జ్ఞానసాధనలని పొరపడిరని నైయాయికుని జవాబు. అభావదర్శనమున కీరెండు ప్రమాణములును బనికిరావు. రెండువస్తువు లున్నప్పుడే సంయోగము; అభావము వస్తువు కాదు. సమవాయమును గుదురదు; ఏలన నభావ మేవస్తువుతోడను సంబంధము లేనిది.౨.

౨. గుణి గుణ సంబంధమునుగూర్చిన న్యాయదర్శనభావము విమర్శింపఁబడినది. అది సరియైనసంబంధము కాదు; ఏలన నది తన సంబంధములేని రెండువస్తువులకుఁగల సంబంధము కాదు. సంబంధమన గా రెండువస్తువులను గలుపునది; రెండువస్తువులలో నొకటైయుండునది, డోలు. డోలును వాయించు కఱ్ఱ, రెంటికివేఱైనది సంయోగము. రెంటిలో నున్నదగుటచే నది యొకటే, గుణి గుణ సంబంధమిట్టిది కాదు. ఒకదండధారివిషయములో, దండగుణము దండమునుండి వేరుకాదు; దండధారిగుణము దండమునుధరించినవానినుండి భిన్నముకాదు. గుణి గుణములు,వస్తువులతో నేకత్వమును కలిగియున్నవి. అభావవిషయములో, ఏది గుణి, గుణముకూడనైయున్నది; ఏలన నేవస్తువుకాని, గుణముకాని, క్రియకాని అభావమునందుండఁజాలదు. అందుచే అభావముయొక్క గుణ మభావమును దర్శింపఁజేయు నొక ప్రత్యేక లక్షణముకలదని చెప్పవలెను. అభావ మెట్టిసంబంధమును లేనిదగుటచే నే యింద్రియమునకును విషయముకాదు. ఒకవస్తువును దర్శించుటకుఁ, దదభావ దర్శనమునకు నొకేయుపకరణమే పనిచేయునని గంగేశునిభావము. అభావము దర్శనాభావముచే లభించుఫలితముకాదు; అదియు నొక దర్శనవిషయమే.

బౌద్ధులననుసరించి అభావదర్శనమనగా నభావాస్తిత్వము కాదు; ఒక యున్న వస్తువుయొక్క లేమి; ఘటము లేని భూతలదర్శనము, ఘటాభావదర్శనమని పొరపడిరి. కాని న్యాయదర్శము ననుసరించి, అభావములు భావములవలెనే దర్శనయోగ్యములు. భూతలముపై ఘటదర్శనాభావము, ఘటాభావ భూతలదర్శనమే యన్నచో నపుడు ఘటాభావ భూతలము, కేవల భూతలమూ వేరా? యను ప్రశ్నముదయించును. రెండు నొకటి కాఁజాలవు. ఘటమున్న భూతలమునకు, లేని భూతలమునకు భేద మున్నదన్నచో రెండును సమానముగా దర్శనవిషయములే.౧.

నేత్ర శ్రోత్రేంద్రియములు తమ విషయములతోఁ బ్రత్యక్షసంయోగమును బొందకుండ, దూరమున నున్నను గ్రహించునని బౌద్ధులుచెప్పెదురు. నేత్రేంద్రియమనగాఁ గను గ్రుడ్డుగాదనియు, నందలి తేజస్సనియు నందుండి యొకకిరణము పోయి విషయముతో సంయోగము నొందుననియు నైయాయికుఁడు బదులు చెప్పెను. అందుచేతనే మనకు దర్శనమందు, దిక్కు, దూరము, స్థానము నున్నవి.౨.

౧. న్యాయబిందు. పు. ౧౧; న్యాయమంజరి. పుటలు ౫౩-౫౬.

౨. నేత్రేంద్రియము మొకటా, రెండా యను విచిత్రసమస్య యిచటఁ బరిశీలింపఁబడినది. రెండని వాత్స్యాయనుఁడు తలఁచి, మన మొకవస్తువును మొదట నొకకంటితోఁ జూచి, రెండవకంటితోఁ జూచినపు డావస్తువు పూర్వదృష్టమని గ్రహింతుము. దీనివలన ద్రష్టయొకఁడేయని తెలియుచున్నది. ఉద్ద్యోతకరుఁడు దీని నంగీకరింపఁడు. (చూడు. న్యా. భా; న్యా. వా ౩, ౧, ౬, ౧౧)

బౌద్ధతార్కికుఁడు న్యాయసిద్ధాంతము నీ విధముగా ఖండించినాఁడు;(౧) నేత్రేంద్రియమనగాఁ గనుగ్రుడ్డు. దానిద్వారా మన మొక వస్తువును దర్శింతుము, కనుగ్రుడ్డు దూరమున నున్న వస్తువునొద్దకుఁ బోయి చూచుటలేదు. (౨) నేత్రేంద్రియము దాని కంటెఁ జాలపెద్దవస్తువులను, అనగా నరణ్యములు మున్నగువానిని దర్శంచుచున్నది. వానితోఁ బ్రత్యక్షసంయోగమే దర్శనమున కవసరమైనచో నది దుస్సాధ్యము. (3) ఒక వృక్షాగ్రమును, నదే కాలములో నాకసమున నన్ను చంద్రుని నేత్రము చూడఁగలదు. అందుచే నేత్రము వానిని దర్శించుటకు వానియొద్దకుఁ బోనవసరములేదు. (౪) నేత్రము వస్తుసంయోగము పొందనవసరములేదు; పొందను జాలదు, ఏలన నేత్రమద్దపుతలుపులు, మున్నగువాని వెనుకకుఁబోకుండఁ జూచుచున్నది. దిక్కు యొక్కయు దూరము యొక్కయు దర్శనము ప్రత్యక్షముకాదు; కాని అనుభవముచే లభించునది, ఉదయనుఁడు తన కిరణావళిగ్రంథమున నీవిమర్శకు సమాధానమొసఁగ యత్నించినాఁడు. (౧) ఒకవస్తువును గ్రహించుటకుఁగాని వ్యక్తపరచుటకుఁగాని వస్తుసంయోగమవసరము. ఒకదీప మొక వస్తువును గాంతి మంతమొనర్చుటకు దానితో సంయోగమును బొందును. అదేవిధముగా నేత్రేంద్రియ మొక తేజోరూపము; అది కిరణరూపమునఁ బోయి విషయముతో సంయోగమును బొందును. (౨) కనుగ్రుడ్డునుండిపోవు కాంతి వ్యాపించి, దృక్పథములో నున్న వస్తువునంత నాక్రమింపఁగలదు. (3) సమీపదూరవస్తు దర్శనకాలములలో భేదమున్నది.దానిని మనమభ్యాస

ములో గుర్తించుటలేదు, కన్ను తెరచినంతనే చంద్రుఁడు కనఁబడును. కారణము కాంతియొక్క వేగ మచింత్యమైనది. మన నేత్రములనుండి బయల్వెడలిన కాంతి బయటనున్న కాంతితోఁ గలిసినందున దూరముననున్నవి సమీపముననున్నవి వస్తువు లేకకాలమునఁ గనిపించుచున్న వనువాదము సరియైనది కాదేలన, నదియే, నిజమైనచో మనకు వెనుకనున్న వస్తువులుఁగూడ గోచరించవలెను. (౪) అద్దపుపెంకు మున్నగువానినుండి కాంతి పోఁగల సామర్థ్యముగలది. పూర్వోత్తర మీమాంసలు న్యాయ సిద్ధాంతము నంగీకరించును. శ్రోత్రదర్శనము విషయములో నొకచోట బయలుదేరినశబ్దము వాయువులో గమనముచేసి, శబ్దతరంగముల నుదయింపఁజేయును, శ్రోత్రేంద్రియముతోఁ దుదిశబ్దము కలియును. ఒక చోటనుండి బయల్వెడలిన శబ్దచలనము తరంగచలనమును బోలియుండును; లేకనొక లతచుట్టును జిగుళ్ళను బెట్టినట్లుండును.౧. శబ్దమేదిశనుండి వచ్చునో తెలియుటకుఁ బ్రతిశబ్దమునకు శబ్దోత్పత్తిస్థానవిశేషణముండును, శ్రోత్రేంద్రియములోని కొన్నిభాగము లాయాశబ్దములను గుర్తించును.

---

౧. చూడు జయనారాయణ కృతవివృతి. ౨.౨.౩౭. ఈభావమును కుమారిలుఁడు ఖండించినాడు; ఆకాశమేకమునగోచరము నగుటచే లోకులందరి శ్రోత్రములకన్ని శబ్దములు సమానముగా వినపడవలెను. ఒకనికిఁ జెవుడున్నచో సందరముండవలెను. మఱియు వాయువుతోఁబోవు శబ్దములు వాయువున కెదురుగాఁ బోవు శబ్దములకంటె నెక్కుడు దూరములో వినపడును, ఆకాశమేకము, శబ్దముచే మార్పుచెందనది కావున శబ్దతరంగము లాకాశమునఁ బ్రసరించును. అందుచేఁ బైవిషయమునకర్థము చెప్పటకష్టము.

ఘ్రాణేంద్రియ విషయములో వస్తువుయొక్క అణువులుగాలిచేఁ బయనించి నాసికనుస్పృశించును. వస్తుదర్శనమింద్రియ విషయ సంయోగమాత్రమున లభించును, నిద్రించువాఁడును గరతాళ ధ్వని విని లేచును.౨.దర్శనజ్ఞానముయొక్కస్వరూప ప్రథమలక్షణ మది'అవ్యపదేశ్య' మని గౌతముఁడు చెప్పెను.ఒకవస్తువు నామ ముచేతనే తెలియనవసరము లేదు. నామము వ్యవహారవినియో గము మాత్రమే; వస్తుదర్శనకాలమున దానియవసరము ముఖ్య ముకాదు. జయంతుఁ డుదాహరించిన యొక సుప్రసిద్ధదేశికుని భావములో నామములతో నవినాభావసంబంధములు గల వస్తువుల జ్ఞానమును దర్శనము పూర్తిగా నిషేధించును. ఒక మానవుఁ డొక ఫలమునుజూచి,దాని స్వభావము నెఱిఁగినచో నదియొక దర్శనమగును; కాని యాఫల నామము నాతఁ డొక వ్యక్తినుండి విన్నచో నాతనికి శబ్దమాత్రదర్శనమే లభించును౧.

---

౨. న్యా.భా.౨.౧ ౨౬. ఇది అప్రియత్న వ్యాపారము, అందుచే దీని కారణమదృష్టమని చెప్పఁబడెను. (న్యా.భా.౨.౧.౨౯.)

౧. దర్శనమంతయూ వస్తువును దెలుపు నామమేయని (వాగ్రూపమ్ తత్త్వమ్) శాబ్దికులు చెప్పెదురు. జయంతుఁడు దీనిని ఖండించినాఁడు.(న్యాయ మంజరి పుట. ౯౯) వస్తువులు నామములు నొకటైనచో నవి శాశ్వతశబ్దములా? కల్పితశబ్దములా? యని వాచస్పతి ప్రశ్నించినాఁడు. దృష్టవస్తువు లదృష్టశబ్దములు కానేరవు; అవి నామములను గా వేలన, నామముల నెఱుఁగని చంటిబిడ్డలు వస్తువులను జూచుచున్నారు. అందుచే నామార్థముల నెఱుఁగనివారు మొదట నిర్వికల్పక దర్శనములను గలిగియుందురు; నామార్థజ్ఞాన మున్నవారైనను, మొదట నిర్వికల్పకదర్శనములనే గలిగి, పూర్వమెఱిఁగిన నామ మంతరంగమునుండి గత సంస్కారరూపమున బహిర్ముఖమై, నిర్వికల్పక దర్శనము సవికల్పకదర్శన మగును. (న్యా.వా. తా.టీక. ౧. ౧. ౪.)

నామసహితముగను, రహితముగను గూడ వస్తుదర్శనము లభించునని వాత్స్యాయనుని మతము. నామసహితవస్తుదర్శనములో మనకు సవికల్పకదర్శనమును, నామరహితమగుదానిలో నిర్వికల్పకదర్శనమును లభించును[౨]. అవ్యపదేశ్య మనగా నిర్వికల్పకము; వ్యవసాయాత్మక మనగా సవికల్పకమనియుఁ జెప్పఁబడెను.

వాత్స్యాయనుఁడు నుద్యోతకరుఁడు నీ భేదమును స్మరించియుండలేదు. వాచస్పతి దీనిని స్మరించి, దీని నుపదేశించినవాఁడు త్రిలోచనుఁడని చెప్పినాఁడు[3]. అర్వాచీన తార్కికు లందరు నసగా భాసర్వజ్ఞుఁడు, కేశవమిశ్రుఁడు, అన్నంభట్టు, సాంఖ్యవైశేషికవాదులు, కుమారిలుఁడు దీని నంగీకరించిరి. గౌతముని నిర్వచనము ననుసరించి, దర్శన జ్ఞానమంతయు సవి

---

౨. మఱియుఁ జూడు. న్యాయమంజరి. పుట ౯౯. నిర్వికల్పకదర్శనము వస్తుజ్ఞానమునుగాని శబ్దమునుగాని గ్రహింపనేరదని జయంతుని వాదము. శబ్దము నేత్రేంద్రియదర్శన విషయముకాదు. వ్యంజన వ్యంగ్యసంబంధము తెలిసి, తత్సంస్కారస్మృతి గలిగినఁగాని శబ్దము తెలియదు. సవికల్పకదర్శనము శబ్దసంస్కారరూపములతోఁ గలిసియుండును. నిర్వికల్పకదర్శన మట్టిదికాదు. సామాన్యవిశేషాది లక్షణములఁ దెలియుటలో రెండునొకటే. భాషలేనిదే భావముండదని భర్తృహరి తలఁచినాఁడు. అందుచే నిర్వికల్పకదర్శనము, భాషతో నిమిత్తములేనిదనుట నాతఁడంగీకరింపఁడు.

(న్యా. వా. తా. టీక ౧.౧.౪)

3. రత్నకీర్తి తనఅపోహాసిద్ధి, క్షణభంగసిద్ధి గ్రంథములలో నీరచయిత నుదాహరించినాఁడు. చూడు యమ్. యమ్. హరప్రసాదశాస్త్రి ప్రకటించిన బిబ్లియోథెకా ఇండికా న్యాయ ట్రాక్ట్స్. సవికల్పక నిర్వికల్పక దర్శనముల భేదమును విశ్వనాథుఁడు గుర్తించి, యవియొక విషయమునకు రెండువివరణరూపములని చెప్పెను. (చూడు న్యా. సూ. వృత్తి. ౧. ౧. ౪.)

కల్పకమని తోఁచుచున్నది. మనము మనదర్శనము లన్నిటిలో ద్రష్టృదృశ్య జ్ఞానములను రెంటినిఁ గలిగియున్నారము కావున నిర్వికల్పకజ్ఞానమునకు నవకాశములేదని జైనులు చెప్పుదురు. సవికల్పక దర్శనములో నొకవస్తువుయొక్క జాతిలక్షణమును, నావస్తువా జాతిలోని యితరవస్తువులతో నెట్లు భేదించునో యా లక్షణములును, నీ రెంటియొక్క సంయోగమునుగూర్చిన జ్ఞానమిమిడియున్నది. ఇట్టి భేదజ్ఞానము నిర్వికల్పకదర్శనమందు లేదు.౧ సవికల్పక నిర్వికల్పక దర్శనభేదము, ఒకవస్తువుతోడి పరిచయము కాని జ్ఞానము, దర్శనమువలనఁగలుగు నిర్ణయములకుఁగల భేదమువంటిదని చెప్పవచ్చును.

ప్రాచీన వైశేషికుల ననుసరించి, ఒకవస్తువుయొక్క సామాన్యవిశేషలక్షణముల సద్యోజ్ఞానమే నిర్వికల్పక దర్శనమనియు, నందు వాని భేదజ్ఞానముండదనియుఁ జెప్పఁబడెను. సవికల్పకదర్శనమందు రెంటిలక్షణముల భేదజ్ఞానముగలుగుననియు, వస్తువొక సవికల్పకవర్గమునకుఁ జెందునని తెలియుననియు నిశ్చయింపఁబడినది. ౨. నిర్వికల్పకదర్శనములో వస్తువుయొక్క లక్షణములను మనము దర్శింతుము; కాని యాలక్షణము లావస్తువుతో విశేషణ విశేష్యసంబంధ మెట్లు గలిగి

---

౧. తర్కభాషాగ్రంథము ననుసరించి, నిర్వికల్పక దర్శనములో, జీవాత్మకు మనస్సంబంధమును, నింద్రియ మనస్సంబంధమును, నింద్రియవిషయసంబంధము నున్నను, విషయసంబంధ మప్రధానము. కాని సవికల్పకములో నది ప్రధానమగును. ౨. న్యాయకందళి. పు. ౧౯౦. ప్రభాకరుఁడు, పార్థసారథి మిశ్రుఁడు సవికల్పకదర్శనము స్మృతిసంస్కారము యొక్కయు, నింద్రియ విషయ వ్యాపారముయొక్కయు సమ్మేళనమని చెప్పి, దీని నంగీకరింతురు.

యున్నవో తెలిసికొనము. సవికల్పకదర్శనమందట్టి సంబంధ
మును దర్శింతుమని వాచస్పతిమతము. శ్రీధరుఁడీయభిప్రా
యము నంగీకరించినాఁడు. నిర్వికల్పకదర్శనమందు మనము
వస్తువుయొక్క స్వరూపమాత్రజ్ఞానమునే కలిగియుందుమను
పూర్వవైశేషికులభావమును ప్రభాకరుఁ డంగీకరించును. సామా
న్యవిశేషలక్షణములను మనము గ్రహించినను, సవికల్పకదర్శ
నమందువలె వాని భేదము గుర్తింపఁబడదు. ఒకవస్తువు దర్శ
నము, దాని సామాన్యలక్షణములుఁగలిగి, రెంటికి సంబంధ
మెట్టిదో తెలియనిదే నిర్వికల్పకదర్శనమని గంగేశుఁడు నిర్వ
చించెను. ఒకయింద్రియము తద్వస్తుసంయోగముగలిగినంతనే
యనఁగా నేత్రమున నొకఘటముతో సంయోగమైనంతనే,
ఘటమేజాతికిఁ జెందినో యది దర్శింపఁబడదు. ౧. ఘటము
నకు ఘటజాతికిఁగల సంబంధజ్ఞానముగలిగినప్పుడు మనకు సవిక
ల్పక దర్శనము గలుగుచున్నది. అన్నంభట్టు ననుసరించి లక్ష
ణములతో నిమిత్తములేని యొకవస్తుజ్ఞానము నిర్వికల్పకదర్శన
మనియు, గుణిగుణసంబంధమనగా నామము జాతిలక్షణముల
సంబంధమును దెల్పునది సవికల్పకమనియు నన్నంభట్టు నిర్వచన
మొనర్చెను. ౨.

---

౧. ప్రథమతో ఘటఘటత్వయోః విశిష్టానవగాహ్యేకజ్ఞానమ్‌జాయతే తదేవనిర్వికల్పమ్॥ చూడు- సిద్ధాంతముక్తావళి. పు. ౫౮.

౨. అతఁడుకూడ నిర్వికల్పకదర్శనము నిష్ప్రకారకమనియు, సవికల్పక దర్శనము సప్రకారకమనియుఁ జెప్పెను. ఇచటఁ బ్రకారతయనగా, నొక ప్రత్యేక జ్ఞానక్రియాలక్షణము; ఈలక్షణ మితరవస్తు జ్ఞానక్రియలనుండి భిన్న మైనదనిచూపును.

సవికల్పకదర్శన విషయవిభాగమువలన, దర్శనప్రక్రియ లోని భావ, నిర్ణయాంశములు వ్యక్తములైనవి. మనకు మొదట దర్శనము, తరువాత భావము, నావెనుక నిర్ణయము లభించు నను సోపానవాదదోషమున కీ సిద్ధాంతము పాల్పడలేదు.

అర్వాచీన న్యాయమునం దింకొకవిధమైన నిర్వికల్పక దర్శనరూపము కన్పట్టుచున్నది; అదియంతతృప్తికరముగాఁ దోఁచదు. మనవిజ్ఞానమునకు మొదట గోచరించునది సవికల్ప కదర్శనము; దానినుండి నిర్వికల్పకదర్శన మనుమానింపఁబడును. కొన్ని గుణములతోఁగూడిన సవికల్పకదర్శనమునందు విశేషణ యుక్తమైన నిర్వికల్పకదర్శన మిమిడియున్నది. లేకున్న సవి కల్పక దర్శన ముండఁజాలదు. గుణముల దర్శనమును సవిక ల్పక మేయైనచో, గుణముల దర్శనాదిక నిరర్థకవాదమేర్పడును. అట్టి నిరర్థకవాదమునుండి బయల్పడుటకు మనము నిర్వికల్పక దర్శనము నంగీకరించుచున్నాము. ౧.

౧ ఐ. యల్. ఎ. పుటలు ౭౨-౭౩. దీపికలో నన్నంభట్టు చెప్పి నాఁడు; "విశిష్టజ్ఞానమ్ విశేషణజ్ఞానజన్యమ్, విశిష్టజ్ఞానత్వాత్ దండీతిజ్ఞానవత్ విశేషణజ్ఞానస్యాపి సవికల్పత్వే, అనవస్థాప్రసంగాన్ నిర్వికల్పసిద్ధిః" మఱియుఁ జూడుము, సిద్ధాంతముక్తావళి.పు.౫౮. విశేషణవిశిష్టమైన విషయజ్ఞానమే విశిష్ట జ్ఞానము. 'ఘటోఽయమ్' అను జ్ఞానమునందు, మన కింద్రియవిషయ (ఘట) సంయోగమే కాక, ఘటత్వ విశేషణముయొక్క పూర్వజ్ఞానముకూడ నుండ వలెను. ఈ పూర్వజ్ఞానము నిర్వికల్పక మనఁబడును. ఇది అతీంద్రియమైనది. విశేషణముయొక్క పూర్వజ్ఞాన మవసరములేదనియు, మన యింద్రియములు విషయవిశేషణములతోఁ బ్రత్యక్షసంపర్కము పొందుననియు పూర్వోత్తర మీమాంసావాదము, మొట్టమొదట మనకు ఘటత్వమును గూర్చిన నిర్వికల్పక

కొందరు నైయాయికులు నిర్వికల్పకదర్శనము ననుమాన విషయముగా నంగీకరింపరు; కేవలవస్త్వస్తిత్వము నే తెలుపు విజ్ఞానమని చెప్పుదురు.౨. అదివిజ్ఞాన విషయమని చెప్పువారి భావ మేమన నదియొక యవిస్పష్టదర్శనమనియే. సవికల్పక జ్ఞాన సంభూతమది యగునని తలఁచువారు, దానిని సూక్ష్మగుణ జ్ఞానముతో సమమైనదని చెప్పుదురు; దానినే వారు నిర్వికల్పక దర్శనమందురు; ఏలన నందు 'అనువ్యవసాయము' లేదు.

సర్వజ్ఞానమున కారంభసోపానము నిర్వికల్పక దర్శనమని న్యాయదర్శన ప్రధానలక్షణము; నిర్వికల్పక దర్శనమే జ్ఞానము కాదు. ఒకవస్తువుయొక్క సద్యోజ్ఞానమే యది; అది సరియగు నర్థములో జ్ఞానసంబంధము కాదు. అది భేదము తెలియని, సంబంధములేని,యొక విజ్ఞానావస్థ;వివేచనార్థగ్రహణములు గాని, విషయ విభాగ విషయ సమన్వయములు గాని, యందు లేవు, అదిప్రకటనశక్తిలేని మూకత్వము వంటిది; అందు భావసంస్కారము లెవ్వియును లేవు. సవికల్పక దర్శనము, భేదసంబంధ జ్ఞానయుక్తమైన విజ్ఞానరూపము.ఇందు వివేకసమాలోచనా ఫలితములున్నవి; ఇది వాగ్రూప ప్రకటనశక్తి కలిగిన స్పష్టమైన సవికల్పక దర్శనము. నిర్వికల్పక దర్శనమందు జాతిలక్షణములు

---

జ్ఞానమే కల్గుననువాదమును మనస్తత్త్వశాస్త్రము బలపరచుట లేదు. ప్రత్యక్ష సవిజ్ఞానమునకుఁ బ్రదర్శింపఁబడుటకు సామాన్యలక్షణములే మొదటివి కావు. జ్ఞానము అస్పష్టతనుండి స్పష్టతకుఁ బరిణామము, ఘటత్వజ్ఞానము, తార్కికముగా నైనను కాని, కాలికముగా దార్శనిక నిర్ణయమునకుఁ బూర్వము గాదు.

౨. వస్తుస్వరూపమాత్రా. న్యాయసారము. పుటలు 3.౪.౧౪-౧౫.

సంబంధములు గర్భితములై యున్నవి; సవికల్పకములో నవి సువ్యక్తము లగును. ఈభావమును పార్థసారధి మిశ్రుఁ డంగీకరించినాఁడు. నిర్వికల్పక దర్శనములేక యింద్రియ జ్ఞానము; సవికల్పకదర్శనములేక దార్శనిక నిర్ణయము రెండునొకే దర్శనవ్యాపారముయొక్క పూర్వాపరసోపానములు. నిర్వికల్పకదర్శనము, ప్రస్తుతము నతిక్రమింపలేదు గావున, నది ప్రకటనశక్తి లేనిది, వివేకశూన్యము, జేమ్సుమాటలలోఁ, 'అపరిణతమైన వాగ్రూపమును బొందని యనుభవము'; తప్పొప్పులభేదము దానికి వర్తింపదు.౧. కాండిల్లాక్ వాక్యములో, "మనము మొట్టమొదట సారి కాంతినిఁ జూచినపుడు, మనమేకాంతి యగుదుమేకాని కాంతిని మనము చూడము."౨ అందుచే నట్టి యపరిణతగ్రహణమునందు దోషముండుట కవకాశము లేదు. దార్శనికనిర్ణయములో ద్రష్టకొకగుణ మారోపింపఁబడినపుడు, తార్కిక సమస్య యేర్పడును; ఏలన మననిర్ణయము బాహ్యావస్తుక్రమమున కనుగుణమైనది కావచ్చును, కాకపోవచ్చును. 'అదియొక మనుష్యుఁడ'ని మనము చెప్పునపుడు, 'అది' యని చెప్పునంత వఱకు మనజ్ఞానము యథార్థమైనదే, 'ఒక మనుష్యుఁడ'నునది కావచ్చును, గాకపోవచ్చును.3. సవికల్పక దర్శనము వివేకజ్ఞానమనియుఁ, బూర్వజ్ఞానసంబంధము గలదనియు, నిర్వికల్పక దర్శ

---

౧. చూడుము, నీలకంఠుని తర్కసంగ్రహ దీపికాప్రకాశము,

౨ జేమ్సు ప్రిన్సిపుల్సు ఆఫ్ సైకాలజీ. వాల్యూము ౨. పుట౪.
మఱియుఁ జూడుము, న్యా. భా. ౪. ౨-3౭.

3. న్యా. బా. 3. ౨. 3౭.

నము కల్పనాపోఢమనగా నట్టి పూర్వసంబంధము లేనిదనియు బౌద్ధతార్కికుల భావమై యున్నది.౧. వస్తుగుణములైన సామాన్యలక్షణము, వస్తుత్వము, గుణము, క్రియ, నామములను నిర్వికల్పకదర్శనము కలిగి యుండదు; అది కేవలము వస్తువుయొక్క స్వలక్షణమునే గ్రహించును.౨. మనతో సన్నికర్షము పొందు సత్యవస్తువు, వాగతీతమైనది; మనము ప్రకటించునది భావసమన్వితము, ధర్మకీర్తి చెప్పినాడు:" దర్శనవిషయము స్వలక్షణయుక్తమైనది. సవికల్పక జ్ఞానము వస్తుసామాన్య లక్షణసమన్వి

---

౧. బుద్ధిక్రియచే నొకవస్తువున కొక నామము నిచ్చుటే కల్పనయని ధర్మకీర్తి యభిప్రాయము. 'అభిలాపసంసర్గయోగ్య ప్రతిభాసప్రతీతిః కల్పనా' మాటలలోఁగలిపి చెప్పుటకు యోగ్యమైనది కల్పన. ఒకవస్తువునకు దానిలక్షణములైన జాతిగుణక్రియానామ ద్రవ్యములతోడి సంబంధజ్ఞానమును గల్పన సూచించునని జయంతుఁడు చెప్పినాఁడు. (న్యాయమంజరి) బౌద్ధవాదము ననుసరించి, జాతికి వస్తువునకును సామాన్య విశేషములకును; ద్రవ్యగుణములకును, భేదములేదు మన సవికల్పకదర్శనము,లేని భేదములనుగల్పించును. గోవులేని గోజాతియు, తద్గుణహీనమైన గోద్రవ్యమును మనకుఁ దెలియవు. చలించు వస్తువునుండి చలనము వేరుకాదు. ఒకవస్తువునకు మనము నామకరణము చేసినపుడు, భిన్నవస్తువులకు సమత్వము నాపాదించుచున్నాము. "ఇది చైత్రుఁడు"ని మనము చెప్పినపుడు, "ఇది" యొక వస్తువునకుఁ జెందును, 'చైత్ర' యొక మాటకుఁ జెందును. మన వాక్యము రెంటికి సమత్వమును బ్రకటించును, అటులే ద్రవ్య మను ప్రమాణము. భిన్నములైన వస్తువులకు సమానత్వమును బ్రకటించును. "ఇది దండహస్తుఁడైన మనుజుఁడ"ను దానిలో, 'మనుజుఁడు' 'దండము' వేరేయైనను, నొకే యాధారము నాశ్రయించియున్నవని చెప్పఁబడెను.అందుచే నీప్రమాణములు భావకల్పితములు.

౨. సజాతీయ విజాతీయ పరావృత్తైః స్వలక్షణమ్ (న్యాయమంజరి, పుట ౯౭.)

తము. సద్యోదర్శనములో లభించునది విశిష్టము, ప్రత్యేకము, క్షణికము నైనది; దానినిగూర్చి మనము తెలిసికొనునది యొక జాతి సామాన్య ధర్మనిత్యతలు గలది.3.

మనకనుభూతమైన యొకవస్తువునుగూర్చి మనమేమైనఁ జెప్పఁబోవు నాక్షణమందే, దానికొక వేరువస్తువుతో సంబంధమునుగూర్తుము; అప్పుడావస్తువు, దానిస్వభావమును గొంత కోల్పోయి, బుద్ధికల్పనాచ్ఛాదిత మగుచున్నది. మనము విన్నది 'రొద' యే, అంతే సత్యము. అది తుమ్మెద 'రొద' యో, ఆవిరియంత్రినాదమో యనునది మనయూహ. మాతృస్తన్యమును రెండవసారి స్పృశించునపుడు, బిడ్డయొక్క జ్ఞాన క్రియ పూర్వానుభవముపై నాధారపడినదేయనియు నందుచే నదియు 'శుద్ధ' మై సంబంధరహితమైనది కాఁజాలదనియు ధర్మోత్తరుని వాదము. క్యాంటు తత్త్వవేత్త చెప్పినట్లు, సంబంధములన్నియు, యథావస్తువులనుగూర్చిన భావకల్పనములనియు, వానిని, జ్ఞానవిషయములుగా మార్చుకొను విధానములనియుఁ జెప్పవచ్చును. సవికల్పకదర్శనములో, మనము సత్యవస్తువునకు రూపాంతరకల్పనము చేయుదుము; అందుచే నది యసత్యమని చెప్పఁబడెను. ౧. ద్రవ్యగుణ కర్మలయొక్క జ్ఞాన

3. శాస్త్రదీపిక, సామాన్యములన్నియు నసత్యములగు భావకల్పనలని వర్ణించినది. "వికల్పాకారమాత్రమ్ సామాన్యమ్......అలీకం వా"

౧. నిర్వికల్పకదర్శనములోఁ గేవల బాహ్యాభేదజ్ఞాన ముండునని బౌద్ధులు చెప్పిన భావమును క్యాంటు తత్త్వజ్ఞుఁ డంగీకరింపఁడు. పోల్చు. అతని సుప్రసిద్ధవాక్యములు: "భావములులేని దర్శనములు గ్రుడ్డివి; దర్శనములులేని భావములు శూన్యములు."

మంతయు నసత్యమని దిజ్నాగుఁడు నిరసించెను.౨. బాహ్యవస్తువులు క్షణికములగుటచే నవి తెలియునవి కావు. ౩. నిర్మాణ సామర్థ్యముగల యూహాశక్తి, క్షణికరంగము నొక దశాపరంపరగా మార్చి, గతానుభవమునందుఁ జేర్చి, భావిదశను సూచించుచున్నది. విజ్ఞానప్రపంచ మనర్థములేక దరిద్రమైనది. పరమార్థములేక సత్పదార్థము మనపై నొత్తిడి కల్గించు వేదనాత్మకము. ౪. దీనినిగూర్చిన భావమూ యా శాస్త్రకారుల తాత్త్విక భావకలుషితములై యుండును. జ్ఞానమంతయుఁ గేవలము మానసికమను వాదము దిజ్నాగునిది. అర్థస్వరూపము నాతఁడు నిర్ణయింపఁబూనుకొనక విడిచిపెట్టెను; దృష్టాంతములు, మనమెంత క్షణికమైన నొక యర్థదర్శనము చేయుచుంటిమని తెలియఁజెప్పనని యాతఁడొప్పుకొనక తప్పినదికాదు. సౌత్రాంతిక వాదమునం దభిమానముగల ధర్మకీర్తి, దర్శనములోని విభేదములకుఁ గారణము మానసేతరములగు నర్థములున్నవని యంగీకరించి, యవి క్షణికములగుటచే వానిని గూర్చిన జ్ఞాన మసాధ్యమని చెప్పెను. వేదనలు ప్రత్యేకములనియు, వాని మూలపదార్థము లనుమానసిద్ధములనియు నాతనియభిప్రాయము.

బౌద్ధవాదమును నైయాయికులు తీవ్రముగా విమర్శించిరి. జాతినామ సమ్మిశ్రితము కాని శుద్ధమైన యింద్రియజ్ఞాన

౨. చూడు: యుఐ. వైశేషికతత్త్వము. పు ౬౭.

3. క్షణస్య (జ్ఞానేన) ప్రాపయితుమ్ అశక్యత్వాత్

(న్యాయబిందు టీక పు ౧౬.)

౪. న్యాయబిందు పు ౧౦3

మసాధ్యమని యుద్ద్యోతకరుఁడు చెప్పినాఁడు. మనకుఁగల్గు వస్తు జ్ఞానము సామాన్యలక్షణయుక్తమైనదై యుండకతప్పదు.౧. ప్రత్యేకవస్తువులే యున్నకారణమున సామాన్య విషయము లన్నియు నూహాసంభవములేయను బౌద్ధవాదమును నైయాయి కులు తిరస్కరించి, ప్రత్యేకసామాన్యవిషయములు రెండును సమానముగానే యున్నవనియు నవి సమవాయసంబంధమును గలిగియున్నవనియుఁ జెప్పుదురు. ఈసంబంధము ప్రత్యక్షముగా నైనఁ జూడఁబడును; లేదా, ప్రత్యేకవస్తువులు యథార్థపదార్థ వర్గముల కారణములగుట ననుమానముచే గ్రహింపఁబడును. తుదకు వస్తుస్వలక్షణమే మనవిజ్ఞానమునఁ బ్రదర్శితమై విజ్ఞాన స్వరూపమును నిర్ణయించును. యదార్థపదార్థములపై మనము సంబంధములను జొప్పించుటలేదు; సంబంధములు వానియం దున్నట్లు చూడఁబడుచున్నవి. యదార్థవస్తుపరిపూర్ణదర్శనములో నీసంబంధములున్నవని మనబుద్ధి కనుఁగొనును. అర్థము సంబంధ ములులేనిదై, జ్ఞానవిషయము సంబంధసమన్వితమైనచో, నప్పుడు మన కనర్థవైరుధ్య మేర్పడును. మనకప్పుడు తెలిసినవస్తువు యథార్థవస్తువుకాదు; అది ద్రష్టకును, యథార్థవస్తువునకు మధ్యవర్తియై యుండు నొక యాకృతి విశేషమగును. కాని మనమిదివఱలోఁ జూచినట్లుగా, సవికల్పకదర్శనము స్వతః నిర్వికల్పకదర్శనజాతికిఁ జెందినదే యని న్యాయ నిర్ణయమై యున్నది. సంబంధములు శూన్యమునుండి హఠాత్సంభవ ములుగావు. అవి నిర్వికల్పకదర్శనములో గర్భితములైయున్నవి;

౧. న్యా॥ వా॥ ౧. ౧. ౪

సవికల్పకదర్శనమందవి సువ్యక్తమగును. సవికల్పకదర్శన విషయమర్థశూన్యముకాదు; ఏలన నది నిర్వికల్పకదర్శనముచేఁ గూడ గ్రహింపఁబడునని జయంతునివాదము. పూర్వస్మృత్యంశము లున్నంతమాత్రమున నింద్రియవ్యాపారమున కాటంకము కలుగదు. సవికల్పకదర్శనమందలి మిశ్రమలక్షణాస్తిత్వము తార్కికముగా లోపముకాదు. దానియందుండు బుద్ధి వ్యాపారము దర్శనమును బలపరచును. నిర్వికల్పకదర్శనముచే గ్రహింపఁబడుదానిని సవికల్పకదర్శనము మఱలగ్రహించుటచే నది యసత్యముకానేరదు. సత్యమునకు నూత్నత్వమే లక్షణము కాదు. భావాంశములు కేవల వికల్పములు కావు. ప్రత్యక్షదర్శనవిషయమైన సామాన్యలక్షణము కేవలము నామమేకాదు ఏలన నది నామములేకుండగను గ్రహింపఁబడఁగలదు. దక్షిణదేశమునుండివచ్చిన యాత్రికుఁడొకఁ డుత్తరదేశమునన్నున్న యొంటెలను జూచి, వానినామము లెఱుఁగకున్నను గుర్తింపఁగలఁడు. వాని పేరెఁఱుగకున్న నాతఁడు సామాన్యలక్షణములను దర్శించును. మనచేతి నాలుగువ్రేళ్లను మనముచూచినపుడు, వాని సామాన్యవిశేషలక్షణములను రెంటినిఁ దెలియుదుము. మనమొకవస్తువుయొక్క ప్రత్యేకలక్షణములనే తీసికొన్నచో నప్పుడు సామాన్య విశేషణలక్షణ సంబంధమును గుర్తింపము. రెండవవస్తువును జూచినప్పుడు, మొదటజూచిన జ్ఞాపకమువచ్చినయెడల నీరెంటికిని సంబంధములేని కారణముచే నట్టి స్మృతివలనఁ బ్రయోజనమేమియును లేదని జయంతుని వాదమైయున్నది. మొదటిది రెండవదియు నొకే జాతికిఁ

జెందిన వగుటచే రెండవదాని దర్శనము మొదటి దానిని స్ఫురింపఁజేయునన్నచో నపుడు ప్రథమదర్శనమందే సామాన్య లక్షణములు, వ్యక్తిగతలక్షణములు రెండునుగూడఁ దెలియు నని స్పష్టమగుచున్నది. సామాన్యవిశేషలక్షణముల జ్ఞానము నిర్వికల్పకదర్శనములో నస్పష్టముగాను, సవికల్పకదర్శనమందు సుస్పష్టముగాను నుండును. మనమొక ప్రత్యేకవిషయమును జూచినపుడు మనకు సామాన్యలక్షణజ్ఞాన ముదయించుననుు విషయములో బౌద్ధులెనను వ్యతిరేకము చెప్పరు. ఇపు డుదయించుసమస్య యేమనగా నట్టిజ్ఞానమున కాధారమేమి? అది ప్రత్యేకవ్యక్తిగతమైనదా, దానినుండి వేరైనదా? నిత్యమా, అనిత్యమా, దృశ్యమా అదృశ్యమా? యనునది; ఏలన, మన జ్ఞానములోఁ విశిష్టతయున్నచో మన జ్ఞానవిషయములోఁ గూడ నట్టివిశిష్టతయుండవలెను. ౧. వ్యక్తిగతలక్షణముకంటె సామాన్యలక్షణము భిన్నమైనది; అది సర్వసామాన్యలక్షణము గావున నిత్యమైనది. వ్యక్తులు జననమరణములను గలిగి యున్నవి; అవి దర్శింపఁబడినను, ననుమానింపబడినను యథార్థములే. ౨. సవికల్పకదర్శనము దర్శనవిషయనామపూర్వస్మృతిపై

౧. విషయాతిశయ వ్యతిరేకేణ ప్రత్యయాతిశయా నుపపత్తేః॥ (న్యాయమంజరి. పు. ౩౧౪)

౨. న్యాయమంజరి. పుటలు ౩౧౯-౩౧౧; ౩౧౩-౩౧౪. పోల్చు. న్యాయవాదమును సెయింటుథామస్ భావమును, మానవుని జ్ఞానమునకుఁ బ్రధానలక్ష్యము బుద్ధీంద్రియములు గలిసి నిర్మించు సమన్వయసిద్ధమగు నేకత్వము, ఇంద్రియజ్ఞానము స్థూలవ్యక్తిత్వమును, బుద్ధి, సూక్ష్మమగు నాంతరంగికమునైన యేకత్వము నొసఁగును. జ్ఞానవిషయమునందుఁ గూటస్థమగు వస్తు

నాధారపడునుగాని, విషయేంద్రియప్రత్యక్షసంయోగముపైఁ గాదనువాదము ఖండింపఁబడెను. ఎట్లనగా సవికల్పకదర్శనమందు స్మృతియు నింద్రియవేదనమును గలిసియున్నను ముఖ్యమైనది యింద్రియసంయోగము. స్మృతి,సహానుభూతము మాత్రమే ఒకజ్ఞానక్రియ దార్శనికమగునో కాదో యనువిషయము నింద్రియప్రకోపనమున్నదో లేదో చూచి తెలిసికొనవచ్చును.౧

---

సాగమును గ్రహించు నంతర్దర్శనమును, పృథగ్రూపములనిచ్చు నింద్రియజ్ఞానమును గలవు. డేకార్టే చెప్పురీతి నది కేవలము వస్తుసారమును గాదు; వ్యవహారజ్ఞానవాదులు చెప్పురీతి నది కేవల మింద్రియవిషయమును గాదు. జ్ఞానము వస్తువుల నెఱుంగుదుము; అవి యమూర్తములైన గుణసారములును గావు, భావాత్మకములగు రూపములును గావు, సామాన్యలక్షణములను వస్తువులనుండి వేరని తలఁచుటవలన, వస్తువులలో నింటికిఁగల నిత్యసామరస్యమును గోల్పోవుదుమే.

౧. న్యాయకందళి॥ పుట ౧౯౩. పార్థసారథిమిశ్రుఁడు చెప్పినాఁడు; "సవికల్పకమపి అనుపగతేంద్రియవ్యాపారస్య జాయమానమ్ అపరోక్షావభాసత్వాత్ ప్రత్యక్షమేవ" (శాస్త్రదీపిక పు౧౧౯) సవికల్పకదర్శన మపరోక్షము, విశదముగాఁ గన్పట్టిన నట్టిది కాదని బౌద్ధులువాదింతురు; అది దానికిఁబూర్వమే కలిగిన నిర్వికల్పకదర్శన సంబంధమాత్రముననే యట్లు గోచరించును. కాని యీభావము నిరాధారము. బౌద్ధవాదమును ప్రభాచంద్రుఁడును విమర్శించెను. అస్పష్టత సవికల్పక దర్శనములకే ప్రత్యేకలక్షణము గాదు. దూరమున గాని, మైకా తలుపులచే నవరోధము పొందిన వస్తువులు, సవికల్ప నిర్వికల్ప దర్శనములు రెంటిలో నస్పష్టముగానే గోచరించును. పూర్వము దర్శింపఁబడినదానినే తిరిగి దర్శించుచున్న కారణమున సవికల్పక దర్శనములు యథార్థములు గావన్నచో, నప్పుడనుమానమును నట్టిదోషముగలదే యగును; ఏలన నందుఁ బూర్వము సర్వసామాన్య లక్షణయుక్తమైనదని గ్రహించినదానినే తిరిగి తెలియు లక్షణమున్నది. బౌద్ధులసిద్ధాంతము ననుసరించి వస్తువులన్నియు క్షణికములు, అందుచే దర్శనమునకే యవకాశములేదు. అనుమానమునకైనను,

వస్తుయాథార్థ్యభావములను గూర్చి బౌద్ధులకును నైయాయికులకును భేదము ప్రధానమైయున్నది. బౌద్ధులకు యథార్థమైనది 'ఇది' యనునది; ఇది క్షణికము, వ్యక్తిగతము, దేశకాలములందు వ్యాప్తి లేనిది: 'సర్వంపృథక్'. సంబంధము లన్నియు బాహ్యమునుండి చొప్పింపఁబడిన యూహాకల్పనలు. దీనికి వ్యతిరేకముగా నైయాయికుని దృష్టిలో, యథార్థవస్తువు,క్షణికగుణముగాదు; గర్భమందనేకత్వముగల పృథక్పదార్థము. అది యనేకత్వమును కలిగి యున్నను నొకటే; అనేకములో నది యేకము,ఇతర వ్యక్తులతోఁ బోల్చినసది యొక ప్రత్యేకవ్యక్తియే; తన యంతర్గత భిన్నతలోనది సామాన్య లక్షణలక్షితము; ఈసమానత్వముచే నదియొక జాతికిఁజెందును. ప్రతివ్యక్తికినీ రెండు లక్షణములునున్నవి, అణుమాత్రపృథక్పదార్థములో భిన్నతలేదు; అది వ్యాప్తిలేనియొక కేవలసంబంధ మాత్రమే యనుట మన యనుభవములోఁ బరీక్షించుటకు వీలులేని నిరాధారవిశ్వాసము. ఏకత్వభిన్నత్వము లొక పూర్ణతలోని యంశములు; అవి వేరుగానుండుట సత్యమే. మన యింద్రియ దర్శనములో వస్తుగుణములు,సంబంధములు రెండునున్నవని యభినవమనస్తత్వశాస్త్రము న్యాయవాదము నంగీకరించుచున్నది.

---

వస్తువుయొక్క విశిష్టవ్యక్తిత్వమును మనము తెలిసికొనుటలేదు; కాని యంత మాత్రముచే ననుమానసిద్ధమగు జ్ఞానము దోషయుక్తమనరాదు. శబ్దమునుండుట వలనఁగాని, భావకల్పిత సంబంధములవలనఁగాని, యొక జ్ఞానము నిరర్థకము గాదు, సవికల్పక నిర్వికల్పక దర్శనములు రెంటికిని దోషావకాశమును, వ్యావహారిక సామర్థ్యమును గూడ సమానములే.

యములకుఁ గలుగు వేదనారూపములే, జ్ఞానము యొక్క మూలపదార్థములగుటచేఁ బరమసత్యములను భావము బాహ్యదృష్టికి గోచరించును. కాని మానవుని యపరిణతానుభవమే వస్తుయాథార్థ్యమని మన మంగీకరింపఁజాలము. గుట్టలుగాఁబడియున్న తాళ్ళు, కట్టెలు, నిటుకలుఁగలిసి గృహముకానేరదు. ఇంద్రియవేదనలే జ్ఞానముకాదు. ప్రస్తుతక్షణమునకు మాత్రమే చెందిన వ్యక్తిగతభావమే యున్నదను సిద్ధాంతము విజ్ఞానజీవితమంతయు నూహాగానమని తలఁచి, తన బుద్ధిశక్తి కాత్మహత్యయే యవసాన లక్ష్యమొనర్చును. నిష్క్రియాత్మకమైన యెఱుకయే యథార్థానుభవమని బౌద్ధులు చెప్పుదురు. సమాలోచనము పాపమనియు దానినుండి మనము విముక్తులముగావలెననియు వారు బోధింతురు. వర్తమానక్షణమే సత్యమను వారి వాదదీక్ష కేవల భ్రాంతిమయము. సత్యాంశలోలత్వము సమాలోచనాశూన్యతకాదు. నాకెట్టయెదుటఁ గన్పట్టున దొక నారింజపండని నేను జెప్పుటలో నేనెట్టిసమాలోచనమహాపాపమున కొడిగట్టు నుత్సాహపరవశత్వమును బ్రదర్శించుటలేదు. సమాలోచనము మానవమానసమునకు సహజలక్షణము. మానవుని మనస్సొక శూన్యమందిరము,నందు వేదనలు ప్రవేశించుననుట యుక్తముకాదు. ప్రతిదర్శనము మనయింద్రియములకు గోచరించు వేదనలయొత్తిడివలనఁ గలుగు ఫలితమే. మనకుఁ బుట్టుకతోడనే యాలోచించు స్వభావమును వచ్చినది. మనము చూచినదానిఁ గూర్చి యాలోచింపకుండ నుండజాలము. వేదనలు స్వచ్ఛముగా మనకు లభింపవు, అవియొక ద్రవ్యలక్షణ

ములుగా మనకు గోచరించును, ఇతర లక్షణ సముదాయము తోఁ గూడి యవి మనకు దర్శనమిచ్చును. శుద్ధమైన సూక్ష్మతమ 'వర్తమాన క్షణము' నకస్తిత్వము లేదు, దేశములో నొక సూక్ష్మతమ దేశము దేశాంతరములచేఁ బరీతమై యున్నట్లే, ప్రతిక్షణము నెడతెగని కాలప్రవాహములో నితరక్షణములతో గలిసి ప్రవహించును, ఇంద్రియజ్ఞానమునుండి బుద్ధిజ్ఞానమును వేరుచేయు బౌద్ధయత్నము నిష్ఫలము; ఏలన నవి భిన్న వ్యాపారములుగావు. ఇంద్రియవిషయ వేదనలు భిన్నరూప ములుగాఁ గలిసి, జ్ఞానప్రపంచ నిర్మాణమును జేయుచున్నవి, వానికి సంబంధములున్నవి; వానిని మన జ్ఞానముచే విడదీయు చున్నాము, వానిని మన జ్ఞానక్రియలచే మార్చుటలేదు, ఇంద్రి యసోపానమున మనకుఁ గొంతయస్పష్టముగాఁ దెలియునది బుద్ధి సోపానమున సుస్పష్టమగు చున్నది. సత్యము సంబంధసహి తము; సహేతుకము, సత్యముయొక్క పూర్ణస్వరూపము కేవల మింద్రియజ్ఞానమునకుఁ గాని, కేవలబుద్ధిజ్ఞానమునకుఁ గాని లభిం చునదికాదు; పూర్ణవ్యక్తికే పూర్ణసత్యము గోచరించును.

ధర్మకీర్తి చతుర్విధదర్శనముల నంగీకరించును; ఇంద్రియ జ్ఞానము, మనోవిజ్ఞానము; జీవవిజ్ఞానము, యోగిదర్శనజ్ఞానము. ఇంద్రియజ్ఞాన మింద్రియవ్యాపారఫలితము, మనోవిజ్ఞానము నింద్రి యజ్ఞానమునకు మఱుక్షణమున నుదయించు నేకసంతానము నకుఁ జెందినది. అది యింద్రియవ్యాపారమున కనంతరము కల్గు రూపజ్ఞానముగా గోచరించుచున్నది; ఏలన ధర్మోత్తరుఁడు వ్రాసినాఁడు: "ఆక్షణమునకు నేత్రము తనపనిని మానువరకు

మానసికదర్శన మారంభముకాదు. ఏలన నేత్రము పనిచేయుచున్నయెడల మన కింద్రియవిషయములయొక్క రూపములు దర్శనమిచ్చుచునేయుండును. ౧. అంతరంగమందలి సుఖ దుఃఖ దర్శనములు మూడవరకమునకుఁజెందిన స్వసంవేదనా రూపములు. మనము జీవాత్మ నది యనుభవించు సుఖ దుఃఖావస్థా రూపములలో దర్శింతుము. ఇది ప్రత్యక్షసాక్షాత్కారము; ఇందు బుద్ధిసంసర్గము లేదు గావున నిర్దోషానుభవము. మానసికానుభవములన్నిటి నిది యనుగమించును. దర్శనములన్నిటికి లక్షణములై గోచరించు భావావేశ సన్నిహితత్వాభిమానిత్వములు జీవాత్మ విజ్ఞానలక్షణములని ధర్మోత్తరుఁడు చెప్పెను. అర్వాచీనన్యాయము ననుసరించి, యీలక్షణములు విజ్ఞానమునఁ బ్రవేశించు ననంతరవ్యాపారములని భావింపఁబడెను. గంగేశునియుద్దేశములో, "ఇది యొక ఘటమని నేనెఱుఁగు

౧. ఏతచ్చమనోవిజ్ఞానమ్ ఉపరతవ్యాపారే చక్షుషి ప్రత్యక్షమిష్యతే వ్యాపారవతితుచక్షుషి యదూపజ్ఞానమ్, తత్సర్వమ్ చక్షురాశ్రితమేవ. న్యాయబిందు॥ టీక. పుట ౧౩. పోల్చు: రిచార్డు సెమనుని భావము. మనము రెండురూపములలో వేదనలుగాంతుము; మూలరూపము; తత్సహాయరూపము మూలవేదన, యింద్రియస్పంద మున్నంతసేపు నుండి, యింద్రియస్పందము పోయినచో నదియుఁ బోవును; కాని యది సముద్రమునందలి తుఫానువలె, తుఫాను పోయినవెనుక నది కలుగఁజేసిన తరంగములు క్రమముగా శాంతించినట్లు, శాంతించును. మూలవేదన తాను గతించినవెనుక నొక చిహ్నమును విడిచిపోవును. అది కొన్ని సందర్భములలో నింకొకవేదన నుదయింపఁజేయును అది మూలవేదనకాదు; తత్సహాయకరూపము

చూడు: సెమన్సు నెమిక్ సైకాలజీ.

డున"ని మనము చెప్పినప్పుడిట్టి విజ్ఞానమున్నదని తెలియును. సవికల్పకజ్ఞాన మొకవస్తువుయొక్క జ్ఞానముమాత్రమే. కాని "ఆవస్తువును నే నెఱుఁగుదున"ను జ్ఞానము వేరు. మొదటి దానిని 'వ్యవసాయము' రెండవదానిని 'అనువ్యవసాయము' నందురు. "ఇది యొకఘటము"ను నది జ్ఞానము; ఇది యొకఘటమని నే నెఱుఁగుదున"ని ౨. చెప్పుట అనువ్యవసాయము. ప్రతి విజ్ఞాన రూపమునందు నొకవస్తువు దృశ్యమగుటతోఁబాటు జీవాత్మ వ్యాపారమును బహిర్గతమై గోచరించునని సాంఖ్య వేదాంతములు విశ్వసించును. ౧. ధర్మకీర్తి ననుసరించి, మన యింద్రియజ్ఞానా

౨. దీపిక. ౩౪.

౧. ఒకవస్తువుయొక్క జ్ఞానసూచకత్వమునుండి యావస్తు జ్ఞానక్రియ భేదించునని చెప్పు కుమారిలుని భావమునకు న్యాయవైశేషికభావము వ్యతిరేకమైనది. జైనులు, వేదాంతులు, కొందరు బౌద్ధులు, జ్ఞానక్రియ తన్నుఁదానే తెలిసికొనునని చెప్పిరి. న్యాయవైశేషికభావము ననుసరించి, జ్ఞానక్రియ, తనపైఁదానే ప్రసరించి, తన్నుఁ దెలిసికొనఁజాలదు. అది పరప్రకాశకముకాని స్వప్రకాశకముగాదు. ఒక జ్ఞానక్రియ యింకొకదానిచేఁ బ్రకాశితమగును; ఏలన నది యప్పుడు జ్ఞానవిషయమగును. (జ్ఞానమ్ జ్ఞానాంతరవేద్యమ్ ప్రమేయత్వాత్ పటాదివత్) దీనినిగూర్చి జైనులిచ్చిన విమర్శనము సంగ్రహముగా చేర్కొందుము. (౧) సుఖము తన్నుఁదానే తెలియునట్లు, దైవజ్ఞాన మితరాధారము లేకుండఁ దన్నుఁదానే యెఱుఁగునట్లు, ఆత్మయొక్క ప్రతిజ్ఞానక్రియయు నాత్మజ్ఞానసహితమే. అట్లు కాదేని యొక జ్ఞానమును దెలియుట కింకొకటి దానినిఁ దెలియుటకు మఱొకటియు నిట్లనంతజ్ఞాన క్రియావసరము కలిగి, యీవాదము దోషయుక్తమగును. (౨) దేవునియందు రెండు జ్ఞానరూపము లున్నవనియు, నొకటి విశ్వము నెఱుఁగుననియు, రెండవది మొదటిదాని నెఱుఁగుననియుఁ జెప్పు నీ రసవాదము సులభముగా ఖండింపఁబడినది. రెండవ జ్ఞానరూపము దృశ్యమా కాదా? దృశ్యమైనచో దాని నదియే

తీతములై చతుర్విధ బౌద్ధసత్యములను, బుద్ధిజ్ఞానముచేఁ గలా
షితము ౧. కానట్టియు, నిర్వికల్పకదర్శనమేమైనను, యోగ

---

చూచెనా, యింకొకదానిచేఁ జూడఁబడెనా? దానినదియే చూచినచో మొదటిదానికే మన మట్టి శక్తికలదని చెప్పవచ్చును. ఇంకొకదానిచే దర్శింపఁబడినదన్నచో వ్యర్థవాదమగును. రెండవదానిని మొదటిది దర్శించు నన్నచో శాఖాచంక్రమణ మగును. రెండవది దర్శింపఁబడక, మొదటిదానినిఁ జూచినచో మొదటిదిమాత్రము రెండవదానితో నిమిత్తములేకుండ విశ్వము నంతను దర్శింపలేదా? దైవజ్ఞానము స్వప్రకాశకమని మన మంగీకరించవలెను. విశ్వమునంతను దెలియుచుండ దన్నుఁదానును దెలియును. ఈవిషయము లో దైవ మానవజ్ఞానములకు భేదములేదు. స్వపరప్రకాశకత్వము విజ్ఞాన సహజలక్షణము; అది మానవవిజ్ఞానమైనను దైవవిజ్ఞానమైననుసరే, సర్వజ్ఞత్వ మొక్కటి మాత్రము దైవజ్ఞానమునకు లక్షణము. (౩) ప్రత్యక్షానుమానములవలన నను వ్యవసాయజ్ఞాన మున్నట్లు సాక్ష్యములేదు. ఆత్మతో మనస్సంయోగ మను వ్యవసాయమునందుండు నను న్యాయశాస్త్రభావము గ్రాహ్యము కాదేలన మానసాస్తిత్వము ఋజువుకాలేదు. (౪) ఒకజ్ఞాన మింకొకదానిచేఁ దెలియఁ బడునెడల, మొదటి దున్నంతకాలము రెండవ దుదయించదు; ఏలన జ్ఞాన క్రియ లొకదానివెనుక నొకటి వచ్చునవి. మొదటిది నశించినవెనుక రెండవది రాదేలన నది చూచుట కేదియునులేదు. మొదటిదానియభావము నది దర్శించు నన్నచో నది చంద్రద్వయ దర్శనమువలె, భ్రాంతియేయగును. (౫) రెండవది దర్శింపఁబడుచో వ్యర్థవాదమగును. దర్శింపఁబడనిచో నదృష్టమైన రెండవది మొదటిదాని నెట్లుచూచును. అనగా నా జ్ఞానము నింకొకని నాకుఁదెలియుని జ్ఞానము చూచు నన్నమాట. (౬) ఇంద్రియము లదృష్టములు, కాని యవి వస్తువులను దెలుపును. అట్లే యదృష్టద్వితీయజ్ఞానము మొదటిదానినిఁ దెలుపు నను వాదము యుక్తము కాదేలన, మొదటిది స్వప్రకాశకము కాకున్నను. బాహ్యవస్తువు నది తెలియఁజేయునను వాదమును న్యాయవైశేషికవిరుద్ధము.

(ప్రమేయకమలమార్తాండము॥ పుట ౩౪.)

౧. మఱియుఁజూడు: న్యాయబిందు టీక పుటలు ౧౪-౧౫. చూడు, వైశేషికసూత్రములు. ౫. ౧. ౧౩. వి. యల్. ఎ. పుట ౮౧.

దృష్టిచేతనే చూడఁగలమని చెప్పఁబడెను. దర్శనము వివిధపరిమాణములుగలది. గాఢాంధకారములోని వస్తువులను పిల్లులు చూడఁగలవు.; రాబందులు దూరమునుండి తమ యెరను గుర్తించును. అనవరత ధ్యానసాధనముచే, మన మింద్రియాతీత దృష్టిని వికసింపఁజేసికొని, తన్మూలమునఁ బరోక్షాపరోక్ష వస్తువులను, గతభావిదశలను, దూరమున మఱుఁగుపడిన ౧ వానిని దర్శింపవీలగును. ఇట్టి యుత్తమయోగిదృష్టి, యప్రయత్నపూర్వకమైన సద్యోదర్శనము. మనకు విచిత్రమైనది యోగులకు సహజమైనది. మన యాశ్చర్యచకితములైన నేత్రములకు క్లిష్టతమము సూక్ష్మతమమునైన విషయము వానికిఁ గరతలామలకమై గోచరించును. మనముచూచు విషయము యోగిదృష్టికి రూపాంతరమునొంది స్వచ్ఛమై కన్పట్టును. ఈవిధముగా మనకు మిక్కిలిస్థూలదృష్టిలో నింద్రియజ్ఞానమును, మిక్కిలి సూక్ష్మమైన యోగిదృష్టిలోఁ బూర్ణజ్ఞానమునుగలవు. మొదటిది ప్రాకృతమానవుని బాల్యదృష్టి, యేకజన్మునికుండు జ్ఞానము; రెండవదాత్మజ్ఞాని దృష్టి; ద్విజన్ముని జ్ఞానము. ఆత్మసాక్షాత్కారమున కవసరమగు తీవ్రకృషికిఁ బూర్వము మొదటి దుండును; ఆకృషిఫలించుటతో రెండవది లభించును. అఖండ జ్ఞానముతోఁగూడిన యాంతరంగిక పరిశోధనమునుండి యిది

౧. న్యాయమంజరి॥ పుట ౧౦3. యోగశక్తులు దైవకటాక్షమునఁ గూడ లభించునని భాసర్వజ్ఞుని యభిప్రాయము.

ప్రసవించును. సర్వసమన్వయ సంపూర్ణమైన 3 సత్యమును యోగిదర్శించును. యోగి దృష్టికిని దైవదృష్టికిని భేదముగలదు. మొదటి దుత్పన్నము; రెండవది నిత్యము. ౧.

గంగేశుఁడు లౌకికాలౌకికదర్శనభేదమును జెప్పెను. అలౌకికదర్శనము మూఁడువిధములు; సామాన్యలక్షణ జ్ఞానలక్షణ యోగములు. ౨. మూఁడవది యోగిదర్శనము. వ్యక్తులయొక్క సమానస్వభావమును జెప్పునది సామాన్యలక్షణము. ప్రాచీన న్యాయదర్శనము సామాన్యలక్షణము దర్శింపఁబడునని యంగీకరించును. సామాన్యలక్షణ దర్శనమునందు బుద్ధివ్యాపారమునకుఁగల ప్రాముఖ్యమును గంగేశుఁడు గుర్తించెను. ఒకవ్యక్తియొక్క సామాన్య లక్షణజ్ఞానమువలన, నట్టిలక్షణముగల సర్వకాల సర్వదేశవ్యక్తులును మనకుఁదెలియును. అట్టివ్యక్తిజ్ఞానము సర్వవ్యక్తులనుగూర్చియు - ధూమమునుగూర్చి యనుకొందము - తెలియుటవలన సర్వజ్ఞత్వము లభించునని భావింపవలసియున్నదను నాక్షేపణమునకు, మనమట్టి వ్యక్తుల సామాన్యలక్షణమునే తెలియుదుము కాని, వాని పరస్పరవిభేదములను

3. ధ్యానశక్తిచేఁ గలుగు యోగుల అర్థజ్ఞానమును ప్రతిభ యనియుం జెప్పుదురు. కాని ప్రతిభ యనగా సామాన్యమానవులు నప్పుడప్పుడు పొందు నతీంద్రియజ్ఞానరేఖల కర్థము. ప. ప్రి. పు ౨౫౮.

౧. ప్రశస్తపాదుఁడు యోగిదర్శనము రెండువిధము లనెను. (ప. ప్ర. పుట ౧౮౭. న్యాయకందళి. పుట ౧౯౫. మఱియుఁజూడుఁడు, ఉపస్కార ౯-౧. ౧౧

౨. మఱియుఁజూడుఁడు, లౌగాక్షి భాస్కరుని తర్కకౌముది. పు, ౯. విశ్వనాథుని భాషాపరిచ్ఛేదము. పుటలు ౬౨-౬౬.

గాదని విశ్వనాథుఁడు సమాధానమిచ్చినాఁడు. సామాన్యలక్షణజ్ఞాన మింద్రియజ్ఞానము కాదు; ఏలన, మనముచూచిన ధూమమువంటి ప్రత్యేకోదాహరణము లేకున్నను దానిని గ్రహింపవచ్చును. విశిష్ట సామాన్యలక్షణములు రెండు నచట నుండి ప్రత్యక్షదర్శన విషయములగుచున్నవి. సామాన్యము మనఃకల్పితము కాదు; విశిష్టవస్తువుల సారరూపము. ఈవిశేష సామాన్యలక్షణ సంబంధస్వరూపము సమవాయమని చెప్పఁబడెను. సామాన్య లక్షణజ్ఞానము, అనుమానవిధానఫలితముగా [3] సర్వసామాన్య సంబంధముల కవకాశమిచ్చుచున్నది. చందనవృక్షసుగంధమును మనము గ్రహించునపుడు మనకు జ్ఞానలక్షణ ప్రదర్శితమగును, దానిని మనము కేవల దర్శనమే చేసినపుడు, నేత్రేంద్రియ వ్యాపారము పూర్వపరిమళస్మృతిని గలిగించి మనస్సంయోగమును గల్పించును, ఇది పరోక్షదర్శనము దీనిని స్మృతిజ్ఞానమనియు నందురు.

జైనులు దీనినొక మిశ్రమజ్ఞాన రూపమందురు. ఇందు చందనదర్శనము, దాని పరిమళభావమును గలిసి యున్నవి, కాని యీప్రత్యక్ష పరోక్షదర్శనాంశములు తమవ్యక్తిత్వమునీమిశ్రమ జ్ఞానమునందుఁ గోల్పోవని వేదాంత పరిభాషాగ్రంథముగ్గడించును. నైయాయికుఁడిట్టి మిశ్రమ విజ్ఞానరూపముల నంగీకరించఁడు. ప్రతి మనఃక్రియయు నేకము; మనస్సణురూపమగుటచే రెండు కార్యములొకసారి జరుగవు. అందుచే సుగంధచందన

3. వేదాంతపరిభాష ననుసరించి, ఆలౌకిక ప్రత్యక్షము నంగీకరించినచో అనుమానాద్యన్య ప్రమాణములనవసరములగును.

మును నేత్రేంద్రియము దర్శించుటయను క్రియయొకే మాన సిక క్రియ; తత్పూర్వము కంటికిఁ జందనము గోచరించుట, పూర్వపరిమళ జ్ఞానస్మృతి కలుగుటయు నుండవచ్చును. నేత్రేంద్రియ దర్శనవ్యాపారము పూర్వసుగంధస్మరణమను గుణము గలిగి, ప్రస్తుత సుగంధచందన దర్శనము సంభవించు చున్నది. ఇందు నేత్రేంద్రియ వ్యాపారము కంటె మనోవ్యాపారమే ముఖ్యమైనది.౧. ఈదృశ్యమున కభినవ మనస్తత్త్వశాస్త్రము భావసహవాససిద్ధాంతము కారణమని చెప్పును. యోగజలక్షణ ధ్యానజన్యము.

"నేను జూచిన ఘటమిదియే" యను వాక్యాదులందు మనకుఁ బ్రత్యభిజ్ఞాస్వరూపదర్శనమగును. న్యాయశాస్త్రకర్తలు దీనినిఁ జర్చించిరి. ప్రత్యభిజ్ఞ, దర్శింపఁబడిన ఘటప్రత్యక్షజ్ఞానమును, బూర్వము చూచిన ఘటస్మృతియు నను రెండు జ్ఞాన క్రియల సమ్మేళన సంజాతభ్రాంతియా? ప్రభాకరుఁడు తలఁచునట్లది యొకభాగము దర్శనము, నింకొకభాగము స్మృతియునైన జ్ఞానైకరూపమా? లేక నది శుద్ధస్మృతియా? లేక శుద్ధమైన దర్శనమా? (అనుభూతి) అది యింద్రియ మనోజ్ఞానముల సముచ్చయరూపమని బౌద్ధులు తలంతురు.౨ అది కేవలమింద్రియ జ్ఞానమునుగాదు, కేవల మనోవిజ్ఞానమునుగాదు; ఏలన దానికారణము కేవలమింద్రియ వేదనయేకాదు; ఏలన భూతకాలవస్తు

౧. చూడు, న్యాయమంజరి॥ పుట ४౬౧; శ్రీధరుని న్యాయకందళి॥ పు. ౧౧౭.

౨. మఱియుఁజూడు, ఖండన॥ ౧. ౧४.

వృత్తో నింద్రియ సంయోగముండదు; మఱియు నదియొక సంస్కారమునుగాదు; ఏలన నీ ప్రత్యభిజ్ఞయందు "ఇది" యను విజ్ఞానమునున్నది. అది రెంటియొక్క మిశ్రమమునుగాదు;ఏలన రెండు వ్యాపారములు భిన్నములు; రెండు భిన్నఫలితములను గలిగి యున్నవి. ప్రత్యభిజ్ఞానరూపము కేవల మేకజ్ఞానక్రియారూపమన్నచో, దాని విషయస్వరూపమెట్టిది? అది భూతవిషయము కాదేలన,నప్పుడు స్మృతికిని ప్రత్యభిజ్ఞకును భేదముండదు. అదియొక భావివిషయమును గాదు;ఏలన నప్పుడు ప్రత్యభిజ్ఞయూహాకల్పనము నొకటి యగును; అదియొక వర్తమాన విషయమును గాదు, ఏలనఁ బ్రత్యభిజ్ఞ యనగా నొక ప్రస్తుత వస్తువును, పూర్వవస్తువుగా గుర్తించుట, అందుచే నది భూత వర్తమాన భవిష్యద్వస్తువను టాత్మవిరుద్ధ ప్రసంగమగును. అందుచే నైయాయికుఁడు ప్రత్యభిజ్ఞయనగా నొక విశేషణ యుక్తమైన దర్శనమనును; దీనివలన వర్తమాన వస్తుజ్ఞానము, పూర్వస్మృతి జ్ఞాన విశేషణయుక్తమై లభించును. మనమొక వస్తువును జూచి యది మనము పూర్వము చూచినదే యని గుర్తింతుము.౧. పూర్వోత్తర మీమాంసావాదులీ సిద్ధాంతము నంగీకరింతురు. జైనులు ప్రత్యభిజ్ఞాపక్ష, అసమ్మిశ్రితమయ్యును, దర్శనమునకును, స్మృతికిని భిన్నమైన లక్షణము కలదని వాదించిరి. ప్రతిదర్శనము నొక యనుమానాంశమును గలిగి యున్నది.

౧. చూడు. న్యాయమంజరి పుటలు ౪౪౮-౪౪౯. మితభాషిణి.(విజయనగరము. సంస్కృతహారావళి.) యిట్లుచెప్పును: "యం దేవదత్త ఇతి అతీత వర్తమాన కాలవిశిష్టవిషయకమ్ జ్ఞానమ్ ప్ర[illegible]జ్ఞా."

మనమొక వృక్షమును జూచినపుడు, మనము నిజముగా వృక్షములోని యొక భాగమునే (ఏకదేశము) చూతుము. ఇంద్రియానుభవమును, భావార్థముతో మేళవించి, వృక్షమును దర్శింతుము.౨. పూర్వము వృక్షమునంతను జూచినస్మృతియు, నాస్మృతి వలన నిప్పుడు చూచిన భాగమును గలిపి, మనమొక యనుమాన జ్ఞానమునుగాంతుము. ఇది ప్రతిదర్శనము యొక్కయు లక్షణము. స్మృతియు, ననుమానమును సహాయకములు; ఇంద్రియానుభవము ప్రధానము. ఇంద్రియ సంయోగముచే మనకెట్టి మానసికదశ కలిగినను నది యొక దర్శనమగును. స్మృత్యనుమానాద్యంశము లందేమి కలిసిన నిబ్బంది లేదు.

గౌతముని యింద్రియజ్ఞాన నిర్వచనము దానిని విపర్యయదోషరహిత లక్షణయుక్త మొనర్చినది. సకలేంద్రియ దర్శనములును నిర్దుష్టములుగావు. మన సహజదర్శనమం దీయంశములున్నవి. (౧) దర్శనవిషయము, (౨) బాహ్యావరణము, నేత్రేంద్రియ వ్యాపారమునందుఁ గాంతి మున్నగునవి, (3) విషయమును దర్శించు నింద్రియము. (౪) జీవాత్మ, ఇం దేది సక్రమముగా లేకున్నను, దర్శనదోషములు గలుగును. బాహ్యవస్తుదోషములకుఁ గారణములు చలనము, సామ్యమును గావచ్చును. సామ్యమువలన ముత్తెపుచిప్పను వెండిగాఁ జూతుము. కాంతి మందగించినచో వస్తు వస్పష్టముగాఁ గోచరించును. మనకు నేత్రరోగాది దోషములున్నచో మన దర్శనమును దోషయుక్తమగును. మన స్సన్యథా వర్తించుచున్న

౨. న్యా॥భా॥ ౨,౧,3౦; ౨,౧,3౧-3౨.

యెడలను, లేక మన జీవాత్మ భావోద్రిక్తమైనను, భ్రాంతిజనించును.౧. భ్రాంతిహేతువులు మూడురకములు. (౧) ఇంద్రియదోషము, స్వర్ణవర్ణకలుషిత నేత్రము. (౨) సంప్రయోగదోషము: అనగా నొక వస్తుభాగమే గోచరించుట. (౩) సంస్కారదోష మనగా, మానసిక వ్యాపారదోషము; అనవసరములైన స్మృతులు సవ్యదర్శనమును నిరోధించుట. మన మొక రజ్జువును జూచుచున్నపుడు పూర్వ సర్పస్మృతివలన సర్పభ్రాంతి కలుగుచున్నది.౨.

స్వప్నము లింద్రియవిషయలక్షణములు గలిగియున్నవి. అవి బాహ్యాభ్యంతరములు. ఇంద్రియప్రకోపములచే నంతరంగమం దణఁగియున్న సంస్కారములను బునరుజ్జీవింపఁజేసి,తన్మూలముననను, పూర్వజీవిత పుణ్యపాపములవలనను నవి జనించును. ఆరిస్టోటల్౧. కూడ నంగీకరించిన భావిదశా సూచకములగు స్వప్నములు విదేహజీవుల ప్రవర్తనముచే లభించుచున్నవని చెప్పఁబడెను.

జీవాత్మకుఁ గేంద్రాంగమైన మనస్సుతో సంయోగము కలిగి, పూర్వానుభవముయొక్క ఆంతరంగికసంస్కారముల సాహాయ్యమున స్వప్నములుదయించునని కణాదసిద్ధాంతము.౨.

౧. న్యాయమంజరి॥ పుటలు ౮౮-౮౯, ౧౭౩.
౨. న్యాయబిందు క. పు. ౧౨.

౧. గోంపెర్జ. గ్రీక్ థింకర్సు. వాల్యుము ౪. పు. ౧౮౫
౨. వైశేషికసూత్రములు. ౯, ౨, ౬-౭.

ఇంద్రియములు నిద్రావశములై నిర్వ్యాపారములై, ౩. మనః కల్పితములగు నాంతరంగికదర్శనములవలన స్వప్నములుదయించునని ప్రశస్తపాదు నభిప్రాయము. పూర్వజ్ఞానసంస్కారము వలనను, దేహానారోగ్యావస్థలవలనను, నదృష్టశక్తులవలనను స్వప్నములు జనించుననియుఁ జెప్పఁబడెను. స్వప్నములు కేవలము పూర్వానుభవ పునఃప్రదర్శనములు గావనియు నవి జీవ కేంద్ర ప్రకోపములనియుః శ్రీధరునిమతము. స్వప్నములం దింద్రియవ్యాపారముకూడ నుండునని యుదయనాచార్యునభిమతము. తన తాత్త్వికసిద్ధాంతమునమసరించి, ప్రభాకరుఁడు గతానుభవ పునఃప్రకటనములే స్వప్నములనియు, నవి స్మృతి ప్రమోహములచే వర్తమానదర్శనములుగా గోచరించుననియుఁ జెప్పినాఁడు. స్వప్నజ్ఞానమునకును, స్వప్నాంతికజ్ఞానమునకును భేదమున్నది; స్వప్నాంతికజ్ఞానమున స్వప్నవిషయమే యెఱుకవచ్చును. భ్రాంతి రెండువిధములు, అధిష్ఠానములు గలది, లేనిది. ఒకసుందరియందు వ్యామోహబద్ధుఁడైనవ్యక్తి, సర్వత్ర యామెరూపమునే దర్శించునను నీ యుదాహరణము నిరధిష్ఠానభ్రాంతిని దెలుపునని శ్రీధరుఁడు చెప్పినాఁడు. ౫.

అనుమానము

అనుమానమనగా 'అను - మానము' పరిమాణమును గొలుచునట్టిది. అదియొక జ్ఞానమునుండి ప్రసరించు నింకొక

---

౩. ప. ప్ర పుట ౧౮౩; ఉపస్కార. ౯, ౨, ౭.
౪. మనోమాత్రప్రభావమ్, స్వప్నజ్ఞానమ్.
౫. న్యాయకందళి. పు, ౧౮౯.

జ్ఞానము. లింగజ్ఞానమునుండి, లింగిజ్ఞానము సంభవించును. ప్రత్యక్షానంతరజ్ఞాన మనుమానమనియుఁ జెప్పఁబడెను. 'ప్రత్యక్షజ్ఞానములేనిదే యనుమానముండద'ని వాత్స్యాయనుఁడు భావించినాఁడు. ఒకదప్తి నిప్పును ధూమమును సంబంధము గలవని చూచి, యింకొకసారి ధూమమును జూచినచో నగ్ని యున్నదని యనుమానించును. ౧. ప్రత్యక్షానుమానజ్ఞానములకుఁ గొన్ని భేదములనుద్ద్యోతకరుఁడు పేర్కొనినాఁడు: (౧) యోగిదర్శనముతప్ప ప్రత్యక్షమంతయు నేకరూపము; అనుమానమున వైవిధ్యముగలదు. (౨) ప్రస్తుతవిషయములకు సంబంధించినదియు, నింద్రియముల కందుబాటులో నున్నదియునుమాత్రమే ప్రత్యక్షము; అనుమానము త్రికాలసంబంధి. (3) అనుమానమునకు సామాన్యసంబంధస్మృతి లేక వ్యాప్తి యుండవలెను; ప్రత్యక్షమునకట్టి దవసరములేదు. ౨. ప్రత్యక్షదర్శనము సాధ్యమగునేని యనుమానమునకుఁ దావులేదు.. 3. ప్రత్యక్షదర్శన విషయజ్ఞానమునకు విశేషమాలోచనావసరము లేదు. ౪. "ఏమియుఁ దెలియని విషయములఁగూర్చికాని, స్పష్టముగాఁ దెలిసిన విషయములఁగూర్చికాని యనుమానము నకుఁబనిలేదు; సంశయాస్పదవిషయములనుగూర్చియే యనుమానము పనిచేయును." ౫. ప్రత్యక్షదర్శనమున కలభ్య

(౧) న్యా॥ భా॥ ౨, ౧, 3౪.
(౨) న్యా॥ వా॥ ౨, ౧, 3౧.
(3) ప్రత్యక్షత్వాదమమాన ప్రవృత్తేః। (శంకరుఁడు డిఁయన్.వి.)
(౪) ఘటోఽయమితి విజ్ఞాతుమ్ నియమః కోన్వపేక్షతే.
(౫) న్యా॥ భా॥ ౧. ౧. ౧.

మైన వస్తుభాగములనుగూర్చి యనుమానము తెలుపును. మనము చూచినది, దానితో సంబంధముగల చూడనిదానిని సూచించును. తన న్యాయసారమునందు భాసర్వజ్ఞుఁ డనుమాన మనఁగా నింద్రియముల కందుబాటులో లేని యొకవిషయ మును దెలియపఱచుననియు, నట్టివిషయమున కింద్రియగోచర ణములోని వస్తువులతో సంబంధముండుననియు నిర్వచనము చెప్పెను. శివాదిత్యు ననుసరించి గంగేశుఁ డొకజ్ఞానమునుండి లభించు నింకొకజ్ఞానమే యనుమానమని నిశ్చయించెను.

గౌతముఁ డనుమానము మూఁడువిధములని చెప్పెను. పూర్వవత్, శేషవత్, సామాన్యతో దృష్టమ్.3. ఈ వర్గీకరణ మునుండి వాత్స్యాయనుఁడు కొంతభేదమును జూపెను. అనఁగా వాత్స్యాయనునికిఁ బూర్వమే న్యాయసూత్రముల వివరణ ములో భిన్నాభిప్రాయము లున్నవని తెలియుచున్నది. అను మానమునందు మనము దృష్టమగుదానినుండి తత్సంబంధియైన

౧. తత్త్వచింతామణి॥ ౨అ. పు. ౨. పోల్చు. మాణిక్యమండియిచ్చిన అనుమాననిర్వచనము; సాధనాత్సాధ్యవిజ్ఞానమ్. (పరీక్షాముఖసూత్రమ్)

౨. సప్తపదార్థీ. పు ౧౪౬

3. పూర్వమీమాంససూత్రము ౧అ. ౨. ౧౯, ౨౨, ౨౩, ౨౯; ౩అ. ౧, ౨-3; ౩అ-౨-౧. ఇందుఁ బూర్వ-శేషశబ్దములు తర్క-వాక్యములందలి పూర్వోత్తరభాగములను నర్థములో వాడఁబడినట్లు తోఁచును,దీని నార్థమునను గార్య కారణములుగా న్యాయము భావించెను. (చూడు. ఆచార్యధ్రువుని 'త్రివిధమ్ అనుమానమ్' ఓరియంటల్ కాన్ఫరెన్సు ప్రొసీడింగ్సు. పూనా. పుట ౨౬౫.

యదృష్టమగుదానియొద్దకు గమింతుము. ఈ దృష్టాదృష్ట వస్తు సంబంధము త్రివిధము. అదృష్టవస్తువు దృష్టవస్తుకార్యమా? కారణమా? లేక రెండు నింకొకదాని కార్యములా? యను విషయములచే నీభేదము వచ్చును. మనము మేఘములను జూచి వర్షించునని తలంచుట పూర్వవదనుమానము. ఇచటం బూర్వవస్తువును జూచి పరము నూహింతుము. ఇంతేకాక, పూర్వానుభవ మంతయుం గూడ నిం దుపయోగించును. పొంగినయేటిని జూచి, వర్షము కురిసియుండవలెనని తలంచునప్పుడు శేషవదనుమానము. ఇచటం గార్యమునుజూచి కారణము నూహించితిమి. వస్తు ద్వంద్వములో నొకదానివలన నింకొకదానిని, యొక వస్తువులో నొకభాగమునుండి యింకొకదానిని, లేక కాని వానిని వేరుచేయుటవలన లభించు దానిని ననుమానించు జ్ఞానముకూడ నిందే చేరును. శబ్దస్వరూప మొక గుణమను ననుమాన మిట్టిదని చెప్పంబడెను. శబ్దము సామాన్యవిశేషసమవాయద్రవ్య క్రియలలో నేదియుం గాదనియు నందుచే నదియొక గుణమనియు నిర్ణయింతుము. ఒక కొమ్ములుగల జంతువును జూచి, దానికొక తోకయు నున్నదని యనుమానించుట సామాన్యతో దృష్టానుమాన మగును. ఇది కేవల కారణధర్మముపై నాధారపడలేదు. అనుభవ సామాన్యస్వభావముపై నాధారపడినది. ఉద్ద్యోతకరుండు దీని నంగీకరించి, కొంగలు కనపడుటచే నొకచోట నీరున్నదను నుదాహరణము నీ యనుమానమును సూచించుట కొసంగియున్నాండు. ఇంద్రియాతీత విషయములం

దెలియుటకుఁగూడ నిది యుపయోగించును.౧. సూర్యుని వివిధ ప్రదేశములలోఁ జూచి, సూర్యునికిఁ జలనమున్నదని యనుమానింతుము. సూర్యచలనమును మనము చూచియుండలేదు. రాగద్వేషాది గుణములను జూచి, ఆత్మ యున్నదని గుర్తింతుము; కాని యాత్మ దృష్టముగాదు.౨.

ఈయుదాహరణముల వలన వ్యాప్తి లేక భిన్నవస్తుసంబంధావసరమున్నదని స్పష్టము. ప్రతివ్యాప్తియందును వ్యాపక వ్యాప్యములున్నవి. ఒకవిషయికిఁగల యొకగుణము వేఱొక

---

౧. ఈయర్థ మసంభవమని కీత్ పండితు నభిప్రాయము.

౨. భిన్న కాలములలో భిన్నప్రదేశములలోఁ గన్పించుచున్న కారణమున సూర్యునికి గతియున్నదని చెప్పు వాత్స్యాయనుఁడిచ్చిన యనుమానోదాహరణము సమంజసము కాదని యుద్ద్యోతకరుఁడు ఖండించినాఁడు, ఏలన మనము సూర్యగోళములోని భిన్నభాగములనే చూచుచున్నాము కాని, సూర్యగతిని జూచుటలేదు, పూర్వవత్ శేషవత్ సామాన్యతోదృష్టమను త్రివిధానుమానముల నుద్ద్యోతకరుఁడు వేరుగాఁ జూడక సంపూర్ణమైన యొక యనుమానమున కివి యుపాంగములని తలఁచిన సంగతిని మనము మఱువరాదు (౧) పూర్వవత్తనగా మధ్యమాంగము లేక హేతువు, పూర్వ లేక సాధ్య లేక మున్నతాంగము ననుసరించవలెను. (౨) శేషవత్తనగా మధ్యమాంగమున్నతాంగము నితరశేష పద్విషయములలోఁ దప్పక యనుగమించునని చూచియుండవలెను, (3) సామాన్యతోదృష్టా యనగా సామాన్యతః అదృష్టా యని విభాగించి, మధ్యమాంగము సాధ్యాసాధ్య భావములకు సమానము కారాదని యర్థము చెప్పినాఁడు. వీనికిం దిమిడియున్నవని సూత్రములోని 'చ' శబ్దమువలన నిర్ణయించి, ప్రత్యక్ష శబ్దప్రమాణ విరోధములు కాని లక్షణములుండవలెనని చెప్పెను. ఈరెండు లక్షణములు సక్రమమైన 'అన్వయవ్యతిరేకి' యను ననుమానము దుండవలెననియు, నాలుగుమాత్రమే కేవలాన్వయి కేవల వ్యతిరేక్య నుమానములం దుండవలెననియు నిరూపించెను.

గుణముతో వ్యాప్తి లేక నిత్యసంబంధమును గలిగియున్న సత్యముపై నాధారపడి యనుమాన నిర్ణయమేర్పడును. పర్వతము నుండి ధూమమును జూచి, పర్వతము మండుచున్నదని నిశ్చయింతుమేలన ధూమాగ్నులు సర్వసామాన్యముగాఁ గలిసి యుండునని మనకుఁ దెలియుఁను, మధ్యమపథమైన ధూమము అనగా లింగపరిశీలనము వలన ధూమము గల వస్తువుకూడ నగ్నిని గలిగి యున్నదని మనము తెలిసికొందుము. ఉద్ద్యోతకరు ననుసరించి, స్మృతి సాహాయ్యముతోఁగూడిన లింగముపై నాధారపడిన వాదమే యనుమానము; లేక హేతుదర్శన జ్ఞాన పూర్వకమై,సాధ్యముతో దానికి గల యవినాభావసంబంధస్మృతి యనుమానము, అనుమాన వాదాంశములు తర్క-వాక్యములోఁ జూపఁబడినవి.

ర—తర్క-వాక్యరూపము (Syllogism)

తర్క-వాక్యములోని పంచాంగము లివి; (౧) ప్రతిజ్ఞ; పర్వతము మండుచున్నది. (౨) హేతువు లేక కారణము;పొగ వచ్చుచున్నది కనుక. (౩) ఉదాహరణము,ఎచట నిప్పున్నచట బొగయుండును; వంటగది. (౪) ఉపనయము లేక ప్రయోగము, అట్లే యీపర్వతమును, (౫) నిగమనము లేక నిర్ణయ ప్రకటనము; కావునఁ బర్వతము మండుచున్నది.౨. ప్రతిజ్ఞ

౧. స్మృత్యను గృహీతో లింగపరామర్శోఽను మానమ్. (న్యా॥వా॥ ౧.౧.౫)

౨. న్యా॥సూ॥ ౧.౧.౩౨. పోల్చు. ప్రశస్తపాదుఁడిచ్చిననామములు: ప్రతిజ్ఞ; అపదేశము: నిదర్శనము; అనుసంధానము; ప్రత్యామ్నాయము. దీని వలన వైశేషిక దర్శనమందు న్యాయభావములు స్వతంత్రవికాసముఁదెవని తెలి

స్థాపింపవలసిన సిద్ధాంతమును మొదటనే ప్రకటించును, సమస్యను నిర్ణయించి, అన్వేషణావధులను నిశ్చయించును. స్థాపింపవలసిన సిద్ధాంతము మొదటినుండియుఁ గార్యక్రమమార్గమును నియమించును; అనుమానప్రవృత్తి దానిని బలపఱచి సమర్థించును. సిద్ధాంతమనగా నొకప్రతిపాదనము; అదియొక సూచనమాత్రమే,౧. ప్రతిజ్ఞలోఁ జెప్పఁబడిన ప్రతిపాదనమునుగూర్చి యింకను దెలియవలెనను నాకాంక్ష లేనిదే హేతుచర్చయే లేదు. ప్రతిపాదనమందు రెండంశములున్నవి. ఒకటి చూచినవిషయము; ఇది సామాన్యముగా నొకవస్తువు లేక వస్తువుగా నంగీకరింపఁదగిన యొకజాతి;౨ రెండవది సాధింపవలసియున్న కార్యము. 'పర్వతము మండుచున్నద'ను దానిలోఁ బర్వతము చూచినవిషయము లేక కర్త లేక ధర్మి; 'మండుచున్నది' ధర్మము, లేక సాధ్యము లేక అనుమేయమనగా ననుమానింపఁదగినది. కర్త లేక ధర్మి యొక్క దృశ్యాంశమును జెప్పి, ధర్మ మా ధర్మికలిగియున్న గుణమును సూచించును. అది గుణముకాని గుణవర్గముకాని కావచ్చును. మనకుఁ బ్రత్యక్షమొసఁగిన కర్త, అనుమేయములోని లక్షణమును గలిగియున్నదనిచూపుటే తర్కవాక్య లక్ష్యము. ధర్మి ధర్మములను

---

యుచున్నది, తర్కవాక్యమునందు భిన్నప్రమాణాంశములున్నవని వాత్స్యాయను నభిప్రాయము, మొదటిది శాబ్దికము; రెండవది ఆనుమానికము, మూడవది ప్రత్యక్షము, నాల్గవదుపమానము, సిద్ధాంతములో నీనాల్గును ప్రవృత్తిలోనున్నవని యూహింపనగును. (న్యా॥భా॥౧.౧.౧)

(౧) న్యా॥ భా॥ ౧, ౧, ౩౯. (౨) న్యా॥ సూ॥ ౨,౧,౬౬.

గలుపు సంధానశబ్దము భాషావసరనిమిత్తము వచ్చినదేకాని దానికిందు ముఖ్యతలేదు. 3. ప్రతిపాదనము ప్రత్యక్షదర్శనమునకుఁగాని శబ్దప్రమాణమునకుఁగాని విరుద్ధము కారాదు. దిఙ్నాగుననుసరించి, అస్పష్టములు, నాత్మవిరుద్ధములు, స్వయం ప్రకాశకములునైన విషయములు ప్రతిపాద్యములుకావు ౪. ఇవి మనకుఁ దెలియనివిషయములు కాని, సువిదితసత్యాంశములు కాని, స్వనిశ్చయవ్యతిరేకములు గాని కారాదు. కర్త లేక పక్షము "ప" సాధ్యము లేక "సా" యగునని ఋజువు చేయుటకు, మొదట మనము పక్షమునుడీసికొని, పరిశీలించి, దానియందు మనము మధ్యమాంగమును గాంతుము. తార్కిక చర్చలన్నిటిలో ప్రతిపాదనానంతరము తద్విషయవిభాగపరిశీలనము జరుగును. తర్కవాక్యములోని ద్వితీయాంగము మధ్యమావయవమైన హేతువు. లేక సాధన లేక లింగము ధర్మియందున్నదని తెలుపును. అది పక్షధర్మత నుగ్గడించును. పర్వతము ధూమావృతమైయున్నది. పక్షత అనుమానమునకు ముఖ్యాధారము, ప్రతి పర్వతమును బక్షముగాదు; దానియందు ధూమమున్నదని చూచి, నిప్పుకూడనున్నదని తెలియఁగోరినంతనే యది పక్షమగును. మన మగ్నినికూడఁ జూచినచో నది పక్షముకాఁజాలదు. పక్షమనగా నందలి సాధ్యము సంశ

(3) చూడు. హిస్టరీ ఆఫ్ ఇండియన్ లాజిక్కు పు. ౨౯౦ మఱియుఁ జూడు. ప॥ ప్ర॥ పుట ౨౩౪; వై॥సూ॥ 3, ౧, ౧౫.

(౪) మఱియుఁజూడు: ప. ప్ర. పు ౨౩౪; వై. సూ. 3,౧.౧౫.

యాస్పదము కావలెనని అన్నంభట్టు నిర్వచించెను. ౧. పక్షము కేవల మొక యంగము కాదు; ప్రతిపాదనమే. మనకిప్పుడు తార్కికానుమానమునకు వలయు సంగతియము లభించినది. హీనాంగము లేక పక్షము; అనగా దీనిని గూర్చి యొకలక్షణ మనుమానింపఁబడును; ఉన్నతాంగము లేక సాధ్యము; అనగా హీనాంగమును గూర్చి చేసిన యనుమానము; మధ్యమాంగము అనగా దీనివలన నున్నతాంగము హీనాంగమును గూర్చి చేసిన యనుమానము సత్యమే యనునది నిశ్చయమగును.

మధ్యమాంగము హీనాంగమునం దున్నంతమాత్రమున ననుమానము సత్యము కాఁజాలదు; మధ్యమోన్నతాంగముల కొక సామాన్యలక్షణ సంబంధము కూడ నిందుఁ గలియవలెను. తృతీయాంగమైన యుదాహరణ ధూమయుక్తమైనదానిలో నిప్పుండును; వంటింటివంటి దనునది. అనుమానాధారమును జూపును. ఉన్నతాంగలక్షణము గలదే యుదాహరణమని గౌతముఁడు చెప్పినాఁడు. వాత్స్యాయనుఁడు దీనినంగీకరించెను. ఉదాహరణ మనగా నొక సామాన్యనియమమును ధృవపఱచునదను భావమును వీరు సూచించునట్లాధారము లేదు. జ్ఞానమంతయు నొక విశేషలక్షణమునుండి యింకొక విశేషలక్షణమును గ్రహించుటయను నర్థములో వారట్లు భావించియుండవచ్చును. కొందరువ్యక్తుల కొకలక్షణమున్నది; ఇంకొకవ్యక్తిగాని వ్యక్తులుగాని కొన్ని యితరలక్షణములలోఁ బూర్వవ్యక్తిసామ్యమును గలిగియుండవచ్చును; అందుచే మొదటిలక్షణము

(౧) తర్క సంగ్రహము. పు ౫౧; సందిగ్ధసాధ్యవాన్.

లోఁగూడ వారికి సామ్యముండవచ్చును. ఉపమానమునుండి న్యాయహేతు (తర్క) వాక్యము పెంపొందియుండవచ్చును. ఈపద్ధతి నారిస్టోట లంగీకరించినాఁడు. ౧. ఉపమాన జ్ఞాన పూర్వకమగు హేతుపద్ధతి మనము తఱచుగా వాడుచున్నదైనను, నది తార్కికానుమానము కాఁజాలదని గుర్తించిరి; ఏలనఁ దార్కికానుమానమునందు సిద్ధాంతము ప్రతిపాదనమునుండియే లభించును. మనముతీసికొనిన యుదాహరణము సామాన్యధర్మసూచకముగానిచో వాదము హేతుశూన్యమగును. సాధర్మ్యము జాతి సామాన్యధర్మమును జూపును. ప్రశస్తపాదుఁడు సాహచర్యము నెఱుఁగును; అది కణాదుఁడిచ్చినదని యాతఁడు చెప్పెను. ౨. అనంతరతర్కము తృతీయాంగము సామాన్యసంబంధ ప్రకటనమని యూహించెను. 3. అనుమానించిన లక్షణమునకును సూచించిన సంజ్ఞకును నవినాభావసాహచర్యము లేకున్నచో ననుమాన మసంభవము. వేదాంతపరిభాష చెప్పెను: "సామాన్యసంబంధజ్ఞానమే యనుమానోపకరణము." ౪. ఉదాహరణమునిచ్చుటవలన ననుమానము సామాన్యమునుండి విశేషమును విశేషమునుండి సామాన్యమును గ్రహించు నుభయలక్షణయుక్తమైనదని తెలియుచున్నది. సామాన్యధర్మ మనేక సమాన విషయములపై

(౧) పోలుచు:ఏథెన్సు థీబ్సుతోఁజేసిన యుద్ధము క్రూరమైనది;ఏలన సమీపసమానులతో యుద్ధ మది; ఫోకిస్‌తో థీబ్సు చేసిన యుద్ధమునట్టిదే.

(౨) ప. ప్ర. పు. ౨౦౫

(3) వ్యాప్తిప్రతిపాదికమ్ వాక్యమ్॥ తర్కసంగ్రహము. పు ౪౬

(౪) అనుమితికరణంచ వ్యాప్తిజ్ఞానమ్। ౨ అ.

నాధారపడియున్నది; ఇది నూతనసత్యములను గనుగొనుట కుపయోగించును. ఉదాహరణముయొక్క అముఖ్యము సహాయ సూత్రమునైన లక్షణమును దిఙ్నాగుఁ డుగ్గడించెను. ఉదాహరణ మనవసరమనియు, నది నియమసామాన్యధర్మమును ప్రదర్శించునేకాని, స్థాపింపదనియు ధర్మకీర్తి యభిప్రాయము. "ఇదివరకుఁ జూచిన సమానవిషయముల సంశ్లేషరూపమే యుపన్యాసాంగమనియు, నిదివఱకుఁ జూడనివిషయముల కీ సామాన్యధర్మముచే సంబంధము గలుగవచ్చుననియు మిల్లుపండితుని భావము; ఉపన్యాసాంగము సామాన్యధర్మ ప్రతిపాదనమనియు నదియే యనుమానమున కాధారభూతమనియు ఆరిస్టాటల్ విశ్వాసము. ఈ రెంటిని తృతీయాంగము సమన్వయించున"ని డాక్టరు. సీల్ భావించినాఁడు. (౧). ఉదాహరణములు భిన్నవిధములుకావచ్చును; (౧) సాధర్మ్యములు – ఇందు నిరూపింపవలసిన లక్షణమును, దానికాధారమును నుండును. వంటిల్లు మున్నగునవి; (౨) వైధర్మ్యములు; నిరూపింపవలసిన లక్షణమును, దాని యాధారమునుగూడ నుండవు; సరోవరము మున్నగునవి. (౨). దిఙ్నాగుఁ డీ రెంటికి నుపమానములను జేర్చెను. సిద్ధసేనదివాకరుఁడు పై రెంటికిఁ జెరొకయారురకముల దోషములను జూపెను.

మధ్యమావయవవ్యాప్తిని గూర్చి యిట్లు చెప్పబడెను: (౧) "శబ్దమనిత్యమైనది, ఏలన నది యుత్పత్తిగలది" యను

(౧) ది పాజిటీవ్ సైన్సెస్ ఆఫ్‌ది ఏన్షెంటు హిందూస్ పుట ౨౫౨.
(౨) న్యా. భా. ౧. ౧. ౩౬–౩౭.

దానిలోవలె మధ్యమావయవమైన 'యుత్పత్తిగలది'. సర్వశబ్దము లకును జెందిన దగుటచే మధ్యమావయవము హీనావయవమునకుఁ గల వ్యాప్తినంతను గలిగి యుండును.(౨) "ఉత్పత్తిగల వస్తువు లన్నియు ననిత్యములు"నందువలె మధ్యమావయవముచే రూపింపఁబడు సర్వవస్తువులు నున్నతావయవము సూచించు వానితో సాధర్మ్యమును గలిగి యుండవలెను. (3) ఉన్నతావయవము ప్రకటించు వస్తువిరుద్ధములైనవి మధ్యమమందుండరాదు; "నిత్యముకాని ప్రతివస్తువు నుత్పత్తికలదే." మధ్యమోన్నతావయవముల కవినాభావసంబంధము సర్వత్రసమకూర్పవలెనని దిఙ్నాగుఁ డుద్ఘాటించినాఁడు. మధ్యమోన్నతావయవముల కెట్టి సాధర్మ్యముండవలెననగా, నున్నతావయవమున్నచోటఁ దప్పకుండ మధ్యమము నుండవలెను; ఉన్నతము లేనిచో, మధ్యమము నుండరాదని యుద్ద్యోతకర్కుడు నియమించెను, ప్రశస్తపాదుఁ డీభావము నంగీకరించెను.౧- వరదరాజు మధ్యమావయవమునకుఁ బంచలక్షణములున్నవని చెప్పెను: (౧) పక్షధర్మత, మధ్యమము హీనములో నుండవలెను; పర్వతములో ధూమము

---

(౧) ప. ప్ర. పు. ౨౦౦.

'యదనుమేయేన సంబద్ధమ్ ప్రసిద్ధంచ తదన్వితే
తదభావేచ నాస్త్యేవ తల్లింగమనుమాపకమ్॥'

మధ్యమాంగము మనము నిరూపింపఁబోవు వస్తువుతో సంబంధించిన వస్తువులన్నిటియం దుండుటయు, వల్లే యన్యత్రముల లేకుండుటయు యుక్తమైన యనుమానమునకు లక్షణమని ధర్మకీర్తి పలికెను. సిద్ధసేనదివాకరుఁడు మధ్యమాంగ మనగా, "ఉన్నతాంగముతో నిత్యసంబంధములేకుండ నుండఁజాల" దనెను. ధూమము నిప్పులేక మఱియితర వస్తువునుండియు జనించదు.

(౨) సపక్షసత్త్వము, అనగా నిరూపింపఁబడిన విషయములతో సాధర్మ్యముగల భావములందు మధ్యమముండుట: ధూమము వంటింటనుండుట. (౩) విపక్షసత్త్వము: నిరూపింపఁబడిన విషయములతో వైధర్మ్యముగల యభావములందు మధ్యమముండకుండుట; సరోవరమునఁ బొగలేకుండుట. (౪) అబాధితవిషయత్వము; హీనావయవముతో విరోధములేకుండుట. (౫) అసత్ప్రతిపక్షత్వము: వ్యతిరేకశక్తులు లోపించుట. కేవలభావాత్మకము లేక అభావాత్మకమగు ననుమానములో యుక్తమైనమధ్యమము నాలుగులక్షణములనే కలిగియుండును; ఏలన నది భావాభావాత్మకములగు వానిలో నుండఁజాలదు. మధ్యమావయవను మానత్రియము ననుసరించి మూడువిధములని యన్నంభట్టు చెప్పినాఁడు: (౧) అన్వయ-వ్యతిరేకలక్షణములు గలది; ఇచట మధ్యమమున్నతముతో నిత్యసాధర్మ్యము గలది; నిప్పుతోఁ బొగ; ఎచట ధూమమున్నదో యచట నగ్నియుండును; వంటిల్లు; నిప్పులేనిచోట ధూమముండదు. సరోవరము.౨.(౨) కేవలాన్వయి: ఇచటఁ గేవల భావాత్మకసాధర్మ్యమే యుండును; "విదితమైన దెల్ల నామయోగ్యమే." దీనికి వ్యతిరేకోదాహరణములేదు. "నామయోగ్యము కాని దవేద్యమే, యనరాదు. (౩) కేవల వ్యతిరేకి: ఇచట నన్వయోదాహరణ మసాధ్యము; "జంతుప్రవృత్తులుగల జీవులన్నియు నాత్మలను గలిగియున్నవి."

---

(౨) మొదటి మూటిని ధర్మకీర్తియు ధర్మోత్తరుఁడును జెప్పిరి.

చూడు: న్యాయబిందు॥ టీక. పు. ౧౦౪. మఱియు లౌగాక్షిభాస్కరుని తర్క-కౌముది. పు. ౧౨. బొంబాయి ముద్రణము.

ఇచట బల్లలను కుర్చీలను జంతుప్రవృత్తులు లేనివనియు నందుచే నాత్మలు లేనివనియు నిరూపింపఁగలము; కాని అన్వయోదాహరణముల నీయఁజాలము; ఏలన నాత్మలును, జంతువులును నేకమై యుండు స్వభావము గలవి.౧. వేదాంతపరిభాష ననుసరించి, భావాత్మత సామాన్య ధర్మముతోఁ గూడిన దనుమానమనియు అభావాత్మక సామాన్యయుక్తమైనది అర్థాపత్తి యనియుఁ జెప్పఁబడెను. ఏలన రెండవ దానిలో నొక విశేషవిషయమునకు సామాన్య ధర్మప్రయోగమున కవకాశము లేదు.౨. కాని న్యాయశాస్త్రము ననుసరించి, ప్రత్యభావమునకు నొక భావము వ్యతిరేకియై యుండుననియు, నందుచే నభావాత్మక సామాన్య లక్షణములనుండి భావాత్మకనిర్ణయములు లభించుననియుఁ జెప్పఁబడెను.3. మధ్యమావయవముఖ్యలక్షణమేమన నది సర్వస్వతంత్రమైనది కావలెను. 'బి' కుమారుఁడు కనుక 'ఎ' నల్లగా

(౧) చూడు: శ్లోకవార్తికము; అనుమానము. ౧౨౧.

(౨) తర్కసంగ్రహము, పుట. ౪౭. ఈ భేదము నుద్ద్యోతకరుఁడును గంగేశుఁడు నంగీకరించిరి. దీనిని జైనమతగ్రంథములలోని యనుమాన వర్గీకరణముతోఁ బోల్చుఁడు: (౧) ఇదియున్నది; ఏలన నదియున్నది-అగ్నియున్నదేలన ధూమమున్నది. (౨) ఇదిలేదు; ఏలన నదియున్నది-చలిగాలేదు, ఏలన నిప్పున్నది. (3) ఇదియున్నది, ఏలన నదిలేదు-ఇచటఁ జలియున్నదేలన నిప్పులేదు. (౪) ఇదిలేదు; ఏలన నదిలేదు-ఇచట మామిడిచెట్టులేదు; ఏలన నిచట నేచెట్టునులేదు.

(3) వ్యాప్తి, అన్వయముకాని వ్యతిరేకముగాని కావచ్చును. అన్వయవ్యాప్తి రెండురకములు; సమవ్యాప్తి; 'జనించినవస్తువులన్నియు ననిత్యములు' విషమవ్యాప్తి; ధూమయుక్తము లన్నియు నగ్నిసహితములు. దీని వ్యతిరేకము కాదు.

నున్నాఁడని మనము వాదింపఁజాలము; 'బి' యితర కుమారులు నల్లగా నుండవచ్చును; యితరుల కుమారులట్లు లేకుండవచ్చును. మనసిద్ధాంతము సత్యము కాకపోవచ్చును; కాని యది తార్కిక దోషయుక్తము; ఏలన 'బి' కుమారుఁడగుటకును నలుపురంగున కును అనుపాధిక సంబంధములేదు.

తర్కవాక్యరూపములోఁ జతుర్థాంగము ప్రయోగము. హీనావయవములో సూచింపఁబడిన హేతువున్నదనికాని లేదని కాని యిదివక్కాణించును. మొదటిది భావాత్మకము; ఉ॥ అగ్ని యీపర్వతమును; అనగా ధూమయుక్తము; రెండవదభావాత్మ కము, ఉ॥ ఈపర్వతమట్లుకాదు; అనగా నిది ధూమయుక్తము గాదు.౧. నిర్ణయము ప్రతిపాదనము సహేతుకమైనదని పునరు ద్ఘాటన మొనర్చును; ఉ॥ కావునఁ బర్వతము మండుచున్నది.౨.

(౧) న్యా.సూ. ౧. ౧. ౩౮. (౨) న్యా.భా. ౧. ౧. ౩౨ వివాదాభ్యాసములనుండి తత్సంప్రదాయములనుండి తర్కవాక్యరూప మొదయించి పెంపొందెనని దీనినిబట్టి తెలియుచున్నది. జైన తార్కికుఁడైన భద్రబాహువు తర్కవాక్యమునకు దశాంగములను వేరొకవిధముగా నిచ్చెను. (౧) ప్రతిజ్ఞ (౨) ప్రతిజ్ఞావిభక్తి (౩) హేతువు (౪) హేతువిభక్తి (౫) విపక్షము (౬) విపక్షప్రతిషేధము (౭) దృష్టాంతము (౮) ఆకాంక్ష (౯) ఆకాంక్షప్రతిషేధము (౧౦) నిగమనము. (దశవైకాలికనిర్యుక్తి. పుట. ౭౪. నిర్ణయసాగర ముద్రణము) భద్రబాహు వితండవాదవిధానము నవలంబించినాఁడు. శబ్దానిత్యమును స్థాపించు హేతునిర్ధారణమునకు, వ్యతిరేకహేతువుగూడఁ జెప్పి, యది సంభవముకాదను పద్ధతి జూపినాఁడు. శబ్దము నిత్యమైనచో నది జనించునదికాదు. సిద్ధసేనదివాకరుఁడు తన న్యాయావతారమునందు తర్కవాక్యము నైదంగములు గలదిగాఁ జేసెను అనంతవీర్యుఁడు దీనిపై వ్యాఖ్య చేయుచు నుత్తమ తర్కవాక్యమునఁ బది, మధ్యమమందైదు, నధమమందు రెండు నంగము లుండునని చెప్పెను.

ప్రథమాంగములోఁ దాత్కాలికముగాఁ బ్రతిపాదింపఁబడినది నిర్ణయములో ఋజువగును.

కొందరు తార్కికులు తర్కవాక్యమునకు దశాంగములఁ జెప్పిరని వాత్స్యాయనుఁడు వచించినాఁడు. మన మిదివరకుఁ జూచిన పంచాంగములకు నీక్రింది యైదును జేర్పఁబడెను. (౧) జిజ్ఞాసయనగాఁ బ్రతిపాదములోని సత్యమును గూర్చి సమగ్రముగాఁ దెలియఁగోరుట; పర్వతమంతయు మండుచున్నదా, కొన్ని భాగములేనా? (౨) సంశయము. మనము చూచునది నిజముగా ధూమమా లేక ఆవిరియట్లు కన్పట్టుచున్నదా? (౩) శక్యప్రాప్తి యనగా మనకుఁగల యుదాహరణము పొగ యున్నచో నెల్లప్పుడును నిప్పుండునను విషయమును దెలుపఁగల సామర్థ్యముగలదేనా? ఏలన నెఱ్ఱగాఁ గాలిన యినుపగుండు ధూమరహితమైనది. (౪) ప్రయోజనము సిద్ధాంతము చేయుటలోని యుద్దేశము. (౫) సంశయవ్యుదాసము మధ్యమోన్నతాంగసంబంధమును గూర్చియు, హీనాంగములోని మధ్యమాస్తిత్వమును గూర్చియు మనకుఁ గల సంశయనిర్మూలనము. ఈయైదంగములును మన జ్ఞానమును విస్పష్టమొనర్చును గాని, ముఖ్యములు గావని వాత్స్యాయనుఁడు భావించినాఁడు. ఇందు మానసిక దశావివరణమున్నది. జిజ్ఞాస సర్వవిజ్ఞానమునకు నారంభదశయే. ఉద్ద్యోతకరుఁడు చెప్పినట్లు జిజ్ఞాస తర్కచర్చలో ముఖ్యాంగముగాదు ౧.

(౧) న్యా వా. ౧౧. ౩౨.

ప్రథమాంగములోని ప్రతిపాదనమును నిగమనము తిరిగి ప్రవచించునదే యనియు, చతుర్థాంగమైన ఉపనయము ద్వితీయాంగమైన హేతుపునరుక్తియే యనియు గుర్తింపఁబడెను. అందుచేఁ దర్కవాక్యము ముఖ్యముగా మూఁడంగములు గలది, తన ఉపాయకౌశల్యసూత్రమునందు నాగార్జునుఁ డంగత్రయ తర్కవాక్యము నారంభించిన వాఁడనియు, భావాత్మకము నభావాత్మకమునైన యనుమానము హేతువువలనను, నుదాహరణము వలనను స్థాపించెననియుఁ జెప్పుదురు.౨ దిఙ్నాగుఁడు నిజముగా దీనికిఁ గర్తయని కొందరభిప్రాయపడిరి.3. తన న్యాయప్రవేశమునందాతఁడు తర్క వాక్యము త్ర్యంగసహితమని చెప్పెను గాని మూఁడవ యంగము భావాభావాత్మకములగు రెండుదాహరణములను గలిగియున్నది. "ఈపర్వతము మండుచున్నది; ఏలన నందు ధూమముకలదు; ధూమయుక్తమైన దెల్లనగ్నియుక్తమైనదే; వంటిల్లువలె; నిప్పులేనిచోట ధూమమును లేదు; కాసారమువలె. దిఙ్నాగుని వాక్యములోఁ దృతీయాంగమొక సామాన్యధర్మము; ఇందు సూచనప్రాయములగు నుదాహరణములున్నవి. తృతీయాంగము నిరర్థకమే యని ధర్మకీర్తి చెప్పినాఁడేలనఁ, బ్రథమాంగమందలి ప్రతిపాదనము హేత్వంతర్గతమై యున్నది. "పర్వతము మండుచున్నది; ఏలన నది ధూమసహితము." అని చెప్పినఁజాలును. అంగద్వయరూపమైన యిట్టి

(౨) హిస్టరీ ఆఫ్ ఇండియన్ లాజిక్సు, పు. ౧౧౫. (3) సుగ్వీరుఁడు: చైనా జపానుదేశములలోఁ బొందుపరుపఁబడిన హిందూలాజిక్సు.; యం వి. వైశేషిక తత్త్వశాస్త్రము. పు. ౭౨, నోటి ౨

తర్క వాక్యములు హిందూతత్త్వగ్రంథములలో నుపయోగింపఁబడినవి. జైనతార్కికులగు మాణిక్యనంది, దేవసూరియు నీయభిప్రాయముతో నేకీభవించిరి. మీమాంసకులు వేదాంతులును మూడంగముల తర్కవాక్యమునే యంగీకరించిరి. వేదాంతపరిభాష, పంచాంగములలో మొదటి మూటిని గాని, చివర మూటిని గాని యుపయోగింప నంగీకరించెను. ౨.

వాత్స్యాయనోద్ద్యోతకరు లిరువురును నైదంగములలోఁ జివరిరెంటిని తొలగించుట కొప్పుకొనలేదు. 3. నిగమనమునందుఁ బ్రథమాంగములోని ప్రతిపాదనము పునరుక్తమని వారంగీకరింతురు. రెండు మూడంగముల మిశ్రమరూపమే నాల్గవదనియు వా రొప్పుకొందురు. తార్కికముగానివి యనవసరములైనను, వివాదములందు వీనియవసరమున్నది; ఏలన, నివి హేతువును సమర్థించి, ప్రథమాంగమునందలి ప్రతిపాదనమును నిస్సంశయముగా సమర్థించును. పంచాంగసహితానుమానము పరార్థానుమానమనగా నితరులకుఁగూడ నమ్మికపుట్టించుననియు, మూడంగములుగలది స్వార్థానుమానమనియు ననగా నాత్మనిశ్చయమొసఁగుననియుఁ జెప్పఁబడెను. మొదటిది

(౧) ప్రమాణనయతత్త్వాలోకాలంకారము॥ పు. 3.

(౨) ౨ అ వరదరాజు తన తర్కరక్షలో మీమాంసవాదుల త్ర్యంగయుక్త తర్కవాక్యమును స్మరించి, బౌద్ధుల యంగద్వయవాక్యరీతినిగూడ వెల్లడించెను. పక్షహేతు దృష్టాంతసహితమగు త్ర్యంగయుక్త తర్కవాక్యము మాతరవృత్తికిఁ దెలియును.

(3) న్యా. భా. ౧. ౧. 3౯; న్యా. వా. ౧. ౧. 3౯.

పరిమాణసంబంధము; రెండవది విజ్ఞానవికాసవిధానమునకు సంబంధించినది కావున, నూత్న సత్యాంశనిర్ణయసాధన ముప యోగించునది, దీనిని గౌతమ కణాదులు విశదముగా స్మరించి యుండలేదు. అనంతర తార్కికులు దీనినంగీకరించిరి. ౪. ప్రశస్తపాదుఁడు స్వనిశ్చితార్థమనియుఁ బరార్థమనియు ననుమానభేదమును జెప్పెను. ౫. పరార్థానుమానము, కేవలము శబ్దపరిధానము. మన మొక పర్వతమును జూచి, యందగ్ని యున్నదా లేదాయని సంశయింతుము. ధూమమునుగాంచి ధూమాగ్ని సంబంధమును స్మృతికిఁదెచ్చుకొని, పర్వతమం దగ్ని యుండవలెనని నిశ్చయింతుము. ఈవిషయము నితరులకుఁ జెప్పఁబూనునపుడు మనము పంచాంగతర్కవాక్యము నుప యోగింతుము.౧.

తర్కవాక్యాంగముల సంఖ్యావిషయములో నెట్టిభేదా భిప్రాయములున్నను, యుక్తమగు ననుమానమునకు, ముఖ్య లక్షణములు రెండనియు నవి వ్యాప్తి లేక నున్నతాంగము; పక్షధర్మత లేక హీనాంగమునని తార్కికు లంగీకరించిరి. మొదటిది సర్వలక్షణసామాన్యధర్మమును, రెండవది కర్త

(౪) దిఙ్నాగుఁడు, ప్రశస్తపాదుఁడు, ధర్మకీర్తి, సిద్ధసేనదివాకరుఁడు, మాణిక్యనంది, దేవసూరి, భాసర్వజ్ఞుఁడు, గంగేశుఁడు మున్నగువారు దీని నంగీకరించిరి.

(౫) ప. ప్ర. పు. ౨౩౧. దీనితోఁ బోల్చుఁడు: ధర్మోత్తరుని జ్ఞానా త్మక శబ్దాత్మక భేదమును (న్యాయబిందు॥ టీక. పు. ౨౧) శివాదిత్యుని అర్థ రూపత్వ శబ్దరూపత్వ భేదములు. (సప్తపదార్థి పు. ౧౫౪)

(౧) తర్కసంగ్రహము. పు. ౪౫.

వ్యాప్తిలోని యొకలక్షణమును గలిగియున్నదనియుఁ జెప్పును౨. ఈ రెండును జె. యస్. మిల్లు రెండులక్షణములకును సరిపోవును; (౧) ఏగుణము లేయితరగుణముల నూచించును? (౨) ఈగుణములను వాక్యములోని కర్త కలిగియుండెనా ?

ఉన్నతాంగముకాని, హీనాంగముకాని స్వయముగా నిగమనమును స్థాపించలేదు. రెంటిసమన్వయము కావలెను. అనుమానవిధానమునకు లింగపరామర్శ ముఖ్యలక్షణము. గంగేశునభిప్రాయములో ననుమానజ్ఞానమునకు వ్యాప్తియొక్క-టియున్నైనచోఁ బరోక్షహేతువగును; లింగపరామర చరమ కారణము లేక ముఖ్యకారణము. ౩. హేతువు వ్యాప్తిసంబంధముకలిగి, హీనాంగమందుండుట దీని సారాంశము. ౪. అనుమానప్రవృత్తి యేకమైన సమన్వయకార్యము. మధ్యమాంగమునుగూర్చిన పరిశీలన మేమియులేదని యద్వైతవాదము. వ్యాప్తి జ్ఞానము సాధనకారణము; దానిని స్మృతికి దెచ్చికొని, నిగమనమును నిర్ణయింతుము.౧. మొదట ప్రత్యక్ష దర్శనము, తరువాతఁ బరిశీలించుట, నావెనుక ననుమాన క్రియయు జరుగుననుదాని నద్వైతవాద మంగీకరింపదు. అను

(౨) తత్త్వచింతామణి ౨ అ. పు. ౨; భాషాపరిచ్ఛేదము పు. ౬౬ సిద్ధాంతముక్తావళి పు. ౬౮.

(3) తత్త్వచింతామణి ౨ అ. పు. ౨

(౪) వ్యాప్తివిశిష్టపక్ష ధర్మతాజ్ఞానమ్ (తర్కసంగ్రహము॥ పు. ౪౪. చూడు: భాషాపరిచ్ఛేదము పు, ౬౬; తత్త్వచింతామణి ౨. ౨; జానకీనాథుని న్యాయసిద్ధాంతమంజరి॥ పుటలు ౭౬-౭౭, పండితముద్రణము.

౧. వేదాంతపరిభాష.

మానక్రియ రెండు భావనిర్ణయములను గలుపుటకాదు; అది యొకవ్యాపారము; ఇందు దర్శింపఁబడిన విషయము (హీనాంగము) (ఉన్నతాంగమైన) జ్ఞాపకమువచ్చిన సామాన్యధర్మముతోఁ గలిసి పనిచేయును. ఈ రెండును భిన్నమానసికావస్థలుగాదు; భిన్నసోపానములలోఁ బనిచేయునవియుఁ గావు; మనస్తత్త్వమునందుకంటెఁ దర్కమునం దెక్కువ దీక్షగల నైయాయికుఁడనుమానవ్యాపారము సమన్వయకార్యమనును.

అనుమానించిన వస్తుస్వభావమునుగూర్చి దిఙ్నాగుఁడొక విచిత్రమైన ప్రశ్న నుదయింపఁజేసెను. ధూమమునుండి యగ్నిని మన మనుమానింపము; ఏలన నదియొక నూత్నజ్ఞాన విషయముకాదు. ధూమాగ్ని సంబంధమును మనమిదివఱకే యెఱుఁగుదుము. మనము పర్వతాగ్ని సంబంధము ననుమానించుటయు లేదు ఏలన, సంబంధమునందు రెండువస్తువులుండవలెను; మనయనుమానములో నొకపర్వతమే యున్నది; నిప్పును మనము చూడలేము. అనుమానించిన దగ్నియుఁగాదు, పర్వతమును గాదు; మండుచున్న పర్వతము. ౨. నిగమనమొకనిర్ణయము.

మధ్యమాంగ మేయేస్థితులలో లభించునను విషయమునకు నైయాయికుఁడు విశేషప్రాముఖ్య మొసంగలేదు, అన్వయ వ్యతిరేకోదాహరణముల వలన నన్వయ వ్యతిరేకసామాన్య ప్రతి

౨. న్యా.వా తా.టీ.; యందు దిఙ్నాగు నుదాహృతవాక్యము; న్యా.సూ. ౧.౧.౫; వేదాంత పరిభాష ౨౮. "పర్వతము చూచినది; అగ్ని యనుమానించినది." యని చెప్పెను.

పాదనము లన్యోన్యాంతర్గతములని యాతఁడు నిశ్చయించెను. అనుమాన ముభయపక్షముల నుండియు సమర్థింపఁబడున దే.౧. హిందూతర్క మేకరూపస్వభావము గలది. ఒక వ్యక్తిపాదన మందలి కర్తయే లక్షణమును గలిగి యున్నదని మనము స్థాపింపఁజూతుమో, యాలక్షణము కర్తతో నవినాభావసంబంధమును గలిగినదను జ్ఞానముచే, నట్టిగుణము దానికున్నదని యనుమానించుచున్నాము. ఈ నియమమును మనము శాస్త్రపదములలోఁ జెప్పుచున్నాము. ఒక జాతిలోని ప్రతివ్యక్తిని గూర్చి యే గుణములు చెప్పుదుమో, యందలి యేవ్యక్తిని గూర్చియైన నాగుణములు చెప్పవీలగును. యుక్తమగు నాలోచనమునకు శాస్త్రీయపద నిర్వచనాదు లవసరము లేదు; అవి సూక్ష్మబుద్ధి వికాసమున కుపయోగించు ననుమాట నిజమే.౨. చివరిమూడు రూపములను, మొదటి రూపములోనికి మార్చవచ్చునని ఆరిస్టోట లంగీకరించినాఁడు.

(౧) 'ఏ' ఉన్నచో 'బి'యున్నది. 'బి' లేనిచో 'ఎ' లేదు. అన్ని వాదములకు నన్వయవ్యతిరేకరూపములున్నవని ధర్మకీర్తి యంగీకరించును; అవి సాధర్మ్యవైధర్మ్యములపై నాధారపడియుండును. కాని కొన్ని సహజముగా వైధర్మ్యము గలిగి వ్యతిరేకి రూపమున కనుకూలముగా నుండును.

ఉ॥ ఎట్టయెదుట నున్న వస్తువులు చూడఁబడును.
ఘటము కనిపించలేదు.
అందుచేత ఘట మెట్టయెదుటలేదు.

(౨) గోంపెర్జ్: "బ్రహ్మాండమైన శుద్ధశక్తినంత నుపయోగించి, గణితశాస్త్రపద్ధతి నెన్నియో తార్కికవాదములకు రూపములు గల్పించెను, కాని తన గ్రంథములలో నొక్క రూపమునైన నుపయోగించలేదు."

హేతుచర్చావిషయవిభాగము, ఆరిస్టోట లిచ్చిన తర్క వాక్య విభాగమును బోలియుండును. పంచాంగరూపమైనను మూడవయవములనే గలిగియున్నది; అంగత్రయవాక్యము నందు మూడుప్రతిపాదన లున్నవి, ఇవి యారిస్టోట లిచ్చిన రూపములకు సరిపోవును. ఇట్టిసామ్యముల ననుసరించి, పరస్పర శాస్త్రజ్ఞాన సిద్ధాంతకల్పన ప్రయత్నములు జరిగినవి. డాక్టరు విద్యాభూషణుఁడిట్లువ్రాసెను. "ఆరిస్టోటలుయొక్క తర్క శాస్త్రము అలెగ్జాండ్రియా, సిరియా మున్నగు దేశములద్వారముగఁ దక్షశిలానగరమునకు వచ్చియుండనోపును. అనుమానమునుండి తర్కవాక్యరూపము భారతీయ తర్కశాస్త్రమున వికసించియుండ లేదని నానిశ్చయము. అందుచే హిందూతార్కికుఁడు తర్కవాక్యరూపము నారిస్టోటలు శాస్త్రమునుండి గ్రహించెనని చెప్పవచ్చును"౧. అనుమానసిద్ధాంతము దేశీయమనియు దర్కవాక్యరూపమును భారతీయు లప్పు డెరుగరనియు నీపండితుని యభిప్రాయము. కీత్ పండితుఁ డిట్లు వ్రాసినాఁడు." తర్కశాస్త్రము యొక్క తరుణదశలలో, గ్రీకుసంబంధ మున్నదనుట కవకాశ మేమియును లేదు. గౌతమకణాదులు కల్పించిన తర్కవాక్యము స్వజాతీయమే యైనను సక్రమాభివృద్ధి నొందలేదు. ఒక్కదిఙ్నాగునియందే మనకు దృష్టాంతసహితమైనపక్ష ధర్మతా వ్యాప్తిహేతువులకు సామాన్యసంబంధము వలననే యనుమానరూపకమైన వాదవిధానము మనకు సంపూర్ణముగా లభించినది. ఈవిషయములో గ్రీకు విజ్ఞానప్రభావము ఫలితము గోచరించు

(౧) హిస్టరీ ఆఫ్ ఇండియన్ లాజిక్కు పు. ౧౫౯.

ననుట సాహసము గానేరదు"౨. దిఙ్నాగునికి రెండు శతాబ్దముల పూర్వుఁడైన ఆర్యదేవునికి గ్రీకు జ్యోతిశ్శాస్త్ర పరిచయమున్నదను విషయమును దీనిని సమర్థించునని యాతఁడు పలికినాఁడు. హిందూ భరతశాస్త్రమునకు ఆరిస్టోటల్ నాట్యసిద్ధాంతముతోఁ గల సంబంధముకూడ నట్టిదేయను నూహకూడ నేదోకొంత సంబంధము గ్రీకు హిందూవిజ్ఞానములకుఁ గలదని తోఁపించుచున్నది. భారతీయతార్కికులతో సంభాషణలు నెఱపిన అలెగ్జాండరుమూలమున ఆరిస్టోటల్ హిందుతార్కికసిద్ధాంతజ్ఞానమును గలిగియుండెననియుఁ గొందరూహించుచున్నారు. కాని యిట్టిసంబంధ సామ్యములకుఁ బ్రత్యక్షసాక్ష్యము లించుకంతయు గోచరింపవు. ఆరిస్టోటల్‌కు బూర్వయుగములందే హిందూబౌద్ధగ్రంథము లందు తర్కవాక్య రూపసహితవాదములున్నవనుసంగతిని మనము మఱువకున్నచో, గ్రీసునుండి భారతీయవిజ్ఞానము 'స్వీకృత' మనుట కాధారము శూన్యమగును. మాక్సుముల్లర్ వాక్యములకుఁ బునరుక్తిదోషము లేదు; "ఈవిషయమునందుఁగూడ మనపూర్వులు తలఁచినదానికంటె నధికతరమైన సంస్కృతసామ్య మున్నదని యూహించుట మంచిది. ఒకదేశములో సాధ్యమైనజ్ఞాన మింకొకదేశమందును సాధ్యమేయనువిషయమును మనమెన్నఁడును మఱువరాదు."౧ గ్రీకు భారతీయ తర్కవాక్యస్వరూపములలో ముఖ్యభేదములున్నవను విషయములవలన నీభావము సమర్థింపఁబడుచున్నది.

(౨) ,, ,, పు. ౫౦౦; నోట్. ౧. అనుబంధము. బి.

౧. స.సి.సా.సం. పుటలు ౩౮౫-౩౮౬.

వ్యాప్తిలక్షణములను దెలుపుట కుదాహరణము నాధారము చేసికొనిన భారతీయపద్ధతితో సమానమైనపద్ధతి గ్రీకుతర్క శాస్త్రమున లేదు. అనుమానమున కాధారము వ్యాప్తియనియు, దీనిని బ్రకటించుట కుదాహరణముకంటె సులభమైనపద్ధతి లేదనియుఁ దెలిసికొనుటకు విశేషవిజ్ఞాన మవసరము లేదు.

## ౯ — Induction

అనుమానము యథార్థమును జెప్ప సమర్థమైనది; కాని యందలి రెండు ముఖ్యాంగములు యథార్థములు కానిచో నీసామర్థ్యము లోపించును. హీనాంగము ప్రత్యక్షవిషయము; ఉన్నతాంగము విశేషములనుండి సామాన్య ధర్మస్థాపనము చేయు సమస్య నుదయింపఁజేయును.

సామాన్య ప్రతిపాదనము లెట్లు లభించును? నైయాయికుఁడు వివిధపద్ధతులనొసఁగి యున్నాఁడు. ఆతఁడు పరిగణనము, ప్రత్యక్షము, పరోక్షనిర్ణయములఁ గూర్చి ప్రసంగించును. తర్కవాక్యమొక సామాన్య ధర్మముతోఁబాటొక దృష్టాంతము నిచ్చును. ఉదాహరణమొక్క ధర్మమును బ్రకటించుటకుఁ జాలినను, సామాన్య సంబంధము నది స్థాపింపఁజాలదు. వంటింటినిప్పునకును, పొగకును, యజ్ఞశాల యందలి ధూమాగ్నులకు నవినాభావసంబంధ ముండవచ్చును; కాని యంతమాత్రమునఁ బర్వతమున నిప్పున్నదని నిశ్చయింపఁజాలము; ఏలన నీధూమాగ్నులయవినాభావసంబంధ మన్నితావులదుండవలెను. ధూమాగ్నిసంబంధము ననేకస్థలములలో మనము చూచుటచే మన వాదము బలవత్తరమగును. అవ్యభిచారసాహచర్య మనేక విష

యములలో దర్శించినచో మన మొక సామాన్య ధర్మస్థాపనము చేయ వీలగును, నిప్పున్న చోటునందెల్ల నగ్నిని చూచినచో జాలదు. నిప్పులేనిచోటులందెల్ల ధూమము లేదనియుఁ జూడఁ వలెను. భావాభావముల రెంటిలో సామ్యముండవలెను.౧. నియతసాహచర్యము నవినాభావరూపసంబంధము బలపఱచి నచో మన కనుపాధికసామధర్మ్యములు లభించును.౨. నిప్పున్న యన్నిచోటలందును ధూమముండదు. ఎఱ్ఱఁగాఁ గాలిన యినుప గుండునకు ధూమము లేదు; తడికఱ్ఱతో గూడిన నిప్పునకు మాత్రమే తప్పక పొగయుండును. అగ్నిధూమసంబంధము సోపాధికము; ధూమాగ్నిసంబంధము నిరుపాధికము. "నిప్పుగల వెల్ల ధూమయుక్తముల'ను నియమము సర్వథాయథార్థము

౧. సాహచర్యజ్ఞానము; వ్యభిచారజ్ఞానవిరహము. తర్కసంగ్రహము పు ౭౫.

౨. ఉదయనుఁ డుపాధియనగా నొకవస్తువు దన ధర్మమును సమీపముననున్న యింకొకవస్తువునకు సంక్రమింపఁ జేయుటయని నిర్వచనముచేసినాఁడు. (తేషు, సమీపవర్తిని ఆదధాతిసంక్రామయతి స్వీయంధర్మమిత్యుపాధిః) ఒక రక్తవర్ణముగల పుష్పము, తనపైనుండిన స్ఫటికశిలకుఁ దన రక్తిమనిచ్చి పద్మరాగమణివలెఁ బ్రకాశింపఁజేయును, అందుచేత నదియుపాధి పోల్చు వరదరాజు నిర్వచనము; "సాధనవ్యాపకాః సాధ్యసమవ్యాప్తా ఉపాధయః (తార్కికరక్ష) శంకితసమారోపిత సర్వోపాధులనుండి నిరుపాధికమైనదే యుక్తమైన సామాన్యము. చూడు వాచస్పతి న్యా.వా.తా.టీక.౧.౧.౧.తర్కమందు దయను ననుసరించి, ఉపాధి యనఁగా (౧) మధ్యమావయవముతో నిత్యసంబంధి (౨) దాని ననుసరించునది (3) ఉన్నతాంగము నెల్లప్పుడనుసరింపనిది. తర్కదీపికయందు నాలు రకముల యుపాధులు చెప్పఁబడినవి. చూడు అథల్యే తర్కసంగ్రహము. పుట ౩౧౭.

కాదు;" ఆర్ద్రేంధనముతోడి నిప్పున్న వాటికెల్ల ధూమముం డునను నియమము నిత్యసత్యము. సోపాధికత గుర్తించినపుడు దోషము కాఁజాలదు, ఉపాధిసంశయము కలిగినపుడెల్ల వానినిఁ బరిశీలించి, సర్వసామాన్య ధర్మమున్నదని మనము స్థాపింప వలసి యున్నది. అనేక సందర్భములలో సాధర్మ్యమును జూచుట వలన సంశయవిచ్ఛేదమగును; వైధర్మ్యమును దర్శించినను సంశయము తొలఁగును. అర్వాచీనతర్కము వ్యతిరేకదృష్టాంతముల కత్యంతప్రాముఖ్యము నొసఁగి లింగలింగసంబంధమే ముఖ్యతమ మని నిర్ణయించెను.౧. మనమూహాకల్పనములను విడిచిపుచ్చి, సత్యాంశములపై నాధారపడు మనోనిగ్రహము కలిగి యుండ వలెనని నైయాయికుఁడు శాసించుచున్నాఁడు. విషయ పరీక్షా పద్ధతులుగల శాస్త్రములున్ననాఁడే, వాని ఫలితములను సక్రమరీతిని వర్గీకరణమొనర్ప వీలగును, అట్టివి లేనినాఁడు, భారతీయులు శాస్త్రపద్ధతులఁ గూర్చి ప్రసంగించుట వలనఁ బ్రయోజనమల్పము. విశేషములను బరిశీలించి సామాన్య నియమముల స్థాపించు విధానములను నైయాయికుఁడు బాగుగా నెఱుగు ననుటకు సంశయము లేదు.

సిద్ధాంతనిర్ణయ నిరసనముల కపసరములగు నన్వయ వ్యతిరేకోదాహరణములను సక్రమపద్ధతిలోఁ బ్రకృతి యెల్ల

---

(౧) వ్యాప్తినిర్వచనము లనేకములు పరిశీలించిన వెనుక, గంగేశుఁడిట్లు చెప్పెను. "సాధర్మ్య మనఁగా పధ్యమొన్నతాంగ సాహచర్యము" (తత్త్వచింతామణి, ౨౫.) చూడు: హిస్టరీ ఆఫ్ ఇండియన్ లాజిక్కు- పు. ౪౨౪

ప్పుడు మన కొసఁగదు. అందుచే వ్యతిరేకసాక్ష్యమున కవసరమగు తర్కపద్ధతి నుపయోగించవచ్చునని నైయాయికుఁడు చెప్పును. ధూమమున్నచోట నగ్నియు నుండునను సామాన్య ప్రతిపాదనము తప్పైనచో, దాని వ్యతిరేక రూపమైన "కొన్ని వేళల ధూమమున్నను నగ్నియుండద"నునది సత్యము కావలెను. అనగా నగ్ని తప్పనిసరిగా ధూమము ననుసరించి యుండనక్కరలేదు. కాని ధూమమున కగ్నియే కారణమని మన మంగీకరింపక తప్పదు. ఈవిధముగా నియతసాధర్మ్యముగల యనేకసందర్భములఁ జూచి, సామాన్య ధర్మప్రతిపాదన మొనర్చుటకుఁ దర్క ముపయోగించును. ఒక ప్రతిపాదనమును స్థాపించుటకు నిదియే విధానము.౧. ఒక ప్రతిపాదనమును గూర్చిన యాథార్థ్యమును మనము నిరసించుచో మనమెట్టి దోషములకుఁ బాల్పడుచున్నామో చూపి, యట్టి పరోక్షవిధానముచేఁ బ్రతిపాదనమును సమర్థింతుము. దీనివలన, నేయితర ప్రతిపాదనమును దృష్టాంశములతో సమన్వయింపదని నిశ్చయమగును.౨.

---

౧. న్యా. సూ. ౧. ౧. ౩౧.

౨ యుక్తమైన ప్రతిపాదన మీలక్షణములను గలిగియుండవలెను. (౧) ప్రతిపాదనము సత్యాంశముల నిరూపింపవలెను. (౨) ప్రకృతిసిద్ధములగు నే సత్యాంశములతో విరోధించరాదు; సుస్థాపితములైన యితర సామాన్య ధర్మములకును వ్యతిరేకము కారాదు. (౩) దృష్టవిషయ సాహాయ్యమున సత్యాంశ నిరూపణము సాధ్యమగుచుండగా నదృష్ట విషయ సాహాయ్య ముపయోగింపరాదు. (౪) రెండు వ్యతిరేక ప్రతిపాదనము లుండగా నిశితపరీక్ష లేక పరిశోధన చేయవలెను. అట్టి పరిశోధన లేనిదే యేప్రతి

ప్రత్యక్షదర్శన విషయ నిర్ణయములకుఁ దర్కము సహాయభూతమగును. చూచుటకు సాధ్యములగు సర్వవిషయములను దర్శించి, మన నిర్ణయమును దర్కముచే బలపఱచినను, సామాన్య ధర్మములనుగూర్చి సంపూర్ణనిశ్చయము మనకుఁ గలుగదు. మన పరిశీలన మసమగ్రమైనంత కాలము మననిర్ణయము లమోఘములు కాఁజాలవు. పరిగణనముపై నాధారపడు సామాన్యధర్మములు నిశ్చయముగా సత్యము కాకపోవచ్చును. యుక్తములైన విశేషములు సర్వసామాన్య ధర్మజ్ఞానము నిచ్చుట కుపయోగించునుగాని, సర్వసామాన్యధర్మనిరూపణము కేవల విశేషములవలన జరుగదు. ఏలన సామాన్యధర్మము కొన్నికాని, యన్నికాని విశేషముల నతిక్రమించును.

సముచ్చయార్థక నిర్ణయములైనను, సామాన్య ధర్మజ్ఞానముపై నాధారపడి యుండును. మన మన్నిసంధర్భములను గణింపము; ఒక వర్గములోఁ జేరుటకు యోగ్యములైన సామాన్య లక్షణలక్షితములగు వానినే యెన్నుదుము, అందుచేఁ బరిగణనపద్ధతియైనను, సామాన్య లక్షణజ్ఞానము లేనిదే నిరర్థకమగును. ప్రత్యక్షము వలన సామాన్య ధర్మములను మనము గ్రహింపవచ్చునని ప్రాచీనన్యాయము చెప్పియున్నది. సామా

---

పాదనమును స్థాపితముకాదు. (౫) అట్టి రెండు వ్యతిరేక ప్రతిపాదనములలో సక్లిష్టమైనదాని నంగీకరింపవలెను. (౬) అట్టి రెండు ప్రతిపాదనములలోఁ బ్రస్తుతవిషయమున కనుగుణమైనదాని నంగీకరింపవలెను. (౭) ఇన్ని లక్షణములతోఁ గూడిన ప్రతిపాదనము పరీక్షకు నిలువవలెను. నిలిచినచో సిద్ధాంతమగును. (సీల్: ది పాజిటివ్ సైన్సెస్ ఆఫ్ ది ఏన్షెంటు హిందూస్. పు. ౨౮౮.)

న్య లక్షణములను గ్రహించుటలో నింద్రియములకు వేరైన వ్యాపారమున్నదని గంగేశుఁడు గుర్తించెను. దాని నాతఁడలౌకిక ప్రత్యక్షమనెను.౧. దీనినిబట్టి చూచినను, సర్వసందర్భపరిగణనము మనకవసరము లేదు. సర్వసామాన్యమగు ధూమత్వలక్షణమును బట్టి మనము ధూమయుక్తములైన సందర్భములనన్నిటిని గ్రహింతుము, ధూమాగ్ని సామాన్య లక్షణములను వాని సంబంధసూత్రములను మనము జ్ఞానలక్షణచే గ్రహింతుము. అందుచే నొక సందర్భమును బరీక్షించి, మనము సామాన్య ధర్మమును గనిపెట్ట వచ్చును. ఒక సందర్భమును గూర్చి యేది సత్యమో, యాజాతికిఁ జెందిన యితరదృష్టాంతములకు నాసత్యము వర్తించునేలన,స్వభావసామాన్యత యనునదున్నది. ఏది యొక మారుసత్యమోయ దెల్లప్పుడును సత్యమే. 'ధూము' మని మనము పలికినప్పుడు, ధూమదృష్టాంతము లన్నియు మన మనస్సునందు లేవు కాని ధూమార్థము మనభావములోఁగలదు, ధూమాగ్ని లక్షణసంబంధము వ్యాప్తి వలన వ్యాప్యవ్యాపక సంబంధమును గలిగి యుండును. అనేక దృష్టాంతపరిశీలన మనవసరమేలన; సామాన్య ధర్మమును గ్రహించుటకుఁ గాదు; మన మిదివరకే గ్రహించిన సామాన్య ధర్మమొకే యుదాహరణము వలన సువిదితముకాదు; అసామాన్య వివేకధురీణులగు వారు కొలఁది యుదాహరణముల వలననే సర్వసామాన్య సంబంధ

౧. ఆరిస్టాటిల్ భావముతోఁ బోల్చుఁడు; సంపూర్ణ సర్వవిషయపరిగణనము చేసినను సామాన్యము సమగ్రముగా సిద్ధించదు; ఏలన మనము జడపదార్థ సంబంధావరోధముల నతిక్రమింపవలెను.

మాత్రములను గనిపెట్టఁగల సమర్థులై యుందురు. సర్వసామా న్య ధర్మమును మనము సృజించుటలేదు; ఉన్నదానిని మనము గ్రహించుచున్నాము, ఏకైక దృష్టాంతము నేకాగ్రదృష్టితోఁ బరికించి మనము సామాన్యలక్షణమును గనిపెట్టవచ్చును. అట్టి నిర్ణయమువలన మనకది లభింపనిచో,నుదాహరణముల సంఖ్యను పెంచినంత మాత్రముననను మనకది లభింపదు. అదికర్తృలక్ష ణమే కాని, మనబుద్ధి నిర్మితము కాదు. ఇంద్రియదర్శనము నతి క్రమించున దనుభవము నతిక్రమింపదు. ఒక్కొక్కవేళ,నొక్క దృష్టాంతమును జూచి, మన యంతర్విచక్షణ జ్ఞానముచేఁ గని పెట్టిన సామాన్యధర్మమును, పరిశీలనము, పరిశోధనాది విధాన ములు సమర్థించునే కాని విశేషము నేమియుఁ జేయవు, ప్రకృ తిలోని ప్రతివిషయమును దాని యుత్పత్తి కారణమైన నియమ ము లేక సూత్రమును దనయందే కలిగియున్నది. ప్రకృతిలో సహజసిద్ధమైన యొక విషయమును బాహ్యముగా వచ్చి చేరిన విషయములనుండి వేరుచేసి, దాని లక్షణములను గుర్తించుటలో నంతర్దర్శనమే ముఖ్యసాధనము. సామాన్య ప్రతిపాదనములు విష యగుణ సంబంధములు. అల్పపిత్తముగల జంతువులన్నియు నధి కాయుర్దాయముగలవగుచో, నల్పపిత్తముగల మనుజాశ్వమహి షములు దీర్ఘాయుర్దాయము కలవగుటచేఁ గాదు; అల్పపిత్త జంతునిర్మాణములోఁ గల కొన్ని యంశములకును దీర్ఘాయువు నకును ముఖ్యసంబంధమేదో యుండుట వలననేయని చెప్పవ లెను. న్యాయ తర్కవాక్యరూపప్రయోజనము నీదిగువ నిశ్చ

యాత్మక ప్రతిపాదన రూపమున నుత్తమరీతిని జూపవచ్చును, 'ఎ' అయినచో 'బి'. 'ఎ' కాబట్టి 'బి'.

ఈభావము ననుసరించి, సామాన్యమునుండి విశేషమును గ్రహించు హేతువిధానమునందు, తర్క-వాక్యములందలి యితరాంగములలోఁగంటె, నిగమనమునం దెక్కువ విషయము తెలియుట కవకాశమున్న సంగతి నూత్నకాంతిలో గోచరించును. సామాన్యధర్మములు పరిగణనాత్మక నిర్ణయమాత్రములుగావు; విశేషవిషయములను బంధించు సంబంధములు వానియంత సత్యమును గలిగియున్నవే. ఒక సామాన్య నిర్ణయమునుండి యొక విశేష సత్యమును మనము పొడగాంచినచో, నొకభావములో నిగమనము ప్రతిపాదనముకంటె నధిక సత్యమును దెల్పును; వేఱొక భావములో నిగమన మందిమిడియే యున్నది.

సర్వసామాన్య సూత్రములు సత్యములును, నంతర్దర్శన యోగ్యములు నైనచో, నేల ప్రేమోన్మాదులకు నున్మాదులకును, శాస్త్రకారులకును దత్త్వజ్ఞులకును గట్టెదుట గోచరించు నీ సత్యము లేల గోచరింపవు? మన సామాన్యనియమ నిర్ణయములు కొన్నివేళల నసత్యములగుటకు హేతువులను జెప్పఁగలమా? దోషనిర్ణయములందు సంబంధముల స్వరూపము సక్రమముగా గుర్తించుట దుస్తరము. అసంఖ్యాకములైన విశేషములనుండి యవి సమగ్రముగా విడఁదీయుట దుస్సాధ్యమగును. వస్తు యాథార్థ్యము క్లిష్టతను గలిగియుండుటచే సంబంధముల సమ్యగ్వివేకము సులభసాధ్యముకాదు. రాగద్వేష

ములవలనను, మాంద్యపాఠ్యముల వలనను, నసత్యములగు ధర్మములు సత్యములని భ్రమింతుము. ఈభావములో విశేష విషయదర్శనము లైనను బూర్ణసత్యములు గాకపోవచ్చును. అంతర్దృష్టిచే గ్రహింపఁబడిన సామాన్య నిర్ణయము లైనను, నూత్న విశేషపరిశీలనమువలన నెక్కుడర్థవంతములగుచు. మనము ముందుఁజూచురీతిగా సర్వవిధజ్ఞానములకు నెట్లో యట్లే సర్వ సామాన్యసంబంధముల యాథార్థ్యము నితరజ్ఞానసాధనరూప ములవలనఁగూడ సాధింపవలసియున్నవి. అంతర్దృష్టవిషయము బాహ్యపరీక్షాసిద్ధమైనఁ కాని సిద్ధాంతము కాఁజాలదు. కేవలాంత ర్దర్శనము నిరర్థకము. బాహ్యదృష్టాంతముల సమగ్రపరిశీలన మసాధ్యము. కావున నీరెండును నన్యోన్యసహాయకారులగును. సామాన్యనియమము కొంతయమోఘతను గలిగియుండును; అది మనమొక బాహ్యదృష్టాంతమును బరిశీలించుటచే నిశ్చయ మగును.

సామాన్యసంబంధములు సత్యాంశములని న్యాయసిద్ధాంతము(౧); అందుచే సవియథార్థములే.(౨) సామాన్యధర్మముల యాథార్థ్యమును జార్వాకులు ఖండించి, అనుమానము నిశ్చ యముకాదనిరి. బౌద్ధులీసామాన్యధర్మములు కేవలబుద్ధికల్పి తములనియు, యథార్థసంబంధములుగావనియు నిశ్చయించిరి. సామాన్యమనున దొకనామమే; మిథ్యారూపము. బౌద్ధగ్రంథ

(౧) సామాన్యస్యవస్తుభూతత్వాత్. (త...-భాషా. పు. ౩౧. పూనా ముద్రిణము)

(౨) స్వాభావికస్తు సంబంధో వ్యాప్తిః (పు. ౩౫)

మగు సామాన్యదూషణాదిక ప్రసారితమునందు సామాన్యములు సత్యములను నంశము ఖండింపఁబడినది. చేతియొక్క యైదు వ్రేళ్ళను మనముచూచుచున్నాము; ఆరవదగు సామాన్యమేది యునులేదు. ఆరవ దున్నదనుట మనతలకొక కొమ్మున్నదనుట వంటిదే.3. దీని ననుసరించి యనుమానమున కేయవకాశము లేదు; కాని బౌద్ధులు దీనినివ్యవహారప్రయోజనసిద్ధికొఱ కంగీకరింతురు; వారు సామాన్యము లనేకవిధములనిరి. మధ్యమావయవ మున్న తావయవముతో స్వభావతాదాత్మ్యసంబంధము కాని, తదుత్పత్తిసంబంధముకాని, అనుపలబ్ధిసంబంధముకాని కలిగియుండవచ్చును. అనగా మనయనుమానములు అన్వయరూపములుకాని వ్యతిరేకరూపములుగాని కావచ్చును; మొదటివి విభాగ, సమన్వయరూపములు గావచ్చును.४. తాదాత్మ్యరూప మిట్టిది; "ఇదియొక వృక్షము; ఏలన నిదియొకరకపు దేవదారుజాతి." తదుత్పత్తి యిట్టిది; "నిప్పున్నది; యేలన ధూమమున్నది." అనుపలబ్ధిసంబంధమందు ఘటాభావానుపలబ్ధివలన లభించును, సామాన్యసంబంధములు బాహ్యవిషయపరిశీలనము వలన నుదయించునవికావు; అవి వస్తుతాదాత్మ్యకారణధర్మములనుండి గ్రహింపఁబడును. సామ్యకారణధర్మములను బౌద్ధులంగీకరించిరి; ఏలన నివిలేనిదే జీవించుటయే సాధ్యముకాదు. దిజ్నాగు ననుసరించి బాహ్యాస్తిత్వముగల వస్తుసంబంధములను జ్ఞానము తెలుపఁజాలదు. సమవాయద్రవ్య, వస్తుకర్మసంబం

(3) కీత్. బుద్ధిస్టుఫిలాసఫీ. పు. ౨33
(४) న్యాయబిందువు. పుట ౧౧

ధము లన్నియు విజ్ఞానకల్పితములు.౧. అందుచే నీసంబంధములు కేవలతార్కికములు.

బౌద్ధసిద్ధాంతమును వాచస్పతి నిశితఖండమునకుఁ బాల్జేసెను. బౌద్ధులుచెప్పినకారణధర్మమునకు సివ్వాగలసందర్భములో నుదయించిన ధూమ మొకపిశాచముచేఁ గల్పింపఁబడెనని చెప్ప వలెను. ఒకేకార్య మొకేకారణజాతమగుట కే హేతువైన నున్నదా? కార్యమునకుఁ గారణము పూర్వమైనచో నవి సమ కాలికములు గావు. ధూమదర్శనమువలన మనము ప్రస్తుత మైనదికాక గతాగ్ని ననుమానింపఁగలము. రెండువస్తువులు సమానములైనచో, నొకదానినిఁజూచిన రెండును జూచినట్లే; అప్పు డనుమానావసర మేలేదు. వాచస్పతి జయంతులు, దేవ దారువునకును వృక్షమునకును సంబంధము సామ్యముగాదు; ఏలన వృక్షములన్నియు దేవదారువులుగావనిరి.౨. కారణధర్మ మును, ద్రవ్యసామ్యధర్మము నెట్లుదయించినవో బౌద్ధుఁడు చెప్పఁడు. ఈధర్మములతో సంబంధములేకుండ సమానలక్షణ ములుగల వస్తువులున్నవి. నైయాయికుఁ డిట్టిపరస్పరసంబంధ ములుగలవాని నన్నిటిని వ్యాప్తిలోఁ జేర్చును. కారణసిద్ధములు సామాన్యవిశేషన్యాయసంజాతములగు వానినేకాక, యితరము

(౧) చూడు. న్యాయకందళి. పు. ౨౦౭. వాచస్పతి దిఙ్నాగుని వాక్యమని యిట్లుదాహరించెను; "సర్వోఽయమనుమానానుమేయభావో బుద్ధ్యారూఢేన, ధర్మధర్మిభావేన నబహిస్సత్త్వమపేక్షతే." (న్యా॥ వా॥ తా॥ టీక॥ ౧.౧.౫)

(౨) న్యాయమంజరి. పు. ౧౧౯; న్యా॥వా॥తా॥టీక॥ ౧.౧.౫.

లైన "కొమ్ములున్న జంతువులన్నియుఁ జీలినగిట్టలు గలిగియుం డును." మున్నగునవియు వ్యాప్తిలోఁ జేరును.౩.

## ౧౦—హేతువు.

అన్ని యితర సామాన్యనియమములవలెనే, నైయాయికుని దృష్టిలో నిమిత్తధర్మమును నిరూపింపనవసరము లేని స్వయంసిద్ధమై యంతర్విజ్ఞానగోచరమగు సత్యమై, యనుభవసిద్ధమగుచున్నది. నిమిత్తసంబంధ పర్యవేక్షణ మీనూత్రమును స్థాపించుచున్నది, కారణమనగా నొక కార్యమునకుఁ బూర్వమై, కార్య మవతరించుట కవిలంఘ్యహేతువగునది. ఒకదృశ్యపరంపరలో గారణముపూర్వదశ. ఇది అనేకసందర్భములలో నెట్టి మార్పును లేక సమాన కార్యహేతువగుచున్న విధము దృష్టము, కాని కేవల పూర్వసంఘటనమే చాలదు,౧. అది యవిలంఘ్యమును గావలెను.

కార్యకారణసంబంధము లేకుండగనే సాహచర్యముగల కారణ మన్యథాసిద్ధము, అట్టి కారణాత్మకపూర్వదశలననేక విధములైన వానిని విశ్వనాథుఁడుదాహరించినాఁడు.౨. ఒక వస్తువున్న చోటును మనము వ్రేలితోఁ జూపవచ్చును. కాని కారణరూపముగాఁ జూపుచున్న వ్రేలున్నను, వ్రేలికిని వస్తువున్న

(3) ప్రశస్తపాదుఁ డకారణసాహచర్యములను వ్యాప్తిలోఁ జేర్చెను. "చంద్రోదయమువలన నది సాగరమున మదయించెనని, కలువ వికసించుటచేఁ దెలియుచున్నది." (ప.ప్ర. పు. ౨౦౫)

౧. గ్లన్డొవర్: హెన్రీ. ౪. I.

౨. సిద్ధాంతముక్తావళి. పుటలు. ౧౯-౨౨.

చోటునకును హేతుసంబంధములేదు, ఘటకారుని దండము నిర్హేతుక కారణము; ఆదండము యొక్క వర్ణమప్రస్తుతకారణము. దండపరిభ్రమణశబ్దము సాహచర్యముగల కార్యము. మనము కలిగించుటకును దొలగించుటకును సాధ్యము కాని శాశ్వతతములు, సర్వవ్యాప్తములు నగు పదార్థములు నిర్హేతుక పూర్వవృత్తులుకాఁజాలవు. కారణకారణము, అనగా ఘటకారుని జనకునకును, జేయఁబడిన ఘటోత్పత్తికిని సంబంధములేదు. మనకు సమీపకారణములే ప్రధానములు, కార్యముతో సాహచర్యము గలిగి యుండు నితరకార్యములు కారణకార్యసంబంధములు గలవని భ్రాంతిజనించు నవకాశముకలదు. భూమ్యాకర్షణశక్తి సర్వసామాన్యకారణమై త్రాసుయొక్క సమత్వాసమత్వహేతువగుచున్నది. ఇట్టియేకకాలకార్యము లొకదాని వెంబడి యొకటివచ్చినపుడు పూర్వకార్యమే పరకార్యమునకుఁ గారణమని భ్రమించునవకాశము విశేషముగానున్నది. కార్యోత్పత్తికేది యవసరముగాదో, యది కార్యమునకు ముఖ్యహేతువుగాదు. కారణమును, సమకాలికములైన ప్రత్యక్ష పరోక్షానుబంధములతోడను గలుపరాదు.౧.వ్యతిరేక శక్తులున్నచోఁ గారణము కార్యరూపమును దాల్చలేదని యంగీకరింపఁబడెను. అందుచేఁ గారణనిర్వచనము నందుఁ బ్రతిబంధకాభావమును జేర్పఁబడెను. కార్యమునకుఁ బూర్వమైన ముఖ్యవృత్తియై, యేదన్యకారణహేతువు గాదో యది కారణమని కేశవమిశ్రుఁడు

౧. అన్యథాసిద్ధనియతపూర్వవృత్తి కారణమ్. చూడు. తర్కసంగ్రహము. పు. ౩౮.

నిర్వచనము చెప్పినాఁడు. దారములు వస్త్రమునకుఁ గారణము: వస్త్రముయొక్క రంగునకుఁగాదు; ఏలన రంగువస్త్రమునకు రంగు గల్పించునుగాని వస్త్రమును గల్పింపఁజాలదు.

పరస్పరము నన్వయ వ్యతిరేకి సంబంధము లేకున్నచో, ననగాఁ,గారణమున్నచోఁ గార్యముండవలెను;కారణము లేనిచోఁ గార్యమునుండని యెడల రెండు వస్తువులకు సంబంధముండదు, కారణసంబంధము లన్యోన్యములు, పరివర్తనార్థ్యములు; అవి రహస్యశక్తులుగావు; అమోఘమైన క్రమగతిచే నవి నిశ్చితములైనవి.౨. విషయముల నతిశ్రద్ధతోఁ బరిశీలింపవలసియున్నది. ఉదయనుఁడిట్లు నుడివెను. "విషయముల నిత్యపరిమితులను, విభేదములను, మనము శ్రద్ధతోఁ జూచి, వానికిఁగల హద్దులను నిశ్చయింపవలెను."3. ప్రకృతి మనకు విషయముల ననేక వివరములతో మిశ్రమమొనర్చి యిచ్చును;అండప్రస్తుతాంశములను మనబుద్ధి వేరుచేసి [illegible] 'ఎ–బి' నెంచుకొనును. కార్యమదృష్టమైనచో; నది తత్కారణమదృశ్యమగుటచేనగునో కాదో నిర్ణయించవలెను. ఇట్టి పరిశీలనలోనే తత్సంబంధానుబంధములు మార్పుపొందకుండఁ జూడఁవలెను. బౌద్ధుల పంచకారణి సిద్ధాంతములో నుపయోగించిన ద్విరూపమైన భేదపద్ధతి నుపయోగింపకుండ నొక కారణముయొక్క శుద్ధత్వమును నిర్ణయింపఁజాలము.౧.

---

౨. భాషాపరిచ్ఛేదము. పు. ౧౬.

3. కుసుమాంజలి. ౧౫. ౬.

(౧) ప్రథమభాగము.

కారణసంబంధములు ప్రత్యక్షపరోక్ష పరిశీలనాఫలిత ములుగావు; అవి ప్రకృతి సిద్ధములుగావు; ప్రకృతిసిద్ధ విషయ ములను గూర్చిన బుద్ధికల్పనలు, 'బి' కి 'ఎ' కారణమని చెప్పు టలో, నింద్రియజ్ఞానము నతిక్రమించి, క్రమగతి న్యాయమును (law of Succession) గను గొనుచున్నాము, కారణధర్మము కేవలదృశ్యముల పూర్వోత్తరసంబంధము కాదు;అది వస్తుసంబం ధము. వస్తువులు గోచరించును; సంబంధము దృశ్యము కాదు.

మనము కారణనానాత్వము నంగీకరించినచోఁ గారణ ధర్మ నిరూపణ ప్రయత్నమంతయు వ్యర్థమగును. కారణనానా త్వము శాస్త్రసిద్ధమైనచో ననుమాన మొక జ్ఞానప్రమాణము కాఁజాలదు.౨. మన మొక పొంగిన నదిని జూచినచో, దానికిఁ బూర్వవర్షము కారణమని చెప్పఁజాలము. అది కొంత తట నిర్మాణముచేఁ గావచ్చును. చీమలు తమగ్రుడ్లను నోటగఱచు కొని పోవుచున్నచో, వాని పుట్టలు విఘాతమందియుండవచ్చునే కాని, రాఁబోవు వర్షకారణమే యని నిశ్చయింపఁజాలము. నెమలికూత యని మనము తలఁచిన శబ్దమువలన మేఘములు కూడుచున్నవని నిశ్చయింపరాదేలన, నెమలికూఁత నెవఁడో యనుకరించి యుండవచ్చును. ఒక కార్యమున కొకేకారణ మనియుఁ గారణబహుత్వ ముండదనియు న్యాయసిద్ధాంతము. సమ్యక్పరిశీలనాలోపముచే ననేకకారణములు గోచరించును. కార్యావధిని నిర్ణయించి, బాగుగా గ్రహించినచోఁ గారణా నేకత్వ మదృశ్యమగును. వర్షముచేఁ గలిగిన నది పొంగునకును,

(౨) న్యా॥ భా॥ ౨. ౧. ౩౭-౩౮.

గొంత యడ్డకట్ట కట్టుటచేఁ గలిగిన పొంగునకును భేదముండును. వర్షప్రవాహము వేగ మెక్కువ గలదై, విశేష ఫేనసంవృతమై, వృక్షఫల శాఖాదికములతోఁ గూడియుండును. వర్షారంభమునకుఁ బూర్వము చీమలు తమగ్రుడ్లను దోడ్కొనిపోవు వైఖరికిని, వాని పుట్టలు భంగపడినప్పు డవి పోవు వైఖరికిని భేదముండును. నెమలికూఁతకును, దాని ననుకరించు మనుజకంఠమునకును భేదమును నిస్సంశయముగా గుర్తింపవచ్చును. కార్యవిశేషమునుబట్టి కారణవిశేషమును గ్రహింపవచ్చును. కారణానేకత్వమును సూక్ష్మముగాఁ బరిశీలించినచో ననేకత్వము తొలఁగిపోవునని వాచస్పతి జయంతు లుగ్గడించిరి. కాని యొకే కార్యము నుద్భవింపఁజేయుటలో నొకేలక్షణములుగల యనేక కారణములు గలియవచ్చునని కొందరు తార్కికు లూహించినారు. కాని యిది శాస్త్రయుక్తమైన వాదము కాఁజాలదు. ఇదియే నిజమైనచో, నొకేకార్యమునకుఁ బెక్కు కారణ సముచ్చయము లున్నచో నందేదో యొక సముచ్చయమునకే యిది కార్యమైయుండునుగాని, మొత్తమన్నిటిని సూచింపదు. అనగాఁ గార్యము లేదని మనము నిశ్చయించునెడల, నొక కారణ సముచ్చయమే కాక, కారణసముచ్చయము లన్నియు లేవని తెలియవలెను. ఈయర్థములోఁ గారణమనగా నున్న పెక్కు కారణసముచ్చయములలో నేదోనొక టైయై, దానికిఁ గార్యము నిశ్చయము, నిత్యసిద్ధమును గావలెను. కారణతావచ్ఛేదకత్వము సూచింపఁబడెను.

(౧) వైశేషికసూత్రములు॥ ౧౦. ౨. ౧-౭; తర్కభాష. పుటలు ౧౫-౨౫; భాషాపరిచ్ఛేదము. పుటలు ౧౭-౧౮; తర్కసంగ్రహదీపికపు. ౪౦

కారణములు మూడువిధములు. (౧) ఉపాదానకారణము లేక సమవాయికారణమువలనఁ గార్యము సిద్ధించును. దారములు పటమునకును, మట్టి ఘటమునకు నుపాదానకరణము లగుచున్నవి. ౧. (౨) అసమవాయికారణమనగా నిది యుపాదానమునందుండునది. దారముల సంయోగశక్తి అసమవాయికారణము. దానములు సంయోగము నొందకున్నచో నవి నొక దారపుకట్టయగునేకాని వస్త్ర ముత్పన్నము కాదు. వస్త్ర వర్ణముకూడ నసమవాయికారణము. దానికి వస్త్రమునకు రంగునిచ్చుశక్తి యున్నది. ఉపాదానకారణమొక ద్రవ్యమును, సమవాయికారణమొక గుణముకాని కర్మకాని యైయున్నది. ౨. అణుసిద్ధాంతమునసుసరించి, భౌతిక జగత్తులోని పరివర్తనములన్నియు నంశౌ సంయోగ వియోగ

(౧) న్యాయవాదమునసుసరించి, కార్యము తదుపాదానకారణ నాశముతో నశించును. ఒకదారము నశించినచో వస్త్రమంతయు నశించినట్లే; కాని యింకను గొంతవస్త్రము మిగిలియున్నది; దానికొక నేతగాఁడుకాని మగ్గముకాని యవసరములేదు. కారణమేమనగా మొదటియుపాదానకారణము పూర్తిగానశింపలేదు; అది స్థితిస్థాపకసంస్కారముగా నిలిచియున్నది.

(౨) సాంఖ్యవేదాంతు లీ రెండవకారణము నంగీకరింపరు. కారణకార్యసంబంధమును భేదసంబంధము. రెంటినికలుపుటకు వేఱొకయవసరము లేదు. సమవాయి, అసమవాయి కారణములకు భేదములేదు. బౌద్ధు లీభేదమును గుర్తింపరు. ప్రతివిషయమును క్షణికమై యింకొకదానికిఁగారణమగుచున్నది. క్షీరము ప్రతిక్షణములో మారుచునేయున్నది: మనముమాత్రమొక దశలో దానిని క్షీరమనియు నింకొకదశలో దధియనియుఁ బేర్కొనుచున్నాము.

ములచే నేర్పడుచున్నవని న్యాయవాదము. ప్రకృతి మూల ద్రవ్యములు మార్పుచెందవు; కాని సంయోగ వియోగాదిపరివర్తనవిధానము ప్రతిక్షణమునను మార్పుచెందుచుండును. ముఖ్యకారణము తదితరములనుండి వేరుగానుండును. ఇది కార్యముద్భవించుటకుఁ బ్రధాన హేతువగును. కుమ్మరి కుండకుఁ బ్రధానకారణము; దండచక్రాదులు సహకారులు, 3. ఈ కారణ వర్గత్రయభేదము నారిస్టోటలును జేసియున్నాఁడు.

కొన్ని వేళల నుపకరణాత్మకమగు కారణ మొక విలక్షణ కారణమని చెప్పఁబడును. ౪. దీనిని కేశవమిశ్రుఁడు ప్రకృష్ట కారణమని పలికెను. ౫. కారణసముచ్చయములో నేది కార్యముతో సన్నిహితముగానుండునో యది కారణము. ౬. దర్శన క్రియలో ద్రష్టయు దృశ్యమును రెండునవసరములే; కాని ముఖ్యకారణ మింద్రియసంయోగము. ఏదిలేకున్న నిశ్చిత కార్యసిద్ధి లేదో యది కారణమని నీలకంఠుఁడు వచించెను. ౭. ఘటమునకు కుమ్మరిదండ ముపకరణాత్మక కారణము; అడవిలోని కఱ్ఱయట్టిది కాదు. దానినిఁదెచ్చి ఘటోత్పత్తి కుపయోగించి

(3) ముఖ్యకారణములు సామాన్యములు; విశేషములు: సామాన్యము లెనిమిదివిధములు: భగవంతుఁడు, ఆతని జ్ఞానము, కోరిక, క్రియ, పూర్వభావము, దేశకాల పుణ్యపాపములు. (తర్కసంగ్రహము. పుటలు ౨౦౭-౨౦౮

(౪) అసాధారణమ్ కారణమ్ కరణమ్. తర్కసంగ్రహము పు 32

(౫) ప్రకృష్టమ్ కారణమ్.

(౬) అవిలంబేన కార్యోత్పత్తి.

(౭) తర్క సంగ్రహము. పు ౧౪౬.

నప్పు డట్టికారణమగును. అందుచే 'వ్యాపారవ' చ్ఛబ్దము ప్రయోగింపఁబడెను. అభినవన్యాయ మింకొకయడుగు ముందుకుఁబోయి 'వ్యాపారమే' కారణమనియుఁ గార్యసిద్ధికది యే ప్రధానసమీపతమకారణమనియుఁ జెప్పెను. ౨.

అనంతరన్యాయమునందుఁ గార్యము ప్రాగభావ ప్రతియోగియని నిర్వచించిరి.౩. ఇది పూర్వాభావముయొక్క భావాత్మకరూపము, కార్యము పూర్వము లేదన్నచో దాని కారంభమున్నదని యర్థము. దీనికే అసత్కార్యవాదము లేక ఆరంభవాదమని పేరు. కార్యము కారణమునందుఁ బూర్వముండదు; అది క్రొత్తగా నుదయించును. ఇది నిత్యనూత్నసృష్టితోఁగూడిన సిద్ధాంతము.౪. కార్యమొక కారణములోఁ బూర్వమున్నదని కాని లేదని కాని, లేక రెండు లక్షణములును గలిగి యున్నదని కాని చెప్పవీలులేదని బౌద్ధులు వాదింతురు. కార్యము జనించుటకుఁ బూర్వము కారణమందు లేదని న్యాయవాదము; యీ సిద్ధాంతము, పూర్ణము తదంశము లన్నిటికంటెను వేరైనదను.

(౨) వఁరయోగవ్యవచ్ఛిన్నమ్ కారణమ్.

(౩) ప్రాగభావప్రతియోగి. (తర్కసంగ్రహము. ౩౫.)

(౪) కారణకార్యములు వేరని చూపుటకుఁ గణాదుఁడు పెక్కుహేతువులను జూపినాఁడు: (౧) అవి భిన్నభావవిషయములు (౨) భిన్నపదవిషయములు (౩) అవి భిన్నకార్యజనకములు (౪) భిన్నక్షణములలో నవి యుదయించును. (౫) ఆకృతిభేదములు గలవు (౬) సంఖ్యావిషయము, దారములనేకములు; వస్త్రమొకటే (౭) కారణకార్యము లభేదములైనచోఁ గారణమునుండి కార్యము నూహించు ప్రయత్న మవసరముండదు, వాటియుఁ జూడు. న్యా.వా.తా.టీక.౩ ౨.౧౭.

తత్త్వమున కనుగుణముగా నున్నది.౫. కారణమందుఁ గార్యము సూక్ష్మరూపమున నున్నదని సాంఖ్యవేదాంతవాదులు చెప్పుదురు. సాంఖ్యము ననుసరించి, యుపకరణాత్మక కారణము కార్యావిష్కరణమునకుఁ దోడ్పడును. నైయాయికుఁడు దీనిని ఖండించును. వస్త్రమిదివఱకే దారములలో నున్నయెడల దానినేల మనము చూచుటలేదు? దారములు వస్త్రము కాదు; మనము దారమును గట్టుకొనము, వస్త్రము దారములలో గోచరింపదనుట యుక్తి కానేరదు; ఏలన నట్లు గోచరింపకుండుటయే మన సమస్యయై యున్నది. కార్యావిష్కరణమనగా, దర్శించుటకు వీలయి, కర్మ సాధనరూపమునఁ బూర్వము లేనిదైనచో, నది కారణము కార్యము నుదయింపఁజేయుటకుఁ బూర్వము లేనిదన్నమాటే. ఒకానొక రూపములోనిది వఱకు లేని దానిని కారణమావిష్కరించుచున్నది.౧. రూపసామర్థ్యస్థితులందుఁ గార్యము కారణమునుండి భేదించుచున్నది. కారణకార్యములకభేదమను సాంఖ్యసిద్ధాంతము యథార్థమైనచో, నవ్యక్త ప్రకృతినుండి పుట్టిన జగత్తంతయును దానివలెనే యగోచరము కావలెను. కార్యము కారణమెంతస్థలము నాక్రమించునో యంతే స్థలము నాక్రమించుచోఁ, గార్యము కారణముపై నాధారపడి యున్న దన్నమాట. వస్తువులు నిత్యము నూత్నముగా నుద్భవించి నశించుచున్న ప్రకృతి సత్యమును గాదనుట కవకాశము లేదు.౨. పాలు పెరుగుగా మారినప్పుడు పాలు మార్పునొంది

(౫) న్యా.సూ. ౪.౧.౪౭-౫౪.

(౧) న్యా.వా.౪.౧.౪౯. (౨) న్యా.భా.౪.౧.౪౯.

నవే కాని నసించలేదని చెప్ప వీలులేదు. "ఒక వస్తువు క్రొత్తగా నిర్మింపఁబడుచుండగా, దాని నుండి పూర్వవస్తువు లేదనియు లేక నశించినదనియు మన మనుమానింతుము".3. క్షీరములోని వివిధాంశములు మార్పునొంది, యొక నూతనాకృతిని దాల్చి పెరుగగుచున్నది, క్షీరముయొక్క సంపూర్ణనాశనము నూత్నమైన పెరుగు నుత్పత్తి చేయఁజాలదని న్యాయవాదము. దీని యర్థమేమనగా నొక ద్రవ్యము తన పూర్వావస్థను విడిచి పెట్టుచున్నదని మాత్రమే; ఈసత్యమును న్యాయవాదము స్పష్టముగా నంగీకరింపదు.

వేరొక కారణ ధర్మమును విశ్వసించు సాంఖ్య వేదాంత గ్రంథము లీ న్యాయసిద్ధాంతమును ఖండించినవి. సాంఖ్యకారిక నుండి యొక దృష్టాంతము నీయవచ్చును.౧. ఏదిలేదో యది యెన్నఁడు నుత్పత్తినొందఁజాలదు. మనమెంత యత్నించినను, నీలిమను పసుపురంగుగా మార్చలేము. నూనెయు నూనెగింజలును గలిసియున్నట్లే, ఉపాదానకారణము నిత్యమును గార్యముతోఁ గలిసియుండును. లేనివస్తువుతో సంయోగమసాధ్యము కావున,c గార్యము కారణమందుండకతప్పదు. సంయోగము లేకున్న నొకకారణ మొకకార్యము నుదయింపఁజేయఁగలదనుట పొసఁగదు. ఏలన నది నిజమైనచో దేనివలననైన నేదియైన నుదయింపవచ్చును; ఒకకార్యమున కొకకారణ మున్న

(3) న్యా భా.3.౨.౧౬.

(౧) సాం.

దని నిర్ణయింప వీలుండదు.౨. కార్యముతో సంయోగము లేకుండగనే యొక కారణ మొక కార్యమును దనలో నంతర్గతమై యున్న యొక శక్తివలన3. నుద్భవింపఁజేయవచ్చు నన్నచోఁ గార్యము కారణమం దున్నదనియే యర్థమగును. అట్లర్థము కానిచో నప్పుడొక ప్రత్యేక కార్య మొక విశిష్టకారణమునుండి యెట్లుత్పత్తియైనదో చెప్పుట దుర్ఘటమగును. మఱియుఁ గారణ కార్యము లేకస్వభావములు గలవగుటచే, నొకటియున్న రెండవదియు నుండవలెను. కార్యము కారణమునుండి పూర్తిగా వేరైనచో రెంటిని గలుపు నియమమెట్టిదియు నుండఁజాలదని సాంఖ్యవేదాంతములు వాదించును. కార్యకారణములకు భేదము లేకున్నచో నొకటి కారణమనియు నొకటి కార్యమనియుఁ జెప్పుట కవకాశమేలేదని నైయాయికుని వాదము. భిన్నదృక్పథములనుండి రెండును యుక్తియుక్తములే. ప్రకరణాంతరమునకుఁ బోవుటకుముందు న్యాయనిమిత్త ధర్మమునుగూర్చి మనము కొన్ని విమర్శనలు చేయవలసియున్నది. నైయాయికుఁడు పూర్వవిషయమును ముఖ్యమని చెప్పును; సరిగాఁ జెప్పుచో నీ పూర్వత్వము తార్కికముగాని కాలికముగాదు. సూర్యుఁడు

(౨) ఈభావమే సరియైనదైనచో నసాధ్యములగు శశవిషాణాదుల నుత్పత్తిచేయవచ్చును. కాని దీనికి న్యాయమిట్లు బదులుచెప్పెను; ఉత్పత్తియైనదిపూర్వము లేనిదనియే కాని, యసాధ్యమైన దుత్పత్తి యగునని కాదు. (న్యాయమంజరి. పు ౪౯౪) (3) కార్యముత్పత్తియగుటకు బూర్వము లేనిచోఁ గారణవ్యాపార మన్యకార్యసక్తమైయుండవలెను; అనగా దారములతోఁ బనిచేయుటకుఁ గర్త కర్మవలన ఘటము లుత్పత్తి యగునన్నమాట. ఒక కర్తయొక్క యొక వ్యాపారము తత్సంబంధ కార్యోత్పత్తినే చేయునని చెప్పి వైశేషికుఁడీ వైరుధ్యమును దొలగించినాఁడు.

కాంతికిఁ గారణము; కారణకార్యము లేక కాలమునందే యున్నవి. నిజమైన కారణము కార్యమున్నంత కాలముండును; కార్యమునకుఁ బూర్వాపరములందుఁ గారణ ముండనవసరము లేదు. సత్యముకొఱకుఁ గాక, వ్యావహారిక ప్రయోజనము కొఱకు నైయాయికుఁడు నిమిత్తధర్మములోని పూర్వభావమునకు లేని ప్రాముఖ్యము నిచ్చియున్నాఁడు.౧. పూర్వావస్థలను, వాని మార్పునకు నలయు నవస్థలను, గార్యోత్పాదక కారణములుగా వివరించుట స్థూలదృష్టిఫలితమే. ఉచితావస్థాసంయోగము తటస్థించినంతనే కార్యము దృశ్యమగును. అట్లుకానిచో గారణము నిత్యమై కార్యము నెన్నఁడు నుదయింపఁజేయఁజాలదు. కార్యము నుదయింపఁజేయకుండు కారణ ముండఁజాలదు. పరివర్తన వ్యాపారమే కార్యము; మఱేదియుఁ గార్యము కాఁజాలదు. అంశాభేదమును, వాని సంయోగమును, కార్యోత్పాదనము నివన్నియు భావకల్పితములే.౨. పూర్వభావమును

(౧) కుసుమాంజలి॥ ౧. ౧౯.

(౨) "కాలగతమైన యవిచ్ఛిన్న పరివర్తన విధానమునుగూర్చి చేసిన భావకల్పనమే నిమిత్తధర్మము. విడిగానున్న కారణములు కలియుటకును, ప్రవృత్త్యారంభమునకును మధ్యమందు విరతిలేదు. కారణకార్యముల మధ్యమందుఁ గొంత విరతిలేక విశ్రాంతికాలములేదు. అవిచ్ఛిన్నమగు పరిణామములో మనము భావముచే నొకగీతను గీసి కాలభేదమును గల్పించుచున్నాము. ఏలన, నొక కారణ మొక క్షణాంశకాలమైన విరతినొందినచో నది యట్లనంతకాల ముండఁగలదు. (బ్రాడ్లే: లాజిక్. ౨. పు, ౫౩౯.)

"ప్రకృతిసిద్ధమగు పరిణామదశా ప్రవాహమునందు మనము భావకల్పనము చేసి నిమిత్తధర్మమును దీయుచున్నాము. అది నిజముగా నంములేదు. మనః కల్పిత సామాన్యములం దిదిమొదట గోచరించును" (బ్రాడ్లే: పు. ౫౪౦)

కార్యకారణాభేదమును గలుపఁజాలమని శంకరుఁడు చెప్పినది యుక్తముగానున్నది. కారణకార్యములయుతసిద్ధము లనగా నవినాభావసంబంధము గలవగుచో, నప్పుడు కారణమెల్లప్పుడు కార్యపూర్వదశ కానక్కరలేదు. కారణకార్యములు వేరనియు నవి యభేదసంయోగమును బొందినవనియు ననుటకంటె, రెండు నొకే వ్యాపారములోని భిన్నరూపము లనుటెక్కువ యుక్తము.[౧] న్యాయసమవాయ సూత్రము దీనినే బలపఱచును. కారణ కార్యములు సమవాయసంబంధమును గలిగి యున్నచో, నవి తాదాత్మ్యత గలవనుట విశదభాషణమగును.

మనము కన్నుఁదెరచినప్పటి కెదురుగాఁ గారణసంబంధములు కన్పట్టురీతిని వానిని ప్రకృతి మనకుఁ బ్రదర్శించునని తలఁచుటకవకాశము లేదు. 'బి' కి 'ఏ' కారణమనియో, 'ఏ' అవసరమైనదనియో 'బి' అప్రధానమనియో, చెప్పుకొని మనయనుభవము నొకక్రమములోఁ బెట్టుకొందుము. కారణధర్మమొక విజ్ఞానరూపము లేక మనబుద్ధికల్పనము. జగమంతయుఁ గొన్ని నియమములకధీనమైయున్నదను భావమునొక ప్రతిపాదనముగా మనము తర్కమం దంగీకరింతుము; తత్త్వశాస్త్రము దానిని స్థాపించును. జీవయాత్రలో నొకవిషయమునకుఁగల మూలకారణమునుగూర్చి కాని దానిసహేతుకతనుగూర్చి కాని యన్వేషింపము. మనకుఁగావలసినకార్యము ఫలించుటకువలయుసందర్భజ్ఞానముతో దృప్తిగాంతుము. మృత్తుఘటకారణము; ప్రకృతి మృత్తునిచ్చును; కుమ్మరిదానినుపయోగించి ఘటమొనర్చును. మనము కారణావస్థ

(౧) శం॥ భా॥ ౨, ౨, ౧౭.

లను సమగ్రముగాఁ బరిశీలింపఁజాలము; అందుచే మనకారణ సంబంధములన్నియు లౌకికములు. కొన్నికొన్ని దశలలోఁ దద్విరుద్ధకారణములు లేనియెడలఁ గొన్ని ఫలితములుదయించితీరును. కారణములకు మూలకారణములను గనుగొనుట, నట్టిప్రయత్నమువలన వ్యర్థవాదము ఫలితమగుట మున్నగువానిని నైయాయికుఁడు నిరుపయోగవ్యాపారమని విసర్జించినాఁడు. కారణకార్యములు తాత్కాలికములు; సత్యవిషయములుకావు; పరిణామవశములయియున్నను, వీనిని మనము సమాకృతిగల నిత్యవిషయములని ప్రసంగింతుము. అణువులైనను, నవి కారణములైనచో, యథార్థరూపములుగావు. మార్పునకుసంబంధములేని కారణములేదు; మార్పుగలదంతయు ననిత్యదృశ్యమే. పరిశీలింపఁగాఁ గారణధర్మమనగా విషయపరంపర; ఒకదానిపై నొకటి యాధారపడియుండు ననంతవిషయప్రవాహము;ఐనను, నిమిత్తన్యాయము నిత్యమైనదనురీతిని మనము గ్రహించుచున్నాము. మనయనుభవావధిలో నది ముఖ్యోపయోగమే; కాని, యది పూర్ణప్రమాణమని యంగీకరింపఁజాలము. నిమిత్తధర్మ మొకవిధమగు ననుభవము.౧.

కార్యము కారణమందులేదను న్యాయవాదమునకుఁ గారణము, యథార్థమైనది దృశ్యమగునదేయనుభావమునందు న్యాయవాదులకుండు నొకవిధమగు విశ్వాసమే. ౨. మనము లోకములో సూక్ష్మములు నసమ్మిశ్రితములునగు నంతరువుల నుండి, స్థూలములు, సమ్మిశ్రితములగు నంతరువులు వ్యక్త

(౧) అధ్యస్తధర్మము, (౨) న్యా॥ భా॥ ౨' ౨, ౧౮.

మగుచుండుటను జూచుచున్నారము. నేడు పెక్కుమంది భౌతికశాస్త్రజ్ఞులు, లోకములోనివిషయపరంపర లీవిధముగా సూక్ష్మములనుండియు; నసమ్మిశ్రితములనుండియు నున్నత క్లిష్టతర శ్రేణికిఁ బరిణామమందునను నీసిద్ధాంతము నంగీకరించు చున్నారు. న్యాయదార్శనికులుచెప్పు సూక్ష్మము నేకమగు పరమార్థమును వా రంగీకరింపకపోచ్చునుగాని, మిగిలినసిద్ధాంత మిరువురకు నొకటేయైయున్నది. మనము నైయాయికునివలె భౌతికాణువులతో నారంభించినను నభినవభౌతికశాస్త్రజ్ఞులవలె 'ఎలక్ట్రాన్సు'తో నారంభించినను, నిత్యోన్నత క్లిష్ట పరిణితినందుచున్న క్రియాశూన్యపదార్థము (Neutral Stuff)తో గాని, యింద్రియవేదనలతోఁగాని, దేశ - కాలములతోఁగాని యారంభించినను, మనమనుసరించునదొక యసమగ్రమగు వివరణవిధానమేయగును. క్లిష్టములనుండి సూక్ష్మములనేకాని సూక్ష్మములనుండి క్లిష్టములు లభించుననుట తాత్త్వికాన్వేషణమున కంగీకారముకాదు. సహజవిజ్ఞానపరిణామ మీనియమమునొప్పుకొనును. ప్రవాహము తన జన్మస్థానమునకంటె నున్నతముగాఁ బ్రవహింపఁజాలదు. సహజసిద్ధములగు నట్టి సందర్భముల నుల్లఘించినచో, వానిని విసర్జించుటేయగును. భౌతికవాదుల కనుగుణముగానుండునని మనము మనసత్త్వ నిర్మాణస్వభావమును గాదనఁజాలము. విజ్ఞానము, కార్యము కారణమందుగర్భితమై, అవ్యక్తరూపమున నున్నదని గుర్తింపకతప్పదు. సరియైన భౌతికవాదము పరిణామము కేవలదృశ్య మాత్రమేయని చెప్పవలసియుండును. అది దృశ్యమునకంటె

యధికమైయున్నదన్నచో భౌతికవాదమునకు విరుద్ధమగును. అలెగ్జాండరుమున్నగు భౌతికవాదులు దేశకాలమునుగాక, ఉన్నతజీవసృష్టి కింకొక నియమమున్నదని యూహించుచునే యున్నారు. ఎట్టయెదుటనున్నదే యధార్థమని భౌతికవాది తలఁచి, యంతర్గతము నవ్యక్తమునైనది లేదని తృణీకరించుచో, నప్పుడు కారణధర్మ మర్థహీనమగును. ఇంద్రియగోచరములు కాని యణువులు, నాత్మలునున్నవనిచెప్పి నైయాయికుఁడు తనసిద్ధాంతమును దానే నిరసించినాఁడు. మనముచూచు వస్తువులుదయించి నశించుచున్నవి కావున నవి యనిత్యములు; నిత్యములగు వస్తువులను మనముచూచుటలేదు; కాని వానిని మనమున్నవని నమ్ముచున్నాము. 'కాలమును తన చిన్నగ్రంథములో గయాన్ చెప్పినాఁడు: "పూర్వులు దేనిని దేవుఁడని భావించిరో, మనము నేఁడు దానినే కాలమని పేరిడి, దానికి సర్వశక్తుల నాపాదించుచున్నాము." ౧. కాలము నిత్యసత్యమను నిర్ణయముననుసరించినచో ప్రపంచముయొక్క లక్ష్యమునుగూర్చి, యది స్థిరము లేక నచలమని నిశ్చయముగా నమ్మఁజాలము. దేనినుండియైన నేదియైన వచ్చునట్టిమార్పులు గల ప్రపంచములో మనము జీవించుచున్నారము. అట్టి ప్రపంచములో దేవునికి స్థానములేదు; క్రమోన్నతపరిణామమువలన ముందెప్పుడో దేవుఁడుదయించునని మనమునమ్మవలెను. మనస్సున కధికతరమైన సోపానము దేవుఁడని అలెగ్జాం

(౧) ౧౯౨౩ సెప్టెంబరు ఫిలాసఫీ రివ్యూ పత్రిక పుట ౪౭౭ లో నుదాహృతము.

డరు పండితుఁడు మనకభయహస్తమిచ్చియున్నాఁడు. దేవుడు పుట్టినతరువాత నధికతరసోపాన మెద్దియని మనమడుగవలెను?

కారణకార్యముల సంబంధమవిచ్ఛిన్నమని నైయాయికుఁడు వాదించును. అభినవ ప్రకృతి శాస్త్రవాక్యములలో మనము న్యాయసిద్ధాంతమును జెప్పుకొన్న యెడల నిమిత్తధర్మమనగా శక్తివ్యయమని తెలియును. ప్రస్తుతము మనము న్యాయము చెప్పు నదృష్టపుణ్యపాపముల నటుంచినచోఁ, బ్రకృతి నిర్మాణములో నతీతమైన దేదియు నుండుట కవకాశము లేదని న్యాయసిద్ధాంతముగాఁ దేలును. శక్తియొక్క పునర్విభాగమే నిమిత్తధర్మము, కారణసామగ్రి హేతువు; దానినుండి జనించునదే కార్యము.౨. ప్రాకృత జనులు తలచునట్లు వస్తువులుదయించి నశించుచున్నవను సిద్ధాంతమును సమర్థించుటకై, వస్తువులందొక నిత్యమగు నవిచ్ఛిన్నతకలదను విషయమును నైయాయికుఁడు గుర్తింపఁడయ్యెను. శూన్యమునుండి యేదియు రాదను భావమును, వస్తువులు జనించుట కాదికాలమున్నదను భావమును సమన్వయించుటకు నైయాయికుఁడు తలపెట్టినాఁడు. లతనుండి పుష్పమును, వృక్షమునుండి ఫలమును, జనించును;

---

(౨. కారణగుణములే కార్యగుణకారణముల వైశేషికుఁడంగీకరించిన విషయమును మనము ముందుఁజూచెదము. నిప్పుయొక్క వేడిమిచే మార్పు నొందకున్నచో, మృత్తుయొక్క నలుపు ఘటము నలుపునకుఁ గారణము ఈసూత్రమొక్కచోఁ జెల్లదని వైశేషికుఁడు చెప్పినాఁడు; అణువులనుండి, అణుద్వయరూపము; దాని వలన నణుత్రయరూపమును జనించునప్పుడు ద్రవ్యమునుత్పత్తిచేయు నణువులసంఖ్యను బట్టి ద్రవ్యపరిమాణ మేర్పడును. సమచ్చయ ద్రవ్యములలో గుణములు మారునని న్యాయమతము.

కాని లతయు పుష్పమును, వృక్షఫలములును నన్నియు నయ థార్థములని యాతఁడు గుర్తించును. కారణము యొక్క ద్రవ్య సమానత్వము నాతఁడంగీకరించి, భిన్నదశలలో నొకే ద్రవ్యము నుండి నూత్నలక్షణము లుదయించునని యాతఁడు చెప్పును. తాత్త్విక ప్రశ్న యేమనగా నీనూత్నలక్షణములు యథార్థము లాయని? వానిని మనము కారణావస్థలోఁ జూడలేదు; కార్యా వస్థలోఁ జూచితిమనుమాట నిజమే, ఈకారణముచే నవి యథా ర్థములని చెప్పఁగలమా? ప్రపంచ పరిమాణదశలనిత్యములని నైయాయికుఁ డంగీకరించినప్పు, డవి పూర్తిగా యథార్థములు గావనియు నంగీకరించినట్లే. మార్పులేనిది సత్యమైనది; సముచ్చ యార్థములు రూపపరివర్తనము నందును, వాడుకలో మనము వస్తువులు పుట్టిగిట్టుచున్నవని చెప్పుదుము; కాని నిజముగా భిన్న ద్రవ్యాంశముల సంయోగ వియోగములే కలుగు చున్నవి; మూలద్రవ్యములు పుట్టుటయు లేదు, గిట్టుటయు లేదు; తరుగుటయు లేదు పెరుగుటయును లేదు, నిజమైన ద్రవ్యము నిత్యము; దాని యవస్థలలోనే మార్పులున్నవి. జడపదార్థమందైనను, ప్రథమ సూత్రము దానికి మార్పులేదనియే. అణువులు నిత్యములు; వాని సముచ్చయద్రవ్యములు కలిసి విడిపోవుచుండును, ద్రవ్యము శూన్యమునుండి పుట్టునను నాత్మవిరుద్ధవాదములోని వైరుధ్యము బీజరూపములో నున్నది స్థూలరూపము దాల్చుచున్నదని తలఁ చుట వలనఁ దొలగిపోవుచున్నది. ఒక దశనొక ద్రవ్యముతోడ ను, తత్పూర్వదశను శూన్యముతోడను సమాన మొనర్చుట భాషాదుర్వినియోగమే యగును.

## ౧౧-ఉపమానము.

ఇదివఱకు మనకు బాగుగాఁ దెలిసిన యొకవస్తువుతోఁ బోల్చుటవలనఁ గలుగు సామ్యముచే మనకొక వస్తుజ్ఞానము నిచ్చున దుపమానము. గవయ మొక గోవువలె నుండునని విని దానినిఁజూచి గవయమని యనుమానించుచున్నాము.౧. ఉపమానవాదమునందు రెండంశములున్నవి. (౧) తెలిసికొనవలయు విషయజ్ఞానము (౨) సామ్యదర్శనము. మొదటిదే నూతనజ్ఞాన ముఖ్యకారణమని ప్రాచీనన్యాయవేత్తలు తలఁచియుండగా, నభినవ నైయాయికులు సామ్యదర్శనమున కెక్కుడు ప్రాముఖ్యమునిచ్చియున్నారు.౨. కేవల సాదృశ్యము, సంపూర్ణమైన నసంపూర్ణమైనను, నుపమానవాదమునకుఁ జాలదు. మొదటి సంపూర్ణసాదృశ్య జ్ఞానమువలన నూతనజ్ఞానములభించదు; గోవు గోవువలె నున్నదని మనము చెప్పము. రెండవదనగాఁ గొంత పోలికయున్నపుడు, మనముచేయు ననుమానము యుక్తము కాకపోవచ్చును; ఒక గేదె యావు కాఁజాలదు. కాని రెంటికిని పోలికలు పెక్కుగలవు. కేవల స్వల్పసాదృశ్యమే యున్నచోఁ నింకను దోషమెక్కుడగును. ఒక ఆవగింజ మేరుగిరికాదు; రెండు నస్తిత్వసాదృశ్యమును గలిగియున్నవి. యుక్తమగు

(౧) ప్రసిద్ధవస్తు సాధర్మ్యాత్ అప్రసిద్ధస్యసాధనమ్।
ఉపమానమ్ సమాఖ్యాతమ్ యథాగౌర్గవయస్తథా॥
హారిభద్రుఁడు: షడ్దర్శనసముచ్చయము. పుట ౨౩ చూడు: న్యాం సూ. ౧. ౧. ౬.

(౨) సాదృశ్యజ్ఞానమ్. (తర్కసంగ్రహము. పుట ౫౮)

నుపమానయుక్త వాదమందు మనము సదృశాంశములను లెక్కపెట్టము; వానిబలమును బరిశీలింతుము.3. సాదృశ్యము ముఖ్యమైనదిక యును కారణబంధమునకు ననుగుణమైనదియుఁ గావలెను. ఈవాద మొకవస్తువునకును దాని నామమునకును గల సంబంధజ్ఞానము నిచ్చును.౬. ఇది సామ్యసమస్యకు సంబంధించును ఆవునుబోలిన యొక జంతువునకు 'గవయ' నామమును మనమిచ్చినాము. ఆజంతువు మనకు గోచరించినప్పుడు దానిని గవయమని పిలుచుచున్నాము. అర్వాచీన తార్కికులు మనకిట్టి జ్ఞానము కేవల సాదృశ్యదర్శనము వలననేకాక, వైధర్మ్యము లేకుండుటవలననుగూడ లభించుచున్నదని చెప్పిరి. ఒక గుఱ్ఱము నొక గోవుతోఁ బోల్చము; ఏలన గుఱ్ఱమునకుఁ జీలిన గిట్టలులేవు; ఒక యొంటెకుఁగల పొడుగుమెడ మున్నగు ముఖ్యలక్షణములనుబట్టి వైధర్మ్యము లేర్పడుచున్నవి.౧. ఈయుపమాన మభినవపద్ధతిలోఁ జేరదు.

వ్యవహారరంగమునఁ గార్యసిద్ధినిచ్చునదియే యుక్తమైనదను సిద్ధాంతమును న్యాయముస్వీకరించినది. ఇంద్రియానుభవసిద్ధములైన విషయముల కీ పరీక్ష చెల్లునుగాని, తదతీతవిషయముల కిది చెల్లదు. నైయాయికుఁ డుపమానముచే నీ కష్ట

(3) న్యా. భా. ౨. ౧. ౪౪.
(౪) ప్రసిద్ధసాధర్మ్యాత్॥ ౨. ౧. ౪౫.
(౫) సాధ్యసాధనాభావా॥ (న్యా. భా. ౨. ౧. ౪౫)
(౬) సంజ్ఞాసంజ్ఞిభావము.
(౧) తార్కికరక్షా పుట ౨౨.

మును దొలగింపయత్నించినాఁడు. ప్రాచీనమహర్షు లుపదే శించిన ఆయుర్వేదసిద్ధాంతమును మనము పరీక్షించి సత్యమని నమ్ముచున్నట్లే వారుకనుగొని బోధించిన యాత్మజ్ఞానసిద్ధాంతమునుగూడఁ బరీక్షించినచో సత్యముకావలెను.

ఉపమానమునకు సాదృశ్యదర్శనము ముఖ్యమైనదికావున దిఙ్నాగుఁడు దీనినికూడఁ బ్రత్యక్షములోఁ జేర్చినాఁడు. వైశేషికులు దీని ననుమానములోఁ జేర్చిరి; ఏలన నీవాదమును వారిట్లు కూర్చిరి: "ఈవస్తువొక గవయము; ఏలన నిదియొక గోవువలెనున్నది.; మఱియు నేదియైన గోవువలెనున్నచో నది గవయమే." ౨. ఉపమానము స్వతంత్రజ్ఞానప్రమాణము కాదని సాంఖ్యమతము; ఏలన నరణ్యవాసుఁడిచ్చిన యుపదేశము శాబ్దికము; సాదృశ్యదర్శనము ప్రత్యక్షజ్ఞానము. 3. భాసర్వజ్ఞుఁడైనను దీనిని శబ్దజ్ఞానము నందుఁ జేర్చినాఁడు. ఉపమానయుక్తమైన వాదము సంకీర్ణమైనది; గవయము గోవువలెనుండునని యరణ్యవాసి చెప్పినది శబ్దజ్ఞానమగును; మనము గవయమును జూచుచున్నాముగావున నది ప్రత్యక్షము; మనము గవయమును జూచినప్పుడు సాదృశ్యవిషయము జ్ఞాపకమువచ్చునుగాన స్మృతియగును; గోవువలెనున్న దేదైనను గవయమను న్యాయమును మనమునమ్ముదుముకావున ననుమానమైనది; గవయ నామము మనముచూచిన జంతువువంటి

(౨) ఉపచారము ౯, ౨, ౫.
(3) తత్త్వకౌముది పుట ౫.

దానికే చెల్లునుగావున నామ మీ జ్ఞానమునకు ముఖ్యలక్ష ణము. చివరఁ బేర్కొనఁబడే యుపమానయుక్తవాదము మన కొసఁగు ప్రత్యేకప్రయోజనము; దీని నితరప్రమాణముల వంటిదని పొరపడరాదు; దీనికి వానితోఁ బోలికలుకొన్ని యుండవచ్చును. ౧.

## ౧౨. శబ్దప్రమాణము

శబ్దప్రమాణము ముఖ్యజ్ఞాన సాధనములలో నొకటి. మనము చూడనట్టియుఁ బరీక్షింప నట్టియు ననేకవిషయముల నితరుల వాక్ప్రమాణముపై నాధారపడి యంగీకరింతుము, జనసామాన్య విశ్వాసమువలనను, చారిత్రిక సంప్రదాయము వలనను, మతగ్రంథదర్శనముల వలనను, మనకు విశేషజ్ఞానము లభించును. ఈవాదములో నిమిడియున్న తార్కికాంశములను శబ్దప్రమాణము వివరించును.

శబ్దోత్పత్తి స్వభావముల గూర్చియు, పదముల అర్థము లను, వాక్యరచనమును గూర్చియు న్యాయదర్శనమేమి చెప్పనో

(౧) సిద్ధాంతముక్తావళి, పుటలు ౭౯, ౮౦. వారినిర్వచనయు వేరుగా నున్నను, పూర్వోత్తరమీమాంస లుపమానమును స్వతంత్రప్రమాణముగా నంగీకరించిరి. అరణ్యములో నొకగవయమును మనముచూచినప్పుడు, మనకుఁ దెలిసిన గోరూపమునందుఁ జూచుటేకాక, గవయగోసాదృశ్య జ్ఞానమును గాంతుము. ఇది యుపమానవాదము; ఏలన గవయమును జూచినప్పుడు మనము గోవును జూడలేదు.

మనము కొంతచూడనగును. ఆకాశము శబ్దమూలము. ౧. నిర్వాత ప్రదేశమునను శబ్దముదయించును గాని దానిని మనము వినఁజాలము;ఏలన దానిని ప్రసరింపఁ జేయుటకు వాయువులేదు. శబ్దగుణము వాయువుపై నాధారపడదు; శబ్దముయొక్క ఘనత మున్నగునవి దానిపై నాధారపడును. ౨. రెండు ఘనపదార్థముల సంయోగముచే శబ్దముదయించును. ఒక శబ్దమింకొక శబ్దమును, నది వేఱొక దానిని, తుదకేదేనొక యాటంకము వచ్చి దాని నాపువరకు నుదయింపఁజేయును. ౩. అది యగోచరమైన యాధారము కలదగుటచే శబ్దము శాశ్వతమను భావము నంగీకరింపఁ జాలము. ౪. అక్షరముల కూర్పుపదము; అభిధాలక్షణలచే నది

---

౧. "వర్ణము కాని యేయితరగుణములు కాని లేనప్పుడు ధ్వని పరంపర యను వినవచ్చును; అందువలన శబ్దమున కాధారమగు వస్తువదృశ్యము, సర్వ వ్యాప్తమని తెలియుచున్నది. మఱియు శబ్దము, కంపములుగల యాధారమున నుండదు." (న్యా. భా. ౨. ౨. ౩౭.) (౨) వైశేషికసూత్రము. ౧. ౧. ౬. (౩) న్యా. భా. ౨. ౨. ౩౮. (౪) శబ్దము శాశ్వతము కాదనుట కనేకాధారములు చూపఁబడినవి (న్యా. సూ. ౨. ౨. ౧౩-౩౮) (౧) శబ్దమునకారంభము కలదు; అది రెండువస్తువుల సంఘర్షణముచే నుదయించును. ఉ॥గొడ్డలి, చెట్టు. సంఘర్షణము శబ్దప్రకాశమునకు సాహాయ్య మొసగునేకాని, శబ్దము నుదయింపఁజేయు ననుట పొసఁగదేలన, సంఘర్షణమును శబ్దము నేకకాలికములుగావు. సంఘర్షణమైనవెనుక దూరమునుండి యింకను శబ్దమును మనము వినుచున్నాము (౨) శబ్ద మనిత్యమేలన దాని కాద్యంతములు గలవు. అది నిత్యమగుచో నెల్లప్పుడు వినఁబడవలెను; శ్రోత్రమెప్పుడును తెలిసియే యుండును. మఱియు మనకు శబ్ద మాగిపోవుటకుఁ గారణములు తెలియును. మ్రోగుచున్న యినుపనిబ్బె చేతితోఁదాకిన శబ్దమాగిపోవును. (౨-౨.౩౨-౩౭ వైశేషికసూత్రము. ౨. ౨. ౨౬-౩౭) ప్రతిశబ్దమునందు నొక శబ్దపరంపర

యొక వస్తువును దెలుపును, ప్రతిపదమున కొక యర్థము కలదు; అది పదమునకును నది తెలుపు వస్తువునకును గల సంబంధమును సూచించును.౧.

యున్నదనియు, నందలి యుత్తరశబ్దము పూర్వశబ్దమును నాశనముచేయు ననియు వాత్స్యాయనుఁడు చెప్పినాఁడు. తుదిశబ్దమును నాశనముచేయున దొక యాటంకము, చేతితోఁదాకుట మున్నగునది. (న్యా.భా.౨.౨.౩౪) ఒక గుణ మొకగుణములో నుండదనియు, రెండుగుణములకు సంయోగముండ దనియుఁ జెప్పు వైశేషికసిద్ధాంతమున కనుగుణముగా నీసిద్ధాంతము ననంతర నైయాయికులు మార్చిరి. శబ్దమును నాశనముచేయున దాటంకమునకు శబ్దమునకును సంయోగము కాదనియు, శబ్దాధారమగు నాకాశముతోడి సంయోగ మనియు వాచస్పతి చెప్పినాఁడు. ఆకాశముతో దానికంటె దట్టమగు పదార్థ సంబంధముచే శబ్ద మాగిపోవును. ఏలన నట్టిశబ్దము నుత్పత్తిచేసిన కారణము లేకుండుటచే, నవరోధముచేఁ దుదిశబ్ద మాగిపోవుచున్నది. (౩) శబ్దము పరంపరరూపములోఁ బ్రవహించుచున్నదని మన యింద్రియములలో నొకటియే గుర్తించుచున్నది. అది శబ్దజాతికిఁ జెందునుగావున ననిత్యము. (న్యా.సూ.౨. ౨. ౧౬.) (౪) శబ్దమున కుత్పత్తియైన పదార్థములకుండు లక్షణము లున్నవని చెప్పఁబడెను. అది కఠోరము, భయంకరము మున్నగు శబ్దములతో వర్ణింపఁ బడును. (౫) మన యుపాధ్యాయుఁడు చెప్పిన శబ్దములను మఱల నుచ్చరించుచున్న కారణముచే నవి నిత్యములు కావని తెలియుచున్నది. (న్యా.సూ ౨.౨. ౨౯) (౬) శబ్ద మదృష్టమైన కారణమునుండి దాని నిత్యతను నిర్ణయింపరాదు. చలనము నదృష్టమే కాని యది నిత్యము కాదు. (న్యా. సూ. ౨. ౨. ౨౨-౨౪.)

(౧) పోల్చు: సాంఖ్యసూత్రము ౫. ౩౭. విజ్ఞానభిక్షువు. వైయాకరణులైన భట్టోజీదీక్షితులు, (వైయాకరణభూషణము పు. ౨౪౩) నాగేశభట్టు (మంజూష॥ పు. ౨౩-౨౬) శబ్దముల వ్యంజనశక్తి శబ్దములందే యున్నదని చెప్పుదురు. సాంఖ్యవేదాంతము లది విషయములలోఁగూడ నున్నదనును. (పంచదశి॥ ౮ అ. ౪-౧౫; న్యాయబిందు టీక పు. ౧౦-౧౧)

వైయాకరణులు స్ఫోట[2].వాదము ననుసరించి యర్థనిర్ణయముచేసిరి. 'గోవు' శబ్దములోని యేయొక అక్షరమును కాని, అన్నియక్షరములు గాని గోశబ్దార్థము నొసగఁ జాలవేలనఁ బ్రతి యక్షరముచ్చరించుట తోడనే నశించుచున్నది. పూర్వాక్షరసంస్కారములతోఁ దుదియక్షరము కలిసి యున్నను, జ్ఞాన క్రియ కన్నియక్షరములు గలిసినను జాలదు. అక్షరములకంటె వేరైనదేదియో జ్ఞానమునకుఁ గారణమగుచున్నది; అక్షరమో, శబ్దమో, వాక్యమో స్ఫోటశక్తిని ప్రకాశింపఁ జేయుచున్నది[3]. ధ్వనియొక్క శక్తి శబ్దార్థజ్ఞానహేతువగు చున్నది. ఏకాక్షరము, పదము కానిచో, జ్ఞానము నీయఁజాలదు. పదస్ఫోటవాదులొక పదమును, వాక్యస్ఫోటవాదు లొకవాక్యమును నిశ్చితార్థము నీయగలవని వాదింతురు. వాక్యస్ఫోటవాదుల ననుసరించి, వాక్యము భాషకారంభము; వాక్యములోఁ బదములుభాగములు; పదముల కక్షరములు భాగములు, స్ఫోటము నిత్యము, స్వయం ప్రకాశకము; అభిధాభిదేయములకుఁ గలసంబంధమును శాశ్వతమైనది. అక్షరపదవాక్యము లన్నియు నర్థమునావిష్కరించునే కాని యుత్పత్తి చేయవు. న్యాయసిద్ధాంతము ననుసరించి, ప్రతిపదమునకును శక్తి కలదు.[4].పదములోని తుదియక్షరము వినుటతోడనే

---

(౨) పాణిని ౬-౧. ౧౨౩ లో స్ఫోటాయన శబ్దము నుపయోగించుటచే నాతని కాలములో నీసిద్ధాంత మున్నదని తెలియుచున్నది చూడుః సర్వదర్శనసంగ్రహము; పాణినిదర్శనము.

(3) స్ఫోటమనగా భావమని డ్యూసేన్ చెప్పినాడు. అదియొక వ్యాకరణభ్రాంతియని థీబో పండితుడు నుడివినాడు.

(౪) శక్తమ్పదమ్। (తర్కసంగ్రహమ్. పు. ౫౯)

మనకాయర్థము స్ఫురించును, 'గోవు' పదములోని 'వు' అను అక్షరమును విని పూర్వాక్షరమును జ్ఞాపకముంచుకొని, పదమునంతను మనస్సుచే గ్రహింతుము. శబ్దార్థముల మధ్యమందు గల సంప్రదాయసిద్ధమగు భావమునుబట్టి మనము విషయజ్ఞానమును గాంచుచున్నాము. ౧.

శబ్దార్థసంబంధము సహజసిద్ధము కాదు; మనము శబ్దార్థమును గ్రహించుచున్న రీతిననుసరించి యది సంప్రదాయసిద్ధమని తెలియఁగలదు. వాడుకవలనను, వ్యాకరణమువలనను, శబ్దకోశములవలనను, వేదాంతిమునననుసరించి సంజ్ఞ ౨ వలనను మనకు శబ్దార్థజ్ఞానము కలుగుచున్నది. ఏయేమాట కేయే యర్థమోయది యీశ్వరసంకేతమని చెప్పఁబడెను.3. అర్వాచీన న్యాయమును మనుష్యులుకూడ సంకేతములనుగల్పింతురనియు నవి యిచ్ఛామాత్రశక్తిగలవనియు భిన్నమానవుల కల్పనలు భిన్నమానములుగా నుండుననియు నందుచే నవి పారిభాషికములనియుఁ జెప్పఁబడెను.

పదములు వేనినిఁ దెలుపును? ఒక వ్యక్తినా? ఆకృతినా? జాతినా? అన్నిటిని దెలుపునా? ౫ వ్యక్తియనగా నొక నియంత మూర్తిని గలిగి కొన్ని ప్రత్యేకలక్షణములతోఁ గూడి

(౧) (న్యా. వా. ౨. ౨. ౫౫)
(౨) సిద్ధాంతముక్తావళి॥ పు. ౧౫; న్యాయమంజరి పు. ౬
(3) న్యా. భా. ౨. ౧. ౫౫; న్యాయమంజరి. పుట ౨౪3.
(౪) తర్కసంగ్రహము. పు. ౫౯.
(౫) న్యా. సూ. ౨ ౨. ౫౬.

యుండును. ౬. అది ప్రత్యక్షగోచరవిషయము. ౭. మూర్తివైలక్షణ్యముగలది. గళమున వ్రేలాడు తోలు, గోవునకు విలక్షణమైనది. జాతి యొకవర్గము; ఆవర్గమునకుఁజెందిన సామాన్యలక్షణమును సూచించును. మనముచూచు గో వేజాతికిఁజెందునో యాజాతినిఁగూర్చినవిశాలజ్ఞానమునీలక్షణమిచ్చును. ౮. న్యాయసిద్ధాంతమునను సరించి, ప్రతిపద మీ మూడుగుణములను, ప్రదర్శించును; వ్యక్తి, ఆకృతి, జాతి; కాని భిన్నపరిమాణములలోమాత్రమే కావచ్చును. ౧. వ్యావహారికముగా మన మాకృతిని గణింతుము; ఇంకను విచక్షణము వలయుచో మనము వ్యక్తినిజూతుము; దాని సామాన్యలక్షణమే మనము కోరునదైనచో నప్పుడు మనము జాతినిస్మరింతుము. పద మాకృతిని సూచించి,వ్యక్తిని రూపించి జాతిని వ్యక్తీకరించును.

---

(౬) ౨. ౨. ౬౮.

(౭) ౨. ౨. ౬౯.

(౮) సమానప్రసవాత్మికాజాతిః (న్యా. భా. ౨. ౨. ౬౬) విడిగా గోవులను గూర్చికాక, గోత్వమునఁగూర్చిన స్పష్టభావము మనకున్నదిగనుక, దానికి యాథార్థ్యముతో సంబంధముండవలెను.(న్యా.భా. ౨. ౨. ౬౧,౬౬) జాతిలక్షణము ప్రతివ్యక్తిలో సమవాయసంబంధములో నుండునని యుద్ద్యోతకరుఁడు పలికెను. జాతిలక్షణములన్నియు వ్యక్తులలోఁ బూర్తిగానుండునా లేదా యను విషయ మప్రస్తుతము, ఏలన జాతియనగా లక్షణసముచ్చయము కాదు; దీనికిఁ బూర్ణాంశసంబంధ మన్వయించదు. జాతియనునది వ్యక్తులకు సంబంధించిన నిత్యలక్షణము; సమవాయసంబంధములో నున్నది; ఈసంబంధము కాలిక సంబంధము.

(౧) ౨. ౨. ౬౩. జాతివిశిష్టవ్యక్తి.

కేవలశుద్ధమైన అవ్యక్తలక్షణమేమియు నుండదు. ఏదోయొక విధముగా నవియవిచ్ఛిన్నమే యగును. ఆకృతియొక్కటియుం జాలదు. ఒకగోవుయొక్క మృణ్మయాకృతి గోవుకాదు; ఏలన జాతిలక్షణములు దానికి లేవు. పదములు వ్యక్తులను దెల్పునను సిద్ధాంతము వాదుకలోనున్నది. ౨.

బౌద్ధశాస్త్రవేత్తలననుసరించి, శబ్దములు భావాత్మకములగు వస్తువులను దెలుపవు; ఆవస్తువు లితరములను నపోహను బోగొట్టును. 'గోవు' శబ్దము గుఱ్ఱముమున్నగు "గోవు" కాని వను నపోహను దొలగించును. ఇట్టి యపోహానిర్మూలనమునలన గోవుశబ్దము "గోవు"నే తెలుపును. 3. ఉద్ద్యోతకరుఁడీయపోహ సిద్ధాంతమును ఖండించెను. ౧. పూర్వము మనకు భావార్థజ్ఞానము లేనిచో నభావార్థజ్ఞానము కలుగదు. సర్వాభావములకును భావమే యాధారము, శుద్ధాభావమర్థరహితము; విశిష్టమైన

(౨) ౨. ౨. ౫౭.

(3) చూడు: న్యాయమంజరి|| పుట. 3౦3, 3౦౬-౭; పార్థసారథి మిశ్రుని న్యాయరత్నాకరము. పూర్వబౌద్ధగ్రంథము లీవిషయమును స్మరించియుండలేదు; రత్నకీర్తి రచితమగు అపోహసిద్ధిలో సూచీమాత్రముగనున్నది. దీనిననుసరించి పదములు భావములనుగాని వ్యతిరేకములనుగాని చెప్పవు. అన్యవిషయాభావము వలన భావవిషయములుగాని, భావవిషయజ్ఞానమువలన నభావవిషయములుగాని లభింపవు. భావాభావరూపముల నేకకాలమున గ్రహించుటే యుక్త్యర్థరహస్యము. సవికల్పక విషయములన్నియు భావాత్మకములు; అవి యన్యములఁ బరిహరించును. ఈసిద్ధాంత మధికతృప్తికరముగా నున్నది కాని యిది బౌద్ధతత్త్వముతో సమన్వయించుట కనుకూలపడదు. హిందూతార్కికులైనను దీనిని బౌద్ధవాదముగా నంగీకరింపరు.

(౧) న్యా.వా. ౨.౨.౬3.

ప్రత్యభావమునకు భావము గర్భితమై యుండును రెండు పర స్పరవిరుద్ధములైన శబ్దము ల విషయములో నొకదాని యర్థమొకటి పరిహరించినను, 'సర్వము' మున్నగు శబ్దాదులలో నట్టిది పొసఁగదు.౨. ప్రతిశబ్దము నొక భావార్థమును సూచించును ఇతర వస్తుభేదముల నది చెప్పినంతమాత్రమున దీనికి దోషము సంభవించదు.3.

కాని దీనికాక్షేపణ తెలుపఁబడెను. శబ్దములు వస్తువులను దెలుపవు; ఏలన శబ్దములు వస్తువులతో నేకకాలమున నుండవు; ఉ॥ ఒక అభావనిర్ణయము: "ఇచట నొకఘటము లేదు.౪. దీనికి వాచస్పతి సామాధాన మిచ్చినాఁడు, ఒకపద మొక సామాన్యలక్షణమును దెలుపును దేశకాలములందుఁగల వ్యక్తులం దిమిడి యున్నవి; అందుచే నిప్పుడున్న వస్తువులను, పూర్వవస్తువులను గూడఁ బదము సూచించును.౫. పదము కేవల భావకల్పనమనియుఁ జెప్పఁరాదు; ఏలన, నట్టిదైనచో, నది భిన్నవ్యక్తుల భిన్నలక్షణములను దెలుపఁజాలదు. పదము వస్తువులయొక్క విశిష్టలక్షణముల సూచించును. అనుభవములో మనము పదముల నుపయోగించుచున్నాము; మనకుఁ గార్యసిద్ధి చేకూరుచున్నది. పదములు కేవల మానసికరూపములనే

---

(౨) చూడు. ఉదయనుని 'ఆత్మతత్త్వవివేకము'

(3) న్యాయమంజరి. పు.3౧౧; న్యాయకందళి పుటలు 3౧౭-3౨౧.

(౪) ప్రమేయకమలమార్తాండముపు.౧౨౪; వైశేషికసూత్రము ౭.౨.౧౭.

(౫) న్యా.వా.తా.టీక. ౨.౨.౬3.

సూచించి, యింద్రియ గోచరములగు విషయములను దెలుప కున్నచో నెట్టి కార్యసిద్ధి దుర్లభమగును.౧.

అభిధాభిధేయసంబంధము దురూహ్యమని యింకొక వాదమున్నది. పదమొక గుణము; వస్తువొక నిజమగు ద్రవ్యము. రెంటికిని సంయోగసంబంధముండఁజాలదు, వస్తువునొక గుణమే యని తలఁచినను, రెండు గుణములకు సంయోగసంబంధముండదు,౨. పదములు చలనములేనివి; సంయోగమున కొక వస్తువు చలనాత్మకము గావలెను, 'ఆకాశ' పదమును, 'ఆకాశ' ద్రవ్యమును రెండును ప్రవృత్తిలేనివే; రెంటికిని సంయోగముండఁజాలదు, శబ్దార్థములకు సమవాయసంబంధమును లేదు, శబ్దార్థ సంబంధము ప్రాప్తిలక్షణమును లేనిదని వాత్స్యాయనుఁడంగీకరించినాఁడు; 'అగ్ని' పదమువలన 'అగ్ని' ప్రాప్తి లేదు.౩. అందువలననే యింద్రియానుభవముకంటె శబ్దజ్ఞానము తక్కువ స్పష్టమైనది.౪. కాని యది జ్ఞానమే కాకపోదు.

ఒకవాక్య మర్థయుక్తములగు ధ్వనులయొక్క గాని, శబ్దములయొక్క గాని సముచ్చయము. వాక్యమందలి పదముల నెఱిగి, వాని యర్థములను గ్రహించుచున్నాము. పదముల

(౧) ప్రమేయకమలమార్తాండము॥ పు. ౧౩౬; విద్యానందుని అష్టసాహస్రి- పు. ౨౭౯.

(౨) వైశేషికసూత్రము ౭. ౨. ౧౪.

(3) న్యా. భా; న్యా. వా. తా. టీక. ౨. ౧. ౫౦-౫౧.

(౪) ప్రమేయకమలమార్తాండము॥ పుటలు ౧౨౮-౧౩౦; కుమారిలుని సూత్రవార్తికము॥ ౫. ౧౧. ౬-౮, ౧౦.

జ్ఞానము దిగవిడిచిన సంస్కారములను మనము జ్ఞాపకముచేసి కొని, వాక్యాంతమందు భిన్నపదార్థములను గలిపి యేకార్థమునుగాంచుచున్నాము. ప్రాచీన నైయాయికులు శబ్దజ్ఞానమునకు ముఖ్యకారణము శబ్దస్మృతిచేఁ గలుగు వస్తుస్మృతియని చెప్పగా, నభినవ నైయాయికులు శబ్దస్మృతియే ముఖ్యసాధనమని చెప్పు చున్నారు. ఒక వాక్యార్థ మీాదిగువవానిపై నాధారపడియుండును. (౧) ఆకాంక్ష; అన్యోన్యావసరము లేక ఆధారము; అనగా నింకొక పదసాహాయ్యము లేనిదే నిశ్చితార్థము నొక పదము ప్రకటింపఁజాలకుండుట (౨) యోగ్యత; అనగా నౌచితి లేక అర్హత లేక వాక్యార్థముతో నానుకూల్యమును గలిగి యుండు శక్తి; వాక్యార్థము నిష్ప్రయోజనముకాకుండఁ జేయు సామర్థ్యము. (౩) సన్నిధి; పదముల సన్నిహితక్రమము. ఇవి పదములయొక్క వ్యాకరణ, తార్కికోచ్చారణ సంబంధములు. మనుజుఁడు, గుఱ్ఱము, సామంతదేశము మున్నగు పదసముచ్ఛయములన్యోన్యాధార శూన్యములగుచో నర్థశూన్యములగును. 'అగ్నినాసించేత్' 'నిప్పుచేఁ దడుపుము' మున్నగు వాక్యముల కుచితార్థ ముండదు. అట్లే విశేషకాలవ్యవధిగలిగి పలుకు పదములకు నర్థముండదు. అన్యోన్యాధారములు, పరస్పరానుకూల్యములు, సాన్నిధ్యమును గలిగిన పదములతోఁ గూడినదే సరియగు వాక్యము. వక్తయొక్క యుద్దేశము నాలుగవ లక్షణమని గంగేశుఁడు చెప్పినాఁడు. 'సైంధవమునుదెమ్ము' వంటివాక్యము 'అశ్వమునుదెమ్మ'ని కాని 'లవణమునుదెమ్మ'ని కాని యర్థమునిచ్చును. ఇందేది నిశ్చితార్థమో వక్తహృద

యము నెఱిఁగినచో మనము నిర్ణయించవచ్చును. ఒక నిశ్చితార్థమునుజెప్పు సామర్థ్యము పదముల కుండవలయుచో నీ లక్షణముకూడ నవసరము.౧. యోగ్యత పదానుగుణ్యమును గోరుచోఁ, దాత్పర్యజ్ఞాన మర్థానుగుణ్యమును గోరును.౨.

ప్రతిపాదనములు మూఁడు విధములు.(౧) విధి (౨) నిషేధము (3) అర్థవాదము లేక హేతువివరణము.3. శబ్దము జ్ఞానసాధనార్థములో నాప్తోపదేశము.౧. ఆప్తుఁడనగా నొక విషయములో సర్వజ్ఞుఁడు; "ఒకవిషయములోఁ బ్రత్యక్షజ్ఞానము కలిగి, యితరులకుఁ దెలియు నిమిత్తము దానినందఁ జేయువాఁడు. అట్టి వ్యక్తి లేజాతికే వర్ణమునకైనను జెందవచ్చును, వారు ఋషులు, ఆర్యులు, మ్లేచ్ఛులుగావచ్చును.౨. ఒక యువకుఁడొకనది దాట శక్యమైనదా యని సందేహించునప్పు డాదేశమందలి యనుభవసిద్ధుఁడగు నొక వృద్ధుని వాక్యము నాప్తవాక్యముగా విశ్వసింపవచ్చును.

ఆప్తవాక్యములు దృష్టార్థములను, అదృష్టార్థములను జెప్పును. క్వైనా జ్వరమును బోగొట్టునను నది దృష్టార్థము.

(౧) భాషాపరిచ్ఛేదము; మఱియుఁ జూడుః వేదాంతపరిభాష. ౫౪.

(౨) మీమాంసకులును వైయాకరణులు నొకవాక్యములోని పదములకుఁ గేంద్రము క్రియయని చెప్పఁగాఁ, గ్రియయున్నను లేకున్నను నొక ప్రతిపాదనార్థ మర్థవంతములగు పదసమూహమని నైయాయికులు భావించినారు. (తర్కసంగ్రహముః పుట ౧౯; (ప్రభాకరశాఖ పు. ౬3.)

(3) న్యా. సూ. ౨. ౧. ౬3; తర్కకౌముది॥ పు. ౧౭.

(౧) ౧. ౧. ౭.

(౨) న్యా. భా. ౧. ౧. ౭.

ధర్మమువలన స్వర్గప్రాప్తి లభించు ననునది నదృష్టార్థము. ఋషివాక్యములదృష్టార్థములఁజెప్పును.3. వ్యవహారప్రపంచ ములో వారివాక్యములు సత్యములని ఋజువగుచున్నవి కావున, వారొసఁగిన యదృష్టార్థములు నట్టివేయని నమ్మవలెను. వేద మంత్రద్రష్టలు మనకాప్తులు; ఏలన, వారు సత్యద్రష్టలు,మాన వకోటి యెడ వారికమేయకృపగలదు; అందుచే వేదములను వారు మానవజాతికిఁ బ్రదానమొనర్చిరి.४.

అనంతరనైయాయికులు, ఉదయనుఁడు, అన్నంభట్టు, వైశేషికతత్త్వవేత్తలు వేదములకుఁగర్త పరమేశ్వరుఁడని నమ్మిరి. వేదప్రామాణ్యమునకుఁగారణములుగానవిశాశ్వతములగుటయు, నిర్దుష్టములగుటయు, మహర్షు లంగీకరించుటయు ననువాదము నుదయనుఁడు తిరస్కరించినాఁడు, నూతన మహాయుగా రంభమున వాని నంగీకరించుటకు మహర్షులుండరు. మీమాం సకుల వేదశాశ్వతత్వవాదము నుదయనుఁడు ఖండించి, వేదముల కవిచ్ఛిన్న పారంపర్యము లేదనియు దానికిఁ గారణము ప్రతి కల్పమునను నూత్నప్రపంచ ముదయించుచున్నదనియు నాతఁడు చెప్పినాఁడు, కాని వాత్స్యాయనుఁడు వేదములు శాశ్వత ములని యంగీకరించెను; కల్పాంతమందు భగవంతుఁడు పునః సృష్టి చేసినపుడెల్ల వేదములను గూడ యథావిధిగాఁ గల్పించి పారంపర్యమును నిలుపుచున్నాఁడు.౧. వేదములు నిత్యముల

(3) న్యా. భా. ౧. ౧. ౮.

(४) ౨. ౧. ౬౮.

(౧) న్యా. భా; న్యా. వా. తా. టీక ౨. ౧. ౬౮.

నియు, నవి ఋషికల్పితములు గాక ఋషిదృష్టము లనియుఁ బ్రమాణములను మీమాంసకులు చూపఁగా, వేదముల కాదియున్నదనుట కాధారములను గొన్నిటిని నైయాయికులు జూపుదురు.౨. మఱియు వేదములలోఁ గర్తను సూచించు కొన్ని వాక్యములు గలవు.

అనృతవైరుధ్య పునరుక్త్యాది దోషములు వేదములకు లేవని నిరసింపఁబడెను.౩. వేదమంతయు నొక సమగ్రమగు గ్రంథమగుటచేఁ బ్రమాణమని వాదింపఁబడెను. వేదప్రామాణ్యము నంగీకరించుటచే నంధవిశ్వాసము నంగీకరించుట కాఁజాలదు.

శబ్దప్రమాణ మొక స్వతంత్రప్రమాణముకాదని దిఙ్నాగు నభిప్రాయము. మనము విశ్వసింపఁదగిన వాక్యమనగా, నా వాక్యమును బలికిన వ్యక్తి నమ్మఁదగినవాఁడనికాని, వాఁడు పలికిన వాక్యార్థము విశ్వాసపాత్రమని గాని గ్రహింతుము. మొదటి దనుమానసిద్ధము; రెండవది ప్రత్యక్షసిద్ధము.౪. శబ్దప్రమాణ మనుమానమువంటిదే, యేలన నదియొక వస్తువు యొక్క జ్ఞానము నొక సంజ్ఞచేఁ దెలుపును; కాని యిచటి

(౨) ఇదంసర్వమసృజత ఋచోయజూంషిసామాని॥

(3) మనము పుత్రకామేష్టి చేసి పుత్రునిఁ బడయకున్నచోఁ గర్మ చేయుటలో లోపముండునుగాని, వేదమంత్రములో నుండదు. సూర్యోదయాత్పూర్వముకాని అనంతరముకాని హోమము చేయుమనువానిలో వైరుధ్యము లేదు. అనవసర పునరుక్తియునులేదు. (న్యా.భా. ౨.౧.౫౭ ౬౮)

(౪) బుద్ధవాక్యములు ప్రమాణములని దిఙ్నాగుఁ డంగీకరించును... చూడు: కుమారిలుని తర్కసంగ్రహము. పు. ౧౬౯.

సంజ్ఞ అనుమానములోని సంజ్ఞవంటిదికాదు; ఏలన నిచట పలికిన వాక్యములు విశ్వాసపాత్రుఁడైనవాఁడు పలికినవా కావా యనుదానిని దెలుపును.౧. సంజ్ఞా సంజ్ఞి సంబంధ మనుమాన ములో సహజమైనది. కాని యది శబ్దజ్ఞానమునందు సంప్రదా యసిద్ధమైనది.౨. పదార్థజ్ఞాన స్మృతివలన శబ్దజ్ఞాన ముదయించు నని మన మంగీకరించినయెడల, నది యనుమానమగును. అప్పుడు సంశయజ్ఞానమును, ఉపమానవిహిత జ్ఞానమునుగూడ ననుమానసిద్ధములని మన మంగీకరింపవలసివచ్చును. కాలత్రయ సంబంధి యగుటచే శబ్దజ్ఞాన మనుమానసిద్ధమైనచో, నవుడు తర్కాదివాద రూపములు ననుమానసిద్ధములే యనవలసి వచ్చును. శబ్దజ్ఞానము మన కన్వయవ్యతిరేకి భావానుగుణ్యతచే నేర్పడునన్నచో, ననగా 'ఘటమ'నగా వస్తుజ్ఞానము, దానిని బలుకకున్నచో నట్టి వస్తుజ్ఞానము లేకుండుటయు నైనచో నప్పుడు ప్రత్యక్షము నొకవిధమగు ననుమానమేయని చెప్ప వచ్చును; ఏలన ఘటమున్నచోట నదియున్నది; లేనిచోట లేదు.3. అందుచే శబ్దములవలన లభించు జ్ఞానము ప్రత్యక్షాను మానోపమానములవలన లభించు జ్ఞానముకంటె వేరైనది.౪.

(౧) న్యా. భా. ౨. ౧. ౫౨.

(౨) న్యా. భా. ౨. ౧. ౫౫.

(3) న్యా. వా. ౨. ౧. ౪౯-౫౧.

(౪) న్యా. భా. ౨. ౧. ౫౨; న్యా. వా. ౧. ౧. ౭.

## ౧౩ – ఇతర జ్ఞానరూపములు.

నైయాయికు లంగీకరించిన ప్రమాణచతుష్టయమును గాక, మీమాంసకు లర్థాపత్తిని, భాట్టులును వేదాంతులును 'అభావము'ను గూడఁ బ్రమాణములుగా నంగీకరించిరి. పౌరాణికులు సంప్రదాయమును, కార్యసిద్ధ్యవకాశమును గూడఁ బ్రమాణములనిరి. కాని యివన్నియు నాలుగు ప్రమాణములలోఁ జేరునని నైయాయికమతము.౧.

ఐతిహ్యము లేక సంప్రదాయము శబ్దప్రమాణములోనిదే.౨. ఒక విశ్వాసపాత్రునిచే సంప్రదాయమారంభమగుచో నది శబ్దతుల్యప్రమాణమే. అర్థాపత్తియనగా నొక సత్యాంశము నింకొక దానిపై నాధారపడి గ్రహించుట. మనము చూడని విషయమును జూచిన విషయమువలనఁ దెలియుట. బలిష్ఠుఁడగు దేవదత్తుఁడు పగలు భుజించఁడు, ఎవ్వఁడును భుజించకున్న బలిష్ఠుఁడు కాఁజాలడు కావున దేవదత్తుఁడు రాత్రి భుజించుచున్నాఁడని తలఁపవలెను. దీనిని మీమాంసకులు స్వతంత్రప్రమాణముగా నంగీకరింతురు కావున దీని నసంయుక్త ప్రతిపాదనరూపక తర్కవాక్యమనిరి.౩. గంగేశు ననుసరించి, యిది అభావాత్మకానుమానము; ఇదియున్న తాంగ లోపమువలన మధ్యమాంగ లోపమును స్థాపించును. భాషాపరిచ్ఛేదము ననుసరించి, యిది

(౧) న్యా.భా.౨.౧.౧౯.
(౨) ౨. ౨. ౨.
(౩) భాషాపరిచ్ఛేదము, పు. ౧౪౩.

వ్యతిరేకవ్యాప్తి లక్షణముగలది.౪. ఒక పూర్ణమునుండి తదంగమగు భాగమును గ్రహించుట సంభవమందురు.ఇది సామాన్యమునుండి విశేషమును గ్రహించు వాదపద్ధతి.ఇది కేవల పరిగణనాత్మకము. అభావము స్వతంత్రప్రమాణమని కొన్ని చోటులఁ దెలుపఁబడెను, అభావమొక జ్ఞానవిషయముగా నంగీకరించియు, దానిని గ్రహించుట కొఱకు ప్రత్యేకప్రమాణావసరమున్నదని న్యాయ వైశేషికులంగీకరింపరు. అస్తిత్వమొక ప్రత్యక్ష విషయమనియు, నది దాని యధికరణములో విశేషణతాసంబంధమును గలిగి యుండుననియు మన మిదివఱకే చూచియుంటిమి. అభావము కూడ దాని యధికరణమువలె సమాన సత్యాత్వముగలదే. ఏలన నధికరణ దర్శనముచే నభావమును జెప్పఁజాలకుందుము, పూర్ణాభావ మనూహ్యము, జ్ఞానవిషయమగు నభావమనిత్యమైనది.౧.

అనుమానము వలన వస్తువుల అభావమును మనము గ్రహింపఁగలము. అభావమనగాఁ గేవలము లేకుండుటకాదు;

---

(౪) దీనిని రెండు ఘట్టములలోఁ జెప్పవచ్చును:
ఎవఁడేమియుఁ దినఁడో యాతఁడు బలిష్ఠుఁడు కాఁడు.
ఈతఁడు బలిష్ఠుఁడు; అందుచే నీతఁడసలే తిననివాఁడు కాఁడు.
అనగా నీతఁడు తినువాఁడే, రెండవ ఘట్టము:—
ఎవఁడుతినునో యాతఁడు పగలైన రాత్రియైనఁ దినవలెను.
ఆతఁడు పగలు తినఁడు
అందుచే నాతఁడు రాత్రి తినును.

(౧) భిన్నభావమునకుఁ జూడు. శాస్త్రదీపిక. ౧. ౧. ౫; వేదాంత పరిభాష ౬౬.

వ్యతిరేకభావమే, ఉన్నదానికి లేనిదానికి గల సంబంధమేయది;
వర్షాభావము, మేఘములకును మహామారుతమునకును గల సం
బంధమును మనకుఁ దెలియఁజేయును; ఏలన మహావాయుమేఘ
సంబంధమే వర్షబిందుపతనమున కాటంకమును గలుఁగ జేయు
చున్నవి; అట్టియాటంకము లేనిచో వర్షబిందువులు భూమ్యా
కర్షణశక్తిచే భూమిపైఁబడి యుండును.౨. రెండువ్యతిరేఖ భావ
ములున్నప్పుడు, ఒకదాని యభావము రెండవదాని భావమును
దెలుపును. న్యాయతర్కపద్ధతి యిట్టి ద్వివర్గవిభాగనూత్రము
ననుసరించును. సమానాసమాన ప్రతిపాదనములీ విభాగముపై
నాధారపడియున్నవి. రెండు వ్యతిరేకవాక్యములు, రెండును సత్య
ములునుగావు రెండు నన్మృతములుగాఁజాలవు, 'ఎ' 'బి' యగును
'బి' కాకపోవును, ఈవ్యతిరేక వాక్యములలో నేదో యొకటి
యధార్థముగా వలెను; ఏలన మూడవ మార్గమున కవకాశము
లేదు.3. ఒక వస్తువుయొక్క భావమునుండి యింకొకవస్తువు
యొక్క అభావమును మన మనుమానించునెడల, నది యను
మాన జ్ఞానమగును.౧. వాత్స్యాయనుఁడు నుడివినాఁడు; "ఉన్న
వస్తువు నెఱిఁగిన కాలమందే, లేని వస్తువునెఱుఁగ కున్నాము;
అనగా లేని దాని నెఱుగకుండుటయు,నున్నదాని నెఱుగటయు
నేకకాలమందే జరుగుచున్నది. దీపము వెలుగునప్పుడేది కన్ప
ట్టునో యది యున్నది; దానివలె నేదికన్పట్టదో యది లేనిది.

(౨) న్యా భా. ౨. ౨. ౧.

3) పరస్పర విరోధేహి నప్రకారాంతరస్థితిః (కుసుమాంజలి. 3.౮.)

(౧) న్యా. భా. ఉపోద్ఘాతము.

మానసికావస్థ లిట్లుండును; వస్తువున్నచో నది గోచరించును; అది గోచరింపలేదు కావున లేనిదే.౨. ప్రశస్తపాదుఁడీ భావముతో నేకీభవించెను. "కార్యము కన్పట్టుటచేఁ గారణమున్నదని సూచించును; అదృష్టకార్యము కారణాభావమును సూచించును".౩. శబ్దప్రమాణము వలనఁ గూడ మనకభావజ్ఞానము లభించును.౪.

౧౪-తర్కము - వాదము.

తర్కమునందు మనమొక తప్పగు ప్రతిపాదనముతో నారంభించి, దానివలన నెట్టిదోషములు సంభవించునో చూపుదుము. ఆత్మ నిత్యముకాకున్నయెడల,నది పూర్వకర్మఫల మనుభవింపఁజాలదు; పునర్జన్మము లేనిదగును; మోక్షమునొందఁజాలదు. అందుచే నాత్మ నిత్యము. దోషయుక్తమైన హీనాంగము నంగీకరించుటతో దోషయుక్తమైన యున్నతాంగము నంగీకరింపవలసివచ్చును.౫. తర్కమితరవాదములవంటిదికాదు, ఇందుఁ బ్రత్యక్షాధారము లేదు. ఇది పరోక్షమార్గమున యథార్థజ్ఞానమునిచ్చును.౬. ఇది సవికల్పక జ్ఞానము నీయదనియు, నొక ప్రతిపాదనమునకు వ్యతిరేకమైన దసాధ్యమనిమాత్రమే సూచిం

---

(౨) న్యా. భా. ౨. ౨. ౨.

(౩) ప. ప్ర. పు. ౨౨౫ మఱియుఁజూడుః వై. సూ. ౯. ౨. ౫; న్యాయకందళి. పుటలు ౨౨౫-౨౨౬; కుసుమాంజలి. ౩. ౨౦, ౨౨, ౨౬.

(౪) అనుపలబ్ధి పదునొకండువిధములని జయంతుఁడు చెప్పెను.చూడుఁ న్యాయమంజరి. పు. ౫౬-౫౭.

(౫) సర్వదర్శనసంగ్రహము. ౧౧ అ.

(౬) ప్రమాణగ్రాహకాస్తర్కః ॥

చుననియు వాత్స్యాయనమతము[2]. ఈవాదమువలన నాత్మ యనాది యని మనకుఁ దెలియదనియు, నాత్మ యనాది కావల యునని మాత్రమే తెలియుననియు నుద్ద్యోతకరు నభిప్రాయమై యున్నది.[1]. తర్కము స్వయముగా నొక జ్ఞానప్రమాణము కాదుకాని, ప్రతిపాదనముల సూచించుట కుపయోగించును.

ప్రాచీన న్యాయము పదునొకండు విధములగు తర్కమును వివరించెను; అభినవన్యాయము వాని నైదుగాఁ గుదించెను. అందు ముఖ్యమైనది మనము వ్యర్థవాదమని చెప్పు ప్రమాణబాధితార్థ ప్రసంగము. ఆత్మాశ్రయము; అన్యోన్యాశ్రయము, చక్రికము; అనవస్థము, మిగిలిననాలుగు తర్కరీతులు.

వాదము తర్కవాక్యములను స్వేచ్ఛగా నుపయోగించి సత్యమును నిరూపించుటకు యత్నించును. కాని యీపద్ధతి తరచుగా జల్పములోనికి దిగును. వాదమునందు జయించుటే లక్ష్యమై, వితండవాదముగాఁగూడ మారును.[2]. అట్టి వ్యర్థవాదమును దొలగించుటకుఁ బ్రతిశక్తి దోషమును జూపి యాతఁడు తన యపజయము నంగీకరించునట్లు చేయవలయును.[3].

(2) న్యా. భా. ౧. ౧. ౪౦.

(౧) న్యా. వా. ౧. ౧. ౪౦.

(౨) ౧. ౨. ౧–3.

(3) అపజయములేక నిగ్రహస్థానమున నిరువదిరెండు భిన్నాంశము లున్నవి.

(౧) ప్రతిజ్ఞాహాని; చేసిన ప్రతిజ్ఞను విడుచుట (౨) ప్రతిజ్ఞాంతరము; నూతనప్రతిజ్ఞను గొనిఁచ్చుట (3) ప్రతిజ్ఞావిరోధము-ఆత్మవిరుద్ధప్రసంగము (౪) ప్రతిజ్ఞాసమన్యాసము లేక ప్రతిజ్ఞనుదిరస్కరించుట (౫) హేత్వంతరము

### ౧౫—స్మృతి.

జ్ఞానమంతయు రెండువర్గములుగా నుండును. అనుభవము: అనగాఁ బ్రత్యక్షజ్ఞానము; ఇందుఁ బూర్వజ్ఞానము పునః ప్రకటితముకాదు. రెండవది స్మృతి; పూర్వానుభవమును తిరిగి స్మరించుట.౧. మనము స్మృతిజ్ఞానమును విడిచిపెట్టినచో గతానుభవమంతయు వ్యర్థమగును. స్మృతిజ్ఞానము సంస్కారజన్యము. స్మృతియనగా, "నాత్మతో మనస్సునకును సంస్కారమునకు నొకవిధమైన సంయోగమువలన" నుదయించునది.౨. అది కేవల సంస్కారమాత్ర జన్యమేయనియు, నందుచేఁ బ్రత్యభిజ్ఞాజ్ఞానమునకు భిన్నమైనదనియుఁ జెప్పఁబడెను. సంస్కారము మన స్మృతికి ముఖ్యకారణమైనను, మనమిప్పుడు చూచుచున్న వస్తువునకును బూర్వమున్న యింకొక వస్తువునకునుగల తాదాత్మ్యమును గుర్తించుటవలనఁ బ్రత్యభిజ్ఞ లభించుచున్నది. స్మృతిజ్ఞానము స్వతంత్రజ్ఞానమని న్యాయ మంగీకరించదు. ఏలన

---

(౬) అర్థాంతరము (౭) నిరర్థకము (౮) అవిజ్ఞాతార్థము (౯) అపార్థకము (౧౦) అప్రాప్తకాలము అనగా వాదక్రమమును విడుచుట (౧౧) న్యూనము అనగాఁ గొన్నివాద సోపానములను విడుచుట (౧౨) అధికము (౧౩) పునరుక్తము (౧౪) అననుభాషణము అనగా మౌనము (౧౫) అజ్ఞానము (౧౬) అప్రతిభ (౧౭) విక్షేపము, రోగాదికారణములు నటించి వాదము మానుట (౧౮) మతానుజ్ఞ, అనగాఁ బ్రతివాదియుఁ దానును గూడ నోడినట్లు నటించుట (౧౯)పర్యనుయోగ్యోపేక్షణము; అయోగ్యమగుదానిని జూడకుండుట (౨౦) నిరనుయోగ్యానుయోగము; యోగ్యము గుదానిని నిందించుట (౨౧) అపసిద్ధాంతము (౨౨) హేత్వాభాస.

(౧) తర్కసంగ్రహము. పు. 3౪.

(౨) వైశేషికసూత్రములు ౯. ౨. ౬.

నిచట వస్తుజ్ఞాన మేమియునుండదు. పూర్వానుభవములోనిది, యిప్పుడు లేనిదియు నగు నొకటే యే క్రమములో నెట్టిరూపములోఁ దటస్థించెనో యట్టి క్రమములోను రూపములోను దిరిగి స్మరింపఁబడుచున్నది.[3] స్మృతిజ్ఞానము యొక్క యాథార్థ్యము దానికి హేతువైన పూర్వానుభవ యాథార్థ్యముపై నాధారపడును. స్మృతిజ్ఞాన మేయితరజ్ఞానముచేతను బ్రతిహతము కాకున్నచో యథార్థమైనదేయని కొందరు న్యాయవేత్తలు చెప్పినారు.[4] ప్రణిధానమును, లింగాది జ్ఞానము నేక కాలమందుండవు కావున స్మరణపరంపర లేక కాలమందుండవు.

## ౧౬ – సందేహము

సందేహావస్థ యీదిగువకారణములచే నుదయించును; అనేక వస్తువులకు సామాన్యములగు లక్షణములను స్మరించుట.

(౩) న్యాయసూత్రవృత్తి. ౧. ౧. ౩.

(౪) తర్కసంగ్రహము॥ పు. ౭.

(౧) న్యా.సూ.౩.౨.౩౩; న్యా.భా.౩.౨.౨౫-౩౦; న్యా.వా.౩.౨.౨౫ ౨౬. స్మరణకారణము లీవిధముగాఁ జెప్పఁబడెను. (౧) ప్రణిధానము (౨) నిబంధము (౩) అభ్యాసము (౪) లింగము (౫) లక్షణము (౬) సాదృశ్యము (౭) పరిగ్రహము (౮) ఆశ్రయాశ్రితబంధము (౯) ఆనంతర్యము (౧౦) వియోగము (౧౧) ఏకకార్యము (౧౨) విరోధము (౧౩) అతిశయము (౧౪) ప్రాప్తి (౧౫) వ్యవధానము (౧౬) సుఖదుఃఖము (౧౭) ఇచ్ఛాద్వేషము (౧౮) భయము (౧౯) అర్థిత్వము (౨౦) క్రియ (౨౧) రాగము (౨౨) ధర్మము (౨౩) అధర్మము. ఇవి సూచకములే కాని సంపూర్ణములు కావని వాత్స్యాయనుని భావము, నిదర్శనం చేదమ్ స్మృతిహేతునామ్ నపరిసంఖ్యానామ్ ఇతి (న్యా.భా. ౩.౨.౪౧) భావస్మరణ సంబంధకారణము లన్నియు నీవర్గములోనికిఁ జేరును.

మనము సంధ్యాకాంతిలో నొక యెత్తైన వస్తువును జూచి, అది యొక మనుజుఁడో, యొకస్తంభమో తెలియకసంశయింతుము; ఏలన నున్నతి రెంటికీ సమానలక్షణము. (౨) ఏవస్తువులకును సామాన్యములు' గాని లక్షణములు గుర్తించుట; ఒకధ్వని నిత్యమా కాదా యను విషయము మనము నిర్ణయింప లేనప్పుడు; ఏలన నది యనిత్యములైన మానవునిలోఁ గాని పశుపక్ష్యాదులలోఁ గాని బయల్వెడలి యుండదు; నిత్యములైన యణువుల నుండియు. నది రాలేదని తెలియును. (3) పరస్పరవిరోధసాక్ష్యము: ఆత్మస్వరూపమునుగూర్చి సమాన సామర్థ్యముగల యిరువురు తత్త్వవేత్తలు భిన్నభావములు ప్రదర్శించుట (౪) దర్శన లోపము,మనము జలమును జూచినప్పుడది నిజముగా జలమా, మృగతృష్ణాజలమా యని సంశయము గలుగ వచ్చును; ఏలన జలము రెంటికి లక్షణమే. (౫) దర్శనాభావలోపము; అనగా దర్శనలోపమునకు వ్యతిరేకమైనది.౨. (౪) (౫) లు రెండును సంశయమునకుఁ గారణములు గావనియు, సమానలక్షణముల నసమగ్రముగాఁ జూచుట యను లోపముండవలె ననియు నుద్ద్యోతకరుఁడు భావించెను. మనము చూచిన లక్షణము పెక్కువస్తువులతో సంబంధము గలిగి యుండుటచే రెండు రకముల భావముల నుదయింపఁజేయును; ఆరెంటిమధ్యమున మానస మాందోళనము పొందును; అదియే సందేహకారణమగును.3.

---

(౨) తర్కసంగ్రహము, పు.౬౪; వైశేషికసూత్రము. ౨.౨.౧౭

(3) డోలాయమానా ప్రతీతిస్సంశయః (గుణరత్నుని షడ్దర్శనసముచ్చయవృత్తి.

చూచిన దానితో నేభావమును సరిపడదు.౮. సందేహ ముదయించి, అశాంతిని గలిగించి, క్రియోత్సాహభంగమును గలుగఁ జేయును.౯. రెండు భావములలో నొక భావము నణఁచివేసి, మనమొక భావమువైపు మనసు త్రిప్పినచో మన కూహలభించును; అనగా నొక నిర్ణయమును దాత్కాలికముగా నంగీకరింతు మన్నమాట.౧. ఒక భావము నణఁచుటకుఁ గారణము రెండవ భావముయొక్క విశేష సామర్థ్యమే. మనమొక వరిపొలములో నొక యెత్తైన రూపమును జూచినపు డది యొక మానవుఁడని నిర్ణయింతుము; ఏలన నెత్తైన స్తంభము వరిపొలములో నుండుట కవకాశము లేదు, సందేహావస్థలో రెండు పక్షములు సమానప్రాబల్యము గలిగి యుండగా, నూహలో నొక దానికంటె నొకటి యెక్కువ ప్రాబల్యమును సూచించును.

అనధ్యవసాయము లేక మఱపు వేఱొక సందేహావస్థ యని చెప్పఁబడెను. మనమొక చెట్టునుజూచి, దాని పేరుమఱచి "దీని పేరే మైయుండు" నని ప్రశ్నించుకొందుము.౨. శివాదిత్య

(౮) అనేకవ్యతిరేకభావజ్ఞానము సంశయావస్థకుఁ గారణమని కాగాక్షి భాస్కరుని నిర్వచనము. తర్కకౌముది; ఏకస్మిన్ ధర్మిని విరుద్ధనానాకోటికమ్. జ్ఞానమ్. పు.౭.పోల్చు. తర్కసంగ్రహము పు.౭౮; భాషాపరిచ్ఛేదము. పుటలు ౧౨౯-౩౦)

(౯) బాహ్యాంతరంగిక సందేహములు రెండువిధములని ప్రశస్తపాదుని భావము. (౧ ప ప్రి.పు. ౧౭౮.)

(౧) సప్తపదార్థి॥ పు. ౬౮.

(౨) చూడు: సప్తపదార్థి॥ పు. ౬౯. పోల్చు: మితభాషిణి. పుట ౨౬. కిమ్ సంజ్ఞకోఽయమితి అత్రాపి, కుతః పనసోవేతి, వికల్పస్ఫురణాత్ అనధ్యవసాయోఽపి సంశయ ఏవ॥

ననుసరించి, మన కిచటను రెండుపక్షము లున్నవి. అవి ప్రత్యక్షముగా లేకుండవచ్చును; ఉన్నచో సందేహావకాశమున్నది. ప్రశస్తపాదుఁడు, శ్రీధరుఁడు, ఉదయనుఁడు వేరొకరీతిగాఁ జెప్పిరి. అది పరిచితవస్తువుయొక్క కాని, అపరిచవస్తువుయొక్క గాని అస్పష్టదర్శనము; ఏలన మఱపువలనఁగాని, యింకను దెలియఁగోరుటచేఁ గాని యిట్టిది సంభవించును. మనదృష్టిలో నొక పరిచితవస్తువు పోవుచుండగా, నన్యమనస్కులమై యుండుటచేఁ గాని, యశ్రద్ధవలనఁగాని దానిని మనము సరిగాఁజూచి యుండము. ఇచట ననధ్యవసాయ మున్నది; మనయెదుట నేదోయొకటి పోవుటఁ జూచితిమికాని, అదియేదో చెప్పఁజాలము. ఒక యపరిచితవస్తువై, దానినామము మన మెఱుగనిచో మన కసంపూర్ణ జ్ఞానావస్థ యగును; ఇది సందేహము కంటె వేరైనది.3.

సందేశ మన్వేషణకుఁ బ్రోత్సాహజనకము. ఏలన నది మనకుఁ దెలియనిదానినిఁ దెలియు కోర్కె కలిగించును. అది యనుమానమునకుఁ బూర్వస్థితి; ప్రత్యక్ష శబ్దజ్ఞానములకుఁ బూర్వస్థితి కాకపోవచ్చును. మన జ్ఞానము సమగ్రమైనచో సందేహము నశించును. సందేహమనగా విపర్యయముగాదు. ఒక వస్తువునుగూర్చి స్పష్టమైన జ్ఞానము మనకు లేదని మన మెఱిగినంతకాలము మనకు సరియైన జ్ఞానమనగాఁ బ్రత్యయజ్ఞానమున్నది. సందేహ మసమగ్రజ్ఞానము; విపర్యయము సదోషము.

(3) ప. ప్ర. పుటలు ౧౭౭-౭౮.

## ౧౭—దోషములు.

న్యాయశాస్త్రము మనకు జ్ఞానసాధనములగు సూత్రావళిని వివరించును. అది ప్రకృతిశాస్త్ర దృక్పథము ననుసరించును. ఇది నిర్వచించు సూత్రములు జీవితానుష్ఠానమునకు నియమములుగావు. మానవుఁడు తన బుద్ధ్యవసరతృప్తికై చేయు ప్రయత్నముల పరిశీలనములఁగూర్చి చెప్పిన సామాన్యనియమములు. సామాన్యముగా జ్ఞానము నిర్దుష్టము; దోషమనుకొనని సంభవము; నిర్దుష్టజ్ఞానోత్పత్తి కవసరములగు పరిస్థితులలోని లోపమువలన సంభవించును. సహజములైన జ్ఞానప్రవృత్తుల కాటంకములు గలిగినపుడు దోషము లుదయించును. న్యాయము దోషములఁగూర్చి విశేషవివరములఁ జర్చించును. విజ్ఞానమునకు విపర్యయదోషము పట్టునవకాశ మధికముగా నుండుటచేతనే తర్కశాస్త్ర ముద్భవించు టవసరమైనదనుటలో నాశ్చర్యము లేదు.

కుతార్కికుల మాయలనుండి రక్షణమిచ్చునదే తర్కశాస్త్రము గావునఁ బదచమత్కార చాతుర్యములఁ గూర్చి విశేషశ్రద్ధ చూపఁబడెను. మూడురకముల ఛలోక్తులున్నవి. (౧) వాక్ఛలము, వ్యంగ్యార్థముగల పదము నుపయోగించి వక్తృభావమునకు వేరైన భావము శ్రోతకుఁ దోఁచునట్లు చేయుట. "ఈ పిల్లవాఁడు నవకంబళుఁడ"ని చెప్పునప్పుడు "నూత్నకంబళము" గలవాఁడనియుఁ 'తొమ్మిది కంబళములు' గలవాఁడనియు నర్థమువచ్చును. (౨) సామాన్యఛలము. ఒక వ్యక్తిని గూర్చిన లక్షణమును జాతికంతకు నున్నదని చెప్పుట.

"ఈ బ్రాహ్మణుఁడు పండితుఁడు. యోగ్యుఁడు" నని చెప్పఁగాఁ, గుతార్కికుఁడు, 'బ్రాహ్మణులందరు నట్టివారుకారని యాక్షేపించును. (3) ఉపచారఛలము. ఆలంకారికార్థము, వాచ్యార్థముగా గ్రహించుట. "ఉరికంబములు మొఱలిడుచున్నవ" నగాఁ నచేతనము లెట్లు ధ్వనిచేయుచున్నవను నాక్షేపణము చేయఁబడును.

జాతి, నిగ్రహస్థానాది దోషములు కేవల వాదసంబంధములు కాని తర్కసంబంధములు కావు. తర్కవాక్యమందలి వివిధాంగములకు సంబంధించినవి దోషములు, పక్షాభాసములు దృష్టాంతాభాసముల కంటె హేత్వాభాసములు ముఖ్యమైనవి. ఇవి యైదు విధములని గౌతముఁడు.౧. చెప్పినాఁడు. (౧) సవ్యభిచారము లేక అనిశ్చితార్థయుక్తము; దీని వలన ననేక నిర్ణయముల కవకాశమున్నది, శబ్దము స్పర్శజ్ఞానము వలనఁ దెలియదు గావున నది నిత్యమనియు ననిత్యమనియుఁ గూడఁ జెప్పవచ్చును; ఏలన నిత్యములగు నణువులును, ననిత్యజ్ఞాన క్రియలును గూడ స్పర్శవలనఁ దెలియునవికావు, మధ్యమాంగమున కున్నతాంగ వ్యాప్తి లేదు. మధ్యమాంగ మేపక్షముతోడను సమానసాహచర్యము లేనిదగుటచే ననంతరతర్కమున నిది 'అనైకాంతికమ'ని

(౧) ౧. ౨. ౪; మఱియుఁజూడు వైశేషికసూత్రములు 3. ౧. ౧౫. ప్రశస్తపాదుఁడు అసిద్ధము, విరుద్ధము, సందిగ్ధము, అనధ్యవసితములను పేర్కొనినాఁడు, (ప, ప్రి. పుటలు ౨౩౯-౪౦) దిఙ్నాగుఁడు పదునాలుగును, భాసర్వజ్ఞుఁడారును జెప్పినారు, మఱియుఁ జూడు తర్కసంగ్రహము పుట ౫౨.

చెప్పఁబడెను. దీనికి మూడంతర్విభాగము లున్నవి. (ఏ) సాధా రణము. ఇందు మధ్యమాంగమతివ్యాప్తిగలది (బి) అసాధార ణము, ఇందుమధ్యమాంగమతి సంకుచితము, (సి) అనుపసం హారి; ఇందు మధ్యమాంగము పరీక్షించుటకు వీలులేనిది. ౨. (౨) విరుద్ధము; ప్రతిజ్ఞావిరుద్ధము, ౩. (౩) ప్రకరణసమము; ప్రతిజ్ఞాసమానము, దీని వలన నిర్ణయము సాధ్యముకాదు; ఏలన నిది సమాధానమునకు బదులు సమస్యనే లేవనెత్తును; ఏలన నిది దర్శింపఁబడని రెండు విరుద్ధగుణములలో నొక దానినిఁ బ్రక టించును.౧. అనంతరత్కము దీనిని సంప్రతిపక్షము క్రిందికిఁ దీసికొని వచ్చినది, ఇది రెండు పక్షములకును సమానముగాఁ బనికి వచ్చునట్లు గ్రహించుటచే సవ్యభిచారముతో సమాన మైన దగుచున్నది.౨. సాధ్యసమము; ప్రతిజ్ఞతో సమమైన కార ణము నిచ్చి దానికింకొక ప్రమాణమును గోరును. దీనికే అసి ద్ధమని పేరు, ఇందు భిన్నరూపములున్నవి. (ఏ) స్వరూపాసిద్ధి; ఇందు మధ్యమాంగ స్వభావమేమియుఁ దెలియదు. ఉ॥ శబ్దము

(౨) తర్కసంగ్రహము పుట ౫౩, మఱియుఁ జూడు విశ్వనాథుని న్యాయసూత్రవృత్తి ౧. ౨. ౮౬.

(౩) న్యా.వా ౧.౨.౬. వాత్స్యాయనుఁడు (౧.౨.౬) యోగభాష్య మునుండి (౩.౧౩) యొక యుదాహరణ మిచ్చినాఁడు. (౧) ప్రపంచమనిత్య ము గావున నదృశ్యమగును. (౨) అదియవినాశము కావున నవిచ్ఛిన్నముగా నడచును, మఱియు చూడు తర్కసంగ్రహము. పుట ౫౮.

(౧) న్యా.భా; న్యా.వా. ౧.౨.౭.
(౨) తర్కసంగ్రహము పుట. ౫౫.

నిత్యము; ఏలన నది దృశ్యము, ఇందు శబ్దము దృశ్యమగుట పూర్తిగా నసిద్ధము, (బి) ఆశ్రియాసిద్ధి; ఇందు మధ్యమాంగము నిరాధారము; ఉ॥ "దేవుఁడు లేఁడు; ఏలన నతనికి దేహము లేదు." ఇచట దేవుఁడు లేనిచో దేహము లేకపోవుట కాధారములేదు. (సి) అన్యథాసిద్ధి; యింకొక హేతువుచేఁ దెలియునది.3. (డి) కాలాతీతము, ఉ॥ శబ్దము నిత్యము; ఏలన నది మిశ్రితమై వర్ణముగా గోచరించును." ఘటముయొక్క వర్ణము దీపముతోఁ గలిసినప్పుడు గోచరించును; కాని యావర్ణము దీపసంయోగమునకుఁ బూర్వము నున్నది; తరువాత నుండును, ఈదృష్టాంతము ననుసరించి, శబ్దము మద్దెలకు దానిని మ్రోయించు కఱ్ఱకుఁ గలయికకుఁ బూర్వమున్నది, తరువాత నుండునని వాదించుట దోషమగును, ఈవాదమునందలి దోషము కాలాతీతమని చెప్పఁబడినది; ఏలన కఱ్ఱమద్దెలకుఁ దగిలినంతనే ధ్వని పుట్టుచున్నది; వర్ణము ఘటదీపసంయోగముతో నేకకాలమందే గోచరించుచున్నది. ఈదోషమునకు బాధితమని పేరు. ఇతర సాక్ష్యము వలన దేనికి విరుద్ధమైనది సత్యమని తెలియుచున్నదో దానిని మధ్యమాంగము ప్రకటించుచున్నది. అర్వాచీన తర్కమందు దోషముల సంఖ్యయింకను గొంత పెరిగినది.

## ౧౮ — సత్యము.

జ్ఞానసిద్ధాంతము మనకు జ్ఞానముగలదను సంశయముపై నాధారపడి యారంభించుటలేదు; మనకు జ్ఞానముకలదను మన

(3) వాచస్పతి ఏః దేశాసిద్ధిని జేర్చినాఁడు; ఉదయనుఁడు వ్యాప్యత్వాసిద్ధిని జెప్పినాఁడు.

నమ్మకముతో నారంభించును. మననమ్మక మెంతవరకు సమర్థింపఁ దగినదో పరీక్షించుటయే జ్ఞానసిద్ధాంతవాది కర్తవ్యమై యున్నది; ప్రమాణసిద్ధాంతమందు మనము నమ్ముసత్య మెంత గలదో నిర్ణయింప నైయాయికుఁడన్వేషించును. ప్రమాణ చతుష్టయమువలన లభించిన మన జ్ఞానవిషయ మెంతసత్యమైనదో యాతఁడు విశదీకరింప యత్నించును.

వస్తువుల మూలతత్త్వమును మన మెఱుఁగము; మన విజ్ఞాన మాత్మవిరుద్ధధర్మము కలదగుటచే నది నిజముకాఁజాలదను మాధ్యమిక సిద్ధాంతము ప్రకటించు నాస్తికవాదము న్యాయదర్శనముయొక్క జ్ఞానసిద్ధాంతముతో విరోధించును. వస్తువు లుండుట సత్యమని మాధ్యమికుఁడు చెప్పుటచే నట్టి నిశ్చయమే తన కాత్మవిఘాతమును గల్గించునని వాత్స్యాయనుఁడు బదులుచెప్పినాఁడు. మూలతత్త్వమేదియు లేదనుదాని కెట్టిప్రమాణమును లేకున్నచోఁ దద్వ్యతిరేకభావమే మనకు శరణ్యమగును. ప్రమాణముల ప్రామాణ్యమును నిరసించుట కైన నింకొకప్రమాణ ముండవలెను; లేకున్న నది నిరాధారవాదమగును నిరాధారవాదము నిరర్థకమే; ప్రమాణ మింకొకటియున్నచోఁ బ్రమాణముల ప్రామాణ్య మంగీకరించినట్లేయగును. శుద్ధ నాస్తికత నిరర్థకవాదము. ప్రతివ్యక్తియు నాలోచించుట కారంభించుటతోడనే జ్ఞానసూత్రముల నంగీకరించుచున్నట్లే యర్థము. విజ్ఞానసూత్రము నంగీకరించినంతనే యథార్థజగత్తు నంగీకరింపకతప్పదు; ఏలన రెండు నన్యోన్యసంబంధము గలిగినవే వాత్స్యాయనుఁ డిట్లు చెప్పినాఁడు "విజ్ఞానమునకు

వస్తు విచక్షణసామర్థ్య మున్నచో, నప్పుడు వస్తుస్వభావ మవిజ్ఞాత మను టనుచితమగును. వస్తుస్వభావ మవిదితమైనచో నప్పుడు వస్తువిచక్షణ సామర్థ్యము విజ్ఞానమునకు లేనట్లే. అందుచే విజ్ఞానమునకు వస్తువిచక్షణశక్తి యున్నది. వస్తుస్వభావము విదితముకా దను టాత్మవిరుద్ధ ప్రసంగము."౧. దీని నుద్ద్యోతకరుఁ డిట్లు సంగ్రహించినాఁడు; "విజ్ఞానమునకు వస్తువివేక మున్నయెడల వస్త్వభావము చెప్పుట సాధ్యముకాదు. వస్త్వభావమే నిజమైనచో, బుద్ధికి వస్తు వైచక్షణ్యా ముండుట దురూహ్యము."౨. జ్ఞాన మర్థవంతమని న్యాయసిద్ధాంతము. ౩.

మనయనుభవములోని వస్తుజాలము కేవలదృశ్యపరంపరయేయను విజ్ఞానవాదమును వాత్స్యాయనుఁడు ఖండించినాఁడు. స్వప్నావస్థలోఁ జూచినవసత్యములనుటకుఁ గారణము

---

(౧) న్యా॥ భా॥ ౪, ౨, ౭. (౨) న్యా॥ వా॥ ౪, ౨, ౨౭.

(౩) మాధ్యమికులు నిశ్చయజ్ఞాన మసాధ్యమనుటకుఁ గొన్ని కారణములఁజెప్పిరి. వానిలో నొకటి ప్రత్యక్షము. దర్శన మింద్రియవిషయములకుఁ బూర్వమునుగాదు, పరమునుగాదు; సమకాలికమును గాదు. అది పూర్వమైనచో నది యింద్రియవిషయసంయోగఫలితము కాఁజాలదు. పరమైనచో, నింద్రియవిషయము దర్శనముచే సిద్ధించెనని చెప్పవీలులేదు. సమకాలికమైనచో మన జ్ఞానక్రియలలో ముందు వెనుకలవసరములేదు. వర్ణగంధము లేకకాలమునఁ దెలియును; దీనిని న్యాయమంగీకరించదు. ఇట్లే యితర ప్రమాణ ప్రమేయసంబంధములునని మాధ్యమికులు వాదించిరి. అందుచే నీ జ్ఞానసాధనములు వ్యర్థములైనవి. దీనికి న్యాయమిట్లు బదులుచెప్పెను. ప్రమాణము వస్తు పూర్వముగావచ్చును; మద్దెలధ్వనికిఁ బూర్వమే: పరముకావచ్చును; కాంతి సూర్యునికిఁ బరమే; సమకాలికముగావచ్చును; ధూమాగ్ని లేకకాలమున నుండును. (న్యా॥ భా॥ ౨, ౧, ౮-౧౯.)

వానిని మనముజాగ్రిదవస్థలోఁ జూచుట లేదు. జాగ్రిదవస్థలోఁ జూచినవస్తుప్రపంచమసత్యమైనచో స్వప్నావస్థ కవకాశమే లేదు. స్వప్న నానాత్వభిన్నత్వములకుఁ గారణము జాగ్రదవస్థలోని వస్తు భిన్నత్వమే. ౪. యథార్థజగత్తే లేనిచో, సత్యాసత్యభేదముండదు; వస్తుదర్శనము మనకు స్వవశమై లేదు; మనయిచ్చవచ్చినదానిని దర్శింపఁజాలమను సత్యాంశములకు సముచితమైన సమాధానము లోపించును. ౧. వస్తువులనుగూర్చిన క్షణికభావములే యున్నవనుటను నైయాయికుఁ డంగీకరింపఁడు. వస్తువులు మన జ్ఞానవిషయములైనచో నవి మన జ్ఞానక్రియాపూర్వస్థితిని గలిగి యుండవలెను. కాని క్షణికవాదముననుసరించి, మనకు దాని జ్ఞానమును దెలుపు వస్తువును మనము చూడఁజాలము; ఏలన నది యాక్షణమందే యదృశ్యముకావలెను. ఇట్టి దసంభవ మేలన దర్శనమనగా మనముచూచువస్తు వెదుట నుండవలెను. వస్తు వదృశ్యమగుట వస్తుదర్శనము నేకకాలముననే జరుగుననుట పొసఁగదు; ఏలన మనము గతములోని వస్తువును గాక వర్తమానవస్తువునే చూతుము. అనుమానముకూడ సాధ్యముకాదు. ౨. మఱియుఁ గారణకార్యము లన్యోన్యా

(౪) న్యా॥ భా॥ ౪, ౨, ౩౩-౩౪, ౩౭.

(౧) న్యా॥ భా॥ ౪, ౨, ౨౬-౩౭.

(౨) చూడు ॥న్యా॥ వా॥ ౧,౧,౩౭; ౩, ౨, ౧౪. ఉద్ద్యోతకరుఁడు నడిగినాఁడు; "శబ్దమనిత్యము; ఏలన నది ఘటమువలె నుత్పన్నము" యీ తర్క-వాక్యములో దృష్టాంతమగు ఘటమునకనిత్యత, ఉత్పత్తియు నుండవలెను. అనిత్యత, పరమం దభావము; ఉత్పత్తి పూర్వాభావము. ఘటము క్షణికమైనచో నీ రెండులక్షణములు నేకకాలమున నెట్లుండును ?"

వినాభావసంబంధులగుటచే నేక కాలమున నుండవలెను. ఉన్నదని యూహింపఁబడుదానికివలెఁ గాక, నిజమగు నునికిగలదానికి మూలభూతమగులక్షణము, ద్రష్టయొక్క యనుభవముతో నిమిత్తములేకుండ, స్వతంత్రమైనదైయుండును. అస్తిత్వము గలది వ్యక్తులఅనుభవముతో సంబాధములేకుండ నెల్లప్పుడు నుండును. వ్యక్త్యనుభవముపాక్షికము. దానికాధారము వస్త్వస్తిత్వము. కాని వస్త్వస్తిత్వమునకు మన యనుభవావసరము లేదు. వ్యక్తియొక్క సంకల్పోద్దేశములతో నిమిత్తములేకుండ స్వతంత్రాస్తిత్వముగల వస్తుజగత్తునకే మనభావములు సంబంధించియున్నవి. ౩. వస్త్వస్తిత్వము ప్రమాణములపై నాధారపడదు; కాని వస్తువులు జ్ఞానవిషయములగుటకుఁ దప్పక ప్రమాణప్రవృత్తి యవసరము. ప్రమ లేక సత్యమునిచ్చునవి గాన ప్రమాణములు. ౧ తన తాత్పర్యపరిశుద్ధిలో నుదయనుఁడిట్లునుడివెను; "వస్తుమూలస్వభావజ్ఞానము ప్రమ; అట్టి జ్ఞానసాధనము ప్రమాణము"౨ నిజమైన వస్తుతత్త్వమేమి? "ఉన్నది యుండుటయు లేనిది లేకుండుటయు వానిలక్షణములు. ౩. ఏది యున్నదో యది గ్రహింపఁబడినపుడు, అనగా యథాభూతమునవిపరీతమునైన వస్తువునుగూర్చి, తెలిసినపుడదియే వస్తుతత్త్వము. అట్లే.మన మభావము నభావముగా గ్రహించునపుడు,

---

(౩) న్యా॥ భా॥; విశ్వనాథుఁడు: న్యాయసూత్రవృత్తి. ౪, ౨, ౨౬.

(౧) ప్ర=యుక్తమైన మా=జ్ఞానము, (౪.౨.౨౯.)

(౨) యథార్థానుభవః ప్రమాతత్సాధనంచ ప్రమాణమ్.

(౩) సతశ్చ సద్భావో సతశ్చాసద్భావః।

అనగా నదియొక వ్యతిరేకభావముగా గ్రహింపఁబడినపుడదియు-నాయఃభావ వస్తుతత్త్వమే యఃగును."౪. వస్తువుయొక్క యథారూప మేదిగాదో యది అప్రమ, భ్రిమ లేక మిథ్యాజ్ఞానమనఁబడును. ౫. శుక్తిరజితభ్రాంతి యిట్టిదే. అది జ్ఞానముకాదు; విపరీతజ్ఞానము.

ప్రశ్న, సందేహము మున్నగువానికి మానవుని మానసికచరిత్రిలో స్థానములున్నవి; వానికి సత్యాసత్య సమస్యలేదు, ఒకవ్యక్తితో సంబంధములేకుండ నొక నిర్ణయము లేక ప్రకటనము తర్కపరీక్షార్హతగలది. జ్ఞానమంతయు విశేష్యవిశేషణములతోఁ గూడిన నిర్ణయరూపమే. న్యాయము నందొక నిర్ణయము గుణిగుణలక్షణములు విభాగింపబడును.౭. వస్తువుల స్వభావములను గుణములను దెలియుటే జ్ఞానము. ఒక నిర్ణయములోని కర్తయొక వస్తువున్నదని చెప్పును; దాని లక్షణములను వివరించి, దాని స్వభావమును క్రియ చెప్పును. రెండును సరిపోవునపుడు మనకు యథార్థజ్ఞానము లభించును.౮. ప్రతివిషయ-

(౪) న్యా. భా; న్యా. వా. ౧. ౧. ౧.

(౫) న్యా. భా. ౧. ౧. ౪.

(౬) న్యా. భా. ౪. ౨. ౧; ౪. ౨. ౩౫.

(౭) పోల్చు; ప్రతి ప్రతిపాదనమందును, మనసునకుఁ బోడకట్టు వస్తువుయొక్క స్వరూపమును మనస్సులో నూహింతుము. (డబ్లియు. ఇ. జాన్సన్. లాజిక్కు.)

(౮) తద్వతితత్ప్రకారకోఽనుభవోయథార్థః, తదభావవతి తత్ప్రకారకోఽనుభవో అయథార్థః (తర్కసంగ్రహము. పుట ౩౫.) ప్రకారమనగా వాక్యములోని క్రియ, క్రియచేఁ దెలియు వస్తుగుణము విశేషణము, ప్రకారము జ్ఞానమునకును, విశేషణము వస్తువునకును జెందును.

మునకు సత్యసంబంధియగు లక్షణమొకటి యుండును. విజ్ఞానము విశేష్య విశేషణభేదములు జెప్పి, యథార్థజగత్తులో నవి కలిసి యున్నవని చూపును. యథార్థజగత్తులో వస్తువులెట్లున్నవో, యాజ్ఞానమును మనకుఁ బ్రమాణము లొసఁగును.౧.

ఒక వస్తువగు ఘటమునకును, మన ఘటజ్ఞానమునకును గల సంబంధము సమవాయముగాదు; ఏలన ఘటవిషయక జ్ఞానము ఘటమునకుఁ జెందినదికాక, ఆత్మకుఁ జెందినది. అది సంయోగసంబంధమునుగాదు; ఏలన సంయోగము రెండు వస్తువుల కుండును. జ్ఞాన మొకగుణము మాత్రమే, కాని వస్తువునకు వస్తుజ్ఞానమునకు నేదోయొక సంబంధముండవలెను. ఏలన నొక నిశ్చితనిర్ణయ ముండకతప్పదు. అందుచే ఘటస్వరూపమే మన నిర్ణయమును నియమించు కారణము. దీనినే స్వరూప సంబంధ మనిరి. దీనికి భీమాచార్యుని న్యాయకోశములో నిర్వచన మిట్లున్నది: "ఒక వస్తువునుగూర్చిన విశిష్టజ్ఞానము మఱే యితర సంబంధమువలనను లభింపరాదు."౨. ఇదియే

(౧) ప్రమాణస్య సకలపదార్థ వ్యవస్థాపకత్వమ్। (విశ్వనాథుని న్యా సూ. వృత్తి॥ ౧ ౧. ౧.

(౨) సంబంధాంతరేణ విశిష్టప్రతీతి జననాయోగ్యత్వమ్॥ ఘటమే సంబంధ మన్నచో సంబంధమునకు వస్తువునకు భేదము తొలగిపోవునన్నచో ఘటము ఘటముగా సంబంధముకాదు ఘటము జ్ఞానవిషయమైనప్పుడే సంబంధమగునని సమాధానము చెప్పఁబడెను.

వస్తుజ్ఞాన సహజసంబంధము.3. జ్ఞానవ్యాపారముగాక, జ్ఞానఫలితము, యథారూపములో నున్న భౌతికవస్తువునుగాదు; కేవల మానసికావస్థయును గాదు; అది విదితమైన వస్తుతత్త్వము లేక స్వరూపము.౧. జ్ఞానవిషయము బాహ్యదృష్టిలోని భౌతికరూపమేయైనచో నప్పుడు విపర్యయమున కవకాశమే లేదు. ఒకవస్తువు నందరొకేరీతి చూచి చెప్పఁగలరు. మనము చూడని దగునొక యుత్తరధ్రువమును గూర్చిన సత్యాంశ విషయమైనచో, నది మన విజ్ఞానములోఁజొచ్చి, భిన్నభావముల కవకాశమిచ్చును. అది కేవల మానసిక దశయేయైనచో, మన మహంభావకలుషితుల మగుదుము. జ్ఞానవిషయము, కేవల భౌతికవస్తువును గాదు, మానసిక దశయునుగాదు; అది వస్తుస్వస్వరూపము, సకల జ్ఞానరూపములలో మనకీ స్వస్వరూపయాథార్థ్యమున్నది. స్వప్నమందుఁ గూడ మనకీ స్వరూపముండునుగాని, స్వప్నవస్తువు లసత్యములని తెలిసికొందుము. స్వప్నాస్తిత్వము వలన నవి యథార్థములై యుండునని సమర్థింపఁజాలము. ఇట్టి భావము

(3) అవచ్ఛేదక సంబంధము స్వరూపసంబంధమే. "దండవాన్ పురుషోఽయమ్" లో దండ మవచ్ఛేదకము. అవచ్ఛేదకములు రెండువిధములు; విషయతావచ్ఛేదకము. ఇది అతిప్రసక్తము కావచ్చును. "ఘటమును నే నెఱుగుదును" ఇచట ఘటత్వ మితరఘటములకు నున్నది. ప్రతియోగితావచ్ఛేదకము. ఇందలి యవచ్ఛేదకము సంకుచితము. గదాధరుఁడు తన విషయతావాదమునందు విషయతావచ్ఛేదకము స్వరూపసంబంధము కాదనెను.

(౧) పోల్చు: "మనవిషయములు కేవలగుణరూపములు, తార్కికరూపములు. ఇవే వస్తురూపములని మనము గ్రహించుచుందుము."

(ఎస్సేస్ ఆన్ క్రిటికల్ రియాలిజమ్ పు. ౫౪)

వల దోషము లుదయించును. జ్ఞానమంతయు స్వరూపజ్ఞానమే; ఇందు వస్తువుల యాథార్థ్యమున్నదను విశ్వాసము గర్భితమై యుండును. మనకుఁ దెలిసినది వస్తుసంబంధియగునో కాదో మనకుఁ దెలిసిన జ్ఞానమే నిశ్చయింపలేదు. మనజ్ఞానమునకు స్వతః ప్రామాణ్యము లేదు.౨. పరతః ప్రామాణ్యమున్నదని న్యాయ సిద్ధాంతము, జ్ఞానమునందే ప్రామాణ్యాప్రామాణ్యములున్నవని సాంఖ్యులును;౧. ప్రామాణ్యమునకు జ్ఞానమును అప్రామాణ్యమున కితర కారణములున్నవని మీమాంసకులును నమ్మెదరు; అందుచే మీమాంసకులొక నిర్ణయ మన్యథావిరుద్ధమని ఋజువు కానంతవఱకు యథార్థమేయని చెప్పుదురు. సర్వ జ్ఞానక్రియలును ప్రమాణరహితములే యనియు వాని ప్రామాణ్యము నితర హేతువులచే ఋజువు చేయవలయుననియు బౌద్ధుల వాదము. ఈభావములన్నిటికి వ్యతిరేకముగాఁ ప్రామాణ్యాప్రామాణ్యములు జ్ఞానక్రియలతో సంబంధములేని వేఱొక స్వతంత్రసాధనముచేనిర్ణయింపఁబడునని నైయాయికుఁడువాదించినాఁడు. ప్రతిజ్ఞానము స్వతఃప్రమాణసిద్ధమైనచో సందేహ

(౨) పోల్సు. డేక్; "జ్ఞానానుభవములన్నియు వస్తువులనుగూర్చిన జ్ఞానరూపములే. వస్తుసంపాదనమందులేదు. వానియాథార్థ్య మితరసాధనములచే ఋజువుకావలెను.

(క్రిటికల్ రియాలిజమ్ పు. 3౨.)

(౧) వీరికి వేదప్రామాణ్యము స్వతస్సిద్ధము; దీనికి బాహ్యప్రమాణమవసరములేదు; ఈశ్వరకల్పితములగుటచే వేదములు నైయాయికులకుఁ బ్రామాణ్యములే.

మున కేతావులేదు.౨. అందుచే సత్యాంశ పరిశీలనమే ప్రామాణ్యమును నిర్ణయించును. మనమొక వస్తువును జూచితిమనుకొందము; మనకు గోచరించుచున్న రూపపరిమాణములు సరియైనవేయని మనము వెంటనే నిశ్చయింపఁజాలము. సూర్యుఁడు కదలుచున్నట్లు మనకుఁగనపడును; కాని నిజముగా సూర్యుఁడు కదలుటలేదు కావున దర్శనము లేక ప్రత్యక్షదర్శనము సత్యమైనదని నిర్ణయించుటకు వీలులేదు. మన జ్ఞానముయొక్క యాథార్థ్యము వివేకపరిశీలనముచే నిశ్చయింపవలెను.3. ఇట్లే యితర సాధనముల వలన లభించు జ్ఞానము కూడనిశ్చితము కావలెను.

ఈసిద్ధాంతమునకుఁగల యనేకాక్షేపణములకు న్యాయము సమాధానమిచ్చును. ఒకవస్తువుయొక్క జ్ఞానమునిచ్చు నొక ప్రమాణమే యింకొక ప్రమాణమునకు విషయముకాఁగలదు. ఒకతక్కెడ వస్తువులను దూఁచునప్పుడు తక్కెడ; కాని దీని నింకొక తక్కెడలో వేసి తూచినప్పుడిదియు వస్తువేయైనట్లుగానే

---

(౨) సిద్ధాంతముక్తావళి. పు.౧3౫. "ఒకజ్ఞానము స్వతఃప్రమాణముచే యుక్తమైనచో నభ్యాసముచే నుదయించుజ్ఞానవిషయమున సందేహమునకుఁ దావులేదు. ఏలన నిందు జ్ఞానము దానియుక్తత గ్రహింపఁబడుచో సందేహమున కవసరమేమి? లేక జ్ఞానముయొక్క యాథార్థ్యము తెలియనిచో నప్పుడును సంశయావకాశములేదు. అందుచే జ్ఞానయాథార్థ్యము ననుమానము వలననే తెలియవలెను.

(3) తర్కభాష యిట్లుచెప్పినది. "ప్రత్యక్షము జ్ఞానమునిచ్చును; దాని యాథార్థ్యము ననుమానము నిశ్చయించును. జలాన్వేషికి జలముకనుపించును. వానియత్నము సఫలమో విఫలమో యగును. సఫలమైనచో యుక్తజ్ఞానమగును. అయుక్తజ్ఞానమువలనఁ గార్యసిద్ధిచేకూరదు."

యొకజ్ఞానసాధన మొకవస్తువును నిరూపించునపుడొక యుపకరణము; కాని యదియే నిరూపింపఁబడవలసినపు డొకవస్తువే యగును. వాత్స్యాయనుఁడిట్లు చెప్పెను: "వస్తువులను గ్రహించు ప్రమాణము బుద్ధి; దానిని గ్రహించునపుడదియే ప్రమేయ మగును." ౧. ఒకప్రమాణమును స్థాపించుట కింకొక ప్రమాణ మవసరము లేదు; అది స్వయంస్థాపితమన్నచో నప్పుడుజ్ఞాన విషయమును స్వయంస్థాపితమేయగును; ప్రమాణములు నిరర్థకములగును. ఒకజ్ఞానముయొక్క యాథార్థ్య మింకొకజ్ఞానము వలన స్థాపింపఁబడుచో దానిని స్థాపించుట కింకొకటి కావలసి వచ్చును. ఇది యనంతవ్యర్థవాదముకాదా ? అట్లుకాక మన మెచ్చట మధ్యమందాగినను, ప్రమాణము సిద్ధము కాదు. దీనిని నైయాయికుఁడొక సారవంతమైనయాక్షేపణముగా స్వీకరింపఁడు; ఏలన నిది కేవల సిద్ధాంతవాదము. వ్యావహారికముగా, మనము ప్రమాణసిద్ధినంగీకరింతుము; ఒకప్రమాణము నింకొకప్రమాణముచే ననంతముగాసాధించుచుఁ బోన

(౧) న్యా॥ భా॥ ౨.౧.౧౬ వాత్స్యాయనుఁడు దీపదృష్టాంతము నిచ్చినాఁడు; దీపము తన్ను, నితరవస్తువులనుగూడఁ బ్రకాశింపఁ జేయును. "దీపము వలన మనము దీపమును, నితరవస్తువులనుగూడఁ జూతుము. కావున నది ప్రమాణము ప్రమేయముగూడ నగుచున్నది.

(౨) ఈయాక్షేపణము నాగార్జునుఁడు 'విగ్రహవ్యావర్తని కారికలో'ఁ జూపినట్టిదే. చూడు "హిస్టరీ ఆఫ్ ఇండియన్ లాజిక్-పుట. ౨౫౭; న్యా॥ భా॥ ౨-౧.౧౭-౧౮. బౌద్ధతార్కికుఁడైన ధర్మకీర్తిని శ్రీహర్షుఁ డిట్లుదాహరించెను; "జ్ఞానము స్వతఃప్రమాణము కాదనువానికి, వస్తువిజ్ఞానమునులేదు." చూ ఖండనము. ౧.౩.

క్కరలేదు. 3. మనకరతలమున నొకపండును జూచునప్పుడు కలుగు జ్ఞానాదికములలో మనకు వానినిగూర్చి సందేహమే యుండదు. ఏకజ్ఞానక్రియవలననే మనము నిశ్చయజ్ఞానము లభించును. సంశయాత్మకములైనజ్ఞానక్రియల విషయములో వర్తమానజ్ఞానముయొక్క యాథార్థ్యమును నిశ్చయించుట కితరజ్ఞానక్రియలసాహాయ్యమ పేక్షింతుము; మనకొకసువిదిత మైన జ్ఞానసాక్ష్యములభించుటతోడనే, యితరాన్వేషణమంత టితో నాపివేయుదుము. వానివిషయములను ఋజువుచేయుటకుఁ గొన్ని ప్రమాణములనే మనము ముందుఋజువుచేయవసి యున్నవి; అట్లుచేసినఁగాని యవి వ్యవహారమున కుపయో గించవు; వానిప్రామాణ్యముతోనిమిత్తములేకుండగనే జ్ఞాన విషయమును స్థాపింపఁగల ప్రమాణములుకొన్ని యున్నవి. అగ్నియొక్క జ్ఞానమునకుఁ బూర్వము ధూమజ్ఞానముండ వలెను. కాని యింద్రియములవి చూడఁబడకుండగనే, యితర వస్తుజ్ఞానమునిచ్చుచున్నవి. కాని యింద్రియముల నితరసాధన ములవలన మనము తెలిసికొనవచ్చును; కాని యట్టిజ్ఞానమన వసరము.

మన జ్ఞానక్రియలు వెంటనే సత్యమును గూర్చినవో కావో నిశ్చయింపఁజాలమని నైయాయికుని వాదమైయున్నది. సఫలతనిచ్చు క్రియాసామర్థ్యము వలన నిట్టి జ్ఞానవస్తుసంబంధ సిద్ధి విదితముకాఁగలదు. జ్ఞానమంతయుఁ గ్రియాచోదకము, ఒక వస్తువు కోరఁదగినదనియో, కోరఁదగనిదనియో, రెండును గాదో

మన కదితెలియఁజేయును, ఆత్మ కేవలము వస్తుధ్యానతత్పరమై, నిష్క్రియాత్మకమైన సాక్షి మాత్రమేకాదు, అయోగ్యములను బరిహరించి, యోగ్యములను సాధించుట యందాసక్తి కలదే యాత్మ. జీవిత ప్రవృత్తిలో నాలోచన మొక భాగమే, "జ్ఞానమొకగ్రాహకశక్తి; అది కోరికనుదయింపఁజేసి, క్రియాజనకమగునది."౧. ప్రయోజన వాదులతో నైయాయికుఁ డంగీకరించి, మానవస్వభావములో నిమిడియున్న ముఖ్యావసరములపై జ్ఞాన మాధారపడి యుండి, సంకల్ప క్రియారూపములఁ బ్రసవించునని చెప్పను. ప్రవృత్తిసామర్థ్యము ననుసరించి, జ్ఞాన వస్తుసారూప్యము నిశ్చితమగును.౧. దీనిని బట్టి వస్తుభావసంబంధము సాదృశ్యముకాదు; మన భావములకును దృష్టార్థములకును సామ్యముండుటపై సత్యమాధారపడుననియు నట్టి భావసామ్యము సరియైనదని వాని వ్యావహారిక ప్రయోజనసిద్ధి ననుసరించి నిర్ణయింతుమనియు నైయాయికుని సిద్ధాంతము.౨.

సరిగాఁ జెప్పవలయుచో, భావము తదనుగుణమైన వస్తుదర్శనముల నిచ్చుటయేకాక, దాని ననుసరించి బాహ్యజగత్తులో మనము ప్రవృత్తిపరులమగుట కనుకూలించుచో నట్టి భావము యథార్థమని నిశ్చితమగును.తత్త్వ చింతామణి యందలి

(౧) న్యా. భా. ౧. ౧. ౨.

(౧) న్యా.భా. ౧.౧.౧౭. మఱియుఁ జూడు. న్యా.భా.న్యా.వా. ౧.౧ ౧; కుసుమాంజలి. 3.౧౫.

(౨) పోల్చు: నొక్టిగార్టు సత్యమునుగూర్చి చెప్పిన సామ్యసారూప్య సిద్ధాంతములు. ది నేచర్ ఆఫ్ ట్రుత్.

ప్రామాణ్యవాదము ననుసరించి, జ్ఞానక్రియల యాథార్థ్యము ననుమానము స్థిరపరచును. మన మొక యశ్వమును జూచి నపుడు మొదట మనము దాని రూపమును దెలిసి కొందుము; 'ఇదియొక యశ్వము' తరువాతఁ నేనొక యశ్వమును జూచితి నను నస్పష్టభావముదయించును, కాని మనమశ్వము నొద్దకుఁ బోయి, నుపరిశీలన మొనర్చుట వలననే అశ్వజ్ఞానము కలుగును. అప్పుడు తాననుకొనిన లక్షణములు చూపట్టకున్నచో ద్రష్టతాను బొరబడితి నని నిశ్చయించును. మనము జలమును జూచి దగ్గరకుఁ బోయి చూచి, మనయవసరముల నది తీర్చినచో మన జలజ్ఞానము సత్యమని నిశ్చయింతుము; ఏలన, నసత్యమైనది కార్యసిద్ధి నొసఁగఁజాలదు.3. మనము కోరినది సిద్ధించినపుడు మన జ్ఞానము యుక్తమైనదని నిర్ణయించుకొందుము, ఈవిధముగాఁ గార్యములనుండి కారణములను గ్రహింతుము. కార్యసిద్ధినిచ్చు దృష్టాంతభావజ్ఞానమువలనను కార్యవైఫల్యమునిచ్చు దృష్టాంతాభావజ్ఞానము వలనను నీ సత్యసూత్రము జనించుచున్నది.

క్రియాసత్త్వమే సత్యపరీక్షకు సాధనము; సత్యవిషయముకాదు. కొందరు ప్రయోజనవాదులు కార్యసామర్థ్య మొక్కటే పరీక్షాసాధనమని నిర్ణయించిరి. బౌద్ధతార్కికులు దీని నంగీకరించి, యిట్లు పలుకుదురు. "యుక్తమైన జ్ఞానము విరోధవిరహితము. మనముచూచిన వస్తువును బొందునట్లు

(3) పూర్వోత్పన్నమ్ జలజ్ఞానమ్ ప్రమా;సఫలప్రవృత్తి జనకత్వాత్; యన్నైవమ్ తన్నైవమ్ యథాఅప్రమా, (అన్నంభట్టు : దీపిక.)

చేయునది విరోధవిరహితము."౧. ఒక వస్తుప్రాప్తి యనగా దానితోఁ బనిచేయుట, దాని స్వభావమును గ్రహించుట.౨.

కాని నైయాయికునికి సత్యము కేవల క్రియాసత్త్వయుక్తమేకాదు. సత్యము మనము దానిని బరీక్షించుటకుఁ బూర్వమే యున్నది. ఒక నిర్ణయము సత్యమగుటకుఁ గారణమది యట్లు ఋజువగుటచేఁ గాదు; అది సత్యమేకనుక ఋజువైనది. దీని కాక్షేపణలను బెక్కింటిని నైయాయికుఁడు పరీక్షించినాఁడు. మన కాంక్షలు సిద్ధించినవో లేదో మనకుఁ దెలియకపోవచ్చును. మనముకోరినది సిద్ధించె నను భ్రాంతి జనించు సందర్భములెన్నియో గలవు. స్వప్నములందు మనకు సంతృప్తి నొసగు సందర్భములున్నవి; అందుచే స్వప్నావస్థలు సత్యములని నిర్ణయింపరాదు. దీనికి నైయాయికుఁ డిట్లు బదులుచెప్పును. కార్యసిద్ధిని నిశ్చయించునది నట్టిభ్రాంతికాదు; యుక్తచిత్తుఁడగువాని కట్టి కార్యసిద్ధి చేకూరినట్లును, పూర్వకార్యఫలప్రాప్తితో నన్వయించునట్లును నిరూపింపఁబడవలెను. అది కేవల విశదమగు మానసికావస్థయును గాదు; చిత్తసంతృప్తియుఁ గాదు; గతానుభవముతో సమగ్ర సమన్వయము కావలెను.

---

(౧) ధర్మోత్తరుఁడు; న్యాయబిందు టీక. ౧ అ. "అవిసంవాదకమ్ జ్ఞానమ్ సమ్యగ్జ్ఞానమ్।...ప్రదర్శితమర్థమ్ ప్రాపయతసంవాదకముచ్యతే॥"

(౨) ప్రవర్తకత్వమేవ ప్రాపకత్వమ్।...ప్రవర్తకత్వమపి ప్రవృత్తివిషయప్రవర్తకత్వమేవ॥ ఒకేవర్గమునకుఁ జెందినను, మనకుఁదెలిసినవస్తువు మనము పొందిన వస్తువు నొకటికాదని ధర్మోత్తరుఁడు తలఁచెను. వస్తుభావసంబంధమును గూర్చిన న్యాయవాదమును బౌద్ధు లంగీకరింపకున్నను, అర్థసిద్ధిని, దానిని నిశ్చయించు నర్థక్రియాసామర్థ్యమును గూడ వ్యావహారికముగా నంగీకరింతురు.

దేశకాలగతమైన మన నిత్యానుభవమునకు స్వప్నానుభవములు సమన్వయింపవు గావున నవి కల్పితములే.

కార్యసిద్ధికిఁ బూర్వము మనజ్ఞానము యుక్తమై యదనుట కాధారము లేదు. అందుచేఁ గ్రియోత్సాహమునిచ్చు విశ్వాసము మనకు లోపించును. యుక్తమైనవస్తుజ్ఞానము కార్యసిద్ధి కవసరము; కాని కార్యసిద్ధికిఁ బూర్వము యుక్తజ్ఞానముండదు. ౧. ప్రపంచమనాదియగుటచే జ్ఞానముముందా కార్యసిద్ధిముందా యనుసమస్య కవకాశము లేదని యుద్ద్యోతకరుఁడు పలికినాఁడు. మఱియుఁ బ్రవృత్తికి వస్తుజ్ఞానమే కాని, వస్తుజ్ఞానము యుక్తమా యనునదవసరము లేదు. పరిచితవస్తువుల విషయములో నిట్టిసమస్య లేనేలేదు నూత్నలక్షణములు చూపట్టు సందర్భములలో గతానుభవదృష్టాంతములు నిశ్చయజ్ఞానమీయనప్పుడైనను, మన మసమగ్రజ్ఞానముతోడనే క్రియాపరులమగుదుము. ఒకప్పుడు మన తాత్కాలికనిశ్చయములను బరీక్షించుటకే ప్రవృత్తిపరులమగుదుము. సామాన్యముగా జీవిత మసమగ్రనిశ్చయములపై నాధారపడియే నడచుచుండును; ప్రతికార్యక్రమమునందు మనము విషయములను దర్కశాస్త్రప్రమాణముననుసరించి పరిశీలించి కార్యములారంభింపఁజాలము. మనభావములు యుక్తములని సమగ్రసాక్ష్యము

---

(౧) దీనిలో ధర్మోత్తరుఁడొక భేదమును జూపించినాఁడు. యుక్తమైన మర్థక్రియానిర్భాసమ్; అర్థక్రియాసమర్థేచ ప్రవర్తకమ్. మొదటిది ప్రత్యక్షముగాఁ గ్రియాజనకము. దీనికిఁ బరీక్షయవసరము లేదు. చూ॥ ఉద్ద్యోతకరుఁడు; వాచస్పతి. ౧, ౧, ౧.

లేకున్నను, వ్యావహారికావసరనిర్బంధముననుసరించి, మనము క్రియాపరులమగుదుము. హేతుసీమకతీతములైన మతవిశ్వాసములననుసరించి మనము కర్మపరవంతులమగుచుంటిమి. కొన్నిసందర్భములలోఁ బూర్ణపరిశీలన మసాధ్యమని నైయాయికుఁడంగీకరించును, యజ్ఞహోమములవలన మనకు స్వర్గప్రాప్తియున్నదో లేదో మనము చచ్చినఁగాని తెలియదు. సంపూర్ణజ్ఞానసిద్ధిలేనిదే ప్రవృత్తిరంగమునఁ బ్రవేశించనువ్యక్తి లోకాతీతుఁడైనఁ గావలయును లేదా యల్పజీవియైనఁగావలెను.

అనంతర నైయాయికులగు వాచస్పతి, ఉదయనుఁడు మున్నగువారు, కొన్నిజ్ఞానరూపముల స్వతఃప్రామాణ్యము నంగీకరించిరి. విపర్యయ విరోధరహితమైన యనుమానమును, ముఖ్యసాదృశ్యముగల యుపమానమును, స్వతఃప్రమాణయుక్తములని వాచస్పతి తలఁచెను; ఏలన నిందు జ్ఞానమును వస్తువులను బంధించు నమోఘసంబంధమున్నది. ఇంద్రియదర్శనమునందును, శబ్దప్రమాణమునందును, నట్టి నిశ్చయసంబంధమున్నదని చెప్పఁజాలము. ౧. వాచస్పతివాదము నుదయనుఁడంగీకరించి, అనుమానోపమానము లేకాక, అనువ్యవసాయము, ధర్మజ్ఞానము స్వతఃప్రామాణ్యముకలవని వాదించినాఁడు

## ౧౯—విపర్యయము.

ప్రమ లేక యథార్థజ్ఞానము, సంశయవిపర్యయములకు వేరైనదని చెప్పఁబడెను;సంశయ విపర్యయములవలనఁ గార్యసిద్ధి

(౧) న్యా॥ వా॥ తా॥ ౧, ౧, ౧. (౨) న్యాయజ్ఞానసిద్ధాంత నిశితవిమర్శనమునకుఁజూడు, ఖండనము.౧.౧౩-౧౪.

చేకూరదు. భ్రమలు, భ్రాంతులు నవి జనింపఁజేయుకోరిక లను సిద్ధింపఁజేయఁజాలవు. గతానుభవజ్ఞానము ననుసరించి ప్రస్తుతావసరములు సిద్ధింపనిచో మనమప్పుడు విపర్యయమును గ్రహింతుము. మన మొక తెల్లనివస్తువునుజూచి, వెండియని తలఁచి, దానినిఁజేఁబట్టి, యదియొక ముత్తెపుచిప్పయని గ్రహింతుము. ముత్తెపుచిప్పయొక్క నూత్నజ్ఞానము, రజితమను భావమునకు వ్యతిరేకమైనది. న్యాయమునను సరించి, విపర్యయమంతయు వ్యక్తిగతమే. వాత్స్యాయనుఁడు చెప్పినాఁడు: "యథార్థజ్ఞానము నిర్మూలించునది దురభిప్రాయమునుగాని, వస్తువునుగాదు." ౧. ఉద్ద్యోతకరుఁడు మరీచిక నుదాహరణముగాఁ గైకొని, "వస్తువెల్లప్పుడు స్వస్వరూపములోనే యున్నది; సూర్యుని కిరణప్రవాహవేగవశమున, జలమను జ్ఞానముకలిగినపుడు, వస్తువులో విపర్యయము లేదు; సూర్యకిరణములు కిరణములుకాకపోలేదు; కిరణచాంచల్యములో మార్పులేదు; విపర్యయము జ్ఞానములోనే సంభవించినది; చలించుచున్న రవికిరణజ్ఞానమునకుబదులు, జలజ్ఞానముకలిగినది. అనగా నొక వస్తు వదికాదను జ్ఞానముకలిగినది." ౨. ఆకాశపుష్పమువలె జలమసలు లేకపోలేదు; జలమున్నదని భావించినచోట నది లేదు. భ్రాంతికి హేతువులు కిరణములు; కాని జలదర్శనము నకుఁగావు, న్యాయముయొక్క జగత్సత్యసిద్ధాంతమిచటఁ గొంత మార్పునొందును; ఏలన భ్రాంతికి హేతువు నది చెప్పలేదు.

(౧) న్యా॥ భా॥ ౪, ౨, 3౫.
(౨) న్యా॥ వా ౧, ౧, ౪.

వస్తువులు, వానిలక్షణములతోఁగూడిన జగత్తు, దర్శితో సంబంధములేని సత్యమనునది న్యాయసిద్ధాంతము, విపర్యయమునకు మూల మసత్యజగత్తులో నున్నది. వాత్స్యాయనుఁడు నుడివినాఁడు: "విపరీతజ్ఞానము పూర్తిగా నిరాధారము కాదు." 3. ఒకవస్తువు నింకొకవస్తువుగాఁ దలఁచుటయే విపర్యయము. దీనినే అన్యథాఖ్యాతి యందురు. దీనిని జైన తార్కికులు, కుమారిలుఁడు, రామానుజుఁడుకూడ సమర్థించిరి. నైయాయికు లితరవిపర్యయసిద్ధాంతములను ఖండించిరి. అవితార్కికములనుటకంటె నెక్కుడుతాత్త్వికము లనవచ్చును. సౌత్రాంతికుల ననుసరించి,ఒక బాహ్యవస్తువుపై జ్ఞానాకారము గల యొక దోషారోపణము విపర్యయమునందున్నది. యోగాచారులు మానసికేతరవస్తువుల నంగీకరించరు. కాని వ్యవహార ధర్మముకొఱకు వస్తువులన్నియు నిజమని వా రంగీకరింతురు;దీనికిఁ గారణ మనాదియైన యవిద్యయందురు.వస్తువులపై జ్ఞానాకారము గల దోషారోపణమే విపర్యయము.౨.మన మొకజ్ఞానము విపర్యయమని యెఱుఁగుదుము.ఏలన దానిస్థానము నింకొకజ్ఞాన మాక్రమించినది.3.దాని కర్థక్రియాకారిత్వము లేదు."ఇది వెండి"యను

(3) న్యా॥ భా॥ ౪, ౨, 3౫.

(౧) న్యా. వా. తా. టీక. ౧. ౧. ౨.

(౨) అనాద్యవిద్యా వాసనారోపిత మలీకమ్బాహ్యమ్, తత్రజ్ఞానాకారస్యారోపః॥ భామతి॥ ౧. ౧. ౧.

(3) భామతి। బలవత్ బాధకప్రత్యయవశాత్॥

జ్ఞానములో, మార్పుపొందినది. 'వెండి' కాదు; 'ఇది' లక్షణము; ఏలన నిర్ణయములో 'వెండి' యను జ్ఞానరూపము 'ఇది' యను దానికున్నదని తలంచితిమి; మార్పునొందిన జ్ఞాననిర్ణయము "ఇది వెండికాద"ని చేయఁబడినది. ఇచట మనము తీసివేసినది 'ఇది' కాని 'వెండి' కాదు. ఏలన వెండి లేదనుట యొకజ్ఞానరూపము లేదనుట యగును. దీనిని జ్ఞానాకారఖ్యాతి యందురు. దీనిననుసరించి, యొక జ్ఞానరూప మొక బాహ్యవస్తువున క్రమముగా నారోపితమైనది. భ్రాంతి తొలగినపుడు, బాహ్యవస్తువైన రజితము విడువఁబడినది. ఇది యోగాచారుల యొక్క తత్త్వసిద్ధాంతమున కుపన్యాత్రమే. ఆత్మకును, జ్ఞేయమునకును, జ్ఞానమునకును నిజముగా భేదములేదని వారి సిద్ధాంతము. యోగాచారుల భావము ననుసరించి, మన జ్ఞానక్రియలు "ఇది వెండి" యను రూపములనుగాక "నేను వెండి" యను రూపములను గ్రహించవలెను. అట్లు వారు గ్రహించుటలేదు. సత్యాసత్య భేదమునకుఁ గారణములను యోగాచారులు చెప్పఁజాలరు. సర్వము వ్యక్తిగత మను తత్త్వమువలన నట్టి దోషము లుదయించును. తేనెలోఁ దియ్యతనమును, విషములో జేదుతనమునున్నవి. ఈగుణములు కేవలభావకల్పితములుగావు. యోగచారభావము ననుసరించియు నైయాయికుని వాదమైన ఒకవస్తువు నింకొకవస్తువుగా గ్రహించుటయే విపర్యయమనునదిచెల్లును.౧. మాధ్యమికులసత్ఖ్యాతివాదులు,అసత్కొక్కటియే

(౧) సాం. ప్ర. సూ. ౧. ౮౫ పై ననిరుద్ధుని వాక్యములు; న్యాయమంజరి పు. ౧౭౮.

నిజముగా నున్నది; బాహ్యాభ్యంతర వస్తుదర్శనజ్ఞానము లన్నియు దోషములే యని వారిసిద్ధాంతము. లేని వెండి యున్నట్లు గోచరించును; కారణమేమన మన యింద్రియములట్లు గ్రహించు లక్షణముగలవి, దీనికి నైయాయికుఁడిట్లు బదులు చెప్పెను, శుక్తిలో రజితభ్రాంతి శూన్యము వలనఁ గలుఁగలేదు; కారణము శుక్తిలోఁ గొంతయున్నది. భ్రమకుఁ గారణములు బాహ్యావస్తువులు కానియెడల, భిన్నభ్రమాకారూపములకు భేదముండదు. లేని వస్తువొక కార్యమునకుఁ గారణము కాఁజాలదు, మనస్సంస్కారముల వలననే విపర్యయ జ్ఞానము కలుగుననుట యుక్తము కాదేలన, బాహ్యావస్తువులు లేనిదే వానినిఁ గూర్చిన మనస్సంస్కారములు నుండవు.౨. అద్వైత మనిర్వచనీయఖ్యాతి నంగీకరించును. ఒక జ్ఞానక్రియలో గోచరించున దేదియైన జ్ఞానవిషయమే. రజితభ్రాంతిలో, రజితము భావగోచరమై, రజితజ్ఞానము నిచ్చును, లేకున్నచో నది రజితభ్రాంతియే యని యెట్లు చెప్పఁగలము? యే భ్రాంతియైనఁ గావచ్చును, కాని యాజ్ఞానము లోని రజితము నిజమునుగాదు; అసత్యమునుగాదు; రెండునుగాదు. నిజమైనచో జ్ఞానము నిజమగును; అసత్యమైనచోఁ బ్రవృత్తియే జనించదు; రెండునైనచో నొకేవస్తువులో రెండు పరస్పరవిరుద్ధ లక్షణములుండవలసి వచ్చును, కావున దాని స్వభావము నిజ

---

(౨) భ్రమాభావములు బాహ్యావస్తువుల వలన జనింపకున్నచో నపుడు సుషుప్తికిని భ్రమకును భేదముండదు; ఒక్కటే భేదము, భ్రాంతిలో మనో వ్యాపారమున్నది; సుషుప్తిలోలేదు, (ప్రమేయకమల మార్తాండము, పు.౧౩; న్యాయమంజరి, పుటలు ౧౭౭-౭౮)

ముగాననిర్వచనీయము, అనిర్వచనీయమగు రజితము గతానుభవములోని రజిత జ్ఞానసంస్కారవశమున నవిద్యచే సృజయించి, లోపభూయిష్ఠమైన యింద్రియమునకు వస్తుసంయోగముచే భ్రాంతి జనించుచున్నది. అద్వైతము ననుసరించి, భ్రాంతి నిజముగా మనస్సున కొక వస్తుదర్శనముచే లభించు జ్ఞానమే, భ్రాంతి జనించినచోట నాకాలమున రజితమున్నది, లేకున్నచో భ్రాంతికి వస్తుదర్శనముండదు. ఈరజితము భ్రాంతి యున్నంత కాలముండును. నైయాయికుఁడు దీని నిట్లాక్షేపించును. నిజముగా వెండిలేనిదే భ్రాంతిమయమైన రజితము జనించినచో, మన కేభావమున్న నావస్తువును జూడఁగలిగి యుండవలెను; అపుడు భావమునకును వస్తువునకును భేదముండదు, కాని యిట్టి జ్ఞానము తాను జెప్పిన అన్యథాఖ్యాతిలో లభించునని సంతసించినాఁడు; ఏలన నొక యనిర్వచనీయమగు వస్తువు మనస్సునకు ద్యోతకమగును.౧. అఖ్యాతి లేక వివేకాఖ్యాతి ప్రభాకరుని విపర్యాసవాదనామము, మనము చూచుశుక్తికిని భావించురజితమునకును భేదమును మనము గమనించలేదు; అందుచే 'ఇదిరజితము' నిపలుకుదుము, యుక్తజ్ఞానమీ భ్రాంతికి వ్యతిరేకముగాదు,

(౧) అద్వైతభావమును విమర్శించి రామానుజుఁ డిట్లడిగెను: "భ్రాంతి కాలమున ననిర్వచనీయ రజిత ముత్పత్తియగుటకుఁ గారణమేమి? రజిత జ్ఞానము రజితము నుత్పత్తిచేయఁజాలదు; ఏలన రజితము రజితజ్ఞాన కారణము గనుక, అది యింద్రియదోషము వలనను గాదు; ఏలన నింద్రియములు బాహ్య వస్తువులలో మార్పులను గలుగఁజేయవు. ఇంద్రియములు జ్ఞానము నిచ్చును; జ్ఞానవిషయముల నొసఁగవు.

భ్రాంతి దర్శనములోని స్మృత్యంశమునకును, జూపట్టు వస్తువునకును భేదమును గుర్తించును. దీనికి వ్యతిరేకముగా న్యాయమిట్లు చెప్పును, భ్రాంతి యున్నంతకాలము రజితము దర్శింపబడుచునే యుండును; అది భావమాత్రమే కాదు, ఇందు రజితమెట్టయెదుట నున్నట్లే గోచరించును కాని, వెనుకఁ జూచిన చెప్పుడు స్మృతికి వచ్చినదని తెలియుదు. భ్రాంతికాలమున నవివేకము క్రియాజనకము కాఁజాలదు. స్మృతిప్రమోషాస్వభావము స్పష్టముగాఁ జెప్పఁబడలేదు. అందువలన మన జ్ఞానేంద్రియమే దోషయుక్తమైన దని చెప్పవలెను.౨. న్యాయదర్శనము యొక్క అన్యథాఖ్యాతి వాద మితరులచేతను ముఖ్యముగా నద్వైతవేదాంతముచేతను ఖండింపఁబడినది.౧.

(౨) జయసింహసూరి అలౌకికార్థఖ్యాతివాదమును జెప్పెను. ఒక మీమాంసకుఁడు దీనికిఁ గర్తయని జయంతుఁడు పలికెను. దీనిననుసరించి, రజితజ్ఞానములో భ్రాంతివిషయము రజితము; ఈరజితము లౌకికరజితముగాదు మన యవసరములఁ దీర్చునది లౌకికము; కాని దలౌకికము. అలౌకికరజితము గొంతప్రవృత్తిజనకమే. అలౌకికరజితమును గూర్చి యవకేమైన జ్ఞానమున్నదా, భ్రాంతి తొలఁగినవెనుక నది యేమగునని నైయాయికుఁ డడిగినాఁడు. భాస్కరుఁడు సాంఖ్యవాదులును సమర్థించిన ప్రసిద్ధార్థఖ్యాతిని దనప్రమేయకమలమార్తాండమునందుఁ బ్రభాచంద్రుఁడు పేర్కొనినాఁడు. దీనిననుసరించి జ్ఞానవిషయ మొక మిథ్యావస్తువు కాదు; జ్ఞానస్థాపితమైన వస్తువే. జలభ్రాంతికి జలమే జ్ఞానవిషయము. ఈభ్రాంతిజ్ఞానము సూర్యకిరణ జ్ఞానముచేఁ దొలఁగినపుడు రెండుజ్ఞానములకు విషయములు రవికిరణములు. ఇది యుక్తమైన భావము కాదేలన, నిది జ్ఞానములన్నియు యథార్థములే యనును. (న్యాయమంజరి॥ పుట ౧౮౭-౮ ప్రమేయకమలమార్తాండము॥ ౧. అ.)

(౧) చూ వేదాంతపరిభాష. ౧౫.

కాలాంతరముననుదేశాంతరముననుగల రజితము ప్రత్యక్ష విషయము కాఁజాలదు. ఏలన నది యింద్రియవిషయముగాదు. అది మనస్సుచే స్మరింపఁబడిన దన్నచో, ననుమానమునందును నగ్ని స్మరింపఁబడినదని చెప్పవచ్చును. ఇఁక ననుమానమున కవకాశమేయుండదు. మఱియు నన్యథాత్వము దేనికిఁజెందును? అది జ్ఞానక్రియకుఁ జెందదు; ఏలన నందు శుక్తి తనరూపమును రజితజ్ఞానమున కొసఁగఁజాలదు. అది జ్ఞానప్రవృత్తిఫలితమున కును జెందదు; ఏలన దృశ్యము యథార్థమైన, నయథార్థమైనను నిచట భేదములేనిదే, అది జ్ఞానవిషయమైన శుక్తికిని జెందదు; ఏలన నది రజితముగాదు. రజితముగా మార్పునొందఁజాలదు. శుక్తిరజితముల కేమియు సాదృశ్యము లేకున్నచో, నవి సమానములు కాఁజాలవు. అది సమానము భిన్నముకూడ నైనచో నప్పుడు, "గోవు పొట్టికొమ్ములు గలది" మున్నగు నిర్ణయములు కూడ భ్రాంతి నిర్ణయములగును. శుక్తినిజముగా రజితముగా మారినచో రజితజ్ఞానము యథార్థమైనదై, దానిని మార్పుచేయ నవసరము లేకుండును. భ్రాంతి యున్నంతకాలము మాత్రమే శుక్తి రజితముగా మారుననచో, నప్పుడు రజితదర్శనము నేత్రదోషములేని వారందరుకూడఁ గలిగియుండవలెను.(౧)

## ౨౦—న్యాయసిద్ధాంతము – సామాన్య పరిశీలనము.

న్యాయదృష్టిలో జ్ఞాన మాత్మగుణమనియు, నది సత్యప్రతిబింబమనియుఁ జెప్పుటవలన నది సమర్థింపనవసరము లేని మవిశదమైన విషయముగా గోచరించును, కాని యిందుఁ గొన్ని

(౧) వివరణప్రమేయ సంగ్రహము.

భావములవివేకముగ నంగీకరింపఁబడియున్నవి. బౌద్ధుల భావజగ ద్వాదద్వేషముచే, సత్యమునకు వస్త్వస్తిత్వమే మూలమనియు, బాహ్యజగత్తుదిృష్టతో నిమిత్తములేకుండ నుండుననియు మన జ్ఞానము లేక మనభావములు వస్తుసారూప్యమును గలిగి యున్న వనియు నైయాయికులు నిశ్చయించిరి. వారు యథార్థస్వరూప మును రెండుగా విభాగించిరి; దృష్టలు; విషయములు, ఈప్రా కృతజన భావములనుండి తత్త్వసిద్ధాంతములను గల్పించిరి. కాని వీరి సిద్ధాంతము విజ్ఞాన సత్యములకుఁ గాని, తర్కసూత్రము లకుఁగాని సరిపడవు. న్యాయసిద్ధాంతములో లోపభూయిష్టము లైన ముఖ్యప్రతిపాదనము లివి: (౧) ఆత్మయు ననాత్మయుఁ బూర్తిగా వేరైనవి. (౨) ఆత్మపై ననాత్మవ్యాపారము వలననే విజ్ఞానముదయించును. (3) జ్ఞానమాత్మలక్షణము. ఇట్టి తాత్త్వి కములైన స్వీయాభిమాన భావములున్నను, న్యాయసిద్ధాంతము నందలి దోషములను దొలగించుటకు వీలైన కొన్నిసూచనల నదియే ప్రకటించియున్నది, జ్ఞానక్రియలలో మనము చూచిన విషయముల వివరణము న్యాయముచెప్పినంతవరకు యుక్తము గానేయున్నది. కాని దానికిఁ దాత్త్వికాధారములఁ జూపుట కది జ్ఞానాతీతభావముల నుపయోగించు నప్పుడవి ఖండనాస్పదములై యున్నవి. జగత్తు భావవిశేషకల్పితము గాదనియు, నది యనంత సామాన్య విశేషములతో నిండియుండిన సజీవరూపమనియు నది మనకుఁ బ్రత్యక్షజ్ఞానమున గోచరించుననియు, మన భావములు కార్యసిద్ధికి సామర్థ్యము గలవనియుఁ జెప్పుటలో ననుభవవిరోధ మేమియును లేదు. లాకే మున్నగు భౌతికజగత్సత్యవాదులకును

వలెనే న్యాయమునకును గల మూలదోష మేమన, ద్రష్టయొక్క ప్రత్యేక రూపమనియు దృశ్యమైన జగత్తింకొక వేఱురూప మనియుఁ దలఁచుటే యైయున్నది. ఈవ్యావహారికదృష్టి నిత్యావసరముల కెంత యుపయోగకరమైన దైనను, మన తత్త్వశాస్త్రమున కనుకూలమైన దైనను, సత్యసామర్థ్యము లేనిదగుచున్నది తర్కశాస్త్రమునకుఁ గల సమస్య, జ్ఞాన మెట్లుదయించునని కాక ముఖ్యముగా జ్ఞాన స్వరూప మెట్టిదనియే. జ్ఞానరూపమును నిర్ణయించుటకు, మనము దాని మూలమునకుఁ బోయి, దాని జన్మకారణముల నరయుటవలన సాధ్యపడదు. విజ్ఞానము కార్యమని నైయాయికుఁడు చెప్పునపుడు జ్ఞానప్రవృత్తి వెనుక కాతఁడు పోవుచున్నాఁడు.

ఆత్మయు ననాత్మయుఁ బూర్తిగా వేఱై, ఆత్మపై అనాత్మ యొక్క కారణప్రవృత్తిఫలితముచే విజ్ఞాన ముత్పత్తియైనదను వాదమునే లాకే, డేకార్టేలును, హ్యూమ్ క్యాంటులును బ్రకటించియున్నారు. ఇదే సత్యమైనచో విజ్ఞానవిషయ మంతయు నొకేవ్యక్తియొక్క మానసికదశాసముచ్చయమే యగును. అనాత్మ ప్రపంచవిషయము లాత్మకుఁజెందిన జ్ఞాన విషయభాగములు కాఁజాలవు; జ్ఞానము వాస్తవికజగత్తునే ప్రకటించు నెడల, నాజగత్తులోని వస్తువులకు ప్రతిబింబములనే ప్రకటించునుగాని యావస్తువులనుగాదు. ద్రష్టను విషయము నుండి వేఱుచేసినపుడు రెంటిమధ్యమందు సేతుబంధన మసాధ్యమగును. ద్రష్టయొక్క సృష్టియే దృశ్యమనికాని, దృశ్యమే లేదనికాని, చెప్పవలసియుండును. వస్తువు జ్ఞానకోశములోనికిఁ

చేసికొనఁబడినదనికాని, లేక నందుఁ బ్రతిబింబితమైనదనికాని, లేక దాని యాకృతియందు ముద్రితమైనదనికాని, వస్తువునకు జ్ఞానమునకు సంబంధమెట్టిదని మనము చెప్పినను, మనముచూచినట్లుగానే యథార్థజగత్తుండుననుటకు మనకు నిశ్చయాధారములు లేవు. ద్రష్టయు జగత్తు నొకదానికొకటి బాహ్యములై యున్నంతకాలము; అనగా నొకజడపదార్థమున కింకొకటి వేరైయున్నట్లున్నంతకాలము, మనభావములు వస్తువులకు సరియైన ప్రతినిధులనికాని, ప్రతినిధులే కావనునదికాని నిశ్చయింపఁజాలము. మన జ్ఞానరూపములను వస్తువులతోఁ బోల్చఁజాలము; ఏలన వస్తువులు జ్ఞానమునకు బాహ్యములైయున్నవి. మనకుఁ బ్రత్యక్షముగాఁ దెలిసినది విజ్ఞానమొకటే; దానిని వస్తువుతోఁ బోల్చలేము; ఏలన సాదృశ్యమునకు రెండువస్తువులుండవలెను; మనకొకటేయున్నది. ఒకవైపునభావమును, వేఱొకవైపున వస్తువునుబోల్చిన దేదైననున్నచో నది విజ్ఞానమే; (౧). కాని యట్టి విజ్ఞానములో నంతర్గతములై వస్తుభావములు రెండునుండియుండవలెను.

సత్యమనగా భావములకు వాస్తవికజగత్తుతో సారూప్యమైనచో, సత్యమనగా విజ్ఞానమునకు బాహ్యమైనదని నిర్వ

(౧) విజ్ఞానము వస్తులోకము వేరగువస్తువులని అలెగ్జాండరు పండితుఁడు భావించెను. ఈరెంటిసంబంధము సమకాలవర్తిత్వము, అవి వేరైనను రెండును సమీపములైయుండుట తటస్థించును కాని యీ విజ్ఞానస్వరూపమెట్టిది ? విజ్ఞానమనగా వస్తుజ్ఞానమే. దానియందు లేనిదానినది యెన్నడును జెప్పఁజాలదు.

చింపఁబడినచో, ననగా విజ్ఞానమునలేనిది, విజ్ఞానమునందుండఁ జాలనిది, విజ్ఞానమయము కానిదియన్నచో, సత్యాన్వేషణము వ్యర్థప్రయాసమే. విజ్ఞానమన్వేషించు లక్ష్యమెన్నటికి సిద్ధించదు; అంతేకాదు, ఆలక్ష్యమునుగూర్చి యెట్టియభిప్రాయమునుగలిగియుండుటకును వీలుండదు. విజ్ఞానగమ్యము, అనగా సత్యసాక్షాత్కారము దుస్సాధ్యమనునిర్ణయమే నైయాయికునెదుర్కొనును. పరిమితమానసమునకు విజ్ఞానపరమావధి సాధ్యముకానిదని యాతఁడు భావించును. అప్పుడు మనము భావములకు వ్యవహారసిద్ధిగలదను నల్పసంతుష్టితో నూరకుండ వలసివచ్చును. వ్యావహారికకార్యదక్షతలేక ప్రయోజనము మనకు దానియందువిశ్వాసమును గలుగఁజేయును. కాని భావములకు వ్యవహారసిద్ధియుండుటకుఁ గారణము భావములు యథార్థజగద్రూపములను న్యాయసిద్ధాంతమునకిది చెల్లదు. ౧. ఇదేవిధమైన యథార్థపరీక్షాపద్ధతి నంగీకరించిన బౌద్ధతార్కికులు భిన్ననిర్ణయములను బ్రకటించిరి. బౌద్ధనిర్ణయము లెక్కువ తర్కయుక్తములైనవని చెప్పవలసియున్నది. ఇచట సత్యవిషయము జ్ఞానవస్తుసారూప్యము కాదు;అనుభవముచేఁ బరీక్షింపఁబడవలెను. ౨. భావములు ప్రవృత్తిచోదకములు; మన మట్టి ప్రవృత్తివలన వాంఛితార్థసిద్ధిఁ బొందినచో, నవి యథార్థము

(౧) పోల్సు బోౘ్రిడ్: "శాస్త్రమునకొక విషయముయొక్క ఆంతర్యరూపమేమనునది ముఖ్యముకాదు; అది నియతకార్యసిద్ధి సాధనమగుటయే ముఖ్యము." (శాస్త్రీయవిజ్ఞానము పు॥ ౩౯)

(౨) న్యాయబిందువు. పు॥ ౧౦౩; న్యాయబిందు టీక పు॥ ౬

లని నిర్ణయింపవచ్చును. మనస్వప్నము లయథార్థములని వక్కాణింపఁబడినవి; ఏలన వానిపైనాధారపడిన వ్యాపారములు విఫలమగుచున్నవి. మనము స్వప్నమువలన నొక పొలమునుదర్శించి, యొక నిక్షేపమునుగాంచినచో, నట్టిస్వప్నము నిజమేయగును; స్వప్నభావము వాస్తవికతాసారూప్యమును గలిగియున్నను లేకున్ననిబ్బందిలేదు. అందుచే సత్యంతాధారయుక్తము, నతినిశ్చితమునైన జ్ఞానమునకు దోషావకాశమున్నది. లేశమాత్రిదోషావకాశమైనలేని యాధారముగల విశ్వాసమేదియునులేదు. ఈవ్యావహారిక ప్రయోజన పరీక్షాపద్ధతిపై నాధారపడి యొకవిధముగా జీవయాత్రచేయవచ్చును, గాని, దానివలన బూర్ణసంతృప్తి యెన్నటికినిగలుగదు. ఒకనికిఁ దృప్తినిచ్చిన దింకొకనికీయకపోవచ్చును. మనకుఁ గావలసినది సత్యస్వరూపమునుగూర్చిన తర్కనిశ్చయము; అది దీనివలన లభింపదు. బౌద్ధులవిజ్ఞానమునుండి మనరక్షణకై కంకణము ధరించిననేయాయము సత్యమునుగూర్చి యెక్కుడుతృప్తికరమైన మార్గమును మనకుఁ జూపలేకపోయెను. బాహ్యజగత్తును గూర్చిన మనజ్ఞానవిషయమున కనుకూలమగు నాధారమును న్యాయముచూపఁజాలనందున నది తన ప్రాథమికప్రతిపాదనములకుఁ దిరిగివచ్చి, జ్ఞానవిషయపరిశీలనములోని యంశములననుసరించి, తన భావములను పునఃపరిశీలనముచేయవసియున్నది.

నేనును నీవును గుర్తించినను గుర్తించకున్నను, వస్త్వాస్తిత్వము సత్యమనియు, నవి మనము గుర్తించుటతో నుండుట

కారంభించుటలేదనియుఁ జెప్పుట యుక్తముగానే తోఁచునుగాని, వాస్తవిక జగదస్తిత్వము మన యనుభవమునకుఁ బూర్తిగా వేరైనదని చెప్పఁజాలము. జ్ఞానమునకును, జ్ఞానవిషయమునకును గల సంబంధము స్వరూప సంబంధమని న్యాయము చెప్పుచున్నది. తెలియఁబడిన వస్తువు జ్ఞానప్రవృత్తిని నిర్ణయించును. జ్ఞానమనగా నొక వస్తుజ్ఞానము.(౧) మధుసూదనసరస్వతి(౨) ఉదయనుని వాక్యము లిట్లుదాహరించెను. "జ్ఞానక్రియలు స్వయముగా రూపరహితములు; వస్తువులే రూపనిర్ణయము చేయునవి. అనగా వస్తువులే జ్ఞానాకృతిని గల్పించును." జ్ఞానక్రియలన్నియు నొకలక్షణమును విశేషణముగాఁ గలిగియుండును. "ఇదియొక సిరాబుడ్డి" మున్నగునవి. తెలియఁబడిన వస్తువు పూర్తిగా జ్ఞానవ్యాపారమునకు వేరైనదైనచో నప్పుడు సత్యమును మనము సారూప్యమువలననే గ్రహింపవలెను. కాని దాని స్వరూపము జ్ఞానవృత్తిలోనిదే యనియు, జ్ఞానము మాత్రము వస్తు యథాస్థితికి వేరైనదనియుఁ జెప్పఁబడెను. ఈ భావము ననుసరించి, జ్ఞానమువలన వస్తూత్పత్తి లేదు. జ్ఞానమునకు వస్తుసారూప్యమును లేదు; జ్ఞానము వస్తువులను గ్రహించును. కావున వస్తువు జ్ఞానసీమావధుల కవ్వలనేయుండుననుట తప్పు. తెలియఁగలదేమన ద్రష్ట మనస్సులో వస్తుకార్యమో, ప్రతిరూపమో ప్రకాశించును. మనము దర్శించినను, భావించినను, స్మరించినను, మనము దర్శించునది, భావించునది, స్మరించు

(౧) న్యాయభాష్యము॥ ౪. ౨. ౨౮.
(౨) అద్వైతసిద్ధి॥ ౧ అ. ౨౦.

నదియు నొక వస్తుస్వరూపమే; అది జ్ఞానవ్యాపారమున కితరమైనది. ద్రష్టృదృశ్యములు వేరను భావమునకును, యథార్థ జగత్తును మనము ప్రత్యక్షముగా నెఱుఁగుదుమను సిద్ధాంతము నకును న్యాయదర్శనములో సమన్వయము లేదు. తెలియు ద్రష్ట కును, దెలియఁబడు వస్తువునకును మధ్యమందు నిరోధించునదే మియును లేదు. ద్రష్టృదృశ్యములు రెండు నభేదములుగాఁ గలిసి యున్నవి. ఒకటి రెండవది కాఁజాలదు. ద్రష్టయొక్క మనః కల్పిత రూపములే వస్తువులను విజ్ఞానవాదమును నిరసించుటలో న్యాయము యుక్తముగా నేయున్నది. ద్రష్టయొక్క జ్ఞానవ్యాపా రముచే దృశ్య ముదయించుటలేదు. సర్వసామాన్య సంబంధ ములు కూడ ద్రష్టయొక్క సృష్టికాక యథార్థజగత్తులోనివే యని చెప్పఁబడెను. ఇంద్రియవిషయము లన్యోన్యసంబంధ శూన్య రేణువులవలె గోచరించుటలేదు; అవి కొన్ని గుణములను లక్షణములను బ్రదర్శించుచున్నవి. అనంతరన్యాయము ననుస రించి, సామాన్యములేక సర్వసమానలక్షణ మింద్రియములతో సంబంధములేని అలౌకికమగు మానసికవ్యాపారమువలనఁ దెలి యుచున్నది. మన యనుభవ జ్ఞానరాశిలోఁ జాలభాగ మిట్టిదే. జగత్తు తన్నుఁ దెలిసికొమ్మని మన కుద్రేకము కలిగించుచున్న దని నైయాయికుఁడంగీకరించినాఁడు. మన యనుభవము నుత్సహింపఁజేయునది లోకముకాని ద్రష్టకాదు. యథార్థజగత్తు మూలములో ద్రష్టృదృశ్యభేదమును గలిగియుండలేదు. అవిభాజ్యమైన జగత్తే సర్వవిజ్ఞాన మూలము. మనము దానిని దెలియు వ్యాపారములో నాత్మలు వేరు, జగత్తు వేరు నని వస్తు

విభాగము చేయుచున్నాము. మన భావకల్పనములు జీవితములో ననేకప్రయోజనములను గలిగియున్నమాట వాస్తవమే కాని, మన జ్ఞానసిద్ధాంతమున కవసరమగు యథార్థజగత్తు మూలభూతమైన చైతన్యరూపము. జ్ఞానముయొక్క స్వరూపస్వభావములను గూర్చిన పరిశోధనమువలన నీ చైతన్యము విశ్వమయమని తెలియఁగలదు. సర్వవస్తువులకుఁ గారణము నాధారము నదియే. అదియొకవిధమగు భౌతికరూపమని తలఁచుట సమంజసముగా నేరదు. అదియొక సముచ్చయ పదార్థము కాదు. జగత్తు పదార్థయుక్తముగా నోపును. దానిని ద్రష్టృదృశ్యవిభాగము చేయుట మన వ్యవహారప్రయోజన సిద్ధికొఱకే. కాని మూలరూపమైన యథార్థజగత్తు పూర్తిగా నవిభక్తము. దానిని గూర్చిన మన విజ్ఞానములో నీ విభాగము లుదయించును. దాని స్వరూపమును బుద్ధిశక్తిచేఁ దెలిసికొన యత్నించునపుడు బుద్ధిశక్తిసహజమగు విభాగవిధానము తప్పదు. కాని యే జగత్తునుగూర్చి మన భావములు చెప్పునో దానికి మన విభాగవిధానము లవసరములేదు. అందుచే నేకమై యవిభక్తమైన సత్యము శుద్ధచైతన్యమే. దీనిని నైయాయికుఁడు విడిచి, వ్యక్తి వస్తువిభాగ నానాత్వమును బ్రతిపాదించినాఁడు.

యథార్థస్వరూప మేకమగు చైతన్యమైనను, తార్కికులు కోరు సత్యస్వరూపము దీనికి భిన్నమైనది; ఏలనఁ దర్కమునకు ద్రష్టృదృశ్యభేదము సహజమైన దగుటచే, వ్యక్తి వస్తురూపమైన దగుటచే,వ్యక్తి వస్తురూపమైన నానాత్వమునుండి యేకత్వమును స్థాపించుట వలనఁగాని వారికిఁ దృప్తియుండదు. న్యాయము

సారూప్యవాదమున కనుగుణమైనను, సమవాయ సిద్ధాంతము మిక్కిలి యుక్తమైనదని గ దీని ననుసరించి జ్ఞానరూపములన్నియు నొక పూర్ణములోని యంశము లనియుఁ బ్రత్యంశమున కుచితస్థానమాపూర్ణములోఁ గలదనియు నంతకు మించిన వ్యాపారమేదియు దానికి లేదనియుఁ జెప్పెను. ఏప్రమాణము యొక్క యాథార్థ్యమైన నితర ప్రమాణములే ఋజువుచేయునని చెప్పఁబడెను.౧. భిన్నజ్ఞానరూపము లన్యోన్యసంబంధయుక్తములు, జ్ఞాన మవశ్యశక్తి గలది, స్వప్న గతులు నున్మాదులుపొందు సంతుష్టి యుక్తమైనది గాదనియు, మనకుఁ బ్రమాణమారోగ్యవంతుఁడై సహజలక్షణ సంపన్నుఁడైన వ్యక్తి యొక్క యనుభవమే యని నైయాయికుఁ డుద్ఘోషించి నప్పుడాతఁడు తన సారూప్య సిద్ధాంతమునకుఁ దిలోదకముల నిచ్చినాఁడు. సహజలక్షణ సంపన్నుఁడైన వ్యక్తి, యధిక సంఖ్యాకులైన జనులకుఁ జెందఁడు, ఈదృష్టి ననుసరించి, కొన్ని భ్రాంతిమయజ్ఞానరూపములు సహజలక్షణములలోఁ జేరును, సంఘము యథార్థానుభవములకంటె భావకల్పనముల కెక్కుడు ప్రాముఖ్యము

(౧) మన మొక వస్తువును జూచి, దాని యాథార్థ్యము ననుమానము వలనను, దాని యందున్న వివిధాంశము లనఁగా నింద్రియములు, వస్తువులు, రెంటి సంయోగము, తత్ఫలితమైన జ్ఞానక్రియలవలనను స్థాపింతుము. బాహ్యములైన యొక జాతివేదనలను స్వీకరించునదే యింద్రియమని యనుమానముచే గ్రహింతుము; యింద్రియదర్శనము వలన వస్త్వస్తిత్వము నిరూపితము; భేదములను జూడకుండుటవలన సంయోగము స్థాపితమగును, ఆత్మ మనస్సంయోగము వలనను, జ్ఞానసంపర్కము వలనను, నీ ప్రవృత్తి ఫలితమగు జ్ఞానమును బొందును. (న్యా.భా.౨.౧.౧౯.)

నిచ్చును. మన యనుభవముల నితరుల యనుభవములతోఁ బోల్చుట వలన వ్యావహారికసిద్ధి కనుకూలమగు నిశ్చయజ్ఞానము మనకు లభించును మనము చూచినది, యితరులు చూచినది, భిన్న దేశకాలములలోఁ జూచిన యెడల నది యథార్థమైనది కావచ్చును. మన యనుభవము లన్నియు శాస్త్రనియమానుగుణములై యుండవలెను. సూర్యుఁడాకాశమునఁ బయనించుచున్నట్లు మనము చూచినను, భూమియే సూర్యుని చుట్టును దిరుగుచున్నది కాని సూర్యుఁడు కదలుట లేదని శాస్త్రము చెప్పుచున్నది. అపరిణతములు సమన్వయ శూన్యములు నైన యనుభవములను, బరిణతములు,సమన్వయసిద్ధములు నైన యనుభవములతోఁ బోల్చి పరీక్షించవలెను. పరిణతానుభవమే ప్రామాణ్యమును సూచించును. వస్తువుమీఁదఁగంటె, దేశకాలాత్మకమైన వ్యావహారిక రంగమున కానుగుణ్యముపై నధికముగా సత్యమాధారపడును. యథార్థ జగన్నిర్మాణవిధానము,సత్యమునకాశ్రయమిచ్చునదిగా నుండవలెను, దేశకాలవ్యవస్థ అవిచ్ఛిన్నమైనదని భావింపఁబడినది. ప్రయోజనవాదులననుసరించి నైయాయికుఁడు జగత్తునుగూర్చిన మనభావములు వ్యవహార క్రియానుగుణములని యంగీకరింపవలెను. ఒకవస్తువును గూర్చిన జ్ఞానము ప్రస్తుతావసరముల కనుకూలించునదే. నిత్యజీవితములో వస్తుమూలభావములు మనకవసరము లేదు; వాని ప్రస్తుతార్థమే మనకు వలయునది. అందరకును శిలలు కాఠిన్యమును, నిప్పు వేడిమినే చూపు ననగా నీ వస్తువులెల్లప్పు డొకే యనుభవము నిచ్చునవని యర్థము. వ్యవహారసిద్ధమగు సారూప్యతయే నైయాయికుని

యథార్థరూపము. ఈప్రమాణమునను సరించి, మానవులందఱ రకుఁ జాతులకు గల సామాన్యములగు భ్రాంతిభావములు, యథార్థములగును. ఈప్రమాణము భూతభవిష్యద్విషయములకుఁ జెల్లదు. మన సత్యాంశములు నిత్యములు కాకున్నను నన్నియు సమానమగు విలువగలవికావు. ప్రపంచము నొక పూర్ణవస్తువుగా గ్రహించు ముఖ్యమైన తార్కికాశయమును సంతృప్తి చేయు నదుత్తమ సత్యము. ఏపరమానుభవము యథార్థప్రపంచము నొక పూర్ణవస్తువుగా గ్రహించి, యందు వ్యక్తులకు లోకమునకు సమస్థానము చూపునో యాయనుభవమే సత్యప్రమాణము. దీని భావమనేకులట్టియనుభవమును బొందిరని కాదు; తార్కికదృష్టి కలవాఁడట్టి యనుభవము వలన సత్యమును దర్శించఁగలఁడని యే తాత్పర్యము. జనసామాన్యభావము సంఖ్యాపరిగణనముచేఁ దెలియునది కాదు.౧. అధిక సంఖ్యగల జనులు ప్రపంచనానాత్వమును విశ్వసించుటచే నట్టి విశ్వాసము వలని వ్యావహారికప్రయోజనసిద్ధినే తెల్పునుగాని యింకేమియుఁ

(౧) పోల్చు: ఒక యంధుఁడు, యుక్త లక్షణములుగల సామాన్య మానవునికి లభించు నేత్రేంద్రియ వికాసమున కవకాశమును గోల్పోయెనను విషయమును, మన మధికసంఖ్యాకులంధులు కారను విషయము వలన గ్రహింపఁగలమా? హఠాత్తుగాఁ దనకు దృష్టిలాభము గలిగిన ప్రథమాంధుఁడు కాంతి యున్నమాట నిజమని వక్కాణించుట కధికారమున్నది. మానవజాతిలో, నాత్మ జ్ఞాననేత్రములు తెరవఁబడినవారి సంఖ్య అతిస్వల్పము, కాని జ్ఞాననేత్రహీనుల సంఖ్య అత్యధికమైన దైనను, కాంతి లేదనుటకు సాక్ష్యముగా వారిసంఖ్య నుదాహరింపరాదు." (చూడు. రాధాకృష్ణుని ఫిలాసఫీ ఆఫ్ ది ఉపనిషత్సునకుఁ దొలిపలుకు. రవీంద్రనాథ టాగూరు)

దెలుపదు. సత్యాసత్య సమస్య జనుల సంఖ్యాబలముచే నిశ్చయముకాఁజాలదు, అధికసంఖ్యాకులకు పచ్చకామెర్ల దోషము పట్టుటచే సత్యస్వరూపము మారదు. అనుభవమహాసాగర గర్భమును సమగ్రపరిశీలన మొనర్చినవారి కేసత్యముద్యోతకమగును. నైయాయికుఁ డార్షజ్ఞానము ప్రమాణమే యని యంగీకరించును. మన యనుభవములను మహాపురుషుల యనుభవము ననుసరించి చూచుకొమ్మని యాతఁడుపదేశించినాఁడు, శ్రేయ స్సౌందర్యముల వలెనే సత్యమును వ్యక్త్యనుభవ సాధ్యమైనది; అనగా నింకను మన యనుభవములోనికి రాక, క్రిమోన్నత పూర్ణానుభవసాధ్యమై, మానవ మానసమున కావిష్కృతమగుటకు వేఁచియున్నదే సత్యము, మనము సత్యమును నిర్మింపము; కనుగొందుము. కాని నైయాయికుఁడు పెక్కుసారులు మనస్తత్త్వజ్ఞుని భావములోనికిఁ బతితుఁడై, జీవులును జడపదార్థములును గలిసి జ్ఞానోత్పత్తి హేతువులగునని వాదించినాఁడు. మనకుఁ బ్రయోజన సిద్ధినిచ్చి వ్యావహారికజ్ఞానము న్యాయము ప్రతిపాదించిన రీతిని ద్రష్టృదృశ్యములకు మూలమందు విభాగమును స్థిరపరుపదు. దానియర్థ మేమనగా మన స్వభావమందును, దానికి దృప్తికలుగు నవకాశము నందును మనకుఁగల విశ్వాసమునే సూచించును. మానవ ప్రవృత్త్యవసరములకు జగమను గుణమై యున్నదనుట యథార్థజగత్తువకు రూపద్వయమైన మానవ మానసములు, వస్తువులు నన్యోన్యసంబంధయుక్తములై యున్నవని సూచించును. సూలదృష్టి గోచరమగు నానాత్వము, సంబంధరహిత వస్తుత్వము పరమసత్యము గాదు. బాహ్య

సంబంధము గలిగిన రెండు యథార్థస్వరూపములను జెప్పు సిద్ధాంత మేక యథార్థజగత్సిద్ధాంతమునకుఁ దావీయవలెను.

సర్వవిజ్ఞానమును వ్యవహారప్రయోజనాత్మకము నుపకరణ రూపమునగుటచే, (దర్క-సిద్ధమగు సత్యమునట్టిదేయని నైయా యికుఁ డంగీకరింపక తప్పదు. తర్క-నిశ్చితమగు సత్యము, యథార్థ జగదూపమునుగూర్చి పరస్పరసంబంధమునుగలిగిన జీవులు వస్తువులుగల వ్యవస్థగాఁ దలఁపఁబడిన కారణముచే నిది వ్యవహార ప్రయోజన సంబంధముగలదిమాత్రమే యగుచున్నది; కాని, సత్యము లైన నానావస్తుజాలములతో నిండియుండునదే జగత్తను భావముకంటె నిది యధికసంతృప్తికరమైనది. యథార్థజగ త్స్వరూపమును భావకల్పనముచే దెలియవీలగు సత్యముగా నిశ్చయింపఁబడెను. మన నిర్ణయానుమానములు పూర్ణత నాసించును. ఈసత్యసంగ్రహ ప్రయత్నమునందుఁ గలిగిన జయాపజయముల భిన్నదశలననుసరించి, వీనికి జ్ఞానము నందుచితస్థానములుండును. వాస్తవికజగత్తులో వ్యక్తి యొక యల్పాంశము; మఱొకయల్పాంశమగు వస్తువును విడదీసి తెలిసి కొనుటకు యత్నించుచుండుటచేఁ దర్క-సిద్ధమైన సత్య మంతయు వ్యావహారిక మే; తర్క-దృక్పథములో నిలిచియున్నంత కాలము జగత్తును సస్వరూపములోఁ జూచి దెలిసికొనుట దుస్తరమైనదే. మనవిజ్ఞానము విభజించి వేరుచేయుస్వభావము గలదగుటచే మనము ప్రయోజనవాదమునే యుపయోగింపక తప్పదు. అత్యంతవిశాలమైన విజ్ఞానమును, తత్కర్తను విడిచి పెట్టును; నిజముగా నాకర్తయు నందొకయంశమే. అందుచే

జ్ఞానమంతయు యథార్థరూపమునుగూర్చిన భావకల్పనమే. పరమసత్యమునుగూర్చిన పరిపూర్ణభావకల్పనము. ౧.

ప్రత్యక్షమును న్యాయము విభాగించిన విధానమును, స్వరూపసంబంధ సిద్ధాంతమును మన జ్ఞానమునందు వాస్తవికత యిమిడియున్నదని చెప్పును. దర్శనము సవికల్పకము, నిర్వికల్పకము నను భేదముచే మన జ్ఞానము మన యవసరోచితమైన వ్యావహారిక జ్ఞానమని స్పష్టమగును. కొన్ని దశలలో జగత్తును గూర్చి మనకు స్థూలపరిచయమును, కొన్నిదశలలో దాని గాంభీర్యము నెఱిగిన సూక్ష్మపరిచయమును గలుగును. జీవితావసరసిద్ధి నొసఁగు క్రియాసామర్థ్యము సత్యమునకుఁ బ్రామాణ్యమని నిశ్చయించుటచే మన సత్యజ్ఞానము మన దృక్పథముల ననుసరించి పరిమితమైనదని తెలియుచున్నది. మన తత్త్వశాస్త్రావసరముల ననుసరించి సంబంధములేని రెండురకముల రూపములతోఁ గూడినదే ప్రపంచమని విభాగించుట యుక్తమే కావచ్చునుగాని, మనము తర్కసీమ కరుదెంచినపుడు ద్వైతభావము నతిక్రమింపవలసియుండును. మేము చూపినట్లే, న్యాయదర్శనము భావించిన సమవాయసూత్రము ననుసరించి సత్యమును బ్రకటించుటయే తర్కశాస్త్రమున కుచితమగును. ఈవ్యావహా

(౧) బ్రాడ్లే: "తుదకుఁ బ్రపంచ మనిత్యదృశ్యమే యగుట నిజమైనచో నట్టి ప్రపంచమహత్త్వ మఖండమైనదగును. ఏలన నది పరిపూర్ణమైన యొకానొక దివ్యతేజస్సుయొక్క ప్రతిబింబమని దర్శింతుము. అట్లిదికాక, లక్షణశూన్యములైన యణువులనో, భావకల్పనములనో మఱుఁగుపరచు తెరవంటిదేయైనచో నది తప్పక మోసమేయగును" లాజిక్కు వాల్యుము ౨ పు. ౯౯౧.

రేకసిద్ధాంతమునకు ఫలిత మేమనగాఁ దర్కము కల్పించిన నానావస్తుజాలము సంబంధయుక్తమైన యొక సముచ్చయరూప భావము పూర్ణసత్యము కాఁజాలదు. పూర్ణపరమసత్య స్వరూపమును గూర్చిన సమస్యను బరిష్కరింప న్యాయదర్శనము పూనుకొనలేదు. కాని న్యాయము ప్రకటించిన జ్ఞానసిద్ధాంతమును లోపరహిత మొనర్చినచో, ద్రష్టృదృశ్య భేదములు నిజముగా విజ్ఞానములోనివనియు, నంతకుమించి మన భావము లున్నతిసందఁజాలవనియు స్పష్టమగును.

## ౨౧—ప్రకృతిప్రపంచము.

న్యాయదర్శనము వైశేషికతత్త్వము నంగీకరించి, భౌతిక ప్రపంచము, నిత్యములు, కారణరహితములు, పరివర్తనశూన్యములు, మన భావములతో నిమిత్తములేని స్వతంత్రాస్తిత్వము గల యణువులచేఁ గల్పింపఁబడినదని నమ్మును. న్యాయశాస్త్రము విశ్వసించు భౌతికపదార్థమును గూర్చిన భావము లించుమించుగా వైశేషికవాదుల భావములే.

కాని తన యీ సిద్ధాంతమునకు వ్యతిరేకవాదు లొసఁగిన యాక్షేపణముల కెట్టి సమాధానములను న్యాయ మొసఁగినదో చూచుటలో నుల్లాసము జనింపకపోదు. కాలసమస్య కొన్ని విచిత్రములగు కష్టములను బ్రదర్శించును. కొందరు నైయాయికులు కాల మొకవిధమగు ననుభవమనియు, దర్శింపఁబడిన వస్తువులయొక్క లక్షణముగా నది గోచరించుననియుఁ దలఁచిరి. శిఖామణి గ్రంథకర్తయైన రామకృష్ణాధ్వరి, మనము వస్తువులను వర్తమానములోఁ జూచుచుంటిమి కావునఁ

గాలమును దర్శింపఁబడినట్లేయని చెప్పినాఁడు. ప్రస్తుతము మన యెదుటనున్న ఘటమువలనఁ బ్రస్తుతకాలము కూడ నీ దర్శనమందున్న దన్నమాటయే. ప్రతివస్తువు కాలమునందున్నట్లు చూడఁబడినను, కాలముమాత్ర మెన్నఁడును జూడఁబడదు.౧. కాలసంబంధములు వస్తుసంబంధములపై నాధారపడియున్నవి. గతాగతములు గాని, మాంద్యవేగములుగాని విషయవ్యాపారములకు వేఱైయుండఁజాలవు. కాలము వస్తుగుణముగా దర్శింపఁబడును గావున నది యథార్థద్రవ్యమే యగును.౨.

భూతభవిష్యత్తులతో సంబంధించని వర్తమానకాలమను నది లేదనిచెప్పు మాధ్యమికసిద్ధాంతమును వాత్స్యాయనుఁడు పరీక్షించినాఁడు.౩. వర్తమానమునకుఁ బూర్వమైనది భూతము పరమైనది భవిష్యత్తనని చెప్పఁబడెను. కావున భూతభవిష్యత్తులతోనిమిత్తములేకుండ వర్తమానకాలము వేరుగాలేదు. దేశకాలసంబంధములనుగూర్చి పొరపడుటవలన నిట్టి దురభిప్రాయము కలిగినదని వాత్స్యాయనుఁడు చెప్పినాఁడు. ఒక వస్తువు పతితమైనపు డావస్తువు కొంతదూరము జరిగినకాలమునకు, నింకను జరుగవలసినకాలమునకును మధ్యమందుఁ గొంత కాలమున్నది. ఇదియే వర్తమానమని చెప్పవచ్చును. గతమయిన దేశము భూతకాలమును, గంతవ్యమయిన దేశము భవిషత్కాలమును, దెల్పును. ఈరెండునుగాక మూఁడవ

---

(౧) న్యాయమంజరి పు. ౧౩౬.
(౨) ,, ,, పు. ౧౩౭.
(౩) న్యా: భా. ౨. ౧. ౩౯; ౨. ౧. ౪౩.

స్థానము వర్తమానమునకు లేదు. ౪. కాని వాత్స్యాయనుఁ డిట్లు చెప్పినాఁడు: "కాలము దేశరూపమునఁగాక క్రియారూప మున గోచరించును." ఒకవస్తు పతనము పూర్తియైనవెనుక మనకు భూతకాలభావము జనించును ... అట్టిక్రియయే ముందుజరుగఁబోవునపుడు భవిష్యత్కాలభావ ముదయించును. ఆవస్తువుయొక్క క్రియ జరుగుచుండగాఁ జూడఁబడిన కాలము వర్తమానము. ఇట్టిసందర్భములలో, జరుగుచున్న కార్యమును జూడనివ్యక్తికి జరిగినది జరుగఁబోవునది చూచుట యెట్లు సాధ్యపడును? గతించినట్టియు రానున్నట్టియుఁ గాలములలో వస్తువు క్రియాశూన్యము. వస్తువు పతనమగుచున్న కాలము లందు వస్తుక్రియ మనము ప్రత్యక్షముగాఁ జూడఁగలము. అందుచే వర్తమానకాలము వస్తువునకును వస్తువ్యాపారమునకుఁ గల సంబంధమును జూపును; కావున నీ వర్తమానకాలముపై నాధారపడియే భూతభవిష్యత్కాల భావములను మనమూహింప ఁగలము. వర్తమానములేకున్నచో మిగిలినరెండు నుండు టకే యవకాశములేదు." ౧. మఱియుఁ గాలములోనున్న వస్తువులనుగూర్చియే వానిని దర్శించుటజరుగును. అందుచే వర్తమానము శూన్యముకాదు; దానికిఁ గొంతపరిమాణ మున్నది; అది కొంత దళసరిగల యిటుకవంటిది.౨.

(౪) న్యా. భా. ౨. ౧. ౩౯.

(౧) న్యా. భా. ౨. ౧. ౪౦

(౨) వైట్ హెడ్. ది ప్రిన్సిపుల్ ఆఫ్ రెలెటివిటీ. పు ౭.

పరిణంచోత్పత్తి స్వభావములను గూర్చిన కొన్ని సిద్ధాంతములను వాత్స్యాయనుఁడు విమర్శించినాఁడు.3. క్షణిక వాదము నాతఁడు ఖండించి, యొక వస్తువొక క్షణములోనే పోయి యింకొకటి వచ్చుననుట కాధారము లేదనియు, వస్తూత్పత్తికి వస్తువిరతికి నొకసంయోగ సూత్రముండవలెననియుఁ జెప్పినాఁడు, క్షణకాలదృశ్యము లున్నచోట వానిని మన మంగీకరింప వచ్చునుగాని, లేనిచోట ననగా శిలలు మున్నగు వానియందు క్షణికత్వము నంగీకరింపఁ జాలము.౪. వస్తువుల పరంపరాస్తిత్వము వాని యవిచ్ఛిన్నతనుగూడ సూచించును. అంతయు నభావమను వాదము నాతఁడు ఖండించినాఁడు. అంతయు నభావమైనచో వస్తుసముచ్చయము లుండవని యాతఁడు వాదించినాఁడు.౧. వస్తువులన్నియు నన్యోన్యాధారభూతములనియుఁ జెప్పఁజాలము. దీర్ఘము, హ్రస్వమునైన నన్యోన్యాధారభూతములైన నైనచో విడిగా నేదియు స్థాపితము కాదు. ఇందేదియో యొకటైనను స్వయంస్థితిలేనిదైనచో వానికిఁ బరస్పరసంబంధమును నిరూపింపఁ జాలము.౨. వస్తువుల యుత్పత్తి వినాశముల వలన వాని యుని

---

(3) న్యా. భా. ౪. ౨. 3౧-33; ౪. ౨. ౨౬-౨౭.

(౪) న్యా. భా. 3. ౨. ౧౧; 3. ౨. ౧౨-౧3.

(౧) న్యా.భా. ౪.౧.3౭-౪౦; ఋతియుఁ జూడు. ౪-౨, ౨౬-౨౭, 3౧-33.

(౨) "వస్తువులకు విశిష్టవ్యక్తిత్వము లేనిచో రెండు సమానాణువులకుఁ గాని రెండు సమానపరిమాణమములు గల వస్తువులకుఁ గాని పొడవు పొట్టి లక్షణములున్నట్లు మనకేల గోచరింపవు ?...... మనము రెండు వస్తువులను జూచినప్పుడొక దానికంటె నొకదాని యాధిక్యమును దర్శించుటకు వీలగుటయే ఆపేక్షా లక్షణము." (న్యా.భా. ౪.౧.౪౦)

త్యతాసిద్ధాంతము నిశ్చితమైనది.అణ్వాకాశ దేశకాలములు, వాని లక్షణములు గొన్నియు నుత్పత్తి నాశనములు లేనివని నైయాయికుని వాదము.3. సకలవస్తువులు నిత్యములను భావమును దోషయుక్తమే; ఏలనఁ గొన్ని వస్తువుల యుత్పత్తి నాశనము లను మనము చూచుచున్నారము, సముచ్చయాత్మక ద్రవ్యములు కూడ నుదయించి నశించుచున్నవి.౪. వాత్స్యాయనుఁడు సర్వపృథక్త్వవాదమునుగూడఁ బరిశీలించినాఁడు.౫.భకపూర్ణము కేవల తదంశాసముచ్చయము కాదనియుఁ బూర్ణము నందలి భిన్నాంశములు పూర్ణముతో సమవాయసంబంధమును గలిగి యున్న వనియు నైయాయికుఁడు చెప్పును.పూర్ణమనగాఁ దదంశా సముచ్చయమే యను బౌద్ధవాదమునుఁ వాత్స్యాయనుఁడు ఖండించి, యట్టి సంబంధము మిథ్యయని చెప్పినాఁడు.౭.

ప్రపంచ మభావజము కాఁజాలదు.అభావవాదులు చెప్పె నదేమనగాఁ గారణము నశించినఁగాని కార్యముదయించదని, మొలకజనించుటకుఁ బూర్వము బీజము నశించును. వాత్స్యాయనుఁడు దీనిని ఖండించినాఁడు, కారణము నశించినచోఁ

(3) న్యా.భా. ౪.౧.౨౫-౨౮.

(౪) న్యా.భా. ౪.౧.౨౯-33.

(౫) న్యా.భా. ౪.౧.3౪-3౬.

(౬) క్రీ. వెనుకనించు మించు 9-వ శతాబ్దాంతమున జీవించిన బౌద్ధాశోక కృతమగు 'అవయవనిరాకరణ' మను జూడుడు.

(౭) సాంఖ్యైకాంతవాదమును గూర్చి వాత్స్యాయనుఁడిచ్చిన వివరణము విశదముగాలేదు, అదిబహుశః పైథాగరస్ సంఖ్యాసిద్ధాంతము వంటిది కావచ్చును.

గార్యముదయింపఁ జాలదు, బీజనాశనమైన వెనుక నంకురోదయ మగుచో, మన మొక బీజమును ధూళిగాఁ జేసిన వెంటనే మొలక పుట్టవలెను, కాని నిజముగా జరుగున దేమన, బీజము బ్రద్దలై యందలి భాగములొక నూత్నాకృతిని దాల్చిన వెనుక మొలక జనించుచున్నది. కావున మొలక, అభావమునుండి కాక, బీజాంశముల నూత్ననిర్మాణమునుండి, జనించుచున్నది.౧. నిమిత్త ధర్మమును నిరసించుట సర్వానుభవ విరుద్ధమైనది.౨.

౨౨—జీవాత్మ - తద్గమ్యస్థానము.

న్యాయదర్శనము ననుసరించి, జగత్తులోఁ గొన్ని ద్రవ్యములుకాని వున్నవి. జ్ఞానక్రియలు, కామములు, ద్వేషములు, సంకల్పములు, సుఖదుఃఖానుభవములు3. ఈ విజ్ఞానరూపము లన్నియు ననిత్యములు; వీనిని ద్రవ్యములతోఁ బోల్చరాదు. అవి 'ఆత్మ' యను ద్రవ్యగుణములు.

'ఆత్మ' యథార్థమైన ద్రవ్యము; దాని గుణములే కామ ద్వేష సంకల్ప సుఖదుఃఖాది జ్ఞానములు. సాధారణముగా నైయాయికుఁ డాత్మాస్తిత్వము ననుమానముచే స్థాపించి, శబ్ద ప్రమాణముచే దానిని స్థిరపరచును.౪. ఆత్మాస్తిత్వమును బ్రత్యక్షముగాఁ గూడఁ దెలియ సాధ్యమని యుద్ద్యోతకరుఁడు

(౧) న్యా. భా॥ ౪, ౧, ౧౪-౧౮.

(౨) న్యా భా॥ ౪, ౧, ౨౨-౨౪.

(3) సుఖదుఃఖములు, రాగద్వేషములు భావమాత్రములైనచో, మనకు త్రివిధ విజ్ఞానరూపము లున్నవి; జ్ఞానము, భావము, సంకల్పము.

(౪) న్యా॥ సూ॥ ౧, ౧, ౧౦.

వాదించినాఁడు. 'నేన'ను దానివిషయమే ఆత్మయని యాతఁడు పలికెను.౪. గత భిన్నానుభవము లన్నియు 'నా వే'యను జ్ఞానమువలన 'నాత్మ' యవిచ్ఛిన్నత దెలియుచున్నది.౬. "ఒకవ్యక్తి యే దేనొక విషయమును గూర్చి తెలియఁగోరునపుడు మొదట నాతఁ డదేమై యుండునని తలఁచి, తరువాత ఆవస్తు వట్టి దిట్టిదని నిశ్చయించుకొనును. ఇట్టి వస్తుజ్ఞానము నెఱిఁగిన కర్తయే పూర్వము దాని నెఱుఁగఁగోరినవాఁడు, దానినిగూర్చి యాలోచించినవాఁడునై యున్నాఁడు. కావున నిట్టి జ్ఞానము భిన్నదశలలో వర్తించిన వ్యక్తి 'ఆత్మ' యను నొకేవ్యక్తికిఁ జెందినదని తెలియును."౧. మనకుఁ బూర్వమెఱిఁగిన వస్తువుల స్మృతి యున్నది.౨. ఒకఁ డొక వస్తువును జూచినప్పుడు, దానిచే నాకృష్టుఁడైనప్పుడు, దానిని సంపాదింప యత్నించునప్పుడు, గల భిన్నప్రవృత్తుల కాధారభూతమైన దొకేయాత్మ.3. మన మానసికజీవిత మనుక్షణమునందు నొక వ్యక్తి జీవితచరిత్రములో నొక ముఖ్యాంశము కాఁగల సమున్నతలక్షణ యుక్తమగునదైనచో, దానికిఁగారణ మా క్షణములన్నియు నొకేయాత్మకుఁ జెందినవగుటయే యైయున్నది. ఉద్ద్యోతకరుఁ డిట్లు చెప్పినాఁడు:

(౪) న్యా॥వా॥ 3, ౧, ౧. ఆత్మ యోగికిఁ బ్రత్యక్షమని వైశేషికులు సమర్థించిరి. (వైశేషికసూత్రము ౯, ౧, ౧. న్యాయకందళీ॥ పు. ౧౯౬.)

(౬) న్యా భా॥ న్యా వా॥ ౧, ౧, ౧౦.

(౧) న్యా. భా. ౧, ౧, ౧౦.

(౨) న్యా. భా. 3, ౧, ౧౪; 3, ౧, ౭-౧౧.

(3) ఏకకర్తృకత్వమ్ జ్ఞానేచ్ఛాప్రవృత్తీనామ్, సమానాశ్రయత్వమ్. (న్యా. భా. 3, ౨, 3౪.)

"ఆత్మ లేదనువానికిఁ బ్రతి జ్ఞానక్రియయు వేరై, ప్రతిదాని కొఱకు వేరైన వస్తువుండవలెను; పూర్వస్మరణజ్ఞాన మసంభవము కావలెను"౮. ఉదా॥ వేదనా రూపములగు విజ్ఞానదశ లొకనికిఁ జెందునవివి, వేఱొకనికివి చెందునని చెప్పవీలు లేదు. ఇంకొకని యనుభవము 'నాది' కాఁజాలదు. స్మృతి, ప్రత్యభిజ్ఞ, ఆత్మయొక్క వ్యావహారికావిచ్ఛిన్నతా జ్ఞానము, సంకల్పములేక ఆత్మ సామర్థ్యప్రకటనము, అన్యాత్మసంబంధము, మున్నగు మానసికావస్థలన్నియు నాత్మ యాథార్థ్యమును నిరూపించును.

విజ్ఞానము దేహగుణమను భౌతికవాదము సులభముగా ఖండింపఁబడెను. అది దేహలక్షణమైనచో నది శరీరములోని భిన్నావయవములందును, భాగములయందు నది యుండవలెను॥ భిన్నావయవములు భాగములునుగూడ విజ్ఞానమును గలిగి యున్నచో వ్యక్తియొక్క విజ్ఞాన మనయు విజ్ఞాన సముచ్చయ

(౮) న్యా. వా. ౧, ౧, ౧౦. వాచస్పతి నుడివినాఁడు: 'ఆత్మలేకుండగనే, ప్రతిజ్ఞానక్రియయు నొకపరంపరలో నింకొకదాని నాదయింపఁజేయుననను ప్రతిపాదనమునను సరించి, పూర్వస్మరణము, భిన్నజ్ఞానక్రియాసమీకరణమును సాధ్యమనిచెప్పినచో, నొకపరంపరలోని ప్రతిజ్ఞానక్రియయు సర్వేతరజ్ఞానక్రియలతోడను గలియుటకు, స్మరించుటకు శక్తిగలదై యుండవలెను." ఈవాక్యములు వాత్స్యాయనుని వచనములకు సంగ్రహరూపములు. వాత్స్యాయనుఁడిట్లు చెప్పెను: "ఒకజ్ఞానక్రియ యింకొకజ్ఞానక్రియను స్మరించుట, ఒకదేహ మింకొకదేహానుభవములను స్మరించుటవంటిదే యగును." (న్యా. భా. ౧, ౧, ౧౦.)

(౯) చూ. సాంఖ్యసూత్రము. 3-౨౦-౨౧. వానిపై విజ్ఞానభిక్షువు అనిరుద్ధుఁడునిచ్చిన వ్యాఖ్య.

రూపమని చెప్పవలెను. దేహమునకు విజ్ఞానమున్నచో, నన్ని జడపదార్థములకు నుండవలెను; ఏలన శరీరము జడపదార్థరూపమే. దేహాతీతమగు నాత్మలేకున్నచో నైతికనియమావళి వ్యర్థమగును. ౧. శరీరమనుక్షణమును మారుచున్నదికావున, రాబోవు జన్మములలో మనకుఁ బాపఫలితమేమియు నంటదు. విజ్ఞానము శరీరమునకు ముఖ్యగుణమైనచో, విజ్ఞానములేని శరీరమెన్నఁడు నుండరాదు; కాని శవములకు విజ్ఞానము లేదు. సమాధ్యవస్థలలో విజ్ఞానము లేదు; అది దేహమునకు సహజగుణముకాదేలన, నైనచో దేహమున్నంతకాలము నది యుండవలెను. దేహగుణములైన వర్ణాదులట్లుండును. ౨. అది దేహముయొక్క తాత్కాలికలక్షణమైనచో దానికారణము దేహముకాక వేఱొకటైయుండవలెను. దేని విజ్ఞాన మొకనికున్నదో, దానికి విజ్ఞానము గుణముకాఁజాలదు; విజ్ఞానము దేహగుణమేయైనచో, నది యితరులకును గోచరించునది కావలెను. 3. విజ్ఞానము దేహమునకు సహాయలక్షణము కూడఁ గాదని కొన్నియనుభవములు తెలుపుచున్నవి. దేహము విజ్ఞానమునకొక యుపకరణమని చెప్పవచ్చును. "శరీరము క్రియలకు, నింద్రియములకు, వస్తువులకు, వాహనము"ని నిర్వచనము చెప్పఁబడెను.౪. ఆత్మ కొన్నివస్తువులను సంపాదించుటకుఁ గాని,

(౧) న్యా. భా. 3, ౧, ౪.
(౨) న్యా. భా. 3, ౨, ౪౭.
(3) న్యా. భా. 3; ౨, ౫3-౫౫.
(౪) న్యా. సూ. ౧, ౧, ౧౧.

తిరస్కరించుటకుఁగాని శరీరము నుపయోగించును. మనస్సునకు, భావములకు నింద్రియములకు శరీరము నిలయము. మనము శరీరమే ఆత్మయని కాని, విజ్ఞానమని కాని చెప్పరాదు. ప్రాణప్రవృత్తులును శరీరము కాదు. ప్రాణశక్తి లేక సత్త్వమనగా నాత్మకు శరీరముతోఁగల యొకవిధమగు సంబధమునే సూచించును. ౫. 'ఆత్మ' యింద్రియములు కాదు; యింద్రియములను సిగ్రహించి, వాని యనుభవములను సమీకరణ మొనర్చునది. ౧. వివిధ జ్ఞానక్రియల కేకత్వము కల్పించునది యాత్మ నేత్రములు శబ్దములను వినఁజాలవు; శ్రోత్రములు దృశ్యములను జూడఁజాలవు. ఒకవస్తువును జూచుచున్న నేనే దానినిగూర్చి విని యుంటిననుభావము, ఆత్మ యింద్రియములకు వేరై, యతీతము కానిచో నసాధ్యమగును. ఉపకరణములుగా యింద్రియము లొకకర్తను లేక యజమానుని సూచించును. పదార్థకల్పితములగుటచే నవి విజ్ఞానమును గుణముగాఁ గలిగియుండఁజాలవు. చూచినవస్తువు, నేత్రమునుగూడ నశించినను, చూచినజ్ఞానము మాత్రము నిలిచియేయుండును; అందుచే నీ జ్ఞానము బాహ్యవస్తువులకుఁగాని. యింద్రియములకుఁగాని చెందదు. ౨. ఆత్మ మనస్సనియుఁ జెప్పరాదు; ఏలన, నాత్మ మనస్సునొక సాధనముగా నాలోచించుట కుపయోగించును. మనస్స్వరూపమణుకల్పితమగుటచే దేహమువలెనే అదియు నాత్మకాఁజాలదు.

(౫) న్యాయకందళి. పు. ౨౬౩.
(౧) న్యా.భా. ౩. ౧. ౧.
(౨) న్యా.భా. ౩. ౨. ౧౯.

గ్రహణశక్తి మనస్సుయొక్క గుణమైనచో నేకకాలమందే సర్వవస్తుజ్ఞానముగల యోగులశక్తి కర్థము చెప్పుట కష్టమగును. ౩. ఆత్మ దేహేంద్రియమనస్సులు గాదు; ఏలన దేహము పతనమైనను, నింద్రియములు నశించినను, మనస్సు నిర్వృత్తి చెందినను, నాత్మ నశించదు. ౪. ఇవన్నియు దృశ్యములలోనివే. ఆత్మయొక్కటే కర్త, ద్రష్టయు నైయున్నది; దృశ్యమెన్నడు ద్రష్టకాఁజాలదు. ౫.

ఈనిత్యమగు నాత్మబుద్ధియుఁగాదు, ఉపలబ్ధియుఁగాదు, జ్ఞానమునుగాదు. ౬. బుద్ధి నిత్యముగాదు; ఆత్మ నిత్యము కాక తప్పదు. ౭. మన విజ్ఞానము నొక ప్రవాహముతోఁ బోల్ప వలెను. అందొక మానసికదశ అదృశ్యమగుటతో నింకొకటి దృశ్యమగును. శబ్దమువలె క్షణికముగాని, ఘటమువలెఁ గొంచె మెక్కువ కాలముండునది కాని, విషయస్వభావ మెట్టిదైనను, జ్ఞానక్రియలు ననిత్యములే. ౮. ఒకవస్తు వెక్కువ కాలముండుట వలన దానిని గూర్చిన మన జ్ఞానవైశద్య మధికముగా నుండును; కాని యట్టిజ్ఞానక్రియమాత్రము నిత్యము కాఁజాలదు౧. పూర్వము

---

(౩) న్యా. భా. ౩. ౨. ౧౯.

(౪) ప.ప్రి. పుట ౬౯. మఱియుఁ జూడు. భాషాపరిచ్ఛేదము. పుట ౪౭-౪౯.

(౫) న్యా. వా. ౩. ౨. ౧౯.

(౬) ౧. ౧. ౫.

(౭) న్యా. వా. తా. టీక. ౧. ౧. ౧౦.

(౮) న్యా. భా. ౩. ౨. ౧-౨; ౩. ౨. ౧౮-౪౧.

(౧) న్యా.భా.౩.౨.౪౪. మఱియుఁ జూడు. న్యా.వా.౩.౨.౪౫.

చూచిన వస్తువును తిరిగి గుర్తించుశక్తి బుద్ధికిఁ జెందినది కాదు.౨. నైయాయికుల ననుసరించి, బుద్ధియొక ద్రవ్యము కాదు; జ్ఞానక్రియకుఁ గర్త కాదు; అది ఆత్మయొక్క గుణము; దర్శింప వీలైనది. సుఖదుఃఖాదులకుఁ గారణములైన యన్నిటిని జూచు సర్వద్రష్టయు, సర్వభోక్తయు, సర్వజ్ఞాతయు నాత్మయై యున్నది.

ఈలక్షణములు గలిగిన ద్రవ్యము వివిధభాగములు గలది కాదు; ఏలన న్యాయసిద్ధాంతము ననుసరించియే సముచ్చయ ద్రవ్యములు నశ్వరములు; అసముచ్చయములవినాశములు. ఉత్పత్తిగల దేదియైనను వివిధభాగకల్పితము; ఆభాగములు విడిపోవునపుడదియు నశించును. ఆత్మ నిరవయవము, నిత్యమునైనది, దాని కాదియు నంతమును లేదు, ఆత్మ కొక యారంభమున్నచో నంతము నుండితీరును. ఆత్మకుఁ బరిమిత పరిమాణము లేదు; ఏలనఁ బరిమితమైనది భాగాన్వితము, నందుచే నశ్వరము. ఆత్మ అణుమాత్రమో, అనంతమో కావలెను; సముచ్చయ ద్రవ్యములవలె నది మధ్యమపరిమాణము గలిగి యుండఁజాలదు, అది యణుమాత్రము గాదేలన, నైనచో దాని గుణములైన బుద్ధి క్రియాసంకల్పాదులను మనము దర్శింపఁ జాలము. అది యణుమాత్రమైనచో శరీరమంతయు వ్యాపించు జ్ఞానక్రియకుఁ గారణమును జూపఁజాలకుండును.3.అది మధ్యమ పరిమాణము గలదైనచో నది శరీరముకంటెఁ బెద్దదైనను

(౨) న్యా. భా. 3. ౨. 3.
(3) తర్కసంగ్రహదీపిక. పు. ౧౭.

చిన్నదైనను గావలయును, ఏలైన నది దేహమంతయు వ్యాపించి యుండునని చెప్పినరీతిని వ్యాపించి యుండఁజాలదు, శరీరపరిమాణమే గల దన్నచో నది శరీరమునకుఁ జాల చిన్నదగును; ఏలన వయసుతో శరీరము పెరుగుచుండును, మఱియుఁ బ్రతిజన్మమునకును దాని పరిమాణము మారవలసిన కష్టము కల్గును. అందుచే నాత్మ సర్వవ్యాప్తి; కాని యనేకవిషయముల నేక కాలమున గ్రహింపఁ జాలదేలన, దానికి గ్రహించు సాధనమైన మనస్సణుమాత్రమైనది. శరీరములో జరిగిన వ్యాపారముల వాసనలను స్వీకరించునది మనస్సు; ప్రత్యాత్మకు నిత్యమైన యొక మనస్సే యుండునని చెప్పఁబడెను.౧.

ప్రతివ్యక్తిలో నుండు నాత్మయు విశిష్టమైనది.౨. ఆత్మల సంఖ్య అనంతము; కాకున్నచోఁ బ్రతివ్యక్తియుఁ బ్రతివ్యక్తి యొక్క భావములను, నూహలను దెలిసికొనఁగల్గును.3. సకల శరీరములలో నొకేయాత్మ యున్నచో నొకవ్యక్తి సుఖమును గాని దుఃఖమునుగాని యనుభవించునప్పుడు, అందరు సమానానుభవమునే గలిగియుండవలెను; కాని యట్లుజరుగుటలేదు.

విజ్ఞాన మాత్మయొక్క ముఖ్యలక్షణముగాదు, జ్ఞానక్రియాపరంపరల కంతమున్నది. "తదిజ్ఞానక్రియ విషయములో

(౧) న్యా భా॥ ౧, ౧, ౧౬; 3, ౨, ౫౨.

(౨) న్యా వా॥ తా॥ టీక. ౧, ౧, ౧౦. న్యా. శా. 3.౧.౧౪.

(3) ఒకేయాత్మ భిన్నదేహములను నడపుటు ప్రకృతి విలక్షణమైనదని యంగీకరింపఁబడెను. (న్యా భా॥ 3, ౨, 3౨.)

నది యింకను నుండుటకు వలయు పుణ్యాపాపకారణములు లేకున్నచో నశించును. లేక కాలవిశేషమువలననైన ననగాఁ బుణ్యాపాప వ్యాపారములను నశింపఁజేయఁగల కాలవిశేషముచేనైన నశించును; లేక తుదిజ్ఞానక్రియ జనింపఁజేయు వాసనలచేనైన నశించును."౮. విజ్ఞానమున కాధారభూతమైన యాత్మకు విజ్ఞాన మెల్లప్పుడు నుండనవసరము లేదు. నిజముగా నదియొక జడస్వరూపము; విజ్ఞానదశా విశేషములు దానికుండ వచ్చును ౯. జ్వాలయొక్క ప్రకాశము జ్వాలకు వేఱైయుండఁ జాలనట్లే, ఆత్మకు వేఱై విజ్ఞాన ముండఁజాలదు. కాని ఆత్మకు విజ్ఞాన ముండనవసరము లేదు. ప్రవృత్తిరంగమునందు, మనస్సంయోగముచే నాత్మ కుదయించు నొకగుణమే విజ్ఞానమని చెప్పఁబడెను. అది యప్పుడప్పు డాత్మయందుఁ బ్రదర్శితమగు లక్షణము.౧.

తన యర్హత ననుసరించి భిన్న కాలములలో భిన్న దేహములతో సంయోగమును గలిగియుండు నిత్యపదార్థమే యాత్మ, వ్యక్తికృత కర్మకలాపమే దేహమూలకారణము; సుఖదుఃఖాను

(౮) న్యా వా॥ 3, ౨, ౨౮.

(౯) ఆత్మ, నిత్యము, నవినాశము, నచలము, నణుమాత్రము, దేహమంతయు వ్యాపింప సమర్థమునగు లక్షణములతో జ్ఞానానందాది పరిశుద్ధ గుణ సమన్వితమని ఉదయనుఁడు భావించినాఁడు.

(౧) న్యా. భా॥ న్యా. వా॥ ౧, ౧, ౧౦. ప.ప్ర.పు. ౯౯.

భవ హేతువునైనది.౨. దేహ మదృష్టమైన విధిబలముచేఁ గల్పింపఁబడినది.3. పూర్వకర్మఫలము నశించనికారణమున దేహము కలుగుచుండును.౪. తాననుభవింపవలసిన కర్మఫలానుగుణమైన దేహమును బ్రతివ్యక్తియుఁ బొందుచుండును. జీవియొక్క జన్మము కేవల భౌతికవ్యాపారముకాదు. ఉద్ద్యోతకరుఁడిట్లు చెప్పినాఁడు: "శిశూత్పత్తివలనఁ గలుగు ఫలితముల ననుభవింపవలయు దంపతుల కర్మయు, నీ లోకమున జనించి యనుభవింపవలయు వ్యక్తియొక్క కర్మయుఁ గలిసి మాతృగర్భమందలి దేహమును సృజించును."౫. ఆత్మకు దేహముతోడి సంయోగమును జన్మమనియు,వియోగము మరణమనియు వ్యవహరింతురు.౬. సృష్ట్యారంభమునం దణువులలో నొక క్రియా

---

(౨) న్యా భా॥ 3, ౧, ౨౭ దేహమును భూమియే ముఖ్యముగా నిర్మించును. మిగిలిన భూతములుకూడఁ గూడియుండును. (3, ౧, ౨౭-౨౯) మనుష్యదేహమును భూమి కల్పించినను, వరుణలోకములలో జలమయశరీరములును, సూర్యలోకములలో జ్వాలామయదేహములును వాయులోకములలో వాయురూపశరీరములు నుండవచ్చునని తలఁపఁబడెను. కాని ఆకాశకల్పిత దేహములులేవు.

(3) న్యా. భా॥ 3-౨. ౬౦-౭౨.

(౪) పూర్వకృతఫలానుబంధాత్॥ (న్యా॥ భా॥ 3, ౨, ౬౦.)

(౫) న్యా॥ వా॥ 3, ౨, ౬3.

(౬) ౪, ౧, ౧౦. సంసారచక్ర మాత్మకుఁ జెందు నా మనస్సునకా యను ప్రశ్న యడుగఁబడెను. ఉద్ద్యోతకరుఁ డిట్లుచెప్పెను: "సంసారమనగా దేహసంయోగ వియోగములైనచో నవి మనస్సునకే చెందును. మనస్సే చరించునది. సంసారమనగా సుఖదుఃఖానుభవ మన్నచో, నప్పు డాత్మకేచెందును (న్యా. వా. ౧, ౧, ౧౯.)

శక్తి నిహితమై, దానివలన నవి కలిసి భౌతికపదార్థములగును. అట్టి క్రియాశక్తియే ఆత్మలయొక్క మానసములలో నుదయించి, యాయా యాత్మల పూర్వకర్మానుగుణములైన గుణముల నుదయింపఁజేయును. ప్రత్యాత్మయొక్క చరిత్రమునం దనేకజన్మము లుండును. ఒక జీవి కేక్షణమందైనను గలచరిత్రముగత జీవితములదై యుండును; భావిజీవితలక్షణముల కదియే సూచనమైయుండును. ఏయొక్క జన్మమైనను, పూర్వానేకజన్మ పరంపరల సముదాయములో నొక్కభాగమై యుండును.

పూర్వజన్మసిద్ధాంతము విశ్వసింపఁబడుటచే దానిని ఋజువుచేయుటకుఁ బ్రయత్నింపఁబడలేదు. చంటిబిడ్డలు చిన్నతనముననే సుఖదుఃఖానుభవములుఁ బొందునట్లు గాన్పింతురు; చంటిబిడ్డయొక్క అరపులు, నవ్వులును వికసించి ముకుళించు పద్మముయొక్క భౌతికక్రియలవంటివే యనుటకు వీలులేదు. ౧. మానవుఁ డొకపుష్పముకంటెఁ జాలవిశేషముగా నధికుఁడు. క్షీరముకొఱకుఁ బుట్టినబిడ్డకోరిక నూదంటురాయికిని నినుపముక్కకునుగల యాకర్షణమువంటిది కాదు, ఏలన బిడ్డ యొక లోహశలాక గాదు. ౨. వస్తువులు గుణసహితములై పుట్టినట్లే బిడ్డలు కోరికలతోఁ బుట్టవచ్చునను నాక్షేపణ ముచితమైనది కాదు; ఏలన కోరికలు కేవలగుణములుకావు; అవి పూర్వా

(౧) 3, ౧, ౧౯-౨౧.

(౨) 3, ౧, ౨౨-౨౪.

నుభవమునుండి యుదయించును. ౩. "పూర్తిగా మఱపుగలిగి, అనుభవశూన్యులమై" మన మీలోకమునకు వచ్చుటలేదు. కొన్ని పూర్వజన్మమునం దార్జించిన స్మృతులు, నభ్యాసములు గలిగి మనము పుట్టుచున్నాము. ౪ కొన్ని నైతిక హేతువులు గూడఁ బూర్వజన్మ పునర్జన్మములను సమర్థించును. మనయాత్మలకుఁ బూర్వపరజన్మముల నంగీకరింపకున్నచో, మనముచేసిన సుకృతనాశనమువలనను, నకృతాభ్యాగమమువలనను మన నైతిక దృష్టి కుంటువడును. మనమిపుడు జేసిన సుకృతఫలానుభవమునకుఁ బరజన్మయును, మనలో నేఁడుగల భేదావస్థలకుఁ గారణముగాఁ బూర్వజన్మము నుండవలెను. మనకర్మఫలానుభవము పూర్తియైనప్పుడు మనయాత్మ సంసారబంధమును పునర్జన్మావసరమును వీడి మోక్షమునుబొందును. ౫. మోక్షమునకు ముందుజన్మములోఁ బూర్వకర్మఫలితమంతయుఁ బూర్తిగా ననుభూతమై నశించును. ౬. దుఃఖరాహిత్యమే మోక్షము.౭ "భయశూన్యము, నాశరహితము, నానందమయమునగు నీ

---

(3) 3, ౧, ౨౫-౨౬.

(౪) కామసంకల్పాదు లాత్మాస్తిత్వమును ఋజువుచేయునే కాని, యది పూర్వమున్నదని చెప్పవని వాదించవచ్చును. కాని నూత్నసృష్టిసిద్ధాంతము ననుసరించి, న్యాయదర్శన మాత్మలకుఁ బూర్వస్థితియున్నదని విశ్వసింపనవసరములేదు.

(౫) న్యా. భా. 3, ౨, ౬౭.

(౬) న్యా. భా. ౪, ౧, ౬౪.

(౭) ౧. ౧. ౨.

యవస్థకే బ్రిహ్మావస్థయని పేరు." ౨. మోక్షమనగాఁ గలుష రహితము నవ్యయానందము, నఖండశాంతిరూపమునైనది. అది యాత్మనాశనము కాదు; ఆత్మబంధనిర్మూలనము. అది దుఃఖము నశించుటయనియే కాని సుఖానుభవమని పేర్కొనఁబడలేదు; ఏలన సుఖమెల్లప్పుడును దుఃఖసమ్మిశ్రితము. అది దుఃఖము వలెనే యుత్పత్తిగలది. ముక్తపురుషుఁ డవ్యయానందము ననుభవింపవలయునన్నచో నాతని కవ్యయమైన దేహమునుండ వలయును; ఏలన దేహనిర్మాణములేనిదే సుఖానుభవము సాధ్యము కాదు. ౩.

ఆత్మ యానందసారమని గ్రంథములు చెప్పినదాని కర్థము దుఃఖలోపమనియే. ముక్తియను భావమున కెప్పుడును దుఃఖ విముక్తియనియే యర్థము.౪. న్యాయదర్శనము ననుసరించి మోక్షమనఁగా, విజ్ఞాన క్రియారాహిత్యము, దేహమనో బుద్ధీంద్రియాదులనుండి విడివడుట. ముక్తపురుషులు పొందు నీయవస్థను గాఢసుషుప్త్యవస్థతోఁ బోల్చవచ్చును.౫. జ్ఞానా నందరహితమైన యీశుద్ధచైతన్యావస్థ అప్రమేయ మహత్త్వము గల దని చెప్పఁబడెను. ఏలన, నీస్థితిలో నాత్మ విభుత్వలక్షణము

(౨) తదభయమ్, అజరమ్, అమృత్యుపదమ్, బ్రహ్మక్షేమప్రాప్తిః। (న్యా. భా. ౧. ౧. ౨౨.)

(3) న్యా వా. ౧.౧.౨౨. మఱియుఁ జూడు: న్యా.భా. ౪.౧.౫౮; సుఖమొక గుణము; ఆత్మ కదియొక యవయవము కాదు, వాచస్పతి: (న్యా. వా.తా.టీక. ౧౧.౨౨)

(౪) సర్వదర్శన సంగ్రహము. ౧౧. అ.

(౫) సుషుప్తస్య స్వప్నాదర్శనే క్లేశాభావవత్ అపవర్గః।(౪.౧.౬3)

లను గలిగి యుండును; కామసంకల్పాది విశేషగుణములుండవు. మోక్షస్థితిలో నానందము నాత్మ యనుభవించునను సిద్ధాంతమును వాత్స్యాయనుఁడు విమర్శించి, దానికి సాక్ష్యము కాని హేతుబలము కాని లేదనెను. ఆనందప్రదర్శనమున కొఱకు కారణమున్నచో నది నిత్యమో యనిత్యమో కావలెను. నిత్యమైనచో బద్ధజీవికి ముక్తజీవికిని భేదముండదు; అనిత్యమైనచో నది యేమగును? ఆత్మ మనస్సంయోగము కాదు; ఏలన దాని వలన నేమియు లభింపదు. పుణ్యాది సాహాయ్యమవసర మగును, కాని యనిత్యపుణ్యఫలము నిత్యము కాఁజాలదు. పుణ్యక్షయముతో సుఖాంతము నగును ౧. మోక్షావస్థ జ్ఞానక్రియాశూన్యమును; ఏలన న్యాయము ననుసరించి, జ్ఞానక్రియలు గూడ ననిత్యములును, ప్రవృత్తి హేతువులు నగుటచే బంధకారణములగును. మోక్షము శుద్ధజ్ఞానరూపమను సాంఖ్యభావమును ఖండింపఁబడెను. ఏలన నీశుద్ధజ్ఞానావస్థకొఱకు కారణముండవలెను; కారణజన్యమైన ననిత్యమే. పురుషుఁడు మోక్షావస్థలో ప్రకృతి నుండి వేరై, తన స్వభావమును బొంది యానందించునని చెప్పిన సాంఖ్యభావము యుక్తముగాదని విమర్శింపఁబడినది; ఏలన జడప్రకృతికి విజ్ఞానగుణము చెప్పుట దోషమని యాతఁడు పలికెను.౨.

నైయాయికుల మోక్షశబ్ద మర్థహీనమని విమర్శకునికిఁ దోఁచును. న్యాయతత్త్వమునకును భౌతికవాదమునకును విశేష

(౧) న్యా. భా ౧, ౧, ౨౨. మఱియుఁజూఁడు. న్యాయకందళి. పుట. ౨౮౬-౮౭.

(౨) న్యా. సూ. 3, ౨. ౭౧-౭౬.

భేదములేదు. ఒకవ్యక్తి ఆత్మకాని, దేహముకాని కాదు; రెంటిసమ్మేళనమును. ఆత్మకు దేహమునుండి వియోగము సంభవించుటచే, "నాశ్చర్యజనకమైన దేదియు సంభవింపదు." "భూమి సముద్రముతోఁగలిసినను, సముద్ర మాకాశమునఁ జొచ్చినను" నంతే అదృశ్యమైన విజ్ఞానమును మరణశాంతితోఁ బోల్చవచ్చును. స్వప్నరహితమగు నిద్రావస్థ మూర్ఛవంటిది. ఒకశిల, గాఢనిద్రలోనుండి, నిద్రాభంగములగు స్వప్నములు లేకుండ నప్రమేయానంద మనుభవించుచున్నదని మనముచెప్పు కొనవచ్చును. నిష్కామ నిర్విచారస్థితి, మానవుఁడు వాంఛించు వాంఛలకుఁ బ్రతిబింబమువంటిదే, వేదనలు, కామములును, భావములును లేకుండఁబోయి, దేశకాలబంధములనుండి విడివడుట వేరు; దైవజ్ఞానముతో నూత్నజన్మమందుట వేరు; హృదయావేశముఁగలవారట్టి యవస్థ నొకకంచుబొమ్మతోఁ బోల్చవచ్చును. అది యితరదేవతావిగ్రహములున్న నిలయములో నుంచనగును. ఏశాఖకుఁ జెందినను వేదాంతి మోక్షమనగా నీ నశ్వరము నల్పమునగు వ్యక్తిత్వముపోయి, అనంత వ్యక్తిత్వములో లీనమైపోవుటయేయని వాదించును. అనంతర నైయాయికులు మోక్షమనగా నఖండానందమని ౧. యర్థము చెప్ప యత్నించిరిగాని, ఆత్మకు విజ్ఞానముతోఁగల సంబంధమునుగూర్చిన భావమును వారు మార్చుకొనినఁగాని యట్టి యర్థముపొసఁగదు.

---

(౧) న్యాయసారము॥ పుట ౩౮-౪౧.

## ౨౩-ఆత్మనుగూర్చియు, నాత్మకు విజ్ఞానముతో సంబంధమును గూర్చియు న్యాయసిద్ధాంతమును గూర్చి కొన్ని విమర్శాత్మక పరిశీలనములు.

తన సిద్ధాంతములో విజ్ఞానమునకుఁ గల స్థానమును నైయాయికుఁడు సరిగా విశదీకరించలేడు. ఆత్మ విజ్ఞానశూన్యమైనదనియు, జీవికి జడపదార్థ సంపర్కముచే విజ్ఞాన ముదయించుననియు నాతఁడు వాదించినాఁడు. మన విజ్ఞానైక్యమునకు మూలాధారముగ నొక యాత్మద్రవ్యాస్తిత్వమును విశ్వసించును. మన విజ్ఞానము రెండుక్షణములలో భిన్నమైనది. కొన్ని క్షణములలోనది పూర్తిగా నదృశ్యమగును. కాని మనము చిన్నతనములోను నిప్పుడు నొకే వ్యక్తులమనియు, పూర్వవస్తుజ్ఞాన స్మరణము మన కుండుటచేతను, విజ్ఞానమున కేకత్వము గలదని గోచరించును. ఈవిజ్ఞానైకత్వమున కర్థము చెప్పుట కొరకై యాత్మద్రవ్య మున్నదనియు, నది నిత్య మేకమనియు, నైయాయికు లూహించిరి. కాని విజ్ఞానదశ లొకదానిపై నొకటి ప్రభావము గలిగియుండును. కాని యాత్మ విజ్ఞానహీనమయ్యుఁ బూర్వవిజ్ఞానస్మృతి నెట్లు కలిగియుండఁ గలదు? కాని నిద్రాద్యవస్థలయందు మన విజ్ఞానమయజీవితమున కభావదశ లున్నచో, నాత్మ హీనమైన దైనచోఁ బూర్వజ్ఞానస్మరణ కవకాశ మెట్లుండఁగలదు? నైయాయికుఁడు తలఁచిన యాత్మ మానసికదశా పరంపరల దర్శించుచుండు నిత్యవిజ్ఞానస్వరూపమే యాత్మ కాకున్నచో నది పూర్వవస్తువులను గుర్తించుటకాని, స్మరించుటకాని సాధ్యపడదు. శంకరుఁడిట్లు

చెప్పెను; "కొన్ని యవస్థలలో విజ్ఞానము చెడునని సమర్థించు నాతఁడైనను, జెడిన విజ్ఞానమును దర్శించు విజ్ఞానము వలసం గాక యట్లు మాట్లాడఁజాలఁడు."౧. ఆత్మ యనఁగా నవిచ్ఛిన్న మగు విజ్ఞానమై, యెన్నఁడును లోపింపనిది కావలెను. తనచే స్వయముగాఁ జూడఁబడినట్టికాని, బాహ్యమునుండి చూడఁబడి నట్టిగాని భిన్నవిజ్ఞానపరంపరల సముచ్చయమే విజ్ఞానమయినచో నది మూలసత్యముకాని, స్వయంప్రకాశము, నిత్యమునైన ద్రష్టకాని కాఁజాలదని చెప్పినప్పుడు నైయాయికుని వాదము యుక్తమైనదే. ఈరెండవ సూత్రము విజ్ఞానాతీతము కానక్కర లేదు, విజ్ఞానశూన్యమగు నాత్మ, విజ్ఞానదశలు విడిచిపోయిన వాసనలను గుర్తించు శక్తిగలిగి యుండుటవలన, విజ్ఞానపూర్వక ముగా జరిగిన విషయముల సంస్కారములను స్వీకరించు మేధస్సు వంటిదే యగును. విజ్ఞానము వెలుగు విజ్ఞానమయ శక్తి స్వరూపముగా నాత్మ నూహింపకున్న నది లేదనుటయే మంచిది. శరీరములోఁగల మేధస్సంబంధములగు పొరలవలననే స్మృతి, ప్రత్యభిజ్ఞయుఁ గలుగు చున్నవని చెప్పుకొనిన సరి పోవును. కాని నైయాయికుఁడిట్టి పరిష్కారముతోఁ దృప్తిపొం దఁడు, అందుచే నాతఁడు విజ్ఞానపతియైన యొక ద్రష్టను లేక యాత్మ నంగీకరింపకతప్పదు, ఆత్మచేతన పదార్థమనుభావము లోని యర్థమిమిడియున్నది. ఆత్మ అతీంద్రియశక్తియు నిత్య విజ్ఞానమయమును; కాని యావిజ్ఞానము వ్యావహారిక జ్ఞానము

(౧) శంకరభాష్యము, ౨. 3. ౧౮.

కాదు. క్షణికములైన జ్ఞానక్రియల స్వరూపము నిత్యమగు నాత్మయని చెప్పుటకు నైయాయికుఁ డిష్టపడఁడు. అందుచే నవినాశియగు నాత్మస్వరూపము ననిత్యములగు మానసికావస్థాపరంపరగా నూహింపరాదు; ఆత్మకు వీనితో నెల్లప్పుడుండనవసరము లేదు. కాని ఆత్మయుండుట వలని ప్రయోజనమిది విజ్ఞానాధిపతి యని యంగీకరించినఁగాని లభింపదు. ఈవిషయములో సాంఖ్యులభావము నైయాయికుల భావముకంటె నొక యడుగు ముందునకు వేసినది.

ఆత్మకు విజ్ఞానము గుణమని చెప్పకున్నచో విజ్ఞానమర్థరహితమగును. విజ్ఞానశూన్యములకును రెండుద్రవ్యములైన యాత్మకును భౌతికపదార్థములకును సంపర్కమువలనవిజ్ఞానముదయింపఁజాలదు. ఆత్మ స్వయముగా విజ్ఞానమయముగాక, బాహ్యప్రపంచ వ్యాపారముచే నందు విజ్ఞాన ముదయించునని చెప్పుటచే నీవాదము నాస్తికవాదముతో సమానమైన దగును; విజ్ఞానము మేధస్సంజాతము కాఁజాలదని వచించినను ప్రయోజనము లేదు, జడపదార్థమునకును విజ్ఞానమునకుఁ జాల దూరమున్నది; విజ్ఞానమునకుఁ దుల్యపదార్థము జడజగత్తులో నింకొకటి లేదు. చేతనాచేతన పదార్థము లన్యోన్యసంపర్కము లెట్లు కలిగియుండునో యూహించు టసాధ్యము. మనమొక యచేతన విషయమునుండి, మానసిక విషయమునకుఁ బోవుటలో నొక ప్రపంచమునుండి దాని కెట్టిపోలికయు లేని యింకొక ప్రపంచమునకుఁ బోవుచున్నాము, ఆత్మ అనంతము నిరవయవము;మన

స్పణుమాత్రము నిరవయవము; రెంటికి సంపర్కమెట్లు చెప్పుట?౧. అనంతవ్యాపియైన యాత్మ యందు విజ్ఞాన ముదయించుచో, నట్టి యాత్మయంతయును దీనికి మూలాధారమా? లేక నందొక భాగమా? మొదటిది సహేతుకము గాదేలన, నప్పుడు విజ్ఞానమునకు సర్వవిషయము లొకే క్షణములో దృశ్యము లు కావలెను. రెండవదియు నిరర్థకవాదమేలన నాత్మ నిరవయవము, పుణ్యపాపములే దీనిని నిర్ణయించునని చెప్పుటకు వీలులేదేలన, సాగరాకాశ నదీ పర్వతాదులను గ్రహించు శక్తికిఁ బుణ్యపాపములకును సంబంధములేదు. శంకరుఁడు వివిధాక్షేపణములఁ దెల్పియున్నాఁడు. ప్రత్యాత్మయు సర్వవ్యాపి గావున నొక యాత్మకు సంబంధించిన మనస్సు సర్వాత్మసంబంధియై, సర్వాత్మలకు నొకే యనుభవముండవలెను. సర్వవ్యాప్తములగు ననేకాత్మ లొకేదేశము నాశ్రయించు ననియు నంగీకరింపవలెను.౧. మనస్సుపై నాత్మయొక్క కార్యము వలన విజ్ఞానముదయించు చున్నదన్నచో, నప్పుడాత్మ, విజ్ఞాన లక్షణములలోఁ బాల్గొనునని చెప్పవలసి యుండును; ఏలన రెండు జడపదార్థములు సంపర్కము పొందినపుడందు వలన జనించునది కూడ నొక జడపదార్థమే కావలయును. నాస్తికభావారోపణము

(౧) శంకరభాష్యము.౨.౨.౧౭. ప్రళయకాలమునం దాత్మల కణుసంబంధముండదని చెప్పఁబడెను. అప్పుడు వానికిఁ బూర్వస్మృతి యెట్లుండును? సంస్కారములు మనస్సులో నుండునా? ప్రళయములో నాత్మతో మనస్సుండునా?

(౧) శంకరభాష్యము॥ ౨, 3, ౫౦-౫3.

నుండి మనము బయట పడవలెనన్నచో, నణువులయొక్క గాని ఎలెక్ట్రానులయొక్క గాని యంధనృత్యము వలన నుద్దేశరహితముగా విజ్ఞానము జనించునను భౌతికవాదమును విసర్జించి, విజ్ఞానము వీనికి వేరైన స్వతంత్రశక్తి యని మనమంగీకరించవలెను. ఆత్మయనగా నొకయభౌతికశక్తి యనియు నది నిత్యపరివృత్తి గలదనియు నట్టి పరివృత్తి మనము చూడఁజాలకుంటిమనియు గ్రహించవలెను. మఱవునకును, నన్పతమునకును గారణము లుండవలెను గాని, స్మృతికిని, జ్ఞానమునకు నవసరము లేదు.

మన మాత్మకును దేహమునకును భిన్నత్వము నంగీకరించు నెడల, వానిపరస్పర సంపర్కమునకు మన మదృష్టహేతువును జెప్పవలసి యుండును. న్యాయదర్శనము ననుసరించి, జ్ఞానక్రియలాత్మ మనస్సంయోగము వలన జనించును. మనస్సునకొక వైపున నాత్మతోడను, వేరొకప్రక్క నింద్రియములతోడను సంయోగమున్నది. ఇట్టి సంయోగమున కాధారము చూపఁజాలక, నైయాయికుఁ డది దైవప్రభావమని నిశ్చయించినాఁడు.

శరీరము నాత్మయు భిన్నములేకాక, అన్యోన్యసహాకారము గల యదార్థరూపములని నైయాయికు నభిప్రాయము. విడిపోఁగల శక్తిగలిగి యాత్మ దేహమున నివసించుచున్నదనియు, దేహము జడపదార్థ కల్పితమనియు సిద్ధాంతీకరింపఁబడెను. మానవనిర్మాణములో నాత్మయు దేహమును సమానపదవి నాక్రమింపఁజాలవు; అవి పరస్పరము వేరైనవియుఁగావు.

దేహమను యంత్రమునకు బాహ్యమునుండి యాత్మయనున దొకటి చేర్పఁబడలేదు. మానవ వ్యక్తియం దాధ్యాత్మిక భౌతిక ద్రవ్యముల కవినాభావసంబంధమును నైయాయికుఁ డుపపాదించి నాఁడు.౧. న్యాయవైశేషికసిద్ధాంతముల ననుసరించి, ఉత్తమ లక్ష్యసాధనమునకుఁ జడపదార్థ మ్ముపకరణముగా నుపయోగింపఁ బడునని చెప్పఁబడెను. చైతన్యమందు జడపదార్థమందుకంటె నత్యధికమైన విలువయు విజ్ఞానమును గలవు; అందుచే నత్యధిక యాథార్థ్యమును గలదు.

సర్వానుభవములకు విజ్ఞానమే యాధారమని నైయాయికుఁ డెఱుఁగును. విజ్ఞానము, భూమి, సూర్యుఁడు వంటి సత్యాంశములలో నొకటిగాదు,సర్వసత్యాంశములకు మూలము నాధారము నైనది. బాహ్యవస్తు ప్రవృత్తిచే నాత్మయందు జనించు గుణముకాక, బుద్ధియనునది సర్వానుభవాధార భూత మైనది. అన్నంభట్టు బుద్ధి 'సర్వవ్యవహారహేతువని వర్ణించి నాఁడు.౨. ఆత్మకుఁజెందిన సర్వవస్తుప్రకాశకలక్షణమని శివాదిత్యుఁడు నిర్వచించెను.3. తద్వ్యాఖ్యాత యగు జినవర్ధనుఁడు మఱియు వివరించుచు నది "అజ్ఞానాంధకారమును దొలగించు, సర్వవస్తుప్రకాశకము గావునఁ గాంతి స్వరూపము"ని ప్రకటిం

(౧) న్యా॥ భా॥ 3. ౨, ౬౦,

(౨) తర్కసంగ్రహము॥ పుట 3౪. తన న్యాయబోధినిలో వ్యవహారమనఁగా శబ్దప్రయోగమని చెప్పెను. కాని యీనిర్వచన మతి సంకుచితము.

(3) ఆత్మాశ్రయః ప్రకాశః॥ పోల్చు: అన్నంభట్టు ఆత్మనిర్వచనము: జ్ఞానాధికరణమ్॥ (తర్కసంగ్రహము॥ పు. ౧౭.)

చెను.౮. సర్వానుభవపూర్వమైన దనుభవఫలము కాఁజాలదు. కొన్ని విశేషభావములు విశ్వాసములు బాహ్యపరిస్థితులవలన జనింపనగునుగాని, విజ్ఞానాధారము లేనిదే, స్వతంత్రముగా బాహ్యపరిస్థితులు వానికిఁ గారణములు గాఁజాలవు. న్యాయ నిర్వచనము ననుసరించి,బుద్ధిద్రష్టకు సంబంధించినది.౧. అదియొక తాత్కాలిక దృశ్యముకాదు; దృశ్యమున కెన్నఁడుఁ జెందని ద్రష్టయొక్క సహజలక్షణము; అదియే విశ్వవ్యాప్తిగల విజ్ఞానము; అది లేనిదే, లోకములోని వస్తువులుగాని, వ్యక్తులుగాని తెలియవు.

విజ్ఞానము సర్వానుభవ మూలాధారమై, యాత్మలు, దానిచేఁ దెలియఁబడు వస్తువులు, కూటస్థసత్యమగు నావిజ్ఞాన భాగములైనచో నది పరిమితిగలది కాఁజాలదు. ఎల్లప్పుడును మార్పునొందుచున్న జీవియు, నాజీవి యనుభవములోని వస్తువులును ననంతమైన విజ్ఞానములో నంశామాత్రములుగావలెను. జీవితములోని వివిధానుభవముల కేకత్వమును ఘటించున దాత్మయని నైయాయికుఁడు చెప్పినాఁడు. అట్టి యాత్మయే సర్వానుభవముల కాధారభూతమైన విజ్ఞానస్వరూపము. దాని నొక ద్రవ్యమని మన మనరాదు; ఏలన వ్యవహారప్రపంచమునకు మాత్రమే సరిపోవు భావములను దానికిఁ గల్పించుట యగును; వ్యవహార ప్రపంచానుభవము లన్నిటికి మూలాధార మదియేకదా! ప్రకృత్యతీతమగు విజ్ఞానమును బ్రకృత్యనుభవ

---

(౮) అజ్ఞానాంధకార తిరస్కారకారకా సకలపదార్థసార్థప్రకాశకాః ప్రదీప ఇవదేదీప్యమానోయః ప్రకాశకః సాబుద్ధిః॥

ములోఁ గలిపినచో నదియొక సాధారణబుద్ధి శక్తిగల వ్యక్తియై, వస్తువులకు వేరైనదగును.

మనమిచట నొకభేదమును గ్రహింపవలెను. వ్యక్తులందర కేకమై శుద్ధమైన విజ్ఞానము వేరు; ఆరంభాంతములుగల జీవులు వేరు. నైయాయికుఁడు ప్రకటించినయాత్మ, పెంపును, చరిత్రమును మార్పునుగలది. ఆదిగల దానికంతమునుగల దనియు, సముచ్చయాత్మక ద్రవ్యమునకు శిథిలత, నాశనము నుండుననియు, నేకమునవిభక్తమునగు వస్తువునకు విచ్ఛిత్తి లేదనియు, జెప్పుహేతువులవలన శుద్ధాత్మ నిత్యతాలక్షణయుక్తమైనదియు, జీవాత్మలకుఁ బరివర్తనమున్నదనియు విశదమొనర్చుచున్నవి. జీవాత్మలకుఁ గాంక్షలు, లక్ష్యములునున్నవి; వాని ననుసరించి, ప్రకృత్యవస్థలయెడ వానిప్రవృత్తులు మారుచుండును. పరిచ్ఛిన్నజీవి కొన్నియవస్థలలోఁ గొన్నియుద్రేకములను గలిగి, పూర్వప్రవృత్తి కారణములవలన నేటిప్రవృత్తి కాటంకములు గలుగుచుండును. పరిశుద్ధాత్మకుఁగల నిత్యత, పరిణామావస్థలలోనున్న జీవాత్మలకుఁగలదనుకొనుట యొప్పదు. వ్యావహారికముగాఁజూచిన స్థిరములుగాఁ గన్పట్టుచున్న జీవాత్మలకట్టి స్థిరత, బాహ్యకారణములచే వచ్చినదే. పరిమితాలయములుగల జీవాత్మలసంఖ్య యనంతము, జీవాత్మలయొక్క—ప్రత్యేకత, తాత్కాలిక తాటస్థ్యమనియు, మర్త్యత్వశాపముతొలగునంతనే, యీలోపమును బోవుననియు నైయాయికుఁడు జెప్పినప్పుడాతనిదృష్టి సక్రమముగానే ప్రకాశించినదని చెప్పవచ్చును.

౧. న్యా. వా. 3. ౨. ౧౯.

బద్ధముక్తావస్థలలో నెందున్నను, నాత్మయొక్క మూలము, సహజమునైన లక్షణము నిత్యమునబాధితమునై యుండవలెను. ఆత్మస్వరూపము మనజ్ఞానమున కతీతమైనదగుటచే, బుద్ధిచిత్త సంకల్పాదుల విడిచి చూడగా మానవవ్యక్తియందు మిగులునది శూన్యము మాత్రమేయని తోఁచును. అనిత్యవిషయ గుణములకు నిత్యము యదార్థమునైనదే యాధారమని నైయాయికుఁడూహించినది యుక్తమే. జీవాత్మకు వస్తుసంబంధమే శుద్ధాత్మస్వభావమును మఱుగుపరచుచున్నది. మనజీవాత్మ, జడపదార్థసాహచర్యముచేఁ బ్రకాశించుటలేదు. చైతన్యము నిత్యమైనదనుటలో నైయాయికుఁడు సత్యమునే పలికినాఁడు; కాని, అది జీవాత్మయని పొరపడినాఁడు. జీవాత్మకుఁబూర్వజన్మజ్ఞానము లేదు; అవిచ్ఛిన్నవిజ్ఞానమును లేదు. మనలోనంతర్వర్తియైయున్న యాత్మసర్వగతమైనదే; కాని వస్తుగుణములనుగూర్చి భావములను గ్రహించుచున్న జీవాత్మశక్తి, వస్తువులపై నాధారపడుచు మార్పునొందుచు,జడపదార్థస్వభావమును గొంతగలిగియున్నది. స్వచ్ఛాత్మస్వరూప మవిచ్ఛిన్న ప్రవృత్తికలది; దానికి జరామృత్యువులు లేవు. కాని మనస్సు, దానినిలయమైన దేహము, తత్సహచరులైన యింద్రియములనలెను, భిన్నలక్షణయుక్తమైనది. జీవాత్మల యనుభవము భిన్నమైనదగుటకుఁ గారణము భిన్నమనస్సులతో వానికిఁగల సంబంధమే. మనస్సంబంధమునుండి జీవాత్మ విడివడినచో నప్పుడు సర్వవస్తువు లేక కాలమనే విజ్ఞానమునఁ బ్రకాశించును. అప్పుడు సర్వజీవాత్మల యనుభవము నొకేయాత్మరూపములని బోధపడును.అప్పుడు జీవాత్మ,

తాను జీవించుచున్న దేశకాలపరిస్థితుల ననుసరించి, యొక విలక్షణమైన దృష్టిని వికసింపఁజేసికొని, సర్వాత్మభావమును బొంది సర్వానుభవమేక కాలమునఁ గాంచఁగల్గును. జ్ఞానమే యాత్మ, వస్తువులన్నియు బరిణామవశమున నొకేయాత్మయొక్క విశిష్టరూపములను వేదాంతవాదమును విశ్వనాథుఁడు సమర్థించినాఁడు (౧).

జ్ఞానస్వరూపమువలన, జీవాత్మయొక్క పృథక్త్వము నిత్యలక్షణము గాదని విశదమగును. ప్రత్యాత్మయు నొక విశిష్ట మనస్సంబంధము గలిగి, చూచుచున్న యనుభవప్రపంచములు సమానములని మనము నిశ్చయింపఁజాలము, ప్రత్యాత్మకొక్క ప్రత్యేక ప్రపంచమున్నచో, నెన్నియాత్మలున్నవో యన్ని ప్రపంచములున్నవను తత్త్వము సిద్ధించును. ప్రపంచము భావకల్పితమను సిద్ధాంతమునకు వైముఖ్యమును న్యాయము ప్రదర్శించి మన మందరమెఱిగిన యేక ప్రపంచమున్నదని పలికినది. అనగా, మనము దేశకాలావధులను దాటి, తాత్కాలిక పృథక్త్వముల నధిగమించి, యనంతము నవిచ్ఛిన్నమునగు రంగమునఁ బ్రవేశించు చున్నామని యర్థము. సకలజ్ఞానము నందునవి లంఘ్య

(౧) యస్త్వస్తు విజ్ఞానమ్ ఏవ ఆత్మా తస్య స్వతః ప్రకాశరూపత్వాచ్చేతనత్వమ్ జ్ఞానసుఖాది కంతు తస్యైవాకారవిశేషః, తస్యాపిభావత్వాదేవక్షణికత్వమ్ పూర్వపూర్వ విజ్ఞానస్య ఉత్తరవిజ్ఞానే హేతుత్వాత్ (సిద్ధాంత ముక్తావళి. ౪౯) ఆత్మయే జ్ఞానము, అది జ్ఞానస్వరూపమని దాని స్వయం ప్రకాశకత్వము వలనఁ దెలియును. ఈయావస్తువుల జ్ఞానమును, సుఖాది జ్ఞానము నాత్మయొక్క విశేషరూపములు. అవి దృశ్యములు కావున ననిత్యములు, పూర్వమానసిక దశలుత్తరదశలకుఁ గారణములగు చున్నవి.

మగు నొక లక్షణమున్నది. తెలియుట యను లక్షణముగల యాత్మ, పరిచ్ఛిన్నము కాఁజాలదు. జీవాత్మకును జగతునకునుసంబంధ మచంచలమైనది గాదు. పరిచ్ఛిన్న విజ్ఞానము సమగ్రముకాదు; అందుచే నది యాత్మ సంతృప్తి లేనిది. పరిచ్ఛిన్న విజ్ఞానము నిత్యమును స్వయం సంస్కారము నొందుచుండు లక్షణమును గలిగి యున్నది. మానవ విజ్ఞానము విచక్షణాత్మకము; దానికి వేరైయున్న జడాచల జగద్విషయములను దాను గాదని త్రోసివేయుచుండును. విజ్ఞానమునకు బాహ్యమైన దెల్ల నిజముగా నట్టిదిగాదు. మనమున్నస్థితిలోఁ దృప్తి నిగాంచలేకుండుటే, మనముండవలసిన స్థితికి సూచకము. బాహ్యప్రపంచము నధిగమించి పోవుటకుఁ జేయు యత్నమంతయు దాని మూలాధారసత్యమును గనుగొనుటకే; అది పరమ విజ్ఞానము; దానిలోఁ జేరని వెవ్వియునుండవు. శుద్ధాత్మకును జీవాత్మకును నైయాయికుఁడు భేదము నంగీకరించును; భావవిశ్వాసములచే జీవాత్మ శుద్ధాత్మయొక్క సగుణరూపమే. ఏక్షణమందైనను, మనము జీవాత్మ లక్షణములను దెలియవలెనన్నచో, దాని గతచరిత్రము, దాని దేశకాలపరిస్థితులు, దాని యవిచ్ఛిన్నత, మున్నగు వాని వలననే తెలియఁగలము. ఈప్రత్యేక లక్షణము లన్నియు శుద్ధాత్మకు వేరైనవనియుఁగాని దానిపైననే యాధారపడి యున్నవనియు నైయాయికుఁ డంగీకరించును. జీవాత్మ నానాత్వము తాత్కాలిక గుణాదుల సంపర్కము వలనఁ గలిగినదనియు, నాత్మయొక్క యదార్థస్వరూపమును దెలిసికొన్నచో నానాత్వము బోవుననియు విశదమగును. వ్యావహారికానుభవము

ననుసరించి చూచినచో ననేకాత్మభానము గోచరించును. కాని పారమార్థిక దృష్టితోఁ జూచినచో నానాత్వమున కతీతమైన యేకత్వము గోచరించును. పరమాత్మ యేకముకాఁజాలదేలన భిన్నములగు నాత్మలయనుభవమునకు భేదము లేకుండఁ బోవు నను న్యాయసిద్ధాంతము సమంజసముకాదు; ఏలన జీవాత్మల నానాత్వమును మేము కాదనలేదు, అనేక మానసము లనేకా త్మల కవకాశమిచ్చును; అనేకాత్మలు తమ ప్రవృత్తుల వలన లోకమును గల్పించును. జీవాత్మలకుఁ బ్రపంచముయొక్క వివిధ రూపముల జ్ఞానముండఁజాలదు. కాని సర్వప్రపంచ సర్వలోకము భానుభవమును గలిగియుండు నొక్క యాత్మయైన నుండవలె నని శ్రీధరుఁడు రచించినాఁడు. అట్టి యాత్మకు సర్వవిషయము లతో సామాన్య సంబంధముండదు. సర్వవస్తువులతో నవి నాభావసంబంధమును సర్వవస్త్వాధిపత్యమును దానికుండును.(౧). సారాంశమేమనగా నిన్నియాత్మలు లేవు; ఆత్మయొకటే, నానాత్వ మంతయు వ్యవహార సంబంధములచే జూపట్టునదే.

సర్వవ్యాపియైన విజ్ఞానస్వరూప యాథార్థ్యమును లేక నేకైకాత్మస్వరూపాస్తిత్వమును సమర్థించుటచే జగత్తు భావ కల్పితమను సిద్ధాంతము నామోదించుట కాఁజాలదు. ద్రష్టలు దృశ్యములతోఁ గూడిన జగత్తున కాధార మేకైకస్వరూపమైన పరమాత్మయని చెప్పుటచే, జీవకోటి జన్మించుట కనేకయుగ ముల పూర్వమే తమ వ్యాపారముల నెరపుచుండిన సూర్య చంద్ర భూమ్యాదిమండలము లసత్యములని చెప్పుటకాఁజాలదు.

---

(౧) న్యాయకందళి పు. ౨౨.

విజ్ఞానము కేవల మాత్మగుణమని చెప్పినంతకాలము న్యాయము మన యనుభవముల కర్థమును నిర్ణయింపఁజాలదు. ఆత్మ యనగా సర్వాంతర్యామియైన విజ్ఞానస్వరూపమని నిశ్చయించినఁగాని మన యనుభవ మర్థవంతము కాఁజాలదు. బాహ్యజగత్పరిస్థితులవలనఁ గొన్ని భావములు విశ్వాసములును జనించి, మానవస్వభావ స్వరూపముల నిర్ణయించుచున్న వను న్యాయవాదము యుక్తమైనదే. కాని యీ మానవస్వభావము సర్వవిజ్ఞాన యాజమాన్యము కలదికాదు. అది దృశ్యపరంపరాగతమగు విజ్ఞానాంశస్వరూపము మాత్రమే. జీవనానాత్వము నకుఁ గారణము భౌతిక జగత్సంబంధమే. జీవాత్మలు జడపదార్థమునఁ దగుల్కొనియున్నను, నాంతరంగికముగా శుద్ధాత్మ భావముఁ బొంద యత్నించుచున్నవి. పరిపూర్ణసిద్ధిఁ గాంచిన జీవు లాత్మతేజోఽగ్నిలోఁ గ్రాఁగి, దేహబంధములను ధూమములు విడిచినవెనుక స్వచ్ఛప్రకాశమును గాంచుచున్నవి. దీని ననుసరించి, సిద్ధాత్మలనగా శూన్యస్వరూపులనియు నర్థము కాదు. ముక్తావస్థలోనున్న జీవులవిషయములో నేకత్వనానాత్వభేదమే లేదు. మనము న్యాయదర్శనము యొక్క ప్రధానోపదేశములను, వైరుధ్యములఁబాపి, సమన్వయ మొనర్చినచో. నిట్టి నిర్ణయమునకు వచ్చుట కవకాశమున్నది. న్యాయవాదు లీయవకాశమున్నదని యెఱుఁగఁజాలరైరి.

## ౨౮-ధర్మశాస్త్రము.

సంకల్పమునకును బుద్ధికిని విస్పష్టమైన భేదమున్నదని న్యాయశాస్త్రకారులు విశదీకరించియుండలేదు. బుద్ధి వస్తు

జ్ఞానము నిచ్చినవెనుక దానినిగూర్చి పనిచేయుటకు బయల్పడు విచిత్రశక్తి సంకల్పముకానల్లే. తన కెదుటనున్న వస్తువులను గ్రహించి, వానినిగూర్చి యాలోచించు కేవల నిష్క్రియా రూపమును బుద్ధియనుకొనుట యుక్తముకాదు. జ్ఞానమంతయు నుద్దేశపూర్వకమైనది; అందువలననే వస్తువులను మనము తెలిసికొనుచునే, వాని యందిష్టానిష్టము లుదయించి, వానిని సాధించుటకుఁగాని తిరస్కరించుటకుఁగాని కోరిక లేర్పడును. ఒక వస్తువునుగూర్చి మన మాలోచించినపుడు, దానివిలువ నప్పుడే కట్టుచు, దానికిఁగల ప్రయోజనమును నిర్ణయింపఁ జూతుము. ధర్మశాస్త్రము జీవితముయొక్క వ్యావహారిక ప్రవృత్తికనగా, నుద్దేశపూర్వక ప్రవృత్తికి సంబంధించినది.

కొన్ని న్యాయగ్రంథములలో సంకల్పప్రవృత్తి స్వభావమునుగూర్చి వివరణముచేయబడెను. విశ్వనాథుఁ డిచ్ఛ కనేక కారణములను జెప్పెను. అసాధ్యవిషయములను మనము గోరము; చంద్రునికొఱ కేడ్చువారు బిడ్డలే. సాధారణముగా మనకుఁ బొందసాధ్యములగు వస్తువులనే కోరుదుము. ౨. మఱియు సంకల్పములోనున్నవి కోరఁదగినవై, కర్తకుపయోగకరములైయుండును. 3. మన మాత్మహత్యచేయ సంకల్పించినప్పుడైనను నొకముల్లును మన మాంసములోఁ జొప్పింపఁ జూచునప్పుడైనను, కొంతప్రయోజనసిద్ధిని మనమాసింతుము.

---

(౧) సిద్ధాంతముక్తావళి(పు౧౪౬-౧౫౦)

(౨) కృతిసాధ్యతాజ్ఞానము.

(3) ఇష్టసాధనతాజ్ఞానము.

కర్తకు సంబంధములేనిదానికి దేనికినివిలువలేదు. కర్త, ఆత్మహత్యాదికార్యములు తనకు శ్రేయఃప్రదములని తనమన, స్సహజావస్థలోనున్నప్పుడు నిశ్చయించును.(౭) అనంతర మెట్టి యభిప్రాయమున కవకాశముున్నను, సంకల్పకాలములోఁ గోరిన వస్తువు ప్రయోజనకారియని యే తలఁపఁబడును. ఒకకార్య క్రమమును మనము నిశ్చయించుకొనునప్పుడు, దాని భిన్నఫలి తముల కవకాశములనుగూర్చి యాలోచించి, యొకనిశ్చయ మునకువచ్చి, దానివలన నధికదోషముండదని భావింతుము.(౮) ఒకవిషయమువలన నధికప్రమాదముండునని తోఁచినయెడల దానికొఱ కెట్టిప్రయత్నమును జేయము. ఇట్టి నిశ్చయము నందు భిన్నఫలితముల పరిశీలనముగలదు.

సహజసిద్ధములై, అప్రయత్నముగాఁ జేయఁబడుకర్మ లకు స్వేచ్ఛాధీనత్వము లేనికారణముచే ధర్మమీమాంసకివి యుక్తములుగావు.(౯) బాహ్యమునుండి ప్రవాహవేగమునఁ బైఁబడు రాగద్వేషముల కాత్మ బద్ధముకాదు. ఆత్మ స్వయముగా విజ్ఞానహీనమైనదైనచో, రాగద్వేషాదులను పాశములు దానిని బంధించి యీడ్చునని యనుకొనవచ్చును. ఆత్మకుఁ గ్రియా శక్తి, పరిశీలనశక్తి నిర్ణయశక్తియుగలవని నైయాయికుఁడు తలఁ

---

(౭) రోగదూషితచిత్తః

(౮) బలవదనిష్టా ఆననుబంధిత్వజ్ఞానము ఈభాగము సంశయాస్పదమైనది. అనిష్టఅజనకత్వజ్ఞానము కాని, అనిష్టజనకత్వజ్ఞానాభావముకాని కావలయును. విశ్వనాథుఁడు రెండవదే యుక్తమనిభావించెను.

(౯) జీవనయోని పూర్వకము.

చెను. దీనియర్థమేమనఁగా నాత్మ యమోఘస్వాతంత్ర్యము గలది. ౨. పురుషకారమునకేమియు స్థానములేదనియు, సర్వభావములకును దైవమే కారణమను భావమును వాత్స్యాయనుఁడు ఖండించెను. మానవసంకల్పము క్రియాసమర్థమే; దైవసంకల్పానువర్తియై పనిచేయును. సంకల్పము కారణశూన్యమై పనిచేయునని వాత్స్యాయనుఁడు విశ్వసింపఁడు. ౩.

సర్వకార్యములకును సుఖప్రాప్తియు,దుఃఖపరిహారమును ప్రయోజనములై ౪. యున్నవి. క్లేశకారణమైన దుఃఖము, ఆత్మ సహజశాంతిలో లేదని సూచించును, సుఖప్రాప్తికాక, దుఃఖవిముక్తియే యుత్తమశ్రేయము; ఏలన సుఖమెల్లప్పుడును దుఃఖసమ్మిశ్రితము.౧. అప్పుడప్పుడు సుఖలేశములున్నను, సంసా-

---

(౨) న్యా. భా. ౪, ౧, ౧౯-౨౧.

(౩) న్యా. భా. ౪, ౧, ౨౨-౨౧.

(౪) న్యా. భా; న్యా. వా. ౧,౧,౨౪; మఱియు న్యా. భా. ౩.౨. ౩౨-౩౭. (౫) ౧, ౧, ౨౧.

(౧) సర్వదర్శన సంగ్రహము, ౧౧ అ. ఉద్ద్యోతకరుఁడీభావమును గొంత మార్చినాఁడు; "సుఖము లేనిచోఁ బుణ్యము వ్యర్థమగును. దుఃఖనివృత్తియే పుణ్యఫలమనరాదు; ఏలన నప్పుడు పుణ్యఫలము కేవల వ్యతిరేకలక్షణము కలదగును. మానవనిత్యజీవితములోఁ బ్రవృత్తి రెండు విధములు, ఒకటి కామ్యసిద్ధికై ప్రవృత్తి; రెండవది కాంక్షితసిద్ధి నిర్మూలనాత్మకము. కామ్యమే లేకున్నచో నీద్విరూప ప్రవృత్తియుండదు, మఱియు సుఖమే లేకున్నచో సుఖమే దుఃఖమని భావింపవలెనను నుపదేశముండదు, సుఖము లేకున్నచో మోహమేయుండదు; ఏలన నెవ్వఁడును దుఃఖమును మోహింపఁడు. (న్యా. వా. ౧,౧,౨౧.) శ్రీధరుఁడును దుఃఖాభావము సుఖమని యంగీకరింపఁడు; ఏలన నానందానుభవమున్నది; మానవప్రవృత్తిలో లక్షణద్వయమున్నది.

రము దుఃఖమయము, సంసారవిముక్తియే పరమశ్రేయము. "దుఃఖము, జన్మము, కర్మ దోషములు, దురభిప్రాయములు, వీనినొక దాని వెనుక నొకటిగా నాశనము చేయవలెను.(౨) దుఃఖము జన్మఫలితము; జన్మము ప్రవృత్తిఫలితము. ప్రవృత్తి, మంచిదైనను, జెడ్డదైనను, సంసారమునకు బంధించి, నీచోన్నత జన్మములకుఁ గారణమగును. దేహధారిత్వము దౌర్భాగ్యమని నైయాయికుఁడు నమ్మును; "జన్మమనునదాత్మకు రోగము వంటిది; కర్మ రాగసంజాతము" నని చెప్పిననోవలిస్ భావముతో నాతఁడేకీభవించును. ప్రవృత్తియంతయు రాగద్వేషమోహము లచే జనించును. ద్వేషములో నీర్ష్య, క్రోధము, దౌర్జన్యము, మాత్సర్యము నిమిడియున్నవి. రాగమునందు, దురాశ, వ్యామోహము, పరవస్తుకాంక్ష మున్నగునవున్నవి. మోహమునందు, దురభిప్రాయము, సంశయము, గర్వము, శ్రద్ధాలోపమునున్నవి. మోహము మిక్కిలి గర్హింపఁదగినది; ఏలననదియే రాగద్వేషముల నుదయింపఁజేయునది. 3 ఈదోషములవలన మన మాత్మ కిష్టానిష్టములు లేవని యెఱుఁగక రాగద్వేషవశుల మగుచుందుము. ఆత్మయొక్క స్వభావమును గూర్చియు సుఖదుఃఖాదులను గూర్చియు మిథ్యాజ్ఞానము వలన నీదోషములు జనించుచున్నవి. పరమార్థమైన నిత్యమోక్షమును బొందు

(౨) న్యా.సూ. ౧,౧,౨; ౪,౧,౬౮. పోల్చు బౌద్ధ కారణధర్మము. (విశుద్ధిమగ్గము. ౧౯.) (న్యాయకందళి. పు. ౨౬౦)

(3) ౪, ౧, 3, ౯.

(౪) న్యా.భా. 3,౨,౬౭; ౪,౧,౬; ౪,౨,౧.

టకు, దోషాభిప్రాయములతో నారంభించి, దుఃఖపర్యంతముగాఁ గల గొలుసును విచ్ఛేద మొనర్పవలెను. దోషజ్ఞానము నశించుటతో దోషములు నశించును. వాని నాశనముతోఁ బ్రవృత్తికి స్థానముండదు గనుక జన్మావకాశమును బోవును. జన్మరాహిత్యమనగా దుఃఖనాశనము; దానికే యఖండానందము నామాంతరము.౪. మన మెంతకాలము ప్రవృత్తిలోనుందుమో యంత కాలమును రాగద్వేషములుండి, పరమశ్రేయస్సముపార్జనమున కాటంకములగును. దుఃఖద్వేషమును ద్వేషమే; సుఖానురాగమును రాగమేయగును గాన నివి యున్నంతకాలము నుత్తమగతి లభించు నవకాశము లేదు.

భేదబుద్ధి నణఁచివేయుమని నైయాయికు నుపదేశము; దోషవిముక్తుఁడైనవాని ప్రవృత్తి పునర్జన్మ హేతువుగాదని యాతఁ డంగీకరించును.౧. జీవన్ముక్తులైనవారు దేహావసాన పర్యంతమును గర్మచేయుచునే యుందురు. అట్టి కర్మ వారిని బంధించదు. మనము మన వ్యక్తిత్వమున కంటిపట్టుకొని, యింద్ర పదవి, బ్రహ్మపదవి. మున్నగునవి కావలెనని సత్కర్మాచరణ మొనర్చినను, మనము సంసారబద్ధులమై యుండకతప్పదు. భేద బుద్ధి సంపూర్ణముగా నశించుటే సంపూర్ణమగు శ్రేయము.

సమ్యక్ జ్ఞాన సంపాదనమువలననే సంసారము తొలఁగిపోదు. దేహాత్మసంబంధ కారణమైన కర్మ సంస్కారము పూర్తిగా హరించవలెను; పునస్సంబంధహేతు వెయ్యదియు నుండరాదు.౨.

---

(౧) న్యా॥ సూ॥ ౪, ౧, ౬౪. (౨) ౪, ౧, ౧౯-౨౧.

తాను వేరను భావమునుండి విముక్తియే పరమశ్రేయము గావున, దానికిఁ దోడ్పడు ప్రవర్తనమంతయు యుక్తమైనది; విరుద్ధమెల్ల నయుక్తము. ప్రవృత్తులు మనోవాక్కాయరూపములు; ఇం దొక్కొక్కటియు మంచిదో చెడ్డదో కావచ్చును.3. మంచిచెడ్డల నెఱిగియుండి దుష్కర్మను సంకల్పించుట ధర్మద్రోహమగును. ఉత్కటరాగప్రభావ వశులమై, పాపమువలన జనించు దుఃఖముల నెఱుఁగఁజాలక సుఖలాలసులమై చరింతుము. ధర్మవిహిత కర్మాచరణమువలన, దేహేంద్రియాదులకు వేఱైన యాత్మస్వరూపమును వివేకించుశక్తి మనకు లభించును. మనము సంపాదింపవలసినదని పునరుక్తిగాఁ జెప్పఁబడిన యథార్థజ్ఞాన మనఁగాఁ గేవల బుద్ధిచే గ్రహించుటకాదు, అది జీవితవైఖరిగా నేర్పడవలెను. దోషజ్ఞానమును స్వార్థపరతయు సాధారణముగాఁ గలిసియుండును.౧. యథార్థజ్ఞానమును స్వార్థరాహిత్యము నవినాభావసంబంధము గలవి. ఈ యథార్థజ్ఞానము గ్రంథాధ్యయనమువలన లభింపదు; అది ధ్యానము వలనను, ధర్మానుష్ఠాననిష్ఠాధిక్యము వలనను,

(3) ౧, ౧, ౧౭. దానము, రక్షణము, సేవయు యోగ్యశారీరిక క్రియలు; హత్యాచోరత్వ జారత్వము, అయోగ్యములు, సత్యవచనము, ప్రయోజనాహ్లాదకర సంభాషణము యోగ్యవాక్కర్మలు; అనృతవచనము, పరుష నిష్ప్రయోజన దూషణ భాషణము అయోగ్యము కానిది. ఔదార్యకృపాశ్రద్ధలు యోగ్యమానసికకర్మలు; ద్వేషానూయాఽవిశ్వాసము లయోగ్యములు.

(౧) న్యా. వా. ౪, ౨, ౨.

లభించును.౨.అధ్యయన మననములతోఁ బాటు యోగాభ్యాసమును జేయవలయును.౪. అధ్యయనము, తత్త్వవిచారణ, ధ్యానము ముఖ్యములని యుద్ద్యోతకరుఁడు చెప్పెను.౫. సంసారసుఖములను విడిచి, కామత్యాగ మొనర్చి, కాంతారనివాసము చేయుచు నాత్మాగ్నిలో మన కామకర్మాదులను హోమము చేయవలయు ననియుఁ జెప్పఁబడెను. భక్తి శాంత్యానందసాధనముగా నంగీకరింపఁబడెను. భగవానుఁడు మన కర్మలలో జోక్యములేని వాఁడయ్యు, వానియెడఁ జూపు భక్తికి ఫలితము లున్నవి.౬.

ఇతర హిందూమత శాఖలవలెనే, న్యాయమతమును గర్మసిద్ధాంతమునంగీకరించి, మనకర్మల ఫలితములు తప్పక సంభవించునని విశ్వసించును. వంటచేయుట మున్నగు కొన్ని కర్మలు సద్యఃఫలితములుగలవి; వ్యవసాయము మున్నగు నితరములకు ఫలమాలస్యముగా వచ్చును. మరణానంతరమునఁ గాని స్వర్గప్రాప్తి లేదు. కావున, ధ్యాన దైవకర్మాదికము

(౨) న్యా. భా. ౪, ౨, ౩౮, ౪౧.

(౩) న్యా. భా. ౪, ౨, ౪౭.

(౪) న్యా. భా ౪౨, ౪౬, నైయాయికులు యోగులనియుఁ జెప్పఁబడిరి. "నైయాయికానామ్ యోగపరాభిధానానామ్" (గుణరత్నుని షడ్దర్శన సముచ్చయవృత్తి) ఆతని తర్కరహస్యదీపికను గూడఁ జూడుము. వాత్స్యాయనుఁడు ౧, ౨, ౨౯ లో యోగముక్రింద న్యాయభావమును బ్రకటించెను.

(౫) న్యా. వా. ౧, ౧, ౨.

(౬) న్యాయసారము పుటలు ౩౮, ౪౦, ౪౧; సర్వసిద్ధాంతసారసంగ్రహము ౬, ౧౦-౨౧, ౪౦-౪౪.

లాలస్యముగా ఫలించునవి. ౧. ఫలితములు వచ్చులోపున ఫలకారణములు నశించవు; అవి ధర్మాధర్మరూపమున నిలిచి యుండును."ఫలసిద్ధియగుటకుఁబూర్వము మధ్యమదశ యుండును; వృక్షములు ఫలములనిచ్చుటకుఁ బూర్వమందువలెనే". ౨ దానినే యదృష్టమందురు; అది కర్మరూపమే. అందుచే మోక్ష సిద్ధియైన వెనుకఁగూడ జన్మావసరముండవచ్చును. ౩. ఆత్మలు తామెట్టి దేహముల ధరించియుండవలెనో పూర్వకృతకర్మల ననుసరించి యుండును. ఆత్మకు దేహమే నామకరణముచేయును. ఆత్మ మనుజుఁడు కాదు, గుఱ్ఱము కాదు, కాని, మనుజాశ్వ దేహములచే నట్లు పిలువఁబడుచుండును. ౪. న్యాయవైశేషిక తత్త్వము సూక్ష్మదేహమున్నదని విశ్వసింపదు. అణురూపము నతీంద్రియమునగు మనస్సహాయమున నాత్మ దేహాంతరప్రాప్తిఁ బొందుచుండును. ఆత్మల కనంతవ్యాప్తి కలదు. గావున మనస్సే జన్మాంతరములనుబొంది వివిధదేహములలోఁ బ్రవేశించుచుండును.

---

(౧) ఉద్ద్యోతకరుఁడు వ్రాసినాఁడు: "సద్యః ఫలితములేని కర్మల విషయములలోఁ గర్మఫలము పక్వమగుటకుఁగల యాటంకములవలన నట్లగును లేక కర్మవాసనలు ఫలించుట కనుకూలపరిస్థితులలోపమో, లేక యొకవ్యక్తి యొక్క కర్మతో సమానకర్మగల వారి కర్మవాసన లాటంకము కలుగఁజేయవచ్చును; సహాయకారణములగు పుణ్యపాపము లాకాలమున లేకుండవచ్చును. న్యా॥ వా॥ ౩.౨.౬౦.

(౨) న్యా. భా. ౪, ౧, ౪౭; ౪.౧.౪౪-౫౪

(౩) న్యా. భా. ౩, ౨, ౬౮.

(౪) న్యా. భా. ౩, ౧, ౨౬.

ప్రకృతి పురుషసముచ్చయాత్మక మైనదే యథార్థజగత్తు. ప్రకృతి పురుష (ఆత్మ) కల్పితము గాదు. దేవుఁడే ఆత్మల కనుభవానుగుణ్యముగా నుండురీతిని ప్రకృతిరూపమును సృజించెను. ఆత్మలకును ప్రకృతికిని సామరస్యముండుటకుఁ గారణము దైవకల్పనమే.

## ౨౫—దైవతత్త్వము.

న్యాయ సూత్రములందు భగవంతుఁడు కాకతాళన్యాయముగాఁ బేర్కొనఁబడిన కారణమునఁ బ్రాచీన న్యాయసిద్ధాంతమాస్తికముగాదను వాదమున కవకాశమిచ్చుచున్నది(౧) దైవనిమిత్త ధర్మమును న్యాయసూత్ర ముదాహరించినది.(౨) వాత్స్యాయనోద్ద్యోతకరవిశ్వనాథులిదే న్యాయమతమనిరి. వాచస్పత్యుదయన వర్ధమానులు, భగవంతుఁడు జగదంత్వర్వర్తియగు కారణమును వేదాంతవాదమునకు విమర్శనమని యభిప్రాయమిచ్చిరి. మానవుఁడు తన కర్మానుగుణములైన ఫలితములను బొందుట లేదనియు నందుచే సర్వఫలము లీశ్వరసంకల్పమును ననుసరించి వచ్చుచున్నవనియుఁ జెప్పు నాక్షేపణమునకు మానవుల కర్మలకు ఫలము లీశ్వరాదేశమున, నీశ్వర సాహాయ్యమునఁ

(౧) "న్యాయ వైశేషిక మూలగ్రంథములు దైవాస్తిత్వము నంగీకరించి యుండలేదు, కొంతకాలము పోయిన వెనుకనే ఆస్తికతయందుఁ బ్రవేశించినది; కాని రెంటిలోనేదియుఁ గూడ దేవుని ప్రకృతికర్తగా వివరించి యుండలేదు." (గార్బే. ప్రాచీన భారతీయ తత్త్వశాస్త్రము, పు. ౨౩.) మూయ పండితుఁడు ప్రాచీన న్యాయ మాస్తికతగలదో కాదో చెప్పఁజాలననెను, (మూలసంస్కృత గ్రంథములు, వాల్యుము 3, పు, ౧33.)

(౨) ౪, ౧, ౧౯-౨౧.

గలుగు చున్నవని నైయాయికుని సమాధానమై యున్నది. ఆత్మ సర్వద్రష్ట, సర్వజ్ఞాత, సర్వానుభవాధిపతి యని చెప్పుటచే వాత్స్యాయనుఁ డాస్తికతను సమర్థించు చున్నాఁడు, ఈవర్ణనము జీవాత్మ సంబంధమైన దైనచో సర్థరహితమగును.3. అనంతర నైయాయికులును వైశేషికులును బహిరంగాస్తిక్యమును బ్రకటించి, ఆత్మసిద్ధాంత వివరణ సందర్భమున దైవస్వరూపమును గూర్చి చర్చింతురు. ఆత్మలు రెండు రకము లనియు నొకటి మానుషము రెండు దైవము నని యన్నంభట్టు చెప్పినాఁడు. దైవాత్మ లేక పరమాత్మ యేకము, సర్వద్రష్టయుఁగాఁగా మానుషాత్మ లనంతములు, భిన్న దేహములకు భిన్నములై యున్నవి, దేవుఁడొక విశిష్టాత్మ; సర్వజ్ఞత్వము, సర్వశక్తియు నాతని గుణములు; వీనిచే నాతఁడు లోకమును క్రమరీతినడపును. మానుషదైవాత్మలకుఁ జాలభేదములున్నవి కావున మూలదర్శనకర్తలగు గౌతమకణాదు లీరెంటినొకే వర్గమునఁ జేర్చిరనుట యుక్తియుక్తముగాఁ దోఁచుటలేదు. న్యాయదర్శనము యొక్క వ్యావహారిక లక్షణమును, తార్కికాభినివేశమును, దైవాస్తిత్వమును గూర్చి తగినంత శ్రద్ధచూపక పోవుటకుఁ గారణములైనవి.౧.

(3) న్యా భా. ౧, ౧, ౯; ౪, ౧, ౨౧.
(౪) తర్కసంగ్రహము, పు, ౨౭.

(౧) అథవ్లే యిట్లు వ్రాసెను: "దేవుఁడసలే లేడను నభిప్రాయముచే గాక, తమ దర్శనములకు వ్యవహార ప్రపంచముతోడనే విశేషసంబంధ మున్న కారణముచే దైవవిషయము తమ విషయమున కతీతమైనదని నమ్మి యుద్దేశపూర్వకముగా దైవవిషయ ప్రసంగమును గౌతమకణాదులు విడిచిపెట్టి

ఈశ్వరాస్తిత్వమున కుదయనుని కుసుమాంజలిప్రమాణ ప్రకటన మొనర్చిన శాస్త్రగ్రంథము. ఇందు మొదటి ప్రకరణములో సుఖదుఃఖ హేతుభూతమైన యదృష్టశక్తి యొక టున్న దనుటకుఁ గొన్ని సందర్భములను బ్రకటించియున్నది.౨. ప్రతికార్య మొక కారణముపై నాధారపడియున్నది; అందుచే మన సుఖదుఃఖముల కొక కారణముండవలెను.౩. ప్రతికారణమును బూర్వకారణమునకుఁ గార్యమే; ప్రతికార్యము భావికార్యమునకుఁ గారణము. ప్రపంచ మనాది కావున, నీకారణకార్యపరంపరకు నారంభము లేదు. అందుచే మన సుఖదుఃఖకారణమున కారంభదశను నిర్ణయింపఁజాలము.౪. కార్యభిన్నత కారణభిన్నతను సూచించును. మన మనుభవించు భిన్నఫలముల కేక కారణమును దేవుఁడని కాని ప్రకృతియని కాని చెప్పఁజాలము.౫.

యుందురు అందుచే సూత్రకారులు వ్యవహార జగద్విషయములనే పరిశీలించి, తదతీత విషయములను సరకుగొనరైరి. ఇది లోపమని నమ్మి భాష్యకారులు దైవాస్తిత్వమును, సమర్థింప వీలైన యొక్క శబ్దప్రమాణమువలననే ప్రకటించిరి. (తర్కసంగ్రహము॥ పుట ౧౩౬-౧౩౭.) "న్యాయదర్శనమునకు ముఖ్యలక్షణము తర్కాభిలాష యగుటచే, దైవవిషయము దానికి ప్రకరణవిరుద్ధమగును. ఒక విషయమును విడిచిపెట్టుట నాస్తికత కాఁజాలదు." (కీత్ ఐ. యల్. ఎ. పు. ౨౬౫.)

(౨) సాపేక్షత్వా దనాదిత్వా ద్వైచిత్ర్యా ద్విశ్వవృత్తితః ప్రత్యాత్మనియమాద్భుక్తి రస్తిహేతురలౌకికః॥ (౧-౪)

(౩) ౧. ౫.

(౪) ౧-౬. అదృష్టమాన కాదివిషయము విడువఁబడెను; చూ॥ న్యా॥ వా॥ ౪, ౧, ౨౧.)

(౫) ౧-౭.

మనముచేయు కర్మలకు సంస్కారములు మిగిలి, కర్మఫలముల నిచ్చు శక్తిగలవై యుండును. "చిరకాలముక్రిందటఁ జేసిన కర్మ కేదోయొక అతిశయప్రభావము లేనిదే నేఁడు ఫలమునీయఁ జాలదు" సత్కర్మవాసన పుణ్యము;దుష్కర్మవాసనపాపము; ఈరెండును గలిసి యదృష్టరూపమునఁ గర్తయొక్క యాత్మ యందు నివసించును; కాని కర్తకు సుఖదుఃఖము లిచ్చు వస్తువు లందుఁగాదు. అనుగుణములైన దేశకాల వస్తువులు గలిగినపు డీయదృష్టము కర్మఫలముల నిచ్చును. పుణ్యపాపము లవిచ్ఛిన్నములై యుండుటకుఁ గారణ మదృష్ట మతీతశక్తిగలదగుటయే. ఆత్మలకు దేహములతో సంబంధము ప్రకృతి కారణసిద్ధముగాదు. ప్రకృతిధర్మములో ధర్మమాత్రము వచ్చి ప్రవేశించును. భిన్నాత్మలు భిన్నానుభవదశాభేదములుండుటకుఁ గారణ మదృష్ట భేదము.

అణువులలోఁగల సహజక్రియాశక్తి చేతను, ఆత్మలలోఁగల యదృష్టముచేతను, విశ్వసృష్టి యేర్పడెనను ప్రాచీన నైయాయికవాదమును సమర్థించినంతవరకు నుదయనుఁడు న్యాయదర్శనకర్తలకు విధేయతనుజూపెను కాని, జడాత్మకమైన యదృష్టమువంటి యొకశక్తి కార్యములకుఁ గారణము కాఁజాలదనియు, నదృష్టప్రవృత్తిని, సక్రమముగా నడపునొక యీశ్వరుఁడున్నాఁడనియు వాదించుటలో నాతఁడు తన పూర్వులభావముల నతిక్రమించెను. ౧. అణువులవలనను,

(౬) ౧-౯.
(౧) ౧. ౧౯.

కర్మశక్తివలను, జగదుత్పత్తి సమర్థింపఁబడదు. స్వభావసిద్ధముగా నణువులు క్రియాసమర్థములగుచో నట్టిసామర్థ్య మెల్లప్పుడు నుండవలెను. అణుప్రవృత్తికిఁ గాలశక్తి కారణమైనచో, నట్టి యచేతనధర్మయుక్తమగు కాలమెల్లప్పుడు క్రియాపరతంత్రమైనఁగావలయు లేదా యెల్లప్పుడు నిష్క్రియాత్మకమైనఁ గావలయును. లేగదూడపోషణమునకై గోక్షీరము స్రవించు నుపమాన మిచట సరిపోదేలన, మృతిపొందిన గోవునుండియు క్షీరము స్రవించవలెను. కావున నొక యచేతనశక్తికిఁ బ్రవృత్తి యున్నచో, నాప్రవృత్తి కింకొక చేతనవ్యక్తి కారణమై యుండవలెను. జీవాత్మ కదృష్టముపై నాధిపత్యముండఁజాలదు; ఏలన నున్నచో, నకాంక్షితదుఃఖసిద్ధి నది వారించియుండును. అందుచే నచేతనమగునదృష్టధర్మము, దేవు నాదేశమునను సరించి ప్రవర్తించును;కాని దేవుఁడు దానిని సృజించనులేదు; దానియమోఘగమనమును మార్పుచేయునులేఁడు; కాని దానివ్యాపారమును జరుగనిచ్చును. ఈవిధముగా నీశ్వరుఁడు మనకుఁగర్మఫలప్రదుఁడు.

ఇతర హేతువుల నుదయనుఁ డీట్లొకశ్లోకములో సంగ్రహించినాఁడు: "కార్యములవలనను ఆయోజనధృత్యాదులవలనను, సంప్రదాయసిద్ధ కళలవలనను, ప్రమాణములవలనను. శ్రుతులవలనను, వాని వాక్యములవలనను, సంఖ్యావిశేషములవలనను, నిత్యుఁడు సర్వజ్ఞుఁడునగు నీశ్వరుఁడున్నాఁడని ధృవపడుచున్నది." ౧. కారణవాదము మొదటఁ బరిశీలింపఁ

(౧) కార్యాయోజన ధృత్యాదేః పదాత్ప్రత్యయతః శ్రుతేః
వాక్యాత్సంఖ్యా విశేషాచ్చసాధ్యో విశ్వవిదవ్యయః।

బడినది. భిన్నాంశకల్పితము గావున జగమొక యుత్పత్తిగలదే; అందుచే దానికొక కర్తయుండవలెను. ఏలన, "ఏక కాలమందున్న కారణపరంపరలతో నిమిత్తములేకుండ తన స్వరూపమును స్వతంత్రముగాఁ బొందఁగలదేదియుఁ గార్యము కానేరదు." జగత్కర్త చేతనుఁడు, "ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులుగలిగి వీనివలన సర్వకారణములను బ్రవృత్తిలోఁ బెట్టి నడిపించునుగాని తన్నుఁ జలింపఁజేయున దేదియును లేనివాఁడు." ఆయోజనశక్తివలన సృష్ట్యాదియందు రెండణువులు సంయోగమునొంది ద్వ్యంద్వ్య ద్రవ్యములేర్పడును. ఈ శక్తి యొకకర్తనునూచించును. ధృతి యనగా నీయద్భుతమైన ప్రపంచమాతని సంకల్పశక్తిపై నాధారపడియున్నది. ధృత్యాదేః యనుచో 'ఆది' శబ్దమువలన నాతఁడు ప్రళయకారకుఁడనియుఁ దెలియును. ఈశ్వరుఁడు లోకమును సృజించి, లయమొనర్చి, తిరిగిసృజించును. సంప్రదాయసిద్ధకళలు బుద్ధిమంతుఁడైనయొక కోవిదుని సూచించును. వేదముల కధికారము వేదకర్త వానికిచ్చియున్నాఁడు. ఉదయనునభిప్రాయములో వేదము లితరవస్తువులవలెనే సృష్టిలయవశములైన అనిత్యవస్తువులు. ఇప్పటికి నవి జ్ఞానాధారములగుటకుఁ గారణము వానికర్త యీశ్వరుఁడగుటయే. ౨ మఱియు శ్రుతియే జగత్కర్తను మనకుఁ దెలుపుచున్నది. మఱియు వేదములు వాక్యయుక్తములుగావున, నొకకర్త యుండవలెను; ఆతఁడు దేవుఁడొకఁడే కావలయును. సంఖ్యావిశేషవాదములోని భావమేమనఁగా, ద్వ్యంద్వ్యానుపరిమాణము, అణుపరిమాండ

---

(౨) ౫. ౧.

ల్యముచలనఁగాక, దానికిఁ గారణములగు నణువుల ద్విసంఖ్య వలనఁగలిగెను. ఈ ద్వంద్వసంఖ్యాజ్ఞానము బుద్ధ్యపేక్షగలది; అందుచే సృష్ట్యాదియందు రెండణువులేకలిసి ద్వంద్వములగుటకుఁ గర్త యొక విజ్ఞానసమర్థుఁడై యుండవలెను. ఈశ్వరాస్తిత్వము ప్రత్యక్షవిషయముకాదు. కావున సహేతుకము కాదను నాక్షేపణము నుదయనుఁడు ఖండించినాఁడు. కనపడని వస్తువు లేదనుట, మనకొకప్పుడు కనపడి యిప్పుడు కనపడకున్న వస్తువునకే చెల్లును. ఇంద్రియాతీతవిషయములట్టివి కావు. ప్రత్యక్షమువలన దైవాస్తిత్వమును నిరూపింపఁజాలమనియే మనము చెప్పఁగలము. ౧. వస్తుభావాభావముల కుపమానముతో సంబంధము లేదు. ౨. శబ్దప్రమాణ మాస్తికతను పోషించును. ౩. అర్థాపత్తియు ననుపలబ్ధియు స్వతంత్రజ్ఞాన ప్రమాణములుకావు.

నైయాయికుని కీశ్వరుఁడు సచ్చిదానంద రూపుఁడైన సగుణమూర్తి; ఆతని కధర్మమిథ్యాజ్ఞాన ప్రమాదములు లేవు. ఆతఁడు ధర్మజ్ఞాన సమాధి సంపన్నుఁడు, సృష్టి చేయుటలో నాతఁడనంతశక్తి సంపన్నుఁడు; కాని జీవుల పూర్వకర్మఫలానుగుణముగ నాతఁడు సృజించును. ఈశ్వరుఁడాప్తకర్మఫలుఁడు; లోకసంగ్రహార్థ మాతఁడు కర్మ చేయుచుండును. "తండ్రి బిడ్డల

---

(౧) ౩, ౧.
(౨) ౩, ౪-౭;
(౩) ౩, ౮-౧౨.
(౪) ౩, ౧౩-౧౭.

కొఱకుఁ గర్మ చేయునట్లే, జగత్పితయుఁ దన సంతతి కొఱకై ప్రవృత్తి పరుఁడగును."౫ సత్యమును గూర్చి స్వతఃప్రమాణ యుక్తమైన యథార్థజ్ఞానము కలవాఁడు గావున నీశ్వరుఁడు సర్వజ్ఞుఁడు. ఆతఁడు శాశ్వతచిత్స్వరూపుఁడు; ఏలన నాతని జ్ఞానక్రియ లవిచ్ఛిన్నములు. అతనికి స్మృత్యనుమాన జ్ఞానము లవసరము లేదు. సామాన్య ప్రజల కరుదుగా లభించు నతీంద్రియ జ్ఞానరేఖయు, నభ్యాసబలముచే యోగులకుపలబ్ధమగు దివ్యజ్ఞానమును, దేవుని కెడతెగని లక్షణమై యున్నది.౬ దేవునికిఁ గామములున్నవి.౭ దేవుని జ్ఞానము శుద్ధము, నిరవద్యమును. అతని యానందమవ్యయము.౮ సృష్టి సమస్యలోని కష్టములు గుర్తింపఁబడెను. దోషజ్ఞానవశమున దుఃఖము నుదయింపఁజేయున దే సర్వప్రవృత్తియు నని చెప్పఁబడెను.౯ తనకుఁ గాని యితరులకుఁ గాని యేదైనఁ గాంక్షాసిద్ధికై దేవుఁడు సృష్టి కర్మ చేసెనా? దేవుఁ డాప్తకాముఁడు కావున నెట్టి స్వీయప్రయోజన ముండియు నాతఁడు సృష్టి చేయలేదు. ఇతరుల కొఱకుఁ బరితపించు నాతఁడెల్లప్పుడును ప్రవృత్తిలంపటుఁడు, మానవకోటి యందలి ప్రేమచే లోకమును సృజించినాఁడనియు మనము

(౫) ౩, ౧౮-౨౩. (౬) ౪, ౧, ౨౧.

(౭) దేవుని సంపూర్ణజ్ఞానములో మానవుల మిథ్యాజ్ఞానము, మిథ్యాజ్ఞానవిషయములు నున్నవా, అట్లున్నచో దేవునికిఁ గూడ మిథ్యా వస్తువర్ణన మున్నదా యను సమస్య నుదయనుఁడు పేర్కొని, దేవుఁడు మానవుని మిథ్యాజ్ఞానములోని మిథ్యాత్వము నెఱుఁగునని సమాధానము చెప్పినాఁడు.

(౮) న్యా. సూ. ౪, ౧, ౨౧.

(౯) ౧, ౧, ౧౮.

నిర్ణయింప లేము. లోకముయొక్క దుఃఖస్వభావమీ నిర్ణయమునకు విరోధమగును. ఈవిమర్శకు నైయాయికు డిట్లు బదులు చెప్పను. "సృష్టి చేయుటలో నాతని ప్రవృత్తి కేవలమనుకంపాజన్యమే, కాని లోకమును సృజింపవలె నను భావమానందసంభాయకమైనను, జగద్వస్తు స్వభావమునకు విరుద్ధముగా నున్నది. సృజించవలసిన మానవుల భిన్నరూప కర్మఫలము పరిపక్వమగుటకు గాలవశమున భేదములుదయించినవి. ఇది దేవుని స్వాతంత్ర్యమునకు లోపము గాదు. ఏలన, "ఎవని దేహము వానికి భారము కాదు. పైగా నదియొకని ప్రయోజనముల సాధించుట కుపయోగించును"న్న సామెత గలదు.౨. దేవుని ప్రవృత్తి కారణాంతరములచే బరిమితమైనది; కాని యీ కారణాంతరముల నాతడు కల్పించు కొనినవే.౩. దేవుని లక్ష్యము మానవులకు సుఖము చేకూర్చుటగాదు; మానవులకు బరమార్థము గూర్చుటయే, పారమార్థిక లక్ష్యసాధనముల కొఱకే లోకమేర్పడినది; క్లేశానుభవమున శ్రేయమును, త్యాగముచే బరిపూర్ణతను సాధింపనగును. నైయాయికులు శైవులనియు, వైశేషికులు పాశుపతులనియు జెప్పుదురు.౧.తన వివేకవిలాసమునందు జినదత్తుడు

(౨) సర్వదర్శన సంగ్రహము, ౧౧, ౮. (౩) న్యా. వా. ౪, ౧, ౨౧.

(౧) చూ: గుణరత్నుని షడ్దర్శన సముచ్చయవృత్తి పుటలు ౪౫-౪౬ కూడ జూడుము: హరిభద్రుని షడ్దర్శన సముచ్చయము:

"అక్షపాదమతే దేవః సృష్టిసంహారకృచ్ఛివః
విభుర్నిత్యైకస్సర్వజ్ఞో నిత్యబుద్ధిసమాశ్రయః॥ (౧౩)

రాజశేఖరుని షడ్దర్శన సముచ్చయము (దీనికి గొంచెము పూర్వము) ఈభావమునే చెప్పును. చూడు: (కీత్. ఐ. యల్. ఎ. పుటలు ౨౬౨-౨౬౩)

(౧౩-వశతాబ్దమధ్యమకాలము)న్యాయ వైశేషికవాదులకు శివుఁడిష్టదైవతమని చెప్పినాఁడు. ఉద్ద్యోతకరుఁడు పాశుపత మతస్థుఁడు. భాసర్వజ్ఞుఁడు తన ధ్యానములో మహేశ్వర సాక్షాత్కారము లభించినదని చెప్పినాఁడు.౨. శివుఁడే పరబ్రహ్మమని యుదయనుఁడు పలికినాఁడు.3.

న్యాయదర్శనాస్తికసిద్ధాంతము హిందూవిజ్ఞాన ప్రపంచములో విశేషముగాఁ జర్చింపఁబడినది. సముచితహేతువాదమున కవకాశము లేనపుడెల్ల నైయాయికుఁ డదృష్టము నుదాహరించుచుండుటను విమర్శకుఁడు గుర్తించియుండును. ప్రాతిపదికాణుసంచలనము, అగ్నికూర్ధ్వవ్యాప్తి, సూదంటురాయి కినుపముక్కయెడఁగల యాకర్షణమునుగూడ నదృష్టకార్యములని చెప్పఁబడెను. అదృష్టమనున దొక హేతుపరిమితిని సూచించును.౪. అదృష్టమున కొక విజ్ఞానసహితుఁడగు సారథి, యనగా నీశ్వరుఁ డవసరమని గుర్తింపఁబడెను. ఏలన లోకములోని వివిధ తాటస్థ్యముల యద్భుత క్రమవిధానము నీశ్వరుఁడు గాక వేఱొకఁడు నడుపఁజాలఁడు. ఈశ్వరుఁడొక్కఁడే

(౨) న్యాయసారము॥ పు. 3౯.

(3) కుసుమాంజలి॥ ౨, ౪.

(౪) తన న్యాయమంజరిలోఁ జార్వాకవాదమును ఖండించుచు జయంతుఁడు తన మొక వస్తుకారణము తెలియఁగనపుడు దానిని స్వాభావికమని చెప్పివేయుదుమని వచించెను,

జ్ఞానేచ్ఛా క్రియాశక్తి సంపూర్ణుఁడు. జీవులు తమ క్రియాశక్తిని ప్రళయకాలమునఁ గోల్పోయి, పునస్సృష్టికాలమునఁ దిరిగి పొందుటకుఁ గారణభూతుఁ డీశ్వరుఁడే. ఉదయన శ్రీధరులు కారణధర్మమున కధిక ప్రాముఖ్యము నిచ్చిరి.౯. ప్రపంచము కార్యమని నిర్ణయించి, నైయాయికుఁడు ప్రమాణావసరము లేకుండ నంగీకరించును. పశువృక్షాదులు స్వయంప్రకాశకము లుకావు; అవి పుట్టి, పెరిగి నశించును. వివిధవస్తువు లుత్పత్తి గలవనుట, మొత్తముమీద విశ్వమంతయు నుత్పత్తిగలదనుట కాఁజాలదు. ఉత్పత్తిలేని యనేక శాశ్వతపదార్థములు గలవని నైయాయికుఁ డంగీకరించును.౧. బ్రహ్మాండముకూడ మొత్తము మీద నట్టిదే కాఁగూడదా? సర్వకార్యములకు ముఖ్యకారణము లుండవలెనా? నైయాయికుఁడు ప్రకటించిన కారణధర్మమునకు విశ్వవ్యాప్తిలేదు. కారణధర్మము సమానము నేకకాలికము నైన పరిణామమునే సూచించును. జగద్వస్తుపరిణామ క్రమమును జూచియే యీకారణధర్మ మూహింపఁబడినది కావున నీ ధర్మ మా జగత్కారణమునకుఁ గల్పింపవీలులేదు. జగత్కారణము నూహించుశక్తి మానవునకు లేదు. కార్యకారణములకు మూలకారణములు వెదకుచో ననంతముగా నీవాదము వ్యాపించి వ్యర్థవాదములోనికిఁబోవును గావున, నీ కారణపరంపరకు వేరగు కారణములేని యొక కారణమును నైయాయి

(౯) న్యాయకందళి॥ పుటలు ౫౪-౫౭.

(౧) "శాశ్వతవస్తువున కుత్పత్తిలేదు. కారణమునులేదు" (న్యా॥వా॥ ౪, ౧, ౩౨,)

కుఁడు గల్పించినాఁడు. శంకరుఁడీ కారణవాదమును నిరసించి, ప్రపంచ మున్నటుల గోచరించుచున్న విషయమును నిస్సంశయ ధైర్యముతోఁ బ్రకటించుట మంచిదని చెప్పినాఁడు. జగత్తు స్వీయాధారభూతమో, వేరొక కారణమునకుఁ గార్యమో మనకు గ్రహించు సామర్థ్యము లేదు. వేఱొక కారణమును మన మంగీకరించినచో దాని కింకొక కారణము నూహించి, యట్లు మఱి పోవువఱకుఁ గారణాన్వేషణము చేయుచుండవచ్చును. దేవుఁడున్న యెడల వాని నెవఁడు సృజించెను? సాంఖ్యము ననుసరించి, దేవుఁడు స్వయంసంభూతుఁడని చెప్పుటెంత సులభమో, జగత్తు స్వయంకృతమని చెప్పుటయు నంతేసులభము. తాత్త్వికముగా నీ సమస్యకుఁ బరిష్కారము లేదు. ఏపరిష్కారమునైన నూహించుచో నది సమస్యకంటె నధమరూపమును బొందును. నైయాయికుని ప్రకృతిభావమువలన నితరకష్టములు సంభవించును. జగత్కర్తయగు దేవునకు దేహమున్నదా లేదా యని యడుగఁబడెను. దేవునికి దేహమున్నచో, నదృష్టము సర్వదేహములను నిర్మించును గావున దేవుని దేహము నదృష్టవశవర్తియగును. దేహధారులు సృజింపఁబడినవి; అందుచే వాని కణువులపైఁగాని, పుణ్యపాపములపైఁగాని యాధిపత్యము లేదు. శాశ్వతదేహ మెట్లుండఁగలదో మనము చూచియెఱుఁగము. దీనివిషయములో నైయాయికులకు విస్పష్టభావములు లేవు. ఏ దేహముతో నిమిత్తము లేకుండ దేవుఁడు సృజించునని యొక మారును, మన యదృష్టముల ఫలితముగా దేవుని కొక శరీర మేర్పడునని వేఱొకమారును జెప్పఁబడెను. ఒకప్పు డణువులే

దేవుని శరీరమనియుఁ జెప్పఁబడెను. ఆకాశ మాతని దేహమని మఱొకచో నుడువఁబడెను. దేహావసరము లేకుండ నణువుల సాహాయ్యమున నెట్లో మనకుఁ దెలియనిరీతి నాతఁడు లోకమును సృజించెనని చెప్ప వీలైనచో, నీ యణుసాహాయ్యముకాని యేయితర సాహాయ్యముకాని లేకుండ నాతఁడు సృజించెననియు మనము చెప్ప వీలగును.

దైవాస్తిత్వ నిరూపణమునకై యుపయోగింపఁబడిన హేతువులు యుక్తములేయని యంగీకరించినను, పరిపూర్ణత లేని మన-మేసర్వాత్మస్వరూపియైన పరమేశ్వరుని రూపాంతరములమో యట్టి పరమేశ్వరుఁడు నైయాయికులుస్థాపించిన పరమేశ్వరుఁడు గాఁడు, నైయాయికుల యీశ్వరుఁడు మనకును లోకమునకును బాహ్యమందుండినవాఁడే. ఆతఁడు లోకమును సృజించి, పోషించి, నశింపఁజేయుఁగాక! కఱ్ఱలమోపు నొక త్రాడుతోఁ గట్టినట్లు, న్యాయదర్శనమునను సరించి, యనేక వస్తుసముచ్చయమును బాహ్యమునుండి బంధించినరూపమే సత్యస్వరూపమగుచున్నది. అణుసృష్టి యీశ్వరుఁడు చేయలేదు; వానికాకృతి నాతఁడిచ్చును. విశ్వమును గల్పించిన భూతజాలమును బాహ్యమునుండిస్వీకరించి పనిచేయునేకాని యాతఁడు జగదంతర్వర్తియైన యొక యనంతశక్తిస్వరూపుఁడు గాఁడు. ప్రపంచమునకు వేఱై, యేకాంతవాసియైన యీశ్వరభావ మొక శుష్కభావమే. ఒకవైపున ననంతస్వరూపుఁడగు నీశ్వరుఁడు నింకొకవైపున ననంతమైనజగత్తు నుండుట సమర్థింపఁదగిన ప్రతిపాదనముగాదు. ఒకదానినొకటి పరిమితమొనర్చును. రెండు

వేరుగానున్నట్లు వర్ణింపఁబడిన వస్తువు లపరిమితములుగాఁ జాలవు. జీవు లెప్పుడో యొకప్పుడు మోక్షముఁ బొందును. సర్వజీవమోక్షసిద్ధితో సంసారమదృశ్యమగును. అప్పు డీశ్వరాధిపత్యము నంతమగును. అంతమగుదాని కాదియునుండవలెను. కావున నీశ్వరజగత్తులు రెండును శూన్యమునుండి యుదయించి శూన్యములోనికిఁ బోవలెను. ప్రేమచే నీశ్వరుఁడు లోకమును సృజించెనని చెప్పఁబడెను. కాని యీతత్త్వముననుసరించి సృష్టికర్థమేమి? అణువులు, జీవులు రెండును నిత్యములై, ప్రపంచము వీని పరస్పర సంపర్కరూపమైనచో, నీశ్వరుఁడు సృజింపవలసిన దేమున్నది? అందుచేఁ దన యీశ్వరుని నైయాయికుఁడు విడిచిపెట్టనైనవలయును, లేదా, అచేతనరూపములోఁ గాక నీశ్వరుని నిత్యకారణధర్మముయొక్క భిన్నరూపములే యణువులు జీవులుఁననియైన నంగీకరింపవలెను. వస్తుస్వరూపము దేవుని శరీరమనిచెప్పిన న్యాయధర్మసూచనకీయర్థమున్నది. దీనినే రామానుజుఁడు విశేషప్రజ్ఞతోఁ దన తత్త్వమునందు నిర్మించి, నిరూపించియున్నాఁడు. దేవుని సర్వజ్ఞత్వమునుండి, యాతని జగదంతర్వర్తిత్వమే యేదోయొకవిధముగా సాధింపఁబడవలసియున్నది. న్యాయదర్శనముననుసరించి, జీవులు విజ్ఞానమాత్రములు; యథార్థస్వరూపము విజ్ఞానమాత్రముకాదని స్పష్టము. విజ్ఞానము, సత్యస్వరూపము నన్యోన్యసంబంధములా, యెట్లను విషయము ననంతమైనమానసమే, పరిమిత మానసములతో నొకటైనమానసమే తెలిసికొనఁగలదు. అణువులును జీవులును, దేవునితో సమానముగా నిత్యములు. న్యాయ మీశ్వర

భక్తి నాదేశించుటచే, దానివలన మానవకోటికి మోక్షలాభ మున్నదనితోఁచును. కాని, యీశ్వర సాయుజ్యమునుగాని, యీశ్వర సారూప్యమునుగాని, న్యాయ ముపదేశింపఁజాలదు, ఏలన న్యాయసిద్ధాంతముననుసరించి, యీశ్వరుఁడు మానవునకు లోకమునకు బాహ్యమునను న్నాఁడు. భిన్నరూపములలో వేదాంతమును, యోగశాస్త్రము నుపాసనము నుపదేశించును; అట్టి యుపాసనవలన నుపాసకున కీశ్వరత్వసిద్ధి లభించునని చెప్పఁబడెను. మానవకోటియొక్క మహోన్నతమతలక్ష్యమున కనుగుణముగా నుండవలెనన్నచో నీశ్వరునిగూర్చిన భావమును న్యాయదర్శనము మార్చుకొనవలెను.

౨౬—ముగింపు.

హిందూవిజ్ఞానమునకు న్యాయదర్శనము చేసిన ప్రిదానమేమనగా, శాస్త్రయుక్తము, విమర్శాపూర్వకమునైన సత్యాన్వేషణ విధానము. ఇతర దర్శనము లన్నియుఁ దమతమ తత్త్వముల ననుసరించి కొలఁది భేదములతో నీవిధానము నంగీకరించినవి. జ్ఞాన ప్రపంచమున కాకృతిపటమును లిఖించి, దాని యవధులను మార్గములను నిర్ణయించి, యందలి ముఖ్యవిభాగములకు నామముల నిచ్చినది న్యాయదర్శనము. ఈనామములు నేటికిని హిందూవిజ్ఞానమున వాడుకలో నుండుటచే న్యాయదర్శనము విజ్ఞాననిధి కెంత యమూల్యవిత్తమును గూర్చినదో విశదమగుచున్నది. న్యాయదర్శన మొసఁగిన దోషపట్టికవలన ననేక శతాబ్దముల నుండియు భారతీయ విజ్ఞానవేత్తలు బహు సులభముగాను వేగముగాను సత్యాసత్య విషయవిభాగ మొనర్చుకొను

టకును, దోషనిర్ణయముల కుచితనామముల ముద్రవేసి పరిక టించుటకు నవకాశము గలిగినది. సంస్కృత తాత్త్వికరచనలలోఁ దఱచుగా మనకుఁ గొన్ని తర్కపదములు "ఇది చక్రకము" అనగా 'విషమవాదమ' ను భావము "అది సాధ్యసమము" ఇది "అన్యోన్యాశ్రయము." "ఇది అనవస్థావాదము" మున్నగునవి గోచరించును. న్యాయ దర్శనమిచ్చిన దోష సిద్ధాంతనూచిక భారతీయ తత్త్వజ్ఞుల కొక సిద్ధపరిష్కార సంపుటి (Ready Reckoner) వలె నుపయోగించి, బోర్నే పండితుని మాటలలో "మనము చేతులు కడుగు కొన వలసినపుడెల్ల సముద్రమునకుఁ బోనవసరము లేకుండఁ గాపాడినది".

తత్త్వమత సమస్యలను బరిష్కరించుటకు మన వ్యావహారికానుభవ పరిశీలనావిధానమే యుక్తమైనదను విశ్వాసము న్యాయదర్శనమునకు బలము దౌర్బల్యము కూడ నైనది. జీవ జడపదార్థము లద్వైతభావముతోఁ గూడిన జగత్స్వరూపము తత్త్వాన్వేషణమున కుచితమైన సామగ్రియేకాని, దానినే తత్త్వ నిశ్చయముగా స్వీకరించుట కర్హమైనదికాదు. ప్రాకృతమానవుఁడు తన కంటికి గోచరించుచున్న బాహ్యజగత్తు యథార్థమైనదని చెప్పుట కెన్నఁడును సంశయింపఁడు. ఆతఁడు జీవులను గూడ నంగీకరించును. కాని హేతువాదియై కాక, సహజజ్ఞానముచేతనే. కాని యాతఁడు యథార్థజగత్తున కంతరువులున్నవని యొప్పుకొనఁడు; ఏలన లోకమున రెండు యథార్థవస్తుస్వరూపము లున్నవను తన భావమునకు వికల్పమేర్పడును. కాని హేతువాదము ననుసరించి, బాహ్యప్రపంచములో నింద్రియా-

తీతవిషయము లుండుననుటకుఁ దలయూఁచును. దైవతత్త్వ విషయములో నాతఁడు సృష్టికారణమునుగూర్చి ప్రశ్నించును. సృష్టి యెట్లువచ్చెను? జగ మిప్పుడున్నరీతినే పూర్వము నున్న దనియు నెల్లప్పు డట్లేయుండుననియు నూహించును. ద్వైతి కావున నాతఁడు జడపదార్థమునుండి జీవపరిణామ మెప్పుడారం భమైనదను విషయమును దర్కింపఁడుగాని, యాతనికిఁగల ప్రత్యక్షజ్ఞానముచే జగము చలనములేని స్థాణువుగాదని యంగీ కరించును. ఈ క్లిష్టసమస్యావరిష్కారమునకుఁ దన యనుభవ మునే యాధారముగాఁ దీసికొనును. తాను తనప్రజ్ఞవలన బల్లలు, నాసనములు మున్నగునవి తనకంటె వేరగు వస్తువులను జేయుచుండుటను గాంచుచున్నాఁడు. అట్లే భగవంతుఁడును దన సృష్టికి వేరని నిశ్చయించును. మన వస్తువులను మనయిచ్ఛ వచ్చినరీతిని పునర్నిర్మాణ మొనర్చునట్లే, యీశ్వరుఁడును దనతో నిత్యములైయున్న జీవులు నణువులు నను సామగ్రిని దనస్వేచ్ఛ ననుసరించి పునఃపునః సృష్టి చేయుచుండునని భావిం చును. ఈవిధముగా న్యాయదర్శనము ప్రాకృతమానవుని లోక జ్ఞానమున కనుగుణముగా ద్వైతప్రపంచ సిద్ధాంతమును గల్పించి దానికొక తత్త్వస్వరూపము నొసఁగినది.

న్యాయవాదము నిస్సంశయముగా విజ్ఞానపరిణామ ములోఁ సహజము, ముఖ్యమునైన యొక ఘట్టమేకాని, తుది మెట్టుకాఁజాలదని మేమిదివఱకే సందర్భోచితముగా నూచించి యున్నాము. మూలద్రవ్యములగు నణుకల్పితమే జగత్తను

సిద్ధాంతము పరిణామవిధానమును విస్మరించినదగును. జగము కేవల భావగతమేయను సిద్ధాంతమును నిర్మూలించుటవలనను, ప్రాకృతమానవాభిరుచి కనుగుణముగాఁ దత్త్వమును బ్రక టించుటవలనను, న్యాయసిద్ధాంతము యుక్తియుక్తమైనదనునట్లు గోచరించును. హిందూవిజ్ఞానమం దేశాఖకాని, తుదకు శంకర తత్త్వమైనను జగత్తుభావమందున్న దేకాని నిజముగా లేదను వాదము నం ింపదు. కాని నిజముగాఁజూచినచో, పరమార్థ స్వరూపమునకును భావకల్పనమునకును, వైరుధ్యముండనవస రము లేదు. ౧. బాహ్యజగత్తు యథార్థమని యంగీకరించువా రందరును జీవులకు వేరై జగద్వస్తుసమూహమున్నదని యొప్పు కొనియున్నారు. విజ్ఞానస్వభావ స్వరూపములను దాత్త్వి కముగాఁ బరిశీలించినచో లోకములోని జడపదార్థములవర్గ ములో నాత్మను జేర్చుట కవకాశము లేదని మనకుసువిదితమగును. దీనివలన నుదయించుతత్త్వము లోకజ్ఞానదృష్టికి విరోధము కాదుగాని దాని )మించును. పరమార్థతత్త్వమైనను, వ్యవహారదృక్పథముననుసరించి, సత్యస్వరూప విజ్ఞానరూపము లకు భేదము నంగీకరించును. మనకనుభవములోనున్న జగత్తు సామరస్యమున పరిచ్ఛిన్నతనుజూపుటవలన నిత్యము నిరవద్య మునగు సత్యస్వరూపమొకటియున్నదని స్ఫురించును. మన

(౧) పోల్చు. గ్రీన్: "ఒకవస్తు వొక విజ్ఞానస్వరూపము కాదనియు, గాని యొక చేతనవిజ్ఞానమునకట్టి వస్తువు యథార్థస్వరూపముగావచ్చు ననియుఁ జెప్పుటకవకాశమున్నది" (వర్క్సు. వాల్యుము ౧పు. ౪౨౩)

యనుభవముయొక్క నిగూఢపరిశీలనమును సాంఖ్యవేదాంతములు గైకొనినవి. న్యాయమునందలి దైవతత్త్వభావములకెక్కుడు సన్నిహితైక్యమును ఘటించి ప్రకటించినది రామానుజతత్త్వము.

### ఉదాహృతగ్రంథములు.

౧. అథల్యే: అన్నంభట్టు తర్క సంగ్రహము.
౨. కోవెల్: ఉదయనుని కుసుమాంజలి.
3. కోవెల్ అండు గఫ్: సర్వదర్శన సంగ్రహము. ౧౧అ
౪. గంగానాథఝా: ఉద్ద్యోతకర వాత్స్యాయన భాష్య సహిత న్యాయసూత్రములు
౫. కీత్: ఇండియన్ లాజిక్క అండ్ ఎటామిజమ్.
౬. సీల్: ది పోజిటీవ్ సైన్సెస్ ఆఫ్ ది ఏన్షెంటు ఇండియన్సు
౭. విద్యాభూషణుడు: హిస్టరీ ఆఫ్ ఇండియన్ లాజిక్క.

ఓం

# భారతీయ తత్త్వశాస్త్రము

## తృతీయాధ్యాయము

### వైశేషికాణువాదము

### ౧ — వైశేషిక దర్శనము.

విశేషనామము నుండి వైశేషిక తత్త్వనామ ముదయించినది. జగత్తులోని విశేషములలో నందు ముఖ్యముగా నక్షిగోచరములుకాని జీవులందు నణువులందు నిజమగు వ్యక్తిత్వము లభ్యమగును. ప్రత్యేకజీవులకు లోకముతోడను, సంఘముతోడను సంబంధమున్నను, నట్టి సంబంధము వలననే తమ వికాసమున కవకాశములున్నను, దమప్రత్యేకతనవి స్వతంత్రముగానుండునట్లు నిలుపుకొనఁగలవు. వైశేషికదర్శనము భిన్నతనంగీకరించు ప్రధానలక్షణముగల తత్త్వము. జీవులయొక్కయు, వస్తువులయొక్కయు, పృథక్త్వము నది కోల్పోవ నంగీకరింపదు. దాని దృక్పథము శాస్త్రయుక్తము. వస్తువిభాగరూపమేకాని, పరిశోధనాత్మకము, సమన్వయరూపముకాదు. కాని, జగత్స్వరూపమునుగూర్చిన సమగ్రసమస్యాపరిష్కారావసరముల నది కాదనలేకపోయెను. శాస్త్రము వర్గీకర

ణము చేయును; తత్త్వశాస్త్రము సమన్వయ మొనర్చును. ఇంద్రియ జ్ఞానబుద్ధిజ్ఞానప్రపంచముల నొకే సమన్వయసూత్రమున లీన మొనర్చు మహాప్రయత్నమునకు వైశేషికదర్శనము పూను కొనలేదు. శాస్త్రదృక్పథముననుసరించి, దృశ్యములగు వస్తు విషయములఁగూర్చి అతిసామాన్యలక్షణములను సమీకరణ మొనర్ప నది యత్నించినది. అనుభవములోని భిన్నరూప ముల కొకయాకృతిని నొకనిర్ణీతస్థానము నిచ్చినది. తత్ఫలిత ముగా లభించిన తత్త్వము సమగ్రసమన్వయహీనమై, విశ్వ విశాలత లేనిదైనది.

బౌద్ధవిజ్ఞానవాదమునకు వ్యతిరేకముగా నీ వైశేషిక తత్త్వము జన్మమందినది. వైశేషికము బౌద్ధజ్ఞానప్రమాణము లగు ప్రత్యక్షానుమానముల నంగీకరించునుగాని, జీవులును, వస్తువులును దెఱచాటుననుండి ప్రదర్శింపఁబడిన మిథ్యా రూపములు గావనియు నవి శాశ్వత సత్యరూపములనియు వాదించును. దైవతత్త్వప్రసంగ మది తలపోయనేలేదు; శంకరా చార్యుని విమర్శనముననుసరించి, వైశేషికదర్శనమునకు నాస్తి కతాలక్షణమున్న సూచనలు లేకపోలేదు. ౧. కాని మానసి కాందోళన మధికమై, సంశయబీజములు వ్యాప్తిలోనున్న కాలమున వైశేషిక మావిర్భవించినమాట మరువరాదు.

ఇది ప్రధానముగా భౌతికాధ్యాత్మిక శాస్త్రమైనను, ననంతరగ్రంథములలోఁ దార్కికచర్చ లతినిపుణముగాఁ జొప్పిం

(౧) వైశేషికవాదు లర్ధవైనాశికులని శంకరుఁడు చెప్పినాఁడు. (శంకర భాష్యము॥ ౨, ౨, ౧౮.)

పఁబడినవి. జీవస్వరూపలక్షములు, ప్రపంచ మణుకల్పితమను భావము మున్నగువిషయములలో న్యాయవైశేషికము లొకే సిద్ధాంతములను బ్రకటించినను, ప్రమాణ రూప నిర్వచనము నందును, నణుసిద్ధాంత వివరణమునందును, వైశేషికదర్శనము నకు విశిష్టమగు ప్రయోజనమును విలువయుఁ గలవు.

౨—కాలము సారస్వతము.

"వైశేషికదర్శనము న్యాయదర్శనముకంటె నెక్కువ ప్రాచీనమైనదిగాఁ దోఁచును."౧. ఈ గార్బే భావము యుక్తమైనదని చెప్పనగును. మానవవిజ్ఞానమునందు విశేషము సామాన్యపూర్వకమై యుండును. జ్ఞాన మదివఱకే స్వతంత్రముగా వికసించి యుండకున్నచో న్యాయదర్శనము మనకొసఁగిన జ్ఞానసిద్ధాంతమువంటి దుదయించుట సాధ్యముకాదు. అదివఱకే యున్న జ్ఞానమును దర్కశాస్త్ర ముదయింపఁజేసి విమర్శించి పరిశీలించును. కణాద సూత్రములును, ప్రశస్తపాదుని పదార్థధర్మసంగ్రహమును జూచినచో న్యాయదర్శన పరిచయమందుఁ గాన్పింపదు; కాని గౌతముని సూత్రములును, వాత్స్యాయన భాష్యమును బరికించినచో నందు వైశేషికభావ ప్రాచుర్యము కొంతయున్నదని విశదమగును. వైశేషికదర్శనము బౌద్ధ జైనములకంటెఁ బురాతనమైనదని కొందరు వాదింతురు. వైశేషికమునందలి అసత్కార్యవాదమే బౌద్ధనిర్వాణ సిద్ధాంతమైనదందురు. జైనుల అస్తికాయములును, వారి యణుసిద్ధాంతమును వైశేషికములోనివే; కొన్ని జైనగ్రంథములును, లలిత

(౧) గార్బే; ప్రాచీనభారతీయ తత్త్వశాస్త్రము. పు. ౨౦.

విస్తారము నీవిషయమును బేర్కొనియుండెను. లంకావతార సూత్రి మణువాద భావములను బ్రకటించెను. జైనముయొక్క ఆరవశాఖకు ముఖ్యదేశికుఁడైన రోహగుప్తుఁడు (క్రీ. వె. ౧౮). వైశేషికదర్శనకర్తయని యొక యర్వాచీన జైనగ్రంథమగు 'ఆవశ్యక'౧.ము ప్రకటించినది. అది ప్రకటించిన వైశేషిక భావము కణాదుని సిద్ధాంతమునకు౨. సరిపోవుచున్నను, జైన మతవృక్షమునుండి జనించిన యొక శాఖయే వైశేషికమనుట సమంజసముకాదు. ఇట్టిభావమును బ్రకటించుటకుఁ గారణము రెంటికి సామాన్యమగు నణువాదమే; కాని యీ యణుసిద్ధాంత విషయమునఁగూడ రెంటికి విశేషభేదము లున్నవి. జైనసిద్ధాంతము ననుసరించి, అణువులన్నియు గుణములలో సమానములే; రూపరసగంధ స్పర్శాలక్షణములు సమానములే; అణువు శబ్ద రహితమైనను, శబ్దము నుత్పత్తిచేయును. వైశేషికము ననుసరించి, గుణములలోనే యణుభేదమున్నది. ఈయణువులకు

(౧) యస్. బి. ఇ. వాల్యూము. ౧౪. పు. ౩౮.

(౨) ద్రవ్యగుణకర్మ సమవాయము లంగీకరింపఁబడెను; సామాన్య విశేష విషయములలోఁ గొంతభేదమున్నది. సామాన్య మిట్లు విభజింపఁబడినది. (౧) మహాసామాన్యము.ఇది పదార్థము లేక, అభిధేయత్వము, లేక జ్ఞేయత్వమునకు సరిపోవును. దానిలోఁ బ్రమాణములన్నియు నిమిడియున్నవి. (చూడు: ప్ర॥ ప॥ పుట ౧౬; వైశేషికసూత్రము॥ ౧, ౧, ౮) మహాసామాన్యమనగా శుద్ధసామాన్యము. ఇతరములు సామాన్యములు విశేషములుకూడనై యున్నవి. (౨) సత్తాసామాన్యము, వైశేషికములోని సత్తాలేక భావమునకు సరిపోవును. ప్రశస్తపాదుఁడు షట్ప్రమాణములకు నస్తిత్వముసాధర్మ్యలక్షణమని చెప్పినాఁడు. (౩) సామాన్యవిశేషము. ఇది యితర సామాన్యములకు సరిపడును. (చూ: యు.వి. వైశేషికా ఫిలాసఫీ. పుటలు ౩౭-౩౮)

వాయ్వగ్ని జలభూసంబంధము ననుసరించి, ఒకటి, రెండు, మూడు, నాలుగు గుణగణము లుండును. శబ్దముతో వానికి సంబంధమే లేదు. అణుసిద్ధాంతము, ద్రవ్యవర్గీకరణము, జ్ఞాన ప్రమాణద్వయముల వలన వైశేషికము బుద్ధ మహావీరుల కాలమున (౬–౫ శ. క్రీ.పూ.) నుత్పత్తియై యుండునని దృఢముగా నిరూపించవచ్చును. కణభోజి లేక కణభక్షకుడని ప్రసిద్ధి వడసిన కణాదుని వైశేషికసూత్రములే వైశేషిక దర్శనమునకు మొట్ట మొదట శాస్త్రరూపము నిచ్చెను.౨. దీనినే ఔలూక్య దర్శనమనియు నందురు.3. కాని కణాదుని యసలుపేరు కశ్యపుడని తెలియు చున్నది.౪. ఇతని రచనము పది గ్రంథముగా నున్నది. మొదటిది ద్రవ్యగుణకర్మసామాన్య విశేషములను పంచప్రమాణములను జర్చించును, రెండవది వివిధద్రవ్యములను గూర్చియు మూడవది ఆత్మ మానసేంద్రియములను. అనుమాన స్వరూపమును గూర్చియు వివరించును, అణుకల్పిత ప్రపంచస్వరూప విషయము నాల్గవగ్రంథ ముఖ్యవిషయము, కర్మ భేదస్వభావముల చర్చ పంచమగ్రంథమందును, ధర్మశాస్త్రవిషయ స్వరూ

(౧) చూ. యుఐ. వైశేషికా ఫిలాసఫీ. పు, 33 అశ్వఘోషుడు తన సూత్రాలంకారమునందు వైశేషికము బుద్ధుని పూర్వయుగమునకుఁ జెందునని చెప్పినాఁడు. (చూ. యుఐ. వైశేషిక ఫిలాసఫీ. పుట ౪౦-౪౧.)

(౨) కొన్ని బౌద్ధజైన గ్రంథములలో నణు సిద్ధాంతమున్నను నది వైశేషికదర్శనమునందుఁ గేంద్రస్థానము నాక్రమించినది (చూ. బాదరాయణ సూత్రములు, ౨, ౨, ౧౧; ధర్మోత్తరుని న్యాయబిందుటీక. పు. ౭౬)

(3) యుఐ. వైశేషికా ఫిలాసఫీ.

(౪) చూ. ప్రి. పం పుట ౨౦౦.

పమును గూర్చి యోగవదాసిలోను బ్రసంగింపఁబడెను. సప్తమ గ్రంథము గుణజీవానుమాన సమస్యలను ముచ్చటించును. మిగిలిన మూడుగ్రంథములు కేవల తార్కికవిషయముల నుగ్గడించును; ప్రత్యక్షానుమాన కారణధర్మములను గూర్చియుఁ జర్చించును. ఇదివఱలోఁ హేతువుల ననుసరించి, వైశేషిక సూత్రములు న్యాయ సూత్రముల కంటెఁ బూర్వములును, బ్రహ్మ సూత్రసమకాలికములును గావచ్చును.౧. కౌటిల్యుఁడు

(౧) వాత్స్యాయనుఁడు వైశేషికసూత్రము నుదాహరించెను. పూర్వవత్పరవ దనుమానభేదము న్యాయముచెప్పినది వైశేషికసూత్రమునకుఁ దెలియదు. వై॥ సూ॥ ములోఁ గాలము పరమకారణమని చెప్పఁబడెను. (౨, ౨, ౯; ౫, ౨, ౨౬). ఇది శ్వేతాశ్వతరోపనిషత్తులోఁగలదు ౧.౧.౨. దీని నేయితరతత్త్వము నంగీకరించియుండలేదు. జీవాస్తిత్వమును నిరూపించుటకుఁగూడ వైశేషికము పూనకొనక, జీవ మనుమానవిషయమా ప్రత్యక్షవిషయమాయని చర్చించెను. బాదరాయణుఁడు ౨, ౨, ౧౧ లో నణువాదమును స్మరించెను; కణాదుఁ డవిద్య, ప్రత్యగాత్మ మున్నగు వేదాంత శబ్దముల నుపయోగించుటేకాక, ఆత్మాస్తిత్వము శబ్దప్రమాణముచేతనే బుజువు కాదనియు, దేహము మూడు లేక నైదణువుల సముచ్చయము కాదనియుఁ జెప్పినపుడు వేదాంతసిద్ధాంతమును మనసునునుంచుకొనియే చెప్పెను. (వై॥సూ॥ ౩, ౨, ౯; ౮, ౨, ౨ ౩). భాష్యకారులనునమ్మినచో వై॥ సూ॥ మీమాంసా సాంఖ్యజ్ఞానమును గలిగియున్నది. చూ॥ వై॥ సూ॥ ౨, ౧, ౨౦; ౩, ౧, ౧-౨; ౫, ౨, ౧౯-౨౦; ౭, ౨, ౩-౯; ౭, ౨, ౧౩; ౯, ౨, ౩. వసుమిత్రుని అభిధర్మ మహావిభాషాశాస్త్రము పంచవిధకర్మలను జెప్పినది. చరకుని వైశేషికస్మరణము మనకుఁ బ్రయోజనములేనిది. తన ప్రజ్ఞాపారమితశాస్త్రమున నాగార్జునుఁడు కాలమొకమార్పులేని నిరవధిక యథార్థ స్వరూపమును సిద్ధాంతమును జేర్కొనెను. (వై॥ సూ॥ ౨, ౨, ౭-౯; ౫, ౨, ౨౬; ౭, ౧, ౨౫). దేశాణుజీవుల కాతఁడిచ్చిన స్మరణవలన, వైశేషిక

వైశేషికము నాస్తీక్షకిలోఁ జేర్చియుండని కారణముచే నడి క్రీ.పూ. 300 కంటె ననంతరము రచింపఁబడెనని తోఁచును. ౨. కొన్ని సూత్రము లప్పుడప్పుడు కణాదసూత్రములలోఁ జేర్చఁబడెను. 3. ఇప్పుడు మనకున్న కణాదసూత్రములలోఁ గొన్నిటికి బ్రశస్తపాదుఁడు భాష్యము రచింపని కారణముచే నవి యాతని కాలమునుండి యుండలేదని తెలియుచున్నది. కణా

సూత్రపరిచయమాతనికిఁ గలదని, తెలియుచున్నది: ఇతఁడు నాఁడనేక వై॥ సూ॥ ముల నుదాహరించినాఁడు: 3, ౨, ౪; ౯, ౧, ౨. జీవ స్వభావములను దెల్పునవి; ౪, ౧, ౧; ౭, ౧, ౧౦ అణుస్వభావమును దెల్పును; ౬-౨, ౧౩; ౫, ౨, ౧౭-౧౯ అణుసంయోగమును దెలుపును. ఆర్యదేవునకు వై॥ సూ॥ పరిచయమున్నది; సూత్రనిర్మాణానంతర వైశేషికదర్శనవికాసముతో హరివర్మకుఁ బరిచయముగలదు. (చూడు. యుఇ. వైశేషికఫిలాసఫీ పుట ౪౬-౫౫)

(౨) కణాదసూత్రములోఁ జెప్పిన వైశేషికసిద్ధాంత మొక ప్రాచీన మీమాంసాశాఖయని దాసుగుప్తుఁడు రచించెను. (హిస్టరీ ఆఫ్ ఇండియన్ ఫిలాసఫీ పుటలు ౨౯౦-౨౯౫). వైశేషికము ధర్మజిజ్ఞాసతో నారంభించి, వైదికకర్మలదృష్టశక్తిచే నైశ్వర్యమిచ్చునని ముగించుటచే నట్లు చెప్పుటకు వీలులేదు; ఏలన, ధర్మమీమాంస యేయొక దర్శనమునకుఁ బ్రత్యేకస్వత్వము కాదు. వైశేషికమీమాంసాదర్శనములకుఁగల భేదముల నల్పముగాఁ ద్రోసివేయుటయుక్తముగాదు. వేదము లీశ్వరకృతములుగా నున్నను ఋషికృతములని కణాదుఁడు వ్రాసెను. (౨, ౧, ౧౯; ౬, ౧, ౧-౨). మీమాంస వేదముల శాశ్వతత్వమును విశ్వసించును. శబ్దముయొక్కయు వేదములయొక్కయు శాశ్వతత్వసిద్ధాంతము లొకదానిపైనొకటి యాధారపడియున్నవి. సమాన భావములు కొన్నియున్నను, వైశేషికము మీమాంసాశాఖయనుట చెల్లదు.

(3) ఫార్డిగాన్: ది వైశేషికాసిస్టమ్. పుటలు ౧౦-౧౧.

దుఁడు ప్రమాణత్రయమునే ౧ చెప్పఁగా, నింకొక మూఁడు ప్రమాణములను బ్రశస్తపాదుఁడు జెప్పెను. తరువాత నేడవది యగు 'అభావ' ము కూడఁ జేర్పఁబడెను. కణాదుఁడు చెప్పిన గుణములకుఁ బ్రశస్తపాదుఁ డేడు గుణముల నధికముగాఁ జేర్చెను.౨

ప్రశస్తపాదుని పదార్థధర్మసంగ్రహము, సూత్రభాష్య మనుటకంటె, నీదర్శనమునుగూర్చి రచితమైన యొకస్వతంత్ర గ్రంథమనఁ బెల్లును. కణాదునిగ్రంథములలోనున్న సూచనలనే ప్రశస్తపాదుఁడు పెంచి వ్రాసెననుట ప్రశస్తపాదుఁడు ప్రకటించిన పరిణతభావములకు విరోధముగాఁ దోఁచుచున్నది.3 చతుర్వింశతి గుణములు, సృష్టి స్థితి లయసిద్ధాంతములు, దోషవర్గప్రకటనము, అనుమానస్వభావములనుగూర్చి ప్రశస్తపాదుఁడు రచించిన విషయములు కణాదునిరచనలకు నూత్న

(౧) వై॥ సూ॥ ౮, ౨, 3. అర్థఇతి ద్రవ్యగుణకర్మసు. (౧, ౧, ౪)) ఆరు ప్రమాణములను జెప్పెను. ఇది యనంతరము చేరెనని చెప్పుదురు.

(౨) మఱియుఁజూడుఁడు: వై॥ సూ॥ ౧, ౧, ౪; ౧, ౧, ౬; ౧, ౨, 3.

(3) చూడు: దాసుగుప్త. హిస్టరీ ఆఫ్ ఇండియన్ ఫిలాసఫీ వాల్యూము ౧, పు 33౧ ఐ. యల్. ఎ. పుటలు ౨౫, ౯3; యూఐ. వైశేషికాఫిలాసఫీ, పుట ౧౭; పద టీక. 3. "అనంతర వైశేషికులకు నైయాయికులతోడను నితరులతోడను వేరుచేసిన సిద్ధాంతములన్నియుఁ బ్రశస్తపాదుని గ్రంథములో నున్నవి; కణాదసూత్రములలో లేవు. వైశేషికదర్శన విశిష్టసూత్రములని చెప్పఁబడిన ద్విత్వ, పాకజోత్పత్తి, విభాగజ విభాగసిద్ధాంతములు ప్రశస్తపాదుని భాష్యములో వివరముగాఁ జర్చింపఁబడినను, కణాదసూత్రములలో స్మరించియైన నుండలేదు." (బోడస్: తర్కసంగ్రహము. పు. 3౦)

ముగాఁ జేర్చినవి. న్యాయదర్శనమీాతనిపై నధికప్రభావము చూపినది; ఇతఁడు వాత్స్యాయను ననంతర కాలమునకుఁ జెందినవాఁడు. ఈతని కాలము క్రీ. వె. నాల్గవశతాబ్దములుగాఁ జెప్పవచ్చును.౧.

ప్రశస్తపాదుని రచనపై నాధారపడిన యొక వైశేషిక గ్రంథము దశపదార్థశాస్త్రమను నది చంద్రునిచేర చింపఁబడినది. ఇది చైనాభాషలో నున్నది. (క్రీ. వె. ౬౪౮.) కాని యిది భారతీయ విజ్ఞాన వికాసమునకుఁ గారణమై యుండలేదు.౨.

(౧) ప్రశస్తపాదునికి దిజ్నాగుఁడు పూర్వుఁడనియు ననేకతర్కవిషయములలోఁ బ్రశస్తపాదుఁ డాతనికి ఋణపడి యున్నాఁడనియు కీత్ పండితుఁడొక దీర్ఘవాదమును సల్పెను. (ఐ. యల్. ఎ. పుటలు ౯౩-౧౧౦) దీని భిన్నభావమునకుఁ జూడు, ఫాడిగన్ ది వైశేషికాసిస్టమ్ పుటలు ౩౧౯-౩౨౩) శంకరుఁడు నుద్ద్యోతకరుఁడు ప్రశస్తపాదుని గ్రంథపరిచయము చూపిరి కీత్ భావము నంగీకరించినను, ప్రశస్తపాదుఁ డుద్ద్యోతకరునికిఁ బూర్వుఁడును, దిజ్నాగునికి తరువాత వాఁడునగును; కావున క్రీ.వె.౫-వ శతాబ్దికిఁ జెందును. మత్ప్రమాణకర్త ప్రశస్తపాదుఁడన్నచో నాతఁడు వాత్స్యాయనుని పూర్వుఁడనియో, అథవము సమకాలికుఁ డనియో చెప్పవలెను. ధర్మపాలుఁడును (క్రీ. వె. ౫౩౫-౫౭౦) పరమార్థుఁడును (క్రీ. వె. ౪౯౯-౫౬౯) ప్రశస్తపాదుని భావములను జర్చించిరి. (చూ. యుఐ వైశేషికా ఫిలాసఫీ పుట.౧౮)

(౨) దీని సాంగ్లములోని కనువదించిన యు.ఐ ననుసరించి, యీగ్రంథకర్త క్రీ. వె. ౬-వ శతాబ్దము వాఁడని చెప్పఁబడెను. దశపదార్థములలోఁ గ్రొత్తగాఁ జేర్చిన నాల్గును. (౧) శక్తి (౨) అశక్తి (౩) సామాన్య విశేషము (౪) అభావము. ఈశ్వర స్మరణయే లేదు. జపానీయులు పెక్కురు దీనిని గూర్చి వ్యాఖ్యలు వ్రాసిరి.

రావణభాష్యము,[3] భారద్వాజవృత్తి,[౪] వైశేషిక సూత్రభాష్యములని చెప్పుదురు గాని యవి నేఁడు లబ్ధములు గావు. ప్రశస్తపాదుని గ్రంథమునకు నాలుగు వ్యాఖ్యానములున్నవి. వ్యోమశేఖరుని వ్యోమవతి, శ్రీధరుని న్యాయకందళి, ఉదయనుని కిరణావళి (క్రీ. వె. ౧౦-వ శతాబ్దము) శ్రీవత్సుని లీలావతి (క్రీ. వె. ౧౧-వ శతాబ్ది). వీనిలో వ్యోమవతి మిగిలిన మూఁటికంటెఁ బూర్వమువది.[౫] శ్రీధరుని న్యాయకందళి క్రీస్తు. వె. ౯౯౧ లో నుదయమందెను. శ్రీధరుఁడు కుమారిల, మండన, ధర్మోత్తరుల భావములతోఁ బరిచితిని గలిగి యున్నాఁడు. లీలావతియుఁ గిరణావళియు న్యాయకందళి వెనువెంటనే రచింపఁబడినట్లు తోఁచును. శ్రీధరుఁడు నుదయనుఁడును గూడ దైవాస్తిత్వము నంగీకరించి, అభావప్రమాణమును గూడ స్వీకరించిరి. శివాదిత్యుని సప్తపదార్థి యీకాలమునకుఁ జెందినదే.[౬] న్యాయవైశేషిక సిద్ధాంతము లొకే తత్త్వమునకుఁ జెందినవని యిది ప్రకటించెను. ప్రమాణ వివరణముతో నిది యారంభించి, న్యాయతర్కమును జ్ఞాన గుణము క్రిందికిఁ దోడ్కొని వచ్చును. లౌగాక్షి

(3) చూ. రత్నప్రభ, ౨౨,౧౧; బోడస్, తర్కసంగ్రహము, పు 33. గంగాధరుఁడు ప్రకటించిన (కలకత్తా ౧౮౬౯) భారద్వాజ వృత్తి భాష్యము విశేషముగా నాధారపడి, పెక్కుమార్పులను జేసెను, చూ. ఫాడిగన్, వైశేషికసిస్టమ్, పు 3౫-౪౦.

(౪) లేకవల్లభుఁడు.

(౫) చూ. ఘాటే ప్రకటించిన సప్తపదార్థి ఉపోద్ఘాతము.

(౬) శివాదిత్యుఁడుదయనుని తరువాతను, గంగేశుని పూర్వము నుండెను. గంగేశుఁ డితని భావముల నెఱుఁగును.

భాస్కరుని తర్కకౌముది, ప్రశస్తపాదుని రచనపై నాధారపడిన యింకొక సంకీర్ణగ్రంథము. వైశేషిక సూత్రమును గూర్చి శంకరానందుని ఉపస్కారమొక కొంత ప్రాముఖ్యముగల గ్రంథము. ౧. విశ్వనాథుఁడు (౧౭-వ శతాబ్ది) తన భాషాపరిచ్ఛేదమునందును, సిద్ధాంత ముక్తావళి యందును గణాదుని వాదమును వివరించెను. ఈతఁడు కొంతవఱకభినవతర్కము ననుసరించినాఁడు, అన్నంభట్టుని కృతులు, జగదీశుని తర్కామృతము క్రీ. శ. ౧౬౩౫ జయనారాయణుని వివృతి (క్రీ. శ. ౧౭-వ శతాబ్ది) వైశేషిక సిద్ధాంతములను వెలువరించుటలో నుపయుక్తములుగా నున్నవి. ఉపస్కారముపై నాధారపడినను, వివృతి కొన్ని విషయములలో భేదములను గల్గియున్నది. ౨.

## ౩—జ్ఞానసిద్ధాంతము.

వైశేషిక తర్కమునకును న్యాయతర్కమునకును స్వల్పభేదమే కలదు. జ్ఞానవిషయము లనంతములు గావున, దర్కమునకు సమస్యయగు జ్ఞానమనేకరూపములను బ్రదర్శించినది. ౩. ప్రత్యక్షము, లైంగికము (అనుమానము) స్మృతి, ఆర్షజ్ఞానము నను చతుర్విధ ప్రమాణము లంగీకరింపఁబడెను. ప్రత్యక్షము వలన మనకు ద్రవ్య, గుణ, కర్మ సామాన్యములు తెలియును.

(౧) ఇదియొక వృత్తి నుదాహరించెను: చూ:(౧, ౧, ౨; ౧,౨,౪,౬; ౩, ౧, ౧౭; ౪, ౧, ౭; ౬, ౧, ౫, ౧౨; ౭, ౧, ౩.) ఇది యెచట నున్నదో లభింపలేదు.

(౨) చూడు: ముఖ్యముగా ౧, ౧, ౪, ౨౫; ౮, ౧, ౧; ౨,౨,౫; ౯, ౧, ౮.

(౩) ప్ర॥ పా॥ పు. ౧౭౨.

భిన్నాంశాకల్పితములైన స్థూలద్రవ్యములు ప్రత్యక్షములోనివే కాని అణువులు, అణుద్వ్యయరూపములును గావు. ఆత్మప్రత్యక్షములేక యోగదర్శనమును వైశేషిక మంగీకరించినది.౪. వైశేషిక ముపమానైతిహ్య శబ్దప్రమాణముల ననుమానము లోనికిఁజేర్చెను.౫. శాస్త్రవాక్యములు తత్కర్తల శీల మపరిహితము కావున, ననుమానసిద్ధమే.౧. న్యాయదర్శనమునవలెనే వైశేషికమును శబ్దము నిత్యముకావున వేదము లమోఘ ప్రమాణములని చెప్పు మీమాంసా సిద్ధాంతమును తిరస్కరించెను.౨. శాశ్వత సత్యధర్మములను దాము గాంచి, యితరులకుఁ జెప్పుటచే ఋషుల వాక్యములైన వేదములు ప్రామాణ్యములని న్యాయదర్శనాభిప్రాయమై యుండఁగా, మంత్రద్రష్టలగు మహర్షుల యమోఘ శీలసంపదవలన వేదప్రామాణ్యమును వైశేషిక మనుమానించినది. శ్రుతిస్మృతులు మన కిచ్చునది యథార్థజ్ఞానముకాని యూహాజ్ఞానముకాదు. అది వస్తుస్వస్వరూప జ్ఞానము. ఈయర్థములో దాని కాదిలేదు; దానిని గొందరు పూర్తిగా దర్శింతురు; కొందర సంపూర్ణముగా దర్శింతురు. సత్యస్వరూపమును సమర్థులైనవారు దర్శించి, మనకందించిరి. వేదములు వాక్యములసముదాయములు గావున శేముషీమంతులగు కర్తలుండి యుండవలెను. అట్టివా రూర్ధ్వలోకమును

(౪) వై॥ సూ॥ ౯, ౧, ౧౧-౧౫.
(౫) ప్ర॥ పా॥ పుటలు (౨౧౨)
(౧) ౯, ౧, 3.
(౨) వై॥ సూ॥ ౨, ౨, ౨౧-3౭; ౬, ౧, ౧; న్యా॥ సూ॥ ౨, ౨. ౧3-౪౦.

గూర్చియు నదృష్టమును గూర్చియు సమగ్రము స్వచ్ఛము నైన జ్ఞానముగలవారు. క్రమముగా నీవేదకర్తృత్వము నీశ్వరున కిచ్చిరి. 'దేవునిమాటలు కావున వేదములు ప్రమాణములే'౩. సరియగు జ్ఞానమునకు వాక్యపదార్థములను సరిగా గ్రహించ వలెను.పదములయొక్క అర్థజ్ఞానము సామాన్యధర్మముపై నాధారపడును గావున నది యనుమానసిద్ధమైనదే.౪. చేష్ట,౫, అర్థాపత్తి,౬. సంభవము,౭, అభావము౮. నన్నియు ననుమానగర్భితములని చెప్పఁబడెను. స్మృతికి స్వతంత్రస్థానమీయఁబడెను.౯. ఆర్షజ్ఞానము ద్రష్టల యంతర్జ్ఞానము. పూర్వానుభవమునే తిరిగి చెప్పును గావున స్మృతినివిడిచి, అంతర్జ్ఞానమును ప్రత్యక్షములోఁ గలిపినచో, వైశేషికము ననుసరించి, మనకు ప్రత్యక్షానుమానములు రెండే మిగిలినవి.

దోషజ్ఞానములు నాలుగువిధములు; (౧) సంశయము; (౨) విపర్యయము; (౩) అనధ్యవసాయము (౪) స్వప్నము.

(౩) తద్వచనాదామ్నాయస్య ప్రామాణ్యమ్ ఇతి॥ (౧౦, ౨, ౯) మఱియుఁజూడు: న్యాయకందళి॥ పు ౨౧౬; వై॥ సూ॥ ౬, ౧, ౧-౪.

(౪) ౩, ౧, ౭-౧౫.

(౫) ప్ర॥ ప॥ పు ౨౨౦

(౬) ప్ర॥ ప॥ పు ౨౨౩.

(౭) ప్ర॥ ప॥ పు ౨౨౫; వై॥ సూ॥ ౯, ౨, ౫.

(౮) ప్ర॥ ప॥ పు ౨౨౫

(౯) ప్ర॥ ప॥ పు ౨౫౬.

(౧) స. సి. సా. సంగ్రహము, ౫ఆ ౩౩.

వీనిని శివాదిత్యుఁడు రెండుగాఁ జేసి సంశయవిపర్యయములని చెప్పి, యూహను, అనధ్యవసాయమను పరోక్షప్రతీతులను సంశయములోఁ జేర్చెను. ౨ స్వప్నమును వేరుగాఁ జెప్పుటకుఁ గారణ మదియొక ప్రత్యేక దేహస్థితిలో లభించుట యేయని శ్రీధరుఁడు చెప్పినాఁడు. 3

ర—పదార్థములు.

ఇదివఱకే మనము చూచినరీతిని, క్రియాసిద్ధిననుసరించి వస్తునిర్వచనమును, ప్రకరణోచితముగా సర్వార్థనిర్ణయములను జేసి, దేనికిని స్వయంసంపూర్ణము లేదని ప్రకటించిన బౌద్ధవాదము, కొన్నిశతాబ్దములకాలము జాతియొక్క హృదయమును వశమొనర్చుకొనెను. అన్యోన్యసంబంధబలముననే అన్నియు నస్తిత్వముగలిగి, యేదియును స్వయంస్థితి లేనివై యుండెను. అన్యోన్యాశ్రయమే జీవితస్వరూపము; అందుచే నాత్మయు, జడపదార్థమును నిట్టివే. ఈభావమును నిరసించి, యెక్కువ తృప్తికరమైనట్టిది, యథార్థముగా సమర్థింపఁదగినదియు నైన నూత్నతత్త్వమును వైశేషికము నిర్మించినది. యథార్థమైనవి, వేరుగానున్నవియు నైన వస్తువిజ్ఞానము నిరసింపఁదగినది కాదనునదే వైశేషికదృక్పథము. వస్తువులయొక్కయు వాని సంబంధములయొక్కయూ లక్షణములే సులభసాధ్యములు, విశ్వవిశాలములునగు యథార్థవస్తులక్షములు. మనము నేత్రములు విప్పి చూచినంతనే, మనకట్టెయెదుట విస్తరించి కన్పట్టునది

(౨) సప్తపదార్థీ పు. 3౨.
(3) న్యాయకందలి. పు. ౧౮౯.

భౌతికప్రపంచము,నందలి పరస్పరసంబంధబాంధవ్యములు. మన విజ్ఞానము వీనినిఁగూర్చియే పనిచేయును. మన మంతర్విలోకనము చేసినచో నొక జీవశక్తియు, దత్సంబంధలక్షణములును గోచరించును. సముచితమైన తత్త్వము కోరునదేమనగా, మన పరిశీలనమును మనయనుభవములోని జ్ఞానవిషయములపైననే కేంద్రీకరించి,దానిని సమర్థించుటకవసరములగు ప్రతిపాదనములనే మనము స్వీకరింపవలెను. యుక్తమైన తత్త్వము వస్తువిభాగపరిశీలనమును మొట్టమొదటఁ గోరును. వైశేషికదర్శనము జరిపిన విషయవిభాగ పరిశీలనాఫలితమునే పదార్థసిద్ధాంతమున నిమిడ్చినది.

పదార్థమనగా ... త్వర్థమొక పదము యొక్క యర్థము. ఒకపదార్థ మనగాఁ దెలిసికొనఁదగిన యర్థమును, నామకరణయోగ్యమైన పదమునైయున్నది. లోకములోని సర్వవస్తువులును,౧. ననగాఁ దెలిసికొనఁదగినవి,౨. నామకరణయోగ్యములైనవియు, అనగా సకలానుభవ విషయములును బదార్థములే; కేవలభౌతికపదార్థములేకాదు ...్యాయదర్శనములోని పదునారు పదార్థములును, వస్తువిభాగమును జెప్పునవి కావు; అవి తర్కశాస్త్రమునందలి ప్రధానవిషయములనూచిక కాని జ్ఞానవిషయములయొక్క సంపూర్ణవిభాగమును జూపునవే వైశేషిక పదార్థములు.

(౧) అస్తిత్వాభిధేయత్వజ్ఞేయత్వములు॥ (ప్ర॥ ప॥ పు ౧౬.)

(౨) ప్రమితివిషయాః పదార్థాః॥ (స... ౩॥ పు. ౨.)

వస్తువులేకాక, వస్తుజ్ఞానముగల కర్తలును వైశేషికపదార్థములే. ఆరిస్టాటలిచ్చిన పదార్థముల తార్కికవర్గీకరణము వ్యావహారజగద్వస్తుజాలమును గూర్చియేకాని, తత్త్వదృష్టికి గోచరించు సర్వవిధ వస్తుజాలమును గూర్చికాదు. ఆరిస్టాటలువలెనే, వైశేషిక తత్త్వజ్ఞులు నామార్థముల సన్నిహితసంబంధము నంగీకరించిరి. ఆరిస్టాటలు పదముల వర్గములుగాఁ జేసినను పదవర్గీకరణము వస్తువర్గీకరణమే యగును. ఏలన నొక విశిష్టనామముగలది వస్తువేయగును. "విడిగాఁ జెప్పిన పదమొకగుణమునో, ద్రవ్యమునో, సంబంధమునో, దేశమునో, కాలమునో, దృష్టినో, అనుబంధలక్షణమునో, కర్మనో కర్మఫలానుభవమునో తెలియఁజేయును"౧. ఈపది పదార్థములలో ద్రవ్యముకాక మిగిలిన తొమ్మిదియు నింకొకవస్తువును జెప్పునవి. ద్రవ్యము మాత్రి మితరవస్తువునుగూర్చి కానితన్నుఁగూర్చి కాని చెప్పదు. అట్లుచెప్పినచో నదియు నొక గుణమగును. కాని ఆరిస్టాటలీ విభాగమును నిస్సంశయము గానొనర్చియుండలేదు. సామాన్యభాషారూపము లాతని వర్గీకరణమున కాధారమైనవి; ఆతఁడు తీసికొన్న పదములు బాహ్యవస్తురూపమును దెల్పునవే. ద్రవ్యమొక మూర్తిమంతమైన వస్తువనఁగానేమి? ఒక గుఱ్ఱమో, యొక గోవో యని చెప్పవలెను. దీనినారిస్టాటలు ద్రవ్యమనును కాని నిజముగా నదియొక గుణమే.౨. అరిస్టాటలుయొక్క

(౧) ఆరిస్టాటలు కాటెగరీస్, ౨,౬; వింటోస్ లాజిక్కు పు, ౧౧౩.

(౨) పోల్చు. జాన్సన్: "ద్రవ్యము స్వయముగా నింకొక ద్రవ్యమును జెప్పదు; కాని దానికి గుణములున్నవి." (లాజిక్ పార్టు ౨; పు. ౧౨.)

సంపుటిలో ద్రవ్యములు,గుణములు నున్నవి.అవి నిత్యములు ననిత్యములు కూడనైయున్నవి. భాష్యకారు లందరును సంబంధమను పదార్థములోఁ దుది యారును విలీనమగునని వ్రాసియున్నారు. కావున నిత్యానిత్యములైన ద్రవ్యములు గుణములు సంబంధములు కలిసి వర్గమును బూర్తిచేయును.

వైశేషిక పదార్థవర్గములో (౧) ద్రవ్యము (౨)గుణము (౩) కర్మ (౪) సామాన్యము (౫) విశేషము (౬) సమవాయము; అనంతర వైశేషికులగు శ్రీధరోదయన శివాదిత్యులు 'అభావ' ము నేడవ దానినిఁగాఁ జేర్చిరి.3. మన విశ్వాసములు భావాత్మకములు నభావాత్మకములు కాని వస్తువులు గావు. ఆరంభదశలలో నర్థము నొక పూర్ణవస్తువుగాఁ బరిగణించి, దాని సామాన్య లక్షణముల నిర్ణయింప వైశేషిక దర్శనము యత్నించినది, కాని, వెనువెంటనే,విశ్వాసముల స్వభావమును గూర్చిపరిశీలించి,యెట్టివి సత్యములైనవి,కానివెట్టివని నిర్ణయింప బూనినది.ఏదియో యొకటున్నదను నది వైశేషిక తత్త్వములో మొదటినిర్ణయము.కాని యస్తిత్వము కేవలమునిర్గుణముకాదు. అందుచే మనమొక యడుగు ముందుకుఁబోయి, అస్తిత్వము గల దొకటుండుటయే కాక,దానికిఁ గొన్ని లక్షణములున్నవని

(3) ప్రశస్తపాదుఁ డారుద్రవ్యములనే చెప్పెను. సప్తపదార్థ సిద్ధాంతము శివాదిత్యునితో నారంభమైనదని యాతని సప్తపదార్థిగ్రంథము వలనఁ దెలియుచున్నది. శంకరుఁడును,హారిభద్రుఁడును వైశేషిక పదార్థము లారనియే చెప్పిరి. చూడుము శంకరభాష్యము, ౨, ౨, ౧౭; యు.ఐ.వైశేషిక ఫిలాసఫీ. పుట. ౧౨౬.

చెప్పవలెను. కొన్ని లక్షణములను గలిగియుండుటచే నొకటి స్థితిని గలిగి యున్నది. ద్రవ్యములున్నవి; గుణములను గలిగి యున్నవి. గుణములు రెండు విధములు, అనేక వస్తువులలో గలవి, సామాన్యములు; వ్యక్తిగతములైనవి విశేషములు. వీనిలో నిత్యములైనవి గుణములనియు, అనిత్యములైనవి కర్మలనియుఁ జెప్పఁబడెను సమవాయమొక విశిష్టసంబంధముగఁ.

(౧) వైశేషిక ద్రవ్యగుణము లారిస్టాటలు ద్రవ్యగుణములకు సరిపడును. ఆరిస్టాటలు మొత్తమును (quantity) గుణములోఁ జేర్చెను. సంబంధములు రెండు రకములు; బాహ్యము సంయోగము వంటిది; ఆంతరంగికము సమవాయము వంటిది. మొదటిది గుణమనియు, రెండవదొక పదార్థమనియుఁ జెప్పఁబడినది. మిగిలిన పదార్థములన్నియు సంబంధములోనికి వచ్చును. దేశకాలములు స్వతంత్ర పదార్థములు. ప్రవృత్తి కర్మ, నివృత్తి కర్మాభావము; లక్షణము సామాన్యమో విశేషమో కావచ్చును. దృక్పథము గుణము, ఆరిస్టాటలొక నియమము ననుసరించి, తన సిద్ధాంతమును నిర్మించినచో నిట్లు వాదించియుండును: "నిత్యములు కాని, తాత్కాలికములుగాని సగుణములగు వస్తువులు పరస్పరాశ్రయ భూతములగు నితర వస్తువులతోఁ గలిసి దేశకాలములచే నిబద్ధములయి యున్నవి. అందుచే ద్రవ్యగుణకర్మ సంబంధములు మనకు ముఖ్య పదార్థములగును, ఆరిస్టాటల్ ద్రవ్యవిభాగములోప భూయిష్ఠమైనదని 'స్టోయిక్కులు, నియోప్లేటోనిస్టులు తలఁచిరి; తనకుఁ దోచినరీతి నీద్రవ్యములను గలిపివేసెనని కాంటును, హెగెల్‌ను భావించిరి. ఆరిస్టాటల్ విభాగము "పశువులను మనుజులు, చతుష్పాత్తులు, గుఱ్ఱములు, గాడిదెలు, కంచరములని" విభజించురీతిని చేసెనని మిల్లు నిందాపూర్వక విమర్శచేసినాడు. పోల్చు. వైశేషిక వర్గీకరణముతో సర్వవస్తువులను ద్రవ్య, గుణములనుగా వర్గీకరించిన జైనుల పద్ధతి. పూర్వమీమాంసకులు శక్తి, సాదృశ్యములు ద్రవ్యములనిరి. ఉదయనుఁడు వీనినే కాక సంఖ్యను గూడ ద్రవ్యమనుట కంగీకరింపలేదు. చూ. కిరణావళి. పు. ౬: సప్తపదార్థి. పు ౧౦; న్యాయకందళి. పుటలు. ౨, ౧౫, ౧౮౮.

మొదటి మూడునైన ద్రవ్యగుణకర్మ లొక యధార్థమైన స్థితి గలవి.౧. కణాదుఁడు వీని నర్థములని చెప్పి, యోగదృష్టిలో వానిని దర్శింపవచ్చునని ప్రకటించియున్నాఁడు.౨. మిగిలిన మూడును సామాన్యవిశేష సమవాయములు బుద్ధివ్యాపారజములని చెప్పవలెను.౩. అవి తర్కపదార్థములు. ప్రశస్తపాదుఁ డిట్లు చెప్పెను. "వీనికి స్వాత్మసత్త్వము, బుద్ధిలక్షణత్వము, అకార్యత్వము, అకారణత్వము, అసామాన్య విశేషవత్త్వము, నిత్యత్వము, అర్థశబ్దానభిధేయత్వమును గలవు.'౪. తుదిమూడు పదార్థముల యాథార్థ్యమును తార్కికప్రమాణ సిద్ధములు.౫. అనగా నవి ప్రత్యక్షజ్ఞాన విషయములుగావు. న్యాయవైశేషికములు గలిసిపోయినవెనుక నీభావమును మార్పునొందినది. ప్రాచీన వైశేషిక దర్శనము ననుసరించి, పదార్థము లన్నిటికి సామాన్యాస్తిత్వ మున్నది.౬. కాని యీ యస్తిత్వము ద్వివిధము. ద్రవ్యగుణకర్మలు సత్తాసంబంధములు. సామాన్యవిశేష సమవాయములు స్వాత్మసత్తా సంబంధములు.౭. తన కిరణావళిలో నుదయనుఁడు సత్తాసంబంధ పదార్థమనగా సమవాయ సంబంధాస్తిత్వమనియు, స్వాత్మసత్తాపదార్థము లనఁగా నర్థ

(౧) వై.సూ. ౧,౨,౭; ౮,౨.౩; ప్ర.ప.పు. ౧౭.
(౨) ౯, ౧, ౧౪.
(౩) ౧, ౨, ౩.
(౪) ప్ర.ప.పు.౧౯; వై.సూ. ౧.౨.౩-౧౦,౧౨,౧౪,౧౬;౭.౨.౨౬.
(౫) బుద్ధిరేవలక్షణమ్ ప్రమాణమ్.
(౬) ప్ర.ప.పు ౧౧.
(౭) ప్ర.ప.పు.౧౯.

సంబంధములేని స్వయంసామర్థ్యముగలవనియు నిర్వచించినాఁడు. శంకరమిశ్రుఁడు తన ఉపస్కారమునందు సత్తాసంబంధమనగా, నాశనావకాశము గలిగి, తన స్వభావమునుండి కార్యము నుత్పత్తిచేయు సామర్థ్యము గలిగి యున్నదని చేసిన నిర్వచన మెక్కువ సహాయకారిగా నున్నది. అస్తిత్వమును దేశకాలపరిమాణములలోఁ జెప్పు శాస్త్రపద్ధతి యిది. స్వాత్మసత్త్వము దేశకాలబద్ధము కానిది; అందుచే నివి నిత్యపదార్థములు, ఇవి బుద్ధిపరికల్పితములయ్యు, యథార్థవస్తువుల కంటె నెక్కుడు సత్యములుగా గ్రహింపఁబడినవి. సామాన్య విశేష సమవాయములను నీమూడు ద్రవ్యములును నిత్యములైనవి, కారణము లేనివియు-ననియు, బుద్ధికల్పితములైన వీని కస్తిత్వము నొసఁగు సహజకాంక్షయుక్తమైనది కాదనియు వైశేషికుఁడు వాదించును.

౫—ద్రవ్యము

వైశేషిక తత్త్వము విజ్ఞానవాదము లన్నిఁటి నెదుర్కొని నిలుచుట కాధారభూతమైనదే ద్రవ్యమనుపదార్థము. విద్యావిహీనులైనను ద్రవ్యములున్నవని చెప్పుదురు. బాహ్యప్రపంచములోని వస్తువులు స్వతంత్రాస్తిత్వము గలవై, యథార్థములుగానే కన్పట్టి, తమకుఁగల విశిష్ట లక్షణములను మనకుఁ బ్రదర్శించుచున్నవి. మనమున్నదని చెప్పుకొనునది నిజముగా వస్తుజాలమే; దేశకాలాద్యవస్థల ననుసరించి యవి బహురూపములై భిన్నవిశిష్ట లక్షణములను గలిగి యున్నవి. గుణములకు వేరైనద్రవ్యము కాని, తదంశములకు వేరైన పూర్ణముగాని లేదను బౌద్ధవాదము మన యనుభవమునకు విరుద్ధమైన

వాదము.౧. యథార్థమైనది వస్తుజాలరూపమునను, వానికిఁ గల గుణ, భాగరూపమునను మనకు దృశ్యమానమగు చున్నది. నిన్న మనము చూచిన ఘటమును నేడు చూచి గుర్తించుచున్నాము; ఘటమనఁగాఁ గేవల వేదనాపుంజమే యైనచో నట్లు గుర్తించుట దుస్సాధ్యము.౨. గుణములు వర్గములుగాను, నెల్లప్పుడును సమానములుగాను, నితరములనుండి విశిష్టభేదమును జూపునవియునై గోచరించుట మన కందరకును సామాన్యానుభవవిషయమే. ఒక మామిడి పండొకేగుణసమూహము నెల్లప్పుడును జూపుటయే కాక, ఒకేలక్షణములుగల చెట్టు వలననే కలుగు చున్నది. నిరవధికమైన యవిచ్ఛిన్నాస్తిత్వమును జూపు నొక చిన్నగుట్టయైనను, లేక నొక మహాపర్వతమైనను నెన్నడు మార్పునొందని గుణములతోఁ గూడిన ద్రవ్యాస్తిత్వము నంగీకరింపని యెడల మనకు విదితములు కాఁజాలవు. "గుణకర్మలను దనలోఁ గలిగియుండి, తనతో సమానాస్తిత్వకారణ రూపమైనదే" ద్రవ్యము.౧. అది గుణముల కాధారభూతమైనది.౨. ఇతర పదార్థములకు గుణములు లేవు.

దాని గుణములకంటె నితరమైన ద్రవ్య మున్నదని వైశేషిక విశ్వాసము. ద్రవ్యము లుత్పత్తియైన వెనువెంటనే గుణములు లేనివి.౩. ద్రవ్యములతో నేకకాలమునందే గుణములు

---

(౧) న్యా. వా. ౧, ౧, ౧౩.
(౨) న్యా. సూ. ౨, ౧, ౩౦-౩౬.
(౧) ౧, ౧, ౧౫.
(౨) గుణాశ్రయో ద్రవ్యమ్॥
(౩) ఆద్యేక్షణే నిర్గుణమ్ ద్రవ్యమ్ తిష్ఠతి॥

నుదయించినచో రెంటికిని భేదమేయుండదు. రెండు నేకకాలమందుత్పత్తికానిచో, ద్రవ్యములు గుణహీనములగుటయు, ద్రవ్యములనఁగా గుణసహితములను నిర్వచనమును నిరర్థకమగుటయుఁ దటస్థించును. ఈ క్లిష్టతను దొలఁగించుటకై, గుణములు ద్రవ్యముతో సమవాయసంబంధమును గాని, ప్రాగభావమును గాని గలిగియున్నవని చెప్పఁబడెను. అనఁగా, గర్భితములుగాని యావిష్కృతములుగాని, ప్రస్తుతముగాని భవిష్యత్తులోఁగాని గల గుణముల కాధారమైనదే ద్రవ్యమని యర్థము.౪. తాను గుణముకాకుండ గుణములుగల ద్రవ్యమున్నదని వైశేషికుఁడు నిరూపింపఁ గోరుచున్నాఁడు; ఏలన ద్రవ్యములను మనము గుణముల నాపాదింతుమేకాని, గుణములను గుణములనుగాదు. లేక యొకగుణ సమూహమున కొక గుణమును మనము చెప్పము. గుణసంబంధములేని ద్రవ్యము దురూహ్యము కావున, ద్రవ్యము గుణసహితమని చెప్పుదుము.

నిత్యానిత్య వస్తుభేదమున్నది. అన్యాశ్రయముగల దేదియు నిత్యముకాదు. సావయవ ద్రవ్యము లన్యాధారములగుటచే ననిత్యములు. నిత్యత, స్వతంత్రత, పరమార్థతయు నిరవయవ ద్రవ్యలక్షణములు.౧. వాని కుత్పత్తి వినాశములు లేవు. అనిత్యవస్తువు లుత్పత్తియై, వానికి వేరైన కారణములచే నశించును.౨.

(౪) సిద్ధాంతముక్తావళి॥ 3.

౧. నిత్యత్వ, అనాశ్రితత్వ, అంత్యవిశేషవత్త్వ (ప్ర.ప.పు.౧౬).

౨. ప్ర.ప.పు. ౨౦; న్యాయకందళి పు.౨౦; చూడు వై.సూ. (౧,౧, ౭-౧౦ ౧,౨,౧౫,౧౮; ౧౦,౨,౧-౨).

భూజలాగ్ని వాయ్వాకాశ దేశ కాలాత్మ మానసములు తొమ్మిదియు సర్వపదార్థములు,3. వైశేషికము భౌతికతత్త్వము గాదు కాని యదియథార్థవస్తుతత్త్వమే; ఏలన నగోచరములగు నాత్మలున్నవనియు, యథార్థద్రవ్యములనగా స్థూలరూపములు కావు; వానిసూక్ష్మరూపములనియు నదినమ్మును. నవద్రవ్యములలో భూజలాగ్ని వాయ్వాత్మమానసములు పెక్కు వ్యక్తిత్వములను గలిగియున్నవి.౪. ఆత్మతప్పమిగిలినవి వ్యాప్తిగలిగి, సమీవత్వ రూపత్వ సంబంధములుండి, కర్మ, వేగములను బొంది యున్నవి. దేశకాలాకాశములు సర్వవ్యాప్తికలవియు, నత్యధిక పరిమాణములుగలిగి, సర్వద్రవ్యముల కవకాశమిచ్చునవియు నై యున్నవి.౫ ఆత్మయు, మనస్సు, నాకాశమును, దేశకాలవాయువులును, పరమాణువులును సామాన్యముగా గోచరములు గావు.౬. మూర్తద్రవ్యములకును భూతద్రవ్యములకును భేదము

---

3. తమస్స్వభావమునుగూర్చి యొకవిచిత్రమగు ప్రశ్నమును శ్రీధరుఁడు ప్రకటించినాఁడు. (న్యాయకందళి పు౯; వై.సూ, ౫, ౨, ౧౯-౨౦). కృష్ణవర్ణము, చలనక్రియయుఁగల యొకప్రత్యేకద్రవ్యము తమమని. కుమారిలుని భావము. (శ్లో॥ వా. పు.౫౩ ప్రభాకరవాదులు తమము తేజోఽభావమనిరి. ఝా; పూర్వమీమాంస పు,౯3.) అన్నంభట్టు భావము నిదియే. (తర్కసంగ్రహము పు 3.) గుణరహితమైనది కావునఁ దమస్సు ద్రవ్యముకాదని వైశేషికాభిప్రాయము, రంగులేనప్పను నీలాకాశమనిచెప్పినట్లే, తమస్సునకు రంగు లేదు. అదియొకవిధమగు నభావము; తేజోఽభావము. (వై సూ. ౫,౨,౧౯; సర్వ ద. సంగ్రహము ౧౦)

౪. అనేకత్వమ్ ప్రత్యేకమ్ వ్యక్తిభేదాః (న్యాయకందళి పు. ౨౨)

౫. ప్ర ప, పు. ౨౨

౬. వై. సూ, ౮,౧,౨.

గలదు. మూర్తద్రవ్యములకు నిశ్చితపరిమాణములుగలవు;౧అవి పరివృత్తిచలనములు గలిగియున్నవి. భూతద్రవ్యములు విడిగాఁగాని కలిసికాని, ప్రపంచములోని సర్వవస్తుజాలమునకును రూప కారణములగుచున్నవి. మనస్సణు పరిమాణమైనను, దేనినుత్పత్తి చేయదు; సర్వవ్యాపియైనను, నాకాశము శబ్దము నుదయింపఁ జేయును, భూజలాగ్ని వాయువులు మూర్తములు నుత్పత్తి కారణములును. ౨.

ఆత్మ సిద్ధాంత విషయమున న్యాయదర్శనభావమే వైశేషిక భావము నైయున్నది. కాని, ఆత్మ ద్రష్టయు దృశ్యమునుగూడ ననుభావము నంగీకరించ లేదు. 3. ఉపమానము నిరుపయోగము. ఆగమానుమానములే మనకు నిశ్చయ ప్రమాణములు. ౪. దేహేంద్రియమానసముల గుణము కానిదగు విజ్ఞానమువలన నాత్మాస్తిత్వము ననుమానముచేఁ దెలియనగును. ౫. సుఖదుఃఖ రాగద్వేష, సంకల్పజ్ఞానము లేకాక, కనుఱెప్పలు తెఱచుట మూయుట; గాయములుమానుట, మనస్సంచలనము, ఇంద్రియ పరివృత్తి, ఆత్మాస్తిత్వమును సూచించును. ౬. ప్రళయమువంటి సహజావస్థలో నాత్మవిజ్ఞాన రహితమైనది. దేహసంబంధ మున్న

౧. పరిచ్ఛిన్న పరిమాణత్వమ్.
౨. తర్కదీపిక పు. ౧౪.
3 వై. సూ. 3, ౨, ౬.
౪. వై. సూ. 3, ౨, ౮, ౧౮.
౫. త్రి.ప. పు. ౬౯; వై. సూ. 3, ౧, ౧౯.
౬. వై. సూ. 3, ౨, ౪-౧౩.

ప్పుడే దానికి జ్ఞానప్రవృత్తి యుండును.౭. ఆత్మ విజ్ఞానమును బోధించునేకాని, విజ్ఞానమాత్మకు నిత్యలక్షణముకాదు. మనస్సాహాయ్యమున నాత్మబాహ్యవిషయములనేకాక, తనగుణములను దెలిసికొనును. ఆత్మ సర్వవ్యాప్తియైనను, దేహసంబంధమున్నప్పుడే జ్ఞానేచ్ఛాక్రియాలక్షణములుండును.

అవస్థాభేదములవలన నాత్మానేకత్వ మనుమానింపఁబడుచున్నది.౮. శ్రుతివాక్యములుకూడ ననేకాత్మలను జెప్పుచున్నవి.౯. ప్రత్యాత్మయుఁ దానుజేసిన కర్మఫలానుభోక్త యగును.౧౦. భిన్నానుభవ పరంపరలలో జీవైకత్వమున్నది.౧౧. జీవైకత్వమును శ్రీధరుఁడు నిరసించెను.౧౨. జీవులు మోక్షము పొందుటవలన జగద్వ్యవస్థ చెడిపోదు; ఏలన జీవులసంఖ్య

---

౭. ఆశరీరిణాం మాత్మనాం స్వవిషయావబోధః (న్యాయకందళి పు. ౫, ౨; పు ౨౭౦)

౮. వ్యవస్థాతో నానా (వై. సూ. 3, ౨, ౨౦).

౯. శాస్త్రసామర్థ్యాత్ (వై. సూ. 3, ౨, ౨౧)

౧౦. ౬, ౧, ౫.

(౧) న్యాయకందళి॥ పు. ౮౬

(౨) "జీవమంతయు నొక్కటేయైనచో మనస్సంపర్క మందరకు సమానమగును...జీవులన్నియు సర్వవ్యాపిత్వముగలవైనను, ననేకజీవుల నంగీకరించువానికి, జీవులన్నియు నన్నిదేహములయందును వ్యాపించినను, వాని యనుభవము లితరజీవుల కుండవు; ఏలన, ప్రతిజీవియుఁ దన పూర్వకర్మానుగుణమైన శరీరసంబంధముచేఁ బొందు ననుభవ మితరులకు సంబంధింపదు. ఏదేహముచే జీవి కర్మచేయునో యాజీవికా కర్మానుభవముండును. అందుచే శరీరబంధము కర్మబంధము నొకదానినొక టాశ్రయించి వచ్చుచున్నవి. ఇట్టి దనంతముగా జరుగుచున్నది. (న్యాయకందళి॥ పు ౮౭-౮౮.)

అనంతము. వైశేషికులు, తమకు బహుత్వమందలి విశ్వాసమువే, బహుత్వమే పరమసత్యమందురు. ముక్తజీవులు విశిష్టభేదముల తోడనే శాశ్వతముగానుందురు.౩. ప్రతిజీవికి నితరజీవుల నుండి యొకవిశిష్టభేదమున్నది కాని యదేదియో మనకుఁ దెలియదు.జీవులలో భేదములకుఁ గారణము దేహభిన్నత్వమే. పునర్జన్మయందైనను, మనస్సు జీవునితోఁబోయి, దానికి వ్యక్తిత్వము నొసఁగును. అందుచే జీవునితో నెల్లప్పుడు నుండు మనస్సు యొక్క భేదమే జీవభేదమును దెల్పును. జీవులెన్నియో మనస్సులన్నియున్నవి. ఒకేమనస్సు జీవునియాత్రిలో నెల్లప్పు డుండును గావున, జీవునియొక్క శీలము కూడ నవిచ్ఛిన్నమై యొప్పును.౪. జీవమునకు నీశ్వరునకును౫. సాదృశ్య మున్నది కాని సమానత్వము లేదు. ఆకాశ దేశకాలములకుఁ బరిచ్ఛిన్నములు నామయోగ్యములు నగు వ్యక్తిరూపములులేవు ౧. దృశ్యములన్నియు వీని యందే గోచరించును. ఉత్పత్తిగల సర్వవస్తువులకును దేశకాలము

---

(౩) జీవముక్తులే యనియు, నుపాధి కారణవశమునను, శాస్త్ర విహిత కర్మాచరణ నిమిత్తమును జీవనానాత్వమును వైశేషిక మంగీకరించిన దని సూచించిన డాక్టరు దాసుగుప్తుని భావమున కాధారములేదు. (హిస్టరీ ఆఫ్ ఇండియన్ ఫిలాసఫీ పు ౨౯౦. వ్యాఖ్య ౧.) వ్యవహారసంబంధమైన జీవానేకత్వమును గూర్చియే కాని వైశేషికము పరమార్థసత్యమును గూర్చి ప్రసక్తిపెట్టుకొనలేదు. విశేషసిద్ధాంతముపై నాధారపడిన నానాత్వభావమే పరమసత్యమని యది నమ్మినది.

(౪) ప్ర॥ పా॥ పు ౮౯; వై॥ సూ॥ ౭, ౨, ౨౧; ౩, ౨, ౨౨.

(౫) కిరణావళి॥ పు ౭; చూడు ఉపస్కారము॥ ౩, ౨, ౧౮.

(౧) ప్రి.ప.పు.౫౮.

లుపాదాన కారణములు.౨. యథార్థస్వరూప మొకగతి; అందుచే దేశకాలాన్వితము.

భౌతికపరివర్తనము లన్నిటికి నొక పూర్ణమైన స్థాన ముండవలెను. అణువాదులందరు నవకాశమును సత్యమగు స్థితి గలదని చెప్పుదురు. ఒక దానికంటె నెక్కువ సంఖ్యగల యవ కాశము లున్నచో, భిన్నావకాశములలోఁ బరిభ్రమించు చున్న యణువుల కన్యోన్యసంబంధము లుండవు. ప్రాక్పశ్చిమ దూరాంతిక భావములకు మూలాధారమైన దవకాశమే ౩. అవకాశ మండలిభిన్నత దానికార్యములపై నాధారపడును.౪.అవకాశము లేకున్నచో వస్తువులు వేరువేరుగా నుండుటకు వీలుండదు.

వస్తూత్పత్తిస్థితి వినాశముల వంటి ప్రకృతి పరివర్తనములకు ముఖ్యావసరరూపము కాలము. అనిత్యవస్తువులయందు మార్పుల నుదయింపఁజేయు శక్తియే కాలము. అది సంచలనముల కన్నిటికిని గారణమగు విశ్వశక్తి కాదు; సర్వ సంచలనముల కదియాధారము మాత్రమే.౫.గోచరించు వస్తువులన్నియు మనకుఁ గదలుచున్నట్లును మార్పునొందుచున్నట్లును, దృశ్యములై యదృశ్యమగుచున్నట్లును గాన్పించు చున్నవి. పరిచ్ఛిన్న వస్తువులాత్మోత్పత్తి సంచలన సామర్థ్యములు గలవి కావు. అయినచో, నెన్నిమార్పులు కలుగు చున్నను మార్పులేని సంబంధ

(౨) ప్రి.ప.పు ౨౫.

(౩) తర్కసంగ్రహము పు,౧౬; భాషాపరిచ్ఛేదము,పుటలు ౪౬-౪౭.

(౪) వై.సూ. ౨,౨,౧౩.

(౫) ౨, ౨, ౯; ౫, ౨, ౨౬: ఈభావమును కాలము దైవమను వాదముతోఁ బొరపడరాదు.

ములు వాని కుండఁజాలవు. సంచలనమున కొక క్రియను గలదు; అనగా సర్వపరివర్తనములతో సంబంధము గల యొక సత్యస్వరూపమేదో యుండవలెను. విశ్వమంతయు నిండి, సర్వ వస్తుక్రియ సంచలనమున కవకాశమిచ్చునదే కాలమని భావింపఁ బడెను. పూర్వోత్తరములు, నేకసమయ భిన్నసమయములు, త్వరితాలస్యభావములు మున్నగు సంబంధములకుఁ గాలమే యాధారము.౧. విశ్వవ్యాప్తమైన పరిమాణము గల కాలమేక ము; విశిష్టలక్షణము గలది; సంయోగ వియోగ లక్షణయుక్త ము. వ్యావహారిక భావములైన క్షణనిమేషదినమాస సంవత్స రాదికము లన్నియు వ్యావహారిక కాలభావమునుండి కల్పితము లైనవే. ప్రాచీన వైశేషికుల భావములలోఁ గాలము నిత్యమైన ద్రవ్యమైనను,౩. దరువాత వచ్చిన శాస్త్రజ్ఞులు దానినొక యను భవరూపముగా భావించిరి.౪. కాలము స్వస్వరూపమేమో మన మెఱుఁగము;మన యనుభవము మాత్రము కాలరూపము నొందుచున్నది. పూర్వోత్తర భావముల కది అసమవాయి కార ణము; ఘటపటాదులగు వస్తువులస్వభావము వాని యుపాదాన కారణము. కాలమేకమైనను, దానితో సంబంధముగల మార్పు లవలన నది యనేకముగా గోచరించును.౫.

---

౧. వై సూ. ౨, ౨, ౬.

౨. ౭, ౧, ౨౫.

౩। ౨, ౭.

౪. అతీతాది వ్యవహారహేతుః (తర్కసంగ్రహము పు ౧౫; భాషాపరిచ్ఛేదము పు. ౪౫.)

౫. న్యాయమంజరి పు. ౧౩౬.

దేశకాలములకుఁగల భేదమును వైశేషిక గ్రంథములు గుర్తించినవి. దేశము దృశ్యవస్తువులకు సంబంధించినది; కాలముదయించి నశించువస్తువులకు సంబంధించినది.౬. కాలసంబంధములు నియతములనియు, దేశసంబంధము లనియతములనియు శంకరమిశ్రుఁడు భావించినాఁడు.౭. వస్తువులు కాలవశమునఁ జలించుచు, దేశవశములై స్వస్థానముల నిలుచుచున్నవి. అతివిశాలములగు సంబంధములనగా స్థలగతియు నవస్థాగతియు దేశకాలము లాశ్రయములుగాఁగలవి; కాని యివి వ్యావహారిక భావములు మాత్రమే; అవి పరివర్తనాత్మకములైన వస్తువుల యునికిని సూచించును. నిరవయవము, నవిచ్ఛిన్నము, ననంతము నగు నాకాశద్రవ్యమును, శబ్దమున కాధారమునై యున్నది. రూప రస గంధ స్పర్శాగుణములు దానికిలేవు. అందుచే నిఁక మిగిలిన శబ్దమే ఆకాశ విశిష్టగుణము.౧. ఆకాశము నిష్క్రియము. మూర్తములైన వస్తువులన్నియు నందు నిబద్ధములైయున్నవి.౨. అణువు లతిసూక్ష్మములగుటచే నవి పరస్పరస్పర్శవలనఁగాని, సంయోగమువలనఁగాని యొకఘనపరిణామము నుబొందఁజాలవు. అవి విడిగానున్నను, గలిసినను, వానిభిన్నావస్థల కాకాశమే యాధారము. అణువులు కలియునుగాని యాకలయిక నిత్యము

౬. సిద్ధాంతచంద్రోదయము చెప్పినది; “జన్యమాత్రమ్ క్రియామాత్రంవా కాలోపాధిః మూర్తమాత్రమ్దిగుపాధిః”

౭. ఉపస్కారము, ౨, ౨, ౧౦; దీనితో క్యాంటుయొక్క అనుభవ సంబంధమైన ద్వితీయ తృతీయోపమానములు.

౧. వై. సూ. ౨,౧,౨౭,౨౯-౩౧.

౨. న్యా. సూ. ౪, ౨, ౨౧-౨౨.

గాదు. ఆకాశ మణురూపముగాదు కాని యదియే అణువులను
యథాస్థానముల నిలుపుచున్నది. ఆకాశముకూడ నణువిభాగ
యోగ్యమైనచో, నీయణుస్థితిబంధన హేతువు నింకొకదాని
నూహింపవలసియుండును. ఆకాశము శాశ్వతము, సర్వగతము,
నింద్రియాతీతము; దానికి వ్యక్తిత్వసంయోగవియోగత్వలక్షణము
లున్నవి. ఆకాశము సర్వదేశము నిండియున్నది; అది స్వయ
ముగా వస్తువులపై నెట్టిపరివృత్తిని గలిగియుండదు; వస్తువులతోఁ
బ్రత్యేకసంబంధములు గలిగి, శబ్దము నుదయింపఁజేసియే
యట్టి పరివృత్తిని జూపఁగలదు. పదవీ సంబంధములను, వస్తువుల
క్రమమును జూపునపుడది దిజ్ఞానమును గలిగి యుండును. దేశ
మనగా నవకాశమను నర్థములోనదియు నాకాశమే. ఆకాశము
నకు నవకాశమునకును భేదము చెప్పఁబడెను. ఆకాశము శబ్ద
గుణమునకు విశిష్టమగు నుపాదాన కారణముగ నుండగా నవ
కాశము సర్వకార్యములకు సామాన్యకారణముగనున్నది.

పంచద్రవ్యములైన భూజలాగ్ని వాయ్వాకాశముల విష
యమై వైశేషిక భౌతికసిద్ధాంతము ప్రకటితమైనది. మనము
చూచు పదార్థము పంచభూత పరికల్పితమై యుండేదో యొక
భూతాంశమధికముగానుండును. పంచభూతములును పదార్థము
యొక్క పంచరూపములైన ఘనపదార్థము (భూమి). ద్రవముద
కము, వాయురూపము వాయువు; తేజోరూపమగ్ని, అవకాశ
రూప మాకాశమునైయున్నవి. భూమికి రూపరసగంధ స్పర్శా
గుణ చతుష్టయమును; జలమునకు రూపరసస్పర్శలును; అగ్నికి
రూపస్పర్శలును, వాయువునకు స్పర్శయును, ఆకాశమునకు శబ్ద

గుణమును గలవు.౧. భూమి కనేకగుణములున్నను, గంధ మధి కముగా నుండుటచే దానికిగంధమే గుణమని పలుకుదుము.౨. జలాదులకుఁగూడ గంధగుణముండుటకుఁ గారణము భూరేణువులందుఁ గలిసియున్నవి. గంధరహితమగు భూమి నూహింపలేము కాని, గంధరహితములగు జలవాయువులను జెప్పఁగలము. భూమి కల్పితములగు వస్తువులు ముత్త్రివిధములు; దేహములు, ఇంద్రియములు, నితరదృశ్యపదార్థములు,౩. జలముయొక్క ప్రత్యేకగుణము రసము. అగ్నిగుణము కాంతి, వాయువగోచర పదార్థము, పరమిత వ్యాప్తిగలది, భిన్నభాగ యుక్తము. వాయువు నిరవధికము కాదని, దానిసంచలనములవలన గ్రహింపనగును; అది నిరవయవము నిరవధికము నేకమునైనచో, నట్టి సంచలనముల కవకాశము లేదు.౪. దానియస్తిత్వమును స్పర్శ వలన నెఱుఁగుదుము;౫ గుణకర్మలను గలదగుటచే నదియొక ద్రవ్యము. ఉష్ణత వాయువుయొక్క విశిష్టలక్షణము. భూవాయు జలాగ్నులవలనఁ గల్పితములైన సర్వవస్తుజాలములకు మూల బీజములు నూక్ష్మాణువులని చెప్పఁబడెను.

---

(౧) బౌద్ధప్రమాణ గ్రంథములలోఁ గానున్నను, నుత్తర బౌద్ధసార స్వతము నందణువాదము నుదాహరించిన వాక్యములు విశేషముగాఁ గలవు. వైభాషికులును, సౌత్రాంతికులు దీనినంగీకరించిరి, చూ, యుఇ, వైశేషికా ఫీలాసఫీ(పుట౨౬-౨౭, (౨) ౪,౧,౪. (౩) ప్రపాపు౨౭. (౪) వై॥ సూ॥ ౨,౧,౧౪. (౫) ప్రాచీన వైశేషికులును, అన్నంభట్టును వాయువు దృశ్య పదార్థము కాదనియు నది యనుమానసిద్ధమనియు భావించిరి. వాయువునకు వర్ణములేమి కావున నది దృశ్యముకాదని వారు వాదించిరి. ఒకవస్తువును దర్శించుటకుఁ గంటితోఁజూచుటే యవసరములేదని అభినవనైయాయికులు గ్రహించిరి. స్పర్శచే వస్తువులను జూడనగును.

## ౬—అణుసిద్ధాంతము.

అణుసిద్ధాంతము మానవ మానసమునకు సహజమైన దగుటచే బురాతన జగద్వివరణ ప్రయత్నము లీరూపములో నడచినవి. ఈసిద్ధాంతబీజము లుపనిషత్తులలో నున్నవి. సర్వ భౌతికపదార్థములును, భూజలాగ్ని వాయువు లను నాలుగు భూతములచేఁ గల్పితములని యుపనిషత్తులు తలఁచి, యే యితర భూతములతోఁ గలియదుగావునను, విశిష్టలక్షణయుక్త మైనది గావునను నాకాశమును విడిచిపెట్టెను. కాని భూజలాగ్నివాయువులు మార్పులును భాగములును గలవగుటచే, మార్పులేక నిత్యమగున దింకొకటి గలదని తలఁపఁబడెను. మార్పునొందక, అవిభాజ్యములైన నిత్యముండు మూలరూపము లెవ్వి యను ప్రశ్న సహజముగా నుదయించును. సుప్రసిద్ధమైన బౌద్ధతత్త్వముల నుదయింపఁజేసిన భావోద్వేగకాలము నందుఁ గొంద రాజీవకులు, జైనులు నణువాదము నూహించిన వారుండిరి.౧. పారమార్థికాధారములపైఁ గణాదుఁ డణుసిద్ధాంతమును గల్పించి, తన్మూలమునఁ బ్రపంచమును సులభవిజ్ఞాన రూపములోనికిఁ దేఁబ్రయత్నించెను. లూసిప్పసు, డెమోక్రిటస్సు నట్లే చేసిరి. డాల్టన్ కాలమువఱకు నణుసిద్ధాంతము శాస్త్రీయపద్ధతిలో నిర్మింపఁబడ లేదు.

సావయవములగు వస్తువులన్నియుఁ దదంతర్గతములగునవయవములతో సమవాయ సంబంధమును గలిగి యున్నవి; ఇందు సంయోగము సహాయకారిగా నుండును. మన యనుభవము

(౧) న్యా॥ సూ॥ 3, ౧, ౬౦-౬౧.

లోని వస్తువులన్నియు సావయవములే; అందుచే నవి యనిత్యములు; నిత్యతలేని యనిత్యత కర్థములేదు.౨. భూమి జలాగ్ని వాయువులు నిత్యములు ననిత్యములు నైయుండఁగా, నాకాశము మాత్రము నిత్యవస్తువు.సముచ్చయ ద్రవ్యము లన్నియు ననిత్యములు; వానికిఁ గారణములగు ననుత్పాద్యాంశములు నిత్యములు.౧. అగోచరములు నిత్యములు నగు నణువు లవిభాజ్యములు.౨. సర్వవిభాగమునకు మూలరూపమణువు. అణువనంతముగా విభాజ్యమైనచో, సర్వవస్తువులు ననంతవిభాగములచేఁ గల్పితములై, వస్తుపరిమాణ భేదములకుఁ గారణములు మృగ్యములగును.౩. పదార్థమనంతముగా విభాజ్యమైనచో, నప్పుడు మనము దానిని శూన్యము వఱకుఁ దీసికొని పోవలసి వచ్చుటయే కాక, పరిమాణ శూన్యములనుండి సపరిమాణ ద్రవ్యములును, నాకృతిలేని వానినుండి యాకృతి గలవియు నుదయించెనను స్వవిరుద్ధప్రసంగము చేయవలసి వచ్చును.౪. వస్తుపరిమాణములలోని భేదములకుఁ గారణము, కొన్ని యణువులు

---

(౨) ౪, ౧, ౪.

(౧) ౪, ౧, ౧; ౨, ౩, ౪-౫; ౭, ౧, ౨౦-౨౧.

(౨) పరంవాత్రుతేః (న్యా॥ భా॥ ౪, ౨, ౧౭-౨౫)

(౩) సర్వేషామ్, అనవస్థితావయవత్వే మేరుసర్షపయో స్తుల్యపరిమాణత్వాపత్తిః చూ: న్యాయకందళి॥ పు ౩౧.

(౪) మన యనుభవ ప్రపంచములోని నానాత్వపరివర్తనములకుఁగారణములు, మార్పులేని నిరవయవ వస్తువులలోనే యుండవలెను. ఇట్టి యగోచరపదార్థముల సంబంధములు వ్యావహారిక జగత్పరివర్తనములకుఁ గారణములగునని హెర్బార్టు నభిప్రాయము.

కలిసి, కొన్ని విడిపోవుచుండుటయే. అనంతమైన యధికపరిమాణమును, ననంతమగు నల్పపరిమాణమును ననుభవసిద్ధములుగాఁ జాలవు. అవి యల్పాధిక పరిమాణ పరిమితులు; మన మెఱిఁగినవన్నియు రెంటికి మధ్యస్థములు. అపరిమితముగాఁ బెంపు చేయుటచే ననంతాధికపరిమాణమును నత్యంత విభాగ మొనర్చుటచే నత్యల్పపరిమాణమును మనకులభించును. అణువులే, సర్వకార్యములకు నుపాదానకారణములు. అవి యింద్రియగోచరములు కాకున్నను, వాని పరిమాణాకార, భావసాంద్రతలు మన మెఱుఁగరానివైనను, వానిని వర్గీకరింపవచ్చును. ఇంద్రియ గోచరములగుభిన్నవస్తువులలో నవి ప్రదర్శించు గుణములచే వాని వర్గీకరణము సాధ్యమగును. వస్తువుల సామాన్య లక్షణములైన సాంద్రత మున్నగు వానిని విడిచిపుచ్చినచో, మిగులునవి వాని విశిష్టలక్షణములగు వాసన, కాంతి, ఉష్ణతలుండును. ఇవి పరిమాణభేదములనే కాక జాతిభేదములను గలిగి యున్నవి. పృథివ్యప్తేజోవాయువులను చతుర్విధ భూతద్రవ్యముల కనుగుణముగాఁ జతుర్విధ పరమాణువులున్నవని నిశ్చయింపఁబడెను. ఈచతుర్విధ పరమాణువులును త్వక్కును, జిహ్వాచక్షువులను, ఘ్రాణేంద్రియములను గల్పించె ననియు నందువలననే, యెంతగాఁ బ్రకోపించిన నొక యింద్రియమూ లక్షణమునే ప్రదర్శించు ననియుఁ జెప్పఁబడెను. భౌతిక పదార్థలక్షణములగు రూపరసగంధస్పర్శలా వస్తునాశముతో నదృశ్యములైనను, నవి యెల్లప్పుడు వాని యణువులలో నిలిచియే యుండును. భూమియందును తత్సంబంధాణువులందును, నగ్నివలనఁ గొన్ని

గుణము లుదయించును.౧. జలతేజోవాయువు లట్టి మార్పులఁ బొందవు.

వైశేషికులు పీలుపాక సిద్ధాంతము నంగీకరింతురు. ఒక ఘటమును గాల్చినపుడది నశించి, యణువులుగా విడిపోవును. వేడి తగులుట వలన నణువులలో నెఱుపురంగు వచ్చును. అట్టి యెఱ్ఱని యణువులు తిరిగి సంయోగము పొంది నూతన ఘటము నిచ్చుచున్నవి. అనగా నొక పూర్ణవస్తునణువులుగా విడిపోవుటయుఁ దిరిగి యవి కలిసి పూర్ణవస్తువగుటయు జరిగినది. ఈ కార్యమంతయు మహావేగముగాఁ దొమ్మిది క్షణములలో జరిగిపోవుట వలన నది మనకు గోచరింపదు.౨. నైయాయికులు పిఠరపాక సిద్ధాంతము నామోదించిరి. రంగు మార్పు ఘటాణువులందును, ఘటమునందు నొకే కాలమునఁ గలిగెనని దీని భావము. ఇది యెక్కువ సహేతుకముగాఁ దోఁచుచున్నది. వైశేషిక సిద్ధాంతమును నైయాయికుఁ డిట్లాక్షేపించును. మొదటి ఘటము నశించి, వేఱొకటి యుద్భవించినచో, నది పూర్వ ఘటమేయని గుర్తింపఁజాలము. కాని మనము రంగులో మార్పుతప్ప, పూర్వఘటమునే చూచుచుంటిమి. అదియును గాక, ధరాణుగంధము కూడ ననిత్యమని వైశేషికాభిప్రాయము. వస్తువులు పూర్తిగా ఘనపదార్థములు గావనియు వానికి సూక్ష్మరంధ్రము లున్నవనియు నందుచేతనే నిప్పువలన నవి యుష్ణతను గ్రహించు చున్నవనియుఁ దెలియుచున్నది.౧.

(౧) ౭, ౧, ౧-౬. (౨) స. ద. సంగ్రహము, ౧౦.

(౧) న్యా॥ వా॥ తా॥ టీక. పు. ౩౯౯; న్యాయమంజరి. పు ౪౩౮

పరమాణువులు మండలాకృతి గలవని చెప్పఁబడెను. అనగా నవి సావయవములని యర్థముకాదు. అవిసావయవయములను నుద్దేశముతోఁ గొన్ని యాక్షేపణలు చెప్పఁబడెను. మూడణువులు వరుసగా నున్నప్పుడు మధ్యమాణువు మిగిలిన రెంటి పార్శ్వములతో స్పర్శగలిగియుండును. ఒక యణువున కన్నివైపుల నణువులున్నచో నణువున కారు పార్శ్వము లున్నవనియు నవి దాని భాగములనియుఁ బేర్కొనవచ్చును. ఈ యారుపార్శ్వముల నొక సూక్ష్మదేశాంశము (Point) నకు మార్చినచో, దీనివలన నెన్నియణువులైన నొకే యణుస్థానము నాక్రమించుననియు నప్పుడు లోకములోని వస్తుజాలమంతయు నొక యణుపరిమాణములోనికి వచ్చుననియు నందు జగత్తు దృశ్యము కాకుండుననియు నాక్షేపణము. దీనికి సమాధానము సులభము. అణువులకు భాగము లున్నవనుట వ్యవహారార్థముః నిజముకాదు.౨. అణువులకు లోపల వెలుపలలేదు.౩. అవి స్థలము నాక్రమింపవు.౪.

(౨) న్యా॥ భా॥ ౪, ౨, ౨౦.

(3) నిరవయవము, సర్వవ్యాప్తమునగు నాకాశ మణువులలో వ్యాపించునా యనుప్రశ్న యుదయించెను.వ్యాపించినచో,నణువులకుభాగము లుండవలెను; వ్యాపింపకున్నచో నణువులు నిరవయవములేకాని, యాకాశము సర్వవ్యాప్తము కాఁజాలదు. దీనికి సమాధానము: నిత్యవస్తువునకు బాహ్యాభ్యంతరములులేవు; అందుచే నాకాశమున కనంతవ్యాప్తిచే నణువులు సావయవములు కానక్కరలేదు. (౪) న్యా॥ వా॥ ౪, ౨, ౨౫. అణువులు స్థూలములుకాదనుటకొఱకు సూక్ష్మములని చెప్పఁబడెను. వాని కొకవిధమగు పరిమాణమున్నది. భావాంతరమునకుఁ జూడుు: ఛటర్జీ:హిందూ రియాలిజమ్॥ పుటలు ౧౯-౩౪; ౧౪౯-౧౫౩;౧౬౪.)

అణువులకు సహజముగాఁ జలనములేదు; వాని చలనమునకు బాహ్యశక్తులు కారణము. ప్రళయకాలమం దణువులు కార్యముల నుత్పత్తిచేయక యే యుండును. అప్పుడవి వేరుగాను నిశ్చలముగానుండుచు. వైశేషికము ననుసరించి, పరమాణు సంచలనమున కొక విశిష్టధర్మము కారణము.౧. ప్రశస్తపాదుఁ డిట్లు నుడివెను. "ప్రత్యక్షానుమానములచే నెట్టికారణమును గోచరింపకున్నను, మనకు లాభనష్టదాయకములైకన్పట్టు మహాభూతములందలి ప్రవృత్తు లదృష్టకారణములచే నుదయించెనని మన మూహింపవలెను."

సర్వవస్తువులును వానికారణములైన యణువులవలన గుణములను గలిగియుండును. ఈయణువులు, సర్వద్రవ్యములకు సామాన్యములైన పంచలక్షణములనేకాక, పూర్వోత్తరతాగుణములను గలిగియుండును. ఇవికాక, భూమికిఁ బ్రత్యేకముగా గంధగుణమును, నితరములగు రూపరసస్పర్శాభార, వేగ, చలనములును గలవు గంధముతప్పఁ దక్కిన భూగుణములు గలిగి, జలము సాంద్రతను ప్రత్యేకలక్షణముగాఁ గలిగియున్నది. తేజస్సు, సామాన్యసప్తగుణముల కధికముగా, నుష్ణతను, రూప చలన, వేగములను గలిగియున్నది; స్పర్శావేగములే వాయువునకు విశేషగుణములు. ఈగుణము లణువులలో నిత్యములై కార్యములలోఁ గానవచ్చును.

వస్తువులు సమూలనాశనమగు కాలమెన్నడునురాదు. బాహ్యరూపములు నశించినను. వానికి మూలభూతములగు

(౧) ధర్మవిశేషాత్॥ ౪, ౨, ౭.

బీజములు నిత్యములు.౧. అంశములొక పూర్ణవస్తురూపమును గల్పించినవికావున, నవి స్వతంత్రముగా నుండు శక్తిగలవి. అందుచేఁదిరిగి వియోగమందివిడిపోవుచుండును. మనకుగోచరించు చున్న ప్రపంచములోని ప్రకృతిదృశ్యము లనేకము లేకాక, భావ దార్థమంతయుఁగూడ శిథిలమై యణురూప మొంది,నూత్న నిర్మాణ ములను భవిష్యద్యుగములలోఁ గల్పించు చుండును. వేరు వేరుగా నున్న యణువులన్యములతో సంయోగమంది భిన్న వస్తురూప ములను గల్పించి, తిరిగి విడిపోయి, పూర్వాణురూపమందుచు నూత్నసంయోగములచే నూత్నద్రవ్యనిర్మితి కాధారభూతము లగుచుండును. ఈసంయోగ వియోగవిధానమనంతముగా జరుగు చున్నది. వైశేషికము ననుసరించి, సృష్టిలో నణువు లసమ్మిశ్రి తములుగా నుండవు.౨. జగదుత్పాదనకాలమందణువులకుఁ బరి స్పందనశక్తియుండునని చెప్పఁబడెను. అణువులు, విడిగా నుత్పాద కములుగావు. ఒకనిత్యము నేకమునగు వస్తువుత్పత్తిచేయునదైన చో, నట్టి యుత్పత్తియు నిత్యమై, మఱియు నుదయించిన వస్తు వులు నిత్యములు నవినాశములు కావలసివచ్చునని శ్రీధరుఁడు వాదించినాఁడు. త్రికములును (triads) కార్యోత్పాదకములు గావు; ఏలన నొకస్థూలపదార్థము దానికంటె సూక్ష్మములగు నంశములచేఁ గల్పితమైనది. స్థూలపరిమాణముగల త్రికము కార్యమేకాక దానినిగల్పించినదియు నింకొకకార్యమే. అందుచే

---

౧. న్యా. భా. ౪, ౨, ౧౬,

౨. వాయువున కీవిధివర్తించదు. ఇందణుసమూహము లసమ్మిశ్రి తములుగా సంచరించును. నైయాయికులకీభావము తృప్తికరముగాదు.

ద్వితయములే కార్యోత్పాదకములు.౧. రెండు పరమాణువులు కలిసినదే ద్వితయము (Diads); ఇదియు సూక్ష్మరూపమే; ఇట్టివి మూడుకలిసినచో త్రికమగును; ఈత్రికము మిక్కిలి సూక్ష్మముకాదు కావున, దృశ్యమగును. ఏకాణువులు, ద్వ్యయములు నదృశ్యములు; దృశ్యమగుటకు వలయు పరిమాణము త్రికమునకుఁగలదు; అది సూర్యకిరణ రేణువంతయుండును. కారణముల గుణములు కార్యగుణములే యను సామాన్య సిద్ధాంతమున కిదివిశేషము. రెండుతెలుపుగల యణువులు కలియుటచే వచ్చు ద్వ్యయములు తెలుపురంగుగలవే. కాని యణువులు పరిమాండల్యములు; ద్వ్యయము లతిసూక్ష్మములు౩; అయిన నవిగోచరించు పరిమాణముల నుదయింపఁజేయును. అందుచేఁ గార్యముయొక్క పరిమాణము దానికారణములగు భాగముల పరిణామముపైఁగాని, సంఖ్యపైఁగాని, క్రమముపైఁగాని యాధారపడునని చెప్పఁబడెను.౪. ద్వితయముల సంఖ్య వృద్ధియైనకొలఁదియుఁ దదుద్భవ ద్రవ్యపరిమాణము హెచ్చుచుండును. అణుసంయోగజములైన ద్రవ్యములు కేవల సము

౧. న్యాయకందళి పు. ౩౨.

౨. కొందరనంతర వైశేషికతత్త్వజ్ఞులు త్రికములనగా నణుత్రయముతే యనిరి. (సిద్ధాంతముక్తావళి పు. ౩౭; యు. వి. వైశేషికాసిస్టమ్. పుటలు ౧౩౦-౧౩౧.)

౩. ద్వితయములు నింద్రియ గోచరములని మహాదేవభట్టు తలంచఁడు, దశపదార్థిభావము నిదియే. చూడు యు. ఒ. వైశేషికాఫిలాసఫీ; న్యాయకోశము. పు. ౩౫౦.

౪. వై. సూ. ౭, ౧, ౯.

చ్చయములే (Aggregates) కాక, పూర్ణద్రవ్యములు (wholes) పూర్ణద్రవ్యములు కాదన్నచో, మనకుభాగములేయుండి, యవి గోచరింపని యణురూపములవలన విభాజ్యములగును. పూర్ణద్రవ్యాభావము నిజమైనచో, మనకగోచరాణువులే మిగులును. అణువులు విడిగా నదృశ్యములనియు, నేకైకభటుఁడు నేకైక వృక్షము గోచరింపక, యొకసైన్యములేక వరణ్యము గోచరించు నట్లే, యణుసమూహములు గోచరించునని చెప్పినచో నీయుపమాన మయుక్తమని న్యాయమువాదించి, భటులు, వృక్షములును స్థౌల్యముగలవనియు, నందుచే నవి గోచరించునవియు నణువులట్టివి కావనియు సమాధానము చెప్పును.౧. పూర్ణద్రవ్య మంతర్గతాంశములకంటె వేరైనది; ఒకరాగము భిన్నస్వరముల కంటె వేరైనది ౨. మఱియుఁబూర్ణతలేనిచో, "ఇదియొక యాసనము," అదియొక మనుజుఁడు" ననువాక్యముల కర్థముండదు. పూర్ణాంశసంబంధము సమవాయము.3.

సృష్టిలయములుఁగలిగి క్రమగతిగల కాలచక్ర సిద్ధాంతముచే స్థిరముగా నలిగియున్న బాటనేహిందూ తత్త్వశాఖయు విడువఁజాలదు. ఈక్రమగతి విధానములను ప్రశస్తపాదుఁడు వర్ణించినాఁడు.౪. బ్రహ్మ ప్రమాణములో వత్సరశతమైనచో పాతఁడు తొలఁగు కాలమే తెంచును.సంసార పరిభ్రమణ సంజాత

(౧) న్యా. భా. ౪, ౨, ౧౪.
(౨) న్యా. సూ. ౨, ౧, 3౫-3౬.
(3) న్యా. భా; న్యా. వా. ౪, ౨, ౧౨.
(౪) ప్ర. ప. పు. ౪౮.

యాతననుండి జీవకోటికి విశ్రాంతినొసంగఁ దలఁచి, పరమేశ్వరుఁడు జీవులను దనలోనికిఁ దిరిగి తీసికొనఁ గోరును. పరమేశ్వరునిలో నీకోరిక జనించిన ముహూర్తముననే, దేహేంద్రియాదుల కన్నిటికిఁ గారణములైనసర్వజీవులలోని యదృష్టవాసనలు నశించిపోవును. అప్పుడా సర్వేశ్వరుని కోర్కె ననుసరించి, జీవుల కణుసంయోగముచే, దేహేంద్రియాదికములఁ గల్పించిన యణువులు విడిపోవును. అణుసమూహములు విడిపోవుటతో ద్రవ్యాకృతులు శిథిలములగును. మహాభూతములగు భూజలాగ్నివాయువులు వరుసగా నశించును. లేక నదృశ్యములై పరమేశ్వరునిలో లయములగును. అణువులు విడిగానుండును; పుణ్యాపాపవాసనాయుక్తములై జీవులుండును; తిరిగి యాజీవుల యనుభవము నిమిత్తము పరమేశ్వరుఁడు సృజింపఁగోరును. పరమేశ్వరేచ్ఛచే నణువులలోఁ జలనముదయించి, జీవుల పూర్వజన్మ సంస్కారములతో ననిలాణువులు సంయోగమందును. అనిలాణువులు కలిసి ద్వితయములు, త్రికములునై, క్రమముగా మహాభూతవాయువుత్పన్నమై, వరుసగా జలభూతము, పృథ్వీ భూతము, తరువాత నగ్నిభూతము జనించును. పరమేశ్వరు నభిధ్యానమాత్రమున బ్రహ్మాండముదయించి, దానిలోనుండి బ్రహ్మయు జగత్తును గలుగును. మిగిలిన సృష్టివ్యాపారమును బ్రహ్మ పూర్తి చేయును. జీవరాశిలో బ్రహ్మ శ్రేష్ఠతముఁడు; ఆతఁడు తన పుణ్యారాశి యున్నంతకాలముండును. జగత్తంతయును బ్రహ్మ సృష్టికాదు. ఆతని పుణ్యక్షయముతో జగన్నాశమును గాదు. రెంటికిఁ గారణము పరమేశ్వరుఁడే. బ్రహ్మ, ఉత్తమజ్ఞానసంకల్ప క్రియా

శక్తులు గలిగి. మానసపుత్రులను, ప్రజాపతులను, మనువులను, దేవపితృమహర్షి వర్ణచతుష్టయాదులను, పూర్వకర్మవాసనల ననుసరించి సర్వజీవరాసులను సృజించును.౧. సృష్టిలయములనంతములు నచలములునగు దేశకాలాకాశభూతత్రయమునకంటవని శ్రీధరు నభిప్రాయమై యున్నది. నూతన జగత్సృష్టి యనునది లేదు. ఏయొక లోకమైన ననాద్యనంత పరంపరగలది. జీవులయొక్క కర్మార్హత ననుసరించి, వాని కనుభవజ్ఞానసిద్ధి కొరకు లోకము సృజింపఁబడినది. జీవులకు సహజసిద్ధములైన కర్మశక్తుల ననుసరించి, సృజింపఁబడి, లోకము వారి యనుభవమునకుపయోగించును. ఏకాలము నందైనను బ్రహ్మయే సర్వజీవులలో నుత్తముఁడు; లోకమంతయు నాతని యనుభవసిద్ధికై యున్నది. పుణ్యమున కాద్యంతములు గలవు కావున, బ్రహ్మపుణ్యమైనను క్షయము కాకతప్పదు. బ్రహ్మ పుణ్యక్షయముతో లోకమును లయమగును. కాని యితరజీవుల సంచితములు మిగిలి పోవును. ఒక బ్రహ్మకుఁ బుణ్యక్షీణమైనచో నింకొక బ్రహ్మ యా స్థానము నాక్రమించును. ఈవిధముగాఁ బ్రతిలోకమునకు గత నూతన బ్రహ్మలుందురు; లోకము లిట్లనంత గతి కలిగి యుండును.౧.

---

(౧) సృష్టి లయవిధానములలో నొక ముఖ్యమైన భేదమును ఫాడెగాన్ తిలకించినాఁడు. అగ్ని, వాయువు వెనువెంటనే జనించుటకు బదులంతమందు జనించినది. "గ్రంధకర్త, క్రమోత్పత్తిని మార్చుటకుఁ గారణమేమనగా భూమ్యగ్ని మిశ్రమమగు హిరణ్యగర్భాండమునకుఁ బూర్వమగ్నిని సృజింప దలఁచినాఁడు." (వైశేషికాసిస్టమ్. పు ౧౬౪.)

(౧) పాదయునఁడు: ఆత్మతత్త్వవివేకము.

ద్వితయముల కుపాదానకారణములగు నణువులవినాశములు. ద్వితయము లణునాశనముచేఁ గాక, నణుసంయోగనాశనముచే నశించును.౨. కార్యనాశనముతోఁ గారణనాశన మగుననియు, నణు ద్వితయముల విషయములో మాత్రము వాని సంయోగమే నశించుననియుఁ బ్రాచీన నైయాయికులు విశ్వసించిరి. అనంతర నైయాయికులుమాత్రము సర్వవస్తువిషయములలో నిదియే జరుగుననిరి. నాశనమనగా వస్తువులుక్రమముగా వాని కారణరూపములలోనికి మారుటే యను భావము ననుసరించి వీరిభావ మెక్కువ తృప్తికరముగా నున్నది. లయమనగా పునస్సృష్టియేకాని, సృష్టి నాశనము కానియెడలను, కార్యనాశన మనగా వస్తు మూలరూప నాశనమైనయెడలను, మూలకారణములు నశించి కార్యముండుటకు మధ్యమందొక విరతికాల ముండవలెను. కాని యీ కార్య మా విరతికాల మందెచటనుండునో యూహింప దుస్సాధ్యము; కార్యము మూల కారణరూపములైన యణువులలో నుండఁజాలదు; ఏలన వానికిఁ గార్యముతోఁ బ్రత్యక్షసంబంధములేదు; భాగములలో నుండఁజాలవేలన నవి నశించినవి.౧.

(౨) పరమాణుద్రవ్య సంయోగనాశము.

(౧) వైశేషికతత్త్వము ననుసరించి ప్రళయములు రెండువిధములు; (౧) అవాంతరప్రళయము; ఇందు దృశ్యవస్తువులే నశించును. (౨) మహాప్రళయము; ఇందు సర్వవస్తుజాలము లణువులుగా విడిపోవును. సృష్టిప్రళయములనగా మూలద్రవ్యముల వ్యక్తావ్యక్తదశలు మాత్రమే. పోల్చు: మహానారాయణోపనిషత్తు ౧౯ అ; కీత్॥ ఐ. యల్. ఎ.

పెక్కు హేతువులను జూపి శంకరుఁడు వైశేషికాణ వాదమును ఖండించినాఁడు. ప్రళయకాలమందుఁ జలన ముద యించుట దురూహ్యము, దీనికి మానవప్రయత్నము కారణము గా దేలన నది యింకను బుట్టియుండలేదు. అదృష్టశక్తి కారణ మైనచో నది యెచట నివసించినది? అది జీవులలో నున్నచో దానికణుసంబంధ ముండఁజాలదు; అది యణువులలోనున్నచో నచేతనమగుట నది చలనోత్పాదక హేతువు కాఁజాలదు. అదృష్టశక్తి జీవులతోఁ గలిసి సమవాయసంబంధముచే నణువు లలో నున్నదన్నచో నప్పుడు ప్రవృత్తి నిత్యమైనద్దై, విలయ కాలభావమునకు విరుద్ధమగును. మఱియు నదృష్టశక్తి జీవుల పుణ్యాపాపములకు ఫలితముల నిచ్చునదేకాని, సృష్టి లయ సంబంధము గలదికాదు. అణుసంయోగమునకుఁ గూడ శంకరుఁ డాక్షేపణలఁ దెల్పినాఁడు. అణువులు పూర్ణవస్తువులుగా (Wholes) (గలిసినచో, నవు డొకదానిలో నొకటి పూర్తిగాఁ జొచ్చి, వస్తుస్థౌల్యము పెరుగుట కవకాశముండదు. కావున వస్తూత్పత్తియే యుండదు. అణువులు భాగసంయోగమందిన యెడల, నణువులు విభాజ్యములగును. మఱియు స్థలాక్రమణ ములేని, యణువులు, సంయోగముచే నెట్లు స్థలము నాక్ర మించునో చెప్పుట దురూహ్యమగును. సంయోగముచే నణువుల లోలేని నూత్నగుణము లెట్లుత్పన్నము లగుచున్నవి? నూత్న ములు నవినాశములునగు నణువులు కలిసినచో, రంగుమున్నగు గుణము లెట్లువచ్చును? మఱియు మహాభూతములగు నగ్ని వాయు భూజలాకాశములలోఁ గొన్నిటి కితరములకంటె నధిక

గుణములున్నవి. అందుచే జలాణువు లనిలాణువులకంటె నధిక లక్షణములను గలిగియుండవలెను. అణువులన్నియు నొకే పరిమాణముగలవైనచో గుణాధిక్యముచేఁ బరిమాణాధిక్యమును వచ్చుచున్నది. మఱియు నవిభాజ్యములగు జీవులకు, మనస్సులకు, నణువులకు సంయోగము సాధ్యముకానిది. మఱియు నణువులు నిత్యక్రియాత్మకములో, నిత్య నిష్క్రియాత్మకములో, రెండునో, రెండునుగాకుండుటో కావలెను. అవి నిత్యక్రియాత్మకములైనచో వానికి విలయముండదు; అవి నిత్య నిష్క్రియాత్మకములైనచో సృష్టి యసాధ్యము. అవి రెండునైనచో స్వవిరుద్ధములగును. రెండునుగాకున్నచో, వాని ప్రవృత్తి నివృత్తులకుఁ గారణములుండుటయు, నీకారణము లదృష్టశక్తి యణువులతో నిత్యమై కలిసియున్నటులనే, నిత్యప్రవృత్తియో, నిత్యనివృత్తియో కలుఁగఁజేయవలయును.౧.

అభినవవిజ్ఞానమున కణువాదమునుగూర్చి సంశయము లున్నవి. వ్యాప్తిగల సర్వవస్తువులును వ్యాప్తిలేని యణువుల వలన సంయోగముచే లభించెనను వైశేషికభావము భావకల్పితమేకాని, యథార్థజగత్తులో నణువుల దర్శించు నవకాశమేమియును లేదు. ఎంతస్వల్పవిషయమైనను, పరిగణనసాధ్యములగు ననేకాంశములను గలిగియుండును. వైశేషికాణుకాదము గ్రీకు విజ్ఞానముపై నాధారపడినదనియు, గ్రీకు విజ్ఞానము పశ్చిమఖండమున వ్యాపించియున్న దినములలో భారతదేశమునకు సంప

---

౧. శంకరభాష్యము, ౨, ౨, ౧౪.

ర్కము కలిగియుండవగుననియు వాదింపఁబడెను.౧. ఇప్పటికి మనకుఁగల విజ్ఞానము ననుసరించి యీవిషయములో నెట్టినిర్ధారణ చేయుటకును వీలులేదు. అణువగోచరమగు సూక్ష్మతమ పదార్థమను సామాన్యభావముతప్ప, నణుసిద్ధాంతవిషయములో గ్రీకు- భారతీయ విజ్ఞానముల కెట్టిపోలికయును లేదు. డెమాక్రిటస్సు ననుసరించి, అణువులకుఁబరిమాణభేదమేకాని గుణభేదము లేదు. గుణవిభాగములులేని యనంతసంఖ్యగల యణువులున్నవనియుఁగాని వానికి రూపపరిమాణభారస్థాన నిర్మాణములలో భేదములున్నవనియు నాతఁడు విశ్వసించెను. కణాదుననుసరించి యణువులకు జాతిభేదములున్నవి; ప్రతిజాతికిని విశిష్ట విశేష లక్షణమున్నది. తత్ఫలితముగా వస్తువుల గుణభేదము పరిమాణ భేదముగా గ్రీకు-సిద్ధాంతము నిర్ణయించఁగాఁ దద్విరుద్ధముగా వైశేషికము నిర్ణయించినది. అణువులలో నప్రధానగుణము లిమిడియుండవను గ్రీకు-వాదమును భారతీయ తత్త్వజ్ఞుఁడంగీకరింపఁడు. అణువులు స్వభావసిద్ధముగాఁ జలనమందుచున్నవని డెమాక్రిటస్, ఎపిక్యూరస్‌లు తలఁచియుండఁగా నణువులు సహజముగా నిష్క్రియాత్మకములని కణాదుఁడు భావించెను. అణువులు జీవనిర్మాణము చేయఁగలవని డెమాక్రిటిస్ విశ్వసించి యుండగా, జీవులు నణువులును వేరనియు, నవిసమానముగా నిత్యతాలక్షణ యుక్తములనియు వైశేషికులు తలఁచిరి. జగత్తు నచేతన ప్రకృతిగా గ్రీకులు భావించి, యీశ్వరుని వారితత్త్వములో లేకుండఁజేసిరి. అనంతసంఖ్యగలిగి, భిన్నరూపములతో

(౧) కీత్: ఐ. ఎల్. ఏ. పుటలు ౧౭-౧౮.

నున్న యణువు లనంతావకాశమునఁబడి, యధికపరిమాణము గల వెక్కువవేగముతోను, నల్పపరిమాణముగలవి తక్కువ వేగముతోను బడుటవలన నన్యోన్య సంఘర్షణము పొందును. ఇట్టిపతనమువలన సముచ్చయద్రవ్యములు, లోకములు నుద యించును. అణుగతిలోఁగొన్ని మార్పులు గణించుటకు శక్యము కాని రీతిని తటస్థించును.౧. ప్రాచీన వైశేషికులు బహిరంగ ముగా దైవాస్తిత్వమును బ్రకటించియుండలేదు కాని, వారి తత్త్వమున కదృష్టధర్మమును గేంద్రనియమముగా నొనర్చిరి. ఈవిధముగా నొక తాత్త్విక లక్షణవిశిష్టమై వైశేషికాణుసిద్ధాం తము ప్రకటితమైయుండఁగా గ్రీకుసిద్ధాంతములో నట్టిదిలేదు. ఈరీతిగా వైశేషికాణువాదము గ్రీకుసిద్ధాంతములోలేని విశిష్ట లక్షణములను గలిగియున్నది. మఱియు నణువాద బీజములు హిందూవిజ్ఞానమునందే కలవు.

మొన్నటివరకు భౌతిక విజ్ఞానశాస్త్రమునందుఁ గూడ నణువాదమే గణ్యతనందినది. ఇటీవలి నూత్నపరిశోధనా ఫలిత ములు దానికిఁ బోషకములుగా లేవు. జడపదార్థము మార్పు లేని మొత్తము కాదు; దాని పరిమాణము వేగముపై నాధార పడి యుండును. అది అతి సూక్ష్మములగు విద్యుచ్ఛక్తి కేంద్ర ములుగా గోచరించును; ఈ కేంద్రము లాధారమవసరము లేకుండ, విశేష కాలాంతరములలోఁ జెదరి, గుణింప శక్యము గాని వేగములతో భిన్నదిగ్భాగముల కెగురు చుండును. పదార్థ ముతో నిమిత్తము లేకుండ నుష్ణతాకాంతి చలనములకు భార

---

(౧) వాలేస్: ఎపిక్యూరియానిజమ్, పు. ౧౦౦.

మున్నదని విదితమైనది. ఇప్పుడణువులనగా విద్యుదణువుల సముచ్చయములు; ఆకాశమునుండి వానిలక్షణములఁ గైకొనుచున్నవి. అణువొక సూక్ష్మమగు సూర్యగ్రహకూటము; దాని కేంద్రమొక సూర్యుఁడు వంటి పరిభ్రామ్యమాణపదార్థరాశి; భూరవి మండలముల బంధించు నాకర్షణమాత్రము ననుసరించి, విద్యుదణువులు (Electrons) దాని చుట్టు నెగురు చున్నవి. పూర్వాణుసిద్ధాంతమీ నూతన సత్యాంశ విషయమెఱుఁగదు. కాని నేటి పరిశోధనాఫలితముల కవకాశమిచ్చి నందున నణుసిద్ధాంతము నిరర్థకమైనదికాదు. ప్రకృతి శాస్త్రదృష్టి ననుసరించి వ్యర్థసిద్ధాంతమైన చైతన్యవాదము (Animism) నణువాదముతో పొసఁగుచున్నది. గ్రీసునందును, భారతదేశము నందును గూడ నణువాదమొక భౌతిక శాస్త్రముగాఁ గాక, యొక తాత్త్విక సిద్ధాంతముగాఁ బ్రతిపాదింపఁబడినది. అందుచే సహజముగా నది భౌతికశాస్త్రీయ పరీక్షాపద్ధతి కనుగుణమైనది కాదు.౧ అది ప్రకృతిదృశ్యముల కర్థము చెప్పుటకై చేసిన భావకల్పితతత్త్వము. అది పరిశీలనాఫలితము కాదు; నూత్నకల్పనము; జగత్తును గూర్చిన మన భావసంపుటిలో నొక క్రమమును, సమన్వయ

(౧) పురాతన కాలమునఁ గాని నేఁడు కాని యణువాదము నిస్సంశయముగా నిరూపింపఁబడి యుండలేదు. అది పూర్వము నుండియు నేటి వఱకును సుస్థిరస్థాపితమగు సిద్ధాంతమని చెప్పుట కవకాశములేదు; కాని, దానిలో నసమానమైన నిత్యతాసామర్థ్యము లుండి, నేటి భౌతికరాసాయనిక పరిశోధకుల కమూల్యఫలితముల నొసఁగినది. అయినను, నిది మానవబుద్ధి కతీతములైన యంశములతోఁ గూడిన దగుటచే నెప్పటికైన నది నిరూపింపరానిదిగా నే యుండును." (గోంపెర్జు: గ్రీకథింకర్సు, వాల్యూము ౧, పు. 3౫3.)

మును జూపినది కావున నది యంగీకారయోగ్యమని చెప్ప వచ్చును; కాని, యాసిద్ధాంతము ఋజువుచేయుటకు వీలులేనిది కావున మనము దానిని దిరస్కరించిన నిబ్బంది లేదు.

౭ — గుణము

ద్రవ్యము విడిగా స్వతంత్రముగా నుండఁగలదు; కాని గుణమట్టిది కాదు.౨.అది ద్రవ్యమందుండును.దానికి గుణములు లేవు. గుణమనగా "ద్రవ్యమాధారముగాఁ గలిగి తనకింక నేగుణములు లేనిదై, సంయోగ వియోగములకుఁ గారణముకానిదై, వానితో సంబంధము లేనిద"ని కణాదుఁడు నిర్వచించెను.౧. సూత్రము పదునేడు గుణములను జెప్పినది: రూపము, రసము, గంధము, స్పర్శ, సంఖ్య, పరిమాణము, పృథక్త్వము, సంయోగము, విభాగము, పరత్వము, అపరత్వము, బుద్ధి, సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, ప్రయత్నము.౨. వీనికిఁ బ్రశస్తపాదుఁడింక నేడుగుణములను జేర్చినాఁడు; గురుత్వము, ద్రవత్వము, స్నేహము, ధర్మము, అధర్మము, శబ్దము, సంస్కారము.3. లఘుత్వమృదుత్వ కఠినత్వములను గూడఁ జేర్చుటకు యత్నములు జరిగెను; కాని గురుత్వాభావమే లఘుత్వమగుట చేతను, మృదుత్వ కఠినత్వములు భిన్నసంయోగావస్థలగుట వలనను నీప్రయత్నములు విఫలములైనవి.౪. అభినవ నైయాయి

(౨) గుణమునకు సాంఖ్యములో విశిష్టార్థము కలదు.
(౧) ౧, ౧, ౧౬; చూ॥ ప్ర॥ పా॥ పు ౯౪.
(౨) ౧, ౧, ౬
(3) ప్ర॥ పా॥ పు ౧౦.
(౪) తర్కసంగ్రహదీపిక॥ పు ౪.

కులు పరత్వాపరత్వ పృథక్త్వములను విడిచి పెట్టిరి; ఏలన మొదటి రెండును దేశకాలములపై నాధారపడును; పృథక్త్వ మన్యోన్యాభావమే. గుణములు మానసికములు, భౌతికములు కూడనై యున్నవి.

నిత్యవస్తువులకుఁ జెందినవి నిత్యగుణములు; అనిత్యవస్తువులకుఁజెందిన వనిత్యగుణములు. రెండుకాని యెక్కువకాని వస్తువులలో నున్నచో నాగుణములు సామాన్యములనఁబడును. రూపరసగంధ స్పర్శలును, స్నేహము, సహజద్రవత్వము, బుద్ధి, సుఖదుఃఖములు, ఇచ్ఛాద్వేషములు, ప్రయత్నము, ధర్మాధర్మములు, సంస్కారశబ్దములు విశేషగుణము లగుటచే నీగుణములుగల ద్రవ్యము లితరద్రవ్యములనుండి వేరుపఱచి చూపును. సంఖ్య, వైశాల్యము, పృథక్త్వము, సంయోగ వియోగములు, పరత్వాపరత్వములు, గురుత్వము, కృతద్రవత్వము, వేగము, సామాన్యగుణములు.(౫) ఇవి ద్రవ్యసామాన్య గుణములును, నూహాకల్పితములునై యున్నవి. ఇవి విశేష గుణము లంత యథార్థములుగావు. సంఖ్య భావకల్పితముగా నుదాహరింపవచ్చును. ఒకే ద్రవ్యము నొకటిగాను, ననేకము గాను గూడఁ జెప్పవచ్చును. సంఖ్య, వైశాల్యము, పృథక్త్వము సంయోగ వియోగములు నన్నిద్రవ్యములకును జెందిన గుణములే. కాలదేశముల కేయితరగుణములును లేవుకాని, ఆకాశమునకు శబ్దగుణముకూడ నున్నది. మూర్తముగా గ్రహింపఁబడిన మనస్సున కణుద్రవ్యములకుఁ గల సప్తగుణములతోఁ

(౫) ప్ర॥ ప॥ పు ౯౫-౯౬.

బాటు వేగ మధికగుణమై యున్నది. జీవాత్మ కైదు సామాన్య గుణములును, తొమ్మిది విశేషగుణములైన బుద్ధి, సుఖదుఃఖములు, ఇచ్ఛాద్వేషములు, ప్రియత్నము, ధర్మాధర్మములు, మానసిక ముద్రాశక్తియును గలవు. ఈశ్వరున కైదుసామాన్య గుణములును, జ్ఞానేచ్ఛాప్రయత్న గుణములును గలవు.(౧) గుణములకు దృశ్యాదృశ్య భేదములుగలవు. ఏకేంద్రియద్యోతకములగు రూపరసగంధ స్పర్శాశబ్దములకు; రెండింద్రియములకుఁ దెలియు సంఖ్యాపరిమాణ పృథక్త్వ సంయోగవియోగ పరత్వా పరత్వ ద్రవత్వ స్నేహ వేగములకును భేదము చెప్పఁబడినది. జీవాత్మలక్షణములైన జ్ఞానము, సుఖదుఃఖములు, ఇచ్ఛాద్వేష ప్రియత్నములు మనస్సునకు గోచరములు.(౨)

చక్షుర్గోచరమగు రూపము పృథివ్యప్తేజములకుఁగలదు; జలాగ్నుల రూపము నిత్యము. భూమివిషయములో నుష్ణత ననుసరించి రూపముమారును. సప్తవర్ణము లంగీకరింపఁబడును. తెలుపు, నీలిమ, పసుపు, యెఱుపు, ఆకుపచ్చ, గోధుమవర్ణము చిత్రవర్ణము. రసము జిహ్వాకుమాత్రమే తెలియు గుణము. భూజలములకు రసముకలదు. రుచు లైదువిధములు: మధురము ఆమ్లము, కటువు, కషాయము, తిక్తము. ఘ్రాణేంద్రియము ముక్కుచే గంధమును దెలియఁగలదు. సుగంధ దుర్గంధములు రెండురకములు భూమికిఁగలవు. స్పర్శాగుణ మొక్క త్వాగింద్రియమునకే కలదు. శీతోష్ణ మందోష్ణములు మూఁడురకము

(౧) భాషాపరిచ్ఛేదము॥ పుటలు ౨౫-౩౮.
(౨) ప్ర॥ ప॥ పు ౯౬.

లనుటచే స్పర్శయనగా నుష్ణోగ్రత (Temperature) స్ఫురించు చున్నది. ఈగుణము పృథివ్యప్తేజోవాయువులకు గలదు. కఠినత్వ మృదుత్వములును, పరుషత్వ సరళత్వములును స్పర్శా భేదములనియుఁ జెప్పఁబడెను.౧. శబ్దమాకాశగుణము.

ద్రవ్యములయొక్క ఒకటి, రెండు, మూడు మున్నగు పరిగణనాత్మక గుణమును జెప్పునది సంఖ్య, ఈసంఖ్యలలో నేకత్వము నిత్యము ననిత్యమునుగూడనై యున్నది; మిగిలినవన్నియు ననిత్యములు. మన మొకఘటమును జూచునపుడు, మనము చూచిన ద్రవ్యముయొక్క ఏకత్వమును దర్శించు చున్నాము. మనమింకొక ఘటము నట్లేచూతుము; దీనిలో ద్విత్వము లేదు. ఈ రెంటి యేకత్వములనుగూర్చి మనముభావించు నపుడే ద్విత్వభావ ముదయించును. ఏకత్వేతరసంఖ్యాభావ మంతయు బుద్ధ్యపేక్షాజాతమే.౨

పరిమితియను ద్రవ్యగుణమువలన, ద్రవ్యములు పెద్దవో చిన్నవో, దీర్ఘములో హ్రస్వములోఁ దెలిసికొందుము. పరిమితి నిత్యవస్తువులలో నిత్యము, ననిత్యవస్తువులలో ననిత్యము. ఆకాశమునకుఁ బరమమహత్త్వము; అణువులకుఁ బరిమాండల్య

(౧) అథల్యే॥ తర్కసంగ్రహము॥ పు ౨౫౬.

(౨) న్యాయకందళి॥ పు ౧౧౯; ఉపస్కారము॥ ౭, ౨, ౮. ఏకత్వమువలెనే ద్విత్వాదులు విజ్ఞానమునకు ద్యోతకములైనను, యథార్థములే యని న్యాయము భావించును గాని, వైశేషికముమాత్ర మీ సంఖ్యలన్నియు విజ్ఞానద్యోతకములే కాక, బుద్ధి కల్పితములని నిశ్చయించెను. ఒకవస్తువే యున్నంతకాలము మన కేకత్వభావమైనను జనింపదను సంగతిని వైశేషికుఁడు మఱచినాఁడు. ద్విత్వమువలెనే యేకత్వమును బుద్ధివ్యాపారమును గోరును.

ములను లక్షణములు. అనిత్యవస్తువుల పరిమితిని మనము వాని లక్షణములైనసంఖ్య, పరిమాణము, నిర్మాణములవలన నిర్ణయింతుము,[3] ద్వితయములు సూక్ష్మములు, మిగిలినవి పరిమితిగలవి.

పృథక్త్వమువలన ద్రవ్యభేదములు తెలియును.[1] ఇది యథార్థమైనదే కాని భావమాత్రము కాదు. ద్రవ్యముయొక్క స్వభావమునను సరించి, యిది నిత్యమో, అనిత్యమో యగును. పృథక్త్వ మనిత్యవస్తువులకు నుండునుగాని, విశేషము నిత్యవస్తు లక్షణము. పృథక్త్వము వస్తుసంఖ్యాభేదమును దెల్పును; విశేషము వస్తువుల విశిష్టగుణములను దెల్పును.

పృథగ్వస్త్వైక్యము సంయోగమును,సంయుక్తవస్తువిభాగమును[2] దెల్పును. ఒక యెగురుచున్న గాలివడగ యొక స్తంభమును స్పృశించునప్పుడువలె నొకవస్తువు చలించుటవలనఁగాని, రెండుగొఱ్ఱెలు కొమ్ములుకలిపి డీకొని నపుడువలె రెండు వస్తువులును గదలినపుడుగాని సంయోగమేర్పడును. సంయోగమింకొక సంయోగమువలనఁ గలుఁగవచ్చును. మనమొక కలముతో వ్రాయునపుడు కలమునకుఁ గాగితముతోఁ గలిగిన సంయోగము వలన హస్తమునకుఁ గాగితముతో సంపర్కము కలుగుచున్నది. రెండు విడిగానున్న వస్తువులకే సంయోగము సాధ్యమగును గావున, సర్వవ్యాప్తములగు రెండువస్తువు లెప్పుడును గలిసియో

(3) వై॥ సూ॥ ౭, ౧, ౮-౯.

(౧) వై॥ సూ॥ ౭, ౨, ౨.

(౨) ప్ర॥ ప॥ పుటలు ౧౩౯; ౧౪౧.

యున్నవి కావున వానికి సంయోగమున కవకాశము లేదు. విభాగము నిట్లే, రెంటిలో నొకవస్తు చలనమువలనఁగాని, రెంటి చలనమువలనఁగాని, వేఱొక విభాగమువలనఁగాని జరుగును. సంయోగవిభాగములవలననే వస్తువులలో మార్పులుగలుగును.

దేశకాలములందలి వస్తువుల దూరసామీప్య భావముల నిచ్చునవి పరత్వాపరత్వములు.౩. ఇవి వస్తువుల సంబంధములనే కాని గుణములను దెలుపునవి కావు, ఈసంబంధములైనను నిత్యములు కావని ప్రశస్తపాదుఁ డంగీకరించెను.౪. సుఖదుఃఖేచ్ఛాద్వేషప్రయత్న జ్ఞానములు జీవాత్మగుణములు. వస్తువులు, పడునప్పుడు భూమిని జేరుటకు వలయు లక్షణమును గురుత్వము తెలుపును.౧ భూజలాణువుల గురుత్వము నిత్యమైనది; ఉత్పత్తిగల స్తుగురుత్వమనిత్యము. ప్రవహించు కార్యమునకుఁ గారణమైన ప్రసరణగుణము సహజసిద్ధమో, నైమిత్తికమో కావచ్చును. జలము సహజప్రసరణ గుణము కలది; భూమి కారణాంతరములచేఁ బ్రవహించునది.౨. స్నేహము జలగుణము; దీని వలన జలమునకు సంయోగ మృదుత్వములు సిద్ధించును.౩. తనకు సుఖదుఃఖకారణములైన ధర్మాధర్మములు జీవాత్మలక్షణములు. అదృష్టము, జీవుల వలన, ద్రవ్యముల వలన నుదయించి

---

(౩) ప్ర॥ పా॥ పు ౧౬౪.
(౪) ప్ర॥ పా॥ పు ౯౯.

(౧) వై॥ సూ॥ ౫,౧,౭-౧౮; ౫,౨,౩; ప్ర॥ పా॥ పు॥ ౨౬౩.
(౨) ప్ర॥ పా॥ పు॥ ౨౬౪.
(౩) ప్ర॥ పా॥ పు॥ ౨౬౬.

సృష్టి క్రమగతి కాధారమై, పూర్వకృత కర్మఫలములను జీవులకు లభింపఁజేయును. వైశేషికము నందీయదృష్ట నియమము సహేతుకజ్ఞానలోపముల నెల్లఁ బూరించుట కుపయోగించినది. దేనికి హేతువు లభింపదో దాని నదృష్టమునకు ముడిపెట్టిరి. సూచికాకర్షణ శిలాసంబంధము; వృక్షలతాదులలో నాసవ ప్రసరణము; అగ్నిజ్వాలకుఁ గల యూర్ధ్వగమనము; వాయు సంచారలక్షణము, అణువుల ప్రాథమిక చలనము నివన్నియు నదృష్టశక్తులే.(౪) వీనికిఁ గారణములు చెప్పుట యనఁగా వీని నుత్పత్తిచేయు శక్తిగలదని ప్రకటించుటే. నాటక ప్రదర్శనమం దసాధ్యక్లిష్టపరిస్థితు లేర్పడినపుడతిమానుష తాటస్థ్యములచే నందలి వైరుధ్యములను నాటకమునుండి తొలగించునట్లు, వైశేషికు లదృష్టము నుపయోగించిరి. సృష్ట్యారంభ కారణము, జగత్క్రమసౌందర్యములు, లోకములోని సన్నివేశములు కారణకార్యసంబంధములను గలిగి యుండుట, మున్నగున వన్నియు నదృష్టశక్తికృతములని చెప్పఁబడెను. తరువాత వచ్చిన వైశేషిక తత్త్వవేత్త లీశ్వరాస్తిత్వము నంగీకరించి నపుడదృష్టశక్తిద్వారమున నీశ్వరుఁడు తన సంకల్పములను నెరవేర్చునని వర్ణింపఁబడెను. సంస్కారము త్రివిధము. (౧) ద్రవ్యములను సంచలన మందుంచు వేగము; (౨) పూర్వానుభవములను జీవాత్మ స్మరించి, జ్ఞాపకముంచుకొను భావన; (3) ఒక వస్తువు

(౪) ౫,౧,౧౫; ౫,౨,౭,౧౩;౪,౨,౭. ఖగోళచలనము దేవతల వలన జరుగుచున్నదని కెప్లరు భావించినాఁడు. (చూ. హిస్టరీ ఆఫ్ ది ఇండక్టివ్ సైన్సెస్. ౩-వ ముద్రణము; వాల్యుము ౧; పు, ౩౧౫, వివెల్ )

స్వస్థానమునుండి చలించియుఁ దిరిగి స్వస్థానమును బొందు స్థితి స్థాపకము. ప్రవృత్తిచేఁ గాని, చలనముచేఁ గాని పాంచభౌతిక ద్రవ్యములనుండి జనించునది వేగము. ద్రవ్యసంయోగము దీనికి నిరోధకశక్తియై యున్నది. వృద్ధి క్షీణతలనొందు లక్షణముగల వస్తువులకుఁ జెందిన గుణము స్థితి స్థాపకత్వము.

## ౮—కర్మ

కర్మ యనఁగాఁ జలనము;౧. ఇది జగత్తులో నవినాశమైన లక్షణము, ఇది ద్రవ్యమునుగాదు; గుణమునుగాదు; ఇది యొక స్వతంత్రపదార్థము. గుణములవలెనే చలనము లన్నియు ద్రవ్యములకుఁ జెందినవి. కాని గుణములు ద్రవ్యములు నిత్యలక్షణములై యుండఁగాఁ, జలనము లేక కర్మ అనిత్యలక్షణమై యున్నది ఒక ద్రవ్యముయొక్క గురుత్వము దాని గుణము; ద్రవ్యపతనము కారణాంతరమగు క్షణిక తాటస్థ్యము. అవిచ్ఛిన్న తాలక్షణయుక్తములైన గుణములు గుణములనియుఁ, గానివి కర్మ లనియుఁ జెప్పవచ్చును. ఇది తాత్కాలిక నిత్యలక్షణముల భేదమై యున్నది.౨. ఒకేద్రవ్యమునకుఁ జెంది, గుణరహితమై, సంయోగ విభాగ ప్రత్యక్షసద్యఃకారణమైనదే కర్మయని కణాదుఁడు నిర్వచించినాఁడు.3. కర్మ పంచవిధము. సామాన్య చలనము, ఊర్ధ్వచలనము, అధశ్చలనము, వృద్ధిక్షైణ్యములు,

---

(౧) ఇచటఁ గర్మ యనఁగాఁ జలనమే కాని, మానవప్రవృత్తి కాని, నైతిక వ్యాపారము కాని కాదు.

(౨) పోల్చు; డబ్ల్యు. ఇ. జాన్సన్. లాజిక్. వాల్యుము. ౧; పు.3౭.

(3) వై. సూ. ౧, ౧, ౭.

సూక్ష్మరూపములోఁ గర్మక్షణికము; వేగమనేక చలనప రంపరల సముచ్చయమై సిరవధికగతి గలది. ఏరూపములో నున్నను కర్మ నిత్యతలేనిదే; ఒక సంయోగము వలనఁ గాని, దాని కాధారమగు ద్రవ్యనాశనము వలనఁ గాని కర్మ సాంత మైన దగును. స్థూలతాశూన్యములగుటచే జీవాత్మయు, నాకా శమును, దేశకాలములును కర్మ లేనివి.౧.

## ౯—సామాన్యము.

ద్రవ్యానేకత్వము మన మంగీకరించినప్పుడు వానిసంబంధ ములనుగూడ సంగీకరించవలెను. ద్రవ్యములన్నియు ద్రవ్య త్వమువలననే,సామ్యలక్షణములు గలవైయున్నవి.అవి పృథక్త్వ ముగలవి కావున భేదలక్షణములను గలిగియున్నవి. అనేకవస్తు వులలో నొకేగుణమున్నచో నది సామాన్యమగును; ఇదియే ద్రవ్యాంతర భిన్నత్వమును బ్రకటించుచో విశేషలక్షణ మగును. సామాన్య మొక బుద్ధికల్పితభావమని కణాదు నభి ప్రాయముగాఁ దోఁచును.౨. కాని మనము ప్రశస్తపాదుని యొద్దకు వచ్చునప్పటి కీభావము మారినది. సామాన్యమనగా నేకము, నిత్యమునైన యొక ద్రవ్యవర్గమునకో, గుణమునకో కర్మకో చెందినదని ప్రాకృత జనాభిప్రాయమున కనుకూల మగు యథార్థవాదరూపముగా మారినది. సంయోగమును, ద్విత్వము ననేకద్రవ్యములకు సన్నిహితసంబంధము గలిగి,

(౧) వై॥ సూ॥ ౫, ౨, ౨౧; ౨. ౧, ౨౧. ఆత్మ ప్రవృత్తిరహితమని కణాదుని భావమగునో కాదో సందేహము.

(౨) ౨, ౧, 3; చూ: ౬, ౨,౧౬. భౌతికద్రవ్యములకును, మనస్సు నకు నణువులకు మాత్రమే కర్మగలదని ప్రశస్తపాదుఁడు చెప్పెను.

యనిత్యలక్షణములై యున్నవి. ఆకాశము నిత్యమైనది; కాని
యనేకవస్తువులతో సంబంధము లేనిది. శుద్ధాభావము నిత్యమై
నది; అనేకవస్తువుల లక్షణమును; కాని యనేకవస్తువులతో
సన్నిహితసంబంధ మున్నదికాదు. అట్లే, విశేషము సామా
న్యముకాదు; అయినచో దాని వైశిష్ట్యమేపోయి, సామాన్య
ముతో నభేదముగలదగును. సమవాయము సామాన్యమని
పొరవడరాదు; అయినచో సమవాయములో సమవాయ మర్ధ
రహితముగా నూహింపవలసివచ్చును. భిన్నద్రవ్యము లొకే
జాతికిఁ జెందునని చెప్పు సామాన్యమొక స్వతంత్రమైన పదా
ర్థము. అది నిత్యము, నేకము, ననేకానుగతము నైనది.౧.అది
స్వవర్గ సర్వానుగతము, అభిన్నాత్మకము, అనువృత్తి ప్రత్యయ
కారణము నైనది.౨ ద్రవ్యగుణకర్మలకు సామాన్యలక్షణమున్నది

(౧) ఆకాశమువలె నేకద్రవ్యములకు జాతి లేక సామాన్యము లేదని
యుదయనుఁడు తలఁచినాఁడు;ఏలన నిచట ఘటకలశాదులకువలె భేదము లేదు.
భిన్నవస్తు సాంకర్యము లేదు; అనవస్థాదోషము కాని,రూపహాని కాని, సంబంధ
శూన్యత కాని లేదు. (చూ: సిద్ధాంతముక్తావళి॥ పు ౮.)
అద్వైతము జాతి నంగీకరింపదు; ఘటత్వము ఘటమున కాధారమని
యంగీకరించునుగాని జాతియనున దెద్దియు వేఱుగా లేదని భావించును. (చూ:
వేదాంతపరిభాష॥ ౧ అ.)

(౨) పోల్చు: క్లార్క్ నిర్వచనము: "ఒకే నామముగలిగి, తన జాతి
లోని సర్వద్రవ్యములతో సమానస్వభావము వస్తువుయొక్క నిజస్వరూపము.
ఈ సహజస్వరూప మాజాతి వస్తువుల కన్నిటికిని సామాన్యమై, సమానగుణ
ములచే మనచే దర్శింపఁబడి, ద్రవ్యవిలక్షణమైన బుద్ధి పరికల్పితమగున దగు
చున్నది." (లాజిక్)

కాని, సామాన్యవిశేష సమవాయాభావములకు సామాన్యలక్షణము లేదు. సామాన్య మింకొక సామాన్యమున నుండదు. వృక్షత్వ ఘటత్వములు సామాన్యములు; వీని కింకొక సామాన్యము లేదు; ఉన్న దన్న చో వ్యర్థవాదము సిద్ధించును. సామాన్యము లఘ్వలఘు భేదములుగలది. సత్తా అత్యంతసామాన్యము.౧. ఇందుఁజేరు వస్తుసంఖ్య అత్యధికమైనది. ఇందన్నియు జేరునుగాని యెందు నిది జేరదు. దీనికంటె నధికమైన జాతిలో నిదియొక వర్గముకాదు. సత్తా యొకటే యథార్థమైన సామాన్యము; ద్రవ్యములన్నియు విశేషములు. రెంటిమధ్యమందు ద్రవ్యము మున్నగు సామాన్యవిశేషము లన్నియు నున్నవి. వీనిలోఁ బరిమితసంఖ్యగల ద్రవ్యములే యుండును. ఇవి సామాన్యములు విశేషములుగూడ నగుటచే నిందు సామ్యభిన్నతలు రెండునుగూడ నుండును.౨. పరిమితి, సామాన్య మేవర్గమునకుఁ జెందునో నిర్ణయించును.

---

సామాన్య మనిత్యము, నానేకరూపయుక్తము, పరిమితవ్యాప్తమునని జైనులు తలఁచిరి. అదియొక జాతికిఁజెందిన వస్తువుల సామాన్యలక్షణము.ఏకము నిత్యము నవిచ్ఛిన్నము నగు వాస్తవికజగత్తులో నిజముగానున్న లక్షణమే సామాన్యమని న్యాయవైశేషిక పూర్వమీమాంసాదర్శనము లంగీకరించును. అనేక వస్తువులలోఁ గల సామాన్యలక్షణము; వస్తూత్పత్తి నాశనములతో నుత్పత్తినాశనములు గలదగుటచే ననిత్యము, పరిమితమునని జైనులుభావించిరి

(౧) వై॥ సూ॥ ౧,౨,౪; ౭-౧౦; ౧౭; ప్ర॥పా॥పు॥ ౩౧౧.

(౨) ప్ర॥పా॥పు॥౧౧. చూ॥యుఐ॥ ది వైశేషిక ఫిలాసఫీ.పుట-౧౦౦ పోల్చు. సప్తపదార్థి, పు. ౭. "సామాన్యమ్ పరమపరమ్ పరాపరంచేతి త్రివిధమ్."

అఖండసఖండ జాత్యుపాధి భేదములును జెప్పఁబడినవి. ఒక వస్తువుయొక్క జాతి జన్మసిద్ధము, నిత్యము నైనది; దాని యుపాధి తాత్కాలికము, కారణాంతరములచే లభించినది. ప్రతి సామాన్య లక్షణమును జాతి యనరాదు. కొందరంధు లున్నారు గావున నంధజాతి యొకటున్నదనరాదు. మనుజులను మనుష్యత్వముచే నొక జాతి యనవచ్చును; దేశభాషాదులకుఁ జెందు వర్గము లుపాధులు, మానవజాతి మానవుల నితర పశు. వర్గముల నుండి వేరుచేసి తెలిసికొనును. కాని నల్లని మనుజులకు నల్లని మేకలతోఁ గాని, నల్లని శిలలతోఁ గాని భేదమును జెప్పము.౧. మొదటిది సహజవర్గీకరణము; రెండవది వ్యావహారికము.

ప్రశస్తపాదుఁడు వస్తువులతో నిమిత్తములేని స్వతంత్ర పదవిని సామాన్యమున కిచ్చినాఁడు. అర్వాచీన వైశేషికులు, సామాన్యములకు స్వతంత్రస్థితి యున్నదనియుఁ బ్రళయకాల మందు నవి నశింపకుండు ననియుఁ జెప్పిరి. ప్లేటో కవి తాకాశమున నిర్మించిన సామాన్య హర్మ్యము లిట్టివే.౨. ద్రవ్యసామా

(౧) న్యా॥సూ॥ ౨, ౨, ౭౧.

(౨) ఈక్రిందివ పేర్కొనిన అరిస్టాటల్ వాక్యముల వలన నీసమస్యలోని క్లిష్టతబోధపడఁగలదు. తన మెటాఫిజిక్సులో అరిస్టాటిల్లు చెప్పెను: "సోక్రటీసు రెండు విషయములను జెప్పెను. సామాన్యవిశేష సంబంధవాదము సామాన్య నిర్వచనము. సోక్రిటీసు వీనికి స్వతంత్రస్థితి యున్నదని చెప్ప లేదు; కాని యాతని యనుచరులు వీనికి స్వతంత్రస్థితి నొసఁగి,వీని నే'భావము' లనిరి. సోక్రటీసుతో నేకీభవించి, అరిస్టాటల్ ప్లేటో అనుచరుల భావములను ఖండించినాఁడు.

న్యములకవినాభావసంబంధ మున్నదని కణాదుఁడు విజ్ఞానము నకుఁ బ్రాముఖ్యమిచ్చి యుండఁగా, వస్తుసంబంధము లేని స్వతంత్ర సామాన్యము లున్నవని ప్రశస్తపాదుఁడు వాదించినాఁడు. అందుచే సృష్ట్యారంభవేళ సామాన్యములు వస్తువులలోఁ బ్రవేశించి, తాత్కాలిక రూపముల గోచరించునని యాతఁడు చెప్ప వలసి వచ్చినది. 3. ఇందలి ముఖ్యవిషయము సామాన్య విశేష సంబంధము; వస్తుమూలకారణ కార్యసంబంధము.

సామాన్య భావమొకనామమే కాని యందేయర్థము లేదను బౌద్ధవాదమును వైశేషికమంగీకరింపదు. బౌద్ధుల ననుసరించి, సామాన్యలక్షణము నామములకుఁజెందినదిమాత్రమే, ౪ కాని యథార్థస్థితి దానికి లేదు. భిన్నవ్యక్తులకు సమానమైన సామాన్యలక్షణమేదియును లేదు. ఒకగోవునకు విశిష్టవ్యక్తిత్వ మునకొకసామాన్య లక్షణమువలయుచో, దానికింకొకటియుఁ గావలసివ్యర్థవాదములోనికిఁబోవును. సామాన్యమనునది లేదు. పూర్వానుభవమునుబట్టి సామాన్యభావమును మనముకల్పించు కొని, బాహ్యవస్తువులకు దానినంటఁగట్టఁజూతుము.౧ శ్రీధరుఁ

(3) దీనిని డన్సుస్కోటస్ భావముతోఁ బోల్చఁడు; సామాన్యము బుద్ధి పరికల్పితమే కాదు; అది బుద్ధివ్యాపారముతో నిమిత్తము లేకుండఁ దత్పూర్వమే యున్నది.

(౪) హోబ్సు హాబిస్: "సామాన్య మనునదేదియును లేదు; నామములే యున్నవి (హ్యూమన్ నేచర్, ౧౮౪ పు. ౬.)

(౧) చూ. సామాన్య దూషణదిక్ప్రసారితా; బౌద్ధన్యాయపరివచన మట్కము, బౌద్ధుల సామాన్య విశేషసమత్వమును జయంతుఁడు ఖండించెను. (న్యాయమంజరి, పు 3౧౧; ౧౯౯-౨౦౦)

డీభావమునీవిధముగాఖండించినాఁడు. "అనేకగోవులకుసామాన్యమైన యొకలక్షణమును మనముదర్శించి, అశ్వగజాదులనుండి గోజాతిని వేరుగాఁ దెలియుచున్నాము.పలు తెఱఁగులగుగోవులకు సామాన్యగోత్వలక్షణమే లేకున్న చో, గోవునకునశ్వమునకు నెట్టి భేదమున్న దో, గోవునకుగోవునకునట్టి భేదమేయుండవలెను; అనఁగా రెండుగోవులనెట్లుచూతుమో, ఒకగోవును నొకయశ్వము నట్లేచూడవలెను, కానినిజముగా మనముగోవులన్నిటికిసామాన్యలక్షణమున్నదని గ్రహించుచున్నాము. ఈలక్షణ మశ్వాదులలోలేదు "౨. నామములీసామాన్యలక్షణములను జెప్పుటకుపయోగించును. ౩. కావున సామాన్య మొకనామమాత్రముకాదని శ్రీధరునివాదమైయున్నది. సామాన్యవిశేషములు బుద్ధ్యపేక్షములని ౧. కణాదుఁడు భావించెను; ఈ బుద్ధికల్పనములచే మనము దృశ్యజాలమును వర్గములుగావిభజింతుము. ద్రవ్యగుణకర్మలకు వేరై సత్తాయనునదున్నదను నాతనిభావము దీనికి విరోధముగాదు. అనేకవస్తువులలోనున్న యొకగుణము సామాన్యమనియు, నద్దానిచే నితరజాతి వస్తువులకు భేదమును జెప్పు

(౨) న్యాయకందళి, పు. ౩౧౭.

(౩) ప్రభాచంద్రుఁడు తన ప్రమేయకమల మార్తాండమునందు (పు. ౧౩౬-౧౩౭) బౌద్ధవాదమును ఖండించినాఁడు. సామాన్యము విశేషము వలెనే దృశ్యవస్తువు; అది కేవలమూహాజన్యము కాదు, రెంటికి భేదము మన మనుభవములోఁ దెలియుచున్నాము. ఒకేకాలము నందొకే వస్తువులో సామాన్య విశేషములను మనము చూచుటవలన మనము వానిని వివేకించుటలోఁ బొరపడరాదు.

(౧) ౧, ౨, ౩.

నపుడు విశేషమనియు నాతఁడువక్కాణించినాఁడు. అనేకఘట ములకుఁజెందిన ఘటత్వముసామాన్యము, ఘటములనితర వస్తు వులనుండి వేరుచేయునపుడదియే విశేషమగును.౨. గుణములను సామాన్య విశేషములనుగా విభాగించుట బుద్ధివ్యాపారము. అనగా ద్రవ్యగుణకర్మలకుఁగల స్థితితో సమానమగుస్థితిసామాన్య విశేషాది సంబంధములకులేదని భావము.౩. కాని యవి భావా త్మకములే కాని యభావములు కావు. కణాదుని మనము విజ్ఞాన వాదిగాఁ జెప్పరాదేలన, సామాన్యము వాస్తవికలక్షణమని యాతఁడంగీకరించినాఁడు. సామాన్యములన్నియు మానసికములని చెప్పునది విజ్ఞానవాదము. సామాన్యమునుసూచించు గుణములు పృథగ్వస్తువులవంటి వాస్తవికలక్షణములే; మన బుద్ధి భిన్నవస్తు గుణసామ్యములను వివేకించి, సర్వవస్తుసామాన్యభావమునునిర్ణ యించును. మనబుద్ధివ్యాపారముతో నిమిత్తము లేకుండ వస్తువు లెట్లున్నవో వివిధవస్తు సామాన్య లక్షణములునట్లే యున్నవని కణాదుఁడు గుర్తించియేయున్నాఁడు. శ్వానములన్నియు సమాన గుణములను గలిగియుండి గోచరించుచున్నవే కాని వానిని మనము కల్పించుటలేదు. వ్యక్తులు వచ్చుచుఁ బోవుచుండును గాని వాని సామాన్య జాతిలక్షణము నిత్యము నేకమునై యుండును. మనుజులు పుట్టి పోవుచుందురు గాని మానవత్వము

(౨) పోల్చు. డన్సు స్కోటస్ భావము: వస్తువులకు స్వస్వరూపము గలదనియు, సామాన్య విశేషభావములకుఁ బాహ్యమే యని యున్నదని యాతఁడు చెప్పినాఁడు.

(3) ౧, ౨, ౩.

నిత్యమైనదే. వ్యక్తులకంటె సామాన్యము లెక్కువ నిత్యతగలవి. దీని ననుసరించి ప్లేటో సిద్ధాంతమును యుక్తమైనదే. ఈభావమునకుఁ బ్రశస్తపాదుఁ డెక్కువ ప్రాముఖ్యమునిచ్చెను. సామాన్యవిశేష సంబంధము సమవాయమగుటచే నిజమైనదే.౧.

## ౧౦—విశేషము.

వస్తువు లన్యోన్య మెట్లు భిన్నములో విశేషమువలన మనము తెలిసికొందము.౧. విశేషము భిన్నత కాధారము. పృథక్త్వమేకము విశిష్టమునైనది. సామాన్యమెట్లు విజ్ఞానముపై నాధారపడియున్నదో యట్లే విశేషము నాధారపడియున్నదని

(౧) ఈభావమును కుమారిలుఁడు ఖండించినాఁడు: మన మొకగోవును జూచినపుడు 'ఇదియొక గోవ'నియే దర్శింతుముకాని, 'గోజాతి లక్షణమైన గోత్వమున్నది కావున నిది గోవ'ని, భావింపము, కావున సామాన్యము విశేషమునుండి వేరుగాలేదు. రెంటికి నభేదమే యున్నది. వేరుచేయ వీలులేకుండుటంగా, పృథగ్గతిమత్త్వము కాని, పృథగాశ్రియాశ్రియిత్వము కాని యగును. రెంటిలో నేదైనను, మొత్తము ద్రవ్యమునకుఁగాని, దాని భాగములకుఁగాని సంబంధముండఁజాలదు. ద్రవ్యచలనము లేకుండ భాగములు చలింపవచ్చును. ద్రవ్యమునకు, భాగములకు నాధారములువేరు, ద్రవ్యమునకు భాగములును భాగములకు వాని మూలములైన యణువులు నాధారములు. అందుచేఁ బార్థసారధి మిశ్రుఁడిట్లు సమవాయమును నిర్వచించినాఁడు; "యేన సంబంధేన ఆధేయమాధారే స్వానురూపమ్ బుద్ధింజనయతి సంబంధస్సమవాయ ఇతి." (శాస్త్రదీపిక.) సామాన్యము విశేషములోఁ జూడఁబడినది కావున రెంటికిని భేదములేదు. సామాన్యమునకు విశేషముతో నెట్టి సంబంధమును లేకున్నచో 'ఇదియొక గోవ' నిమన మెన్నఁడును జెప్పఁజాలము సామాన్య విశేషసంబంధముభిన్నత్వములో నేకత్వమని కుమారిలుఁడును, పార్థసారధి మిశ్రుఁడును భావించిరి.

(౧) ప్ర॥ పా॥ పు ౧౩.

కణాదుఁడు చెప్పినాఁడు.౨. నిత్యవస్తువులందుండి, పరస్పర భేదములను దెలుపునది విశేషమని ప్రశస్తపాదుఁడు తెలిపినాఁడు. వ్యవహారములో వస్తుభేదములు వానియందలి భాగములవలనఁ దెలియును. మనము విషయవిభాగము చేయునపు డిట్టిభాగములులేని నిరవయవ ద్రవ్యములు మనకు లభించినపుడు, ప్రతి నిరవయవ ద్రవ్యము నితరద్రవ్యములనుండి వేరని తెల్పు విశిష్టగుణమును గలిగియున్నదని మన మూహింపవలెను. అణువులకును, దేశకాలాకాశములకును, జీవులకును, విశేషలక్షణములుగలవు; ఇవి జాతిగుణములుగాక, వ్యక్తులగుణములే యైయున్నవి. ఈవిశిష్ట విశేషములే మనకుఁ దెలియఁగల లక్షణములు. వీనికిమించి మన కేమియుఁ దెలియుట కవకాశములేదు. పరమాణువులసంఖ్య అనంతమైనట్లే, విశేషముల సంఖ్యయు ననంతమే.3. నిరవయవ వస్తువుల పరమవిశేషములను యోగులు దర్శింతురని ప్రశస్తపాదుఁడు తెలిపినాఁడు.౪.

విశేషములున్నవని యూహించుటకెట్టి యవకాశములును లేవని నవీననైయాయికులు తలఁచుచున్నారు. విడిగానున్న యణువులభేదములను దెలియుటకీవిశేషము లవసరములన్నచో, నీవిశేషముల పరస్పరభేదమును దెలియుటెట్లు? ఈవిశేషములలో స్వతస్సిద్ధమైన, స్వగతమైనశక్తి గలదనియుఁ దన్మూలమున

(౨) ౧, ౨-3.

(3) విశేషాస్తుయావన్నిత్య ద్రవ్యవృత్తిత్వాదనంతా ఏవ॥ (సప్తపదార్థి పు ౧౨.) లైబ్నిజ్ సిద్ధాంతముతోఁ బోల్చు.

(౪) ప్ర॥ పా॥ పు 3౨౧; చూ: తర్క-సంగ్రహము: పుటలు ౭, ౭౫.

వాని భేదములు తెలియుననియుఁ జెప్పవలనుపడదు. కాని యట్లు చెప్పవీలగుచో, నీశక్తి యణువులలోనే యున్నదనిచెప్పినచో నీ విశేషములనూహింపనవసరమేయుండదు. కుమారిల ప్రభాకరానుచరులును, వేదాంతవాదులును, విశేష సిద్ధాంతమునంగీకరింపరు. వస్తువులుసహజముగా భిన్నములైనచో వానికి సామాన్య లక్షణమునుగనుగొనుటదుర్లభము.

## ౧౧—సమవాయము.

కారణకార్యసంబంధమే సమవాయమని కణాదునభిప్రాయము. ౧. అవినాభావైక్యముగలిగి, అన్యోన్యాధారభూత సంబంధముచేనది దానియందున్నదనుభావమునకు మూలమైనదే సమవాయమని ప్రశస్తపాదునినిర్వచనము. ౨. ధర్మము,సుఖము జీవునిలోనే యున్నను; నివి పరస్పరాధారభూతములు కావు కావున సమవాయ సంబంధమును గలిగియున్నవికావు. పదపదార్థసంబంధమును సమవాయము కాదేలన నిదియు నన్యోన్యాధార భూతసంబంధము కాదు. ఒక ఫలము భూమిపై నుండ వచ్చును గాని, భూమియు ఫలము నవినాభావసంబంధము గలవి కావు కావున వానికిని సమవాయ సంబంధము లేదు. అయుతసిద్ధి (అవినాభావ సంబంధము) సమానత్వము కాదు; ఏలన రెండు నొకటి నిజముగాఁ గావు. అగ్నిరూపము, నయఃపిండము వేరు

(౧) ౭, ౨, ౨౬.

(౨) అయుతసిద్ధానామ్ ఆధార్యాధారభూతానామ్ యస్సంబంధ ఇహాప్రత్యయ హేతుస్సమవాయః, (ప్ర॥ ప॥ పు॥౧౪.) చూ॥ పు॥ ౩౨౪; వై॥సూ॥ ౭,౨,౨౬–౨౮; ౫,౨,౨౩.

వస్తువులు. కణాదుఁడు కారణసంబంధములను సమవాయములోఁ జేర్చినాఁడు; ప్రశస్తపాదుఁడు కారణేతరములను గూడ నందుఁ జేర్చెను. ఒక ద్రవ్యమును దాని గుణములను పూర్ణాంశము లను, చలనమును, చలించు వస్తువును, జాతిని, వర్గమును, కారణ కార్యములను బంధించు సంబంధమే సమవాయము. ఇందుఁ గలిసి బద్ధములైన విషయము లేకత్వము గలిగిన పూర్ణ రూపములు.

వస్తుగుణమైన సంయోగము తాత్కాలికము. సమ వాయ మమోఘసంబంధము. పూర్వము విడిగానున్న వస్తువు లకు సంయోగము వీలగును; సమవాయ సంబంధముగల వస్తువు లెప్పుడును విడిగానుండవు. విభాగము వలన సంయుక్త వస్తు వులు విడిపోవును; సమవాయ సంబంధము నిత్యమైనది. సమ వాయసంబంధము రెంటిలో నొకదాని కర్మచే వచ్చునదికాదు. రెండు వేరుగా నున్న వస్తువులకు సంయోగము కలుగును; సమ వాయసంబంధము గల వస్తువు లన్యోన్యాశ్రయముగలవి.(౧) సమవాయసంబంధము గల వస్తువులు, నశించుటవలనఁ గాక మఱెన్నఁడును విడిపోవు. సమాన స్వభావముగల వస్తువులు విడిగానుండి, తాత్కాలికముగా సంయోగముపొందును. ఇది బాహ్యసంబంధము; సమవాయ మభ్యంతర సంబంధము.(౨) సంయోగమునందు రెండు భిన్నవస్తువులు కలిసినను నేకపూర్ణత నందఁజాలదు. సమవాయమైక్యము నొసఁగును.

---

(౧) ప్ర॥ పా॥ పు॥ ౩౨౬.

(౨) పోల్చు. జాన్సన్.

ఉత్పత్తిగల దాని కనవస్థాదోషమున్నది కావున సమవాయము నిత్యమైనదని చెప్పఁబడెను. దానికి సంబంధించిన వస్తువుతోఁగాని, పూర్వమందుఁగాని, పరమందుఁగాని సమవాయము గోచరించదని శ్రీధరుఁడు చెప్పినాఁడు. వస్త్రము యొక్క సమవాయము వస్త్రమునకుఁ బూర్వమే యున్నచో సమవాయము పొందిన వస్తుద్వయములో నొకటి లోపించిన కాలమున నీసమవాయ మెట్లుండెనో చెప్పుట కసాధ్యమగును. అది వస్త్రముతో నుదయించినచో సమవాయ సంబంధమున కాధారలక్షణమును వస్త్రము గోల్పోవును. వస్త్రముత్పత్తియైన వెనుక నది వచ్చినచో, వస్త్రము దాని కాధారము కాఁజాలదు. కార్యము సమవాయమున కాధారమును గాఁజాలదు. వస్తూత్పత్తి నాశములతోఁగాక, సమవాయమున కుత్పత్తి నాశనములులేవు. ఈరీతి దీని నిత్యత గౌణము, సమవాయసంబంధము దృశ్యముకాదు; వస్తువులకుఁగల యవినాభావ సంబంధము వలన ననుమానించి తెలిసికొన వీలైనదే.౧.

మొదటిద్రవ్యపంచకమునకు సమవాయిత్వము ననేకత్వము లక్షణములైయున్నవి; కాని సమవాయమేకము నద్వితీయమును.౨. సమవాయము సమవాయసంబంధముచే దేనియందు నుండదు;అట్లున్నచో ననవస్థాదోషము పట్టును.సత్తానుగూర్చిన మన వివిధభావములకు భేదములేనట్లే, సమవాయమునుగూర్చిన మన వివిధభావములకు భేదములేదు.సంబంధించువస్తువులకు భేదమున్నను,సంబంధమొకే రూపమైనది.3.

(౧) ప్రాచీననైయాయికు లిది ప్రత్యక్షవిషయమని తలఁచిరి.
(౨) తర్కసంగ్రహము. పు ౮. (3) ప్ర॥ పా॥ పు 3౨౬.

వాస్తవికత్వ మాపాదింపఁబడినను, సహేతుకముగాఁ జెప్పుచో సమవాయభావము బుద్ధివ్యాపారమే. అది భావ మందుదయించిన దే:(ద్రవ్యేతరాస్తిత్వము దానికి లేదు. సమవాయ సిద్ధాంతమును శంకరుఁడు ఖండించినాఁడు. సమవాయము వలెనే, ఆకాశమునకు నణువులకును మధ్యమందున్న సంయోగ మును నిత్యమైనదే. సమవాయ మెంతవఱకు సంబంధమో, యంత వరకు సంబంధవస్తువులతో సమానమైనది కాదు. సమవాయము సంబంధ విషయములకు బాహ్యమైనది; దాని కాసంబంధ విషయములతో సంబంధమునకు వేఱొకసంబంధము కావలసి యుండుటచే దానికింకొకటియు నిట్లనంతముగాఁ బోయినచో ననవస్థాదోషము సంభవించును. సమవాయి ద్రవ్యములకు సమవాయమునకు మనము సంబంధము నెట్లుప్పు డూహింపవలసి యుండును. సమవాయి ద్రవ్యములలో సమవాయ ముండుట కింకొక సమవాయ మవసరముకానిచో, సమవాయి సమవాయ ములు సమానము లగునుగావున, సంయుక్తవస్తువులతో సంయోగము సమానమనియు మనము చెప్పనగును. ౧. సమ వాయి విషయములతో సమవాయమునకు సంబంధముకలుగు టకు మూఁడవదొకటి యవసరము లేదని వాదించుట నిరర్థకము;

(౧) కుమారిలుఁడిట్లు చెప్పినాఁడు: సమవాయముచే నొకజాతికిఁ జెందినవస్తువునుండియు, నాజాతినుండియు సమవాయము వేరైనచో నప్పుడు సమవాయము వానిలో నొకసంబంధముగా నుండఁజాలదు, లేక దానితోఁ దాదాత్మ్యముగలదైనచో జాతియు దానికిఁజెందినవస్తువు నొకటేయగును. ఒకవస్తువుతో సమానత్వముగలవస్తువులు సమానములేయగునను సూత్రమిచట నరించుఁ.

సంయుక్తములైయున్న వస్తువుల సంయోగమునకు సమవాయ మవసరమై యున్నది. ఇందొకటి ద్రవ్యమును రెండవది గుణము ననుటవలన నీ సమస్య పరిష్కృతము కాదు. అణుద్వితయము నకు నణువులకుఁగాని, ఒకవర్గమునకు నందలివ్యక్తులకుఁగాని, యొకబల్లకును దానిపైనున్న వస్త్రమునకుఁగల సంబంధము వంటిదే గలదనుటకు సందేహము లేదు. కాని రెంటివిషయములో నున్న క్లిష్టతయు నొక్కటే; వానిసంబంధ మెంతసన్నిహిత మైనను సమానము కాదు. కారణకార్యముల కిట్టి సంబంధ ముండవలెనను వాదము యుక్తము కాదు. వైశేషికు లంగీక రించునట్లు, కారణకార్యముల కవినాభావసంబంధమున్న యెడల రెంటికి మూలస్వరూప మేకమని యూహించుట సులభతర మార్గము. న్యాయవైశేషిక కారణధర్మమునను సరించి కార్యా త్పూర్వము కారణముండుట ముఖ్యమైనలక్షణము. ౧. అవినా భావసంబంధము దీనికి వ్యతిరేకమైనది. కారణము విడిగానుండు శక్తిగలది. విడిగానుండఁజాలని కార్యమునకుఁ గారణసంబంధమే సమవాయమైనచో, సంబంధమునకు వస్తుద్వయమవసరము గావున, గార్యములేనంతకాలము కారణముతో సంబంధ ముండఁజాలదు; అందుచే రెంటికిని సమవాయ సంబంధముండఁ జాలదు. కార్యముదయించిన వెనుకనే, యీ సమవాయసంబంధ మునఁ బ్రవేశించుననుటయు నిరర్థకమగును; కారణసంబంధ మునకుఁ బూర్వమే కార్యముండఁగలదని వైశేషికు లంగీకరించు నెడల, నది విడిగానుండఁగలదనియే చెప్పవచ్చును. కార్య

(౧) శంకరభాష్యము ౨, ౨, పు ౧౩-౧౭.

కారణముల మధ్యమందు, సంయోగవిభాగములు తటస్థించవను నియమమునకును భంగమువాటిల్లును. కారణముతో సంబంధముకలుగుటకుఁ బూర్వమే కార్యముండఁగలిగినచో నీ వెనుక రెంటికినిగల సంబంధము సంయోగమగునుగాని సమవాయము కాదు. ఉత్పత్తిగల ప్రతివస్తువున కాకాశాదులతోడి సంబంధము సంయోగమెట్లగునో, యట్లే కారణ కార్యసంబంధము సంయోగముకాని సమవాయముకాదు.

## ౧౨. అభావము

కణాదుఁ డభావము నొక స్వతంత్రపదార్థముగా నంగీకరించియుండలేదు. ఆతనిదృష్టిలో శుద్ధాభావ మర్థములేనిది; మిగిలిన యభావరూపము లన్నియు భావసంబంధముగలవే.౧. ప్రాగభావ మనఁగాఁ గార్యాత్పూర్వ కారణస్థితి; ప్రధ్వంసాభావ మనగా ననంతరకారణ స్థితిలేక కార్యము దానినిఁ గల్పించిన యంశములుగా విడిపోవునప్పటిస్థితి; అన్యోన్యాభావములేక విశిష్టరూపములుగల వస్తువుల సంబంధము. లోకములోని వస్తువుల వ్యావహారిక వర్గీకరణమున కొక స్వతంత్రమైన అభావద్రవ్యకల్పన మవసరములేదుకాని, జగత్తు నర్థముచేసికొను తార్కికపద్ధతి కభావము నూహించు టవసరమైయున్నది. వైశేషికదర్శనము తాను నిర్ణయింపఁదలఁచిన విషయమును విశాల మొనర్చి, సర్వానుభవమునకు సమగ్రమైన యర్థమును జెప్పఁదలఁచినపుడీ యభావపదార్థభావమును గల్పించెను. సకల తత్త్వములందును సంబంధములకుఁ బ్రముఖస్థానమున్నది.

(౧) ౯, ౧, ౧.

సంబంధమువలన మన మొక ద్రవ్యమునుండి యింకొక ద్రవ్యమును దెలిసికొందుము; ఇట్లు ద్రవ్యమునుండి ద్రవ్యాంతరమునకుఁ బోవుటభావముకాదు. అన్యత్వ మభావమున కాధారము; స్వవిరోధ మనునది నీచాభావము. స్వవిరోధసూత్రము నతిక్రమింపని ప్రతిసంబంధము నొకవిధమగు నభావమే. ఒకవస్తువు, తత్సంబంధములును సన్నిహితసంపర్కము గలవి. మన మొక వస్తువునుగూర్చి పలుకునపుడు దాని యస్తిత్వమును మన మగ్గడించుచున్నాము. మన మొక సంబంధమునుగూర్చి పలుకునపుడు దాని యభావము నగ్గడింతుము. విరోధములేని స్థితిగలదే యొకవస్తువు; విరోధములేని వ్యతిరేక భావమే యొకసంబంధము.

అభావ మొక తార్కికపదార్థమే యైనను, భావముతో సమానాస్తిత్వము దానికి నున్నదను విశ్వాసము కొన్ని వేళలఁ బ్రదర్శింపఁబడినది.౧. ఈవిధముగా వ్యతిరేకభావము నభావము సాంకర్యముఁ బొందినవి. పదార్థ షట్కాన్యోన్యాభావము నుండియే యభావత్వ ముదయించెనని విశ్వనాథుఁడు తెల్పి యున్నాఁడు.౨ సర్వసంబంధములకును వ్యతిరేకభావము నూహింపవచ్చును; శ్రీధరుఁడు భావించినట్లు సమానత్వమునకు నస్తిత్వమున కేకాదు. వేదాంత మీమాంసావాదుల భావ మొక పదార్థమనియే యంగీకరింపరు. అది కేవల మొక సూక్ష్మాధా

---

(౧) న్యా॥ భా; న్యా॥ వా॥ ౨, ౨, ౧౨. చూ: న్యాయకందళి॥ పుటలు ౨౨౮-౩౦.

(౨) అభావత్వమ్ ద్రవ్యాది షట్కాన్యోన్యాభావత్వమ్॥ (సిద్ధాంత ముక్తావళి॥ పు ౧౨.)

రముకంటె వేఱైద్దియుఁగాదని వాఁడభిప్రాయపడెను.౩. అభావ మొక విశిష్టపదార్థమైనచో ననవస్థాప్రాప్తి తప్పదు; ఏలన ఘటాభావము వేఱు, ఘటము వేఱు; ఘటాభావాభావమును ఘటమును వేఱగును. ఈక్లిష్టతను దొలఁగించుటకై ప్రాచీన నైయాయికులు ఘటాభావాభావమనగా ఘటాస్తిత్వమే యని చెప్పిరి. వ్యతిరేకభావమునకు వ్యతిరేకభావము భావమే కాని యీ యర్థము నందర రంగీకరించియుండలేదు. ఒక యభావ మెన్నఁడును భావముతో సమానము కాఁజాలదని నవీననైయాయికులు తలఁచిరి. ప్రథమాభావము యొక్క అభావాభావము మాత్రము ప్రథమాభావముతో సమానమేయని యంగీకరించిరి.౧.

వాత్స్యాయనుఁడు ప్రాగభావ ప్రధ్వంసాభావములనే యంగీకరించెను. మొదటి దాని ననుసరించి పుత్రుఁడు జన్మించు వరకుఁ బుత్రుఁడు లేనివాఁడే. రెండవదాని ననుసరించి,౨.ఘటము భిన్నమైనపుడు ఘటము లేనిదే. అభావమును వాచస్పతి (౧) తాదాత్మ్యాభావమనియు (౨) సంసర్గాభావమనియు విభాగించినాఁడు.౩. రెండవ దానిని మరలఁ బూర్వాపరాత్యంతాభావములుగా విభజించెను. అత్యంతాభావమే సమవాయాభావమనియుఁ బేర్కొనఁబడెను. వంధ్యాపుత్రుఁడు, శశవిషాణ

(౩) అధికరణకైవల్యమంత్రమ్.
(౧) తర్క సంగ్రహదీపికా, పు. ౮౦.
(౨) న్యా. భా. ౨, ౨, ౧౨.
(౩) న్యా. వా. తా. టీక. ౨, ౨, ౯.

ములు మున్నగు స్వవిరుద్ధభావము లత్యంతా భావములు. అత్యంతాభావములో నొక భావస్థిరీకరణమును దత్సంబంధా భావమును బ్రకటింపఁబడును. అన్యోన్యాభావము నందేవస్తువుల మధ్యమందు తాదాత్మ్యసంబంధము లేదని చెప్పబడెనో యావస్తువులు యథార్థములు కానక్కరలేదు. అన్యోన్యాభావమునందు మనము రెండు వస్తువులైన ఘటవస్త్రములకుఁ దాదాత్మ్యము లేదని ప్రకటింతుము; అత్యంతాభావమునందుఁ దాదాత్మ్యము కాక, సంబంధమే లేదని వక్కాణింతుము. అన్యోన్యాభావనిర్ణయమునందు "ఒకఘటము వస్త్రము కాద"ను వాక్యమునకు వ్యతిరేక భావము "ఘట మొక పటమే"యనుటే. వాయువునకు రంగులేదను నత్యంతా భావనిర్ణయమునకు వ్యతిరేక నిర్ణయమునందు వాయు వర్ణములకు సంయోగము చేసి వాయువునకు రంగు గలదని" చెప్పవలెను. అన్యోన్యాభావమునకు వ్యతిరేకము తాదాత్మ్యము; అత్యంతాభావమునకు వ్యతిరేకము సంబంధము. పటనాశముతో నదియు నాశనమగును గావున, నన్యోన్యాభావము నిత్యము గాదని శివాదిత్యు నభిప్రాయము.౧. శ్రీధరుఁ డభావచతుష్టయము నంగీకరించెను; పూర్వాపరాన్యోన్యాత్యంతా భావములు.౨. విశ్వనాథుఁ డిట్టి పద్ధతినే యనుసరించెను.3. ఘటము భూమిపై నున్నపుడు దాని యస్తిత్వము దర్శింపఁబడెను; దాని నచటనుండి తొలఁగించి నపుడు

(౧) సప్తపదార్థి, పు. ౧౮౯.

(౨) న్యాయకందళి, పు. ౨3౦. మతియుఁ జూడు, సమంతభద్రుని ఆత్మ మీమాంస; తర్కసంగ్రహము, పు. ౮౦.

(3) సిద్ధాంత ముక్తావళి, పుటలు ౧౨-౧3.

దాని యభావము గుర్తింపఁబడెను. ఘటాభావము నిత్యమై యున్నది; ఘటమున్నప్పు డది యాచ్ఛాదనమొంది యున్నదని విశ్వనాథుని వాదము. సర్వవస్తువుల కత్యంతాభావ మెల్లప్పుడు సర్వత్రి గలదు; ఆయాదేశము లందాయాకాలము లందుండు వస్తువులచే నది తాత్కాలికముగా మఱుఁగువడి యుండును. ఈవిధముఁగా సర్వాభావము కొన్నివేళల పరిమితము, గొన్నివేళ లనపరిమితముఁనై యున్నది. అపరిమితమైన దత్యంతాభావము. పరిమితాభావమునకు నిశ్చితమగు నారంభమో, అంతమో గలదు. ప్రాగభావమున కాది లేదు కాని యంతముఁ గలదు. ప్రధ్వంసాభావమున కాది యున్నది కాని యంతము లేదు. నవీన నైయాయికు లత్యంత నైపుణ్యమును జూపు భిన్నాభావరూపముఁ లను గల్పించి యున్నారు.౮.

అభావరూపములన్నియు వైశేషిక తత్త్వదృష్టిపై నాధారపడి యున్నవని తెలియుచున్నది. వస్తువులన్నియు శుద్ధభావాత్మకములై పరిణామశూన్యము లైనచో నన్నియు నిత్యములు కావలెను. ప్రాగభావము లేదన్నచో సర్వవస్తువులును వాని ప్రవృత్తులు నారంభము లేనివై యుండవలెను; ప్రధ్వంసాభావము లేదన్నచో, వస్తువులు వానిప్రవృత్తులు నవిచ్ఛిన్నములుఁ గావలెను. అన్యోన్యాభావము లేదన్నచో వస్తుభేదమే తెలియదు; అత్యంతాభావము లేదన్నచో, సర్వవస్తువులకు సర్వకాల సర్వదేశాస్తిత్వము చెప్పవలెను.

---

(౮) చూడు, భీమాచార్యుని న్యాయకోశమునందు అత్యంతాభావము అన్యోన్యాభావము, అభావము.

## ౧౩-ధర్మశాస్త్రము.

బుద్ధిపూర్వకములు, కానివి కర్మలు రెండువిధములనియు, బుద్ధిపూర్వక కర్మలకే ధర్మనూత్రము వర్తించుననియు వైశేషికులు నిశ్చయించిరి.౧. జీవనపూర్వక క్రియలు బుద్ధిపూర్వకములుగావు. ఇచ్ఛాద్వేషపూర్వకములు బుద్ధిపూర్వకములు. జీవనపూర్వకకర్మలు దేహపోషకములు; బుద్ధిపూర్వకములు హితప్రాప్తిహేతువులు.౨. సుఖములేక చిత్తానుగుణత్వము సుఖోపాదకవస్తువులం దపేక్ష కలిగించును. క్లేశరూపమగు దుఃఖము, తదుత్పత్తిహేతువగు వస్తువిద్వేష ముదయింపఁ జేయును. ఇచ్ఛాద్వేషములు సుఖదుఃఖహేతువులగు వస్తువుల యెడ మనకుఁగలుగు సంకల్పవ్యాపారములు.౩. వీనివలన నిష్టవస్తుప్రాప్తికి ననిష్టవస్తు నిరోధమునకుఁ బ్రవృత్తికలుగును. వైశేషికము ననుసరించి, ధర్మ మభ్యుదయ నిశ్శ్రేయసప్రాప్తివిధానములను బ్రకటించును. అభ్యుదయము సత్కర్మనిష్ఠవలనను, రెండవది తత్త్వజ్ఞానమువలనను సిద్ధించును.౪. ప్రశస్తపాదు ననుసరించి, జ్ఞానులసుఖమే ఉత్తమసుఖము. "ఇచ్ఛాభావస్మృతి వస్తువులతో నిమిత్తములేకుండ, వానినిఁగూర్చిన జ్ఞానముండి, చిత్తశాంతి,తుష్టియుఁ గలిగి, వాని విలక్షణధర్మములచే లభించునదియే యుత్తమసుఖము."౫. సర్వజనులకును వర్తించు

(౧) ౫, ౧, ౧౧.
(౨) ప్ర॥ పా॥ పు ౨౬౩.
(౩) ప్ర॥ పా॥ పు ౨౫౯.
(౪) ౧, ౧, ౧-౨, ౪.
(౫) ప్ర॥ పా॥ పు ౨౫౯.

ధర్మములివి. (౧) శ్రద్ధ (౨) అహింస లేక యేప్రాణికెన్నఁడు హానిచేయకుండు ప్రతిజ్ఞ.౧. (౩) భూతహితత్వము (౪)సత్య నము (౫) అస్తేయము (౬) బ్రహ్మచర్యము (౭) అనుపధా భావశుద్ధి (౮) క్రోధవర్జనము (౯) అభిషేచనమువలని కాయ శుద్ధి (౧౦) శుచిద్రవ్యసేవనము (౧౧) విశిష్టదేవతాభక్తి (౧౨) ఉపవాసము (౧౩)అప్రమాదము. వర్ణాశ్రమచతుష్టయ ధర్మములు యథోక్తములుగాఁ జెప్పఁబడెను.౨ గార్హస్థ్య మన సరము లేకుండగనే సన్న్యాసాశ్రమమును స్వీకరింపవచ్చునని శ్రీధరుఁడు చెప్పినాఁడు.౩. సన్న్యాసియనఁగాఁ బ్రపంచమును విసర్జించు నాతఁడు కాక, విశ్రేయమునకై ప్రతిజ్ఞచేయు వాఁడే.౪. నిష్కామచిత్తముతో, వస్తుఫలాసక్తివిడిచి, కర్మలు చేసినవాని ధర్మసిద్ధి యగునని ప్రశస్తపాదుఁడు తుదివాక్య ముగాఁ బలికినాఁడు.౫. ఆత్మాభివృద్ధికి మనోనిగ్రహము ప్రధా నమైనది. "చిత్తనిగ్రహము లేనివానికిఁ బరిశుద్ధాహారమును భుజించుటవలన నభ్యుదయప్రాప్తిలేద" ని చెప్పఁబడెను.౬ చిత్త నిరోధమునకు యోగాభ్యాస మంగీకరింపఁబడెను.౭. బాహ్య కర్మనిష్ఠకాకుండ నాంతరంగికమైన యోగ్యతయే ముఖ్యమైనది.

(౧) భూతానామ నభిద్రోహసంకల్పః (న్యాయకందళి. పు ౨౭౫.)
(౨) ప్ర॥ ప॥ పు ౨౭౩; వై.సూ. ౬, ౨, ౩.
(౩) న్యాయకందళి పు ౨౭౭. (౪) సర్వభూతేభ్యో నిత్యమభయం దత్వా...(ప్ర. ప. పు ౨౭౩.)మఱియుఁజూడుఁ: వై సూ ౨, ౩౦.
(౫) ప్ర॥ ప॥ పు ౨౭౩; మఱియుఁజూడుఁ:(వై॥ సూ॥ ౬, ౨, ౧-౨; ౪-౬,౮. (౬) వై॥సూ॥ ౬, ౨, ౮. (౭) వై॥సూ॥ ౫,౨, ౧౬-౧౮.
(౮) యం.వి. వైశేషికాఫిలాసఫీ పు ౩౧.

జన్మముయొక్క కాలము, దేశము జన్మసంబంధావస్థలు, కుటుంబము, మాతాపితృ స్వరూపము, నాయుర్దాయము నన్నియు నదృష్టముచే నిర్ణయింపఁబడును. 3. పూర్వకర్మ ఫలానుభవమున కవకాశము ప్రతి జీవికి నుండును. గత జన్మఫలమే యీజన్మము నకవసరము లేదు; మన కర్మలన్నియు నొకే జన్మములో ఫలావస్థ బొందుశక్తి గలవి కానక్కర లేదు. ౪. సంస్కారములు నశించవు గాని, వాని ఫలితావస్థకు జన్మానేకములు పట్టవచ్చును. సముచిత శిక్షణము వలన మనకుఁ బూర్వజన్మ స్మరణము లభించును. ౫. ఇతర హిందూతత్త్వశాఖలవలెనే, వైశేషికమును మన ముత్తమాధమ జన్మము లెత్తుట కవకాశము లున్నవని యంగీకరించును. ౬. సర్వజీవులు తమ పుణ్యానుగుణములైన స్థానములనుబొందును. మోక్షమును గూర్చిన వైశేషికభావము న్యాయభావముతోఁ గొలది భేదమును, గలిగి యున్నది. కణాద తత్త్వము ననుసరించి, మోక్షావస్థలో జీవి, గుణావస్థారహిత మైన నిర్మలాకాశము వలె, సర్వగుణవిముక్తి బొంది యుండు ననియు, నైయాయికుల ననుసరించి, మోక్షావస్థ జ్ఞానానంద భరితమనియుఁ దన శంకర విజయములో మాధవుఁడు చెప్పి యున్నాఁడు. ౧. వైశేషికము ననుసరించి, మోక్షావస్థ సుఖ

(3) వివృతి, ౬, ౨, ౧౫.

(౪) న్యాయకందళి, పు. ౫3; ౨౮౧; ఉపస్కారము. ౬, ౨, ౧౬.

(౫) ఉపస్కారము, ౫, ౨, ౧౮; ౬, ౨, ౧౬.

(౬) ప్ర. ప. పుటలు ౭౦-౨౮౧.

(౧) అత్యంతనాశో గుణసంగతే ర్యాస్థితిర్న భోవత్ క్షణభక్షపక్షే. ముక్తిస్తదీయే చరణాక్షపక్షే సానందసంవిత్సహితా విముక్తిః।

రూపమని చెప్పుటకు వీలులేదు; ఇది మనకాకర్షవంతముగ లేకున్నను, వైశేషిక తర్కమున కిట్టి భావమనుగుణముగా నున్నది. నామరూపాది సంయోగముచే నుదయించిన గుణములనుండి జీవి విడివడినపుడు పూర్వస్వాతంత్ర్యమును దిరిగి పొందును. బాధా దుఃఖ వినాశమనగా, జీవనాశమే యని విమర్శించిన మండనుని ఖండన మర్థరహితము గాదు.౩. మోక్షస్థితిలో జీవి సహజావస్థననుభవించునని శ్రీధరుఁడు చెప్పినాఁడు.౪. అవ్యయమగు జీవికి నాశనము దురూహ్యము; కాని దానికిఁ జెప్పఁబడిన మోక్షావస్థా స్వరూపము శిలాజడత్వ సదృశావస్థగా భావించుట కవకాశమున్నది.౫. తన భావమును బోషించుట కుపనిషత్తుల నుండి యాధారములను శ్రీధరుఁడు జూపి యున్నాఁడు.౬.

౧౪—ఈశ్వరుఁడు.

కణాదసూత్రములు బహిరంగముగా నీశ్వరుని స్మరించి యుండలేదు. అణువులయొక్కయు జీవులయొక్కయు మూల ప్రవృత్తి కదృష్టమే కారణమని చెప్పఁబడెను.౧. జగత్ప్రవృత్తి

---

(౨) ఆత్మ విశేష గుణానామ్ అత్యంతోచ్ఛేదః।

(౩) విశేష గుణనివృత్తి లక్షణాముక్తి రుచ్ఛేదపక్షమ్ నభిద్యతే.

(౪) ఆత్మనః స్వరూపేణా వస్థానమ్.

(౫) స. సి. సా. సంగ్రహము, ౫, ౩౬.

(౬) న్యాయకందళి, పుటలు ౨౮౨-౨౮౭.

(౧) ౨, ౧, ౧౮, ౧౯. వై॥ సూత్రములలో నీశ్వరాస్తిత్వ నిరూపణములున్నవని కొందరుచెప్పుదురు; కాని యీభావ మంగీకారయోగ్యము కాదు. ౨, ౧, ౯-౧౪ లో నిత్యము నగోచరమునగు ననిలాస్తిత్వము చెప్పఁబడెను. ౨, ౧, ౧౫-౧౭ నందీయస్తిత్వము ప్రత్యక్షానుమాన విషయము కాదనియు,

హేతువుగా నదృష్టనియమము కణాదునికిఁ దృప్తినొసఁగి యున్నను, నాతని యనుచరు లదృష్టమొక యచేతనము, ప్రాకృతమునైన నియమమని యసంతృప్తిచెంది, యదియీశ్వర సంకల్పముపై నాధారపడియున్నదని నిర్వచించిరి. జగత్తున కీశ్వరుఁడు మూలకారణము, నణువు లుపాదానకారణమునని చెప్పఁబడెను. ఈశ్వ రాస్తిత్వావసర మున్నదని కణాదుఁడే భావించె ననుట కాధారములేదు. రెండుచోట్ల చెప్పఁబడి, యనంతర భాష్యకారులచే దైవాస్తిత్వమును సమర్థించుచున్నవని నిరూపింపఁబడిన సుప్రసిద్ధ వాక్యము(2). లీశ్వరుని స్మరించియుండలేదు. వేదముల నీశ్వరుఁడు కల్పింపలేదనియు, నవి ఋషికల్పితములనియుఁ గణాదుఁడు విశ్వసించినట్లు తోఁచును. తన పదార్థ ధర్మసంగ్రహా(3). ప్రథమశ్లోకమునం దీశ్వరుఁడే జగత్కారణుఁడని వచించినను, ప్రశస్తపాదుఁ డీశ్వరునకుఁ దన తత్త్వములోఁ బ్రధానస్థానము నీయలేదు. వైశేషికతత్త్వమం దీశ్వరునకు స్థానము లేదనియు, నణువులు జీవులు నిత్యములు నుత్పత్తిరహితములనియు, నదృష్టశక్తిచే వాని ప్రవృత్తులన్నియు సాధ్యము

---

ననుభవైకగమ్యమనియుఁ జెప్పఁబడెను. ౨, ౧, ౧౮-౧౯ లోఁ బ్రాచీనులు కొన్ని సత్యములను దర్శించి, మనకు సంపాదించి యిచ్చిరనియు, వానిని గూర్చిన మన భావములు విశ్వాసముపై నాధారపడియుండుననియు నుడువఁబడెను. చూ: (యు.వి. వైశేషికా ఫిలాసఫీ॥ పుటలు ౧౬౪-౧౬౬.) ౩, ౨, ౪-౯. లో జీవసమస్యయు నిట్లే చర్చింపఁబడెను )

(2) తద్వచనాదామ్నాయస్య ప్రామాణ్యమ్॥ (౧,౧.౩,౧౦,౨,౯.)

(3) ప్ర॥ ప॥ యొక్క ఉపక్రమోపసంహార భాగములను; పుటలు ౪౮-౪౯, చూడుడు.

లగుచున్నవనియు వేదాంతసూత్రభాష్యమున శంకరుఁడు విమర్శించి యున్నాఁడు.౧.

వైశేషిక నాస్తికస్వరూపము వ్యతిరేకవాదుల విమర్శల వలన నెట్టితృప్తియు నీయఁజాలదని విదితమైనది. గణనాతీత సంఖ్యాకములైన యచేతనాణు సమూహములు సృష్టిలోని నానాత్వములో గోచరించు నద్భుతమైన యేకత్వము నుదయింపఁ జేయఁజాలవు. అవి కలిసి యాలోచించి, జీవప్రపంచనిర్మాణమునకు వలయుఁ గార్యక్రమమును గొనసాగింపఁజాలవు. వైశేషికతత్త్వవేత్తలలోఁ గొందరు తర్కవరిష్ఠాధురీణులు సర్వప్రవృత్తి కదృష్టము కారణమనుటలో సంతృప్తినిగాంచలేకుండిరి. అణువులెంతగా నవ్యయములు నిత్యములునైనను, వాని ప్రవృత్తులను సక్రమవిధానములో నడపుటకొక మనశ్శక్తి యుండవలెనని నిర్ణయించిరి. ఈశ్వరుఁడు మొదట నణువులను జూచినంతనే యాతనిబుద్ధిలో ద్వైతభావముదయించి దానివలన ద్విత్వములేర్పడినవి. అనుమాన శ్రుతిప్రమాణములు రెండును నీశ్వరాస్తిత్వమును సూచించును. ౨. మహాభూతచతుష్టయము నెవఁడో యొకఁడు వాని జ్ఞానముగలవాఁడు చూచియుండెనని చెప్పనగును; ఏలన నవి కార్యములు. 3. శబ్దాధారముల కీశ్వరుఁడే నిర్ణయముచేసి కల్పించెను. వేదములు బహువాక్య సముచ్చ

(౧) శంకరభాష్యము. ౨, 3, ౧౪.

(౨) కీత్. ఐ. యల్. ఎ. పుటలు ౨౬౫-౨౬౬; [illegible] పు. ౫౪.

(3) ౨, ౧, ౧౭-౧౯.

యములుగావున బుద్ధిమంతులగు రచయితలను సూచించును.౪.
వేదములలోని భావములు నిర్దుష్టములు, భ్రమా ప్రమాదాది
దోషశూన్యములునగుటచే నవియొక శాశ్వతము, సర్వజ్ఞము
నైన ప్రజ్ఞాపరిపూర్ణునివలన నుదయించెననియుఁ దెలియుచు
న్నది. ౫. మఱియుఁ బ్రళయకాలమునందు జీవులు విజ్ఞాన
హీనములై యుండుటచే నణువులప్రవృత్తి నవి నిగ్రహింపఁ
జాలవు; మఱియు నణుప్రపంచాభ్యంతరమందుఁ గ్రియా
మూలశక్తి యేదో తెలియదు. మన కనవస్థాదోషము పట్ట
కుండ నుండవలెనన్నచో, (బ్రథమప్రవృత్తికారకుఁడగు నొకని
నంగీకరించవలెను. ౧. ప్రథమారంభకుఁడొక్కని నూహించిన
చాలును; సంఖ్య పెంచనవసరము లేదు. బహుదేవతాస్తిత్వము
వలన వివాదములేర్పడవచ్చును; అందుచే సృష్టికర్తయొకఁడే.
అతఁడే యీశ్వరుఁడు.

ఈశ్వరునకు దేహమున్నదా యనుసమస్య శ్రీధరుఁడు
చర్చించినాఁడు. దేవునికి దేహముండనవసరము లేదు. శరీరావ
సరము లేకుండఁ గర్మచేయుచ్చును. చేతనాత్మకమగు జీవి యచే
తనమగు దేహమునకుఁ బ్రవృత్తి గలిగించును. దేహము జీవికిఁ
జెందియున్నను, దానికి స్వయంప్రవృత్తిశక్తి లేదు. కర్మసాధ

(౪) బుద్ధిపూర్వ వాక్యకృతిర్వేదే, చూడు ఉపస్కారము ౬, ౧, ౧
(౫) ఉపస్కారము. ౧౦, ౨, ౯, వేదప్రామాణ్యాంగీకారముపై నీ
వాదమంతయు నాధారపడియున్నది. బౌద్ధులవలె మనమీప్రామాణ్యము
నంగీకరింపకున్నచో నీవాదము నీరసమగును.

(౧) భూమ్యాకాశ గ్రహగోళసంచలన కారకుఁడగు నీశ్వరునంగీకరిం
చిన ఆరిస్టాటిల్ సిద్ధాంతముతో దీనిని బోల్చుఁడు.

నము దేహము. అణువులు దేవునికట్టి సాధనములు. ఇచ్ఛా ప్రయత్నములకు దేహమవసరమన్నచో నట్టియవసర మిచ్ఛా ప్రయత్నము లాగంతుకములైనప్పు డుండునేకాని, స్వభావ సిద్ధములైనప్పుడుకాదు. ఈశ్వరుని జ్ఞానేచ్ఛాక్రియాశక్తులు నిత్యములు. ౨. సృష్టికర్తయగు నీశ్వరునిఁగూర్చిన యాక్షేపణములకన్నిటికి శ్రీధరుఁడు సమాధానముచెప్పినాఁడు. దేవుఁ డాప్తకాముఁడు గావున నాతనికి సృష్టిచేయుటయందిచ్ఛ యుండనవసరములేదన్నచో, నాతఁడు స్వార్థేచ్ఛాపరుఁడు కాఁడు, కావున నితరులక్షేమమునకై సృజించునని చెప్పెను. కర్మనియతి ననుసరించి, లోకములో దుఃఖము నీశ్వరుఁడుంచినాఁడనియు, దుఃఖమంత హేయపదార్థముకాదనియు నది లోకజ్ఞాన హేతువనియు నాతఁడు సమర్థించెను. సౌశీల్యసంపన్నియతి ననుసరించుట దేవుని స్వాతంత్ర్యమునకు లోపముకాఁజాలదు.

ఈశ్వరునిఁగూర్చి వైశేషికులయొక్కయు నైయాయికులయొక్కయు౧. భావములు సమానములే. లోపములు సమానములే. జీవులు నణువులునుగలిసి అదృష్టశక్తివలన నొక స్వయంసంపూర్ణమైన యంత్రమువంటి నిర్మాణమని మొదటినిర్ణయము. వైశేషిక సిద్ధాంతములను దీవ్రముగా ఖండించిన విమర్శకుల యొత్తిడికి నిలువలేక, అనంతర వైశేషిక తత్త్వజ్ఞులు దైవాస్తిత్వము నంగీకరింపక తప్పనిసరియైనది. ఈశ్వరుఁడు జగత్కర్త

(౨) న్యాయకందళి పుటలు ౫౭-౫౮.

(౧) దేవతావిషయే భేదో నాస్తి నైయాయికైస్సమమ్॥
(హరిభద్రుని షడ్దర్శనసముచ్చయమ్ పు. ౫౯.)

కాఁడు; జీవులు, నణువులు నాతనితో సమానముగా నిత్యములు. మనుష్య జీవులకు లేని సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వములున్న కారణముచే నీశ్వరుఁడు జగత్పరిపాలనమును నడుప సమర్థుఁడు. దేవునికి సంసారబంధము లేదు. కొన్ని నియమములను గల్పించి, ప్రపంచ ప్రవృత్తి నాతఁ డారంభించి, దాని నియతగమనమున నాతఁడెట్టి జోక్యమును గలుఁగఁ జేసికొనకుండును. ప్రపంచ మొక ఘటికాయంత్రమువంటి నిర్మాణము. ఈశ్వరుఁడు దానికి నియతగతి నొసఁగి, హాన్యపక్రమములు లేకుండ నడచునట్లు కూర్చినాఁడు. ప్రపంచగతిలో జోక్యము లేకున్న చో నీశ్వరుఁ డట్టి ప్రపంచమున కెట్టియుపకృతియుఁ జేయఁజాలఁడు. జోక్యమున్న చో స్వీయకల్పిత నియతి నతిక్రమించినవాఁడగును. ఈశ్వరునికిని దేనికిని సంబంధము లేదు. కాని మనము మూల ప్రతిపాదనములను సవరింపకున్న చో, నీశ్వరుఁడు మన కెట్టి సాయము నొనర్పఁజాలఁడు. పరస్పరసంబంధము లేని రెండుపదార్థములతో మన మారంభించినచో, వాని సంబంధశూన్యతా లోపమును దేవుఁడు బాహ్యమునుండి సవరింపఁజాలఁడు. ఒక బాహ్యశక్తి వశమై వర్తించు లోకము సమన్వయశూన్యమైన వస్తువుల మొత్తమగును. జీవు లన్యోన్యజ్ఞానము లేనివగును. అట్టి జగత్తులోని ప్రతివస్తు వన్యసంబంధము లేని యొక కేంద్రమగును. జీవులు, వస్తువులు వేఱైనవి. వానికి సంపర్కము బాహ్యశక్తికృతము. కావున మన మొక తృప్తికరమైన నిర్ణయమును గాంచవలెనన్న చో, మన ముపక్రమించిన భావముల లోనే దిద్దుబాటు చేసికొనవలెను. ఈశ్వరుఁ డొకఁ డున్న చో

నాతఁడే సృష్టిచేయుటకు వలయు సాధనసంపత్తిని గూడ సృజింప కొనఁగలఁడు. జీవులకు నణువులకు నీశ్వరతుల్య నిత్యత్వము నూహింపనవసరము లేదు. దేవుఁడే యున్నచో, సర్వలోకము లాతనిపై నాధారపడియుండఁగా నణువులుమాత్రి మాతని వలనఁ గలుఁగ వనుకొనుట హాస్యాస్పదము.

౧౫— వైశేషికతత్త్వము – సామాన్యపరిశీలనము.

వైశేషిక ముఖ్యసిద్ధాంతములను మనము విమర్శనబుద్ధితోఁ బరిశీలించిన యెడల నందలి ప్రధాన లక్షణములును లోపము లునుగూడ విదితములగును. యథార్థస్వరూపము ప్రదర్శించు భిన్నలక్షణములను సమన్వయించి, యొక సమగ్రతత్త్వమును గల్పించుట తత్త్వశాస్త్రవిధియై యున్నది. "ఒక్క—తత్త్వమునందే బుద్ధి గోచరములగు భిన్నవిషయ సంబంధస్వరూపములను, వైశే షికము ప్రదర్శించినది."౧. వైట్ హెడ్ పండితుఁడు జెప్పిన రీతిని, ప్రత్యక్ష ప్రపంచవిషయములను, శాస్త్రవిషయములను విడదీసి పరిశీలించుట లాభకరము. ప్రత్యక్షవిషయము లనఁగా, వర్ణ శబ్దరుచులు, నుష్ణోగ్రతా భేదములును; మనము వీనిని దర్శించి, దృశ్యప్రపంచార్థమును దెలిసి కొనుటకు మనము కొన్ని శాస్త్రవిషయములను గల్పించి, యవి ప్రత్యక్షములు గాకున్నను, లోకమును గూర్చి మనకొక సంపూర్ణస్వరూప మును బ్రదర్శించునవై యున్నవి. వైశేషికదర్శనమందును మనకు ప్రత్యక్షవిషయము లున్నవి; వీనితో మన యనుభవ మారంభ మగును. ఈప్రత్యక్ష విషయములఁ గూర్చి, మనము ద్రవ్య

(౧) వైట్ హెడ్. ది కాన్సెప్ట్ ఆఫ్ నేచర్, పు. ౧౮౫.

గుణాది సంబంధములలో నూహించుట కారంభించుటతో, మన మనుభవ ప్రపంచములోఁ బ్రవేశించుచున్నాము. ఇదివరకే మనము పెక్కుసారులు చెప్పుకొని యున్నట్లే, మన మొక వస్తువును దాని గుణములను గూర్చి ప్రసంగించునపుడు మనము యథార్థస్వరూపమును జెప్పుటలేదు; దానికి భావరూపమును గల్పించుచున్నాము. నిత్యానిత్య ద్రవ్యగుణ భేదములను దెల్పునపుడు వైశేషికతత్త్వము మన యనుభవముయొక్క తాత్కాలిక లక్షణము నుగ్గడించి, జీవాణువులు, దేశకాలములు, ఆకాశమానసములు మున్నగు ననేక భావములను గల్పించుచున్నది. ప్రత్యక్ష విషయములకు ననుభవప్రపంచమునకు ననగా శాస్త్ర విషయములకు నన్యోన్య సామరస్యము కుదిరినచో నీసిద్ధాంతము తృప్తియొసఁగును గాని, వైశేషికము నందట్టి సామరస్యము మృగ్యముగా నున్నది.

అభావనూత్రమునకు వైశేషిక సిద్ధాంతమిచ్చిన విశేష ప్రాముఖ్య మందలి నానాత్వలక్షణమునకు హేతువైనది. యథార్థస్వరూప మొక ద్రవ్యముకాని,సగుణము లైన యనేకద్రవ్యముల సముచ్చయములు గాని కాదు. విభాగము, నుపమానము, భిన్నత్వము నేకత్వము మున్నగు లక్షణములతోఁ గూడిన సంబంధ విశేషము. పరస్పరసంబంధ బాంధవ్యములచే నిర్మితమైన యొక క్లిష్టనిర్మాణ స్వరూపము చెంది యనేక వస్త్వస్తిత్వమును బ్రదర్శించునదే మన యనుభవసిద్ధమైన వ్యవహారప్రపంచము. వ్యక్తి వైవిధ్యములో సామరస్యము గలిగి, సమన్వయ సమగ్రతగల యొక స్వరూపముగా యథార్థజగత్తును బ్రదర్శించు ప్రయత్న

మును వైశేషికతత్త్వము చేసి యున్నది. పరస్పర వైరుధ్యములఁ బోఁగొట్టి సామరస్యమును జేకూర్చనిదే, తార్కికముగా మన కొక సమన్వయసిద్ధి నొందిన లక్ష్యము సిద్ధింపదు. స్వవిరుద్ధ విషయములు దురూహ్యములు; కాని వైశేషికతత్త్వములో నిట్టి స్వవిరుద్ధ విషయములు సమన్వయసిద్ధినిగాంచి యుండలేదు.

అభావనియమ మొక సంపూర్ణనూత్రము కాదని వైశేషికులంగీకరించిరి. అభావము దేనియభావమును జెప్పునో యా వస్తువున కస్తిత్వమసలే లేదని చెప్పలేదు. దేనిని లేదనుచున్నామో అది యొకప్పు డున్నదనియే యర్థము. మఱియు నభావము దేనినిలేదనునో యావస్తుస్వరూపము భావాత్మకమగుటచే స్థిరమైన యభావమునకు సంబంధము గలదికాదు. భూమిపై నొకచోట ఘటమును జూడఁగోరి, యది లేదని కాంతుము; అందుచే ఘటము లేదందుము. ఉన్నవస్తువును లేదందుముకాని, లేనిదానిని లేదనము. అభావగర్భస్థమైయున్నది వియోగముకాని లేకుండుటకాదు. అభావనూత్రప్రయోజన మేమనగా యథార్థవస్తువు నొక సంపూర్ణవిజ్ఞానరూపములోఁ బ్రదర్శించుటయే. భావాభావములు రెండును సమానసాక్షికవిజ్ఞానరూపములే. 'ఉన్నద'నుట కేవల యథార్థవస్తుస్వరూపతుల్యముకాదు; అట్లే, 'లేద'నుటయు నట్టిదే. అభావ మొక భావముయొక్క లోపము; ఏదిలేదు; ఎట్టిది లేదను లక్షణములతోఁగూడినదే. అభావ మొక వస్తుభానము; ఆవస్తులక్షణము లన్నిటిని లేదనదు; తుద కభావ మభావాభావముకూడఁ గావలెను. కావున నొకసమన్వయస్వరూపములో భిన్నవస్తు

భరితమైన జగత్కల్పనము చేయుటే వైశేషికాభావప్రయోజనము. కాని మనము సరిగాఁ జెప్పవలయుచో మనబుద్ధిచేఁ గల్పితమైన జగత్తునుగూర్చిన విజ్ఞానస్వరూపము పరమసత్య స్వరూపమెన్నఁడును గాఁజాలదు. అనేకత్వ భిన్నత్వము లొక సమన్వయమందిన విజ్ఞానస్వరూపమునందే నిజమైనవి. వైశేషిక వాది స్వతంత్రవస్తువని చెప్పునది వాస్తవికజగత్తులో నొక యంశముమాత్రమే. భిన్నత్వ వ్యతిరేకత్వభేదమును వైశేషిక తత్త్వము గ్రహించియుండలేదు. భిన్నమైనది వ్యతిరేకము గానక్కర లేదు. భిన్నద్రవ్యములకు సంబంధము లేకుండ నక్కర లేదు. భిన్నత భేదాభావమునంగీకరింపదు. పరస్పరసామరస్యము లేనివి కొన్నియున్నవి; కాని వాని సామరస్యశూన్యత నిత్య లక్షణము కాదు. వ్యావహారికావధులలో నీ భిన్న పదార్థములు గోచరించునుగాని, యథార్థస్వరూపము సమగ్రసమన్వయ సంపూర్ణతగలది. సర్వవస్తువులకును సమగ్రతను సంపూర్ణతను గల్పించుటచే వైశేషికతత్త్వము వివిధాంశాన్యోన్య భిన్నత్వము నేకపరమార్థ వస్తుస్వరూపములో సమన్వయింపఁజాలక పోయినది; ఏకత్వానేకత్వములు రెండు ననాదియైనవని చెప్పినదేకాని, రెంటికి నభేదసమన్వయ మొనర్పలేకపోయినది. అభావమాత్రము ననుసరించి, సమగ్రసమన్వయ జ్ఞానరూపమును వైశేషికసిద్ధాంతము కల్పింపలేకపోయినది.

వస్తువులు, వానిసంబంధములు మనయనుభవములో నున్నవని వైశేషికతత్త్వ మంగీకరించును. ద్రవ్య గుణ కర్మలు

వేరుగాను, నన్యోన్యాశ్రయములుగనుగూడ నుండుటయేకాక, సామాన్యవిశేష సమవాయసంబంధములను గలిగియున్నవి. ప్రతిద్రవ్యమున కొక సామాన్యగుణము, విశిష్టగుణము, సమవాయముచే రెంటికి సంబంధముగలిగియున్నది. అనేకత్వమును సాధించు తత్త్వమునకు సంబంధముల యాథార్థ్యమును సమర్థించుట ముఖ్యావసరమైయున్నది. ఈసంబంధము లసత్యములైనచో నిర్గుణాత్మకమైన వస్త్వేకత్వమునే యంగీకరింపవలసియుండును. లేకున్నచో సంపూర్ణములైన యనేకవస్తువులున్నవనియు నవి సంబంధశూన్యములనియుఁ జెప్పవలసియుండును.

వైశేషికతత్త్వములో సమవాయ మొక నీరసమైన సంబంధమైనది. రెండు పృథగ్వస్తువులకు సంబంధమే సమవాయమనుటకు వీలులేదు; కాని సంయోగమునకును దానికిని భేదమున్నదనియుఁ జెప్ప వలనుపడదు. సంయోగము సమవాయము కాదన్నచో సంపూర్ణవస్తువు, తదవయవముల సంయోగముకంటె బాహ్యమైనదని చెప్పవలెను. పరస్పరసంబంధమందినభిన్నద్రవ్యముల సమ్యక్సామరస్యరూపమును సృజించుటే వైశేషికసమవాయాభావ సూత్రముల యుద్దేశము. కాబట్టి వైశేషిక నానాత్వ తత్త్వము పరమార్థస్వరూపము కాఁజాలదు.

సామాన్య విశేష భేదములు ద్రవ్యములయొక్క గుణభేదములే. విశేషస్వభావమెట్టిది? వ్యవహారరంగమున మనము స్వయంసంపూర్ణ ద్రవ్యాస్తిత్వము నంగీకరింతు మన్నమాట నిజమే. కాని యీ విశేష మనగానేమో తృప్తికరమగు సమా

ధానమును జెప్పఁజాలము. ఒక ద్రవ్యమునుగూర్చి మనమెరిగిన దంతయు నేమన దానిగుణములు దాని ప్రవృత్తియునైయున్నవి. దాని విశిష్టత మనకు నిర్వచింపరానిది. కాని యది పరిమితి లేనిదని తోఁచుచున్నది. పృథక్త్వ మనునది నిజముగా లేదు; కేవల మూహాకల్పితము. జీవాత్మవిషయము చూడుఁడు. ఇది మార్పు చేయఁజాలని దేమైననున్నదా? జీవాత్మయొక్క పృథక్త్వము దాని జన్మాంతరప్రవృత్తితో మారుచుండునదైనచో నది పరివర్తనశీలముగలదే. అదియొక నిర్వికారస్వరూపమైనచో నద్దాని స్వభావము మనమెఱుఁగనిది. వాస్తవికాంశముల నీక్షించినచో "నైల్యము' ను మనమెఱుఁగము; ఒకరకము నీలవర్ణమునే మన మెఱుఁగుదుము; దాని సామాన్యస్వభావమును గాని, 'నైల్య' మును జెప్పు విశేషమునుగాని మనమెఱుఁగము. ఇవన్నియుఁ గలిసి పృథగ్విశేష మెట్లగునో మనము తెలిసికొనఁజాలము. మఱియుఁ దుదకు నిజముగా 'పృథక్త్వ' మననేమో మనకుఁ దెలియదు. విశేషసిద్ధాంతమునకుఁ దార్కికముగానైన నాధారములేకున్నను, వ్యవహార విజ్ఞానాభ్యాస బలముచే మనముద్రవ్యములకును జీవులకు నవ్యయమైనఁ బృథగ్వ్యక్తిత్వ మున్నదని భావింతుము. అనంతసంఖ్యాకములగు ద్రవ్యములకును జీవులకును నపరిచ్ఛిన్నమైన పృథక్త్వమున్నచో నీ పృథక్త్వత్వ మేకాత్మకమైన యథార్థ వస్తుస్వరూపముయొక్క పృథక్త్వమును నశింపఁజేయును. కావున సమవాయాభావములవలన నొక సమగ్ర విజ్ఞాన సమన్వయరూపమును వైశేషికతత్త్వము నిరా

పింపఁదలఁచినయెడల, పృథక్త్వ మనేకవస్తువుల కున్నదను సిద్ధాంతము మార్పునొందవలెను.౧.

గ్రహించుబుద్ధితో నిమిత్తము లేకుండ ద్రవ్యగుణకర్మల యందొక సామాన్యలక్షణమున్నదని విశ్వసింపఁబడెను; మఱియు నది నిత్యద్రవ్యములందు నిత్యమనియు ననిత్యద్రవ్యము లందనిత్యమనియు నూహింపఁబడెను. సామాన్య విశేషములు రెండును యథార్థములైన వైనచో,ఁ ప్రకృతి క్రమమునందు స్థిరస్థాపితములైనవని తలఁపఁబడు నీద్రవ్యములతో సామ్యముగలవే శాస్త్ర పరికల్పిత సామాన్యములైనచో, యుక్తములు నయుక్తములు నగు సకలద్రవ్యములకును సామాన్యము లుండవలెను. మఱియు శాశ్వతములైన సామాన్యములు లేవు. తర్క–స్వభావమే మన విజ్ఞానమును మార్పులేని దానిగా నూహించును; దీని ననుసరించి, న్యాయవైశేషిక తత్త్వము వస్తుమూలరూపములు, గుణములు, వాని భేదములు నచలములని నిర్ణయించెను. ఏవస్తువు

(౧) పోల్చు: బ్రాడ్లే "ఆనేకత్వములోని వివిధద్రవ్యములకు స్వయం సంపూర్ణతలేదు. ప్రతిద్రవ్యమునుండియుఁ దదతీత సంబంధమును విడిచినచో, ననేకత్వమే మిగులదు ఏకత్వములేని భిన్నత్వ మర్థరహితమగును. అందుచే బృథగ్వస్త్వస్తిత్వ మాత్మవిరుద్ధ ప్రసంగమగును. ప్రతి ద్రవ్యమునందును భిన్నరూపము లున్నవని చెప్పుటవలన నీ క్లిష్టత తొలఁగదు; ఈవిభాగ మంతము లేకుండఁ జేయవలసివచ్చును. ప్రతివస్తువును దదతీత స్థితిలేనిదైనచో ననేకత్వము నశించును. ఏది స్వయంస్థితి గలిగి వేఱైన వ్యక్తిత్వములేనిదో, యది పృథగ్వస్తువు కాఁజాలదు. అందుచేఁ బృథగ్వస్తువు లుండుట కేవల మూహాకల్పనము. వీనికి నిజమైన స్థితిలేదు." (లాజిక్‖ వాల్యూము-౨. పు. ౬౩౧) మఱియుఁజూడుము: జెంటైల్. థియరీ ఆఫ్ మైండ్ ఏజ్ ప్యూర్‌ఏక్టు. ఇ. టి. పు. ౧౧౩.)

నొకేకాలమున నుండుట నుండకుండ నుండుటయు జరుగదు. ఇదియే స్వవిరోధసూత్రము; ఈసూత్రమున కనుగుణముగనే, సృష్ట్యాది నుండియుఁ బ్రళయకాలము వరకు నెట్టి మార్పులను బొందకుండ నొకేతీరున వస్తువులుండుననుభావముతో వానిని వర్గములుగా భావించుట జరిగినది. వస్తువులకు స్థిరత్వమున్నదను విశ్వాసమును డార్విన్ పరిణామ సిద్ధాంతము త్రోలఁగించినది. ఒక జాతిలోని భేదము లధికముగాఁ బెంపొందిన ప్రకృతి స్వభావము వలననే, యింకొక జాతిగా వస్తువులు పరివర్తనమందుచున్నవి. లక్షలకొలఁది సంవత్సరముల పరిణామ క్రమముచే వర్గములకు స్వరూపము లేర్పడుచున్నవి. నేఁడును వస్తువర్గము లన్నియు నిరంతర పరివర్తన శీలములు గలిగి యన్యోన్య స్వరూపముల నొందు చున్నవి. సంప్రదాయ పరంపరావశమున నొక యశ్వజాతి లక్షణములు గుర్తింప నసాధ్యములగు రీతిని మారిపోవచ్చును. కావున సర్వసామాన్యములని చెప్పఁబడిన లక్షణములు స్వయంస్థితి గలిగిన నిశ్చలస్వరూపములు గావు భిన్న ప్రకృత్యవస్థలలోఁ జరిగిన పరిణామములలోని దశావిశేషముల నవి తెల్పును. వస్తుజాతులు నశించిపోవుచుండగా జాతులను నమ్మిన తార్కికుని కాధారము నదృశ్యమగును. ఏయొక పరిణామ ఘట్టములోనైన నొక జాతిలక్షణమును సామాన్యము సూచించును; కాని యాలక్షణమైనను స్థిరమైనదిగాదు. సామాన్యములు శాశ్వతములని చెప్పఁబడినప్పు డవి యనంతములని యర్థము కాదు; కాలసంబంధములతో నిమిత్తము లేనివని యర్థము. ప్రాగభావాదులకు సామాన్యమైన యభావము సర్వ

సామాన్యమైనదని న్యాయవైశేషికములు నంగీకరించి యుండ లేదని జైన తార్కికులు బలికిరి; సామాన్యములు సర్వసామాన్యము లనియు నంగీకరింపఁబడలేదు. భిన్నసామాన్యములకు సామాన్యము లేక భిన్నభావములకు సామాన్య మనగా వాని సామాన్య లక్షణమైనచో వస్తువులకు వేరుగా నొక సామాన్య మెద్దియును లేదని చెప్పవచ్చును. మాప్పుగల వానికి, లేనివాని కిని భేదమును జెప్ప గోరికతో నీసామాన్య సూత్రముద్దేశింపఁ బడినది. అధిక వాస్తవికతగలఅతీంద్రియ ప్రపంచమునకీసామాన్యములు చెందు నన్నచో, వానికి మూలభూతములైన పృథగ్వస్తువులతో వానికి సంబంధముగలుగుట దుస్సాధ్యమగును. ఏకము నిత్యమునగు నొక వస్తుయాథార్థ్యము ననేకములు ననిత్యములునగు పృథగ్వస్తువులతో సంబంధమును గలుగుటయు సులభవిషయము గాదు. సామాన్యము విశేషముపై నాధారపడకున్నచో మఱకు ప్లేటో తత్త్వమందువలె వ్యర్థవాదమేర్పడును. పూర్తిగా వేరైన సామాన్య విశేషములకు సంబంధము పొసఁగదు. విశేషసంభరితమైన ప్రపంచమునకు వాస్తవికతతో సంబంధము లేనిదని నిరసింపవలసి యుండును. సమవాయ సూత్రబద్ధములగుటచే సామాన్య విశేషములు విడదీయరానివని న్యాయవైశేషికతత్త్వమంగీకరించును అనగా సామాన్య విశేషములకుగల భేదము విజ్ఞానరంగమునకు జెందినదే యనియు, నది యథార్థజగత్తులోనిది కాదనియు, నంగీకరించియు, స్వతంత్రసామాన్యము లున్నవని వక్కాణింపఁ బడెను. అట్టి సామాన్యములు జగద్విలయమైనను, నశింప

వనియు, బ్రళయవేళ నవి కాలము నాశ్రయించి యుండు
ననియుఁ గాలమొక యథార్థస్థితి గలదనియుఁ జెప్పఁబడెను.

ద్రవ్య గుణ కర్మలు యథార్థజగత్తులోనివనియు, సంబంధములు తార్కికవిభాగజన్యములనియు గుర్తించినచో నీ సంబంధములను నిజముగా నస్తిత్వముగల ద్రవ్యములుగా భావింపరాదు. సత్తా యనున దొకటున్నదనియు ద్రవ్య గుణ కర్మలకు దాని లక్షణములున్నవనియుఁ జెప్పఁబడెను. కారణాన్యోన్య సంబంధములును, సాధర్మ్యాదియు నస్తిత్వముగలవికావు; ఏలన నస్తిత్వము పృథగ్వస్తులక్షణము. గుణకర్మలు ద్రవ్యలక్షణములు. (1) ఎట్టి దేశకాలపరివర్తనములు తటస్థించినను, గుణములు నిమిత్తధర్మముయొక్క అవిచ్ఛిన్నరూపములనియు, కర్మలు తాత్కాలికనిమిత్తధర్మాంశములనియుఁ జెప్పవచ్చును. ఒకద్రవ్యముయొక్క సంపూర్ణస్వరూపములో గుణకర్మ లనగా నిత్యానిత్య లక్షణము లవిభాజ్యములైయున్నవి. (1) ప్రతి ద్రవ్యమునకు విశేష గుణ కర్మలున్నవి. లోకతాటస్థ్యము లన్నియు ద్రవ్యలక్షణములని ప్రాకృతజనాభిప్రాయము. ఒక ద్రవ్యమును, దాని గుణములనుగూర్చిన భావములు మనకు సుపరిచితములు. ఇది యమోఘసత్యమనియు నిరూపింపనవసరములేనిదనియు వైశేషికము భావించినది. యథార్థమైన దొక ద్రవ్యమో గుణమో కావలయును. గుణములన్నియు యథార్థవస్తు భిన్నలక్షణములు; అవి తద్వస్త్వాధారశూన్యములుగ నుండవు.

(1) డబ్ల్యు. ఇ. జాన్సన్. లాజిక్ వాల్యుము 1పు 3౫.

(1) డబ్లియు. ఇ. జాన్సన్. లాజిక్. వాల్యుము. 1. పు 32.

అన్యసంబంధరహితములై సర్వస్వతంత్రములైన యనేకవస్తువు లున్నవను ప్రాకృతభావము పరమసత్యమని వైశేషికనిర్ణయమై యున్నది; కాని స్వతంత్రపృథగ్వస్తురూప మెట్లుండెనో మన కెట్టియభిప్రాయమును సూచించియుండలేదు.

పైకి నిర్దుష్టముగా గోచరించుచున్న ద్రవ్యగుణసిద్ధాంత మనేక సమస్యాగర్భితమైన మహాకూపమువంటిది. ద్రవ్యము గుణముల కాధారమైనదని నిర్వచనము.(౨). అందుచే గుణములు విడిగానుండవు. ద్రవ్యగుణభేదము మానసికము; కానిసామాన్య విశేషాదులకంటె నధికయాథార్థ్యము గుణకర్మలకుఁ గలదనుట కాధారములేదు. గుణములతో నిమిత్తములేకుండ ద్రవ్యమున్న దని వైశేషికమతము. సృష్ట్యారంభ ముహూర్తమున ద్రవ్యము గుణరహితమైయుండెనట; అనగా వస్తు పరమార్థస్వరూపము వేరు, గుణసహితరూపము వేరునని స్పష్టము. వస్తు మూల రూపమునకును, వస్తువునకుఁ గల విశిష్టములైన నిత్యగుణముల కును సంబంధములేదని చెప్పవలెను. వస్తు స్వస్వరూపస్థితికి దాని గుణముల నిత్యత యవసరములేదు. వస్తువుల విశేషగుణములు కార్యములనియు ననగా గుణములు ద్రవ్యములనుండి జనించిన వనియుఁ జెప్పఁబడెను. కాని యొక ద్రవ్యము తద్భిన్నగుణము లకుఁ గారణ మెట్లుకాఁగలదు? తెలియఁదగిన గుణములన్నియుఁ గాక వేరుగానున్న ద్రవ్యస్వరూపమేమో మనబుద్ధి కచింత్యము.

(౨) ప్రాచీనన్యాయము గుణకర్మల కాశ్రయమైనదే ద్రవ్యమని నిర్వ చింపఁగా, నవీనన్యాయము ద్రవ్యమెంక గుణములకే యాశ్రయమని నిర్వ చించెను.

గుణములకన్నిటికి వెనుకనున్న దేదో చెప్పరానిది; అవేద్యము. గుణములకంటె ద్రవ్యమున కధిక యాథార్థ్యము నాపాదించుట మనకుఁ జిరకాలానుగతమైన దృఢమగు నభ్యాసము. వైశేషిక ద్రవ్యములు మనకు వ్యవహారములో గోచరించు గుణములకుఁ గేవల మూహాకల్పితములు, నవిదితములునగు నాధారములు. అవి శాస్త్రీయ పరీక్షచే ఋజువైనవికావు. కాని యొక ద్రవ్యమునకు గుణములు పోయినచో, స్వభావమును బోవుననియు వైశేషికాభిప్రాయమే. ద్రవ్యగుణసంబంధము సమవాయమని చెప్పఁబడెను. అనగా, నొకటిలేకున్న నింకొకటి యుండఁజాలదు.౧.

ఇట్టి ద్రవ్యగుణసంబంధమును శంకరుఁడు ఖండించినాఁడు. రెండు నవిభాజ్యసంబంధమును గలిగియున్నచో వాని యవిభాజ్యత దేశమునకుఁ గాని, కాలమునకుఁగాని, స్వభావమునకుఁ గాని చెందినదైయుండవలెను. ఈరెండును దేశమునం దవిభాజ్యములుగావు; ఏలన తంతువులనుండి కల్పితమైన వస్త్రము తంతువులాక్రమించు స్థలమునే యాక్రమించునుగాని, వస్త్రము యొక్క స్థలమునుగాదు. వస్త్రగుణములైన రంగు మున్నగునవి వస్త్రముయొక్క స్థలము నాక్రమించును గాని తంతువుల యొక్క స్థలమునుగాదు.౧. కాలమునకుఁజెందిన అవిభాజ్యత సమవాయసంబంధ లక్షణమైనచో నొక గోవుయొక్క వామ దక్షిణ శృంగము లట్టి సంబంధమును కలిగియుండవలెను. అది

(౧) చూడు: గౌడపాదకారిక॥ 3 అ. ౫. పై శంకరభాష్యము.

స్వభావములేక శీలమునకుఁ జెందినదైనచో, నప్పుడు ద్రవ్య గుణములకు భేదముచెప్పుట సాధ్యము; ఏలన రెండునొకటే ౨. ద్రవ్యగుణములపై నాధారపడినచో నది నిజముగా వేరైనదికాదు. ద్రవ్యము దానిగుణములతో సమవాయసంబంధమును గలిగియుండుటేకాక, సర్వద్రవ్యములు నేకపదార్థ సంబంధమును గలిగియున్నవి; అదేవిధముగాఁ బృథగ్వస్తువులు తమజాతికిఁ జెందియున్నవి 3. గుణములుకాక వేరుగా ద్రవ్యమును మనము చూచియెఱుఁగము; గుణములు మారినను, మార్పులేనిదేదో యున్నదనుట తార్కికలక్షణముకాదు. ౪. పరివర్తనశీలములగు గుణము లున్నవన్నచో నిత్యద్రవ్యాస్తిత్వము నంగీకరింపవలనువడదు. నేఁడేపుగా రసభరితమైయున్న పచ్చనియాకు, రేపు పసిమితగ్గి, యెల్లుండి గోధుమవర్ణము నొంది వాడిపోవుచున్నది. ఆకుయొక్క నిత్యగుణమేమో మన మెఱుఁగము. ఒక ద్రవ్యముయొక్క మూలప్రకృతి మనకవేద్యమైన రహస్యమని తత్త్వచరిత్రమంతయు సాక్ష్యమిచ్చు

(౧) వై॥ సూ॥ ౧, ౧, ౧౦

(౨) శంకరభాష్యము ౨, ౨, ౧౭.

(3) సంఖ్యవంటి గుణములుగల గుణముల నేల ద్రవ్యములలోఁ జేర్చ రాదని శ్రీహర్షుఁడడిగినాఁడు. గుణములు సామాన్యమున కాశ్రయములని చెప్పినచో, నుపాధులవంటివాని కవి యాశ్రయము లేల కారాదని యాతని ప్రశ్న. (ఖండన. ౪,3.) గుణ మొక పదార్థమనుట కలెగ్జాండ రంగీకరింపడు.

(౪) చూ॥ న్యా॥ వా॥ ౧, ౧, ౧3. ఇచట "పృథివ్యాదిగుణాః" అనుచో ద్వంద్వసమాసమను నర్థములో నింద్రియములు పృథివ్యాదిద్రవ్యములను గుణములను గ్రహించును.

చున్నది. ౧. గుణకర్మలకు వేఱైన ద్రవ్యరూపమెట్టిదో మనకుఁ దెలియు నవకాశము లేదు. వ్యవహారప్రపంచములో ద్రవ్యగుణములను బదార్థములని వాడుకొనక తప్పదు; కాని వస్తుస్వరూపము గుణము లేయని చెప్పరాదు; గుణములు కాక వేఱుగా ద్రవ్యమే లేదని వైశేషికులు చెప్పియున్నారు. ఒకద్రవ్యనిర్వచనమును దానిగుణములనుబట్టియే చేయఁగలము. భిన్నగుణములనుబట్టి వస్తువుల భేదమును మనము గ్రహింతుము. భిన్నకాలములలో నొకే గుణసమూహమును బ్రదర్శించునప్పుడు వస్తువొకటేయని నిర్ణయింతుము. భిన్నలక్షణయుక్తములైన వస్తువులనుజూచి భిన్నవస్తువులున్నవని గ్రహించుచున్నాము. స్థిరముగానున్న గుణములప్రోవే ద్రవ్యమగుచున్నది. జీవులు, నణువులు, దేశము, కాలము, నాకాశము, మనస్సు నిట్టి ద్రవ్యములే.

వ్యవహారజగత్తులోని సకలానుభవ రూపముల నొక తత్త్వములో ముడిపెట్ట వైశేషికము ప్రయత్నించినది. ద్రష్టతో నిమిత్తము లేకుండ స్వయంస్థితి గలది ప్రపంచము. మానవుఁడు నిరాధారముగఁ గల్పించినవి కావను నర్థములో సంబంధములు వాస్తవికస్థితి గలవే. మనకుఁ గలుగు వస్తుజ్ఞానము నానాత్వము గలిగి సంభవించు చున్నదని వైశేషికు లంగీకరింపరు. కేవల

---

(౧) ద్రవ్యమునకు గుణమునకు సమానమైన వాస్తవికత గలదని సాంఖ్యము చెప్పును. అద్వైత వేదాంతము ననుసరించి, ద్రవ్యమొక విజ్ఞాన రూపమని భావించి, కాకున్న చో నది తర్కవిరుద్ధభావమని నిరసించును. పోల్చు. లాకే: ఎస్సే ఆవ్ ది హ్యూమన్ అండర్‌స్టాండింగ్.

మాహాకల్పితములు కాక నిజముగా నస్తిత్వముగల సూత్రము లపై సంబంధము లాధారపడి యున్నవి. గుణకర్మ సామాన్య విశేషసమవాయాదులన్నియు నాశ్రితములు; ద్రవ్యము వీనికన్నిటి కాశ్రియమునై యున్నది ద్రివ్యములు పూర్తిగా స్వతంత్రి ములు. కారణోత్పన్నములైన అనిత్యద్రివ్యములు నిజముగా ద్రివ్యములు గావు. వైశేషిక సిద్ధాంతమునకు నిత్యమైన ద్రివ్య నవకమే కేంద్రిస్థానము నాక్రిమించినది. ఈనవద్రివ్యములు శాస్త్రవిషయములు గాని, యింద్రియ గోచరములగు ద్రివ్య ములు గావని వైట్‌హెడ్ పండితుఁడు చెప్పినాఁడు: వీని కెట్టి విలువగల దనఁగా, మనము మన యింద్రియముల ద్వారమునఁ బ్రికృతిలోఁ జూచిన దృశ్యముల కొక క్రమము నిచ్చి ప్రదర్శిం చును. ప్రికృతి యంతయు నొక నిరంతర పరివర్తనాత్మకమగు దృశ్యమనియు దానికిఁ గారణము నింకొకచోఁ జూడ వలెననియు వైశేషికులు తమకుఁగల వ్యవహార జగత్తునందలి విశ్వాసముచే నిశ్చయించిరి. మన యనుభవ ప్రివంచములోని దృశ్యము లన్నియు ఛాయామాత్రిము లనియు నీ ఛాయలకు మూలము లైన ద్రివ్యములు తెఱవెనుకనున్నవనియు వారునమ్మిరి. కాని యిది నిరాధారమైన విశ్వాసమే. మన మనుభవ జగత్తును విడిచి, వెనుక నేదో రహస్యముగా వస్తువులు స్వస్వరూపము లలో నున్నవని తలపనవసరము లేదు. వస్తువులు స్వతంత్రిములై విడిగాను, యథార్థముగాను నున్నవని చెప్పు మన విజ్ఞానమును నమ్మవలె నని వైశేషిక ముద్బోధించు చున్నది; కాని, మన యింద్రియ విజ్ఞానమునకు గోచరించుచున్న ద్రవ్యములు యథా

ర్థవస్తువుల ఛాయామాత్రములే యని చెప్పుటలో నాత్మనిర్ణయ విఘాతములగు వాక్యములను బలుకుచున్నది. ప్రకృతి దృశ్యముల నన్నిటిని సమన్వయించుటకుఁ బూనుకొన్న వైశేషిక దర్శనము వ్యావహారిక జగత్తులో గోచరించుచున్న నానాత్వములకు వెనుక పారమార్థిక నానాత్వమున్నదను నిరాధారతాత్త్వక విశ్వాసము ననుసరించినది. ప్రకృతిలోని యేకత్వమును విడగొట్టి విభాగించెనే కాని, దానిని తిరిగి సమన్వయించుటలో గృతార్థత నొందలేక పోయినది, విడిపోయి, సంబంధ శూన్యత నందియున్న నానాత్వమున కేకత్వమును ఘటించుటకు దైవాస్తిత్వమును సాహాయ్యముగాఁ దెచ్చుకొనవలసి వచ్చినది. మార్పులేని నిత్యవస్తువులకును, నిత్యపరివర్తనాత్మకములగు ప్రకృతిదృశ్యములకును సమగ్ర సమన్వయము లభింపలేదు. ఈ రెంటిని బంధించు సూత్రము దుర్లభమయ్యెను.

ద్రవ్యపరస్పరసంబంధము సరిగా వివరింపఁబడియుండలేదు. వ్యవహారప్రపంచములో వస్తుసంబంధమును బ్రధానముగాఁ జెప్పిన వైశేషికసిద్ధాంతము, పరస్పరసంబంధములేని జీవులను, నణువులను శాస్త్రీయద్రవ్యములనుగా భావించి, సంబంధములన్నియు శాశ్వతములని నిర్ణయించినది. యథార్థ వస్తుస్వరూపములు నిత్యములైన నవద్రవ్యములు; అవియెన్నఁడు మార్పునొందవు; వ్యవహారజగద్వస్తుపరివర్తనకారణము వానిలో లేదు. అందుచే సంబంధమంతయు బాహ్యాతాటస్థ్యమే. సంబంధశూన్యములైన యణువులు వ్యవహారజగత్కారణములు కాఁజాలవు. వ్యవహారప్రపంచము నుత్పత్తి చేయుట కణువులు

సంయోగసంఘర్షణములఁ బొందవలెను. అణువులకుఁ గద లిక గుణమైనచో, వాని పృథక్త్వము నశించును; ఏలన నణుసంచలనము పృథక్త్వమునకు విరుద్ధమైనది. అదృష్టము కారణమని యంగీకరించుట తాత్త్విక హేత్వనకాశమును శాశ్వతముగా విసర్జించుటే యగును. పదార్థవివరణసందర్భ ములో వాని సంబంధములన్నియు నిజమనుసిద్ధాంతమును బ్రక టించిన వైశేషికము, తనసిద్ధాంతమున కానుగుణ్యముచూప వలయునన్నచో, శాస్త్రద్రవ్యములైన శాశ్వతములు మార్పు లేనివియు నగు నిత్యద్రవ్యసిద్ధాంతమును విడిచిపెట్టవలయును. యథార్థమైన సంబంధనియమము. సంబంధమొందినవస్తువుల పృథక్త్వముతో జతపడదు. కావున నిత్య నిరవయద్రవ్యములని చెప్పఁబడినవి నిత్యపరిణామమందుచున్న జగత్తులోని కొలఁది నిలకడగల ద్రవ్యములేయగును. పరివర్తనమును, సంబంధ మును యథార్థజగత్తునకు మూలరూపములైనచో నప్పుడు సత్యజగత్తు పృథగ్వస్తుసముదాయము కాదు. నిత్యమును మార్పునొందుచు, సమాకృతిగలిగియున్న జగమే యథార్థమై నిలుచును.

నిత్యములగు నణువు లున్నవని వైశేషికదర్శనము ప్రతి పాదించుటలోని భావమేమనగా, దేశకాలస్వరూపగర్భ మందెచటనో మానవనేత్రమునకు గోచరముకాని సూక్ష్మ రేణువులున్నవనియు,నవి సంయోగము నొందినపుడు,సంయుక్త రూపములు గోచరములేయనియు నవి నిత్యములుకాకున్నను దాంతస్థిరతనుగల్గి యున్నవనియుఁ జెప్పవచ్చును. శూన్యము

నుండి యెద్దియు నుద్భవించదను కారణధర్మము ననుసరించి, యీ సూక్ష్మాణ్వాస్తిత్వమును గల్పింపవలసివచ్చినది. దిక్కాలవ కాలగతులు దేశకాల వ్యవస్థాలక్షణములైనచో, నందు నిండి యుండునవి రూపరసగంధోష్ణతా శబ్దములని వైశేషికులు చెప్పినది నిజమే. ప్రస్తుతము శబ్దమునువిడిచి, రూపరసగంధోష్ణతలను వైశేషికు లణుగుణములని నిర్ణయించిరి. మన యనుభవములోని యీగుణములు నిత్యములుగావున వీని కణువులే కారణములను భావము నుపపాదించిరి.మూర్తిగల ప్రకృతిదృశ్యము లనిత్యద్రవ్య సంజాతములనియు, నిత్యదృశ్యములు నిత్యద్రవ్యజాతములనియుఁ జెప్పఁబడెను. వైశేషికతత్త్వము మూలాధారముగా గైకొనిన విషయములు మన యింద్రియానుభవములోని దృశ్యములే, వీనికి వైశేషికులు హేతువులఁ గల్పింప యత్నించిరి. అణువు లింద్రియగోచరములు కావని వైశేషికులు స్పష్టముగాఁ బ్రకటించి, మన కింద్రియగోచరములైన సర్వదృశ్యముల కవియే కారణములనియు నిర్ణయించిరి. వస్తుజాలమంతయుఁ బ్రకృతికిఁజెందినదే కాని బౌద్ధులవలె మానసికమని తలపఁబడలేదు. కాని యింద్రియగోచరములగు వస్తువులన్నిటికిఁ గారణము లణువులని భావింప నవసరమున్నదా? రంగులు శబ్దములు, రుచిస్పర్శలు నొకదానితో నొకటి సంబంధములేకుండ మనకు వ్యవహారజగత్తులో లభించినచో, వీనికిఁ గారణభూతములైన యణువులును పరస్పరసంబంధశూన్యములైనవని యూహింపవీలగును. కాని మనకు గోచరించు ప్రకృతి, భిన్నదృశ్యము లెడతెగక పరస్పర సాహచర్య సంపర్కములు గలిగియున్న

యొక్క నిరంతర ప్రవాహరూపముగా నున్నదని వైశేషికులు చక్కఁగా వక్కాణించియున్నారు. ఇంద్రియ విషయజాలమును బరిశీలించి, ద్రవ్యగుణసంబంధములతోఁ గూడిన యనుభవ మును మనము గల్పించుకొనుచున్నాము. ఈ మన యనుభవ ములో వైశేషికు లూహించిన యణువుల కవకాశము లేదు. వైశేషికుల అణుసిద్ధాంతమువలనఁ గొన్ని సూక్ష్మ సమస్య లుద యించి, విజ్ఞానవాద ప్రమాదములోనికి దారి చూపినవి. అణువులు మన కెఱుకలో లేవు; కాని వ్యవహార జగత్కారణ ములగు నణువు లున్నవని మన మూహించుచున్నాము. ఇచట జూపిన కారణధర్మ విధానమైనను జడాత్మకము; ఉన్నవి వేరు; అవి యణువులు; మనకుఁ గన్పట్టునవి వేరువస్తువులు; వస్తువుల కారణము లనుభవాతీత విషయములు. ప్రత్యక్షవస్తు జగత్తున కాధారభూతముగ నూహింపఁబడిన యీ యణ్వాధారము బల వత్తరమైనదికాదు. మన యనుభవము దేశకాలములలో దృశ్య పరంపరగా లభించుచున్నది. ప్రతివిషయమునకొక దేశము, నొక కాలము, నున్నవి. కాని యీ దేశకాలలక్షణములు విషయ ముయొక్క సంపూర్ణాకారములుకావు. సూక్ష్మపదార్థ రేణువు లైన యణువులనుగూర్చి మనమేమియు నెఱుఁగము. ద్రవ్యము లేక కాలమున ననేకస్థలములనాక్రమించి, రూపవైశాల్యము లను గలిగియున్నవి. సరిగాఁ జెప్పవలయుచో, నొక విశ్వ విశాలపదార్థములనుగాని, యగోచరములగు నణువులనుగాని మన మెఱుఁగము; ద్రవ్యములనే మనము గాంచుచున్నాము. ఒక ద్రవ్యమనగాఁ జలనముగలదని మనము సామాన్యముగా

నెంచుచున్నాము. అది పదార్థములో నొకభాగము; తనలోఁ గల భాగములకు మార్పులేకుండ నుండునట్లును, నితరస్థల సంబంధములలో వానికి మార్పులున్నట్లును నది సహజస్వరూపములను నిలబెట్టుకొనుచున్నది. ఒకవస్తువునకుఁ గొన్ని యవధులున్నవి; బాహ్యాభ్యంతరభాగ సంబంధములలో మార్పులు లేనంతకాల మావస్తువు తన పృథక్త్వమును నిలుపుకొనును. మనకొక వస్తువు లేక స్థూలపదార్థమని పిలుచునది యొక దేశావరణము; దానికిఁ గాలగతపరిణామములతో నిమిత్తము లేకుండ నిత్యమైయుండు నొకవిశిష్టలక్షణముగలదు. మనకుఁగల సందర్భములో దేశమును గాలమునాక్రమించు ద్రవ్యము దేశకాలములనుండియు వేరైనదిగాభావింతుము. దేశకాల వ్యవస్థాస్థితి గలదే పదార్థము.(1) సామాన్యమునుండి విశేషమును, సంబంధములనుండి తద్వస్తువులును, దేశకాల సంయోగమునుండి పదార్థమును గల్పింపఁజూచిన అలెగ్జాండరు, రస్సెల్ వంటి అభినవభౌతికవాదులతోఁగాని, తత్తుల్యులగు బౌద్ధులతోఁగాని వైశేషికులు సాంగత్యమునంగీకరింపరు. చలించు వస్తువులు లేనిదే చలనమును లేదు. అణువనగా నొక యథార్థమైన ద్రవ్యమనియే వైశేషికభావము. వైశేషికులననుసరించి, అణువులు వర్ణాదిగుణములను గలిగియున్నవి. రంగుమున్నగు గుణముల

(1) విషయములు సగుణరూపములు; వీనినుండియే దేశకాలములు గుర్తింపఁబడినవి. కేవలస్థలాక్రమణమును, సాహచర్యమును భావకల్పనములు. ప్రపంచమూలరూపములని వేనినైన పిలువవీలగుచో నవి దేశకాలపదార్థసముచ్చయరూపములు. వైట్ హెడ్ పండితునభిప్రాయములో విషయములు దేశకాలపదార్థరూపముల కాధారములు.

గలదేదియు నణువుగాని, నిత్యవస్తువుగాని కాఁజాలదని శంక రుఁడు విమర్శించియున్నాఁడు. మన యనుభవమున ననుసరించి చూచినచో వర్ణాదిగుణములుగల వస్తువులు స్థూలములు నని త్యములునైయున్నవి.౧. అగోచరత్వమే నిత్యత్వలక్షణమైనచోఁ జాలసూక్ష్మములగు ద్విత్వములును నిత్యపదార్థములే కాన లెను. ౨. జగత్తునకాధారమైనయొక నిత్యవస్తువవసరమైనచో నది యణుసముదాయముకాఁజాలదు. 3. ప్రత్యక్షప్రపంచ వస్తునానాత్వమున కణునానాత్వ మవసరమని యూహింపఁబ డెను. భిన్నదశలలోఁ బరివర్తనమందుచున్న పదార్థసిద్ధాంతము నిత్యాణుసిద్ధాంతమునకు విరోధమైనది. ప్రకృతము, నజా రూపమునగు ననుభవము, ప్రపంచమును పృథగ్వస్తుజాలముగా విభాగించునుగాని, ఈసత్పర్యవేక్షణము వస్తువులన్యోన్యరూప ములనందుచున్నవని తెలుపును. పరిణామమనున దొకటి యున్నది. వస్తుయాథార్థ్యమనఁగా ననేకవస్త్వస్తిత్వము గాదు; ఏకప్రకృతిరూపము. వైశేషికముయొక్క వ్యావహారికదృష్టి నిత్యవస్తువునుగాక పరిణామమందున్న ప్రకృతినే ప్రతిపా దించుట సమంజసమైయుండెడిది. ప్రకృతియొక్క అభిన్నైకరూప మును, భిన్నాణువర్గమున కుత్పత్తియందు మూలభూతమగు నేకత్వమును మనకు ముఖ్యాకర్షణములగు విషయములు. పరిణామమనగా, భిన్నరూపాంతరములలో లీనమైయున్న

---

(౧) వై॥ సూ॥ ४, ౧, ౧.

(౨) ४, ౧, ౫.

(3) శంకరభాష్యము. ౨, ౨, ౧౫.

నియమమాత్రూపాంతరములకన్నిటికి నతీతమైనది. మనకు గోచరించు యథార్థపదార్థ మణురూపముకాదు; అది యేకాత్మక ద్రవ్యము; అందు గుణములపైనాధారపడిన భిన్నరూపము లంతర్లీనములగుచుండును. భిన్నభూతము లొకేపదార్థము యొక్క భిన్నరూపములు; భూమి స్థూలమైనది; జలము సూక్ష్మము; తేజము సూక్ష్మతరము; వాయువన్నిటికంటె సూక్ష్మతరము. ౧. రూప రస గంధ స్పర్శలు నాలుగును భూమికిని, రూప రస స్పర్శలు జలమునకును నిట్లే గుణములున్నవని, వీనికనుగుణముగా వీనికారణములైన యణువులకిట్టి భిన్నగుణములున్నవని తలంపరాదు. అణువులన్నిటికి నన్ని గుణములును లేవు. అణువుల కొకేగుణమున్నచో, భూమికి రుచియును, జలమునకు రంగును, మనము కలిగియుండఁజాలమేలన, కార్యగుణములు కారణగుణానుగుణములై యుండవలెను. ౨. అనంతభిన్నతగల యణుసముదాయమొక సామరస్యముగల ప్రపంచమునకుఁ గారణముకాఁజాలదు. ఇందలి క్లిష్టతను దొలగించుటకే విచిత్రమైన సమవాయసూత్రమును గల్పించిరి. రెండణువుల సంయోగముచేనేర్పడిన ద్విత్వములు వానితో సమవాయసంబంధమునుగలిగియుండియు వానికంటె భిన్నములైనవని చెప్పఁబడెను.

---

(౧) నవీన భౌతికశాస్త్రము ననుసరించి యణువులనగా విద్యుద్రేణువులు; పదార్థముకూడ సూక్ష్మతమమైన యాకాశరూపమై, యించుమించుగా జేతనగుణములను జూపుచున్నది.

(౨) శంకరభాష్యము॥ ౨, ౨, ౧౬.

ప్రకృతి విషయప్రవాహములో నణువులు నిత్యత గలిగిన యంశములు. ప్రకృతిలో నచంచలమైన దేదో యున్నది. ప్రకృతిలో నచలములైన వానినే మనము ద్రవ్యములందుము. మన మిదివఱలోఁ జెప్పిన రీతినే వస్తువుల పరివర్తమునకే ద్రవ్యములను నామకరణము చేయఁబడినది. ఎంత మారుచున్నను, మనము మనయనుభవములోఁ గొన్ని మార్పులేని లక్షణములను జూచుచున్నాము. అందుచేఁ బ్రకృతి గర్భస్థమైయున్న నియమము, నిత్యపరివర్తన మందుచున్నను, నవిచ్ఛిన్నతగలిగి నిలుచుచునేయున్నది. అణువాదమునుండి మనకులభించు తత్త్వసూచన మేమనగా యథార్థమైన దేదో యది స్వయంపోషకత్వశక్తిగలదైయున్నది. అనగాఁ బూర్ణతగలిగినదానికే సత్యస్థితి యున్నది; భాగములకు స్వతంత్రస్థితి యున్నచోఁ బూర్ణతకు లోపము సంభవించును. కాని పూర్ణాంశ సంబంధములోఁ జిక్కులు లేకపోలేదు. కావున యథార్థమైనది విజ్ఞానమే యని చెప్పవలెను.

దేశకాలముల సర్వసామాన్య యథార్థరూపములను వైశేషిక ముగ్గడించుటలోని యర్థమేమనఁగా, జగత్తు మనకొక యనంతవ్యాప్తి గలదిగాను, దాని కాద్యంతములుగాని, లోతుగాని లేనిదానిగాను గోచరించుచున్నది. ప్రతివిషయమునకు దేశకాల లక్షణములున్నవి. ఒక పదార్థముయొక్క దేశలక్షణము చలింపకయుండి, కాలలక్షణము మారినచో, నా పదార్థము చలింపకున్న దందుము. కాల మెడతెగక మారుచుండునట్లే, పదార్థము నెడతెగని మార్పునొందుచున్నచో నది చల

నము గలిగియున్నదందుము. మన యనుభవమంతయు దేశకాలానుగతమైనదగుటచే, వైశేషికులు దేశకాలములు మనకు బాహ్యములై యున్నవనియు నందు ద్రవ్యాదులువచ్చి చేరుచుండుననియు నూహించిరి. దేశకాలసంబంధములు దేశమందును గాలమందును గల మన వస్తుదర్శనములచే నేర్పడినవి. మన యనుభవములోని దేశకాలలక్షణముల కాధారభూతములైన విశ్వవిశాల దేశకాలద్రవ్యము లున్నవని యూహింపవలసివచ్చె నెడ, నతివిశాలమైన స్వర్గములో నతివిశాలమైన యొకబుద్ధిని, అతివిశాలమైన యొక తేజమును, నొక యంధకారమును, మనము ప్రత్యక్ష ప్రపంచములోఁ జూచు నన్నిరకముల వస్తువుల కాధారభూతములైన యత్యంత విశాలములైన విశ్వాకృతి గల ద్రవ్యములుండవలెననియు నేల యూహింపరాదు? మన యనుభవమున కాధారభూతములైన దేశకాలములు మనయనుభవమునుండియే వచ్చినవని చెప్పుటకు వీలులేదు. దేశకాలములు విశ్వవిశాలములు విశ్వవ్యాప్తములునైన ద్రవ్యములనగా, నేవస్తువైనను దేశమందున్నదనియు, నేది తటస్థించినను గాలమందుఁ దటస్థించుననియు నభిప్రాయము. జగద్వస్తువులన్నియుఁ జలనముగలిగియున్నవి, అనగా స్థలము నాక్రమించుననియుఁ గాలవశములై ప్రవర్తించుననియుఁ దెలియవలెను. వస్తురహితమైన దేశమును, సంఘటనాశూన్యమగు కాలమును ద్రవ్యములని వారియభిప్రాయము. దేశకాలలక్షణ లక్షితములగు మన యనుభవమునకుఁ గారణములనుజూపు నిమిత్తము వైశేషికు లనంత దేశ కాలాస్తిత్వము నూహించి ప్రతిపాదించిరి

కాని, యవి తాత్త్వికభావకల్పనములే కాని యథార్థస్థితి గలవికావు.

కాలభేదములులేని దేశము కేవల మర్థరహితముకాదు కాని, మార్పులు, చలనములును లేనిదేదియును లేదు; సంబంధించు వస్తువులులేని సంబంధము లేనట్లే. కాలము యథార్థ వస్త్వస్తీతమై యున్నది. కాలము వస్తు నానాత్వమును సూచింపదు. ఒకే ద్రవ్యములోఁ గాలగతి యుండవచ్చును. ఒక మనుజుఁడు స్వభావపరివర్తన మందవచ్చును. ఒక పుష్పము వర్ణభేదమును బొందనగును. దేశము స్థలదూరత్వాది గుణసహితమగుటచే దానికి యథార్థ వస్త్వస్తిత్వ మవసరము. కేవల కాలమట్టి వివిధ వస్త్వస్తిత్వమును గోరదు. ఒక యథార్థవస్తువన్యాధారమును గోరనిరీతినే వివిధవస్తువులుండుట కాలమున కవసరముకాదు.

అణ్వస్తిత్వమును స్థాపించుట కుపయోగించిన హేతువులను దేశకాలాస్తిత్వమును దెల్పుట కుపయోగించలేదు. కాలముయొక్క అవిచ్ఛిన్నత అవిభాజ్యములగు వేర్వేరు క్షణములవలనఁ గలిగినదనికాని, దేశముయొక్క అవిచ్ఛిన్నత వేర్వేరు స్థలములవలన లభించినదనికాని వైశేషికులు చెప్పలేదు. పదార్థము నశించినచో శూన్యమగునేమోయను భయముచే నవిభాజ్యములగు నణువులున్నవని చెప్పుకొనవలసివచ్చిన యెడల, దేశకాలముల యవిచ్ఛిన్నత నదేతీరున నవిభాజ్యములగు భిన్నస్థలక్షణములచేఁ గలిగెనని చెప్పవలసియుండును. దేశకాలముల విషయమున, ననంతమైన దేశముకాని కాలముకాని

యున్నదనుట సమంజసమైనచో, భౌతికప్రపంచ కారణమును జెప్పుటకైన నొక విశ్వవ్యాప్తమగు పదార్థమున్నదని సులభముగాఁ జెప్పవచ్చును. వస్తువు లన్యోన్య మొక సంబంధము గలిగియుండగా నట్టిది దేశసంబంధమనియు, క్షణము లొక సంబంధమును గలిగియుండుటచే నవి కాలసంబంధములనియుఁ జెప్పుచున్నాము. మన యనుభవములకు వస్తుసంబంధములే దేశకాలములని వ్యవహరించుచుంటిమి. ఈ దేశకాలసంబంధములు మనకుఁ బ్రత్యక్షానుభవాంశములు. కాని విశ్వవ్యాప్తములైయున్న దేశకాలములలో వస్తుసంఘటనములు గలుగుచుండునను సిద్ధాంతము నిత్యమగు నణుద్రవ్య సంపత్తిని గోరును. ఇది కేవలము తాత్త్వికభావకల్పనమే. ఒక విశ్వవ్యాప్తమగు దేశమును, విశ్వవ్యాప్తమై యున్న కాలమును, నిత్యములైయున్న యణు సముచ్చయమును యథార్థ విషయములు కావు; అవి కేవల భావకల్పిత విషయములే.౧. గుణముల కాధారభూతమైనది ద్రవ్యమనునయుక్త నిర్వచనమువలననే, వైశేషికులు దేశకాలాదులు ద్రవ్యములని తలపవలసివచ్చినది. పదార్థము దేశకాలములందు నిండియున్నది; మనము సరిగాఁ జెప్పుకొనవలసినచో జగత్స్వరూపమునకు మూలకారణమైనది దేశ-కాల-పదార్థ-సంపుటియని చెప్ప

(౧) పోల్చు. వైట్ హెడ్. "విషయము లోకసిద్ధాంతముగానున్న దేశములోఁగాని, కాలములోఁగాని, నిత్యముగానున్న యొక పదార్థమునఁగాని తటస్థించుచున్నవని భావింపరాదు. ప్రాచీనసంబంధ సిద్ధాంతమునను సరించి, దేశకాలములు వస్తుసంబంధములు; మనసిద్ధాంతమునను సరించి, యవి విషయసంబంధములు" (ఎంక్వైరీ. పు ౨౬)

వలెను; వైశేషికు లీ భావము నస్పష్టముగా గ్రహించిరి. ఆకాశము, దేశము, కాలము నొకే యథార్థస్వరూపమనియు, వానివలనఁగలుగు భిన్న కార్యములవలన, మూడుగా వ్యవహరింపబడుచున్నవనియు శివాదిత్యుఁడు చెప్పియున్నాఁడు. ఈ భావమునే చంద్రకాంత తర్కాలంకారుఁడు సమర్థించినాఁడు. కణాదుననుసరించి, దేశ కాలాకాశము లొకేదవ్యమైనను, భిన్న ఫలితముల చేతను, భిన్న బాహ్యావస్థ 3 లచేతను భిన్నములుగాఁ జెప్పఁబడుచున్నవనియు నీతఁడు వాదించియున్నాఁడు. పకృతిస్వభావమునుజూచి గ్రహించిన భావములు. అనంతర నైయాయికులు దేశకాలము లీశ్వరుని భిన్నరూపములనిరి. ४.

విజ్ఞానమొక పవృత్తి; ఒకదవ్యమున కచేతనజగత్తుతోఁగల సంబంధములఫలితముగాఁ బదర్శింపఁబడు గుణము. జీవునకు గుణములతోఁగలది సమవాయసంబంధము. ఆత్మకును జ్ఞానాదిగుణములకునుగల సంబంధమునుగూర్చి శంకరుఁడు చర్చించినాఁడు. ఆత్మ నిత్యమును, గుణము లనిత్యములు నగుటచే రెంటికి సమానపదవిని వైశేషికమీయఁజాలదని యాతఁడు వాదించినాఁడు. రెంటికిని సమానపదవి నొసఁగి

(౨) ఆకాశాదిత్రయంతు వస్తుతః ఏకమేవ ఉపాధిభేదాన్నానాభూతమ్ (సప్తదార్థి పు ౧౭.)

(3)

(४) అథల్యే తర్కసంగ్రహము. పు ౧౩౧.

నచో గుణరహితమైనస్థితి యాత్మకెన్నఁడు నుండఁజాలదు. అనఁగా గుణములవలెనే, ఆత్మయు ననిత్యముకావలెను. ౧. మానసికజీవితము సంకుచితమైనదగుటకుఁ గారణము మనస్సణు రూపమైనదని చెప్పఁబడెను; కాని ఆత్మకును మనస్సునకును సరియైనసంబంధము జెప్పుట కష్టమగును. ఆత్మకును విజ్ఞాన గుణమునకును భేదమున్నదని వైశేషికులు చెప్పుటలో వారు కేవల మచేతనసంబంధమునే తీసికొనిరి. మనమనస్సునకు బాహ్యముననున్న యింకొకదానితో సంపర్కమువలన మన యనుభవ ముదయించుచున్నదను భావమువలననే, మనమిది వరలోఁ బెక్కుసార్లు చూచియున్నట్లే, మనయనుభవ మర్థ రహితమగుచున్నది. ఆత్మయొక్క మూలస్వరూప మెట్టిదో మన మెఱుఁగము. ఆత్మయొక్కగుణములైన సుఖదుఃఖములు, జ్ఞానము మున్నగునవి అచేతనజీవులు నచేతనాణువులు గలియు టచే సంభవించును. ఆత్మ స్వతంత్రితగాంచినంతనే, గుణము లదృశ్యములగును; ముక్తాత్మ, గుణరహితమై, స్వగతభేదరహిత మగుటచే నది వాస్తవికతలేనిదగును. దృశ్యములో ద్రిష్ట లీన మగుచున్నది; తానెఱిఁగిన జగన్నిర్మాణమునకు సహకార మొనర్చు సృజనాత్మకమైన కేంద్రిమే మానవుఁడు. తత్త్వ శాస్త్రమునకు సమస్యయైన యనుభవము మనస్సంబంధము లేని ప్రికృతికాని, ప్రికృతిసంబంధములేని మనస్సుకాని కాదు. మానసిక భౌతికవస్తువులు సర్వథా సంపూర్ణసన్నిహితసంబంధ

మును గలిగియున్నవి. సర్వాధారము విజ్ఞానమేకాని, బాహ్యరూపములుకావు. అణువులు, ప్రకృత్తులు విషయములుగాఁగల భౌతికశాస్త్రవేత్తలును, జీవులు, గుణములుగల మనస్తత్త్వశాస్త్రజ్ఞులును వాస్తవికతలేని భావకల్పనముల కస్తిత్వము గలదను భ్రాంతికి వశులగుట నూతనవిషయముకాదు. పరమాత్మేతరమైన సర్వమును జగత్పరిణామ రూపములేయను నద్వైతులయొక్కయు, సాంఖ్యులయొక్కయు నిర్ణయమునకు విశేషసామంజస్యమున్నదనుట సత్యదూరముకాదు.

న్యాయతత్త్వవిచారణకాలమందు జీవానేకత్వసిద్ధాంతమున కాధారములేదని చూపియుంటిమి. ఇచట మనకొకవైపున జీవకోటియు నింకొకవైపున దేశకాల పదార్థసంపుటియు నున్నది. రెండవదాని ప్రధానలక్షణము ప్రవాహరూపము; అందుచే సాంఖ్యులు దీనికిఁ బ్రకృతియని నామకరణముచేసిరి. పురుషప్రకృతి సిద్ధాంతమును బ్రతిపాదించిన సాంఖ్యసిద్ధాంతము న్యాయవైశేషిక తత్త్వమునకొక యడుగు ముందుకువేసినది.

సూక్ష్మపరిశీలనమువలన, సంబంధములు, గుణములు ప్రధానములైన పురుషప్రకృతిరూపముల కనుబంధములైయున్నవని తెలియఁగలదు. ఋగ్వేదమునందును, బైబిలులోని జగదుత్పత్త్యధ్యాయమందును, అవ్యక్తస్థితినుండి, యీశ్వరుని ధ్యానశక్తిచే, భిన్నాంతరువులుగల జీవకోటియు జడజగత్తు నుదయించెనను సూచనలో గంభీరార్థమిమిడియున్నదని చెప్పవగును. పూర్ణతగలిగిన ద్రవ్యమే యథార్థాస్తిత్వముగలదని

చెప్పవలెను. సృష్టిలో నెచటనుగాని దేశకాలగతమై సంపూర్ణమైన ద్రవ్యమును మనము చూచియుండలేదు. వస్తువులకు పృథక్త్వము నాపాదించునవధులను మన మూహింపఁజాలము, దశాభేదములుగల పృథక్త్వములున్నవి; సృష్టిలో నుత్తమ వ్యక్తిత్వముగలవాఁడు పరిచ్ఛిన్న మానవుఁడే; ఆతఁడును స్వయంసంపూర్ణుఁడుగాఁడు. పరిచ్ఛిన్న మానసములను, ప్రకృతినిఁ గూడఁ దనలో లీనమొనర్చుకొనఁగలిగినదే నిజమైనవ్యక్తిత్వము. పరిణామప్రవాహములో దృశ్యమగుచు నదృశ్యమగుచుఁ బోవుచున్న జగద్రూపమే పరమసత్యస్వరూపము నేకము నవిచ్ఛిన్నమునగు సత్పదార్థప్రతిబింబము. ప్రకృతి యొకయనంత ప్రవాహము, నన్యోన్యసంబంధరూపము. దేశమును భిన్న స్థలములుగాను, గాలము ననేకక్షణములుగాను, పదార్థము ననేకాణువులుగాను విభాగింపవచ్చును. కాని, మనమిదివరకే చూచినరీతిని, జగత్తునొక దేశముగనో, కాలముగనో, పదార్థముగనో దర్శింపఁజాలము; అది దేశ కాల పదార్థసంపుటి; ప్రకృతి నిర్మాణసామగ్రి; ఇందలిభాగములన్నిటిని భిన్నవస్తువులనరాదు; భిన్నరూపములే.

ఏదృక్పథమునుండి చూచినను, వైశేషికపదార్థ సిద్ధాంతము లోపభూయిష్టమైయున్నది. వ్యవహారజీవితరంగమునందు వాని కర్థమున్నదని యందుమా, వ్యవహారములో మనము చూచు భేదములన్నిటికి ననుగుణముగాఁ బదార్థములను జెప్పి యుండలేదు; లక్ష్యములు సాధనములు నట్టివే. వైశేషిక

పదార్థములు, ప్రత్యక్షజగత్తున కర్థముచెప్పు తాత్త్వికభావము లందుమూ, లోకములోని సర్వపరివర్తనములు, భిన్నత్వ ములు నేకనూత్రబద్ధములని చూపవచ్చును. జీవాత్మలును ప్రకృతియు నిత్యపరిణామమున నన్యోన్యాధారభూతములైన భిన్న రూపములని చెప్పనొప్పును. ఆత్మ సత్పదార్థములలో నొక యంశమనియు, దానికిని జడపదార్థమునకును విశేష భేదమున్న దనియుఁ జెప్పిన వైశేషికభావము సముచితమైనదే.

బాహ్య జగత్స్వరూపమంతయును నిత్యపరిణామ ప్రవా హరూపమైన ప్రకృతియే యన్నచో, నిందాత్మ కెట్టి స్థాన మీయవలయును? ఇది జ్ఞానసిద్ధాంతసమస్య. జీవాత్మకొక నిష్క్రియాత్మకమైన మనస్సుగలదనియు, బాహ్యజగత్తు తన స్వభావానుగుణములైన భావములనందుఁ బ్రవేశపెట్టుచుండు ననియుఁ జెప్పిన న్యాయభావమును వైశేషికమంగీకరించినది యుక్తిదూరమని మనము చూచియున్నాము. జడపదార్థ పరిశీలనమే వైశేషికతత్త్వ దృష్టినంతను వశపఱచుకొన్నది. భౌతిక తత్త్వఛాయలు వెనుకనున్న వస్తుసత్యమును మఱుగు పఱచినవి; అందుచే నణుస్వభావముగలవే జీవులనియు, స్వభా వముచే నవియు విజ్ఞానశూన్యములనియుఁ జెప్పఁబడినది.

అణువులు జీవులు, దేశము కాలము, ననునవి కేవల సంకేతములే; మనయనుభవమే వానికిఁగల యర్థము. వైశేషి కులు వాని నాధారముగాఁగొని తమ సిద్ధాంతములను నిర్మిం చిరి. మనముచూచు జగత్తులోని భిన్నరూపముల కివి కేవల

సంకేతములుమాత్రమే. న్యాయతత్త్వ విమర్శనమునందిదివఱకు మనముచూచి యున్నట్లే, భౌతిక మానసిక వస్తుజగత్తులు నిజమగు నైకైకవిజ్ఞానాంతర్గతములై యున్నవి. అది మానసికవిజ్ఞానమని పొరపడరాదు. ద్రష్టృదృశ్యభేదముల కేకాధారమదియే. ఈవిషయము నంగీకరించినఁగాని, సృష్టిక్రమమునకుఁగాని మనుష్య జంతు వృక్షలతాభరితమైన ప్రకృతికిఁగాని వైశేషికులు సరియగు హేతువులను జూపఁజాలరు. అదృష్టమను దానికీహేతుత్వము నంటఁగట్టుటయు హేతులోపమే యగును; పరిపూర్ణ విజ్ఞానస్వరూపునిగా మారువఱకును నీశ్వరుఁడైన నదృష్టస్థానము నాక్రమింపఁజాలఁడు భిన్నరూపములున్నను దనయేకత్వమున కిబ్బందిలేనిది ద్రవ్యమైనచో, నప్పుడు లోకములో మనము చూచు భిన్నగుణస్వరూపను లోకేపరమాత్మయొక్క-భిన్నాకృతులని సమన్వయించుటలో నెట్టికష్టమునుండదు. తాను చేసినప్రకృతి పరిశీలనాఫలితముల నేకముఖమునకుఁ దెచ్చి, సమన్వయ స్వరూపనిర్మాణము చేయకుండుటే వైశేషిక సిద్ధాంతలోపము. ఎవఁడు సర్వవస్తువుల నేకసూత్రగతములఁగాఁజూచునో వాఁడే నిజముగాఁ దత్త్వజ్ఞుఁడను ప్లేటో పండితుని వాక్యము ననుసరించి, వైశేషికమొక తత్త్వమనుట కర్హతను బ్రదర్శించియుండలేదు. నానావిషయముల నొకచోఁగూర్చుట తత్త్వశాస్త్రముకాఁజాలదు. భిన్నభావభరితమైన మానవజీవిత వైవిధ్యమును వైశేషికము సముచితముగాఁ బరిశీలించియుండలేదు. భౌతికతత్త్వమును, నీతిమతాశయములను వైశేషికు లేక తత్త్వ

ముగా సమన్వయించి యుండలేదు. అణుసిద్ధాంతముతోఁ గూడిన నానాత్వము, జగద్రహస్యస్వరూపమును సమగ్రముగా నెఱుఁగఁ గోరువానికి సంతృప్తినొసఁగఁజాలదు, కాని కేవల తార్కికుని సూక్ష్మపరిశీలనము, యథార్థజగత్స్వరూపముతో సంబంధము లేని, బుద్ధిమాత్రగమ్యమగు శాస్త్రభావసంపుటికంటె నధికమైన దానినీయఁజాలదను వైశేషిక నిర్ణయముతో మేము నేకీభవింతుము. తత్త్వశాస్త్రము విమర్శింపఁగలదే, కాని, ప్రాకృతదృక్పథమునుండి పూర్తిగా విడివడఁజాలదు. ప్రాకృతదృష్టి సంపూర్ణజ్ఞానముకాదు కాని, సారవంతమైన తత్త్వజిజ్ఞాస కది ప్రథమ సోపానము, తత్త్వవిధానము ప్రాకృత దృష్టికి భిన్నమైనది. ఇంద్రియగోచరమగు జ్ఞానావధుల నెంతవఱకు విస్తరించి, యతీంద్రియసీమలో నెంతవరకుఁ బయనింపసాధ్యమో యంత వరకుఁ జొచ్చుకొనిపోవుటకుఁ దత్త్వశాస్త్రము యత్నించును. తత్త్వప్రతిభకు సాధనభూతమైన సృజనాత్మకమగు తర్కవివేకము జగదాధారమైన యొక మహోన్నత నియమమును సూచింప యత్నించును. న్యాయవైశేషిక దర్శనము లవలోకించిన సత్యాంశములనుండియే యింక నెక్కుడు తృప్తికరమైన తత్త్వమును నిరూపింప సాధ్యమగును. ముందు మనము చూడఁబోవురీతిని, "ఒకే పరమేశ్వరుఁడు; ఒకే ధర్మము; ఒకేద్రవ్యము" అను విశ్వాసమున కనుగుణమైనట్టియు నధికతృప్తినిచ్చునట్టియు దత్త్వస్వరూపమును సాంఖ్యవేదాంతములు నిర్మించినవి.

# భారతీయ తత్త్వశాస్త్రము

*

[డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణుని
'ఇండియన్ ఫిలాసఫీ' అను నాంగ్లగ్రంథమునకు
ఆంధ్రానువాదము]

*

## చతుర్థభాగము

*

బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ.,
ఆంధ్రోపన్యాసకుఁడు,
పి. ఆర్. కాలేజీ, కాకినాడ.

గ్రంథకర్త :
శ్రీ వివేకానందస్వామి జీవితము
శ్రీ రామతీర్థస్వామి జీవితము
హిందూమతము మున్నగునవి.





డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణుఁడు.



బులుసు వేంకటేశ్వరులు ఎం. ఏ.

# విషయసూచిక



## చతుర్థాధ్యాయము

### సాంఖ్యతత్త్వము

# పంచమాధ్యాయము

## పతంజలియోగతత్త్వము



# షష్ఠాధ్యాయము

## పూర్వమీమాంస

# సప్తమాధ్యాయము

## వేదాంతసూత్రములు



# అష్టమాధ్యాయము

## శంకరాద్వైతవేదాంతము

# అంకితము

గురుదేవా ! గతజన్మ పుణ్యమున నా
కు న్గల్గె నీదర్శనం
బరుదై, నీవరవాక్య దివ్యసుధ నే
నా కంఠమున్ గ్రోలి, సం
సరణాబ్ధిం దరియించు ధైర్యమును గాం
చం గల్గితిన్, సత్కృపా
భరణా ! నీవు కృతీశ్వరుండవయి ప్రో
వన్ మ్రొక్కెదన్ సద్గురూ !

# పీఠిక

'సాహిత్యభూషణ'

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ. బి. యల్.

ఆమ్నాయవాఙ్మయము జ్యోతిర్మయమైనది. ఈశ్వర కటాక్షము నంది అంతరంగ గర్భాలయమందలి పరంజ్యోతిపై నంతర్దృష్టిని సారించి తన్మయత్వమంది మంత్రద్రష్టలు ఆత్మవాక్కులందు నిగమవిభూతి నవలోకించిరి. హృదయ దిగ్వలయమునఁ దేజరిల్లిన భాస్వదాశయ మరీచికాగుచ్ఛము, వీరి రచనమున సూర్యమండలమై విలసిల్లెను. దివ్యదృష్టిగల మహర్షులు వీనిని విలోకించి ఈరచన మపౌరుషేయ మని ముక్తకంఠముతో వాకొనిరి. అతీంద్రియదృష్టిగల ఈ యతీంద్రుల సృష్టియే భారతీయ తత్త్వశాస్త్రము. ఆత్మసాక్షాత్కార, ఆత్మవిశ్వాస, ఆత్మజ్ఞానముల సంయుక్తమహిమ మిందుఁ గలదు.

భారతీయసంస్కృతికి స్వతస్సిద్ధమైన యీ ప్రభావము నెఱిఁగిన మహాపురుషుఁడే ఈ తత్త్వశాస్త్రకథనమును జగతికిఁ దెలుపఁజాలును. ఋషికులమునఁ బుట్టి ఆర్షసంప్రదాయముల ననుసరించి సాధనమార్గమున ముందంజవేయు రచయితయే, దివ్యభావానుభూతి నందిన కళోపాసకుఁడే ఈకర్తవ్యమును నిర్దుష్టముగా నిర్వహింప సమర్థుఁడు. విషయపరిజ్ఞానము మాత్రమే తాత్త్వికగ్రంథసృష్టికి సామగ్రిని బ్రసాదించునని తలఁపఁజెల్లదు. వైదుష్యమునకు దైవీసంపద మహిమను జేకూర్చును. నైసర్గిక ప్రతిభకు మననసముద్భవ భావశబలత శక్తిని బ్రసాదించును.

నిదిధ్యాసన ధ్యానధారణ సమాధి స్థితులందు పరిణతి నందిన హృదయము వాగ్దేవీపూజా మందిరమువలెఁ దేజరిల్లి ప్రాకృతపరిశీలనమున కందని మహిమను బడసి ఉపాసకుని జీవిత మందు దివ్యదృశ్యమును జూపును. ప్రాపంచికదృష్టితో సంతృప్తి పడని ఆనందవ్రతుఁడు ఈదృశ్యసందర్శనమువలన అమరత్వము నందును. ఈతని వాఙ్మయమందుఁ బీయూషజలధి గోచరించుట అబ్బురము కాదు. కేవలము భౌతికదృష్టి గల రచయిత కీతఁ డెంతదూరమున నుండునో యూహింపనగును.

భవపరంపరనుండి భారతి నారాధించుచు దివ్యశక్తి నందిన సాధకుఁడు శ్రీరాధాకృష్ణపండితుఁడు. ఈయనహృదయము శ్రమవ్రతమువలన ఆనందహ్రదమాయెను; ఈయనయూహలు సౌందర్యనిలయము లాయెను. నిలుకడవడసిన విద్యుల్లతవలె ఈమహారచయిత వాక్కులు కడుంగడు మనోహరములై విలసిల్లును. స్వర్ణద్యుతిసందీప్త శిశిరబిందువిభూషితయై మానస సరోవర వారిపూరమున నగుమోముననయై వెలయు శతపత్రి సుందరివలె ఈయన హృదయపుండరీకము ప్రఫుల్లమై ప్రమోద మరంద సంభరితమై ఈయన కృతులను అమృతసరస్సు లొనరించెను. సహస్రార కమలము వికసించినపుడు, అంతరంగమున సుధాబిందువులు కురిసినపుడు, కవీంద్రునిసూక్తులందు పీయూషమ యూఖములు వెలారుట యచ్చెరువా? శ్రీ రాధాకృష్ణుని ప్రజ్ఞ ఘనపాండితియందు మాత్రములేదు. ఆయన కవితాదృష్టి గల తాత్త్వికుఁడని, తాత్త్వికదృష్టికల గద్యకవి యని ఆయన వాఙ్మయసృష్టియును వక్తృత్వకౌశలమును దిగంతములకుఁ దెలి

పెను. వారికృతులలో నుద్గ్రంథమని వాసిగాంచిన భారతీయ తత్త్వశాస్త్రము నువలక్షించినపుడు పూర్వోక్త నిర్వచనము నకు బహుళ దృష్టాంతములు గోచరించును. సహస్రకిరణములు దినమణియందు వెలయులీల, సహస్రాబ్దములనుండి సహస్ర శాఖోపశాఖలతోఁ బరిఢవిల్లు భారతీయ తాత్త్విక వైదుష్యము ఈ మహాగ్రంథమునఁ గేంద్రీకరింపఁబడినది.

ఈమహాగ్రంథము నాంధ్రీకరించుట సామాన్య క్రియ కాదు. మాతృకలో నుల్లేఖింపఁ బడిన బహుళ శాస్త్రాంశము లను అనువాదకు లీవలలోనే పఠించి యుండవలయును; కవి హృదయము నెఱిఁగిన విమర్శకుఁడై, గ్రంథస్థగంభీరభావమును గ్రహించిన తజ్జ్ఞుఁడై, మూలగ్రంథ మందలి భాషాసౌందర్య మును గుర్తించిన రసజ్ఞుఁడై, సంస్కృతాంధ్రములం దనల్ప పాండితి నందిన ప్రజ్ఞాధురీణుఁడై, గ్రంథరచనమున సిద్ధహస్తుఁడై యున్న మహనీయుఁడే యిందులకుఁ గానలయును. ఈయన్ని శక్తులును గల శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారి యాంధ్రీకర ణము శ్రీరాధాకృష్ణుల ఆంగ్లరచనమువలె రసభరితమై, గంభీర భావబంధురమై, సర్వాంగసుందరమై యొప్పుచున్నది.

భారతీయ తాత్త్వికవీథు లందు గంధసింధురముల వలె ముందంజవేసిన పరివ్రాజిక చక్రవర్తులు పలువురున్నారు. ఒకరి కొకరు వీరు ఛాయాచిత్రములు కారు. వీరి ప్రత్యేకప్రతిభ ప్రత్యేకవ్యక్తిత్వమునఁ బ్రకటితమైనది. ఈగ్రంథభాగమున వివరింపఁబడిన సాంఖ్యతత్త్వము, పూర్వమీమాంసా వేదాంత మాత్రములు, ఒకే తాత్త్విక మహీరుహశాఖలు. సమన్వయ

దృష్టితో వీక్షించు విద్వాంసుల కిందు పొరపొచ్చెములు కాన రావు. ప్రాచీనార్వాచీన ప్రాచీప్రతీచీసంస్కృతులను సమన్వయ దృష్టితో సమీక్షించి పృథ్వీవాసులకు శాంతితారకమంత్రోపదేశము చేయు మహాపురుషుని దృక్పథమును గుర్తించి అనువాదకులు వారి వైజ్ఞానిక స్వరూపమును ఆంధ్రమహాజనుల సమక్షమున నిలిపిరి. మంచుమల పునాదికి సహపాఠియై భారతీయ తత్త్వశాస్త్రము జగతిపై నిలుచునంతకాలము, ఈయుద్గ్రంథము నిలిచి సకలసద్గుణ నికురంబయైన శారదాంబకు మిగులం గూర్చుకైసేతయై వెలయు నని విశ్వసించుచున్నాను.

---

# అనువాదకుని భూమిక.



ఒక్కమాటలోఁ జెప్పవలయునన్నచో భారతదేశచరిత్ర బ్రహ్మర్షివరేణ్యుల బ్రహ్మజ్ఞానసాధన చరిత్రయే. ఇదివఱలో మేము చెప్పియున్నరీతిగా, భారతజాతియొక్క దృష్టి శుద్ధ తాత్త్వికదృష్టి. ఇహలోకజీవితము క్షణికమైనది; దుఃఖమయ మైనది; ఎవఁ డీలోకమున జన్మించి, బ్రహ్మవేత్త కాకుండ మర ణించునో వాఁడు కడు నికృష్టజీవి; బ్రహ్మజ్ఞానసంపాదనమునకు తపస్సే శ్రేష్ఠతమమార్గము (తపసా బ్రహ్మవిజిజ్ఞాసస్వ); పరమాత్మయొక్కటే పరమసత్యమగు వస్తువు; అందుచే నదియే విని, యాలోచించి, దానినిగూర్చియే ధ్యానించి, పొందఁదగిన దను మూలసిద్ధాంతము భారతజాతిహృదయములోని ప్రధాన రక్తనాళమై యుగములు ప్రసరించినది.

పరమసత్య దర్శనమున కాంతరంగిక తపోమార్గమే స్వచ్ఛము, పవిత్రము, నిశ్చయమునైన మార్గము. అందుచేఁ బ్రాచీనమహర్షులు బాహ్యప్రకృతిని స్వాధీనమొనర్చుకొని సర్వ శక్తులను బొందఁగలిగియు నది కాలహరణమొనర్చు వ్యర్థ ప్రయాసయని తృణీకరించిరి. కాని, నేఁటి పాశ్చాత్య ప్రకృతి శాస్త్రపండితులు సత్యాన్వేషణపరాయణులయ్యు సత్యసాధ నమునకు నిర్దుష్టమగు నాంతరంగికప్రకృత్యతీతమైన తపోమార్గ మునకు రాఁజాలరైరి. దీనికిఁ గారణము వారి దృష్టి బాహ్య దృష్టి; బుద్ధిబలముచేతనే బుద్ధ్యతీతమగుపరమసత్యమును సాధింప (గలమను మార్గ్యమునుండి వారు విడివడఁజాలకున్నారు.

కొలఁది ప్రకృతిశక్తులను కనుఁగొని, వానినిదృఢీకరించిముందుకు బోయి పూర్ణసత్యాన్వేషణ మొనర్చుటకు బదులుగా, నీ శక్తులను సామ్రాజ్యనేతల చేతులలోఁబెట్టి, దారుణప్రపంచ మారణోత్సవకారకు లగుచున్నారు. కాని, నేఁటి పాశ్చాత్య ప్రకృతిశాస్త్ర పండితులైనను, తమబాహ్యశక్తి ప్రయోగముల వలనఁ బరమార్థము దూరమగుటయేకాక, యిహలోకము నరకప్రాయమైనదని తెలిసినవెంటనే, యీబాహ్యమార్గమును విసర్జించి, తపోమార్గమును పట్టితీరవలయు దినములు వచ్చి తీరును.

ఆంతరంగికాత్మ ప్రపంచసౌందర్య మనంతానంద రస స్ఫూర్తి గలిగినది; దానితోఁబోల్చినచో బాహ్యప్రపంచ సౌందర్యము మిక్కిలి పేలవమైనది. ప్రాచీన భారతీయ మేధావు, లాత్మజ్ఞాన ప్రపంచమున, నిరంతర విహార మొనర్చి, అగణిత భిన్నఘట్ట పథములలో సత్యజ్యోతి యెట్లు ప్రకాశించునో గ్రహించి, లోకసంగ్రహార్థము వివరించియున్నారు. కపిల సాంఖ్యము, పతంజలియోగము, జైమినీయపూర్వమీమాంసా సూత్రము, భారతీయతత్త్వప్రజ్ఞ మేరుశిఖర ప్రమాణ సౌంద ర్యముగలదని తెలిపినవి. అనంతరము గౌడ పాదాచార్య కృతకారికలు, నావెనుక శ్రీమచ్ఛంకరాచార్యుల మహాభాష్య ములు తత్త్వశాస్త్ర విషయములో నిఁక చెప్పవలసినదేమియు మిగులకుండఁజేసినవి. వైదికమత మొక మహోత్తుంగ వృక్ష రాజమైనచో నీభిన్నతత్త్వసిద్ధాంతములు, సూత్రములు, భాష్య ములు పరస్పర సమన్వయ సిద్ధిగల శాఖోపశాఖాసముదాయ

మని చెప్పనగును. కేంద్రసత్యమగు పరమాత్మజ్ఞానమున కివి యన్నియు సోపానములే.

శ్రీ రాధాకృష్ణపండితుఁ డీభిన్నసిద్ధాంతములను కాళిదాస మహాకవి శాకుంతలాది రూపకములను తీర్చిదిద్దిన నేర్పుతో రచించినాఁడు. నిష్పక్షపాతబుద్ధితో నాయాతత్త్వముల విశేషములను, పరస్పరసంబంధములను, మహత్త్వౌచిత్య, నవ్యత్వ, కమనీయత్వముల నాతఁడు తన సహజానన్య సామాన్యశైలిలో రచించి, అభినవజగత్తునకు మహోపకృతి నొనర్చి యున్నాఁడు.

ఇది నాల్గవభాగము. శంకరాద్వైతమంతయు నిందుఁ బ్రకటించుటకు వీలు లేకపోవుటచేఁ గొంత పంచమభాగమునకు విడువవలసివచ్చినది. శ్రీశంకరాద్వైతము సహజముగా నఖండప్రజ్ఞానైశిత్య సౌందర్యమహితమైనది. శ్రీరాధాకృష్ణుఁడద్దాని నావిష్కరించుటలోఁ దన్మయుఁడై, అనితరసాధ్యరచనా వైదగ్ధ్యమును ప్రదర్శించినాఁడు. ఐదవభాగముతో నీభారతీయతత్త్వశాస్త్రము పూర్తియగును ఆంధ్రమహాజనులు ప్రేమతో దీని నాదరింతురని నమ్ముచున్నాము. అడిగినవెంటనే పీఠిక వ్రాసియిచ్చిన శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారికి, ఈగ్రంథభాగముద్రణమునకుఁ జెరియొకశతమును బంపి యభిమానించిన శ్రీ ముప్పన సోమరాజుగారికిని, శ్రీకాల్లూరి రామచంద్రసత్యనారాయణరావుగారికిని, నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

విధేయుఁడు,
బులుసు వేంకటేశ్వరులు.

ఓం

# భారతీయతత్త్వశాస్త్రము

---

## చతుర్థాధ్యాయము

---

### సాంఖ్యతత్త్వము

---

#### ౧—ఉపోద్ఘాతము.

---

విజ్ఞానముయొక్క సాంప్రదాయికపంథ యనఁబడు విధానమున కొక యడుగు ముందుకుఁ బెట్టినదే సాంఖ్యతత్త్వము. అవిచ్ఛిన్నతా సూత్రోద్ఘాటనమువలన నీతత్త్వము కొంతవరకు జగత్స్వరూపమును పరస్పరసంబంధములేని పదార్థములను విడి పొట్లములనుగట్టి చూపు విధానమునకు స్వస్తిచెప్పినది. క్లిష్టము ప్రవాహరూపమునైన సృష్టి కర్మముచెప్పు విషయములో న్యాయవైశేషికు లుపయోగించిన, స్థాణురూపము దాల్చిన పదార్థసిద్ధాంతము నవలఁద్రోసి, అణునానాత్వ సిద్ధాంతమును వెనుకవిడిచి, సాంఖ్యతత్త్వము చెప్పఁదగిన పురోగమన మొనర్చినది. సృష్టిస్థానమునఁ బరిణామమునుంచి, ప్రకృత్యతీత మత మూలాధారములను గొంత యిది సడలించివేసినది. పరమేశ్వరుఁడు తనయేకైకసంకల్ప క్రియామూలమున విశ్వసృష్టిని

గల్పించెనను భావము నిరసింపఁబడెను; అనంతజీవకోటికిని, నిత్యక్రియాశీలమగు ప్రకృతికి నన్యోన్యసంపర్కముచే, ననఁగా ప్లేటో వాక్యములలో "సర్వజీవ పరంపరలకును నిలయమును మాతృస్వరూపమునై"న౧. ప్రకృతిసంపర్కముచే జగ ముద యించెనని నిర్ణయింపఁబడెను.

ద్రష్టృదృశ్య భేదములతోఁగూడిన విజ్ఞానలక్షణము నను సరించి, పురుషులు, ప్రకృతియు యథార్థములని సాంఖ్యతత్త్వ మూహించినది. జ్ఞేయమగు వస్తువు, తెలియు జీవియు నున్నవని నమ్మకున్నచో మన యనుభవమున కర్థముండదు. మన యను భవ మెందుకున్నది; యెట్లున్నది మున్నగు విషయములఁగూర్చి వివేకవిలసితమగు విజ్ఞానము నొసఁగుటకు సాంఖ్యము యత్నించి నది. సాంఖ్యతత్త్వమునుగూర్చి ప్రత్యేకకృషిచేసిన రిచార్డ్ గార్బే యిట్లు నుడివినాఁడు; "ప్రపంచ చరిత్రమందు మొట్ట మొదటిసారి కపిలసిద్ధాంతములో మానవ మానసముయొక్క సంపూర్ణస్వాతంత్ర్యమును, స్వీయసామర్థ్యమం దఖండవిశ్వాస మును ప్రదర్శింపఁబడినవి."౧. "భారతవర్షమున నుదయించిన విజ్ఞానరాశిలో నిది యత్యంతభావ విశిష్టతగల తత్త్వశాస్త్రమని చెప్పవచ్చును."౨. దీనియందుఁ గొంతవర కతిశయోక్తిగలదని

(౧) మఱియుఁజూడుము: ఎన్నీడ్సు. ౩, ౬, ౧౩; ఇ. టి. మెకెన్నా; వాల్యూము: ౨. పు ౮౬.

(౧) ఫిలాసఫీ ఆఫ్ ఏన్షెంట్ ఇండియా॥ పు ౩౦. మఱియుఁజూడుము డేవీస్॥ పు ౯.

(౨) సాంఖ్యప్రవచనసూత్రము: పు ౧౮.

తలఁచువారైనను, పరిశుద్ధ తత్త్వశాస్త్ర వికాసములో నిది యొక విఖ్యాత పరిణతియని యంగీకరింపవచ్చును.

సిద్ధాంతరూపమైన పరిశీలనమువలన నిర్ణయములు చేయ సమకట్టిన కారణముచే నిది సాంఖ్యశాస్త్రమను నామమును గాంచినది. సంఖ్యాశబ్దభవమే సాంఖ్యమనియు,3. జగత్స్వరూపమును గొన్ని సంఖ్యలుగల తత్త్వములుగా విభాగించి చెప్పుటచే నీనామము సముచితమై యున్నదనియుఁ గొందరు భావించిరి. కాని యీ పరిగణనవిధాన మొక్క సాంఖ్యమున కేకాక సర్వ హిందూతత్త్వములకును సామాన్యలక్షణమై యున్నది. పురాతన గ్రంథములలో 'సంఖ్య'యనగాఁ దత్త్వవిచారమనియే కాని, విషయపరిగణన మను నర్థములో నుపయోగింపఁబడలేదు.౪. పురుషునియొక్కయుఁ దదితర తత్త్వములయొక్కయు,

(3) గార్బే: ఫిలాసఫీ ఆఫ్ ఏన్షెంట్ ఇండియా: పు ౪౮. మహాభారతము సాంఖ్యమునుపరిసంఖ్యాన మనెను. చూ: ౧౨, ౧౧౩౯-౩; ౧౨, ౧౧౪౦౯; ౧౧౪౧౦. వింటర్నిట్జ్ చెప్పినాఁడు: "పైథాగరస్ భారతీయ సాంఖ్యతత్త్వప్రభావము ననుసరించెను." (కలకత్తా రివ్యూ: ౧౯౨౪. పు౨౭.)

(౪) పోల్చు: మ॥ భా॥ ౧౨, ౧౧౯-౩౪.

"దోషాణాంచ గుణానాంచప్రమాణం ప్రవిభాగతః।
కంచిదర్థమభిప్రేత్య సాసంఖ్యే త్యుపధార్యతామ్॥

ఒక యర్థనిర్ణయము చేయునప్పుడు గుణదోష పరిగణనము చేయుటయే సంఖ్యయని చెప్పవచ్చును. సంఖ్యయనగా నెప్పుడును బరిగణనార్థము నేచెప్పరాదు. విష్ణు సహస్రనామ భాష్యములో శంకరుఁడు "శుద్ధాత్మ తత్త్వవిజ్ఞానమ్ సాంఖ్యమిత్యభిధీయతే" యను వాక్యము నుదాహరించినాఁడు. చూ: హా.ల్. సాంఖ్యసారము పు ౫.

స్వరూపమునుగ౧. సమ్యక్ శీలనముచే నీతత్త్వము వివరించును గాన దీనికీనామము సముచితమైయున్నది.౨.

౨–సాంఖ్యపూర్వగాథ.

విజ్ఞానచరిత్రమందుఁ బూర్తిగా నూతనమైన విషయ ముండదు. సర్వతోముఖమైన యొక విజ్ఞానతత్త్వమేయొక మానవుని ప్రత్యేక ప్రజ్ఞనుండియు నుదయింపదు. ఒక నూత్న సిద్ధాంతమును నిర్మించుటకుఁ దత్కర్తకు వలయు భావసామగ్రి తత్పూర్వమే వ్యాప్తిగాంచియుండవలెను. ఋగ్వేదమునందు సృష్టిక్రమమును వివరించు సందర్భములో సాంఖ్యప్రకృతిపురుష సిద్ధాంత సూచనలను గొన్నిటి నుదాహరించియుంటిమి. మన ముపనిషత్తులకు వచ్చునప్పటి కందు వివిధోపదేశములలో సాంఖ్యతత్త్వ ప్రధానభావములన్నియు గోచరించును. ఉపనిష త్కర్తలందరు నొకేరీతి నూహించియుండలేదు. కొందరు, తాము నిర్మింపకున్నను, సాంఖ్యతత్త్వ నిర్మాణమునకు వలయు భావములను బ్రకటించియున్నారు. తన కుపనిషత్తులే యాధార మని సాంఖ్యతత్త్వము చెప్పుకొనుటలో, సాంఖ్య ద్వైతమున కుపనిషన్మతము పూర్తిగా విరుద్ధమైనను, గొంతయాధారము లేకపోలేదు. ఉపనిషత్తులలోని ప్రకృతినిగూర్చిన భావములు సాంఖ్యతత్త్వమున నధికప్రాముఖ్యమును గాంచినవి. మొదటి

---

(౧) సమ్యగ్వివేకే నాత్మకథనమ్॥

(౨) శంఖుఁడను మూలపురుషుని వలన సాంఖ్యమను నామమేర్పడె నని తలఁపఁబడెనుకాని దీనికాధారములేదు. చూ:హాల్. సాంఖ్యసారము పు. 3.

హారి సాంఖ్య శబ్దమును శ్వేతాశ్వతరము[౩]. స్మరించినది; కాని సాంఖ్యతత్త్వములోని భిన్నాంశములుమాత్ర మితరములగు నుపనిషత్తులలో నున్నవి. పునర్జన్మభావము; ఇహలోక మసంతృప్తిహేతువను తలంపునుగాక, మోక్షమునకు జ్ఞానమే సాధనము, పురుషుఁడే శుద్ధద్రష్ట మున్నగు ప్రధాన నియమావళియు నుపనిషత్తులనుండియే గ్రహింపఁబడెను.[౪] కఠోపనిషత్తునందుఁ. జడ జగత్పరిణామ పరంపర కగ్రస్థానము నాక్రమించినది 'అవ్యక్త'ము; దానినుండియే మహదాత్మయు, బుద్ధి, మనస్సు, ఇంద్రియములు,వస్తువులు.క్రమముగా నుదయించినవి. అహంకారము చెప్పఁబడలేదు. పరమాత్మ వచింపఁబడినది. సాంఖ్యతత్త్వజ్ఞులు తా ముపయోగించిన భావములలో నివియే ప్రాచీనతమములు. ప్రకృతి ప్రథమసంతానము మహత్తు; ప్రళయానంతరము సృష్టి కారంభమునందు, మూలప్రకృతి పదార్థము[౨].ను సృజించినవెనుక పరమాత్మ ప్రథమజుఁడుగాఁ దన్నుఁదానే సృజించుకొను నను నుపనిషద్భావమే యిది. మనఃప్రవృత్తివర్గీకరణము ప్రశ్నోపనిషత్తు నందలి జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థల ననుసరించి గ్రహింపఁబడియుండనగును.[౩] సృష్టిక్రమ

(౩) ౬, ౧౩.

(౪) బృ॥ ఆ॥ ఉ॥ ౨, ౪, ౧౪; ౩, ౪, ౨; ౪, ౩, ౧౯; ముండక ఉ॥ ౩, ౧, ౧.

(౧) ౩, ౧౦-౧౧; ౬, ౭-౧౧. పోల్చు ఛాం. ఉ. ౬, ౮, ౬

(౨) రా॥ వే॥ ౧౦, ౧౨౯, ౧. పోల్చు మ॥ భా॥ ౧౨, ౩౧౧, ౩.

(౩) ౪౫. పోల్చు. సాంఖ్యుల సూక్ష్మశరీరమును నీ యుపనిషత్తులోఁ జెప్పిన షోడశకళాన్వితుఁడగు పురుషునితో.

మును గూర్చిన సాంఖ్యభావములకంటె నధికవికాసమందిన భావములు శ్వేతాశ్వతరోపనిషత్తునందు[౪] గలవు. కాని సాంఖ్య గుణత్రయము మున్నగు సూత్రములన్నియు నుపనిషత్తులో దైవతత్త్వమున కనుబంధముగాఁ జేయఁబడినవి. ప్రధానము నకును మాయకును, పరబ్రహ్మకును పురుషునకు నందభేదము చెప్పఁబడెను.[౫] బుద్ధునితర్వాత యుగమునకుఁజెందిన మైత్రాయణ్యుపనిషత్తు,[౬] విశేషాభివృద్ధినొందిన సాంఖ్యతత్త్వ పరిచయముగలిగి, తన్మాత్రలను,[౭] మూడుగుణములను,[౮] ప్రకృతి పురుషభేదమును వివరించియుండెను.[౯] ఈశబ్దముల నన్నిటిని సామాన్యార్థమందును, నిశ్చితార్థ రహితముగను నుపనిషత్తు లుపయోగించినవి; అనంతర తత్త్వములు వీనికి స్థిరములగు నర్థ సిద్ధాంతకల్పనము చేసినవి. ఒకపూర్వభౌతికమతశాఖనుండి పెంపొందినదే సాంఖ్యతత్త్వమని చెప్పిన జాకోబీభావమున కాధారము లేదు. ఆత్మసర్వస్వతంత్రమైనది, పరిపూర్ణవాస్తవికతకలది

(౪) చూ॥ శ్వే॥ అ॥ ఉ॥ ౧, ౪; ౪, ౫.

(౫) ౧, ౧౦; ౪, ౩, ౧౨; ౪, ౧.

(౬) చూ॥ కీత్: సాంఖ్యము. పుటలు ౧౪-౧౫. నృసింహతాపనీయ, గర్భ, చూళికోపనిషత్తులు విశేషముగా సాంఖ్యసిద్ధాంతముననుసరించినవి.

(౭) ౩, ౨; ఛాం॥ ఉ॥ ౬, ౩.

(౮) ౨, ౫; ఛాందోగ్యోపనిషత్తునందును, శ్వేతాశ్వతరోపనిషత్తునందును జెప్పఁబడిన త్రివర్ణములననుసరించి గుణత్రయసాంఖ్యసిద్ధాంతము కల్పితమని కొందరు చెప్పూరు.

(౯) ౬, ౧౦. పోల్చు. కీత్ "వివరములలో సాంఖ్యమందున్న దెల్ల నుపనిషత్తులలో నెచటనో యొకచోట నున్నది."(సాంఖ్యము పు ౬౦౪

యని నిర్ణయించుటచే, మానసికవ్యాపారములకు భౌతికార్థములను జెప్పు నాస్తికవాదులకు సాంఖ్యము శాశ్వతముగా వ్యతిరేకమని ఋజువుచేసికొన్నది. సాంఖ్యతత్త్వవికాసమున నేఘట్టమందునుగూడ దానికి భౌతికవాద సంపర్కమున్నట్లు సాక్ష్యము లేదు.

సాంఖ్యమునకుఁ బ్రాచీన బౌద్ధముతోఁగల సంబంధము ననుసరించి, పరస్పరభావ సంగ్రహణము శంకింపబడినది. మనకు నేఁడులభించు సాంఖ్యగ్రంథములు బౌద్ధమతారంభమున కనంతర కాలమునుండి వచ్చినవేయైనను, బౌద్ధసిద్ధాంతముల ప్రభావ సంపర్కము గొంతయున్నను, సాంఖ్యభావములు మాత్రము బుద్ధునిపూర్వగ యుగమునకుఁ జెందినవేయనియు, సాంఖ్యతత్త్వమున కాధారము బౌద్ధతత్త్వముకాదనియుఁ జెప్పవలసియున్నది. దుఃఖము జీవితమందు నిశ్చయమనునదియు, వైదికకర్మకలాపము

---

(౧) "బుద్ధునికిఁ బూర్వమందే సాంఖ్యయోగతత్త్వములు వ్యాప్తిలో నున్నవనుట కమోఘములగు నాధారములపరిమితములుగా హిందూబౌద్ధ గ్రంథములలోఁ గలవు" (రాజేంద్రలాల్ మైత్ర: యోగసూత్రములు, పు. ౧౬) చూ. గార్బే. సాంఖ్యప్రవచనసూత్రవృత్తి. పు. 3. పోల్చు. బ్రహ్మజాలసూత్రము: "సోదరులారా! నిత్యత్వవాదులైన సన్న్యాసులును బ్రాహ్మణులును గలరు; ఆత్మయు జగత్తును సత్యములని వారు నాలుగాధారములను జూపిరి. వీరు తర్కవాదాభ్యాసపరులై, వారియుక్తి ప్రయుక్తులతోఁ గూడిన వాదచర్చలవలన నీ నిర్ణయములను బ్రకటించిరి. ఆత్మ శాశ్వతమైనది; నూతనోత్పత్తికిఁ గారణముగాక, ప్రపంచమొక సుస్థిరమైన పర్వతశిఖరమువలెను, సుస్థాపితమైన స్తంభమువలెను నచలమైయున్నది ఇక నీ జీవులన్నియు, జన్మపరంపరావశములైయున్నను, భిన్నావస్థలలోఁ బతనోత్పతనములుగలిగి, శాశ్వతములై వర్తించుచుండును."

నకుఁ బ్రాముఖ్యముతగ్గుటయు, ఘోరతపోవిధాన నిరసనమును, ఆస్తికభావము విషయములో నుదాసీనతయు, బరిణామనిత్యత్వమును బౌద్ధసాంఖ్యములకు సమానములు. ఈసమాన భావతాటస్థ్యము పరస్పరభావ స్వీకృతికి సాక్ష్యముకాఁజాలదు; మఱియు ముఖ్యములైనవిభేదములును గలవు. సాంఖ్యమతము నకుఁ గేంద్రసిద్ధాంతములైన, ప్రవృత్తిరహితుఁడైన పురుషుఁడు, అవ్యక్తప్రకృతి, గుణత్రయము మున్నగువానిలో దేనిని బౌద్ధ మంగీకరించదు. బౌద్ధనిమిత్తధర్మమునకును సాంఖ్య పరిణామ వాదమునకును బోలికలున్నచో దానికిఁ గారణము రెంటికి మూలాధారము లుపనిషత్తులగుట యే. బుద్ధుని కాలమందలి సాంఖ్యము నాస్తికమగునో కాదో మనకుఁ జెప్పుట కాధార ములు లేవు.

మహాభారతమునందు సాంఖ్యతత్త్వ సామ్యముగల భావసంపుటి స్పష్టముగా వర్ణింపఁబడియున్నది. పురుషప్రకృతి భేదము ననుగీత వివరించినది. ౧. ప్రకృతితత్త్వములైన యిరు వదినాలుగును ద్రష్టయైనపురుషునికి విషయములు; పురుషుఁ డిరువదియైదవతత్త్వము. ౨. ప్రకృతి పురుషులకుఁగల మూల భేదములను గుర్తించుటవలన మోక్షము సిద్ధించును. ౩. జీవ నానాత్వము వ్యావహారికము. ప్రకృతిసంబంధ మున్నంత

(౧) ౧౪, ౫౦.
(౨) మ॥ భా॥ ౧౨, ౩౦౬, ౩౯-౪౦.
(౩) ౧౨, ౩౦౭, ౨౦.

కాలము జీవు లనేకములు. ప్రకృతికిఁ దమకుఁ గలభేదజ్ఞానమునుబొందుటతో జీవు లిరువదియారవతత్త్వమగు నీశ్వరుని యందుఁ జేరుదురు. ౪. పురాణేతిహాసతత్త్వము ప్రధానముగా ఆస్తికము; అందుఁగల సాంఖ్యభావములన్నియు 'ఆస్తికత'ను సమర్థించుట కుపయోగింపఁబడెను. సాలెపురుగునుండి దారము లుత్పత్తియగురీతిని, ఆత్మనుండి గుణము లుత్పన్నములగు చుండును. ౧. పురుషాధీనమై ప్రకృతి తన వ్యాపారములఁ జేయు చున్నది. ౨. ప్రకృతి, పురుషసంజాతమనియు, నది తిరిగి తిరిగి, యందుఁ బ్రవేశించుచుండుననియుఁ జెప్పఁబడెను. ౩. మహదహంకారమానసములు పరమపురుషుని విశ్వజగత్ప్రవృత్తులు. సంప్రదాయముననుసరించి, సాంఖ్యతత్త్వ ప్రవక్తయగు కపిలుఁడు పురాతన బ్రహ్మర్షివరేణ్యుఁడని వాకొనఁబడెను. తరువాతఁ దానుగాంచిన విస్పష్టమైన యాకృతి, పురాణయుగమునందైనను సాంఖ్యమునకుఁ గలిగియుండలేదని స్పష్టము, వలనఁ బురాణములలోఁ దన్మాత్రప్రశంస లేదు. తత్త్వముల భిన్నవికాసరీతులనుగూర్చి భిన్నభావములు చెప్పఁబడినవి. అనుగీతలోని సాంఖ్యతత్త్వవర్ణనము మూలసాంఖ్యతత్త్వమునకించుమించుగా సరిపోవునట్టి యత్యంతసన్నిహితత్వమును గలిగి

(౪) ౧౨, ౩౫౦, ౨౫, ౨౬; ౧౨, ౩౫౧, ౨-౪.

(౧) ౧౨, ౨౮౫-౪౦.

(౨) ౧౨, ౩౧౪, ౧౨; ౧౨, ౩౧౫, ౮.

(౩) ౧౨, ౩౦౩, ౩౧.

యున్నది. ౪. పంచశిఖునియొక్కయు. ౫. అసితదేవలుని ౬ యొక్కయు భావములు చెప్పఁబడినవి. 'ఆసురి' సాంఖ్యమును పంచశిఖునికిఁ జెప్పెనని యున్నది. ఈవిషయము సాంఖ్యకారికలోఁ బునరుక్తమైయున్నది. ఆసురియు, పంచశిఖుండును 'ఆస్తిక' సాంఖ్యమును బ్రకటించి, పరబ్రహ్మ పరిపూర్ణ సత్యస్వరూపియని విశ్వసించిరి. జీవాత్మయొక్క స్వాతంత్ర్యము పరిచ్ఛిన్నమైనది. పంచశిఖుని భావములకును,సాంఖ్యతత్త్వభావములకును ముఖ్యములగు భేదములు వివరములలోఁ గలవు.౧.

మనువు, సాంఖ్యమును నామముతో స్మరింపకున్నను, ప్రథమాధ్యాయములో నిచ్చిన సృష్టిక్రమమును, ప్రమాణ

(౪) ౧౪, ౪౦-౪౨.

(౫) ౧౨, ౨౧౯; ౧౨, ౩౨౧, ౯౬-౧౧౨.

(౬) ౧౨, ౨౭౪.

(౧) ఆరవ యింద్రియమైన మనస్సనకుఁ బ్రతిగా శక్తియే ఆరవ కర్మేంద్రియమని యాతఁడు తలఁచినాఁడు. ౧౨, ౨౧౯ లోని వర్ణనమునకును ౧౨-౩౨౧, ౯౬-౧౧౨ లోని వర్ణనమునకును భేదమున్నది. పంచశిఖుఁడు ముప్పది నియమముల నంగీకరించెనని చెప్పఁబడెను. ఇది ప్రాచీనరూపమైన పంచశిఖుని తత్త్వమని చెప్పుదురు. శాస్త్రకర్తయైన పంచశిఖుఁడును, పురాణములోని పంచశిఖుఁడు నొకఁడో కాఁడో తెలియదు. ఏలన మహాభారత పంచశిఖుని భావములకును, సాంఖ్యయోగ తత్త్వములోని పంచశిఖుని భావములకును విశేష భేదములున్నవి. చరకాచార్యు నాయుర్వేద శాస్త్రమునుండి పంచశిఖుని భావములను ప్రొఫెసర్ దాసుగుప్తుఁ డుదాహరించినాఁడు. కాని యందు దన్మాత్ర ప్రశంసలేదు. ప్రకృతి పురుషుల వ్యక్తమని చెప్పఁబడెను. పురుషుఁడు ప్రవృత్తిరహితుఁడును గాఁడు; మోక్షమనఁగా బ్రహ్మైక్యము. అందుచే నీభావములకు సాంఖ్య మెంతయాధారమో, వేదాంత, న్యాయవైశేషిక, బౌద్ధములు నంత యాధారములే యని చెప్పనగును.

త్రయము[౨]. నంగీకరించుటయు, గుణత్రయ వివరవర్ణనమును[౩]. సాంఖ్యప్రభావమును జూపును. పురాణములును,[౪]. అనంతర వేదాంత గ్రంథములును సాంఖ్యసిద్ధాంతముల నుపయోగించు కొనెను గాని, నాస్తికత తత్త్వమును మాత్రము స్వీకరింపలేదు. సాంఖ్యతత్త్వ కాలనిర్ణయమున కివి నిరుపయోగములు.

ఉపనిషత్తులందును, మహాభారతము, భగవద్గీత మనుస్మృతులందును గల సాంఖ్యభావము లాస్తికములు.[౧]. పురుషుఁడును, ప్రకృతియు స్వతంత్ర తత్త్వములుగావు; అవి యీశ్వరుని భిన్నరూపములు. అశ్వఘోషుని బుద్ధచరితమందు, ఆస్తిక సాంఖ్యభావములు గల బుద్ధుని పూర్వగురువైన 'అరాడు' నితో బుద్ధుని సమావేశము వర్ణింపఁబడినది. పురాతన సాంఖ్య

(౨) ౧౨, ౧౦౫.

(3) ౧౨, ౨౪-3౨.

(౪) భాగవతము॥ 3, ౫; మత్స్యపురాణము 3 అ అగ్నిపురాణము॥ ౧౭ అ; మార్కండేయపురాణము ౧౪.

(౧) "మహాభారతాది ప్రాచీనగ్రంథములను బరిశీలించిన వెనుక నీశ్వరునం దవిశ్వాసముగల వాక్య మొక్కటియు సాంఖ్యమునుగూర్చి చెప్పునది కనఁబట్టలేదు." (ఫ్రాంక్లిన్ ఎడ్గెర్టన్. అమెరికన్ జర్నల్ ఆఫ్ ఫైలాలజీ. ౧౪,౧. పు ౮.) దేవుఁడు లేఁడను సాంఖ్యమునకును, దైవాస్తిత్వమును జెప్పు యోగమునకును భేదము నుగ్గడించునదని మ॥ భా॥ ౧౨, ౧౧౦౩౯. చెప్పఁబడినది. ఎడ్గెర్టన్ యీభావమును ఖండించినాఁడు. కాని ౨౬ తత్త్వములను జెప్పిన సాంఖ్యమునకును, ౨౫ తత్త్వములను జెప్పిన సాంఖ్యమునకును భేదమును జెప్పిన మ॥ భా॥ వాక్యములను త్రోసిపుచ్చుట సాధ్యముకాదు. రెండవ సాంఖ్యము దైవమునుగూర్చి యుదాసీనతచూపును. (౧౨, 3౦౦) కాని మ॥ భా॥ నిరీశ్వరసాంఖ్యము నంగీకరింపదన్న మాటనిజమే.

తత్త్వ ముపనిషతులకుఁ జెందిన విశిష్టాద్వైతముతో సాదృశ్య ముగల వాస్తవికాస్తికత్వమని చెప్పుటకుఁ బ్రబలాధారము లున్నవి. ఇట్టి సాంఖ్య ముపనిషద్భావానుగుణ్య మని చెప్ప వీల గును గాని, పురుషనానాత్వమును, ప్రకృతిస్వతంత్రతను, ప్రతిపాదించి, పరమపురుష ప్రశంసను సంపూర్ణముగా విడిచిన సాంఖ్యము నట్లుచెప్పరాదు. సాంఖ్యతత్త్వము తృప్తికరమైన దగుటకు వలయు పరమపురుషభావము నెట్లుసాంఖ్యము విడువఁ గలిగిన దనునది ప్రశ్న. బౌద్ధమతారంభకాలమువరకును సాంఖ్యమొక విశిష్టవ్యాప్తి గాంచిన తత్త్వముగా వికసించి యుండలేదు. బాహ్యప్రపంచము నిజముగాదని బౌద్ధులునిశ్చయ ప్రకటన చేయఁగా, ప్రకృతిపురుషులు యథార్థాస్తిత్వము గల వని, హేతువిధానముచే సాంఖ్యతత్త్వము నిరూపించి, బౌద్ధ వాదము నెదుర్కొనెను. కేవల హేతువాదముపై నాధారపడ వలసివచ్చిన సందర్భములో దైవాస్తిత్వమును నిరూపించు హేతుసామగ్రి లేదని చెప్పవలసి వచ్చినది.

### ౩—సారస్వతము.

సంప్రదాయమై శకశ్యంత్యముగా సాంఖ్యతత్త్వప్రవక్త కపిలుఁడని యంగీకరించినది.[౧] ఆతఁడు బ్రహ్మపుత్రుఁడని కొంద ఱును, విష్ణ్వవతార[౩]మని కొందరును, మఱికొంద రగ్ని దేవతర

శ్వే. అ. ఉ. ౫, ౨. పోల్చు. మ. భా. మోక్షధర్మము:
సాంఖ్యస్యవక్తాకపిలో పరమర్షిః పురాతనః ।
హిరణ్యగర్భోయోగస్య వక్తానాన్యః పురాతనః॥
౨. మ. భా. ౧౨, ౩౪౦, ౬౭; రామాయణము. ౧. ౪౧.
౩. భాగవతము ౩, ౧౪, ౩౬; ౨, ౭౩.,

యొక్క యవతారమనియుఁ జెప్పుదురు. ఇవన్నియుఁ బురాణ గాథలు; ఒకటిమాత్రము నిశ్చయము; కపిలుఁడనునొక చారిత్రక పురుషుఁడుండి యుండెననియు సాంఖ్యతత్త్వము నాతఁడు కల్పించెననియుఁ జెప్పనగును. బుద్ధునికిఁగ్రీ బూర్వశతాబ్దమాతని కాలమనుటలో విశేషవ్యత్యాసముండదు. కపిలుఁడు రచించెనని తలఁపఁబడు సాంఖ్యప్రవచనసూత్రమును, తత్త్వసమాసము నాతఁడు రచించెననుట కాధారములెవ్వియును లేవు. ఈశ్వరకృష్ణుఁడు తనకారికలోఁ దాను కపిలశిష్య పరంపరలో ఆసురి, పంచశిఖుఁడు మున్నగువారివెనుకవచ్చిన వానిఁగాఁ జెప్పుకొనెను.౬ ఈయాసురి, శతపథబ్రాహ్మణములోని ఆసురియే యైనచో, క్రీ. పూ. 600 ప్రాంతమువాఁడై యుండవలెను. పంచశిఖుఁడు క్రీ. వె. ప్రథమశతాబ్దమునకుఁ జెందియుండవచ్చునని గార్బే భావించెను. మనకులభించిన యల్పవాక్య సాక్ష్యములనుబట్టి, యాతఁడు గుణత్రయ సిద్ధాంతమును విశ్వసించెనని

౪. సాం. ప్ర భా. ౬, ౭౦.

౫. సర్వతత్త్వములలో సాంఖ్యము ప్రాచీనతమమైనదని వీబరుపండితు నభిప్రాయమైయున్నది, (హిస్టరీ ఆఫ్ ఇండియన్‌లిటరేచర్ పుట ౨౩౫.) సాంఖ్యయోగములు లతిసనాతనములైనవని మ. భా. చెప్పును. సనాతనవేద్వే. ౧౨, ౧౩౭౧౧.

౬. సాం. కా. ౭౦. మ. భా. ననుసరించి (౧౨, ౨౧౮, ౧౪-౧౫). కపిలు ననుసరించినవారు, ఆసురి, పంచశిఖుఁడు, గార్గ్యుఁడు, ఉలూకుఁడు చైనాసంప్రదాయము ననుసరించి, యొకపంచశిఖి కణాదశిష్యుఁడు, ఇ-తడు పంచశిఖుఁడుగాఁడని స్పష్టము. చూ.యుఐ. వైశేషికాఫిలాసఫీ. పు ౭౯౪, మ. భా. లో జనకపంచాశిఖ సంవాదమొకటిగలదు. కొన్నియాతనిభావములు యోగభాష్యములో నుదాహృతములు.

తెలియుచున్నది. పురుషుఁడణుపరిమాణముగల వాఁడని నమ్మి, ప్రకృతిపురుష సంబంధమునకుఁ గారణము కర్మకాక అజ్ఞానమని నిశ్చయించెను.[3]

ఈశ్వరకృష్ణుని సాంఖ్యకారిక మనకు లభించినవానిలోఁ బ్రాచీనమైనదియు, సుప్రసిద్ధిగాంచినట్టియు శాస్త్రగ్రంథము. దీనినామమునుబట్టియే యిది ప్రథమగ్రంథముకాదని స్పష్టము. వార్షగణుఁడనువాని గ్రంథమును వింధ్యవాసుఁడు తిరిగి రచించెనని యొకచైనాసంప్రదాయము చెప్పుచున్నది. కారికార గ్రంథకర్తయే వింధ్యవాసుఁడైనచో, మనకుఁదెలియని యొక పూర్వగ్రంథాధారముచేఁ గారిక రచింపఁబడెనని చెప్పవలెను.[5]

---

(౧) సాం॥ ప్ర॥ భా॥ ౧, ౧౨౭.

(౨) యో॥ భా॥ ౧, ౩౬.

(౩) సాం॥ ప్ర॥ భా॥ ౬, ౬౮.

(౪) వింధ్యావాసినామ మీశ్వరకృష్ణుని గౌరవనామమని తకాకుసు చెప్పెను. (జె. ఆర్. ఏ. యస్. ౧౯౦౫) గుణరత్నుఁ డవి భిన్ననామములని భావించెను. (తర్కరహస్యదీపికా॥ పు ౧౦౨, ౧౦౪.)

(౫) సాంఖ్యశాస్త్రములోఁ గొంతభాగమే మనకు లభించెననియుఁ జాలవరకుఁ గాలప్లుతమైనదనియు భాగవతము చెప్పుచున్నది. సాంఖ్యగ్రంథములనేకములు కాలగర్భమున నశించినవని విజ్ఞానభిక్షువు చెప్పెను. (సాంఖ్యప్రవచన భాష్యము, ఉపోద్ఘాతము) సాంఖ్యకారికలోని చివరిశ్లోక మిట్లున్నది: "ఈ డెబ్బది శ్లోకములలోను షష్టితంత్ర మంతయుఁ జెప్పఁబడినది. ఇందుపాఖ్యానములును, వివాదవిషయములును విడువఁబడినవి" ఈ శ్లోకము ప్రక్షిప్తమని స్పష్టము; ఏలన దీని ప్రథమ భాష్యకారుఁడైన గౌడపాదాచార్యుఁ డీశ్లోకమును స్మరింపలేదు. గుణరత్నుఁడు షష్టితంత్రోద్ధారమని స్మరించెను. ఆసురి దీనిని వ్యాప్తికిఁ దెచ్చెనట. పంచశిఖుఁడు దీనిని నాస్తికమొనర్చి, కపిలునికిఁ గర్తృత్వ మాపాదించెను. కాని వీనినిగూర్చి స్పష్టముగా

అది క్రీ. వె. తృతీయశతాబ్దమునకుఁ జెందిన గ్రంథము. ౧.

గౌడపాదుఁ డీకారికపై నొకభాష్యమును రచించెను. మాండూక్యోపనిషత్తుపైఁ గారికరచించిన గౌడపాదుఁడీతఁ డగునో కాదో శంకింపవలసియున్నది; ఏలన. రెంటిభావములకు భేదము విశేషముగానున్నది. ఆతఁడు వాచస్పతికిఁ బూర్వుఁడు

నేమియుఁ జెప్పఁజాలము. షష్టితంత్ర మనగా నొకగ్రంథము కాదనియు నరువది విషయముల ప్రణాళిక యనియు వాచస్పతియు, నారాయణుఁడును జెప్పినారు జైనుల అనుయోగద్వార సూత్రమునఁ జెప్పఁబడిన షష్టితంత్రము నకు నిదియే యర్థముకానగును. అహిర్బుధ్న్య సంహిత ననుసరించి, (౧౨౮) సాంఖ్యము ౬౦ విభాగములు గల ఆసికగ్రంథమనియు, ప్రకృతినిగూర్చి ౩౨ భాగములును, వికృతినిగూర్చి ౨౮ భాగములు నున్నవనియుఁ జెప్పఁబడెను. తన తత్త్వకౌముదిలో (పు ౭౨) వాచస్పతి రాజవార్తికమునుండి, యొక వాక్యము నుదాహరించెను ప్రకృతి, దాని యేకత్వము, దానికిఁ బురుషునికి భేదము మున్నగు నరువది విషయములనుగూర్చి చెప్పుటచే నది షష్టితంత్రమని పిలువఁబడెనని యిందుఁజెప్పఁబడెను షష్టితంత్రకర్త పంచశిఖుఁడని యొకచైనా సంప్రదాయము; వార్షగణ్యుఁడని మఱికొందరుచెప్పిరి చూ: భామతి॥౨,౧,౩.

౧. పరమార్థుఁడను బౌద్ధసన్యాసి (క్రీ. వె. ౬-వ శతాబ్దము.) దీనిని చైనాభాషలోనికి కనువదించి, దానికొక భాష్యము వ్రాసినాఁడు కారికనుండి రెండవశ్లోకము నుదాహరించిన వసుబంధునికి వింధ్యావాసి పూర్వుఁడని చైనా సంప్రదాయము. చూ. యుఐ, వైశేషికాఫిలాసఫీ కీత్ చెప్పునట్లు వింధ్యా వాసుఁడు కారికాకర్తయో (సాంఖ్యము, పు. ౭౦; ఐ. యల్. ఎ. పు. ౨౪౯; కర్మమీమాంసా. పుట ౫౯.) లేక బెల్వాల్కర్ చెప్పునట్లు భాష్యకారుఁడో (భండార్కర్ కమ్మెమొరేషన్ వాల్యుము, పు. ౧౭౫-౧౭౮.) తెలియదు. కాని, ఈశ్వర కృష్ణుఁడు క్రీ. వె. ౪-వ శతాబ్దమునకుఁజెందిన వసుబంధునికిఁ బూర్వుఁడు, కాళిదాసే యీశ్వర కృష్ణుఁడని స్వప్నేశ్వరుఁడనినాఁడు. "ఈశ్వరకృష్ణనామ్నా కాళిదాసేనకృతః కారికాః." చూడు హాల్ వివచిత సాంఖ్యసారము పు. ౨౫ ఈశ్వర కృష్ణుఁడు నాస్తికవాదియని స్పష్టముగాఁ

గావున క్రీ. వె. ౮-వ శతాబ్దమునకుఁ జెందినవాఁడు కావచ్చును. ౨. వాచస్పతి సాంఖ్యతత్త్వకౌముది (క్రీ. వె. ౯-వ శతాబ్దము) యొక సువిదితగ్రంథము. నారాయణుని సాంఖ్యచంద్రిక గౌడపాద భాష్యముపై నొక వృత్తియైయున్నది.

కపిలకృతమని చెప్పఁబడిన సాంఖ్యప్రవచనసూత్రమధ్యాయషట్కము గలది. మొదటి మూడధ్యాయములును సాంఖ్యసిద్ధాంతములను వివరించును; చతుర్థమునందు సూత్రములను వ్యాఖ్యానించు నుపాఖ్యానములు గలవు; పంచమాధ్యాయము విమర్శాఖండనములు గలది; షష్ఠాధ్యాయము విషయసంగ్రహపునరుద్ఘాటనముతో నుపసంహారము చేయును. మాధవుని సర్వ

---

జెప్పవచ్చును. కారికలో ౭౦ శ్లోకములుగలదని చెప్పఁబడినను మనకులభించినవి ౬౯ మాత్రమే. సాంఖ్యకారిక, ౬౧ పైగౌడపాదభాష్యమునుసరించి, పోయిన శ్లోకము నిట్లుకల్పింప తిలక్పండితుఁడు యత్నించినాఁడు:—

"కారణమ్ ఈశ్వరమ్ ఏకేబ్రువతే కాలమ్‌పరే స్వభావమ్‌వా,
ప్రజాఃకథమ్ నిర్గుణతో వ్యక్తతః కాలస్వభావశ్చ",

గౌడపాదభాష్యమున కిట్టిశ్లోకము మూలమైయుండనోపును. కాని నాస్తికభావము నుగ్గడించెనుగాన, ఛేదించివేయబడి యుండవచ్చును.

(౨) సాంఖ్యకారికనుగూర్చి-రచితమైనది మాఠరవృత్తి; గౌడపాదుని భాష్యము దీని సంగ్రహమేయని చెప్పఁబడెను. కాని సామాన్యముగా మొదట భాష్యమును తరువాత వృత్తియు వచ్చుచుండును. సాంఖ్యకారికలోని చివరి మూఁడు శ్లోకములపై వ్యాఖ్యచేసిన కారణముచే మాఠరవృత్తి భాష్యానంతర విరచితమే. చూ: భండార్కారు కమ్మెమొరేషను వాల్యూము.

(3) తన కౌముదీప్రభలో స్వప్నేశ్వరుఁడు సాం॥ ప్ర॥ సూ॥ పంచశిఖునదనియు, కపిలుఁడు దానిని వ్యాప్తికిఁ దెచ్చెననియుఁ జెప్పెను. చూ: హాల్॥ సాంఖ్యసారము, పు ౮.

దర్శనసంగ్రహము దీనిని స్మరింపమియు, సాంఖ్యకారికపైఁగడన భావముల నాధారముచేసి చెప్పుటయు నీ కారణములచే నిది క్రీ. వె. ౧౪-వ శతాబ్దమునకుఁ జెందినదని చెప్పుచున్నారు.౨ కారిక కేవలద్వైతమును వివరింపగా, దైవాస్తిత్వము నెడ మాత్రము కొంతసౌమ్యభాగమును ప్రకటించెను. అనిరుద్ధుని సాంఖ్యసూత్రవృత్తి ౧౫ వ శతాబ్దమునకును, మహాదేవుని సాంఖ్యసూత్ర వృత్తిసారము ౧౬ వ శతాబ్దమునకును జెందిన వని చెప్పవచ్చును. నాగేశుని లఘుసాంఖ్య సూత్రవృత్తికిఁ బ్రాధాన్యము లేదు. సాంఖ్యప్రవచన సూత్రమునకు విజ్ఞానభిక్షు

(౧) గుణరత్నుఁడు (క్రీ. వె. ౧౪-వ శతాబ్దము) దీనిని స్మరించి యుండలేదు. మఱియు దానిపై భాష్యము క్రీ. వె. ౧౬-వ శతాబ్దములో వెలువడినది. సూత్రము పూర్వగ్రంథమైనచో నేల దానిపై భాష్యమొకటి పూర్వపరచితముకాలేదను విషయము దురూహ్యమగును. అది యితరతత్త్వము లన్నిటిని స్మరించినది. వాచస్పతి కది తెలియదు. ౧౧-వ శతాబ్ద ప్రథమభాగ ములోఁ దన గ్రంథమును రచించిన ఆల్బెరూని, యీశ్వరకృష్ణ గౌడపాదుల గ్రంథపరిచయమును జూపెను గాని, సూత్రపరిచయ మాతనికిలేదు.

(౨) పోల్బు గార్బే: "ముఖ్యముగా, సూత్రకర్త, యీశ్వరవాదము నేకబ్రహ్మసిద్ధాంతము, బ్రహ్మానందస్వరూప విషయము, బ్రహ్మలోకప్రాప్తి వాదము మున్నగువానికి సాంఖ్యతత్త్వము సంపూర్ణవిరుద్ధముకాదని ఋజువు చేయుటకు వ్యర్థప్రయత్నము చేసినాఁడు. (చూ: ౧, ౯౫, ౧౫౪, ౫, ౭౪ ౭౮, ౧౧౦; ౬, ౫౧, ౫౮, ౫౯.) సాంఖ్యసూత్రము వేదాంతసంపర్కము గలిగిన ఫలితములను స్పష్టముగాఁ జూపుచున్నది. ౪, 3. సూత్రము వేదాంత సూత్రము ౪, ౧, ౧౧. తోఁ బ్రతిమాటలోను సరిపోవును. ౫, ౧౧౬, లో వేదాంతశబ్దము బ్రహ్మరూపతాయనియే వాడఁబడినది" గార్బే ప్రకటించిన సాం॥ ప్ర॥ భా॥ పు ౧౧.

విరచితమైన సాంఖ్యప్రవచన భాష్యము (క్రీ. వె. ౧౬౦౦) సుప్రసిద్ధమైనది. సాంఖ్యమునకును, ఆస్తిక వేదాంతమునకును భేదములను జాలవరకుఁ దగ్గించుట కీతఁడు ప్రయత్నించెను. ఈతని దృష్టిలో నద్వైతవేదాంత మాస్తిక వేదాంతవిరుద్ధము. విజ్ఞాన భిక్షువింకను సాంఖ్యసారము, యోగవార్త్తికము. యోగసార సంగ్రహము, విజ్ఞానామృతమను బ్రహ్మసూత్ర భాష్యమును రచించెను.

## ౪—కారణధర్మము.

ప్రకృతిపురుషుల ద్వైతమును నిర్ణయించిన సాంఖ్య తత్త్వముయొక్క హేతువాదమును మనము పరిశీలింపవలసి యున్నది. కారణధర్మమునను సరించి ప్రకృతియున్నదని సాంఖ్యము స్థాపించినది.

కార్యము దానికారణమందుఁ బూర్వమేయుండు ననునది సాంఖ్యతత్త్వ ప్రధానసూత్రములలో నొకటైయున్నది. కార్యము సూక్ష్మరూపములోఁ గలిగియుండునదే కారణమని సాంఖ్యము నిర్వచించి, దానినిసమర్థించుట కీదిగువచెప్పిన యాధారములను జూపెను.౧. (౧) లేనిదెట్టి ప్రవృత్తికిని విషయముకాఁజాలదు. గగనకుసుమ ముత్పత్తి కాదు. లేనిదెన్నఁడు నుండఁ జాలదు. వేయిమంది చిత్రకారులైనను నీలిమనుండి పసిమి రంగును సృజింపలేరు.౨ ఒకద్రవ్యము తదాధారభూతమైన పదా

౧. సాం కా. ౯.

౨. నహినీలమ్ శిల్పిసహస్రేణాపిపీతమ్కర్తుమ్ శక్యతే.
(తత్త్వకౌముది. ౯. ౯.)

ర్థమునుండి వేరుకాదు. (౩) ద్రవ్యరూపము దాల్చుటకుఁ బూర్వము పదార్థరూపములో నది యున్నది. దీనినంగీకరింపకున్నచో, నేదిదేనినుండియైన నుదయింపవచ్చును. (౪) దేనికి శక్తియున్నదో దానికేకారణ సామర్థ్యమున్నది. (౫) కార్యము కారణ తుల్యస్వభావముగలదే. స్వభావముచే వస్త్రము దారములకు వేరైనదికాదు. అన్యోన్యము భిన్నములైన ద్రవ్యములకుఁ గారణ సంబంధముండజాలదు.౩ వికాసమనగా నదివరకే సూక్ష్మరూపముగా నున్నది లేక నంతర్నిహితమై యున్నదే, యావిష్కృతమగుట లేక ఆరిస్టాటల్ మాటలలో, నవ్యక్తమైనది వ్యక్తమగుట; హెగెల్ భాషలో నస్ఫుటముగానున్నది ప్రస్ఫుటమగుట. దీనికి శాస్త్రాధారమును గలదు.౧ ఈసత్కార్యవాద సిద్ధాంతము ననుసరించి, కార్యకారణము లొకేవస్తువుయొక్క వ్యక్తావ్యక్తరూపములు. ఉత్పత్తియనఁగా నుద్భావమును, నాశనమనగా అనుద్భావము లేక కారణరూపములోని కదృశ్యమగుట.౨ సంపూర్ణ నాశనమనునది లేదు. భూతభవిష్యదవస్థలు నశించలేదు; యోగులు వానినిదర్శింపఁగలరు.౩, ఆవిర్భావతిరోభావ సిద్ధాంతమును సాంఖ్యమంగీకరించును.

కారణకార్యములు భిన్నదశలు, కావుననొక దాని కొకటి వేరైనవి;౪ కాని యీ భిన్నత మనవ్యావహారికావస

౩. మా. తత్త్వకౌముది. పు. ౯.
౧. ఛాం. ఉ. ౬, ౨, ౨; భగవద్గీత. ౨. ౧౬.
౨. సాం. ప్ర. సూ. ౧, ౧౨౦—౧.
౩. సాం. ప్ర. సూ. ౧, ౧౨౧
౪. కారణకార్య విభాగాత్, (సాం. కా. ౧౫.)

రములచేఁ జూపట్టునది. ఘట ముదకమును భరించునుగాని, మృత్తిక కాదు. ఉపాదానకారణమును, గార్యమును మూలములో నొకటేయైనను, నవి వ్యవహారములో భిన్నప్రయోజనముల నిచ్చునుగావున భిన్నములు. మూలములో నేకత్వము, వ్యవహారములో భిన్నత్వమును గలవు. సాంఖ్యము ననుసరించి కారణములు రెండురకములు. సూక్ష్మస్థూలకారణములు; స్థూలకారణము కార్యమందుండును; సూక్ష్మకారణము బాహ్యమునుండి తనప్రభావమునుజూపును. కార్యముకారణములోనున్నను కారణస్థితినుండి దానినావిష్కరించుటకింకొకశక్తి యవసరము. నువ్వులనుమర్దించినఁగాని నూనెరాదు; ధాన్యమును దంచినఁగాని బియ్యమురాదు. సహకారశక్తి లోపించినయెడలఁగార్యముత్పత్తి కాదు. ౧కార్యముకారణమందు సూక్ష్మరూపములోనున్నను, నది వెంటనే యావిష్కృతముకాదు. అవ్యక్తమైనది వ్యక్తమగుటకుఁ గల యవరోధములను దొలగించునదే సహకారశక్తి. ఈసహకారశక్తులు, దేశము, కాలము, రూపములేక ద్రవ్యాకార౨విశే

౧. ఈసహకార కారణములనుగూర్చి వ్యాసుఁడుదాహరణముల నిచ్చియున్నాఁడు: "పెక్కుపొలములున్న యజమాని, యిదివరకే నీటితో నిండియున్న యొకపొలమునుండి నీటినితరక్షేత్రములకుఁ బ్రవహింపఁజేయఁగలడు. ప్రతిక్షేత్రమునకు మొదటితూరనుండి నీటిని దేనవసరములేదు. పొలములోని మొక్కలన్నిటికి నీటినొకేవ్యక్తి తీసికొనిపోనవసరములేదు. నీటికాలువలోనడ్డుగానున్నమట్టిని, పొలములో నాటంకముగానున్న కలుపును దొలగించుటచే జలము తనసహజశక్తిచే నన్నివరిమొక్కల వేళ్ళకును బ్రవహించును. ఉపాదానకారణములకు సహకారమొనర్చు నిమిత్తకారణ వ్యాపారమిట్లుండును." (యోగభాష్యము. ౪, ౩)

౨. యోగభాష్యము. ౩, ౧౪.

పమునని వ్యాసుఁడువచించెను. ఒకశిలనుండి మొలక బయలు దేఱదు.౩. కార్యములు రెండువిధములు, పాలనుండి వెన్న తీయుట సామాన్యకార్యము, సువర్ణమునుండి యొకయాభరణము చేయుట, పదార్థమంతయు నూతనాకృతి వహించుట. ఒకవస్తుగుణము మాఱినచో ధర్మపరిణామమగును. సూక్ష్మరూపము స్థూలముగా నావిష్కృతమగుట కేవల బాహ్యలక్షణ పరిణామము. కాలమువలన వస్తువులోఁగలుగు మార్పు నవస్థా పరిణామమందురు.౪. సర్వదేశములందు సర్వకాలములందు మార్పు జరుగుచునేయున్నది. ఒకే ప్రవాహములో మనము రెండుసారులు ప్రవేశింపలేము; ఏలన నందలి యుదకము రెండు క్షణములలో నొకటికాదు. అదేవిధముగా నొకేవ్యక్తి రెండు సారులు ప్రవాహములోఁ బాదములుంచలేఁడు; ఏలన నొక క్షణములోనివ్యక్తి రెండవక్షణములో మాఱినాఁడు. బాహ్యాభ్యంతరములైన సర్వద్రవ్యావస్థలు నీపరిణామ నియతికివశములై యున్నవి. పరిణామవిధానము ననుసరించి, పూర్వోత్తరసంబంధ ముచేఁ గారణధర్మమును౨. మానవమానసముకల్పించినది.

---

౩. సాంఖ్యతత్త్వము ననుసరించి, సకలవస్తువులును ప్రకృతిభిన్నరూపములే కావున, నొకకార్యమున కాటంకములుగా నున్నవానినిఁ దొలగింపఁ గలిగినచో, నేకార్యమో కార్యముచేనైన నుదయింపవచ్చును. ఒకశిలలోని యణువులొక మొలకయందుండి పుట్టుట కాటంకములని తోఁచినచో, దైవ సంకల్పముచే నట్టియాటంకములు తొలఁగఁగలవు

౪. యోగభాష్యము, ౩, ౧౩.

(౧) సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౧౨౧.

(౨) బుద్ధినిర్మాణ.

## ౫—ప్రకృతి.

నిత్యపరిణామశీల మగు ననంతవిషయ సంపుటిమైన ప్రకృతిస్వరూపమున కర్థము చెప్పుటకు సాంఖ్యము యత్నించి నది. అనంతదశలలో నున్న భౌతికపదార్థ రూపములు, సూక్ష్మ పదార్థ సంజాతములై, ప్రకృతి మూలస్వరూపావిష్కరణము నందుచున్నవని చెప్పఁబడెను. సర్వకార్యములు కారణగర్భిత ములై యున్న యెడల, ననవస్థాదోషము లేకుండ నుండవలె నన్నచో, నాదికారణ మొకటి యుండవలెను. కారణధర్మము నుండి, వస్తుప్రపంచమునకు మూలరూపము నాధారమునైన దవ్యక్త ప్రకృతియని వచింపఁబడెను. ప్రకృత్యస్తిత్వమును సాంఖ్యకారిక యిట్లు స్థాపించెను.3. (౧) పృథగ్వస్తువులు పరిమాణములోఁ బరిచ్ఛిన్నములు. ఏది పరిచ్ఛిన్నమో యది దానికి బాహ్యమైన వేరొక వస్తువుపై నాధారపడును. కావున విశ్వాధారమైనది పరిచ్ఛిన్నవస్తువు కాఁజాలదు. (౨) సర్వ పృథగ్వస్తువులు వ్యాప్తిలక్షణములు గలవగుటచే నివన్నియు నొకే మూలాధారముగలవని సూచించును. భిన్నవిషయములు పరస్పరము సంపూర్ణముగా వేరైనవని సాంఖ్యము విశ్వసింపదు. (3) ఒక ప్రవృత్తిధర్మము వస్తుపరిణామములో వ్యక్తమగు చున్నది. పరిణామధర్మము పరిణామదశలలో నేయొకదశయును గాఁజాలదు. అది వివిధదశలకు నతీతమూ నంతర్గతము కూడనై యున్నది. (౪) కార్యకారణములకు భేదముగలదు. అందుచేఁ బరిచ్ఛిన్నము పరాధారసహితమునగు జగత్తున కదియే కారణ

(3) సాం॥ కా॥ ౧౫, ౧౬.

మని చెప్పఁజాలము. (౫) జగత్తున కేకత్వము సుస్పష్టమగు టచే దత్కారణము నేకమని సూచించును. అల్పతమరూపము నుండి యధికతమ రూపమువఱకు జగత్తులో నవిచ్ఛిన్నత గల దని సాంఖ్య విశ్వాసము. వస్తువుల యుత్పత్తియు, విలయము నొక క్రమవిశిష్టతఁ గలిగియున్నవి. ప్రపంచము తత్కారణ మైన ప్రకృతియొక్క పరిణామమని చెప్పఁబడెను. ప్రతివస్తువు దాని నుత్పత్తిచేయు కారణమునకుఁగార్యము; ఏలన శూన్యము నుండి శూన్యమే సంభవించును. కార్యమునకంటెఁ గారణ మల్పమైనదైనచోఁ, గారణ ముత్పత్తిచేయని కార్యములోని భాగమును శూన్య ముత్పత్తిచేసియుండవలెను. అందుచేఁ గార ణము కార్యముకంటె నధికమో, సమానమో కావలెను. డేకార్టే మాటల నుపయోగించినచోఁ, గార్యములోని యర్థ మును, విలువయు, యాథార్థ్యమును బరమకారణములో సమ గ్రముగా నుండవలయునని సహజమైన హేతుజ్ఞానము వెల్ల డించును. ఏది మూలరూపములో నంతర్నిహితమై లేదో యది యెన్నఁడును గార్యరూపమున నావిష్కృతము కాఁజాలదు.౧. ప్రతికార్యమున కొకకారణ మున్నను, బ్రకృతికిఁ౨ గారణము లేదు. ప సర్వకార్యకారణమని కార్యములవలనఁ దెలియు చున్నది.3. అది ప్రధానమనఁబడును; ఏలన సర్వకార్యములు

(౧) పోల్చు: డేకార్టే చెప్పిన ముఖ్యోపాదాన కారణభేదము,

(౨) సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౬౭.

(3) సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౧౨౦, ౧3౬.

దానిపై నాధారపడియున్నవి.౧. అది బ్రహ్మయనఁబడు, నేలన నది పెంపొందును.౨. మాయయనఁబడు నేలన నది పరిమాణమును నిర్ణయించును. భిన్నద్రవ్యము లందుండి జనించును గావున నది యాదిమూర్తి యనఁబడును. ప్రకృతిలేక యనాత్మనుండి పురుషుఁడు లేక ఆత్మ సంభవించెననుట సాధ్యముకాదని సాంఖ్య నిశ్చయము.

వస్తువులు కారణజన్యములు; ప్రకృతి కారణరహితము; వస్తువులు పరాధీనములు; ప్రకృతి స్వతంత్రమైనది. వస్తువులనేకములు, దేశకాలపరిచ్ఛిన్నములు; ప్రకృతి యేకము, సర్వవ్యాపి, నిత్యమునైనది.3. వస్తువులు సంజ్ఞలు; వాని మూలకారణము నవి సూచించును. ప్రకృతి కెన్నఁడును నాశనము లేదు; అందుచే నది పుట్టుకగలిగి యుండదు. చేతనశక్తి అచేతన జగత్తున కుపాదాన కారణము గాఁజాలదు. ఏలనఁ జైతన్య మెన్నడును జడపదార్థము కాఁజాలదు. పురుషునికిఁ గర్తృత్వము లేదు, అహంకారమే కర్త; ఏలన నదియు నొక యుత్పత్తిగలవస్తువేశ

౧ ప్రధీయతే (సాం. ప్ర. భా. ౧, ౧౨౫). లోకాచార్యుఁడది సర్వపరిణామాధారము కావునఁ బ్రకృతియనియు, స్వజ్ఞాన వ్యతిరేకము గావున నవిద్యయనియు, నానారూపసృష్టికారణము గావునమాయయనియుఁ జెప్పినాఁడు. ప్రకృతిరిత్యుచ్యతే వికారోత్పాదకత్వాత్, అవిద్యాజ్ఞాన విరోధిత్వాత్, మాయావిచిత్రసృష్టికర్తృత్వాత్,(తత్త్వత్రియము పు. ४७.) సర్వభౌతిక రూపములకు నగోచరమైన మూలప్రకృతి యొకటున్నదని ప్లేటో భావించినాఁడు. చూ.టిమోరస్, పు. ౨४. ౨. భగవద్గీత. ౧४.3.

3. సాం. కా. ౧౦; సాం॥ ప్ర॥సూ.౧, ౧౨४; మఱియుఁ జూడు. యో॥ భా॥ ४, ౧౨; సాం॥ ప్ర॥ భా॥ ౧, ౭౬.

(४) సాం॥ ప్ర॥ సూ॥ ౬, ౫४.

ప్రకృతి యగోచర పదార్థమగుట ముఖ్యవిషయము. కాదు. దృశ్యములుకాకున్నను, నిజములని సువిదితములైన వస్తువులెన్నియోగలవు. అతిసమీపాతిదూరవస్తువులు దృశ్యములుగావు. ఇంద్రియ మానసికదోషములు, ఇతరద్రవ్యావరోధము, మనము చూడవలయు వస్తువులకంటె నెక్కుడాకర్షణము గల వస్తువులుండుటయు, మనచూపును వ్యర్థమొనర్చును. ప్రకృతి సూక్ష్మమగుటచే నదృశ్యము౧. వ్యాసుఁడు ప్రకృతి నిట్లు వర్ణించెను: "ఏదియెల్లప్పుడున్నదియు లేనిదియునో, దేని యందెన్నఁడభావతలేదో, యేదివిశిష్టసంజ్ఞాహీనమో, అవ్యక్తమో. సర్వకేంద్రాధారమో అదియేప్రకృతి."౨. జీవావసరముల గూర్చిన దస్తిత్వము గలదైనచోఁ బ్రకృతిలేనిదని చెప్పవలెను; కాని యాలేకుండుట చతురస్రచక్రమువలె లేకుండుట కాదు. అస్తిత్వముగలదేదియునశించదు; వస్తువులవ్యక్తరూపములలోఁ బ్రకృతియందున్నవి. వస్తుజగత్తంతయు దానియందంతర్నిహితమైయున్నది. గుణములు పరస్పరవిరోధములుగావు; అవి యొకసమస్థితిలోనున్నవి; అదినివృత్తికాదు; అట్లుగోచరించుసమరసప్రవృత్తి. ప్రకృతి యొకవ్యక్తికాక శక్తియని చెప్పవలెను. ఈత్రిగుణసామ్యావస్థ౩, భౌతికమానసికరూపము లన్నిటికాధా

---

౧ సాం॥ కా. ౮.

౨ నిస్సత్తాసత్తమ్, నిస్సదసన్నిరసద్, అవ్యక్తమలింగమ్ ప్రధానమ్. (యో. భా. ౨, ౧౯: సాం॥ ప్ర భా. ౧, ౬౧.

3 సామ్యావస్థా. (సాం॥ ప్ర॥ భా. ౧, ౬౧.)

౪ పోల్చు రా॥ వే॥ ౧౦ ౯౨.

రము. అదిశుద్ధసామ్యావస్థ. మనకుఁగలజ్ఞానము దృశ్యజ్ఞానమే గా యగుటచేఁ బ్రకృతియొక్కగాని, గుణములయొక్క కాని నిజ స్వరూపము మనకుఁ దెలియదు. దానికిశబ్దస్పర్శలు లేవు;౧ వీనికతీత లక్షణములు మనకు సాధ్యములుగావు. వ్యావహారికముగా నది యొక భావము లేక నామము,౨ కాని యది సర్వసృష్టికిని బూర్వరూపమని గ్రహింపవలసియున్నది.౩

ప్రపంచ మొక యేకపదార్థమునుండి జనించినదనియు, నట్టి పదార్థములోని సూక్ష్మాంశముల భిన్నసంయోగములచే భిన్నాకృతు లేర్పడినవనియుఁ జెప్పు సాంఖ్యసిద్ధాంతము భౌతిక వాదముతోఁ గొన్ని సామ్యములను గలిగియున్నది. బాహ్య స్వరూపము ననుసరించి ప్రపంచ మొక యపరిమ వస్తుసము చ్చయమని మనకుఁ దోఁచునుగాని, దానికొక సహేతుకమైన స్వరూప మున్నదని నిరూపింపవలెనని సాంఖ్యమును భౌతికవాద మును గూడ యత్నించును. రెండునుగూడ నొకమూల పదార్థ మున్నదనియు నది నిత్యము నవ్యయము నభేదము ననియు విశ్వ సించును. మన ప్రత్యక్షానుభవములో మనముచూచు నానా

---

౧ షష్టితంత్రమునుండి వ్యాసుఁడొక శ్లోకము నిట్లుదాహరించెను;

"గుణానామ్ పరమమ్‌రూపమ్ నదృష్టిపథమ్‌ఋచ్ఛతి।
యత్తుదృష్టిపథమ్‌ప్రాప్తమ్ తన్మాయేవసుతుచ్ఛకమ్."

దీనిపై వాచస్పతివ్యాఖ్య వ్రాయుచుఁ బ్రకృతిమాయకాదు మాయ వంటిదని చెప్పినాఁడు. మాయేవసతుమాయా.

౨ సాం॥ ప్ర॥ భా॥ ౧, ౧౨౮; విష్ణుపురాణము. ౧, ౨, ౨౧-౨౧.

౨ సంజ్ఞామాత్రమ్. (సాం॥ ప్ర॥ భా॥ ౧, ౬౮.)

౩ ప్ర=పూర్వము, కృతి=సృష్టి లేక ప్ర=అధికముగా, కృ=చేత.

వస్తు పరంపర యొకే మూలపదార్థముపై నాధారపడియున్నదని చెప్పఁబడెను. కాని సాంఖ్యుల ప్రకృతి భౌతికవాదుల శుద్ధ పదార్థమని చెప్పరాదు. పురుషోత్పత్తికిఁ బ్రకృతికి శక్తిలేదనియు నట్లే ప్రకృత్యుత్పత్తికిఁ బురుషునకు సామర్థ్యము లేదనియు సాంఖ్యశాస్త్రవేత్తలు గుర్తించినారు. భౌతికవాదు లంగీకరించరు గాని, సాంఖ్యవేత్తలు ప్రకృతి పరిణామమున కొక లక్ష్య మున్నదనియు "దానివెనుకనున్న మన మెన్నఁడెరుగని వేరొక ప్రపంచ కాంతిరేఖలు దానినుండి ప్రసరించుచున్నవ" నియు నంగీకరింతురు. సాంఖ్యుల ప కేవల మొక విశఁ వ్యాప్తమగు పదార్థము కాదు; అది యొక చేతన వ్యక్తియును గాదు; ఏలనఁ బురుషుఁడు ప్రకృతికి వేరని చెప్పఁబడెను. ప్రకృతినుండి పంచస్థూలభూతములును జనించుటే కాక;సూక్ష్మములైన మానసరూపము లన్నియు నందుండి జనించుచున్నవి. బాహ్యప్రపంచ స్థితికంతకు నదియే మూలాధారము. సాంఖ్యమిట్టి సిద్ధాంతమును భౌతికశాస్త్ర పద్ధతిచే నిర్ణయించలేదు. తాత్త్వికపద్ధతిచేతనే యీనిర్ణయమును జేసినది. పరిపూర్ణమైన యథార్థస్వరూపము నెన్నడు మార్పులేని ద్రష్టగాను, నిత్యము ను మార్పుగల దృశ్యముగాను సాంఖ్యము విభాగించెను. ఆ దృశ్య భాగమునకే ప్రకృతి మూలమైనది. నిరంతరప్రవృత్తిమయ స్వరూపమైన జగద్వ్యాపారమునకు సంజ్ఞారూపమే ప్రకృతి. ప్రకృతి తనకుఁ దెలియకుండగనే, సునిశ్చితలక్ష్యము నూహింపకుండగనే, యొక మహాప్రయోజనము కొఱకు నిత్యము క్రియాపరతంత్రమై నడచుచున్నది.

౬—గుణములు.

ప్రకృతిపరిణామము తద్గర్భితమైయున్న గుణత్రయము వలన జరుగును. ౧. ప్ర కృతికార్యములనుబట్టి గుణత్రయాస్తిత్వ మూహింపబడినది కార్యమైన బుద్ధికి సుఖదుఃఖ విస్మయ గుణము లున్నవికావున దానికారణమైన ప్రకృతి కట్టిగుణము లుండియుండవలెను. గుణములు ద్రవ్యవిషయములు గావు; వాని కార్యములవలన నవి యున్నవని గ్రహింపఁబడెను. సత్త్వము మొదటిగుణము. అది యాంతరంగిక చైతన్యము. మానవునికి సుఖానుభవరూపమున నావిష్కృతమగును. సత్త్వ శబ్దము 'సత్' అనగా 'నున్నది' యను పదమునుండి వచ్చినది; చైతన్యమునకట్టి శక్తిగలదని చెప్పుదురు. 'సత్' అనగాఁ బరిపూర్ణతయనియు నింకొకయర్థము; దీనివలన సుఖశ్రేయములను గలిగించునది సత్త్వమనియుఁ జెప్పుదురు. సత్త్వము ప్రకాశకత్వము గలది. ౨. రెండవదైన రజస్సు సర్వ ప్రవృత్తికారణమును, క్లేశమూలమునైనది. అత్యుత్కట సుఖానుభూతియు విశ్రాంతి లేని ప్రయత్నమును ౧. రజస్సు లక్షణములు. మూడవది తమస్సు; ప్రవృత్తికవరోధమై, మాంద్యమును గల్గించునది; దీనివలన నజ్ఞానాలసత్వములు గల్గును. క్రమముగా సత్త్వ రజస్తమో గుణములకుఁ బ్రకాశప్రవృత్తి నియమ ౨. ములు లక్షణములై సుఖదుఃఖమాంద్య హేతువులగును. ఇవి

(౧) సాం॥ కా॥ ౧౬. (౨) సుఖప్రకాశలాఘవము.

(౧) దుఃఖోపష్టంభకత్వ, ప్రవర్తకత్వములు; తమస్సు మోహాశురు త్వావరణైః॥ (తత్త్వకౌముది పు ౧౩)

(౨) ప్రకాశక్రియాస్థితి శీలమ్। (వై॥ సూ॥ ౨, ౧౮)

పరస్పర సంపర్కముగలిగి, పరస్పర పోషకములై యుండును. ఈ మూడుగుణములును విడిగా నెన్నఁడుండవు. అవి దీపశిఖ, ప్రత్తి, నూనెవలెఁ గలిసియుండును. 3. అవి ప్రకృతిలోని ప్రధానద్రవ్యములు. సర్వవస్తువులు గుణత్రయకల్పితములై యున్నవి. ౪. వస్తుభేదమునకుఁ గారణ మొక్కగుణము యొక్క యుత్కర్షయే. ఈగుణత్రయభావము మానసికావస్థా పరిశీలనాఫలితమే; అనుభవభేదమునుబట్టి గుణభేద మేర్పడినది. సాంఖ్యకారికయొక్క కాలమునందే, యీగుణములు ప్రకృతియొక్క ముఖ్యాంగములుగా గ్రహింపఁబడినవి. ౫ అవి గుణములనుటకుఁ గారణము ప్రకృతియొక్కటే ద్రవ్యము; గుణములందలి లక్షణములు. ఏయొక ద్రవ్యపరిణామమందైనను గుణములు భిన్నావస్థలను దెల్పునవిగా గ్రహింపనగును. పొందవలసిన రూపమును సత్వమును, దానిని సాధించుటకుఁ

(3) సాం॥ కా॥ ౧3.

(౪) త్రిగుణాత్మకమ్॥

(౫) పోల్చు. శే. అ. ఉ. ౪, ౫. "అజామేకామ్‌లోహిత శుక్ల కృష్ణమ్" ఛాం. ఉపనిషత్తులోఁ జెప్పఁబడిన మూడురంగుల నిదిస్మరించునని శంకరుఁడు చెప్పినాఁడు. సాంఖ్యవాది దీనికిట్లర్థము చెప్పునని శంకరుఁడిట్లు వ్రాసెను; "ఈశ్లోకములోని లోహితశుక్లకృష్ణములనగా రజస్సత్త్వతమములు. లోహితము రజస్సు; ఏలననది యెరుపుదనమును గలిగించి, అశాంతహేతువై రంజింపఁజేయును. శుక్లము సత్వము; ఏలననది స్వచ్ఛతనిచ్చును. కృష్ణము తమస్సు; ఏలననది చీకటిని గలుగఁజేయును. ఈమూడును మూలప్రకృతి గుణములు గావున నవి 'అజములు' పుట్టుకలేనివి" గుణములనుటకుఁ గారణ మవి యాత్మనుబంధించునవి. గుణమనగా రజ్జువు. (సాం।ప్ర॥ భా॥ ౧,౬౧.)

గల యాటంకములను దమస్సును, వానినిఁ దొలగించు శక్తిని రజస్సును దెల్పుచు రూపసిద్ధిహేతువులగును. సాంఖ్యసత్కార్య సిద్ధాంతము ననుసరించి,యొకవస్తు వెన్నఁడును. సృజింపఁబడదు; ఆవిష్కృతినే పొందును. వస్తూత్పత్తి యనఁగా నావిష్కృతియు, వస్తు వినాశమనఁగా, ననావిష్కృతియు నని యర్థము. ఆవిష్కృత్యనావిష్కృతులు రెండును నిరోధకశక్తులుండుట లేకుండుటపై నాధారపడి యుండును. ఆటంకములు లేనపుడొక వస్త్వావిష్కృతి నొందును. ఒక వస్తువుయొక్క సత్త్వము లేక రూప మావిష్కృతినొందును. రజస్సావిష్కృతి సాధనము; సత్త్వావిష్కృతినిరోధకము తమస్సు.౧. సత్త్వతమస్సులు భావాభావాత్మకము లైనచో, రెంటికిఁగల సంఘర్షణరూపమైనదే రజస్సు. ప్రతివస్తువునకు లక్ష్యరూపమున్నది;ప్రస్తుతావస్థ దానికాటంకమై తొలగింపవలసియున్నది. మొదటిదిసాత్త్వికావస్థయు రెండ

౧. డాక్టరు సీల్ యిట్లువ్రాసెను; "ప్రతిదృశ్యమునకు నాధారము త్రిగుణాత్మకము; మూలచైతన్యము, శక్తి, స్థూలరూపము. ఇవికలిసిసర్వ వస్తువులను గల్పించును. ఒకవస్తువుయొక్క సత్త్వము దానిని బుద్ధి గోచరరూప మొనర్చును. సమష్టి బుద్ధిగోచరము కానిదేదియును లేదు. కాని యిదిగుణత్రియములో నొకటి. దీనికి స్థూలతకాని, నిరోధకశక్తిగాని, క్రియాశక్తిగాని లేదు. రెండవది తమస్సు; ఇదిజడపదార్థము; చలనమునకును, బుద్ధిప్రవృత్తికి నిరోధకమునను. కాని చైతన్యమును, జడపదార్థమును క్రియాశక్తిగలవి కావు, రజస్సే పనియంతయును సేయునది; అవరోధములఁ దొలగించి, బుద్ధిలేక చైతన్యము తనకార్యములను నెరవేర్చుశక్తి నిదియిచ్చును. (డిపోజిటివ్ సైన్సెస్ ఆఫ్‌ది హిందూస్, పు॥ ౮.) ఈయర్థవివరణములో సీల్ పండితుఁడు సాంఖ్య సిద్ధాంతమును వివరించుటకు బదులు సవరించుచున్నట్లు దోఁచును.

వది తామసికావస్థయు నైయున్నది. విజ్ఞానమునకు గోచరమగు రూపమునుబొందుట సత్త్వగుణముయొక్క ఆశయము. సర్వము నకీలక్షణములున్నవి. కావున నివి ప్రకృతిలక్షణములని పరిగణింపఁబడినవి ౧.

సాంఖ్యగుణములు వైశేషికగుణములు కావు; వీనికి లఘుత్వము, ప్రవృత్తి మున్నగు లక్షణములున్నవి.౨. విజ్ఞానభిక్షువు వీనిని సత్త్వరూపములనియు,౩. భౌతిక మానసిక దోషముల నుదయింపఁజేయు నాంతరంగిక ప్రవృత్తులని ప్రాచీనోపనిషత్తుల౪. లును భావించెను. నిర్మాణములో నీగుణము లతిసూక్ష్మములని చెప్పఁబడెను. అవి నిత్యపరివర్తనశీలములు. సామ్యావస్థలోనైనను, నవి పరస్పరసంక్రమణము నొందుచున్నవి.౫. సామ్యావస్థ చెడకుండునంతకాల మీమార్పులవలన వస్తుజగత్తులోఁ గార్యోత్పత్తి లేదు. సామ్యస్థితికి విపర్యయమేర్పడినప్పుడు గుణక్షోభమువలన నన్యోన్యసంఘర్షణ ఫలితముగాఁ బరిణామ మారంభమగును. గుణముల పరస్పర

(౧) సర్వజగత్తునకును లక్షణమైన ప్రవృత్తికి దానిని నిరోధించు శక్తి వేరొకటి లేకున్నచో నర్థములేదని చెప్పఁబడెను. అందుచే రజస్సులేక ప్రవృత్తి తమస్సు లేక మాంద్యమును సూచించును. తమస్సు లేనిచో సర్వవస్తువులు నిత్యక్రియా గ్రస్తములగును. క్రియాశక్తివలన యోగ్యకాంక్షాసిద్ధి యున్నది కావున నందు సత్త్వమును నున్నది. (తత్త్వకౌముది పు ౧౩.)

౨. సాం॥ ప్ర॥ భా. ౧, ౬౧.

౩. వాచస్పతియు సాంఖ్యకారికయు నీయర్థమును జెప్పవు.

౪. శ్వేతాశ్వతర మైత్రాయణ్యుపనిషత్తులు.

౫. సారూపపరిణామము.

వ్యాపార సంఘర్షణమువలన జగద్రూప వైవిధ్య ముదయించు చున్నది. ఏగుణ మే రూపమున నతిశయస్వభావము చూపునో యారూపమున కా గుణాకృతి లభించును గాని, యితరగుణము లందు లేవని తలఁపరాదు. స్థాణువులైన జడపదార్థములలోఁ దమోగుణ మతిశయలక్షణమై యున్నది. సత్త్వరజోగుణము లప్రధానములుగా నున్నవి. చలనముగల వస్తువులలో రజోగుణ మతిశయమై, యితరగుణము లణఁగియున్నవి. కావున సత్త్వ రజస్తమోగుణములని చెప్పినపుడు వానిని విడిగానున్న గుణము లని యర్థము చేసికొనరాదు; దేనియం దేగుణమతిశయముగా నున్నదో దానికాగుణము చెప్పఁబడెనని గ్రహింపవలెను. ఈగుణములు పరస్పరసహకారముచేఁ గార్యజగత్తు నుదయింపఁ జేయుచున్నను, నవిపరస్పరము సంయోగమునొందవు. ఒక గుణముపై నొకగుణప్రభావమువలనఁగాని సాన్నిధ్యమువలనఁ గాని యవిమార్పునొందుచుండును. అవి పెంపొంది, కలిసి, విడిపోవుచుండును. ఇతరగుణములు తీవ్రముగాఁ బనిచేయు చున్నను నేగుణముకాని తనసహజలక్షణమును గోల్పోవదు.౧ ప్రకృతియు దానినుండి జనించిన సకలమును నీగుణములను గలిగయున్నవి; అందుచే నవి విజ్ఞానహీనములై యున్నవి. ఈ గుణములు తమలోఁదమకుఁగల భేదములనుగాని, తమకుఁ బురు షునకుఁగల భేదమునుగాని తెలియుశక్తిలేనివి. ఇవన్నియు దృశ్య ములే; పురుషుఁడొక్కఁడే ద్రష్ట.

---

౧ యో. భా॥ ౧, ౧౭౪.

విజ్ఞానభిక్షు వీగుణములనుగూర్చి వేరొకభావమును జెప్పినాఁడు. అవివ్యక్తుల నానాత్వము ననుసరించి, అనంతములనియు సూక్ష్మతత్త్వములనియు నాతనిభావము. ఈతనివాదము ననుసరించి, సర్వసామాన్యములైన యీగుణములు భిన్న సంయోగములచే భిన్నకార్యముల యుత్పత్తికి హేతువులగుచున్నవనుట సమంజసముకాదేలన, కొన్నిస్వల్పభేదముల[౨]కివి హేతువులను జూపఁజాలవు. గుణముల రూపము లనంతములైనను, వానికన్నిటికినిగల సామాన్యలక్షణములచే లఘుత్వము మున్నగునవి- మూఁడువర్గములుగా విభజింపఁబడినవి.[3] సత్త్వాదులైన మూఁడుకారణ ద్రవ్యములలోఁ బ్రతి గుణమునకు ననేకవిశిష్టరూపములున్నవి.[౧] గుణములకు సృష్టిలయములులేవు. సూక్ష్మావస్థనుండి స్థూలాకృతినొందుదశలో వివిధసంపర్క- పరివర్తనములచే వృద్ధిక్షయములు, అల్పత్వానల్పత్వములు బాహ్యదృశ్యరూపముల కున్నను, ఆవిష్కృతానావిష్కృతముల మొత్తమెన్నఁడును సమానముగానేయుండును. ఇదియంతయు ద్యూతక్రీడలోవలెనే జరుగును; పాచికలన్నియు మార్పులేనివేయైనను, నవిపడుస్థానముల ననుసరించి వానికి భిన్నార్థములు గలిగినవగును. మార్పులన్నియు స్థానము, క్రమము, వర్గము, సంయోగ వియోగములలోనే చూపట్టును;

౨ సాం. ప్ర॥ భా॥ ౧, ౧౨౭.
3 సాం॥ ప్ర॥ భా॥ ౧, ౧౨౮.
(౧) సాం॥ ప్ర॥ భా॥ ౧, ౧౨౮.

నిత్యస్థితిగల మూలద్రవ్యము లెల్లప్పుడును గలిసి విడిపోవు చుండును.౨.

౭—పరిణామము

ప్రకృతి మూలద్రవ్యము; దానినుండియే జగమంతయు నుత్పన్నమైనది. వ్యక్తస్వరూపములోఁ బ్రకృతియనగా వ్యతిరేకశక్తుల సంయోగము మాత్రమే. సామ్యావస్థలోనన్నియు సంబద్ధములైయున్నప్పుడు ప్రవృత్తిలేదు. నివృత్తియే ప్రకృతి యొక్క సహజావస్థ.౩ బాహ్యప్రవృత్తి లేకుండుటనగా, క్రియాశక్తిలోపమని తలపఁరాదు. ఆవిష్కరణలక్షణము లేక సత్త్వము; ప్రవృత్తి లేక రజస్సును, ఆవిష్కృతినిరోధకము, ప్రవృత్తిరహితమునగు తమస్సుచే నెమర్కొనఁబడినవి. వ్యతిరేకశక్తుల సామరస్యమే ప్రపంచమను మహోన్నతసూత్రమును సాంఖ్యము మనకుఁ బ్రకటించినది. ఏకమునభేదమునైన దేదియైన నెల్లప్పుడును ప్రవృత్తిపరతంత్రమైనఁ గావలయును లేదా నిత్యక్రియాశూన్యమైనఁ గావలెను. ప్రకృతి సహజముగా సంఘర్షణముగలది కాదు; అందుచేఁ దప్పనిసరిగా నందు భేదముండనవసరము లేదు. ౧ గుణసామ్యస్థితికి సంక్షోభముకలిగినపుడు, ప్రకృతికిఁ బ్రళయము ౨ సంభవించి, యొకగుణమతిశయభారమై పట్టుదప్పి,పరిణామమారంభమగును.

(౨) తత్త్వకౌముది. పుటలు ౧౩-౧౬: తత్త్వవైశారది. ౨, ౨౦; ४, ౧౩-౧౪; యోగవార్త్తికము. ४, ౧౩-౧४.

(3) యోగభాష్యము. ౨, ౧౮.

(౧) చూ: స్పెన్సర్: ఫస్టుప్రిన్సిపుల్సు: పు ౧౯.

(౨) ప్రకృతినాశము.

పురుష ప్రభావముచేఁ బ్రకృతిపరిణామమందును. పురుషుని యర్థసిద్ధికొఱకై త్రిగుణాత్మక విశిష్టరూపములోఁ బ్రకృత్యా విష్కరణము జరుగును. ౩. ప్రకృతి యేకము, సర్వవ్యాప్తి యును గావున సర్వవస్తువుల కదియే యాధారము; ఒకవిధ ముగాఁ జూచినచో, సర్వవస్తువులు సమానలక్షణములను గలిగియుండవలెను. కాని, వస్తువులన్నియుఁ దమలక్షణముల నొకేసారి ప్రదర్శించవు. దేశకాలనిమిత్తముల ననుసరించి, సర్వవస్తుపరిణామ మొక నియతసూత్రముప్రకారము జరుగు చుండును. ౪. ఈపరిణామ మెందుకిట్లు జరుగునో మనకుఁ దెలియదు. ఉన్నస్థితిని మనము గ్రహించవలెను. సర్వవస్తు బీజ నిలయమగు ప్రకృతినుండి విజ్ఞానస్వరూపములు, వాని విషయములు నావిష్కృతములగుచున్నవి.

ప్రకృతి పరిణామములోఁ బ్రథమోత్పత్తి గాంచినది మహత్తు. ఇది జీవియొక్క బుద్ధికాధారము. మహత్తు సమష్టి బుద్ధిస్వరూపము; వ్యక్తిగతముగా దానినే బుద్ధియందురు. బుద్ధి శబ్ద పర్యాయపదముల ననుసరించి, ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్య ములు వీనివ్యతిరేకములు బుద్ధి లక్షణములుగాఁ జెప్పఁబడుటచే మనస్సంబంధార్థమే దీనికి నిర్ణయింపఁబడినట్లు తోచును.౧. కాని మహచ్ఛబ్ద పర్యాయములుగా బ్రహ్మ మున్నగు పదములుండు

(౩) త్రయాణాంత్వవస్థా విశేషాణామాదౌ పురుషార్థతా కారణంభవతి॥ (యో॥ భా॥ ౨. ౧౯) దీనిపై వాచస్పతి భాష్యమునుగూడఁ జూడుఁడు

(౪) పరిణామక్రమ నియమము.

(౧) మతి, ఖ్యాతి, ప్రజ్ఞా, జ్ఞానమ్॥

టచే దీనికి సమష్టిస్వరూపార్థమును యుక్తమేయని తోఁచును౨. బుద్ధియనగా నశరీరియైన పురుషునిఁగా భావింపరాదు. సర్వ మానసిక వ్యాపారముల కాధారమైన సూక్ష్మశక్తియే బుద్ధి. వస్తువివేకము బుద్ధివలన మనకుఁ గలుగును. బుద్ధి నిశ్చయజ్ఞాన నిర్ణయముచేయును. తక్కిన యింద్రియములన్నియు బుద్ధివశములై పనిచేయును. బుద్ధియొక్కటే పురుషవశమై వర్తించును. పురుషుఁడు బుద్ధిసహాకారముచే సర్వానుభవములనుగలిగి, తనకును ప్రకృతికిని గల భేదమును గుర్తించును.

ప్రకృతి సంభూతములైన యితరవస్తువులవలెనే బుద్ధియు త్రిగుణాత్మకము. సాత్త్వికబుద్ధికి విధినిర్వాహణము, జ్ఞానము, రాగద్వేషశూన్యతయు నితర దైవగుణసంపత్తియుఁ గలవు; రాజసబుద్ధికిఁ గామములు లక్షణములు; తామసబుద్ధి కజ్ఞానాలసత్వములు గుణములు. సర్వజీవు లీశ్వర౩. స్వరూపములనియు రజస్తమోగుణములు జీవుల స్వతస్సిద్ధమైన యీశ్వరత్వమును మఱుఁగుపఱచుచున్నవనియు విజ్ఞానభిక్షువు చెప్పినాఁడు.౪. భూతసృష్టియు బుద్ధిసృష్టియు వేరు. విపర్యయము, అశక్తి, తుష్టి, సిద్ధియు బుద్ధిరూపములు. వీనికేబదిరూపము లున్నవి౫. అవిద్యాఽస్మితాదు లగు నజ్ఞానరూపము లైదు; వీనిలో నొక్కొక్క

(౨) అనంతర వేదాంతమందు సమష్టిబుద్ధి హిరణ్యగర్భుని యుపాధిగాఁ గైకొనఁబడెను.

(౩) సర్వఏవ పురుష ఈశ్వరఇతి,

(౪) సాం॥ ప్ర॥ భా॥ ౨, ౧౩. మఱియుఁజూడుః యో॥ భా॥ ౧, ౨

(౫) సాం॥ కా॥ ౪౭.

జాని కెనిమిది రూపములున్నవి. రాగము పదిరకములు; ద్వేషాభినివేశము లొక్కొ-క్కటియుఁ బదునెనిమిది తెఱఁగులు. అశక్తి యిరువదియెనిమిది రూపములు గలది; నవరూపకము తుష్టి; అష్టవిధము సిద్ధి.

బుద్ధి నిత్యానిత్యము. ఇది ప్రకృతిలో బీజాకృతివహించి అవ్యక్తమై యున్నది. అది కారణరూపమునుండి కార్యరూపము దాల్చినపుడు బుద్ధి యనఁబడును. బుద్ధి అవ్యయము, సర్వసంస్కారగర్భితము నని విజ్ఞాన భిక్షువు చెప్పినాఁడు. స్మృతి బుద్ధిగతమే కాని మనస్సునకుఁ గాని యహంకారమునకుఁ గాని చెందినదికాదు. "పరమార్థ జ్ఞానసిద్ధి"వలనఁ జిత్తాహంకారములు విలయమందినను, స్మృతి నిలిచి యుండును.౨.

మనోఽహంకారేంద్రియాత్పూర్వమై బుద్ధియున్న నే కారిక చెప్పినరీతిని బుద్ధి తన విధులను నిర్వర్తించఁగలదు. కాని వీని కన్నిటికిఁ బూర్వమే బుద్ధి యున్నదని సాంఖ్యము చెప్పుచున్నది. అందువలన సర్వద్రష్టృదృశ్యభేదముల కాధారభూతమైన సమష్టిశక్తియే బుద్ధియని గ్రహింపవలెను. కాని మన మూహించిన విశ్వైకశక్తిని సాంఖ్యమంగీకరింపదు. అందుచే మహత్తులేక బుద్ధియొక్క పదవి సందిగ్ధమైనది. ప్రకృతి సంభూతము, నహంకారజనకమునగు బుద్ధి వేరు; ఇంద్రియమనోఽహంకారవ్యాపారములను నడపించు బుద్ధివేరు రెండు నొకటే యైనచోఁ బ్రకృతి పరిణామమంతయు వాస్తవికత లేనిదేయగును;

౧. సాం॥ ప్ర॥ భా॥ ౨॥ ౪౧-౪౨.

౨. సాం॥ ప్ర॥ భా॥ ౨, ౪౨.

వలన నహంకారమును, నిరహంకారతయును రెండును బుద్ధి నుండి పుట్టినవే. ఈసందిగ్ధస్థితి ప్రకృతి జన్యములైన యితర పదార్థముల కన్నిటికిని గలదు.

అహంకారము బుద్ధి కనంతరపరిణామమే. అహంకారము వలననే వివిధశక్తులు ప్రత్యేకాధారభూతములగు చున్నవి. ఇందుఁ గూడ మనము వ్యష్టిసమష్టి రూపవిచక్షణ చేయవలెను. వ్యష్టిరూపములో, బాహ్యవస్తు జ్ఞానములేని యహంకారమర్థ రహితము, కాని సాంఖ్యపరిణామసిద్ధాంతమునందు వస్తు ప్రపంచ మహంకారమున కనంతర పరిణామమని చెప్పఁబడెను. సమష్టి రూపమైన విశ్వాహంకారమొకటి యుండవలె ననియు వ్యష్టి రూపములైన ద్రష్టృదృశ్యములు దాని రూపములే యనియు నూహింపవలసి యుండును. అహంకారము భౌతికపదార్థమని తలపఁబడెను; బుద్ధి జ్ఞానాధిక్యత గలదియు, నహంకారమధిక క్రియాసమర్థ మనియుఁ జెప్పనగును. స్వీయాభిమాన మహంకారమునకుఁ బ్రధాన ప్రవృత్తి. కర్తృత్వమహంకారమునకే కాని, పురుషునికి లేదు.౧. ఆత్మజ్ఞానముతో విజ్ఞానము నకుగల సంబంధమే అహంకారముతో మహత్తునకుఁ గలదు. రెండవది యుండవలె నన్నచో మొదటిది ముందుండవలె ననుట హేతుయుక్తమైనది. అహంకారాస్తిత్వమును దాని

(౧) సాం.ప్ర.సూ.౬.౫౪. విజ్ఞాన భిక్షువీఛాందోగ్య వాక్యము నుదాహరించెను; "బహుస్యామ్ ప్రజాయేయ" (నేను సృష్టించి యనేక మగుదును గాక" దానిపై నిట్లాతఁడు వ్యాఖ్యచేసెను "సర్వభూతములును,దదితరములు నభిమానముచే నుదయించెను గావున నభిమానమే సృష్టి కారణము."

(సాం. ప్ర. సూ. ౧. ౬౩.)

కార్యములవలన మన మనుమానించి తెలిసికొను చున్నాముౘ. ఇతరవస్తువుల కుపాదాన కారణమగుటచే నహంకార మొక ద్రవ్యము. అహంకారము మూలమునఁ బ్రకృతి కర్మలన్నియుఁ దనవేయని పురుషుఁడు తలఁచును. కార్యసూచనలను వేదనలను నాత్మ కహంకారమందఁ జేయును. ఈవిధముగా నది భావనిర్ణయ వ్యాపారములలో నాత్మకుఁ తోడ్పడును. అహంకారము విశ్వ చైతన్యమునుండి యేర్పడిన వ్యష్టిరూపము గాదు; అది బాహ్య ప్రపంచమునుండి వచ్చు భావములకుఁ బృథగ్వ్యక్తిత్వము నిచ్చును. అహంకారము సత్త్వసంశుద్ధమైనపుడు మనము సత్కర్మాచరణ మొనర్తుము. రజోగుణ యుక్తమైనపుడు దుష్కర్మ లొనర్తుము. తమోగుణ గ్రస్తమైనపుడు విజ్ఞానహీనకర్మ లొనర్తుము. సుషుప్త్యవస్థలో నహంకారము ప్రవృత్తిలోనుండదు; కాని కామసంస్కారములన్నియు నుండును.౧. అహంకారము మహత్తునుండి కాని, బుద్ధినుండికాని యెట్లుత్పన్నమైనదో చెప్పుట కష్టము.

అహంకారమునుండి గుణములు త్రివిధపరిణామమంది, సాత్త్విక రాజస తామస రూపముల నొందును. పంచజ్ఞానేంద్రియములు పంచకర్మేంద్రియములు, మనస్సును సాత్త్వికాహంకార వికారములు. పంచసూక్ష్మభూతములు తామసాహంకార వికార

(౨) సాం. ప్ర. సూ. ౧. ౬౩.

(౧) సాం॥ ప్ర॥ భా॥ ౧, ౬౩.

ములు, రాజసాహంకారరూపమైన తైజసము రెంటియందు నుండి కార్యోత్పత్తి హేతువగును.౨. పంచతన్మాత్రలనుండి తామసలక్షణాతిశయముచే బంచస్థూల భూతోత్పత్తి కలుగును. అన్నిటిలో నేదోయొక గుణ మతిశయావస్థలో నున్నను నితరగుణములుకూడ నుండి వానివిధులను నెరవేర్చి, పరోక్షముగా వస్తుపరిణామము నందు సహకారులగుచుండును.

ఇంద్రియములిచ్చు దృశ్యములను భావములుగా సమన్వయ మొనర్చు ముఖ్యకర్తవ్యము మనస్సు చేయుచు, భిన్నక్రియా విధానముల నూచించుచు, గర్మేంద్రియముల ద్వారమున సంకల్పముయొక్క నిర్ణయములను నెరవేర్చుచుండును. బుద్ధ్యహంకార విషయములోవలెనే, మనస్సునుగూర్చియు నింద్రియమునకును నింద్రియప్రవృత్తికిని భేదము గుర్తింపఁబడలేదు. ఇంద్రియములు ద్వారములు, మనస్సు ద్వారపాలకుఁడు నని

---

(౨) సాం॥ కా॥ పుటలు ౨౮-౨౯. సాత్త్వికాహంకారమునుండి మనస్సును, రాజసమునుండి దశేంద్రియములును, తామసమునుండి పంచతన్మాత్రలు నుదయించును. (సాం॥ ప్ర॥ భా॥ ౨, ౧౮. రజోగుణము సర్వపరిణామమునకుఁ బ్రధానమనియు, నితరగుణములు వస్తులక్షణహేతువు లనియు సామాన్యముగా నంగీకృతమైన భావమునే అనిరుద్ధుఁడు ప్రకటించినాఁడు. మహత్తునుండి యహంకారమును, నహంకారమునుండి తన్మాత్రలును జనించునని వాచస్పతి చెప్పగా, నహంకారమును, తన్మాత్రపరిణామమును మహత్తులో విడిపోవునని విజ్ఞానభిక్షువు పలికెను.

చెప్పఁబడెను.౧. దర్శనకర్మలకు రెంటికిని మనస్సహాకార మవస రము. వివిధేంద్రియముల విషయములో మనస్సు వివిధ రూపములను వహించుచుండును.౩. చలనక్రియాశక్తులు౪. గల సాధనమగుటచే మనస్సుసర్వవ్యాపికాదు. ఇంద్రియసంపర్కము గలదగుటచే, నిది సావయవము. బుద్ధ్యాదీంద్రియము లీశ్వరా ధీనతగల్గిన నిత్యతాలక్షణ యుక్తములుగావు.౫.

త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములు పంచేంద్రియ ములు. అవసరము కార్యమును గలుగఁజేయును. మనకుఁగోరిక యున్నది; అందుచేఁ బ్రవృత్తులను వానివిషయములను సృజించు కొనుచున్నాము ౬. ఇంద్రియములు భూతములనుండి జనించ లేదు; ఏలన నింద్రియములును భూతములునుగూడ నహంకా

(౧) సాం. కా. ౩౫, బుద్ధి, అహంకారము, మనస్సు సరిగా విభా గింపఁబడలేదు. అవియంతఃకరణ రూపములని తలఁపఁబడెను. "కేవల త్రివిధ దశాభేదమనుసరించి యంతఃకరణ మేకైకరూపము, బీజము, అంకురము, మహావృక్షము మున్నగువానిలోవలెనే, యది కార్య కారణసంబంధముగలది" విజ్ఞానభిక్షువు వాయుపురాణమునుండి యిట్లుదాహరించెను; "మనోమహాశ్చ మతిర్బ్రహ్మపూర్బుద్ధిః ఖ్యాతిరీశ్వరః (సాం: ప్ర భా॥ ౨, ౧౬.) చూ. సాం. ప్ర॥ భా॥ ౨, ౪౦.

(౨) సాం॥ ప్ర. సూ. ౨, ౨౬.

(౩) సాం॥ ప్ర॥ సూ॥ ౨, ౨౭.

(౪) సాం॥ ప్ర॥ సూ॥ ౫, ౬౯-౭౦.

(౫) సాం. ప్ర. సూ. ౫, ౧౨౮.

(౬) పోల్చు. మ. భా. ౧౨, ౭౭౫౮. రూపరాగాదభూచ్చక్షుః చూ. మ. భా. శాంతిపర్వమ్. ౨౧౩-౧౬.

రోద్భవములు.౭. సృష్టిలయములున్నవి కావున నింద్రియములు నిత్యములుగావు. ఒక్కొక్కయింద్రియ మొక్కొక్క గుణమును గ్రహించును. ఇంద్రియములనగా నవయవములుగావు; అవి మనస్సుపయోగించు ప్రవృత్తులు ౘ. స్థూలసూక్ష్మభూత విషయముల దర్శించు సాధనములు.౯ కర్మేంద్రియములు వాక్పాణి పాద పాయూపస్థలు, ఇంద్రియములతోఁగూడిన మనస్సు, వాని ప్రవృత్తిచేఁ బంచప్రాణములను.౧౦. సృజించునని చెప్పఁబడెను. వేదాంతతత్త్వమున నీపంచప్రాణములకు స్వతంత్రస్థానమీయఁబడెను. సాంఖ్యసూత్రము ననుసరించి ప్రాణమింద్రియ లక్షణమనియు నింద్రియములు లేనియెడలఁ బ్రాణముఁడదనియుఁ జెప్పఁబడెను.౧.

వస్తుప్రపంచము పంచేంద్రియముల కనుగుణముగాఁ బంచతన్మాత్రలను ౨. గలిగియున్నది. ఇవి శబ్దస్పర్శ రూపరస గంధముల సూక్ష్మరూపములు, ఇవి భౌతికతత్త్వము లేగాని ప్రాకృతదృష్టికి గోచరించునవికావు. ఇందొక్కొక్కటియు నొక్కయింద్రియసంబంధమునుమాత్రమే కలిగియుండును. స్థూల భూతములుమాత్రము వివిధేంద్రియములకుఁ గన్పట్టును.

---

(౭) సాం॥ ప్ర॥ సూ॥ ౨, ౨౦.
(ౘ) సాం. ప్ర. సూ. ౨, ౨౩.
(౯) సాం. కా. ౩౪.
(౧౦) సాం. ప్ర. సూ. ౨, ౩౧.
(౧) ౫, ౧౧౩.
(౨) ఆదిమాత్రమే (తన్మాత్ర), చూ. ప్రశ్నోపనిషత్తు. ౪, ౮. పోల్చు ఎంపిడోకిల్సుయొక్క భూతముల సిద్ధాంతము.

ఈతన్మాత్రస్వరూపములు యోగులదృష్టికి౩, గోచరించును గాని, ప్రత్యక్షవస్తుదర్శనమువలన నితరు లనుమానించి తెలిసికొనవలయును. తన్మాత్రలకు విశేషలక్షణము లేదనియు వానినుండి పుట్టిన స్థూలభూతములకు విశిష్టలక్షణము లున్నవనియుఁ జెప్పఁబడెను. ౪. తన్మాత్రలు సంయోగముచే నణురూపములు దాల్చినఁగాని యింద్రియవిషయములు కాఁజాలవు. తమోఽవృతమైన భూతాది లేక అహంకారము భేదరహితము, క్రియాశూన్యము, నిర్గుణమునై యొక్కద్రవ్యత్వమునుమాత్రము గల్గియున్నది. భూతాదిరజోగుణావృతమైనపుడు పరిభ్రమణశక్తి గలిగి తేజోవంతమైన సూక్ష్మపదార్థముగామారి శక్తిసముపేతమగును; అప్పుడు శబ్ద స్పర్శ రూప రస గంధ తన్మాత్ర లుదయించును. భూతాదికిని తన్మాత్రలకును మధ్యమస్థానము నాకాశమాక్రమించును. కారణాకాశము సూక్ష్మము, సర్వవ్యాప్తము; కార్యాకాశ మణురూపము గలది, అహంకారాంశములతో శబ్దతన్మాత్ర కలియుటచే నేర్పడినది. శబ్దతన్మాత్రలు కారణాకాశమునం దనిలాణుపరిణామమున కాధారములై యున్నవి.౧ వ్యాసభాష్యము ననుసరించి, అహంకారమునుండి

---

(౩) తత్త్వకౌముది. పు. ౫.

(౪) పోల్చు. ఛాందోగ్యభాష్యము. (౬-౪). పంచభూతమిశ్రమముచే స్థూల భూతము లుదయించును. ఈస్థూలభూతములలో నేభాగ మెక్కువగా నుండునో యానామము వచ్చినది. ఒకవేదాంతభావము ననుసరించి, ప్రతిభూతమునందును సగము భూతభాగమును, మిగిలిన నాలుగుభూతములలోనుండి యెనిమిదవవంతును గలియున్నని చెప్పఁబడెను.

(౧) చూ. సీల్. పాజిటివ్ సైన్సెస్ ఆఫ్ ది ఏన్షెంట్ హిందూస్.

శబ్దతన్మాత్రయును, అహంకారయుక్తమైన శబ్దతన్మాత్రనుండి శబ్దస్పర్శాలక్షణములుగల స్పర్శతన్మాత్రియు నిట్లేయితరములు నుద్భవించునని చెప్పఁబడెను ఇతరములొక్కొక్క-గుణమధికముగాఁ జేరుటవలన జనించును.

గౌడపాదవాచస్పతుల ననుసరించి తన్మాత్రిలయొక్క- సంయోగములచే వృద్ధిపొందిన సముచ్చయరూపముల వలన స్థూలభూతము లుదయించును. ఈభావము ననుసరించి, యాకాశమునకు స్థూలసూక్ష్మభేదమును జెప్పఁజాలము; ఏలన నాకాశమునకు శబ్దగుణమొక్క-టే యున్నది.౨. ఆకాశాణువాకాశతన్మాత్రినుండియు, ననిలాణువు శబ్దస్పర్శతన్మాత్రిల నుండియు, జనించునని వాచస్పతి చెప్పెను. ఈ రెంటిలోను స్పర్శాతన్మాత్ర ముఖ్యమైనది; తేజోఽణువు శబ్దస్పర్శరూప తన్మాత్రిలనుండి వచ్చును; ఇందు రూపతన్మాత్ర ప్రధానమైనది; అట్లే జలాణువు నాలుగు తన్మాత్రిలనుండియు పృథివ్యణువు పంచతన్మాత్రిల నుండియు జనించును; ఇందు వరుసగా రస గంధతన్మాత్రలు ముఖ్యములు.౩. విజ్ఞానభిక్షువు కొలఁదిగా భేదాభిప్రాయమును గలిగి యున్నాఁడు. ఆకాశాణువాకాశతన్మాత్రినుండి భూతాది సహకారమున జనించును.౪.

(౨) చూ. తైత్తిరీయోపనిషత్తు, ౨, ౧,

(౩) తత్త్వవైశారది ౧; ౪౪,

(౪) యోగవార్తికము. సర్వాణువులకు భూతాదిసహకారమున్నదని వాగేశుఁడు భావించెను. సర్వత్రి తన్మాత్రైస్తద్భూతోపాదానే ఽహంకారస్య సహకారిత్వమ్‌బోధ్యమ్,"

స్థూలాణువులు కలియునపుడు వానిగుణములే సముచ్చయద్రవ్యములలో నుండునేకాని వానితత్త్వములలో భేదముండదు. (1) ఆకాశాణువునకుఁ బరద్రవ్యప్రవేశక శక్తియు, ననిలాణువున కొత్తిడికలుగఁజేయు శక్తియు, దేజోఽణువున కుగ్రకాంత్యుష్ణతలును, జలాణువునకు ద్రవ్యత్వమును, పృథివ్యణువునకు సంయోగాకర్షణమును గుణములైయుండును. స్థూలాణుసంయోగమువలన పృథివీభూత ముదయించును. సుఖదుఃఖాభావముల నుదయింపఁజేయు తన్మాత్రలశక్తి, తన్మాత్రలరూపములో గోచరింపదు. స్థూలాణువులలో నది గోచరించును గావున స్థూలభూతములకు శాంత ఘోర మూఢగుణభేదములు చెప్పఁబడినవి. భూమ్యగ్న్యాదు లనేక గుణభేదములచే జగత్తులో నానారూపములను బ్రదర్శించుచున్నవి. ఏకాణువర్గ నిర్మితములగు వస్తువులలోఁ జెప్పఁదగిన భేదములు లేవు. ప్రతివస్తువులో నిహితమై నిగూఢమైయున్న శక్తి సమానమైనదే కావున, (2) పరిణామమంతయుఁ బురుషునికొఱకే జరుగును. స్థూలాణువులు (3) చేతనాచేతనరూపములనన్నిటిని గల్పించును గావున నచేతనములనుండి చేతనరూపావిష్కృతికి వలయు పరిణామములో విచ్ఛిన్నత లేదు. అచేతన స్థావరజంగమవర్గ

(1) అవిశేషమునుండి విశేషపరిణామము తత్త్వాంతర పరిణామమని చెప్పుదురు; ధర్మ (గుణ) పరిణామమేకాదు.

(2) యో॥ భా॥ 3, 14.

(3) స్థూలాణువులలో వివిధతన్మాత్రలు గలవు కావున నివి వైశేషికాణువులతో సమానములుగావు. తన్మాత్రలవయవశూన్యములు నగోచరములును.

ములు పరిణామ ఘట్టములు; వీని నిర్మించుద్రవ్యములలో భేదములేదు; ద్రవ్యగుణభేదము లున్నవి. ౪. అణువులయొక్క భిన్నసంయోగములవలన భిన్నగుణము లేర్పడుచున్నవి. సామాన్యముగా నంగీకరింపఁబడిన చతుర్విధదేహములకు సాంఖ్యము సాంకల్పికసాంసిద్ధిక శరీరములనుజేర్చినది. సర్వ దేహములకును భూమియే ఉపాదానకారణము; ౫ ఇతరభూతములుకూడ సహకారులుగా నున్నవి. స్థూలదేహము పంచభూతపరికల్పితము. కాని, యిందాకాశ మవసరములేద ని కొందరును, భూమియొక టేచాలని కొందరును దలఁచిరి. మానవదేహమందుఁ బృథివీభూత మతిశయముగా నుండుననియు, సూర్యలోకస్థుని దేహమునఁ దేజోభూతమతిశయమై యుండుననియుఁ జెప్పఁబడెను. ౧.

గుణత్రయావృతమైన ప్రకృతియుఁ బ్రకృతిసంభూతవస్తువులును వివేకశూన్యములును, సర్వపురుషసామాన్యములును, నచేతనములును, ప్రసవధర్మయుక్తములు నగు విషయములని చెప్పఁబడెను.౨. పరిణామదశలోని ప్రతివస్తువును దత్పూర్వవస్తువుకంటె స్థూలతరమును, పరవస్తువుకంటె సూక్ష్మతరము నైయున్నది. ప్రకృతినుండి పంచభూతములవఱకు వచ్చు తత్త్వములిరువదినాలు గనియు, బురుషుఁడిరువదియైదవతత్త్వమనియు

(౪) ధర్మపరిణామము.

(౫) ౫, ౧౧౨.

(౧) 3, ౧౭-౧౯.

(౨) సాం॥ కా॥ ౧౧.

సాంఖ్యశాస్త్రము చెప్పెను.౩. ప్రకృతి సముద్భవములైన యిరువదిమూఁడు తత్త్వములును గార్యములే; ఏలన నవి ప్రకృతిపురుషులకు వేఱైనవియును, బరిమిత పరిమాణము గలవియు, వృద్ధియుఁ బుట్టియు నను ప్రధానముయొక్క లక్షణములను గలిగినవియుఁ బురుషుని కుపకరణములునై యున్నవి.౪. సర్వజగద్వస్తువులును ప్రకృతికి వికృతులని చెప్పఁబడినవి. ఒకమూల ద్రవ్యమునకు గుణములకుఁగల సంబంధమే ప్రకృతి వికృతులకుఁ గల సంబంధము. మహదహంకార పంచతన్మాత్రలును గొన్నిటికిఁ గారణములును, గార్యములునై యున్నవి. పంచస్థూలభూతములును, నేకాదశేంద్రియములును వేనికిని గారణములు గావు. ప్రకృతి కారణముమాత్రమే; పదునొకండుపదార్థములు

(3)

౧. పురుషుఁడు.

౨. ప్రకృతి (అవ్యక్తము)=వ్యక్తము.

| | |
|---|---|
| ౩. బుద్ధి | ౧౦ మనస్సు. |
| ౪. అహంకారము | ౧౧-౧౫. పంచేంద్రియములు |
| ౫-౯. పంచతన్మాత్రలు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు | ౧౬-౨౦ కర్మేంద్రియములు |
| | ౨౧-౨౫. పంచస్థూలభూతములు; పృథివ్యప్తేజో వాయు రాకాశములు. |

౪. సాం॥ప్ర॥ సూ.౧, ౧౨౯-౧౩౪; సాం॥కా॥ ౧౫.

కార్యములు. ఏడుపదార్థములు కారణములు, కార్యములుఁ గూడను; పురుషుఁడు కారణముకాదు, కార్యమునుగాదు.౧.

ఈపరిణామ వస్తువులు, స్వకీయలక్షణములు గల యితర వస్తువుల నుత్పత్తి చేయఁగలుగు వానిని 'అవిశేష'ములనియు నట్టితరముల నుత్పత్తి చేయలేని వానిని 'విశేష'ము లనియుఁ జేర్కొనిరి. అహంకారము తన్మాత్రల నుత్పత్తి చేసినపుడాతన్మాత్రలలో నభిమాన మెచటనున్నదో మనము తెలియఁజాలము. అహంకారసంభూతమైనది పూర్తిగా భిన్నతత్త్వమువలె నున్నది; అందుచే నిచటఁ దత్త్వాంతరపరిణామము చూపట్టుచున్నది. ఇంద్రియములును, స్థూలభూతములును భిన్నలక్షణములు గల వాని నుత్పత్తి చేయఁజాలవు. అందుచే నహంకారము 'అవిశేష' తత్త్వముకాఁగా, నింద్రియాదులధిక విశేషములగుచున్నవి.౨.

కారణరూపమున నవ్యక్తముగా నున్నది కార్యరూపమున వ్యక్తమగుటయే పరిణామము. ఆద్యంతములు నిశ్చితములైయున్నవి. ప్రకృతి యనేకద్రవ్యముల నుత్పత్తిచేయుచున్నను, తా నవ్యయమై నిలుచుచున్నది. వస్తూత్పత్తివలన వస్తుమూలాధారమైన ద్రవ్యము క్షీణించుటలేదు. భౌతికపదార్థ

(౧) సాం॥ కా॥ 3, పోల్చు: ఎరిజినా: "ఏదిసృజించునేగాని సృజింపఁబడదో; ఏదిసృజింపఁబడి సృజించునో; ఏదిసృజింపఁబడునుగాని సృజించదో; ఏదిసృజింపఁబడదు, సృజింపదో." చూ. గర్భోపనిషత్తు. 3౬

(౨) చూ: రౌ॥ భా॥ ౨, ౧౯ తన్మాత్రలు, నహంకారము మహత్తుయొక్క అవిశేషరూపములనియుఁ బంచభూతములు తన్మాత్రలయొక్క విశేషరూపములనియుఁ బంచేంద్రియములు, పంచకర్మేంద్రియములు, మనస్సును 'అస్మిత' విశేషరూపములనియుఁ జెప్పఁబడెను.

మేదియుఁ దనశక్తినిఁ గొంతఁ గోల్పోవకుండఁ బనిచేయఁజాలదు. అందుచేఁ బ్రకృతి కేవల భౌతికద్రవ్యస్వభావముగలది కాదు.

సాంఖ్యపరిణామ సిద్ధాంతమెట్లు యుక్తమైనదో సరిగా బోధపడుటలేదు; ఈపరిణామమందు భిన్నదశలకుఁ గలహేతువు లెవ్వియో తృప్తికరముగా నెచ్చటను జెప్పఁబడి యుండలేదు.

సాంఖ్యతత్త్వములోని వివిధసూత్రములు ప్రకృతినుండి వచ్చినవని సహేతుకముగాఁ జూపు టసాధ్యము; అవి ప్రకృతిజములనియు, నవి యట్లు తటస్థించుచున్నవనియుఁ జెప్పఁబడెను. ఏకైక ప్రకృతినుండి యవి క్రమరీతి నుదయించెననుట కవకాశములేదు. విజ్ఞానభిక్షు వీ లోపమును గ్రహించియే, సాంఖ్య పరిణామవాదము యుక్తమైనదనుటకు శాస్త్రప్రమాణమే౧. యాధారమని విశ్వసింపఁగోరినాఁడు. కాని యిది సహేతుకమైన తాత్త్వికచర్చకుఁ దిలోదకములిచ్చుటయే యగును.

బుద్ధ్యహంకార మానసాదులు పరిణామమున క్రమోత్పత్తియైన తత్త్వపరంపరగా మనము నిర్ణయింపనవసరములేదు. అవి పరిణతినందిన జీవులయొక్క తార్కికపరిశీలనా ఫలితములు మాత్రమే. వాచస్పతి యిట్లు వ్రాసినాఁడు: "ప్రతిమానవుఁడు మొదటఁ దన బాహ్యేంద్రియముల నుపయోగించి, తరువాత మనస్సుతో నాలోచించి, యావెనుక విషయముల నన్నిటి నహంకారమున కందఁజేసి, యప్పుడు తుదకు బుద్ధిచేఁ గర్తవ్య

౧. అతిపరోక్షత్వే ర్మహాన్మహతోఽహంకార ఇత్యాది సృష్టిక్రమే శాస్త్రమేవ ప్రమాణమ్, (సాంఖ్యసారము) మఱియుఁ జూడు జయంతుని న్యాయమంజరి పుటలు ౪౯౨-౯౬.

నిర్ణయమును జేయును"౨. ఈ విభాగమంతయు నంతరింద్రియ వ్యాపారములనే చెప్పునుగాని, ఎస్తు జగత్తుతో సంబంధించిన విషయముల పట్ల నివెట్లు వర్తించునో స్పష్టముగాఁ జెప్పఁబడి యుండలేదు. పిండాండము నుదాహరణముగాఁ గైకొనియే బ్రహ్మాండస్వరూప నిరూపణమును జేయఁబడినది;ఏలన మానవునియందు బ్రహ్మాండములోని సర్వమును సూక్ష్మరూపమునఁ గానవగును. జాగ్రన్నిద్రావస్థల కనుగుణముగా సృష్టిలయము లున్నవి. సుషుప్త్యవస్థలో నాత్మయున్నది కాని, ప్రపంచ మునుగూర్చిన జ్ఞానముండదు. అట్లే ప్రళయకాలమున జీవు లుండును, గాని, ప్రకృతి దృశ్యము కాదు. సుషుప్తినుండి మేల్కాంచిన వ్యక్తి, "నేను సుఖనిద్రపొందితిని, నాకేమియుఁ దెలియద"ని చెప్పునపు డీ తెలియని దశాత్మ లేక అవ్యక్త ప్రకృతి; దీనినుండి తెలియుశక్తి జనించును ప్రకృతి, ప్రవృత్తి సహితమైనప్పు డున్నస్థితి, జీవునిసుషుప్త్యవస్థను సరిపోవును. సుషుప్తినుండి లేచినవెంటనే చైతన్యముకలిగి, అహంకార ముద యించి, విశ్రాంతిలేని కామదాహ ముత్పత్తియగును. ఇంద్రియములును శబ్దస్పర్శాదులు తరువాత మొలకెత్తును. అట్లే మానవుఁడు సుషుప్తినుండి లేచినంతనే స్థూలభూతజ్ఞానముద యించును. జీవునకనాత్మ సాంగత్య మేర్పడినప్పుడు గోచరించు నాదశాకాశమున మొట్టమొదటఁ బ్రత్యక్షమగునది బుద్ధి చైతన్యమను వెలుఁగు. మొదట నపుడు జీవియేదియో యున్నదని గ్రహించును. అనాత్మ తనకువేరైనదని తెలియుటతోఁ దన

౨. తత్త్వకౌముది, పు, ౨౩.

ప్రత్యేకవ్యక్తిత్వమును గుర్తించును. "నేను నాకంటె వేరైన వస్తుజగత్తును జూచుచున్నా"నని" తెలియును. అట్టి వస్తుజగత్తు భూతకల్పితమై, భిన్నమానసికావస్థల సమన్వయమై ప్రకాశించును.౧. సాంఖ్యపరిణామసిద్ధాంత విధానమంతయు మానవుని మానసికదశా భేదములపై నాధారపడి నిర్మింపఁబడెను. మానసికదశా పరిణామములనుండి యీసిద్ధాంతము తాత్త్విక సిద్ధాంతమగుట కుపనిషత్సంప్రదాయము సహకార మొనర్చినది. నిర్గుణ బ్రహ్మమునుండి ప్రథమపరిణామదశలో బ్రహ్మ జనించెనని యందుఁజెప్పఁబడెను. ప్రకృతినుండి మొట్టమొదట

---

(౧) సర్. ఆర్. జి. భండార్కరు సాంఖ్యపరిణామ సిద్ధాంతమునకు ఫిక్టేతత్త్వవేత్తవంటి యర్థమునిచ్చి యున్నాఁడు. తనమనస్సునందేమి జరుగుచున్నదో యెఱుఁగువ్యక్తి, తానుసృజింపని కొన్ని వేదనలు తనకువచ్చి గోచరించుటను జూచును. అందుచే నొకబాహ్యప్రకృతియున్నదనియూహించును. తనవిజ్ఞాన పరిమితివలన బాహ్యప్రకృతి వాస్తవికతను నిశ్చయించును." విజ్ఞానదశలో "నేను"నునది పరిచ్ఛిన్నమని తెలిసినప్పుడు మొట్టమొదటబుద్ధి "నేను" భావమును స్థిరీకరించి, "నేను" గాని దానిని గ్రహించును. "నేను" యొక్క పరిచ్ఛిన్నత: దానికిఁబూర్వమపరిచ్ఛిన్నత లక్షణమై యుండెనని సూచించును. ఈవిధముగా మనకుఁ బరిచ్ఛిన్నాహంకారము, తద్వ్యతిరేకము, పరిచ్ఛిన్నత; పరమాత్మభావమును లభించును. సూక్ష్మస్థూలభూతములును, వానితన్మాత్రలును, నింద్రియములును నహంకారోద్భవములనఁబడినవి నిజముగాఁ బ్రకృతిసంజాతములు. స్వతంత్రమై పరిచ్ఛిన్నమైనపరమాత్మయే పురుషుఁడు; అనాత్మసంబంధమైన యపరిచ్ఛిన్నతయే బంధము. పరిపూర్ణస్వతంత్రతగల పురుషుఁడు పరిచ్ఛిన్నతాకారణముగాఁజాలఁడు. గావున, సాంఖ్యము దానికి వేరుకారణమున్నదనిచెప్పును; ఆకారణము సహజముగా ననంతమైంది; కాని యనంతమగు నహంభావసంబంధముచే జీవుఁడు జ్ఞానహీనుఁడై, తానుపరిచ్ఛిన్నుఁడని తలఁచుచున్నాఁడు." చూ. ఇండియన్ ఫిలసాఫికల్ రివ్యూ, ౨, పు. ౨౦౦.

జనించినది మహత్తను భావము కఠోపనిషత్తులో నవ్యక్తము నుండి హిరణ్యగర్భుఁ డుదయించెనను భావమునుండి గ్రహింపఁ బడినది.౭. చైతన్యవిలసితమైన ప్రకృతియే మహత్తు. ఉపనిషత్తులలో నిర్గుణావ్యక్త బ్రహ్మమునుండి హిరణ్యగర్భుఁడు లేక బ్రహ్మ జనించెనని చెప్పఁబడెను. వేదాంతముచెప్పిన పద్ధతి నంగీకరించిననే ప్రకృతినుండి మహత్తుజనించెననునది సహేతుకముగా సమర్థింపఁదగును. ద్రష్టృదృశ్యములకతీతమై పరబ్రహ్మమున్నది. దృశ్యసంబంధము పరబ్రహ్మమునకుఁ జెప్పినవెంటనే పరబ్రహ్మము ద్రష్టయై, తద్భిన్నమగుదృశ్యముగలదియగును.౧ పరబ్రహ్మస్వభావము శుద్ధచైతన్యము; ప్రకృతి యచేతనము. రెండును సంయోగమొందినపుడు, విజ్ఞానాజ్ఞానరూపము లేక ద్రష్టృదృశ్యరూపము కలుగును; అదియే మహత్స్వరూపము. అనాత్మయు మూలమందాత్మయే; అజ్ఞానము బీజాకృతిలోనున్న జ్ఞానమే. ఆత్మ యనాత్మనుండి తాను వేరని భావించినంతనే యహంకార ముదయించును. మొదటబుద్ధియుఁ దరువాత నహంకారమును జనించును. సృష్టికిఁబూర్వమే యహంకృతి యున్నది. "నేననేకము గావలెను; నేనుసృజింతున"నుటయే.౨.

(౭) 3, ౧౧.

(౧) పోల్చు. బృ ఆ. ఉ. ౧, ౪, ౭. ఈక్షాంచక్రే; ఛాం. ఉ. ౬, ౨, ౨, తదైక్షత, పోల్చు. భాగవతమ్." చిత్తమని చెప్పఁబడినది వాసుదేవుఁడు లేక విష్ణువు నదియే మహత్." యదాహుర్వాసుదేవాఖ్యమ్ చిత్తమ్ తన్మహదాత్మకమ్, (3, ౨౬, ౨౧.) చూ. సాం॥ ప్ర॥ భా॥ ౬, ౬౬,

(౨) ఛాం. ఉ. ౬, ౨, 3.

మానసికదశా సమన్వయము తాత్త్వికదశా నిర్ణయములతో మిశ్రమమందుటచేతనే సాంఖ్యసిద్ధాంతమునకు దోషముపట్టినది. మానసికదశా పరిణామమును, యథార్థ జగత్పరిణామమును సరిపోవుటకు ద్రష్ట పరబ్రహ్మమైనఁగాని సాధ్యపడదు. స్వకీయ భావములనన్నిటి నుపనిషద్భావములతోఁ గలుపఁజూచుటకు సాంఖ్యము యత్నించినది.

### ౮ — దేశకాలములు

జగత్పరిణామములోని ప్రతిదృశ్యమునకుఁ గ్రియావికార పరిస్పందములు లక్షణములైయున్నవి.3 సర్వవస్తువులు ననంత సూక్ష్మములైన వృద్ధిక్షీణతలు పొందుచున్నవి. అనుక్షణమును విశ్వమంతయు మార్పునొందుచున్నది. బాహ్యజగత్తులో దేశకాలము లాకాశమునుండి జనించి, పరిమితరూపములను బ్రదర్శించును; దేశమునందు వస్తుసాహచర్యమును, గాలమునందుఁ జలించు వస్తుప్రవృత్తియు నున్నవి.

విజ్ఞానభిక్షువిట్లు చెప్పినాఁడు. "నిత్యములగు దేశకాలములు, ప్రకృతిరూపములు, లేక ఆకాశము యొక్క మూలకారణములు; లేక ప్రకృతియొక్క విశిష్టరూపములు. అందుచే దేశకాలముల సామాన్యత్వలక్షణము స్థాపింపఁబడినది. ........ కాని పరిచ్ఛిన్న దేశకాలము లాకాశసంభూతములు. అవి యాకాశమువలన నేదోయొకయుపాధిసంబంధముచే నుదయించును."౧

(3) వ్యక్తమ్ సక్రియమ్. పరిస్పందవత్. (తత్త్వకౌముది.) చూ. యో. భా. 3, ౧3.)

౧. సాం। ప్ర. భా. ౨-౧౨; ౨-౧౦; పోల్చు యో. భా. 3-3౩.

పరిచ్ఛిన్న దేశకాలము లుపాధిపరిచ్ఛిన్నమైన యాకాశస్వరూపములే. కాని యవి యాకాశసముద్భవములని చెప్పఁబడినవి. దేశకాలములు వేసిసంబంధములేనిచో భావమాత్రములే. న్యాయవైశేషికతత్త్వము చెప్పినరీతి నవి ద్రవ్యములు కావు; ప్రకృతి పరిణామదశలనుబంధించు సంబంధములుమాత్రమే. విషయములు దేశకాలసంబంధములలో గోచరించును. అనంతములగు దేశకాలములను మనముదర్శించియుండలేదు. అందుచే నవి బుద్ధికల్పితములని చెప్పుదుము. పూర్వోత్తరసంబంధములో నుండు పరిచ్ఛిన్నవస్తుజాలమును మనముజూచి, పరిణామగతి నర్థముచేసికొనుట కనంతకాలక్రమమును గల్పించుకొందుము. వ్యాసుఁడిట్లుచెప్పినాఁడు;"పదార్థముయొక్క సూక్ష్మరూప మణువైనట్లే, క్షణము కాలముయొక్క సూక్ష్మరూపము. అనగా నొకయణువొక ప్రదేశమునుండి సూక్ష్మతమదూరమునందు నింకొక ప్రదేశమునకు గమనముచేయుటకగుకాలము క్షణమని చెప్పవచ్చును. కాని యీగతిపరంపరకే క్రమమందురు. క్షణపరంపరలు కలిసి వస్తువుకాఁజాలదు. ఇట్టి స్వభావముగల కాలము యథార్థవస్తువుకాఁజాలదు. అది మనఃకల్పితమును, దర్శనములయొక్కగాని పదములయొక్కగాని ఫలితమునగుచున్నది."౨కాని క్షణముదృశ్యవిషయము, పరంపరపై నాధారపడియున్నది. 3. క్షణములయొక్క నిరవద్యమైనగతియే క్రమము; దీసినే బుద్ధి

౨. సఖల్వయంకాలో వస్తుశూన్యోఽపిబుద్ధి నిర్మాణః శబ్దజ్ఞానానుపాతీ.

3. క్షణస్తువస్తుపతితః క్రమావలంబీ.

మంతులుకాలమందురు. ఏకకాలమందు క్రియముండ(జాలదు కావున రెండుక్షణములోకేమారుండవు. ఒకక్షణము తరువాత నింకొకక్షణమువచ్చినచో( గ్రియమున్నది. వర్తమాన మేకక్షణము; దీనికి(బూర్వోత్తరములులేవు. అందుచే వర్తమాన క్షణమున కితరసంబంధములేదు. కానిభూతభావిక్షణములు పరిణామమందుగర్భితములైయున్నవని చెప్పవలెను. ఈవిధముగా నను క్షణము ప్రపంచమంతయు మారుచున్నది.౧. అందుచేబాహ్యజగత్తులోని రూపములన్నియు నీవర్తమానక్షణమునకు సంబంధించియున్నవి. ౨.

జగత్తు యథార్థమునుగా దయథార్థమునుగాదు. అదిమనుష్యవిషాణమువలె నసత్యమునుగాదు; అదిగతించునుగావున నిజమునుగాదు, 3, అదియనిర్వాచ్యమనిచెప్పరాదు; ఏలన సత్తిదానికస్తిత్వముండదు.౪.ప్రపంచ మభావప్రతిబింబమనిగా కాని, మాహాకల్పనమనిగా కాని సాంఖ్యమంగీకరించదు. ప్రపంచము నిత్యప్రకృతిరూపమున నున్నది; క్షణికదృశ్యములరూపమున నుండుటలేదు.౭. పరివర్తనములకువశమై ప్రపంచముతాత్కాలి

---

౧. తేనైకేనక్షణేన కృత్స్నోలోకః పరిణామమనుభవతి॥
౨. యోగులుక్షణములను వానిక్రమములను బ్రత్యక్షముగా దర్శింప( గలరు. (యో. భా. 3-౫౨)
3, సాం. ప్ర. సూ. ౫' ౫౨-౫3.
౪. సాం. ప్ర. సూ. ౫. ౫౪.
(౫) సాం. ప్ర. సూ. ౫. ౫౫.
(౬) సాం. ప్ర. సూ. ౧-౪౨
(౭) సదసత్ఖ్యాతిరబాధాభాధాత్. (సాం ప్ర. సూ, ౫-౫౬)

కాస్తిత్వమునుగలిగియున్నది.౮ జగత్క్రియము ద్వివిధము;సృష్టి లయాత్మకము.మూలప్రకృతినుండిభిన్నవస్తుక్రమావిష్కృతియే సృష్టి; నానావస్తురూపములుతిరిగి మూలప్రకృతిలోవిలీనములగుటే లయము.సామ్యావస్థకు భంగముకలుగుటచే వివిధభౌతమయప్రపంచముదయించి, యుగాంతమందుఁబరిణామ వ్యతిరేకక్రమము ననుసరించి, తుదకుఁబ్రకృతియందులీనమగును.ఇంకొకనూతనప్రపంచారంభమగువరకుఁ బ్రకృతి యీవిలయావస్థలో నిలిచియుండును. ఈసృష్టిలయ క్రమచక్రమున కాద్యంతములు లేవు. ఏయొకవ్యక్తియో మోక్షముపొందినను, ప్రకృతి నాటకము సమాప్తముకాదు.౧. కాని ముక్తపురుషులీ ప్రకృతివికారము లంటకుండ నుందురు. ప్రకృతి యేకైకమయ్యును, పురుషులందరకు సామాన్యమయ్యును, దానికి బహురూపములున్నవి. ప్రకృతి స్థూలతమమునుండి సూక్ష్మతమమువఱకుగలఁ నానా రూపములను బద్ధజీవులకుఁ జూపును; ముక్తజీవుల కది స్వకీయ మూలప్రకృతియై గోచరించును. ప్రేక్షకులున్నంతకాలము ప్రకృతి తననాటకమును సాగించుచునే యుండును. సర్వజీవులు ముక్తిపొందినపుడు, నాటకాంతమై, నటులందరును నిష్క్రమింతురు. ౨. కాని ప్రకృతిబంధములనుండి వినిర్ముక్తులగుట కెన్నియో జీవులెల్లప్పుడు పెనగులాడుచునే యుండును గావున, ప్రకృతి వ్యాపారపరిభ్రమణము నిత్యమును సాగుచునే

(౮) సాం. ప్ర, భా. ౧-౨౬, .
(౧) సాం॥ ప్ర॥ సూ. 3, ౬౬.
(౨) సాం. కా. ౫౮-౫౯; సాం. ప్ర. సూ, 3, ౬3.

యుండును. సంసారమెన్నటికిఁ దుదిగాంచదు.[3] ప్రళయము సహజావస్థ కావున,ఁ బరిణామదశలో లయావస్థకుఁబోవు లక్షణము నిమిడియుండును. ప్రపంచము తాత్కాలికముగ వికృతినొందవలెనని పురుషులందరును గోరినయెడల,ఁ బ్రకృతి సామ్యావస్థ నొందును. గుణములలోనే దానికి నత్యంతప్రాముఖ్యము లేని సాంగత్యమును గలిగియున్నవి. అందుచే నూతనవస్తూత్పత్తిగాని, గుణోత్పత్తిగాని లేదు. ప్రళయావస్థ కూడఁ బురుషుల ప్రయోజనమునే నెరవేర్చుట కేర్పాటు చేయఁబడినది. ప్రళయావస్థలోఁ బ్రకృతి ప్రవృత్తిరహితముగాదు ; అందలి మార్పులుమాత్రము సర్వసామాన్యములై యుండును.

౯—పురుషుఁడు.

సర్వజీవులలో స్వయం నిర్ణయనియమమున్నది. దీనినే సామాన్యముగా నాత్మ యనునామముతో వ్యవహరించుచున్నారు. సరియగు నర్థములో 'ఆత్మ' యన్ని ప్రాణులలోనున్నది; అందుచే భిన్నప్రాణిజాలములన్నియు నీవిషయములో సమానములే. ఈవిభేదములన్నియు నాత్మయొక్కజీవితము నరికట్టి మరుగుపఱచు భౌతికోపాధులచేఁ గలిగినవి. ఈయాత్మలు ధరించిన భిన్నదేహముల స్వరూపస్వభావములననుసరించి, వానియాచ్ఛాదనములలో భేదములున్నవి. ఆత్మలయొక్క జన్మలకు మూలహేతువు, భౌతికదేహసమూహజన్మహేతువు నొకటియనిచెప్ప వీలులేదు. పరిచ్ఛిన్నజీవితానుబంధములు లేనట్టియు దేశకాల

(3) యో॥ సూ॥ ౨, ౨౨; సాం॥ ప్ర॥ సూ॥ ౨, ౪; సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౧౫౯; ౧, ౬౭; ౬, ౬౮, ౬౯.

ములనతిక్రమించినట్టియు ముక్తజీవావస్థగలదని సాంఖ్యమువక్కా ణించుచున్నది. ఒకవిధముగా మానవుఁడు మర్త్యజీవితమునకని వార్యములైన దోషపరీవృతుఁడైన పరిచ్ఛిన్న వ్యక్తియయ్యు, నాతనిలోనేదోయొకశక్తి వీనినన్నిటి నతిక్రమించునదున్నదను టకుఁ జైతన్యమేసాక్ష్యమిచ్చుచున్నది. మానవుఁడనగా మనస్సు గాని, ప్రాణముగాని, దేహముగాని, కాదు; వీనికన్నిటికధిపతియై పుష్టినిచ్చి, పోషించునాత్మయే; అదినిత్యము శాంతమునైనది. జగద్విషయములను తత్త్వశాస్త్రదృష్టి ననుసరించి పరికించిన యెడల, మన కొకవైపునద్రష్టలును, వేఱొకవైపున దృశ్యము లును లభించును. ద్రష్టకేదృశ్యమునకుఁగాని యున్న సంబంధ మేమన నది జ్ఞానసంబంధము లేక యనుభవమని చెప్పవలెను. తెలియువాఁడు పురుషుఁడు, తెలియఁబడునది ప్రకృతియు నని సాంఖ్యము చెప్పుచున్నది.

పురుషాస్తిత్వమును స్థాపించుటకు సాంఖ్యము పెక్కు హేతువులను జూపియున్నది.౧. (౧) వస్తుసముచ్చయ మింకొ కనికొఱకై యుండవలెను. భిన్నవస్తుసముదాయమైన యొక పాన్పు, దానిపైఁ బవ్వళించువానికొఱకే యైనట్లు, పంచభూత సమూహ రూపమైన, ప్రపంచము వేఱొకని ప్రయోజనము నకై యున్నదని గ్రహింపవలెననియు, నొకజీవుని సంతుష్టి కొఱకై, బుద్ధ్యాదిసహితమైన భోగ్యమగు దేహము సృజింపఁ బడినద"నియు గౌడపాదుఁడు చెప్పినాఁడు (౨)జ్ఞేయములగు వస్తు వులన్నియు మూడుగుణములను గలిగియున్నవి. గుణవిరహితమై

సాం॥ కా॥ ౧౭; సాం। ప్ర॥ సూ॥ ౧, ౬౬; యో॥ సూ॥ ४, ౨४.

సాక్షియైన యాత్మ యున్నదని యవి సూచించును. (3) సర్వానుభవములను జతపరచి, యాజమాన్యము వహించు నొక శుద్ధ చైతన్యశక్తి యుండవలెను. (4) ప్రకృతి యచేతనము గావునఁ బ్రకృతివస్తువుల ననుభవించువాఁ డొకఁ డుండవలెను. (5) కైవల్యసిద్ధికై చేయు ప్రయత్నమున్నది; ప్రకృతిగుణములకు వ్యతిరేకలక్షణములు గల యొక పురుషు నస్తిత్వము నిది సూచించును. వస్తుజీవితబంధములనుండి విముక్తిపొందు నపేక్ష బంధవిముక్తిని గాంచు నొక శక్తిని సూచించును.

ఆత్మయొక్క స్వరూప మెట్టిది? అది శరీరముగాదు, చైతన్యము భూతసంభూతము కాదు; ఏలన నీ భూతములలో నట్టి శక్తి యేయొకదానియందు లేదు; అందుచే నవికలిసినప్పుడు నుండదు.౧. ఇంద్రియము లాత్మకాదు; ఏలన నవి దర్శనోపకరణములుకాని, ద్రష్టలుకావు ఇంద్రియములు బుద్ధియందు వికారములను గలిగించును. పురుషుఁడు బుద్ధికాదు; ఏలన బుద్ధి యచేతనము. ఈభిన్న మానసికావస్థల నేకీకృత మొనర్చి, సర్వానుభవముల కైక్యసిద్ధి నిచ్చునదాత్మ; ప్రకృతి౩.తోఁగాని దేహముతోఁగాని సంబంధములేని శుద్ధచైతన్య మాత్మయని చెప్పఁబడెను. ఆత్మకు మార్పులున్నచో జ్ఞానావకాశములేదు. చేతనత్వ మాత్మలక్షణ మగుటచేఁ బరిణామ ప్రవాహములోని సర్వవస్తువులకు నాత్మజ్ఞాన మొసఁగుటలోఁ దోడ్పడును. ఊహా

(౧) సాం॥ ప్ర॥ సూ॥ ౫, ౧౨౯.

(౨) సాం॥ ప్ర॥ సూ॥ ౨, ౨౯; 3, ౨౦-౨౧.

(3) సాం॥ ప్ర॥ సూ॥ ౬, ౧-౨.

భావరంగముల నన్నిటి నది ప్రకాశింపఁజేయును. పురుషునికిఁ బరివర్తన మున్నచో నాతని కభావముండవచ్చును; అప్పుడు ప్రకృతిసంబంధములైన సుఖదుఃఖా ద్యవస్థానుభవము లేకుండఁ బోవచ్చును. పురుషుని స్వాభావమైన నిత్యప్రకాశత్వము మారు నదికాదు ౧. ఆ కాంతి సుషుప్త్యవస్థలోను, మిగిలిన జాగ్ర త్స్వప్నాద్యవస్థలలోను గూడ నుండును; ఇవన్నియు బుద్ధివికా రములే.3. అందువలనఁ బురుషుఁ డున్నాఁడు. కాని యాతఁడు కారణముకాని కార్యముకాని కాదు.౪. ప్రకృతియనున దొక టున్నదని మనకుఁజూచు శక్తినిచ్చు జ్యోతియేయది. వస్తువులను బ్రకాశింపఁజేయుట కది దేనిపై నాధారపడదు. ప్రకృతియుఁ దత్సంభవములును స్వయంవ్యక్తములుగావు. వాని యావిష్క రణము పురుషుని దివ్యకాంతిపై నాధారపడి జరుగును. చేత నత్వము భౌతికసంబంధమును గలిగియున్నను, భౌతిక హేతువు లచేఁ దెలియునదికాదు. మనోబుద్ధ్యాదు లుపకరణములు మాత్రమే. తా మెవని విజ్ఞానలక్ష్యమును సాధించుట కుపకర ణములో యా రహస్యమును దెలుపఁజాలవు. పురుషుఁడు విజ్ఞానస్వరూపియేకాని యానందస్వరూపిగాఁడు; ఏలన నానంద మొక ప్రకృతిగుణము, సుఖదుఃఖానుభవము లన్నిటిలో దప్ట్ర

(౧) సాం॥ ప్ర॥ భా॥ ౧, ౭౫; యో॥ సూ॥ ౪, ౧౮; సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౧౪౬.

(౨) సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౧౪౮.

(3) సాం॥ ప్ర॥ భా॥ ౧, ౧౪౮.

(౪) సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౬౧.

దృశ్యసంబంధ మున్నది. సుఖదుఃఖములు బుద్ధికిఁజెందును.౫. విజ్ఞానముతో నానందము నున్నచోఁ బురుషుని స్వభావములో ద్వైతమేర్పడును.౬. దుఃఖము పురుషస్వభావములో నున్నచో మోక్షావకాశము లేకుండును. పురుషునికిఁ జలనశక్తి లేదు; మోక్షసిద్ధి ప్రాప్తించినంతనే యెచ్చటకునుబోఁడు.౧. పురుషుని పరిమాణము పరిచ్ఛిన్నముగాదు. పరిచ్ఛిన్నమైనచో భాగపరికల్పితము నాశనముకలదియు నగును ౨. పురుషుఁ డణుస్వరూపి గాదు; అయినచో సర్వశరీరావస్థానుభవశక్తి యుండకుండును. పురుషునికిఁ గర్మసంగతియును లేదు. పురుషుఁడు సర్వగుణవిరహితుఁడు; కాకున్నచో మోక్షావకాశ ముండదు. వస్తుస్వభావ మనివార్యము; కావున సుఖదుఃఖము లాత్మ కుండఁజాలవు.

దైహికముగాను, మానసికముగాను, నైతికముగాను మానవులలో భిన్నత్వమున్నది కావున నాత్మ లనేకములున్నవని చెప్పవలెను. ప్రపంచములో విజ్ఞానజీవు లనేకములున్నవి. ప్రతి విజ్ఞానజీవియు లోకము స్వీయదృక్పథముతో వీక్షించి గ్రహించుచు, స్వతంత్రానుభవమును గలిగియున్నది. భిన్నదృక్పథములకుఁ గారణము ప్రకృతిగాదు; అందుచే సాక్షిస్వరూపములగు భిన్న చేతన శక్తులున్నవి. వీనికి భిన్నావయవములు,

(౫) సాం॥ ప్ర॥ సూ॥ ౬, ౧౧.
(౬) సాం॥ ప్ర॥ సూ॥ ౫, ౬౬.
(౧) సాం॥ ప్ర॥ సూ॥ ౧, ४౯.
(౨) సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౫౦.
(3) సాం॥ ప్ర॥ సూ॥ ౬, ४౫; ౧, ౧४౯, ౧౫౦.

కర్మలు, గలవు, భిన్న కాలములలో జననమరణములునుగలవు౩. ఒకజీవి స్వర్గమునకు వేఱొకటి నరకమునకుఁ బోవును. విజ్ఞాన ప్రవాహములు వేరనియు, నొక్కొక్క ప్రవాహము స్వాయముగాఁ బృథక్త్వమును గలిగియున్నదనియు సాంఖ్యము వక్కాణించుచున్నది. పృథగ్విజ్ఞాన ప్రవాహమున కేకత్వమును ఘటించు పురుషుఁడు లేనిచో యెట్లుచేకూరునో చెప్పఁజాలము కాని, భిన్నములైన ప్రత్యేక వ్యక్తిత్వములుండుచోఁ బురుష నానాత్వము సిద్ధించును. ఆత్మ యొక్కటేయైనచో, నేయొకఁడు ముక్తిపొందిన నందరును పొందవలెను.౪. స్వభావములో నాత్మ ప్రకృతికి వ్యతిరేకమైనచో ననేకాత్మలున్నవని చెప్పవలెను. ఏలన నందరకుఁ బ్రకృతి యొకటేయైయున్నది ఏకాత్మాస్తిత్వమును దెలుపు శాస్త్రవాక్యములు జీవముఖ్యగుణములు సమానములగుని చెప్పుననుసర్థమిచ్చు రీతిని వివరింపఁబడినవి. ఈ వాక్యములు జీవములు స్వరూపములో సమానములనియేకాని అన్నియు నొకటే౭. యని చెప్పవని వాదింపఁబడెను. మోక్షమనఁగా బ్రహ్మైక్యముగాదు; ప్రకృతిసంబంధము పోవుటయే. వానికిఁ బ్రకృతివస్తువులతోఁ దాత్కాలికముగానున్న సంబంధమునవలనఁ బ్రకృతివస్తు వ్యాపారముల నసంగదృష్టితోఁ దిలకించు సర్వసామాన్యలక్షణ మందరలోనున్న జీవులకుఁగలదు.

(౪) సాం॥ కా॥ ౧౮.

(౧) సాం॥ ప్ర, సూ, ౫, ౬౧; సాం,ప్ర,భా, ౧. ౧౫౪.

(౨) వైశద్యవిరహమేకాని అఖండత కాదు.

ఉపనిషదాత్మభావము ననుసరించి, సాంఖ్య పురుష భావము గైకొనఁబడినది.౩. దాని కాద్యంతములుకాని, గుణములుకాని లేవు. అది సూక్ష్మము, సర్వవ్యాపి, నిత్యసాక్షి, మనోబుద్ధీంద్రియాతీతము, దేశకాలనిమిత్తత తుపరికల్పిత జగత్స్వరూపమున కతీతమునైనది. దానికిఁ బుట్టుక లేదు; అది దేనినిఁ బుట్టింపదు. దాని నిత్యత యనఁగా నెల్లప్పుడుఁ దుటయే కాదు; అది అవ్యయపరిపూర్ణత గలదనియర్థము. అది చిద్రూపమేకాని, వ్యావహారికముగా నది సర్వవస్తు విజ్ఞానమునుగలిగి యుండదు; ఏలన వ్యావహారికజ్ఞాన ముపాధి పరిచ్ఛిన్నమైనది. అది వివిధబంధములనుండి విడువఁబడినచో నప్పుడు దానికి వికారముల జ్ఞానముండదు. తన సహజావస్థలో నుండును.౪. పురుషునికిఁ బ్రకృతితో సంబంధము లేదు.౫. పురుషుఁడు నిర్వికారుఁడు, నుదాసీనుఁడు, నిష్క్రియుఁడునైన సాక్షిమాత్రుఁడు. ప్రకృతిలక్షణములు, పురుషలక్షణములును వ్యతిరేకములైనవి. ప్రకృతి యచేతనము, పురుషుఁడు చేతనుఁడు, పురుషుఁడు నిత్య నిర్వికారుఁడు, ప్రకృతి సవికార నిత్యతగలది. గుణత్రయాన్వితము, ప్రకృతి; పురుషుఁడు నిర్గుణుఁడు, ప్రకృతి దృశ్యము. పురుషుఁడు ద్రష్ట.

---

(౩) బృ. ఆ. ఉ. ౪, ౩, ౧౬; శ్వే. అ. ఉ. ౬, ౧౧, ౧౯; అమృ బిందూపనిషత్తు ౫, ౧౦. (౪) సాం, ప్ర, సూ, వృత్తి, ౬, ౫౯;

(౫) బృహ. ఆ. ఉ. ౪, ౩, ౧౫.

(౬) సాం, కా,౧౯. పోల్చు, హరిభద్రుని షడ్దర్శనసముచ్చయమునై మణిభద్రుని వాక్యములు:-"అమృతశ్చేతనో భోగీ, నిత్యస్సర్వగతో౽క్రియః। అకర్తానిర్గుణస్సూక్ష్మ ఆత్మా కాపిలదర్శనే॥

## ౧౦—జీవాత్మ

దేహేంద్రియోపాధి సంబంధముచేఁ బరమాత్మ జీవాత్మ యని వ్యవహరింపఁబడును. ౧. అహంకారసహితుఁడగు పురుషుఁడే జీవాత్మయనియు సంగరహితుఁడైన పురుషుఁడు కాఁడనియు విజ్ఞానభిక్షువు చెప్పినాఁడు. ౨. శుద్ధపురుషుఁడు బుద్ధ్యతీతుఁడు; కాని యాతఁడు బుద్ధిలో నహంకారరూపమునఁ బ్రతిఫలించి, సర్వదుఃఖాద్యవస్థానుభూతిఁ గాంచును. మనకు బుద్ధియందాత్మభ్రాంతి కలుగుచున్నది. నిజముగా సహజ జ్ఞాన లక్షణములచేఁ బురుషుఁడు బుద్ధికతీతుఁ డనుసంగతిని మన మెఱుఁగకుంటిమి. 3. ఇంద్రియాద్యుపాధిబద్ధమగు ప్రతి బుద్ధియుఁ బూర్వకర్మానుగుణమైన ౪ పృథగ్రూపమును గలిగి యున్నది; ప్రతిబుద్ధికి నొకవిశిష్టమగు నజ్ఞాన మావరించి యున్నది. జీవాత్మలో నేది వివిధవిషయావస్థల ననుభవించుచు, (బ్రి)వాహరూపమై యున్నదో యట్టి మానసికవ్యక్తిత్వమే అహంకారము. ఇట్టి వ్యక్తిత్వము నిత్యపరివర్తనము గలిగి తాత్కాలికమైనదేకాని, దీని కాధారభూతమై నిత్యమైన పురుషస్వరూపము కాదు. పురుషుఁడు మార్పులేని యవ్యయ స్వరూపుఁడు; జీవుఁడు ప్రకృతిప్రపంచగతుఁడు. వస్తుప్రపంచములో నహంకారములును వస్తువులే; వస్తువులతోఁ బాటవియుఁ బారమార్థిక సత్యములుగావు. ఇతరవస్తువులెట్లు మనకుఁ దెలి

(౧) సాం ప్ర సూ వృత్తి ౬; ౬3.
(౨) సాం ప్ర భా ౬ ౬3.
(3) యో సూ ౨-౬
(౪) సాం ప్ర భా ౨, ౪౬

యునో, యట్లే యవియును మనకనుభవగోచరములే. ప్రతి జీవియు మరణవశమగు స్థూలదేహమందుఁజిత్తేంద్రియాదులతోఁ గూడిన సూక్ష్మశరీరమును గలిగియున్నది. ఈ సూక్ష్మ శరీరమే పునర్జన్మమున కాధారమును, ౧. భిన్నజన్మములలో జీవైకత్వమును బోషించునదియు నైయున్నది. సర్వానుభవ సంస్కారనిలయమైన యీ సూక్ష్మశరీరమునే లింగశరీర మందురు;లింగ మనగాఁ బురుషుని గుర్తుచెప్పునది. ఈ లింగదేహ ములు వ్యవహార జగత్సంబంధ సూచనలు; ఇవి లేనిదే పురుష నానాత్వమున కాధారము నశించును, లింగదేహములన్నియుఁ బ్రకృతిసంభవములు గావున గుణత్రయాన్వితములే. ఒక లింగముయొక్క రూప మాయా గుణములెట్టి పరిమాణములో మిశ్రమములైనవో దానిఁబట్టి యుండును. ప్రతిజన్మశీల మొకలింగాకృతినొందును. లింగదేహ మున్నంతకాలము జన్మము స్థూలదేహధారిత్వమును దప్పవు. అజ్ఞాన మౌర్ఖ్య ములు లక్షణములుగా నుండుటచే నికృష్టతమమగు పశుజన్మము తామసగరిష్ఠమై యుండును. ఊహాస్మరణశక్తులు వికసింపని కారణముచేఁ బశువుల సుఖదుఃఖానుభవములు విశేషకాల ముండవు,నిశితములునుగావు. పశువులందలి సాత్త్వికాంశ మత్య ల్పమగుటచే వానికి వర్తమానప్రవృత్తి కవసరమైన స్వల్ప జ్ఞానమే యుండును. రజోగుణ మధికమైనపుడు పురుషుఁడు మానవదేహమందుఁ బ్రవేశించును. మానవులు విశ్రాంతిలేని వారై దుఃఖవినిర్ముక్తికై నిత్యకృషిచేయుచుందురు. సత్త్వగుణ

౧) సాం. ప్ర. సూ. 3,౧౬.

మతిశయవికాసమందినపుడు జీవికి మోక్షజ్ఞానము లభించును; అప్పుడిఁక ప్రకృతి జీవుని దుఃఖమయజీవితమునకు బంధించి యుంచలేదు. ముక్తపురుషుఁడు జగన్నాటకము నసంగదృష్టితో విలోకించు సాక్షిమాత్రుఁడై యుండును. మరణకాలమునఁ బురుషుని ప్రకృతికి బంధించినపాశములు తెగిపోయి, ముక్త పురుషుఁడు సర్వస్వతంత్రతను గాంచును. ఈ మాఱ్పులనఁగా బంధమోక్షములు పురుషుని కనుబంధములై యున్న సూక్ష్మ దేహమునకుఁ జెందినవేకాని, శుద్ధచైతన్యస్వరూపియగు పురుషునకుఁ జెందవు. కాని పురుషుఁడు రజస్తమోగుణము లతిశయించియున్నంతకాలము తన సహజరూపమునుమఱచిపోవును. లింగదేహాంతర్గతము లైయున్న పురుషుఁడు రేకరూపులే; లింగదేహ భేదములన్నియుఁ బ్రకృతిపరిణామ ప్రవాహమునకుఁ జెందినవే. పరిణామసిద్ధాంతమునను సరించి మానవునకుఁ బశు పక్షి వృక్ష లతాది సర్వజీవులతోడను రక్తసంబంధ మున్నది.

జీవాత్మ పురుషప్రకృతిమిశ్రమరూపము. పురుష ప్రకృతిసాంగత్యముచే, సూక్ష్మశరీరము ప్రకృతిసంభూత మగు జడపదార్థకల్పితమైనను చేతనలక్షణయుక్తమగుచున్నది. దానికి సుఖదుఃఖములు కర్మలు కర్మఫలములు, జన్మాంతరానేకసంచారమును గలుగుచున్నవి. ఆత్మ లేక పురుషుఁడు ప్రపంచప్రవృత్తియెడ నుదాసీనుఁడు. ప్రకృతివస్తువులలో నొకటియగు బుద్ధికే ప్రవృత్తి లక్షణ మైయున్నది. కాని బుద్ధి సంబంధముచే నుదాసీనుఁడగు పురుషుఁడే కర్తగా గోచరించును.

నిజముగుకర్తృత్వ మంతఃకరణమునకుఁ జెందినది. పురుషుఁ డంతఃకరణమునకుఁ బ్రకాశమిచ్చును. ౧. అచేతనమగు నంతఃకరణము స్వయముగాఁ గర్త కాఁజాలదు; దానికిఁ జైతన్యమును బురుషుఁడే యిచ్చెను. శుద్ధచైతన్యముతో నొకప్రత్యేక సంబంధమును గలిగియుండుటచే నంతఃకరణమును బ్రకాశించు చున్నది. చైతన్య మంతఃకరణములోఁ బ్రవేశించదు; అందుఁ బ్రతిఫలించును. ఈ పురుషప్రకృతి సంబంధము నిత్యముగాదు. ప్రకృతిసంపర్కమువలనఁ బురుషుఁడు తన సహజస్వరూపమును దెలిసికొని ప్రకృతిబంధములనుండి విముక్తిగాంచును. మానసిక భౌతికజగత్తులకు రెంటికిఁ బ్రకృతియే యాధారము. ఒకటి ద్రష్టగాను రెండవది దృశ్యముగాను వ్యవహరించును. రెండును భిన్నపరిణామక్రమములను గలిగియున్నవి.౧ ప్రకృతికిఁ గర్మయుఁ గర్మ ఫలానుభవమును గలదు. సుఖదుఃఖములు ప్రకృతివికారములు. అజ్ఞానవశమునఁ బురుషుఁడు వాని ననుభవించును.౨. ప్రకృతివ్యాపారములకుఁ జైతన్యప్రకాశ మున్నదని భావించి, పురుషుఁడు ప్రకృతికర్మల నన్నిటిని నిష్క్రియుఁడై యవలోకించుచుండియు, తనస్వభావమును

---

(౧) సాం. ప్ర సూ. ౧, ౯౯.

(౧) పోల్చు, వాచస్పతి. "గుణానామ్ ద్వైరూప్యమ్ వ్యవసేయాత్మకత్వమ్, వ్యవసాయాత్మకత్వంచ, తత్రవ్యవసేయాత్మకతామ్ గ్రాహ్యత్వమ్. ఆస్థాయపంచతన్మాత్రాణి భూతభౌతికాని ... ... వ్యవసాయాత్మకత్వంతు గ్రహణస్వరూపసమాస్థాయ సాహంకారాణీంద్రియాణి." (తత్త్వవైశారది, 3, ४८)

(౨) తత్త్వకౌముది, పు. ౫.

మఱచి, తానే యాలోచించుచుండెననియు, (గర్మ చేయు చుండెననియు నమ్మును. ఇట్టి యజ్ఞానవిశ్వాసముచేఁ బురుషుఁ డొక దేహమునబద్ధుఁడై,తన యథార్థజీవితమును గోల్పోవును; శాశ్వతశాంతిని బోఁగొట్టుకొని, కాలగర్భమునఁబడి యశాంతి ననుభవించుటతటస్థించెను.పురుషుఁడుచలింపఁడు; కాని దేహము స్థలాంతరములకుఁ బోవుచుండును. నిష్క్రియుఁడై, అంగీకారా నంగీకారముల సూచించు పురుషుఁడనగాఁ బ్రకృతిలోజరుగు చలనమునకు నామాంతరమే. ప్రకృతి చేతనముగాకున్నను, బురుషసాన్నిధ్యవశమునఁ దానొక సచేతనమని తలఁచునట్లే పురుషుఁడు కర్తగాకున్నను, ప్రకృతికర్తృత్వమును దనదిగా నజ్ఞానవశమున భావించును. దుఃఖానుభవ ముపాధివృత్తిరూప మగు భావమే. • బంధము నిజముగాఁ జిత్తమునకే కలదు; దానిఛాయయే పురుషునిపైఁబడును.

సాంఖ్యముచెప్పు పురుషజీవస్వభావ మద్వైతవేదాంతము ప్రకటించిన జీవాత్మ పరమాత్మ స్వభావముతో సాదృశ్యము కలిగియున్నది. అద్వైతవేదాంతము ననుసరించి, ప్రవృత్తియు, దానికాధారమైన మనోదేహాదులు నాత్మకులేవు. ఉపాధివశ మున నాత్మ కర్తయను భ్రాంతిజనించును. ఉపాధివశంగతుఁ డగుటచే జీవుఁడే నిరుపాధికుఁడగు పురుషుఁడను భ్రాంతి కలుగు చున్నది. అద్వైతమునందు వ్యక్తిత్వము సూక్ష్మశరీరమునకును,

(3) సాం. కా. ౨౦, ౨౨; సాం. ప్ర. సూ. ౧, ౧౬౨-3; యో. సూ. ౨, ౧౭; భ. గీ. ౧౩, ౨౧. (కఠ. ఉ 3,౪.)

(౪) సాం. ప్ర. భా. ౧, ౨౭.

సాంఖ్యమునందు లింగశరీరమునకును నిజము గాఁగలదు. విజ్ఞాన భిక్షు వద్వైత ప్రతిబింబవాద సదృశభావములను వెల్లడించి నాఁడు. అంతఃకరణ మందాత్మ ప్రతిబింబించెనను నదే యీ వాదము. ఈచిదాభాసమే జీవాత్మ.

జీవుని సంకుచితము పరిచ్ఛిన్నమునగు స్థితికిఁగారణము పురుషుని సహజస్వభావముగాదు. పురుషుఁడు తనసహజస్థితి నుండి పతనముచెందినాఁడు. పురుషుని యనుభవమనఁగా వస్తువుల ప్రతిబింబములు పురుషుఁడు గ్రహించుటే.౧ ప్రకృతి పని చేయునపుడు, పురుషుఁడు తత్కర్మఫల మనుభవించును; ఏలన ప్రకృతి వ్యాపారమంతయుఁ బురుషుని నిమిత్తముద్దేశింపఁబడి నదే.౨ సరిగాఁజెప్పుచో, నవివేకజాతమైన యభిమానము చేతనే పురుషున కిట్టియనుభవము కలుగును.3, నిజము తెలియుట తోడనే, సుఖదుఃఖములును లేవు; కర్తృత్వమును భోక్తృత్వమును లేదు.౪

మోక్షముకొఱకై యత్నించుచున్న జీవాత్మభావమునకును, ననంతము నిర్వికారమునైన యాత్మకెట్టిబంధములు నుండవను నద్వైతభావమునకును సామరస్యరూపమే సాంఖ్యసిద్ధాంతము. కావునే, పురుషుఁడు శాశ్వతముగా నిర్వికారుఁడై

(౧) పురుషస్య విషయభోగః ప్రతిబింబాదానమాత్రమ్' (సాం॥ ప్ర॥ భా॥ ౧, ౧౦౪.

(౨) సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౧౦౫.

(3) సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౧౦౬.

(౪) సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౧౦౭.

యున్నను, నాతఁడు దుఃఖాభాసము ననుభవించును. స్ఫటిక శిల సమీపమునను న్న రక్తవర్ణముగల పుష్పమును దనయందుఁ బ్రతిఫలింపఁజేయునుగాని, యెట్టిసంగదోషము లేకుండ నుండు నట్లే, యజ్ఞానవశమున దుఃఖమనుభవించుచున్నట్లు భ్రాంతి పొడమినను, నిజముగా నాత్మ దుఃఖరహితమై స్వస్థితిలోనే యుండునని చెప్పఁబడెను. సూర్యపురాణమునుండి విజ్ఞానభిక్షు విట్లుదాహరించినాఁడు; "స్ఫటికము సమీపరక్తపదార్థ వర్తిత్వ ముచే రక్తవర్ణమై కన్పట్టినట్లే, నిర్వికారుఁడగు పురుషుఁడు, వికారసహితుఁడుగా గోచరించును."(౧) రక్తవర్ణ పుష్పములుంచిన స్ఫటికపాత్రను శంకరుఁడుదాహరించెను.(౨) పురుషుఁడు చలితుఁ డైనట్లు కన్పట్టినచోఁ దాత్కాలికముగా సంబంధముగలిగిన మనశ్చాంచల్యముచేనట్లు కన్పట్టునేగాని నిజముగాఁగాదు. మన స్సంబంధము పురుషునిపై నెట్టి నిత్యాసిత్యసాంగత్య చిహ్నమును గలిగింపఁజాలదు. కారణము సాంగత్యము యథార్థముకాదు కావున, సంస్కారములు నేమియునుండవు.

(౧) "యథాహి కేవలో రక్తస్ఫటికో లక్ష్యతే జనైః
రంజకాద్యుపధానేన తద్వత్పరమపూరుషః॥ (సాం॥ప్ర భా॥౧,౧౯)
పురుషుఁడు నిష్క్రియుఁడు నుదాసీనుఁడునైనను, గుణత్రయ ప్రతిభావసంగతిచేఁ గర్తవలె గోచరించును: పోల్చు.
ప్రకృతేః కార్యం నిత్యైకాప్రకృతిర్జడా
ప్రకృతే స్త్రిగుణావశేషాదుదాసీనోఽపి కర్తృవత్. (స॥ ద॥ సా॥ సం॥ ౯, ౧౫.
(౨) ఆత్మబోధ

## ౧౧—ప్రకృతి పురుషులు.

పురుష ప్రకృతిసంబంధ సమస్యయే సాంఖ్యతత్త్వములో నత్యంతక్లిష్టమైన సమస్య. ప్రకృతిపరిణామ సిద్ధాంతములో నొకగొప్పయాకర్షణ ముండుటయేకాక, తత్త్వలక్ష్యసిద్ధి కనుగుణముగా నది రూపింపఁబడినది.3 ఆత్మ నజ్ఞాననిద్రనుండి మేల్కొల్పుటకే ప్రకృతి దురంతదుఃఖమయమైన ప్రపంచ మును బరిణమింపఁజేయును. జగన్నాటకమునంతను విలోకించు చున్నను, నిర్వికారమైయున్న యాత్మకు విషాదగాధాపరిప్లుత మైన జగత్పరిణామ మవసరమైయున్నది. ప్రకృతివ్యాపారమున కంతకును బురుషునిప్రయోజనముల సాధించుటేపరమలక్ష్యము; కాని యీసంగతి ప్రకృతికిఁదెలియదు.౪. పురాణ కల్పిత వైచిత్ర్యప్రదర్శనమునకు సాంఖ్యమిష్టపడదు కాని, జగదంతర్గ తమైన ప్రయోజన మొకటియున్నదని నిర్ణయించినది. జడా త్మకమైనను నత్యంతశేముషీ వైభవవిలాసమును సూచించు ప్రకృతివ్యాపారఫలితమైన యత్యద్భుత జగన్నిర్మాణవిధానము యొక్కయు, విశ్వసౌందర్యముయొక్కయు, భావగాంభీర్యము వర్ణనాతీతమే, కాని ప్రకృతివ్యాపారము విజ్ఞానవిలసితముకాదని సాంఖ్యముస్పష్టముగాఁ జెప్పుచున్నది. ౧. సాంఖ్యమిచ్చిన

---

(3) సాం॥ ప్ర॥ సూ॥ ౨, ౧; 3, ౫౦.

(౪) సాం. కా. ౪౯.

౧. సాం. ప్ర. సూ. 3-౬౧.

యుపమానములు మనకు మార్గమును సుగమ మొనర్చుటలేదు. విజ్ఞానహీనములయ్యువృక్షములు ఫలముల నెట్లిచ్చుచున్నవో, యట్లే విజ్ఞానములేకున్నను ప్రకృతి, కర్మచేయుచున్నదని చెప్పఁబడెను. ౨. మఱియు వత్సరంరక్షణనిమిత్తము గోవుపాలనిచ్చుచున్నది. జడపదార్థము హేతునిర్ణయముచేయఁజాలదు. ప్రకృతి వస్తువులు కేవలజడపదార్థకల్పితములునుగావు. ప్రకృతిస్వయముగాఁ గ్రియాసమర్థమైనచో మోక్షమున కవకాశములేదు; ఏలననట్టికిృయాశక్తి పెంపొందుచుండును. కాక, ప్రకృతిసహజముగా నిష్క్రియాత్మకమైనచో, వాస్తవికజగద్వ్యాపారమంతయు నొక్కసారి యాగిపోవును. ప్రకృతి వ్యాపారము, తాను జలింపకున్నను, చలింపఁజేయుశక్తిగల యొకకర్తను సూచించును. ప్రకృతి పరిణామమునకొక చేతనశక్తియాధారమైయుండవలెను. కానిసాంఖ్యమంగీకరించిన చేతనవ్యక్తులు ప్రకృతిపైఁ బ్రత్యక్ష ప్రభావమును గలిగియుండలేదు. కేవల పురుషసాన్నిధ్యవశముననే, ప్రకృతి క్రియాపరతంత్రమగునని సాంఖ్యము చెప్పుచున్నది. సృజనసామర్థ్యము పురుషునికిలేకున్నను, నానావస్తుజాలసమన్వితమైన జగత్తునుదయింపఁజేయు ప్రకృతి, పురుష సాంగత్యవశముననట్లుచేయునని చెప్పఁబడెను. ప్రకృతి యంధురాలు; కానిపురుషుని యాజమాన్యముచే నదిజగత్తునుదయింపఁ జేయుచున్నది. ప్రకృతిపురుష సాంగత్యమెట్టిదనినచో, స్వచ్ఛదృష్టిగలయొకకుంటివాఁడు దృఢపాదుఁడైన యొక గుడ్డివాని

౨ సాం. ప్ర. సూ. వృత్తి. ౨-౧.

భుజములపై నధిరోహించుట వంటిది. ౧. అనంతసంఖ్యాకములగు జీవుల చలనముచేఁ బ్రకృతి పరిణామము నడచుచున్నది. ప్రకృతిపైఁ బురుషప్రభావముచే గుణత్రయసామ్యస్థితికి భంగము వాటిల్లి, ప్రకృతిపరిణామముఁ గలుగును. ౨. పరస్పరము సామరస్యములో నున్న గుణముల సామ్యస్థితి పురుష సాన్నిధ్య

(౧) సాం. కా. ౨౧. గౌడపాదుఁడిట్లు చెప్పెను; "ఒక కుంటివాఁడు నొక గుడ్డివాఁడు యాత్ర చేయుచు నట్టడవిలో నితర యాత్రికులు తమ్ము విడిచిపోఁగా, మార్గముకొఱకు వెదకికొనుచు దొంగలచేఁ దరుమబడి, యిరువురు కలిసి, కుశలప్రశ్నానంతర ముభయులు చూపు నడక పంచుకొన నిశ్చయించిరి. చూపుగల కుంటివాఁడు గుడ్డివాని భుజములపై నెక్క, వాఁడు నడచుచుండగాఁ దాను మార్గము చూపుచుండెను. అదేవిధముగాఁ గదలుశక్తి గాకున్నను, జూచుశక్తి ఆత్మయందుఁగలదు. అది కుంటివానివలెనున్నది, చూచుశక్తి లేదు కాని కదలుశక్తి ప్రకృతి యందున్నది, ఇదియే అంధుఁడు. మఱియు నీపంగ్వంధు లిరువురు తమపనియైన వెనుక విడిపోవునట్లే, పురుషునికి ముక్తిలభించిన వెనుక ప్రకృతికిఁబనిలేదు. ప్రకృతి సహకారమునఁ బురుషుఁడు మోక్షప్రాప్తిఁ జెందును. ఉభయుల కార్యములు నెరవేరినంతనే, వారిసంబంధపాశమును దెగిపోవును." (కారికాభాష్యము, పు. ౨౧.)

(౨) నిర్మాణాత్మకమగు పరిణామతత్త్వమునకొక మూలసూత్రమవసరమైయున్నది. ఒకవిధమగు మూలతత్త్వముగా దేశకాలభావమును గైకొని అలెగ్జాండరు పండితుఁడు కాలమును క్రియాశక్తిగాఁ బ్రకటించినాఁడు. "పరిణామము-మనస్సు"ను గ్రంథమున కుపోద్ఘాతములో హాబ్‌హౌస్ సర్వపరిణామమును నడపుశక్తి యేదోయొకరూపమున మనస్సేయనినిర్ణయించెను. తన "ఎమర్జంటు ఇవల్యూషన్" గ్రంథములోఁ బరిణామక్రియాశక్తి దేవునిదేయని లాయడ్ మోర్గన్ చెప్పినాఁడు.

ముచేఁజెడును. పరిణామ మారంభించుటకుఁ బూర్వము ప్రకృతి సామ్యావస్థలో నున్నది; గణనాతీత సంఖ్యగల పురుషులు నట్లే యుండిరి కాని, ప్రకృతిపై నొకజడాత్మక శక్తిప్రభావమును జూపిరి. దీనిచే ప్రకృతిసామ్యావస్థ చెడి, మొదటఁ బరిణామము నావెనుక, జీర్ణనాశనదశలు సంభవించును. ప్రకృతి తిరిగి సామ్యావస్థనొందఁగా మఱలఁ బురుష ప్రభావముచే నొత్తిడికలిగి, పరిణామదశ ప్రారంభమగును. సర్వజీవులు ముక్తి పొందువఱకు నీ విధానము జరుగుచుండును. కావున జగత్పరిణామమున కాద్యంతకారణము పురుషుఁడే. కాని పురుషుఁడు నిమిత్తమాత్రుఁడే; అతనికెట్టి సంకల్పమును లేదు; కేవల మాతని సాన్నిధ్యప్రభావమే జగత్పరిణామ హేతువు. పురుషుఁడు ప్రకృతిపైఁజూపు ప్రభావము నూదంటు రాయి సూదిపైఁ జూపునట్టిదే. (౧) సాంఖ్యపురుషుఁ డారిస్టాటల్ దేవునితో సాదృశ్యమును గలిగియున్నట్లు తోఁచును. జగత్పరిణామము తదతీతుఁడైయున్న దేవునిప్రభావమువలన జరుగుచున్నదనియుఁ గాని యాతఁడు జగదంతర్యామియై పనిచేయఁడనియు నారిస్టాటల్ మతము. ఆరిస్టాటల్ చెప్పిన యీశ్వరుఁడు కేవల స్వగతజ్ఞాన నిశ్చలుఁడై, పైనుండికాని లోనుండికాని లోకము నేరీతిని నడిపింపఁడు. ఈశ్వరుఁడు ప్రథమకర్తయై, జగచ్చలన హేతువగును; కాని యీజగచ్చలనమున కాతని సంకల్ప చోదితమైన కర్తృత్వమేమియును లేదు. జగద్వ్యాపార సంబంధ మీశ్వరుని పరిపూర్ణతకు లోపమగును. అందుచే శుద్ధచిత్స్వ

(౧) సాం॥ కా॥ ౫౭; సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౯౬.

రూపుఁడు నచలుఁడునగు నీశ్వరుఁడు తన యస్తిత్వమాత్రము చేతనే జగత్ప్రవృత్తిహేతుభూతుఁడగుచున్నాఁడు. అనంతర జగద్వస్తు వికాసము వస్తుస్వభావముచేతనే జరుగును. పురుషుఁడు ప్రకృతికి వేఱైయుండెననియు, ప్రకృతిపై నాతనిప్రభావము సత్యమైనదైనను నది యెట్లుసమంజసమో చెప్పఁజాలము. రెంటికి సంబంధమున్నమాట సత్యమే; కాని దానిరహస్యము మాత్రము మనవివేకమున కతీతమైయున్నది. ౧. పురుషార్థసిద్ధి

---

(౧) పోల్చు. శంకరభాష్యము, ౨. ౨. ౬, ప్రకృతి వ్యాపారము జీవులభోగము నిమిత్తమా, జీవమోక్షసిద్ధిని జేకూర్చుటకొఱకా యనువిషయమును జర్చించుచు శంకరుఁడిట్లుచెప్పినాఁడు; "సుఖదుఃఖసంగతి యేమియును లేనియాత్మకు భోగమెట్లు చెప్పనగును? అది సాధ్యమగుచో మోక్షావకాశము లేకుండును. ఏలన నాత్మ నిష్క్రియాత్మకము గావున మోక్షయత్నము చేయఁజాలదు; ప్రధానము ఆత్మకనేక విధానుభవ ప్రాప్తికొఱకే పనిచేయును. మోక్షమే లక్ష్యమైనచోఁ బ్రధానముయొక్క వ్యాపారముద్దేశశూన్యమగును; ఏలనఁ బ్రధానమునకు బూర్వమందే యాత్మ మోక్షావస్థగలదై యుండును. లేక ప్రకృతివ్యాపారమాత్మకు భోగమోక్షములు రెంటికొఱకునైనచోఁ బ్రధానమునందుఁగల భోగవస్తువుల సంఖ్య యనంతమైనదగుటచే మోక్షావకాశముండదు. ప్రధానముయొక్క ప్రవృత్తికి వాంఛాసిద్ధియే లక్ష్యమనుటకును వీలులేదు; ఏలన నిత్యశుద్ధమగు నాత్మకుఁగాని, యచేతనమగు ప్రధానమునకుఁగాని యెట్టికామము నుండఁజాలదు. చిత్స్వరూపమైన ఆత్మయొక్క దర్శనశక్తి వ్యర్థమగుననుగానఁ బ్రధానము క్రియాపరతంత్రమై యున్నదందువేనియుఁ, బ్రధానముయొక్క వ్యాపారము నిరర్థకమగు నందువేనియు, నప్పుడు రెండునుగూడ నెన్నడును ప్రవృత్తి నుండి విరమింపవు గావునఁ దుద కాత్మకు మోక్షావకాశము లేకుండఁబోవును."

కాఁజాలఁ బ్రకృతి వర్తించునని చెప్పరాదు; ఏలన, పురుషులు నిత్యముక్తస్వభావులు, ప్రకృతికర్మఫలములతో నిమిత్తము లేనివారు. జీవుల ప్రయోజనార్థమే ప్రకృతిప్రవృత్తి; అవిద్యావశులై జీవులు తాము లింగశరీరములతోఁ దాదాత్మ్యము నొంది, కామ్యములుగలిగి, భేదజ్ఞానావసరమును గలిగి యున్నారు. కావునఁ బ్రకృతి జీవుల నుత్పత్తిచేయును; జీవులు తమ బంధములనుండి విముక్తిగాంచుటకై, దుఃఖానుభవ మవకాశమును గల్పించును.౨. పురుషప్రకృతిసంబంధ మూహింపఁ బడెను కావున, యథార్థపురుషునకి యథార్థజగత్తుతో సంబంధమున్నది. ఈయూహ యున్నంతకాలము ప్రకృతి పురుషుని కనుగుణముగాఁ బ్రవర్తించును. వృద్ధిక్షయశీలమగు ప్రకృతిప్రపంచము వేరు, తాను వేరను సత్యమును పురుషుఁడు గ్రహించుటతోడనే ప్రకృతి పురుషుని సంబంధవృత్తిని గోల్పోవును. ౧. ప్రకృతిపరిణామ ప్రధానకారణము కేవల పురుష సాన్నిధ్యము కాదు; ఏలనఁ బురుషులెల్లప్పుడు నున్నారు. నిజ మగు కారణము పురుషు లవిద్యావశులగుటయే.

ప్రకృతి మహదాదితత్త్వములుగా మారుటకుఁబూర్వము భిన్నత్వము లేదు. అదృష్టమింకనుజనించలేదు; ఏలన నదృష్టము మహజ్జాతమును, ప్రకృతిప్రవృత్తిప్రారంభమునకుఁ బూర్వమందుండునదియు నైయున్నది.పూర్వసృష్టిలోనియదృష్టము నిరర్థ

౨. సాం॥ ప్ర॥ సూ॥ వృత్తి, ౨, ౧.

౧. సాం. కా. ౬౧; సాం. ప్ర. సూ. 3-౭౦

కము; ఏలన నదిభిన్నవ్యక్తులకు భిన్నమగుటేకాక, సృష్ట్యారంభ మున భిన్నజీవులకది విభాగింపఁబడియుండలేదు. పర్యవసానమే మనగా, నజ్ఞానమే ప్రకృతిపరిణామకారణము, ౨. ఏలన ధర్మ సంబంధమజ్ఞానకార్యమే. 3. అజ్ఞానము ప్రకృతిపురుషుల తాత్కాలికసంబంధమునుగలిగించును; ఈసంబంధమునిజముకా దేలన, జ్ఞానోదయముతోనది నశించిపోవుచున్నది.

ప్రకృతియెట్లోపురుషులను స్వవశమొనర్చుకొన్నది. తమ యిచ్ఛకువ్యతిరేకముగాఁ బురుషులెట్లోప్రకృతిబంధములలోఁ జిక్కుకొనిరి. నిత్యముక్తస్వభావులగు పురుషులెట్లు నిత్యప్రకృతి వలలో మొట్టమొదటఁజిక్కుకొనిరో కారణము చెప్పఁబడలేదు దానికిఁ గారణమాదిలేనియవిద్యయే. అవిద్యకాది యున్నచో, దానికిఁబూర్వము జీవులుముక్తాత్ములైయుండి, తరువాతబద్ధులు కావలసియుందురు. అనగా ముక్తపురుషబంధము స్వఘాతవచన మగును.

అవిద్యయెట్లువచ్చెనో మనమెఱుఁగము. అందుచేదాని కాదిలేదనియు నంతమున్నదనియుఁ జెప్పబడెను. ౧. అవివేకమే పురుషప్రకృతి సంయోగకారణము. ౨. ఈయవివేకము ప్రళ యవేళఁగూడనుండును ; ప్రకృతి పురుషసంయోగ ముండదు. ఈసంయోగముయథార్థపరిణామముకాదు; ఏలనఁబురుషు నిలోఁ

---

౨. యో. సూ. ౨,౨౪.

3. సాం. ప్ర. సూ. 3,౬౭.

౧. చూ. సాం. ప్ర. సూ. ౬,౧౨-౧౫.

౨. సాం. ప్ర. భా. ౧,౧౯; యో. సూ. ౨-౨3,౨౪.

గ్రాత్రలక్షణములేమియుఁ నుదయింపలేదు. పురుష ప్రకృతి సంయోగము భోగిభోగ్యసంబంధమని కొందరుచెప్పిరి. ౩.

౧౨. -పురుషుఁడు; బుద్ధి,

ప్రకృతి సంతానసామగ్రిలో నత్యంతప్రధానమైనదిబుద్ధియే. వస్తువుల నింద్రియములు బుద్ధికిసమర్పింపఁగా బుద్ధివానినిఁ బురుషునకుఁ బ్రదర్శించును. పురుషప్రకృతి భేదమును బుద్ధియే వివేకించి, పురుషునియనుభవమునకవసరమైన సర్వకార్యఫలితములను జేకూర్చును. ౪. తనసాన్నిధ్యముననున్న పురుషుఁడు తనలోఁ బ్రతిఫలించుటచే బుద్ధిపురుషస్వభావ స్వరూపముల బొంది సర్వవస్త్వనుభవమును బొందుచున్నది. బుద్ధిప్రకృతి భవమైనను, నందుచే నచేతనమైనను; జేతనమువలెఁ గన్పట్టుచున్నది.౫;పురుషుఁడు తనచేతనత్వమును బుద్ధికిసంప్రదానమొనర్చుటలేదు; "ఏలన బ్రకృతియొక్క సాత్త్వికాంశము స్వచ్ఛమైన దగుటచే నందుఁ బురుషుఁడు ప్రతిఫలించును; దానితో నహంకారాభిమానములుగలిగి, యట్టిశక్తి తనదేయని ప్రకృతికి భ్రాంతి జనించుచున్నది. ఈభ్రాంతి పురుషునికిఁ గలుగుచున్నది; ఎట్లన చంద్రునికి గదలిక లేకున్నను, జలప్రవాహచల

---

౩. సాం. ప్ర. భా. ౧,౧౯. ఇట్టిసంబంధమును విజ్ఞానభిక్షువంగీకరించలేదు; ఏలన, నీసంబంధము నిత్యమైనదైనచో, జ్ఞానముచేనది నిర్మూలము కాదు; అనిత్యమైనచో దీనినిసంయోగమేయనవచ్చును.

౪. సాం. కా. ౩౭: చూ. సాం. ప్ర. భా, ౧,౧౬,౧.

౫. చేతనవదివ (సాం. కా. ౨౦) చూ. సాం. కా. ౬౦

(౧) సాం॥ ప్ర॥ సూ॥ వృత్తి. ౬, ౫౯.

నమునందుఁ బ్రతిఫలించు చంద్రుఁడును జలించుచున్నాఁడు."౧ బుద్ధ్యవస్థకును, బురుషునికిని సంయోగముండఁజాలదని వాచస్పతి నిశ్చయించినాఁడు; ఏలన, నీరెండును సంబంధములేని భిన్న రూపములు. అందుచేతనే బుద్ధియందుఁ బురుషుఁడు ప్రతిఫలించుటచే బుద్ధిచైతన్యవంతమగుచున్నదని చెప్పఁబడెను. బుద్ధి పురుష సంయోగాభాసమే యహంకారము. పురుషుఁడు చూచినంతనే బుద్ధిలో మార్పుజనించును; అట్టిమార్పు కలిగినపుడు బుద్ధి పురుష నంశామాత్రమును గ్రహించును; ఇట్టిబుద్ధివికార పురుషసంయోగముతోడనే పురుషప్రకృతిసంయోగము సంభవించును. పురుషప్రకృతిసంయోగమెట్టిదనిన, మనస్సులో నుద్భవించు రూపములన్నియుఁ బురుషుఁడు తనవేయని భ్రమించును.బుద్ధిలక్షణమైన యవివేకమును, బద్ధపురుషునిలోఁ బ్రతిబింబించును,౨.

తనతో సన్నిహితసంపర్కముగల బుద్ధితోఁబురుషునికి మొదటసంయోగముగలిగి, తరువాత మిగిలినవానితో నేర్పడును. పురుషుఁడు బుద్ధికి సాక్షియనియు. బుద్ధిసాహాయ్యమున నితరవస్తువుల విషయములో ద్రష్టయనియు విజ్ఞానభిక్షువు చెప్పినాఁడు.ముక్తుఁడునుదాసీనుఁడునగు పురుషుఁడు బుద్ధిసంపర్కముచే సాక్షియగుచున్నాఁడు.3. ఆత్మకును దేహమునకును సంబంధము

---

(౨) సాం॥ ప్ర.సూ॥౧, ౧౯.) "జన్మమనగా నొకబుద్ధితో సంయోగము; బుద్ధ్యుపాధి సంయోగముచే పురుషునకు దుఃఖానుభవము కలుగుచున్నది."

(3) సాం. ప్ర॥ ౯, ౫౦.

నిజమైనచో దేహలోపములన్నియు నాత్మకు సంక్రమించును. ఆత్మనిత్యశుద్ధమను సాంఖ్యసిద్ధాంతమునకు భంగమువాటిల్లును. బుద్ధిదోషములన్నియుఁ బురుషునియందుఁ బ్రతిఫలించుటచే బంధము సంభవించినది. బుద్ధికి దాని సహజస్వచ్ఛత లభించి నప్పుడు ప్రతిఫలావకాశము నశించి, మోక్షములభించును; అనగా బుద్ధి ప్రకృతియందు లీనమగును. ప్రకృతివ్యాపారము పురుషుని యర్థసిద్ధికొరకేయని చెప్పుటలో నర్థమేమనఁగా, బుద్ధియొక్క శుద్ధిసంపాదనమునిమిత్తమే. బుద్ధి సహజముగా సాత్త్వికమేయైనను, పూర్వవాసనా సంబంధదోషములవశమున వ్యక్తులలో నది రాజసమో, తామసమో యై యుండును. మనమనుభవించు సుఖదుఃఖానుభవము, బాహ్య ప్రపంచముతో బుద్ధిసంయోగముచే లభించును; పురుషుఁడు సాక్షిమాత్రుఁడై యుండును. బుద్ధి సుఖమునే కలుగఁజేయ వలసియున్నను, నూతనముగావచ్చిన దోషములవలన దుఃఖమును. గలిగించును. ఈ కారణముచేతనే, భిన్నవస్తువుల కొకే వస్తువు భిన్నానుభవముల నిచ్చుచున్నది. గ్రహింపవలసిన ప్రతివిషయమును మనము వ్యక్తిగతములగు భావముల ననుసరించి దర్శింతుము. అందుచే నొకనికి సుఖమైతోఁచున దింకొకనికి దుఃఖమగుచున్నది; అంతేకాక మొదటివ్యక్తికే తరువాత దుఃఖహేతువు గావచ్చును. మనము సామాన్యముగా మనము కల్పించుకొనిన ప్రపంచములలో జీవించుచున్నాము; ఇందు మనకు నచ్చినవిషయములకెక్కుడు ప్రాధాన్యమునిత్తుము. మన సామాన్యజీవితములు వాంఛాపూరితములగుటచే, దుఃఖ

మును, సంశయాస్పదమగు సుఖలేశమునుగలిపి మనకు లభించుచున్నవి. మనము బుద్ధిని పవిత్రమొనర్చి, పూర్వసంస్కారములను విదళించినచో, మనకుఁగల భావములను విసర్జించి, వస్తుసహజసంబంధములను దెలిసికొందుము. బుద్ధి సత్త్వసంశుద్ధమైనచో, యథార్థజ్ఞానము లభించును; బుద్ధి రాజసగుణావృతమైనచోఁ గామమును, దామసగుణోపేతమైనచో విపరీతజ్ఞానాదికమునుసంభవించును. ౧.

## ౮. -జ్ఞానసామగ్రి.

సకలవిధ జ్ఞానమందును మూడు విషయములుండును; తెలియఁబడువిషయము లేక జ్ఞేయము, తెలియునాతఁడు లేక జ్ఞాత; తెలియుసాధనము లేక జ్ఞానము, సాంఖ్యతత్త్వమునందు శుద్ధ చిత్స్వరూపమే ప్రమాత;వృత్తియే ప్రమాణము;వస్తురూపమగు వృత్తివికారము చిత్స్వరూపమునఁ బ్రతిబింబించుటయే ప్రమ లేక జ్ఞానము. జ్ఞేయమువృత్తిప్రతిబింబవిషయమే."౨.అనుభవము పురుషునకుఁ జెందును.3 బుద్ధ్యహంకార మానసేంద్రియములు ప్రమాతయొక్క సాధనసామగ్రి. ఒకవిషయ మింద్రియము

(౧) సత్త్వమ్ యథార్థజ్ఞానహేతోః, రజో రాగహేతుః, తమోవిపరీతజ్ఞానాది హేతుః.

(౨) సాం॥ ప్ర॥ భా॥ ౧, ౮౮.

(3) సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౧, ౪3.

లకు వేదన కలిగించునపుడు మనస్సింద్రియవేదనల కొకరూపమును గల్పించి అహంకారమునకు సమర్పింపఁగా. నహంకారము దానినాత్మకుఁ బ్రదర్శించును; బుద్ధి దానినొకభావముగా మార్చును.౯ బుద్ధి దేహమంతయును నిండియుండి, గతజన్మసంస్కారములను వాసనలను గలిగియుండును; అవి తదనుగుణపరిస్థితులు సంభవించునపుడావిష్కృతములగును. "ఇంద్రియములను ప్రవాహములద్వారమున వస్తుసంయోగముగలిగికాని, లేక,అనుమానసంజ్ఞాదికములవలనఁగాని, తెలియఁదగిన వస్తురూపమైనవృత్తి మొదటబుద్ధియందు జనించును. ఈవృత్తి వస్తుసంజ్ఞతో నొకప్రతిబింబాకృతిని పురుషునియందుఁ బ్రవేశించి,ప్రకాశించును; పురుషుఁడు మార్పులేనివాఁడు గావున వస్తుప్రతిబింబరూపముగాఁ బరివర్తనము చెందఁజాలఁడు." వస్తుజ్ఞానమనఁగా వస్తురూపముగా మారుటేయైనచోఁ బురుషునకట్టిమార్పులేదు; అందుచే బుద్ధికట్టి పరివర్తనము కలుగునని చెప్పఁబడెను. వస్తువృత్త్యాకృతి

(౮) పెక్కుకారణములచే మనస్సు పదునొకండవ యింద్రియమని గుర్తింపఁబడెను. నిత్యుఁడగు పురుషునికే సుఖదుఃఖాత్మకములగు వస్తువులతో ప్రత్యక్షసంబంధమున్నచో మోక్షావకాశమేలేదు. ఈసంబంధము ప్రకృతిద్వారమునన్నదన్నచోఁ బ్రకృతియు నిత్యమైనదే కావున మోక్షావకాశము లేదు. అనిత్యములగు ఘటాదులకుఁ బురుషుని నిత్యమైనబుద్ధితో సంబంధము చెప్పుచో, నప్పుడు దృష్టాదృష్టవస్తుభేదముండదేలన, నేకక్షణముననే సర్వవస్తువులు దర్శింపఁబడును. ఘటాదులకు బుద్ధిసంబంధము బాహ్యేంద్రియములపై మాత్రమే యాధారపడియున్నదన్నచో; మనదర్శనము లొకే కాలమునకుఁ జెందకుండుటకుఁ గారణమరయఁజాలము.

(౯) తత్త్వకౌముది. పు. ౩౬, సాంఖ్యజ్ఞాన సిద్ధాంతవిమర్శనమునకు చూ, న్యా॥ వా; న్యా॥ వా॥ తా.టీక. ౩,౨, ౮-౯.

గోచరించుటకుఁ జిత్స్వరూపమున బుద్ధి ప్రతిఫలించవలెను.౧ ఈ ప్రతిబింబము బుద్ధివికాసముచే జనించును. పురుషునిలో నీ ప్రతిబింబము ప్రతిఫలించు వస్తువెంతకాలముండునో అంత కాల ముండును. బుద్ధివికారము పురుషునిలోఁ బ్రతిబింబించుట తరువాతజరుగునదిగాక, బుద్ధివికారము. ప్రతిబింబము నేక కాల మందే జరుగును. ఇంద్రియములద్వారమున బుద్ధి బాహ్యవస్తువులతో సంయోగముపొందినపుడు, బాహ్యవస్తురూపమును బొందును. వికారముచెందిన బుద్ధియందుఁ బ్రతిఫలించిన చేతనశక్తి బుద్ధివికారము ననుకరించును. ఈ యనుకరణమే మనకుపలబ్ధికారణ మగుచున్నది. పురుషుని ప్రతిబింబము యథార్థసంయోగము కాదు; బుద్ధికిని పురుషునకును గలభేదమును గుర్తింపలేని యవివేకముచే నట్లు చూపట్టుచున్నది. బుద్ధిలోఁ బ్రతిఫలించు పురుషునికి బాహ్యవస్తుసంయోగమే జ్ఞానమనియు, పురుషునికిట్టి జ్ఞానసంబంధమువలన "నేను కర్త"నను నహంకారము జనించుచున్నదనియుఁ దెలియవలెను. ౧. కాని నిజముగా 'నేను' అను పురుషుఁడు కర్త కాఁజాలఁడు; కర్తయైన బుద్ధి యాలోచింపఁజాలదు. ౩.

---

(౧) సాం॥ ప్ర॥ భా॥ ౧, ౯౯.

(౧) బుద్ధావారోపిత చైతన్యస్య విషయేణ సంబంధో జ్ఞానమ్; జ్ఞానేన సంబంధశ్చేతనో హం కరోమీతి ఉపలబ్ధిః (ఉదయనుని కుసుమాంజలి ౧,౧౪ పై హరిదాస భట్టాచార్యుఁడు వ్రాసినది.) (౩) వస్తుప్రతిబింబ వికారము పొందిన మనస్సుద్వారమున నాత్మకు వస్తుజ్ఞానముకలుగునని వాచస్పతియు, నాత్మ మనస్సునందుఁ బ్రతిఫలింపఁగా నామనస్సు తిరిగి యాత్మయందుఁ బ్రతిబింబించుటవలన వస్తుజ్ఞానము కలుగునని విజ్ఞానభిక్షువును దలఁచిరి.

బుద్ధివ్యాపారము పురుషసంపర్కము లేనిదే జ్ఞానశక్తి కాఁజాలదు. మనోబుద్ధీంద్రియము లచేతనములను భావము దీనివలన విశదమగుటకే యిట్లు చెప్పఁబడెను. 3.

అంతరింద్రియములు జడాత్మకములైన ప్రకృతిసామగ్రియే. చూచుట, ఆలోచించుట, కోరుట నిర్ణయించుట మున్నగునవి మానసికములైన యంతరంగప్రవృత్తులు. ౪. ఇవి యచేతనములుగానే యుండి పురుషలక్షణముచేఁ జైతన్యవంతములగును. ఇదిమాత్రము కేవల పురుషప్రవృత్తి; మిగిలిన క్రియాప్రవృత్తి యంతయుఁ బ్రకృతికిఁజెందినదే. పురుషుఁడొక చలనములేని యద్దము; ఇందంతఃకరణము ప్రతిఫలించును. చేతనమైన యాత్మ తన దివ్యశక్తిచే సర్వేంద్రియవ్యాపారములను జైతన్యవంతము లొనర్చి, వాని జడత్వమును బోనాడును. బుద్ధికిఁ బురుషసాన్నిధ్యమే కాక, బుద్ధియందుఁ బురుషప్రతిబింబమునుగూడ సాంఖ్యమంగీకరించును. మనము ముఖ ప్రతిబింబము నద్దములోఁజూచునట్లే,బుద్ధిలోఁ బురుషప్రతిబింబమును

(3) సాంఖ్య సిద్ధాంతమునందుఁ బురుషునిప్రభావము ప్రకృతిపై వ్యాపించునపుడు బుద్ధ్యహంకారాదు లుదయింపఁజాలవు. అందువలన బుద్ధి కేవలము జడపదార్థమని చెప్పనవసరములేదు. పురుషప్రభావమువలననే బుద్ధివికసించును. బుద్ధ్యహంకారాదులు పురుషునియుపయోగమునకై సిద్ధముచేయఁబడియున్న యుపకరణములనియుఁ, బురుషులు వానిద్వారమున దూరదర్శినీయంత్రముద్వారమునవలెఁ జూచునపుడు నచేతనములు నచలములునై యుండుననియు ననమూహింపనవసరములేదు; ప్రకృతి సామ్యస్థితిని పురుషుడు చలింపఁజేయునపుడుఁ బ్రకృతిబుద్ధి నుదయింపఁజేయఁ జూచుననది సాంఖ్యమూలసిద్ధాంతము.

(౪) మనోబుద్ధ్యహంకారము లొకేయింద్రియమని చూడఁబడెను.

గు ర్తింతుము. చేతనశక్తి కాత్మదర్శనమిట్లు తప్ప వేరొకరీతిని సాధ్యము కాదు. ౧.

రూపరహితమగు పురుషునికిని సరూపమగు బుద్ధికినిగల సంబంధము దురూహ్యమైనది. వాచస్పతిననుసరించి, దేశకాలావధులలో నీ రెంటికి సంయోగమసంబద్ధము. అందుచే నాతఁడు సన్నిధియనఁగా యోగ్యతయని యర్థము చెప్పినాఁడు. పురుషుఁడు బుద్ధిప్రవృత్తినుండి వేరైయున్నను, బుద్ధితోఁ దాదాత్మ్యమును బొందు విభ్రాంతికి వశుఁడై, తదవస్థలనన్నిటిని తనకాపాదించుకొనుచున్నాఁడు. అట్టి విశిష్టమైన యోగ్యతనంగీకరించినయెడల, మోక్షకాలమునఁ బురుషుఁడు దానినుండి విముక్తిఁ బొందుట, శక్యాంతరముండరాదని విజ్ఞానభిక్షువు వాదించెను. అనఁగాఁ బురుషుఁడు బుద్ధివ్యాపారమును శాశ్వతముగా ననుభవించుచునేయుండును గావున మోక్షావకాశము లేదని చెప్పవలసియుండును. అందుచేనాతఁడు ప్రతిజ్ఞానక్రియయందును బుద్ధితోఁ బురుషునికి యథార్థసంయోగమున్నదని వాదించినాఁడు. అట్టి సంయోగమువలనఁ బురుషుని కేమార్పు నుండనవసరము లేదు; ఏలన మార్పనగా, త్రిగుణము లుత్పన్నములగుటయే. బుద్ధి వికారవశమై, పురుషునిలోఁ బ్రతిఫలించునపుడు, పురుషునిలో, "నేను కర్త" ననుభావ ముదయించును; పురుషుఁడు బుద్ధిలోఁ బ్రతి ఫలించినపుడు, బుద్ధి చేతనమువలెఁ బ్రకాశించును. బుద్ధిపురుషసంబంధము స్ఫటికములో సన్నిధియున్న రక్తపుష్ప ప్రతిబింబమువంటిదని విజ్ఞానభిక్షువు నంగీకరించెను.

(౧) చిచ్ఛాయాపత్తి. (స॥ ద॥ సం॥ ౧౫)

నిజముగాఁ బుద్ధిసంబంధము లేదు గాని, సంబంధమున్నదను భ్రాంతి కలుగుచున్నది. ౧.

అనంతసంఖ్యగల పురుషులు, విశ్వవ్యాప్తికలిగి, చేతన స్వరూపులైనను,సర్వవస్తువులను సర్వకాలములలోఁ బ్రకాశింపఁ జేయుటలేదు; ఏలన వానిస్వభావము సంగరహితము; అందుచే వస్తురూపమునొందుట కవకాశము లేదు. తమకుఁ జెందిన బుద్ధులందే పురుషులు ప్రతిఫలింతురు కాని, యితరము లందుఁగాదు ఏవస్తువు బుద్ధికి వికారముకల్పించునో యావస్తువు విదితమగును; ఏదికాదో, అది మనకగోచరము. ౨.

జాగ్రత్స్వప్నసుషుప్తి మరణావస్థల భేదము గుర్తింపఁ బడెను. జాగ్రదవస్థలో నింద్రియముల ద్వారమున బాహ్య వస్తువులతో బుద్ధి తాదాత్మ్యము పొందును పూర్వానుభవ సంస్కారముల రూపములతో బుద్ధి స్వప్నదశలోఁ దాదాత్మ్య మందును.సుషుప్తి ద్వివిధము; ఇది బుద్ధిలయము సంపూర్ణము నసంపూర్ణమునగు దశలననుసరించి యుండును. అసమగ్రలయా వస్థలోబుద్ధి వస్తురూపములఁ బొందదు;కాని సుఖదుఃఖ మాంద్య ములను బొందును.మాంద్యము దాని సహజలక్షణమే. అందు చేతనే,మనము నిద్రనుండి మేల్కాంచినప్పుడు, మననిద్రయొక్క స్వరూపానుగుణమైనస్మరణ మనకుఁగలుగును. మరణావస్థలో మనకుబుద్ధియొక్క సంపూర్ణలయము సిద్ధించును,౧.

---

(౧) సాం॥ ప్ర॥ భా॥ ౬, ౨౫; యో॥ సూ॥ ౧, ౪,౭; యో॥ భా॥ ౨, ౨౦; ౪, ౨౨.

(౨) స॥ ద॥ సం॥ ౧౫.

(౧) సాం॥ ప్ర॥ భా॥ ౧, ౧౪౫.

౧౪. జ్ఞానాధారములు.

జ్ఞానవ్యాపారము పంచవిధము; ప్రమాణము లేక శుద్ధ జ్ఞానము; విపర్యయము లేక జ్ఞానవిషయమునకులేని రూపముపై నాధారపడిన అయథార్థజ్ఞానము;౨ వికల్పము లేక రెండు విషయములలో నేదియో తెలియక యూగులాడు సంశయావస్థను దెలుపునది;3 తమస్సుపైక నాధారపడిన నిద్రావస్థ; స్మృతి.

ప్రత్యక్షానుమాన శబ్దప్రమాణత్రియమును సాంఖ్య మంగీకరించును.౪. ఇంద్రియవ్యాపారముచే జనించునది ప్రత్యక్ష జ్ఞానము. ఘటమువంటి యొకవస్తువు దృష్ట్యావరణమున నున్న ప్పుడు, బుద్ధి ఘటరూపము నొందును;౬ ఆత్మయప్పుడు ఘటా స్తిత్వమును గ్రహించును.౭. ప్రత్యక్షము నిర్వికల్పకమనియు సవికల్పకమనియు గుర్తింపఁబడెను. వాచస్పతి ననుసరించి, యింద్రియముల ద్వారమున బుద్ధి బాహ్య వస్తుసంయోగము నొందును. ప్రథమసంయోగములో వస్తువిశేషములు తెలి యని నిర్వికల్పక జ్ఞానమేయుండును. తరువాత మానసిక వికల్ప సంకల్ప వ్యాపారఫలితముగా వస్తువొక విశిష్టస్వభావముగల దిగా గోచరించి,౮ మనకుసవికల్పక జ్ఞానములభించును. ప్రత్యక్ష

(౨) యో॥ సూ॥ ౧, ౮ (3) యో॥ సూ॥ ౧, ౯.

(౪) యో॥ సూ॥ ౧, ౧౦.

(౫) సాం॥ కా॥ ౪.

(౬) తదాకారాల్లేఖీ.

(౭) సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౮౯.

(౮) పోల్చు. వ్యాసుఁడు: "సామాన్య విశేషసముదాయోద్రివ్యమ్." (యో॥ భా॥ 3, ౪౪.)

దర్శనమునకు మనోవ్యాపార మవసరమని వాచస్పతి తలఁచి యుండఁగా నది యవసరములేదనియు,నింద్రియద్వారమున బుద్ధి వస్తుసంయోగముపొందుననియు విజ్ఞానభిక్షు వూహించినాఁడు. ఇంద్రియవిషయముల నొకపొందికకుఁ దెచ్చి, సవికల్పక దర్శన ముగా నొకక్రమములోఁ గూర్చు పని మనస్సుచేయునని వాచస్పతి భావించెను; వస్తువుల సవికల్పకలక్షణము నింద్రియములు ప్రత్యక్షముగా దర్శించుననియు, నూహాసంశయకామలక్షణము లను బ్రదర్శించునది మాత్రమే మనస్సనియు విజ్ఞానభిక్షువు జెప్పినాఁడు. యోగదృష్టిని సాంఖ్య మంగీకరించినది; సర్వవస్తువులును సర్వకాలములందును వ్యక్తములో, అవ్యక్తములో, యైయుండునని సాంఖ్యమతము. ధ్యానమువలన లభించిన శక్తులతోఁగూడిన యోగిమానసము, సూక్ష్మరూపములలోనున్న భూత భవిష్యద్వస్తుజాలముతో సంయోగముచేఁ దెలిసికొనఁ గలదు. ౧. మనశ్శక్తులవలనఁగలుగు యోగిదృష్టికి నింద్రియ దృష్టికిని జాలభేదమున్నది. స్మృతిజ్ఞానమునందు, మనస్సు, నహంకారము, బుద్ధియు మాత్రమే పనిచేయును; కాని వీని వ్యాపారమునకుఁ బూర్వప్రత్యక్షదర్శన సంస్కారములుండును. బాహ్యేంద్రియములు బాహ్యవస్తువులు లేనిదే పనిచేయఁ జాలవు కాని మనస్సుమాత్రము భూతభవిష్య ద్వస్తువులను గూడ భావింపఁగలదు. అంతర్దృష్టిలో నింద్రియముల సహాకారములేకుండును. బుద్ధి సుఖదుఃఖావస్థలను దర్శింపఁగలదు ౨.

(౧) సాం॥ప్ర॥భా॥ ౧, ౯౧. (౨) వస్తుసంపర్కములేని సుషుప్త్యవస్థలో వ్యక్తమగునది సాత్త్వికసుఖము (శాంతిసుఖము.) అదియే బుద్ధికప్పటి లక్షణము; దానినే ఆత్మసుఖమనవచ్చును." (సాం॥ ప్ర॥ భా॥ ౧, ౬౫.)

ప్రత్యభిజ్ఞయుఁ బ్రత్యక్షములోనికిఁ దేఁబడెను. ఇది సాధ్యమే, యేలన బుద్ధి నిత్యమైనది; వ్యక్తులయొక్క క్షణికవీక్షణములకు భిన్నమైనది. ఈనిత్యమైన బుద్ధిమార్పులనొంది, ప్రత్యభిజ్ఞలోఁ గల భిన్నజ్ఞానక్రియలతో సంపర్కముగలిగిన దగును. ఆత్మ మార్పులేనిదగుటచే నిట్టిసంపర్కము దానికుండదు.౧

సాంఖ్యమునసుసరించి, ఒకజ్ఞానక్రియ నింకొకటి తెలియఁ జాలదు; కాని యాత్మయే దానిని దర్శించును. జ్ఞానక్రియ బుద్ధివ్యాపారము; బుద్ధి యచేతనము; అందుచేనది దానికే జ్ఞాన విషయము కాఁజాలదు; ఆత్మయే దానినిగ్రహింపఁగలదు.౨.

అభావము ప్రత్యక్షములోని దనియే చెప్పఁబడెను. కేవలాగోచరత్వ మభావమనరాదు. దూరస్థితి, అత్యంతసామీప్యము, అత్యంతసూక్ష్మత, యింద్రియచాంచల్యము, అశ్రద్ధ, వస్తువాచ్ఛాదింపఁబడుట, అన్యవస్తుసంసర్గము,3 మున్నగు కారణములచే నగోచరత్వము సంభవింపనగును.

అనుమానము ద్వివిధము; వీతము; అవీతము. మొదటిది భావాత్మక సాదృశ్యముపై నాధారపడును; రెండవదభావాత్మక సాదృశ్యముపై నిలుచును,౪. పంచావయవ సహిత తర్కవాక్యమంగీకరింపఁబడెను.౫. సాదృశ్యదర్శనము, తల్లోపము

---

(౧) ఈసిద్ధాంత విమర్శకు, చూ॥న్యా॥సూ॥ 3,౨,౧-౯.

(౨) యో॥ భా॥ ౪, ౯.

(3) సాం॥కా॥౭; సాం॥ప్ర॥సూ॥౧,౧౦౮-౯.

(౪) పూర్వవత్, సామాన్యతో దృష్టములను మొందటి దాని క్రిందను, శేషవత్తును రెండవ దాని క్రిందను వాచస్పతి చెప్పెను.చూ. తత్త్వకౌముది. పు. ౫. (౫) సాం॥ప్ర॥సూ॥ ౫, ౨౭.

నున్నప్పుడు సామాన్యధర్మము ప్రతిపాద్యమగును ౬. నిత్య సాదృశ్యమును జూపు వ్యాప్తి ప్రత్యేకనియమము కాదు. ౭ అది యొక వస్తుసంబంధమే కాని వస్తువు కాదు ౧ అర్థాపత్తి సంభవములనుమానాంతర్గతములే యని చెప్పఁబడెను.

ఆప్తవచనముకూడ నొక జ్ఞానాధారమే. వస్తుశబ్దముల కభిధాభిధేయత్వసంబంధమున్నది. ఆప్తవచనము, ఆచార ధర్మము, సంప్రదాయనియతి దీనిని ధృవపరచును. ౨. వేదములు పురుషకల్పితములని చెప్పరాదు; ఏలన వానినిఁగల్పింప సమర్థులెవరును లేరు. 3. ముక్తపురుషులకు వేదములతో నిమిత్తము లేదు. బద్ధజీవులు వేదములను రచింప నసమర్థులు. ౪. వేదములు నిత్యములునుగావు; ఏలన నవి కార్యలక్షణములను గలిగియున్నవి. అక్షరము లుచ్చరించినవెంటనే నశించును. "ఈ యక్షర మదియే"యని మనము చెప్పునపుడది యేక

(౬) సాం॥ప్ర॥సూ॥ వృత్తి ౫, ౨౮ సాధ్యసాధనముల నిత్యసాహచర్యముగాని, ఏదో యొకదాని నిత్యసాహచర్యముగాని వ్యాప్తియనఁబడును (సాం॥ప్ర॥సూ॥౫,౨౯.)"ఉత్పత్తిగల సర్వవస్తువులు అనిత్యములు"ధూమసహితము లన్నియు నగ్నియుతములు"వీని కుదాహరణములు, (౭) తత్త్వాంతరమ్, ౫, ౩౦. ఏది పోషింపఁబడునో దానియొక్క శక్తిని గలిగి యుండుట వ్యాప్తియని పంచశిఖు నభిప్రాయము. (ఆధేయ శక్తియోగము, ౫,౩౨)

(౧ ౫, ౩౩-౩౫.

(౨) సాం॥ ప్ర॥సూ॥ వృత్తి ౫,౩౮.

(౩) సాం॥ ప్ర॥ సూ॥ ౫, ౪౬.

(౪) సాం॥ ప్ర॥ సూ॥ ౫, ౪౭.

జాతికిఁ జెందునని మనభావము. ౧. పురుషకృతములు కానంత మాత్రమున వేదములు శాశ్వతములని నిర్ణయింపరాదు; ఏలన నొక మొలక పురుషకృతము కాకపోవచ్చును; అది నిత్యమైనది గాదు. ౬. వేదవిషయము లతీంద్రియములు; కాని, "అతీంద్రియ విషయము లంతర్దృష్టిగోచరములే; వానికిఁ బదార్థ లక్షణ నిర్ణయముచేయు సామాన్యరూపములుండవచ్చును; లేక శబ్దముచే వస్తువు తెలియునగును." ౭. వేదములు పురుష కృతములుగాకున్నను, విషయములను దెలియఁజేయు వానిశక్తి నాప్తులు వారిశిష్యులకందఁజేసిరి. ౮. వేద మపౌరుషేయము కావున సంశయవికల్పాది దోషరహితమై, స్వతః ప్రమాణ యుక్తమైనది. వేదముల ప్రామాణ్యము వేదేతరములపై నాధార పడునెడల మనకవి ప్రమాణములు కాఁజాలవు. ౯. కల్పా రంభమునఁ గపిలుఁడు వేదస్మృతిని గలిగియుండెను. ముక్తపురు షులు వేదవాక్యములను దమజీవితములో ననుష్ఠానముచే ఋజువుచేసి, యితరులకందఁజేసిరి. మనకు శాస్త్రోపదేశము చేయువారు ద్రష్టలుకాక, వాని నితరులనుండి గౌరవముచే

---

(౫) సాం। ప్ర। సూ। వృత్తి ౫, ౪౫, ౫, ౫౭ లో స్ఫోటవాదము ఖఁడింపఁబడినది; శబ్దము కార్యలక్షణముగలది కావున నిత్యముగాదని చెప్పఁ బడెను. (౫, ౫౮)

(౬) సాం। ప్ర। సూ। ౫, ౪౮.

(౭) అతీంద్రియేష్వపి పదార్థతావచ్ఛేదకేన సామాన్యరూపేణ ప్రతీతేః ర్వ్యక్ష్యమాణత్వాత్. (సాం। ప్ర। సూ। ౫, ౪౨.)

(౮) సాం। ప్ర। సూ। ౫, ౪౩.

(౯) సాం॥ప్ర॥సూ॥౫,౫౧.

నంగీకరించినయెడల నంధులంధులను నడపినట్లగును. ౨. ఆప్తుల వాక్యములు ప్రమాణములుగా మన మంగీకరించుటకుఁ గారణ మేమన, నాయుర్వేదాద్యన్యశాస్త్రములలో వారి వాక్యము లాచరణలోఁ బరీక్షకు నిలచినవి. ౩.

వేదములే కాక యితరదర్శనము లపౌరుషేయములని వాదించుట కవకాశమున్నదని సాంఖ్యమెఱిగి యుండుటచే నేవి నిజముగా నపౌరుషేయములో నిర్ణయించుటకు హేతువాద మవసరమని ప్రకటించెను. వాచస్పతి యిట్లునుడివెను: "ఈదర్శనము లప్రమాణములగుటకుఁ గారణమేమన నివి హేతుయుక్తములుకాని ప్రకటనలు చేయుట, సమర్థించుటకుఁ దగిన యాధారములఁ జూపకుండుట, తర్క-ప్రమాణ విరుద్ధప్రసంగము లుగ్గడించుట, మ్లేచ్ఛ సంకీర్ణజాతులు వీని నంగీకరించుటయునై యున్నవి".౪. తన వృత్తిలో ననిరుద్ధుఁడీ భావము నుదాహరించెను: "ఒక యాప్తుఁడు పలికెను గదా యని మహాసురులాకసమునుండి భూమిపైఁబడరు. హేతుసంబద్ధములైన వాక్యములనే నేనును, మీవంటివారు నంగీకరింపవలెను."౧.

తానొక క్రొత్తపద్ధతి పట్టెనను నపవాదమునకుఁబాల్పడకుండుటకై సాంఖ్యము వేదప్రామాణ్యము నంగీకరించెను. కాని మనము ముందుఁ జూడఁబోవురీతిగా, నది పెక్కు పూర్వవిశ్వాస

(౨) సాం॥ప్ర॥సూ॥౩,౮౧.
(౩) సాం॥ప్ర॥భా॥౧,౮౮.
(౪) తత్త్వకౌముది, పు. ౫.
(౧) "నహ్యాప్తవచనాన్నభసోని పతంతిమహాసురాః।
యుక్తిమద్వచనమ్ గ్రాహ్యమ్ మయాన్యైశ్చభవద్విధైః॥(౧,౨౬)

ములను విసర్జించి, పెక్కింటిని విస్మరించెను. అయిన నది యెన్నడును బ్రత్యక్షముగా వేదములను ధిక్కరింపలేదు; కాని వాని మూలాధారముల ననుసరించెను.

బుద్ధివికారము ప్రమాణము; ఈప్రమాణము యొక్క యుక్తాయుక్తత లనంతర వికారముల వలననే పరీక్షింపఁబడ వలెను; కాని బాహ్యవస్తు ప్రమాణమున కిచటఁ బ్రసక్తియుండ రాదు. భ్రమాజ్ఞానమున కభావము కాక భావాత్మకద్రవ్యమే విషయము. జలభ్రాంతికి జలమే విషయము; రవి కిరణదర్శన జ్ఞానముచే నీభ్రాంతి తొలఁగినపుడు, రవికిరణములే జ్ఞానవిష యములగును. 2. ప్రమాణతాప్రమాణతలు జ్ఞానక్రియకుఁ జెందినవే. 3. శ్రుతియొక్కటే స్వతః ప్రమాణ మనియు, ప్రత్యక్షానుమానములకు దోషము సంక్రమింపవచ్చును గావున వాని నితరసాక్ష్యములచే ఋజువుచేయవలసియుండు ననియుఁ గొన్ని వేళలఁ జెప్పఁబడెను. 4. అర్థక్రియాకారిత్వమే ప్రమాణసిద్ధిని నిర్ణయింప సమర్థమైనది. మనజ్ఞాన మహంకార కలుషితము; నిరహంకారమైన స్వచ్ఛప్రపంచజ్ఞానముండుట దుస్తరమైనవిషయము. జీవుఁడాత్మనిర్మితమగు నహంకారకారా

---

(2) యుక్తాయుక్త జ్ఞానభేదమును గ్రహింపదు గావున దీనిని ప్రభా చంద్రుఁడు ఖండించినాఁడు.

(3) నైయాయికుఁ డీభావమును ఖండించెను; ఏలన జ్ఞానక్రియలు సహజముగా నయుక్తములైనచో. మనము ప్రవృత్తిపరులము కాఁజాలము; లేక నవియుక్తములైనచో విస్పష్టముగానున్న దోషములకు మనము కారణము లను జెప్పఁజాలము, (4) సాం॥ప్ర॥సూ॥ ౧,౧౪౭;౧,౩౬,౭౭,౮౩,౧౫౪; ౨,౨౦, ౨౨; ౩,౧౫,౮౦; ౪,౨౨.

గారబద్ధుఁడై, యుండుటచేఁ దదతీతదృష్టికలిగి సత్యమును గాంచుట సులభసాధ్యము కాదు. అందుచే మన యింద్రియజ్ఞానమంతయు నిట్టి దోషవిషసిక్తమై యున్నది. పురుషసంబంధమైన ప్రతిజ్ఞానాంశము నంతఃకరణ ప్రవృత్తిగా భ్రమాస్పదమై యున్నది. బుద్ధియొక్క ఛాయ పురుషునిపైఁ బడినపుడే, పురుషుఁడు తనకు జ్ఞానసంబంధముగల కర్తగా భ్రమించును. ౧.

### ౧౬—సాంఖ్యజ్ఞానసిద్ధాంతము; కొన్ని సామాన్య పరిశీలనములు

సాంఖ్యతత్త్వసమీక్ష నింకొకప్రకరణమునకు విడిచి, సాంఖ్యజ్ఞాన సిద్ధాంతములనిచట సంగ్రహముగాఁ బరిశీలింతము. ౨. వ్యవహారజగత్తులో గోచరించువస్తువులనుగూర్చి వ్యక్తియనుభవమునుండి, సాంఖ్యము వ్యక్తులయొక్కయు వస్తువులయొక్కయు స్వతంత్రాస్తిత్వమును నిరూపింప వాదించినది. న్యాయదర్శనజ్ఞానసిద్ధాంతచర్చలో మనమిదివఱకుఁ జూచియున్నరీతిగా, యథార్థజగత్తులో నర్థకారిత్వము లేని శుద్ధ వ్యక్తులు, వస్తువులు కేవల మూహాజన్యములుమాత్రమే.

(౧) తత్త్వకౌముది. పు. ౫.

(౨) కాంటు తత్త్వజ్ఞునియొక్కయు సాంఖ్య మతముయొక్కయు జ్ఞానసిద్ధాంతములకుఁ గొంత సామ్యమున్నది. అతీంద్రియద్రష్టలు, (పురుషులు) విషయములు (ప్రకృతి) గలసి వ్యవహారజగత్తగుచున్నది. వ్యవహారరంగములో రెండును జీవులస్వాతంత్ర్యమును, జడపదార్థాస్తిత్వమును నంగీకరించినవి. జీవులు కర్తలుగావు కావున, బాహ్యవస్తువులులేనిదే వేదనలు కలుగవు. ఈశ్వరాస్తిత్వమును నిరూపించుట దుస్సాధ్యమని రెండు నంగీకరించును. ఇతర విషయములలో విశిష్టభేదమున్నవి.

సాంఖ్యమనుభవ జగదైకత్వమును సంబంధములేని వ్యక్తులుగాను విషయములుగాను విభాగించి, మనయనుభవమెట్లు సాధ్యమో విశదీకరింపలేక పోయెను. సర్వజ్ఞానవిషయములను బ్రకాశింపఁజేయు నిత్యజ్యోతియు శుద్ధచేతనము పురుషుఁడని భావించుట వలనను, బ్రకృతి పురుషునికిఁ బూర్తిగా వ్యతిరేకమైనదని నిర్ణయించుట వలనను, బ్రకృతి పురుషుని కెన్నఁడు విషయము కాఁజాలదు పురుషప్రకృతుల మధ్యమందు సాంఖ్యము ద్రవ్వినగొయ్యినది యెన్నటికినిఁ బూడ్పఁ జాలదయ్యెను. సాన్నిధ్యప్రతిబింబాద్యుపమానము లూహాకల్పిత రోగముల కుచితములైన యౌషధములుగాఁ బనిచేయవయ్యెను. ప్రకృతి పురుషస్వభావము సాంఖ్యము చెప్పినదే నిజమైనచోఁ బురుషుఁడు ప్రకృతి నెన్నఁడెఱుఁగఁ జాలఁడు. తన చైతన్యరాశిలో బుద్ధివికారప్రతిబింబము లనఁబడునవెట్లు తటస్థించునో పురుషుఁడు చెప్పఁజాలఁడు. బుద్ధి వికారము పొందినపుడావికారము పురుషుని చిత్స్వరూపములోఁ బ్రతిఫలించునని సాంఖ్యమతము. వాదము కొఱకీ ప్రతిబింబసిద్ధాంతము యుక్తమైనదని యంగీకరించినను, మనము విజ్ఞానవాదములోనికిఁ బ్రవేశించుట లేదా? ఒక ప్రతిబింబమును గ్రహించుట, కేవల మానసికము కాని యథార్థవస్తువును దర్శించుట కాఁజాలదు. బాహ్యమున నున్న వస్తువునకు నంతరంగభావమునకుఁ గల సంబంధమెట్టిది? వీనికిఁ గార్యకారణసంబంధమున్న దన్నచో వీనికి సంపూర్ణముగా వేరైన లక్షణము లేమైనవి? చూచుట యనఁగా నెన్నఁడైనఁ గేవల చైతన్యపరివర్తన మగునా? చైతన్యమనఁగా నిత్యమైన

విషయవిజ్ఞానము కాదా? జ్ఞానము జ్ఞానవిషయమును రెండు వేరైన స్వతంత్ర సత్యస్వరూపములనుట వలన మనము సువిజ్ఞాతాంశముల నతిక్రమించి పోవుటలేదా? ప్రకృతి పురుషులు లేశమాత్రమైన సంబంధములేని వేరువస్తువులైనచో నప్పుడు మనకు విజ్ఞానవ్యాపారమునకుఁ గాని, భౌతిక ప్రవృత్తికైనఁగాని యవకాశమే యుండదు. ఇది అనవస్థాదోషమగును. కాని సాంఖ్యము తన సిద్ధాంతము నందలి దోషముచేఁ గలుగు నసంతృప్తిని గొన్ని యసంబద్ధములైన యుపమానములచే నాచ్ఛాదింప యత్నించినది. వ్యక్తియువిషయము నొండొరు లెదురైనపుడు, ప్రతిబింబవిధానము వలన వాని గుణములు, లక్షణములును వినిమయమొందును. వ్యక్తివిషయములు కొంత సమాన స్వభావములను గలిగి యుండకున్నచో నొక దాని నింకొకటి యెట్లు ప్రతిబింబింపఁగలదు? అచేతనమైన బుద్ధి పురుషునెట్లు ప్రతిఫలింపఁ జేయఁగలదు? వికారలక్షణ యుక్తమైన బుద్ధిలో నిర్వికారనిరాకారనిత్యసాక్షియైన పురుషుఁడెట్లు ప్రతిఫలించును? కావున నీరెండును బూర్తిగా లేశమాత్రసామ్యములేని విరుద్ధ విషయములు కాఁజాలవు. యోగసూత్ర విభూతిపాదచరమ శ్లోకము బుద్ధి పురుషునంత శుద్ధమైనపుడు మోక్షసిద్ధి నగునని చెప్పుచున్నది.౧. శుద్ధమైన బుద్ధి పురుషుని బంధింపఁజాలదు. బుద్ధి వినాశనమునకుఁ బూర్వము, శుద్ధబుద్ధిలోఁ బురుషుని ప్రతిబింబము కలుగును. ప్రకృతి పురుషుల యొక్కయు, వాని భేదమును గూర్చియుఁ బూర్ణజ్ఞానము బుద్ధివలననే కలుగును. ఎంత

(౧) సత్త్వపురుషయోః శుద్ధిసామ్యే కైవల్యమ్.

కాలము బుద్ధి స్వార్థపరమై, అహంభావకలుషితమై యుండునో యంతకాలము మనకు సత్యస్ఫురణము లభింపదు. దృష్ట్రుదృశ్య సంబంధరూపమైన జ్ఞానకారణమును సాంఖ్యము మనకుఁ జెప్ప లేనిదయ్యెను. జ్ఞానవిషయము జ్ఞానిపైనను, జ్ఞానిజ్ఞానము జ్ఞాన విషయముపైనను నాధారపడి యుండునని సాంఖ్యమంగీక రించును. అనఁగా రెంటి సమన్వయరహితమైన జ్ఞానము లేదు. వస్తువిషయ సంపూర్ణజ్ఞానము లేనిదే, వ్యక్తి తన్నుఁదాఁ బూర్తిగా నెఱుఁగఁజాలఁడు. విషయము వ్యక్తివలన వ్యక్తీకరింపఁ బడినఁగాని వ్యక్తి విషయము నెఱుఁగఁ జాలఁడు. అందుచే రెంటికి సంబంధము ముఖ్యముగాదా? రెండు నొకదాని కొకటి వేరు కాఁజాలవు. వస్తువు వేరనుభావము, మనము మనయను భవమునుండి బాహ్యకారణములను వెదకుటకు యత్నించుటచేఁ గలుగు చున్నది.

చైతన్యముయొక్క సహజరూపమును మనము దర్శించి యుండలేదు. అది జ్ఞానముచే ననుమానింపఁబడిన విషయము. అది శుద్ధచిత్స్వరూపమని చెప్పఁబడెను. సర్వజ్ఞాన సామాన్య లక్షణమును విడఁదీసి, రూపగుణకర్మలులేని పురుషుఁడనియుఁ జిత్స్వరూపమనియు నామకరణము చేయఁబడెను. దానినే శుద్ధ దృష్ట యనిరి. ఈదృష్టయొక్క విజ్ఞానములోని యంశములు నిత్యము మారుచుండును; ఈమార్పునకుఁ గారణము వస్తుప్రపంచ స్వభావమనిరి; ఈస్వభావమెట్టిదన, నిత్యపరివర్తనములో నేక త్వము గలది. మానసికావస్థలు, నింద్రియ విషయములు నన్నియుఁ బరిచ్ఛిన్నస్వభావముగల జడపదార్థములే. ఇవన్నియు

బాహ్యవస్తు ప్రతిబింబములై, వచ్చుచుఁబోవు చుండును; ఇవి సూక్ష్మపదార్థములుగా నున్నవి. బుద్ధివికారరూపము లన్నియు నీబాహ్యప్రపంచ వస్తురూపజాతికిఁ జెందిన వయ్యును, బుద్ధి సూక్ష్మతరమును, నధికసాత్త్విక లక్షణయుక్తము నగుటచే బురుషుఁడు బుద్ధినే ప్రకాశింపఁ జేయును. ప... యితరవస్తువులకంటె బుద్ధి, పురుషునికాంతి ప్రతిఫలించుట కెక్కుడర్హతను గలిగి యున్నది.(౧). జ్ఞానము విషయములో, మనము బుద్ధివికారముల వల్లనే యితర వస్తుజాలమును దెలిసికొందుము. ప్రతి జ్ఞానక్రియ యందును దానినిఁ బ్రకాశింపఁ జేయు చైతన్యమును, నచేతనమయ్యుఁ, బురుషదత్త కాంతిచేఁ జైతన్యమునఁ బ్రతిఫలించు బుద్ధివికారమును గలవు. బుద్ధి సంచలనములు స్వయముగా నచేతనములు; కాని యవిపురుష సంపర్కముచే వ్యక్తియొక్క సమన్వయసిద్ధి నందిన యనుభవములగు చున్నవి. ఒకటి మార్పులేనిది, యొకటి మారునదియు నగు రెండంశములు మన యనుభవములో నున్నవి; అవి పర

(౧) స్థూలపదార్థమందు, తమోగుణమున కనుగుణముగా ద్రవ్యము రజోగుణమున కనుగుణముగా శక్తియు (Mass and Energy) ప్రధాన లక్షణములై యున్నవి బుద్ధియందుఁ దమోగుణమత్యల్పము,సత్త్వమత్యధికమునై యున్నవి; అందుచే నది ప్రతిఫలించు స్వచ్ఛతగలది, బుద్ధియందుఁ గేవల సత్త్వరజస్సులు మాత్రమే యున్నచో నేకకాలమందు సర్వవిషయములు వ్యక్తములు గావలసి యుండును. తమస్సుగూడ నుండుటచే నట్లు జరుగుట లేదు. తమస్సెచటఁ దొలగింపఁబడునో యచట చైతన్యకాంతి ప్రతిఫలించును, ఒక విధముగా బుద్ధియందు సర్వజ్ఞానము నిహితమై నిగూఢమై యున్నది.జ్ఞానావిష్కృతిరజో గుణనిర్మూలనముపై నాధారపడి యుండును.

స్పరసంబంధము లేని పృథగ్వస్తువులనియు ననుభవములో నేకత్వ మునందు చున్నవనియుఁ జెప్పవీలు లేదు. జ్ఞానభాగములగు వ్యక్తియు విషయమును స్వయంసంపూర్ణములనుట, యేకము నవిభాజ్యమునగు సత్యమను వస్త్రమును ఖండము లొనర్చి, యవి వేరు వస్తువులనుట వంటిదే యగును. పురుషుఁడాత్మయుఁ బ్రకృతియనాత్మయు నైనచో వాని నిర్వచనార్థము ననుసరించియే, యవి యితరేతరవిరోధములు, సంబంధశూన్యములు నగును; వానిసంబంధము కేవల జడాత్మకమని సాంఖ్యము చెప్పుట యుక్తమే. వ్యక్తివిషయములకు జడసంబంధమున్న దనఁగా, నవి భిన్నసంఖ్యారూపములగుటయే కాక, పూర్తిగా వేరైన స్వతంత్రవస్తువులన్న మాట. బుద్ధియొక్క యచేతనవికారములుఁ గడువిచిత్రముగా నింద్రజాలములోవలెఁ జైతన్యముచేఁ బ్రకాశవంతములగుచున్నవి. చేతనాత్మకమైన జ్ఞానకారణము మనకిచట సరిగా నిరూపింపఁబడలేదు ౧. అచేతనవికారము కలిగినపుడు చైతన్యప్రకాశమెట్లుదయించుననునది క్లిష్టమైన సమస్యయై యున్నది. కాని యీసమస్యను సృజించినది మనమే. అనుభవ సీమకు బాహ్యములై యెట్టిసంబంధమును లేని వ్యక్తులను విషయ ములను మొట్టమొదట మనము కల్పించి, వానికనుభవములో

(౧) పోల్చు. "అచేతనమగు నహంకారము స్వయంజ్యోతియగు నాత్మను వ్యక్తమొనర్చుననుట నుసిమైనబొగ్గు సూర్యునివ్యక్తమొనర్చుననుట వంటిదేయగును."

"శాంతాంగారా, ఇవాదిత్యమ్ అహంకారో జడాత్మకః
స్వయంజ్యోతిషమాత్మానమ్ వ్యనక్తీతినయుక్తిమత్,
యామునాచార్యులు: ఆత్మసిద్ధి: రామానుజభాష్యము ౨, ౧, ౧.

సంపర్కముచే కూర్పఁబరిక్రమించుచున్నాము. ద్రష్టయు దృశ్యమును నొకేచైతన్యానాంతర్గతాంశములులేక జ్ఞానాంశములనునది యథార్థతత్త్వము ప్రకటించు విషయము. ద్రష్టయు దృశ్యమును వేరైయుండి సమీపించి సంపర్కము పొందుటలేదు; అవి నిజముగా నవినాభావసంబంధముగలవి. అనుభవమే మనకు నిజమగు సాక్ష్యమైపలికినచో, ద్రష్టృదృశ్యము లేకసత్యాంశములేయని చెప్పను. మనవిజ్ఞానమయ జగత్తులోఁ బనములు పరస్పరాశ్రియ భూతములైకాని, యేదేనొకసామాన్య లక్షణముచే నన్యోన్యాశ్రియ సంబంధబద్ధములై యుండునట్లే ద్రష్టృ దృశ్యము లన్యోన్యము నవినాభావసంబంధములు గలవై యున్నవని గుర్తించిననే కాని, జ్ఞానమున కవకాశమే లేకుండఁ బోవును. సర్వవిజ్ఞానమునకు మూలాధారమైన చైతన్య మున్నదను విషయము ప్రధానమైన సత్యము. సాంఖ్య తత్త్వములోని పురుషుఁడు విశ్వచైతన్య రూపమైన యాత్మస్వరూపమనియు, మనస్తత్త్వమునకు నాధ్యాత్మికతత్త్వమునకుఁగల భేదములను గుర్తింపని కారణముచే నీ విశ్వాత్మయే యేకమయ్యు ననేకముగా గ్రహింపఁబడుచున్నదనియు గమనింపవలసియున్నది. ప్రతిజీవునియం దీవిశ్వాత్మ స్వరూప మంతర్గతమైయుండి పనిచేయుచున్నది. ఒకవిధముగాఁ జెప్పుచో, మనజ్ఞానమంతము నీ యాత్మయొక్క స్వరూప వ్యక్తీకరణమే; కాని యింకొకవిధముగాఁ జూచినచో, బాహ్య వస్తువుల వేదనలచే నింద్రియములద్వారమున నిది యుదయించు నని చెప్పవలసియుండును. అందరిలో వికసించి ప్రకాశించు బుద్ధి

శక్తి యొకటే; అది వ్యక్తిగత పరిమితావధులనుండి విడివడి విముక్తముగాఁ దహతహలాడుచున్నది; ఈపరితాపము వ్యక్తిగతమైన దృక్పథమునుండికాక, యొక శుద్ధద్రష్టయొక్క దృక్పథమునుండియే కొనసాగుచున్నది. ఒకవిధముగా మన జ్ఞానము పూర్తిగావ్యక్తిగతమైయుండఁగా, నింకొకవిధముగా నదివ్యక్తులందర కతీతమై ప్రకాశించుచున్నదని తెలియవలెను.

## ౧౬ — ధర్మశాస్త్రము.

దుఃఖము సర్వప్రాణిలక్షణ[౧]మను భావముతో సాంఖ్య మారంభమగుచున్నది; ఇది మూఁడువిధములు. (౧) ఆధ్యాత్మికము లేక ఆంతరంగికము; (౨) ఆధి భౌతికము లేక బాహ్యప్రపంచజన్యము; (౩) ఆధిదైవికము లేక అతిమానుషశక్త్యుద్భవము. దైహిక మానసికాశాంతిచే జనించు క్లేశము మొదటి వర్గములోనిది; మానవపశుపక్ష్యాదుల వలనఁ గలుగునది రెండవరకము; గ్రహమండల భూతాధిదైవతముల వలన నేర్పడునది మూఁడవది.[౧] ప్రతివ్యక్తియు దుఃఖము నణచివేసి వీలైనచో నిర్మూలింపవలెనని యత్నించును. కాని ఆయుర్వేద ప్రక్రియలవలనఁ[౩]గాని, శాస్త్రసాధనముల వలనఁగాని, దుఃఖనాశనము గాదు. వైదికకర్మాచరణమాత్రముచే మోక్షసిద్ధిలేదు. బౌద్ధజైనమతములవలెనే, వైదికకర్మకాండ ధర్మసూత్రభంగ మొనర్చునని సాంఖ్యమతమును బ్రకటించి యున్నది.అగ్ని

(౧) సాం॥ ప్ర॥ సూ॥ ౬,౬-౮; యో॥ సూ॥ ౨, ౧౫.

(౧) తత్త్వకౌముది, పు ౧.

(౩) సాం. కా. ౨.

ష్టోమాదియాగకర్మలలోఁబశువధవలన నహింసానియమోల్లంఘనము జరుగుచున్నది. యజ్ఞమందైనను హింస పాపహేతువే యగును. మఱియు యజ్ఞకర్మచే లభించు స్వర్గముకూడ ననిత్యమైనదే. స్వర్గజీవితమైనను గుణత్రయాతీతము కాదు. ధర్మానుష్ఠానము వలనను, యాగాచరణములవలనను, మనము దుఃఖదినమును ముందుకు నెట్టుచున్నామే కాని నాశనమొనర్చుట లేదు. జన్మదోషములను మరణమైనను దొలగింపఁజాలదు; ఏలన జన్మాంతరములలోనైన నీదోషములు పునరావర్తములగుచుండును. క్లేశములాత్మ సహజగుణములైనచో వాని వలన మనకు విముక్తి యెన్నఁడును లేదు. అవి కారణాంతరసంభవములు ననిత్యములు నైనచో దుఃఖకారణములనుండి మనము విడివడుట వలన ముక్తి సాధనము గలదు.

బంధము ప్రకృతిగుణము; కాని పురుషునికారోపింపఁబడినది. "దుఃఖజ్ఞానము, కర్మాచరణరూపమగు వివేకావివేక లక్షణము చిత్తమునకు లేక నంతఃకరణమునకుఁజెందినదేకాని, దాని ప్రతి ౧. బింబమే పురుషునిసుఖదుఃఖానుభూతి యగుచున్నది." పురుషునిబంధము మిథ్యాకల్పితమే;౨ ఏలనఁ జిత్తసాన్నిధ్యమట్టి భ్రాంతినిగల్పించుచున్నది,అందుచేఁ బురుషుని బంధమౌపాధికము. పురుషునికి దుఃఖసంబంధమునిజమేయైనచో నదియెన్నఁడుఁబోదు; విజ్ఞానభిక్షువు కూర్మపురాణమునుండి3 యాశ్లోకార్థము

(౧) సాం. ప్ర. భా. ౧,౫౮.
(౨) వాణ్మాత్రమ్. సాం. ప్ర. సూ. వృత్తి, ౧,౫౮.
(3) ౨, ౨, ౧౨.

నుదాహరించినాఁడు;” స్వభావముచే నాత్మకలుషితము పరివర్తనాత్మకము నైనచో జన్మశతములనైన నాత్మకు మోక్షప్రాప్తి యసంభవము.” ౪. బంధమునకుఁగారణములు దేశకాలములుగాని, దేహకర్మలుగాని కావు, ౫, ఇవన్ని యునాత్మకుఁజెందిన వే. ఒకవస్తువుయొక్క గుణమింకొకవస్తువులో మార్పును గలుగఁజేయదు; అట్లు కలుగఁజేయు నెడల నందరకు సుఖదుఃఖములు సమానములుగావలెను,౬. స్వభావముచే నిత్యుఁడు శుద్ధుఁడు సర్వజ్ఞుఁడు ననంతుఁడునగు పురుషునికిఁ బ్రకృతిసంపర్కముచే బంధము కలుగు చున్నది, ౭ ప్రకృతియొక్క సామీప్యమాత్రమనుభవకారణము కాఁజాలదు; ఏలన ముక్తజీవికిఁ గూడ ననుభవమున్నది. “బంధకారణ మనుభవవిషయాస్తిత్వము; ముక్తావస్థలోనది లేదు.”౮. అవివేకమేబంధ హేతువు; అవివేకము బుద్ధికిఁ జెందినది. కాని యవివేక నిర్మూలనముతో మన దుఃఖనిర్మూలనమును సిద్ధించును. జ్ఞానాజ్ఞానములే మోక్షబంధములకుఁ గేవల కారణములుగా. పురు

(౪) యద్యాత్మా మలినోఽస్వచ్ఛో వికారీస్యాత్ స్వభావతః
నహితస్యభవేన్ముక్తి ర్జన్మాంతర శతైరపి. (సాం.ప్ర.భా. ౧,౭.)
పురుషునికి దుఃఖమేసహజమైనచో, దానిని నిర్మూలించుమనునుపదేశము నిరర్థకము. (సాం ప్ర. సూ. ౧-౮-౧౧)

(౫) సాం. ప్ర, సూ. ౧,౧౨-౧౬,

(౬) సాం, ప్ర. సూ, వృత్తి, ౧-౧౬. (౭) ౧. ౧౯.

(౮) సాం. ప్ర. సూ. వృత్తి. ౬,౪౪.

(౯) సాం. ప్ర. సూ. ౨-౭. తనసాం. ప్ర. సూ. వృత్తిలో ననిరుద్ధుఁడీభావమునుదాహరించినాఁడు.” వస్తుస్వభావముచే బంధమును, వస్స్వభావముచే మోక్షమునులేదు. రెండును విపరీతజ్ఞానజన్యములే” (౧-౭)

షుఁడు నిత్యముక్తస్వభావుఁడు. పురుషునకు రాగద్వేషములు, అధికారదాస్యములు, ప్రవృత్తినివృత్తులును లేవు. జన్మాంతరములలోఁ బరిచరించు సూక్ష్మశరీరములోఁ బుణ్యాపాపములు నిలచియుండును. దేహాస్తిత్వమే దుఃఖరూపము.(౧) అసంగమైన యాత్మ పరిశుద్ధమగును. పురుషుని పరిపూర్ణత నందుటయే జీవుని మహాయత్నమునకు లక్ష్యము. మనలో నంతర్వ్యాప్తియైయున్న పురుషుని సమగ్రముగా నెఱుఁగుటకే సర్వధర్మాచరణము తోడ్పడును. సంసారము విశేష క్లేశదూషితము, పరస్పరవిరుద్ధ పరిమితాంశాసంకలితము. దురంత సంసార పరిభ్రమణమునందు జీవుఁడెల్లప్పుడు ముక్తిపొంద యత్నించిన, విఫలుఁడగుచున్నాఁడు; నిత్యము నేకము, సంపూర్ణము,సంగరహితమునగు పురుషావస్థ జీవికి దుర్గమమగుచున్నది. ప్రతిజీవునియం దంతర్వర్తియై యుత్తమపురుష స్వరూపమున్నది; దానినిఁ దెలిసికొనఁగోరు జీవి వేరెచటికిఁ బోనవసరము లేదు;తన స్వస్వరూపమును గుర్తించుటయే చేయవలసినపని. ధర్మానుష్ఠానమనఁగా నూతనలక్షణ సంపాదనము కాదు; మఱచిపోయిన స్వస్వరూపమును దిరిగి స్మృతికిఁ దెచ్చుకొను పునరవలోకనమే. మోక్షమనఁగా నాత్మ స్వస్వరూప సంధానము పొందుటే; విభ్రాంతిచేఁ దాను గల్పించుకొనిన శృంఖలములఁ బెఱికివేయుటయే. మనదృష్టికిఁగలిగిన మిథ్యావరోధమును జించివేయుటే మోక్షము. 'నాస్మి' 'అది నేనుగాదు'; 'నమే' 'అది నాదిగాదు'; 'నాఽహమ్'

(౧) సాం. కా. ౫౫.

నేను జీవినిగాదని తెలిసికొనుటే మోక్షసిద్ధి యగును. ౨. మోక్షప్రాప్తి జ్ఞానము వలన లభించును గాని, జ్ఞానమనఁగా శాస్త్రపరిచయము గాదు. జ్ఞానము ధర్మయోగాద్యనుష్ఠాన ఫలితము.౧. విపర్యయము బంధకారణము; అవిద్యయు,నస్మితా భావము, రాగద్వేషాభినివేశములు విపరీతజ్ఞానము లోనివే.౨. దీనికిఁ గారణ మశక్తి; అశక్తి యిరువదెనిమిది తెఱగులు గలది; ఇందుఁ బదునొకండింద్రియములకును,౧౭దునేడు బుద్ధికిని జెందినవై యున్నవి.౩.స్వార్థరహిత ప్రవృత్తి మోక్షమునకుఁ బరోక్ష సాధనము;౪. దానంతటది మోక్షము నీయదు; అది పుణ్య లోకప్రాప్తి నీయవచ్చునుగాని యది ముక్తియని తలఁపరాదు.౫. విచక్షణ జ్ఞానముచే నుదయించు వైరాగ్యము తత్పూర్వవైరాగ్యమున కంటె శ్రేష్ఠమైనది.౬. వైరాగ్యము వలనఁ బ్రకృతి లయము సంభవించును.౭. ఈప్రకృతిలయావస్థయే పరమముక్తి కాదు. ప్రకృతిలయమందిన జీవులు, తమ దోషము లింకను జ్ఞానాగ్నిదగ్ధములు కానందున, నీశ్వరులై జన్మింతురు. "పూర్వ సృష్టిలోఁ గారణరూపమైన ప్రకృతిలో లయమందిన జీవి పర

(౨) సాం. కా. ౬౪.
(౧) ౩, ౭౭-౭౮.
(౨) సా॥ ప్ర॥ సూ॥ సాం॥ ప్ర॥ భా॥ ౩, ౩౭.
(౩) సాం॥ ప్ర॥ సూ॥ ౩, ౩౮, సాం. కా.౪౦.
(౪) ౧, ౮౨; ౮౫
(౫) సాం॥ ప్ర॥ సూ॥ ౩, ౫౨-౫౩.
(౬) వైరాగ్యమారువిధములుగాఁ జెప్పఁబడెను.(తత్త్వకౌముదిపు.౨౩)
(౭) వైరాగ్యాత్ప్రకృతిలయః (సాం.కా.౪౫; సాం॥ప్ర॥సూ॥౩,౫౪)

సృష్టిలో నాదిపురుషుఁడగు నీశ్వరుఁడై, సర్వజ్ఞుఁడై, సర్వకర్తయై జన్మించును.[౮] నీతివిహితజీవితము నిగూఢజ్ఞానము నిచ్చును; దోషదూషితజీవనము జ్ఞానము నాచ్ఛాదించును. అవినీతిపరివర్తనమువలన జీవియధికముగా దేహపాశములచేఁ గట్టువడును. సాంఖ్యకారికలోఁగంటె, సాంఖ్యసూత్రమునందు యోగాభ్యాసమున కధికప్రాముఖ్య మొసఁగఁబడినది. మన యాహారవిహారములు, భావనాప్రవృత్తులు పూర్తిగానిగ్రహింపఁ బడినప్పుడే వివేకవిలసితమగు జ్ఞానము సాధ్యమగును. ఇంద్రియములు నియతములై, చిత్తము శాంతినొంది, బుద్ధిస్వచ్ఛమైనప్పుడు పురుషుని జ్యోతి యందుఁ బ్రతిఫలించును. బుద్ధిసహజముగా సాత్త్విక సంపత్తికలదైనను; వివిధవాసనావాసితమైన కారణమున నైజస్వచ్ఛతను గోల్పోయినది. బాహ్యవస్తుసంసర్గముచేఁ జిత్తమునకు సంక్రమించిన మాలిన్యము ధ్యానముచే క్షాళితమగును.[౧] చిత్తము స్వీయస్వచ్ఛతను సంపాదించి, కామవిదళన మొసర్చినపుడు బాహ్యవస్తువులు రాగద్వేషములను జేకెత్తింపఁజాలవు. వస్తువులు మనయందు మమకారము నుదయింపఁజేయ లేనప్పుడు వాని నిజస్వరూపము మనకుఁ దెలిసి,యాత్మశాంతి లభించును.

---

(౮) సాం॥ ప్ర॥ భా॥ 3, ౧౬. వాచస్పతి బంధములు వివిధరూపములను వివరించెను; ప్రాకృతికము, వైకృతికము, దాక్షిణకము. మొదటి వర్గము ప్రకృతి సర్వశక్తియనియు,రెండవవర్గము ప్రకృతిసంజాతవస్తుజాలము సర్వశక్తియనియు, దలఁచును. మూడవవర్గము స్వార్థఫలితములకై పరశక్తిని విస్మరించును (తత్త్వకౌముది పు॥ ౪౪; తత్త్వసమాసము పు. ౧౯.)

(౧) సాం॥ ప్ర॥ సూ॥ 3, 3౦; సాం॥ ప్ర॥ భా॥ 3, 3౦.

ఇట్టిపరిపూర్ణ నిస్సంగత్వము సామాన్యులకు సులభసాధ్యము కానందున, కళానైపుణ్యముచే నిర్మమదృష్టి నభ్యసింప యత్నింతుము. కాని కళారాధనము ప్రకృతిసంగమును దాత్కాలికముగా మాత్రమే పోఁగొట్టును.

గుణత్రయ(౧) సిద్ధాంతములో విపులధర్మార్థ మిమిడి యున్నది వానిలోఁగల గుణపరిమాణభేదములనుబట్టి లోకము లోని జీవులు వర్గీకరణముచేయఁబడెను. దేవతలలో సత్త్వగుణ, మతిశయమై రజస్తమోగుణములు కృశించియుండును. దేవత లలోఁగంటె మనుజులలోఁ దమోగుణమధికమై యుండును. జంతుజాలములో సత్త్వగుణము చాలహీనమైయుండును. వృక్ష జాతిలోఁదమమితరములలోఁగంటె నిబిడమైయుండును. ఉన్నత జాతికిఁబోవుకొలఁదియుసత్త్వగుణమభివృద్ధిగాంచి,తమోగుణము సన్నగిల్లుచుండును.దుఃఖము రజోగుణముయొక్కయొకవిధమగు వికారము; (౨). సరిగాఁజెప్పుచో. నీమూడుగుణములునుమనలో బ్రత్యణువునందును గలిసిమెలసి పనిచేయుచుండును. అవి యేపరి మాణములలోఁ గలిసియున్నవో వానినిఁబట్టి, మనశీలస్వరూప మేర్పడును.ఉత్తమతత్త్వసంపదగలవారిని,తీవ్రశక్తిప్రతాపములు గలవారిని, మాంద్యపంకమగ్నులను జూచుచున్నాము. అతి శయముగానున్న తమోగుణమువలన మాంద్యము,నజ్ఞానము, దైన్యము, అలసత. అవిశ్వాసము,క్రియావైముఖ్యము మున్నగు

---

(౧) సాంఖ్యములోని గుణములచేతనములు; వేదాంతములో నవిప్రజ్ఞా లక్షణములను సూచించును

(౨) దుఃఖమ్ రజఃపరిణామవిశేషః।

నవిజనించును. మందుఁడు, జడుఁడు, మూర్ఖుఁడునైన మానవ స్వభావముతమోగుణసంజాతము.రజోగుణాధిక్యముగల వ్యక్తులు చపలులు, శాంతిహీనులు, నిత్యక్రియోత్కంఠులు నగుదురు. సవిమర్శము,సౌమ్యము,ప్రజ్ఞావిలసితమునైన స్వభావము సత్త్వసంభూతము. మానవులందరలో నీమూడుగుణములు వివిధ పరిమాణములలో మిశ్రమములైయుండునుగాని, యోగులయందు, భక్తులయందు, జ్ఞానులయందును సత్త్వగుణమత్యంతాభివృద్ధి చెందియుండును. యుద్ధవీరుఁడు, రాజ్యాంగతంత్రజ్ఞుఁడు, కర్మశూరుఁడుమున్నగువారిలో రజోగుణమధిక తేజోవంతమై ప్రకాశించును. మనజీవితములోఁ బ్రిత్యణువునందీగుణత్రియముసమ్మిళితమైయుండునుగాని, వానికిఁ బ్రధానస్థానములుగూడనున్నవి; సత్త్వము మనస్సునందును, రజోగుణము ప్రాణములందును, తమోగుణము దేహమునందును విశేషముగావ్యాపించును. సాంఖ్యమతము యజ్ఞకర్మకు విశేష పుణ్యఫలము నీయదు. శూద్రులకు వేదపఠనాధికారమున్నది. గురువు బ్రాహ్మణుఁడే కానక్కఱ లేదు ; ముక్తపురుషుఁడెవఁడైనను సరే. మన పూర్వపుణ్యము ననుసరించి, గురుకటాక్షము లభించును.

౧౭—మోక్షము

సాంఖ్యతత్త్వమున మోక్షమనునది నిజముకాదు; ఏలనఁ బురుషుఁడు నిజముగాబద్ధుఁడు కాఁడు. బంధమోక్షములు, అవివేకవివేకముల ఫలితములై ప్రకృతిపురుషసంయోగవియోగములను దెలుపును. ౧. ప్రకృతి పురుషుని బంధింపదు;

(౧) సాం, ప్ర. సూ. 3-౭౨.

తన్నుఁదానే పెక్కువిధముల బంధించుకొనును. ౭. పురుషునకుఁ బుణ్య పాప ద్వంద్వములతో లేశమాత్రసంబంధమును లేదు. 3. వివేకహీనునకుఁ బ్రకృతిచూపు ప్రవృత్తిలక్షణమే బంధమును, వివేకవంతునకుఁ బ్రకృతిచూపు నౌదాసీన్యమే మోక్షమునైయున్నవి. ४. ప్రకృతి ప్రవృత్తిపరమైయుండఁగా, (బురుషునిప్రతిబింబము నది గ్రహించి, పురుషునిఁ దనఛాయచే నాచ్ఛాదించును. కాని పురుషునిలో దృశ్యమానమగుమార్పు లేక వికారము కేవలము మిథ్యామాత్రమే. ౫. పురుషునికి సూక్ష్మదేహసంబంధమే సంసారకారణము; ప్రకృతిపురుషులకుఁ గల భేదమునెఱిగిన జ్ఞానమువలన వాని సంపర్కవిచ్ఛేదమొనర్చుటే మోక్షమగును. పురుషుఁడు ప్రకృతి సంగములనుండి విడివడి, ప్రకృతివ్యాపారములను దనకారోపించుకొనుట భ్రష్ట వివేకమని గ్రహించును, పురుషుఁడు నిత్యనిస్సంగ స్థితిలోనుండగాఁ బ్రకృతి నివృత్తిమగ్నమైయుండును. ఆత్మయొక్క స్వస్వరూపమును మఱుగుపరచు వస్తుసంబంధ మున్నంతకాలము మోక్షప్రాప్తి లేదు. ప్రకృతి ప్రవృత్తిరహితమైనచో, బుద్ధివికారములు కట్టువడును; అప్పుడు పురుషుఁడు సహజస్థితిలోఁ బ్రకాశించును. ౧. ముక్తపురుషుని విషయమఁలో బ్రథా

(౭) సాం. కా. ౬-౭.
(3) సాం. ప్ర. సూ. 3-౬४; యో. సూ. ౭-౨౭
(४) సాం. కా. ౬౨.
(౫) సాం. ప్ర. ౨,౮.
(౧) సాం॥ ప్ర॥ సూ। ౨,3 ४; యో. సూ. ౨, 3.

నము సృజించుట మానుననగాఁ బురుషుని కనుభవకారణోత్పత్తి లేకుండును; అనగా జన్మరూపమైన యుపాధిపరివర్తనము తొలఁగి పోవును." ౨. ముక్తిపొందినపురుషుఁడు సంసర్గహీనుఁడై, తనకు వేరైయున్న దాని నెట్టిదానిని దర్శింపక, భావింపక యుండును. ౩. అట్టిపురుషునికిఁ బ్రకృతికాని ప్రకృతి జన్యములైన వస్తుసంతతికాని యెట్టిమోహమును గలిగింపవు; ఆతఁడొక భాస్వన్నక్షత్రమువలె, నిహలోకతాపత్రయములకు దూరస్థుఁడై ప్రకాశించును. బద్ధులకు, ముక్తులకు నిజముగా భేదములేదు; మోక్షమనఁగాఁ, బురుషుని దివ్యస్వరూప వ్యక్తీకరణమునకుఁగల యవరోధము దొలఁగించుటే. ౪. సమాధి సుషుప్తి మోక్షావస్థలలో బుద్ధి వికారములన్నియు లయమై పురుషుఁడు స్వస్వరూపములో నుండును. ౫. సుషుప్తిలోను, సమాధియందును, పూర్వానుభవ సంస్కారవాసనలుండును; మోక్షమందుండవు. ౬. వివేక రూపమగు జ్ఞానముకూడ మోక్షసిద్ధితో నశించును; ఏలన రోగమునుబోఁగొట్టి తానును దేహమునుండి బయటికిఁబోవు నౌషధమువంటిదే జ్ఞానము, మోక్షము దుఃఖవిముక్తియే కాని

---

(౨) ముక్తమ్ ప్రతిప్రధాన సృష్ట్యుపరమో యత్తద్భోగహేతోః స్వోపాధి పరిణామవిశేషస్య జన్మాఖ్యస్యానుత్పాదనమ్. (సాం. ప్ర. భా. ౬, ౪౪.)

(౩) ప్రకృతి వియోగో మోక్షః (హరిభద్రుఁడు),

(౪) సాం. ప్ర. సూ. ౬, ౨౦.

(౫) యో. సూ. ౧, ౪

(౬) సాం. ప్ర. సూ. ౫, ౧౧౭.

జీవితమంతయు దానితో నశించదు. మోక్షానాంతరము పురుషుని వ్యక్తిత్వమవినాశమై నిలుచునని విశ్వసించుటచేసాంఖ్యము నిరాశోపహతమైన మతముగాదు. ప్రకృతి ప్రవృత్తి యాగి పోయినపుడది మఱల నవ్యక్తస్థితిలోనికిఁబోవును. అప్పుడు పురుషులు దృశ్యములులేని ద్రష్టలు, ప్రతిఫలించుటకు వస్తువులు లేని యద్దములునై, ప్రకృతి కలుషములనుండి విముక్తినంది, శుద్ధచిత్స్వరూపములై, కాలాతీతములై ప్రకాశించుచుండును. మోక్షసిద్ధికలుఁగగానే, "పురుషుఁడచలుఁడు, స్థితప్రజ్ఞుఁడు, ప్రకృతివ్యాపారములకు సంగరహిత సాక్షీభూతుఁడై విలసిల్లును."౧, సాంఖ్యుల మోక్షలక్ష్యము, బౌద్ధుల జీవనాశనము గాని, శూన్యస్థితిగాని,౨ అద్వైతవాదుల బ్రహ్మైక్యముగాని,3. యోగుల అతిమానుషశక్తి సంపాదనముకానికాదు.౪. మోక్షమానందరూపమునుగాదు; ఏలనఁ బురుషుఁడు సర్వగుణ విరహితుఁడు.౫ ఆనందమునుగూర్చి పలుకుశ్రుతివాక్యములకర్థమేమనగాఁ, దుఃఖవిమోచనమగుననియే.౬. పురుషుఁ డెంతవరకు సగుణుఁడో యంతవరకు ముక్తుఁడుగాఁడు.౭.

(౧) చూ. సాం. కా. ౫౯.

(౨) సాం. ప్ర. సూ. ౫, ౭౭-౭౯.

(3) సాం. ప్ర. సూ. ౫-౪౧.

(౪) సాం. ప్ర. సూ. ౫-౪౨

(౫) ౫-౭౪.

(౬) ౫-౭౪.

(౭) నిష్క్రియాత్మకమైన శాశ్వతధ్యానమగ్నతయే పరమకల్యాణమని తలఁచిన ఆరిస్టాటల్ భావమునకు సాంఖ్యభావముతో సామ్యము లేకపోలేదు.

జ్ఞానోదయమైనవెంటనే, పురుషునికిఁ బ్రకృతిబంధము పోయి మోక్షములభింపదు. కారణమేమనఁ బూర్వకర్మానుభవవాసనాబలమింకనునుండుటచే, కొంచెదికాలము కర్మావసరముండును.౮. కాని శరీరమప్పుడవరోధముగానుండదు. ప్రారబ్ధకర్మబూర్తియగు వఱకు దేహముండునుగాని, నూతనకర్మలెవ్వియుబంధింపవు. జీవన్ముక్తుని కెట్టియువివేకము లేకున్నను,గతసంస్కారవశమున దేహముండును.౯. బంధవిముక్తియు, దేహస్థిత్వమును విరోధములుగావు; ఏలన వాని కారణములు వేరు. మరణముతో జీవన్ముక్తుఁడు సంపూర్ణసిద్ధినందును,దీనినే విదేహకైవల్యమందురు.౧౦జీవన్ముక్తులు మనకుమోక్ష స్వరూపసాధనములనుపదేశింతురు. ౧౧. ప్రకృతినాటకవిరమణముతో నిఁకఁ జూచుటకేమియునుండదు గావునఁ బురుషుఁడుద్రష్టకాఁడు; కాని ముక్తపురుషునికి సర్వలోకజ్ఞాన ముండునని చెప్పఁబడెను. ౧. ముక్తపురుషులకుఁ బరస్పరసంపర్కముండునో లేదో మనకుఁ తెలియదు. లక్ష్యముచూడఁగా వ్యక్తిత్వనాశనమేకాని, వ్యక్తివికాసమనితోఁచదు. ఇతరపురుషులతో సంబంధము లేక,ప్రకృతిసంగము లేశమాత్రమును లేని పురుషుని ముక్తావస్థ రాగక్రియావిరహితమైన స్థాణుస్థితిగాగోచరించును; జడత్వమునకు మోక్షమునకు భేదమున్నట్లు కన్పట్టదు. స్వభావముచేఁ బ్రకృతి

(౮) సాం. కా. ౬౭,
(౯) సాం. ప్ర. సూ. ౩,౮౨-౮౩.
(౧౦) ఛాందోగ్యోపనిషత్తు. ౮-౧౨-౧.
(౧౧) ౩-౭౯.
(౧) సాం॥ ప్ర॥ సూ॥ వృత్తి ౬, ౫౯.

ప్రవృత్త్యాత్మకమగుటచే నదియెన్నఁడు నిష్క్రియాత్మకము కాఁజాలనందున సాంఖ్యుల మోక్షసిద్ధాంతము యుక్తముగ లేదని ప్రశస్తపాదుఁడధిక్షేపించినాఁడు. ప్రకృతి యచేతనమైనచోఁ బురుషుఁడు సత్యమును దెలిసికొనెనో, లేదో యెట్లు గ్రహింపఁగలము ?౨. సాంఖ్యులననుసరించి, వస్తువినాశముండదనియు నవ్యక్తరూపమునే పొందుననియు నిశ్చయమైనయెడల, నజ్ఞాన రాగద్వేషాదులు పూర్తిగానశించునవకాశములేదు. అంతేకాక, ముక్తపురుషునం దీదోషములు తిరిగి తలలెత్తుట కవకాశము విశేషముగా నున్నది.౩.

౧౮—మరణానంతర జీవితము.

ఆత్మ అనాద్యనంత స్వభావముగలదని సాంఖ్యమత నిర్ణయము. ఆత్మ కనాదిస్థితిలేనిచో ననంతస్థితి యెట్లుండును. అందుచే నాత్మకాదిలేదు. ఆత్మలయొక్క నిత్యత నధికముగా గుర్తించినకొలఁదియు సృష్టికర్తయగు భగవంతుని యస్తిత్వము నంత తక్కువగా గుర్తింప నవసరముండును.౧. సాంఖ్యము ననుసరించి, ప్రకృతి పురుషభేద జ్ఞానలోపమే సంసార కారణ

(౨) "మనకొక యుదాహరణమున్నది. శబ్దము త్పత్తియై మనకు గోచరించిన వెనుకఁగూడ, మనబుద్ధియా శబ్దదృష్టినే కొంతకాలమువఱకుఁ గలిగి యుండును. అదేవిధముగా, మనకు వివేకజ్ఞాన ముదయించిన వెనుకఁగూడ స్వభావబలముచే నట్టిప్రయత్నమే చేయుచుండును. (ప్ర. ప॥ పు॥ ౭.)

(౩) ఉదయనుని పరిశుద్ధి. ౨, ౨, ౧౩; శాస్త్రదీపిక. పు. ౩౨౩).

(౧) మెక్ టెగార్టువంటి ప్రాజ్ఞులు కొందరు సృజనశక్తిహీనుఁడు దుర్బలుఁడునగు దేవుని యస్తిత్వమును నిరూపింపఁజూచిరి.

మైయున్నది. ఈ యజ్ఞాన మంతఃకరణముపైఁ దనసంస్కార మును ముద్రించుటచే ననంతరజన్మములో నీదోషమే యవిచ్ఛిన్నమై నిలుచును. జన్మాంతర దేహపరంపరలలో నవిచ్ఛిన్నమై యాత్రచేయు లింగదేహము, మనోబుద్ధ్యహంకారములు, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, పంచతన్మాత్రలు, పంచభూతబీజములు కలిగియున్నది. ఇట్టి పరికరములతోఁ గూడిన లింగదేహము బీజరూపమై స్థూలదేహము నుద్భవింపఁజేయును. చిత్రప్రదర్శనమునకు యవనిక యెట్లవసరమో, మన సత్త్వ నిర్మాణమున కీభూతతన్మాత్రలు, బీజములు నంతయవసరమై యుండును.౨. దృగ్గోచరముకాని యీ లింగదేహము, వివిధజన్మములలో జీవిచేసిన కర్మవాసనలను స్వీకరించును. జన్మాంతరములో నెట్టిదేహము కలుగవలెనో దాని నిదియే నిర్ణయించును. లింగదేహమే సుఖదుఃఖములకు నిలయము.3. లింగదేహము, పురుషుఁడుకాదుకాని, వ్యక్తియొక్క స్వరూపలక్షణముల నిర్ణయించును. అది సర్వసంస్కార నిల

---

(౨) సాంఖ్యకారిక, ౪౧, కేవలమనోబుద్ధ్యహంకారములు చాలునని చెప్పవీలులేదు ఏలన వీని కాధారమై యొకలింగదేహముండవలెను. స్థూలదేహతసరము నీవాక్యములు ప్రతిపాదించునని కొందరు వాదించిరి. ఈవాదములో సారములేదు; ఏలన జన్మాంతర పరివర్తనములో స్థూలదేహముపోయి, లింగదేహమే యవిచ్ఛిన్నమై పయనించును. అధిష్ఠానశరీర మనిమూడవదేహమొకటి యున్నదనియు, నదిస్థూలభూతముల సూక్ష్మాంశములచేఁ గల్పితమై, లింగదేహమున కాధారమగునవియు విజ్ఞానభిక్షువు తెలఁచినాఁడు. (సాం॥ ప్ర॥ భా॥ 3, ౧౨)

(3) సాం। ప్ర॥ సూ॥ 3, ౮.

ముము. లింగదేహము భిన్నపాత్రల నటించు నటునివంటిది. ప్రకృతికిఁగల సర్వవ్యాపిత్వలక్షణము దీనికుండుటచే నిట్టిశక్తి గలిగియున్నది. పురుషునకు లింగదేహసంయోగము దుఃఖకారణము, సూచనముకూడనై యథార్థజ్ఞానము కలుగునవందాక నుండును. తల్లిదండ్రులిచ్చిన దేహము చావుకోఁబోవునుగాని, లింగదేహములు నిత్యములైయుండును.౧. లింగస్థూల దేహసంయోగము జన్మకారణము; వానివియోగము మరణము. ముక్తపురుషులవిషయములోఁ గాక, లింగదేహ పునర్జన్మములు యుగాంతమువఱకునుండి, యనంతరము లయశాంతుల నొందును; కాని పునస్సృష్టి కాలములో లింగదేహము తిరిగి జన్మాంతరచక్రభ్రమణమందుచుండును.

స్థూల సూక్ష్మ దేహములు లేనిదే, భిన్న జన్మ రూప కారణములగు కర్మఫలములిచ్చు భావముల కవకాశముండదు౨ బీజాంకుర న్యాయరూపమైన యీ పరస్పరాధారవిధానమాది లేనిదనుటలో దోషములేదు.౩. బుద్ధ్యహంకార సూక్ష్మ స్థూల

(౧) సాం॥ కా॥ ౩౯.

(౨) సాం। కా। ౫౨. లింగదేహమునకును భావములకును కర్తకు విషయమునకుఁ గల సంబంధమున్నదని వాచస్పతియు నారాయణుఁడును భావించియుండఁగా, బుద్ధికిని దానియవస్థలకును గల సంబంధసామ్యమును విజ్ఞానభిక్షువు చెప్పినాఁడు.

(౩) సృష్టి మూఁడువిధములు: (౧) భౌతికసర్గము; ఇందు స్థూలదేహములు నాత్మలు నుండును. ఇందెనిమిది యున్నతజీవవర్గములు, పంచహీన జీవవర్గములు, వీనికి భిన్నమైన మానవవర్గమును గలిసి పదునాలుగువర్గములున్నవి; ఇవి మూఁడులోకములలో వ్యాపించియున్నవి. (౨) తన్మాత్రసర్గము

దేహ పరిణామమంతయు భౌతికపరిణామమే; దాని ఫలితమునుః భౌతికమే, కాని యిందుఁ గొన్ని ఫలితము లతిసూక్ష్మము లగుటచే బాహ్యదృష్టి కగోచరములు. ఈ భౌతికనిర్మాణమునకుఁ బురుషసంపర్కము కలిగినప్పుడు దేవమానవ పశువర్గములో నొక జన్మము ప్రాప్తించును.

ధర్మాధర్మములు ప్రకృతిజములైన యంతఃకరణలక్షణములు ౧. ఈ లక్షణములవలననే పరిణామచక్రములో నున్న భిన్నదశల కనుగుణములైన జీవుల దేహేంద్రియ నిర్మాణములు జరుగును.కర్మ సూత్రప్రవర్తనము బుద్ధిభావములపై నాధారపడి నడచును.౨. ప్రత్యాత్మ కొక దేహసంబంధముండి, పుణ్యవిశేషము ననుసరించి, నికృష్టోత్కృష్ట జన్మాంతరములు పదునాలుగును స్వీకరించి పయనించును.3. జ్ఞానహీనమైన కేవలేంద్రియ విషయలంపటమైన పశుజన్మమున కనుకూలమగు దేహముకాని జడములైన వృక్షలతాది జన్మరూపములుగాని మనకుఁ గలుఁగ వచ్చును. స్థావరజన్మమును మనకువలెయు ననుభవసాధనసీమ

---

ఇందు లింగదేహసృష్టి జరుగును. (3) ప్రత్యయసర్గము లేక భావసర్గము: ఇందు నాలుగువర్గములైన బుద్ధిప్రవృత్తులుండును. జ్ఞానమున కాటంకములు, జ్ఞాననాశనములు, తృప్తినొసఁగునవి, పరిపూర్ణతనిచ్చునవి.

(సాం॥ కా॥ ౫3; సాం॥ ప్ర॥ సూ॥ 3, ౪3.)

(౧) సాం॥ ప్ర॥ సూ॥ ౫, ౨౫; సాం॥ కా॥ ౪౫.

(౨) సాం॥ కా॥ ౪౦, ౪3, ౫౫,; భ॥ గీ॥ ౭, ౧౨; ౧౦, ౪, ౫. త్రివిధదేహ విషయమును చూ: ౫, ౧౨౪.

(3) సాం॥ కా॥ ౪౪.

గావచ్చును.౪. ఈ ప్రకృతిజములైన దేహములన్నియు నంత ర్వర్తియైయున్న పురుషు నాచ్ఛాదించునేకాని నశింపఁజేయఁ జాలవు.

౧౫—సాంఖ్యము నాస్తికతత్త్వమా?

ఉపనిషత్తులందును భగవద్గీతయందును సాంఖ్యసిద్ధాంత భావములన్నియు నొక మహనీయమైన యాస్తికతత్త్వమున కనుబంధముగా నెట్లు విరచింపఁబడినవో మనము చూచి యుంటిమి. సాంఖ్యమతములోని సృష్టిక్రమసిద్ధాంతమును, నిష్క్రియుఁడైన పురుషుని తత్త్వమును పౌరాణిక తత్త్వశాస్త్రము స్వీకరించినదికాని, ప్రకృతి పురుషులు సంబాధములేని పృథక్త్వమును గలిగియుండెనను విషయమును దోసిపుచ్చి, యవి యేకస్వరూపమగు బ్రహ్మపదార్థములోని భిన్నాంశములు మాత్రమే యని ప్రకటించెను. సాంఖ్యము మూలరూపములో 'ఆస్తికత'ను నిరూపించియుండలేదు. సర్వాధారమైన పరమాత్మ విషయములో నౌదాసీన్యమును, సంసారనిమగ్నమైన యాత్మ కవిద్యా సంబంధనిర్ణయము చేయుటలో నుపేక్షాభావమువలనను సాంఖ్యతత్త్వము బౌద్ధతత్త్వమును స్మరింపఁజేయుచున్నది. స్వచ్ఛ తార్కిక పరిశోధనమువలన జీవాస్తిత్వము యథార్థముకాదనుట కవకాశములేదని నిరూపించుటకే సాంఖ్యశాస్త్రనిర్మాణ ప్రయత్నము జరిగినదని తోఁచును.

సృష్టిసమస్యలోని క్లిష్టత గుర్తింపఁబడెను. స్వార్థమో పరోపకారమో సర్వకార్యములకు మూలోద్దేశమైయుండ

(౪) సాం॥ ప్ర॥ సూ॥ ౫౯, ౧౨.

వలెను. దేవునికి సర్వకామసిద్ధి యదివరకే గలదు. కావున స్వార్థమేమియు నుండనవసరము లేదు. దేవుని హృదయము స్వార్థలక్ష్యములచేఁగాని కామములచేఁగాని కలుషితమైనచో నాతఁడు బద్ధుఁడేయగును. ఆతఁడు నిత్యముక్తస్వభావుఁడే యైనచోఁ దిరిగి సృష్టిక్రియాపాశబంధములలోఁ దగుల్కొనఁడుగ దేవునికి బంధమును లేదు, మోక్షమును లేదనుట సహేతుక చర్చాధారములను మూలవిచ్ఛేదమొనర్చుటే యగును. జగత్సృష్టి దేవునిదయచే జరిగినదనుట పొసఁగదు: ఏలన సృష్టికిఁ బూర్వము జీవులకుఁ బోఁగొట్టుకొనవలసిన దుఃఖము లేదు. దేవుఁడు కల్యాణసంకల్పముకలిగి సృష్టిచేసినచో దుఃఖరహితులైన జీవులనే సృజించియుండును. జీవుల భిన్నప్రవర్తనముల కనుగుణముగాఁ గర్మఫలములనిచ్చుట కీశ్వరుఁడవసరమని చెప్పినచోఁ గర్మసూత్రమే యాపనిచేయఁగలదు గావున దేవుని యవసరము లేదు. ౧. మఱియుఁ జైతన్యవిలసితమగు శక్తి యచేతన వస్తూత్పాదనము చేయఁజాలదు. సృష్టికర్తయు ననంతస్వరూపియునగు నీశ్వరుఁడును, శాశ్వతములైయుండు పురుషులు పరస్పరవిరుద్ధ విషయములు. ఆస్తికత అమృతత్వము నందలి విశ్వాసమును సన్నగిలఁజేయును; ఏలన నాత్మలను సృజించు దేవుఁడున్నచో, నాత్మల కుత్పత్తియున్నది కావున నవి నిత్యములుకాఁజాలవు. విజ్ఞానావధుల కతీతపరిసంగము లొనర్చుట కిష్టములేని సాంఖ్యము దైవాస్తిత్వమును ఋజువు

(౧) సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౯౩-౯౪॥

(౧) సాం॥ వృ॥ సూ॥ ౫, ౧; తత్త్వకౌముది. పు॥ ౫౭.

చేయుటకువలయు ప్రమాణములు లేవని చెప్పను. ౨. విశ్వసింపఁదగిన ప్రత్యక్షసాక్ష్యముగాని, అనుమానజ్ఞానముగాని శ్రుతిప్రమాణముగాని యీశ్వరాస్తిత్వమును నిరూపింపఁజాలదు. దేవుఁడు లేఁడని నిరూపించునర్థములో సాంఖ్యము నాస్తికవాదము గాదు, దేవుఁడున్నాఁడనుటకు సరియగు హేతువులేదనిమాత్రమే యది చెప్పను. 3. ఈశ్వరస్తోత్రపరములగు శ్రుతివాక్యములన్నియు నిజముగా ముక్తపురుష ప్రశంసా వాక్యములే. ౪.

ప్రజ్ఞావాదమైన సాంఖ్యమతమందుఁగూడఁ ప్రాచీన వైదిక దేవతలు స్థానమునుసంపాదించుకొనిరి. కాని వారు నిత్యతా లక్షణయుక్తులుగారు. సృష్ట్యారంభమునందే ప్రకృతియొక్క భిన్నపరిణామ దశానిర్ణయమును జేసిన వ్యవస్థాపక రూపుఁడైన యీశ్వరత్వమును సాంఖ్యము కల్పించినది. శివుఁడు, విష్ణువు మున్నగువారు ప్రకృతిస్వరూపులని నిశ్చయింపఁబడిరి.౧. ప్రకృతియందణఁగియుండి యావిష్కృతినందుచుండు నీశ్వరభావమును సాంఖ్యమంగీకరించును.౨ మహదాదులతో సంగరాహిత్యము

(౨) సాం॥ ప్ర॥ సూ॥ ౫, ౧౨, పోల్చు డార్విన్. సర్వవస్తువులకాది రూపమైన సృష్టిరూపరహస్యమునుఛేదింపఁ బరిష్కారము మనకుఁదెలియదు. నామట్టుకు నేను దెలియదని చెప్పకొందును." (లైఫ్ అండు లెటర్సు ఆఫ్ ఛార్లెస్ డార్విన్.) (3) అది "ఈశ్వరాభావాత్" అనిచెప్పక, "ఈశ్వరాసిద్ధేః" అనియే చెప్పను.

(౪) సాం॥ ప్ర॥ సూ॥ ౫, ౯౫; 3, ౫౪-౫౬.

(౧) సాం. ప్ర. సూ. 3, ౫౭.

(౨) ప్రకృతిలీనస్య జన్యేశ్వరస్యసిద్ధిః (సాం॥ ప్ర॥ భా॥ 3, ౫౭.

నభ్యసించిన యాత్మలు ప్రకృతిలో విలీనత్వమంది, సర్వజ్ఞులు, సర్వకర్తలు నగుచున్నవి.3. మనము దేవుని కీలక్షణములను జెప్పుదుము. కాని ప్రకృతియెల్లప్పుడింకొకనిర యాజ్ఞావశవర్తియై యుండునని సాంఖ్యము గ్గడించుటచే నీ దేవతలుస్వతంత్రులుగారు.

పురుషుల జ్ఞానావసరముల కనుగుణముగాఁ బ్రకృతి పరిణామమెట్లు చేకూరెను? పురుషుఁడులేని ప్రకృతియేమియుఁ జేయఁజాలదు. ప్రకృతిసాహాయ్యములేని దే పురుషుఁడు ముక్తి పొందఁజాలఁడు. ప్రకృతిపురుషులు పూర్తిగా సంబంధశూన్యములని పలుకుటలో నర్థములేదు. పంగ్వంధ సహకారోపమానము యుక్తముకాదేలన; నిరువురు చేతనులగుటచేఁగలిసి యాలోచించఁగలరు. కానిప్రకృతి జడపదార్థము.౫ మఱియుఁ దుదకుఁ బురుషుఁడే ముక్తిపొందునుగాని. ప్రకృతికట్టిమోక్షము లేదు. ఆకర్షణ శిలాయః శలాకసంబంధమును సరిపోదు; ఏలనఁ బ్రకృతికి నిత్యపురుష సాన్నిధ్యము నిత్యపరిణామ హేతువగును." ప్రధానమచేతనము; పురుషుఁడుదాసీనుఁడు; మూడవశక్తి యేదియును లేదు; ప్రకృతిపురుష సంపర్కమెట్లును గలుగుట కవకాశము లేదు."౬ ప్రేక్షకులకు దర్శనమిచ్చి, నృత్యముచేయ నిరాకరించు నర్తకియొక్క యుపమానము సమంజసముగాదు.

(3) సర్వవిత్, సర్వకర్తా. (సాం॥ ప్ర॥ సూ॥ 3, ౫౬)

(౪) సాంఖ్య. ప్రి॥ సూ॥ వృత్తి. సాం. ప్ర. భా. 3, ౫౫; యో. సూ. ౪. 3.

(౫) శం. భా. ౨. ౨, ౭.

(౬) శం. భా. ౨, ౨, ౭.

తెలియక ప్రకృతి తాదాత్మ్యమును బురుషుఁడు పొందును. ఈదోషనివారణోపాయము దోషముకంటె నికృష్టమగుచున్నది. దోషము సంపూర్ణదోషానుభవమువలనఁ బోవునని చెప్పఁబడెను. ప్రకృతివ్యాపారములందు జుగుప్సకలిగినప్పుడు పురుషుఁడు ముక్తిఁగాంచునఁట!

పురుషాశయములకును బ్రకృతికర్మలకును సామరస్యమునుగూర్చుట సాధ్యముకాదని గుర్తించి యనంతరసాంఖ్యవాదులు ప్రకృతిపరిణామముయొక్క సక్రమచోదనము నీశ్వరుని హస్తములలో నుంచుటకుఁగల యాటంకములను దొలగించిరి.(౧) ఈవిధముగా వారు మూల సాంఖ్యతత్త్వము నభివృద్ధిచేసిరి. సాంఖ్యతత్త్వమునకు విశ్వవిశాలజీవిత మవసరము; అందుచే భిన్నపురుషులకు భిన్నకార్యకలాపములను నియమించిరి. ప్రకృతి పరిణామము నొక యఖండశక్తి నడపుచున్నదని వాచస్పతి భావించెను. ఈశ్వరాభావప్రకటనముచేసిన కపిలునిభావ మొక జీవితాభ్యాసమున కవసరమగు సూత్రమని విజ్ఞాన భిక్షువు తలఁచినాఁడు; దేవునిపై నధికముగా నాధారపడినచో విచక్షణజ్ఞానసంపాదనమున కాటంకమగును గావున నట్టి యీశ్వరునిపై నాధారభావమును నిరుత్సాహపఱచుటకే కపిలుఁడు నాస్తికభావమును బ్రకటించెనని యాతనియుద్దేశము. సాంఖ్యతత్త్వమున కీశ్వరాస్తిత్వావసరము లేదని చూపుటకు నాసికవాదమును బ్రకటించుటలో నధికప్రసంగమున్నదని

(౧) వాచస్పతి, విజ్ఞానభిక్షువు, నాగేశుఁడు. పోల్చు: వాచస్పతి; "ఈశ్వరస్యాపి ధర్మాధిష్ఠానార్థమ్ ప్రతిబంధాపనయ ఏవవ్యాపారః"

యూతఁడు పలికినాఁడు. జనసామాన్యభావమును ౨. దృష్టి పఱచుటకై సాంఖ్యము నాస్తికభావము నుగ్గడించెననియు, దుష్టులగువారు పవిత్రజ్ఞానమును సంపాదించుట కిష్టములేక వారి నపమార్గములోఁ బెట్టు నుద్దేశముకూడఁ గలదనియు నతఁడు కొన్ని వేళల సూచించినాఁడు. ౩. దేవునిఁగూర్చిన సాంఖ్యభావమున కాతఁ డర్థాంతరములఁ జెప్పినాఁడు. అనేకస్థలములలో ౧ విజ్ఞానభిక్షువు సాంఖ్యవేదభావములకు సామరస్యమును జూపయత్నించినాఁడు. ౨ సర్వవ్యాపియగు పురుషాస్తిత్వము నాతఁడంగీకరించెను. "ఆ సర్వజ్ఞుఁడైన పరపురుషుఁడు, సర్వపురుషసారమూర్తి, సర్వవేత్తయు, సర్వకర్తయునై, తన సాన్నిధ్యబలమాత్రమున నొక భారశిలవలె (load-stone) ప్రకృతి ప్రవృత్తికారణుఁడుగానున్నాఁడు" ౩. కాని తత్త్వనిర్మాణమునకుఁ బ్రధానమైనసమస్యను సంపూర్ణముగఁ జర్చించియుండ లేదు. తన సాంఖ్యమతప్రపంచమునకుఁ దత్త్వవిచార మనవసరమను విపరీతభావమునకది కారిమైనది.

(౨) అభ్యుపగమవాదము.

(౩) పాపినామ్ జ్ఞానలిబంధార్థమ్ (సాం. ప్ర. భా. ఉపోద్ఘాతం.)

(౧) సా॥ ప్ర॥ భా. ౧, ౧౨౨; ౫, ౯౧, ౬౫; ౬. ౫౨, ౬౬.

(౨) జగత్తునకుపాదానకారణమైన ప్రకృతి బ్రహ్మమునుండి యభిన్నమని చెప్పఁబడెను. ఆత్మలువేరు. (సాం॥ ప్ర॥ భా॥ ౧, ౬౯; ౩, ౫౬.

(౩) సహి పరఃపురుషసామాన్యమ్ సర్వజ్ఞానశక్తిమత్, సర్వకర్తృశక్తిమచ్చ. (సాం. ప్ర. భా. ౩, ౫౭; ౫, ౧౨.)

## ౨౦—సామాన్య పరిశీలనము.

ఎట్టి భిన్నవాక్యములలోఁ జెప్పఁబడినను, వానిరచయితలు దేశకాలములలో నెంతదూరస్థులైనను, ప్రాతిపదిక సమస్యలు పౌనఃపున్యముగా సంభవించుచుండుటను తత్త్వశాస్త్ర చరిత్ర నభ్యసించు జ్ఞానపిపాసి గాంచుచునే యుండును. సమస్యలుగాని, వానిసమాధానములుగాని స్వరూపములలో మార్పునొందవు; మార్పంతయు వానిప్రయోగమునందే కానవగును. అత్యంత ప్రకృతకీటకావస్థనుండి, పూర్ణవికాసమందిన మానవునివఱకుఁగల పరిణామ ప్రవాహములో నొకక్రమపరిణతిగలదని శాస్త్రీయపరిణామసిద్ధాంతమును గనుగొనుటలో, నీసిద్ధాంతములో నూత్నత యేమియును లేదు; ఏలన నీసిద్ధాంతభానముపనిషత్తులందును, గ్రీకుతత్త్వజ్ఞులైన అనాగ్జిమాండర్, హెరాక్లిటస్, ఎంపిడోకిల్సు మున్నగు రచనలలోనుగలదు; కాని నూత్నముగాఁ జేసిన దేమన వివరముల పరిశోధనము పరీక్షయు, నభినవశాస్త్రపద్ధతుల ననుసరించిన ప్రమాణ నిరూపణమునైయున్నవి. మానవమానసమునకొక ఘట్టములోఁ గలిగిన యనసరమును సంతృప్తిపరచిన సాంఖ్యసిద్ధాంత మొక తత్త్వనిర్ణయము; ఇది నాటితాత్త్వికలక్ష్యముల వాతావరణములోఁ గల్పితమైన దేకాని, యథార్థజగద్విషయ సాక్ష్యములపైనాధారపడిన పరిశీలనాఫలితముగాదు. ప్రకృతిపురుష ద్వంద్వమును, పురుషానేకత్వమును గలిగిన సాంఖ్యసిద్ధాంతము తత్త్వశాస్త్ర ప్రధానసమస్యకుఁ దృప్తికరమైన పరిష్కారము నొసఁగలేకపోయినది; కారణమేమనఁ బ్రకృతిపురుషుఁడు ననంతవ్యాప్తి గలి

గియు నితరపురుషులతో సంబంధములేనివాఁడై యుండెననిచెప్పఁ బడెను, ప్రకృతిపురుష ద్వైతభావము లోపభూయిష్ఠమైన తత్త్వముపై నాధారపడినది. ప్రకృతియుఁ బురుషుఁడును మన యనుభవసిద్ధసత్యములుగావు; అనుభవమున కర్థము చెప్పుటకై చేయఁబడిన యనుభవాతీత భావకల్పనములేయని మనము మొదటనే మనసునందుంచుకొను టవసరము.

పురుష సిద్ధాంతమువలన సాంఖ్యము వెల్లడించు మూల సత్య మేమనఁ జలనము, వేడిమి, విద్యుత్తులవంటి జడశక్తి, చైతన్యముగా నర్థము చేసికొనరాదనియే. కొన్ని నరముల కదలికకును గొన్ని చేతనప్రవృత్తులకును సంబంధమున్నదని మాత్రమే నేటి యత్యంతవికాసమందిన భౌతికశాస్త్రము స్థాపించిన విషయము. ఈముఖ్యమగు జడచేతన ప్రవృత్తి సంబంధమును విస్మరించుట యుక్తముకాదు. మానసికదశా పరంపర కతీతమై, వేరై ప్రకాశించునదే పురుషస్వరూపము. అట్టి పురుషుఁడు మన కనుభవాతీతుఁడు; భౌతికతత్త్వభావములోని కాతఁడు ప్రవేశించుట కవకాశములేదు. పురుషుని మనము సర్వభౌతిక పదార్థములనుండి వేరుచేసినచో, నప్పుడు పురుషునిఁ దెలియు సాధనసామగ్రి మన కేమియు మిగులదు. మనమప్పుడు పురుషుఁడక్షయుఁడు, నవిభాజ్యుఁడు మున్నగు వ్యతిరేకపదములతోడనే చెప్పుకొనవలసియుండును. "ఎట్టిచలనముకాని పరివర్తనముగాని లేక, పురుషుఁ డాత్మ స్వస్వరూపవిలసితుఁడ"ని మనము వచింపవలెను. భావనాశక్తియైనను మనమా పురుషునిగూర్చియూహింపవీలులేదు; శుద్ధచైతన్యమూర్తియని మాత్రమే చెప్పుకొనుట

కవకాశముండవచ్చును. మన భౌతికవ్యవస్థా ఫలితములగు మానసికదశా పరంపరలను బ్రకాశింపఁజేయుచు మనలో నంత ర్వర్తియై యున్న చైతన్యశక్తియే పురుషుఁడని భావింపఁబడెను. తాను దర్శించు ప్రకృతినాటక పాత్రలలో నాతఁ డొకఁడు కాఁడు. ప్రకృతికాంత తన కళావైదగ్ధ్యముతో నెవ్వనియాశయ సంస్ఫూర్తికై పనిచేయుచున్నదో యాతఁడు నాటకరంగముపై గోచరింపఁడు, కాని సర్వ వస్త్వస్తిత్వమున కాతఁడు మూలా ధారుఁడని మాత్రము చెప్పఁబడెను. మన మెఱుఁగునది పురు షుఁడు కాదు; జీవుఁడు, అనగా ప్రకృతి పరిచ్ఛిన్నుఁడగు పురు షుఁడు. మనము జూచు ప్రత్యాత్మయు దేహధారియైనయాత్మయే. పురుషుఁడు సంబంధశూన్యుఁడై వేరుగానుండి, ప్రకృతిజన్యము లైన వ్యక్తివిషయములతోఁ దాత్కాలిక సాహచర్య సంబంధ మునుమాత్రమే కలిగియున్నాఁడని చెప్పుటవలన, జీవైకత్వ మును మనము విచ్ఛేద మొనర్చినవార మగుచున్నాము. మనము మన నిత్యానుభవసిద్ధములైన సత్యాంశములను నిరాకరింప కున్నచో, వస్తు వ్యక్తిసంబంధ శూన్యమైన పురుషభావము కేవల భావకల్పితమైన గగనకుసుమ సదృశాస్తిత్వము గలదే యని స్పష్టమగును.

పురుషుల అస్తిత్వమును నిరూపించుటకు సాంఖ్యము చూపిన హేతువులు వ్యావహార జగజ్జీవాస్తిత్వమును నిరూ పించునవేగాని, పరమార్థజీవాస్తిత్వమును దెలుపవు. సాంఖ్య పురుషానేకత్వము దీనిని విశద మొనర్చును; పురుషుఁడొక్కఁడే యైనచో నాతనికిఁ జెందినబుద్ధికి భ్రాంతివిమోచనముకలిగిన

వెంటనే సర్వజగత్క్రమము పూర్తియగుననునది పురుషనానాత్వమును సమర్థించు ప్రధానకారణముగాఁ జెప్పఁబడెను. కాని నిజముగా నట్లుజరుగదు. కొన్నిజీవులు ముక్తిపొందినను, కోట్లకొలఁది బద్ధజీవులకొఱకు సృష్టిక్రియ మవ్యాహతముగా నడచుచునేయుండఁగలదు. పురుషు లనేకులుగాక నొక్కఁడే యైనచో భిన్నవ్యక్తులందరు నొక్కపురుషుని పుట్టుకతోఁ బుట్టి, వాని మరణముతో మరణించవలసియుండుననను వాదమును సహేతుకముగాదు; ఏలన, నిత్యుఁడైన పురుషునకు జనన మరణములున్నవని సాంఖ్యము పొరఁబడుచున్నది. జనన మరణము లేకముహూర్తమున సందరకు జరుగుటలేదు గావున, జీవులనేకములు భిన్నములునని మన మనుమానప్రమాణముచేఁ దెలిసికొనుచున్నాము. ఒకవ్యక్తి చూచునొకవస్తువు నితరు లేకకాలమునఁ జూచుటలేదు; కారణమేమనఁ బ్రతిజీవికొక ప్రత్యేకదేహమును, భిన్నలక్ష్యములు నున్నవి.(౧) వ్యవహార జగజ్జీవానేకత్వమునుబట్టి, పారమార్థికజీవానేకత్వమునుగూడ నూహించుటవసరము లేదు; కాని సాంఖ్య మట్లుచేసినది సాంఖ్య పురుషునకుఁ బ్రకృతితో నెట్టిసంబంధమును లేదు. పురుషునికి వ్యక్తిత్వముగాని, సృష్టిక్రియాసామర్థ్యముకాని మనమాపాదించుటకు వీలులేదు. పురుషులకెట్టి గుణములనారోపించుటయు నయుక్తమేయగును. పురుషుఁడు గుణరహితుఁడు, అవిభక్తుఁడు, అవినాశి; అచలుఁడు, నిష్క్రియుఁడు, సుఖదుఃఖాదిభావవికార శూన్యుఁడు. పరివర్తనశీలమంతయుఁ బ్రకృతి కేచెందును. పురు

(౧) స. ద. సా. సంగ్రహము. ౧౨, ౬౮-౬౯.

షులలో భేదముండుటకెట్టి యాధారమును లేదు. పురుషులందఱకుఁ జేతనత్వము, సర్వవ్యాపిత్వము, సమానమై, భేదము లేశమాత్రమును లేనప్పుడు, పురుషులనేకులనుట హేతువిరుద్ధము. భిన్నతాశూన్యమగు ననేకత్వమర్థరహితము. అందుచేతనే భాష్యకారులైన గౌడపాదాదులేక పురుషత్వ సిద్ధాంతమునందెక్కుడాదరమును సూచించిరి.౧. వస్తుభోక్తయొకఁడుండవలయును మనము గుర్తించినచో, నాత్మభోక్తయేకాని క్రియాశూన్యుఁడగు పురుషుఁడుకాఁడని స్పష్టమగును. వేఱురూపములు, జననమరణములు గేహాభాగ్యాదులు జీవానేకత్వమును జూపును. గుణత్రయావస్థలు ప్రకృతిరూపములే కావున, వానిననుసరించి పురుషానేకత్వము సిద్ధించదు. పురుషుల భోగమోక్షములకొఱకుఁ బ్రకృతి పనిచేయుచున్నది కావున ననేకపురుషులుండుటవసరమనుటయుఁ బొసఁగదు. పురుషుఁడొక్కఁడేయైనచో బుద్ధియు నొకటేయుండును. కాని శుద్ధపురుషుఁడన్యయుఁడు నుదాసీనుఁడు నగుటచే నిష్కాముఁడను మాటను మనము మఱువరాదు. నిత్యముక్తులైన శుద్ధపురుషులకొఱకుఁ బ్రకృతి పరిశ్రమించుటలేదు; పురుషుల అహంకారరూప ప్రతిబింబములకొఱకే ప్రకృతి వ్యాపారము. జీవనానాత్వమును గూర్చి వివాదము లేదు. మోక్షకాంక్షతోఁ బరితపించు లక్షణముగలవి వివేకశూన్యములైన జీవులు. ప్రకృతితో సంబంధము గలిగి యున్నవి జీవులు; జ్ఞానముచేఁ దెలియఁ బురుషుఁ డేకైకమాత్రుఁడునని మనముచూచిన

(౧) చూ॥ సాం. కా. ౧౧, ౧౮ ల పై గౌడపాదుఁడు

హేతువులన్నియు విశదీకరించును. నానాత్వము పరిచ్ఛిన్నతాలక్షణాయుక్తము; నిత్య ముక్త శుద్ధస్వభావముగల పురుషుఁడొక్కఁడేకాని పెక్కురుండఁజాలరు. ప్రకృతిపరిణామమునకు పురుషుని యవసరమున్నచో నొక్కఁడేచాలును.౧. తన సిద్ధాంతమును సమర్థించుటకనుకూలముగా నున్నదని సాంఖ్యము పురుషభావము నంగీకరించిదనువిషయము స్పష్టము. ప్రతిచేతనప్రక్రియ నొక సచేతనవ్యక్తికిఁ జెందును. మన యనుభవమంతయు నొకవిధముగా నాత్మానుభవమే. కాని పురుషునియనుభవము నాతని యాత్మనుండి యెట్లు వేరుచేయగలము? మనము మనఃప్రవృత్తులను మానసికవ్యక్తి నూహింపకుండ తిలకింపఁజాలము; కాని, యావ్యక్తి వాస్తవిక జగత్సంబంధములేని యొకసాక్షిమాత్రుఁడనియో, యే జగద్విషయపరంపరలకుఁ దాను సామరస్యముగూర్చునని చెప్పఁబడెనో, యావిషయములతో నెట్టిసంబంధమును లేని విశ్వసామాన్యసూత్రమనియో యూహించుట నిరర్థకము మన

(౧) గుణవిరహితములై, చిత్స్వరూపులై, సర్వవ్యాప్తియు వాగతీత కల్యాణరూపులైన యాత్మల నానాత్వమునుగూర్చి శంకరుఁ డిట్లు నుడివినాఁడు: "పురుషులందరు చిత్స్వరూపులు, ప్రకృతికి సాన్నిధ్యమున నుండు విషయములో వీరికి భేదములేదు; వీరియౌదాసీన్యమున కర్త యేకపురుషునకు సుఖదుఃఖసంయోగ మున్నచో నందరకుండితీరును." (శం॥భా॥ ౨,౩,౫౦) "సర్వవ్యాప్తిగల యనేకపురుషులున్నారని ఋజువుచేయుట దుస్తరము: ఏలన వానికి సరిపడు నుపమానములులేవు" (శం॥భా॥౨,౩,౫౩) అన్నియు సర్వవ్యాపకములగుచో నొకేస్థలమాక్రమించును.

మానసికానుభవ సామరస్యమునకుఁ గారణము పురుషసాన్నిధ్య వర్తిత్వమనుట పైవిషయమును దిరిగి చెప్పుటయు, గల్పిత కారణము పూర్వమున్నదనుటయు నగును. చేతనానుభవ సామగ్రినంతను దనలోనిముడ్చుకొను ప్రయాణపేటికవంటి వాఁడు కాఁడు పురుషుఁడు. సాంఖ్యతత్త్వమంతటిలోఁగూడఁ బురుషునకు జీవునకుఁగల భేదముగుర్తింపఁబడలేదు. పురుషుఁడవ్యయుఁడు, పరివర్తనశూన్యుఁడు, నిష్క్రియుఁడు, సంబంధహీనుఁడునైనచో, నాతనికి దోషములకు వశమైనకర్తృత్వ భోక్తృత్వములుండుట కవకాశములేదు. ఏలన నొకవిషయమున కతీతమైన విషయముతో సంబంధమిది. ౧. కాని యీ లక్షణములు ప్రకృతికిఁ జెందునవికావు; ఏలన నవి బుద్ధిగల వ్యక్తిలక్షణములు. అధ్యాసయనగా నొకచేతనవ్యక్తి యొక్క వస్తుగుణము లింకొకవస్తువునకున్నవని యారోపించుట. ఇచట జీవభావము వ్యక్తీకరింపఁబడినది. జీవులు పృథగ్వ్యక్తిత్వము గలవైయున్నవి; దేశ కాలాతీతమైన వేఱొకప్రపంచమున ననేకపురుషులున్నారను విషయమును నిరూపింపఁజాలము. పురుషుఁడు పరిపూర్ణచైతన్యము; మానవ చేతనత్వముతో నాతనిఁ బోల్చరాదు. పురుషుఁడు ప్రత్యేకవ్యక్తినైన నాలో మూలాధారభూతుఁడై నిస్సంశయముగా నున్నాఁడు; వ్యక్తిగత రాగద్వేషవశుఁడైన వుఁడు పురుషుఁడనుట శబ్దముల కవ ప్రయోగమగును. ప్రతిజీవియుఁ బురుషత్వప్రాప్తికై యత్నించు చున్నదనుట కర్థమేమనఁ బ్రతిజీవియు స్వస్వరూపములోఁ

(౧) సాం. కా. ౨౦-౨౧.

పురుషుఁడేయని తెలియవలెను; ప్రతిమానవుఁడు దైవస్వరూపమే.

ప్రకృతియు ననుభవమునుండి గ్రహింపఁబడిన యొక భావమే. వస్తు జగత్కారణము, నాధారమునైన యొకపదార్థమును మనము పరిచ్ఛిన్నభావముచే రూపకల్పనము చేసినదే ప్రకృతి. మన యనుభవజగత్తే వాస్తవికమైనచో, మనకెన్నఁడు తెలియుట కవకాశములేని శుద్ధవస్తురూపమే ప్రకృతి. ప్రకృతి యనగా నవ్యక్తమని చెప్పుటచే నీ లక్షణము విశదమగుచున్నది. వస్తువుల మూలాధారమైన రూపరహిత శుష్కత్వమే ప్రకృతి. వాస్తవికజగ ద్వస్తుజాల సామాన్యలక్షణముల కాకృతినొసఁగి ప్రకృతియనిరి. రెండు వ్యతిరేకగుణముల పరస్పరసంఘర్షణ రూపము ౧ ప్రతిభౌతిక మానసిక ప్రకృత్యంశమందునుగలదు; దీనివలననే ప్రకృతి వ్యాపారము జనించును. గర్భితమైన దావిష్కృతినొందుటే పరివర్తనమనఁదగినచో నొకరూపమా విష్కృతినొందుటకు వలయు నవరోధములతోఁ గలిగియుండు సంఘర్షణమేయని చెప్పనొప్పును. గుణత్రయమును సర్వవస్తువుల కవస్థాత్రయ లక్షణమునొసఁగును; గుణత్రయ సామ్యస్థితి యని చెప్పినప్రకృతి, సర్వవాస్తవిక జగద్రూపమే. మహాదేవుఁడు నుడివినట్లు, ప్రకృతియనగా గుణముల కాధారమగు నది కాదు; గుణత్రయస్వరూపమే.౨. గుణములు ప్రకృతిరూప

(౧) విషమత్వము, చూ. మైత్రాయణ్యుపనిషత్తు, ౫, ౨.

(౨) సాం॥ప్ర॥సూ॥ వృత్తిసారము, ౧, ౬౧. మఱియుఁజూడు ౬, ౩౯, పోల్చు. గుణాఏవప్రకృతిశబ్ద వాచ్యానతుతదతిరిక్తప్రకృతిరస్తి, (యోగ వార్తికము, ౨, ౧౮.)

ములుగాని, ప్రకృతిధర్మములుగావు; బుద్ధి పరికల్పితమైన భావమే, వ్యావహారికముగాఁ జూచినచో, సర్వవస్తువుల యొక్కయు ననంతబీజనిలయమైన అవ్యక్తమని తెలియఁగలదు.

సాంఖ్యుల ప్రకృతిగుణ వివరణమునుబట్టి, ప్ర[illegible]యుఁ దత్పరిణామమును పారమార్థికదృష్టితోఁ జూచినచో వాస్తవిక ములుగావని తోఁచును మూఁడుగుణములును సర్వవస్త్వవస్థా రూపములైయున్నవి. ప్రకృతిపరిణామములోఁ బ్రతిఘట్టము నందునొక మహాలక్ష్యము లేక సత్త్వము, దానిని సాధించు యత్నము లేక రజస్సు, జడత్వము లేక తమస్సునున్నవి. విజ్ఞాన భిక్షువు దృష్టిలో నివి కేవలభావకల్పనములుకాక, యథార్థలక్షణములే. ఇవిలేని వస్తువేదియునుండదు. సాంఖ్యము ననుసరించి, యివి సహజసంఘర్షణావస్థలోనున్నవి. ప్రకృతి వ్యతిరేక సామర్థ్యములుగలది. దానికిఁగ్రియాశక్తియుండుటేకాక, దానికి వ్యతిరేకమైన క్రియాశక్త్యవరోధక లక్షణమునున్నది. తమస్సు వ్యాపారమాంద్యమునుగలిగించుశక్తి. ప్రకృతిప్రవృత్తికాటంకమై, తమస్సుకూడఁ బ్రవృత్త్యాధారమగుచున్నది. త్రిగుణాత్మకమైన దొకయవస్థయేకాని వాస్తవికపదార్థముకాదు. త్రిగుణాత్మకమైన ప్రతివస్తువు నొకసంఘర్షణ రూపమే. తనకతీతమైనస్థితికిఁబోవ యత్నించుచున్న స్థిరాస్తిత్వములేదే యని మనమంగీకరించిన మాత్రమే, సత్త్వరజస్తమోగుణములు పరస్పర సంఘర్షణ ములోనున్నవనియునేక కాలమునందే యవివస్తుభాగములనియుఁ జెప్పవీలగును. ప్రకృతిజగత్తులో, నేవస్తువునకు సంపూర్ణతయు, సామరస్యమును లేదు; ఏలన నెల్లప్పుడేదోయొక గుణ

మతిశయించి యితరగుణముల నణఁచియుంచును. సత్త్వమే యున్నప్పుడైనను, దానివశమైయున్నప్పటికిని తమస్సుకూడ నుండును. ఒకదానినొకటి యతిక్రమించుటో, యొకదాని నింకొకటి యణఁచి పుచ్చుటో తప్పఁ బరిణామమనగా వేరొద్ది యును లేదు. కాని అణఁచిపుచ్చుటనగా నతిక్రమించుట కాదు. ఏయొకగుణముకాని తదన్యగుణముల నాశన మొనర్పఁజాలదు. సత్త్వరజస్తమోగుణములు వ్యతిరేకశక్తుల జయించియున్న స్వస్వరూపముగాని, యవిసామ్యస్థితిలో నున్న స్వరూపముగాని మనకు గోచరించు విషయముగాదు. ప్రళయకాలమున నవి పరిపూర్ణ సామరస్యములో నుండునని చెప్పుదురు కాని యది యథార్థము కాదు; ఏలనఁ బ్రళయవేళఁ బ్రకృతి సమ్యక్సంఘర్షణావస్థలో నుండునని చెప్పఁబడెను. ప్రకృతికి మూడుగుణములున్నవి; మూడును సమబలాన్వితములే; అందుచేఁ బరిణామము లేదు. ఏయొకగుణమో బలవత్తరమైనపుడు మాత్రమే పరిణామ మారంభమగును. సామ్యస్థితి లేనంతకాలము పరిణామ మవిచ్ఛిన్నగతిలో నుండును. గుణత్రయపరిపూర్ణ సామ్యావస్థ గల సిద్ధిని సాంఖ్య మూహించియుండలేదు. అది నిజముగా నొక సందిగ్ధావస్థ; ఈ యవస్థలోఁ బ్రకృతికిఁ బ్రవృత్తియు లేదు. నివృత్తియును లేదు. సహకారశూన్య శక్తులు పూర్ణవిరోధములై యున్నవి. అది సాధ్యమును సూచించదు; అసాధ్యముయొక్క యవధిని సూచించును; ఇందు సాధ్యములు పరస్పరవిరుద్ధములుగా విభాగింపఁబడినవి. ఏవిధముగాఁ జూచినను బ్రకృతిలో నేకత్వముగాని సామరస్యముగాని చూపట్టదు. భిన్నభావముల

కైకత్వమును ఘటించు సర్వసామాన్య లక్షణముకాని, వాని నన్నిటినిఁ దనలోఁ గలుపుకొను నేకస్వరూపముగాని దానికి లేదు. అది గుణత్రయ సంఘర్షణావస్థయే. ప్రకృతిరంగమున కొక యర్థమునిచ్చి, యొక క్రమమును గూర్చుటకుఁ బురుషుని యవసరమున్నది. పురుషుని సాన్నిధ్యప్రభావము వలనఁ బ్రకృతి యొక్క సంఘర్షణావస్థ తొలఁగి, యేదో యొక గుణ మితర గుణముల నణఁచిపుచ్చి యాధిపత్యము వహించును. పరిపూర్ణావస్థ యెన్నఁడు నుండదు. గుణముల మధ్యమందు సామరస్యము నసాధ్యము. ప్రకృతి ప్రపంచము స్వయంసంపూర్ణముగాదు. దానిగుణములు దాని స్వవిరుద్ధలక్షణమును సువ్యక్తమొనర్చు చున్నవి. పరిపూర్ణతలేక సత్యస్వరూపమునందు గుణవైరుధ్యము తొలఁగుటయో యతిక్రమింపఁబడుటయో జరుగును గావున, నట్టి లక్షణము ప్రకృతిలో లేనందుచే నది యథార్థమైనదిగాదు ప్రకృతిపరిణామమునకుఁ దుదిలేని లక్షణమువలననే యది పారమార్థికముగా సత్యముగాదని స్పష్టమగుచున్నది. అద్వైత వేదాంత మీ విషయమును గుర్తించియే, ప్రకృతిజగత్తు మాయాస్వరూపమని నిశ్చయించెను.

ప్రకృతిపురుషుల కెట్టిసంబంధమును లేదను సాంఖ్యవాద మును మనమంగీకరించినచో నప్పుడు ప్రకృతి పరిణామమున కవకాశము లేదు. గర్భితశక్తులు, చేతనుని చోదనము లేని దే యెట్లు పరిణతినందఁగలవో మనకుఁ దెలియదు. వివేకలక్షణము లేనిచోఁ బ్రవృత్తియుండదని సాంఖ్యమే చెప్పుచున్నది. "సాంఖ్యుల మూఁడుగుణములును సామ్యావస్థలోనున్నప్పుడు

ప్రధానమందురు. ప్రధానముకాక వేరుగాఁ బ్రధానమునకుఁ గ్రియాశక్తి నిచ్చునదిగాని, ప్రధానము యొక్క ప్రవృత్తినణఁచి వేయునదిగాని యేదియును లేదు. పురుషుఁ డుదాసీనుఁడు; ప్రవృత్తి ప్రకృతికిఁ గలిగించుటగాని ప్రకృతికిఁగలప్రవృత్తిని నిగ్రహించుటగాని యాతనిపనిగాదు. కావున సంబంధశూన్యమైన ప్రధానము కొన్ని వేళల నెట్లు మహత్తుగా మారునో యేఁ గొన్ని వేళల మారదో తెలియుట కాధారమేమియును లేదు"౧. "పచ్చిక పాలుగామారినట్లే, ప్రధానము మహదాది వికారములనొందుననుటకును వీలులేదు, ఏలన, బచ్చిక పాలుగామారుట కితరకారణము లున్నవి; అవిగోవునందే యున్నవికాని వృషభమందు లేవు.౨. పరిమితిలేని కారణమును బరిమితిగల కార్యములనుండి యనుమానింప వచ్చునను వాదము ననుసరించియైనను గుణత్రయకల్పిత ప్రకృత్యస్తిత్వమును నిశ్చయింపఁజాలము. గుణము లొకదాని కొకటిపరిచ్ఛిన్నతను గలుగఁజేయును; కావున నవి కార్యములే. గుణము లపరిచ్ఛిన్నములైనచో వానికి భేదముండదు కావున, గార్యోత్పత్తియే యుండదు. 3. సామ్యావస్థలోనున్న గుణత్రయమే ప్రధానమునకు రూపమిచ్చునెడలను, మఱియు నవి పరస్పరమునల్పాధిక భేదసంబంధములో లేకుండునెడలను, నవి యన్యోన్యము పాలిత పాలక సంబంధములోఁ బ్రవేశింపఁ

---

(౧) శం. భా. ౨, ౨, ౪. చూ॥ శం॥ భా॥ ప్రశ్నోపనిషత్తు ౬, ౩.

(౨) శం॥ భా॥ ౨, ౨, ౯.

(3) రామానుజభాష్యము, ౨, ౨, ౧.

జాలవు; ఏలన నప్పుడవి పరిపూర్ణస్వతంత్రతగల భిన్నలక్షణములుగలవి కాఁజాలవు. గుణములను సామ్యస్థితినుండి చలింపఁజేయు బాహ్యశక్తి వేఱొకటెద్దియును లేదుగావున, (బ్రవృత్తి కవకాశము లేదు. ౧. జడమగు ప్రకృతి చేతనులగు పురుషుల ప్రయోజనసిద్ధికి సాధనములగు కార్యముల నుదయింపఁజేయఁ జాలదు; చేయఁగలదనుట సాంఖ్య ముఖ్యసిద్ధాంతవిరోధము.౨ ప్రపంచపరిణామమునకు వివేకప్రచోదితముకాని ప్రకృతియే కారణమని శ్రుతులెచ్చటను జెప్పలేదు. ప్రకృతిపరిణామమునకుఁ బరమోద్దేశమున్నదనియుఁ బురుషుల పరమార్థసిద్ధిఁ జేకూర్చుటయే ప్రకృతిప్రవృత్తికి లక్ష్యమనియు సాంఖ్యసిద్ధాంతము. ప్రకృతి యచేతనమగుచో వ్యావహారిక పారమార్థిక నిమిత్తధర్మములు ప్రకృతికిఁ గలవనుట సహేతుకముగాదు. ప్రకృతిపరిణామము ప్రయత్నపూర్వకముగాదనియు నది దాని సహజలక్షణమనియుఁ గొన్నిసమయములలోఁ జెప్పఁబడెను. అలవాటుచే గుఱ్ఱము బండిని లాగుచుండును. శకటచోదకుఁ

(౧) శం. (౧) (౨)ర. రామానుజుఁడు నుడివినాఁడు: భిన్న గుణముల నివాస భేదమునుసరించి, గుణముల యాల్పాధిక భేదముకలుగును. (సాం. కా. ౧౬.) వీనిపైనాధారపడిన అంగాంగి భావమునుండి ప్రపంచోత్పత్తి యగునని సాఖ్యులువాదించినచో, నప్పుడు ప్రళయకాలములోవలె గుణములకు సామ్యస్థితియున్నప్పుడు వీనికల్పాధిక భేదముండదు;అందుచే జగదుత్పత్తి కలుగదు. ప్రళయకాలమందుఁగూడఁ గొలదిభేదముండు నన్నచో, సృష్టి నిత్యమైనదని స్థిరపడును.“ (రామానుజభాష్యమ్ ౨, ౨, ౬.)

(౨) శం॥ భా॥ ౨. ౨, ౩.

దశ్వగమనమును గమనించుటతప్ప మఱేమియుఁ జేయఁడు. కాని యభ్యాసప్రవృత్తికిఁ బూర్వము ప్రయత్నకపూర్వక కర్మయున్నది. వివేకముగల చోదకు లశ్వమునకు గమనమును నేర్పియున్నారు. కాని సాంఖ్యసిద్ధాంతమునను సరించి, పురుషుని చోదకత్వ మంగీకృతముకాదు. ఆవుదూడకొఱకు కావు పొదుగులోఁ బాలుచేపువచ్చునను నుపమానము సరిపోదు; ఏలన సన్నిహిత పరమార్థకారణములకు భేదమును మనము గుర్తింపవలసియున్నది. (౧). ఒకయంశము నుగ్గడించుట దానిని సాధించుట కాఁజాలదు. వస్తుక్రమమును కొన్నినియమముల ననుసరించును, కాని, యీ నియమములన్నిటికి మూలాధార మగు నొక్కనియమమును మనమూహించినఁగాని, హేతు సంపూర్ణత లభించదు. పంగ్వంధజనసంబంధోపమానము సయుక్తికము గాదేలన, నిరువురుచేతనులు, క్రియాసమర్థులునగు టచేఁదమ కార్యసిద్ధికనుకూలమగు కార్యక్రమమును నిర్ణయించు కొని జరుపఁగలరు. ప్రకృతిపురుషులకట్టి సమానప్రయోజన మెద్దియును లేదు. జడప్రకృతికి దుఃఖానుభవము లేదు; నిష్క్రియుఁడగు పురుషునికినిదుఃఖము లేదు. వీరిరువురు లోకోద్ధరణమున కెట్లు కలియుదురు? రెంటికి నతీతమైన పరమార్థమును సాంఖ్య

(౧) శం॥ భా॥ ౨, ౨, 3. మఱియు, "చేతనమగు గోవు తనవత్స మును ప్రేమించి, దానికొఱకై కోరి తన క్షీరము నుదయింపఁజేయును; గోవత్సము గోస్తనము కుడుచుటవలనఁ గూడ క్షీరములు ప్రవహించును."

మంగీకరించినఁగాని, యీప్రశ్నకు జవాబుచెప్పుట దుష్కరము. ౨.

ద్రష్టయు దృశ్యము నొక యతీతైకత్వములో నంశములు, నొక పూర్ణములో నవయవములు. వ్యావహారికఘట్టములోనైనను, మనవిజ్ఞానమంతయు నొక విషయమునుగూర్చిన విజ్ఞానము; యథార్థజగత్తంతయు నట్టి విజ్ఞానవిషయమే. ఒక వస్తుజగత్తునుండి మనము వేఱై, దానితో సంబంధమును గల్పించుకొనుటవలననే, మన మాత్మస్వరూపమును దెలిసికొన సాధ్యమగును. మన వస్తుజగత్తును గూర్చిన జ్ఞానము విస్తరించిన కొలఁదియు, నాత్మజ్ఞానమును వృద్ధిపొందుచుండును. తెలిసికొను వ్యక్తికిని తెలియఁబడు వస్తువునకును సంబంధమే లేదన్నచో నొకదానినుండి రెండవదానికి మార్గమేయుండదు. రెంటికిఁగల యేకత్వము రెంటికిఁగల భేదమున కాధారమైయున్నది. మన అవిద్యచే ననఁగా, మన యనుభవ స్వరూపావస్థాజ్ఞానలోపముచే ద్రష్టకు దృశ్యమునకుఁ గల యేకత్వము గోచరించుట లేదు. మనస్సు వేరు, విషయము వేరు, నను ద్వైతభావము మన మానసిక సహజాలోచనమగుట నిజమే కాని, రెండును పూర్తిగా వేరైనచో వానికి సంయోగము కూర్చున దింకొక టేదైన నుండవలెను. అట్టివిధానము పినొసఁగఁజాలదని మనకుఁ దెలిసి

(౨) ఆస్తికుఁడైన విజ్ఞానభిక్షువు ప్రకృతిపురుషసంయుక్త ప్రవృత్తికి హేతువును జూపినాఁడు. ఆతఁడిట్లు వ్రాసినాఁడు; "ప్రకృతి స్వాతంత్ర్యవాదిభ్యామ్, సాంఖ్యయోగిభ్యామ్, పురుషార్థయుక్తప్రవృత్తిః స్వయమేవ పురుషేణ ఆద్యజీవేన సంయుజ్యతే...అయస్కాంత లోహవత్...అస్మాభిస్తు ప్రకృతిపురుషసంయోగ ఈశ్వరేణ క్రియతే." (విజ్ఞానామృతమ్ ౧, ౧, ౨.)

నప్పుడు, సర్వజ్ఞాన సర్వజగదాధారభూతమైన పరమచైతన్య మొకటున్నదనియు నీరెండు నందలి భాగములనియుఁ దెలియఁ గలదు. ఈ యేకత్వమును గ్రహింపకపోవుటే సాంఖ్యసిద్ధాంత లోపమై యున్నది.

మనకు లభించిన సాక్ష్యమంతయుఁ జూపునదేమన, ద్వైతము పారమార్థికసత్యము గాదనియుఁ, బ్రకృతిపురుషుల సంబంధ మనుద్దిష్టముగాదనియు స్పష్టమైనది. దీనిని సమర్థించు సాంఖ్యభావములను గొన్నిటి నిటఁ బొందుపరచుచున్నాము. పురుషునిలోఁ దాను నివసించుచున్న లోకముయొక్కయుఁ దన యొక్కయు నిజస్వరూపజ్ఞానమును బ్రకృతి ప్రతిఫలింపఁ జేయును. రెంటికిని గల భేదమున కంతర్గతమై యేకత్వమున్నదని యిది విశదీకరించుటలేదా? పురుషునితో సంబంధము గలిగి నప్పుడే ప్రకృతి పరిణామమందును. సంబంధములేనప్పు డది యవ్యక్తమైయుండును.(౧) ఏపని నదిచేయనో అదియే ప్రకృతి యైనచో నని పురుషప్రభావమును గలిగియున్నదని సూచించును. అనగాఁ బురుషసంబంధములేని ప్రకృతి దురూహ్యమనిస్పష్టము. ఆదిలేని స్వతంత్రుఁడైన పురుషునితో సమానమైన నిత్యత యే ప్రకృతికిఁ గలదని సాంఖ్యవాదము. కాని మనముసరిగాఁ జెప్పుకొన్నచోఁ బ్రకృతిపురుషు లిరువురు నొకే సత్యస్వరూపములోని భిన్నాంశము లని నిశ్చయింపవలెను. సృజనాత్మకమైన పరిణామమునకవి మూలాధారములైన ముఖ్యాంశములు. నిత్యమైన ప్రకృతిగర్భ

(౧) సాం॥ ప్ర॥ సూ॥ ౧, ౭౮.

(౨) ప్రకరోతీతిప్రకృతిః॥

మునకుఁ బురుషుఁడాధానకర్తగాకున్నచో ననుభవ మసాధ్యమగును. ప్రకృతిపదార్థము పురుషమంత్ర ప్రభావములేనిదే వస్తూత్పత్తినొసఁగఁజాలదు. ప్రకృతి పరిణామములో గర్భితమైయున్న పరమోద్దేశమునకుఁ గారణము పురుషుని ప్రభావమే. ప్రకృతివికాసము పురుషుని మోక్షసిద్ధికి సాధనమగుచున్నది. ఉద్దేశపూర్వకముగా నెట్టికార్యక్రమమును బ్రకృతికొనసాగించుచున్నదని సాంఖ్యమంగీకరించదుగాని, ప్రకృతిపరిణామమంతయుఁ బురుష ప్రయోజనసిద్ధికై యొకమహోద్దేశము ననుసరించి నడచుచున్నదని భావించుచున్నది. పురుషుని యెట్టిప్రయోజనము దానిపై ముద్రితమగునో యట్టిరూపమును ధరించుటకుఁ బ్రకృతి సిద్ధమై యున్నది. ప్రకృతిసర్వరూపములను ధరింప సమర్థమైనదే; కాని పురుషులెట్టిరూపముల నిర్ణయింతురో ప్రకృతి యట్టి వస్తురూపముల నుత్పత్తిచేయును. ప్రకృతియను గొలుసులో పురుషుఁడెచ్చటను లేకున్నను, గొలుసులో నన్నిభాగములకాతని ప్రభావము సమానముగానున్నది. పురుషుని ప్రభావము ప్రకృతిపరిణామము నారంభించుటేకాక, అవిచ్ఛిన్నముగా నది దానిలోనెల్లప్పుడుండును. ఒకజ్ఞానహీనమైన విశ్వాసము పురుషుని ప్రకృతినాటకరంగములోనికిఁ దోయుచున్న యెడల, విభ్రాంతివశములైన మనమానసములు ప్రకృతి నాటకమును దిలకింపనున్నయెడలను, బ్రకృతివ్యాపారమే లేకుండెడిది. ప్రకృతి పురుషుల ద్వైతభావము ననుసరించి, సాంఖ్యము ప్రకృతిలోఁగల యితరలక్షణములనుండి విజ్ఞానమును వేఱుపరచి విభజించినది. జ్ఞానము, జీవితము, ధర్మము మానవప్రకృతిలో

నతిసూక్ష్మరహస్యములై వెలసినవి; మానవ స్వభావములోని విజ్ఞానేతర విషయములన్నియు మనకు సువిదితములగుటకుఁ గారణము తనసిద్ధాంతమునకు వ్యతిరేకమైన మానవప్రకృత్యైక్యమును సాంఖ్యము విశ్వసించినది. ఇదివరకు మనముచూచిన రీతిని బుద్ధి యచేతనము జడమునైనచో నది చైతన్యమును బ్రతిఫలింపను జేయలేదు. భిన్నజీవితాంతరువులలోనున్న వస్తువులొకదానినొకటి ప్రతిఫలింపఁజేయవు. బుద్ధియందుఁ బురుషుని ప్రతిబింబము భ్రాంతిమాత్రమే కావునఁ బురుషునికి బుద్ధ్యవస్థానుభవముండదు. సాంఖ్యము చెప్పిన పద్ధతిలోఁ బురుష బుద్ధి సంబంధము రెంటికిబంధుత్వమునే సూచించునుగాని విరోధమును గాదు. ప్రకృతి పురుషసంబంధములో నత్యంత సన్నిహితత్వము బుద్ధియందుఁ గలుగును. బుద్ధివిచక్షణ జ్ఞానముకలిగి, విశ్వశక్తి వ్యాపారముల కేకత్వము ఘటించి, అహంకార సాహాయ్యముచే బుద్ధీంద్రియ ప్రవృత్తులకు సాక్షిమాత్రమైన యాత్మకు వానితోఁ దాదాత్మ్యమును భావింపఁజేయును. సాత్త్వికరూపములోనున్న బుద్ధియే వివేకజ్ఞానమునకై కృషిచేయును. ప్రవృత్తి తాదాత్మ్యమయుక్తమని యెఱిఁగి, యిదియంతయు గుణత్రియ సామ్యస్థితి భంగమనిగ్రహించి, యీమాయానాటకమునుండి విరమించును. పురుషుఁడీ జగన్నాటకముతో సంబంధమును విడిచిపెట్టుటయుఁ బురుషునియందుఁ దానుబ్రతిఫలించుశక్తిని ప్రకృతి గోల్పోవుటయు జరుగును. అహంకార వ్యాపారమణఁగిపోవును; బుద్ధియు నుదాసీనత వహించును. గుణములు సామ్యస్థితినొందును. బుద్ధి మోహమగ్నమైనచో, బురుషుఁడు చిక్కులోఁ జిక్కుకొనును.

బుద్ధి మోహపాశములను దెగఁద్రెంపినచోఁ పురుషుఁడు రక్షితుఁడగును. చూడఁగా బుద్ధియే పురుషునివలెఁ బనిచేయుచున్నది. అందుచే నిది ద్రష్టకు సన్నిహితలక్షణములుగలది కాని, దృశ్య జగత్తునకుఁగాదు.౧.

ఈసిద్ధాంతముయొక్క నైతికఫలితములుగూడ గమనింపఁదగినవి. ప్రకృతిపూర్తిగా నచేతనమైనచో, సంకల్పమునకు స్వతంత్రతయుండుట కవకాశము లేదు; ఏలన సంకల్పము ప్రకృతిసంభూతమే. ధర్మాధర్మములు పసుపు, పంచదార, మున్నగువస్తువులే యగునుగావున ధర్మమీమాంస నిరర్థకమగును. హింసచేసిన మానవుఁడు శిలాసదృశుఁడు కాఁజాలఁడని సాంఖ్యమువచించుచున్నది. వృక్ష శిలాదులలో లేని దేదో మానవునందుఁ గలదు. ప్రకృతియందుఁ గేవల మచేతనము గాని దేదియో యున్నది; లేకున్నచో నది మనకు మోక్షసాధనము కాఁజాలదు. ప్రకృతిపురుషులు పూర్తిగా వేరైనచో రెంటికిసంబంధ మనివేశమనుటకు వీలులేదు. ఒండొంటితో సంబంధము లేని రెండువస్తువులకు సంబంధభ్రాంతి యెట్లు జనించునో తెలియదు. ప్రకృతివికాసమున కీసంబంధము నిజమైన

(౧) తనవివరణప్రమేయసంగ్రహములో విద్యారణ్యుఁడిట్లు చెప్పినాఁడు: "వస్తువులు సాంఖ్యోక్తరీతినేయున్నచో, నహంకారము, దానిపైనాధారపడునదంతియు, సకలకర్మయు, భోగము మున్నగునవన్నియుఁ జేతనునికి విషయములై గోచరించును. "ఇది యొకకర్త", "ఇది యొకభోక్త" యని తెలియునేకాని బాహ్యమునుండి జీవునిపైనేదియుఁ జూపింపఁబడదు. అందుచే, "నేను కర్తను", "నేను భోక్తను" అనుభావము లుదయింపవు.

[ఇండియన్ థాట్. పు. ౩౨౬.]

దై యుండవలెను; పురుషుఁడు తన స్వచ్ఛతను, సంబంధరాహిత్య మును బ్రకృతిమూలమునఁ దెలిసికొనుట కనుగుణముగా నీ సంబంధము యథార్థముకావలసియున్నది. పురుషుఁడు దేని సాహాయ్యమునఁ గృతార్థుఁడగుచున్నాఁడో, యది పురుషునికి బాహ్యముకాఁజాలదు. శుద్ధద్వైతము సూచించునట్లుగాక, సాంఖ్యము ప్రకృతిపురుషులకు సామీప్యము చేకూర్ప యత్నించినది. ప్రకృతిపురుషుల యన్యోన్యసహకార మత్యద్భుత మైనది. ఒకయుదాహరణము ; మనమచేతనకాంక్షయని చెప్పనగునొక యొత్తిడిచేఁ బ్రకృతి యచేతనములగు కొన్ని ప్రతిమాస్వరూపములను దయారుచేయును; వీనిద్వారమునఁ బురుషుఁడు జగద్రూపమును గ్రహించును. చేతనాచేతన ప్రకృతులు రెండునొకే పరిణామములోని భిన్నదశలు. మోక్షా సక్తచిత్తుఁడు జీవి; అల్పచేతనుఁ డనంతచేతన స్వరూపుని సూచించును; అనంతచైతన్యము ప్రకృతిభావమునఁ బరిచ్ఛిన్న మైనది. తనలో నంతర్గతమైయున్న యనంతనిజస్వరూప మును జీవి క్రమముగా గ్రహించును.

దృశ్యజగత్తును సాంఖ్యము ప్రకృతి యంత్రమనియు, జీవమోక్షమనియు రెండుగా విభాగించి నపుడీవిభాగములు బుద్ధి పరికల్పితములు గాని, వాస్తవికములు గావు. వ్యావహారిక జగ త్తులో విడఁదీయరాని సంబంధము గలిగిన రెండు భిన్నలక్షణ ములు గోచరించుచున్నవని యవి మనకుఁ దెలియఁజేయును. పురుషుఁడు చేతనుఁడైనచో, వ్యతిరేక లక్షణము కలిగి యుండు టచేఁ బ్రకృతి యచేతనమని చెప్పవలెను. ప్రకృతి పురుషులు

సర్వానుభవములో నున్న భిన్నాంశములు. చేతనాచేతనములగు నీరెండును బరిణామములోని భిన్నాంశములు. కేవల పురుషుఁడు కాని, కేవల ప్రకృతికాని యథార్థమైనది కాదు. అస్తిత్వముగల దెల్ల నామరూపములు గలది కావున నట్టి యస్తిత్వము వీనికి లేదు. పదార్థములేని రూపమును, రూపములేని పదార్థమును వస్తుశ్రేణిలో నాద్యంతఘట్టములు; కాని యివి నిజముగా నున్నవికావు. ప్రథమసంజాతము మహత్తు; మహత్తునుండి యితరములన్నియు వచ్చినవి. ఈమహత్తు శుద్ధపదార్థము కాదు; ఉత్పత్తియైనపదార్థము. అవ్యక్త ప్రకృతియొక్క వ్యక్తరూపము మహత్తు. ప్రకృతిపురుషుల సహకారము లేనిచో మహత్తు జనించదు. మహత్తు ప్రకృతినుండి పురుషవీక్షణముచే జనించిన ప్రథమ సంతానము. సాంఖ్యతత్త్వ మంగీకరించిన యీశ్వరుఁడు శుద్ధద్రష్టకాఁడు; దృశ్యబీజమాతని యందంతర్గతమై యున్నది. ప్రపంచములోని సర్వవస్తుజాలమునకు మూలకారణమును మనము చెప్పికొనినచో, సర్వవస్తు బీజసంకలితమైన సర్వాత్మ భావము మనకు లభించును. అనగా ద్రష్టృదృశ్యరూపము. (Subject–object) లోకములోని సర్వవస్తువులును ద్రష్టృదృశ్య రూపములై యున్నవి. దేవుని యందును నతిస్థూలమగు జడ పదార్థమందును మనకుఁ బ్రకృతి పురుషలక్షణములు రెండును గాననగును. పదార్థమధికముగా నున్నవి దిగువశ్రేణిలోను, రూపమధికముగానున్న వున్నతశ్రేణిలోను జేరును. సృష్టిజీవ శ్రేణిలో జీవశక్తికి విజయ మధికమైన కొలఁదియు నాజీవి పైమెట్టు నాక్రమించుచుండును. స్థూలతమజడపదార్థఘట్టములో

వస్తువు లొందురులకు కేవల బాహ్యములై గోచరించును. కాని యాఘట్టమందలి జగత్తు కూడఁ బురుషప్రయోజన సిద్ధి కవస రమే. వృక్షపశుమానవ వర్గములలో మన మాత్మారోహణ క్రమగతిని గమనింతుము. చేతన జగత్తులో వృక్షలతాదులు మొదటి మెట్టులోనున్నవి; జ్ఞానేంద్రియ సమన్వితమగు పశువర్గ మంతకంటె నున్నత పరిణామదశకుఁ జెందును; మానవుఁడు తన వివేకసంకల్పశక్తుల వలన నింకను మహోన్నతపరిణామదశకుఁ జెందును. సర్వవస్తువులు క్రమముగా నున్నతపరిణామము నొంద యత్నించుచున్నవి. పరిణామవాదము ననుసరించి, జీవి యొక్క స్థిరరూపముగాదు; పరిపూర్ణపురుషరూపము సిద్ధించు నందాఁక తోఁడ్కొనిపోవు పరిణామగమనములో నొక తాత్కాలిక స్వరూ పము మాత్రమే. ఈవ్యతిరేకద్వంద్వము లన్యోన్యాధారభూత ములు; ఒకే వాస్తవికపరిణామములో భిన్నగమనరూపములు. ప్రకృతినుండి పురుషుని వేరుచేసినచోఁ, బురుషుఁడు వాస్తవిక సత్యస్వరూపుఁడు కాఁజాలఁడు; అట్లే పురుషునుండి వేరుచేయఁ బడిన ప్రకృతియు నగును. సర్వవస్తువులును ప్రకృతిపురుష మిశ్రమరూపములు; పురుషునధికముగా వ్యక్తీకరింప యత్నించు చున్నవి; ఈప్రయత్నమే జగత్ప్రవృత్తి.

మన యనుభవ ప్రపంచములో నుత్పత్తియైన వస్తువు లలో నత్యున్నతమైనది కూడ శ్రేష్ఠతమవస్తువు కాదనియు, నేదోయొకదాని నణఁచివేయవలయునని ప్రయత్నించు రెండు లక్షణములకు మూలాధారమైనది మూడవదేదియో యుండ వలయుననియు సాంఖ్యము చెప్పినదాని ననుసరించి, విశదమగు

చున్నది. ఈ భిన్నశక్తి సంఘర్షణావృతమైన ప్రపంచమున కతీతము హేతువునైన దొకవంక పురుషుఁడును వేఱొకవంక ప్రకృతియునై, యొకటి బీజాత్మకద్రష్టయు రెండు బీజాత్మకవిషయమునుగా నున్నవని చెప్పుట మన యనుభవాంశములకు విరుద్ధమును, సాంఖ్యసూత్రభావములకు వ్యతిరేకమునై గోచరించును. మహత్తువలన ననేకాహంకారములును, తన్మాత్రలు నుద్భవించునెడల, మహత్తుకుఁ బూర్వమందే యీ యహంకార తన్మాత్ర నానాత్వ ముండెనని యూహింపనవసరములేదు. వస్తువులన్నియు నేకప్రకృతి రూపములనినచో, అనేకద్రష్టలందరు నొకే విశ్వద్రష్ట రూపములనియు, వ్యవహారప్రపంచములో ననేకులుగా నున్న జీవులు తమ యేకత్వమును గ్రహించుటకాఁటంకములుగా నున్న జడపదార్థమును నిగ్రహించవలసి యున్నదనియుఁ జెప్పనొప్పును. నిష్క్రియాత్మకమగు పురుషుని చైతన్యమును, నిత్యపరిణామాత్మకమగు ప్రకృతియుఁ బూర్తిగా వేఱని భావించినయెడల నెన్నటికిని తత్త్వశాస్త్ర సమస్య పరిష్కృతముకాదు. కాని సాంఖ్యతత్త్వము సహేతుకమైనదివలె గోచరించును. ఏలన నది యేకము నిత్యమునైన చైతన్యశక్తి యొక్క భిన్నరూపములే యీ భిన్నసంబంధములని తోఁచు రీతిని వర్ణించియున్నది. ప్రకృతిపురుషుల మధ్యమందుఁగల అద్భుత సహకారము, వ్యతిరేకశక్తు లేకశక్తిభిన్నరూపములని చూపును. బాహ్యగోచరమగు ద్వైతము తదతీతమైన యేకత్వము నాధారముగాఁ గలిగియున్నది. సర్వానుభవపూర్వలక్షణ మేదైన నున్నచోఁ, బురుషప్రకృతి లక్షణములు రెండు

నిమిడియున్న యేకైకస్వరూపమే; ఏలన, నీప్రకృతిపురుషులు రెండు పరస్పరము నెదురై రణోన్ముఖములై యుండలేదు. పరిణామములో వీని వైషమ్యము తొలఁగిపోయినది. రెండును మూలాధారభూతమగు నొక యేకత్వముపై నిలిచియున్నవి. తాను జీవుఁడను భ్రాంతిలేని పురుషుని లక్షణములను వర్ణించిన సాంఖ్యపద్ధతి చూచినచో, నేకైకమాత్రుఁడు,పరిశుద్ధుఁడు, పరిపూర్ణుఁడు నగు నొక పురుషు నంగీకరించినట్లేయగును; జగత్పరిణామదశలలోఁ దటస్థించు జీవుల పరితాపములు సంఘర్షణములు, భేదములు నట్టి పురుషు నంటవు; మఱియు నట్టి శుద్ధపురుషుఁడు పరిణామదశ లన్నిటిలో నున్నను వానికన్నిటికి నతీతుఁడై యున్నాఁడని స్పష్టమగును. దేశకాలావృతమైన పరిణామగతి, తనలో నున్నను నిత్యపరిపూర్ణ పురుషుని బంధింపఁ జాలదు. ప్రపంచ మాతని కవధి కల్పింపఁజాలదు. మూలములోనే సమన్వయింపరాని ద్వైతముతో నారంభించినచో, జగదైకత్వము దుస్సాధ్యమగును. ఏక్షణమునం దొక వస్తుజ్ఞానము పరమాత్మకుండునో, యాక్షణమందే పరమాత్మ, పరమపురుషుఁడై విషయమైన మహత్తుపై నాధిపత్యము వహించును.(1)

(1) క్రమముగా సత్త్వరజస్తమో గుణములలో నేది యుత్కృష్టత నందియుండెనో దానిననుసరించి, మహత్పదార్థమునుండి బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుఁడు నుదయింతురని మత్స్యపురాణము చెప్పుచున్నది.

"సవికారాత్ప్రధానాత్తు మహత్తత్త్వమ్ ప్రజాయతే,
మహానితియతః ఖ్యాతిః లోకానామ్ జాయతేసదా,
గుణేభ్యః క్షోభ్యమానేభ్యః త్రయోదేవా విజజ్ఞిరే,
ఏకమూర్తిస్త్రయోభాగా బ్రహ్మవిష్ణుమహేశ్వరాః॥ చూడు:ఇండియన్ ఫిలసాఫికల్ రివ్యూ. వాల్యుము-2పు.200 వ పదటీక.చూ: భాగవతము 3ఆ,

విజ్ఞానభిక్షువు మహాభారతము౨.నుండి యొక శ్లోకము నుదాహ
రించెను. ఆ శ్లోకము చెప్పునదేమన, బరిణామముగల ప్రకృతి
యనగా నవిద్యయనియు, నెట్టిమార్పును లేని పురుషుం డనఁగా
విద్యయనియు భావము.3. ప్రకృతియనఁగాఁ గేవల భావకల్పి
తము గాదని ప్రకటింప సాంఖ్యము తత్తరపాటు చూపినది.
కారణమేమన, బ్రకృతి వాస్తవికముగానిచో, నిజముగా నది
బంధకారణము కాఁజాలదు.౪. ఏదియెట్లున్నను బ్రకృతి ఆత్మ
యొక్క అనాత్మస్వరూపము. అనాత్మకు౫. సాక్షియైన
ఆత్మ అనాత్మ లేక ప్రకృత్యస్తిత్వమును సూచించుచున్నది.
దృశ్యముయొక్క యుత్పత్తి దానిని దర్శించుదృష్టతో మేళ
వింపఁబడినది. ఈ స్వయంజ్ఞానరూపియైన పరమాత్మ, మహత్తు
నకు సంబంధించినది; ఇది యేయొక జీవాత్మయుఁగాదు; ఏలన
నెన్ని జీవులు మోక్షముపొందినను, నట్టిపరమాత్మ
బ్రవృత్తిని గలిగించుచునేయుండును. పరమేశ్వరాధిపత్యమునఁ
బ్రకృతి క్రమముగా నానాత్వమును బ్రదర్శించుచుండును.
సృష్టికాదియందు మహత్తే తన యుపాధిగాఁగల పరమపురుషుఁ
డొకఁడుదయించెనని విజ్ఞానభిక్షువు సూచించినాఁడు. ౧. ఈ
పరమపురుషునియందుఁ బురుషుని శాంత్యానందములు, ప్రకృతి

(౨) ౧౨, ౧౧, ౪౧౯.

(3) సాం॥ప్ర॥భా॥ ౧, ౬౯.

(౪) పోల్చు: నహిస్వప్నరజ్జ్వా బంధనమ్ దృష్టమ్॥ (సాం॥ ప్ర॥ భా॥ ౧, ౨౦.)

(౫) ప్రకృతిమ్ పశ్యతిపురుషః॥ (సాం॥ కా॥ ౬౫.)

(౧) సాం॥ ప్ర॥ భా॥ ౫, ౧౨.

యొక్క క్లేశసంఘర్షణాన్వితమైన యనేకత్వమును గలిసియు-న్నవి. సర్వజీవులు, సర్వదేహములు పరమపురుష గర్భస్థములైయున్నవి; ౨ పృథగ్వ్యక్తులందరా పరమాత్మసాగరములో బుద్బుదములే. మహదీశ్వర సంయుక్తస్వరూపము సృష్ట్యాది రూపము. ఇందు జగత్తులోని ప్రకృతిపురుషరూపద్వయము బీజరూపమున నైక్యమైయున్నది. అందుచేతనే ప్రకృతి పరమాత్మపై నాధారపడియున్నదని వేదాంతము, పురాణములు ప్రకటించినవి. 3. ఇట్టిభావము నాశ్రయించిననే సాంఖ్యతత్త్వము సహేతుకముకాఁగలదు. ఇట్టి యద్వైతసత్యమును సాంఖ్యము గ్రహింపఁజాలక, కేవల బుద్ధిఘట్టమునమాత్రమే నిలిచి, ప్రకృతిపురుషభేదము నిజమనియు, వానియేకత్వ మసత్యమనియు విశ్వసించుటతో సంతృప్తినొందినది. యుగయుగములనుండియు నడుగఁబడి, చర్చింపఁబడుచువచ్చిన సమస్యలనే సాంఖ్యమును దిరిగిప్రకటించినది కాని, యాసమస్యలలో నిమిడియున్న భిన్నార్థములను గ్రహించుటకాని, వాని నుచితరీతిఁ బరిష్కరింపయత్నించుటకాని జరుగలేదు. కాని జగత్స్వరూప రహస్యములనుగూర్చి, యే యంశమును విడ

(౨) వాయుపురాణ చతుర్థాధ్యాయమునందు సాంఖ్యులమహత్తు నీశ్వరునిగాను, బ్రహ్మగాను జెప్పఁబడెను. పోల్చు: "అవిజ్ఞేయమ్ బ్రహ్మాగ్రే సమవర్తత." ఈశ్వరునిసృష్టి సంకల్పమే జగద్యోని.

(3) ఇది విష్ణుపురాణమునందు (౧, ౨) కార్యకారణశక్తియుక్తమ్ అని వర్ణింపఁబడెను. పరమేశ్వరుని కార్యమిది; మిగిలిన సృష్టికంతకుఁ గారణమును, చూళికోపనిషత్తు ప్రకృతియనఁగా "వికారజననీమ్ మాయామ్ అష్టరూపమజమ్ ధ్రువమ్." మఱియుఁ జూ॥ సాం॥ ప్ర॥ భా॥ ౧, ౨౮.

నాడుటగాని, భగ్న మొనర్చుటగాని చేయకుండ, సర్వతోముఖ భావమునుసాధింప సాంఖ్యతత్త్వము మహోన్నతకృషి యొనర్చినది. వస్తువుల భిన్నరూపములకు, సమ్యక్సంబంధనిర్ణయము చేయుటకుఁబూర్వము వాని స్వరూప స్వభావములను సువ్యక్త మొనర్పవలెను; అనుభవప్రపంచమును సాంఖ్యము సమగ్రముగా విభాగించి, భావితత్త్వవేత్తలకుఁ బూర్వరంగము ననుకూలముగా నలంకరించినది.

## ఉదాహృతగ్రంథములు


౧. యస్. సి. బెనర్జి: సాంఖ్యతత్త్వము.
౨. గార్బే: సాంఖ్యప్రవచనభాష్యము.
౩. గార్బే: సాంఖ్యసూత్రవృత్తి.
౪. కీత్: సాంఖ్యసిస్టమ్.
౫. నందలాల్ సింహా: సాంఖ్యతత్త్వము.
౬. సర్వదర్శనసంగ్రహము: అధ్యాయములు ౧౪,౧౫.
౭. సీల్: పాజిటివ్ సైన్సెస్ ఆఫ్ ఏన్షెంట్ హిందూస్.

# భారతీయ తత్త్వశాస్త్రము

## పంచమాధ్యాయము

## పతంజలి యోగ తత్త్వము

### ౧—ఉపక్రమణిక

ఆత్మ సంబంధదృశ్యములనుగూర్చి, మనస్తత్త్వపరిశోధన మండలి యొనర్చిన యన్వేషణముల వలన, నిదివఱకు శాస్త్ర సమ్మతములగు సత్యాంశములని తలంపంబడిన దృఢతమవిశ్వాసముల పటుత్వము సడలనారంభించినది. బుద్ధియు స్మృతియుం గేవల భౌతికమేధస్సుపై నాధారపడిన వనియు, నీభౌతికమేధస్సు నశించుటతో నవియు నదృశ్యములై పోవుననియుం గల్గిన నిశ్చయములు మారినవి. విజ్ఞానవ్యాపారమునకు మేధస్సవసరము లేదని కొందరు విజ్ఞులు నేడుగుర్తింప నారంభించిరి. పంచేంద్రియసాహాయ్యముపై నాధారపడిన లక్షణములుగాక, యితరలక్షణములు గొన్ని మనస్సునకుం జెందియున్నవని ప్రస్తుత మనస్తత్త్వజ్ఞులు కొందరు భావించుచున్నారు. మేధస్సుపై నాధారపడిన స్మృతియుం, దర్కశక్తియుంగాకుండ నితరమనశ్శక్తులు కొన్ని

యున్నవని నేటితత్త్వశాస్త్రజ్ఞులును నెమ్మదిగా నంగీకరింప నారంభించిరి. ప్రాచీన భారతీయ వైజ్ఞానికులు మానసాతీత తత్త్వ రహస్యములనుగూర్చియు, నిగూఢాత్మ శక్తులనుగూర్చియు ననుభవ పూర్వకమగు శాస్త్రీయ జ్ఞానమును గలిగియుండిరి. బాహ్యేంద్రియ సహకారమవసరము లేకుండఁగనే, కనుట, తెలియుట, సాధ్యమనియును, భౌతికములగు నిందిృయ మేధస్సుల నుండి మనము విడివడి స్వతంత్రత పొందఁగలమనియు వారు చెప్పియున్నారు. మనకిందిృయాదులవలన గోచరించు ప్రపంచమునకంటె విశాలతరమైన ప్రపంచమున్నదని తెలియుచున్నది. మననేతృము లట్టివిశాల జగత్తునుజూడఁ గలిగిననాఁడు, హఠాత్తుగా దృష్టిలభించిన యంధునికెట్టి దృశ్యవైభవముగోచరించునో యట్లే, మనదృష్టియు విశేష విశాలదర్శనశక్తిని గలిగి ప్రకాశించును. ఈవిశాలదృష్టి నార్జించుటకును, గర్భితశక్తులను వ్యక్తీకరించుటకును నిశ్చితసూత్రములు కల్పితములైయున్నవి. ఏకాగ్రతను బెంపొందించుటయు, సర్వశక్తి కేందృమైన యాత్మపై దృష్టిలగ్నమొనర్చి, చిత్తచాంచల్యము నరికట్టుటయు మున్నగు యోగప్రక్రియల నభ్యసించుటవలన, వ్యాయామ దీక్షాపరతంత్రుఁడు తన దేహమును వశమొనర్చుకొనురీతినే, ప్రతివ్యక్తియు నాత్మనిగ్రహశక్తిని సాధింపఁగలఁడు. మానవుని సామాన్యానుభవ సీమావధుల నతిక్రమించి,మన స్తత్వపరివర్తనముచే మనకున్నత విజ్ఞానదశను లభింపఁజేయుటకు యోగ ముపకరించును. భౌతిక దేహముపై మనశ్శక్తికిఁగల యాధిపత్యము, ఏకాంతవాసము, చిత్తశాంతి, ధ్యానసమాధులలోని

యానందము, బాహ్యప్రకృత్యవస్థలయెడ నుదాసీనత మున్నగు హిందూవిజ్ఞాన కేంద్రసత్యములు యోగమున సువ్యక్తములై యున్నవి. ఆధునిక మానవుని కీహిందూసంప్రదాయ సిద్ధము లగు యోగవిషయములు విచిత్రములుగాఁ గన్పట్టును. కాని బాహ్యవస్తు వ్యామోహము ప్రబలి, ఉదరపోషణాత్మక సంపా దన ప్రవృత్తిలో దురాశోపహతమై యింద్రియ చాపల్యవశమై యున్న నేటిమన మనఃప్రవృత్తిని క్షాళనమొనర్చి శుద్ధిచేయు నిమిత్త మీయోగ సాధనావసరముగలదని దానిప్రయోజనము నరసిన కొందరువిజ్ఞులు భావించుచున్నారు.

యోగశబ్ద మనేకార్థములలో నుపయోగింపఁబడినది.౧. యోగమనఁగా 'విధానము' ని స్థూలార్థము.౨. బంధించుటను నర్థములోఁ గూడఁ దరచుగా వాడఁబడినది. 3. ఉపనిషత్తులలోను భగవద్గీత యందును, సంసారమగ్నమై, కలుషితమైన యాత్మ, పరమాత్మకు దూరమై వర్తించునని చెప్పఁబడెను. వియోగమే సర్వపాపములకును మూలము. పాపదుఃఖవిముక్తి పొందవలె నన్నచో యోగసిద్ధి యనఁగాఁ బరమాత్మానుసంధానమును

౧, చూ. భారతీయతత్వశాస్త్రము. ప్రథమభాగము.

౨. భగవద్గీత 3-3.

(3) చూ॰ ఋగ్వేదము, ౧-౩౪-౯; ౭-౬౭-౬౮: 3-౨౭-౧౧; ౧౦-౩౦-౧౧; ౧౦-౧౧౪-౭; ౪-౨౪-౪: ౧-౫-3; ౧-౩౦-౭ ; శతపథ బ్రాహ్మణము. ౧౪-౭-౧,౧౧ జీవాత్మ పరమాత్మానుసంధానమేయోగమని యాజ్ఞవల్క్యు నభిప్రాయము. సంయోగోయోగ ఇత్యుక్తో జీవాత్మ పరమాత్మ నోరితి.

సాధించవలెను. పతంజలి ననుసరించి, యోగమనఁగా సంయోగము కాదు; ప్రయత్నము; భోజుఁడు పలికిన రీతిని, ప్రకృతిపురుషుల వియోగము. నోవలిస్ పండితుని మాటలలో, "అతీతమగు నేను" ను దెలిసికొనుటే. యోగమనఁగాఁ బ్రయత్నము, దృఢప్రయత్నమనియు నర్థము. అందుచేతనే, యోగతత్త్వమనఁగాఁ జిత్తేంద్రియ నిరోధమని వచింపఁబడెను.౪. సమాధిలో లభించు సిద్ధికి యోగమని కూడఁ జెప్పఁబడినను, దానిని సంపాదించు సాధనవిధానమను నర్థములో నెక్కువగా వాడఁబడినది. యోగమనఁగాఁ బరమేశ్వరుని దివ్యశక్తియను నర్థమిచ్చు వాక్యములును లేక పోలేదు.౫. పతంజలిననుసరించి, మానవప్రకృతిలోఁగల భౌతిక మానసిక చాపల్యముల నిగ్రహముచేఁ బరమార్థమునుసాధించు సక్రమవిధానమని చెప్పవలసియున్నది. స్థూలదేహము, ప్రవృత్తి పరమగు సంకల్పమును, విషయవివేకముగల చిత్తమును నిగ్రహింపఁబడవలెను. దేహకలుషములను క్షాళనమొనర్చి, దాని సంక్షోభమ్మును బోఁగొట్టుటకుఁ గొన్ని యోగాభ్యాసము లవసరములని పతంజలి వక్కాణించినాఁడు. ఈ యభ్యాసముల వలన లభించిన పాటవము, పెంపొందిన యౌవనము, వృద్ధిపొందిన ఆయుర్దాయము, మోక్షసాధనకుపయోగింపఁబడవలెను. చిత్తశుద్ధినిరోధముల కితరపద్ధతులున్నవి. పతంజలి ముఖ్యోద్దేశము పరమార్థసిద్ధాంతప్రకటనము

---

(౪) యో. సూ. ౧-౧.

(౫) భగవద్గీత. ౬-౫ చూ, బలదేవుని ప్రమేయ రత్నావళి. పు. ౧౪.

కాదు; సుశిక్షిత ప్రవృత్తి వలన మోక్షము నెట్లు సాధించుటను నదే యాతని ప్రధానలక్ష్యము. ౧.

## ౨—పూర్వచరిత్ర

సామాన్యమానవులకులేని దేహమనశ్శక్తులనుగొన్నిటి నభ్యాసశిక్షణములచే సంపాదింపవచ్చుననియు, దేహ మనో వ్యాపార నిరోధమువలన దుఃఖవిముక్తియగుననియు నిట్టివి ప్రాచీనభారతీయ భావములే. భావసమాధ్యవస్థలనుగూర్చి ఋగ్వేదములో నపరిణతభావములు కొన్ని యున్నవి. 'ముని' ౧.

౧ యోగతత్త్వోపనిషత్తు చతుర్విధయోగములను జెప్పినది; మంత్రయోగ, లయయోగ, హఠయోగ, రాజయోగములు. పతంజలిది రాజయోగము, ఏలన, నది చిత్తవృత్తినిరోధమువలన సమాధినిబొందు సాధనములను విపులముగా వివరించినది. దైహికప్రవృత్తులను నిగ్రహింపవచ్చునని హఠయోగముచెప్పును. దేహనిగ్రహము పతంజలియోగములో నొకభాగము. మంత్రయోగము విశ్వాసముచే రోగనివారణముచేయును. ఈపద్ధతి క్రైస్తవభక్తి బోధలపై నాధారపడియున్నదని కొందరు క్రైస్తవ పండితులు చెప్పుదురు కాని విశ్వాసముచే బాధానివారణము (Faith-Cure) ఏయొక ప్రత్యేకమతము నకుఁ జెందినదికాని ప్రబలసాక్ష్యమున్నది. యమ్. కూ. మనకుఁ బ్రాచీన వైద్యుని స్మృతికిఁదెచ్చుచున్నాఁడు. నమ్మకముచే రోగనివారణమనఁగా, ప్రకృతిక్రమములో నీశ్వరుఁడుజోక్యముకలిగించుకొనుట గాని, లేక వేఱొక యింద్రియాతీతశక్తి ప్రభావము నుపయోగించుటకాని కాదు. రోగము నరములకు సంబంధించినప్పుడు, లేక, మనస్సుచలించి చెడినపుడు, నిశ్చితమైన సంకల్పములేక తీవ్రసంకల్పములేక హఠాన్మానసిక క్షోభము కలిగినప్పుడు మంత్రములుపనిచేయును. "విరిగినకాలు విశ్వాసముచే నతుకుకొనిన సందర్భమునాకొకటియైనఁ జూపినచో నీపద్ధతులను నమ్మెదను"ని సవాలుచేయఁగలిగినవిమర్శకుని వాక్యములు పూర్తిగానర్థరహితములుగావు.

౧. ఋగ్వేదము, ౧౦-౧౩౬.

యను శబ్దమును ఋగ్వేదముపయోగించినది. ఋగ్వేదము ననుసరించి, పరంజ్యోతిని ధ్యానించుట పవిత్రమైనభక్తిమార్గ మగును. ౨. తపోనిష్ఠవలన నతీంద్రియశక్తులు లభించుననిచెప్పు వాక్యము లధర్వణవేదమున విశేషముగాఁగలవు. ౩. తరువాత నీ ధ్యానము ధర్మయుక్తమైన తపోమార్గముగాఁ జెప్పఁబడెను. నిత్యపదార్థముపై దృష్టినిలుపుటకు మనము సర్వసంసారభోగ ములను విడిచిపెట్టవలెను. సత్యస్వరూపముయొక్క యథార్థ జ్ఞానము కొఱకుఁ జేయు నాంతరంగికాన్వేషణమే యోగాభ్యాస ముగా నుపనిషత్తులుగ్రహించినవి. ద్రష్టయైన యాత్మ ప్రత్యక్ష గోచరమగునది కాదుకావున ధ్యానైకాగ్రతలు ముఖ్యములని వక్కాణింపఁబడినవి. ౪. తపోబ్రహ్మచర్యము లుత్కృష్ట శక్తులనిచ్చు ధర్మములని యుపనిషత్తులు పేర్కొన్నవి. ౫. సాంఖ్యసిద్ధాంతములను స్మరించిన యుపనిషత్తులు యోగపద్ధ తులను ప్రకటించినవి. కఠ శ్వేతాశ్వతర మైత్రాయణ్యుపని షత్తులు సాంఖ్యతత్త్వసిద్ధాంతములకు భిన్నమైన మతానుష్ఠాన విధానముల నుగ్గడించినవి. యోగము సాంకేతికశబ్దముగా కఠ తైత్తిరీయ మైత్రాయ ౬ ణ్యుపనిషత్తులయందుపయోగింప

౨. ఋగ్వేదము; ౩, ౩, ౯, ౧౦ లలో గాయత్రి పేర్కొనఁబడి నది. షట్త్రియుఁజూడుము శుక్లయజుర్వేదము. ౩-౩౫; సామవేదము, ౨-౮-౧౨

(౩) భారతీయతత్త్వశాస్త్రము, (౪) బృ, ఆ, ఉ, ౪-౧౪; ౩-౫; ౪౪; తై, ఉ, ౧; కఠ ఉ, ౩-౧౨; ప్రశ్న, ఉ, ౫-౫)

(౫) ఛాం, ఉ, ౩, ౧౩, ౪; బృ, ఆ. ఉ ౧-౨-౬; ౩-౮-౧౦ ప్ర, భా. తై, ఉ, ౧. ౯, ౧; ౩, ౩, ౧; తై. బ్రాహ్మణము ౨-౨-౩; ౩ శ బ్రాహ్మణము, ౧౧-౫-౮-౧. (౬) ౬-౧౦,

(బడెను. కాని యిందుఁ జెప్పఁబడిన యోగము పతంజలియోగఁ మనుటకు వీలులేదు. గాఢసుషుప్త్యవస్థతో మోక్షమునిచ్చు సమాధ్యవస్థనుబోల్చిన యుపనిషత్తులనుండియే సమాధిభావము కలిగియుండనగును. ఇంద్రియములు బుద్ధిచిత్తములతో నిర్వృతి నొందుస్థితియే ఉత్తమయోగావస్థయని కఠోపనిషత్తు వర్ణించెను. ౧సహజముగా నిట్టి సమాధ్యవస్థను ప్రయత్నపూర్వకముగా సాధించుమార్గముల నభ్యసించిన జనులుండియుందురు. మైత్రి ఉపనిషత్తు షడంగయోగమునుజెప్పి, పతంజలితత్త్వములోని శాస్త్రపదములను బెక్కింటినుపయోగించియున్నది.౨.ప్రాచీనో పనిషత్తులకాలమునాటికి యోగతత్త్వము పరిణతికిరాలేదనియు నర్వాచీనోపనిషత్కాలమునాటి కిది వికాసమందెననియు విశద మగుచున్నది.

రెండర్థములలోను యోగమును బుద్ధుఁడభ్యసించెను. తపోనియమముల నన్నిటి నాతఁడనుష్ఠించుటయేకాక, మహో త్కృష్టధ్యానము నాతఁడుసల్పెను. లలితవిస్తారము ననుసరించి, బుద్ధునికాలమునందు లెక్కలేనన్ని యోగాభ్యాస పద్ధతులుండె నని తెలియుచున్నది.3. బుద్ధుని గురువులలో అలారుఁడు మున్నగువారు యోగవిద్యలో నిష్ణాతులు. యోగైకాగ్రత నభ్యసించు పద్ధతులన్నియు బౌద్ధసుత్తములలోఁ గాననగును. యోగశాస్త్రమందలి విజ్ఞానమయములైన చతుర్విధధ్యాన

(౧ ఛాం. ఉ. ౬, ౮, ౬.

(౨) ౬, ౧౮.

(3) భారతీయతత్త్వశాస్త్రము. ప్ర॥ భా॥

పద్ధతులను, బౌద్ధమతమందలి చతుర్విధధ్యానపద్ధతులకును సరి పోవును.౪. బౌద్ధతత్త్వము ననుసరించి; భక్తి, శక్తి, విజ్ఞాన, కేంద్రీకరణ జ్ఞానములైదును యోగసిద్ధి నీయఁగలలక్షణములై యున్నవి.౫. యోగశాస్త్ర మీభావముతో నేకీభవించును.౧. బౌద్ధుల యోగాచారశాఖ బౌద్ధపద్ధతులను యోగశాస్త్ర పద్ధతులను బహిరంగముగాఁ గలిపివేసినది. అనంతర బౌద్ధగ్రంథములు విశేషపరిణతినందిన యోగశిక్షణమును బ్రకటించినవి.౨

సిద్ధాంతానుష్ఠానములు, మతతత్త్వములు నొకేసంపూర్ణ తత్త్వములోని భిన్నాంశముల రూపములే, సాంఖ్యయోగము లని మహాభారతము ప్రదర్శించినది. యోగ మీశ్వరు నిరువది యారవ తత్త్వముగా సంగీకరించినదని చెప్పఁబడెను. మఱియు మొదట మోక్షమనఁగా బ్రహ్మైక్యమని తలపఁబడెనుగాని, తరువాత ప్రకృతి పురుషుల వియోగమే మోక్షమని భావింపఁ బడెను. జీవసృష్టికంతకుఁ గారణము పరమాత్మ కాదనియు నీశ్వరుఁడే యనియు నిశ్చయింపఁబడుట దీనికిఁగారణము. ప్రాణాయామ ధారణములు మహాభారతమునఁ జేర్కొనఁబడెను.3. పౌరాణిక యుగమునందలి యోగులు పెక్కుమంది, విచిత్ర

(౪) యోగ. సూ. ౧, ౧౭.

(౫) మజ్ఝిమనికాయము, ౧, ౧౬౪.

(౧) యో॥ సూ, ౧. 33

(౨) వివరములకుఁజూడు. హాప్కిన్సు: మహాభారతయోగపద్ధతి.

(3) మ, భా, ౧౨-౧౧౬౮3-౪.

యోగశక్తులనుర. సంపాదించునిమిత్తము యోగాభ్యాసరతులై రని మహాభారతము వచించెను.౫.

ఉపనిషత్తులును, మహాభారతము, భగవద్గీతయును, జైన బౌద్ధ మతములును యోగాభ్యాసముల నంగీకరించినవి. యోగసిద్ధాంతమునకు మూలపురుషుఁడు బ్రహ్మయని చెప్పఁబడెను. తన కాలమున నసంస్కృతములై వ్యాప్తిలోనున్న ధ్యానతపోవిధానముల నన్నిటిని సంస్కరించి పతంజలి శాస్త్ర నిర్మాణమొనర్చి యుండెనని చెప్పవచ్చును. అపరిణతావస్థలో నున్న సాంప్రదాయిక భావములను నాఁటి జీవితానుభవావసరముల ననుసరించి, పతంజలి సూత్రీకరించెను. ఈతని రచన తన కాలపరిస్థితులను బ ంబించుచున్నది. ఇందు శ్రేష్ఠతమ యోగ విద్యాంశములతోఁబాటు, నాఁడు ప్రజాబాహుళ్యములో వ్యాప్తిగాంచియున్న యనేకవిశ్వాసములు గలిసి యున్నవి.

వాత్స్యాయనుఁ డింకొక పూర్వయోగమును గూర్చి పలికినాఁడు. జీవుని కర్మవలనఁ బ్రపంచోత్పత్తి యైనదనియు, రాగద్వేషములు, క్రియాపరత్వము, అభావోత్పత్తి భావనాశనము కర్మవలననే జనించెననియు నీ యోగసిద్ధాంతము

(౪) మ. భా, ౧౨-౩౭౬-౮.

(౫) మ. భా. ౧౨-౩౪౦-౩౫౬ ; ౧౨-౩౦౩-౧౬౩ ; ౧౩-౧౪-౪౨౦.

చెప్పును.౧. మానవప్రయత్నము నీయోగము ముఖ్యమని చెప్పుటచే, సాంఖ్యమునకంటెఁ బూర్వమీమాంసయొక్క కర్మసిద్ధాంతముతోఁ బోలిక కలిగియున్నది. పూర్వమీమాంస సత్కార్యవాదము నంగీకరించి, ఆత్మ నిత్యమనియు, దేహేంద్రియ మనో జడపదార్థలక్షణము లన్నియు నాత్మసంయోగముచేఁ జీవానుభవహేతువు లయ్యెననియు వచించెను. ఆత్మ స్వరూపము, కర్మ, కారణధర్మము మున్నగు ప్రధానవిషయములలో సాంఖ్యయోగములకుఁ దీవ్రభేదములున్నవని వాత్స్యాయను నభిప్రాయము. సాంఖ్యతత్త్వమునకుఁ గర్మప్రాధాన్యమును జేర్చినచోఁ బ్రాచీనయోగతత్త్వ మగును.

### 3—కాలము; సారస్వతము.

యోగశాఖకు సనాతన పాఠ్యగ్రంథము పతంజలియోగసూత్రమే. ఇందు నాలుగుభాగములున్నవి. మొదటిది సమాధి స్వరూప లక్ష్యములను లేక సమాధిలో లీనమగుటను దెల్పును గాన సమాధి పాదమనఁబడెను. రెండవది దీనినార్జించు సాధనములను దెల్పునది గావున సాధనపాదమనఁబడెను. యోగ సాధనములచేఁ బొందనగు నతీంద్రియ శక్తులను వివరించునది గావున మూఁడవది విభూతిపాదము. ముక్తిస్వరూపవివరణము

---

౧, బురుషకర్మనిమిత్తో భూతసర్గః, కర్మహేతవో దోషాః ప్రవృత్తిశ్చ స్వగుణవిశిష్టాశ్చేతనా, అసదుత్పద్యతే ఉత్పన్నమ్ నిరుధ్యత ఇతి యోగానామ్. (న్యా.భా. ౧-౧-౨౯). ఇంద్రియావయవములు భూతపరికల్పితములని యోగము చెప్పునని ఉద్ద్యోతకరుఁడు పలికినాఁడు.

చేయును గావున నాల్గవది కైవల్యపాదమైనది.౧. యాజ్ఞవల్క్య స్మృతిననుసరించి, యోగతత్త్వము మూలస్థాపకుఁడు హిరణ్య గర్భుఁడు. కాని యోగసూత్రకర్త పతంజలియనుటకిది ప్రతి బంధకముగాదని మాధవుఁడు వ్రాసినాఁడు; ఏలనఁ బతంజలి తనగ్రంథమునకు "అనుశాసనమ"ని పేరిడినాఁడు.'అను' శబ్దము వలనఁ దనగ్రంథ మొక పూర్వశాస్త్రము ననుసరించి రచింపఁ బడెనేకాని యిదియే ప్రథమశాస్త్రముగు కాదని తెలుపును.౨.

౧. యోగసూత్ర చతుర్థభాగములో నితరతత్త్వ విమర్శనయుండుట చేతను, తృతీయభాగాంతమందు గ్రంథాంతమును సూచించు 'ఇతి' శబ్ద ముండుటవలనను గొందరునాల్గవభాగము తరువాతఁజేర్పఁబడెనని తలచిరి. (చూ, దాసుగుప్త, హిస్టరీ ఆఫ్ ఇండియన్‌ఫిలాసఫీ,పు, ౨౩౦) ౨ సర్వదర్శన సంగ్రహముగా౧౫అ. ౩ పతంజలియోగసూత్రము క్రీ,పూ, ౨-వ శతాబ్దమునకుఁ జెందినది క్రీ॥వె॥౪-వ శతాబ్దమునకుఁజెందునని కొందరభిప్రాయపడిరి.అణు సిద్ధాంతము (౧-౪౦) సౌత్రాంతిక క్షణిక వాదము ౪-౫౨),స్ఫోటవాదము (చూ,యో,భా, ౩॥౧౬ బౌద్ధతత్త్వము (౪-౧౫-౧౬) యోగసూత్రములో పేర్కొనఁబడెను, వసుబంధునితత్త్వము వై.సూ. నందుఖండింపఁబడినదని నిశ్చయించి, యోగసూత్రము క్రీ వె. నాల్గవ శతాబ్దపూర్వము కాఁజాలదని ప్రొఫెసర్ వుడ్సుతెలపినాఁడు. నాగార్జునుఁడు తనకారికలోయోగమును స్మరించనికారణము ఓనిని సమర్థించుచున్నది. కాని యీవాదమునిజమైనది. గాదు. ఏలననాగార్జునుని ఉపాయకౌశల్యహృదయశాస్త్రముయొక్క చైనా భాషానువాదమష్టవిధతత్త్వములలో యోగమొకటియని పేర్కొనియున్నది బౌద్ధతత్త్వము వసుబంధు, అసంగులకుఁ బూర్వతరమైనది. యోగతత్త్వము క్రీ,పూ, ౩౦౦ నుండియుఁ బ్రచారములోనున్నదని జాకోబీపండితుఁడుచెప్పి నాఁడు. ఉమాస్వాతితత్త్వార్థసూత్రము ౨-౫౨ యోగసూత్రము ౩-౨౨ ను స్మరించినది. ఉమాస్వాతి, తనభాష్యకారుఁడైన సిద్ధసేనునికి (క్రీ, వె, ౫-వ శతాబ్దము) పూర్వుఁడుకావలెనుకావున క్రీ,వె, ౮-వ శతాబ్దమునకుఁ జెంద వలెను. అందుచే పతంజలి క్రీ వె. ౭-వ శతాబ్దానంతరమునకుఁజెందఁడు.

వ్యాకరణ శాస్త్ర కర్తయైన పతంజలి క్రీ. పూ. రెండవ శతాబ్ద మధ్యమకాలమునకుఁ జెందునని చెప్పఁబడెను. ఇతఁడే యోగ సూత్రకర్తయని నిరూపింపఁబడలేదు. (౧) (క్రీ. వె. ౪-వ శతాబ్దము) యోగసూత్రమునకు వ్యాసుని భాష్యము యోగసిద్ధాంతములను వివరించు ప్రమాణగ్రంథము. వ్యాసభాష్యమునకు వాచస్పతి (క్రీ. వె. ౯-వ శతాబ్దము.) తత్త్వవైశారదియను వ్యాఖ్య రచించినాఁడు. భోజ విరచిత రాజ మార్తాండముకూడఁ గొంత ప్రాముఖ్యముగల గ్రంథమే. విజ్ఞాన భిక్షువిరచితయోగవార్తికము, యోగసారసంగ్రహము విఖ్యాత రచనలైయున్నవి. ఈతఁడు కొన్నివిషయములలో వాచస్పతి భావములను ఖండించి, యోగతత్త్వము నుపనిషత్తుల తత్త్వము

(౧) యోగసూత్రముపైఁ దానువ్రాసిన రాజమార్తాండ భాష్యము నందు (ఉపోద్ఘాతము, పు. ౫) తాను వ్యాకరణయోగాయుర్వేదములను గూర్చి గ్రంథములను రచించితిననియుఁ, దానందుచేఁబతంజలివలెనే, వాఙ్మనశ్శరీరదోషములను క్షాళనముచేసితిననియు భోజుఁడు వచించెను. దీనివలనఁ బతంజలియు వ్యాకరణయోగాదివిధగ్రంథములను రచించెనని సూచనచేయఁబడెను ఇదియే ప్రాచీనతమమైన ప్రశంస. కాని తనగ్రంథమున నుపోద్ఘాతము భోజుఁడే రచించెనా యనునది సంశయాస్పదము. తనయోగసిస్టమ్ (హార్వర్డ్ ఓరియంటల్ సీరీస్) న నుపోద్ఘాతములో వుడ్సు పండితుఁడు మహాభాష్యకర్తయగు పతంజలియు, యోగసూత్రకర్తయగు పతంజలియు నొకఁడు కాఁడని సాక్ష్యములఁ జూపెను. రెంటికిని భాషాసామ్యముఁగాని, విషయసామ్యములుగాని లేవు ఇరువురు పతంజలులొకరేయని సుప్రసిద్ధవైయాకరణులైన భర్తృహరి, కైయటుఁడు, వామనుఁడు, నాగేశుఁడు చెప్పియుండలేదు.

నకు సరిపడునట్లు చూపయత్నించినాఁడు.౨. ప్రతితత్త్వమును, యోగపద్ధతులను దనభావముల కనుగుణముగామార్చి ప్రకటించెను. మైత్రి, శాండిల్య, యోగతత్త్వ, ధ్యానబిందువున్నగు కొన్నియనంతరోపనిషత్తులు యోగసూత్రముల కధిక ప్రాముఖ్యము నిచ్చియున్నవి.

## ౪–సాంఖ్యము - యోగము

కొలఁదిభేదములతో సాంఖ్యతత్త్వమునంగీకరించి, దాని నాధారముగాఁజేసికొని, యోగమునుగూర్చిన భావములను పతంజలిసూత్రీకరించెను. పురాతనగ్రంథములలో యోగనియమములు, సాంఖ్యభావములతోఁ గలిసియే కన్పట్టుచున్నవి. ౧ సాంఖ్యముచెప్పిన యిరువదినాల్గు తత్త్వముల నంగీకరించి, యోగసూత్రము వానినిగూర్చి చర్చింపనైన యత్నింపలేదు. ప్రపంచమున కాదియునంతమును లేదు; అది మారుచుండును. అది నిజస్వరూపములో గుణసంయుక్తమైనట్టియు నెల్లప్పుడొకతే రైయైనట్టియుఁ బ్రకృతి. గణనాతీతములైన యాత్మలున్నవి; ఇవి జీవులకుఁ జైతన్యమిచ్చి, శుద్ధనిత్యస్వరూపములైయుండును. కాని యివి జగత్సంసర్గముచే, (బరోక్షముగానివి సుఖదుఃఖానుభవకర్తలై. సంసారయాత్రలో ననేకదేహముల ధరించు

(౨) యోగతత్త్వములగూర్చిన యితరగ్రంథములు నాగోజీభట్టు, నాగేశభట్టు, నారాయణభిక్షువు, మహాదేవుఁడు తమవాదముల కనుగుణముగాఁ బతంజలి భావములను మార్చుకొనిరి.

(౧) చూ. ౪౮. ఉ. యోగసూత్రములకు వ్యాసుఁడు రచించినది సాంఖ్యప్రవచన భాష్యమనఁబడును. సాంఖ్యయోగముల కెంతసన్నిహిత సంబంధమున్నదో దీని వలనఁ దెలియఁగలదు.

మన్నవి. ప్రకృతిపరిణామవిషయములో యోగతత్త్వమునను సరించి, రెండుసమపరిణామక్రియలు లున్నవనియు నివి మహత్తు నుండి యారంభించి, యొకవైపున నహంకారము, మనస్సు, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములును, వేఱొక వైపునఁ బంచభూతములు, పంచతన్మాత్రలుగఁ బరిణమించు ననియుఁ జెప్పఁబడెను. వ్యాసునను సరించి,పంచస్థూలభూతములు తన్మాత్రలనుండి జనించెను; పదునొకండింద్రియములు నహం కారము లేక అస్మితభావమునుండి యుద్భవించెను. తన్మాత్రలు స్థూలభూతములనుండి జనించలేదు; కాని యివియు నస్మిత ముతోఁ గలిసి, మహత్కారణముచే నాఱు ప్రత్యేక తత్త్వము లైనవి. బుద్ధివికారములను వ్యాసుఁడు రెండు వర్గములుగా మాత్రము విభజించినాఁడని విజ్ఞానభిక్షువు తలచినాఁడు కాని, యహంకారముతో సంబంధము లేకుండ మహత్తునుండి తన్మా త్రలు జనించెనని యాతఁడును సూచించి యుండలేదు.౧.సాంఖ్య మునందు సాత్త్వికమైన యహంకార మింద్రియములను, తామ సాహంకారము తన్మాత్రలను నుద్భవింపఁ జేసెననియు, రెండును మహద్వశములై యున్నవనియుఁ జెప్పఁబడుటచే,సాంఖ్యయోగ పరిణామక్రియములలో నెన్నఁదగిన భేదమేమియును లేదు. సాంఖ్యము యొక్క అంతరింద్రియత్రయమును యోగము చిత్తము క్రిందఁ జేర్చినది. అహంకారమును మనస్సును బుద్ధి నుండి వేరని యోగమంగీకరింపదు. మఱియు నింద్రియములు

(౧) యోగవార్తికము, ౧, ౪౫.

స్థ తలఁచుటచే, యోగతత్త్వమునకు
కిరావసరము కన్పట్టలేదు.

వస్తువుల స్వస్వరూపజ్ఞానలోపముచేఁ గామాదు లుద్భ యించి, లోకములోని సర్వదుఃఖములకును క్లేశములకును హేతువులగు చున్నవి. ప్రపంచ మనాది యగుటచే నజ్ఞానమున కాది యేదియను ప్రశ్నయు నర్థరహితమైనది. ప్రళయకాలమందైనను పురుషుల చిత్తములు ప్రకృతిలోఁజేరి, కొంతకాలము విశ్రమించి, పునస్సృష్టికాలమునఁ దమతమ అవిద్యలతోఁ దిరిగి సృజింపఁబడును. కొలఁది మార్పులేవైన వ్యక్తిగతావిద్యలవలనఁ గలిగినఁ గలుఁగ వచ్చును. వీని యవిద్యాస్వరూపముల ననుసరించి కర్మాశయ జాత్యాయుర్భోగములు లభించుచుండును. యోగసూత్రము ననుసరించి యీశ్వరుఁడు నవిద్యయు సృష్టి కారణములు. అవిద్యాప్రభావము వలన, నిత్యపరిభ్రామ్యమాణ మగు ప్రకృతిశక్తి, భౌతికమానసిక ప్రపంచ వికారరూపములుగా మార్పు నొందును; యీశ్వరుఁడు ప్రకృతికి దూరస్థుఁడయ్యు, నవరోధములను దొలఁగించును. అవిద్య వివేక శూన్యమైన దగుటచే ననంతకోటి పురుషుల కామముల నెఱుఁగఁ జాలదు; పురుషుల కామముల కనుగుణముగాఁ బ్రకృతివికారముల నీశ్వరుఁడు చిత్స్వరూపుఁడు గాన, మార్చుచుండును. జీవి జడపదార్థపంక మగ్నుఁడైనాఁడు; ఇది యాతని సహజపావనత్వకలుషరాహిత్యమునుండి పతనము. సాంఖ్యములో వలె యోగమునందలి జీవి ప్రకృత్యధీనుఁడుగాఁడు. ఆతనికొక్కఁడు స్వాతంత్ర్యమున్నది; మఱియు దైవసాహాయ్యముచే ముక్తిని సాధించఁగలఁడు. సాంఖ్య

మునందువలెనే యోగమునందును మనము పునర్జన్మదుఃఖాములనుండియే విముక్తి పొందవలెను, పురుషునకుఁ బ్రధానముతో సంబంధమే సంసారకారణము; ఈసంపర్కనాశనమే ముక్తి; పూర్ణజ్ఞానమే దీనికి సాధనము.౧. ఆత్మ సాక్షి లేక ద్రష్ట; ప్రధానము జ్ఞానవిషయము;౨. రెంటి సంయోగము సంసార హేతువు.

ప్రకృతినుండి పురుషుని వేరుచేయుటయే మోక్షోద్దేశము; రెంటికి భేదము తెలియుటే సాధనము. జ్ఞానమే ముక్తి సాధనమని సాంఖ్యము జెప్పగా, నేకాగ్రతయుఁ దీవ్రప్రయత్నము నవసరములని యోగముచెప్పును.3. మనమిదివఱకుఁ

(౧) దుఃఖబహులః సంసారో హేయః ప్రధానపురుషయోః సంయోగో హేయహేతుః సంయోగస్యాత్యంతికీనివృత్తిర్హానమ్ హానోపాయః సమ్యగ్దర్శనమ్, (యో॥ భా॥ ౨, ౧౫.) (౨) ౨, ౧౭

(3) జ్ఞానము, యోగము మోక్షమునకుభిన్నమార్గములని పలికి, మధుసూదన సరస్వతి తనగీతాభాష్యమునందు (భ॥ గీ॥ ౬.౨౯) యోగవాశిష్టము నుండి యిట్లుదాహరించినాఁడు: "అహంకారయుక్తమైన మనస్సు నణఁచివేయుటకు యోగము, జ్ఞానము రెండుసాధనములు. మనఃప్రవృత్తిని యోగము నిరోధించును; జ్ఞానము సత్యావబోధము. కొందఱకు యోగము సాధ్యముకాదు; కొందరకు జ్ఞానము దుస్తరము."

"ద్వౌక్రమౌ చిత్తనాశస్య యోగోజ్ఞానంచ రాఘవ।
యోగోవృత్తి నిరోధోహి జ్ఞానమ్ సమ్యగవేక్షణమ్,
అసాధ్యఃకస్యచిద్యోగః కస్యచిత్తత్త్వనిశ్చయః॥

పోల్చు. భగవద్గీత; "నిర్వ్యాణానామ్ జ్ఞానయోగోన్యాసినామిహకర్మను". భగవద్గీత ౫. ౫. యోగసారసంగ్రహము ౧.౭. ఈభేదము మనమనస్తత్త్వముబట్టి యుండునును, అంతర్దృష్టియుకలవాఁడు యోగమును, బాహ్యదృష్టికలవాఁడు సాంఖ్యమును గ్రహించును.

జూచియున్నట్లు, భగవద్గీతయందును శ్వేతాశ్వతరోపనిషత్తు నందును జ్ఞానమువలన ముక్తికి సాంఖ్యమును నిష్కామకర్మ వలన మోక్షప్రాప్తికి యోగమును జెప్పఁబడెను.౧. అందుచే సాంఖ్యము తర్కప్రమాణ విచారము చేయుచుండఁగా, యోగము భక్తిసాధనములను, చిత్తనిగ్రహోపాయములను జర్చించును. అందువలన యోగమునకు దేవుఁడవసరమగుటచేఁ గపిలుని నిరీశ్వర సాంఖ్యమునకుఁ బ్రతిగా సేశ్వర సాంఖ్యమనిపించుకొన్నది. జీవిని జడపదార్థబంధములనుండి విడిపించుటే యోగలక్ష్యము. ఉత్కృష్టపదార్థరూపము చిత్తము; చిత్తప్రవృత్తిశృంఖలముల నుండి విముక్తినిగాంచు నుపాయములను యోగము నిర్వచించినది. చిత్తమును సహజవ్యాపారమునుండి నిగ్రహించి, ప్రకృతి దుఃఖమును బోనాడి సంసారమును దరింతుము.

## ౫—మనస్తత్త్వసిద్ధాంతము.

దేనిని సాంఖ్యము మహత్తనెనో దానినే యోగము చిత్తమనెను ౨, ఇది ప్రకృతియొక్క ప్రథమసంతానము; బుద్ధ్యహంకారమానసము లీచిత్తములోనివేయని విశాలార్థము చెప్పఁబడెను.3, ఇది త్రిగుణబద్ధమై, గుణముల పరిమాణభేదము ననుసరించి నానావికారములను బొందుచుండును. ఇదినిశ్చయముగా

(౧) భ. గీ॥ ౧౩–౨౪. మఱియుఁ జూడు. మ॥భా॥౧౨, ౧౧౬౪౯–౧౧౭౦౭. మఱియుఁజూడు. స॥ సి॥ సా॥ సంగ్రహము; ౧౦, ౪–౬. ఇందు యోగమునను సరించి కేవలజ్ఞానము నిరుపయోగమని వక్కాణింపఁబడెను.

(౨) వేదాంతమునందు బుద్ధికేక బుద్ధివికారములకే చిత్తమని చెప్పఁబడెను. చూ వేదాంతసారము.

(3) చిత్తశబ్దేన అంతఃకరణమ్బుద్ధిమ్ ఉపలక్ష్యతి. (వాచస్పతి)

నచేతనమేకాని, సన్నిధానవర్తియగు నాత్మప్రతిబింబమువలనఁ జేతనమగుచున్నది. ఇంద్రియముల ద్వారమున వస్తుసంసర్గముచేఁ గలుషితమైనప్పుడది బహువికారముల నందుచున్నది. పురుషచైతన్యమందుఁ బ్రతిఫలించుటచేఁ జిత్తము తానే భోక్తయని తలంచును. చిత్తము నిజముగా నుపకరణమే; ఆత్మయే చిత్తద్వారమునఁ జూచుదృష్ట. కారణమగుటచేఁ జిత్త మాకాశమువలె సర్వవ్యాప్తి కలది; ప్రతిపురుషున కొక చిత్తముతో సంబంధముకలదు కావునఁ బురుషుల వలెఁ జిత్తములు ననంతసంఖ్యాకములు. జన్మాంతర పరంపరలోని దేహపరిమాణముననుసరించి, చిత్తముకూడ నల్పాధికపరిమాణములందుచుండును. పురుషుఁడొక పశు దేహమునొందినపుడు చిత్తము సంకోచమంది, మానవదేహ ప్రాప్తికల్గినపుడు వృద్ధిపొందును. ఈ పరిమాణభేదమందు చిత్తమునకుఁ గార్యచిత్తమని పేరు; ఇవి వివిధచేతనదశారూప ములలో గోచరించును. మరణకాలమునందు, ఁబురుషులతో సంయుక్తమైన కారణచిత్తము, పూర్వపుణ్యపాప ఫలానుగుణ ముగాఁ బ్రకృతిపూరించు 'అపూర'ము వలననేర్పడిన నూతన శరీరమునందుఁ గార్యచిత్త రూపమంది గోచరించును. చిత్తమును దనలోనియుడ్చుకొను వేరొక సూక్ష్మశరీరావసరము యోగతత్త్వమున కవసరములేకపోయినది. ౧. కారణచిత్తమెల్లప్పుడేకము సర్వవ్యాపియు నైయుండఁగా, ఁదాను ధరించు దేహముననుసరించి కార్యచిత్తము పరిమాణభేదములనందు

---

(౧) సూ॥ తత్త్వవైశారది. ౪, ౧౦.

చుండును.౨. రజస్తమోగుణములనణఁచివేసి, కార్యచిత్తమును దన సహజసర్వవ్యాపిత్వముగల కారణచిత్తస్థితికిఁ దెచ్చుటయే యోగశిక్షణలక్ష్యము. చిత్తము సర్వవ్యాపిత్వలక్షణమును సంపాదించినపుడు యోగి సర్వజ్ఞుఁడగును. చిత్తము పురుషుఁడంత శుద్ధమైనపుడు ముక్తినొందును. చిత్తద్వారముననే పురుషుఁడు వస్తుజ్ఞానమునుకలిగి, లోకముతో సంబంధమునుబెట్టుకొనును.3. చిత్తము పురుషునినిమిత్తమే యున్నది. పురుషుఁడు చిత్తవిజ్ఞానభావ సంకల్పము౧.లకంటె లోపల నున్నవాఁడు పురుషుఁడు జ్ఞానపీఠమని౨. చెప్పఁబడెనుగాని, జ్ఞానమువలనఁ బురుషస్వభావము మారదు. చైతన్యము, చిత్తదర్పణమునందుఁ బ్రతిఫలించునపుడు, చిత్తము బాహ్యవిషయరూపము నెంత కలిగియున్నదో యంతవరకుఁ జిత్తరూపమును బొందుటచే

---

(౨) చిత్తము సర్వవ్యాపకత్వముగలదని సాంఖ్యము భావింపదు యో॥ సూ॥ ౪, ౧౦కి వ్యాస వాచస్పతులవ్యాఖ్యలు చూడుము. పోల్చ నాగేశుఁడు: సాంఖ్యాః ప్రతిపురుషమ్ సర్వశరీర సాధారణమ్ ఏకైకమేవ చిత్తమ్. కింతు ఘటప్రసాదరూపమ్, స్వల్పమహదాశ్రయ భేదేన ప్రదీపవత్ స్వల్పమహచ్ఛరీరభేదేన సంకోచవికాస చాలితయా స్వల్పమహత్పరిమాణమ్చ, నతువిభుః (౪-౧౦)

(3) ౧, ౨; ౨- ౬; ౧౮, ౨౦.

(౧) చిత్తము పురుషునితో సంయుక్తముగాదు; సమీపమందున్నది. ఈ సామీప్యము పురుషునితో దేశకాలసంబంధ ఫలితముకాదు. విశేషమేమన చిత్తమునకుఁ బురుషునకు సహజసామరస్య మున్నది. పురుషుఁడు భోక్త; చిత్తము భోగ్యము. అనేక వస్తురూపవికారములనొందు చిత్త మనుభవవిషయమని వర్ణింపఁబడెను. (వాచస్పతి॥ ౧, ౪.)

(౨) ౨, ౨౦॥

జ్ఞానోత్పత్తియగుచున్నది. చిత్త మనేక వికారములనంది, తాను దర్శించు బాహ్యవస్తువుల రూపమునుబొందును. కాని చిత్తము తానుజూచు వానినెఱుఁగఁ జాలదు. ఏలన నది యచేతనము౩. ఆత్మ ప్రతిబింబ సంయోగముచే వస్తుజ్ఞానము చిత్తమునకుఁ గలుగును. వస్తుజ్ఞాన విషయములోఁ జిత్తము ద్రష్టవలనను, దృశ్యమువలనను గూడ సంచలితమగును. చిత్తము నిత్యము మారుచున్నను, మన జ్ఞానము మార్పులేనిది; ఏలన నాత్మ యెన్నడును మారని నిజమైన ద్రష్ట. మఱియుఁ జిత్త మొక్కె క్షణమున నొక్కెవికారము నొందును. గావున నొక్కె క్షణమున నాత్మ యొక్కె వస్తువును దెలియఁగలదు. అందుచే మన కేక కాలమునందుఁ జిత్తము వస్తువు రెండును దెలియవు.౪. దృష్టములైన వస్తువులు మన దృష్టిలో సంబంధములేకుండ స్వాతంత్రి స్థితిగలవే. ఒక వస్తువునుగూర్చిన జ్ఞానకారణము వస్తుకారణము గాదు.౫ రెండు భిన్నభావము లేకకాలమున నుదయింపవు.౬. చిత్తమునం దుదయించిన భావముద్రలు వాసనారూపములను ధరించి, మన లక్ష్యలక్షణములను పునర్దర్శనాదికమును గలుగఁ జేయును. చిత్తపరివృత్తులు గొన్ని శక్తుల నుద్భవింపఁజేయును. అవి తిరిగి కొన్ని శక్తులకుఁ గారణములగును; అందుచే సంసార

(3) ౪, ౧౭-౧౯.
(౪) ౪, ౨౦.
(౫) ౪, ౧౬.
(౬) ౪, ౧౯.

చక్రి మెడ తెగక పరిభ్రమించుచుండును.౧. ఈ సంబంధముల వలన రాగద్వేషములును, 'నేను' 'నాది' యను భావములు నుదయించును. కామతృష్ణా సముద్భూతమే సంసారజీవితము. లోకానుభవముపై నాధారపడియున్న అహంకారము దృష్టి కాదు. అహంకారజీవితము తృప్తిలేని యశాంతితో నిండి యుండును. ఏలన నది పంచాకృతిగల యవిద్యావశమై యున్నది. అనిత్యమును నిత్యమనియు, నశుద్ధము శుద్ధమనియు దుఃఖము సుఖమనియు, ననాత్మ నాత్మ౨. యనియుఁ దానుగాని మన శ్శరీరములు దా ననియు౩, రాగమనఁగా సుఖవస్తుసంగము, ద్వేషమనఁగా దుఃఖమునిచ్చు వస్తుద్వేషము, అభినివేశము లేక బ్రతుకుటయందు సహజమైన తీపి, చావునందు భయము౪. నివి పంచవిధావిద్యలు. ఆత్మకుఁ జిత్తసంబంధమును ఛేదించుటే మోక్షము. చిత్తబంధములనుండి విముక్తమైన యాత్మ తన స్వస్థితినొంది, కామతృష్ణారహితమై, అహంకారశూన్యమగును. నిజస్వరూపములోఁ బురుషుఁడు, చిత్తవ్యాపారములకు సాక్షి మాత్రుఁడే యగును. చిత్తము వృత్తిపరమై యుండఁగా, పురు

(౧) ఏవమ్ వృత్తిసంస్కారచక్రమ్ అనిశమావర్తతే (యో॥భా॥౧, ౫)

(౨) ౨, ౫, పురుషబుద్ధి భేదజ్ఞానలోపమే (అఖ్యాతి) అవిద్య కాదు, కాని దగునని తలఁచుట లేక (అన్యతాఖ్యాతి) దీనివలన బుద్ధియే ఆత్మయని తలఁచి, అది శుద్ధము, నిత్యము, సుఖనిలయము నని భ్రమించుటయు అవిచ్ఛిన్నమగు సర్వక్లేశముల కవిద్యయే కారణము; కర్మవాసనా కోశహేతువు. (యో॥ భా॥ ౨, ౫.)

(౩) ౨, ౬.

(౪) ౨, ౭, ౯.

షుఁడు భిన్నావస్థల ననుభవించుచున్నట్లు గోచరించును; ధ్యాన ములోఁ జిత్తము నిశ్చలమై యున్నప్పుడు పురుషుఁడు స్వస్వ రూపములో స్థాయినొందును.

జ్ఞానముచే మోక్షమను సాంఖ్యసిద్ధాంతమును యోగ మంగీకరించును గాని, మనోనిగ్రహమే మోక్షప్రాప్తికిఁ బ్రధానమని వక్కాణించును. చిత్తవృత్తి నిరోధమనగా సుషుప్త్యవస్థా తుల్యమని యర్థముకాదు. యోగము లేక యేకాగ్రతవలన బాహ్యాకోశముల నతిక్రమించి, నిగూఢాత్మ సీమ కేఁగుదుము. చిత్తముయొక్క పంచదశలలో నేకాగ్రత దాని లక్షణమే.౧ రజోగుణ మతిశయించి, వస్తువులచే విక్షేపమందునపుడు చిత్తము క్షిప్తమందురు. మన కామరాగముల ననుసరించి, వస్తువులపై మన మనస్సును కేంద్రీకరింపవచ్చును; కాని యిట్టి యేకాగ్రత మోక్షసాధనము కాఁజాలదు. తమోగుణ మతిశయమై, నిద్రాగ్రస్తమైనపుడు చిత్తము మూఢ మనఁబడును. సహజలోపములచేఁ గాని, తాత్కాలిక క్లేశములచేఁ గాని తరచుగాఁ జకితమై యున్నప్పు డది విక్షిప్తమనఁబడును, సామాన్య మానసమిట్టి స్థితిలో నున్నది; ప్రియవస్తువుల నపేక్షించుచు నప్రియములఁ బరిహరించుచు నుండును. ఈమూడవస్థలును గుణత్రయ సంయుక్తములగుటచే, నపరిపూర్ణములే. సత్త్వగుణములతో నిండి, యేదేనొక లక్ష్యముపైఁ గేంద్రీకృతమగు చిత్తమున కేకాగ్రచిత్తమందురు. మహోన్నతప్రయత్నముల కీయేకాగ్రత సాధనమగును. వికారముల నరికట్టి నప్పు

(౧) సచసార్వభౌమశ్చిత్తస్య ధర్మః (యో॥ భా॥ ౧:౧)

డది నిరుద్ధచిత్త మనఁబడును. గత సంస్కారములుꣻ నిలిచి యున్నను, చిత్తవికారము లరికట్టఁబడును. చిత్తముయొక్క సర్వదశలలో నేకాగ్రిత యుండునని యోగతత్త్వజ్ఞు లంగీకరించిరి కాని, సమాధియందీయేకాగ్రత నిరుపమానోన్నత స్థాయి నంది యుండును. ప్రతిమానసిక వృత్తియు నొక సంస్కారమును దిగవిడుచును. ఈసంస్కారము చిరకాలమునఁ దిరిగి చైతన్యవంత మగును. సమానవృత్తులు సమానదృశ్యపథములనిచ్చును. యోగియైనవాఁ డీ చిత్తవృత్తుల నేకాక, గత సంస్కారములను గూడ నున్మూలింపవలెను; లేకున్నచో నవి తిరిగి మొలకెత్తును. చిత్తము వృత్తిరహితమైనపుడు, నిశ్చలమై, దానికి గోచరించు నేరూపమైనను, ననఁగా జ్ఞాని జ్ఞానజ్ఞేయములలో నే రూపమైనను ధరించును. ౧. వస్తుస్వరూపము నది గ్రహించఁగలదు.

ఈ చిత్తనైశ్చల్యములోఁ గొన్ని న్యూనావస్థలున్నవి. శబ్దార్థజ్ఞానసహితమైనది సవితర్కసమాపత్తి యనఁబడును. ౨. స్మృతి శబ్దార్థరహితమైనపుడు, వస్తువు తన సహజరూపములోఁ బ్రత్యక్షమగును. దీనినే నిర్వితర్కసమాపత్తి యందురు. 3.

(౨) ఇవి సంప్రజ్ఞాతాఽసంప్రజ్ఞాత సమాధిభేదములకు సరిపడును. మొదటిమూడును యోగతత్త్వములోనికిఁ జేఁబడెను. ఏలన, జాగ్రిదవస్థ యందైనను నేదోకొంత యేకాగ్రితయుండును. యత్కించిచ్చిత్తవృత్తి నిరోధమ్ (యోగసార సంగ్రహము. ౫.)

(౧) ౧, ౪౧.
(౨) ౧, ౪౨.
(3) ౧, ౪3.

వ్యాసుఁడు వ్రాసినాఁడు: "శబ్దములయొక్క వ్యావహారికార్థ స్మరణము స్మృతినుండి తొలగిపోవునపుడు, మఱియు సమాధి ప్రజ్ఞనుండి భావవికల్పములు, పూర్వశ్రుతదృష్టార్థములు నదృశ్యములైనపుడు, లక్ష్యవస్తువు తన నైజస్వరూపములలో నిరాచ్ఛాదితమై విశిష్టలక్షణయుక్తమై గోచరించును." ४. దీనిని పరప్రత్యక్ష మందురు. ఇదియే సర్వానుమాన శబ్దజ్ఞానములకు మూలాధారమైనది. దీనివలననే వాని కాకృతికల్గును. ౫. ఈ జ్ఞానము శబ్దానుమాన జ్ఞానసహితము గాదు. ౬.

మఱియు సవిచార నిర్విచారసమాపత్తులును గలవు. సవిచారసమాపత్తిలో దేశకాల నిమిత్తానుభవములతోఁగూడిన సూక్ష్మరూపములు కనిపించును. దీనియందొకభావముచే గ్రహింపనగు సూక్ష్మరూప ముదితమై యంతర్విలోకనవిషయమై ప్రకాశించును. నిర్విచారసమాపత్తియందు సర్వవస్తు సూక్ష్మరూపములు గుణవిరహితములై వస్తుమూలాకృతులలో గోచరించును. దీనియందు లక్ష్యవస్తువు చూపునొకటైపోవును.౧ .సవితర్క నిర్వితర్క సమాపత్తులు రెండును సూక్ష్మరూపములకు సంబంధించునవి; సవిచార నిర్విచార సమాపత్తులు స్థూల రూపములకు సంబంధించినవి. ఇవన్నియు సబీజసమాధిలోనివని చెప్పుదురు; ఏలన నవి యేకాగ్రతకు వలయు వస్తువులుగలిగి

(४) యో। భా॥ ౧, ४౨.
(౫) తచ్చ శ్రుతానుమానయోర్బీజమ్. తతః శ్రుతానుమానే ప్రభావతః
(౬) నచశ్రుతానుమాన జ్ఞానసహాభూతమ్ తద్దర్శనమ్. (యో॥ భా॥ ౧, ४౨)
(౧) యో॥ భా॥ ౧, ४४.

యున్నవి. సూక్ష్మరూపిదైనను, పురుషుఁడేకాగ్రచిత్తమునకు దృశ్యవస్తువు కాఁజాలఁడు.

మనచిత్తమనేక వ్యతిరేకశక్తులకు రణభూమియగుటచే వానిని నిగ్రహించి యొకసామరస్యమును జేకూర్చవలసియున్నది. ఆత్మసంరక్షణ సంతానోత్పాదన కాంక్షలు సహజబలోపేతములై నిగ్రహించుటకు దుస్సాధ్యములై బాధించును. ఏకాగ్రతకవరోధములు భిన్నరూపములగు విపరీతభావములు.౨. ఇవి అవిద్యాస్మితారాగద్వేషాభినివేశములు. రోగాలసతాసందేహ నిరంకుశత్వములు, మాంద్యము, లోకవ్యామోహము, కలుషదృష్టి, చాంచల్యము, మున్నగునవి యితరదోషములు.3. విపరీత భావములు చిత్తైకాగ్రత కననుకూల జీవితహేతువులగును; అనేకసందర్భములతోఁగూడిన యితరదోషములు చిత్తైకాగ్రతకవరోధములై వర్తించును.

## ౬—ప్రమాణములు

ప్రత్యక్షానుమాన శబ్దప్రమాణములు మూడును జ్ఞానసాధనములుగా నంగీకరింపఁబడెను.౪. ఇంద్రియద్వారమున నొక బాహ్యవస్తువు చిత్తమును స్పృశించినపుడు మనకుఁ బ్రత్యక్షమగుచున్నది. మానసవికారము వస్తువుతో ప్రత్యక్షసంబంధమును గలిగి యున్నది. వస్తువునకు సామాన్య విశేషలక్షణములు రెండు నున్నను, ప్రత్యక్షమందు మనకు విశేషముల

(౨) ౧. ౩౦.

(3) యో॥ భా॥ ౨, ౬; ౧, ౮.

(౪) యో॥ భా॥ ౧, ౭.

తోడనే సంబంధము కలదు. బాహ్యవస్తు యాథార్థ్యమును యోగతత్త్వమంగీకరించినది. జగత్తువలెనే, జగద్వస్తువు లన్నిటికి నిత్యములైన మూలరూపము లున్నవి; స్థూలరూపములు పరివర్తన మందుచుండును గాని, మూలరూపము లెన్నడును బూర్తిగా నశింపవు. ఒకవస్తు వింకొకటిగా మారినప్పుడు, దాని రూపమే మారినది; రూపములన్నియు నశించునపుడు వస్తువు మూలాకృతి నొందును. కాని యీరూపములు కేవల భ్రాంతి కల్పితములు గావు. వస్తువు లింద్రియముల స్పృశించు నపుడే వేదనలు కలుగును. మనకుఁ బ్రేరణకలిగించు వస్తువొకటే యైనను, వేదనలనేకములుఁ గావచ్చును. ఏలన, గుణత్రయములో నేదోయొక గుణప్రభావముతోఁ గూడిన వస్తుభావములను జిత్తము స్వీకరించును.౧.

వస్తువుల సామాన్య స్వభావమును మనము గుర్తించు మానసిక వృత్తియే అనుమానము. సామాన్య లక్షణాస్తిత్వ దర్శనమే అనుమానమున కాధారము. అవినాభావసంబంధము గలిగిన రెండు వస్తువులలో నొకటి ప్రత్యక్షమగుట వలన రెండవదియు నున్నదని నిశ్చయింప వీలగును.

పత్యక్షానుమానములచే నొక వస్తువును గూర్చిన జ్ఞానమునొక విశ్వాసపాత్రుఁడగు వ్యక్తి యితరులకు శబ్దముల వలన నందఁజేయవచ్చును. ఇదియే మూఁడవ జ్ఞానసాధనము.

యుక్తమైన జ్ఞాన మితరములైన చతుర్విధ మానసిక వృత్తులనుండి వేరుగాఁ దెలియవలెను. విపర్యయము వస్తుస్వభా

(౧) ౪, ౧౫-౧౭.

వస్తువునకు వ్యతిరేకమైన అయుక్త జ్ఞానము.౨. వికల్పమనగా నర్థములేని శబ్దముల రూపము.౩. జాగ్రత్స్వప్న వృత్తుల యభావముపై నాధారపడిన మానసిక వ్యాపారము నిద్ర.౪. మెలకువ కలిగినపుడు మనకెట్టినిద్ర కలిగినదో యాస్మృతి యున్నది కావున నిద్రమనోవ్యాపారమేయని చెప్పఁబడెను. కావున వ్యాసుఁడిట్లు చెప్పినాఁడు; "మేల్కొనిన మానవుఁడు, నిద్రాకాలములో నొకకారణానుభవము లేకున్నచో నీసంయోగ స్మృతి నెన్నడును గలిగియుండఁజాలఁడు. మెలకువ గాంచినపుడు దానిపై నాధారపడిన స్మృతులను గలిగియుండఁజాలఁడు."౧. అందుచే నిద్రయొక్క విశిష్టప్రత్యయము. దీనినిఁగూడ సమాధిలో నిగ్రహించవలెను. ఒకవస్తువుయొక్క పూర్వానుభవముచే విడువఁబడిన వాసనలవలన వస్తువుచుదిరిగి జ్ఞాపకమునకుఁ దెచ్చుకొనుటయే స్మృతి.

ప్రత్యక్షానుమాన శబ్దప్రమాణములచేఁ గలిగిన జ్ఞానము పూర్తిగా నిర్దుష్టముగాదని యోగము నిశ్చయించును; ఏలన సాంఖ్యతత్త్వమువలెనే యోగమును బురుషునకును బుద్ధికిని భేదము తెలియని విపర్యయ జ్ఞానమే మనయనుభవ జ్ఞానమని చెప్పును. వస్తువుల స్వస్వరూపజ్ఞానము యోగాభ్యాసమువలననే

(౨) ౧, ౮. (౩) ౧, ౯.

(౪) అభావప్రత్యయాలంబనావృత్తిర్నిద్రా. (౧, ౧౦)

(౧) "ఆగమేనానుమానేన ధ్యానాభ్యాసరసేనచ, త్రిధాప్రకల్పయన్ ప్రజ్ఞామ్ లభతేయోగముత్తమమ్. (యో॰భా.౧,౪౮) ఈమాటికిని శ్రవణమనననిధిధ్యాసతో సహవాసమున్నదని వాచస్పతి చెప్పినాఁడు.

లభింపఁగలదు. వ్యాసుఁడొక శ్లోకార్థము నిట్లుదాహరించినాఁడు: "శ్రుతులవలన, ననుమానమువలనను, ధ్యానములో నేకాగ్రతను నిలుపవలెనను కాంక్షవలనను, నీమూఁడుమార్గముల వలనను, మానవుఁడు తనయంతర్దృష్టిని వికసింపఁజేసికొని యుత్తమ యోగ ప్రాప్తినిబొందును." ౨.

౭ — యోగకళ.

మనస్సుయొక్క బాహ్యవినియోగమువలనఁగాక, దాని వృత్తులనణఁచివేసి, మనఃకోశమున కంతర్గతమై, సామాన్యజీవిత వ్యాపారములచే నాచ్ఛాదింపఁబడిన మన దైవత్వస్వభావమును లోనికిఁబోయియే దర్శింప వీలగును. ఆత్మ బీజరూపమునఁ బ్రతి జీవిలోనున్నను, మన శక్తులన్నియు వస్తుసంపాదనాయత్తములై యుండుటచే దానిని సరిగావ్యక్తీకరింపలేక పోవుచుంటిమి. మన విజ్ఞానమును మఱల సత్యమార్గమునఁబెట్టుటకు మనకు నిశిత శిక్షణమవసరము. తృష్ణను ౧ జయించుటవలనను, నిరంతరాభ్యాసబలమువలనను, మన చిత్తవృత్తులనణఁచివేయ వీలగునని యోగముపదేశించుచున్నది. ధర్మజీవనముచే దృష్ణను జయింపవచ్చును; చిత్తవృత్తి నిరోధమునకు మనశ్చాంచల్యమును లేకుండఁజేయవలెను. దీనికిఁ జిత్తశుద్ధినిచ్చు కర్మయు, బ్రహ్మచర్యము, జ్ఞానము, భక్తియు నవసరములైయున్నవి. ౨. దృష్టాదృష్ట వస్తు తృష్ణను విసర్జించి, యాత్మనిగ్రహము సాధించిన జితేంద్రియునకు కలుగుభావమే వైరాగ్యము. ౩.

(౨) ౧, ౧౨.

(౧) ౧, ౧౩-౧౪. (౨) యో॥భా॥ ౧, ౧౪. (౩) ౧, ౧౫.

అట్టి జితేంద్రియుఁ డిహపరలోక సుఖవిముఖుఁడగును. ఉత్తమ వైరాగ్యము సాధించినవాని కాత్మజ్ఞానముకలుగుటచే, వస్తుకాంక్ష గాని, వస్తుగుణలోలతగాని ప్రమాదహేతువులుగావు.(౪) దీనివలన ముక్తి సిద్ధించును. రజోలేశ సహితమైన వైరాగ్యము ప్రవృత్తి పరమగునుగావున దానివలనఁ బ్రకృతిలయమే ప్రాప్తించును.

మానవోపాధియందు స్థూలదేహము, ప్రాణకోశము, మనఃకోశము, పురుషుఁడునుండెను.(౫) మలినమైన మాంసము నకును; చపలమైన చిత్తమునకును, పురుషుఁడు లోపల

(౪) ౧, ౧౬.

(౫) యోగ మొకవిధమైన శరీరశాస్త్రమును బ్రచురించినది. శరీర మంతయు వ్యాపించియున్న 70 కోట్ల నాడులును; చక్రములును, వెన్నెముక మూలమున నున్న కుండలి యను నొక గొప్పశక్తియు నది మేల్కొన్నచో నీ చక్రముల నన్నిటిని చైతన్యవంతముల నొనర్చుననియుఁ జెప్పఁబడెను. మానవ దేహమున నూర్ధ్వాధోభాగము లున్నవి. హస్తశిరోమధ్యమము లూర్ధ్వభాగమును, ఊరువులు పాదములు నధోభాగమునై యున్నవి. ముఖ్యముగా మానవ దేహమునందు దేహమునకుఁ గేంద్రము వెన్నెముక మూలాధారము. ఇది రెండుభాగములకు నాధారభూతమైనది. నాడులు, సూక్ష్మనాడీ గ్రంథులు రెండు తత్త్వములుగా నేర్పాటైయున్నవి. మేధస్సును వెన్నెముకయుఁ గపాలమునందుఁగల కేంద్రములు, వెన్నెముకనే హిందూశరీర శాస్త్రవేత్తలు బ్రహ్మదండము లేక మేరుదండమనిరి. ఇందు సుషుమ్నానాడి యున్నది. ఈ నాడి మూలాధారచక్రమున నారంభమై; శిరస్సునందలి సహస్రారమం దంతమగును. స్వాధిష్ఠాన, మణిపుర, అనాహత, విశుద్ధము లితరచక్రములు. వెన్నెముకలో యోగనాడులు మూడున్నవి. ఇడాపింగళా సుషుమ్నా నాడులివి. ఇందు సుషుమ్నానాడి ముఖ్యమైనది. దీనికిఁ గుడివైపునఁ బింగళయు, నెడమ వైపున నిడయు నున్నవి. ఈనాడి కింద్రియగోచరములు కాని షట్చక్రములు లేకపద్మము లున్నవి. యోగదృష్టి కివి గోచరించును.

చుండుటచే నివి యోగమున కవరోధములగుచున్నవి. దేహ మన స్సంబంధ మత్యంతదృఢమైనది; ఏలన, "దుఃఖము, దైన్యము, దేహముయొక్క అస్వస్థత, ఉచ్ఛ్వాస నిశ్వాసములు నన్నియుఁ జపలచిత్త ఫలితములు." ౧. దేహారోగ్యమే మానవజీవిత పరమలక్ష్యము కాదు కాని, ముఖ్యావసరములలో నది యొకటై యున్నది. మానవుఁడొక భౌతికయంత్రమనియు దానికి బాహ్యమునుండి యొకయాత్మ జేరియున్నదనియుఁ దలపరాదు. భౌతికాధారమును విడిచిపెట్టుపద్ధతికిఁబోక యోగమందుచే దాని నంగీకరించి, యాత్మసమస్యలో నొకయంశముగా గ్రహించి నది.ఆటంకములను దొలగించుట కుపాయముగా మనకు యోగ మష్టాంగపద్ధతి నిచ్చినది.యమనియమాసనప్రాణాయామములు, ప్రత్యాహారము లేక యింద్రియములను లోనికిఁ దీసికొనుట; ధ్యానము లేక దృష్టి నొకచో నిలుపుట; ధారణ లేక లక్ష్యవస్తువునే తలఁచుట,సమాధి లేక యేకాగ్రతయు నష్టాంగములు.౨. చివరిమూఁడును ప్రత్యక్ష లేక అంతరంగసహాయకారులు; మొదటియైదునుపరోక్ష లేక బహిరంగసహాయకారులు.౩.

(౧) ౧, ౩౧. (౨) ౨, ౨౯.

(౩) పతంజలి తత్త్వములో నివన్నియు నొకశాఖకే చెందినవు,తరువాతి గ్రంథములలో భేదము లుదయించెను. కర్మవలన మోక్షము లభించునది కర్మ యోగము ఈశ్వరునియందు భక్తిచే ముక్తికలుగుమార్గము భక్తియోగము. జ్ఞానముచే మోక్షము జ్ఞానయోగము. మనశ్శక్తి శిక్షణమునిచ్చునది రాజయోగము. దేహప్రాణముల నిగ్రహించి, మంత్రములతోఁ గూడినది హఠయోగము. దేహనిగ్రహ విధానములవలన నాత్మజ్ఞానఫలితములు లభించునని చెప్పు ఆశివాదము రసేశ్వరదర్శనమునం దున్నది. (సు॥ద॥సం॥ ౯ అ.)

7 భారతీయ తత్త్వశాస్త్రము

## ౮—ధర్మానుష్ఠాన సిద్ధి

యోగాభ్యాసమునకు వలయు ధర్మానుష్ఠానసిద్ధిని చేకూర్చునవి యమనియమములు, అహింస, సత్యప్రియత్వము, ఆర్జవము, బ్రహ్మచర్యము, ప్రతి గ్రహము చేయకుండుట మన మభ్యసింపవలెను. అనగా ననృత చౌర్యవ్యభిచారదురాశా పర హింసాదుల నుండి మనము దూరస్థులము కావలెను.౧. వీనిలో ముఖ్యమైన దహింస; మిగిలిన వన్నియు దీనిలో నంతర్గతములై యున్నవి. సర్వథా సర్వకాలముల యందు సర్వజీవుల యెడ ద్వేషము లేకుండ నుండుటే అహింసయని విపులార్థముగాఁ జెప్పఁబడెను.౨. అహింస యనఁగాఁ గేవల హింసాత్యాగమే కాదు, వైరత్యాగము.3. దయామైత్రీ సంతోష స్థైర్యములు, సుఖదుఃఖసదసద్వస్తు సమత్వమును చిత్తప్రసాదనము నిచ్చును. మన మీర్ష్యారహితులమై, యితరుల దుఃఖముల కార్ద్రహృదయులము కావలెను.పాపమును ద్వేషించుచుఁ బాపియెడ మృదుత్వమును జూపవలెను. ఈనియమములు పూర్తిగా నభ్యసింపవలసిన వగుటచే ననుల్లంఘనీయములు. "చంపకుము" అనునది శాసనము, కాని దేశద్రోహులను గాని, సైన్యమునుండి పలాయితులనుగాని, మతద్రోహులను గాని, బ్రాహ్మణ నిందకులను గాని చంపవచ్చునని పైనియమమునకు న్యూనతకల్గించుట కవకాశము లేదు. ఆత్మ సంరక్షణార్థమైనను వధ పనికిరాదు.

(౧) ౨, ३०.

(౨) సర్వథాసర్వదాసర్వభూతానామ్ అనభిద్రోహః(యో॥భా॥౨,3०.

(3) ౨, 3౫.

యమములు దేశజాతి వయోఽవస్థాభేదములులేని కఠోరశాస నములు.౪. అందరకు నున్నతధ్యానమున కర్హతలేకున్నను, నివి సర్వజనులు నభ్యసింపవలయు నియమములై యున్నవి. బాహ్యాంతశ్శుద్ధియు, తృప్తి, తపస్సు, దైవభక్తియు నియమ ములు.౧. ఇవి విధులలోఁజేరవు; గాని యోగ మభ్య సింపఁ గోరువారు వీనిని నిత్యము ననుష్ఠింపవలెను. ఈయమ నియమానుష్ఠానము వలన నిహాపరసుఖ కాంక్ష నశించి శుద్ధ వైరాగ్యము కలుగును.౨.

నీతినియమోల్లంఘనము చేయు నుత్సాహము జనించి నపుడు, వానికిఁ బ్రతిపక్షభావనము చేయుట మంచిదని చెప్పఁ బడెను.౩. మనస్తత్త్వ విభాగజ్ఞులు మనకు మన చిత్తచాపల్యముల నరికట్టుటకు మూడు మార్గములను జెప్పిరి. మొదటి పద్ధతి యేమనఁగా మన కేయుద్రేకము కలిగినదో, దానికిఁ వ్యతి రేకమైన భావము నూహించి దానిని దరిమివేయుట; చిత్తములో సంస్కారరూపమునుండి పైకిరా యత్నించు నుద్రేకమును దానికి విరుద్ధమగు భావముతో నణఁచివేయుట రెండవది; మూడవది మనకుఁ గలిగిన యుద్రేకమున కతీతస్థితికిఁ బోవుట; మన జీవితస్వభావమును సంపూర్ణముగా మార్చుటే యోగముయొక్క మహదాశయము.

---

(౪) ౨, ౩౧.

(౧) ౨, ౩౨.

(౨) ౧, ౧౫.

(౩) ౨, ౩౩.

మనఃప్రవాహము రెండు వైపులకుఁ బ్రవహించును. మోక్షజ్ఞానముల వైపుకుఁ బ్రసరించు నపుడది మంచిదనియు, నవివేకముతోఁ గూడిన సంసారరూపములోని కది ప్రవహించు నపుడు చెడ్డదనియుఁ దెలియవలెను.౪.

కర్మలు బాహ్యాభ్యంతరములని రెండు విధములు. ఇవి మరల నాలుగు రకములు: కృష్ణకర్మలు:అనగా బాహ్యాభ్యంతర క్రూరకర్మలు; పరనింద. బాహ్యము; అశ్రద్ధ ఆంతరంగికము; శుక్లకర్మలు: లేక ధర్మవిహితములు, జ్ఞానశ్రద్ధాదులగు నివి మానసికములు. శుక్లకృష్ణకర్మలు, ఇవి బాహ్యకర్మలు; ఎంత మంచివైనను గొంతదోషము కలవి. వైదికకర్మలు కూడఁ గొంత హింసతోఁగూడి యుండును. అశుక్లాకృష్ణకర్మలు; ఇవి సర్వసంగత్యాగులగు జ్ఞానుల కర్మలు.౫. జ్ఞాని చేయునదే సర్వోత్తమ కర్మ యగును.

౯ — శరీరశిక్షణము.

చిత్తమునకెంత ప్రాముఖ్యమున్నదో దేహమునకు నంత ప్రాముఖ్యమున్నదని యోగతత్త్వము గుర్తించినది. ఏకాగ్రత కాసనము భౌతికసాహాయ్యము నిచ్చును.౧. మనము పరుగెత్తు చునో, నిద్రించుచునో దేనిపై మనస్సు లగ్న మొనర్పఁజాలము. మనము ధ్యానమారంభించుటకు ముందు సముచితమగు నొక యాసనములోఁ గూర్చుండవలెను. సులభము, సంతోషకరము,

(౪) యో॥ భా॥ ౧, ౧౨.

(౫) ౪, ౭.

(౧) చూ॥భ॥ గీత॥ ౪, ౧౦; ౨. ౪౬–౪౮,

స్థిరము నైన యాసనము కావలెననిమాత్రమే పతంజలి చెప్పి నాఁడు; పెక్కు తెఱఁగుల యాసనములఁగూర్చి భాష్యకారులు విపులముగా వర్ణించి చెప్పిరి. ఒకపాదముపై నొకపాదము నడ్డముగాఁబెట్టుకొని కూర్చుండి, నాభిస్థానమున దృష్టిని కేంద్రీకరించుటవలన సృష్టియొక్క మూలస్వరూపమును దెలిసికొనవచ్చునని భారతీయ తత్త్వజ్ఞులూహించిరని భారతీయవిజ్ఞానమును విమర్శించుచు నిటీవల నొకవిమర్శకుఁడు చెప్పుటలో నాతఁడనుకొన్నది యోగాసనములలో నొకటైయుండవచ్చును.

పశుకామ ప్రవృత్తికి దేహమాధారము కావచ్చును లేక దైవశక్తి కాకరముగా నగును. ఆహారవిషయములో వివేకమవసరమని చెప్పఁబడెను. నరముల కుద్రేకముకలిగించి, తాపాగ్నినిగాని నిద్రామాంద్యమునుగాని జనింపఁజేయు భోజన పానీయములను స్వీకరింపరాదని చెప్పఁబడెను. జీవితముయొక్క శారీరక భోగములవలన నాత్మానందము మందగించును. విజ్ఞానమయ జీవితము, ధార్మికానుష్ఠానము మానవజీవిత లక్ష్యములని యంగీకరించినయెడల శరీరావసరములకు వానిముందు నీచస్థానమునే పొందవలెను. యోగమునందలి యనంతరఘట్టములు విశేష శరీరక్లేశ సహిష్ణుతను గోరును. ఉగ్రములగు తపస్సాధనలుచేసిన కొందఱ శరీరములు, పాటవముతప్పి పడిపోవు ప్రమాదము తటస్థించిన సందర్భములుగలవు. అందుచే శరీరమును ముందుసరియగు నిగ్రహములోనికిఁ దేవలసియున్నది. జరాదోషవశముగాకుండ, కార్శ్యమునొందు నవకాశము లేకుండ,

దేహమును స్వచ్ఛమగు పరిపూర్ణసాధనము చేయుటయే హఠయోగాశయము.

యోగము దేహమును నిగ్రహింపుమనును గాని నిర్మూలింపుమనదు. కామలంపటత్వమును విడిచిపెట్టుట శరీరమును బలవంతముగా దండించిచంపుట కాదు. క్రైస్తవ యూరపు దేశములందును, హిందూదేశమందునుగూడ నీరెంటికిని భేదము తెలియక దురభిప్రాయపడిరి. ౧. దేహమును సుశిక్షణాభ్యాసములచే సంశుద్ధమొనర్చుటవలన సౌందర్య సౌకుమార్యములు, నిరుపమాన బలదార్ఢ్యములు లభించును. ౨.

---

(౧) పోల్సు సూసో తన ఆత్మకథలోఁ దన్నన్యునిఁగా భావించి తన యనుభవముల నిట్లు వ్రాసినాఁడు; "యౌవనములో నీతఁడుతీవ్రములగు నుద్రేకభావములు శక్తిపాటవములనుగల్గియుండి, వానివలన సంభవించిన దోషముల నెఱిఁగి, దేహనిగ్రహముచేయ నిశ్చయించి యనేకపద్ధతుల ననుసరించెను. చాలకాల మాతఁడొక బొచ్చుచొక్కాయును, నొక యినుపగొలుసును వాడెనుగాని వానివలన దేహము కొట్టుకొనిపోయి రక్తము కాలువలుగట్టుటచే వానిని విసర్జించెను. రహస్యముగా నాతఁడొక లోపలిచొక్కాను దయారుచేయించెను; దానిలో ప్రతివైపున తోలుముక్కల నతికించి, వానికి నూటయేబది కంచుమేకుల నమర్చి, పదునైదు సూదులవంటివాని మొనలను నిత్యము శరీరమాంసములోనికి గ్రుచ్చుకొనునట్లుగాఁ గూర్పించెను. ఈచొక్కా దేహమునకు మిక్కిలి బిగువగునట్లుచేయించి, ముందువైపున ముడిబిగించి, దేహమంతయుఁ దిరుగు నట్లేర్పాటు చేయించెను. దీనితోనే యాతఁడురాత్రి నిద్రింపనారంభించెను." (సిద్ధుఁడైన హెన్రీసూసో స్వీయచరిత్రము, అనువాదము, టి. యఫ్. నాక్సు.) ఈగ్రంథమున నింకను నెక్కువహృదయభేదకములగు వర్ణనలుకలవు. ఇనుపమేకులు గ్రుచ్చిన యేసుక్రీస్తు దుర్భరయాతనల ననుకరించిన క్రైస్తవభక్తుల గాథలనేకములుగలవు బెర్నార్డు, తెరిసా, జానుల కథలట్టివే. రూపలావణ్యబల వజ్రసంహననత్వాని కాయసంపత్, (3-౪౬.)

## ౧౦—ప్రాణాయామము

ప్రాణాయామమునకుఁ గొంత ప్రాముఖ్యమీయఁబడెను. గాని, పతంజలి దానినిఁ గేవలమిచ్ఛాపూర్వకమని విడిచి పెట్టెను. ౧. చిత్తప్రసన్నత ధర్మానుష్ఠానముచేఁగాని, ప్రాణాయామముచేఁగాని పొందవచ్చును. ౨. అందుచే దానియందు నమ్మకమున్నవారికే ప్రాణాయామ మంగీకరింపఁబడెను. ప్రాణాయామము చిత్తమును ప్రసన్నమొనర్చునని హఠయోగము దీని కున్నతస్థానమిచ్చినది. దీనివలన రహస్యశక్తులు కొన్ని కలుగుననియు నెంచఁబడెను. క్రమవిధానమున నూపిరి పీల్చి విడుచు వ్యాయామము నేఁడుకూడ నారోగ్యప్రదమని తలపఁబడుచున్నది. 3. ఈ వ్యాయామ మధికముగాఁ జేయుట వలనఁ గొన్నిసమయములలో భావపరవశతయుఁ గలుఁగ

---

(౧) ౧, 3౪.

(౨) ౧, 33–3౯.

(3) "ఆయుర్వృద్ధిసాధనము"లను విషయమునుగూర్చి డా. వీబర్ పండితు నుపన్యాసములోని యీక్రిందివాక్యము లీవిషయమునుగూర్చి కొంత ప్రసంగించినవి. "క్రమమైన సుదీర్ఘారోహణమువలన, హృదయముయొక్క బలమును, క్రియాశక్తియు మిక్కిలివిచిత్రముగాఁ బెంపొందినవి. ఈ కారణముచే, నూపిరిపీల్చు వ్యాయామమును జేయుటవలన నాకు నితరులకుఁగూడ నందు ముఖ్యముగా దుర్బలహృదయనాడి గలవారికి విశేషలాభములు గలిగినవి. నేను సామాన్యముగా దీర్ఘములైన పూరకరేచక వ్యాయామములను దినమునకు మూఁడులేక అయిదునిమేషముల కాలముచేయుట కారంభించి, క్రమముగాఁ బది పదునేను నిముషములవరకుఁ బెంచితిని." (బ్రిటిష్ మెడికల్ జర్నల్. డిసెంబరు ౫, ౧౯౦3.)

వచ్చును. దేహదార్ఢ్యము లేనివారు ప్రాణాయామము నధికముగాఁ జేయుటవలనఁ బ్రమాదము కలుగనచ్చును. అందుచే యోగవిద్య రహస్యముగా నుంచవలసినదయ్యెను. ౪.

౧౧–యింద్రియనిగ్రహము.

లోషి యను చైనాతత్త్వవేత్త బురదనీటిని శుభ్రపరచుటెట్లను ప్రశ్న వేసి, దానినట్లే కదపక విడిచిపెట్టినచో నదియే శుభ్రపడునని తానే బదులుచెప్పినాఁడు.౧. ఇంద్రియములను బాహ్యప్రవృత్తినుండి వెనుకకు మరలించి లోనికిఁదీసికొను ప్రత్యాహార మనునది నేటి మన సత్త్వశాస్త్రములో నింద్రియముల కంతర్వర్తిత్వము గూర్చుట యను(Introversion)పద్ధతికి సరిపడును.౨. బాహ్యమునుండి వచ్చు సర్వప్రేరణములకు మనస్సును దృఢసంకల్పముతో మూసివేయవలెను. క్రైస్తవగీత మిట్లు పలుకుచున్నది; "నిశ్చలముగానుండి తెలిసికొనుము." చంచలోద్రేకములను, వ్యర్థాలోచనములను, నిశ్చితసంకల్పముతోఁ దరిమివేయుమని యీ శిక్షణము బోధించును. ప్రతిసాధకుఁడును దన హృదయములోనే యొక ధ్యానగుహను నిర్మించుకొని నిత్యమందు నివసింప నేర్చుకొనుచుండవలెను.

---

(౪) చూ॥ చింతామణి హఠప్రదీపిక.

(౧) టావ్ టే ప్రభువు

(౨) "మనస్సు స్వవశమైయున్నప్పుడు దానియాలోచన యుత్కృష్టమైనదగును. అనఁగా దృశ్యములుగాని, ధ్వనులుగాని సుఖదుఃఖములుగాని మనస్సు నంటనపుడు, దేహముతో సంసర్గము కాని, దేహాభిమానము కాని లేక, యాత్మజిజ్ఞాసకలిగినప్పు డుత్కృష్టవిజ్ఞాన మిుదయించును." (ప్లేటో)

యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహారములు యోగమునకు సహకార సూత్రములేకాని, యోగాంగములు కావు.3.

౧౨—ధ్యానము.

భూలోక స్వర్గలోక రహస్యముల నన్నిటిని పెల్లగింప యత్నించు మానవ మానసముయొక్క అవిరతసంచార ప్రవృత్తి నిజూచి, బాహ్యకర్మలనుండియు నాంతరంగిక పరివర్తనముల నుండియు మన చిత్తమును వెనుకకు మరలించుటవలననే సత్య సాక్షాత్కారమగునని యోగతత్త్వ మువదేశించుచున్నది. ఒకచోఁ జిత్తమును కేంద్రీకరించుటే ధారణ యనఁబడును; అనగాఁ జిత్తస్థాయి. మామూలు జీవితములో భావములువచ్చి పోవుచుండును, కాని నిలకడకలిగియుండవు. సుగ్రమగు నేకాగ్రత యొక క్షణకాలము మాత్రమే నిలుచును. ఇతరభావములచేఁ జలింపక యేకధారగానుండు భావమే ధ్యానమనఁబడును. ధ్యానము సమాధితో నంతమగును. సమాధియందు 'నేన'ను భావము పోవును; దేహమానసములు బాహ్యప్రేరణముల కన్నిటికి మృతిపొందినవగును; ధ్యానవిషయమేదైనను, నదొక్కటియే స్ఫురద్రూపముతోఁ బ్రకాశించును. ఈమూటి నొకే విషయముపైఁ జొప్పించినపుడు దానిని సంయమమందురు.౧. బాహ్యవిషయములపైఁ గాని ఆంతరంగవిషయములపైఁ గాని యీ సంయమశక్తిని ప్రయోగించినపు డతీంద్రియశక్తు లనఁగా

(3) ఇవి పరిశుద్ధిఘట్టమును, ధ్యానధారణములు జ్ఞానఘట్టమును, సమాధిబ్రహ్మైక్యమును దెలియఁజేయును.

(౧) 3, ౪.

మూసిన తలుపుల వెనుకనున్నది చూచుట, అదృశ్యమగుట, యితరుల భావములను గ్రహించుట, మున్నగునవి కలుగును. సాధకుఁ డీ శక్తులచే నాకృష్టుఁడైనచోఁ దన లక్ష్యమును గోల్పోవు ప్రమాదమునకు గురియగును. ఈయాకర్షణముల నిరాకరించి, ముందుకుఁబోవలెను.౨.

## ౧౩—సమాధి.

మోక్షముపొందుటకు ముందుఁబోవలసిన యవస్థాంతరము పేరు సమాధియనఁబడును. సమాధిమూలమున మోక్షముఁబొందుటే సరియగువిధానమని చెప్పు యోగము మోక్షమును సమాధియనియే నిర్వచనముచేసెను. యోగస్సమాధిః.౧. అదియొక తన్మయావస్థ; యిందు బాహ్యప్రపంచ సంబంధము తెగిపోవును. యోగశిక్షణమునకిదియే పరమావధి; ఏలన నిం దాత్మ కాలవశమై, పరివర్తనాత్మకమైన స్థితినుండి, నిత్యము, పరిపూర్ణమునైనస్థితికి బోవును. ౨. సమాధిద్వార

---

(౨) ౩, ౫, ౧.

(౧) యో॥ భా॥ ౧, ౧.

(౨) "నేను బెక్కుమారులు జాగ్రత్సమాధిని బొందియున్నాను. చిన్నతనమునుండియు నొంటరిగానుండఁగా నట్లుతటస్థించెను. నావ్యక్తిత్వమునుగూర్చిన దీవ్రానుభవదృష్టితో నాపేరును నేనేరెండుమూడుసారులుచ్చరించి, యీతన్మయావస్థ లభింపఁగా, నిరవధికశక్తిస్వరూపములో నావ్యక్తిత్వము హరించి యదృశ్యమై పోవుచుండెడిది. ఈయవస్థ సంశయజ్ఞానావస్థ కాదు; అత్యంతస్వచ్ఛము,నత్యంతనిశ్చయము, వాగతీతమునైన యీయవస్థలోనుండఁగా మరణమొక యసత్యమైన హాస్యవిషయమనియు,నహంభావనాశన మాత్మనాశనము కాదనియు నదియే యథార్థజీవితమనియుఁ దెలిసినది."(టెన్నిసన్ జీవితము, వాల్యూము. ౧, పు.౩౨౦) చూ, టెన్నిసన్; ఏన్షెంట్ సేజ్.

మునఁ బురుషుఁడు తన సహజస్థితిని దిరిగిపొందును. సమాధిలో వివిధదశలున్నవి. వీనిని సంప్రజ్ఞాతా సంప్రజ్ఞాత సమాధు లందురు.సంప్రజ్ఞాతసమాధిలో ధ్యానవిషయ జ్ఞానము మనస్సు కలిగియుండును; ఏస్థితియందుఁ జిత్త మేకాగ్రతనొంది, యొక విశిష్టము,యథార్థమునగు విషయమును స్ఫూర్తివంతమొనర్చి, క్లేశములను గర్మబంధములను నిర్మూలించి, సర్వచిత్తవృత్తు లను నిగ్రహించుటే పరమలక్ష్యముగాఁ గలదగునో యాస్థితియే సంప్రజ్ఞాత సమాధియనఁబడును. 3. ఇందు జ్ఞానికి జ్ఞేయము నకు నేకత్వము సిద్ధించును;జ్ఞానికి జ్ఞేయము తెలియును, ఏలన, జ్ఞేయమే జ్ఞానియగును. విజ్ఞానము విజ్ఞానవిషయము నొకటే. ఈ యవస్థలో వితర్క-విచారానందములు, నస్మితాభావము నుండును. ౧. ఈ యేకాగ్రతారూపములకు విశిష్ట విషయ ములుగలవు. సంప్రజ్ఞాతసమాధియొక్క వివిధదశారూపము లకు వివిధనామములున్నవి; సవితర్క, సవిచార, సానంద, సాస్మితములు. ఏదిమంచి దేదికాదు; ఏదియున్న దేదిలేదు మున్నగువానినిగూర్చి మనకు, మనసులోఁ దర్కమున్నంత కాలమును, మనకొకవిధమగు నానందము నహంకారము నున్నంతకాలమును మనది సంప్రజ్ఞాతసమాధి. ఈ యానందా నుభవముపోయి. యింకనున్న తత్స్థాయీభావములో లీనమైన పుడు, ధర్మమేఘమను స్థితివచ్చును; ఇందాత్మకు జడపదార్థ

(3) యో॥ వా॥ ౧, ౧.

(౧) నిద్రలో మనకు యథార్థవస్తువుపై నేకాగ్రతలేదు కావున నిద్రసమాధికాజాలదు. చూ॥ వాచస్పతి ౧, ౧.

సంబంధము పూర్తిగా నశించి, కర్మకిఁక దావులేకుండఁబోవును. వేదాంతముననుసరించి యీస్థితిలో భావములు పరిపూర్ణ స్వచ్ఛములై ప్రవహించును.

అంతశ్శాంతినార్జించినవానికి వస్తు సత్యస్వరూపమును గూర్చి దివ్యదృష్టికలుగును. వ్యాసుఁడు వచించినవిధమున: "బుద్ధియొక్క సత్త్వము ప్రకాశరూపము; అపవిత్రతాచ్ఛాదనము విచ్ఛేదమైనపుడు, రజస్తమోరహితమై యా తేజః ప్రకాశము స్వచ్ఛమై ప్రసరించును. నిర్విచారసమాధియందీ స్వచ్ఛత (వైశారద్యము) యుదయించును; యోగి యీ యవస్థలో నొకదివ్యకాంతివలన నధ్యాత్మప్రసాదమును బొందును. ఇచటి జ్ఞానము వ్యావహారికజ్ఞానముననుసరింపదు; వస్తుస్వరూపజ్ఞాన మొక్క మెఱుపువలె మెఱయును." ౨. ఈ సమాధి ప్రజ్ఞ సత్యసంభరితమైయుండును.౩.అందు లేశమాత్రదోషము నుండదు. అనుమాన శబ్దప్రమాణమువలన లభించుజ్ఞానము భావమాత్రమనియు, నీ సమాధి ప్రజ్ఞ యథార్థవస్తుస్వరూపమనియు రెంటికిఁగల భేదమును బతంజలి పేర్కొని యున్నాఁడు. ౪. విశేషార్థమే దీనివిషయమైనప్పుడు ప్రత్యక్షముతో దాని కత్యంత సన్నిహిత సంబంధముగలదు. సమాధి ప్రజ్ఞకు గోచరించిన విషయములు స్థూలదృష్టికతీతములైన సూక్ష్మరూపములైయుండును.౧.దీనినే పరమ్ ప్రత్యక్షమనిరి.౨.

(౨) యో॥ భా॥ ౧, ౪౭; ౨, ౪౫; ౩, ౫౪.
(౩) ఋతంభరాతత్రప్రజ్ఞా, (౧, ౪౦), ౪, ౧, ౪౦.
(౧) యో॥ భా॥ ౧, ౪౯.
(౨) యో॥ భా॥ ౧, ౪౨.

కావున జ్ఞానవిషయము సూక్ష్మరూపమైనను,నాత్మకుఁజెందినదై నను, నేకాగ్రదృష్టికి మాత్రమే గోచరించును. మన చర్మచక్షువులు మూయఁబడినపు డది యాత్మదృష్టియగును. ఇట్టియాత్మదృష్టి లభించినపు డన్యభావములన్నిటిని దరిమివేసి, తిరిగి యుదయింప కుండఁ జేయును. 3. కాలత్రయానుభవ సర్వస్వముతోఁగూడిన సర్వోత్తమ దివ్యదృష్టి మనకుఁ గలిగినపుడది మనకుఁబరిపూర్ణ సర్వజ్ఞత్వమును బ్రసాదించును. ४. సమాధియనఁగా నది యున్నంతకాలమునందు నేకాకృతిగల యనుభూతి కాదు. అది యనేక మానసికావస్థా పరంపరతోఁగూడి క్రమముగానవి యుక్లిష్టములై, తొలఁగిపోయి, పరవశతను సమకూర్చును. అసంప్రజ్ఞాత సమాధియం దేకాగ్రదృష్టికి విషయములేదు; గతసంస్కారము లుండవచ్చును. ౫. సంప్రజ్ఞాత సమాధి యందు ద్రష్టయు దృశ్యమును వేరై స్పష్టముగాగుర్తింపఁ బడును. అసంప్రజ్ఞాత సమాధిలో నీభేదము నశించును. ౬.

---

(3) ౧, ౫౦.
(४) 3, ౫४.
(౫) ౧, ౧౭.
(౬) "ఇచట నాత్మ దేహమానసముల నతిక్రమించి,తనకుఁగావలసినది లభించెననియు, నచట నెట్టిదోషము నుండదనియు, నచటఁదనకుఁగలిగిన యా నందమున కొన్ని స్వర్గసుఖములైనఁ జాలవనియుఁ దెలిసికొనును. (ప్లాటినస్, ఎన్నీడ్సు, ౬, ౭, 3४.) షెల్లింగు తనతత్త్వలేఖలలో నిట్లువ్రాసినాఁడు; "మనయందరిలోఁ గాలపరివర్తనముల కతీతమైన యొక యద్భుత దివ్యరహస్య శక్తియున్నది. బాహ్యవస్తువులనుండి మరలి, మార్పులేని యానిత్యశక్తి నిమనము కనుగొనవచ్చును. ఈయాత్మ నాత్మయెరుగు నీపద్ధతివలననే మనసర్వాతీంద్రియ జ్ఞానము లభించుచున్నది. ఈయాత్మదర్శనమే మనకు సత్యస్వరూపమును

సబీజనిర్బీజసమాధి భేదము చెప్పఁబడినది. వాచస్పతి ననుసరించి బీజమనఁగా, "జన్మాయుర్దాయ వివిధభోగములను నవరోధములకు సరిపోవు కర్మ వాసనాశయము."(౧). ఇది గలది సబీజము, లేనిది నిర్బీజ సమాధియు నగును. సర్వప్రకృతి వస్తువుల వలెనే చిత్తమునకును సత్త్వరజస్తమో గుణరూపము లున్నవి. వ్యాసు ననుసరించి, "చిత్తముయొక్క సత్త్వలక్షణము, కాంతి; అది రజస్తమములతోఁ గలిసి నప్పుడు శక్తిని, యింద్రియ విషయములను గోరును; అది కేవల తమోఽవృతమైనపుడు, అధర్మము, నజ్ఞానము, తనప్రభుత్వమును గుర్తించుటకు వలయు నిస్సంగత్వలోపము నుండును; అదియే విపర్యయకోశ నిర్ముక్తమైనపుడు సర్వమును గాంతిమయ మొనర్చును; మఱియు నది యీషన్మాత్ర రజోగుణకలిత మగుటచేఁ బుణ్యజ్ఞాన నిస్సంగత్వ ప్రభుత్వములను లభింపఁజేయును. ఆసత్త్వమే లేశమాత్ర రజోగుణమైనను లేనిదైనపుడు, స్వరూప ప్రతిష్ఠితమై, సత్త్వపురుషాన్యతాఖ్యాతి మాత్రమగుటచే, ధర్మమేఘధ్యాన పరాయణ మగును. అది ధర్మమేఘమనుటకుఁ గారణమది మేఘమువలె

---

జూపును; మిగిలినదెల్ల నసత్యమే. ఇతరజ్ఞానములన్నియు నింద్రియవిషయబద్ధములైయున్నవి; కాని యిది స్వతంత్రమైనది. మనమంతర్దృష్టిచే ద్రష్టకుదృశ్యమునకును భేదమును జూచినప్పుడిట్టిస్థితి సంభవించును. అట్టిస్థితిలోఁ గాలభావము నశించి, మనము కాలాతీతస్థితిననుభవింతుము. బాహ్యప్రపంచము మనకొకదృశ్యముకాదు, అది మనలో విలీనమైపోవును." దీనినిఁబట్టి కేవలాశియాఖండవాసుని మానసమునకే యిట్టితన్మయోన్మాదము సంతోషకరమనియు నితరులకు లేదనియు ననుటకు వీలులేదు.

(౧) తత్త్వవై ౧, ౨.

వధస్సీమలలో శ్రేయస్సంపదనువర్షించును; సర్వకర్మక్లేశముల కతీతుఁడై,యట్టి చిత్తముగల కర్త శాశ్వతసత్యసూర్యకాంతిలో సుఖించుచుండును. ధ్యానము చేయువారు దీని నుత్తమప్రజ్ఞావస్థయందురు. కాని చిచ్ఛక్తి యవినాశియగుటచే వస్తువులతో నైక్యము పొందదు. అది వస్తువులను జూచును, గాని యది నిస్సంగమై నిత్యమై వెలయును. సత్త్వసారమైన వివేకఖ్యాతి దీనికి భిన్నమైనది."మనము పొందఁదగిన యుత్తమజ్ఞాన మిదియే యైనను, దీనిని గూడ మనము విడిచిపోవలెను.౧. "అందుచే దీనితో విసిగి చిత్తము దీనిని గూడ నణఁచివేయును. ఈస్థితిలో సంస్కార శక్తులుండును. గొప్ప ప్రజ్ఞాశక్తుల నిచ్చు సబీజ సమాధిని నిర్బీజసమాధికి మెట్టుగా నుపయోగించుకొనవలెను. నిర్బీజసమాధిలో నెట్టి విషయజ్ఞానలేశము నుండదు గావున, దీనినే అసంప్రజ్ఞాతమనిరి." కొన్ని వాసనలున్నను వాని మూలములు నరకివేయఁబడినవి.పరిపూర్ణమైన అసంప్రజ్ఞాత సమాధిలో సర్వసంస్కారములు సంపూర్ణ నాశనమందు నని భోజుఁడు చెప్పినాఁడు.౨. సంస్కారము లుండునని వ్యాసవాచస్పతులు భావించిరి.3. కాని యవి మోక్షసిద్ధితో నశించును. అన్నియు

---

(౧) వ్యాసుఁడు పంచశిఖునుండి (౧, ౪) యిట్లుదాహరించెను."జ్ఞానమంతయు నొక్కటే; అదివివేకమే." "ఏకమేవదర్శనమ్; ఖ్యాతిరేవదర్శనమ్."

(౨) భోజవృత్తి, ౧, ౧౮.

(3) రాజేంద్రలాల్ మైత్రా యిట్లు వ్రాసెను; "ఈయభిప్రాయభేదమునకుఁ గారణము పతంజలి సమాధినుండి మెలకువ యుండుననియు; భోజుఁడుచెప్పిన సమాధినుండి తిరిగి వచ్చుటయుండదనియు నూహింపవచ్చును."

నశించును గావున,నీదివ్యప్రజ్ఞయు నణఁగిపోయినఁ గాని యోగి నిర్బీజసమాధినిఁ బొందఁడు.౪.

మనము సమాధిఘట్టమును జేరువరకు, ప్రకృతినుండి పురుషుని వివేకించు నభావాత్మక ప్రయత్న మేయుండును. రెంటికి భేదముగు ర్తించుట పూర్తియగుటతోఁ, బురుషుని స్వరూపము వ్యక్తమగును. ప్రకృతిసంబంధ భ్రాంతి లేని పురుషుని స్వస్వరూప వ్యక్తీకరణ ముత్తమసమాధి రూపము. ఈ నిర్విచార సమాధి యందు ద్రష్ట స్వస్వరూపములో నివసించును.౫. పురుషునకుఁ జిత్తవృత్తికి సంబంధ మున్నదను భ్రాంతి లేశమాత్రమైనఁ గలు గుట కవకాశము నశించును.౬. చిత్త మొక తిరగలివంటిదని యోగము భావించును. మనమందు గోధుమ లుంచినచో, వానినే పిండిగాఁజేయును; మన మందేమియు నుంచకున్నచో నది తిరిగి తిరిగి, అరిగిపోయి యదృశ్యమగును. చిత్తముయొక్క వృత్తులను మనము నిర్మూలించినచో దాని వ్యాపార మాగి పోయి, నిష్క్రియమగును. అప్పుడు మన మెడ తెరపిలేని బాహ్య జగత్సంరంభ నినాదముల కతీతమైన ప్రశాంతియందుఁ బ్రవేశింతుము. చిత్తము దిక్కులేనిదగును; పురుషుఁడు స్వస్థితిఁ గాంచును, నిశితమగు నేకాగ్రతవలన లభించు యోగావస్థ యిదియే. దీనిని మనము వర్ణింపఁజాలము. ఏలన వ్యాసుఁడు చెప్పినట్లు,"యోగము యోగమువలననే తెలియును;యోగము

(౪) తస్యాఽపినిరోధే సర్వనిరోధమ్ నిర్బీజస్సమాధిః (౧, ౫౧.)

(౫) ౧, 3.

(౬) ౧, 3, ౪.

వలననే యోగము వ్యక్తమగును; ఎవఁడు యోగజిజ్ఞాస కలిగి యుండునో యాతఁడే యోగమునం దెల్లప్పుడు విశ్రాంతి గాంచును.౧. కొలఁదిమంది మాత్రమే సమాధ్యవస్థను బొందఁ గలరు; ఆకొలఁది మందిలోఁ జిరసమాధిలో నుండఁగలవారు లేరనియే చెప్పవచ్చును; ఏలన జీవితావసరములు సమాధిభంగ కారణములు. అందువలననే దేహపాత మగువరకు మోక్షము సాధ్యము కాదని చెప్పుదురు.

తన్మయావస్థలు తటస్థించు ననుటలో సంశయము లేదు. ఇట్టి "యీశ్వరోన్మాదమే" మానవజాతికిఁ బరమ శ్రేయఃపరం పరలను బ్రసాదింపఁగల దివ్యశక్తి యని ప్లేటో చెప్పినాఁడు. మహోన్నత సత్యస్ఫురణ లట్టి క్షణములలో లభించును. హోరెబ్ కొండమీఁద మోజెస్ పరమేశ్వరుని "నేనున్నాను"ను ప్రణవనాదమును వినెను. "పవిత్రము, పవిత్రము"ను మాట లలో సత్యరహస్యమును ఈశైయ్ గ్రహించెను. ఒకవీథీదృశ్య ములో సెయింటు పీటర్ దేవుఁడు సర్వజనులకు సర్వదేశము లకుఁ బ్రభువని కనిపెట్టెను. తనకు జ్ఞానపరివర్తనము కలిగిన క్షణములో సెయింట్ పాల్ సమాధిగతుఁడై యుండెనని చెప్పు దురు. మధ్యమయుగ మందలి యోగు లతీంద్రియదృశ్యములను ధ్వనులను వినియుండుట సర్వసామాన్యవిషయమై యున్నది. అభినవకవులలో వర్డ్సువర్తు, టెన్నిసన్ సమాధ్యవస్థలను

---

(౧) "యోగేనయోగోజ్ఞాతవ్యో యోగోయోగాత్ ప్రవర్తతే।
యోఽప్రమత్తస్తుయోగేన సయోగేరమతేచిరమ్."
(యో॥ భా॥ 3, ౬)

వర్ణించిరి. ఈ యతీంద్రియ దృశ్యములు, నాదములు, సత్యాపరాయణుఁడైయున్న జిజ్ఞాసువున కవసర ముహూర్తములలో ధైర్యమిచ్చి సాయపడుటకు భగవంతుఁ డిచ్చునవేయని తలఁపవలెను. అందువలన ఆస్తికులకుఁ దన్మయావస్థ దైవాస్తిత్వమును నిరూపించును. యోగ మిట్టిభావము నంగీకరింపదు. ప్రతిజీవియు మూలమునందు దైవస్వరూపమే. బాహ్యాభ్యంతర ప్రకృతినిరోధమువలన నీదైవత్వ మావిష్కృతమగును.౧. అతీంద్రియదృశ్యసినాదము లాత్మశక్తి వ్యక్తీకరణములని యోగభావము. అవి యెంతవరకుఁ బ్రమాణము లను విషయము హేతుజ్ఞానము నిర్ణయించును.

## ౧౪ — మోక్షము

యోగమునసనుసరించి మోక్షమనఁగాఁ గైవల్యము లేక సంపూర్ణస్వాతంత్ర్యము. అదియొక శూన్యత కాదు; ప్రకృతిబంధమునుండి స్వేచ్ఛగన్న పురుషుని నిత్యజీవితము. అది నిర్గుణావస్థయని చెప్పఁబడెను; ఏలన నట్టి స్థితిలోఁ బురుషునకెట్టి ప్రయోజనమును లేదు. ౨. పురుషుఁడు స్వస్వరూపమునొందినాఁడు. ఇతరహిందూతత్త్వములలోవలెనే, యోగమునందును, వస్తురూపజ్ఞానశూన్యతయే తృష్ణకుఁ గారణము. అజ్ఞానఫలితమే దేహము; చిత్తము దానికిఁ బ్రాపు; భోగానుభవమే

(౧) 'సెయింట్ జోన్'కు బెర్నార్డుషా వ్రాసిన సముజ్జ్వలమైనయుపోద్ఘాతమును జూడుఁడు.

(౨) పురుషార్థశూన్యానామ్ గుణానామ్ ప్రతిప్రసవః కైవల్యమ్ స్వరూపప్రతిష్ఠావా చిచ్ఛక్తేరితి. (యో॥సూ॥ ౪, ౩౩.)

దానివిషయము. అవిద్యయున్నంతకాలము సంసారభారము పోదు. అవిద్య వివేకఖ్యాతివలననే పోవును. ౪. జ్ఞానసిద్ధితో నజ్ఞానభావములన్నియు నదృశ్యమగును. పురుషుఁడు శుద్ధుఁడై, చిత్తవృత్తుల కసంగుఁడై నిలచును. గుణములు విరతినొంది, యాత్మ నిజస్థితిగాంచును. ౧.

సంగరాహిత్యము, స్వాతంత్ర్యము జీవలక్ష్యములు. అందుచే మానవబంధుత్వములు, సాంఘికకుటుంబసంబంధములు దానికి వ్యతిరేకమగుటచే, యోగము ధర్మరహితమని విమర్శింపఁబడెను. వ్యక్తిని లోకమునకుసంబంధించు సర్వబంధములను విచ్ఛేదమొనర్పఁజూచు యోగతత్త్వమునందు నీతిధర్మములకుఁ దావులేదు. ౨. ఇట్టివిమర్శనముల కిదివఱకుఁ

---

(౩) ఇదిసప్తదశాన్వితము: (౧) దేనినుండి విముక్తిపొందవలెనో యది తెలియునుగానఁ దిరిగి దానినెఱుఁగనవసరములేదు (౨) దేనినుండి విముక్తి పొందవలెనో తత్కారణములు హరించినవి కావున మరల నవి హరించనవసరము లేదు. (౩) నిరోధసమాధికి విముక్తి ప్రత్యక్షగోచరము. (౪) మోక్షోపాయ మగు వివేకదర్శన మభ్యసింపఁబడినది. ఈనాలుగును బాహ్యకార్యవిముక్తిని దెలియఁజేయును, మిగిలినమూడును చిత్తముక్తిని వ్యక్తపరచును. (౧ బుద్ధి పరిమాణము విడిచిపెట్టఁబడెను. (౨) గుణములు విరతిబొందును.

(౧) ౩, ౨౪, ౩౩.

(౨) సహేతుకముగాఁజెప్పుచో యోగలక్ష్యమునకు నీతినియమానుష్ఠానమవసరములేదు. సంగరాహిత్యమునేకాంతజీవనమును గోరువానికి బుజువర్తనము, మైత్రియున్నగునవసంగతములు. వ్యక్తిత్వనాశనమును గోరులక్ష్యమునకును, ధర్మఫలితాసక్తికిని సంబంధమునుగూర్చుట యోగతత్త్వములో సమన్వయహీనమగు లక్షణము. ఇదిబుద్ధిజాడ్యమును బ్రదర్శించుచున్నది. జర్నల్ ఆఫ్ ఫిలాసఫీ. (నెంబరు, ౮, పు. ౨౦౦)

చెక్కనాస్లు జవాబుచెప్పియున్నాము. ధర్మమార్గ మొక్కటే మనలను బరిపూర్ణతకుఁ దోడ్కొనిపోవచ్చునుగాని, యోగము మనలను ధర్మాధర్మముల కతీతమైనస్థితికిఁ దీసికొనిపోవును. అనేకకలుషములచే నాచ్ఛాదింపఁబడిన ఆత్మయొక్క స్వస్వరూపము నెఱుఁగుటే మోక్షము. ఆకలుషములను మనము సుశిక్షితప్రయత్నముచేఁ దొలగింపఁగలము. తత్త్వజ్ఞానము మనల రక్షింపలేదని యితర హిందూతత్త్వములకంటె యోగతత్త్వమధికముగా నుగ్గడించినది. మనకు నిజముగావలయునది తత్త్వజ్ఞాన నిశితవాదములు గావు; సంకల్పనిగ్రహము. మన మాంతరంగిక కామోద్రేకములను జయించవలెను. ఆత్మరోగము నిర్మూలనముచేయు వైద్యుఁడే నిజమైన తత్త్వవేత్త; కామదాస్యములనుండి మనలనాతఁడు విడిపించును. మానవులందరు యోగాభ్యాసమున కర్హులుకారని యోగతత్త్వము గ్రహించినది. అభినవమన స్తత్త్వశాస్త్రములో 'బాహ్యదృక్కులు' (Extroverts) అనువారు కొందరున్నారు. వీరికిఁ గర్మయోగము చెప్పఁబడెను. తపస్సు, స్వాధ్యాయము, నీశ్వరప్రణిధానమును వారభ్యసింపవచ్చును. ౧. చిత్తమందుఁ గల పూర్వకర్మఫలితములైన వాసనలతోఁగూడిన కాలుష్యములను భస్మమొనర్చునదే తపస్సు. యోగము మనప్రవృత్తిగల

(3) గుణములతో సంపర్కమును విడిచి యాత్మ, స్వస్వరూప జ్ఞానమును గాంచినదగుటచే నిర్ముక్తము శుద్ధమునైనది. (గుణసంబంధాతీతః స్వరూపమాత్రజ్యోతిరమలః కేవలీపురుష ఇతి.) (యో॥ భా॥ ౨, ౨౭.)

(౧) ౨, ౧.

మనఃకోశములోపల నవ్యక్తరూపమున నింకొకకోశమున్న దనియు దానియందుఁ గర్మసంస్కారరూపమున నుండుననియు, తపస్సు వానిని నశింపఁజేయుననియుఁ జెప్పను. ౨.

సమాధివలన శక్తివంతుఁడైన యోగి త్రివిధమగు కర్మ నున్మూలించును. (౧) ప్రారబ్ధము; గతములోఁ జేయఁబడిన కర్మఫలము లారంభమగుట, (౨) సంచితము; గతకర్మల ఫలితములు భవిష్యత్తులో నెపుడో యనుభవించుటకై నిలువచేయఁబడి యున్నవి. (౩) ఆగామి; ఈజన్మములోఁ జేయఁబడి ఆ జన్మములోఁగాని, యింకొక భవిష్యజ్జన్మములోఁగాని ఫలితము నకువచ్చునవి. మూడవది దైవసేవచేఁగాని మానవసేవచేఁగాని పోవును. పక్వమైన కర్మ లీదేహములోనే యనుభవించి యోగి ముందుజన్మలవరకుఁ బక్వముకాని కర్మలను రాఁబోవు జన్మాంతర దేహముల నన్నిటి నిపుడే సృజించుకొని యనుభవము పూర్తిచేసికొనఁగలఁడు. అట్టి ప్రతిదేహమున కొక చిత్త ముండును. దానికి నిర్మాణచిత్తమని పేరు. నిర్మాణచిత్తసంయుక్తములైన నిర్మాణ దేహములు సహజదేహములనుండి భిన్నములైయుండు తెలియఁగనగును. నిర్మాణచిత్త దేహాక్రియలు పరి

(౨) మనస్సుయొక్క బహిఃప్రాంగణమున జరుగునదంతయు లోపలనున్న అంతర్మనఃప్రవృత్తుల వలననే యేర్పడును. పరముల రోగములు, గ్రహావేశము మున్నగువానిచే బాధపడు రోగుల విషయములో యోగు లభ్యంతర మనోమందిరములో నున్న భావములను బహిర్ముఖ మొనర్చుటకుఁ దన్మయావ్యవస్థలను గల్పింతురు. అభినవ మనస్తత్త్వ విభాగవిధానమును Psycho-Analysis) జ్ఞాపకమునకుదెచ్చు నీరోగవిమోచన విశ్వాసము భారతదేశములో విశేషవ్యాప్తినందియున్నది.

పూర్ణ క్రమవిధానము ననుసరించును. యోగియొక్క ప్రజ్ఞ వీనిని నిగ్రహించి నడపును. నిర్మాణమైన కృత్రిమదేహమున కొక గమ్యమున్నది. నియమిత సంచితకర్మభాగమును నాశన మొనర్పవలెను. ఆపని యైనంతనే, యోగి యా దేహాధిపత్య మును విడిచిపెట్టఁగా నావ్యక్తి హఠాన్మరణమొందును. సహజ దేహపద్ధతిలోవలెఁ గాక, నిర్మాణ చిత్తానుభవములకు వాస నలు మిగులవు.౧.

౧౫-౬

ఎంతకాల మవిద్యయుండునో జననమరణాత్మకమైన సంసార మంతకాలముండును. కర్మసూత్రము యథార్థమనియు, మన జీవితము, దాని పరిమితము మున్నగున వన్నియుఁ గర్మ సూత్రమువలన నిర్ణయింపఁబడును.౨. మన పూర్వజన్మములు మనకు జ్ఞాపకముండవు గాని, వర్తమాన జన్మములోని లక్షణ ముల ననుసరించి, కొన్ని పూర్వజన్మ విశేషములను మన మూహింపవచ్చును.౩. ఈలక్షణములన్నియు వానియొక్క హేతుఫలాశయాలంబనములు పోయినచో నదృశ్యములగును. వీనికి మూలకారణ మవిద్య; యితరానుబంధ కారణము లుండ వచ్చును. వర్తమానములోఁ బరిపక్వమునకువచ్చు సంకల్పము యొక్క రూపము ననుసరించియే ఫలస్వరూపముండును; సంస్కారముల కన్నిటి కాధారము చిత్తము; ఆ సంస్కారము లను బహిర్ముఖము లొనర్చునవే విషయములు.౪.

(౧) ౪-౪-౫. (౨) ౨, ౧౨-౧౪.
(3) ౪-౯. (౪) ౪. ౧౧.

## ౧౬—అతీంద్రియశక్తులు.

జనసామాన్య ప్రచారములోనున్న వైచిత్ర్యప్రదర్శన విద్యయు మోక్షసాధనవిధానమును యోగములో సమ్మిశ్రిత ములైనవి. యోగసాధనాకాలములోఁ గొన్నియద్భుతశక్తులు కలుగునని పూర్వబౌద్ధగ్రంథములు గుర్తించినవి; కాని బుద్ధుఁ డాశక్తులయందు భ్రాంతిపెట్టుకొనుటవలన మోక్షసాధనమున కవరోధము కలుగునని చెప్పియున్నాఁడు. ఉగ్రతపస్సుచేసి అత్యద్భుతశక్తులను సంపాదించినవారి చరిత్రలను హిందూమత గ్రంథములు వర్ణించియున్నవి. సమాధిప్రాప్తికొఱకే యీ శక్తులనన్నిటిని వినియోగించుట యోగపద్ధతి. తుదిమెట్టుజేర కున్నను, క్రిందిసోపానములును విలువలేనివిగావు. ఏమెట్టుకా మెట్టే ఫలితమునిచ్చును. ఆసనములవలన లభించు దేహనిగ్రహమువలన శీతోష్ణములయెడ నుదాసీనభావమేర్పడును.౧. మనము దేనిపై నేకాగ్రతను నిలిపినను దానినిగూర్చి మనకు సమగ్రమగు నంతర్విజ్ఞానము లభించును. అతీంద్రియ విషయ జ్ఞానమునకు సంయమము సాధనము. సంయమమువలన మనము వస్తుమూలతత్త్వము నెఱిఁగి, జ్ఞానకాంతిని దర్శింతుము. మైత్రీ దయానందముల నిగ్రహముచే నీశక్తులు వృద్ధిపొందును.౨ అతీంద్రియశక్తులగు దూరశ్రవణ దూరదర్శనములు సంయమ ఫలితములే.౩. మన అవయవములపై మన కేకాగ్రతను నిలిపినచోఁ

(౧) ౨, ౪౮.
(౨) 3, ౨3.
(3) 3, ౨౪.

పైశాచికబలము చేకూరును.౪. అవ్యక్తసంస్కారములుకూడ మనకుఁ బ్రత్యక్షములై పూర్వజన్మజ్ఞానము లభించును.౫. ఒక భావము ననుసరించి సంయమముచేఁ బరచిత్తజ్ఞానముకూడఁ గలుగును.౬. ప్రకృతిలోవలె నింద్రియ సాధనసంపత్తితో నిమిత్తములేకుండ నొకనిభావమును వేఱొకని కందఁజేయవచ్చును. సర్వవస్తువులయొక్క త్రివిధపరిణామముపై దృష్టి కేంద్రీకరించి, కాలత్రియ జ్ఞానమును మనమార్జింపవచ్చును.౧. యోగి తన దేహము నదృశ్య మొనర్పఁగలఁడు౨, ద్వివిధకర్మనుగూర్చి, (ప్రారబ్ధము, ఆగామి) సంయమమువలన యోగి తనమరణ కాలమును దెలిసికొనఁగలఁడు. తత్తదుచిత సంయమమువలన యోగి, సూక్ష్మము, రహస్యము, నస్పష్టములగు విషయములను, సర్వజగత్ప్రదేశములను, ఖగోళమును, ధ్రువతారను, శరీరనిర్మాణ రహస్యమును, గ్రహింపఁగలఁడు. పతంజలి ననుసరించి, యాత్మకును బ్రకృతికిని భేదము నెఱిగినవాఁడు సర్వవస్త్వ

---

(౪) 3, ౨౫.

(౫) 3, ౧౮.

(౬) 3, ౧౯.

(౧) 3. ౧3.

(౨) గోరెస్ రచించిన యుద్గ్రంథ మైదుభాగములు; దైవ, ప్రాకృత, పైశాచిక యోగములుగా విభజింపఁబడెను. దైవప్రకరణమునందు దూరశ్రవణ దర్శనాఘ్రాణ శక్తు లుగ్రతపఃఫలితముగా సంభవించి నట్టియు, నొక యోగి యదృశ్యుఁడగు శక్తిని, వేరొకఁడు మూయఁబడిన ద్వారములనుండి ప్రవేశించు శక్తి మఱొకఁడు వియత్తలమున నెగిరెడు శక్తి యెట్లు గాంచిరో యీకథలను వర్ణించెను." (డీన్ ఇఁజ్, క్రిస్టియన్ మిస్టిసిజమ్, పు. ౨౬౪-౫.)

వస్థాజ్ఞానమును, సర్వజ్ఞత్వమును బొందును.౩. పూర్ణజ్ఞానము లభించుటకుఁ బూర్వము, మనకు సత్యస్వరూపముయొక్క-ఛాయలు గోచరించును. దీనినే ప్రతిభయందురు.౪.

ఈయతీంద్రియశక్తులు లభించినపు డవి పరిపూర్ణతా స్వరూపములే యని తోఁచినను, సమాధి కవరోధకములే.౫. ఇవి యాత్మజీవితములో ననుబంధఫలితములు. మన మోక్ష యాత్రలో నీశక్తులు మార్గమందు గోచరించు పుష్పముల వంటివి; కాని యాత్రకు లక్ష్యమీ పుష్పసంగ్రహము కాదని సత్యాన్వేషకుఁడు గ్రహించును. ఈశక్తులను నిరసించుట వలననే మోక్షము ప్రాప్తించును.౬. బనియన్ వ్రాసిన గాథలో యాత్రికులు స్వర్గధామమునకై బయలుదేరి స్వర్గద్వారము నొద్దనే నరకమార్గమునకుఁ దోడ్కొనిపోవు వేరొక చిన్నిగుమ్మ మును జూతురు. యోగశక్తులచే విమోహితుఁడగు నాతఁడు వెనువెంటనే యధఃపతితుఁడగును.

యోగతత్త్వమునను సరించి, యీ యతీంద్రియశక్తులు ప్రకృతినియమ విరోధములుగావు. ఇంద్రియగోచరమగు ప్రపంచమే సర్వప్రకృతియుఁ గాదు. భౌతికప్రపంచ నియమములకు వ్యతిరేకములుగా గోచరించునవి బ్రహ్మాండములో నింకొక కోశములోని సూత్రములే.

(౩) 3, ౪౯.
(౪) 3, 3౭.
(౫) 3, 3౭.
(౬) 3, ౫౦-౫౧.

ఇవి యన్యోన్యసహకారములై వర్తించును. భౌతికభిన్నమగు ప్రపంచమునకొక శాస్త్రము నియమములునుగలవు; అఖండ ములైన యీ భౌతిక మానసికశక్తులనుజూపి, లోకసంగచిత్తుల నున్నతజీవితాసక్తుల నొనర్పఁ బ్రోత్సహించుట కుపయోగించి యుండవచ్చును. అల్పబుద్ధులు మారుట కద్భుతసూచన లవసరములు.

"జన్మముచేతనేకాని, యోషధులవలనఁగాని, మంత్రములవలనగాని, తపస్సమాధులవలనఁగాని యీ సిద్ధులు లభించును." ౧. గతజన్మములలో యోగమభ్యసించినవారీజన్మమునఁ బుట్టుకతోడనే యట్టిసిద్ధులను గలిగియుందురు. కొలఁది శిక్షణమువలన నీ యాజన్మసిద్ధులు యోగులగుదురు. ఓషధులవలనను, మత్తుకలిగించు పదార్థమువలననుగూడ నొకప్పుడీ యోగశక్తులు గలుగును. మత్తుమందులవలనఁగలుగు నున్మాదావస్థకును సమాధ్యవస్థకును భేదము సామాన్యజనులకుఁ దెలియదు. సిద్ధులఁబొందు మార్గములలో నోషధీప్రక్రియకూడ నొకటియని చెప్పెను గాని పతంజలియోగము దీనినంగీకరించి యుండలేదు. ౨. అనాగరికజాతులలో నభ్యాసములోనున్న యీ యోషధీకృతోన్మాదములతో స్వచ్ఛయోగవిధానములు కలిసిపోయినవి. మంత్రములు, జపతపాదులుకూడ నీసిద్ధులను

(౧) ४, ౧.

(౨) "నైట్రిస్ ఆక్సైడ్ తన్మయావస్థను బ్రేరేపించును. విల్లియమ్ జేమ్స్ ననుసరించి, సురాపానముచేసినవ్యక్తి వస్తువులనుగూర్చిన స్థూలదృష్టి నుండి మారి యుజ్వలదృష్టిగలవాడగును. ఆక్షణములో నాతనికి సత్యస్ఫురణము కలుగును." (వెరైటీస్ ఆఫ్ రెలిజియస్ ఎక్స్పీరియన్సు. పు. ३ర౭.)

సాధించుటలో సాయపడును. ౧. కాని సంయమమునకే ప్రాధాన్యమీయఁబడెను. ఓషధులవలనను మందులవలనను గలుగు దృశ్యములును, నరముల బలహీనతవలన లభించు విలక్షణవైచిత్ర్యములును నిరసింపఁబడినవి. కాని జనసామాన్య భావవిశ్వాసములతో సంపర్కమును బూర్తిగాఁ గోల్పోవ నిష్టములేని కారణముచే, దనతత్త్వమునకు నిజముగాఁ జెందని యీ విధానములను యోగసూత్రము స్వీకరించి స్థానమొసఁగినది. ఈ జనాభిప్రాయాదరభావమువలననే నికృష్ట విధానములకును మహోన్నత యోగలక్ష్యములకును నీతత్త్వమునందు స్థానము గల్గెను. వాతావరణ మప్రయత్నముగాఁ దన ప్రభావమును జూపును; అందుచే, యోగము తానుద్భవించిన కాలమునందుఁ బ్రచుర్యమందియున్న భావములనుగూడ బ్రదర్శించియున్నది. కాని యీయప్రధానములు, కాలికములునగు విషయములను, ముఖ్యములు, తత్త్వసమన్వితములు నగు యోగాంగములనుండి విడఁదీయుట సులభము. ఈ మందులను మంత్రముల నొకసారిమాత్రమే పేర్కొని, తిరిగి వానిని యోగసూత్రము స్మరింపలేదు; అనగాఁ బ్రకృత జన విశ్వాసముల కవసరములగు నీయద్భుత ప్రదర్శనములకుఁ దాత్త్వికదృష్టిలో నెట్టివిలువయు లేదని యోగసూత్రనిశ్చయ భావము.

(౧) అమెరికా నూతనవిజ్ఞానము సునిశ్చితపదములపైఁగాని లేక క్రియముగల సూత్రములపైఁగాని యేకాగ్రతను నిలుపవలెనని చేయుచున్న ప్రబోధము మన మంత్రజపమునకు సరిపోవును.

౧౨—భగవంతుఁడు.

యోగమునకు సహకరించు వానిలో దైవభక్తి యొకటని పతంజలి చెప్పినాఁడు.౧. దేవుఁడు ధ్యానవిషయమే కాకుండ, మోక్షమునకుఁగల యవరోధములను దొలగించి సాయపడు ననియుఁ జెప్పఁబడెను. ఆస్తిక్యము పతంజలితత్త్వమున కవినాభావమైన యంగము కాదు. ఆస్తిక్యమున కవసరములగుజ్ఞాన విషయములను గూర్చి పరిశ్రమింపక, యోగాభ్యాసమునకు దేవుఁడుపకరించును గావుఁన బతంజలి దేవునంగీకరించెను. దైవాస్తిత్వమును గూర్చి వ్యాసుఁడొక శాస్త్రవాదమును జూపినాఁడు.౨. దేవుఁడు ప్రకృష్ట సత్త్వుఁడు. "పరమేశ్వరుని మహిమకుఁ దుల్యమైనట్టిగాని, యతిశయమైనట్టిగాని శక్తి వేఱొకటిలేదు. ఏలన, నేది దైవమహిమ నతిశయించునదిగాఁ గన్పట్టునో యది దైవ మహిమనే నిరూపించును. మహిమయొక్క పరిపూర్ణ స్వరూపియే యీశ్వరుఁడు."౨. లేక యీశ్వరమహిమతో సమానమైన దున్నదా? ''ఏలన సమానులగు నిరువురొకే వస్తువును గోరి, యుందొకఁడు" ఇది నూత్నమైనదనియు నింకొకడు ఇది పురాతనమైనదనియుఁ బలికినవు డందొకఁడు జయించి, రెండవవాఁడు పరాభూతుఁడై మొదటివానియొద్ద నల్పుఁడగును. ఇరువురు సమానులొకే వస్తువు నేకకాలమందుఁ బొందఁ జాలరు; ఏలన నది స్వీయవిరుద్ధ విషయము. అందువలన నెవనియందున్న ప మహిమతో సమానముగాని

(౧) ౧, ౨౩.
(౨) యో. భా. ౧, ౨౪.

యధికముగాని యగునది వేరెచ్చటను లేదో, యట్టివాఁడే యీశ్వరుఁడని మేము సమర్థించుచున్నాము."3. క్రిమోన్నత దశానూత్రిమున సుత్కృష్ట తమ స్థితి యొక టుండవలెను; ఈ నూత్రమునను సరించి పతంజలి దేవునిసర్వజ్ఞతను నిరూపించినాఁడు. అధికాధికతరము లున్నప్పు డధికతమమైనదియు నుండవలెను. మహిమలో భిన్నసోపానముల కవకాశ మున్నపుడు తుదిమెట్టునుండవలెను. సర్వజ్ఞత్వములో నిట్టి సోపానశ్రేణి గలదు. శుద్ధసత్త్వరూపము నాచ్ఛాదించు జడపదార్థరూపమైన తమఃపరిమాణమునుబట్టి యీసోపానక్రమముండును. సర్వజ్ఞతాబీజము పరిపూర్ణముగా నిరాచ్ఛాదితమై సత్త్వసిద్ధిని గాంచినపు డీశ్వర సర్వజ్ఞత్వము ఫలితమగును. "ఆతనిలో సర్వజ్ఞతాబీజము పరిపూర్ణతఁగాంచును."౧. అంధప్రాయమైన జడప్రకృతి, మానవులు స్వస్వకర్మానుగుణఫలితముల ననుభవించు ప్రపంచ క్రమ సామరస్యములకు హేతువుకాఁజాలదు. ప్రకృతిపరిణామమును నడపువాఁడు పరమేశ్వరుఁడు. పురుషార్థప్రయోజనముల కనుగుణముగాఁ బ్రకృతివికాస ముండవలెనని యాతని మహాదాశమైయుండును. కాని దేవుఁడు ప్రపంచమును సృజించలేదు; ఏలన ననంతదయాసముద్రుఁ డగు దేవుఁడు దుఃఖనిలయమగు నీ లోకకర్త కాఁజాలఁడు. శ్రుతి యీశ్వరాస్తిత్వమును సాధింప యత్నించును గాని, యీప్రయత్నము శాఖాచంక్రమణ

(3) యో. భా. ౧, ౨౪.

(౧) తత్రనిరతిశయమ్, సర్వజ్ఞత్వబీజమ్ (౧-౨౫) ఇటియు దీనిపై యో॥భా; యో॥ వార్తికమునుజూడుడు.

వాదము; ఏలన నది వేదములు ప్రమాణములగుట కీశ్వరకల్పితములగుట యేయని వాదించును. అవి చెప్పు విషయములు సత్యాంశములకు సరిపడును, గావున వేదములు ప్రమాణములని చెప్పఁబడెను. వేదప్రామాణ్యమును సాంఖ్య మంగీకరించెను గాని దానిని సమర్థింప యత్నింపలేదు. వేద మూలహేతు వీశ్వరుఁడని చెప్పి యోగము సమర్థింప యత్నించినది.

పతంజలి భావములో నీశ్వరుఁడెట్టివాఁడో చెప్పుట సులభసాధ్యముకాదు. కర్మసూత్రమున కతీతుఁడును,3 లోకకాలుష్యములంటనివాఁడును, నగు విశిష్టపురుషుఁడీశ్వరుఁడు. ప్రపంచ సంబంధ బంధరహితుఁడై, లోకజీవు లనుభవించుచున్న దుఃఖభారమువలన సంగము లేనివాఁడై, పుణ్యపాపాతీతుఁడై యప్రమేయానందము ననుభవించును. ఆతఁడు సర్వజ్ఞుఁడు, సనాతన మహర్షి గురువరేణ్యుఁడును. జ్ఞానమోక్షములకొఱకుఁ బరితపించుజీవులకు దేవుఁడు సాయపడవలసిన యెడల నాతఁడునుగొంత వరకు సంసారగతుఁడు కావలసివచ్చును. అందుచేఁ బతంజలి దేవునొక జ్ఞానోపదేశికునిఁ జేసెను. ప్లేటో మొదలు నేటివరకుఁ గల జ్ఞానులలో దేవుఁడొక జ్ఞానాచార్యునిగాఁ బ్రతిఫలించి యున్నాఁడు. అతఁడు కాలాతీతుఁడు,౧ దయాస్వరూపుఁడు; ఆతనికెట్టి కామములును లేవుగాని, సంసారతప్తులగు జీవులయందవ్యాజప్రేమతోఁ బ్రతియుగారంభమునందును శ్రుతిప్రవచ

(౨) తత్త్వవైశారది॥ ౧-౨౪.

(3) ౧-౨౪.

(౧) ౧, ౨౫, ౨౬.

నము చేయుచుండును. రజస్తమోగుణవిరహితమై, పరిశుద్ధమైన యాతని సత్త్వగుణము స్వవశమై యాత్మావిష్కృతికిఁ దోడ్పడును. ౨. దేవుఁడు నిత్యముక్త స్వభావుఁడగుటచే, నొకప్పుడు బద్ధులై యిపుడు ముక్తినొందిన జీవులుకాని, భావిదశలోఁ దిరిగి బద్ధులుకావలయు ప్రకృతిలయులుగాని యాతనితో సములుగారు. ముక్తజీవులకుఁ బ్రపంచముతో నెట్టిసంబంధము నుండదు; దేవునికెల్ల కాలములందు లోకసంబంధమున్నది. పదార్థము యొక్క అతిశుద్ధమగు స్వరూపమగు సత్త్వగుణముతో దేవునికెన్నడు విచ్ఛేదముకాని నిత్యసంబంధమున్నదనియు నందుచే నాతని కఖండశక్తిజ్ఞాన శ్రేయస్సంపద నిత్యమై యుండుననియు నూహింపఁబడెను. ఆతఁడు కృపాపరతంత్రుఁడై, సత్త్వగుణము నాశ్రయించి, జగద్రంగమునఁ బ్రవేశించును. ఆతఁడుకోరి క్లేశవశులైన జీవులనిమిత్తమట్లు చేయునుగాన నాతనిఁగర్మసూత్రము బంధించదు. ప్రళయకాలమునందుఁ బ్రకృతి అవ్యక్తరూపములోనికిఁ బోయినపుడు, భగవంతుఁడు తానుధరించిన రూపమునుగూడ విడిచిపెట్టి, పునస్సృష్టియైన వెనుక మరలధరించును. రాత్రివేళ నొకవ్యక్తి మఱునాడుదయమున నిన్ని గంటలకు మేల్కొనవలెనని నిశ్చయించి, తనసంకల్ప సంస్కారబలముచే నట్లే నియతకాలమున మేల్కొనునట్లు ప్రకృతి నూత్నపరిణామమారంభమై, నూత్నజీవులుదయించునపు డీశ్వరుఁడు తానుదిరిగి తనపూర్వదేశిక రూపమును ధరింపవలయునని నిశ్చయించి యట్లే చేయును, ప్రణవశబ్దమగు 'ఓం' యీశ్వరునిచిహ్నము.

(౨) యో॥ భా, ౧, ౨౫.

ప్రణవమును ధ్యానించు నాతఁడు దైవసాక్షాత్కారసిద్ధి నొందును.౧.

యోగతత్త్వములోని సగుణదైవభావమితరభావములతో దృఢమగు సామరస్యమును గలిగి యుండలేదు. మానవుఁడు పొందవలసిన పరమావధి పరమేశ్వరునితో నైక్యానుసంధానము కాదు; ప్రకృతినుండి పురుషుఁడు పూర్తిగా విడివడుటయే. భగవంతుఁ డొక పురుష విశేషమూర్తియేః కాని, సృష్టి కర్తయుఁ బోషకుఁడును గాఁడు. మనుజుల కర్మల కాతఁడు శిక్షించుటకాని కటాక్షించుటగాని చేయఁడు. ఆతఁడు రంగములోని కేతెంచి నపుడాతని కేదోయొక కార్యక్రమముండవలెను ఆతఁడు తనకు భక్తులైన వారి యభ్యుదయమున కవరోధములను దొలగించి సాయపడును.ప్రణిధానముచే మనకీశ్వరకృప లభించును. మోక్ష సిద్ధి కీశ్వరుఁడు సహాయభూతుఁడగును గాని,యాతఁడే మోక్షము నొసఁగఁడు.అట్టి యీశ్వరభావము నిజముగా సంతృప్తి నొసఁగఁ జాలదు.౨. ప్రజాభిప్రాయమున కనుకూలముగా నుండును ద్దేశముతో నీశ్వరునికల్పించి,యోగతత్త్వము పోషించినది.౩. జగ

(౧) ౧, ౨౭-౨౮. (౨) చూ॥ శంకరభాష్యము, ౨.౨.౩౬, ౪౧.

(౩)పోల్సు.గార్బే:"యోగతత్త్వముయొక్క స్వరూపమును నిస్సంశయముగా నిర్ణయించినది సగుణదైవభావమునందుఁ దరువాతఁ జేర్చుటయే; పతంజలివిరచితమైన యోగసూత్రమున నీవిషయము సమన్వయసిద్ధిలేకుండఁ జేర్చఁబడెను. యో॥ సూ॥ ౧, ౨౩-౨౭; ౨, ౧, ౪౫ సగుణదైవమును జెప్పను. ఇవి గ్రంథమునందలి యితరభాగములతో నన్వయింపవు సరికదా, వానిమూలాధారములను ఖండించునవిగానున్నవి."

(ఫిలాసఫీ ఆఫ్ ఏన్షెంట్ ఇండియా. పు.౧౫)

త్తును గూర్చిన సాంఖ్యసిద్ధాంతమును, యోగశిక్షణవిధానమును జనబాహుళ్యమునకు బోధించుటకుద్దేశించి, ప్రజలలో వ్యాపించి యున్న యాస్తికభావమును తృప్తి చేయకూడదను ప్రచారము చేయుట కష్టసాధ్యమని తలఁచియుండవచ్చును. అనంతర యోగతత్త్వమునందు మానవహృదయసామాన్యములగు నాశయములకుఁ బ్రాధాన్యమధికమై, యీశ్వరునికిఁ దత్త్వములో గ్రిమముగాఁ గేంద్రస్థాన మీయఁబడెను. ఈశ్వరాస్తిత్వ యాథార్థ్యము మానవుని విశుద్ధహృదయమునఁ బ్రకాశించినది. మానవునాత్మానుభవమే యీశ్వరుఁడున్నాఁడనుటకు సాక్షి. ఆత్మతోఁ బరమాత్మ సంభాషించును; సత్యమునన్వేషించు వారు తమహృదయములలో నీశ్వరవాణీనినాదమును వినుదురు. కఠోరములగు శరీరక్లేశములతోడను, నైతికప్రమాదముల తోడను గూడియున్న కఠినమగు యోగశిక్షణమునకు, సహకారియు మార్గదర్శకుఁడు, అజ్ఞానదుఃఖములనుండి రక్షకుఁడు, జ్ఞానోపదేష్టయు, నుత్సాహప్రదాతయునగు నీశ్వరుఁడవసరము. అనతికాలములోనే, మానవలక్ష్యమున కీశ్వరుఁడు కేంద్రస్థానమునాక్రమించెను. యోగమునందలి యిట్టి దైవాస్తిత్వమునువిడిచి, భగవద్గీతలో స్వచ్ఛమైనదైవభక్తి బోధింపఁబడెను. సమాధియందాత్మ యీశ్వరుని దర్శించి స్వవశ మొనర్చుకొనును. ఇంద్రియ మానసికవిషయయములన్నిటినుండి యాత్మను వేరుచేసి, కామతృష్ణాదుల నరికట్టి, యహంకారమును నిర్జించి, మనము పరమేశ్వరునితోఁ బునస్సంధానమును

బొందుదుము, విజ్ఞానభిక్షువు చెప్పినాఁడు;"మనముచేయు సర్వ విధధ్యానములలో ఈశ్వరజ్ఞాన ముత్తమమైనది." ౧.

౧౮—ఉపసంహారము.

ప్రాక్పశ్చిమ ఖండములలో నభినవమానవుని దృష్టికీయోగ ముపదేశించు మోక్షసాధన విధానమంతయు నాత్మవశీకరణతంత్రమువలె గోచరించును. తీవ్రములగు నేకాంత ధ్యానములు, ఆసన ప్రాణాయామాది శరీరవ్యాయామములు, మానవ మానసముల నొకవిశిష్టమార్గమును బట్టునట్లుచేయును. ఇట్టిపద్ధతులే యోగమార్గమను నజ్ఞానము, తరువాత వ్యాపించిన తాంత్రిక కుత్సితాచారముల వలనను, పతంజలియోగమున కపార్థములను గల్పించిన కొందరున్మాదయోగుల మూఢాభ్యాసముల వలనను సంభవించినది. పతంజలియోగము మూలరూపములో నిట్టిదోషములు లేనిదే, మనము స్వప్నమందైన నూహింపని యనంతశక్తులు మనలో నిమిడియున్నవని పతంజలియోగము చెప్పును. మనలో నిగూఢముగా నిద్రాణములైయున్న యీ శక్తుల నావిష్కరించుటకు సాధనోపాయముల నది చూపును. దేహ చిత్తాత్మసంశుద్ధివలనఁ బరంజ్యోతిని దర్శించుట కవకాశమును గల్పించునదే యోగశిక్షణము.౨.

(౧) యోగసారసంగ్రహము॥ ౧.

(౨) "ప్రియురాలు తన ప్రియునికి స్వాగతమిచ్చుటకు సంసిద్ధురాలగునట్లు నీవును సిద్ధపడుము" జ్ఞానియగు మార్కస్ చెప్పినాఁడు.

(ఇరెనాయిస్. ౧, ౧౩, 3.)

చిత్తస్వభావముపై మానవజీవిత మాధారపడియున్నది గావునఁ జిత్తనిగ్రహముచే మన స్వభావమును మార్చుకొను మార్గము మన హస్తగతమై యున్నది. భక్తి సంయమములచే, మనము సర్వదోష విముక్తులము కాఁగలము.౧. మానవదృష్టి పరిమితి, జగత్పరిమాణ పరిమితికాదు. మన యింద్రియముల కగోచరములగు ప్రపంచము లున్నవి; పశువర్గముతోఁ బాటు మనకును గల వానికంటె వేరింద్రియములు నున్నవి; జడశక్తులేకాక యితరశక్తులును గలవు. మన కాత్మయందు విశ్వాసమున్నచోఁ బ్రకృత్యతీత ప్రపంచము ప్రకృతిసిద్ధ ప్రపంచమే యగును. మనలో నధికసంఖ్యాకులు సగము నేత్రములు విప్పకయే, మందమతులై, తాపత్రయ భారహృదయులై జీవితమును గడపుచున్నారు; వివేకదృష్టిగల కొలఁదిమందియైనను, మేల్కాంచిన వెంటనే తిరిగి నిద్రావశులగుచున్నారు. ఏకాంతవాసములలోఁ బ్రశాంతమనస్కులమై, మనలో నంతర్నిహితములై యున్న యాత్మశక్తులను దర్శించి, క్షణికములైన మనకు గోచరించు జ్ఞానకిరణములను నిలుపుకొని, సుస్థిరకాంతి పుంజమై, మన యంధకార జీవితమునంతను బ్రకాశింపఁజేయునట్లు చేసికొనుమని సనాతనులగు నీజ్ఞానులు మన కుపదేశించినారని తెలిసికొనుట మంచిది.

(౧) సెల్ఫుమాస్టరీ యను తన చిన్నగ్రంథములో యమ్. కూయే యిట్లు వ్రాసెను: "నీవు కోరినదానిని నీవు పొందఁగలవని దృఢముగా విశ్వసింపుము; అది సహేతుకమైనచోఁ దప్పక లభించితీరును." సంశయము మున్నచోఁ ఫలితము నాస్తి.

## ఉదాహృత గ్రంథములు.

౧. దాసుగుప్త: యోగా ఏజ్ ఫిలాసఫీ అండ్ రెలిజియన్

౨. వ్యాసభాష్య, వాచస్పతి టీకాసహిత పతంజలి యోగసూత్రము.

౩. రాజేంద్రలాల్ మైత్రా; భోజభాష్యసహిత యోగ సూత్రములు.

౪. వుడ్సు; పతంజలియోగ తత్త్వము. హార్వర్డు ఓరియంటల్ సీరీస్ ౧౭.

ఓం

# భారతీయ తత్త్వశాస్త్రము

## షష్ఠాధ్యాయము

## పూర్వమీమాంస

### ౧—ఉపోద్ఘాతము.

చారిత్రికముగా నైనను గాకున్నను, వైజ్ఞానికముగా నుత్తరమీమాంసకుఁ బూర్వతరమైనది గావున దీనికిఁ బూర్వమీమాంస యనిపేరు కలిగినది. వస్తుసత్యజ్ఞాన ముత్తరమీమాంసా విషయమైనట్లే, కర్మ పూర్వమీమాంసా ప్రధాన విషయము. ఉపనిషత్తులు గాక, వేదమంతయు ధర్మము లేక విధివత్కర్మను గూర్చి చెప్పును. అట్టి కర్మలలో ముఖ్యము లైనవి యజ్ఞములు. సామాన్యముగా వేదోక్త కర్మాచరణము జ్ఞానసంపాదనమునకుఁ బూర్వాంగము. జ్ఞాన కర్మలు పరస్పర విరోధములని చాటిన శంకరుఁడును, నీజన్మములోఁగాని గత జన్మములోఁగాని చేసిన సత్కర్మవలననే, సత్యాన్వేషణాసక్తి కలుగునని చెప్పియున్నాఁడు.

మీమాంసకారంభ బీజములు వేదములలోనే గలవు. కర్మను గూర్చియు సిద్ధాంతములగూర్చియు నియమములనుగూర్చియు జర్చించుట, సంశయించుట యనునర్థములో మీమాంసశబ్దము వేదములలోనుపయోగింపఁబడినది. సక్రమయజ్ఞ కర్మాచరణము వేదవాక్యార్థవినిర్ణయములపై నాధారపడినది సంశయవిషయము లనువిశదపరచుటకై విపులీకరణ మవసరమైనది. ఈనియమ వైపుల్యమువలనయజ్ఞమెట్లు చేయవలెనో సుబోధమైనది. తటస్థించిన సమస్యలకాయాసందర్భములలో నిశ్చితార్థములనుచర్చించినిర్ణయించిరి. ఈనిర్ణయములు బ్రాహ్మణములలో విరివిగా గోచరించును. బ్రాహ్మణము లిచ్చిన యీనిర్ణయ వివరములకుఁబొందికలేక, యితరసాహాయ్యములేనిదే యవిఅస్పష్టములు నసంపూర్ణములునై బోధపడవు. నాఁడీ యితర సాహాయ్యము వాఙ్మూలమున నున్న సంప్రదాయమే, కర్మ నిర్వహణమునకు వేదోక్త వాక్యములు, శిష్టాచారమును గలిసి చిరకాల ముపయోగించినవి. భిన్నవైదికశాఖ లేర్పడినప్పుడు, చిరకాలమునుండి యవిచ్ఛిన్నముగా వచ్చుచున్న సంప్రదాయగ్రంథములే ప్రమాణములుగా గౌరవింపఁబడు చుండెడివి. బౌద్ధమతోదయముతో వైదిక ధర్మానుయాయులు తమ మతమునంతను బునఃపరిశీలన మొనర్చి, దాని సత్యమును సహేతుకమని పునఃప్రతిష్ఠాపన మొనర్చుటకై సూత్రీకరింపవలసి వచ్చినది. మీమాంసా నియమముల నొక పద్ధతిలోనికిఁ దెచ్చి, సూత్రరచనముచే వానిని సమర్థించుటకు జైమిని యత్నించెను.

పూర్వమీమాంసకు ధర్మజిజ్ఞాసయే ప్రధానకర్తవ్యము. దీనిలక్ష్యము సిద్ధాంతమునందుకంటె ననుష్ఠానమునందే విశేషముగాఁగలదు. ఇందుఁగాననగు తాత్త్వికప్రసంగములు కర్మకాండ కనుబంధములైయున్నవి. ధర్మసమగ్రతకొఱకు, దేహముకలిగి కర్మఫలితముల ననుభవించు నొక నిత్యమగు నాత్మయున్నదని నిశ్చయింపఁబడెను. విధిచోదిత కర్మలు, వానివలనఁగలుగు ఫలితములు వేదములు ప్రకటించియున్నవి. ఈధర్మరూపమైన కర్మానుష్ఠానమునకును, వైదికకర్మలకు శుభప్రదములైనఫలితములనిచ్చు సామర్థ్యమునకును సనాతనవేదమే ప్రమాణము; వేఱొకప్రమాణ మవసరము లేదు. కాని, వేదప్రామాణ్యము నితరులు న్యూనపరచునపుడు, మనకు ముఖ్యముగా వేదోక్తకర్మఫలము ప్రత్యక్షవిషయముకానప్పుడు, కేవల వేదప్రామాణ్యమే మాకు శరణ్యమను పిడివాదము తృప్తికరముకాఁజాలదు. అందుచే దైవసంబంధములు, తాత్త్వికములునగు విపులవాదములు చర్చలు బయల్వెడలినవి ఉత్కృష్టధర్మమంతయుఁ గర్మపరముగానున్నదను కేంద్రసత్య మంగీకరింపఁబడినపుడు, మీమాంస, యితరులెట్టి తాత్త్వికభావములను బ్రకటించినను వానికి స్వాగతమిచ్చెను. ఇట్టి తాత్త్వికభావసమన్వయలోపముండుటచేతనే, భిన్నశాఖలవారందరును ధర్మమే యుత్తమలక్ష్యమని యంగీకరించియు, భిన్నార్థనిర్ణయములను బ్రకటించిరి. వేదప్రామాణ్యమును నిరసించు బౌద్ధులకును, గర్మకంటె జ్ఞానమే శ్రేష్ఠతరమని వాదించు జ్ఞానవాదులకును సమాధానముగా, వేద

మమోఘ ప్రమాణమని వక్కాణించి దానియౌచిత్యమును మీమాంస సుస్థాపితమొనర్చెను. మీమాంస ప్రత్యక్షముగా బహుదేవతారాధనపరమును, పరోక్షముగా నాస్తికమునై యున్నది. బౌద్ధులకు వ్యతిరేకముగా నది ప్రపంచవాస్తవికత నంగీకరించును.

హిందూమతమున కీ పూర్వమీమాంస చాలముఖ్యమైనది. హిందువుల నిత్యజీవిత నియమములను వ్యక్తపఱచు, మతగ్రంథములకు మీమాంసాసూత్రములననుసరించి యర్థనిర్ణయముచేయవలసియుండును. ప్రస్తుత హిందూన్యాయము కొంతవరకు మీమాంసాతత్త్వముపై నాధారపడియున్నది.

## ౨—కాలము - సారస్వతము

సర్వసామాన్యనియమముల నది సూత్రీకరించెను గావున జైమిని మీమాంసాసూత్రములకుఁ బూర్వ వేదార్థవివరణచరిత్రముగలదని స్పష్టమగుచున్నది. వివిధయజ్ఞములు, వాని ప్రయోజనములు, అపూర్వసిద్ధాంతము, కొన్ని యితర తాత్త్వికవిషయములు నందుఁ వర్ణింపఁబడెను. ఇది ద్వాదశాధ్యాయసమన్వితము. ఇందు మొదటిది జ్ఞానప్రమాణములను గూర్చియు వేదప్రామాణ్యములనుగూర్చియుఁ జర్చించుటచే నిది తాత్త్వికముగా విలువగలదై యున్నది. జైమినివేదముల ప్రత్యంశమును సమర్థింపయత్నించెను. ఆతనిచే రచింపఁబడిన దేవతాకాండ లేక సంకర్షణకాండ పూర్వమీమాంసకుఁ జెందినది; ఏలన, నది వేదప్రోక్తమైన యుపాసననుగూర్చి ప్రసంగించును.

న్యాయయోగసూత్ర పరిచయముగల జైమినిగ్రంథము క్రీ. పూ. ౪-వ శతాబ్దమునకుఁ జెందుననియు నదియే దీని యత్యంత ప్రాచీనకాలమనియుఁ జెప్పఁగును.౧. దీనికి శబరవిరచితమైనదే ముఖ్యమగు భాష్యము. శబరునికాల మించుమించుగా క్రీ. పూ. ౧-వ శతాబ్దము ౨. శబరునికిఁ బూర్వమే

(౧) మీ. సూ వెక్కు-బౌద్ధసిద్ధాంతములను ఖండించుననుకుమారిలుని భావమును మనమంగీకరించుచో (చూ.శ్లో॥వా. ౧, ౧౩, ౫, ౬) బౌద్ధమతారంభమునకు వెనువెంటనే మీ.సూ. రచ జరిగెనని చెప్పవలెను. మ. భా. న జైమినీయకృతికెట్టి ప్రశంసయునులేనికారణమున నేఁడియునిశ్చయింపఁజాలము. జైమినిగ్రంథ మైదుస్థానములలో బాదరాయణునిఁ బేర్కొనుటచే (౧,౧,౫, ౨,౨,౧౯; ౬,౧,౮; ౧౦,౮,౪౪; ౧౧,౧,౬౪.) నిదియు బా॥సూ॥ కాలమునకే చెందవలెను. బా॥ సూ॥ వేదాంతవిషయమున నధికారపాండిత్యముగల వాఁడని పదిసూత్రములలోఁ బేర్కొనెను. (౧,౨,౨౮; ౧,౨,౩౧; ౧,౩,౩౧; ౧,౪,౧౮;౩,౨,౪౦;౩,౪,౨;౩,౪,౧౮ ౩,౪,౪౦;౪,౩,౧౨;౪,౪,౫ )ఇందుఁ దొమ్మిదిమీమాంస. సూ॥ లో దొరకనందున, భా. సూ. పేర్కొన్న జైమిని మీ॥ సూ॥ కర్త కాఁడని కొందరందురు. కొన్ని జైమినిగ్రంథములు నశించినవని కొందరుతలఁచిరి. కొన్నితావులందు జైమిని బా.సూ. జ్ఞానమునుజూపినాఁడు. ఆత్మ అశరీరియను బాదరాయణుని సిద్ధాంతము వాతఁడంగీకరించెనుగాని దాని సమర్థించుహేతువులెవ్వియుఁజెప్పలేదు. భాష్యకారులీతఁడు బాదరాయణుని హేతువుల నంగీకరించెనని చెప్పుదురు; (౧౧, ౧,౬౪; బా॥సూ॥ ౩,౩,౫౩; చూ. మీ.సూ. ౯,౧; బా॥సూ॥ ౩,౨,౪౦). అందుచేనాతఁడుతిరిగి వానినిఁ జూపలేదు.

(౨) ఝా: ప్రభాకరశాఖ పుటలు ౬,౭. శబరునివిజ్ఞానవాదశూన్యవాద ఖండనము కాలమునునిర్ణయింపదు. శబరుఁడు పేర్కొన్నవృత్తి (క్రీ. వె. ౨౦౦—౫౦౦ ) కాలము నాటిదగుటచే శబరుఁడు నాకాలమువాఁడేయని జాకోబి తలచెను. శబరునిది క్రీ॥ వె॥ ౪౩౦ లకు బూర్వముకాఁజాలదని కీత్ పలికెఁనాడు.

భాష్యములను రచించినవారు భర్తృమిత్రుఁడు,౩. భవదాసుఁడు,౪. హరి,౫. ఉపవర్షుఁడు.౬. మున్నగువారు, కాని వారి గ్రంథములు మన కలభ్యములై యున్నవి. శబరుని భాష్యమే తరువాతవచ్చిన మీమాంసా రచయితల కందరకాధారము. బ్రాహ్మణముల సంప్రదాయమతము నతిచాకచక్యముతో సమర్థించిన కుమారిలుఁడు౧. వేదముల ప్రామాణ్యమును, బురోహితు నాధిపత్యమును నాతఁ డంగీకరించి, సూత్ర, భాష్యముల రెంటికి వ్యాఖ్య మూఁడుభాగములుగా రచించెను. ప్రథమా

---

(౩) న్యాయరత్నాకరము. పు. ౧౦; కాశికా. పు॥ ౧౦.

(౪) శ్లో॥ వా॥ ౧, ౬౩.

(౫) శాస్త్రదీపిక, ౧౦, ౨, ౫౯-౬౦)

(౬) శబరుఁడు తనభాష్యములో ౧, ౧, ౫. ఒకవృత్తినుండి దీర్ఘ వాక్యము నుదాహరించెను. (చూ. ౨, ౩, ౧, ౬; పైశబరుఁడు) కుమారిలుఁడీ వృత్తికర్త వృత్తికారుఁడని పేర్కొనెను. డా॥ ఝా॥ యితఁడే భవదాసుఁ డనెను. పార్థసారథి యీతనినామమును స్మరింపలేదు. అతనిపూర్వుఁడగు నుపవర్షునివలెనే, బోధాయనుఁడు రెండుమీమాంసలపై, వృత్తులను రచించెనని జాకోబీ భావించెను. (జె.ఏ బి.యస్. ౧౯౧౧)

(౧) హిందూమత సంస్కర్తుఁడని ప్రసిద్ధిగన్న కుమారిలుఁడు బౌద్ధమతమునుండి హిందూమతమునకు మారిన బీహారు బ్రాహ్మణుఁడు. చూ. ఎలియట్. హిందూమతము; బౌద్ధమతము, వాల్యుము ౨, పుటలు ౧౧౦, ౨౦౭. ఆతఁడు దాక్షిణాత్యుఁడని తారనాథునభిప్రాయము. తానుజేసిన రెండుపాపములకై, అగ్నిగుండమున నాత్మహత్యచేసికొనవలెనని కుమారిలుఁడు తలచినాఁడు. తన బౌద్ధగురువును నాశనమొనర్చుట, వేదములు నిత్యములని చూపుటకొఱకును, వేదోక్తకర్మాచరణమే మోక్షసాధనమనియు ఋజువుచేయు నిమిత్తమును దేవుఁడులేఁడని వాదించుటయు నీపాపములైయున్నవి. (చూ. మాధవశంకర దిగ్విజయము).

ధ్యాయ ప్రథమభాగము శ్లోకవార్తికము. రెండవది తంత్ర వార్తికము తృతీయాధ్యాయాంతము వఱకు నున్నది. మిగిలినది టుప్టీక. కుమారిలుఁడు శంకరునకుఁ బూర్వుఁడు; క్రీ. వె. ౭-వ శతాబ్దమునకుఁ జెందనగును.౨. విధివివేకమును, మీమాంసానుక్రమణియును రచించిన మండనమిశ్రుఁడు కుమారిలానుచరుఁడు. విధివివేకములోని భావములను న్యాయకణిక యను గ్రంథరూపమున వ్రాసిన వాచస్పతి (క్రీ॥ వె॥ ౮౫౦) కంటె నీతఁడు పూర్వుఁడు, కుమారిలుని కృతికి భాష్యకారు లనేకు లున్నారు. సుచరితమిశ్రుఁడు కాశికయను శ్లోకవార్తికభాష్య రచయిత; సోమేశ్వరభట్టు న్యాయసుధలేక రాణకయను తంత్ర వార్తికమునకు భాష్యమును రచించెను; పార్థసారథిమిశ్రుఁడు (క్రీ॥వె॥ ౧౩౦౦)న్యాయరత్నాకరమను శ్లోకవార్తికభాష్యమును కుమారిల కృతివంటి స్వతంత్ర మీమాంసాగ్రంథమగు శాస్త్ర దీపికను, తంత్రరత్నమును రచించెను; వెంకటదీక్షితుఁడు టుప్టీకా భాష్యముగా వార్తికాభరణమును రచించెను.౧.

---

(౨) పండితునను సరించి, కుమారిలుఁడు భవభూతిగురువు. (క్రీ. వె. ౭౨౦-౭౮౦) అందుచే నీతఁడు క్రీ. వె. ౬౦౦-౭౫౦) కాలమునకుఁ జెందును. ఈతనికీర్తి హర్షునిపరార్ధ కాలమునాటికి సుప్రతిష్ఠితమై యుండెనని చెప్పఁబడిన భావమునకిది సరిపోవును.

(౧) యుక్తిసుధాపరిపూరణి గ్రంథకర్తయైన రామకృష్ణభట్టను, మయూరమాలికాకర్తయైన సోమనాథుఁడును, భట్టశంకర, భట్టదినకర, కమలాకరులీశాఖకుఁ జెందినవారు.

శబరభాష్యము ననుసరించి, దానికి బృహతియను వ్యాఖ్యను ప్రభాకరుఁడు రచించెను.౨. అచ్చటచట శబరుని భావములను కుమారిలుఁడు నిరసించెను. ప్రభాకరుఁడు కుమారిలుని భావములను గణింపకుండుటయు, బృహతిలోఁ జెప్పిన సమాన భావములు కుమారిలుఁడును రచించుటయు,3. నీకారణములచేఁ గుమారిలుని కంటెఁ బ్రభాకరుఁడు పూర్వుఁడని కొందరందురు, బృహతి యందలి శైలినిబట్టి యది పూర్వతరమని కొందరభిప్రాయబడిరి.౪. ఆతఁడు రచించిన ప్రకరణపంచిక

(౨) సంప్రదాయముననుసరించి, ప్రభాకరుఁడు, మండనుఁడు కుమారిలుని శిష్యులనియు, ప్రభాకరుని ప్రతిభావిశేషమునుజూచి 'గురు' పదవి నిచ్చెననియుఁ జెప్పుదురు.

(3) ౧,౨,3౧; ౧,3,౨; ౧,౪,౧.

(౪) ఝు; ప్రభాకరశాఖ, కీత్; కర్మమీమాంస, కుప్పుస్వామిశాస్త్రి సంప్రదాయభావమును స్వీకరించి, ఝూకీత్తులవాదమును విపులముగా ఖరిడించెను. (చూ. ఆయనవ్యాసము, పూర్వమీమా-స: ప్రభాకరశాఖ; ౨-వ ఓరియంటల్ కాన్ఫరెన్సుప్రచురణములు, కలకత్తా). ఇకప్రాచీనదాక్షిణాత్య సంప్రదాయము ఉమ్వేకుఁడు కుమారిలుని శిష్యుఁడనిచెప్పెను

"ఉమ్వేకః కారికామ్ వేత్తి చంపూమ్ వేత్తి ప్రభాకరః।
మండనస్తూభయం వేత్తి నోభయం వేత్తి రేవణః॥

శ్రీపంఢితుఁడు గౌడవహోకుపోద్ఘాతములో నీశ్లోకము నేచంపుకుబదులు తంత్రమును, మండనకుబదులు వామనశబ్దములనుమార్చి యుదాహరించెను. చూ. గుణరత్నుని షడ్దర్శనసముచ్చయవృత్తి (౧౪౦౦). ఉమ్వేకుఁడనగా భవభూతియనియుఁ గుమారిలుని శిష్యుఁడనియుఁజెప్పఁబడెను. మఱియుఁజూడుము చిత్సుఖుని అద్వైతప్రదీపిక, పు. ౨౬౧.

ప్రభాకరశాఖా గ్రంథములలో ముఖ్యమైనది. అతఁడే రచించిన పరిశిష్టము శబరభాష్యమునకు లఘుటీక. భవనాథుని న్యాయ వివేకము ప్రభాకరుని భావములను విపులముగా వివరించును.౧. ప్రభాకరుని శిష్యుఁడైన శాలికనాథుఁడు ధర్మకీర్తిని పేర్కొనెను. వాచస్పతి తన న్యాయకణికయందుఁ బ్రభాకరానుచరులలో రెండు శాఖలున్నట్లు చెప్పెను.౨. మూడవ మీమాంస శాఖ మురారి శాఖయని3 హిందూమత గ్రంథములలోఁ జెప్పఁబడెను. కాని యీశాఖకుఁ జెందిన గ్రంథములు మనకు లభించవ లేదు. మాధవ విరచితమైన జైమినీయ న్యాయమాలా విస్తారము మీమాంసా దర్శనమును బద్యరూపమునను గద్యములో నొక భాష్యమును గలిసి యున్నది, అప్పయ్య దీక్షితుఁడు (౧౫౫౨-౧౬౨౪) తన విధిరసాయనములోఁ గుమారిలుని ఖండించినాఁడు ఆపదేవుఁడు మీమాంసా న్యాయ ప్రకాశము లేక ఆపదేవీయము ప్రాథమిక పాఠ్యగ్రంథమును రచించెను. (౧౭-వ శతాబ్దము.) సుప్రసిద్ధమగు లౌగాక్షి భాస్కరుని అర్థసంగ్రహమాపదేవుని గ్రంథముపై నాధారపడి రచింపఁబడెను. ఖండదేవుఁడు (౧౭-వ శతాబ్దము) భాట్టదీపిక యను నొక గ్రంథమును వ్రాసెను. ఇందలి తర్కశాస్త్రము

(౧) చూ. ప్రకరణసంచిక ౧.

(౨) జరత్ప్రాభాకరాః నవ్యప్రాభాకరాః॥

(3) మురారేస్తృతీయః పంథాః॥

వలన నిది విఖ్యాతి గన్నది. ఇతని మీమాంసా కౌస్తుభము సూత్రములను గూర్చి ప్రసంగించును. ౪.

### 3—ప్రమాణములు

జైమిని ప్రత్యక్షానుమాన శబ్దప్రమాణత్రయము నంగీకరించెను. ప్రభాకరుఁ డుపమానార్థాపత్తులనుగూడ నంగీకరించెను. కుమారిలుఁ డనుపలబ్ధినిఁగూడఁ జేర్చెను. ఐతిహ్యము తిరస్కరింపఁబడెను; ఏలన, జనప్రవాదము (Rumour) నిజమగునో కాదో, దాని కుదయస్థాన స్వరూపస్వభావములు తెలియుట కవకాశము లేదు గావున, నిశ్చయించుట కవకాశము లేదు. స్మృతినిప్రమాణములలోఁ జేర్చలేదు; ఏలన నది యిదివరకు దెలిసినదానినే తిరిగి చెప్పును.

మనస్సు నింద్రియములు నున్నవని యెట్లనుమానింప వచ్చునో ప్రభాకరుఁడు వర్ణించియున్నాఁడు. మనజ్ఞానక్రియలు తాత్కాలికములైన లక్షణములుగలవి; అవి సమవాయి కారణములు, నసమవాయి కారణములుగూడ నైయున్నవి. ౧. జ్ఞానక్రియల సమవాయికారణ మాత్మ; అసమవాయి కారణ

---

(౪) రాఘవానందుని మీమాంసాసూత్రదీధితి, రామేశ్వరుని సుబోధిని, విశ్వేశ్వరుఁడులేక గాగాభట్టునిభట్టచింతామణియుఁ జెప్పఁదగినగ్రంథములు. వేదాంతదేశికుని సేశ్వరమీమాంస మీమాంసావేదాంతభావసమన్వయము చేయుటకై చేసినయత్నము. ఇతఁడు రామానుజానుచరుఁడు; రెండుమీమాంసలొకే దర్శనములోని భాగములే యని యీతనిభావము.

(౧) పాల్సు: ప్రకరణపంచిక: "విషయజ్ఞానము క్షణికము; ఆత్మ ప్రధానకారణము; ఆత్మకు మనస్సుతో సంయోగము సహాయసంబంధము."
(పు. ౯౨)

మాత్మ కాఁజాల దేలన నాత్మ కారణశూన్యమైనది. కాని యది యాత్మయందే యుండవలెను. ఒకద్రవ్యమునందుండునది గుణము; అందుచే నసమవాయి కారణమొక గుణముకావ లెను. నిత్యమగు నొకద్రవ్యములో ననిత్యములగు గుణము లుదయించినచో, నది యితరద్రవ్య సంయోగముచేఁ గావ చ్చును. ఇతరద్రవ్యములిట్లే తిరిగి యితరద్రవ్యములం దుండు టకు సాక్ష్యములేదు గావున నవి నిత్యములేగావలయును. ప్రత్యక్షము భావాత్మక జ్ఞానక్రియగావున నాత్మయొక్క విశేషలక్షణమైయుండవలెను. అట్టిగుణము నిత్యద్రవ్యములకుఁ జెందవలెనన్నచో, నసమవాయికారణ మితరద్రవ్య సంయోగ రూపముగా నుండవలెను. అట్టిద్రవ్యములు దేశకాలములవలె సర్వవ్యాపకములైనఁ గావలయును లేదా, అణుపరిమాణమునైన గలిగియుండవలెను. సర్వవ్యాప్తిగల ద్రవ్యములతోసంయోగము మనజ్ఞానక్రియల వైవిధ్యస్వరూపమున కనుగుణములు కావు. అందువలన జ్ఞానక్రియలఅసమవాయి కారణ మణుద్రవ్యసంయో గమే; ఈ సంయోగ మణుచలనముల వలననే సంభవించును. ద్రష్టయగు నాత్మకుఁజెందిన దేహములోని మనస్సే యీయణు ద్రవ్యము. జ్ఞానక్రియల అసమవాయి కారణాధారము మజే దియుఁ గాఁజాలదు. దాని సమవాయికారణ మాత్మయే. దేహ ములోని యీ యణుద్రవ్యము, ప్రతి జ్ఞానక్రియయందు నాత్మతో సంపర్కముపొంద యత్నించును; ఇట్టి సంయోగ ఫలితముగా నసమవాయి కారణసంయోగ మేర్పడుచున్నది. కాని, మనస్సు సుఖదుఃఖాది కార్యముల నుద్భవింపఁజేయును

గాని,వర్ణ పరిమళాది గుణములను జనింపఁజేయలేదు. వీని నెఱుఁగుటకు మనస్సితరేంద్రియ సాహాయ్యము నపేక్షించును.౧. బాహ్యవస్తువులతో మనస్సహితేంద్రియ సంయోగమువలన నాత్మ బాహ్యప్రపంచ జ్ఞానమును బొందుచున్నది. మనస్సున కాత్మతో సంయోగము పుణ్యాపాపములపై నాధారపడును; కాని, మనస్సునెడనాత్మ కేవల ముదాసీనత వహించునదికాదు. సుఖదుఃఖ రాగద్వేష౨. రూపములగు మానసికావస్థల చునది గనుక మనస్సు నింద్రియవర్గములోఁ జేర్పఁబడెను. మానసేంద్రియములపై మన మాధారపడ నవసరములేనిచో నేకకాలమం దన్నివస్తువుల నెఱుఁగు శక్తి మనకుఁ గల్గునని చెప్పఁబడెను.

మనస్సుతోఁ గలిసినపు డాత్మ జ్ఞానక్రియా హేతువగు చున్నది. జీవియొక్క పూర్వకర్మ ఫలానుగుణమైన యదృష్ట శక్తిచేఁ గాని, ఆత్మచే నిశ్చితమైన మానసిక వ్యాపారమువలన గాని యిట్టిసంయోగ మేర్పడును. ఆత్మయే యనుభవకర్త లేక భోక్త, దేహము భోగాశ్రయము; ఇంద్రియములు భోగసాధన ములు, భోగ్యవిషయములు రెండువిధములు; సుఖదుఃఖాదు లాంతరంగికములు; ఘటాదులు బాహ్యములు. ఒకేముహూర్తమున మన సంవిత్తొక వస్తువుతోడనే కాని రెంటితో సంయోగము నొందదని ప్రభాకరుని మతము.

---

(౧) శాస్త్రదీపిక, పు. ౧౦౦.

(౨) శాస్త్రదీపిక, పు. ౯౮.

## ర—ప్రత్యక్షము.

ప్రత్యక్షము సాక్షాత్ప్రతీతి. . ఇది యింద్రియ సంయోగము వలనఁ గలుగును. ప్రత్యక్షమునందు, విషయముతో నింద్రియమునకు, విషయ విశేషగుణములతో నింద్రియమునకు, నింద్రియముతో మనస్సునకు, మనస్సుతో నాత్మకును సంయోగము కలుగును. విషయముతో నింద్రియసంయోగము, ఫలితము(౧)వలన మన మనుమానించు విషయమును బ్రకాశింపఁజేయు శక్తియని కుమారిలుఁడు వివరించినాఁడు. నిజముగా నున్నవస్తువులు లేక నింద్రియగోచరములగు వస్తువులకు సంబంధించినదే ప్రత్యక్షము. అతీంద్రియ విషయములతో దానికి సంబంధము లేదు. విషయములు ద్రవ్యములుకాని, జాతులుకాని, గుణములుకాని కావచ్చునని ప్రభాకరుని భావము.

ఒక శ్రోత్రేంద్రియము తప్ప తక్కినయింద్రియములను గూర్చి న్యాయసిద్ధాంతమునే మీమాంసకుఁ డంగీకరించును. దేశదూరసామీప్యములు స్పర్శారూపములచేతనే కాక, శబ్దమువలనఁగూడఁ బ్రత్యక్షముగాఁ దెలియును. దేశమనగ స్థానము, దిక్కులు గలవు ఇవి రెండును శబ్దవిశేషములుగాఁ బ్రత్యక్షవిషయములే. శ్రవణేంద్రియము విషయమైన శబ్దముతో సంయోగమునొందును. శ్రవణముదూరస్థమగు శబ్దము నొద్దకుఁ బోదు; వాయుతరంగ సంచాలితమై శబ్దము శ్రవణేంద్రియద్వారమును జేరును. అందువలననే,దగ్గరనున్న వారికి

(౧) శ్లో. వా. ప్రత్యక్షసూత్రము పుటలు ౮౨-౮౩.

వినఁబడునది దూరముననున్నవారికి వినఁబడకుండుటకుఁ గార ణము శబ్దమునకు భిన్నపరిమాణములున్నవనియు దీనివలనఁ దెలియును. ౧. బౌద్ధులూహించినట్లు, ప్రత్యక్ష సంయోగము లేనిదే శబ్దములను శ్రవణము వినఁగలిగినయెడల, సర్వదూర సమీపశబ్దములు నొకేకాలమున శ్రవణము వినవలెను. కాని యట్లుజరుగుటలేదు. చెవిలో నొకగాలితెరయున్నది. మాటాడు వానినుండి వాయుతరంగ మొకటివచ్చి యాతెరను దాకును. దానివలన శబ్దము వినఁబడును. శ్రవణము శబ్దస్థానమునకుఁ బోయి కాక, చెవిలోనికిఁ బ్రసరించిన శబ్దముతో సంయోగ మొందును. కాని శబ్దము లెల్లప్పుడు వివిధప్రదేశములలో నుండునుగాని, చెవిలోనిగాలి తెరయందుండవు. అవి కేవల శబ్దములుగాఁ గాక, తాముదయించిన దిక్కులసహితముగా శ్రవణమును దాకును. అందుచే శబ్దములు వానిదిక్కులుకూడఁ బ్రత్యక్షముగా దర్శింపఁబడును. శబ్దదూరమును బ్రత్యక్ష శ్రవణవిషయమే, యేలన, సమీపశబ్దములు దూరశబ్దములకం టెఁ దీవ్రతరములై యుండును.

ప్రభాకరుఁడును కుమారిలుఁడునుగూడ సవికల్పక నిర్వికల్పక భేదములతోఁ బ్రత్యక్షము సిద్ధమని యంగీకరించిరి. కుమారిలుననుసరించి,నిర్వికల్పకదర్శనము పృథగ్వస్తువును దర్శించును. వస్తువునకు సామాన్యవిశేషలక్షణములున్నవని తెలియదు. ౨.

(౧) తీవ్రమందాదివ్యవస్థా.
(౨) శ్లో॥ వా॥ ప్రత్యక్షసూత్రము॥ పు. ౧౧౩.

నిర్వికల్పక దర్శనమునకు వస్తువే కారణమని చెప్పఁబడెను. 3. సవికల్పక దర్శనమునందు వస్తుసామాన్యవిశేష లక్షణములు స్పష్టముగా గోచరించును. ౪. పార్థసారథి దీనినింకను విశేషముగా సమర్థించెను. ఇంద్రియవస్తు సంయోగమువలన, సంబంధరహితమైన వస్తుజ్ఞానముకలుగును. అప్పుడు మనము వస్తు గుణభేదమునుగాని, సామాన్యవిశేష లక్షణములనుగాని వివేకింపము. నిర్వికల్పక ప్రత్యక్షము లేనిచో సవికల్పకముండదు; ౧. ఏలన, వస్తువునకును వస్తుగుణములకునుగల సంబంధజ్ఞానమును సవికల్పక ప్రత్యక్షమిచ్చును. అనగా సంబంధించువిషయము లదివరకే తెలిసియుండవలెను. ఈవివరములు నిర్వికల్పకదర్శనములో స్థూలముగాఁ దెలియకున్నచో సవికల్పకదర్శనములో స్పష్టముగాఁ దెలియవు సవికల్పకదర్శనములో వస్తుజాతిని, నామమును జ్ఞాపకముంచుకొని, దర్శింపఁబడిన వస్తువునకన్వయింతుము. జాతినామములు తెలియనిచో, నవి జ్ఞాపకమునకు రావు. అందుచే జాతి నామ గుణములు స్థూలముగాఁ దెలిసిన నిర్వికల్పకదర్శనము పూర్వమున్నదని యంగీకరింపవలెను.

వస్తుజ్ఞానమునకు వాక్సంబంధము లేదని కుమారిలు నభిప్రాయము.౨. గోజాతి తెలియుటకు గోశబ్దరూప మవసరము

(3) ఉద్ధవస్తుజమ్.
(౪) శ్లో॥ వా॥ ప్రత్యక్షసూత్రము॥ పు. ౧౨౦.
(౧) శాస్త్రదీపిక॥ పుటలు. ౧౦౯-౧౧౦. దీనిపై విమర్శకు, చూ॥ జయంతుని న్యాయమంజరి పు ౯౮.
(౨) శ్లో॥ వా॥ ప్రత్యక్షసూత్రము. పు. ౧౨౬.

లేదు; తెలిసిన వస్తువును గోవని మనము వర్ణింతుము.3. నిర్వి కల్పక దర్శనమనగా, నస్పష్టదర్శనమని కుమారిలుఁడు తలఁచెను; అనగాఁ జంటిబిడ్డయొక్క ఆలోచన వంటిది. ఇందు సామాన్య విశేషలక్షణములు తెలియని వస్తుదర్శనమేయుండును. నిర్వికల్పక దర్శనములో జాతిలక్షణములు, విశేషలక్షణములును గూడఁ దెలియునని ప్రభాకరుఁడు తలఁచెను. కాని యితరవస్తువులింకను దెలియవుగావున జాతిలక్షణములు సుస్పష్టముగా విదితములు గావు. మొదట నొకవస్తు వితరవస్తువులతో భేదముకలదని గుర్తింపఁబడును. 'ఒక జాతిలోని యితరవస్తువులతో సామ్యలక్షణములను గలిగియుండుటవలన నది యొకజాతికిఁ జెందినదని తెలియును. ఇది యొకజాతికిఁజెందిన వస్తువని తెలియును గాని, యాజాతికిఁ జెందిన యితరవస్తువులతోఁ బోల్చి చూచినఁగాని దాని నిజస్వరూపము బోధపడదు.౧. నిర్వికల్పక దర్శనమునందు జాతివిశేషలక్షణము లున్నను, నవి యట్లున్నవని గుర్తింపఁ బడవు. సవికల్పక దర్శనమునం దాత్మ జాతిలోని యితరవస్తువులను స[illegible] సామ్యభేదములను గమనించును. సవికల్పకదర్శనము మిశ్రిమదర్శనమనియు, నందుఁ బూర్వ స్మరణ యున్నదనియు, జాతిలోని యితరవస్తువులు తమ వాసనలచే నాత్మకు గోచరించుననియుఁ బ్రభాకరుఁడు చెప్పినాఁడు. పూర్వస్మృతి యిప్పటి వస్తువునకు సంబంధించినదికాదు; దీనితోఁ

(౩) శ్లో॥ వా॥ పుటలు. ౧౮౦, ౧౮౭.

(౧) వస్త్వంతరానుసంధాన శూన్యతయా సామాన్యవిశేషరూపతా న ప్రతీయతే। చూ॥ ప్రకరణపంచిక॥ పు. ౫౪-౫౫.

బోలికగల యితరవస్తువులకు సంబంధించినది; అందుచే నిప్పటి వస్తుజ్ఞానము దానివలన నుపహతముకాదు.

కుమారిల ప్రభాకరు లిరువురు సామాన్యలక్షణములు యథార్థములైనవనియు, నవి ప్రత్యక్షవిషయము లనియు నంగీకరింతురు. విశేష వ్యక్తిత్వ మొక్కటే యథార్థమనియు, సామాన్యము లూహాకల్పితములనియు బౌద్ధుల భావము.౨. కుమారిలుఁడును పార్థసారథియు నీ బౌద్ధభావమును ఖండించిరి. మనమెప్పు డొకవస్తువును జూచినను, నదియొక జాతికిఁజెందిన దానినిఁగాఁ జూతుము; అందుచే సామాన్యము ప్రత్యక్షవిషయమే. ప్రత్యక్షవ్యాపారమునందు సమన్వయభేద విజ్ఞానములు రెండు నున్నవి. అం దనువృత్తి వ్యావృత్తులు రెండు నున్నవి. సామాన్యలక్షణయాథార్థ్యముపై ననువృత్తి యాధారపడి యున్నది. అనుమానవృత్తియు దానిపై నాధారపడును. సామాన్యము విశేషమునుండి వేరుగా దర్శింపఁబడలేదు గావున సామాన్యము వాస్తవముగాదనియు బౌద్ధుఁడు చెప్పుటకు వీలు లేదు. ఏదియున్నదో యది వేరైనను గావలెను, గాకుండవలెం. నను వాదము వస్తుత్వము నంగీకరించును. సామాన్యము ప్రతి వ్యక్తియందును సంపూర్ణముగా నున్నదా లేక అన్నిటియందుఁ గలిసియైనఁ బూరిగానున్నదాయని ప్రశ్నించుటయు సముచితముగాదు; ఏలన, నట్టిభేదము వ్యక్తులవిషయములో వర్తించును గాని, సామాన్యమునకు వర్తించదు; సామాన్యము భాగములు

(౨) వికల్పాకారమాత్రమ్ సామాన్యమ్॥

(౧) యద్వస్తు తద్భిన్నమ్ అభిన్నం వా భవతి.

లేనిది. సామాన్యమునుగూర్చి జైనుల భావముగూడఁ దిరస్కరింపఁబడెను.౨. సామాన్యము సామ్యమేయైనచో, "ఇది గోవువలె నున్నద"ని చెప్పవలెను, గాని, "ఇది గోవ"ని చెప్పరాదు. మఱియు సామాన్యములేని సామ్యమునులేదు. సమానలక్షణములుగల వస్తువులకు సామ్యముండును. సామాన్యలక్షణము వ్యక్తినుండి వేరైనదికాదని కుమారిలు నభిప్రాయము. 3. రెంటికిఁగల సంబంధము భిన్నతలో నేకత్వము. మనము సామాన్యమునుగాని విశేషమునుగాని మన యవసరమునుబట్టి చూతుము. సామాన్యమునే ఆకృతియందురు; ఆకృతియనఁగా నాకారముకాదు; సమానలక్షణమని భావము; ఏలన,ఁ జేతన పదార్థమైన 'ఆత్మ'కుఁ గూడ నాకృతియున్నదని చెప్పఁబడెను. వస్తువులరూపము నశించునది; కాని వస్తువుల జాతిస్వభావము నశించునదికాదు.౧. "జాతి యనగా నాకృతియనియుఁ జెప్పనగును; అనగా నది యేలక్షణమువలన నొకవస్తు వొక జాతికిఁ జెందునో యాలక్షణము. అది సర్వపృథగ్వస్తువులకును సమానమైన లక్షణమును, నివన్నియుఁ గలిసి యొక సముచ్చయరూప

---

(౨) నచసాదృశ్యమేవ సామాన్యమ్॥

(3) శ్లో॥ వా॥ ప్రత్యక్షసూత్రము॥ పు. ౧౮౧. దీనిపై వ్యాఖ్య వ్రాయుచు న్యాయరత్నాకర మిట్లువ్రాసెను: "జాత్యాదులు విశేషమునుండి పూర్తిగా వేరుకావు. ఒకవిశిష్టమగు గో వొక గోజాతికిఁజెందిన గోవుతో సామ్యమును గలిగియుండనిచో గోవుగా గుర్తింపఁబడదు. వస్తు వొకజాతి నుండి పూర్తిగా వేరైనదైనచో నిట్టిది సాధ్యముకాదు. జాతి వస్తువులకు గల సామ్యమువలననే జాతినిఁ దెలియఁగలము. అందుచే వస్తువునకు నాజాతికి సామ్యముండితీరవలెను." చూ: ఆకృతివాదము, ౮, ౧౦, ౧౮, ౨౫.

మును బొందుననెడి భావము నిచ్చునదియునై యున్నది". సామాన్యవిశేషములు పూర్తిగా వేరుకాదని పార్థసారథి యభిప్రాయము. అయినచో నొక వ్యక్తిలో సామాన్యమును మన మెన్నడును దర్శింపఁజాలము. "ఇదియొకగోవ"ను దర్శనములో 'ఇయంబుద్ధి'యు 'గోబుద్ధి'యుఁ గూడనున్నవి మొదటిది విశేషము, రెండవది సామాన్యమునై యున్నవి. "ఇది" "గోవు"ల రెంటియొక్క జ్ఞానమును భిన్నమైనది; కాని యీరెండు నొకే వస్తువులో నున్నవి. ప్రత్యక్షముయొక్క యిట్టి లక్షణద్వయము వస్తువునకు సామాన్యవిశేష లక్షణములు రెండు నున్నవని చూపును. ఈ భేదసామ్యములు పరస్పరవిరోధములు కావు. "ఇదివెండి" "ఇదివెండికాద"ను వానిలో నీవిరోధమున్నది.3. ఈ భేదసామ్యము లొకేవస్తువుయొక్క భిన్నరూపములు.

ప్రభాకరానుచరు లీ భావము నంగీకరించరు. ఒకే జ్ఞానక్రియ సామాన్యవిశేషముల మధ్యమందుఁగల భేదసామ్యముల గుర్తింపఁజాలదు. విశేషసామాన్యముల భేదమును మనము దర్శించునపుడవి వేరుగానున్నవని గ్రహింపవలెను. మనము వానిసామ్యమునే దర్శించునపుడు మనమొక విశేషమునేగాని సామాన్యమునేగాని దర్శింపవలెను. ఈవిషయ

(1) తంత్రవార్తికము. 1,3,30.
(2) "జాతిమేవాకృతిమ్ ప్రాహుః వ్యక్తిరాక్రియతేయయా
సామాన్యమ్ తచ్చపిండానామ్ ఏకబుద్ధినిబంధనమ్॥
(శ్లో॥ వా॥ ఆకృతివాదము.)
(3) శాస్త్రదీపిక॥ పు. 203.

ములో నొకేవిషయ మనఁగా, విశేషముగాని, సామాన్యము
గాని, విశేష సామాన్యముల రెంటిని, వానియేకత్వమును
గూడ దర్శింపఁజేయును. కాని, సామాన్యము విశేషముతో
నేకత్వజ్ఞానముగాని,విశేషముసామాన్యముతో నేకత్వజ్ఞానమును
గాని జనింపఁజేయుట సాధ్యముకాదు. అందు నేకజ్ఞానక్రియ
భేదసామ్యముల రెంటి నేకకాలమందు గుర్తించుట సాధ్యపడదు.
ఈవాదమయుక్తమని పార్థసారథి వాదించును. రెండువస్తువుల
జ్ఞానము తప్పనిసరిగా వానిభేదజ్ఞానము నీయనవసరము లేదు.
మన మొకజాతికిఁజెందిన యొకవస్తువును మొట్టమొదటిసారి
దర్శించినపుడు విశేషసామాన్యములు రెండును దర్శింపఁబడును
గాని వానిభేదము తెలియదు. ఈజాతికేచెందిన యింకొక
వస్తువును మనముచూచినపుడు, మొదటివస్తువునకు దీనికిసంబంధ
మును గలిపి, రెండు నొకేజాతికిఁ జెందునని గ్రహించి వాని
భేదములను గమనింతుము. అందుచే రెండువస్తువుల జ్ఞానము
వానిభేదజ్ఞానము నొసఁగనవసరములేదు. ఒకవస్తువుయొక్క
జ్ఞానము దాని సమానత్వజ్ఞానము నీయనవసరము లేదు; మనము
దూరమున నొకవస్తువును దర్శించి, యది యొక స్తంభమా?
మనుజుఁడా? యని సంశయింపవచ్చును. ౧.

సామాన్యము నిత్యమైనదియు, ననేకవస్తుసమానలక్ష
ణము నగుటచేతను, విశేష మనిత్యము, విశిష్టము నగుటవల
నను, సామాన్యవిశేషములు సమానములుగావని ప్రభాకర

(౧) న వస్తుద్వయ ప్రతీతిరేవ భేదప్రతీతిః; నాప్యేకవస్తుప్రతీతిరేవా భేదప్రతీతిః (శాస్త్రదీపి॥ పు ౨౮౭.)

శాఖవారు భావింతురు. సామాన్యము విశేషము నొకటే యైనచో నప్పుడు సామాన్య మనిత్యమై, భిన్నవ్యక్తులలో భిన్నమై,విశేషములునిత్యములై,యనేకత్వములకు సమానములు గావలసియుండును. అనేకరూపములుగల వస్తువు కొన్ని విషయములలో నిత్యము, కొన్నిట ననిత్యమును గావచ్చుననియు, గొన్ని లక్షణములలో సమానముఁ గొన్నిట భిన్నముగావచ్చుననియుఁ బార్థసారథి బదులుచెప్పును. ౧.

అవయవి ప్రత్యక్షవిషయమని ప్రభాకరుని భావము. వస్తువులు సావయవములై యున్నవి. ఒకవస్తువును మనము చూచుట కన్ని యవయవములఁ జూడనవసరము లేదు. ఒకభౌతిక వస్తువును దీసికొని చూచినచో, నణువులు దానికుపాదాన కారణములు; దానికి విశిష్టతనొసఁగు సంయోగము నూక్ష్మ కారణము. అవయవి (whole) "అవయవములు" రెండునొకే వస్తురూపములనియు, మనదృక్పథమునునుసరించి యొకవస్తువు నేకముగానో భిన్నాంశసముచ్చయముగానో చూతుమని కుమారిలు నభిప్రాయమైయున్నది. ౨.

ప్రత్యభిజ్ఞ ప్రత్యక్షజ్ఞానక్రియా స్వరూపమేయని నైయాయికులతోఁ గుమారిలుఁ డేకీభవించును; ఏలన, నింద్రియ వ్యాపారమున్నచోట నది యుండునుగాని లేనిచోటనుండదు. ప్రత్యభిజ్ఞ పూర్వస్మరణముపై నాధారపడినమాత్రమున నది

(౧) శాస్త్రదీపిక॥ పు. ౨౮౮.

(౨) శ్లో॥వా॥ వనవాదము.

యుప్రత్యక్షమని భావింపరాదు. ఒక ప్రత్యక్షవస్తువుతో నింద్రియసంయోగ మెప్పుడున్నను నది ప్రత్యక్షదర్శనమే యగును. 3. దూరస్థములు, నగోచరములు, భూతభావికాలము లందున్నట్టియు వస్తువులను యోగులు దర్శించు దివ్యదృష్టిసిద్ధాంతమును మీమాంసకు లంగీకరింపరు. ఈయోగిదృష్టియింద్రియగతమైననుగావలెను, లేదా యింద్రియాతీతమైనను గావలెను. మొదటిదైనచో, నింద్రియములు భూతభావిదశలతోఁగాని, దూరవస్తువులతోఁగాని సంయోగము బొందఁజాలవు; అందుచే వానియొఱుక కలుగదు. అంతరంగి కేంద్రియమైన మనస్సైనను సుఖదుఃఖాది మానసికదశల జ్ఞానమునే జనింపఁజేయును. ఉన్నతదశావికాసమునందినచో నింద్రియములు వస్తుసంయోగ మవసరములేకుండ వస్తుజ్ఞానమును బొందఁగలవని వాదించుట నిరర్థకము; ఏలన నెంత యున్నతవికాసమైనను నింద్రియస్వభావమును మార్చలేదు. యోగదృష్టిలో భూతకాలవిషయములు గోచరించుటకు స్మృతియే కారణమని చెప్పవలెను. పూర్వజ్ఞానములేని వస్తువులను స్మరింపఁగలదన్నచో నది సంశయాస్పదము. భూతభవిష్యద్దూరస్థ వస్తుజ్ఞానమునకు వేదములే యాధారములు. ౧.

సుఖదుఃఖాద్యనుభవరూపకమైన మానసిక దర్శనము మీమాంస కంగీకారమే. జ్ఞానక్రియ అంతర్విలోకన విషయము

(3) శ్లో॥వా॥ ప్రత్యక్షసూత్రము. పు॥ ౨౩౮-౨౩౭.

(౧) చూ: శాస్త్రదీపిక. పు. ౧౫; చూ: యామునాచార్యుని సిద్ధిత్రయము. పు. ౭౧.

కాదు. మానసిక దర్శనము జ్ఞానేతరవ్యాపారములకు మాత్రమే సంబంధించినది. స్వప్నములందైనను, మన జ్ఞానమొక బాహ్య ప్రపంచ వస్తువునకు సంబంధించినదే.౨. స్వప్నకాలమందా వస్తువు సస్వరూపములో నున్నను లేకున్నను, నది పూర్వదృష్ట వస్తు వాసనారూపమున నుండును. కొన్ని పూర్వవాసనలఁ బైకుబికించు స్మృతిస్వభావముఁగలదే స్వప్నవస్తు జ్ఞానము. పూర్వానుభవ వాసనాసమూహములో నేభాగమిప్పుడు సుఖ దుఃఖాద్యనుభవమునకుఁ బరిపక్వదశ నందియున్నదో యాభాగమే స్మరింపఁబడును. ఇంద్రియములతో మనస్సంబంధము లేకున్నను, మనస్సుతో నాత్మకు సంపర్కముగలుగునట్టి నిద్రయందే స్వప్నము లుదయించును. స్వప్నములేగాని గాఢసుషుప్తిలో, నాత్మతో మనస్సంయోగము విరతినొందును. ఇది ప్రభాకరునిభావము; సుషుప్తిలో నాత్మ తన శుద్ధచిత్స్వరూపమును దిరిగిపొందుటచే స్వప్నములుండ నవకాశము లేదని కుమారిలుఁడు తలఁచినాఁడు. ౧.

## ౫—అనుమానము.

రెండువస్తువుల కొక స్థిరసంబంధమున్నప్పుడు, వానిలో నొక వస్తువును మనము దర్శించునపుడు రెండవవస్తువును గూర్చిన కొంతభావము మనకు లభించుటే అనుమానజ్ఞాన

---

(౨) శ్లో॥వా. నిరాలంబనవాదము పు. ౧౦౭.౧౦౮; శాస్త్రదీపిక. పు. ౧౬౨-౧౬౩.

(౧) ఝా; ప్రభాకరశాఖ. ౭.

మని శబరుఁడు తలఁచినాఁడు. శబరుఁ డనుమానము ద్వివిధ మని చెప్పెను. (౧) ప్రత్యక్షతోదృష్టము; ధూమాగ్నులవంటి గోచరించు వస్తువుల స్థిరసంబంధముగలది; (౨) సామాన్యతో దృష్టము: ఇంద్రియగోచరముకాక, రవిగతి, వియత్తలమున రవిస్థానచలనమువంటి చిత్తగోచరమగు సంబంధముగలది. 3. కారణకార్యములకును, పూర్ణాంశములకును, ద్రవ్యగుణము లకును, జాతివ్యక్తులకును నుండునట్టి యథార్థము, నిత్యము, నమోఘమునైన సంబంధమువంటి దుండవలెను. వర్తమాన మునమాత్రమే యింద్రియములతో సంయోగముకలిగిన దే ప్రత్యక్షమగుటచే సామాన్యధర్మము ప్రత్యక్షమునుండి జనిం పదు. అది యనుమానమునుండికాని, యర్థాపత్తినుండికాని ప్రాప్తించునదియుఁ గాదేలన నివి యాసంబంధమునే యాశ్రయించి యుండును. సామాన్యధర్మ మనుభవముపై నాధారపడి స్థాపితమగును. ధూమాగ్నులుకలిసి యుండుట లేకుండుట యునుగల సందర్భములను మనము పరికించి, యన్నిసందర్భముల కనువర్తించు సామాన్యనియమమును నిర్ణయింతుము. నిత్యమగు సాహచర్యసంబంధమకాని, సామ్యసంబంధముకాని, కారణ కార్యములనుగలుపు సూత్రబీజమై మన మనఃఫలకమున

(౨) జాతసంబంధస్యైకదేశ దర్శనాత్ ఏకదేశాంతరే సన్నికృష్టేఽర్థే బుద్ధిః॥ (చూ; ప్రకరణ పంచిక. పు ౬౪.)

(3) శబరుని సామాన్యతోదృష్టము, వాత్స్యాయనుని మొదటి వివరణ మునకును, వాత్స్యాయనుని పూర్వవత్ శేషవత్తులు శబరుని ప్రత్యక్షతో దృష్టమునకును సరిపోవును.

ముద్రితమైనపుడు తత్సంబంధములో నొకవిషయమును గమ
నించి, రెండవదానిని స్మరింతుము.

కుమారిల ప్రభాకరుల ననుసరించి, యనుమాన వాద
మునకు మూడంగములు కలవు; (౧) ప్రతిజ్ఞ లేక విషయ
ప్రతిపాదనము; ఇది ముఖ్యావయవము; ఇది సోపపత్తికమగు
నుపమానము నిచ్చును; మూడవది హీనావయవము. ఈయంగ
త్రియ మేకక్రమములోనైన నుండవచ్చును. ఒక వ్యక్తిగతమగు
ననుమానము, యితరులకుఁ గలుగు ననుమానము, వేరని
మీమాంసకు లంగీకరింతురు. అనుమాన జ్ఞానవిషయము ద్వివి
ధము: (౧) దృష్ట స్వల్పలక్షణము; అనగా విశేషలక్షణముగల
వస్తురూపకదర్శనము;ధూమమునుండి యగ్ని ననుమానించుట;
(౨) అదృష్ట స్వలక్షణము; అనగా వస్తుస్వలక్షణము గోచరింప
కుండుట: అగ్నియొక్క దహనశక్తిని గూర్చిన యనుమానము.
ఇదివరకే తెలిసిన వస్తువులకు సంబంధించినదియు,వస్తుసామాన్య
సంబంధ పూర్వజ్ఞానము గలదియు ననుమానమని ప్రభాకరుఁడు
భావించెను. అనుమానమునకు నవ్యతయొక ముఖ్యలక్షణమని
కుమారిలుఁడు తలఁచెను.ధూమమును జూచుట,ధూమమెల్లప్పు
డగ్నితో సంబంధించి యుండు ననుభావము వలన నగ్ని నను
మానించుటయును నిజమే కాని, యనుమిత విషయ మిదివఱకు
మనకుఁ దెలియనిదే;అనగా (బర్వతమగ్నితోఁగూడి యున్నదను
నుపమానములోని యర్థము.౧.

౬ — శ్రుతిప్రమాణము

ధర్మస్వరూపమును నిర్ణయించుటే మీమాంసాలక్ష్యము. ధర్మమొక భౌతికపదార్థముకాదు కావున నది యింద్రియ గోచరమగు విషయముకాదు. ఇతర ప్రమాణములు కూడఁ బ్రత్యక్షముపై నాధారపడిన వగుటచే నవియు ధర్మనిర్ణయమునకుఁ బనికిరావు. అగ్నిష్టోమమును జేయు నాతఁడు స్వర్గమునకుఁ బోవును మున్నగు విషయములను గూర్చి యనుమానాది ప్రమాణము లేమియుఁ జెప్పఁజాలవు. ఇట్టి జ్ఞానమును వేదములే చెప్పఁగలవు, ధర్మజ్ఞానమునకు వేదమే ప్రమాణమైనను, దాని నితర ప్రమాణము లీయఁజాలవని చూపుటకు వానిని గూడఁ బరిశీలింప వలసి వచ్చినది. ఇతర ప్రమాణములు దురభిప్రాయమును నిరసించుటకును బనికి వచ్చును.

విధికర్మలు శ్రేయఃప్రదములో యట్టి కర్మములందభిలాష కలిగించు బోధనాత్మక వాక్యములే వేదసారము. వేదములలోఁ గర్మయే ప్రధానమని యెంచి, జైమిని, ప్రత్యక్షముగాఁ గర్మ ప్రతిపాదకములు కాని వేదభాగములు వ్యర్థములగును గావున, వానిని కర్మ పరముగ నర్థమును జెప్పవలెనని వాదించెను.౧. ఇతర గ్రంథములు మానవునికిఁ గర్మ ప్రచోదకము లైనంత వరకుఁ బ్రమాణములు.౨. వేదములలోని ప్రతివాక్యమును,

(౧) శ్లో॥వా॥ అనుమానపరిచ్ఛేదము పు. ౫౦. అసాధారణ, బాధిత సాధారణ, అసిద్ధదోషములను నాలుగింటిని ప్రభాకరుఁ డంగీకరించును. అనైకాంతిక,అసిద్ధములుగా విభాగించినతో మారిలునిపద్ధతి న్యాయపద్ధతికిసరిపోవును.

(౨) సృష్టియొక్క మూలసమస్యలనుగూర్చి చెప్పు వేదవాక్యముల కీ భావము విరుద్ధము.

కర్మనే బోధించునని చూపుటకు మీమాంసకులు యత్నించిరి. సామాన్యముగా వేదములు మంత్రము బ్రాహ్మణములుగా విభాగింపఁబడినవి. ఇంకొకవిభాగము ననుసరించి, (౧) విధి (౨) మంత్రములు (౩) నామధేయములు (౪) నిషేధములు (౫) అర్థవాదములు నని చెప్పఁబడెను. ౧.

శబ్దజ్ఞానమనఁగా నింద్రియగోచరముకాని జ్ఞానమనియు నది శబ్దార్థజ్ఞానముచే నుదయించుననియు నిర్వచింపఁబడెను. ఈశబ్దములు మనుజు లుచ్చరించినవి కాని, వేదములలోనివిగాని కావచ్చును. ౨. ఆప్తులైనవా రుచ్చరించినవి ప్రమాణములే. వేదవాక్యములు స్వతఃప్రమాణములు. ఏజ్ఞానము తరువాత సిద్ధముకానిదని యింకొకజ్ఞానముచేఁ జూపఁబడునో యదియుఁ బ్రమాణము గాదు. కాని వేదవాక్యము లిచ్చుజ్ఞానము దేశ

---

(౧) ౧, ౨, ౧. వేదాంతము వేదములలోని విధికర్మోపదేశములనే కాక, యితరములనుగూడఁ బ్రమాణములుగా నంగీకరించును.

(౨) "స్వర్గమునుగోరువాఁడు యజ్ఞమును జేయవలెను" మున్నగుఫలితములనిచ్చు కర్మచోదనముచేయు వేదవిధులే ప్రధానములైనవి. యజ్ఞవివరములనఁగా, యజ్ఞములోని వివిధాంగక్రమమును యజ్ఞముచేయువారి యర్హతలను మున్నగువానిని జెప్పు నల్పవిధులును గలవు. ఏయేదేవతలకు హోమములఁ చేయవలెనో మున్నగు వివిధవిషయములను యజ్ఞకర్తకు జ్ఞాపకము కలుగఁ జేయుటకు మంత్రము లుద్దేశింపఁబడినవి. కొన్నిమంత్రముల కతీంద్రియఫలితములను వెంటనేయిచ్చు 'అపూర్వ'మను శక్తిగలదని చెప్పుదురు. నామములు యజ్ఞఫలితములను జెప్పును. నిషేధములు విధులకు రూపాంతరములే. విధి విహిత విషయ నిందాప్రశంసలను దెల్పునవే అర్థవాదములు. మఱియు నవి యితరులు చేసిన కర్మలను, చరిత్రలోనుండి యుదాహరణములను గూడఁదెల్పును. (అర్థసంగ్రహము)

కాలావస్థాభంగములేనిది. ౩. వేదచోదిత మయుధార్థమనుట స్వవచోవిరుద్ధము. వేదములు తమ ప్రామాణ్యమునకుం దామే యాధారము.మన ముపయోగించు శబ్దము లితరప్రమాణగోచరములగు వస్తువులను గూర్చి చెప్పును; అట్టితర ప్రమాణములకు దెలియని శబ్దములున్నచో నవియమోఘముగా విశ్వసింపఁదగిన వారుచెప్పినవైయుండవలెను.అందుచే వేదోక్తములు కానివాక్యములకు స్వతఃప్రామాణ్యము లేదు.౧. అవైదికజ్ఞాన మనుమాన జ్ఞానతుల్యమని ప్రభాకరుఁడుచెప్పెను. వేదప్రోక్తమగు శబ్దములకే శబ్దప్రామాణ్యమున్నది;౨.కాని జ్ఞానమంతయు సిద్ధిగలదే యను సిద్ధాంతమున కిది విరోధమగుచున్నది. వేదములకుఁ గర్త లేఁడు కావున, లోపముల కవకాశము లేదు; అందుచే వేదముల కప్రమాణ దోషమెన్నఁడును సంభవించదు.౩. మానవుల వాక్యము లట్టి వారాప్తులైననే సిద్ధము లగుట వలన, నట్టివియు శబ్దప్రమాణములే యని కుమారిలుఁ డభిప్రాయపడినాఁడు.

అందలి శబ్దములు శాశ్వతములైనవి గావున వేదములు శాశ్వతములైనవే. శబ్దార్థసంబంధము సహజమైనదే కాని క్రుత్రిమము గాదు. శబ్దార్థముల కట్టి సంబంధము గలదని ప్రత్యక్షముగాఁ దెలియునదే. ఒకఁడొక శబ్దమును మొదటిసారి విని నప్పుడట్టి శబ్దమును గుర్తింపనిచో, గుర్తించుటకు వలయు

(౩) అపౌరుషేయం వాక్యమ్ వేదః॥ (అర్థసంగ్రహము) పు.౩.

౧. ౧,౧,౨ పై శబరుఁడు.

౨. శాస్త్రదీపిక, పు. ౫౩.

౩. ప్రకరణ సంచిక, ౫, ౩. పోల్చు. కుసుమాంజలి, ౩, ౧౬.

నితర సాధన సంపత్తి లోపించెననియే యర్థము కాని సంబంధ లోపమున్నదని చెప్పరాదు కాంతిలేనిదే కన్నుచూడ లేద న్నచో,నసలేచూడఁ జాలదని యర్థముకాదు.ఇట్టి శబ్దమున కిది విషయ మను జ్ఞానము సాధనము.ఇది యనుభవముచే లభించు నది.శబ్దమునకు భావమును వ్యక్తీకరించు శక్తి సహజముగానే యున్నది. సామాన్య నామములగు ఘటాదులలో నిది పరమ సత్యము. ఇందు శబ్దార్థ సంబంధ మెట్టి కృత్రిమ నియమమును గోడను సంబంధము లేనిది.౧. శబ్దములు, నవి చెప్పు వస్తువు లును గూడ నిత్యములైనవి అనాదికాలము నుండియు మానవు లాయావస్తువుల కుపయోగించు నాయానామములు సమానములే.

ప్రభాకరు ననుసరించి కేవల ధ్వనియనునది లేదు.అన్ని ధ్వనులు నక్షరరూపమున వినఁబడును శబ్దము నేయక్షర ములు గూర్చునో యాయక్షరములకు శబ్దము వేరుకాదు. శ్రోత్రి మక్షరములను దర్శించును;అ వేక్రమములో వినఁబడునో దానిని బట్టి శబ్దములు నిర్ణయింపఁబడును. శబ్దములో నెన్ని యక్షరములున్నవో యన్నిదర్శనము లుండును; కాని వాని సన్నిహిత సాహచర్యము వలన నొకే దర్శనమని యూహిం తుము. ప్రత్యక్షరము యొక్క దర్శనము వెంటనే యదృశ్యమై యొక సంస్కారమును దిగవిడుచును. వివిధాక్షరముల దర్శన సంస్కారములు చివరియక్షర దర్శనముతోఁ గలిసి శబ్దభావ

(౧) శ్లో॥ వా. ౨. చూ. ౨, ౬౨-౬౮.

మును గలిగించును; దానికి శబ్దార్థము నిచ్చుశక్తి గలదు.౨
శబ్దశక్తి యందలి వివిధాక్షరముల శక్తినుండి వచ్చినదే కావున
నక్షరములే శబ్దజ్ఞానకారణములని చెప్పఁబడెను. శబ్దార్థజ్ఞాన
మింద్రియ గోచరమగునది కాదు. ఇంద్రియము లక్షరముల
నిచ్చును; అక్షరము లాశబ్దమును సూచించు వస్తువును దెలుపఁ
గలవు. అందుచేఁ బ్రిభాకరుఁడు శబ్దజ్ఞానమూలము లక్షరములే
యని చెప్పియున్నాడు. శబ్దములకు సూచనశక్తులు గలవు. వాని
వలన మనకర్థము తెలిసినను, దెలియకున్నను, వస్తువులే వ్యక్తము
లగును.౧

అక్షరములకే శక్తియున్నదనియు, స్ఫోటమునకుఁ గాద
నియుఁ గుమారిల ప్రిభాకరులు వాదించినారు. ఒక శబ్దమును
గల్పించు నక్షరముల యొక్క క్షణికములైన ధ్వనులకు వేరై,
వానిచే నుదయించునది కాని సంపూర్ణమగు శబ్దరూపము లేక
స్ఫోటమున్నదను సిద్ధాంతమును వారు నిరసింతురు.

సామాన్యముగా శబ్దములయొక్క నిత్యతాలక్షణమును
గూర్చియు, నందు ముఖ్యముగా వేదముల శాశ్వతత్వమును
గూర్చియుఁ జెప్పఁబడిన యాక్షేపణములు సమీక్షింపఁబడినవి.
(౧) శబ్దోచ్చారణ మంతయు మానవ యత్నకల్పితమని మన
కందరకు విశదమైనవిషయము కావున, నది యారంభము కల

(౨) వ్యక్తులు వస్తువులు నుదయించిన వెనుక వానికిఁగల్పింపఁబడిన నామముల విషయములో శబ్దార్థసంబంధము మానవకల్పితమని ప్రిభాకరు డంగీకరించును.

(౧) పోల్చు. శాస్త్రదీపిక.

పగుటచే నిత్యమైనది కాఁజాలదు. శబ్దోచ్చారణ మిదివఱకే యున్న శబ్దమును వ్యక్తీకరించును గాని, అదియే దానిని మొదటిసారి కల్పించుట లేదని జైమిని జవాబు చెప్పినాఁడు. (౨) శబ్దము క్షణకాలమే యుండును; ఏలన నది యుచ్చరింపఁబడిన వెంటనే నశించును. శబ్దమట్లు నశించదనియు, నది తిరిగి పూర్వావ్యక్తరూపము నొందుననియు జైమినిసమాధానము. మనసకగోచరములగు వస్తువులు లోకమునఁ జాలగలవు. శబ్ద'కల్పన' మనగా శబ్దమును వ్యక్తీకరించు ధ్వనులకట్టి కల్పనము వర్తించు నని జైమిని యభిప్రాయము. (3)ఒకే శబ్దము నొకే కాలమున ననేకు లనేకస్థలములలో నుచ్చరింతురు. శబ్దము సర్వవ్యాప్తియు నిత్యము నైనచో నిది సాధ్యము కాదు అనేకు లనేక స్థలముల నుండి యేక కాలము నందొకే సూర్యుని దర్శించునట్లే, యనేకు లొకే శబ్దము నుచ్చరింతురు. (౪) శబ్దములు మార్పుల నొందుచున్నవి. అవి నిత్యములైనచో మారుట కవకాశముండరాదు. శబ్దములు మారుట లేదనియు, వాని స్థానమున వేరుశబ్దములు వాడఁబడుచున్న వనియు జైమిని సమాధానము. (౫) దాని

(౨) పరిభాకరు ననుసరించి, యాతఁడంగీకరించు అన్వితాభిధాన వాదమునుబట్టి, శబ్దార్థములు వాక్యములలోఁ గర్మనుపదేశించునపుడే తెలియునవి. గావున. శబ్దములు వాక్యములలోని యితరాంశములతోఁ గలిసి వస్తువులనే తెల్పును. అవియొక విధికి సంబంధించు, కేవలమర్థములనే దెల్పుచో, నట్టి జ్ఞానము స్మృతివంటిదగుటచేఁ బ్రమాణము గాఁజాలదు. కుమారిలానుచరు లంగీకరించిన అభిహితాన్వయవాదము ననుసరించి, అర్థములు శబ్దములకే చెందును కాని యీజ్ఞానము స్మరణమునఁగాని, తెలివివలనఁగాని కాక, శబ్దశక్తివలననే కలుగును. శబ్దము లర్థములనిచ్చును. అర్థములుకలిసి వాక్యజ్ఞానమునిచ్చును.

నుపయోగించు వారిసంఖ్యను బట్టి శబ్దముయొక్క పరిమాణము పెరుగుటయుఁ దరుగుటయు నుండును గావున నది నిత్యము గాదు. శబ్దపరిణామ మెన్నఁడును బెరుగుటయుఁ దరుగుటయును లేదనియు, శబ్దములధ్వనియే దాని నుచ్చరించు వారి ననుసరించి యట్లు మారునని జైమిని బదులు చెప్పెను.(౧)

జైమిని తనసిద్ధాంతమును స్థిరపరచుట కనేక హేతువులను జూపెను. శబ్ద మెల్లప్పుడుండును; దాని యుచ్చారణ మితరులకు దానిని వ్యక్తీకరించుటకొఱకే. లేనిదానిని వ్యక్తీకరించుట కెట్టి ప్రయత్నము నుండఁజాలదు. మఱియు "గోవు" శబ్దముచ్చరించినపుడు దాని నెల్లప్పుడు సమాన శబ్దముగానే చూతుము. గోశబ్దమునే మూడు నాలుగుమారు లుచ్చరించుట కలదుగాని, మూడునాలుగు శబ్దములు గోశబ్ద స్థానమున నుచ్చరించుట జరుగదు. ఇది శబ్ద నిత్యత్వమును జూపుచున్నది. అనిత్యవస్తువుల నాశనమునకుఁ గారణములు మనకుఁ గన్పట్టుచున్నవి గాని, శబ్దముల నాశనకారణము లెవ్వియు మనకుఁ గన్పట్టవు. వాయువునుండి పుట్టు ధ్వని శబ్దముకాదు. ధ్వని శబ్దమును వ్యక్తీకరించుట కుపయోగించును. మఱియు శబ్దములు శాశ్వతములని చెప్పు వేదవాక్యము లనేకములుగలవు.(౨)

శబ్దములు జాతులను జెప్పునుగాని వ్యక్తులను జెప్పవు. మన మొక గోవును దెమ్మని చెప్పునపు డొక విశిష్టమైన గోవని

(౧) ౧, ౧, ౬-౧౭.
(౨)
(౧) ౧, ౧౮-౨౩.

యభిప్రాయముకాక, గోసామాన్య లక్షణములుగల జంతు వనియే యభిప్రాయము. శబ్దము జాతినో రూపమునో చెప్ప నేలన, దాని ప్రయోజనము వ్యావహారికము.౧. శబ్దము వ్యక్తులనే చెప్పుచో, గోజాతి భావము కలుగుట కవకాశము లేదు. మఱియు నొకశబ్దము జాతిలోని సర్వవ్యక్తులను వ్యక్తము చేయఁ జాలదు; ఏలన నట్లుచేసినచో సర్వవ్యక్తుల సర్వశక్తులు దాని కుండవలసి వచ్చును. అది వ్యక్తిసముచ్చయమునకును జెందదు; ఏలన నా సమూహములోఁ గొన్ని వ్యక్తులు మరణించి, కొన్ని నూత్నముగా రావచ్చును. శబ్దమొక వ్యక్తినే చెప్పునదైనచో శబ్దార్థములకు నిత్యసంబంధముండదు; అందుచే వ్యవహారసిద్ధి యుండదు; ఏలన నప్పుడే వ్యక్తికా శబ్దము చెందునో నిర్ణయించుట కష్టమగును. వ్యక్తులనఁగా సూచింపఁబడిన వస్తువులైనచో నవి సర్వవ్యాప్తి లేనివి గావున, శబ్దార్థ సంబంధావకాశము పోవును. ఆకృతి శాశ్వతమైనదగుటచే, శాశ్వత శబ్దముతో సంబంధము నొందఁగలదు. శబ్దములు వానియర్థములు శాశ్వతములగుటచే, రెంటినిగూర్చియు మన కపార్థములు గలుగవచ్చును. మానవుల యుచ్చారణములకు దోషముండవచ్చును; వేదము లుచ్చరించినవాని కట్టిదోషములు లేవు.

వేదము లీశ్వరకృతము లను భావమును మీమాంసకులు నిరసింతురు. వేదములు వానిస్వశక్తిచే శాశ్వతములైనవని వారియభిప్రాయము. ఈశ్వరుఁడు సశరీరుఁడు కాఁడు కావున నాతనికి వాగింద్రియముకాని త్వగింద్రియముగాని లేదు; అందుచే

(౧) ఆకృతిస్తు క్రియార్థత్వాత్॥ (౧, 3, 33.)

నాతఁడు వేదవాక్యముల నుచ్చరింపఁజాలఁడు. వేదములను వ్యక్తీకరించుట కాతఁడొక మానవస్వరూపమును దాల్చునేని, యాతఁడు భౌతిక జీవితావస్థకుఁగల దోషములన్నిటికిని బాధ్యుఁడగును; అట్టి వాఁ డుచ్చరించు వాక్యములు ప్రమాణములు గాఁజాలవు. మఱియు వేదములీశ్వరకల్పితములనికాని, మానవకల్పితములనికాని చెప్పు సంప్రదాయమును లేదు. సృష్టిసిద్ధాంతము ననుసరించియైనను, సృష్టికర్త, ప్రతికల్పారంభము నందును పూర్వస్మరణశక్తిచే వేదములను దిరిగి వ్యక్తీకరించుచుండునని చెప్పవచ్చును. ౧. వేదవాక్యముల కామంత్రకర్తలైన ఋషుల నామము లనుసంధింపఁబడినవి కనుక వేదములు మానవకల్పితములని చెప్పఁబడెను. ఋషులు వేదముల నధ్యయనముచేసి యితరులకు బోధించిరని సమాధాన మీయఁ

---

౧. ఏతమ్ సృష్టేర్వేదపూర్వత్వమ్ సాధయతామ్ నకించిదుత్తరం భవతి, తేనసత్యపిసర్గే. సుప్తప్రబుద్ధన్యాయేన అనాదిరేష వేదవ్యవహారః। (న్యాయరత్నాకరము). మీమాంసావాదమును నైయ్యాయికులు ఖండింతురు. (౧) వేదమెట్టిపురుష విరచితమైనను, గతప్రళయములో నదిచెడియుండవలెను. (౨) అట్టి వేదకర్తనెవ్వఁడెన్నడును స్మరింపఁజాలకుండె ననుట సమంజసము కాదు. (౩) వేదవాక్యము లితరవాక్యసమానలక్షణములుగలవే. (౪) వేదములను గురువు శిష్యపరంపరగా బోధించిన పద్ధతిఁజూచి అనాదిగా నిట్లే జరుగుచుండెనను వాదమునిలువదేలన, నేగ్రంథమునుగూర్చియైన నిట్లే చెప్పవచ్చును. (౫) నిజముగను వేదములకుఁ గర్తగలఁడు. (౬) ధ్వనినిత్యము గాదు; పూర్వము వినిన యక్షరములనే మఱల వినుచుంటిమనుటవలన, నా యక్షరములే యని కాని యవినిత్యములని కాని సిద్ధింపదు; అవి పూర్వము మనము వినిన యక్షరముల వర్గమునకే చెందునని మాత్రమే తెలియును. (చూ. స. ద. సంగ్రహము. ౧౨ అ.)

బడెను. వేదములు మహర్షులకుఁగాని, యీశ్వరునకుఁగాని పత్ర ములై లేవను నర్థములో నవి యస్పష్టములని చెప్పఁబడెను. వారు వేదములనెఱిఁగి యితరుల కందఁజేసిరి.౧. చారిత్రిక నామములు పేర్కొనఁబడియుండుటచే వేదముల ప్రామా ణ్యము సిద్ధముకాదని చెప్పుదురు. మంత్రములు ప్రపంచము యొక్క శాశ్వతరూపములనుగూర్చి మాత్రమే వర్ణించునని జవాబుచెప్పఁబడెను. ఇందుఁ బేర్కొనఁబడిన నామములు విశ్వసామాన్యధర్మములనే చెప్పునుగాని చారిత్రికనామములు గావు. విశ్వామిత్రుఁడనగా సర్వజీవ మిత్రుఁడని యేకాని, చరి త్రాత్మకవ్యక్తి గాఁడు.

౭.—ఉపమానము.

సామ్యముగల నిర్ణయముల కుపమానమే కారణము. మన మొకవస్తువును జూచి, వేరొకవస్తువును స్మృతికిఁదెచ్చుకొను నప్పుడు రెంటికిఁగల సామ్యజ్ఞానమున కుపమానమే కారణమని చెప్పఁబడెను. పట్టణమున నేనుజూచిన గోవు నేనిప్పుడుచూచు చున్న గవయముతో సామ్యముగలిగియున్నది. ౧. ఉపమాన మునఁ గలుగు జ్ఞానము వేరు; ప్రత్యక్షజ్ఞానము వేరు నని గ్రహింపవలెను. ఏలన నింద్రియములతో నిప్పుడు సంపర్కము

(౧) చూ. మీ. సూ. ౧, ౧, ౨౭–౩౨. వేదముల అపౌరుషేయ త్వమునుగూర్చిన భావములు, పూర్వమీమాంసయును వేదాంతమునయును సమాన ములే. పోల్చు. భామతి; పురుషాస్వాతంత్ర్యమాత్రమ్ అపౌరుషేయత్వమ్‌రోచ యంతే జైమినీయాఽపిలచ్చాఽస్మాకమపి సమానమ్." (౧, ౧, ౩).

(౨) శాస్త్రదీపిక, పు. ౨౦౮.

లేని వస్తువును మనము జ్ఞాపకముచేఁ దెలియుదుము; గోవునుఁ జూచిన కాలమున గవయము చూడఁబడియుండలేదు; అనుమానమున కవసరములగు సంశయము లెవ్వియును లేవు.

## ౮—అర్థాపత్తి

ఒకప్రత్యక్షవిషయ మవగతమగుట కింకొక విషయభావన యవసరము; ఈవిషయభావనయే అర్థాపత్తి, అనుమానమునకును దీనికిని భేదమున్నది. ఇందు దర్శింపఁబడిన యంశములలో నుదయించుసందేహము వేఱొక విషయభావనచేతనే నివృత్తమగును;అర్థాంతరభావన చేయువరకు దృష్టవిషయాంశములు సంశయాస్పదములైయుండును. అనుమానజ్ఞానములో సంశయమునకుఁ దావులేదు. ఇది ప్రభాకరుని భావము. పరస్పరవిరుద్ధములుగా గోచరించు విషయములకు సమన్వయము కూర్చున దర్థాపత్తియని కుమారిలునిమతము; సునిశ్చితాంశములుగల యనుమానమునం దట్టి వైరుధ్యము లేదు. కుమారిలునిభావము శ్రేష్ఠతరము. ఏలన, దృష్టవిషయమును గూర్చిన యెట్టిసంశయమైనను నర్థాపత్తి వాదమునకు దోషము గలిగించును. ఒకవ్యక్తి యింటలేఁడనియు, సజీవుఁడై యున్నాఁడనియుఁ దెలియనిదే, ఆతఁ డెచ్చోటనో యున్నాఁడని చెప్పఁజాలము.

## ౯—అనుపలబ్ధి

వృత్తికారునివలెనే కుమారిలుఁ డనుపలబ్ధి నొకస్వతంత్రజ్ఞానప్రమాణముగా నంగీకరించినాఁడు.౧. భేదమనగా సాదృశ్యా

(౧) మా. ౧, ౧, ౪ పై శబరుఁడు.

లోపమే; అనుపలబ్ధి దీనిని పూరించును. "ఈస్థలములో ఘటము లేదని మనముచెప్పునప్పుడు మనము ఘటాభావమును గుర్తించి నాము. ఎదుటనున్న వస్తువుతో నింద్రియసంపర్కమునుగోరు ప్రత్యక్ష మభావమును దర్శింపఁజాలదు.౨. అభావము నితర ప్రమాణములును గ్రహింపఁజాలవు. ఏవస్తువు లేదని చెప్పు దుమో దానిమానమును గూర్చిన జ్ఞానసాధన మనుపలబ్ధి. మన మొక రిక్తప్రదేశమును, ఘటాభావమును దర్శింతుము. రిక్తస్థలముతో సమానముగా ఘటాభావమును దర్శింపఁబడినదని చెప్పవచ్చునుగాని, ఇంద్రియవస్తుసంయోగమునుగోరు ప్రత్యక్ష మనుపలబ్ధి కాఁజాలదు, రిక్తస్థలమును జూచి, యచటలేని ఘట మును స్మరించి, ప్రత్యక్షక్రియతో సంబంధములేని ఘటాభావ జ్ఞానమును సంపాదించుచున్నాము. అనుపలబ్ధివలననే అభావ జ్ఞానములభించును.౧. అభావ మొక భావాత్మక విషయమని చెప్పఁ బడెను.౨. రిక్తస్థలమనగా నేవస్తువు నాక్రమింపనిస్థానమని యర్థము౩..

అనుపలబ్ధి స్వతంత్రప్రమాణమని ప్రభాకరుఁ డంగీక రింపఁడు. ఏవస్తువున్నచో దర్శింతుమో యావస్తువచట లేకుండు టను జూచి తదభావము ననుమానముచేఁ దెలియుచున్నాము. రిక్తస్థలమేకాని ఘటము లేదని చూచి, లేదనిచెప్పుచున్నాము. వస్తువున కాధారమైన దానినిజూచుటే యభావమును జూచుట

(౨) శ్లో॥ వా॥ అభావపరిచ్ఛేదమ్.
(౧) శాస్త్రదీపిక. పు. ౨౩౮.
(౨) వస్త్వంతరైక సంసృష్టః పదార్థఃసామ్యతాధియః (౧౧౨).
(3) శ్లో॥ వా॥ నిరాలంబనవాదము, పు. ౮౦.

యని చెప్పుచున్నాము.* కుమారిలుఁడీభావమునుఖండించెను. మనము రిక్తస్థలమునే కాక, పుస్తకములు కాగితములు మున్నగు వానితో నిండియున్నస్థలమును జూచి, ఘటాభావజ్ఞానమును బొందవచ్చును. ఘటమను గుణవిశిష్టముకాని ప్రదేశమును మనము చూతుమని చెప్పినచో నభావజ్ఞానము నంగీకరించిన వారమగుదుము. కేవల ప్రదేశదర్శనము ఘటాభావజ్ఞానము నీయఁజాలదు; ఏలన ఘటమున్నను ప్రదేశము దర్శింపఁబడును. ప్రదేశ మభావగుణసహితమై దర్శింపఁబడవలెను; అనగా నభావ జ్ఞానమే.

### ౧౦ — ప్రభాకరుని జ్ఞానసిద్ధాంతము

ప్రభాకరుఁడు త్రిపుటీసంవిద్వాది. ప్రతిజ్ఞానక్రియయందు నేకకాలమునఁ దెలియువాఁడు, తెలియఁబడునది, తెలివియు నుండునని యీవాదము చెప్పును. "అహమిదంజానామి" "నేను దీనినిఁ దెలియుచున్నాను" వాక్యమందు "నేన"ను నహంవిత్తి 'దీనిన'ను విషయవిత్తి, 'తెలియుచున్నాన'ను స్వసంవిత్తియు మూడునున్నవి.౧ జ్ఞానమంతయు నొకేకాలమున విషయ

---

* ప్రభాకరుని ఈభావము ఖండనఖండఖాద్యము ౪, ౨౧లో విమర్శింపఁబడినది.

(౧) కొందరు పశ్చిమపండితులుకూడ నిట్లే భావించినారు. హామిల్టన్ ప్రకారము; "ఒకజ్ఞానవృత్తిని నేనెఱుఁగుదున"నియు, నాత్మజ్ఞానవృత్తిని, "నేనెఱుఁగుట నెఱుఁగుదు"నియుఁ జెప్పవచ్చును. కాని, మనమెఱుఁగుదుమని యెఱుఁగకుండ దేని నెఱుఁగుటయు సాధ్యముకాదు. కావున మనము నిజముగా నెఱుఁగకుండ మన మెఱుఁగుదుమని యెఱుఁగుటయు సాధ్యముకాదు." పోల్చు: వారిస్కో: "నేనెఱుఁగుటకొరకు నాచిత్తమును నేనెఱుఁగవలెను; అనగా నేనెఱుఁగుట నెఱుఁగవలెను. దీని యర్థమేమన నాత్మవృత్తి కాత్మయేఁ జిత్తమును దెలియుననియే." (నొద్దై సెల్ఫు పు. ౫)

జ్ఞానము స్వీయజ్ఞానముకూడ నైయున్నది.౨. సకలజ్ఞానరూపము లందు ననగా శబ్దానుమానాదికములో నేనను నాత్మ మన స్సంయోగద్వారమునఁదెలియును.ప్రతిజ్ఞానవృత్తియందునాత్మను గూర్చి ప్రత్యక్షసద్యోజ్ఞానముండునుగాని, యట్టిజ్ఞానము ప్రతి వృత్తియందనాత్మలేక విషయమునుగూర్చి యుండకపోవచ్చును. స్మారణానుమానములందు విషయముతోఁ బ్రత్యక్షసంపర్క ముండదు. పరోక్షజ్ఞానమునందు విషయము ప్రత్యక్షగోచరము కాదు, కాని పరోక్షజ్ఞానమే ప్రత్యక్షగోచరమగును జ్ఞానము ప్రత్యక్షదర్శనముచే నాత్మజ్ఞానమగుచున్నది. జ్ఞానము జ్యోతి స్స్వరూపము, ప్రకాశవంతమునగుటచే దానివ్యక్తీకరణమున కేయితరసహాసంపత్తియు నవసరములేదు. అందుచే జ్ఞానము స్వయంగ్రాహకమైనదని చెప్పఁబడెను. గ్రహించు చిత్తమును, గ్రహింపఁబడు విషయమును స్వయంప్రకాశకములుగావు: అందుచే నవి వ్యక్తీకరింపఁబడుటకు వేరొక స్వయంప్రకాశ త్వము గల దాని నపేక్షించును. జ్ఞానవృత్తులు స్వయంప్రకా శకములు; అవి వస్తువులవలె దర్శింపఁబడవు.౧. అవి యితర జ్ఞానవృత్తులకును దెలియవు. అవి యెన్నఁడును దృశ్యములు

(౨) సుషుప్తిలో వస్తుజ్ఞానములేదు గావున నాత్మయున్నను నాత్మ జ్ఞానములేదు. సుషుప్తిలోనాత్మలేకున్నచో, మేల్కొన్న వెనుక నేనునిద్రించితి నను ప్రత్యభిజ్ఞకవకాశముండదు. (ప్రకరణసంచిక, పు. ౧౬౫.)

(౧) పోల్చు: దీనితో నల్జెగ్జాండరుచెప్పిన అనుభూతిధ్యానములకుఁ గల భేదమును, (దేశము, కాలము, దేవుఁడు, వాల్యూము. ౧, పుటలు ౧౨- ౧౩.)

గావు; అందుచే సుఖదుఃఖాదులవలె నవి గోచరింపవు. అవి జ్ఞానరూపములలోనే కాని విషయములుగా నెన్నఁడును దెలియవు.౨. జ్ఞానవృత్తులును విషయములైనచోఁ బ్రతిజ్ఞానక్రియకింకొకటి కారణమై, యనవస్థాదోషము పట్టును. మన మనశ్శక్తిచే, విషయములను దెలియుదుమే కాని జ్ఞానక్రియలను గాదను శబరుని భావముతోఁ దన సిద్ధాంతమునకు సామ్యము లేదని ప్రభాకరుఁడు భావించి, జ్ఞానరూపములు స్వీయజ్ఞానము కలవైనను, వాని ననుమానముచే నెఱుఁగఁదగునని వాదించినాఁడు. మనకు విషయగ్రహణ శక్తివలన జ్ఞానము కలుగుచున్నదని యనుమానము చెప్పుచున్నది. ఈజ్ఞానము ప్రమేయ జ్ఞానమే కాని సంపూర్ణజ్ఞానము లేక సంవేద్యముకాదు. ప్రభాకరు ననుసరించి, విషయాకృతి గోచరించినపుడే సంవేద్యజ్ఞానము లభించును. ఇంద్రియగోచరములగు విషయముల కిది చెల్లును. జ్ఞానరూపముల కాకృతి లేనందున నవి విషయములు కాఁజాలవు. అవి యనుమానముచేఁ దెలియఁగలవు. అనుమానము వలన నొక విషయరూపముగాని విషయలక్షణముగాని తెలియదు; విషయాస్తిత్వము మాత్రమే తెలియును.౧. జ్ఞానరూపము లాత్మపరిణామ ప్రవృత్తులగుటచే ననుమాన విషయములని ప్రభాకర కుమారిలు లిరువురు తలఁచిరి.

జ్ఞానము యుక్తమైనదగునా కాదా యనున దేబాహ్యావిషయమును నిర్ణయింపఁజాలదు. బాహ్యావిషయముల

(౨) సంవిత్తయైవహి సంవిత్సంవేద్యా నసంవేద్యతయా.

(౧) నాప్యనుమానాత్ రూపగ్రహణమ్ సన్మాత్రగ్రాహ్యనుమానమ్ భవతి.

రూపాంతరసృష్టియుండదు. బాహ్యప్రపంచమున వ్యవహారసామర్థ్యము నొసఁగు ప్రత్యక్ష జ్ఞానశక్తియే జ్ఞానము సయుక్తమైనదని నిరూపించును. సర్వజ్ఞానరూపము లిట్టివే; అనంతర మనుభవము గలిగి మన కుపదేశించువరకు నవి వేచియుండవు. ఒక విషయమును దెలియు జ్ఞాన మయుక్త మెన్నడునుగాదు. జ్ఞానవృత్తు లయుక్తములైనచో, నవి మనకు విశ్వాసపాత్రములుగావు. జ్ఞానము స్వసంవేద్యమైనను, దాని సంసిద్ధి జ్ఞానసాధనములచే స్థాపితమగును. జ్ఞానలక్షణములందే జ్ఞానసంసిద్ధి లక్షణమునున్నది. ౨.

జ్ఞానమును ప్రామాణికమనియు నప్రామాణికమనియుఁ బ్రభాకరుఁడు విభాగించును. ప్రత్యక్షానుభూతి ప్రామాణికము; స్మృతి కాదు. "ప్రామాణిక జ్ఞానమునకును స్మృతిజ్ఞానమునకును భేదమున్నది. స్మృతిజ్ఞానమునకుఁ బూర్వజ్ఞాన మవసరము." ౩. విషయమునకుఁ బరోక్షసంబంధముగల జ్ఞాన మయుక్తము. పూర్వము తెలియకుండుట, ప్రామాణిక జ్ఞానలక్షణముగాఁ బ్రభాకరుఁడును కుమారిలుఁడును జెప్పిరికాని, కుమారిలుఁడితర

(౨) తత్త్వచింతామణిలో గంగేశుఁడీ భావమును ఖండించినాఁడు. జ్ఞానహేతువులే జ్ఞానప్రామాణ్యమును నిరూపించుచో, నయుక్తజ్ఞానము యుక్తజ్ఞానము నొకటే యగును; ఏలన, రెంటికి నాధారములు సమానములే మఱియు జ్ఞానము స్వప్రకాశమైనచో, సంశయజ్ఞానహేతువేమో చెప్పుటకు మార్గములేదు.

(౩) ప్రమాణమనుభూతిః సాస్మృతేరన్యానప్రమాణమ్స్మృతిః పూర్వప్రతిపత్త్యపేక్షణాత్. (ప్రకరణపంచిక. పు. ౪౨.)

దోషములుకూడ లేకుండవలెనని నిర్ణయించినాఁ. జ్ఞానమంతయు యుక్తమైనదై, ప్రవృత్తి చోదకమగును.

విపర్యయమనునది సత్ జ్ఞానము కాదు. జ్ఞానమంతయు స్వప్రకాశము, యథార్థమునైనచో "ఇది వెండి" యనుభావము విపర్యయము కాఁజాలదు. ముత్తెపు చిప్పను వెండియని మనము పొరపడినపుడు, రెంటికిఁ గల భేదమును వివేకించుశక్తి లోపించుట చేతనే విపర్యయ మేర్పడినది. దృష్టస్మృతాంశముల రెంటి నొక భావములోఁ గలిపి వేసితిమి. మనచిత్తమునకుఁ బ్రదర్శింపఁబడునదే జ్ఞానవిషయము. 'ఇది రజితమ'ను దానిలో మన చిత్తమునకుఁ బ్రదర్శితమైనది 'రజితము' కాని 'శుక్తి' కాదు. ఇచట మనము శుక్తిని రజితమని భ్రమించుటలేదు; ఏలన శుక్తి మన చిత్తమునఁ బ్రవేశించలేదు. స్మరింపఁబడిన విషయము గోచరించిన విషయము నొకటి కాలేదు. "ఇది రజితమ"ను నిశ్చయము "ఇదియొక శుక్తి మాత్రమే"యను నిశ్చయముచేఁ దొలగింపఁబడినది. ఇచట విపర్యయహేతువు 'అఖ్యాతి' యనగా దృష్టస్మృతవిషయభేద వివేకలోపము. దృష్టమైన 'ఇది', స్మరింపఁబడిన "రజితము" రెండును యథార్థములే, రెండును వేరను భేదవివేకము లోపించినది. దీని నఖ్యాతియందురు. ఈయవివేక హేతువు లింద్రియ దోషములు, శుక్తి రజితసామ్యభావ స్ఫురణమునై యున్నది. పూర్వదృష్టమైన రజితమును గూర్చిన మనస్సంస్కారము మృతమగును. రెంటికిఁగల భేదమునుగుర్తించు వివేకలోపము ప్రవృత్తి హేతువగును. ప్రత్యక్షానుభూతిలో జ్ఞానము నకు

యుక్తాయుక్త భేదము లేదు ఏలన, రెండును గర్తకు సమాన కర్మచోదకములే.౧.

అన్యశాఖ లీసిద్ధాంతమును విమర్శించినవి. "స్మృతి జ్ఞానము, ప్రత్యక్షజ్ఞానము, రెండును మనస్సునందు గోచరము లగునా కాదా? చూపట్టకున్నచో నవి లేనివే......చూపట్టి నచో వాని భేదమగ్రాహ్యమగుట దురూహ్యము..."౨. విప ర్యాయ మున్నంతకాలము, విషయము మనస్సునకుఁ బ్రత్యక్ష విషయమే కాని క్షణికదృశ్యము కాదను విషయము నీసిద్ధాం తము గ్రహించి యుండలేదు. స్మృతి భ్రింశమున కవకాశ మెట్లున్నదో చెప్పుట కష్టము. ఇది విషయము ప్రత్యక్షమను భ్రాంతిని కల్పించుచున్నది.3. ఈవిషయభేద జ్ఞానలోపమున్నచో వ్యక్తి ప్రవృత్తి పరుఁడగు టెట్లగు చున్నాఁడో చెప్పుటయు దుస్తరము. తానెన్నడును గోరని ప్రత్యక్షవిషయమగు శక్తి జ్ఞానము నివృత్తిచోదకమగును; స్మరింపఁబడిన రజితజ్ఞానము ప్రవృత్తి చోదకమగును; రెంటికి భేదము తెలియని అజ్ఞత క్రియా పరతంత్రమెట్లగునో దురూహ్యమగు చున్నది.౪.

ప్రతిజ్ఞానరూపమునందును జ్ఞాతృజ్ఞాన జ్ఞేయములున్న వను ప్రభాకరునివాదమును మనస్తత్వశాస్త్రము సమర్థించుట

---

(౧) "శుక్తి పసుపురంబుగానున్నద"ని జనము పలుకునపుడు దీనిలో స్మృత్యంశ మేమియునులేదు. నేత్రదోషముచేనైనన్నుశుక్తిలో బసుపురంగును జూచినచో, నదికాదని తెలియువఱకు నిదియుక్తమే.

(౨) చూ॥ పండిట్. న్యా, సూ. వాల్యూమ్. ౧౨, పు. ౧౦౯.

(3) వివరణ ప్రమేయసంగ్రహము. ౧,౧.

(౪) తత్త్వచింతామణి

17

లేదు. మనమొక వస్తువునెఱుఁగునప్పుడు, మనకుఁ గలుగుజ్ఞానమునందు మనవ్యక్తిగతాంశ మేలయుండవలెనో తెలియదు. తెలియువ్యక్తి దురహంకార దూషితుఁడు కాకున్నచో నట్టి జ్ఞానములో నావ్యక్తిగతభావ ముండనవసరము లేదు. తరువాతఁ జేసిన యాలోచనము ప్రత్యక్షవిషయమని ప్రిభాకరుఁడు పొరపడినాఁడు. ఒకఁ డొకవిషయమునుగూర్చిన తనజ్ఞానమునఁ గూర్చి తలఁచునప్పుడు, వానిభావములో విషయావిషయములు రెండునున్నవి. జ్ఞాతృసంబంధము లేని యొకవిషయము తెలిసినదని మనమూహింపఁజాలము కాని, తెలిసినవని తలఁపకుండ వస్తువులనుగూర్చి యొకఁడేల తలపఁజాలఁడో తెలియుట లేదు. జ్ఞానగతములైయున్న నిగూఢాంశములనుగూర్చి, విజ్ఞానములో నున్నతదకారూపమైన యంతర్విచారణ మనకుఁ దెలియఁజేయును. మన మెఱుఁగుదుమని యెఱుఁగకుండ దేని నెఱుఁగఁజాలమని ప్రిభాకరుఁడు నమ్మినాఁడు; (౧) "నే నెఱుఁగుదును," "నే నెఱిఁగితినని యెఱుగుదున"ను రెండుభాగములకును భేదమును ప్రిభాకరుఁ డెఱుఁగనట్లు తోఁచుచున్నది. యఱియుజ్ఞానము స్వప్రకాశమైనచో వస్తువులు జ్ఞానరూపములై గోచరించును; కాని వాస్తవికరూపములలోఁ గన్పట్టవు; అందుచే నీవాదము విజ్ఞానవాదమగుచున్నది. (౨) ఈవిజ్ఞానదోషము నుండి తప్పించుకొనుటకై స్వప్రకాశ జ్ఞానరూపములుకూడ

---

(౧) ఏవిషయజ్ఞానమందైనను, విషయజ్ఞానమును జ్ఞానవిషయమును గలిసియేయుండునని ఇటలీపండితుఁడైన బోనటెల్లి భావించినాఁడు.

(౨) శ్లో. వా. శూన్యవాదము, పు. ౩౩౩.

ననుమానమువలననే తెలియునని ప్రభాకరుఁడు ప్రకటించెను. విషయములు దర్శింపఁబడునుగాని జ్ఞానరూపములుగాదని శబరుఁడుచెప్పిన వాక్యమును విమర్శించుచు నీతఁడు జ్ఞానరూపములనుమానమువలననే తెలియునని చెప్పినాఁడు. 3. కాని యిది జ్ఞానరూపములు స్వప్రకాశములను భానమునకు వ్యతిరేకమగుచున్నది. అనుమితజ్ఞాన మాత్మ మనస్సంయోగమనియు నీసంయోగము జ్ఞానహేతువగుచున్నదనియు శాలికానాథుఁడు సూచించినాఁడు. ౧. అనుమితజ్ఞానమంతయు నిదియే యైనచో జ్ఞానరూపము లనుమితములనిచెప్పుట తప్పగును. జ్ఞానము స్వప్రకాశకమనినచో విజ్ఞానప్రమాదమున్నది;జ్ఞానము స్వయంప్రకాశముగలదనియే కాని దాని స్వభావశీలములెట్టివో ప్రభాకరుఁడు మనకుఁ జెప్పలేదు. జ్ఞానము పారమార్థికసంపూర్ణతగలదని వక్కాణించి, విషయావిషయా ర్థమెట్లు జ్ఞానగర్భితమైయున్నదో చూప యత్నించినాఁడు. ఆతఁడీ సిద్ధాంతములో నితరవిషయముల నన్నిటినింకను, విశేషముగాఁ బరిశీలించినచో ద్వైతభావవిశ్వాసములను దిగనాడియుండెడివాఁడే.

## ౧౧—కుమారిలుని జ్ఞానసిద్ధాంతము

ఆత్మప్రవృత్తిచేఁ గలుగు సంచలనము జ్ఞానము; తత్ఫలితముగా బాహ్యవస్తువివేకము సిద్ధించును. ఒకవస్తుజ్ఞానము దీనినిగూర్చిన మఱియొకజ్ఞానముగాఁ బరిణమించదు; అది

---

(3) అతస్సిద్ధమానుమానికత్వమ్ బుద్ధేః.

(౧) ప్రకరణసంచిక, పు. ౬౩.

వస్తువ్యక్తీకరణమునే చేయును.౨. ఒకజ్ఞానక్రియలో నాలు గంశములున్నవి (౧) జ్ఞాత, (౨) జ్ఞేయము, (3) జ్ఞానకరణము, (౪) జ్ఞాతత. కుమారిలు ననుసరించి, జ్ఞానము ప్రత్యక్ష విషయముగాదు; అది జ్ఞానముచే (బ్రకటితమైన వస్తురూపమున ననుమానముచేతనే తెలియునది.3. ప్రతిజ్ఞానకర్మయందు నొకవిధమగు ద్రష్టృదృశ్యసంబంధమున్నది; ఇందు ద్రష్టయొక్క ప్రవృత్తి కొంత యున్నది. ఇట్టి సంబంధముండుట వలన ద్రష్టయొక్క కర్మ ననుమానించుట కవకాశమున్నది. ఈకర్మయే జ్ఞానరూపము. జ్ఞాతృజ్ఞేయ సంబంధము వలన జ్ఞానము లభించును; ఇది మానస ప్రత్యక్షమగును. జ్ఞాతృజ్ఞేయముల మధ్యం బ్రవేశించు నీమానసదర్శనము లేనిదే, నాత్మకు విషయసంపర్కమే లభింపదు. జ్ఞాతృజ్ఞేయములకుఁగల యిట్టి విశిష్ట సంబంధము వలననే, జ్ఞానాస్తిత్వ మనుమానింపఁబడును. చిత్తమిచట నాత్మానాత్మలకు సంబంధమును గలుపునది. జ్ఞానరూపములు స్వప్రకాశకములను వారు గూడ, జ్ఞాతృజ్ఞేయ సంబంధములో నిమిడియున్న జ్ఞానమంతర్దర్శన విషయమని యంగీకరింతురు. గ్రహించు నాత్మకును గ్రహింపఁబడు విషయమునకును గల సంబంధమును జ్ఞానమునకును, జ్ఞానజ్ఞేయమునకును గలసంబంధ

(౨) పోల్చు; ఇటలీవిద్వాంసుఁడైన కోస్మిని యిట్లుచెప్పెను; ప్రతి జ్ఞానవృత్తియు విషయమును మనకుఁదెలియఁజేయును; కాని యేజ్ఞానవృత్తియు దానినే మనకుఁదెలియఁజేయదు. చూ. ఫిలసాఫికల్ రివ్యూ. జూలై ౧౯౨౨; పు. ౪౦౦.

(3) జ్ఞాతతానుమేయమ్ జ్ఞానమ్. మతియుఁజూడు. ౧: ౧, ౧ పై శబరుఁడు.

మును తెలిసిననేగాని, "ఘటము నాచేఁ దెలియఁ బడినద"ని చెప్పుటకు సాధ్యముకాదు.౧. జ్ఞానము స్వప్రకాశమైనచో, విషయము జ్ఞానము వలనఁ బ్రకటితమైన యెడల, జ్ఞానమునకును జ్ఞానవిషయమునకును గల సంబంధము దేనివలనఁ బ్రకటిత మగును? రెంటికిఁగల సంబంధము నాజ్ఞానమే ప్రదర్శింపఁ జాలదు; ఏలన నది యుదయించిన కాలమునకుఁ బూర్వము లేదు. ఒకజ్ఞాన ముదయించినప్పుడు, దాని విషయము నది ప్రదర్శించును; అందుచే రెంటికిఁగల సంబంధము నాజ్ఞాన వృత్తియే ప్రదర్శింపఁజాలదు. జ్ఞానక్రియ క్షణికమగుటచే, నది మొదట విషయమును బ్రదర్శించి, తరువాత విషయమునకుఁ దనతో సంబంధమును గూడఁ బ్రదర్శించునని చెప్పఁజాలము. జ్ఞానమునకును జ్ఞానవిషయమునకును గల సంబంధము స్వప్రకాశకమనియుఁ జెప్పఁజాలము; ఏలన దానికెట్టి సాక్ష్యమును లేదు, అందుచే నాత్మకును విషయమునకునుగల సంబంధమంత ర్బుద్ధి విషయమనియు, దానివలన జ్ఞానాస్తిత్వము ననుమానించు చున్నామనియుఁ గుమారి లానుచరులు వాదింతురు.౧.

ఒక జ్ఞానవృత్తి గలదని జ్ఞానవిషయమున నుత్పత్తియైన అతిశయ లక్షణముచే ఋజువగుచున్నది.౨. జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ ములు మూడును చిత్తముచేఁ బ్రదర్శింపఁబడుచున్నవని వాదించు

(౧) అన్యతాజ్ఞాతో మయాఘటా ఇతి జ్ఞానజ్ఞేయసంబంధో, జ్ఞాతృ జ్ఞేయసంబంధో వానవ్యవహర్తుమ్ శక్యతే.

(౧) శాస్త్రదీపిక. పు ౧౫౮-౧౫౯.

(౨) అర్థగతో వా జ్ఞానజన్యోఽతిశయః కల్పయతి జ్ఞానమ్. శాస్త్రదీపిక పు. ౧౫౯.

వారైనను (త్రిశయ ప్రతిభాసవాదులు) నీ యతిశయలక్షణము నంగీకరింతురు. బాహ్యవస్తు యాథార్థ్యమును సాధించు నుద్దేశముతో జ్ఞానవృత్తి స్వప్రకాశకమను సిద్ధాంతమును కుమారిలుఁడు తిరస్కరించినాఁడు. విషయమునందుత్పత్తియగు నతిశయలక్షణముచే జ్ఞానవృత్తి గలదని యనుమానించు నీ తత్త్వమును న్యాయవైశేషికులు నిరసించిరి. జ్ఞానవృత్తి జ్ఞాన విషయములో వికారము నుత్పత్తిచేయునని తలఁపరాదు. ఒక విషయము తాను గ్రహింపఁబడుట దానిగుణముకాదు; అది జ్ఞాన జ్ఞానవిషయ సంబంధమునుమాత్రమే సూచించును.3.

(3) జ్ఞాతయనఁగా జ్ఞానవిషయముగానుండు లక్షణమే. వాస్తవికతా స్వభావనిర్వచనము సులభముకాదు. ఒకవిషయమువలన జ్ఞానవృత్తి యుదయించుటయే వాస్తవికత యైనచో, జ్ఞానవృత్తిహేతువులగు నింద్రియాదికములును విషయములే కావలెను. ఒకవస్తువులేనికాలమున దానియందొక గుణము నుదయింపఁజేయుట సాధ్యముకాదు జ్ఞాతతాలక్షణము వస్తుగుణమే; కాని గ్రహింపఁబడు భూతభావివస్తువులలో నదికలుగుట కవకాశములేదు. పచన క్రియ బియ్యములో నుడుకుటనుత్పత్తిచేయునట్లే, జ్ఞానవృత్తి జనించిన వెనుక వస్తువునకు జ్ఞాతతాలక్షణ ముదయించుననుట యుక్తముకాదు; ఏలనఁ, దండులము లోదనముగా మారుటను మనము స్పష్టముగాఁజూడఁగలము; వస్తువులలో జ్ఞాతతాలక్షణమట్లు గోచరించునదికాదు. మఱియు నొకవస్తువు తెలిసినపుడు, దానిలో నొకయతిశయలక్షణము (జ్ఞాతత) జనించునని చెప్పినచో, నీజ్ఞాతతాలక్షణము తెలిసినపుడింకొక జ్ఞాతతాలక్షణమిందు మఱల జనించవలసియుండుటచే ననవస్థాదోషము సంభవించును. ఈయనవస్థాపరిహారార్థము, జ్ఞాతతాలక్షణము స్వప్రకాశకమన్నచో, జ్ఞానవృత్తియు స్వప్రకాశకమే యగువచ్చును. ఒకవస్తువు కాలత్రయమందుండును. అదిగ్రహింపఁబడునపు డది వర్తమానవస్తువుగా గ్రహింపఁబడును. అందుచే వర్తమానకాల నిశ్చితమైన విషయావస్థయే జ్ఞాతయగుటచే దీనివలన మనముజ్ఞానవృత్తి నను

దీనికి సమాధానముగాఁ గుమారిలానుచరు లిట్లు చెప్పుదురు. జ్ఞానవృత్తి దృశ్యమేయగుచో, నదియొక విషయమగును. దానిని గ్రహించుట కింకొక జ్ఞానవృత్తి కావలెను. దీనిచే ననవస్థా

---

మానించి తెలిసికొందుమని వాదింపవచ్చును, కాని, యీవాదము నిలువదు. ఏలన, వర్తమానకాలనిర్ణయము వస్తువునకుఁజెందినది; అదిజ్ఞానవృత్తి జన్యము కాదు; జ్ఞానవృత్తిచే గ్రహింపఁబడునదే. వస్తుజ్ఞానముచే జ్ఞానవృత్తి యనుమానింపఁబడినదన్నచో, జ్ఞానవృత్తి ఆత్మగతమా వస్తుగతమాయను ప్రశ్న జనించును. వస్తు వచేతనమగుటచే నందుండఁ జాలదు; అది యాత్మగతమైనచో, వస్తుజ్ఞానముచే ననుమానింపఁబడిన వృత్తియేది? అది జ్ఞాతృవ్యాపారరూపమన్నచో, నీకారణము నిత్యమా అనిత్యమా? అనిత్యమైనచో దాని కారణమేది? అదియాత్మ మనస్సంయోగజాతమన్నచో, నది వస్తువుతో నింద్రియము సంయోగ సహకారియగునుగావున, నివన్నియు జ్ఞానవృత్తికారణములే యనవచ్చును. ఆత్మపరివృత్తిరూపమగు నొకమధ్యవర్తిత్వకారణమూహింప నవసరములేదు. అవి నిత్యమనియు,ననుబంధకారణములచేఁ దాత్కాలిక జ్ఞానరూపములు గోచరించుననియు వాదించుచో, జ్ఞానవృత్తిహేతువులుగా నివి సరిపోవును. గావున. నాత్మపరివృత్తికారణము నూహింపనవసరములేదు. (శ్రీధరుఁడు,న్యాయకందళి, పు. ౯౬-౯౭.) ఈజ్ఞాతతాలక్షణము అర్థధర్మమా జ్ఞానధర్మమాయని ప్రభాచంద్రుఁడు పరీక్షించినాఁడు. అది నిగ్రహింపఁబడినప్పుడే కాని యింకెప్పుడు నదివస్తువులో నుండదు కావున నది యర్థధర్మము కాదు; మఱియు నదిగ్రహించునాత్మయొక్క ప్రత్యేకధర్మమై గోచరించును.అది జ్ఞానవృత్తులకుఁజెందదు; ఏలన,జ్ఞానవృత్తి కుమారిలుననుసరించి యదృశ్యము;ఇది జ్ఞానవృత్తిలక్షణమని చెప్పఁబడెను; అగోచరమగునది జ్ఞాతతాధారముకాఁజాలదు. లేక జ్ఞానస్వభావమైన యీజ్ఞాతతాలక్షణము దృశ్యమందుమా, జ్ఞానవృత్తియు నట్టిదేయని చెప్పవచ్చును. జ్ఞాతతాలక్షణ మర్థస్వభావమన్నచో దానికర్థప్రాకట్యమనియే తాత్పర్యము కావలెను. జ్ఞానవృత్తియే యగోచరమైనచో, దానివలన గ్రహింపఁబడు వస్తువు నగోచరమేయగును (ప్రమేయకమలమార్తాండము, పు. ౩౧-౩౨.) కుమారిలుననుసరించి,ఘటజ్ఞానము, ఘటము

దోషము సంభవించును. అందుచే జ్ఞానవృత్తు లదృశ్యము లనియు, నవి జ్ఞానవిషయములను మాత్రమే ప్రదర్శించుశక్తి గలవనియు వారు వాదించిరి. ౧. అనుమానముచే జ్ఞానవృత్తియు జ్ఞానవృత్తిచే విషయములును విదితములగును. జ్ఞానము స్వతః

నందు జ్ఞాతతాలక్షణము నుదయింపఁజేయును: ఇది, "ఈఘటము నాచేఁదెలియఁబడినది" ను ప్రత్యక్షవిషయమగును. దీనివలన జ్ఞానవృత్తియున్నదనియు, నది సప్రమాణమనియు ననుమానింతుము. జ్ఞానము, జ్ఞానజ్ఞానము, ప్రామాణ్యజ్ఞానము నొకటి వెనుక నొకటివచ్చునని న్యాయసిద్ధాంతము; చివరిరెండు నేకకాలికములని కుమారిలు నభిప్రాయము.

(౧) తన ప్రమేయకమలమార్తాండమునందు (పు. ౩౧) ప్రభాచంద్రుఁడీ భావమును విమర్శించెను. ప్రమాతృప్రమితీ ప్రమాణములు ప్రమేయము వలెనే, జ్ఞానవిషయములే. భిన్నజ్ఞానాంశములను మనము నిత్యానుభవములో స్పష్టముగాఁ జూచుచున్నాము. దర్శింపఁబడిన ప్రతివిషయ మొక ప్రత్యక్షవిషయముగాఁ జూడనవసరములేదు. ఆత్మయొక జ్ఞానవృత్తిగా దర్శింపఁబడునే కాని జ్ఞానవిషయముగాఁ గాదు. జ్ఞానవృత్తియు నొక ప్రత్యక్షదర్శనోపకరణముగా గ్రహింపనగును. ఆత్మ దర్శనవిషయమని కుమారిలానుయాయు లంగీకరించు నపుడాత్మ ద్రష్టయైనను, వస్తుప్రదర్శన సాధనమగు జ్ఞానవృత్తియు దర్శనవిషయమే యనికూడ నంగీకరింపవచ్చును. ఆత్మ దృశ్యమే యైనచో, నదృశ్యమగు జ్ఞానవృత్తితో నిమిత్తములేకుండ స్వయముగానే యొక బాహ్యవస్తువును గ్రహింపఁగలదు. ఒక యుపకరణావసరము లేనిదే, ప్రమాత ప్రవృత్తి నుదయింపఁజేయ లేదనినచో, బాహ్యాభ్యంతరేంద్రియములు జ్ఞానోపకరణములు గావచ్చును. ఉపకరణములేనిదే, ప్రవృత్తి సాధ్యము కానిచో, ఆత్మ తన్నెఱుఁగు వృత్తిలో నాత్మ కుపకరణమేది? ఆత్మ కాత్మయే యుపకరణమైనచో, వస్తుజ్ఞానమున కదేయుపకరణము గావచ్చును. ఆత్మయుఁ దత్ఫలజ్ఞానమును దృశ్యములని యొప్పుకొన్నచో, జ్ఞానోపకరణము కూడ జ్ఞానవిషయముగాఁ గాక, జ్ఞానోపకరణముగా దృశ్యమే యని యంగీకరింపవచ్చును.

ప్రమాణమనువాదమును మీమాంసకులంగీకరింతురు.౧.సమ్యక్ జ్ఞానకారణములకన్నిటికి స్వతః ప్రామాణ్య మున్నద”ని కుమారిలుఁడు నుడివినాఁడు;ఏలన, నేశక్తి స్థితిలేనిదో,దానినెద్దియు నుదయింపఁజేయజాలదు.” ౧. జ్ఞానమున కింద్రియములు, ననుమానచిహ్నములు సాధనములుగావచ్చును;కాని,జ్ఞానముస్వయ

మఱియు,గరణజ్ఞానము కర్తనుండియుఁ దత్ఫలజ్ఞానము నుండియుఁ బూర్తిగా వేరు కావు; ఈరెండును దృశ్యములైనచోఁ గరణ జ్ఞానమొక్కటియు నదృశ్యమెట్లగును? అదియుఁ గాక, ఆత్మయు, నొక వస్తువును దానెఱుగు జ్ఞానవృత్తియు మన యనుభూతిలోఁ బ్రత్యక్షముగా గోచరించు విషయము లగుటచే నవి బుద్ధివిషయములని చెప్పవలయును. (ప్రతీయమానత్వం హి గ్రాహ్యత్వమ్, తదేవ కర్మత్వమ్) బుద్ధి కేదిగోచరించన నది దాని విషయమే. “నేను ఘటము నెఱుఁగుచున”ను దానిలోఁ గర్త ఘటజ్ఞానగుణోపేతుఁడైన దన్నుఁ దానెఱుగును. ఆత్మయు ఘటమును వలెనే, కర్తయొక్క ఘటజ్ఞానమును ప్రత్యక్షదర్శన విషయమే. మఱియు జ్ఞానవృత్తి యదృశ్యమైనచో నది యథార్థమని యేప్రమాణమును చూపలేము.

(౧) తత్ర గురూణాం మతే జ్ఞానస్య స్వప్రకాశరూపత్వాత్, తత్ జ్ఞాన ప్రామాణ్యమ్ తేనైవ గృహ్యతే, భాట్టానామ్ మతే జ్ఞానమతీంద్రియం, జ్ఞాన జన్యజ్ఞానతా ప్రత్యక్షా, తథా చ జ్ఞాన మనుమీయతే, మురారి మిశ్రాణాం మతే, అనువ్యవసాయేన జ్ఞానమ్ గృహ్యతే, సర్వేషామపి మతే, తత్ జ్ఞానవిషయక జ్ఞానేన తత్ జ్ఞానప్రామాణ్యమ్ గృహ్యతే.(సిద్ధాంత ముక్తావళిపు,౧౩౫)

(౧) మఱియుఁజూడు న్యాయరత్నాకరము, ౨, ౪౭.

యము ౨ గానే, వస్తువులను బ్రకాశింపఁజేసి, స్వతః ప్రమాణ శక్తినిఁ బ్రదర్శించును. కారణముల స్వచ్ఛత నిశ్చితమగువఱకు మనము వేచియున్నయెడల నితరకారణములచే నింకొకజ్ఞాన వృత్తి జనించువఱకును నిట్లే యనంతముగా వేఁచియుండవలసి వచ్చుచో ననవస్థాదోషము సంభవించును. ౩. స్వతః ప్రామాణ్యవాదమును ననుసరించి, జ్ఞానవృత్తులన్నియుఁ బ్రామాణికములే. వాని ప్రామాణ్యము జ్ఞానవిషయస్వభావములో విరోధమున్నఁగాని, వానికారణములకు దోషములు సంభవించి నఁగాని తొలఁగిపోవును. ౪. మన మొక రజ్జువును సర్పముగా భ్రమించి తరువాత నది రజ్జువేకాని సర్పముకాదని తెలిసికొని నప్పుడు మన మొదటిజ్ఞానవృత్తి ప్రమాణయుక్తముకాదని తోసివేయఁబడెను. జ్ఞానోపకరణములలో దోషములున్నవని మనము గ్రహించినపుడు జ్ఞానముయొక్క ప్రామాణ్యమును

(౨) "భావాత్మకద్రవ్యోత్పత్తికిఁ గారణమవసరము. అవియొక మారుత్పత్తియైనపుడు వానికార్యముల విషయములో నవి స్వయముగానే చైతన్య మొసఁగును." (౨, ౪౮). ఘటోత్పత్తికి మృత్తికాదు లవసరము కావచ్చును గాని, జలధారణక్రియను ఘటమే స్వయముగాఁజేయును. ఒకజ్ఞానముత్పత్తి యగుటకొక కారణమవసరము గావచ్చును, వస్తునిజస్వభావగ్రహణ వ్యాపారమున కది యితరకారణములపై నాధారపడదు. ఈవిధముగా స్వతఃప్రామాణ్యమునకును నింద్రియ సంయోగకారణాదులపై నాధారపడుటకును విరోధము లేదని మీమాంసకుఁడు వాదించును. జ్ఞానోదయానంతరమే యింద్రియ సంయోగాదు లనుమానముచేఁదెలియును. ఒక్క స్మృతివిషయములోఁ బూర్వానుభవముపై నాధారమవసరమున్నదని స్పష్టము.

(౩) శ్లో. వా. ౨, ౪౯-౫౧.

(౪) శ్లో. వా. ౨, ౫౩,

మనము శంకింతుము. కండ్లకుఁ గామెర్లజబ్బుగలవాఁడు ముత్తెపుచిప్ప పచ్చగానున్నదనును. దోషము తన కంటిదని గుర్తించినపుడు, ముత్తెపుచిప్ప తెల్లగానున్నదని యంగీకరించును. మన ముపకరణదోషములను గ్రహించునంతకాలము సంశయమునకుఁ దావు లేదు. ఇతరసాధనములవలన బాహ్యవస్తుసహజస్వరూపము నెఱుఁగుటవలనఁగాని, జ్ఞానోపకరణదోషములను గుర్తించుటవలనఁగాని జ్ఞానవృత్తులప్రామాణ్యము పరిహరింపఁబడును. ప్రతిజ్ఞానవృత్తియు సాధారణముగా నంగీకరింపఁబడిన జ్ఞానరూపముగావున సప్రామాణికమని, సందేహకారణము లేనంతవరకు నంగీకరింపవలసినదే. ఒకభావము యొక్క అప్రామాణత స్వతస్సిద్ధముకాక, విషయాంతరములచే సంభవించునదే. ౧. మనము సంశయములో నున్నను, ననగా నొకదూరపు వస్తువులను జూచియో, అస్పష్టకాంతిలోఁ జూచియో వస్తుస్వరూపమును సంశయించినపుడు, వస్తుదర్శనమునకువలయు పరిస్థితులు సవ్యమైనవైనపు డుదయించు జ్ఞానవృత్తిచే సంశయనిర్మూలనమగును. కొన్నిసందర్భములలో రెండవ జ్ఞానవృత్తిదోషమును దొలగించుటకు మూఁడవ దవసరముకానచ్చును; అట్లే నాల్గవదియుఁ గావలసివచ్చును; కాని పెక్కుసందర్భములలో స్వల్పజ్ఞానరూపసంఖ్యలతో శంకానివారణ మగును. ౨. కుమారిలునననుసరించి, జ్ఞానవృత్తి పరంపర

(౧) శ్లో. వా. ౨, ౫౯, ౫౭, యత్రకారణ దోషజ్ఞానమ్ బాధకజ్ఞానమ్ వాతీత్రమిథ్యాత్వమ్, (శాస్త్రదీపిక, పు. ౧౪౪.) జ్ఞానస్య ప్రామాణ్యమ్ సత్వఃఅప్రామాణ్యమ్ పరతః. (౨) శ్లో. వా. ౨,౬౧.

నాలుగెదుదశలలోనికిఁ బోవునప్పటికి లభించుజ్ఞాన మనిర్ద్వ్యా సత్యమగును. 3. శుక్తిరజితభ్రాంతి జ్ఞానమును ప్రామాణిక మేయని కుమారిలుఁడు విశ్వసించును. కర్తృకాలమున నా జ్ఞాన మున్నది. అనంత రానుభవము దానినిఁ ద్రోసివేయుట వేరొక విషయము. వసువువచ్చగానున్న శుక్తిజ్ఞానములో నైనను, పసుపుపచ్చదనము నిజమైనదే. అది కంటిలోని కాలేయ సం సంబంధమైన పచ్చదనము. ఒకయున్నత దృశ్యము మనుజుఁడా స్తంభమాయను సంశయజ్ఞానము కూడఁ బ్రామాణికమే; ఏలన మన మొక యున్నతమైనదానినిఁ జూచి, రెండు పొడు గైన వస్తువులను స్మరింతుము. విపర్యయజ్ఞానమునకుఁ గారణ మసంపూర్ణజ్ఞానముగాని, అజ్ఞానముగాని, కావచ్చును. కాని

(3) పార్థసారధి చెప్పినాఁడు "జ్ఞానదోషమునకు సువిదితములైన కారణములు దేశకాలపరిస్థితులకు నింద్రియములకు, జ్ఞానవిషయమునకు సంబంధించిన లోపములైయున్నవి. అట్టిదోషములేకుండినప్పుడు అనగా వ్యక్తి పూర్ణజాగృతిలోనుండి, స్వాధీన సకలేంద్రియుఁడై, పట్టపగలు సముజ్వలకాంతిలోఁ దనకు సమీపములోనుంచిన యొకఘటమును జూచినప్పుడెట్టి సంశయమును గలుగనవసరములేదు; అందుచే నాతనిదర్శనము లోపము గలదగు నవకాశమును లేదు. ఇతరసందర్భములలో లోపమున కవకాశమున్నది. విషయమగు ఘటము దూరమునుండవచ్చును; అప్పుడప్రామాణ్యశంక యుదయించును. కాని సామాన్యముగా నింకొకపరీక్షయు మనతో నదియుఁ దొలఁగును. అతఁడా ఘటమునొద్దకు నడచిపోయి, యేదినిజమో నిశ్చయింపవచ్చును. శంక కవకాశములేదని ధ్రువపడగానే, మనజ్ఞానప్రామాణ్యము నిశ్చితమగును." (శ్లో॥ వా॥ ౨. ౫౮.)

కేవలము దోషమైన జ్ఞానము కాదు. ౧. దోషరహితమై, అవిదితపూర్వములైన విషయముల జ్ఞానమే ప్రామాణికజ్ఞానమని పార్థసారథి నిర్వచించెను. ౨. జ్ఞానము స్వప్రకాశకమను విషయమిందుఁ బోషింపఁబడినది. ౩. స్వతః ప్రామాణ్య స్వభావముగల జ్ఞానలక్షణము దీనఁ దిరిగి చెప్పఁబడినది. ప్రామాణ్యము జ్ఞానలక్షణము; కాని యితరజ్ఞానములతో నిది సరిపడి, విరోధములేనిదగునా యను సమీక్ష చేయవచ్చును. ఇదంతయు బాహ్యపరీక్షయే; ఈపరీక్ష జ్ఞానముయొక్క యాంతరంగికస్వభావమును జెప్పదు.

సత్యస్వభావము సాపురస్యమేయై, దానికి వేరొక పరీక్ష యవసరములేనిచో, సత్యమును దెలియుటే కష్టమైనదగును; వలన నిది మనము బయల్పడుటకు వీలులేని సుడిగుండమునకుఁ జేర్చును. నాలుగైదు జ్ఞానవృత్తులలో సంశయవిచ్ఛేద మగునని

(౧) జ్ఞానముయొక్క అప్రామాణతలు మూడువిధములు: దుర్జ్ఞానము అజ్ఞానము; సంశయము. దుర్జ్ఞానసంశయములకుఁ గొన్ని స్పష్టములగు లోపములే కారణములు. అజ్ఞానములో నేకారణములును లేవు. (శ్లో. వా. ౨-౫౪, ౫౫)

(౨) కారణదోషబాధక జ్ఞానరహితమ్ అగృహీతగ్రాహిజ్ఞానమ్ ప్రమాణమ్. (శాస్త్రదీపిక. పు. ౧౨౩.)

(౩) కాని చూ. ఝా; ప్రభాకరమీమాంస౨. ఈకిష్టస్థితిలో ప్రమాణశబ్దము రెండర్థములలో వాడఁబడెనని సూచింపఁబడెను. ప్రతిజ్ఞానక్రియయు నొకజ్ఞానక్రియగాఁ బ్రమాణమైనదే. ఈయర్థములో విపర్యయము, స్మృతి మున్నగునవియుఁ బ్రమాణములే. కాని వ్యవహారసిద్ధి ననుసరించి, యేజ్ఞానము క్రియాదక్షమో యది ప్రమాణమనియు, గానిది గాదనియు విభాగము చేయఁబడెను. చూ. పి. శాస్త్రి: పూర్వమీమాంస ౨ అ.

కుమారిలుఁడును పార్థసారథియుఁ జెప్పవచ్చునుగాని, విష యాంతర జ్ఞానముచే జ్ఞానపరిశీలన మవసరమైనచో, నప్పుడే జ్ఞానమును సంపూర్ణప్రమాణమని చెప్పఁజాలము.౨.

జ్ఞానవృత్తులకు రూపములు లేకున్నచో వాని భేదము లను గుర్తించుట సాధ్యముకాదని మీమాంసాసిద్ధాంత విమర్శ కులు చెప్పుదురు. రెండుజ్ఞానములకు భేదమును దెల్పునది జ్ఞాన విషయమే కావున, జ్ఞానము విషయరూపమును ధరించునని చెప్పఁబడెను. జ్ఞాన జ్ఞానవిషయములకు సమానత్వ మున్నదని చెప్పఁబడెను. తెలియు నాత్మకును, తెలియఁబడు వస్తువునకును సమతయున్నచో, నొకవస్తువు నాత్మ తెలిసికొనునని చెప్ప వలను పడదని మీమాంసకుని వాదము. జ్ఞానభేదమున కాధారము రూపమేకాదు. ఒక విశిష్టధర్మమువలన వ్యక్తమగు సంవేదన లేక నొక వ్యక్తియొక్క జ్ఞానమున్నది; ఆ వ్యక్తిచే నా జ్ఞానము విషయసంబంధ ప్రవృత్తిని గలిగించును. ఏవస్తువుపై నీప్రవృత్తి ప్రసరించునో యావస్తువే గ్రహింపఁబడును. అట్టిజ్ఞాన మొక విశిష్టవస్తు సంబంధ వ్యాపారమును గల్గించునుగావున, భేదమున కాధారమగుచున్నది.

(౨) ఈక్రిందఁజెప్పినదాని ననుసరించి యిది స్టౌట్ పండితుని భావ ము గాఁదోఁచును; తుదకు సత్యము నింకొక సత్యాంశముతో సామరస్యము న్నంతమాత్రమున నిజమేయని నిర్ణయింపఁజాలము. సద్యోజ్ఞానములేని కార ణము చే సామరస్యమాత్రము నిశ్చయాత్మకముకాదు... జ్ఞానమంతయు నితర జ్ఞానముపై నాధారపడియుండు ననువాదము శాఖాచంక్రమణమగును. గోడ కట్టుటకొఁకయిటుక నింకొకయిటుకపైఁ బెట్టుటయేకాని యొకయిటుకయు భూమిపైఁబెట్టుటయుండనిరీతిదగును. (మైండ్. ౧౯౦౮. పు. 33.)

జ్ఞాన స్వప్రకాశకత్వ సిద్ధాంతమును నైయాయికుఁ డంగీకరింపఁడు. జ్ఞానము స్వతః ప్రమాణవిలసితము కాదు. మన జ్ఞానరీతులన్నియు సత్యసంగతములని చెప్పఁజాలము. మనము మనభావముల ననుసరించి పనిచేయునపుడు కొన్ని ఫలించుటయుఁ గొన్ని వ్యర్థములగుటయు జరుగుచున్నది. ఫలించినవానికిఁ బ్రామాణ్యమును, విఫలములైనవానికి నప్రామాణ్యమును మన మనుమానముచేఁ దెలియుచున్నాము.(౧)

జ్ఞాన స్వప్రకాశకత్వము సర్వజ్ఞానముయొక్క విడఁదీయరాని గుణమే. సామ్య, సామరస్యములు ప్రామాణ్యమును బరీక్షించునుగాని జనింపఁజేయలేవు. అవి మనకుఁ బ్రామాణిక జ్ఞానస్వభావమును వర్ణింపఁజాలవు. జ్ఞానప్రవృత్తి గ్రహించుచే వస్తువులను దెలిసికొనుటయే. ఇందు మనస్సునకు యథార్థ ప్రపంచసంబంధ మిమిడియున్నది. ఒకవిధముగా మనస్సని వార్యములగు విజ్ఞానసూత్రముల ననుసరించి పనిచేయును "ఇది రొట్టె" యని మనము చెప్పునప్పుడు, మనము రొట్టె యనునది నిజముగా రొట్టె కాకుండవచ్చును. కాని యాక్షణ మునకు మాత్రమది రొట్టెయని గ్రహింపఁబడెను; ఆక్షణమున కాభావ మనివార్యమైనది. అప్పటి కెట్టిసంశయమును మన మనస్సును క్షోభింపఁజేయదు. మననిర్ణయ మప్పటికి సంపూర్ణ సత్యమే. అవి సత్యములైన నసత్యములైనను మన నిర్ణయము లన్నిటికి నిట్టి యనివార్యతా లక్షణమున్నది. భావనిర్ణయ మనగా నూహావిహారమని యర్థముకాదు. మన మనస్సునకు

(౧) న్యాయమంజరి: పు. ౧౬౦-౧౭౩.

గోచరించు నద్దానిని మన మంగీకరింపకతప్పదు. యథార్థజగత్తు మన మానసికవృత్తులను నియమించును. ప్రతినిర్ణయము నందును,మనకు గోచరించునది మనకప్పటి కగోచరమైన దింకను విశేషముగా నున్నదని సూచించును. ప్రతినిర్ణయమునందును గోచరించినదానిని విస్తరించు మానసికవ్యాపారము నుండును. మనఃప్రవృత్తి దృశ్యవిషయమున కర్థము చెప్పఁబూని, యది యింకను సంపూర్ణమగు లోకములోని యొక భాగమేయని నిశ్చయించును. మీమాంసకులు యథార్థవస్తు ప్రపంచాస్తిత్వ పోషకులే; కాని యొక నిర్ణయముయొక్క ప్రామాణ్యమితర నిర్ణయములపై నాధారపడి యుండునని చెప్పిన కుమారిలుని వాదమువలన, వీరి సిద్ధాంతము సామరస్యమేకాని సామ్యము కాదని తోఁచును. వివిధనిర్ణయములకు సమన్వయముండవలెను. కాని యీ యాంతరంగిక సమన్వయము చాలదు. యథార్థ జగత్తు సమన్వయము కలిగినదిగావున మననిర్ణయసమన్వయము ప్రామాణ్యస్థాపన మొనర్చుచున్నదని చెప్పుదుగు.

మన కనుభూతమగుచున్న యథార్థజగత్తునకును మన మనస్సునకును గల సంబంధమునుగూర్చిన మూలసమస్యను మీమాంసకులెత్తుకొనలేదు. మన మనస్సునకు బాహ్యమున నిజమగు జగత్తొకటి యున్నదను ప్రాకృతభావమును వారంగీక రించిరి. మనభావములకును, యథార్థవస్తువులకును సామ్య మునుగూర్చిన క్లిష్టసమస్యలను బరిష్కరించుట కవసరము లేకుండ సర్వజ్ఞానరూపములు స్వతః ప్రమాణయుక్తములను సిద్ధాంతమును మీమాంసకులు ప్రతిపాదించి తృప్తినొందిరి.

## ౧౨-జీవాత్మ.

వేదవిధుల ననుసరించి, కర్మల కింకొక లోకమున శుభ ఫలితములుండునని చెప్పఁబడెను. దేహపాతానంతరము జీవించు నొక యాత్మ లేనిచో నీ వేదవిధులు నిరర్థకములగును. సోమ యాజి స్వర్గమునకుఁ బోవుననియున్నది; స్వర్గమునకుఁబోవునది రక్తమాంసకల్పిత దేహముకాదు; అది యశరీరమైన యాత్మ కావలెను.౧. ఆత్మాస్తిత్వమునుగూర్చి జైమిని యొట్టిప్రమాణ వివరణములను జూపక, దీనివిషయమై వేదాంతము చూపిన హేతువులనే యంగీకరించినట్లు తోఁచును.౨. ఆత్మ లేక పురుషుఁడు బుద్ధీంద్రియములనుండి వేరైనవాఁడు.3. నిత్యద్రష్ట యొకఁ డున్నాఁడనియు నాతఁ డాత్మవిదితుఁడనియు, నాతఁ డితరులు చూపుటకుఁగాని చూచుటకుఁగాని, లభింపఁడ"నియు శబరుఁడు పలికినాఁడు.౪. ఆత్మ, జ్ఞానస్వరూప మను భావము శబ

(౧) ౧. ౧. ౫

(౨) రెండుమీమాంసలకును వృత్తికారుఁడైన ఉపవర్షుఁ డాత్మవిషయము ఉత్తరమీమాంసలో విచారింపఁబడునని వ్రాసెను. (౧-౧-3) శబరుఁడు నిట్టిభావమునే కలిగియుండునని తోఁచును; ఏలనఁ దన ఆత్మవాదమునఁ దుదిశ్లోకమున కుమారిలుఁ డిట్లు చెప్పెను; (శ్లో. వా.):—

ఇత్యాహ నాస్తిక్య నిరాకరిష్ణురాత్మాస్తితామ్ భాష్యకృదత్ర యుక్త్యా. దృఢత్వమేతద్విషయశ్చ బోధః ప్రయాతి వేదాంతనిషేవణేన; "ఈవిధముగా భాష్యకారుఁడగు శబరుఁడు నాస్తికవాదనిరసనార్థమై యుక్తిసామర్థ్యమున నాత్మాస్తిత్వమును నిరూపించినాఁడు; ఈభావము వేదాంతజ్ఞానముచే సునిశ్చితముకాఁగలదు." చూ. శబరభాష్యము. 3-3-౫3.

(3) ౧-౧-౪. (౪) స్వసంవేద్యస్స భవతి. నాసౌ అన్యేన శక్యతే ద్రష్టుమ్ దర్శయితుమ్ వా.

రుని భావమునకు సరిపోవును. విజ్ఞానవాద నిరసనార్థ మాతఁడు జ్ఞానము నెఱుఁగు కర్తయొకఁ డున్నాఁడనియు, నాతని నాతఁడే యెఱుఁగుననియుఁ జెప్పెను ౧.

బుద్ధీంద్రియములకు విలక్షణమైనదాత్మయని మీమాంస కులు భావింతురు. నిద్రలోవలె బుద్ధివిరతి నొందినపుడాత్మ యుండును. రెండు నేకకాలములో నున్నను రెండు నొకటే యని చెప్పరాదు. ఇంద్రియములు నశించినను, శిథిలమైనను, నాత్మ చెడునది కాదు. కావున నాత్మ యింద్రియములు కాదు. వివిధేంద్రియ వ్యాపారములను సమన్వయించు శక్తి యొకటున్నది. దేహము భౌతికము; సర్వజ్ఞానరూపముల యందును ద్రష్ట దేహమునకు భిన్నుఁడై యున్నాఁడని యెఱుగుదుము, దేహాంగములు జడములు; వాని కలయికచేఁ జైతన్య ముద్భవింపదు, దేహము దాని కతీతమగు నొకలక్ష్యసిద్ధికి సాధనము; అందుచే దానిని నడపు నాత్మ కుపకరణమని చెప్పుదురు. పూర్వస్మరణశక్తులచే నాత్మ యుండుట సత్యమని తెలియుచున్నది. ఆత్మకుఁ బరివర్తనమున్నదని యంగీకరింపఁబడెను గాని, యెన్ని పరివర్తనము లున్నను నది స్థిరమై నిలుచుచున్నది. ఆత్మయను ద్రవ్యమునకు జ్ఞానమేను సదొక గుణము.౧.ఆత్మ మారుచుండు ననులక్షణము దాని శాశ్వతత్వమునకు హానికరము గాదు.౨. మనము కర్మఫల మనుభవించునపుడు చేసిన కర్మలను మఱతు మనుటయు నాక్షేపణ కాఁజాలదు.ఆత్మ యనగా భావపరంపరా

(౧) జ్ఞానాతిరిక్తః స్థాయీజ్ఞాతావర్తతే.

(౧) శ్లో. వా. ఆత్మవాదమ్. పు. ౧౦౦.

(౨) శ్లో. వా. ఆత్మవాదమ్, పు. ౨౨-౨౩.

రూపమే యనియు, (బూర్వభాగమునుండి జనించిన సంస్కారమే తరువాత భావము నుదయింపఁ జేయుననియుఁ జెప్పిన బౌద్ధవాదఖండనార్థము, కర్మసూత్రి మర్థసహితమైనచో, భిన్న భావాంతర్గతమైన యాధార మొకటి యుండవలెనని కుమారిలుఁడు ప్రకటించినాఁడు. కర్మ ఫలానుభవ నియమమునకును, పునర్జన్మావకాశమునకును గారణములను బౌద్ధులు చూపఁజాలరైరి. ఇచట లింగదేహాస్తిత్వసిద్ధాంత ముపకరింపదు. ఏలన దానికిని భావమునకును గల సంబంధరహస్యము తెలియునది కాదు. బౌద్ధభావపరంపరావాదము ననుసరించి, స్వీయజ్ఞానము, కామము, స్మృతి, సుఖదుఃఖాదులకుఁ గారణము లేదు. అందుచే, భావసామర్థ్యము గలిగి, నిత్యమై, పునర్జన్మావకాశముగల దొకటుండవలెను. ఆత్మ అణుపరిమాణము గలది కాదు; ఏలన దేహములోని భిన్నభాగములందలి మార్పులనది గమనించును; అది సర్వవ్యాపిత్వము గలిగి, జన్మాంతరములందు వివిధ దేహములతో సంబంధము నొందఁగలదు. తనతో సంబంధముగల దేహము నాత్మ ముక్తి లభించువరకు నడపును. సర్వవ్యాపియైన యాత్మ కర్మ చేయఁ గలదు; ఏలనఁ గర్మయనఁగా నణుసంచలనమే కాదు, ఆత్మ శక్తిచే దేహము చలించును.

అనుభవవైవిధ్యమునకుఁ గారణముండవలెను, గావున నాత్మనానాత్వసిద్ధాంతమును మీమాంసకు లంగీకరించినారు.

---

(౧) బుద్ధీంద్రియ శరీరేభ్యోఽభిన్నా ఽఽత్మా విభుః ధ్రువః, నానాభూతః ప్రతిక్షేత్ర మర్థజ్ఞానేషు భాసతే.

(స.ద.సా. సం. ౬-౨౦౭) మూ. శ్లో. వా. ఆత్మవాదము. పు ౧-౭

శరీరప్రవృత్తులాత్మలు లేనిదే జరుగవు గావున నాత్మాస్తిత్వ మను మానింపఁబడుచున్నది. నాప్రవృత్తులకుఁ గారణమునా యాత్మ యైనట్లే, యితరుల ప్రవృత్తుల కితరుల యాత్మలే కారణములు. ఆత్మగుణములైన ధర్మాధర్మముల భేదమునకుఁ గారణముగా ననేకాత్మలుండవలెను. ఒకే సూర్యుఁడు భిన్నవస్తువులలోఁ బ్రతి ఫలించి, భిన్నగుణములను గలవాఁడైనట్లే; ఒకేయాత్మ భిన్న దేహములలోఁ బ్రతిబింబించి, భిన్నగుణములుగలదిగా గోచ రించుచున్నదను వాదమసంగతము; ఏలన గుణభేదమునకుఁ గార ణము ప్రతిబింబకారణములైన వస్తువులేకాని సూర్యుఁడొకఁడే. ఈయనుమానము నిజమైనచో, నాత్మకుఁజెందినవిఁగా గన్పట్టు చున్న భిన్నలక్షణములు నిజముగా దేహములకుఁ జెందినవేకాని యాత్మయొక్క టేయని స్పష్టమగును. కాని సుఖదుఃఖాది గుణము లాత్మ గుణములేకాని దేహమునకుఁ జెందవు.

ప్రభాకరు నభిప్రాయములో నాత్మయనఁగా జ్ఞాన క్రియానుభూతి సుఖదుఃఖాదిగుణముల కాశ్రయమైన యొక అచేతనస్వరూపము,(౧) నిత్యము నేకమునైన యాత్మయొక్క టున్న దని మనకుఁ బ్రత్యక్షజ్ఞానములేదు. నిత్యములైన విజ్ఞానవిషయ ముల గుర్తించుశక్తివలన నాత్మాస్తిత్వము పరోక్షముగాఁ దెలి

(౧) కర్తాభోక్తాజడో విభురితిప్రాభాకరాః. మధుసూదన సరస్వతి సిద్ధాంతబిందువు; న్యాయరత్నాకరము జడార్థమునిట్లుచెప్పును: "స్వాచజ్ఞాన స్వరూపభిన్నత్వాజ్జడః; జానామీతిజ్ఞానాశ్రయత్వేన సభాతి నజ్ఞానరూప త్వేన.

యును. ప్రత్యభిజ్ఞయనుదానిలో స్మృతియు, విషయపూర్వానుభవమును గలవు. మన మొక పూర్వానుభవమును స్మరింపఁ గలుగుచున్న కారణమువలన, పూర్వ ప్రస్తుతానుభవముల రెంటికి నేకమైన యొకయాత్మయున్నదని స్పష్టమగుచున్నది. అందుచేఁ ప్రభాకరు ననుసరించి, నిత్యమగునాత్మ లేక నేకమగు వ్యక్తిత్వము ప్రత్యభిజ్ఞకు విషయముకాదు, దానికాశ్రయమని తెలియుచున్నది.౨. అది సర్వవ్యాపి, మార్పులేనిది. అది స్వప్రకాశకముకాదు; ఏలన గాఢనిద్రలో నాత్మయున్నను మనకు జ్ఞానముండుటలేదు. "నేను ఘటము నెఱుఁగుదు" నను స్వప్రకాశకజ్ఞానము, ఘటమునొకవిషయముగాను, నాత్మను ఘటజ్ఞానాశ్రయముగాను వ్యక్తీకరించును. జ్ఞానవిషయమగు ఘటమెట్లు వెంటనే తెలియునో, అట్లే జ్ఞానాశ్రయమైనయాత్మయు నట్లే వెంటనే తెలియును. 'నేను'గా గోచరించునది సర్వవిషయవిరహితమైన యాత్మయే. సర్వజ్ఞానరూపములలో నాత్మ వ్యక్తమగును గావునను, దేహజ్ఞానము లేనివానిలోఁగూడ నది వ్యక్తమగును గావునను, నాత్మ దేహాభిమానమైనదని గ్రహింపఁబడెను. ఆత్మస్వస్వరూపములో గోచరించునది కాదు;

(౨) అద్వైతము దీనినంగీకరింపదు. స్మృతియందు వర్తమానాత్మయే యున్నది; పూర్వానుభవములోఁ బూర్వాత్మయున్నది. ఈ రెంటికి ననుసంధానము ప్రత్యభిజ్ఞవలననే కలుగును; ఈ ప్రత్యభిజ్ఞ కింకొకటి దానికి మఱొకటియు ననంతముగా కలయుటచే ననవస్థయేర్పడును. ప్రస్తుతస్మృతియు, బూర్వదర్శనముగలిసి యాత్మావిచ్ఛిన్నతను నిరూపింపఁజాలవు; ఏలన, గతవర్తమాన జ్ఞానములు కలయికనొందవు.

జ్ఞానవృత్తికిఁ గర్మగాఁగాక కర్తగా నది విదితమగును. జ్ఞానవృత్తి యాత్మయందు స్వీయఫలము నుత్పత్తి చేయదు; అందుచే నాత్మ బాహ్యాభ్యంతరదర్శనవిషయము గాదు. విషయజ్ఞానవిరహితమైన ఆత్మజ్ఞానము లేదు. ఆత్మజ్ఞానమునకుఁ గర్తయుఁ గర్మయుఁ గూడఁ గాఁజాలదు. (౧) ఆత్మ వివేకహీనమైనను, నది కర్తయు, భోక్తయు, సర్వవ్యాపియు నైయున్నది. ఈవిధముగా నాత్మ బుద్ధీంద్రియ దేహములకు భిన్నమై, నిత్యమై, సర్వజ్ఞానరూపములచే వ్యక్తమగుచున్నది. ఆత్మ యణుపరిమాణము గలదనికాని, తానుధరించు దేహపరిమాణముగలదని కాని ప్రభాకరుఁ డంగీకరింపఁడు. అది సర్వవ్యాపియైనను, నింకొక దేహములో జరుగువిషయముల నాత్మ యనుభవింపఁజాలదు; వీలనఁ దన పూర్వకర్మానుభవమైన దేహమునందు జరుగుదానినే యది తెలిసికొనును. దేహమునకొకటిగా నాత్మలనేకములు గలవు ముక్తావస్థలో నాత్మ శుద్ధరూపముననుండి. సర్వవసుజ్ఞానాశ్రయమై ప్రకాశించును; కాని, సుఖదుఃఖాదులకు దేహసంబంధ మవసరముగావున, నట్టి యనుభవ మాముక్తావస్థలోని యాత్మకు సంబంధించునది కాదు. ఆ గారణము లేదు. గావున దానికి నాశనమును లేదు. ప్రత్యక్షానుభూతికిఁ గర్తయు విషయమునుగూడ నాత్మయే యగునను టలో వైరుధ్యము లేదని పార్థసారథి వాదించినాఁడు. జ్ఞానప్రవృత్తివలన నాత్మ వ్యక్తమగుచున్నదని ప్రభాకరుఁడు చెప్పవు డాత్మ సంవిద్విషయముకూడ నైయున్నదని యాతని యభి

(౧) శాస్త్రదీపిక. పు. ౩౮౭-౩౮౮.

ప్రియము. స్మృతి ప్రత్యభిజ్ఞలలో విషయము మాత్రమే బుద్ధికి గోచరించునుగాని యాత్మ లేక కర్త గాదు. ఆత్మయే ప్రత్యక్షానుభవ విషయముగా గ్రహింపఁబడును; అదియే వర్తమాన స్మృత్యభిజ్ఞావిషయముగా వ్యక్తమగును. ఆత్మ యొక్క ప్రత్యభిజ్ఞలో నాత్మ విషయముగానిచో, నట్టి ప్రస్మృతి నిర్విషయకమగును; కాని నిర్విషయకమైన జ్ఞానస్మృతి యుండదు. అందుచే నాత్మ యాత్మ జ్ఞానవిషయమని చెప్పవచ్చును. ౧. వస్తువులెట్లు ప్రామాణికజ్ఞానవృత్తిచేఁ దెలియునో, ఆత్మయు నట్లే తెలియును, గాని, యన్వుడైన నాత్మ కర్తయేకాని విషయము కాదు. ఒక నడచుచున్న మనుజుఁడు, నడచుటయను కర్మ తనదైనను, దానికిఁ గర్తయగునేకాని, నడకకు విషయముః కానట్లే యని గ్రహింపవలెను.

కుమారిలానుచరుల ననుసరించి, యాత్మ ప్రతిజ్ఞాన వృత్తిలోను వ్యక్తమగుటలేదు. ఆత్మ ప్రతిజ్ఞానవిషయమును గుర్తించదు. "ఇదియొక ఘటము"ని మన మొకప్పుడు గ్రహించి, యాఘటమును మనము గ్రహించినట్లుగా నెఱుఁగము. ఆత్మ వస్తుజ్ఞానమునకును కర్తగాఁగాని, కర్మగాఁగాని వ్యక్తముకాదు; కాని కొన్నివేళల వస్తుజ్ఞానముతోఁబాటొక విశిష్టమగు నహం ప్రత్యయజ్ఞానము కలుగుచున్నది. అట్టి జ్ఞానమున కాత్మ విషయము. అనాత్మజ్ఞానమున నాత్మయు వ్యక్తమగునుగాని యదెల్లప్పుడు స్పష్టముగా వ్యక్తము గాకపోవచ్చును. అది ఆత్మజ్ఞానమునందే సువ్యక్తమగును; అది విషయజ్ఞానము వంటిదికాదు.

(౧) ప్ర॥ ప॥ ౩౮౮.

చేతనాత్మకజీవితములో వస్తుజ్ఞానముకంటె నాత్మజ్ఞాన మున్నత
పరిణామదశను జూపును.

ఆత్మయు సంవిత్తు (Consciousness)నొకటికాదని నిశ్చ
యించి, యందుచే నాత్మ స్వప్రకాశకము గాదని ప్రభాకరుఁడు
చెప్పవలసివచ్చెను. కాని యీ భావమును సమర్థించుట సాధ్య
ముకాదు. ఆత్మ ప్రమాత, లేక జ్ఞాత; ప్రభాకరుఁడు సంవి
త్తునే జ్ఞాతయని వర్ణించి, యొకప్పుడు జ్ఞానమనియుఁగూడఁ
బ్రకటించెను.౧. ఆత్మ మనస్సునకు గోచరించు విషయమను
కుమారిలుని వాదమును ఖండించుటకై, ఆత్మ స్వప్రకాశక
మనియు, బాహ్యవస్తు జ్ఞానము౨.నకు సంబంధముకలిగి యున్న
దనియు నందుచే నది సంవిత్తున కాశ్రయరూపమగు నచేతనము
కాదనియు శాలికనాథుఁడు వచించినాఁడు. సంవిత్తు స్వప్రకాశక
మైనది; కాని యది సంవిద్విషయముగా గ్రహింపఁబడక పోవచ్చును
జ్ఞానవృత్తు లాత్మపరిణామ రూపము లనియుఁ జెప్పఁబడెను.
అందుచే సంవిత్తు ఆత్మస్వభావమని చెప్పవలెను; కాకున్నచో నది
జ్ఞానరూపముగా మార్పునొందఁ జాలదు. ఆత్మ లేక సంవిత్తు,
సంవిత్తునకెన్నడును విషయము కాఁజాలదు. అంతమాత్రమున
నది యచేతనమని చెప్పరాదు. అది సర్వజ్ఞానాధారము, జ్ఞానము

---

(౧) సంవిత్తనగాఁ దెలివియనులక్షణ మను నర్థములో నుపయోగింపఁ
బడెను. సంవిదుత్పత్తి కారణమ్, ఆత్మ మనస్సన్నికర్షాఖ్యమ్॥(ప్రకరణసంచిక
పు. ౬3.)

(౨) స్వయంప్రకాశత్వేన, విషయప్రతీతిగోచరత్వేన॥

(ప్రకరణసంచిక॥ పు ౧౫౧)

యందది కర్తగాఁ జూపట్టును. నే ననునదే యాత్మ; సర్వజ్ఞానము నకు దానినే కర్తగా మనముగ్రహించుచున్నాము. ఆత్మ ద్రవ్య గుణకర్మలలో నేదియుఁగాదు. అది కేవల సంవిత్స్వరూపము. అహంకరణముతో సంపర్కము కలిగినపుడది యహంభావమను భ్రాంతి జనించునని యద్వైతవేదాంతము నుడువుపద్ధతి. గాఢ సుషుప్తిలో సర్వాహంకారబంధములనుండియు విముక్తమగును, గావున నాత్మయట్టి గాఢసుషుప్తిలో నహంభావరూపముగా గోచరింపదు. వస్తుజ్ఞానమునందు సర్వవ్యాపియగు నాత్మ తనకు వస్తుజ్ఞానసంబంధలక్షణముతో గోచరించును. తనవాద మద్వైత వేదాంతభావమునకు సరిపడును గావునఁ బ్రభాకరుఁడు విశేష ముగా దీనిని వక్కాణించుట క్లిష్టపడఁడు; ఏలన వ్యక్తుల భిన్న త్వమును, కర్మలవిషయమున పృథగ్వ్యక్తి బాధ్యతను స్థాపించు టయే యాతనిసిద్ధాంతమునకు లక్ష్యము. ప్రభాకరుఁడు చెప్పి నాఁడు; "నేను" 'నాది' యను శబ్దములాత్మనుగూర్చిన మిథ్యా భావము లనువిషయమును ప్రపంచ విషయసంగత్యాగ మొన ర్చిన వారికుపదేశింపవలెనుగాని, కర్మసంగులైనవారికిఁగాదు"౧.

కుమారిలు ననుసరించి యాత్మ దేహమునుండి భిన్నమైనది. ఆత్మయనఁగాఁ జిత్స్వరూపమే; జీవాత్మ లనేకములు న్నవి. ౨. జీవాత్మలన్నియు నొకేస్వభావముగలవి. కావున నాత్మ యొకటేయని యుపనిషత్తులు పలుకుచున్నవి. 3. ఆత్మ

(౧) బృహతి,పు 3౨. బెంగాల్ ఏషియాటిక్కు సొసైటీ వ్రాత ప్రతి.

(౨) శ్లో॥ వా॥ ఆత్మవాదము, పు. ౭౪, ౭౫.

(3) తంత్రవార్తికము, ౨, ౧, ౫.

చిత్స్వరూపము, జ్ఞానపరివృత్తి కాశ్రయమును; ఆత్మజన్యమే జ్ఞానవృత్తి.౧. 'అహం' భావమువలన నాత్మాస్తిత్వ మూహింపఁ బడినది. ఆత్మ యితరుల కగోచరము. ౨. ఒకఘటమెట్లు ప్రత్యక్షవిషయమో యట్లే ఆత్మయు జ్ఞానవిషయమైన ప్రత్యక్ష వస్తువే. అది మానసికప్రత్యక్ష విషయము. ఆత్మజ్ఞానద్రష్టయు విషయమునుగూడ నైయున్నది; ఇందెట్టి వైరుధ్యమును లేదు. 3 ఆత్మయందు జ్ఞానవిషయరూపమగు ద్రవ్యాంశమును, జ్ఞాన ద్రష్టయగు రూపములో బోధాంశమును గలిగియున్నది. ౪. ప్రభాకరానుచరులు దీనినాక్షేపింతురు. ఆత్మలోని ద్రవ్యాంశ మచేతనమైనచో నదియాత్మయే కాఁజాలదు; నిజముగానున్నది చిత్స్వరూపమే; ఇది కర్తయేకాని విషయము కాఁజాలదు. అది యవిభాజ్యమగుటచే నొకేకాలమున నదికర్తయు విషయము కూడనగు మార్పుఁ నొందుట కవకాశము లేదు. ద్రవ్యత్వము జ్ఞానవిషయమైనచో నాత్మ, ఘటమువలెనే ద్రవ్యము కావున నది

(౧) రామానుజుఁ డిట్టి భావమునే యంగీకరించి, జ్ఞాన మాత్మలక్షణ మనియు నది వృద్ధిక్షైణ్యముల నొందుచుండువనియుఁ జెప్పెను; జ్ఞాన మాత్మ పరిణామమనియు నది ప్రమాణములచే లభించుననియుఁ గుమారిలుఁడు చెప్పి నాఁడు.

(౨) శ్లో॥ వా. ఆత్మవాదము. ౧౪౨-౧౪3.

(3) శ్లో॥ వా. ఆత్మవాదము॥ ప్ర ౧౦౭.

(౪) పోల్చు: న్యాయరత్నావళి: ఆత్మనోఽస్తి అంశద్వయమ్, చిదంశో ఽచిదంశశ్చ; చిదంశేన ద్రష్టృత్వమ్ అచిదంశేన జ్ఞానసుఖాది పరిణామిత్వమ్ మామ్ అహంజానామీతి జ్ఞేయత్వంచ॥)
(పి. శాస్త్రి, పూర్వమీమాంస॥ పు. ౯౫.)

జ్ఞాత లేక కర్త కాఁజాలదు. శుద్ధజ్ఞానస్వరూపము జ్ఞాతయనియు, వ్యావహారసిద్ధమైన జ్ఞానము విషయమనియుఁగఁ గుమారిలుఁడు వాదించు నెడల, మనకిప్పుడు మూఁడురకములున్నవి; శుద్ధవిషయ గ్రహణము, శుద్ధజ్ఞాతృత, ఘటవచ్ఛిన్నజ్ఞాతృత. మఱియుఁ బ్రతిజ్ఞానవృత్తియందును నాత్మప్రత్యక్ష జ్ఞాతగా గోచరించుట వలన, వేఱొకయాంతరంగిక ప్రత్యక్షదర్శనము నూహించు టవసరము లేదు.

జ్ఞాన మాత్మలక్షణమైనచో నాత్మ యచేతనము కాఁజాలదు. ఆత్మ చిత్స్వరూపమైనచో నది స్వస్థితి గలది; ఏలన దాని యస్తిత్వమే సర్వప్రమాణములకు నాధారమైనది.౧ కుమారిలు ననుసరించి, జ్ఞానముతో విషయమునకు సంబంధము వృత్తి వలన జరుగును. ఆత్మయొక్క అచిదంశారూప మంతఃకరణము గావచ్చును. అంతఃకరణము ద్వారమున నాత్మ, వృత్తిగా మారును. ఆత్మ జ్ఞానదృష్టిలో నది కర్తయు విషయమును గూడఁ గావచ్చును, గాని దాని యర్థమాత్మలోఁ జిదచిదంశా భాగము లున్నవని తలఁపరాదు. ఆత్మ స్వరూపమును గూర్చిన సమ్యగ్భావమును గ్రహింపఁ గుమారిల ప్రభాకరు లిరువురును యత్నించిరి కాని, వారు పెట్టుకొన్న వ్యావహారిక ప్రయోజనము లట్టి యత్నముల కాటంకములైనవి.

(౯) ఘటావచ్ఛిన్నాహి జ్ఞాతృతా గ్రాహ్యా శుద్ధైవజ్ఞాతృతా గ్రాహికా (న్యాయమంజరి.)

(౧) చూ: సురేశ్వరుని సంబంధవార్తికము. ౧౦౬౬.

## ౧౩—యథార్థజగత్స్వరూపము

మీమాంసకుల ప్రత్యక్షసిద్ధాంతము ననుసరించి, బాహ్యా వస్తువులున్నవి; వానితో సన్నికర్షము వలననే ప్రత్యక్షదర్శన ముదయించును.౨. మనము చూతుమనఁగా వస్తువులను జూతుము; జ్ఞాన వృత్తులనుగాదు,౩. జ్ఞానవృత్తిని మన మను మానింతుము గాని దర్శింపము. జ్ఞానము స్వప్రకాశమను భావము ననుసరించి, గ్రహింపఁబడిన వస్తువులు యథార్థము లనియే యర్థము. కుమారిలుఁడు నిరాలంబనవాద శూన్యవాద ములను ఖండించును. బాహ్యజగదస్తిత్వమే జీవితమునకు మన యనుభూతికి నేకాధారము. భావపరంపరలు తప్ప మఱేమియు లేకున్నచో, బాహ్యజగత్తు నిజమను నమ్మకముపై నిలుచు మన నిర్ణయము లన్నియు యథార్థములగును. జ్ఞానవృత్తులకు బాహ్యప్రపంచమున యథార్థములగు నాధారము లున్నవను జ్ఞాన మేయితరజ్ఞానము వలనను నిరాకృతముగాలేదు. యోగ దృష్టిలో జాగ్రదవస్థాజ్ఞానవృత్తు లసత్యములై కన్పట్టు ననువాద మునకు యోగదృష్టి ప్రమాణము కాదనియుఁ గొందరుయోగుల దృష్టిలో బాహ్యవస్తువులు నిజమే యనియుఁ గుమారిలుఁడు సమాధానము చెప్పెను. జగన్మిథ్యావాదమును మీమాంసకు లంగీకరింపరు. "విదితమైన దంతయు మిథ్యయనియు నవిదితమై నది నిజమనియు బ్రహ్మవేత్తల నిర్ణయమైనచో వారికొక సమ

(౨) సత్సంప్రయోగము॥ మీ॥ సూ॥ ౧, ౧, ౪.

(3) అర్థవిషయా ప్రత్యక్షబుద్ధిర్న బుద్ధి విషయా॥ ౧, ౧, ౪. పై శబరుఁడు.

స్కారముతో నావాదమును విరమింతును."(౧). ప్రపంచము యథార్థమైనది; దాని వాస్తవికత, దానిని దర్శించు మనస్సుపై నాధారపడి యుండలేదు.

ద్రవ్యము లష్టవిధములని ప్రభాకరుఁ డంగీకరించెనుః ద్రవ్యగుణ కర్మలు, సామాన్యము, పరతంత్రత, శక్తి, సాదృశ్యము, సంఖ్య యనునవి. ద్రవ్యగుణకర్మలు న్యాయదర్శనము చెప్పిన రీతినే వివరింపఁబడెను. ప్రభాకరు ననుసరించి సామాన్యము యథార్థమైనది. ప్రతివ్యక్తిలో నది సమగ్రముగానుండి, యింద్రియగోచరమై యున్నది. వ్యక్తిసంబంధము లేకుండ నది విడిగాలేదు. ప్రభాకరుఁ డుత్తమ వ్యక్త్యస్తిత్వము నంగీకరింపఁ డేలన నది మనకు జ్ఞానవిషయము కాదు. అనేకవస్తువులు కేవల వస్తువులుగా నున్నట్లు మనము చూచుటలేదు. ఒక పృథగ్వస్తు వున్నదని చెప్పుచో నావస్తువున కొక విశిష్టమగు స్థితి యున్నదని మన భావము. మన మేవస్తువును దానిగుణములనుండి వేరుగాఁ జూడము. సామాన్యవిశేషములు సమవాయసంబంధ బద్ధములై యున్నవి. ఒక నూతనవ్యక్తి జన్మించినపు డొక నూతన సమవాయసంబంధ ముద్భవించి, యితరవ్యక్తులలోఁగల జాతిలక్షణములతో సంబంధము నొసఁగును. ఒక వ్యక్తి నశించినపుడు, వ్యక్తికి సామాన్యమునకును గల సంబంధము విచ్ఛిన్నమగును. అది నశ్వర వస్తువులలోఁగూడ నుండును గావున సమవాయము నిత్యముగాదు. అది యేకముగాదు; వస్తువు లెన్ని

(౧) బృహతి॥ పు. 3౦; మతియఁజూచు శాస్త్రదీపిక, అద్వైతమ
నిరాగ

యున్నవో అంత సంఖ్య దీనికిని గలదు. దానికి సంబంధించు వస్తువుల స్వభావము ననుసరించి,సమవాయము జన్మసహితము, జన్మరహితము, గోచరము, నగోచరముకూడ నైనది. ద్రవ్య గుణ కర్మ సామాన్యము లేశక్తివలన వస్తు కారణములగు చున్నవో దానికే శక్తియని పేరు.(౧) ఈశక్తి దానిఫలితముల వలన ననుమానింపఁబడుచున్నది. ఇది నిత్యవస్తువులలో నిత్యమై నదియు ననిత్యవస్తువులలో ననిత్యమునైనది ప్రభాకరు ననుస రించి, సాదృశ్యమనగా ద్రవ్యగుణకర్మలలో నేదియుఁగాదు; ఏలన నది గుణగతమై సమవాయసంబంధ రూపమున నుండును. ద్రవ్యము గుణములలోఁగాని, గుణకర్మ లితర గుణకర్మలలోఁ గాని యుండవు. సాదృశ్యము జాతిస్వభావముగాదు; ఏలన సాదృశ్యము విషయాంతర సంబంధముపై నాధారపడును. అది జాతులకుఁజెందును; ఒక గోజాతి అశ్వజాతివంటిదే యని మనము చెప్పఁదుము. అది అభావమునుగాదు; ఏలన నది దాని వ్యతిరేకవస్తు సంబంధముచే గ్రహింపఁబడదు. ప్రత్యక్షమువలన సాదృశ్యము తెలియదని మన మిదివరకే చూచియున్నాము. అనుమానములేక ఆప్తవాక్యము, ఉపమానము సాదృశ్య జ్ఞానము నీయవచ్చును.(౧) శక్తి సాదృశ్యసంఖ్యలు స్వతంత్ర ద్రవ్యములుగాఁ బరిగణింపఁబడెరు; ఏలన నవి యితరవస్తువు

(౧) కారణములో నొకయదృష్టశక్తి యుండి, కార్యము నుదయింపఁ జేయునను భావమును నైయాయికుఁడు ఖండించినాఁడు; ఏలన నాశక్తి ప్రత్యక్షానుమాన విషయముగాదు. (చూ: కుసుమాంజలి॥ ౧, ౪.)

(౧) ప్రకరణపంచిక. ౫ అ.

లుగా మారవు. నైయాయికుఁడు చెప్పిన విశేష మంగీకరింపఁ బడలేదు; ఏలన విశేషమొక విశిష్టగుణమే. అభావము ప్రదేశము లేక వస్తుస్థాన మాధారముగాఁ గలదే తప్ప నధిక మేమియుఁగాదు.

కుమారిలుఁడు ద్రవ్యములను భావములనియు నభావము లనియు రెండుగా విభాగించెను. అభావములు నాలుగువిధములు; పూర్వములు, పరములు, పూర్ణములు, అన్యోన్యసంబంధులు. భావములు నాలుగువిధములు; ద్రవ్య గుణ కర్మ సామాన్య ములు. శక్తి సాదృశ్యములు ద్రవ్యములోనివే. పటుత్వము వస్తుగుణమే; దానిననుమానింతుమేకాని చూడలేము. వస్తూ త్పత్తితో నదియు నుదయించును. సంఖ్య యొకగుణమే. శక్తి సహజముగాని ఆధేయముగాని కావచ్చును. అనేకవస్తువులలో గుణవర్గమును చూపులక్షణమే సాదృశ్యము. అది యొక ప్రత్యేకద్రవ్యము గాదు; ఏలన మనయనుభవములో సాదృ శ్యము భిన్నరూపములలో గోచరించుచున్నది. కుమారిలు నభి ప్రాయములో, ననుమాన మేవస్తువులలో నున్నదో వానినుండి వేరై విడిగానుండదు. (2) ప్రభాకరునివలెనే కుమారిలుఁడును జాతిస్వభావము గోచరించునదని భావించును. (3) భిన్నవస్తువులకే సంబంధమనున దుండును; కాని, జాతికి విశేషమునకువలెనే, అవినాభావసంబంధముగల వస్తుసంబంధమే సమవాయమని చెప్పఁ బడుటచే నది దురూహ్యమగు భావమగుచున్నది.

(2) శ్లో॥ వా॥ ప్రత్యక్షసూత్రము. పు. ౧౪౭-౧౫౦)

(3) ఇంద్రియగోచర. శ్లో॥ వా॥ వనవాదము॥ పు. ౨౪.

గుణనిలయమైనది ద్రవ్యము; ద్రవ్యములు తొమ్మిది: పృథివ్యప్తేజోవాయురాకాశములు, ఆత్మయు, మనస్సును, దేశము, కాలమును. వీనికిఁ గుమారిలుఁడు తమస్సును, శబ్దమునుగూడఁ జేర్చును. ౧. భూ జలాగ్ని వాయువులకు రూప స్పర్శ గుణములున్నవి; అందుచే నివి నేత్రత్వగింద్రియములకు విషయములు. ఇతరద్రవ్యము లనుమానముచేఁ దెలియునే కాని ప్రత్యక్షములు గావు. ఆకాశముయొక్క ధావళ్యమునకుఁ గారణ మందుండు నగ్ని రేణువులే. ఆకాశము శబ్దమునకాశ్రయమని యనుమానింపఁబడినది. వాయు వుష్ణముగాదు శీతముగాదని ప్రభాకరుని మతము. అగ్నియొక్కగాని, జలముయొక్కగాని రేణువు లందుండుటచే వాయు శీతోష్ణగుణములు గోచరించును. వాయువు త్వగింద్రియగోచరమని కుమారిలు నభిప్రాయము.

## ౧౪—ధర్మశాస్త్రము.

సముచిత జీవితవిధానమును దెల్పునది ధర్మము చోదనలక్షణయుక్తమైనది ధర్మమని జైమిని నిర్వచనము.౨ చోదనము ధర్మమునకు లక్షణము. ఇది శాసనకర్తయొక్క శాసననిర్వచనము. శబరుననుసరించి, కర్మప్రేరణమొనర్చునవి చోదన

(౧) కాంతిలోపమే తమస్సని ప్రభాకరునిభావము. అదియొక ద్రవ్యముకాని, గుణముకాని యైనచో నది పగటివేళఁగూడ గోచరింపవలెను. తమస్సునకు నీలవర్ణ మున్నదనియు నది చలనశక్తిని గలిగియున్నదనియు నందుచే ద్రవ్యమనియుఁ గుమారిలునివాదము.

(౨) చోదనాలక్షణో ఽర్థో ధర్మః॥ (౧, ౧, ౨)

వాక్యములు.3. విధి బాహ్యమునుండి వచ్చునది; మనకతీతమగు శక్తిసముద్భవములే విధులగుట దీనికిఁగారణము. చోదన యనగా నాంతరంగికమగు నుద్దీపనము, లేక యొత్తిడియని యింకొక యర్థమున్నది అంతర్వాణి పలుకునది బాహ్యశాసనముతో నేకీభవించును. వ్యక్తిసంకల్పమును, జాతినిర్ణయమును సరిపోవును. విధివిహితకర్మ దుఃఖముకంటె నధికతర సుఖము నిచ్చునని భాష్యకారులు చూపయత్నించిరి; అందువలనవిధ్యుక్త ప్రవర్తనము శ్రేయఃప్రదము. ఈలోకమునఁ గాకున్నను, సుఖమే లక్ష్యమని పూర్వమీమాంస నిశ్చయించెను. పరలోకసుఖావాప్తికొఱకై మనమిహలోక సుఖకాంక్షను విడువవలయును. అనర్థహేతువగుకర్మ ధర్మముకాదు. విధ్యుక్తమైనదే ధర్మము; అది సుఖహేతువగును.౧. మనము విధ్యుక్తకర్మముల నాచరింపకున్నచో, మనకు సుఖమలభ్యమగుటేకాక, దుఃఖము తప్పనిదగును.

పూర్వమీమాంసా ధర్మశాస్త్రము శ్రుతిపై నాధారపడియున్నది. ౨. వేదవిధులు ధర్మమును వివరించును. వేదోక్తమైనదే సత్కర్మయని మీమాంసకు నభిప్రాయము. స్మృతివాక్యములకు సమానములగు వేదవాక్యములున్నవనియు

(3) చోదనేతి ప్రవర్తకశబ్దోనామ॥ (౧, ౧, ౨. పై శబరుఁడు.)

(౧) శాసనము, విధి; కర్తవ్యము ధర్మము; ఫలము కర్మ.

(౨) పోల్చు: ధర్మమునకు పాలేయిచ్చిన నిర్వచనము; "ఈశ్వరసంకల్పమున కనుగుణముగా, నిత్యానందప్రాప్తికి, మానవకల్యాణసిద్ధికిఁ జేయు కర్మయే ధర్మము."

నందుఁ గొన్ని నష్టములైనఁ గావచ్చుననియు సంప్రదాయ సిద్ధమైన సిద్ధాంతము. స్మృతిశ్రుతి విరోధమున్నచో స్మృతియే నిరాకరింపఁదగినది.౩. స్వార్థపరతతోఁ జెప్పఁబడిన స్మృతులను విడిచిపెట్టఁదగును.౪. స్మృతుల తరువాత సదాచారము ముఖ్యమైనది.౫ స్మృత్యుక్తములు కాని ధర్మములు సత్ప్రయోజన నియమములుగ భావింపఁదగును. ప్రాకృత వికారములకులోఁగి మనమువర్తించుచో మనప్రవర్తన మధర్మమగును.౬. వేదోక్త విధుల ననుసరించియే హిందూజీవితము నియమింపఁబడినదగుటచే,మీమాంసాసూత్రములు హిందూధర్మ నిర్ణయమున కత్యవసరములు.సంధ్యాది నిత్యకర్మలను,యధోచిత నైమిత్తికకర్మలను ననుష్ఠించుట మనమోక్షమున కవసరము.ఇవి మానరాని నియమములు. వానినాచరింపకున్నచో మనకుఁబ్రత్యవాయము కలుగును.విశిష్టకాంక్షాసిద్ధికై మనము కామ్యకర్మల నొనర్పవలెను. కాంక్షలు లేనిచోఁ గామ్యకర్మ లవసరము లేదు. నిషిద్ధకర్మలను జేయకున్నచో నరకప్రాప్తి లేకుండును; కామ్యకర్మలు చేయకున్నచో స్వార్థపరత నశించును; విధ్యుక్తకర్మాచరణము మోక్షసిద్ధినొసఁగును.

ద్విజులైన మూడు వర్ణములవారికే యజ్ఞకర్మార్హతగలదని జైమిని నిశ్చయము. ఆత్రేయుఁ డీతనిని సమర్థించెను. సర్వ

(౩) ౧, ౩, ౩.
(౪) ౧, ౩, ౪.
(౫) ౧, ౩, ౭-౯.
(౬) ౪, ౧, ౩.

వర్ణముల వారును యజ్ఞములు చేయవచ్చునని చెప్పబాదః ముస్నగువారు లేకపోలేదు. శూద్రులకు వేదాధికారము లేదు గావున వారికి యజ్ఞకర్మార్హత లేదని జైమిని వాదించెను.౧.

పరిభాకరానుచరులు సంకల్పశక్తిని గూర్చి విశేష వివరణము చేసినారు. సిద్ధాంతముక్తావళిలో నిచ్ఛాపూర్వక ప్రవృత్తికి క్రింది దశాంతరము లున్నవని పరిభాకరుఁడు రచించినాఁడు; కార్యతాజ్ఞానము లేక ధర్మాచరణావశ్యకతాజ్ఞానము; చికీర్ష లేక దాని ననుష్ఠింపవలెనను కోరిక; ఇాదట్టికర్మ చేయుటకు సాధ్యమేయను విశ్వాసమిమిడియున్నది(కృతిసాధ్యతాజ్ఞానము); ప్రవృత్తి; చేష్ట; క్రియ. కామ్యకర్మలోఁగల సత్ఫలకాంక్షకంటెఁ గార్యతాజ్ఞానము ముఖ్యమైనదని ప్రభాకరు నభిప్రాయమై యున్నది. వైదికయాగాది కర్మలలో విధి శబ్దశక్తిచే విధి చివరచెప్పిన ఫలమును సంపాదించు శక్తిని యజమానిలో నుదయింపఁజేయునని చెప్పఁబడెను. మనుష్యప్రయత్నమున కవకాశ మున్నదని మీమాంస యంగీకరించును; లేనిచో మానవుఁడు తన కర్మలకు బాధ్యతలేని వాఁడగును.

సరిగా నర్థము గ్రహించినచోఁ గర్మసూత్రమునకు వ్యక్తిస్వాతంత్ర్యమునకు వైరుధ్యము లేదు. మనము మొదటి యడుగు వేయుట మానవచ్చును; కాని వేసినచో నిఁక రెండవది

(౧) ౬, ౧, ౨౫-౩౮. కొన్ని విషయములను జైమిని తన కిష్టములేక ఖండించి, వేరర్థములను జెప్పెను. ౬, ౧, ౪౪-౫౦ లో నగ్న్యాధానము చేయు నధికారము నాలుగువర్ణములకుఁ జెందదని రథకారునికిఁ గలదని యంగీకరించెను. నిషాదులు రౌద్రయజ్ఞమును జేయవచ్చును. (౬-౧, ౫౧-౫౨)

మొదలు తక్కిన యడుగుల నన్నిటిని కర్మసూత్రమే. అభ్యాస బలముచే వేయించును.౧.

జాతియొక్క జ్ఞానమునే వేదములు ప్రకటించును;వివేక విలసితమగు ప్రజాభిప్రాయమున కది వ్యతిరేకముగా గోచరించిన యెడల సందేహముదయించుట కవకాశమున్నది.అత్యధిక సంఖ్యాకులంగీకరింతురు గావున వేదవిధులకు స్వతఃప్రామాణ్యమున్నదని కుమారిలుఁడు వాదించినాఁడు. వేదోక్తనియమముల ప్రామాణ్యమును జనాభిప్రాయము సమర్థించి పోషించుచున్నదని యాతని నిశ్చయము. కాని, ధర్మనిర్ణయవిషయములో వేదవాక్యములనే శిరసావహించుట శ్రేష్ఠమనియు, బ్రాహ్మణ్యమని కాని, జనులకు సుఖావహమని కాని తలఁచి స్థిరతలేని భావములను బట్టి నడచుట యుక్తము కాదనియు నాతఁడు బోధించినాఁడు.౨. మహాజనుల ప్రవర్తనము కూడ మనకు ధర్మస్వభావమును దెలియఁజేయును. వేదవిరుద్ధములగుటచే బౌద్ధుల స్వభావములను సమర్థించుటకుఁ గుమారిలుఁ డిచ్ఛగింపలేదు. అహింసాప్రశస్త్యము నుగ్గడించిన బౌద్ధనైతికప్రబోధ నియమావళి యోగ్యమైనదని యాతఁ డంగీకరించుటకు వెనుదీయలేదు కాని, యది వేదమును నిరసించుటచే నయోగ్యమైనదని నిర్ణయించెను. బౌద్ధమతము బోధించిన సత్యమనేకాన్నృత భావ

(౧) డేరియస్ ప్రేత పర్షియా పతనకారణము నిట్లుచెప్పెను:"మనము స్వేచ్ఛగాఁ బాపకూపములోఁ బడుటకుఁ బరుగెత్తునప్పుడు, దేవుఁడుకూడ మనతో సహకరించును."

(౨) శ్లో॥ వా॥ ౨, ౨౪౨-౨౪౭.

ములచే నాచ్ఛాదింపఁబడినదని చెప్పి దానిని కుక్క తోలు సంచిలోఁ బోసిన క్షీరమని పోల్చినాఁడు.౧.

కర్మవలన సిద్ధిగలదను సిద్ధాంతమును లూథర్ ఫారిసీలు మరాచారముల నేసుక్రీస్తును ఖండించినట్లే, జడాత్మకమగు కర్మాచరణ విధానమును వేదాంతము నిరసించినది. ఎంత పవిత్ర కర్మనైనను, మనము సముచిత భావోజ్జ్వలత లేకుండ యంత్రమువలె చేయవచ్చును; అట్టి కర్మాచరణ విధాన మొక్కటియే మోక్షసాధనము కాఁజాలదు. దాని యందు మన ముంచు మూఢవిశ్వాసము పరిహాదహేతువు కూడ నగును. పెక్కు యజ్ఞములను మన మాచరింపవచ్చును గాని మన హృదయములో నెట్టిమార్పును లేకుండవచ్చును. ధర్మమనఁగా నాంతరంగిక పరివర్తనము, వ్యక్తిపునర్నిర్మాణము నైనచో నిజముగా వలయునది స్వార్థపరతను హోమముచేయ వలయునుగాని యజ్ఞశాలలో నాజ్యమునుగాదు. శ్రద్ధాభక్తి తపస్సులు ముఖ్యములని వేదములు చెప్పును; యజ్ఞములలో పీసకిఁ బ్రాధాన్యములేదు. పరమేశ్వరార్పణ బుద్ధితో సర్వకర్మ లను జేయవలెనను ఆస్తికభావములు వేదానుకూలములై యున్నవి. కొందరనంతర మీమాంసావాదు లీభావమును

(౧) శ్వాచర్మనిక్షిప్తక్షీరవత్॥ (తంత్రవార్తికము॥ ౧, ౩, ౬. పు. ౧౨౭.)

(౨) శ్రద్ధాం దేవా యజమానా...ఉపాసతే (ఋగ్వేదము॥౧౦, ౧౫ చూ:ఋగ్వేదము॥౧, ౧౫౬; ౧, ౧, ౧౦; ౧౦, ౬౦; ౬, ౩౪; ౧౦,౧౩౬; అథర్వణవేదము॥ ౪, ౮, ౩౯.)

సమర్థించిరి. ఈశ్వరార్పణ భావముతోఁ జేసిన విధ్యుక్తధర్మము మోక్షసాధనమని లౌగాక్షి భాస్కరుఁడు చెప్పినాఁడు.౧. ఈ లోకమునఁగాని, పరలోకమునఁగాని కర్మ ఫలప్రాప్తి యున్న దనుటవలన, స్వార్థత్యాగబుద్ధి, నిష్కామకర్మాచరణభావము కుంటువడును. మీమాంసకులు కేవలయజ్ఞకర్మలను౨.గూర్చియే మనకుఁ జెప్పువారగుటచే, మానవ జీవితములో నధికభాగము విడిచిపెట్టఁబడినది.

## ౧౫—అపూర్వము.

కర్మఫలప్రాప్తి కొఱకే చెప్పఁబడినది. కర్మకుఁ గర్మ ఫలమునకు నిస్సిష్టసంబంధమున్నది. నేఁడుచేయఁబడిన యొక కర్మ గతించుటకుఁ బూర్వమొక యదృష్టరూపము నొందని దే, యెప్పుడో భవిష్యత్తులో నొకఫలిత మీయఁజాలదు. అట్టి యదృష్టశక్తి యొకటున్నదని నిశ్చయించి జైమిని దాని కపూర్వమని పేరిడెను. 3. అపూర్వమనఁగాఁ గర్మఫలము యొక్క అదృష్టమగు పూర్వస్థితియనిగాని, కర్మానంతర కర్మస్థితి యనిగాని చెప్పవచ్చును. యాగాదికర్మలు నియతఫలములను గొంతకాలము పోయినవెనుక నిచ్చునని పచింపఁబడెను గావున, నట్టి కాలాంతరఫలసిద్ధి యపూర్వసాహాయ్యములేనిదే సాధ్య

(౧) ఈశ్వరార్పణబుద్ధ్యా క్రియమాణస్తు నిశ్శ్రేయసహేతుః (అర్థసంగ్రహము)

(౨) యాగాదిరేవధర్మః తల్లక్షణమ్ వేదప్రతిపాద్యః॥(అర్థసంగ్రహము పు. ౧.)

(3) అపూర్వము=పూర్వములేనిది.

పడదు. ౪. కర్మకుఁ గర్మఫలమునకుఁ గల తాత్త్వికబంధమే అపూర్వము. ౫. కర్మఫల ప్రదాత పరమేశ్వరుఁడనుటకు మీమాంసకు లంగీకరింపరు; ఏలన భిన్నతలేని యేకాత్మకమగు కారణము భిన్నతగల కార్యోత్పత్తికి హేతువుకాఁజాలదు. ౬. ప్రధానకర్మయందుఁగాని, కర్తయందుఁగాని, కర్మాచరణకుఁ బూర్వమందు లేనట్టియు ననంతరమున్నట్టియు నొక శక్తియే అపూర్వమని కుమారిలుఁడు నిర్వచనము చెప్పి, దాని యస్తిత్వమును శ్రుతిస్మృతులే ప్రకటించినవని వచించినాఁడు. కర్మనుండి జనించి, ఫలావాప్తికి సాధనమైన శక్తియే యపూర్వము. అపూర్వాస్తిత్వము నంగీకరింపకున్నచో నెన్నియో వేదరహస్యములు నిరర్థకములగును. ఒకయజమానిచేసిన యాగ మా యజమానిలో నొకశక్తి నుద్భవింపఁజేయును. ఆశక్తి యాతనిలో నితరశక్తులవలెనే జీవితాంతమువఱకు నిలిచి, యనంతర మా కర్మఫల మాతని కొసఁగుచున్నది. ప్రభాకరు నభిప్రాయములో నపూర్వ మాత్మలో నుండఁజాలదు; ఏలన నాత్మ సర్వవ్యాపి యగుటచే నిష్క్రియాత్మకమైనది. కర్మ కర్తలో నొకవిలక్షణ శక్తి నుదయింపఁజేసి, తన్మూలమున ఫలప్రాప్తి నిచ్చుననువాదము నాతఁ డంగీకరింపఁడు యాగక్రియవలన నట్టిశక్తి జనించునని ప్రత్యక్షానుమాన శబ్దప్రమాణములు చూపుట

(౪) పూర్వ॥ మీ॥ సూ॥ ౨, ౧, ౫.

(౫) పోల్చు: భీమాచార్యనిర్వచనము: యజ్ఞాదిజన్యః స్వర్గాదిజనకః కశ్చనగుణవిశేషః॥ (న్యాయకోశము)

(౬) శం॥ భా॥ ౩, ౨, ౪౦.

లేదు. కర్త యొక్క పరిశ్రమవలనఁ గర్మ జరుగుచున్నదిగావున, గర్మఫల సాధనశక్తి యీపరిశ్రమలో నుండవచ్చును. అందుచే నీయపూర్వము కర్మయందేకాని కర్తయందుండదు. నియుక్తుఁడైన వ్యక్తి యొక్క కర్మకుఁదగిన ఫలము నుదయింపఁజేయు ప్రత్యక్షకారణము కార్యమని 3. ౧. 3 లో నిరూపింపఁబడెను. ఈకార్యమనఁగాఁ గర్మ కాదు; ఏలనఁ గర్మ ఫలమునకుఁ బ్రత్యక్షకారణము కాదు. కార్యము కర్త యొక్క కృతివలన లేక పరిశ్రమవలన జనించునది. కర్తయందీ పరిశ్రమ నియోగింపఁబడును. ౧. పరిశ్రమ కర్తలోనొక కార్యమును జనింపఁజేయును; దీనికి ప్రభాకరుఁడు నియోగమని పేరుపెట్టెను. ఈనియోగము కర్తనొక కార్యాచరణమందు నియోగించును. కాని శాలికనాథుఁడు చెప్పిన రీతిని, యీనియోగము విధిసహాయము లేనిదే ఫలసిద్ధి నుత్పత్తిచేయఁజాలదు. ప్రభాకరుని ౧ భావము నర్థముచేసికొనుట సులభము కాదు; కాని కుమారిలుని భావముకంటె నీతఁడు చూపిన విశేషములేదు.

అపూర్వసిద్ధాంతము నుద్ద్యోతకరుఁడు ఖండించినాఁడు.౨. అది నిత్యముగాదు; అయినచో మృతికవకాశమే లేదు; ఏలనఁ బుణ్యపాపములు నిత్యములగును, అపూర్వ మేకమైనచో సర్వజనుల సుఖదుఃఖములు సమానములు గావలెను. అపూర్వమొకటైనను, దానిని వ్యక్తీకరించు రూపము లనేకములుండ

---

(౧) 3, ౧, 3.

(౧) ప్రకరణపంచిక॥ పు. ౧౮౫.

(౨) న్యా॥ వా॥ ౧, ౧, ౭.

వచ్చుననియుఁ జెప్పుటకు వీలులేదు; ఏలన దానిని వ్యక్తీకరించు రూపమేదో మనకుఁ దెలియదు; అది ఫలసిద్ధినిచ్చు శక్తియో; అపూర్వమునకుఁ జెందిన శక్తియో తెలియదు. అపూర్వము నా శక్తియనొకటో, కాదో తెలియదు. గుప్తమైన యపూర్వము వ్యక్తమైనదన్నచో, నది మొదటనెట్లు గుప్తమైనదో చెప్పఁ జాలము. నిత్యమగు నపూర్వము భిన్నవ్యక్తులకు భిన్నమైయుండు నన్నను, దానివ్యక్తీకరణమందలి క్లిష్టసమస్యలు తొలఁగవు. శంకరుఁడపూర్వ సిద్ధాంతమును విమర్శించెను. అపూర్వ మచేతన మగుటచే నది చేతనమైనదానిచేఁ జలితముగాకుండఁ జలించదు. అపూర్వనియమము మొక్కటియుఁ గర్మఫలకారణముగాను నిర్ణయింపదు. అపూర్వసూత్రము ననుసరించి యీశ్వరుఁడు కర్మఫలముల నిచ్చునన్నచోఁ, గర్మనియతి ననుసరించి ఫలప్రాప్తి నీశ్వరుఁడిచ్చునని చెప్పు వేదాంతభావమే యగును.3.

### ౧౫—మోక్షము.

జైమినియు శబరుఁడును మోక్షసమస్యను బరిష్కరింపఁ బూనుకొనలేదు. వారు స్వర్గద్వారమును జూపిరే కాని సంసార విముక్తిమార్గమును జెప్పలేదు. ఇతరశాఖలవారి మోక్షసమస్యను గూర్చి యాలోచించుటచే ననంతర రచయితలు దీనిని విడిచిపెట్టుటకు వీలులేకపోయినది. పునర్జన్మ కారణమైన ధర్మాధర్మ ప్రవృత్తి త్యాగమే మోక్షమని ప్రభాకరుఁడు వచించెను. మోక్షమనఁగా, "సర్వ ధర్మాధర్మ నిర్మూలనముచేఁ బూర్తిగా

---

(3) కర్మాపేక్షా దపూర్వాపేక్షాద్వా యథాస్తు తథాస్తు ఈశ్వరాత్ఫలమ్॥ (శం॥ భా॥ 3, ౨, ౪౧.)

దేహధారణావశ్యకత నశించుటే"౧. యని నిర్వచనము చెప్పఁబడెను. సంసారమునందు సుఖములు దుఃఖసమ్మిశ్రితములై యుండుటెఱిఁగి, మానవుఁడు ముముక్షువగును. అతఁడు నిషిద్ధ కర్మలనే కాక, యిహపరములలోఁ గొంతసుఖమునిచ్చు విధ్యుక్త కర్మలనుగూడఁ జేయుటమానును. ప్రారబ్ధకర్మ క్షయమగుటకు వలయుఁ బ్రాయశ్చిత్తముల నాతఁడు నెరవేర్చి, తృప్తి చేతను, మనోనిగ్రహముచేతను, నాత్మజ్ఞానముచేతను, జన్మ, నాశన మొనర్చుకొనును. ౨ కేవలజ్ఞానము బంధవిముక్తి నొసఁగఁజాలదు; కర్మనాశనము మోక్షహేతువు ఇఁకఁ బుణ్యాపాపముల నార్జింపకుండ జ్ఞానము చేయఁగలదు. 3. ప్రభాకరానుచరులు కేవల కర్మచే మోక్షసిద్ధిలేదని తలఁచిరి. కర్మ, ఫలాగమసంధిచేఁ బునర్జన్మహేతువగును. మన యిచ్ఛానిచ్ఛలు మనకుఁ గలుఁగఁబోవు జన్మస్వభావమును నిర్ణయించును. మోక్షము వలయుచో నీశాఖా చంక్రమణమును ఖండింపవలెను. సుఖదుఃఖ నిరాసమే మోక్షము. అది యొక్క యానందస్థితి కాదు; నిర్గుణమైన యాత్మ కానందగుణము నుండదు; మోక్ష మాత్మసహజస్థితిలో నొందుటే. ౪.

ఆత్యంతికస్తుదేహోచ్ఛేదో నిశ్శేష ధర్మాధర్మ పరిక్షయనిబంధనో మోక్షఇతిసిద్ధమ్। ధర్మాధర్మవశీకృతో జీవస్తాసుతాసుయోనిషు సంసృతి॥ (ప్రకరణపంచిక॥ తత్త్వాలోకము పు ౧౫౬)

(౨) శమదమబ్రహ్మచర్యాదికోప బృంహితేన ఆత్మజ్ఞానేన॥ పు ౧౫౭

(3) దీనికి భిన్నభావమునకుఁ జూడు. బృహచ్చింతామణి వారణాశి ప్రతి॥ పు ౫౭.

(౪) స్వాత్మస్ఫురణరూపః॥

దుఃఖవిరహితమైన ఆత్మయొక్క స్వస్థితియే మోక్షమని కుమారిలు నభిప్రాయము.౧. ఆత్మానంద సిద్ధియే మోక్షమని కొందరు తలంచిరి.౨. దీనికిఁ గుమారిలుని భావము వ్యతిరేకము; అభావలక్షణయుక్తమైనది గాకున్నచో మోక్షము నిత్యమైనది కాఁజాలదు.3. దుఃఖవిముక్తియే కాని మోక్షమనఁగా సుఖానుభూతికాదనియే పార్థసారథియుఁ దలఁచినాఁడు. ఆత్మ జ్ఞానశక్తి లక్షణముగలది. వస్తుజ్ఞానము బుద్ధీంద్రియప్రవృత్తిచేతనే కలుగుచున్నది. బుద్ధీంద్రియములు మోక్షావస్థలో లేవు 'పున;నాత్మ నిర్వికార శుద్ధరూపములో నుండును. సుఖదుఃఖాది లక్షణవిరహితమై మోక్షస్థితి యుండును. అది బాహ్యవస్తుజ్ఞానము కాని, యాంతరంగిక విచారము కాని లేని యవస్థ, కాని కుమారిలుఁ డాత్మజ్ఞానసిద్ధిరూపము గలదే మోక్షమని చెప్పుట వలన నద్వైతభావమునకు దగ్గరగా వచ్చినాఁడు. మోక్షసిద్ధికి జ్ఞానము చాలదని యాతఁడు భావించినాఁడు, జ్ఞానసహిత కర్మ మోక్షము నిచ్చునని యాతని నిశ్చయము.

౧౭—ఈశ్వరుఁడు.

వేదోక్తములైనచో హోమములను సమర్పించుట కవసరమగు వివిధదేవతలను పూర్వమీమాంస కల్పించెను. వైదిక ధర్మాచరణమున కొరకు పరమేశ్వరుఁ డవసరములేదు కావున నీ దేవతలను మించిన భావకల్పనము చేయఁబడలేదు. జైమిని

(౧) పరమాత్మ ప్రాప్త్యవస్థామాత్రమ్॥

(౨) చిత్తేనస్వాత్మ సంఖ్యానుభూతి॥

(3) శ్లో॥ వా॥ సంబంధాక్షేప పరిహారమ్॥ పు. ౨౦౭.

దేవుని యెడఁదాక్షిణ్యభావమును జూపెనే కాని, నాస్తికభావమును బ్రదర్శింపలేదు. వైదిక మతానుష్ఠానములో నేయంశమునకును దైవసాహాయ్యమవసరము లేదు. నిత్యమై స్వయంస్థితిగల వేదము ధర్మప్రవచనము చేసెను; వేదముల కీశ్వర కర్తృత్వము నాపాదించు యత్నము తిరస్కరింపఁబడినదని యిదివఱకే చూచియుంటిమి. యజ్ఞఫలప్రాప్తి కే దేవునికృపయు నవసరము లేదు. కర్మలకు వెంటనే ఫలితము సిద్ధించకపోయినను, దానివలన నతీంద్రియమైన యపూర్వముదయించి, సముచితకాలములోఁ గర్తకు ఫలావాప్తి నొసఁగును. సర్వజ్ఞుఁడగు నొకయీశ్వరుఁడున్నాఁడని చూపుటకుఁ బ్రమాణభూతములగు నాధారము లెవ్వియునులేవు. ప్రత్యక్షానుమాన శబ్దప్రమాణములా పని చేయలేవు. "అతఁడన్నియు నెఱుఁగును", అతఁడు ప్రపంచము నంతను దెలిసినవాఁడు" ఇన్నగువాక్యములు యాగకర్తను స్తవముచేయునవే. కర్మయుఁ గర్మఫలమునొక్కయుఁ బౌరంపర్యము బీజవృక్షన్యాయమున ననంతముగా నడచుచుండును. కల్పాంతమున లయము,తిరిగి పునస్సృష్టిజరుగునను వాదమునకు మీమాంస సుముఖముగాదు. పరిణామ ప్రళయవిధానము నిత్యమైనది. ఒకానొక ముహూర్తమున జీవుల పరిణామమును పరమేశ్వరుఁడు ఖండించి, పునస్సృష్టివేళ వానినిఁదిరిగి కల్పించునని తలఁచుట కవకాశము లేదు. సృష్టిలోభాగములకు లయోత్పత్తి పద్ధతులున్నవిగాని, సృష్టికి మొత్తముమీఁద లేవని ప్రభాకరుఁడు తలఁచినాఁడు. మనుజపశుసంతతుల దేహోత్పత్తికి జననీజనకులే కారణములుగాని, యీశ్వరుని జోక్యమేమియు నవసరము లేదు.

దైవేచ్ఛవలన నణువులు పనిచేయుచున్నవని చెప్పఁజాలము; ఏలన మన యనుభవములోఁ బ్రతిజీవాత్మయు దానికి సంబంధించిన దేహముపైఁ దానే పనిచేయుచున్నది. అణువులు దేవుని శరీరము గావు. దేవుని కొక శరీరమున్నదని మన మంగీకరించినను, నాశరీరప్రవృత్తికిఁ గర్త దేవుఁడే యని చెప్పవచ్చును. దేవునిప్రయత్నము నిత్యమైనదైనచో నణువులు నిరవధిక ప్రవృత్తినిఁ గలిగి యుండవలెను. ధర్మాధర్మములను నడపు దైవశక్తి యున్నదనియుఁ జెప్పఁజాలము; ఏలన నవి బుద్ధిగల వ్యక్తులకుఁ జెందినవి. ఒకవ్యక్తి, యెంతటి ఘనుఁడైన నింకొకని ధర్మాధర్మముల నెఱుఁగఁ జాలఁడు. ఇతరుల అదృష్టమగు ధర్మమును దేవుఁడు తన మనస్సుతోఁగాని యింద్రియములతోఁగాని చూడలేఁడు; ఏలన నితరుల ధర్మమాతని శరీరమునకు బాహ్యమున నున్నది,ధర్మాధర్మములను దేవుఁ డెట్లు నడపునో సులభముగా నవబోధమగుటలేదు. దేవుని యాజమాన్యము సంయోగ సంబంధము కాఁజాలదు; ఏలన ధర్మాధర్మములు గుణములు; సంయోగము ద్రవ్యములకే గాని యుండదు. అది సమవాయ సంబంధమును గాఁజాలదు; ఏలన ధర్మాధర్మము లితరజీవగతములై యున్నవి గాని దేవునిలో లేవు.

తర్కముచే నీశ్వరాస్తిత్వమును స్థాపించి, వేదము లీశ్వరకృతములని ప్రకటించిన న్యాయదర్శన సిద్ధాంతమును గుమారిలుఁడు ఖండించినాఁడు. ఈశ్వరకృతములని చెప్పఁబడిన వేదము లీశ్వరుఁడు జగత్కర్తయని చెప్పినచో నీ

భావమున కెంతయో విలువనీయనక్కఱలేదు. ౧. సృష్టికర్త సృష్టిని సృజించినచో దానికి సాక్షులెవరు? మఱియు నాతఁడా సృష్టి నెట్లుచేసెను? ఈశ్వరునికొక భౌతిక దేహము లేనిచో నాతనికి సృజనకాంక్షయే యుండదు. ఒకవేళనున్నచో, నాతని శరీరసృష్టి కింకొక సృష్టికర్త యుండవలెను ఈశ్వరుని దేహము నిత్యమన్నచో, భూమ్యాది భూతములింకను సృజింపఁబడ లేదు గావున, నేపదార్థములతో నాతని శరీరము కల్పితమైనది? అతని సృష్టివ్యాపారమునకుఁ బూర్వమే పదార్థమున్నచో, మొదట నీశ్వరుఁడే కాకుండఁ గొన్నిద్రవ్యములున్నవని యంగీకరింపవలసియుండును. దుఃఖ దూషితమైన లోకసృష్టి చేయుటలో నీశ్వరు నుద్దేశమేమి? పూర్వకర్మయే కారణమనుటకు వీలు లేదేలన నతఃపూర్వ మొకసృష్టి లేదు. కృపచే సృజించెననుటకును వీలులేదేలన, గ్రృపచూపవలసిన జీవు లదివఱకు లేరు. మఱియు నాతని కృపయే సృష్టికారణమైనచో సుఖజీవులను సృజించియుండవలెను. దుఃఖాంశ లేనిదే సృష్టి యసాధ్యమన రాదు; ఏలన దేవుని కసాధ్యములుండరాదు. అట్లుకాక యీశ్వరుని కితరనిర్బంధహేతువులున్నచో నప్పుడాతఁడు సర్వశక్తిసమన్వితుఁడగుట సత్యమగును. సృష్టి నీశ్వరుఁడు వినోదము కొఱకుఁ జేసెనన్నచో, నీశ్వరుఁడు సంపూర్ణానందస్వరూపి యను సిద్ధాంతము వ్యర్థమగుటయు, వినోదముకొఱ కీశ్వరుఁ డెంతయో శ్రమకు లోనగుటయు జరుగును. మఱియుఁ జేసిన

(౧) శ్లో॥ వా॥ సంబంధాక్షేప పరిహారము పు. ౧౧౪; చోదన సూత్రము పు. ౧౪౨)

సృష్టిని నాశనముచేయు కోరికయు నీశ్వరుని కనుచితమేయగును. ఈశ్వరుని మాటలను మనమేలనమ్మవలెను? ఆతఁడు నిజముగా సృష్టి చేసినవాఁడు కాకున్నను దనకెంతయో శక్తిగలదనిచూపుటకై యట్లు వచించియుండవచ్చును.౧. ధర్మపరిమాణములో నితరులకంటె నీశ్వరుఁడు భిన్నుఁడన్నచో, నది వేదములవలననే సాధ్యమగుటచే, సృష్టికిఁ బూర్వము వేదము లుండియుండవలెను.౧. అణువు లీశ్వరేచ్ఛ ననుసరించి వర్తించునన్నచో, నాతని కా యిచ్ఛ యెట్లు జనించెను? అదృష్టమువంటి దాతని యిచ్ఛకుఁ గారణమైనచో నదృష్టమే సృష్టికిని గారణము గావచ్చును.౨. ఈశ్వరుఁ డన్యముపై నాధారపడినచో నాతని స్వాతంత్ర్యము కుంటుపడును. ఈశ్వరుని సంకల్పమే జగత్కారణ మన్నచో, కర్మ సిద్ధాంతము నిరర్థకమగును.

దేవతల దేహలక్షణముల విషయములో వేదము లట్లు వర్ణించుటకా దేవతలను సంకీర్తనముచేయుటే యుద్దేశము. "నీహస్తముల నూతఁగాఁ గొంటిన"ను వాక్యమునకు, "నీసంరక్షణము నపేక్షించుచున్నాన"నియే యర్థము.౩. ప్రభాకర కుమారిలు లిర్వురును దేవతలకు దేహములున్నవని యంగీకరింపరు. మనకర్మలకు ఫలితముల నేదేవతలయొక్క దయవలనను మనము పొందుటలేదు; అందుచే దేవతలకు దేహము

(౧) అస్పష్టాపిహి అసౌ బ్రూయాదాత్మైశ్వర్య ప్రకాశనాత్ ॥ ౬౦.
(౧) శ్లో॥వా॥ సంబంధాక్షేపపరిహారము॥ పు.౪౪-౭౨;౧౧౪-౧౨౬.
(౨) " " " పు. ౭౨-23.
(3) చూ: శబరుఁడు. ౯, ౧, ౯ పై.

లుండనవసరము లేదు. ఆది మీమాంసకులు దేవతలకుఁ గొంత స్వరూప యాథార్థ్య మున్నదని చెప్పిరిగాని, యనంతర మీమాంసకులు మంత్రములకే ప్రాముఖ్యమున్నదని యుగ్గడింపఁ దలఁచి, యాగకర్త మంత్రములకే శ్రద్ధచూపవలెను గాని దేవతల కవసరము లేదని వాదించినారు. దేవత లూహాకల్పితులని భావించియు, వారికి హోమములు సమర్పించుట వలనఁ గర్మ ఫలసిద్ధి యగునని యే చెప్పిరి. మంత్రములకు వేరే దేవతలున్నారని వారు విశ్వసింపలేదు.౪.

ఇటీవలఁ బూర్వమీమాంసను గూర్చిన యొక గ్రంథములో నీవిషయమును గూర్చిన మీమాంసా భావమునకును వేదాంతభావమునకును సామరస్యమును జూపుట కొక వింత వాదము ప్రకటింపఁబడెను.౧. ఫలప్రదానము లిచ్చుదాతగా నీశ్వరుని యస్తిత్వమును జైమిని నిరసించెనేగాని, జగత్కర్తగా నీశ్వరుఁడు లేఁడని యాతఁడు వాదించి యుండలేదని వచింపఁబడెను. ఈశ్వరుఁడు జగత్కర్తయుఁ గర్మఫలప్రదాతయుఁ గూడనై యున్నాఁడని శాఖాంతరులు చెప్పఁగా, (గర్మఫల ప్రదాత యీశ్వరుఁడు గాఁడని జైమిని భావమని చెప్పఁబడెను. ఏది సుఖమునుగాని దుఃఖమునుగాని యిచ్చునో దానినే ఫలమనిరి. అదియొక వ్యక్తికి సుఖదుఃఖానుభవ మిచ్చునపుడే ఫలమనఁబడును.౨. ఒక ఫలమునకుఁ గర్మ కారణమని చెప్పఁబడి

(౪) చూ: ఆపదేవుఁడు. దేవతాస్వరూప విచారమ్॥

(౧) పి శాస్త్రి. పూర్వమీమాంస॥ పు. 3.

(౨) శబరభాష్యము॥ 3, ౨, 3౮.

నపుడు, దాని యర్థమేమనఁగా నొకవస్తువు జనించుటయే కాక యావస్తువొక వ్యక్తికి భోగ్యమైనది. బాదరాయణుఁడు తన గ్రంథ తృతీయాధ్యాయములో జైమినీయ సిద్ధాంతమును విచారించి,కర్మఫలము నిచ్చునది యపూర్వమే కాని దేవుఁడు కాడను జైమిని భావమును ఖండించినాఁడు. దేవుఁడు సృష్టికర్త గాఁడని జైమిని భావమేయైనచో దాని విచారణను బాదరాయణుఁడు ద్వితీయాధ్యాయములోనే చేసియుండెడివాఁడు. ఏలన ద్వితీయాధ్యాయములో వ్యతిరేక మతసిద్ధాంతముల నాతఁడు విమర్శించినాఁడు. సృష్టిలోని విభేదముల కన్నిటికి నీశ్వరునే బాధ్యునొనర్చినచో నీశ్వరునికిఁ బాక్షికదృష్టియు నిర్దాక్షిణ్యమును సంక్రమించును గావున, జైమిని జీవరాసుల భిన్నానుభవకారణము పూర్వకర్మయే యని నిశ్చయించినాఁడు. ఈవివరణము సహేతుకము గాదు. మనకు సుఖదుఃఖము లిచ్చుటకు ముందు వస్తూత్పత్తి యుండవలెను. మనకు సుఖదుఃఖప్రదాత పూర్వమైనచో నదియే సృష్టికిని గారణమై యుండవలెను. సృష్టికర్మ కీశ్వరుఁ డవసరమైనచో నపూర్వమనఁగాఁ గేవల కర్మనియతియే యగుటయు దాని ననుసరించి యీశ్వరుఁడు సృష్టి చేయుటయుఁ దటస్థించును. ప్రత్యక్షముగానో పరోక్షముగానో సృష్టికర్తయుఁ గర్మఫల ప్రదాతయు నీశ్వరుఁడే యగును.

పూర్వమీమాంసలో నీలోప మసంతృప్తిహేతువగుటచే ననంతర రచయితలు రహస్యముగా దేవునందుఁ జేర్చిరి. జడమైన అపూర్వనియమము సృష్టిలో విశేషసమన్వయలక్షణమునుజూపు ఫలితములకుఁ గర్త కాఁజాలదను వాదములోని

హేతుసామర్థ్యము సముచితమైనదని భావింపఁబడెను. ౧. నెమ్మదిగా నీశ్వరతత్త్వము చొప్పింపఁబడెను. కాని యీ కర్మఫలనూత్రి చోదకుఁడగు నీశ్వరుఁడీసూత్రిమునకు బద్ధుఁడు కాఁజాలఁడు; ఏలన, నెవఁడును దనస్వభావమువలననే బంధింపఁబడఁడు. కర్మనియుతి యీశ్వరుని స్థిరసంకల్పమునే ప్రదర్శించును. ఉపాసనకూడ నొకవిధమగు కర్మయేయనియు నది స్వయముగానే ఫలోత్పత్తి సమర్థమనియు వాదింపఁబడినను, గర్మయు నుపాసనయు మోక్షప్రాప్తి కవసరములని కుమారిలుఁడు పలికినప్పు డాతఁ డీశ్వరాస్తిత్వము నంగీకరించినాఁడు. ఇంచుమించుగా నారంభదశలోనే, ఆస్తికతత్త్వము ననుసరింపకున్నచో మీమాంసాతత్త్వము వివేకవంతులకు సంతృప్తి నీయఁజాలదను విషయము గుర్తింపఁబడెను. అందుచే నాపదేవుఁడును లౌగాక్షిభాస్కరుఁడును, పరమేశ్వర ప్రీత్యర్థము యజ్ఞముచేసినచో నది యుత్తమశ్రేయఃప్రదమగునని ప్రకటించినారు. ఈభావమే వేదాంతదేశికుని సేశ్వరమీమాంసలో సమగ్రపరిణతిఁ గాంచినది.

పూర్వమీమాంస ధర్మమునకుఁ బ్రాముఖ్య మిచ్చినది. నిత్యమగు కర్మసూత్రిమే పరమార్థసత్యమని విశ్వసింపఁబడెను. ఈశ్వరుఁ డనగా ధర్మమే. ధర్మవిషయము లన్నియు వేదప్రోక్తములు; వేదము లీశ్వరచిత్తమును వ్యక్తీకరించును. కుమారిలుఁ డిట్లుచెప్పెను "శబ్ద బ్రహ్మరూపమగు నీ శాస్త్రమే వేద

---

(౧) భామతి॥ 3, ౨, ౪౧.

ముందురు; ఇది యీశ్వరునిచే స్థాపింపఁబడినది.[౧] కుమారిలుఁడు తన గ్రంథమును శివప్రార్థనముతో నారంభించెను. "ఎవని దేహము శుద్ధజ్ఞానస్వరూపమో, మూఁడు వేదము లెవనికి మూఁడు నేత్రములో యెవఁ డానందసిద్ధికి హేతుభూతుఁడో, యెవఁ డర్థచంద్రభూషితుఁడో యా శివునకు నేను ప్రణమిల్లుచున్నాను."[౨] వేదము లీశ్వరసంకల్ప రూపములు. యాగాది కర్మ లానందప్రాప్తికి విశిష్టకారణములు గావచ్చునుగాని, యీశ్వరుఁడే ప్రధానహేతువు నాఁడు ప్రచారములోనున్న లోకాయత మతములకు ములైన ఆస్తికమార్గముల కనుగుణముగా నుండుటకై, మీమాంసా తత్త్వమున కర్థవివర

(౧) శబ్దబ్రహ్మేతి యచ్చేదమ్ శాస్త్రమ్ వేదాఖ్య ముచ్యతే।
తదప్యధిష్ఠితమ్ సర్వమ్ ఏకేన పరమాత్మనా॥

(౨) విశుద్ధజ్ఞానదేహాయ త్రివేదీ దివ్యచక్షుషే। (తంత్రవార్తికము. పు. ౭౧౯.) శ్రేయః ప్రాప్తినిమిత్తాయ నమః సోమార్ధధారిణే। (శ్లో॥వా॥౧,౧. పార్థసారథి తన న్యాయరత్నాకరములో నీశ్లోకమునకుఁ గుమారిలుఁ డాస్తిక భావబద్ధుఁడు గాకుండు నర్థమును జెప్పెను. శ్లోకము యజ్ఞపరమని యాతఁడు వచించెను. విశుద్ధమ్ మీమాంసయా సంశోధితమ్ జ్ఞానమేవ దేహో యస్య; త్రివేద్యేవ దివ్యమ్ చక్షుః ప్రకాశకం యస్య; సోమస్య అర్ధమ్ స్థానమ్ గ్రహచమసాది తద్ధారిణే ఇతియజ్ఞపక్షే ఒపిసంగచ్ఛతే॥ కాని కుమారిలుఁడు సగుణ శివుని స్మరించెనని యాతఁ డంగీకరించెను. విశ్వేశ్వరమ్ మహాదేవమ్ స్తుతిపూర్వమ్ నమస్యతి॥ స॥ ద॥ సా॥ సంగ్రహమునుండి కుమారిలుఁ డాత్మ యేకము ననేకము నని చెప్పెనని తెలియుచున్నది. ఈగ్రంథము కొన్నియితర వేదాంత గ్రంథములవలెనే కుమారిలుఁడు వేదాంతియని నిరూపింపఁజూచెను.

ణముచేయు కుమారిలుని సంకల్ప మిట్టిభావముల కనుకూల ముగా నున్నది.౧.

ఒకతత్త్వశాస్త్రముగాఁ బూర్వమీమాంస సంతృప్తి నొసఁగఁజాలదని చెప్పనవసరములేదు. సృష్టినిగూర్చి యొక తాత్త్వికభావముగా నది యసమగ్రమైయున్నది. పరమార్థము, పరమార్థమునకు జడపదార్థ జీవరాశితోఁగల సంబంధములను గూర్చిన మూలసమస్యల నది పరిష్కరింపఁబూనుకొనలేదు. అదిప్రకటించిన ధర్మము చైతన్యరహితము; అదివివరించిన మతము హేతుబద్ధము గాదు. అత్యంతముఖ్యమైనది యాగ సమాచరణమే; యాగకర్తలయెదుట దేవతలును నిలువఁజాల రైరి. దేవతనామము చతుర్థీవిభక్తిలోఁ జెప్పఁబడినది హేతు రహితముగాదని యనంతరమీమాంసకులు బహిరంగముగాఁ జెప్పిరి. 'ఇందాయస్వాహా' యను దానిలో నింద్రుఁడు దేవత. (అనఁగా యాగకర్త యింద్రునికొఱకు కాతనిపైఁ గృపచే హోమముచేయుచున్నాఁడని భావము.) ఇట్టి మతములో హృదయమును స్పందింపఁజేసి, చైతన్యవంతమగున దేదియు నుండుటకవకాశము లేదు. ఈకారణమువలన వైష్ణవ, శైవ, తాంత్రికసిద్ధాంతకల్పితమైన యేకేశ్వరతత్త్వము లుదయించు టలో నాశ్చర్యము లేదు. మనము నిత్యము నాతనిపై నాధారపడి, మనకష్టసుఖములలో మనహృదయము నాతనికర్పించి ధైర్య

(౧) ప్రాయేణైవహి మీమాంసా లోకేలోకాయతీకృతా।
తమాస్తికపథే కర్తుమయమ్ యత్నః కృతోమయా॥
శ్లో॥ వా॥ ౧, ౧౦.

ముతో నుండుటకు వీలగునొక పరమేశ్వరు నీభిన్నతత్త్వములు మనకుఁ బ్రసాదించినవి.

## ఉదాహృతగ్రంథములు


౧. గంగానాథ్‌ఝా: శ్లోకవార్త్తికము.

౨. గంగానాథ్‌ఝా: పూర్వమీమాంస; ప్రభాకరశాఖ

3. కీత్: కర్మమీమాంస.

౪. పి. శాస్త్రి: పూర్వమీమాంసకుపోద్ఘాతము.

౫. సర్కార్: అర్థవివరణమునకు మీమాంసాసూత్రములు.

ఓం

# భారతీయ తత్త్వశాస్త్రము

## సప్తమాధ్యాయము

## వేదాంత సూత్రములు

### ౧—ఉపోద్ఘాతము.

వేదాంతమందలి తాత్త్విక సంపత్తిచేతనేగాక, భారతీయ మతముతో దానికిఁగల సన్నిహిత సంబంధముచేతను, మఱే యితర తత్త్వముకంటె నిది భరతవర్షమున నధికముగా సజీవమై యుండుటచేతను దీని నెక్కుడు శ్రద్ధతో మనము పరిశీలింప వలసియున్నది. ఏదో యొకరూపములో వేదాంతమే భారతీయ వైజ్ఞానికభావముగా నేటిప్రపంచమునఁ బ్రచారము పొంది యున్నది.

'వేదాంత'మనఁగా వేదముల చివరిభాగమునం దనఁగా నుపనిషత్తులందుఁ బ్రకటింపఁబడిన సిద్ధాంత సముచ్చయమని యర్థము. ఉపనిషద్భావములు వేదముల పరమలక్ష్యమును లేక

వేదసారమును బ్రకటించును.౧. పరబ్రహ్మతత్త్వమును వివరించును గావున వేదాంతసూత్రములను బ్రహ్మసూత్రములనియు నిర్గుణపరమాత్మ స్వరూపమును వివరించును గావున శారీరిక సూత్రములనియుఁ గూడఁ బేర్కొనఁబడెను.౨. వేదోక్తమై, ధర్మజిజ్ఞాసయుఁ ధర్మఫలప్రసక్తియుగలిగి జైమిని విరచితమైనది కర్మమీమాంస యనియు,నుపనిష దాస్తిక తాత్త్వికభావములను వర్ణించు బాదరాయణ దు తరమీమాంస యనియుఁ బ్రసిద్ధములైనవి.3. రెండును గలిసి వేదసర్వస్వమును సమ్యక్పరిశీలనము చేయును.

ఉపనిషత్తులు భిన్నదృక్పథములనుండి చేయఁబడిన సత్యావలోకనము లేకాని, మహాసమస్యలనొకటి వెనుక నొకటిగాఁ దీసికొని చర్చించినవి గావు. కాని యవి శ్రుతుల వంటి యపౌరుషేయప్రామాణ్యముగలవని విశ్వసించువారు, వానియందు సమ్యక్సమన్వయముపొందిన మహోపదేశ మిమిడి యున్నదని చూపవలసియున్నారు; బాదరాయణుఁడీ కృత్యమును నెరవేర్పఁబూనినాఁడు. ఈయన రచన శాస్త్రీయతత్త్వ

(౧. "తైలేషు తైలవద్వేదే వేదాంతస్సుప్రతిష్ఠితః" (ముక్తికోపనిషత్తు) గౌతముఁ డుపనిషత్తులకును వేదాంతమునకును భేదమున్నదనును. (౨౨-౯) కాని సంప్రదాయము ననుసరించి ఉపనిషద్వాదులే వేదాంతానుయాయులని చెప్పుదురు

(౨) శరీరము=దేహము.

(3) పోల్చు: వేదాంతవాక్య కుసుమగ్రథనార్థత్వాత్ సూత్రాణామ్॥ (శం॥ భా॥ ౧, ౧, ४.)

నిర్మాణమనుటకంటె, ఆస్తికతత్త్వ వివరణమనుట యుక్తము. "న్యూటెస్టమెంటుతో క్రిస్టియన్ డాగ్మాటిక్సు కెట్టిసంబంధమున్నదో, అట్టిసంబంధమే బాదరాయణకృతి కుపనిషత్తులతో నున్నది. దేవునిఁగూర్చియుఁ బ్రపంచమునుగూర్చియు జీవాత్మ యొక్క సంసారపరివర్తనమును మోక్షమునుగూర్చియు నది యన్వేషణముచేసి, సిద్ధాంతములకుఁ గన్పట్టు వైరుధ్యములఁ దొలఁగించి, వాని నేకసూత్రబద్ధమొనర్చి, ముఖ్యముగా విరోధుల విచ్ఛేదక విమర్శలనుండి వానిని గాపాడనుద్దేశించెను."౧ ఇందైదు వందల యేబదియైదు సూత్రములున్నవి; ఇందుఁ జాలసూత్రములు రెండు మూడు పదములుగలవే; వీనిలో వేదాంతతత్త్వమంతయు నిర్వచింపఁబడెను. సూత్రములు స్వయముగా బోధపడవు; అర్థనిర్ణయములో భాష్యకారునికిఁ బూర్ణస్వేచ్ఛనిచ్చును. ఇవి యేనిర్దిష్టరూపమునిచ్చుట కనుమతింపవు. వీని యుపదేశము కొన్నివేళలవ్యక్తిగతాస్తిక భావోజ్జ్వల ప్రకాశముగలిగినదిగను, కొన్నివేళల నద్వైతభావ కల్పనాన్వితముగను వ్యక్తీకరింపఁబడినది. భిన్నములైన ఆస్తికమతశాఖలలో భిన్నములైన సంప్రదాయములతిప్రాచీనకాలముననే సుస్థాపితములై, శంకర రామానుజాదులచే రచనాకృతిఁ గాంచినవి. భాష్యకారులలో ముఖ్యులగువారు, శంకరుఁడు, భాస్కరుఁడు, యాదవప్రకాశుఁడు, రామానుజుఁడు, కేశవుఁడు, నీలకంఠుఁడు, మాధవుఁడు, బలదేవుఁడు, వల్లభుఁడు, విజ్ఞాన

(౧) డి. యస్. సి. పు.౨౧.

భిక్షువు. ౧. వీరందరు నొకేతత్త్వమును బెంపొందింపరు; మఱియు సూత్రార్థనిరూపణచేయుటలో నెవరిభావము సత్యమైనదో చెప్పుట సులభవిషయము కాదు. ఏలన నీసూత్రసిద్ధాంతములు సందేహాస్పదములై విశేషముగాఁ జర్చింపఁబడుచున్నదినములలో నీభాష్యములు రచింపఁబడినవి. ఈ భాష్యకారులు తమ కదివరకేయున్న నిశ్చితభావముల కనుగుణముగా సూత్రముల కర్థవివరణములుచేసిరి; తమ తాత్త్విక సిద్ధాంతములను సమర్థించుటకు వీలుగా స్పష్టార్థములనిచ్చు పదముల కర్థాంతరములుచెప్పి, సూత్రముల తాత్పర్యముల నిచ్చవచ్చినరీతిని నిర్ణయించిరి. ఎవరెట్టి కృషిచేసినను, వారి కనుగుణమైన తత్త్వభావముల నీయఁగల యపూర్వసామర్థ్య సమన్విత లక్షణములుగల వీసూత్రములు.

బాదరాయణ సూత్రము లితర వేదాంత ప్రవక్తలను స్మరించియుండుటచే బాదరాయణునికి భిన్నముగా నుపనిషత్తులకు స్వతంత్రముగా నర్థవివరణ మొనర్చినవారు గొందరు గల

---

(౧) అత్యంతప్రాచీన భాష్యకారులలో నుపవర్షుఁడొక భారతీయ సంప్రదాయముకూడఁ జెప్పును. శబరుఁడు తన పూ. మీ. భాష్యములో వృత్తికారుఁడుపవర్షుఁడనివ్రాసెను. శంకరుఁడిట్లే తలఁచెను. (3,3,ర3.) రామానుజుఁడు తదనుచరులు వానినే బోధాయనుఁడనిరి. రెండుపేర్లు నాతనివేయని వేదాంతదేశికుఁడు భావించెను. ద్రామిడ, టంక, భర్తృప్రపంచ, భారుచి, కపర్ది, బ్రహ్మనంద, గుహదేవుల భాష్యము లలభ్యములు. చూ. కు. భా. ౧, ౧, ర; ౧, ౨, ౨3; ౧, 3, ౧౯; ౧, ర, ౧౨; ర, 3, ౧ర.

రని విశదమగుచున్నది.౧. బాదరాయణుఁడు సూత్రరచన చేసిన కాలమునఁగూడ జీవాత్మ పరమాత్మ సంబంధము, ముక్తి పొందినవెనుక నాత్మస్వరూపము మున్నగు ప్రధానసమస్యలను గూర్చి భిన్నాభిప్రాయములున్నవి.౨. ఆత్మ బ్రహ్మసంబంధమునుగూర్చి ఆస్మరథ్యుఁడు భేదాభేద సిద్ధాంతమును ప్రకటించెను.౩. మోక్షకాలము వఱకు నాత్మ బ్రహ్మకు భిన్నమైనదనియు, మోక్షసిద్ధితో నది బ్రహ్మైక్యము పొందుననియు నౌడులోమి భావించెను.౧. ఆత్మకు బ్రహ్మకు నెట్టిభేదమును లేదనియు, నేదోవిధముగా నది జీవాత్మగా గోచరించుచున్నదనియుఁ గాశకృష్ణుఁడు చెప్పెను.౨. అనంతర వ్యాఖ్యాతలిందేదోయొకభావము నంగీకరించుచువచ్చిరి. నాఁ డుపనిషత్తాత్పర్యమునుగూర్చి విశేష చర్చలు జరిగియుండును; నాఁ డితర శాఖలుకూడఁ బ్రచారములో నున్నను, బాదరాయణుని తత్త్వమొక సుప్రసిద్ధశాఖకుఁ జెందియుండెనని తోఁచును.

---

(౧) బాదరి. (౧, ౨, ౩౦; ౩, ౧, ౧౧; ౪, ౩, ౭; ౪, ౪, ౧౦) ఔడులోమి. (౧, ౪, ౨౧; ౩, ౪, ౪౫; ౪, ౪, ౬.) ఆశ్మరథ్యుఁడు. (౧, ౨, ౨౯; ౧, ౪, ౨౦) కాశకృష్ణుఁడు. (౧, ౪, ౨౨) కార్ష్ణజిని. (౩, ౧, ౯) ఆత్రేయుఁడు. (౩, ౪, ౪౪) జైమిని; మ॥ భారతముకూడ వారి భావములను ప్రకటింపలేదు.

(౨) ౪, ౩, ౭-౧౪; ౪, ౪, ౫-౭.

## ౨—గ్రంథకర్తృత్వము—కాలము.

శంకరుఁడు మొదలు నేటివరకు సంప్రదాయమునుబట్టి సూత్రకర్త బాదరాయణుఁడనియే చెప్పవచ్చును. బాదరాయణుని నామము గ్రంథములోఁ గొన్నితావులం దుత్తమ పురుషౌ.లో నుపయోగింపఁబడి యుండుటనుబట్టి గ్రంథకర్త బాదరాయణుఁడు కాఁడేమో యని తోఁచవచ్చును.౪. ప్రాచీన భారతదేశములో నిట్టియుత్తమపురుష ప్రయోగము తఱచుగా వాడఁబడియుండుటచేత బాదరాయణ కర్తృత్వమును శంకింప నవసరములేదు. బాదరాయణుఁడే వ్యాసుఁడనియు భారతీయ సంప్రదాయము. శంకరానుయాయులైన గోవిందానందుఁడు, వాచస్పతి, ఆనందగిరియు బాదరాయణవ్యాసు లొకరేయని చెప్పుదురు. రామానుజుఁడు, మాధ్వుఁడు, వల్లభుఁడు, బలదేవుఁడు సూత్రకర్త వ్యాసుఁ డనిరి. మనము మహాభారతమును, విష్ణు పురాణమును, భాగవతమును నమ్మినచో బాదరాయణుఁడు పెక్కుచోటుల స్మరించియున్న జైమిని వ్యాసుని శిష్యుఁడు. అందుచే జైమినీ బాదరాయణుల పరస్పర స్మరణ జైమినీ వ్యాసుల గురుశిష్య సంబంధమున కుచితముగాలేదు. శబరుఁడు, గోవిందానందుఁడు, ఆనందగిరియు నట్టి విరోధమున కవకాశము

(౩) ౧, ౪, ౨౦-౨౨.

(౪) ౧, ౪, ౨౦.

లేదనిరి.౧. కాని శంకరుని భావమేమో విస్పష్టముగాఁ దెలియదు.౨.

సూత్రములు సాంఖ్యవైశేషిక దర్శనములను, జైన బౌద్ధులనుగూర్చి పరిసంగించెను.(౧౫. ౭; ౮. ౨౮)గీతాశ్లోకములు వరుసగా ౨. ౩. ౪౫; ౪. ౧. ౧౦ సూత్రములకు సరిపోవునని శంకర రామానుజ మాధ్వ వల్లభులును, మఱియు మొదటి ముప్వురును గీత (౭. ౧౧) ౪. ౧. ౧౦ సూత్రమునకు సమానమనియు భావించిరి. సూత్రములందలి పెక్కునామములు శ్రౌత సూత్రమునందును గలవు; ఆశ్మరథ్యుఁ డాశ్వలాయనసూత్రమందును; బాదరి. కార్ష్ణాజిని, కాశకృష్ణులు కాత్యాయన సూత్రమందును; ఆత్రేయుఁడు తైత్తిరీయ ప్రాతిశాఖ్యసూత్రమందును బేర్కొనఁబడిరి. ఆత్రేయుఁడు, కాశకృష్ణుఁడు,

(౧) ౧. ౩, ౨౬; ౧, ౩, ౩౩; ౩. ౨, ౪౧; ౩, ౪, ౧; ౩, ౪, ౮; ౩, ౪, ౧౮; ౪, ౩, ౧౫; ౪, ౪, ౭; ౪, ౪, ౧౨. (౨) జైమిని బాదరాయణుల గ్రంథము లొకదానినొకటి యుదాహరించును; రెంటినిగలిపి యనంతర రచయిత యొకఁడో యొకటిగాఁ బ్రచురించెను; ఉపవర్షుఁడు దీనికి భాష్యము రచించెను. ఉపవర్షునిరచనయే శబరుని పూర్వమీమాంసాభాష్యమునకు, శంకరుని బాదరాయణ సూత్రభాష్యమునకు నాధారమైనదని డ్యూసేన్ వాదించెను. (డ్యూసేన్స్ సిస్టమ్ ఆఫ్ వేదాంత. పు. ౨౪.)

(౨) చూ॥ బెల్వాల్కర్. (వేదాంతసూత్ర బహుగ్రంథకర్తృత్వము ఇండియన్ ఫిలాసఫికల్ రివ్యూ, అక్టోబరు. ౧౯౧౮; అభయకుమార గుహుని "బ్రహ్మసూత్రములలోని జీవాత్మ" పు॥ ౮

(3) బా॥ సూ॥ భాష్యములో నొకచోట శంకరుఁడు, ద్వాపరకలియుగ సంధికాలమున మహావిష్ణునాజ్ఞచొప్పునఁ బురాతనబ్రహ్మర్షియు వేదవిదుఁడు నగు అపాంతరతమస్సను వాఁడు కృష్ణద్వైపాయనుఁడుగా జన్మించెనని

బాదరియు బోధాయన గృహ్యసూత్రమునందును; ఆత్రేయుఁడు భారద్వాజగృహ్యసూత్రమునందును బేర్కొనఁబడిరి. కాశకృష్ణుఁ డతిప్రాచీన వేదభాష్యకారుఁడు. జైమినిని పాణిని మహాభాష్యమునఁ బేర్కొనఁబడెను. ౧. గరుడ, పద్మ పురాణములును, మనువును వేదాంతసూత్ర హరివంశములను స్మరించెను. హాప్కిన్సు వీనికాలము క్రీ. పె. ౨౦౦ గా నిర్ణయించెను. క్రీ॥ పె॥ ౨౦. లను బాదరాయణునికాలము దాటదని కీత్ భావించెను. ౨. క్రీ. పూ. (౫౦౦-౨౦౦) కాలములో సూత్రరచన జరిగినదని భారతీయపండితుల యభిప్రాయమై యున్నది. ఫ్రేజరు దీనికాలము క్రీ.పూ. ౪౦౦ గాఁ జెప్పెను. 3. మ్యాక్సుముల్లర్ చెప్పినాఁడు: "మహాభారతభాగమైన గీతా

చెప్పెను. ఈకృష్ణద్వైపాయనుఁడే బా॥ సూ॥ రచయితయని శంకరుఁడు చెప్పినందున, విండిష్మన్, తరువాత తెలాంగ్ పండితులు శంకరునభిప్రాయములో వారిరువురు నొకరుకారని నిశ్చయించిరి. ("బాదరాయణునిగూర్చి యొకవాక్య" జె ఏ. యస్. బొంబాయి, వాల్యుము. ౧౬, ౧౮౮౩, పు॥ ౧౯౦.) శంకరుఁడు వ్యాసునచట నుదాహరించినను, వ్యాసుఁడే సూత్రకర్తయనుభావము ప్రకటింపకుండఁ జేసెను. (౨, ౧, ౧౨; ౨, 3, ౪౭.) బా॥ సూ॥ లలో భగవద్గీతయు, మ॥ భా॥ శాంతిపర్వమును బెక్కుతావుల నుదాహరింపఁబడెను. సూత్రకర్తయు, మహాభారతకర్తయు నొకండేయైనచో భాష్యకారులను మనము నమ్మినచో, నీవిషయము సులభముగా బోధపడదు.

(౧) ౪, ౧. ౧౪.

(౨) కర్మమీమాంస, పు. ౫౨౬, కాని జాకోబి సూత్రరచన క్రీ.పె. ౨౦౦-౪౫౦ మధ్యకాలమున జరిగెనని చెప్పెను. (జె॥ఎ॥బి॥యస్, ౧౯౧౧.)

(3) లిటరరీ హిస్టరీ ఆఫ్ ఇండియా, పు. ౧౯౬.

కాలమేదియైనను, బాదరాయణ వేదాంతసూత్రములకాలమంతకుఁ బూర్వమైయుండవలెను." ౪.

## ౩— శాఖాంతరసంబంధము.

బాదరాయణ వేదాంతసూత్రములకును, జైమిని మీమాంసా సూత్రములకును గల సరియగు సంబంధమును గూర్చి భిన్నభాష్యకారులు భిన్నరీతుల వివరించిరి.౫. వృత్తికారునివలెనే రామానుజుఁడును రెండు మీమాంసలు నొకే గ్రంథమని నమ్మెను గాని శంకరుఁ డీభావము నంగీకరించలేదు, బహుశః ఆరంభములో రెండు నొకే రచనలోని భాగములై యుండవచ్చును.౬. ఈరెండుమీమాంసలును నిస్సంశయముగా సంప్రదాయ సిద్ధమైన వైదికతత్త్వములే; ఆదిలోనివి వేదములకు వ్యాఖ్యారూపములే. బాదరాయణుఁడు న్యాయదర్శనము నెచటను స్మరించియుండలేదు. యోగము సాంఖ్యముతోఁ జేర్పఁబడెను. సాంఖ్యతత్త్వవిమర్శయే యోగవిమర్శయు నగును.౧. సాంఖ్యతత్త్వము మిక్కిలి విపులముగా ననేకస్థలములలో౨.

(౪) యస్,యన్, పు.౧౧౩; గుహ: బ్రహ్మసూత్రములోని జీవాత్మ.

(౫) పెక్కుతావుల బాదరాయణుఁడు జైమిని నుదాహరించెను; ౧,౨,౨౮; ౧,౨,౩౧; ౧,౩,౩౧;౧,౪,౧౮;౩,౨,౪౦; ౩,౪,౨; ౩,౪,౧౮; ౩,౪,౪౦; ౪,౩,౧౨; ౪,౪,౫; ౪,౪,౧౧.

(౬) చూ॥రా॥భా॥ ౧,౧,౧; జాకోబి; జె.ఏ. ౦,౭,౧౯౧౦.

(౧) ౨, ౧, ౩.

(౨) ౧, ౧, ౫-౧౧;౧, ౪, ౧-౧౩; ౨, ౧, ౧-౧౨;౨,౨,౧-౧౦

విమర్శింపఁబడెను.౩. సాంఖ్యమొక్కటే విశేషగౌరవము చూపఁబడినది. దీనికిఁ గొంతకారణము సాంఖ్యసిద్ధాంతములు గొన్ని బాదరాయణుని కంగీకారములే; మిగిలిన కారణము సాంఖ్యమును మను వ్యాసులంగీకరించిరి.౪. వైశేషిక సిద్ధాంతములు ఖండింపఁబడినవి.౫ మఱియు బాదరాయణుని కాలములో వైశేషిక దర్శనమంత గౌరవప్రపత్తులు గలిగి యుండలేదని తెలియుచున్నది. వివిధబౌద్ధశాఖలును, లోకాయత భాగవతసిద్ధాంతములును గూడఁ జర్చింపఁబడెను.౬. భాగవతభగవద్గీతల ఆస్తిక తత్త్వములు కొంతవరకు బాదరాయణుని రచనకు భావప్రేరణ హేతువులైనవి.

## ౪—తాత్త్విక భావములు.

వేదాంతసూత్రము నాలుగధ్యాయములుగా నున్నది. ప్రథమాధ్యాయము బ్రహ్మసత్యమను సిద్ధాంతమును వివరించును. ఇందు భిన్న శ్రుతివాక్యములకు సమన్వయము చేయఁబడెను. మతమునుగూర్చిన యెట్టివివరణమైనను, పరమేశ్వరుని గూర్చిన యెట్టిహేతు ప్రసంగమైనను, జీవాత్మ జగత్తులను గూర్చిన యేప్రకటనమైనను; దాము తమ స్వీయానుభవములోఁ బరమార్థమును దర్శించితిమని చెప్పిన జ్ఞానుల వాక్య

(౩) ౧, ౧, ౧౮; ౧, ౨, ౧౯; ౧, ౨, ౨౨; ౧, ౩, ౩; ౧, ౩, ౧౧; ౧, ౪, ౨౮; ౨, ౧, ౨౯; ౨, ౩, ౫౧; ౪, ౨, ౨౧.

(౪) చూ: శం॥ భా॥ ౧, ౪, ౨౮.

(౫) ౨, ౨, ౧౧-౧౭.

(౬) చూ: ౨, ౨, ౧-౪౫; ౧, ౪, ౨౮; ౩, ౩, ౫౩-౫౪.

ములను దీసికొని, తాము స్థాపింపఁబోవు సిద్ధాంతము సంతృప్తి కరముగానలసినయెడల, మహర్షుల దివ్యానుభవ వాక్యముల కేకాభిప్రాయమును సంఘటింపవలసి యున్నది. మనకుఁ బ్రథమాధ్యాయములో బ్రహ్మస్వరూపమును గూర్చియు, బ్రహ్మకుఁ జీవాత్మకు, జగత్తుకుఁగల సంబంధమును గూర్చియు వివరణము గలదు. ద్వితీయాధ్యాయములో నాక్షేపణలకు సమాధానములును, విరోధిసిద్ధాంత ఖండనమును గలవు. ఇం దీశ్వరునిపై జగ మెట్లాధారపడి యున్నదియు, నది యీశ్వరునుండి యెట్లుత్పత్తియై తిరిగియాతనిలో లయముగాంచునో కూడ వర్ణింపఁబడెను; ద్వితీయాధ్యాయ పరార్ధభాగమునను, ఆత్మస్వరూపలక్షణములఁ గూర్చియు, ఆత్మ కీశ్వరునితోడను, దేహముతోడను, స్వీయకర్మలతోడ నెట్టిసంబంధము గలదో యను విషయముల గూర్చియు మానసికతత్త్వానుగుణములైన రమ్యభావములు గలవు. తృతీయాధ్యాయము బ్రహ్మవిద్యాప్రాప్తి సాధనవిధానములను వివరించును. ఇందుఁ బునర్జన్మమునుగూర్చిన ప్రసక్తియుఁ, గొన్ని యుపనిషత్తులగు మన సత్త్వ(౧) సంబంధములును, ఆ స్తిక భావ(౨) సంబంధములు నగు చర్యలును, గొన్ని సిద్ధాంతముల గూర్చిన లఘువ్యాఖ్యలును గలవు. చతుర్థాధ్యాయము బ్రహ్మవిద్యాఫల ప్రశంసచేయును; ఇందు సవివరముగా నాత్మ మరణానంతరము పయనించు దేవయాన పితృయానములను గూర్చియుఁ, బునరావృత్తి రహితమైన మోక్షస్వరూప

(౧) ౨, ౩, ౧౫ మొదలు. (౨) ౩, ౨, ౧-౧౦.
(౩) ౩, ౨, ౧౧-౪౧.

మునుగూర్చియుఁ గూడ వర్ణనములున్నవి. ఒక్కొక్క అధ్యాయమునకు నాలుగు పాదములున్నవి; ప్రతిపాదమందలి సూత్రములు వర్గములై అధికరణములుగా రచింపఁబడెను. భిన్నభాష్యకారు లుపయోగించిన సూత్రప్రతుల ననుసరించి కొన్ని పాఠభేదము లున్నవి కాని వానికంత ప్రాముఖ్యము నీయ నవసరము లేదు.౧.

వేదములు శాశ్వతములనియు,౨. శాస్త్రము పరమ ప్రమాణమనియు బాదరాయణు నభిప్రాయము.౩. తర్కము వలనఁ బరమార్థసత్యమును గనుగొనుట సాధ్యమని యాతఁడు బహిరంగముగాఁ బ్రకటించెను.౪. శ్రుతిస్మృతులు రెండును జ్ఞానమూలములనియు, నవియే ప్రత్యక్షానుమానము లన.౫. వచ్చుననియు నాతఁడు చెప్పినాఁడు; దీనికి శంకరుఁడు చెప్పినట్లు, కారణమేమనగా స్మృతికిఁ బ్రామాణ్యముండనవసరము కాని శ్రుతి కవసరము లేదు. స్వతఃప్రామాణ్యము గల శ్రుతిప్రత్యక్షమనఁబడును. శ్రుతి యనఁగా నుపనిషత్తులనియు, స్మృతియనఁగా భగవద్గీత, మహాభారతము, మనుస్మృతియునై యున్నవి. వ్యవహారజ్ఞాన ప్రపంచములో, ననుమానము ప్రత్యక్షముపైనాధారపడునట్లే, స్మృతి శ్రుతిపై నాధారపడును. బాదరాయణుఁ

(౧) చూ, బెల్వాల్కర్: "వేదాంతసూత్ర బహుగ్రంథకర్తృత్వము. పు, ౧౪౪-౧౪౫, ఇండియన్ ఫిలసాఫికల్ రివ్యూ.

(౨) ౧, ౩, ౨౯.

(౩) ౧, ౧, ౩.

(౪) ౨, ౧, ౧౧.

(౫) ౧, ౩, ౨౮; ౩, ౨, ౨౪; ౪, ౪, ౨౦.

డేయితరప్రమాణముల నంగీకరింపఁడు. ఆతఁడు రెండు రంగముల నంగీకరించును; ఒకటి పంచభూతములు మనోబుద్ధ్యహంకారములతో గూడినది; రెండవది బుద్ధ్యతీతమైన బ్రహ్మసంబంధము. బ్రహ్మజ్ఞానవిషయములలో మనకు శాస్త్రమే యాధారము. ౬. వేదవిరుద్ధమైన దేదియు బాదరాయణునికిఁ బ్రమాణముకాదు. తర్కము నిర్దిష్టలక్షణములపై నాధారపడును; బ్రహ్మకీలక్షణములున్నవి, వీని కితరలక్షణములతో నిట్టిభేదమున్నదని చెప్పఁజాలము. అందువలనఁ దర్కము భక్తి ధ్యానములకు ౨ లభించు సాక్షాత్కారజ్ఞానమునకు సరిపోదు.౧.

వేదాంతసూత్రము ననుసరించి, సాంఖ్యము చెప్పిన ప్రకృతిపురుషులు స్వతంత్రములుగాక, యేకవస్తు భిన్నరూపములే. అనంతరవస్త్వనేకత్వము దురూహ్యము. అనంతమగు బ్రహ్మపదార్థమే యుపనిషత్తులు ప్రతిపాదించిన పరమసత్యము. ప్రథమాధ్యాయమునం దుపనిషత్తులలోని బ్రహ్మపదార్థములనుగూర్చిన వివిధవర్ణనముల చర్చగలదు. ౩. బ్రహ్మయే జగత్తునకు మూలము, నాధారము నంతమునేకాక, ౪ జగదుపాదాన ప్రధానకారణములై యున్నది. సాధనసామగ్రి ౫ లేకుండ నాతఁడు సృజించఁగలఁడు. సుషుప్తియే బ్రహ్మాస్తిత్వమునకు సాక్ష్యముగా నీయఁబడెను. ౬. బ్రహ్మ యనఁగా

(౬) ౧, ౧, ౩; ౨, ౧, ౨౭.

(౧) ౨, ౧, ౬; ౨, ౧, ౧౧. (౨) ౩, ౨, ౨౪.
(౩) ౧, ౨, ౩. (౪) ౧, ౧, ౨.
(౫) ౨, ౧, ౨౩-౨౭. (౬) ౧, ౧, ౯.

నచేతనప్రధానమనికాని; జీవాత్మయనికాని తలఁపరాదు. అతఁడు సర్వధర్మస్వరూపియు, ౬ నాంతరంగిక ధర్మమును మార్గదర్శకుఁడు నైయున్నాఁడు. ౭ ఆతనికి స్వచ్ఛత, సత్యసంకల్పము, సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్త్వము, మున్నగునవి గుణములు.౮ ఆతని విశ్వరూపలక్షణములును జెప్పఁబడినవి. అతఁడు విశ్వజ్యోతియు, రవిలోనున్న హిరణ్యపురుషుఁడును, విశ్వాకాశమును, విశ్వప్రాణమును, ౧౦ ఆత్మజ్యోతియు నాతఁడే. ౧౧. ఆతఁడు పరిచ్ఛిన్నమగు స్థలము నాక్రమించి, మానవుని హృదయాకాశమున ౧ నున్నరూపమున నాతనిని ధ్యానింపవలయును నని చెప్పఁబడెను; పరమాత్మయే సర్వవస్తు మూలాధారమును, నిర్వికారభక్తిపూజార్హుఁడునై యున్నాఁడు. ౨.

అచేతనపదార్థములు చేతనజీవులు నొకేపరమాత్మ కెట్లు సంబంధించియున్నవి ? గీతవచించినరీతి నవి యొకే సత్యముయొక్క పరాపర ప్రకృతులని మన మూహింపవచ్చునా ! వేదాంతసూత్రి మీవిషయమును స్పష్టముగాఁ జెప్పలేదు. అవిస్పష్టమగు నుపనిషత్తుల సృష్టిభావమే యిందు నున్నది. అజము నిత్యమునైన ౩ బ్రహ్మమే విశ్వమునకంతకుఁ

(౬) ౨, ౧, ౩౬. (౭) ౧, ౧, ౨౦.
(౮) ౧, ౨, ౧-౨; ౨, ౧, ౩౦. (౧౦) ౧, ౧. ౨౦-౨౩.
(౧౧) ౧, ౧, ౨౪.

(౧) ౧, ౨, ౬.
(౨) ౧, ౧, ౬.
(౩) ౨, ౩, ౮.

గారణము. ౪. బ్రహ్మమే ప్రతి భౌతికద్రవ్యమును సృజిం చెను. ౫. ప్రధానభూతవ్యాపారముచే జగత్పరిణామము సంభ వించుచున్నను, దాని కాపరిణామశక్తిని బ్రహ్మయే యిచ్చి యున్నాఁడు. బ్రహ్మ, భూతములను సృజించి వానిలోఁ బ్రవే శించెనని చెప్పఁబడెను. భూతాంతర్వర్తియగు బ్రహ్మయే యితర వస్తూత్పత్తికిఁ గారణమగుచున్నాఁడు. ౬.

బ్రహ్మ జగత్తున కుపాదానమూలకారణములని యిది వఱకే చెప్పితిమి.౭. బ్రహ్మ సర్వమును సృజించి, కాంచనము కాంచన వస్తురూపములుగను, మృత్తు మృణ్మయవస్తురూపము లుగను మారునట్లే, సర్వవస్తురూపమును ధరించెను. సూత్ర ములలో.౮. కారణకార్యములకును, బ్రహ్మకును జగత్తునకును సంబంధము చర్చింపఁబడినది కారణకార్యసమానత్వము రెండుదాహరణములలోఁ జూపఁబడెను. ఒకవస్త్రముమడత పెట్టి నప్పుడు దాని స్వరూపమును సరిగా వ్యక్తీకరించదు; మడత విప్పినచో దానిస్వరూపము సంపూర్ణముగాఁ బ్రదర్శితమగును. రెండుసమయములలో వస్త్ర మొక టే యైనట్లు, కారణకార్యము లొక టేయైనను వానిగుణములు భిన్నములై గోచరించును.౧.

(౪) ౧, ౨, ౫; ౧, ౨, ౧; ౨, ౧, ౨౨; ౧, ౧, ౨౨.
(౫) ౨, ౩, ౭.
(౬) ౨, ౩, ౧౩.
(౭) ౧, ౪, ౨౩-౨౭.
(౮) ౨, ౧, ౧౪-౨౦.
(౧) ౨, ౧, ౧౯. శం॥ భా॥

ఊపిరి బిగపట్టినప్పు డొకవ్యక్తి యేపనియు జేయఁజాలఁడుగాని యాతఁడు సజీవుఁడై యుండును; ఊపిరి విడిచినపుడు, తన కర చరణాదులను కదపఁగలఁడు. రెండువేళల నూపిరి సమానమై నదే. అట్లే, కారణకార్యములు సమానములేయైనను, భిన్నఫలి తముల నుత్పత్తిచేయుచున్నవి.౨. మృత్పాత్రి మృత్తికనుండి వేరుకానట్లే.3. జగత్తు బ్రహ్మమునుండి వేరుకాదు.౪. భాష్య కారులు కారణకార్యములకు భేదములేదని యంగీకరింతురుగాని బ్రహ్మ జగత్సమానత్వ స్వరూపమును వారు వేరువిధముగా వివరించిరి. బాదరాయణుని భావములో ననన్యసంబంధ మనగా భేదములేకుండుటకాని, మార్పులేకుండుట గానికాదు. ఈ మార్పునకుఁ గారణ మవిద్య యని శంకరుఁడు కల్పించెను. రజ్జువును సర్పమని తలఁచి భ్రాంతిగొన్నవానికే సర్పము గోచ రించు రీతి నవిద్యామగ్నుఁడైన వానికే ప్రపంచ మున్నట్లు భాసించును. ఇతర భాష్యకారులు పరిణామసిద్ధాంతము నంగీ కరించిరి. కారణ కార్యముల కుదాహరణములుగా ఛాందో గ్యోపనిషత్తులో మట్టి, బంగారము, నినుము వానితోఁదయారు చేయఁబడిన వస్తువులు పేర్కొనఁబడెను గాని రజ్జు సర్పములు శుక్తి రజితములు చెప్పఁబడలేదు. పరిచ్ఛిన్నవస్తువులు బ్రహ్మ రూపాంతరములుగా యథార్థములే. బ్రహ్మయే ప్రపంచమున

(౨) ౨, ౧, ౨౦, ౺౦॥ భా॥ కార్యము మార్పుచెందిన కారణమని రామానుజు నభిప్రాయము. నూలుకు వస్త్రమువలె, బ్రహ్మకు జగ మవస్థాం తరమని శంకరుఁడు నంగీకరించును.

(3) ౨, ౧, ౧౪.

(౪) ౧, ౧, ౪; ౧, ౪, ౨౨.

కుపాదాన కారణమను వాక్యము, బ్రహ్మపదార్థవికారమే ప్రపంచమని సూచించును.౧. ప్రపంచము మిథ్యయుఁగాదు. స్వప్నదృశ్యమువంటిదియుఁగాదు; అదియొకయథార్థమగుస్వరూపమై, సృష్టిస్థితి లయములను బ్రహ్మమందే గలిగియున్నది ౨. అగ్ని కుష్ణత యున్నరీతినే, సృష్టిచేయు శక్తి శుద్ధనిష్కలబ్రహ్మమునకుఁ గలదని బాదరాయణుఁడు విశ్వసించును.౩. పరబ్రహ్మ లీలకొఱకు,౪. దానెట్టిమార్పును బొందకుండ,౫ బ్రపంచముగాఁ బరిణమించును.౬. ఇదియెట్లు సాధ్యమో చూపవనసరము లేదని బాదరాయణుఁడు విడిచిపెట్టెను. రామానుజాదులు సూచించినట్లు, బ్రహ్మమున కనూహ్యములగువానిని సాధించు నద్భుతశక్తు లున్నవనియైన నాతఁడు చెప్పియుండలేదు. పరస్పరము విరోధములుగా నున్నట్లు గోచరించు శ్రుతివాక్యములనే యాతఁడు మనకుఁజూపి, శ్రుతిప్రమాణమును శంకించుటకు మనకెట్టి యధికారమును లేదనెను. తార్కికదృష్టి ననుసరించి, యీవాదమంత తృప్తికరముగాదు. ఈవిషయమునే శంకరుఁడు వివరింపఁబూని, బ్రహ్మ మెన్నఁడును జగత్తుగా మారలేదని చెప్పి, శ్రుతివాక్యములందలి వైరుధ్యము నిజముగా శ్రుతులలోనిది గాదనియు నది జ్ఞానహీనులైన మానవుల బుద్ధిలోని

(౧) ౧, ౧, ౨౬; ౨, ౩, ౭.
(౨) ౨, ౨, ౩.
(౩) ౧, ౩; ౧.
(౪) ౨, ౧, ౩౩.
(౫) ౧, ౪, ౨౬.
(౬) ౨, ౧, ౨౭.

దనియు వాదించెను. అవిద్యాదూషితులమైన మనము బ్రహ్మము జగత్తుగా మారునని విశ్వసింతుము. పరమసత్యమైన దవ్యక్తమగు బ్రహ్మమనియు, జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయస్వరూపమగు ప్రపంచమెట్లో బ్రహ్మ మందున్నదనియు శంకరుఁడు వాదించును. రామానుజుఁడు భిన్నమగు నభిప్రాయమును జెప్పెను. శుద్ధాద్వితీయ బ్రహ్మమునకుఁ దోడుగా ననాదియైన జగత్ప్రవాహము రెండవదిగా నున్న సందర్భమును వివరించు క్లిష్టసమస్య నెదుర్కొనుటకు శ్రుతిపై నాధారపడి, పరమేశ్వరుఁ[గ]న శక్త్యద్భుత శక్తులుండుటచే నతని కసాధ్యములన్నియు సుసాధ్యములేయని రామానుజుఁడు వక్కాణించును.౨.

బాదరాయణుఁ 3 డాత్మకు జ్ఞాయని పేరిచ్చెను. జ్ఞాయనఁగా జ్ఞానమని శంకరుఁడును, జ్ఞాతయని రామానుజుఁడు నర్థముచెప్పిరి. వల్లభుఁడు శంకరునితో నేకీభవించెను. కేశవుఁడాత్మ, జ్ఞానము జ్ఞాతయుఁగూడ నైయున్నదనెను. జీవాత్మ

(౧) చూ. రామానుజభాష్యము. ౨, ౧, ౨౭.

(౨) (3, ౨, 3) బ్రా. సూ. ననుసరించి, స్వప్నమువలె జగత్తు మాయకాదు. అనంతరవేదాంతము ననుసరించి 'మాయా' శబ్దమునకు స్పష్టమైన యర్థములేదని తెలియుచున్నది. భాస్కరుననుసరించి అర్థప్రత్యయశూన్యత్వమనియు, శంకరుననుసరించి దృష్టనష్టస్వరూపత్వమనియు రామానుజు ననుసరించి ఆశ్చర్యాత్మకత్వమనియో, వల్లభుననుసరించి సర్వభావనాసామర్థ్యమనియో నిర్ణయింపఁజాలము.

(3) ౨, 3, ౧౮.

యొకకర్త. ౪. జననమరణములు శరీరసంబంధములు; ౫. అవి ద్యాదిలేని యాత్మకుఁ జెందవు, ఆత్మ నిత్యము. ౬. జీవాత్మ అణుపరిణామముగలదని చెప్పఁబడెను. రామానుజ మాధ్వ కేశవ, నింబార్క, వల్లభ, శ్రీకంఠు లీభావము నంగీకరించిరి. ఆత్మ, సర్వవ్యాపి లేక విభుత్వముగలదనియు, వ్యావహారికముగా నది యణురూపమని చెప్పఁబడుననియు శంకరుఁడు భావించెను. ౭. బాదరాయణుఁడు పరబ్రహ్మ జీవాత్మలో నున్నదని యంగీకరించునుగాని, బ్రహ్మస్వభావమాత్మలక్షణముచే సంగదోషము నొందదని యాతఁడువచించెను,౮. రవి,రవికాంతివలెనే బ్రహ్మయు జీవాత్మయు భిన్నములు; రవికాంతి మేఘాదులచే నాచ్ఛాదింపఁబడినను, రవికంటనట్లే, జీవాత్మకుఁగలుగు దుఃఖము బ్రహ్మకంటదు,౯. జీవాత్మకర్మచేసి ఫలమనుభవించును; పుణ్యపాపముల నార్జించును; సుఖదుఃఖవశమగును; కాని పరమాత్మ దీనికి వ్యతిరేకలక్షణములుగలిగి, సర్వకలుషవిముక్తమైనది.౧౦. "తత్త్వమసి", 'అయమాత్మాబ్రహ్మ" మున్నగువాక్యములు, బ్రహ్మయు

(౪) ౨, ౩, ౩౩–౩౯.

(౫) ౨. ౩, ౧౬.

(౬) ౨. ౩, ౧౮.

(౭) ౨, ౨, ౧౯–౨౮. బా. సూ. ననుసరించి, జీవులు నాలుగువర్గములు, జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజ్జములు. భిన్న పరిమాణములలో నవి యన్నియుఁ జేతనములే. తమోఽధిక్యముచే స్థావరములు చేతనత్వమును బ్రకటింపలేకున్నవి.

(౮) ౧, ౨-౮.

(౯) ౨, ౩, ౪౬; దీనిపై కేశవుని వ్యాఖ్య చూడుము.

(౧౦) ౧, ౧, ౧౭; ౨, ౧, ౨౨.

జీవుఁడును, దేవుఁడు మానవుఁడును, నిజముగా నేకమేయని చూప యత్నించును. సర్వమునకు బ్రహ్మయే కారణమైనచో, జీవాత్మకుఁగావలెను. పరిపూర్ణదైవత్వమన్ని వస్తువులందును గలదు. ప్రతిజీవియు నీశ్వరాంశయే. జీవబ్రహ్మసంబంధము సరిగా నెట్టిదో బాదరాయణుని వాక్యములలో స్పష్టముగ లేదు; జీవాత్మ బ్రహ్మాంశమో, బ్రహ్మభాసమో తెలియదు. ౨. జీవబ్రహ్మ సంబంధవిషయములో నాశ్మరథ్యుఁడు, నౌడులోమి, కాశకృష్ణుఁడు భిన్నభావములను గలిగియున్నారని బాదరాయణుఁడు సూచించెను. ప్రదేశార్థములోఁ గూడ నాత్మ, బ్రహ్మాంశమని యాశ్మరథ్యుఁడు తలఁచెను; సుషుప్తిలో జీవాత్మ తాత్కాలికముగా బ్రహ్మతో సంయోగము నొందునని యౌడులోమి మతము; శంకరుఁ డంగీకరించిన కాశకృష్ణునిభావములోఁ బరిపూర్ణబ్రహ్మయే జీవాత్మస్వరూపమని వచింపఁబడెను. ఈభిన్న భావములను బాదరాయణుఁడు పేర్కొని యేభావము తన మతమో చెప్పఁడు. ౩. "పరమాత్మలో జీవాత్మ అంశామాత్రము"ను వాక్యమునకు, "అంశవలె (అంశైవ) గోచరించున"ని శంకరుఁ డర్థము చెప్పెను. అవిభాజ్యుఁడగు బ్రహ్మలో నంశలుండఁజాలవు కాని, జీవేశ్వరులకు నేకత్వము భిన్నత్వము నుండుటచే జీవుఁడు బ్రహ్మాంశమే యని భాస్కరవల్లభులు వక్కాణించిరి. ప్రకాశించు నగ్ని లేక సూర్యుని వంటి

(౨) ౨. ౨. ౪౩, ౫౦. (౩) ౧. ౪. ౧౯-౨౨.

(౪) ౨, ౩, ౪౩. ౬౦. భా.

వానినుండి బయల్పడు కాంతి యందలిభాగమైనట్లే, జీవాత్మ బ్రహ్మలో నిజముగా నంశమేయని రామానుజ నింబార్క, బలదేవ, శ్రీకంఠులు భావించిరి. ఒకసర్పము తన చుట్టలనుండి వేరును, వేరునుగానట్లే, పరమాత్మనుండి జీవుఁడు వేరగును, గాను గాదను వాదము నిరసింపఁబడెను. ౧ ఈభావమునిచ్చు సూత్రము బ్రహ్మకును జడపదార్థమునకునుగల సంబంధమును గూర్చి తెలుపునని చెప్పి, పాముచుట్టలు, పాముయొక్క భిన్నావస్థను దెల్పునేకాని, భేదమును దెలుపనట్లే, జడపదార్థము బ్రహ్మావస్థాంతరమునే దెలుపునుగాని భేదమును జూపదను వాదమును నిరసించెను. జీవ జడపదార్థములు రెండును బ్రహ్మాంశములేయని రామానుజుఁడు చెప్పెను. పామును పాముపడగయు వేరైనను, నొకటేయైనట్లుగా జడ పదార్థము బ్రహ్మముతో నొకటియు వేరునుగూడనని కేశవుని వాదము. జడపదార్థము తనయస్తిత్వమున కాధారభూతమైన బ్రహ్మతో నొకటేకాని. నామరూపములను గలిగియుండుటచే బ్రహ్మకు భిన్నమైనది. అట్లే జీవుఁడు బ్రహ్మతో భేదాభేదము లను గలిగియుండెను; జీవాత్మ తప్పకుండ బ్రహ్మకు భిన్నము కూడ నైయున్నది. ౨. బ్రహ్మకును జీవునికిని గలభేదము నిత్యమైనదనియు మోక్షానంతరముకూడ నీభేద ముండుననియు బాదరాయణుని నిశ్చితభావముగాఁ దోఁచుచున్నది. చందన

(౧) 3, ౨, ౨౭.

(౨) 3, ౨, ౨౭-౨౮ కేశవునివ్యాఖ్య.

తైలము కొంచెమైనను దేహమునంతను పరిమళింపఁజేసినట్లే జీవుఁడణురూపియైనను దేహమునంతను వ్యాపించియున్నాఁడు.[3]

ప్రపంచ మీశ్వరసంకల్ప ఫలితము. అదియాతని లీల. దీనియర్థము తనవినోదముకొఱకై పాపదుఃఖముల నాతఁడు సృజించెననికాని, లేక కొన్ని మతవిధానములు చెప్పునట్లు తన్ను నిత్యము ప్రార్థించి స్తవముచేయు నల్పజీవకోటి యుండవలెనను నుద్దేశముతో సృష్టిచేసెననికాని కాదు. పూర్ణకృపానిధియగు భగవానుఁడు జీవకోటి దుఃఖమునుజూచి వినోదించుచుండినచో నాతఁడు భగవంతుఁడు కాఁజాలఁడు. వ్యక్తుల కర్మయే మానవులలోని భిన్నతకుఁ గారణము. ౧. మానవుల పూర్వజన్మకర్మ దేవుని స్వాతంత్ర్యమును బంధించును. జీవులకసమానముగా సుఖమును విభాగించి యిచ్చుట దైవసంకల్పరూపమగు ధర్మక్రమమును బ్రదర్శించును. అందుచే బ్రహ్మకుఁ బక్షపాతమును లేదు; నిర్దయత్వమును లేదు. కొందరాస్తికులు భావించురీతి నాతఁడు లీలావిహారవినోదియుఁ గాఁడు, బాధ్యతాహీనుఁడును

---

(3) ౨, 3, ౨3. శ్రుతిననుసరించి, జీవుఁడు హృత్పద్మమునందున్నాఁడు. అది ౧౦౧ నరములు కలియు వెన్నెకములోని సూక్ష్మకేంద్రము. వానిలో సుషుమ్నానాడి శిరస్సులోనికి వ్యాపించును. మరణవేళ, జ్ఞాని దైవకృపచే, హృదయగ్రంధిని జీల్చి, సుషుమ్నానాడిలోఁ బ్రవేశించి, కపాలమును భేదించి శరీరమునుండి బయటికిఁబోవును. (౪, ౨, ౭.) దేహమునుండి బయటికిఁబోవునపుడు జీవుఁడు సూక్ష్మేంద్రియ మనస్సహిత ముఖ్యప్రాణములను దోడ్కొనిపోవును. (3-౧, ౧-౭.);(౪, ౨, 3-౨౧) వానితోఁగలిసి పునర్జన్మమెత్తును.

(౧) ౨, ౧, 3౪.

గాఁడు. ఎవరికర్మల కనుగుణముగా వారికి ఫలములిచ్చుటచే నీశ్వరు నమోఘనిష్పాక్షిత నిరూపింపఁబడుచో, సదసత్కర్మ లను జీవులుచేయుటకుఁ గారణభూతుఁడు నాతఁడేయనుభావము నకు సమాధానము లేకుండఁబోవును. ప్రతి వ్యక్తియొక్క ప్రతి కర్మకు నీశ్వరుఁడే కారకుఁడైనచో నీశ్వరుఁడే కర్తయు భోక్తయుఁ గూడ నగును. అనంతమగు నీకర్మఫల ప్రవాహములోనుండి యీశ్వరుఁడును బయుల్పడఁజాలని వాఁడై, సద సత్ఫలముల నాతఁడు ననుభవింపవలసినవాఁడగును. ఈసందర్భములోఁగూడ సూత్రము శ్రుతి నుదాహరించునే కాని, యీసమస్యను బరిష్కరింప యత్నింపలేదు.

తృతీయాధ్యాయమునందు బ్రహ్మజ్ఞాన సాధనానుకూల మగు దేహమును ధర్మశిక్షణ మొసఁగునని చెప్పఁబడియున్నది. మనయందున్న జ్ఞానోపకరణముల శుద్ధికొఱ కుపనిషత్తులు చెప్పిన సూత్రములే యంగీకరింపఁబడినవి.౧. ద్విజాతులకు యజ్ఞార్హత గలదనియు, శూద్రులును స్త్రీలునుగూడ దైవకటాక్షముచే మోక్షము నొందఁగలరనియు నంగీకరింపఁబడెను.౨. సేవాపూర్వకమైన కర్మమార్గమును, సన్న్యాసమునుగూడ వేద విహితములేక. యని సూత్రకర్త చెప్పి, త్యాగబుద్ధితోఁగూడిన నిష్కామకర్మమార్గమే తన మతమని సూచించెను.౪. ప్రతి కర్మయు జ్ఞానవిరోధకముగాదు;౫. అజ్ఞానముతోఁ జేసిన కర్మయే దోషము. మోక్షానంతరము మనకెట్టి స్వాతంత్ర్యమున్నను,

(౨) 3, ౨, ౪౧; కౌషీతక్యుపనిషత్తు॥ 3, ౮.

(౧) ౨, 3, ౪౦-౪౨. (౨) ౧, 3, 3౪-3౮; 3, ౪, 3౮.
(3) 3, ౪, ౯. (౪) 3, ౪, 3౨-3౫. (౫) 3, ౪, ౨౬.

నీలోకమున జీవన్ముక్తావస్థయందుఁ గూడఁ గర్మావసరమున్న దని చెప్పఁబడెను.౬. ఉపనిషత్తులవలెనే, సూత్రము వివిధ దేవతారాధనము నంగీకరించి, భక్తుల కాయా దేవతలు వరము లిత్తురనియుఁ గాని దేవతలిచ్చు వరములుఁగూడఁ బరమేశ్వరా ధీనములై యుండుననియుఁ జెప్పెను.౭. ప్రతీకోపాసన మంగీక రింపఁబడెనుగాని సత్యము తదతీతమైనదనిచెప్పి, దుర్బలమానసుల కొఱకది తప్పదని సూచింపఁబడెను ౮. బ్రహ్మ మవ్యక్తస్వరూప మనియు, నది సంరాధానస్థితి౯.లో గోచరించుననియు వచింపఁ బడెను. దైవసాక్షాద్దర్శనమే శ్రేష్ఠతమమైన మతము. ఈ సాక్షాత్కార సంపాదన సామర్థ్యము లేనివారు శాస్త్రములపై నాధారపడుదురు. ఆత్మసిద్ధియే మానవకృషికి లక్ష్యము.౧౦.ఈ యాత్మానుసంధాన మైక్యమో, లేక సాలోక్యమో చెప్పఁ జాలము. బాదరాయణుఁడు జీవన్ముక్తి సాధ్యమని చెప్పెను. బ్రహ్మజ్ఞానప్రాప్తి, సంచితకర్మలను నాశమొనర్చునుగాని,౧. ప్రారబ్ధ కర్మక్షయ మగువరకు దేహ ముండకతప్పదు.౨.

పునరావృత్తి లేని బ్రహ్మైక్యమునిచ్చు దేవయానమును గూర్చి చతుర్థాధ్యాయములో వర్ణింపఁబడెను. ౪.౪.౫-౭ లో ముక్తిపొందిన జీవుని లక్షణములు చర్చింపఁబడెను. విజ్ఞానము ముక్తపురుషలక్షణమని యౌడులోమి భావించెను. ముక్తపురు షుని కలోకసామాన్యములగు నతిశయలక్షణము లుండునని

(౬) ౩, ౪, ౩౨. (౭) ౩, ౨, ౩౮-౪౧. (౮) ౪, ౧, ౪.
(౯) ౩, ౨, ౨౩-౨౪. (౧౦) ౧, ౧, ౯.
(౧) ౪, ౧, ౧౩-౧౫.
(౨) ౪, ౧, ౧౯.

జైమిని భావము. బాదరాయణుఁ డీరెంటిని సమ్మిళితమొన ర్చెను. ముక్తిపొందగనే యించుమించుగా ననంతశక్తియు జ్ఞానమును గల్గునని యాతఁడు వివరించి, ప్రపంచమును సృజించి, రక్షించి, లయింపఁజేయు శక్తులుమాత్రి మేముక్త పురుషునికిని లభింపవని పలికినాఁడు ౩. ఆపని దేవుఁడొక్కఁడే చేయసమర్థుఁడు. ఈసూత్రముున కర్థము నతిసులభముగా రామానుజ మాధ్వులు చెప్పఁగల్గిరి; ఏలన జీవబ్రహ్మలకు భేదము నిత్యమైనదనువారి సిద్ధాంతమున కిది సరిపోవును. ౪. కాని బాదరాయణుఁ డీవిషయమును స్పష్టముగాఁ జెప్పలేదు. కొన్నిసూత్రములలో జీవబ్రహ్మభేదము నిత్యమని చెప్పఁ బడెను. ౫. గాని కొన్నిసూత్రములలో భిన్నభావములు బ్రక టింపఁబడెను. ౬.

## ౫-ముగింపు.

బాదరాయణుఁ డేకేశ్వరతత్త్వమును ప్రదర్శించెను. బహు దేవతాతత్త్వము లేక స్వతంత్ర్యములు యథార్థములునైన పర మార్థము లనేకములున్నవనికాని, లేక దైవాసురశక్తుల ద్వైతము పరమసత్యమనికాని యాతఁడు విశ్వసించియుండలేదు. ఔడు లోమి, బాదరి, కాశకృష్ణుల నిర్విశేషచిన్మాత్రము బ్రహ్మ మను భావమును, ఆశ్మరథ్య జైమినుల సవిశేషచిన్మాత్రమే బ్రహ్మమను భావమును రెంటిని బాదయణుఁ డంగీకరించెను. ఈరెండు భావములకు సమన్వయము సూత్రకర్త బుద్ధిలో నెల్లు

(౩) ౪, ౪, ౧౭. (౪) ౧, ౧, ౧౭.
(౫) ౪, ౪, ౧౭, ౨౧. (౬) ౪, ౨, ౧౩, ౧౬.

శ్రో(చినదో సూత్రిస్వరూపపరిశీలనము చెప్పదు. బ్రిహ్మము నిర్వికార నిత్యస్వరూపమని యుపనిషత్తులు చెప్పును. ప్రపంచము వికారశీలముగలదియు ననిత్యమైనదియును; ఇట్టికార్య మట్టి కారణమునుండి యెట్లు జనించును ? శ్రుతివచనముల నాధార ముగా( దీసికొని బ్రిహ్మమే జగత్తుగా( బరిణమించి, తాను నిర్వికారమై నిలుచునని సూత్రిము చెప్పినది. ౧.

బ్రిహ్మకారణత్వ నిర్వచనము నింకను సహేతుకముగా( జేయు(యత్నమువలన భిన్నభావము లుదయించినవి. తానట్టి మార్పును బొందకుండ, బ్రిహ్మము జగముగా( బరిణమించు నని శంకరు(డును; బ్రిహ్మము నిజముగా జగముగా మార్పు నొందెనని రామానుజవల్లభులును వాదించిరి. జీవునిలో బ్రహ్మ మున్నను, రెంటికి(గల స్వభావభేదములచే జీవుని దోషము బ్రిహ్మమున కంటదని బాదరాయణు(డు చెప్పెను. ౨. అతడు జీవబ్రిహ్మైకత్వమును భేదమునుగూడ నంగీకరించెను. ఈ వాదము హేతుబద్ధముగాదు; ఉపనిషత్తు లుగ్గడించిన నిర్గుణ నిర్విశేష బ్రహ్మమునకు సూత్రకారుని బ్రహ్మభావ మనుగుణము కాదని శంకరు(డు భావించెను; సూత్రికారు(డు సూచించిన దే యుపనిషద్బ్రహ్మమని యితరభాష్యకారు లంగీకరించిరి. సగుణ నిర్గుణ బ్రిహ్మసిద్ధాంతముకాని, జగన్మిథ్యావాదముకాని సూత్ర కారునికి( దెలియదని వీరివాదము. ప్రిపంచము మిథ్యయని సూత్రికారు(డు నమ్మినచో మిథ్యాప్రిపంచకర్తృత్వ విచారణ యనవసరము గనుక, తాను విశేష శ్రిమతోనై సాంఖ్య

(౧) ౧, ౪, ౨౭. (౨) ౧, ౨, ౮.

తత్త్వమును ఖండించి, సృష్టి సిద్ధాంతములను జర్చించి యుండఁడు. దేవప్రకృతిలో నిజమగు పరిణామస్వభావముగూడ నున్నదనియు, నీస్వగతభేదమువలన బహువస్తు జీవరూపములను ధరించుననియు బాదరాయణుని భావమై యుండవచ్చునుగాని, దీని నాధారపూర్వకముగా స్పష్టముగా నిర్ణయింపఁజాలము.

ముక్తజీవి బ్రహ్మతో నవిభాజ్యస్థితి నొందునని చెప్పఁబడెను. ఈ యవిభాజ్యస్థితి కనంతర భాష్యకారు లనేకార్థములను దీసిరి. దానిని సంపూర్ణజీవ బ్రహ్మైక్యమని శంకరుఁడును, నది యసమగ్రైను సంధానమని రామానుజుఁడును భావించిరి. శంకర తత్త్వములో రెంటికి స్థానమున్నది. ధర్మవిషయములో సన్న్యాసకర్మ సంబంధమును గూర్చియు, వానివలన మోక్ష సిద్ధిని గూర్చియు బాదరాయణుఁడు చర్చించియుండలేదు. మత విషయములో బ్రహ్మ మవ్యక్తమనియు, గాని యాత్మ దృష్టికి సాక్షాత్కరించుననియు నాతఁడు విశ్వసించెను. రెంటికి సమన్వయము చేయవలసియున్నది.

ఉపనిషద్భావముల వివరింపఁబూనిన బాదరాయణ సూత్ర ముపనిషత్తులవలెనే నిశ్చితరూపములేని యవిస్పష్ట లక్షణములనే సూచించెను. దీనివలన నందు సంశయములకుఁ జర్చలకుఁ దావున్నది. సూత్రభావము నింకేవిధముగా సుస్పష్టముగా నిర్ణయింపఁబూనినను, దోషములు లోపములు చెలరేగుట కవకాశమున్నది. వ్యక్తిగత తాత్త్విక స్వభావముల ననుసరించి, యెట్లు సూత్రములు భిన్నార్థ సిద్ధాంత వివరణముల కవకాశమిచ్చెనో మనము ముందు చూచెదము.

ఓం

# భారతీయతత్త్వశాస్త్రము

## అష్టమాధ్యాయము.

### శంకరాద్వైత వేదాంతము.

#### ౧—ఆరంభవచనము.

శ్రీశంకరాచార్యులవారి యద్వైత తత్త్వము నిరుపమానప్రజ్ఞాతిశయవైభవమును, నిస్తుల తార్కికసంపద్విలాసమును బ్రదర్శించును. అందుఁ గాననగు పరిశుద్ధ మేధావిత్వమునను, మానవులకుఁగల యాశావిశ్వాసములయెడ నౌదాసీన్యముచూపు నిర్దయాత్మకమైన తర్కప్రతిభయు, వ్యక్తిగత మతాభిమానముల కెట్టివిలువ నీయని నిరంకుశ స్వేచ్ఛావిహారమును, దానినొక విసిర్మలాధ్యాత్మిక తత్త్వముగాఁ బ్రదర్శించును. శంకరునిగూర్చి యెట్టిపక్షపాతము నున్నదనుట కవకాశములేదని డాక్టరు. థీబోపండితుఁడిట్లు నుడివినాఁడు: "శంకరుఁడు ప్రతిపాదించిన సిద్ధాంతము, మతవిషయసంబంధము లేని శుద్ధతాత్త్వికదృష్టితోఁ జూచినచో, భారతపుణ్యభూమిలో

బయల్వెడలినవానిలో నత్యంతమనోహరము, నతిసుప్రసిద్ధము నైన తత్త్వము; శంకరాద్వైతమునుండి భేదించు నితర వేదాంత తత్త్వములుగాని, యే వేదాంతేతరతత్త్వములుగాని,సంప్రదాయ సిద్ధమైనదని చెప్పఁబడు శంకరుని వేదాంతతత్త్వము చూపు ప్రజ్ఞాతిశయ ధైర్య గాంభీర్యములను జూపఁ జాలవు." ౧. మనము శంకరుని వాక్యములను జదువునపుడు, నిశితమైన మహాప్రజ్ఞయు నఖండాత్మజ్ఞానసిద్ధియు మూర్తీభవించిన యొక మహాపురుషునితో సాంగత్యము మనకు లభించినదని మనము తలఁపకుండ నుండఁజాలము. అనంతవిశ్వము నను భవపూర్వకముగా గ్రహించి, యాత్మనిగూఢరహస్యసీమలఁ బరికించు నాతని యవలోకనము, ప్రమాణసిద్ధముకాని దొక్క మాట యెక్కువకాని తక్కువకాని పల్కని యాతని ప్రచండ దీక్షయుఁ దిలకించినచో, భిన్నాభిరుచులఁ జూపు మధ్యమ యుగ మతప్రవక్తలలో శంకరుఁ డసమానధీర విగ్రహముగా మనకుఁ బ్రత్యక్షమగును. భూతభవిష్యద్భావ సంపర్క మవస రము లేకుండ శంకరుని తత్త్వము పరిపూర్ణతగలిగి స్వతంత్రమై ప్రకాశించును. శుద్ధ కళారచనలందుండు స్వయంసంపూర్ణతయు స్వప్రమాణసిద్ధియు నిందు గోచరించును. శంకరుని తత్త్వము తాను స్వయముగాఁ బ్రతిపాదించిన సిద్ధాంతములను వివరించి,

(౧) బా॥ సూ॥ ఉపోద్ఘాతము. పు॥ ౧౪ సర్. చార్లెస్ ఎలియటు ననుసరించి శంకరతత్త్వము, "ఋజుత్వ, సమగ్రత్వ, గంభీరత్వములలో భారత తత్త్వములన్నిటికిఁ గిరీటము వంటిది."

(హిందూ బౌద్ధమతములు. వాల్యుము ౨ పు॥ ౨౦౮.)

తాను నిర్ణయించుకొనిన లక్ష్యమును మఱువక, భిన్నాంగము లకు సామ్యస్థితిఁగూర్చి దృఢనిర్మాణమై వెలసినది. శంకరుఁ డొసఁగిన తత్త్వజ్ఞానార్థి కుండవలయు లక్షణములఁగూర్చి చూచినచో నాతని యుద్దేశములోఁ దత్త్వజ్ఞానమనఁగా దానికి జీవితసమర్పణమేకాని, కేవల మేధస్సంబంధ పరిశ్రమయే కాదని స్పష్టమగును. మొదటి లక్షణము నిత్యానిత్య వస్తువివేకము; అనఁగా జిజ్ఞాసు వెన్నడు మార్పునొందని పరమార్థమును నిత్య మును మారుచుండు ప్రపంచమునుండి వేరుచేసి తెలిసికొను భావనాశక్తి నార్జింపవలెను ఇట్టి శక్తిగల వ్యక్తి తత్త్వా న్వేషణ పరాయణుఁడు గాకుండ నుండఁజాలఁడు. "ఇహా మూత్రఫలభోగ విరాగము" రెండవలక్షణము. ఈభౌతిక ప్రపంచమందల్పజీవితములో నాత్మాశయ సంతృప్తి నొసఁగు నదేదియును లేదు. జీవితానుభవముచేఁగలుగు విషాదము నుండియే తత్త్వజిజ్ఞాస కవకాశము, దానియవసరముకూడ సము ద్భవించును. జిజ్ఞాసువైన వ్యక్తి వస్తుప్రకృతిచే జనించు వ్యామో హములకు బద్ధుఁడుగాకుండ నున్నత విజ్ఞానవేత్తలకు లక్షణ మైన నిస్సంగదృష్టిని బెంపొందించుకొనవలెను. మూడవది ధర్మనియమ దీక్ష ౧ యు నాలుగవది ముముక్షుత్వమునని పేర్కొనఁబడెను. మనకు మోక్షకామిత్వ ముండవలెను; సెయింట్ ల్యూక్ మాటలలో 'అమరజీవితాసక్తి'౨ గావలెను.

---

(౧) శం॥ భా. ఉపోద్ఘాతము॥

(౧) శం॥ భా॥ ౨, ౧, ౧.

(౨) ఆక్టులు. ౯, ౪౮.

యథార్థమగు తత్త్వలక్ష్యమును మనకు శంకరుఁడు ప్రసాదించి నాఁడు; అది జ్ఞానము కంటె ననుభవసిద్ధియనియు, దర్కపాండి త్యమున కంటె నాత్మస్వాతంత్ర్యమనియుఁ జెప్పనొప్పును. శంకరుని కేకాక, మహనీయవిజ్ఞాన సార్వభౌములనఁదగు ప్లేటో, ప్లాటినస్, స్పినోజా, హెగెల్, మున్నగు విశ్వవిఖ్యాతపురుషుల కును, తత్త్వజ్ఞానమనఁగా, మానవుని నికృష్టజీవితములోని యల్పవిషయ వశంవదముకాని స్వతంత్రధీరతయు, శాశ్వత సత్యదర్శనదీక్షయు నైయున్నది. శంకరాచార్యుని సునిశితము విశ్వవిశాలమునగు తర్కప్రతిభ స్వచ్ఛమహదావేశస్ఫూర్తిని బ్రదర్శించును; ఏలన నది లేనిచోఁ దత్త్వజ్ఞానము శుష్కతర్క వ్యాపారమగును. అత్యంత సునిశ్చితమైన తర్కప్రజ్ఞలో సార్వ భౌముఁడయ్యు, నింకొకరంగమున నాతఁడు మహనీయోజ్జ్వల కవితాప్రపంచ సార్వభౌముఁడుకూడ నైయున్నాఁడు. ఆతని ప్రతిభాకాంతిరేఖలు విజ్ఞానజగత్తులోఁగల తమస్సీమలకు వెలుఁగునిచ్చి, అత్యంత విచ్ఛిన్నహృదయములకుఁ దాపోప శాంతినొసఁగినవి. ఆతని తత్త్వ మనేకులకు ధైర్యమును జిత్త శాంతిని బ్రసాదించునుగాని యది దుర్బోధము నగాధమునగు భావవైరుద్ధ్యాంధకారమని తలఁచువారును లేకపోలేదు. మన మాతని వాదములతో నేకీభవించినను, మానినను, నాతని సూక్ష్మబుద్ధి ప్రకాశ మెవ్వరినైనఁ దాము న్న నికృష్టస్థితిలో నుండనీయదు.

౨-శంకరుని జీవితము-కాలము.

క్రీ. వె. ఆరవ శతాబ్దాంతమునఁ గాని, మధ్యకాలమునఁగాని శంకరుఁ డుండెనని తెలాంగువండితు నభిప్రాయము ౧. క్రీ. వె. ౬౮౦ లేక నింకను కొంచెము పూర్వము శంకరుని జననకాలమని సర్. ఆర్. జి. భండార్కరు చెప్పినాఁడు.౨. క్రీ. వె. ౭౮౮ జన్మకాలమనియు, ౮౨౦ మరణకాలమనియు మ్యాక్సుముల్లరు .మెక్డుగల్ వండితు లభిప్రాయపడినారు. ౯-వ శతాబ్దారంభ కాలమున శంకరుఁ డుండియుండెనని కీత్పండితుని భావమునై యున్నది.3.

తపోనిరతి యందును, కర్మయోగమునందును సమాన సామర్థ్యము గలిగిన యేకాంత యతిశేఖరుఁడును మహోజ్జ్వల భావ పరిపూర్ణుఁడు నగు శంకరుని విగ్రహము మనకు హృదయ స్పందము కలుఁగఁజేయకమానదు. కొందరు శిష్యులాతని జీవిత చరిత్రాంశములను లిఖించిరి; అందు ముఖ్యములైనవి మాధవ కృత శంకర దిగ్విజయము, నానందగిరి విరచిత శంకరవిజయ

(౧) శంకరుల సూత్రభాష్యమునఁ జేర్కొనఁబడిన పూర్ణవర్మ యను కాలమున మగధను బాలించిన యొక బౌద్ధ భూపతియని యాతని వాదము.

(౨) చూ: సంస్కృత వ్రాతప్రతుల యన్వేషణమునుగూర్చిన ప్రకటన. ౧౮౮౨, పు. ౧౫.

(3) ఐ యల్. ఎ. పు. 30. కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయ నాందీ శ్లోకములో (క్రీ॥ వె॥ ౬-వ శతాబ్ద మధ్యకాలము) మాయావాదమును గూర్చి సుప్రసిద్ధములైన మరు మరీచికా రజ్జుసర్పోపమానము తీయఁబడెను. అవి బౌద్ధగ్రంథములలోఁగూడ నీయఁబడినవి కావున శంకరుని రచనలనుండి తీసికొనఁబడినవని తలఁప నవసరములేదు.

మున౧. శంకరుఁడు నిరాడంబరమై, కష్టములకోర్చి కృషి చేయు మలబారు బ్రాహ్మణపండిత వంశములోనివాఁడు; దక్షిణాపథ పశ్చిమ సముద్రతీరస్థమగు కాలఁడిగ్రామ మాతని జన్మస్థానము.౨. శంకరుని గృహదైవము శివుఁడను సంప్రదాయ మున్నను, జన్మముచే నాతఁడు శాక్తేయుఁడని కొందరు చెప్పుదురు. చిన్ననాఁడే యాతఁడు గౌడపాదాచార్యుల శిష్యుఁడైన గోవిందుని వేదపాఠశాలలోఁ జేరెను. తన గ్రంథములన్నిటిలో శంకరుఁడు తనగురువు గోవిందుఁడని స్మరించెను; అనగా నద్వైత తత్త్వవిషయములన్నిటి నాతఁడు బోధించెనని స్పష్టము. ఎనిమిదేండ్ల బాల్యముననే శంకరుఁడు చతుర్వేదముల నమితోత్కంఠతోఁ జదివినాఁడు. ఆతఁడు స్వతంత్రప్రజ్ఞాప్రతిభలు చూపిన వేదవిద్యాపారంగతుఁడైన పటుఁడై ప్రకాశించెను. జీవిత రహస్య ప్రాముఖ్యముల నాతఁడు గుర్తించి, చిన్ననాఁడే సన్న్యాసి జీవిత సౌందర్యము నంతర్దృష్టిలోఁ జూచెను. జగద్వస్తు విషయము లెఱుగకుండగనే త్యజించి యాతఁడు యతిపుంగవుఁ

(౧) చిద్విలాసుఁడు సదానందుఁడు కొన్ని విషయములను వ్రాసిరి. స్కాందపురాణము (కా.అ.) కొన్ని యంశములను జెప్పును. నారాయణాచార్యుఁడను నొక మాధ్వమతస్థుఁడు తన మాధ్వవిజయము, మణిమంజరి గ్రంథములలోఁ గొన్ని వివరముల నిచ్చెను. కాని వీరిచ్చిన విషయములకుఁ జారిత్రకాధారము లేకపోవుటచే సంశయాస్పదములు. (చూ. శంకరుని జీవితకాలము, సి. యస్ కృష్ణస్వామి అయ్యర్, మదరాసు.)

(౨) చిదంబరమున క్రీ. శ. ౮౮ లో జన్మించి, క్రీ. శ. ౧౨లో శంకరుఁడు మృతిపొందెనని ఆనందగిరి వచించెనుగాని, యీవాదమునకు విశేషాధారములు లేవు.

డయ్యెను. కాని యాతని దావేశపరవశత్వములేని బడుగుసన్న్యాసము కాదు. సత్యమొక పరిశుద్ధాగ్నిజ్వాలయై యాతనిలో వెల్గొందినది. ఆతఁ డనేకస్థలములకుఁ బోయి, శాఖాంతరులతో వేదాంతచర్చలు జరిపినాఁడు. ఈశాస్త్రవాదపర్యటనములలో నాతఁడు కుమారిలుని(౧), మండనమిశ్రునిఁ గలిసికొనెను; మండనమిశ్రుఁడీతని శిష్యుఁడై సురేశ్వరాచార్యనామమున సుప్రసిద్ధుఁ డయ్యెను.(౨) అమరుకరాజ మృతకళేబరమున నీతఁడు ప్రవేశించు గాథ వలన నీతఁడు యోగసిద్ధులు గలవాఁడని తెలియుచున్నది. ఆతఁడు స్థాపించిన మఠచతుష్టయములో మైసూరురాజ్యములోని శృంగేరీమఠము ప్రధానమైనది. తూర్పున పూరీజగన్నాథమునందును, పశ్చిమమున ద్వారకయందును, హిమాచలమున బదరీనాథమునందును మఱి మూఁడుమఠములున్నవి. సంప్రదాయమేకగ్రీవముగాఁ జెప్పు నొక్క యద్భుతసంఘటనము శంకరుని హృదయమున నెంత మానవప్రేమరసము గలదో యాతఁడెంత మాతృభక్తిపరిపూర్ణుఁడో ప్రదర్శించును. సన్న్యాస నియమముల నుల్లంఘించి యాతఁడు తల్లి మరణించినప్పుడామె కూర్ధ్వదైహిక కర్మనంతను యథోక్తముగా నొనరించుటచే యతిసమాజమున కంతకు నాతనియెడ గ్రోధముద్భవించెను. హిమాలయ

---

(౧) శంకరుఁడు కుమారిలుని శిష్యుండని యొక దక్షిణదేశ సంప్రదాయమైయున్నది.

(౨) సురేశ్వరాచార్యుఁడు మండనమిశ్రుఁడు నొకరు కారని కొన్ని హేతుబద్ధములైన యాధారములను మైసూరు వాసియగు హిరియన్న పండితుఁడు చూపినాఁడు. (చూ॥ జె॥ ఆర్॥ ఎ॥ యస్॥ ఏప్రిల్ ౧౯౨౩, జనవరి ౧౯౨౪.)

మందలి కేదారనాథము నందాతఁడు తన ముప్పదిరెండవయేట శివైక్యము నొందెనని సంప్రదాయము చెప్పుచున్నది. వ్యావహారిక జీవితానుభవాలోచనలు గల మన దృష్టిలో, శంకరుని జీవితము సంఘసంపర్కము వలనఁ గలుగు నుత్సాహశూన్యమైనదిగాఁ దోఁచవచ్చును. గాని, యీశ్వరధరసంస్థాపనార్థమై, యాత్మరతులై, నిరాడంబర మహోన్నతభావపూరితమైన జీవితమును గడపు వారికిది సహజమైన లక్షణమని తెలియవచ్చుచున్నది. శంకరుఁడు ప్రజాకోటిని ధర్మమార్గములఁ జూపితరింపఁజేయు నీశ్వరాదేశము గర్భమునఁ బెట్టుకొని జన్మించియుండుటచే,నాతఁడు తక్క నింకొకఁ డెవ్వఁడు నీమహాత్కార్యమును నెరవేర్చు సామర్థ్యము గలవాఁడు లేకపోవుటచేతను తన దివ్యసందేశముతోఁ బాటు నిర్మలవైరాగ్యకలిత నిస్సంగ జీవితము నాతఁడు ప్రదర్శింపవలసి వచ్చినది.

కొలదియేండ్లలోనే శంకరుఁడు వివిధజీవిత కార్యక్రమముల నాచరించి కృతార్థుఁడయ్యెను; ఇం దేయొకకార్యక్రమ సిద్ధియైనను సామాన్యమానవునికిఁ బూర్ణసంతుష్టి నిచ్చియుండును.ఆతని మహనీయకర్మసిద్ధి యాతఁడు ప్రాచీనగ్రంథము రచించిన భాష్యములమూలమున నిర్మించి పోషించిన అద్వైత తత్త్వమే. నాఁడు వ్యాపించియున్న భిన్నజ్ఞానప్రమాణములకుఁ బురాతనగ్రంథ సిద్ధాంత సంప్రదాయములతో సామరస్యముఁగూర్చి ప్రకటించుట కిదియే యుత్తమ పద్ధతియని యాతఁడు నిశ్చయించినాఁడు. ఆ రేడు శబ్దములలోఁ బ్రజాసామాన్యమున కభిరుచికల్గిన హిందూమతము విజృంభించినది.

దక్షిణాపథమున బౌద్ధమతము క్షీణించి (౧) జైనమత మత్యున్నత శిఖరమందినది. వేదోక్త కర్మవిధులు గౌరవహీనములయ్యెను. శివభక్తులైన అడియారులు, వైష్ణవభక్తులగు ఆల్వారులు దైవభక్తి ప్రచారము చేయుచుండిరి. మతసంబంధోత్సవములు, పౌరాణికధర్మ ముపదేశించిన ఆలయ దేవతాపూజలు దేశ మంతయును వ్యాపించుచున్నవి. దక్షిణమునఁ బల్లవ పరిపాలన మనివార్యమై వెలయుచుండెను; దానివలన లభించిన స్వాతంత్ర శాంతియుత వాతావరణములో బ్రాహ్మణతత్త్వము హిందూ మతముగా మారఁజొచ్చినది. నాఁడుజరిగిన జీవితపునర్నిర్మా ణమునకుఁ బల్లవరాజులు ప్రదర్శించిన మతాభిరుచులే సాక్ష్యము లిచ్చుచున్నవి. పల్లవవంశమందలి ప్రథమచక్రవర్తులు బౌద్ధ మతస్థులైనను, దరువాత తరమువారు వైష్ణవులును దుదకు శైవులును రాజులైరి. బౌద్ధుల సన్న్యాసదృష్టికిని, వైష్ణవుల భాగవతదృష్టికిని వ్యతిరేకముగా మీమాంసకులు వేదోక్త కర్మాధిక్యమును బ్రచారము చేయుచుండిరి. జ్ఞాన సన్న్యాస మార్గములు నిష్ప్రయోజనములని కుమారిల మండనమిశ్రులు ప్రకటించుచు, గర్మశ్రేష్ఠతను గృహస్థ ధర్మాతిశయమును గొనియాడిరి. అట్టితరుణమందే శంకరుఁడు రంగస్థలమునఁ బ [illegible]ంచి, సనాతన సంప్రదాయసంరక్షకుఁడుగా ఖ్యాతిఁ

(౧) వెంపొందుచున్న బౌద్ధము నైదవశతాబ్దములో ఫాహియాన్ చూచినాఁడు; కాని తరువాత నవఁగా ౬,౭ శతాబ్దములలో వచ్చిన యూన్ చ్వాంగ్ బౌద్ధమత క్షీణదశను గాంచినాఁడు. బాణుని హర్షచరిత్ర మీభావ మును సమర్థించును.

గాంచి, యాధ్యాత్మికసంస్కర్తయయ్యెను. పురాణసిద్ధమగు నుజ్జ్వలభావదీప్తినుండి, యుపనిషద్రహస్య జ్ఞానోన్ముఖమగునట్లు యుగమును బరివర్తనముచేసెను. అతీంద్రియానుభూతికి జీవులను దోడ్కొనిపోవు మతశక్తియే సత్యమునకు గీటురాయి వంటిది. బౌద్ధమతము, మీమాంసావిధానము, భక్తిమార్గము కంటె నధికతరమగు సంతృప్తినొసఁగు తత్త్వమతములను నిర్మించి, వానిమూలమున యుగమునకొక నూత్నదృక్పథము నిచ్చుటకు శంకరుఁడు తాను జన్మించియుండెనని తలఁచి ప్రయత్నించెను. ఆస్తికులు సత్యము నావేశోద్రేకములచే నాచ్ఛాదించుచున్నారు. ఈశ్వరసాక్షాత్కారానుభవశక్తిచేఁ గలుగు నాత్మపరవశత్వముచే వారు సాంఘికజీవిత మర్యాదల కుదాసీనతఁ జూపిరి. కర్మయే సర్వమని మీమాంసకులు బోధించి, రసహీనములగు క్రియాకలాపముల నారాధింపఁ బూనిరి. సమ్యక్ జ్ఞానముపై నాధారపడినప్పుడే ధర్మము జీవితాంధకారమును బోఁదోలి కాంతిమయ మొనర్పఁగలదు. శంకరునిభావములో నద్వైత తత్త్వమొక్కటే పరస్పరవిరుద్ధ తత్త్వభావ సామరస్యముఁగూర్చి, సమన్వయించు సామర్థ్యము గలది; అందుచే నాతఁడు, సంసారతరణమున కత్తమోపాయముగా జీవాత్మ పరబ్రహ్మైక్యభావమును వేనోళ్ళఁ బ్రకటించు నేకైకోద్దేశముతోడనే తన గ్రంథములన్నిటిని రచించెను. ౧. తన జన్మస్థానమైన మలబారునుండి, యుత్తరమున హిమాలయమువఱకు నాతఁడుచేసిన సంచారములో నాతఁడెన్ని యో

(౧) "సంసారహేతు నివృత్తి సాధనబ్రహ్మాత్మైకత్వ విద్యా ప్రతిపత్తయే." చూ॥ శం॥ భా॥ ౧, ౧, ౧.

యారాధన విధానములను దర్శించి, మానవుని సంస్కరించి, యూర్ధ్వగమనము నీయఁగలశక్తియున్న విధానముల నన్నిటి నాతఁ డంగీకరించినాఁడు. మోక్షమున కొకే మార్గమున్నదని యాతఁడెన్నఁడును బోధింపలేదు; ప్రజాసామాన్యమునకాచరణ లోనున్న భిన్నదైవతములనఁగా విష్ణుశివశక్తి సూర్యాదులను గూర్చి, నిరుపమాన సౌందర్యవిలాసములఁ బ్రదర్శించు గీతా శ్లోకపుంజములను రచించెను. ఇదియంతయు విశ్వవిశాలమగు నాతని మానవప్రేమను, సహజప్రతిభా వైదగ్ధ్యమును సూచించును. జనసామాన్యమతము నాతఁడు పునరుజ్జీవన మొనర్చుచుఁబునీతముకూడ నొనర్చెను. దక్షిణదేశములోని శాక్తేయమత విధానములోని నీచారాధనపద్ధతుల నణఁచివేసెనుగాని కలకత్తా లోని కాళీపూజాపద్ధతిలో నాతనిప్రభావ మెట్టిమార్పునుగలిగింపకుండుట శోచనీయవిషయము. మల్లారిదేవుఁడనుపేర శివునొక కుక్కరూపమునఁ బూజించు దక్షిణదేశమందలి నీచారాధనమును, మానవ బలిఁగోరు భైరవదేవు నుపాసించు కాపాలిక మతస్థుల అత్యాచారముల నాతఁడు నిర్మూలించెనని చెప్పుదురు. దేహమునఁ దప్తలోహ శలాకలతోఁ గాల్చి ముద్రిలు వేయు పద్ధతి నాతఁడునిరసించెను. బౌద్ధధర్మమునుండి యాతఁడు సుశిక్షణము, మూఢవిశ్వాస నిరాసము, మఠనిర్మాణము ను త్తమభక్తి శ్రద్ధలను సంరక్షించి నిష్కలుషముగా నిలుపునని తెలిసికొని, యాతఁడు స్వయముగా దశసంఖ్యాకమైన సన్న్యాసి వర్గములను స్థాపించెను. అందు నేటికి నాలుగువర్గములు చెక్కుచెదరక సజీవములై నిలిచియున్నవి.

శంకరాచార్యుని జీవితము వైరుద్ధ్యనిలయమను భావము నుదయింపఁజేయును. ఆతఁడు తత్త్వవేత్తయుఁ గవియు, విద్వద్వరేణ్యుఁడు, ఋషికల్పుఁడు, యోగి మతసంస్కర్తయుఁగూడ నైయున్నాఁడు. ఆతని వ్యక్తిత్వమును మనము స్మరించునప్పుడా మహనీయుని భిన్నప్రజ్ఞా సామర్థ్యములవలన భిన్నరూపములు మనకు స్ఫురించును. యువకుఁడైన యాతఁ డనితరసామాన్య శేముషీధురంధరుఁడై, నిర్లక్ష్యసాహసములతో శాస్త్రచర్చా ధీరవిహారుఁడుగా నొకని దృష్టికిని; ప్రజాకోటిలో నైక్యభావము నుద్దీపింపఁజేయవలెనని ప్రచార మొనర్చిన రాజకీయ కుశలునిగా నింకొకని దృష్టికిని; అసమాన తర్కాయుధము నుపయోగించి, విజ్ఞాన జీవితరంగములలోఁ గల యన్యోన్య వైరుద్ధ్యములఁ దొలగించు నైకైక కృషిలో నిమగ్నుఁడైన ప్రశాంత తత్త్వవేత్తగా వేఱొకని దృష్టికిని; మనమందరమును మన మెఱిఁగినకంటె ఘనతర వ్యక్తిత్వములు గలవారమని ప్రకటించు యోగివర్యునిఁగా మఱొకనికిని; శంకరుని దివ్యవిగ్రహము గోచరించును. అట్టి సర్వతోముఖ శక్తిసామర్థ్యములు గల వ్యక్తు లరుదుగా నుందురు.

### 3—సారస్వతము.

ఈ యద్వైతశాఖకుఁ బ్రధానగ్రంథములు శంకరాచార్యులవారి యుపనిషద్గీతా సూత్రభాష్యములు.(౧) ఉపదేశసాహస్రి

(౧) ఈశ, కఠ, కేన, ప్రశ్న, తైత్తిరీ, యైతరేయ, శ్వేతాశ్వతర, ఛాందోగ్య, ముండక, మాండూక్య, బృహదారణ్యకోపనిషత్తులు, అథర్వశిఖ, అథర్వశిరస్సు, నృసింహ తాపనీయోపనిషత్తులకుఁ గూడ నాతఁడు భాష్యము వ్రాసెనని చెప్పుదురు.

వివేకచూడామణియు నద్వైతతత్త్వ సామాన్యస్వరూపమును వ్యక్తీకరించును. దక్షిణామూర్తి స్తోత్రము,హరిమీడేస్తోత్రము, ఆనందలహరి, సౌందర్యలహరి, జీవితమం దాతనికిఁ గల విశ్వాసాదరములఁ జూపును. ఆప్త వజ్రసూచి, ఆత్మబోధ, మోహముద్గరము, దశశ్లోకి, అపరోక్షానుభూతి, విష్ణుసహస్రనామ సనత్సుజాతీయభాష్యములు నాతఁడే రచించెనందురు. లక్షణ వైవిధ్యముతోఁగూడిన యాతని సర్వతోముఖ వ్యక్తిత్వము నాతని గ్రంథములు ప్రకటించును. హేతుభావనా హాస్యశక్తుల నేకముఖముగఁ జూపు నాతని శైలి యాతని మానసిక లక్షణముల కద్దమై ప్రతిబింబించును. శంకరుఁడు స్థాపించిన యద్వైత తత్త్వమునకు విపులము సుదీర్ఘమునగు చరిత్రము న్నది; అది యింకను దుదిఁగాంచి యుండలేదు. ఇతరతత్త్వ స్థాపకులందరు తమ వాద సామర్థ్యమును శంకరుని సిద్ధాంతములను విమర్శించుటవలననే చూప యత్నింతురు. అందుచేఁ బ్రతిశతాబ్దమునందును శంకరుని సిద్ధాంతమును సమర్థింపవలసి వచ్చినది. శంకరుని యనంతరము నేటివఱకు నాతని యద్వైత తత్త్వ మెట్టి భిన్నదశాప్రాప్తి నొందినదో, వర్ణించుటకిది యదనుకాదు.౧.

(౧) శంకరు ననంతరమును వెంటనే రచింపఁబడిన సుప్రసిద్ధములైన అద్వైతగ్రంథములు సురేశ్వరాచార్యుని వార్తికములు, నైష్కర్మ్యసిద్ధి, వాచస్పతి భామతి, పద్మపాదుని పంచపాదిక, ఆనందగిరి వ్యాఖ్యానిర్ణయము. ౧౩-వ శతాబ్దమునకుఁ జెందిన అమలానందుని కల్పతరువు భామతికిభాష్యము. ఈకల్పతరువునకు విపులమగు వివరణగ్రంథమగు కల్పతరు పరిమళమను దానిని ౬-వ శతాబ్దమునకుఁజెందిన అప్పయ్యదీక్షితుఁడు రచించెను. ఈతని సిద్ధాంత లేశ మద్వైత భిన్నరూపముల సంగ్రహచరిత్రను వివరించు ముఖ్యగ్రంథము

మొదటి నాలుగుసూత్రములకు విపుల టీకారూపమైన పద్మపాదుని పంచపాదికకుఁ బంచపాదికా వివరణమను వ్యాఖ్యను ప్రకాశాత్ముఁడు (క్రీ॥ వె॥ ౧౨౦౦) రచించెను. ఈ ప్రకాశాత్ముని గ్రంథమునకు టీకగా వివరణ ప్రమేయసంగ్రహమను గ్రంథమును మాధవనామాంతరము గల విద్యారణ్యుఁడు (౧౪-వ శతాబ్దము) వ్రాసెను. ఆతని పంచదశి అనంతరాద్వైత శాస్త్రగ్రంథము; ఆతని జీవన్ముక్తి వివేకముకూడఁ గొంత విలువగలదే. పంచదశి కర్తృత్వమునుగూర్చి సంప్రదాయ భేదమున్నది. మొదటి యారధ్యాయములను విద్యారణ్యుఁడును, మిగిలిన తొమ్మిదింటిని భారతీతీర్థుఁడును రచించె నందురు. (చూ: పీతాంబరస్వామి కూర్పు. పు. ౬) తన వృత్తి ప్రభాకరములో నిశ్చలదాసుఁడు మొదటి పది ప్రకరణములు విద్యారణ్యుఁడు రచించెననియు మిగిలినవానిని భారతీతీర్థుఁడు వ్రాసెననియుఁ జెప్పెను. (పు. ౪౨౪) సర్వజ్ఞాత్మముని (క్రీ॥ వె॥ ౯౦౦) తన సంక్షేప శారీరకమందు శంకర తత్త్వమును వివరించెను. దీనికి రామతీర్థుఁడు భాష్యము వ్రాసెను. శ్రీహర్షుని ఖండన ఖండఖాద్యము (క్రీ॥ వె॥ ౧౧౯౦) అద్వైతశాస్త్ర విపులీకరణము చేసినవానిలో నుత్కృష్టమైన గ్రంథము. అది తత్త్వశాస్త్రముయొక్క వ్యర్థత్వమును గూర్చిన దీర్ఘమగు ప్రకటనము, భావనాశక్తి సూచించు పరమార్థవిషయములను సత్యములని తలఁచి వానిని గ్రహించుట కెట్టియవకాశమును లేకున్నను మానవమానసము చేయు ప్రయత్నము నిరుపయోగమని నిరూపించును. నాగార్జునివలెనే, సకలసూక్ష్మ శాస్త్రీయపద్ధతిలో సామాన్యద్రవ్యపరిశీలనముచేసి, విశేషతార్కికవిభాగపరీక్ష చేఁబరమార్థమును గ్రహించుశక్తి మానవమానసమునకులేదు. గావున నేదియు సత్యమని కాని యసత్యమని కాని చెప్పఁజాలమని వాదించెను. విశ్వైకచైతన్యమొక్కటే సత్యము; తక్కినవన్నియు సంశయాస్పదములు. పరబ్రహ్మైకాస్తిత్వ విశ్వాసముగల వాఁడగుటచే నీతఁడు బౌద్ధులనాస్తికతకు భిన్నుఁడైనాఁడు: (౧, ౫.) న్యాయప్రమాణముల నాతఁడుచ్చరించి, కారణధర్మమును బరీక్షించి, న్యాయము యథార్థజగత్తునుగూర్చి కాక, యింద్రియ గోచరదృశ్యములను గూర్చి మాత్రమే వివరించునని వాదించెను. నిర్గుణబ్రహ్మము జ్ఞానవిషయము గాకున్నను సత్యమే యనియు వస్తునానాత్వము నిజముకాదనియు నాతని

## ౮—గౌడపాదుఁడు.

### అద్వైతవేదాంతమును శాస్త్రయుక్తముగాఁ బ్రదర్శించిన

నిశ్చయము (౧, ౯) ఇట్టిదే తత్త్వదీపికయను నొకగ్రంథమును, ఖండనఖండ ఖాద్యముపై నొకభాష్యమును చిత్సుఖుఁడు వ్రాసినాఁడు. చిత్సుఖీయమును న్యాయామృతము ఖండించెను మధుసూదన సరస్వతి (౧౬-౭ శతాబ్దము) తనయద్వైతసిద్ధిలో న్యాయామృతమును ఖండించెను. రామతీర్థుఁడు తనతరంగిణిలో నద్వైతసిద్ధిని విమర్శించెను. తరంగిణీవిమర్శకు సమాధానముగా నద్వైత పద్ధతి సమర్థించుచు బ్రహ్మానందుఁడు గౌడబ్రహ్మానందీయమను నొకగ్రంథమును రచించినాఁడు. శంకరమిశ్రుఁడు రఘునాథుఁడు ఖండనమునుగూర్చి స్వతంత్రగ్రంథములను వ్రాసిరి. ధర్మరాజవిరచిత వేదాంతపరిభాష తార్కిక తత్త్వమును వివరించు నుత్కృష్టపాఠ్యగ్రంథము. ధర్మరాజు పుత్త్రుఁడైన రామకృష్ణుఁడు దానిపై శిఖామణియను నొకగ్రంథమును వ్రాసెను. అమర దాసు రచించిన మణిప్రభ దీనిపైనొక చక్కనిటీక. విజ్ఞానభిక్షువిరచిత విజ్ఞానామృతము(౧౬-వ శతాబ్దము.)సాంఖ్య ద్వైతము వేదాంతమునందున్నదని చూపయత్నించును. అద్వైతానందుని బ్రహ్మవిద్యాభరణము, (౧౫-౭శతాబ్ది గోవిందానందుని రత్నప్రభ, సదానందుని వేదాంతసారము (౧౫ ౭ శతాబ్ది) దానిపైఁగల భాష్యములైన సుబోధిని, విద్వన్మనోరంజని, ప్రకాశానందుని సిద్ధాంతముక్తావళి,సదానందునద్వైతముత (బ్రహ్మసిద్ధి,లక్ష్మీధరు నద్వైతమకరంద ముకొంత(ప్రాముఖ్యముగల గ్రంథములు. మహోపనిషత్తువంటి కొన్ని యవంత రోపనిషత్తులు; యోగవాశిష్టము, అధ్యాత్మరామాయణమువంటి మతగ్రంథ ములుకూడ నద్వైతపరములు. యోగవాశిష్ఠము బౌద్ధభావపూరితము. బోల్చు:

"యదిదమ్దృశ్యతే కించిత్తన్నాస్తి కిమపిధ్రువమ్
యథాగంధర్వనగరమ్ యథావారిమరుస్థలే. (౨.)

ఇంకను ననేకములగు నద్వైతవేదాంతగ్రంథములున్నవి కాని, శంకరుఁడుచెప్పిన వాదములకంటె నవ్యముగాఁజెప్పినవిలేవు. సురేశ్వర, వాచస్పతి, పద్మపాద, శ్రీహర్ష, విద్యారణ్య, చిత్సుఖ, సర్వజ్ఞాత్మముని, మధుసూదన సరస్వతి, అప్పయ్యదీక్షితులు, భావనావైఖరిలో సమానులేయైనను, వారిలో నొక్కొ-

ప్రథమపురుషుఁడు గౌడపాదుఁడు.౧. ఆతడు శంకరుని గురువైన గోవిందుని గురువని సుప్రసిద్ధిగాంచెను; ౭-వ శతాబ్దాంతమునఁ గాని, ౮-వ శతాబ్దారంభమునఁ ౧. గాని, యాతఁడు జీవించె నని చెప్పఁబడెను. ఉత్తరగీతకు గౌడపాదుఁడొక భాష్యమును గూడ రచించెనని చెప్పుదురు. అద్వైత తత్త్వప్రధానసిద్ధాంతము లగు జీవబ్రహ్మైకత్వము, మాయావాదము, పరమార్థమును జెప్పుటకుఁ గారణధర్మము నిరుపయోగమని నిర్ణయము, వ్యావహారిక పారమార్థిక జగద్విభాగము, మోక్షైకసాధనము జ్ఞానమే

క్కురే తాము సమర్థించిన అద్వైతవాదమునందుఁబూర్వము లేని క్రొత్తఁదనమును జేకూర్చిరి. వారివాదసిద్ధాంతములు సమానమేయైనను, వారివ్యక్తివైశిష్ట్యమును ప్రదర్శించిరి.

(౧)సాంఖ్యతత్త్వమునకు భాష్యకర్తయైన గౌడపాదుఁ డితఁడు కాదని తోఁచును.

(౧) భావవివేకుని తర్కజ్వాలకు టిబెట్టు భాషాంతరీకరణములో 'కారిక' పేర్కొనఁబడుటచే, గౌడపాదుఁ డితని పూర్వుఁడని వాలెసర్ చెప్పినాఁడు. భావవివేకుఁడు యువాన్ ఛ్వాంగునకుఁ బూర్వుఁడగుటచే, గౌడపాదుఁ డించుమించుగా క్రీ. వె. ౫౫౦ ప్రాంతము వాఁడు కావలెను. (చూ. జాకోబి, జె.ఎ.ఒ. యస్. ఏప్రిల్, ౧౯౧౩.) కారిక కంటె బ్ర. సూ. పూర్వకాలమునకుఁ జెందునని జాకోబి తలఁచును. పురాతన బౌద్ధగ్రంథములలో బ్ర. సూ. స్మరణ లేకుండుట వలన నీవాదమునకు దోషము సంభవించదు; ఏలన, బ్ర. సూ. వేదాంతవిషయము సుస్పష్టము గానందున నితరులందేని నుదాహరించుటకు వెఱచిరి. "[illegible] బౌద్ధులు బ్ర. సూ. వేదాంతమును దిరస్కరించి యుండరు; ౫-వ శతాబ్దమునాటి జైనులట్లే చేసిరి. కాని వారు గౌడపాదునట్లు తిరస్కరింపఁ జాలరైరి. ఏలనఁ జాల విషయములలో నాతని తత్త్వము వారితత్త్వములోని భావములకు సరిపోవును." (జె. ఎ. ఒ. యస్. ఏప్రిల్, ౧౯౧౩) భారతీయ పండితులు జాకోబి భావమును సమర్థింతురు.

యను ప్రవచనము, పూర్ణశూన్యత యనునది దురూహ్యమను ప్రకటనము మున్నగున వాతని కారికలో వివరింపఁబడినవి. కారిక నాలుగు భాగములు. మొదటిదైన ఆగమ ప్రకరణము మాండూక్యోపనిషదర్థమును వ్యక్తపరచును. తాను ప్రతిపాదించు పరమార్థతత్త్వము శ్రుతి విహితమనియు హేతుబద్ధమనియుఁ జూపఁయత్నించును.౧. రెండవది వైతథ్యప్రకరణము, ఇది వ్యతిరేకములగు ద్వంద్వములతోఁ గూడిన దగుటచేఁ బ్రపంచము మిథ్యారూపమని నిరూపించును. మూఁడవ దద్వైతసిద్ధాంతమును స్థాపించును. నాలుగవదైన అలాటశాంతి ప్రకరణము మఱల నద్వైత తత్త్వమును వివరించి, వ్యవహారజ్ఞానము వ్యర్థమైన దనియు నాత్మయే సత్యమనియు వాదించును. కాలుచున్నయొక కఱ్ఱను గిరగిర త్రిప్పినచో నదియొక జ్వాలాచక్రము లేక అలాటచక్రభ్రాంతి నుదయింపఁ జేయునట్లే, ప్రపంచ నానాత్వమును గోచరించునని చెప్పఁబడెను.౨. అది యోగాచారభావములను బేర్కొని బుద్ధుని నామము నైదారుసారులు స్మరించెను.

బౌద్ధమతము బహుళ వ్యాప్తినొందిన కాలములో గౌడపాదుఁడు జీవించెను. సహజముగా నాతఁడు బౌద్ధసిద్ధాంత పరిచయము గలిగి, వానిలోఁ దన యద్వైతమునకు విరోధించని వాని

(౧) ౨, ౨౩.

(౨) చూ. మైత్రాయణీ ఉపనిషత్తు ౬-౨౪. ఈయుపమానము తఱచుగా బౌద్ధగ్రంథములలో నుపయోగింపఁబడినది. నిజముగా, భావయందును భావమునందునుగూడ గౌడపాదకారిక మాధ్యమికబౌద్ధరచనలను బోలి, యందలి బహుళోపమానముల నుపయోగించి యున్నది. ముఖ్యముగాఁ బోల్చు; ౨.౩౨; ౪, ౫౯. చూ. జె. ఆర్. ఎ.యస్. ౧౯౧౦, పు. ౧౩౬.

నంగీకరించెను. తన సిద్ధాంత మేశ్రుతిపై నాధారపడినది కాద నియు హేతు వాదబద్ధమనియు నాతఁడు బౌద్ధులకుఁ బ్రక టించెను. వేదప్రమాణ వాదులగు సంప్రదాయ మతస్థులకుఁ దన తత్త్వము శ్రుతివచనాధారము గలదని పలికెను. బౌద్ధమత సూత్రములను గొన్నిటిని స్వీకరించి, వాని నద్వైత పరముగా నర్థకల్పనముచేసి సమన్వయించిన విశాలహృదయము నాతఁడు ప్రదర్శించెను.

## ౫—వ్యావహారిక జ్ఞానపరిశీలనము.

మాండుక్యోపనిషత్తులోఁ బ్రదర్శింపఁబడిన భిన్నజీవిత దశావిశేషములనుగూర్చి యిదివరకు స్థలాంతరమునఁ బ్రసం గించియున్నాము. ౧. ఈభిన్నావస్థానుభవము నాధారముగాఁ గొని, యాతఁడు స్వప్నానుభూతి జాగ్రదవస్థానుభూతితోఁ దుల్యతగలదే యని వాదించినాఁడు. మన స్వప్నానుభవ మితరుల సామాన్యానుభవముతోఁ బొత్తులేనిదని కాని, లేక మన సహజానుభవమునకు సరిపడదని కాని౨ యనుటకుఁ గారణము మన స్వప్నానుభవము పూర్తిగా నయథార్థమగుట కాక, మనము పెట్టుకొన్న వ్యావహారికప్రమాణముల కనుగుణము కాదని యే గ్రహించవలసియున్నది. స్వప్నములోక ప్రత్యేకానుభవమునకుఁ జెందినవి; వానియవధులలో నవి సామరస్యమును గలిగియేయున్నవి. స్వప్నజలము స్వప్నదాహమును దీర్చును

(౧) పోల్చు. బ్రాడ్లే; + టూత్ అండ్ రియాలిటీ. పు॥ ౪౬౨– ౪౬౪.

(౨) ౨, ౨౦౩.

గాని జాగ్రదవస్థలోని దాహమున కుపశాంతి నీయదనుట యుక్తిహీనతనే ప్రకటించును. అట్లనుట జాగ్రదవస్థానుభవమే స్వయంసిద్ధి సత్యములుగలదని వచించుటేయగును. ఈ రెండు ననగా 3 జాగ్రత్స్వప్నావస్థలు వాని యవధులలో సత్యములే; కాకున్నచోఁ బారమార్థికదృష్టిలో రెండు నసత్యములే, జాగ్రదావస్థలోని వస్తువులకు మనకందరకు సామాన్యములనియు, స్వప్నదృశ్యములు స్వప్నమునుగాంచినవానికి వ్యక్తిగతములనియు గౌడపాదుఁ డెఱుగఁడని తలఁపరాదు. ౧. కాని యాతఁడిట్లు చెప్పెను: "స్వప్నమందువలెనే, మెలఁకువలోఁ జూచినవస్తువు లసత్యములు." ౨. మనకు దృశ్యమైన దేదియైన నసత్యమేయని యాతనివాదము. వస్తువులన్నియు నసత్యములు; వానిని దర్శించు ద్రష్టయొక్కఁడే నిజయనుభావములు కొన్ని

---

(3) "నేనీవిషయమును శ్రద్ధగాఁబరిశీలించినపుడు, నేను మెలకువగా నుంటినో, కలలోనుంటినో నిశ్చయముగా నిర్ణయించుటకు వలయు లక్షణము నాకొక్కటియును లభింపలేదు. స్వప్నదృశ్యములు, జాగ్రదవస్థానుభవములు నత్యంతసామ్యము గలిగియుండుటచే నేనువిభ్రాంతమనస్కుఁడనై, నేనిపుడు కలలోలేనని నిశ్చయించలేనివాఁడనై యున్నానని చెప్పఁగలను." (డే కార్టే మెడిటేషన్సు. పు. ౧.) ఒకేస్వప్నము ప్రతిదినము కలిగినచో మనము మెలకువలోని వస్తువులతోవలెనే స్వప్నవస్తువులతోను దప్పకవర్తింతుమని పాస్కల్ చెప్పినది యుక్తియుక్తముగానున్నది. ఆతనిమాటలివి; "ఒకకర్మకారుఁడు ప్రతిదినము రాత్రి ౧౨ గంటలకాలము దానుచక్రవర్తినని కలఁగాంచఁగల్గినచోఁ బ్రతిరాత్రియు ౧౨ గంటలకాలముఁ దానొకకర్మకారుఁడనని కలఁగాంచఁగలిగిన చక్రవర్తి పొందునంతటి సుఖమును బొందఁగలఁడు."

(౧) ౨, ౧౪.

(౨) ౨, ౪.

యుపనిషత్తులలోనే యున్నవి; వీనిని కొన్ని బౌద్ధశాఖలు పెంపొందించి శూన్యవాదములను స్థాపించినవి. జీవిత మొక జాగ్రత్స్వప్నమని నిరూపించుట కీవాదమును గౌడపాదుఁ డుపయోగించెను. ౩. జాగ్రత్ప్రపంచము యథార్థమని మన మన్యుల మానసికావస్థల ననుభవించుటవలనఁ గాక, వారు చెప్పినది విశ్వసించుటవలననే యంగీకరింతుము. జాగ్రత్ప్రపంచములోని వస్తువులకు లక్షణములైన దేశకాల నిమిత్తసంబంధములు పరమసత్యములని మనమూహింప నవసరములేదు. గౌడపాదుననుసరించి, "ఏది స్వయంసంపూర్ణమో, ఏది స్వయంస్థితిగలదో, ఏది స్వయంసంభూతమో, ఏది కారణాంతర తాత్కాలిక స్థితిగలదికాదో, దేనిస్థితి యవిచ్ఛిన్నమై వెల యునో అదియే వస్తుస్వభావము." ౪. ఈవిధముగాఁ బరీక్షించి నపుడు, జీవులు, జగత్తునుగూడ, నిత్యస్థితిగలవి కావనియు నాత్మస్వరూపమాత్రము లేయని యనియు స్పష్టమగును. ౫

వస్తుసముచ్చయము కొన్ని నియమములు గలిగి, కొన్ని సంబంధములతోఁ గూడ మనోగోచరమగును. ఇందు ముఖ్యమైనది గారణధర్మము. కారణకార్యము లేక్రమము ననుసరించి నడచుచున్నవి? అవి యొక పశువిషాణముల వలె నేకకాలికము లైనచో వానికిఁ గారణకార్యసంబంధ ముండఁజాలదు. బీజవృక్షన్యాయమింతకంటె నధికయుక్తి యుక్తముగాదు. మనకుఁ గార

(3) ౨, ౩౧.
(౪) ౪, ౯.
(౫) ౪, ౧౦, ౨౮, ౬౧.

ణము తెలియని దేనినిఁ గార్యమనఁజాలము.౧. స్వభావ దోషము చేతనే కారణధర్మము సంపూర్ణమైనది కాదు. ఒక వస్తుస్థితిని గమనించి, దాని కాధారములను గూర్చి ప్రశ్నించి, అవి తెలిసినచోఁ దిరిగి వానికాధారముల నడుగవలసి వచ్చును. ఈపద్ధతి కంతము లేదు.౨. ఆదిలేని నిత్యకారణము లున్నవనియు నవి కార్యోత్పత్తి చేయుననియు మనము విశ్వసించునెడల, స్వయంకృతమగునది కారణహీనమెట్లు కాఁగలదని గౌడపాదుఁడు వాదించును. మార్పుచెందు నది నిత్యమెట్లు కాఁగలదు? తాము స్వయముగా నజములై వస్తువుల నుత్పాదించు వాని నెచట మనము చూడఁగలము? కారణకార్యము లందుచే ననిత్యములు, పరస్పరాధారభూతములునై, కలిసియే యదృశ్యములగును.3. నిమిత్తధర్మము పరమార్థ స్వరూపము కాదు; అది జ్ఞానలక్షణములలో నొకటి. గౌడపాదుఁడిట్లు చెప్పును; "సదసత్పదార్థములలో దేనికిఁగాని యసత్పదార్థము కారణము కాఁజాలదు. సత్పదార్థమున కింకొక సత్పదార్థమైనఁ గారణము కాదు.౪" సత్పదార్థ మసత్పదార్థ కారణమెట్లు కాఁగలదు? ఈకారణ ధర్మలోపములచే గౌడపాదుఁడు, "ఏదియు స్వయముగాఁ గాని, యన్యముచేఁగాని జనించదు. ఏదియు నుద్భవించియు నుండలేదు. సత్తుగాని, అసత్తుగాని, రెండుఁగాని జనించ

(౧) ౪, ౧౬-౨౧.
(౨) ౪, ౧౧-౧3, ౨౨, ౨3, ౨౫.
(3) ౪, ౧౪-౧౫.
(౪) ౪, ౪౦.

లేదు."౫. కారణధర్మము నవకాశములేదు. ఈశ్వరుఁడు జగత్కారణమని కాని స్వప్నావస్థలకు జాగ్రదవస్థానుభవము కారణమని కాని మనము చెప్పఁజాలము.౧. బాహ్యాభ్యంతర విషయములుగాని, జీవులుగాని జగత్తుగాని యేమియు నిజముకాదు.౨" మనము కారణధర్మము నంగీకరించి నంతకాలమవియు యథార్థములే ౩. "అన్నియు సంవృతి సంజాతములే కాని, నిత్యములేవియుఁ గావు. ప్రతివస్తువు సత్పదార్థసంబంధి యగుటచే నిత్యమే; అందుచే నాశరహితమైనది."౪. ఉత్పత్తి నాశనములు కేవలమిథ్యాదృశ్యములే; ఏదియుఁ బుట్టనులేదు; నశింపను నశింపదు.౫. కారణాది సంబంధముల నన్నిటిని మనము త్రోసిపుచ్చి ప్రపంచాతీతులమైనఁ గాని సత్యము లభింపదు.౬.

(౫) ౪, ౨౨. దీనిపై శంకరుఁడిట్లు వ్యాఖ్యానించెను: ఏవిధముగానైన నొకటియింకొకదానినుండి సంభవించెనని నిరూపించుట నిజముగా దుస్తరము. ఏదియుఁ దనరూపమునుండి తానుబుట్టదు. ఒకఘటమునుండి యింకొకఘటముత్పత్తి కాదు. ఒకటివేఱొకదానినుండియుఁ బుట్టదు. ఘటమునుండి వస్త్రముదయించదు; వస్త్రమునుండి యింకొకవస్త్రమును జనించదు. లేక ఘటపటములుకలిసి వేఱొకఘటమునుగాని, వేఱొకపటమునుగాని జనింపఁజేయఁజాలవు."

(౧) ౪, ౩౯.
(౨) ౪, ౫౧-౫౨, ౯౭.
(౩) ౪, ౫౫-౫౬; ౪, ౪౨.
(౪) ౪, ౫౭.
(౫) ౨, ౩౨.
(౬) ప్రపంచోపశమమ్॥ ౨, ౩౫,

అద్వైతదృష్టిలో బాహ్యాభ్యంతర భేద మితరులు భావించునట్టిదికాదు. మానసిక ప్రపంచము బాహ్యజగత్తు వలెనే దృశ్యవిషయము నసత్యము నైనది. ఆత్మయొక్కటే సత్యమగు ద్రష్ట. ఈభావమును గౌడపాద శంకరు లిరువురు నంగీకరింతురు గాని శంకరుఁడు జాగ్రత్స్వప్నావస్థల భేదము నెక్కుడు శ్రద్ధగా వివరించును. భౌతిక మానసిక ప్రపంచములు రెండును బ్రహ్మ రూపాంతరములే యైనను, వానికి పరస్పరము భేదమున్నదని శంకరుఁడు చెప్పును, కాని గౌడపాదుఁడు సంప్రదాయసిద్ధమగు విజ్ఞానవాదమును సమర్థించినవాఁడగును; ఏలన బాహ్యవస్తువులన్నియు మనఃకల్పితములుగాన నసత్యములని ఋజువుచేయుట కాతఁడు బౌద్ధవిజ్ఞానవాదమునే స్వీకరించెను[౧]. విజ్ఞాన స్పందనమువలననే ద్రష్టృదృశ్య నానాత్వములేనిదే యున్నట్లు భ్రాంతిజనించును.[౨]. మానవుని మనస్సులోనే జగత్తున్నది.[౩]. యథార్థజగత్తనున దంతయు మానసిక సంస్కార

---

(౧) గౌడపాదుని వాదమును జాకొబి యీక్రిందితర్కవాక్యరూపమునఁ జెప్పెను; "జాగ్రదవస్థలోఁ జూచినవస్తువులు నిజముకాదు; ఇది ప్రతిజ్ఞ; అవిదృశ్యములు గనుక: ఇది హేతువు; స్వప్నములోఁజూచినవస్తువుల వంటివే; ఇది దృష్టాంతము. స్వప్నదృశ్యములు నిజముకావు; అదేవిధముగా దృశ్యతాలక్షణము జాగ్రదవస్థలోని వస్తువులకును గలదు. ఇది హేతూపనయము; అందుచే జాగ్రదవస్థలో జూచినవస్తువులు నిజముకావు. ఇది నిగమనము" (జె. ఎ. ఒ. యస్. వాల్యుము ౩౯, పార్టు A ఏప్రిల్ ౧౯౧౩.) ఇంకయుఁ జూడు ౨, ౨౯, ౩౧; ౪, ౬౧-౬౯, ౭౨-౭౩.

(౨) ౨, ౧౫, ౧౭; ౪, ౪౭.

(౩) ౪, ౪౩-౪౮, ౭౨; ౪, ౭౭; ౧, ౧౭.

సముచ్చయమాత్రమే యనియు, వానికనుగుణముగా బాహ్య వస్తువులు లేవనియు నాతఁడు ప్రకటించెను. "వస్తుస్వభావలక్షణ ములనుబట్టి, కారణాకారణత్వము లేదని స్పష్టమగును."౪. "చిత్తము వస్తువులకు సంబంధించిలేదు; వస్తువులందు ప్రతిఫ లించుటయులేదు; ఏలన వస్తువు లసత్యములు; వాని ప్రతి బింబము చిత్త ప్రతిబింబమే."౫.

బాహ్యవస్తువులు ప్రేరేపింపకున్నచో భావములు నూహలు జనించవని బాహ్యజగదస్తిత్వవాది పలుకును. భావములకు వేరుగా స్వతంత్ర్యముగా వస్తువు లున్నవను విశ్వాసము సహేతుకముగాదని గౌడపాదుఁడుచూపినాఁడు; "బాహ్యార్థవాదులను ఖండించుటకు విజ్ఞానవాదులశాఖకుఁజెందిన బౌద్ధులవాదమే గౌడపాదుని వాదమని శంకరుఁ డంగీకరింపక తప్పినదికాదు; కాని గౌడపాదుఁడు విజ్ఞానవాదము నింతవఱకే యంగీకరించెను." ౬. భావప్రవాహ యాథార్థ్యమునుగూడ గౌడపాదుఁడు విశ్వసింపఁడు, విజ్ఞానవాదులకుఁ బ్రధానాధార మగు చిత్తమునే యాతఁడు నిరసించెను. "కావునఁ జిత్తముద యించలేదు; చిత్తము గ్రహించువస్తువులు నుదయింపలేదు. చిత్త చిత్తవిషయముల కుత్పత్తిగలదని తలఁచువారు వాయు

---

(౪) ౪, ౨౫. శంకరుఁడు దీనినిట్లు వ్యాఖ్యానించెను.

"మానసికభావములకుఁ గారణములనఁబడు ఘటాదులకాధార భూతములగు కారణములులేనివి. అందుచేనవి మానసికభావహేతువులుంగావు."

(౫) ౪, ౧౬.

(౬) ౪, ౨౧, ౧౫-౨౭.

మార్గమున గుర్తులు చూచువారే."౧. మన యనుభవ మంతయు మిథ్యయైనచో, సత్యాసత్యదర్శన మెట్టిది? బ్రహ్మ పదార్థదృష్టిలో నెట్టిభేదమును లేదు. రజ్జువును సర్పముగాఁ జూచుటెంత మిథ్యయో, రజ్జువుగాఁ జూచుటయు నంతమిథ్యయే. జాగ్రత్స్వప్నావస్థలలోని వస్తువులజ్ఞానము నిరవధికము గాదు. సుషుప్త్యవస్థలో బాహ్యాభ్యంతరవస్తుజ్ఞానమే లేదు. అట్టి సుషుప్తిలో వస్తువులన్నియు నేకచైతన్యరాశిలోఁ గరిగి కలిసిపోయినట్లు గోచరించును.౨. జ్ఞాతృజ్ఞేయ భేదములతోఁ గూడిన జ్ఞానము పరమసత్యముకాదని సుషుప్త్యవస్థచూపును. కలలున్నంతసేపు కలలు నిజము; స్వప్నముకాని, సుషుప్తికాని కలుగనంతసేపు జాగ్రదవస్థ నిజము. మనము జాగ్రత్స్వప్నావస్థలకుఁ దిరిగివచ్చు సుషుప్తియు వానివలె నసత్యమే; "ఏ యనాదియగు మాయానిద్రనుండి జీవి మేల్కొని, అజము, నిత్యజాగృతిగలది, స్వప్నశూన్యము, నద్వితీయమునగు నాత్మసాక్షాత్కారముగాంచునో" ఆయవస్థతోఁ బోల్చినచో నీ జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు మూడు నసత్యములేయని తెలియును. 3.

"ఏది మొదటలేదో, చివరనుండదో, అది మధ్యమందును గూడ లేనిదే"౪ యను నింకొక హేతువునుబట్టి కూడఁ బ్రపం

(౧) ౪, ౨౮.

(౨) యథా రాత్రౌ నైషేణ తమసాఽవిభాజ్యమానమ్ సర్వమ్ ఘనమివ, తద్వత్ప్రజ్ఞాన ఘనఏవ.

(3) ౧, ౨౬. (౪) ౨, ౬.

చము మిథ్యయని గౌడపాదుఁడు వాదించెను. అనగా దేని కాద్యంతములు గలవో అది యసత్యము.౧. యథార్థాస్తిత్వలక్షణము వస్తువు మనకు దృశ్యమగుట కాని, క్రియార్థకారియగుట కాని కాదు;అది స్వతఃస్థితి గలిగి,త్రికాలాబాధ్యమై యుండుటే. జాగ్రదవస్థలోని వస్తువులు స్వప్నములో నదృశ్యములు; స్వప్న దృశ్యములు జాగ్రదవస్థలో నశించును.దృశ్యప్రపంచ మబద్ధమని గౌడపాదుఁడీ కారణములను జెప్పెను; (౧) స్వప్నప్రపంచ సాదృశ్యము, (౨) దృగ్విషయమగుట,(3) అర్థరహిత సంబంధములు గలిగి యుండుట, (౪) సార్వకాలికము గాకుండుట.

మన కనుభవసిద్ధమగు వస్తుజగత్తంతయు ననిత్యమగుటచే దీని కతీతమగు నిత్య సత్పదార్థము నొకదానిని గౌడపాదుఁడు ప్రతిపాదింపఁబూనెను. అనిత్యదృశ్యము నిత్యవస్తు వున్నదని సూచించును. నిత్యవస్తువు లేదన్నచో ననిత్యవస్తువు లేకుండును.౨. త్రివిధావస్థల కాధారభూతము నతీతమునై ఆత్మ యున్నదని యుపనిషత్తులు వచించుచున్నవి.3. ఆత్మయే యున్నది. అది అవిభాజ్యము; ఏలన నందు భాగము లున్నచో నానాత్వముండును. సత్పదార్థములో భేదములు లేవు; సత్పదార్థ భిన్నమైనది అసత్పదార్థమే; అసత్పదార్థ మనగా లేనిదే." ఏది యున్నదో, అది లేకుండ నుండదు; ఏది లేనిదో అది యెన్నఁడు

(౧) ౨, ౭. (౨) ౩, ౨౮.

(3) ౧, ౧, ఏకఏవత్రిధాస్మృతః పోల్చు:

"సత్త్వాజ్జాగరణమ్ విద్యాత్, రజసాస్వప్న మాదిశేత్,
ప్రస్వాపనన్తు తమసాతురీయమ్ త్రిషు సంతతమ్."

మా. సాం. ప్రి. భా. ౧, ౯౧.

నుండఁజాలదు."౪. సత్తనఁగా జ్ఞానమే; కాకున్నచో నది యేకముకాఁజాలదు. జ్ఞానమే సత్పదార్థము; కాని యిది విపర్యాపసరము గల మానవజ్ఞానముకాదు. మానవజ్ఞానము సంబంధ కలితమగుటచే ద్వంద్వములపై నాధారపడును. ఇచట జ్ఞానమనఁగా నాత్మప్రకాశము; దీనివలననే సర్వమానవ విజ్ఞానము భాసించుట కవకాశము కలిగినది. "ఎన్నఁడుఁ బుట్టనిదీ నిద్రియు స్వప్నమును లేనిది, తన్నుఁదాఁ బ్రకాశింపఁజేయునదీ అది స్వయంప్రకాశము గలది."౧. గాఢనిద్రలో మనకు గోచరించు శూన్యతవంటిది సత్పదార్థమని భ్రమింపరాదు. గాఢ నిద్రలో మనకు గ్రహణశక్తిలేదు; బ్రహ్మస్థితిలో శుద్ధజ్ఞానమున్నది.౨. భిన్నోపాధి గతమైనప్పు డాత్మకు జాగ్రత్స్వప్నసుషు ప్త్యవస్థలు వ్యక్తీకరించుకొను భిన్నరూపములు.౩.

## ౬—సృష్టి

పరమాత్మకును దృశ్యజగత్తులకును సంబంధమునుగూర్చిన సమస్యను గౌడపాదుఁడు పరిశీలించినాఁడు. మనము

(౪) ౪, ౪.

(౧) ౪. ౮౧, వతియోఁజూడు. 3, 33, 3౫-3౬.

(౨) స్థూల సూక్ష్మ కారణ దేహములలో నాత్మ,విశ్వ, తైజస, ప్రాజ్ఞ నామములుగలిగి వ్యవహరింపఁబడును. పోల్చు: హెగెల్ భావములతో; మానవమానసము సత్యమును క్రమోన్నత సోపానదశలో ననగా నస్పష్టభావముతో నారంభించి క్రమముగా స్పష్టభావములనుగలిగి తెలిసికొనును. అనఁగా సత్యమొక సోపానక్రమములో మానవమానస పరిణామము ననుసరించి క్రమముగా నెక్కువస్పష్టముగా వ్యక్తమగుచుండును.

(3) 3, ౧౫.

సృష్టిస్వరూప చింతాపరులముమాత్రమే కాక, పరమార్థ చింతాతత్పరులమైనచో సృష్టియనునదే లేదని విశదము కాఁగలదు. సత్పదార్థము మార్పునొందునది కాదు; పొందు నన్నచో, "అమర్త్యమైనది మర్త్యమగును." ౪. పరిణామ మంతయు నసత్యము; వ్యావహారిక దృష్టికిమాత్రమే సత్యము; నిజముగా భేదమనునది లేదు; (నాస్తి భేదః కథంచన) ౫. అవస్థాభేదరహితమగు నాత్మ, దర్శించుటకుఁ దానేతప్ప వేరె ద్రియును లేదు. శంకరుఁడు పలికినట్లుగా: "వస్తువుల నెఱుఁగు వ్యక్తి క్రియాపరుఁడై యుండవలెనుగాని, కేవలవ్యక్తిత్వము వస్తుజ్ఞానమునీయదు." అనాత్మ ఆత్మయను నీయధ్యాస, ఏక మనేకముగాఁ గన్పట్టు నీభ్రాంతి యెట్లుదయించును? అవిభా జ్యమగు నాత్మ విభాగింపఁబడదు. కాని యనేకత్వభ్రాంతి యున్నది; ఇది యెట్లుకలుగుచున్నదో తెలియదు. కాని మనకు గోచరించు ప్రపంచ మసత్యమైనను దానికి హేతువు నిర్ణయింప వలెననియుఁ జెప్పఁబడెను. ౧. సృష్టికిఁగల భిన్న కారణము లను గౌడపాదుఁడు పరామర్శించును: "సృష్టి దైవవిభూతియని కొందరందురు; సృష్టి కేవల స్వప్నమాయవంటిదని కొందరు చెప్పుదురు; అది దైవసంకల్పమని మఱికొందరు వచింతురు; కాలమునునమ్ము వారది కాలసంభూతమని భావింతురు. సృష్టి భోగార్థమని దలఁతురు."వీనిని నన్నిటిని గౌడపాదుఁడు తిరస్క-

(౪) 3, ౨౧.

(౫) 3, ౧౫. ౯, ౨౪.

(౧) ౧, ౧౭-౧౯.

రించి, యిది 'దేవుని స్వభావ' మనును; సర్వసిద్ధులుగల దేవునికెట్టి వాంఛయుండును ?" ౨. అందుచేఁ బ్రపంచము స్వప్నతుల్యము లేక మిథ్యయను వాదమును దోసిపుచ్చి, గౌడపాదుఁడది యీశ్వరుని స్వభావరూపమగు మహిమా ప్రదర్శనమని వక్కాణించెను. ఇతరవాక్యములలోఁ బ్రపంచ యాథార్థ్యమును సూచించు భావములునుగలవు: "స్వమాయచే నాత్మ తన్నుఁగూర్చి భావించెను. ఈవిధముగా బయల్వెడలిన వస్తువుల నాత్మయే గ్రహించును. ఈవిషయములో వేదాంతము చెప్పు తుదిమాటయే యిది." 3. ఇచట గౌడపాదుఁడు మాయయనఁగా నద్భుతశక్తియనునర్థములో నుపయోగించెను; అది ఆత్మస్వభావ మనెను. "నిత్యప్రకాశ స్వరూపమగు నాత్మ నాత్మస్వభావమే యాచ్ఛాదించును.'౧. మానవదృష్టికి సత్యము గోచరింపకుండ మఱుగుపఱచు ననాదియగు విశ్వశక్తియే మాయయనియుఁ జెప్పఁబడెను.౨. అవ్యాకృతమగు నిర్గుణబ్రహ్మ మాయతోఁగలిసి యీశ్వరుఁడై 'నానాజీవరాశుల నుదయింపఁ జేయుచున్నాఁడు."3.

ఉపనిషత్తు లుదాహరించిన మృత్తి కాయఃపిండాగ్నిస్ఫులింగాదులు నిర్గుణబ్రహ్మను గ్రహించుటకు సాయపడు సూచ

(౨) ౧, ౭-౯.
(3) ౨, ౧౨; ౩, ౧౦.
(౧) ౨, ౧౯.
(౨) ౧, ౧౬.
(3) ౧, ౬.

నలు మాత్రమే.౪.అనంతర వేదాంతమందీ భావమునే అధ్యారోపాపవాదమనియు దాని నిర్మూలనమే యవసరమనియుఁ జెప్పఁబడెను.౫. ఈప్రకటన లన్నిటిలోఁగల తాత్త్విక సత్యమేమనఁగా నాత్మయే వ్యవహారజగత్తున కాధారభూతమగు సత్యమనియు, నది యేకైక స్వరూపమనియుఁ జెప్పఁనగును.౬. "ద్వైతరూపమంతయు మిథ్య; అద్వైతమే సత్యము,"౭. శంకరుఁడు చెప్పినాఁడు; "సర్పము రజ్జువునందువలె, జగద్వస్తు నానాత్వమంతయు నాత్మయందుఁ గలదు."౮. ఆత్మ జగత్తుగా మారు ననరాదు. రజ్జువు సర్పభ్రాంతిని గలిగించురీతినే, ఆత్మ వస్తువుల నుదయింపఁజేయునేకాని నిజముగాఁగాదు.౯. ఆత్మ మాయచే ననేకమైనట్లు కన్పట్టునుగాని తత్త్వతః ఆత్మ అనేకము గాదు.౧౦. "వస్తు నానాత్వస్థితి యాత్మగాదు. వస్తునానాత్వము నకు స్వతంత్రస్థితియు లేదు. అందుచే నేదియు సమానమును గాదు భేదమునుగాదు."౧. ప్రపంచ మాత్మయుఁగాదు తద్భిన్నమునుగాదు. పరబ్రహ్మదృష్టితో గాడపాదుఁడు ప్రపంచము

(౪) 3, ౧౫.
(౫) వేదాంతసారము॥ ౨ అ.
(౬) ౧, ౧౩-౧౭.
(౭) మాయామాత్ర మిదంద్వైతమ్, అద్వైతమ్ పరమార్థతః॥ (౨-౧౭)
(౮) ౨, ౧౨, ౧౯ పై శం॥ భా॥
(౯) 3, ౨౭; ౨, ౧౭.
(౧౦) 3, ౨౭.
(౧) ౨, 3౪.

మిథ్యయనియు, నానావస్తు దర్శన మసత్యమనియుఁ బ్రక
టించును.౨

గౌడపాదుఁడు మాయాశబ్దమును నిశ్చితార్థములో నుప
యోగించియుండలేదు. మాయయనఁగా (౧) ఆత్మకును బ్రపం
చమునకును గల సంబంధము దుర్బోధమనియు (౨) ఈశ్వర
స్వభావమనియు, (3) ప్రపంచము స్వప్నసదృశమనియు నర్థముఁ
లలో నుపయోగింపఁబడెను. శంకరుఁడు మొదటిదాని కధిక
ప్రాముఖ్యమిచ్చి, మూడవదాని కుదాసీనత చూపినాఁడు.
అందుచే గౌడపాదుని వాదము జగత్తు వ్యావహారికసత్యమనుట
కంటె మాధ్యమికుల సంవృతి సత్యము లేక అసత్య మనుటకు
పీలుగానున్నది 3.

నిర్గుణబ్రహ్మమునుజూచి చిత్తము ప్రపంచమని తలఁచి
నచో జీవునిగూర్చియు నట్లేతలఁచును. ఆత్మ నానాజీవరూపము
లలో గోచరించుటయుఁ జిత్తదృశ్యమే. ఆత్మ విశ్వాకాశ
మైనచో జీవుఁడు ఘటాకాశ మనవచ్చును. ఘటము విచ్ఛిత్తి
పొందుటతో ఘటాకాశము మహాకాశములోఁ గలియును.
నామరూప సామర్థ్యా ద్యుపాధివశమున భేదములు కలిగినవి.
ఘటాకాశము మహాకాశములో నొక భాగమనికాని, దాని
వికారమని కాని చెప్పఁజాలనట్లే, జీవాత్మ పరమాత్మాంశమని
కాని దాని వికారమనికాని చెప్పవలనుపడదు. రెండునొకటే;

(౨) 3, ౧౯, ౨౮; ౪, ౪౫; ౨, ౧౭.

(3) వ్యావహారికవస్తు ప్రపంచము గగనసదృశమైన మిథ్యయని గౌడ
పాదు నభిప్రాయము. జ్ఞానమును మిథ్యావస్తు సదృశమే.

భేదములు దృశ్యమాత్రములే; కాని వ్యావహారికావసరార్థము భేదమును గుర్తింపవలసియుండును.౪.

## ౭—ధర్మశాస్త్రము; మతము.

తన స్వస్వరూపము నాచ్ఛాదించు బంధవిచ్ఛేద మొనర్చుటయే మానవునికి నిశ్శ్రేయస్సంప్రాప్తిసాధనము. జీవాత్మయే పరమాత్మయను జ్ఞానమే మోక్షహేతువు.౧. ముక్తపురుషుఁడు లేక ఆత్మ "యెన్నఁడు పుట్టలేదు; అది కారణధర్మాతీతము".౨. నిజమెఱిగినవాఁడు ప్రపంచములో జడసమానుఁడై, సంపూర్ణముగ నుదాసీనభావముతో జీవించును,౩. విధి నిషేధము లాతని బంధింపవు.౪.

ఉత్తమశ్రేయఃప్రాప్తికిఁ గ్రమోన్నతసాధనము చేయుటే నైతికప్రయత్నము. జీవులకు పృథగ్వ్యక్తిత్వముగల వ్యావహారిక జగత్తునందే మంచి చెడుగుల భేదమున్నది మానవుని సంపూర్ణ వ్యక్తిత్వము నావహించునదే అవిద్య గావున, దానిని నిర్మూలించుటకు సమ్యక్ జ్ఞానమే కాక, సత్ప్రవర్తనమును, దైవభక్తియు గూడ నవసరములు మతము వలన మనము నిశ్శ్రేయసమును బొంద సాధ్యమగును. దైవారాధనములో జీవికి సంపూర్ణస్వాతంత్ర్యము గలదు. అన్నిరూపములు పరబ్రహ్మరూపములే కావున నెవఁడెట్లు భావించినను దోషములేదు.౫. జీవేశ్వరభేదము పె

(౪) ౩, ౩, ౧౪.

(౧) ౨,౧౮,౩౮. (౨) ౪,౭౫;౩,౩౮.

(౩) ౨,౩౬. (౪) ౨,౩౭.

(౫) ౨,౨౯-౩౦.

నాధారపడిన మతము, వ్యావహారికార్థకారి కావున, బూర్ణ సత్యము గాకున్నను నంగీకరింపఁబడినది౬. గౌడపాదుఁడు యోగ పద్ధతి కూడ నొక మార్గమని యంగీకరించును. “నిజమైన ఆత్మ జ్ఞానముచేఁ జిత్తమాలోచించుట మానినచో వృత్తిరాహిత్యము వలన నది శాంతిఁ బొందును.”౭. జ్ఞానస్థితి నిద్రయని భ్రమింప రాదు; ఏలన నిచట బ్రహ్మమే జ్ఞానవిషయము.౮. అది భావా తీతము, నద్వైతము, నగు స్థితప్రజ్ఞావస్థ౯. మనోనిగ్రహమును గోరు యోగపద్ధతి క్లేశతరమని చెప్పి,గౌడపాదుఁ డీప్రయత్నము సాగరమునంతను కుశాగ్రముతో నొక్కొక్క బిందువు చొప్పున నిర్జల మొనర్చుట వంటిదని పోల్చెను.౧౦. కాని మోక్షానంద సిద్ధియగువరకు నీప్రయత్నమును దృఢసంకల్పముతోఁ జేయుచుఁ బోవలెను.

౮—గౌడపాదుఁడు; బౌద్ధమతము.

బంధమోక్షములు, జీవుఁడు, ప్రపంచము నన్నియు నసత్యములను గౌడపాదుని రచనలలోని భావమొక మిథ్యాజీవి మిథ్యాప్రపంచములో నొక మిథ్యాబంధ విముక్తికై చేయు ప్రయత్నము వలనఁ గలుగు మోక్షమును మిథ్యయే గావచ్చు నను నిశితవిమర్శకు గురి కావచ్చుననుటలో నాశ్చర్యము లేదు. ఎన్నఁడు మార్పులేని పరతత్త్వము తన సహజస్థితిని గోల్పోవ కుండ, నెట్లు మార్పులతోఁ గూడిన ప్రపంచమగునను రహస్య

(౬) 3,౧౦. (౭) 3,3౨.
(౮) 3,33-3౪. (౯) 3,3౫-3౮.
(౧౦) 3, ౪౦-౪౧.

సమస్యకుఁ బరిష్కారము లేనిదని చెప్పుట వేరు; పరిణామ ప్రపంచ మంతయు మరుమరీచిక యని త్రోసిపుచ్చుట వేరు. మనము బ్రతుకుట యను నాఁట నాడఁదలఁచి నప్పుడు, మన మాడు నాఁట బూటకమే యనియు, నందు లభించు బహుమానము లన్నియు హుళుక్కి యనియు భావింపఁజాలము. ఇట్టి సిద్ధాంత ముతోఁ గూడిన తత్వమేదియు మనకుఁ జిత్తశాంతి నొసఁగఁ జాలదు. భావములో నంతయు నసత్యమని నిశ్చయముగా నమ్మి, వ్యవహారములో సర్వవస్తువులతో సంబంధము పెట్టుకొనక తీరని స్థితిలో నుండుటయే యీసిద్ధాంతమును సంపూర్ణముగా ఖండించుట కాధారభూతమగును. జగదస్తిత్వమును గూర్చిన సమస్య గుప్తము దుర్బోధమును గావచ్చును. అనఁగాఁ బ్రపంచమున కతీతమై తనలోఁ బ్రపంచమును లీనమొనర్చుకొను పరమసత్య మొకటి యున్నదని యర్థము కావచ్చును. గాని ప్రపంచము స్వప్నదృశ్యమనికాదు, ఈభావము నతిశయోక్తిగా గౌడపాదుఁడు చెప్పుటకుఁ గారణము తరువాత వచ్చిన బౌద్ధమతసిద్ధాంతములే. అందుచే నాతఁ డవసరము లేనంతగాఁ దనది బౌద్ధవాదము కాదని వక్కాణించును. తన గ్రంథాంత మందాతఁడు, "ఇది బుద్ధుఁడు చెప్పినది కాద"ని నిరసించెను.౧. దీనిపై వ్యాఖ్య వ్రాయుచు శంకరుఁడిట్లు రచించెను; "బౌద్ధసిద్ధాంత మద్వైత సాదృశ్యమును గలిగి యున్నది. కాని వేదాంతమునకు మూల స్తంభమైన అద్వైతతత్వమది కాదు."

(౧) నైతత్ బుద్ధేనభాషితమ్. (౪, ౯౯.)

గౌడపాదుని గ్రంథములు బౌద్ధమతమునందు ముఖ్యముగా విజ్ఞానవాద, మాధ్యమికశాఖల భావములవలనఁ బ్రేరితమైన లక్షణములు గలిగియున్నవి. ౨. బాహ్యవస్తుజాలమంతయు నసత్యమని ఋజువుచేయుటకు విజ్ఞానవాదులే హేతువులను జూపిరో, గౌడపాదుఁడును వానినే చూపెను. బాదరాయణ శంకరులిరువురును స్వప్నజాగ్రదవస్థలకు 3. నిజమగు భేదమున్నదనియు, జాగ్రదవస్థలోని భావములు వస్తుసంబంధహీనములైన స్వతంత్రభానములు గావనియు నంగీకరింతురు. కాని గౌడపాదుఁడు జాగ్రత్స్వప్నావస్థలకు భేదము చూపెను. ౪. బౌద్ధవిజ్ఞానవాదముతోఁ దనతత్త్వమునకు సంబంధము లేదనిచూప శంకరుఁడు యత్నింపఁగా గౌడపాదుఁడు విజ్ఞానవాదము నాహ్వానించినాఁడు ౧ విజ్ఞానవాదమే పరమసత్యమని యంగీకరించుట కిష్టపడక, దృశ్యమెంత మిధ్యయో, ద్రష్టయునంతే మిధ్యయని గౌడపాదుఁడు ప్రకటించి, నాస్తికవాదమున కతి సమీపమునకుఁబోయెను. నాగార్జునునివలెనే యాతఁడు కారణధర్మమును ద్రోసివుచ్చి, ౨ పరిణామసత్య

(౨) గౌడపాదుఁడు బౌద్ధుఁడేయనియు, బౌద్ధమత ముపనిషణ్మతము నకు సరిపడినదేయనియు నాతఁడునమ్మి మాధ్యమిక కారికాభాష్యమును రచించెనని తలఁచువారు కొందరుగలరు. చూ॥ దాసుగుప్త: హిస్టరీ ఆఫ్ ఇండియన్ ఫిలాసఫీ (పు॥ ౪౨3-౪౨౮.)

(3) ౨, ౨, ౨౮-3౨.

(౪) ౨, ౪.

(౧) ౪, ౨౪-౨౮.

(౨) ౨, 3౨; ౪, ౪, ౭, ౨౨, ౫౯.

మని ఖండించెను. "నాశనము లేదు, సృష్టియును లేదు; ఎవఁడును బద్ధుఁడుగాఁడు; ఎవఁడును మోక్షకామిగాఁడు, మోక్షసిద్ధియెవ్వనికి లేదు. ఇదియే పరమసత్యము." 3. వ్యావహారజగత్కారణ మవిద్యయే; నాగార్జునునిమాటలలో సంవృతి. "ఐంద్రజాలికకల్పితమగు బీజమునుండి, మాయా కల్పితాంకురము మొలకెత్తినది. ఈయంకురము నిత్యమునుఁ గాదు; వస్తువులస్థితియు నట్టిదే." ४. భేదములతోఁగూడిన జ్ఞానమునకతీతమైన పరమసత్యము భావాభావములచేఁగాని, రెంటిచేఁగాని, రెంటిలోపముచేఁగాని, వర్ణించుటకు సాధ్య మైనదిగాదు. గౌడపాద నాగార్జునుల భావములో సత్యము ప్రపంచోపశమమైనది ౫. ఈసిద్ధాంతసామ్యము లేకాక, భాషా సామ్యములనుబట్టియు బౌద్ధమతప్రభావము గౌడపాదరచనలోఁ గలదని స్పష్టముగాఁ దెలియుచున్నది. వస్తువులకు 'ధర్మ' మనియు బుద్ధిజ్ఞానమునకు 'సంవృతి' యనియు, బాహ్యజగదస్తిత్వమునకు

(3) ౨, ౩౨; మాధ్యమికకారిక, ౧,౧; యోగవాసిష్ఠము. ४,౩౮, ౨౨.

"నబంధోఽస్తి నమోక్షోఽస్తి నాబంధోఽస్తినబంధనమ్.
అప్రబోధాదిదమ్ దుఃఖమ్ ప్రబోధాత్ప్రవిలీయ తే."

(४) ४, ౫౯. శూన్యమునుండి వస్తువు లుద్భవించినవను బౌద్ధవాద సారాంశమిందుఁ జెప్పఁబడెను.

(౫) ప్రపంచోపశమమ్. ౨,౩౫. పోల్చు. మాధ్యమికకారిక ౧, ౧; ౨౦, ౨౫.

"సర్వోపలంభోపశమః ప్రపంచోపశమశ్శివః
నక్వచిత్ కస్యచిత్ కశ్చిత్ ధర్మో బుద్ధేన దేశితః॥

'సంఘాతము'నియు నామములు బౌద్ధప్రయోగములే. ౧. అలాటచక్రోపమానము, జగన్మిథ్యాత్వమును దెల్పునిమిత్తము బౌద్ధరచనలలోఁ దరచుగా నుపయోగింపఁబడెను." ౨.

మాధ్యమికుల అభావతర్కము నుపనిషద్బ్రహ్మోపదేశముతో మేళవించుటకై చేయఁబడిన ప్రయత్నమే గౌడపాదకారిక. కాని గౌడపాదుని రచనలో నభావవాదము భావాత్మకలక్ష్యము నతిశయించియున్నది. శంకరుఁడు రెంటికిని సముచితస్థానసిద్ధినిఁ జేకూర్చినాఁడు.

## ౯—భర్తృహరి.

సమానభావములు గలిగి శంకరునకుఁ బూర్వుఁడైనట్టియు, విఖ్యాత తర్కవ్యాకరణవేత్తయు నగు నాతఁడు భర్తృహరి.౩. క్రీ. పె. ౬౫౦ లో నీతఁడు గతించియుండునని మ్యాక్సుముల్లర్ తలఁచినాఁడు.౪. ఈతఁడు రచించినది 'వాక్య

(౧) ౩, ౧౦; ౪, ౨౨.

(౨) లంకావతారము. బి. టి. యన్. ప్రతి. పు. ౯౫. బౌద్ధశూన్యవాదమునే వేదాంత పరముగా గౌడపాదుఁడు సూత్రీకరించెనని సమర్థించు పండితులు చాలమందిగలరు. జాకొబి, పౌసిన్, సుక్తాంకర్, విధుశేఖరభట్టాచార్యాదులు. కాని శంకరుఁడు బౌద్ధమతసామ్యముగల వాక్యముల కన్నిటికి వేరర్థములు చెప్పినాఁడు. చూ: ౪, ౧, ౨, ౧౯, ౪౨, ౯౦. ఇందు బుద్ధబౌద్ధసిద్ధాంతములకుఁగల స్పష్టములగు సంబంధ వాక్యముల కర్థాంతర కల్పనము నెట్లుచేసెనో శంకరుని భాష్యము తెలుపును.

(3) కవియగు భర్తృహరియు, తర్కవ్యాకరణవేత్తయు నొకఁడుగాఁడని డాక్టర్. వింటర్నిజ్ పండితుఁడు సంశయించినాఁడు, కాని యీ సుప్రసిద్ధుఁడగు విద్వాంసుఁ డీవిషయమున సరిగా నాలోచించియుండలేదు.

(౪) సాం॥సూ॥ పు. ౯౦.

పది' యను మహత్తరమైన తత్త్వగ్రంథము. ఇది యించుమించుగా బౌద్ధమతభావ సమన్వితము. భర్తృహరి పెక్కుమారులు బౌద్ధసన్న్యాసియై, తిరిగి సంసారిగా మారినాఁడని ఇత్సింగ్ చెప్పినాఁడు. అతని యుపదేశము లీగాథను సమర్థించునవిగానే కన్పట్టును. ఆతఁడు వక్కాణించిన జగదనిత్యత్వము, వస్తునిస్సంగత్వావసరము బౌద్ధలక్షణయుక్తములు. "సర్వవస్తువులు భయాన్వితములు; వైరాగ్య మొక్కటే భయములేనిది."౧. అనంతభేదసహితమగు ప్రపంచ మూహాకల్పితము, ప్రపంచవస్తువులన్నియు నిరాత్మకములు; నామధేయములచే వానికి వ్యక్తిత్వమాపాదింపఁబడుచున్నది. కాని యాతఁడు బ్రహ్మపదార్థమును బరమసత్యముగాఁ బ్రతిపాదించి, జగత్తు వివర్తరూపమని వర్ణించుటచే భర్తృహరి బౌద్ధులతో భేదించినాఁడని తెలియవలెను. వాక్కే బ్రహ్మమని యాతఁడు చెప్పెను: "అద్యంత రహితము, నక్షర శబ్దతత్త్వస్వరూపమునగు బ్రహ్మము పరిణామముతోఁ గూడిన ప్రపంచ వస్తురూపముల ధరించినది."౨. "నిరవయవము, నిత్యస్ఫోటరూపము, నగు బ్రహ్మమే శాశ్వతమైనది."3. శబ్దబ్రహ్మభావము గ్రీకు లుపయోగించిన 'లోగాస్' భావము వంటిదే.

---

(౧) సర్వం వస్తుభయాన్వితమ్ భువిన్నృణామ్ వైరాగ్యమేవాభయమ్.

(౨) అనాది నిధనమ్ బ్రహ్మశబ్దతత్త్వమ్ యదక్షరమ్, వివర్తతేఽర్థభావనప్రక్రియాజగతో యథా.॥

(3) స్ఫోటాఖ్యోనిరవయవో నిత్యశబ్దోబ్రహ్మైవేతి, (స. ద. సం. పు. ౧౪౦)

## ౧౦—భర్తృప్రపంచము.

శంకరుఁడు బృహదారణ్యకోపనిషద్భాష్యమునందు భర్తృప్రపంచ ముపదేశించిన ద్వైతాద్వైతము లేక భేదాభేద వాదము నుదాహరించినాఁడు. వీని ననుసరించి, బ్రహ్మము ద్వైతము నద్వైతము కూడనై యున్నది, కారణబ్రహ్మమును కార్యబ్రహ్మము నను భేదమున్నది కాని, ప్రపంచము తిరిగి బ్రహ్మమందుఁ బ్రవేశించిన వెనుక రెండు నొకటే యగును. పరస్పరవిరోధములగు ద్వైతాద్వైత లక్షణము లొకే దృష్టి కుండఁజాలవు. అనేకత్వములో నేకత్వలక్షణము లౌకికవస్తువులకు వర్తించును గాని, బ్రహ్మమునకు వర్తించదు. ఉపాధిగతుఁడైన జీవికి ద్వైతము నిజము గావచ్చును, కాని ముక్తజీవి కది యదృశ్యయగును.

## ౧౧—శంకరుని కుపనిషద్బ్రహ్మసూత్ర సంబంధము.

మానవజాతి యొక్క పెంపొందుచున్న ఆత్మశక్త్యావిష్కరణ రూపమే తత్త్వశాస్త్రము. దానికాకృతి నొసఁగువారే తత్త్వవేత్తలు. సకలవిఖ్యాత శకములలో విపులఖ్యాతిఁగన్న విజ్ఞానవేత్త లుదయించి, వారట్టి యుగావసరజన్ములు, యుగ సృష్టికర్తలునై విలసిల్లుదురు. యుగమున కేది యవసరమై యున్నదో యట్టి తత్కాలావసరావకాశమును హస్తగత మొనర్చుకొని, చిరకాలమునుండి యావిష్కృతి కవకాశసామర్థ్యములులేక ప్రజాహృదయములం దటమటించుచున్న యావే

(౮) శం.భా.బృ.ఆ.ఉ. ౫,౧. దీనిపై సురేశ్వరాచార్య వార్తికమును, ఆనందజ్ఞానిటీకను చూ.

దనలకు వాఙ్మూల్యమునిచ్చి బహిఃప్రకటన మొనర్తురు. ప్రథమ శ్రేణికిఁజెందిన మహితప్రజ్ఞాధురీణుఁడై, తన యుగమున సంప్రదాయసిద్ధమై వెలయుచున్న తత్త్వప్రపంచ రంగమునఁ బ్రవేశించి, దానికిఁ దద్యుగావసరోచిత రీతిని నూతన రూపకల్పన మిచ్చెను. హిందూవిజ్ఞానము బౌద్ధమతమును సమగ్రముగా జయించినను, బౌద్ధమతమం దిమిడియున్న యొక గుప్తమైన బలము ప్రజాహృదయములలో ముద్రితమైపోయినది. అనుశ్రుతములుగావచ్చిన విశ్వాసములందు బౌద్ధమతము వెదఁజల్లిపోయిన సంశయభావము లింకను సంపూర్ణముగా నశించిపోలేదు. వైదిక కర్మకలాపమువలనఁ గలుగు తత్త్వప్రయోజనమునుగూర్చి శంకించువారి కందరకు మీమాంసకులు సహేతుకమగు సంతృప్తి నొసఁగఁజాలకుండిరి. వివిధాస్తికశాఖావాదులు తమకుఁ దోఁచినరీతినిఁ గర్మల నాచరించుచు వానికివలయు శ్రుతిప్రమాణములను జూపుచుండిరి. భిన్నశాఖల వివాదములతో విసిగి వేసారిన చరిత్రలోని సందిగ్ధభావ వికీర్ణమైన యుగమది. పూర్వసంప్రదాయ విజ్ఞానమును విడువనొల్లకున్నను, నూత్న మతశాఖాభిప్రాయములయెడ నాదరభావమును నెరపి, ప్రాచీన విజ్ఞానభాండములను విచ్ఛిన్నముకాకుండ విశాలమొనర్చి, భిన్నదశలలోనున్న విజ్ఞానసంస్కృతీ ప్రతినిధులైన మానవుల కందరకు సముచితస్థానముఁ జూపి, కలహించుచున్న పలుతెగలవారికి సమన్వయ సామరస్యములఁ జేకూర్ప సమర్థుఁడైన అప్రమేయధర్మ ప్రతిభాశాలి యొకఁ డవసరమైనాఁడు. కోట్లకొలఁది ప్రజల శ్రుతిపుటములలో నదివరకే గింగురు

మనుచు నున్న యుగధ్వనికి శంకరుఁడు సుస్వరముఁగూర్చి భిన్నమహైక్యసూత్రి మద్వైతవేదాంతమే యని గంభీరకంఠముతోఁ జాటెను.

తాను బ్రవచింపఁబోవు సిద్ధాంతము నూత్నమైనదికాక నిజముగా వేదాంతర్గతమైనదేయని ప్రకటించి శంకరుఁడుత్కృష్ట వినమ్రభావమును జూపినాఁడు. అనేక పూర్వగురు పరంపరానుగతమై యవిచ్ఛిన్నముగావచ్చిన మహత్తర ప్రాచీన సంప్రదాయమే తానుపదేశించుచున్నానని యాతఁడు విశ్వసించెను.౧. వేదాంతసూత్రములకు భావాంతరవిశ్వాసముగలవారనేకులు భాష్యములను రచించియుండిరని యాతఁడెఱుఁగును. తనకు భిన్నముగా రచించిన వేరొక్క భాష్యకారు నాతఁడు తరచుగా స్మరించెను ౧. నిజముగా శంకరుని సిద్ధాంతము పూర్వసంప్రదాయానుగుణమైనదో, లేక దానికిఁ బునర్నిర్మాణమో, లేక పూర్వవిజ్ఞానమునకుఁ గ్రొత్తగాఁజేర్చిన నవ్యకల్పనమో నిర్ణయించుట సుసాధ్యము కాదు. పురాతన నవీన భావభేదమును మనము నిర్ణయింపఁజాలము; ఏలన, జీవిత వ్యాపారములోఁ బ్రాఁత క్రొత్తలు కలిసిపోవును.

ప్రధానోపనిషద్విషయములో, శంకరునిసిద్ధాంత ముపనిషద్భావానుగుణ్యమై యున్నదని చెప్పవలెను. మనమిది

(౧) వృత్తికారునకు వ్యతిరేకముగా శంకరుఁడు పూర్వగురుపరంపరను స్మరించినాఁడు. చూ॥ దహరాధికరణము. ఇందు "అస్మదీయాశ్చ" శబ్దమున్నది మఱియు "సంప్రదాయవిధిచార్యైః" అని పెక్కుతావులఁ జెప్పఁబడెను. చూ॥ తైత్తిరీయోపనిషత్తునకు శం॥ భా॥ ప్రారంభశ్లోకము.

వరలోఁ జూచినరీతి నుపనిషత్తులు జగద్రహస్యమునుగూర్చి యే యొకనిశ్చితభావమును బ్రకటింపవు. ఉపనిషత్కర్తలు పెక్కురు గలరు; వారు సమకాలికులుగారు; అందుచే వారందరొకే భావమును బ్రకటింపఁదలఁచిరని యూహించుటకవకాశము లేదు. కాని శంకరుఁ డుపనిషత్తుల కేకాభిప్రాయమున్నదని చూపయత్నించినాఁడు. శంకరుననుసరించి బ్రహ్మజ్ఞానము, సర్వోపనిషత్సామాన్యమై, యెట్టి పరస్పరభిన్నత్వమునులేనిదై యున్నది. ౨. పరస్పర మత్యంతవిరుద్ధములుగా గోచరించు నుపనిషద్వాక్యములను సమన్వయింప శంకరుఁడు పూను కొనెను.

ఉపనిషత్తులలోఁ బరబ్రహ్మమును గూర్చి నిర్గుణసగుణ భేదవర్ణనలున్నవి. పరాపర విద్యాభేదము వలన వానికి సమన్వ యమును గూర్ప శంకరుఁడు యత్నించినాఁడు. పరాపర విద్యా భేదముపనిషత్తులలో నున్నది.3. ఉపనిషత్తులలో నున్న పరాపర విద్యాభేదము శంకరుఁడు స్వీకరించిన రీతిగా లేకున్నను, శంకరుఁ

(౧) శం॥ భా॥ ౪,3,౭;౧,3,౧౯. శంకరుఁడు ఖండించిన వృత్తికారుఁడు బోధాయనుఁడు గాఁడనియు, బృహదారణ్య కోపనిషద్భాష్యములో శంకరుఁ డుదాహరించిన 'సంప్రదాయవేత్త'యగు ద్రవిడుఁడు విశిష్టాద్వైత శాఖకుఁ జెందిన ద్రావిడభిక్షుఁడనియు లింగేశ మహాభగవత్ తలఁచినాఁడు. చూ, ఇండియన్ ఫిలసాఫికల్ రివ్యూ; వాల్యూము ౪, పు. ౧౧౨, భగవాన్ ఉపవర్షుని నామము శంకరభాష్యమున రెండుమారులు స్మరింపఁబడెను. శం, భా; ౨,3,౨౮; 3,3,౫3.

(౨) డ్యూసేన్స సిస్టమ్ ఆఫ్ వేదాంత, పు. ౯౫.

(3) ముండకోపనిషత్తు ౧,౧,౪-౫; మైత్రాయణ్యుపనిషత్తు,౬,౨౨,

డిచ్చిన యర్థమునకు వ్యతిరేకము గాదు. ఉన్నత తత్త్వజ్ఞానమునకు, సామాన్య ప్రాకృతభావమునకు గల భేదమును గుర్తించుట మూలముననే, యాజ్ఞవల్క్యు నద్వైతతత్త్వమును, సగుణ స్వరూపుడగు నీశ్వరుడు సృష్టికర్త, ప్రపంచము యథార్థమైనది మున్నగు భావములను జెప్పిన ద్వైతమునకును సామరస్యమును గూర్చుటకు సాధ్యమగును. ఈ భేదనియమముచే శంకరుఁడనేక క్లిష్టసమస్యలకుఁ బరిష్కారము గాంచెను. ఈశోపనిషత్తునందు౧. "బ్రహ్మ, మచలమైనది; మనోవేగమును మించిన వేగముగలది"యను పరస్పర విరోధలక్షణములు చెప్పఁబడెను. "ఇందు వైరుధ్యమేమియు లేదని"శంకరుఁడు చెప్పినాఁడు. బ్రహ్మమును నిర్గుణ సగుణరూపములలో నూహించుట కవకాశములున్నవి.౨. బ్రహ్మమును వర్ణించిన నిర్విశేషసవిశేషలక్షణములనుగూర్చి శంకరుఁడిట్లు చెప్పినాఁడు: "రెండుభిన్నదృష్టులకు బ్రహ్మమేకకాలముననే నిర్గుణము సగుణమునై గోచరింపవచ్చును, ముక్తపురుషునిదృష్టికి బ్రహ్మము నిర్గుణముగాను సంసారబద్ధుని దృష్టికి సగుణముగా ననగాఁ బ్రహ్మముజగత్కారణమనియు సర్వజ్ఞుఁడనియుదోఁచును. బ్రహ్మముతో నైక్యసిద్ధిని, లేక సారూప్యమునుబోధించు ద్వివిధోపనిషద్వాక్యములకు శంకరుఁడతిసులభముగా సమన్వయమును గూర్చును. ప్రాచీనోపనిషత్తులలో మాయావాదము మృగ్యమైనను, నది యుపనిషత్తుల భావ

---

(౧) నైషదోషః నిరుపాధ్యుపాధి మత్త్వోపపత్తేః।

(౨) ఛాం.ఉ. ౮,౧,౫; బృ.అ.ఉ. ౪,౫,౧౩.

ముకు సమ్యక్పరిణతియని చెప్పనొప్పును. ౧. అవిద్యాశబ్దము కఠోపనిషత్తునందుఁ గలదు; ఇది యిచట నజ్ఞానార్థమున వాడఁబడియున్నది. ౨. కాని యీ యవిద్యాశబ్దము శంకరాద్వైతమునఁ బ్రముఖపాత్రత గాంచినది. బ్రహ్మము నిర్విశేష పదార్థమనియు మోక్షమనఁగా బ్రహ్మైక్యమనియుఁ జెప్పు నుపనిషద్వాక్యముల కుచితార్థ వివరణమొనర్చుటలో నితర భాష్యకారులకు విశేషకష్టము సంభవించెను. కొన్ని వాక్యములముఖ్యములని శంకరుఁడు త్రోసిపుచ్చినవియుఁ గలవు. ౩. కాని మొత్తముమీఁద శంకరు నుపనిషదర్థమే యితరభాష్యకారునికంటె నధికతృప్తికరమైనది. ౪. మనము వేదాంత

(౧) కఠ. ఉ. ౨,౪,౨; ఛాం.ఉ. ౮,౩,౧-౩; ౧,౧,౧౦; ప్రశ్న. ౧,౧౬ బృహదారణ్యకో. నిషత్ప్రార్థన "అసతో మాసద్గమయ, తమసో మాజ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతం గమయ" మాయాసిద్ధాంతమును సూచించును. (౨) ౨,౪,౫; ముండకోపనిషత్తు, ౨, ౧, ౧౦.

(౩) చూ. డ్యూసేన్: ది సిస్టమ్ ఆఫ్ వేదాంత, పు. ౯౫.

(౪) థీబో, గఫ్, జాకోబ్ యీయభిప్రాయమునే కలిగి యున్నారు. "సర్వోపనిషత్తులలోని యుపదేశము నంతనొక పరస్పరవైరుధ్యములు లేని సమన్వయసిద్ధిగల సిద్ధాంతమునకు సరిపడునని స్థాపించుట దుస్సాధ్యమగు కార్యము. కాని యట్టి కార్యమునకుఁ బూనుకొన్నచో శంకరుని తత్త్వమే నిర్మించుటకు సాధ్యమైన వానిలో శ్రేష్ఠతమమైనదని చెప్పవచ్చును." (శంకర భాష్యమున కుపోద్ఘాతము; థీబో.) "శంకరుని తత్త్వముపనిషత్సిద్ధాంతముల యొక్క సహజము సముచితమునైన నిర్మాణము." (గఫ్: ఫిలాసఫీ ఆఫ్ ది ఉపనిషత్సు, పు. ౮.) కలనల్ జాకోబ్ యిట్లు వ్రాసినాఁడు; "ఉపనిషత్తులలోని వైరుధ్యములన్నిటిని విడఁదీసి, సమ్యక్సామరస్య సంపన్నాలసితమైన యొక తత్త్వముగా నిర్మించు దుస్తరకార్యమునకుఁ బూనుకొన్నచో శంకరుని తత్త్వమొక్కటే యట్టి కార్యమును సాధించెనని చెప్పవలెను." (వేదాంతసూత్రమున కుపోద్ఘాతము.)

సూత్రము దీసికొనునప్పుడీవిషయమంత సులభమైనది గాదు. భాష్యములు చూడకున్నచో సూత్రకారు నభిప్రాయములు దుర్గ్రాహ్యములు. ఒకగ్రంథముయొక్క అర్థనిర్ణయము చేయుటకు హిందూసంప్రదాయము ననుసరించి యాఱురకముల పరీక్షలున్నవి. (౧) ఉపక్రమము, ఉపసంహారము (౨) అభ్యాసము, (౩) అపూర్వత, (౪) ఫలము, (౫) అర్థవాదము, (౬) ఉపపత్తి. వీనిననుసరించి పరిశీలింపఁగాఁ దానుస్థాపించిన యద్వైతమే సూత్రసిద్ధాంతమని శంకరుఁడభిప్రాయపడు. ౧. ఉపనిషదుపదేశసారమే వేదాంతసూత్రమను సంప్రదాయ భావమునకు నిది సరిపోవును. పెక్కురు వేదాంతపండితులు, ముఖ్యముగా డాక్టర్. థీబో, సూత్రకారు నభిప్రాయమునకు రామానుజవాదమే సమీపించునని తలఁచిరి. ౨. ప్రతిభారతీయ

(౧) శం॥ భా॥ ౧, ౧, ౪.

(౨) "పరాపరబ్రహ్మజ్ఞాన భేదమును వారు కల్పించియుండలేదు; శంకరునివలె వారు పరబ్రహ్మము, ఈశ్వరుఁడు నను భేదమును జెప్పలేదు; శంకరునివలె జీవాత్మ పరమాత్మైక్యభావమును వారు స్థాపించలేదు."(శం॥భా॥ ఉపోద్ఘాతము.) ఈతఁడు చూపిన ముఖ్యహేతువుల నిట్లు పేర్కొనవచ్చును; (౧) చతుర్థాధ్యాయములోని చివరి మూఁడుభాగములు, నీశ్వరసాక్షాత్కార సిద్ధి పొందినవ్యక్తి పునరావృత్తిరహితమైన బ్రహ్మలోకప్రాప్తినొందు సోపానక్రమమును వర్ణించును. మఱియు గ్రంథాంతసూత్రము "వారికిఁ బునరావృత్తి లేదని శ్రుతి చెప్పుచున్న" దనునదియే ఉపసంహారమగుటచే, నీయవస్థ పునర్జన్మరహిత మోక్షస్థితియేకాని, శంకరుఁడు తలఁచినట్లు మోక్షమార్గములోనొక ఘట్టము కాదని తెలియవలెను. శంకరుననుసరించి, ౪।౨,౧౨-౧౪,౪,౪,౧-౭ నిర్గుణబ్రహ్మసిద్ధి నందినవాని యవస్థను వర్ణించును. దీనికి సమాధానముగా నుపసంహారమునకంటె నుపక్రమ మీవిషయములో నిశ్చయాత్మకమైనది. ఉప

భాష్యకర్త యుఁ దన దే సూత్రకారు నభిప్రాయమునకు సరియగు

క్రమ మెక్కువ విలువగలదని అప్పయ్యదీక్షితుఁడు చెప్పినాఁడు. కాని యీ సమాధానమే థీబో ౪,౩,౭-౧౬ నందు బాదరి, జైమిని, బాదరాయణుల భావములుగలిగి, ఉపక్రమమునఁ బూర్వపక్షము, నుపసంహారమున సిద్ధాంత స్థాపనమును జరుగునని చెప్పిన దానికి ఖండనమగును. (౨) ౧,౧,౨ లోఁ జెప్పఁబడిన బ్రహ్మనిర్వచన మీశ్వర నిర్వచనముగాఁ దీసికొనుటకువీలులేదు. "శాశ్వతమగు నిశ్శ్రేయసము నొసఁగఁజాలని అపరబ్రహ్మ నిర్వచనముతో సూత్ర మారంభించెననియు, నుపసంహారములో నట్టిసగుణబ్రహ్మమే వర్ణింపఁ బడెననియు నట్టి బ్రహ్మవేత్తలకు నిత్యమోక్షసిద్ధి కవకాశములేదని చెప్పఁ బడెననియుఁ దలఁచుట సమంజసముకాదు." దీని కద్వైతులు చెప్పు సమాధానమేమనఁగా, బ్రహ్మ స్వస్వరూపములో ననిర్దేశ్యుఁడు నగ్రాహ్యుఁడునైనను మనము వ్యావహారికముగాఁ గొంతనిర్వచనము చేయవలసియున్నది. అందుచేఁ గొన్ని విశేషణములను గొన్ని లక్షణములను జెప్పి, యితరవస్తువుల కవిలేవని చూపి, బ్రహ్మపై లక్ష్యమును నిలుపుటకు సహాయభూతులైరి. ఈలక్షణములు సచ్చిదానందాది స్వరూపలక్షణములు, సృష్టికర్తృత్వాది తటస్థలక్షణములునై యున్నవి. ద్వితీయసూత్రములోని నిర్వచనము బ్రహ్మజ్ఞానమున కుపయోగించును. (౩) శంకరుఁడు చెప్పిన మాయాసిద్ధాంతము సూత్రములలో లేదను వాదమున కీపదటీకలో సమాధానముచెప్పుట కతిక్లిష్టమైనదగుటచే సాధ్యము కాదు. కాని శంకరుని ప్రపంచభావము సూత్రోపదేశానుగుణమైనదన్మి నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. మాయాసిద్ధాంత ప్రయోగఫలితమే జీవాత్మ పరమాత్మైక్య సిద్ధాంతము. బాదరాయణ మతమును శంకరుఁడు క్రమముగా బ్రకటించెనా యను విషయమును నిర్ధారణగాఁ జెప్పఁజాలము. చూ: థీబో॥ శం॥ భా॥ ఉపోద్ఘాతము: జాకోబి, వేదాంతసారము: ఉపోద్ఘాతము: సుందర రామన్: వేదాంతసారము: ఉపోద్ఘాతము: ఆప్టే: మాయావాదము: లింగేశ మహాభగవతుని వ్యాసము: ఇండియన్ ఫిలసాఫికల్ రివ్యూ. వాల్యూము ౪. బాదరాయణ శంకరులకుఁ జాలభేదము లున్నవని డ్యూసేన్ చెప్పినాఁడు: డ్యూసేన్ సిస్టమ్ ఆఫ్ వేదాంతము॥ పు. ౩౧౯.

ప్రతిబింబమనియు నితరుల భావములన్నియుఁ దద్విరుద్ధము లనియుఁ విశ్వసించును. ౧.

౧౨-శంకరుఁడు - శాఖాంతరములు

బ్రాహ్మణమతము బౌద్ధమతమును సోదరభావముతోఁ గాఁగిలించి చంపివేసెనని చెప్పుటలోఁ గొంతసత్యము లేకపోలేదు. మెల్లగాఁ బెక్కుబౌద్ధపద్ధతులను జీర్ణించుకొని, యాగపశువధను ఖండించి, బుద్ధునొక విష్ణ్వవతారముగా నంగీకరించి, బ్రాహ్మణ మతము బౌద్ధమతములోని యుత్తమభావములను స్వాధీన మొనర్చుకొనెను. ఆది బౌద్ధములోని తాత్కాలికస్వరూప లక్షణము లదృశ్యములైనను, బౌద్ధమతము, కొంతవరకు శంకరునివలన, జాతీయ జీవితములో జీవచ్ఛక్తియై ప్రసరించెను. విజ్ఞానసీమలో బౌద్ధమతము కల్పించిన వాతావరణము నెట్టి బుద్ధిమంతుఁడును దాఁటి పోలేకపోయెను; ఈవాతావరణము శంకరుని మనఃప్రవృత్తినిగూడ నెక్కువగా స్వవశ మొనర్చు కొనెను. శంకరుని ప్రతిస్పర్ధులాతఁడు ప్రచ్ఛన్నబౌద్ధుఁడనియు నాతని మాయావాదము ప్రచ్ఛన్నబౌద్ధమతమనియు వాకొనిరి. పద్మపురాణమున నీశ్వరుఁడు పార్వతితో నిట్లు చెప్పెను: "మాయావాద మొక మృషాసిద్ధాంతము; ప్రచ్ఛన్నబౌద్ధ

---

(౧) పోల్చు: భాస్కరభాష్యము॥ ౨. సూత్రభావముల నణఁచివేసి స్వీయభావములను బ్రతిపాదించిన భాష్యకారులు పెక్కురు గలరు. ఇంకనట్టి భాష్యకారులు పెక్కు రుదయింపఁగలరు.

"సూత్రాభిప్రాయసంవృత్య స్వాభిప్రాయప్రకాశనాత్।
వ్యాఖ్యాతమ్ యైరిదమ్ శాస్త్రమ్ వ్యాఖ్యేయమ్ తన్నివర్తయే॥

తత్త్వము; కలియుగములో నేనే స్వయముగానొక బ్రాహ్మణ రూపమున నీతత్త్వమును బోధించితిని." ౧. రామానుజునిని గురువుగురువైన యామునాచార్యుఁడీ భావమునే చెప్పెను. రామానుజుఁడట్టిభావమునే పునరుద్ఘాటించినాఁడు. సాంఖ్య తత్త్వమును విమర్శించుచు విజ్ఞానభిక్షువిట్లు చెప్పినాఁడు: "కేవలము మనయజ్ఞానమే మన బంధకారణమని చెప్పు వాక్యము బ్రహ్మసూత్రములలో నొక్కటియును లేదు. తాము వేదాంతులమని చెప్పుకొనువారు ప్రవచించిన విచిత్రమైన మాయాసిద్ధాంతము బౌద్ధుల విజ్ఞానవాదరూపములలో నొకటియే. ఈసిద్ధాంతము వేదాంతభాగము కాదు" ౧. శంకరుఁడు మాయావాదము శ్రుతిసిద్ధమని స్థాపించిన వెంటనే, తత్ప్రతిస్పర్ధులది బౌద్ధసిద్ధాంత పునఃకల్పనమేయనియు వేదోక్తముకాదనియు వాదించిరని స్పష్టము. పద్మపురాణమందలి శివుని తుదిమాట లిట్లున్నవి: "ఉత్కృష్టమైన మాయాసిద్ధాంతము వేదప్రసిద్ధముకాదు. కాని యందు వేదము

---

(౧) "మాయావాద మసచ్ఛాస్త్రమ్ ప్రచ్ఛన్నమ్ బౌద్ధమేవచ। మయైవ కథితం దేవి, కలౌ బ్రాహ్మణరూపిణా॥ (౧,౧౪.) మతియుఁ జూడుము, స. ద. సంగ్రహమ్

(౨) తన సిద్ధిత్రయమునందు, యామునాచార్యుఁడు బౌద్ధులకు నద్వైతులకుఁ గూడ జ్ఞాతృజ్ఞానజ్ఞేయభేదము మిథ్యయని, చెప్పెను. ఈభేదములకు మాయయే కారణమని అద్వైతులును, బుద్ధియే కారణమని విజ్ఞానవాదులుఁ జెప్పుదురు. (జె,ఆర్,ఎ,యస్, ౧౯౧౦, పు, ౧౩౨)

(౧) సాం॥ప్ర॥భా॥ ౧,౨౨.

లందలి సత్యాంశములున్నవి." ౨. ఈ వివిధభావములవలనఁ దెలియునదేమన శంకరుఁడు బౌద్ధతత్త్వములోని కొన్నియంశములను, మాయావాదమును, మతనిర్మాణములను స్వీకరించి తనమతములోఁ జేర్చుకొనెను. విజ్ఞానముయొక్క అవిచ్ఛిన్నతను సంరక్షించు నిమిత్తము పరస్పరవిరుద్ధభావములను శంకరుఁడు సమన్వయింపఁ బూనుకొనెనని కొందరు చెప్పినారు. ఇది శంకరుని విశ్వవిశాలబుద్ధికి లేక యాతని పూజ్యమగు పరభావసహనశీలమునకుఁ దార్కాణమే యైనను, నాతని నిర్దుష్టహేతువాద సిద్ధికిఁ గొంతలోపము నాపాదించి తీరును. అట్టిలోపమును గప్పిపుచ్చుటకే యాతని మాయావాద ముపకరించె ననియుఁ జెప్పవచ్చును. ఏది యెట్లున్నను, బౌద్ధతత్త్వముతో సంబంధము లేకుండ నుపనిషత్తులనుండియు వేదాంతసూత్రములనుండియు శంకరుఁడు తన తత్త్వమునంతను వినిర్మించెనని చెప్పుటకు సంశయింపనవసరము లేదు.౧. బౌద్ధమతము వేదవిరుద్ధమతమని నేఁడు ప్రచారములో నున్న భావమునకు భారతీయ మతచరిత్రకపార్థకల్పనమే ముఖ్యకారణము. బుద్ధుఁ డుపనిషత్తులలోని కొన్ని భావములను బెంపొందించెనని బౌద్ధతత్త్వమును జర్చించిన సంద

(౨) వేదార్థవన్మహాశాస్త్రమ్ మాయావాద మవైదికమ్.

(౧) వ్యతిరేకభావ నిరసనమునందుఁ బెక్కు రద్వైతానుచరులు మాధ్యమికుల వాదపద్ధతులనే యుపయోగించినారు. ఇతర తత్త్వశాఖలను విమర్శించుటకు, భావ కేభావములు నవసరములేదనియు మాధ్యమికతర్కవాదము నుపయోగించినఁ జాలుననియు శ్రీహర్షుఁడు చెప్పినాఁడు. వితండాకథామాలంబ్య ఖండనానామ్ వక్తవ్యత్వాత్॥ ఇతరసిద్ధాంత ఖండనమందు మధుసూదనసరస్వతి వాద, జల్ప, వితండ రీతుల నుపయోగించెను.

ర్భములో మేము పెక్కుసారులు వచించియుంటిమి. విష్ణ్వవతారములలో నొకనిఁగా బుద్ధునిఁ జేర్చుటలోని యర్థమేమన నాతఁడు వేదధర్మసంరక్షణార్థ మవతరించెను గాని తన్నాశము నకుఁ గాదు. బౌద్ధమతమునకుఁ నద్వైతవేదాంతమునకు గొన్ని సామ్యములున్నవి; యిందాశ్చర్యము లేదు; ఏలన రెంటికి మూలాధారము లుపనిషత్తులేయై యున్నవి.

ఈవిషయమును శంకరుఁడు నిస్సంశయముగా నెఱుఁగును; బుద్ధుఁ డంతగా నెఱిఁగినట్లు తోఁచదు. బౌద్ధుల భావస్వాతంత్ర్యప్రేమ శంకరున కున్నది; కాని శంకరునకు సంప్రదాయ మతాదరమును గలదు. తాత్త్వికముగా నేయుద్యమమును నాస్తికభావము నాధారముచేసికొని పెంపొందఁజాలదని శంకరుఁ డెఱిఁగి, శ్రుతిపై నాధారపడి బ్రహ్మాస్తిత్వమును బ్రకటించెను. బౌద్ధుల క్షణికవాదము మాయాసిద్ధాంతమువంటిదే. వ్యవహారజగత్తున్నదనియు లేదనియు శంకరుఁడు పలికినాఁడు. భావాభావాత్మక వాదముల నన్నిటిని బుద్ధుఁడు నిరసించి, పరిణామమొక్కటే నిజమని చెప్పినాఁడు.౧. శంకరుఁడు పారమార్థిక వ్యావహారిక సత్యముల నంగీకరించెను. ఈభేదము బౌద్ధుల పరమార్థసంవృతి భేదమునకు సరిపోవును.౨. పూర్వ బౌద్ధము దృక్పథములో భావాత్మకమైనది; ప్రత్యక్షవిషయములనే యది స్వీకరించెను. దృశ్యప్రపంచము వెనుక నేమియును లేదని

(౧) సంయుత్తనికాయమ్॥ ౨౨, ౯౦, ౧౬.

(౨) ద్వేసత్యే సముపాశ్రిత్య బుద్ధానామ్ ధర్మదేశనా।
లోకే సంవృతి సత్యంచ, సత్యంచ పరమార్థతః॥
శ్లో॥ వార్తికముపై న్యాయరత్నాకరమును జూడుడు. నిరాలంబనవాదము.

కొందరు ప్రాచీనబౌద్ధులును సూచించిరి. అసంతృప్తికరమైన దృశ్యపరంపరకు మూలాధారమై,కూటస్థమగు నొక పరమసత్య మున్నదనియు దానివలననే సర్వవస్తు దృశ్యములకు విలువ గలుగుచున్నదనియు శంకరుఁ డొక హిందువుగాఁ బ్రవచించి నాఁడు. కాని శంకరుని మోక్షభావమునకు బౌద్ధుల నిర్వాణము సరిపోవును.3. పూర్వ బౌద్ధమతమునకు బ్రహ్మను జేర్చినచో నద్వైతవేదాంతము సిద్ధించును. బౌద్ధవిజ్ఞాన విశిష్టతను, లోపములను శంకరుఁడు సమగ్రముగా గ్రహించినాఁడు. బౌద్ధ శాఖల నాతఁడు ఖండించిన పద్ధతులతో మన మంగీకరించలే కున్నచో దానికిఁ గారణ మాతఁడు బుద్ధుని యుపదేశములకుఁ గాక, నాఁడు ప్రచారములోనున్న బౌద్ధభావముల కాతఁడు సమాధానము చెప్పవలసివచ్చె ననుమాట మఱవరాదు.

ఒక తత్త్వముయొక్క స్థానమది లోపమున కొసఁగు విశిష్టభావసందర్భైననే కాక, యది యేభావములను ఖండించెనో దానిపైఁ గూడ నాధారపడి యుండును. మండనమిశ్రుని తోడి వాదము వలన శంకరుఁడు కేవల కర్మకాండకు వ్యతిరేకి యని తోఁచుచున్నది. బ్రహ్మజ్ఞానమే మానవుఁడు ముఖ్యముగా నార్జింపవలయునదని యాతఁడు వక్కాణించెను. కేవల కర్మ మతము శుష్కాచారమగు నని యాతఁడు భీతి పొందినాఁడు. శుష్కాచారవాదులను జీసస్‌ను, విధి దాస్యమును పాల్‌ను ఖండించినట్లే, కేవల కర్మ నిష్ఠజీవిత పరమలక్ష్యము కాదనియు

(3) వాసనాత్యంతవిరామః జీవబ్రహ్మైక్యజ్ఞానసిద్ధిః (సోఽహమ్ లేక అహం బ్రహ్మాస్మి మాధ్యమికుల శూన్యతైవాఽహం అనుదానికి సరిపడును. ఇం దొకే సత్యముయొక్క భిన్నార్థము లుక్తములు.

నొకప్పుడది తల్లక్ష్యమునకు దారుణశత్రువనియు శంకరుఁడు తలఁచినాఁడు, వేదధర్మము పూర్తిగా నిరర్థకమని యాతఁడు నిరసింపలేదు. నిజముగా బ్రహ్మజ్ఞానసిద్ధిఁ బొందిన తత్త్వవేత్తలే వైదికవిధి నిషేధములు నతిక్రమించి ప్రవర్తింపఁగలరనియు, మిగిలిన వారందరు నైహికాముష్మిక సుఖాపేక్ష విడిచి, వేదాంత విజ్ఞానార్హతను గడించుట కవసరమగు చిత్తపరిమితిని సంపాదించు నిమిత్తము వేదోక్త విధివిధానానుష్ఠాన మొనర్చుటవసరమనియు నాతఁడు ప్రవచించెను. వైదిక కర్మనిష్ఠవలన నాత్మోన్ముఖత లభించి, తన్మూలమున మానవజాతియొక్క శాశ్వతలక్ష్యమును సంప్రాప్తించును.

శంకరు ననుసరించి, పూర్వోత్తర మీమాంసావిషయ లక్ష్యములు భిన్నములు. పూర్వమీమాంస, మానవ ధర్మజిజ్ఞాసయొనర్చి, యిహలోకమున మనప్రవర్తనపై నాధారపడి లభించుపరలోకమును మనదృష్టియెదుటఁ బెట్టును. దానివలన సంభవించు నుత్తమశ్రేయము కూడ నిత్యమైనది గాదు. కాని వేదాంతము సత్యసాక్షాత్కార సిద్ధిదము. వేదాంత లక్ష్యమైహికాముష్మికాభ్యుదయము కాదు; పునర్జన్మరాహిత్య స్వరూపమగు నిశ్శ్రేయసము. ఇది మన కుత్తరలోక సుఖ ప్రాప్తిపై దృష్టియున్నంతకాలము లభింపదు. మన కర్మలతో నిమిత్తములేకుండ నిత్యసిద్ధమై ప్రకాశించు సత్యస్వరూప జిజ్ఞాసయే బ్రహ్మజిజ్ఞాసయై యున్నది ౧.

(౧) కాని సాధారణముగా ధర్మజిజ్ఞాస మనస్సును బ్రహ్మజిజ్ఞాస కనుకూలమొనర్చును. సూటిగా బ్రహ్మ జిజ్ఞాసచేయు సమర్థుఁడగు నాతఁడు పూర్వజన్మములలోఁ గర్మసిద్ధుఁడై యుండవలెను.

సామాన్యముగా శంకరుఁడు శాఖాంతరుల తత్త్వము లనే ఖడించును గాని వారి మతభావములను గాదు. భాగవత తత్త్వవిషయములో భాగవత మతము శ్రుతిస్మృతులపై నాధారపడినదే యని యంగీకరించును గాని, జీవాత్మలన్నియు నీశ్వరుని వలనఁ బుట్టినవను భావము నాతఁడు గర్హించును.౨. జీవ బంధమోక్ష కారణభూతుఁడగు నీశ్వరువాధిపత్యము నాతఁ డంగీకరించును. అవిద్యారంగమునకుఁ జెందిన తార్కికాన్వేషణముల కతీతమైన బ్రహ్మజ్ఞానమెట్లు మానవహృదయమున

---

(౨) వాసుదేవుఁ డాత్మమనోఽహంకరణములుగా విభాగము పొందునని భాగవతులు చెప్పుదురు. ఆత్మ యీశ్వరునినుండి జన్మించినచో దానికి నాశము నుండును; అందుచే మోక్షమున కవకాశములేదు, ఆత్మ యీశ్వరునుండి వలెనే, మనస్సాత్మనుండియు, నంతఃకరణము మనస్సునుండియు జనించెనని భాగవతులు భావింతురు. ఇది దురూహ్యమని శంకరుఁడు వాదించును; ఏలన నిది యనుభవవిరుద్ధము కాదు. వ్యవసాయము చేయువాఁడు తన పనిముట్లను తనలోనుండి యుత్పత్తి చేయఁజాలనట్లే, ఆత్మ తన యుపకరణములను దనలోనుండి యుత్పత్తి చేసికొనఁజాలదు. వాసుదేవాది చతుష్టయమును సమానలక్షణశక్తులు గలిగి యున్నచో నవన్నియు నొకటే యని చెప్పవచ్చును. వాసుదేవునినుండి యంతఃకరణము వఱకు నొకదానినుండి యొకటి క్రమముగా జనించుచో నప్పుడు కార్యములన్నిటికి ననిత్యత్వదోషము పట్టును, లేక యీ నాలుగును నిత్యములైనచో, వాసుదేవుఁడాత్మ నేలసృజించెను, ఆత్మయే వాసుదేవుని సృజించెనని యేల చెప్పరాదను ప్రశ్న బయలుదేరును. ఒకే సత్పదార్థము నాలుగు రూపములలో వ్యక్తమగు చున్నదన్నచో బ్రహ్మ నాలుగు రూపములలోనే కాక, అనంతరూపములలో వ్యక్తమగు చున్నదని అద్వైతులు చెప్పుదురు. (శం॥ భా॥ ౨, ౨, ౪౨-౪౪.)

నుదయించుసను క్లిష్ట సమస్యాపరిష్కారము నిమిత్తము శంకరుఁ డీశ్వరసంకల్పము కారణమని చెప్పెను.౧.

పరస్పర సమన్వయ శూన్యములైన సాంఖ్యతత్త్వజ్ఞుల భావములను; అతి వ్యావహారికములగు న్యాయవైశేషికభావములను శంకరుఁడు ఖండించినాఁడు. ఆతఁడు నైయాయికుల వ్యావహారికపద్ధతిని విడనాడి, దానిస్థానమున బౌద్ధతత్త్వజ్ఞులతోఁ దుల్యమైన తీవ్రనిశిత తార్కికవిమర్శా పద్ధతిని బోషించినాఁడు.

## ౧౩- ఆత్మ.

మన వ్యావహారికానుభవమున కంతర్గతమైన సత్యమును బరిశోధించునదే అధ్యాత్మవిద్య. చేతనుని వ్యాపారములను బరికించి, వాని పరిగణనమే దానిపనిగాదు; సత్యస్వరూపమును గూర్చి మన యనుభవాంశము లేమిసూచించునో యనునది నిర్ణయించుటే దానికర్తవ్యము. భౌతిక మన సత్త్వాంశము

(౧) "అజ్ఞానావస్థలో నున్న జీవాత్మ, యింద్రియాద్యవయవ సముచ్చయరూపమైన దేహమునుండి యాత్మ భిన్నమైనదని గుర్తింపలేదు; అవిద్యాంధకారమగ్నమైన దగుటచేఁ జూపులేనిది; సర్వకర్మాధ్యక్షుఁడు, సర్వజీవాంతర్వర్తియునగు పరమాత్మనుండి, కర్తృత్వ భోక్తృత్వ రూపమగు సంసారము జనించును; పరమేశ్వరానుగ్రహము వలననే జ్ఞానముగలిగి, తన్మూలముస మోక్షము సిద్ధించును" మఱియు జీవేశ్వరైకత్వము గుప్తమైయున్నను, 'సముచితౌషధములవలన నంధత్వము నశించి, క్రమముగా దృష్టిసంభవించునట్లే, యీశ్వరధ్యాన తత్పరుఁడగువాని కీశ్వరకటాక్షముచే జీవేశ్వరైక్యజ్ఞాన ముదయించునుగాని, సహజముగానే జీవికి నట్టిజ్ఞానము లభింపదు. ఏలన బంధమోక్షము లీశ్వరేచ్ఛాధీనములై యున్నవి. దైవత్వమును గుర్తించని జీవికి బంధమును, గుర్తించిన జీవికి బంధవిచ్ఛేదమును సంభవించును." (డ్యూసేన్. సిస్టమ్ ఆఫ్ వేదాంత॥ పు. ౮౬-౮౭)

లను శంకరుఁడు విమర్శింపఁడు; వీని కాధారభూతమగు సత్య మెట్టిదని యాతని ప్రశ్న; ఈప్రశ్నమున కాతఁడు బాహ్యము నుండియు నభ్యంతరమునుండియుఁ గూడ సమాధానము నరయ యత్నించును; చివరకు రెంటికి భేదములేదని వ్యక్తమగును. వేదాంత సూత్రభాష్యమున కుపోద్ఘాతములో నాతఁడు మన సర్వానుభవములకు మూలాధారమగు నదేమైన నున్నదాయని ప్రశ్నించి, యట్టి లక్షణము గలదని చెప్పఁబడిన సర్వానుభ వాంశముల యర్హతను బరిశీలించును, మన యింద్రియములు మనలను మోసగింప నచ్చును; మన స్మృతి భ్రాంతియే కావచ్చును. భూతభవిష్యత్తు లూహామాత్రములు గావచ్చును. జగద్వస్తురూపము లన్నియు మనఃకల్పితములై, మన జీవితమంతయు మిధ్యకానోవును. జాగ్రదవస్థానుభవము లన్నియు స్వప్నప్రపంచానుభవతుల్యము లన్నచోఁ గాదనుట కాధారములు లేవు; స్వప్నప్రపంచమందును మన మనేకదృశ్యములఁ జూచి, నీడలతో నాటలాడి, భూతములతోఁ గొట్లాడి, మెలకువ వచ్చిన వెనుకఁ గూడ మన స్వప్నగాథావిహారములను స్మరించుచున్నాము. స్వప్నములు నిజమైనచో మనము నిజములని తలఁచినవి స్వప్నములు గావచ్చును. సర్వజ్ఞాన విషయములు మన నమ్మకముపై నాధారపడుటచే సంశయాస్పదములు; కాని వీనికన్నిటి కతీతమగు నదేదో మన యనుభవములో నింకను మిగిలియున్నట్లు తోఁచును. మన యనుభవములో బాహ్యజగత్తు వలన జనించునది కాక, దానిని నిర్మించి నడపించు నదేదోయున్నట్లు స్ఫురించిన యెడల; ఇంద్రియ గోచరప్రపంచమును గూర్చిన మన

జ్ఞానమునందే, యింద్రియముల కందని సత్యమేదో తొంగి చూచుచున్నట్లు మనకుగోచరించు నెడల నట్టి యతీతశక్తి మనలో గర్భితమైయున్నదని మనము నిస్సంకోచముగాఁ బ్రకటింప వలసి యున్నది మన యందాత్మాస్తిత్వభావము మనకుఁ బ్రత్యక్షానుభవ మగుటచే సంశయావస్థకిదియే యవధియైయున్నది. ప్రతివ్యక్తియు ౘడనయాత్మాస్తిత్వమును స్వీయానుభవములో నిత్యమును గాంచుచు నేయున్నాఁడు; అందుచే "నేను లేన" నియెవ్వఁడునుదలఁపఁ జాలఁడు(౧). డేకార్టేవలెనే శంకరుఁడును, నితరవస్తువులనుగూర్చిన సందేహములతో సంబంధము లేకుండ నిత్యానుభవ సిద్ధమగు నాత్మాస్తిత్వ సత్యము నిలిచియున్నదని నిశ్చయించినాఁడు.(౨) ఆత్మాస్తిత్వము నెఱుగకున్నచోఁ బ్రతివ్యక్తియు "నేను లేన" ని చెప్పవలసివచ్చును గాని యిట్లుజరుగుట లేదు. ఆత్మ, చైతన్య ప్రవాహమునకు, సత్యానృతములకు, సదసత్తులకుఁ బూర్వ మున్నది. "ఆత్మానుభవముపై సర్వజ్ఞానప్రమాణములు నిలిచి యుండుటచేతను, నట్టియాత్మానుభవము స్వతస్సిద్ధమగుట వల నను, నాత్మాస్తిత్వమును వేరుగా ఋజువు చేయు నవసరము లేదు." "బుద్ధికి, దానిప్రవృత్తికిని మూలాధారమై చిత్స్వరూపమున నున్న యాత్మ, వానికన్నిటికిని భిన్నమై, స్వతఃప్రకాశకమై వెలయుచున్నది. బుద్ధ్యాదులన్నియు నాత్మ కుపకరణములై

(౧) సర్వోహి ఆత్మాస్తిత్వమ్ ప్రత్యేతిన నాఽహమస్మీతి॥
శం॥భా॥ ౧,౧,౧.)

(౨) పోల్చు: డేకార్టే; డిస్కోర్సు ఆన్ మెథడ్.

వర్తించును."౩. ప్రతిలక్షణమును బ్రవృత్తియు, స్థూలదేహమును నాంతరంగిక ప్రాణశక్తియు, నింద్రియములు నంతఃకరణమును, "అహం" కారమును 'ఆత్మ' సంబంధులై ఆత్మపై నాధారపడియున్నవి. ఇవన్నియు వానికతీతమగు నొకప్రయోజనసిద్ధి కుద్దేశింపఁబడినవి; వీనికన్నిటికిఁ గూటస్థమై యొకయాధారమున్నది. ఆత్మను సంశయించుటకు వీలులేదు; ఏలన నాత్మాస్తిత్వ మసత్యమనువానిస్వరూపమేయది." ౪. బుద్ధిప్రవృత్తిరూపమగు విజ్ఞానమనాత్మ ప్రపంచమునకుఁ జెందినదగుటచే విజ్ఞానమువలన నాత్మనెఱుఁగుట దుస్సాధ్యమని శంకరుఁడు వాదించును. మనతార్కికగ్రాహకశక్తులనన్నిటిని నిద్రపుచ్చి, యాత్మనుగ్రహింతమన్నచో నట్టిజ్ఞానము మనము కోరునట్టిది కాకుండును. కాని, యాత్మనుండి మనభావము విడిపడఁజాలదేలన, నాత్మసంబంధశూన్యములగు విజ్ఞానానుభవములులేవు. ఆత్మ మన జ్ఞానావరణమును దాటిపోయినను, నది పూర్తిగా దాటిపోఁజాలదు. ఆత్మభావమున కాత్మయేవిషయము;౧ ఆత్మ సద్యః ప్రకాశకమగుటచేతనే విదితమగుచున్నది.౨. అదిప్రమాణములచేఁ బ్రకాశింపదు; ఏలన సర్వప్రమాణాధారమాత్మయే;

---

(౩) సురేశ్వరవార్తికము. పు ౧౮౯,౧౪౨,౭౯౧-౭౯౮.(శ్రుతియుఁ జూడు: శం॥భా॥ ౨,౩,౭; ౧,౩,౨౨.)

(౪) యఏవహి నిరాకర్తాతదేవ తస్య స్వరూపమ్॥ (శం॥భా॥౨,౩,౭.)

(౧) అస్మత్ప్రత్యయవిషయము. పోల్చు: కేన॥ ఉపనిషత్తు॥ ౨ ప్రతిబోధ విదితమ్॥

(౨) అపరోక్షత్వాచ్చ, ప్రత్యగాత్మప్రసిద్ధేః॥ (శం॥భా॥ ౧,౧,౧)

మఱియునది సర్వప్రమాణములకుఁ బూర్వమేయున్నది.౩ తార్కికముగా నాత్మయొక సాధ్యవస్తువు; అందుచే దానియస్తిత్వమును మనమంగీకరించవలెను;౪.

శంకరుఁడు నిజమగు నాత్మకును, విషయప్రపంచమునకును భేదమును జెప్పెను. ద్రష్టయు దృశ్యమును వెలుతురు చీకటివలె వ్యతిరేకములని యాతని నిశ్చయము. అందుచే నిజముగా ద్రష్టయైనచో దృశ్యమెన్నటికిని గాఁజాలదు. తాత్త్వికముగా స్వయంస్థితిగల వస్తువునకు నిత్యతావిచ్ఛిన్నతా సంపూర్ణతాలక్షణములుండును, ఏది నిజముగా ద్రష్టయోయది స్వయంస్థితి స్వప్రకాశములు గలదై యుండును.౧. అందుచే నాత్మాస్తిత్వప్రకటనము వలన శాశ్వత బ్రహ్మాస్తిత్వసత్యమును స్థాపితమగును. ఆత్మాచబ్రహ్మ.౨. బ్రహ్మాస్తిత్వ సత్యమునకు బ్రహ్మ సర్వజీవమూలాధారమగుటయే ప్రమాణము.౩

ఆత్మాస్తిత్వము సువిదితమైనను,నది యెట్టిదో,అనంతమో సాంతమో, చిద్రూపమో ఆనందమో, ఏకమో, తత్తుల్యము

(౩) ఆత్మాతుప్రమాణాది వ్యవహారాశ్రయత్వాత్ ప్రాగేవప్రమాణాది వ్యవహారాత్ సిద్ధ్యతి॥ (శం॥భా॥ ౨,౩,౭; శం॥భా॥ గీత॥ ౧౮,౫౦.)

(౪) శంకరుఁ డిట్లుచెప్పెను; "పరమాత్మ, అహం ప్రత్యయవిషయ రూపమగు కర్తనుండివేరై, సర్వసాక్షియై, సర్వములో సమానమై, ఏకమై, అద్వితీయమైనదగుటచే వేదమువలనఁగాని తర్కమువలనఁగాని తెలియఁబడదు. పరమాత్మయనగా సర్వమున కాత్మయగుటచే దాని నెవఁడును లేదనఁజాలఁడు. లేదనువాని స్వరూపమే పరమాత్మ" (౧,౧,౪.)

(౧) చూ: హెగెల్. ఈస్థటిక్స్. ఇ. టి. ౧ అ.

(౨) శం॥భా॥ ౧,౧,౧.

(౩) సర్వస్యాత్మత్వాచ్చ బ్రహ్మాస్తిత్వప్రసిద్ధిః॥

లగు ననేకములలో నొకటియో, సాక్షిమాత్రమో, రెండునుగాదో మన మెఱుఁగము, ఆత్మ స్వరూపమును గూర్చి పరస్పర విరుద్ధాభిప్రాయము లున్నకారణముచే, శంకరుఁ డాత్మ విదితము నవిదితము కూడనని చెప్పెను. 'నేను'ను "నేను కాని దాని"నుండి వేరు చేయవలెను. నేను కాని దానిలో బాహ్య జగత్తు, దేహము, నింద్రియములే కాక, జ్ఞానోపకరణ సముచ్చయ మంతయుఁ జేరును. మనము వాడుకలో మానసికావస్థలన్నియుఁ గర్తృకములనియు భౌతికావస్థలన్నియు విషయములనియుఁ జెప్పుచున్నాము. కాని తాత్త్విక దృష్టిలో మానసిక భౌతికావస్థలు రెండును విషయ ప్రపంచము లోనివే.౮. నాస్తికులాత్మ యనగా దేహమనియో, యింద్రియము లనియో చెప్పుదురు కాని చేతనత్వము జడపదార్థము భిన్నవర్గములకుఁ జెందిన వగుటచే నందొకటి రెండవది కాఁజాలదు. ఆత్మ యింద్రియము లనియుఁ జెప్ప వలన పడదు. ఏలన నప్పుడెన్ని యింద్రియము లున్నవో ఆత్మలన్ని యుండవలసి వచ్చుటచే నేకవ్యక్తిత్వమొక క్లిష్టసమస్య

---

(౮) తనభార్యకుఁ గాని పుత్రునికిఁగాని 'అస్వస్థత'గా నున్నప్పుడు "నాకు స్వస్థతలేదని" చెప్పుట కభ్యాసమై, తనకు బాహ్యములైనవాని లక్షణములను దానే యారోపించుకొను రీతినే, మనుజుఁడు దేహగుణములు తనవని యారోపించుకొని, "నేను పుష్టిగానున్నాను, నీరసముగా నున్నాను, నాది తెల్లనిరంగు, నేను నిలఁబడితిని, పోవుచుంటిని, గంతులిడుచుంటిని' ని చెప్పుచుండును; అట్లే యింద్రియలక్షణముల నారోపించుకొని, "నేను మూగవానిని, అశక్తుఁడను, చెవిటిని, గ్రుడ్డిని"నియు, నట్లే యంతఃకరణ లక్షణముల నారోపించుకొని, కామకాంక్షాసంశయ నిశ్చయాదికములను బొందుచు-

యగును. మఱియు భిన్నేంద్రియములు లాత్మలైనచో దర్శనశ్రవణ స్పర్శాదిక మేకకాలముననే జరుగవలెను. యోగాచార సిద్ధాంతము ననుసరించి, అనిత్యమగు మానసిక దశాపరంపరయే.౧. యాత్మయని చెప్పఁబడెను కాని యీసిద్ధాంతమును నమ్మినచో స్మృతి ప్రత్యభిజ్ఞల కవకాశముండదు. నిత్యమగు నాత్మయనునదే లేదను శూన్యవాద మాత్మాస్తిత్వము సంశయింపరాదను శంక

---

న్నాఁడు. అదేవిధముగా, నహంప్రత్యయము సర్వలక్షణప్రవృత్తి సాక్షిస్వరూపమగు నాత్మ కారోపించి ప్రవర్తించును." (శం॥ భా॥ ౧,౧,౧) చూడుము డ్యూసెన్స సిస్టమ్ ఆఫ్ వేదాంత. పు ౫౪౮; ఆత్మబోధ: పు ౧౮; స.సి.సా. సంగ్రహము. ౧౨ అ. ౪౯-౬౨, ౭౨-౭౭. పోల్చు: డేకార్టే: "మానవదేహమని పిలువఁబడు వివిధావయవ సముచ్చయము నేనుకాదు; ఈయవయవము లన్నిటిలో వ్యాపించియున్న సూక్ష్మవాయువు కాని ప్రాణముకాని, యింక ననేక నామములతోఁ జెప్పఁబడు నూపిరి కాని నేనుగాదు; ఇవన్నియు లేకున్నను నేనుందునని నాకు విశ్వాసముగలదు." (మెడిటేషన్స్. పు ౨) మఱియుఁజూడుము: ఛాందోగ్యోపనిషత్తు ౮, ౭-౧౨; తై. ఉ. ౨,౧,౭; మాండూక్య. ఉ. మనోవికారములు, విషయములు కారణమును నిరూపింపఁజాలవు. మన దృష్టిని మనము చేతనప్రవృత్తి పరంపరనుండి, చేతనుని చైతన్యముపైఁ గేంద్రీకరించవలెనని చెప్పి క్యాంటు తత్త్వవేత్త తాత్త్విక తర్కసిద్ధాంతమునకు నూతనజ్ఞానధనమును జేకూర్చినాఁడు. కాని తాను ప్రతిపాదించిన సిద్ధాంతములో నిమిడియున్న విశేషార్థముల నాతఁడు పూర్తిగా గుర్తింపఁజాలకపోయెను; విశ్వైక చైతన్య మొకటి యుండునని యాతఁ డూహింపలేకపోయెను. చేతనాచేతనములకుఁ జేతనములలో జ్ఞానజీవులకు నజ్ఞానజీవులకు భేదములున్నవని యాతఁడు గుర్తించెనుగాని, యీ నానాత్వమునకు మూలకారణమగు చైతన్యమునకుఁగూడ ననేకత్వ మున్నదని యాతఁ డవితర్క్యముగా నిశ్చయించుటలోఁ బొరపడినాఁడు.

(౧) క్షణిక విజ్ఞానాధారము.

రుని తత్త్వములోని ప్రథమ సూత్రమునకే వ్యతిరేకమగును. మనము ప్రపంచమంతయు శూన్యమని చెప్పి ను. నీశూన్యమును గుర్తించు నాతఁడు లేఁడనఁ జాలము.౧.సుషుప్త్యవస్థలోఁ గూడ నాత్మ యున్నది; మనము మేల్కాంచినపుడు స్వప్నములచే నబాధితమైన సుఖనిద్ర లభించెనను స్మరణ కలుగుచున్నది. ఇది స్మృతి వలన సాధ్యమగు చున్నది. స్మృతి మానసికావస్థాదర్శనమే కావున, నిద్రాసౌఖ్యము. నన్యవస్తురాహిత్యము నిద్రా కాలములో మానసిక విషయములై యుండవలెను. నిద్రాకాలమున నశాంతికారణములు లేకుండుటచే, నిద్రాపూర్వమానసికావస్థాస్మరణము వలనను నిద్రానంతరస్థితి దర్శనము వలనను జ్ఞానము కలుగుచున్న దన్నచో మన కనుభవపూర్వకముగాని దేదియుఁ దెలియుట కవకాశము లేదని సమాధానము చెప్ప వచ్చును.

అభావమునకు భావాత్మక దృశ్యమెద్దియు నుండదు కాబట్టి నిద్రాకాలమున నశాంతియు జ్ఞానమునులేవని యూహింపఁబడెనన్నచో, దీనికి సమాధానముగా జ్ఞానాభావాదిక మనుమానింపఁబడుటకైన మొదట మానసగోచరము కావలెను; అనగా నవిలేనికాలమున లేనట్లు ప్రత్యక్షముగాఁ జూడఁ బడియుండవలెను. అందుచే సుషుప్త్యవస్థలో నెఱుకయు నశాంతియులేవని ప్రత్యక్షముగా దర్శించియుండవలెను. సుషు

(౧) శూన్యస్యాపి స్వసాక్షిత్వాత్.

ప్త్యవస్థలో మనఃప్రవృత్తి శాంతించి, శుద్ధచైతన్యమేయున్నది.౨ ఎడతెగక మారుచుండు మానసికావస్థలకన్నగాc గాలవశమై యనేకచంచల మానసికావస్థలకు సంబంధించి 'నేన'ను కొను భావమాత్మయని పొరపడరాదు,౧. ప్రవృత్తికిc బూర్వమహం

(౨) అంతఃకరణము క్రియాశూన్యమైనది; అదిఅవిద్యతో సంబంధించిన శుద్ధచైతన్యము. వివరణగ్రంథకర్త సుషుప్తిలోని ప్రవృత్తియంతయు నవిద్యా సంబంధియేయనును; సుషుప్తిలో నెట్టిప్రవృత్తియునులేదని సురేశ్వరుని మతము.

(౧) యమ్ బెర్గ్సన్ వెంపొందుచున్న జీవభావమునుగూర్చి గానకుc బరిచయ మొనర్చినాడు. గతానుభవములను స్మృతిబలమున సంపాదించు కొనుచు జీవి తనలక్ష్యసాధనకై ముందుకుబోవుచుండునని యాతcడు చెప్పెను. (క్రియేటివ్ ఇవల్యూషన్ పు॥ ౨౧౦.) కొందరుబౌద్ధులు తలcచురీతిని, గతా నుభవ స్మరణశక్తియే వ్యక్తిత్వమునకాధారమైనచో రెండుక్షణములలో నొకే యాత్మయుండుట కవకాశములేదు. భిన్నదశాపరంపరలకు సంధాన మొనర్చు స్మృతిబలమైనదేకాని, యవిచ్ఛిన్నమగు నాత్మయందిమిడియున్న కాలాతీత లక్షణమును కర్థము చెప్పవలసియుండును. అనంతముగాc బరిణామ మొందు చున్న జీవాత్మభావము సంతృప్తినొసంగcజాలదని బెర్గ్సన్ తెలిసికొనియే భూత భవిష్యత్సంబంధములేని శుద్ధకాలమానమునకు సంబంధించినదాత్మయని యూహించెను, అదియే కాలభేదరహితమై అవిభాజ్యమైన నిత్యవర్తమానము. శాశ్వ తత్వమునుగోరు కాంక్ష నీవిధముగా బెర్గ్సన్ కాలత్రయ భేదశూన్యమగు నిత్య వర్తమానముగా నూహించి సంతుష్టిచెందినాcడు. కాని యాతనిభావము నను సరించి నిత్యతాలక్షణములుగల యాత్మ అబాహ్యావిషయములపై నాధారపడి వెం పొందును, అదిస్వయంస్థితిగలదికాదు. గాఢసుషుప్త్యవస్థలోcగూడనుండి సమ గ్రము సంపూర్ణమునైన స్మృతియున్నదని బెర్గ్సన్ చెప్పి యట్టిస్మృతియే జీవాత్మ యొక్క అవిచ్ఛిన్నతకు నిత్యతకుcగారణమని వచించినపుడాతcడు శంకరుని సిద్ధాంతమునకు సమీపమునకు వచ్చినాcడు. స్మృతియందిమిడియున్న ఆత్మ శక్తి, వస్తుప్రపంచమంతయు నదృశ్యమైనను నిత్యమైనిలచునని యాతడంగీక రించినాcడు.

కారమున్నమాట నిజమే గాని యహంకారమాత్మ కాదు; ఏలన నహంకారముకూడ నొక జ్ఞానవిషయముగుటచే నదితనాత్మ్వా ర్థ్యమున్నదికాదు.౨. చేతనపరివృత్తి పరంపర లేక మానసికా వస్థాపరంపరయే యాత్మయని తలచుట చైతన్యవిషయములను చైతన్యమని పొరపడుటేయగును. అనుభూతవిషయములు మానసిక దశాప్రవాహములు పడుచులేచుచు,దృశ్యమై యదృ శ్యములగుచుండును. ఈభిన్నదశాపరంపరలను సంధానము చేయుటకు వాని నన్నిటి ననుగమించు విశ్వచైతన్య మొకటి యుండవలెను. "వర్తమాన మందున్న దాని నెఱిగిన వానిని 'నేనే'; భూతకాలమందున్న దానిని, భూతపూర్వమైన దానిని దెలిసిన వానిని 'నేనే'; భావిదశను, భావిదశా నంతరస్థితినిఁ దెలియువానిని నేనే; యని చెప్పఁబడినప్పుడు, జ్ఞానవిషయము మార్పుచెందుచున్నను, జ్ఞాత మారుటలేదనియు నాతఁడు భూత వర్తమాన భవిష్యత్తులలో నిత్యుఁడై యనవచ్ఛిన్నుఁడై యున్నాఁడనియు విదితమగుచున్నది."౧. కాలగతమైన విషయ సమూహము నొక పరంపరయని చెప్పవీలగుటకా వివిధవిషయ ములలో నన్నిటియందు నవిచ్ఛిన్నముగానుండి వాని కేకత్వ మును ఘటించుచుఁ గాలాతీతమైన శక్తి యేదియో యున్నదని

(౨) అహంకారపూర్వకమపి, కర్తృత్వమ్ నోపలబ్ధిర్భవితుమర్హతి అహంకారస్యాపి ఉపలభ్యమానత్వాత్. (శం॥ భా॥ ౨,3,౪౦.)

(౧) సర్వదావర్తమాన స్వభావత్వాత్, (శం. భా. ౨,3,౭; శం.గీ, భా. ౨, ౧౮.) చూ. అద్వైతమకరందము పు॥ ౧౧, ౧3.

గుర్తించినపుడే వీలగును.౨. ఆత్మ ప్రకృతి ప్రపంచమునకుం జెందినదిగాదు; ఆత్మ యుండనే లేకున్నచోఁ బ్రకృతి జగత్తుండుటకే యవకాశము లేదు. మనకు శుద్ధాత్మభావము లభించుటకాత్మను దానినావరించియున్నవాని నన్నిటినుండియు వేరుచేయవలెను; ఆత్మ కావాసమైన శరీరమునుండియు తన్మూలమున ననుభూతములగు సర్వవిషయ జాలమునుండియు నాత్మను వేర్పఱచి చూడవలెను.౩.మన తర్కబుద్ధి కట్టి యనావృతమగు నాత్మభావము శూన్యముగానో కేవల విజ్ఞానబీజ స్వరూపముగానో తోఁచవచ్చును; కాని యదియొక భిన్నాంశ సంపూర్ణ రూపమనికాని, వివిధగుణాకరమైన ద్రవ్యమని కాని, తలఁచుటకంటె నిట్లూహించుటే మేలు. దేహము శిథిలమై, మనస్సు నశించి నప్పటికి నవినాశియై నిలుచునది నిర్విశేషచిన్మాత్ర స్వరూపమగు నాత్మయే.౧.

(౨) శంకరుఁడు లోకోపనాదముతో నేకీభవించును రెండువస్తువులను బోల్చినపు డవిసమానములో భిన్నములోఁ దెలియు చైతన్యమేకము నవిభాజ్యమైనదని ఋజువుచేయును. (మెటఫిజిక్సు. పు॥ ౨౪౩.)

(౩) బుద్ధీంద్రియాదులచేతనములు; అవియొకద్రష్టకు విషయములు. పోల్చు: 'భామతి: "చిత్స్వభావాత్మావిషయి, జడస్వభావాబుద్ధీంద్రియదేహవిషయావిషయాః"

(౧) స॥సి॥సా॥ సంగ్రహము ౧౨, ర. పోల్చు; ఆగస్టైన్; "సోపాన క్రమము ననుసరించి దేహములనుండి దేహాదులను దర్శించు నాత్మజ్ఞానమునుగాంచితిని అచటనుండి యింద్రియములు బాహ్యవిషయవార్తల నేయంతఃకరణమున కందఁజేయునో దానినిఁగాంచితిని. ఇదిపశువర్గముయొక్క జ్ఞానావధి; అచటనుండి విషయవార్తలపై నిర్ణయములుచేయు విచక్షణజ్ఞానలక్షణమును

దేహమందలి యింద్రియములు నాడీసంచారములు దేశకాలానుగతములు. ఇవి చేతనత్వము నుదయింపఁజేయుచున్నవను భ్రాంతి జనించుచున్నది. ఇదియే తత్త్వప్రధాన సమస్య. అచేతనము చేతన కారణము కాఁజాలదు. చేతనమైన దచేతన కారణమైనఁ గావచ్చును. మనోబుద్ధీంద్రియములు స్వయం సమృద్ధములు గావు. "ఆత్మ లక్షణమగు నుపలబ్ధి వీని ప్రవృత్తుల కాధారము కావలెను. నిత్యజ్ఞాన స్వరూపమే ఆత్మలక్షణము౨. అచేతన కారణభూతమైన యీచేతనము పరిమిత జీవచైతన్యము కాదు; అనంత విశ్వచైతన్యమే. ఏలన, ఁబరిమితచేతనుల కగోచరములైన యనేకవస్తుజాలము లున్నవి. అందుచే విశ్వైకచైతన్య మొకటి గలదనియు నందీ పరిమిత చేతన రూపము లన్నియు నంశామాత్రము లనియు మనము గ్రహింపవలెను. సర్వజగదాధారభూతమైన మూలచైతన్యము మానవునిలోఁ గల చైతన్యమని భ్రమింపరాదు; ఏలన జగత్పరిణామములో మానవచైతన్య మాలస్యముగా వ్యక్తమైనది. విషయముల కుత్పత్తి

---

నాలోనీశక్తియు మార్పునొందుచుండున దగుటచే దానికి మూలాధారమైనదియు మార్పులేనిదియు నగు జ్ఞానస్వరూపమే విచక్షణజ్ఞానముకంటె నుత్తమమైన దనియుఁ దెలిసినది. ఇచటనుండి యొకతటిల్లతవలె నొకయవలోకనముతో నెన్నడుమారనిది, నిత్యస్థితిగలదియునైన చైతన్యము గోచరించినది" (కన్ఫెషన్స్. ౭, ౧౩.)

(౨) నిత్యోపలబ్ధి స్వరూపత్వాత్, (శం॥ భా॥ ౨,౩,౪౦,) పోల్చు: చిత్సుఖి, ౧, ౭.

"చిద్రూపత్వాత్ అకర్మత్వాత్ స్వయంజ్యోతిరితి శ్రుతేః।
ఆత్మనః స్వప్రకాశత్వంకోని వారయితుమ్ క్షమః॥

లయములుండుటచే, స్వప్రకాశకములు కావు. స్వయంప్రకాశ స్వరూపమైన[3]. ఆత్మయొక్క కాంతిచే నీవిషయము లన్నియుఁ బ్రకాశించును.[౪]. అది శుద్ధచైతన్యము. "అందు జ్ఞాతృజ్ఞాన జ్ఞేయ భేదములు లేవు; అది సత్యజ్ఞానానంత స్వరూపము."[౧]. అది నిర్విషయ జ్ఞానమయమైనది.[౨]. "ఆత్మ సర్వదాశుద్ధ చిత్స్వరూపము; ఉప్పురాశి కుప్పగానుండు టెట్లు స్వభావమో, యట్లే

(3) శం॥భా॥ ౨, ౨, ౨౮.

(౪) స్వయంజ్యోతి స్స్వరూపత్వాత్, (శం॥భా॥౧, 3, ౨౨. చూ॥శం॥ భా॥ ప్రశ్నోపనిషత్తు. ౬, 3.

(౧) వివేకచూడామణి.పు.౨౩౯, నైయాయికుఁ డీసిద్ధాంతము నీక్రింది యాధారములతో ఖండించెను,మనవ్యవహారజ్ఞాన మంతయు నింద్రియ మానస బద్ధమైన కారణముచే మనకు శుద్ధచైతన్యమనుభూతవిషయము కాదు. అది యపరోక్షానుభవ సిద్ధియనుట వ్యవిఘాతభావము. స్వప్రకాశకమైన యాత్మ ప్రత్యక్షానుభవ సిద్ధమన్నచో, నంధున కాతఁడు చూడకున్నను, వెలుగు చున్న దీపము వ్యక్తమగుచున్నదని చెప్పవలె యగును. దీపము చూచిన వానికే గోచరించు నన్నచో, నాత్మయుఁ జూచినవానికే గోచరించును;అనఁగా నది జ్ఞానవిషయమగును; అప్పుడది శుద్ధమైనది కాఁజాలదు. ఆత్మ స్వప్రకాశ స్వభావము గలదైనచో సుఖదుఃఖానుభవములును స్వప్రకాశకములా యని కుమారిలుఁ డడిగినాఁడు. ఈభావము ననుసరించి, సుషుప్త్యవస్థలో నాత్మ నిరతి నొందుచున్నది. జాగ్రదవస్థలో వ్యక్తములగు దేహేంద్రియాదులు గాక సుషుప్త్యవస్థలో నాత్మయే యున్నదన్నచో, సుషుప్త్యవస్థలో మనము దేనిని జూచితిమని మెలకువ వచ్చిన వెనుక తెలియుచున్నదని కుమారిలుఁడు చెప్పినాఁడు. ఆత్మ మానసప్రత్యక్ష గమ్యమని యాతఁడు భావించెను.

చూ॥ శాస్త్రదీపిక పు॥౪౮౭-౬౦

(౨) నిర్విషయ జ్ఞానమయమ్, పోల్చు: శంకరుని హరిస్తవము, పు, ౪.

శుద్ధజ్ఞాన మాత్మస్వభావము."[3] చైతన్యమున కచేతన లక్షణ ముండజాలదు. స్వకీయ ధర్మముచేతనే ఆత్మ నిత్యప్రకాశమా నమై యుండును. బాహ్యాధార మేమియు లేకున్నను సూర్యుఁడు ప్రకాశించు నట్లే, నిర్విషయ జ్ఞానప్రకాశమాత్మ లక్షణము[4]. ఆత్మ శుద్ధజ్యోతి, స్వచ్ఛతేజస్సు; అది సర్వజ్ఞానాధారమే కాక, దాని కాంతియందే సర్వజ్ఞానమును బ్రకాశించును.

ఆత్మ యొక చేతనద్రవ్యము; జ్ఞానముతో దానికిఁ గల సంబంధము ద్రవ్యగుణ సంబంధమని చెప్పు న్యాయ విశిష్టా ద్వైతవాదమును శంకరుఁడు నిరసించినాఁడు[5]. ఆత్మకు జ్ఞాన సంబంధము భేదాభేదములలో నేదియో యొకటి కావలెను; లేక భేదాభేదసంబంధమైనఁ గావలెను. జ్ఞానము స్వభావముచే నాత్మకు భిన్నమైనచో నప్పుడు వానికి ద్రవ్యగుణసంబంధ ముండ నేరదు[6]. మఱియు భిన్నవస్తువుల విషయములో నీసంబంధము సంయోగము కాని, సమవాయము కాని కావచ్చును. సంయో గము రెండు స్థూలవస్తువులకుఁ జెల్లును. ఆత్మయు జ్ఞానము నట్టివి కావు. ఆత్మకును జ్ఞానమునకును సమవాయ సంబంధమున్నచో నీసంబంధ మాత్మకన్వయించవలెను; ఈరెండవ సంబంధము నట్లే యనంతముగా నన్యసంబంధములు నాత్మ కన్వయించ

---

(౩) శం॥భా॥ ౩,౨,౧౬ చూ॥ శం॥భా॥ ౧,౩,౧౯,౨౨.

(౪) శం॥భా॥ ౨,౩,౨౪

(౫) చిద్ధర్మ ఆత్మావతు చిత్స్వభావః। పో॥ల్పు॥ జ్ఞానభిన్నో నిత్యాత్మా ఇతిసిద్ధమ్, (విశ్వనాథ ముక్తావళి, పు ౪౯.)

(౬) ఆత్మమటాఽవత్ ధర్మాధర్మిత్వానుపపత్తేః

వలెను. దీని వలన ననవస్థాదోషము సంభవించును. అందుచే వలన నాత్మయు జ్ఞానమును భిన్నములైనచో రెంటికి ద్రవ్యగుణ సంబంధ మసాధ్యమగును. రెంటికి నభేదము చెప్పినచో నొక దాని కొకటి గుణమని చెప్పుటర్థరహితము, ఒకే వస్తువున కింకొక దానితో నభేదము భేదము కూడఁ జెప్పుటనోన్య విరోధమగును. అందుచే నాత్మయు జ్ఞానము నొకటేయని నిశ్చయింపవలెను.౨.

చైతన్యములేక ఆత్మ, బుద్ధిజ్ఞానమని తలఁపరాదు. బుద్ధి గ్రాహ్యమైన యాత్మభావము పరమార్థముకాఁజాలదు ; అది కర్తృవిషయ సంబంధజన్యమగు కార్యమగును. తనవిషయసృష్టి తానే చేసికొనుశక్తిగలదిగా జ్ఞానమునూహించుచో, నప్పుడైన నందు కర్తృవిషయభేదము బీజరూపముననుండును; అందుచే నీజ్ఞానముకూడలోప భూయిష్ఠమగును. నిజమగుసత్తాయును జ్ఞానమును గలిసియుండును. ఆత్మ జ్ఞానములేని సత్తాకాఁజాలదు; సత్తాలేనిదే జ్ఞానమేలేదు. ౧. అదియానంద స్వరూప మునైయున్నది. ౨. సర్వదుఃఖ విముక్తియే యానందము. ౩. ఆత్మ విసర్జింపవలసినదిగాని, సంపాదింపవలసినదిగాని యేదియునులేదు. ఆత్మయందపకర్షిమలక్షణ మేమియులేదు.

---

(౨) చూ. హస్తామలకమ్. చూ. హాల్డేన్. రెయిన్ ఆఫ్ రెలెటివిటీ (పు. ౧౫౬.

(౧) సత్తైవచబోధా; బోధఏవసత్తా.

(౨) తై, ఉ, ౨౫, ఆత్మాఽస్తి, భాతి, ప్రీణాతి.

(౩) పోల్చు, బృ, ఆ, ఉ, ౩, ౫.

ప్రవృత్తి స్వభావముచే ననిత్యమగుటచే, నాత్మకుఁ బ్రవృత్తి లేదని శంకరుని వాదము. ౪. "ఆత్మయందుఁ బ్రవృత్తి లేదు; ఎందుఁబ్రవృత్తియున్నదో దానికిమార్పు లేకుండనుండఁ జాలదు," ౫. అహంకారము సర్వప్రవృత్తికిని మూలము, మన మెఱిఁగినంతవరకది దుఃఖహేతువు; ౬. కామపరతంత్రము. ౭. కర్తృత్వభోక్తృత్వములు ద్వైతభావముపై నాధారపడును ; అందుచేనది పరమసత్యముకాదు. ౮. దేహాద్యుపాధివశము కాకుండ నాత్మకుఁగర్తృత్వముండఁజాలదు ; ఉపాధులన్నియు నసత్యములే. ౯. ఆత్మకు స్వతస్సిద్ధముగాఁ గర్తృత్వము లేదు.౧౦, సత్యము, స్వయంస్థితి, సర్వవ్యాపిత్వము, సర్వజీవాంతర్వర్తిత్వము నాత్మలక్షణములుగా శంకరుఁడు చెప్పినాఁడు. ౧౧. ఆత్మయేకము ననంతము, సర్వవ్యాప్తముననని శంకరుఁడే హేతువులను జూపెనో యట్టి హేతువులచేతనే హెగెల్ తన " భావము"ను

---

(౪) అధ్వవ.  (౫) శం, భా, ౧, ౧, ౪.

(౬) కర్తృత్వస్య దుఃఖరూపత్వాత్, (శం, భా, ౨, ౩,౪౦)

(౭) కర్మహేతుః కామస్యాత్, ప్రవర్తకత్వాత్, (శంకరుని ఉపోద్ఘాతము, తై. ఉ.)

(౮) అవిద్యాప్రత్యుపస్థాపితత్వాత్ కర్తృభోక్తృత్వయోః, పోల్చు, బృ, ఉ, భా, ౪-౫-౧౫.

(౯) పోల్చు; సురేశ్వరుఁడు; "ఆత్మస్వస్వరూపమే నిర్విశేషమని బ్రహ్మవేత్తలు చెప్పుదురు. ఆత్మకితరదశాసంయోగ మజ్ఞానజము, వార్తికము, పు, ౧౦౯.

(౧౦) స్వతః అనధికారిణః చూ. సురేశ్వరవార్తికము.

(౧౧) సత్యత్వమ్, స్వమహిమాప్రతిష్ఠితత్వమ్ (పు. ౧౧౦-౧౧౩ సర్వగతత్వమ్, సర్వాత్మకత్వమ్, (శం. భా. ౧-౩-౯)

గూర్చి చెప్పెను. ఎన్నఁడు నాత్మకు స్వీయవ్యతిరేకలక్షణములు గాని భిన్నలక్షణములుగానిలేవు; దానికిఁ బరిమితి నాపాదించు భిన్నవస్తువెద్దియును లేదు. ఆత్మయెల్లప్పుడును స్వేచ్ఛావశమైనది. చైతన్యము పరిమితిలేనిది. పరిచ్ఛిన్నతాజ్ఞానమపరిచ్ఛిన్న చైతన్యాస్తిత్వమును సూచించును. చైతన్యమునకవధియేయున్నచో నితరవస్తువులచేఁ బరిమితమైన చైతన్యమునకుఁ దనపరిచ్ఛిన్నతాజ్ఞానమేయుండదు. అందుచేఁ జైతన్యము పరిచ్ఛిన్నతయుఁ బరస్పరవిరుద్ధ విషయములు. పరిచ్ఛిన్నత వస్తులక్షణము; చైతన్యము వస్తువుగాదు.

ఆత్మకనాత్మతో నెట్టిసంబంధమును లేకుండఁజేసి, దానికి స్వతంత్రస్థితిని గల్పించినాఁడని డేకార్టేను విమర్శించిరి. కాని శంకరుని యాత్మయనగా జీవాత్మయని పొరఁబడరాదు. అనాత్మవిముక్తమైనట్టియో లేక అనాత్మకు వ్యతిరేకమైనట్టియో జీవాత్మాస్తిత్వమును శంకరుఁడు స్థాపింపఁబూనుకొన్నచో నాతఁడు పరిచ్ఛిన్నవిషయ రహితములగు ననేకజీవాత్మలనో లేకున్న శుష్కమైన విశ్వాత్మభావమునో గాంచియుండును. శంకరుని యాత్మ జీవాత్మయుఁగాదు, తత్సముచ్చయమును గాదు. జీవాత్మ జాలమంతయుఁ బరమాత్మపై నాధారపడి యున్నది. శంకరుఁడుచెప్పినదేమన 'ఆత్మయనగా వ్యావహారిక ధర్మము ననుసరించి భాషలోఁ జెప్పుటకు వీలైనదిగాదు; లేక వ్యావహారిక జ్ఞానోపలభ్యమగు నొక గోవువంటిది యనుగాదు. అదిసామాన్య విశేషలక్షణములచే వ్యక్తమగునదియుఁగాదు. అదియిట్లువర్తించు నట్లువర్తించుననియుఁగూడఁ

జెప్పఁజాలము; ఏలననది నిత్యవిమర్శక్రియాత్మకమైనది. అందుచే నది భావాత్మకమైన పద్ధతిలోఁజెప్పుటకు వీలులేనిది" క్యాంటు యొక్క పారమార్థికాత్మ భావమునకును, శంకరుని భావమునకును భేదమున్నది. క్యాంటుచెప్పినయాత్మకు వ్యావహారికానుభవములతో సంబంధసంయోగములున్నవి. అది జీవాత్మజ్ఞానమున కతీతమైనదని చెప్పఁబడినను, నదిక్రియాత్మకమైన యిచ్ఛారూపముగలదగుటచే సంకుచితమగుచున్నది. జీవాత్మకును తదతీతమైన యాత్మకును క్యాంటుచెప్పినభేదమునుబట్టి చూచినచో శంకరు నాత్మభావమునకుఁ గొంతసరిపోవును. కాని నిత్యస్థితిగల పరమాత్మ చైతన్యము నిత్యపరిపూర్ణమైనదగుటచేఁ బరిణామదశాహీనమైనదని శంకరుఁడు చెప్పినాఁడు,(౧). క్యాంటుచెప్పిన క్రియాత్మకమైన యిచ్ఛాశక్తి జీవాత్మయే; కాని దానియందనిర్వచనీయమైన పారమార్థికలక్ష్య మిమిడియున్నది. ఫిక్టే చెప్పిన పరిపూర్ణమగు 'అహం' భావము జీవాత్మకంటె నధికమేమియునుగాదు; బీజరూపమునుండి పరిణతిగాంచినట్టి క్రియాశక్తి వ్యక్తరూపము ననాత్మసంబంధముచేఁగాంచినది. 'అహం' వ్యక్తిత్వమునకు మూలాధారమగునట్టి శక్తికి నితరవిషయాస్తిత్వములతో భేదముండుటచేతనే శంకరుఁడు తానుజెప్పినయాత్మ యేయితర వస్త్వస్తిత్వముతో సంబంధములేని సంపూర్ణస్థితిగలదగుటచే నొకవ్యక్తిత్వలక్షణయుక్తమైనది కాఁజాలదని చెప్పి

(౧) పోల్చు; జెంటైల్ చెప్పిన 'శుద్ధదర్శిష్ట' భావము. అదియెన్నడును విషయములేక దృశ్యముకాఁజాలదు. (థియరీ ఆఫ్ మైండ్ ఏజ్ ప్యూర్ అక్ట్ పు. ౬-౭.

నాఁడుకాని తార్కికదృష్టిననుసరించి, జీవాత్మయే సత్యమైనది. పరమాత్మ ఛాయామాత్రి సత్యముగలదియునగును. కాని, మనము పరమార్థదృష్టితోఁ జూచినచో నచట విషయావిషయములేకమై, యేక చైతన్య స్వరూపమును దర్శింతుము. ౨. పారమార్థికదృష్టియే స్వప్రకాశమైనదృష్టి. అదియే ప్రతివ్యక్తియొక్క నిజస్వరూపము. ఆస్థితిలోఁ బ్రతివ్యక్తియుఁ నేను నాస్వస్వరూపము"నని గ్రహించి యాత్మసిద్ధినిగాంచును. ఇట్టిపారమార్థికానుభూతి నేయితరమైన యనుభవమును మార్పు చేయు లేదు. దానికవధులులేవు. అదివిభాగవ్యాప్తులకు వశమైనదిగాదు. అది యెల్లప్పుడు సర్వత్రియున్నది. అందు ద్వైతము లేదు. అది యందరలో సమానముగా నున్నది. అందెట్టిపృథక్త్వమున కవకాశము లేదు; విశ్వజీవభాగస్వాములమగుట చేతనే మనము జీవించుచున్నాము; విశ్వవిజ్ఞాన భాగస్వాములగుటవలననే మనమాలోచింపఁగలుగుచున్నాము; పరమాత్మ మనయందంతర్నిహితమై యుండుటవలననే మనయనుభవములన్నియు సాధ్యములగుచున్నవి.౧.

---

(౨) పోల్చు; కైర్డు; "జ్ఞానమనఁగా నొకచేతనవ్యక్తికి నొకవిషయముతో సంబంధమైనచో, నట్టిసంబంధమెంత సన్నిహితమైన నంతజ్ఞానము పరిపూర్ణమగును; పూర్తిగానది పరిపూర్ణమగుట కింపలిద్వైతమదృశ్యము కావలెను; దృష్టృదృశ్యములు కలిసిపోవును; ఈయేకత్వమును వ్యక్తీకరించు శబ్దమాత్రిమే ద్వైతమగును, జ్ఞానమాత్మ జ్ఞానమగును." క్రిటికల్ ఫిలాసఫీ ఆఫ్ కాంటు. పు॥ ౮౬)

(౧) శం. భా. మాండూక్యోపనిషత్తు; ౨-౭, పోల్చుబొశాంక్యు "ఆత్మలో నేదోయతీతమైన దైవత్వమున్నది; దానినినిర్వచించుటకుసాధ్యము

## ౧౪—జ్ఞానసాధన సామగ్రి.

వ్యావహారికానుభవాంశములను గూర్చియుఁ విజ్ఞాన ప్రాథమికమాత్రములను గూర్చియు సంశయదృష్టిని శంకరుఁడు బౌద్ధవిజ్ఞానవేత్తలనుండి గ్రహించినాఁడు. ప్రాతిపదికమాత్రము లనఁబడువాని నాధారముగాఁ గైకొని తాత్త్విక సిద్ధాంత నిర్మాణము చేయఁబూనుట సముచితము కాదని యాతఁడు నిర్ణయించినాఁడు. అందుచే జ్ఞాన జ్ఞానసామగ్రిని గూర్చి యాతఁడు విమర్శా పూర్వక విభాగపరిశీలన మొనర్చినాఁడు. మనలో నిగూఢముగానున్న యాత్మ తాను జీవించుచున్న విధానమునుగూర్చి యేమియుఁ బలుకదు. పరమార్థసత్య స్వరూపమద్వైతము. కాని సవికల్పకజ్ఞానము పారమార్థికజ్ఞానము నిట్టి వికృతరూపములో దర్శించును; (౧) అంతఃకరణమున ననుసరించి పరివర్తించు ప్రమాతృచైతన్యము. (౨) అంతఃకరణవృత్తి వికారముననుసరించు ప్రమాణచైతన్యము. (3) గ్రహింపఁబడిన విషయజ్ఞానము ననుసరించు విషయచైతన్యము. పరిపూర్ణచైతన్య మేకము, సర్వవ్యాపి; అంతఃకరణమును దానివికారమును, విష

---

కాదు; వేద్యమనుటకంటె నవేద్యమను టే మేలు. అజ్ఞానముకంటెను, ప్రేమకంటెను, దయకంటెను గూడ శ్రేష్ఠతరమైనది; ఏలన వీనిలోనింకను భిన్నత యున్నది. ఈజ్యోతి యింద్రియాతీతస్వరూపమగును. అది యవిభాజ్యమగు నేకస్వరూపము; అందుఁ దండ్రియుఁ బుత్రుఁడు, హోలీఘోస్టు భేదములు లేవు; అది మానవాతీతమైనది. అదిస్వయంస్థితిగలిగి, స్వయంప్రకాశ కాంతి యుతమై స్వయముగా నచలమయ్యు సర్వవస్తుసంచలనకారణమైనశక్తిగలది." (హాంటుస్ ఎస్సే; ఆన్ పాన్ థీయిజమ్ పుట. ౧౪౦.)

యమును బ్రకాశింపఁ జేయునదైయున్నది. ౧. ఇంద్రియములు కాకుండ నంతఃకరణమొకటున్న దనుటకు హేతువుల నిదివరకే మనముచూచియుంటిమి. 3. అంతఃకరణ మంతరింద్రియప్రవృత్తికిస్థానము, బాహ్యేంద్రియములకుఁ గానందున నట్టినామము కలిగినది. ఇంద్రియము నిచ్చువార్తలనదిస్వీకరించి వానినొక క్రమమునఁ గూర్చును. అంతఃకరణమొకయింద్రియముగాదు; ఏలన, నదియొకయింద్రియమేయైనచోఁ దన్నుఁ దాను బ్రత్యక్షముగాఁ జూచుటకాని,తనవికారములను దర్శించుటగాని జరుగదు.అదిసావయవము,మధ్యమ పరిమాణముగలది;అణుపరిమాణముగాని, యనంతపరిమాణముగాని దానికి లేదు. ముఖములనద్దమెట్లుప్రతిఫలింపఁజేయునో యిదియునట్టి ప్రతిఫలించు శక్తిగలిగి విషయములను వ్యక్తమొనర్చును. కాని యీశక్తి యంతఃకరణమునకు స్వతస్సిద్ధముగాదు; ఇదిదానికాత్మసంయోగముచే లభించును. అంతఃకరణము తనకాంతిని విషయములపైఁ బ్రసరింపఁజేసి ప్రకాశింపఁ జేయునని చెప్పఁబడినను, నిజమున

(౧) చూ: పంచదశి: ౨-౫౧.

(౨) మనస్సొకయింద్రియమే యని వాచస్పతిభావించెను.

(3) ఆత్మకు నింద్రియములకు మధ్యనొక సంధానసూత్రముండవలెను. అంతఃకరణము లేకున్నచో నిత్యదర్శనమో తదభావమో యేర్పడవలసి వచ్చును. ఆత్మకింద్రియవిషయ సంయోగమువలన నిత్యదర్శనమును, నిట్టి సంయోగమున్నను గార్యము సిద్ధించకున్నచో దర్శనాభావమును గలుగును, కాని రెండునుగూడ యథార్థములుగావు. అందుచే నంతఃకరణమున్నదనియు దానియవధానానవధానములచే దర్శనము దర్శనాభావము నేర్పడుచున్నవనియు నిశ్చయింపవలెను. (శం. భా, ౨-3-3౨)

శంతఃకరణము నందాత్మజ్యోతి ప్రకాశించుచున్నది.౧.ఆత్మయే జ్యోతి; తన్మూలమున నంతఃకరణము దర్శించును.౨. అంతఃకరణమునకు రూపవికారము లుండును. వస్తువులను బ్రదర్శించు వికారమునకు వృత్తి యందురు.౩. అంతఃకరణవృత్తులు నాలుగు విధములు;సంశయ,నిశ్చయ,గర్వ స్మరణములు. సంశయావస్థలో నున్న యంతఃకరణమునే మనస్సందురు; నిశ్చయావస్థలోనున్న పుడు బుద్ధి యందురు; గర్వసహితమైనప్పు డహంకారమందురు; ఏకాగ్రతయు స్మరణముగలిగి యున్నప్పుడు చిత్తమందురు.౧.

---

(౧) చూ. మనీషాపంచకము, బుద్ధియు మనస్సమున్నగునవి స్వయముగా నచేతనములనియుఁ బురుషసాన్నిధ్యముచే నవి సచేతనములగుచున్న వనియుఁజెప్పిన సాంఖ్యభావమును శంకరుఁడంగీకరించెను. అద్వైతమందు శుద్ధ స్వప్రకాశరూపమగు నాత్మయే సాంఖ్యపురుషుని స్థానము నాక్రమించును.

(౨) ఉపదేశసాహస్రి. ౧౮, ౭౩-౩౪, చూ. శం. భా. తై.ఉ.౨, ౧; వార్తికము: తై. ఉ, ౨, ౧.

(౩) అంతఃకరణమున కితరావేశాదిక వికారములుఁగూడనున్నవి. కాని వానిని వృత్తులనరు.

(౧) చిత్తమున్నంతకాలము బుద్ధి విషయమునకు జన్మస్థితిలయావస్థలు మూడును గలవు. ధ్యానైకాగ్రత లవసరమగు నారాధనాదులలోఁ జిత్తవృత్తి ముఖ్యమైనది. సంశయలక్షణముగల మనస్సునకును. నిశ్చయలక్షణముగల బుద్ధికిని శంకరుఁడు భేదముచెప్పెను. (౨,౩,౩౨) సంకల్పవికల్పములు, నింద్రియాదర్శనము, స్మరణ, కామరాగములు మనస్సులోనివే. సమాలోచనము, నిర్ణయము, హేతువిచక్షణము, నాత్మజ్ఞానముగల బుద్ధి మనస్సుకంటె నున్నతమైన శక్తి. బుద్ధియేకాక అహంకారముకూడ నున్నదని సాంఖ్యమతము; కానిచిత్తమును సాంఖ్యము బుద్ధిలోఁగలిపివేసినది. వేదాంతపరిభాష యీ నాలుగును వేర్కొనెను. ఇతర వేదాంతగ్రంథములైన వేదాంత

జ్ఞానమునకుఁ గారణము శుద్ధచైతన్యమొక్కటియే కాదు; అది యంతఃకరణముతోఁగూడి యుండవలెను. ఈయంతఃకరణము భిన్నవ్యక్తులలో భిన్నమైయుండును; అందువలననే యొకని జ్ఞానమింకొకనిదిగాదు. అంతఃకరణము పరిమాణపరిమితి కల దగుటచేఁ బ్రపంచములోని వస్తువులనన్నిటి నెఱుఁగజాలదు. అది యేవ్యక్తికిఁజెందునో యావ్యక్తి పూర్వ సంస్కారముల ననుసరించి భిన్నపరిమాణములలో వర్తించును.౨.

## ౧౫—ప్రత్యక్షము.

శంకరుఁడు మూఁడుజ్ఞానాధారములను బేర్కొనెను; ప్రత్యక్షము; అనుమానము; శ్రుత్యుక్తము.౧. అనంతర రచయితలు, ఉపమానము, అర్థాపత్తి,అభావమునుగూడఁ జేర్చిరి.౨

---

సారము, వేదాంత సిద్ధాంతసార సంగ్రహము మున్నగునవి మనస్సునకుఁ జిత్తముతోను, బుద్ధి కహంకారముతోడ నభేదమొనర్చి సామరస్యము కూర్చినవి. అర్వాచీనాద్వైతమందు రాగజ్ఞాన సంకల్ప విభాగములుపోయి, వీనికి సంబంధించిన చైతన్యప్రవృత్తినంతను బాహ్యాభ్యంతర దర్శనభావములుగా విభజించెను.

(౨) ఈశ్వరునివలె జీవాత్మ, వృత్తివికార సహకారము లేనిదే వస్తువులను బ్రకాశింపఁజేయలేదు; ఏలన జీవాత్మకవిద్యోపాధియున్నది. పరిపూర్ణ చైతన్య ముపాదాన కారణముగా సర్వవస్తురూపమై యుండుటచే స్వప్రకాశముచే వానిని వెలుఁగొందఁజేయును. స్వతస్సిద్ధ స్వభావముచేతనే జీవాత్మ, అంతఃకరణ సహకారము లేనిదే బాహ్యవస్తు సంయోగమును బొందఁజాలదు. (చూ: సిద్ధాంతలేశము.)

(౧) సురేశ్వరుఁడు తననైష్కర్మ్యసిద్ధియందాగమప్రమాణమునకు లౌకికప్రమాణమునకు వ్యత్యాసమున్నదనిచెప్పెను; చూడు (సంక్షేపశారీరకము. ౨, ౨౧. (౨) చూ. వేదాంతపరిభాష.

స్మృతిని సత్యమజ్ఞానముగా సంగీకరించలేదు; ఏలన నవ్యత సర్వ జ్ఞానలక్షణముగాఁ జెప్పఁబడెను. 3 .

ప్రత్యక్షానుమాన సంబంధ మానసికతత్త్వమును శంకరుఁడు చర్చించి యుండని కారణముచే నాతని భావములను గూర్చి చెప్పుట కవకాశములేదు. తృప్తికరము గాకున్నను వేదాంత పరిభాషలోని వివరములే మనకు శరణ్యములు. దాని ననుసరించి, సామాన్యముగా నింద్రియ ప్రవృత్తి వలన లభించు ప్రత్యక్ష విషయజ్ఞానమే ప్రత్యక్షము. ఇంద్రియ దర్శనమందు విషయీ విషయములకుఁ బ్రత్యక్ష సంయోగమున్నది.४. నేత్రము నొక ఘటముపై నిలిపినపు డంతఃకరణము ఘటము నొద్దకుఁబోయి, దానినిఁ బ్రకాశింపఁ జేసి,దాని రూపము నొంది దానిని గ్రహించును. ఆంతరంగిక ప్రవృత్తిచే భౌతికస్పందనములు, మానసిక వృత్తులుగా మారునని తలఁపఁబడెను. మనము నీలాకాశమువైపు చూచినంత మాత్రమున మనము దేనిని

---

(3) అనధిగతాఽబాధితార్థ విషయజ్ఞానత్వమ్ ప్రమాత్వమ్. (వేదాంత పరిభాష ౧) ఈనిర్వచనము ధారావాహికబుద్ధికిని సరిపోవును; ఏలన నది క్షణక్షణమును మారును.

(४) ఆఱువిధముల సంయోగము అంగీకరింపఁబడెను. (౧) ఇంద్రియమగు నేత్రమునకు విషయమైన ఘటమునకును సంయోగము, (౨) సంయుక్తతాదాత్మ్యము. ఇదిఘటముయొక్క ఘటత్వముతో సంయోగము (3) సంయుక్తాభిన్న తాదాత్మ్యము ఇదిఘటవర్ణము యొక్కవర్ణత్వముతో సంయోగము (४) తాదాత్మ్యము; ఆకాశముతో భిన్నముకాని యాకాశలక్షణమైన శబ్దముతో సంయోగము (५) తాదాత్మ్యవదభిన్నము. శబ్దముయొక్క శబ్దత్వముతో సంయోగము (౬)విశేష్య విశేషణభావము. చూ. వేదాంతపరిభాషశిఖామణి.)

దర్శింపవచ్చు. అంతఃకరణ మొక జ్యోతివలెఁ బనిచేయును; దాని వృత్తి యొక దీర్ఘకిరణమువలె బాహ్యమునకుఁ బ్రసరించును, కాంతి కిరణమువలెనే, యీవృత్తియుఁ గొంత దూరమే వ్యాపించును. అందుచే దూరస్థవస్తువులుగోచరింపవు. వృత్తి వస్తువుతో నైక్యమై, యావస్తుపరిసరములఁ గూడ వ్యాపించును. మనము దేనినిఁ జూతుమో యది వృత్తి స్వభావము ననుసరించి యుండును. వృత్తియొకవస్తుభారరూపమునుదాల్చినచో మనకు వస్తుభారము తెలియును; వస్తువర్ణరూపమును దాల్చినచో వర్ణము తెలియును. ధూమము వలన నగ్ని ననుమానించి నపుడు, వృత్తి నిప్పునొద్దకుఁ బోదు; ఏలన నేత్రేంద్రియమునకు ధూమముతోఁ గాని నిప్పుతో సంయోగము లేదు. మన మొక ఘటమును జూచినప్పుడు, ఘటజ్ఞానము ఘటముపైఁ బ్రసరించిన యంతఃకరణ వృత్తితోఁ గలిసి పోవును; ఎట్లన నొక ఘటాంతర్గతమైన యాకాశ మాఘటమున్న గదిలోని యాకాశముతోఁ గలియునట్లే, పరమచైతన్యమునకుఁ బరిచ్ఛిన్నత కల్పించు రెండు కారణములైన వృత్తివికారమును, విషయము నొకేచోట నుండుటచే భేదమును గల్పింపవు. ఈయేకత్వము ఘటజ్ఞానమును బ్రత్యక్ష లక్షణయుక్త మొనర్చును.(౧) ఇదియే ప్రత్యక్షమునకు ననుమానమునకును భేదము, అనఁగాఁ బ్రత్యక్షమునందు విష

(౧) ఘ్రాణేంద్రియము, జిహ్వేంద్రియము, త్వగింద్రియము క్రమముగా వానివిషయములను గ్రహించుటకై తమస్థానములనుండి కదలనవసరము లేదు; కాని నేత్ర శ్రోత్రేంద్రియములు మాత్రము వాని విషయములయొద్దకుఁ బోవలెను. శబ్దతరంగ సిద్ధాంత మంగీకరింపఁబడలేదు.

యము, విషయగ్రహణము కలిసిపోవును; అనుమానమందు విషయము ననుమితభావమును వేరుగా నుంచఁబడును. అనుమానమందు మనస్సు విషయమును గూర్చి యాలోచించునే కాని, దానిని సమీపించి కలిసికొనదు. ప్రత్యక్షము వేరు, స్మృతి వేరు; స్మృతియందు గతవిషయ స్మరణమే యుండును. విషయమును మానసికవృత్తియు వర్తమానకాలమునకుఁ జెందవలయునను నంశము కూడఁ జేర్పఁబడెను.౧.

ప్రత్యక్షము భిన్నవిధములైనదని యంగీకరింపఁబడెను. ఇంద్రియజన్యము; ఇంద్రియాజన్యము. ఆంతరంగికములైన రాగద్వేషాదులు రెండవరకములోనివి. ప్రత్యక్షనిర్వచనమునకుఁ బ్రధానమింద్రియముగాదు; విషయరూప చైతన్యమును ప్రమాణ చైతన్యమును సంయోగమందుటే ముఖ్యము.౨. మనము సుఖమునుగాంచినపుడు సుఖము, మానసిక సుఖవృత్తియు నొకేచోటనుండి తీరవలయును. ధర్మాధర్మము లంతఃకరణ లక్షణములైనను, ప్రత్యక్ష విషయములుగావని చెప్పఁబడెను. అవి ప్రత్యక్ష విషయములుగానుండుట కవకాశము లేదనియే హేతువు చెప్పఁబడినది. యోగ్యత్వము ముఖ్యమైనది.3. విష

(౧) వర్తమానత్వమ్॥

(౨) ప్రమాణచైతన్యస్య విషయావచ్ఛిన్న చైతన్యాభేదః॥ ఇతి.

(3) యోగ్యత్వమ్॥ అంతఃకరణమును, దానిగుణములును సాక్షిచైతన్యమునకుఁ బ్రత్యక్షవిషయము లైనప్పుడైనను, ప్రమాత, స్వీయగుణసహితమగు నంతఃకరణ రూపములోనున్న వృత్తితోఁ గలిసియుండును. సాక్షిచైతన్యము యొక్క జ్ఞానమునగా, వృత్తిరహిత గ్రాహకశక్తి యనికాదు; ఇంద్రియసంబంధముకాని, అనుమానాది ప్రమాణ సంబంధముకాని లేదని భావము. అంతః

యముల యోగ్యతాయోగ్యత లనుభవైకవేద్యములు. పద ప్రయోగమూలమునఁగూడఁ బ్రత్యక్షదర్శనము సిద్ధింపవచ్చును; "నీవుపదవవాఁడవ"ను దానిలోవలె దృష్టవిషయము మానసిక వృత్తితో సంయోగమునుచెందినపు డట్టిది లభించును.౪. "నేను మధురమైన చందనవృక్షమును" జూచితినను దానిలోఁ జందన వృక్షము ప్రత్యక్షము; దానిమధురపరిమళము దృశ్యవిష యముకాదు కావునఁ బ్రత్యక్షముగాదు. అందుచేఁ బ్రత్యక్ష మనఁగా, "వర్తమానకాలములోనున్న యొకవస్తురూపమును ధరించిన యింద్రియ గోచరయోగ్యమైన శుద్ధచైతన్యమునకును వస్తురూపమునుదాల్చిన వృత్త్యాకృతి వహించిన శుద్ధచైతన్యము నకును సంయోగమ"ని నిర్వచింపఁబడెను.౧.

సవికల్పక నిర్వికల్పక భేదమంగీకరింపఁబడెను. సవికల్పక ప్రత్యక్షమునందు, విషయమైన ఘటమునకును, విషయలక్షణ మైన ఘటత్వమునకును భేదమున్నది.౨. నిర్వికల్పక ప్రత్యక్ష ములో విషయలక్షణములన్నియు విడిచిపెట్టఁబడినవి. "అది నీవే; "ఇతఁడే యాదేవదత్తుఁడు." మున్నగు వాక్యములలోఁ

కరణవృత్తి గ్రహింపఁబడినపుడు ప్రమాత కింకొక రెండవవృత్తితోడను, దరిశ యట్లే యనేక వృత్తులతోడను సంబంధ మవసరములేదు; ఏలనఁ బ్రథమ వృత్తియే స్వీయవిషయమగును. వృత్తేః స్వవిషయత్వాభ్యుపగమేన॥

(౪) చూ: పంచదశీ॥ ౭–౨౩.

(౧) "తత్తదింద్రియ యోగ్య వర్తమాన విషయావచ్ఛిన్న చైతన్య భిన్నత్వమ్ తత్త దాకారవృత్త్యవచ్ఛిన్న జ్ఞానస్య తత్తదంశే ప్రత్యక్షత్వమ్" చూ: వివరణప్రమేయ సంగ్రహము॥ ౧, ౧.

(౨) ఘటఘటత్వయో ర్వైశిష్ట్యమ్॥

కర్తకును కర్మకును భేదములేదు. 'అదినీవే' యనుదానిలో జ్ఞాతయే విషయమగుటచే జ్ఞాతయొక్క చైతన్యమునకును, జ్ఞాతృరూపము నొందిన వృత్తిచైతన్యమునకును భేదము లేదు. ౩. వాక్యార్థమును మనము భిన్నాంగముల సంబంధములో నిమిత్తములేకుండ గ్రహింతుము.

జీవసాక్షియనియు నీశ్వరసాక్షియనియు నింకొక భేదము చెప్పఁబడెను. పరమచైతన్య మంతఃకరణ రూపమొందినది జీవుఁడు; ఆచైతన్యమే యంతఃకరణ బద్ధమైనపుడు జీవసాక్షి యగును. జీవతత్త్వములో నంతఃకరణము ప్రవేశించును; కాని యదిబాహ్యముననేయుండి జీవసాక్షి నాచ్ఛాదించును. జీవుని విషయములో నదియొకవిశేషణము; జీవసాక్షి విషయములో నది యుపాధియగును. ౪. ఈశ్వరుని విషయములోను, నీశ్వర సాక్షి విషయములోను నంతఃకరణము స్థానమున మాయాశక్తివచ్చును. మాయారూపధారియైన పూర్ణచైతన్య మీశ్వ

(౩) నిర్వికల్పప్రత్యక్షమునందు గుణవిశేషములు వినా వస్తువు గుర్తింపఁబడునని చెప్పఁబడెను. అనఁగా 'మహాసామాన్యమస్యైతు సత్తామ్' (న్యాయమంజరి పు. ౯౭) జయంతుఁడు దీనిని ఖండించెను. నిర్వికల్పక ప్రత్యక్షములో వస్తుస్వరూపమాత్రమే తెలిసినయెడల, సవికల్పకప్రత్యక్షములో గుణవిశేషములు తెలియుటకు కవకాశమేలేదని యాతఁడు చెప్పెను. మఱియు గుణవిరహితమగు వస్త్వస్తిత్వము తెలియుటకు కవకాశమేలేదు. నచ భేదమ్ వినాసత్తాగ్రహితుమపి శక్యతే.

(౪) కలువలోని నైల్యమువలె నొక గుణమొక వస్తువిశేషమును దెలుపు లక్షణము. ఉపాధియనగా భిన్నమైన విశేషలక్షణము. ఒక గాజుముక్క సమీపమున నున్నయొక రక్తపుష్పమువలన, గాజు రక్తిమగలిగినట్లు గోచరించును. (న్యాయమంజరి॥ పు. ౯, ౭.)

రుఁడు; మాయోపాధి సమన్వితమైనప్పుడదియే యీశ్వరసాక్షి. జీవునికి దేహముతో నెట్టిసంబంధమున్నదో, యీశ్వరునికిఁ బ్రపంచముతో నట్టిసంబంధమున్నది.

ప్రత్యక్షవిపర్యయము కూడఁ జర్చింపఁబడినది. శుక్తి రజిత భ్రాంతి యట్టిదే. దోషముతోఁ గూడిన నేత్రమునకు వస్తు సంయోగము కలిగినపుడు, మెఱుపుతోఁగూడిన వస్తురూపమును దాల్చిన యంతఃకరణ వృత్తి యేర్పడును. శుక్తి రజితములకు సామాన్యమైన మెఱుగును జూచుటచే జనించిన పూర్వరజిత జ్ఞానసంస్కారముతో నవిద్యాశక్తి ౧. తోడ్పడి సత్యమగు రజితము గోచరించును. అవిద్యావికారమగు రజితము విషయ చైతన్యమున నివసించును. మిథ్యారజితమున కాధారము స్వస్వరూపములో నున్న పరమచైతన్యము కాదు; విషయ చైతన్యమే. ఈమిథ్యాదర్శనమునందు రెండు వృత్తులున్నవి; ఒకటి 'ఇది' యను భావము, రెండవది మిథ్యారజితము, మొదటిది యథార్థముగా గోచరించునదే; రెండవది స్మృతిరూపము. ఒకే జ్ఞానమీరెంటిని గలుపుటచే విపర్యయ మేర్పడుచున్నది. మిథ్యావిషయమైనను కేవల శూన్యప్రదర్శనము గాదు; అయినచో భ్రాంతియే కలుగదు. మన మొక వస్తువును భ్రాంతియని తలఁచి నప్పుడది యొక వస్తువు కాకపోలేదు; కాని యది వ్యవహారసిద్ధముగా నెట్టి రూప

---

౧ మన మొక రజ్జువును సర్పమని భ్రమించినప్పుడు తత్కారణమైన అవిద్యయు ననాదియైనదేనా యని న్యాయామృతకర్త యడిగినాడు 'మనవ్యక్తి గతవిపర్యయములన్నియు మూలభూతమగు నవిద్యారూపములే. పోల్చు: అవిద్యయొక్క మూల, తూలరూపములు.

ములో నుండవలయునో యట్టి రూపములో మాత్రము లేదు(౧). శంకరాద్వైతము ననుసరించి యథార్థరజితము గూడ నిజమైనది కాదు గాని, వ్యవహారసిద్ధమగు రజితమునకును, మిథ్యారజితము నకును భేదమున్నది. మిథ్యారజితదర్శనము కేవల వ్యక్తిగతము. ఈమిథ్యారజితము ద్రష్టయగు వ్యక్తికే తెలియును గాని, వ్యక్తిగతములైన సుఖదుఃఖాదుల వలెనే యితరుల కనుభూతము కాదు.౨.

అద్వైతము ననుసరించి, గతానుభవ సంస్కారములచే వికారమొందిన ప్రత్యక్షరూపమే ప్రత్యభిజ్ఞ, విషయసమాన త్వమునకే కాక, దానిని గుర్తించు వ్యక్తి సమానత్వమునకుం గూడ నద్వైత మధికప్రాముఖ్యము నిచ్చును.

---

(౧) ఈభావము ననుసరించి, శుక్తిస్థానమున రజితోత్పత్తి, లోకములో నేయితరవస్తువైన నుత్పత్తి యగుట వంటిదే, ఏలనం బ్రతికార్యమును దాని కారణమైన యవిద్య యందిమిడి యుండును. నైయాయికులును, రామాను జుండును మిథ్యారజితోత్పత్తి నూహింపనవసరము లేదనిరి. వేఱొకచోం జూచిన రజితభ్రాంతి విషయమగుననిరి; తన్నిశ్చయమే మిథ్య, దీని కద్వైత మిట్లు జవాబు చెప్పును. గ్రహించిన విషయము మిథ్యాకల్పితమైనను, దృష్టి గోచరమైనది. వేఱొకకాలములో నింకొకచోం జూచిన రజితమిప్పటి ప్రత్యక్ష విషయము కాంజాలదు. ఇందలిక్లిష్టతను దొలగించుటకై రజితముతో నింద్రియ సంయోగము లేదని నైయాయికుండు చెప్పినాండు. దీని నంగీకరించినచో ననుమానము కూడ నొక స్వతంత్రప్రమాణము కాంజాలదు. మిథ్యారజితము జీవునిపై సుఖదుఃఖాదులవలెం బ్రవర్తించినచో, 'నేను సుఖిని, దుఃఖి"ననుట వలెనే, 'నేను రజితమును"ని చెప్పవలసి యుండునను నాక్షేపణకు, 'నేను' 'రజితము'నను భావము లేకానుభవసిద్ధములు గావని సమాధానము చెప్పం బడెను.

(౨) కేవల సాక్షివేద్యము. (౩) సుఖాదివదనన్యవేద్యము.

వ్యవహారజగత్తునకును, స్వప్న, మిథ్యాజగత్తులకును శంకరుఁడు భేదమును గమనించును.౪. తర్కబుద్ధి గోచరజగత్తునకు దేశకాలనిమిత్తములతోఁ బాటబాధితత్వము కూడ లక్షణములై యుండవలెను.౫. స్వప్నవస్తుజాలమున కీలక్షణములు లేవు. యథార్థమనుట కర్తృతయున్నచో స్వప్నజగత్తు, శూన్యముపై నాధారపడినను, నేకత్వమును గలిగియుండవలెను. కాని స్వప్నానుభవములు జాగ్రదవస్థానుభవ విరుద్ధములగుటయే కాక, యొకే స్వప్నమందే పరిహరింపఁబడుచున్నవి. శంకరుఁడు భావిదశా సూచకములగు స్వప్నావస్థల సంగీకరించునుగాని, తత్సంబంధవిషయము లసత్యములే యనును. అందుచే స్వప్నజగత్తు జాగ్రత్ప్రపంచమునకుఁ గల యాథార్థ్యమును గలిగినది కాదు.౧. స్వప్నములో మిథ్యాగోచరములైన విషయములు వానియథార్థ స్వరూపజ్ఞాన ముదయించువఱకే యుండును. జాగ్రదవస్థలోనైనను, యథార్థమును గుర్తించు పరమచైతన్యముండదు గావున, స్వప్నవిషయములు జాగ్రదవస్థలోఁగూడ గోచరింపవలెనని యొక యాక్షేపణ చెప్పఁబడెను. అద్వైతము బాధకు నివృత్తికి భేదమును జెప్పును. బాధయందుఁ గార్యము తదుపాదాన కారణముతో నశించును; నివృత్తిలోఁ గార్యము నశించినను గారణము మిగిలియుండును. మిథ్యాజగత్తున కుపాదాన కారణమైన యవిద్యను సత్యదర్శనమే నశింపఁజేయఁగలదు.

(౪) శం॥భా॥౩,౨,౧,౩.

(౫) దేశకాల నిమిత్తసంపత్తి రబాధశ్చ.

(౧) పారమార్థికస్తు నాఽయమ్ సంధ్యాశ్రయస్సర్గో వియదాదిసర్గవత్॥ శం॥భా॥ ౩,౨,౪.

ఒక నూతన మానసికవృత్తి యుదయించినప్పుడుగాని, యింద్రియదోషము తొలఁగినపుడుగాని నివృత్తికలుగును. స్వప్నవస్తువులు జాగ్రదవస్థలో నదృశ్యములగుటకుఁ గారణము వస్తుయాథార్థ్య దర్శనమువలనఁగాదు; ఇతర మానసికవృత్తు లుదయించి, నిద్రాదోష నివారణ మొనర్చును. శుక్తి జ్ఞానము రజితభ్రాంతిని దొలఁగించును; స్వప్నజ్ఞాన మొకవిధమగు స్మృతి రూపము; అందుచే నది ప్రత్యక్షవిషయ రూపములకుఁ దప్పనిసరిగా భిన్నమైనది.౧.

---

(౧) శం॥ భా॥ ౨, ౨, ౨౯. అనంతరభాష్యకారులు శంకరుఁడిచట నింకొక శాఖాభావమును స్మరించెననిరి. (శం॥ భా॥ ౧, ౧, ౯.) మఱియు జూడు. శం; భా, ౩, ౨, ౧-౧౦. స్వప్నములలో నైం సుఖదుఃఖానుభవములు పూర్వసుకృత దుష్కృత్యములననుసరించి సమకూరునని శంకరుఁడు చెప్పినాఁడు. (శం॥ భా॥ ౨,౩,౧౪) స్వప్నానుభవవిషయములో ననవచ్ఛిన్న చైతన్యము స్వప్నములకు మూలాధారమనియొకప్పుడు చెప్పఁబడెను; కాని యిదినిజమైనచో వ్యక్తిగతచైతన్యముతో నిమిత్తములేకుండఁగనే స్వప్నములు కలుగవలెను. అట్లుకలుగుటలేదు సాక్షిరూపమగు నాత్మ తనతో సాహచర్యముగల విషయములనే ప్రకాశింపఁజేయఁగలదు. కాక, అహంకారాద్యవిచ్ఛిన్న చైతన్యమే స్వప్నహేతువైనచో స్వప్నము గాంచునాతఁడు స్వప్నములను దనయందే నిత్యము గాంచవలెను. స్వప్నాధారమును, స్వప్నదృశ్యమును తాదాత్మ్యసంబంధమునుగాని, యాధారాధేయ సంబంధమునుగాని కలిగియుండవలెను. అప్పుడు స్వప్నదర్శనమిట్లుండవలెను; "నేనొకహస్తిని": నేనొక హస్తినైతిని. కాని స్వప్నగతుఁడట్లుకాక, పర్వతముపైనున్న హస్తిని జూచి, తాను వేరు హస్తివేరనియుఁ గాంచుచున్నాఁడు. అందుచే నీభావము నంగీకరింపమన్నచో, స్వప్నవైవిధ్యమునకు హేతువునుజూపఁజాలము; ఏలన వ్యక్తులందరకు ననవచ్ఛిన్నచైతన్యము సామాన్యమే గావున, నదియే స్వప్నాధారమైనచో, నందరిస్వప్నములు సమానములై యుండవలెను.

అద్వైతము ప్రతిపాదించిన ప్రత్యక్షసిద్ధాంతముపూర్తిగా శాస్త్రీయముగాదు కాని, యందలి తాత్త్వికదృష్టి విలువగలది. అంతఃకరణము, నదివస్తురూపవృత్తి వికారములనందుట యున్నగు నదంతయు సహేతుకముగా స్థాపితముగాదు. దృశ్యమును బ్రదర్శించు నింద్రియవేదనలతోఁగలిసి చూపట్టు మానసికసంస్కారరూపములకుఁగలప్రాముఖ్యమును, సముచిత స్థానమును జేర్కొనఁబడలేదు. ప్రాకృతవిజ్ఞానములో ద్వైతభావమేలేదు; అదియొక యేకైకచేతనప్రవృత్తి. దానినతిక్రమించుటవలననే జ్ఞానాభివృద్ధి కలుగును, అద్వైతముయొక్కయు, సాంఖ్యముయొక్కయుఁ బ్రత్యక్షప్రమాణమునందలి గుణవిశేషమేమనఁగా, విజ్ఞానము కేవలమచేతన పరివర్తనమువలని ఫలితముకాదని నిశ్చయించుటే. విజ్ఞానము ప్రాతిపదికమైన సత్యము; దానికచేతన విషయము లెవ్వియుఁ గారణములుగాఁజాలవు. ద్రష్టకు సంబంధములేని విషయమున కస్తిత్వములేదని యద్వైతము చెప్పుటలో నర్థమేమనగా విషయమును బోషించు మూలాధారమైన సత్యమునకును విషయి కాధారభూతమగు సత్యమునకును భేదములేదనియే,(౨). ద్రష్టవిషయములన్నిటికి వ్యక్తిత్వముండవలెను గావున బరిపూర్ణ నిత్యచైతన్యమును, శూన్యతయును, బ్రత్యక్షవిషయములుగావు.

## ౧౬—అనుమానము.

అనుమానము దానికి నిమిత్తకారణమైన వ్యాప్తిజ్ఞానముచే సిద్ధించును. "కొండ ధూమసహితమై యున్నద"ను

(౨) ప్రమాతృసత్తాతిరిక్తసత్తాకత్వాభావః.

దానిలోవలె హేతువునందు లక్షణ మిమిడియున్నప్పుడును, "ధూమమున్న చోట నిప్పుండి తీరునను పూర్వానుభవ మానసిక సంస్కారము జాగృతమై నప్పుడు,"ను "కొండ మండుచున్న ద"ను ననుమానజ్ఞానము సిద్ధించుచున్నది. హేతువునకును హేత్వాధార విషయముల కన్నిటికి సామాన్యమై యున్న సాధ్యమునకును సమాన లక్షణములున్నప్పుడు వ్యాప్తియగునని నిర్వచనము చేయఁబడెను. సాధ్యహేతువ్యాప్తిదర్శనమువలనను, మఱియు నవ్యాప్త్యభావదర్శనము చేతను ననుమానము సమకూరును.౧. దీనినిఁ బోషించు నుపమానముల వలన సామాన్య సత్యస్థాపనమై, వ్యతిరేకలక్షణాభావముచే సమర్థింపఁబడును. అద్వైతము ననుసరించి, "ఎచట ధూమమున్నదో, యచట నిప్పున్నద"ను సర్వసామాన్య నిశ్చయజ్ఞానవ్యాప్తి వలననే యనుమానసిద్ధి చేకూరును."ఎచట నిప్పున్నదో,యచటఁ బొగ యుండద''ను సర్వసామాన్య వ్యతిరేక నిశ్చయవ్యాప్తి వలన నర్థాపత్తి లభించును. సరిగాఁ జెప్పుచో నభావవ్యాప్తి యనునది లేదు; అన్నిసవికల్పక విషయములలో నభావాంశము కొంతయున్నది. కేవలాన్వయీ సంబాధములు సాధ్యములుగా నంగీకరింపఁబడ వేలన నందు విపక్షమే లేదు. ప్రతి లక్షణము దాని యభావ వ్యతిరేకరూపమగుట చేతను, సర్వాభావములు పరమసత్యమైన బ్రహ్మమందు వసించి యుండుట చేతను, నిర్గుణమగుట చేతను, బ్రహ్మమునుగూర్చి కేవలాన్వయ సంబం

(౧) వేదాంత పరిభాష, ౧,ఆ. సాచవ్యభిచారా జ్ఞానేసతి సహాచార దర్శనేన గృహ్యతే.

ధములు లేవు. అనుమానమునకు స్వార్థ పరార్థ భేదములున్నవని యద్వైత మంగీకరించును. పరమార్థానుమానమున మూడంగములున్నవి; ప్రతిపాదన, హేతువు, నుపమానము గావచ్చును. లేక ఉపమాన, ప్రయోగ, నిశ్చయములైనఁ గావచ్చును.

## ౧౭—శబ్దప్రమాణము.

ఆగమప్రమాణము స్వతంత్రజ్ఞాన మూలమని యద్వైత మంగీకరించినది. ఒక వాక్యమందలి యర్థమే యితరప్రమాణములచేతను దోషముగా నిరూపింపఁబడనప్పు డావాక్యము ప్రమాణవాక్యమే.౧.

శంకరుఁడు స్ఫోటవాదమును ఖండించెను. అక్షరములే పదమని యాతఁ డుపవర్షునితో నేకీభవించెను. ఈయక్షరములు నశింపవు; "ఏలన, నవి తిరిగి చెప్పఁబడినప్పు డా యక్షరములే యని గుర్తింపఁబడును."౨. పదములు జాతిని లేక ఆకృతిని దెల్పునే కాని వ్యక్తిని దెలుపవు; ఏలన వ్యక్తులసంఖ్య యనంతమైనది. వ్యక్తులకే జన్మలయము లున్నవి కాని జాతులకు లేనందున, పదములకును, నవి సూచించు జాతులకును సంబంధము నిత్య

(౧) యస్యవాక్యస్య తాత్పర్యవిషయీభూత సంసర్గో మానాంతరేణ నబాధ్యతే, తద్వాక్యమ్ ప్రమాణమ్,

(౨) ఒక పదములోఁగల యక్షరము లొక విశిష్టక్రమమును,సంఖ్యను ననుసరించి సంప్రదాయ ప్రయోగసిద్ధిచే నొక విశిష్టార్థమును గలిగి యున్నవి. ఈయక్షరము లుపయోగింపఁ బడినపుడు, బుద్ధి కవి యక్షరములుగాఁ దోఁచి, ప్రత్యక్షరమునకుఁ గల యర్థమును వరుసఁగా గ్రహించిన వెనుక, సముచ్చయార్థముబోధపడి, వాని విశిష్టార్థమును స్పష్టపఱచును. (శం॥ భా॥ ౧,౧,౩,౨౮)

మని చెప్పఁబడెను. పదమున కర్థము శక్యమనియు, లక్ష్యమనియు ద్వివిధము. శంకరుఁడు సామాన్యముల నంగీకరించి యవి పుట్టుక లేనివనియు,వ్యక్తులుమాత్రము పుట్టుకగలవనియుఁ జెప్పెను.౧. దృష్టము ననుభూతమునైన దాని కంతర్వర్తియై సామాన్యముండును. భూలోకములో నున్న వస్తువులకు స్వర్గములోనున్న మూలరూపములే సామాన్యములు. వానినిఁ బ్రమాణములుగాఁ గైకొని యీశ్వరుఁడు జగన్నిర్మాణమును నడపును.

వేదమనగాఁ గాలాతీతమైన విజ్ఞానము; అందుసృష్టి యొక్క స్థితికి సంబంధించిన శాశ్వతసూత్రములున్నవి. వేదములపౌరుషేయములు; అవిదైవసంకల్పరూపములు. ౨ వేదా

(౧) అనంతరాద్వైతులు సామాన్యముల నంగీకరింపరు; కారణమవి ప్రత్యక్షానుమాన విషయములుగావు. భిన్నవ్యక్తులలో నొకేసమానరూపదర్శనము సామాన్యాస్తిత్వమును ఋజువుచేయవు. (నతావత్ గౌ గౌరితి అభిన్నాకార గ్రాహిప్రత్యక్షమ్ జాతౌ ప్రమాణమ్.) భిన్నోపమానములలో గోవును గ్రహించుట గోసామాన్యత్వమును ఋజువుచేయదు. భిన్నపాత్రలలో ప్రతిఫలించు చంద్రుని గ్రహించుటవలన విశ్వసామాన్యచంద్రాస్తిత్వమును నిరూపించుట కాఁజాలదు. అన్నిగోవులయందు సమానగోస్వరూపమును జూచుటయు నిజముకాదు. నిజమైనను, గోవులకు సామాన్యలక్షణములున్నవనియే తెలియునుగాని, సర్వసామాన్యత్వము స్థాపింపఁబడదు. సర్వసామాన్యలక్షణముగలదిగా నొకగోవును మనముచూడము. భిన్నావయవక్రియ నిర్మాణము సామాన్యమును జూచినను, నదివిశ్వసామాన్యలక్షణము కాఁజాలదు. చూ. తత్త్వప్రదీపిక పు. 303. సామాన్యములులేవను బౌద్ధవాదములు చిత్సుఖియందుఁ జేర్కొనఁబడెను.

(౨) శం॥ భా॥ ౧,౧,3. పోల్చు: ప్లేటో; "ప్రపంచముయొక్క నిర్మాణక్రమరూపమే యీశ్వరమానసము."

ర్థము నిత్యమైనదేకాని, వేదవాక్యములు నిత్యములుగావు; ఏలనఁ బ్రతికల్పారంభమున నవిఋషులచేఁ గల్పింపఁబడు చుండును. వేదము లక్షర, పద, వాక్యసముచ్చయములనియు, నవి సృష్ట్యారంభముననుండి,ప్రళయ కాలమందాకాశాది భూతములవలె సదృశ్యములగు చుండుననియు నద్వైతివిశ్వసించును. [3]జగత్క్రమమునకు నిరోధకములగు ఘట్టములు తరచుగా సంభవించుచున్నను, ననాదియైన సంసారమందొక నియతత్వమున్నది.౩. జగత్పరమార్థరూపము వేదములందంతర్నిహితమై యుండుటచే నది నిత్యమగుటవలన వేదములును నిత్యములే యగును.పౌనఃపున్యముగావచ్చు ప్రపంచరూపములకు నియతాకృతియుండుటచేఁ గల్పాంతములవలన వేదప్రామాణ్యమున కనర్థము వాటిల్లదు.౧. పరమసత్యము నిత్యమైనరీతిగా వస్తుపరమార్థరూపములు నిత్యములుగావు;ఏలన నివి యవిద్యా సంజాతములు. శబ్దములనుండి జగదుత్పత్తియైన శబ్దము జగదుపాదాన కారణముగాదు; బ్రహ్మమే యట్టికారణము. శంకరుఁడిట్లు చెప్పెను; "అవ్యయములగు పదములున్నవి. వానియందిమిడి యున్న శాశ్వతార్థప్రకటనముచేయు శక్తి నవి కలిగియున్నవి. అట్టి పదప్రయోగార్హతగల వస్తువులయుత్పత్తియే పదముల

(౩) డ్యూసేన్సుసిస్టమ్ ఆఫ్ వేదాంత. పు॥ ౮౦.

(౧) శ్రుతిచెప్పినరీతిగా(బృ॥అ॥ఉ॥ ౨,౪,౧౦)పరమేశ్వరుఁడలసట లేని లీలతో సర్వజ్ఞాననిధులగు ఋగ్వేదాదులను మానవుఁడు నిశ్వసించునట్లుగా నావిష్కరించెను. తన్మూలముననే దేవ పశు మనుష్య వర్ణాశ్రమాది విభాగములేర్పడెను.అందుచేఁ బరమేశ్వరుని కనితరసాధ్యములగు ననంతప్రజ్ఞా సామర్థ్యములుండవలెను. (శం॥ భా॥ ౧, ౧,౩.)

నుండి జగదుత్పత్తియని చెప్పఁబడినది."౨. శాశ్వతముగా స్వతంత్రములగు చిచ్ఛక్తియు, సంకల్పశక్తియుఁగల యీశ్వరుఁడీపదములను స్మరించి, ప్రతికల్పారంభమునను వానికిఁ బునరావిష్కృతియొసఁగును. సృష్టియనగా నీపదముల యావిష్కరణమే; దీనిప్రవృత్తి కాలాతీతము, న్యాయమీమాంసా తత్త్వజ్ఞులు చూపినవానికంటె నితరాధారములు వేదప్రామాణ్యమును సమర్థించుటకుఁ జూపఁబడెను. వేదము లీశ్వరస్వరూపము నావిష్కరించి, యీశ్వర భావగర్భితములగుటచే శాశ్వత స్వయంప్రకాశ లక్షణము గలవి. రూపమున సూర్యకాంతి ప్రత్యక్షసాధనమైనవిధమున, వేదప్రామాణ్యము స్వతస్సిద్ధము, సద్యస్సిద్ధమునైనది.౩.

స్మృతికిఁ బూర్ణప్రామాణ్యము లేదు. బుద్ధీంద్రియాతీత జ్ఞానము నిచ్చు శ్రుతిఁగి. కనుగుణమైన స్మృతియే ప్రమాణమగును.౨. జడపదార్థమును, దాని లక్షణములను నిర్ణయించుటలో శ్రుతియైనను శాస్త్రమంత ప్రమాణముగాదు.౩. కాని ధర్మాధర్మ విషయములో స్మృతియే యేకైకప్రమాణము. పరమార్థస్వరూప విషయములో ననుమానము ననుభవ జ్ఞానముకూడఁ బ్రమాణము లేర.

---

(౨) శం॥ భా॥ ౧,౩,౨౮.
(౩) వేదస్యహినిరపేక్షమ్ స్వార్థేప్రామాణ్యమ్ రవేరివరూపవిషయే
(౧) శం॥భా॥ ౨,౧,౧.
(౨) శం॥ గీతాభాష్యము॥ ౩,౬౬.
(౩) శం॥భా॥ ౧,౪,౪; ౧,౩,౭.
(౪) శం॥భా॥ ౧,౧,౨

౧౮- విజ్ఞానవాద నిరసనము.

కొంతఁగా నిత్యమై గోచరించు బాహ్యజగద్రూపము శంకరుని యథార్థ జగత్పటమునుండి తుడిచి వేయఁబడ లేదు. ఒక యాసనమునుగాని, బల్లనుగాని చూచుట కేవల మానసిక భావదర్శనమే యని శంకరుఁడు తలఁచియుండ లేదు. అట్లు తలఁచుట ప్రత్యక్షసాక్ష్యమును దోసిపుచ్చి, భౌతికజగత్తునంత నొక వ్యర్థస్వప్నముగా భావించు టేయగును. "మన విజ్ఞానమునకు బాహ్యములై వస్తువులున్నవని యంగీకరించు టనివార్యమైనది; ఏలన నొక స్తంభముకాని, యొకగోడకాని కేవల విజ్ఞానరూపమని యెవ్వఁడును భావింపఁడు; కాని ప్రతివ్యక్తియు స్తంభమును గోడయు జ్ఞానవిషయములని యెఱుఁగును." "బాహ్యవస్తువులు లేవనువారు, మనస్సులో గోచరించిన రూపములే బాహ్యమున నున్నట్లుగా గోచరించుచున్నవని చెప్పుటచే నీవిషయ మందరకును విశదమగుచున్నది." "జ్ఞానము వేఱు; వస్తువు వేఱు." వస్తువైవిధ్యముచే జ్ఞానవైవిధ్య మేర్పడుచున్నది. మనము వస్తువులను జూచుచున్నాము; మిథ్యాదృశ్యములను ధ్యానించుట లేదు. మనము చూచుటలోని మానసికప్రవృత్తి మనము చూచిన వస్తుహేతువుగాదు; వస్తుస్వభావము మనకి ప్రవృత్తి హేతువగుచున్నది. ఒకవ్యక్తి చిత్తమునకు గోచరించుటమాత్రమే వస్తులక్షణమంతయుఁగాదు. మన మొక దుఃఖమును జూచినప్పుడైన నది కేవల మానసిక వికారము కాదు. ఏ జ్ఞానవిషయమున కైనను గల యస్తిత్వ వాస్తవికత్వములు దానికి నున్నవి. వస్తువు లెట్లున్నవో మనము వానినట్లే చూచు

చుంటిమి; అవి యెట్లు గోచరించుచున్నవో యస్పష్టమైయున్నవి. తాత్త్వికముగానైనను, శంకరుఁడు విషయాస్తిత్వము సంగీకరింప వలసి వచ్చినదని మనము ముందుఁ జూడఁగలము. ఏలనఁ దెలియుట లేక యెఱుకయే చైతన్యము, దానికి గుణములుకాని వేరు దశలుకాని లేవు. అది శుద్ధ(గుణ స్వచ్ఛతగలది. వర్ణలక్షణ గతిక్రియాదులన్నియు వస్తుప్రపంచములోనివే. పరికించుట, దర్శించుట, స్మరించుట, భావించుట, మనన మొనర్చుట, నిర్ణయించుట, తర్కించుట, విశ్వసించుట మున్నగువానిలోఁగల భేదములను గుర్తించుటకుఁ గారణము వస్తునానాత్వమే. శుద్ధచైతన్యమిచ్చుట యు లేదు, పుచ్చుకొనుటయు లేదు. విపరీతదర్శనము సంద్దైన నేదో యొక విషయముండును. అందువలననే శంకరుని తత్త్వమందును, బ్రాడ్లే తత్త్వమందును (బరిపూర్ణ సత్యములు లేవు; కేవల విపర్యయములును లేవు.[1] యథార్థభావములు మన ప్రయోజనసిద్ధి కనుగుణములై; సత్యమొక సమన్వయసిద్ధి గల పూర్ణరూపమను భావమునకు సరిపడును; విపరీతభావములట్లు సరిపడవు మనముచూచి, చవిగొని, స్పృశించి యనుభవించు జగత్తు సతత్కర్తలమైన మనతో సమానముగా నిజమైనదే.[2]

(1) "విశేష హేతువివరణము నటుంచి, నా దృష్టిలో సత్యానృతములు పూర్ణసత్యములుగావు, పారమార్థికముగా వానికిఁగల భేదము పరిమాణభేదమే." (ట్రూత్ అండ్ రియాలిటీ పు. ౨౫౨) బౌద్ధవిజ్ఞానవాదమును శంకరుఁడెట్లు ఖండించెనో ప్రథమభాగమునఁ జూడనగును.

(2) ప్రశ్నోపనిషత్తునకు భాష్యము వ్రాయుచు శంకరుఁ డిట్లు నుడివెను: "తెలియుట కవకాశము లేని బాహ్యవిషయ మున్నదని చెప్పరాదు. గోచరించు వస్తువొకటి చూడఁబడెను గాని, చూచుటకుఁ (న్న మాత్రము లేదనుట వంటిదే, జ్ఞానము లేకున్నచో జ్ఞానవిషయమును లేదు." (౬-౨)

మనస్సు తనపరిమాణములతో నొకవైపునను,దన్నిర్మాలమున నది గ్రహించు ప్రపంచమింకొక వైపునను గలిసి వర్తించుచున్నది. సర్వతత్త్వకేంద్రసత్యమగు విషయీవిషయ సంబంధమును శంకరుఁ డంగీకరించి, కేవల విజ్ఞానవాదమును,భౌతిక వాదమును మన కనుభవసిద్ధమగు జగత్తును సమగ్రముగా నిరూపింపఁ జాలదని ప్రకటించినాఁడు. విజ్ఞానవాదమును ఖండించుటే కాక శంకరుఁడు జాగ్రత్స్వప్నావస్థాభేదమును గూడ నొక్కి చెప్పెను. స్వప్నానుభవములు జాగ్రదనుభవ వ్యతిరేకములుకాగా,జాగ్రదనుభవములు మాత్ర మేయితరానుభవములచే నిర్మూలితములగుటలేదు ౨

జగద్వస్తువు లూహాకల్పితములు గావని శంకరుఁడు వివరించియు, దార్శనికలక్ష్యము ననుసరించి, మన జ్ఞానవిషయములన్నియు విషయచైతన్య రూపములని చెప్పెను. పారమార్థికముగాఁ జూచినచో జ్ఞానవిషయములు జడపదార్థ, చలన; భౌతికశక్తి, మానసిక రూపములుగాఁ దలఁప రాదనియు నివన్నియు బుద్ధికల్పితభావములే యనియు నాతఁడు చెప్పెను. వస్తువులకు స్వతంత్ర స్థితిలేదు;నాయొక్కగాని నీయొక్కగాని విజ్ఞాన విషయము లవి కాకున్నను, నీశ్వరుని జ్ఞాన విషయములై యున్నవి.౩ ఈశ్వరుని విజ్ఞానదృష్టికి, స్వీయజ్ఞానము గల జీవుల

---

(౨) నైవమ్ జాగరితోపలబ్ధమ్ వస్తుస్తంభాదికమ్ కస్యాంచిదపి, అవస్థాయాంబాధ్యతే, (౧,౨,౨౯.)

(౩) విజ్ఞానవాది యనఁబడు బర్క్లే కూడఁ జగన్నిర్మాణమును దిలకించు నొక దేవు నూహించెను, వ్యక్తుల కతీతభావము లన్నియు నీశ్వరునందున్నవి.

త్రోడను, విషయములతోడను గూడిన బ్రహ్మాండము లన్నియు బ్రత్యక్షములు. అవిచ్ఛిన్న జగత్క్రియమునకు నిరవధికమగు నీశ్వరదృష్టియే కారణము. జీవవస్తుజాలమునకంటె నాతడధి కౌన్నత్యముగలవాఁడు. అతనిలో ననంతవిషయజాల మత్యంత ప్రత్యక్షమైయున్నది. సృష్టిచేసి, సృష్టిలోని సర్వము నెఱుగు విశ్వైకశక్తియాతనిది. మనజ్ఞానవిషయముల నెట్లు మనముప యోగింతుమో, యదేవిధముగా నీశ్వరుఁడు బ్రహ్మాండనిర్మాణ చోదనసామర్థ్యమునుగలిగియున్నాఁడు ఈశ్వరు నఖండజ్ఞానము దానివిషయమైన యనంత బ్రహ్మాండము సంకుచితములై, యజ్ఞానవశములైన జీవకోటిగను, దానికి విషయమైన జగత్తు గను మారినవి. సర్వవిషయము లీశ్వరచైతన్యపోషణములో నున్నవి. ఈశ్వరచైతన్యమెఱిఁగినచో నదియంతులేని మహా విజ్ఞానసాగరస్వరూపమై గోచరించును. జీవుఁడజ్ఞానమునుండి మేల్కాంచినచోఁ దన్నుబంధించు నుపాధులను దిగఁద్రొక్కి సాగరజలమంతయు లవణముతోనిండియుండునట్లు,విశ్వమంతయు బాహ్యాంభ్యంతరముల సర్వత్ర ఆత్మమయమైయున్నట్లు తిలకించును. సరిగాఁజెప్పుచో, సృష్టిలోని సర్వవిషయములు నాత్మమయములే. (ఆత్మనఏవధర్మాః)౧. విషయీవిషయముల కతీతమైన పరమసత్యస్వరూపమే యాత్మస్వరూపము; తదన్యమే మియును లేదు. విషయీవిషయభేదమున్నచో, నాత్మపరమ ద్రష్టయై సర్వసృష్టియు నాతని విషయమగును. మనమందరము పరిచ్ఛిన్నజీవులమై విషయప్రపంచభాగమాత్ర భోక్తలమగు

(౧) శం. భా. శ్వే॥ ఉ॥ ౨, ౧.

దుము. భౌతిక రూపములు, మానసికదశాపరంపరలు మనకెట్టె యెదుటనున్నవను వాదముతో సర్వమాత్మమయమని చెప్పి శంకరునిసిద్ధాంతమును నిరసింపయత్నించుట నిష్ప్రయోజనము. అవి లేవని శంకరుడనడు. వ్యావహారిక సత్యములను జేబూని, పారమార్థిక సమస్యలను బరిష్కరింపఁ బూనుట వ్యర్థ ప్రయత్నము.

శంకరుని పారమార్థిక సత్యసిద్ధాంతము నిజముగా నత్యంత హేతుబద్ధమైన యథార్థవాదము. పారమార్థిక లక్ష్యము నన్వేషించుటకు వ్యక్తికిఁ బూర్ణస్వాతంత్ర్యమున్న నుండవచ్చును గాని, పరమార్థము మాత్రము వీనితో సమిత్తములేని స్వతంత్ర పదార్థము.౧. సత్యాన్వేషణ కృషి మనము చేయవచ్చును, జేయకుండవచ్చును. ఇది మనస్వేచ్ఛలోనిదే. కాని మనమట్టి ప్రయత్నమునకు నడుముకట్టుకొంటిమా, సత్యస్వరూపము నున్నరీతిని మనమంగీకరించి తీరవలయును.౨, జ్ఞానమెన్నఁడును సృజింపఁబడుటకాని, సముత్పత్తియగుట కాని జరుగదు; అది యావిష్కృతమగును. ఆవిష్కరణవిధానము కాలగతమైనది కావచ్చునుగాని, యావిష్కృతినొందినది.మాత్రి మకాల బాధితము. జ్ఞానమునకుఁ జరిత్రలేదు; మనఃప్రవృత్తి పరిణామమున కున్నది. ప్రత్యక్షానుమానములు వ్యావహారిక జీవితావధులలో జ్ఞానావిష్కృతికి సాధనములు.

---

(౧) పురుషచిత్తవ్యాపారాధీనము.

[౨] నవస్తుయాథాత్మ్యజ్ఞానమ్ పురుషబుద్ధ్యపేక్షమ్.

(3) శం. భా. ౧, ౧, ౪.

### ౧౯ — సత్యనిర్ణయ లక్షణము.

అద్వైతము ననుసరించి, మానసవృత్తి కొకవిషయముండ వలెను. విషయము మానసవృత్తియే కావచ్చును, లేక మఱొకటి కావచ్చును. అదియొక బాహ్యవిషయమును దానిరూపానుగుణవికారము నొందినపుడు గ్రహించవచ్చును. లేదా తన్నుఁదానే గ్రహింపవచ్చును.౪. విషయగ్రహణమును గ్రహించుటనునది లేదు; ఏలన సర్వగ్రహణములును స్వప్రకాశములైనవి. ఒక విషయగ్రహణ వ్యాపారమునకును, దాని గ్రహణమునకును మధ్య నెట్టి మానసవృత్తియును లేదు. ఒకవిషయగ్రహణజ్ఞానము ప్రత్యక్షము సద్యస్సంపాదితము నైనది. ఒకమానసవృత్తిని గ్రహించుటలోఁ బ్రత్యక్ష బుద్ధ్యవలోకనమున్నది ౧. జ్ఞానక్రియలు స్వప్రకాశము లనఁగా, స్వీయజ్ఞానమునకే యవి విషయములు.౨. జ్ఞానము ప్రత్యక్షసిద్ధి గలదనఁగా, దేనివలన నది జ్ఞానమని తెలియునో తన్మూలముననే యది ప్రమాణమగును. అందుచే సర్వజ్ఞానమును సత్యమైనదే.

---

(౪) స్వవిషయవృత్తి.

(౧) కేవలసాక్షి వేద్యత్వము॥

(౨) ఏజ్ఞానక్రియ తాను దర్శింపఁబడదో, యది విషయగ్రహణశక్తి గలదను భాట్టు సిద్ధాంతము దోషకలితము జ్ఞానక్రియ లచేతనవస్తు లక్షణములు గలవి కావు కావున, నొకదాని కొకటి విషయము కాఁజాలదు. ప్రభాకరుని మతము నిదియే. కొందరు బౌద్ధులు జ్ఞానక్రియ స్వీయజ్ఞానము కలిగి, తన్నుఁదానే యావిష్కరించుకొను ననిరి. అది సాధ్యపడదని యద్వైత నిశ్చయము. ఒక జ్ఞానక్రియ యింకొకజ్ఞానికి విషయముకాఁ గలిగినచో, నట్లనంతముగాఁ గావచ్చును.

నిజము కానిదానిని మనము భావింపఁజాలము. భావింపఁగలిగినచో సత్య మలభ్యమగును; ఏలన మనము సత్యము నెఱుఁగుట కేప్రమాణము నుపయోగించినను, నది మనస్సహజమైన లోపమును బూరింపఁజాలకుండును; కారణము మనము గైకొన్న ప్రమాణముకూడ మన బుద్ధివ్యాపారమే; అందుచే నది బుద్ధిసహజమైన సంశయాకులిత మగును. అందువలన నిజము కాని యాలోచనము లేదనియు, నదిమానవుల రాగద్వేషాది మేఘావృత మైనప్పుడే సత్య మనృతముగాఁ జూపట్టుననియు నంగీకరింపవలెను. శ్రుతిప్రమాణము కూడ మన కిచటఁ దోడ్పడదు; ఏలన నది వ్యక్తియొక్కయు, సత్యస్వరూపము యొక్కయు లక్షణములను మార్చలేదు; మఱియు శ్రుతి ప్రకటించు ననుభవ జ్ఞానమును, సత్యమని నిరూపితమగువరకుఁ దాత్కాలికముగా నంగీకరింపవచ్చును.

జ్ఞానమంతయు నీవిధముగా స్వతస్సిద్ధ ప్రామాణ్యయుక్తమై యుండఁగా దాని స్వప్రకాశలక్షణము మన మానస దోషములచే నాచ్ఛాదితమైనది. మన వ్యావహారిక ప్రపంచ జ్ఞానము నిర్దుష్టమైనదని తెలిసికొనుటకు, వ్యావహారిక పరీక్షామాత్రములైన సామ్యత, వ్యవహారసిద్ధి, సామరస్యాదు లుపయోగించును. "ఒకవస్తు యాథార్థ్యము మానవభావములపై నాధారపడదు. అది వస్తువుపైనే యాధారపడును, ఒక స్తంభము నొక స్తంభమనియో, మనుష్యుఁడనియో, మఱొకటనియో చెప్పుటచే దాని స్వస్వరూపము సిద్ధించదు. అదియొక స్తంభమను టే సత్యమును, వస్తుస్వరూపాను గుణమును నైయున్నది."

వస్తువుల స్వస్వరూపమును గూర్చిన పరీక్ష, వస్తుస్వభావమునకు సరిపడుటే.౧. సత్యానృతములు రెండును వస్తుసంబంధములేవని శంకరు నభిప్రాయము. కాని పారమార్థికముగానున్న దొకటే వస్తువు; అది బ్రహ్మపదార్థమే; ఏభావమును దానికి సరిపడదు. అందుచే మన నిర్ణయము లన్నియు నసమగ్రములు.

అబాధానియతి సత్యమునకుఁ బ్రమాణమని శంకరుని నిశ్చయము. అబాధితముగు జ్ఞానమే సత్యము.౨. అవక్రదండ ముదకములో వక్రమై తోఁచును. నీటిలో దాని వక్రత, దాని యవక్రత స్పర్శ కెంతనిజమో, యంతయే నేత్రమునకు నిజము. నేత్రము చేసిన నిర్ణయమును స్పర్శ నవరించున దగుటచే స్పర్శ, దృష్టికంటె నధికతరమైన స్థిరత గలది. ఈనిర్వచనము సత్యము యొక్క సామరస్య స్వభావమును నిరూపించును. కాని సర్వ వస్తువుల నొక యేకత్వసిద్ధిలో మనము దర్శించఁగలమా? జీవితమును గూర్చియుఁ బ్రపంచమును గూర్చియుఁ బరిపూర్ణ

(౧) ఏవమ్ భూతవస్తు విషయాణామ్ ప్రామాణ్యమ్ వస్తుతంత్రమ్ శం॥ భా॥ ౧, ౧, ౨.

(౨) భామతి: అబాధితానధిగతా సందిగ్ధబోధ జనకత్వంహి ప్రమాణత్వమ్ ప్రమాణానామ్, (౧,౧,౪.) మరియుఁ జూడు వేదాంతపరిభాష, అబాధితార్థ విషయజ్ఞానత్వమ్, "వస్తు వెట్లున్నదో దానినే చెప్పు జ్ఞానము ప్రమాణము కాదు; వేఱొకరీతి చెప్పుటచే నప్రమాణమును గాదు; దేని విషయ మనంతర మెద్దానిచేతను నిరసింపఁబడదో, యదే ప్రమాణము; దేని విషయము నిరసింపఁబడునో యది ప్రమాణము కాదు. ఇట్టి ప్రామాణ్యము శ్రుతిసిద్ధమైన బ్రహ్మజ్ఞానమునకే కలదు; మఱే యితరజ్ఞానమునకును లేదు. (అద్వైతసిద్ధి, ౧, ౧౨.)

జ్ఞానముగల వ్యక్తి యెవఁడైనఁ గలఁడా? గతమును గూర్చి మనకుఁ దెలిసిన దల్పము; అనాగత మేమియును దెలియదు; వర్తమాన మత్యంత వైపుల్యముగల దగుటచే దుర్గ్రాహ్యము. ఏది యనుభవాంతరముచే మూలపరివర్తనమందునో, యది స్వస్వరూపము గాదు; దాని సత్యస్వరూపమందు లేదు. స్వప్న దశలు జాగ్రదనుభవము చేతను, జాగ్రదనుభవము బ్రహ్మానుభవము చేతను నిర్మూలితమగు చున్నవి. బ్రహ్మానుభవమును తోసిపుచ్చిన దేదియును లేకపోవుటచే నదియే శ్రేష్ఠతమ మైనది,౧. ఈపరీక్ష లన్నియు వ్యావహారికములను మాట మనము మఱువరాదు. శంకరు ననుసరించి, బ్రహ్మజ్ఞానము పూర్ణసత్యసాక్షి; కారణమిచట జ్ఞాతృజ్ఞేయము లేకస్వరూపమే. తార్కిక నిరూపణము వ్యావహారిక జగత్తులోనిది; ఇచట జ్ఞాతృజ్ఞేయైకత్వము, మన మానసిక దృష్ట్యవరోధములచే నిరుద్ధమైనది. దీని నేయొక మాటలో నవిద్యయనిరి. తర్కప్రమాణము మన దృష్ట్యవరోధములను విచ్ఛేదమొనర్చి, సత్యము యొక్క స్వతఃప్రమాణ స్వభావము నావిష్కరించును. తార్కిక సూత్రము లుపకరణముల వంటివి; అవి దోషనివృత్తికుపయోగించును; వాని వలన మన మానసిక జాడ్యములుతొలఁగిపోవును.

## ౨౦–వ్యావహారిక జ్ఞానలోపము

జ్ఞాతృజ్ఞానజ్ఞేయ భేదములందు వ్యావహారిక జ్ఞానము విహరించును;౧ సత్యమున కిట్టిభేదములు లేవు.౨. సత్యము స్వ

(౧) బాధః జ్ఞానాంతరాభావాత్, (శం॥ భా॥ ౨,౧,౧౪.)
(౧) అవిద్యాకల్పితమ్ వేద్యవేదితృవేదనాభేదమ్. (శం॥ భా॥ ౧,౧,౪.

సంబంధదూరమైనచో, సంబంధసమ్మిశ్రితమగు విజ్ఞానము సంపూర్ణతి లేనిదని చెప్పవలెను. వస్తుస్వరూపమునుజూపఁ జాలనిదగుటచే నదియవిద్యయనఁబడును. శుద్ధచైతన్య స్వరూపమగునాత్మ జ్ఞానవిషయముగాదు ఆత్మజ్ఞానప్రవృత్తికి విషయికాని, విషయముకాని యెన్నఁడును గాఁజాలదు. నిజమగు నాత్మజ్ఞానమునందు, విషయి, సంపూర్ణముగా విషయములో గోచరించి, యేమియు మిగులకుండును. ఏమానసికావస్థలోను, విషయి, తనయెదుటఁ దానువిషయముగాఁ జూపట్టదు.3. ఏదియైనను దేశకాలస్థమగునప్పుడే విషయముకాఁగలదు. కాని దేశకాలములును, వానియందుండు విషయములునుగూడఁ దమ్ముఁ బోషించు నాత్మసంబంధులై యున్నవి. అందుచే సర్వజ్ఞానమునకు సర్వసాక్షియగు నదవ్యక్తము నగ్రాహ్యమునైనది. ౪. యథార్థవస్తువునొక జ్ఞానవిషయముగాఁ జూచుట కసాధ్యమగుట వలననే, మనసర్వజ్ఞానమందు నేదోయతీతమైనదున్నదను సూచనకు హేతువగుచున్నది. జ్ఞానపరిణామము పరమసత్యావిష్కరణమేకాని, యట్టిపరిణామములో సత్యమును దర్శించుట దుస్సాధ్యము. సర్వవస్తు జగత్తునకును, దేశకాలములకును 'ఆత్మ' యే మూలాధారమగుటచే, నాత్మను దానిసంతతియనఁదగు వస్తుజాలములో సంకుచితమొనర్చి తెలిసికొన యత్నించుట వ్యర్థ

(౨) స. సి. సా. సంగ్రహము. ౧, ౨, ౪౭. చూ. అద్వైతమకరందమ్ పు॥ ౧౬. చూ॥ శం॥ భా॥ గౌడపాదకారిక. ౪, ౬౭.

(3) చూ. శం. భా. తై॥ ఉ॥ ౨, ౧.

(౪) అవ్యక్తమనింద్రియగ్రాహ్యమ్ సర్వదృశ్యసాక్షిత్వాత్. (3, ౨, ౨౪.)

ప్రియత్నమగును, "నిన్ను నేనెట్లు తెలిసికొందు" ననుప్రశ్న, సోక్రటీసును క్రీటో యడిగిన "నిన్ను నేనెట్లు సమాధిచేయుదున ?"ను ప్రశ్నవలెనే యర్థరహితమైనది.౧. ఆత్మజ్ఞానమనున దంతఃకరణ సహితమగు నాత్మకే సాధ్యమగునది.౨.

పశ్చాదులకుఁగల జ్ఞానవర్గమునకుఁ జెందినదే మనుష్య జ్ఞానమని యుపమించి, మనవ్యావహారిక జ్ఞానమందుచే సత్య

(౧) తానుదేశకాలసంబంధమగు నుపాధివశుఁడను గాననియు వాని కతీతుఁడననియుఁ జెప్పినవాదమును క్రిటో యంగీకరించిన వెంటనే క్రిటో ప్రశ్నకు సోక్రటీసు హేళనచేసి పలికినాఁడు చూ॥ ౬౭౨ పుట.

(౨) ఆత్మకుఁ బ్రత్యభిజ్ఞయుండవచ్చును. విషయమును గుర్తించుకర్త అంతఃకరణ సహితమగునాత్మ; గుర్తింపఁబడు విషయము కాలత్రియానుభవ సహితమగు జీవాత్మ, ఉపాధి భేదములచేన నొకేజీవాత్మ కర్తయు విషయమును గూడనగును. "నేనుబూర్వమెవఁడనో యిప్పుడు నేనే" యను రూపములోఁ బ్రత్యభిజ్ఞసద్యోజ్ఞానసిద్ధమగుచున్నది. పోల్చు: క్యాంటు సిద్ధాంతము; "ఈ 'నేను', 'వాఁడు', అ'ది' యను విషయివలన మనకుఁదెలియు నదేదో యతీతమైన కర్తృభావమే. దానిని తద్గుణగణములవలన నే లేక, యితరవస్తువున కదికల్పించు లక్షణములవలననే మనముగ్రహింతుము. అట్టి యితరవస్తువుల నుండి దానిని వేరుచేసినచో మనకెట్టిభావమును గలుగుట కవకాశములేదు. నిజముగా దానినెఱుగుటకై దానిచుట్టును తిరిగి తిరిగి, దానినిగూర్చి యెట్టి నిర్ణయమును జేయుటకైన దానిద్వారముననే చేయవలసియుంటిమి. ఇచట మనకొక దుస్తరమైన పరిస్థితియేర్పడినది; దానినుండి బయటపడు మార్గము లేదు; ఏలన, మనవిజ్ఞానము మనకుఁజూపు దొక వేరైనవిషయము కాదు; సర్వ విషయములకును సామాన్యమైనరూపమేయది." (కెయిర్డు; క్రిటికల్ ఫిలాసఫీ ఆఫ్ క్యాంటు. వాల్యూము. ౨, పు.౨౯.) విషయివి సర్వవిషయ గుణాదుల నుండియు వేరుపఱచి భావించుట కవకాశమున్నది గనుక, విషయికూడ విషయములలో నొకటైయుండఁగలదని డేకార్టే చెప్పినాఁడు. కాని యూహా సాధ్యమగునది యథార్థమగు స్థితిగలదని తలఁపఁబడినది.

సందర్భాన సామర్థ్యములేనిదని శంకరుఁడు పలికినాఁడు.3. "ఏలన నెట్లు పశువులు, పెద్దచప్పుడు వినఁబడినచో నాధ్వనివానికి భయావహమైనట్లు గోచరించినప్పుడవి దూరముగాఁ దొలఁగుటయు, నిష్టమైనదైనచో దానిని సమీపించుటయు జరుగునో అనగాఁ జేతితో నొకకఱ్ఱనెత్తియున్న మానవునవి చూచి, "వాఁడుకొట్టున"ని తలఁచి, తలఁగి పోఁజూచును; అట్లే చేతి నిండఁ బచ్చికతో నెదుటనున్న వానినిఁజూచి సమీపించును—అదే విధముగాఁ గొంచెమెక్కువ పరిణతిఁబొందిన మనుజులును, దమకంటె బలిష్ఠులు కృపాణహస్తులై యెదుటఁ జూపట్టినప్పుడు వారికి వెనుదిరిగి తలఁగిపోవుదురు. ఈవిధముగా జ్ఞానవిషయ సాధనములలో మనుజులు పశువులుసమానమే. పశువుల విషయములో ప్రత్యక్షాది ప్రక్రియ లవివేకపూర్వకములై నడచును. కాని పరిణతచిత్తులైన మానవుల విషయములోనైనను బహుసామాన్య లక్షణములే యున్నవి"౧.

అనఁగా మనఃప్రవృత్తికిఁ గావలసినదానినే పరికించు స్వభావమున్నదని శంకరు నభిప్రాయము. మనవ్యావహారిక ప్రయోజనములే మన యాలోచనలనన్నిటిని నిర్ణయించును. 'ఎద్దుకంటిదీపము' కాంతినంత నొకస్థలమునఁ బ్రసరింపఁజేసిన రీతిగా మనయంతఃకరణము మనచిత్తచైతన్యము నొకేసంకుచిత విషయముపైఁ గేంద్రీకరింపఁజేయ సాయపడును. మనము చూచువిషయములలో నేది మన ప్రయోజనానుగుణమో

(3) పశ్వాదిభిశ్చావిశేషాత్. (శం॥భా॥ ఉపోద్ఘాతము.) చూ॥ డ్యూసేన్. సిస్టమ్ ఆఫ్ వేదాంత. పు. ౫౭.)

దానినే మనము గుర్తింతుము. మంయవరములు, ప్రయోజనములు మనముకల్పించు సామాన్య ధర్మనియమములనుగూడ నిర్ణయించుచున్నవి.

తర్కసిద్ధమైన భావనాశక్తి, యెంతపరిణతిగాంచినను, సత్యసందర్శన సమర్థముగాదని శంకరుని నిశ్చయము. వాల్టైర్ యొక్క తత్త్వప్రదీప్తమైన భావకల్పనములో నించుమించుగా నొకసహస్రసంఖ్యగల యింద్రియములుగల మానవులైనను, తెనుకంటె దురదృష్టవంతులు పంచేంద్రియ సమన్వితులు మాత్రమేయైన మానవులకంటె నొక్కయిసుంగుకూడ సత్యమునకెక్కువసమీపమునకుఁ బోఁజాలరని వచింపఁబడెను. భౌతిక శాస్త్రము పరిశోధించి తెలుపు బాహ్యప్రపంచజ్ఞాన మెంతవరకు యథార్థజగత్తునకు సంబంధించినదో నిశ్చయించిచెప్పుట దుస్తరము. మన మీవిషయమునుగూర్చి యాలోచించిన కొలఁదియు నింద్రియములవలన లబ్ధమైనప్రపంచము యథార్థమైనదని నిర్ణయించుటెక్కువ దుస్సాధ్యమగుచున్నది. అంధుని కంటెఁ బంచేంద్రియపరిణతిగల మానవుఁ డెక్కువెఱుఁగును. కంటికి గోచరించు జగత్తుకంటె స్పర్శకుఁ దెలియునదెక్కువ విపులమైనట్టిరీతిగా నింద్రియగోచర జగత్తుకంటె యథార్థ జగత్తు విపులతరము కాఁగూడదా? అదేవిధముగా, నొక యంధజాతియొక్కజ్ఞానము దృష్టిలాభమువలన నతిశయమగు రీతిగా, టెన్నిసనకవి నుడివిన, “ఉన్నతము నుత్తమము” నగు నింద్రియమేదైన సిద్ధించినయెడలను, శ్రుతివచనములోని బ్రహ్మ

నుభవసిద్ధి చేకూరినయెడలను,మనకు నేటిబుద్ధికిఁ జూపట్టుజగత్తు కంటె సర్వవిధముల నుత్కృష్టమైన యత్యంతవిశాలజగత్తొక చేల గోచరింపరాదు? అనగా నింద్రియలబ్ధము, భౌతికశాస్త్ర సిద్ధమునైన జగత్తునుగూర్చిన యవిశ్వాసముతో నీభావమును మేము ప్రకటించుటలేదు. మనకున్నతదృష్టికలిగి, దీని కతీత మగుస్థితికి మార్గముగోచరించువరకు నింద్రియగోచరప్రపంచము తదనుగుణమగు యాథార్థ్యమునుమాత్రమే కలిగియుండగలదు.

మానవ మానస ముపయోగించు ప్రతి భావకల్పన మును నిశ్చయార్థము నెద్దానినిఁ జూపలేదని ఋజువుచేయునిమి త్తము శంకరుఁడు సునిశితమగు తర్కవాదముఁ బ్రదర్శించి,మన విజ్ఞానమున కంతకు మూలభూతమగు నొక ప్రధానలోపము గలదను నిశ్చయము నాతఁడు శాసనాధికారముతోఁ బ్రకటిం చెను.మన యనుభవమును గూర్చి మనము విశృంఖల ప్రసంగ ములు చేయుదుముగాని, దృగ్దృశ్యములకుఁ గల నిజమగు సంబంధ మెట్టిదో మన మెఱుఁగము. ద్రష్టయగు చైతన్యము తాను బ్రకాశింపఁజేయు విషయముతో నేదోయొక సంబంధ మును గలిగియుండవలెను. అదియే లేకున్నచో, విషయస్వభా వముతో నిమిత్తములేకుండ నెప్పుడైన నెట్టిజ్ఞానమైన నుండ వచ్చును. ఈవిషయీ విషయసంబంధము సంయోగమును గాదు; సమవాయమునుగాదు; అనగా బాహ్యమునుగాదు; ఆంతరంగికమును గాదు. విషయమున నుత్పత్తియగు జ్ఞాతతయే విషయ వాస్తవికతకుఁ బ్రమాణమని చెప్పిన కుమారిలుని భావము యుక్తముకాదు; ఏలన నట్టికార్య మంగీకారయోగ్య

ము కాదు. వ్యవహారప్రయోజన సిద్ధి నిచ్చునవే వస్తువు లనునది సత్యముకాదు. మనదృష్టికి గోచరించు నాకాశము వంటి నిరర్థక వస్తువులెన్నో యున్నవి. వస్తుయాథార్థ్య మనఁగా జ్ఞానకరణమునకు వస్తువు విషయమగుటయే కాఁజాలదు; ఏలన నిది దృష్టవిషయములకే చెల్లునుగాని, స్మరింపఁబడిన వానికిఁగాని, యనుమానింపఁబడిన వానికిఁగాని సమన్వయించదు. మఱియుఁ బ్రత్యక్షమునందు వస్తుస్వభావము ననుసరించియే చేతనవృత్తి రూప మేర్పడునుగాని యనుమితవిషయ మిట్టిదిగాదు. దృగ్దృశ్యనిశ్చయసంబంధ మెట్టిదో మనకుఁ దెలియదు. సరిగా నుడివినచో మన జీవితమంతయు, మన ప్రవృత్తియంతయు విషయప్రపంచమునకుఁ జెందినదే; దానితోఁగలిసి దృక్చైతన్య మున్నదని చెప్పఁగలము; ఈ సాహచర్యము మనకుఁ దెలిసినదివలె గోచరించును; ఏలన నిందు దృగ్దృశ్యములు లోకే విశ్వచైతన్యాంతర్గతము లగుటచే వ్యతిరేకములుగావు

సత్యము నెఱుఁగుటకే మన మనశ్శక్తి యంతయుఁ గృషి చేయుచున్నది; కాని దురదృష్టవశమున, సత్యమును సత్యేతరమైన దానికి సంబంధింపఁ జేసినఁ గాని యట్టి కృషి జరుగదు. యథార్థవస్తువు సత్యమును గా దసత్యమును గాదు. అది యున్నదని మాత్రమే చెప్పవలెను. కాని మనజ్ఞానము ననుసరించి, దాని కేవో లక్షణముల నాపాదింతుము. జ్ఞానమంతయు, నింద్రియ సంబంధమైనది కాని, మనస్సంబంధమైనది కాని, పరమార్థము నావిష్కరించుటకే ప్రయత్నించును.౧. ప్రత్యక్షము

(౧) ప్రత్యక్షప్రమాచాత్ర చైతన్యమేవ. (వేదాంతపరిభాష. ౧.)

తత్పూర్వము కాని యనంతరము కాని యుండక, కాలములో నొక క్షణమందుండు నది మాత్రమే; కాని యది కాలాతీత మగు సత్యమునే సూచించును; కాని సత్యము నది ప్రదర్శించుట లో మసమర్థమైనది. సత్యమును గ్రహించుటలోఁ గల సామర్థ్య శవమున్న జ్ఞాన రూపములకును సమానమే. ద్రష్టకు వర్తింపఁ జేయుటకు మనము చెప్పు ప్రతిలక్షణము లోపభూయిష్ఠమే యగుటచే; నీభావములో మన నిర్ణయములన్నియు నయుక్త ములే. మనము సత్యమనగా సత్యమనియే చెప్పవలెను, లేదా సత్యమనగా 'అ' 'ఆ' 'ఇ' యనియో చెప్పవలెను. మొదటి పద్ధతి విజ్ఞానమున కుపకరించునదికాదు; రెండవదే మనవిజ్ఞా నము చేయుచున్న పద్ధతి. సత్యమునది వేఱొకటియని, యనఁగా సత్యేతరమైన దేదియోయని చెప్పుచున్నది.సత్యము దద్భిన్నమైన దాని నారోపించుటనే శంకరుఁడధ్యాసయని పలికినాఁడు.౨. అధ్యాసయనఁగా నొకవస్తు వదికానిరూపముగా గోచరించుట.౩ ఒకదీపము రెండుగాఁ జూపట్టుటయో లేక రజ్జువు సర్పముగాఁ గన్పట్టుటయో జరిగినప్పుడది యధ్యాసయందుము. ఒకవిధముగాఁ బరిచ్ఛిన్న వస్తుజ్ఞానమంతయు ననృతమే; ఏలన నేకము నిత్యము నగు చైతన్యమునకు విషయము లధ్యాసచేయఁబడినవి. ఇందతి విచిత్రమగు నధ్యాసయేదనఁగా, విషయీ విషయములను గూర్చి మనకు గలుగుభ్రాంతి;౧.దీనిననుసరించి,మనమాత్మకు లేని ప్రవృత్తిని, కర్తృత్వభోక్తృత్వములను నారోపింతుము. సరిగాఁ

(౨) అధ్యాసో నామ అతస్మిం స్తద్బుద్ధిః ।
(3) పరత్ర పరావభాసః ।

జెప్పుచో, విషయికి భిన్నమైన దేదియును లేదు; ఏలనఁ బరమార్థ స్వరూపము మనమూహింపఁగల సర్వలక్షణ సంభరితమైనది. మనమట్టి పరమసత్యమున కారోపించునది సత్యమున కెన్నటికైన న్యూనమైన దే. "విషయీ విషయములకు, యుష్మదస్మద్రూపము లే గోచరించు రూపములు; వానికిఁగల సంబంధమంధకారమునకుఁ గాంతికిఁగల సంబంధమే. 'నీవు' లేక 'అనాత్మ' సీమకుఁజెందిన విషయమును, దానిగుణములను 'నేను' లేక ఆత్మయను సీమకుఁ జెందిన పరమాత్మ కారోపించుటయు, నటులనే విషయిని, విషయికిఁ జెందినగుణములను విషయమున కారోపించుటయు హేతురహితమైనదియు సత్యేతరమైనదియునగును. కాని మానవ కోటి కీపద్ధతి, మిథ్యాజ్ఞానవశమున నభ్యాసమై, సత్యానృతముల ననగా విషయీ విషయములను మిశ్రితమొనర్చుట నైసర్గిక మైనది; అందుచే నొకదానిలక్షణము నింకొకదాని కారోపించుచున్నారు."(౨) అవిద్యామార్గమును బట్టించు నీయధ్యాస, "సామాన్య జీవితమునందును, వేదములందును, కర్మజ్ఞాన శాస్త్రములందునుగూడ జ్ఞాతృజ్ఞేయములకు భిన్నతకల్పించుట కును, వ్యావహారిక ప్రయోజనసిద్ధికి భేదముల నారోపించున్ను

(౧) ఆత్మని క్రియాకారక ఫలాద్యారోపలక్షణమ్. అధ్యాసశబ్దము యొక్క అతీతమిథ్యాత్వమునకు సరిపడును. దేశకాలగతములగు విషయము లను, జీవాత్మ, తానుకల్పించిన భావముల నారోపించి, యావస్తువులు జీవా త్మకు వేరుగానున్నవని యీమిథ్యాభావము భావింపఁజేయును.

(౨) శం॥ భా॥ ఉపోద్ఘాతము, దేహాదిష్వనాత్మసు అహమస్మీత్యాత్మ బుద్ధిరవిద్యా (శం॥ భా॥ ౧, ౩, ౨.)

గను జేసిన కారణమైనది."3.పరమార్థరహస్యము తెలియువరకు నన్నిజ్ఞానప్రమాణములును యుక్తములేయగుచుఁ బరిచ్ఛిన్న బుద్ధికిఁ దాత్కాలిక క్రియాసిద్ధి నిచ్చుచున్నవి. కాని నిజమునకు మనజ్ఞానమంతయు నవిద్యయే. ఆత్మేతరములైన సర్వారోపణములను విదళించి, పరమచైతన్యమును స్థిరము చేయుటయే విద్యలేక జ్ఞానమగును.౨.

శంకరునిభావములో విషయియనఁగాఁ బరమాత్మయు, విషయమనఁగా వ్యవహారప్రపంచమునైయున్నది. జీవాత్మ సముచ్చయము, దేహేంద్రియగణము, జడజగత్తు మున్నగున వన్నియు విషయములోనివే. విషయియనఁగా (బరబ్రహ్మ చైతన్యము;3 దీనిపై విషయప్రపంచమంతయు నిలిచియున్నది. విషయములన్నిటికి లక్షణ మొకటియున్నది; మానసవృత్తిమూలమునఁ జైతన్యమునకు విషయములగుటవలనఁగాక వేరెవ్విధమున

(3) 'నేను' 'నాది' యనునది దేహేంద్రియాదులకుఁ జెందిన దను భ్రాంతిలేనిచో జ్ఞాతయుండనే (డు; అందుచే జ్ఞానసాధనోపయోగమున కవకాశములేదు; ఏలన,నింద్రియసాహాయ్యములేనిదే ప్రత్యక్షములేదు; యింద్రియ ప్రవృత్తి, దేహాధారములేనిదే యుండదు; దేహాత్మభావములేనిదే కర్మకవకాశములేదు; ఇదంతయు జరుగనిదే జ్ఞానావకాశములేదు. ఈజ్ఞానము గ్రహించునాత్మ దేహాద్యుపాధిరహితము. అందుచేఁ బ్రత్యక్షాది జ్ఞానసాధనలన్నియు నవిద్యావిషయకముఁ జెందినవే." శం॥ భా॥ ఉపోద్ఘాతము; చూ. డ్యూసేన్. సిస్టమ్ ఆఫ్ వేదాంత. పు॥ ౫౬; స. సి. సా. సంగ్రహము, ౧౨, ౯౯-౯౯.

(౧) శం॥ భా॥ ౧,౧,౪.

(౨) శం॥ భా॥ ౧,౧,౧.

(3) శం॥ భా॥ ౧,౧,౧.

నవి వ్యక్తములు కావు. శాస్త్రగ్రంథములవలన (బరమాత్మ స్వరూపమును గ్రహింప యత్నించుటవలననైన దానిస్వస్వరూపము లభింపదు. నిజముగ పరమాత్మజ్ఞానమున కొకరూపముకాని వృత్తికాని లేదు.౪

ఏకైకమగు నిర్గుణచైతన్యమును విచ్ఛేదమొనర్చి, విషయీవిషయసంబంధములోఁ జూచునట్లుచేయు నధ్యాస మానవ మానసప్రకృతిలోనేయున్నది. విషయీవిషయప్రపంచ హేతు వగు నీయధ్యాస అనాద్యనంతము, నైసర్గికము, మిథ్యాప్రత్యయ రూపము, జీవాత్మలగ కర్తృత్వభోక్తృత్వ ప్రవృత్తికారణము, సువిదితమునైనదని చెప్పఁబడెను.౬

శంకరుని ప్రత్యక్షదోషవివరణ మాతనిజ్ఞానసిద్ధాంతము నకు మూలకారణమును సూచించును. త్రాడునుజూచి పామని భ్రమించి మనము, "ఇదియొకసర్పము"ని నిర్ణయించినప్పుడు మనకు రెండంశములున్నవి; ఇంద్రియగోచరమగు 'ఇదియు' 'దీనికి' మనమారోపించు 'సర్పమును.' ఇంద్రియములకు గోచ రించు వస్తువును గ్రహించురూపమే రెండవది మననిర్ణయము లోని దోషమునకుఁ గారణము మనబుద్ధి భూమిపైనారోపించిన యర్థము. 'ఇది' యనునంశము మనకు సమ్యగ్దర్శనము లభించిన

---

(౪) ఆత్మవిషయము కాదనియు, నందుచే నితరవస్తుగుణముల నాత్మ కారోపింపఁజాలమనియుఁ జెప్పినయాక్షేపణమునకు, శంకరుఁ డాత్మభావ మున కారోపణము జరుగుచున్నదని బదులుచెప్పి యింద్రియవిషయసంపర్క మవసరములేదనియు నజ్ఞాను లాకాశమునకు నిబిడనీలత్వము నారోపింతు రనియు, నాకాశమింద్రియవిషయము కాదనియు వచించినాఁడు.

(౫) కర్తృత్వభోక్తృత్వప్రవర్తకః (౬) సర్వలోకప్రత్యక్షః

వెనుక గూడనుండును. సామాన్యదర్శనముచందైనను విషయము, దానినిగూర్చిన యర్థనిర్ధారణమునను రెండంశములు నున్నవని వాదించి, శంకరుఁ డిట్లడిగినాఁడు; మనదృష్టికి గోచరించు విషయము లన్నిటికి మూలాధారమైన దేది ? మనము చూచు సర్వవిషయములకు, సహజములైన వానికిని, యథార్థములైన వానికిఁ దద్భిన్నములగువానికి సర్వసామాన్యమైన యాధారమేదైన నున్నదా? అదియే అస్తిత్వమని శంకరుఁడు చెప్పెను. మనము చూచినదెల్ల నస్తిత్వమునుగలిగి యున్నట్లు గాంచుచున్నాము. విషయములనుగూర్చి మన యర్థనిర్ణయము లెట్లున్నను, వానిమూలాధారమగు నస్తిత్వ మవిచ్ఛిన్నమై గోచరించుచున్నది. ఉపనిషద్వచనములలో మృణ్మయవస్తువులలో మృత్తును, హేమమయద్రవ్యములలో హేమమునట్టివే. రూపము లెట్లుమారినను, మూలపదార్థ మెట్టిమార్పునొందక స్థిరముగానుండును. ఈమూలపదార్థమునుగూర్చిన జ్ఞానలోపమే మన యవిద్యకు హేతువు.(౧)

అవిద్య, లేక నైసర్గికాధ్యాసబీజము మనవ్యక్తిత్వ మూలములందే యున్నది. అది మనపరిచ్ఛిన్నత కింకొక పేరు. సత్యమునకు సత్యమే హేతువు. మన మవిద్యాస్వభావము నెఱిఁగినంతనే బంధవిచ్ఛేదమగును. అవిద్య నైసర్గికమైనను ననివార్యముకాదు. అది యనివార్యమేయైనచో, దానినుండి విముక్తి పొందుమని బోధించుట వ్యర్థము. అనివార్యమైనదానికి విరుద్ధముగా మనము కృషిచేయఁజాలము. తెలియుట కవకా

(౧) అధిష్ఠానవిషయము.

శము లేనిదానిని మనము తెలిసికొనఁజాలము. అవిద్యావ్యాపారము నరికట్టుటకు మనకవకాశమున్నది. మనకుఁగల సహజాభ్యాసములకంటె మనుమతీతులమని యిది నిరూపించుచున్నది.

ప్రమాణసమన్వితమైన పరిచ్ఛిన్న విజ్ఞానము ఒకలక్షణము నొకక్రమమునుగల యనుభవప్రపంచమునకుఁ జెందినది. ఇందు మన దేహధర్మములకు విశేషస్థానములేదు. మనబుద్ధి నిర్మాణమెట్టిదనన నది వస్తుజగత్తులో నొకనియతిని, క్రమమును గోరును. హఠాత్సంభవాపక్రమముల నదిసహించదు. విషయప్రపంచము పూర్తిగా హేతుబద్ధమైనదై, సర్వవిషయములలో ధర్మక్రమములనుగోరు మన వివేకమున కనుగుణమైనది ఇది వ్యావహారికజ్ఞానముయొక్కయు, భౌతికశాస్త్రముయొక్కయు విశ్వాసము. శంకరుఁడు విషయములనుండి విజ్ఞానమును వేరుచేయఁడు. దేశకాలనిమిత్తసూత్రములలోవ్యక్తమగు మనమానసిక నియమములు కలిసి, యాలోచించుకర్తయొక్క స్వరూపమును గల్పించునవగుటయేకాక, యివియే విషయజగత్తులోని రూపములుగూడ నగుచున్నవి, బుద్ధిసూత్రములు, బుద్ధిగోచరములగు విషయములకుఁగూడవర్తించును. దేశకాలనిమిత్తకల్పితజగత్తు, దానియందలి సర్వవిషయములతో, దానినెఱుఁగగోరు విషయికొఱకై యేర్పడియున్నది జీవాత్మ జగత్తులాంశ్యోరులపై నాధారపడియున్నవి. వివేకకాంక్ష కనుగుణమైన స్వభావముగ ప్రకృతి యుండుటను నీయంశమొక విశ్వైకమానసాస్తిత్వమును నిరూపించును, ఈవిశ్వమానసమొకవైపున ప్రకృతికాత్మయై వేఱొక వైపున దానితో సహకరించుచు సాధుపడుచుండు మనలోని

వివేకకారణమగుచున్నది. ఒకక్రమగతిగల జగత్తు మనస్సు కొఱకే, తదనుగుణమైయున్నది. ఒకపశువునకుఁగల ప్రపంచ మొక పశుమానసముకే యనుగుణమైయుండును. అట్లే మనుజ ప్రపంచమును మనుష్యమానసాను గుణమైనది. పూర్ణతయు ననంతసంబంధ సమన్వితమునగు వాస్తవికజగత్తొక విశ్వవిశాలము, పరిపూర్ణమునగు నొకమనస్సును గోరును; అట్టి మానసమే యీశ్వరస్వరూపము; మన కగోచరములగు ప్రపంచ భాగముల నీశ్వరుఁడు పోషించును. మనపరిచ్ఛిన్నజ్ఞాన మపరిచ్ఛిన్నమగు నొకదానిని గోరుటమనబుద్ధి కనివార్యమగు నవసరము కాని మనబుద్ధి ప్రమాణముల విదితమగు నట్టి దానిఁగాదు. మనము మనుజుల మగుటచే మనుజస్వభావోచితరీతి నాలోచింతుము. విశ్వైకసత్యస్వరూపము నొకకేంద్ర వ్యక్తిత్వము గలదానినిగను, జగత్తంతయు దానివిషయముగను భావింతుము. ఇది మనతర్కచర్చా ఫలితమగు సమన్వయరూపము; ఇది యమోఘముకాదు. ఇదిమనస్సునకు సద్యఃప్రత్యక్షముకాదు. ఇది మనయనుభవముయొక్క శ్రేష్ఠతమమైన సమన్వయస్వరూపము; ఏయితరానుభవమైన నిట్టిదేయైనంతకాలమిది సత్యమే యగును.౧. విషయీ విషయసంబంధము పశు, మనుష్య, దైవ ప్రపంచములకు సమానమే. కాని యీమనయనుభవములోని రెండంశములుననఁగా విషయీ విషయము లన్యోన్యాధార భూతములును, సమానపరిణామ పరివర్తన నియమబద్ధములునై

(౧) ౨, ౧, ౧౧.

యున్నవి. ఏపరిపూర్ణ సత్యస్వరూపమునందుఁ బరిత్యాంశము నన(గా విషయీ విషయములు, మనశ్శరీరములు, వర్తమాన భూతభవిష్యత్తులు తత్తదుచితస్థానముల నాక్రమించి సమన్వయ సిద్ధినొందునో యట్టిమానవానుభవము విషయముగాదు; కాని యది సర్వవిజ్ఞానమునకును పారమార్థికలక్ష్యము. దైవమును గూర్చికాని మానవునిగూర్చికాని సర్వజ్ఞానమును విషయీ విషయ సంబంధ సమన్వితమగుటచే సత్యంతోత్తమమైనదని చెప్పరాదు. సవికల్పన జ్ఞానమంతయుఁ బరమసత్యము నేక విషయి, వృత్తి, విషయములుగల మూర్తికల్పనమే; సమాధి గత దృష్టికిఁ దప్ప, దృష్టకు వేరై గోచరించు విషయము దానిని సమీపించు వృత్తియు నుండితీరును. ఆలోచనాశక్తియు, హేతు వాదరీతియుఁ బరిచ్ఛిన్నజీవితమునకుఁ జెందినవే; పరమార్థము బుద్ధి కతీతమే; పరమార్థము స్వీయసాక్షియగుటచే నాలోచన కవసరము లేదు.

# భారతీయ తత్త్వ శాస్త్రము

*

[డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణుని
'ఇండియన్ ఫిలాసఫీ' అను నాంగ్లగ్రంథమునకు
ఆంధ్రానువాదము]

*

పంచమ భాగము

*


బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ.,
ఆంధ్రోపన్యాసకుఁడు,
పి. ఆర్. కాలేజీ, కాకినాడ.


గ్రంథకర్త :
శ్రీ వివేకానందస్వామి జీవితము
శ్రీ రామతీర్థస్వామి జీవితము
హిందూమతము మున్నగునవి.





డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణుఁడు.



బులుసు వేంకటేశ్వరులు ఎం. ఏ.

# విషయసూచిక



## అష్టమాధ్యాయము

### శంకరాద్వైతవేదాంతము

# నవమాధ్యాయము

## రామానుజుని ఆస్తికతత్త్వము

## దశమాధ్యాయము

### శైవము, శాక్తము, అనంతర వైష్ణవము

## ఏకాదశాధ్యాయము

సమాప్తి



## త ము

గురుదేవా! గతజన్మ పుణ్యమున నా
కున్ గల్గె నీదర్శనం
బబ్బెదె, నీవరవాక్య దివ్యసుధ నే
నాకంఠమున్ గ్రోలి, సం
సరణాబ్ధిం దరియించు ధైర్యమును గాం
చంగల్గితిన్, సత్కృపా
భరణా! నీవు కృతీశ్వరుండవయి ప్రో
వన్ మ్రొక్కెదన్ సద్గురూ!

---

# ఉపోద్ఘాతము

భారతదేశ మనఁగా బ్రహ్మజ్ఞానము నగ్రస్థానము నిచ్చిన దేశము. మానవుఁడుగా జన్మించిన ప్రతివ్యక్తియు జన్మరాహిత్యము నెఱిఁగి, బ్రహ్మవేత్తయై శరీరత్యాగము చేయవలయు నను దివ్యాదర్శము భారతవర్షీయుల సర్వవిజ్ఞాన సారాంశము. ఈవిషయము నే, వేదములు, దర్శనములు, సూత్రములు, భాష్యములు భిన్నసిద్ధాంతములలో దేశ కాల పాత్రోచితగాఁ బ్రదర్శించియున్నవి.

వేద వేదాంగములు పలికిన మహావాక్యములు మానవజాతికి సార్వకాలిక ప్రమాణములై యున్నవి. అవి సత్యములే యని తెలిసికొనుటకుఁ బుస్తకజ్ఞానము కాక, అనుభవజ్ఞానమే సాధనము. అనుభవజ్ఞానము తపోత్యాగములచే లభించును. జీవయాత్రలో ధర్మసహితార్థకామము లనుభవించుచు, దయాదానాదికములచే స్వార్థమును కృశింపఁ జేయుచుఁ గ్రమముగా నిష్కామకర్మములచే మానవుఁడు చిత్తశుద్ధి నార్జించి, సజ్జనయోగిజనసాంగత్యముచే వైరాగ్యమును, దైవభక్తిని గాంచి, నిరంతరాభ్యస్త తపోధ్యానాదులచే నీశ్వరసాక్షాత్కార భాగ్యమును, దానివలన బ్రహ్మజ్ఞానమును, బ్రహ్మత్వమును బొందుటకు యత్నింపవలెను.

భారతదేశమున ధీరశబ్దమున కర్హులగువారు శతృంజయులుకారు, మృత్యుంజయులు; చక్రవర్తులుగారు యోగిచక్ర

వర్తులు; ధనికులుగారు వైరాగ్యధనులు, తపోధనులును; రాజకీయవేత్తలుగారు, బ్రహ్మవేత్తలు.

పెక్కుశతాబ్దముల పర్యంతము భారతవర్షము పరాధీన జాతియై, స్వతంత్రప్రజ్ఞను, దానితోఁబాటు స్వధర్మసంరక్షణా సామర్థ్యమును గోల్పోయినది. ఆంగ్లేయపరిపాలనతో నొక నూత్న నాగరికత మహామారుతమువలె వచ్చి, భారతీయ విజ్ఞాన మహావృక్షము నల్లూతలూగించినది. ఈభిన్న భావ సంపర్కములచే భారతజాతి మానసము మోహగ్రస్తమై, సంశయక్షుభితమై కర్తవ్యశూన్యతం గాంచినది.

కాని భారతీయ తత్త్వమహావృక్షరాజ మూలములు పాతాళము వఱకు వ్యాపించినవగుటచే, నది చావులేక నిలుచుటయే గాక, సావకాశము లభించినప్పుడెల్లఁ జిగిర్చి, క్రొత్త కొమ్మలఁ బెట్టుచునే యున్నది. పరమార్థమునకుఁ బ్రాధాన్యమిచ్చి జీవించుజాతికిఁ బ్రకృతి సహజమగు నికృష్టదశ యొకవేళ సంభవించినను, నది తొలఁగిపోవుటయుఁ దిరిగి స్వకీయాస్తిత్వము చేకూరుటయు నిశ్చయము. ఒక్క అల్పజీవితములో సర్వతోముఖ సంపూర్ణమగు భారతీయ తత్త్వమున కనుభవసిద్ధి గాంచిన శ్రీ రామకృష్ణ పరమహంస పావనవైరాగ్యాగ్నిజ్వాల ముప్పదియైదుకోట్ల భారతీయుల పాపపంకమును క్షాళన మొనర్చి వేసెను. ఆమహాపుణ్యమూర్తి జన్మముతో భారతజాతి పునరుజ్జీవన మారంభమై, గాంధిమహాత్ముని సత్యాహింసాయుధ ప్రయోగములచే నపూర్వచైతన్య వైభవమును గాంచినది.

సర్వేపల్లి రాధాకృష్ణ పండితుండు, నవ్యభారతీయ తాత్త్విక చక్రవర్తియై, నాగరికతాశిఖరము నంటిన పశ్చిమ ప్రపంచమునకు, వారి భాషలో, వారి పద్ధతిలో, సుబోధముగు రీతి, సార్వధర్మతత్త్వములను ప్రకటించి, భారతజాతి వైజ్ఞానిక పతాకమునకుఁ బ్రపంచరంగమధ్యమున జయగీతములఁ బాడించినాఁడు. ఈపుణ్యపురుషుఁ డొనర్చిన సేవకు భారతజాతి శాశ్వతముగా కృతజ్ఞతను జూపవలసి యున్నది.

ఆంధ్రుండనై, రాధాకృష్ణుఁ డొనర్చిన యీమహత్తర కార్యమునకు ముగ్ధుండనై, యాతని భారతీయ తత్త్వశాస్త్ర గ్రంథము నాంధ్రీకరించు సదృష్టవశమునఁ గొంత యాతని ఋణమును దీర్చుకొనవచ్చునని యూహించి, నేటి కైదవభాగమును గూడఁ బూర్తి చేసితిని, మొదటి నాలుగు భాగముల నాదరించిన రీతినే, దీనిని స్వీకరించి, యాంధ్రమహాజనులు మన్నింతురని నమ్ముచున్నాను. క్లిష్టతరమైన యీయనువాదమున దోసములెన్నియో యుండవచ్చును. వానిని మన్నించి నన్ను దయతోఁ జూడ నాంధ్రమహాశయులఁ దిరిగి వేఁడుకొనుచున్నాను.

భారతీయ తత్త్వభవిష్యత్తును గూర్చి రాధాకృష్ణ పండితుఁడు కొన్ని వాక్యములను వ్రాసియున్నాఁడు. భారతీయ తత్త్వమహిమ సర్వజనాంగీకార యోగ్యము, స్తుతిపాత్రము నగుటకు వ్యక్తులలో సమగ్రనిత్యజీవితానుష్ఠానమే పరమ శరణ్యము. ఖండఖండాంతర ప్రచారములు, పండితమండలిని దిగ్భ్రమ నొందించు మృదుమధుర రచనలు, సభ్యుల సమ్మో

హావళులఁ జేయు నుపన్యాసగర్జనములు, మిక్కిలి అల్పమైన విలువగలవి. ఆత్మ శక్తి, లోకములోని సర్వదోషములను భస్మమొనర్చి, పరమ సుఖ శాంతులను నిలుపఁగలదని, చూపవలసి యున్నది. ఇహపరములు రెండును సమ్యక్సంబంధము గలిగి, నిర్దుష్టఫలితముల నిచ్చుటకు సాధనమాత్మ శక్త్యుపాసనమే యని, నాగరిక ప్రపంచమంతటిచే నేకగ్రీవముగా నంగీకరింపఁ జేయుటయు, నాచరింపఁ జేయుటయు, గర్భమందు బ్రహ్మర్షి సంప్రదాయమును గలిగి జన్మించిన భారతీయుల మహత్తర కర్తవ్యమై యున్నది. పరమేశ్వరుఁడిట్టి కర్తవ్యజ్ఞానమును భారతీయులలో నినుమడింపఁ జేయుఁగాక.

ఈగ్రంథరచనమున నాకనేక విధముల నత్యంతప్రోత్సాహమిచ్చి యాదరించిన పెద్దలందరకు నేనెల్లప్పుడును కృతజ్ఞుఁడను. దీనినొక ప్రత్యేకాభిమానముతో నెట్టిలోపములును లేకుండ మనోహరముగా ముద్రించి, తమ యౌదార్యమును జూపిన శ్రీ పట్టమట్ట శేషగిరిరావు పంతులుగారికి నాకృతజ్ఞతాభివందనములను దెలుపు చున్నాను.

ఇట్లు,
గ్రంథకర్త.

ఓం

# భారతీయ తత్త్వశాస్త్రము

## అష్టమాధ్యాయము

### శంకరాద్వైత వేదాంతము

#### ౨౧ - అనుభవజ్ఞానము.

---

మన మసత్యమనుటవలనఁ గలిగిన ఫలితము లన్యోన్య విరుద్ధములు నసమంజసములు నయినప్పుడొక విషయము నిజమనియు, నొక భావము సత్యమనియు, స్థాపితమగును. లోపభూయిష్ఠమగు మన బుద్ధికిదియే పరమ ప్రమాణముగాఁ గన్పట్టుచున్నది. తార్కికముగా నాత్మాస్తిత్వమున కింతకంటె శ్రేష్ఠతరమైన ప్రమాణములేదు. ఆత్మ నిజమా కాదా యని యడుగుట వ్యర్థసంప్రశ్నమే యగును; ఏలన సర్వజీవిత విజ్ఞానానుభవము, హేతుక్రమాన్వితముగా నిర్వచింపఁ బడకున్నను, నాత్మయే సత్యమనునదే నిత్యసాక్ష్యమై ప్రకాశించుచున్నది కాని మనఃపరికల్పితోపకరణములచేఁ బరమార్థమును గ్రహింపఁజేయు యత్నము పరస్పర విరుద్ధభావారణ్యమునకుఁ దోడ్కొని

పోవును. ఇట్టి విషాదపర్యవసానమును నిరోధింపఁ గాంక్షించు నెడల మనస్సు తన్నుఁదానణఁచి వైచుటవలననే అవిద్యావరోధము తొలఁగింపఁబడును. మన తర్కప్రమాణముల వలన మనకుఁ గలుగు నసంతృప్తి, మనకుఁ దెలిసిన దానికంటె మన మధికులమనియు, మన పరిమిత మనస్సీమావధులను దాటి సత్యసామ్రాజ్యమునఁ జేరఁగలమనియు, సూచించును. కాని, మన బుద్ధికది యెల్లప్పుడు దుర్గమమే; తనకతీతమైన దాని నెంతవరకు సాధ్యమైన నంతవరకుఁ దెలిసికొందమని బుద్ధి యత్నించును గాని, దాని యత్నమెన్నటికిని ఫలించునది కాదు. బుద్ధి కేయవధులు దాటరానివై, యనివార్యములని తోఁచునో యవియే, మనలోఁ దార్కికశక్తి కంటె నతీతమగు నాధార మేదో యున్నదని స్ఫురింపఁజేయును. మన విజ్ఞానము సత్యము నేకమునై, మానవుఁడు తన పృథగ్వ్యక్తిత్వమును ద్రోసిపుచ్చి, పరమాత్మతో నేకత్వమును గాంచినచో, విజ్ఞానముయొక్క పరమావధి సిద్ధించును గాని, యది విజ్ఞానమనఁబడదు. అనుభవసిద్ధిలో విజ్ఞానము హరించును. జ్ఞానము జ్ఞేయముతో నేకమని తెలిసినపుడు జ్ఞానము సిద్ధజ్ఞానమై, ఆత్మయే నిత్యజ్ఞానస్వరూపమని విశదమగును.౧, ఇట్టి పరిపూర్ణజ్ఞానమే పరమార్థ జ్ఞానమును. వ్యావహారికార్థ ప్రయోగములచే 'జ్ఞాన' శబ్దమున కభిచారము కల్గి

---

(౧) "పరమార్థమును గ్రహించుటనఁగా గ్రహించు మనతోనది కలిసి యేకమగుటయే." (జెంటైల్; థియరీఆఫ్ మైండ్ ఏజ్ ప్యూర్ ఆక్ట్.పు.౧౦.)

నది.[2] అనుభవజ్ఞాన మనుమాట దీనికంటె నెక్కువ సక్రమార్థ సూచకము కాఁగలదు.

శంకరుఁ డంతర్దృష్టిలేక యనుభవదృష్టికలదని చెప్పెను.[3] ఇందు విషయీ విషయభేదములంతరించి, పారమార్థిక సత్య మనుభవసిద్ధమగును.[4] వాఙ్మనసాతీతమైన యిట్టి నిరతిశయానుభవము మనజీవితమునంతను మార్చి, దైవసాక్షాత్కారసిద్ధి నొసఁగును. మానవుఁడు తనబుద్ధితోఁగూడి పరిచ్ఛిన్నోపాధుల నతిక్రమించినపు డిట్టియనుభవము ప్రాప్తించును. ఇట్టి యనుభవము రసెల్ మాటలలో, "నిజమగు నానందమునొసఁగి, మనుష్యత్వమున కతీతమగు స్థితిలభించినదను మహోత్సాహము నిచ్చెను!"[5] చిత్తశుద్ధితోఁగూడిన ధ్యానకాలమందును, సౌందర్యానుభవమునందు నట్టిదివ్యానుభవచ్ఛాయలు మనకు గోచరించును.[1] ఆత్మయు నంతఃకరణము నొకటేయని తెలిసి, యవిద్యనశించినపుడు సత్యము సాక్షాత్కరించును. దీనినే సమ్యగ్జ్ఞానమనియు[2] సమ్యగ్దర్శనమనియుఁ[3] జెప్పెదురు. అట్టి యనుభ

(౨) మాధవుఁడిట్లు చెప్పెను; "అదిజ్ఞానముకాదు; ఏలన నిచట జ్ఞేయమైన విషయములేదు. "జ్ఞేయాభావే జ్ఞానస్యాప్యభావాత్.

(౩) చూ.శం.భా. ౧,౧,౨; ౨,౧,౪: ౩,౩,౩౨; ౩,౪,౧౫.

(౪) చూ. ఆత్మబోధ. పు. ౪౧.

(౫) ఫిలసాఫికల్ ఎస్సెన్స్, పు. ౯౩.

(౧) ప్లాటినస్ చెప్పినాఁడు; "అదియెట్టిదైక్యమనగా భూలోకవాసులగు ప్రియులు పరస్పరముగలిసిపోఁగోరువడి దానిఛాయ". (ఎన్నీడ్సు. ౬, ౯, ౩౪.); పోల్చు. బృ ఆ.ఉ. ౬,౩,౨౧.

(౨) శం॥ భా॥ ౧,౨,౮; (౩) శం॥ భా॥ ౧,౩, ౧౩;

వమున కవసరమగు చిత్తశుద్ధిని సంసిద్ధతను సమ్యగ్జ్ఞానము కోరునదికాఁగా, సమ్యగ్దర్శనమనఁగా సద్వస్తుసాక్షాత్కారము; ఇందు పరమార్థము ప్రత్యక్షముగా నీక్షణధ్యాన విషయమగును.౪. అయథార్థవిషయములపై ధ్యానమునిల్పుట కవకాశమున్నదికాని, యనుభవసిద్ధి లభింపదని శంకరుఁడు చెప్పుటచే నాతఁడు చెప్పిన యనుభవ మూహాకల్పిత వస్తుధ్యానముకాదు. యోగి యీశ్వరుని సంరాధనస్థితిలోఁ జూచును, సంరాధనమనఁగా నిశ్చలధ్యానమగ్నత.౫ ఇంద్రుఁడును, వామదేవుఁడును దేనివలన బ్రహ్మైక్యమును సాధించిరో యట్టి 'ఆర్షజ్ఞాన''మును శంకరుఁ డంగీకరించినాఁడు.౬ అదిసత్యము నెట్టయెదుట దర్శించునట్టి దగుటచేఁ బ్రత్యక్షస్వభావముఁగలదే.౭. కాని యీప్రత్యక్ష విషయము దేశకాలగతమైనదికాదు. అనుభవజ్ఞానమనఁగా నేదో యొక విషయమును దెలిసికొనుటకాదు; మనలోనిగూఢమై సర్వాధా

(౪) శం॥ భా॥ ౧,౩, ౧౩.

(౫) శం॥భా॥ ౩,౨,౨౪; చూ. కఠోపనిషత్తు. ౪,౧. అట్టిధ్యానమున విషయీవిషయభేదముకలది కాదాయనునాక్షేపణకు శంకరుఁడిట్లు నుడివెను:" తేజస్సు, ఆకాశము, రవియునవి ప్రకాశించు విషయములనుబట్టి భిన్నములై తోఁచునుగాని వానియేకత్వమెన్నఁడు చెడదు. అదేరీతిగా, నుపాధిభేదము వలన నాత్మభిన్నత్వము చూపట్టునుగాని యాత్మయేకమగుట సహజము, మూలభూతమునగు సత్యము." (శం॥భా॥ ౩,౨,౨౫.)

(౬) ఇదిరత్నప్రభలో నిట్లువివరింపఁబడెను: "పూర్వజన్మములలో శ్రవణ మననాదులవలన, సత్యసాక్షాత్కార మప్రయత్నమై సిద్ధించును." (జన్మాంతరకృత శ్రవణావినా అస్మిన్ జన్మని స్వతస్సిద్ధమ్ దర్శనమార్షమ్.")

(౭) శం॥భా॥ ౧,౪,౧౪. (౧,౧,౩౦); చూ॥శం॥భా॥ తై॥ఉ॥౧,౧౦.

తమై, సర్వజీవజీవమైయున్న సర్వశక్తినాత్మస్వరూపముగా దర్శించు టయే. న్యాయదర్శనము చెప్పునర్థములో బాహ్యజగత్తు నెఱుంగుటకుఁ బ్రత్యక్షానుభవమొక్కటే సాధనము; కాని యిచట ననుభవసిద్ధియనఁగా నద్వైతస్వరూపము యొక్క అత్యంతనిగూఢమగు నంతర్దర్శనము; అతీంద్రియ ప్రపంచమునుగూర్చి మనకుఁ దెలిసినదియు, మనము విశ్వసించునది యంతయు దీనిపై నాధారపడియున్నది. అనుభవజ్ఞానవిషయమే వ్యక్తిగతభావముగాని, జ్ఞాతయొక్క బుద్ధి పరికల్పిత స్వరూపముగాని కాదు. అదియొక యథార్థమగు విషయము౧. దానిని మనమెఱుగుటయు నెఱుఁగకుండుటయు దానికెట్టి వికారహేతువునుగాదు. దేశకాలానుగతములై నిత్యపరిణామవాహినిలోఁ బరిభ్రమించుచున్న వస్తుజాలమున౨. కతీతమైన వస్తుస్వరూపమది. సత్యసాక్షాత్కారసిద్ధిగల జీవి దృష్టికి వివిధదర్శనములు చూపు తార్కికవాదనైపుణ్యము లర్థహీనములు. "దేహధారియయ్యుఁ దనకు బ్రహ్మజ్ఞానసిద్ధి చేకూరినదని హృద్గతానుభవము నిశ్చయించుచుండ నెవ్వఁడు గాదనఁగలఁడు?"3. శ్రద్ధాభక్తులన్నియు, ధ్యానసాధనలన్నియు నిట్టి యనుభవసిద్ధి సంపాదనార్హతను మనకుఁ గలుగఁ

(౧) అనుభవావసానత్వాత్ భూతవస్తువిషయత్వాచ్చ (శం.భా.౧,౧,౨,

(౨) పోల్చు: ప్లేటోతత్త్వము; వివేకము, దేశకాలాతీతమైనట్టియు, "వర్ణరూపస్పర్శారహితమైనట్టియు నాత్మాధిపతియగు ప్రజ్ఞకే గోచరమగునట్టియు సత్యజగత్తును గోచరింపఁజేయును" ఆత్మకు నానాత్వమును ప్లేటో చెప్పగా శంకరుఁ డేకత్వమును జెప్పెను.

(3) కథంహ్యేకస్య స్వహృదయప్రత్యయమ్ బ్రహ్మవేదనమ్ దేహధారణంచాపరేణ ప్రతిక్షేప్తుమ్ శక్యతే? (౪,౧,౧౫. శం॥భా॥)

జేయుటకొఱకే యుద్దేశింపఁబడియున్నవి. పూర్ణజిజ్ఞాసగలవానికే నిజమగు నర్హతగలిగి యాత్మసాక్షాత్కారము లభించును. అది ప్రయత్నశూన్యముగా నాకసమునుండి వర్షించునది కాదు. అది మానవుని యొక్క స్వచ్ఛవివేకము ప్రఫుల్ల పుష్పరాజమై ప్రకాశించుటే. అది మానవుని ప్రజ్ఞకు సంతృప్తినొసఁగఁజాలని స్వప్నదృశ్యము వంటిదికాదు. ఏదినిజమో యది, గ్రహింపఁగల సర్వజనబుద్ధులకు నిజమేయగును. సూర్యుఁడు శాస్త్రము వ్యక్తిగతములు కానటులే, సత్యమునుగాదు. సత్యమునకు విశ్వజనీనత నైసర్గికలక్షణము; అది యేవ్యక్తిపైఁగాని, తుద కీశ్వరునిపైఁగాని యాధారపడదు. సత్యసాక్షాత్కారవిధానము వ్యక్తిగతము, విశిష్టమును గావచ్చును గాని సత్యము మాత్ర మట్టిదిగాదు. సత్య మొకచోట నొకకాలమునను సత్యముకాక, సర్వకాల సర్వదేశములకును సత్యమేయగును.

తార్కికపద్ధతివలనఁ గాక వస్తువుల స్వస్వరూపమును గూర్చిన జ్ఞాన మొకవిధమగు బుద్ధి విలోకనరూపమైన చైతన్యవృత్తివలన లభించునని క్యాంటుపలికినాఁడు. అట్టి బుద్ధివిలోకనము వలననే యాత్మజ్ఞానము లభించునని ఫిక్టేపలికినాఁడు; ఇదియే యాతని తత్త్వములో జ్ఞానమునకంతకు మూలాధారము. విషయీ విషయైక్యభావరూపమగు పూర్ణచైతన్యమును సూచించుటకిట్టి పదములనే షెల్లింగువాడినాఁడు. కాని శంకరు

(౪) శం॥భా॥ ౨,౧,౬. అనుభవావసానమ్ బ్రహ్మవిజ్ఞానమ్. అనుభవారూఢమేవచ విద్యాఫలమ్॥ (3,౪,౧౫.) జ్ఞానఫల మనుభవసిద్ధము. (శం. గీ॥భా॥ ౨,౨౧; బృ. ఆ. ఉ. ౪,౪,౧౯.)

ననుసరించి, యాతని యనుభవజ్ఞానవిషయము, క్యాంటు చెప్పిన మూలవస్తునానాత్వముగాని, ఫిక్టెచెప్పిన యాత్మభావముగాని, షెల్లింగు నిర్వచించిన నిష్క్రియత్వముగాని కాదు; శంకరు ననుభవవిషయము విశ్వైక చైతన్యమగు నాత్మపదార్థము ప్లాటినస్ వలెనే, శంకరునికిఁ బరమార్థము విషయముగా నెన్నఁడు గోచరించదు; జ్ఞానాతీతమైన సాక్షాత్కారమందే యది సిద్ధించఁగలదు. ౧. అట్టియనుభవజ్ఞాన, మే యితర జ్ఞానముచేత, నుపహతముకానందున నదియే పరమసత్యము౨. ఒకవిషయాస్తిత్వము, దానినిగూర్చిన మన భావమును వేరు చేయఁబడని నిర్వికల్పక వేదనారూప మనుభవజ్ఞానమని పొరపడరాదు. అనుభవజ్ఞానమునకుఁ బహిర్దృష్టికంటె వివేకవిలసితమైన యంతర్దృష్టితోడనే విశేషసామ్యముగలదు. అది మననాత్మకమైన సవికల్పకజ్ఞానముకంటె నుత్కృష్టమైన ప్రత్యక్షజ్ఞానము. మన బాహ్యజ్ఞానదృక్పథముననుసరించి, పరమార్థము సంశయాస్పదమైనదే; దైవమునుగూర్చియు, మోక్షమును గూర్చియు, జన్మరాహిత్యమును గూర్చియు మనభావములత్యంతనిగూఢములైన మహదాశయములకు గుర్తులు, నామ

---

(౧) ఎన్నీడ్సు. ౬,౯,౪.

(౨) బాధకజ్ఞానాంతరా భావాచ్చ. (శం॥భా॥ ౨,౧,౧౪) శతశ్లోకి యందిట్లు చెప్పఁబడెను: "బ్రహ్మజ్ఞానము శ్రుతి రెండువిధములుగాఁ జెప్పుచున్నది; ఒకటి స్వానుభూతి; రెండవది ఉపపత్తి; మొదటిది దేహాను బంధమువలనఁ గలుగును; రెండవది సర్వాత్మకత్వభావమువలనఁ గలుగును. "నేను బ్రహ్మ"ను ననుభవము మొదటఁ గలిగి, తరువాత, "అంతయు బ్రహ్మమే" యను ననుభవము సిద్ధించును.

ములునుమాత్రమే; వానినిసాధించుటకు మన మెంత ప్రయత్నముచేసినను, మనము మన మనఃపరికల్పితములైన వైరుధ్యముల నతిక్రమించినప్పుడుగాని కృతార్థులము కాఁజాలము. అనుభవాధ్యాసలు, పరమార్థమునకును మనపరిచ్ఛిన్న మానసమునకు మధ్యమందుఁగలయొక ఛిద్రమును సూచించును.

సర్వజనులకీ యనుభవసిద్ధి తెరచినద్వారమే యైయున్నను కొలఁదిమందియె యందుఁ బ్రవేశింపఁగలరని శంకరుఁడంగీకరించినాఁడు. ౧. కాని ముఖ్యవిషయమేమనగా నందఱకు దానికొఱకై యత్నించుట కధికారమున్నది. పరమార్థము నిజమైనిత్యమై సాధింపఁ గృతనిశ్చయులైనవారి కెట్టయెదుట నున్నది. ఏకొలఁది మంది జీవులకో స్వప్నతుల్యావస్థలలో జ్యోతిర్మయరూపమునఁ గాని, యంతర్వాణీ ప్రసంగములద్వారమునఁగాని యిట్టి యనుభవసిద్ధి లభించునను వాదమునకు శంకరుఁడు విముఖుఁడు. కొందరకుమాత్రమే దర్శనమిచ్చి, యితరుల కవకాశము లేకుండఁ జేయు దైవము నిజముగా నూహాకల్పితుఁడే. పరమార్థానుభవసిద్ధి, నిజముగాఁ గొలఁదిమందికే సాధ్యము; కాని దానిని

---

(౧) పోల్చు: డీన్ ఇంజ్. "సంపూర్ణజ్ఞానమనఁగా సంపూర్ణమగు జ్ఞాతృజ్ఞేయైకత్వమే; ఏలనఁగుదవు మన మెఱుఁగునది మనసంగతియే. అందుచే దైవజ్ఞానపద్ధతియెట్టిదనఁగా, ప్లాటినస్ చెప్పినరీతిగా నందరకునున్నను గొలఁది మంది మాత్రమే యుపయోగించు నొకవిధమగు నంతశ్శక్తినగా, కేంబ్రిడ్జి ప్లేటోవాదుల మాటలలో మానవు నంతరాత్మలో నిహితమైయున్న దైవదర్శన బీజము నావిష్కరించి బహిర్ముఖ వికాసమునొందించుటే." (వ్యాసములు రెండవసీరీస్, పు. ౧౪.)

జేయుట కందర కధికారమున్నది; తర్కప్రజ్ఞ మానవజాతిలో నింక నధికసంఖ్యాకుల కందుబాటులోనిదైయున్నది. అందరలోఁ గొన్ని శక్తు లధికముగా వికసించినను, గొన్నిశక్తులు కొందరలో నిద్రాణములైయున్నవి. ప్రస్తుత యుగపరిణామదశలో, ననుభవ జ్ఞానము వ్యక్తిగతమైయున్నది; అది హేతుబుద్ధి ప్రవృత్తికను గుణమై గోచరించినప్పుడే యథార్థమని విశ్వసింపఁబడును.

౨౨ - అనుభవ, తర్క, శ్రుతిజ్ఞానములు.

అనుభవజ్ఞానమున కత్యంతనిశ్చయ ప్రామాణ్యమున్నను, భావనాదృష్టిలో దాని కత్యల్పమగు స్పష్టతయే కలదు. అందుచే నర్థనిర్ణయము లవసరములైనవి; కాని వీనికి సహజలోపము గలదు; అందుచే నవి నిత్యసంస్కారమును గోరును. పూర్తిగాఁ జెప్పుట కవకాశములేని విషయములను శ్రుతి చెప్పయత్నించును. బ్రహ్మవేత్తలు తర్కమునకు భాషకు నతీతములగు విషయములను బలుకుదురు. అనుభవజ్ఞానము లేనివారు, పరమార్థ సమస్యాపరిష్కారమున నఖండకృషి చేసిన లోకాతీతపురుషుల మహత్తరానుభవ క్రోడీకరణ రూపములైన వేదవాక్యములను విశ్వసించి ప్రవర్తింపవలసి యున్నది. సామాన్య మానవునకా పరమచైతన్య సత్యస్వరూప మనుభవైకవేద్యమే కాని, ప్రత్యక్షానుమానాది మానవ కల్పితప్రమాణముల వలన నిశ్చయము కాఁజాలదు. ఈప్రమాణములు పరమార్థమును సూచించునే కాని చూపఁజాలవు. సత్యము విజిజ్ఞాసితవ్యమని౧. శంకరుఁ డంగీకరించి,పరపక్షసిద్ధాంతఖండనమున కవిరోధనియతి నుపయోగ

(౧) సత్యమ్ విజిజ్ఞాసితవ్యమ్. (శం॥భా॥౧,౨,౮.)

గించును. ముఖ్యముగా బౌద్ధాది తాత్త్వికభావములకు శంకరుని యాక్షేపణమునకుఁ బ్రధానకారణము తర్కపద్ధతి వలనఁ బరమార్థనిర్ణయము చేయుట వ్యర్థమని నిరూపించుటకే. శ్రుతిప్రమాణ మింద్రియజ్ఞానమునకును, హేతునిర్ణయములకు నతీతమైనదని యాతఁడు నిశ్చయించెను; కాని ప్రత్యక్షానుమాన ప్రవర్తకరంగమున శ్రుతిప్రమాణము నిష్ప్రయోజనము. నిప్పు చల్లగానుండునని కోటిగ్రంథములైనను నిరూపింపఁజాలవు.౧. సామాన్యమానవ ప్రమాణముల కలభ్యమగు జ్ఞానము నుపదేశించుటే శ్రుతులకు లక్ష్యము.౨.

వేదముల యుద్దేశ్యమాత్మైకత్వము నుపదేశించుటే.౩. అవిద్యావిముక్తికి వేదాంతజిజ్ఞాస కారణము గాదని శంకరుఁడు చెప్పినాఁడు; ఏలన జిజ్ఞాసయు జ్ఞానము నంతయు, విషయీ విషయ కల్పితద్వైతరూపము గావున, బ్రహ్మానుభసిద్ధికాటంకము. కాని యిది అవిద్యానివృత్తికే కాని, జ్ఞానప్రాప్తికి నిరుపయోగము.౪. రజ్జుజ్ఞానము కలిగినంతనే సర్పభ్రాంతి నశించు

(౧) జ్ఞానంతు ప్రమాణజన్యమ్ యథాభూతవిషయంచ, నతన్నియోగశతేనాపి కారయితుమ్ శక్యతే, నచప్రతిషేధశతేనాపి వారయితుమ్ శక్యతే. (శం భా. 3,౨,౨౧; శం॥గీ॥భా॥ ౧౮,౬౬.)

(౨) ప్రత్యక్షాది ప్రమాణానుపలబ్ధేహి విషయే శ్రుతిప్రామాణ్యమ్ నప్రత్యక్షాదివిషయే (శం॥గీ॥భా॥ ౧౮,౬౬.) అజ్ఞాతజ్ఞాపనంహిశాస్త్రమ్.

(3) ఆత్మైకత్వ విద్యాప్రతిపత్తయే సర్వేవేదాంతా, ఆరభ్యంతే శం॥భా॥ ఉపోద్ఘాతము

(౪) అవిద్యాకల్పిత భేదనివృత్తి. (శం॥భా॥ ౧,౧,౪.) చూ॥శం॥గీ॥భా॥ ౨,౧౮. పోల్చు: ప్లాటినస్: "ఈశ్వరుని వాక్కుచేఁగాని, లిఖితోపదేశ

రీతిగా, నవిద్యానివృత్తి యనఁగా సత్యదర్శనమే;౯. వేరొక నూతన సాధనకాని, జ్ఞానకార్యముకాని సత్యసందర్శనమున కవసరములేదు ౬."ద్వైత నాశనానంతరము జ్ఞానప్రాప్తికొక క్షణకాలమైన నంతరముండదు; ఉండునెడల ననవస్థాదోషము కలిగి, ద్వైతమెన్నటికిని నశించదు. అందుచే నవిద్యానిర్మూలనము, జ్ఞానప్రాప్తియు సమకాలికములే."౧. అజ్ఞానము తొలఁగినంతనే, నిజము ప్రత్యక్షమగును ౨ అవిద్యనుండి విద్యాప్రాప్తి యెట్లు సంభవించునను ప్రశ్నకు దోషము పోయినంతనే స్వప్రకాశశీలముగల సత్యము ప్రకాశించున దగుటచే నీప్రశ్న సముచితమైనది కాదు — దైవానుగ్రహము వలననే జరుగుననుటకంటె శ్రేష్ఠతరమైన సమాధానములేదు. 3. చిత్తశుద్ధిగల వాఁడంధుఁడనినచో వానికి దైవానుగ్రహవశమున దృష్టిలాభము సిద్ధించినట్లే జ్ఞానసిద్ధి కలుగును.

ముచేఁగాని చెప్పుటకు వీలులేదు; కాని మన మాటలు, లిఖితోపదేశములును, మార్గము తెలియనివారికిఁ బోవలయు త్రోవచూపునట్లు, మన యాత్మ బుద్ధివీక్షణమునుండి తదతీతమగు నంతర్వీక్షణమునకుఁ బోనలెవని సూచించుట కుపయోగించును; కాని యనుభవదృష్టి స్వయంకృషి వలననే సిద్ధించును.''
(ఎన్నీడ్సు ౬,౯,౮; కెయిర్డ్సు; గ్రీక్ థియాలజీ, వాల్యూము ౨,పు॥ ౨౩౭.

(౯) శం॥భా॥మాం॥ఉ॥ ౨.౭.

(౬) శం॥భా॥మాం॥ఉ॥ ౨,౭.

(౧) శం॥భా॥ మాం॥ఉ॥ ౨,౭.

(౨) ఆత్మైవ అజ్ఞానహానిః

(3) శం॥భా॥ ౨,3,౮౧; చూ॥ కఠోపనిషత్తు ౨,౨౨. ఈభావమును మనసునందుంచుకొనియే డ్యూసేన్.శంకరునికి మతపక్షపాతమున్నదని యూహించెను. చూ॥ డ్యూసేన్సుసిస్టమ్ఆఫ్ వేదాంత, పు॥ ౮౬, ౮౭.

శ్రుతి నంగీకరించుట యనఁగా, మహర్షులయొక్కయు సిద్ధపురుషులయొక్కయు సాక్ష్యము నంగీకరించుటే: శ్రుతిని విడిచిపెట్టుట మానవజాతియొక్క, అత్యంతరసవంతమైన యనుభవమును విడిచిపెట్టుటే. భౌతికశాస్త్రవిషయములో నాయారంగములలో నత్యంత సుప్రసిద్ధులగు పరిశోధకులు ప్రకటించిన సత్యాంశములను మనమంగీకరింతుము; గానవిద్యలో, విఖ్యాత సంగీతకర్తల రచనల నాలకించి, సంగీతసౌందర్యము నెట్లుపాసించవలెనో తెలిసికొనయత్నింతుము. ఆధ్యాత్మికసత్యాంశములవిషయములో,భక్తివిశ్వాసములచే మహత్తరతాత్త్వికైశ్వర్యధుర్యులయినట్టియు నమేయాధ్యాత్మిక ప్రజ్ఞాప్రవీణులయినట్టియు మహనీయు లుపదేశించిన పలుకుల నతిగౌరవపురస్సరముగా మనమాలకింపవలెను. ఉత్తముల భావములనధముల భావములతోఁ బోల్చి ప్రయోజనము లేదు. "పావనసంప్రదాయముచేఁ దెలియనగు విషయములో మనయాలోచనల నుదాహరించినచోఁ బ్రయోజనము లేదు; ఏలన సంప్రదాయసిద్ధమగు జ్ఞానాధారములేని మనభావము లూహాజన్యములేయగుటచే యుక్తములు కాఁజాలవు. ఊహాకల్పనములు విశృంఖలములు."౪ మన విజ్ఞానముపై మనమాధారపడినచోఁ బ్రపంచమును, మనయస్తిత్వమును, భవిష్యత్తునుగూడ సంశయించి, తుదకు మనము

(౪) శం॥భా॥ ౨,౧,౧౧. అందువలననే సుప్రసిద్ధతత్త్వజ్ఞులగు కపిలకణాదుల భావము లన్యోన్యవిరుద్ధములైయున్నవి. పోల్చు; కుమారిలుఁడు; తార్కికు లత్యంతశ్రద్ధతో నిశ్చయించిన భావములను వారికంటె నెక్కువ యుక్తిగలవారు ఖండింతురు.

సంశయముతో నంతమొందవలయును. కాని, మనకుఁజుట్టునున్న లోకమును గ్రహించుటో, లేకున్న నందునశించుటో తప్పని దగుటచే, మనజీవశక్తి మనయాత్రను విశ్వాససీమకే నడపును. తర్కము నెట్టివేయుట కసాధ్యములైన కొన్నియాత్మజ్ఞాన సంస్కారములు మనలో నిమిడియున్నవి. అభావము నాశ్రయించి యే యొకఁడును బ్రతుకలేఁడు. ఒకనియతమైన తత్త్వశాస్త్రమును గల్పించుట నిరర్థకమనువిషయమును నిరూపించుటకే, శంకరుని తత్త్వముద్దేశింపఁబడినది. శంకరుననుసరించి, కేవల తర్కప్రజ్ఞ సందేహముతో నంతమొందును. ప్రపంచము సహేతుకము, ధర్మసమ్మితమునని మనవిశ్వాసము. అందలి ముఖ్యవివరముల నెఱుఁగకయే ప్రపంచమొకపూర్ణతగలదని నమ్ముదుము. ప్రత్యక్షముగా గోచరించుచున్న యపక్రమాంతర్గతమై నిత్యక్రమమెట్లున్నదో తెలిసికొనకుండ, నట్టిదున్నదని భావింతుము. ఈశ్వరాస్తిత్వము నిజమని నమ్ముటవలన జీవితములు మనకుసారవంతములై, స్థిరసంరక్షితములగుచున్నవి.౧. మఱియు సత్యము,౨ నిత్యసమానము,3 ననిరాకృతము,౪ విశ్వ

(౧) "ప్రత్యక్షమువలనఁగాని, యనుమానమువలనఁగాని, మానవులు తమకింకొక జన్మమందుఁగల సంబంధమునుగాని, మరణానంతరాత్మాస్తిత్వమునుగూర్చికాని తెలిసికొనలేరు. అందుచే శ్రుతిచెప్పు సత్యములవసరములైయున్నవి." (శం॥ భా॥ బృ॥ఆ॥ఉ॥ ఉపోద్ఘాతము.)

(౨) సమ్యగ్జ్ఞానము.

(3) ఏకరూపమ్॥

(౪) పురుషాణామ్ విప్రతిపత్తి రనుపపన్నా॥

జనీనము కావలెను. కాని మనయాలోచనములకట్టిలక్షణములు లేవు, కాని జ్ఞాననిలయముగా వేదము శాశ్వతమైనది; దాని విషయము స్థిరమైనది; దానినుండి లభించు పూర్ణజ్ఞానము భూతభవిష్యద్వర్తమానములలో నెట్టి భావముల వలన నుపహతము కాదు. కేవల హేతుచర్చ నిస్సారమైనది. హేతువాదము స్థాపించు నిర్ణయములది యంగీకరించు ప్రతిపాదనలపై నాధారపడి, భిన్నములగు చుండును. మతతత్త్వవిషయములలో శ్రుతిస్మృతులు ప్రకటించు ననుభవజ్ఞానముపై మతమునకు సంబంధించిన తత్త్వశాస్త్రయుక్తి యాధారపడవలెనని శంకరుని నిశ్చయము. తర్కమనఁగాఁ జరిత్రోపదేశ శిక్షితముకాని యుక్తి యని శంకరుని భావము. అట్టివ్యక్తిగత తర్కము సత్యమును స్థాపింపఁజాలదు; ఏలన విషయగ్రహణశక్తి యనంత వైవిధ్యము కలది.౧. మానవజాతిలో నత్యధిక సంఖ్యాకులకు సంతృప్తి నొసఁగిన సత్యాంశ సంకలితమైనదే శ్రుతి. శ్రుతి సంప్రదాయ సిద్ధములగు విశ్వాసములతోఁ గూడినది; అవి కేవల బుద్ధి పరికల్పితభావములు కాక, జీవచైతన్య తేజోరేఖలే. అట్టి ప్రత్యక్ష జీవశక్త్యనుభవములేని మనకు శ్రుత్యుక్తములగు ననుభవములు విశేష ప్రయోజనాన్వితములు.౨.

యుక్తిలేక తర్కము శ్రుత్యర్థనిర్ణయమున కవసరమని శంకరుఁడు నిశ్చయించెను. ఎప్పుడవకాశము లభించిన నప్పుడు శ్రుతివాక్యముల నాతఁడు హేతుప్రమాణములచే సమర్థించి

(౧) కస్యచిత్ క్వచిత్ పక్షపాతేసతి పురుషమతివైరూప్యేణ తత్త్వావ్యవస్థాన ప్రసంగత్వాత్: (శం॥భా॥౨,౧,౧.)

(౨) శం॥భా॥౨,౧,౧౧; ౨,౩,౧; ౧,౧,౨.

చూపును౩. అనుభవజ్ఞానమునకు సహాయభూతముగా నాతఁడు తర్కవాదము నంగీకరించెను౪. ఆతని దృష్టిలోఁ దర్క మొక విచక్షణచేయు నాయుధము; అది నిరాధారములగు నిర్ణయములను ఖండించును; మఱియు నదియొక సృజనాత్మకమైననియతి; సదసద్విషయములనేర్చి, సత్యాంశములను వక్కాణించు నట్టిది౫. "విషయనిర్ణయ సామర్థ్యము లేనివారైనను, సముచిత కారణము లేనిదే, యొక విశిష్టమగు సంప్రదాయమున కను బంధము పెట్టుకొనరు."౬.

అనుభవ మత్యంత నిగూఢమగు నాత్మానుభూతియగుట వలన వ్యంగ్యార్థములనిచ్చు భాషవలననే ప్రకటింప వీలగును; అట్టి ప్రకటనల సంపుటీకరణమే శ్రుతి. ఇట్టి యనుభవాధారము

---

(౩) చూ: శం॥భా॥గౌడపాదకారికా; ౩,౨౭; ౩,౧. పై గౌడపాద కారికకు వ్యాఖ్యవ్రాయుచు శంకరుఁ డిట్లుపలికినాఁడు: "అద్వైతము శ్రుతి ప్రమాణసిద్ధమైనా, తర్కస్థాపితము కాఁజాలదాయని ప్రశ్నింపఁబడెను; కాని యీ యధ్యాయములో నద్వైతమునెట్లు తర్కముచే స్థాపింపనగునో చూపఁబడినది" తర్కశబ్దప్రమాణ సంబంధమునుగూర్చి విపులమగు చర్చవలయుచో చూ: రెండువ్యాసములు 'సంస్కృతపరిశోధన' జూలై ౧౯౧౯; ఫిలసాఫికల్ రివ్యూ. ఏప్రిల్ ౧౯౧౮ వి. సుబ్రహ్మణ్యఅయ్యరు; మైసూరు విశ్వవిద్యాలయ పత్రిక. నవంబరు ౧౯౧౯ అద్వైతవేదాంతము క్రిటికల్ ఐడియాలిజమ్ యస్ సూర్యనారాయణన్.

(౩) శం॥భా॥౨,౧,౧.

(౪) శం॥భా॥౨,౧,౬; ౨,౧,౧౧.

(౫) శం॥భా॥౨,౧,౪,౩౭; ౨,౨,౪౧; ౨,౪,౧౨.

(౬) శం॥భా॥ ౨,౧,౧.

లేని శ్రుతివాక్య మర్థములేని శబ్దమువంటిదే౧. స్వతంత్రార్థము లేని యర్థవాదములు విధి వాక్యార్థవివరణమును జేయుట కుప యోగించును. అవి ప్రత్యక్షమునకంటె నాధిక్యముగలవికావు. సత్యస్వరూపమును వర్ణించు వాక్యములే ప్రమాణములు౨. శ్రుతికూడ ననుభవమున కనుగుణమై యుండవలెనేగాని, వ్యతిరేకముకారాదు. వాచస్పతి చెప్పినాఁడు; "ఆగమసహస్రమైనను ఘటమునొక పటముగా మార్పఁజాలదు." 3. ఇదేవిధముగా మతవిషయచర్చలలో, శ్రుతివాక్యము లనుభవపోషకములై యుండవలెను. ఇంద్రియసిద్ధమో, ఇంద్రియాతీతమో, యేదైనను ప్రత్యక్ష ముత్తమసాక్ష్యము. కొన్నినియమములకులోనై, యది మన కనుభవసాధ్యమైనది. అనుభవమును బ్రకటించున దే యగుటవలననే శ్రుతికిఁ బ్రామాణ్యముసిద్ధించినది; అనుభవము స్వతఃప్రమాణయుక్తమగుటచే, నితరప్రమాణాధారములతో నిమిత్తము లేకుండగనే, వేదములును స్వతఃప్రమాణయుక్తములైనవి. ౪. అందుచే మానవుఁడు తనలోనున్న శక్తి

(౧) కేవల శ్రుతి ప్రత్యక్ష సాక్ష్యమున కధికతరమైనదిగాదు; విశిష్టార్థభరితమైన శ్రుతియే ప్రమాణము. తాత్పర్యవతిశ్రుతిః ప్రత్యక్షాద్బలవతి, నశ్రుతిమాత్రమ్॥ (భామతి)

(౨) ఈభామతి భావమును వివరణకర్త ఖండించెను. కారణముస్వతంత్రార్థయుక్తమైనదానికిఁ బ్రామాణ్య మంగీకరించుట ప్రమాదకరము. శ్రుతి విర్బోమత్వ పరత్వలక్షణములచే నితరప్రమాణముల కన్నిటికి నతీతమైన సామర్థ్యముగలది.

(3) నహ్యాగమసహస్రమపి ఘటమ్ పటయితుమ్ ఈశతే॥ (భామతి ఉపోద్ఘాతము) (౪) ప్రామాణ్యమ్ నిరపేక్షమ్॥

వికాసమువలన వేదములలోని సత్యములను సంపూర్ణముగా దర్శింపగలడు; కాని మానవుల కందరకు నట్టిశక్తిని వికసింపఁ జేసికొనుటకు వలయు ధైర్యముకాని, తీరికగాని, యవకాశములుగాని లభింపవు గావున, శ్రుతిప్రామాణ్యమును విశ్వసించుటే సులభమగు నుపాయము.

## ౨౩ - పరవిద్య ; అపరవిద్య.

పరమసత్యమే పరవిద్య; ఇందలి విషయమాత్మైకత్వరూపమగు నేకైకసత్యము. తర్క-సాధన సామగ్రిచేఁ బరమార్థమును వర్ణింపఁబూనినచో మనము తప్పనిసరిగాఁ గథలను సంజ్ఞాశబ్దముల నుపయోగింప వలసి వచ్చును. వేదములు మనకు సత్యమును కించుమించుగా సరిపోవు తార్కిక నిర్వచనము నిచ్చును. అపరవిద్య యనగాఁ బూర్తిగా నవిద్యగాదు; వ్యావహారిక దృక్పథమునుండి చూచిన సత్యస్వరూప మపరవిద్య.౧. దేశకాల నిమిత్త ధర్మబద్ధమైన ప్రపంచము సంపూర్ణముకాదు; మన మనఃపరిణతి కనుగుణమై యది గోచరించును. దానికి మనదృష్టి పరిచ్ఛిన్నతయే కారణము; ఈపరిచ్ఛిన్నతా పరిమాణము ననుసరించి మనకు గోచరించు సత్యము భావమాత్రమై యుండును. ప్రైకత్వభావము, నపరనానాత్వభావము నొకే విధములగు సత్యములు కాఁజాలవు. అపరవిద్యచూపు నానాత్వము పరవిద్యాచ్యుతి వలననే సంభవించునని శంకరుఁడు నిర్ణయించినాఁడు.

(౧) పోల్చు: డ్యూసేన్; "నిశ్చయముగాఁ జూచినచో నీయపరవిద్య యనఁగా, నవిద్యాదృక్పథమునుండి చూచిన విద్యయే."
(డ్యూసేన్ వేదాంతతత్త్వము. పు. ౧౦౦)

అపరవిద్య మిథ్యకాని, మోసగించునది కాని కాదు. అది యసమగ్రమైనది మాత్రమే. కాకున్నచో, నపరవిద్యను గూర్చి శంకరుఁడు సల్పిన విపులవాదములును, చర్చలును గూడ వ్యర్థవ్యవసాయమగును. అపరవిద్య క్రమముగాఁ బరవిద్యకుఁ దోడ్కొని పోఁగలదని యాతఁడంగీకరించెను. "సృష్టిని గూర్చి శ్రుతులు చెప్పినదియు నవిద్యారూపమైనదియు బ్రహ్మయే సత్యమని యుపదేశము చేయు వాక్యములే లక్ష్యములుగాఁ గలది. ఇది మరువరాదు."౨. మెలకువ వచ్చువరకు స్వప్నావస్థానుభవములే నిజములగు రీతిగా నతీతమైన పరబ్రహ్మతత్త్వము మానవుని బుద్ధి యంత్రములోఁ జొచ్చి, యీశ్వరతత్త్వమై యథార్థజ్ఞానము లభించు వరకు, నిజమై గోచరించును. 3. అవిద్య లేక పరిచ్ఛిన్నజ్ఞానము, తదతీతమైన పరమార్థమునకు సాక్ష్యము. అవిద్య, తాను సత్యమును బ్రత్యక్షముగాఁ జూడఁజాలదనియు, నందుచే నసమగ్రమగునదనియుఁ జెప్పును ౧, సామాన్యసాధకుఁడు భేదముల నతిక్రమించి, తా నన్వేషించు

(౨) డ్యూసేన్. పు. ౧౦౬. (3) శం. భా. ౨,౧,౧౪.

౧ పోల్చు, డా. మెక్‌టెగార్టు, "బుద్ధిభావముల కేయోగతత్త్వమను గుణము కాదో యది వ్యర్థము. తర్కము ను విచ్ఛేదమొనర్పయత్నించినవానినే తునకఁ దర్కమే విచ్ఛేదమొనర్చును. కాని బుద్ధిదృక్పథములో నారంభించి, తదతీతమైన సత్యమును దెలిసికొనుటకు దాని నతిక్రమించు తత్త్వమింకొకటి యున్నది. అపరవిద్యాదృష్టి నతిక్రమించుట దానిని విడిచిపెట్టుటగాదు." (హెగిలియన్ కాస్మాలజీ, పు. ౧౯౨) స్పినోజా తర్కానుభవ జ్ఞానములకు భేదమును చెప్పినాఁడు. జ్ఞానము మూఁడురకములని యాతఁడు నమ్మెను, (౧) ఊహాజ్ఞానము కేవలభావమాత్రము. అసమంజసములు, నజ్ఞములునగు

మున్న విషయములో లీనమై యొకవిధమగు నజ్ఞతా మేఘావృతుఁడై యుండును; తాత్త్వికులకు కొన్ని క్లిష్ట విషయములను శంకరుఁడు పేర్కొని, దీనికంటె శ్రేష్ఠతరమగు నంతర్దృష్టి యున్నదనియుఁ గేవలము బుద్ధిశక్తి కగోచరమగు దైవసంపద్వైభవమునంతను నది దర్శింపఁగలదనియుఁ బలికినాఁడు. శంకరు ననుసరించి, ప్రమాణసిద్ధిగల వేదములు పరాపరజ్ఞానముల రెంటెనిగూడఁ జెప్పును. అవి యేకము నద్వైతమునగు బ్రహ్మస్వరూపమును, నానాత్వసంకులమగు జగత్తుయొక్క మిథ్యాత్వమునుగూడ వర్ణించును. శంకరుని తత్త్వములో మూడు విధములగు నస్తిత్వముగలదు. (౧) పారమార్థికము (౨) వ్యావహారికము (౩) ప్రాతిభాసికము. (౧) బ్రహ్మపదార్థము,

భావములన్నియు నిందులోనివే విపర్యాసములిందులోనివే (౨) తర్కము ఇది సామాన్యభావములను; శాస్త్రజ్ఞానమును మనకిచ్చి, వస్తువుల సామ్యభేద వైరుధ్యములను గ్రహించును. (ఎథిక్స్, వాల్యూము ౨,పు,౪౯,స్కోలియమ్) ఊహ, సామాన్య విద్యాహీనుని మానసికవ్యాపారమును సూచించును, తర్కము శాస్త్రవేత్తయొక్క నియమాన్వితభావజ్ఞానమును బ్రదర్శించును. (౩) అనుభవజ్ఞానము, దీనికిఁ దాత్త్వికప్రతిభ, వివేకసహితమగు నంతర్దృష్టి, సృజనాత్మక శక్తియు నవసరములు. వ్యక్తియే దీనివిషయము, కాని శంకరుఁడు యూరప్ శాస్త్రవేత్తలలోఁ బ్రధానముగా ప్లేటోను స్మరింపఁజేయును. ఇరువురును మహత్తర తాత్త్వికయథార్థవాదులే. వారు తమతమ పూర్వమున్న విజ్ఞానమును దమ కాలభావములతో సమన్వయించినవారే, ఉభయులును జ్ఞానమును పరాపరవిభాగ మొనర్చిరి. బాహ్యరూపములకంతర్వర్తియై పరమార్థస్వరూపమున్నదనియు, దాని నాత్మ బాహ్యదృష్టినివీడి యంతర్ముఖమైనప్పుడే దర్శింపఁగలదనియు నిరువురును బలికిరి. పరమార్థ సాక్షాత్కార మనుభవదృష్టికే సాధ్యమనియు వారు విశ్వసించిరి.

(౨) దేశకాలనిమిత్తబద్ధమగు జగత్తు, (3) శుక్తిలో రజిత భ్రాంతి ౧. ఈ భ్రాంతి సర్వసామాన్యమైనదికాదు; అది యప్పుడప్పుడు సంభవించును; దాని కర్థసిద్ధి లేదు. భ్రాంతిజనకమైన వస్తుస్వస్వరూపజ్ఞానము కలిగినవెంటనే భ్రాంతి తొలఁగిపోవును. బ్రహ్మజ్ఞానప్రాప్తిలో వ్యావహారిక ప్రపంచము మిథ్యయని తెలియును. స్వప్నజగత్తునకంటె నూహాకల్పిత ప్రపంచమునకంటె నధికతరమగు యాథార్థ్యము వ్యావహారిక జగత్తునకుఁ గలదు. వ్యావహారిక ప్రపంచము జీవరాశి, ప్రకృతి, ఈశ్వరునితోఁ గూడినది; కాని నిజమునకది బ్రహ్మమూలమై యున్నది.౨ జీవాత్మకును, వ్యావహారిక జగత్తునకును సమాన యాథార్థ్యమేగలదు. జీవాత్మయొక్క భావసముద్భూతమైన మిథ్యాజగత్తుకాదు వ్యావహారికజగత్తు. జీవాత్మకు, దాని భావములకును వేఱై స్వతంత్రమై, దేశము నావరించిన బాహ్యజగత్తు కలదు. ఈజీవాత్మ వస్తురంగములు రెండును పరస్పరము కారణసంబంధమును గలిగియున్నవి. ప్రపంచములో జీవాత్మలమై మన మేమి చూచుచున్నామో వానిని మనమే పారమార్థికజీవులముగా నచటఁ గూర్చితిమి.

---

(౧) వేదాంతపరిభాషా॥ కొన్ని యర్వాచీనాద్వైతరచనలలో జీవునకు గూడ నిట్టి భేదము చెప్పఁబడెను. దృగ్దృశ్యవివేకమునందుపాధిపరిచ్ఛిన్నమగు పరమాత్మయే నిజమగు నాత్మయని వచింపఁబడెను. దానికిఁ గర్తృత్వభోక్తృత్వములను,నింద్రియాంతఃకరణబంధమును నారోపించినపుడది జీవాత్మయగును. ఈజీవాత్మ దేహేంద్రియాదులు తనవని భావించును.

(౨) పోల్చు: ఆనందగిరి, శం,భా,మాం,ఉ. బ్రహ్మణ్యేవజీవో జగత్॥ ఈశ్వరశ్చేతి సర్వమ్ కాల్పనికమ్ సంభవతి.

౨౮-శంకరాద్వైతము; కొందరు పాశ్చాత్యవిమర్శకుల భావములు

శంకరుని జ్ఞానసిద్ధాంతము తఱచుగా క్యాంటు-వ్లెషా సిద్ధాంతముతోఁ బోల్చఁబడినది.౧. రెంటికిఁ జెప్పఁదగిన సామ్యభావములున్నను, మిక్కిలి ముఖ్యములైన భేదములు నున్నవి. క్యాంటువలెనే శంకరుఁడు జ్ఞానసమస్యను-ఆత్మజ్ఞానసమస్యను నిర్మించి, తన తత్త్వజిజ్ఞాసకు ముఖ్యస్థానము దానికిచ్చెను. ఉభయులును బాహ్యప్రపంచము యథార్థముగాదనియు నీలోపమునకుఁ గారణము మానవమానస ప్రకృతిలోనే యున్నదనియు రచించిరి. మానవుని జ్ఞానసాధన సామగ్రినిఁ బరిశీలించి, యింద్రియాతీతవిషయములఁ దెలియుట దుస్సాధ్యమని క్యాంటు నిర్ణయించెను. ఏది జ్ఞానమునకు విషయమైనను, దేశకాలధర్మపరీవృతమై, బుద్ధిప్రమాణములలో ముఖ్యమైన నిమిత్తధర్మబద్ధమగును. పరమార్థస్వరూపము మనకు దుర్గ్రాహ్యము; మనము గ్రహించునది తదాభాసమాత్రమే. శంకరుననుసరించి, యేకమైనదాని ననేకముగా దర్శించునట్లు చేయునది మనదృష్టిలోఁ గల యొక ఘోరమైన లోపము. ఇందలి వైచిత్ర్య మేమనఁగా, మనకును బరమార్థమునకును శాశ్వతముగా మధ్యస్థమై ప్రవరించు నొక మన తర్కయుక్తి మనపైఁ జొప్పించుచున్నది. శంకరుఁడును క్యాంటునుగూడ జ్ఞానకారణసమస్యను వ్యావహారికపద్ధతిలోఁ గాక, విమర్శాపద్ధతిలోఁ బరి

(౧) ప్లాటినస్ యొక్క అనుభవజ్ఞాన తత్త్వము భారతీయవిజ్ఞానమునకుఁ గొంత ఋణపడియున్నదని చెప్పఁబడెను. గార్డియన్ చక్రవర్తితోఁ ప్రాచ్యదేశ దండయాత్రలో ప్లాటినస్ అనుగమించెనని మన మెఱుఁగుదుము. అప్పుడాతఁడు భారతీయ తత్త్వవేత్తలను గలిసియుండవచ్చును.

ష్కరింపఁజూచిరి. అనుభవములోఁ గల తార్కికార్థమునుగాక దానియొక్క మూలకారణములను గనుగొనఁదలఁచి వ్యవహార జగత్తునకు బాహ్యమైన వస్తుస్వరూప జగత్తున్నదని నిర్ణయించుటలో క్యాంటుచేసిన పొరపాటును శంకరుఁడుచేయలేదు. మన యనుభవాంతర్గతమైయున్న మూలాధారసూత్రమునుగనుగొన శంకరుఁడు నిశ్చయించినాఁడుకాని దానికి బాహ్యమైన సత్యమునుగూర్చికాదు. తర్కబుద్ధియే యథార్థవస్తు సమన్వితమని భావించుచో, దాని యాథార్థ్యము యుక్తమైనదిగాదనివారుభయులు నంగీకరించిరి; అట్టి భావము మిథ్యాసంస్కారమని క్యాంటు చెప్పినాఁడు. ఉభయులును విజ్ఞానవాదమును ఖండించిరి. మన మున్నామను జ్ఞానము స్వతస్సిద్ధము, నమోఘము ననియు, బాహ్యవస్తుజ్ఞాన మనుమితము, సంశయాస్పదము ననియుఁ జెప్పిన డేకార్టేకు వ్యతిరేకముగా, రెండును సమానముగా స్వతస్సిద్ధములు, నిశ్చయములు ననిక్యాంటు పలికినాఁడు. 'క్రిటిక్' ఆఫ్ ప్యూర్ రీజన్' ద్వితీయ ముద్రణమునందు,'విజ్ఞానవాదనిరసనమ'ను భాగములో బర్క్లీ విజ్ఞానవాదమును విచ్ఛేదమొనర్చినాఁడు. "నాయస్తిత్వమును గూర్చి వ్యావహారికముగా నిర్ణయింపఁబడిన విస్పష్టజ్ఞానమే బాహ్యవస్తుస్థితిని నిరూపించును" కాని పరమార్థ మనఁగా, మన విజ్ఞానమునకు వేరైనదనియు, నట్టి జ్ఞానముతోడను సంబంధములేనిదనియుఁ దలఁచినచో, నప్పుడు శంకరు ననుసరించి, మన కనుభవములోనున్న జీవాత్మయు బాహ్యప్రపంచమును గూడ నసత్యములేయగును; క్యాంటు చెప్పిన దేమనఁగా నింద్రియానుభవ జగద్విషయము

లన్నియు దృశ్యమాత్రములే కాని పరమార్థము కాదు.౧.
అట్లు కాక, వాస్తవిక స్వరూపమనగా నిత్యానుభవసిద్ధమైన
దన్న చో, జీవాత్మయు బాహ్యజగత్తును రెండును యథార్థములే
యగుచు సమానస్థితిని గలిగియుండును. మనము పరమార్థమున
కిచ్చిన నిర్వచనము ననుసరించి, జీవాత్మ జగత్తులు సత్యములో
అసత్యములో యగును. స్వస్వరూపముగల వస్తునానాత్వమును
క్యాంటు ప్రతిపాదింపఁగా, నది యేకము నద్వితీయముననని శంక
రుఁడు నిశ్చయించినాఁడు. ఈవిషయములో వ్యవహారప్రపంచ
నానాత్వమును వస్తుస్వస్వరూపైకత్వములోని కకారణముగా
దెచ్చిన క్యాంటు కంటె శంకరుఁడు చెప్పినదే ఘనతరమైన
తత్త్వమని విశదమగుచున్నది.

బుద్ధీంద్రియ జ్ఞానములకు క్యాంటువలె శంకరుఁడు నిశ్చ
యమైనభేదమును జెప్పఁడు. బాహ్యవిషయమును మనబుద్ధిశక్తి
గ్రహింపలేదనియు శంకరుఁ డంగీకరింపఁడు. క్యాంటుననుసరించి,
జ్ఞానముతోనిమిత్తము లేని దృశ్యపరంపరయే గోచరించుననియు,
మనబుద్ధిప్రవృత్తిధర్మములగు ననివార్యత్వ సర్వసామాన్యత్వ
లక్షణములను మనము బాహ్యమునుండి చేర్చుటవలన జ్ఞాన
మగుచున్నదనియు గ్రహింపనగును. శంకరునిదృష్టిలో మనః
ప్రవృత్తికి నింద్రియగోచర దృశ్యమునకు వ్యతిరేకధర్మమేమి
యును లేదు. రెండును పరస్పరానుగుణములు, ఇదియే శంకరు
నకును బ్రాడ్లేకునుగల భేదమును. మనవస్త్వనుభవములో
'వస్తువు' న్నదనియు, బుద్ధిప్రవృత్తివలన 'వస్తువును' గూర్చి

(౧) క్యాంటు ప్రోలిగామినా, చూ॥ ౧౩. రిమార్కు ౨.

మనఃకల్పితభావములను వేరుచేయుదుమనియు,గాని 'వస్తువు'ను దెరిగి యథాతథముగా దర్శింపలేకున్నామనియు శంకరుఁడు చెప్పెఁడు. ప్లేటోభావమున కాక్షేపణగా ఆరిస్టాటల్ తెల్పినటుల నింద్రియగోచరమగునది బుద్ధిగోచరముకానిచో, మన భావములవలన నింద్రియజగత్తు తెలియదని శంకరుఁడు భావించినాఁడు. శంకరుననుసరించి, యింద్రియజ్ఞానము బుద్ధిజ్ఞానము కంటె నల్పమైనది; బుద్ధిజ్ఞాన మింద్రియజ్ఞానము నెఱుగఁ దోడ్పడును. కాని బుద్ధిజ్ఞానమును యథార్థవస్తువును దెలుపఁ జాలదని యాతని నిశ్చయము. కాని బుద్ధిజ్ఞానము పరమార్థమున కింద్రియజ్ఞానముకంటె సమీపమైనదని యాతఁడు చెప్పెను.

మానవవిజ్ఞానము క్రమవికాసమందుచు వచ్చినదను బెర్గసన్ వాదముతో శంకరునిసిద్ధాంతమును గొందరుపోల్చిరి. ఏకాణుజీవినుండి(అమీబా)క్రమోన్నత పరిణామము జరిగినది. మానవత్వవికాసమునకుఁ బూర్వ మనేకచేతనరూపము లణఁచి వేయఁబడినవి. మనుష్యుఁడుగాఁ బరిణామమొందుటకు విశేష శక్తి వ్యయమైనది. వ్యవహారార్థప్రయోజనము నిమిత్తము మనతర్కబుద్ధి యవసరమేకాని, మనలో నిగూఢములైన శక్తులన్నియు మానవత్వముతోడనే పూర్ణవికాసమునొందినవని తలపోయుట యుక్తముకాదు. ఈలోకమునందే, నిద్రాణములైయున్న శక్తు లావిష్కృతినొందిన మహామేధావులను, ప్రతిభావంతులను మనము చూచుచున్నాము. జీవితప్రవాహమును బుద్ధి విచ్ఛేదమొనర్చి, యనంతపరిణామక్రమము నొక నిశ్చల

వస్తురూపమునఁ బ్రదర్శించుటను బెర్గ్సన్ వాదమును శంకరుఁ డంగీకరింపఁడు. బుద్ధి వాస్తవికస్వరూపమును విచ్ఛేదమొనర్చుటేకాక, పునస్సంధానమునుగూడఁ జేయును. బుద్ధికివిభాగ సంయోగ ప్రక్రియలు రెండును గలవు. విజ్ఞానమనియుతవిషయమును నియతిలోనికిఁ దెచ్చును. అది వస్తుజగత్తును ఖండఖండములొనర్చుటేకాక, దేశకాల నిమిత్తనియమములచే నాఖండముల నేకతా సూత్రబద్ధముచేయును. మన నిత్యానుభవములోని బాహ్యప్రపంచమును గ్రహించుటకు మనబుద్ధులు చాలును. అంతేకాక, రెండు నన్యోన్యాధారభూతములుగా, నొకేపరిణామముయొక్క రెండుసమానరూపములుగాఁ గల్పింపఁబడినవి. మానవచైతన్యమునకు బుద్ధియే శిఖరమైనవృత్తి కాకున్నచో, దానికిఁ గారణమేమన బుద్ధి పరికల్పితప్రపంచము సమగ్రమైనదిగాదని శంకరుఁడు వచించును. తార్కికబుద్ధికి సమగ్రమైతోఁచిన జగత్తు జీవితానుభవములోఁగల ప్రపంచపరిపూర్ణతను గలిగియుండలేదు. అందుచే దానిని శంకరుఁ డుత్తమచైతన్యరూపముగా నంగీకరించియుండలేదు. శంకరునిదృష్టిలో గణితశాస్త్రమొక్కటే భావకల్పితము గాదు.- జ్ఞానరూపములైన చరిత్ర, కళలు, నీతిశాస్త్రము, మతముతోఁగూడ నట్టివే; ఏలన నివన్నియు ద్వైతదృక్పథమునుండి కల్పితములే. విభాగించి, కల్పించుననుకారణముచే బుద్ధిని శంకరుఁడు గర్హింపఁడు. దాని బాహ్య వాస్తవికత నాతఁ డంగీకరించి, యందు సంపూర్ణసంతృప్తి లభింపదనును. మన మల్పవిషయములనుండి క్లిష్టతార్కికసూత్రములకుఁబోయి, విశ్వజగద్రూపమే తన వితతి

ముగాఁగల యీశ్వరుని ప్రతిపాదించినపుడు, మనబుద్ధిప్రవృత్తి తార్కికమగు యాథార్థ్యమును దర్శించుటలో వికాసమందెనని శంకరుఁడు చెప్పను. విజ్ఞాన విజయము బాహ్యజగద్విషయమే; ఏలన బహిర్ముఖమైనమహోన్నత విజ్ఞానము పరమార్థమును గ్రహించుటకు సమర్థమైనది గాదు. మనమెంత యుత్కృష్టముగా నాలోచించిన నంత యెక్కువగాఁ దెలియుదుము; కాని మన యుత్కృష్టతమాలోచనమైనను సమగ్రసత్యసాధకము గాదు. బుద్ధిసాహాయ్యముతో మన మున్నతపథమునకు సత్యాన్వేషకులమై పోగా, (బరిచ్ఛిన్నవిజ్ఞానాంతరువులో బ్రహ్మస్వరూపమైన యీశ్వరతత్త్వమును గనుగొనుటే, పూర్ణము, సమగ్రము, నత్యంతపరిణతమునైన యనుభవము. కాని యీశ్వరుఁడు నిర్గుణబ్రహ్మము కాదు; ఏలన నీశ్వరైకత్వము మనబుద్ధి కతీతవిషయము

పశ్చిమతత్త్వజ్ఞులలో శంకరుని తత్త్వమున కత్యంతసమీపమునకువచ్చు నాతఁడు బ్రాడ్లే; మూలములలో వారికి ముఖ్యభేదములు నున్నవి. 'అప్పియరన్సు అండ్ రియాలిటీ' లేక 'సత్యము: తదాభాసరూపము'నను గ్రంథమున ద్వితీయభాగమం దాతఁడు ద్రవ్యగుణములకు, గుణములకు సంబంధములకుఁ గల ముఖ్యాముఖ్య లక్షణభేదమును గూర్చి సునిశితవిమర్శ యొనర్చి, మానవవిజ్ఞానము పరిచ్ఛిన్నమైనదను సిద్ధాంతము నాతఁడు ప్రకటించినాఁడు. విజ్ఞానము పరమార్థము నెన్నఁడును గ్రహింపఁజాలదని యాతని పరమనిశ్చయము. వస్తుదృశ్యమును దానినిగూర్చిన భావకల్పనమును విడదీయు పద్ధతివలన వస్తు

రహస్యమునుగాంచుటయను లక్ష్యము దుస్సాధ్యమనియాతఁడు చెప్పెను. (బ్రాడ్లే ననుసరించి, నీలవర్ణ వేదన కలిగినప్పుడు, మన కొక దృశ్యము గోచరించినది; దానియొక్క విశిష్టగుణ మొకటి మనబుద్ధిగోచరమైనది. మన ప్రత్యక్షానుభవములో నీరెంటి భేదము గుర్తింపఁబడదు; రెండునుగలిసి యేకరూపముననేగోచ రించును. బుద్ధి కల్పితనిర్ణయములో నీరెంటిని మనము వేఱు పఱచి, విశేషగుణమును విషయికారోపింతుము, మననిర్ణయ ములన్నియు నిట్లే చేయఁబడును. జీవితముగాని, వస్తుస్వరూపము గాని విభాగించుటకు వీలులేని వస్తుదృశ్య తద్భావకల్పనాసమ్మి శ్రితమైనది. రెంటిని విడదీసి యర్థముచేసికొను పద్ధతియే మాన సికమైన తర్కపద్ధతి ఇట్లు విడఁదీయు మానసవ్యాపారము, తర్కలోపమని (బ్రాడ్లేవలె శంకరుఁడు భావింపలేదు; వస్తుయథా ర్థస్వరూపము మన నిర్ణయవిషయము; అది వేదనాంశము రూపమున నను భూతమనియు శంకరుఁడంగీకరింపఁడు. జ్ఞానము నందు భావమనఁగా మానసికరూపము కాదనియు, యథార్థ ప్రపంచ సంబంధముగల బుద్ధి నిర్ణయమనియు నంగీకరించినను, నిట్టి బుద్ధినిర్ణయము వేదనారూపమగు వ్యక్తిగతానుభవము కాదనియు నది సర్వస్వతంత్రమగు వాస్తవిక జగత్స్వరూప మనియు శంకరుఁడు వాదించును. నాకును నాయనుభవమునకు నేమితటస్థించినను, జ్ఞానమనఁగా వేదనయొక్కగాని దానివిపుల రూపముయొక్కగాని లక్షణ వ్యక్తీకరణముగాక, జ్ఞానమనగా యథార్థవస్తుస్వరూపము నావిష్కరించున దగుటచే, నెట్ట యెదుట బాహ్యముననున్న యథార్థజగత్స్వరూపమునే యది

వ్యక్తీకరించును. ఎంతవరకు మనము వ్యక్తిగతానుభవార్థము నన్వేషింపఁ జూతుమో, అంతవరకు మనయన్వేషణము మానసికమేకాని తార్కికము కాఁజాలదు. బ్రాడ్లే యుపయోగించిన 'Feeling' 'అనుభవ' మను శబ్దముచేఁ గల్గిన సంశయము శంకరుని తత్త్వములో లేదు. సర్వనిర్ణయములయొక్క నిజమగు విషయమును యథార్థజగత్స్వరూపమే; మనము మన భావముచేఁ గల్పించిన లక్షణమును దాని కారోపింతుముగాని, మనమారోపించిన లక్షణముదాని నెన్నఁడు సమగ్రముగాఁ జెప్పలేదని శంకరు డంగీకరించును. ఈవిధముగా వస్తువు,గుణము సత్యము దానియాభాసమునకనుసరిపోవును. 'ప్రతినిర్ణయమునందు,నిజమగు విషయముసత్యస్వరూపమే;మనము దానిని గూర్చి చెప్పుహేతువు దాని విశేషణమే. కాని యీవిశేషణము నెల్లప్పుడు సత్యస్వరూపని మతిక్రమించియే యుండును. విశేషణ విషయము లేకమైనఁగా మనకు సత్యస్వరూపము లభింపదు. అట్లేకమగుట విజ్ఞాన విషయముకాదు. బ్రాడ్లే నుడివిన రీతిగా, "విషయమునకు భిన్న లక్షణములను జెప్పుదుమా, అప్పుడది విషయవిరుద్ధమగును. అభిన్నత నారోపింతుమా, మన మేమియుఁ జెప్పలేదని యే స్పష్టము." మన మాలోచన చేయునంతకాలమును, విశేషణము విషయమునకు సరిపోదు; ఆభాసరూపము సత్యమెన్నఁడును గాదు. శంకరు ననుసరించి, నిర్ణయము లన్నియు నయుక్తములే! వస్తుగుణ విభాగము వలనఁ గాదు; మన మేగుణమును జెప్పిన నది వస్తువునకు భిన్నమైనదే యగును. భిన్నతలేనిదే విజ్ఞానము లేదు. భిన్నతయున్నచో యథార్థవస్తుస్వరూపము లేదు.

యథార్థమైనది సమన్వయసిద్ధి గలదనియు నందుచే సత్యమనగా సమన్వయ సిద్ధియే కావలయునని బ్రాడ్లే విశ్వసించినాడు. స ణ ...., సామరస్యమును సత్యచిహ్నములు. లక్షణ నిర్ణయము చేయుటకు వీనిని శంకరుఁ డుపయోగించెను. దేశ కాల నిమిత్తాదులు స్వయంసంపూర్ణతను గాని, సామరస్యమును గాని కలిగి యుండలేదు. అవి స్వవిరోధకములే కాక,తమ కతీత వ్యాప్తి గలవి. శంకరు నభిప్రాయమును సరిగాఁ జూచినచో, సమన్వయసిద్ధియు సత్యమును దెలుపదు. ఏలన సమన్వయ సిద్ధి గల వస్తు వనేక విభాగము లొకటిగాఁ జేయబడిన స్వరూపమే. భిన్నవిభాగ సమన్వితమగు వస్తుభావము వ్యావహారిక భావమే. దీనిని మనము పరమార్థమున కారోపించుచున్నాము.సామరస్య రూపమగు సత్యమనఁగా,సకలపరిచ్ఛిన్న విషయావిషయముల సామరస్యరూపమైన యీశ్వరతత్త్వమును భావింపవలెను. ఇట్టి సమన్వయరూపైకత్వమును వ్యక్తీకరించు నీశ్వరతత్త్వము బుద్ధిగమ్యముకానందున నదియు నాభాసరూపమే యగునని శంక రుఁడునిశ్చయించెను. మనసర్వవిజ్ఞానములో వస్తుయథాస్వరూ పము;దానికి మన మారోపించులక్షణములు పరస్పరవిరుద్ధములు; వాని కేకత్వమును ఘటించుట సాధ్యముకానిది. కాని లోకము లోని భిన్నవిషయములన్నియు నొకే సంపూర్ణస్వరూపములోని వనియు,నింకను మిగిలిపోయిన వేవైననున్నచో నవి యాభాస రూపము లేయనియు, మనమారోపించు లక్షణములన్నియు యథార్థవస్తులక్షణములేయనియుఁ దర్కనిశ్చయము.తర్క ప్రపంచ ములో యథార్థవస్తురూపములో నేదొకొంతసంస్కరించినచో

(జేరి సమన్వయసిద్ధినందని విషయ మేదియును లేదని బ్రాడ్లే చెప్పి నాఁడు. కాని యీసంస్కారపరిణామము నాతఁడు నిర్ణయించి చెప్ప లేదు ఏనిర్ణయమును, దానివిషయము యథార్థవస్తు వైనంతకాలము, సత్యము కాఁజాలదని చెప్పిన బ్రాడ్లే భావ ముతో శంకరుఁ డేకీభవించును. బ్రాడ్లే చెప్పినాఁడు: "భిన్నాంశ కలితమై, సంబంధలక్షణాన్వితమైన విజ్ఞానము మనకు సత్యము నెన్నఁడు సమకూర్చదు; తదాభాస రూపమునే యది ప్రద ర్శించును. అదియొక సాధనము; ఉపకరణము; వ్యవహారక్రియా సమర్థము, జీవితమున కత్యంతప్రధానము నైయున్నది; కాని పరమార్థదృష్టిలో నది సమర్థించుటకు లేశమాత్రి యాథార్థ్య మును లేనిది.'' అందుచే యథార్థవస్తుస్వరూపముయొక్క మన భావకల్పనము నట్టి "వ్యావహారికార్థసాధన మేకాని సత్యమును వెల్లడించున దెన్నఁడును గాఁజాలదు." జ్ఞాతృ జ్ఞేయపిభేదముపై నాధారపడు తర్కజ్ఞానలోపమును బ్రాడ్లే శంకరు లుభయులును గుర్తించిరి. ద్వైతమంతయు మనస్సంజాతము. ౧. శంకరుని తర్కమందు సంశయతత్త్వ యోగతత్త్వ భావములు రెండు న్నవి. పరమార్థము పరిచ్ఛిన్నబుద్ధిచేయు ప్రయత్నమున కలభ్య మగు లక్ష్యము; అట్టి లక్ష్యసిద్ధిచేకూరినపుడు మనవిజ్ఞానము యొక్క వ్యావహారికాకృతిని గోల్పోయి, జ్ఞాతృజ్ఞేయ భేదములు తొలఁగిపోయి యింద్రియాతీత ప్రత్యక్షజ్ఞానముగా మారి పోవును. బుద్ధి పరికల్పితవిజ్ఞానమున కనివార్యములగు దోషము లను బోనాడుటకుఁ దార్కికప్రజ్ఞాప్రవృత్తి పనికివచ్చును.

---

(౧) ద్వైతమ్ సర్వమ్ మనస్.

శంకరుని జ్ఞానసిద్ధాంతములోఁ జూపట్టు వైరుధ్యములు నసంపూర్ణతయు నాతని తార్కికపద్ధతిలో నెట్టిలోపము వలనఁగలిగినవి కావు; వస్తుమూలతత్త్వమును బ్రకటింపయత్నించు తత్త్వమున కీలక్షణము లనివార్యములు. శంకరుని దృష్టికి, జ్ఞానమెంతయో ముఖ్యమైనదియు నజ్ఞానమెంతయో ప్రమాదము నగుటచే, దార్కికపరిశీలనమునకు నిలువనిదానిని దేనినాతఁడు సత్యముగా నంగీకరింపఁడు.

౨౫. వైషయిక పరిశీలనమార్గము; దేశకాలనిమిత్తములు.

వస్తుప్రథమావలోకనమువలన జనించు నసంతృప్తియే తత్త్వజిజ్ఞాసకుజనని. స్థూలదృష్టికి లభించు వస్తుస్వరూపమే యథార్థమైనదని సామాన్యమానవుని భావమైయుండఁగాఁ జింతనాపరుఁడు ప్రథమదృశ్యరూపమే పరమార్థరూపమాయని శంకించును. అసత్యమైనదానినుండి సత్యమును, ననిత్యమునుండి నిత్యమైనదానిని వేరుచేసి తెలిసికొనుటే తత్త్వశాస్త్రము యొక్క లక్ష్యము. భగవంతుఁ డున్నాఁడాయను సమస్యారూపములో మతసంబంధప్రతిపాదనలు జరుగుచున్న దినములలో మనకుఁ గోచరించునదేదియనికాక, నిజమగున దేదియనునదే ప్రధానసమస్యయని శంకరుఁడు ప్రకటించినాడు. ఏది మనకగోచరమో యది నిజముకావచ్చును; ఏదిగోచరించుచున్నదో యది నిజము కాకపోవచ్చును; స్థూలదృష్టికి వస్తు నిజస్వరూప మగోచరము కావచ్చును. ప్రాక్పశ్చిమ ప్రపంచములలోని సర్వ తత్త్వజిజ్ఞాసకును, నీ దృష్టిభేదమే భౌతిక తత్త్వశాస్త్రవిభేదహేతువైనది. మైలీషియనుల "పదార్థము; ఎంపి

థోకిలుస్, అనాగ్జోగోరసుల 'భూతములు' పైథాగరస్ యొక్క 'సంఖ్య'లు; లూసిప్పస్, డెమోక్రిటస్సుల 'అణువులు'; ప్లేటో 'భావములు'; అరిస్టోటల్ యొక్క 'ఎంటిలెచీస్' దృశ్య విషయముల వెనుకనున్న యదార్థవస్తుస్వరూపము నెఱుఁగుటకై చేసిన ప్రయత్నముల ఫలితములే. వస్తుబాహ్యమూలస్వరూప సమస్య మధ్యయుగములకుఁ జెందినది డేకార్టే స్పినోజా లీ సమస్యను బరిష్కరింపఁజూచిరి. హ్యూమును క్యాంటును విషయక్రమమునుమార్చి, వస్తు స్వస్వరూపము వేరు, దాని బాహ్యస్వరూపము వేరని వచించిరి. మూలతత్త్వము వేరు స్థూలదృష్టికి గోచరించునది వేరునని హెగెల్ నిశ్చయించినాఁడు; నిజవస్తురూపము విద్యుచ్ఛక్తి యనియు దానివికారములే వస్తువులనియు నభినవభౌతికశాస్త్రవేత్తలు నిర్ణయించిరి. ఈ భిన్నతత్త్వజ్ఞుల భావములలో విశేషభేదములున్నవికాని, స్వయంస్థితిగలిగి నిజమైన వస్తుస్వరూపమునకును దాని బాహ్యస్వరూపమునకును భేదమున్నదను నంశ మందరకు సమానమే.

శంకరునికిఁ తత్త్వశాస్త్రమనఁగాఁ బరమార్థముయొక్క నిత్యస్వరూపమును లేక జగత్తుయొక్క మూలకేంద్రస్వరూపమును బ్రదర్శించుటే. అదియే బ్రహ్మవిద్య. ఆతనిదృష్టిలో నింద్రియగోచరమైనది నిజముకాదు. ఒకవిషయతాటస్థ్యము వేరు, దాని కర్థనిర్ణయము చేయుట వేరు. మనకు గోచరించునదెల్ల నిజముకాదు. తటస్థించునదెల్ల, గోచరించునదంతయు నిజమైనచో, మన యనుభవమంతయు నిజముకావలెను. మోసగించు స్వప్నములైనను నిగూఢాంతరంగిక జీవితవిషయములే. మనకు సామా

న్యముగా దృగ్గోచరములగు నెవ్వియు సత్యములుగావసత్యము లునుగావు, ౧. కొందరువ్యక్తులకే విదితములగు విషయము లసత్యములనియు, నందరకు సువిదితములైనవి సత్యములనియుఁ దర్కనిశ్చయము. మన యనుభవములోని ప్రధానవియమముల (దీసికొని, దేశకాలనిమిత్త న్యాయబద్ధములైనవన్నియు నయథార్థములేయని ప్రకటించెను. మన యనుభవములన్నిటికి దేశమే సామాన్యరూపమైన యాధారము; కాని నిజమగు వస్తువు దేశ విరహితమునవిభాజ్యమునైనది. ఏది దేశగతమో యది విభాజ్యము; అందుచే నుత్పత్తినొందిన కార్యరూపము; యథార్థ వస్తువవిభాజ్యము, కారణశూన్యము, నందుచే న దేశమును.౨ దేశమునకు విభుత్వలక్షణము పరిపూర్ణముగాదు. 3ఏది దేశముచేఁ బరిచ్ఛిన్నమో, యది కాలపరిచ్ఛిన్నమును. కాలము తన్నుఁదానతిక్రమించు లక్షణముగలది; కాని యెన్నఁడు నట్లు చేయలేదు. మన నిత్యానుభవసీమలోఁ గాలము సర్వగతమై

(౧) పోల్చు: బ్రాడ్లే; "జగత్తునందులేక నాయందేదో సత్యమున్నదని నేను దెలిసికొనుటవలన నట్టి సత్యమున్నదని మాత్రమే నిశ్చయమగును...... బాహ్యజగత్తున్నది. దానినిఁ గాదనలేము; కాని గోచరించు బాహ్యజగత్తును మను, దానినే యంధప్రాయముగా నిజమనుకొనుటమను మధ్యమందే విమయమంతయు నున్నది." (సత్యము-తదాభానము॥ పు, ౨౦౬-౨౦౭ )

(౨) చూ: శం॥భా॥ ౨,3,౭

(3) యద్ధిలోకఇయత్తా పరిచ్ఛిన్నమ్ వస్తుఘటాది తదంతవత్ దృష్టమ్ (శం॥భా॥ ౨,౨,౪౧.)

నదే.(౪) కాని ప్రపంచముయొక్క తుదిలేనిగతి స్వసంపూర్ణము కాదు; అందుచే నేది కాలగతమో, యది నిజముగాదు.

మన యనుభవములో నిమిత్తధర్మము ప్రధానమైనదగుటచే శంకరుఁడు దానిని నిశితవిమర్శచేసి, యది యెట్టిసంతృప్తి నొసఁగఁజాలని భావమని నిరూపించినాఁడు. విషయము లోకసమన్వయసిద్ధిగల యేకరూపములో నన్యోన్యసంబంధబద్ధములై యున్నవను విశ్వాసము ప్రాకృతమానవుల యొక్కయు, భౌతికశాస్త్రము యొక్కయు విశ్వాసమే. కారణములో లేనిది కార్యములో నున్నదను న్యాయవైశేషిక భావమును శంకరుఁడు ఖండించినాఁడు. కార్యము బహిర్గతమగుటకుఁ బూర్వము కారణరూపమున నుండవలెనని యాతఁడు వాదించెను. ఏలన నదివరకు లేనిదేదియుఁ గ్రొత్తగా జనింపదు. ఇసుకనుండి తైల ముత్పత్తికాదు. కార్యము కారణములో నుండకున్నయెడల నెట్టి ప్రయత్నమును దానిని కారణమునుండి యావిష్కృతినొందింపఁజాలదు. మనము చేయునదేమనఁ గారణమును గార్యముగా మార్పుచేయుటే. కార్యము కారణమం దదివరకే లేకున్నచో మనకృషికి విషయమే లేదు. కార్యము కారణముకంటె నధికవ్యాప్తిచెందిన రూపమన్నచోఁ గార్యము కారణములోనిదే కాని నూత్నముగా రాలేదని స్పష్టపడుచున్నది. కార్యము కారణరూపమున నున్నచోఁ, గారణమును మార్చుటకుఁ గర్త

(౪) కాలమవ్యయమని కొన్నిపురాణములు చెప్పును; ప్రకృతిః పురుషశ్చైవ నిత్యౌ కాలశ్చసత్తమ॥ (విష్ణుపురాణము) కాని విద్యారణ్యుఁడు చెప్పినట్లు పురాణభావము బాహ్యజగత్తునుగూర్చియే పురాణస్యాఽవిద్యాదృష్టిః॥

యొక్క కృషి యనవసరమను నాక్షేపణమునకుఁ గారణమును కార్యరూపములోఁ బ్రదర్శించు టే కర్తయొక్క ప్రయోజనమని శంకరుని సమాధానము. కారణకార్యముల సంబంధము నిరవధికము; అనగాఁ గారణము మార్పునొందకుండనుండు కాలముండదు. ఉన్నచోఁ గారణ మనంతరము హఠాత్తుగా మార్పునేలపొందునో మనకుఁ దెలియదు. అందుచేఁ గారణ మెల్లప్పుడు గార్యముగా మారుచున్నది. కారణధర్మ మనవధికగతి గలిగినదైనచోఁ గారణ కార్యములు వేరుకావని చెప్పవలెను. ఏ ఒక నిందొకటి వేరొకటిగా మారుచున్నదని చెప్పఁజాలము. కారణమునందుఁ గార్యముగా మారు నతిశయశక్తి యొకటున్నదని చెప్పఁబడెను. శంకరుఁడు పలికినాఁడు: "నీవుచెప్పిన అతిశయశక్తియనఁగాఁ గార్య పూర్వస్థితియైనచోఁ గార్యము కారణములో లేదను వాదమును నీవే విడిచిపెట్టిన వాఁడవగుదువు. కారణమునుండి యొక నిశ్చితమగు కార్యమే జనించుననుట నంశమును నిరూపించుటకుఁ గారణములో నొకశక్తి యున్నదనియు నదియే నీవుచెప్పిన అతిశయశక్తి యనియు వాదింతువా అప్పుడు నీవు చెప్పిన శక్తి, కార్య కారణములకు వేరుకానిదై అభావాత్మకముకానిదైనప్పుడే నిశ్చితకార్యోత్పత్తి హేతువు కాఁగలదు. అట్లుకాక, నీయతిశయశక్తి కార్యకారణభిన్నమైనను, నభావాత్మకమైనను నిశ్చితకార్యోత్పత్తికారణము కాఁజాలదు. అందుచే నాశక్తి, కారణముయొక్క ఆత్మశక్తి యనియు స్పష్టమగు చున్నది. మఱియుఁ గారణము కార్యాత్మస్వరూపమే కాక, కార్యోత్పాదన హేతువగుచున్నది. కారణము కార్యరూపమున నవి

చ్ఛిన్నమై లేకున్నచోఁ గార్యమెన్నఁడును గోచరింపదు. మృత్తు పాత్రయందును, నూలు వస్త్రమునందును నిలిచియే యున్నది. కారణకార్యములు పరస్పరసంబంధము లేకుండ నశ్వమువలెను, గోవువలెను విడిగా దర్శింపఁబడునవి కావు. కార్యముయొక్క పూర్వాపరరూపముల భేదము స్థూలమైనదే. కారణకార్యము లొకే వస్తువుయొక్క రెండురూపములు.౧. రెండు వస్తువులు, వాని జన్మలయరూపములు వేరై యుండఁగా సమానస్వభావమును గలిగి యుండఁజాలవని యొక వాదము కలదు. ఈవాదమయుక్తమని శంకరుఁడిట్లు చెప్పెను. "బీజములనుండి మొలకలుత్పత్తి యగునట్లే, ఉత్పత్తి యనఁగా నిదివరకున్నదే బహిర్గతమగుటయే; అట్లు బహిర్గతమగుటలో సమస్వభావముగల భూరేణువుల నది స్వీకరించును; యీభూరేణువు లదృశ్యములై బహిర్గతమైన కార్యమదృశ్యమై కారణ రూపమొందుటే లయము. వీనియందు మన మభావమునుండి భావమును, భావమునుండి యభావమును గలుగు నంతరమున్నదని యంగీకరించునెడల, నప్పుడు గర్భస్థమగు పిండము దానినుండి పుట్టిన బిడ్డకును, బిడ్డనుండి పెరిగిన యువకుఁడు వృద్ధునకును భిన్నుఁడై, మఱియు నిరువురు బిడ్డల తండ్రి యొకఁడు కాకుండగను నుండ వలసి వచ్చును."౨. బాహ్యరూపభేదముచే నొక వస్తువు మారదు. చేతులు ముడిచినను జాపినను దేవదత్తుఁడొకఁడే. పాలు మజ్జిగ రూపమునవలె, ద్రవ్యము లవిచ్ఛిన్నములై యుండును. అవి

(౧) శం॥ భా॥ ౨,౧,౧౮.
(౨) శం॥ భా॥ ౨,౧,౧-౭.

కార్యముల నామములను ధరించి, యుండుటచే, నూరుసంవత్స రములు యత్నించినను మనము కారణభిన్నమగు కార్యమును జూడఁజాలము. మూలకారణ మెట్లొక నటుడు భిన్న పాత్రల వేష ములలో నాడినను నొకే వ్యక్తియో. యట్లే భిన్నదశలలో భిన్న కార్యరూపములు ధరించినను, గార్యము తత్పూర్వము కారణ మందున్నదనియు, నది కారణ భిన్నము కాదనియు సహేతుకముగా ఋజువైనది"౧. దీని కుపమానముగాఁ బటము నిచ్చి శంకరుఁడు దానిని మడతపెట్టి నప్పుడది పటమో కాదో తెలియదనియు నొకవేళఁ దెలిసినను, దాని పొడుగు వెడల్పులు తెలియవనియుఁ గాని దానిని విడఁదీసి నవుడన్నియు సుస్పష్టము లగు ననియు వాదించినాఁడు. మడచినట్టియు విప్పినట్టియు వస్త్ర మొకటే యైనట్లే, కారణకార్యము లభిన్నములు.౨. ఒక వస్తు వింకొక రూపములో గోచరించుటచే దాని వస్తుస్వభావమును గోల్పోవదు. మార్పంతయు నొక వస్తుసంబంధమే. సమస్వభావము గలయొకవస్తువునకు సంబంధింపని భిన్నదశాపరంపరను మార్పన రాదు. అవస్థాభేదమే కాని వస్తుపరివర్తనము లేదు. పెరుగులోఁ బాలవలె దృగ్గోచరమైనను, వృక్షములోని బీజమువలె నగో చరమైనను, మూలద్రవ్యావిచ్ఛిన్నత నంగీకరింపక తప్పదు. మఱియుఁగారణమే నిజమైనవస్తుస్వరూప మనియుఁ గార్యము తదాభాస మాత్రమే యనియుఁ జెప్పనగును.3. కారణ

(౧) శం॥ భా॥ ౨,౧,౧౭.

(౨) శం॥ భా॥ ౨,౧,౧౯.

(3) శం॥ భా॥ ౨,౧,౧౯.

కార్యములకు అభేదమే శంకరుఁ డంగీకరించిన సిద్ధాంతము.౪ కారణకార్యములకు మధ్యకాలములోఁగల భిన్నదశలన్నియుఁ బరిణామదశాభేదములు గలిగి యున్నవనియు, తార్కిక సూత్రిసంబంధములలో వాని నిముడ్చుటకవి నిశ్చలత్వము గలవిగా స్వీకరింపఁ బడుననియు నాతఁడు నిశ్చయించెను ౫. నిమిత్తధర్మము సమగ్రము కాదు. ఒకవిషయమునకుఁ బూర్వోత్తరదశలలో నిశ్చయింపవీలులేని సంఖ్యగల విషయములేర్పడుచున్నవి. ప్రతివిషయము దాని కారణావస్థయొక్క మూలరూపమును సూచించును. 'ఎ' 'బి' కిఁ గారణమనుట 'బి' స్వభావమును నిర్ణయించుటకాఁజాలదు. ౧. ప్రథమకారణము నూహించుట నియమభంగమే యగును; ఏలనఁ గాలమునకును, గారణకార్యపరంపరకును నాది యున్నదనుటే యగును. ప్రథమకారణమునకుఁ గారణమైననుండవలెను, లేదా, కారణకార్యవిధాన మసంగతమైనఁ గావలెను. కాని ప్రథమకారణము లేనిచోఁ గారణధర్మ మసంపూర్ణమగును. ప్రకృతియొక్క

---

(౪) కార్యకారణాభేదము లేక తాదాత్మ్యము లేక అనన్యత్వము. చూ॥ శం॥ భా॥ ౨,౧,౧౪;౧,౪,౧౪; గౌడపాదకారిక, 3,౧౫; సురేశ్వర వార్తికము, పు,౨౫౮.

(౫) కొందరు నేటి భౌతికశాస్త్రజ్ఞులు శక్తి, చలనము మున్నగు భావములను విసర్జించి, మూలకారణ నియతినెట్లును సూచించుట కిష్టపడక, తాము కనుగొన్న వానిని మాత్రీకరించి విడిచిపెట్టుచున్నారు.

(౧) పోల్సు: క్యాంబెల్: "కారణధర్మము నొక నిశ్చయనియమముగాఁ గదిసికొనుట మన అసమగ్రజ్ఞానమునే సూచించును." ఫిజిక్సు: ది ఎలిమెంట్సు, పు॥ ౬౭.

అవిచ్ఛిన్నతను విచ్ఛేదమొనర్చి, భూతభవిష్య ద్వర్తమానములుగా విభాగింపవలసివచ్చును. మన కవిచ్ఛిన్నప్రవాహరూపమున గోచరించుదాని నొక పరిచ్ఛిన్నపరంపరగాఁ జేయవలెను. మనము 'ఎ' యను విషయముతో నారంభించి, దాని తరువాత వచ్చు 'బి' తోఁ గారణసంబంధమును గల్పింపఁ జూతుము. కారణ ధర్మము చేయఁగల యుత్తమసేవ యేమనఁగా దృశ్యజాలము లన్యోన్యసంబంధములుగలిగి, తమలో నొకటి కాని పరమార్థముతో సంబంధము లేనివై యుండునంతవరకుఁ బరిణామక్రమము నదివివరించును. కారణధర్మ మొకసంబంధమనియుఁ సంబంధములన్నియుఁ బారమార్థికముగా నర్థవిహీనములనియుఁ గూడ మనమిచటఁ జేర్చవలెను. కారణధర్మము సంపూర్ణమైనదైనచో దానియనంతగమనమున కేఘట్టమందునువిరతియుండరాదు. కాని దానినతిక్రమించి మనము ప్రవర్తింపఁగలమని శ్రుతులు వక్కాణించుచున్నవి. ౧. గౌడపాదుని వాదమును శంకరుఁ

---

(౧) పెక్కు భాగములుగలిగి ద్రవ్యరూపములోనున్న కార్యమెట్లు కారణభాగములలో నుండఁగలదను సమస్యను శంకరుఁడు బయటఁబెట్టినాఁడు: అది అన్ని కారణాంశములలో నుండునా? కొన్నిటిలోనా? "అన్నిటిలో నుండునన్నచో, నన్ని భాగములు లేక కాలమున నింద్రియగోచరములు కానందున సమూచ్చయరూపము మనకు దృష్టముకాదు; లేక కొన్నిటిలోనుండునన్నచో, ననేకములయొక్క లక్షణము కొన్నిటివలనఁ దెలియదు. సముచ్చయములో నంతర్గత సముచ్చయములమూలమునఁ దెలియునందుమా, అదియు సాధ్యము కాదు. ఒక కత్తి దాని ఒరనంతను వ్యాపించియుండును, కత్తి భాగములు వేరు, ఒర భాగములు వేరు. దీనివలన ననవస్థాదోష ముదయించును. సముచ్చయరూపము ప్రతిభాగమున నున్నదందుమా, ప్రతిభాగ మొకసముచ్చయమగును. గోవుయొక్క విశిష్టలక్షణము ప్రతిగోవునందున్నట్లే, సముచ్చయరూపము

డంగీకరించినాఁడు. ౧. కారణకార్యము లభిన్నములగుటచే, గారణధర్మ పరిణామములు బాహ్యరూపములుమాత్రమే. కారణము బుద్ధినిర్మాణములో సహజాంశమైయుండుటచే, విష యములను పూర్వోత్తరసంబంధముచే నెఱుఁగుకారణనియ తిని మనముపయోగింపకతప్పదు. "కారణకార్యముల కభే దము సంగీకరించుటకు హేతువేమన మనబుద్ధి కారణకార్య సముచ్చయ ప్రభావమునకు వశమైయున్నది." ౨. దీనికి వ్యాఖ్య వ్రాయుచు నానందగిరి యిట్లుపలికినాఁడు: "కారణకార్యములు పరస్పరాధారభూతములగుటవలననే కారణకార్యముల కాధా రమును నిర్ణయించుటలేదు; మానసికమైన విజ్ఞానముకూడ నింకొక యాధారమైయున్నది. కారణకార్యము లొకటిలేనిదే రెండవది భావించుట కవకాశములేదను మానసిక విజ్ఞానమే యది." మనము కారణధర్మమున కవిరోధరూపమునుగల్పింప వలెనన్నచో దానిని మనము కారణకార్యైకత్వరూపము దాల్చువరకును సంస్కరింపవలెను. అట్టి రూపములో భౌతిక శాస్త్రమునకు, వ్యావహారికప్రయోజనములకు నిరర్థకమగును.

---

ప్రతిభాగమున నుండవచ్చునని చెప్పినచో, జాతిలక్షణములు ప్రతిగోవునందు గోచరించునుగాని, సముచ్చయరూపము ప్రతిభాగమునను గోచరించుటలేదు అట్లు గోచరించునెడల, గోవు కొమ్ములనుండియో, తోఁకనుండియో క్షీర ములు ప్రవింపవలెను. అట్టిదెన్నఁడును జరుగుటలేదు." కారణకార్యములను బంధించు సమవాయ సంబంధవిమర్శకు చూ॥ శం॥ భా॥ ౨,౧,౧౮.

(౧) చూ॥ శం॥ భా॥ కారిక ౪,౧౧.౨౦; ౪,౪౦ శం॥ భా॥ బృ ఆ॥ ఉ॥ ౨॰

(౨) శం॥ భా ౨,౧,౧౪. చూ॥ ఆనందగిరి.

కారణధర్మమును సక్రియముగాఁ గల్పించినచో నది నిరర్థక మగును; అది క్రియాసమర్థమైనచో నయథార్థమగును.

ప్రతి పరిచ్ఛిన్నవస్తువు, తన పరిచ్ఛిన్నతనేకాక, యిం కొక వస్తువుపై నాధారపడియుండు వైరుధ్యమునుగూడఁ బ్రద ర్శించును. ఏవిషయమును స్వయంనిర్ణయ సామర్థ్యమునుగాని, స్వసంపూర్ణతనుగాని కలిగియుండలేదు. ప్రతివస్తువు తన స్వరూ పమునుండి వేరురూపమునొంద యత్నించు లక్షణమును గలిగి యున్నది. ఏది పరిచ్ఛిన్నమో యది స్వయముగా ననిత్యము; కాని యది తన కతీతమగుస్థితి నొంద నువ్విళ్లూరుచున్నది. ఈ లక్షణ మొక్కటే ప్రపంచము మాయారూపమని నిరూపింప సమర్థమైనది. అస్థిరత, లోపము, నపరిపూర్ణతయు గలదగుటచే బరిణామము మాయ. పరిణామమనఁగా నన్యవస్తువగుట, మా ర్పునొందుట, వ్యతిరేకవైరుధ్యసంకలితమగుటయునై యున్నది. పరివర్తనాత్మకమగునదెల్ల విభాగసమన్వితము! ఈవిభాగములు బలవత్తరములై జీవితము నొక విభాగ విరోధరంగముగాఁ జేయును. పరివర్తన మొక నియమభంగమని ప్లేటోయును, నిజ స్వరూపసిద్ధిసాధన లక్షణమని ఆరిస్టోటలును దలంచిరి. కాని, యిరువురు యథార్థవస్తువు మార్పులేనిదనియే నిశ్చయించిరి. ఈశ్వరుఁడనఁగాఁ బ్రవృత్తి లేక క్రియాశక్తియని ఆరిస్టోటలు తలఁచినమాట నిజమేకాని, యీశ్వరప్రవృత్తి మార్పులేనిది; యీశ్వరక్రియాశక్తి నిష్క్రియాత్మకమైనదియనియే యాతఁడు చెప్పినాఁడు. శంకరుని దృష్టిలో నేది యథార్థమైనదో, యది మార్పులేనిది; స్వయంసమృద్ధమైనది; నిత్యశాంతి పరిపూర్ణమై

నదియునగుటచే దాని కెట్టి లోపముకాని, యవసరముకాని, మార్పుకాని, విరోధముకాని లేనిదై యున్నది. బ్రాడ్లే మతములో, "ఏది పూర్ణసత్యమో యది నిశ్చలమైనది." సత్యమాత్మ సమన్వయసిద్ధి గలదికావున, మనయనుభవమాత్మ విరుద్ధ లక్షణాన్వితమగుటచే సత్యమైనదికాదు. శంకరుని మాటలలో, సత్య మేకము, నద్వితీయమును; మన యనుభవము విభేదవైరుద్ధ్యసహితము. సత్య మింద్రియాతీతమైనది. సత్యము యుక్తమైన జ్ఞానవిషయమునుగాదు; ఏలన సత్యాన్వితముకాని జ్ఞానము ప్రామాణికమని యెంచఁబడదు. సత్యము పరిపూర్ణమైనది. మార్పులేనిది. సర్వానుభవ రూపములలో నేకమై, సర్వ దృశ్యముల కాధారభూతమైనది బాహ్యప్రపంచము నామరూపసంభరితమైం. స్వవిరుద్ధములగు దేశకాలనిమిత్త సంబంధ బద్ధమైనది. దేనినిఁ దీసికొనుఁడు; దాని కనంతమగు భూతచరిత్రయు, ననంతమగు భవిష్యద్దశయుఁగలిగి, యెచ్చట నెన్నఁడు నంతమొందని లక్షణమును బ్రదర్శించుచున్నది. ఇట్టి క్లేశకారణమగు తుదిలేని లక్షణముచే నసత్యమని వ్యక్తమగు ప్రపంచము నిత్యపరిపూర్ణవస్తువు నన్వేషింపుమని బోధించుచున్నది.

## ౨౬—బ్రహ్మపదార్థము.

"కాలము వేగముగా నడచుచున్నది; జీవితము వ్యయమగుచున్నది; అంతయు మారిపోవుచున్నది" దేనికిని నిలకడ లేదు; అంతయుఁ బ్రవాహరూపమున నున్నది. దీనినతిక్రమించి సత్యమును దెలియు కృషివలన నీ ప్రవాహమే సర్వమునుగాదని

(౧) శం॥భా॥ ౧, ౩, ౪౧.

స్పష్టపడుచున్నది. తార్కిక లౌకిక, నైతిక హేతువాదము లన్నియు నీ పరిచ్ఛిన్న జీవితమున కధికమైనదేదో యున్నదని సూచించుచున్నవి. పరిచ్ఛిన్న జీవితావధులను దాటిపోఁగోరు యత్నము పరిచ్ఛిన్నజీవితమే యథార్థమైనదికాదనిసూచించును. ఒక పరిపూర్ణసత్యమేదో యున్నదని మన మనస్సు నిర్ణయించుకొనక తప్పనిసరియగు చున్నది. డేకార్టే వాదించిన రీతిగా, మన పరిచ్ఛిన్నత నంగీకరించుటలో ననంతపరిపూర్ణతగలదేదోయున్న దని గర్భితార్థమై యున్నది.౧ నిజముగా నభావాత్మకనిర్ణయము కేవలమభావాత్మకముకాదు."ఎచట దేనిని మనమసత్యమన్నను సత్యమగు నదొకటున్నదని మనములో నుంచుకొనియే యట్లందుము."౨. భావాస్తిత్వమే యభావనిరసన హేతువు. ఏదియో లేదనుట కర్థమేదియో యున్నదనియే. రెంటిని గాదనుచే నాస్తికత యగును. సర్వవస్తువులు పరిణామవశము లను బౌద్ధ భావముతో శంకరుఁ డేకీభవించుచు, నీపరిణామ జగద్దర్భస్థమై యొక యింద్రియాతీతమగు సత్యమున్నదని నిశ్చయించెను. అన్యాధారముతో నిమిత్తములేని యొక పరమార్థ ముండితీర వలెను. సృష్టియంతయు మనఃకల్పితమే యనుకొన్నను, సర్వకల్పనామూలాధారమొకటి యుండును.3. కాల్పనిక వస్తువులైనను నిరాధారముగా వియన్మధ్యమున గాలిలో నెగురఁజాలవు. మనము సత్యమను కొనునదియు నొక కార్యమే

(౧) మెడిటేషన్సు, పు. ౮.

(౨) శం॥ భా॥ 3,౨,౨౨.

(3) సర్వకల్పనామూలత్వాత్. (3,౨,౨౨.)

యన్నచో నప్పుడు బయటకాని లోపలఁగాని యెట్టి నిజమైన వస్తువు నుండదు.౪. వేదములు ప్రకటించిన యనుభవజ్ఞాన మవినాశమగు సత్యమేదో యున్నదని మనకుఁ బ్రబలసాక్ష్యమిచ్చుచున్నది. "భారతీయు లెన్నఁడు వస్తుస్వరూప నిర్ణయప్రమాణబద్ధులు కార"ను౫ డ్యూసేన్ వాక్యము నిజముకాదు. శంకరాచార్యుని రచనలలో బ్రహ్మాస్తిత్వమును గూర్చి యెట్టితార్కిక ప్రామాణ్యము చూపఁబడిన నది నిస్సంశయముగాఁ బరమార్థ ప్రామాణ్యమే. పరిపూర్ణమగు పరమార్థము నొక దానిని మనము ప్రతిపాదింపక తప్పదు. లేకున్న మన జ్ఞానము, మన యనుభవము నంతయుఁ దుత్తునియలగును. సత్యనిరూపణ విధానములలో శంకరుఁ డపూర్వ ప్రతిభను, నవ్యతను జూపినాఁడు. మతవిద్వాంసులవలె నాతఁడీశ్వరలక్షణములఁ గూర్చిన చర్చతో నాతఁడారంభము చేయఁడు. ప్రపంచకర్త, లేక ప్రథమకారణము విషయములలో నాతఁ డుదాసీనతను మఱియు విమర్శాదృష్టిని గూడఁ బ్రదర్శించినాఁడు. బ్రహ్మానుభవసిద్ధియే యాతనికి మూలాధారము. అదియే అత్యుత్తమ మతానుభూతి. మానవుని సత్యసాక్షాత్కారమున కేదైన ప్రమాణము వలయుచో ననుభవసిద్ధియే యట్టి ప్రమాణము. సర్వజీవులకు బ్రహ్మప్రత్యక్షమే; సర్వజీవితాంతర్గతమగు సత్యమే బ్రహ్మపదార్థము. ఏదైనఁ దార్కికప్రమాణము కావలెనన్నచో, బ్రహ్మాస్తిత్వ ప్రతిపాదనా రహితమగు మానసిక కృషియంతయు దుర్బలమైన

(౪) శం॥ భా॥ ౨,౩,౭.

(౫) డ్యూసేన్ సిస్టమ్ ఆఫ్ వేదాంత, పు ౧౨౩.

దగుటచే నట్టిప్రమాణనిరూపణము సాధ్యము కాదని యాతఁడు వాదించును.

కారణలక్షణమును స్వభావమనియు లేక సామాన్యమనియు, కార్యము నవస్థ లేక విశేషమనియు శంకరుఁడు చెప్పినాఁడు.౧. "లోకమందు చేతనాచేతన రూపములగు ననేక సామాన్యములు విశేషములును గలవు. సోపానక్రమ పరంపరలోనున్న యీ సామాన్యములన్నియు మహాసామాన్యము, ప్రజ్ఞానఘనస్వరూపము నగు బ్రహ్మస్వభావములో నిమగ్నములైయున్నవి."౨. అందుచే నీ మహాసామాన్య స్వరూపము నెఱుఁగుటవలన దానియందే నిహితములైయున్న సర్వవిశేషములును దెలియును.3.

బ్రహ్మయే సత్యమనఁగా బాహ్యప్రపంచ దేశకాలగతమై యింద్రియగోచరమగు దానికి భిన్నమైనదని యర్థము౪. బ్రహ్మ యొకద్రవ్యముకాదు కాని సర్వమూలమని చెప్పఁబడెను.౧. బ్రహ్మము దేశగతముకాదు కాని సర్వదేశములందు వ్యాప్తమైయున్నది; ఏలన సర్వవస్తువు లందుండి దానిపై నాధార

(౧) శం॥ భా॥ ౨,౩,౯.

(౨) అనేకాహి విలక్షణా శ్చేతనాచేతనరూపాః సామాన్య విశేషాః; తేషాంపారంపర్యగత్యాగ ఏకస్మిన్ మహాసామాన్యే అంతర్భావః ప్రజ్ఞానఘనే.! (శం॥భా॥బృ॥ఆ॥ఉ॥ ౨,౪,౯.) పోల్చు: సర్వభావములకు మూలాధారమగునది శ్రేయోభావమని ప్లేటో.

(3) సామాన్యస్యగ్రహణే నైవతద్గతా విశేషాగృహీతాభవంతి. (శం॥ భా॥ బృ॥ ఆ॥ ఉ॥ ౨,౪,౭. (౪) శం॥భా॥ ౪,3,౧3.

(౧) వేదాంతపరిభాష॥ ౧.

పడియున్నవి. బ్రహ్మము కారణముకాదు; అయినచోఁ గాల సంబంధ బాంధవ్యము తేవలసివచ్చును.౨. దానిస్వభావ మని ర్వచనీయము; ఏలన మనము దానినిఁగూర్చి యేమిచెప్పిన నది యొక విశేషమగును. దానినిఁగూర్చి మనము పలుకవచ్చును గాని సంపూర్ణముగా వర్ణింపఁజాలము; దానినిగూర్చి యెట్టి తర్క-జ్ఞానమును సంపాదింపఁజాలము.3. పరిచ్ఛిన్న మానవుఁడు బ్రహ్మ నెఱుఁగఁగల్గినచో మనబుద్ధి యనంతమైనదైనఁ గావ లయును లేదా బ్రహ్మము పరిచ్ఛిన్నపదార్థమైనఁ గావలెను. "ఒక వస్తువును దెలుపుట కుపయోగించు ప్రతిశబ్దము నావస్తు వొకజాతికో, కర్మకో, గుణమునకో, సంబధరీతికో చెందినదని చెప్పును."౪. బ్రహ్మమునకు జాతిగుణకర్మ సంబంధలక్షణము లెవ్వియును లేవు. అది స్వజాతీయ విజాతీయ స్వగతభేదరహి తము౫. పత్రపుష్పఫలాది స్వగతభేద మొకచెట్టునకుఁ గలదు; ఇతర వృక్షములతో సమాన లక్షణములను, శిలాదు లతో భిన్నతను గలిగియున్నది.౬. బ్రహ్మకో సామ్య

(౨) పోల్చు:కార్యకారణవ్యతిరిక్తస్యాత్మనః సద్భావః...అశనాయాది సంసార ధర్మాతీతత్వమ్ విశేషః॥ (శం॥భా॥ 3,3,3౬.)

(3) శం॥భా॥ 3౨-33. (౪) శం॥గీ॥భా॥ ౧3-౧౨.

(౫) సజాతీయవిజాతీయ స్వగతభేదరహితమ్॥

(౬) పంచదశి॥౨-౨౦. రూడోల్ఫ ఒట్టో ది ఐడియా ఆఫ్ ది హోలీ ఇ. టి. పుట౫౬ ప్లేటో ఆత్మప్రపంచమును, బరిణామజగత్తునుదాటి 'నిశ్శ్రేయస' భావము నూహించినాఁడు. విషయీవిషయ భేదరహితము కు నిర్గుణసత్య స్వరూపమును ప్లాటినస్ భావించినాఁడు. "ఈనిర్గుణసత్యము సర్వవస్తువుల కాధారభూతమే కాని యేవస్తువునుగాదు. దానినిగూర్చి యేమియుఁజెప్పఁ

మేదియును లేదు; తద్భిన్నమును లేదు; స్వగతభేదమును లేదు. ఏలన నివియన్నియు వ్యావహారికభేదములు. సర్వవ్యావహారిక భావములకది వ్యతిరేకమగుటచే మనమెఱిగిన సర్వవిషయముల కది వ్యతిరేకరూపముగాఁ దెలియనగును. శంకరుఁడది ఏకమని కూడఁజెప్పుట కంగీకరింపక, అద్వైతమని వ్యతిరేకపదమునే వాడెను. అది పూర్తిగా నితరమైనదికాని, శూన్యతగాదు. ౧. ఉపయోగించిన శబ్దములన్నియు వ్యతిరేకములైనను, వానియర్థము భావాత్మకమే. అభావమనఁగా నేభావము లేదో చెప్పను. మన మనుభవప్రపంచమున కారోపించు భావత్వము దానికి లేదుగావున నభావమనఁదగును. అనఁగా నది శుద్ధశూన్యము కాదు; ఏలనభావముండుటచేతనే. అభావమున కర్థమున్నది. మనము వ్యావహారికజగత్తులో నుపయోగించు భావత్వాభావత్వలక్షణములు బ్రహ్మకు లేవని శంకరుఁడు నుపనిషత్తులును కూడఁజెప్పినవి.౨ ఏది బ్రహ్మముకాదో చెప్పనగునుగాని బ్రహ్మమేదో చెప్పఁజాలము. నిత్యానిత్య, పూర్ణాంశ, సగుణనిర్గుణ, పరిచ్ఛిన్నాపరిచ్ఛిన్న భావద్వంద్వముల కన్నిటికది యతీతము.

జాలము. ఏలన నది సర్వము నతిక్రమించు స్వభావముగలది."..."పరమక్రేమశ్శబ్దము నుచ్చరించినవెనుక నీవు దేనినిదానికిఁ జేర్చుతుము, ఏమిచేర్చిన నంత ముట్టుకు దానికి లోపమేయగును. దానికి జ్ఞానమున్నదని చెప్పినను నీవుదానిని విభాగించినవాఁడవగుదువు." క్లిమెంట్ ఆఫ్ అలెగ్జాండ్రియా, సత్యమేది కాదో చెప్పనగును. గాని యేదోచెప్పరాదను బాఁతసిద్ధిని సాధించెను.

(౧) వాఙ్మనసాతీతత్వమ్ నాభావాభిప్రాయమ్, శం॥భా॥ ౩,౨,౨౩.
(౨) శం॥భా॥ప్రశ్న॥ఉ॥ ౪,౧

ఏలన నివన్నియు వ్యావహారిక భావములు. పరిచ్ఛిన్న మైన దెల్లప్పు డపరిచ్ఛిన్న మైనదగుటకు యత్నించుచున్నది; కాని యపరిచ్ఛిన్న మైనదాని కేమియగుట కవసరము లేదు. అవసరమున్న చో నది పరిచ్ఛిన్న మైన దేయగును. దాని నపరిచ్ఛిన్న మైనదని మనమన్న చో నది పరిచ్ఛిన్నతాభావతుల్యమని భావింపరాదు. పరిచ్ఛిన్నత నతిక్రమించినఁగాని బ్రహ్మస్వభావము తెలియదు. అనాత్మ రూపోపాధిగతమైనఁగాని వ్యక్తిత్వమునకవకాశము లేదు. కావున బ్రహ్మమొక వ్యక్తిగాదు. పరాధారముతో నిమిత్తము లేని యర్థములో వ్యక్తిత్వశబ్దము నుపయోగింతు మేని, యది అపశబ్దప్రయోగ మేయగును. బ్రహ్మము నిర్గుణమనఁగా, నది వ్యావహారదృష్టికతీతమని యర్థము; ఏలన గుణములు ప్రకృతిసంభవములు; బ్రహ్మము తదతీతము. గుణములు వస్తులక్షణములు. పరమేశ్వరుఁడొక వస్తువుగాదు. వస్తువులు వచ్చిపోవుచుండును; కాని సత్యము సర్వవస్తుపరివర్తనాంతర్గతమైన నిత్యవస్తువు. అందుచేనది గుణాతీతమైనది. అనఁగా బ్రహ్మము శుద్ధశూన్యభావమనికాదు; అందుకొఱకే యుపనిషత్తు చెప్పినది; "నిర్గుణో గుణీ". బ్రహ్మము పారమార్థికజ్ఞానచైతన్యము; కాని బ్రహ్మ మెఱుఁగునదేదియును లేదు; వ్యవహారజ్ఞానమంతఃకరణవికారమే.(౧)

(౧) స్పైనోజా చెప్పినరీతిగా, "దైవబుద్ధికిని మానవబుద్ధికిని నామసామ్యమే తప్ప వేరెందును సామ్యములేదు. నక్షత్రరాశిలోని శ్వానమునకును భూమిపైఁదిరుగు కుక్కకును బోలిక చేయరాదు." (ఎథిక్స్, ౧,౧౭. స్కోలియమ్)

జ్ఞానము బ్రహ్మయొక్క స్వస్వరూపముకాని, గుణముకాదు.౨ అది నిత్యమైనదనఁగా, నెల్లప్పుడు మార్పులేకుండ పెర్మెనెడ్సు చెప్పినరీతిగా "నిశ్చలము"కాదు; ప్లేటో సోఫిస్టులో 3. నిరసించిన "మనస్సులేని స్థాణుసదృశము"ను గాదు. అది కాలమున కతీతము, కాలుష్యమున కతీతమునని యర్థము. దాని పరిపూర్ణతయు, సమృద్ధియుఁ గాలముతో సంబంధములేనివను నర్థములో నది నిత్యమైనది.౪. వస్తువులను, వానిగతులను బంధించు కాలక్రమమునకు బ్రహ్మము విషయములో నర్థములేదు. బ్రహ్మము నిత్యస్థితి; దానికిఁ గాలసంబంధము లర్థశూన్యములు దానికి భిన్నములైనవన్నియుఁ గావని వ్యతిరేకవాక్యములచేతనే దానినిఁ జెప్పవచ్చును. అది అసత్తుకాదు కనుక సత్తనియు, నచిత్తుకాదు కనుక చిత్తనియు,౫. దుఃఖస్వరూపముకాదు గనుక నానందమనియుఁ జెప్పవీలగును. అది యథార్థమగు స్థితిగలది కావున సత్యమైనది. దాని యస్తిత్వమన్యాధారకాంక్ష లేనిది కావున నిత్యము. అది బాహ్యమునుండి దేనినిఁ దనలోనికిఁదీసికొనదు; తీసికొన్నచో నాత్మలో ననాత్మ కవకాశము కలుగును.

---

(౨) సత్యమ్ జ్ఞానమనంతంబ్రహ్మ" యను వాక్యమునకు బ్రహ్మయే జ్ఞానమున కాధారమని రామానుజుఁడు నైయాయికులు నర్థముచెప్పిరి. పోల్చు: నిత్యమ్ విజ్ఞానమానందంబ్రహ్మ ఇత్యాదౌ విజ్ఞానపదేన జ్ఞానాశ్రయ ఏవోక్తః (విశ్వనాథుని సిద్ధాంతము ముక్తావళి, పు. ౪౯,)

(3) పు. ౨౪౯

(౪) పోల్చు: స్పినోజా. "నిత్యమగు దానికిఁ గాలసంబంధశబ్దములచే నిర్వచనము చేయఁజాలము." (ఎథిక్సు, ౫, ౧. స్కోలియమ్)

(౫) జడత్వరాహిత్యమ్.

అది యనాద్యనంతము. దాని కావిష్కృతిగాని, పరిణతిగాని, వికాసముగాని, మార్పుగాని లేదు; ఏలన నదెల్లప్పుడు సమాన మైనదే. బ్రహ్మపదార్థము భాగసమన్వితమైన పూర్ణవస్తువు కాదు; ఏలన నదియేకరసస్వరూపము.౧. అది యథార్థస్వరూపమేగాని, జగత్స్వభావము దానికి లేదు.౨. అట్టి పరమార్థము జడాత్మకముగాని పరిమాణము గలది కాని, భాగాన్వితము గాని కాదు. నిత్యము, లోపరహితమునగు నీపదార్థము చిత్స్వరూపము, అట్టి పరిపూర్ణతాసిద్ధిగల బ్రహ్మ ఆనందస్వరూపము కావలెను.3. బ్రహ్మానందములో మానుషానందము నొక లేశ మాత్రస్వరూపమే.౪.

సచ్చిదానంద విభుత్వలక్షణము లాత్మకును బ్రహ్మము నకును సమానములే. ఆత్మయే బ్రహ్మము. కేవల విషయా విషయములొకటే. మానవబుద్ధియొక్క దృక్పథమునను సరించి,ఆత్మయనఁగా యథార్థముకానిభావమే యైనట్లు, బ్రహ్మ మునుదోఁచును. పరబ్రహ్మనుండి సర్వలక్షణములును దీసివేసి నచో నది యించుమించుగా శూన్యావస్థగాఁ దోఁచవచ్చును. ఇట్టి గుణవిరహిత శూన్యతాస్వరూపమే, సర్వప్రపంచమూలా ధారమగుసత్యస్వరూపమని యెట్లుభావించఁగలము ? "అయి నచో బ్రహ్మ మభావరూపమా ? కాదు; ఏలనఁ గాల్పనిక

(౧) శం. భా. ౧,3,౧.
(౨) నిష్ప్రపంచసదాత్మకమ్. (శం. భా. ౨,౧,౧౬.)
(3) శం. భా. ౧,౧,౧౨; 3,3,౧౧-౧3; తై. ఉ. ౨,౭.
(౪) బృ. ఆ. ఉ. ౪,3,3౨.

వస్తువులకైన నేదో యాధారముండవలెను" ౫. శూన్యము కాని దేదైన నుండవలెనన్నచో బ్రహ్మయే నిత్యము కావలెను. బ్రహ్మ స్వస్వరూపములోఁ బరిపూర్ణమైనది; కాని మానవదృష్టి కది శూన్యముగాఁ దోఁచవచ్చును. "సూక్ష్మమునుగాదు స్థూలమునుగాదు; దీర్ఘమునుగాదు; హ్రస్వమునుగాదు." ౬. "అశ్రుతము, అమతము" ౭. నైన విభేద విరహితబ్రహ్మ స్వరూపము నిర్వికల్పకమైన శూన్యమనియు, దుఃఖకరమగు శుష్కనిశ యనియుఁ దోఁచవచ్చును. సర్వలక్షణవిరహితమగు నాత్మ యనాత్మసదృశమే యని హెగెల్ పలికినాఁడు. అట్టి భేదరహితమగు బ్రహ్మము జ్ఞాతవ్యముగాదని రామానుజుఁడు నైయాయికులు హెగెల్‌తో నేకీభవింతురు ౧. విమర్శకుల భావమును శంకరుఁ డెఱిఁగియుండియే యిట్లు చెప్పెను: "దేశ గుణ, గమన, ఫల భేదరహితమును, నద్వితీయ పరమాత్మస్వరూపమునగు పరబ్రహ్మము మందబుద్ధుల కనాత్మగాఁ దోఁచును." ౨ మన దృష్టికి బ్రహ్మము శుద్ధశూన్యముగాఁ దోఁచవచ్చును గాని,

(౫) "శూన్యమేవతర్హి తత్, న మిథ్యావికల్పస్య నిర్నిమిత్తత్వానుపపత్తేః। (శం. భా. గౌడపాదకారిక.)

(౬) బృ. ఆ. ఉ. 3, ౮, ౮. పోల్చు: ఆగస్టైన్." మనము దేవుఁ డేది కాఁడో చెప్పవచ్చును గాని దేవుఁడేదో చెప్పఁజాలము." (ట్రినిటీ. ౮, ౨.)

(౭) కఠ. ఉ. 3. ౧౫.

(౧) నిర్విషయస్య జ్ఞానత్వే మానాభావాత్. (విశ్వనాథ సిద్ధాంత ముక్తావళి పు॥ ౪౯.)

(౨) దిగ్దేశగుణగతి ఫలభేదశూన్యమ్‌హి పరమార్థసదద్వయమ్ బ్రహ్మ మందబుద్ధీనా మసదివ ప్రతిభాతి. (శం॥ భా॥ ఛాం॥ ఉ॥ ౮, ౧, ౧.)

యోగిదృష్టిలో సర్వసంపూర్ణమై కనప్పట్టును. ఈశ్వరుని సగుణ స్వరూపునిఁగాఁ జేయ నిష్టపడని మహోన్నత పథవిహారము చేయు భావగతి, లౌకికదృష్టికి దేవునిశూన్యముగాఁ జేయుచు న్నట్లు గోచరించును. కాని సర్వమతములకుఁ జెందిన ద్రష్టలగు మహర్షులు నిర్గుణబ్రహ్మకు బుద్ధి కల్పితగుణారోపణము చేయుట కిచ్చగింపలేదు. ౩. ప్రాకృతమానవకోటి నిమిత్తము శ్రుతి బ్రహ్మమును సగుణముగా౪ వర్ణించినది; ఏలన "శ్రుతియిట్లు భావించెను: బ్రహ్మాస్తిత్వమునుగూర్చి మొదట నమ్మి ప్రాకృతజను లాస్తికమార్గమునుబట్టినచోఁ దరువాతవారిని క్రమముగా బ్రహ్మస్వరూపజ్ఞానమును గ్రహించునట్లుచేసెదను."౫. శంకరుఁడుపనిషద్భాష్యకారుఁడుగా బ్రహ్మయొక్క సగుణ నిర్గుణ లక్షణములను సమన్వయింపవలసి వచ్చినది.౧. బ్రహ్మ

(౩) పోల్చు. రూడోల్ఫ్ ఒట్టో: "సత్యమునుగూర్చిన తత్త్వము భక్తిభావములేని శూన్యవాదము కాదు. అందుత్తమోత్తమమైన భక్తిభావ మిమిడియున్నది. వ్యతిరేకపదవాచ్యమైనది నిజముగా నిర్వచనీయమైన పరమసత్యమే. ఇందు దేదీప్యమానమగు మతానుభవ రహస్యమిమిడియున్నది." (ది ఐడియా ఆఫ్ ది హోలీ. పు॥ ౧౮౯)

(౪) చాం॥ ఉ॥ ౧, ౬, ౬; ౩, ౧౪, ౨.

(౫) సన్మార్గస్థా స్తావద్భవంతు, తతః శనైః పరమార్థసదపి గ్రాహయిష్యామీతి మన్యతే శ్రుతిః॥ (ఛాం॥ఉ॥ ౮, ౧,౧) సదానందుఁడు తన వేదాంతసారమందు, అధ్యారోపాపవాదమును వర్ణించి, మనము బ్రహ్మకుఁ గొన్ని లక్షణములను మొదట నారోపించి, తరువాత వానిని నిరాకరింతుము.

చూ: శం॥గీ॥భా॥ ౧౩, ౧౪,

(౧) శం॥భా॥ ౧, ౧, ౧-౩౧; ౧, ౨; ౧, ౨, ౧-౧౭; ౨౨-౨౫; ౩౯-౪౩; ౧, ౪, ౧౪-౨౨; ౩, ౩, ౩౫-౩౬. చూ: డ్యూసేన్.

యొక్క వ్యాప్తి వర్ణనములనుగూర్చి వ్యాఖ్యవ్రాయుచు నితరుల కె[2]. భావముల నందఁజేయుటకు నుపాసనాది ప్రయోజనముల కొఱకును[3]. నవి యుద్దేశింపఁబడినవని శంకరుఁడు రచించెను. మనకు సంబంధించిన యీశ్వరుఁడును జగత్కర్తయుఁ బరిపాలకుఁడు నగు వానిమూలమున బ్రహ్మ స్వస్వరూపమునకు మన భావము క్రమగతి ప్రసరించును. బ్రహ్మ నిర్గుణమేయైనను, సచ్చిదానందములు దాని స్వరూపలక్షణము లనియు, సృష్టికర్తృత్వాదికములు తటస్థలక్షణములనియుఁ జెప్పవచ్చును.[5] బ్రహ్మకు సచ్చిదానంద[4] నిర్వచనము సపరిపూర్ణమేయని శంకరుఁడెఱుగును; కాని అంతకంటె నుత్తమమగునిర్వచన మసాధ్యమని యాతని భావము. తనయొక్క పరిమితిని దెలిసికొను సామర్థ్యము మానవ మానసమున కున్నది. బ్రహ్మానుభవమువలననే బ్రహ్మజ్ఞానము లభింపఁగలదు. బ్రహ్మవేత్తయే బ్రహ్మస్వభావమును గూర్చిన ప్రతిప్రశ్నకు మౌనముచేఁగాని, నేతివాక్యములచేఁ గాని సమాధానమిచ్చును. విద్య, బ్రహ్మయే సచ్చిదానందస్వరూపమనియు స్వయంసమృద్ధమనియుఁ జెప్పి,

---

(౨) ఉపలబ్ధ్యర్థమ్.

(౩) ఉపాసనార్థమ్॥ శం॥భా॥ఛాం॥ఉ॥ ౮,౧,౧; శం॥భా॥౧,౧,౨౦, ౨౪, ౩౧; ౧, ౨, ౧౧, ౧౪; ౩, ౨, ౧౨, ౩౩.

(౪) ఒక కాకి నడికొప్పపైఁ గూర్చుండియున్న యిల్లు దేవదత్తుని దని చెప్పినప్పుడు మనమాయింటి ప్రధానలక్షణములను గాక, ఒకతటస్థలక్షణమును మాత్రమే చెప్పితిమి. అది దేవదత్తుని యింటి పరోక్షవర్ణనము. సృష్టికర, సృష్టికారణమని బ్రహ్మనుగూర్చి మనము చేయువర్ణన మట్టిదే.

(౫) నృసింహతాపని. ఉపనిషత్తు.

మన కత్యుత్తమ బ్రహ్మభావము నొసఁగఁగలదు. అవిద్య లేక అపరవిద్య,సృష్టికర్తృత్వము,పాలకత్వము మున్నగు సంబంధలక్షణములు బ్రహ్మ కారోపించునుగ. అందుచే బ్రహ్మనుగూర్చి పరాపరవిద్యలు రెండున్నవి. "అవిద్యాకల్పితనామరూపాది భేదములను విసర్జించి,సూక్ష్మస్థూలాదిది లక్షణవిరహితమైనదే బ్రహ్మమను వ్యతిరేక పదములచే సూచింపఁబడునది పరవిద్య. కాని యాబ్రహ్మపదార్థమునే, ఉపాసనాద్యవసర నిమిత్తము భేదలక్షణమును గలదిగాఁ జెప్పునదపరవిద్య"3. బ్రహ్మమే తర్కకల్పితములగు 'మూసల'లోఁ గరగించి పోసిన నీశ్వరుఁడగును. ద్రవ్యగుణ భేదవిరహితమైన పూర్ణానుభవదృష్టిలో నీశ్వరభావము త్తమమైనది కాదు. లౌకికజ్ఞానదృష్టిలో నీశ్వరభావముకంటె శ్రేష్ఠతరమగు సత్యస్వరూపము సాధ్యముకాదు. సగుణబ్రహ్మభావము జిజ్ఞాసువుయొక్క భావోద్రేకప్రతిబింబము కాని, వాతోపహతమై చరించు బుద్బుదముకాని కాదు. మానవ మానసమునకు నిత్యమైన బ్రహ్మస్వరూప మీసగుణబ్రహ్మ

(౧) రత్నప్రభ॥ "విద్యావిషయో జ్ఞేయమ్ నిర్గుణమ్ సత్యమ్, అవిద్యావిషయ ఉపాస్యమ్ సగుణమ్ కల్పితమ్॥" (౧, ౧, ౧౧.) పోల్చు: ప్లాటినస్ "సత్యమును మనము శ్రేయోరూపమని పలికినప్పు డదియొక గుణమును గలిగియున్నదని యర్థముకాదు; సర్వజీవకోటి కది లక్ష్యమైనదనియే భావము. అది భావాత్మకమని చెప్పుట కర్థ మేమనఁగా, నది యభావవస్తు జాలములోనిది కాదనియే. అది భావాతీతమైనది."

(౨) బృ. ఆ. ఉ. 3, ౮, ౮.

(3) శం॥భా॥ ౧, 3౧; ౪, 3, ౧౪.

జ్ఞానకాంతి మూలముననే గోచరించును.౮. సిద్ధాంతముయొక్క స్వగతసామరస్యసిద్ధి నిమిత్తము బ్రహ్మమును, బ్రాడ్లేవలెనే, "సగుణముకాని, ధార్మికముగాని, సుందరముకాని, సత్యము కాని కాద"ను వ్యతిరేకపదములచేతనే వర్ణింపవలసి యున్నది. బ్రహ్మమునకు మన యున్నతానుభవములతో నెట్టిసంబంధము లేదనియు, లేక వానియెడ నుదాసీనభావముగల దగుచున్న దనియు మనకుఁ దేలిన సారాంశము. నిశితమగు నిట్టి తత్త్వమును స్థాపించు వ్యతిరేకసూత్రముల వలన మన సమున్నతానుభవములు వ్యర్థములగుటచే మన మతావసరముల నిమిత్తము వేఱొకదృక్పథమును మన ముగ్గడింపవలసి యున్నది.

(౮) డ్యూసేన్ సిస్టమ్ ఆఫ్ వేదాంత॥ పు. ౧౦౩; పోల్చు; ఎక్హార్టు: ఇతఁడగ్రాహ్యమైన దైవస్వరూపమునకును, సృష్టికర్తయగు దేవుని స్వరూపమునకును భేదమును సూచించెను. "స్వస్వరూపములో నాతఁడీశ్వరుఁడు కాఁడు; మానవునిదృష్టిలో నీశ్వరుఁడే. కాలమున కతీతమైన యేకత్వమే నాస్వరూపము. దానికి వృద్ధిక్షయములులేవు, ఆస్థితి యీశ్వరున కతీతమైనది. దానినే నేను గోరుదును." ప్లాటినస్ చెప్పినాఁడు. "అసలు పూర్ణమైనసత్యముయొక్క ప్రతిబింబమే మనబుద్ధికి గోచరించునది. దానిని గ్రహించుటకు బుద్ధియే నిత్యమును యత్నించుచుండును. సత్పదార్థమున కెట్టి కోర్కెయు నెట్టిప్రయత్నము నవసరములేదు." పోల్చు: బ్రాడ్లే: "పూర్ణసత్పదార్థమును గ్రహించుటకుఁ బరిచ్ఛిన్నమానవుల కసాధ్యము. కాని కొలఁదిగనో, గొప్పగనో, దానియొక్క స్వభావమునుగూర్చి తెలిసికొనుట కవకాశమున్నది. పరమార్థమునుగూర్చి యింతకంటె నెఱుఁగనవసరములేదు. కాని యిట్టి జ్ఞాన మనుభవసిద్ధి కాఁజాలదు. మానవ పరిచ్ఛిన్నబుద్ధికి గల యవధులలో నిది సత్యమైనదే." (సత్యము; ఆభాసము, పు. ౧౯౯.)

కాని బ్రహ్మ సగుణమును నిర్గుణమును గూడఁ గాజాలదు.[1] ఆకృతిద్వయముగల సత్యములేక రెండురీతులలో ననుభవమున కవకాశమిచ్చు సత్యము పరమసత్యము కానేరదు. పూర్ణపరమాత్మానుభవముతో నీద్వైతము నశించును. మనము బాహ్యమునుండి చూచునప్పు డాపరబ్రహ్మకు భిన్నాకృతులున్నవని గోచరించును. బ్రహ్మ స్వరూపములో నెట్టిగుణరూపములు లేవు. రూపవ్యక్తిత్వలక్షణములకు విద్యాప్రపంచములో నర్థము లున్నవి. పరబ్రహ్మమునందీ విభేదము లన్నియు సహజముగా విలయమందును. వ్యతిరేకముల ననంతముగా సమన్వయింపఁ జేయుచు స్థాపింపవలయు నొక భావనిర్మాణముగా బ్రహ్మమును దలఁపరాదు.[3] పరమార్థము తత్త్వశాస్త్ర కల్పితమగు వస్తువు కాదు. అది నిత్యాస్తిత్వముగల సత్యము. పరమాత్మనుగూర్చి బుద్ధిచేఁ దలపోయు సర్వయత్నములను శంకరుఁడు నిరసించును. మనబుద్ధితో దాని నూహింప యత్నింతుమా, వెంటనే పరమాత్మయు వ్యావహారిక ప్రపంచములో నొక భాగమైపోవును.

---

౧. పోల్చు; బ్రాడ్లే; (సత్యము; పరమార్థము. పు ౪౩౧.)

౨. "ఒకేవస్తువు నామరూపాదిభేదగత మగుటయుఁ గాకుండుటయు స్వవిరోధలక్షణమగును.... ఉపాధిసంబంధముచే నొకవస్తువు స్వభావము మారి వేరొకస్వభావమును బొందదు; ఏరూపమును బ్రదర్శించినను, బ్రహ్మపదార్థము భేదరహితమని యెంచవలెను." (డ్యూసేన్ సిస్టమ్ ఆఫ్ వేదాంత పు. ౧౦౨-౧౦౩)

3. సరియగు తర్కము ననుసరించి, బ్రాడ్లే యిట్టినిర్ణయమునకే రావలసియున్నను, నాతఁడు కొన్ని పరమార్థమునుగూర్చిన సందేహములచే స్థిరచిత్తుఁడు కాలేకపోయెను. యధార్థముగాఁ జెప్పవలయుచోఁ బరమాత్మయు

### ౩౭—ఈశ్వరుడు లేక సగుణబ్రహ్మ

ఈశ్వరుఁడనఁగాఁ బరమపురుషునిఁగా గ్రహింపఁదగిన సగుణ బ్రహ్మరూపమని శంకరు నభిప్రాయము. ఈశ్వరాస్తిత్వమునుగూర్చిన ప్రశ్న నిరర్థకప్రశ్నయని శంకరుఁడు చెప్పినాఁడు. ఈశ్వరుఁడున్నచో నాతఁ డితరవస్తువులవలెనే యుండును; అనఁగా నాతఁ డగణితములగు వస్తువులలో నొకఁడై, వానిలో నొకదానికొకటి భిన్నములైనట్లే, యాతఁడు వానికి భిన్నుఁడై యుండవలెను; లేదా, యాతఁడు సర్వవస్తురూపుఁడైన విరాట్పురుషుఁడనవలెను; దీనికి నాస్తికతకును విశేష భేదముండదు. అస్తికత్వభావములో నీశ్వరునిగూర్చిన ప్రశ్నను గల్పించుటవలన, దీనినిఁ బరిష్కరించు నవకాశములన్నియు ముందే తొలగింపఁబడినవి. సక్రమహేతువాదము సత్యమును

---

భావాభావలక్షణము లెవ్వియులేనిది; మనము దానిని దర్కముచేఁ దెలిసికొనఁజాలము; సగుణము నిర్గుణమును దెలుపఁజాలదు; ఒకయవధినుండి యింకొకయవధికిఁబోయి తెలిసికొను మనతార్కికబుద్ధి నిరవధికబ్రహ్మమును గ్రహింపఁజాలదు. మనము మనపరిచ్ఛిన్నత నతిక్రమించునపుడు, సగుణలక్షణము లన్నియు నేపరమాత్మలో నంతరించిపోవునో యాపరమాత్మయే మిగులును. రామానుజునిభావములో విపులీకృతమైన మానవభావమే దైవత్వము. మానవదైవప్రజ్ఞలకు భేదమువ్యాప్తిలోనున్నదేకాని వస్తుతఃలేదు. మానవబుద్ధి కొన్ని సంబంధములనే గ్రహింపఁగా దైవభావ మన్నిసంబంధములను గ్రహించును. కాని శంకరు నభిప్రాయము దీనికి భిన్నమైనది. సగుణసంబంధములలో మనము తగుల్కొన్నచో వానికంతములేదు. సగుణసంబంధము లనంతవిభాగములుగలవై, అసంఖ్యాకసంయోగములు గలవగుటచే వీని కేకత్వముఘటించుట దుస్తరము. మిథ్యావిషయము లెన్నికలిసినను యథార్థవస్తువుకాదు: పరమార్థము వీనికతీతము; సత్యము బుద్ధికతీతము.

స్థాపించు శక్తిగలదైనచో, మనమెన్నఁడో యీసమస్యను బరిష్కరించియుందుము. సహేతుకములని చెప్పుకొనుచుఁ బరస్పర విరుద్ధభావములుగల మతశాఖ లనేకములున్న విషయము జగద్విదితమే. ఈశ్వరాస్తిత్వమునుగూర్చి చూపఁబడిన ప్రమాణమును దీసికొని, యిటీవల క్యాంటువలెనే, వానిలోపములను శంకరుఁడు వ్యక్తీకరించినాఁడు.

పరిపూర్ణతగల కర్తయొకఁ డున్నాఁడనియుఁ దదితరమంతయు నాతనికి విషయమనియు నూహించుటే తర్కలక్ష్యము. సత్యమొక సక్రియ సమన్వయరూపమనఁగా నీశ్వరానుభవమే యగును. విషయము లన్యోన్యసంబంధముగల యొకవ్యవస్థకుఁ జెందినవని ప్రాకృతదృష్టియు, భౌతికశాస్త్రదృష్టియు నొప్పియున్నది; అనుభవము దీనిని సమర్థించుచున్నదిగాని, పూర్తిగా గ్రహింపఁజాలకున్నది. ఏలన, మనయనుభవములోఁ జేరనిది జగత్తులోఁ జాలఁగలదు. మనకుఁ జాలజ్ఞానము కలదని తలంతుము గాని, యీపరిమిత జగత్తునందైనను మనకుఁ దెలిసినదసమగ్రమే. సత్యమును సమగ్రముగా గ్రహించినప్పుడే దేవుఁడున్నాఁడు; ఆతఁడే సృష్టికర్తయను ప్రతిపాదన మనము చేయుట కర్హతగల్గును. జగత్తును సమగ్రముగా గ్రహించు సామర్థ్యము మనబుద్ధికి లేదు; పరిశుద్ధసత్తునకు విశ్రాంతిలేని యనంతప్రవృత్తికి సమన్వయముచేకూర్చు శక్తి మానవాతీతమైనది. ౧. మనయనుభవములోని క్లిష్టతలను దొలగించి,

(౧) పోల్చు: "దేవుఁడుమాత్రము దూరాలోచన చేయుటకై, మిక్కిలియున్నతపథము నాశ్రయించినాఁడు."

యెంతనూఁ క్షీకరించి, యేకవిషయక్రమముగా నొకప్రకృతి, పురుషుఁడు, కర్త యని మనము చెప్పుకొన్నను, మనము దాని గమనమునకుఁ జరిత్రకు బాహ్యసాక్షులమే యగుదుము. ప్రపంచము మన మానసికాన్వేషణమున కతీతముకానిదై, అది యెచట నెట్లుపుట్టినదో, యెందుఁజేరునో, దాని స్వరూపలక్ష్యములను మనము దెలిసికొనఁగల్గినచో, మనమప్పుడు పరిచ్ఛిన్నులము గాము; అందుచే నప్పుడు మనము పరిచ్ఛిన్నమైనదేదియని కోరము. విషయములన్నియు నొకేవ్యవస్థకుఁజెంది, యీశ్వరచిత్తమునే ప్రదర్శించునను తర్క-విశ్వాసమొక భావము మాత్రమేయగును. సృష్టిక్రమవాదము కారణనియతి నుపయోగించును. ఇది వ్యవహారజగద్వివరణమునకుఁ గూడ సమర్థము కాదు; మనము వ్యావహారికజగత్తుకుఁ బరమార్థముతో సంబంధముగలిపి, పరమార్థమే బాహ్యజగద్రూపమున వ్యక్తమగుచున్నదనిచెప్పుటకుఁగూడ నీవాదము నిరర్థకము. బాహ్యప్రపంచములోని భిన్నదృశ్యపరంపర లన్యోన్యకారణములు కాఁజాలవు. ఈదృశ్యప్రపంచమునందొక కారణరహితకారణమున్నదని యంగీకరింపఁ జాలము. ఈజగత్సంసారమున కాదియున్నదనుట స్వవిరుద్ధవాదమగును. ప్రథమకారణమునకై వెదకుట, కాలగర్భమునఁ గాలాధారమగు నవస్థనన్వేషించుట వంటిదే యగును. సంసారమనఁగా నాది లేనిదనియే యర్థము. పరిచ్ఛిన్నతను ద్రోసిపుచ్చినచో నపరిచ్ఛిన్నత సిద్ధించు ననుభావము కూడ హేతునిరూపణమును గోరును. పరిణామజగత్తునకే అన్వయించు కారణధర్మమును పరమార్థమున కన్వయించినచో,

మనము పరమార్థము నొక జ్ఞానవిషయము నొనర్చి,పరమార్థ మనగా దురభిప్రాయపడుచుంటి మన్నమాట; దేనిని ప్రపంచ కారణమని మనము నిర్ణయించు చున్నామో అదియు మనయను భవజగత్తు లోనిదే యని మఱువరాదు. ప్రతికార్యమున కొక కారణముండు ననునది సర్వసామాన్య ధర్మమని మన మంగీక రించినను,(౧) పరిచ్ఛిన్నజగత్కర్త యొక పరిచ్ఛిన్నుఁడే యనియే మన మనుమానింపవలసి వచ్చును. ప్రథమకారణము దాని కార్యములైన విషయముల కనుగుణమైనదే కావలయును;ఏలన రెంటికిఁ గార్యకారణసంబంధ మున్నదని చెప్పఁబడినది. జగ త్కారణ మీశ్వరుఁడైనచో, నాతఁడు దేశకాల వ్యవస్థాంతర్గ తుఁడై, విశేషముగా విపులీకృత మానవరూపియై, మానవుని వలెనే మానసదేహోపకరణములచే నిర్వచింపఁదగు విజ్ఞానము గల వాఁడగును. అట్టి యీశ్వరుఁడున్నచో మన విజ్ఞానమెంత వికసించుట కవకాశమున్నను, దానితో నాతని స్వరూపస్వభా వములను నిర్ణయింపఁజాలము. కాని యట్టి యీశ్వరుఁడు మాన వునితోఁ దుల్యములగు నుపకరణములనే యుపయోగించు వాఁ డగును గావున నపరిచ్ఛిన్నుఁడు గాఁడు; అనంతశక్తి సంపన్నుఁ డును గాఁడు.

జగన్నిర్మాణము మానవు నాత్మాభ్యుదయమున కను గుణముగాఁ గల్పించినకారణముచే నీశ్వరుని కృపతోఁ గూడిన నైపుణ్యము వ్యక్తమగుచున్నదను నైతికవాదముకూడ నెట్టి సంతృప్తి నొసఁగఁజాలదు. ఎట్లు తర్కించి చూచినను, జగత్తు

(౧) యత్కార్యమ్ తత్సకర్తృకమ్.

లోని పుణ్యపాపములబాధ్యత దేవునినెత్తిపైఁబడును.౧. లోకము లోని దోషముల కీశ్వరకర్తృత్వము కారణముగాదని సమర్థించుటకు పర్షియా పౌరాణికగాథలలోవలె, దోషకారకుఁడు సైతానొకఁ డున్నాఁడని చెప్పవలసివచ్చును. అప్పుడు దేవుని యేకత్వముస్థానములో దైవరాక్షస (సైతాను) ద్వైతమును జొప్పించినవార మగుదుము. ఆత్మ దేవునిలో నొకభాగమైనచో దేవుఁడాత్మయొక్క దుఃఖమునకు భాగస్వామి కావలసియుండును; ఏలన, దేహములో నొకయంగము బాధపడినచో దేహమంతయు బాధపడును. అందుచే వ్యక్తులబాధలకన్న దేవునిబాధ లెక్కువగుటచే, మనము కొలఁది బాధలతోఁ గాలక్షేపము చేయుటే మంచిదికాని, లోకుల బాధలన్నిటిని భరింపవలసిన ద్వైతమును గోరుట తెలివితక్కువయగును.

పరిపూర్ణతగల యీశ్వరుని సంతృప్తికై లోకసృష్టి యవసరములేదు. ఈశ్వరుని విలాసముకొఱకు సృష్టి యవసరమందుమా, అతఁడు నొక సంసారియే యగును. రూపము, పరిపూర్ణత మున్నగు గుణము లీశ్వరుని కున్నవన్నచో, నాతని

(౧) ఒక హీబ్రూప్రవక్త చెప్పినరీతిగా "కాంతిని నేను గల్పించి చీకటిని, కాంతిని సృజించి యశాంతిని జనింపఁజేయుచు, నిట్టికార్యము లన్నిటిని నేనే చేయుచున్నాను." మున్నగు భావముల ధోరణి యుపనిషత్తులలోఁ గూడఁ గానవగును. "ఎవరి కాతఁ డూర్ధ్వలోకముల నీయఁదలఁచెనో వారిచేఁ బుణ్యకర్మలను; ఎవరి కాతఁ డధోలోకముల నీయఁదలఁచెనో, వారిచేఁ బాపకర్మలను జేయించును. ఆతఁడు జగద్రక్షకుఁడు, పరిపాలకుఁడు సర్వాధిపతియునై యున్నాఁడు." (కౌషీతకీ. ఉ. 3, ౮.)

నిర్గుణతత్త్వముతో నివియెట్లు జతపడునో చెప్పవలసి యుండును నిర్గుణబ్రహ్మకు గుణారోపణము చేయుట తర్కమున కసాధ్య విషయము.

ఈశ్వరాస్తిత్వమును గూర్చి యిట్టినిరర్థక ప్రమాణముల వలన బాహ్యప్రపంచములో బయలుదేరిన యీప్రశ్నకు యథార్థమగు నౌచిత్యము లేదని శంకరుఁడు చెప్పినాఁడు. మన ప్రపంచము యొక్క అసమగ్రతను మనము గుర్తించినచోఁ బ్రపంచమును గూర్చిన ప్రశ్నయు దాని సమాధానము నీప్రపంచము లోని తర్కయుక్తులేకాని, సత్యమునకు సంబంధించినవి కావు. అందుచేఁ దర్కయుక్తులను నిరసించు టీశ్వరాస్తిత్వమును నిరసించుటకాదు. సగుణబ్రహ్మ రూపమగు నీశ్వరాస్తిత్వమును నిరూపించుట కేతర్కవాదములును పనికిరావని శంకరుని భావము. ఈతర్కప్రమాణములు చూపునదే మన మీశ్వరుఁ డుండుట కవకాశమున్నదని మాత్రమే ఈశ్వరాస్తిత్వము మన బుద్ధి మనశ్శక్తుల కతీతమగు విషయము.౧ శ్రుతులలో వర్ణింపఁ బడిన ద్రష్టలగుమహాత్ముల అంతర్దృష్టి మనకుఁ గలిగినచో నప్పుడే యీశ్వరాస్తిత్వము నిశ్చయమని యనుభూతమగును. శంకరుని తత్త్వము ననుసరించి యీశ్వరాస్తిత్వము స్వతఃప్రమాణయుక్తమును గాదు, తార్కికసత్యమునుగాదు, వ్యావహారికప్రయోజన

(౧) పోల్చు: ష్వైట్జర్: "ప్రపంచము నున్నదున్నట్లుగాఁ జూసి కొన్నచో, మానవజాతియొక్క లక్ష్యములకుఁ బ్రవృత్తులకు నుపోద్ఘాతార్థ మును జెప్పుట దుస్సాధ్యము. మన కర్మలకు వెనుక నెట్టి పరమోద్దేశము నున్నదని లేశమాత్రముగానైన నిరూపింపఁజాలము." (ఉపోద్ఘాతము. ౧౨. నాగరికత: ధర్మము. ౨.)

సిద్ధికై చేయబడిన యొకప్రతిపాదన మాత్రమే. దీనికాధారము శ్రుతియే౨. ఈశ్వరుడు సర్వజ్ఞుఁడు, సర్వశక్తిసమన్వితుఁడు. ఆతఁడు ప్రకృతికాత్మయు, సృష్టికి మూలధర్మమును, జగచ్చలనశక్తియుఁ జైతన్యదాతయు, సర్వవస్తుజీవకారణమునని చెప్పవచ్చును. శ్రుతివాక్యములు చెప్పునది హేతువిరుద్ధముగా నుండనవసరములేదు. శ్రుతి నంగీకరించుటయనఁగా, ఁదగినన్ని నిదర్శనములు లేకున్నను వ్యతిరేకనిదర్శనములు లేని విశ్వాసము నంగీకరించుటయే. ప్రపంచమునుగూర్చి, మనకు మనము కల్పించుకొను తార్కికనిర్ణయమునకొక ఘట్టమును జేయుసరికి మన మవసరము. అనుభవసిద్ధిగలుగులోపున మనకు శ్రుతిప్రమాణ మవసరము. ఈశ్వరుని సృష్టి కర్తృత్వ విషయములో మనజ్ఞానమునకు శ్రుతిప్రమాణమొక్కటే యాధారము. ౧. శ్రుతి యిట్లుచెప్పినది: "నామ రూపములు

---

(౨) ఐరోపాఖండములోఁ దార్కికప్రమాణ వ్యర్థతను నిరూపించినవారిలో క్యాంటు తత్త్వవేత్తయే ప్రథముఁడని పరిగణింపఁబడుచున్నను, ప్లేటో యీవిషయమును గుర్తించెనని చెప్పుట, ధర్మము. "అందుచే నీ ప్రపంచకర్తయుఁ దండ్రియునైన యీశ్వరుని గ్రహించి, మానవుల కర్థమగు భాషలోఁ బ్రకటించుట సాధ్యమైన విషయముకాదు."(టిమాయి పు ౨౮సి) పోల్చు: బిషప్ గోర్: "మానవుని తర్కమెన్నఁడు నితరసాధనములతో నిమిత్తములేకుండ సృష్టికర్తయగు నీశ్వరునిఁ దెలిసికొనఁగలిగెనని నే నంగీకరింపఁజాలను" (దేవునియందు విశ్వాసము. పు. ౧౫౨.) అందుచే శ్రుతిప్రమాణమే శరణ్యమని యాతఁడుచెప్పెను. అట్లే సెయింటిథామస్ ఎక్వినాస్ చెప్పెను. పోల్చు: శం॥భా॥ కేన. ఉ॥ ౧, ౪.

(౧) ఛా॥ఉ॥ ౧, ౧, 3.

గలిగి, యనేకకర్తలు భోక్తలు, కర్మఫలములతోఁగూడి, దేశ కాలనిమిత్తనూత్రిములచే మానవమానసమున కూహించుట కైన శక్యముకానివిధమునఁ గల్పితమైన ప్రపంచకారణము సర్వజ్ఞత్వము సర్వశక్తియుఁగలిగిన సగుణబ్రహ్మమే (ఈశ్వరుఁడే)." ౨. తాత్త్విక ధార్మిక పరిపూర్ణతలన్నియు నట్టి యీశ్వరుని గుణములు. ఆతఁడు సర్వదోషములకతీతుఁడు. ౩. ఆతఁడు బాహ్యాభ్యంతర జగత్తుల కంతర్యామియు, సూర్యునందు నేత్రమునందుఁ బ్రకాశించువాఁడు నైయున్నాఁడు. ౪. ఆతఁడే విశ్వసృష్టి స్థితి లయకర్త. ౫.

శ్రుతి ప్రమాణసిద్ధమని యీశ్వరాస్తిత్వమును మనము ఋజువుచేసినవెనుక, దానిని హేతువాదమున కనుగుణమైనదే యని నిరూపించుట కష్టముగాదని చూప శంకరుఁడు యత్నించినాఁడు. మనము కార్యమునే చూచుచున్నాము; కాని ఈశ్వరుఁడే ప్రపంచకారణమో, వేఱొకటియో మనము నిర్ణయింపఁజాలము;ఏలన నొకేకార్యమునకు భిన్నకారణము లుండవచ్చును. అందుచే శ్రుతి చెప్పుచున్నది కావున నీశ్వరుఁడే జగత్కారణమని మన మంగీకరించవలెను. ఈశ్వరుఁడే ప్రథమకారణము; ఏలన, నతఁడు జన్మములేనివాఁడు, సన్మాత్రస్వరూపియగు నీశ్వరుఁ డింకొక సన్మాత్రస్వరూపివలన జనించుట

---

(౨) శం॥భా॥ ౧, ౧౨.
(3) శం॥భా॥ ౧, ౧, ౨౦; ఛాం॥ఉ॥ ౧, ౬.
(౪) శం॥భా॥ ౧, ౧, ౨౦; బృ. ఆ. ఉ. ౩, ౭, ౯.
(౫) శం॥భా॥ ౧,౧, ౧౮-౨౦,౨౨; ౧,౩,౩౯, ౪౧, ౧,౨,౯-౧౦.

శవకాశము లేదు; ఏలనఁ గారణములోఁ గొంత యాధిక్యత లేకుండఁ గార్యకారణ సంబంధ ముండఁజాలదు.౧. ఈశ్వరుఁ డొక భిన్నతగలిగిన వ్యక్తివలన జనించియుండఁ డేలన, నభేద వ్యక్తినుండి భిన్నతగల విషయము లుత్పత్తియగునేకాని వ్యతిరేకవిధాన మెన్నడును జరుగదు. ఈశ్వరుఁ డభావమునుండి పుట్టలేదు; ఏలన నభావము నిరాత్మకమైనది. శ్రుతియు దీనిని నిరసించి, "అసత్తునుండి సత్పదార్థ మెట్లుత్పన్నమగున"ని యడిగినది. ఈశ్వరుఁడొక ప్రకృతికి వికృతి యన్నచో ననవస్థాదోషసిద్ధి కలుగును.౨. ఈశ్వరుఁ డజుఁడు, కారణముకాఁడు, కార్యమునుగాఁడు. ఈశ్వరుఁడే కార్యమైనచో నాకాశము మొదలు సర్వకార్యములు నిరాత్మకములై మనము నాస్తిక వాదులము కావలసివచ్చును.౩.సర్వవిషయములకు యాథార్థ్యము నొసఁగున దీశ్వరుఁడే.

ప్రతికార్యమున కొకకారణ మున్నదను సూత్రము నంగీకరించినచో నణువులుగాని, ప్రకృతిగాని, అసత్తుగాని ఒక ప్రత్యేకవ్యక్తిగాని, తాటస్థ్యముగాని కారణము కారాదా౪౧. వీనినన్నిటిని శంకరుఁడు నిరాకరించును.ప్రకృతి మృతప్రాయము కాదు; దాని గర్భమునఁ జైతన్యస్ఫూర్తి గల సజీవరూపమది.

(౧) ఈశ్వరునికంటె నధికతరమైన దేదియు దురూహ్యముగావున నీశ్వరుఁడే కారణభూతుఁడు: పోల్చు: డే కార్టే వాదము.

(౨) శం॥భా॥ ౨, ౩, ౯.

(3) శం॥భా॥ ౨,3,౭.

(౧) శం॥భా॥ ౧,౧,౨.

ఆత్మజీవితనాటకమున కనుగుణమై ప్రకృతి రంగమున్నది. “ప్రపంచమునందు వివేకముచే నడుపఁబడని యచేతనవస్తువు, మానవుని లక్ష్యములను సాధించుట కుపకరించు వస్తువులను దనలోనుండి సృజింపఁజాలదు. మందిరములు, ప్రాసాదములు, శయ్యాసనోపవనాదులు, విచారమును బోఁగొట్టి, సుఖమును గలిగించుటకై వివేకవంతులగు శిల్పులచే నిర్మింపఁబడినవి. ఈ ప్రపంచ నిర్మాణము నట్టిదే. అనంత కర్మఫలానుభవమున కను కూలించు రీతిగా భూలోక నిర్మాణమును, నట్టి కర్మానుభవ మున కుపకరణములుగా ననంతవైవిధ్యము గల జీవరాశియొక్క స్థూలసూక్ష్మ దేహావయవ నిర్మాణమును జూచినచో నిది యంతయు నవివేకమైన ప్రధానముచే నెట్లు కల్పింపఁబడఁగలదు? కుంభకారుని వశమై యున్నంతకాలము మట్టికూడ ననేకరూప ములు పొందుట కనుగుణమై యున్నరీతినే, జడపదార్థము నొక వివేకవంతుని వశమై నడుపఁబడుచున్నది.”౨. అనంతజన్మముల నుండి వచ్చుచున్న కర్మఫలముల ననుభవించుట కనుగుణమైన రంగముగా నుపచరించుటే సృష్టి ప్రయోజనము. అచేతన ప్రకృతి యిట్టి కృత్యములను నెరవేర్పఁజాలదు. చైతన్యమును, ప్రవృత్తియు ప్రపంచ కారణమునకుఁ జెందియుండవలెను.3.

(౨) శం॥భా॥ ౨,౨,౧.

(3) బ్రహ్మసామీప్యమే జగత్పరిణామమునకుఁ జాలునదైనచో నూచంటుడాయి యినుపముక్కనువలెఁ బురుషుల సాన్నిధ్యమాత్రముననే ప్రకృతి కేల ప్రవృత్తి లభింపదు? మఱియు అవిద్య సహజముగా సృష్టిహే తువగును, దానికొక ప్రయోజన మవసరములేదు, “అవిద్యాచస్వభావతా ఏవ, కార్యోన్ముఖీ, నప్రయోజన మపేక్షతే” (భామతి)

ప్రపంచ రచనాక్రమము లోక వివేకముగల యజమానిని సూచించును. ఏకలక్ష్యసిద్ధికై యనేకసాధనము లుండుటయు దీనినే వ్యక్తపరచును.[౪] మానవులు తమ కర్మఫలముల నొక క్రమరీతి ననుభవించు విధానమునకుఁ గారణ మపూర్వముగాని యీశ్వరుఁడు గాఁడను పూర్వమీమాంసా వాదమునుగూడ శంకరుఁడు సమీక్ష చేసెను. అపూర్వ మనాత్మకమైన దగుటచే, దాని ప్రవృత్తి కింకొక యాత్మశక్తి యవసరమని శంకరుని విమర్శ. న్యాయవైశేషికుల ప్రపంచాతీతుఁడైన దేవుఁడు ప్రపంచమున కుపాదానకారణము కాఁడు కావున నిరుపయోగము. మానవుఁడే సృష్టికారకుఁడైనచోఁ దనకు దుఃఖకారణములగు జన్మ జరామరణ వ్యాధులు లేకుండఁజేసికొని యుండును. "స్వతంత్రుఁడగు వాఁడెవ్వఁడు నొక కారాగృహమును దనకుఁ దానే నిర్మించుకొని యందుఁ బ్రవేశించఁడు."[౧]. తాటస్థ్యము, అణువులు, ప్రకృతి, నైయాయికుల యీశ్వరుఁడు యుక్తము లైన జగత్కారణములు కాఁజాలవు. నిత్యుఁడు, సర్వశక్తిసమన్వితుఁడు, సర్వవ్యాపియు, సర్వజ్ఞుఁడునైన యీశ్వరుఁడే శ్రుతి వచనము ననుసరించి, జగత్కారణ భూతుఁడు.[౨]

---

(౪) శం॥భా॥ ౧,౩,౩౯.

(౧) నహీశ్చిదపరతంత్రో బంధనాగారమ్ ఆత్మనః కృత్వాఽనుప్రవిశతి. (౨,౧,౨౧) పోల్చు: డేకార్టే: "నాకు నేనే కర్తనైనచోఁ పరిపూర్ణ లక్షణము లన్నిటిని కల్పించుకొని నేనే యీశ్వరుఁడనై యుండెడివాఁడను" (మెడిటేషన్స్: పు. 3)

(౨) శం॥భా॥ ౨,౧,౨౨; ౪,౧,౨౩, ౨౪.

ఈశ్వరుఁడే ప్రపంచమున కుపాదానకారణము, ముఖ్యకారణమునై యున్నాఁడు. మన యనుభవములో నుపాదానకారణములు సచేతనములుకావను నాక్షేపణమునకు శంకరుఁడిట్లు బదులుచెప్పినాఁడు. "మన యనుభవములోవలెనే జగత్కారణమును గానవసరములేదు. ఏలన, జగత్కర్త అనుమానప్రమాణముచేఁగాక, శ్రుతిప్రమాణమువలనఁ దెలియుచున్నాఁడు" మనము శ్రుతివాక్యములపై నాధారపడునప్పుడు వ్యావహారికానుభవమునకవి సరిపోనవసరములేదు. 3. న్యాయతత్త్వము ననుసరించి, సచేతనకారణమనగా నొక కర్తయొక్క జ్ఞానేచ్ఛాక్రియలొక వస్తూత్పాదన కవసరములు. జ్ఞానము నొక్కదానినే వేదాంతి యంగీకరించెను; జ్ఞానము స్వయంసమృద్ధమనియు, ఇచ్ఛాక్రియలకుఁగారణములు గాఁబూర్వేచ్ఛాక్రియ లుండవలసివచ్చుటచే ననవస్థాదోషము సిద్ధించుననియు వేదాంతి వాదించును. కార్యకారణములకు వైలక్షణ్యముండుటచే నీశ్వరుఁడు జగత్కర్త కాఁజాలఁడవి యాక్షేపింపఁబడెను. ఒక స్వర్ణశలాక యొక మృణ్మయపాత్రకుఁ గారణముకాదు. పరిశుద్ధాత్మస్వభావుఁడగు నీశ్వరుఁడు, కలుషము నాత్మవిరహితమునగు ప్రపంచమునకుఁ గారణముగాఁజాలఁడు. ౧. జడములైన నఖకేశాదులు చేతనులవలన నుత్పత్తియగుచుండుట గలదని శంకరుని సమాధానము. జడపదార్థమగు పేడనుండి, పేడ

(3) న ఆవశ్యమ్ తస్య యథాదృష్టమేవ సర్వమభ్యుపగంతవ్యమ్॥ చూ: డ్యూసేన్ సిస్టమ్ ఆఫ్ వేదాంత పు. ౯౨-౯3.

(౧) శం॥ భా॥ ౨,౧,౮.

వృనకు పుట్టుచున్నది. ఈవిషయములలో బాహ్యాభేదములు గోచరించుచున్నను వీనికన్నిటి కేకకారణము భూమియని చెప్పినచో నీశ్వరజగత్తులకు రెంటికి నట్టి యేకైకలక్షణము సత్తాయున్నదని శంకరుని సమాధానము. రెండును సంపూర్ణముగా భిన్నములుగావు. జగత్తుకంటె నతిశయలక్షణసంపన్నుఁడైనచోఁ గార్యముకంటెఁ గారణ మెచ్చటనైన నతిశయశక్తికలదే యగుచున్నది.

ప్రపంచ మీశ్వరునివలనఁబుట్టి యీశ్వరునియందే చేరుచున్నదన్నచో, నట్లుచేరునపుడు ప్రపంచగుణములైన జడత్వము ద్రవ్యత్వము,మాధ్యము, పరిచ్ఛిన్నత, కాలుష్యము మున్నగునవియు నీశ్వరునిలోఁ జేరి, యీశ్వరునిఁ గలుష మొనర్చునని యాక్షేపించిరి. 3. కార్యములు కారణములలోఁ జేరునపుడవి వాని విశేషలక్షణములను దిగవిడిచి, స్వర్ణాభరణములు, స్వర్ణమునఁ గలిసిపోవునట్లీశ్వరునిలోఁ గలిసిపోవునని శంకరుఁడు జవాబుచెప్పెను. కార్యము తన లక్షణములను విడువకుండఁ గారణములోఁజేరుట నిజముగు పరివర్తనము కాఁజాలదు. ౪ ప్రపంచ మారీతిగా విశేషలక్షణములను గోల్పోయి, యీశ్వరునిలో విలీనమైనచో, దిరిగి, కల్పాంతమందు భోక్తృభోగ్యభేదముతోఁ గూడిన పునఃప్రపంచావిష్కరణ మవసరములేదను నాక్షేపణకు శంకరుఁడొక యుపమానమూలమున సమాధాన మిట్లిచ్చె

(౨) శం॥ భా॥ ౨,౧,౬

(3) స్థౌల్య, సావయవత్వ, కేవత్వ, పరిచ్ఛినత్వాఽశుద్ధ్యాది.

(౪) శం॥ భా॥ ౨,౧,౯.

నాఁడు; "సుషుప్తినుండియు, సమాధినుండియు నాత్మవిరతిపొంది జాగ్రదవస్థలోనికి వచ్చినప్పు డెట్లేకత్వమునుగోల్పోయి పృథగ్వ్యక్తియగుచున్నాఁడో, యట్లే ప్రపంచమీశ్వరునుండివచ్చినపుడును జరుగును"౧. ప్రపంచ మీశ్వరునిలోలయమైనను, భేద సంస్కారముండిపోయి, తిరిగి ప్రపంచముత్పత్తియగును. పునః సృష్టికిఁగారణము జీవుల పూర్వజన్మలలోని కర్మలఫలితము లనుభవింపకుండ మిగిలిపోయినవి. ముక్తజీవులు మాత్రము తిరిగి జన్మింపరు; ఏలన వారివిషయములోఁ బునర్జన్మ కారణమగు నజ్ఞానము నశించిపోయినది ౨. సరిగాఁజెప్పుచో సృష్టియే లేదు; ఏలన సంసారమాద్యంతములులేనిది. అనాద్యనంతమగు సంసారములో సృష్టిలయాదులు వివిధఘట్టములు మాత్రమే. ప్రతి కల్పారంభమునను, భిన్నరూపములతోఁగూడిన మూల పదార్థము విస్తరింపఁబడును. భూతవర్తమానదశల కవిచ్ఛిన్న సంబంధమున్నది; లయావస్థకుఁ దదనంతరమునవచ్చు సృష్టికి నిట్టి యవిచ్ఛిన్నసంబంధముగలదు. ఈశ్వరునికి జీవాత్మకును పూర్ణవస్తుభాగసంబంధమున్నచో జీవాత్మ దుఃఖానుభవములో నీశ్వరుఁడు భాగస్వామిగావలసివచ్చును. ఈయాక్షేపణమును దొలగించుటకు మూలవస్తువునకు దాని ప్రతిబింబముతోఁగల సంబంధము చెప్పఁబడినది. ప్రతిబింబమున కెట్టిదోషము కలిగినను మూలద్రవ్యమున కంటదు.

---

(౧) శం॥ భా॥ ౨,౧,౯.

(౨) శం॥ భా॥ ౩,౧,౯.

కొందరకాహ్లాదము, కొందరకు దుఃఖమును గలుగు నట్లు భిన్నమార్గములననుసరించి ప్రపంచమును గల్పించినవాఁ డీశ్వరుఁడు కాఁజాలఁడని యింకొకయాక్షేపణ చెప్పఁబడినది; ఏలన నాతఁ డధర్మపరుఁడు, క్రూరుఁడనవలెను. ౧. దీనికి సమాధానముగాఁ గర్మసూత్రము చెప్పఁబడెను. ఈశ్వరుఁడు నిరంకుశముగా వర్తించుటలేదు; జీవుల పూర్వకర్మలననుస రించి, వానికిఁదగిన ఫలితముల నొసఁగుచున్నాఁడు. జీవుల కర్మలకనుగుణమైన సృష్టి నీశ్వరుఁడుచేయుచున్నాఁడు. పూర్వ కర్మఫలానుభవరంగమే లోకము గావున నీశ్వరునిసృష్టి కర్తృ త్వము వాని ప్రధానలక్షణము గాదు. వనములోని మొక్క లెల్లు తమసత్త్వముల ననుసరించి పెరుగునో దానికి వనరక్ష కుఁడు బాధ్యుఁడు గాఁడు. శంకరుఁ డీశ్వరుని వర్షముతోఁ బోల్చెను, వర్ష మన్ని మొక్కలకును గురియునుగాని,బీజబలము ననుసరించి మొక్క పెరుగును. ప్రతివ్యక్తియొక్కయు నూతన జన్మము వ్యక్తియొక్క కర్మల నైతికలక్షణముల ననుస రించి యుండును. ౨. ఆదిసృష్టియందే, జీవులకుఁ బుణ్య పాపకర్మలెవ్వియు లేనప్పుడు, దుఃఖ దౌర్భాగ్యములేకుండ నీశ్వరుఁడేల సృజింపలేదని యడుగవచ్చును. ఇది శాఖాచంక్ర మణ వాదమగును. శంకరుఁ డిట్లుచెప్పెను: "పుణ్యపాపములు లేకుండ నెవ్వఁడును జన్మించఁడు; జన్మించకుండ నెవ్వఁడును బుణ్యపాపములుచేయఁజాలఁడు;అందుచే సృష్టి కాదియున్నచోఁ,

(౧) శం॥ భా॥ ౨, ౧, ౩౪.

(౨) శం॥భా॥ ౧, ౩, ౩౯.

మనకు శాఖాచంక్రమణమే లభించును." ౩. ప్రపంచమున కాది లేదు. ౪. అందలి ప్రతిజీవియొక్క ప్రస్తుతజన్మమున కొక పూర్వజన్మమే కారణము. కల్పాంతములందును, పునస్సృష్టివేళలందునుగూడఁ గర్మసూత్రము వర్తించును. సంసారము స్థూలరూపమునఁగాని, సూక్ష్మరూపమునఁగాని యీశ్వరునిలోనుండును. ప్రపంచమూలమగు ప్రకృతి, యొక కార్యము కాదు. కావున, నితరకార్యములన్నిటికంటెను నుత్కృష్టమైనదై,౧ యీశ్వరునం దున్నది. ప్రకృతికి మూలాధారమెచ్చట నుండఁజాలదు గావున, నీశ్వరునిలో నొకయంశగాఁ దలఁపఁబడినది. ప్రకృతిసమన్వితుఁడగు నీశ్వరుఁడు ప్రపంచమునకు ముఖ్యకారణము నుపాదానకారణమును. ఈశ్వర కార్యముగాఁ బ్రపంచమాతఁడు సృజించినవెనుక బాహ్యరూపముననున్న విధముననే, కారణరూపమున సృష్టికిఁబూర్వ మాతనిలో నుండును. ౨. సృష్టికిఁబూర్వమే నామ రూపమయసృష్టి యీశ్వరజ్ఞానవిషయమైయుండును. ౩.

ఉపనిషత్తు లీశ్వరుఁడంతర్యామియని భావించును. ఈశ్వరుఁడు జీవాత్మకు వేరుగా లేఁడు; జీవాత్మమూలమున నాతఁడు ప్రకృతిలోఁ బ్రవేశించినాఁడు." ఈశ్వరుఁడు తన శుద్ధరూపములోఁ

(౩) శం॥ భా॥ ౨, ౧, ౩౬.
(౪) శం॥ భా॥ ౨, ౩, ౪౨.
(౧) సర్వస్మాద్వికారాత్ పరోయోఽవికారః (శం॥భా॥ ౧,౨,౨౨)
(౨) శం॥భా॥ ౨,౧,౬. చూ॥శంభా॥కఠ॥ఉ॥ ౩,౧౧; ఛాం॥ఉ॥ ౭,౧౪,౧.
(౩) శం. భా॥ ౧.౧,౫.

దనయాత్మస్వరూపముతో నశుద్ధదేహములోఁ బ్రవేశించఁడు; అట్లు ప్రవేశించినను దానినిఁ దానేచేసిన స్మృతికలిగి వెంటనే విడిచిపెట్టును. ఎట్టిశ్రమయులేకుండ, నేయాత్మరూపములో నీశ్వరుఁడు లోకమునఁబ్రవేశించునో, దానితోడనే, ఐంద్రజాలికుఁడు దాను ప్రదర్శించిన దృశ్యమును బోఁగొట్టినట్లు ప్రపంచమును లయింపఁజేయును. ఇట్లు జరుగుటలేదుకావున, ౘప్రపంచమును దన క్షేమమెరిగిన యొకయాత్మగలిగినవ్యక్తి చే సృజింపఁబడలేదు.౪." దీనికి శంకరుఁడు భిన్నకార్యము లొకేకారణమున నుదయించుననియు, నొకేభూమినుండి భిన్నలక్షణములుగల శిలలు, స్వర్ణభూషణములు నెట్లుత్పన్నములగునో, యట్లే యొకే యీశ్వరునినుండి భిన్నజీవులు కార్యములు నుద్భవించుననియు బదులుచెప్పినాఁడు.౫.

ఈశ్వరుఁ డుపకరణము లవసరములేకుండసృజించఁగలఁడు. తన యద్భుతశక్తులవలనఁ దానే యనేక కార్యరూపములఁ బొందుచున్నాఁడు.౬.తనలో సంపూర్ణములగు సర్వశక్తులు నుండుటచే నితరసాహాయ్యము లేకుండ నాతఁడు సృష్టిచేయఁగలఁడు. బాహ్యోపకరణములతో నిమిత్తములేకుండ నీశ్వరుఁడును మహా

(౪) శం॥భా॥ ౨,౧,౨౧.

(౫) శం॥భా॥ ౨,౧,౨౩.

(౬) పరిపూర్ణశక్తికమ్ (శం॥భా॥ ౨,౧,౨౪.)

ర్షులు తమతపశ్శక్తిచే నేదియైన సృజింపఁగలరని చెప్పఁబడెను.౧. ఈశ్వరునిసృష్టికర్మ మనుష్యుల కర్మవంటిదికాదు ౨ పాలు పెరుగుగా మారినట్లు, తన విశేషశక్తివలన నీశ్వరుఁడు ప్రపంచముగా మారుచున్నాఁడు.3. నానారూపసమన్వితమగు ప్రపంచము నీశ్వరుఁడు కల్పించెను గావున నాతని కనేక శక్తులున్నవని తెలియుచున్నది.౪. ఈశ్వరుఁడు నిశ్చయముగా స్వతంత్రుఁడైనచో నాతనికి సృజింపవలయు నవసరము లేదు. దేవునికి లోపములుగాని, సిద్ధించని కామములుగాని లేవు. సర్వసిద్ధులుగల ఈశ్వరుని కెట్టి కాంక్షయు నున్నదనుట యాతని స్వయంసమృద్ధిలక్షణవిరుద్ధమగును.౫. సృష్టివలన నీశ్వరునికొక యుద్దేశము కాని, యొక కోర్కెగాని, యొక లేనివస్తుసంపాదనముగాని కలిగెననుటవలన నీతనికిఁ బరిపూర్ణతాలోపమగును నియతోద్దేశరహితుఁడై యాతఁడు చేసిన సృష్టి బాల్యచేష్టకంటె నధికము కాఁజాలదు. దేవుఁడే కైకకారణమైనచోఁ గార్యమంతయు నొక్కసారియే కన్పట్టవలెను; కాని భిన్నదశలతోఁ గూడిన క్రమపరిణామమే మనము చూచుచుంటిమి. దీనికి సమాధానముగా బాహ్యమునుండి యేకర్మయు నిర్ణయింపఁబడదు. కర్మకు వెనుకనున్న ముఖ్యోద్దేశము దానిని నిర్ణయించును. అందుచే "ఈశ్వ

(౧) ౨,౧,౨౫,3౧ (౨) శం।భా। ౧,౪,౨౬

(3) క్షీరవత్ ద్రవ్యస్వభావవిశేషాత్ (శాం।భా। ౨,౧,౨౪) క్షీరోపమానము యుక్తము కాదు; పాలు పెరుగగుటకు ద్రవ్యాంతర సాహాయ్య మవసరము: అదియే ఉష్ణత. (౪) శం।భా। ౨,౧,3౦

(౫) నిత్యపరితృప్తత్వమ్ (శం।భా। ౨,౧,3౨-33) బ్రహ్మ ప్రాప్తకాముఁడు గావున జీవాత్మ సాదృశ్య మిచట పనికిరాదు.

రునికర్మ యెట్టిప్రయోజనమును లేని స్వభావసిద్ధమైన లీల" యని చెప్పఁబడెను. ౬. ఈశ్వరుని సృష్టిక్రియ యాతని పరిపూర్ణతయొక్క బాహ్యప్రసరణము. లీలాభావమున కనేకార్థములు గలవు. ఈశ్వరుని సృష్టి కెట్టి స్వార్థపరమైన ప్రయోజనమును లేదు. మనుజుఁ డూపిరిపీల్చి విడుచుట స్వభావమైన రీతినే, దైవస్వభావము యొక్క బాహ్యప్రసరణమే సృష్టి యనవచ్చును.౧. దేవుఁడు సృష్టిచేయకుండ నుండఁజాలఁడు. సృష్టి కర్మయనునది నిష్కారణ సంభవముగాని, మాధ్యసంజాతముగాని కాదు; అది యీశ్వరుని స్వభావోద్గతము. ఆనందాతిశయముచే నీశ్వరుఁడు తన శక్తిచైతన్యముల నావిష్కరించినాఁడు ౨. మొదట నిర్గుణబ్రహ్మ మున్నదనియు నావెనుక నొక సగుణరూపమును ధరించు టవసరమని నిశ్చయించెననియు శంకరుఁడు భావింపఁడు. స్వీయానందాతిశయము చేతను, ధర్మప్రకటనార్థము నీశ్వరుఁడు సృజించెను. సృష్టికర్మ యను నీ జగన్నాటకమం దీశ్వరుఁడు వినోదవిహార మొనర్చునను భావముతో నేకీభవించి, శంకరుఁ డీశ్వర కర్మ సహేతుకము, లక్ష్యసహితము, వనియు నది యప్రయత్నముగా నతిసులభముగా జరుగునట్టిదనియు నిరూపింప యత్నించెను. ముక్తపురుషు లీశ్వరానందమున భాగస్వాము లగుదురు. జీవు లీశ్వరునకు వేరై

(౬) శం।భా। ౨,౧,33

(౧) శం॥భా॥ ౨,౧,33.

(౨) పరిపూర్ణత పాఁగి ప్రవహించునదే సత్స్వరూప మను ప్లాటినస్ భావముతోఁ బోల్చు.

యుండవు; యీశ్వరునియందే తదంశరూపులై, పరిపూర్ణతనందఁ గోరుచుండును. జడపదార్థములు, నిరాత్మకములుగా గోచరించున వన్నియు నీశ్వరసంబంధములై యాతనిలో నున్నవే. ఈశ్వరశక్తి సర్వాంశలలోఁ బ్రవర్తించి, వానినిఁ బోషించుచుండును "తృణబ్రహ్మ పర్యంతముగల సర్వజీవరాశులు నా దేహమే."3. ఈశ్వరుఁడును జగత్తు ననగాఁ గార్యకారణములొకటే. అవి రూపములలోఁగాని, బాహ్యపరిణామ వికారములలోఁ గాని సమానములుగావు; వానియం దంతర్గతమైయున్న బ్రహ్మపదార్థముచే నవి సమానములు. నామరూపావిష్కృతి గాంచినపుడు ప్రపంచము; లయమనగా నామరూపోప సంహారమునై యున్నది. సృష్టియనఁగా నీశ్వరతత్త్వము దేశకాలావచ్ఛిన్నమగు బాహ్యావిష్కృతిఁ గాంచుట.౧. ప్రతి కల్పాంతమందు నీశ్వరుఁడు లోకమును దనలోనికిఁ దీసికొను ననగా భౌతికప్రపంచము మూలప్రకృతిలో విలీనమై జీవాత్మలన్నియు దాత్కాలికముగా నిరుపాధికములై, గాఢనిద్రా ముద్రితములగును. కాని జీవుల పూర్వకర్మ సంస్కారము లింకను నుండుటచే, నీశ్వరుఁడు నూతనసృష్టి చేయుటతోడనే జీవులు నూతన జన్మముల నొందవలసివచ్చును. అప్పుడు తిరిగిజన్మ జరామృత్యు సంకలితమైన సంసారపరిభ్రమణ మారంభమగును.౨.

(3) ఉపదేశసాహస్రి, ౯,౪; దక్షిణామూర్తి స్తోత్రము పు. ౯.

(౧) పోల్చు: ఎమిలీబ్రాంటే: "భూమియును మానవులు, సూర్యచంద్రాదులతో బ్రపంచమంతయు నదృశ్యమైనపుడు, నీవేయుందువు; నీయందే సర్వజీవులు నుండును." (౨) సృష్టి స్థితి లయవ్యాపారములనుబట్టి యొకే పరమేశ్వరుని బ్రహ్మ విష్ణు, శివులని చెప్పుదురు.

జీవులు పరస్పరభిన్నములైనను, నీశ్వరాంశారూపములే. జీవులు, భిన్నకర్మలను, ఫలితములునుగలిగి, మరణానంతరము తిరిగి పునర్జన్మ[3] నొందునపుడు పరస్పరమిశ్రమమందవు.[4] జాగ్రిదవస్థలో సర్వజీవులయొక్క సముచ్చయాత్మస్వరూపము విరాట్ లేక వైశ్వానరరూపము. స్వప్నావస్థలోని జీవాత్మస్వరూపము లింగము లేక తైజసము. సర్వతైజసములయొక్క యేకరూపము హిరణ్యాగర్భుఁడు లేక సూత్రాత్మ[5]. కారణశరీరములోనున్న జీవాత్మకు ప్రాజ్ఞుఁడనియు సర్వప్రాజ్ఞస్వరూపి యీశ్వరుఁడనియుఁ బేర్కొనఁబడెను. సుషుప్త్యవస్థలోని జీవికింకను ద్వైతమున్నది. ఆతని సంకల్పవిజ్ఞానమూలమగు బుద్ధి యింకనున్నది. ఉపసంహృత జగత్స్వరూపియగు నీశ్వరుఁడు, అవ్యక్తద్వైతనియతిగల సుషుప్త్యవస్థలోనున్న జీవునితోఁ బోల్పవచ్చును. పరిశుద్ధబుద్ధిలో బద్ధుఁడైన బ్రిహ్మరూపమే యీశ్వరుఁడు. ఆతఁడు గుణత్రియమునుగలిగియుఁ దపతీతుఁడై యున్నాఁడు. ఆతనికి సూక్ష్మము సాత్త్వికమునగు స్వచ్ఛశరీరముగలదు. ఈశ్వరునుండి విరాడ్రూపము, ననఁగా, సుషుప్తినుండి జాగ్రిదవస్థయు; ప్రాజ్ఞునుండి దేహియు సృష్టిక్రిమము; దీనికి వ్యతిరేకక్రిమము ప్రళయము. బాహ్యజగత్తులో శంకరుఁడు పరిణామమునంగీకరించునుగాని, బ్రిహ్మతో సంబంధమును జెప్పవలసినప్పుడు వివర్తవాదమునుఁ బ్రకటించును.

(3) ఛాం॥ ఉ॥ ౬, ౧౦.
(4) శం॥ భా॥ ౨, ౩, ౪౯.
(5) శం॥భా॥ ౨, ౩, ౧౫.

ఒక యుపాదానకారణము తనకు భిన్నముకాని కార్యము నుదయింపఁజేయును. ౧. ప్రపంచము బ్రహ్మాభిన్నము కాదు; బ్రహ్మ సద్రూపముచేఁ బరివర్తనమందుచున్నట్లు గోచరించును. ప్రపంచ మవిద్యయుఁగాదు; అచేతనమగు నవిద్య జడరూపమున మార్పుచెందుచున్నది. ఈరీతిగాఁ బ్రపంచము బ్రహ్మ, మాయామిశ్రితము. ఈశ్వరుఁడు ప్రపంచమున కుపాదానకర్తయును, ముఖ్యకారణమునని స్పష్టముగాఁ బలికెను. గాని, యనంతరాద్వైతములో నీవిషయమున భిన్నభావము లుదయించినవి. వేదాంతపరిభాషననుసరించి, జగత్పరిణామకారణము మాయకాని, బ్రహ్మకాదు. 3. వాచస్పతి బ్రహ్మయే కారణమని, మాయ సహకారియని చెప్పినాఁడు. మాయావశులైన మానవుల దృష్టిలో జడజగత్తే బ్రహ్మ; మాయయే దాని కారణము. ౪. ఇందుఁ జెప్పఁబడిన మాయ జీవులనాచ్ఛాదించునది. అందుచే జగత్తుయొక్క జడతాలక్షణమునకుఁ గేవల శుద్ధబ్రహ్మకారణ మనరాదు; కావున జడత్వమునకుఁ గారణము మాయాసహితబ్రహ్మ యని చెప్పనొప్పును. బ్రహ్మ

---

(౧) స్వాభిన్న కార్యజనకత్వ ముపాదానత్వమ్।

(౨) వివరణగ్రంథ మీభావమును సమర్థించెను.

(3) ప్రపంచస్యపరిణామి ఉపాదానమ్ మాయానబ్రహ్మేతిసిద్ధాంతః॥

(౪) వాచస్పతి మిశ్రాస్తు జీవాశ్రితమాయా విషయీకృతమ్ బ్రహ్మ స్వత ఏవ జాడ్యాశ్రయ ప్రపంచాకారేణ వివర్తమాన తదుపాదానమ్ ఇతి మాయా సహకారిమాత్రమ్॥ (యస్. యన్. యస్. ౧.)

జగత్సంబంధమెట్టిదో మనము చెప్పఁజాలము కావున, మాయా కల్పితమగు జగత్తునకు బ్రహ్మ మాధారమని చెప్పవలెను. ఈ భావమును, పదార్థతత్త్వనిర్ణయము ప్రకటించినది. ౧. సిద్ధాంత ముక్తావళీకర్త బ్రహ్మకు లోకముతో నెట్టిసంబంధమును జెప్పుట కిష్టపడక, మాయయే జగత్కారణమని పలికెను. సంక్షేపశారీరిక గ్రంథకర్త జగదుపాదానకారణము బ్రహ్మమేయనియు బ్రహ్మ మేకైకసత్యమైయుండగాఁ గారణాంతరమును జెప్పుటకు వీలులేద నియు నిర్ణయించెను. నిర్గుణబ్రహ్మకెట్టి గుణసంబంధమును జెప్పుట కిష్టములేనివారు మాయాన్వితమగు బ్రహ్మయనఁగా నీశ్వరుఁడే జగత్కారణమనిరి. ౨. బ్రహ్మ కుపాదానకారణము తటస్థగుణము మాత్రమే. ప్రపంచముగామారు కారణస్వరూపము మాయయనియు, 3. ప్రపంచమున కాధారభూతమైనది మాయోపాధిగతమైన యీశ్వరుఁడనియు విద్యారణ్యునభిప్రాయము. ౪. బాహ్యస్థూలప్రపంచ మీశ్వరమాయాసంజాత మనియు, బుద్ధీంద్రియాదులతోఁ గూడిన సూక్ష్మప్రపంచ

(౧) ప్రపంచే ఉభయోరపి మాయా బ్రహ్మణో రుపాదానత్వమ్ తత్రచపరిణామతయా మాయయా, ఉపాదానత్వమ్; అధిష్ఠానతయాచబ్రహ్మణ ఉపాదానత్వమ్॥ బ్రహ్మవివర్తమాన తయా అవిద్యాపరిణామమానతయా ఉపాదానమ్ (S. L. S. ౧)

(౨) శం।భా॥ ౧,౧,౨౦; ౧,౨,౧ పై నాధారపడిన వివరణము.

(3) పరిణా మ్యుపాదానతా

(౪) వివర్తో పాదానత, మాయోపహిత చైతన్యలక్షణ మనఁబడెను.

మీశ్వరుని మాయాసాహాయ్యముతోఁ గూడిన జీవసంజాత మనియుఁ గొందరు తలపోసిరి. ౯. సూక్ష్మప్రపంచ మవిద్యాశక్తివలన నుద్భవించుననియు, నీశ్వరుని మాయాసహకార మవసరము లేదనియు, నీశ్వరమాయచే భూతప్రపంచ మేర్పడు ననియు మఱికొందరు భావించిరి. ఈ రెండుదృక్పథముల నుండియు ననగా బాహ్యాభ్యంతరములనుండి చూచినచో బాహ్యప్రపంచమున కాధారముగా బ్రహ్మయును, నాంతరంగిక ప్రపంచమున కాత్మయు నని చెప్పవచ్చును. ఇంద్రియగోచరము సర్వప్రవృత్తి సాధనము నైన వ్యావహారిక ప్రపంచమున కుపాదానకారణము పరమార్థమై యుండఁగా, స్వప్న మిథ్యాప్రపంచమున కుపాదానకారణము జీవాత్మయైయున్నది. ప్రపంచ మంతయు జీవునివలననే జనించున దనుట కెవ్వరు నంగీకరింప కున్నను, తృణ బ్రహ్మపర్యంతము గల సర్వవస్తు సమన్విత ప్రపంచ క్రమమునకు జీవాత్మయే ఉపాదాన కారణమని విశ్వసించువారును గలరు. ౧.

.౨౮-ఈశ్వరుని మిథ్యాత్వ లక్షణము.

బ్రహ్మమును దర్పు మూసలలోఁ బోసినచో మనకు వ్యావహారిక జగత్తుగాఁ గన్పట్టుచున్నను, లేక దానినే యీశ్వ

(౯) వియదాది ప్రపంచ ఈశ్వరసృష్టమాయాపరిణామ ఇతి; తత్ర ఈశ్వర ఉపాదానమ్; అంతఃకరణాదికంతు, ఈశ్వరాశ్రిత మాయాపరిణామ మహాభూతో పసృష్టజీవా విద్యాకృతభూతసూక్ష్మకార్యమితి, తత్రోభయో రుపాదానత్వమ్॥

(౧) వీరివాదము నప్పయదీక్షితు లిట్లు నుడివెను. "జీవ ఏవ స్వప్న ద్రష్టృవత్ స్వస్మి న్నీశ్వరాది సర్వకల్పకత్వేన సర్వ కారణమితి కేచిత్"

రుఁడన్నను భేదములేదు. ఈశ్వరుఁడు సర్వస్వరూపుఁడు; సర్వ మాతనియందే యున్నది. ప్రళయకాలమందు సూక్ష్మరూప మున నవ్యక్తముగాను,సృష్టికాలమున వ్యక్తరూపముననను నుండును. అవ్యక్తబ్రహ్మకును,ప్రపంచమునకు నొకవైపునను, వేఱొకవైపున నీశ్వరునకును గల సంబంధమును శంకరుఁడు సరిగా వివరింపలేదని డ్యూసేన్ చెప్పిన విషయ మంత సమంజ సముగాలేదు. అతఁ డిట్లు చెప్పినాఁడు: "ఈ యవ్యక్తబ్రహ్మము నకు రెండు వ్యతిరేకరూపములున్నవి; మొదట నుపాధిగతుఁ డైన బ్రహ్మస్వరూపముగా బాహ్యప్రపంచమును; తరువాత మన కుపాసనకు, మన బుద్ధికి సామీప్యమునకు వచ్చురీతిగా నీశ్వరస్వరూపమును గూర్చిన భావములు కలుగును. అవ్యక్త బ్రహ్మముయొక్క యీ రెండు పరస్పరవిరుద్ధములైన రూపము లకు స్పష్టమైన భేదమును శంకరుఁడు ప్రకటింపకుండుట యాశ్చ ర్యకరమైన విషయము. కాని యొక వాక్యము ననుసరించి, మిథ్యారూపముల కన్నిటికి నింద్రియగోచర రూపములే యాలంబనములను నర్థము కన్పట్టు రెండును నెల్లప్పుడు కలియు చుండు కారణమువలన రెంటికిఁగల భేదములను శంకరుఁడెన్నఁ డును సరిగా గురిుంచియుండలేదు." ౧. ఒక వాక్యములో శంకరుఁడిట్టి భేదమునుగుర్తించెనని డ్యూసేనంగీకరించినాఁడు; ౨ కాని యది వ్యర్థమని నిరసించినాఁడు. బాహ్యప్రపంచ మంతయు బ్రహ్మమిథ్యారూపమే. బాహ్యరూపదృష్టితోఁ జూచిన

(౧) డ్యూసేన్. సిస్టమ్ ఆఫ్ వేదాంత. పు॥ ౨౦౫-౨౦౬.

(౨) శం॥ భా॥ 3॥ ౨, ౨౧.

పుడు బ్రహ్మయే యీశ్వరుఁడగును. మగధ విదేహరాజ్యము లోకే ప్రపంచములోనివైనట్లే, యీశ్వరుఁడును, జీవాత్మలు నొకే పూర్ణవస్తువైన బ్రహ్మకుఁ జెందినవే. 3. నిర్గుణబ్రహ్మ సగుణబ్రహ్మమైనచో నప్పుడు మన కీశ్వర, జీవ, ప్రపంచ త్రయముకలుగును.

నిర్గుణమైన పరమాత్మ తత్త్వమునుండి, ప్రపంచోత్పత్తి కలిగినదని చెప్పవలసిన సిద్ధాంతరూపమగు తత్త్వశాస్త్రము, పూర్వఖండమందైనను, పశ్చిమఖండమందైనను ప్రకృత్యా విష్కరణమున నొక మాయానూత్రమువంటి దవసరమని యంగీకరింపక తప్పనిసరియైనది. ఐరోపావిజ్ఞానములో జగదతీతమైన యేకత్వదర్శనము వినా నిజమైన బాహ్యవస్తుస్థితి లేదని క్యాంటు తత్త్వవేత్త నిర్ణయించియు నాతఁడీ నిర్ణయమును కేవల సిద్ధాంత మాత్రముగానే భావించెనుగాని, వాస్తవికప్రపంచ మంతటికది యాధారభూతమని నిశ్చయింపలేకపోయెను. ఏకస్వరూపము నిందియాతీతమునగు పరమార్థమునకు, వస్తువుల స్వస్వరూప సంబంధమును గల్పించి, యాతఁడు తన తత్త్వనిర్మాణములో హేతువిరుద్ధమగు నొకయంశమును జొప్పించెను. అనుభవ మంతయు నొకవిషయికి సంబంధించినదేయను కేంద్రసత్యమును ఫిక్టే క్యాంటునుండి స్వీకరించి దానినిఁ బెంపొందింప యత్నించెను. విషయవికాసముచే విషయములో నన్యపదార్థమెద్దియుఁ బ్రవేశింపదనియు, నన్నిదశలలోని వికాసము నాంతరంగికమే యనియు నాతని యభిప్రాయము. నిర్గుణ సత్యమాత్మావిష్క-

(3) శం॥ భా॥ 3, 3, 3౧.

రణకార్యములోఁ దనకు భిన్నమైనదాని నూహించును ఆత్మ యనాత్మరూపముననేగాని స్వీయావిష్కృతి నొందఁజాలదు. ఆత్మ యందే యీ యనాత్మబీజమున్నది క్రమముగాఁబర మాత్మయే, తన రూపాంతరములైన భిన్నజీవాత్మలుగా గోచరించు చున్నది అందుచే, ఫిక్టేననుసరించి, యాత్మ తన ప్రవృత్తి నెఱుఁగుటకనాత్మ నడ్డుగా బెట్టుకొనవలెను. శుద్ధచైతన్య మాత్మ సంకోచ మొనర్చుకొనియే భిన్నరూపములగుటకవకాశమున్నది. అట్లే, మన యీశ్వరభావము ననుసరించి, నిర్గుణబ్రహ్మయుఁ ప్రకృతియు, మాయాశక్తియు నవసరములై యున్నవి.

మానవదృక్పథమునుండి చూచినచో, పరిణామప్రపంచ మునకు హేతువును జూపవలసియున్నది. మార్పులేని బ్రహ్మ దీనికిఁ గారణముకాఁజాలదు. బ్రహ్మ మారినచో బ్రహ్మయే కాఁజాలదు. బ్రహ్మ కెన్నడును మార్పులేనిచో మనకు గోచ రించు పరిణామమున కర్థము చెప్పవలెను. పరిణామజగత్తున కచేతనప్రకృతి కారణము కాఁజాలదు. బ్రహ్మ సదూపము. పరిణామమే ప్రకృతి, అద్వితీయబ్రహ్మతో సమానస్థానమును బ్రకృతి కిచ్చుటవలన మనము బ్రహ్మపరిపూర్ణతకు లోపము నాపాదించుచున్నాము. కాని బ్రహ్మేతరమగు రెండవవస్తువును మన మూహింపకున్నచో జగత్కారణమును జెప్పుట దుస్తర మగును. కావున నొక్కటేయుపాయమున్నది; సదూపమును బరిణామమును రెంటినిఁ దనలోఁ గలిగిన సగుణబ్రహ్మము లేక యీశ్వరుని మన మంగీకరింపవలెను. భావాతీతమగు నిర్గుణబ్రహ్మ సంకల్పముచే సగుణమయ్యెను. మూలమున నేకమగుపదార్థము

బహిర్గతమై, సృష్టిరూపము దాల్చెను. స్వచ్ఛము, నేకము స్వయం సంపూర్ణమునగు నిర్గుణబ్రహ్మ సర్వవస్తువులను దనకు బంధించుకొని, వానికిఁ బరస్పరానుబంధమును గలుగఁజేసిన యీశ్వర రూపమును దాల్చెను బ్రహ్మము విషయీ విషయములకు రెంటికి నతీతము. ఒక విషయసంబంధముగల విషయిగా బ్రహ్మము మారినపు డీశ్వరుఁడగును; ఈశ్వరుఁ డనేకత్వములో నేకత్వ రూపము. ఈశ్వరుని శక్తివలనఁ బ్రకృతి, ప్రపంచము నంతను బరిణమింపఁజేయును. ప్రకృతి లేక విషయమునకు స్వతంత్రస్థితి గాని, యర్థముకాని లేదు. అది యచేతనమగుటచే సచేతనమగు శక్తిసాయము లేనిదే దేని నుత్పాదింపఁజాలదు. అది కేవల విషయికితరమైనది; ప్రపంచ మీశ్వరుని కన్యమైనది; ఈశ్వరుఁడు బ్రహ్మయొక్కయుఁ బ్రకృతియొక్కయు మిశ్రమరూపము. ఈశ్వరుఁడు శుద్ధచైతన్యము కాదు; స్వీయజ్ఞానముగల వ్యక్తిత్వము. "అతఁడు సంకల్పించెను; నే ననేకమగుదును; నేను సృజింతును."౧. జ్ఞానము, స్వీయజ్ఞానము, వ్యక్తిత్వము విషయము లున్ననే సాధ్యములగును. సర్వజ్ఞత యీశ్వరలక్షణము; అది యెట్లు సాధ్యమో భిన్నవిధములఁ జెప్పఁబడెను.౨.

(౧) ఛాం॥ఉ॥ ౬,౨,౩; ఐత, ఉ, ౧,౧,౧; ప్రశ్న. ఉ॥ ౬,౩,౪; ముండక ౧,౧,౯.

(౨) సర్వజీవమానసికి సూక్ష్మవాసనలతో నిండియుండు మాయయే యీశ్వరోపాధియని భారతీతీర్థుఁడు వాదించెను. ప్రకటార్థ గ్రంథకర్త యీ భావము నంగీకరించి, కాలత్రయమునందుఁ బ్రపంచముతో నుండునది మాయయనియు, దానిసాయమున నీశ్వరునకు సర్వజ్ఞత్వ మున్నదనియు వచించెను. తత్త్వశుద్ధికర్త, యీశ్వరుని కెల్లపుడు ప్రత్యక్షజ్ఞాన మవసరము లేదనియు,

జ్ఞానము బ్రహ్మస్వభావము. అది యొక్క తెలియువలయు విషయ సంబంధమైనపు డొక కార్యరూపము నొందును. అట్టి విషయమునకు సంబంధించిన బ్రహ్మ, విజ్ఞాతయగును. అనఁగా జ్ఞానస్వరూపియగు బ్రహ్మ జ్ఞేయవిషయ మెవరైనచో జ్ఞాత యగును.౧. అనాత్మ వ్యక్తిత్వముతో సవినాభావసంబధముగల లక్షణమని తలఁచిన రామానుజునితోడను హెగెల్‌తోడను శంకరుఁ డేకీభవించును. కాని వ్యక్తి తేఁ ముత మరూపమని వారు నిశ్చయింపఁగా, ననాత్మసంబాధమున్నంతవరకు మనము వ్యావహారికజగత్తులో నుంటిమని శంకరుఁడు ఘోషించినాఁడు. ఈ భేదము నతిక్రమించినఁగాని పరమార్థసిద్ధి లేదు. శుద్ధ సత్తా రూపము సంబాధ సత్తాయైనపుడు, మొదటిసంబాధ మన వ్యస్తువుతోడ నే యుండును. సత్తులకు భిన్నమైన దసత్తే. ౨. ఈశ్వరుఁడనఁగాఁ దమస్సులోనుండి ప్రకాశించు నవిచ్ఛిన్న జ్యోతిస్స్వరూపమైన బ్రహ్మకు భిన్నుఁడే. ఆతఁడు ప్రకియ

తవర్తమానప్రపంచ మాత్రనికిఁ బ్రత్యక్ష జ్ఞానవిషయమైనను, పూర్వప్రపంచ స్మృతి, భవిష్యత్ ప్రపంచ స్వరూపజ్ఞానము పరోక్షముగ నుండవచ్చు ననియుఁ జెప్పినాఁడు. కౌముదీగ్రంథకర్త, యీశ్వరుఁడు బ్రహ్మలక్షణము లను గలిగి,సర్వవిషయములను బ్రకాశింపఁజేయునవెను.చూ:శం॥భా॥౧,౪,౯ సిద్ధాంతలేశము౧.

(౧) ఇది వాచస్పతిభావము నైయున్నది.

(౨) పోల్చు: "ఈశ్వర జ్యోతి తమస్సులోఁ బ్రకాశించుచున్నది." (సెయింట్ జాన్.౧,౫) దీని పైవ్యాఖ్య నిట్లు బిషప్ వెస్టుకాట్ వ్రాసెను: "తేజస్సుతోఁబా టాకస్మికముగా నంధకారమును గోచరించును." (ది గాస్పెల్ ఎక్కార్డింగు టు సెయింట్ జాన్. పు॥ ౫)

వాతావరణములోఁ గ్రిమమునను స్థాపించు సత్యస్వరూపి;జలో పరిభాగమున నాసీనుఁడై ధ్యానగతుఁడైన స్వరూపమును. 3. అంధకారము కాంతినిఁ గప్పివేసి, సర్వము నాక్రమింపఁజూచుటయు, దానిని దిగమ్రింగివేయుటకై ఈశ్వరజ్యోతి సదా యత్నించుచుండుటయు జరుగుచున్నది. బ్రహ్మమునకు నంధకారమునకును, నీశ్వరునకు నంధకారమునకు సహజవైరమున్నను. చివరకీశ్వరజ్యోతియే జయించును. బ్రహ్మకును జగత్తునకు మధ్యవర్తియై, రెంటిస్వభావములను గలిగియుండువాఁడే యీశ్వరుఁడు. అతఁడు బ్రహ్మతో నొకఁడయ్యు, విషయజగత్సంబంధముగలవాఁడు. సృష్టికిఁ బూర్వమేకూడ సగుణబ్రహ్మయగు నీశ్వరునకు విషయమున్నది. ఆవిషయము "నామరూపములు; అవి యాత్మరూపములును గావనాత్మరూపములును గావు; అవి పరిణతినందలేదు కాని పొందయత్నించుచున్న"వని శంకరుఁడు చెప్పినాఁడు. ౪. ఇచట మనకుఁ బరమాత్మ 'అహం' రూపమై 'యహంభావ విరోధమైనదానిని విషయముగాఁ దలఁచుచున్నది. మార్పును, ప్రవృత్తియు లేకుండు టీశ్వరలక్షణము లెన్నఁడును గాఁజాలవు. వ్యావహారికముగా సత్యస్వరూపియై యాతఁడు నిత్యప్రవృత్తిపరుఁడై తన స్వరూపనష్టమును పునర్లాభమును బొందుచుఁ బ్రపంచమునఁ బ్రవేశించి తిరిగి స్వస్థితిఁగాంచుచునుండక తప్పదు. ఏమియుఁజేయక, ప్రపంచము

---

(3) చూ॥ ఉపోద్ఘాతము శం॥ గీ॥ భా॥

(౪) శ॥ భా॥ ౧, ౧, ౫ "అనిర్వచనీయే, నామరూపే, అవ్యాకృతే, వ్యాచికీర్షితే.

నకు దూరస్థుఁడై, తటస్థుఁడైనవాఁడీశ్వరుఁడుగాఁజాలఁడు; ప్రేమ
నిలయుఁ డసలే కాఁజాలఁడు. ప్రేమ, దాని విషయజీవితమందే
జీవించుచు, దుష్కృతపాపాచరణములనువిడిచి, సుఖదుఃఖభాగ
స్వామియగుటే లక్షణము. శంకరుని దృష్టిలోను, పెక్కు రితర
తత్త్వజ్ఞుల దృష్టియందును, స్వీయ వ్యతిరేకరూపమై, విషయ
విరహితమై, దానితోఁ దన యేకత్వమును బ్రకటింపని స్వీయ
జ్ఞానముగల వ్యక్తిత్వ మసంభవము. స్వీయజ్ఞానముగలవ్యక్తి తన
విషయములమూలముననే జీవించుట, సంచరించుట, స్థితిగలిగి
యుండుటయు జరుగును; కాని, తన విషయవైషమ్యము
లంటనిదై యున్నదని నిరూపించు టవసరమేకాని సమర్థింప
శక్యము కాదు. ప్రకృతిలోని సంఘటనములు, జీవులలోని
మార్పులు నీశ్వరునిలోఁ గూడ మార్పులు కలిగింపక
మానవు. ఈశ్వరోపాధి లేక శరీరమగు ప్రకృతియందు
జీవవ్యాపారము లనేక వికారములను గలిగించునని వేదాంత
పరిభాష నిస్సంశయముగా నంగీకరించుచున్నది,౧. జగదుత్పత్తి
లయములీశ్వరునకు మార్పుగలదనియు, వృద్ధిక్షయము లున్నవ
నియు సూచించుచున్నవి. సృష్టిలయము లీశ్వరజీవితములో
యథార్థసంచలనములైనంతవరకు నీశ్వరుఁడు కాలాతీతుఁడుగాక
కాలవశంవదుఁడేయనియు, సృష్టిలయములు వ్యావహారికజగత్తు

(౧) సృజ్యమానప్రాణి కర్మవశేన పరమేశ్వరోపాధి భూతమాయా
యామ్ వృత్తి విశేషా ఇదమ్ ఇదానీమ్స్రష్టవ్యమ్, ఇదమిదానీమ్ పాలయిత
వ్యమ్, ఇదమిదానీమ్ సంహర్తవ్యమ్, ఇత్యాద్యాకారాజాయంతే. తాసాం
చవృత్తీనామ్ సాదిత్వాత్ తత్ప్రతిబింబిత చైతన్యమపిసాదీత్యుచ్యతే. (౧)

నకుఁజెందినవైనట్లే,యీశ్వరుఁడును జెందుననియుఁ జెప్పవలెను. మన మొక పరివర్తన నియతి నుపయోగించి,దానికొక పరివర్తన శూన్యమగు నిర్వికారమైన యాధారము కావలసిరాగా, నీశ్వర తత్త్వ మట్టిదేయనుచున్నాము; పరివర్తనమంతయు నీశ్వరుని దేహమునకున్నదియని వాదింతుము.౧. ఈశ్వరుఁ డవ్యక్తమగు నొక సూక్ష్మదేహమును ధరించెను; తదంతర్గతమగునామరూప బీజక్షేత్రమీశ్వర కర్మభూమియైనది; కాని యిది యాతని సంకల్పము ననుసరించి కల్పించుకొనిన సంకుచితరూపమే.౨. ఈశ్వరునితో సమాననిత్యతగల రూపములేని పదార్థము నంగీక రించుటచే నీశ్వరు నవిచ్ఛిన్నతకు లోపము నాపాదించును. ఈలోపము స్వగతమైనదేకాని బాహ్యావధిపరికల్పితమనుటవలన నెట్టిప్రయోజనమును లేదు.

సగుణబ్రహ్మము పరివర్తనశీలము గలదైనను, దాని యంతర్గతమై ప్రధానాంశముల కేకత్వము నిలిచియుండుననియు బరివర్తనములు తటస్థలక్షణములనియుఁ జెప్పఁబడెను. నానా రూపములుగా నాత్మావిష్కృతి నొందుటచే నీశ్వరుని యేక త్వము భంగపడదు.౩. "ఐంద్రజాలికునకుఁ దాను సృజించిన

(౧) శం॥భా॥ ౨,౧,౪, దక్షిణామూర్తిస్తోత్రమందిట్లు చెప్పఁబడెను. "చరాచర జగత్తులోనిదంతయు, భూజలాగ్ని వాయుతేజోఽకాశ సూర్య చంద్రులును, జీవమును గలిసి యీశ్వరు నష్టాంగరూపము. ఈశ్వరేతరమైనది మరెద్దియును లేదు."

(౨) అవ్యాకృతమ్ నామరూపబీజశక్తిరూపమ్ భూతసూక్ష్మమ్, ఈశ్వ రాశ్రియమ్, తస్యై వోపాధిభూతమ్॥ (శం॥భా॥ ౧,౨,౨౨)

(3) ఛాం॥ఉ॥౮,౧౪,౧; ౬,౩,౨; తై ఆరణ్యకమ్॥3,౧౨,౭; శ్వే॥ఉ॥౬,౧౨.

మాయవలన దోష మంటనట్లే, సంసారమాయ దానినిఁ గల్పించిన యీశ్వరునంటదు."౪. శంకరుఁ డీరీతిగా,ఁ బరిచ్ఛిన్నవస్తుత దభావముల నీశ్వరునిలో సమన్వయించినాఁడు. సత్పదార్థమును నిర్గుణాత్మపదార్థముగా నిర్ణయించి, దానిరూపమే స్వయంపరికల్పితమగు సగుణతత్త్వమని హేతువిరుద్ధముగా నిశ్చయించిన స్పినోజాకుఁగల యాక్షేపణ శంకరున కనువర్తింపదు. పరిచ్ఛిన్నోపాధి లక్షణముల నన్నిటినిఁ దిరస్కరించినచో నొక సదూప భావాస్తిత్వమే మనకు లభించునని యాతనికిబాగుగాఁ దెలియును. మనము తర్కపద్ధతుల నుపయోగించినంతకాలము పరమసత్యము మనకు నిర్గుణబ్రహ్మముకాక, సగుణబ్రహ్మరూపి యగు నీశ్వరుఁడే యనియు, ననంతపరిణామ పరివర్తనముల కతఁడే యాధారమనియుఁ దెలియఁగలదు. కాని, శంకరుని తత్త్వ మంతటిలోను తర్కసిద్ధమగు జ్ఞానము పరిపూర్ణసత్య ప్రకటన సమర్థముకాదను నిశ్చయము విస్తరించియున్నది. అందుచే నీ సగుణబ్రహ్మ భావము, పరస్పరవిరుద్ధభావములతో నిండియుండుటచే నది పరమసత్యము కానేరదని స్పష్టము.

పరిచ్ఛిన్న ప్రపంచమున కీశ్వరుఁడు మూలకారణము నుపాదానకారణము ననునొక బుద్ధిపరికల్పితభావము. సర్వ సామాన్యమగు సగుణస్వరూపమునందు సామాన్యవిశేషవిషయము లన్నియు నేకమైయున్నవని చెప్పుట సులభమే కాని నిరూ

(౪) శం॥భా॥ ౨,౧,౯. యథాస్వయంప్రసారితయా, మాయయా మాయావీత్రిష్వపి కాలేషు నసంస్పృశ్యతే ఽవస్తుత్వాత్,ఏవమ్ పరమాత్మాఽపి సంసార మాయయా నసంస్పృశ్యత ఇతి.

పించు,టసాధ్యము. భిన్నత్వములో నేకత్వము,పరివర్తనములో నిత్యతయు, మన వ్యావహారికజగత్తులోనే సహేతుకములుగా నిరూపించుట కసాధ్యమైనచో నీశ్వరుని విషయములోను నట్టిదే. శంకరుని సిద్ధాంతము యథార్థాస్తిత్వములేని భావ మాత్రైకత్వమేయను నాక్షేపణకుఁ దావిచ్చునని యాతఁడెరిగి యుండియు, నేకత్వ భిన్నత్వములకుఁ దార్కికముగా సమన్వయ మసాధ్యమని యాతని నిశ్చయము. రెండు నెట్లేకకాలమున నుండఁగలవో తనకుఁదెలియదని శంకరుని నిశ్చయము.౧. పరిపూర్ణసగుణమూర్తియగు నీశ్వరభావము మన యనుభవ జగత్కారణ నిరూపణము కాదు; జగత్కారణసమస్యయొక్క పునరుక్తిమాత్రమే మనయనుభవములో నేకత్వము భిన్నత్వము ననగా నిత్యతయు, (బరివర్తనము నను రెండంశము లున్నవి. జీవులతోడను వస్తువులతోడనుగూడి, పరివర్తనము నిత్యతయుఁ గల సముచ్చయరూపమగు మన యనుభవకారణ మెట్టిదని ప్రశ్నించి, యీశ్వరుఁడే దానికిఁ గారణమనియు నేలన నీశ్వరునికే జీవవస్తు ప్రపంచమంగాంగిసంబంధములో ననుబద్ధమై

(౧) విశేషములతోఁ గూడిన సామాన్యముల యదార్థతాసిద్ధాంతము శంకరున కంగీకృతము కాలేదు; ఏలన నీయథార్థతావాదుల సామాన్యముల కనంతత్వము లేదు. అవి విశేషభిన్నములైన పరిచ్ఛిన్న విషయవర్గములకుఁ జెందినవి; ఈశ్వరుఁడుకూడ నిట్టి సామాన్యస్వరూపియేయైనచో, నాతఁడును పరిచ్ఛిన్నుఁడే కావున ననేకరీతుల నాతఁ డాత్మజ్ఞానికావచ్చును. అతఁ డపరిచ్ఛిన్నుఁడైనచో నతని కొక లేమార్గమున్నది;లేక శంకరునిమాటలలో నాతనికిఁ బరివృత్తియేయుండదు. అతని కస్తిత్వమేకాని పరిణామము లేదు; అందుచేఁ బరివృత్తియు లేదు.

యున్నదని బదులుచెప్పుచున్నాము, అవి యీశ్వరునికి దేహమగుననుట హేతునిరూపణము కాఁజాలదు. వ్యావహారిక జగత్తుయొక్క సర్వసామాన్యలక్షణమున కాకృతిఁగల్పించి యీశ్వరుఁడనుచున్నాము. రామానుజుఁడును, హెగెల్ తత్త్వజ్ఞుఁడును. పరమసత్యము భిన్నతాసహితమగు నేకత్వస్వరూపమనిరి. వారిదృష్టిలో హేతుబద్ధమైనదే యథార్థమైనది; ఈశ్వర జగత్తులు రెండును నిజమే. నిర్వికల్పకమగు ననుభవజ్ఞానము, వస్తుజగద్యాథార్థ్యము వారి నాకర్షింపవు. సత్యస్వరూపము గాదు వారుకోరునది; బుద్ధికిస్ఫురించు సత్యస్వరూపమునే, వారుకోరుదురు; ఇందభావాంశ మిమిడియున్నది. బుద్ధివ్యాపారమంతయుఁ దనకు వ్యతిరేకాంశము లన్నిటిని లోఁగొని, వానినధిగమించుటే. ఆత్మవ్యాపారమంతయు వ్యతిరేకవిషయములతో నెడతెగని సంఘర్షణమే. నిత్యప్రవృత్తియే దైవజీవితము. తార్కికముగాఁ బ్రపంచమొక యేకసూత్రబద్ధమని తలఁచుట పరిపూర్ణనిర్గుణతత్త్వము యొక్క అనంతభిన్నరూపములుగల ప్రదర్శనమేయని భావించుటే. దీనియందలి భావలోపములనుమాత్రము మఱువరాదు.

శ్రుతులు సృష్టిక్రమమును వర్ణించుటకుఁ గారణము బ్రహ్మ జగదేకస్వరూపమును నిరూపించుటకే,౧. ప్రపంచము దేవునిస్వరూపముగాక, వేరుపదార్థముగా దాని నీశ్వరుఁడు కల్పించినచో, నీశ్వరునకుఁ బ్రయోజనమేదియో యున్నదను

(౧) ఏవముత్పత్త్యాదిశ్రుతీనామ్ ఐకాత్మ్యావగమపరత్వాత్
శం|భా( ౪,౩,౧౪; ౨,౧,౩౪

దోషము నారోపింపవచ్చును. అనఁగా నాతఁ డీశ్వరుఁడు కాఁ జాలఁడు. కర్మసూత్రము ననుసరించి యాతఁడు సృజించెనందు మా, యాతని స్వాతంత్ర్యమునకొకానొక మాటంక మేయగును. ఫిక్టేతత్వజ్ఞుఁడు చెప్పిన ఆత్మస్వభావమునుగూర్చి మనము ప్రసంగించియుంటిమి; తాను విచ్ఛిన్నమై, యొక యవరోధము నెదుర్కొని, ఆత్మ స్వీయజ్ఞానమునుబొందుచున్నది. అట్టియాత్మ తాను కారణము నాధారమునగు నన్యపదార్థముపై నాధార పడినదగును. అట్టియాత్మ సృష్టికిఁ బూర్వమందును, పరమందు నుండఁజాలదు. అనాత్మను మనము నిర్మూలింపగలిగినచో దానితో నాత్మనిర్మూలనముకూడనగును. ఈసందర్భము లల్ప ముగా ఫిక్టే దృష్టికానుటవలననే. "విషయీవిషయములుగాక రెంటికి మూలాధారమగు" సత్యమునుగూర్చినభావ మాతనికి స్ఫురించినది. ఫిక్టేసృష్టి కస్పష్టమైన యీవిషయము శంకరుని దృష్టిలో సువిస్పష్టమై, విషయీవిషయభేదములు తర్కవిష యములనియు, (౧పరమార్థము తర్కమున కతీతమైనదనియు విశ దమయ్యెను.. పరమాత్మ జ్ఞానాధిపతియుఁగాదు, జ్ఞానవిషయ మునుగాదు; పరమాత్మయేజ్ఞానము. ఈశ్వరభావమునకు బా హ్యావ్యక్తీకరణమే ప్రపంచమై, యది యీశ్వరుని కెల్లప్పుడు నాత్మజ్ఞానముండుట కనుకూలముగా దానివిషయమై యుండె నన్నచో నట్టి యీశ్వరుఁడు సగుణుఁడే కాని నిర్గుణుఁడు కాఁ

---

(౨) శం॥భా॥ ౨,౨,3౭.

(3) మాయోపాధిః జగద్యోనిః సర్వజ్ఞత్వాదిలక్షణః

(వాక్యవృత్తి పు। ౪౫)

జాలఁడు, ఏలన, "పరమాత్మ, ముకురములోఁ దన ముఖమును జూచుకొనుటకుఁగాని, పంజరములోని యుడుతవలె పరిభ్రమించుటకుఁగాని యాత్మ పరిపూర్ణతాసిద్ధికై పూనుకొనలేదు".౧. ఒక్కమాటలోఁ బ్రపంచకారణములలో వ్యక్తిత్వ ముత్తమ ప్రమాణముకాదు. ప్లాటినస్ చెప్పినాఁడు: "స్వీయజ్ఞానము, స్వీయవైచక్షణ్యముఁగలదేదియైనను మూలరూపముగాదు".౨. కావున నిర్గుణబ్రహ్మ యీశ్వరాతీతమై, స్వగతభేదరహితమై, విషయీవిషయములనవిచ్ఛిన్నమగు తన శుద్ధపరిపూర్ణచైతన్యమున బంధించియున్నదని చెప్పవలెను.

అనుభవజ్ఞానలభ్యమగు నిర్గుణబ్రహ్మకును, బుద్ధిగమ్యమగు సగుణబ్రహ్మకును భేదమున్నది. నిర్గుణబ్రహ్మ తర్కరీతుల కతీతుఁడు; సగుణబ్రహ్మ రూపములో భిన్నతయుఁ దదతిక్రమణమును మేళవించియున్నవి. తార్కికబుద్ధికి నిర్గుణబ్రహ్మ స్వరూపములో, నన్నిరంగులు నేకవర్ణమైన చీకటివలె గోచరించును పరిచ్ఛిన్నజగత్తున కర్థము నిర్గుణబ్రహ్మసంబంధములోఁ జెప్పవలెనన్నచో, పరిచ్ఛిన్నతనందుఁ బ్రవేశపెట్టవలసియుండును. శుద్ధసత్తు మనము బుద్ధిచే భావింతుమా, అసత్తును భావించినవార మగుదుము; రెంటిసంపర్కమువలనఁ బరిణామజగత్తు జనించును. సరిగాఁ జెప్పుచో నీశ్వరుఁడును బరిణామవశుఁడగును. సదసద్విరుద్ధ్య మాతనియం దంతర్నిహితమగును. ఈశ్వ

(౧) సత్యము; తదాభాసము, పు, ౧,౭,౨

(౨) ఏన్నీడ్సు; 3,౮,3, మెక్ కెన్నాస్ ఇటి వాల్యూము ౨, పు ౧౪౧

ము(డే పుట్టుకకలవా(డు కాకపోవచ్చునుగాని, తన స్వరూపము నాత( డసంతపరిణామక్రమముచే వ్యక్తీకరించును. సదసత్తు లేక పరమార్థ భిన్నరూపములే; వస్తువు తచ్ఛాయారూపములు, అనిర్వాచ్యమైన నిర్గుణబ్రహ్మకును, సర్వవ్యావహారికానుభవ విషయములలోనంతర్వర్తియై, యేకీకరణమొనర్చు సగుణబ్రహ్మ మునకును మధ్యమందొక యవిలంఘ్యమగు భిదక్రముంచినా(డని శంకరునివిమర్శించువారలకు, రెంటియొక్క దృక్పథములనుగూర్చిన సంశయజ్ఞానమే కారణము. బుద్ధి పరికల్పితజ్ఞానము విషయీ విషయభేదము నెన్న( డతిక్రమింప(జాలదు. అందుచే సగుణ బ్రహ్మమే యిట్టి జ్ఞానమున కుపలబ్ధరూపము. దీని కతీతమై నిర్గుణబ్రహ్మయున్నది.

## ౨౯—జగన్మిథ్యాత్వము.

బ్రహ్మయు జగత్తును, ననగా నేకత్వము ననేకత్వమును రెండును సత్యములుగా(జాలవు. "ఏకత్వ బహుత్వములు రెండును సత్యమైనచో లౌకికప్రవృత్తి పరు(డైనవా( డసత్యగతు( డయ్యెనని మనము చెప్పుటకు వీలులేదు...... జ్ఞానమువలన మోక్షముచేకూరునని చెప్పరాదు; మఱియు నేకత్వజ్ఞానముచే ననేకత్వజ్ఞానము నతిక్రమింపలేము."౧. వాస్తవికతా ప్రమాణ ములం బట్టి పరిశీలింప(గా వ్యావహారిక జగత్తు మిథ్యాలక్షణ యుక్తమని తెలియ(గలదు. విశేషాంశములు, సంఘటనలు విషయములై యొక తెలిసికొను విషయికి సంబంధించియున్నవి.

(౧) శం॥భా॥ ౨,౧,౧౪.

జ్ఞానవిషయ మేదైనను నశ్వరమైనది.౨. అర్థము దాని మిథ్యా రూపమునకుఁ గల భేదమే విషయికి విషయమునకుఁ గల భేదమునకును సరిపోవునని శంకరుని వాదము. దృష్టవిషయములన్నియు నసత్యములు; ద్రష్టయు నదృష్టము నగునాత్మ సత్యమైనది.౩. జాగ్రద్విషయములను స్వప్న విషయములతోఁ బోల్చుచో, విజ్ఞానమునకు విషయములుగా రెండు నసత్యములే.౪. సత్యమవిరోధమైనది; ప్రపంచము విరోధసముద్రము. దేశకాలనిమిత్త కల్పితమగు ప్రపంచము స్వయంసంపూర్ణము కాదు. పరిచ్ఛిన్న జగత్సమస్యలను బరిష్కరించుటకు సమర్థమైన సూత్ర మీజగత్తులో నేదియును లేదు. సర్వవ్యవహారజగదనుభవ రూపములగు దేశకాల నిమిత్తములు పరమప్రమాణములుగావు. సత్యము వీనిచే నాచ్ఛాదితమైనది. మనము దేశకాలనిమిత్త విషయముల నతిక్రమించినచో నానాత్వభూయిష్ఠమగు ప్రపంచ మేకరూపము నొందునని చెప్పఁబడెను.౧. దేశకాలనిమిత్తములను 'మూసల'లోఁ బోసిన మన యనుభవము సత్యము కాదు. సత్యము సార్వకాలికము.౨. అది పూర్వ

(౨) యద్దృశ్యమ్ తన్నశ్యమ్॥

(౩) పోల్చు: "కనపడు వస్తువు లనిత్యములు; కనపడనివే నిత్యములు"

(౪) దృశ్యత్వ మసత్యమ్ చ అవిశిష్ట ముభయత్ర॥ (శం।భా।గౌడపాదకారిక. ౨,౪.)

(౧) పోల్చు: "అస్తిభాతిప్రియమ్ రూపమ్ నామచే దంశపంచకమ్; ఆద్యంత్రయం బ్రహ్మరూపమ్ జగద్రూపమ్ తతోద్వయమ్." చూ: అప్పయ దీక్షిత సిద్ధాంతలేశము॥ ౨.

(౨) త్రైకాలికాద్య బాధిత్వమ్॥

మున్నది; వర్తమానములోనున్నది, ముందుండును. 3. యథార్థవస్తు వీనాఁడుండి రే పదృశ్యమగునదికాదు. వ్యావహారికజగత్తెల్లప్పుడు నుండదు కావున యథార్థముకాదు. యథార్థదృష్టి కయథార్థమైన జగత్తు గోచరించదు. అందుచే యథార్థజ్ఞానము వలనఁ బరిహార్యమగు జగము నిజముకాదని చెప్పఁబడెను. ౪. పరమైనసత్య మపరమైనదాని నసత్యమొనర్చును. లోకములోని విషయములకు మార్పుగలదు. అవి స్థిరవస్తువులుగాక, నిత్యము మారుచున్నవి. ఏది మారునో యదెన్నడు మారని నిత్యవస్తువు కాఁజాలదు. శంకరుఁడు చెప్పినాఁడు:" నిత్యమగు నెద్దానికి నాదియుండదు; ఆదిగల దేదియు నిత్యముగాదు."౫. మారుచుండు వస్తువులెవ్వియు మనకు సంతృప్తినీయఁజాలవు; ఎన్నడుమార్పులేనిదే సత్యమైనది. ౧. నిజమైనదెన్నఁడును

---

(3) కాలత్రియసత్తాకత్|| పోల్చు: విష్ణుపురాణము; "యత్తుకాలాంతరేణాపినాన్య సంజ్ఞాముపైతి వై, పరిణామాదిసంభూతామ్ తద్వస్తు" (౨, ౧౩, ౯౫.) పోల్చు: క్రిస్టియన్ లిటర్జీ; "మొదట నెట్లుండెనో, యిప్పుడు నట్లే యెన్నటికి నట్లేయుండఁగలదు; జగత్తున కంతములేదు"

(౪) జ్ఞానైక నివర్త్యత్వమ్|| "అద్వైతసిద్ధి కలిగినంతనే, జీవాత్మ యొక్క సంసార పరిభ్రమణమును, నీశ్వరుని సృజనశక్తియు నదృశ్యము లగును అవిద్యాకల్పితమగు ద్వైతప్రపంచ రూపమంతయుఁ బూర్ణజ్ఞానముచే నివృత్తమగును" (శం॥భా॥ 3,౨,౪; ఆత్మబోధ ౬,౭.)

(౫) నహినిత్యమ్ కేన చిదారభ్యతే, లోకే యదారబ్ధమ్ తదనిత్యమ్. (శం॥భా॥ తై॥ ఉ॥ ఉపోద్ఘాతము.)

(౧) యద్విషయాబుద్ధి ర్న వ్యభిచరతి తత్సత్; యద్విషయాబుద్ధి ర్వ్యభిచరతి తదసత్. చూ॥ శం॥ భా॥ ౧, ౧, ౪; తై॥ ఉ॥ ౨, ౧.

లేకుండనుండదు. సంసారములోని దేదియైన నిజమైనదైనచో మోక్షస్థితిలోను నిజమైనదికావలెను. ఈభావమునననుసరించి, పరివర్తనాత్మకజగత్తు నిజముకాదు. ప్రపంచము శుద్ధసత్తుగాని శుద్ధాసత్తుగానికాదు. శుద్ధసత్తు జగత్పరిణామములోనిది కాదు. శుద్ధాసత్తు హేతుబద్ధమైన భావమేకాదు;ఏలన నదియట్టిదైనచో శుద్ధాభావమొక వస్తువనవలసివచ్చును; సర్వవస్త్వభావమొక భావమనుట వైరుధ్యమగును. అభావమొక వస్తువు కాదు. మారుచున్నదే యున్నది; అది కార్యముల నుత్పత్తిచేయుచున్నది. కావున సత్తును గాదసత్తునుగాదు.౨. ఏదశయందును జగత్తుసత్తై, పరిణామహీనము కాఁజాలదు. పరిపూర్ణత నందుటకై నిత్యమును కృషిచేయు ప్రవృత్తిగలదే ప్రపంచము; కాని పరిపూర్ణత దానికెన్నడును సిద్ధించదు. సృష్టికందరానిదై యేదోయున్నదని యెల్లప్పుడు స్ఫురించును. ౩. ఆత్మసిద్ధియే ప్రపంచప్రవృత్తి కవసానదశ; ౪. కాని ప్రపంచము ప్రపంచముగానుండఁగా నది సాధ్యముకాదు.ఈశ్వరజగత్సంబంధము నిత్యమైనది. సదసత్సంబంధ మన్యోన్యవిరుద్ధమైనది; సత్తు అసత్తును స్వాధీనమొనర్చుకొని సత్తుగా మార్చు

---

(౨) అర్థక్రియాకారి. పోల్చు: సురేశ్వరుఁడు: "కేవలాసత్తునకు సామర్థ్యము లేదు; సత్తుతో వేరుగాఁగాని, కలిసికాని యుండఁజాలదు. అందుచే సత్తే క్రియాకారి." (వార్తికము పు.౨౭.

(౩) శం॥ భా॥ ౪, ౩, ౧౪.

(౪) శం॥ గీ॥ భా॥ ౧౮-౫౦.

కొనయత్నించును. పరిణామజగదధ్యక్షుఁడైన యీశ్వరునిలక్ష్య మిదియే; అసత్పదార్థమునాతఁడు జయించి, సత్పదార్థముగా నెల్లప్పుడును గావింపఁజూచును; కాని తర్కబుద్ధి కీప్రయత్నము దుస్సాధ్యమై పరిణమించును. అంతులేని యీ సదసత్సంఘర్షణమే యీప్రపంచపరిణామక్రమము. సృష్ట్యాదినుండియు నంతమువరకు వెలుతురు చీకటిపై దండయాత్ర చేయుచుండుటచే నడచుచున్నది. చీకటిని మనము దూరదూరముగాఁ దరుమవచ్చును; చీఁకటి తప్పుకొనునేకాని తొలఁగిపోదు. పరిచ్ఛిన్నజగత్తులో సదసత్సంబంధ మొకదానికొకటి కలియకుండునది కాదు. అది పరస్పరసంఘర్షణమే; వానిసంబంధ మన్యోన్యశత్రుత్వమే. ఇందే యొకటియు రెండవదిలేనిదే యుండదు. ఒకదానిలోనింకొకటి యెంతగాఁ బ్రవేశించినను, వాని భేదతారతమ్యము లవినాశములైయుండుటచే, జగత్తులోని సర్వమస్థిరమై, గోచరించును. పరిణామ జగదీశ్వరుఁడైన దేవుని యందుఁగూడ నీ యసద్రూపమున్నది. అసద్రూపములైన లోపములను విడిచినచో సర్వవస్తు స్వస్వరూపముచు దనలో నిమిడ్చికొనియున్న బ్రహ్మమే నిజమైన సద్రూపము, తద్భిన్నమైనదంతయును సత్యమే. ౧. తాను కానిదగుటకును, తన్నతిక్రమించి పోవుటకును యత్నించునదే సంసారప్రవృత్తి. ప్రపంచమున కస్తిత్వమును లేదు, లేకపోనులేదు; అందుచే

(౧) బ్రహ్మభిన్నమ్ సర్వమ్ మిథ్యాబ్రహ్మభిన్నత్వాత్. (వేదాంత పరిభాష.)

స్వరూప మనిర్వచనీయము." అది సదసద్భిన్నమైనదయ్యు, రెంటిలక్షణములను గలిగియున్నది. ౩. ప్లేటో వచించినట్లు, పరిచ్ఛిన్నవస్తువులన్నియు సదసన్మిశ్రితములు. ౪. దృశ్యమానప్రపంచ వస్తువైవిధ్యమునకు సత్తే మూలకారణము కావలెను; ఏలన మఱెద్దియును లేదు; కాని ప్రపంచము మాత్రము యథార్థముకాదు. అందుచే నది సత్యముయొక్క వికల్పమని చెప్పఁబడెను. ౫. పరిచ్ఛిన్న జగత్తంతయు బొశాంకే మాటలలో, "నిత్యానిత్య వస్తుస్వభావ మహత్తరవైరుధ్యము". భూమ్యాకాశములు నుసిమైపోనగును; మనశరీరము శిథిలమగును; మన యింద్రియములు మార్పునొంది మన వ్యావహారికములైన జీవాత్మలు చెదరిపోవచ్చును. ఇందేదియుఁ బారమార్థికముగా సత్యముకాదు. ప్రపంచస్వభావమును గూర్చి చెప్పఁబడిన యీలక్షణమునకే మాయయని పేరు.

## ౩౨. మాయాసిద్ధాంతము.

అద్వైతతత్త్వమందుఁ బ్రధానలక్షణమైన మాయాసిద్ధాంతముయొక్క తాత్పర్యమును మనము సరిగా గ్రహించవలసి

---

(౨) తత్త్వాన్యత్వాభ్యామ్ అనిర్వచనీయా ... పోల్చు: ప్లాటినస్ ఎన్నీడ్సు. 3, ౬, 3; మెక్ మన్నాస్ ఇ. టి. వ్యాఖ్యానము ౨ పు. ౭౯.

(౩) సదసద్విలక్షణ.

(౪) సదసదాత్మక.

(౫) సత్యానృతే మిథునీకృత్య. (శం. భా. (ఉపోద్ఘాతము.)

యున్నది.౧. పూర్వాధ్యాయమున మనము జూచినకారణము లనుబట్టి ప్రపంచము యథార్థమైనదని యంగీకరించుటకు వీలు లేని కారణముచే మాయయని చెప్పఁబడెను. సత్యమగు బ్రహ్మమునకు నసత్యమగు జగత్తునకుఁగల సంబంధమెట్టిది? శంకరుని దృష్టికీప్రశ్నయే అయుక్తమైనదగుటచేఁ బరిష్కారశూన్యమైనది.

---

౧. మాయ యనగా ఋగ్వేదమునందు దేవతలయొక్క, అందు ముఖ్యముగా వరుణేంద్రమిత్రుల అతిమానుషశక్తిగా వర్ణింపఁబడినది. ప్రాచీన ఋక్కులలో మాయ జగత్తునంతను నిలుపు శక్తియని చెప్పఁబడెను. (ఋ, వే, 3,3౮,౭; ౯,౪3,3; ౧,౧౪౯,౪; ౫,౮౫,౫) మొసమునఁగా పంచనార్థములో నసురుల లక్షణమనియు వారితో దేవతలెల్లప్పుడు వైరముగల్గియుండిరనియుఁ దెలియుచున్నది. సుప్రసిద్ధమైన యొక ఋక్కులో (౬,౪౭.౧౮) ఇంద్రుఁడు తన మాయాశక్తిచే ననేకరూపములుదాల్చెనని వర్ణింపఁబడినది:

రూపమ్ రూపమ్ ప్రతిరూపో బభూవ
తదస్యరూపమ్ ప్రతిచక్షణాయ
ఇంద్రోమాయాభిః పురురూపఈయతే
యుక్తాహ్యస్యహరయశ్శతాదశ.

"అతఁడెన్నియో రూపములలో నూహింపఁబడెను; ఇవన్నియుం నాతనిరూపమేయని భావింపవలెను. అనేకరూపములలో నింద్రుఁడు యామాశక్తిచే సంచరించును. వేయిగుఱ్ఱము లుపయోగింపఁబడెను" ఇచట మాయ యనగా ననేక విచిత్రరూపములఁదాల్చు శక్తి. ఋ।వే। ౫,౫౪,౭, యిట్లున్నది: "నీవు నిందుదేహరూపమునుదాల్చినపుడు నీబలమును బ్రకటించుచు మానవులలో సంచరించినావు; ఓ ఇంద్రా! మనుజులుచెప్పు నీవుచేసినయుద్ధములన్నియు నీమాయాకల్పితములు. పూర్వముకాని, యిప్పుడుకాని నీకెవ్వరును శత్రువులులేరు" ఇంద్రునిచర్యలు విలాసక్రీడలు. ప్రశ్న ఉ,౧,౧౬ లో మాయ యనగా మిథ్యయను నర్థములో వాడఁబడెను. శ్వే, అ, ఉ, ౪,౧౦ భ, గీ, ౪,౫.౭; ౧౮-౬౧ లో నీశ్వరునకు మాయాశక్తి కలదని వచింపఁబడెను.

నిర్గుణబ్రహ్మ సాక్షాత్కారసిద్ధిలో బ్రహ్మ జగత్సంబంధప్రశ్నయే బయల్వెడలదు; ఏలన, వివాదముల కవకాశము లేని సత్యాము దర్శింపఁబడినది. తార్కికముగాఁ జూచినచో, జగత్తునకు సంబంధముగల శుద్ధబ్రహ్మము లేదు. వాదాంతరమందు మనము దృక్పథమును మార్చుచుండుటచే నీసమస్యాబయలు దేరును. ఊహాకల్పితమగు సమస్యకు యథార్థమగు పరిష్కారముండఁ జాలదు. సంబంధము రెండుభిన్నవస్తువులకే యుండును; బ్రహ్మకును జగత్తునకును సంబంధము చెప్పవలెనన్నచో నవి భిన్నములని చెప్పవలెను; కాని ప్రపంచము బ్రహ్మేతరము కాదని యద్వైతము చెప్పుచున్నది. శంకరుఁడు కార్యకారణత్వమునకును అనన్యత్వమునకును భేదమును వివరించినాఁడు. ౧. బ్రహ్మయు జగత్తు ననన్యములు; అందుచే వానికిఁగల సంబంధసమస్య కవకాశము లేదు. బ్రహ్మాధారముగలదే జగము. ౨. కాని బ్రహ్మయే జగత్తనియుఁగాదనియుఁగూడఁ జెప్పవలెను. జగత్తు బ్రహ్మయే; ఏలన బ్రహ్మేతర మేమియును లేదు; జగత్తు బ్రహ్మ కాదు; ఏలన జగత్తునకుఁగల జననలయాదికములు బ్రహ్మకు లేవు. బ్రహ్మ జగద్వస్తుసముచ్చయము కాదు. బ్రహ్మ జగత్తులను వేరుపరచినచో, బాహ్యమునుండి మనము వానికిఁగలువు

---

౧. అతశ్చ కృత్స్నస్య జగతో బ్రహ్మకార్యత్వాత్ తదనన్యత్వాత్, (శం।భా। ౨,౧,౨౦)

౨. దీనితో స్పినోజా కారణసిద్ధాంతమును బోల్చుఁడు: సర్వపరిచ్ఛిన్న వస్తుసముచ్చయాంతర్వర్తియగు కారణ మీశ్వరుఁడన్నచో నది ద్రవ్యగుణ సంబంధ మగును.

సంబంధబంధము బలహీనము; కృత్రిమము నగును. బ్రహ్మ జగత్తు లొకటే; అవి సత్యము, తచ్ఛాయయువలె నున్నవి. కొన్ని యవరోధములచే నాచ్ఛాదితమైన యవిచ్ఛిన్నవస్తువే పరిచ్ఛిన్నవస్తువు. ప్రపంచము బ్రహ్మమే; ఏలన, బ్రహ్మము నెఱిగినచో, జగత్సమస్యలన్నియుసమసిపోఁగలవు. జగత్తు స్వయముగా యథార్థస్వరూపమని మన పరిచ్ఛిన్నమనస్సు భావించుటచే నీ సమస్యలన్నియు జనించినవి. నిర్గుణబ్రహ్మము నెఱిగినంతనే, పరిచ్ఛిన్నరూపము లు నవరోధము లు నదృశ్యములగును. సత్యస్వరూపమగు బ్రహ్మ పదార్థముకాని హేతువుచే జగత్తు మాయారూపమనఁదగును.

తర్కప్రమాణములవలన బ్రహ్మ జగత్సంబంధమును జెప్పుట దుస్సాధ్యమని శంకరుఁడు వక్కాణించినాఁడు. "సత్తున కసత్తుతో నెన్నడు సంబంధముండదు."(౧). అవిజ్ఞాతకారణముచే నెట్లో ప్రపంచమున్నది; దానికి బ్రహ్మతోఁగల సంబంధ మనిర్వచనీయము. అట్టి సంబంధమునుగూర్చి చేసిన నిర్వచనముల నన్నిటిని దీసికొని, వానిలోపములను శంకరుఁడు ప్రదర్శించినాఁడు. అపరిచ్ఛిన్నమగు బ్రహ్మము పరిచ్ఛిన్నజగత్తును సృజించెనన్నచోఁ బరిచ్ఛిన్నతాదోషము బ్రహ్మకనువర్తించును. బ్రహ్మ జగత్సంబంధము కార్యకారణసంబంధము కాఁజాలదు. ఏలన, కాలగతమగు భిన్నదశారూపములకే కారణ కార్య సంబంధ మన్వయించును. బ్రహ్మ కారణమనియు జగత్తు కార్యమనియుఁ జెప్పరాదు; ఏలన బ్రహ్మకు జగత్తునకును భేదము

(౧) నహి సదసతో స్సంబంధః (శం॥ భా॥ మాం ఉ ౨, ౭)

చెప్పి, బ్రహ్మ నొకవస్తువుగాఁ జేసి యింకొకవస్తువుతో సంబంధముగల దానినిగా నిర్ణయించుటగును. మఱియు జగత్తు పరిచ్ఛిన్నము; అపరిచ్ఛిన్నము ననంతమునగు బ్రహ్మమెట్లు దానికిఁ గారణము కాఁగలదు? పరిచ్ఛిన్నమైన జగత్తు పరిమితము ననిత్యమునైనచో నపరిచ్ఛిన్నమైన బ్రహ్మము పరిచ్ఛిన్నజగత్తునకవధియైనయెడల నదియుఁ బరిచ్ఛిన్నమైనదే యగును. అపరిచ్ఛిన్నమగు బ్రహ్మ మెట్లుపరిచ్ఛిన్నమైనదగునో దురూహ్యము. అవ్యక్తబ్రహ్మ మొక ముహూర్తమున వ్యక్తముగావలెనని నిశ్చయించునా? శంకరుఁడు గౌడపాదుని యజాతివాదమును సమర్థించినాఁడు. ప్రపంచ ముదయించనేలేదు; ఉదయించినట్లు మన దృష్టిదోషముచే గోచరించును. ప్రపంచము బ్రహ్మకనన్యము నవ్యతిరిక్తమునై యున్నది. "ఆకాశముతో నారంభమైన వ్యక్త ప్రపంచము కార్యము; పరబ్రహ్మము కారణము. పరమసత్యస్వరూపమైన యీ కారణముతోఁ గార్యమేకము; ఏలనఁ గార్యమునకు భిన్నమగు నస్తిత్వము లేదు."౧. అది యేకత్వరూపము; లేక వ్యావహారికభాషలో నిత్యసాహచర్యము; అంతే కాని కాలాంతర సన్నివేశముకాదు; కాలాంతర్గతమైన విషయములకే క్రమమును గూర్చునది కారణశక్తి. ప్రపంచము యొక్క మూలాత్మస్వరూపమే బ్రహ్మము. ప్రపంచముబ్రహ్మమునకు వేరై గోచరించినచో, మనకుగోచరించునది నిజస్వరూ

---

౧. కార్యమాకాశాదికమ్ బహుప్రపంచమ్ జగత్, కారణమ్ పరంబ్రహ్మ తస్మాత్కారణాత్పరమార్థతో ఽనన్యత్వమ్ వ్యతిరేకేణాభావః కార్యస్యావగమ్యతే॥ (శం॥భా॥ ౨,౧,౧౪.)

పము కాదని చెప్పవలెను.౨. పరబ్రహ్మమునకుఁ బ్రవృత్తియు నుండదు. ఏలనఁ బ్రవృత్తి పొందవలసిన లక్ష్యమో, సిద్ధియో లేకుండ నుండదు. పరమాత్మ పరిచ్ఛిన్న జగన్మూలమున వ్యక్త మగుచున్న దన్నచో, పరిచ్ఛిన్నమైన దపరిచ్ఛిన్నమైన దానిని వ్యక్తీకరింపఁజాలదని శంకరుఁడు సమాధానమిచ్చెను. ప్రపంచ మున్నను లేకున్నను, బ్రహ్మ మెల్లప్పుడు సూర్యునివలెఁ బ్రకాశించుచునేయున్నది. కొన్నివేళల మనము రవికిరణములను దర్శింపకున్నచో నాదోషము రవికిఁజెందదు. బ్రహ్మము స్వస్వరూపస్థితమై యెల్లప్పుడు నుండును. బ్రహ్మమునకు, బ్రహ్మ యొక్క వ్యక్తరూపమునకును భేదమును జెప్పఁజాలము. రెండు నొకటే. బీజవృక్షన్యాయ మిచట సరిపడదు;ఏలన నవి కాలదశలకుఁజెందిన పరిణామరీతులు. కాలప్రమాణములను కాలాతీతమగు బ్రహ్మ కారోపించుటచే మనము నిత్యమగు బ్రహ్మనొక పరిచ్ఛిన్నవస్తువుగాఁ జూచినట్లగును. ఈశ్వరున కాత్మవ్యక్తీకరణమునిమిత్తము సృష్టి యవసరమని యన్నచో నట్టి యీశ్వరుఁ డంతర్వర్తిమాత్రుఁడే యగును. శంకరుఁడు పరిణామవాదము నంగీకరింపఁడు. ప్రపంచముగామారునది బ్రహ్మయా?బ్రహ్మలో నొకభాగమా? బ్రహ్మయేమైనచోఁ బ్రపంచ రూపమున మనయెదుటనే యుండుటచేఁ దదతీతమగు సత్యమేద్దియును లేదు. బ్రహ్మభాగమే లోకమైనచో బ్రహ్మ విభాజ్యుఁడగును. ఏది విభాజ్యమో అది నిత్యము కాదు. ౧.

---

(౨) చూ: శం॥భా. ౨,౧,౧౪; ౨,౩,౩౦; ౨,౩,౬.

(౧) శం॥భా॥ ౨, ౧, ౨౬.

బ్రహ్మ నిరవయ స్వరూపియని శ్రుతులు చెప్పుచున్నవి ౨. అందుచే బ్రహ్మపూర్తిగాఁ గాని, కొంతగాని ప్రపంచముగా మారినచో బ్రహ్మ స్వతఃస్థితిని గోల్పోయినవాఁడగును. జగత్పరిణామముతోఁబాటు బ్రహ్మకుఁ బరిణామమున్నచో, మన ప్రవృత్తులచే బ్రహ్మవికాసమున కభివృద్ధియున్నచో నప్పుడు బ్రహ్మ గుణసహితుఁడగును. కాని, బ్రహ్మమొక్కటే సత్యమై పరిణామజగద్భేదములన్నియు నందులో విలీనములైనవే యైనచో, జగత్తులోని ద్రవ్యగుణాదికము జీవితమున కర్థశూన్యమగును. బ్రహ్మ జగత్సంబంధమునకు, వృక్షశాఖాసంబంధము గాని, సాగరతరంగ సంబంధముగాని మృత్కుంభసంబంధము గాని, యుపమానములుగాఁ జెప్ప వలనుపడదు; ఏలన నివి యన్నియు బుద్ధిపరికల్పిత ద్రవ్యగుణ సంబంధములుమాత్రమే. పరమాత్మయు జీవాత్మలు, నిరవయవము లేయగుటచే, వాని సంబంధము బాహ్యమగు సంయోగముకాని, యాంతరంగికమైన సమవాయముకాని కాఁజాలదు. జీవాత్మలు బ్రహ్మమందుఁగాని బ్రహ్మ జీవాత్మలందుగాని సమవాయసంబంధమున నుండెనా ? పరిణామ జగత్తుతో బ్రహ్మమునకు సంబంధమునుగూర్చు ప్రతియత్నమును విఫలము గాక తప్పదు. పరిచ్ఛిన్నజగత్తున కపరిచ్ఛిన్న బ్రహ్మముతోఁ గల సంబంధము మానవబుద్ధికి గ్రాహ్యముకాని పరమ రహస్యమై తోఁచును. జగత్తున కాధారమవ్యయమగు పరమాత్మ

(౨) శ్వే॥ ఉ॥ ౬, ౧౯; ముం॥ ఉ॥ ౨, ౧-౨; బృ॥ ఆ॥ ఉ॥ ౨, ౧, ౧౨; 3, ర, ర.

యేయనియు, రెంటిసంబంధములో నెట్టిభిదయును లేదనియుఁ బ్రతిమతమును జెప్పును గాని నేటివరకు నా రెంటికిఁగల సంబంధమును సహేతుకముగా నెవ్వఁడు చెప్పఁగలిగియుండ లేదు. ౧. మనకుఁగలిగిన విజ్ఞానాభివృద్ధి సాహాయ్యమున బాహ్యజగద్దృశ్యముల స్వరూప స్వభావముల నెక్కువవివరము గాను, సూక్ష్మముగాను వర్ణింపవచ్చునుగాని, జగత్తు పరమాత్మనుండి యెట్లుద్భవించినదో మన మూహింపఁజాలము. మన హేతువాద శృంఖల మెంతదీర్ఘమైనదైనను గావచ్చును; దాని లోని లింకులసంఖ్యయుఁ బెరుగవచ్చును, గాని, మన మొక ఘట్టము చేరునప్పటి కాగిపోయి, యిఁక ముందుకుఁ బోఁ

(౧) ౨, ౧, ౨౪-౨౬. "ప్రపంచ మెట్లెందున్నదో, దాని పరిచ్ఛిన్నతకుఁ గారణమేమో చూపుట దుస్తరము అంశమాత్రమైన మానవ బుద్ధికి సంపూర్ణమగువిషయము విదితమైనదగును." "పరిచ్ఛిన్న జీవకేంద్రములలోఁ బరిచ్ఛిన్నరూపముఁగూర్చి యిది యది యను ననుభవమున్నది." "జగద్దృశ్య మేలయున్నదో మన మెఱుఁగఁజాలము. (అప్పియరన్సు; అండ్ రియాలిటీ పు॥ ౨౦౪, ౨౨౬, ౪౧౩.). గ్రీన్ పండితుననుసరించి, కాలాతీతము పరిపూర్ణమునగు నిత్యచైతన్యమొకటి యున్నదనియు, మిగిలిన చేతనరూపము లన్నియుఁ గాలవశములు, నసంపూర్ణములు, ననియుఁ జెప్పవచ్చును. రెంటికిఁగల సంబంధము దురూహ్యమని గ్రీన్ అంగీకరించెను. ఒక పరిపూర్ణచైతన్య మేల నానాచేతనాకృతులను సృజింపవలెనను ప్రశ్న పరిపూర్ణచైతన్య మట్లేల యుండవలెనని ప్రశ్నించుటేయగును. పోల్చు: స్కిల్లర్: జగదుత్పత్తిసమస్య పూర్తిగానయుక్తమైనది; ఏలన, నిందడుగరాని విషయ మడుగఁబడినది, సత్య మేల యెట్లున్నదని దీని తాత్పర్యమైయున్నది. ఇది యేతత్త్వశాస్త్రమును బరిష్కరింపఁగలదియుఁ గాదు; పరిష్కరింపనవసరమును లేదు." (స్టడీస్ ఇన్ హ్యూమనిజమ్.)

జాలనిస్థితి సంభవించును. మాయాశబ్దము మన పరిచ్ఛిన్నతను, మనజ్ఞానములో నొక ఛిద్రమును వ్యక్తీకరించును. మాయావి తన యింద్రజాలశక్తిచే నొకవృక్షమును శూన్యమునుండి సృజించును. వృక్ష మెట్టయెదుటనున్నమాట నిజము; అదియెట్లు కలిగినదో మనకుఁ దెలియదు గావున దానిని మాయ యందుము. ఈజగత్సమస్య కుదాహరణముగా నీటీవల ననేకాపార్థములకు గురియైన రజ్జు సర్పభ్రాంతిని శంకరుఁడు ప్రకటించినాఁడు. రజ్జుసమస్యయే జగత్సమస్య; రజ్జువేల సర్పముగా గోచరించునను ప్రశ్నను బాలురడుగవచ్చునుగాని దానికిఁ దత్త్వవేత్తలును సమాధానము చెప్పఁజాలరు. బ్రహ్మ జగద్రూపమున గోచరించు సమస్య యింకను కఠినతరమైనది. రజ్జువు సర్పముగా గోచరించునట్లే, బ్రహ్మము జగత్తుగా గోచరించునని మాత్రమే మనము చెప్పఁగలము. (1) ఈశ్వర పరబ్రహ్మ సంబంధసమస్య, జగద్బ్రహ్మ సంబంధసమస్యయొక్క విశిష్టమైనరూపమే.

జగత్తు బ్రహ్మపై నాధారపడినను, బ్రహ్మకీ సంబంధముచే దోషముపట్టదని చూపుటకై శంకరుఁడు కారణమునకుఁ బరిణామోపాదానత్వమునుగాక వివర్తోపాదానత్వమును గల్పించెను. వివర్త మనఁగాఁ దలక్రిందగుట, దేశకాలాద్యవచ్ఛిన్నమగు జగత్తు బ్రహ్మయొక్క వివర్తరూపము. మూలద్రవ్యము పరబ్రహ్మము; దేశకాలస్థమగు రూపములో బ్రహ్మయొక్క

(1) మాయామాత్రమ్ హ్యేతత్ యత్పరమాత్మనో ఽవస్థాత్రయాత్మనావభాసనమ్ రజ్జ్వా ఇవ సర్పాదిభావేన ... (శం॥ భా॥ 2,1,9.)

రూపాంతరమే జగత్తు; రూపాంతరము మనకొఱకై కల్పితము గావున బ్రహ్మకు దానిపై నాధారపడవలసిన యవసరము లేదు. అనేకత్వరూపమగు ప్రపంచముయొక్క దృశ్యమును పరమాత్మ మనకుఁ బ్రదర్శించునదే కాని యది పరమాత్మ స్వస్వరూపముగాదు. పాలు పెరుగుగా మారినపుడు పరిణామము; త్రాడు పాముగా గోచరించుట వివర్తమగును.౨. రజ్జుసర్పము శుక్తిరజతము, మరుమరీచిక, మున్నగు శంకరుఁ డుపయోగించిన యుపమానములన్నియుఁ, గార్యము కారణముపై నాధారపడునే కాని, కారణమగు బ్రహ్మ కార్యమగు జగత్తుపై నాధారపడదని సూచించు నిమిత్తమే. పరిణామమందు గార్యకారణములొకే వాస్తవిక క్రమమునకుఁ జెందినవి; వివర్తములోఁ, గార్యము కారణభిన్నమైన క్రమమునకుఁ జెందినదై, సర్పము రజ్జువునందువలె బ్రహ్మమందు నివసించును.౧.

మాయాసిద్ధాంతమున కద్వైతగ్రంథములం దర్థాంతరములొసఁగఁబడినవి. ౨బ్రహ్మ మేకమేగావున మాయ బ్రహ్మభిన్నము కాఁజాలదు; బ్రహ్మ మదివరకే పరిపూర్ణతగలది కావున, దానికి నూతనముగా నేదియుఁ జేర్చనవసరము లేనందున, జగము బ్రహ్మేతరమైన యే కారణమువలనను గలిగియుండ లేదు, అందుచే జగమసజ్జాతము కానోపును, జగత్పరిణామము బ్రహ్మములోని పరమార్థక్రమ క్షీణతవలననేయని చెప్పఁబడెను.

---

(౨) శం॥భా॥ ౨,౧,౨౮.

(౧) పరిణామోనామ ఉపాదానసమసత్తాక కార్యాపత్తిః; వివర్తోనామ ఉపాదాన విషమసత్తాక కార్యాపత్తిః॥(వేదాంతపరిభాష. ౧.)

మాయయనఁగా నొక విభాగించుశక్తి, పరిచ్ఛిన్నతనుద్భవింపఁ జేయు నియతి, దురూహ్యమగు దానినూహించి, రూపరహిత మగుదానికి రూపకల్పనము చేయుమాత్రమని నిర్వచింపఁబడెను.౩ మాయ పరమాత్మయొక్క లక్షణమే కాని, పరమాత్మయుఁగాదు తద్ధర్మమునుగాదు. మాయకొక ప్రత్యేకస్థానమిచ్చుట, ద్వైతము నంగీకరించుటే యగును. మనకింద్రియగోచర ప్రపంచములోని ఛిద్రము నింద్రియాతీతవస్తువు కారోపించుట యుక్తము కానేరదు. మాయకు బ్రహ్మసంబంధమును గల్పించినచో నీశ్వరుఁడగును. మాయ యీశ్వరశక్తియగును. కాని యీశ్వరుఁడు స్వీయ మాయోపహతుఁడు కాఁడు. మాయ కస్తిత్వమున్నచో నది బ్రహ్మకుఁ బరిచ్ఛిన్నత నేర్పరచును; మాయ లేకున్నచో, జగద్దృశ్యము కారణహీనమగును. జగత్తు నుదయింపఁజేసినంత వరకు మాయ నిజమైనదే; బ్రహ్మకుఁ బరిచ్ఛిన్నతఁ గల్పించుటలో మాత్రమది యథార్థము కాదు. బ్రహ్మవలె నది నిజమును గాదు; గగనకుసుమమువలె నసత్యమునుగాదు. ౧. దాని మన మెట్లు పేర్కొన్నను, జగత్కారణత్వమున కది యవసరము. అది యీశ్వరుని నిత్యశక్తి. మాయాసాహాయ్యమున, బ్రహ్మ

---

(౨) శం॥ భా॥ తై॥ ఉ॥ ౨,౬. "నాసద్రూపా నసద్రూపా మాయా నైవోభయాత్మికా, సదసద్భ్యామ్ అనిర్వాచ్యా మిథ్యాభూతా సనాతనీ॥ (సూర్యపురాణమ్॥ ౧,౩,౧౯.)

(౩) ఏకఏవ పరమేశ్వరః కూటస్థో నిత్యోవిజ్ఞాన ధాతురవిద్యయా, మాయయా, మాయావివత్ అనేకధా విభావ్యతే నాఽన్యోవిజ్ఞాన ధాతురస్తి॥ (శం॥ భా॥ ప్రవచనభాష్యము ౧,౩,౧౯.)

(౧) శం॥ భా॥ ౧,౪,౩.

జగత్తునకుపాదానకారణమనియు, మాయయనగాఁ బ్రవృత్తి హేతువనియు సంక్షేపశారీరక గ్రంథకర్త చెప్పినాఁడు. కాని, యది బ్రహ్మయొక్క లక్షణముగా, నొక పరివృత్తిరూపముగా స్వీకరింపఁబడెను, అది ప్రపపంచానుగతమైన కార్యసత్తా నిరూపకశక్తియని చెప్పఁబడెను. మాయయొక ద్రవ్యముగాదు; అందుచే నది జగదుపాదానకారణముకాఁజాలదు. అది బ్రహ్మ యొక్క వృత్తిరూపమై, ప్రపంచహేతువగుచున్నది. ౨, ఈ గ్రంథకర్త ననుసరించి, సత్యమునుగప్పిపుచ్చు నావరణశక్తియు దాని కపార్థమునుగల్పించు విక్షేపశక్తినిగలిగిన బ్రహ్మయొక్క పరిచ్ఛిన్నతను గల్పించు శక్తియని చెప్పఁబడెను. 3. మొదటిది జ్ఞానలోపమాత్రమగుచుండఁగా, రెండవది విపర్యయహేతు వగుచున్నది. మనము సత్యమును దర్శింపకపోవుటే కాక, దాని స్థానమున వేఱొకటి జూతుము. మాయ నామరూపనానాత్వ కారణము; నామరూపసముచ్చయరూపమేజగత్తు. నామరూప సముచ్చయముచే నీమాయ బ్రహ్మము నాచ్ఛాదించును.

సత్యమును గప్పిపుచ్చి, యసత్యమును బ్రదర్శించు నీ రెండును మాయాలక్షణములు. అనేకత్వముతోఁ గూడిన ప్రపంచము సత్యము నాచ్ఛాదించుచున్నది.

"దేవునిఁజూవుటకొఱకే సృష్టియున్నదని కొందరు చెప్పె దురు. తనశక్తికొలఁది నీశ్వరుని మఱుగుపఱచుటకే సృష్టి యని నేను నిర్ణయింతును" ౪.

---

(౨) తజ్జన్యత్వేసతి, తజ్జన్యజనకోవ్యాపారః॥

(3) చూ: వేదాంతసారము ౪.

(౪) బ్రౌనింగ్. బిషప్ బ్లోగ్రామ్స్ ఎపాలజీ.

ఈరీతిగా మాయ మోసగించు లక్షణము¹గలది కావున నవిద్యయని చెప్పఁబడెను. ఇది కేవల మజ్ఞానమేకాదు, దుర్జ్ఞానము. ఈలక్షణమును బ్రహ్మ కారోపించినచో నీశ్వరుఁడగును. "అచలము శుద్ధమునగు నేకబ్రహ్మము, తన మాయాశక్తి చే సృష్టికర్తయగు ..ను."²;

అవ్యక్తరూపముననున్న ప్రపంచమును వ్యక్తమొనర్చు స్వగతమైన యీశ్వరునిశక్తియే మాయ. దురూహ్యమైన మాయ కామసంకల్పరూపద్వయమును దాల్చును. అది నిత్యుఁడగునీశ్వరుని సృజనాత్మకశక్తి గావున నిత్యమైనదే; దీని సాహాయ్యమున నీశ్వరుఁడు జగత్తును సృజించును. మాయకు వేరుగా నివాసస్థానము లేదు. అగ్నియందు దుష్ణతవలె నది యీశ్వరునందున్నది. దాని   దానియస్తిత్వము ను...మితము. 3. మాయ యనఁగా నామరూపసముచ్చయమే. నామరూపము లవ్యక్తరూపమున నీశ్వరునిలోనుండి వ్యక్తములై ప్రపంచనిర్మాణ హేతువులగుచున్నవి. ఈయర్థములో మాయ యనఁగాఁ బ్రకృతి.⁴ నిర్గుణబ్రహ్మకంటె నీశ్వ

---

(౧) మాయకు వంచనార్థములోఁ జూడు మిలంద. ౪, ౮,౧ 3

(౨) అప్రాణమ్ శుద్ధమేకమ్ సమభవదథతన్మాయయా కర్తృసంజ్ఞమ్ (శతశ్లోకి పు॥ ౨౪.) పోల్చు: పంచదశి. ౧౦, ౧

(3) నిస్తత్వాకార్యగమ్యాస్య శక్తిర్మాయాగ్ని శక్తివత్ (పంచదశి.)

(౪) పోల్చు: ఈశ్వరస్య మాయా శక్తిః ప్రకృతిః (శం॥ భా॥ ౨, ౧, ౧౪.) చూ॥ శ్వేత॥ఉ॥౪-౧౦ శం॥గీ॥భా॥ ఉపోద్ఘాతము;౭,౪; సాంఖ్య ప్రవచనభాష్యము. ౧‹ ౨౬.

నునికి సత్తాతక్కువ; ఇతరవిషయములన్నియు నింకను దక్కువ సత్తాగలవి. క్రమముగా నీ సోపాన క్రమములో నట్టడుగున నున్నవస్తువునకు సత్తా శూన్యమై, యొక శూన్యకుడ్యము వలె గోచరించును. సృష్టికాలమునందుఁ బరమేశ్వరుఁడు గుణరూపహీనము లగువానికిఁ దనలో నవ్యక్తములుగానున్న గుణరూపముల ననుసంధించును.“ఈయవ్యక్తప్రకృతినే కొన్నివేళల నాకాశమనియు౧,అనక్షరమనియు,మాయయనియుఁ బేర్కొనఁబడెను.ప్రపంచమును సృజించుటలో మాయభౌతికాధారము.౪ అదియనేకవికారములనుబొంది ప్రకృతిక్రమము నుదయింపఁజేయును.అది యీశ్వరుని సూక్ష్మశరీరము,సాంఖ్యులప్రధానము వలెఁగాక,యిది దేవునిపై నాధారపడును.౫.అది యీశ్వరుఁడు తనపైఁగల్పించుకొనిన పరిచ్ఛిన్నతారూపము. బీజమునందు భావివృక్షరూప మిమిడియున్నరీతిగానే, ప్రకృతియందు జగద్రూపమంతయు నిమిడియున్నది ఈ త్రిగుణాత్మకమైన ప్రకృతి౬

(౧) బృ॥ఆ॥ఉ॥ ౩,౮,౧౧.

(౨) ముండ ఉ॥ ౨,౧,౨.

(౩) శ్వే॥ఉ॥ ౪,౧. చూ: శం॥భా౧,౪,౩. “అవిద్యాత్మికాహి సా బీజశక్తిరవ్యక్త శబ్దనిర్దేశ్యా, తదేతదవ్యక్తమ్ క్వచిదాకాశశబ్ద నిర్దిష్టమ్ క్వచిదక్షర శబ్దోదితమ్ క్వచిన్మాయేతి సూచితమ్॥ “అవ్యక్తనామ్నీ పరమేశశక్తిరనాద్యవిద్యాత్రిగుణాత్మికా పరా కార్యానుమేయా సుధియైవ మాయా యయా జగత్సర్వమిదం ప్రసూయతే॥

(౪) పోల్చు: మెటీరియాప్రైమా, థామిస్టు ఫిలాసఫీ (వివేకచూడామణి పు ౧౦౮)

(౫) న స్వతంత్రమ్ తత్త్వమ్॥ (శం॥భా. ౧,౨,౨౨)

(౬) పంచభూతములు

యీశ్వరాత్మయనిగాని, తద్భిన్నమనికాని చెప్పఁజాలము. అది ప్రళయవేళఁగూడ బీజశక్తిరూపమున నీశ్వరునందుండును. మాయ లేక ప్రకృతి, పురాణములలో, నీశ్వరునిప్రియురాలై సృష్టికిృయలోఁ బ్రధానసాధనమగును. 2మాయా ప్రపంచము, జగదీశ్వరి యనంతరూపములఁ బొందుటకై సల్పులీల. 3 అందుచే నీశ్వరుఁడు లేక విషయికి విషయముతో నిత్య సంపర్కముండుటచే, ప్రపంచ మనివార్యావసరము. ఈశ్వరునికిఁ బ్రపంచ మవసరమైయున్నది; ఏలన హెగెల్ మాటలలో లోకము పరమేశ్వరు నాత్మసిద్ధి కవసరము.

అద్వైతతత్త్వమున మాయాశబ్దమున కీయఁబడిన భిన్నార్థముల నిచటఁ బొందుపఱచవచ్చును. (౧) ప్రపంచము స్వేతుకాస్తిత్వము లేనిదిగావున, నది మిథ్యాస్వరూపమగుటచే మాయయని చెప్పఁబడెను. (౨) తార్కికదృక్పథమునుండి పరికించు మనకు జగద్బ్రహ్మసంబంధ మర్థవంతమైనది; ఏలన మనము శుద్ధ బ్రహ్మస్వరూపము ననుభవదృక్పథములో నంగీకరింతుము. కాని పరస్పరవిరుద్ధములైన పరబ్రహ్మయు ననేకత్వరూపమైన ప్రపంచము నెట్లుసంబంధించియున్నవో మనకెన్నఁడు తెలియుట కవకాశములేదు. ఇట్టి మన జ్ఞానదౌర్భాగ్యమునకే

(౨) పోల్చు: బృ॥ఆ॥ఉ॥ ౧,౪,౩.

(౩) పోల్చు: త్వమసి పరబ్రహ్మ మహిషి ॥(ఆనందలహరి) తమస్సం జాతములని చెప్పఁబడెను. సత్త్వమునుండి పంచజ్ఞానేంద్రియములు, నంతఃకరణము నుదయించెను. రజస్సునుండి పంచకర్మేంద్రియములు, వీని మిశ్రమమువలనఁ బంచప్రాణములు నుద్భవించెను; ఇవికలిసి సూక్ష్మశరీరమగును.

మాయ యని పేరు. (3) బ్రహ్మయే జగత్కారణమన్నచో, దానియర్థమేమనగా జగత్తు బ్రహ్మపైనాధారపడియున్నదనియు నట్టి యాధారముచే బ్రహ్మ కెట్టిలోపము సంభవింపదనియు, నిట్టి బ్రహ్మాధారముగల జగద్రూపమే మాయ యనియుఁ జెప్పఁబడెను. (ర) బ్రహ్మయే జగద్రూపమున గోచరించునని చూపుటకు చెప్పిన హేతువే మాయ యనఁబడెను. (౫) మనము వ్యావహారికదృక్పథము ననుసరించి, తర్కపద్ధతుల నుపయోగించినచో నాత్మవ్యక్తీకరణ సమర్థుఁడు పరిపూర్ణుఁడునగు నీశ్వరుని వ్యక్తిత్వము లభించును. ఇట్టి యీశ్వరు నాత్మవ్యక్తీకరణ శక్తియే మాయ యనఁబడెను. (౬) ఇట్టి యీశ్వరునిశక్తి ఉపాధిగా మారి, అవ్యాకృతప్రకృతియై ప్రపంచకారణమగును. ఇదియే యీశ్వరునివిషయము; దీనినుండి జగత్తు నీశ్వరుఁడు కల్పించును, ౧.

## ౩౧. అవిద్య.

మాయాభావ మవిద్యాభావముతో సన్నిహితసంబంధమును గలిగియున్నది. బాహ్యప్రపంచ మవిద్యాకల్పితమనునర్థమిచ్చు వాక్యములు శంకరుని రచనలలోఁ గలవు. జగద్దృశ్యమునకుఁగారణము మానవ బుద్ధిస్వభావములో నున్నదికాని బ్రహ్మయందు లేదు. అల్పతమవస్తువునందుఁగూడ, నవిభక్త

(౧) పోల్చు; ఈశ్వరస్యాత్మభూతే ఇవావిద్యాకల్పితే నామరూపే, తత్త్వాన్యత్వాభ్యామ్, అనిర్వచనీయే సంసారప్రపంచ బీజభూతే ... ఈశ్వరస్య మాయాశక్తిః...ప్రకృతిరితిచ శ్రుతిస్మృతోరభిలప్యేతే (శం,భా,౨,౧,౧ర) శం,భా, ౧,ర,౩,౨,౨,౨,

బ్రహ్మము సంపూర్ణముగానున్నది; అనేకత్వదర్శనమునకుఁ గారణము దేశకాలనిమిత్త ధర్మముల ననుసరించి పనిచేయు బుద్ధియే. తన బ్రహ్మసూత్రభాష్యమున కుపోద్ఘాతములో నవిద్యాశక్తియే మనల సంసారప్రవాహమునఁ ద్రోయుచున్న దని శంకరుఁడు రచించినాఁడు. వ్యావహారిక పారమార్థిక దృక్పథములలో నొకదాని నింకొకటిగాఁ బొరపడుట, అనగా నధ్యాస, యెంతదోషపూరితమైనను మానవ మానసమునకు సహజమైనది. అది మన జ్ఞానేంద్రియ నిర్మాణములోని లోపమే.౧. నిజముగాఁ గొన్ని తేజస్స్పందనములే మన యింద్రియములకు శబ్దములుగాను ధ్వనులుగాను గోచరించునట్లే, నిజముగా బ్రహ్మమేయైనను, దాని కార్యరూపమైన నానావస్తు ప్రపంచముగాఁ జూచి యంగీకరించుచున్నాము. మన మెంతకాల మవిద్యావశులమై, తర్కప్రమాణములను విశ్వసింతుమో యంతకాలము మనము మన యనుభవములో విషయీలక్షణ పరిశీలనముచేఁ బరమార్థజ్ఞానమును బొందఁజాలము. అనుభవ జ్ఞానసిద్ధినుండి పతనమే అవిద్య; ఏకము నద్వితీయమునగు బ్రహ్మపదార్థము ననేకముగా విచ్ఛేదించు పరిచ్ఛిన్నాత్మయొక్క మానసికలోప మవిద్య. చీఁకటి వెలుతురుయొక్క కృశావస్థయే, డ్యూసెన్ చెప్పినరీతిగా నవిద్య "మన జ్ఞానముయొక్క జన్మసిద్ధమైన కాంతివిహీనతయే"౨. దేశకాల నిమిత్త నిర్మాణమునఁగాక వస్తువులను యథాస్థితిలోఁ జూడఁ

(౧) శం॥ భా॥ ఉపోద్ఘాతము

(౨) డ్యూసెన్ సిస్టమ్ ఆఫ్ వేదాంత పు ౩౦౨.

జాలని మనస్సుయొక్క వక్రతయే అవిద్య. అది యొకానొకపరి దృష్టికాదు; వ్యావహారిక ప్రపంచముయొక్క అసమగ్రప్రమాణముల ననుసరించు పరిచ్ఛిన్న మానసము యొక్క నైజసంస్కారము. అది మన దైవజీవితమును మఱుగుపరచు నొక యభావాత్మకమగు శక్తిస్వరూపము. మన యింద్రియదోషముచే రజ్జువు సర్పముగాఁ నెట్లు గోచరించునో, యట్లే మన యవిద్యచే బ్రహ్మమే జగద్రూపమునఁ గన్పట్టుచున్నది. రజ్జువును రజ్జువుగాఁ జూచినవెంటనే, సర్పదృశ్య మంతరించిపోవును. బ్రహ్మస్వరూపదర్శనముతో జగద్రూప మంతరించిపోవును. ఏది తదతీతమైన యనుభవమువలన సత్యమని నిరూపింపఁబడినదో, యది, మన యవివేకమువలనఁ గాకున్నచో, సత్యముతో సంబంధమును బొందఁజాలదు. పరబ్రహ్మమందు రూపకల్పనమును మనముచేయుచున్నాము. సర్పదృశ్యమును, రజ్జువాస్తవికతను సమన్వయింపుమన్నచో, లేనిదానికున్నదానితో సంబంధము సాధ్యముకాదని మనము చెప్పెదము. సర్పము గోచరించుటకు నేత్రమే దూష్యము. త్రాడును త్రాడుగాఁ జూచినచో సమస్య సమసిపోవును; అప్పుడు త్రాడే పాముగాఁ గన్పట్టినదని చెప్పుదుము. బాహ్యప్రపంచదృశ్యమునకు దృష్టిదోషముతప్ప వేరుకారణము లేదు. చైతన్యము సత్యమైయుండఁగా, దానిస్థానమున వస్తువులను దర్శింపఁజేయుటయే యీదృష్టిదోషము చేయఁగలపని. అవిద్యయనఁగాజ్ఞానలోపముగాని, సంశయజ్ఞానముకాని, దోషపూరితజ్ఞానముగాని కావచ్చును. అది కేవల మభావాత్మకమేకాక, భావాత్మకము

గూడ నైయున్నది. అవిద్యాస్థిత్వ మందరెఱింగిన దేయని శంకరుఁడుచెప్పినదాని కర్థమేమనఁగాఁ బరిచ్ఛిన్నత సర్వసామాన్యమనియే. తనకు సర్వవిషయములనుగూర్చియుఁ దెలియదని ప్రతివ్యక్తియు నంగీకరించును. ౧. ఈలోపము నందరు గుర్తించియుండుటచే సర్వసామాన్యవిదితాంశమని చెప్పవచ్చును.

ఒకవ్యక్తికిఁగల జ్ఞానమునకు భిన్నమైన అజ్ఞానమే ఉపనిషత్తులుచెప్పిన అవిద్యయైయున్నది. ౨. శంకరుని రచనలననుసరించి, మానవమానసముయొక్క పరిచ్ఛిన్నతను సూచించు తర్కపద్ధతియే అవిద్య. అది వంధ్యాపుత్రునివలె నభావవస్తువు కాదు; ఏలన నది సర్వజనుల కనుభవసిద్ధమైనది. సుజ్ఞానముచే నది నశించునుగావున, నది పరిపూర్ణము యథార్థమునైన భావవస్తువును గాదు. అది యసత్తైనచో దేని నుత్పత్తిచేయఁజాలదు; అది సద్రూపమైనచో దానినుండి యుద్భవించినదియు నిజమేకావలెను గాని మిథ్యామాత్రముకారాదు. "అవిద్య యథార్థమునుగాదు; మిథ్యయునుగాదు; రెండునుగాదు."౧. దాని జన్మము, కారణము మనకుఁ దెలియనిదైనను, నది ప్రవర్తించు మనఃప్రమాణరూపములచే సువిదితము. అజ్ఞాన పాప దుఃఖ హేతువైన యీ యవిద్య యెచటనుండివచ్చినది? అవిద్య వ్యక్తిత్వకారణము గాదు; ఏలన వ్యక్తులులేనిదే అది యుండఁజాలదు. అది వ్యక్తిత్వకారణమేయైనచో నది వ్యక్తుల అస్తిత్వ

(౧) అహమ్ అజ్ఞః ఇత్యాద్యనుభవాత్. చూ॥ వేదాంతసారము. పుట.
(౨) చూ॥ ఛాం॥ ఉ ౧, ౧, ౧౦; బృ॥ఆ॥ఉ॥ ౪, ౩, ౨౦; ౪, ౪, ౩.
(౧) వివేకచూడామణి పు॥ ౩.

ముతో నిమిత్తములేకుండనుండునది యనగా బ్రహ్మకుఁజెందు నదికావలెను. కాని యవిద్య బ్రహ్మకుఁజెంద దేలన, బ్రహ్మ దీనికి వ్యతిరేకమగు నిత్యజ్ఞానతేజస్స్వరూపి. ౨. సర్వజ్ఞాత్మముని తలఁచినరీతిగా నది బ్రహ్మయందుండఁజాలదు; వాచస్పతి వచించునట్లది వ్యక్తియందుండఁజాలదు. ౩. బ్రహ్మయొక్క వికారరూపమే అవిద్యాస్థానమనుట నిరర్థక మేలన, బ్రహ్మ వికారమందుట కవిద్యతప్ప కారణాంతరములేదు. ప్రతిజీవి కొక భిన్నమగు నవిద్యను మనమూహింపవలెనని రామాను జుఁడుపలికెను; లేకున్నచో, నొకజీవికి మోక్షసిద్ధితో నన్నిజీవులు ముక్తి పొందవలెను. అందుచే నవిద్య జీవభేదముల కనుగుణమై యుండునుగావునను, వానికది కారణముకాదు కావునను, నది దుర్బోధము. ఇచట మనకు శాఖాచంక్రమణవాద మేర్పడినది.౧

---

(౨) "దేవుఁడు జ్యోతి; అందుఁ జీఁకటియే లేదు." (౧.జ్యా॥౫.)

(౩) చూ॥ శ్రీధరుని న్యాయకందళి. రామానుజభాష్యము. ౨,౧,౧౫.

(౧) రామానుజభాష్యము. ౨, ౧, ౧౫; సా॥ప్రి॥ సూ॥ ౧, ౨౧-౨౪,౫,౧౩-౧౯, ౫౪. పార్థసారథిమిశ్రుఁ డిట్లా క్షేపించినాఁడు: "అవిద్య యనఁగా నపార్థజ్ఞానమా? లేక దానికిఁగారణమైన దేదైన నింకొకటియున్నదా? మొదటిదైనచోనీ యవిద్య యెవనిది? అది శుద్ధచిత్స్వరూపియగు బ్రహ్మదికాదు. రవిబింబములో నంధకారముండదు. అది జీవాత్మలది కాదు; ఏలన జీవాత్మలు బ్రహ్మభిన్నములుకావు అవిద్యయుండుట కవకాశములేదు; దానికి కారణమైన దింకొకటియునులేదు; మఱియు నవిద్యయు దానికారణమును బ్రహ్మేతరమైన యాశ్రయముగలవన్నచో బ్రహ్మయొక్కయేకత్వ మంతరించును బ్రహ్మ

అవిద్యారూప మనిర్వచనీయమని చెప్పి శంకరుఁ డీవాదమునుండి తొలఁగినాఁడు. శంకరుని తత్త్వములో ప్రశ్నకర్థము లేదు. వ్యావహారికపరిమాణము పారమార్థికముగా నిష్ప్రయోజనము. అవిద్యయున్నదని మనమెఱుఁగుదుము; జీవసృష్టి ఎట్లుజరిగినదో యను ప్రశ్నవలెనే, అవిద్య ఎట్లుదయించినదను ప్రశ్న కవకాశము లేదు. ఆత్మకు నవిద్యకుఁగల సంబంధమును మనమెఱుఁగఁ

---

యొక్క అవిద్య యెచటనుండివచ్చినది? బ్రహ్మ యొక్కఁడే సత్యస్వరూపము గావున వేరొద్దియునులేదు. అవిద్య బ్రహ్మస్వభావమన్నచో బ్రహ్మకు విద్యయే స్వభావమై అవిద్యకూడ నెట్లగును? కిమ్ భ్రాంతిజ్ఞానమ్? కింవా భ్రాంతిజ్ఞానకారణభూతమ్, వస్త్వంతరమ్? యస్మి భ్రాంతిస్స్యాత్కస్య? న బ్రహ్మణస్తస్య స్వచ్ఛవిద్యారూపత్వాత్, నహిభాస్కరే తిమిరస్యావకాశే సంభవతి; నజీవానామ్, తేషాం బ్రహ్మాతిరేకేణాభావాత్, భ్రాంత్యభావాదేవచ, భ్రాంతిజ్ఞానమ్ తత్కారణంచ అభ్యుపగచ్ఛతా మద్వైతహానిః, కింకర్తాచ బ్రహ్మణోఽవిద్యా, నహికారణాంతరమస్తి, స్వాభావికీతిచేత్, కథమ్ విద్యాస్వభావమ్ అవిద్యాస్వభావమ్స్యాత్?(శాస్త్రదీపిక.పు.౩౧౩-౩౧౪,౧౧౩)

అద్వైతమును ఖండించుచుఁ గుమారిలుఁడిట్లు వాదించెను "బ్రహ్మ స్వతఃస్థితికలిగి శుద్ధుఁడైనచో, బ్రహ్మకు వేరైనదేదియులేదు, స్వప్నసదృశమైన యీ యవిద్యాప్రవృత్తికిఁ గారణమేమి ? అవిద్య బ్రహ్మకు భిన్నమన్నను, దాని కింకొక కారణ మున్నదన్నను, నద్వైతము నశించును, అది బ్రహ్మస్వరూపమేయైనచో నది యెన్నఁడు నశించదు."

"స్వయంచ శుద్ధరూపత్వాత్ అభావాచ్చాన్య వస్తునః
స్వప్నాదివ అవిద్యాయాః ప్రవృత్తిస్తస్య కింకృతా
అనేనోపప్లవేఽభీష్టే ద్వైతవాదః ప్రసజ్యతే
స్వాభావిక మవిద్యాంతు నోచ్ఛేత్తుమ్ కించిదర్హతి।

(శ్లో। వా। సంబంధాక్షేపపరిహారము, పు,౭౪,౭౫)

గల్గినచో మనమా రెంటికి నతీతులముగావలెను.౧. అవిద్యయే ఆత్మకు ముఖ్యలక్షణమైనచో నాత్మకు విద్యనుండి విముక్తి యెన్నఁడు నుండదు. కాని యాత్మ దేనినిఁదనలోఁజేర్చుకొనుట గాని, తనలో నేమాత్రము నైన విడిచిపుచ్చుటగాని చేయునది కాదు. అవిద్య యేపరిచ్ఛిన్నవ్యక్తికిని, మానవుఁడైనను నీశ్వరుఁడైనను, వానికిఁజెందదు; ఏలన, నట్టివ్యక్తి యవిద్య జెందుట కాతఁడు మొదట సృజింపఁబడవలెను. కావున నాతనిసృష్టికిఁ గారణ మాతనియొక్కగాని, మఱెవ్వనియొక్కగాని యవిద్య కాఁజాలదు. బ్రహ్మ సగుణత్వమొందుటకాని, జీవులయుత్పత్తి గాని, పరిచ్ఛిన్నజీవితలక్షణమగు నవిద్యవలన జరిగినదికాదు. ఈశ్వరప్రవృత్తివలన జరుగు సంఘటనమే అవిద్య. కాని అవిద్యయు బ్రహ్మము నెల్లకాలమున నుండఁగలవను సమస్యయే తీర్పరానిది. శంకరుఁడిట్లు చెప్పినాఁడు: "బ్రహ్మ మవిద్యాసంజాతము కాదనియు, బ్రహ్మకవిద్య లేదనియు మనమంగీకరింతుము; అవిద్యావశమై బ్రహ్మేతరమైన యింకొకవ్యక్తి యుండి తత్కారకుఁడగుననియు మన మంగీకరింపఁజాలము."౨. సంక్షేపశారీరకము ననుసరించి, "నిర్విభాగచిత్స్వరూపమే అవిద్యకాశ్రయము విషయము నైయున్నది." 3. డ్యూసే నిట్లుచెప్పినాఁడు: "యథా

---

(౧) శం,గీ,భా, ౧3,౨

(౨) శం,భా,బృ ఆ,ఉ, ౧,ర,౧౦. తనఅద్వైతమకరందములో లక్ష్మీధరుఁ డిట్లు చెప్పినాఁడు: "నేను ప్రకాశించుటలేద' ను మాటకుఁ గారణభూతమైన స్వయంజ్యోతిరూపముగల ఆత్మ నవిద్య యెట్లుంటఁగలదు? కాని చిదాకాశమున నవిద్యామేఘ మెంకింతకన్పట్టును; జ్ఞానసూర్యుఁ డుదయించువరకు నదియుండును." (౧౬-౧౭)

(3) ౧,3౧౯; ఆశ్రయత్వవిషయత్వభాగినీనిర్విభాగచితిరేవకేవలా,

ర్థముగా బ్రహ్మేతరమైనదేదియు లేదు. ప్రపంచరూపమున బ్రహ్మ వికారమును, బహుజీవభిన్నత్వరూపమైన బ్రహ్మయందు భేదమును మనము చూచుట కవిద్యయే కారణము. కాని యిది యెట్లుజరుగుచున్నది? బ్రహ్మమేకము నద్వితీయమునై యుండగా వికారమును నానాత్వమును మనము చూచుచు మోసమున కెట్లు పాల్పడుచున్నాము? ఈప్రశ్నకు మనగ్రంథకర్తలు సమాధాన మిచ్చియుండలేదు.౧. వారు సమాధాన మీయకపోవుట నిజమేకాని కారణము సమాధానము లేకపోవుటయే. కాని, విమర్శకు లూరకుండరు; వారిట్లు బదులుచెప్పుదురు: "సర్వము విజ్ఞానాతీతమనిచెప్పు నీతత్త్వములో, హేతువైపరీత్య మాక్షేపణీయముకాదు." ౨. ఇది నిజమే. బ్రహ్మమేకమునద్వితీయము శుద్ధము, పరిపూర్ణమునయ్యు విపరీతభావముల నుదయింపఁజేసి దిగ్భ్రాంతికల్పించు నీయవిద్యాశక్తి యెచటనుండి వచ్చినదో తెలియదు. 3.

(౧) డ్యూసేన్‌సిస్టమ్ ఆఫ్ వేదాంత పు,302

(౨) పార్థసారథిమిశ్రుఁడు; "అతాృనిర్వచనీయ వాదేనాఽనుపపత్తిర్దూషణమ్॥

(3) సంక్షేపశారీరక, వివరణ, వేదాంతముక్తావళి, అద్వైతసిద్ధి, అద్వైతదీపికాగ్రంథకర్తలు, చీకటి గృహములోనుండి గృహమును మఱుఁగు పరచునట్లే, అవిద్యయు బ్రహ్మమే ఆశ్రయము, విషయమునని తలఁచిరి. అవిద్యకు జీవుఁ డాశ్రయమనియు, బ్రహ్మ విషయమనియు వాచస్పతి భావించెను. ఈశ్వరుఁడుకూడ జీవాజ్ఞానసంజాతుఁడే యనియు, జీవులెందరో ఈశ్వరులందరుండవలెననియు నీతనిభావము. మఱియు నన్యోన్యాశ్రయత్వము చెప్పఁబడెను; జీవు లవిద్యపైనను, నవిద్య జీవులపైనను నాధారపడును. అందు నవిద్యకు స్థానము బ్రహ్మమందే యున్నదని చెప్పఁబడెను. ఇది యద్వైతసిద్ధాం

### 3-౨-ప్రపంచము మిథ్యయా ?

ప్రపంచము మిథ్యయనియు, కేవల మనఃకల్పితమనియు నొక దురభిప్రాయ మాయవిద్యా సిద్ధాంతమువలన నుదయించి నది. సర్వదృశ్యములు, నీశ్వరుఁడును గూడ నవిద్యారూపములే యని శంకరుఁడు తెఱచుగాఁ బలికినాఁడు.౧. మన పరిచ్ఛిన్న జ్ఞాన మెట్లు తలఁచినను, బ్రహ్మముయొక్క నిజస్వరూపము మారదు. దృష్టిదోషము గలవారికి రెండు చంద్రబింబములు కన్పట్టుటచే నిజముగాఁ జంద్రు లిరువు రుందురా? "సత్తని కాని యసత్తనికాని చెప్పుటకు వీలులేని నామరూపాత్మకమగు వ్యావహారికజగత్తు పూర్తిగా నవిద్యపై నాధారపడియున్నది; పరమార్థస్వరూపమగు సత్తు నిత్యమై, మార్పులేనిదై ప్రకాశించుచున్నది. మన మాటలలో మార్పుచే నిరవయవమైన పరమాత్మలో మార్పు కలుగదు "౨. సృష్టి,యీశ్వరుని పరిచ్ఛిన్నతా సమస్య లుదయించినపుడు శంకరుఁ డిట్లుచెప్పినాఁడు: "తత్త్వ

తముగావున, నీవిషయమును విద్వన్మనోరంజనీగ్రంథకర్త చర్చించి,సుషుప్త్యవస్థలో జీవాత్మ బ్రహ్మమం దైక్యమగుననియు, నవిద్య నిజముగానున్నచో నది బ్రహ్మమందే యుండవలెననియుఁ జెప్పెను. చూ, పండిట్, సెప్టెంబరు ౧౮౭౨, శుద్ధచైతన్య మవిద్యావిరోధముకాదు ;అవిద్య వృత్తిచైతన్యరూపము విద్యారణ్యుఁడు చెప్పినట్లు, ఆత్మాకృతిఁదాల్చిన అంతఃకరణవికారముచే నాత్మయందలి యవిద్య తొలఁగుచున్నది.

(౧) ఏకత్వమ్...పారమార్థికమ్ మిథ్యాజ్ఞాన విజృంభితమ్చ నానాత్వమ్॥ (శం॥భా॥ ౨,౧-౧౪,)

(౨) పోల్చు: శం॥భా॥౨,౧,౩౧; ౨,౧,౧౪; ౨,౩,౪౬;౨,౧,౨౭,

మసి' మున్నగు వాక్యములవలన నభేదజ్ఞాన ముపదేశింపఁబడి నపు డభేదదృష్టి ప్రబుద్ధమై, జీవుని జన్మాంతర పరివర్తనము, నీశ్వరుని సృజనప్రవృత్తియు విరతినొందును; ఏలన, విభాగ రూపమైన ప్రపంచస్వభావ మవిద్యాసంజాతము; సమ్యగ్జ్ఞానముచే నది తొలఁగిపోవును. అయినచో సృష్టి యెచటనుండి వచ్చినది? మంచినే కాకుండఁ జెడుగునుగూడ సృజించిన బాధ్యత యెవనిది? నామరూపములే ప్రవృత్తి సాధనసంపత్తిగాఁ గలిగి, అవిద్యాకృతమైన దానిని విచక్షణచేయు జ్ఞానలోపముచే నుదయించినదే సదసత్కర్మాచరణ రూపమైన సంసారము. జనన మరణాదుల వస్తువిభాగ మందలి వ్యామోహామువలెనే, యీ యజ్ఞానమును పారమార్థికదృష్టిలో నసత్యమైనదే."౧. మఱియు, "నామరూపాత్మకమగు నవిద్యాకృతమైన యనేకత్వము, పరిణామము గలదియు లేనిదియు, సద్రూపము నసద్రూపము కానిదియునై, స్వస్వరూపములో నది పరిణామజగత్తున కతీతస్థితిగలిగి, యెన్నడునుమార్పుచెందని దగుచున్నది"౨. ఈభావమును ప్రత్యేకముగా వక్కాణించినచో జీవుని యవిద్యకు వేరుగా ననేకత్వమున కస్తిత్వములేదని తోఁచును. అన్ని మార్పులు, చలనములు, వికాసపరిణామములు, ప్రకృతిశాస్త్ర పరిశోధనలు, స్వప్నవార్తలనియు, నెండమావులనియుఁ జెప్ప వలసివచ్చును. బ్రహ్మ జగత్కారణత్వ వాద మీభావమును రూఢిపరచును. జగత్పరివర్తనము వలన బ్రహ్మమం దెట్టి

(౧) పోల్చు: అవిద్యాకృతమ్ కార్యప్రపంచమ్॥ (శం॥భా॥౧, 3, ౧.)
(౨) శం॥భా॥ ౨,౧,౨౭.

మార్పును గలుగదని నిరూపించు నుత్కంఠతో,[3] సర్వమును త్రాడునం దారోపించినట్లే, జగత్తును బ్రహ్మమున కారోపింపఁ బడెనని శంకరుఁడు చెప్పినాఁడు.[౪] "చీఁకటిలో నొకఁ డొక త్రాడును పామని పొరపడి, భయకంపితుఁడై పరుగిడవచ్చును. అప్పు డింకొకఁడు, "భయపడకుము; అది త్రాడేకాని త్రాఁచు కాద"ని చెప్పవచ్చును. అట్లుచెప్పి మొదటివాని భయముడిపి, పారిపోవు నాతనిని మరలించవచ్చును. త్రాడు పామని కలిగిన భ్రాంతి కొంతసేపుండి, తరువాతఁ దొలగుటవలనఁ ద్రాడున కెట్టి మార్పును గలుగలేదు."[౫] నక్షత్రములు నిజముగా మినుకు మినుకు మనవు; మన దృష్టికిమాత్ర మట్లు కన్పట్టుచున్నవి. నక్షత్రములనుండి ప్రసరించు కాంతి నిర్వక్రముగానే యున్నది; కాని యా కాంతిమార్గమగు వాతావరణములోని చలనములవలన మనదృష్టి చలించి, నక్షత్రములు చలించుచున్న వను భ్రాంతిని గలిగించుచున్నవి. అదేవిధముగా, మన దృష్టిదోషముచే బ్రహ్మమం దనేకత్వ పరివర్తనాదిక మున్నదను భ్రాంతి జనించుచున్నది.[౧] శంకరుఁ డిచ్చిన కొన్ని యుదాహరణముల వలన ననేకత్వము, భిన్నత్వము మానవ మనస్సముద్భవమగు మరు మరీచికా భ్రాంతి వంటిదేయని స్పష్టమగును.

---

(3) శం॥భా॥ ౨,౧,౨౮; ౨,౧,౯.

(౪) అధ్యారోపితమ్॥

(౫) శం॥భా॥ ౧.౪,౬; మఱియుఁజూడుము: శం॥భా॥ కఠోపనిషత్తు 3,౧౪; ౪,౧౧.

(౧) శం॥భా॥ ౨,3,౪౬.

భేదములన్నియు మానవ మానస కల్పనములే; మనస్సనేక కోణాకృతిగల గాజుముక్కవలె, యథార్థముగానున్న యేకత్వమును విచ్ఛేదమొనర్చి దానిస్థానమున ననేకత్వమును బ్రదర్శించును; నిజమున కనేకత్వము, దానినిఁ గల్పించు మనస్సు రెండు నసత్యములే. కాని మన ముపమానములను భావస్ఫూర్తికొఱకే యుపయోగించవలెనుగాని, వాని వాచ్యార్థమును సాగఁదీసి యర్థాంతరవ్యాప్తి నిచ్చునట్లు చేయరాదని శంకరుఁడు చెప్పియున్నాఁడు. ౨.

అనంతరాద్వైతులు కొందరు విజ్ఞాన వాదార్థము నంగీకరించిరి. అవిద్య విజ్ఞాతకుఁ జెందుననియు, కనుగ్రుడ్డుపైఁ బొర యున్నచో నది వస్తుస్వరూపమును మఱుగుపరచునట్లు వర్తించుననియు వాచస్పతి చెప్పినాఁడు ౩. అవిద్యయే మిథ్యాప్రపంచ కారణమనియు, నీ యవిద్యవలననే మనము బ్రహ్మము మిథ్యాజగత్తున కుపాదాన కారణమనియు భావింతుమని మధుసూదన సరస్వతి పలికినాఁడు. ౪. మిథ్యా జగన్మూలము చిత్తము; చిత్తనాశముతో మిథ్యాజగత్తును నశించును."౫. చిత్సుఖి, అద్వైత

(౨) శం॥భా॥ ౩,౨౧, ౧౭-౧౯.

(౩) జీవాశ్రయమ్ బ్రహ్మవిషయమ్॥ బ్రహ్మకుఁ గల్పించిన భిన్నరూపములకుఁ గారణ మంతఃకరణ వికారములని యాతఁడు చెప్పెను. ఈవిధముగా నాతఁడు వికారములను, వాని విషయములను నంగీకరింపవలసివచ్చినది.

(౪) "అస్యద్వైతేంద్ర జాలస్య యదుపాదానకారణమ్ అజ్ఞానమ్ తదుపాశ్రిత్య బ్రహ్మకారణముచ్యతే॥ (అద్వైతసిద్ధి, పు. ౨౩౮.)

(౫) చిత్తమూలో వికల్పోఽయమ్ చిత్తాభావేనకశ్చన॥ (వివేకచూడామణి। పు. ౪౦౭.)

సిద్ధాంతముక్రావలి, యోగవాసిష్ఠము, దృష్టి సృష్టి వాదమును బలపఱచి, మన చిత్తజ్ఞానము జగన్మూల కారణమనియు, విషయీవిషయ విజ్ఞాన విరతితో జగత్తు నసన్మగ్నమగుననియు వాదించినవి.౧.

అద్వైత తత్త్వమునందు చెప్పిన జగన్మిథ్యాత్వమును గూర్చి పశ్చిమఖండవిమర్శకు లిట్టిభావములనే ప్రకటించుటలో నాశ్చర్యము లేదు. జగత్తునుగూర్చి యిట్టిభావమును మనము నందుంచుకొనియే ఎడ్వర్డుకెయిర్డువ్రాసినాఁడు:"అద్వైతమత మొక జగన్మిథ్యావాదమై, సర్వమీశ్వర స్వరూపమను తత్త్వముగాఁ బెంపొందినది. ఇది ప్రదర్శించు నేకత్వము వస్తుభిన్నత్వమును సమన్వయించునదికాదు; ఈ యేకత్వ మొక యగాధమైన

(౧) చూ॥ వ। సి॥ సా॥ సంగ్రహము ౧౨, ౧౭-౧౯. దృష్టి సృష్టి వాదమనఁగాఁ జూడఁబడినంతకాలమే సృష్టియున్నదనునది యోగవాశిష్ఠ సిద్ధాంతము.

"మనోదృశ్యమిదం సర్వమ్ యత్కించిత్సచరాచరమ్,
మనసోహ్యున్మనీభావాత్ ద్వైతమ్ నైవోపలభ్యతే॥
చూ॥ యోగవాశిష్ఠసారములో జీవన్ముక్తి అధ్యాయము. పోల్చు: సంక్షేప శారీరకము.

"తవచిత్త మాత్మ తమసాజనితమ్ పరికల్ప యత్యఖిలమేవజగత్"
నృసింహతాపనీ. ఉ॥

"చిద్ధిదమ్ సర్వమ్," (౨, ౧, ౭)

"తస్మాద్విజ్ఞానమేవాస్తి నప్రపంచో నసంస్మృతిః (లింగపురాణము. సా॥ ప్ర॥భా ౧, ౪౨లో నుదాహృతము.) వీనియాధారముననే విజ్ఞాన భిక్షువిట్లు సమర్థించెను: "ఏతేనాధునికానామ్ వేదాంతిబ్రువాణామ్ అపి మతమ్ విజ్ఞానవాదతుల్య యోగక్షేమతయా నిరస్తమ్" (సాం॥ప్ర॥భా॥ ౧, ౪౩.)

గర్తము; అందు భిన్నత్వ్యముపడి యదృశ్యమైనది." ౨. ఈ భావము జీవితమునొక విషాదాంతమగు హాస్యముగాఁజూచి, వ్యావహారికజగత్తునుగూర్చి శంకరుఁడు చెప్పిన యనేకవాక్యముల కపార్థము కల్పించి, సముచితార్థవివరణముల నన్నిటిని భంగపఱచినది. అందుచే జగత్తు మిథ్యయను భావమునకు వ్యతిరేకముగా దృశ్యమాత్రమను భావమును బలపరచు పెక్కువిషయముల నిచటఁ గ్రోడీకరింపవలసి యున్నది.

అవిద్య సాంఖ్యులప్రధానమువలెనే యచేతనమగుటచే జగత్కారణము కాఁజాలదు. సాంఖ్యప్రధానవాదులను ఖండించిన శంకరుఁ డవిద్యాసముద్భవమే ప్రపంచమను వాదమును సమర్థించునని మన మూహించుట కవకాశము లేదు. అవిద్యాశ్రోనారంభమైన బౌద్ధుల కారణధర్మపరంపరా వాదమునుగూడ శంకరుఁడు ఖండించినవిషయమును మనము మఱువరాదు. "చేతనుఁడగువాని మనస్సులో నుదయించినయూహయేఅవిద్య. పదిరెండు లింకులుగల కారణధర్మమనుగొలుసులోనిది మొదటి లింకు. దేహ మనస్సముచ్చయము లిందు గ్రహింపఁబడినవి; కాని యవియెట్లు పరస్పరసంపర్కమును గలిగియుండునో చెప్పఁబడలేదు." ౧. శంకరుఁడు శూన్యవాదమును, ౨, క్షణభంగవాదమును ౩. గూడ నిరసించినాఁడు. విషయముతో సంబం

(౨) ఇవల్యూషన్ ఆఫ్ రెలిజియన్, వాల్యూము ౧. పు|| ౨౬౩ ఇట్టి పశ్చిమ పండితుల విమర్శలకు చూ|| కీర్తికర్, స్టడీస్ ఇన్ వేదాంత. అ ౨.

(౧) శం, భా, ౨, ౨, ౧౯

(౨) శం, భా, ౨, ౨, ౩౧

(౩) శం, భా, ౨, ౨, ౧౮-౨౧, ౨౬

క్షము లేని విషయజగత్తున్నదను నిరూపణమువలననే బౌద్ధవిజ్ఞాన వాద నిరసనము స్థిరమైనది. వస్త్వస్తిత్వము మన మానసికవికారములపై నాధారపడియుండ లేదు. ప్రపంచమును జ్ఞానస్వరూపముగాఁజూచినపుడు పారమార్థికసత్యము చెప్పఁబడినది. అదే విధముగా జాగ్రదనుభవము స్వప్నానుభవతుల్యమని నిరూపింప యత్నించు వాదములన్నిటిని శంకరుఁడు నిరసించినాఁడు.౪. జగత్తు కేవల మవిద్యాసంభూతమని యాతఁ డంగీకరింపఁడు. శంకరుని భావములో నవిద్య కేవలము వ్యక్తిగతమైన శక్తి యేఁ కాదు; దానికి బాహ్యమగు వాస్తవికతయుఁ గలదు.౫. అందరి కనుభవసిద్ధమైన పృథివ్యాదిప్రపంచమున కదియే కారణము అవిద్య, స్థూల సూక్ష్మ రూపములనుగలిగి, యనాద్యమై, ౧ భావాత్మక లక్షణయుక్తమైనదే అవిద్య. ౨. అవిద్య, మాయ, ప్రకృతియు సమానార్థకములుగా వాడఁబడినవి. ౩.

(౪) రెంటికి భేదములేనిరీతిగా నవంతరాద్వైతులు రచించిరి. లక్ష్మీధరుని అద్వైతమకరందమునకుఁ దానువ్రాసిన భాష్యములలో స్వయంప్రకాశుఁడిట్లు చెప్పెను: "నాలో స్వప్నప్రపంచముభ్రాంతి కల్పితమైనట్లే నాకుఁగలుగు జాగ్రదవస్థయు భ్రాంతికల్పితమే" చూ, పండిట్, అక్టోబరు ౧౯-౬౩, పు, ౧,౨౯

(౫) "జీవఈశో విశుద్ధాచిత్ విభాగశ్చతయోర్ద్వయోః
అవిద్యాతచ్చితోర్యోగస్షడస్మాక మనాదయః
(సిద్ధాంతముక్తావళిలో నుదాహృతము)

(౧) అనాదిభావరూపమ్ యద్విజ్ఞానేన విలీయతే తదజ్ఞానమితిప్రాజ్ఞా లక్షణమ్ సంప్రచక్షతే॥ (చిత్సుఖీ॥ ౧,౧౩.)

(౨) ఆత్మన్యవిద్యాసానాదిః స్థూలసూక్ష్మాత్మనాస్థితా॥ (స।సి।సా। సంగ్రహము ౧౨,౧౯.) (౩) పోల్చు:లోకాచార్య: తత్త్వత్రయము॥ పుర౯. చౌకాంబాముద్రణము.

పరబ్రహ్మమే జగదాధారమని శంకరుఁడు వాదించెను. బ్రహ్మము జగత్తునుండి పూర్తిగాభిన్నమైనచో, ఆత్మ జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలనుండి పూర్తిగావేరైనచో, జగత్తుయొక్కగాని, జాగ్రదాద్యవస్థాత్రయముయొక్కగాని యథార్థతను నిరసించుటవలనఁ బరమార్థప్రాప్తి సాధింపఁబడదు. అపుడు మనము నాస్తికవాద మంగీకరించి, సర్వోపదేశములు నిరర్థకములని త్రోసిపుచ్చవలసివచ్చును.౪. మిథ్యాసర్పము శూన్యతనుండి జనించుటలేదు; భ్రాంతి తొలఁగినపు డది శూన్యగతమగుటయును లేదు. భ్రాంతికి మూలస్థానము మనస్తర్కములుగాని, పరమార్గముగాదు. బహురూపప్రపంచము మన భావదోషముచేఁ జూపట్టునది. భావదోషమును దొలగించుటనఁగా, భావమును మార్చుకొనుట. త్రాడు పాముగాఁ గనిపించును; భ్రాంతి తొలఁగినపుడు,పాము త్రాడులోఁ గలిసిపోవును. అదే రీతిగా వ్యవహారజగత్తు బ్రహ్మసాక్షాత్కారసిద్ధిలో లీనమగును. ఇచట జగత్తు నిర్మూలింపఁబడుటలేదు; అది వేఱొకరూపముతో గోచరించును. జీవన్ముక్తిభావము, క్రమముక్తిభావము, సత్యాసత్యములకు, ధర్మాధర్మములకు భేదమునుగుర్తించుట, వ్యావహారిక జగన్మూలమున మోక్షసంపాదనావకాశము, నివన్నియు బాహ్యప్రపంచ దృశ్యములలో సత్యమున్నదని సూచించును; జగత్తులో బ్రహ్మమున్నదికాని, జగద్రూప

(౪) యదిహిత్రయవస్థాత్మ విలక్షణమ్ తురీయమన్యత్ తత్ప్రతిపత్తిద్వారాభావాత్ శాస్త్రోపదేశానర్థక్యమ్ శూన్యతాపత్తిర్వా.

(శం. భా. ముం ఉ. ౨, ౭)

మున లేదు. జగత్తంతయు మిథ్యయేయై బ్రహ్మముతో సంబంధము లేనిదైనచో, ప్రేమయు జ్ఞానము, వైరాగ్యము నున్నత జీవిత వికాసమున కుపయోగింపవు. ధర్మాచరణముచే బరబ్రహ్మ సాక్షాత్కారసిద్ధి కవకాశమున్నదని శంకరుఁ డంగీకరించినంత కాలము, ధర్మమునకు విలువయున్నదని యాతఁడంగీకరించినట్లే. ప్రపంచ మసత్యమే కాని, భ్రాంతి కాదు. జీవి కేవలమొక యసత్పదార్థము కాదు. ఆత్మకాని దాని నాత్మయనుకొను భ్రాంతిని దొలగించుటవలననే మోక్షము లభించును. విద్యారణ్యుఁడు చెప్పినరీతిగా, "జీవాత్మ పూర్తిగా నాశనము పొందవలసినచో మానవులకు మోక్షము లాభకరము గాదు."

బ్రహ్మమే లేకున్నచో మనకు జీవాత్మయు నుండదు. భ్రాంతియు నుండదు. శంకరుఁడు చెప్పినవిధమున, "నిజముగాఁ గాని యబద్ధముగాఁగాని వంధ్యకుఁ బుత్రుఁడుదయింపఁడు."౧. ప్రపంచమున కెట్టి యథార్థమైన యాధారమును లేనిచో, నసత్తే దానిమూలమైనచో, బ్రహ్మముకూడ నసత్యమేయని మనము కొట్టివేయవలసియుండును.౨. ప్రపంచమునకు సత్పదార్థ మాధారము; ఏలన, "మరుమరీచికయు నిరాధారముగా నుండజాలదు."3 ఏస్వప్నమిథ్యాకల్పితమో, దేనిద్రవ్య మిథ్యాసంబంధమో,

---

౧. శం॥ భా॥ గౌడపాదకారిక. ౧.౬.

౨. యదిహాసత ఏవ జన్మస్యాత్ బ్రహ్మణోఽసత్వప్రసంగః

3. నహిమృగతృష్ణికాదయోఽపి నిరాస్పదా భవంతి. (శం. గీ. భా. ౧3-౧౪) మఱియుఁజూడుఁడు. శం॥భా॥ఛాం॥ ఉ. ౬.౨.3; మాం.ఉ.౧.౭.

యది స్వప్నమే కాఁజాలదు.౪. మనమీ ప్రపంచము ద్వారా పరమార్థమును జేరఁ గలుగుచున్నామనఁగా నీప్రపంచములోఁ బరమార్థాంశ మిమిడియున్నదని చెప్పవలెను. రెండును భిన్నములైనచో, నొకటిసత్యము రెండవ దసత్యరూపమునని చెప్పుటకే వీలులేదు. ప్రపంచము బ్రహ్మముకాదు; బ్రహ్మముపై నాధారపడియుండవచ్చును. ఏది సత్యముపైనాధారపడియుండి, సత్యముకాదో దానిని దృశ్యమాత్రమని చెప్పవలెను. ప్రపంచము బ్రహ్మముయొక్క సత్యస్వరూపముగాకున్నను, పరిచ్ఛిన్నులమగు మనదృష్టికి గోచరించు బ్రహ్మముయొక్క బాహ్యదృశ్యరూపమేయని చెప్పనగును. కాని వ్యవహారజగత్సమస్య యింతమాత్రమున నిశ్చయముకాదు ౧.

---

౪. అనంతరాద్వైతమునందుఁ బ్రపంచమును స్వప్నముతోఁ బోల్చిన యుపమానమును భగ్నమగునంతవరకు సాగఁదీసిరి. అద్వైతమకరందమిట్లు చెప్పుచున్నది. "ఆత్మనుగూర్చిన అజ్ఞానమనునిద్రచేఁగల్పితమైనజగత్తను దీర్ఘస్వప్నమునందుఁ బరలోకమోక్షాదిస్ఫురణరేఖాకాంతులు పొడకట్టుచుండును.

"ఆత్మాజ్ఞానమహానిద్రాజృంభితేఽస్మిన్జగన్మయే
దీర్ఘస్వప్నే స్ఫురంత్యేతే స్వర్గమోక్షాదివిభ్రమాః (౧౭)

౧ ఇంకొకసందర్భములో బర్క్లే చెప్పినది శంకరుని విషయములో సరిపోవును. "సూర్యచంద్రనక్షత్రములేమగును? గృహ నదీ పర్వత వృక్ష శిలాదులు, మనశరీరములు నేమగును? ఇవన్నియుఁ గేవలమాహావినోదవిలాసములే?... మనము నిర్వచించిన సూత్రముల ననుసరించి, ప్రకృతిలో నేయొక దానికి నభావములేదు మనకింద్రియగోచరమగునవన్నియు నిజమైనవి స్థిరమైనదియగును. ప్రకృతిసిద్ధవస్తుజాలమునకు, మిథ్యాదృశ్యములకును భేదము నిలిచియేయుండును." మానవవిజ్ఞానసూత్రములు. పు. ౩౪.

మోక్షమునుగూర్చిన శంకరునిభావములవలన జగత్సత్త్వమునుగూర్చి పైనిచెప్పిన యంశము సమర్థింపఁబడుచున్నది. మోక్షమనఁగా నది లభించుటతోఁ బ్రపంచ మదృశ్యమైపోదని యాతఁ డుద్ఘాటించెను. ఏలన నట్లైనచోఁ బ్రపంచము మొట్టమొదటి ముక్తపురుషునితో నంతరించియుండెడిది. బహుత్వమును నాశనమొనర్చుటే మోక్షమైనచో, విద్యచే నవిద్యను బోగొట్టుకొనుట మోక్షమునకు యుక్తమార్గముకాదు; అపుడు చేయవలయు కర్తవ్యము ప్రపంచమును నాశమొనర్చుటే.౨. శంకరుఁడు జీవన్ముక్తి,విదేహముక్తియను ముక్తిభేదములను జెప్పినాఁడు.ముక్తావస్థకు శరీరముండుట లేకుండుటయు భేదముకలుగఁజేయదు;సంసారబంధములనుండివిముక్తియేమోక్షము.జగద్రూపమగు ననేకత్వముండుటయుఁ బోవుటయు ననువానిపై మోక్షమాధారపడి యుండలేదు; మోక్షసిద్ధిగలిగిన వానిని జగత్తు మోసగింపఁజాలనిదగును. అందుచే జీవన్ముక్తునికిఁ దనశరీరముతోఁ గూడిన ప్రపంచము విరతినొందదు; కాని దానినెట్టి దృష్టితోఁ జూడవలెనో యాతఁడు గ్రహించును. ముక్తపురుషునికి జగమింకొక కాంతిలో గోచరించును. ముక్తపురుషుఁడు కామములచే నంధుఁడై, సంసారసంచారములో నెన్నడు లభింపని సుఖాదులకొఱకుఁ బరుగు లిడఁడు. జీవబ్రహ్మైక్యసిద్ధి యగుట తోడనే, జీవులువేరు, విషయములువేరు, వాని ప్రవృత్తులు వేరను భేదబుద్ధినిఁ గలిగించు నజ్ఞానము నశించును.౧.

౨. శం. భా. ౩.౨.౨౧.

౧. బ్రహ్మాత్మదర్శినాన్ ప్రతి, సమస్తస్య క్రియాకారకఫల లక్షణస్య వ్యవహారస్యాభావమ్, (శం.భా.౨.౧.౧౪)

అవిద్యావశంగా నాత్మానాత్మలనుండి వివేకింపలేక పోవుటయే. ఇచ్ఛాజ్ఞానక్రియా ప్రవృత్తులు మనకుఁ గలవని మనమెఱుఁగు దుము. ఈ విషయము స్పష్టమేయని శంకరుఁ డంగీకరించును గాని, వీనిపై నాధారపడి, పరిచ్ఛిన్నజీవులు నిజముగా వాని స్వస్వరూపములైన యపరిచ్ఛిన్నాత్మ రూపములని యాతఁ డంగీకరింపఁడు. పరమార్థ మర్థమును గ్రహించును. దృశ్యములన్నియుఁ బరమార్థమునకుఁ జెందినవే. అద్వైత మంగీకరించిన అనన్యత్వ సిద్ధాంతములోని సత్యమిదియే. రామానుజుఁడు దీనినిట్లు విమర్శించినాఁడు; "కార్యమసత్యమును కారణముచేఁ గార్యకారణముల కనన్యత్వమును సమర్థించువారు, వారియనన్యత్వసిద్ధాంతమును నిలుపఁజాలరు; ఏలన, సత్యమైన దానికి నసత్యమైన దానికి ననన్యత్వముండఁజాలదు. వారి వాదమే యుక్తమైన దైనచో, బ్రహ్మమసత్యమైనను గావలెను లేదా, జగత్తు సత్యమైనను గావలెను;" ౨. నిర్గుణబ్రహ్మము జగత్తుతో ననన్యతను గలిగియున్నదని యద్వైతి చెప్పుటలేదు. జగత్ర్పపంచమున కాధారభూతమగు బ్రహ్మము, జగత్తుతో సమానముగా నసత్యమైనదనియు నాతఁడు వచించుటలేదు. దృశ్యప్రపంచ మసత్యమనియు ననగా, బ్రహ్మమునకు వేఱుగా దానికస్తిత్వము లేదనియు నాతఁడు చెప్పును. ఈయనన్యత్వమును శంకరుఁడభావముగా ననఁగా, దాని కారణమునకు భిన్నమైన దానినిఁగా నర్థము చెప్పినాఁడు. ౧, అనన్యత్వమేకత్వమును సమర్థించదు;

౨. రామానుజభాష్యము. ౧,౧,౧౫

౧. తద్వ్యతిరేకేణాభావః (శం.భా.౧,౧,౧౪.)

భిన్నత్వమునే నిరసించునని తన భామతిలో వాచస్పతి స్పష్ట పఱచినాఁడు. ౨. కారణధర్మమును, దానికి సంబంధించిన తాత్త్వికైకత్వమును జర్చించుచు, గార్యము కారణముతోఁ నేకమేగాని కారణము కార్యముతోఁగాదని శంకరుఁడు పలికినాఁడు. 3. ఏకత్వములో భేదములన్నియు లయముకావచ్చును గాని, యద్వైతమునందు, వ్యావహారిక పారమార్థికసత్యములకు మధ్యమందు గల ఛిద్రమును గప్పివేయుట కొఱకొక సర్వైకత్వప్రకటనము చేయఁబడెను. మృత్తికా వికారముల కన్నిటికి మూలాధారము మృత్తికయే యని చెప్పిన యుపనిషద్వాక్యమున కర్థ వివరణముచేయుచు శంకరుఁడు ప్రపంచము బ్రహ్మరూపము బ్రహ్మమూలమనని చెప్పియున్నాఁడు. కార్యములసత్యములని యాతఁడు నిరసించునపుడు, "బ్రహ్మాభిన్నము, లేక 'కారణభిన్న' ము నని విశేషణములు చేర్చినాఁడు. ౧. జీవితము నిజముగా నొకస్వప్నమనికాని, మనజ్ఞానమొక స్వప్న దృశ్యమనికాని యాతఁడెచ్చటను జెప్పియుండలేదు.

౨. నఖల్వనన్యత్వమిత్యభేదమ్ బ్రూమః కింతుభేదమ్ వ్యాసేధామః (భామతి) ఈభావమునే టీకాకారుఁడిట్లు చెప్పెను:

"ప్రపంచము బ్రహ్మముతో నేకముగాదు; దాని మూలకారణమగు బ్రహ్మమునకు వేరైన యస్తిత్వము దానికిలేదు"

"కారణాత్ పృథక్ సత్తాకాన్యత్వమ్ సాధ్యతే, నత్వైకాభిప్రాయేణ"

(3) శం.భా.౨.౧.౭.

(౧) బ్రహ్మవ్యతిరేకేణ, లేక కారణవ్యతిరేకేణ. (శం.భా. ౨. ౨, 3; గౌడపాదకారిక. ౧, ౬.)

సగుణమైన సర్వసామాన్యలక్షణము పారమార్థికప్రమాణము కాఁజాలదని శంకరుఁడు నిరసించుటవలన నాతఁడు ప్రపంచమును మిథ్యాకల్పితముగా భావించెనని యూహింపఁబడెను. అద్వితీయమైన శంకరుని బ్రహ్మమే జంతువులు దరిఁజేరినను మఱలిఁ దిరిగిరాని కేసరిగుహారమువంటిదని తోఁచును. తర్కపద్ధతిచే మనము జగద్బ్రహ్మ సంబంధమును తెలిసికొనఁజాలమని, శంకరుఁడు చెప్పి, జగత్తు బ్రహ్మమూలము బ్రహ్మేతరాధారాస్తిత్వములు లేనిదియునని యేయితరవాస్తవికవాదికినిఁ దీసిపోకుండ నుద్ఘాటించియున్నాఁడు. బ్రహ్మమును జగత్తునొక సంపూర్ణ ద్రవ్యభాగములని యాతఁడంగీకరింపఁడు గాని, వానికిఁ బరస్పరవ్యతిరేకత్వమున్నదనియు నాతఁడు చెప్పఁడు. కాని, పెక్కుమంది సుప్రసిద్ధపండితులిట్టి నిర్ణయమునకువచ్చిరి. ౧. దృశ్యప్రపంచ బ్రహ్మసంబంధసమస్య పరిచ్ఛిన్నమనస్కులమగు మనకెన్నటికి నొకసమస్యగానే యుండునని శంకరుఁడు చెప్పిన భావ మధికపరిణతినిఁ జూపును. అనాద్యమగువిషయముల కాదినిగ్రహింపఁజాలని మానవవిజ్ఞానము వ్యర్థమైనదని మనము నిరసింపనవసరములేదు.

ఇప్పుడు మనప్రశ్న యేమనగా, నేదృశ్యములనుండి మనము పరమార్థము నన్వేషించి కన్గొనయత్నింతుమో, అట్టి

(౧) డ్యూసేన్ భాష్యవివరణము సువిశితమైనది. మ్యాక్సుముల్లరు చెప్పినాఁడు "నేనిచటఁ బ్రదర్శించుటకు యత్నించినరీతిని సరియగు వేదాంత తత్త్వముయొక్క ముఖ్యసూత్రముల నర్థముచేసికొనిన ప్రతివ్యక్తికి నీతత్త్వము నందు మనస్తత్త్వమునకుఁగాని, సృష్టివాదముల గాని ధర్మశాస్త్రమునకుఁగాని స్పష్టతావులేదనియగును."(సిక్స్‌సిస్టమ్స్ ఆఫ్ ఇండియన్ ఫిలాసఫీ, పు. ౧౬౦.

వ్యావహారికదృశ్యములు, పరమార్థసత్యమునుగూర్చి మనము మవపరిచ్ఛిన్నమనస్సులతో నూహించి కల్పించుకొనుభావమాత్రములా? మఱియొకలాగునఁ జెప్పినచో, వ్యావహారికప్రపంచము పరమార్థముయొక్క వికృతిరూపమా? లేక మన పరిచ్ఛిన్నదృష్టికి గోచరించు కేవలమిథ్యాస్వరూపమా? యనున దిముఖ్యసమస్య. జగము పరమార్థవికృతిరూపమని రామానుజుని మతము, ఇదియే హెగెల్ తత్త్వము; దీనిననుసరించి, వ్యవహారజగత్తు నిర్గుణబ్రహ్మయొక్క బాహ్యప్రదర్శనము. స్పైనోజాయొక్కతత్త్వ మొకవిధముగాఁజూచినచో నిట్టిదే.౧. జగత్తు కేవలభావకల్పితమనుభావమును యోగాచారబౌద్ధులును, ప్రతిపాదించిరి వీరు క్యాంటుతత్త్వజ్ఞునివలెను, తరువాత నధికముగా షోపెన్‌హోయరువలెను, బాహ్యప్రపంచము వ్యక్తిగతమైన బుద్ధిగోచరమాత్రమే యని నిర్ణయించిరి. సత్యస్వరూపమును మానవుఁ డూహించి కల్పించిన భావమాత్రాస్తిత్వముగలదే ప్రపంచమను నర్థమునిచ్చు వాక్యములు గొన్ని శంకరుని రచనలలోఁగలవు! పరిచ్ఛిన్నవ్యక్తులతో నిమిత్తము లేకుండ బాహ్యప్రపంచమునకు యథార్థమగు నస్తిత్వముగలదనుభావమునిచ్చు కొన్నివాక్యములునుగలవు. శంకరునితత్త్వమును సరిగాగ్రహించుటకు మన మవిద్యా మాయాసంబంధమును స్పష్టముగా గ్రహింపవలెను.

౧. పండిత కోకిలేశ్వరశాస్త్రి యిట్టిభావము శంకరునకుఁ గలదని వ్రాసినాఁడు. చూ, ఆతని అద్వైతతత్త్వము.

## 33—మాయ—అవిద్య.

బాహ్యప్రపంచ దృక్పథమునుండి చూచినచో మాయయనియు, వ్యక్తిగతదృష్టినుండి చూచినచో నవిద్యయనియుఁ జెప్పఁబడును. ౧. బ్రహ్మము నాత్మయు నొకటేయైనట్లు, మాయయు నవిద్యయు నొకటే. నిజముగా నొకటైన దానిననేకముగాఁ జూచు మానవస్వభావము నవిద్యయందురు; కాని యిది మానవులందరకు సామాన్యమైనది. ఏలన, నవిద్యనుగూర్చి శంకరుఁడు చెప్పునపుడది నీదియనికాని నాదియనికాని చెప్పలేదు. అదియొక విశ్వవ్యాప్తమగుశక్తి; వ్యక్తుల చిత్తములలో నది వ్యాపించునుగాని, వాని కతీతమైన శక్తియునైయున్నది. మన జ్ఞానేంద్రియము లదివరకే సృజింపఁబడిన వస్తువులను జూచి, వ్యవహరించును; మన యింద్రియములా వస్తువులను జేసియుండలేదు. శ్రుతులు చెప్పిన క్రమములో నీశ్వరుఁడు ప్రపంచమును సృజించినాఁడు. దానిని మనము దర్శించుచున్నాము. ౨. మాయ విషయీవిషయసంబంధి; వ్యక్త్యాత్మకము, సార్వజనికము గూడనై యున్నది. ఉపాధిగతములైన చిత్తములును, బాహ్యవస్తువులును గూడ దానినుండియే వచ్చి

---

౧. "ఆదికర్తయొక్క సంకల్పమునకు వశమై, సాటిలేని ఫలితములు నుదయింపఁజేయునపుడు దానిని మాయయందుము: అది స్వతంత్రమై, సత్యము నాచ్ఛాదించు శక్తిగలిగిన దైనప్పు డవిద్యయనఁబడును" (వివరణ ప్రమేయ సంగ్రహము ౧.౧; ఇండియన్ థాట్ వాల్యుము ౧. పు. ౨౮౦.)

౨. శ్రుతిదర్శితేన క్రమేణ పరమేశ్వరేణసృష్టమ్, అజ్ఞాతసత్తాకమేవవిశ్వమ్, తత్తద్విషయ ప్రమాణావతరణే తస్య తస్య దృష్టిసిద్ధిః (సిద్ధాంతలేశము. ౨.)

నవి. ఏదికారణముగా నసత్యప్రపంచము సత్యమైనదిగా గోచ రించుచున్నదో, యది కేవల వ్యక్తిగతమైనదైనచో, నది కేవల మాయాకల్పితమే యగుటచే, జగత్తున కుపాదానకారణమని మనము చెప్పుట కవకాశములేదు. అట్లుగాక, మాయ జగత్తు న కుపాదానకారణమే యన్నచో, నదగా సాంఖ్య ప్రకృతి వంటిదన్నచో, నది యప్పుడు కేవలము వ్యక్తిగతము కాఁజా లదు. వ్యక్తిగతమైన అవిద్యయు, బ్రహ్మసంబంధమైన ప్రకృ తియు నేకకాలమం దుదయించును; ఇం దేయొకటియు రెండ వది లేనిచో దురూహ్యము; ౧. అందుచే నవిద్యయుఁ బరమా ర్థముపై నాధారపడియున్నది. జీ ౨. వాత్మయుఁ బ్రకృతియు నన్యోన్యాశ్రియ భూతములై యున్నవి. అవిద్యాప్రకృ తులు సమాననిత్యతను గలిగి, వ్యవహారజగత్తునకుఁ జెందియు న్నవి ౩. దేశకాలనిమిత్త కల్పితమగు జగత్తు, అవిద్యాద్వార మున మనకు గోచరించు పరమార్థరూపము. అవిద్య యీపని చేయుటకే యర్హత గలదై యేర్పడియున్నది. కేవల విజ్ఞాన వాదమునుగాని, భౌతికవాదమునుగాని శంకరుఁ డంగీకరింపఁడు. జీవాత్మ ప్రకృతి సంజాతమగు నొక వస్తువుకానిరీతినే, ప్రకృతి మన విజ్ఞానమునకు మాత్రమే గోచరించు నొక దృశ్యమును

---

౧. పోల్చు: క్యాంటు; బెర్గ్సన్, జడపదార్థముయొక్క భౌతికస్వ రూపము మన విజ్ఞానముయొక్క బుద్ధి కల్పనముతో నారంభమైనది; బుద్ధి యు, నింద్రియ గోచరమగు జగత్తు నేకకాలమందుదయించి, పరస్పరా శ్రియ భూతములైయున్నవి.

౨. విష్ణుపురాణము: అవిద్యాపంచపర్వైషాప్రాదుర్భూతా మహాత్మనః (౧. ౫. ౫.) 3 అద్వైతసిద్ధిపు, ౫,౯,౫.

గాదు. వస్తుప్రపంచాస్తిత్వమునకుఁ గల హేతువులే, జీవాత్మాస్తిత్వమునకును గలవు. మన మానసము లపార్థకల్పనము నేల చేయుచున్నవి ? అవిద్య యెందుకున్నది? దేశకాలనిమిత్త పరికల్పిత జగత్తేల యున్నది ? మాయకుఁ గారణమేమి ? ఈప్రశ్నలన్నియుఁ బరిష్కరించుటకు సాధ్యముకాని మూల సమస్యారూపములే,శుద్ధచిత్స్వరూపమగు నాత్మయెట్లో అవిద్యా వశమైనది; శుద్ధసత్స్వరూపమగుబ్రహ్మము దేశకాలనిమిత్తాత్మకమగు ప్రపంచమైనట్లే. వ్యావహారిక జగన్మూలమున బ్రహ్మము ఉఁగినట్టే, మన మవిద్యామూలమున విద్యను గ్రహింతుము. ఇట్టిపరివర్తన మనాదియై యేలసంభవించు చున్నదో మనకన్ననిర్వచనీయమైనది; కాని, మనవిజ్ఞానసహిత మానసములుగాని వానిచే గ్రహింపఁబడుచున్న ప్రపంచము గాని మిథ్యకాదు. వస్తుదృశ్యమొక యూహాదృశ్యముకాదు. అవిద్యయు, మాయయు నొకేయనుభవముయొక్క బాహ్యాభ్యంతరరూపములు. జ్ఞానముచే నదృశ్యమగునదికావున నది యవిద్యయనఁబడెను; బాహ్యదృశ్యపరంపర, పరమేశ్వరునితో సమానముగా నిత్యమైయుండునదికావున మాయయనఁబడును. మాయ ప్రళయకాలమందుఁగూడ నుండునని శంకరుఁడుచెప్పినాఁడు. సర్వజ్ఞుఁడైన యీశ్వరుఁడు మాయకధిపతిగావున, నాతని కవిద్యయునులేదు. సాంఖ్యతత్త్వజ్ఞ లీశ్వరు నంగీకరించలేదు; కాని ప్రకృతిప్రపంచమున కనాదియైన యవిద్య కారణ మనిరి. అవిద్య బుద్ధియొక్కగుణముకావున, బుద్ధి యందే యుండును; అవిద్య కనాదిత్వలక్షణము బుద్ధినే యాశ్రయించి

యుండునని చెప్పవలెను. బుద్ధి, యీకారణముచే మూలద్రవ్యమగు ప్రకృతియొక్క రూపమే. ఈవిధముగా నవిద్యయొక్క వాస్తవికత సాధింపఁబడినది. వివరణప్రమేయసంగ్రహ మిట్లు చెప్పుచున్నది; "అద్వైతదర్శనమున కాటంకముఁగల్పించి, ద్వైతమును దర్శింపఁజేయునంతవఱకు నవిద్య మనబుద్ధిగతమైనలోపమే యనుటకు సందేహములేదు; కాని, యదిజగదుపాదాన కారణమగుటవలన నది మహనీయమైనది; ఏలన, దానివలన బ్రహ్మజ్ఞానము సాధ్యమగుచున్నది"౧. అపరిచ్ఛిన్నమైనదానినిఁ దెలిసికొనుటకుఁబూర్వము పరిచ్ఛిన్నత మనకవసరమైనదే.

శంకరుఁ డవిద్యా మాయాశబ్దములను సమానార్థకములుగా నుపయోగించినను, ౧. రెంటికి భేదము ననంతరాద్వై

౧. ఇండియన్ థాట్; వాల్యూ. ౨. పు. ౧౭౭. శ్లో: ఈశావాస్యోపనిషత్తు; అవిద్యవలన మృత్యువును దరింతుమని యిందుఁజెప్పఁబడెను.

(౧) అవిద్యయు మాయయు నొకటికాదని కల్నల్ జాకోబ్ భావించెను. చూ: వేదాంతసారము. ౫. నానాత్వముతోఁగూడిన జగత్తవిద్యాకృతము. పరిచ్ఛిన్నమానసరూపములు, దేశకాలనిమిత్తములు దృశ్యప్రపంచమున కాలంబనములు. అవిద్య మాయానామరూపములను గల్పించి వానిమూలమున బాహ్యజగత్తు నుద్భవింపఁజేయుచున్నది. అవిద్యా ప్రత్యుపస్థాపిత నామరూపమాయావేశవశేన (శం. భా. ౩, ౨, ౨) మూలప్రకృతి మాయయనియు, దానికార్యములైన ఆవరణవిక్షేపము లవిద్యయనియుఁ గొన్నిసమయములలోఁ జెప్పఁబడెను శుద్ధసత్త్వసహిత మూలప్రకృతి మాయయనియు, నశుద్ధసత్త్వ సహితమైన దవిద్యయనియుఁ గొందరు తలఁచిరి. విక్షేపశక్తి ప్రధానామూలప్రకృతి మాయ; ఆవరణశక్తి ప్రధానామూల ప్రకృతి అవిద్యా సత్త్వరజోస్తమో గుణకలితమై ఈశ్వరోపాధి రూపమైన దవిద్యయని కొన్ని యద్వైతగ్రంథములు చెప్పుచున్నవి. ఇది సరియగుభావముగాఁ దోఁచదు, రజస్తమోగుణము లీశ్వరునకున్నచో నాతనికి జీవునితో

తులు నిర్ణయించిరి. మాయ యీశ్వరోపాధియనియు, నవిద్య జీవోపాధియనియుఁ జెప్పఁబడెను. విద్యారణ్యుననుసరించి, మాయయందు బ్రహ్మయొక్క ప్రతిబింబమే శుద్ధసత్త్వస్వరూపి యగు నీశ్వరుఁడనియు; అవిద్యయందు బ్రహ్మప్రతిబింబమే, రజస్తమోగుణసహిత సత్త్వరూపమగు జీవాత్మయనియుఁ జెప్పఁబడెను. ౨. శంకరుఁ డీభావమునే యిట్లు చెప్పెను; "నిర్గుణ బ్రహ్మమే, మనము మనబుద్ధిచే భావించినపుడు శుద్ధోపాధిగల సగుణుఁడైన యీశ్వరుఁడగును." 3. అవిద్యాసంజాతము లన్నియు నీశ్వరునిశక్తులే. ఈశ్వరస్వభావా విష్కృతియే ప్రపంచము; మానవబుద్ధితో నది సంబంధించియున్నది. జగద్వస్తువు లన్నియు నీశ్వర మానసికభావములును, మానవబుద్ధి గోచరములు నైయున్నవి. జగత్కారణుఁ డీశ్వరుఁడని చెప్పఁబడెనుగాని, మఱల జగమవిద్యాకల్పితమనియు వచింపఁబడెను. ౪. బ్రహ్మమును, మాయయు జగత్తులోనుండి, రెండునుగలిసి

భేదముండదు. పోల్చు: స్కందపురాణము: అవిద్య జీవోపాధియనియు, బ్రహ్మ విష్ణు మహేశ్వరుల యుపాధిరూపమే మాయయనియు, నిందుఁ జెప్పఁబడెను.

"అవిద్యోపాధికో జీవో నమాయోపాధికః ఖలు,
మాయాకార్య గుణచ్ఛన్నా బ్రహ్మ విష్ణు మహేశ్వరాః

(౨) పంచదశి. ౧౬-౧౭

(3) శం. భా. ఛాం. ఉ. 3, ౧౪, ౨. విశుద్ధోపాధిసంబంధాత్.

౧. ౧,౧,౨.

౨. పోల్చు: అవిద్యాత్మికాహిసాబీజశక్తి రవ్యక్తశబ్దనిర్దేశ్యాపరమేశ్వ రాశ్రియామాయా (శం.భా. ౧.౪.౩). మఱియుఁజూడు. శం.భా.౨.౧.౧౪ ౭.౩.౧౫. అవిద్యయామాయయా.

దాని యుపాదానకారణమగుచున్నవి. బ్రహ్మమును, మాయయు, సత్యము దానిదృశ్యమునై, రెండునూత్రము లోకేనూత్రముగాఁ బెనవేయఁబడినట్లున్నవి.

## ౩౮ — ప్రకృతి జగత్తు

శంకరుఁడు యథార్థజగద్వర్ణనముతో నూరకొనలేదు తనసిద్ధాంతము ననుసరించి, దృశ్యప్రపంచరూపములను బరిశీలించి, పరిచ్ఛిన్న భావములలోనుండు సత్త్వమునునిర్ణయించి సత్యము, భిన్న దృశ్యరూపములలో నెట్టిక్రమములోగోచరించునో తెలిపియున్నాఁడు. ప్రతిదృశ్య మెట్లుతనకాధారభూతమగు సత్యమును బ్రదర్శింప యత్నించునో యాతఁడు నిరూపింపఁబూనుకొనెను. సర్వమునకు మూలాధారభూతమై యవ్యయబ్రహ్మముండుటచే, క్రమముగా నుత్తరోత్తరాధికముగా బ్రహ్మస్వరూప మావిష్కృతమగుచున్నది 3. "మానవునియొద్దనుండి తృణమువఱకు నన్నియు నొకేచైతన్యముతో నిండియున్నను, జ్ఞానము, శక్తి మున్నగునవి సోపానక్రమములో సన్నగిల్లునట్లే, మానవుని మొదలు హిరణ్యగర్భునివఱకుఁగల యున్నతపథసోపానశ్రేణికిఁజెందిన జీవరాశిలో క్రమజ్ఞానాభ్యున్నతి వికసించుటను మనముచూచుచున్నాము.4

3. యద్యప్యేక ఏవాత్మా సర్వభూతేషు స్థావరజంగమేషు గూఢ స్తథాపి చిత్తోపాధివిశేషతారతమ్యాత్ ఆత్మనఃకూటస్థ నిత్యస్యైకరూపస్యాపి ఉత్తరోత్తరమావిష్టస్య తారతమ్యమ్ ఐశ్వర్యశక్తివిశేషైఃశ్రూయతే (శం. భా. ౧.౧.౧౧.)

4. శం.భా. ౧.3.3౦ యథాహి ప్రాణిత్వ విశేషేఽపి మనుష్యాది స్తంబపర్యంతేషు జ్ఞానైశ్వర్యాది ప్రతిబంధః పరేణపరేణ భూయానీభవన్ దృశ్యతే తథామనుష్యాదిష్వేవహిరణ్యగర్భపర్యంతేషు జ్ఞానైశ్వర్యాభివ్యక్తిరపి పరేణపరేణ భూయసీభవతి. చూ. శం,భా. ౧.౧.౧.

దృశ్యప్రపంచమున మన మీక్రిందిభేదములను దర్శింపఁగలము, (౧) కర్మ ఫలప్రదాతయగు నీశ్వరుఁడు, (౨) కర్మఫలసీమ యగు నామరూపాత్మక ప్రకృతి ప్రపంచము, (3) ఉపాధిగతములైన జీవాత్మలు, కర్మఫలము లనుభవించు నిమిత్తము తిరిగి తిరిగి లోకమున జన్మించుచుండుట. ప్రపంచముయొక్క అనేకత్వము భోక్తయు భోగ్యము, కర్తయుఁ గర్మభూమియు నను ద్వంద్వములపై నాధారపడియున్నది. జడప్రపంచమంతయు క్షేత్రమని, చెప్పఁబడెను; ఏలన నిచట జీవులు తమ కర్మాచరణమున కనుకూలమైన వాతావరణమున్నది:ఇచట జీవులు తమ కోరికల ననుసరించి కర్మలొనర్చి, ఫలితముల ననుభవింతురు౧. ఇది పంచభూతాత్మకమగు జడప్రకృతి, జీవప్రపంచమాత్మలతో నిండియుండును. జీవాత్మలీ భూతములలోఁ బ్రవేశించి, తరులతాపశుమానవ దేవతారూపములఁ దాల్చును ౨. ఈసంసారచక్రమునందు, భిన్నవర్గములకుఁ జెందిన జీవరాశులున్నవి; వాని కనుగుణములైన యనుభవములకు సరిపోవు పరిస్థితులిందు గల్పింపఁబడినవి. తృణబ్రహ్మ పర్యంతముగల యీజీవరాశి సోపానక్రమములో నున్నతములగు ననుభవములను బొందుచుండును.3.

(౧) ఫలోపభోగార్థమ్... సర్వప్రాణి కర్మఫలాశ్రయః (శం. భా. ముం. ఉ. 3,౧,౧.

(3) వైదిక దేవతలును జగత్పరిణామమునకుఁ జెందినవారే. (శం॥ భా॥ ౧,౨,౧౭; ౧,3,33.)

(3) శం॥ భా॥ ౧,3,౧౦. శం॥భా॥బృ॥ఉ॥ ౧,౪,౧౦.

ప్రపంచపరిణామ మొక క్రమము ననుసరించును.౪. ప్రకృతినుండి ప్రథమవస్తురూపమగు నాకాశము దేశపదార్థముల కాకరమై యుదయించును. "బ్రహ్మాండమంతయు నీశ్వరునుండి యుదయించినది; మొదట నాకాశము నావెనుక నితర భూతములును జనించినవి.౫. ఆకాశము జడము, నేకము, ననంతము, సర్వగతము, నైన ప్రథమభూతము.౧. ఆకాశమనఁగా నవకాశమును, నత్యంతసూక్ష్మపదార్థమును గూడనై యున్నది. ఆకాశ మెంత సూక్ష్మతమ పదార్థమైనను నదియు భూమిజలాగ్ని వాయువర్గములకు జెందినదై యున్నది. ఆకాశమనఁగాఁ గేవల నిరోధములు లేని యవకాశమాత్రమను బౌద్ధుల భావమును శంకరుఁడు ఖండించినాఁడు.౨. దీని యభావాత్మకమైన లక్షణము భావాత్మకలక్షణఫలితమే యని శంకరుని వాదమైన్నది.౩. ఆకాశము నుండి యితర సూక్ష్మభూతము లున్నత సోపానక్రమములో నుదయించును.౪. ఉపనిషద్వర్ణనము౫ ననుసరించి, యాకాశము నుండి వాయువు జనించునని శంకరుఁడు చెప్పినాఁడు. అగ్ని

(౪) శం॥ భా॥ ౨,౧,౨౪-౨౫.

(౫) శం॥ భా॥ ౨,౩,౭.

(౧) శం॥ భా॥ ౧,౧,౨౨; ౧,౩,౧౪. చూ॥ ఛాం॥ ఉ॥ ౩,౧,౪౩ ౮, ౧౪.

(౨) అవరణాభావ. (శం॥ భా॥ ౨,౨,౨౨.)

(౩) వస్తుభూతమ్.

(౪) శం॥ భా॥ ౧,౩,౮-౧౩.

(౫) తై॥ ఉ॥ ౨,౧; ఛాం॥ ఉ॥ ౬,౨,౨-౩.

వాయువునుండియు, నగ్నినుండి జలమును, జలమునుండి భూమియు నుదయించును. ఈపంచభూతములును దాని వికార రూపములకంటె నెక్కువ నిత్యతగలిగిన వగుటచే నవి శాశ్వతములు నవినాశములు నవి వర్ణింపఁ బడినవి.(౬) ఆకాశమునకు శబ్దము గుణము; వాయువున కొత్తిడి; అగ్నికుష్ణతయుఁ గాంతియు; జలమునకు రుచియు, భూమికి గంధమును గుణములై యున్నవి. భూతములకు గుణసంబంధము బీజవృక్షసంబంధము. ఆకాశకారణము శబ్దతన్మాత్ర; ఆకాశము స్థూలశబ్దము నుదయింపఁజేయును. తన్మాత్రలో భూతము దాని గుణమును గూడ నుండును. భూతములలోఁ గూడ సోపానక్రమమున్నదని మనము చూచితిమి ఇవన్నియు నాకాశతన్మాత్రలో నున్నవని తెలియుచున్నది. అనఁగాఁ బ్రపంచమంతయు నాకాశమునుండి లేక శబ్దమునుండి, జనించుచున్నది.

మహాభూతకల్పితమైన జడప్రపంచమంతయు నీ సూక్ష్మభూతమిశ్రమములచేఁ గలుగుచున్నది. (౧) స్థూలాకాశము శబ్దమును, వాయువొత్తిడిని శబ్దమును, నగ్ని వీనిని మఱియు నుష్ణమును గాంతిని, జలము వీనితోఁగూడ రుచిని, భూమి

---

(౬) ఛాం॥ ఉ॥ ౪,౩,౧; బృ॥ ఆ॥ ఉ॥ ౧,౫,౨౨.

(౧) ప్రతి స్థూలవస్తువునందును, భిన్న పరిమాణములలోఁ బంచతన్మాత్రలునుండును. దీనినే పంచీకరణ మందురు; అనగాఁ బంచతన్మాత్రలును మిశ్రణమునొంది, స్థూలవస్తూత్పత్తియగుట. శంకరుఁడు పంచీకరణమును గూర్చి చెప్పలేదు. కాని యనంతరాద్వైతములో దీని కధికప్రాముఖ్యము గలిగెను చూ॥ వేదాంతసారము. త్రివృత్కరణమును శంకరుఁడు చెప్పియున్నాఁడు. వాచస్పతియు దీనినిఁ జెప్పెను.

యితర భూతగుణములతోఁబాటు తన సహజగుణమైన గంధమును బ్రకాశింపఁజేయును. ప్రతివస్తువునకును శబ్ద స్పర్శ రూప రసగంధములు గుణములైయున్నవి. భూతతన్మాత్ర లణునిర్మాణము లేని యవిచ్ఛిన్నము నేకమునగు పదార్థరూపములై యుండఁగా, స్థూలభూతపదార్థములు సముచ్చయద్రవ్యములు; ఇవికూడ నణునిర్మాణము లేని యవిచ్ఛిన్నద్రవ్యములనియుఁ జెప్పఁబడినవి.(౨) స్థూలభూతములు పరిణామవికారములచే భిన్నవస్తూత్పత్తి హేతువులగుచున్నవి. జడపదార్థము నిత్యమవస్థాపరిణామమందుచున్నది. ఇందు బాహ్యమునుండియు మార్పులు కలుగవచ్చును. బ్రహ్మాండ పరిస్పందన మున్నదని శంకరుఁడు పలికినాఁడు.(౩) ఈభూతములన్నియు నచేతనములగుటచే నవి స్వయముగాఁ బరిణామమునొందఁజాలవు. వానియందంతర్యామి భూతుఁడై యీశ్వరుఁడున్నాఁడని భావించవలెను.(౧) భిన్నభూతప్రవృత్తులకు భిన్నదేవతలు కారణములనిచెప్పినచో నందు విరోధమేమియును లేదు; ఏలన, దేవతలందరు నీశ్వరుని క్రియారూపములే.

---

(౨) అద్వైతవేదాంతములననుసరించి అణువనగా సూక్ష్మతమమైనజడపదార్థవిభాగముగాదు; అణువనగా, బుద్ధికూహించుటకు సాధ్యమైన అల్పతమ పదార్థాంశము.

(౩) సర్వలోకపరిస్పందనము.

౧. పరమేశ్వర ఏవ, తేన తేనాత్మనావతిష్ఠమానోఽభిధ్యాయంస్తమ్ తమ్ వికారమ్ సృజతి. (శం. భా. ౨.౩,౧౩) పరిణామమున కన్నిదశలలో నీశ్వరసంకల్ప మవసరములేదని రామానుజుఁడు భావించెను. ఆకాశోత్పత్తికి బూర్వమొక్కసారియే దైవసంకల్పము కలుగును.

లయమునఁగా సృష్టియొక్క విపర్యయము. ఆ లయకాలమందు, భూమిజలమందును, జలమగ్నియందును, నగ్ని వాయువునందును, వాయువాకాశమునందును, నాకాశ మవ్యాకృతము నందును బ్రవేశించును.

మనస్సు ముఖ్యప్రాణ ఇంద్రియములన్నియు భౌతికగుణ స్వభావములు గలవే యని శంకరు లభిప్రాయపడిరి. ఇతరవస్తువులవలెనే మానవదేహము భూమిజలాగ్నిత్రయముచేఁ గల్పితము.౩ మనఃప్రాణవాక్కులు భూమిజలాగ్నులకు వరుసగా సరిపోవును. ఇవి స్థూలభూతములకు భిన్నములైనవిగాను, వానికిఁ బూర్వములుగాని యనంతరములుగాని యుత్పత్తి యగునని కొందరు చెప్పువిషయమును శంకరుఁ డెఱుఁగును. ఏదియెట్లైనను, నివి భౌతికములవలెనే, స్వభావముగా నచేతనములును, భిన్నప్రయోజనములకు సాధనములుగా సృజింపఁబడినవనియుఁ జెప్పవచ్చును. జడపదార్థము పరార్థమని చెప్ప

(౨) చూ శం.భా.౨.౩.౧౪, పోల్చు డ్యూసెన్; "పంచభూతములయొక్క క్రమపరిణామము, క్రమముగా నవి తిరిగిలయమగుటయును గూర్చిన యీ సంప్రదేశముయొక్క భావము మనకుఁదెలియుటకుఁ జాలినంతవిశేషవివరణము మనకు లేదు కాని, యిది ప్రకృతిశాస్త్రమునకుఁ గొంతవఱకు భావము నీయవచ్చును. ఘనపదార్థములు నీటిలోఁ గరిగిపోవును; నీరు వేడిమిచే నావిరియై వాయువుగా మారి, వాయువు పైకిఁబోయిన కొలఁదియు నతిసూక్ష్మమై యాకాశముగా మారవచ్చును. ఈవ్యతిరేక క్రమమున లయ మేర్పడనగును; దీని క్రమపరిణామము సృష్టి" (డ్యూసెన్, సిస్టమ్, ఆఫ్, వేదాంత.పు.౨౩౭)

౩. ఛాం. ఉ. ౬. ౨. ౨-౩

౪. శం. భా. ౨. ౪. ౨౦; ౩.౧.౨.

బడెను. ౫. జడప్రపంచములోఁ బ్రకృతి సమస్వభావము గలది. ౬.

జీవప్రకృతిలో నొక నూతననియతి మనకు గోచరించును. ఇందు వస్తువులందంతర్గతమై యొక జీవశక్తి యున్నది. ఈశక్తివలన నీవస్తువులున్నత పరిణతి నొంది, యొక లక్ష్యమును సాధించుచున్నవి. ఒక శిల జీవించుటలేదు; ఏలన దానియందుఁ బరిపూర్ణతనొందు లక్షణములేదు; ఒకస్తంభముగాఁ గాని, యొక విగ్రహముగాఁ గాని మార్పునొందు నాంతరంగిక లక్ష్యముకాని, బలముకాని దానియందు లేదు. కాని యొక మొక్క సజీవము. దాని ననుకూలవాతావరణ మందుంచినచో నది చిగిర్చి, మొగ్గపెట్టి, పుష్పించి, ఫలించుశక్తి గలిగియున్నది. దానికిఁ జూచుటకు, వినుటకు, ననుభవించుటకు, నస్పష్టముగాఁ దాను గావలసిన భావిస్థితిని దెలిసికొనుటకు శక్తి యున్నది ౧. ఇఁక జంతువనుకూలపరిస్థితులలో బెంపొందుటే కాక, దాని కనుకూలపరిస్థితులను వెదకికొను లక్షణమును గలదు. ఒక ప్రయోజనము నాసించి జంతువు చరించును; మొక్క యాపనిఁ జేయఁజాలదు. మానవుఁడింక నుత్కృష్ట జీవితమును బ్రదర్శించును. శంకరుని వాక్యములలో మానవుఁడు వ్యుత్పన్నచిత్తుఁడు; సంకల్పజ్ఞాన శక్తులాతనికిఁ గలవు. వనలతాదుల వికసించుశక్తియు, జంతువుల సంచారగ్రహణ శక్తులును, మఱియు దూరదర్శిత్వము, నిత్యానిత్య వస్తువివే

(౫) శం.గీ.భా. ౧౩-౨౨

(౬) శం.భా.తై.ఉ. ౨,౮

తము, సదసద్వివేచనము మున్నగు శక్తులను మానవుఁడు కలిగి యున్నాఁడు. సమగ్రమనుష్యత్వసిద్ధిఁగాంచిన వారు దేవతలు. ఈవిధముగా జీవప్రపంచములో నాలుగు వర్గములు మనకు గోచరించును; దేవతలు, మనుష్యులు, జంతువులు, వృక్షములు. (౧) ఉపనిషద్భావము ననుసరించి, తరులతాదులు భోగస్థానము లనియు, నందు జీవాత్మలు తమ యసత్కర్మ ఫలానుభవముకై ప్రవేశించి నవియు శంకరుఁ డంగీకరించును. ౨

సుఖదుఃఖానుభూతి వానికిఁ దెలియకున్నను, పూర్వకర్మ క్షయము వానికగుచున్నదని చెప్పఁబడెను. శంకరుఁడు సామాన్యముగా మూఁడురకముల దేహధారులగు జీవుల నంగీకరించును. అత్యంతసుఖానుభోగముగలవారు దేవతలు; సుఖదుఃఖమిశ్రమ భాజనులగు మనుష్యులు; విశేషదుఃఖతాపము ననుభవించు పశువర్గము. ౧ ఈ దేహసంబంధ మున్నంతకాలమును నీజీవులు ప్రాణశక్తులు సూక్ష్మశరీరములతోఁ గలిసి, మోక్షప్రాప్తికాలమువఱకు వానినంటిపట్టుకొనియుండును. అగ్నినుండి నెరసులవలెనే. జీవులన్నియు బ్రహ్మమునుండి బహిర్గతిఁగాంచినవనియు, నెరసులు తిరిగి యగ్నిలోఁ బ్రవేశించలేవు గాని, జీవులు తిరిగి బ్రహ్మమందుఁ బ్రవేశించుననియుఁ జెప్పఁబడెను. ౨.

(౧) శం॥ భా. ౩, ౧, ౨, ౮

(౨) శం॥ భా. ౩, ౧, ౨౮,

(౧) శం. భా. ౨, ౧, ౩౮.

(౨) ముం. ఉ. ౨, ౧, ౧; కౌషీతకీ. ఉ. ౩, ౩, ౮; ౨౦; బృ. ఆ. ఉ. ౨, ౧, ౨౦. చూ. శం. భా. ౩, ౧, ౨౦-౨౧; ఐత. ఉ ౩, ౩; ఛాం. ఉ. ౬, ౨, ౨.

౩౫—జీవాత్మ.

జీవాత్మలక్షణపరిశీలనమువలనఁ బరమాత్మైకత్వ సత్యజ్ఞానమును మనకుఁ గలిగించుటే వేదాంతమునకు లక్ష్యము. వేదాంతవాక్యములం దీయర్థములు రెండును గోచరించును. ౩. స్మృతులు సంబంధములు, ఇష్టానిష్టములు, నిశ్చయానిశ్చయములు మున్నగువానిసంపుటీరూపములోని భిన్నాంశములనన్నిటి నేకముహూర్తమున దర్శించుట మనకసాధ్యమైనను, దానిసామాన్యనిర్మాణము, ముఖ్యలక్షణములు మనపరిశీలనమునకు సుసాధ్యములైయున్నవి. జీవాత్మ విజ్ఞానాత్మయు. పరిణామగతమునై యుండగా, పరమాత్మ యెట్టిమార్పులకును వశముకానిదై యున్నది ౪. మూలరూపములో జీవాత్మయుఁ బరమాత్మయు నొక్కటేయని చెప్పఁబడెను. తత్త్వమసిగ వ్యతిరేకలక్షణయుక్తములైన వస్తువులు సమానములుకావనునాక్షేపణయు నిస్సారమైనది; ఏలన లక్షణవ్యతిరేకత్వ మసత్యమని నిరూపింపవచ్చును." ౧ సర్వానుభవకారణభూతమైన యాత్మకును, మనమనస్సునకుఁ బొడకట్టు 'నేను' 'నాది' యను నాత్మకును భేదమును శంకరుఁ డతిజాగరూకతతో వివరించినాఁడు.

(౩) శం. భా. ౨, ౩, ౨౫.

(౪) శం॥ భా॥ ౧॥ ౩, ౨౪; పోల్చు: కఠో॥ ఉ॥ ౩, ౧; ముం॥ ఉ॥ ౩, ౧, ౧; శ్వే॥ ఉ॥ ౪, ౬, ౭.

(౧) పోల్చు: క్వేకరుమతస్థుల సుప్రసిద్ధసిద్ధాంతము. ప్రతివ్యక్తి యొక్క హృదయాంతరమునందు నంతర్జ్యోతియున్నది. సర్వవాదసిద్ధాంతములం నీ జ్యోతియొక్క సూచననను సరించి పరీక్షింపఁబడును.

(౨) శం॥ భా॥ ౪, ౧, ౩.

అహం ప్రత్యయవిషయము శుద్ధసాక్షి యైన ఆత్మ గాదు; కర్తృత్వ భోక్తృత్వాది గుణవిశిష్టమైన జీవాత్మయే. సమస్తత్వ వేత్త లంతర్విలోకనవిషయమే యాత్మయని చెప్పఁబడు. పరమాత్మ శుద్ధచిత్స్వరూపము; ౩. జీవాత్మ యొక్క లక్ష్యసిద్ధికై ప్రవృత్తి గలిగియున్నది. ప్రవృత్తి మనకందరకు నిగూఢము నత్యంత సన్నిహితము నైన యనుభవము. సర్వప్రవృత్తులకు జీవాత్మయే కర్త. ౪. కర్తృత్వ మాత్మకు ముఖ్యస్వభావమైనచో, నుష్ణత లేకుండ నగ్ని యుండనేరదనే, కర్తృత్వహీనమై యాత్మయుండఁజాలదు గావున దానినుండి యాత్మకు విముక్తి లేదు. కర్తృత్వము దుఃఖజనకము గావున కర్తృత్వవిముక్తిఁ బొందనంతకాలము మానవుఁ డుత్తమస్థితిఁ బొందనట్లే యగును. ఆత్మోపాధిలక్షణమే కర్తృత్వమై యుండఁగా, దాని నాత్మ కారోపించుచున్నాము."౧. జీవాత్మ నిస్సంశయముగాఁ గర్తయే; లేకున్నచో, వేదవిధులన్నియు నిరర్థకము లగును. ఆత్మకుఁ గర్తృత్వమును జెప్పిన యుపనిషద్వాక్యములు గలవు.౨. కర్తృత్వము నిజముగా విజ్ఞానోపాధియందే కలదు

---

(౩) శం॥ భా॥ ౨, ౩, ౪౦. (౪) శం॥ భా॥ ౧, ౧, ౪.

(౧) శం॥ భా॥ ౨, ౩, ౪౦. తస్మాదుపాధిధర్మాధ్యాసేనైవాత్మనః కర్తృత్వమ్ నస్వాభావికమ్. చూ॥ శం॥ భా॥ శ్వే॰ ఉ॥ ౩,౪. ఆత్మకుఁగాని పురుషునకుఁగాని కర్తయొక్క ప్రవృత్తితో నిమిత్తములేదని అద్వైతము సాంఖ్యము నంగీకరించును ఉపాధిసంబంధము వలన నజ్ఞానవశమైనపుడది కర్తగాఁ బడుచున్నది. ఈయజ్ఞానము నవిద్యయని అద్వైతమును, ప్రకృతియని సాంఖ్యమును జెప్పుచున్నవి.

(౨) బృ॥ఆ॥ఉ॥ ౪,౩,౧౨; తై॥ఉ॥ ౩,౫; శం॥భా॥ ౨,౩,౩౩.

జీవాత్మ విషయావిషయ, ఆత్మానాత్మ, స్వరూపము. వ్యక్తి స్వభావగతమైన ఆత్మయే జీవి.౩ అజ్ఞాన సహితమైన ఆత్మయే జీవి. శంకరుని భాష్యలో, "ప్రతి మానవుఁడు నీశ్వరుఁడయ్యు, మాయాశక్తిచే నటించుచున్నాఁడు ౪. అవిద్య లేక తార్కికజ్ఞానము జీవాత్మయొక్క వ్యక్తిత్వమునకుఁ గారణమై, "వంచించి వంచింపఁబడుచున్నది." జీవాత్మకు బుద్ధి సంబంధమే దాని విశిష్ట లక్షణము. సమ్యగ్జ్ఞానముచే సంసారము నశించు నంతవఱకు నీలక్షణముండి యుండును.౫ మరణానంతరమునఁ గూడ జీవాత్మకు బుద్ధిసంబంధముండును. అది మోక్షముచేతనే విచ్ఛిన్నమగును. సుషుప్త్యవస్థలోను, మరణావస్థయందును, నీబుద్ధిసంబంధ మవ్యక్తమై యుండి, జాగ్రదవస్థయందును, పునర్జన్మమందును నది వ్యక్తమగును. ఈసంబంధమున కవిచ్ఛిన్నతను మన మంగీకరింపకున్నచోఁ గారణధర్మము భగ్నతఁజెందును; ఏలన నిశ్చిత కారణము లేకున్నచో నేదియునుదయించదు.౬ మరణకాల

---

(౩) శం॥ భా॥ ౨,౩,౪౦.

(౪) సురేశ్వరుఁడు జీవాత్మ నొక గోపరిపాలకునిచే నపహృతుఁడై గ్రామసీమలోఁ బెంపఁబడుచున్న యొక రాజకుమారునితోఁ బోల్చెను. కొంత కాలమునకు రాజు, తన నిజస్వరూపమును దెలిసి, గోపాలకుల తోడిపొత్తు విడిచి, తన సార్వభౌమత్వమును మరలఁ బొందెను.

రాజసూనోః స్మృతిప్రాప్తౌ వ్యాధభావో నివర్తతే,
తథైవమాత్మనోఽజ్ఞస్య తత్త్వమస్యాదివాక్యతః।

(౫) శం॥ భా॥ ౨,౩,౧౦.

(౬) అవ్యక్తస్థితిలో బుద్ధియుక్తాత్మలన్నియు నీశ్వరునందుండు నని చెప్పఁబడెను; కాని జీవులన్నియు సుషుప్తి మరణావస్థలలో బ్రహ్మమునందుఁ జేరవనియుఁ జెప్పఁబడెను. (ఛాం॥ ఉ॥ ౬,౮; శం॥ భా॥ ౨,౩,౩౧.

మందాత్మ విసర్జించివేయు పంచభూతమయమైన స్థూలదేహమును, ౧. పంచప్రాణములును, ౨. దేహబీజరూపమగు సూక్ష్మభూతాంశపరికల్పితమైన సూక్ష్మశరీరమును ౪ గలిసి మానవవ్యక్తిత్వ స్వరూపమేర్పడుచున్నది, సూక్ష్మశరీరము నందు, ౫ పంచజ్ఞానేంద్రియములును, పంచకర్మేంద్రియములును పంచప్రాణశక్తులును, మనస్సును, బుద్ధియుఁగలిసి పదునేడింద్రియములున్నవి. ౬. ఈసూక్ష్మశరీరము భౌతికమేకాని, మిక్కిలి సూక్ష్మమైనదగుటచే, దేహమునువిడిచి పోవునపుడు దృగ్గోచరము కాదు. సూక్ష్మదేహమును, ప్రాణశక్తులును, మోక్షసిద్ధి కలుగువఱకు నాత్మను సంబంధించి విడువనివైయుండును; కర్మాశ్రయరూపముమాత్రము ప్రతిజన్మమునందును మారుచుండును. ౭. వ్యక్తిత్వమునకాధారమునాత్మలోఁగాని, యుపాధి

(౧) అన్నమయకోశము.

(౨) ఇంద్రియములు రెండువిధములు: బుద్ధీంద్రియములు, జ్ఞానేంద్రియ స్థలముఁజెందినవి; కర్మేంద్రియములును, కర్మాకర్మలకు స్వాధీనమైనవ్యాపారము మనస్సువిజ్ఞాతాస్థమఁ జెందినవి. ముఖ్యప్రాణము పంచప్రాణములుగా విభాగింపఁబడును సూక్ష్మశరీరము మిక్కిలి చిన్నరూపముగలది కాని దృగ్గోచరముకాదు. (శం॥ భా॥ ౧, ౪, ౧౩.)

(౩) సూక్ష్మశరీరము, లింగశరీరము, భూతాశ్రయము

(౪) దేహబీజాని, భూతసూక్ష్మాని.

(౫) సాంఖ్యుల లింగశరీరమునకిది సరిపోవును

(౬) కర్తృత్వభోక్తృత్వావశిష్ట శోకమనోమయాది పంచకోశవిశిష్టః ఆచేతనధర్మ మిచటఁ బనిచేయును. (శం॥ భా॥ బృ॥ ఆ॥ ఉ॥ ౧, ౪, ౧౭.)

(౭) శం॥ భా॥ ౨, ౪-౮-౧౨; డ్యూసేన్‌సిస్టమ్ ఆఫ్ వేదాంత పు॥ ౩౨౫ ౬)

లోఁగాని, చూడము. విద్యాకర్మప్రజ్ఞా ౮. సమన్వితమైన కర్మా శ్రితముమే దాని కాధారము. సంసారముండునంతకాలము సూక్ష్మశరీరము ప్రాణశక్తులను దనతోఁ దోడ్కొనిపోవును; తరువాతి జన్మములెత్తినను నివి యాత్మననుగమించును; కాని యట్టిజన్మములలో సంతోషకరణేంద్రియములు నిద్రాణములై యుండును. సంసార మనాదియగుటచే, నాత్మకీ యుపకరణ సముచ్చయ మనాదిగానే కల్పితమయి యుండవలెను; మూఁడ వదైన కారణశరీరము, కర్మసూత్రముననుసరించి, జన్మాంతరము లలోయాత్రచేయుచుండు నిత్యతగలదై యున్నది. ఈయాంత రంగిక వ్యక్తిత్వవివరములన్నియు సాంఖ్యులసిద్ధాంతమునకు సరిపడును. ఒకపంచప్రాణులశక్తుల విషయమునందే భేదమున్నది.

పంచజ్ఞానేంద్రియములును, మనస్సునుత్పత్తియైనవియు,౧. సూక్ష్మములును, పరిచ్ఛిన్నములునైయున్నవి. అవి పరమాణు తుల్యములు కావు; అయినచో, నవి శరీరమంతయు వ్యాపించి యుండుట కవకాశముండదు. అవి సూక్ష్మరూపములుగలవి; స్థూలములైనచో మరణానంతరమవి దేహమునువిడిచిపోవు నపుడు కాన్పించవలెను. అవిపరిమితపరిమాణముగలవి; అట్లుకాక సర్వవ్యాప్తములైనచో, నవి దేహమును విడిచిపోవుటగాని, తిరిగి దేహమునఁ బ్రవేశించుటగాని యుండదు. శంకరుఁడిచ్చిన వివరణములో నింద్రియప్రవృత్తులను గూర్చియే, కాని, వాని భౌతికభాగములనుగూర్చి ప్రసంగించియేయుండ లేదు. ఇంద్రి

(౮) చూ॥ బృ॥ ఆ॥ ఉ॥ ౪, ౪, ౨.
(౧) శం॥ భా॥ ౨, ౪, ౧-౪.

యములన్నియు నవి యాక్రమించు స్థానముల పరిమాణము లనే గలిగియున్నవి. ౨. ఈవివిధేంద్రియములు వివిధభూతము లనుండి వచ్చినవనియు, నీ వివిధభూతాధిదైవతములే యింద్రి యాధిదైవతములుననియుఁ జెప్పఁబడెను. 3. ముఖ్యప్రాణమే జీవితమంతకును జైతన్యమిచ్చి, నడపుశక్తి, మానసికయంత్రి మంతయు దానిపై నాధారపడియున్నది. ముఖ్యప్రాణమే యింద్రియములనుగూడఁ బోషించునదికావున, నవియుఁ బ్రాణ ములని చెప్పఁబడెను. ౪ ఉపాధిగతమైన యాత్మయే జీవుఁడు; జీవునకే కర్తృత్వ భోక్తృత్వములున్నవిగాని యాత్మకులేవు. ౧.

జీవుఁడే దేహేంద్రియాధిపతియై, కర్మ ఫలసంగియై యున్నాఁడు. ఆత్మయే జీవుని మూలరూపము గావున దానికి విభుత్వమున్నదనియు నణుత్వము కాదనియుఁ జెప్పఁబడెను. దాని

(౨) శం॥ భా॥ ౨, ౪, ౯-౧౩.

(3, శం॥ భా॥ ౨, ౪, ౧౪-౧౬; బృ॥ ఆ॥ ఉ॥ ౧, 3, ౧౭; 3, ౨, ౨3; ఐత॥ ఉ॥ ౧, ౨, ౪.

(౪) శం॥ భా॥ ౨, ౪, ౬.

(౧) పమ్బ్రహ్మ... అపహతపాప్మత్వాదిధర్మకమ్, తదేవజీవస్య పారమార్థికం స్వరూపమ్... ఇతరాదుపాధికల్పితమ్ (శం॥భా॥ ౧,3,౧౯.)

ఇట్టి భావమునే ప్లేటో గ్లాకస్ సముద్రగర్భమున మునుగునుదాహరణమిచ్చి నాఁడు. సముద్రములో నాతనిఁ జూచినచో నాతనిని మనము గుర్తింపలేము; ఏలన సముద్రములోని నాచు, జలజంతుజాలము నాతని నాచ్ఛాదించినవి. ప్రతి జీవాత్మయు స్వస్వరూపమును గోల్పోయిన పరమాత్మయే సంసారసం బంధమగు నత్తిగుల్లలు, నాచు, మున్నగువాని పాశములనుండి దానిని విడి పింపవలెను

కణుపరిమాణమున్నచో, దేహమంతయు వ్యాపించు వేదనా జ్ఞానము పొందజాలదు.౨.

జీవమణుపరిమాణము కలదని వాదించువారు చెప్పిన దేమనగా, నది యొక దేహమును విడిచి వేఱొక దేహమును బొందుచుండుటచేతను, సర్వవ్యాప్తమైనచో నట్లు రాకపోక లుండవు కావునను జీవమణుస్వరూపము గలదని వాదింతురు. ఈ రాకపోక లుపాధులకే గాని యాత్మకు లేవని శంకరుని వాదము.3. అణుపరిమాణమే జీవున కుండుట నిజమైనచో, దేహమంతయు వ్యాపించియున్న వేదనలను గ్రహించుట సాధ్యము కాదను వాదమునకు సమాధానముగా, చందన స్పర్శ దేహమున నొక చోటనే కలిగినను, దేహమంతయు దాని పరిళమము వ్యాపించు రీతిగానే, జీవుడణుమాత్రుడైనను దేహమంతయు వ్యాపింపగలడని చెప్పబడెను. పాదమున నొక ముల్లు గుచ్చుకొన్నప్పుడు నొప్పి గుచ్చుకొనినచోటనే యున్నను, క్లేశానుభవము దేహమంతయు ననుభవించుచుండుటచే జీవమణు స్వరూపము గాదని శంకరుడు బదులుచెప్పెను. ఒక గదిలో నుంచిన దీపముయొక్క కాంతి గదియంతయు వ్యాపించు రీతినే, జీవ మణురూపమైనను, దేహమంతయు జీవ చైతన్య మాక్రమించునని జీవాణుత్వవాదులు పలికినారు. గుణమునకు ద్రవ్యాంతరవ్యాప్తి లేదని శంకరుడు చెప్పినాడు. దీపమునకు దాని కాంతికిని ద్రవ్యగుణసంబంధము లేదు. రెండు

(౨) శం॥ భా॥ ౨,3,౨౯.
(3) ,, ,,

నగ్నిరూపములే. దీపమం దగ్ని రేణువు లత్యంత సన్నిహితములై యున్నవి; కాంతియం దవి దూరముగా వేరుపడియున్నవి. జీవుని చైతన్యగుణము దేహమంతయు వ్యాపించియున్నచో; జీవమణు పరిమాణముగలది కాఁజాలదు. ఉపనిషద్వాక్యములలోఁ జెప్పఁబడిన యణుపరిమాణ మాత్మలక్షణముగాఁ జెప్పఁబడ లేదు; చిత్తబుద్ధి కల్పితమగు జీవునికే చెప్పఁబడెను.౧. అణు వనగా బుద్ధికగ్రాహ్యమైన సూక్ష్మరూపము గలదనియే వాని యభిప్రాయము.౨. చిత్తాద్యుపాధి బద్ధమగు జీవాత్మ సర్వవ్యాప్తముగాదనియుఁ బరమాత్మ కట్టి సర్వవ్యాపిత్వ మున్నదనియు నంగీకరింపఁబడెను .౩. వ్యావహారికబుద్ధియుక్తమైనదగుటచే జీవాత్మ కణుత్వము చెప్పఁబడెను.౪. ఆత్మకు నిలయము హృదయమేయని చెప్పిన వాక్యముల కర్థమేమన, బుద్ధి స్థానములో జీవాత్మ యున్నదనియే. మఱియు సర్వత్ర వ్యాపించు శక్తిగల దేక దేశమున నుండుటకు సాధ్యపడునేకాని, యేకదేశవ్యాప్తి మాత్రమే గలది సర్వత్రవ్యాపించుట కవకాశము లేదు.౫. ఆత్మకుఁ బరిమితపరిమాణమును జెప్పిన యుపనిషద్వాక్యముల కన్నిటికి నీరీతిగానే శంకరుఁ డర్థమును వివరించినాఁడు.౧. మత

(౧) ముండ॥ఉ॥ ౩,౧౯; శ్వే॥ అ॥ ఉ॥ ౫. ౮-౯.

(౨) శం॥భా॥ ౨.౩.౨౯.

(౩) శం.భా॥ ౨,౩,౧౯-౩౨

(౪) ౨,౩,౨౯.

(౫) శం॥భా॥ ౨,౧,౭; ౩,౩,౪౯.

(౧) చూ,శం,భా,౧,౩.౧౪-౧౮;౧,౨,౧౧-౧౨

విధి నిషేధాదులంతయు జీవాత్మ వ్యావహారికముగా నిజమను నిశ్చయముపై నాధారపడియున్నది. విధి నిషేధాత్మక ధర్మము లన్నియుఁ గూడి, పాపపుణ్యనిర్ణయము చేయు శ్రుతి స్మృతి ధర్మ శాస్త్రమంతయు దేహేంద్రియా ద్యుపాధి పరికల్పితమగు జీవాత్మయే నిజమగు నాత్మయను నిశ్చయము నంగీకరించి యున్నది. సంసార మహానాటకరంగమున నొకప్పుడు నవ్వుచు నొకప్పు డేడ్చుచు సుఖదుఃఖాది సర్వానుభవములను బొందు చుండున దాత్మకాదనియు నాత్మయని మనము భ్రమించు జీవాత్మయనియుఁ జెప్పఁబడెను. ఉపాధి నిర్ముక్తమగువఱకు నాత్మకు సుఖదుఃఖాది సంగతియు, పృథగ్వ్యక్తిత్వమును నుండక తప్పదు ౨.

ఆత్మకుఁగల భిన్నదశలను శంకరుఁడు వివరించినాఁడు. జాగ్రదవస్థలో, జ్ఞానేంద్రియము లన్నియుఁ బనిచేయుచుండు టచే, మనము వస్తుజ్ఞానమును మనస్సుచేతను నింద్రియముల చేతను గాంచుచున్నాము. స్వప్నావస్థలో నింద్రియములు విరతి నొంది, మనస్సొక్కటే ప్రవృత్తిలోనుండును. జాగ్రదవస్థలోఁ గలిగిన యింద్రియానుభవ సంస్కారముల వలన మనస్సు స్వప్నములో విషయములను గ్రహించును. స్వప్నము ననుభ వించు నాత్మయుఁ బరమాత్మగాదు; ఉపాధిగతమైన జీవాత్మయే. అందువలననే, స్వప్నములో మనయిచ్ఛవచ్చిన దానిని సృజింపలేకున్నాము. అట్లు చేయఁగలిగినచో, నెవ్వనికి దుస్స్వ

ప్నములే యుండవు. ౧. గాఢనిద్రలో నింద్రియ మానసములు విరతినొంది, యాత్మ తన స్వస్వరూపములో మగ్నమై, సహజ స్థితినొందును. జీవాత్మ పరిచ్ఛిన్నతకుఁ గర్మపరిచ్ఛిన్నతయే కారణమని శంకరుఁడు భావించెను. మఱియు స్మృతియున్నది. అత్మను స్మరణము వలన నిద్రనొందిన యాత్మయే మేల్కాంచి సాక్షియగుచున్నది. శ్రుతి దీనిని సమర్థించుచున్నది; అట్లు కాకున్న నాత్మపరిచ్ఛిన్నతపోయి శ్రుతివాక్యమునకు వ్యర్థత సంభవించును. "జీవుఁడు నాఁటికోకఁడు విదిగ్రించి బీజ రూపమున మేలుకొనుచో, నాతని కర్మాపరిచ్ఛిన్నత నశించును. ముక్తపురుషులు మేల్కొనరు. గాఢనిద్రయందును, మరణమందువలెనే, వ్యక్తిత్వబీజము పోషింపఁబడినదని స్పష్టము. దీనికి వ్యతిరేకముగా నెన్నిస్మృతివాదములు చెప్పినను, సుషుప్తిలోఁగూడ జీవుని బంధించునుపాధి బీజరూపమున నున్నదని యంగీకరింపఁబడెను. మోక్షావస్థలో స్వప్నమందుఁ గూడఁ బృథగ్వ్యక్తిత్వ బీజము పూర్తిగా నశించినచో, మేల్కాంచుటకు వలయు నవిద్యాబీజమెచటనున్నది ? మోక్షమునందు బ్రహ్మముతో శాశ్వతైక్యము కలుగుననియు, నిద్రావస్థలోఁ దాత్కాలికైక్యము కలుగుననియు శంకరుఁడు వివరించినాఁడు. "సుషుప్తిలో నుపాధి మిగిలియుండుటచే, మెలకువ కలుగుటతో జీవాత్మ తిరిగివచ్చుచున్నది" ౨. మోక్షావస్థలో నవిద్యాబీజములన్నియు భస్మములగును. ౩

(౧) శం,భా,౩,౨,౭ (౨) శం.భా.౩,౨,౯.
(౩) మా,శం,భా, గౌడపాదకారిక ౩,౧౪.

మూర్ఛావస్థయొక ప్రత్యేకదశ. అది జాగ్రదవస్థకాదు; ఏలన విషయజ్ఞానము లేదు. విషయాంతరైకాగ్రతచే నిట్టి బాహ్యవస్తువుల యెడను దాసీనత కలిగియుండలేదు. అది స్వప్నావస్థకు భిన్నమైన దేలన, నీయవస్థాస్మృతిజ్ఞానముండుట లేదు; మరణమునకు భిన్నమైన దేలన, దేహమునఁ బ్రాణము నిలిచియున్నది; సుషుప్తికి భిన్నమైన దేలన, దేహమం దశాంతి యున్నది. సుషుప్తిగతుని లేపినంత సులభముగా మూర్ఛాగతుని మేల్కొనఁ జేయలేము. అందుచే మూర్ఛావస్థసుషుప్తి మరణముల మధ్యావస్థయని చెప్పఁబడెను. "మూర్ఛావస్థ మరణావస్థఁ జెందును; ఏలన నది మరణద్వారము! "కర్మ శేషమేమైన నున్నయెడల, వాక్కును, మనస్సును మూర్ఛితునకుఁ దిరిగి వచ్చును; లేకున్నచోఁ బ్రాణము నుష్ణము నాతనినుండి తొలఁగి పోవును."౧."

నిజమునకుఁ బ్రతిమానవుఁడు నిరవయవ నిర్వికార పరబ్రహ్మ స్వరూపమేయైనను, మనమాత్మ పుట్టుననియుఁ మృతి నొందుననియు బలుకుచుందుము. ఉపాధి జన్మమరణములను మనమాత్మ కారోపింతుము. ౨. సృష్టిలోని జీవులకుపాధులే వ్యక్తిత్వము నారోపించు కారణములై యున్నవి. ౩. జీవునాయుర్వర్ణ దేహాదులనన్నిటి నుపాధులే నిర్ణయించును. ౪. ఉపాధి

---

(౧) శం॥ భా॥ ౩, ౨, ౧౦.
(౨) శం॥ భా॥ ౨. ౩. ౧౭.
(౩) శం॥ భా॥ ౩, ౨, ౯.
(౪) సురేశ్వర వార్తికము, ప్ర. ౧౧౦-౧౧౩.

భేదము చేతనే జీవభేదము నేర్పడి. కర్మలు కర్మఫలములు నేజీవు లకుఁ జెందునను విషయములో వ్యత్యయము కలుగుటలేదు.౫. జలగతమైన సూర్యబింబము వంటిదే జీవాత్మయని చెప్పినను, దాని వలన జీవుల భిన్నవ్యక్తిత్వములకు లోపము రాదు.౬.

### ౩౬—సాక్షి—జీవుఁడు.

ప్రతి జీవాత్మయందును జ్ఞానేచ్ఛాక్రియా శక్తులేగాక, సాక్షిరూపమగు నంతరాత్మయు నున్నది. బాహ్యజ్ఞానము సాక్షి యనియు, దాని కంతఃకరణ ముపాధియనియు దాని సాహాయ్యమున వస్తువులను బ్రకాశింపఁజేయుననియుఁ జెప్పనగును. అంతఃకరణోపాధియే పరమాత్మను సాక్షిగాఁ బ్రదర్శించును. వస్తుజ్ఞానముతో నీసాక్షిచైతన్యము గోచరించును గాని, యది వస్తుజ్ఞానమునకుఁ బూర్వమే గలదు. అంతఃకరణ మొక వ్యక్తియందుఁ బ్రవేశించి, వ్యక్తిలో నొక ముఖ్యభాగమగుట వలననే మనకు జీవుఁడేర్పడును.

జీవసాక్షుల సంబంధమెట్టిది? అర్వాచీనాద్వైతగ్రంథములలో భిన్ననిర్వచనములు చెప్పఁబడెను. స్థూలసూక్ష్మ దేహములకు మూలాధారమై, వానితో సంగత్వము లేకుండ వాని కార్యముల నన్నిటి నవలోకించుచు నెన్నడు మార్పునొంద

---

(౫) శం॥భా॥ ౨,౩,౪౯.

(౬) "సూర్యుని ప్రతిబింబ మొకటి కదలుచుండవచ్చును గాని, యందుచే వేఱొక ప్రతిబింబమును గదలనవసరములేదు. అట్లే, యొక్క జీవాత్మయొక్క కర్మలతోడను, కర్మఫలములతోడను వేఱొక జీవాత్మకు సంబంధముండనవసరములేదు." (శం॥భా॥ ౨,౩,౫౦.)

కుండునదే సాక్షియని విద్యారణ్యుడు చెప్పినాడు. ౧. భోక్త యగు జీవాత్మయొక్క ప్రవృత్తి విరతి నొందినప్పుడు సూక్ష్మ స్థూల దేహములను బ్రకాశింపజేయునదీ సాక్షియే. తన సహచరులుగా గోచరించు నీరెండు దేహముల నెల్లప్పుడు సాక్షి చూచుచుండును. జీవిత వ్యాపారములం బాల్గొను జీవుడు సాక్షిగాదని విద్యారణ్యుని నిశ్చయము. సాక్ష్యాత్మ నిర్గుణమైన దనియు, గర్మఫలభోక్తృత్వము లేని కేవల సాక్షిమాత్రమనియు నుపనిషత్తు చెప్పుచున్నది. ౨. నాటక రంగవేదికపై నుండి తన కాంతిచే, రంగనాయకుని, నటిని, సభనుగూడ సమానముగా బ్రకాశింపజేయు దీపముతో విద్యారణ్యుం డింకొక తావునం బోల్చియున్నాడు; వీరెవ్వరు లేకున్నను దీపము వెలుగుచునేయుండును.౧. సాక్షిరూపమగు నాత్మ, జీవుని, యంతఃకరణమును, బాహ్యవస్తువులనుగూడం బ్రకాశింపజేయుచు, నవి సుషుప్తికాలములో లేనప్పుడును సమానముగానే ప్రకాశించునని చెప్పుట కీయుపమాన మీయంబడినది.౨. సాక్షి,నిష్క్రియత్వముచే నీశ్వరునుండి భేదించును.

---

(౧) పంచదశి ౬౫, సిద్ధాంతలేశము, ౧౫, విద్యారణ్యు నభిప్రాయము నిట్లు వర్ణించినది, "దేహద్వయాధిష్ఠానభూతమ్, కూటస్థచైతన్యమ్, స్వావచ్ఛేదకస్య, దేహద్వయస్య, సాక్షాదీక్షణాన్ నిర్వికారత్వాత్ సాక్షీత్యుచ్యతే,"

(౨) పోల్చు: "సాక్షీ, చేతా, కేవలోనిర్గుణశ్చ (శ్వే॥౬॥౧౧॥)

(౧) "నృత్యశాలాస్థితో దీపః ప్రభుమ్ సభ్యాంశ్చ నర్తకీమ్, దీపయేద విశేషేణ తదభావేఽపిదీప్యతే" (పంచదశి, ౧౦,౧౧,

(౨) పంచదశి, ౧౦,౧౨.

సర్వజీవాత్మయుఁ బరమాత్మయునగు శుద్ధబ్రహ్మమే సాక్షి యనియు, నది ప్రతిజీవాత్మకు కూటస్థమైన దగుటచే, ననేకముగాఁ దోఁచుచున్నదనియు తత్త్వప్రదీపికలోఁ జెప్పఁబడెను. సాక్షి నిర్గుణమని చెప్పుటచే సగుణబ్రహ్మమైన యీశ్వరుఁడగుటకు వీలులేదు. కర్మకుఁ గర్మఫలమునకుఁ గర్తయు భోక్తయు నైన జీవుఁడును సాక్షి కాఁజాలఁడు.[3] పంచదశీ తత్త్వప్రదీపికా భావమును శంకరుఁ డంగీకరించినాఁడు.

ఈశ్వరుని విశిష్టరూపమే సాక్షియని కౌముది చెప్పుచున్నది. ఈశ్వరుఁడు సాక్షియని చెప్పు శ్వేతాశ్వతరోపనిషద్వ్యాఖ్యముపై నీగ్రంథకర్త యాధారపడి యిట్లు చెప్పినాఁడు. ఈశ్వరుఁడు జీవప్రవృత్తి నివృత్తుల నెఱిఁగియుండియు, వానిచే నాతఁడు చలింపఁడు.[౪] జీవునిలోనుండి, యాతని యవిద్యాదుల నన్నిటి నాతఁడు ప్రకాశింపఁజేయును. సుషుప్తిలోవలె సకల ప్రవృత్తులు విరతినొందినపుడు సాక్షినే ప్రాజ్ఞుఁడందురు.[౧] తత్త్వశుద్ధి కర్త దీని నంగీకరించును. ఈశ్వరుఁడు సాక్షియను నదే వ్యావహారికదృష్టికి గోచరించు ప్రథమభావము. ఈభావమును శంకరుఁడు తన రచనలలోఁ బోషించినాఁడు. ఒకే వృక్షముపైనున్న రెండుపక్షులను గూర్చిన సుప్రసిద్ధమైన ఉప

---

(3) తత్త్వప్రదీపికాయామ్ అపి, మాయాశబలితే, సగుణే, పరమేశ్వరే 'కేవలోనిర్గుణా' ఇతి విశేషణానుపపత్తేః సర్వప్రత్యగ్భూతమ్, విశుద్ధమ్ బ్రహ్మ, జీవాద్భేదేన; సాక్షీతి ప్రతిపాద్యతా ఇత్యుదితమ్॥ (సిద్ధాంతలేశమ్ ౧)

(౪) పరమేశ్వరస్యైవరూపభేదః కశ్చిజ్జీవప్రవృత్తినివృత్త్యోరనుమంతా స్వయముదాసీనస్సాక్షీ నామ॥ (సిద్ధాంతలేశము ౧.)

(౧) చూ॥ వైశేషికసూత్రము ౧, 3, ౪౨.

నిమద్వాక్యమునుగూర్చి౨. శంకరుఁడు భాష్యము వ్రాయుచు నిట్లుచెప్పెను. "చెట్టుపైనున్న రెండుపక్షులలో నొకటి క్షేత్రజ్ఞుఁడు; ఇది సూక్ష్మశరీరములోఁ బ్రవేశించి, యజ్ఞానవశమునఁ, ననేక రుచులతోఁ గూడిన సుఖదుఃఖాత్మక కర్మఫలముల నాస్వాదించుచున్నది. రెండవపక్షి, నిత్యశుద్ధ బుద్ధస్వభావుఁడు, సత్త్వగుణసంపూర్ణుఁడు నగు నీశ్వరుఁడు ఫలములను దినఁడు; ఏలన, భోక్తృ భోగ్యముల రెంటిని శాసించువాఁ డాతఁడే. "ఒక సార్వభౌముని విషయములోవలెనే, యాతనిచూపే శాసనతుల్యమైనది."౩.

అవిద్యోపాధిగతుఁడగు జీవుఁడే సాక్షియని మఱి కొందఱు భావించిరి, ఏలన,నాతఁడు సాక్షిమాత్రుఁడేకాని కర్త గాఁడు. అజ్ఞానవశమున నాతఁడంతఃకరణముతోఁ దాదాత్మ్యభానమునొందినపుడే కర్తయు భోక్తయునగును. దీనికాక్షేపణ యిట్లు చెప్పఁబడెను; సర్వవ్యాప్తమగు నవిద్యయే సాక్షిరూప జీవోపాధియైనచో నప్పుడాజీవుఁడు తనమనస్సునేకాక సర్వజీవమానసములను బ్రకాశింపఁజేయవలెను. కాని యట్లు జరుగుటలేదు. కావున, నంతఃకరణోపాధిసహితుఁడగు జీవుఁడే సాక్షిరూపమగు నాత్మ, అందుచే భిన్నవ్యక్తులలో నిది భిన్నమై

---

(౨) ము॥ ఉ॥ ౩, ౧, ౧

(౩) పశ్యత్యేవకేవలమ్ దర్శనమాత్రేణహి తస్యప్రేరయితృత్వమ్ రాజవత్ (శం॥ భా॥ ము॥ ఉ॥ ౩, ౧, ౧.

(౪) కేచిదవిద్యోపాధికో జీవఏవసాక్షాత్ ద్రష్టృత్వాత్ సాక్షీ; జీవస్యాంతఃకరణతాదాత్మ్యాపత్త్యాకర్తృత్వభోక్తృత్వారోపభాక్త్వేపి స్వయముదాసీనత్వాత్। (సిద్ధాంతలేశము. ౧.)

యుండును, సుషుప్త్యవస్థలో నది సూక్ష్మరూపమున నుండునని చెప్పఁబడుటచేనది మూడవస్థలలో నుండును. జీవాత్మకును, సాక్షిరూపమగు నాత్మకును భేదమేమనఁగా, నంతఃకరణము జీవాత్మకును గుణమైయుండగా, సాక్షిరూపమగు నాత్మకది యుపాధిమాత్రముగ నున్నది. (౧) వేదాంతపరిభాషా నిశ్చయము నిదియే; యితరభాగములలో దీనికి విరోధము లేదు; వలన, పరమాత్మ పృథగ్వ్యక్తిలో వర్తించునపుడు సాక్షియనఁబడును. పరమాత్మయే వ్యక్తిగతమై వర్తించునప్పుడు జీవసాక్షియనియు, సర్వజగత్తునందు వర్తించునపు డీశ్వరసాక్షియనియుఁ బేర్కొనఁబడెను. భిన్నోపాధులే యీ భిన్ననామములకుఁ గారణము. జీవసాక్షి కుపాధియంతఃకరణము, శరీరముమున్నగునవియు, నీశ్వరసాక్షి కుపాధి సర్వసృష్టియునై యున్నది. విశ్వాత్మ యీశ్వరుఁడును, వ్యక్తిగతాత్మ జీవుఁడునై యున్నాఁడు.

## 32—ఆత్మ జీవుఁడు

మనము ద్రవ్యత్వమునుగాని నిరవయవత్వమునుగాని జీవాత్మకు లక్షణములని చెప్పఁజాలము. అది యణువు గాదు; భిన్నాంశముల సముచ్చయము. దేహాద్యుపాధిపరికల్పితమగు నొక విశిష్టజీవకేంద్రమున జరిగిన భిన్నానుభవముల సమన్వయ స్వరూపమే జీవాత్మ యైయున్నది. దేహేంద్రియాదు లీయనుభవమునందుఁ బాల్గొని, యేకత్వావిచ్ఛిన్నత్వములనుగూర్చును.

(౧) అంతఃకరణోపాధానేన జీవస్సాక్షీ...... అంతఃకరణ విశిష్టః ప్రమాతా. (సిద్ధాంతలేశము. ౧)

దేహాదులలో బద్ధమైన యీచైతన్యము పరిచ్ఛిన్నమైనది. దీని యనుభవములో శరీరావస్థాద్యంశములు భాగములైయున్నవి. శరీరము క్రమముగాఁ బెంపొందునట్లే, జీవవిజ్ఞానమును క్రమముగా వికసించును. జీవాత్మ తన విజ్ఞానమునకుఁ దానే కారణముకాదు. కాలగతమై పరిణామమందుచున్న వ్యావహారిక విజ్ఞానముచేఁ గల్పితమైన యేకత్వానుభవమే జీవాత్మయై యున్నది. అదియొక బుద్ధిభావకల్పితమైన స్వరూపము.(౧) అది యొకేవ్యక్తిలోఁ బరివర్తనమందుచుండునదగుటచే నిర్వికారమగు పరమాత్మస్వరూపము గాదు. సర్వజీవాత్మాధారభూతమగు నాత్మ నిర్వికారము, నిశ్చంచలమునైనది.

బుద్ధికగమ్యమైనను, నిత్యసాక్షియై యుండి, జీవానుభవసంసర్గ మెంతమాత్రమును లేనిదే యాత్మ. నిత్యసాక్షీ స్వరూపమగు నాత్మ మనఃప్రవృత్తి విహారమునకు వెనుకనున్న తెరవంటిది. ఈమనఃప్రవృత్తు లాత్మనుండి యుద్భవించునని చెప్పరాదు; ఏలన,సత్యస్వరూపము, తానుగాని వస్తువులని యూహింపఁబడుటచే సంగత్వదోషము నొందునది కాదు. మనము వేఱొక రూపమున నర్థముచేసికొంటిమిగదాయని వస్తువులు మార్పునొందవు. నిర్వికారమగు నాత్మయెట్లు వికారము నొందును?, నిత్యమైన జ్ఞానజ్యోతి కేబాహ్యకారణముచేఁగాని తమస్సంపర్కమెట్లు కలుగఁ గలదు?;ఏలన నది సర్వసంగ వివర్జితము. సత్తసత్తెట్లగునను ప్రాచీన సమస్యయే యిది. దేహేంద్రియ మనోవిషయాద్యుపాధి సంబంధము వలననే, యాత్మ

(౧) పోల్చు: వార్డు: సైకలాజికల్ ప్రిన్సిపుల్సు. పు ౩౬౧-౩౭౭.

కనిత్య జీవాత్మ భావము కలిగినది. కాని యాత్మకును, జీవాత్మకును గల సంబంధము మాయయనియు ననఁగా ననిర్వచనీయమని చెప్పఁబడెను. ఆత్మయే నిత్యముక్త, శుద్ధమోక్షస్వరూపము నైనచో, నది జీవాత్మ రూపములో నెట్లు కాంక్షా ప్రవృత్తులను గలిగి యుండును? "స్వయముగా నచలమయ్యు నొక వస్తువితర వస్తువులఁ జలింపఁజేయవచ్చున"ని సమాధానము చెప్పఁబడెను. సూదంటురాయి తాను గదలకుండ నినుపముక్కలను జలింపఁ జేయును.(౧). జీవ పరమాత్మలకు సంబంధమును జెప్పునపుడు మనకు వ్యావహారిక ప్రమాణములే గతియై యున్నవి; కాని, యీ వ్యావహారిక ప్రమాణము లాసంబంధమును జెప్పుటకు సమర్థములు గావు

ఆశ్మరథ్యుఁడు, ఔడులోమి, కాశకృష్ణుఁడు మున్నగువారు జీవబ్రహ్మసంబంధమును గూర్చి బ్రహ్మసూత్రములోఁ జేర్కొనిన వివిధభావములను శంకరుఁడు సమీక్షచేసినాఁడు. నిప్పుకు నెరసులకు గల సంబంధమే జీవబ్రహ్మ సంబంధమని వచించు నుపనిషద్వాక్యముల నాశ్మరథ్యుఁ డాధారముగాఁ దీసికొనెను. నిప్పునుండి బయల్వెడలు నెరసులానిప్పునకు భిన్నములుగావు; ఏలన, రెంటికి నేకస్వభావము గలదు. కాని నిప్పునకు నెరసులకు నసలే భేదములేక పోలేదు; ఏమియు భేదము లేకున్నచో నెఱసులు వేరుగా దెలియనే తెలియఁబడవు; వానిలో వానికి భేదమును దెలియదు. కావున జీవులు పరమాత్మనుండి పూర్తిగా భిన్నములు గావు; ఏలన భిన్నములైనచో

(౧) శం॥ భా॥ ౨, ౨, ౨.

వానికి విజ్ఞానలక్షణ మేమియు నుండరాదు; అవి పూర్తిగా నభిన్నములును గావు; అయినచో, వానికి బ్రహ్మకును, వానిలో వానికిని భేదమే యుండదు. అందువలన జీవాత్మలు పరబ్రహ్మమునుండి భిన్నములు నభిన్నములు కూడ నగుచున్నవని యాశ్మరథ్యుడు గ్రహించెను.౨. దేహబుద్ధీంద్రియాద్యుపాధిబద్ధమైన జీవాత్మ బ్రహ్మమునుండి భిన్నమరియు నట్లయ్యు, జ్ఞానధ్యానాది సాధనముచే నది యుపాధినిర్ముక్తమై బ్రహ్మైక్యము నొందుననియు నౌడులోమి నిశ్చయించెను. బద్ధమైన జీవాత్మ బ్రహ్మమునుండి పూర్తిగా భిన్నమనియు, ముక్తాత్మ పూర్తిగా బ్రహ్మమే యనియు నాతఁడంగీకరించినాఁడు. ౧. శంకరుఁడు కాశకృత్స్నుని భావముతో నేకీభవించెను. ౨.

రామానుజుఁడు తలఁచినట్లు జీవాత్మ బ్రహ్మములో నొకభాగము కాఁజాలదు; ఏలన, బ్రహ్మము దేశకాలాతీత మగుటచే విభాగములు లేనిది. మధ్వాచార్యుఁడు భావించిన రీతిగా జీవాత్మ బ్రహ్మ భిన్నముగా దేలన, బ్రహ్మ మద్వితీయము నేకము సర్వమయమునైనది. 3. వల్లభాచార్యుఁడూహించిన విధమున, జీవాత్మ బ్రహ్మముయొక్క వికారమునుగాదు; ఏలన బ్రహ్మము నిర్వికారమైనది. సృష్టిక్రమమును జెప్పిన వేదము లగ్న్యాదిభూత సృష్టినే చెప్పినవిగాని, ఆత్మసృజింపఁ

(౨) శం,భా॥ ౧, ౪, ౨౦.
(౧) శం,భా. ౧ ౪.౨౧.
(౨) శం,భా. ౧.౪,౨౨.
(3) శం,భా. ౪,3,౧౪.

బడెనని చెప్పియుండలేదు గావున, జీవాత్మ యీశ్వరుని సృష్టి గాదు. జీవాత్మ పరమాత్మనుండి, భిన్నమునుగాదు, దానిభాగమునుగాదు, వికారమునుగాదు, జీవాత్మయే పరమాత్మ. ఉపాధిపరిచ్ఛిన్న మగుటచే దాని స్వభావమును గుర్తింపలేకున్నాము. ౪. అది పరమాత్మ స్వరూపమే కాకున్నచో, జీవమోక్షమును జెప్పు శ్రుతి వాక్యములు నిరర్థకము లగును. ఆత్మైకత్వోపదేశమును గూర్చి శంకరుడిట్లు చెప్పినాడు. "జీవాత్మ పరమాత్మనుండి భిన్నమైనచో, బరమాత్మ జ్ఞానము వలన జీవాత్మ జ్ఞానము లభింపదని చెప్పవలసివచ్చుటచే, బరమార్థస్వరూపము నొక్కదానిని దెలిసికొన్నచో సర్వము విదితమగునని చెప్పిన యుపనిషద్వాక్యము వ్యర్థమగును"౧. తైత్తిరీయోపనిషద్భాష్యములో శంకరుడిట్లు చెప్పినాడు. "ఒక వస్తువునకు దానికు భిన్నమైనదానితో నేకత్వ మెన్నటికి సాధ్యముకాదు."౨ బ్రహ్మవేత్త బ్రహ్మయేయగునని చెప్పిన యుపనిషద్వాక్యములవలన జీవుడే బ్రహ్మమని స్పష్టపడుచున్నది.

తాత్త్వికముగా జీవాత్మపరమాత్మైకత్వము నంగీకరింపవచ్చును. కాని యీ జీవాత్మ స్వస్వరూపజ్ఞానమనుభూతమగు వఱకు జీవబ్రహ్మ సంబంధసమస్య పరిష్కృతముకాదు. ఉపాధిభారములచే మన జీవాత్మలు కృంగి ప్రవృత్తి పరములగు

(౪) చూ, శం, భా, ము, ఈ, ౨, ౨, ౧, ౫౪, ఈ, ౨, ౨, ౧,
(౧) శం|| భా|| ౧, ౪. ౨౦.
(౨) శం|| భా|| తై|| ఉ|| ౨, ౮, ౧౯.

చున్నవి.[3] జీవాత్మ పరమాత్మ సంబంధమును తర్కముచే నిర్ణయింపఁజాలమని యెఱిగియుండియు ననంతరాద్వైతములో సిద్ధాంతములుగా రచింపఁబడిన కొన్ని యుపమానములను శంకరుఁడు సూచించినాఁడు.

ఒక ఐర్లండు దేశీయు ననంత దేశమును నిర్వచింపుమని యడుగగా నాతఁడిట్లు వచించెనని చెప్పుదురు: "పైభాగము క్రిందిభాగము, నలువైపుల తలుపులుపీకి వేసిన పెట్టెవలె నున్నది." తలుపులు మున్నగు నావరణములచే బద్ధమైన పెట్టె యనంతమగు దేశము కానిరీతినే, బుద్ధీంద్రియాది బద్ధములగు జీవులు బ్రహ్మముగాదు. మన పరిచ్ఛిన్న జీవముల కూర్ధ్వాధో భాగములను, నలుదెసలఁగల యాచ్ఛాదనములను నిర్మూలించినచో, మనమును బ్రహ్మముతో నేకమగుదుము. అవచ్ఛేద్యావచ్ఛేదకసూత్రముపయోగింపఁబడినది ౧. అఖండాకాశ ఘటాకాశ సంబంధమునుపయోగించి, శంకరుఁడు జీవబ్రహ్మ సంబంధమును సూచించినాఁడు. ఘటాద్యుపాధులను భగ్నమొనర్చినచో, నవచ్ఛిన్నాకాశములు మహాకాశములోఁ గలిసిపోవును.

---

(3) "సాన్నిధ్యముచే నాత్మను దనలోఁ బ్రతిబింబించు నహంకారమే జ్ఞాతయన్నచో రామానుజుఁడిట్లు ప్రశ్నించినాఁడు: "ఆత్మ అహంకారమునఁ బ్రతిబింబించునా? లేక అహంకార మాత్మలోఁ బ్రతిబింబించునా? ఆత్మ కర్త కావనుటచే నది ప్రతిబింబించదు. అట్లే యచేతనముగు నహంకారమెన్నటికిని జ్ఞాతకాఁజాలదు." (రామానుజభాష్యము. ౧, ౧, ౧)

(౧) అవచ్ఛేద్యావచ్ఛేదకత్వము. శం॥ భా॥ ౧, ౩, ౭; ౧, ౨, ౬; ౧, ౩, ౧౪-౧౫; ౧, ౨, ౧౧-౧౨; ౨, ౧, ౧౪, ౨౨; ౨. ౩. ౧౭; ౩, ౨, ౩౪.

అదేవిధముగా, దేశకాలనిమిత్తకల్పితములగు నుపాధులను నిర్మూలించినచో జీవుఁడే బ్రహ్మమగును. ఒక ఘటాంతర్గతమగు నాకాశము ధూళిధూమపరిచ్ఛిన్నమైనచో నితరఘటాకాశములకంటని రీతినే, యొకజీవికిఁగలుఁగు సుఖదుఃఖాదులితరజీవినంటవు. ఉపాధిభేదముననుసరించి, యొకేయాకాశ మనేక నామములను బొందుచున్నను, దానికెన్నఁడును మార్పులేదు. బ్రహ్మమున కుపాధ్యంతర్భావము కలిగినప్పుడు స్వరూప తిరోభావమునందును; అప్పుడు బ్రహ్మముయొక్క సర్వజ్ఞత్వము పరిచ్ఛిన్నతనొందును. ఇట్టి యుపాధిపరిచ్ఛిన్నత్వము ధవళమైన మణికి సమీపముననున్న రక్తసుమరక్తిమ కలిగినట్లే యని చెప్పవచ్చును. ౨. ఆకాశము ఘటాములతో దహింపఁబడుట కాని, చలించుటకాని జరుగదు. 3 ఒకఘటములోని యాకాశము మహాకాశములో నొకభాగముకాని, దాని వికారమనికాని చెప్పఁజాలము. అదేరీతిగా జీవు లాత్మభావములుకాని వికారములుగాని కావని చెప్పవలెను. బాలుర కాకాశము ధూళిధూసరితమని గోచరించురీతినే, యాత్మబద్ధమనియుఁ బాపముచే మలినమైనదనియు నజ్ఞానులు తలపోయుదురు. ఘటోత్పత్తి నాశములతో నాకాశముత్పత్తి నాశనములను బొందుటలేదు. అదేవిధముగా నాత్మ కుత్పత్తిలయములు లేవు కొందరంతరాద్వైతులీభావము నంగీకరించి, యంతఃకరణోపాధివశమైన పరమాత్మయే జీవుఁడని చెప్పుదురు.

(౨) శం॥ భా॥ 3, ౨, ౧౫; ఆత్మబోధ పు॥ ౯౬.

(3) శం॥ భా॥ ౧-౨-౮.

ఈయుపాధి సిద్ధాంతమునకు వ్యతిరేకముగా, నొక జీవుఁడు తన పుణ్యకర్మబలముచే స్వర్గమునకుఁ బోయి నప్పుడు, స్వర్గములో నాజీవుని చిత్తోపాధి, భూలోకములో నున్నప్పటి చిత్తోపాధికి భిన్నమని చెప్పఁబడెను. దీనివలన ననిష్టధర్మఫలములను కృతనాశము, నకృతాభ్యాగమము మున్నగునవి కలుగును. భూలోకములోని పరిచ్ఛిన్న చిత్తమే స్వర్గమునకుఁ బోవునని చెప్పరాదని సమాధాన మీయఁబడెను. విశ్వవ్యాప్తమైన యాత్మకు సంచారలక్షణమును జెప్పుట యుక్తముగాదు. ఘట సంచలనము వలన నందలి యాకాశమునకు సంచలనమెన్నడు నుండదు.

భోక్తయగు జీవాత్మయొకటే యని చెప్పుటకు దానినొక పరిచ్ఛిన్న చిత్తమని కాక, దర్పణము వంటిదైన మనస్సుతో నిత్యము నవినాభావసంబంధముగల చిత్తప్రతిబింబరూపమని చెప్పవచ్చును.౧ బృహదారణ్యకోపనిషద్భాష్యమునందు౨. శంకరుఁడు ప్రతిబింబవాదమును సూచించినాఁడు. నీటసూర్య చంద్ర ప్రతిబింబములు కేవల ప్రతిబింబములేకాని, నిజము కానట్లును, సమీపమునున్న రక్తకుసుమము యొక్క రక్తిమధవళమణి యందు గోచరించునే గాని నిజమున కది ప్రతిబింబమైనట్లును, నీటిని తొలగించినంతనే, సూర్యచంద్రులే మిగిలియుండుట వలనను, రక్తకుసుమమును దీసివేసిన వెంటనే మణి యొక్క స్వచ్ఛధావళ్యము మార్పులేకుండఁ బ్రకాశించుట

(౧) శం॥భా॥ ౨,3,౫౦: శం॥భా॥ గౌడపాదకారిక, ౧,౬.

(౨) శం॥భా॥బృ॥ఆ॥ఉ॥ 3,౪,౧౨, చూ॥ బ్రహ్మబిందు ఉ॥పు॥౧౨.

చేతను, వస్తువులు జీవులు నదేరీతిగా, నవిద్యాంతర్గతమై యున్న పరమాత్మ ప్రతిబింబములే కాని యథార్థములు గావని చెప్ప వచ్చును. అవిద్య తొలగినంతనే, ప్రతిబింబములు నదృశ్యములై బ్రహ్మమొక్కటే ప్రకాశించును. బ్రహ్మమే మూలబింబము; ప్రపంచము దాని ప్రతిబింబము, వివిధరూపములతోఁ గూడిన ప్రపంచము, బ్రహ్మ మను సూర్యు ననేక రూపములలోఁ బ్రతిబింబించు సాగరము వంటిదని చెప్పఁబడెను. ప్రతిబింబములోని దోషములచే బ్రహ్మబింబము స్పృశింపఁబడదని చెప్పుట కుపయోగించు నీయుపమానమును శంకరుఁ డంగీకరించినాఁడు. ప్రతిబింబభిన్నతకు దర్పణభిన్నతయే కారణమైన రీతిగా, నద్వితీయమగు బ్రహ్మమేకమయ్యు భిన్నాంతఃకరణ సంసర్గముచే భిన్నమై గోచరించుచున్నది. రూపప్రతిబింబముగల జలము కదలినచో, నందలి ప్రతిబింబములును కదలును. అవచ్ఛేదకవాదులంతఃకరణరూపమున నున్న సూక్ష్మపదార్థ మవిద్యారూపమనియు దాని నవచ్ఛేదకమనియు, జీవవిశేషణమనియుఁ జెప్పఁగాఁ, బ్రతిబింబవాదులంతఃకరణము చిత్స్వరూప ప్రతిబింబమును స్వీకరించు నుపాధి[౧]యని చెప్పుదురు. అది జీవుని కవిద్యావశమున గోచరించునేకాని దానిసహజస్వభావము కాదు.

అనంతరా ద్వైతవాదులు కొంద రీభావము నంగీకరించి, యంతఃకరణ ప్రతిబింబితమగు పరమాత్మ[౨]యే జీవుఁడని పలికిరి.

---

(౧) ఒక వర్ణ మావర్ణముగల వస్తువునకు విశేషణము. ఒక ఘటమా ఘటాంతర్గతమైన యాకాశమున కుపాధి.

(౨) అంతఃకరణ ప్రతిబింబమ్ జీవచైతన్యమ్|| (వేదాంతపరిభాష ౧)

జగమొక నీడయైనచోఁ దచ్ఛాయామూలము బ్రహ్మము. ప్రతిబింబవాద మనేక హేతువుల ననుసరించి విమర్శింపఁబడెను. రూపములేనిదానికిఁ బ్రతిబింబము నుండదు, నందును ముఖ్యముగా రూపములేని దర్పణములో నసలేయుండదు. శుద్ధచిత్తు నవిద్యయు రెండును రూపములులేనివే. జీవుఁడొక ప్రతిబింబమైనచో నేది ప్రతిబింబితమో యది ప్రతిబింబించుదానికి భిన్నమై యుండవలెను. అందుచే మూలరూపమైన బ్రహ్మము, జగద్వస్తుజాలమునకు వేఱైయుండవలెను. అప్పుడు బ్రహ్మము యొక్క సర్వాంతర్యామిత్వ సిద్ధాంతమునకు బాధకలుగును. ప్రతిబింబవాదమునకు నవచ్ఛేద్యావచ్ఛేదక వాదమునకు సంభవించు దోషములు పట్టును. ప్రతిమనస్సులోని ప్రతిబింబమునకుఁ దత్స్వరూపమునను న్న చిద్రూపమే కారణమైనచో, భిన్నస్థలములలో నీ ప్రతిబింబము లొకేమనస్సులో భిన్నములు కావలెనని విమర్శింపఁబడెను. కాని చిద్రూపము సర్వత్ర యేకమను మాట నీ విమర్శనము గుర్తింపలేదు. జీవుఁడు బ్రహ్మ ప్రతిబింబమైనచో నప్పుడు బ్రహ్మకు భిన్నుఁడు కావున నయథార్థము కావలెను. వివరణ గ్రంథకర్త యీసమస్య నొక విధముగాఁ బరిష్కరించినాఁడు. నేత్రములనుండి కిరణములు, బయల్వెడలి, ప్రతిబించు వస్తువునకుఁ దగిలి, వెనుకకు మరలి వచ్చి, యథార్థముఖ ప్రతిబింబమునేచూపును. ఈ ప్రతిబింబము నిజమగు వస్తువునకుఁ జెందినదే. దీనినే బింబ ప్రతిబింబాభేదవాద మందురు. కాని యిదియు నంగీకరింపఁబడలేదు. ఈ యుపమానమును బూర్తిగాఁ దీసికొన్నచో, మన కొక ప్రకా

శించు జ్యోతియు, దాని ఛాయవడు నొక వస్తువును, నాజ్యోతి యొక్క కిరణముల నడ్డగించు నింకొకటియుఁ గావలసియున్నవి. కాంతి వెడలుచున్న జ్యోతికి వేరై కిరణప్రసారణమున కుపయోగించు నింకొక పదార్థ ముండవలసివచ్చుటచే నద్వైతమునకు బాధకల్గును. ఈ రెండు వాదములను గూడఁ దిరస్కరించువారు తన సహజస్వరూపము నెఱుఁగని పరమాత్మయే జీవాత్మయని చెప్పుదురు. శంకర సురేశ్వరు లీభావము నంగీకరింతురు. జీవాత్మరూపము బ్రహ్మముయొక్క అనిర్వచనీయప్రదర్శనము౨. జీవాత్మ గోచరించుచున్నది. కాని యెట్లో మన మెఱుఁగము.

### ౩౮–ఈశ్వరుఁడు—జీవుఁడు.

జీవేశ్వరు లిరువురు స్వస్వరూపములలో బ్రహ్మమే యై యిరువురు నుపాధివశులైన యెడల, జీవేశ్వరులకు భేదములే కుండఁ బోవుచున్నది. ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడు, సర్వశక్తిసమన్వితుఁడు, సర్వవ్యాపియు; జీవుఁడు మాత్రమల్పుఁడు దుర్బలుఁడు నజ్ఞానియు ననియు శంకరుఁడు పలికియున్నాఁడు. "నిరతిశయోపాధి కలితుఁడగు ౧ నీశ్వరుఁడు హీనోపాధికలితుఁడగు జీవులను బరిపాలించును. ఈశ్వరున కవిద్యలేదు. ౩ ఈశ్వరోపాధులీశ్వ

(౧) ఈవాదఖండనమునకు చూ. సాం. ప్రి. భా. ౧,౧౫౨,౧౫౩.
(౨) చూ. శం. భా. బృ. ఆ. ఉ. ౨,౧.

(౧) శం. భా. ౨,౩,౪౫,
(౨) శం. భా. ౨,౩,౪౩.
(౩) నిత్యనివృత్తావిద్యత్వాత్, (శం. భా. ౩,౨,౯.)

నది సర్వజ్ఞత్వమునకు బాధకములుగావు. ఈశ్వరునిమాయ, యీశ్వరుని వశమైయుండుటచే నతని స్వభావము నిరాచ్ఛాదితమై యుండును. గాజుపాత్రి తనలోనున్న వస్తువులను మఱుఁగుపఱచ నట్టిరీతినే, మాయ యీశ్వరలక్షణములను గప్పివేయదు. ఈశ్వరోపాధియగు మాయ శుద్ధ సత్త్వకల్పితమగుటచే నది యవిద్యారూపమగు సంతతికరణమునుత్పత్తి చేయదు. మాయ యాతనికి స్వాధీనములోనుండి, యాతని సృష్టిలయకార్యములలోఁ దోడ్పడును. ఈశ్వరుని యందుఁగల యీ మాయలేక ఆత్మన్యస్త్కరణశక్తి, జగన్నానాత్వకారణమై జగత్తు వేరనియు జీవులు వేరనియుఁ దలచు జీవుని భ్రిమకుఁ గారణమగుచున్నది. అవిద్య మాయవలననే జనించినది. బ్రిహ్మము యొక్క- శుద్ధచిత్స్వరూపమిట్టి మాయా సమన్వితమైనపు డీశ్వరుఁడనియు,నవిద్యాసమన్వితమైనపుడు జీవుఁడనియు వ్యవహరింపఁబడెను. సృష్టిచేయుటలో నీశ్వరునికి స్వార్థమేమియు లేనందున, నాతఁడకర్తయనియు, జీవుఁడు కర్తయనియుఁ జెప్పఁబడెను. ఈశ్వరుఁడు కర్మానుగుణఫలముల నిచ్చువాఁడును, బ్రిహ్మముతోఁ దానేకమని యెఱిఁగిన వాఁడునగుటచేఁ దనయంతరంగములో శాశ్వతానందము ననుభవించుటచేఁ బూజింపఁదగిన వాఁడు. జీవుఁడాతని సేవకుఁడు;తన దైవత్వస్వరూపజ్ఞానము లేనివాఁడగుటచే, సంసారమగ్నుఁడైనాఁడు. ఇదియే మతవాక్యములలో స్వామిభృత్య సంబంధము ౧. నెరసులు నిప్పునకెట్లో

(౧) శం॥భా॥ 3,౨,౯.

యట్లే జీవులీశ్వరాంశము లనియు స్థలాంతరమునఁ జెప్పఁబడెను. ౨.

అనంతరాద్వైతమున జీవేశ్వర సంబంధమును గూర్చి చెప్పఁబడిన వివిధ భావముల నిచటఁ బేర్కొనవగును. ప్రకటార్థ వివరణమిట్లు చెప్పినది: "అనాదియు ననిర్వచనీయము, సర్వజడజగత్కారణము బుద్ధితో మాత్రమే సంసర్గము గలదియునైన మాయయందుఁ బ్రతిబింబితమగు చిత్తే యీశ్వరుఁడు; ఆవరణ విక్షేపశక్తులు రెండు గలిగి, అవిద్య యను నామముచే వ్యవహరింపఁబడు మాయయందనంత పరిచ్ఛిన్న దేశములలోఁ బ్రతిబింబితమగు చిద్రూపము జీవుఁడు "3. ఈగ్రంథకర్త ననుసరించి, మాయావిద్యలు పూర్ణాంశసంబంధము గలవి. మాయయీశ్వరోపాధియు నవిద్య జీవోపాధియునని చెప్పవచ్చును. కొలఁది భేదములతో సంక్షేప శారీరక మీభావమునే యంగీకరించెను. ఇందవిద్య కారణము నంతఃకరణము కార్యమనియుఁ జెప్పఁబడెను.౪. ఈగ్రంథకర్త ప్రతిబింబవాదము నంగీకరించును గానఁ బూర్ణాంశా విభాగ వాదము నంగీకరించఁడు. పంచదశి యిట్టి భావమునే ప్రకటించి

(౨) శం॥భా॥ 3,3,౪3.

(3) అనాదిరనిర్వాచ్యా, భూతప్రకృతిశ్చిన్మాత్రసంబంధినీ, మాయా తస్యాం చిత్ప్రతిబింబ ఈశ్వరః; తస్యాఏవపరిచ్ఛిన్నానంత ప్రదేశేష్వావరణ విక్షేపశక్తి మద్వ్యవిద్యాభిధానేషు చిత్ప్రతిబింబో జీవఇతి. (సిద్ధాంత లేశము. ౧.)

(౪) అవిద్యాయామ్ చిత్ప్రతిబింబ ఈశ్వరః, అంతఃకరణే చిత్ప్రతిబింబో జీవః।

నది. త్రిగుణాత్మకమై, అవ్యక్తమైన మూలప్రకృతికి రెండు రూపములున్నవి. రజస్తమోగుణముల నణఁచివైచి, సత్త్వగుణమతిశయమై యున్న మూలప్రకృతి భాగమీశ్వరోపాధియగు మాయయనియు, సత్త్వగుణము నతిక్రమించి రజస్తమములున్న భాగము జీవోపాధియగు నవిద్యయనియుఁ జెప్పఁబడెను. ఇచట మాయావిద్యలకు భేదము పరమాణాత్మకము గాక గుణాత్మకమై యున్నది. పంచదశిలో నింకొకచోట నిట్టి భావమే యున్నది. విక్షేపశక్తి విశేషముగాఁగల ప్రకృతి మాయయనియు, నావరణశక్తి విశేషముగా నున్నచో నవిద్యయనియు నచటఁ జెప్పఁబడెను.[1] పంచదశిలో[2] విద్యారణ్యుఁడాకాశము నిట్లు భాగించెను; (౧) ఘటాకాశము, (౨) మేఘమహామారుతాదులతోఁ గూడి ప్రతిబింబించు జలాకాశము, (౩) మహాకాశము, (౪) మేఘాకాశము, అదే విధముగా నాలుగు విధములుగాఁ జిత్స్వరూపమున్నది. (౧) కూటస్థ మనఁగా స్థూలసూక్ష్మ దేహావృతమై, యెన్నఁడు మారకుండునది, (౨) జీవుఁడనఁగా, మనస్సులోఁ బ్రతిబింబితమైన చిత్స్వరూపమే యజ్ఞానవశమున మార్పులేని మూలచిత్స్వరూపమని తలఁపఁబడునది; (౩) అవిచ్ఛిన్న చిత్స్వరూపము, (౪) సర్వజీవమానసములలో సూక్ష్మవాసనారూపమునఁ[3] బ్రతిబింబించు చిత్స్వరూపము, బ్రహ్మకంటెపట్టుకొని యుండు యేకరూపమైన మాయ లేక యీశ్వరుఁడు దీని నను

(౧) ఈ భావములనే తత్త్వవివేకమును జెప్పును.
(౨) ౬ అ.
(౩) ధీవాసనా.

ంచి, మనఃప్రతిబింబితమైన చిత్స్వరూపము జీవుఁడనియు, సర్వజీవ సూక్ష్మసంస్కారములతోఁ గూడిన మాయయందుఁ బ్రతిబింబించు చిత్స్వరూప మీశ్వరుఁడనియుఁ జెప్పెను. పంచపాదికా వివరణగ్రంథకర్త జీవుఁడీశ్వర ప్రతిబింబమని చెప్పెను.౪. మాయోపహితుఁడైన యీశ్వరుఁడే జీవుఁడనియుఁ జెప్పబడెను.

### ౩౯—ఏకజీవవాదము అనేకజీవవాదము

అవిద్య యేకమే యగుటచే నవిద్యోపాధికతుఁడగు జీవుఁడు నొకఁడే యను వాదమును శంకరుఁ డంగీకరింపఁడు; ఏలన సర్వజీవు లొకటియేయైనచో, నొక్కజీవునికి మోక్ష సిద్ధించో, సర్వజీవమోక్షము కలిగి, సృష్టిలో జీవులు లేకుండఁ బోవలెను. కాని యట్లు జరుగుటలేదు. అవిద్యాసంజాతములైన భిన్నాంతఃకరణోపాధిగతమైన బ్రహ్మ మనేక జీవరూపములుగా విభాగము నొందినదివలె నగుచున్నది కాని మాయకు నవిద్యకు, వీనికిని బ్రహ్మమునకుఁ గల సంబంధ సమస్యలవలన ననంతరాద్వైతమునం దనేక సిద్ధాంతములు బయలువెడలినవి. వానిలో ముఖ్యమైనవి (౧) ఏకజీవవాదము: (౨) అనేకజీవ వాదము.

ఒక్కటే జీవమున్నది; ఒక్కటే శరీరమున్నది ఈ యొక్క జీవమే నిజమైనది. స్వప్నాదులలో గోచరించు దేహములకు జీవములేదు. ఒక్క జీవియొక్క అవిద్యవలననే, అనే

(౪) వీని కాధారము, బృ॥ఆ॥ ౬॥ ౯,౭; గీతావాక్యములు, "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి."

కత్వమునకుఁ గూడిన ప్రపంచ మూహింపఁబడినది. కాని యిట్టి యేకజీవవాదమిూ బాదరాయణ సూత్రములకు వ్యతిరేకమైనది. 2 1. 22; 2. 1. 33, 1. 2. 3. సృష్టికర్త జీవుఁడు కాఁడు; వినోదార్థము సృజనశక్తి చూపు జీవేతరుఁడగు నీశ్వరుఁడు. ఈశ్వరుఁడాప్తకాముఁడగుటచే నాతనికి సృష్టిచేయుటలో నెట్టికోర్కెయును లేదు. అందుచే బ్రహ్మముయొక్క ప్రతిబింబమైన ముఖ్యజీవుఁ డనఁగా హిరణ్యగర్భుఁ డొక్కఁడే యున్నాఁడనియు, నితరజీవులన్నియు నా హిరణ్యగర్భుని రూపాంతరములే యనియు వీనికే బంధమోక్షము లున్నవనియుఁ జెప్పఁబడెను. ఈరచయితలందరు జీవైకత్వవాదము నంగీకరించి, దేహములనేకము లున్నవనియు, నొక్కొక్క దేహమున కొక్కొక్క జీవప్రతిబింబము సమకూర్పఁబడెననియుఁ జెప్పుదురు. ఏకజీవవాదులలో మూఁడవవర్గమువా రిట్లు చెప్పుదురు. ఒకేజీవ మనేక శరీరములలో నివసించుచున్నది. శరీరభేదమును బట్టి జీవభేదము గోచరించుచున్నది. కాని యొకే దేహములోని భిన్నావయవములకుఁ గలిగిన క్లేశముల నేకజీవ మెట్లుగ్రహించుచున్నదో యట్లే, సర్వదేహములలో జీవ మేకమేయైనచో భిన్నదేహ క్లేశముల నేకకాలమునఁ దానేల యనుభవించుట లేదను నాక్షేపణము నీ యేకజీవవాదు లూహింపరైరి. కాని వారుచెప్పునదేమన, మనకుఁ బూర్వజన్మములలోని సుఖదుఃఖానుభవ జ్ఞానము లేనిరీతిగానే, దేహానేకత్వభేద మొకేజీవమునకితర దేహానుభవము లేకుండఁ జేయుచున్నది. జీవైకత్వ, దేహానేకత్వవాదమునే వీరు సమర్థింతురు.

అవిద్యనుగూర్చిన భిన్నాభిప్రాయములవలన ననేకజీవ వాదమున కనేక రూపములు కలిగినవి. (౧) అంతఃకరణరూపమున నవిద్యయుండుట జీవస్వభావమునకు ముఖ్యమైనది, అంతఃకరణాదికము జీవరూపమైనచో, నంతఃకరణము లనేకములుగాడుటచే జీవు లనేకములుగానలెను (౨) ఇతరులిట్లు భావించిరి. బ్రహ్మమందుండి, బ్రహ్మమున కాశ్రయమై, బ్రహ్మము నాచ్ఛాదించు నవిద్యయేకమైనను నీయవిద్యానాశనమే మోక్షమైనను, నీయవిద్యలో భాగములుగలవు. జీవన్ముక్తిలో విక్షేప గల యవిద్యాంశము కొంతయుంకను మిగిలియున్నదని చెప్పవలెను. విదేహముక్తిని విషయములో నీయవిద్యపూర్తిగా నశించును. (౩) చిద్రూపమునకవిద్యతో సంబంధముండుటే బంధమనియు నట్టిసంబంధము విచ్ఛిన్నమగుటే మోక్షమనియు భావించు మూడవమార్గమువారు కొందరుగలరు చిద్రూపమున కవిద్యాసంబంధమును నిర్ణయించునది అంతఃకరణము లేక మనస్సు, బ్రహ్మానుభవప్రాప్తితో మనస్సు నశించి చిత్స్వరూపములో నాభాగమునకుగల యవిద్యాసంబంధము తొలంగును; ఇతర చిద్భాగములలో నవిద్యాసంబంధము మిగిలి యుండును. (౪) ప్రతిజీవిలో నవిద్య సంపూర్ణతగానుండి, బ్రహ్మమును మఱుగుపరచుచున్నది. అవిద్య జీవుని విడిచిపుచ్చుటే మోక్షము. (౫) అవిద్య యంతయు నంశావిభాగమంది, జీవులకు బంచిపెట్టబడినది. తనకుజెందిన అవిద్యాంశమును నశింపజేయుటచే నాజీవమునకు ముక్తి కలుగును. ప్రపంచమంతకు నవిద్యాంశాసముచ్చయమే కారణము. "ఒక వస్త్ర

మునకు దారములన్నియుఁ గలిసి కారణమగుచున్నవి; ఏయొక దారము తెగినను, వస్త్రము చెడును; మిగిలినదారముతో నప్పు డొక నూతనవస్త్ర మేర్పడినరీతిగానే, ప్రపంచము సర్వజీవు లకుఁజెందిన అవిద్యాంశాసముచ్చయముచే నేర్పడి, యేయొక జీవియొక్క అవిద్యాంశము నశించినను, ప్రపంచము చెడును: కాని మిగిలినజీవుల అవిద్యాంశములచే నింకొక నూతనప్రపం చము కల్పితమగుచుండును." (౬) అవిద్యలోని ప్రతిభాగము నొక ప్రత్యేకప్రపంచమును గల్పించును. శుక్తిలో గోచరిం చిన రజితభ్రాంతి ప్రతివ్యక్తికొక్కొక్కరీతిగా నుండునట్లు ప్రతి జీవిలోనున్న యీవిద్యవలన నుదయించిన ప్రపంచ మొక్కొ క్కని కొక్కొక్కరీతిగా నుండును...... కాని యీభిన్న ప్రపంచములన్నియు నొకటిగాఁ గన్పట్టుటకుఁ గారణము, "నీవుచూచిన రజితమునే నేనును చూచితిన"ని చెప్పుటవంటి మిథ్యాజ్ఞానము. (౭) ఒకటేప్రపంచమున్నది; దీనికుపాదాన కారణ మీశ్వరసంస్థితమైన మాయ; సర్వజీవులలో నివసించు నవిద్యాసముచ్చయమునకిది భిన్నమైనదని చెప్పువారు కొందరు గలరు. ఈయవిద్యాప్రవృత్తి రెండురకములు. ఒకప్రవృత్తి బ్రహ్మము నాచ్ఛాదించును; రెండవది విక్షేపకశక్తిరూపకమై శుక్తి రజితభ్రాంతి, స్వప్నగత యథార్థవస్తుభ్రాంతిని గలుగఁ జేయును.

(౧) చూ. సిద్ధాంతలేశము.

## ౪౦. ధర్మశాస్త్రము.

ప్రపంచములోని సర్వవిషయములలో మానవుఁడొక్కఁడే ధార్మికవ్యక్తి, పరిచ్ఛిన్నాపరిచ్ఛిన్న జగత్తులు రెంటితో దనకు సంబంధమున్నదని యాతఁడు గుర్తించినాఁడు. పరిచ్ఛిన్న జగత్తులో నపరిచ్ఛిన్నశక్తి ప్రవర్తించు చుండుట కవికల్పితము కాదు; అది తత్త్వశాస్త్రము చర్చించి కనుఁగొనిన పరమసత్యము, మానవుని దేహసంబంధము పూర్వ కర్మఫలానుగుణమై, యచేతన సూత్రనిబద్ధమై నడచినను, నాతనియందు సత్యసుందర శివస్వరూపములకు నిరవధిక లక్ష్యములు, వాని యుత్తరోత్తరాధికా విష్కృతికతనిఁ బ్రేరేపించి పనిచేయించుచున్నవి. మానవునియందు బ్రహ్మమధికముగా నావిష్కృతి నందుచున్న కారణము వలననే, మానవునికిఁ దార్కికధార్మిక ప్రవృత్తి కర్తృతయు నధికారమును గల్గినవి. ౧. మానవుఁడు వానిని సాధింపయత్నించియు సిద్ధి పొందఁజాలనంత కాలమాతఁడు సంసారబద్ధుఁడై యుండును; ఆతఁడనంత బ్రహ్మజ్ఞానసిద్ధిని గాంచిన క్షణముననే, హృదయభారము సడలి, అవ్యయానందము వరదలై పారును. బ్రహ్మైక్యసిద్ధియే సర్వప్రవృత్తిలక్ష్యము; ఏలన బ్రహ్మము కేవలము సద్రూపము, చిద్రూపమే కాక, ఆనందరూపము కూడనగుటచే, సర్వసాధనములచే సంపాదింపఁదగినది౨ బ్రహ్మాత్మైకత్వమే జీవితపరమ గమ్యస్థానము, "ఆత్మ కుచిత

(౧) ప్రాధాన్యాత్ ... కర్మ జ్ఞానాధికారః (శం॥భా॥తై॥ఉ॥ ౨,౧)

(౨) ప్రయోజన సూచనార్థమ్ ఆనందగ్రహణమ్.

(వేదాంతపరిభాషను గూర్చిన శిఖామణి: ఉపోద్ఘాతము.)

మగు భోజనము", ౩ పరమైక ప్రయోజనము. ఈ గమ్యస్థానమును సాధించువరకు జీవాత్మకుఁ దన స్థితివలన నసంతృప్తి యగుచుండగును." మూఁడులోకములలో నున్న ప్రతిజీవియు దుఃఖాస్పదములైన వానికొఱకుఁ గాక, సుఖాస్పదములైన వానికొఱకే యన్వేషించును." ౪ సర్వమానవులును నిశ్శ్రేయసమునే యపేక్షించుచున్నారు. ప్రాసింగు కవివరేణ్యుని మాటలలో, "సర్వజీవులు నెన్నిలోపములున్నను, నెంత దుర్బలులైనను, గొంత సుగుణసంపత్తి గలిగి, యూర్ధ్వముఖులై పయనించుచున్నారు. నిగూఢములై లోతైనగుహలలో నున్న మొలకలు తామెన్నఁడును సూర్యునిఁ జూచియుండలేదు కాని, సూర్యోన్ముఖములై, యాతనిఁ గన్గొను నాత్రముతో నూర్ధ్వముఖముగాఁ బైకిఁ బెరుగ యత్నించు చుండునట్లే."

సంసారవృక్షమునుండి మనము త్రుంచు మధురాతిమధురములని తలఁపఁబడిన ఫలములను మననోటఁ బెట్టుకొన్నంతనే,భస్మముగామారిపోవుచు.మహోన్నతమని యూహింపఁబడిన భోగము కూడ రోఁత పుట్టించును; స్వర్గసుఖములు కూడ నశాశ్వతములు. ఒక సత్క్రియాచరణము కాని, యొక మధురగీతాశ్రవణము గాని,యొక ధ్యాననిష్ఠాదృష్టి కాని:మనల నొక్కసారి మన సంకుచితావధులనుండి పైకిలేవనెత్త వచ్చును గాని, నిత్యసంతుష్టి నిచ్చునది బ్రహ్మానుభవ మొక్కటే,అదియే మన వ్యక్తిత్వమునకుఁ బరిపూర్ణ వికాసము నిచ్చి, నిరుపమాన

(౩) ఫోయిడ్రస్ ప్. ౨౪౭.

(౪) శతశ్లోకి, పు. ౧౫.

ములగు శాంత్యానందములను జేకూర్చును.౧. మనము లోకమున కంటిపెట్టుకొని, క్షణిక మిథ్యాదృశ్యములను నిజములని నమ్మి, వాని వలన గలుగునట్లుదోఁచు సుఖలేశాభాసము వానిని జేరునప్పటికే యదృశ్యమై పోవుటఁజూచి నిరాశోపహతులమగుటచే మనకు దుఃఖప్రాప్తి కలుగుచున్నది "మానవుఁ డెంత కాలము దేహమే యాత్మయని నమ్మునో, యంతకాలము పాపజలరాశిలో మునిఁగి, దుఃఖపంకనిమగ్నుఁడగును. సర్వాత్మస్వరూపమే తానని నమ్ముటతోడనే, దుఃఖపరిసమాప్తి యగును."౨. పరమార్థ స్వరూపమును మన మనోదృష్టి కనుగుణముగాఁ గల్పింపఁ జాలము; దాని స్వరూపమును యథారీతిగా మనము గ్రహింప వలసినదే, శంకరుని దృష్టిలో సత్యమిట్లుండ వలెనని మనము కల్పించినది తత్త్వశాస్త్రము గాదు; సత్యమెట్లున్నదో చూచి గ్రహించుటే.అనుభవదృష్టిచే ననంతరూపమగు సత్యము నెఱుగుటవలన శాంత్యానందములు సిద్ధించును. భిన్నత్వముతోఁ గూడిన ప్రపంచముతోఁ గలిసియున్నను, ధర్మశీలము వలని ఫలితములన్నియుఁ బరమార్థ సంపాదనకు సాధనములగును. బ్రహ్మాత్మైక్యసిద్ధియే పరమ శ్రేయమై

(౧) "మోక్షమనఁగా దుఃఖరహితమైన నిరవధికానందము. మానవులు సుఖదుఃఖములు రెంటినిఁ గోరుట సహజము గావున, మోక్షాపేక్ష యెల్లప్పుడుండును" (సంక్షేపశారీరకము. ౧,౬౭) పోల్చు: స్పైనోజా. "మనసుఖము గాని దుఃఖము గాని మన ప్రేమకు నిలయమైన వస్తుస్వభావముపైననే యాధారపడి యుండును... కాని, నిత్యమును ననంతమునగు వస్తువుపైఁగల ప్రేమ, క్లేశరహితమైన పరిశుద్ధానందముతో మనస్సును నింపును."

(౨) శం॥భా॥ముం॥ఉ॥ 3,౧,౨.

నను, ధర్మమువలన లభించు శ్రేయఃప్రాప్తి తత్సాధనరూపమే. ధర్మవిరుద్ధములగు ఫలితములు బ్రహ్మజ్ఞాన సంపాదమునకు వ్యతిరేకము లగును.

సత్యసమన్వితమైనదే ధార్మికమైన కర్మ; అనృతసమన్వితమైన దధర్మము. ౧. మరణానంతరము పుణ్యలోకప్రాప్తి నిచ్చునది సత్కర్మయు దుఃఖమయలోక ప్రాప్తినిచ్చునది దుష్కర్మయు నగును. మానవుఁడు క్రమవికాసమువలనఁ దన నిజమగు ననంతస్వరూపమును సాధించి దైవత్వసిద్ధినొంద యత్నించును. వ్యావహారికప్రపంచములో నీశ్వరుఁడే ఉత్తమ వ్యక్తి; ప్రపంచ మాతని కార్యము. ఈశ్వరభక్తుఁ డీజగత్తు నంతను ప్రేమింపవలెను; ఏలన నిదియంతయు నీశ్వరసంతానమే. స్వార్థపరతంత్రుఁడగువానికి శాంతిమోక్షములు లేవు; లోక కల్యాణముకొఱ కాత్మార్పణము చేయువానికే నిశ్శ్రేయస మున్నది. అహంకారమే మహాపాపము; సర్వభూతదయ, ప్రేమయే పరమపుణ్యము. సర్వజీవసుఖశ్రేయములకై పాటు పడుటవలననే, మనకు వ్యక్తిగతోద్ధరణము కలుగును. అహంభావకారణములగు నింద్రియములను ప్రతివ్యక్తియు నిగ్రహింపవలెను. గర్వమునువిడిచి వినయము నార్జింపవలెను. అట్లే, పరనిరసనమునకుబదులు క్షమ, స్వకుటుంబ మమకారమునకు బదులు జగత్కుటుంబ ప్రేమయుఁ బెంపొందవలెను. మనముచేయుకర్మ వ్యక్తిగతమైన స్వార్థపరత నణఁచివైచి, సంఘ శ్రేయోభి

(౧) పోల్చు: "పాపముచేయు ప్రతిమానవుఁడు జ్ఞానమును ద్వేషించును." (సెయింట్ జాన్. 3,౧౯.)

వృద్ధిని బలపరచు సంకల్పమే ప్రధానమైనది. మానవుఁడు తన మమకారమును జంపి, విశ్వాత్మలో లీనమగుట కుపాయములుగానే విధులు దేశింపఁబడినవి. తన కాలములోని ధర్మప్రమాణములను శంకరుఁ డంగీకరించి, శాస్త్రనిషిద్ధకర్మలను విడువవలెనని బోధించినాఁడు. అధ్యయన యజ్ఞదానతపో పవాసాదికములు జ్ఞానసాధనములు. ౧. అవి శీలమును పోషించి, చిత్తశుద్ధినిచ్చి, అంతర్దృష్టి నుజ్జ్వలింపఁజేయును. లోకోత్తర ప్రజ్ఞాప్రభావము గలవారు సత్యమును వెంటనే గ్రహింపవచ్చునుగాని, సామాన్య మానవునికిఁ గొంతకాలము, ప్రయత్నమవసరము. నిత్యవిధులను, గృహస్థధర్మములను శ్రద్ధతో నెరవేర్చుటవలన, బ్రహ్మప్రాప్తి కనుగుణమైన చిత్తశుద్ధి నిచ్చును. 3. వైదిక కర్మకలాపమును నిష్ఠతో నాచరించుట వలన నభ్యుదయము ప్రాప్తికలుగునుగాని, అభ్యుదయముఁగా నిశ్శ్రేయసము కాదు. ౪. బ్రహ్మజ్ఞానమువలనఁ బరమాత్మనెఱిగి ముక్తి పొందవచ్చునుగాని, యీశ్వరు నేరూపములో నర్చించినను, ననేకవిధములగు ఫలితములు లభించునుగాని యవన్నియు సంసారము నతిక్రమింపఁజేయునవి కావు. ౫. వానివలన మనము స్వార్థములను విడిచి, రాగద్వేషమాంద్యములను జయించి దుఃఖములను ధైర్యముతో నెదుర్కొని, నిశ్చలశాంతి నందఁగ

(౧) బృ॥ఉ॥ ౪,౪,౨౨
(౨) శం॥భా॥ 3,౪,౨౬.
(3) ౪, ౧, ౪.
(౪) శం॥భా॥ము॥ఉ॥ ఉపోద్ఘాతము.
(౫) శం॥భా॥ ౧,౧,౨౪, చూ 3,౨,౨౧.

లుగుదును. శ్రద్ధాపూర్వకమగు ధ్యానమువలన జ్ఞానము చేకూరును. భక్తియుఁ జ్ఞానసాధనమే. తీవ్రశిక్షణాభ్యాసముచే సుశిక్షితములైన మానసములకే బ్రహ్మజ్ఞానము సాధ్యమగును. జ్ఞానము నార్జించుట యనఁగా బాహ్యమునుండి దానిని మనసులోఁ జొప్పించుట కాదు; సత్యము మానవునాత్మ గర్భముననే యున్నది. వినశ్వరమగు ప్రపంచమునుండి తిరోగమించు మనస్సులో నాత్మజ్ఞానము ప్రకాశించును. మన బుద్ధి నద్దమువలె స్వచ్ఛమొనర్చినచో, లోని జ్ఞానము లాంతరులోని దీపము శోభించు గాజుచిమ్నీలోనుండి బయటికి స్వచ్ఛముగాఁ బ్రసరించునట్లు ప్రకాశించును. "ఆత్మ సర్వకాలములలో సర్వవస్తువులలోనుండియు, నది యన్నిటిలోఁ బ్రకాశించుట లేదు. స్వచ్ఛమైన వస్తువులలోఁ గాంతి ప్రతిఫలించునట్లు, జ్ఞానము స్వచ్ఛబుద్ధిలోఁ బ్రకాశించును"౧. శంకరుఁడు బ్రహ్మజ్ఞానమున కతిశయప్రాముఖ్యము నిచ్చెను. ధర్మానుష్ఠానము బ్రహ్మజ్ఞానసాధనము, జ్ఞానమే మోక్షహేతువు; ఇతరసాధనములు పరోక్షసహకారులు.౨. "ఎవనికి రాగరహితమైన చిత్తశుద్ధి

(౧) సదా సర్వగతోఽప్యాత్మా, న సర్వత్రావభాసతే, బుద్ధావేవావభాసేత, స్వచ్ఛేషు ప్రతిబింబవత్॥ (ఆత్మబోధ పు. ౧౭.)

(౨) శం॥భా॥ ౪,౧౧; శం॥భా॥ తై॥ఉ॥ ౧,౩. జ్ఞానసంపాదనమే తత్త్వవేత్తల కర్తవ్యమని ప్లేటో చెప్పినాఁడు. శ్రేయోభావదర్శనమే యట్టి జ్ఞానఫలము. ఇతరుల కది దేశకాల పాత్రానుగుణమైన విధివిధానములను గూర్చి సునిశ్చితభావముల నిచ్చును. చూః ఫేడో, రిపబ్లిక్ అప్లే; అరిస్టాటిల్ 'యుక్త్యకల్పితము' అయిన 'నీతిధర్మముల'ను సామాన్యమానవుల కుపదేశించెను. మోక్షాపేక్షగలవారికి వివేకము నాతఁ డుపదేశించెను. వివేకమాత్రము దైవవిషయముల నెఱింగించును" (నికోమకీన్ ఎథిక్స్ ౧౦,౮)

కలదో, వర్తమాన పూర్వజన్మకర్మ లెవని బంధింపవో, ఎవఁడు లోకములోని క్షణికములగు లాభనష్టములను వికారములను జుగుప్సతోఁ జూచునో, వానికే బ్రహ్మజ్ఞానకాంక్ష జనించును౧. సమాధిస్థితిని జేకూర్చు యోగాభ్యాసమును శంకరుఁ డంగీకరించినాఁడు. బాహ్యవస్తువులన్నిటినుండియు నింద్రియములను లోనికిఁదీసికొని, తన సహజస్వరూపముపైఁ గేంద్రీకరించుటవలన సమాధిలో సంపూర్ణమగు సంతుష్టి కలుగును. దీనినే శంకరుఁడు సంరాధనయని పలికినాఁడు. యోగాంగములగు యమనియమాసన ప్రాణాయామప్రత్యాహారములు బహిరంగసాధనములనియు, ధారణ ధ్యానము లంతరంగసాధనములనియు నద్వైత మంగీకరించినది. ౨. సదసద్వస్తువివేకము, ఇహాముత్రఫలభోగవిరాగము, శమదమోపరతితితీక్షాసమాధిశ్రద్ధలు, ముముక్షుత్వమును నివి యాంతరంగికనియమములు, వీనివలన బ్రహ్మజ్ఞాన ముదయించును. 3.

ఏవిజ్ఞానవేత్తయుఁ దానున్నత సత్యగ్రహణములో నుత్తీర్ణుఁడైనను, దనయుగములోని విశ్వాసములను భగ్నమొనర్చుటకు యత్నింపఁడు. వర్ణాశ్రమధర్మవ్యవస్థల పటుత్వముసడలినను, శంకరుఁడు వానియందలి విశ్వాసమును నిరసింపఁడు.

---

(౧) శం॥ భా॥ కేన ఉ॥ ఉపోద్ఘాతము మఱియుఁజూడు శం. భా. ఛాం॥ ఉ॥ ఉపోద్ఘాతము; ౫, ౮, ౧; బృ॥ ఆ॥ ఉ॥ ౪, ౪, ౨౭; కఠ ఉ॥ ౧, ౨, ౧౫.

(౨) వేదాంతములోని శ్రవణమననములు ధారణమునకును, నిధిధ్యాసము ధ్యానమునకును, దర్శనము సమాధికిని సరిపోవును.

(3) శం॥ భా॥ 3, ౪, ౨౭.

ఏదేనొక వర్ణములో జన్మించుట హేతురహితతాటస్థ్యము కాద నియు, (బూర్వజన్మ కర్మననుసరించియే యది జరుగుననియుఁ జెప్పు సంప్రదాయము ననుసరించి, వేదాధ్యయనాధికారము దేవతలకు ఋషులకు, నున్నత ద్విజవర్ణములవారికే గలదను విషయమును శంకరు డంగీకరించినాఁడు. ౧ ఏవర్ణస్థుఁడైనను బ్రహ్మజ్ఞానమున కర్హుఁడని ౨. శంకరుఁ డంగీకరించును గాని, బ్రాహ్మణధర్మము నంగీకరించువారు మాత్రము వర్ణాశ్రమవిధుల ననుసరింపవలెనని శంకరు నభిప్రాయము. బ్రాహ్మణుఁడు వేదాధ్యయనముచే జ్ఞానమును బొందఁగా, నితరు లీశ్వరారాధనాదికముచే నాజ్ఞానమునే పొందవచ్చును.3 బ్రహ్మజ్ఞానసంపాదనమునకు వేదాధ్యయన మొక్కటేగతి యను వాదమునకు శంకరుని రచనలలో సాక్ష్యమును సంపాదించుట కవకాశములేదు. తన తత్త్వశాస్త్రమందువలెనే, హిందూధర్మ ప్రవచనము నందును శంకరుఁడు పరస్పర విరోధభావముల కవిరోధసమన్వయమును జూపయత్నించినాఁడు. కులమత భేదములతో నిమిత్తము లేకుండ, జిజ్ఞాసగల మానవులందరకు బ్రహ్మజ్ఞానద్వారములను దెరచియుంచి, శంకరుఁడు తన విశ్వ

(౧) రైక్వుఁడు శూద్రుఁడని చెప్పియు వేదము నుపదేశించిన జానశ్రుతి విషయమును, ఛాం. ఉ. ౪-౧,౨ సత్యకామజాబాలవిషయమును శూద్రుఁడు సంసారమార్గములో నున్నతవర్ణమునకువచ్చి జన్మించునవరకు నాతనికి బ్రహ్మజ్ఞానార్హతలేదను నర్థముతో వివరింపఁబడెను.

(౨) శం॥భా॥ 3,౪,3౮,

(3) పురుషమాత్రసంబంధిభిర్జపోప వాసదేవతా రాధనాదిభిర్ధర్మ విశేషైరనుగ్రహో విద్యాయాస్సంభవతి.

మానవప్రేమను వెల్లడించి, అద్వైతమునుండి బయల్వెడలు తార్కిక నిర్ణయముల కాతఁడు బద్ధుఁడై నిలిచినాఁడు. ఉత్తమ బ్రహ్మజ్ఞానము నార్జించిన విదురుఁడు మున్నగు శూద్రులు పూర్వజన్మ పుణ్యవిశేషము గలవారను బ్రాహ్మణవాదము నాతఁడంగీకరించినాఁడు. ఏశూద్రుఁడిపు డద్వైతజ్ఞానమును గ్రహించు సామర్థ్యమును జూపునో యాతఁడు పూర్వజన్మములో వేదము నభ్యసించెనని తలఁపవలెను. ఈవిధముగా నగ్రవర్ణముల యధికారమును శంకరుఁడు స్వీకరించినాఁడు. బ్రహ్మజ్ఞానవేత్తలైనవారు ద్విజులైనను, చండాలురైనను వారిని తనకు గురువులుగా భావింతునని శంకరుఁడు పలికినాఁడు. "అద్వైతము ననుసరించి, జగన్మిథ్యాత్వము నెవఁడు తెలిసికొనెనో యాతఁడు చండాలుఁడైనను, ద్విజుఁడైనను, నాకు నిజముగా గురుతుల్యుఁడు ఇది నానిశ్చయము."౧.

ఆశ్రమధర్మములు విధిగా నాచరింపవలెనని చెప్పఁబడెను. మోక్షసిద్ధికొఱకుఁ బ్రతివ్యక్తియు సన్యసింప నవసరము లేదు. బృహదారణ్యక ఛాందోగ్యోపనిషత్తులలో గృహస్థులే బ్రహ్మవిద్యనార్జించి బోధించిరని చెప్పఁబడెను. కాని, సన్యాసులకు వైదికకర్మలు కాని, గార్హస్థ్యవిధులు గాని, నైమిత్తిక పూజాదికములు గాని లేని కారణముచే నితరులకంటె నధిక సులభముగా బ్రహ్మజ్ఞానమును సాధింపనర్హులని చెప్పవచ్చును. ఆశ్రమధర్మముల ననుసరించువారు మోక్షాత్పూర్వము సన్యసించి తీరవలెను. ఆశ్రమవిధుల ననుసరింపని వారికట్టి నియమ

(౧) మనీషాపంచకము, చూ|| కౌపీనపంచకము, పు| 3,3,౫.

ము లేదు. సన్యాసులు బ్రహ్మసంస్థితులు "అట్టి బ్రహ్మసంస్థితి మిగిలిన మూడాశ్రమముల వారికి సాధ్యము కాదు. ఏలన వారు తమ యాశ్రమమున కనుగుణములగు ధర్మములను సరిగా నాచరింపని లోపముచే నష్టజ్ఞానులగుదురు. సన్యాసులకు కర్మాచరణలోప దోషము లేదు."౨. మఱియు, "ఏయాశ్రమస్థునికైనను జ్ఞానప్రాప్తి కధికారమున్నను, సన్యాసి జ్ఞానమే మోక్షమిచ్చును; మిగిలినవారి జ్ఞానము కర్మసంబంధము గలదగుటచే నట్లీయఁజాలదు.౧" హిందువుల నిత్య మతాచారములలో నొకశిక్షణ క్రమముగాని, యొక సామాన్యప్రమాణముగాని లేదని గుర్తించి, సన్యాసాశ్రమ వర్గములను నవీనపద్ధతుల కనుగుణముగా నిర్మించి, బౌద్ధనిర్మాణ ప్రయోజనములను హిందూధర్మమునకును లభింపఁజేసెను.౨. స్త్రీలను బౌద్ధాశ్రమములలో నంగీకరించిన దుష్ఫలితముల నెఱిఁగి, శంకరుఁడు దారిద్ర్య శౌచతపో విధానముల నాశ్రయించి, సంసారనిర్ముక్తులు కాఁగోరువారికి నిలయములుగను, విద్యాకేంద్రములుగను నిర్మింపఁబడిన మఠములలో స్త్రీలకుఁ దావులేదని శంకరుఁడు

---

(౨) శం॥ భా॥ 3,౪,౨౦.

(౧) శం॥ భా॥ మాం. ఉ. ఉపోద్ఘాతము. సన్న్యాసనిష్ఠైవ బ్రహ్మవిద్యామోక్షసాధనమ్ న కర్మసహితేతి॥

(౨) వివిదిషా సన్న్యాసమనియు విద్వత్సన్న్యాసమనియు సన్న్యాసమును విద్యారణ్యుఁడు విభాగించెను. మొదటిది బ్రహ్మాన్వేషకునిది. రెండవది సిద్ధపురుషునిది మొదటిరకపు సన్న్యాసమును స్వీకరించినచో దానిని నియమముగా ననుసరించియే నడుపవలెను రెండవదానికి బంధములు లేవు. చూ: జీవన్ముక్తి వివేకము.

నిర్ణయించెను. మతవ్యవస్థలలో వర్ణభేదములను శంకరుఁడు పాటింపలేదు

హిందువు లందరకును వర్ణాశ్రమవిధులు వర్తించును; ఏలన, ఈ ధర్మములు జాతియొక్క పరిణత విజ్ఞానమును సూచించును. సంఘక్షేత్రముకొఱకే వ్యక్తులు జీవింపవలెను; అట్టి వారికీ సూత్రములు బాహ్యశాసనములుగావు. ఒక వ్యక్తి యొక్క నైతికప్రయోజన మావ్యక్తి సంఘమునకు జేయు సేవ పైననే కేవల మాధారపడియుండలేదు. బాహ్యమునుండి, మన యిచ్చవచ్చినరీతిని రూపము నిచ్చుటకు మానవుఁ డొక మట్టి ముద్ద కాదు. ఆతనిని లోపలనుండి సంస్కరింపవలెను. మానవుని నీవిదిచేయుము చేయవలదని శాస్త్రములు శాసించునవి గావు; జాతియొక్క పరంపరాగతమైన యనుభూతినే శాస్త్రములు జ్ఞాపకముచేయును. ౧. సామాన్యధర్మములుగాక, నియమములు నాచారములు భిన్నస్థానములలో భిన్నములైయుండును. ౨. క్రమోన్నతినందినకొలఁదియు నైతిక జీవితమును క్రమముగా వికసించును. 3. ఆచార నీతి నియమావళి కాలముతోఁ బెరుగుచుండును. వైదిక విధివిధానము జ్ఞానమున కవిలంఘ్యము కాదు. వేదాధికారములేనివారైనను బ్రహ్మవేత్తలైరి. దీనులు, నీచవర్ణులునుగూడఁ బూజాపాత్ర

(౧) జ్ఞాపకంహి శాస్త్రమ్, న కారకమ్. చూ|| శం||భా||బృ||ఉ|| ౨, ౧, ౨౦.

(౨) శం.భా. ౧, ౧, ౪.

(3) శం.భా ౧, ౧, ౪.

నములవలనను, త్యాగోపవాసాదికములవలనను, దైవకృపకుఁ పాత్రులై, తన్మూలమున జ్ఞానమును మోక్షమును బొందవచ్చును. ౪.

పరమార్థసిద్ధినంది బ్రహ్మవేత్తయైనవాఁడే శ్రేష్ఠుఁడగు బ్రాహ్మణుఁడు. అట్టి బ్రహ్మవేత్త యెట్లుజీవించునో చెప్పుటకు శంకరుఁ డీక్రిందిశ్లోకము నుదాహరించినాఁడు:—

"ఏయొక్కఁడు నెవ్వనిఁ గులీనుఁడని కాని, కులహీనుఁడని కాని, పండితుఁడని కాని, దుర్వృత్తిపరుఁడని కాని భావింపఁడో యాతఁడే బ్రాహ్మణుఁడు. గూఢధర్మాశ్రితుఁడైన యట్టి విద్వాంసుఁ డీలోకమున నంధ జడమూక జనునివలె నవిజ్ఞాతుఁడై చరించుచు జీవితమును గడపవలెను. ౫.

అట్టి బ్రహ్మవేత్త జీవితము ధ్యానమయ నిష్క్రియత్వము గాదు. ఆతఁడు వినయపరిపూర్ణుఁడై, పరమపావనములైన శాంత్యానంద మహాగంగాస్రవంతిలో నుత్సాహభరితుఁడై యీదులాడును. ఏకర్మ నాతఁడు చేసిన నది యాతని బంధింపదు. ఆతని కర్మ సామాన్యుల కన్వయించు కర్మ వంటిదిగాదు. ౧. కొందఱు ముక్తపురుషులు జీవనమాత్రార్థస్వల్ప కర్మను జేయు

(౪) శం. భా. ౩, ౪, ౩౬-౩౯.

(౫) "యమ్ న సంతమ్ నచాసంతమ్, నాశ్రుతమ్ నబహుశ్రుతమ్, నసువృత్తమ్ నదుర్వృత్తమ్ వేదకశ్చిత్ సబ్రాహ్మణః గూఢధర్మాశ్రితో విద్వాన్ అజ్ఞాతచరితం చరేత్, అంధవజ్జడవచ్చాపి మూకవచ్చ మహీంచరేత్." శం. భా. ౩, ౪, ౫౦; డ్యూసేన్ సిస్టమ్ ఆఫ్ వేదాంత పు. ౧౪౧.

(౧) విదుషః క్రియమాణమపి కర్మ, పరమార్థతోఽకర్మైవ (శం॥గీ॥భా॥ ౪,౨౦.)

మరు; కాని మఱికొందఱు లోకసంగ్రహార్థము మహాక్రియా పరతంత్రులగుదురు. ౨. ఇట్టికర్మ వ్యక్తియొక్క అహంకారము నుండి ౩ బయల్వెడలు నది కాదు కావున నది యాతని సంసారబద్ధు నొనర్పదు ౪. ముక్తులైన వారు తమమోక్షము వల ననే తమతోఁబాటు లోకమును గూడ ధరింపజేయఁగలరు.

సంసారచక్రములోఁ బరిభ్రమించు వారికి వేదవిధులు, నైతిక నియమములు నవసరములే; కాని విరాగియై సంసార

(౨) శం॥గీ॥భా॥ ౪,౧౯.

(౩) శం॥భా॥ ౪,౧,౧౩.

(౪) "ఎవఁడు మేల్కొనియు గాఢసుషుప్తివలెనుండి, ద్వైతమును జూడఁడో, చూచియు దాని నద్వైతమని యెఱుఁగునో ఎవఁడు కర్మచేసియు ఫలసంగుఁడు కాఁడో, వాఁడొక్కఁడే నిస్సంశయముగా నాత్మజ్ఞాని" (ఉపదేశసాహస్రి. పు. ౪,౫) "ఎవఁడు ప్రవృత్తిలోనున్నను, దన కర్మమందు మమకార మూంచఁడో, యాతఁడే నిజముగా జీవన్ముక్తుఁడగును." "ఎవఁడు సర్వవిషయసంగి యయ్యుఁ దాను వేరొకనిపనిలో నున్నరీతిగాఁ బ్రశాంతుఁడు, నచలుఁడు, నిత్యసంతుష్టుఁడు నగునో, యాతఁడే నిజముగా జీవన్ముక్తుఁడు." రాముఁడు వశిష్ఠు నడిగినాఁడు: "ప్రపంచవిషయ సంగతుఁడయ్యు దీర్ఘసమాధినుండి మేల్కొన్నవానివలెఁ బ్రసన్నుఁడై యుండఁగలవాఁడా? ఏకాంతమందు సమాధినిమగ్నుఁడై యుండువాఁడా శ్రేష్ఠుఁడు?" వశిష్ఠగురు విట్లు బదులుచెప్పినాఁడు: "ఈసృష్టియు దాని గుణములు ననాత్మరూపము లని భావించువారికిఁ గలుగు నంతరంగశాంతియే సమాధి; తనకీ ప్రపంచముతో సంగములేదను నిశ్చయభావముతోఁ జిత్తశాంతి నార్జించినవాఁడు ప్రపంచములో నుండవచ్చును. లేదా ధ్యానమగ్నుఁడు కావచ్చును. రాగాగ్ని వారి హృదయములలోఁ బూర్తిగాఁ జల్లారిపోయినచో వారిరువురు సమానముగా ధన్యులే." (యోగవాశిష్ఠము: జీవన్ముక్తి వివేకములో నుదాహృతము)

మందలి భేదదృష్టిని విడిచి, ప్రవర్తించు వానికవి వర్తింపవు.౧ ముక్తపురుషుఁడు తన యిచ్ఛవచ్చిన రీతిగాఁ బ్రవర్తింపవచ్చునా యను సమస్య బయల్వెడలినది. కర్మ ప్రేరణకుఁ గారణమైన స్వార్థవ్యామోహము ముక్తపురుషునికి లేదు గావున నాతఁడసలే కర్మచేయఁడు. ౨.అవిద్యావశుఁడై చేయు కర్మయు నాత్మజ్ఞానము నేకకాలమున నుండఁజాలవు. 3. ఇట్టివాక్యములవలన ముక్తపురుషుఁడైనవానికిఁ గర్మయే లేదని బోధపడునుగాని, స్వార్థరహితుఁడై, ముక్తసంగుఁడై ముక్తపురుషుఁడు కర్మచేయునని చెప్పు వాక్యములు శంకరుని రచనలలోఁ గాననగును౧. ఆతఁడు పాపకర్మ నెన్నఁడును జేయుట కవకాశమే లేదు. ధర్మసూత్రముల కతీతమైన యథేచ్ఛాప్రవర్తనము మోక్షావస్థ కలంకారమనియు, ధర్మనియమోల్లంఘనమున కది యాహ్వానము కాదనియుఁ జెప్పఁబడెను. ధర్మము నెడ నిర్లక్ష్యభావము నది యెంతమాత్రమును బోధింపదు. పాపమెన్నఁడు చేయుట కవకాశము లేని పరమాత్మానుసంధానము ముక్తపురుషుని కేర్పడును. అంగాఁ బాపకర్మవిషయములో నాతఁడు వ్రతుఁడే. క్రైస్తవమతములోని ఆంటినామియనుల భావముతో శంకరుని భావము బొరవడరాదు. ముక్తపురుషుఁడు సర్వవాంఛాసిద్ధిఁ

(౧) నిస్త్రైగుణ్యేపథి విచరతాంకోవిధిః కోనిషేధః

(౨) వచనియోగాభావాత్ సమ్యగ్దర్శినో, యథేష్ట చేష్టాప్రసంగః పర్యుత్తాభిమానస్యైవ ప్రవర్తకత్వాత్ అభిమానాభావాచ్చ, సమ్యగ్దర్శినః శం.భా. ౨, 3, ౪౮.

(3) శం॥భా॥ తై౹ ఉపోద్ఘాతము.

(౧) శం॥గీ॥భా॥ ౪,౨౧.

బొందెను గావున నాతనికిఁ గోరుట కెట్టివిషయమును౨. లేని మాట నిజమేకాని యాతఁడు లోకసంగ్రహార్థము పనిచేయును. మఱియు, నాతనివిషయములో నైతికవిధి కర్థములేదని శంకరుఁడు చెప్పినాఁడుకాని యాతఁడు నీతినియమములను విసర్జించునని యెచ్చటను జెప్పియుండలేదు.౩. ధర్మసంసిద్ధి యనఁగా, ధర్మవినాశముగాక, ధర్మనియమబద్ధమైన వ్యక్తిత్వ నాశనమని తెలియవలెను. మనలోఁ గల్మషములు మిగిలి, పశుత్వమింకను బోనంతకాలమే నీతినియమముల కర్థమున్నది నీతినియమములు, మనము తప్పుచేయఁ జూచునపుడు సన్మార్గమును సూచించును. నాగరికతగల మానవునికి హత్యాచౌర్య సంబంధములగు చట్టములతో నిమిత్తములేని రీతినే, ఆత్మరతుఁడగు ముక్తపురుషునికి నైతిక నియమావళితో నిమిత్తములేదు.

౪౧—శంకరప్రతిపాదిత ధర్మసూత్రముల కాక్షేపణావిచారము.

శంకరుఁడు ప్రతిపాదించిన నైతికనియమావళి విశేష విమర్శకుఁ బాల్పైనది దానినిఁగూర్చి చేయఁబడిన యాక్షేపణలను మనము సంగ్రహముగాఁ బరిశీలింపనగును.౧. ఉన్న

---

(౨) శం॥గీ॥భా॥ ౫.

(౩) సురేశ్వరాచార్యుఁ డిట్లుచెప్పెను: "ఎవని హృదయములో నాత్మ బ్రహ్మైక్యజ్ఞానసిద్ధి కలిగినదో, యాతనికి అద్వేషము మున్నగు లక్షణములప్రయత్నాభ్యాసములగును. అవి ప్రయత్నములేకుండగనే సంపాదితములగును." (నైష్కర్మ్యసిద్ధి॥ ౪,౬౯.)

(౧) అద్వైతవేదాంతము ప్రతిపాదించు ధర్మసూత్రముయొక్క నీతి విమర్శనమునకును, డ్యూసేన్ పండితుని పునర్నిర్మాణమునకును, 'అద్వైతము ధర్మసూత్రము' అను హాగ్ పండితుని వ్యాసము. మదరాసు క్రిస్టియన్ కాలేజీ పత్రికలో ౧౯౧౬ డిసెంబరు.

దంతయు బ్రహ్మమొక్కటేయై, ప్రపంచము మిథ్యయైనచో, నప్పుడు మంచిచెడ్డలకు భేదమే తొలఁగిపోవును. ప్రపంచము ఛాయామాత్రమైనచోఁ బాపము ఛాయకు ఛాయయగును. ఛాయామాత్ర రూపములైన పాపదౌర్జన్యములతో మనమేల మేల మాడరాదు? ఇట్టి స్వప్నసదృశము నసత్యమునగు జీవితములో ధర్మముకొఱకేల మనము మన స్వార్థములను త్యాగమొనర్చి శ్రమనొందవలెను? ధర్మశాస్త్రముచెప్పు నానాత్వము నిజమైనచో, జీవితము నిజము; జీవిత మసత్యమైనచో, ధర్మమాత్రము లసత్యములేయగును. కేవల జగన్మిథ్యాభావమును మన మంగీకరింపకున్నచో, నీ యాక్షేపణ నిరర్థకమగును. పరమార్థసంపాదనములో ధర్మాధర్మములకు విలువగలదు.

జీవాత్మ పరమాత్మైకత్వమే సత్యమైనయెడల, ధర్మమునకు స్థానమేలేదని యాక్షేపింపఁబడెను. బ్రహ్మ మొక్కటే యున్నచో, ధార్మికకృషి కవసరమేలేదు. ఈ యాక్షేపణ నిత్యానిత్య వస్తుభేద జ్ఞానలోపముపై నాధారపడియున్నది. యథార్థముగాఁ గాలమున కతీతమైన బ్రహ్మమును, గాలగతములై, యసంపూర్ణములగు విషయములు నొకటేయనిశంకరుఁ డెచటను జెప్పియుండలేదు. జీవాత్మ బ్రహ్మైక్యమును దెల్పు తాత్త్విక సత్యమువలన, వ్యావహారిక జగత్సీమలో నైతికభేదముల ప్రామాణ్యము భంగపడదు. శంకరుఁ డిట్లుచెప్పినాఁడు: "నిప్పంతయు నొకటే; శవదహనము చేయు నగ్ని పవిత్రమైనది కాదందుము; సూర్యుఁ డొకఁడే, పవిత్ర ప్రదేశములలోఁ బ్రసరించు సూర్యకాంతిని మనము పూజించి, కల్మషప్రదేశములలో

వ్యాపించినదానిని గ్రహింతుము. మృణ్మయరూపములేయయ్యు మణులను రత్నములను మనము కోరుదుము; యితరమృణ్మయ రూపములగు శవాదులను మనము నిరసింతుము."౧. అదేవిధ ముగా,( పారమార్థికముగా సర్వవస్తువులు బ్రహ్మమే యైనను, గొన్ని గ్రహింపఁదగినవి, కొన్ని పరిహరింపఁదగినవి యని తెలి యవలెను, 'అహంబ్రహ్మాస్మి' యనగా, నహంకారసహితమగు జీవాత్మయే బ్రహ్మమని యర్థముకాదు; ఉపాధివిరహితమైన శుద్ధాత్మయు బ్రహ్మము నొకటియని తెలియవలెను.౩. ధర్మ జిజ్ఞాస కవసర మెట్లుకలుగుననఁగా, నాత్మయొక్క నిజమైన యపరిచ్ఛిన్నతా స్వభావమునకును, వర్తమానమం దది ధరిం చిన పరిచ్ఛిన్నతా వస్త్రజాలమునకును సంఘట్టన మెడతెగనిదై నడచుచున్నది. మానవుల స్వస్వరూప మేకము సవికారమునై యుండఁగా, నుపాధిశక్తివలన నది పతనమంది, వికృతినొంది నది.౧. మన మేస్థితికిఁ బోయినచో సత్యము ప్రత్యక్షమగునో, యట్టి స్థితిలోనున్నప్పుడు పరిచ్ఛిన్నతా దౌర్బల్యముతోఁగలుగు పోరాటమున కర్థముండదు. పరబ్రహ్మమునుండి మనము వేరను భావము సంపూర్ణనాశన మగువరకు నట్టి పోరాటము జరుగు చునేయుండును. జీవాత్మ, తాను బరమాత్మనని గ్రహించు

(౧) శం॥భా॥ ౨,౩,౪౮

(౨) ముఖ్యసామాన్యాధికరణ్యము.

(౩) బాధసామాన్యాధికరణ్యము.

(౧) ఎక్‌హార్ట్ అడిగినాఁడు: "తానొక చక్రవర్తియై యుండియుఁ దాను చక్రవర్తినని యెఱుఁగకున్నచో నేమిలాభము?" స్వర్గరాజ్యము నష్ట రాజ్యమే.

వరకు, నసంతృప్తి మగ్నమై స్వస్థానదూరత్వమువలనఁ గలుగు పరితాపముచేఁ దప్తమగుచుండును. పరిచ్ఛిన్నవ్యక్తులముగా మనకు విధులు, లక్ష్యములు నున్నవి. ప్రతివ్యక్తియుఁ దాను జేయు కర్మకు బాధ్యుఁడై, ప్రవర్తింపవలసియుండును.౨.

శంకరుని ధర్మసూత్రము బుద్ధిసంబంధమైనది; ఏలన నవిద్య లేక అవివేకము బంధకారణము.3. సర్వవ్యాపారానుభవములకు నాధారము జీవుని మిథ్యాజ్ఞానము. సమ్యగ్జ్ఞానము మోక్షకారణము.౪ జీవబ్రహ్మభేదజ్ఞానము మిథ్యాజ్ఞానమగుటచే యథార్థమైనజ్ఞానముదానినిఁదొలగించును.దీనివలనఁ దెలియునదేమన, మోక్షసంపాదనమునకు వలయునది ధర్మశీల సంసిద్ధి కాదనియు, కేవల తాత్త్వికజ్ఞానమనియు స్పష్టము. అద్వైత వేదాంతముయొక్క మూలభూతమగు లోపమిదియే యని డ్యూసేన్ తలఁచినాఁడు. "సత్యరూపముయొక్క సమ్యగ్జ్ఞానమును సంపాదించుటకు మూలాధారమైన మనలోని 'నేన' ను వదేయని వేదాంతము యుక్తముగానే చెప్పినది. కాని బుద్ధ్యుపకరణ సామగ్రియనాత్మకనఁగా మిథ్యాప్రపంచములోని దని

(౨) శం॥భా॥ 3,3,౫3. మతిపూఁజాఁడు: 3,౨,౯.

(3) శం॥భా॥ ౨,3,౪౯.

(౪) శం॥ భా॥ ౧,౨-౯; 3,౨,౨౫, ౪,౨,౯; ౧,3,౫౯.

(౫) మిథ్యాజ్ఞానకృతఏవ జీవపరమేశ్వరయో ర్భేదోనవస్తుకృతః (శం॥ భా॥ ౧,3,౧౯.) చూ: శం॥భా॥ గౌడపాదకారిక. ఉపోద్ఘాతము. పోల్చు: "జ్ఞానమ్ వినా మోక్షో నసిధ్యతి." (ఆత్మబోధ) వివేకావివేకమాత్రేణైవ॥ (శం॥భా॥ ౧,3,౧౯) చూ: అపరోక్షానుభూతి పు. ౧౪.

కొట్టివేసియు, జ్ఞాతయైన వ్యక్తియొక్క విజ్ఞానమున కీయద్వైత తత్త్వమును బ్రకటించి, యంతటితో నాగిపోయిన పొరపాటు చేసినది; పరమాత్మకు నిలయము డేకార్టేవలె బుద్ధియని చెప్పక హృదయమని చెప్పుటలో వేదాంతము శ్రేష్ఠతరమైనదే,"౧. ఏకమునద్వితీయమునగు బ్రహ్మమిదివరకే పరిపూర్ణతగలదైనచో, దాని యాథార్థ్యము నప్రతిహతముగాఁ బ్రకటించుటే మనము చేయవలసిన కర్తవ్యమును, దాని కితరమైనదెల్ల నసత్యమనుటే మన ధర్మము నైనచో, ధార్మికప్రవృత్తికిఁ జోదకశక్తియే లోపించును. మనకుఁగల పరిచ్ఛిన్నతాదోషవిముక్తికి దానినిఁ గాదనుటే చేయవలయు కార్యమైనచో నైతికదీక్ష కవకాశమేలేదు. ద్వేషమును జయించుటకుఁగాని, మన స్వభావపరివర్తనమునకుఁ గాని మనము కృషి చేయనవసరము లేదు. అవిద్య, ప్రధానముగాఁ దార్కికభావమేయైనను, శంకరుని తత్త్వములో నది సంపూర్ణమగు జీవితదృక్పథమే యగును. "దేహమే ఆత్మ యనునభిమానమే అవిద్య: అందుచే దేహమున కాధార ముదయించును; దాని స్వరూపమే రాగము; దానిని దూషించునదే ద్వేషము; శరీరమునకు బాధకలుఁగనోపు ననుభావములచే భయాదికముతలచూపును." ౧. మిథ్యాజ్ఞానమే స్వార్థపరములగు ననురాగప్రవృత్తుల కాధా

(౧) డూసేన్, సిస్టమ్ ఆఫ్ వేదాంత, పు॥ ౫౯.

(౧) దేహాదిష్వనాత్మస్వహ మస్మీతి ఆత్మబుద్ధిరవిద్య; తతస్తత్పూజనాదౌ రాగః;తత్పరిభవాదౌ ద్వేషః; తదుచ్ఛేద దర్శనాద్భయమ్,...శం॥భా॥ ౧, ౩, ౨.

రము. ౨. పరిచ్ఛిన్నవ్యక్తియొక్క పరిచ్ఛిన్నతయే అవిద్య. దానిమూలముననే మానవుఁడు తన నిజస్వరూపము బ్రహ్మత్వ మని యెఱుఁగక, రాగద్వేషమయ జీవితమును గడపయత్నించును. మనశీలములోని దోషములు కేవలలోపములే కావు. అవిద్యాశ్వరవాణీ వికల్పరూపములు. శంకరుఁడు తరచుగా 'అవిద్యాకామకర్మ' ౩ సమాసము నుపయోగించును. జీవనానాత్వము నిజమనినమ్మ దృష్టిదోష మవిద్య; ౪. కామ మసత్యవిషయానురాగము; కర్మ యనఁగా దానిని సంపాదించుటకుగాను చేయు ప్రయత్నము ఇట్టి యవిద్యాప్రేరితమగు నహంకారముచేయు కర్మయే సంసారకారణము ౫. అవిద్యవలనఁ గామము, కామమువలనఁ గర్మయు నుదయించును. మిథ్యాదృష్టిని భగ్న మొనర్చి, స్వార్థపరత నణఁచివైచి, సత్యకామము నుదయింపఁ జేయుటయే మోక్షసాధనమగును. ౬ స్వార్థప్రవృత్తి నణఁగఁ

(౨) శం॥ భా॥ కేన ఉ॥ ఉపోద్ఘాతము. సంసారబీజమజ్ఞానమ్ కామకర్మప్రవృత్తి కారణమ్; మఱియు, "అవిద్యా కామకర్మలక్షణమ్ సంసారబీజమ్." శం॥భా॥ కేన ఉ॥ ౪, ౯

(౩) శం॥భా॥ ముం॥ ఉ॥ ౩, ౧, ౧.

(౪) అవిద్యా కల్పితమ్ లోకప్రసిద్ధమ్ జీవభేదమ్ శం॥ భా॥ ౨, ౧, ౧౪; ౧, ౩, ౧౯.

(౫) అనాత్మ దర్శినోహి అనాత్మవిషయః కామః కామయమానశ్చ కరోతి కర్మాణి; తతస్తత్ఫలోప భోగాయశరీరా దుపాదానలక్షణ స్సంసారః శం॥భా॥ తై॥ఉ॥ ౧, ౧౧.

(౬) సర్వవాసనాక్షయమ్ సర్వకామ వినాశమ్ సర్వకర్మప్రవిలయమ్

దోషిక, సత్కామముల నభివృద్ధిపరచి, అహంభావభరితమైన వ్యక్తిత్వమును నిగ్రహించుట ధార్మిక ప్రవృత్తి కవసరమగు శిక్షణలోనిదే. అహంభావ వ్యక్తిత్వము నశించనిదే, మనకుఁ బరిపూర్ణత సిద్ధించదు. మనము కామమును జయించి లోక కల్యాణముకొరకే పనిచేయవచ్చును; కాని మన జీవితములో నేదో సందర్భములో దుష్కామమునకు వశులమై, స్వార్థపరులము గాకుండ నుండఁజాలము. కావున మన మవిద్యారూపములైన కామాహంకర్తృత్వ భావములను బూర్తిగా నశింపజేసినఁ గాని, సమ్యగ్జ్ఞాన విలసితమగు స్వచ్ఛ నిరహంకారదృష్టిని గలిగి యుండఁజాలము. ధర్మనియమానుష్ఠాన తత్పరుఁడు యాదృచ్ఛికముగా నిష్కాముఁడగును. సమ్యగ్జ్ఞానబలముచే మహర్షి నిష్కాముఁడగును.౧.

శంకరుఁడు పరోక్షాపరోక్ష జ్ఞానభేదమును వివరించినాఁడు. జీవబ్రహ్మైక్యభావము యథార్థమని గురుగ్రంథవాక్యావళి వలన గ్రహించు తర్కజ్ఞానము పరోక్షజ్ఞానము, తాను పృథగ్వ్యక్తినను భావమును విడిచిపుచ్చి, బ్రహ్మైకత్వము నను

(౧) చూ. ఈభావమును బాగుగా సూచించిన హీరియన్నా పండితుని వ్యాసము ఇండియన్ ఓరియంటల్ కాన్ఫరెన్సు ప్రొసీడింగ్సు వాల్యూము, ౨. నిజమైన అనుభజ్ఞానమునకు, కేవల తార్కికజ్ఞానమునకుఁ భేదమును దెల్పుచు నాతఁడిట్లు చెప్పెను: "శంకరుని మాటలలో, నిత్యనూతనసృష్టి నందుచున్న కామకర్మ పరంపరయే జీవితము. కామకర్మములు పోయినను వాని కారణమగు నవిద్య బీజరూపములోనున్నచో నది బుద్ధిగతానందమగును; అవిద్యయుఁ నిర్మూలనమైనచో, బ్రహ్మానందము." పు.౨౮౧.

భవపూర్వకముగా సాధించిన దపరోక్షజ్ఞానము లేక అనుభవ జ్ఞానము.౨. పరోక్షజ్ఞానము వలన మోక్షసిద్ధి కలుగదని శంకరుఁడు చెప్పినాఁడు. బృహదారణ్యకోపనిష ద్భాష్యములో శంకరుఁ డీవిషయమునుగూర్చి చెప్పినాఁడు.౧.సాధకుఁడు తాను పండితుఁడ నను భావమును విడిచి, క్రమముగా, బాలుని నిష్కల్మషభావమును గాంచి, దానినుండి మౌనిభావము నార్జించి, తుదకు, బ్రహ్మేతరములగు సర్వార్థ కామములను విసర్జించి, బంధరహితమగు బ్రాహ్మణత్వసిద్ధిని బొందవలెనని శంకరుఁడు వివరించెను. అందుచే నద్వైతము,తత్త్వము మతము కూడనైయున్నది. బ్రహ్మవిద్యవలన నిశ్చయమైన బ్రహ్మానుభవము సద్యస్సంపాదితమగును.3. కాలాంతరమం దెప్పుడో ఫలితమునుజూపునది బ్రహ్మవిద్యకాదు.

ఇదేవిధముగా, బ్రహ్మానుభవసిద్ధికిఁ జిత్తశుద్ధి ముఖ్యమైన సాధనమని చెప్పఁబడెను. రజస్తమోగుణముల నణఁచి, సత్త్వగుణమును వికసింపఁజేయుటే చిత్తశుద్ధి. ఇది తపస్సాధనల వలనను, నిష్కామకర్మ వలనను లభించును. ఇందు ధర్మప్రవర్తన మతిక్రమింపఁబడదు; ఇమిడియుండును." ఎవని కెన్నడహం

(౨) పోల్చు: వరాహోపనిషత్తు:
'అస్తిబ్రహ్మేతిచే ద్వేద పరోక్షజ్ఞానమేవతత్,
అహమ్ బ్రహ్మేతిచే ద్వేదసాక్షాత్కారస్స ఉచ్యతే.
(౧) 3,౮,౧౦. మఱియుఁజూడు: ఛాం॥ఉ॥ ౪,౧,౭.
(౨) పోల్చు: సెయింట్ మాథ్యూ; ౧౮,3.
(3) అనుభవారూఢమేవచ విద్యాఫలమ్ నక్రియాఫలవత్కాలాంతర భావి శం॥భా॥ 3,౪,౧౫)

కార మమకారము లసత్యములని తెలియునో, వాఁడవ్వి డాత్మవిదుఁడగును."౪. కామము నణఁచిపుచ్చినఁగాని, అవిద్య నశింపదు. జ్ఞానమనగా నాంగ్లభాషలోని జ్ఞానపదార్థమేకాదు. జ్ఞానమనఁగా నిజమైన విద్య; సంపూర్తిగా నుత్తీర్ణతనొందిన జీవితలక్షణము.౫.జ్ఞానమనఁగా నొకసిద్ధాంతము నంగీకరించుటగాదు; జ్ఞానమనఁగా ననుభవసిద్ధి; బుద్ధిజ్ఞానము దానికి బాహ్యచిహ్నమే. శంకరుఁడు కేవల ప్రజ్ఞాసామర్థ్యమున కెక్కుడు విలువనీయలేదు. సత్యమును దెలిసికొనుటకు బుద్ధిజ్ఞాన మసమర్థమని తెలియు బుద్ధిజ్ఞానమే శ్రేష్ఠమైనదని యాతఁ డభిప్రాయపడెను. మోక్షమనఁగా నవిద్యానాశనమే; కాని యవిద్యానిరసనమాత్రముచే నది లభింపదు. బ్రహ్మాస్తిత్వమును మన బుద్ధిశక్తిచే గ్రహించినంతమాత్రమున మనము బ్రహ్మవేత్తలము కాఁజాలము. బ్రహ్మజ్ఞానమనఁగా, మన మూలస్వరూపము బ్రహ్మమని, విశ్వసించుటేగాక, నిజముగా జీవితమును బ్రహ్మమయ మొనర్చుటయగును.

శంకరుని తత్త్వములో నింకొక దౌర్బల్యమేమనఁగా నాతఁడు ప్రతిపాదించు నైతికధర్మము పారమార్థికముగా సత్యముగాదని చెప్పఁబడెను. మన 'అహం' వ్యక్తిత్వము లోకములో నితరవస్తువులనుండి భిన్నమైనదనియు, దేశకాలములలో

---

(౪) ఉపదేశసాహస్రి. ౧౪,౫౯. చూ: ౧౪, ౧౪౧; శం॥భా॥ కేన ఉ॥ ఉపోద్ఘాతము.

(౫) చూ: ప్లేటోటిమోస్. పు. ౯౦; అరిస్టాటిల్ నికోమకియన్ ఎథిక్స్. ౧౦,౭.

దానికి పృథక్ స్థితిగలదనియుఁ దలఁచినంతకాలము నీతినియమములకర్థమున్నది. నైతికప్రపంచము, తనయందలి వ్యక్తులకు పృథక్త్వమున్నదని నిశ్చయించుటచే,నసత్యజగత్సంబంధమైన దే. నియతవిధులు, తత్ఫలితములైన వాంఛాసిద్ధులు, వ్యక్తిగతములైనవే: పరిచ్ఛిన్నజీవుల పృథగ్వ్యక్తిత్వములపైననే, కర్మయుఁ గర్మఫలములు నాధారపడియున్నవి. మన మెంతవరకు వ్యక్తిగతమగు ధర్మసూత్రముల దృక్పథములను గలిగి యుందుమో, భ్రమ ప్రమాదములతోఁ గూడిన సంసారమం దంతకాలమునున్నామని యే చెప్పవలెను. వ్యక్తిగతమైన దృక్పథమును క్రమముగా విడిచి, తాను బ్రహ్మమునను భావమును బొందుటే నైతికాభివృద్ధి లక్షణము; వ్యక్తిగత భావము నశించి, బ్రహ్మభావము సంపూర్ణముగా గలుగుట తోడనే, నీతి ప్రవర్తనావసరము తొలఁగి పోవును. ధార్మిక ప్రవృత్తి కవసరమున్నంతకాలము బ్రహ్మసంసిద్ధి లక్ష్యము దూరస్థమే యగును. ధర్మానుష్ఠానమునకు లక్ష్యము మన సంకుచిత వ్యక్తిత్వము నతిక్రమించి విశ్వాత్మభావములో లీనమగుటే, కాని యీధార్మిక వ్యక్తికిఁ జెందిన పృథగ్వ్యక్తిత్వభావలేశము మిగిలి యున్నంతకాలము, మనయూర్ధ్వగమన మసంపూర్ణమై యుండును. కాని, పరిచ్ఛిన్నవ్యక్తిత్వమును విడువకుండ, నపరిచ్ఛిన్నాత్మ సంసిద్ధిని గాంచుట దుస్సాధ్యమను విషయము స్పష్టము. ఈలక్ష్యసిద్ధికి మన నైతికవ్యక్తిత్వము నతిక్రమించి, తత్సంబంధమగు దీక్షానియమముల నధిగమించిన తత్త్వసాక్షాత్కారసిద్ధి నొందవలెను. అందుచేఁ బరిపూ

కృతాసంసిద్ధి నార్జించు విషయములో, మన వ్యక్తిగతమగు కృషియు, ధర్మానుష్ఠాన ఫలితమును సరిపోవని శంకరుఁడు తెరచుగా నుద్ఘాటించి యున్నాఁడు. కర్మవలన మోక్షము లేదు. పరిచ్ఛిన్నతను మన మతిక్రమింపవలెను. పరిచ్ఛిన్న జీవిత మూలబీజమగు నవిద్యను నిగ్రహింపవలెను. మన నిజస్వరూపము బ్రహ్మమని తెలియుకొనుటకు మన మవిద్యాకామకర్మమూలమగు సంసారబంధములను ఛేదింపవలెను. మనమెంత ధర్మవర్తనులమైనను, మనయోగ్యత మన పరిచ్ఛిన్నతను బోఁగొట్టి అవిద్యా సంబంధములను భగ్నమొనర్పలేనంతకాలము, మోక్షము మనకు దూరమైయుండును. అందుచే నెట్టికృషి చేసినను మోక్షసిద్ధిలేదని శంకరుఁడు వాదించును; ఏలన, నేకర్మయైనను, వైదికవిధి నిర్వాహణమైనను, లేక యీశ్వరారాధనమైనను, మనవ్యక్తిత్వము నంటిపట్టుకొనియుండు పరిచ్ఛిన్నత, నటే యుంచుటచే, మన సంసారపరిభ్రమణము సాగుచునే యుండును. ఈ సంసారచక్రమునుండి విముక్తినిచ్చునది జ్ఞానమొక్కటే; జ్ఞానమే మనపరిచ్ఛిన్నానధులను దాటించి, బ్రహ్మైక్యసిద్ధినిచ్చును.౧ పరిణామస్వభావముగలది ధర్మానుష్ఠా

(౧) ఈవిషయములో శంకరుని భావముతో బొశాంకె పండితుని భావమునకు సామ్యమున్నది. మోక్షమునకు శంకరుని జ్ఞానమువలెనే, బొశాంకే విశ్వాసమును జెప్పినాఁడు. పోల్చు: "కర్మవలనఁగాక, భక్తిచే మనము పరిపూర్ణమైన దానితో నేకము. ఇచట మన లోపము పూరింపఁబడును. తరింపఁజేయు ననుభవము 'లకిదియే యర్థము. విశ్వాత్ముఁడగు నీశ్వరుని కృపపై మనము భారముంచి, యీశ్వరైకత్వమును మనము గాంచి, మన పరిచ్ఛిన్న బుద్ధి కది

నము; స్వయంసమృద్ధమైన సత్యమునది సంపాదింపఁజాలదు.
మానవజీవితమునకు నైతికాభివృద్ధియే ప్రధానమైనదైనచో,
మనముత్తీర్ణులమై స్వస్వరూపసంసిద్ధిని బొందుదశ మనకెన్నటికిఁ రాదు. మానవుని సహజరూప మీశ్వరుఁడే యైనచో,
'నేనీశ్వరుఁడ' నని మానవుఁడు చెప్పు స్థితినందినచో నవ్వాడికి నైతిక
ప్రవర్తనావసరమే లేదు. నీతినియమముల ననుష్ఠించుటలోఁ
దృప్తిగాంచునాతఁ డాత్మసాక్షాత్కారమువలని సంతృప్తినిఁ
గాంచఁజాలఁడు. నైతికజీవితమే సర్వమునైనచో, ధర్మానుష్ఠానముచే నుజ్జ్వలమైన జీవితముకూడ వ్యర్థమేయగును; ప్రేమ
క్షణికమేయగును; ఆనంద మందరాని ఫలముగాఁ బరిణమించును.
నీతినియమముచే ముక్తిగాంచుట దుర్లభమని సెయింట్ పాల్
నుడివియున్నాఁడు.(౧) మన మేమిచేసినను, మన స్వార్థమును
విసర్జించినఁగాని, మనము తరింపఁజాలము. స్వార్థపరులమై
మనము ధర్మోపదిష్టవిధులను నెరవేర్పవచ్చునుగాని, యట్టి విధి
నిర్వహణము ధర్మప్రయోజనముగలది కాఁజాలదు. మనలోని
పాపస్వభావము నున్మూలించుటకు, శంకరుని మాటలలో
నవిద్యానివృత్తికి, భక్తిసాధనమని పాల్‌ను, జ్ఞానమని శంకరుఁ
డును వచించిరి. అట్టి జ్ఞానమే మన పరిచ్ఛిన్నతను ఛేదించి,
పాపమునతిక్రమింపఁ దోడ్పడును. మోక్షమనఁగా నొకనూత్న

విరుద్ధముగాఁ దోఁచుటఁ గాంతుము." (ది మీటింగ్ ఆఫ్ ఎక్ట్రీమ్సు ఇన్ కాంటెంపరరీ ఫిలాసఫీ, పు॥ ౧౭౩) చూ॥ మైండ్; న్యూ॥సీ; వాల్యూము ౩౦; పు॥ ౯౮.)

(౧) ఎపిసిల్ టు ది రోమన్సు ౩,౮,౧౦; ఎపిసిల్ టు గాలేషియన్సు ౨,౩...

నిర్మాణముగాని, కల్పనముగాని కాదు; అది లోనున్నదాని నావిష్కరించుటే. ధర్మఫలము బాహ్యమైనది, జ్ఞానము స్వయం సంపూర్ణమైనది. జ్ఞానమునకు లోపముగాని, లక్ష్యముగాని, యుద్దేశ్యముగాని లేదు. శాశ్వతమై స్వయంసంపూర్ణమైన మోక్షము కర్మవలన లభింపదని శ్రుతి చెప్పుచున్నది.౨. తాను నిరసింపవలయు మతవిరోధభావములను మనసులో నుంచుకొని యొక మతసిద్ధాంతముయొక్క అర్థనిర్ణయము చేయుటే సిద్ధాంత తాత్పర్యనిర్ణయమునకు నిర్దుష్టమైన సూత్రమని మనము జ్ఞాపకముంచుకొన్నచో, మోక్షసిద్ధికి సాధనముగాఁ గర్మమార్గము నిరుపయోగమని శంకరుఁడుద్ఘాటించుటలోని అతిశయోక్తి కర్థము సువిదితము కాఁజాలదు. మోక్ష సంపాదనమునకుఁ గేవల కర్మకలాప నిర్వాహణమే సామర్థ్యము గలదనువాదమును మీమాంసకు లతిశయోద్ఘాటన మొనర్చిరని శంకరుఁడు భావించినాఁడు. మీమాంసకులు వైదిక కర్మకాండ కిచ్చిన విపరీత ప్రాముఖ్యమునకుఁ బ్రతిగా శంకరుని కర్మ నిరస

(౨) నాస్త్యకృతః కృతేన. శంకరుఁడిట్లు వివరించెను; అకృతో మోక్షః కృతేనకర్మణా నాస్తీతి; చూ॥ శం॥ భా॥ తై॥ ఉ॥ ఉపోద్ఘాతము మఱియు, "కర్మ యనఁగా నున్న సర్వవస్తుస్వభావములకు వేఱై, యొక వ్యక్తిమానసశక్తిపై నాధారపడునది...జ్ఞానము ప్రమాణజన్యము; వస్తుతంత్రములు ప్రమాణములు; అది వేదవాక్యములపైఁగాని, మానవమానసములపైఁగాని యాధారపడదు." (శం.భా. ౧,౧,౪.) చూ॥ శం॥ భా॥ ౧,౪,౨౨.) మాధ్యమికులు జ్ఞానసంభారము వలన ధర్మకాయమును, పుణ్యసంభారము వలన సంభోగకాయమును లభించునని చెప్పిరి. (మాధ్యమికావతారము, 3,౧౨.) చూ॥ కీత్ పండితుని బౌద్ధతత్త్వము, పు॥ ౨౭౭.

నము నర్థము చేసికొనవలెను. అజ్ఞాననిర్మూలనమే మోక్షము. "అవిద్యా నాశనమే పరమార్థసిద్ధి."౧. "బ్రహ్మస్వభావమునుగూర్చిన అవిద్యా నిర్మూలనముతో, స్వాత్మ సంస్థితుఁడై, మానవుఁ డుత్తమస్థితి నొందును."౨. బ్రహ్మము నెఱుఁగుట యనఁగా మన కిదివరకులేని దానిని సంపాదించుట గాదు; మన మజ్ఞానవశమున మఱచిపోయిన మన నిజస్వభావమును గుర్తించుటే. అది సర్పమను భ్రాంతి తొలఁగినంతనే, రజ్జుజ్ఞానమెట్లు ప్రకాశించునో,౩. అట్లే, అవిద్యానిర్మూలనముతో విద్య ప్రకాశించును.౪. తాత్కాలిక ఫలితములనిచ్చు కర్మ,నిత్యము నిరామయము నైన మోక్షము నీయఁజాలదు.కర్మ అవిద్యను దొలఁగింపఁజాలదు; ఏలనఁ గర్మావిద్యలు పరస్పర విరుద్ధములుగావు. కర్మ పూర్వమైనది జ్ఞానమనిచెప్పఁబడినపుడు; జ్ఞానమనఁగా బాహ్యవస్తుజ్ఞానమేగాని బ్రహ్మజ్ఞానమని యర్థముకాదు. ఒకకామమును సాధించుటకే కర్మచేయుదుము. మోక్షము కర్మతో నన్వయింపదు. కర్త, తనకుఁ బ్రత్యేక వ్యక్తిత్వముగలదనియు, (దానార్జింపవలయు వస్తువు తనకు వేరై

---

(౧) శం॥ భా॥ ముం॥ ఉ॥ ౧,౫. అవిద్యాపాయఏవహిపరప్రాప్తిః। అవిద్యా నివృత్తిరేవమోక్షః॥

(౨) శం॥భా॥తై॥ఉ॥ ఉపోద్ఘాతము, "అవిద్యా నివృత్తౌ స్వాత్మన్యవస్థానమ్ పరప్రాప్తిః."

(3) శం॥భా॥ 3,౨,౨౧.

(౪) శం॥భా॥ ౨,౧,౧౪,

యున్నదనియు సమ్మతించుచోఁ గర్మకర్తృము లేదు. ౧. కాని యీ భేదములున్నంతకాలము మోక్షప్రాప్తి లేదు. “భిన్నత్వదర్శనముతో మోక్షముండదు; భిన్నత్వదర్శనము లేనిదే కర్మ లేదు.” ౨. చేయఁబడిన కర్మలవలన నీదిగువవానిలో నేదో యొకఫలితము సంభవించును; “నూత్నవస్తువు (ఉత్పత్తి). వికారము, సంస్కారము, ఆప్తి.” మోక్షమిందేదియును గాదు. ౩. కర్మకుఁ జిత్తశుద్ధినిచ్చు విలువగలదు; కాని, యది అసంపూర్ణదృష్టిపై నాధారపడునదగుటచే, ఁబరప్రాప్తిసాధనము కాఁజాలదు. జ్ఞానమే మోక్షసాధనము. ౪. కొన్నిచోటుల శంకరుఁడు దీనినతిశయముగా నుగ్గడించినాఁడు” కర్తృకర్మఫలాదిభేదవిరహితమైన బ్రహ్మజ్ఞానమునకు బాహ్యమైన సహకారశక్తిగాని సహాయసంపత్తిగాని యవసరమని తలఁచుట సహేతుకము గాఁజాలదు; బ్రహ్మజ్ఞానఫలమైన మోక్షమునకుఁగూడ నట్టి బాహ్యసహకారము నవసరము లేదు; కావున, జ్ఞానము, స్వభావముచే నట్టి కర్మరూపమగు పరసహకారసంపత్తి నిఁగోరదు”* నిత్యకర్మానుష్ఠానమువలన జన్మాంతరపాపములు నశించుననియు కామ్యకర్మములవలన వాంఛితార్థసిద్ధియగుననియు శంకరుఁ డంగీకరించును. నిత్యనైమిత్తిక కర్మఫలములు తాత్కాలిక కామసంతృప్తినిచ్చునే గాని, నిత్యమగు పరమార్థసంపత్తి నీయఁజాలవు. కామ్య

(౧) శం॥ భా॥ ఛాం॥ ఉ. ఉపోద్ఘాతము.
(౨) శం॥ భా॥ కేన ఉ॥ ఉపోద్ఘాతము.
(3) శం॥ భా॥ తై॥ ఉ॥ ౨, ౧
(౪) ఆత్మబోధ. పు॥ ౨౦౩.
(౫) చూ॥ శం॥ భా॥ కేన ఉ.

కర్మలను, నిషిద్ధకర్మలను చేయుటమాని, ప్రారబ్ధకర్మఫలముల ననుభవించుటచే నశింపఁజేసి, విధి కర్మాచరణముచే నాగామి కర్మఫలత్రయమును సాధించినచో, నేయితరసాధనముతో నిమిత్తములేకుండ మోక్షము సాధ్యమని మీమాంసకులు చెప్పుదురు. ప్రారబ్ధములుకాని కర్మ లనంతములుగా లున్నవి. వాని ఫలితము లొక జన్మములోఁ బూర్తికావు; వీనివలన ననేకజన్మములు, జన్మములలోఁ దిరిగి యనేకకర్మలు పెరుగుచునే యుండును. కర్మమూలమగు కామమును నశింపఁజేసినఁగాని మన కుపాయాంతరము లేదు. అవిద్యయే కామములకుఁ గారణమగుటచే, విద్యయే మనలఁ గర్మబంధములనుండి విడిపింపఁగలదు(౧). అందుచే బాహ్యకర్మలకు మూలాధారమునే బ్రహ్మవిద్యనిర్మూలించును.(౨). బాహ్యప్రవర్తనముకంటెఁ బ్రధానమైన దాంతరంగిక జీవితము. అంతరంగమునఁ జెలరేగు విషమసమస్యలు బాహ్యమాత్రములచేఁ బరిష్కృతములుగావు. మన యేకాంత హృదయములు, ధ్యానప్రార్థనములు జీవితసమస్యా పరిష్కార

(౧) శం॥భా॥ ౧,౧,౪. పోల్చు: ప్లేటో: "తత్త్వజ్ఞానహీనులగువారు కేవల మలవాటుచే ధర్మాచరణము చేయుటవలన, జన్మానేకపరిభ్రమణమును మహాసుఖము ననుభవింతురు. వారికలు దోమలు చీమలవలెనో, లేక మానవులవలెనో తిరిగి జన్మించుచు నల్పజీవితముల గడపుదురు మఱియుఁ గొందఱుత్తరుషోరులు గావచ్చును కాని పరిశుద్ధుఁడగు తత్త్వవేత్త యనఁగా జ్ఞాని తప్ప నెవ్వఁడును మరణించినవెనుక, దేవతావర్గములో జన్మింపఁజాలఁడు" (ఫాడో. పు. ౮౨).

(౨) ఇదానీమ్ కర్మోపాదానహేతు పరిహారాయ బ్రహ్మవిద్యా ప్రస్తూయతే॥ (శం॥ భా॥ తై॥ఉ॥ ఉపోద్ఘాతము.)

ములో( దోడ్పడును. అందుచే సముచితసృష్టిని సంపాదించుటే సర్వోత్తమధర్మము. మన చిత్తము నాత్మాయత్త మొనర్చుట లోనే ధార్మికప్రజ్ఞారహస్య మిమిడియున్నది. ఆత్మజ్ఞానఫలితమే ధర్మజీవనము. ఆత్మజ్ఞానములేని ధర్మజీవనము బాహ్యానియమాచరణమే యగును.

ఇంకొక యర్థములో మానవుని భిన్నదశల ననుసరించి యుండునవే ధర్మవిధులు. సాంఘికప్రయోజన ప్రదములైనవే ధర్మనియమములను నపార్థము నేటి ప్రపంచములో నంగీకరింపబడినది. సంఘమును గూర్చిన మన భావములకేకాక, భగవంతుని గూర్చిన మన భావములకుగూడ విలువయున్నది.

ఆత్మజ్ఞానము కర్మకు వ్యతిరేకమైనదనియు, రెంటికి స్వప్నమందైనను సంబంధము లేదనియు శంకరుని నిశ్చితభావము. కర్మనిష్ఠులైన గృహస్థులయ్యు, జ్ఞానసిద్ధులై, శిష్యులకు బ్రహ్మజ్ఞాన దాన మొనర్చినవారు గలరని శ్రుతులు పేర్కొన్ననను విషయమునకు సమాధానము చెప్పుచు, బ్రత్యక్షముగా సత్యమగు దానినట్టి విషయములును నిరసింపజాలవనియు, "వేయి సూత్రములైనను వెలుతురును చీకటి నొకచోనుండునట్లు చేయజాలవు; ఇంక నుపమానప్రసక్తియేల" యనియు శంకరుడు పలికినాడు. ౧. ఈ వివాదమంతయును "కర్మ" పద

(౧) విద్యాకర్మవిరోధాచ్చనహి బ్రహ్మాత్మైకత్వదర్శనేన సహకర్మ స్వప్నేఽపి సంపాదయితుమ్ శక్యమ్...యత్తుగృహస్థేషు బ్రహ్మ విద్యాసంప్రదానకర్తృత్వాది లింగమ్ నతత్ స్థితిన్యాయమ్ బాధితమ్ ఉత్సహతే; నహి విధిశతేనాపి, తమఃప్రకాశయో రేకత్రసంభవశక్యతే కర్తుమ్, కిముత లింగైః కేవలైరతి, (శం॥భా॥ముం॥ఉ॥ ఉపోద్ఘాతము)

మును నిశ్చితార్థములో నుపయోగింపక పోవుటచేఁ దటస్థించి నదే. స్వార్థపరమగు ఫలాకాంక్షతోఁ జేయఁబడినచోఁ గర్మ కాత్మజ్ఞాన విరోధమేర్పడుట నిజమే. ఆత్మజ్ఞానము నార్జించిన వెనుక నొకవ్యక్తి లోకసంగ్రహార్థమై చేయుకర్మ, యాతని బంధించి సంసారమగ్న నొనర్పఁజాలదు. కామ్యకర్మయు నాత్మజ్ఞానమును గలిసియుండఁజాలవు ౧. జ్ఞానకర్మలు రెండును, కాంతితమస్సులవలె నసంగతములైనచోఁ, గర్మయనఁగా, గామ్యకర్మయనియు, జ్ఞానమనఁగా స్వార్థరహితమగు జ్ఞానమనియు మనమర్థము చేసికొనవలెను. ముక్తపురుషుఁడు చేయు లోకసంగ్రహార్థమైన ప్రవృత్తియనరాదు. శంకరు ననుసరించి. ముక్తపురుషుఁడు చేయు దానిని గర్మయనరాదు. "ఆత్మరతుఁడై, తాను జేయు నిత్యకర్మలలో నానందమును గాంచుచు విలసిల్లు నాతఁడుత్తమ బ్రహ్మవేత్త'౨యని చెప్పిన ముండకోపనిష ద్వాక్యమునకు భాష్యము వ్రాయుచు శంకరుఁడిట్లు వ్యాఖ్యానించెను. "ఈవాక్యము కర్మ జ్ఞానసంబంధము నంగీకరించెనని తలఁచుట మూర్ఖుల ప్రలాపము" ౩. కొంతప్రవృత్తి యంగీకరింపఁబడిన మాట నిశ్చయము. శంకరుఁడు చెప్పినదేమన ముక్తపురుషుని ప్రవృత్తి, అహంకారముపై నాధారపడిన కర్మ యనరాదు ౪. ఇంకొక వాక్యములో నాతఁడిట్లు చెప్పెను: "జ్ఞాని

(౧) శం। భా। ఈశో ఉ। ౧౮. (౨) ౩, ౧, ౪.

(౩) అసత్ప్రలపిత మేవైతత్, మరియుఁ జూడు. శం. భా. చాం. ఉ. ఉపోద్ఘాతము.

(౪) కర్మహేతుః కామ స్స్యాత్, (తై,ఉ,శం,భా, ఉపోద్ఘాతము.)

ర్మైనవానికి, జీవితమంతయు నాతఁడెట్టి కర్మచేసినను, కర్మ సంగములేదు; ఏలన జ్ఞానమహాత్మ్యమట్టిది."౧. సంసారమునకు బంధించు జన్మాంతరముల నిచ్చు ప్రవృత్తికే కర్మ యని పేరు; ఏలన నిట్టి కర్మ జ్ఞానమున కవరోధమును గల్పించును. కాని ముక్తపురుషుని కర్మ యిట్టిదికాదు. ఏలన నది కామకలుషితము గాదు. ముక్తపురుషుఁడు సర్వకామములను జయించినాఁడు. ముక్తపురుషుని కెట్టి సంసారబంధములేని దివ్యావస్థ నుగ్గడింపఁ దలచినప్పు డాతఁడు కొన్ని చోటులలో సర్వకర్మలు దుఃఖ హేతువులగుటచే ముక్తపురుషుఁడెట్టి కర్మయుఁ జేయఁజాలఁడని చెప్పినాఁడు ౨.

సన్న్యాస ధర్మమునకే ప్రాధాన్యమిచ్చెనని శంకరుని తత్త్వమును గూర్చి యింకొక యాక్షేపణము కలదు. వ్యావహారికజగత్తులో నిజముగా సంపాదింపఁదగిన దేదియును లేదని శంకరుఁడు వేనోళ్లఁ జాటినాఁడు. ౩. మనకును మన ప్రేమ పాత్రులగు నందరకును, నేఁడు గాకున్న రేపైనను జరామృత్యువులు గలవనియు, మనకుఁ బ్రియములైన సర్వవస్తువులు శ్మశానభస్మముగా మారిపోవుననియు నిశ్చయము. ఆత్మ నిలుచు

---

(౧) శం॥భా॥ ౩,౪,౧౪; చూ॥శం॥భా॥ఛాం॥ఉ॥ ౨,౨౩,౧.

(౨) శం॥భా॥ ౨,౩,౪౦.

(౩) పోల్చు: జాక్. ౨,౧౫-౧౬. "ప్రపంచమునుగాని, దాని యందలి దేనినిఁగాని ప్రేమింపకుము ప్రపంచమోహముఁగల వానికి జగత్పితపైఁ బ్రేమయుండదు. దేహేంద్రియ కామవస్తుజాలమంతియు లోకమునకుఁ జెందినదే కాని, దేవునికిఁ జెందదు; లోకము, కామవస్తుసహితముగా నశించిపోవును గాని, యీశ్వరేచ్ఛననుసరించు వానికి నాశనములేదు."

టకు సరియగు స్థిరమైన తావు లోకమున లేదు. సంసారసంగ త్వము యొక్క వ్యర్థతనొక సుప్రసిద్ధమైన యుపాఖ్యానము చెప్పుచున్నది: తన్నుఁదరుముకొని వచ్చుచున్న యొక వ్యాఘ్ర ము నుండి కాపాడుకొను నిమిత్తమొక ప్రయాణీకుఁడు పరువెత్తి యెదుటనున్న యొక పాడునూతిలోదుమికెను. కాని నూతిలో నడుగున నొక దారుణ విషసర్పము నోరుతెరచి, కోరలుసాచి, విషానల జ్వాలలను గ్రక్కుచున్నది. ఆతఁడు వ్యాఘ్రభయ ముచేఁ బైకిరాఁజాలఁడు; సర్పభీతిచేఁ గ్రిందికిఁ బోఁజాలఁడు. నూతిగోడనుండి బయటికిఁ బెరిగియున్న యొక చిన్న మొక్కను బట్టుకొని నిలిచియున్నాఁడు. అట్లు నిలిచియుండుటచే నాతఁ డలసటజెంది, మరణము తప్పదని యెంచినాఁడు. అన్నివైపుల నుండియు మృత్యువు ముసురుకొని వచ్చుచున్నను, నాతఁడా మొక్కను బట్టుకొని ప్రాణాసక్తిచే వ్రేలాడుచున్నాఁడు. కాని, సితాసిత మూషకద్వయమా మొక్క మొదలును విసుగువిరా మము లేకుండఁ గొరికివేయుచున్నది. క్షణములో నాతనికాధార మైన మొక్క తెగి పడిపోవుటచే నాతఁడు మృత్యువునోటఁ బడవలసియున్నది. అట్లే సంసార యాత్రికులమగు మనము, జీవితములోని దుఃఖముల నెఱుగుదుము. మనము మమకార ముతోఁ బట్టుకొని యూగిసలాడు వస్తువులన్నియు క్షణికములని యెఱుగుదుము; కాని సుఖలేశమునిచ్చు నేయడవిమొక్క యాకులలో నున్న తేనెచుక్కలకో యాసించి, నాలుకలుసాచి నాకుచున్నాము. దారుణ సర్పరూపమున మృత్యువు నోరుతెఱ చుకొని యున్నదని యెఱిఁగియు, మనము పట్టుకొనిన కొమ్మ

లను,సితాసిత మూషికములను నహోరాత్రములు కొరికివేయు చున్నవని తెలిసియు, జీవితమను వృక్షభ్రాంతి తొలఁగిపోవుట లేదు. విషసర్పమెదుటనున్నది. కాని మధుబిందువులు తియ్యగా నున్నవి. ఈ సంసారవృక్షమే పరమార్థమని నమ్మి, మనలో నంతర్వర్తియైయున్న యాత్మకు సంతృప్తి కలుఁగఁజేయున దెద్దియు నీసంసారమునలేదను ఘోరసత్యాంశము నెఱుఁగొనుట కిచ్ఛగింపము. పరమార్థసంసిద్ధి, నిర్విశేష సర్వసంగత్యాగముల ఫలితమని శంకరుఁ డుద్ఘోషించినాఁడు. కామము సంపూర్ణవినాశమంది, సుఖదుఃఖములను రెంటెని విడిచిపెట్టుటచే మోక్షసిద్ధి కలుగును. పరిపూర్ణ ధర్మాచరణముకాని, మహోజ్జ్వల ప్రజ్ఞా సామర్థ్యముగాని, పరమార్థసంసిద్ధి నిచ్చుటకుఁ జాలవు. దేహాభిమానమును విడిచి, త్యాగమయ జీవితమును గడపుమని శంకరు నుపదేశము. ఆత్మకు శత్రువు కేవల దేహముకాదు. "నేను" "నాది" యను దేహాభిమాన పాశమే ప్రబలశత్రువు.౧. జీవన్ముక్తునికి దేహమున్నది; కాని యాతని మోక్షమున కది యాటంకముగాదు అజ్ఞాని దేహ మాత్మజ్ఞానవికాసమున కవరోధ సహస్రమును గలుగఁజేయును గావున దేహ సంసర్గముచే నాత్మశక్తి యణఁగిపోవునని శంకరుఁడు వాదించినాఁడు. దేహ సంబంధమైన కామమోహములను దహనముచేయుఁడని శంకరుఁ డనేకరీతుల ఘోషించియున్నాఁడు.

శంకరుని జగన్మిథ్యావాదమునను సరించి, సాంఘికజీవితమున కవకాశములేదని యింకొక యాక్షేపణముగలదు.

---

(౧) శతశ్లోకి పు. ౧౫

ప్రపంచ మసత్యమైనచో దానివిషయములో నెట్టిప్రసక్తియు మనకుండనవసరము లేదు. జగత్తు మనలను బంధింపకుండఁ జూచుకొన్మనలేదు. జగత్తునే విసర్జింపుమని శంకరుని భావము. శంకరునివాదము జగద్బహిష్కారముగాని జగత్సంస్కారము గాదు. సాంఘికవ్యవస్థలను సంస్కరించు ప్రోత్సాహ మాతని తత్త్వముపదేశించుట లేదు. కాని యిది శంకరునిభావము కాదని శంకరుని జీవితమే ముక్తకంఠముతోఁ జాటుచున్నది. వ్యక్తిత్వ మనఁగా, వ్యక్తిపరమైన స్వార్థపరతగాదని శంకరుని తత్త్వమంతయు ఘోషించుచున్నది. మానవుఁడు తనలోఁ జేరిన జగత్కాలుష్యములను గడిగివేసి, పరిశుద్ధుఁడుఁ గావలెను. అహంకారమునకు, కామములకు, నింద్రియసుఖాపేక్షకు నీచ దాస్యమునుండి యాతఁడు విముక్తినొందవలెను. "నేను" "నాది" యను భావములను మానవుఁడు విడచి, మమకార సూచకములగు సర్వసంబంధములను విచ్ఛేద మొనర్చి, "ఏకాకియై యేకాకియగు బ్రహ్మమునొద్దకుఁబయనించుట"వలననే శాశ్వతజీవితము కలుగును. శంకరుఁ డుపదేశించినది లోకమునువిడిచిపారి పోవుట కాదు;అహంకార త్యాగము. లోకమునుండిపారిపోవుట సులభమేకాని, మమత్వమునుండి విడివడుటంత సులభకార్యము కాదు. స్వార్థమునణఁచివేయుటకు మనకవసరమైనచో నేకాంత వాసము నిర్జనప్రదేశమును సాధనముగాఁ దీసికొన్మని యాతఁ డుపదేశించెను. స్వార్థశృంఖలములనుండి పూర్తిగావిముక్తుఁడైన యాతఁడు లోకములో నెట్టికార్యభారమునైన వహించుట కధికారముగలదు. శంకరునితత్త్వము, లోకముతోడి సంసర్గము

కాని, లోకమునుండి పలాయనముకాని కాక, లోకసంరక్షణమేయగును. సిద్ధపురుషుఁడు తనకొఱకుఁగాక, మానవకల్యాణముకొఱకే జీవించును. తామరాకుపై జలబిందువువలె, మనము నిస్సంగులమై లోకములో విహరింపవలెనని శంకరుని బోధయైయున్నది. జ్ఞాననేత్రములఁ దెరచియుంచుకొని, మన కర్తవ్యములను నెరవేర్పవలయుననియు, నిస్సంగబుద్ధితోఁ జూచుచేకాని ప్రపంచమును ద్వేషింపనవసరము లేదనియు శంకరునిమతము. ౧

మోక్షమనఁగాఁ బరమ శాంతియనియు, నచట మన విజ్ఞానవ్యక్తిత్వము లదృశ్యములగు ననియు నర్థమైనచో, మన మట్టి దానినిఁ బొందుటకు మానవత్వమునే కోల్పోవుదుమను

(౧) ఉపనిషత్పఠనము నా జీతమునకు శాంతినిచ్చినది; నాకవసాన దశలోఁగూడ శాంతినీయఁగలదని చెప్పిన సోపెన్‌హోయరు వాక్యమును స్మరించి, మ్యాక్సుముల్లర్ చెప్పినాఁడు:'సోపెన్‌హోయరు తనకుఁ దాత్కాలికముగాఁదోఁచిన దానిని రచించువాఁడెన్నఁడును గాఁడు. రోగుల రహస్యానుభవములను విని సమచిత్తతగోల్పోయి, యుద్రేకవశుఁడగువాఁడును గాఁడు. వేదాంతము విషయములో నాతఁడు చూపిన యావేశము నాకును గలిగిన దనియు, నా జీవయాత్రలో వేదాంతము మహోపకారమొనర్చెననియు బహిరంగముగా నంగీకరించుటవలన నాకెట్టి యవమానముకాని భయముగాని లేదు. ఒక దేశమును సంరక్షించుటలోఁగాని: పాలించుటలోగాని, ధనమార్జించుటలోఁగాని, ఘననిర్మాణములలోఁగాని పాల్గొనుటకుఁ బ్రతివ్యక్తికి నవకాశముండదు. ప్రశాంతమైన ధ్యానజీవితమును గడపుటకు వేదాంతముకంటె శ్రేష్ఠతరమైన సహకారి యింకొకటిలేదు. ఒకఁడు ప్లేటోమతవాదియయ్యు, యోగ్యుఁడగు క్రైస్తవుఁడై, పూజ్యుఁడగు పౌరుఁడుగావచ్చును; వేదాంతి విషయమట్లే చెప్పనగును." (యస్,యస్; పు. ౧౯౩)

నాక్షేపణము, ధర్మము పరిచ్ఛిన్న జగత్సంబంధి కావున, బరిచ్ఛిన్నాపరిచ్ఛిన్న వస్తుసంబంధమును గూర్చిన మహోన్నత సమస్యకుఁ దోడ్పడనిపోవును. తార్కికముగాఁ జూచినచో, ననుభవజ్ఞానమునకు బుద్ధి జ్ఞానమునకు గలసంబంధ సమస్య యే యిది. పరిచ్ఛిన్న ప్రపంచమపరిచ్ఛిన్న బ్రహ్మముపై నాధారపడియున్నదని మన మెఱుగుదుము కాని, యెట్లాధారపడియున్నదో మనకుఁ దెలియదు. అదేరీతిగా ధర్మజీవనమునకు మోక్షమునకు సంబంధమున్నది కారణరూపము మనకుఁ దెలియదు. అనుభవజ్ఞానమును దర్కజ్ఞానమును, బ్రహ్మమును జగత్తును, ఆత్మ సాక్షాత్కారమును ధర్మవర్తనము నొకదాని నుండి యొకటి వేరుపరచుటవలన, శంకరు ననుసరించి, ప్రపంచము మిథ్యయనియు, మన జ్ఞాన మసత్యమనియు. మన ధర్మజీవనము మోసమనియు శంకరునిగూర్చి చేసిన యాక్షేపణమును సమర్థించిన వారమగుదుము. కాని శంకరుఁడెన్నియో సారులు ప్రపంచము బ్రహ్మమూలమై యున్నదని చెప్పియున్నాఁడు. వ్యవహార ప్రపంచము నధిగమించిపోవుట కదియే మార్గము. పరమార్థసిద్ధికి మార్గము వ్యవహారజగత్తు ద్వారముననే కల్పితమై యున్నరీతినే, ముక్తికి మార్గము ధర్మజీవనము ద్వారముననే కల్పితమై యున్నది. మోక్షావస్థలో ధర్మ మతిక్రమింపఁబడినను, మోక్షమునకు ధర్మమునకు సంబంధము లేదనరాదు. తనవిధి నిర్వహణమును గాని, యీశ్వరభక్తినిగాని సాధకుఁడు విడిచిపెట్టవలెనని యెచటను బోధింపఁబడలేదు. ధర్మజీవనము యొక్క మిథ్యాత్వము, ధర్మమనుష్ఠాన సిద్ధిపొంది నవెనుకనే

సంభవించు విషయము. ఇహలోకమున ధర్మజీవనకృషి, లోపాపజయసమన్వితము; కాని నిశ్శ్రేయసమెంచటనో లోకాంతరమున లభించునదికాదు. అది యిచ్చటే యిప్పుడేలభింపఁగలదు. ధర్మకృషి వ్యావహారికము మాత్రమే యనుటలోఁ దాని యంతర్గర్భితమైన పారమార్థికాంశమున్నదనియే యర్థము. పుణ్యపాపభేదము పరిచ్ఛిన్నతాదశకుఁ జెందినదే యనఁగా, వ్యవహారజగత్తులో ధర్మాచరణము నిషేధింపఁబడినదని యర్థము కాదు. పుణ్యపాపభేద మసత్యమను విషయము, స్వార్థపరతా శృంఖలములచేఁ దమ్ముఁదామే బంధించుకొని పరిచ్ఛిన్న జీవితక్లేశము ననుమడింపఁ జేసికొనువారికి వర్తించునని తలఁపరాదు. శంకరుఁడు నీతిధర్మములను నిరసింపలేదు; మోక్షద్వారమునకు నీతిధర్మములే కవాటములని చెప్పినాఁడు. అనుభవజ్ఞానముపై లౌకికజ్ఞానమును, బ్రహ్మజ్ఞానముపై నీతివర్తనము నాధారపడియున్నవి. ధర్మజీవనమను బీజము మొలకెత్తి, బ్రహ్మజ్ఞానమును బుట్టించును.

## ౧౨—కర్మ

శంకరుఁడు కర్మమాత్రము నంగీకరించినాఁడు. అవిద్యాసంభవమైన కర్మయే వ్యక్తిత్వమునకు హేతువు.౧, మనము జన్మించు ప్రపంచము మన కర్మఫలానుగుణమే.౨.వ్యక్తియొక్క దేహము వ్యక్తి చేసిన పూర్వకర్మయొక్క సుఖదుఃఖరూపములగు ఫలితముల ననుభవించుట కనుగుణమై నిర్మింపఁబడినది.3.

(౧) శం॥ భా॥ 3,౨,౯. (౨) క్రియాకారకఫలమ్.

(3) కార్యకారణ సంఘాతము.

ఒకొక్కొక్కప్పుడొక జన్మములోఁ జేసిన కర్మలఫలము ననుభవించుట కనేక జన్మము లవసరములగును. ప్రారబ్ధకర్మానుభవము పూర్తియగు లోపున, నూతన కర్మ లారంభించి, 'ప్రారబ్ధానుభవ చక్రము శాశ్వతముగా విరతిలేకుండఁ దిరుగుచునే యుండును.౪. ధర్మజీవన ప్రవృత్తి, తుదిలేని పరిశ్రమయై నడచుచునే యుండును. మానవజీవితావస్థా వైవిధ్యముచే, ధర్మసూత్రరూప వైవిధ్యము ననంతముగా నుండును. ఈపరిశ్రమ, బ్రహ్మజ్ఞానము లభించి, కర్మను సబీజముగా నాశమొనర్చి, పునర్జన్మావసరము లేకుండఁ జేయునందాఁక నడచుచునే యుండును. కర్మసూత్రసంబంధమునుండి విముక్తియే మానవజీవితలక్ష్యము. కాని మానవుఁడు పరిచ్ఛిన్నుఁడు గాకున్నంతకాల మాతఁడీ లక్ష్యమును సాధింప యత్నించుచునే యుండును, గాని కృతార్థుఁడు కాఁజాలఁడు. ధర్మజీవనము సాధనమే కాని సిద్ధికాదు. కోరికతోఁ జేయఁబడిన కర్మలన్నియుఁ గర్మసూత్రము ననుసరించి ఫలితముల నిచ్చును; స్వార్థరహితుఁడై మానవుఁ డీశ్వరార్పణ బుద్ధితోఁ జేసిన కర్మ చిత్తశుద్ధి హేతువగును.

పూర్వకర్మలను దారముచే నెటులాగఁబడిన నటు కదలుచుండు గాలిపడగలము మనము కామని తెలియవలెను. మానవుఁడు తనకర్మలకుఁదానే బాధ్యుఁడననియు, నీశ్వరుఁడు కర్మఫలప్రదాతయై మాత్రమే మనకు సాయపడుననియు నిదివరకే చెప్పియుంటిమి. ౧. ఈపని చేయుమనికాని వలదనికాని

(౪) డ్యూసేన్సు సిస్టమ్ ఆఫ్ వేదాంత. పు. 3౭౪.

(౧) శం॥భా॥ ౨, ౩, ౪౨.

యీశ్వరుఁడెవ్వని బలవంతముచేయుఁడు. సంకల్పబలముచేఁ బూర్వసంస్కారములను గూడ మనము జయించవచ్చును. ౨. "ప్రయత్నదీక్షవలన మనలను బంధించిన శృంఖలములను ద్రెంపివేయవలెన"ని వశిష్ఠుఁడు యోగవాశిష్ఠములో రాముని కుపదేశించినాఁడు. ౩. మానవుఁ డుద్రేకవశుఁడగుటచే, నాతని కిష్టానిష్టములు గలవు. ౪. మానవుఁడు పుట్టుకతోఁ దనకుఁ గలిగిన యసంస్కృతిస్వభావమునుబట్టి నడచినచో నుద్రేకములకు వశుఁడైపోవును. ఉద్రేకవశుఁడైన మానవుని క్రియలు స్వతంత్రములుగావు. కాని మానవుఁ డుద్రేకసముచ్చయమే కాదు. మానవునిలో దైవత్వమిమిడియున్నది. ఇంద్రియవ్యాపారపరంపరకతీతమై యాత్మశక్తి దానికి మూలకారణమై నడపుచున్నది. మానవునిచరిత్ర మచేతన విగ్రహప్రదర్శనము కాదు; అది సృజనశక్తియుక్తమైన పరిణామము.

## ౪౩—మోక్షము.

మన దృష్టికి గోచరింపకున్నను సర్వకాలములయందు నిర్వికారమైయున్న స్థితియొక్క ప్రత్యక్షానుభవమే మోక్షము. ఉపాధి నిర్మూలనముతో నాత్మకు మోక్షప్రాప్తికలుగును. ఆత్మ సర్వకాలములయం దెట్లున్నదో, అట్లే అచ్చటనే యుండును. అదియే సర్వమున కాదికారణరూపము. అది ప్రపంచమెన్నఁడు మన కీయఁజాలనిది, మననుండి తొలగింపఁజాలనిదియు నైన

(౨) శం॥గీ॥భా॥ 3, 3, ౪.

(3) చూ॥ జీవన్ముక్తి వివేకము ౧ అ॥

(౪) శం॥గీ॥భా॥ ౫, ౧౫; 3, 33.

పరమశాంతియుఁ బరమసుఖమునై యున్నది. "ఇది పారమార్థిక సత్యస్వరూపము, కూటస్థము, నిత్యము, నాకాశమువలె సర్వవ్యాపియు, నిర్వికారము, నిత్యతృప్తము, నిరవయవము, స్వయంజ్యోతి స్వరూపము, పుణ్యపాపాది ఫలితములకుఁగాని, కాలత్రయ ప్రభావమునకుఁగాని యందుఁ దావులేనిదియు నశరీరమైనదియు మోక్షస్వరూపము."౧. తన్నావరించిన యశుద్ధపదార్థములు భస్మమైపోఁగా సువర్ణము సహజకాంతితోఁ బ్రకాశించునట్లును, తమ్ముఁ గప్పివేయు పగలు పూర్తియై, నిర్మేఘమైన నిశాకాశమున స్వచ్ఛముగా విలసిల్లు నక్షత్రములవలె నవిద్యానాశనముతో నాత్మ సహజామల కాంతితోఁ బ్రకాశించును.౨. స్వయంకృతములైన సర్వబంధములనుండియు సంపూర్ణ విముక్తియు, వాఙ్మనోఽతీతము సర్వమానవప్రయత్నములకుఁ బరమలక్ష్యమునైన మోక్షశాంతి, మన మనస్సుకంటెను మన కత్యంత సన్నిహితమై యున్నది. శంకరుఁడు చూపు స్వర్గము, మన లోకమునకు దూరస్థము, భిన్నమునైనది కాదు; చూడ నేర్చినవారి కెల్లప్పుడిచటనే యున్నది. మోక్షమనఁగా నెప్పుడో, యీజీవితాంతమున, నింకొక లోకములో సంభ

(౧) ఇదంతు పారమార్థికమ్, కూటస్థమ్, నిత్యమ్, వ్యోమవత్సర్వవ్యాపి, సర్వవిక్రియారహితమ్, నిత్యతృప్తమ్ నిరవయవమ్, స్వయంజ్యోతిస్స్వభావమ్, యత్రధర్మాధర్మౌ సహకార్యేణ కాలత్రయంచ నోపావర్తేతే తదశరీరమ్ మోక్షాఖ్యమ్॥ (శం॥భా॥ ౧,౧,౪.)

(౨) శం॥భా॥ ౧,౩,౧౯.

వించునది గాదు; మన యెదుటనే యిప్పుడే లభింపఁగల సత్య స్వరూపముతో నేకత్వమును బొందుటే.౧.

ముక్తాత్మ స్వకీయమైన సహజావస్థయే.౨. మోక్ష మాత్మ నిర్మూలనము గాదు; ఆత్మయందుఁ బ్రకాశించు దివ్య జ్యోతి వలన, ఁబరమాత్మ తాదాత్మ్యము ననుభవించుటే. నిత్యానందప్రాప్తియే మోక్షమని చిత్సుఖాచార్యుఁడు చెప్పి నాఁడు.3. అజ్ఞానసంవర్ధితమైన దుఃఖమాత్మ యొక్క సహజానందస్వభావము నాచ్ఛాదించినది; అజ్ఞాననాశముతోఁ దుఃఖమదృశ్యమై ఆత్మయొక్క దుఃఖ విరహితానందము బహిర్గతమగును. ప్రపంచమును నశింపఁజేయు బాహ్య క్రియావిధానము మోక్షసంపాదనా విధానముగాదు. గట్టి తనమును బోఁగొట్టుటకు వెన్ననగ్ని కర్పించునట్లు గాదు౪. ప్రపంచవిధ్వంసనమను ఘోరకార్యము మానవమాత్రునకుఁ సాధ్యముగాదు. మోక్షమనఁగాఁ బ్రపంచానేకత్వమును నశింప ఁజేయుటే యగుచో, మొట్టమొదటిసారి మోక్షము పొందిన

(౧) దీనిని నాగార్జునుని నిర్వాణభావముతోఁ బోల్చుము. నిర్వాణమేకముగా దనేకముగాదు, జన్మలయములుగాని, చాంచల్యనైశ్చల్యములుగాని లేనిది; నిత్యమును గా దనిత్యమునుగాదు,సంసారముతో నేకమైనది. (మాధ్యమిక కారిక. ౨౫,౧౯.)

(౨) శం॥ భా॥ ౪, ౪, ౧-3, పోల్చు: అద్వైత బ్రహ్మసిద్ధి; ఆత్మస్యైవాఽవిద్యానివృత్తి.

(3) అనవచ్ఛిన్నానందప్రాప్తి.

(౪) శం॥ భా॥ ౪,౪,౬; బృ॥ ఉ॥ ౪,౫,౧3.

వ్యక్తికొకఁడనే ప్రపంచమంతయు నశించియుండెడిది. ౧. మోక్ష మనఁగా నానావస్తునాశనము కాదు; వస్తునానాత్వ భావ నిర్మూలనమే. ౨. ప్రపంచ ముఖవైఖరినిమార్చి, సర్వవస్తు వులలో నూత్నతను దర్శించు జ్ఞానమే మోక్షము. జీవిత జగత్తు లనుగూర్చిన యిట్టి నూత్నదృష్టివలనఁగలిగిన అంతర్విజ్ఞానము మోక్షకారణముగాక, మోక్షరూపమేయని చెప్పవచ్చును.3 పతనోత్పతనములతోఁ గూడిన యీప్రపంచగతి యనంతముగా సాగుచునేయుండును, గాని, ముక్తపురుషునికి దానితో సాంగ త్యము లేకుండఁ బోవును.

మోక్షమియొక్క నిజస్వరూప మవిద్యాశబ్దముచే నిరూపింపఁబడును. మోక్షప్రాప్తితోఁ బ్రపంచమున కేమియుఁ దటస్థించదు;ప్రపంచమునుగూర్చిన మనభావములే మారును. వివేకహీను నాకర్షించి వశపరచుకొను ప్రపంచములోని క్షణిక వస్తుజాలము ముక్తపురుషునిచిత్తమునకు వికారమునుగలి గింపఁజాలవు. దుఃఖకారణము మిథ్యాజ్ఞానము; ౪. తన్నాశయ

---

(౧) ఏకేనచాది ముక్తేన పృథివ్యాది ప్రవిలయః కృతా ఇతీదానీమ్ పృథివ్యాది శూన్యమ్ జగదభవిష్యత్. శం॥భా॥ 3, ౨, ౨౧.

(౨) జ్ఞాతే ద్వైతమ్ నవిద్యతే.

(3) పోల్చు: శుద్ధబ్రహ్మకర్తృవిషయమ్, ఏకమేవజ్ఞానమ్, తన్నాశ ఏవచమోక్షః. సిద్ధాంతలేశభాష్యకారుఁడగు కృష్ణానందుఁ డిట్లు వ్రాసెను. "చైతన్యస్యాజ్ఞానసంబంధో బంధః, తదసంబంధో మోక్షః, నతు తన్ని వృత్తిః. మిథ్యాజ్ఞాననివృత్తియే మోక్షమని పద్మపాదుఁడు భావించెను. మిథ్యా జ్ఞాననివృత్తిమాత్రమ్ మోక్షః

(౪) మిథ్యాభిమానభ్రమ నిమిత్తా ఏవ దుఃఖానుభవః(శం॥భా॥౨,3,౪౬.)

ములో దుఃఖనివృత్తి యగును. ఈరీతిగా మోక్షమనఁగాఁ బ్రపంచవిలయముగాదు; ప్రపంచస్వభావమును గూర్చిన యసత్యజ్ఞానదృష్టి మార్పునొందుచే ముక్తపురుషుఁడు. తిరిగి యెన్నఁడు ప్రపంచసంగుఁడు కాఁజాలఁడని యుద్ఘాటించు నుద్దేశముతోఁ, వ్యావహారిక ప్రమాణబద్ధమైన పృథగ్దృశ్యభేదనాశనమే మోక్షమని శంకరుఁడు బోధించినాఁడు.౧.

బ్రహ్మాత్మైక్యజ్ఞాన సిద్ధివలన, జీవవస్తు నానాత్వముతోఁ గూడిన యీశ్వరసహిత జగత్తంతయు నదృశ్యమగు నను భావముచే జగత్తు మిథ్యయనునదే శంకరుని మతమను విమర్శ కవకాశము కలుగుచున్నది.౨. సర్పభ్రాంతి, రజ్జు స్వస్వరూపదర్శనముతోఁ దొలఁగినరీతిని, మేల్కాంచినంతనే, స్వప్నదృశ్యము లన్నియు వినష్టమైనరీతిని, మోక్షసిద్ధితో సంసారము విరమించు నను భావములుగల వాక్యములు శంకరుని రచనలలో ననేకములుగలవు. జీవ బ్రహ్మైక్య జ్ఞానసిద్ధి యగుటతోడనే, మన పరిచ్ఛిన్నదృష్టికిఁ గాన్పించు జగత్స్వరూపము మార్పునొందును. మన చిత్తమునకు గోచరించు వస్తుజాలములు, నిర్గుణ బ్రహ్మమునం దారీతిగా గోచరింపవు.3. మనకుఁ గన్పట్టురీతిగాఁ బ్రపంచము బ్రహ్మముయొక్క దృష్టిలో నుండదని పెక్కురీతుల

(౧) సురేశ్వరుఁడు చెప్పినాఁడు: "పరంజ్యోతి జ్ఞానదృష్టి గోచరమైనపుడు బ్రహ్మతృణపర్యంతముల సర్వము స్వప్నములోని వస్తువులవలె మిథ్యయగును. (మానసోల్లాసము, ౧)

(౨) గృహీతే త్వాత్మైకత్వే బంధమోక్షాది సర్వవ్యవహార పరిసమాప్తిరేవస్యాత్॥ (శం॥భా॥ ౧,౨,౬)

(3) శం॥భా॥ ౧.౨,౧౨; ౧,౨,౨౦.

శంకరుఁడు చాటియున్నాఁడు. భిన్నరూపములుగల జగత్తు పరమసత్యైక స్వరూపములో నిలువఁజాలదని బ్రాడ్లే తత్త్వజ్ఞుఁడును శంకరునితో నేకీభవించియున్నాఁడు. బ్రాడ్లే మాటలలో, దృశ్యము లన్నియు నిర్గుణైక రూపముగా నున్న సత్యములో నెట్లో నానాత్వమును గోల్పోవును. బ్రహ్మ మెన్నఁడును మార్పులేనిది గావున బ్రాడ్లే ప్రయోగించినఁ 'వికార' శబ్దము కూడ నిచట దోషకలితమే యగును. తనకుఁగల తార్కికప్రమాణనైశిత్య విలసితమగుబుద్ధిచేఁ బ్రపంచము మిథ్యయను నపార్థసూచకములగు వాక్యములను శంకరుఁ డుపయోగించినాఁడు. వస్తుదృశ్యములు పరమాత్మలో నానాత్వమును గోల్పోవు వికారమును బొందుననియు, శాశ్వతసామరస్యరూపమగు సత్యములో భిన్ననాదములు లయమగుననియుఁ జెప్పుటలో మనము వ్యావహారిక ప్రమాణముల నుపయోగించి చెప్పువారమగుచున్నాము. శంకరుని భావములో నివన్నియు, నేకము నద్వితీయమునగు బ్రహ్మస్వరూపములో భిన్నతనూహించు దోషమునకుఁ బాల్పడుచున్నవి. సత్యము సర్వసంబంధాతీతమైనది. సత్యము నిజముగా నవాఙ్మనోగోచరము. వ్యవహార ప్రపంచమా స్వరూపములోఁ బారమార్థిక సత్యాంశము కాఁజాలదు. అద్వితీయబ్రహ్మమును జగద్రూపముగాఁ జూపునది నశించుటకోడనే మిగులునది బ్రహ్మమే.జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను మనము తురీయములో లయింపఁజేసినపుడే జ్ఞానసిద్ధియగునని మాండూక్యోపనిషద్భాష్యములో శంకరుఁడు చెప్పియున్నాఁడు. పరబ్రహ్మమన్నిటి నధిగమించుచు

నన్నిటిని దనలోఁ గలిగియుండును ౧. 'ప్రపంచోపశమమ్'
అనఁగా, ప్రపంచము బ్రహ్మమందు విలీనమగునని యేకాని, నాశ
నమగుననియర్థము కాదు. భిన్నపరమార్థావస్థలను దర్శించుశక్తులు
మనకున్నవి. తురీయావస్థలో విలక్షణమగు కాంతిలో నింకొక
దృష్టిగలిగి, సత్యమునుయథాస్థితిలో దర్శింతుము; ఈకాంతియు
నీదృష్టియు నిర్వికారములు. ఈదృష్టితోఁ జూచినచో, మన
మిదివరకుఁ జూచిన ప్రపంచము స్థానములో బ్రహ్మమే గోచ
రించును ౧. మనమునిర్మాలించునది మిథ్యాకల్పనము. మిగులు
నది వస్తుస్వభావము.౨. ముక్తపురుషదృష్టి కపరోధము
కల్పించుశక్తి మాయకు లేదు. అనుభవజ్ఞానముచే జీవబ్రహ్మైక్య
సిద్ధియగుటతోడనే, మనకు దృశ్యవస్తుసంగపాశములు భగ్నమై,
యవి మనల నిదివర కాకర్షించిన రీతిగా వర్తింపవు మన యిం
ద్రియములు, చిత్తము పనిచేసినంతకాల మాదృశ్యజగదూహ్యవ
ములుండి తీరునుగాని, అనుభవసిద్ధమగు బ్రహ్మరూపముతో
వానికి సంబంధముండదు. యుక్తజ్ఞానముచే మరుమరీచి కాభ్రాంతి
నశించును గాని, మరుమరీచిక యట్లేయుండి మనలనెన్నఁడిఁక
మోసగించదు. అదృశ్యమునే చూచి మన మింకొక భావమును
గలిగి యుందుము. మిథ్యారూపముయొక్క మిథ్యాత్వము

---

(౧) త్రయాణాం విశ్వాదీనామ్, పూర్వ పూర్వ ప్రవిలాపనేన తురీయస్య ప్రతిపత్తిః ప్రవిలయ మనగా లీనమగుటకాని, నిరాకరణము గాదని సూచనకలదు.

(౧) శం॥భా॥ ౧,౩,౧.

(౨) శం॥భా॥ మాండూక్య ఉ॥ ౨,౭.

తెలిసిన వెనుక నది మిథ్యకాఁజాలదు. నామరూపములు నిర్గుణ తత్త్వములోఁ గలిసి పోయినను, లేక నిర్గుణబ్రహ్మము యొక్క రూపాంతరములుగా గోచరించినను, జగత్తుమాత్రము మిథ్య గాదని స్పష్టమైనది.

మోక్షమనఁగా, జీవబ్రహ్మైక్యమనియు, (౧) బ్రహ్మము సర్వవ్యావహారిక ప్రమాణాతీతమైనట్లే, మోక్షమును వ్యావహారిక జ్ఞానప్రమాణములచే నిర్వచింపఁబడఁజాలదనియు శంకరుఁడనేక వాక్యములలోఁ బ్రకటించియున్నాఁడు. దేశకాలములు, కార్యకారణములు, చేతనాచేతనములు, కర్మలు, కర్మానుభవములు, మున్నగువానిపై లౌకికజ్ఞానమాధారపడియున్నది; మోక్షావస్థకు వీనితో నెట్టిసంబంధమును లేదు. దేశమునకుసంబంధించిన స్వర్గమునఁగాని, బ్రహ్మలోకమునఁగాని, ముక్తపురుషులు నివసింతురని కాని, వారు శాశ్వతముగా జీవింతురనికాని చెప్పుటకు వీలులేదు. "అనంతకాలము శ్రేయము నధికతర శ్రేయమునొనర్పఁజాలదు; ధవళవస్తువును ధవళతరమొనర్పఁజాలద"ని (౨) చెప్పిన అరిస్టాటల్ భావముతో శంకరుఁడేకీభవించును. మోక్షావస్థ అవిచ్ఛిన్నక్రియాత్మకమనియుఁ జెప్పఁజాలము; మోక్షమత్యంత సమున్నతానుభవము; అందు బుద్ధివ్యాపారమును, విజ్ఞానవృత్తియు నతిక్రమింపఁబడినవి. ఆత్మ, సంసారచక్రము నుండి నిర్ముక్తమై, వృద్ధిక్షయజననమరణాదుల నతిక్రమించి,

(౧) బ్రహ్మైవహిముక్త్యవస్థా.

(౨) నికోమెకీన్ ఎథిక్స్. ౧, ౬.

"ఏకక్షణమునందే, యనంతజీవిత సమగ్రి సంపాదనమొనర్చు నవస్థ"³యని బోధియన్ చెప్పినరీతిని నిత్యత్వానుభవసిద్ధినొందును. వ్యావహారిక భేదముల కతీతమగు సర్వాత్మభావసిద్ధి లేక బ్రహ్మాత్మసిద్ధినందుటయే మోక్షము. ౧. మోక్షమనఁగా, "బ్రహ్మస్వరూపమైనతనసహజస్థితిననుభవపూర్వకముగా గ్రహించుటేగాని, స్వర్గాదులవలె సంపాదింపఁబడునది కాదు. శ్రుతివాక్యము, హేతువాదము కూడ బ్రహ్మమేకస్వభావయుక్తమైనదని చెప్పుటచే మోక్షము నట్టి స్వభావముగలదే కావున దాని యనుభవసిద్ధిలో బ్రహ్మకును సామాన్యమానవునకును భేదము లేదు. సాలోక్యసామీప్యాదులు సంపాదింపఁబడిన పదవులు గావున, వాని మహిమకు దశాభేదమున్నది కాని, మోక్షమున కట్టి భేదము లేదు." ౨. బ్రహ్మము "సర్వవ్యాపియు సర్వాంతర్గతము సర్వాత్మరూపమును గావున నది రాకపోకలు గలిగినది కాఁజాలదు. మనలో నత్యంత సన్నిహితమై యున్నదాని యొద్దకుఁ బోవుట యనునదర్థరహితము. మానవుఁడు తనకు భిన్నమైన దానియొద్దకే పోవునని మనకందరకుఁ దెలిసియే యున్నది." ౩. పరమేశ్వరభక్తులు బ్రహ్మలోక ప్రాప్తినందుదురుగాని, మోక్షసిద్ధిగలవారెచటకుఁ బోనవసరము లేదు. ౪.

(3) ఎవిలిన్ అండర్హిల్ జాకొపోనిడిటోడి.డి. పు. ౨౪౯ లో నుదాహృతము.

(౧) స సర్వాత్మభావః సర్వసంసార ధర్మాతీత బ్రహ్మస్వరూపత్వమేవ (శం. భా, తై. ఉ. ౨.౧.) (౨) శం. భా॥ 3,౪,౯౨.

(3) శం॥ భా॥ ౪,3,౧౪; 3,3,3౧.

(౪) శం॥ భా॥ ౪,3, ౭-౮.

ఎచట నహోరాత్రములులేవో, యెచటఁ గాల ప్రవాహ మాగిపోవునో, యెచట రవి చంద్ర నక్షత్రాదులాకసమునుండి యదృశ్యములగునో. అదియే మోక్షావస్థయని వ్యతిరేక భావములచే సూచింపఁబడెను. లౌకిక జ్ఞానభేదముల కందుఁ దావులేదు. ౯. అది క్రైస్తవుల స్వర్గమువంటిదే; నిర్దుష్టమైన, పరంపరాగత నిధానము; అది యక్షీణము. కానియది శూన్యమని భావింపరాదు. ముక్తపురుషుఁ డన్యమును జూడక, సర్వములోఁ దన స్వరూపమునే చూచును.౧. లౌకికదృష్టికి బ్రహ్మము శూన్యముగాఁ దోఁచినట్లే, మోక్షము నాత్మవినాశముగాను, విస్మృతభావముగాను, స్థితిరహితశూన్యస్వరూపముగాను గోచరించును. దీనినే జార్జి ఎలియట్ కవి "లెజెండ్ ఆఫ్ జుబాల్" నందిట్లు సూచించినాఁడు; "మర్త్యత్వమును విడిచినవాఁ డస్తమించిన రవికిరణము సర్వజ్యోతిస్స్వరూపమగు రవిబింబమునఁ జేరినట్లే, పరమాత్మలోఁ బ్రవేశించునని యెఱుఁగక, శూన్యశ్మశానమున జేరుచున్నాఁడని తలఁచును." దుర్బలమానసులకే బ్రహ్మము లేనట్లు తోఁచునని చెప్పినట్లే, శంకరుఁడు, లౌకికదృష్టికిఁ బరమాత్మానుసంధానము శూన్యస్థితియే యని గోచరించును గాని, యది నిజముగాదని వక్కాణించి యున్నాఁడు. మోక్షావస్థలోఁగూడ స్వీయవ్యక్తిత్వభావ ముండవచ్చునని కొన్ని వాక్యములు చెప్పుచున్నవి.

(౯) దర్శనాది వ్యవహారాభావా, (శం. భా. ౧,౩,౯.)

(౧) ముక్తస్యాపి సర్వైకత్వాత్ సమానోద్వితీయాభావః (శం॥ భా॥ ఛాం॥ ఉ॥ ౮,౧౨,౩.)

అట్టివాక్యము నొకదానినిఁ జేసికొని, మోక్షావస్థలో విశేష విజ్ఞాన మదృశ్యమగును గాని, పూర్ణస్మృతి నాశముగాదని నిరూపించినాఁడు. దానినే విజ్ఞానఘనాత్మయందురు.2. అట్లే మోక్షావస్థలో నుపాధి నాశ్వమగును గాని యాత్మ నాశనము గాదు.3. వ్యర్థవినాశము మోక్షముగాదు. పరిచ్ఛిన్నదృష్టిగల మనకు దేహేంద్రియ చిత్తబుద్ధి సంయుక్తమైన జీవాత్మయే యథార్థమైనది; పరమాత్మతో నైక్యమై, కాలావధుల |మించి, నిత్యస్థితి నొందిన యాత్మస్థితి నిక్కముగాదని తోఁచును. మన యిహలోక జీవితమనంతముగాఁ బొడిగింపఁ బడుటే మోక్షమని మనము వాంఛింతుము. దేహేంద్రియ చిత్తములను దాటిపోఁజాలని జీవాత్మ కవిచ్ఛిన్న వ్యక్తిత్వమును శంకరు డంగీకరించును. కాని పరిచ్ఛిన్నత తొలఁగిపోయి, దేహము విచ్ఛిన్నమై,పరమాత్మ తాదాత్మ్యము నొంది నప్పుడే మనము నిజమగు నిశ్శ్రేయసము నిచటనే యిప్పుడే సంపాదింపఁగలము. అట్టి స్థితియొక్క లక్షణములను నిర్వచించుట దుస్తరము. అట్టి బ్రహ్మైక్యసిద్ధి యందలి మహామహిమను మనకన్ను చూడఁజాలదు; చెవివినఁజాలదు, చిత్తమూహింపలేదు. మనకు మోక్షమర్గ వంతము

(2) శం॥భా॥ 1,4,22; ఆతఁడు బృ॥ఆ॥ఉ॥ 4,3,30 (శం॥ భా॥ 1,3,19 లోనిది) ఉదాహరించి, యిట్లు వ్యాఖ్యవ్రాసినాఁడు: "విశేషవిజ్ఞాన వినాశాభిప్రాయమేవ, నవిజ్ఞాతుర్వినాశాభిప్రాయమ్"

(3) ఉపాధిప్రలయమేవాయమ్ నాత్మప్రలయమ్॥(2,1,14.)

కావలెనన్నచో వ్యావహారికపదము లుపయోగించి, యది సర్వాత్మభావమని చెప్పవలెను.౧.

ఆదేవిధముగా, పరమేశ్వరునాత్మ స్వరూపమే జీవుని సహజస్వరూపము; దేహియగుటకుఁ గారణ ముపాధిపాశబంధనమే"౨యని పెక్కుతావుల శంకరుఁడు చెప్పియున్నాఁడు.అవిద్యానివృత్తి వలన, మిథ్యాసర్పభ్రాంతి తొలఁగి, నిజమగు రజ్జువే గోచరించురీతిని, కర్తృత్వభోక్తృత్వములచేతను, రాగద్వేషములచేతను, మాలిన్యము నొందిన జీవాత్మ, జ్ఞానసిద్ధిచే, సర్వవికారములు తొలఁగి,పూర్ణదైవత్వసిద్ధినందును."౧.అప్పయదీక్షితులీ శంకరవాక్యము నుదాహరించి.తానుసమర్థించిన జీవేశ్వరైక్య౨. భావమునే శంకరుఁడును బ్రతిపాదించెనని నిరూపించినాఁడు. 3.

(౧) సర్వాత్మభావో మోక్ష ఉక్తః (శం॥భా॥బృ॥ఆ॥ఉ॥ ౪,౪,౬)

(౨) పారమేశ్వరమేవహి శరీరస్య పారమార్థికమ్ స్వరూపమ్, ఉపాధికృతంతు శరీరత్వమ్, (౩,౪,౮) మఱియు; ఏవమ్ మిథ్యాజ్ఞానకృతాఏవజీవపరమేశ్వర యోర్భే దోనవస్తుకృతోవ్యో మవదసంగత్వా విశేషావత్ (శం॥ భా॥ ౧,౩,౧౯; చూ॥శం॥భా॥ఈశా॥ఉ॥ ౧౪.)

(౧) యదవిద్యాప్రత్యుపస్థాపితమ్ అపారమార్థికమ్ జైవమ్‌రూపమ్ కర్తృత్వభోక్తృత్వరాగద్వేషాది దోషకలుషితమ్ అనేకానర్థయోగి, తద్విలయనేన, తద్విపరీతమ్, అపహతపాప్మత్వాది గుణకమ్ పరమేశ్వరమ్ స్వరూపమ్ విద్యయా ప్రతిపాద్యతే, సర్పాదివిలయనేనేవ రజ్జ్వాదీన్ (శం. భా. ౧,౩,౧౯.) చూ. దీనిపై కల్పతరువు, పరిమిళవ్యాఖ్యానములు.

(౨)భాష్యకారో ఽప్యతిస్పష్టమ్ ముక్తస్యసగుణేశ్వరభావాప్తమాహ

(౩) చూ: సిద్ధాంతలేశము॥ ౪. అనేకజీవవాదము ననుసరించి, ముక్తియనగా నన్నిజీవులు ముక్తిపొందువరకు నీశ్వరునితో నేకత్వము, ననంతరము బ్రహ్మతో నేకత్వమునని సూచింపఁబడెను. చూ: సిద్ధాంతలేశము॥ ౪.దానిపై కృష్ణానందవ్యాఖ్య.

ముక్తిఁ బొందిన యాత్మకుఁ బరమాత్మతో నవిభాగస్థితి గలదని చెప్పఁబడెను. ఈయభేదస్థితి కనేకార్థములు చెప్పఁబడినవి. పాపవిముక్తి, సత్యశీలనము, మనన్నగునవేకాశ, సర్వజ్ఞత్వసర్వశక్తిమత్త్వములు ముక్తాత్మకుఁ గలవని జైమిని తలఁచినాఁడు. ౪. దీనికి వ్యతిరేకముగా నౌడులోమి, పాపవిముక్తియుఁ జైతన్యముమాత్రమే ముక్తాత్మలక్షణములని పలికినాఁడు ౫. జైమినిచెప్పిన యితరలక్షణము లుపాధివలన జనించునవేయని యాతఁడభిప్రాయపడెను. బాదరాయణుని దృష్టిలో నీరెండుభావములకు విరోధము లేదు ౬. శంకరుఁడు బాదరాయణునితో నేకీభవించెను. ఔడులోమిచెప్పిన పారమార్థిక సత్యము,వ్యావహారిక ప్రమాణసిద్ధము కాఁబాలదు; కాని వ్యావహారికప్రమాణసిద్ధమగు సత్యమేవలయుచో జైమినీయభావము యుక్తమైనదగును. ఒకేమోక్షావస్థనుగూర్చి జైమిని బుద్ధిపరికల్పితభావమును, ఔడులోమి పారమార్థికభావమును ప్రకటించిరి. ముక్తపురుషున కనంతజ్ఞానశక్తులు కలుగునని బాదరాయణుఁడుచెప్పి, యీశ్వరవిశిష్టలక్షణములైన సృష్టిస్థితి లయసామర్థ్యములుమాత్రము లభింపవని ప్రకటించెను. ౧. జీవులకీశ్వరునికిఁగల స్వాతంత్ర్యము, ననంతశక్తియుఁగలుగుట దుర్లభమని చెప్పిన మాధ్వుని భావమున కిది సరిపోవును. బ్రహ్మము నందు స్వగతభేదము జీవేశ్వరులకు నిత్యభేదములనుజెప్ప-

(౪) శం॥భా॥ ౪,౪,౫ చూ: ఛాం॥ఉ॥ ౮,౧,౬; ౮,౭,౧.

(౫) శం॥భా॥ ౪,౪,౬; బృ ఉ ౪,౫,౧౩

(౬) శం భా ౪,౪,౭

రామానుజుని కెట్టిక ష్టమును లేదు. "శుద్ధబ్రహ్మ సమాన త్వము" సంపూర్ణముగా ముక్తపురుషునికి లభించునని చెప్పు నుపనిషద్వాక్యములకిది విరుద్ధముగానున్నదని శంకరుఁడు వాదించినాఁడు. "ముక్తపురుషుఁడు సృష్టికర్తయగును." మున్నగు నుపనిషద్వాక్యము లున్నను, బాదరాయణుఁడు ముక్తపురు షుఁడు లోకపాలకుఁడు కాఁజాలఁడని వచించినాఁడు. శుద్ధ మోక్షావస్థలో విషయీ విషయములుగాని, జీవజగత్తులు గాని లేవు; అందుచే సృష్టిచేయుట, పాలించుట మున్నగు వ్యాపారముల కవకాశమే లేదు; కాని యీశ్వరజగత్తులున్నంత కాలము నీదశలో ముక్తి పొందుటనఁగా నది సంపూర్ణముక్తి కాఁజాలదు; ఇట్టి స్థితిలో ముక్తజీవుని కీశ్వరలక్షణములన్నియు లభించునుగాని, యీశ్వరుని సృజనాదిశక్తులు మాత్రము లోపించునని శంకరుఁడు వివరించినాఁడు. ౧. శంకరుననుసరించి, బ్రహ్మవేత్త బ్రహ్మైక్యమునొందును: దానినే యీశ్వర సమానత్వమని మనము చెప్పవచ్చును. బ్రహ్మవేత్తలు కాక, యీశ్వరారాధకులైన భక్తులు బ్రహ్మలోకస్థితులై యనేకశక్తు లను బొందుదురుగాని, వారి యవిద్య పూర్తిగాఁ దొలఁగని కారణముచే సృష్టికర్తృత్వపాలకత్వాది శక్తులుమాత్రము లభిం పవు. వారీశ్వరభిన్నమైన పృథగ్వ్యక్తిత్వముగలిగి యీశ్వర శక్తిభరితులై యుందురు.

(౧) వై॥సూ॥ ౪, ౪, ౧౭.

(౧) బాదరాయణ తత్త్వమునకు నుపనిషత్తులకును, బాదరాయణ సూత్రములలోనే (౪, ౨, ౧౩, ౧౬, -౪, ౪, ౧౭, ౨౧) కనపట్టు పరస్పరవైరు ద్ధ్యముల నీవిధముగా శంకరుఁడు పరిష్కరించినాఁడు.

సంసారవిముక్తి లేక మోక్షావస్థ లోకసంగ్రహార్థ మగు కర్మతో సమన్వయించునా? అట్టి సమన్వయము లేదని యే శంకరునిసమాధానము; ఏలన, సర్వకర్మలు ద్వైతముపై నాధారపడియున్నవి; సత్య మద్వైతమగుటచే దీనికి విరుద్ధమగును. కాని, జీవన్ముక్తులవిషయములలోఁ గర్మయంగీకరింపఁబడినది. అనఁగా, నద్వైతమునకుఁ గేవల ప్రవృత్తితో విరోధము లేదు. జీవన్ముక్తులు సజీవులైయుండఁగానే, అహంకార కర్మనూత్రములకతీతులై బ్రహ్మసాక్షాత్కారమును గాంతురు. అందుచేఁ గర్మమోక్షములకు సహజమగు విరోధమెద్దియును లేదు.

ఈసందర్భములో ముక్తపురుషుఁడు తిరిగి యీలోకమున జన్మించు విషయము చర్చింపఁబడెను.౨. బ్రహ్మవేత్తలైన అపాంతరతమస్సు మున్నగు వారీలోకమున మరల జన్మించిరి. వారు లోకసంగ్రహార్థ మాధికారికులై జన్మించిరని శంకరుఁడు పలికినాఁడు. వారి జగత్కల్యాణ కర్మ పూర్తియగుటతోడనే వారి జీవయాత్ర ముగిసి, వారికిఁకఁ బునర్జన్మ ముండదు. బ్రహ్మవేత్తలమైన వెనుక గూడ లోకకల్యాణకాంక్ష కలిగి, మన మీలోకమున కేతెంచుట జ్ఞానపూర్వకమై యుండునే కాని, శిక్షాఫలితమై యుండదు. కాని మోక్షమునకు సంసారము విరుద్ధమని శంకరుని నిశ్చయము; కర్మ సంసారసంబంధియే కాని మోక్షసంబంధిగాదు.

(౨) శం॥భా॥ 3, 3, 3౨.

అనంతరాద్వైతమున మోక్షమునుగూర్చి భిన్నభావములు పొడచూపెను.(౧) మోక్షమనఁగా బ్రహ్మైక్యమనియు, ప్రత్యస్థితో దైవమానవసహితమగు లోకమంతయు నదృశ్యమగు ననియు నేక జీవసిద్ధాంతవాదులు చెప్పుదురు.(౨) ప్రపంచమున కంతకుఁ గారణము జీవులయవిద్యయే యని యనేక జీవాదులు భావింతురు. అవిద్యానాశనముతోఁ బ్రపంచ మదృశ్యమయ్యును నంతను మిగిలిన బద్ధజీవుల దృష్టికి గోచరమగు చుండును. జీవేశ్వరులు బ్రహ్మప్రతిబింబములని తలచువారి ననుసరించి, మోక్షమనఁగా నీప్రతిబింబహేతువగు ముకురభగ్నతయే; అప్పుడు మూలబ్రహ్మమే ప్రకాశించును. జీవేశ్వరులకు బ్రహ్మమే యేకాధారమయినను, నొక విధముగా నీశ్వరప్రతిబింబమే జీవుఁడు ఈభావము ననుసరించి, మోక్షమనఁగా నింకను బద్ధజీవులున్నంతకాల మీశ్వరైక్యమే కాని బ్రహ్మైక్యము గాదని చెప్పుదురు. ఒకే ముఖమనేక ముకురములలోఁ బ్రతిబింబించు నపుడే దేనొక యద్దమును దొలగించినచోఁ దత్సంబంధ ప్రతిబింబము మూలబింబములలోఁ గలిసి పోవును. కాని యితరములగు నద్దములన్నియు నిర్మలములగు వరకు ముఖలక్షణము యథారీతినే యుండును. కావున బద్ధజీవు లున్నంతకాలము మోక్షమనఁగా నీశ్వరైక్యమే; కాని సర్వజీవమోక్షమైనవు

---

(౧) సిద్ధాంతలేశము. ౪౫.

(౨) ఏకజీవావాధే తదేకాజ్ఞాన కల్పితస్యజీవేశ్వర విభాగాది కృత్స్న భేదప్రపంచస్య తద్విద్యోదయే విలయాన్నిర్విశేష చైతన్యరూపేణైవాఽవస్థానమ్.

జీశ్వరుఁడు తన మూలబింబభావమును గోల్పోయి, బ్రహ్మ మందుఁ గలిసి పోవుటచే సర్వజీవులకును బ్రహ్మైక్యసిద్ధి లభించును. కాని సంప్రదాయసిద్ధమగు నద్వైతము ననుసరించి, సంసారమనంతము గావున మోక్షమనఁగా నీశ్వరైక్యానుసంధానమే.

బ్రహ్మజ్ఞాన స్వరూపమునుగూర్చి విచిత్రమగు ప్రశ్న బయలు దేరినది; జ్ఞాన మున్నంతకాలము మోక్షము లేదు; కాని బ్రహ్మజ్ఞానసిద్ధి లేనిదే మోక్షము దుర్లభము. కాని బ్రహ్మ జ్ఞానము పరమమోక్షసిద్ధికి వ్యతిరేకముగాదా? పరమముక్త్యవస్థలో జ్ఞానముండదు; అందుచే నుత్కృష్టజ్ఞాన మెట్లు నిర్మూలింపఁబడు నను విషయము ననేకోపమానములలోఁ జెప్పిరి. ఒక కాలకఫలము నశుద్ధజలప్రవాహములోఁ బడవేసినచో దాని కలుషములన్నియుఁ గొట్టుకొనిపోయి యదిమాత్రి మడుగునకు మునిగిపోవురీతిని; ఎఱ్ఱగాఁ గాలిన యొక పెనముపైనొక నీటిబిందువును వేసినచో, నా పెనముయొక్క వేడిమిని గొంత దీసికొని తా నదృశ్యమైనరీతిని; గడ్డిమోపులోఁ బడవైచిననిప్పు గడ్డినంతను గాల్చివేసి తా నారిపోవు విధముననను, బ్రహ్మజ్ఞానము మన యజ్ఞానమును నాశనమొనర్చి, దానితో నదియు నశించిపోవును.(౧) క్రమముక్తి వాదమును శంకరుఁ డంగీకరించెను. ప్రణవజపమునుగూర్చి ప్రశ్నోపనిషత్తులోనొక వాక్యమునకు భాష్యము వ్రాయుచు నట్టి జపమువలన బ్రహ్మలోకప్రాప్తియు ననంతరము క్రమముగా ముక్తియు లభించునని

(౧) చూ: సిద్ధాంతలేశము. అ. ౩.

యూతఁడు చెప్పినాఁడు.౧. ఇంకొకచోట నీశ్వరారాధనము వలన దురితక్షయమై, యీశ్వరత్వములేక క్రమముక్తి సిద్ధించు నని నుడివినాఁడు.౨. బ్రహ్మలోకమున నాత్మ తన ప్రత్యేక వ్యక్తిత్వమును గలిగియుండును. ఇతర యోగులదృష్టిలోవలెనే శంకరుని దృష్టిలో స్వర్గమనఁగా జీవుఁ డీశ్వరధ్యానమగ్నుఁడై యుండు నవస్థయే యనువాద ముత్తమలక్ష్యము కాఁజాలదు. జీవుని కీశ్వర సాక్షాత్కారము గలిగి, యీశ్వర దివ్యతేజః ప్రకాశములో నుండు స్థితి కలుగనగును గాని, జీవాత్మకును దల్లక్ష్యమునకును భేదమింకను నిలిచియేయుండును. జీవాత్మ స్వస్వరూపసందర్శనము నింకను బొందనిదై తన పరిచ్ఛిన్నతచే బరమాత్మలో లీనము గాలేకయుండును.

శంకరుఁడు చెప్పిన జీవన్ముక్తి వివరణమువలన, మరణించిన వెంటనే యాత్మకు నిత్యావస్థ సిద్ధించునని తలపరాదు. బ్రహ్మజ్ఞానము లభించినచో బ్రతికియుండగనే మోక్షసిద్ధియున్నది. మరణప్రాప్తివరకు దేహమున్నను, బ్రహ్మవేత్తను మోసగింపదు. కుండచేయుట పూర్తియైనను గుమ్మరివానిచక్రము కొంతసేపు తిరుగుచుండురీతినే, మోక్షమువచ్చినను జీవితము కొంతకాలము నడచుచునేయుండును; ఏలన, నిదివరకే జన్మకారణమై యున్న శక్తి నడ్డుపెట్టనవసరములేదు. ౧. శంకరుఁడింకొక యుపమానము నిచ్చినాఁడు. చంద్రుఁడొక్కఁడే

(౧) శం. భా. ౧,౩,౧౩.
(౨) శం. భా. ౩,౨,౨౧.
(౧) శం.భా. ౪,౧,౧౫.

యని యెఱింగియు నేత్రరోగముచే రెండు చంద్రబింబములను జూచు నాతఁడు, చేయునదిలేక నిజమును తెలిసికొని యూరకుండును. ౨. సర్వవ్యాపారములు బ్రహ్మమందే జరుగుచున్నవని బ్రహ్మజ్ఞాని తెలిసికొనును. 3.

౨౪—భవిష్యజ్జన్మము,

బ్రహ్మవేత్త యొక్కఁడే మోక్షమును బొందును; మిగిలిన జీవులందరు జన్మాంతరముల నందుదురు. ౪. మోక్షకాలమువరకు మనజీవితములు సంసారచక్రమందుఁ బరిభ్రమించుచుండును. సంసారము కాలగతి స్వరూపము; ఈయనంత సంసారచక్రములో జీవులకు భావిదశ కవకాశము కల్పితమై యున్నది. జ్ఞానము వలననే జీవులు కాలమునుండి నిత్యస్థితిని బొందుదురు. కాలగతిలోఁ గాలాతీత నిత్యత్వమున్నదని యవిచ్ఛిన్నపరిణామమే చూపుచున్నది. టిమోస్ నందు ప్లేటో సుప్రసిద్ధవాక్యములలో, "కాలము శాశ్వతత్వముయొక్క గతిగల ప్రతిబింబమే." జన్మాంతరముయొక్క యాథార్థ్యమును నిరూపించుటకు శంకరుఁడు క్రొత్త కారణములను జూపియుండ

(౨) శ.భా. ౪,౧,౧౫.

(3) అర్వాచీనాద్వైతమున భిన్నభావములు ప్రకటితములైనవి: (౧) జీవన్ముక్తావస్థలో మూలావిద్య కొంతవరకుఁ దనశక్తిని సడలించును. (౨) అవిద్యావాసన, అవిద్యానాశనమైన వెనుకఁ గొలఁది కాలముండును. (3) మూలావిద్య దగ్ధవస్త్రశేషమువలె నుండును. (౪, జీవన్ముక్తునికి, జగము, దేహము మున్నగునవి కన్పట్టవు, చూ, సిద్ధాంతలేశము ౪,౫,

(౪) శం.భా. బృ.ఆ.ఉ. ౧,౧,౧, సర్వజ్ఞాత్మముని యొక్కఁడే జీవన్ముక్తి నంగీకరింపఁడు, మిగిలిన యద్వైతులందరు నంగీకరించిరి.

లేదు. భౌతిక దేహము నశించినపుడు తనస్వభావమునను సరించి యొక నూతన దేహకల్పనము చేయు బీజమొకటి మిగిలియుండు నని విశ్వసింపఁబడెను. జీవాత్మయనఁగా దేహమేయనియు, దేహనాశముతో నాత్మయు నశించుననియుఁ జెప్పు నాస్తికవాదమును శంకరుఁడు ఖండించినాఁడు. ౧. ఆత్మ దేహభిన్నము; ఆత్మకు భిన్నజన్మములలో నేకత్వముండుటవలనే స్మరణాదికమున కవకాశము కలుగుచున్నది. ౨. మన శరీరములు భస్మమైనను, మనలో నవినాశియగున దేదో యున్నది. దీనివలననే జన్మాంతరమున కవకాశము కలుగుచున్నది. మనము సంపాదించిన జ్ఞానమును, మనము నిర్మించుకొనిన శీలమును మనతో జన్మాంతరములలోఁగూడి వచ్చును. 3. పుణ్యాత్ములు పావన

(౧) దేహమున్నంతకాల మాత్మగుణములు పొడచూపును గావున, నవి దేహగుణములే యనవచ్చుననుట యుక్తమేలన, మరణానంతరము దేహమున్నను నాత్మగుణములు చూపట్టుటలేదు. చీకటిలోఁ జూచుట కొక దీపము కావలెను గావఁ జూపు దీపగుణమని చెప్పరాదు. దీపమువలెనే దేహ మొక యుపకరణము. మఱియు దేహావసరముకూడ నెల్లప్పుడుండదు; దేహము నిద్రలో నిశ్చలమైయుండగా మన మెన్నియో వస్తువులను జూచుచున్నాము. మనకు గోచరములగు నాకురూపాది దేహగుణములకును, మనక గోచరములగు నాత్మగుణములకును భేదమున్నది. దేహాస్తిత్వమువలన జీవగుణాస్తిత్వము బుజువగునుగాని, దేహములేనిదే కాదనుమాట నిజమే. జీవి దేహాంతరమునఁ జేరి యచట నుండవచ్చును. జీవము భౌతికవస్తులక్షణమైనచో, నీ భౌతికవస్తువులు జీవదృగ్విషయములు కాఁజాలవు. భూతములు, వానివలన నుత్పత్తియైన వస్తుజాలమును మనము దర్శించి, వాని యస్తిత్వమును నిర్ణయించుచున్నారము కావున, దర్శనము వానికి భిన్నమైనదని నిశ్చయింపవలెను.

(౨) శం॥భా॥ 3,3,౫౪.

(3) శం॥భా॥ 3, ౪,౧౧; బృ॥ఆ॥ ౪,౪,౨; చూ॥ శం॥భా॥3,౧,౫-౬.

చరితులు సుకృతజన్మములను, దుశ్చరితులు పాపులు హీనజన్మ ములను గాంతురు. భవిష్యజ్జన్మస్వభావము భూతజన్మము లోని శీలసంపదపై నాధారపడియుండును. జన్మమరణములు జీవాత్మను దేహసంయోగ వియోగములనే ప్రదర్శించును. (౧)

శంకరు ననుసరించి, వైదిక దేవతలు నమస్యులుగారు; ఏలన, "దేవతల యమరత్వమున కర్థము వారెక్కువ కాలము జీవింతురనియు, వారి యైశ్వర్యము స్వీయబలముపై నాధారపడి నది కాక యీశ్వరప్రసాదమే" యనియుఁ దెలియవలెను. (౨)

మరణానంతర జీవప్రయాణమును శంకరుఁడు సవివర ముగా వర్ణించినాఁడు. సుకృతజీవులు మరణించిన వెనుక యముని తేజోమయస్వర్గమునకుఁ బోయి, పితృదేవతల(3)తోఁ గలిసి సుఖజీవితముల గడపుదురు; దుష్కృతులైన వారంధ తమస్సహిత హీనలోకములలోఁ బడుదురని ఋగ్వేదము చెప్పి నది (౪) జ్ఞానులు దేవయానమున నుత్తమలోకముల ద్వారమునఁ బోయి, పునరావృత్తి రహితబ్రహ్మలోకప్రాప్తి నొందుదురు. కర్మనిష్ఠాపరులైనవారు పితృయానమునఁ జంద్రమండల వస్తులై పుణ్యఫలము లనుభవించి, తిరిగి తమ పూర్వకర్మానుగుణము లైన జన్మముల నొందుదురు. జ్ఞానకర్మలు లేనివారు, క్రిమికీట కాదులు వృక్షలతాదులునై, చంద్రమండల సౌఖ్యలేశమైన లేని

---

(౧) శం॥ భా॥ ౨, ౩, ౧౬-౧౭.

(౨) శం. భా. ౧, ౨, ౧౭.

(౩) ౧౦, ౧౪, ౧౦.

(౪) ౧౦, ౧౫౨, ౪.

హీనప్రదేశములలో జన్మింతురు. ౧. ఈమూడుమార్గములును సంసారచక్రములో భిన్నఘట్టములని శంకరుఁడు నిశ్చయించి నాఁడు. మోక్షము వీనికన్నిటికి భిన్నమైనది పితృయానమువలనఁ దిరిగి యిహలోకజన్మము సంభవించును. దేవయానమువలనఁ బునరావృత్తిలేని బ్రహ్మలోకప్రాప్తిగలదు. ఛాందోగ్యోపనిషత్తు ౧ నందు దేవయాన పితృయానములు రెండేవర్ణింపఁబడినవి; జ్ఞానహీనులందరు పితృయానముననే పోదురు. వైదికోపనిషద్భావ సమన్వయముచేయు నుద్దేశముతో శంకరుడు లోకాంతరములందును, జన్మాంతరములందును రెండువిధములుగాఁ గర్మఫలముల ననుభవింతురని చెప్పినాఁడు. ౨. వైదికకర్మలవలనఁ బుణ్యలోక సుఖప్రాప్తియు, నైతికజీవితమువలన నిహలోకమున జన్మాంతర ఫలితములు గలుగునని వివరింపఁబడినది. ౩. సంప్రదాయసిద్ధ ధర్మముల ననుసరించి, వైదికకర్మలు చేసినవారు, సమ్యక్ జ్ఞానశూన్యులై, పితృయానమున ధూమావృతములైన ప్రదేశముల ద్వారమునఁ జంద్రలోకములో సత్కర్మఫలములనుభవించి, తిరిగివచ్చి యిహలోకమున జన్మింతురు. ఈశ్వరారాధనము చేయుచు జ్ఞానయుక్త పుణ్యకర్మల నాచరించినవారు దేవయానమున నున్నతోన్నత లోకములనొంది సూర్యమండల ద్వారమున బ్రహ్మలోకసిద్ధి నొందుదురు. ౪. ఈశ్వరు నారా

(౧) బృ॥ ఆ॥ ఉ॥ ౬, ౨; ౧౬, ౬.
(౧) ౫,౩,౧౦; శం॥భా॥ ౩,౧, ౧౨-౨౧,
(౨) శం॥భా॥ ౩,౧,౮,
(౩) శం॥భా॥ ౩,౧, ౯-౧౧.
(౪) శం॥భా॥ ౪,౩, ౧-౬.

ధించిన యాతఁ డైశ్వర్యశక్తులను బొందుచుఁగాని, "ఆతని యజ్ఞానమింకను దొలఁగిపోలేదు." అవిద్యానివృత్తి కాలేదు. హీన దేవతల నారాధించినవారు నుచితఫలసిద్ధిని గాంతురుగాని మోక్షమార్గము నెన్నఁడు పట్టఁజాలరు.౧. అవినీతిపరు లధోలోకపతనము నొందుదురు.౨. కాని యాత్మైకదర్శనావకాశము లేని శాశ్వతసంసార మెవ్వరికిని లేదు.3.

మరణకాలమున నింద్రియములు మనస్సునందును, మనస్సు ముఖ్యప్రాణమందును, ముఖ్యప్రాణము జీవుని కిల వాహనరూపమైన సూక్ష్మశరీరమునందును బ్రవేశించును. అవిద్యయు, పూర్వసంస్కారసహిత సూక్ష్మదేహమును జీవోపాధులు; ఇవి దేహమును విడిచిపోవును.౪. ఈసూక్ష్మదేహము సూక్ష్మనాడుల ద్వారమున బయటికిఁ బోవుటచే నట్లు చెప్పఁబడినది. ఈసూక్ష్మదేహము తనుత్వము, సంచారశక్తియు, దనగమమున కేయాటంకము నుండక, యెవ్వరికి గోచరింపని స్వచ్ఛతను గలిగి యుండును.౫. మోక్షకాలము వరకు నీసూక్ష్మశరీరము నాశముగాదు.

(౧) శం॥ భా॥ ౪,౧,౪; ౪,3, ౧౫-౧౬.

(౨) శం॥ భా॥ ఛాం॥ ఉ॥ ఉపోద్ఘాతము; చూ: 3,౧,౧-౭,౧౦.

(3) దేవయానమున బ్రహ్మలోకములోఁ బ్రవేశించినవారి స్థితినిఁ గూర్చి యొకసమస్య బయలుదేరినది. వారికి దేహములుండవని బాదరియు, నుండునని జైమినియు భావించిరి. రెంటిని సమన్వయించి, యాశక్తిముగలవారు తమ విలాసము ననుసరించి, దేహములఁగలిగియు లేకుండియుఁగూడ నుండఁగలరని బాదరాయణుఁడు వచించెను. (శం॥ భా॥ ౪,౪,౮-౨౨.)

(౪) ౨,౨,౧-౫.

(౫) ౪,౨,౮-౧౧.

## ౨౫—మతము.

శంకరు నద్వైతవాద మఖండపరిజ్ఞాఫలితమైనను,మతనిష్ఠ నొసంగఁజాలదని యాక్షేపణగలదు. ఆతని నిర్గుణబ్రహ్మ మనహృదయములోనుజ్జ్వల ప్రేమనుగాని భక్తినిగానిజనింపఁజేయఁజాలదు. ఎవ్వఁడు నెన్నఁడు జూచియుండనట్టియుఁ జూడరానట్టియు, నెవ్వఁడు సమీపించుట కవకాశము లేని జ్యోతిర్మయస్వరూపము గలట్టియు నిర్గుణబ్రహ్మమునుమనమారాధింపఁజాలము. నిరాకారబ్రహ్మము మన యారాధన కనుకూలమగు రీతిని సాకారమయ్యెనని చెప్పఁబడెను. ఈశ్వరారాధన మనఁగా జ్ఞానపూర్వకముగా మిథ్యాభావముతోడి సాంగత్యముకాదు. పరిచ్ఛిన్నమానసమున కీశ్వరరూపముననే నిర్గుణ బ్రహ్మరూపము గోచరించును. పరమాత్మతోనేకత్వముగాంచనివ్యక్తికా పరమాత్మ అనంతకల్యాణ గుణపరిపూర్ణుఁడుగాఁ గన్పట్టును. ౧. ఈశ్వరభావమత్యున్నత తర్కసిద్ధమైనసత్యమై యత్యంత నిగూఢమత విశ్వాసముతో మేళవించునదే. ఈసగుణ బ్రహ్మము స్వచ్ఛ భక్తి పూజాపాత్రుఁడు; ఆతఁడు మానవకోటి భయభక్తుల కుదాసీనతవహించు ధర్మసంబంధము లేని దైవముకాఁడు. ఆతఁడు రజస్సత్త్వపరిపూర్ణుఁడై, ధర్మదయానిధియై, సర్వజ్ఞత్వ సర్వవ్యాపిత్వ సర్వశక్తి మత్త్వములు గలిగి జగత్కర్తయు భర్తయు ధర్మాధ్యక్షుఁడునై వ్యవహరించును. శంకరుఁడు చెప్పిన యాశ్వరునకు స్వచ్ఛసంపూర్ణ పావన శీలమును, ధార్మికసౌందర్యమును ముఖ్యలక్షణములు. జీవేశ్వరసంబంధము, ప్రేయసీ ప్రియ

---

(౧) శం. భా. 3,3,౧౨.

సంబంధముగా, భృత్యస్వామి సంబంధముగా, పితృపుత్రసంబంధ ముగా మిత్రసంబంధముగాఁ జెప్పఁబడెను. తన సంతానమును దన వైపాశక్షించు కార్యములో నీశ్వరు ననంతకల్యాణ గుణ ములను శంకరుఁడు వర్ణించునప్పుడాతని తత్త్వసిద్ధాంతములోని కాఠిన్యము సడలును. శంకరునిదృష్టిలో మతమనఁగా సిద్ధాంత నిర్వచనముగాని, కర్మకలాపముగానికాదు; దైనికజీవితానుభూ తియే. నిర్గుణబ్రహ్మస్వరూపమునెడ నాత్మ గౌరవభావముతో మత మారంభమై పరమాత్మైకత్వసిద్ధితో నంతమగును. బర బ్రహ్మసాక్షాత్కారమే మతసిద్ధి. ఆత్మ సహజస్వభావము నెఱుఁగుటయే నిక్కమగు భక్తివిధానము. ౧. వివిధ ధ్యాన మార్గము లుపనిషత్తులలోఁ ౨. జెప్పఁబడినవి; సాధకులు తమ స్వభావోచితమార్గము నొకదానినిబట్టి తరింపవలెను.3 ధ్యేయము మందఱికొక్కటే;ధ్యానసాధనలలో నైవిధ్యము గలదు. మతా రాధనము స్థూలముగా ద్వివిధము; సగుణబ్రహ్మోపాసనము ప్రతీకోపాసనము ౪. సాధకుఁడు తన కీశ్వరుఁడు బాహ్యముగ నున్నాఁడని విశ్వసించునపుడు ప్రతీకోపాసన కవకాశమున్నది.

ఉపాసకోపాస్య సంబంధమువలన రెంటికిభేదమున్నదని

(౧) స్వస్వరూపానుసంధానమ్ (వివేకచూడా మణి పు॥ 3౧.

(౨) 3,3,౫.

(3) శం॥భా॥ 3౹3,౫౯.

(౪) శం॥భా॥ ౪,౧,3.

వ్యక్తమగుచున్నది.౫ ఉత్తమోపాసనవలన బ్రహ్మలోకప్రాప్తి కలుగునుగాని, యచటజీవేశ్వరభేదము మిగిలియున్నది. ఆస్థితి నుండి ముక్తి క్రమముగానే కలుగును. మతమనఁగా జనసామా న్యభావములో నతీతమైనదని భావింపఁబడును.ఇది యసంపూర్ణ మగు ననుభవముమాత్రమే. సమగ్రముగా సత్యము తెలియునంతవఱ కిదియుండును. కాని యిట్టియనుభవ మతిక్ర మింపఁబడుటకు సందేహములేదు; ఏలన, "పరిపూర్ణతత్త్వసిద్ధి ప్రాప్తించగనే, తదంశామాత్రమగు ననుభూతి తొలఁగి పోవును." జీవాత్మైకత్వమును నిరూపించు బ్రహ్మవర్ణ్యుల వాక్యములను శంకరుఁ డుదాహరించినాఁడు. "భగవాన్ ! నీవే నేను; నేనే నీవు."౬. "అహంబ్రహ్మాస్మి" యున్నగు మహా వాక్యములకర్థవివరణముచేయుట ప్రతిమతతత్త్వమునకు ముఖ్య కర్తవ్యమైయున్నది, "తత్త్వమసి" వాక్యములలో నీశ్వరునికి వానిసృష్టియైన జీవునికి భేదమతిక్రమింపఁబడినది మతానుభూతి లోని భేదములన్నియు సిద్ధికలుగుటతోఁ దొలఁగిపోవునని శంక రుఁడు వచించినాఁడు. సాకారమగు నీశ్వరభావము మతాను ష్ఠానదశలోమాత్రమే యర్థవంతమగును; బ్రహ్మజ్ఞానదృష్టిలో దానికర్థములేదు.౭. అవిద్యావరణముచే నంధుఁడగు పరిచ్ఛిన్న మానవుఁడు నిర్గుణబ్రహ్మము సవికల్పకమనియు, దనకు భిన్న మైనదనియుఁ దలఁచును. బాహ్యప్రకృతిచే నాచ్ఛాదితమైన మానవుని బుద్ధికిమాత్రమే బంధమోక్షము లర్థవంతములై

(౫) ఉపాస్యోపాసకభావోఽపి భేదాధిష్ఠానఏవ. (శం॥భా॥౧, ౩,౪)

(౬) త్వంవాఽహమస్మి భగవోదేవతే అహం వైత్వమసిభగవోదేవతే. (శం॥భా॥ ౪,౧,౩౦.)

తోఁచును. మానవునకు వేరుగానున్న యీశ్వరత్వమే పరమ సత్యమైనచో, యోగుల దివ్యానుభవము లర్థరహితములగును; మన మొకపరిపూర్ణత లేని దైవముతోఁ దృప్తి పొందవలసియుండును. పరిపూర్ణత లేనివాఁడు దేవుఁడు కాఁజాలఁడు; అతఁడే పరిపూర్ణుఁడైనచో మతానుభూతియే సర్వోత్తమమైనది కాజాలదు. ౨. ఈశ్వరత్వమే పరిపూర్ణత్వము కాఁజాలదేలన మానవుని యపరిపూర్ణత వేరై మిగిలియుండును. అదిపరిపూర్ణత లేనిదైనచో నీశ్వరస్వభావవిరుద్ధమగును. అందుచే మతానుభూతిలో మూల వైరుధ్యమున్నది. కావుననది యవిద్యావరణమునకుఁ జెందినదని స్పష్టమగుచున్నది.

వైదిక దేవతలనంగీకరించనిదే కర్మకాండ కవకాశము లేదు. సంప్రదాయమునంగీకరించు శంకరుఁడు దేవతలనగా భూతాధిపతులు కాక, ప్రకృతిశక్తుల రూపము లేయని నిర్వచించెను.౧. ఆదిత్యుఁడుమున్నగు దేవతలుఁ తేజస్సుమున్నగు లక్షణములకు సంబంధించియున్నను, శ్రుతులుచెప్పురీతిగాఁ బంచభూతముల

---

(౧) పోల్చు: బ్రాడ్లే "సాదృష్టిలో నిర్గుణతత్త్వ మీశ్వరుఁడుగాదు. ఆరాధనదృష్టి నధిగమించినచో నీశ్వరత్వమున కర్థము లేదు. ఈదృష్టి కేవల వ్యావహారికమే. నిర్గుణతత్త్వ మీశ్వరుఁడేల కాఁడనఁగా, నిర్గుణతత్త్వము సర్వసంబంధవిరహితము; అందుచేఁ బరిచ్ఛిన్నబుద్ధికిదానితో సంబంధములేదు. ఆనిర్గుణతత్త్వమును మనమారాధించుటకుఁ బూనుకొని మతారాధనవస్తువుగా నంగీకరించినచో, దాని నప్పుడే మనము మార్చినవారమగుదుము.

(ట్రూత్ అండ్ రియాలిటీ పు. ౪౨౮)

(౨) చూ॥ బ్రాడ్లే: ట్రూత్ అండ్ రియాలిటీ. పు. ౪౩౬.

గుణములైన దివ్యస్వరూపములనుగలిగి యీశ్వరశక్తి సమన్వితములైయున్నవి. మఱియు నవి బ్రాహ్మణమంత్రములలో నుపయోగింపఁబడినవి. ౧. భిన్నప్రాణకర్మలకీ దేవతలధిష్ఠాతలు. ౨, అగ్ని వాక్కునకు, వాయువు ప్రాణములకు, నాదిత్యుఁడు నేత్రమునకు నధిష్టానదైవములు. జీవులసుఖదుఃఖములతో నీ దేవతలకు సంబంధము లేదు.3. మరణకాలమందీ దేవతలు తమక్రియాశక్తి నుపసంహరించుకొందురే కాని, ప్రాణ శక్తులతోఁ గలిసి, దేహాంతరమునకుఁబోవు. వానిపుణ్యపాపముల ననుసరించి, పరమేశ్వరుఁడు దేవతలను, మనుష్యులను, పశువులనుసృజించును. దేవతల అమరత్వమాపేక్షికము, దేవతలును సంసారబద్ధులు ; వారికిని నిత్యస్థితి లేదు.౪.వారికిఁదరణోపాయముబ్రహ్మజ్ఞానమే; వారిందుకీశ్వరునిపై నాధారపడిజీవింతురు. దేవతలుబ్రహ్మవిద్యకై కృషిచేసినగాధలు శ్రుతులలోఁగలవు. ఈ దేవతలు, సామాన్యులవలె జన్మమరణవశులైనచో. వేదములనిత్యతకులోపమగునను నాక్షేపణము నిలువఁజాలదు; ఏలన, వేదవాక్యములు స్థానవిశేషముల లక్షణములకు వర్తించునేగాని వ్యక్తులకువర్తింపవు, 'ఇంద్ర' శబ్దము స్థానవిశేషమే కాని వ్యక్తికిఁ జెందినది కాదు. ఆస్థానము నెవరాక్రమించిన నానామముతోఁ బిలువఁబడుదురు. దేవతలవ్యక్తిత్వము నిజముగాదు; ఏలనవారు యజ్ఞములలోఁ బ్రత్యక్షమగుట లేదు; అట్లుప్రత్యక్షమగుట కవకాశ

౧. చూ. డ్యూసేన్ సిస్టమ్ ఆఫ్ వేదాంత. పు. ౬౫-౬౬.

౨. ఐతరేయోపనిషత్తు. ౧, ౨, ౪.

3. అదియొక్క టేభోక్త; దేవతలు భోగోపకరణభూతములు.

౪. శం.భా. ౧-3-౨౮.

మును లేదు; ఏలన ననేకస్థలములలో నొకేమారు వారెల్లుండఁ గలరని యాక్షేపింప బడెను. దీనికి సమాధానముగా శంకరుఁడు దేవతలకుఁ గనపడకుండనుండు శక్తి కలదనియు, యోగులవలె వారికి నానారూపధారణశక్తి కలదనియుఁ జెప్పినాఁడు.

శంకరుని తత్త్వమున కాలయములు, కర్మలు నవసరము లేకున్నను, సంప్రదాయ విశ్వాసబలము నెఱిఁగియున్నవాఁడు కావున, వానియందు నమ్మకముండుట దోషముకాదని వచించినాఁడు(౧). మతార్థవివరణము విషయములో శంకరుఁడితర వేదాంత వ్యాఖ్యాతలవలె సంప్రదాయ వాదమునుగాక, తాత్త్వికవాద పద్ధతి నుపయోగించినాఁడు. ఆస్తికవాది సాధారణముగా నొక మతశాఖావాదముపై నాధారపడును. తనమతశాఖకుఁ జెందిన సిద్ధాంతముల నాతఁడు క్రోడీకరించి, వివరించి, సమర్థింపఁ బూనును. తనతత్త్వమే చెప్పునదిమాత్రమే సత్యమని యాతఁడు విశ్వసించును. దానిపై నాధారపడి యాతనిమతము నిలుచుటయో కుంగుటయో జరుగును. నిక్కముగాఁ దత్త్వవేత్తయైనవాఁడు తానుజన్మించిన మతమునుగాని ప్రధానముగాఁ దీసికొనఁడు. ఆతఁడు మతమనువిషయమునునుగూర్చి నిర్దుష్ట పరిశీలనము చేయును. ఎల్లవేళల నన్యమతభావములఁ దనలో నిముడ్చుకొను విశ్వవిశాల సర్వసహనభావముగల తత్త్వోపదేశకులలో శంకరుఁడగ్రస్థానమును వహించును. ఈపరమతాదర

(౧) తాననేకదేవాలయములు దర్శించినందుకు క్షమింపుమని శంకరుఁడు మరణకాలమునం దీశ్వరునిఁ బ్రార్థించెనని చెప్పుదురు. ఏలన, నీశ్వరుని సర్వవ్యాపిత్వమునకు భంగము కలుగుట కాతఁ డంగీకరించినదైనది

భావము, మూఢవిశ్వాసజన్యమునుగాదు; సంధిమార్గమును గాదు; అదిశంకరుని తత్త్వమతవిధానమున కత్యంతసహజమైనది. సకలసిద్ధాంతములకుఁగల లోపముల నాతఁడు గుర్తించి, పరమేశ్వర తత్త్వము నేయొకసిద్ధాంతమునకును బంధించుట కాతఁడిచ్చగింపలేదు. వివేకముగల వాఁడెవ్వఁడును దనమత శాఖయే యీశ్వరునిఁ బరిపూర్ణముగాఁదూఁచిగ్రహించి, తన తత్త్వమును లిఖించెనని చెప్పసాహసింపఁడు. ప్రతిమతశాఖా తత్త్వమును దైవవిశ్వాసరంగమున నొకపరిశోధనము; ననుష్ఠాన దశలో నొకఘట్టమునగును. మతానుభూతి కిదియే సాధనము. ఏయొకమతము ననుసరించియైన నొకవ్యక్తి, యీశ్వరు నన్వేషించి, తనసాధనమున కర్థముగలదని విశ్వసించినచో నట్టిపద్ధతి విసర్జింపఁదగినదని యుపదేశింపఁబూనుట గర్హింపఁదగినది. భక్తి విశ్వాసములతో నీశ్వరునారాధించి, తన్మూలమునఁ దమకు దివ్యానుభూతికలిగినదని తృప్తిచెందువారలను ఖండించు మతోన్మాదము శంకరునికిలేదు. పరస్పర వ్యతిరేక విశ్వాసములుగల్గినను, ధార్మికోత్సాహము, చిత్తశాంతి, పరమాత్మసాంగత్యము, భిన్నవర్గములకు సమానఫలితములైనప్పుడు, శంకరుఁడు వారి భావములను ఖండింపఁబూనుకొనలేదు. ప్రపంచములోని మతప్రవక్తలలో నుత్తమప్రతిభావంతులలో నొకఁడు వచించినరీతిని, "వారి విశ్వాసములవలనఁగాక, ఫలితముల మూలముననే, జనుల సంగతి తెలియఁగలదు." దైవారాధన తత్పరతయు యు, లోకసేవాభిరతియుఁ గలిగియున్నచో లోకు లేనామముతో నీశ్వరునర్చించిన నిబ్బందిలేదు. మతభేదము ననుస

రించి, యొకేసత్యమును భిన్ననామములతో భావించిరి.౧. ప్రకృతివెనుకనున్న సత్యమును బ్రకటించునిమిత్తము, మన యవసరము ననుసరించి, పెక్కుచిహ్నముల నుపయోగింతుము ప్రత్యేకమతశాఖా దురభిమానములేనివాఁ డగుటచేతను, మానవకోటియందు వ్యాజకరుణగలవాఁ డగుటచేతను, శంకరుఁడీమాయాకల్పితజగత్తులో మానవుల సత్యాశయసంకల్పములే ప్రధానములైనవని గుర్తించినాఁడు. శంకరుఁడు కేవల ప్రచారముకొఱకుఁ దనతాత్త్వికసిద్ధాంతములను సవరింపఁ బూనుకొనలేదు. శంకరునిదృష్టిలో హిందూమతమంతయుఁ దనలో భిన్నమతసత్త్వములకు భిన్నభావములకుఁ దావొసఁగునదే అందుచే నాతని షణ్మతస్థాపకాచార్యుఁడనిరి.౨. మతవిషయములలో, వ్యవహారప్రపంచమునకు సంబంధములేని గగనసమోన్నత లక్ష్యములనుఁ బ్రకటించుట సులభమే; లేక, మహోన్నతవంకనున్నతాదర్శములనే విడిచి, కేవల వ్యావహారికభావమార్గములఁ బట్టుటయు సులభమేకావచ్చును; గాని, విస్పష్టమగు వ్యవహారజ్ఞానమును, మహోన్నతలక్ష్యనిష్ఠతో సమన్వయ మొనర్చుటే కష్టసాధ్యమైన కార్యము. ఇట్టి కర్తవ్యమును నెఱవేర్చుటకే శంకరుఁడు బూనుకొనెను. ఒకే మతప్రవక్త, భిన్నములగు నారు మతతత్త్వములను సమర్థింపఁ బూనుకొన్నట్టి పరమాద్భుతదృశ్యము; అట్టి యద్భుతదృశ్యము హిందూదేశములోనే చూడసాధ్యమగును. విద్యా

(౧) హరిస్తుతి పు॥ ౧౮.

(౨) శైవవైష్ణవ, సౌరశాక్త, గాణాపత్యకాపాలికములు.

రణ్యుఁడు వచించినరీతిగా మానవులు భగవంతునికి నానావస్తు రూపములిచ్చిరి. సర్వాంతర్యామియు, దారుశిలావిగ్రహరూపియు నాతఁడేయని ప్రజలునమ్మిరి; ౧. వైష్ణవ శైవ శాక్తేయాది మతశాఖలవారు పరస్పరము కలహించుచుండఁగా, నీమతతత్త్వములను నికృష్టవాదసీమనుండి సత్యస్వరూపసీమకు లేవనెత్తి, శంకరుఁడు వానికి సమున్నతస్థాయినిగూర్చెను. ప్రచారములోనున్న భిన్నమతరూపముల కేక మూలాధారమును సూచించి. మహోన్నతపరమార్థలక్ష్యమునకు వీనిననుసంధించెను. మానవహృదయాభ్యంతరమున నిగూఢమై నిలిచియున్న సత్యమే మతాధారమని యాతఁడుగ్గడించెను. ఆత్మదర్శనమే సర్వమతపరమావధి;జీవాత్మపరిచ్ఛిన్నరూపభావముల కతీతమగు పరమాత్మతో దాదాత్మ్యము గాంచునందాఁక సంసారచక్రమునఁ బరిభ్రమణము తప్పదని యాతఁడుబోధించెను. తాత్త్వికదృష్టికిఁబరమాత్మ యేకమున ద్వితీయమేయయ్యెను, భిన్నరూపములు భావింపఁబడుచున్నవి. సత్యస్వరూపములో సోపానభేదము లేదు ; సత్యమునుగూర్చిన మనభావములలోనే సోపానక్రమతారతమ్యమున్నది. దేవుఁడేలేడను నిశ్చయమునకాతఁడు దుముకలేదు; దేవుఁడున్నచో, నాతనిఁగూర్చి మనుజులొకేరీతిభావములను వెల్లడింతురు.భావవైవిధ్యమునకుఁగారణముపాధివైవిధ్యమే.౧ ఈరీతిగా శంకరుఁడు నాస్తికవాద మూర్ఖవాదములకు స్పష్టముగా దూర

౧. అంతర్యామినమారభ్య స్థావరాంతేశవాదినః
(పంచదశి. ౬-౧౨౧) చూ, ౬-౨౦౬-౨౦౮.

(౧) శం. భా. ౧,౧,౨౦. జేరన్ వాన్ హ్యూకేన్ వ్రాసిన యొక గ్రంథములో నొకవ్యాసమున్నది; దానిభావము శంకరుని తత్త్వమునకు సరిగా

ష్ఠుఁడు. తనమహోదార నిశ్చయముల కనుగుణముగా, నాతఁడు భిన్న దేవతాస్తవములను రచించినాఁడు; భక్తిరసపారవశ్యమున నాతని స్తోత్రగీతావళిని మించునవి లేవు, కాని దీనియర్థము శంకరుఁడు మూఢవిశ్వాసములను నీచారాధన విధానములను సమర్థించెనని తలపఁరాదు. మతము పేరజరుగుచున్న కొన్ని నీచోపాసన కలాపముల నాతఁడు నిరసించినాఁడు. తనయద్వైతసిద్ధాంతము ననుసరించి, యీశ్వరతత్త్వము నర్థముచేసికొనుటలో

---

సరిపోవును; “పూర్తిగా నేకవిషయమునుగూర్చియొక మతమునకు నింకొక మతమునకును, బాహ్యదృష్టితోఁజూచినచో ననేక భేదములున్నవి; అట్లే, ఒక మనస్సునకు నింకొకమనస్సునకేకాక, యొకేమతమునందు,నొకేమనస్సునందుఁ గూడఁ గాలభేదముతో భావభేదములున్నవి. చాలమంది వ్యక్తులు, మతములు చెప్పుకొనుచున్న తమయనుభవములు, తామాదర్శించిన విషయములు నిజముగాఁజూచినచో నేమియు సంస్కారములేని బాల్యపరిసంకమూలనియే చెప్పవచ్చును గాని, భిన్నరూపములలో, నెంతస్వల్పముగానైనను, నవి మానవాతీతమగు పరమైకసత్యమున భాగస్వాములగుచున్న వనుటలో సందేహము లేదు. మానవ మానసమునకు బాహ్యమునుండియు,మానసాంతర్గతమైయుండియుఁగూడఁ బనిచేయుచున్న సత్యస్వరూపము, సత్యాన్వేషణమునకు మానవునిఁ బురికొల్పుచున్న కారణము, సందర్భము విషయముకూడనైయున్నది. ఇందుచేతనే మానవుఁడు నిత్యము నీశ్వరుని పునస్సందర్శనమునకై యత్నించుచున్నాఁడు. మానవుని మతభావముల క్రమవికాసగాంభీర్యములకు: ప్రత్యక్షమతానుభూతియందే నిత్యశాంతి సౌఖ్యములున్నవని మానవుఁడు నిశ్చయించుటకును; పరమసత్యము నింకను సమగ్రముగా ననుభవింపలేనను గాంక్షయు; మానవబుద్ధి పరిమాణనిర్వచనము లాపనిని నెరవేర్చుట కసమర్థములనియు నేకకాలమున గ్రహించుటకుఁ బరమసత్య మనుభవైకవేద్యమే యని తెలియుటకు సర్వత్రనిండియుండి మానవునిఁబురికొల్పుచున్న తత్సత్యమేకారణము.” (ఫిలాసఫీ అండ్ రిలిజియన్. పు, ౪౪-౪౫.)

వము న్న తాశయములనెఱుఁగునట్లు ప్రజలకాతఁడుపకృతి చేసెను.
చిత్తశుద్ధితో మనము సత్యము నెఱుఁగ యత్నించినచో మన
మానసమునకు సత్యము స్ఫురించునని యాతఁడు నమ్మినాఁడు.
ఆచరణలోనున్న మతములనుగూర్చి యాతని కాదరబుద్ధియు,
విచక్షణదృష్టియుఁగూడఁ గలవు. పురాతనమైన హిందూమత
విశిష్టసందేశము నీనూత్న యుగావసరమున కనుగుణముగా
నాతఁ డుగ్గడించుటకు యత్నించి దానిలోని శ్రేష్ఠత కిదివఱకుఁ
గంటె నెక్కుడువిస్పష్టతనుగూర్చెను. ఈయుద్దేశములో జాతి
జీవనైకత్వమును సుప్రతిష్టిత మొనర్చునుదారభావముగర్భితమై
పొడచూపుచున్నది. కేవలబాహ్యవ్యవస్థానిర్మాణమువలనఁగాని,
నియతములగు నాంతరంగికవిశ్వాసములవలనఁగాని, యీయేక
త్వమునుసాధించుట కాతఁడుపూనలేదు. విశాలవిజ్ఞానప్రచార
ముచే నీపనిసాధింప నాతఁడుద్యమించెను; వ్యక్తిగతమైన మతా
నుభూతియొక్క లక్షణమున కేప్రాధాన్యమిచ్చి హిందూమతము
నాతఁడాధ్యాత్మిక ప్రాతిపదికనిచ్చిపోషించెను. హిందూవిజ్ఞాన
మును వివరించుటలో నాతఁడు తనకు వ్యతిరేకములైనభావము
లకుఁగూడ నప్పుడప్పుడు తావీయవలసివచ్చెను.

భిన్నమతశాఖావాదోపవాద ఝంఝామారుతార్భటు
లణఁగి పరిశుద్ధవాదసిద్ధాంత ప్రశాంతిరూపముగా శంకరాద్వై
తము ప్రకాశించెను. అది వితండవాదము కాని, బాహ్యశాసనము
గాని కాదు; పరిణతినందిన రాజమర్యాదతోఁగూడిన భావవైభ
వము, దానితాత్త్వికమైన ఋజుప్రయత్నమును, సమున్నతజ్ఞాన
మును ప్రదర్శించును. మతానుభూతికి మానవహృదయాంతరము

నిలుచునట్లుచే. దాని నెన్నఁడును నిర్మూలింపఁజాలము. మానవునాధ్యాత్మిక కృషియంతయు సత్యసాక్షాత్కారసిద్ధి సాధించుట కొఱకుద్దేశింపఁబడినదే, కాని తాత్కాలిక లాభసంపాదనము కొఱకుఁగాదు. స్వయంపరిచ్ఛిన్న వ్యక్తిత్వగౌరవ గర్వములను, నహంకార మమకార ప్రవృత్తులను బరిత్యజించిననే గాని సత్యసాక్షాత్కారమునకు నవకాశములేదు. మన పరిచ్ఛిన్నానుభవజ్ఞానప్రమాణములచేఁ బరమేశ్వరునిఁ గొలుచుటకు యత్నింపరాదు. భగవంతుఁడు తనకొఱకే స్వయంస్థితి గలిగియున్నాఁడు; కాని కేవలము మనకొఱకాతఁ డున్నాఁడని తలఁపరాదు. మన తర్కము, మనధర్మము ననుసరించి, మనకోర్కెలు దీర్చులక్షణములుగల వానిగా దేవుని మన మూహింతుము. దుర్బలమానసుఁడగు మానవుఁడు తన యల్పవాంఛల నెరవేర్చుకొనుటకై యీశ్వరు నుపకరణముగా దలఁచు పద్ధతి మానవునికి గౌరవప్రదమగునేమో కాని యీశ్వరునికిఁగాదు. నిజముగా దేవునిఁ బ్రేమించువాఁడు తన్నుఁదిరిగి దేవుఁడు ప్రేమింపవలెనని కోరఁడని యొకవిధముగా స్పినోజా తత్త్వవేత్త చెప్పిన భావముతో శంకరుఁ డేకీభవించును.

శంకరుని యద్వైత మూహాతీతముగా గోచరించుటకుఁ గారణ మేమనఁగా, మనము గ్రహించుటకు సాధ్యమగు దాని కంటెఁ గ్రిందిమెట్టులో నుండుటలోనే మనము తృప్తిని గాంచుచున్నాము. మనుష్యలక్షణము లంటకట్టఁబడిన దైవతత్త్వమును శంకరుఁడు నిరసించిన కారణమున నాతని మతము కొంత నిరాశాజనకముగా నుండును. కాని, పరమాత్మకు మనము జ్ఞానము

17

సంకల్పము లేదనుట లోపముకాదు; వీనిలోపము పరమాత్మ యొక్క పరిపూర్ణతాలక్షణమే యగును. ఇంతమాత్రముచే శంకరునికి మతదృష్టి లేదనరాదు. ఆతని రచనలలో నీమతదృష్టి మహోత్సాహపూరితముగాను గొన్నితావులలో మితిమీరియుఁ బ్రకటింపఁబడి యున్నది. కాని మన సామాన్యమతభావము లాతని తర్కాసిధారకు గురియైనవి; ఈశ్వరుని గూర్చిన భావములు మనవలెనే యస్థిరములు నసంగతములు నని యాతని నిశ్చయము.

ఏదియెట్లున్నను; దైవవిషయములను బరీక్షించుటలో యోగదృష్టితో సునిశితమైన ప్రజ్ఞాప్రభావమును మేళవించిన శంకరునిమూర్తి మనకు గోచరించును. ధ్యానసాధనమునకు శేముషీప్రతిభా వివేకము లాటంకములు గాఁజాలవని చెప్పుటకు శంకరుని జీవితమే మనకు సాక్ష్యము. మఱియు ధ్యానజీవితమునకు బాహ్యప్రపంచ ప్రవృత్తిని విసర్జింప నవసరములేదనియు నాతని జీవితము ప్రదర్శించినది వ్యక్తిగతానుభవమును, శ్రుతివాక్యమును, తాత్త్విక సమాలోచనమును శంకరుఁడు సమన్వయించినాఁడు.

## ౨౬-తుదివాక్యము.

ఉపనిషత్తులు మతమును గూర్చియుఁ దత్త్వమును గూర్చియు నేకకంఠమునఁ బలుకును. పరమసత్యమునుగూర్చి యవి బ్రహ్మమనియుఁ బరమేశ్వరుఁ డనియుఁ దెలుపును. మోక్షమనఁగా బ్రహ్మైక్యమనియుఁ గైలాసవాసమనియుఁ గూడ నవి వచించును. మన యుపనిషత్తులలో గోచరించు

బ్రహ్మమును గూర్చిన భావాత్మక వర్ణనములు, నేతివాక్యములు సర్వమత సారస్వతములకు సామాన్యవిషయములే. క్రైస్తవ, మహమ్మదీయ యూదుమతములకుఁ జెందిన యోగులందరు వాగతీతమగు సత్యమునుగూర్చి మనకు వార్తలందించి యున్నారు; ఇతరు లీశ్వర పరిపూర్ణతా మహిమనుగూర్చి పలికియున్నారు. యోగులును తత్త్వవేత్తలును భగవాను నసంతత్త్వమునుగూర్చి వచింపఁగా, భక్తు లాతనిని మిత్రునిగా, రక్షకునిగాఁ జూతురు. ప్రతి మతతత్త్వము నీ ద్వివిధ దృక్పథములను గమనించి సమన్వయించి సమర్థింపవలసియున్నది. ఉపనిషత్తు లుపదేశించిన మతానుభవార్థమును గూర్చిన యీ సమస్యను శంకరుఁడు లేవనెత్తెను. ఇదియొక ప్రత్యేక ప్రకరణమునకుఁ జెందినదేయైనను, దాత్త్వికాంశము లన్నిటికి సమన్వయము గావలెనన్నచో శంకరుఁడు చూపిన పరిష్కారము, విశ్వవిశాలమగు నర్థముకలిగి, సంతృప్తికరమై యున్నదని చెప్పనగును. ఇది ముఖ్యముగాఁ దాత్త్వికపరిష్కారమే; ఏలన భిన్న జీవిత దృక్పథముల నుత్తేజమొనర్చి సమన్వయించి, శాంత్యానందముల నిర్మింపఁగల సామర్థ్యము సమ్యగ్జ్ఞానశక్తిదేయై యున్నది. బుద్ధి సర్వసమస్యలను బరిష్కరింపఁజాలదనియు, ననుభవజ్ఞానము దానికి సహాయభూతము కావలెననియు నాతఁడు చెప్పినమాట నిజమే. జీవితరహస్య సమస్యలకు శంకరుఁడు శిరమువంచును గాని, యన్నిటిని రహస్యములని యాతఁ డంగీకరించఁడు. శంకరుని తత్త్వగర్భమందు సృష్టిరహస్యసమస్య

సుపరిశిష్టితమైయున్నది. అందు సర్వజీవగతులు, సర్వాణుస్పందనములు లగ్నములై యున్నవి.

ప్రపంచోత్పత్తికిఁ గారణ మనిర్వచనీయమనిచెప్పుటకు బదులుగా, నర్వాచీనాద్వైతులగు కొందర మార్గముననుసరించి దుస్స్వప్నదూషితులగు మానవులను మోసగించుటకు జగత్తు మిథ్యామాత్రమని కొట్టివేయుట శంకరుని తత్త్వమున కపచారమేయగును.

శంకరుని వేదాంతముచూపు తాత్త్విక గాంభీర్యము, తార్కికసామర్థ్యము నిరుపమానములు. ఒకభావము ననుసరించి దాని కనుగుణముగా నింకొకభావముదయించి, అద్వైతములో నంతమై, సర్వభావసిద్ధిచేకూరును. అది యొకగొప్ప యేకత్వతత్త్వవాదము; దానినిఁ గేవల తాత్త్వికవిమర్శనలచే ఖండింపఁజూచుట దుస్సాధ్యము. మఱి, కవితానుభూతిలో సాధ్యములగు మహోన్నత క్షణములలో స్ఫురించు జీవనజ్యోతిని శంకరుఁడు మనకుఁ బ్రదర్శించును; అప్పుడు మనము ప్రజ్ఞావాదమును విడనాడి, యోగదృష్టి ననుసరించిన శంకరునితో నేకీభవింతుము. శంకరుఁడీ మహోన్నత సీమనిలిచి యున్నంత కాలమాతని మన మెదుర్కొనఁజాలము. ఇట్టి యుత్కృష్టానుభవ సీమకెగఁబ్రాకలేని మానవులలో నధికసంఖ్యాకులకు హృదంతరమున నొకవిధమగు సంశయక్రిమి కొలుకుచునే యుండును. అట్టివారు, మనము పుట్టి, పెరిగి, జీవించుచున్న ప్రపంచ మజ్ఞానదృశ్యమని కొట్టివేయు టెట్లును సమంజసము కాదని భావింపఁగోరుదురు. ఆపరంజ్యోతిలో నన్యోన్యవైరుధ్య వైష

శ్యములలోఁ గూడిన యీదృశ్యములన్నియు నెట్లో సమన్వయ సిద్ధిఁగాంచునని చెప్పినను వారికది తృప్తినొసఁగఁ జాలదు. అట్టి వారిదృష్టిలో సర్వవస్తువక్రత్వములఁదీర్చు పరంజ్యోత్యస్తిత్వము సంశయాస్పదము; ఎదుటనున్న యథార్థజగత్తు నెట్టి యోగి దృష్టితో నిరసించినను శంకరుని భావమును వారంగీకరించరు. మానవుల క్లేశములన్నియు నుపశమించుననియు, జగమంతయు నిర్దాక్షిణ్యముగా మరుమరీచికవలె నదృశ్యమై పోవుననియు, మనదుఃఖములకు మనమే కారకులమనియు, జగత్ప్రళయవేళ, మనకుఁగల దుఃఖదోషాద్యనర్థ జాలమంతయు నశించి, సంపూర్ణసంతుష్టి నీయఁగల బ్రహ్మైక్యము మనకుఁ జేకూరుననియుఁ జెప్పు నీభావముల నేకులకూహామాత్రములని తోఁచును అంతర్ముఖత్వమును, సమాధిమగ్నతను జేపట్టి, వానిని స్వతః ప్రమాణములని పలుకుచు, వ్యావహారిక జీవితమునెడ నిష్కరుణాత్మకమైన యౌదాసీన్యమును వహించుట సామాన్యబుద్ధికి గ్రాహ్యవిషయము కాఁజాలదు. ఈసంగతి నెఱిఁగియుండియే శంకరుఁడు మనకు హేతునిబద్ధమగు ఆస్తికత నొసఁగినాఁడు. అదిమనబుద్ధిశక్తిని నిరసించదు; అనుశ్రుతముగావచ్చిన పూర్వ విజ్ఞానమునుదూషించదు; మఱియుసత్యమునుగూర్చిన యుత్తమ ప్రజ్ఞాప్రకటనమునిచ్చును.౧. ఆత్మదృష్టిలభ్యమగు బ్రహ్మై

౧. పోల్చు: ప్లేటో:—“దేవతలను గూర్చియు, జగదుత్పత్తిని గూర్చియు మనకుఁగల భావములకుఁ బరస్పర వైరుధ్యములను దొలగించి, నిర్దుష్ట నిశ్చితార్థములఁ గూర్పలేకుండుట వలన నెవ్వఁడాశ్చర్యము నొందనవసరము లేదు. యుక్తమనితోఁచిన యొక భావమునకుఁ దీసిపోవని విధమున మనము

తత్త్వమునకు తర్కపరిజ్ఞానసిద్ధమగు వ్యావహారికాస్తిత్వమునకు నెట్టిసంబంధమున్నదో శంకరుఁడు మనకుఁ జెప్పలేదు. ఏలన, గథే వివేకయుక్తముగాఁ బల్కినట్లు, "మానవుఁడు జగద్రహస్య సమస్యను బరిష్కరించుటకుఁ బుట్టలేదు; ఈసమస్యయెచట నారంభించునో గ్రహించి, జ్ఞానవిషయావధుల నతిక్రమింపకుండ నుండనేర్పుటకే యాతని కధికారమున్నది." మనము చేరరాని సీమయొకటున్నదని శంకరుఁడు గుర్తించినాఁడు. దానినిఁ గూర్చి వివేకసహితమగు నజ్ఞత్వమే యుక్తమైన పద్ధతి. అత్యద్భుతములగు భావవైదగ్ధ్యనైశిత్యములతో నాతఁడు జరిపిన సత్యాన్వేషణము, క్లిష్టములగు జీవితసమస్యల సాధింప నాతఁ డుపయోగించిన మహోన్నత తాత్త్వికదృష్టియు, నట్టి దృష్టి వలన నెట్టి యాస్తిక సిద్ధాంతము లుదయించునో యను శంక లేని మనోవిశృంఖలత్వము, మానవత్వములో నిజముగాఁ బరబ్రహ్మత్వ మిమిడియున్నదను దివ్యదృష్టి, వీనిపై శంకరుని కృషి యొక్క ఘనత నిలిచియున్నది.

మహాతార్కికుఁడై, సాటిలేని తత్త్వవేత్తయై, విశ్వవిశాల సమానభావము గలిగి, పరిశాంతచిత్తుఁడై నిశ్చయించు లక్షణ పరిపూర్ణుఁడై, సత్యమును బ్రేమింపుఁడని హేతువును గౌరవింపుడని, జీవితపరమార్థమును గ్రహింపుఁడని శంకరుఁడు మన కుప

---

మః నిర్ణయమును నిర్మించినచో నంతేచాలు; ఏలన, జెప్పె నేనును, నేఁజెప్ప నది పరీక్షించు మీరును మనుష్యమాత్రుల మనుసంగతి మరువరాదు. అందుచే మనము రచించుగాథ యుక్తియుక్తమైన నంతియచాలు; అధికముగోరుట వ్యర్థము, (టిమావ్, పు. ౨౯, ౩)

దేశించినాఁడు. పదిరెండు శతాబ్దములు గతించినవి కాని, యీతని ప్రభావము నేటికిని సజీవమై యున్నది. ఆతఁడనేక హేతువిరుద్ధవాదములను నిర్మూల మొనర్చెను, వాని నాతఁడు ఖండింపలేదు. వానికంటె నెక్కువ యుక్తియుక్తమై, వానికంటె శ్రేష్ఠతరాత్మజ్ఞానము నిచ్చు విషయముల నాతఁడు సౌమ్యుఁడై చూపెను. ఉపనిషత్తులందున్నను ప్రజానీకము మఱచిపోయిన విపులభావజాలము నాతఁడు లోకములో వ్యాప్తికిఁ దెచ్చుటచే గతించిన జ్ఞానము నాతఁడు పునరుజ్జీవింపఁ జేసెను. ఆతఁడూహా కల్పనములపై నాధారపడు తత్త్వజ్ఞుఁడు కాఁడు; ఆచరణకు సాధ్యమగు దివ్యదృష్టి గలిగిన తత్త్వవేత్త; మఱియు నాతఁ డుజ్జ్వల క్రియాశూరుఁడు; సముత్తుంగౌదార్యసమన్వితుఁడగు సామాజిక తత్త్వజ్ఞుడని యాతనిని పేర్కొనవచ్చును. జీవితమును గూర్చిన యాతని దృష్టిలో నేకీభవింపని వారైన నాతని సమరజీవులలో లెక్కించుటకు వెనుకాడరు.

## ఉదాహృతగ్రంథములు


౧. కార్పెంటర్:—థీయిజమ్ ఇన్ మెడీవల్ ఇండియా. లెక్చర్. ౬

౨. దాస్‌గుప్త:—భారతీయతత్త్వచరిత్రి. ౧౦–అధ్యాయము

3. డ్యూసేన్:—ది సిస్టమ్ ఆఫ్ ది వేదాంత.

౪. ద్వివేది:—గౌడపాదకారికాసహిత మాండూక్యోపనిషత్తు.

౫. మహాదేవశాస్త్రి:—శంకరభాష్యసహిత భగవద్గీతా.

౬. మ్యాక్సుముల్లర్:—సిక్సుసిస్టమ్స్ ఆఫ్ ఇండియన్ ఫిలాసఫీ. అ. ౬

౭. ౨ నరసింహము:—ది వేదాంటిక్ అబ్సల్యూట్ అండ్ ది వేదాంటిక్ గుడ్, మైండ్. యన్.యస్, ౮౨,౮౩

౮. థీబో:—శంకరభాష్యసహిత వేదాంతసూత్రములు. (యస్. బి. ఇ.)

౯. విద్యారణ్యపంచదశి:—శ్రీనివాసరావు; కృష్ణస్వామిఅయ్యరు ముద్రణము.

# భారతీయ తత్త్వశాస్త్రము

## నవమాధ్యాయము

### రామానుజుని—ఆస్తికతత్త్వము

#### ౧. ఆరంభవాక్యము

తత్త్వశాస్త్రమునకు మూలములు మానవుని జీవితావసరములయందే గలవు, మానవునిజన్మసహజములగు మూలకాంక్షలను సమర్థింపక, మతములోని నిగూఢతత్త్వమును వ్యక్తీకరింపని యేతత్త్వమును జనాంగీకారము నందఁజాలదు. మన దుర్దశాదుఃఖములం దుపశాంతియొసఁగఁజాలని, తత్త్వశాస్త్రజ్ఞుల భావకల్పనములు కేవలశేముషీవినోదకములగునే కాని, నిశ్చయవిజ్ఞానహేతువులు కాఁజాలవు. నిశ్చలము నిర్వికారమునగు శంకరుని నిర్గుణబ్రహ్మమెట్టి కర్తృత్వపరిభావములు లేనిదగుటచే, మనకుఁ బూజ్యభావము నుదయింపఁజేయదు. తన్నుఁగూర్చి చూపరులు చేయుప్రశంస నెఱుఁగఁజాలని టాజ్ మహల్ వలె, శంకరుని నిర్గుణబ్రహ్మము, తదారాధకుల భయరాగముల నుదాసీనత వహించును. మతలక్ష్యమే తత్త్వలక్ష్యమనియు, దేవు నెఱుఁగుటే సత్యము నెఱుఁగుటయని తలఁచువారికి శంక

మని భావమొక పాండిత్యబలముతోఁగూడిన తప్పునకుఁబూర్ణో దాహరణమువలె గోచరించును. అది సహజమానవప్రకృతి విరుద్ధమగుటయేకాక, పరిణతబుద్ధికిఁగూడనట్లే తోఁచును. ప్రపంచమొక మిథ్యాదృశ్యము; పరమేశ్వరుఁడు స్వీయాతిశయ కాంతిచే సంధీభూతుఁడైన నిర్గుణబ్రహ్మము, దౌర్బల్యాజ్ఞాన దూషితులగు మానవులు తమహృదయకుహరములనుండి మొఱ పెట్టినప్పుడు, మనకుఁదెలియని తావునుండి కృపాభయహస్తము చూపట్టి రక్షించుననుప్రత్యక్షానుభవ విషయము విడిచిపెట్టఁ బడినది. భక్తులు తమకష్టకాలములలో భగవానునితోఁబొందు సజీవసాన్నిధ్యమున కుచితస్థానమును శంకరుఁడొసఁగలేదు. ఆత్మోద్ధరణమనఁగా, నవిజ్ఞాతమగు నిర్గుణబ్రహ్మసాగరములో మునిగిపోవుటయని శంకరుఁడు వక్కాణించును. వ్యక్తిగతము లైన లక్ష్యముల నిర్గుణనియమావళికి వశమొనర్చుటచే, సత్య శివసౌందర్యములు వ్యక్తులతో సంబంధములేని రూపరహిత నియమములుగావని దైవారాధకుఁడు వాదించును. వ్యక్తివినా అనుభవముండుననుట స్వవిఘాతవచనము. సత్యము పరిపూర్ణ త్వము, సౌందర్యమునొక యాదిపురుషుని హృదయములో సమగ్రసిద్ధినిగాంచెనని సూచించును. భగవంతుఁడే పరమార్థ మగుసత్యము, పరమప్రయోజనమునైయున్నాఁడు. భగవంతుని హృదయకుహరమూలమందుఁ బ్రధానముగానున్నది కేవలసత్య సంసిద్ధియు లేక, సౌందర్యానుభూతియుఁగాక, ప్రాణికోటికొరకు నిత్యమును బ్రసరించుచుండు పరిపూర్ణ ప్రేమామృతమైయున్నది. పరిచ్ఛిన్న జగత్ప్రయోజనమేమనగానందలి జీవకోటికి భగ

వంతుఁడు తనతో సారూప్యముగాంచుట కవకాశముగాఁగల్పించి యున్నాఁడు. దేవునిదృష్టిలో జీవులకుఁ గేవలజీవత్వముచేతనే విలువయున్నది; కేవలము జీవులార్జించిన ప్రజ్ఞాధర్మపరిణతి చేతనేగాదు, జీవులను గల్పించి, వాని సద్వృత్త్యమొనర్చుట కే దేవుఁడు వానినిసృజించి యుండలేదు.

రామానుజుఁ డీశ్వరప్రపంచ సంబంధముపైఁ దనదృష్టిని గేంద్రీకరించి, యీశ్వరాస్తిత్వము యథార్థమనియు, నాతఁడు స్వతంత్రుఁడనియు, జీవాస్తిత్వమును సత్యమేకాని, వానియస్తి త్వము పరిపూర్ణముగా నీశ్వరాధీనమై యున్నదనియు వాదించును. జగత్తునకు మూలాధారమై యొక తత్త్వమున్నదనియు నది మిథ్యకాదనియు నాతఁడు వచించును. ముక్తజీవులు తమ ప్రత్యేక వ్యక్తిత్వములతో నవిచ్ఛిన్నముగా నుండునని యాతఁడు వక్కాణించును. జడజగత్తును, జీవులును దమప్రత్యే కాస్తిత్వమును గలిగియున్నను, నందేదియు బ్రహ్మస్వరూపము గాదు, ఏలన బ్రహ్మ మెట్టిలోపమునులేని నిత్యపరిపూర్ణుఁడు; జగత్పదార్థము జడము; జీవు లవిద్యాదుఃఖదూషితులు. కాని వీనికన్నిటి కేకత్వమున్నది; జడజగత్తును, జీవులును దేవుని శరీరము; దేవుని దేహముగానే వాని కునికి గలదేలన దేవుఁడే వాని కాత్మయు, యజమానియునగును. (౧). బ్రహ్మమునకు

(౧) ఈలోకములోని సర్వమును, జీవులుగాని, జడపదార్థములుగాని పరమాత్ముని దేహరూపములే; అందుచేతనే పరమాత్మ నిరుపాధిక శరీరుఁడని చెప్పుదురు. ఈకారణముచేతనే బ్రహ్మవిషయముగాఁగల శాస్త్రము శారీరక శాస్త్రమని కోవిదులు పల్కిరి ”

వేరుగా వాని కస్తిత్వములేదు జీవాత్మయు, జడజగత్తు నీశ్వర భిన్నము లేకాని, యీశ్వరాధీనములై, యీశ్వర సేవార్థము కాక వానికి వేరే ప్రయోజనమును లేదు. కావున రామానుజుని సిద్ధాంత మద్వైతమే కాని, యొక విశేషముతోఁ గూడి యున్నది ఏకమైన పరమాత్మ యనేకత్వము నంగీకరించును; అది జీవ జగత్తులతోఁ గలిసియుండును. అందుచే నది విశిష్టాద్వైతమైనది.

ధర్మవిషయములోఁగూడ మీమాంసకుల కర్మవాదమును, శంకరానుయాయుల ప్రజ్ఞానైపుణ్యముచు గూర్చి ప్రతిఘటనలు బయలుదేరినవి. మిక్కిలి ప్రాచీనమైన ఋగ్వేద కాలమునందును, దేవతలు కొన్ని వేళలందుఁ బ్రార్థనములకును గొన్ని వేళలఁ గర్మకును స్వాధీనులైరని మనము చూచి యుంటిమి క్రతువిధాన మెల్లప్పుడును, మొదట నరణ్యములలోఁ దరువాత నాలయములలో జరిగిన పరమేశ్వరుని ప్రతీకారాధన విధానముతోఁ బోరాడవలసివచ్చినది. వైదికక్రతు మతమందు దా మారాధించు దేవతకంటె యజ్ఞాధ్వర్యము వహించు పురోహితునకే యెక్కుడు ప్రాముఖ్యమున్నది. మఱియు బౌద్ధము శిథిలతనొందిన యరాజక పరిస్థితులలో సుస్థిరసంఘ నిర్మాణము చేయఁబూనిన బ్రాహ్మణ శిల్పిశేఖరుఁడగు కుమారిలుఁడు యజ్ఞాధికారమును పైమూఁడు వర్ణముల ద్విజులకే యొసఁగి, వర్ణవియమమునకు కట్టుదిట్టముగాఁ బునాదివేసెను; మిగిలిన ప్రజాసామాన్యమునకు భక్తిమార్గమే యాధారమైనది. ఈ కారణముచేతనే, మీమాంసావాదమునకుఁ బ్రతీకారముగా ఆస్తికమతములైన వైష్ణవ, శైవ, శాక్తేయము లుద్భవించి

పెంపొందినవి. వీనిదృష్టిలో వర్ణజాతి పదవీభేదములకు ప్రాముఖ్యము లేదు. ఆస్తిక తత్త్వములో సాంఘికోద్ధరణాశయ మిమిడియున్నది. ఒకే తల్లిదండ్రులైన దేవుని బిడ్డలమగుటచే మనమందరము సమానులమే. అధికులు నల్పులు నందరు బిడ్డలు తండ్రికి సమానాదరపాత్రులే.

శంకరుడు జ్ఞానమనగా కేవల సిద్ధాంతజ్ఞానమని చెప్పియుండలేదు గాని, శంకరుని శిష్యులలో కొందరు మతమనగా హృదయమునకు నిచ్చకు సంబంధించినది కాక, బుద్ధికి మాత్రమే సంబంధించినదని చెప్పు ధోరణిని ప్రదర్శించిరి.(౧) శాశ్వతమైన పారమార్థిక జీవితములో దోషకార్యదూషితమైన యాత్మకు వారు స్థానమీయలేదు. 'అహంబ్రహ్మాస్మి' వాక్యపారాయణము వివేకవిహితమగు భక్తిస్థానము నాక్రమింపజాలదు. అందుచే వైష్ణవశాఖాచతుష్టయముతో గూడిన ఆస్తికమతములన్నియు భక్తికే ప్రాముఖ్యము నిచ్చినవి.(౧) ఏభావభేదములున్నను నివన్నియు మాయావాదమును నిరసించుటలోను, సగుణుడగు నీశ్వరు నంగీకరించుటలోను, బరమాత్మలో నదృశ్యమైపోక, యీశ్వరునియందు జీవాత్మ తన యవిచ్ఛిన్నవ్యక్తి

---

(౧) పోల్చు: వాక్యార్థజ్ఞాన మాత్రాదమృతమితి. (తత్త్వముక్తాకలాపము. ౩, ౪౫.)

(౧) రామానుజుని శ్రీసంప్రదాయము; మధ్వుని బ్రహ్మసంప్రదాయము; విష్ణుస్వామి రుద్రసంప్రదాయము; నింబార్కుని సనకాది సంప్రదాయము.

త్వమును బరిపూర్ణ మొనర్చుకొనునని నిశ్చయించుటలోను నేకాభిప్రాయమును గలిగి యున్నవి.

## ౨ - ఆగమములు

క్రమముగా భారతవర్షములోని స్వదేశవాసు లాయ్యాల విజ్ఞాన ప్రభావసంపర్కము కలిగిన కొలఁదియు హిందూమతము మిక్కిలి వైశాల్యమును బొందినది. ఉన్నతసంస్కృతిగల ద్రవిడ జాతియు, వెనుకఁబడియున్న యాటవిక జనవర్గములును వైదిక యజ్ఞమత విధానమును, దేవాలయార్చన విధానమును, బహిరంగోత్సవపద్ధతులును బెంపొందుటకుఁ దోడ్పడినవి. క్రొత్త జాతులు వచ్చి చేరుచుండిన కొలఁదియు, గ్రొత్త శాఖలేర్పడ నారంభించినవి. ప్రతిశాఖకు విశిష్టములై తిలక, దీక్షా గురు మంత్ర శాస్త్రములు వెలసినవి. అతిప్రాచీన దశయందే, వైష్ణవ శైవశాక్తేయములు వరుసగా, పంచరాత్రసంహిత, శైవాగమము, తంత్రమునను ప్రత్యేక మతగ్రంథములతోఁ బెంపొందినవి.

ఆగమములు సామాన్యముగా నాలుగు భాగములుగా విభజింపఁబడినవి జ్ఞాన భాగము, యోగభాగము; క్రియాభాగ మనఁగా నాలయనిర్మాణ విగ్రహప్రతిష్ఠావిధానము; చర్యాభాగమనఁగా నర్చనకాండ (౧) ప్రతిమారాధనమునందు విశ్వాసముగల మతములకు సంబంధించునవే యాగమము లనిరి. ఏలన నవి ఆలయనిర్మాణ ప్రతిష్ఠాదులనుగూర్చి మిక్కిలి విపులములైన నియమములను నూత్రములను వర్ణించినవి. శాక్తేయ

(౧) పద్మసంహితా: ౧,౨,౬; ౨,౧,౩; ౩,౧,౬; ౪,౧,౧.

శైవము లించుమించుగా సమానధర్మములు గలవేకాని, శాక్తేయులు శివుని దేవియగు శక్తి నారాధించుటలోఁ గొన్ని యసంస్కృత పద్ధతుల ననుసరింతురు. దేవునికి భార్యయు బిడ్డలును గలరనునది సంస్కృతిలేని కాలపుభావము; మానవధర్మానుకరణము. సాంఖ్యము చెప్పు పురుషప్రకృతి సిద్ధాంతము శక్త్యారాధనమునకుఁ దాత్త్విక సామర్థ్యమును గూర్చినది. శివుఁడు తెలియుటకు, సమీపించుటకు నతీతుఁడైనవాఁడు,నిష్క్రియుఁడు నగుటచే, నతనితోఁ గలిసియుండియు నిత్యక్రియా శీలయగు శక్తివలన దైవానుగ్రహప్రాప్తి సాధ్యమగును.

తమిళ గ్రంథములగు నాలదియార్, శిలప్పతికారము, మణిమేఖలై, కురల్ మున్నగు వానివలన, క్రీస్తుశకారంభ శతాబ్దులలో దక్షిణ భారతవర్షమున జైనబౌద్ధమతముల ప్రభావము కొంతయుండెనని చూపట్టును. శిలప్పతికారము ననుసరించి, (క్రీ. వె. ౧-వ శతాబ్దము) కావేరీ పట్టణమున విష్ణ్వాలయములు, జైనబౌద్ధవిహారములు నుండెను. క్రీ.పూ. 3-వ శతాబ్దిలో నశోకుఁడు తన మతప్రచారకుల నంపెను. ఇంచుమించుగా నాకాలముననే, మౌర్యచక్రవర్తియగు చంద్రగుప్తునితో భద్రబాహువు దక్షిణాపథమునకు జైనులను వలస పంపెనని చెప్పు సంప్రదాయ చరిత్రమున్నది. తీవ్రభక్తివిశ్వాసము లంగీకరించి, కటాక్షించు పరమేశ్వరునిఁ గోరు ద్రావిడ దృష్టికి జైనబౌద్ధమతములు తృప్తినీయఁజాలవయ్యెను. ఏకేశ్వర మతములగు శైవవైష్ణవములు ప్రబలినవి; వారి యాగమముల ననుసరించి తద్భక్తులు ప్రవర్తించిరి.

## 3—పురాణములు

పురాణములు తత్త్వశాఖల కాలమందలి మతకావ్యములు, కథలు గాథలురచించి తన్మూలమున, నవి దైవమానవలోక సంఘ తత్త్వములను సంప్రదాయము ననుసరించి ప్రకటించినవి. ఆకాలమునందలి యవైదిక సిద్ధాంతములను వీలైనచో నున్మూలించు నుద్దేశముతో నవిరచింపఁబడినవి. తాత్త్విక సిద్ధాంతములను, ప్రాకృతజన విశ్వాసములతో మేళవించి వర్ణించు నానాభావసమన్వితము లీపురాణములు. పురాణకర్త వ్యాసుఁడని ప్రతీతి ౧ అవి వేదసంప్రదాయములనే యవిచ్ఛిన్నముగా వ్యక్తీకరించునట్లు ప్రకటించుకొన్నవి.౨. ఈపురాణములు౩ తత్త్వసిద్ధాంతములను ప్రకటించునుగాని యొకసమ

(౧) కొన్ని పురాణములు విష్ణుకర్తృత్వము జెప్పుకొనెను. చూ పద్మపురాణము. ౧,౬౨,౧౫.

(౨) వాయుపురాణము. ౧,౧౧,౧౯౮. ౨౦౨.

(౩) ముఖ్యపురాణము లష్టాదశసంఖ్యగలవి. విష్ణు, భాగవత, నారదీయ, గరుడ, పద్మ, వరాహపురాణములు వైష్ణవములు, శివ, లింగ, స్కాంద అగ్ని లేక వాయు, మత్స్య, కూర్మ పురాణములు శైవములు. ఇతరములగు, బ్రహ్మ లేక సౌర, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, మార్కండేయ, భవిష్య, వామనపురాణములు బ్రహ్మసంబంధములు. మఱియు నవివరుసగా సాత్త్విక, తామసరాజసములనియుఁ జెప్పఁబడును. చూ మత్స్యపురాణము. ౫౨. ఇవి మహాపురాణములనఁబడును. మఱియు నుపపురాణములుగలవు. ప్రతిపురాణము సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశానుచరితములను పంచలక్షణములను గలిగియుండును. పురాణము లితిహాసముల కర్వాచీనములు. అతిప్రాచీనమగు పురాణములు క్రీ॥ శకమునకుఁ బూర్వకాలమునకుఁ జెందునుగాని తరువాత వానిలోఁ గొన్ని మార్పులు చేయఁబడెను. "ఇవి క్రీ. పూ. ౫-వ

న్యాయ పద్ధతి ననుసరించలేదు. ప్రాచీన విజ్ఞానవేత్తల యుపదేశముల నందు ముఖ్యముగా వేదాంత సాంఖ్యోపదేశములను విస్తరింపఁజేయుటే వాని యాశయము. నామము ననుసరించియే యవి పురాతన సంప్రదాయములను గాపాడునవని తెలియును. ఇవన్నియు ఆస్తికములే; ఈశ్వర, జీవ, జడపదార్థ భేదముల నన్నియు నంగీకరించును. త్రిమూర్తి భావమున కౌన్నత్య మేర్పడెను; కాని ప్రతిపురాణమును విష్ణునకో, శివునకో ప్రాధాన్యాధిపత్య మిచ్చి వర్ణించును. విష్ణుప్రాధాన్యముగా నున్న పురాణమున శివుడు బ్రహ్మయు విష్ణు నర్చించుటే కాక విష్ణుభక్తుల నాదరింతురు ౧. భాగవతపురాణమున శివుఁడు ప్రచేతసునితో నిట్లు పలికెను: "విష్ణుపదార్పితచిత్తుఁడైనవాఁడు నాకుఁ బ్రియుఁడు ౨." భగవానుఁడీ జగత్తున కేకైకాధారము, మూలము, గతియునై యున్నాఁడు.3. ఏ పేరు పెట్టినను బరమేశ్వరునకు సకలకల్యాణ గుణములను బురాణము లారోపించును. "ఎవఁడింద్రియాతీ

శతాబ్దారంభకాలమున కైనఁ జెందియుండును. ఆపస్తంబుని కాలమింకను పూర్వతరమైనదని బుజువైనచో నీపురాణకాలము నింకొక, ౧౫౦ లేక ౨౦౦ యేండ్లు వెనుకకు జరుపవచ్చును." (పర్జిటర్; ప్రాచీన భారతవర్ష చరిత్ర సంప్రదాయము. పు. ౯౧.) ఇతరములుగాక, ఛాందో. ఉ. 3,౪,౧: శతపథబ్రాహ్మణము ౧౧,౫,౬,౮; అర్థశాస్త్రము, ౧, ౫—పురాణములను స్మరించినవి.

(౧) పోల్చు: విష్ణుపురాణము ౧,౨,౨. శక్తయో యస్య దైకస్య బ్రహ్మవిష్ణు శివాత్మికాః (౧.౯). చూ. భాగవతము. ౧,౨,౨3.

(౨) భగవంతమ్ వాసుదేవమ్ ప్రపన్నః ప్రియో హి మే. (౪,౨౪,౨౮) (చూ. ౪,౨౪,3౦)

(3) విష్ణుపురాణము. ౧,౨,౪.

తుఁడో, సర్వద్రవ్యములలో నుత్తమద్రవ్యమో; ఎవఁడు పరమాత్మయు, స్వయంస్థితి గలవాఁడునై, రూపవర్ణాది లక్షణ విరహితుఁడై, జన్మజరామృత్యువులు గాని, వృద్ధిక్షీణతలు గాని లేక నిర్వికారుఁడై యుండునో; ఎవఁడద్వితీయుడు నిత్యుఁడునై, విభువై, విశ్వగర్భుఁడై ప్రకాశించునో యట్టి వాసుదేవుఁడనఁబడిన వాని నెవరు వర్ణింపఁగలరు?"౪. ప్రకృతి, తత్పరిణామమును గూర్చి సాంఖ్యము చెప్పినదే యంగీకరింపఁబడెను గాని.ప్రకృతి పరిణామ మీశ్వరాధీనమై నడచునని నిశ్చయింపఁబడెను. ప్రకృతియే యీశ్వరుని దేవిగా వర్ణింపఁబడెను. విష్ణుపురాణతృతీయాధ్యాయారంభమున మైత్రేయుఁడు పరాశరు నిట్లడుగఁగా, "శుద్ధబ్రహ్మమునకు సర్గాది కర్తృత్వమెట్లు చెప్ప వీలగును?", అగ్నియం దుష్ణమువలె సర్వసృష్టియు నాతని యందే యున్నదని బదులు చెప్పఁబడెను.౧. జగద్వాస్తవికత్వమును బురాణము లంగీకరించును;జగన్నిరసనము నిమిత్తమే మాయాశబ్దము నుపయోగించును.౨.

మత విషయములోఁ బ్రార్థనాయజ్ఞములతోఁ గూడిన వైదికారాధనము, భక్తి ప్రతిమారాధనములుగా మారిన సంగతి విస్పష్టము.పౌరాణిక ధర్మము సంప్రదాయ వ్యతిరేకము గాదు. కర్మ పునర్జన్మసిద్ధాంతమును, ధర్మజ్ఞాననిష్ఠ వలన మోక్షావకాశము నంగీకరింపఁబడెను. ఏయొక తత్త్వమునకో తలయూపుటకాక, యీశ్వరుని యందచంచల భక్తియే కలి

(౪) విష్ణుపురాణము. ౧,౨,౧౦.

౧. ౧, ౩. ౨. పద్మపురాణము, ౬, ౨౬౩, ౭౦.

ముగముముత్తమ మోక్షసాధనమని చెప్పఁబడెను. 3. పర్వతములనైనఁ గదలించునదే భక్తి; భక్తికసాధ్యములు లేవు. ౪. కృపుడు, సత్పురుషుఁడై, పవిత్రుఁడై, సర్వజీవకోటికి శుభమును జేకూర్చు మహాంత మాపురుని యాతనితల్లి యుపదేశించెను ౫. "ఎవఁడు తన వర్ణధర్మమును విడువక, మిత్రామిత్రభేదవృత్తి లేనివాఁడై, పరుల ధనమును కాసింపక, యేప్రాణి కెన్నఁడ పకృతి చేయక, పరిశుద్ధచిత్తుఁడై యుండునో యాతఁడే విష్ణుభక్తుఁడని తెలిసికొనుము," ౧. సంపదయే గౌరవకారణమై. ధనమే సచ్ఛీలమై. మోహమే స్త్రీపురుషుల సంబంధసూత్రమై. అసత్యమే జీవిత విజయహేతువై. కాంతాసంగమమే యైహిక సుఖసాధనమై, బాహ్యోపాధివర్గమే, అంతరాత్మయని యేసంఘమున వ్యాప్తిగాంచునో ఆసంఘము శిథిలతగాంచును. ౨. అట్టిసంఘము నుద్ధరించుట కొకరక్షకుఁడవసరము. ఈశ్వర

3. భాగవతము, ౧౨, 3, ౫౨ భాగవతము భక్తిసోపాన భేదములను వివరించును.

శ్లో॥ శ్రవణమ్ కీర్తనమ్ విష్ణోస్స్మరణమ్ పాదసేవనమ్,
అర్చనమ్ వందనమ్ దాస్యమ్ సఖ్యమాత్మనివేదనమ్,
(౭-౫-౨3)

౪. ౧, ౧౨, ౫, విష్ణుపురాణము, ౧,౧,౧.

౧. విష్ణుపురాణము 3,౭.

౨. అర్థఏవాభిజనహేతుః, ధనమే వాశేషధర్మహేతుః, అభిరుచిరేవ దాంపత్య సంబంధహేతుః, అనృతమేవవ్యవహారజయహేతుః, స్త్రీత్వమేవ ఉపభోగహేతుః..., బ్రహ్మసూత్రమేవ విప్రత్వహేతుః, లింగధారణమేవ ఆశ్రమహేతుః..."

విష్ణుపురాణము. ౪.౨౪.౨౧-౨౨

సాదృశ్యమే మోక్షము. ౩. రామానుజమతము విశేషముగా విష్ణుభాగవత పురాణములకు ఋణపడి యున్నది.

## ౪—రామానుజజీవితము

క్రీ. శ. ౧౦౧౭-వ సంవత్సరమున శ్రీపెరుంబుదూరులో రామానుజుఁడు జన్మించెను. చిన్ననాఁడే యాతనితండ్రి స్వర్గస్థుఁడయ్యెను. కులస్థులైన బాలురకానాఁడు లభించు విద్యాశిక్షణమైన వెనుక, కాంచీపురములోని యాదవప్రకాశునొద్ద రామానుజుఁడు వేదాంతమభ్యసించెనుగాని, గురువుగారి యర్థనిర్ణయము లన్నివిషయములలో నాతఁడంగీకరింపలేదు. సుప్రసిద్ధ శ్రీరంగమఠాధిపతియగు ఆళవందారు రామానుజుని పాండిత్యమున కచ్చెరువంది, శ్రీరంగ మఠాధిపత్యమాతనికీయ నిశ్చయించెను. అలవందారు కవసానదశవచ్చినప్పుడాతని శిష్యులు రామానుజునిఁ దోడ్కొనిరమ్మని పెరియనంబి నంపిరి. రామానుజుఁడు వచ్చులోపుననే గురువు మరణించెను. రామానుజుఁడాలవందారు మృతదేహమును సమీపింపఁగా నాతని కుడిచేతి మూఁడువ్రేళ్లు ముడుచుకొనియుండెను. మూఁడుకోరికలు మిగిలిపోయినవనియు నందు ముఖ్యమైనది, బ్రహ్మసూత్రములకొక సులభమైన భాష్యరచనమనియు శిష్యులు దానికర్థము చెప్పిరి. రామానుజుఁడు కాంచీపురమునకుఁ దిరిగివచ్చి, తన దైవప్రార్థనములను యథారీతిగాఁ జేయు చుండెను. ఒకనాఁ

౩. అనుభవములలో భక్తి యొగ్గడింపఁబడెను. కాని సంతృప్తికొఱకు విశేషస్వేచ్ఛ యొసఁగఁబడెను మంత్ర, యంత్ర, యోగసాధనల కధిక[illegible]న మీయఁబడెను.

సుత్కట విచారములో నాతఁడు తద్భావికర్తవ్యమునుగూర్చి దైవసంకల్పమెట్లున్నదో కనుగొనుమని దేవాలయార్చకు నడిగెను. దైవసంకల్ప మొక శ్లోకరూపకముగా నిట్లుచెప్పఁబడెను: "నేనేపరతత్త్వమును; భేదమే నామతము; ప్రపత్తియే నిరపాయ హేతువు; స్వప్రయత్నమవసరములేదు; అంత్యకాలమున మోక్షము సిద్ధింతును. పెరియనంబియే ఉత్తమదేశికుఁడు."(౧) దైవమిట్లు పలికెను; లేక రామానుజుఁడు దైవవాణి నిట్లువిని, దాని ననుసరింప నిశ్చయించెను. మధురాంతకమందున్న పెరియ యనంబి నాతఁడు కలిసికొని, వానివలన వేదాంతరహస్యోపదేశము నొందెను. మహాపురుషుల కనుకూలవతియగు సతీమణి లభించు టరుదు; తనలక్ష్యములకై కృషిచేసి, యాతని శక్తుల నతిశయింపఁ జేయునట్టిది రామానుజునిభార్య కాకపోయినది. దాంపత్యమందు ననుకూలత దాచుటకు శక్యముకానిది; రామానుజుఁడు తన మరదృష్టమును గ్రహించినాఁడు బుద్ధశంకరులవలెను, ప్లేటో, పాల్ లవలెను, నీశ్వరసామీప్యమును లేక మానవపరిపూర్ణత్వ శిఖరముల నందుకొనుటకు సర్వసంగత్యాగమే సాధనమని నిశ్చయించెను. సన్న్యసించిన యాతనిని జనులందరుమెచ్చి, యతిరాజని నుతించిరి. రామానుజుఁడు శ్రీరంగమున స్థిరనివాసియై, తిరువాయి మోయిని గూఢార్థముల నభ్యసింతును. బోధా

(౧) శ్రీమాన్పరమ్ తత్త్వమహమ్, మతమ్ మే భేదః, ప్రపత్తిర్నిరపాయ హేతుః, నావశ్యకీచ స్మృతిః అంత్యకాలే మోక్షో మహాపూర్ణ ఇహాచార్యః

జీవితాంతమందు సర్వమానవులు మోక్షమునుపొందుదురనునది పాంచ రాత్రముల కేంద్రలక్షణము, చూ. వేదాంతదేశికుని పాంచరాత్రరక్షా.

యనవృత్తిని కంఠస్థముగా నెఱిగిన శిష్యుఁడగు కురుత్తాళ్వారు సాయమున రామానుజుఁడు వేదాంతసారమును, వేదార్థసంగ్రహమును, వేదాంతదీపమును, బ్రహ్మసూత్ర గీతాభాష్యములను రచించెను. వైష్ణవపండితులెల్లరు రామానుజ బ్రహ్మసూత్రార్థవివరణము నంగీకరించిరి. అదియే వైష్ణవులకు శ్రీభాష్యమయ్యెను. దక్షిణాపథమెల్లెడ సంచారముచేసి, రామానుజుఁడనేక శిథిలదేవాలయములను పునర్నిర్మాణముచేసి, అసంఖ్యాకులను వైష్ణవులగా మార్చెను. మహాజ్ఞాన సంపన్నుఁడు తన యుగమునకుఁ బ్రవక్తయై తనకు లభించిన సంప్రదాయసిద్ధమగు ప్రాచీన విజ్ఞానమును దన జీవితములోఁ బునరనుభూతికిఁ దెచ్చెను. రామానుజునికి సహవాసము నొసగిన భక్తులు జ్ఞానులు నిత్యధ్యాన వైరాగ్యములతో దమ జీవితములఁ గడపిరి. ఆల్వారుల గీతములు వారిహృదయములలోఁ బరమేశ్వరుఁడు నిండారి, పొంగి పొరలించిన మహత్తరావేశ భక్తిపూరితములు. వలన వారికి భగవానుఁడనఁగా జగత్కర్త యేకాదు; సన్నిహితమిత్రుఁడు, మార్గదర్శియు నైనాఁడు. జన్మసహజమైన భక్తిభావము రామానుజునికిఁ బరమేశ్వరు నొక వ్యక్తిగాఁ బ్రదర్శించినది. శంకర రామానుజు లిరువురు వేదాంత మహాప్రవక్తలే. వారి చిత్తములలో సమాన సమస్య లుదయించినవి. వారి కాధారములగు మూలగ్రంథములును సమానములే; వారి వివరణపద్ధతు లించుమించుగా సమాన ప్రతిపాదనలపైననే సాగినవి; కాని ఫలితములుమాత్రము విస్పష్ట భిన్నత్వమును సూచించినవి. వారుచేసిన

నిర్ణయములు, పరమార్థసంగ్రహణములో వారి భిన్నములగు చూపులను బ్రదర్శించినవి. రామానుజుఁడు సహజమతాను భూతిని గట్టిగానమ్మి సృష్టిరచనవలనను. నవతార ప్రవక్తల వలనను, సాక్షాత్కారముల వలనను, మానవునకు గోచరించు పరమేశ్వరునివ్యక్తీకరించు నిగూఢమగు ననుష్ఠాన భక్తిమార్గము నాతఁడు ప్రకటించినాఁడు. బ్రహ్మసూత్రములయందు నువనిషత్తులయందు నవ్యక్తనిగూఢత్వము నందియున్న భావముల నాత: డాల్వారులయొక్కయు నాచార్యుల యొక్కయు సాంగత్యముచే బహిర్గతము లొనరింపఁగలిగెను. ఆతఁ డెన్నఁడును దానొక స్వతంత్రమగు తత్త్వము నుపదేశించుచున్నట్లు భావింపలేదు. సార్వకాలికమైన బ్రహ్మజ్ఞానమునే యాతఁడు ప్రకటించుచున్నట్లు విశ్వసించెను.

౫ - చరిత్ర సారస్వతము

ఇతిహాసారంభ యుగమునుండి యించుమించుగా వైష్ణవోద్యమ మవిచ్ఛిన్నముగాఁ బ్రబలిన చరిత్రమున్నది. ఋగ్వేదమునందు విష్ణువు పరమపదనివాసియైన ఆదిత్యదేవతగా భావింపఁబడెను. ౧. వరుణ దేవతాభావము బలవత్తరమగు నేకేశ్వరవాదలక్షణ లక్షితమైయున్నది. వేదములందు మనకు శుభాశీర్వచన ప్రదాతయగు భగదేవతా భావమున్నది. ఈభగశబ్దము నకు శ్రేయశ్శక్తియనుభావము పెంపొందింది, క్రమముగా నట్టిశక్తిగలవాఁడే భగవానుఁడని తలపఁబడెను. భగవదారాధనతోఁగూడిన మతమే భాగవతమతము. భాగవతమతమును

(౧) వి ష్ణోః పరమమ్ పదమ్॥

గూర్చి మహాభారతము స్మరించినది. భాగవతమతమే వైష్ణవ మతమై భగవానునే విష్ణువుగా గ్రహించెను. మహాభారతములోఁ జెప్పఁబడిన పంచరాత్రమతమున వైష్ణవమత లక్షణములన్నియు నున్నవి. ఇతిహాసములలో విష్ణువునకుఁ బ్రత్యర్థిగా శివుఁడు పేర్కొనఁబడెను. కాని విష్ణుపురాణమునందు విష్ణువు దేవదేవత్వ మప్రతిమానము. భాగవతపురాణము (క్రీ. వె. ౯౦౦) కృష్ణునే ప్రధానముగా వర్ణించిన భాగవతమతమునే ప్రకటించినది. ఇందలి భక్తి మహదావేశపూరితము; జీవేశ్వర సంబంధము నాయకీనాయక సంబంధముగాఁ బ్రదర్శింపఁబడెను. దక్షిణాపథమునకు భాగవతమతము క్రీ. ప్రథమ శకారంభమునకుఁ బూర్వమెపుడో వచ్చియుండెనని నానాఘాట్ శాసనమువలన స్పష్టమగుచున్నది. కలియుగమందు నారాయణారాధకులసంఖ్య, దక్షిణదేశములో నధికముగా నుండునని భాగవతము చెప్పుచున్నది.(౧) ప్రామాణ్యసిద్ధిఁ గాంచిన ద్వాదశాళ్వారుల గీతములు నాలాయిర ప్రబంధమను (౨) సామాన్య

(౧) ౧౧, ౫-౩౮-౪౦.

(౨) ఈగ్రంథము ౪,౦౦౦ పద్యములు గలది నాలుగు భాగములుగా విభజింపఁబడెను. మొదటిది ముదలాయిరము; ఇందు పెరియాళ్వారు, ఆండాల్ మున్నగువారి వాక్యము లున్నవి. రెండవది తిరుమంగయాళ్వారునిదైన పెరియతిరుమొరి. మూఁడవది సుప్రసిద్ధమైన నమ్మాళ్వారుని తిరువాయ్మొరి. నాల్గవదగు 'ఇయర్ప' మొదటిదానివలెనే యనేకాళ్వారుల వాక్యసంకలనము. నమ్మాళ్వారుని తిరువాయిమొరి, తమిళ్ వేదస్వరూపమని చెప్పుదురు. పోల్చు: "వేదమ్ తమిళు సెయ్దమారన్"; మఱియు:—

నామముతోఁ బిలువఁబడెను. ఈయాల్వారులలో నొకస్త్రీయు, ఁబెక్కురు శూద్రులు, నొక భూపాలుఁడును గలరు. పిరియనంతరము సగుణారాధనము వలన నీశ్వరానుగ్రహము లభించునను విశ్వాసమునకుఁ దాత్త్వికాధారమును నిర్మించు నాచార్యులు బయలుదేరిరి. రామానుజపూర్వాచార్యపరంపరలో ముఖ్యులు నాథముని, ఆలవందారు, యామునాచార్యుఁడు. పన్నిద్దరాల్వారులలోఁ జరమాల్వారు శిష్యుఁడైన నాథముని (క్రీ. వె. ౧౦-వ శతాబ్దము) ఆల్వారుల యుపదేశవాక్యముల నొక పద్ధతిలోనికిఁ దెచ్చెను. న్యాయతత్త్వమును యోగరహస్యము నితఁడే వ్రాసెనందురు. వేదార్థమునే వైష్ణవాగమములు ప్రతిపాదించు నని సమర్థింప యామునాచార్యుఁడు మిక్కిలి శ్రమపడెను. ఆతని ముఖ్యరచనములివి: ఆగమప్రామాణ్యము, మహాపురుష నిర్ణయము, సిద్ధిత్రయము, గీతార్థసంగ్రహము, చతుశ్శ్లోకి, స్తోత్ర

---

కూర్మేకలియుగే ప్రాప్తే నాస్తికైః కలుషీకృతే,
విష్ణోరంశాంశ సంభూతో వేదవేదార్థతత్త్వవిత్
స్తోత్రం వేదమయంకర్తుమ్ ద్రావిడ్యాపిచభాషయా
జనిష్యతి సతాంశ్రేష్ఠో లోకానాం హితకామ్యయా."

(భవిష్య పురాణమ్)

తిరువాయిమోయిని గూర్చి నాథముని యిట్లు చెప్పెను; "సహస్రశాఖోపనిషత్సమాగమమ్, ద్రావిడవేదసాగరమ్." తిరువాయిమోయి యొక్క ప్రధాన విషయము అర్థపంచక ప్రవచనము (౧) పరమాత్మ (౨) జీవాత్మ (3) రెంటి సంబంధము (౪) అనిష్టనాశనము (౫) ఇష్టసిద్ధి.

రత్నము. వైష్ణవుల మతసారస్వతము నుభయవేదాంతనామ మునఁ బిలుతురు; ఏలన నందు సంస్కృత ప్రస్థానత్రయము, తమిళ ప్రబంధము కూడ నున్నవి. ఆల్వారుల గీతములు, శ్రుతి స్మృతి వాక్యసారము నే ప్రకటించునని చిరసంప్రదాయ విశ్వాస మున్నది. శంకరుని నిరంకుశమైన అద్వైతవాదమువలన, రామానుజుఁడు తిరిగి, వేదోక్తమైన యేకేశ్వరమతమును బునఃప్రకట నము చేయవలసి వచ్చినది. బోధాయనవృత్తి యందలి భావ ములనే తాను విస్తరింపఁ జేసితిననియు,తంక, ద్రమిడ,గు. గుహ దేవ, కపర్ది, భారుచులుఖ. తనతో సమానభావములు గలవా రేయనియుఁ జెప్పినాఁడు. రామానుజుఁ డుగ్గడించిన యేకేశ్వర వాదముయొక్క పురాతనత్వమును శంకరుఁ డంగీకరించును. అందుచే రామానుజమతమునకుఁ బూర్వమూలములుగా నేకే శ్వరప్రతిపాదకోపనిషత్తులు, నారాయణీయ ప్రకరణముతోఁ గూడిన మహాభారతభాగములు, భగవద్గీత, విష్ణుపురాణము వైష్ణవాగమములు, ఆల్వారులయు నాచార్యులయు రచనములు నని చెప్పవచ్చును. ఉపనిషద్గీతా బ్రహ్మసూత్రార్థముతో వైష్ణవభక్తుల భావములకు సమన్వయమును గూర్చునవే రామా నుజుని ముఖ్యరచనలు. ఆతని స్వతంత్రప్రతిభ కెంత స్థాన మున్నదో నిర్ణయించి చెప్పుట సులభముకాదు కాని, యతనిచే రచింపఁబడిన శ్రీభాష్యము, "బ్రహ్మసూత్రములలో నేకేశ్వర తత్త్వమున కాధారములను గనుగొను యత్నములన్నిటిలో నాతని యత్నమే విశేషగుణసంపూర్ణత్వములచే నిరుపమానమై

ప్రకాశించుచున్నది."౧. రామానుజుని భక్తి, తత్పూర్వుల కంటెను, ననంతరకాలికుల కంటెను నధికముగాఁ జాత్త్వికము, నియమనిబద్ధము నైనది. వేదవిధి కర్మవిధానముల నిరసింప నాతఁడుద్యమింపలేదు; పౌరాణిక గాథల కధిక ప్రాముఖ్యము నాతఁడీయలేదు, భక్తివలన మోక్షము లభించునని ప్రకటించి, యదియే ప్రస్థానత్రియ ప్రధానసందేశమని నిరూపించుటకే యాతఁడు యత్నించెను. రామానుజ భాష్యమునకు సుదర్శన భట్టు విరచిత శ్రుతప్రకాశికయే గణ్యమైన టీకయైయున్నది.

ఇంచుమించుగా ౧౩-వ శతాబ్దముననే దక్షిణోత్తరములగు తెంగలె వడగలె శాఖలకు భేదములు ప్రబలెను. తెంగలే శాఖ తమిళప్రబంధమే మతగ్రంథమనినమ్మి, సంస్కృతగ్రంథములయెడ నౌదాసీన్యము చూపెను. వడగలె శాఖకు రెండును సమానప్రమాణములే. తెంగలులు దోషభోగ్యమను ప్రమాదకర సిద్ధాంతము నంగీకరించిరి; అనఁగా భగవానుఁడు పాపము ననుభవించును; ఏలన దానివలన నాతని యనుగ్రహము చూపుట కెక్కుడవకాశమున్నది,౨. వడగలు తమిళముకంటె

(౧) కీత్, ఇ. ఆర్. ఇ. వాల్యూము. ౧౦, పు. ౫౭౨.

(౨) చూ ఓస్కార్ హైల్డు డిప్రొఫండిస్: "క్రీస్తు, తనలోని యే దైవ లక్షణమువలననో, మానవునిలోఁ బరిపూర్ణత కత్యంతసన్నిహిత సంబంధ ప్రాప్తికిఁ బాపిని ప్రేమించుటే మార్గమని యట్లుచేసెను. దానియర్థమింకను దెలియనిరీతి నాతఁడు: పాపములు దుఃఖములు స్వయముగా సుందరములగు విషయములనియు, నవి పవిత్రములైన పరిపూర్ణతాంశములనియు నాతఁడు చూపినాఁడు"

నధికముగా సంస్కృతము నుపయోగించి, లక్ష్మీభావమునకు శాక్తేయ మతాంశములను గొన్నిటిని స్వీకరించిరి.3.

పిళ్లె లోకాచార్యుఁడు తెంగలె శాఖకు ముఖ్యప్రతినిధి. ఈశ్వరానుగ్రహ మమోఘమైనదనియు దానిని గేవలభక్తి చేతనే గాక, ప్రపత్తిచేఁగూడ సాధింపవలెననియు నాతఁడు బోధించెను. గురువునకు సంపూర్ణాత్మసమర్పణమే చేయవలెనని యీశాఖవారి మతము. ఇది రామానుజుఁడు చెప్పిన వివేక సహిత గురుశుశ్రూషాపద్ధతి గాదు. రహస్యములనఁబడు నష్టాదశ గ్రంథములను లోకాచార్యుఁడు రచించెను. అర్థపంచక' తత్త్వత్రయములందు ముఖ్యములు తెంగలెశాఖలో మనవాల మహాముని ప్రధానభక్తుఁడు.

రామానుజానుయాయులలో నగ్రగణ్యుఁడగు వేదాంత దేశికుఁడు లేక వేంకటనాథుఁడు (౧౩-వ శతాబ్దము) వడగలె శాఖాస్థాపకుఁడు. కాంచీపురము జన్మస్థానమయ్యు నధికజీవిత కాలము నాతఁడు శ్రీరంగమునఁ గడపెను ఆతఁడనేక విషయములగూర్చి విపులరచనలు చేసెను గాని యాతని ముఖ్య గ్రంథము లాతనిచేఁ దమిళభాషలో రచింపఁబడిన పరమత భంగ రహస్యత్రయసారములై యున్నవి. ఆతని పాంచరాత్ర

---

(3) విష్ణుపత్నియగు లక్ష్మియు విష్ణువవలెనే జన్మరహిత యనియు విష్ణువుతో సమముగాఁ గృపఁజూపుననియు నర్చించవలెనని వారనమ్ముదురు. ఆమెకు జన్మమున్నదనియు, దైవకృప కామె సాధనశక్తియనియు తెంగలె శాఖవారుతలఁచిరి. చూ. ఆహా. దశభేదములు గోవిందాచార్యస్వామి జె.ఆర్. ఎ. యస్. ౧౯-౧౦.

రక్ష, సచ్చరిత్రరక్ష, పంచరాత్రశాఖానియమాచారములను వివరించును. శ్రీభాష్యమునకు తత్త్వటీకను, గీతాభాష్యము నకు తాత్పర్యచంద్రికను నాతఁడు రచించెను. పూర్వోత్తర మీమాంస లొకేతత్త్వ భాగములనియు, దైవయాజమాన్త్ర ముఁగాక, కర్మ ఫలము నీయఁజాలదనియు నాతఁడు వాదించి సేశ్వరమీమాంస యను గ్రంథమును రచించెను. ఆతఁడింకను రచించిన న్యాయసిద్ధాంజనము, తత్త్వముక్తాకలాపము, తద్వ్యాఖ్యయగు సర్వార్థసిద్ధియు నుపయుక్త రచనములు. ఆతనిఖండన గ్రంథము శతదూషిణి అద్వైతమును నిరసించినది; దానికి భాష్యమొకటి చండమారుత మనునది, (౧౭-వ శతాబ్దము) పైదానితో సమానమైన ఖండనగ్రంథమే, శ్రీనివాసాచార్య కృత యతీంద్రమత దీపిక పదునేడవ శతాబ్దములోఁ బ్రధాన గ్రంథము. శైవమతావలంబియయ్యు నప్పయ్యదీక్షితుఁడు పెక్కు వైష్ణవగ్రంథములకు వ్యాఖ్యలువ్రాసెను.[౧] రామానుజమతమును సమర్థించుటకై, రంగరామానుజుఁ (౧౬-వ శతాబ్దము) డుపనిషత్తులకు భాష్యములు వ్రాసెను. రామానుజునిప్రభావ మనంతర హిందూమత చరిత్రమందు నేటికిని దృశ్యమానమగుచున్నది. మధ్వ,వల్లభ, చైతన్య, రామానంద, కబీరు, నానక్ నడపిన యుద్యమములందు వారును, సంస్కార

---

౧. ఒకకాంచీపుర పండితసభలో శివవిష్ణువులకు భేదము లేదనియుఁ నందుచేఁ దాను శివు నర్చించుచుంటిననియుఁ జెప్పెను. "మహేశ్వరేవా జగతామధీశ్వరే, జనార్దనేవా జగదంతరాత్మని, నవస్తుభేద ప్రతిపత్తిరస్తుమే, తథాపిభక్తి స్తరుణేందుశేఖరే."

మతమగు బ్రహ్మసమాజమును, రామానుజ ప్రోక్తమగు నేకే
ఎ —ప్వమున కెంతయు ఋణపడియున్నారు.

౬-భాస్కరుఁడు.

క్రీ.వె, ౯౦౦ ప్రాంతమున, భాస్కరుఁడు భాస్కర భాష్య మను నొక బ్రహ్మసూత్ర భాష్యమును రచించెను.౧. ఇది యొక మతశాఖకుఁ జెందిన గ్రంథముకాదు. శంకరుని వాదమునుగాని, పంచరాత్ర వైష్ణవవాదమునుగాని యిది సమర్థించుటకుఁ బూనుకొనలేదు. భాస్కరుఁడు భేదాభేదవాదమును సమర్థించెను.౨. బ్రహ్మమనగా సర్వభేదవిరహితమగు శుద్ధచైతన్యరాశి కాదు. సర్వసంపూర్ణగుణ సంపన్నమైనది. బ్రహ్మము యొక్క కారణరూప మేకత్వమును, కార్యరూపము నానాత్వమునుగా భావింపఁబడెను.3. కారణ మూలరూపములలో వస్తువుల భేదములు; కార్యపృథగ్రూపములలో భిన్నములు. నిప్పు గడ్డిని హరించినట్లు భేదము భేదమును హరించునది కాదు. రెండును సమానముగా సత్యములే. పరిణామము నిజమేయని భాస్కరుఁడు నమ్మెను.౪. మాయావాదము ప్రామాణ్యవిరహితమనియు బౌద్ధసంపర్క సంభూతమనియు భాస్కరుని

(౧) ఇతని భావముల నుదయనుఁడు తన కుసుమాంజలిలో ఖండించెను (క్రీ॥వె॥ ౯౮౦)

(౨) దీనిపై విమర్శనమునకు, చూ॥ రా॥ భా॥ ౧, ౧, ౪.

(3) కార్యరూపేణ నానాత్వమ్, అభేదః కారణాత్మనా॥ (భాస్కరుఁడు: ౧,౧,౪.)

(౪) భాస్కరీయస్తు చిదచిదంశావిభక్తమ్ బ్రహ్మద్రవ్యమ్, అచిదంశేన విక్రియతే॥ (సర్వార్థసిద్ధిః 3,౨౭.)

మతము. జడజగత్తు నిజముగా నున్నదనియు, నది బ్రహ్మలక్షణయుక్తమే యనియు నాతనివాదము. జడపదార్థము బ్రహ్మముపై వర్తించినపుడు దేహేంద్రియరూపమగు నుపాధిగామారి, జీవోత్పత్తికారణ మగును. ఉపాధులు మాయాకల్పితములు గావనియు, యథార్థములేయనియు నాతని విశ్వాసము. సహజముగా జీవాత్మ బ్రహ్మముతో నేకమేకాని యుపాధివశమున వేరై యున్నది.౧. జీవబ్రహ్మ సంబంధమున కగ్ని విస్ఫులింగసంబంధముపమానముగాఁ జెప్పఁబడెను. బ్రహ్మమునకు నుపాధులకుఁ గల సంబంధ జ్ఞానలోపముచే సంసార మేర్పడినది. తపోధర్మములచే, వానిభేదము నెఱిఁగించో మనము తరింతుము. జీవాత్మల పునర్జన్మము, తన్మూలమునఁ గలుగు దుఃఖమును బ్రహ్మము నిజముగా ననుభవించునని భాస్కరుఁడు తలఁచినాఁడు. కర్మ మోక్షసాధనమగు జ్ఞానాంగమని యాతఁడు చెప్పును. ఆతఁడు రామానుజుని వాదమును, లేక జ్ఞానకర్మ సముచ్చయవాదము నంగీకరించునని చెప్పవచ్చును.

## ౭—యాదవప్రకాశుఁడు.

కొంతకాలము రామానుజుని గురువైన యాదవప్రకాశుఁడు క్రీ. వె. ౧౧-వ శతాబ్దములో కాంచీపురమున జీవించి, అద్వైతార్థప్రతిపాదకమగు నొకస్వతంత్రభాష్యమునురచించెను.

---

(౯) మహాయానిక బౌద్ధగాథితమ్ మాయావాదమ్॥ (భాష్యము ౧,౪,౨౯.)

(౧) జీవపరయోశ్చ స్వాభావికోఽభేదః; ఔపాధికస్తు భేదః। భాస్కరుఁడు, ౪,౪,౪; చూ. ౪,౪,౧౯; ౨,౩,౧౮.

బ్రహ్మపరిణామవాదము నాతఁడు ప్రతిపాదించెను. బ్రహ్మము చిత్తుగాను, అచిత్తుగాను, ఈశ్వరుఁడుగాను మార్పు నిజముగాఁ బొందెనని యాతనిమతము. ఈశ్వరుఁడు చిద్రూపమన్నచోఁ, జేతనాచేతన రూపములన్నియు నొకవస్తువుయొక్క అవస్థాభేదములని చెప్పనొప్పును. దీనినే భేదాభేదవాదమందురు. బ్రహ్మము పరివర్తనమందినను దనస్వచ్ఛతను గోల్పోవదు. ఒకవస్తు వేకకాలమున నేకత్వభిన్నత్వములుఁగలదనుటలో యాదవునికి విరోధమేమియుఁ గాన్పింపలేదు. సర్వవస్తువులు సర్వకాలములలో గోచరించుచున్నవని యాతఁడుచెప్పెను. కారణజాతి ద్రవ్యరూపమున వానికభేదమనియుఁ, గార్యవ్యక్తిరూపమున వానికి భేదముగలదనియుఁ జెప్పఁబడెను. బ్రహ్మజగత్తులు రెండు నీరీతిగా భేదాభేదములై యున్నవి.(౧) పరిచ్ఛిన్నములగు జీవాత్మల పాట్లన్నియు బ్రహ్మముపడునని భాస్కరుఁడుజెప్పఁగా, బ్రహ్మము సహజస్వచ్ఛతతో నెప్పుడును బ్రకాశించునని యాదవుఁడు చెప్పెను.(౨) జీవేశ్వర జడపదార్థములు బ్రహ్మ వికారములుగాక, మూలరూపములేయన్నచో, మనము భ్రమావశులమని తెలియఁగలదు. బ్రహ్మమొక్కటే యథార్థద్రవ్యము మిగిలినవన్నియు నందుండి జనించినవే. యాదవుని దృష్టిలో భిన్నత్వమేకత్వముతో సమానముగా యథార్థమైనది; భాస్కరునిభావములో భేదములుపాధిమూలములు; ఉపాధులు యథార్థములే; ఏకత్వము మూలసత్యము. చిదచిదీశ్వరులు పార

(౧) సర్వార్థసిద్ధి 3 అ. ౨౭.

(౨) భాస్కరుఁడు ౧,౧,౧౭.

మార్థికముగా యథార్థములని భావించుటచే సంసారభ్రమగా ముత్పన్నమగుచున్నది. ఈయజ్ఞానమును బోగొట్టుటకు జ్ఞాన కర్మలు రెండునవసరములే.

బ్రహ్మమునకు నీశ్వరునకు భేదము ప్రమాణవిరుద్ధమని రామానుజుఁడు విమర్శించును. ఈశ్వరున కతీతుఁడెవ్వఁడును లేఁడు. ఈశ్వరుఁడు బ్రహ్మమునకు వికారరూపమనుట యుక్తము. జీవేశ్వరపదార్థ శక్తులకు, శక్త్యాశ్రయమైన బ్రహ్మమునకును గలసంబంధము విస్పష్టముగాఁ జెప్పఁబడలేదు 3.

## ౮ - జ్ఞాన ప్రమాణములు

రామానుజుఁడు ప్రత్యక్షానుమానశబ్ద ప్రమాణముల నంగీకరించి, తక్కిన వానియెడ నుదాసీనతవహించెను. వాని యనుచరులొకటి రెండధికముగాఁ జేర్చిరి. భేదమువలన వ్యక్తీకరింపఁబడినదే ప్రత్యక్ష విషయము. దానికొక రూపమును నిర్ణంచు జాతిలక్షణము గలదు. ౧.

ప్రత్యక్షమున సవికల్పక నిర్వికల్పక భేదమున్నదని రామానుజుఁ డంగీకరించును. నిర్వికల్పక ప్రత్యక్షమనఁగా కేవల భేదరహిత విషయగ్రహమును గాదు. గుణములతో నన్యోన్యసంబంధములేని సగుణవిషయ గ్రహణమునుగాదు. అది నిర్గుణవిషయ గ్రహణము కాదేలన, గుణభిన్నత్వలక్షణ

(3) తత్త్వముక్తాకలాపము, 3 అ. ౨౮.

౧. వస్తుబాహ్యలక్షణములు ప్రత్యక్షవిషయములు. మన మొక ధ్వని వినినప్పుడు శ్రోత్రేంద్రియవృత్తి బహిర్గతమగును. వాయు వింద్రియవిషయము, గంధశూన్యమయ్యు, రూపస్పర్శలకు విషయము.

విరహిత వస్తుదర్శనము దుస్సాధ్యము వైలక్షణ్యమే చిత్తముఖ్యలక్షణ మగుటచేఁ గొన్ని విశిష్టలక్షణములు లేనిదే వస్తువును మనము తెలియఁజాలము. ఒకవిశిష్టలక్షణ సహిత వస్తుగ్రహణమే జ్ఞానలక్షణమై యున్నది. ౨. ఏలన సవికల్పక ప్రత్యక్షమందును, నిర్వికల్పక ప్రత్యక్షమందుఁ జూడఁబడిన లక్షములనే తిరిగి స్మరించి, గుర్తింతుము. రెంటికి భేద మేమనఁగా, నిర్వికల్పక ప్రత్యక్షమందొక వస్తువును మొదటి సారి యేచూచి, దాని జాతిలక్షణమును గ్రహింతుము కాని, యాజాతికిఁజెందిన సర్వవస్తులక్షణ మిదేయని తెలిసికొనఁజాలము. ౩. అట్టివస్తువునే రెండవదానినో, మూడవదానినో మనము చూచుట తటస్థించినపుడది యాజాతి వస్తువులకన్నిటికి గల సామాన్యధర్మమని గురి ంతుము.

రామానుజునికి వ్యక్తులే యథార్థములు. వానియందు జాతిత్వలక్షణమను నదొకటి లేదు. అంశాసంస్థాన విషయములో సాదృశ్యమున్నది. సాదృశ్యమునుబట్టియే వస్తుభావమును గల్పించుకొందుము. సాదృశ్యమే సమానపద ప్రయోగమున కాధారము.౧. భేదము తానువివరించు విషయసంబంధి కాదని వేదాంతదేశికుని వాదము. అందుచే ప్రత్యక్షము మనకు విషయ జ్ఞానమును తద్భేదమునుగూడ నీయఁగలదు.౨. ఇవి అన్యోన్యా

---

౨. సవిశేషవస్తు విషయత్వాత్ సర్వప్రమాణానామ్, (౧,౧,౧.)
3. తత్త్వముక్తాకలాపము. ౪,3౨.

(౧) పోల్చు: జైనభావములతో.
(౨) సర్వార్థసిద్ధి, ౫-౧౪.

క్రియములు ...వ్వు రెంటి కేకత్వమును మనము పూర్వ మక్షించిన ప్రకృతి పరస్పరాధారభూతములుగాఁ దోఁచును కాని వీని నంతను మన మిట్లెంతగా గ్రహించినను, విషయసంబంధములేని భేదమెట్లుండఁగలదో దురవగాహమై యున్నది.[3]

యోగదృష్టి స్వతంత్ర జ్ఞానప్రమాణము కాదని రామానుజానుయాయులు తలపోసిరి. ప్రత్యేంద్రియము నొక విశిష్టవస్తువర్గమునే చూచుటకు నిర్మింపఁబడినది; ఎంతయభ్యాసబలమున్నను నది యితరేంద్రియ విషయములను గ్రహింపఁ జాలదు. చెవి చూచుటకాని, కన్ను వినుట గాని జరుగదు. యోగదృష్టి, యీయింద్రియముల మూలముననే పనిచేసినచో నది యింద్రియదృష్టి, యింద్రియాతీతమైన దైనచో నది యనుభవదూరమగుటచేఁ బ్రమాణము కాఁజాలదు.

స్మృతిప్రమాణ మంగీకరింపఁబడి ప్రత్యేక స్థానమీయఁ బడినది. అది ప్రత్యక్షములోఁ జేరదేలన, స్మృతి జ్ఞానములోఁ బ్రత్యక్షమిమిడియే యున్నది. కాకున్నచోఁ బ్రత్యక్ష పూర్వక మగుటచే ననుమానమును ప్రత్యక్షము క్రిందకే రావలెను.

ఒక సామాన్య నియమము వలన లభించు జ్ఞానమను మానము. నిజమున కొక్క విషయమే సామాన్య నియమమును సూచింపనగును. అనేక విషయములు మన సందేహము దొల

(3) అభావము ప్రత్యక్షవిషయముగాఁ జెప్పఁబడెను; ఏలన, నొక వస్తువులేదన్నచో నింకొకచోట నున్నదని భావము. అనుపలబ్ధిమూలమునఁ జిత్తమున కెల్లప్పుడు తనకు సంబంధించు విషయము లుండనవసరము లేదని తెలియఁగలదు. (౧,౧,౧.)

గించును. తర్కమువలనను, భావాత్మకాభావాత్మకోదాహరణముల వలనను, మన మప[illegible]త విషయములను పరిహరించి. సామాన్య ధర్మస్థాపనము చేయుదుము.౧. తర్కవాక్యమునకు మూడంగములున్నవి. న్యాయ పంచాంగ వాక్యములోని మొదటి మూడుగాని చివరిమూడుగాని స్వీకరింపఁబడినవి. పోల్చుట స్మృత్యనుమానములపై నాధారపడుటచే స్వతంత్ర ప్రమాణముగాదు. అర్థాపత్తియు, సంభవము ననుమాన గర్భితములే.

రామానుజుఁడు శ్రుతిప్రమాణము నంగీకరించెను. సర్వసృష్టి కాధారభూతమగు పరమార్థ మేయితరప్రమాణములకును గ్రాహ్యముకానిదగుటచే శాస్త్రైకవేద్యము.౨.బ్రహ్మము ప్రత్యక్షవిషయముగాదు ౩. మన యనుభవములోని సామాన్యానుమితులు బ్రహ్మముయొక్క యాథార్థ్యమును స్థాపించుటగాని, నిరసించుటగాని చేయఁజాలవు.౪. మన బుద్ధిసూచించు బ్రహ్మాస్తిత్వము మన ప్రజ్ఞాసీమ కతీతమైయున్నది, ఇంద్రియాతీత విషయజ్ఞానమునకు శ్రుతియే సాధనము; తర్కము శ్రుత్యర్థ సమర్థనమునకే పనికివచ్చును.౫. వేదములు శాశ్వత

(౧) సర్వార్థసిద్ధి: ౪,౪౭. (౨) ౧,౨,౧.
(౩) ౧,౧,౩. (౪) ౧,౨,౨౩.

(౫) ౨,౧,౧౨. అన్యథాశాఖావాద విమర్శనమునందు యామునాచార్యుఁడు స్వచ్ఛమగు హేతువాదమునే యుపయోగించును. తన ప్రతికక్షి వాదమును దిరస్కరించి యిట్లు నుడువును: "ఆస్తికుల కీ యుపదేశములో నమ్మకముండవచ్చును. మనకు నమ్మకములేనివారమగుటచే వాదము సహేతుకము గానున్ననే తృప్తినిచ్చును." (సిద్ధిత్రయము. పు. ౫౫)

ములైనవి; ప్రతి సృష్ట్యారంభమున నీశ్వరుఁడు వానినుచ్చరించు చుండును. స్మృతీతిహాసములు వేదార్థప్రతిపాదకములే కావున బ్రామాణికములే. భగవానుఁడగు వాసుదేవుఁడే కర్తయగుటచే పంచరాత్రాగమములును ప్రమాణములే.౬. యథార్థమైనచో నైతిహ్యములేక సంప్రదాయము నాగమజ్ఞాన తుల్యమైనదగును ౭.

విజ్ఞానము స్వయముగాఁ బరమార్థ సాక్షాత్కారము నొసఁగఁజాలదని రామానుజుని నిశ్చయము. వేదములుకూడ మనకుఁ బరోక్షజ్ఞానమునే యిచ్చును. శ్రుతివాక్యార్థ జ్ఞానముకంటె విలక్షణమైన దింకను నేదియో కావలసియున్నది. తర్కజ్ఞానముగాక సాక్షాత్కారము భక్తిసంభరితమైన ధ్యానమువలన లభించును.౧. చేతనాచేతనరూపయుక్తమైన యేకబ్రహ్మసాక్షాత్కారము వామదేవాదులకు సిద్ధించెను.౨. ఈమహోన్నతమగు దివ్యజ్ఞానమాత్మయొక్క విజ్ఞానేతర లక్షణబలముచే సాధ్యమగును. పరమార్థస్వభావము నెఱుగుటకు మనస్సునకితరశక్తులున్నవి. సత్యసాక్షాత్కార సిద్ధికివలయు నొకమహాసంకల్పములో నీశక్తులన్నియుఁ గేంద్రీకృతములగును. అప్పుడు మనస్సు మహోచ్చసీమలోఁ బనిచేయఁగలదు. అట్టి మహోచ్చస్థాయిలో మనస్సునకుఁ దార్కికశక్తియు నూహాశక్తియుఁ

(౬) తత్త్వముక్తాకలాపము॥ ౪, ౧౨౧,
(౭) అది అసత్యమైనచో నాగమాభాసయగును॥

(౧) రామానుజభాష్యము ౩, ౨, ౨౩.
(౨) ౩, ౨, ౨౪.

కూడ నుండును. దోషతర్కావేశముల కవకాశము లేకపోలేదు; కాని మనస్సుయొక్క నీచస్థాయిలో రసభావములు సమన్వయ శూన్యములై యుండును. కాని క్రమముగా భావములెట్లు నియమ బద్ధములగుచుండునో యట్లే, రసములు సుశిక్షితములై హేతు బద్ధములగును. అంతర్దృష్టికి గోచరించు విషయము ప్రత్య క్షముకాదు కావున దానిని పరోక్షజ్ఞానమనిరి. కాని దాని స్వచ్ఛత్వసామీప్యత్వములనుబట్టి ప్రత్యక్ష జ్ఞానమునకది తీసి పోవునదరాదు 3. నిత్యదైవార్చన ప్రార్థనాదికములవలన దైవా నుగ్రహముకలిగి, జ్ఞానము లభించునని మనము ముందుఁజూడఁ గలము. ఇదిభక్త్యనుభూతిలేక యీశ్వర సాక్షాత్కారసిద్ధి. జీవాత్మ, పరమాత్మాలింగనములో విలీనమగును.

సర్వవిజ్ఞానము యథార్థరూపమేగాయైనచో మన జ్ఞానము కొన్నివేళల నయథార్థ మేలయగుచున్నది? అస్మృతదృష్టికి గోచ రించు వస్తువయథార్థముకాదు; ఏలనఁ బంచీకరణ సిద్ధాంతము ననుసరించి, ప్రకృతిలోఁగల సర్వవస్తువులును పంచభూతాంశము లేదో యొక నిష్పత్తిలో మేళవించిన సంయుక్త ద్రవ్యములే; "ఒకదానిని 'రజిత' మనియు నింకొకదానిని 'శుక్తి' యనియుఁ బేర్కొనుటకుఁ గారణము, రెంటిలోఁ దద్వస్తులక్షణ మతిశ యమై యుండుటే. ముత్తెపుచిప్పలు వెండి శలాకలవలె నుండు టను మనము చూచియుంటిమి. అందుచే వెండి లక్షణములు గొన్ని ముత్తెపుచిప్పలోఁ గలవని ప్రత్యక్ష ప్రమాణమే

(3) రామానుజభాష్యము 3, ర, ౨౬.

(౧) సర్వమ్ విజ్ఞానజాతమ్ యథార్థమ్, (౧,౧,౧,)

చూపును.” కొన్ని విషయములలో సమానత్వము వస్తుసాదృశ్య మును సూచింపను. మన మెండమావులలో నీటినిఁ జూతుము; ఏలన, సూర్యకాంతి యందును, మృద్రేణువుల యందును నీరు గలదు. పచ్చకామెరలు గలవాని కంటికి ధవళశంఖము పచ్చగాఁ గాన్పించును; కంటి పచ్చదనము నేత్రేంద్రియ కిరణప్రసార ముతో శంఖమునుగప్పి, యందలి ధావళ్యము నాచ్ఛాదించును. ఈవాదమెంత యశాస్త్రీయముగాఁ గన్పట్టినను, సర్వజ్ఞాన మును యథార్థసంబంధియను విశ్వాసమును విడిచిపెట్టుటకు రామానుజుని కిష్టము లేదని విశదమగును. స్వప్నములందుఁ గూడ జీవుల పుణ్యపాపముల ననుసరించియే, సుఖదుఃఖాను భవమునకై యీశ్వరుఁడు వస్తురూపములను గల్పించును.[౨] “జీవుల పుణ్యపాపఫలిత రూపముగా నీజగత్తును సృజించి, కొన్నిటినిఁ గొలఁదిమందికి మాత్రమే గోచరించి, కొఁది కాలమే యుండులాగునఁ గూడ సృజించును. ఈభేదమువలననే, వస్తు వుల ఉచ్చత్వనీచత్వ భేదకారణమైనది.[౧] కొన్ని జ్ఞానవిష యములు లసత్యములు, కొన్ని సత్యములు నని భేదము చెప్పుట యుక్తము.

రామానుజుఁడు విపర్యయాస్తిత్వమును నిరాకరింపఁ జూచినాఁడు ఆతఁడు జ్ఞానమంతయు సత్యసంబంధియేయనును గాని, అన్నిరకముల జ్ఞానమును సంపూర్ణ సత్యసంబంధియని చెప్పఁడు. మనజ్ఞానము సామాన్యముగా నపరిపూర్ణము, పాక్షి

(౨) చూ. రామానుజభాష్యము ౩,౨,౫,౬.

(౧) ౧, ౧, ౧.

కమునైయున్నది. మనము ముత్తెపుచిప్పను వెండియని భ్రమించి నప్పుడు, మనము దానిలోని కొన్నిలక్షణములనే చూచి, కొన్ని టిని విడిచిపెట్టినాము. పచ్చనిశంఖమును జూచుటలో దాని ధావళ్యమును విడిచిపెట్టితిమి. స్వప్నానుభవములలో విషయ ములు స్వప్నగతవ్యక్తికే సంబంధించినవి కాని యితరులకు సంబంధింపవను విషయమును మనము మఱచిపోవుదుము. నిజమైన జ్ఞానమునుబానిలోఁ గూడ వ్యవహారప్రయోజన ములకవసములగు నంశములను మనము గమనింపము. నిజ మైన జ్ఞానమును, కాని జ్ఞానమును రెండును పరిచ్ఛిన్నములే యయ్యును, నిజమైనది, మనయాశయముల కనుగుణములగు నంశములను గ్రహించి, కార్యసిద్ధినిచ్చును; నిజముకాని దీపని చేయఁజాలదు. నిజమైనస్థానము జీవితోపయోగి; ఎండమావు లలో దోషమేమనగా నందు జలాంశము లేకపోలేదు; అందలి నీరు మనదాహమును దీర్చునంతలేదు. నిజమైనజ్ఞానము యథా ర్థవస్తు సంబంధియు వ్యసహారను గుణమునైయుండును. ౨.

అన్నిరకములైన జ్ఞానమును యథార్థవస్తులక్షణములను గొన్నిటిని దెలుపును. గాని యథార్థవస్తువును సమగ్రముగా గ్రహింపనిదే, యది పరిచ్ఛిన్నజ్ఞానమనియే చెప్పవలెను. మన జ్ఞానము సర్వతోముఖ సంపూర్ణతనందువఱకు, దోషావకాశము తొలఁగదు. అనగా, జ్ఞానాభిలాషికి సర్వలోపములు పోవలెను. ఆశయముండును గాని సంసారమగ్నులకది సాధ్యముకాదు.

(౨) యతీంద్రమతదీపిక

జ్ఞానము స్వభావముచేతనే అవిలంఘ్యమైనదని రామానుజుని భావము. ఈ లక్షణము ననుసరించియే, నిర్వికల్పక జ్ఞానము సవికల్పముగా మారిపోవును. ఎల్లప్పుడు మన నిర్ణయములు విషయముల నుత్తరోత్తర పరిపూర్ణతకు దోడ్కొని పోవును. జ్ఞాన మత్యున్నతమైనపు డనఁగాఁ దనగమ్యస్థానమును జేరినపుడు, సముచిత వ్యాపారములతోఁ గూడిన భిన్నాంశముల సమన్వయముగాంచిన యేకైకానుభూతి సిద్ధించును. అట్టి పరిపూర్ణానుభూతిలో, ప్రత్యంశము, సముచితస్థాన వృత్తినిగలిగి, పరిచ్ఛిన్నమయ్యు, విశిష్టవ్యక్తిత్వమును గలిగియుండును. జీవాత్మకు మోక్షసిద్ధితోఁ బూర్ణజ్ఞానప్రాప్తియుఁ గలుగును.

అభేదమగు నేకత్వమును మన బుద్ధి గ్రహింపఁజాలదనియు, నీ యసాధ్యకార్యమును సాధింపలేకపోవుట బుద్ధిదోషము కాదనియు శంకరుఁడు చెప్పినమాట యుక్తియుక్తమైనది. విషయము స్వాత్మైకత్వమే యైనచో, 'స' 'ప' యను మన నిర్ణయము తప్పగును. ఏలన 'స' అనగా 'స' అనియే చెప్పవలెను. అర్థయుక్త నిర్ణయ మసత్యమును, పునరుక్తినిర్ణయము వ్యర్థమునగును. మననిర్ణయములో వస్తువు, దాని లక్షణము నున్నవిగాని, రామానుజుఁడు చెప్పిన దేమన నవి భిన్నములనియే. ఒకవస్తువు తనభిన్నలక్షణములలోఁ దన ఏకత్వమును బ్రదర్శింపకున్నచో నిర్ణయమే లేదు. ఏకత్వమొక సంబంధము. సంబంధమునకు రెండు కావలెను. ఆరెండును భిన్నములు కానిచో వానికిసంబంధముండదు. భేదములోపించినచో నేకత్వసంబంధమునులోపించును. పరిపూర్ణైకత్వమందు సంబంధ

సమస్యలేదు. 'స' 'స' యనిచెప్పినప్పుడైనను, నందు భేదము గర్భితమైయున్నది. 'తత్త్వమసి' యనునప్పుడు; రెంటికి బాహ్యాభేదమున్నదనియు, యథార్థముగా నీరెండు నేకమేయని నిర్ణయించుచున్నామనియు శంకరుఁడు వాదించును. అభేదభేదములు రెండును సమానముగా యథార్థములేయని రామానుజ వాదము. ఏకత్వమంతయు భేదసహితము. ప్రతినిర్ణయము దీని కుదాహరణముగానుండును, 'ఆకాశము నీలముగానున్నదే'ను దానిలో, 'ఆకాశము' 'నీలము' నొకటికాదు; పూర్తిగా భిన్నములునుగావు. వస్తువు, వస్తుగుణమైన నైల్యముకలిసియున్నవి; కాని వానికి భిన్నార్థములున్నవి. విజ్ఞానమందలి సంబంధదృష్టి, యథార్థవస్తు స్వభావప్రకటనమున కనుకూలమైనది; ఏలన, యథార్థవస్తువు తనయంశములను నిర్ణయించుచు, వానిచే నిర్ణీతమగునొక పరిపూర్ణస్వరూపము. విజ్ఞానముయొక్క తార్కిక స్వభావము లోపమనుట వివేకహీనమగు ప్రమాణముపై నాధారపడుటే యగును. అన్యోన్యసంబంధాంశములను వ్యక్తీకరించి, పెంపొందించి, సమన్వయించి, వానిమూలమున నిలుచునదే జ్ఞానమనఁబడును. సజీవక్రియా సమర్థమగునియతి, తనలో భేదనిరూపణముచేసికొనియు, నభేదమై వర్తించును. సంబంధ సమన్వయ వ్యాపారము మన కభావస్థితిఁ జేకూర్చునని శంకరుని వాదము. రామానుజుఁడు దీనిని నిరసించి, ఆత్మవ్యక్తీకరణావకాశ సంపన్నమగునొకసజీవవస్త్వస్తిత్వమును ప్రతిపాదించును. ఏకత్వము సంబంధములుండవనికాని, సంబంధములున్నచో నేకత్వముండదనికాని రామానుజుఁ డంగీకరింపఁడు. జ్ఞానము చూపు

ప్రపంచమొకక్రమ పరిపూర్ణతగలది; ఏకసూత్రముయొక్క సవివర వ్యక్తీకరణము, లేక ప్రదర్శనము. భగవంతుఁడు, ప్రపంచము సమానముగా సత్యములు; ఇందేదియొకటియు నసత్యమైయుండఁజాలదు. ఏకైకవ్యక్త్యనుభూతిరూపమే దీనికవకాశమిచ్చును. భగవంతుఁడాత్మజ్ఞానపరిపూర్ణుఁడని విజ్ఞానము పారమును ముట్టినపుడు గ్రహించును. సత్యమొకవ్యక్తి; సత్యాంశము లందలి యల్పవ్యక్తులు.

౯—కారణము-ద్రవ్యము.

రామానుజుఁడు సత్కార్యవాదసిద్ధాంతము నంగీకరించును. ప్రతికార్యమునకొక పూర్వస్థితమైన ఉపాదాన కారణముండును. కారణ ధర్మమనగా నవస్థాంతరత్వము. ౧. నూలుపోగులే వస్త్రమునకు గారణములు; ఏలన నూలుపోగులను పడుగుపేకగా నేయుటే వస్త్రమగును. ౨. వస్తువుయొక్క భావాభావములు భిన్నదశలు. అభావము తాత్కాలికము, నిత్యము కాదు.

గుణములు కలదే ద్రవ్యము. ద్రవ్యమాధారము; దానిపై నాధారపడునదనఁగా నాధేయ మద్రవ్యము. వస్తువులు ద్రవ్యములు; గుణ, సంబంధములు అద్రవ్యములు. దీపపుకుందె ద్రవ్యము; దీపమును ద్రవ్యమే: కాని దీపము గుణము కూడనైయున్నది.

---

౧ అవస్థాంతరాపత్తి రేవహి కార్యతా (రామానుజగీతాభాష్యము, ౧౩-౨)

౨. రామానుజభాష్యము. ౨, ౧, ౧౯-౨౦; మతియుఁ జూడుఁ, ౨, ౧, ౧౬.

వృద్ధిక్షీణతలు గలదగుటచే బుద్ధియు నొకద్రవ్యమే; బుద్ధి ఆత్మ కొక గుణమునై యున్నది. 3. సృష్టియంతయు దేవుని విశేష ణమగుటచే నీశ్వరుని దృష్టిలో సద్రవ్యమగును. ద్రవ్యములే ఉపాదాన కారణములు కాఁగలవు; అద్రవ్యములట్టివి కావు ౧. ప్రకృతి, కాలము, శుద్ధసత్త్వము, ధర్మభూతజ్ఞానము, జీవాత్మ, యీశ్వరుఁడు ద్రవ్యములు. ౨ మొదటి మూడును జడములు. జీవేశ్వరు లజడములు; జ్ఞానమునకు రెండు లక్షణములుగలవు, జడద్రవ్యములవలెఁగాక, జ్ఞానము స్వయం వ్యక్తీకరణమును జేసికొనును, బాహ్యవస్తువులను వ్యక్తీకరించును. జ్ఞానమెప్పు డును స్వప్రయోజన పరముగాక, ఆత్మపరమైనది. ఆత్మ కది నియవమానమగు సహకారలక్షణము; అందుచే దానిని ధర్మ భూత జ్ఞానమందురు. ఏదేనొక విషయసాంగత్యము నందిన యొకయింద్రియ మూలమున నుదయించు జ్ఞానమువలన నాత్మ విషయమును దెలిసికొనును. విషయివిషయములు భిన్నము లని తలపఁబడి, జ్ఞానము వానికి సంబంధము కూర్చునని నిశ్చ యింపఁబడినది.

శబ్దముయొక్క పంచలక్షణములు, ఒత్తిడి, రూపరస గంధములు, మిశ్రమలక్షణము, భారము, సంఖ్య, ఔన్న త్యము, వ్యక్తిత్వము, కలయిక, భేదము, ఇచ్ఛాద్వేషములు, సంతోషక్లేశములు. సంకల్ప బుద్ధులు అద్రవ్యములు.

---

3. తత్త్వముక్తాకలాపము, ౪, ౭.

(౧) తత్త్వముక్తాకలాపము, ౫,౨.

(౨) ,, ,, ౧,౬.

## ౧౦ - ఆత్మ - జ్ఞానము

నిజమైన వస్తువభేదబ్రహ్మమే యగుటచే, విషయావిషయభేదము తాత్కాలికమేకాని నిజముకాదని శంకరునివిశ్వాసము. రామానుజుఁడీ భావమును నిరసించి, జ్ఞానలక్షణము ననుసరించియే, నిత్యముగా నొకవ్యక్తియు, దద్భిన్నములైన విషయములు నున్నవని వాదించును. 3. భేదదర్శనమే జ్ఞానలక్షణము. అభేదవస్తుదర్శనము నిచ్చుప్రమాణ మేమియును లేదు. అట్టిదున్నచో, బ్రహ్మము విషయమై, అనిత్యవస్తువర్గమునఁ జేరవలసివచ్చును. శుద్ధజ్ఞానమనునదుండఁజాలదు. ఇది సత్యమో అనృతమో కావలెను. శుద్ధజ్ఞానము సత్యమైనచో దానికిఁ గొన్నిలక్షణము లుండవలెను. అనృతమైనచో నది గగనకుసుమము వంటిదగును. ౧. జ్ఞానమునకు నిత్యత్వము, స్వయంప్రకాశకత్వము మున్నగు విశేషణములను శంకరుఁడును జెప్పినాఁడు. జ్ఞానము స్వయంప్రకాశకమే, మఱియు నది వేద్యముకూడ నైయున్నది. తెలియఁబడుటచేఁ బ్రతివిషయము జడద్రవ్యము కానక్కఱలేదు.

జ్ఞాన మపరిచ్ఛిన్నమైనచో జ్ఞానవిషయములు నట్టివే కావలెను; కాని యట్లు జరుగుటలేదు. సుషుప్త్యాద్యవస్థలలో నిర్విషయక జ్ఞాన ముండునని యనుకొనుట పొరపాటు. "గాఢనిద్రావస్థనుండి మేల్కాంచిన వ్యక్తి, "స్వభావముచే నన్నిటికి

(3) నచనిర్విషయాకాచిత్సం విదస్తి.

(౧) సంవిత్ సిద్ధ్యతివానవా, సిద్ధ్యతిచేత్ సధర్మతాస్యాత్, నచేత్ తుచ్ఛతా గగనకుసుమాదివత్. (౧,౧,౧.)

వ్యతిరేకమై, యజ్ఞానమునకు సాక్షియైన శుద్ధజ్ఞానస్వరూపము గానే నాయవస్థలో నున్నానని" తనకుఁదాను జెప్పుకొనుట లేదు. "నేను సుఖముగా నిద్రించితి"ననియే తలఁచును. దీనివలన, నిద్రయందుఁ గూడ నాత్మలేక 'నేన'ను వాఁడు తెలిసికొను ద్రష్టయనియు, 'సుఖము' నెఱుగుననియు స్పష్టమగుచున్నది. అప్పటి ద్రష్ట దేనిని నెఱుఁగకున్నాఁడనఁగా, ద్రష్ట యుండెననియు, విషయములు లేవనియుఁ దెలియుచున్నది"(౨) విషయసంబంధము లేని జ్ఞానముండఁ జాలదు. సుషుప్త్యవస్థలో నది పనిచేయదేలన నప్పుడు విషయములు లేవు. సుషుప్త్యవస్థలలో నాత్మ స్వయం జ్ఞానముతో నిర్విషయక జ్ఞానమును గలిగి యుండును. జీవాత్మ యనగా నహంభావమే కాని, శుద్ధజ్ఞానరూపము గాదు. సుషుప్తిలో నహంకార మదృశ్యమయ్యు నజ్ఞాన సాక్షిమాత్రముగా జీవుఁడుండునని చెప్పుటవలన శంకరుఁడును దీని నంగీకరించినట్లే. ఏది తెలియుటకును శక్తిలేనిదో, అది సాక్షియుఁగాఁ జాలదు. శుద్ధజ్ఞానము సాక్షి కాఁజాలదు. సాక్షి యనఁగా ద్రష్ట. ఈద్రష్ట సుషుప్తిలో నుండును; అది యిప్పుడు తమోఽవృతమై యుండుటచే దానిని మన మెఱుగము. సుషుప్తిలో నది లేకయున్నచో, మేల్కాంచిన వెనుక సుఖనిద్రానుభవ జ్ఞాపకము సాధ్యము కాదు. నిత్యమగు నీద్రష్ట లేనిదే, స్మృతి సాధ్యము కాదు; నిన్న జరిగిన దానిని నేడు మనము గుర్తింప లేకుందుము. జ్ఞానము, నిత్యద్రష్టయు నొకటే యన్నను, స్మృతి కర్థము చెప్పుట కష్టమగును. అందుచే నొక తెలియు జ్ఞాతయున్నాఁడ

(౨) ౧,౧,౧, మఱియుఁ జూడు. ౨,౩,౩౧.

నియు నాతఁడు వివిధకాలములలో నొకఁడేయనియుఁ గేవల జ్ఞానమే కాదనియుఁ దెలియుచున్నది.౧ జీవాత్మ స్వయంప్రకాశత్వముగల జ్ఞానముకాదు; కాని నెఱుఁగువాఁడు. "నేను జ్ఞానమున,౨ని మన మెన్నఁడును జెప్పము." నేనెఱుఁగుదునని చెప్పుదుము.౩. ద్రష్ట వలననే జ్ఞానమునకు స్వయంప్రకాశకశీలము లభించినది జ్ఞానాస్తిత్వము, తత్స్వయంప్రకాశకత్వమును జీవాత్మ వలననే వచ్చినది.౪ ఈవిధముగా స్థాపింపఁబడిన విషయము "విషయవర్గములోనిదే యని వాదించుట తన తల్లి గొడ్రాలని చెప్పుట వంటిదే." ప్రకృతియొక్క అచేతనకార్యమైన అహంకారమునకు జ్ఞాతృత్వమును జ్ఞానమునుగూడ నాపాదింపఁజాలము. జ్ఞానసారరూపమైన యాత్మకు జ్ఞానలక్షణమును గలదు.౧ అది జ్ఞాతయే కాని కేవల జ్యోతి కాదు.౨. జ్ఞాతృత్వమునకుఁ బరివర్తనశీలముండవలెనని తలఁపనవసరము లేదు. జ్ఞాతయనఁగా, జ్ఞానమునకాధారమైనదే౩. ఎఱుకగల యాత్మ నిత్యముగావున, జ్ఞాన

---

(౧) ప్రతిసంధానంహి పూర్వాపరకాల స్థాయినమ్ అనుభవితారమ్ ఉపస్థాపయతి, నానుభూతిమాత్రమ్, (౧,౧,౧.)

(౨) అనుభూతిరహమ్.

(౩) అనుభవామ్యహమ్.

(౪) ౧,౧,౧ మఱియుఁజూడుఁ. ౨,౩,౧౯.

(౧) చిద్రూప...చైతన్యగుణక.

(౨) జ్ఞాతైవప్రకాశమాత్రమ్॥ మఱియుఁజూడుః బృ॥ఆ॥ఉ॥౪,౩,౭; ౧౪; ౪,౫,౧౫; ఛాం॥ఉ॥౮,౧౨,౩,౫; ౮-౨౬-౨; ప్రశ్న॥ఉ॥ ౪,౯;౬,౫ తై॥ఉ॥ ౨,౪.

(౩) ౧,౧,౧.

మును నిత్యమైనదే. కాని యీ నిత్యజ్ఞాన మెల్లప్పుడును ప్రకా శింపదు. జ్ఞానము, స్వయముగా నపరిచ్ఛిన్నమయ్యు, వృద్ధి క్షీణతలు పొందఁగలదు. కర్మవశమున వివిధావసరముల కనుగుణముగా సంకోచమునంది, భిన్నేంద్రియముల మూలమున భిన్నరూపము లొందుచుండును. ఈ యింద్రియసంబంధ భేదములచే దాని కుదయాస్తమయము లున్నవని తలపఁబడును. జీవితావస్థలలో సర్వకాలములయం దది పనిచేయుచున్నను, నడుమెన్నడు లేని స్థితియుండదు. ఈ యవస్థానుగుణ పరివర్తనలక్షణ మప్రధానమైనదగుటచే నాత్మనిర్వికారమైనదని చెప్పఁబడును. 3. జ్ఞాన మెప్పుడును విషయము కాఁజాలదను భావమును రామానుజుఁ డంగీకరింపఁడు. అన్యవస్తువులను బ్రకాశింపఁజేయునప్పుడది విషయముకాదుకాని, తఱచుగా నది విషయమగుచుండును, కాఁగలదు. మనుష్యుల ముఖవైఖరిఁ జూచి, వారి రాగద్వేషభావములను గనిపెట్టఁగలుగుట వలనను, లేక ఒకవ్యక్తి తన గతానుభవమును నేఁటి జ్ఞానవిషయముగాఁ బరిశీలింపఁగలుగుట వలనను, నొకని జ్ఞాన మింకొకనికి జ్ఞానవిషయమగుచున్నదని మనకు నిత్యానుభవమే. జ్ఞానము జ్ఞానవిషయమగుట వలనఁ దన స్వభావమును గోల్పోవదు. జ్ఞానము స్వవిదితమని మనము చెప్పరాదు. తన యస్తిత్వమునకుఁ దానే యాధారమైకాని, తాను బ్రకాశింపఁజేయు విషయమును దనమూలముననే జేయుటచే నైననేమి యాక్షణములోని నది ప్రకాశింపఁజేయు స్వభావమును గలిగియుండుటే జ్ఞానప్రధాన లక్షణమని

రామానుజుఁడు తలఁచెను.౧. జడపదార్థములు లావిష్కృతినొంది నపు డవి స్వయంవ్యక్తములు లగుటలేదు. ఆత్మ యితరలక్షణము లైన అణువ్యాప్తిత్వము, నిత్యత్వాదికము, గతానుభవజ్ఞానము మున్నగునవి వానివలననే వ్యక్తములగుటలేదు; కాని వానికి భిన్నమగు జ్ఞానవృత్తివలననే వ్యక్తీకరింపఁబడుచున్నవి.౨

## ౧౧. ఈశ్వరుఁడు.

యథార్థవస్తు వభేదైకస్వరూపము కాదని రామానుజుని జ్ఞానసిద్ధాంతమువలన నేర్పడును. అది సవికల్పకమైన పరిపూర్ణతకలదియై, సభేదైకత్వ స్వరూపమును గలిగియున్నది. పరమాత్మ యొకటున్నదని రామానుజుఁడు నిస్సంశయముగా నంగీరించును; పరిచ్ఛిన్నజీవ యాథార్థ్యము నాతఁడంత నిస్సంశయముగానే యంగీకరించును. భిన్నములు ననేకములునగు వస్తువులకుఁ బరస్పరసంబంధప్రవృత్తి కవకాశముండవలెనన్నచో, బ్రహ్మాండములోని నానాంశముల ననుసంధించు సర్వసామాన్యమగు నొకపారమార్థిక నియమముండవలెను. తర్కమేకాక, మతానుభూతియుఁ బరిచ్ఛిన్నవస్తువు సత్యమనియుఁ బరమాత్మ యొకవ్యక్తియనియు నంగీకరింపఁగోరును. దేవునితో వ్యక్తి సంబంధమే, మనకు వేరైన యీశ్వరునితో నేస్తమును గూర్చును. మన స్వార్థరహితభక్తికిఁగాని, ఓర్పుతో ననుభవించు దుఃఖము

(౧) అనుభూతిత్వమ్ నామ వర్తమానదశాయామ్ స్వసత్తయైవ స్వాశ్రయమ్ ప్రతిప్రకాశమానత్వమ్ స్వసత్తయైవ స్వవిషయసాధనత్వమ్ వా. (౧,౧,౧,)

(౨) చూ. శ్రుతప్రకాశిక.

నకుఁగాని యేవికారమును జూపక నిర్వికార నిరీక్షణముచేయు నిర్గుణబ్రహ్మము భక్తిమార్గమునకు సరిపడు దైవస్వరూపము గాదు. శంకరునివాదము శూన్యతను సూచించుననియు, దాని నాతఁడు విచిత్రభావ నైపుణ్యముచే నాచ్ఛాదింప యత్నించె ననియు రామానుజుఁడూహించును. శంకరుని నిర్గుణబ్రహ్మ మొక శూన్యస్వరూపము; అది సర్వతోముఖ సౌందర్యరాశి యగునొక యశ్వమువంటిది. దానికిఁ బ్రాణములేని లోప మొకటేయున్నది. అట్టినిర్గుణబ్రహ్మము ప్రత్యక్షానుమానశ్రుతి ప్రమాణములకు వేనికిఁలోఁబడదు.(౧) జ్ఞానప్రమాణములన్నియుఁ బరిచ్ఛిన్నములగుటచే నపరిచ్ఛిన్నమగు బ్రహ్మమునెట్లు తెలుపఁ గలవు? శ్రుతులే మిథ్యయైనచో శ్రుతిప్రోక్తమగు బ్రహ్మము నట్టిదే కావలెను. పారమార్థిక సత్యస్వరూపమగు భగవా నుని యందు గుణము, మితి, భేదము, అన్యవస్తువునుండి, విలీనమై యేకత్వమును బొందినవి. అపరిచ్ఛిన్నతలోనే పరిచ్ఛిన్నత యున్నది. బ్రహ్మము స్వగతభేదము గలిగి, చిదచిద్విశిష్ట సంపూర్ణ స్వరూపమై యున్నది(౧). సచ్చిదా నంద లక్షణములు బ్రహ్మమున కొక వ్యక్తిత్వమును శీల మును గల్పించును. బ్రహ్మయొక్క జ్ఞానము ప్రత్యక్షమై నది; అది యింద్రియములపై నాధారపడదు.(౨). భగవాఁనుడు సర్వజ్ఞుఁడగుటచే నన్నిటిని ప్రత్యక్షముగాఁ జూచును,బ్రహ్మము

(౧) ౧, ౧, ౧.

(౧) ౧,౧,౨. సర్వదర్శనసంగ్రహము ౪.

(౨) ౧,౨,౧౯.

పరిపూర్ణవ్యక్తి; జీవులపరిపూర్ణ వ్యక్తులు. వ్యక్తిత్వమున కర్తను నియతోద్దేశముల నొక క్రమవిధానము ననుసరించి సాధించు సామర్థ్యముండుటే. భగవంతుడు పరిపూర్ణ వ్యక్తి; కారణమాత్రనిలో ననితరాధారమగు పూర్ణానుభవసిద్ధి యున్నది. వ్యక్తిత్వమున కవసరములగు భేదాంశము లాతనియందే యున్నవి. జ్ఞానము, శక్తి, కరుణ దేవుని ముఖ్యలక్షణములు. కరుణావశుడై యాతడు లోకమును సృజించి, నియమములను స్థాపించి, మోక్షార్థులందరకు సాయపడుచుండును.౩. ఆతని ప్రీతి లక్షణము నితరలక్షణములకు వేరయ్యు, నన్నియు నొకే వ్యక్తికి జెందుటచే నాతని యేకత్వమునకు భంగహేతువులు గావు. దేవునికి దనగుణసంబంధము సనాతనము స్వాభావికము నైనది౪. జీవజడపదార్థములు దేవుని గుణములనియే చెప్పబడును; కాని పైగుణము లాతని యాత్మలక్షణములు, తన గుణములకే కాక, తనపై నాధారపడు విషయములకు నీశ్వరుడాశ్రయమే.౫. ఈశ్వరుని కొక "ప్రత్యేక దైవరూపమున్నది. అది ప్రకృతిజము కాదు; కర్మజమునుగాదు".౧. దేహమనగా బంచభూత పరికల్పితమేకాదు; కేవల ప్రాణముచే బోషింపబడునదే కాదు. అది యింద్రియములకు స్థానమేకాదు. సుఖదుఃఖానుభవ కారణమే కాదు. చిత్స్వరూపమగు నాత్మ దేనిని స్వీకరించి, స్వాధీనమొనర్చుకొని, తన ప్రయోజనముల కొఱకుపయోగించుకొనునో,

---

(౩) రహస్యత్రయసారము॥ ౨౩.

(౪) రామానుజభాష్యము ౨,౧,౧౫.

(౫) రహస్యత్రయసారము ౩

(౧) ౧, ౨, ౧

యేది ఆత్మకువశమైన సాధనమో అదియే దేహమని రామానుజుని నిర్వచనము. ౨. సశరీరియయ్యు నీశ్వరుఁడు దుఃఖముల ననుభవింపఁడు; ఏలనఁ దుఃఖములకుఁ గారణము కర్మకాని, దేహధారిత్వముగాదు. ౩. ఈశ్వరుఁడు కర్మాధిపతి; స్వయముగాఁ గర్మ ఫలమీయఁజాలదు. అచేతనము, క్షణికమునగు కర్మ, భావికాలమునకు సంబంధించిన ఫలితము నీయఁజాలదు. ౪. పరమేశ్వరుఁడే, ఇహపరములందెట్టి భోగానుభవముల నెవరు పొందవలెనో నిర్ణయించును. అనేక రూపములను గలిగియున్నను బ్రహ్మమునకు రూపములేదనియుఁ జెప్పవచ్చును; ౫. ఏలన, "జీవాత్మ దేహమునందుండి తదనుగుణములగు సుఖ దుఃఖముల ననుభవించుచున్నది; బ్రహ్మమునకు సుఖదుఃఖానుభవము లేదు గావున, బ్రహ్మము రూపరహితమని చెప్పవలెను." జడపదార్థ పరివర్తనములుగాని, జీవుల దుఃఖములుగాని బ్రహ్మమున కంటవు. దోషమంతయుఁ బూర్వకర్మ ఫలితమే, అనగా సంసారపరిభ్రమణమే దానికిఁ గారణము. దేవునికందు బాధ్యతలేదు. అనంతములగు నూర్ధ్వలోకముల కవ్వల నాతడు దివ్యకాంతి మయస్థానమున నుండును; అచట నెట్టి తమో

---

(౨) ౨, ౧, ౯

(౩) ౧, ౧, ౨౧

(౪) ౩, ౨, ౩౭

(౫) బ్రహ్మరూపరహితత్వమేవ,

(౬) ౩, ౨, ౧౪

రేఖయు నుండఁజాలదు.౧. అట్టి జీవితము ముక్తజీవులకే లభించును; దేవుని కట్టి జీవితమగుటలో వింతలేదు. ౨.

జీవులు, జడపదార్థము చిద్రూపమగు నీశ్వరుని యందేకమై, ద్రవ్యమునకు గుణములవలె, పూర్ణవస్తువులో సంతర్భాగములవలె, నాత్మకు దేహమువలె సంబంధమును గలిగి యున్నవి.౩. వానినే ప్రకారములనియు, శేషములనియు, నియామ్యములనియుఁ జెప్పుదురు.౪. ఈశ్వరుఁడు ప్రకారి, నియంతయు, శేషియునియుఁజెప్పఁబడును.౫. తమపరివర్తన పరిణామములలో నవి యేకబ్రహ్మావశంవదములై యున్నను, యథార్థములు సత్యములునైనవి. ప్రపంచమునకుఁ బరమేశ్వరాశ్రయత్వ స్వభావము దేహమునకు జీవాశ్రయత్వమువంటిదేయని చెప్పఁదగును. ఆతఁడు విడిచినప్పుడు దేహము శిథిలమగును గాన, నది మూలద్రవ్యము కాదు. శరీరగతులన్నియు నాత్మసంకల్పము ననుసరించియుండును.౬. జగత్తును దేవునితో నిట్టిసంబంధమునే గలిగి, తనయస్తిత్వమునకీశ్వరునిపైనాధారపడి, యీశ్వరేచ్ఛా

(౧) ౧, ౧, ౨౧.

(౨) ౩, ౩, ౨౭.

(౩) పోల్చు: జగత్సర్వమ్ శరీరంతే. రామాయణ యుద్ధకాండ, ౧, ౨౦, ౨౬; తిరువాయిమోయి ౧,౧,౪; బృ.ఆ.ఉ. ౫, ౭.

(౪) వేదాంతదేశికుఁడు నియామ్యత్వమనగా, తత్సంకల్పాధీన, సత్తా స్థితి ప్రవృత్తికత్వమ్." అనివచించెను.

(౫) రామానుజభాష్యము, ౨,౪,౧౪.

(౬) స్వరూపాశ్రితమ్, సంకల్పాధీనమ్.

వశమైయుండును.౧. జగత్తు బాహ్యశరీరముగాను,జీవులు సూక్ష్మ దేహముగాను, నీశ్వరుఁడున్నాఁడు. జీవజడపదార్థము లీశ్వర గుణములైనచో, నవి స్వతంత్రగుణవృత్తి శక్తులు లేనివని యర్థముకాదు. దేహాత్మ సంబంధము వలన, దేహమాత్మకు గుణమయ్యు, దేహమును గొన్నిగుణములను గల్గియున్నదని తెలియఁగలదు. దీని ననుసరించి రామానుజుఁడు జగత్సా మరస్యమును, జీవానోన్యస్య ప్రవృత్తిని, నిరూపించును. జీవుల కన్నిటికి యథోచితస్థానకర్మల నిర్ణయించి యిచ్చు నీశ్వరుని దివ్యమానసమే జగత్తున కేకత్వము ఘటించును. తమ సహజ స్వరూపభేదములచే జీవులు భోక్తలు, జడపదార్థము భోగ్యము, యీశ్వరుఁడు ప్రేరితయు నగును.౨. కాని ప్రకారప్రకారిసంబం ధముచే నేకత్వమున్నది కావున నన్నియు నొకటే యగును.౩. ఏకత్వమనగా నపృథక్సిద్ధియని చెప్పవలెను.

రామానుజుని భావములో దేవుఁడనఁగా, సోపాన క్రమోన్నతినంది యాత్మ జ్ఞానములోఁ బరిపూర్ణత గాంచిన వ్యక్తులలో నుత్తమవ్యక్తియని గాని, లేక పరిచ్ఛిన్న జగత్తున కందరాని నిర్గుణ బ్రహ్మమూర్తి యని కానికాదు. లోకములోని చేతనాచేతన పదార్థసంతతి యీశ్వరునితోఁ గలిసి యున్నను, నవి తమ యస్తిత్వపోషకత్వముల నీశ్వరునుండియే

(౧) ఈశ్వరస్వరూపాశ్రితమ్, ఇచ్ఛాధీనమ్.

(౨) శ్వేతాశ్వతరోపనిషత్తు, ౧.

(3) బ్రహ్మము ప్రకారవిశిష్టప్రకారి.

పొందినవి. దేవుఁ డెంతనిజమో, నానాత్వముతోఁ గూడిన జగత్తును తత్సమముగానే నిజము. కాని జగత్తున కాధార మీశ్వరుఁడు; దాని కారణముగాదు. దేవుఁడు జగదంతర్వర్తియైన యాధారమనియుఁ జెప్పరాదు. అట్లు చెప్పుటవలన నీశ్వరుఁ డనేకములో ననేకమై యున్నాఁడనియు, ననేక వస్తుజాత మేకత్వ స్వరూపమగు నీశ్వరునందు లీనమైయున్నదనియుఁ జెప్పవలసివచ్చును. రామానుజుని కీశ్వరుఁడు జగదంతర్వర్తియు నతీతుఁడు గూడనైన యాధారము. దేవుఁడొక వ్యక్తియే కాని, యాతఁ డనేక జీవసముదాయమూర్తియని భావింపరాదు; అనగా నాతఁడు మానవులుగాని తద్విషయములుగాని రూపొందిన మూర్తియని భ్రమింపరాదు. బ్రహ్మాండ క్రమాంతర్గతుఁడై, యీశ్వరుఁడు దాని కాధారము నాశ్రయమునై, ప్రళయకాలమున దానినిఁ దిరిగి స్వీకరించును.౧. సృష్టిలయములు కాలగతములైన తాటస్థ్యములుగావు; జగత్తునకాధార మీశ్వరుఁడనిచూపు తార్కికసాక్ష్యములు. బ్రహ్మ మొక్కఁడే అకారణుఁడు; తక్కినవన్నియు సకారణములు.౨. విచ్ఛిన్న ప్రపంచమున కాతఁడు బాధ్యుఁడయ్యు, దానిలోపము లాతని నంటవు. పరమేశ్వరుఁడు విష్ణువేయని, యాతని కుత్తమగుణము లన్నియు రామానుజుఁ డారోపించెను. బ్రహ్మయు శివుఁడును విష్ణువే.౩.

---

(౧) ౧,౧. పోల్చు: తిరువాయుమోయి: ౧౦, ౪, ౩. రామానుజ తత్త్వమును విశిష్టాద్వైత మనుటకుఁ గారణము రెండు విశిష్టవస్తువు లద్వైతసిద్ధిఁ గాంచినవి. (౨) ౨, ౩, ౯. (౩) పోల్చు: తిరువాయిమోయి: ౧౦,౧౦,౧.

పరమాత్మ ననేకరీతులలో నూహింపనగును. బ్రహ్మ మనఁగా జీవజడపదార్థములతోఁ గూడిన కేంద్రైకరూప మన వచ్చును, లేక జీవజడములందు లీనమైపోయిన యేకాత్మరూప మనవచ్చును. బ్రహ్మము పరమసత్యస్వరూపము; జగత్తాతని దేహము లేక విశేషణము. ఈజగత్తు సృష్టిలోవలె వ్యక్తము కావచ్చును; ప్రళయములోవలె నవ్యక్తమై యుండనగును. ప్రళయమందైనను జీవజడములు సూక్ష్మరూపములలో నుండఁగలవు. అన్నిటికిఁ బూర్ణమోక్షప్రాప్తియే సృష్టికిలక్ష్యము. ఈ లక్ష్యసిద్ధిలో జీవులు తమసహజ పావనత్వమునుగాంచి,వైకుంఠ ధామమున విష్ణువునెదుట నివసింతురు. ప్రకృతియు సత్త్వ సంసిద్ధిఁగాంచును.ఇట్టి పారమార్థిక జగత్తీశ్వరునిలో నిహితమై యున్నది. అది నిత్యసిద్ధమైనది, ఇది ప్రళయకాలమందలి చేత నాచేతనముల స్థితియని భ్రమింపరాదు. జగద్దేహముగాక, యీశ్వరునికి సూక్ష్మతమమైన దివ్యదేహమున్నది. దీనితో నాతఁడనేక రూపములధరించి, లోనొకఁడయ్యు ననేకత్వమును బ్రదర్శించును. ఇది నిత్య విభూతియనఁబడును. కాని యీశ్వరుని మూలరూపమిదియుఁగాదు.

రామానుజుఁడు తన పరమార్థతత్త్వమును శ్రుతి ప్రమాణములచే సమర్థించును. బ్రహ్మము సకలకల్యాణ పరిపూర్ణుఁడని వేదములుగ్గడించును. 'సత్యం జ్ఞానమనంతంబ్రహ్మ' యని ఉపనిషత్తు చెప్పుచున్నది. ఈవిశేషణములన్నియు నొకే పరమాత్మకుఁ జెందును. బ్రహ్మము నిర్వికారపరిపూర్ణమనియు, నాతనిచిచ్ఛక్తి యెన్నఁడును సన్నగిల్లదనియు ముక్తజీవుల జ్ఞాన

ము కొంతకాలము సంకుచితమై యుండెననియుఁ జెప్పఁబడెను. బ్రహ్మమనంతము; ఏలన, దానికి దేశకాలద్రవ్యోపాధిపరిమితు లెవ్వియులేవు; మరియు స్వభావముచే నితర వస్తువు లన్నిటికి విలక్షణమైనది. అనంతత్వము బ్రహ్మము యొక్క గుణస్వభావములకు విశేషణము; జీవులు నిత్యముగలని చెప్పఁబడెనే కాని యీలక్షణములు లేవు. ఆతఁడు మొదట నొక్కడే ఏలన నప్పుడింకొకఁడు లేడు. బ్రహ్మమున కెట్టి గుణములును జెప్పని శ్రుతులున్నవని రామానుజుఁ డంగీకరించును. గాని, పరిచ్ఛిన్న గుణరాహిత్యమే దాని కర్థమని వాదించును. బ్రహ్మస్వరూపము జ్ఞానాతీతమనగాఁ బరిచ్ఛిన్న మనశ్శక్తి కందని యనంతకల్యాణగుణము లాతని కున్నవని యాతఁడు భావించును. నానాత్వమును నిషేధించు శ్రుతివాక్యముల కాతఁడు బ్రహ్మమునకు వేరై వస్తువులు లేవని యర్థము చెప్పెను. పరమాత్మ సర్వాత్మ స్వరూపము తానై యున్నది. సిద్ధిగాంచిన వ్య "అన్యమెద్దియుఁ జూడఁడు, వినఁడు, తెలియఁడ"ని యుపనిషత్తులు ఘోషించును. భక్తుఁడు దివ్యానందమయమైన బ్రహ్మానుభూతినొందిన నప్పుడు, సర్వవస్తువులును బ్రహ్మస్వరూపమునందును, బ్రహ్మవిభూతియందును నేకమై యున్న కారణముచే బ్రహ్మమునకు వేరుగా వేనినిఁ జూడఁడని రామానుజుఁ డర్థము చెప్పినాఁడు. ౨.సుప్రసిద్ధమగు 'తత్త్వమసి' మహావాక్యమునకును

(౧) దేశకాలవస్తు పరిచ్ఛేద రహితమ్...సకలేతరవస్తు విజాతీయమ్. (౧, ౧, ౨.)

(౨) ౧, ౩, ౭

రామానుజుఁ డిట్లే యర్థము చెప్పినాఁడు. 'తత్త్వమసి' యన్నప్పుడు, జీవబ్రహ్మవిశిష్ట లక్షణములను విడిచిపెట్టి, రెంటి కభేదైక్యము చెప్పఁబడెనని శంకరుఁడు భావించును. "ఇతఁడా దేవదత్తుఁడను" వాక్యములో విషయము దేవదత్తునికే చెందును. 'ఈ, ఆ' యను భావము తొలఁగినఁగాని, 'స' కును 'ప' కును సమానత్వ మెన్నఁడును స్థాపింపఁబడదు. అంతవరకు వాక్యార్థమాత్మవిరుద్ధమేయగును. అందుచే, "తత్త్వమసి" యను వాక్యార్థ మేమనఁగా, నవిద్యావశమున మనకుఁదోఁచిన భేదములు నశింపఁగా జీవాత్మయు బ్రహ్మయు నొక్కటేయని నిశ్చయము. దీనికి వ్యతిరేకముగా రామానుజుఁడు వాదించి, ప్రతినిర్ణయము రెండు భిన్నవస్తువులనే చెప్పునని పల్కెను. జీవబ్రహ్మములు రెండును సామానాధికరణ్య సంబంధములోఁ జెప్పఁబడినపుడు,౧. రెంటికిభేదమున్నదనియే భావము. ఈ రెండు నొకేవస్తువుయొక్క భిన్నార్థములు. ఈ రెండర్థము లొకేవస్తువులో నుండనిచో వాక్యార్థ మనర్థమగును. అందువలన "తత్త్వమసి" వాక్యములో నిగూఢార్థమున్నది. జీవులు బ్రహ్మ మందిమిడియున్న సముచ్చయస్వభావము బ్రహ్మమున కున్నది.౨. జీవబ్రహ్మలు, విశేషణ విశేషములుగాను, ఆత్మదేహములుగాను సంబంధమును గలిగి

(౧) సమానమ్=ఏకమ్. అధికరణమ్=విశేషణానామ్ ఆధారభూతమ్-విశేష్యమ్॥

(౨) మఱియుఁజూడుము: ౨, ౧, ౨౩.

యున్నవి.౩. రెంటికి భేదములేకున్నచో, నొకటి రెండవదని మనము చెప్పఁజాలము. యోగసిద్ధినొందిన జీవాత్మ, పరమాత్మతోఁ దాదాత్మ్యమునొంది, తన్నుఁ బూజింపుమని చెప్పిన శ్రుతివాక్యములున్నవి. "నన్ను ధ్యానింపుమ"ని యింద్రుఁడును "నేనే మనువును, నేను సూర్యుఁడ న"ని వామదేవుఁడును జెప్పిరి. ఈవాక్యములు బ్రహ్మ సర్వాంతరాత్మత్వమును దెల్పునని రామానుజుఁ డర్థము చెప్పెను.౧ అనంతబ్రహ్మ మన్నిటియందున్నది గావున, జీవునియందు నుండును; అందుచే మనము ను ప్రహ్లాదునివలె "బ్రహ్మము 'నేను'గానున్నది; అన్నియు నానుండి జనించును; అన్నియు నేనే; నాలో నన్నియు నున్నవ"ని చెప్పవచ్చును.౨. ప్రత్యక్షముగనో, పరోక్షముగనో పదములన్నియు బ్రహ్మమునకే వర్తించును.౩.

వైష్ణవ దైవతత్త్వమున కాధారములు వేదాగమపురాణములు, ప్రబంధము. వేదములు, బ్రహ్మము స్వస్వరూపమును నంతర్యామిత్వమును జెప్పెను. పంచరాత్రాగమములు, వ్యూహసిద్ధాంతము నంగీకరించును. రామకృష్ణా ద్యవతారపూజను బురాణములు చెప్పెను. దక్షిణభారత దేవాలయములలోని దైవవిగ్రహముల నుద్దేశించి, చెప్పిన భక్తిస్తోత్రములే ప్రబంధ

(౩) జీవపరమాత్మనోః శరీరాత్మభావేన తాదాత్మ్య నవిరుద్ధమ్॥ చూ: వేదార్థసంగ్రహము. పుటలు. ౩౨, ౩౫, ౪౪, ౧౧౦.

(౧) ౧, ౧, ౩౧.

(౨) విష్ణుపురాణము॥ ౧,౧౯.౮౫. సర్వగతత్వాదనంతస్య సఏవాహ మవస్థితః మత్తస్సర్వమహం సర్వమ్ మయిసర్వంసనాతనే॥

(౩) వేదార్థసంగ్రహము. పు. ౩౦.

వాక్యములు. విష్ణువైన బ్రహ్మముయొక్క స్వరూపము పంచాత్మకము. విగ్రహాదికము లర్చారూపములు; విభవము లవతారములు; సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్నానిరుద్ధరూపములు చతుర్వ్యూహములు; వాసుదేవుని సూక్ష్మరూపము నంతర్యామిత్వము. శుద్ధ సత్త్వదేహముతో వైకుంఠమునర నివసించు నారాయణుఁడే పరస్వరూపమని కొన్ని వేళలఁ జెప్పఁబడెను. భగవానుఁడు తన యనంత పరిపూర్ణతచేఁ దన విభూతి రూపముల కతీతుఁడు. దేవుని పరిపూర్ణ వ్యక్తిత్వములో సృష్టి లీలారూపము లంశామాత్రములే. దేవుని స్వతంత్ర స్వరూపము వేరుగానున్నది. ఆరూపములో భక్తులకు బంధుత్వావకాశమున్నది. వైకుంఠములోఁ నాతఁడు లక్ష్మీసమేతుఁడై శేషశయనమున నుండును. లక్ష్మి యనఁగా విష్ణువుయొక్క సృజనశక్తిస్వరూపము; కాని యర్వాచీనవైష్ణవమతములో నామె జగజ్జననియై, కొన్నిసమయములలో దుర్బల దీనజనసంరక్షణమునకై భర్తనుప్రోత్సహించునదిగా వర్ణింపఁబడెను. ఆమె పరమేశ్వరునితో నిత్యైక్యమందినశక్తి. ఆయన ధర్మమూర్తియైనచో లక్ష్మి దాక్షిణ్యమూర్తి. రెండు నీశ్వరునిలో నేకత్వము నందినవి. విష్ణుశక్తియైన లక్ష్మికి రెండురూపములున్నవి. క్రియారూపమనగా నిగ్రహించి నడపుశక్తి; భూతిరూపమనఁగాఁ బరిణామనియతి. ఈ రెండును చైతన్యజడాత్మకములై, జగత్తునకు మూలోపాదానకారకత్వసామర్థ్యమును విష్ణువున

(౧) పరబ్రహ్మ పరవాసుదేవాది వాచ్యో నారాయణః (యతీంద్ర మతదీపికా)

కిచ్చును. పరమేశ్వరునకారుపరిపూర్ణగుణములున్నవి. జ్ఞానము, శక్తి, బలము, ఆధిపత్యము, వీర్యము, ప్రకాశము.౨. ఉత్తమ దైవమూర్తియగు వాసుదేవుఁడీ షడ్గుణ పరిపూర్ణుఁడు. వ్యూహ చతుష్టయములో మిగిలిన మూఁడును రెండులక్షణములనే కలిగి యుండును. భక్తులకొఱకుఁ గారుణ్యమువహించి యీ వ్యూహ ములోని వివిధరూపముల నీశ్వరుఁడు ధరించునని రామాను జుఁడు చెప్పినాఁడు. వ్యూహములోని మిగిలిన ముప్వురును సంకర్షణుఁడు-జీవాధిపతియు, ప్రద్యుమ్నుఁడు-మానసాధిపతియు ననిరుద్ధుఁ డహంకారాధిపతియునైయున్నారు.3. విష్ణు నవతార ములే విభవరూపములు. రామానుజుఁడు తనగీతాభాష్యారంభ మునని ట్లు వ్రాసినాఁడు; "పరమేశ్వరుఁ డనంతకారుణ్యవశుఁడై, తన మూలసహజదైవ సంపద కెట్టిలోపమును గలుఁగకుండ ననేకరూపములు ధరించి,యనేక పర్యాయము లవతరించెను... భూభారమును దొలగించుట కొఱకే కాక, ప్రాకృతపురుషుల మైన మనకుఁగూడ ననుగ్రహము చూపుటకును, నల్పాధిక భేదము లేకుండ, నందరకు నయనోత్సవ మొనర్చి, దివ్యా నందము కూర్చుట కద్భుతకృత్యముల నెన్నిటినో జేయుటకు నాతఁ డవతరించెను." రామానుజుని దేవుఁడు నిర్గుణుఁడై, యూర్ధ్వమున నెచటనుండియో నిర్లిప్తుఁడై మనల నుపేక్షించు వాఁడు గాఁడు; ఆతఁడు మనలోఁగలిసి,మన సుఖదుఃఖములలో భాగస్వామియై, మన సత్కార్యానుష్ఠానమునకుఁ దోడ్పడి, జగ త్సంరక్షణ కార్యభారమును వహించును. అవతారము లనగాఁ

(౨) మఱియుఁజూడు, విష్ణు పు. ౬, ౫, ౭౯.
(3) రా, భా, ౨, ౨, ౪౦,

బరమేశ్వరుఁ డప్రాకృతస్థితినుండి ప్రాకృతక్రమములోనికి వచ్చుటయే. ఈయవతారములు ముఖ్యకారణభేదములచే ద్వివిధములు, విష్ణువు స్వయముగాఁ బ్రకృతిలో జోక్యము కలుగఁ జేసికొన్నపుడది ముఖ్యావతారము; గౌణము లావేశావతారములు. ప్రజలు ముఖ్యావతారములను ముక్తికొరకును, నావేశావతారముల నైశ్వర్యబలాదుల కొఱకు నర్చింతురు. భగవంతుఁడు శాస్త్రోక్తముగాఁ బ్రతిష్ఠింపఁబడిన విగ్రహములలో నుండును. విగ్రహములలోఁ దాను బ్రవేశించియుండుట కీశ్వరుఁడెంత బాధపడుట కంగీకరించునో అర్థపంచక గ్రంథము వర్ణించినది.౧. ఈశ్వరుఁ డంతర్యామియై, సర్వజీవులలో నుండి, స్వర్గనరకములను వానికిఁ బడయనించును. నీలమేఘమధ్యమున మెఱుపుతీగవలె పరమేశ్వరుఁడు మానవునిలో నుండును.౨. అంతర్యామియగు దేవుఁడే శ్రీపతముఁడు.3.

## ౧౨ – జీవాత్మ

రామానుజుని పరబ్రహ్మతత్త్వము విశిష్టమైనది. జీవులు, తమ సర్వస్వము నాపరబ్రహ్మము నుండియే గాంచినను,

(౧) "సర్వజ్ఞుఁడయ్యు నజ్ఞునివలెను; ఆత్మకుఁడయ్యు ననాత్మకవలెను, సర్వాధిపతియయ్యు, మానవుల వశుఁడైనట్లును, సర్వశక్తి సమన్వితుఁడయ్యు, నశక్తునివలెను, నాప్తకాముఁడయ్యు, గోరికలున్నవానివలెను, సర్వరక్షకుఁడయ్యు దీనునివలెను, యజమానియయ్యు సేవకుని వలెను, నగోచరుఁడయ్యు గోచరునివలెను, అగ్రాహ్యుఁడయ్యు, గ్రాహ్యునివలెను జూపట్టును."

(౨) నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవభాస్వరా (వేదార్థసంగ్రహము.

(3) పోల్చు: పంచరాత్ర రహస్యము. పూర్వపూర్వోదితోపాస్తి విశేషాక్షీణ కల్మషః, ఉత్తరోత్తర మూర్తీనామ్ ఉపాస్త్యధికృతోభవేత్ మా. సర్వదర్శన సంగ్రహము, ౪.

స్వేచ్ఛాక్రియాలక్షణములను సహజముగా గల్గియుండుటచే నవి పృథగ్వ్యక్తు లనఁబడును. అద్వితీయమగు పరబ్రహ్మ యొక్క భిన్నరూపములే వ్యక్తులను వారి వాదమును రామానుజుఁడు కఠినముగా నిరసించెను. పరబ్రహ్మాంశమైనను, జీవాత్మ యథార్థము, ననన్యము, నిత్యము, బుద్ధిజ్ఞానసహితము, నిరవయవము, నిర్వికారము, నగోచరము నణుస్వరూపము నైనది.(౪) అది దేహేంద్రియప్రాణ బుద్ధులకు వేరైనది. అది జ్ఞాత, కర్తయు, భోక్తయునై యున్నది. మానవునిలో నది స్థూలదేహమునకును, ప్రాణమునకును, పంచకర్మేంద్రియములకును మనస్సునకు నంటియున్నది. ప్రాణమునింద్రియములవలె నుపకరణమాత్రమే.(౧) అంతరంగావస్థలను, ఇంద్రియసాహాయ్యమున బాహ్యవిషయజ్ఞానమును మనస్సాత్మ కందించును. మనస్సునకు మూడు వృత్తులున్నవి. అధ్యవసాయము అనగా నిశ్చయము; అభిమానము; చింత.(౨) అణురూపముగు జీవాత్మ హృత్పద్మమందుండును. సుషుప్తికాలమున నది హృదయమందును బరమాత్మ సంపర్కము గలిగియుండును.(౩) నిద్ర జీవావిచ్ఛిన్నతకు భంగము కాదు. ఏలన, నవిచ్ఛిన్న వ్యాపారము, స్మృతి, శ్రుతివాక్యములు, ధర్మోపదేశములు దీనిని సమర్థించుచున్నవి.(౪) దీప

(౪) ౨,౨,౧౯-౩౨; ౨,౩,౧౮. యతీంద్రమతదీపిక, ౮.

(౧) ౨, ౪, ౧౦.

(౨) ఈవృత్తుల ననుసరించి దాని నే బుద్ధి, అహంకారము, చిత్తము వందురు.

(3) 3, ౨, ౯.

(౪) 3, ౨, ౭.

కళిక చిన్నదయ్యుఁ దనకాంతిచే వ్యాప్తిసంకోచములుగలిగి, యనేకవస్తువులను బ్రకాశింపఁజేయురీతినే, జీవ మణుపరిమాణ మయ్యు, వ్యాప్తిసంకోచశక్తులచే, దేహములో నన్నిస్థలముల లోని సుఖదుఃఖములను గ్రహించును. ౧౫. దేశకాలములలో సుదూరవస్తువులనునది గ్రహింపఁగలదు. జీవులజ్ఞానము, దేవుని జ్ఞానమువలెనే నిత్యము,స్వయంపోషకము,సర్వవ్యాప్తముయుక్తము నైనది. కాని పూర్వకర్మాదిదోషములచే నది తాత్కాలిక ముగాసంకుచితమైనది.౧౬. సుఖదుఃఖపరిభాగమువలన జీవు లనేకములని స్పష్టము. మోక్షసిద్ధివరకు జీవులు ప్రకృతిబద్ధములు; ఆశ్వికున కశ్వముఁవలె జీవులకుఁ బ్రకృతి వాహనమువంటిది. దేహబంధము, నశ్వరమగు నీమట్టిపాత్రతో సంబంధము జీవు నీశ్వరబాంధవ్యమును గుర్తింపకుండఁజేయును. జన్మమరణాదు లున్నను జీవాత్మకు ముఖ్యలక్షణములలో మార్పుండదు. చేతన ప్రపంచములో ననేకపర్యాయములుపుట్టి పోవుచుండును; కాని తన సహజలక్షణమును గోల్పోవదు. ప్రళయకాలమునందు జీవుల విశిష్టరూపములు పోవును గాని, జీవు లవినాశములై యుండును. వానికిఁ బూర్వజన్మల కర్మఫలము పోదు. అందుచే బునస్సృష్టికాలమున వానికర్మల ననుసరించి, యవి తిరిగి సంసారములోనికి నెట్టఁబడును. దేహసంబంధ ముండుటవలనను,

(౧౫) ౨, ౩, ౨౮, ౨౬.

(౧౬) ఈశ్వరస్యేవ జీవానామపి, నిత్యంజ్ఞానం స్వతశ్చ సర్వవిషయమ్ ప్రమాత్మకమ్ చ తత్తత్కర్మాదిదోషవశాత్ సంకుచితవిషయమ్। (వేదాంతదేశికుఁడు సేశ్వరమీమాంస॥)

(౧౭) ౨, ౧, ౧౫.

లేకుండుటవలనను కలుగు జ్ఞానవృద్ధి, క్షీణతలే జన్మమరణములు; మోక్షము వచ్చువరకు జీవులకు దేహసంబంధము తప్పదు; ప్రళయవేళమాత్రము నామరూపభేదము తెలియుట కవకాశము లేని సూక్ష్మదేహములుండును.౧. జీవునకుఁ బూర్వజన్మ జ్ఞానముండదు; ఏలన, స్మరణశక్తి యీ దేహమునకుమాత్రమే సంబంధించినది.

జీవుని ముఖ్యలక్షణము "అహంబుద్ధి". అది జీవుని నశించు విశేషణమేకాదు; అది జీవునిగర్భస్థమైయున్న ముఖ్యలక్షణము, అట్లుకానిచో, ముక్తిప్రయత్నము వ్యర్థమగును. బంధమోక్షావస్థలు రెంటియందును జీవాత్మ జ్ఞాతృత్వలక్షణ మవిచ్ఛిన్నమై యుండును. జీవుఁడు ప్రవృత్తిగల కర్తయునై యున్నాఁడు. కర్మలు జీవునికిఁ జెందుటచేతనే జీవుఁడు ఫలితముల ననుభవించుట జరుగుచున్నది. జీవికి క్రియాసామర్థ్య మున్నంతమాత్రమున నెల్లప్పుడు ప్రవృత్తిలో నుండనవసరములేదు. కర్మవశమున జీవులకు దేహసంబంధ మున్నంతకాలము, వానికర్మలు స్వతంత్రములుగావు. దేహబంధములు తొలఁగి, మోక్షము వచ్చిన వెనుక, వానికి సంకల్పమాత్రముచేఁ గోర్కెలు సిద్ధించును. ముఖ్యలక్షణములలో భేదముండుటచే జీవుఁడు దేవుఁడు గాఁడు. జీవము బ్రహ్మాంశమే. పరబ్రహ్మ మవిభాజ్యము ౧. గావున, నందొక భాగము వేరై జీవాత్మయయ్యెననుటకు వీలు లేదు. కాని యది పరబ్రహ్మాంతర్గతమై యున్నది. జీవులు

(౧) 3, ౨, ౫.

(౧) ౨, 3, ౪౨.

బ్రహ్మముయొక్క విశేషణ రూపములని రామానుజుఁడు చెప్పినాఁడు.౨. అవి బ్రహ్మమునకు వేఱైయుండఁజాలవు గావున బ్రహ్మమునకుఁ గార్యము లనవచ్చును గాని, ఆకాశాదులవలె నుద్భవమందిన కార్యములుగావు. జీవముఖ్యలక్షణ మెన్నఁడును మారదు. జీవికిఁ గలుగు భిన్నదశా పరివర్తనములు జ్ఞానవృద్ధి క్షీణతలచేఁ గలిగినవిమాత్రమే, ఉత్పత్తిమైన యాకాశాదులకు ముఖ్యస్వభావమే మార్పునొందును.3. జీవాత్మకుఁగల బాధా నుభవాది లక్షణము లీశ్వరునకు లేవు. జడపదార్థములకువలె ముఖ్యలక్షణములలో మార్పుగాని, చేతనములకుఁగల వృద్ధి క్షీణతలుగాని లేనివాఁ డీశ్వరుఁ డొక్కఁడే.

కర్మ ప్రవృత్తికి జీవాత్మ స్వప్రయత్న మొక్కటే చాలదు గాని, జీవాత్మాంతర్గతమైన పరమాత్మాస్తిత్వముచే జీవుని స్వేచ్ఛాప్రవృత్తి కాటంకముగాదు. కాని పరమాత్మ సహకారమవసరము.४. తన భావి దశానిర్మాణమునకు జీవుని స్వతంత్రత నుగ్గడించినను, సత్పురుషుఁడు ప్రకృతి నియమముల

(౨) "జీవాత్మ పరమాత్మలో నంశామాత్రము; ఎట్లన, అగ్నిసూర్యాదులనుండి వ్యాపించు కాంతి తదంశమైనట్లే; లేక గోఽశ్వాదికముల సామాన్య లక్షణములవలెను, సితాసితవర్ణములవలెను నవి వస్త్వంశములైన రీతిగను; లేక దేహము దేహికంశామాత్రమైనట్లును;అంశమనగా నేక దేశమాత్రము;విశిష్టవస్తు విశేషణమువంటిది. విశేషణ విశేషములు పూర్ణవస్తుతదంశ సంబంధమును గలిగి యున్నను, వానికి ముఖ్యలక్షణ భేదముండుటఁ జూచుచున్నాము." (౨,3,४౫.)

(3) స్వరూపాన్యతా భావలక్షణా, ౨,3,౧౮.

(४) ౨, 3, ४౧.

నతిక్రమింపఁ గలఁడని ఘోషించినను, కర్మతోడను జడపదార్థముతోడను నెట్టి బంధమును లేక, సంపూర్ణ స్వతంత్ర ధర్మమూర్తి యీశ్వరుఁ డొక్కఁడే యని రామానుజుఁడు పలికినాఁడు.౧. పరమేశ్వరుని శేషియందురు, జీవేశ్వరసంబంధము శేషిశేషభావము, శేషిత్వమనగా జీవుని విషయములో నీశ్వరునికిఁ గల సమగ్రశక్తి.౨.

మానవ స్వాతంత్ర్యము, పరమేశ్వర ప్రభుత్వమును గూర్చిన సమస్యలకు రామానుజుని తత్త్వములో నధిక ప్రాముఖ్యమీయఁబడెను; ఏలన రామానుజుఁడు రెంటిని సమర్థింపఁ బూనినాఁడు. జీవాత్మలు తమ ప్రవృత్తికిఁ బూర్తిగా దేవునిపై నాధారపడును. మంచిచెడ్డల నీశ్వరుఁడే నిర్ణయించి, జీవులకు దేహములిచ్చి, వాని నుపయోగించు సామర్థ్యమిచ్చెను. కాని జీవుల బంధమోక్షములకుఁ బరమేశ్వఁడే పారమార్థికముగాఁ గారణము. అయినను, లోకములోనున్న ననంత దుఃఖయాతనల కీశ్వరుఁడు బాధ్యుఁడుగాఁడు. మంచిచెడ్డల వివేకముగల మానవుఁడే దానికి బాధ్యుఁడు. మానవుని యిచ్ఛ దేవుని పరిపూర్ణతకు లోపముగాఁ జూపట్టును. స్వతంత్రేచ్ఛగల జీవులు దేవునిసంకల్పమునకు వ్యతిరేకముగాఁ బ్రవర్తింపవచ్చును. కర్మమాత్రమునకను

(౧) ౧, ౧, ౨౧.

(౨) పోల్చు: లోత్జీ సిద్ధాంతము: తానీశ్వరుని సృజనపోషణాత్మక స్వభావమునుండియే తన స్వరూపమును గాంచినను, నాత్మ తన యేకత్వమును, దానీశ్వరునుండి వేరైన వ్యక్తిత్వము గలిగి, యితర వ్యక్తులనుండి భిన్నమనియు నెఱుఁగును.

గుణముగాఁ దానువర్తింపవలసివచ్చుటచే దేవుఁడుపరిపూర్ణుఁడు గాఁజాలఁడు .మానవుల కర్మలన్నిటికి మూలములో నీశ్వరుఁడే కారణమని రామానుజుఁడీ సమస్యనుండి తప్పించుకొనెను. ఇది దోషము కాదేలన నీశ్వరుఁడు కొన్ని నియమముల ననుసరించి ప్రవర్తించును.ఇది యాతని స్వభావము. ఈశ్వరుఁడు తన నియమ రహితములైన విశృంఖలభావముల ననుసరించి, జీవిచే సదసత్కర్మలు చేయించుటలేదు; కర్మసూత్రము ననుసరించి వర్తించుటచేఁ దన నియతస్వభావమును జూపుచున్నాఁడు. కర్మసూత్ర మీశ్వరాధీనముగానిదైనచో నీశ్వరుని పరిపూర్ణతకు లోటు వచ్చును. కర్మసూత్రమును విసర్జింపనిదే యీశ్వరుని స్వాతంత్ర్యమును గాపాడలేమనిచెప్పు విమర్శకుఁడు హిందువుల కీశ్వరునిగూర్చినభావ మెట్టిదో యెఱుఁగఁడు. కర్మసూత్ర మీశ్వరేచ్ఛారూపమే. కర్మాధ్యక్షుఁడై కర్మపద్ధతి నీశ్వరుఁడే స్థాపించినాఁడు. కర్మనియతి యీశ్వర స్వభావరూపమేయగుటచే ధర్మపరులను బహూకరించి, దుర్మార్గుల నాతఁడే శిక్షించుచున్నాఁడని చెప్పవచ్చును. ౧ కర్మసూత్రము దేవునిపై నాధారపడక స్వతంత్రమైనదికాదని నిరూపించునిమిత్తమే, కర్మసూత్రమును భగ్నమొనర్చు సామర్థ్య మాతనికున్నను నాతఁడట్లు చేయుటకిచ్చగింపఁడని కొన్నివేళలఁ జెప్పఁబడెను,౧. తన ధార్మికేచ్ఛా

(౧) ౨, ౨, ౩; ౩, ౨, ౪

(౧) లోకాచార్యుఁ డిట్లుచెప్పెను. "స్వభావనిత్యత్వములకుఁ దనపైఁ నాధారపడిన జీవుల కన్నిటికిఁ గర్మనాశన మేకకాలమందే గావించి ముక్తి నీయఁగల సామర్థ్య మీశ్వరునకున్నను, శాస్త్రవిధిరూపమగు కర్మసూత్రము

స్వరూపమగు కర్మశాసనమును లోకమునఁ బ్రవర్తింపఁజేయు వ్రతనిష్ఠుఁడై, తనకుఁ దొలఁగింప సాధ్యమైనను. నధర్మముండుట నంగీకరించెను. మానవుని ప్రవృత్తికిఁ జోదకమగు నిచ్ఛా యత్నముల నంతర్యామియగు నీశ్వరుఁ డంగీకరించును, ౨. స్వనియమోల్లంఘనముచేఁ బ్రపంచక్రమములోఁ గల్లోలము గలిగింప నాతఁ డిచ్ఛగింపఁడు. ఈశ్వరుఁ డంతర్యామియయ్యు ననవసర వ్యాపారములలోనికిఁ బోఁడు

జీవులు త్రివిధములు: నిత్యజీవులు ప్రకృతి కర్మవిరహితులై వైకుంఠమున నానంద మనుభవించుచుందురు; ముక్తజీవులు: భక్తి కర్మ జ్ఞానములచే బంధవిచ్ఛేదము చేసికొనినవారు.

---

నకు జీవులను బద్ధులనొనర్చుటకుఁ గారణ మాతని స్వేచ్ఛాలీలావినోద కాంక్షయే "యథేప్సమ్ కర్తుమ్ శక్తత్వాత్ సకలాత్మనోఽపి, యుగపదేవ ముక్తాన్ కర్తుమ్ సమర్థత్వేఽపి, స్వాధీనస్వరూపస్థిత్యాదినాత్మనః కర్మవ్యాకృత్య మారీకృత్య శాస్త్రమర్యాదయా తానంగీకుర్యామిత్థం స్థితిలీలారసేప్సయైవ (తత్త్వత్రయము పు. ౧౦౪) ఈశ్వరుఁడు ప్రథమ కారణము, కర్మ ద్వితీయ కారణము, "పరమేశ్వరుఁడు స్వమాహాత్మ్యానుగుణ లీలాప్రవృత్తియందు నిశ్చితుఁడై, కర్మకు ధర్మాధర్మరూపముల నేర్పరచి, తత్కర్మలోఁ బొల్గొనుటకు జీవులకు దేహేంద్రియాదులిచ్చి, వానిని నియమించు శక్తినొసఁగి, యంతర్యామియై వానిలోఁ ప్రవేశించియుండెను......... ఈశ్వరదత్తములైన నిట్టి శక్తులనుగాంచి జీవులు స్వేచ్ఛగాఁ బుణ్యాపుణ్యకర్మలు చేయమొదలిడెను.........సత్కర్మ నిరతుఁడైనవాఁడు తన శాసనానుగుణముగా వర్తించుచున్నాఁడని యీశ్వరుఁడు వానికి ధర్మపరాయణత్వమును, నైశ్వర్య సుఖమోక్షములను నిచ్చి, తన శాసనములకు విరుద్ధముగా నడచుకొనువాని కనుగుణశిక్షాదు లొసఁగును" (౨, ౨, 3)

(౨) ౨, ౭, ౪౧

బద్ధజీవులు: అవిద్యావశులై స్వార్థపరులై సంసారసాగర మగ్ను లగువారు.(1) జీవాత్మ ఉత్తమస్థితికిఁ బోవచ్చును లేదా, అధమ స్థితిలోఁ బడి, దేహాభిమాన మధికమై, బుద్ధి నశించి, కేవ లాహార నిద్రాదికము మాత్రమే తెలిసిన పశుత్వము ప్రాపింప నగును.(2) సంసారగతులైన జీవులు నాలుగువిధములు: దేవ మనుష్య పశుస్థావరములు. జీవులన్నియు భేదము లేనివయ్యును, భిన్న దేహ సంబంధములచే భేదములు చూపట్టును. జీవుల వర్ణ భేదములుగూడ దేహభేదములవలననే తటస్థించును. సహజ ముగా జీవులు దేవతలునుగావు, మనుష్యులునుగావు, బ్రాహ్మ ణులునుగావు శూద్రులునుగావు. సంసారగత జీవులు భోగ మోక్షాపేక్షచే ద్వివిధములుగా నుండును. మోక్షకాలము వఱకుఁ బూర్వకర్మ ఫలానుభవమునకై జీవులు జన్మించుచుండ వలెను. జీవుఁ డింకొక దేహమును ధరించునపుడు భూత తన్మా త్రలచే(3). నావరింపఁబడియుండును. అవియే జీవప్రాణాధా రము(4). బంధ మున్నంతవరకు సూక్ష్మదేహముండుచు(5) ముక్తులు దేవయానమునను, సత్పురుషులు పితృయానమునను బోవుదురు. దుర్మార్గులు చంద్రలోకమునకుఁ బోక, వెంటనే

(1) చూ: రహస్యత్రయసారము. 4. నిత్యసంసారబద్ధులు కొందఱుందురని నమ్మి విశిష్టాద్వైతులు గలరు. చూ: తత్త్వముక్తాకలాపము 2. 28-29.

(2) 1, 1, 4.

(3) 3, 1, 1.

(4) 3, 1, 3.

(5) 4, 2, 7.

యాలోకమున నే పుట్టుదురు. జీవుల కూర్ధ్వగతి చూపువారు పరమేశ్వర ప్రతినిధులు.౬. జీవులు దైవప్రకృతిలో భాగస్వాములైనచో వారి దొకప్పుడు శుద్ధమోక్షములు గల దైవప్రకృతియై యుండవలెను. అట్టి దైవలక్షణములను జీవు లేల కోల్పోయి, కర్మవశములయ్యెను? కర్మ జీవుల నెట్లు స్వాధీనమొనర్చుకొనెనో హేతువుగాని, శాస్త్రముగాని మనకుఁజెప్పఁజాలదు. ఏలన జగత్పరిణామ మనాదియైనది.

## ౧౩ - జడపదార్థము.

ప్రకృతి, కాలము, శుద్ధతత్త్వము మూడు నచేతనద్రవ్యములు. అవి భోగ్యములు, సవికారములు, మానవలక్ష్యముల కుదాసీనములు.౧. ప్రకృత్యస్తిత్వము ప్రత్యక్షానుమానవిషయముగాదు ౨. శ్రుతిప్రమాణముచే నది యంగీకరింపఁబడినది. సృష్ట్యారంభవేళ సత్త్వరజస్తమో గుణములం దుదయించును. ప్రళయకాలమున పదార్థము మిక్కిలి సూక్ష్మరూపమున, నామరూపభేదము లేక యుండి తమస్సని పిలువఁబడును. జడపదార్థమజమే; దాని రూపములు వచ్చి పోవుచుండును.

సృష్టికాలమునఁ దమస్సునుండి మహత్తును, మహత్తునుండి యహంకారమును, లేక భూతాదియు నుదయించును. సాత్త్వికాహంకారమునుండి యేకాదశేంద్రియములును, తామసాహంకారమునుండి పంచతన్మాత్రలును, జనించును; రాజ

(౬) ౪, ౩, ౪,

(౧) సర్వదర్శనసంగ్రహము. ౪.

(౨) తత్త్వముక్తాకలాపము. ౧, ౧౧.

సాహంకార మీరెంటి పరిణామమున సహకరించును.౩. అహంకారమునుండి సూక్ష్మభూతమగు శబ్దము వచ్చును; తరువాత నాకాశము వచ్చును. ఆకాశమునుండి సూక్ష్మభూతమగు స్పర్శయు, దరువాత వాయువు నిట్లే యితర భూతములనునుద్భవించెను. శబ్దస్పర్శాదులచే క్రమముగా నాకాశవాయ్వాదులను గ్రహింతుము శబ్దమన్నిభూతములలో నున్నది. స్పర్శాజ్ఞానము మూడు విధములు. ఉష్ణ శీత సమశీతోష్ణములు. వేడిమివలన మార్పులనొందు పంచవర్ణములు గలవు. ఆకాశమునకు వేరుగా నెట్టిదేశమును విశిష్టాద్వైతు లంగీకరింపరు. సూర్యుఁడుదయించు వైపు తూర్పనియు, నస్తమించువైపు పశ్చిమమనియు గుర్తుపెట్టుకొని, వీనినుండి దూరసామీప్యపరిగణనము చేయుచుందుము.౧. ప్రాణమనగా నింద్రియములని పొరపడరాదు. అది వాయువు యొక్క అవస్థావిశేషము.౨. సాంఖ్యులవలెఁ గాక, ప్రకృతికీశ్వరుఁడే కారకుఁడు, నియంతయునని విశిష్టాద్వైతులు చెప్పుదురు.౩.

కాలమున కొక ప్రత్యేకస్థానము నిచ్చిరి. అది సర్వాస్తిత్వరూపము.౪. అది ప్రత్యక్ష విషయము. దినమాసాదిభేదములు కాలసంబంధములపై నాధారపడునవే.౫.

(౩) సర్వార్థసిద్ధి. ౧, ౧౧.
(౧) తత్త్వముక్తాకలాపము. ౧, ౪౧.
(౨) ,, ,, ౧, ౫౩-౫౪.
(౩) సర్వార్థసిద్ధి, ౧, ౧౬.
(౪) తత్త్వత్రయము ననుసరించి కాలము తత్త్వశూన్యము.
(౫) ఉపాధిభేదము. (తత్త్వముక్తాకలాపము. ౧, ౬౯.

సత్త్వరజస్తమో గుణములు మూఁడును ప్రకృతియున్నవి. కాని శుద్ధసత్త్వమునకు సత్త్వగుణమొక్కటే యున్నది. అది దేవుని నిత్యవిభూతిలోని ద్రవ్యరూపము. అది లోనున్న రూపము నాచ్ఛాదింపదు. ప్రకృతి సాహాయ్యమున నీశ్వరుఁడు లీలావిభూతిగా నొక విశ్వశక్తిని ప్రదర్శించును. నిత్యవిభూతిరూపమున శుద్ధసత్త్వసాహాయ్యముచే లోకాతీతశక్తిని గలిగి యుండును.

ఈయచేతన ద్రవ్యములన్నియు నీశ్వరేచ్ఛానుగుణములై వర్తించును ౬. అవి తమంతటఁ దాము మంచివియునుగాదు చెడ్డవియునుగాదు; జీవుల కర్మలననుసరించి సుఖదుఃఖముల నిచ్చును. ఈశ్వరుఁడే వానిప్రవర్తనమును నిర్ణయించును; "వలన, వస్తువులిచ్చు ఫలితములు వాని స్వభావముపైననే యాధారపడి యున్న యెడల, సర్వవస్తువులు సర్వకాలములందు నందరకు సుఖమునో దుఃఖమునో యిచ్చుచుండవలెను, కాని యట్లుజరుగుట లేదు." "స్వతంత్రమగుపరబ్రహ్మమునకు నీద్రవ్య సంబంధము లీలావినోదము; ఆతఁడు వానిని తనస్వాధీనములో నుంచుకొని పెక్కురీతుల నడపుచుండును."౧. అవిద్యాకర్మ బంధములనుండి విముక్తుఁడైన వానికి లోకమానందమయమై తోఁచును. జీవజడపదార్థములు రెండును దేవుని శరీరము లేక విశేషణములేగాని, దేవుఁడు జీవులతోఁ బ్రత్యక్షముగను, జడ పదార్థముతోఁ బరోక్షముగను సంబంధమును గలిగియుండును. అచేతనములు చేతనముల వశమైయుండును. జడపదార్థ మధి

(౬) ౨, ౨, ౨.
(౧) 3, ౨, ౧౨

కముగాను బూర్ణముగాను దేవునిపై నాధారపడును; జీవులకుం గొంతస్వేచ్ఛయున్నది. జీవులీశ్వర సాన్నిధ్యమునొంది జనన మరణాదుల నతిక్రమింపవచ్చును.

## ౧౪. సృష్టి.

ప్రతికార్యమున కొక యుపాదానకారణమున్నదనియు, జగత్కార్యము బంధరహితజీవాస్తిత్వమును సూక్ష్మపదార్థాస్తిత్వమును సూచించుననియు రామానుజుఁడుతలంచెను. చేతనాచేతనము లీశ్వరుని ప్రకారములయ్యు, వానికనాదిగాఁగల పృథగ్వ్యక్తిత్వము, బ్రహ్మములో నెన్నఁడును గలిసిపోదు. వానికొక విధమైన ద్వితీయాస్తిత్వస్థానమున్నది. అందుచేనవి తదనుగుణముగాఁ బెంపొందును. వానికిఁ గొన్నిదశలలో మారుచుండు రెండవస్థలున్నవి. మొదటిది: నామరూపభేదరహితమై, మనకుఁ దెలియు గుణములులేనిదైయుండు నవ్యక్తావస్థ; ఇందు బుద్ధి సంకుచితమై యుండును. బ్రహ్మ కారణావస్థలోనుండు ప్రళయదశ యిదే. యీశ్వరేచ్ఛచే సృష్టి మొదలగునప్పుడు సూక్ష్మపదార్థము స్థూలమై, పూర్వజన్మకర్మఫలానుగుణములగు దేహసంబంధము జీవులకుఁగలిగి, బుద్ధి వికసించును. చేతనాచేతనములతో నీవిధముగా గోచరించుబ్రహ్మము కార్యావస్థలో నున్నాఁడని చెప్పనగును. సృష్టిలయము లొకే బ్రహ్మపదార్థముయొక్క భిన్నావస్థలు మాత్రమే. ౧. జీవ జడపదార్థములు కార్యకారణావస్థాద్వయమును గలిగియుండును. కారణావస్థలో జీవులు దేహరహితములై, ప్రకృతి సామ్యస్థితినొందియుండును.

---

(౧) చూ. రామానుజ గీతాభాష్యము ౧౩, ౨, ౯, ౭

కాని సృష్టికాలమునఁ బూర్వకర్మవశమున జీవులు గుణసామ్య స్థితిని జలింపఁజేయఁగా, నీశ్వరేచ్ఛచేఁ బ్రకృతి కర్మఫలితము లను నిర్మించును. పూర్వము దామొనర్చిన కర్మల ఫలితముల ననుభవించు నవకాశము జీవులకుఁ గల్పించుటకొఱకే సృష్టి చేయఁబడును. ఈ దృష్టితోఁ జూచినచో నీశ్వరుని సృష్టి కార్యము పూర్తిగా స్వతంత్రమైనది గాఁజాలదు. ౧ పంచరాత్రము ననుసరించి సృష్టి రెండువిధములు; శుద్ధసృష్టి, స్థూలసృష్టి. మొదటిది సృష్టియేకాదు. అది యీశ్వరుని నిత్యమగు నంతశ్శక్తి వ్యక్తీకరణము. జ్ఞానైశ్వర్యశక్తి బల వీర్య తేజస్సులందుఁ బ్రకటితములు. ఇవి లక్ష్మీసమేతుఁడగు వాసుదేవుని లక్షణములు. వ్యూహములు, విభవములు శుద్ధ సృష్టిలోనివే. శుద్ధసత్త్వపరికల్పితమగు వైకుంఠము శుద్ధసృష్టి లోనిదే ౧. స్థూలసృష్టి గుణత్రయాన్వితమగు ప్రకృతివలన నిది వఱకుఁ జెప్పఁబడిన క్రమములో జరుగును. ౨. ఈశ్వరునికీ సృష్టి కార్యమొక లీల. ౩. లీలాభావములో నిష్కామత్వము, స్వేచ్ఛ, ఆనందము నిమిడియున్నవి. ఈభావము ననుసరించియే రామా

---

(౨) ౨. ౧, ౩౪-౩౫

(౧) వంగీయ వైష్ణవశాఖ దీనినంగీకరించునుగాని, లక్ష్మీవిష్ణువుల స్థానమున రాధాకృష్ణులను నిలుపును

(౨) పంచరాత్రసంహితల ననుసరించి, రెంటికి మధ్యమవర్గమునకుఁ జెందిన సృష్టినిఁగూడఁ జెప్పును.

(౩) పోల్చు; క్రీడాహరేరిదమ్‌సర్వమ్; మఱియు, హరేవిహారసిక్రీడా కంతుకైరివ జంతుభిః; మఱియు లోకవత్తు లీలాకైవల్యమ్." సూత్రమును.

నుజుఁ డీశ్వరునకు సంపూర్ణ స్వాతంత్ర్యమున్నదని వాదించును. ప్రకృతియు జీవులు నీశ్వరుని క్రీడావస్తువులు; అవియెన్నఁడును వానియిచ్ఛకు వ్యతిరేకములు కాఁజాలవు. తనస్వేచ్ఛావిలాసము కొఱ కీశ్వరుఁడీ నాటకప్రదర్శనమును జేయును. ర

పరిపూర్ణము నద్వితీయమునగు బ్రహ్మమునుండి, పరిచ్ఛిన్న జగదుత్పత్తి కవకాశము లేదనియు, లేక పరిచ్ఛిన్నమానసమపరిచ్ఛిన్నబ్రహ్మ పదార్థమునుండి పరిచ్ఛిన్న సృష్టి యెట్లు వచ్చెనో తెలియుట కవకాశము లేదనియుఁ జెప్పిన శంకరుని సమస్య రామానుజుని బాధించలేదు; ఏలన నిర్గుణ బ్రహ్మమునుండి సగుణసృష్టి యేర్పడెనని చెప్పు శ్రుతివాక్యములను రామానుజుఁడు విశ్వసించును. శ్రుతివాక్యమునకు హేతు సామర్థ్యమునుండితీరును. నిర్దేహజీవులు, నవ్యక్తజడపదార్థము నుండవలెనని యీశ్వరేచ్ఛయైనచో నట్లుండునా యుండవా? ఈశ్వర సృష్టి కాధారభూతములగు నీ మూలద్రవ్యములు మధ్వాచార్యుఁడు చెప్పినట్లు, బాహ్యమునుండి వచ్చినవికావు. అవి యీశ్వరునందే ప్రకారరూపములై యున్నవి. కాని; యీశ్వరేచ్ఛకుఁ బూర్వమే యీ ద్రవ్యము లుండవలెను. ఇంకొకరకమగు ద్రవ్యమువలన నింతకంటె మంచిసృష్టి జరిగి యుండవచ్చునని యూహించుట కవకాశమున్నది. తనకు సాధ్యములగు ప్రపంచములన్నిటిలో నుత్తమమైనదాని నీశ్వరుఁడు

---

(ర) స్వసంకల్పకృతమ్ (రామానుజగీతాభాష్యమ్. ౧, ౨౫.); పోల్చు: "ఈశ్వరుఁడత్యయానందమున ననంతరీతుల నానందించును." (ప్రొనింగు పెరా సెల్సన్).

కల్పించుటకు వీలులేదు; ఉన్న ద్రవ్యముతో సాధ్యమైనంత మంచిసృష్టి నాతఁడు చేయఁగలిగెను. నిరుపాధిక సత్తాకమైన దే బ్రహ్మము౧. మార్పునకు వశమైన జడపదార్థమును, జడపదార్థ వశమైన జీవసమూహము నట్టిదిగాదు. తన విశేషణములగు జీవ జడపదార్థములు వికారము నొందుచుండగా బ్రహ్మము నిర్వికారమై యెట్లుండఁగలదో భావించుట కసాధ్యమైనది. ఈ ప్రకారములు సూక్ష్మరూపములనుండి స్థూలములుగను, మఱల సూక్ష్మములుగను మారుచున్నవి. అందుచే నీశ్వరుఁడును వికారము నొందునని రామానుజుఁ డంగీకరింపవలసి వచ్చినది.౧. సృష్టి యీశ్వరుని విశేషణమని రామానుజుఁడు చెప్పెను. అనఁగాఁ బరబ్రహ్మము విశేషణ రహితముగా నుండఁజాలదన్నమాట; విశేషణము పరబ్రహ్మ కవసరము. దీఁకి వ్యతిరేకముగాఁ గొన్ని శ్రుతివాక్యము లుండుటచే రామానుజుఁడు దీని నంగీకరింపఁ డయ్యెను. "ఈజీవులు నాయందు లేరు"౨. వాక్యమునకు వ్యాఖ్యవ్రాయుచు రామానుజుఁడిట్లు చెప్పెను: "నాయిచ్ఛచే సర్వజీవుల కాధారము నేనే; కాని వాని వలన నాకెట్టి సహకారము నవసరములేదు."నాస్థితి

(౧) నిరుపాధికసత్తా. ౧,౧,౨. వ్యాఖ్య: శ్రుతప్రకాశికా: కేనాపి పరిణామవిశేషేణ తత్తదవస్థస్యసత్తా సోఽపాధికసత్తా, అతోనిరుపాధికసత్తా నిర్వికారత్వమ్॥

(౧) ఉభయప్రకారవిశిష్టే నియంత్రంసే తదవస్థా తదుభయ విశిష్టతా రూపవికారోభవతి. (రా.భా. ౨, 3, ౧౮.)

(౨) భగవద్గీత ౯, ౪.

కీజీవు లెప్పుడు నేవిధమునఁ దోడ్పడనవసరము లేదు."3. జగ ముండుట వలన (బరమేశ్వరునకే ప్రయోజనమును లేదు. దైవ స్వభావములో జగమిమిడియున్నదను రామానుజుని యీశ్వర తత్త్వమున కిది వ్యతిరేక మగును. "పత్రముగాని పుష్పముగాని భక్తితోనిచ్చిన నేను సంతసింతు" ననుగీతా వాక్యమును వివరించుచు రామానుజుఁడు వ్రాసినాఁడు, "నాకు స్వభావమగు నిరవధికము నవ్యయమునగు నానందము ననుభవించుచున్నను, భక్తులిచ్చిన దానిని నాకు దుస్సాధ్యమగు వస్తువులభించినదానినిగా స్వీకరించి యనుభవింతును." ౪. తనభక్తుల దానములచే నీశ్వరుఁ డధిక ముగా నానందించునుగాని, భక్తులుగానివారి కష్టదుఃఖములతో నాతనికి సంబంధములేదు. తనలో భాగమైన హస్తమో, పాదమో బాధపడినచో నొక వ్యక్తియు బాధపడునట్లే, జీవు లీశ్వరాంశములైనచో జీవుల దుఃఖములం దీశ్వరుఁడు భాగ స్వామి యగును, అందుచే జీవునికంటెఁ బరమేశ్వరుఁడే యెక్కు- వేడ్చును.౧. కాని జీవుల దుఃఖమువలన నీశ్వరుఁడు కలుషితుఁడు గాఁడని రామానుజుఁడు వాదించును. సృష్టిస్థితిలయకార్యము లీశ్వరుని లీలలైనచో, నీశ్వరుని వినోదము మార్పుల నొందు ననియు, నీవ్యాపారముల వలన నాతని యానంద మతిశయించు ననియు మన మూహింపనగునా? ఈశ్వరుని పరస్వభావమవ్య

(3) మత్‌స్థితౌ తైర్నకశ్చిదుపకారః (రామానుజ గీతాభాష్యము ౯. ౪.)

(౪) రామానుజ గీతాభాష్యము. ౯-౨౬.

(౧) శం. భా. ౨, 3, ౪౫.

యానందము; తన విశేషణముల వికారము లాతని కధికానందము నొసఁగును. జీవదేహసంబంధము హేతుయుక్తముగా నిర్ణయింపఁబడని రీతినే, నిర్వికారము, పరిపూర్ణమునగు నీశ్వరుని పరానందమునకును నాతనిశరీరవికారములచేఁగలుగు నానందమునకును సంబంధము స్పష్టముగా నిరూపింపఁబడలేదు.

మాయాసిద్ధాంతమును, జగన్మిథ్యాత్వమును రామానుజుఁడు తీవ్రముగాఁ బ్రతిఘటించును. లోకములోని భేదములకు మానవుని పరిచ్ఛిన్న మానసమే కారణమైనచో, నీశ్వరునికి భేదము లుండరాదు. కాని యీశ్వరుఁడే లోకమును సృజించి భిన్నజీవులకు వాని కర్మఫలితముల నేర్పాటు చేసెనని శ్రుతి చెప్పుట వలన, నీశ్వరునకు లోకభేదములతో సంబంధమున్నదని తెలియుచున్నది. మరుమరీచికవలె జీవనానాత్వ మసత్యమనుటకు వీలులేదు; ఏలన మరీచికపై నాధారపడి మనము చేయు యత్నము వ్యర్థమగుచున్నది; జగత్తుపై నాధారపడి మనము చేయు కార్యము లట్లగుటలేదు. మఱియు ప్రత్యక్షము మనకుఁ జూపు ప్రపంచ వాస్తవికత, శ్రుతిసాక్ష్యముచేఁ దొలగింపఁబడుచున్న దనుటయు సహేతుకవాదము కాదు; ఏలన, శ్రుతిరంగము, ప్రత్యక్షరంగము భిన్నములు; అందుచే నొకదాని నొకటి యవి నిర్మూలింపఁ

(౧) ఆకాశవాయ్వాదిభూతా...పదార్థగ్రాహి ప్రత్యక్షమ్: శాస్త్రంతు ప్రత్యక్షాద్యపరిచ్ఛేద్య సర్వాంతరాత్మత్వ సత్యత్వాద్యనంత విశేషణవిశిష్ట బ్రహ్మస్వరూప...విషయమ్, ఇతి శాస్త్రప్రత్యక్షయోర్న విరోధః॥ (వేదార్థసంగ్రహము. పు. ౭౭.)

జాలవు.౧. జ్ఞానమంతయు వస్తువుల నావిష్కరించును.౨. నిత్యముగానుండవు గావున, వస్తువులే లేవనుట విచిత్రవాదము. వ్యతిరేక వస్తువులకును, భిన్నవస్తువులకును భేదము తెలియని వాదమిది. భేద మభావసూచకముగాదు. రెండు జ్ఞానక్రియలు పరస్పరవిరుద్ధములైనచో నపుడు రెండును యథార్థములుగావు. "కాని ఘటపటాదు లన్యోన్య విరుద్ధములుగావు; ఏలన నవి దేశకాలములలో భిన్నములైయున్నవి. ఏదేశమం దేకాలమున నొక వస్తువున్న జ్ఞానమును, నాదేశమం దాకాలముననే వస్త్వభావజ్ఞానమును గలిగినచో నవి పరస్పరవిరుద్ధములు. కాని దేశకాలములు భిన్నములైనచో నిట్టి వైరుద్ధ్యములేదు."౩. రజ్జుసర్పభ్రాంతి దృష్టాంతములో నభావజ్ఞాన మొకే దేశకాలములలో సంభవించుచున్నది. అందుచే వైరుద్ధ్యమున్నది. కాని మన మిప్పుడు చూచిన యొకవస్తు వింకొక కాలమున నింకొక దేశములో లేకున్నచో, నావస్తు వసత్యమను నిర్ణయము చేయుటసాహసమగును.శంకర రామానుజులిద్దరు నేకత్వము నేక సమర్థింతురు. నిజమగు నేకత్వము భేదసహితమనియు, నభావ విరుద్ధసహితము కాదనియు రామానుజుడు భావించును. అద్వైతముయొక్క అవిద్యాసిద్ధాంతమున కనేకాక్షేపణలను రామానుజుడు చూపెను. అవిద్య కాశ్రయమేది ? పరి

(౨) అర్థప్రకాశ.

(3) దేశాంతర కాలాంతర సంబంధి తయానుభూతస్యాన్య దేశ కాలయో రభావా ప్రతిపత్తావవిరోధః॥ (౧,౧,౧.)

(౪) శం॥భా॥ ౨,౨,33; రా॥భా॥ ౨,౨,3౧.

పూర్ణుఁడగు పరబ్రహ్మ కాఁజాలదు; అవిద్యాసంజాతుఁడగు జీవుఁడును గాఁడు. అవిద్య బ్రహ్మయొక్క స్వయంప్రకాశము నాచ్ఛాదింపఁజాలదు. స్వయంజ్యోతియగుజ్ఞానమునకు వేఱొక యాధారముగాని విషయముగాని లేదు. అట్టిజ్ఞానము తనలో నెలకొనియున్న యొకలోపముచే నానావిషయములతో సంబంధమును గలిగియున్నదని భావించినచో నాలోపము సత్యమా, అసత్యమా ? అది అద్వైతముననుసరించి నిజముగాదు; రామానుజు ననుసరించి యది అనృతము కాఁజాలదు; ఏలన నది యీశ్వరుఁ డంగీకరించినదే. మానవజ్ఞానములో, నవ్యక్తమైనది వ్యక్తమగునప్పుడు, వ్యక్తమగుకార్యమున కవరోధమగునదేదియో యుండవలెను. అట్టిదోషము బ్రహ్మమున కున్నదనుటకు వీలులేదు. మఱియు బ్రహ్మముకూడ నవిద్యావశుఁడైనచో సర్వము నసత్యమను నిర్ణయమునకు రాకతప్పదు. అవిద్యాస్వరూపమును సహేతుకముగా నిర్ణయింపఁజాలము. అది సత్యమునుగా దసత్యమునుగాదు. ఒకవిషయ మనిర్వచనీయమనుట సమంజసముగాదు. అవిద్య యున్నదని యేజ్ఞానప్రమాణమును ఋజువు చేయలేదు. ప్రత్యక్షానుమాన శబ్దప్రమాణములు దానిని నిరూపింపఁజాలవు. శ్రుతులలో మాయయనఁగా దేవు నద్భుతశక్తియను నర్థములో నుపయోగింపఁబడెను. దేవునికి శాశ్వతము నసత్యమునగు నవిద్యతో సంబంధములేదు. అద్వైతముననుసరించి శ్రుతులుగూడ నవిద్యలోనే చేరును; దానితో జ్ఞానమున కాధారమే పోవును. నిర్గుణబ్రహ్మజ్ఞానప్రాప్తిచే నవిద్యానివర్తనమగునన్నచో, నట్టిది జరుగదేలన నట్టిజ్ఞానము

సాధ్యము కాదు. యథార్థమగు నవిద్య, భావజన్యమగు జ్ఞానము వలన నివృత్తముగాదు. ప్రపంచము మహత్తరమైనది; గంభీ రార్థసహితమైనది; అది వట్టి భ్రమాసంజాతమనుట పొసఁగదు. మనమును, జగత్తును బ్రహ్మకు వేరైయుండుట నిజమని నమ్ము టయే యదార్థమగు నవిద్యయై యున్నది.

౧౫ - ధర్మ, మతజీవితము.

ద్వీపవాసులు తాము సాగరమధ్యమున నుంటిమని యెఱుఁగనట్లే దేహగతులైన జీవులు సంసారమున జీవించు చున్నవి. తాము దేవుని ప్రకారములమని (అంశములు) యెఱుఁగక ప్రకృతి సంభూతులమని నమ్ముదురు. పూర్వజన్మ సంస్కారవశమున జీవాత్మ దేహబంధములలోఁ దగుల్కొని యుండుటచే దాని యంతర్జ్యోతి బాహ్యాంధకారముచే నాచ్ఛా దింపఁబడును. ప్రకృతి పరికల్పిత దేహాచ్ఛాదనమే తన నిజమగు నాత్మస్వరూపమనియు, క్షణిక మానవసంతోషమే నిత్యానందమ నియు జీవుఁడునమ్మి, దేవునికిఁ బెడమొగము పెట్టుచున్నాఁడు. దేహమును గల్పించునవిద్యాకర్మలే జీవాత్మకుఁ బతనహేతు వులు. పరిశుద్ధమైన యాత్మకు జడపదార్థసంపర్కమే నీచస్థితిని గూర్చినది. ఈ పాపమువలన నాత్మాభ్యున్నతి కవరోధము కల్గు టయే కాక, దైవద్రోహము కూడనైనది. ఈశ్వరుఁడే సర్వాత్మ స్వరూపియను విద్యచే నవిద్యానివృత్తి కావలెను. జీవులకు స్వతంత్రప్రవృత్తి సామర్థ్యమును రామానుజుఁ డంగీకరించును. బాధ్యత విషయములోఁ బ్రతివ్యక్తియు నీశ్వరునకన్యుఁడే. తన కీశ్వరుఁడాధారమని తెలియనిచో, జీవినిఁ గర్మయంత్ర

మూలమున శిక్షించి, దాని దుర్వర్తనములను స్మృతికిఁదెచ్చి, సత్యము నెఱుఁగుటకు సాయపడును. అంతర్వర్తియైయున్న యీశ్వర ప్రేరణావశమున జీవాత్మ తనదోషమును గుర్తించి, దైవ సాహాయ్యము నపేక్షించును. పాపమునకు బాధ్యత మానవు నిదే యని రామానుజతత్త్వ ముద్ఘాటించును. యామునాచార్యుఁడు 'దానొకసహస్రపాపఘట'మని వర్ణించుకొని దైవకటాక్షము నర్థించును. వైష్ణవమతము శ్రమాన్వితమగు తపోవిధానములను బ్రోత్సహించదు.

ఆస్తికుఁడగు రామానుజుఁడు జ్ఞానకర్మలచేఁగాక భక్తిప్రసాదములచే మోక్షము సాధ్యమని నమ్మెను. శాస్త్రముల ననుసరించి జ్ఞానమనగా ధ్యానమును, నిదిధ్యాసనము నై యున్నది. ౧. ఈశ్వరుఁడు మనకంతరాత్మ యనియు, మన మీశ్వరునిలో నంశములమనియుఁ జెప్పు సత్యముపై దృష్టి కేంద్రీకరించుటచే భక్తి జనించును. దుష్కర్మవినాశమైనఁగాని యీ జ్ఞానముదయింపదు. నిష్కామకర్మవలనఁ బూర్వకర్మ క్షయమగును. శాస్త్రచోదిత కర్మలను స్వార్థముతోఁ జేసినచోఁ బ్రయోజనము లేదు. కర్మఫలితము క్షణికము, జ్ఞాన మక్షయమైనది. కాని యీశ్వరార్పణబుద్ధితోఁ జేయు కర్మ మోక్షసిద్ధికి సాహాయ్యమగును. ౨. నిష్కామకర్మవలన సత్త్వగుణము పెంపొంది, సత్యము స్ఫురించును. జ్ఞానకర్మలు భక్తిసాధనములు, భక్తి స్వార్థపరత్వమును మూలములోనికిఁ బెరికివైచి,

(౧) 3-౮,౨౬.

(౨) తదర్పితాఖిలాచారతా (నారదభక్తిసూత్రము సూ,౧౯)

సంకల్పమునకు నూతనబలమును, బుద్ధికిఁ గ్రొత్తచూపును, నాత్మకు నవ్యశాంతినిఁ జేకూర్చుశక్తి గలది.

నికృష్టోపాసనము మొదలిడి, యీశ్వరసాక్షాత్కారము వరకు సర్వవిధారాధనములు భక్తియే యనునర్థము వ్యాప్తిలో నున్నది. ఋగ్వేదకాలమునుండిఁ నేటివరకు నీదేశమున భక్తికి [౧]బరిణామచరిత్ర గలదు. రామానుజు ననుసరించి భక్తి యనఁగాఁ బ్రశాంతధ్యాన మూలమున నీశ్వరసాన్నిధ్యముఁగాంచుటే. భక్త్యంగముల నాతఁడు విపులముగా వివరించెను. ఆహారవివేకము,[౨] ఈశ్వరుని యందనన్యకాంక్ష లేక విమోకము; అభ్యాసము; పరోపకారకమైన క్రియ;[3] సర్వజీవక్షేమకాంక్ష లేక కల్యాణము; సత్యము; ఆర్జవము; దయ; అహింస; దానము; అనవసాదము లేక నిరాశారహితమగు నిత్యసంతుష్టి[౪] మున్నగు

(౧) పోల్చు: "సుఖాపేక్షతో, నాభావము లన్నియును నుత్కంఠతో నింద్రుని స్తుతించును; సుందరుఁడగు యువకవరు నాతని వధువులు కౌగిలించుకొను రీతిని, నాకోరిక తీర్చునని నాభావములు ఆతని నాలింగనముచేసికొనును; ఓ హయింద్రా! నాచిత్తము నీయందే లగ్నమై తిరిగి రాకున్నది. నావాంఛా సిద్ధికి నిన్నే ప్రార్థింతును." (ఋగ్వేదము, ౧౦,౪౩,౧.)

(౨) ఇంద్రియవిషయ మోహముండరాదని చెప్పిన శంకరుని వివరణ మింతకంటె శ్రేష్ఠతరము.

(3) స్వాధ్యాయము, ఈశ్వరారాధనము, పితృదేవతలకు సేవ, మానవజాతికిఁ బశుజాతికి నిర్వహింపవలసిన విధులుగా విభాగింపఁబడెను.

(౪) సర్వదర్శనసంగ్రహము, ౪.

నవి. కావున భక్తియనఁగా నుద్రేకముగాదు;(౫) ఇచ్ఛాబుద్ధి శిక్షణము.(౬) ఈశ్వరుని గూర్చిన జ్ఞానము, నీశ్వరేచ్ఛావశమగు సంకల్పమునుగ భక్తిలోనివి. మనస్సును హృదయమును సంపూర్ణముగా నీశ్వరుని కర్పించుటే భక్తి. ఇది సాక్షాత్కారసిద్ధితో సమాప్తమగుచు.(౨)

భక్తియు, మోక్షము నవినాభావసంబంధముగలవి; భక్తియొక్క ప్రతిఘట్టమందును మనకుఁ గ్రమాభివృద్ధి కల్గుచున్నది. భక్తియొక్క పరిణామమే మోక్షము. అదియే సాధనములన్నిటికంటె శ్రేష్ఠతరమైనది; ఏలన భక్తి ఫలరూపమగు సాధనము. జీవాత్మ భక్తివలనఁ గ్రమముగాఁ దన కీశ్వరుని తోడి సంబంధము నధికముగా గుర్తించి, తుదకుఁ దనకుఁ బరమాత్మయగు నీశ్వరునికి సంపూర్ణార్పణము చేసికొనును. తరువాత నిఁక స్వాభిమానము, స్వార్థపరత్వము నుండవు; ఏలన నహంకారము స్థానమున నీశ్వరుఁడు ప్రవేశించినాఁడు; జీవితమంతయు దీనితో మార్పునొందును. నమ్మాళ్వారు చెప్పినాడు;

---

(౫) స్వప్నేశ్వరుఁ 'డనురక్తి' యనగా జ్ఞానసహితమగు భక్తియని చెప్పినాఁడు. అంధ ప్రేమ భక్తి కాదు.

(౬) జ్ఞానకర్మానుగృహీతమ్ భక్తియోగమ్. (రామానుజ. గీ. భా. ఉపోద్ఘాతము) ధీప్రీతిరూపా భక్తిః (తత్త్వముక్తాకలాపము.)

(౧) వేదార్థసంగ్రహములో రామానుజుఁడు సాధనభక్తి, పరాభక్తి యని భక్తిభేదము తెల్పెను. వాఙ్మనో దేహనిగ్రహము, విధికర్మాచరణము, స్వాధ్యాయము, నిస్సంగత్వము మున్నగునవి మొదటిదానిలోఁ జేరును.

(౨) ౧, ౧, ౧.

(3) నారద భక్తిసూత్రములు పు, ౨౬

"నన్ను నీలోఁ గలుపుకొను మహాత్తరమైన నీ వరప్రసాదమున కు నేను కృతజ్ఞుఁడనై నాయాత్మను నీకు సమర్పించినాను."౪. మనరక్తములోని ప్రతిబిందువును, హృదయమందలి ప్రతిస్పందనమును; బుద్ధియందలి ప్రతిభావమును దేవునికి సమర్పింపఁబడును. "నేను కాదంతయు నీవే" యనునదీయవస్థ, వైధీభక్తి ముఖ్యభక్తియని భక్తి రెండుతెరగులు. మొదటిది ప్రార్థనలు, పూజలు, విగ్రహారాధనముతోఁగూడినది. ఇవన్నియు నాత్మ పురోభివృద్ధినిచ్చునుగాని, తరింపఁజేయఁజాలవు. మనము పరమాత్మ నర్చింపవలెను; భక్తి చరమసోపానములలో ధ్యాన విషయముగా నేరూపమును నిలువఁజాలదు.౧.

ఈశ్వరునకు సంపూర్ణ సమర్పణము ప్రపత్తి.౨. భాగవతుల ననుసరించి, ప్రపత్తియే మిక్కిలి నిశ్చయమైన మోక్ష

---

(౪) తిరువాయిమోయి ౨, ౩, ౪

(౧) రామానుజుఁ డొక గురుప్రోక్త శ్లోకము నిట్లుదాహరించినాఁడు: "ఆబ్రహ్మస్తంబ పర్యంతా జగదంతర్వ్యవస్థితాః। ప్రాణినః కర్మజనితసంసారవశవర్తినః। యతస్తతోనతే ధ్యానే ధ్యానినాముపకారకాః। అవిద్యాంతర్గతా స్సర్వే తేహిసంసారగోచరాః॥" "బ్రహ్మమొదలు తృణపర్యంతము సర్వవస్తువులు కర్మజాతమగు సంసారపాశబద్ధములు. అవిద్యాంతర్గతములై, సంసారసంగతములైన యావస్తువులు ధ్యానమున కుపకరించు విషయములుకాఁజాలవు.

(౨) చూ: రామానుజుని భగవద్గీత ౭ అ. ౭,౧౪. లకు వ్రాసిన ఉపోద్ఘాతవాక్యములు. ప్రపత్తి కారంగములు చెప్పఁబడినవి. (౧) అనుకూల్య సంపత్తి అనగా నీశ్వరార్పణమున కర్హములైన లక్షణముల నార్జించుట (౨) ప్రతికూలలక్షణ విసర్జనము. (౩) ఈశ్వరుఁడు తన్నుఁదప్పక రక్షించు ననువిశ్వాసము. (౪) రక్షణకై మొఱ (౫) కార్పణ్యము (౬.) ఆత్మసమర్పణమును మొదటియైదు వారవడానికి సాధనములు. ఆత్మసమర్పణమే ప్రపత్తి.

సాధనము. పండితులకుఁ బామరులకు, నధికులకు నల్పులకు నందరకు నిది సులభసాధ్యమైనది. జ్ఞానకర్మలపై నాధారపడు భక్తి, కష్టసాధ్యమగుటచే నగ్రజాతిత్రయమునకే చెప్పఁబడినది కాని యెవ్వఁడైనను, గురూపదేశమునంది, యీశ్వరుని భుజ స్కంధములపైఁ దన భారమునిడి, సుఖింపవచ్చును. ఆల్వారుల సంప్రదాయము నధికముగానాదరించిన తెంగలై (దక్షిణశాఖ) శాఖ ననుసరించి, మోక్షమునకుఁ బ్రపత్తి యేకైకమార్గమనియు యత్నాంతర మేమియు నవసరములేదనియుఁ జెప్పఁబడెను. ఈశ్వరుని సంపూర్ణార్పణ మొనర్చినవాని నాతఁడే రక్షించును. వడగలై (ఉత్తర)శాఖ, మోక్షమునకుఁ బ్రపత్తి యొకమార్గమే కాని యొకేమార్గము కాదని చెప్పును. ఈశాఖ ననుసరించి, మోక్షసిద్ధికి మానవప్రయత్న మవసరమని చెప్పును. కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తులను సాధించిన వ్యక్తి కీశ్వరకృప లభించును. ఈ శాఖ చెప్పునది మర్కట కిశోరన్యాయము; మర్కట కిశోరము ప్రయత్నపూర్వకముగాఁ దల్లినంటి పట్టుకొనియుండవలెను. రెండవశాఖ చెప్పునది మార్జాలకిశోరన్యాయము. ఇచటఁ దల్లి తనకిశోరమును నోటఁ గఱచుకొని, కొనిపోవును. ఈశాఖ ననుసరించి, మానవప్రయత్నములో నేమియునులేదు; దైవ కటాక్షమే మోక్షార్హులగు వారినేర్చి రక్షించును. ఈశ్వరుఁ డేదేనొక్క ముహూర్తమున జీవాత్మ నావేశించి స్వీకరించును. తిరిగి ప్రయత్నమవసరములేదు; ఆత్మ సమర్పణము నిత్యము జరుగుచుండవలెనని రెండవశాఖ చెప్పును.

భాగవతపురాణములోని భక్తి, రామానుజుఁడు చెప్పిన దానికంటె నిగ్రహము తక్కువచూపును. కొంతమితిలేని యావేశము భక్త్యారంభదశలోఁ జూపఁబడినది. ఆత్మపరివర్తన మందుచున్న వ్యక్తి కొంత అద్భుతాహ్లాద పరవశత్వమునం దును, భాగవతభక్తిలో భావముద్రిక్తమై, దేహకంపముగలిగి, గద్గదకంఠమై, సమాధ్యవస్థలోనికిఁ దోడ్కొనిపోవు లక్షణము కలదు. కర్మకలాపము నెడ నుదాసీనభావము చూపి, భాగవతము ఫలాపేక్షలేని యీశ్వరభక్తి ప్రధానమని బోధించును. కోరిన ప్రతివ్యక్తియు నీశ్వరునియం దైక్యము పొందవచ్చునని యది చెప్పును ఇది భక్తివలన సాధ్యమగును. కాని యీశ్వరునిలోఁ గలిసిపోవుటకంటెఁ నెల్లప్పుడును వేఱైయుండుటే విశేషానంద హేతువని చెప్పఁబడెను. భాగవతము చూపుదేవునిలో మానవత్వభావ మధికముగా గోచరించును. ఈశ్వరుఁడు భక్తపరాధీనుఁ డగుటచే నస్వతంత్రుఁడు. ౧. తన భక్తసంఘము లేనిదే, యీశ్వరుని కెట్టి సంతృప్తియును లేదు. ౨. గోపీకృష్ణ సంబంధచరిత్రమును దైవలీలగా వర్ణించుటయే భాగవతములోని ముఖ్యలక్షణము. ఈచరిత్రాంశములు భక్తిచేఁ బునీతములై, యనంతర వైష్ణవశాఖలను బ్రోత్సహించినవి.

---

(౧) భాగవతము, ౩. ౨౯, ౩౩,

(౧) ౯, ౪, ౬౩.

(౨) నాహమాత్మా నమాశాస్తే మద్భక్తైస్సాధుభిర్వినా, (౯,౪,౬.) పోల్చు: భక్తప్రాణోహి కృష్ణశ్చ కృష్ణప్రాణాహి వైష్ణవః (నారద పంచరాత్రము ౨,౩౬.)

అత్యంత సన్నిహితములగు మానవసంబంధము లీశ్వర మానవసంబంధచిహ్నములుగా వైష్ణవభక్తి యుపయోగించి నది. పరమేశ్వరుని గురువుగా, మిత్రునిగా, తండ్రిగా, తల్లిగా, బిడ్డగా, మఱియుఁ బ్రియునిగాఁగూడ నారాధించిరి. ఆల్వారులు, భాగవతము, వంగీయవైష్ణవమతమున నీశ్వరుని బ్రియునిగా స్వీకరించినవి. భక్తిలోవలె, నుత్తమప్రేమలో, ప్రియుని సాన్నిధ్యమున నుండుటే పరమసుఖము; ఫలసిద్ధి సాధకము; ప్రియాప్రియుల వియోగజీవితమే, దుఃఖము, వ్యర్థము, నైనది. ప్రేమలో నింద్రియాకర్షణమే ముఖ్యమని భావించుటచే, నీప్రేమ చిహ్నమగు భక్తిభావము యుక్తము కాదని మన మూహింప వచ్చును; కాని పరిశుద్ధప్రేమలో నింద్రియాకర్షణముల కల్ప స్థానము మాత్రమే యున్నది. పెక్కురు స్త్రీ పురుషులు, వశు వాంఛ కతీతమగు నంతరువులో నున్నవారు. ప్రేమయనఁగా నిత్యనూతనాకర్షణానుభూతుల కొఱకన్వేషించుట గాదని చెప్ప గలరు. నిజమగు ప్రణయము గలవారు, తాము చూచినట్టియు నెఱిగినట్టియు జనులందరికంటె నధికముగాఁ దా మొండొరుల విశ్వసింతురు. అట్టిప్రేమగల వ్యక్తి, తన ప్రియుని కొఱకు లేక ప్రియురాలి కొఱకు, లోకమునంతను నెదుర్కొనుటకుఁ గాని, యెన్నికష్టములనైన ననుభవించుటకుగాని దారిద్ర్య మందు, నరణ్యవాసము, నవమానములందు సుఖము గాంచు టకు, నెల్లప్పుడు సంసిద్ధత జూపును. ఒకవేళ నే దురదృష్ట వశమునైన వియోగము సంభవించినను, దిరిగి కలిసికొను నవ కాశము గోచరింపకున్నను, బ్రియులొండొరులను మఱువక,

తమ కనోన్యప్రేమచే లభించిన సంబంధమును నశింపకుండఁ గాపాడుకొనుటకై, సర్వనాశనమైనను, దుదకు మరణము తట స్థించినను, లెక్కచేయరు. సీత, సావిత్రి, దమయంతి, శకుంతల మున్నగు పతివ్రతల చరిత్రములు భారత హృదయములో శాశ్వతముగా ముద్రితములై యీప్రణయరీతి నుపదేశించు చున్నవి. అందుచే భారతీయ వైష్ణవుఁడీశ్వరునిఁ దన ప్రియునిఁగా బ్రేమించి,౧ మానవప్రేమలోని యుద్రేకములు,నావేశములు, నీశ్వరుని వైపునకుఁ ద్రిప్పుటలో నాశ్చర్యము లేదు. ఈశ్వర సాన్నిధ్యము లేకున్నచో, భక్తుని కాందోళనము, నిస్సహాయ తయుఁ గలుగును; ఏలన వేఱెద్దియు నాతనికి సంతుష్టి నొసఁ గదు. వారి భక్తిగీతములలో, నీశ్వరునికి హృదయముతో మొర పెట్టుట, తద్విరహములో దుస్సహావిచారము, సంయోగాశ పొడగట్టుచోఁ గలుగు నద్భుతానందము, నీశ్వరుఁడు చూపు ప్రణయముయొక్క అనిర్వచనీయ మహత్త్వమందలి గౌరవము విశేషముఁగా గోచరించును. పరమేశ్వరునితో నైక్యము పొంది తీరవలెనను మహాయోగుల పరమావేదన వైష్ణవభక్తుల ప్రసంగ ములలోఁ గాననగును. నమ్మాళ్వారిట్లు మొదలిడెను: "పరం

(౧) పోల్చు: సఏవవాసుదేవోఽసౌసాక్షాత్పురుష ఉచ్యతే।
స్త్రీప్రాయమితరాత్సర్వమ్ జగద్బ్రహ్మపురస్సరమ్
"పరమేశ్వరుఁడొక్కఁడే పురుషుఁడు; బ్రహ్మతో సహా మిగిలిన జీవులందరు స్త్రీలు: వానిపై నాధారపడి వానితోఁ గలియఁగోరు చుందురు."
మఱియుఁ బోల్చు:
"స్వామిత్వాత్మత్వశేషిత్వ పుంస్త్వాద్యస్స్వామినోగుణాః
స్వేభ్యో దాసత్వ దేహత్వ శేషత్వ స్త్రీత్వదాయినః."

జ్యోతివగు నీవు నాయంతరాత్మను కాల్చి, కరిగించుచుంటివి. నీతో నేనెప్పుడు కలియుదును."౧. గాఢమగు దైవభక్తి కల వాఁడీశ్వరేతరములగు నన్నిటి నుదాసీనుఁడై చూచును.౨.

హిందూభక్తుఁడు కామమును జంపఁడు; కాని దాని నీ లోకమునుండి స్వర్గమున కెత్తును; దానిని సృష్టినుండి సృష్టికర్త పైకిఁ బోనిచ్చును. మణవాల యను భక్తుఁడిట్లు చెప్పినాఁడు; "ఇంద్రియవిషయములనుండి యజ్ఞాని గాంచు సుఖమే, దేవునిపైఁ బెట్టినచో భక్తి యనఁబడును. నమ్మాళ్వారునకీ భక్తియే సౌందర్యనిధియగు పరమేశ్వరునియెడఁ బ్రేమగాఁ బరిణమించినది. అందుచే నాళ్వారులకు భక్తి యనగా బ్రేమయైనది౩. వధూవరుల సంబంధభక్తిఁ జూపువారిలోఁ బెక్కుమంది పరిశుద్ధులు, యోగ్యులు నైనను దీనిదుర్వినియోగముకూడ లేదనరాదు. కాని అట్టి దుర్వినియోగములు త్రోవతప్పుటలే యగును. వర్ణభేదము లాత్మకుఁ జెందవు. అవి దేహమునకుఁ జెందినఁ జెందవచ్చును; అవి సంఘమునకుఁ జేయువలయు విధు

(౧) తిరువాయ్మొళి ౯, ౧౦, ౧

(౨) అనురాగాద్విరాగః। భక్తిమార్గములో నాలుగు దశలున్నవి. (౧) దేవునివైపు దిరిగి తన భావోద్రేకములను వెళ్లబుచ్చుకోరిక (౨) సిద్ధి లభింపని దుస్సహబాధ, (౩) వాంఛాసిద్ధికలవ దివ్యానందపరవశత్వము, (౪) దివ్యానందరాశియగు పరమేశ్వరప్రియునితోఁగలిసి నిత్యసుఖానుభూతి.

(౩) యా ప్రీతిరస్తి విషయే ష్వవివేకభాజామ్
సైవాచ్యుతే భవతి భక్తిపదాభిధేయా
భక్తిస్తు కామ ఇహతత్కమనీయరూపే
తస్మాన్మునే రజనికాముకవాక్యభంగీ (ప్ర)సిద్ధోపనిషత్సంగతి

లను భిన్నవ్యక్తులకు నిర్ణయించును. కాని వర్ణమాత్మలక్షణ సంబంధికాదు. బ్రాహ్మణులచే నర్చింపఁబడిన కొందరాళ్వారులు శూద్రులు. దైవభక్తులలో వర్ణభేద మవసరము లేదని రామానుజుఁడు చెప్పినాఁడు ౧ వర్ణాశ్రమధర్మములు లేని వారికిఁగూడ బ్రహ్మజ్ఞానార్హత గలదని యాతఁ డంగీకరించి నాఁడు.౨ భక్తిప్రపత్తులకు మధ్యవర్తియగు నొకపురోహితుఁ డవసరము లేదు; ప్రేమసమర్పణమునకు శ్రుతి ప్రమాణము నవసరము కాదు. దైవకృప యేనరుని సొంతసొమ్మునుగాదు. గాఢభక్తి గలవానికి శాస్త్రము, నియమమును లేవు ౩. రామానుజుఁడు భక్తిలో సర్వసమత్వమును సమర్థించి, భక్తి సర్వవర్ణాతీతమైనదని ప్రకటించినాఁడు మేల్కోట దేవాలయములోనికిఁ బంచముల కాతఁడు ప్రవేశమిచ్చినాఁడు. కాని సంప్రదాయ క్రమవిధానములన్నిటి నాతఁడుల్లంఘింపనుద్దేశించినట్లుతోఁచదు. సంప్రదాయమును గారవించి, యాతఁడు ద్విజవర్ణత్రయమునకే స్వేచ్ఛగలదనియు నితరులు క్రమముగాఁ బరిశుద్ధులై యింకొక జన్మమెత్తువరకోర్పుతో నుండవలెననియుఁ జెప్పెను. అందుచే నాతఁడు తన సిద్ధాంతములోని తర్కనిర్ణయముల నాచరణ

(౧) పోల్చు: నాస్తి తేషు జాతివిద్యారూపకులధనక్రియాదిభేదః. (నారద భక్తిసూత్రములు పు.౭౨) మరియుఁబోల్చు:

శ్వపాకోఽపి మహీపాల విష్ణుభక్తో ద్విజాధికః
విష్ణుభక్తి విహీనస్తు యతిశ్చశ్వపచాధమః
(భాగవతము)

(౨) ౩, ౪, ౩౬,: ౧, ౩, ౩౨-౩౯

(౩) అత్యంత భక్తియుక్తానామ్ నైవశాస్త్రం నచక్రమః

సాధ్యములొనర్ప నిచ్ఛగించి యుండలేను. తరువాతవచ్చిన (౧౩-వ శతాబ్దము) వైష్ణవగురువగు రామానందుఁడు వర్ణభేదములను నిరసించెను. "ఒకవ్యక్తి యొక్క జాతివర్ణముల నెవ్వఁడడుగరాదు. దేవు నర్చించువాఁడు దైవసంబంధియే" ఆయన ప్రధానశిష్యగణము పన్నిద్దరలో నొకఁడు బ్రాహ్మణుఁడు, నొకఁడు మంగలి, యొకడు చెప్పులుకుట్టువాఁడు, నొకఁడు రాజపుత్రుఁడు, నొకతె స్త్రీయుఁ గలరు. చైతన్యుఁడు జాతికులభేదములు విడిచి, యందరకు భక్తి ప్రేమధర్మమును బోధించెను. దక్షిణభారతదేశములో వేదాంతదేశికుఁడు శుద్ధభక్తికర్మమతమును బోధించెను. ౧. భారతీయ నాగరికతాచరిత్రలో నెల్లప్పుడు వర్ణకాఠిన్యమును నిరసించు నుపదేశములు చేయఁబడెను. కాని, యీ నిరసనోద్యమము లెవ్వియు జాతిహృదయమున సుస్థాపితమైయున్న యీ వర్ణవిభేదభావమును దొలఁగింపలేకపోయెను.

## ౧౬—మోక్షము.

రామానుజు ననుసరించి మోక్షమనఁగా జీవాత్మ అదృశ్యమగుటకాదు; దానినిబంధించు పాశములనుండి విముక్తి నందుటే. జీవాత్మ అదృశ్యమైనచో సత్యాత్మ నాశనమే యగును.౨. ఒక ద్రవ్యము వేరొక ద్రవ్యముగా మారదు.౩.

(౧) శ్రుతిస్మృతిర్మమైవాజ్ఞా యస్తాముల్లంఘ్యవర్తతే ఆజ్ఞాచ్ఛేదీమమ ద్రోహీ మద్భక్తోఽపివైష్ణవః॥ చూ: రహస్యత్రయసారములో శాస్త్రీయనియమనాధికారము.

(౨) ౧,౧,౧. (౩) విష్ణుపురాణము ౨,౧౪.౨౭.

మానవుఁ డెంత యున్నతస్థితి గాంచినను, నాతని కెల్లప్పు డర్చించి, ప్రేమించి, భాషింపవలయు నీశ్వరశక్తి, ప్రేమస్వ రూపమై యెదుట నుండఁగలదు. మనకుఁగలవానిలో మతాను భూతియే ఉత్తమానుభూతి యని ప్రకటించు రామానుజుఁడు తదనుభూతిలోఁ 'దానుకాని దున్న' దని పలికెను. ముక్తజీవికి సారూప్యమే కాని సాయుజ్యము లేదు.౧. ముక్తజీవి దివ్యజ్ఞానము కలిగి, యీశ్వరుని నిత్యసాక్షాత్కారము నొందుచుండును.౨ మఱేకోరికయు నాజీవికి లేని కారణమున, దిరిగి సంసారములో నికిరాదు.3. మోక్షమున కాటంక మహంభావము కాని, వ్యక్తిత్వముగాదు. జీవి సహజ స్వభావము నిత్యముక్తియై యున్నను, సంసారదశలో నవిద్యా కర్మావృతమైనది మోక్షా వస్థ యనఁగా, సహజములైన చిదానంద లక్షణముల నిరాతంక వ్యక్తీకరణము. ముక్తజీవిని స్వరాట్టనిరి; కారణము కర్మనూత్రి బంధవిముక్తియే ౪. రామానుజు ననుసరించి జీవన్ముక్తి లేదు. కర్మ నిశ్శేషమై, దేహపతనమైన వెనుక, ముక్తుఁడు పరమేశ్వర సాన్నిధ్యమును గాంచును. మోక్షావస్థలో జీవులన్నిటి కొకే రూపముండును. అచట దేవతా మనుష్య పశువృక్ష భేదము

(౧) బ్రహ్మణో భావః నతు స్వరూపైక్యమ్|| (౧,౧,౧)

(౨) పరిపూర్ణ పరబ్రహ్మానుభవమ్|| పోల్చు: "సర్వదేశ సర్వకాల, సర్వావస్థైగళిలమ్, సర్వేశ్వరనై, అనంతమంగళాన, విగ్రహగుణవిభూతిచేష్టి తమ్ గలింబోన్నమ్ తురయామల్, నిరతిశయభోగ్యమాక, విషయీకరిత్తు కొండిరుక్కుమ్" (రహస్యత్రయసారమ్ ౨౨.)

(3) రా|| భా|| ౪.౪,౨౨.

(౪) శ్రుతప్రకాశికా ౧,౧,౧.

లేదు. సంసారమందే యీభేదముల కర్థముగలదు. జడపదార్థ సంబంధమువలననే జీవికి విశిష్టవ్యక్తిత్వ మేర్పడును. అసహాజ మగుగాక. నీ సంబంధమును జీవులు నిర్మూలింపనగును. దేహ సంబంధ సంజాతమగు వ్యక్తిత్వము స్థిరమైనదిగాదని తెలియుచున్నది. ఈ వ్యక్తిత్వము నాశనమగుటవలన జీవాత్మ బ్రహ్మ లక్షణములనుగాంచి, స్వస్వరూపమును గాంచును. దానికి వేరేనూతనలక్షణమునురాదు ౧.

ముక్తావస్థలో జీవులకు రెండుదప్ప, బ్రహ్మలక్షణము లన్నియు లభించును. జీవులణు పరిమాణములు గలవైయుండును; పరమేశ్వరుడు సర్వవ్యాపి అణుపరిమాణము గలదైనను, ముక్తి పొందిన జీవాత్మ పరమేశ్వరునిచే సృజింపఁబడిన వివిధ లోకములలో వివిధదేహములలోఁ బ్రవేశించఁగలదు; ౨ కాని, సృష్టిచేయుపని యీశ్వరునికేగలదు; ముక్తాత్మకందు శక్తి లేదు.

వైకుంఠమునమున్న జీవులొకే రూపమును గల్గియుండరు. వారి రూపములు విశుద్ధసత్త్వ పరికల్పితములు. ఈసత్త్వ పదార్థసాహాయ్యముచే ముక్తజీవులు తమ భావములకు నాశయములకు రూపమునిత్తురు. ఈనాటకము ముగియునని చెప్పుటకు వీలైనచో నప్పుడు ముక్తజీవి పరిపూర్ణితనందియుఁ బర బ్రహ్మకు విశేషణముగానే యుండును. వరబ్రహ్మ, యేక మయ్యు, తన అంతర్యామిత్వధర్మము వలన, ననేక జీవైక్యరూ

(౫) కర్మరూపజ్ఞానమూలః, న స్వరూపకృతః॥ (౧,౧,౧.)

(౧) ౪, ౪, ౧

(౨) ౪, ౪, ౧౩-౧౫

పముగలదైనను, దన యేకాత్మత్వమునకు భంగము రాకుండ నుండును. ఈముక్తజీవ సంఘములో నేయొకజీవియు స్వార్థపరత లేక, విశ్వాభ్యుదయము కొఱకే పనిచేయును.

విశిష్టాద్వైతతత్త్వము ననుసరించి, ముక్తజీవులలో రెండు జాతులు గలవు. ఇహలోకములో నీశ్వరసేవచేయు నలవాటుగల వారచటను జేయుదురు; రెండవ తెగవారు కేవలులు; వీరు నిరతాత్మధ్యానముచేఁ గృతార్థులైన వారగుటచే నేరితో గలియక యుందురు.

ముక్తజీవులు నివసించు స్వర్గధామము మామూలుగా వర్ణింపఁబడునదే. ౪. వస్త్రధారణాది వివిధాచార వివరములలోను, ప్రదేశవిషయములోను గొలది భేదములున్నవి. స్వచ్ఛజలధారలు, మధురసఫలభరితవనములు, మందమారుతములు, కనకమయ సూర్యజ్యోతియు వారి కాహ్లాదకరములై యుండును. ఇచట వారాడిపాడి, గాననృత్య వినోదముల ననుభవించి, యపుడపుడు వేదాంతగోష్ఠి సలుపుచుందురు. ధ్యానయోగికట్టి స్వర్గజీవితము సుఖము నీయఁజాలదు. మార్పులేని యొకప్రకృతి స్వరూపమున బద్ధుఁడైయున్నట్లాతఁడు విలపించును. వ్యక్తిత్వావరణములను జీల్చివైచి, విశ్వజీవితములో లీనమైపోవ నాతఁడు గోరును. పరమేశ్వరునితోఁ దాదాత్మ్యముపొంద దహతహలాడు ధ్యానయోగులకు రామానుజుఁ డన్యాయ్యము చేసినాఁడు. భూలోకానందముకంటెఁ బెక్కురెట్లధికానంద మిచ్చునట్లుగా వర్ణింపఁబడిన స్వర్గము వారికి దృప్తినీయదు. ఆత్మ

(3) నారదపంచరాత్రము ౪

యీశ్వరుని నిత్యసాక్షాత్కారము గాంచి, నిత్యదర్శనోల్లాసము గ్నతం గాంచినను, దానింకను వేఱై, దానుగోరిన ధ్యానవస్తువుతో నేకముగాదు. తన వ్యక్తిత్వమును దిగనాడి, దేవునిలోఁ గలిసిపోవుటే ప్రధానాశయముగా గలవారు గొందరుపనిషన్మహర్షులు, ప్రాచీన గ్రీసు దేశమందలి ఆర్ఫిక్కు సోదర సంఘము; కొందరు క్రైస్తవ సుఫీయోగులు గలరు. తమ దేహములనే గాక, వ్యక్తిత్వములను గూడ విసర్జించి, తమ యాత్మలను దేవునిలో విలీనమొనర్తురు. అట్లు విలీనత్వము గాంచిన యోగి యొకఁడేని గలఁడని మనకు సాక్ష్యములేదు. వస్తుస్వభావముచే నట్టి జీవేశ్వరైక్యము లభించిన సాక్ష్యము దొరకుటే దుస్సాధ్యమని రామానుజునివాదము. ఈశ్వరుఁడైన జీవుఁడు తానట్టితినని చెప్పుటకుఁ దిరిగిరాఁడు; అట్లు చెప్పువాఁడీశ్వరుఁడై యుండఁడు.

## ౧౭ - సామాన్య పరిశీలనము

శంకరుని తత్త్వము నిశితప్రజ్ఞాధురంధరులగు వారికిఁ గొంత మనోహరముగా నుండవచ్చును. అట్టి వ్యక్తులు, కష్టనిర్మూలనములకై భావోద్రేకములతోఁ గూడిన సాధనముల నంగీకరింపరు; లోకపరిస్థితులు తమకుఁ గలిగించు నెంత ఘోరవిషాదమునైనను చెక్కుచెదరని మనశ్శాంతితో స్వీకరించు సంకల్ప శిక్షణముచే నాంతరంగిక సంతుష్టి నందుదురు. ఆర్తత్రాణపరాయణత్వముచే ద్రవించు హృదయముగల యీశ్వరుఁడుండవలెనని కోట్లకొలఁది మానవులు కోరుదురని శంకరుఁడంగీకరించినాఁడు. రామానుజుని భావముసత్యముయొక్క అత్యు

న్నతప్రకటనము, మన బుద్ధికిలభించు దానికంటె నధిక విశాలతర మైనదే సత్యమని శంకరుఁడు పలుకును. మతానుభూతి వలన మనకు లభించు నదత్యున్నతానుభూతి కాదని తలఁప నవసరము లేదని రామానుజుఁడు చెప్పును.౧. జీవిత మతరంగములలో రామానుజుని దైవతత్త్వము వంటి దానినే శంకరుఁడు నంగీకరించును. వైష్ణవస్మార్త శైవశాక్త రూపములలో నిదియే హిందూ మతవిశ్వాసము. ఇట్టి విశిష్టలక్షణమును విడిచిపెట్టి, ఊహాకల్పిత మగు నద్వైతసూత్రమే హిందూమతమని పశ్చిమఖండ పండితులు విమర్శకులు భావించుట విచిత్రముగా నున్నది౨. రామానుజతత్త్వ మేయాస్తికతత్త్వమునకును దీసిపోవునది కాదు; కాని, అన్నిటికినిగల క్లిష్టసమస్యలు దీనికినిఁ గొన్ని లేకపోలేదు.

సత్యస్వరూప మొక్కటే యని చెప్పి, దానిలో నానాత్వమును సంగమింపఁజేసి విశేష్య విశేషణ సంబంధ సిద్ధాంతమును రామానుజుఁడు ప్రతిపాదించినాఁడు.౧. సత్, చిత్, ఆనందగుణములకు బ్రహ్మమునకు గల సంబంధమును దీసికొని,

---

(౧) పోల్చు: బ్రాడ్లే: "మతానుభూతివలన లభించు సత్యస్వరూపము కంటె శ్రేష్ఠతరమైన దానినిఁగోరు మానవుఁడు తానేమి కోరుచుండెనో యెఱుగఁడు."

(౨) హెగెల్ వ్రాసినాఁడు: "ప్రాచ్యమతములలో, సత్యమేకైక ద్రవ్యమనునది ప్రథమనిర్ణయము. వ్యక్తి, స్వతంత్రమైన పరమ సత్స్వరూపమునకు వేరైన వ్యక్తిత్వమును నిలుపుకొన్నచో నెట్టి విలువయునుండదు. తన వ్యక్తిత్వమును దిగవిడిచి, పరమసత్స్వరూపమునఁ గలసి పోయినపుడే, దాని మూలముననే విలువను గాంచును."

(౧) న్యాయసిద్ధాంజనము పు. ౯౬.

వీని యేకత్వము నిర్గుణము కాదనియు, విది సమవాయసంబంధమనియు, నిందు వస్తువునకు గుణములకు భేదమేకాక, గుణముల మధ్యమందును భేదముండుననియు రామానుజుఁడు వాదించును. అనంతవిశేషణముల కంతరాధారమగు విశేష్యమే పరమేశ్వరుఁడు బుద్ధినిర్ణయమువలన సత్యస్వరూపము నెఱుఁగవచ్చునను నిశ్చయముతో నున్నంతకాలము రామానుజుఁ డీ సిద్ధాంతమునకు రాకతప్పదు సిద్ధాంతములన్నియు ద్రవ్యగుణసమన్వయములే. ఈసిద్ధాంతము లన్నియుఁ బరిచ్ఛిన్నవస్తు సంబంధములు; వీని యేకత్వము సమవాయ సంబంధమును దాటిపోఁజాలదు; పరిచ్ఛిన్నానుభవములో నవిచ్ఛిన్నైకత్వము లభింపదు పరివర్తనశీలము గలిగి, పరిచ్ఛిన్నమగు జగత్తు నతిక్రమించినఁగాని, సమగ్ర వస్తుగుణ స్వరూపమగు సత్యము చూపట్టదని తెలియఁగలదు. అట్టి పరమసత్యమే తర్కవిధానమున కాధారము. మన సిద్ధాంతములందు వస్తుస్వరూపమును విశేషణ పరంపరచే స్థాపింప యత్నింతుము. కాని విశేషణము లెన్నిటిని గల్పించినను, అనంతలక్షణ యుక్తమగు మూలద్రవ్య వైభవమును నిర్విశేషముగాఁ దెలుపఁజాలము. కావున బుద్ధ్యతీతమగు సత్యాస్తిత్వమును ముందే యంగీకరింపవలసియున్నది. సత్యము జ్ఞానము నొకటేయను భావము మొదటినుండియు మన మనస్సులో నున్న పూర్ణసిద్ధాంతమే. విభిన్నగుణములైన సచ్చిదానందములతోఁ గూడిన పరమేశ్వరుఁ డొక సగుణ బ్రహ్మమని చెప్పుటయే కాని, యీ లక్షణము లెట్లు బ్రహ్మ

ముతో సంబంధమును గలిగియున్నవో రామానుజుఁడు మనకు
వివరించి యుండలేదు.

విశేష్యవిశేషణములకును, ౧. బ్రహ్మజగత్తులకును,
సంబంధము భేదము కాని సాహచర్యము కాదు. ఏలన సాహచర్య
మంతర్గత భేదసూచకము.

జీవులు జగత్తును బ్రహ్మముతో నేకమా ? అయినచో
నేభావములో ? విశేషణములకు విశేష్యము నిత్యాధారము,
సహజమునైనది.౨. జగత్తు కేవలమొక విశేషణమాత్రమే
కాదు, దానికిఁ బరమేశ్వరునితో సంబంధమున్నది. పరమాత్మ
యొక్క ఆంతరంగిక తత్త్వవ్యక్తీకరణమగు రూపము జగత్తు.
జీవాత్మలు బ్రహ్మతోఁబాటు శాశ్వతము లనుటవలన, బ్రహ్మ
మునకుఁ బరిచ్ఛిన్నత కలుగు చున్నది. తదంతర్గతములగు నంశ
ములయొక్క నిరవధికమగు నపరిచ్ఛిన్నత వలన బ్రహ్మము
యొక్క అపరిచ్ఛిన్నత న్యూనమగు చున్నది. జీవబ్రహ్మములు
రెండును నిత్యములైనచో వాని సంబంధమెట్టిది ? వాని మధ్య
మందు నిత్యసంబంధమున్నచో నది ముఖ్యమైనదైనను, ప్రాసం
గికమైనదైనను, నిర్వచింప వీలులేని రహస్యమగును. బ్రహ్మము
యొక్క ఆత్మ బ్రహ్మముయొక్క దేహమునకు భిన్నమైనది.
అందుచే నది సర్వావస్థాతీతమైనదని చెప్పవలెను.

---

(౧) విశేష్యవిశేషణ సంబంధభావము తృప్తికరముకాదు. రెండు
నొకటేయైనచో భేదమున కర్థములేదు; రెండును వేరైనచో నపుడది బాహ్య
సంబంధమగును. అది ఆంతరంగిక సమవాయ సంబంధమైనచో దీని కభావ
స్థితి యేర్పడును.

జీవులు దైవజీవితములోని స్పందనములని రామానుజుని నిశ్చయము. పరబ్రహ్మము సర్వజీవజగత్తులతోఁ గూడిన వ్యక్తిత్వమైనచో, విశిష్టవిజ్ఞాన భావప్రయోజనములుగల పరిచ్ఛిన్న జీవు లాతనియం దెట్లు పోషింపఁబడునో తెలియదు. ఒకజీవి యింకొక జీవిలో భాగము కాఁజాలదు. రామానుజుని బ్రహ్మ మొక పరమాత్మయే కాదు; అనంతములగు నిత్యజీవుల నిత్య సమాజము. ఒకే పారమార్థికదృష్టిలో నీశ్వరుఁడు జీవసహితుఁడు జీవవిరహితుఁడు కాఁగలఁడు? ఈశ్వరునికిని, వానివలన నుద్భవించిన యల్పజీవులకును, సర్వస్వరూపమగు పరమాత్మకును భేదము చెప్పనగును. ఈశ్వరుఁడు, జీవులు, జడపదార్థము గలిసి పరమాత్మయగును గాని, కేవల మీశ్వరుఁ డొక్కఁడే కాఁడు. కాని సర్వాతీతము సర్వస్వరూపము నగు పరమాత్మయే యీశ్వరుఁడని రామానుజుఁడు చెప్పెను. బ్రహ్మైకవాదమును సమర్థించునపు డాతఁడు పరబ్రహ్మ జీవజడపదార్థ సహితైకత్వమనియు, జీవ పృథక్త్వమును బోధింపఁ దలఁచినపుడు, జీవు లీశ్వరకల్పితములయ్యు, విశిష్టవిజ్ఞాన కేంద్రములనియు, జ్ఞాతృస్వరూపములనియు వర్ణించును.

జీవజడపదార్థసహితప్రపంచమునకు బ్రహ్మము ముఖ్యోపాదానకారణము. వికారములన్నియు దేవుని దేహసంబంధములు కాఁగా నాతని యాత్మ నిర్వికారమై యుండును.[1] "పరమాత్మకు వేరైన చేతనాచేతనవస్తుజాలమంతయు నాతని దేహము,

(౧) స్వరూపానుబంధిత్వేన నియతత్వాత్ (౨, ౪, ౧౪)

నిరుపాధికము, సశరీరమునగు నాతనియాత్మ యేకైకము." ౨
దేవుని దేహ ముపాదానకారణము; దేవునియాత్మ ముఖ్యకారణము; కావున దేవుఁడు జగత్తునకు ముఖ్యకారణమునుపాదానకారణముకూడ నైయుండెనని చెప్పనొప్పను. ఈభేదము ప్రధానమైనది; ఏలన జీవుని దేహవికారములు జీవుని కెట్లంటవో, యీశ్వరుని దేహవికారము లీశ్వరునికి నంటవని రామానుజుఁడు నమ్మెను. ఐనచో నీశ్వరుని యేకత్వము నిర్వికారమైయుండునది. ప్రళయకాలములోవలె సూక్ష్మరూపమందును, సృష్టికాలములోవలె, స్థూలరూపమునను, పరిచ్ఛిన్నము గాకున్నను, విశిష్టవ్యక్తిత్వముగల మోక్షావస్థయందును, నీశ్వరతత్త్వము జగద్భిన్నమైయుండును. దీనికి నీశ్వరుని నిత్యవిభూతికినిఁగూడ భేదమున్నది. కేవలము విశేషణములగు సచ్చిదానందలక్షణములను దీసివేసినచో బ్రహ్మస్వరూపమేమో తెలియుట కవకాశము లేదు. కాని, విశేషణములే యాతని ముఖ్యస్వభావమైనచో, వానికిఁగలుగు వికార మీశ్వరస్వభావమునకు నంటును. దీనివలన నీశ్వరుఁడు పరిపూర్ణవ్యక్తిగాక, పరిణామదశావశుఁడై యున్నాడని చెప్పనగునా! కావున నీశ్వరుని యాత్మ ముఖ్యకారణము, నాతని దేహ ముపాదానకారణము నను భేదము వ్యర్థమైనది, కోడిపెట్టలో నొకభాగము గ్రుడ్లుపెట్టుచుండగా మిగిలిన భాగము కూరలో నుడుకుననుటవంటిదే ౧.

(౨) తత్త్వముక్తాకలాపము 3-౭౫
(౧) స్వాశ్యేతిరిక్తమ్ చేతనాచేతనవస్తుజాతిమ్ స్వశరీరమితి, సఏవనిరుపాధికస్వశరీర ఆత్మా (౧. ౧. ౧౩)

జీవ బ్రహ్మసంబంధ సమస్యయే యేకేశ్వర తత్త్వము నకుఁ బ్రధానసమస్య. అనేకపరిచ్ఛిన్న జీవసముచ్చయ మపరి చ్ఛిన్నబ్రహ్మము కాఁజాలదు. వీనికతీతమగు నదేదియో యుండ వలెను. ప్రపంచములోని సర్వవిషయములను రామానుజుఁడు చేతనాచేతనములుగా విభాగించును. అవి పరస్పర సహకార వర్తనమును గలిగియుండుటచే వానిని నడపు నీశ్వరుఁ డొకఁ డుండవలెను తర్కము దీనినే సూచించును; మతవిశ్వాసము దీనిని సమర్థించును; అందుచే మన మందరము దీనినే యంగీకరింతుము. కాని యిది యీసమస్యకు సరియగు సమాధానముకాదు. మనము చేయు సిద్ధాంతము జగత్తులోనిదే కాని జగత్తును గూర్చినది గాదు. ఏయథార్థజగత్తును మనము చూచుచు న్నామో దాని కారణమును మన మెన్నఁడును జెప్పఁజాలము. కాని తదంతర్గతమైన ద్వైతను మన నిర్ణయము హేతుబద్ధమైన సంబంధముచేఁ గల్పింపఁబడలేదు. చేతనా చేతన జగత్తే పరి చ్ఛిన్న వస్తువైనచో నన్యోన్య వ్యతిరేకములైన యీరెండు నొకే యథార్థవస్తువునకుఁ జెందఁజాలవు. పూర్ణైకత్వము గాని, విశేషణ భిన్నత్వముగాని మార్పునొందవలెను. రామానుజుఁ డీరెంటినొక పరమాత్మలోఁ గలిపి, యొక పరమసూత్రముచే నందలి భాగములను నంశములను నందే బంధించినాఁడు. శంక రుఁడు చెప్పిన నిర్గుణబ్రహ్మ, మానవజాతి కెన్నఁడందరాని యూర్ధ్వపదమున నున్నదని రామానుజుఁడు విమర్శించినాఁడు. అంతకంటెఁ దృప్తికరమగు నేక బ్రహ్మతత్త్వము నీయ రామా

(౨) ఆనందగిరి శా.సూ. ౧, ౨, ౮

నుజుఁడు యత్నించినాఁడు. అది నిర్గుణైకత్వమును గాదు; భిన్నాంశ సముచ్చయమునుగాదు; అది సర్వభేదసంబంధములను దనలో నిముడ్చుకొనిన సత్తారూపము. కాని యిట్టి దివ్యానుభూతి మాత్రము ఋజువుచేయుటకు సాధ్యము కాని కేవలభావకల్పనము కాదని యెవరు చెప్పఁగలరు ? మాటల పొందికచే మంచి వాదమును గల్పింపవచ్చును గాని దానికి సత్యము సరిపోవుట సందేహాస్పదమైనది. పరమాత్మ, నిర్వికారమై సర్వాతీతమైన సత్యమే యైనచోఁ దిక్కాలాతీతమైన దానికిఁ గాలవశత్వమును జగత్పరిణామ సంబంధము నెట్లు వచ్చినది ? నిర్వికారపరిపూర్ణమైన పరమాత్మ స్థానమున నిత్యపరిణామశీలము గలిగి, క్రమాభ్యుదయ పరిపూర్ణతనంద యత్నించు నింకొక నియతినే దేని నిర్మించుటకు రామానుజుఁ డంగీకరింపకున్నచోఁ బరమేశ్వరు నాత్మకు దేహముతోడి సంబంధమును గూర్చిన సమస్య నాతఁడు తృప్తికరముగాఁ బరిష్కరింపఁ జాలఁడు.

మఱియు నీయేకత్వములోఁ బ్రకృతియంత్రము, జీవరంగము నెట్లు సమ్మిళితమైనది ? ప్రపంచముయొక్క యేకత్వము నొకవైపునను, జీవపృథక్త్వమును బోషింపఁ బూనుకొనవచ్చునుగాని, మన దుఃఖములు క్లేశములు, మనలోప పాపములు పరబ్రహ్మములో నవిభాజ్యములగు నంశములైనచో మఱియు నవి యీశ్వరుని చిచ్ఛక్తిలో నిత్యముగానుండి, యెల్లప్పు డాతని చిత్తవిషయములుగానున్నచో, నీజీవు లీశ్వరుని మానసములోని నిత్యాంశములుగావా ? అట్లుగాకున్నచో మనము పరమేశ్వరునకు భిన్నులగు వ్యక్తులమైనచో నీశ్వరుఁడు

మనకు వేరైయుండవలెను. ఒకే చైతన్యములో మనము భాగస్వాములమైనంతమాత్రమున, మనవ్యక్తిత్వములకు లోపము కల్గునా? ౧. రామానుజుఁడు దేహిదేహసంబంధ దృష్టాంతమును దీసికొని,తనలో నంతర్వర్తియగు దేహివినా దేహముండఁజాలదని వాదించును. ఆత్మవిడిచిపెట్టినవెంటనే దేహము నశించును. మఱియు జీవికి సుఖ దుఃఖానుభవములు గూర్చుటకే దేహమున్నది, దేహమునకు మూలకారణము జీవమే. కాని యీదృష్టాంతమును బోషించినచో నీశ్వరుఁడే సర్వమునై, జీవులు, దేహములు నాతని వినోదార్థ ముపకరణమాత్రములగును. హెగెలియన్ విజ్ఞానవేత్తలు సూచించిన సర్వస్వరూపద్రవ్యము సమస్యాపరిష్కారమునకుఁ దోడ్పడదు. ఒకవైపున నిత్యపరిపూర్ణమగు పరమసత్యమును, వేరొకవైపున ననంతమగు జగత్పరిణామము నేకకేంద్రములో సమన్వయింపవలసి వచ్చుటయే వీరికిఁగల తత్త్వసమస్య.

పృథగ్జీవుల నిత్యము స్వతంత్రమునగు యాథార్థ్యమును బోషింప రామానుజుఁడు కోరి, జీవవ్యక్తిత్వము మిథ్యారూపమను వాదమును దీవ్రముగా నిరసించును. ఏకసత్పదార్థమగు పరమాత్మలో నీశ్వరుఁడు, జీవులు, జడపదార్థము ననుభేదము

(౧) బ్రాడ్లే చెప్పినాఁడు:"ప్రత్యేకవ్యక్తులమగు మనము స్వతంత్రాస్తిత్వము గలవారమని నిశ్చయించినచో, మతవిజ్ఞానానుభవములో నీశ్వరాస్తిత్వము యథార్థమైనదనుట వ్యర్థసంభాషణమగును" (ట్రూత్ అండు రియాలిటీ పు. ౪౩౮-౯)

లను జూడవలెను. ౧. సర్వవస్తువులు నీశ్వరుని దేహమగుటచే ప్రతిజీవున కాత్మ యీశ్వరుఁడే. ౨. రామానుజుఁడు దేనిని జీవాత్మగాఁ దీసికొనెనో యది భూతభవిష్యత్తులుగలిగి, పరిచ్ఛిన్నమగు మమకార కేంద్రమే. సర్వజ్ఞానమునకు విషయీవిషయ భేదమున్నదని వాదించుట యుక్తముగాదు. ఈభేదము నిత్యమైనదిగాదు. చూపువిషయములో దృగ్విషయసీమ విషయముగను, నేత్రము విషయిగను మనము గ్రహింతుము. అదే రీతిగా, జ్ఞానవిషయములో, జ్ఞానవిషయమును దానిరూపమును వేరుగా భావించి, మొదటిది విషయమనియు, రెండవది విషయియనియు నూహింతుము. కాని యీరెండును నిజముగా వ్యావహారికప్రపంచమునకుఁ జెందినవే. దేనిని రామానుజుఁడు విషయి యనునో, యది నిజమైనయర్థములో విషయికాదు; అది విషయరూపమునొంది వ్యావహారికజగత్తులోని యితరపరిచ్ఛిన్న వస్తువులలో నొకటి యగుచున్నది. ౧.

దేహవికారములు జీవాత్మ కంటవని రామానుజుఁడు చెప్పెను. ౨. అది సహజముగా శుద్ధమైనది, జడజగత్సంబంధాంధ

(౧) పోల్చు: రాన్‌డాల్ భావము. (ధర్మాధర్మసిద్ధాంతము, వాల్యుము ౨, పు, ౨౩౮) (౨) సర్వాత్మత్వాత్ ప్రత్యగాత్మనోఽపి ఆత్మా పరమాత్మా.

(౧) పోల్చు: జెంటైల్: "బుద్ధియొక్క అతీతక్రియాశక్తిని మన మెరిగియున్నచో, నది ద్రష్టయు దృశ్యము కూడనని చెప్పరాదు. విజ్ఞానవిషయమగు విజ్ఞానము విజ్ఞానము కాఁజాలదు అనగా నది విషయమే కాని విషయి కాదు: దృశ్యమేకాని ద్రష్టకాదు."

(౨) స్వశరీరగత బాలత్వ యువత్వస్థవిరత్వాదయో ధర్మాః జీవస్వ నస్పృశంతి. (౧, ౧, ౧౩.)

కారము దాని కాంతిని మఱుగుపరచునే కాని, దానిని దొలగింపఁ జాలదు. అచేతన పదార్థసంబంధము తాత్కాలికమైనది; పరిహార్యము, ఈసంబంధమునకుఁ బాపమే హేతువు; శుద్ధాత్మ పాపము చేయఁజాలదు. దేహసహితమగు నాత్మకుఁ గాని పాపము లేదు; పాపము లేనిదే సశరీరాత్మ యుండదు. ఇతర హిందూతత్త్వజ్ఞులవలెనే, రామానుజుఁడును సంసార మనాది యని చెప్పి యీసమస్యనుండి బయటఁ బడినాఁడు కాని ఆత్మ యొక్క శుద్ధస్వరూప మీసమస్యలో నిమిడి యున్నది. పాపము తత్ఫలితము విషయ పరంపరలోనివి. శుద్ధమగు విషయి, పాప రహితమగుటచే వీనిచే స్పృశింపఁబడదు. కాని ఆత్మ పాపము చేయునదైనచో నది యిదివరకే జడపదార్థ సంబంధము కలిగి యున్నదని చెప్పవచ్చును; అట్లైనచో, నది శుద్ధాత్మ కాదు; వ్యావహారికమగు జీవాత్మ. విషయపరంపర కాది లేదనినచో, శుద్ధాత్మ యొక వైపునను, విషయము వేరొక వైపునను నుండి, రెండును నిత్యవస్తువులగుటచే వాని కర్థము చెప్పుటకు మూఁడవ దెద్దియు లేకుండును. ఆత్మ సహజస్వచ్ఛతగలది; దేహము దాని కంటిపట్టుకొని యుండును. ఇదెట్లు తటస్థించును? ఆత్మకు జ్ఞానమునకును సంబంధమెట్టిది? అవి భిన్నములా? ఏకమా? అవి భిన్నములైనచో, దేహములోనే యొక చోటనే కలిగిన సుఖదుఃఖానుభూతి; జ్ఞానమునకుఁ జెందును గాని ఆత్మకుఁ జెందినది కానందున నాత్మకు సుఖదుఃఖము లంటవు. జ్ఞాన మాత్మ వ్యాపారమనియుఁ జెప్పరాదేలన, నప్పుడది సకారణమగును. కాని రామానుజు ననుసరించి, జ్ఞానము నిత్యము, స్వతంత్రము

నైన దగుటచే నుత్పత్తియైనది కాదు. ఆత్మయు జ్ఞానము నొకటే యైనచో నాత్మకు వృద్ధిక్షీణత లుండవలసి వచ్చును. కాని యణుపరిమాణమగు నాత్మ పెరుగదు, తరుగదు. ఆత్మ విజ్ఞానమయమైనది;౧. దీనికి జ్ఞానసంబంధము స్పష్టముగాఁ జెప్పఁబడ లేదు. ఆత్మ విజ్ఞానపూరితము; దానికి విజ్ఞాన మొక విశేషణ మునై యున్నది.౨. "జ్ఞాతకు జ్ఞానము భిన్నమైనది; అది దాని గుణమై యున్నది. గంధము భూమిగుణమైనను, నది దానికి భిన్నముగా నుండునట్లే."౩. సుషుప్తిలో నిర్విషయక జ్ఞానమున్న దని రామానుజుఁ డంగీకరించును.౪. ఆత్మస్వభావము శుద్ధచైతన్యము కాని కేవల జ్ఞానము కాదు; అప్పుడప్పు డది విషయ సంబంధియగును.

జీవబ్రహ్మసంబంధమును క్లిష్టతలేనిది కాదు. రామానుజుఁడిట్లు చెప్పెను: "పరబ్రహ్మ మనేకము కాఁగోరెను. పంచభూతాత్మకమగు జగత్తు నుదయింపఁజేసి, చేతన జీవవర్గమును దేవమనుష్యాది దేహములలో వాని యర్హతల ననుసరించి ప్రవేశపెట్టి, తుదకుఁదానే, స్వేచ్ఛావశమున నీజీవవర్గములోఁ బ్రవేశించి, జీవాంతరాత్మయై, యీవర్గము లన్నిటికి నామరూప పరిణతిం గూర్చి, వానికి వస్తుత్వ నామధేయత్వ

(౧) విజ్ఞానమయోహి జీవో నబుద్ధిమాత్రమ్ (౧,౧,౧౩.)

(౨) ౨, ౩, ౨౯.

(౩) ౨, ౩, ౨౭

(౪) జ్ఞానస్య విషయగోచరత్వమ్ జాగర్యాదౌ ఉపలభ్యతే. (౨, ౩, ౩౭.)

సామర్థ్యములను గల్పించెను."౧. జీవ మీావిధముగాఁ బరమార్థ ప్రతిబింబము ప్రతిజీవియందు (౧) ప్రతివస్తువునకు జ్యోతి యగు నంతర్యామి బ్రహ్మము,(౨)జ్ఞాతయగు నాత్మ,(౩)ఆత్మ కుపకరణములగు నచేతనద్రవ్యములు గలవు. ఈవిధముగాఁ బ్రతివ్యక్తియుఁ బరబ్రహ్మవలెనే యేకత్వములోఁ ద్రయాత్మ కత్వము గలదైయున్నది.౨. బ్రహ్మము మూలరూపము; వ్యక్తి తదనురూపము; ఏలనఁ బ్రతివ్యక్తియుఁ బరిచ్ఛిన్న భౌతికావరణ లలోఁ బరమేశ్వరుని పరిపూర్ణతగలది. ఆత్మ తన దేహమును విసర్జించి, మోక్షావస్థ నందినపు డది కేవల నిర్గుణైకాంశ౧గా నగును. అది పరమేశ్వర సంబంధము లేనిది కాఁజాలదేలన, దైవశక్తి ప్రవాహములందుఁ బ్రవహించుచుండును. ఈ యాత్మల కన్యోన్యాచ్ఛాదన ముండదా? కాకున్నచో వీనికిఁ బరస్పరము భేదమును గల్పించునదేది? అవి స్వతస్సిద్ధద్రవ్య ములా? లేక పరబ్రహ్మయందు నివసించు కేవల గుణములా? ప్రత్యాత్మ కొక కేంద్రమేర్పడి, సర్వానుభవముల నేకముఖము నకుఁ దెచ్చు శక్తి యున్నదని రామానుజుఁడు చెప్పిన వాదము దుర్బలమైనది.

రామానుజుని జీవాత్మభావము, ద్రవ్యసిద్ధాంతమును ఖండించినక్యాంటువాదమును,శంకరుని సూత్రభాష్యవాదమును జ్ఞాపకముచేయును. నిరవధికమై నిత్యసమానమగు శాశ్వతమైన వ్యక్తిత్వ మొకటున్నదని రామానుజుఁడు విశ్వసించును.అట్టి నిత్యా

(౧) ౧,౧,౧౩.

(౨) అచిజ్జీవవిశిష్టపరమాత్మా॥ (౧,౧,౧౩.)

సమానసిరవధికలక్షణ మాత్మకే గలదని శంకరుఁడు వాదించును. నిరవధికపరిణతికి నిత్యసమానాత్మకు సంబంధమెట్లు కూడునో రామానుజుఁడు చెప్పఁజాలఁడు. హెగెల్ తత్త్వములో వలెనే భిన్నతాంతర్గతమగు నేకత్వము చెప్పఁబడినది. ఒక దేహమునుండి యింకొక దేహమునకు జేరుటవలన నాత్మయొక్క రూపము వికారము నొందనియెడల, శరీరసంబంధము, స్మృతి, జ్ఞానమును నాత్మకు మూలస్వభావ లక్షణములు కావని విశదమగును. మనకుఁ దెలియుటకు శక్యములగు గుణములతో నిమిత్తము లేని యట్టి ఆత్మలక్షణమెట్టిదో మనకు దుర్గ్రాహ్యము. అప్పుడు మనకొక విధమగు నిర్గుణజీవత్వమేర్పడును. వ్యక్తిసమానత్వము నిరవధికవిజ్ఞానము, అమర్త్యత్వము, పూర్వజన్మము మున్నగునవి వ్యర్థపదములగును. అట్టి నిర్గుణజీవమునకు మననిత్యలోకానుభవముతో సంబంధము లేదు. అట్టి సంబంధశూన్య నిర్గుణజీవవ్యక్తిత్వము భిన్నవ్యక్తులలో భిన్నముగా నుండుననుట భ్రాంతి కల్పితమే. ప్రతివ్యక్తియందు మూలభూతమై యొక యాత్మయున్నదనియు దానికి నిత్యవికారపరంపరా ప్రవాహముతో సంబంధమెట్లో యేర్పడెననియుఁ దెలియుచున్నది.

శంకర రామానుజు లిరువురు మహత్తర వేదాంతవిజ్ఞానవేత్తలు: వారిలోఁగలఉత్తమలక్షణములు పరస్పరము లోపములైనవి. రసహీనమై చూపట్టు శంకరుని తర్కప్రతిభ యాతని తత్త్వమును మతదృక్పథములోనిరుత్సాహ కారణమైనది; సృష్టికార్యములోఁ దాను స్వహస్తములతో సాయపడినవానివలె వైకుంఠసౌఖ్యములఁగూర్చి యాతఁడు వర్ణించు మనోహరవర్ణ

నలు బుద్ధి నొప్పింపఁజాలవు. పరమేశ్వరుని, మానవుని, జగత్తు నన్నిటినిఁ దన యప్రతిహత తర్కాసిధారకు గురిచేసి, బ్రహ్మైకత్వమును నిరూపించు శంకరునివాదము రామానుజానుయాయులలో నొకించుకచలనమును గలిగించదు. శంకరానుచరులు గురువునకొకమెట్టు పైకిఁబోయి, యద్వైతమును నాస్తికరూప సామీప్యమునకుఁ దోడ్కొనిపోయిరి. పరమేశ్వరుని హృదయ మందిరములో మేమే నిత్య స్వేచ్ఛావిహారము చేయువారమని రామానుజానుచరులు పలుకుదురు. కాని రామానుజునిలో మహత్తర మతప్రతిభకలదు. ఉపనిషదాగమపురాణ ప్రబంధములనుండి భావఝురులాతనిలో నేకమై ప్రవహించినవి; వివిధ ఝురీపరంపల నాతఁడు సహజసామర్థ్యముతో స్వీకరించెను. మతానుభూతికల్పించు నవ్యక్తైకత్వములో నీభిన్నభావ పరంపరలు లీనమైపోయినవి. దృఢతరతత్త్వవివేక మాతనిలోని మత విజ్ఞానావసరముల కూతగఱ్ఱయైనది. మతభావసిద్ధినిఁ దార్కిక సూత్రాశయములతో సమన్వయింపనాతఁడు తీవ్రకృషిచేసెను. స్వయంసంపూర్ణమగు మతతత్త్వము నాతఁడు మనకుఁ బ్రసాదించుటలోఁ గృతార్థుఁడు కాఁజాలకపోవుటలో నాశ్చర్యమేమియును లేదు. మతమునకును దత్త్వశాస్త్రమునకును మధ్యమందు గోచరించు విశాలమగు గర్తమును గప్పివేయుట కాతఁడు ప్రదర్శించిన సునిశిత తార్కికప్రజ్ఞయు, నమితోత్సాహశక్తియు స్తుతిపాత్రములైనవి. స్వల్పబుద్ధియు, ననుభవమునుమాత్రమే యుండి యీశ్వరమహిమ నంతగా నెఱుఁగని సామాన్యమానవుఁడింతకంటె సులభపరిష్కారము నిచ్చియుండును. అట్లుకాక,

రామానుజుఁడూహించుటకు సాధ్యమగు నుత్తమవర్గమునకుఁ జెందిన యేకేశ్వరతత్త్వము నీశ్వరాంతర్యామిత్వరేఖాసమ్మిశ్రితమొనర్చి ప్రదర్శించెను. ౧.

(౧) రామానుజసూత్రభాష్యము; థీబో: ఇ. టి. యస్. బి. ఇ. ౫౮

(౨) రామానుజసూత్రభాష్యము; రంగాచార్యుని ఇ. టి

(౩) రామానుజగీతాభాష్యము; గోవిందాచార్యుని ఇ. టి.

(౪) యతీంద్రమతదీపిక; గోవిందాచార్యుని ఇ. టి.

(౫) సర్వదర్శనసంగ్రహము; ౪-వ అధ్యాయము.

(౧) శంకరుని సగుణబ్రహ్మము, బ్రహ్మలోకము, రామానుజుని విష్ణువైకుంఠములకు సరిపోవును. మనకుఁ దెలిసినంతవరకివియే మహోత్కృష్టభాగ్యములైనను, స్వతఃప్రమాణసిద్ధిచే నట్లుగావని శంకరుని వాదము. ఈవాదము వలన జీవితమున కెట్టిభేదమును గలుఁగదు.

# భారతీయ తత్త్వశాస్త్రము

## దశమాధ్యాయము

### శైవము, శాక్తము, అనంతర వైష్ణవము

### ౧ - శైవసిద్ధాంతము.

మొదటినుండియు వైష్ణవమతశాఖకు ప్రతిస్పర్ధి శైవమతశాఖయే౧. నేటికి నిది దక్షిణ భారదేశములో విశేషప్రాముఖ్యమును గాంచి యున్నది.దక్షిణదేశములో నిది క్రీస్తు పూర్వము నుండియు విలసిల్లినది; బౌద్ధజైన మతములను ప్రతిఘటించుటచే నిది విశేష విఖ్యాతిగాంచి, వైష్ణవమతముతోఁ బాటు క్రీస్తు వెనుక నైదారు శతాబ్దములలో విజయము గాంచినది. క్రీస్తు వెనుక ౧౧-వ శతాబ్దములో నొక విశిష్టమగు తత్త్వము ననగా శైవసిద్ధాంతము నిది ప్రకటించినది. దీనిలో విశేషకృషి చేసిన డాక్టర్. పోప్ దీనిని గూర్చి, "మిక్కిలి విపులము, సర్వమత శాఖలలో సుప్రసిద్ధము, నిస్సంశయముగా నిసర్గామూల్యతత్త్వ

(౧) మాధవుని సర్వదర్శనసంగ్రహము చతుర్విధ శైవశాఖలను చెప్పినది; నకులీశపాశుపతము, శైవము, ప్రత్యభిజ్ఞాశైవము, రసేశ్వరము, చివరిది తత్త్వశాస్త్రసంబంధికాదు.

గర్భితము లైనద”ని వచించెను.౨. శైవసిద్ధాంతమునకును గాశ్మీర శైవమతమునకును ముఖ్యసామ్యము లనేకము లున్నను, శైవ సిద్ధాంత సామాన్యస్వరూపము గాని, యందలి ప్రధాన సిద్ధాంతములు గాని కాశ్మీర శైవమునుండి గ్రహింపఁ బడినవని చెప్పుటకు వీలులేదు. అత్యంత ప్రాచీనములగు తొల్కాప్పియము వంటి తమిళ గ్రంథములు మోక్షానందపథ వివరణము చేసిన అఱియారులు లేక సిద్ధులను గూర్చి ప్రసంగించినవి. ఈగ్రంథములు రుద్రభావమును వేదముల నుండియు, రుద్ర శివ మతమును బ్రాహ్మణముల నుండియు, మహాభారతము నుండియు, శ్వేతాశ్వతరోపనిషత్తు నుండియు స్వీకరించినవి. ఇవి గాక, ౨౮ శైవాగమములును, నందు ముఖ్యముగా జ్ఞానమును గూర్చి ప్రసంగించు భాగములును, శివభక్తుల గీతములును, ననంతర శైవ తత్త్వజ్ఞుల రచనలును, దక్షిణ శైవమతమున కాధారభూతము లైనవి.

౨–సారస్వతము.

ఆగమము లిరువదియెనిమి దని యంగీకరింపఁబడినవి.౧. కామికము, జ్ఞానభాగమగు మృగేంద్రాగమమును ముఖ్యము లైనవి. తమిళభక్తులగు మాణిక్కవాసగరు (క్రీ.వె. ౭–వ శతా

(౨) తిరువాసగమ్, పు. ౬౮.

(౧) కాంచీపుర కైలాసనాథాలయమం దిరువదియెనిమిది శైవాగమము లున్నవని శిలాశాసన సాక్ష్యమున్నది. ఇదియే ప్రాచీనతమమైనది; రాజసింహవర్మయను పల్లవచక్రవర్తి (క్రీ.వె. ౯–వశతాబ్దము) తనకీ మతమందు విశ్వాసమును ప్రకటించెను.

బ్దము) సుందరరు వీనిని స్మరించిరి. శైవభక్తివాఙ్మయము ౯-౧౦ శతాబ్దముల మధ్యమకాలమునకుఁ జెందును. ౨. నంబిఆండార్ నంబి సంకలనమొనర్చిన శైవగీతములనే (క్రీ. శ. ౧౦౦౦) తిరుమురై యందురు. దేవారమని చెప్పఁబడు మొదటిభాగములో సంబంధారు, అప్పారు, సుందరారుల గీతములున్నవి. మిగిలిన వానిలో ముఖ్యమైనది మాణిక్కవాసగరుని తిరువాసగము. అరువదియిద్దరు శైవభక్తుల చరిత్రముల వర్ణించిన సెక్కిరారుని పెరియపురాణము (౧౧-వ శతాబ్దము) విలువగల విషయములను జెప్పును. రౌరవాగమములోని ద్వాదశగీతముల విపులీకరణమనఁదగు మేకందరుని శివజ్ఞానబోధము (౧౩-వ శతాబ్దము) శైవసిద్ధాంతములోని భావప్రకటనమునకుఁ బ్రమాణగ్రంథమై యున్నది, మేకందరుని నలుబది తొమ్మిది మంది శిష్యులలో మొదటి వాఁడగు అరుల్నంది శివాచార్యుఁడు శివజ్ఞానసిద్ధియారను సుప్రసిద్ధగ్రంథకర్త. ఉమాపతి రచనలలో (౧౪-వ శతాబ్దము) శివప్రకాశము, తిరుఅరుల్పయన్ ప్రముఖములైనవి. శైవసిద్ధాంతము వేదాగమ ౧ ద్వయముపై

(౨) "ప్రపంచములో నేమతశాఖయును భక్తిరసపూరిత వాఙ్మయమును సృజించియుండలేదు. ఇందలి సముజ్జ్వలభావసంపద, రసపారవశ్యము, రచనామాధుర్యము సాటిలేనివి" (బార్నెట్: భారతీయవారసత్వము పు. ౭౨.)

(౧) శివజ్ఞానసిద్ధియారు చెప్పెను: "వేదములు, శైవాగమములే యథార్థగ్రంథములు. వానిలో వేదములు సార్వజనీనములు. పుణ్యాధనుల కొఱకుఁ బ్రత్యేకముగా నాగమములు ప్రతిపాదింపఁబడి వేదవేదాంతముఖ్యసత్యములందుపదేశింపఁబడియున్నవి. రెండు నీశ్వరప్రోక్తములే." (౧. ౪౬) పోల్చు: నీలకంఠుఁడు: వయంతు వేద శివాగమయోః భేదమ్ న పశ్యామః. బ్రహ్మమీమాంస (పు. ౧౫౬)

నాధారపడి, యుండును. రెంటికి శాస్త్రీయసమన్వయ కర్త నీలకంఠుఁడు. ౨ (౧౪-వ శతాబ్దము.) ఇతఁడు బ్రహ్మసూత్రములకు భాష్యమువ్రాసి, శైవమతమున కనుకూలముగా నర్థ వివరణ మొనర్చెను. రామానుజ దృక్పథము నీతఁడంగీకరించి, ఒకవైపున నద్వైతవాదమును, వేరొకవైపున నీశ్వరజీవజగద్భేదములను నిరసించును. 3. అంబాసహిత శివుఁడే పరమేశ్వరుఁడు; చేతనాచేతనము లాతని శరీరము. అప్పయ్య దీక్షితుల భాష్యము శివార్కమణి దీపిక అమూల్యమైనది.

## 3—సిద్ధాంతములు

శివుఁడే పరమసత్యము; ఆతఁడనాది పురుషుఁడు, కారణరహితుఁడు, లోపశూన్యుఁడు, సర్వకర్త, సర్వజ్ఞుఁడు, జీవ సంసారబంధ విచ్ఛేదకుఁడునని గ్రహింపఁబడెను. సచ్చిదానంద సూత్రములో స్వయంస్థితిగల యాతని కెనిమిది లక్షణము లున్నవని యర్థము చెప్పఁబడెను; పరమపావనత్వము, అనుభవ జ్ఞానము, అనంతప్రజ్ఞ, సంపూర్ణబంధ రాహిత్యము, అనంత, కృప, పరిపూర్ణశక్తి, అవ్యయానందము. ఈశ్వరాస్తిత్వము నకుఁ గొన్నిప్రమాణములు చెప్పఁబడెను. ప్రపంచము పరిణామము నొందుచున్నది. దాని కుపాదానకారణమైన ప్రకృతి

---

(౨) చూ. నీలకంఠుడు ౧, ౧, 3.

(3) ముఖ్యవాక్యములన్నియు రామానుజభాష్యమునుండి ప్రతిధ్వనుతే. పోల్చు: సూక్ష్మచిదచిద్విశిష్టమ్ బ్రహ్మకారణమ్, స్థూలచిదచిద్విశిష్టమ్ తత్కార్యమ్భవతి. (౧.౧.౨) కానిచూ. అప్పయ్యదీక్షితానందలహరి

ప్రకృతి కవలె నచేతనమగుటచే జగన్నిర్మాణ సామర్థ్యములేనిది. భూతములు జడములగుటచే నవియుఁ గర్తలుగావు కర్మయు నట్టిదే. మేకందరు ననుసరించి. కాలము మారుచున్నట్లు గోచ రించుచున్నను, నిజముగా నిర్వికారమైనది. ౧. సర్వప్రవృ త్తిలో నది యుండునుగాని, స్వయముగా నది కర్తగాదు. కాని యీశ్వరుఁడే జగత్తునకుఁ బ్రత్యక్ష కారణుఁడైనచో నతని స్వేచ్ఛాపరిపూర్ణతలకు లోపము సంభవించును. అందుచే నీశ్వ రుఁడుపకరణ మగునొక శక్తివలన నీకార్యమును జేయునని చెప్పఁబడెను. కర్మనియతి మానవు నాత్మాభివృద్ధి కనుగుణ ముగా వర్తించును. అది గమ్యములను గల్పించుటకాని, ధర్మా ధర్మభేదములనుగాని చేయదు. వీనినొక శక్తిసాహాయ్యమునఁ బరమాత్మయే కల్పించి, జీవుల కుచిత కర్మఫలముల నిచ్చును. ఘటమునకుఁ బ్రథమకారణము కుమ్మరి, దండసహిత చక్ర ముపకరణ కారణము, మృత్తిక యుపాదానకారణము నైనట్లే, జగత్తునకుఁ బ్రథమకారణము శివుఁడు, నుపకరణకారణము శక్తియు నుపాదానకారణము మాయయు నని చెప్పఁబడెను. నాదస్వరము లన్నిటిలో శబ్దము నిండియుండునట్లే, లేక పరిమ ళము ఫలమునంతను నాశ్రయించియుండు విధముననే, యీశ్వ రుఁడు తనశక్తిచే జగత్తులోఁ బరిపూర్ణముగా నిండియుండుటచే నాతఁడు జగద్భిన్నముగా గోచరింపఁడు. ఈశ్వరుఁ డాత్మ; జీవ సహితప్రకృతి ప్రపంచ మాతని దేహము. ఈశ్వరుఁడు వాని

౧. శివజ్ఞానబోధమ్ ౧. ४.

యందు నవి యీశ్వరునియందు నున్నను రెండు నొకటికాదు. అద్వైతమనఁగా నేకత్వముకాదు; అవినాభావసంబంధము.

కాలాతీతుఁడు గాన శివుఁడు నిత్యుఁడు. ఆతఁడు సర్వశక్తిసమన్వితుఁడు. ఆతఁడు తన శక్తి ద్వారమునఁ బనిచేయును. ఆతనిశక్తి యచేతనముకాక, చేతనశక్తియే యీశ్వరునిశరీరమే. దేహము పంచమంత్ర పరికల్పితమైనది. సృష్టి స్థితిలయములు, జీవతిరోధాన మోక్షములు నను నైదు కార్యములయందుఁ దోడ్పడును. శివుని జ్ఞానము నిరవధిక నిత్యప్రకాశ భాసురము. పౌష్కరాగమము ననుసరించి, కుండలినీశక్తి లేక శుద్ధమాయ యను దానినుండి శివుఁడు తన క్రియాశక్తులను గాంచును. ఆతని వ్యక్తిత్వమం దిమిడియున్నది. శుద్ధచైతన్యమగు శివునికిని, జడపదార్థమునకును మధ్యమం దొకవిధమగు సంధానరూపమే శక్తియైయున్నది. ఉపాధియే శివుని ప్రవృత్తులలో భేదకారణము.(౨) శివునితరువాత నంతవాఁడగు ననంతుఁడాది సర్వజీవ బంధమోక్షకారణ ముపాధియే. ఉమాదేవి యనఁబడుశక్తి, శివుని ప్రతిబింబమేకాని స్వతంత్రమైనదికాదు. అన్యసంబంధము లేని పరతత్త్వమే శివుఁడు; వస్తుసంబంధముగలదియే శక్తి. శైవ సిద్ధాంతము ననుసరించి, శివుఁడు తత్త్వముచెప్పు పరబ్రహ్మము. మతముచూపు నీశ్వరుఁడు కూడనైయున్నాఁడు. ఆతఁడు రక్ష

(౧) సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములు. పోల్చు: తైత్తిరీయారణ్యకము॥ ౧౦,౪౩,౪౭.

(౨) పౌష్కరాగమము ౨,౧.

కుఁడు గురువునై, మానవకోటియందలి ప్రేమచే నీరూపములను ధరించును. ప్రేమయే యాతని స్వరూపము.౧.

అనంతజీవరూపమగు పశుకోటికి శివుఁడే పతి. వానినాతఁడు సృజించలేదు; ఏలన జీవు లనాద్యనంతములు. ఆత్మ దేహమునకు భిన్నమైనది; దేహము భోగ్యమగుజడపదార్థము. స్మృతివలనను, ప్రత్యభిజ్ఞవలనను నాత్మయున్నదని తెలియుచున్నది. అది సర్వవ్యాపియై నిత్యమై, చేతనాత్మకమగు కర్తయై యున్నది. నిత్యము సర్వవ్యాప్తము నైన చిచ్ఛక్తికది నిలయము. ౨. దృక్క్రియారూపమగు చైతన్యము దానికిఁగలదు. శివజ్ఞానసిద్ధియరు ననుసరించి, ఆత్మస్థూల సూక్ష్మదేహములతోఁ గలిసియున్నను వానికి భిన్నమై యిచ్ఛాజ్ఞానక్రియారూప[3] శక్తులను గలిగియున్నది. అది తానెందుండునో తాత్కాలికముగా దానితో నేకమైయుండును. సంసారమందుండి ప్రపంచవస్తువులపైఁ దన దృష్టి నిలిపి, మోక్షావస్థలో నీశ్వరునిపై నిలుపును. ప్రళయవేళ జీవులు దేహరహితములై శక్తులరూపమున శివునాశ్రయించియుండును. జీవులసంఖ్య పెరుగదు, తరుగదు. ముక్తజీవులసంఖ్య పెరిగినకొలఁదియు సశరీరజీవులసంఖ్య తగ్గుచుండును. ముక్తజీవిలోఁ జైతన్యము పూర్ణావిష్కృతిగాంచును. బద్ధజీవిలోనది మఱుగుపడియుండును. ఒకటి, రెండు లేక మూడు కలుషములలో నేవియుండునో వాని ననుసరించి జీవాత్మలు

---

(౧) శివప్రకాశమ్, ౧, ౧, నల్లస్వామిపిళ్లై; శైవసిద్ధాంతము, (పు, ౨౭౭

(౨) మృగేంద్రాగమము, ౭, ౯

(౩) ౩, ౧.

ము త్తెఱఁగులై యుండును. ౧. భూమ్యాదు లీశ్వరుని సృష్టికార్యములే. అవి యచేతనములై, జీవప్రయోజన సాధకము లగును.

పాశజాలము త్రివిధము; అవిద్య. కర్మ, మాయ,౨. మొదటి దాణవమల మనగా నాత్మ తానణుత్వభావము గలదని నమ్ముటవలన వచ్చినది. ఆత్మ, తాను శుద్ధచైతన్యమయ్యు, బరిచ్ఛిన్నమనియు, నల్ప దేహ జ్ఞానశక్తులు గలదనియు నూహించును. శుద్ధచైతన్యమే తన స్వస్వరూపమనియు, మఱచి, దేహమే తానని భ్రమించును. ఇదియే పశువుయొక్క పశుత్వము. సర్వజీవుల కవిద్య యొక్కటే; ఆది లేనిది; నిబిడము, ఘనము నైనదై యనేక రూపములు గలదై యుండును. సృష్టిలయాదులు పరిచ్ఛిన్న జగత్సంబంధులే యగుటచే,నవి అవిద్యాపరిణామములని చెప్పఁబడును. 3. చేతనమగు నాత్మ కచేతన దేహసంయోగము నొందుటకుఁ గర్మయే కారణము. కర్మ అవిద్యకు సహకారి జీవప్రవృత్తుల వలన జనించిన దగుటచే దానికిఁ గర్మయని పేరు వచ్చినది. అది సూక్ష్మము, నదృష్టము నైనది. సృష్టియందుండి ప్రళయవేళ నది మాయలో లీన

---

(౧) విజ్ఞానకళులనఁబడు నుత్తములు మాయాకర్మ బంధవిముక్తులై ఆణవకాలుష్య మొక్కటియుఁ గలిగి యుందురు. తరువాత వారు ప్రళయాకళులు; వీరాణవ, కర్మదోషముల వలన (బునర్జన్మము నొందుదురు: సకలులు మిగిలిన వారందరును త్రివిధదోషములను గలిగి యుందురు.

(౨) మృగేంద్రాగమము, ౨,3-౭.

(3) ,, ,, ౭-౧౧.

మగును. అది నశించదు; దాని ఫలితముల నది యిచ్చితీరునుగా. మాయ, జగత్తున కుపాదానకారణము, స్వభావముచే నచేతనము,౨. సృష్టిబీజము, నానాశక్తి సమన్వితము, సర్వవ్యాపియు నవినాశనమునైనది. "బీజములో నిక్షిప్తములైన మూలపత్రి ఫలాదులెట్లు దానినుండి జనించునో, యట్లే, జగత్తు కళ మొదలు క్షితివరకు మాయాబీజమునుండి యుత్పన్న మగును 3.

శైవమతము సృష్టివిధానమును గూర్చి విశేషశ్రద్ధ చూపెను. శివుఁడు శుద్ధచైతన్యము; జడపదార్థము పూర్తిగా నచేతనము; శక్తి రెంటికీ సంధానకర్త. చైతన్యస్వభావము గలదగుటచే శక్తి జగత్తున కుపాదానకారణము కాదు. అది శాశ్వతమగు నాదము; స్థూలసూక్ష్మములను, చేతనాచేతనములను, శబ్దార్థములనుఠ. కలుపు సంధానకర్తయునై యున్నది. జగన్మాత, శుద్ధమాయ, వాక్కు లేక నాదరూపము," ప్రశాంతి యొక్క ధ్వని." సాంఖ్యుల యిరువదియైదుకు బదులు శైవసిద్ధాంతము జగత్తును ముప్పదియారు తత్త్వములుగా విభాగించెను. ప్రకృతికి బుద్ధికి మధ్యమందు గుణము చేర్పఁబడెను. అందుచేఁ బురుషునితోఁ గలిసి యిరువదియారు తత్త్వములున్నవి పురుషుని కూర్ధ్వమున, నియతి, కాల, రాగ, విద్యా, కళలను పంచాంశుకమున్నది. కళ కూర్ధ్వమున, మాయ, శుద్ధావిద్య, ఈశ్వ

(౧) ౯,౧-౫.

(౨) ౯,౨-౪.

(3) పౌష్కరాగమము. 3,౪.

(౪) పౌష్కరాగమము. ౨,౧౭.

రుఁడు, సదాశివుఁడు, శివుఁడు గలరు. శివతత్త్వ మొక ప్రత్యేక వర్గము. సదాశివుఁడు, ఈశ్వరుఁడు, శుద్ధావిద్యయుఁ గలిసి విద్యాతత్త్వములు; ఇఁక మాయ మొదలిడి మిగిలిన ముప్పదిరెండు నాత్మ తత్త్వములు. ఇవి పరిణామము లోని భిన్నదశలు. మొదట మాయ సూక్ష్మ తత్త్వములుగాఁ బరిణమించి, తరువాత స్థూలతత్త్వములుగా నావిష్కృతి గాంచును. కళ, మాయనుండి జనించిన మొదటి తత్త్వము. చైతన్యావిష్కృతి కడ్డువచ్చు కాలుష్యములనుబో నడంచి, కర్మ ననుసరించి దాని వికాసమునకు సాయపడును. విద్య తరువాత తత్త్వము; దీనివలన నాత్మ సుఖదుఃఖానుభవము నొందును. "దేనివలన జీవాత్మ, బుద్ధి ప్రవృత్తులనుపరికించునో అదియే విద్య." ౧ కోరికయే మాయ; సర్వానుభవములు దానిపై నాధారపడియున్నవి. కాల మనుభవమును భూతభవిష్యద్వర్తమాన క్రమములో నియమించును. కాలము నిత్యము గాదు; ఏలన నిత్యత కాలాతీతము. జీవులకుఁగల దేహావయవాది భిన్నత్వమును సక్రమముగా నిలుపునది నియతి. పురుషు లీయైదింటిచే నావృతులు. శైవసిద్ధాంతము ననుసరించి, సాంఖ్యమూలప్రకృతియు నుద్భవమందినదే. దానిపై నింకను నైదు సూక్ష్మతత్త్వము లున్నవి. ఈయైదులో మొదటి మూడు నిచ్ఛాజ్ఞానక్రియాశక్తులను వికసింపఁజేయుటకుఁ దోడ్పడును. మిగిలినవి రెండును నించుమించుగా దేశకాలములకు సరిపోవును. పురుషులనుభవింపవలయు లోకములు ప్రకృతి ద్రవ్య

(౧) పౌష్కరాగమము ౫, ౯

పరికల్పితములు. ప్రకృతి మొదటి స్థూలావిష్కరణము, ప్రకృతి నుండి గుణములు, గుణములనుండి బుద్ధియువచ్చును. మిగిలిన పరిణామమంతయు సాంఖ్యవిధానము ననుసరించియే జరుగును.

శివతత్త్వమునిష్కల, యనగా సర్వజ్ఞానక్రియాప్రవృత్తికి నవ్యక్తమగు నాధారము. "శివునిశక్తియగు శుద్ధమాయ, తన ప్రవృత్తి జీవితము నారంభించుటతోడనే, శివుఁడు భోగశివుఁడగును. ఈతఁడే సదాశివుఁడు లేక సదాఖ్యుఁడు; నిజముగా శివునికి వేరుకాఁడు. శుద్ధమాయ ప్రవృత్తిపరమై యుండగా, భోగశివుఁ డధికారశివుఁడగును. అప్పు డాతఁ డీశ్వరుఁడే కాని, సదాశివునికి భిన్నుఁడుగాఁడు. ౧. పంచమంత్రదేహము సదాశివుని దే కాని శివునిదికాదు. శుద్ధావిద్య యథార్థజ్ఞానకారణము. ప్రతిసృష్ట్యారంభకాలములందును, నిష్క్రియాదశ లుండును. దానియనంతరము పరిణామ మారంభమగును. కాలుష్యములు పెంపొందుటకు శివుఁడే సాయపడి, తన యనుగ్రహముపై నాధారపడిన జీవుల పారమార్థికవికాసమునకుఁ దోడ్పడును. జీవుల వ్యాపారముల నాతఁడు గుర్తించి, వానియభ్యుదయమున కాతఁడు సహకారియగును. కర్మనియతిని గౌరవించుటవలన నీశ్వరుని స్వేచ్ఛకు భంగముకలుగదు; ఏలనఁ గర్మనియతినొక సాధనముగా నాతఁ డుపయోగించును. ౩.

(౧) పౌష్కరాగమము, ౧, ౨౫-౨౬

(౨) ౭, ౧౧-౨౨

(౩) సర్వదర్శనసంగ్రహము, ౭; శివజ్ఞానబోధమ్, ౨, ౫.

శైవసిద్ధాంతము జగన్మిథ్యావాదము నంగీకరించదు. అనాదియగు సంసారమున కనాదులగు జీవజడపదార్థములే కారణములు. జగత్తునకొక మహత్తరధర్మప్రయోజనమున్నది; అది కేవలమొక భ్రాంతికృతముకాని వినోదముకాని కాదు. జడపదార్థబంధములనుండి జీవులను విడిపించుటకీశ్వరుఁ డెల్లప్పుడు కృషి చేయుచుండును. కర్మచే నడుపఁబడు ననవరతజగచ్చక్రపరిభ్రమణమున కుద్దేశ్యమొక్కటేకలదు. మానవుని కూర్ధ్వగతి నొందుమని ప్రోత్సహించుటే. "అందరు నాతని నెరుగవలెనని శివుఁడు నిత్యము కోరున"ని (౧) మేకందరు వలికినాఁడు. జీవుఁ డీశ్వరు నెఱుగుట కాకాంక్షించుటేకాదు; యీశ్వరునికి నదేకోరిక.

మనము విముక్తి నొందవలసిన పాపము త్రివిధబంధము. ఆత్మ జ్ఞానజ్యోతి నాచ్ఛాదించు తమోరూపమగు నవిద్య లేక ఆణవమును మనము నిర్మూలింపవలెను; పునర్జన్మ హేతువగు కర్మనుచ్ఛేదించి, సర్వపాపముల కాధారమైన మాయ నున్మూలింపవలెను. మన ప్రయత్నములో నీశ్వరుఁడు తోడ్పడును జీవుల సుఖదుఃఖములతో సంబంధములేని నిర్గుణ బ్రహ్మ వలనఁ బ్రయోజనములేదు. శివుఁడు కృపాపరిపూర్ణుఁడు; యుగయుగముల నుండియు జీవుల భక్తికి మెచ్చి రక్షింప నెదురు చూచుచుండును. జీవేశ్వరులకు వ్యక్తిగత బాంధవ్యమున్నది. ఈశ్వరానుగ్రహమే మోక్షమునకు రాజమార్గము. శివుని యందు మనకుఁ బసిబిడ్డవంటి నిష్కల్మష విశ్వాసముండవలెను. "దరిఁ జేరఁగోరని వారి కాతఁ డెట్టివరముల నీయఁడు; తన్నుసమీ

(౧) శివజ్ఞానబోధమ్, ౧౨, ౩.

పించు వారి కన్నియు నిచ్చును. పరమేశ్వరుని కెవరియెడ నసిష్టము లేదు."౨. శివభక్తు లీశ్వరదర్శనమునకై పరితపింతురు. మాణిక్యవ సాగరుఁడిట్లు పాడినాఁడు: "పాపనిలయమగు నీదేహమును విసర్జించి, దివ్యజ్యోతిస్స్వరూపమగు శివనివాసమును దర్శించి, నేత్రోత్సవము పొందఁగోరెదను. అపరిమితానానంత స్వరూపా! నీపురాతన భక్తసమాజమును జూడ నీదాసుని హృదయ మువ్విళులూరు చున్నది."౩. పాపపరితాపమత్యధికముగా నున్నది. కొందరు భక్తులు తమపాపములే తమకు దైవ సంయోగము లభింపకుండఁ జేయుచున్నవని విలపింతురు.౧. వైష్ణవుల భక్తికంటె శైవులభక్తి యెక్కుడు పటుత్వమును, మగటిమిని గలిగి యుండును.

తిరువాసగము ౨ మనోహరగీతములలో నజ్ఞానమునుండి యీశ్వరుని జేరు జీవయాత్ర వర్ణించును. అవిద్యాకామముల

(౨) తిరు-అరుల్-పయన్, ౧,౯.

(౩) పోప్ భాషాంతరీకరణము, తిరువాసగము. ౨౫,౯.

(౧) పోల్చు: అప్పార్:

"నాజాతియు గుణములు నన్నియు దోషములే. నేనధమపాపిని; నాయోగ్యత పాపమే. నాయంతరంగమంతయుఁ బాపదౌష్ట్యములతో నిండి యున్నది. శౌచమన్న నిష్టపడను. నేను పశువును, ఐనను పశుమార్గమును విడుచుట కిష్టపడను......నేనతినికృష్టుఁడను ఇంత పాపినెట్లు జన్మించితినో."......

(౨) శైవసిద్ధాంతవాఙ్మయమును గూర్చి సర్ ఛార్లెస్ ఎలియట్ వ్రాసినాఁడు:" నేను జదివిన మతవాఙ్మయములో, వ్యక్తిమతసాధన జీవితములో—సంభవించు పోరాటములు భయములు, ఆశలు కలఁతలు, ధైర్యవిజయములు—వీనినిఁగూర్చి యందుఁ జేయఁబడిన మహత్తరగంభీర వర్ణనలెచ్చటను లభించి యుండలేదు."(హిందూమతము బౌద్ధమతము, వాల్యుము౨, పు౩౧౭.)

నుండి; ప్రేమజ్యోతిమయ స్వాతంత్ర్యమునకు జరుగు యాత్రలో మొదట జాగృతి. దానివలన నుత్సాహసంతోషములు, తరువాత వచ్చు చాంచల్యమున ధైర్యము, పోరాటమున శాంతి, తుదకు సంయోగముచేఁ గలుగు శాంత్యానందములు వర్ణింపఁబడెను. ఈశ్వర సాక్షాత్కారసిద్ధిలో జ్ఞాతృజ్ఞేయజ్ఞానభేదములు తొలఁగి పోవునని చెప్పఁబడెను.3. పూర్వశైవమతము కొంత పరమత సహనభావము చూపినది. "ఏదేవుని నీవారాధించినను, శివుఁడే యాతఁడై కన్పట్టును. వీని కన్నిటి కతీతుఁడైన యీశ్వరుఁడు నీస్వచ్ఛభక్తి నిజూచి యనుగ్రహము నిచ్చును"౪. మోక్షసాధనములో గురువుకుఁ బ్రాముఖ్యమున్నది. నిజమైన గురువున కిదే తుదిజన్మము. శివుఁడే స్వయముగా గురువులో నుండి, శిష్యుని దయతో గురువు నేత్రముల ద్వారమునఁ జూచుచుండును ౧. శివుని కవతారములు లేవు. కాని తఱచుగాఁ దన భక్తులను బరీక్షించి, సత్యమార్గమునఁ బెట్టుట కాతఁడు గోచరించుచుండును. కాని శివుఁడజుఁడే. మానవ దేహయాత్ర యాతని కెన్నఁడును లేదు.

ధర్మనియమములు ముఖ్యములు. సిద్ధియారు చెప్పినాఁడు; "మానవకోటిని ప్రేమింపనివానికి దేవునియందుఁ బ్రేమ లేదు"౨. కర్మసూత్రి మవిలంఘ్యమైనను, జీవస్వేచ్ఛకు భంగము

(3) తిరు అరుల్ పయన్, ౮. ౭౪.

(౪) శివజ్ఞానసిద్ధియారు,

(౧) తిరుఅరుల్ పయన్ ౫.

(౨) ౧౨;౨.

లేదు. మానవప్రయత్నమున కీశ్వరుఁడు తోడ్పడ నెల్లప్పుడు సంసిద్ధుఁడే. కర్మయు జ్ఞానమును గలిసి మోక్షమిచ్చును.౩. నిజమగు ఆస్తికమతములో వర్ణభేదకాఠిన్యము శిథిలతగాంచును. మాణిక్యవాసగరు వర్ణనియమములఁ బ్రతిఘటింపకున్నను, ననంతర శైవులగు పట్టణాధుపిళ్లై, కపిలారు, తెలుఁగుకవి వేమన వర్ణధర్మములను నిరసించిరి. దేవుఁ డొక్కడైనట్లే, జాతియు నొక్కటే యని తిరుమూలరు చెప్పినాఁడు.౪. బసవుఁడు స్వయముగా బ్రాహ్మణుఁడైనను, బసవుని సంస్కరణోద్యమము (౧౨-వ శతాబ్ద మధ్యకాలము) బ్రాహ్మణాధికారమును దీవ్రముగాఁ బ్రతిఘటించెను ౫ ఈశాఖ పునర్జన్మభావము నంగీకరింపదు. పాశభంగమైన వెనుక, జీవుఁడు శివసదృశుఁ డగును. సృష్టిలయాది పంచక్రియలు శివుఁ డొక్కనికే చెందును.౧. ఇఁక నాత్మ నాచ్ఛాదించు కాలుష్య మేమియునుండదు కావున నీశ్వరుని కాంతియందు సులభముగాఁ బ్రసరించును. మోక్షమీశ్వరైక్యముగాదు; సాన్నిధ్యమే. మేకందరు చెప్పినాఁడు: "శివునితో నైక్యమై, జీవుఁడు నశించినచో, నీశ్వరునితో నిత్యసాహచర్యము గలిగియుండు వ్యక్తిత్వమే యుండదు. అట్లు

(౩) నీలకంఠుఁడు ౧,౧,౧.

(౪) ఒన్రె కులము ఒరువనెదేవానమ్ (తిరుమంత్రము)

(౫) లింగాయతమతశాఖ వర్ణభేద తీవ్రప్రతిఘటనముతో బయలుదేరినది కాని నేఁడు లింగాయతులు వర్ణభేదము నంగీకరించుచున్నారు.

(౧) మృగేంద్రాగమము. ౬,౭. "నిరంతరమ్ శివోఽహమితి భావనా ప్రవాహేణ శిథిలితపాశతయా ఉపగతపశుభావః ఉపాసకః శివఏవభవతి॥ (నీలకంఠుఁడు ౪,౧,౩.)

నశింపక వేరైయున్నచో నీశ్వరసంయోగము లేదు. కాని పాపములన్నియు నశించి, లవణము నీటిలోఁ గలిసినరీతిని, సిద్ధుఁడు శివదాసుఁడై యాతని పాదసన్నిధి నెప్పుడుండి సుఖించును."౨ "పాపనాశనముతో నాత్మ శివసదృశస్థితిని గాంచును."3.ముక్తజీవులు సశరీరులుగాఁగాని యశరీరులుగాఁ గానియుండవచ్చును.౪. మోక్షస్థితిలో దేహముకూడ శివతేజస్సుతోఁ బ్రకాశించునని కొందరు శైవులు చెప్పుదురు. కొన్ని విచిత్రశక్తులు వారికిలభించునని కొందరుచెప్పుదురు. శివైక్యము పొందుటకు ముందుఁ గర్మఫలములను పూర్తిగా జీవు లనుభవించివేయవలెను. జీవన్ముక్తుఁడు, సశరీరుఁడైనను, నీశ్వరునితో భావతాదాత్మ్యము నొందును. తిరిగి జన్మములనిచ్చు పను లెవ్వియు నాతఁడు చేయఁడు. ఈశ్వరసాన్నిధ్య మాతనిహృదయములో నిండియుండును.౫. పూర్వజన్మ కర్మరాశి నశించువరకు నాతఁడు సశరీరియై యుండును. సాధనకాలమందలి కర్మ యీశ్వరకృపచే నశించును.౧. ముక్తపురుషులుచేయు కర్మలన్నియు వారిలో నీశ్వరుఁడుండి ప్రోత్సహించిచేయించునవే ౨

(౨) నీలకంఠుఁడు ౪,౪,౭. (3) శివజ్ఞానబోధమ్ ౧౧,౫.

(౪) నీలకంఠుఁడు. ౪,౪,౪.

(౫) నీలకంఠుఁడు. ౪,౪,౫.

(౧) తిరు-అరుళ్-పయన్. ౧౦, ౯3.

౨. తిరు-అరుళ్-పయన్ ౧౦, ౯౭.

"నీకొఱకు మొఱపెట్టు నాజిహ్వయు, మిగిలిన నాశక్తులన్నియు నీ రూపమే; నీవేనాబలము! నాలోఁబ్రవహించుచున్న కంపమునీవే; సదసద్రూపమంతయు నాదే; మఱేదియునులేదు."

### ౪ - ప్రత్యభిజ్ఞాశాఖ

కాశ్మీర శైవమతమున కాధారము లాగమములేకాని, తరువాత రచన లద్వైతపోషకములుగా నున్నవి.

వసుగుప్తుఁడు (౮-వ శతాబ్దము) శివసూత్రములను గాంచి, కల్లటునకు బోధించెనని చెప్పుదురు. వసుగుప్తుఁడో, కల్లటుఁడో రచించిన స్పందకారిక, (క్రీ. వె ౯౦౦) ఉత్పలునిప్రత్యభిజ్ఞాసూత్రము (క్రీ. వె. ౯౩౦) అభినవగుప్తుని పరమార్థసారము ప్రత్యభిజ్ఞా విమర్శిని, తంత్రాలోకము, క్షేమరాజు శివసూత్రవిమర్శిని, స్పందసందోహము, నీశాఖకుఁజెందిన కొన్ని ముఖ్యగ్రంథములు. శైవాగమములను, సిద్ధాంతగ్రంథములను వారు ప్రమాణములుగా స్వీకరించి, శంకరాద్వైతవాదానుకూలముగా వానిని మార్పుచేసిరి. ఏకేశ్వరతత్త్వమును ప్రతిపాదించు భిన్నభావములుగల యీగ్రంథములను మూఁడువర్గములుగా విభజించి, త్రికమనిరి. ౩. భాస్కరవార్త్తిక సహిత శివసూత్రమును, క్షేమరాజు విమర్శినియు నొకపద్ధతికిఁ జెందినవి. కల్లటునివృత్తితోఁ గూడిన వసుగుప్తుని స్పందకారిక వర్ణించు తత్త్వము మొదటి పద్ధతికి భిన్నమైనదిగాదు. సోమానందుని శివదృష్టి, ఉత్పలుని ప్రత్యభిజ్ఞాసూత్రము, అభినవగుప్త విరచిత గ్రంథావళియు నద్వైతపోషకములు. ౧. వీనిలో మాధవు ననుసరించి, అభినవగుప్తుని గ్రంథములే మిక్కిలి ముఖ్యములైనవి;

---

(౩) పరమార్థములగు నీశ్వర, జీవ, జడపదార్థములనుగూర్చి చెప్పునది కావున నవి త్రికమనఁబడెను.

(౧) చూ. పరమార్థసారము, పు, ౩౪, ౩౬, ౪౮-౫౦, ౫౪

ఏలన, మొకటి రెండువర్గముల భావములిందుఁ గూర్పఁబడి నవి. ౨. ఈసిద్ధాంతవాదులు కూడ నితరపద్ధతులన్నియు దీనికిఁ దోడ్పానివో వు సోపానములవంటివని చెప్పుదురు. 3.

జగతిలో యథార్థమైనది శివుఁడే. ఆతఁడు సర్వజ్ఞుఁడు, పరిపూర్ణస్వతంత్రుఁడు. విభుత్వ, నిత్యత్వ, రూపరహిత్వాది గుణము లింకను జాలగలవు; స్వచ్ఛందత్వమాతని విశిష్ట లక్ష ణము. విషయి, విషయము, భోక్తయు ద్రివ్యమునాతఁడే ర. "ఏ చైతన్యమునుండి యీ ప్రపంచమంతయు నుదయించెనో, యది స్వభావముచే స్వతంత్రమైనదగుటచే దాని కవరోధము కలిగించున దేదియును లేదు. భిన్నములగు జాగ్రత్స్వప్నసుషు ప్త్యాద్యవస్థలలో సంచరించుచు, వానితోఁ దాదాత్మ్యము పొందుచు నిజస్థితినుండి పతన మెన్నడును బొందకయుండును."౫ అద్వైతధోరణిలో నిట్లుచెప్పఁబడెను:" దేనియందు సుఖము లేదో, దుఃఖము లేదో జ్ఞాతయు జ్ఞేయమును లేవో, జడత్వము లేదో అదియే నిజముగానున్నది "౬. ప్రమాతయొక్క యాథార్థ్యము నకు సాక్ష్యమక్కర లేదు. ఏలన, సర్వప్రమాణములును దానిపై నాధారపడియున్నవి.౭ శివునికిఁ ద్వితీయుఁడెవ్వఁడును లేఁడు.జగతి

(౨) సర్వదర్శనసంగ్రహము, ౮

(3) తద్భూమికాః సర్వదర్శన స్థితయః (ప్రత్యభిజ్ఞాహృదయ సూత్రము, పు, ౮)

(ర) స్పందకారికా, పు, ౨౯

(౫) ,, పు, ౨-ర

(౬) ,, పు, ౫

(౭) శివసూత్రవిమర్శిని, పు, ౫

విజ్ఞానమందే యున్నను బాహ్యమున నున్నట్లు గోచరించును. "చిద్రూపియగు పరమేశ్వరుఁడు కామపరతంత్రుఁడై, వస్తుసముదాయమును యోగివలె బాహ్యమున నున్నట్లుగాఁ బ్రకాశింపజేయును. కాని దాని కాధారములేదు."౧. కర్మవంటి ప్రేరణకారణముగాని, ప్రకృతివంటి యుపాదానకారణముగాని, సృష్టికారణముగా నంగీకరింపఁబడలేదు. మిథ్యారూపములను బ్రదర్శించు మాయయుఁ గారణముకాదు. ఈశ్వరుఁడు పరిపూర్ణస్వతంత్రుఁడై, తన కేవలసంకల్పశక్తివలన సర్వమును గల్పించెను. ప్రపంచము తనలోనేయుండి, వేరుగానున్నట్లుగోచరించు రీతి నాతఁడు వస్తువు లద్దములో గోచరించునట్లు చేసినాఁడు. తనలో గోచరించు ప్రతిబింబదోషము లంటక ముకురము నిర్మలమైయుండునట్లే తాను సృజించినవస్తు మాలిన్యములచే నీశ్వరుఁడు కలిషితుఁడు గాకయుండును. తనలో నిహితములైయున్న యద్భుతశక్తులవలన నీశ్వరుఁడు జీవకోటిరూపమును ధరించి, జీవానుభవార్థము విషయములను గల్పించును. ౨. నిజమైన వస్తువు నిరవధికమైన శుద్ధాత్మ; జగదేకైకాధారము; తత్స్పందనమే సర్వభేదములకుఁ గారణము.

---

(౧) ఈశ్వర ప్రత్యభిజ్ఞాసూత్రము. ౫.౬. జ్ఞానానందమయుఁడైన పరమేశ్వరుఁడు శక్తిని, మాయను, ప్రకృతిని, భూమిని సృజించెనని పరమార్థసారము చెప్పుచున్నది. (చూ:౪.) ఈశ్వరుఁడు దేవమనుష్యాది రూపములను ధరించును. (౬)

(౨) పరమార్థసారము. పు.౪౪-౫౦.

విశ్వైకాధారుఁడై, నిత్యనిర్వికారుఁడైన సత్యస్వరూపుఁడే శివుఁడు. అతనిశక్తి కనంతరూపములున్నవి. వానిలో ముఖ్యము లైనవి చిత్తు, ఆనందము, ఇచ్ఛ, జ్ఞానము, క్రియ, ముప్పది యారు తత్త్వములు గలవు. శక్తి చిద్రూపమునఁ బనిచేయు నప్పుడు, శివుఁడు శివతత్త్వముగా మారును. శక్తియొక్క ఆనంద వృత్తిచేఁ జైతన్య ముదయించుటతో రెండవఘట్టమైన శక్తి తత్త్వమేర్పడును. ఆత్మావిష్కరణేచ్ఛచే రూప ముదయించుట మూడవదశ. తరువాత జగత్తు నుద్భవింపఁజేయు నీశ్వరతత్త్వము, తరువాతఁ గ్రియారంభవేళ జ్ఞాతృజ్ఞేయములు రెండును గలుగును. ఇది శుద్ధవిద్యాదశ. ఈవిధముగా శివశక్తియొక్క పంచ శక్తుల ఆవిష్కరణమొందు పరతత్త్వము లున్నవి.

మాయాప్రభావముచే నియతి, కాల, రాగవిద్యాకళోపాధిసహిత బాహ్యప్రపంచ ముదయించును. ఈమాయాప్రభావమువలననే, యేకచైతన్యమనేకపరిమితరూపములలో ననగాఁ బురుషులలో గోచరించును. ఉపాధులన్నిటికి మీఱియున్నది. ప్రకృతి పురుషభేద ముదయించును. మిగిలిన పరిణామ క్రమమంతయు సాంఖ్యులు చెప్పినట్లే జరుగును. పరిణామదశలన్నియుఁ దిరిగి శివునియొద్దకుఁ జేరును సృష్టిలయ చక్రభ్రమణ మంగీకరింపఁబడెను. సృష్టి క్రమకార్యము పరమశివుని శుద్ధరూపమునకుఁ గాలుష్యముగలిగింపదు; ఏలన శివుఁడన్నిటికతీతుఁడు.

ఆత్మ జ్ఞానస్వభావముగలది; జీవాత్మయు నట్టిదే యగుటచేఁ, బారమార్థికముగా నాత్మానేకత్వ మంగీకరింపఁబడలేదు.

శుద్ధజ్ఞానము ప్రతివ్యక్తిలో నున్నది; మిథ్యోపాధులచే నాచ్ఛాదింపఁ బడియున్నది. అజ్ఞానమే మన బంధకారణము.౧. క్షేమరాజు చెప్పినాఁడు; "అనంతజ్ఞానరూపియై, ఆత్మ 'నేను పరిచ్ఛిన్నరూపి" ననియు; స్వతంత్రతగల్గి, నేను దేహము' ననియుఁ దలఁచును. ౧ ఆత్మయే శివుఁడనియు, శివేతరప్రపంచము మిథ్యయనియు మఱచి యిట్లు భావించును.

సత్యప్రత్యభిజ్ఞయే మోక్షమునకు వలయునది. జీవాత్మయే పరమాత్మయైనచో నీప్రత్యభిజ్ఞ యెందులకని యడుగవచ్చును. దీనికి సమాధానముగా మాధవుఁడొక యుపమానమును జెప్పినాఁడు. విరహములోనున్న వనిత, తనప్రియుఁడు సమీపవర్తియై యుండుటచే మనశ్శాంతిఁబొందదు. సమీపమున నున్న యాతఁడే తనప్రియుఁడని యామె గుర్తింపవలెను. ఇట్టి ప్రత్యభిజ్ఞవలననే అజ్ఞానబంధము విచ్ఛిన్నమగును. ఆత్మ తానే యీశ్వరుఁడని గుర్తించినపుడు పరమేశ్వరైక్యానంద సమాధినందును స్పందశాఖ ననుసరించి, ఆత్మ, గాఢమగు యోగధ్యానముచే జ్ఞానమునుబొంది, జగత్తునంతను శివమయముగాఁజూచి, అఖండప్రశాంతియుత సమాధిఁ గాంచును. శివసూత్రము మూడు మోక్షమార్గములఁ జెప్పెను; శైవ, తాంత్రిక, యోగములు.

అభినవగుప్త ననుసరించి ముక్తపురుషులు మూఁడు వర్గములుగా నుందురు; పరమాత్మలోఁ గలిసిపోయిన పరముక్తులు

(౧) శివసూత్రము. ౨

(౧) శివసూత్రభాష్యము, ౧,౨.

ఈశ్వరతత్త్వైక్యము గాంచిన అపరముక్తులు; జీవన్ముక్తులు. ముక్తాత్మ పరమాత్మతో నేకమగును; ఏలన స్తవహోమాదులు చేయుట కెట్టిభేదము నుండదు. ౨. "ఈవిధముగా ద్వైతభావమునశించి, ఆత్మమాయ నధిగమించి, జలము జలమునందును, క్షీరము క్షీరమునందును గలిసిపోవునట్లు, బ్రహ్మైక్యము పొందును." 3.

## ౫ - శాక్తేయము.

శక్తిమతారంభబీజములు ఋగ్వేదమునఁ గలవు. ఒక మంత్రములో శక్తి బలమునకు మూర్తియని చెప్పఁబడెను; అదియే స్వర్గమందుండి, భూలోకమును రక్షించుచున్నది."౧. ఆమె జగద్భారమును వహించు పరమశక్తియు, సువ్రతులగు భక్తులకుఁ దల్లి యనియు వచింపఁబడెను. తరువాత నామెయే సువర్ణారుణ రూపమైన యుమాదేవిగాఁ గేనోపనిషత్తు నుడివినది. ఆమె మహాభారతమందు కృష్ణుని సోదరియై, వైష్ణవమత సంబంధమును గాంచినది. శైవుల కామె శివసతీమణి యగు పార్వతి. పురాణములలో నామె చండీదేవియై,నిత్యపూజ నందినది. ఆవెనుక యామె సచ్చిదానందరూపిణియై, పరబ్రహ్మ ప్రతినిధియై, స్త్రీపురుషాది భేదములులేని మూర్తిగా నర్చింపఁ

---

(౨) జె. ఆర్. ఎస్. ౧౯౧౦

(3) పరమార్థసారము. పు, ౫౧,

(౧) ౧, ౧, ౧3౬, 3.

(౨) చూ. ఛాం. ఉ. 3,౧౨;బృ.అ.ఉ.౫.౧౪.

బడినది.3. క్రమముగా వైదిక కర్మవిధానమునకు బదులు, జగ న్మాతయే శక్తిగా నుపాసింపఁబడెను. ఈమతశాఖా సారస్వత మునే తంత్రమందురు. స్త్రీలందరు జగన్మాతృరూపములుగా భావించి, యీమతము స్త్రీలను గౌరవించినది ౪.

శాక్తమతమునకుఁ జెందిన డెబ్బదియే డాగమములలో, జ్ఞాన మోక్షసాధనములను దెల్పిన వైదుశుభాగమములు, మంత్రశక్తులను బెంపొందించు అరువదినాలుగు కౌలాగమ ములు, నెనిమిది మిశ్రాగమములుగా విభాగింపఁబడెను. భాస్కర రాయలు తన లలితా సహస్రనామభాష్యములో శక్తి సూత్ర గ్రంథమునుండి తొమ్మిది సూత్రముల నుదాహరించినాఁడు. శక్తిసూత్రము మనకు లభించి యుండలేదు. దేవీ శివ సంవాద రూపమున నున్న తంత్రములు ౭-వ శతాబ్దము, తద నంతరకాలములకుఁ జెందినవి. సర్. జాన్ వుడ్రో కృషి వలన ముఖ్యతంత్ర గ్రంథములు నేడు ప్రకటింపఁబడినవి. ఈమతమునందు శివుఁ డఖిలానుగతుఁడు, శుద్ధచైతన్యనిరాకార నిష్క్రియామూర్తి. ఆతనికి జగత్సంబంధమేమియు లేదు. సక్రి యాసాకారరూపిణియైన శక్తియందే సర్వజీవులున్నవి. సౌందర్య లహరిలోఁ బ్రారంభశ్లోక మిట్లున్నది, "శివుఁడు, శక్తిసంగుఁడై నప్పుడే సృజింపఁగలఁడు; లేకున్న నాతఁడు కదలనైనఁ గదల

(3) పునాప్రపంవా స్మరేత్ దేవీమ్ స్త్రీరూపంవా విచింతయేత్.

(౪) విద్యాసమస్తాస్తవదేవిభేదాః స్త్రియస్సమస్తాస్స కలాజగత్సు. అథవానిష్కలామ్ ధ్యాయేత్ సచ్చిదానందలక్షణామ్.

లేడు"౧ ప్రకాశవిమర్శాసంబంధమువంటిదే శివశక్తుల సంబంధము. విమర్శ యనఁగాఁ బరబ్రహ్మముయొక్క సహజపరిభ్రమణమని భాస్కరరాయలు నిర్వచించెను. ౨. సంబంధరహితమగు నిర్గుణచైతన్యమునకు విమర్శయే మొకటిసంబంధము; దీనివలన నానాభేదరూపప్రపంచోత్పత్తియగును. విమర్శలేక శక్తి నిర్గుణచైతన్యములో గర్భితమైయున్నది. అది నిర్గుణచైతన్యము యొక్క సగుణమూర్తి; అదియే అనాత్మగామారును. శివుఁడు చిత్తు; శక్తిచిద్రూపిణి. బ్రహ్మవిష్ణుశివులు సృష్టిస్థితిలయకార్యములను శక్తికి వశులై చేయుదురు. పూర్ణానందానుభూతిలో శివశక్తి భేదము తొలఁగిపోవుమ. రెండు నేకరూపమగును. నిష్క్రియావస్థలోనున్న అవ్యక్త బ్రహ్మరూపము శివుఁడు; ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులు గలిగి, జగత్తు నావిష్కరించుశక్తి సగుణబ్రహ్మ రూపము అస్తిత్వగర్భితమై శక్తియుండుటచే శివుఁడు శక్తియు నొకటే; శక్తి ప్రవృత్తిలోనున్నను, నివృత్తిలో నున్నను, నది రెండురూపములలోను నున్నది, సర్వవిషయ ప్రపంచబీజరూపమై శక్తి శివునిలోనున్నది. శక్తికి స్థూలసూక్ష్మభేదములున్నవి. ఆమె సర్వవస్తుజాలమునకుఁ దల్లి; ఆభాస, రక్తి. విమర్శన, బీజావస్థాన, విలపనతాలక్షణము లైదు నామెకుఁ గలవందురు. సాంఖ్యమతములోఁ బ్రకృతికి సరిపోవు జడపదార్థము నున్నది.

(౧) శివశ్శక్త్యాయుక్తో యదిభవతిశక్తః ప్రభావితుమ్। నచేదేవమ్ దేవోనఖలు కుశలః స్పందితమపి॥

(౨) చూ: విమర్శరూపిణిలో లలితాసహస్రనామభాష్యమును పు. ౫౪౮.  (3) ఆనందలహరి. పు. ౨,౨౪.

ప్రకృతి లేక మాయ దేవియొక్క తత్త్వమని చెప్పఁబడెను. ౧. జగత్కారణమైన ప్రకృతి లేక మాయ శక్తి గర్భమందున్నది. అది ప్రళయకాలమున నవ్యక్తము, సృష్టికాలమున వ్యక్తమునై యుండును. ప్రకృతినుండి సాంఖ్యపరిణామమే యిందు ననుసరింపఁబడినది. శక్తియొక్క చోదనము ననుసరించి, మాయ స్థూలభూతములుగను, చేతనులయొక్క దేహరూపములుగను వ్యక్తీకరించుకొనును. సర్వజీవులలోఁ జైతన్యమునిండియున్నది. భిన్నోపాధికారణములచే నొకే చైతన్య మనేకముగా గన్పట్టుచున్నది. సాంఖ్యుల యిరువదియైదు తత్త్వములకు బదులుగా ముప్పదియారు తత్త్వములు చెప్పఁబడెను (౧) శివతత్త్వము, పరమమూలమైనది. (౨) విద్యాతత్త్వమనఁగా, శక్తియొక్క సూక్ష్మరూపావిష్కరణము. (3) ఆత్మతత్త్వము లేక మాయ మొదలు భూమివరకుఁగల స్థూలజగత్తు. ఇది వరుసగాఁ బ్రకాశము, విమర్శ, అనాత్మలకు సరిపోవును. శాక్తవిధానములోని పరతత్త్వములో స్వగతభేదములున్నవి, కాని మోక్షమునుగూర్చియు జగదైకతమునుగూర్చియుభావములు తరచుగాఁ బ్రకటింపఁబడెను. శంకరుని సమగ్రమగు నద్వైతవాదసామ్యము లిందుఁగలవు. ౨. మొదట మనకు నిర్గుణబ్రహ్మము, తరువాత శక్తిసమేతసగుణదైవమూర్తియుఁగలరు. అందుండి నాదము, నాదమునుండి బిందువుతే.

(౧) సామ్యావస్థాగుణోపాధికా బ్రహ్మరూపిణీ దేవీ॥

(౨) ఇది యద్వైతమని చెప్పఁబడెను. కులార్ణవతంత్రము. ౧,౧౧౦. తంత్రశాఖను ప్రత్యేకముగాఁ బరిశీలించిన సర్. జాన్ వుడ్రో. యీతత్త్వము సాంఖ్యులద్వైతమునకును శంకరాద్వైతమునకు నొకవిధముగా మధ్యమస్థానము నాక్రమించునని చెప్పెను. (ఇండియన్ ఫిలసాఫికల్ రివ్యూ. వాల్యుము. ౧. పు. ౧౨౨.) (3) శారదాటీక. ౧.

దానినుండి సుధామయము; యీయైదును శైవులశివుఁడు, శక్తి సదాఖ్య, యీశ్వరసుధామయములకు సరిపోవును. మిగిలిన పరిణామమంతయు శైవవిధానమే.

జీవి, మాయావశుఁడై, మోక్షము వచ్చువరకు, తాను స్వతంత్రుఁడైన కర్తననియు భోక్తననియుఁ దలఁచును. శక్తి జ్ఞానమే మోక్షమార్గము;౧. మోక్షమనఁగాఁ బరబ్రహ్మము యొక్క ఆనందమయ జ్యోతిలో విలీనతనొందుటే. "సర్వము బ్రహ్మస్వరూపమని గ్రహించిన వానికిఁక నేయోగమును, నేపూజయు నవసరము లేదు."౨. జీవన్ముక్తి యంగీకరింపఁ బడెను.౩. మోక్ష మాత్మశిక్షణపై నాధారపడి యుండును; ఆత్మశిక్షణ మాంతరంగిక దృష్టి నొసఁగును. ఇట్టి యాత్మ దృష్టి, "స్వాధ్యాయము వలనఁగాని, యజ్ఞముల వలనఁగాని, శతోపవాసముల వలనఁగాని లభింపదు. తానే బ్రహ్మమను జ్ఞానమువలన మానవుఁడు ముక్తి నొందును."౪. బ్రహ్మయే సత్యమను చిత్తసిద్ధావస్థ అత్యుత్తమమైనది; బ్రహ్మధ్యాన భావము మధ్యమము; బ్రహ్మస్తుతి జపాదిక భావమంతకంటెఁ దక్కువది. బాహ్యపూజాదిక భావ మధమమైనది."౫. కర్మ కాండయెడ నిరసనభావము ప్రకటింపఁబడినది. కులార్ణవ తంత్ర మిట్లు చెప్పును; "మృత్తిక తోడను, విభూతితోడను

(౧) శక్తిజ్ఞానం వినాదేవినిర్వాణమ్ నైవజాయతే। (నిరుత్తరతంత్రమ్)
(౨) మహానిర్వాణతంత్రము. ౧౪,౧౨౩. చూ: ౧౨౪-౧౨౭.
(౩) ,, ,, ౧౪,౧౩౫.
(౪) ,, ,, ౧౪,౧౧౫,౧౧౬.
(౫) ,, ,, ౧౪,౧౨౨.

శరీరమును బాయుటే మోక్షసాధనమైనచో నిత్యమట్లు చేయు గ్రామశునకములకు ముక్తి లభింపవలెను."౬. వర్ణభేదము లప్రధానములు; తాంత్రిక శిక్షణమున కందరర్హులే.౭. భక్తి మోక్షమునకు సహాయకారి. ఆరాధనా స్వాతంత్ర్య మంగీక రింపఁబడెను."నదులన్నియు సాగరమునఁ జేరునట్లే, దేవు నేరూ పమునఁ బూజించినను నన్నియు బ్రహ్మమునకే చెందును."౧. అల్పదేవతలు కాలకర్మ సూత్రములకు బద్ధులు.౨.

యోగరహస్య మార్గమున కెల్లెడలఁ బ్రాముఖ్య మీయఁబడినది. మంత్రములు దైవకృతములు, పావనములు, శక్తిరూపములునై యున్నవి; ఏలన శక్తియే శబ్దస్వరూపము. దేహాంతర్గతములైయున్న శక్తుల యావిష్కరణమునకుఁ బ్రాధాన్య మీయఁబడెను. సిద్ధిగాంచిన మానవుఁడు కుండలినీ శక్తిని మేల్కొలిపి, షట్చక్రములను భేదించును. 3. కర్మ, పున ర్జన్మ, స్థూలసూక్ష్మ దేహములు మున్నగువానిని గూర్చిన సిద్ధాంతములు శాక్తులంగీకరించిరి.

---

(౬) ౧.

(౭) అంత్యజాఅపియేభక్తానామ జ్ఞానాధికారిణః॥ స్త్రీ శూద్రబ్రహ్మ బంధూనామ్ తంత్రజ్ఞానేఽధికారితా। (వ్యోమసంహితా)

(౧) మహానిర్వాణతంత్రము. ౨,౫౦.

(౨) యేసమస్తా జగత్సృష్టిస్థితి సంహారకారిణః। తేఽపికాలేషులీయం తేకాలోఽహిబలవత్తరః॥

(3) చూ. ఏవలన్ సర్పెంటుపవర్. శాక్తేయుల సాధన సందేహాస్పద మైనది. చెప్పఁబడినంత నిందాపాత్రముకాదు కాని, సంస్కారమున కవ కాశమున్నది.

## ౬—మధ్వాచార్యులు

శంకరాద్వైతమునకు ఫలితముగా దానికి వ్యతిరేకమై, రామానుజతత్త్వముతో ననేకసామ్యములు గలిగి, మధ్వాచార్య కృతమైన ద్వైతవేదాంతము బయల్వెడలినది. ౧. మధ్వాచార్యులు శుద్ధద్వైతమును బోధించెను. జీవేశ్వరులకు, నీశ్వర జడపదార్థములకు, జీవజడపదార్థములకు, నొకజీవాత్మతో నితర జీవాత్మలకు, నొక జడపదార్థభాగముతో నితరభాగములకుఁ గలభేదములను పంచవిధములుగా నాతఁడు నిరూపించెను. విష్ణుకుమారుఁడగు వాయువే, యీశ్వరునకు మనకుఁగల యేకైక మధ్యవర్తియను వాదము, శాశ్వతనరకమున్నదను వాదము మఱియు నీశాఖయొక్క ప్రచారాభినివేశము, మనకుఁ దగిన సాక్ష్యము లేకున్నను, క్రైస్తవమతప్రభావమును గొంతసూచించును. మధ్వాచార్యుని కేనోపనిషద్భాష్యము బ్రహ్మసారము నుండి తీసికొనఁబడిన దగుటచే మధ్వునికిఁ బూర్వమే ద్వైతమత సంప్రదాయ మున్నదని చెప్పవచ్చును. మనము ముందుఁ జూడఁబోవురీతిగా, నీతఁడు, సాంఖ్యన్యాయవైశేషిక సిద్ధాంతముల నతినిపుణముగా నుపయోగించినాఁడు.

---

(౧) ముఖ్యభేదము లేమనఁగా: జీవులు సహజతత్త్వములో సమానములేయని రామానుజుఁడు చెప్పఁగా, నవి భిన్నములని మధ్వాచార్యుఁడు చెప్పెను. బ్రహ్మ ముపాదానకారణమని రామానుజుఁడు, కాదని మధ్వుఁడు భావించిరి. మధ్వుని యుద్దేశములో జగము దేవుని దేహముకాదు. రామానుజ తత్త్వము ననుసరించి, మోక్షమున కర్హతలేని జీవులువేరు, ముక్తజీవుల సుఖానుభూతిలో భేదములులేవు.

## ౭ - జీవితసారస్వతములు

దక్షిణ కనరాజిల్లాకుఁ జెందిన 'ఉడిపి' గ్రామములో ౧౧౯౯-వ సంవత్సరమున పూర్ణప్రజ్ఞుఁడు, ఆనందతీర్థుఁడునను నామాంతరములు గల మధ్వాచార్యుఁ డుదయించెను.౧. చిన్ననాఁడే యాతఁడు శ్రుతిశాస్త్రములలో మహాపండితుఁడై యావెనుక సన్యసించెను. పెక్కేండ్లాతఁడు తపోధ్యానములతోడను విద్యావాదములతోడను గడపెను. శంకరశాఖీయుఁడు, అచ్యుతప్రేక్షనామధేయుఁడునైన యీతని గురువుతోడి చర్చల ఫలితముగా నీద్వైతవాదమును గల్పించెను. విష్ణువే పరమేశ్వరుఁడని ప్రకటించి, రామానుజుని వలెనే విష్ణుచక్రాంకితముల భుజములపై ధరించుట శ్రేయస్కరమని యీతఁ డంగీకరించినాఁడు. దేశములో నలుమూలల ననేకుల నీతఁడు తనమతములోఁ జేర్చి, ఉడిపిలో శ్రీకృష్ణాలయము నొకదానినినిర్మించి, తనయనుచరుల కందరకు దానిని ముఖ్యకేంద్రముగాఁ జేసెను. యజ్ఞములలోఁ బశువధవలని రక్తపాతము నాతఁడు నిషేధించి, కీర్తిగాంచి, డెబ్బదితొమ్మిదవ యేట దివంగతుఁడయ్యెను.

మధ్వరచనలే యీ శాఖకుఁ బ్రమాణగ్రంథములు. ఈతఁడు బ్రహ్మసూత్రముల కొక భాష్యమును వ్రాసి, తన వివరణయే సరియైనదని అనువ్యాఖ్యానమను నింకొక గ్రంథ

(౧) నారాయణాచార్య విరచితములగు మధ్వవిజయమును, మణిమంజరియు మధ్వజీవిత కార్యములనుగూర్చిన గ్రంథము. ఆయనభక్తులు కొందరు వ్రాసిన యాతని విచిత్రగాథలను మానవాతీతకార్యములను విడిచిపుచ్చినచో మిగిలినగ్రంథ మాతని జీవితసందేశములను చారిత్రాత్మకముగా వ్యక్తపరచును.

మును రచించి సమర్థించెను. ఆతని యుపనిషద్గీతాభాష్యములు, భారతతాత్పర్యనిర్ణయమను మహాభారతసారము, భాగవతటీకయు నాతని తత్త్వమును వ్యక్తపరచును. ఋగ్వేదములోని మొదటి నలుబదిమంత్రములకు నీతఁడు భాష్యముఁ వ్రాసి యతని ప్రకరణములలో ననేక తాత్త్వికవిషయములను జర్చించెను. ప్రస్థానత్రయముపైఁగాక, పురాణములపై నాతఁడెక్కుడాధారపడెనని యాతని రచనలన్నియుఁ జూపును; ప్రమాణ గ్రంథములనన్నిటి కాతఁడు ద్వైతపరముగా నర్థముచెప్పుట సులభమైన పనికాదు. మాధ్వసూత్రభాష్యమునకు వ్రాసిన జయతీర్థునివ్యాఖ్య, అను వ్యాఖ్యానమున కీతఁడే వ్రాసిన న్యాయసుధ యను వ్యాఖ్యయు మిక్కిలి ముఖ్యములైనవి. జయతీర్థ వ్యాఖ్యకు చంద్రిక యను టీకను వ్యాసరాయలు రచించెను. పూర్ణానందుని తత్త్వముక్తావళి,(౨) అద్వైతమును దీవ్రముగా నిరసించెను.

## ౮ – జ్ఞాన సిద్ధాంతము.

మధ్వుఁడు ప్రత్యక్షానుమాన శ్రుతిప్రమాణముల నంగీకరించెను; ఉపమనుమానరూపాంతరముగా గ్రహింపఁబడెను. ప్రత్యక్షానుమానములు స్వయముగా జగద్రహస్యమును దెలుపఁజాలవు. ప్రత్యక్షమింద్రియ గోచరములగు నంశములనే తెలుపును. అనుమానము మనకు నూతనాంశముల నీయఁజాలదుకాని, యితర సాధనములచే లభించిన వానినిఁ బరీ

(౧) చూః సూ।భా॥ వాల్యూము. ౧,౩,౧౪.

(౨) కవెల్. భాషాంతరీకరణము.

క్షించి క్రమములోఁ బెట్టుటకుపయోగించును. సత్యమును గూర్చిన యథార్థజ్ఞానమునకై మనము వేదములపైననే యాధారపడవలెను. వేదవాక్యములన్నియుఁ బ్రమాణములే యని మధ్వుఁడు నమ్మును. మంత్రిబ్రాహ్మణము లుపనిషత్తులతో సమానప్రమాణ ప్రయోజనములు గలవి. పౌరుషేయా పౌరుషేయ ప్రమాణములకు భేదమున్నదని యాతఁడు చెప్పెను. అపౌరుషేయప్రమాణమే పరిపూర్ణముగా నిర్దుష్టము. మాధ్వతత్త్వము వేదసారమును దెల్పుననియు వేదము లపౌరుషేయములనియుఁ జెప్పఁబడెను.

విషయగ్రహణ మేసాధనముచే లభించినను, గ్రహింపఁబడిన విషయముయొక్క ప్రత్యక్షసాక్ష్యముపై నాధారపడును. విషయగ్రహణములోఁ దత్సాధనోపకరణములుండవు. జ్ఞాతృజ్ఞేయ సంబంధము సద్యఃప్రత్యక్షము. ప్రత్యక్షానుమాన శ్రుతిప్రమాణములు జ్ఞానోత్పత్త్యుపకరణము లగుటచే నట్లు పిలువఁబడినవని జ్ఞానమును బాహ్యమునుండి పరిశీలించుటవలన దెలియును. ప్రత్యంశమును గూర్చిన జ్ఞానమును నిజమైనదేః ఆ యంశ మా క్షణకాలమునందే యుండిపోవచ్చును. అది నిజమైనది కాదని మనము నిరసించినచో, నింకొక విషయజ్ఞానము సప్రమాణమైనది మనకు లభించియుండవచ్చును. సూర్యోదయాస్తమయములు మనకు విషయములేకాని, సూర్యునకుదయాస్తమయములు లేవను జ్ఞానము కలుగువరకుమాత్రమే యుండును, జ్ఞానము సహజప్రమాణ యుక్తమైనదని, మధ్వాచార్యుఁడు విశ్వసించి, దానిని నిరసించు సిద్ధాంతము లన్నిటిని

ఖండించెను. మనజ్ఞానసత్యస్వరూపమును వ్యక్తపరచి, దాని యథార్థాస్తిత్వమును నిరూపింపకున్నచో, నసత్యవస్తువెన్నఁడును దృగ్గోచరము కాఁజాలదు. గాన నదియసత్యవిజ్ఞానవిషయమెన్న డును కాఁజాలదు; మఱియు నది కారణకార్యరూపజ్ఞానముతో సంబంధింపఁజాలదు. జ్ఞానమంతయు నసత్యమేయైనచో సత్యా సత్యభావభేదములే యదృశ్యములగును. ఒకమిథ్యాదృశ్యమును బరిశీలించిన నీవిషయము స్పష్టమగును. అందు మనదృష్టికొక వస్తువు చూపట్టును; మనయింద్రియముల లోపములవలనఁగాని, యితరజ్ఞానసాధనాదోషములవలనఁగాని, మనము దానిస్వభావ మునుగూర్చి పొరపడవచ్చును. మిథ్యాదృశ్యములోని విష యాంశములు మిథ్యకావు. అవి అనుభూతసత్యాంశములే. కొన్నిలోపములచే, మనము చూచువస్తువును సమగ్రముగాఁ జూడక, దానిలక్షణములు కొన్నిగల వేఱొకవస్తువు జ్ఞాపకము వచ్చి, అదేయిదని పొరపడుదుము. ప్రతిమిథ్యాదృశ్యము నందును రెండంశములుండును. ఒకటి యథార్థమైనది, రెండ వది భావింపఁబడినది. జగన్మిథ్యాభావమున కర్థమేమనఁగా నిజమైనదొకటియుండఁగా దానిస్థానమున నింకొకటిచూచు చుంటిమనియే కాని, నిజమైన దేదియులేదని యర్థముకాదు.

అనుభవము నాధారముగాఁదీసికొని, జ్ఞాతృజ్ఞేయములు రెండునులేని జ్ఞానములేదని మధ్వాచార్యుఁడు నిర్ణయించెను. గ్రహించు జ్ఞాతయు గ్రహింపఁబడు విషయములేకున్నచో జ్ఞానము వ్యర్థవచనమగును. జగత్తుమిథ్యకాదు. వస్తుభేదము నంగీకరింపకున్నచో భావభేదమునుండదు. భేదములున్నవని

మనజ్ఞానము చెప్పుచున్నది అవి కేవలము వాసనల వలనవచ్చిన వనుట యుక్తము కాదు; ఏలన వాసనలవలన భేదములుదయించవు.

దేశకాలములశక్తివలన భేదము లుదయించినవనియు, దేశకాలములు జ్ఞాతృబుద్ధిరూపమాత్రము లేయనియుం జెప్పంబడెను. దేశకాలములు జీవాత్మకొనొకమైనచో, నవి పరిమాతకో నేకముగు నెట్లో తెలియకున్నది. జ్ఞానరూపియగు నాత్మ సర్వవ్యాపియైనచో దేశకాలభేదముల కవకాశములేదు. దేశకాలము లవిద్యాసంభూతములన్నచో నాత్మకు, నవిద్యకుంగల సంబంధమును సంతృప్తికరముగాం జెప్పంజాలము. అవిద్యావివరణప్రయత్నమంతయు దేశకాలపరివృతమై యుండుటచే దేశకాలము లవిద్యాజాతములని చెప్పవీలుపడదు. దేశకాలములు సావయవములగు పూర్ణరూపములని యూహింపంబడెను. వానికి భాగములులేనిచో, నిచ్చట నచ్చట, యిప్పుడప్పుడను భేదభావముల కవకాశముండదు. మనకు దేశభాగములు మాత్రమేకన్పట్టును. మనముచూచువస్తువులు సర్వదేశము నాక్రమించుననుట పొరపాటు. మనము దేశకాలభాగములను మాత్రమే చూచుచుండుటచే నవియున్నవని భావింపవలెను; అవి సాక్ష్యాత్మకు దృగ్విషయము లేయని మధ్వాచార్య నిశ్చయము.

పదార్థము స్వతంత్రము, పరతంత్రమునని రెండువిధములని మధ్వాచార్యుఁడు చెప్పినాఁడు: పరమేశ్వరుఁడొక్కఁడే స్వతంత్రపదార్థము. పరతంత్రజీవులు, భావాభావభేదములను గలిగియున్నవి. భావజీవులు చేతనాచేతనభేదములచే రెండువిధములై యున్నవి. జడపదార్థము, కాలము నచేతనభావములు.

అచేతనజగత్తు వేదములవలె నిత్యమో; ప్రకృతి, దేశకాలముల వలె నిత్యానిత్యమో, ప్రకృతి జములవలె ననిత్యమోగావలెను.౧

౯—భగవంతుఁడు

మూలభేదములుగల్గి, నిత్యములైన మూడుపదార్థము లున్నవి. అవియే జీవేశ్వరజగత్తులు. మూడునుయథార్థములు, నిత్యములేయైనను జీవజగత్తులీశ్వరునిపై నాధారపడియుండును. స్వతంత్రపదార్థముబ్రహ్మమే, యేకైకసృష్టికర్త. వేదార్థజ్ఞానము వలన నీశ్వరస్వభావము నెఱుఁగవచ్చును;౨ అందుచే నీశ్వర స్వభావమవేద్యముకాదు. పరబ్రహ్మ మనిర్వాచ్యమనిచెప్పుట లోని యర్థమేమనఁగా నీశ్వరునిగూర్చిన సంపూర్ణజ్ఞానము కష్టతర మనియే. ౩ పరమేశ్వరుఁడు భావాతీతుఁడు.౧ ధ్యానావస్థలో మనమూహించిచూచురూపమాతనిది కాదు, శ్రుతియందలి భిన్న భాగములు పరమేశ్వరుని భిన్నత్వమునుజూపు నను వాదమును మధ్వాచార్యుఁడంగీకరింపఁడు. పరమేశ్వరుఁడు నాతనిలక్షణ ములు నభేదములైనను భిన్నవచనములలో వానిని మనము పేన వచ్చును.౨ 'ఏకమేవాద్వితీయమ్ బ్రహ్మ' యను మహావాక్య మునకర్థమేమనఁగా సర్వోత్తమగుణసంపదలో బ్రహ్మతుల్యమగు

(౧) మధ్వసిద్ధాంతసారమననుసరించి పదిపదార్థములున్నవి. ద్రవ్య గుణకర్మసామాన్యవిశేషవిశిష్టాంశిశక్తి సాదృశ్యాభావాదశపదార్థాః

(౨) మాధ్వభాష్యము. ౩, ౩, ౧,

(౩) ,, ,, ౧,౧, ౪

(౧) మధ్వభాష్యము. ౩,౨,౨౩.

(౨) చూ. న్యాయసుధ. ౧,౧,౨; ౧,౧,౬. పోల్చు మధ్వసిద్ధాంత సారము. భేదాఽభావేపి, భేదవ్యవహారనిర్వాహకా, అనంతాఏవవిశేషాః(౨౧)

నశించెననుకొనుట లేదనియు, బ్రహ్మసర్వవ్యాపియనియుఁ జెప్పవలెను. ఈశ్వరుని విశేషణములు పరిపూర్ణములగుటచే నాతని కెట్టి లోపమునుగలిగింపవు. బ్రహ్మ అనంతకల్యాణగుణపరిపూర్ణుఁడు. అతఁడే విష్ణువు. ఆతఁడు తనసంకల్పమాత్రముచే సర్వజగత్తును, జగములోని సమస్తమును నియమించును. పునఃపునః ఆతఁడు సృష్టిలయములుచేయుచుండును. ఆతనికి దివ్యదేహ మొకటి కలదు; ఆతఁడు సర్వాత్మ కుఁడు సర్వాంతర్యామియునై యున్నాఁడు; ఎలన సర్వజీవాత్మలకధిపతి.3 ఆతఁడు వ్యూహరూపములుగలిగి, యప్పుడప్పుడవతారములనుదాల్చి, పవిత్రములగు విగ్రహములలోరహస్యముగానుండును. ఆతఁడు సృష్టిస్థితిలయకారకుఁడై, జ్ఞానదాతయై, నానారూపధారియై, కొందరనుశిక్షించి, కొందరను రక్షించును. లక్ష్మి, నానారూపములు ధరించు శక్తిగలిగి, యాతనిప్రకృతినేయుండును. ఆమెకుభౌతిక దేహములేదు; ఆమె సర్వవ్యాప్తిగలిగి భర్తతోఁగలిసి శాశ్వతముగానుండును. అనాద్యనంతముగా నామె విష్ణుమహత్త్వసాక్షిరూపిణియై యుండును. పరమేశ్వరుని సృజనశక్తిరూపమే లక్ష్మీదేవి. ఆమె సచేతనప్రకృతి. ఈశ్వరునకామెకంటె నధిక చిచ్ఛక్తియు, వరిమగుణగణమును గలదు.౧. స్త్రీ పురుష దేవతలు కొన్నిజన్మములైన వెనుక ముక్తిపొందునట్లు గాక, లక్ష్మి నిత్యముక్తాత్మురాలు. జీవజడముల నీశ్వరుఁడు శూన్యమునుండి సృజించలేఁడు; శూన్యములో వానిని లీనముచేయఁడు;

(3) ౧,౨, ౧3.
(౧) ౪,౨,౯.

కాని యాతనికి వానిపై నాధిపత్యముగలదు ఆతఁడు జగత్తు నకు మూలకారణమే కాని, యుపాదానకారణము కాదు. పూర్ణ చైతన్యరూపియగు నాతఁడచేతన జగత్కర్త కాఁజాలఁడు. ఆతని పొరలిపారు నత్యతిశయమైన పరిపూర్ణతయొక్క ఫలితమే ప్రవృత్తి. జీవుల కర్మలననుసరించి ఫలితములిచ్చువాఁడే కాని, దానిచే నీశ్వరుఁడు కర్మపై నాధారపడువాఁడని తలఁపరాదు; ఏలన మధ్వాచార్యులు చెప్పినరీతిగా, "కర్మయొక్కయు సర్వ వస్తువులయొక్కయు నస్తిత్వ మీశ్వరాధీనమైయున్నది"౨

## ౧౦—జీవాత్మ

భూమిపైనున్న సర్వమును సచేతనమేయని మధ్వాచార్యునిభావము. జగమంతయుఁ జేతనప్రకృతి విస్తృతి; ప్రత్యల్పాణుదేశమును జీవమయమైయున్నది. అతని తత్త్వనిర్ణయములో నిట్లుచెప్పినాఁడు; "అణుమాత్ర దేశములో ననంత జీవ రాశి జీవించుచున్నది."౩. జీవబ్రహ్మభేదము నిజమని యాతఁడు చెప్పను.౪. సంసారమున జీవేశ్వరులు భిన్నమై, మోక్షమున నభిన్నము లనువాదము నాతఁడంగీకరింపఁడేలన, రెండుభిన్న వస్తువులెన్నఁడు భేదాభేదసంబంధమును గలిగి యుండజాలవు. పూర్తిగా నీశ్వరునిపై నాధారపడినను, జీవులకుఁ గర్తృత్వము, బాధ్యతయుఁ గలవు. ౧. జీవాత్మకు సంపూర్ణకర్తృత్వము లేదు;

(౨) ౨, ౧, ౩౭.

(౩) పరమాణు ప్రదేశేష్వనంతాః ప్రాణిరాశయః

(౪) ౧, ౨, ౧౨.

(౧) ౨, ౩, ౩౩-౪౨

దాని కర్తృత్వ మీశ్వరాధీనమగుటచే దానిశక్తి పరిమితమైనది. ౨. ఈశ్వరుఁడు సర్వవ్యాపియు, జీవుఁడణుపరిమాణమాత్రుఁడు. ౩. పరిమితపరిమాణముగలిగియున్నను జీవి, తనకుఁగల చిచ్ఛక్తిచే దేహమంతయు వ్యాపించియుండఁగలదు. జ్ఞానేంద్రియము నను సాక్షియందును; భౌతికమగు మనస్సు తన యనుభవములను సాక్షి యెదుటఁ బెట్టును. జ్ఞాతృరూపమగు సాక్షికే 'నేను'ను భావము చెందును. ఇదియే వ్యక్తిత్వమూలము. జీవాత్మ సహజముగా సుఖస్వభావముగలదియే కాని, పూర్వకర్మరూపములగు జడశరీరసంబంధముచే దుఃఖము ననుభవించును. పాపవిముక్తి కానంతవరకు జన్మాంతరప్రాప్తి కలుగుచుండును. ఆనందాది గుణములు మోక్షకాలమునఁ బ్రకాశించును.౪. జీవులు నిత్యములయ్యు, దేహసంబంధములచే జన్మోపేతములగుచున్నవి ౫. ఏ. రెండుజీవులొకే లక్షణమును గలిగియుండవు. జీవప్రపంచ సోపానములోఁ బ్రతిజీవికిఁ దత్తదుచితమగు స్థానప్రయోజనములున్నవి. జీవు లీశ్వరాధీనములైయున్నవి. వాని పూర్వకర్మానుగుణముగ కర్మచేయుట కీశ్వరుఁడు వానిఁ బ్రేరేపించును.౬.

(౨) ౨, ౩, ౩౪; ౨, ౩, ౨౮.
(౩) ౨,౩, ౨౩
(౪) ౨, ౩, ౩౧
(౫) మాధ్వ బ్ర, సూ, భా (౨, ౩, ౧౯)
(౬) ౨, ౩, ౪౧-౪౨ స్వప్నములుకూడ నీశ్వరసంకల్పజములే యని చెప్పఁబడెను (౩-౨, ౩, ౫)

జ్ఞానజీవులు మువ్విధములు:- (౧) నిత్యముక్తులు-లక్ష్మి మున్నగువారు; (౨) సంసారవిముక్తులైన ఋషి-పితృ దేవమనుష్యాదులు; (3) బద్ధజీవులు. మూఁడవవర్గములో ముక్తియోగ్యులు నయోగ్యులు గలరు. అయోగ్యులగువారిలోఁగొందరు తమోలోకములగు నరకములకుఁ బోవుదురు; కొందరు నిత్యసంసారగతులు. సహజగుణసంపదచేఁ గొందరు ముక్తి కర్హత గలిగి, కొందరు నరకయోగ్యులై, కొందరు శాశ్వతసంసారచక్ర పరిభ్రమణమందుచు, సుఖదుఃఖాదు లనుభవించుచుందురు. ఈ వర్గత్రియవిభాగము గుణత్రియముపై నాధారపడియున్నది. సాత్త్వికజీవి స్వర్గమునకు, రాజసజీవి సంసారమునకు, తామసజీవి నరకమునకుఁబోవును. చేతనములన్నియు దేవ మనుష్య పశు పక్షి వృక్షాదికవర్గములుగా విభాగింపఁబడెను. జీవతారతమ్యములను బట్టి నిశ్చితసోపానక్రిమ మేర్పాటుచేయఁబడినది. మోక్షార్హులగు జీవులలోనైతము రెండుజీవులకు సర్వసమానార్హత యుండదు. దేవమార్గములో బ్రిహ్మయు, వాయువును ప్రిముఖస్థానము లాక్రిమింతురు. విష్ణుమూర్తియాజ్ఞచే బ్రిహ్మ సృజించును. బ్రిహ్మ దేశికాగ్రిగణ్యుఁడును. మాధ్వతత్త్వ ప్రిథమప్రితిపాదకుఁడునని చెప్పఁబడెను; అందుచేతనే మాధ్వతత్త్వమును బ్రిహ్మ సంప్రిదాయ మందురు. జీవేశ్వరులకు మధ్యవర్తి వాయువు. బ్రిహ్మజ్ఞానముఁనొంది మోక్షముపొందుటకు వాయువు జీవులకు సాయపడును. వాయువే ప్రియతమమైన

విగ్రహము; హరిసుతుఁడునని వచింతురు. ౧. సిద్ధజీవులు బద్ధ జీవులు కలియుఁజాలరు.

## ౧౧—ప్రకృతి జగత్తు

భౌతికవస్తువులు జడజగత్సంభూతములు ; ఇవిసర్వజీవ రాశి దేహావయవములనుగూర్చును. ఇవన్నియు మూలప్రకృతి నుండి జనించి కొంతకాలమున కందేచేరును. ప్రకృతియేకరూప ముగాఁగన్పట్టుచున్నను, సూక్ష్మావస్థలో భిన్నసూత్రములం దిమిడియున్నది. జీవేశ్వరప్రవృత్తివలన నీ సూక్ష్మప్రకృతియే బాహ్యదృశ్యజగత్తుగాఁబరిణామమందును. ఈశ్వరుఁడు ప్రకృతి నుండియే రూపకల్పన మొనర్చును. ప్రకృతియే రూపముల కుపాదానకారణము. ఈశ్వరుఁడేరూపములలోఁ బ్రవేశించి,యంత ర్భూతుఁడైయుండును,౧. అవ్యక్తమూల ప్రకృతిబాహ్యప్రకృతి గాఁ బరిణతినందులోపున నిరువదినాలుగు ప్రకృతి జన్యపదార్థ భేదములున్నవి; మహత్తు, అహంకారములు, బుద్ధి, మనస్సు, పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు,పంచేంద్రియ విషయములు, పంచభూతములు, మూలప్రకృతిలోనివిసూక్ష్మ రూపములలోనుండును.

## ౧౨— [illegible]రుఁడు—జగత్తు,

జీవజడజగత్తు " మిథ్యారూపమనికాని, యీశ్వర పర రూపమనికాని చెప్పుపద్ధతులను విసర్జించి, శుద్ధద్వైతవాదమును

(౧) పూర్వము భీముఁడు, హనుమంతుఁడుగా నవతరించిన వాయువే మధ్వుఁడై యవతరించెనని యాతని యనుచరులు భావించిరి:

(౧) ౧, ౪, ౨౯

మధ్వాచార్యులు ప్రతిపాదించెను. జీవాత్మపరతంత్రమైయీశ్వరునిపై నాధారపడియున్నది; సృష్టిజీవితమున కాధారమందుఁ బ్రసరించు ప్రాణసారమైనట్లే, పరమాత్మయొక్క-ప్రాణాధారమైన శక్తిసాహాయ్యములు లేనిదే జీవాత్మనిలువలేదు. నిత్యపరస్వరూపిణియైనను లక్ష్మికూడ నాతనిపైనాధారపడియున్నది జగమున కుపాదానకారణమగు ప్రకృతికధిదైవమే లక్ష్మీదేవి. తనకు సంబంధములేని ప్రకృతినెట్లో యీశ్వరుఁడు చైతన్యవంతమైనదానిని ప్రకృతియునెట్లో యీశ్వరాధీనతకంగీకరించును.

ద్వైతార్థమును గల్పించి సమర్థించుటకు మధ్వాచార్యులనేక శ్రుతివాక్యములకు శ్రమతోఁ బ్రయత్నించి తనకనుగుణమొనర్పవలసివచ్చినది. 'తత్త్వమసి' మహావాక్యమున కర్థము చెప్పుచు నది జీవేశ్వరైకత్వమును జెప్పదనెను. ఆత్మకుఁగల లక్షణములు మూలములో నీశ్వరలక్షణతుల్యములేయని దాని యర్థము.౧. ఈశ్వరాంశమే జీవాత్మయని ప్రకటించు వాక్యములకు నిదేయర్థము. శ్రుతివాక్యముల నాతఁడింకొకక్రమములోఁ జదువును. సఆత్మాతత్త్వమసి యనుదానిని సఆత్మాఅతత్త్వమసియని చదివి 'ఆత్మవునీవుకావ'ని చెప్పుచు 3. 'అయమాత్మాబ్రహ్మ' యనునది కేవల జీవాత్మస్తుతి వాక్యమగును

---

(౧) ౨,3,౨౯.

(౨) భగవద్గీత ౧౫,౭.

(3) మాధ్వభాష్యము. బృ.ఆ.ఉ. పు ౧౧౪; చూ॥ ఛా॥ఉ.౬,౮,౭. ఈవాక్యము 'త్వమ్తదీయోఽసి'లేక త్వమ్తస్యాసి యనువాక్యములకు సరిపోవునని చెప్పఁబడెను.

లేదా, ధ్యానోపయోగార్థమంత్రిమని యామునుడు చెప్పెను. మఱియు నది ఖండింపఁదగిన పూర్వపక్షము జెప్పినదెను. జీవబ్రహ్మైకత్వమును జెప్పువాక్యములలోనున్న జీవబ్రహ్మశబ్దముల కర్థాంతరములు ప్రకటించి మాధ్వుఁడు వాదించుచు. ఆత్మబ్రహ్మమెట్లన, ఆత్మకు వర్ధనశీలమును అటనశీలమును గల దని యాతఁడు వాదించెను.

మూలభేదము లెన్నియున్నను, నిర్వాసన మోక్షాధిపత్యము వలనఁ బ్రపంచములో నేకత్వ క్రియములు నిరాటంకముగా నున్నవి. ద్రవ్యమును గుణమును, సంశమును పూర్ణవస్తువును, వేరుపరచు విశేషలక్షణమును దీసికొని యేకత్వానేకత్వముల ననుసంధించును.౮ విశేషము సంఖ్యచే ననంతము. ఏలన నది నిత్యానిత్యవస్తువులలో నివసించి, భావాభావరూపములనొందెడు నది. ఒకయభావరూపమునుండి విశేషమింకొక యభావరూపమును వేరుచేయును. కాని యొకవిశేషమునకు వేరొక విశేషమెట్లు భేదించును. ఇంకొకవిశేషముచే ననుటవలన నభావస్థితి యేర్పడును. అందుచే విశేషము స్వయంనిర్ణయ శక్తిగలదని చెప్పఁబడెను. విశేషన్యాయముచే భేదములు పారమార్థికముగా సత్యములుగావని నమ్మినచో భేదములతోఁగూడిన ప్రపంచమున కర్థము చెప్పవచ్చును. విశేషవ్యాపారముచేతనే జగత్తులో భేదమున్నది విశేషము పరమాత్మకు భిన్నమైనదైనచోఁ బరమాత్మైకత్వమే నశించును; అట్లుగాక, విశేష మభిన్నమైనచో నది విశేషమే కాఁజాలదు.

(౮) న్యాయామృతము, వాల్యుము, 3, పు. ౧౩౭.

౧౩—ధర్మము-మతము

జ్ఞానమే మనమీశ్వరుని పై బూర్తిగా నాధారపడి ప్రేమించ వలయునని మనకుఁ దెలియఁ జేయునది.౧. ఆత్మానాత్మసంబంధ మైన సర్వవిషయములనుగూర్చిన సమ్యక్ జ్ఞాన మీశ్వరజ్ఞానము నిచ్చును; ఈశ్వరజ్ఞాన మీశ్వరభక్తి నుద్భవింపఁ జేయును. తత్త్వ వివేకచరమాధ్యాయమున మధ్వాచార్యుఁ డిట్లు చెప్పినాఁడు." ఈపరిచ్ఛిన్న జగత్తంతయు నిత్యము హరికధీనమైయున్నదని యెఱిగిన వానికిఁ దప్పక ముక్తి లభించును."

నిష్కలుషధర్మానుష్ఠానము మోక్షమునకుఁ బునాది. ధర్మ నియమముల నంగీకరించి, నిష్కామముగా విధులను నెరవేర్ప వలెను. ధర్మప్రవృత్తివలన సత్యదృష్టి కలుగును. సమర్థుఁడైన గురు ముఖమున వేదాభ్యాసముచే సమ్యక్ జ్ఞానము లభించును. ప్రతి వ్యక్తియందుఁ బరమేశ్వరు నొకయంశమెఱిఁగెడి శక్తియున్నది. సమర్థుఁడగు గురు విభిన్నప్రకృతుల నెఱిగి బోధింపవలెను; "ఏలక్ష ణమును దర్శించుట కెవనికర్హతయున్నదో దాని నెఱుఁగుటవలన నే మోక్షసిద్ధియగును గాని మార్గాంతరము లేదు."౧. దేవద్విజులకే వేదాధికారమున్నది; స్త్రీ శూద్రులు స్మృతిపురాణపఠనముల వలన తరణోపాయము నొందఁగలరు. గ్రహించుశక్తి గలవార లందరకు వేదాంతము నభ్యసించుట కర్హతను మధ్వాచార్యుఁ డంగీకరించెను.౨. వీరైనన్ని పర్యాయము లీశ్వరునియందుఁ జిత్త

(౧) ౩, ౩, ౪౯.

(౧) మాధ్వభాష్యము. ౩, ౩, ౫౩

(౨) ౧, ౧, ౧.

మును లయింపఁజేయు ధ్యానమవసరమని చెప్పఁబడెను. ధ్యాన యోగములో దైవకృపచే నపరోక్షానుభూతి లభింపఁగలదు మెఱుపువలెఁ జలింపక, సూర్యునివలె నిశ్చలమగు నీశ్వరధ్యానము కలిగినంతనే బంధములు విచ్ఛిన్నములై ముక్తి లభించును.

ఈశ్వరసాన్నిధ్యము సూటిగా లభింపదు. వాయువుమధ్యవర్తి. మధ్వాచార్యుఁడు సమర్థించిన దైవకృపైకవాదము మనకాగస్టైన్ వాదమును స్మృతికిఁదెచ్చును. మానవుఁడెన్నఁడును మోక్షార్హత నార్జింపఁజాలఁడు. దైవకృపవలననే రక్షితుఁడు కాఁగలఁడు. సచ్ఛీలమీశ్వరకటాక్ష హేతువుకాఁజాలదు. నిర్హేతుకముగా నాతఁడు కొందరకు మోక్షార్హతను గొందరకు దుర్గతిపాత్రతనుగల్గించును. ఈశ్వరసంకల్పైకమాత్రముననే కొందరు ముక్తులు కొందరు బద్ధులునగుదురు. ఈశ్వరనిర్ణయము నిష్కారణము, నియమ రహితము, నను మధ్వాచార్యునివాదమును హిందూసంప్రదాయమంగీకరించదు. ఆత్మభిన్నదశలకు బ్రహ్మసంకల్పమేగ కారణమైనను, మనభక్తిప్రాబల్యమున కనుగుణముగా నీశ్వరకటాక్షము చేకూరుననియు సూచింపఁబడెను. మనశీలసంపదవలనమాత్రమే మోక్షమురాదు; దైవసాహాయ్యము కూడ నవసరము. మనప్రయత్నములవ్యక్తమగు పరబ్రహ్మమును వ్యక్తమొనర్పఁజాలవు. మనభక్తి కాతని మనస్సుకరగినపుడాతఁడు పొడచూపును.౩. భక్తునిభక్తి కీశ్వరుఁడు బదులు

(౧) ౩, ౨, ౦,
(౨) ౩, ౨, ౨౦, ౨౧,
(౩) ౩, ౨, ౨౩, ౨౪,

చెప్పెను. మధ్వానుచరులలో భిన్నవర్గములవారు, దైవేచ్ఛయే సర్వకారణమనియు, మానవునికిఁ గర్తృత్వస్వాతంత్ర్యము గలదనియు; గొన్ని భేదములతో నంగీకరింతురు. జ్ఞానము, భక్తి విధ్యుక్తకర్మనిర్వహణము ముఖ్యములైనవి. దేహమును విష్ణుచిహ్నాంకిత మొనర్చుకొనుట, బిడ్డలను విష్ణువివిధనామములతోఁ బిలుచుట, దానధర్మదయావిశ్వాసములాచరించుటయు నీశ్వరసేవలోని యంగములు, దైవకృపాప్రాప్తికి దైవారాధన మవిలంఘ్యమగు పరిథమనూత్రము. జ్ఞానసహితకర్మచే నాత్మాభ్యుదయముకల్గును. కర్మకలాపములు, యజ్ఞములు; యాత్రలు మంచివే. పశువధతోఁ గూడిన యాగములు నిషేధింపఁబడెను; యజ్ఞములలో జీవపశువునకుబదులు పిష్టపశువునుపయోగించుట కాదేశింపఁబడెను.

ప్రారబ్ధకర్మాంతమువరకు దేహసంబంధమాత్మకుఁదప్పదు, కాని, దేహపాతముతోఁ బూర్ణమోక్షసిద్ధియగును. జీవన్ముక్తికవకాశమున్నది. సత్యము నెఱిఁగియు మోక్షహేతువైన దైవకృపలేకున్నచో నెవఁడును దేహబంధవిముక్తుఁడు కాఁజాలడు. ఇదియే జీవన్ముక్తి. శుద్ధమోక్షమీశ్వరానుగ్రహమువలననే కలుగును.

భాగవతము ననుసరించి మోక్షమనగా నన్యరూపములను విడిచి, స్వస్వరూపవ్యవస్థితిని బొందుటే.౧. ఆది జీవేశ్వ

(౮) ౧, ౧, ౧౭ మధ్వాచార్యుననుసరించి ముక్తియనగా, స్వస్వయోగ్య స్వస్వరూపానందాభివ్యక్తి.

(౧) మాధ్వభాష్యము, బృ, ౪, ౪, ౧౧౮.

రైకత్వముగాదు; జీవేశ్వర సాహచర్యము. సుషుప్తిలోనవలెనో లేక, ప్రళయకాలమందు వలెనో జీవేశ్వరభేదము గానరానిచో నది మోక్షముగాదు.౨. సృష్టి లయకాలములందైనను ముక్త జీవులు తమ వ్యక్తిత్వజ్ఞానమును గలిగి యుందురు. మోక్షావస్థలో దుఃఖనివృత్తి, సుఖానుభూతియుఁ గల్గును. కాని జీవాత్మ యీశ్వరతుల్యపదవి నొందఁజాలదు. ఈశ్వరసేవయే జీవకర్తవ్యము. బ్రహ్మైకత్వమే మోక్షమను దాని కర్థమేమనఁగా బ్రహ్మ సాక్షాత్కారసిద్ధి కలిగిన దనియే. "పరబ్రహ్మమును జూచువాఁడు పరబ్రహ్మమే యగును"౩. మున్నగు వాక్యములకు జీవబ్రహ్మైకత్వ మర్థముకాదు. ముక్తపురుషుల కందరకు సమాన సంకల్పలక్ష్యములే యుండును.౪. వారికి నిజముగాఁ గోరికలుండును గాని వారికోరిక లీశ్వరుని కోరికలే. వారీశ్వర ధ్యానమును విలాసము కొఱకుఁ జేయుదురు.౫. వారికోర్కెలే ప్రయత్నమును లేకుండ సిద్ధించును.౬. వారు స్వచ్ఛందసంకల్పులై, శుద్ధసత్త్వమయ దేహముల ధరింతురు; ఈ దేహములు కర్మజములు కావు. వారికట్టి దేహములపై నభిమానముండదు. వారు దేహధారణము చేయకున్నను, మనకు స్వప్నసుఖమువలె

(౨) తత్త్వముక్తావళి, పు. ౫౫-౫౬.
(౩) ౪, ౨, ౧౬.
(౪) ౩, ౩, ౨౭.
(౫) ౪, ౪, ౮
(౬) ౪, ౪, ౧౦-౧౬
(౭) ౩, ౧, ౨౯.

వారి కానందమెప్పుడును లభించును. మోక్షము పొందిన వారు సంసార విముక్తులగుదురు; అన్యులు తమ కర్మ ననుసరించి, జన్మాంతరములఁ బొందుదురు మరణించిన వెనుక, స్థూల దేహము దాని కారణాంశ రూపములోనికి శిథిలత గాంచి, జీవాత్మ, దృగ్గోచరము కాని సూక్ష్మదేహమును ధరించి, యింద్రియములను దోడ్కొని, నరకలోకముల లోనికిఁగాని, తేజోమయములైన చంద్రలోకముల లోనికిఁగాని పోయి కర్మలనుభవించును. తరువాత మరల మాతృగర్భమునఁ బ్రవేశించి, యిలోకోచిత శరీరమును గాంచును.౧. జన్మాంతర పరంపర యీవిధముగా సాగుచు, నీశ్వరభక్తి వలనఁ గొందరు సిద్ధి బొందుటయు, దైవద్వేషము వలనఁ గొందరు నరకప్రాప్తి నొందుటయుఁ దటస్థించును.

## ౧౪ — వి మ ర్శ

ప్రపంచ మేకసూత్రబద్ధమని జ్ఞానము చూపునే గాని, బాహ్యసంబంధమునుమాత్రమే గలిగియున్న జీవేశ్వరజడపదార్థ విభాగమునుజూపదు. జీవాత్మకును, జీవాత్మలో నంతర్వర్తియై పనిచేయు జగదేకత్వసూత్రములకుఁ జెప్పఁబడిన సంబంధమును సంతృప్తికరముగా లేదు. ఈశ్వరుఁడే సృష్టికర్తయైనచో, జగదారంభపరిణామ మీశ్వర సంకల్పముచేనైనచో మనము సృష్టికర్థము చెప్పవచ్చును. కాని కోరికగల దేదియైనను పరిచ్ఛిన్నత గలదను విషయము దీని కడ్డువచ్చును. ఈభావము ననుసరించి యీశ్వరుఁడు పరిపూర్ణుఁడుగాఁడనవలసివచ్చును. జగ మీశ్వరునిపై నెట్లాధారపడినదో విస్పష్టముగాఁ జెప్పఁబడలేదు. ఈశ్వ

యుఁడు నిజముగా స్వతంత్రుఁడైనచో నప్పుడు బాహ్యమైన దేదియు నాతనిఁ బరిచ్ఛిన్ను నొనర్పజాలదు. ద్వైత మీశ్వర పరిపూర్ణతకు లోపము ఘటించును. మధ్వాచార్యుఁ డపరిచ్ఛిన్నతను భావమాత్రముగా దీసికొన్న కారణముచే దానికిఁ బరిచ్ఛిన్నజగత్సంబంధమును సరిగాఁ జెప్పలేకపోయెను; బ్రహ్మయు జగత్తును సమానముగా నిత్యములైనచో వానిసంబంధ మెట్టిది ? ఈసంబంధమును నిత్యమైనదన్నచో బ్రహ్మమున కితర విషయములు బంధములగునా ? జీవులలో బ్రహ్మసంబంధము సహజమైనదన్నచో నదియుఁ బొసఁగదు; ఏలన జీవసంబంధ హేతువు బ్రహ్మమందు లేదు. బ్రహ్మమునకు జీవనిమిత్తమే లేనప్పుడు జీవసంబంధావసర మసలే లేదు, జీవేశ్వరసంబంధము నిర్హేతుక తాటస్థ్యమనుటకును వీలులేదు; ఏలన జన్మరహితములైన జీవులను, పరమేశ్వరుని శాశ్వతత్వమునకు బంధించుకొనఁగల్గు సంబంధ మొకటున్నచో నది కేవల తాటస్థ్యము కాఁజాలదు. జీవ జడ పదార్థములు పరబ్రహ్మముపై నాధారపడునవైనచో నవి ద్రవ్యము లనఁబడవు. ఏది స్వయంసంపూర్ణమో, స్వయం నిర్ణయశక్తిగలదో; ఏది పూర్ణస్వతంత్రోద్యుక్తమో దానికే "ద్రవ్య"మను నుత్తమార్థముగలదు. పరబ్రహ్మమునకే యట్టి లక్షణములున్నవని మధ్వాచార్యు లంగీకరించును. ప్రత్యక్షముగనో పరోక్షముగనో సర్వము విష్ణువునుండి జనించెను. ఆతని కుమారుఁడగు వాయువు, భార్యయగు శ్రీదేవియుఁ గూడఁ బూర్తిగా నాతనిపై నాధారపడుదురు. విష్ణువు జగత్పర

మార్గస్వరూపమనుటచే నితరవిషయములకు పరతంత్రి, జన్య వ్యక్తిత్వము లేదనుకొన నవసరము లేదు.

మఱియుఁ గొందర నేర్చి రక్షించు సిద్ధాంతము నైతిక జీవితమునకుఁ బ్రమాదకరమైనది. జీవులకు సర్వమిదివరకే దైవముచే నిర్ణయింపఁబడినదను భావపద్ధతి మధ్వాచార్యుల యితర భావములకు వ్యతిరేకమైనది. ఈశ్వరుని ధార్మికప్రవృత్తికి లోపము నాతని నిష్పక్షపాత దయాదృష్టి కపార్థమును ఘటించును. పురుషప్రయత్నము నిరర్థకమగును; ఏలన మానవుఁడు జ్ఞానీశ్వరకృపకుఁ బాత్రుఁడసని కాని, కాదని కాని యెట్లు తలఁచినను, మాంద్యము, నైరాస్యము నాతని నావరించును. మనకు భావిగతి తెలియనిదైనచో, పరిశుద్ధులమగుటకు మనము యత్నింపవచ్చును. జ్ఞానము లేకున్నను మనమాశతో నుండవచ్చును. కాని యీసిద్ధాంతము మనల నుదాసీనతా పంకమగ్నుల నొనర్చును. దీనినుండి బయల్వెడలు ప్రశ్న మేమనఁగా, మనలో స్వర్గసంపాదనముకై గోర్కెఁగలుగఁ జేసి, దానికి మీరనర్హులని శాసించుటవలన నీశ్వరుఁడు మనల నవమానపూర్వక హేళనకు గురిచేయుటలేదా? మానవజన్మమెత్తిన ప్రతివ్యక్తి యందంతర్నిహితమైన దైవత్వమును వికసింపఁజేసికొనుట కవకాశములున్నవని నిశ్చయమైనఁగాని సార్థకమగు నైతికప్రవృత్తి కవకాశము లేదు. జీవాత్మ చిదానందరూపమనియుఁ దానట్టిదని యెఱుఁగదనియు, నీశ్వరుఁడును చిదానందుఁడేయనియు నీసంగతి నాతఁడవిచ్ఛిన్నముగా నెఱుఁగుననియుఁ గొన్ని వాక్యములలో మధ్వాచార్యుఁడు చెప్పినాఁడు.

అందు జీవేశ్వరుల కెంతభేదమున్నను నదిమూల భేదముకాదని తెలియుచున్నది. జీవాత్మస్థితి, యజ్ఞానావరణ పరిమాణమును దెలుపునదియు, ముక్తజీవుల కీశ్వరునితో భేదముండనవకాశము లేదనియుఁ దెలియఁగలదు. వ్యవహార ప్రపంచ భేదములను మనము పరమార్థప్రపంచమునకుఁగూడ ననుసంధించుటవలన నిట్టిసిద్ధాంతము లుదయించును.

## ౧౫—నింబార్కుఁడు.

రామానుజునినంతరము, మధ్వాచార్యునకుఁబూర్వము నించుమించుగా ౧౧-వ శతాబ్దమునజీవించిన తెలుఁగు వైష్ణవ బ్రాహ్మణుఁడు నింబార్కుఁడు. వేదాంతపారిజాత సౌరభమను బ్రహ్మసూత్రభాష్యమును, జీవేశ్వరజగద్భేదములను వివరించు దశశ్లోకియనుదాని నాతఁడురచించెను. ఇతనివాదము ద్వైతాద్వైతము. నింబార్కునివాదమునుసమర్థించుచు, తత్త్వప్రకాశిక యను భగవద్గీతాభాష్యమును కేశవకాశ్మీరుఁడు రచించెను. నింబార్కుని బ్రహ్మసూత్రభాష్యము బ్రహ్మపరిణామ వాదమును వివరించును. పురుషోత్తమునిస్వతంత్రస్థితికిని జీవప్రకృతుల పరతంత్రస్థితికిని భేదము చెప్పఁబడెను. జీవేశ్వరు లిరువురునాత్మ జ్ఞానముకలవారయ్యు, జీవునిజ్ఞానముపరిచ్ఛిన్నము; ఈశ్వరుని దట్టిదికాదు. జగత్తుభోగ్యము, జీవుఁడుభోక్తయు, నీశ్వరుఁడు నియంతయు నైయున్నారు.

నింబార్కునివాదము ననుసరించి, శంకరునర్థములోఁ గాకున్నను జీవాత్మజ్ఞానస్వరూపి, సూర్యుఁడుకాంతియుఁ గాంతి కారణము నైనట్లు, జీవాత్మ జ్ఞానము, జ్ఞాతయుఁగూడనై యున్నది.

ఆత్మకుగుణసంబంధము ధర్మికి ధర్మసంబంధము; ఇది భేదాభేద సంబంధము. ధర్మిధర్మములకు భేదము చూపట్టదు కాని పూర్ణసమత్వము లేదు జీవ మణుపరిమాణముగలదైనను; వ్యాపకశక్తిగల జ్ఞానమువలన దేహములో నన్ని భాగములలోని బాధలనుగ్రహించును.౧. జీవికి కర్తృత్వముగలదు. జీవికిఁ గర్తృత్వము లేదని చెప్పు శ్రుతివాక్యములకర్థము జీవకర్తృత్వము పరతంత్రమనిమాత్రమే. సర్వావస్థలలో నానందమే జీవునిలక్షణము. జీవికి స్వతంత్ర జ్ఞానప్రవృత్తులు లేవు. సుషుప్తి మోక్షావస్థలలో జీవి యుండును. ఈశ్వరుఁడెప్పుడును నియంతయైనట్లే, జీవుఁడన్నియవస్థలలో నీశ్వరాధీనుఁడు. జీవసంఖ్య అనంతము; వానికీశ్వరుఁడే పోషకుఁడు.

జడజగత్తునకు మూడుతత్త్వములున్నవి. (౧) మూలప్రకృతినుండి రానిదగు అప్రాకృతము; అనగా రామానుజుఁడు చెప్పిన శుద్ధసత్త్వమువంటిది; ఇది యీశ్వరుని నిత్యవిభూతియై యీశ్వర దేహమును నిర్మించును. (౨) త్రిగుణాత్మకప్రకృతి, దానినుండి జనించినవి. (౩) కాలము, ప్రకృతి కాలములు జగత్ స్థితికి ముఖ్యహేతువులు. జీవాత్మలవలెనే యీమూడుతత్త్వములు నిత్యములైనవి.

ఈశ్వరుని నిత్యస్వభావము నియంతృత్వము. నింబార్కుఁడును, కేశవుఁడు బ్రహ్మనిర్గుణత్వ లక్షణమును నిరసించి, యీశ్వ

(౧) కేశవుఁడు చెప్పినాఁడు: "నాఽపినిరర్థకమ్ బ్రహ్మ తస్యజ్ఞాన క్రియాదీనామ్ స్వాభావికశక్తీనామ్", (౧,౧,౪.) మరియు, "ఆనందమయ శబ్దవిశిష్ట ఆత్మా బ్రహ్మైవ." (౧,౧,౧౩.)

మున కనేకకల్యాణ గుణములను జెప్పినాఁడు. కృష్ణుఁడే పరమేశ్వరుఁడని నింబార్కుఁడు చెప్పి, యాతనికి సమస్త కల్యాణ గుణములున్నవనియు, గామాహంకారాజ్ఞాన సంగత్వాదోషములు లేవనియు వర్ణించినాఁడు. ఆతఁడు నాలుగు వ్యూహములుగలిగి, యవతారములను ధరించును. జగమున కాతఁడే ముఖ్యోపాదానకారణము. ఆతనిసూక్ష్మములగు చిదచిద్రూప శక్తుల యావిష్కరణమువలననే విశ్వమేర్పడినదగుటచే నుపాదాన కారణమయ్యెను. జీవులకుఁ గర్మఫలసంబంధమును, వాని ననుభవించు సాధనసామగ్రిని కల్పించుటచే నాతఁడు ముఖ్య కారణమునయ్యెను. ప్రపంచము మిథ్యయని కొట్టివేయుటకు వీలులేదు. ఏలన, నది యీశ్వరునిలో సూక్ష్మరూపమునుండి పరిణతినందినదే. నింబార్కుఁడు వివర్తవాదమును నిరసించి, జగత్తు నిజముగా మిథ్యయైనచో నది యింకొకదాని నాచ్ఛాదింపఁజాలదనెను.

జగజ్జీవేశ్వర సంబంధము పూర్ణాభేదము గాదు; ఏలన, భిన్నత్వమును ప్రతిపాదించు ననేకములగు నుపనిషద్వాక్యముల కిది విరుద్ధమగుటయే కాక, వివిధ తత్త్వములకుఁ గల స్వాభావ స్వరూపముల కనన్వయ దోషము నాపాదించును. లేక యీ మూఁడు తత్త్వములును భిన్నములనియుఁ జెప్ప వీలులేదు; ఏలన నట్లు చెప్పుటేకైకతత్త్వము నగ్గడించు నుపనిషత్తులను ద్రోసిపుచ్చుట యగును. జీవాత్మకును జగత్తునకును బరమేశ్వరుఁడు పూర్తిగా భిన్నుఁడైనచో నాతని సర్వవ్యాపిత్వమునకు

లోపము సంభవించును. జీవాత్మవలెను, లేక జగము వలెను బరమాత్మయుఁ బరిచ్ఛిన్నత గలిగి నదయ్యె, వానినిఁ బరిపాలింప లేని దగును. అభేదమే సత్యము, భిన్నత్వ ముపాధివశమున వచ్చినదనియుఁ జెప్పవీలులేదేలన, బ్రహ్మ కుపాధిసంబంధ మున్నదనవలసి వచ్చును. అప్పుడు బ్రహ్మమునకుఁ బరిశుద్ధత పోయి, దోషములు, సుఖదుఃఖాదికములు సంభవించును. ఇది బ్రహ్మస్వభావమునకు విరుద్ధమగును. అందుచే భేదాభేదములు రెండును నిజమని నింబార్కుఁడు నిర్ణయించెను. జీవ జగత్తులు, భిన్నస్వరూపగుణములుకలవగుటచే బ్రహ్మాభిన్నములు. కాని యవి భిన్నములుకావు; ఏలన బ్రహ్మాధారము లేనిదే వాని కస్తిత్వమే లేదు. భిన్నత్వము పరతంత్ర సత్తాభావమును, అభేదము స్వతంత్రసత్తాऽభావమును విశదీకరించును. ఈభేదాభేదవాదము ననుసరించి, 'తత్త్వమసి' యను మహావాక్యమునకు, 'తత్' అనఁగా నిత్యము సర్వవ్యాప్తమునగు బ్రహ్మమనియు, 'త్వమ్' అనఁగా బ్రహ్మముపై నాధారపడు జీవాత్మ యనియు, 'అసి' రెంటికిఁగల భేదాభేదసంబంధమును దెలుపు ననియు నర్థము చెప్పెను. రవికి, రవికిరణములకు, నగ్నికి నెరసులకు నట్టి సంబంధమే యున్నది. జీవజడములు బ్రహ్మ భిన్నములయ్యును, తరంగములు జలముతోడను, చుట్టలు త్రాడుతోడను వలె, బ్రహ్మముతో ననన్యసంబంధమును గలిగి యున్నవి. ఈభిన్నవస్తువులు పూర్తిగా వ్యతిరేకములు, సంబంధశూన్యములును గావు. భేదాభేదములు రెండును సమాన సత్యములు; ఏది భిన్నమో యది సమానమునై యున్నది.

కాని జీవులు, జగము స్వయంసంపూర్ణములు గావు; ఈశ్వరాధీనములై వర్తించును. ౧. ప్రళయకాలమున జీవ జగత్తులు సూక్ష్మరూపములలో నీశ్వరునిలోఁ జేరును. ప్రళయమునకును పునస్సృష్టికిని మధ్యకాలమందు చేతనా చేతనములన్నియు సూక్ష్మరూపమున నీశ్వరునియందే నిలుచును. బ్రహ్మశక్తివలన మరల సృష్టిజరిగి ప్రతిజీవియుఁ దదనుగుణ దేహమును ధరించును.

చేతనా చేతనజగత్తులు బ్రహ్మముతో గలిసి యొక సముచ్చయవ్యక్తియగుననియు, నదియే జగత్తున కుపాదానకారణకారణమనియుఁ జెప్పు సిద్ధాంతము ను నింబార్కుఁ డంగీకరించడు; బ్రహ్మముయొక్క శక్తియే జగదుపాదానకారణమనియు, నా శక్తియొక్క వికారములు బ్రహ్మమున కంటవనియు నాతఁడు వచించెను. రామానుజుఁడు చెప్పిన దేవుని దేహమునే నింబార్కుఁడు శక్తియనెను, సృష్టినిర్మాణమునకు దేవునికి సామగ్రి యవసరము లేదు. ఆతఁడు సర్వశక్తిసమన్వితుఁడగుటచే బహ్మాండమును సంకల్పమాత్రముచే సృజింపఁగలఁడు. ౧. ఈ రీతిగా బ్రహ్మము ప్రపంచమునకు ముఖ్యోపాదానకారణములైయున్నవి. జగత్తు బ్రహ్మస్వరూపమే; తన పరిణామకార్యములకది బ్రహ్మముపై నాధారపడియుండును. కాని యొకవిధముగా బ్రహ్మ

(౧) దశశ్లోకీ. ౭

(౧) ౧, ౧, ౧౦.

మున కది వేరైనది. ప్రకృతి పరిణామమునకు మూలము గుణత్రయమను మామూలువాద మంగీకరింపఁబడెను. ౨.

పరమేశ్వరుఁడు సర్వసద్గుణసంపన్నుఁడు; దోషరహితుఁడు, మార్దవసౌందర్య, మాధుర్యలక్షణపరిపూర్ణమైన దివ్యదేహముగలవాఁడని చెప్పఁబడెను. 3. జీవులసంఖ్యయనంతము; వాని కణుపరిమాణముగలదు. ప్రతిజీవియు బ్రహ్మతేజోరాశిలోని యొక కిరణమే మూర్తిభవించినది, ౪. పరిపూర్ణ జీవబ్రహ్మైకత్వము నీసిద్ధాంత మంగీకరించదు; ఏలన విశేషణతారతమ్యములచేగలుగు భేదములను నిర్మూలింపవలసివచ్చును. కేవలానేకత్వమునుగూడ నంగీకరింపదు; ఏలనఁ బరబ్రహ్మము యొక్క సర్వవ్యాపకత్వమునకు, నాతనిసంపూర్ణతాస్వభావమునకు లోపము సంభవించును.

అనాద్యవిద్యాఫలితమగుకర్మవలన జీవునిపరిశుద్ధస్వభావమాచ్ఛాదితమగును; కాని, దైవకృపదానినుచ్ఛేదింపఁగలదు. ప్రపత్తియనగా సంపూర్ణమగునీశ్వరార్పణమే మోక్షసాధనము. ప్రపన్నులగువారియెడ దయజూపి పరమేశ్వరుఁడు వారిభక్తిని వికసింపఁజేయును; తత్ఫలితముగా బ్రహ్మసాక్షాత్కారసిద్ధి యగును. జీవాత్మపరమాత్మస్వరూపజ్ఞానము, దైవకృపారూపమగు మోక్షస్వభావజ్ఞానమును భక్తికవసరములు. అవిచ్ఛిన్నధారారూపమగు దైవవిశేషణ స్వభావక్రమానుభూతియేభక్తి:

(౨) దశశ్లోకీ, 3.

(3) దశశ్లోకీ, ౪.

(౪) బ్రహ్మసూత్రభాష్యము, ౨, 3, ౪౨.

దీనివలనస్వార్థపరత సంపూర్ణముగానశించును. మనస్సు, ఇంద్రియములు, దేహము మున్నగున వాత్మయనుభావము, దైవేతరమగు నాధారమున్నదనుభ్రాంతి, దైవశాసనములయెడను పేక్షాభావము లేక వ్యతిరేకభావము, అల్పదేవతలకు, బరమేశ్వరునకు భేదమెఱుగమి, నిజమగుభక్తిచే గలుగు మోక్షానందములను గూర్చిన యవిశ్వాసము మున్నగు నీశ్వరసాక్షాత్కారమునకు గల యవరోధములను భక్తివలన గ్రమముగా నిర్మూలింపవచ్చును. నింబార్కుని మతములో లక్ష్మీనారాయణులే రాధాకృష్ణులు.౧. భక్తియనగా నుపాసనకాదు. ప్రేమయే దుర్బలులగు వారికెల్లపుడు దైవకృప సాయపడి,సత్యమును బ్రదర్శించుచుండును. అన్యదేవతారాధనము నిషేధింపఁబడెను. శాస్త్రోక్త ధర్మానుష్ఠాన మవిలంఘ్యము; భక్తిసహితమగుకర్మ బ్రహ్మజ్ఞానసాధనము.౩.

రామానుజ నింబార్కు లిరువురు భేదాభేదావసరమును గుర్తించి, చేతనాచేతనములు బ్రహ్మవిశేషణములని భావించిరి; కాని రామానుజుఁడు జీవబ్రహ్మైక్యమున కధిక ప్రాముఖ్యము నిచ్చెను. నింబార్కుఁడు రెంటికిసమాన ప్రాముఖ్యమునిచ్చి, రెండును సమానసత్యములని పల్కెను. మఱియు రామానుజుఁడు చిదచిత్తులు రెండును బ్రహ్మ విశేషణములని నిర్ణయించెను.౪. నింబార్కుఁడు దీనిని ఖండించెను. శరీరమున్నంత

(౧) దశశ్లోకీ. ౫, ౮.
(౨) ౧, ౧, ౪.
(౩) ౧, ౧, ౭,
(౪) చిదచిద్విశిష్ట పరమేశ్వరాద్వైతము.

మాత్రమున గుణములున్నవని చెప్పనవసరము లేదు; ఏలన నొకవిశేషణమునకు విషయమూ విశేషణముగల వస్తువునకది లేని యితరవస్తువులతోఁగల భేదమే. చిదచిత్తులు విశేషణము లైనచో నీవిశేషణముః విశిష్టమైన బ్రహ్మమున కే యన్యవస్తువుతో భేదమును సూచించును ?

## ౧౬ — వల్లభాచార్యుఁడు

వల్లభుఁడు (క్రీ. వె. ౧౦౪౧) దక్షిణాపథమునకుఁజెందిన తెలుఁగుబ్రాహ్మణుఁడు; ఉత్తరదేశమునకువెడలి, పదిమూఁడవ శతాబ్దమునకుఁజెందిన విష్ణుస్వామిభావములను బెంపొందించెను. ఈతఁడు ప్రస్థానత్రయ ప్రమాణమునేగాక, భాగవతమును గూడఁ బ్రమాణముగా స్వీకరించెను. తన రచనలగు అనుభాష్యము, సిద్ధాంతరహస్యము, భాగవత టీకాసుబోధిను. ౧. ౘలలో శంకర రామానుజ భిన్నమైన యాస్తిక వేదాంతమతమును ప్రతిపాదించెను. దీనినే శుద్ధాద్వైత మందురు. ౨. ప్రపంచ మంతయు సత్యమును బ్రహ్మముయొక్క సూక్ష్మరూపము నని యాతఁడు వచించెను. జీవజగత్తులు సూక్ష్మరూపములో బ్రహ్మమే. జీవ, కాల, ప్రకృతి లేక మాయలు నిత్యవస్తువు లని వల్లభుని మతము. అవి బ్రహ్మరూపములే కాని వేరుకావు. మాయయే జగత్కారణమని నుడువువారు శుద్ధాద్వైతులుగా రేలన,బ్రహ్మేతరమైన దింకొకటున్నదని వారు చెప్పుదురు. 3

(౧) గిరిధరుని శుద్ధాద్వైతమార్తాండము, బాలకృష్ణుని ప్రమేయరత్నార్ణవము నీశాఖకుఁ జెందినవి.

(౨) శంకరుని కేవలాద్వైతము

(3) ౧, ౧, ౬.

శంకరుఁడు బ్రహ్మ మాయాశక్తివలన జగదుత్పత్తి చెప్పెను; మాయవంటి యేయితర పదార్థావసరము లేకయే బ్రహ్మము జగత్తును గల్పింపఁగలదని వల్లభుఁడు చెప్పెను. ఆతని దృష్టికి శాస్త్రమే పరమప్రమాణము; శాస్త్రవిధిని తర్క మెదిరింపఁ జాలదు.౧. ఈశ్వరుఁడు సచ్చిదానందుఁడు; సగుణుఁడు. బ్రహ్మ నిర్గుణమని చెప్పు శ్రుతివాక్యముల కర్థ మాతని గుణము లతీతములైనవనియే.౨ పరమేశ్వరుఁడై, జ్ఞాన క్రియాశక్తులు మూర్తీభవించి కృష్ణుఁడయ్యెను. ఆతఁడే జగత్కర్త. మనకు వలె నాతనికి సృష్టిచేయుటకు దేహ మవసరమని తలఁపరాదు. కేవలేచ్ఛా శక్తిచే నాతఁడు సృష్టిచేయఁగలఁడు. ఆతఁడు కర్తయేకాక, భోక్తయునై యున్నాఁడు ౩. ఆతనికి దేహావస రములేదు గాని భక్తుల సంతుష్టికొఱ కాతఁ డనేకరూపములు ధరించును.౪. అత్యుత్తమమైనది కర్మతోఁగూడిన యజ్ఞరూపము. బ్రాహ్మణోక్త కర్మలవలన నీ యజ్ఞపురుషుఁడు కృపజూపును. జ్ఞానసహితమూర్తి బ్రహ్మము, ఉపనిషద్జ్ఞానమే తత్సాధనము. పరమేశ్వరుఁడైన కృష్ణుని గీతాభాగవతోక్త రీతి నర్చింపవలెను.

మనుష్యపశుజీవులలో నానంద మాచ్ఛాదింపఁబడినది; జడపదార్థములలోఁ జైతన్య మాచ్ఛాదితము. ఆవిర్భావతిరో

(౧) ౧, ౧, ౨౦.

(౨) చూ. అతని బ్రహ్మసూత్రభాష్యము 3, ౨, ౨౨.

(3) ౧, ౧, ౧.

(౪) ౧, ౧, ౨౦-౨౧.

భావలక్షణ సామర్థ్యముచే బ్రహ్మము సంకల్ప మాత్రమున సర్వము చేయును. జీవుఁ డణుపరిమాణము గలిగి, బ్రహ్మాంశమై బ్రహ్మతో నొకటిగా నుండును.౬. బ్రహ్మముయొక్క ఆనంద మాచ్ఛాదితమై యప్పుడు, జీవుఁడగును. జీవమావిష్కృతి రూపమే యైనను, నది బ్రహ్మము వలెనే సత్యము, నిత్యము నైనది జీవులు మూఁడువిధములు. శుద్ధజీవుల జ్ఞానైశ్వర్యమవిద్యచే నాచ్ఛాదింపఁబడదు. రెండవవర్గము సంసారిజీవులు. వీ రవిద్యాగ్రంథులలోఁ దగుల్కొని, స్థూలసూక్ష్మశరీర సంబంధములచే జననమరణముల నొందుచుందురు. ముక్తజీవులు, విద్యామహితులై, సంసారబంధ విముక్తులగుదురు. మోక్ష మొందిన జీవాత్మ, సర్వాచ్ఛాదనలు తొలఁగి, సహజగుణములను గాంచి, యీశ్వరైక్యము గాంచును. జడజగత్తు కూడ బ్రహ్మాత్మకమే. దానిలో బ్రహ్మయొక్క చిదానందలక్షణ ద్వయము మఱుఁగు పడి, శుద్ధసాత్త్వికస్థితి యుండును. బ్రహ్మముయొక్క ఆవిష్కృతియే జగమగుటచే దానిని బ్రహ్మకార్యమనిరి. సృష్టిలయములు బ్రహ్మముయొక్క వ్యక్తావ్యక్త రూపములు. బ్రహ్మముత్పత్తియై, సృష్టిరూపమున గ్రాహ్యమై, లయకాలమున స్వస్థితింగాంచి, యగోచరమగును. ప్రపంచము బ్రహ్మముతో సమానముగా నిత్యము సత్యమునైనది; బ్రహ్మ శక్తివలననే సృష్టిలయములు జరుగుచున్నవి. జగత్తు మిథ్యకాదు; అది బ్రహ్మ భిన్నముగాదు. కారణకార్యసంబంధము సంపూర్ణ

(౫) ౨, 3, ౧౯.

(౬) ౨, 3, ౪3,

సమానత్వమే.(౧) మూలములో జగత్తు బ్రహ్మమే. తన స్వస్వరూపములో నెట్టి మార్పును లేకుండగనే, జీవజగద్రూపములను బ్రహ్మమే తాల్చుచున్నది. జగత్తునకు ముఖ్యోపాదాన కారణములు బ్రహ్మమే.(౨) పాక్షికత్వ క్రూరత్వములు బ్రహ్మమునకు లేవు; బ్రహ్మరూపములైన జీవులలోని భేదము సహజమైన దని వల్లభుడు చెప్పెను. మాయాబంధములు విచ్ఛిన్నమైన జీవాత్మ బ్రహ్మమే యని యాతని మతము.

ఈశ్వరుఁడొక పూర్ణశక్తి; జీవుఁడాతనిలో నంశము కాని జీవసత్తాబ్రహ్మసత్తాయే యగుటచే రెంటికి నిజమగు భేదము లేదు. నిప్పు, నెరసుల యుపమానము విరివిగా నుపయోగింపఁబడెను. జీవాత్మ అవిద్యామేఘచ్ఛన్నమగు బ్రహ్మము కాదు; ఒక విశేషణమదృశ్యమైన బ్రహ్మస్వరూపము. జీవుఁడు కర్తయు భోక్తయుఁ గూడనైయున్నాఁడు. అణుపరిమాణము గలిగినను, జీవాత్మ. తన పరిమళముచే చందనము తాను లేని చోట్లఁగూడ వ్యాపించినట్లే, తన విజ్ఞానముచే దేహమంతయు వ్యాపించును. అద్వైతరూపమగు నేకపరమ సత్యము నంగీకరించిన రామానుజుని దృష్టిలో జీవేశ్వరభేద మెన్నఁడు తొలఁగి పోదు. జీవేశ్వరుల సంబంధము పూర్ణాంశ సంబంధము. ఇందంశములు పూర్ణమునకు భిన్నములైనవి. రామానుజుని సామానాధికరణ్యము లేక విశేషణ విశేష్యభావము చూపున దేమన

(౧) ప్రాగ్భావము కారణావస్థ; ప్రధ్వంసాభావము కార్యమదృశ్యమగుటచే.

(౨) ౧, ౧, ౪

వంశములు పూర్ణములో సమవాయ సంబంధమును గలిగి యున్నవి. వల్లభునిది షెల్లింగు స్ప్యాటిస్ తత్త్వమువంటిది; ఇందు భేదములు నిర్మూలింపఁబడినవి. రామానుజునిది హెగెల్ తత్త్వసాదృశ్యమును గలిగియున్న దనవచ్చును.

లౌకికప్రపంచము మిథ్యకాదు౧. ఏలన మాయయనున దీశ్వరేచ్ఛచే జనించినదే. "బ్రహ్మమే జగత్తునకు మూలోపాదానకారణము. బ్రహ్మము సృష్టిచేసినవాఁడే కాక సృష్టియు నాతఁడే."౨. తా ననేకము గావలెనని పరబ్రహ్మ కోరి, తానే జీవజగత్తులయ్యెనని చెప్పిన బృహదారణ్యకోపనిష ద్భావము నాతఁ డంగీకరించును.౩. ఆత్మవ్యక్తీకరణకాంక్ష బ్రహ్మమందు సహజమైయున్నది. మాయయనున దీశ్వరశక్తి. ఈశక్తివలన నీశ్వరుఁడు ప్రపంచసృష్టిలయములను జేయును. మాయయనగా నవిద్యకాదు. ఏకత్వము నాచ్ఛాదించి, భిన్నతాభావము నుత్పత్తిచేయునదే అవిద్య.౧. జడప్రకృతి యున్నదనియు దానిని బ్రహ్మము చైతన్యవంత మొనర్చుననియు వల్లభుఁ డంగీకరింపఁడు. స్వస్థితిలో బ్రహ్మ మవిజ్ఞేయమయ్యు, జగద్రూపమునఁ దెలియఁగలదు.

సంసారము మాత్రము నిజమైనది కాదు. జీవాత్మ ప్రపంచము నిజమనినమ్మట తప్పుకాదు; దానిలో ననేకత్వమున్నదని

(౧) అణుభాష్యము ౧,౧,౪.

(౨) అనుభాష్యము ౧,౧,౪.

(3) ౧,౪,3.

(౧) చూ. శుద్ధాద్వైతమార్తాండము.

విశ్వసించుట తప్పు. ప్రపంచము సత్యమేకాని దానిని గూర్చి మనభావములో లోపమున్నది. అది బ్రహ్మరూపములలో నొకటి యని మనమెఱుఁగకున్నాము. జగత్తుయొక్క నిజస్వరూపమెఱుఁగని యజ్ఞానముచే నాచ్ఛాదింపఁబడి జీవాత్మ బాధపడుచున్నది. నిజమెరిగిన వారికి జగత్తే బ్రహ్మరూపమున గోచరించును. శ్రుతిజ్ఞానము వలన సత్యమెరిగిన వారికి, జగము బ్రహ్మముగాను బ్రహ్మేతరముగాను గూడ గోచరించును. అజ్ఞానులదృష్టికి బ్రహ్మ సత్యస్వరూపమునకును ప్రపంచమిథ్యాస్వరూపమునకును భేదమే తెలియదు. అవిద్య మానవ మానసమందు స్థాపితమైయున్నది. జగత్తు సంపూర్ణముగా మిథ్యయను భావమును వల్లభుఁ డంగీకరింపఁడు. జగము మిథ్యయైనచో, నది బ్రహ్మతో నేకమనియుఁ జెప్పుటకువీలులేదు. మోసమున కవకాశమున్నదికాని, దానికారణ మీశ్వరకృతముకాదు.

మాయాబద్ధమైన జీవాత్మ దైవాను గ్రహములేనిదే ముక్తి పొందఁజాలదు. మోక్షమునకు భక్తియే ప్రధానమార్గము. జ్ఞానము భక్తిని బోషించును. దేవునియందు దృఢవిశ్వాసమున్నచో సర్వపాపములు నశించును. కాని దీని కపార్థములు కల్పింపఁబడినవి. శరీరక్షోభపద్ధతులన్నిటిని వల్లభుఁడు గర్హించెను. దేహము దైవనిలయమగుటచే దానిని హింసించుటతగదు. జ్ఞానసిద్ధికిఁ బూర్వము ననంతరము కూడఁ గర్మలుండును. ౧. మోక్షముత్తమ లక్ష్యముకాదు. శాశ్వత కృష్ణసేవయు నాతని దివ్యలీలలందుఁ బాల్గొనుటయు నుత్తమ

(౧) అనుభాష్యము, ౧, ౧, ౧.

పరమావధి. వల్లభుఁడు పరబ్రహ్మమునకుఁ బురుషోత్తమున కును భేదమును జెప్పెను. ౨. ముక్తపురుషులలో ననేక భేదము లున్నవి. కొందరు సనకాదులవలెఁ బూర్వబంధముల నన్నిటి నుచ్ఛేదించి, దైవానుగ్రహముబొంది, ముక్తులై, వైకుంఠమున నివ సింతురు. కొందరు భక్తిని పెంపొందించుకొని, పరిపూర్ణ ప్రేమ గలవారై పరమేశ్వరునికి సహచరులగుదురు. పరిపూర్ణముగా నిష్కామమగు నీశ్వర ప్రేమనే వల్లభుఁ డుద్బోధించినాఁడు.

బ్రహ్మమునకును జీవజడజగత్తులకును సంబంధమంశాంశి సంబంధము. భేద మప్రధానము; అభేదము యథార్థమని వల్ల భుఁడుగ్గడించెను. 'తత్త్వమసి' 'అపరబ్రహ్మమేనీవ' నునది పరమసత్యమని యితఁడు వచించెను. రామానుజుఁడు, నింబా ర్కుఁడు నది యౌపచారిక మనిరి. జీవాత్మ యానందమును, జడపదార్థము చైతన్యమును, నానందమును బొందినపుడు, వీనికి బ్రహ్మముతో భేదము నశించును. దీనికి రామానుజుఁడంగీక రింపఁడు.

## ౧౭ – చైతన్యమతము.

దాక్షిణాత్య వైష్ణవమతము శ్రీకృష్ణుని బృందావన లీలల నెక్కుడుగా స్వీకరించి యుండలేదు; కొందరాళ్వారులు మాత్రము గోపీకృష్ణ వినోదములను స్మరించిరి. కాని ఉత్తర దేశమున నీవిషయము భిన్నముగా నున్నది. నింబార్కు నను సరించి, ముకుందప్రియురాలైన రాధ కేవల గోపికానాయికయే కాదు; ఆమె కృష్ణుని శాశ్వత ప్రియపత్ని. గీతాగోవింద కర్త

(౨) „ ४, 3, ౨౭.

మైన జయదేవుని యొక్కయు, విద్యాపతి, ఉమాపతి, చండీ దాసు (౧౪-శతాబ్దము)ల యొక్కయు రచనలు బెంగాల్ బీహారు దేశములలో నభ్యుదయ మందుచున్న రాధాకృష్ణ తత్త్వమును జూపుచున్నవి. దీనికి గారణములు శాక్తేయ తత్త్వాచారములే. ఇట్టి వాతావరణములోఁ బెంపొందిన సుప్రసిద్ధ వైష్ణవాచార్యుఁడగు చైతన్యుఁడు, విష్ణుపురాణ భాగవత, హరివంశ, బ్రహ్మవైవర్త పురాణములలోఁ బ్రదర్శింపఁబడిన కృష్ణచరిత్రముచే నాకృష్టుఁడై, తన మహనీయ వ్యక్తిత్వ సౌశీల్యములఁ దోడ్పాడుటచే వైష్ణవమతమున కొక నూతనాకృతిని గల్పించెను. ఆతని విశాలదృష్టి చేతను, ప్రజాహితభావముల చేతను, నాతని కధికానుచర వర్గము లభించెను. కాని యాతని విచిత్రరీతులకు సంప్రదాయవాదులు మిక్కిలి చకితులైరి. మహమ్మదీయులను దన మతములో స్వేచ్ఛగాఁ గలుపుకొనెను; తన ప్రప్రధమశిష్యులలో నొకఁడు ముసల్మాన్ ఫకీరు. చైతన్య శాఖలో హరిదాసను పేర నాతఁడు విశేషఖ్యాతియు గౌరవమును గాంచెను. ఆతని శిష్యులు రూపుఁడు సనాతనుఁడు ననువారు, హిందూసంఘముచే బహిష్కృతులు, మహమ్మదీయ మతమునఁ జేరి శత్రువులైనవారు, చైతన్యునిచేఁ దిరిగి స్వీకరింపఁబడిరి. జీవగోస్వామి (౧౬-వ శతాబ్దము) పిమ్మట బలదేవుఁడు నీశాఖకుఁ దత్త్వాధారములను గల్పించిరి. ఈశాఖకుఁ జెందిన మూలశాస్త్రగ్రంథములు, జీవగోస్వామి సత్సందర్భము, దానిపైఁ దానే వ్రాసిన సర్వసంవాదినీయను భాష్యము. బలదేవుని బ్రహ్మసూత్రగోవిందభాష్యము. బలదేవుని ప్రమేయ

రత్నాకరము సుప్రసిద్ధగ్రంథము. ఈరచయితలు కొంతవరకు, రామానుజ మాధ్వులనుండి తమ భావములను గాంచిరి.౧ ఈశ్వరుఁడు, జీవులు, మాయలేక ప్రకృతి, జ్ఞానశుద్ధసత్త్వ లక్షణములు గల స్వరూపశక్తి, కాలము, ననుపంచతత్త్వము లను వారంగీకరింతురు.

జ్ఞానసిద్ధాంత విషయములో నీశాఖ చూపు విశిష్టత యేమియునులేదు. వేదప్రమాణముతోఁ గలిపి సంప్రదాయ సిద్ధములగు జ్ఞానాధారము లంగీకరింపఁబడెను. మిక్కిలి ప్రాథమికమైన జ్ఞానదశ మొదటఁ గలదనియు నందుండి సవికల్పక జ్ఞానముదయించెననియు జీవగోస్వామి చెప్పినాఁడు. స్వతస్సిద్ధమై సంబంధశూన్యమగు జ్ఞానము, సవికల్పజ్ఞాన పూర్వమైనది. ఇది నిర్వికల్పకజ్ఞానము, సవికల్పకమం దిమిడియున్నది. నిర్వికల్పక జ్ఞానములోని సత్యాంశము, సవికల్పకములో సవివరముగా వ్యక్తమగును. అనగా నిర్వికల్పకజ్ఞానము యథార్థజ్ఞానమే; సంబంధశూన్యమైన యింద్రియాతీత జ్ఞానమిట్టిదే సకలభేదము లను సమన్వయించు సామాన్యధర్మమును జీవగోస్వామి యంగీకరింపఁడు.౨. మొదట మనకు సామాన్యమును గూర్చిన సహజ జ్ఞానము నావెనుక, గుణవిశిష్టమైన సామాన్యజ్ఞానమును లభించును పరిశుద్ధ బ్రహ్మస్వరూపమును గూర్చిన జ్ఞానము నిస్సంశయజ్ఞానమే. కాని దాని నతిక్రమింపవలెనని జీవగోస్వామి నిశ్చయము.

---

(౧) ప్రమేయరత్నావళి, పు. ౮.

(౨) భాగవత్సందర్భము, పు, ౫౫.

సచ్చిదానంద గుణమహితుఁడైన విష్ణువే కృపాప్రేమరస స్వరూపియగు సగుణదైవము. ప్రకృతిగుణవిరహితుఁడగుటచే నాతఁడు నిర్గుణుఁడు; సర్వజ్ఞత్వాది గుణములచే నాతఁడు సగుణుఁడు. స్వరూపసంబంధముచే నీగుణము లాతనికిగలవు. బ్రహ్మస్వరూపమును వ్యక్తీకరించు నీగుణము లాతనిలో నున్నవి.3. ఆతఁడే జగదుత్పత్తి స్థితిలయముల కారణము. జగదుపాదాన ముఖ్యకారణము లాతఁడే.౪. తన పరాశక్తిచే నాతఁడు ముఖ్యకారణుఁడై, అపరావిద్యాశక్తులచే నుపాదాన కారణుఁడగుచున్నాఁడు. ఆతనిమూలరూపము నిర్వికారము. సగుణరూపము మారుచుండును. దేవుని ముఖ్యలక్షణము ప్రేమయుగో. నానంద శక్తియును, నానందమును.౧. అవతారము లాతని నిజస్వరూపములే కాని వ్యక్తులవలె నంశములుగావు ౨. ఆతని కనంతరూపములున్నవి; వానిలోఁ బ్రేమనిధియగు కృష్ణుని రూపము త్తమమైనది. పరమేశ్వరుఁడగు కృష్ణునికి మూఁడు ముఖ్యశక్తులున్నవి; అవి చిన్మాయాజీవశక్తులు. చిచ్ఛక్తిచే నాతఁడు తన సంకల్ప

---

(3) మధ్వునపంతరము, బలదేవుఁడు విశేషసిద్ధాంతము నంగీకరించి, స్వరూపశక్తి, దాని వికారములకు మాత్రమే వర్తింపఁజేయును; ఏలన జగద్భేదములు, సత్యాంశములగుటచే వానిని నిరూపించుటకొక విశేషమవసరము లేదు.

(౪) „ ౧,౪,౨౪.

(౫) ఇదియే శ్రీ. చూ. బలదేవుఁడు. 3,3,౪౦. ౪౨.

(౧) ప్రీత్యాత్మ ౪,౧,౧.

(౨) స్వాంశావిభిన్నాంశా భేదము చెప్పఁబడెను. చూ. బలదేవుఁడు ౨,3,౪౭.

జ్ఞానస్వరూపమును, మాయాశక్తిచే సృష్టి కర్మను, జీవశక్తిచే జీవకోటిని బోషించును. శ్రీకృష్ణు నుత్తమశక్తిరూపము హ్లాదినీ రూపము. రాధ పరమానంద స్వరూపిణి.3. జీవగోస్వామి ననుసరించి, యీశ్వరుఁ డద్వితీయుఁడు. స్వస్వరూపములో నాతఁడు పరబ్రహ్మము, సృష్టికర్తగా భగవానుఁడు. మొదటిది నిర్గుణరూపము; రెండవది సగుణరూపము. రెండవ దేశక్కఁడు నిజమైన రూపమని జీవగోస్వామి భావించెను. బలదేవు ననుసరించి, పరమేశ్వరుఁడు హరి; హరియొక్క ప్రభుత్వైశ్వర్య రూపము నారాయణుఁడు; ఆతని సౌందర్యానంద రూపము కృష్ణుఁడు.

జీవసహితజగత్తు పరమేశ్వర శక్తులచే నావిర్భవించెను. అవి వానికి వేరుగా నున్నను వానిపై నాధారపడి యున్నవి. అవి వానితో నేకమునుగాదు భిన్నమునుగాదు. ఈసంబంధ మొక యచింత్యభేదాభేదము. జగత్తు నిజమైనది; మిథ్యకాదు. అది జీవులను దేవునినుండి తన వైపు కాకర్షించుటచే దానిని మాయ యనిరి. దేవుని సేవకుఁడు, మాయాశక్తి వలన, జగమునకు దాసుఁడగుచున్నాఁడు.

ఈశ్వరుఁ డాత్మకు భిన్నుఁడై తదధిపతియై యున్నాఁడు. ఈశ్వరుఁడు సర్వవ్యాపి; ఆత్మ అణుమాత్రము.4. జీవగోస్వామి ననుసరించి, యీశ్వరుని స్వరూపశక్తి, యాతని జీవశక్తి లేక

(3) పోల్చు:-"కృష్ణస్వరూపిణీ పరమానందరూపిణీ."

(బ్రహ్మవైవర్త పురాణము ౫,౪,౧౭.)

(4) బలదేవుఁడు ౨,౨,౪౧.

తటస్థశక్తిని బోధించి, సృజింపఁజేయును. జీవశక్తి మాయా లేక బహిరంగశక్తిని బోధించును. ఈశక్తు లీశ్వరునకు భిన్నములై యుండఁజాలవు. సృష్టికాలమునఁ బ్రళయము పూర్వమున్న జగన్నిర్మాణ స్మృతిగలిగి యీశ్వరుఁడు తా ననేకము గావలె నని కోరి, తనలో లీనములైయున్న జీవులను, వానికొరకు భోగ్యవిషయములను, వేరువేరుగా సృజించును. మహత్తత్త్వము నుండి బ్రహ్మాండమువరకు సర్వము నాతఁడు సృజించును. పూర్వయుగక్రమము ననుసరించి, వేదములను సృజించి, బ్రహ్మ కొప్పగించి, మిగిలిన సృష్టికార్యక్రమ మాతనిపైఁ బడ వేయును. వేదములవలన బ్రహ్మ వస్తుమూలరూపములను స్మరించి, వెనుకటివలెనే తిరిగి కల్పించును. వేదములలోఁ జెప్పఁబడిన యింద్రాదులు స్థానములుకాని స్థిరపురుషనామములుగావు స్థానములు నిత్యములు, వాని నాక్రమించువారు మారుచుందురు.౧. జీవజడపదార్థము లీశ్వర విశేషణములని రామానుజుఁడు చెప్పినాఁడు. జీవగోస్వామియు బలదేవుఁడు నవి యీశక్తి రూపములనిరి. అచేతన ప్రకృతి నీశ్వర విశేషణముగాఁ జెప్పుటకు వీరు సంశయించిరి; ఏలన నది యీశ్వరునిలో వైషమ్యకారణమును గల్పించినదగును. అందుచే జీవగోస్వామి, ప్రకృతి యీశ్వరుని బాహ్యశక్తియనియు నాతనికి దానితోఁ బరోక్షసంబంధమే యున్నదనియు జెప్పెను. బలదేవుఁడు ప్రకృతియే మాయయనియు నది యీశ్వరుని యీక్షణమాత్రమున నుత్పన్నమగుననియుఁ జెప్పినాఁడు. మాయాశక్తి

(౧) బలదేవుఁడు ౧,౩,౩౦.

వలన జీవులు తమ సహజస్వరూపమును మరచి, ప్రపంచపాశ బద్ధులగుదురు. భక్తివలనఁ గర్మ నశించును.(౧) కృష్ణుని ప్రేమించుటవలన సాక్షాత్కారము లభించును. రాధాప్రేమరూపమున నీశ్వరానుగ్రహము జీవులపైఁ బ్రసరించును. జీవులు తన్ను మోక్షాపేక్షతో నాశ్రయింపవలెనని సృష్టికర్త యుద్దేశము. కామ మింద్రియగతము; ప్రేమ దైవసంబంధము. భక్తియే మోక్షసాధనము. వేదములు భాగవతము మున్నగునవభ్యసింపవలెను. గురుభక్తి మిక్కిలి ప్రధానమైనది. మతవిషయములలోఁ దర్కముపై నాధారపడరాదు. వర్ణభేదములప్రధానములు. ఎంతనీచుఁడైనను దైవానుగ్రహపాత్రుఁడు. సర్వభూతదయ, వినయము, చిత్తశాంతి, నిష్కామత్వము, పవిత్రహృదయము ముఖ్యముగా నార్జింపవలయు నైతికగుణములు.

శాశ్వతమగు నీశ్వర ప్రేమానుభవమే మోక్షము. స్వర్గజీవులు పరమేశ్వర కింకరులై మహాభక్తులై యుందురు. ప్రేమయే మోక్షము. భక్తియే యథార్థమగు ముక్తి. భక్తివలన పునర్జన్మవిచ్ఛేదమై, జీవుని కీశ్వరసారూప్యము కలుగును. జీవేశ్వరైక్య మెన్నఁడును గలుగదు. ౩. నిర్గుణ బ్రహ్మానుభూతి

---

(౧) మామూలు భక్తిదశలను చైతన్యుఁడంగీకరించెను. (౧) శాంతి (౨) దాస్య (౩) సఖ్య, (౪) వాత్సల్య (౫) మాధుర్యములు: పూర్వదశ లుత్తరదశలో నిమిడియుండును. మధురభక్తి పరిపూర్ణము. వంగసారస్వతము భక్తిభావముల పలునిశితవిభాగములుగాఁ జేసెను. (చూ. రూపుని ఉజ్జ్వల నీలమణి.) (౨) సచ్చిదానందైకరసే భక్తియోగే తిష్ఠతి. (గోపాలతాపని ఉపనిషత్తు,) చూ. బలదేవుఁడు, ౩, ౩, ౧౨

(౩) బలదేవభాష్యము, ౧, ౧, ౧౭,

కలిగి, తరువాత సగుణబ్రహ్మమైన భగవానుని సాక్షాత్కారము లభించును. నిర్గుణ బ్రహ్మానుభూతి, జ్ఞానసిద్ధమగుటచే నుత్తమ మైనదికాదు. భక్తివలనఁ గలుగు భగవత్సంసిద్ధి, దేహపతనానంతరమే కలుగును. బ్రహ్మజ్ఞానము వలన జీవన్ముక్తి లభించుట కవకాశమున్నదికాని, భగవంతుని ప్రేమించుట కదిచాలదు. రామానుజుని విశేషణ సిద్ధాంతమును దన శక్తిసిద్ధాంతముచే జీవగోస్వామి మార్పుచేసినాఁడు. కాని తన స్వభావమునకు విరుద్ధమగు గుణము నీశ్వరునకుఁ జెప్పరాదన్నచో నీశ్వరలక్షణ వ్యతిరేకమగు శక్తిని మాత్రమెట్లు చెప్ప వీలగును? ఈశాఖకుఁజెందిన కొందరు తాము మధ్వానుచరులమని చెప్పుకొందురు కాని, నిజముగా వీరు రామానుజునకు సన్నిహితులు; ఏలన, భిన్నత్వమును వీరంగీకరించినను, జీవేశ్వరైకత్వమును సమర్థింతురు. భేదము లీశ్వరశక్తి సంజాతములు. తత్సంబంధమచింత్యము. తన సర్వసంవాదినిలో నీశ్వరుఁడు, గుణములునేకమును గాదు. భిన్నములునుగాదని జీవగోస్వామి యంగీకరించెను.

---

## ఉదాహృతగ్రంథములు

౧. అవలన్:—మహానిర్వాణ తంత్రము.

౨. అవలన్:—శక్తి; శాక్తము.

3. బార్నెడ్:—భారతీయ హృదయము

౪. కార్పెంటర్:—భారతదేశ మధ్యయుగాస్తికమతము.

౫. ఛటర్జీ:—కాశ్మీర శైవము.

౬. మాధవుఁడు:—సర్వదర్శనసంగ్రహము. ౫, ౯, అధ్యాయములు.

౭. మాధవుఁడు:—బ్రహ్మసూత్ర, గీతాభాష్యములు.

౮. నల్లస్వామి పిళ్లె:—శైవ సిద్ధాంతరచనము.

౯. పద్మనాభాచార్యుఁడు:—మధ్వజీవితోపదేశములు.

౧౦. పోప్:—తిరువాసగమ్.

౧౧. శ్రీనివాసయ్యంగార్. భారతీయతత్వ ముఖ్యదశలు:
అధ్యా. ౨, ౩.

శివసూత్ర విమర్శిని.

# భారతీయ తత్త్వశాస్త్రము

## ఏకాదశాధ్యాయము

---

### సమాప్తి

-:౦:-

### ౧ - తత్త్వజ్ఞాన వికాసము.

భారతదేశ విజ్ఞానచరిత్రయొక్క సర్వదశలలోను, మానవుఁడు జీవించు బాహ్యవ్యావహారిక ప్రపంచమునకు లోపల, నాత్మ శక్తికి నివాసమై, సూక్ష్మమును, నధికసత్యమునైన వేఱొక యథార్థజగత్తున్నదను భావము జాతి దృక్పథమున కెప్పుడును ప్రకాశించుచునే యున్నది జగద్రహస్యము నెఱిఁగి, పశుపశాతీతమైన ధార్మికాధ్యాత్మికోన్నత సీమ కుద్గమున మొనర్చుటకు మానవుఁడు చేయు నఖండకృషికి భారతవర్ష ముదాహరణము కాఁగలదు. చతుస్సహస్ర వత్సర పరిమితిగల యీకృషి మన యెదుట నున్నది. సింధు, పంజాబులలో లభించిన పూర్వయుగచిహ్నములను బట్టి, యీచరిత్ర కాలము చాలవెనుకకుఁ బోవుచున్నది. మనుష్యుల ప్రవర్తనము సక్రమమైనదో వక్రమైనదో, పైనుండి చూచుచున్న ఆకాశ సూర్య దేవతలు లోకమును బరిపాలించుచున్నారను నమాయికపు విశ్వాసము; మన

ప్రార్థనలను వినికాని, మన వైదికకర్మాచరణ ఫలితముగాఁ గాని మనకోర్కెలను ప్రసాదించు దేవత లొక్కఁడే యగు పరమేశ్వరుని భిన్నరూపములను విశ్వాసము; యేపావనాత్మ నెఱుగుటచే శాశ్వతజీవితము సిద్ధించునో ఆయాత్మ మనలో నిహితమైయున్న పరమాత్మయేయను స్థిరనిశ్చయము; నాస్తిక సంశయ కర్మవాదసముద్భవము, నావెనుక దేవుఁడున్నను లేకున్నను మనోవాక్కాయశుద్ధి గలిగి, యెట్టిదుష్కార్యమును జేయకుండుటవలననే జీవబంధవిచ్ఛేద మగునని బోధించిన జైన బౌద్ధ నైతికతత్త్వములచే నివి తుడిచివేయఁబడుటయు; పరమాత్మకుఁ బరమార్థగుణ పరిపూర్ణతయేకాక నైతిక గుణ పూర్ణత నాపాదించు భగవద్గీతయొక్క విశాలాస్తిక తత్త్వము; నేటికి నుపయోగములోనున్న జ్ఞాన ప్రపంచ ప్రధానద్రవ్య నిర్మాణముచేసిన న్యాయశాస్త్రము; ప్రకృత్యర్థ వివరణ మొన ర్చిన వైశేషికదర్శనము; బాహ్యాంతరంగిక ప్రకృతి తత్త్వపరి శోధన లొనర్చిన సాంఖ్యమతము; ముక్తిమార్గమున బాటలు వేసిన యోగశాస్త్రము; సాంఘిక నైతిక నియమావళినిఁ గల్పించిన మీమాంసయు; పరమాత్మ స్వభావస్వరూప వివ రణ మొనర్చిన శంకర రామానుజ, మాధ్వ, నింబార్క,వల్లభ, జీవగోస్వాముల మతసృష్టి, మానవజాతి చరిత్రలో స్తుతిపాత్ర మగు తత్త్వవికాసమును ప్రదర్శింపఁగలదు. ఒకపద్ధతినుండి యింకొకపద్ధతియు, నొకశాఖనుండి యింకొకశాఖయు సహే తుక క్రమమున నుద్భవించెను. భారతీయుని జీవితము, భౌతిక సాంఘిక సాంస్కృతి కావసరముల ననుసరించి పరివర్తన

మందుచుంబురోగమించుచు నూత్నరూపములందాల్చుచువచ్చి నది. ప్రారంభదశలలో మొట్టమొదటిసారిగాఁ బ్రాచీన భారతీయులు సర్వము తామే చేయవలసివచ్చెను. తా మాధారపడుట కెట్టి పూర్వవిజ్ఞానమును లేకపోయెను. ఇప్పుడులేని యనేక కష్టసమస్యలను వా రెదుర్కొనవలసి వచ్చినది. కాని విజ్ఞానానుష్ఠాన జగత్తులో వారు సాధించినది సామాన్య విజయముకాదు. కాని విజ్ఞానచక్రము పూర్తికాలేదు; నూత్న రూప నిర్మాణావశ్యకత లేకపోలేదు;జగద్రహస్యమునువ్యక్తము కాలేదు; తత్త్వజ్ఞాన మింకను బాల్యదశను దాటిపోలేదు. భారతీయ విజ్ఞానపరిశీలనము- ఏవిజ్ఞాన పరిశీలనమైన నిట్టిదే- పరమార్థమనంత రహస్య సమస్యాశృంఖలితమైన దనియు, దానినిఁ బరిష్కరింపఁ గోరుమానవు నవిచ్ఛిన్న కృషి మహోల్లాసపూరితమైన దనియు విదితమొనర్చెను. మానవవిజ్ఞాన దేవాలయ నిర్మాణములో నొక క్రొత్తశిలను జేర్చుటకును; జ్ఞాననిధిలో నొక క్రొత్త నాణెమును పడవేయుటకును పరంపరగా నుద యించిన వైజ్ఞానిక శేఖరులు తీవ్రకృషిసల్పిరి. కాని మానవప్రజ్ఞ లక్ష్యమును జేరలేక పోయెను; గమ్యస్థానమును జేరుటకుఁ గాని, యత్నమును విరమించుటకుఁ గాని దానికి వీలులేదు. ఘనమైన గత విజ్ఞానమునకు వారసులమై, వారు వెలిగించి యిచ్చిన విజ్ఞానదీపిక, లనంతముగా మనల నలముకొనియున్న గాఢాజ్ఞానాంధకారము దొలగించుటకుఁ జాలవను విషయము మన కిక్కడు స్పష్టముగాఁ దెలియుట కవకాశమిచ్చినవి. తత్త్వవేత్తల సర్వప్రయత్నముల ఫలితమేమనఁగా, సత్యమును

గూర్చిన మహాసమస్యల యెదుట, బూర్వయుగారంభదశలలో మన మెచట నిలిచితిమో నేఁడు నచటనే నిలిచి యుంటిమి;. పరిచ్ఛిన్న మానసకల్పిత పాశములచేఁ బరమార్థరహస్య సమస్య యను తాళికిబంధింపఁబడిన మన మెన్నఁడున ట్లేనిలిచియుందుముగ కాని తత్త్వజ్ఞానాన్వేషణ మెన్నటికిని వ్యర్థమైన కృషియని తలపరాదు. మనకుఁ దగులొని యున్న గొలుసుల యొత్తిడి, చప్పుడులచే నివి మనకు సువ్యక్తములగును. మనయపరిపూర్ణతను మనకు సుస్పష్టమొనర్చి, పరిపూర్ణతకై మనలో నున్న దాహము ను దేకింపఁజేసి, మన క్షణికజీవితము లెంత నిస్సహాయములోఁ బ్రదర్శించును. ప్రపంచ స్వస్వరూపము మన బుద్ధి గోచరమగునంత ప్రత్యక్షవిషయము కాదని తెలియుటచే నాశ్చర్యమేమియును లేదు. ఏలనఁ దత్త్వవేత్త యనఁగా జ్ఞానము నుపాసించువాఁడే కాని పొందినవాఁడు గాఁడు. యాత్ర ముగి యుటలో విశేషము లేదు; యాత్రయే ముఖ్యము. కడఁజేరుట కంటె జేరు యత్నములో నధికానంద మున్నది.

మనరచన ముగించుచుంటిమి కావున, మనకుఁ దెలిసిన చారిత్రికసత్యాంశముల ననుసరించి, మన కభ్యుదయమున్నదని నమ్మనగునా యని ప్రశ్నించుకొనవచ్చును. మానవవిజ్ఞాన పరిణామము పురోగమనమా లేక తిరోగమనమా ? నేఁడు మనకు గలిగిన ఫలిత మర్థరహితము హేతుశూన్యమును గాదు. పురోగమనమునందు భారతదేశమునకు విశ్వాసమున్నది; మన మిదివరలోఁ జూచినరీతిగా సృష్టిలయ చక్రమున కొక క్రమానుబంధమున్నది. కాలగతిలో నంతర్వర్తియైయున్న సూత్ర

మవిచ్ఛిన్నము. గతము నున్మూలింప యత్నించు విప్లవము లైనను దాని నుద్ధరించుటకే సహకరించును. తిరోగమించు తరంగములు ప్రవాహపురోగమనము నరికట్టుటకు బదులు ముందునకే కొనిపోవును. మన దేశమున మొన్నటితో గతించి నట్టి జీర్ణశకములవంటివి నిజముగాఁ బూర్వదశల దొలగించి, నూత్నజీవిత సృష్టిచేయుటకుఁ దోడ్పడు సంధికాలములు, జీర్ణ దశ, వికాసదశ, రెండును గలిసిపోవును. ఒకఘట్టములో నభ్యు దయశక్తు లప్రతిహతవేగముతో ముందుకుఁ బోవును; మఱొక దశలో నీశక్తి ముందుకు వెనుకకు నూగిసలాడును; కొన్ని వేళల నభ్యుదయ శక్తుల నణఁచివేసి తిరోగమనశక్తులు విజయ మందును; కాని మొత్తముమీఁద, భారతీయతత్త్వచరిత్ర మభ్యు దయమార్గమునే పట్టినని చెప్పనగును. ఇట్టి పరిణామప్రవా హములోఁ గొన్ని విలువగలవి కొట్టుకొనిపోయి, నశించినవని చెప్పుకొనకుండు టవివేకము. గతచరిత్ర మొకవిధముగా నడచి నదని దూషించుటకాని, విచారించుటకాని వ్యర్థమైనవని. ఇంకొకపద్ధతినే చరిత్ర నడచియుండినచో నింతకంటె నికృష్టఫలి తములిచ్చి యుండెడిదేమో! రాబోవు దశ మనకు ముఖ్య మైనది. వెనుకటి తరముల వారిభుజములపై మనము నిలిచి యుండుటచే వారికంటె దూరముగా మనము చూడఁగలము. దృఢతరముగాఁ బూర్వులు వేసిన పునాదులను జూచి, సంతుష్టి నొంది యూరకొనక, నవ్యదృష్టితోఁ బ్రాచీనుల యత్నమును మిళితమొనర్చి, మఱియు నుత్కృష్టమగు నిర్మాణమును జేయు టకై మనము కృషి యొనర్పవలెను.

౨-సర్వతత్త్వములో నేకత్వము.

భారతీయవిజ్ఞానవేత్తల సర్వప్రయత్నములలో నేదో యొకరూపమునఁ బ్రస్ఫుటముగాగోచరించుసూత్రములు రెండు గలవు. సంప్రదాయము నాదరించుటయు, స్వాచ్ఛసత్యోపాసన యునై యున్నవి. తన పూర్వులు ప్రవచించిన సిద్ధాంతములు తత్త్వసౌధనిర్మాణమునందుఁజేరిన శిలలు; వాని నూడఁబెరికి నచోఁ దన సంస్కృతి దూషితమగును, కొన్ని యననుకూల లక్షణములున్నను తమ సంప్రదాయవైభవము నభ్యుదయ కాములైనవా రెన్నడును దృణీకరించరు. ఈ విజ్ఞానవేత్తలు, సంప్రదాయవిజ్ఞానరాశిపైఁ బ్రజలదృష్టి కేంద్రీకృతమైయుండు టచే దానిలోని భావముల కర్థవివరణమును, నర్థాంతరములను నూత్నార్థములను జేసి, కొన్నిటి నుపేక్షింతురు. అర్వాచీన భారతీయవైజ్ఞానికులు జగద్యథార్థస్వరూపమునుగూర్చి ప్రాచీను లొసఁగిన భిన్నములగు తత్త్వనిర్ణయములను సమర్థించి, మొత్తముపైనవి యేకసత్యమునుదెల్పు భిన్నభావములని నమ్ముదురు. ఈ విభిన్నభావములు మన కజ్ఞాతమగు ప్రపంచమునుగూర్చి మానవమానస మొనర్చిన పరస్పరసమన్వయశూన్యములైన కల్పనములనికాని; కేవల మూహాపై నాధారపడిన నిరాధార తత్త్వభావసంకలనములనికాని వారు తలఁపరు. తత్త్వసౌధరాజ మంతయు నేకైకమహామానస పరికల్పితమేయనియు, నందలి భిన్నభావములా సౌధరాజములోని స్తంభద్వారాది వివిధ భాగములనియు వారు విశ్వసింతురు.

తర్కము, శాస్త్రము, తత్త్వము, మతము నవినాభావ సంబంధములు గలవి. విజ్ఞానపరిణామములోఁ బ్రతినూతన శకము నొకనవ్యతర్కసంస్కారముతో నారంభమైనది. నూతన విజ్ఞాన స్వభావాంతర్యమును జూపునదగుటచే విజ్ఞాననిర్ణయ విధాన మధిక ప్రయోజనము కలది. తర్కహేతునియమావళి ననుసరింపనిదే స్థిరత్వనిర్మాణ మసాధ్యమని న్యాయశాస్త్రము ప్రకటించును. భౌతికప్రపంచనిర్మాణములోని భిన్నాంశముల నెఱుఁగనిదే సంతృప్తికరమగు తత్త్వజ్ఞానము లభింపదని వైశేషికదర్శన మాగ్రహించును. మనము మేఘములలో మేడలను గట్టఁజాలము. భౌతికశాస్త్రము, తత్త్వశాస్త్రము వేఱైనవి; వానిని మనము మిశ్రమముచేయుటకు వీలుపడదుకాని ప్రకృతి శాస్త్రఫలితముల కనుగుణమైన తత్త్వశాస్త్ర విధానమును నిర్మించు టవసరమై యున్నది. కాని భౌతికజగత్తునుగూర్చిన సత్యములను విశ్వజగత్తున కన్వయింపఁ జేయఁబూనుటఁ బ్రకృతి శాస్త్రము ననుసరించి తత్త్వమును నిర్ణయించు దోషమునకుఁ బాల్పడుటే యగును. ఇట్టిప్రమాదములోఁ బడరాదని సాంఖ్య దర్శన ముద్ఘోషించుచున్నది. ప్రకృతిసామగ్రి చైతన్యము నుదయింపఁజేయలేదు. అచేతనప్రకృతినుండి చేతనప్రకృతిని, చేతన జగత్తునుండి యచేతనజగత్తును సృజింపఁబూనుట వ్యర్థప్రయత్న మగును. యథార్థజగత్తు ప్రకృతిశాస్త్రమునకును, వ్యవహార జీవితమునకును జూపట్టునదేకాక, యోగతత్త్వానుభూతివిషయ మని యోగదర్శనము చెప్పుచున్నది. పూర్వమీమాంస ధర్మమును, వేదాంతము బ్రహ్మజ్ఞానమును బోధించును. చేతనా

చేతనజగత్సంబంధమే తత్త్వశాస్త్రమునకుఁ బ్రధానసమస్య; దీనినే వేదాంతము స్వీకరించి పరిష్కరించును. ఋషులనోన్వ్యవ్యతిరేకజ్ఞానులు కారను సత్యము తత్త్వదర్శనమునకు సన్వయించును. న్యాయ వైశేషిక భౌతికతత్త్వము, సాంఖ్యయోగ ద్వైతము, వేదాంతాద్వైతములలోని భేదము, వీనిలో నొకటి సత్యము. వేరొక టసత్యమునగుటచేఁగాక నల్పాధిక సత్యములను గలిగియుండుటచేఁ గలిగినది. ౧. అవి క్రమముగా మంద మధ్యమోత్తమాధికారుల కుపయోగించునవై యున్నవి. ఈభిన్నభావము లొకే సత్యమను శిలనుండి చెక్కఁబడిన భిన్నాకృతులు, ఆసత్యశిలమాత్ర మేకము, పరిపూర్ణమునైనది. జగత్తత్త్వమును నిర్ణయించు నేశాస్త్రమును, తర్కప్రకృతి శాస్త్రముల యొక్కయు, మనశ్శాస్త్ర ధర్మశాస్త్రముల యొక్కయు, మతవేదాంతముల యొక్కయు వివిధభావములను స్వీకరించి సమన్వయింపనిదే, సమగ్రము కాఁజాలదు. భారత దేశములో నుదయించిన ప్రతిదర్శనము నొక ప్రత్యేక జ్ఞాన సిద్ధాంతమును, చేతనాచేతనములను, ధర్మమతములను, ధర్మ మతములను గూర్చిన విశిష్టభావములను నిర్వచించి యున్నది. ప్రకృతి శాస్త్రముల పరిశోధనా ఫలితముగా భౌతికజగత్తును గూర్చి మన విజ్ఞాన మపరిమితముగాఁ బెంపొందినది. అందువలన నెట్టి సంకుచిత దృష్టియు మనకు సంతృప్తి నీయఁజాలదు. ప్రకృతి శాస్త్రమనస్తత్త్వ శాస్త్రముల ఫలితముల ననుశీలింపని భావితత్త్వ నిర్మాణములు నిరర్థకము లగును.

### 3—తత్త్వశాస్త్రము - జీవితము.

జీవితమును నియమించి, సత్ప్రవృత్తితో నడపుటే తత్త్వశాస్త్ర కర్తవ్యము. భ్రమాప్రమాదములతోఁ గూడిన భవసాగరమునందు మనజీవితమను నావ చుక్కానిపట్టి క్షేమముగా నడపునదే తత్త్వశాస్త్రము. సజీవమై తత్త్వశాస్త్రమున్నచో నది ప్రజాజీవితమునకు దూరమైయుండదు. విజ్ఞానవేత్తల భావములు వారి జీవితానుభవ పరిణామ ఫలితములే. మనము వారి నభినందించి, పూజించుటే కాక, వారిదృష్టిని మన మార్గింపవలెను. వశిష్ఠవిశ్వామిత్రులు, గార్గీయాజ్ఞవల్క్యులు, బుద్ధమహావీరులు, గౌతమకణాదులు, కపిలపతంజలులు, బాదరాయణజైమినులు, శంకరరామానుజాదులు చరిత్రకుపయోగించు నామమాత్రములు కాక, మన జీవితములను తీర్చిదిద్దు మహావ్యక్తులు. వారిదృష్టిలో నంతర్దర్శనానుభవములపై నాధారపడు బ్రహ్మాండమునుగూర్చిన విశ్వవిశాల భావము తత్త్వశాస్త్రము. విజ్ఞానము తుదిగాంచినపుడు, జీవితానుభూతియను పరమప్రమాణముచే నిరూపింపఁబడి యది మతమగును. తత్త్వశాస్త్ర మొసఁగు సుశిక్షణమే మతానుష్ఠానసిద్ధి యేక కాలమందగును

### 4—మధ్యమయుగ తత్త్వశాస్త్ర జీర్ణదశ.

ఈగ్రంథ ముద్ధరించి చూపిన సాక్ష్యమునుబట్టి, భారతీయ మానసమునకు సమాలోచన వృత్తియును భయపడునను విమర్శకవకాశములేదు. పుక్కిటిపురాణములను నమ్మి, తదతీతమైన విజ్ఞానము నుద్భవింపఁజేయుటకు వలయు నిష్పాక్షిక

పటుత్వసంపద లేనిదే ప్రాఖ్ఖండ దృష్టియని, భారతీయవిజ్ఞాన పరిణతినంతను మనము త్రోసిపుచ్చుటకు వీలుపడదు. కాని గతించిన మూడు లేక నాలుగు శతాబ్దముల భారతీయ విజ్ఞాన చరిత్రలో నట్టి విమర్శ కవకాశమిచ్చు సందర్భము లున్నవి. తా నిదివరలో వహించిన ఆసియాఖండ విజ్ఞాన నాయకత్వమును భారతదేశము వహించుట మానివేసినది. ౧. యుగయుగములనుండి అవ్యాహత వేగమున వరదలై ప్రవహించిన భారతీయ విజ్ఞాన మహావాహిని, నేడు వేగము పోయి, చలనము నశించి, నిలువ నీటికి నిలయమై, పాడుపడి యున్నది. ఈజీర్ణదశకుఁ జెందిన తత్త్వశాస్త్రరచయితలు తాము సత్యారాధకులమని చెప్పుకొనిరే కాని, నిజముగాఁ బాక్షిక వాదశాఖలకుఁ జెందిన సంప్రదాయాగత సిద్ధాంతములను బట్టుకొని ప్రాకులాడుటే సత్యారాధనమని వారిభావము. ఇట్టి వాదలాలసులగు తత్త్వకోవిదులు తమయెదుట కృశించి, సైకత భూములలో నింకిపోయి యదృశ్యములగుచున్న పిల్ల కాలువలనుజూచి, సువిశాల గంభీరమగు భారతీయవిజ్ఞాన ప్రవాహిని యని భ్రమించుచున్నారు.

ఇట్టి ఫలితమున కనేక కారణములున్నవి. మహమ్మదీయ పరిపాలనముచేఁ గల్గిన మార్పులు ప్రజామానసములను సంప్రదాయ సంకుచితదృష్టికి బంధించినవి. స్థిరనిర్ణయములను, సాంఘికస్థాయీభావమును, ప్రతిఘటించి,వ్యక్తిగతాభిప్రాయములను స్వతంత్రముగాఁ బ్రకటించి, భావసాంకర్యమునుద్భవింపఁజేయు దినములలోఁ బ్రమాణభూతమై శాసించు విజ్ఞాన

వసరము కన్పట్టినది. మతప్రచార కార్యక్రమముతోఁ గూడిన
మహమ్మదీయ విజయము, ననంతరము వచ్చిన క్రైస్తవ
ప్రచారకోద్యమము హిందూసంఘస్థాయీభావము నుయ్యా
లూగింప యత్నించినవి. అట్టి సంచలనయుగములో సంఘధర్మ
ములకు క్షేమముండవలె నన్నచోఁ బ్రమాణశాసనమను
నిశ్చల స్తంభము నంటిపట్టుకొని యుండుటే మార్గమని తలపఁ
బడెను. విజ్ఞానసంఘర్షణ సమయమున, హిందువు తన ధర్మ
క్షేత్రసంరక్షణార్థము నియమావళి యను కంచె వేసికొని, విజా
తీయభావములందుఁ బ్రవేశించకుండ నరికట్టెను. హిందూ
సంఘము హేతువును నమ్మక, వివాదములకు విసిగి, సంశ
యించుటే పాపమను ప్రమాణము నాలింగన మొనర్చుకొని
కూర్చుండెను. ఈవిధముగాఁ దాను బెట్టుకొన్న దీక్షకు బద్ధు
రాలై హిందూసంఘ మపజయమందెను. అంతతో స్వతంత్ర
విజ్ఞానవేత్త లంతరించిరి; పూర్వసందేశములనే స్మరించి,
క్రొత్తబాటలను ద్రొక్కుట కసమర్థులైన పండితులు మిగిలిరి.
తమకు దెలిసినదే కాక మిగిలిన దేమియు లేదని కొన్ని
శతాబ్దముల పాటు వారాత్మ వంచనకు లోనైరి. వారు తత్త్వ
శాస్త్రమనఁగా గతించిన తత్త్వశాస్త్రచరిత్రమే యనిభ్రమించు
టచే నిర్మాణాత్మకశక్తి వారినుండి తొలఁగిపోయెను. హిందూ
సంఘము తన కర్తవ్యమును దిగవిడచి, మిథ్యాభావ పాశబద్ధ
మైనది. హేతుపద్ధతికి మార్గదర్శి, సంరక్షకురాలునైన సంఘము
దానిని విడిచి, తనకు దా నపకృతి యొనర్చుకొనెను. విజ్ఞాన
యాత్ర చిరకాలమునుండి, చాలదూరము చేసి నేటికి గమ్యా

స్థానమును జేరినదని యనేకులు భావించి, విసివి, వేసారి, విశ్రాంతి నాశ్రయించిరి. ఇది నిజముకాదని యెఱిగిన కొలఁది మందియు, సజ్ఞానక్షేత్రవైశాల్యమునుజూచి, దానినిఁ బరిశోధించు యాతన లనుభవించుటకు భీతిగొని యూరకుండిరి. శాశ్వతములు మహాక్లిష్టములు నైన సమస్యల నెదుర్కొనుటకు దుర్బలహృదయులకు జంకుపుట్టును. సత్యముయొక్క అనంతస్వరూపము నన్వేషించుట వలనఁ గలుగు మతిసంచలనము నుండి తొలఁగి పోవ నెంతటి మేధావులైనను యత్నింతురు. బలవత్తమములైన మానవశక్తులకుఁ గూడ మాంద్యమునఁబడు దశలుండును. గతించిన మూడు, నాలుగు శతాబ్దములలో తాత్త్వికోత్సాహము మాంద్యమునఁ బడినది.

## ౫—ప్రస్తుతస్థితి

నేఁడు ప్రపంచమహామతములు, భిన్నవిజ్ఞానవాహినులు భారతపుణ్యభూమిలోఁ గలిసికొనినవి. పశ్చిమఖండవిజ్ఞానసంపర్కము మనలో నిటీవలఁ బెంపొందిన నివృత్త్యాత్మకసంతృప్తిని చెదరఁగొట్టినది. ఇతరసంస్కృతి నభ్యసించుటవలనఁ బారమార్థికసమస్యలకు నెన్నఁడు మార్పులేకుండ నిర్ణయింపఁబడిన శాసనపూర్వక సమాధానములు లేవని తెలిసినది. దాని వలన సంప్రదాయసిద్ధములగు సమాధానములందు విశ్వాసము దెబ్బతినినది; విజ్ఞానవైవిధ్యస్వాతంత్ర్యము లధికముగా గుర్తింపఁబడినవి. సంప్రదాయము కదలుట ప్రారంభించినది. కొందరు విజ్ఞానవేత్తలు పూర్వపు బునాదులపై నూతననిర్మాణముచేయ

వదలపెట్టగా, మరికొందరు వానిని బూర్తిగా నిరాకరింపఁ జూచిరి. ఈసంధియుగ మున్నత్యాశాందోళనాభరితమై యున్నది.

గతశతాబ్దములో భారతదేశము పశ్చిమఖండ విజ్ఞానవిహారమునకు దూరమైన యొక దుర్గంధజలతటమున నిలిచెనదికాని నేఁడట్టి యేకాంతజీవితము తుదముట్టినది; మూఁడునాలుగు శతాబ్దములయనంతరము వచ్చు చరిత్రరచయితలు భారత పశ్చిమఖండ సంపర్కఫలితములనుగూర్చి విశేషము వ్రాయ వలసియుండును. కాని యా ఫలితము లింకను మన దృష్టి గోచరములు కాలేదు. భారతదేశమందుఁ గలిగిన ఫలితమేమ నఁగా, ప్రజల అనుభవరంగము వైశాల్యమును బొందినది; విమర్శదృష్టి పెంపొందినది; నిరర్థకభావములయెడ నరుచి జనించినది.

ఈపరిణామములో నింకొక విశేషమున్నది. విజ్ఞాన క్రియారంగముల రెంటియందును గూడ, నరాజకదశ యందు వలెనే అస్వాతంత్రదశ యందును మానవునుత్సాహశక్తి నుండ గించును. విజ్ఞాన నాగరికతల విషయములో నీరెంటికిని భేదము లేదు. అరాజకము వలన, నార్థిక క్లేశ వినాశములు, సాంఘిక ప్రమాదములు కలుగును; పరదాస్యము వలన నార్థిక సుఖస్థై ర్యములు, సాంఘిక శాంతియు లభించును. నాగరకతాప్రమా ణములతో నార్థిక సంపదను, సంఘశాంతిని బోల్చుట భావ సాంకర్యమగును. కొన్నితరములుగాఁ దాననుభవించుచున్న యంతఃకలహములు, తత్ఫలితముగా సంభవించిన వ్యక్తిగత క్లేశ ములు భరింపలేక ౧౯-వ శతాబ్దారంభమున బ్రిటిష్ పరి

పాలన సంభవించుటకు స్వర్ణయుగారంభముగా భావించిన భారతీయుల నాటి భావములను మన మర్థము చేసికొనఁగలము. కాని నేటిపరిస్థితిలో మానవ హృదయకోశమునుండి బయల్వెడలు కోర్కె సౌకర్యము కొఱకుఁగాదు సుఖము కొరకు; శాంతి శ్రీమగతి కొరకుఁగాదు, స్వతంత్రజీవితము కొఱకు; స్థిరమగు నార్థికస్థితి, న్యాయమగు పరిపాలనల కొఱకుగాదు; ఎంతదుర్భర వ్యయప్రయాసలతో నిండియున్నను దన లక్ష్యమును దానే స్వాయముగా సాధించుకొను స్వాతంత్ర్యము కొఱకునై యున్నది. ఇట్టి నేటిభారతీయుని కోర్కె నాదరముతో మనము గ్రహింపవలెను. రాజకీయ స్వాతంత్ర్యలోప మున్నచోట నితరగుణ సంపాదనము సాధ్యపడదు. ఆంగ్లపరిపాలనము దేశమునకు శాంతి భద్రతలను జేకూర్చినది కాని, యవి సాధనములే కాని లక్ష్యములుగావు. అగ్రస్థానము దేనికీయవలెనో దాని కిచ్చిన యెడల, ముఖ్యమైన దాత్మ స్వాతంత్ర్యము; ఆర్థిక స్థైర్యము, రాజకీయ రక్షణము సాధనము మాత్రమే. ఎంత న్యాయ విజ్ఞాన హేతువైనను,నాత్మ లక్ష్యములను గుర్తింపని పరప్రభుత్వ విశృంఖల పరిపాలనము తన రాజ్యములోని ప్రజల కుత్సాహము నుదయింపఁ జేయలేదు; వారిలో సజీవప్రవృత్తిని రేకెత్తింపఁ జాలదు. ప్రజాకోటికిఁ బ్రాణప్రదములైన, చైతన్యప్రభ, స్వతంత్ర సమాలోచనశక్తి, స్వేచ్ఛతోఁ గూడిన మనుగడ, మానసికానందము, శాంతిసమృద్ధి మున్నగు జీవశక్తు లింకిపోవు చుండగా, భారతీయులు తమ భారము తగ్గినదని కాక, తమ యస్వతంత్రతాభారము కృంగించుచున్నదని తలఁచుటలోఁదప్పు

లేదు. అట్టి ప్రజల కాంగ్లేయులమహా కార్యములనుగూర్చి చెప్పుట నిష్ప్రయోజనము; ఏలన, చరిత్రయొసగు నిర్ణయ మొక కార్యము వలనఁ గలుగు నాత్మోన్నత్యముపై నాధారపడును. గతించిన తరములలోని ప్రజానాయకుల లక్ష్యములు పూర్వభావ ప్రతిష్ఠను లేకాని, నూత్న భావములను బ్రకటింప లేకపోవుటకుఁ గారణము పశ్చిమవిజ్ఞానప్రవాడిచే గలిగిన పరవశత్వము, పరాజయ పరాభవములై యుండెనని చెప్పవచ్చును. ప్రస్తుత భారతీయ దృష్టి నేపేరునఁ బిలిచినను, అశాంతి, ప్రతిఘటన, విప్లవము– యేదైనను దాని మూలకారణములు బ్రిటిష్ వారెరుగనివి కావు. సహజముగా శ్రేష్ఠతరమైనదని తాము నమ్మిన తమ నాగరికతను దెచ్చి, భారతీయులపైఁ జొప్పించి, భారతీయోద్ధరణమునకు, వికాసమునకు నది యుక్తమైనదని– బ్రిటిషు వారు బలవంతముగాఁ బ్రచారము చేయఁబూనుకొని, మితి, విరతి లేకుండఁ జేసిరి. ఇట్టి సాంస్కృతిక సామ్రాజ్యప్రచారము నెడ భారతదేశమున కెట్టి యాదరభావమును లేదు. ప్రాచీనాచారములను వారు నమ్మి వాని నాశ్రయించిరి; ఏలన రాగద్వేషోద్రేకాంధతనుండి వారి నవి కాపాడినవి. భారతీయ పూర్వచరిత్రతోఁ బరిచయముగలవారు ప్రజలు తమయాధ్యాత్మిక స్వగృహమున నివసింపఁగోరుట నాదరదృష్టితోఁ దిలకింపఁ గలరు; ఏలన "ప్రతివ్యక్తియుఁ దన స్వగృహములో రాజే".౧. ఈ యాంతరంగిక స్వేచ్ఛ నరికట్టు రాజకీయదాస్యము దారుణాపమాన హేతువుగాఁ బరిగణింపఁబడెను. అంతరంగస్వపరిపాలనోత్కంఠయే బాహ్యమున స్వరాజ్యకాంక్షయై ప్రబలినది.

కాని భావిదశ విశేషాశాసంభరితమై యున్నది. భారత దేశ మాంతరంగిక స్వాతంత్ర్యమును గాంచినచో నప్పుడు పశ్చిమవిజ్ఞానము విశేష ముపకరింపఁగలదు. సంస్కృతివిషయములో నేకాంతజీవితము గడపు సిద్ధాంతము హిందూవిజ్ఞాన మెరుగదు. ప్రాచీనకాలములందైనను, దనప్రజలకు సరిపడునంత నాత్మవిద్య నార్జించిన వెనుక, విజాతీయుల విజ్ఞానభావముల నాదరించుటకు సంశయించిన దశయున్నదని యేచరిత్రయును జూపఁజాలదు. తన పూర్వ మహోచ్చదశలో, భారతదేశము ఎథీనియనుల విజ్ఞానసాదృశ్యమును జూపినది. పెరికిల్సు చెప్పినాఁడు; "పరాభిప్రాయములను సంతోషముతో నాదరించి, మనతో నేకీభవింపనివారిని నిరసనదృష్టితో మనము చూడము." అన్యాభిప్రాయములన్నచో భీతి, మనలోని దౌర్బల్యము, స్వవిశ్వాసలోపముల పరిమాణానుగుణమై యుండును. నిజమే! నేఁడు, మనముఖమందు విషాదరేఖలున్నవి; వార్ధక్యసూచకముగా మన జుట్టు తెలుపెక్కినది. మనలోఁ గొందరు విజ్ఞానవేత్త లశాంతిపూరితచిత్తులైరి; కొందరు నిరాశోపహతులుకూడనై, మానసిక తపోగుహావాసులైరి. పాశ్చాత్యవిజ్ఞానము నెడ సహాయనిరాకరణ భావము కొన్ని అస్వాభావిక సందర్భములచేఁ గలిగిన తాత్కాలికఫలితము, పాశ్చాత్య సంస్కృతిలోని జీవశక్తుల నర్థముచేసికొని, జీర్ణించుకొను యత్నములు జరుగుచునేయున్నవి. పశ్చిమవిజ్ఞానమందలి విలువగలయంశములను భారతీయులు జీర్ణించుకొన్నచో నందు విశేషముండదు. ఇట్టిదశలు భారతదేశ చరిత్రములో నెన్నియోయున్నవి.

పశ్చిమవిజ్ఞానసంపర్కము లేనివారిలో నధికసంఖ్యాకులు మేధావులు, నైతికోన్నతవర్గమునకుఁ జెందినవారు. వీరికి రాజకీయములతో సంపర్కము లేదు. వీరు కానున్నది కాకమానదను నిరాశావాదులై, మన మేమియుఁ జేయలేమను మంత్రమును బఠించువారు. తాము నేర్చుకొనవలసియున్నదికాని, విసర్జింపవలసియున్నదికాని యేమియు లేదని వారు నమ్మి, ప్రాచీనమైన శాశ్వతధర్మముపైఁ దమదృష్టిని నిగిడ్చి, తమ కర్తవ్యములను నెరవేర్చుచుందురు. మన మర్థముచేసికొనుటకుఁగాని, నిగ్రహించుటకుఁగాని వీలులేని యనేకశక్తులు పనిచేయుచున్నవనియు, నీ మహామారుతములను మన మాత్మగౌరవవిశ్వాసములతోఁ దిలకించినచోఁ గ్రమముగా వాని వ్యర్థత బయల్పడుననియు వారుపదేశింతురు, కాల మనుకూలించినదినములలో

శ్రుత్యర్థములకును హేతుబద్ధతత్త్వనిర్ణయములకును సామరస్యమును గల్పింపఁబూని విశాలహృదయమును జూపుట కలవాటుపడిన వర్గమే యిది. నాస్తికులయొక్కయు, మతద్రోహుల యొక్కయు దాడులనుండి మతమును సంరక్షించిన దీవర్గమే. మతార్థవివరణమునకు వీ రుపయోగించుపద్ధతి యాలంకారికము. వీరి యభిప్రాయములో మతమనఁగా సర్వరసభావసమన్వితమైన సంపూర్ణ మానవస్వభావమును నిర్ణయించునదై యున్నది నేఁటి పండితులు తమపూర్వులవిజ్ఞానమునుండి నిజమగు నావేశమును గాంచియున్నచోఁ, బ్రస్తుతము దేశములోనున్న నూత్నశక్తులను బహిష్కరించుటకుబదులు, తమ ప్రాచీనవిజ్ఞానము నాధారముగాఁగొని, నిజమగు ప్రతిభను జూపి నవ్యజీవితమార్గ

నిర్మాణమునకు మార్గదర్శకులై యుండెడివారు. కాని భావ ప్రవృత్తులయందు వారు పూర్వప్రమాణములయెడ నతిశయా దరముజూపి, లౌకిక పారమార్థికవిషయములన్నిటిలోఁ దమ దృష్టి శ్రేష్ఠతరమైనదని వర్తించి, నవ్యమార్గముల నన్వేషింపఁ జాలని భావదాస్యమునకు నంధవిశ్వాసములకుఁ బాల్పడిరను నిందకు గురియైరి. మహర్షాదీయుల యుగపూర్వదశలలో శ్రుతి ప్రమాణమునకు స్వతంత్రహేతువాదముతో విరోధము లేదు. తమకుఁ బ్రమాణములైన వేదములందును, నాగమములందును దమకుఁ గల విశ్వాసమునకు సహేతుకాధారములను జూపుట కానాటిపండితులెన్నఁడునుజంకలేదు; కొన్ని శ్రుతివాక్యముల నేర్చి వానియర్థములను సకారణముగా వారు నిరూపింపయత్నించు చుండిరి; కాని నేఁడు వేదప్రమాణగౌరవమే స్వతంత్రప్రతిభకుఁ జెరసాలగాఁ బరిణమించినది. ప్రమాణగ్రంథవిశ్వాసమును శంకించుటనఁగా మహనీయులగు ప్రాచీనమహర్షులను నిందించు టయేయని నేఁడు తలపఁబడినది. అవితర్క్యముగా శ్రుతిప్రమాణ మునునమ్ముటే సచ్ఛీలమని చెప్పఁబడుచున్నది. శ్రుత్యుదాహ రణముచే శంకాన్వేషణములనణఁచివేసి, సంప్రదాయ విశ్వాస రాశి కనుకూలింపని భౌతికశాస్త్ర సత్యములు నిరసింపఁబడినవి. ఉదాసీనత, మాంద్యము, నంధవిశ్వాసము ప్రధానప్రజ్ఞాధర్మ ములుగాఁ బరిగణింపఁబడినవి. ఫలితమేమనఁగాఁ బ్రాచీనమగు నేయుత్తమరచనతోఁ బోల్చినను నేటి తత్త్వశాస్త్రరచనలు నికృష్టములై చూపట్టును. నిబంధములు తక్కువగా నున్నచో విజ్ఞాన మెక్కుడు వైశాల్యమును గలిగి యుండెడిది.

భారతీయ విజ్ఞానవేత్త ఉదారమైన హేతువాద విశ్వాస సంప్రదాయము కలవాడు. ప్రాచీన మహర్షులు నూత్నసృష్టి చేసిరేకాని పరానుకరణము చేసినవారుకారు. తాముగాంచిన సత్యరాజ్యమును విస్తరింపఁజేసి, నిత్యము మార్పునొందునదగుటచే నెప్పటికప్పుడే క్రొత్తగా బయల్పడు జగత్సమస్యలఁ బరిష్కరించుచుండెడువారు. వారి కనుక్రమముగా లభించిన జ్ఞానసంపదకు వారెన్నడును బానిసలుకాలేదు. గతసమస్యా పరిష్కారములనే పునరుద్ఘాటించుట నిరర్థకము; ఏలన పూర్వచరిత్రయే తిరిగి సంభవింపదు. వారి తరములో వారు చేసినదానినే తిరిగి చేయునవసరములేదు. మనము మనకన్నులఁ దెరచి యుంచుకొని, నేటి సమస్యల నర్థముచేసికొని, గతానుభవ జ్ఞానము నుపయోగించుకొని, పరిష్కరింప యత్నింపవలెను. సత్యమునందలి శక్తి బాహ్యరూపముల కంటిపట్టుకొని యుండదు; నూత్నరూపముల నెప్పటికప్పు డుద్భవింపఁ జేయుచుండును. పూర్వసమాసములకుఁ గూడ నవ్యార్థకల్పనము చేయఁబడును. నేఁడు మనము నిర్మించు తత్త్వము నేటి కవసరమగును గాని గతకాలమున కన్వయింపదు. జీవితమెట్లు నిత్యనూత్నమో, తత్త్వశాస్త్రరూపార్థము లట్లే నిత్యనూత్నములై యుండును. వర్తమానము భూతకాలముతో నవిచ్ఛిన్న సంబంధము కలిగియున్న రీతిగనే, తత్త్వశాస్త్రమును గతభావములతో నవిచ్ఛిన్నమై ప్రకాశించును.

సంప్రదాయవాదులు చెప్పు హేతువులలో నొకటేమన సత్యము కాలోపహతమనునదే. సూర్యాస్తమయసౌందర్యమును,

బిడ్డయెడ మాతృప్రేమయు నెట్లో యట్లే కాలముచే సత్యము మార్పు చెందదు. సత్యము నిర్వికారమే కావచ్చును; దానినిఁ బ్రకటించు రూపసామగ్రి సవికారమే. గతమునుండి మనము భావశక్తిని స్వీకరింపవచ్చును. ఆ భావములు బీజాత్మకము లగుటచే శక్తివంతములే; కాని వానికాకార రేఖావిన్యాసమును వర్తమానావసరోచితముగా నిర్ణయింపవలెను. నేటి మనమతము, తరతరముల వికృతరూపమను మాటను మఱువరాదు; భావశక్తి కనవసరములగు రూపములలో నేల మార్పుండరాదు? శబ్దమును 'తు,చ' తప్పకుండఁ బాటించి, యందలి అర్థమును తలక్రిందొనర్చుట కవకాశమున్నది. ఎక్కువ జ్ఞానమును దర్కపాండిత్యమును గల్గిన రెండు వేల యేండ్లనాటి హిందూనాయకులిన్ని శతాబ్దములు గడచిన వెనుక నేడు తిరిగి భూలోకమున కరుదెంతురేని, తాము ప్రకటించిన బాహ్యాశబ్దార్థముల నొకింత భేదము లేకుండ విశ్వసించు మన యనుచరకోటిలోఁ దమయాంతర్యము నెఱిగినవారి నరుదుగాఁ జూడఁగల్గుదురు. నేఁడు పెక్కురకముల చెత్తయు చెదారమును పెరిగిపోయి, ఆత్మశక్తియొక్క స్వేచ్ఛాప్రవాహముల కాటంకములైనవి. పటుత్వమును గోల్పోయి, సత్యవిరహితములైనను నత్యంతప్రాచీనములగుటచే బూజ్యములని బాహ్యారూపములను సమర్థించుటవలనఁ, జిరానుగతమై కుళ్ళి కృశింపఁజేయు విషజాడ్యముచేఁ బీడింపఁబడుచున్న రోగిబాధల కాలమును బొడిగించినట్లగును. పూర్వాచారప్రియులు మార్పునకుఁ దమ హృదయములలోఁ దావీయవలెను. వారట్టి యవసరమును గుర్తింపనికారణమున నేటి తత్త్వజ్ఞానరంగమున నుని

శితిమైన ప్రతిభయు, దత్త్వవిరోధమగు నజ్ఞానమును విచిత్ర సాంకర్యమునందు గోచరించుచున్నది; తాత్కాలికముగా బ్రాచీనమతము నాచ్ఛాదించిన కాలుష్యముల నెట్లు నిర్మూలించుట; ప్రకృతిశాస్త్రవృష్టి మతమున కెట్లనుసంధింపదగును; వ్యక్తిగత భిన్నావసరోచితముగా మతము నెట్లన్వయించుట; ప్రాచీనమతము తమ ప్రభావములజూపు నేటి భిన్న దృక్పథముల నెట్లు సమన్వయ మొనర్చుట; మున్నగు పెక్కు సమస్యల నెదుర్కొని పరిష్కరించుయత్నములో భారతీయ విజ్ఞానవేత్తలందరు తమశక్తులను కేంద్రీకరింపవలసియున్నది. దురదృష్టవశమున నీసమస్యలను విడిచి, కొన్ని సంఘములు ప్రాచీనయుగజీవుల కుచితమగు విషయములను జర్చించుచున్నవి. పండితప్రకాండుల కిది కాలక్షేపకారణమైనది. విశాలదృక్పథములో జాతీయమత ప్రబోధము చేయు కార్యక్రమ మెవరు యించలేదు. అనుశ్రుతమైవచ్చిన ఆధ్యాత్మిక సంపద యేకొలదిమందికో చెందిన గుప్తధనముకాదనువిషయము గ్రహింపబడలేదు. భావములు శక్తులు; ప్రస్తుతజాతి జీవితము మృత్యుగ్రస్తముకాకుండ గాపాడుట కీభావములను నలుమూలల వ్యాపింపజేయవలెను. మానవహృదయమును ద్రవింపజేయగల ఉపనిషద్గీతా గౌతమబుద్ధ వాక్యములు వ్యర్థములగుట నిజముగా విచిత్రమే. పుణ్యకాలము మించకుండ, జాతీయజీవితము దిరిగి నిర్మించినచో, భారతజాతి కొకభావిదశ యుండగలదు. ఈజాతియను పురాణవృక్షమున నింకెట్టి సుమ

రాజములు పూయునో, యెట్టి మధుర రసభరితఫలములు పండునో యెవరు చెప్పఁగలరు ?

పాశ్చాత్త్య విజ్ఞానసంపర్కము లేని వారు సర్వవిషయములలోను క్రియలలోను పూర్వాచారపరులై యుండఁగా, పశ్చిమ విజ్ఞానపరవశులగు కొందరు ప్రాకృతిక తత్త్వములను ప్రకటించుచు, మనము మనప్రాచీన విజ్ఞానశృంఖలములనుండి పూర్తిగా విముక్తులముగావలెనని బోధించుచున్నారు. వీరు సంప్రదాయ విద్వేషముగలిగి, పూర్వవిజ్ఞానమును పూర్తిగా శంకింతురు. ఈ'యభ్యుదయ" వాదుల భావములు మనమెఱుగనివికావు. విజాతీయుల దాడులనుండియు. దోపిడులనుండియు మన ఆత్మజ్ఞానము మనలను రక్షింపలేకపోయినది. పూర్వవిజ్ఞానము జాతికి ద్రోహమొనర్చి, ప్రస్తుతదురవస్థకుఁ గారణమైనది. పాశ్చాత్త్యుల భౌతికవిజయమార్గములను వీరనుకరించి జాతికిఁగల పూర్వనాగరికతావృక్షమును వేళ్ళతోఁ బీకివైచిన యెడల, పశ్చిమదేశ నవీనభావముల నిచటకు దిగుమతిచేయ వచ్చునని వీరి తలంపు. మొన్నటివరకు భారతీయ విశ్వవిద్యాలయములలో భారతీయవిజ్ఞానము బోధనాప్రణాళికలో లేదు; నేఁడైనను, తత్త్వబోధనాప్రణాళికలో దానిస్థాన మత్యల్పము. భారతీయవిజాన మన్యవిజ్ఞానములకు దీసికట్టను వాతావరణము సర్వత్ర వ్యాపించియున్నది. సాంస్కృతికముగా విలువగలదే మైనను, లార్డు మెకాలే వేసినబాట నిరాఘాటముగా నొకవైపున నున్నది. పశ్చిమఖండసంస్కృతియొక్క శక్తిపటుత్వములు మనదృష్టి నరికట్టునట్లదిచేయుచు, మన విజ్ఞానమును

మనము ప్రేమించునట్లుగాని, వలయుచో సంస్కరించుకొనుటకుఁగాని ప్రోత్సాహించుటలేదు. కొంతవరకు, మెకాలే కోరిక ఫలించినది; ఆంగ్లేయులకంటె నెక్కుడాంగ్లదృష్టి మనకుఁ గల్గినది. సహజముగా నిట్టివారు, భారతీయవిజ్ఞానమును నిరసించు పాశ్చాత్యవిమర్శకుల కండయై నిలుతురు. భారతీయవిజ్ఞాన పరిణామ మంతయు నంతర్విభేదమూఢవిశ్వాసరంగమని వీరి నమ్మకము. వారిలో నొకఁ డీమధ్య. "భారతదేశము బాగుపడవలె నన్నచో, మనదేశమున కాంగ్లదేశ మాధ్యాత్మికజనని' యు, గ్రీకుదేశము జననీజననియు' ఁగావలె"నని ప్రకటించెను. ఇఁక మతములో నాతనికి నమ్మకమే లేకపోవుటచే, హిందూమత స్థానమున క్రైస్తవమతము రావలెనని చెప్పకుండుట దోషము కాదు. అజ్ఞానాంధకారపతితుఁడై, అపజయపరాభూతులైన వీరు, మనకు భారతీయవిజ్ఞానమునెడ పూజ్యభావ మొక జాతి దౌర్బల్యమనియు, లేక స్వజాతి దురభిమానమనియుఁ జెప్పుదురు.

పాశ్చాత్యుల దృష్టికి భారతదేశ మొక మహాద్భుత నిష్క్రియత్వమున మున్గిన దేశము కాదని చూపట్టు నీసమయముననే, కొందరు స్వజాతి సోదరుల కట్లే చూపట్టుట మిక్కిలి వినోదకరమగు విషయము. భారతీయమగు తత్త్వ మర్థరహితము, కళ నిస్సారము, కవిత్వ ముదారభావశూన్యము, మతము మూఢవైచిత్ర్య సమ్మిశ్రితము, ధర్మము విజ్ఞానహీనము నని భారతీయులకు నచ్చఁజెప్పుటకుఁ బశ్చిమఖండ మఖండప్రయత్నము చేసినది. నేటికి భారతదేశమును గూర్చిన తనభావము నిజముకాదని పశ్చిమజాతి గుర్తింప నారంభించుచుండఁగా,

మనలోఁ గొంద రది పూర్తిగా నిజమేయని సమర్థించుటకుఁ బూనుకొనిరి. పరిశీలనకుఁ బ్రాముఖ్యముగల నేటియుగములోఁ బ్రజలను బూర్వయుగ విజ్ఞానములోనికి నెట్టి, నమ్మకములను జలింపఁజేయు తర్క-సంశయ వాదములనుండి రక్షింపఁబూనుట దుర్ఘటమేకాని, కేవలము నూతనములైన మతధర్మనీతిపద్ధతులపైఁ గాక, యిదివఱకే సుస్థిరముగా స్థాపితములైయున్న ప్రాచీన పద్ధతులపై జాతినిర్మాణ మొనర్చుటే క్షేమకరమను మాటను మనము మఱవరాదు. మన జీవితములకు మూలము లైన జలాధారములనుండి తెగఁద్రెంపికొని మనము జీవింపఁ జాలము. తత్త్వప్రణాళికలు, రేఖాగణితాకృతివలెఁ గాక, జీవితానుభవమునుండి జనించునవి. గత చారిత్రిక సంప్రదాయము మన బ్రతుకున కవసరమైన యాహారము; దానిని విడుచుట కృశించి నశించుటకే.

పూర్వసంప్రదాయ వాదులు ప్రాచీనవిజ్ఞాన మహత్త్వమును విశ్వసించి, యభినవసంస్కృతి నిరీశ్వరమని నిర్ణయించిరి; నవనాగరికులు ప్రాచీన విజ్ఞానము వ్యర్థమైనదనియుఁ బ్రకృతి సంబంధ విజ్ఞానమే విలువగలదనియు నమ్ముదురు. ఈభావములకుఁ గొంత యర్థమున్నది; కాని యుక్తమైన దృష్టితోఁ జదివినచో భారతీయ విజ్ఞానచరిత్ర యీరెండభిప్రాయములును సమానముగా లోపభూయిష్ఠములని తెలియఁగలదు. భారతీయ విజ్ఞానము నిష్ప్రయోజనమైనదని ఖండించువారు దానినెరుగరు. అదియే పరిపూర్ణమైనదనువారు వేరేవిజ్ఞానపరిచయమును లేనివారు. పూర్వవిజ్ఞాన గౌరవముగల సంప్రదాయవాదులును,

నూత్నాశయములు గల సంస్కారవాదులు నొకరి నొకరర్థము చేసికొన యత్నింపవలెను. ఓడలు, విమానములు, పొగబండ్లు, తంతీమార్గములు, మానవులందర నొక్కజాతిగాఁ గలిపివేయుచున్న నేటి ప్రపంచములో మన మేకాంతజీవితము గడపుట సాధ్యముకాదు. మన విజ్ఞానము ప్రపంచాభ్యున్నతికి హేతువై, ప్రపంచదృష్టిచేఁ బెంపొందవలెను. నిర్జీవతత్త్వములు, పాడుగోతులవలె, క్రిమికీటకాదులను బెంచును; ప్రసరించుచున్న ప్రవాహము లెప్పటికప్పుడు నూత్న ఝరీజలములచే శుభ్రోదకపూర్ణము లగుచుండును. అన్యుల సంస్కృతుల స్వీకరించి, జీర్ణించుకొనుట దోషముకాదు; కాని మనము స్వీకరించు విషయములను శుద్ధియొనర్చి, వాని కున్నతి ఘటించి, మనవిజ్ఞానమునఁ గల సమున్నతభావములతో సమన్వయించుకొనవలెను. నేఁడు మన జాతీయవిజ్ఞాన మను మూసలోనికివచ్చి బాహ్యము నుండి వడిన భిన్న విజ్ఞాన విషయములను సంధించి, సమన్వయించిన పద్ధతి యించుమించుగా గాంధి, టాగూరు, అరవిందఘోషు, భగవాన్దాసుల రచనలలో గోచరించును. శాఖాపాండిత్యములను జయించి, మన కట్టెదుట నూత్నముగాఁ గన్పట్టిన మహనీయసంస్కృతిని స్వీకరించి, బెంపొందుచున్న మహోన్నత భావదశా కాంతిరేఖ లల్పముగా నీ రచనలలోఁ జూపట్టుచున్నవి. ప్రాచీన భారతీయ విజ్ఞానరాశిలోని వరమోత్కృష్ట మానవత్వధర్మాంశములను విరివిగాఁ బరిగ్రహించి, పశ్చిమవిజ్ఞానములోనివిలువను విశేషముగా గుర్తించిన లక్షణములు వీరి రచనములలో గోచరించును. పురాతన విజ్ఞాన

జలధారను నేఁడు పునస్సాక్షాత్కారమొనర్చుకొని యుండలే ప్రసన్నసలిలముల నాఁకలి దప్పులచే నెండి,బీటలుపడినభూముల లోనికి, బరిశుద్ధములగు గొట్టములమూలమునఁ జొప్పింప వీరుఁ పూనుకొనిరి. కాని మనము నిజముగాఁ జూడఁగోరు భావిదశ నేఁడు లేదు; నేఁడు దేశములోని ప్రతిభావంతుల శక్తులనన్నిటి నాకర్షించు రాజకీయాందోళనము శాంతించి, పూర్వ విద్యాలయములలో నల్పతరముగా బోధింపఁబడుచున్న భారతీయ విజ్ఞానము నూతనముగా బయల్వెడలు విద్యానిలయములలో నధికాదరదృష్టితో నభ్యసింపఁబడు టారంభమైనచో భావిదశారుణోదయకాంతి గోచరింపఁగలదు. పూర్వవిజ్ఞానాభిమానముచే రాబోవు దశను విస్మరించు సంప్రదాయశక్తులు, భావిదశలో నెట్టి ప్రాబల్యమును బొందఁజాలవు.

భారతీయతత్త్వశాస్త్రమునకుఁగల నేఁటిసమస్య యేమనగా, బ్రస్తుత సత్యాంశములకు సంబంధములేకుండ దానిని సంకుచిత పఱచి, యొకశాఖగా వర్తింపఁజేయుటా? లేక మిక్కిలి విశేషముగాఁ బెంపొందిన అభినవ ప్రకృతిశాస్త్రజ్ఞానముతో భారతీయతత్త్వవేత్తల ప్రాచీనాదర్శముల ననుసంధించి మానవజాత్యభ్యుదయమునకు వలయు నద్భుత నిర్మాణశక్తులలో దాని నొకటిగాఁజేయుట యా యనునదే. తత్త్వశాస్త్ర లక్ష్యమునందును, ప్రాచీనదర్శనోద్దేశములయందును మనకు విశ్వాసమున్నచో మనదృక్పథము నిత్యము, విశాలవంతము గావలెనని విదితమగును. మానవజీవితమున కౌన్నత్యాభ్యుదయముల నీయఁగలుగుటవలననే భారతీయతత్త్వశాస్త్రము నేఁ

దర్థవంతమై, పూజ్యమగును. గత ప్రాచీనభారతీయతత్త్వాభ్యుదయ చరిత్రమునుబట్టి చూచినచో భావిదశనుగూర్చిన యాశారేఖలు పొడఁజూపుచున్నవి. మహావిజ్ఞానవేత్తలైన గార్గీ-యాజ్ఞవల్క్యులు, బుద్ధ - మహావీరులు, గౌతమ - కపిలులు, శంకర-రామానుజులు, మధ్వ-వల్లభులు తదితరులు భారతదేశ సజీవాస్తిత్వమున కత్యుత్తమసాక్ష్యములు; మహామహిమాన్వితమైన ఆత్మశక్తిగల జాతియొక్క నిరుపమానౌత్కృష్ట్యమునకుఁ బ్రబలాధారములు; భారతవర్షమింక నున్నతస్థితికిఁ బోఁగలదనియు, ఁబోయి తీరుననియుఁ జెప్పఁగల ప్రతిజ్ఞాన్వితమైన నిదర్శనములునై యున్నవి.